# శ్రీ కైవల్యసారథి

## (విష్ణు సహస్రనామ భాష్యము)



కనకాభిషేక గ్రహీత, గండపెండేర సన్మానిత, సువర్ణఘంటాకంకణ,
శ్రీవిద్యా నిధి, చక్రవిద, శ్రీవిద్యా రత్నాకర, శ్రీవిద్యా విశారద

డా॥ క్రోవి పార్థసారథి

# శ్రీ కైవల్యసారథి

## (విష్ణు సహస్రనామ భాష్యము)



*గ్రంథకర్త :*

**కనకాభిషేక గ్రహీత, గండ పెండేర సన్మానిత, సువర్ణఘంటాకంకణ,**

**చక్రవిద, శ్రీవిద్యానిధి, శ్రీవిద్యా రత్నాకర, శ్రీవిద్యా విశారద,**

**డాక్టర్ క్రోవి పార్థసారథి**

# శ్రీ కైవల్య సారథి


*గ్రంథకర్త :*

**క్రోవి పార్థసారథి**

రీడర్ ఇన్ కామర్స్

శాతవాహన కళాశాల, విజయవాడ.



ప్రథమ ముద్రణ : నవంబరు 2003

ప్రతులు : 1000





**వెల : రూ. 360-00**

*ప్రాప్తి స్థానములు :*

**కె. మంజూష**

23-11/1-10/2, దేవీ నిలయం

ఓగిరాలవారి వీధి, సత్యనారాయణపురం,

విజయవాడ - 520 011.

ఫోన్స్ : 0866-2530672

**శివకామేశ్వరి గ్రంథమాల**

41-22/4-36, భ్రమరాంబాపురం,

కృష్ణలంక, విజయవాడ - 13.

ఫోన్ : 0866-2522824

డి.టి.పి. : ఆర్. ఝాన్సీ & ఎస్. సునీత

*ముద్రణ :*

**నిర్మలా ఆఫ్‌సెట్ ప్రింటర్స్**

26-6-3, పాపయ్య వీధి, గాంధీనగర్,

విజయవాడ-3. ఫోన్ : 0866 - 2574828

శ్రీ కైవల్య సారథి అను

విష్ణు సహస్రనామ భాష్యము

# శ్రీ గండికోట శేషగిరిరావుగారు

# శ్రీమతి లక్ష్మీనరసమ్మగార్ల

జ్ఞాపకార్థము ముద్రించబడినది.

ఈ గ్రంథ ముద్రణకు

ఆర్థిక సహాయము చేసినవారు

# శ్రీ గండికోట రఘురామశర్మగారు

# శ్రీమతి రమాదేవిగారు

श्री श्री जगद्गुरु शङ्कराचार्य महासंस्थानम् , दक्षिणाम्नाय श्री शारदापीठम् , शृङ्गेरी.

**SRI SRI JAGADGURU SHANKARACHARYA MAHASAMSTHANAM,**
**DAKSHINAMNAYA SRI SHARADA PEETHAM, SRINGERI - 577 139.**

**PRIVATE SECRETARY**
To His Holiness Sri Jagadguru
Shankaracharya Dakshinamnaya
Sri Sharada Peetham
SRINGERI-577139.(Karnataka)

Camp : SRINGERI
Ref : D - 1/60665
Date : 1/8/2003

శ్రీయుతులు క్రోవి పార్థసారథిగార్కి నమస్కారములు.

మీరు పంపిన శ్రీకైవల్యసారథియను గ్రంథమును శ్రీచరణులు అవలోకించినారు.

మహాభారతమందు భీష్మపితామహునిచే యుధిష్ఠిరునకుపదిష్టమయిన విష్ణు సహస్రనామస్తోత్రము సర్వత్ర ప్రసిద్ధము. దానికి శ్రీమచ్ఛంకర భగవత్పాదా--చార్యులవారు చక్కని భాష్యం వ్రాసినారు. అందు వారు శ్రుతిస్మృతీతిహాస పురాణాదులనుదహరించి పలు నామములకు అనేకార్థములను చెప్పినారు. వారి భాష్యమే మిక్కిలి ప్రామాణికముగ ఎల్లెడల ప్రథితమైయున్నది. ప్రస్తుతం మీరు ఆ భాష్యానుసారంగా తెలుగులో శ్రీకైవల్య సారథియను పేర విస్తృతమైన వివరణమును వ్రాసి ప్రకటించుట ముదావహముగనున్నది. బహుగ్రంథ పరిశీలన పురస్సరముగ రచించిన ఈ వివరణ శ్రీశారదా చంద్రమౌళీశ్వరుల కృపవలన ఆంధ్రుల మన్ననలను పొందుగాక. మీకు ఇతోధిక శ్రేయఃప్రాప్తి యగుగాకయని శ్రీచరణులు ఆశీర్వదించినారు.

ఇట్లు,

T. Dakshinamurthi

Dr. K. Parthasarathi
23-11/1-10/2, Devi Nilayam
Ogiralavari Street, Satyanarayanapuram
**VIJAYAWADA** - 520 011 (AP)

Avadhoota Datta Peetham

18-08-2003

"తజ్జపస్తదర్థ మననం" అనే సూత్రం - అర్థాన్ని అనుసంధానం చేస్తూ మంత్రోచ్చారణ చేయటమే జపం అని చెపుతోంది. నామజపం, మంత్రజపం, మౌనజపం అని ఇలా అనేక విధాల జపాలు ఉన్నాయి. దేవతానామాన్ని బిగ్గరగా ఉచ్చరిస్తూ దేవతామూర్తిని స్మరిస్తూ భక్తి తన్మయులవటాన్ని నామజపం లేదా దివ్యనామ సంకీర్తనం అంటారు. ఏదైనా దేవతకు సంబంధించిన మంత్రాన్ని బిగ్గరగానో, కేవలం పెదాలు కదుపుతూనో లేదా మనస్సులోనో జపించడాన్ని మంత్రజపం అంటారు. ఈ రెండు మార్గాలూ ముక్తిని ప్రసాదించేవే.

నామరూపంలో ఉన్న విష్ణుసహస్రనామ స్తోత్రం దేవతా తత్త్వాన్ని, సృష్టిరహస్యాన్ని తెలుపుతూ అధ్యాత్మజ్యోతిని వెలిగించేదిగా ఉంది కనుక ఈ స్తోత్రమంతా మహామంత్రమే.

గత పది సంవత్సరాలుగా ప్రజలకు విష్ణుసహస్రనామంలోనూ, లలితా సహస్రనామంలోనూ శ్రద్ధాభక్తులు పెరిగాయి. అందుకే అన్నిచోట్లా నామజపయజ్ఞాలు జరిపిస్తున్నారు. ఇది చాలా సంతోషకరమైన విషయం.

పైనచెప్పినట్లుగా అర్థానుసంధానంతో చేసే మంత్రజపం విశేష ఫలాన్నిస్తుందనే రహస్యం తెలిసినవారు కనుకనే క్రోవి పార్థసారథి విష్ణుసహస్రనామస్తోత్రానికి "శ్రీ కైవల్యసారథి" అనే భాష్యాన్ని రచించారు. ఈ భాష్యాన్ని మేము పరిశీలించాము. ఇది పండితలోకానికి, పామర జనానికీ కూడా చాలా ఉపయోగించేదిగా ఉంది. విష్ణుసహస్రనామానికి శాస్త్రసమ్మతంగా భాష్యం రచించడం సామాన్యమైన విషయం కాదు. ఇంతటి గొప్పకార్యాన్ని సాధించిన క్రోవి పార్థసారథి గారికి, వారి కుటుంబానికి ఆశీస్సులు.



ఈ భాష్యాన్ని అధ్యయనం చేసినవారికి కైవల్యసిద్ధిని ఆదిగురు దత్తాత్రేయస్వామి అనుగ్రహించగలడని ఆశీస్సులు అందచేస్తున్నాము.

ఇతి

శ్రీ దత్తస్మరణమ్

Sri Ganapati Sachchidananda Ashrama, Datta Nagar, Mysore, India-570004
tel +91-(0)821- 486486, fax +91-(0)821- 487487
email avadhuta@blr.vsnl.net.in, http://www.dattapeetham.com

SRIMANNARAYANA RAMANUJA YATHIBHYO NAMAHA

Tridandi Chinna Srimannarayana
Ramanuja Jeeyar Swamy

**JEEYAR EDUCATIONAL TRUST,**
SITANAGARAM - 522 501.
GUNTUR DISTRICT. A.P.
✆ (08645) 272929, 272353

Dt. :

**శ్రీమతే నారాయణాయ నమః**

శ్రీ విష్ణు సహస్రనామస్తోత్రం సర్వులకూ ఉపాదేయం.
శ్రీరామానుజ సంప్రదాయంలో శ్రీపరాశరభట్టారకులు భగవద్గుణ దర్పణం పేర అద్భుతమైన భాష్యాన్ని అనుగ్రహించినారు.

శ్రీవిష్ణు సహస్రనామస్తోత్రంపై ప్రీతితో శ్రీమాన్ క్రోవి పార్థసారధిగారు నామవైభవాన్ని అనేక ప్రస్తావములతో వివరించారు.

వారి కృషికి అనేక మంగళాశాసనములు కావిస్తున్నాం!

జై శ్రీమన్నారాయణ!

(చిన్న జీయర్ స్వామీజీ)

JET, Hyderabad. ✆ 040-23224426
Email - acharya27@yahoo.com Internet : www.chinnajeeyar.org

Phone : 2707 (Tenkasi)

HIS HOLINESS JAGADGURU

**SRI SIVA CHIDANANDA BHARATHI SWAMI**

Sri Siddheswari Peetadhipati

Courtallam - 627 802

(Via) Tenkasi -Tirunelveli Dist. ----- South India

With Narayanasmritis

5-5-1997

# అభినందన

దేవీ పూజలో కాక, సమయమతములు, శ్రీ చక్రాంతర్గత రహస్యములు. భిన్న సంప్రదాయములలో పంచదశీ ఈ మహామంత్రము, షట్చక్రభేదన దేవి సాక్షాత్కారము మొదలైన విషయములు పామరులకు కూడా అర్థమయ్యేరీతిలో

శ్రీ క్రోవి పార్థ సారథి గారు వ్రాసిన

## "శ్రీ విద్యాదర్శనము"

గ్రంథావిష్కరణ సమయమున వారిని అభినందిస్తూ కుర్తాళం సిద్ధేశ్వరీ పీఠ మహా సంస్థానామోదమున గ్రంథకర్తను

## "శ్రీ విద్యారత్నాకర"

అను బిరుదరాజముతో సన్మానించడమయినది.

ఇతి నారాయణస్మృతి:

## క్రోవి పార్థసారథిగారి పరిచయం

పూర్తిపేరు : క్రోవి పార్థసారథి

వృత్తి / ఉద్యోగము : రీడర్ ఇన్ కామర్స్
శాతవాహన కళాశాల, విజయవాడ.

ఇంటి అడ్రస్ : 23-11/1-10/2, దేవీ నిలయం,
ఓగిరాలవారి వీధి, సత్యనారాయణపురం,
విజయవాడ-520 011. ఫోన్ : 2530672

**రచించిన గ్రంథాలు :**

1. శ్రీవిద్యా దర్శనము
2. శ్రీవిద్యా దర్పణము (గౌడపాదుల సుభగోదయస్తుతికి తెలుగు వ్యాఖ్య)
3. శ్రీవిద్యా రహస్యము
4. దేవీ కథాసుధ
5. శ్రీవిద్యా సర్వస్వము (కామకలావిలాసానికి వ్యాఖ్య)
6. శ్రీవిద్యా మహాయంత్రము (శ్రీచక్రానికి విశేష వ్యాఖ్య)
7. శ్రీవిద్యా హృదయము (యోగినీ హృదయానికి వ్యాఖ్య)
8. శ్రీవిద్యా పంచదశి (పంచదశీ మహామంత్రానికి వివరణ)
9. భావనోపనిషత్తు
10. ఉపనిషత్సర్వస్వము
11. శ్రీచక్ర సర్వస్వము
12. త్రిపురా రహస్యదీపిక
13. బ్రహ్మసూత్రమంజరి
14. శ్రీచక్రము
15. శ్రీవిద్యాసారథి (లలితా సహస్రనామ భాష్యము) 1004 పేజీలు
16. శ్రీ కైవల్య సారథి (విష్ణు సహస్రనామ భాష్యము) 1288 పేజీలు
17. తొలి ఏకాదశి
18. ఉపనిషద్దర్శనము (దశోపనిషత్తులపై MP-3 C.D.)
19. శ్రీవిద్యా దర్శనము (MP-3 C.D.)
20. శ్రీవిద్యాసారథి (లలితా సహస్రనామ భాష్యము)
    MP-3 ఆడియో సి.డి.లు-2 (24గం॥లు)

**సత్కారాలు** : 1. 13-12-1999 కనకాభిషేకము

2. 01-08-1998న సువర్ణ ఘంటాకంకణ ప్రదానము

3. 03-11-2002 గండపెండేర ప్రదానము

4. 11-01-2004 నవరత్నాంగులీయ ప్రదానము (గణపతిస్వామివారిచే)

**బిరుదులు** : 1. చక్రవిద, శ్రీవిద్యారత్నాకర, శ్రీవిద్యా విశారద, శ్రీవిద్యానిధి.

**సన్మానాలు** : 1. అవధూత దత్త పీఠాధిపతి శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానంద స్వామి

2. కుర్తాళం సిద్ధేశ్వరీ పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ శివచిదానంద భారతిస్వామి

3. గన్నవరం భువనేశ్వరీ పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ చిదానంద భారతి స్వామి

4. గుంటూరు శృంగేరి శ్రీ విరూపాక్ష పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ శివకళ్యాణానంద భారతి మహాస్వామి

5. విశ్వబంధు తపోవనం ట్రస్ట్ అధిపతులు శ్రీశ్రీశ్రీ వాసుదేవానందగిరి స్వామి

6. చైతన్యతపోవనం ట్రస్ట్ అధినేత శ్రీశ్రీశ్రీ మాతా శివచైతన్య

7. కాళీగార్డెన్స్ అధిపతులు శ్రీశ్రీశ్రీ చంద్రకాళీ ప్రసాదమాతాజీ

8. విజయవాడ లలితా పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ మాతా శివలీల

9. గౌ॥శ్రీ॥డి. శ్రీపాదరావు, స్పీకర్, ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీ

10. గౌ॥జనాబ్ ఎమ్.కె. బేగ్ (మంత్రివర్యులు)

11. గౌ॥శ్రీ॥ దేవినేని రాజశేఖర్ (నెహ్రూ) (మంత్రివర్యులు)

12. గౌ॥శ్రీ॥ జలగం ప్రసాదరావు (మాజీ మంత్రివర్యులు)

13. గౌ॥శ్రీ॥ ఉపేంద్రగారు (మాజీ కేంద్రమంత్రివర్యులు)

**ప్రశంసాపత్రాలు** : కంచి, శృంగేరి, ద్వారక, పుష్పగిరి, కుర్తాళం తదితర పీఠాధిపతులచే

**ఆర్థికసహాయం** : పై గ్రంథాలలో 2,3,5 గ్రంథాలకు తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఆర్థిక సహాయం

**కొనుగోలు ఆర్డరు** : పై గ్రంథములు కొని దేవాలయాలలో భద్రపరుచమని దేవాదాయశాఖ కమీషనరు వారి ఉత్తర్వులు.

**వ్యాసాల ప్రచురణ** : దేవాదాయశాఖవారు ప్రచురించే "ఆరాధన" పత్రికలో ఎనిమిది వ్యాసాల ప్రచురణ, ఇంకా అనేక పత్రికలలో.

# వంశాదికములు

కృష్ణాజిల్లా దివితాలూకా చోడవరం గ్రామకాపురస్తులు భారద్వాజస గోత్రీకులు మేడిచర్ల చల్లయ్యశాస్త్రి గారు. వీరి భార్య శ్రీమతి సుబ్బమ్మగారు వారికి నలుగురు కుమారులు.

1. సత్యనారాయణగారు 3. దక్షిణామూర్తిగారు

2. చంద్రశేఖరంగారు 4. రామ్మూర్తి అవధాని గారు

ఇద్దరు కుమార్తెలు

1. శ్రీమతి వేమూరి రాజేశ్వరి గారు 2. శ్రీమతి ఈమని సీతామహాలక్ష్మి గారు

మేడిచర్ల సత్యనారాయణ గారి కుమారుడు ఆంజనేయశాస్త్రి గారు. వీరి భార్య శ్రీమతి రామలక్ష్మిగారు. కుమార్తెలు 1. శ్రీమతి క్రోవి సత్యపర్వత వర్ధనమ్మగారు, వీరి భర్త కృష్ణమూర్తిగారు. 2. శ్రీమతి శిష్టా పద్మావతి గారు. వీరి భర్త రామసత్యనారాయణగారు, శ్రీమతి క్రోవి సత్యపర్వత వర్ధనమ్మగారి జ్యేష్ఠకుమారుడు క్రోవి పార్థసారథి.

2. గుంటూరుజిల్లా కొల్లూరు గ్రామకాపురస్తులు శ్రీవత్సస గోత్రీకులు కూచిభొట్ల నాగభూషణ శాస్త్రిగారు. వీరికి ఐదుగురు కుమారులు

1. నారాయణశాస్త్రిగారు 4. సుబ్రహ్మణ్యశాస్త్రిగారు

2. ప్రభాకరశాస్త్రి గారు 5. వీరరాఘవశాస్త్రి గారు

3. లక్ష్మీనృశింహశాస్త్రి గారు

ఇద్దరు కుమార్తెలు

1. శ్రీమతి మేడిచర్ల బాలాత్రిపురసుందరి గారు 2. శ్రీమతి కుందుర్తి శకుంతలమ్మ గారు

శ్రీమతి బాలాత్రిపుర సుందరి గారి పెద్దకుమార్తె శ్రీమతి క్రోవి సత్యపర్వత వర్ధనమ్మగారు. వీరి భర్త కృష్ణమూర్తిగారు. వారి జ్యేష్ట కుమారుడు క్రోవి పార్థసారథి

కూచిభొట్ల లక్ష్మీనృసింహశాస్త్రి గారు ఘట్టివారికి పెంపుడు వెళ్ళారు. తరువాత కాలంలో సన్యసించి శ్రీశ్రీశ్రీ కళ్యాణానందభారతి తరువాత

గుంటూరులోని శృంగేరీ శ్రీ విరూపాక్ష పీఠానికి **నృసింహానంద భారతి** పేరుతో అధిపతులయినారు.

పార్థసారథి గారి మాతామహుని వంశంలో అందరూ శ్రీవిద్యోపాసకులే.

3. ప్రకాశంజిల్లా ఒంగోలు కాపురస్తులు కౌశికస గోత్రీకులు, వారణాసి వేణుగోపాల కృష్ణయ్యగారు, వీరి భార్య మీనాక్షమ్మ గారు. వీరి కుమారుడు రమాకాంతశర్మ గారు. వీరి భార్య శ్రీమతి అన్నపూర్ణమ్మగారు. కుమార్తె శ్రీమతి పిల్లుట్ల సరోజినీదేవి. వీరి భర్త రాధాకృష్ణమూర్తిగారు.

రమాకాంతశర్మ గారికి ఇద్దరు కుమారులు

1. వెంకట శ్రీధర్ వీరి భార్య శ్రీమతి మాధవి 2. మురళీకృష్ణ వీరి భార్య శ్రీమతి శ్రీపద్మలక్ష్మి కాగా ఒక కుమార్తె. శ్రీమతి రమాదేవి. ఆమె భర్త క్రోవి పార్థసారథి.

4. బాపట్ల వాస్తవ్యులు శ్రీవత్సస గోత్రీకులు పిల్లుట్ల వెంకట సుబ్బయ్య గారు. వీరి భార్య శ్రీమతి అమ్మణ్ణమ్మగారు. వారికి ఇద్దరు కుమారులు.

1. చిరంజీవి శర్మగారు వీరి భార్య శ్రీమతి రామలక్ష్మిగారు

2. శివావధానిగారు వీరి భార్య శ్రీమతి విజయశ్రీగారు.

ముగ్గురు కుమార్తెలు

1. శ్రీమతి గండికోట లక్ష్మీనరసమ్మగారు వీరి భర్త శేషగిరిరావుగారు

(వీరి కుమారుడే ప్రఖ్యాత పారిశ్రామికవేత్త అన్నపూర్ణా గ్రూప్ సంస్థల అధినేత అయిన శ్రీ గండికోట రఘురామశర్మ గారు)

2. శ్రీమతి వారణాసి అన్నపూర్ణమ్మ గారు వీరి భర్త రమాకాంతశర్మగారు

3. శ్రీమతి పెద్దిభొట్ల హనుమాయమ్మ గారు వీరి భర్త సుబ్బరామయ్యగారు (ప్రముఖ కథారచయిత)

శ్రీమతి వారణాసి అన్నపూర్ణమ్మ గారి కుమార్తె శ్రీమతి రమాదేవిగారు. రమాదేవి గారి భర్త క్రోవి పార్థసారథి.

5. దివితాలూకా విశ్వనాధపల్లె గ్రామకాపురస్తులు జొన్నవిత్తుల కృష్ణయ్య గారు ఆయనకు నలుగురు కుమారులు.

1. సీతారామయ్య గారు  2. పద్మనాభం గారు

3. సూర్యనారాయణ గారు  4. ఆదినారాయణ గారు కాగా

1. శ్రీమతి క్రోవి లక్ష్మీనరసమ్మ గారు

2. శ్రీమతి జొన్నలగడ్డ సీతారావమ్మగారు

3. శ్రీమతి నిమ్మగడ్డ అన్నపూర్ణమ్మ గారు

4. శ్రీమతి లంక నాంచారమ్మ గారు

5. శ్రీమతి దైతా వెంకట లక్ష్మీగారు కుమార్తెలు

శ్రీమతి క్రోవి లక్ష్మీనరసమ్మ గారి భర్త పురుషోత్తమశర్మగారు వీరి ఏకైక సంతానం క్రోవి కృష్ణమూర్తి గారు. ఆయన జ్యేష్ఠ పుత్రుడు క్రోవి పార్థసారథి.

6. కాకినాడ వాస్తవ్యులు హరితస గోత్రీకులు క్రోవి గోపాల సోమయాజులు గారు. ఆయనకు ఇద్దరు కుమారులు

1. నాగేశ్వర సోమయాజులు గారు 2. బాలకృష్ణ సోమయాజులు గారు

వీరిలో బాలకృష్ణ సోమయాజులు గారికి ఇద్దరు కుమారులు.

1. పురుషోత్తమ దీక్షితులు గారు 2. లక్ష్మీనారాయణ సోమయాజి గారు

పురుషోత్తమ దీక్షితులుగారికి ఐదుగురు కుమారులు

1. నాగేశ్వర సోమయాజి గారు  4. లక్ష్మీనారాయణ గారు

2. సుందరం గారు  5. రామ్మూర్తి గారు

3. దక్షిణామూర్తి గారు

వీరిలో నాల్గవవారైన లక్ష్మీనారాయణ గారి కుమారుడు పురుషోత్తమ శర్మగారు. భార్య శ్రీమతి లక్ష్మీనరసమ్మగారు వారి కుమారుడు కృష్ణమూర్తి గారు. వారికి ముగ్గురు కుమారులు.

1. పార్థసారథి భార్య శ్రీమతి రమాదేవి వీరికి ఇద్దరు కుమార్తెలు.

I. శ్రీమతి గునుపూడి శైలజ భర్త డా॥ పవన్ కుమార్, వీరి కుమార్తె 'ధాత్రి'

II. కుమారి మంజూష కాగా కుమారుడు కృష్ణకాంత్ శర్మ

2. రామారావు భార్య శ్రీమతి డా॥ భారతలక్ష్మి

3. విజయ కుమార్ భార్య శ్రీమతి పద్మావతి

ఇద్దరు కుమార్తెలు

1. శ్రీమతి గునుపూడి గిరిజా కుమారి భర్త నాగేశ్వరరావు గారు (ఫైనాన్షియల్ డైరక్టర్, హైదరాబాద్ వాటర్ వర్క్స్)

2. శ్రీమతి కూనపులి శారద భర్త భాస్కరమూర్తి గారు

కృష్ణమూర్తి గారి జ్యేష్ఠకుమారుడు క్రోవి పార్థసారథి

7. కృష్ణాజిల్లా బందరు (మచిలీపట్నం) కాపురస్తులు లంక లక్ష్మీనారాయణగారి కుమారుడు వెంకట్రామయ్యగారు. వీరంతా శ్రీవిద్యోపాసకులే. వీరి దౌహిత్రుడు క్రోవి పురుషోత్తమ శర్మగారు. చిన్నప్పడే తల్లిని పోగొట్టుకుని తాతగారికి వారసుడైనాడు. ఈ రకంగా బందరు వాస్తవ్యుడైన పురుషోత్తమ శర్మగారి మనుమడు క్రోవి పార్థసారథి గారు వృత్తిరీత్యా ప్రస్తుతం విజయవాడ శాతవాహన కళాశాలలో వాణిజ్య శాస్త్రవిభాగంలో రీడరుగా పని చేస్తున్నారు.

# ప్రణతులు

ఈ రోజున విష్ణుసహస్రనామాలను ప్రతి ఒక్కరూ పారాయణ చేస్తున్నారు. అలాచేసేటప్పుడు ఆ నామాలకు గల అర్థాలను కూడా తెలుసుకుని పారాయణచేస్తే దాని ఫలితము ఎక్కువగాను, త్వరగాను సిద్ధిస్తుంది.

శ్రీమహావిష్ణువును గురించి వేయినామాలతో చేసిన స్తోత్రమే 'విష్ణుసహస్రనామములు'. దీనికి సాక్షాత్తూ శ్రీమహావిష్ణువు యొక్క అవతారమైన వేదవ్యాసుడు ఋషికాగా దేవకీ సుతుడైన భగవానుడు - దేవత. మహాభారతయుద్ధం ముగిసిన తరువాత అంపశయ్యమీద ఉన్న గాంగేయుడు, యుధిష్ఠిరునికి వీటిని వివరించాడు. ఆ సమయంలో భగవానుడైన శ్రీకృష్ణపరమాత్ముడు కూడా ప్రక్కనే ఉండి, విష్ణుసహస్రనామస్తోత్రాన్ని ఆసాంతం విని ఆనందించాడు.

విష్ణుసహస్రనామాలు కొన్ని సమూహాలుగా చెప్పబడ్డాయి. వీటినే ప్రకరణలు అన్నారు. ఒక్కొక్క ప్రకరణంలో ఒక్కొక్క విషయం వివరించబడింది. ఈరకంగా మొత్తం 53 ప్రకరణాలు చెప్పబడ్డాయి. ఇక్కడ శ్రీమహావిష్ణువు అంటే సాక్షాత్తూ పరమేశ్వర స్వరూపమే. అందుకే ఈ నామాలలో వైష్ణవతత్త్వము, చతుర్వ్యూహాలు, రాముడు, కృష్ణుడు, బుద్ధుడు, కల్కి మొదలైన అవతారాలు, అర్చిరాది మార్గము, గజేంద్రమోక్షము వంటి అనేకం వివరించటం జరిగింది.

మొదటగా విష్ణుసహస్రానికి భాష్యం చెప్పినవారు శంకర భగవత్పాదులవారు. తరువాత రామానుజుల శిష్యుడైన పరాశరభట్టరు వారు దీనికి వ్యాఖ్య వ్రాశారు. వీటిని తెలుగులోకి అనువదించటం కూడా జరిగింది.

కైవల్యము పొందాలంటే శ్రీమహావిష్ణువు తత్త్వం పూర్తిగా తెలియాలి. దానికి మార్గం విష్ణుసహస్రనామాలు. వీటికి గనక అర్థం

తెలుసుకోకలిగినట్లైతే ఆత్మసాక్షాత్కారము జరిగి కైవల్యము సిద్ధిస్తుంది. ఈ రకంగా కైవల్యానికి దారి చూపుతుంది. కాబట్టే ఈ గ్రంథానికి శ్రీ కైవల్యసారథి అని పేరు పెట్టం జరిగింది. విష్ణుభక్తులందరికీ ముక్తి మార్గాన్ని చూపేదే శ్రీ కైవల్యసారథి.

శంకరభగవత్పాదుల భాష్యాన్ని ప్రాతిపదికగా తీసుకుని, నిరుక్తములో చెప్పిన అర్థాన్ని, పరాశరభట్టరులవారి వ్యాఖ్యను పరిశీలిస్తూ, ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలు, భగవద్గీత, అష్టాదశ పురాణాలు, నారాయణీయములను జోడించి ఈ గ్రంథాన్ని వ్రాయటం జరిగింది. గ్రంథ రచనలో 55 ఉపనిషత్తులను ఉటంకించటం జరిగింది.

ఈ గ్రంథానికి శ్రీముఖములిచ్చిన స్వామీజీలందరికీ నమస్సుమాంజలులు.

గ్రంథరచనకు నన్ను ప్రోత్సహించిన నా భార్య శ్రీమతి రమాదేవికి, మిత్రులు శ్రీ పింగళి వేకంటకృష్ణారావుగారికి కృతజ్ఞతాభినందనలు.

గతంలో నేను వ్రాసిన గ్రంథాలలాగానే దీన్ని కూడా ఆదరిస్తారని భావిస్తూ.....

కీ॥శే॥ గండికోట శేషగిరిరావు, లక్ష్మీనరసమ్మ దంపతుల జ్ఞాపకార్థం ఈ గ్రంథ ముద్రణకు ఆర్థికసహాయం చేసిన వారి కుమారుడు, ప్రముఖ పారిశ్రామికవేత్త, అన్నపూర్ణా గ్రూప్ ఆఫ్ ఇండస్ట్రీస్ అధినేత, హైదరాబాద్ వాస్తవ్యులు భారద్వాజస గోత్రీకులు శ్రీ గండికోట రఘురామశర్మ, రమాదేవి దంపతులకు వారి కుటుంబ సభ్యులకు పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు ఆయురారోగ్య ఐశ్వర్యములు ప్రసాదించాలని ఆకాంక్షిస్తూ.....

స్వభానునామ సంవత్సర
కార్తీక పౌర్ణమి, శనివారం
8-11-2003

బుధజన విధేయుడు
**క్రోవి పార్థసారథి**

## ఇందులో ఉటంకించిన ఉపనిషత్తులు

1. ఈశావాశ్యోపనిషత్తు
2. కేనోపనిషత్తు
3. కఠోపనిషత్తు
4. ప్రశ్నోపనిషత్తు
5. ముండకోపనిషత్తు
6. మాండూక్యోపనిషత్తు
7. తైత్తిరీయోపనిషత్తు
8. ఐతరేయోపనిషత్తు
9. ఛాందోగ్యోపనిషత్తు
10. బృహదారణ్యకోపనిషత్తు
11. బ్రహ్మోపనిషత్తు
12. నారద పరివ్రాజకోపనిషత్తు
13. శాట్యాయనోపనిషత్తు
14. పరబ్రహ్మోపనిషత్తు
15. హంసోపనిషత్తు
16. అమృతబిందూపనిషత్తు
17. అమృతనాదోపనిషత్తు
18. క్షురికోపనిషత్తు
19. తేజోబిందూపనిషత్తు
20. నాదబిందూపనిషత్తు
21. యోగతత్త్వోపనిషత్తు
22. యోగచూడామణి ఉపనిషత్తు
23. మండల బ్రాహ్మణ ఉపనిషత్తు
24. శాండిల్యోపనిషత్తు
25. పాశుపతబ్రహ్మోపనిషత్తు
26. యోగకుండలి ఉపనిషత్తు
27. నారాయణోపనిషత్తు
28. మహానారాయణోపనిషత్తు
29. రామరహస్యోపనిషత్తు
30. వాసుదేవోపనిషత్తు
31. తారసారోపనిషత్తు
32. గోపాలతాపినీ ఉపనిషత్తు
33. కృష్ణోపనిషత్తు
34. గరుడోపనిషత్తు
35. ఆత్మభోధోపనిషత్తు
36. కైవల్యోపనిషత్తు
37. శ్వేతాశ్వరోపనిషత్తు
38. అధర్వశిరోపనిషత్తు
39. అధర్వశిఖోపనిషత్తు
40. జాబాల్యోపనిషత్తు
41. భావనోపనిషత్తు
42. సౌభాగ్య లక్ష్మి ఉపనిషత్తు
43. సుబాలోపనిషత్తు
44. సర్వసారోపనిషత్తు
45. శుకరహస్యోపనిషత్తు
46. ముద్గలోపనిషత్తు
47. మహోపనిషత్తు
48. ఏకాక్షరోపనిషత్తు
49. సూర్యోపనిషత్తు
50. అధ్యాత్మోపనిషత్తు
51. ఆత్మోపనిషత్తు
52. ముక్తికోపనిషత్తు
53. వజ్రసూచికోపనిషత్తు
54. కలిసంతరణోపనిషత్తు
55. కౌషీతకీబ్రాహ్మణము

## విష్ణుసహస్రంలో ఒకటి కన్న ఎక్కువసార్లు వచ్చిన నామాలు

| నామము | సంఖ్యలు | నామము | సంఖ్యలు |
|---|---|---|---|
| విష్ణుః | 2, 258, 657 | అమేయాత్మా | 102, 179 |
| పురుషః | 14, 406 | వసుః | 104, 270, 696 |
| శ్రీమాన్ | 22, 178, 220, 613 | వసుమనాః | 105, 697 |
| కేశవః | 23, 648 | సత్యః | 106, 212,. 869 |
| శివ | 27, 600 | అమోఘః | 110, 154 |
| ఈశ్వరః | 74, 36 | విశ్వయోనిః | 117, 149 |
| ప్రభుః | 35, 299 | వేదవిత్ | 128, 131 |
| ఆదిత్యః | 39, 563 | చతురాత్మా | 137, 769 |
| పుష్కరాక్షః | 40, 556 | చతుర్వ్యూహః | 138, 767 |
| విధాతా | 44, 484 | భోక్తా | 143, 500, 888 |
| పద్మనాభః | 48, 196, 346 | సహిష్ణుః | 144, 565 |
| సవిష్టః | 53, 436 | అనఘః | 146, 831 |
| కృష్ణః | 57, 550 | శుచిః | 155, 251 |
| ప్రాణదః | 65, 321, 408, 956 | వీరహా | 166, 741, 927 |
| ప్రాణః | 66, 320, 407 | అనిర్దేశ్యవపుః | 177, 656 |
| ప్రజాపతిః | 69, 197 | శ్రీనివాసః | 183, 607 |
| హిరణ్యగర్భః | 70, 411 | సతాంగతిః | 184, 450 |
| మాధవః | 72, 167, 735 | అనిరుద్ధః | 185,638 |
| విక్రమీ | 75, 909 | గోవిందః | 187, 593 |
| కృతజ్ఞః | 82, 532 | సుపర్ణః | 192, 855 |
| సంవత్సరః | 91, 819 | సింహః | 200, 488 |
| అజః | 95, 204, 521 | నివృత్తాత్మా | 229, 597 |
| సిద్ధః | 97, 819 | అనిలః | 234, 812 |
| అచ్యుతః | 100, 318 | విభుః | 240, 880 |

| | | | |
|---|---|---|---|
| దుర్ధరః | 266, 715 | క్షామః | 443, 854 |
| బుద్ధః | 278, 351 | యజ్ఞః | 445, 971 |
| పావనః | 292, 811 | సర్వజ్ఞః | 453, 815 |
| అనలః | 293, 711 | సువ్రతః | 455, 818 |
| కాంతః | 296, 654 | సుఖదః | 459, 889 |
| మహీధరః | 317, 369 | గోపతిః | 495, 592 |
| వాయువాహనః | 331, 856 | గోప్తా | 496, 593 |
| వాసుదేవః | 332, 695, 709 | అమితవిక్రమః | 516, 641 |
| ఆదిదేవః | 334, 490 | శుభాంగః | 586, 782 |
| శ్రీనివాసః | 183, 607 | స్రష్టా | 588, 990 |
| తారః | 338, 968 | కుముదః | 589, 807 |
| శౌరిః | 340, 644 | కృతాగమః | 655, 789 |
| భీమః | 357, 948 | అనంతః | 659, 886 |
| మార్గః | 365, 397 | మహాకర్మః | 672, 787 |
| ఉద్భవః | 373, 790 | పుణ్యః | 687, 925 |
| గహనః | 382, 544 | వసుప్రదః | 693, 694 |
| వీరః | 401, 643, 658 | అపరాజితః | 716, 862 |
| ప్రణవః | 409, 957 | అక్షోభ్యః | 801, 999 |
| దక్షః | 423, 917 | హుతభుగ్ | 879, 887 |
| ప్రమాణమ్ | 428, 959 | సవితా | 884, 969 |
| అనిర్విణ్ణః | 435, 892 | చక్రీ | 908, 995 |

మొత్తం 90 నామాలు ఒకటి కన్నా ఎక్కువ సార్లు చెప్పబడ్డాయి.

# లలిత - విష్ణు సహస్రనామావళి

అమ్మవారుకాని, విష్ణువుకాని, శివుడుకాని ఏ పేరుతో పిలిచినా అది పరమేశ్వరస్వరూపంగానే చెప్పాలి. ప్రస్తుతం లలితాసహస్రనామాలు, విష్ణు సహస్రనామాల పారాయణ ఎక్కువగా జరుగుతోంది. ఈ రెండింటిలో చెప్పబడిన పరమేశ్వర స్వరూపం ఒకటే.

నిరాకారుడు నిర్గుణస్వరూపుడు పరబ్రహ్మ. చరాచరజగత్తుకు అతడే కారణభూతుడు. అఖిలాండ కోటిబ్రహ్మాండాలను అతడే సృష్టించాడు. సృష్టి స్థితిలయాలకు అతడే కారకుడు. అతని నుండే బ్రహ్మాది దేవతలు, సప్తరుషులు, సూర్యచంద్రాది గ్రహాలు, సమస్తము జన్మించినాయి. అతడు శాశ్వతుడు. నిత్యుడు. అతడే సత్యము. అతడు ధర్మస్వరూపుడు. ధర్మాన్ని రక్షించటానికి అనేక అవతారాలెత్తాడు. దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేశాడు. అతన్ని అనేక పేర్లతో పిలుస్తాం. ఆ స్వరూపమే పరమేశ్వరి లేదా విష్ణుమూర్తి ఈ రెండింటి మధ్యనా భేదం లేదు ఒక్క పేరులో తప్ప. అందుకే సహస్రనామావళిలో కూడా రెండు చోట్లా ఒకే నామముంటుంది. లేదా వేరువేరు నామాలున్నా ఆ రెండింటికీ అర్ధం ఒక్కటే. ఆ విషయం దిగువ నామాలను పరిశీలిస్తే విశదమవుతుంది.

| విష్ణు సహస్రనామావళి | | లలితాసహస్రనామావళి | |
|---|---|---|---|
| 1. | విశ్వం | 256. | విశ్వరూపా |
| 16. | క్షేత్రజ్ఞ | 343. | క్షేత్రజ్ఞపాలినీ |
| 19. | యోగవిదాంనేతా | 225. | మహాయోగీశ్వరేశ్వరీ |
| 44. | విధాతా | 337. | విధాత్రీ |
| 46. | అప్రమేయః | 413. | అప్రమేయా |
| 70. | హిరణ్యగర్భః | 638. | స్వర్ణగర్భా |
| 77. | మేధావీ | 539. | మేధా |
| 95, | 204, 521, అజః | 663, | 864 అజా |
| 102. | అమేయాత్మా | 617. | అమేయాత్మా |
| 115. | బహుశిరా | 533. | సర్వతోముఖీ |

| | | | |
|---|---|---|---|
| 117. | విశ్వయోని | 620. | అనేకకోటిబ్రహ్మాండజననీ |
| 70. | మహామాయ | 215. | మహామాయ |
| 172. | మహాబలః | 222. | మహాబలా |
| 173. | మహాబుద్ధిః | 223. | మహాబుద్ధిః |
| 174. | మహావీర్యః | 721. | మహావీర్యా |
| 175. | మహాశక్తిః | 217. | మహాశక్తిః |
| 187. | గోవిందః | 267. | గోవిందరూపిణీ |
| 190. | దమనః | 267. | తాపత్రయాగ్నిసందగ్ధ సమాహ్లాదనచంద్రికా॥ |
| 209. | గురుః | 604. | గురుమూర్తి |
| 210. | గురుతమో | 713. | గురుమండలరూపిణీ ॥ |
| 224. | సహస్రమూర్ధా | 282. | సహస్రశీర్షవదనా |
| 227. | సహస్రపాత్ | 284. | సహస్రపాత్ |
| 226. | సహస్రాక్షః | 283. | సహస్రాక్షీ |
| 245. | నారాయణః | 298. | నారాయణీ |
| 264. | శ్రుతిసాగరః | 290. | సకలాగమ సందోహశుక్తి సంపుట మౌక్తికా |
| 304. | అదృశః | 649. | అదృశ్యా |
| 305. | వ్యక్తరూపః | 399. | వ్యక్తావ్యక్త స్వరూపిణీ |
| 310. | శిష్టేష్టః | 411. | శిష్టేష్టా |
| 372. | అమితాశనః | 753. | మహాశనా |
| 377. | పరమేశ్వరః | 396. | పరమేశ్వరీ |
| 391. | తుష్టః | 443. | తుష్టః |
| 392. | పుష్టః | 444. | పుష్టిః |
| 403. | ధర్మాః | 958. | ధర్మిణీ |
| 431. | అనర్థః | 291. | పురుషార్థప్రదా |
| 445. | యజ్ఞః | 769. | యజ్ఞరూపా |
| 453. | సర్వజ్ఞః | 196. | సర్వజ్ఞా |

| | | | |
|---|---|---|---|
| 478. | సత్ | 818. | సత్యరూపా |
| 480. | క్షరమ్ | 757. | క్షరాక్షరాత్మికా |
| 484. | విధాతా | 357. | విధాత్రీ |
| 491. | మహాదేవః | 209. | మహాదేవీ |
| 496. | గోప్తా | 266. | గోప్త్రీ |
| 497. | జ్ఞానగమ్యా | 981. | జ్ఞానగమ్యా |
| 498. | పురాతనః | 802. | పురాతనా |
| 532. | కృతజ్ఞః | 374. | కృతజ్ఞా |
| 541. | కనకాంగదీ | 31. | కనకాంగదకేయూర కమనీయ భుజాన్వితా |
| 558. | భగవాన్ | 279. | భగవతీ |
| 577. | నిర్వాణమ్ | 390. | నిర్వాణసుఖదాయినీ |
| 582. | శాంతః | 141. | శాంతా |
| 617. | శతానందః | 252. | పరమానందా |
| 623. | ఛిన్నసంశయా | 173. | సంశయఘ్నీ |
| 651. | కామదేవః | 63. | కామదాయినీ |
| 720. | అమూర్తిమాన్ | 814. | అమూర్తా |
| 766. | చతుర్బాహు | 7. | చతుర్బాహుసమన్వితా |
| 817. | సర్వతోముఖః | 533. | సర్వతోముఖీ |
| 913. | శశిరః | 357. | తాపత్రయాగ్ని సందగ్ధ సమాహ్లాదన చంద్రికా |
| 917. | యజ్ఞః | 769. | యజ్ఞరూపా |
| 973. | యజ్వా | 880. | యజ్ఞకర్త్రీ |
| 1000. | సర్వప్రహరణాయుధధరః | 513. | సర్వాయుధధరా |

ఈరకంగా 59 నామాలున్నాయి. వీటన్నింటికీ ఇంచుమించుగా అర్థం ఒక్కటే.

లలితాసహస్రంలో 'పరమేశ్వరి' అన్నా విష్ణుసహస్రంలో 'శ్రీమన్నారాయణుడు' అన్నా, ఇద్దరూ ఒక్కటే. అదే పరమేశ్వరస్వరూపం. వీరిద్దరికీ భేదంలేదు ఒక్కపేరులో తప్ప. అది కూడా మనం కల్పించిందే.

యోగసాధనలో సాధకుడు షట్చక్రాలు దాటి సహస్రారందాకా వెడితే అక్కడ ఆత్మసాక్షాత్కారమవుతుంది. అదే పరాస్థానము.

| | | |
|---|---|---|
| అది శివస్థానమని | – | శైవులు |
| పరమపురుషస్థానమని | – | వైష్ణవులు |
| పరమేశ్వరీస్థానమని | – | శాక్తేయులు |

చెప్పగా అక్కడ హరిహరులుంటారని, ప్రకృతి పురుషులుంటారని ఇతరులు చెప్పటం జరుగుతోంది.

ఏది ఏమైనప్పటికీ అక్కడ ఉండేది పరాత్పరుడు. అతడే జగత్తులను సృష్టించిన వాడు. అక్కడికి చేరిన వారికి సంసారబంధనాలుండవు. ఆకలిదప్పికలుండవు. వారికి వాక్సిద్ధి గలుగుతుంది. ఇష్టార్థసిద్ధి జరుగుతుంది. పునర్జన్మ ఉండదు.

# శ్రీ లక్ష్మీ అష్టోత్తర శతనామ (దారిద్ర్యవిమోచన) స్తోత్రమ్

**ఓం దేవ్యువాచ :**

దేవదేవమహాదేవ త్రికాలజ్ఞమహేశ్వర ।
కరుణాకర దేవేశ భక్తానుగ్రహకారక ॥
అష్టోత్తరశతం లక్ష్మ్యాః, శ్రోతుమిచ్ఛామి తత్త్వతః ॥

**ఈశ్వర ఉవాచ :**

దేవిసాధుమహాభాగే మహాభాగ్య ప్రదాయకం ।
సర్వైశ్వర్యకరం పుణ్యం సర్వపాప ప్రణాశనం ॥

సర్వదారిద్ర్యశమనం శ్రవణాద్భుక్తిముక్తిదం ।
రాజవశ్యకరం దివ్యం గుహ్యాద్గుహ్యతమంపరం ॥

దుర్లభం సర్వ దేవానాం చతుష్షష్టికళాస్పదం ।
పద్మాదీనాం వరాంతానాం నిధీనాం నిత్యదాయకం ॥

సమస్త దేవసం సేవ్య మణిమాద్యష్ట సిద్ధిదమ్ ।
కిమత్ర బహునోక్తేన దేవీ ప్రత్యక్షదాయకం ॥

తవప్రీత్యాఽద్య వక్ష్యామి సమాహిత మనాశ్శృణు.

అస్య శ్రీలక్ష్మ్యష్టోత్తర శతనామస్తోత్ర మహామంత్రస్య । మహాలక్ష్మీః దేవతా। క్లీం బీజం । భువనేశ్వరీ శక్తిః । శ్రీమహాలక్ష్మీ ప్రసాదసిద్ధ్యర్థే జపే వినియోగః ॥

సాం అంగుష్ఠాభ్యాం నమః సీం తర్జనీభ్యాం స్వాహా
సూం మధ్యమాభ్యాం వషట్ సైం అనామికాభ్యాం హుం
సౌం కనిష్ఠి కాభ్యాం వౌషట్ సః కరతలకరపృష్ఠాభ్యాం ఫట్
సాం హృదయాయ నమః సీం శిరసేస్వాహా
సూం శిఖాయై వషట్ సైం కవచాయహుం
సౌం నేత్రాభ్యాం వౌషట్ సః అస్త్రాయఫట్
భూర్భువస్సువరోమితి దిగ్బంధః ॥

**ధ్యానం :**

వందే పద్మాకరాం ప్రసన్నవదనాం సౌభాగ్యదాం భాగ్యదాం ।
హస్తాభ్యా మభయ ప్రదాం మణిగణై ర్నానావిధై ర్భూషితాం ।

భక్తాభీష్ట ఫలప్రదాం హరి హర బ్రహ్మాదిభి స్సేవితాం ।
పార్శ్వేపంకజ శంఖ పద్మనిధిభి ర్యుక్తాం సదా శక్తిభిః ॥ 1

సరసిజ నయనే సరోజహస్తే ధవళతరాంశుక గంధమాల్య శోభే ।
భగవతి హరివల్లభే మనోజ్ఞే త్రిభువన భూతకరి ప్రసీద మహ్యమ్ ॥ 2

ప్రకృతిం వికృతిం విద్యాం సర్వభూత హితప్రదాం ।
శ్రద్ధాం విభూతిం సురభిం నమామి పరమాత్మికామ్ ॥ 1

వాచం పద్మాలయాం పద్మాం శుచిం స్వాహాం స్వధాం సుధాం ।
ధన్యాం హిరణ్యయీం లక్ష్మీం నిత్యపుష్టాం విభావరీమ్ ॥ 2

అదితిం చ దితిం దీప్తాం వసుధాం వసుధారిణీం ।
నమామి కమలాం కాంతాం కామాక్షీం క్రోధ సంభవాం ॥ 3

అనుగ్రహపదాం బుద్ధి మనఘాం హరివల్లభాం ।
అశోకా మమృతాం దీప్తాం లోక శోక వినాశినీం ॥ 4

నమామి ధర్మనిలయాం కరుణాం లోకమాతరం ।
పద్మప్రియాం పద్మహస్తాం పద్మాక్షీం పద్మసుందరీం ॥ 5

పద్మోద్భవాం పద్మముఖీం పద్మనాభప్రియాం రమాం ।
పద్మమాలా ధరాం దేవీం పద్మినీం పద్మగంధినీం ॥ 6

పుణ్యగంధాం సుప్రసన్నాం ప్రసాదాభిముఖీం ప్రభాం ।
నమామి చంద్రవదనాం చంద్రాం చంద్ర సహోదరీం ॥ 7

చతుర్భుజాం చంద్రరూపా మిందిరా మిందుశీతలాం ।
ఆహ్లాద జననీం పుష్టిం శివాం శివకరీం సతీం ॥ 8

విమలాం విష్ణుజననీం పుష్టిం దారిద్ర్య నాశినీం ।
ప్రీతపుష్కరిణీం శాంతాం శుక్ల మాల్యాంబరాం శ్రియం ॥ 9

భాస్కరీం బిల్వ నిలయాం వరారోహాం యశస్వినీం ।
వసుంధరా ముదారాంగాం హరిణీం హేమ మాలినీం ॥ 10

ధనధాన్యకరీం సిద్ధిం స్త్రైణసౌమ్యాం శుభప్రదాం ।
నృపవేశ్మ గతానందాం వరలక్ష్మీ వసుప్రదాం ॥ 11

శుభాం హిరణ్య ప్రాకారం సముద్ర తనయాం జయాం ।
నమామి మంగళాం దేవీం విష్ణు వక్షస్థల స్థితాం ॥ 12

విష్ణుపత్నీం ప్రసన్నాక్షీం నారాయణ సమాశ్రితాం ।
దారిద్ర్య ధ్వంసినీం దేవీం సర్వోపద్రవ వారిణీం ॥ 13

నవదుర్గాం మహాకాళీం బ్రహ్మ విష్ణు శివాత్మికాం ।
త్రికాల జ్ఞాన సంపన్నాం నమామి భువనేశ్వరీం ॥ 14

లక్ష్మీం క్షీరసముద్రరాజ తనయాం శ్రీరంగధా మేశ్వరీం ।
దాసీభూత సమస్తదేవ వనితాం లోకైక దీపాంకురాం ।
శ్రీమన్మందకటాక్ష లబ్ధవిభవ బ్రహ్మేంద్ర గంగాధరాం ।
త్వాంత్రైలోక్య కుటుంబినీం సరసిజాం వందేముకుందప్రియాం ॥ 15

మాత ర్నమామి కమలే కమలాయతాక్షీ ।
శ్రీవిష్ణు హృత్కమల వాసిని విశ్వమాతః ।
క్షీరోదజే కమల కోమల గర్భ గౌరి ।
లక్ష్మి ప్రసీద సతతం నమతాం శరణ్యే ॥ 16

త్రికాలం యో జపే ద్విద్వాన్ షణ్మాసం విజితేంద్రియః ।
దారిద్ర్య ధ్వంసనం కృత్వా సర్వ మాప్నో త్యయత్నతః ॥ 17

దేవీనామ సహస్రేషు పుణ్య మష్టోత్తరం శతం ।
యేన శ్రియమవాప్నోతి కోటిజన్మ దరిద్రతః ॥ 18

భృగువారే శతం ధీమాన్ పఠే ద్వత్సర మాత్రకం ।
అష్టైశ్వర్య మవాప్నోతి కుబేర ఇవ భూతలే ॥ 19

దారిద్ర్యమోచనం నామస్తోత్ర మంబా పరం శతం ।
యేన శ్రియ మవాప్నోతి కోటిజన్మ దరిద్రతః ॥ 20

భుక్తాతు విపులాన్ భోగా నస్యా స్సాయుజ్య మాప్నుయాత్ ।
ప్రాతఃకాలే పఠేన్నిత్యం సర్వ దుఃఖోపశాంతయే ।
పఠం స్తు చింతయే ద్దేవీం సర్వాభరణ భూషితామ్ ॥ 21

# విషయసూచిక

# శ్రీ కైవల్యసారథి

## 1. ప్రస్థావన

"నమస్కారం గురువుగారు !"

రెండు గొంతులు ఒక్కసారిగా పలికేటప్పటికి ఉలిక్కిపడి తలెత్తి చూశాడు రత్నాకరుడు. ఎదురుగా చేతులు జోడించి వినమ్రులై నుంచుని ఉన్నారు అతని శిష్యులు కృష్ణశర్మ, నారాయణభట్టు.

చాలాకాలానికి వచ్చిన శిష్యులను చూసి ఆనందభరితుడైనాడు రత్నాకరుడు. కుశల ప్రశ్నల అనంతరం అడిగాడు 'వచ్చిన పని ఏమిటి ?' అని.

"గురుదేవా ! ఇప్పటి దాకా మీ వద్ద ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలు, కామకళా విలాసము, సుభగోదయస్తుతి, యోగినీ హృదయము, త్రిపురారహస్యము, దేవీభాగవతము, లలితా రహస్యనామాలకు భాష్యము వంటి శ్రీవిద్యా గ్రంథాలను అనేకం చెప్పుకున్నాము. పరబ్రహ్మ స్వరూపుడైన పరమేశ్వరుడు ఒక్కడే. ఆద్యంతములు లేనివాడు. సృష్టి స్థితి లయ కారకుడు. జగత్తంతా ఆవరించినవాడు. పిపీలికాది బ్రహ్మపర్యంతము తానే అయినవాడు అతడే. అతడికి అనేక నామాలు, అనేక రూపాలు. ఏ పేరుతో పిలిచినా పలుకుతాడు. ఏ రూపంతో కొలిచినా కరుణిస్తాడు. అటువంటి పరాత్పరుణ్ణి శివుడని, కేశవుడని, హరిహరుడని, శక్తిస్వరూపమని భక్తులు సేవిస్తూ ఉంటారు. మీ దయవల్ల శ్రీవిద్యా ప్రతిపాదితమైన గ్రంథాలను ఇప్పటిదాకా చెప్పుకున్నాం. ఇప్పుడు విష్ణుసహస్ర నామాలకు భాష్యం చెప్పుకుందామని వచ్చాం. కాబట్టి కాదనక మమ్ములను కృతార్థులను చెయ్యండి" అన్నారు శిష్యులు.

ఆ మాటలు విన్న రత్నాకరుడు పరమానందభరితుడై "నాయనలారా ! మీ కోరిక తప్పక తీరుస్తాను. ఇవాల్టికి శెలవు తీసుకుని రేపు రండి." అన్నాడు. అనుకున్న ప్రకారం ఆ మర్నాటి సాయంత్రం వచ్చిన శిష్యులు గురువుగారికి సాష్టాంగ ప్రణామాలర్పించి, ఆయన అనుమతితో సుఖాసీనులైనారు. రత్నాకరుడు అమితానందంతో శిష్యులను ఆశీర్వదించి విష్ణుసహస్రనామ భాష్యం చెప్పటం ప్రారంభించాడు.

**శాన్తాకారం భుజగశయనం పద్మనాభం సురేశం**

**విశ్వాధారం గగనసదృశం మేఘవర్ణం శుభాంగం ।**

**లక్ష్మీకాంతం కమలనయనం యోగి హృద్యాన గమ్యం**

**వందే విష్ణుం భవభయహరం సర్వలోకైకనాథమ్ ॥**

శాంతస్వరూపుడు, ఆదిశేషుని మీద శయనించేవాడు, పద్మనాభుడు, సర్వదేవతలకు అధిపతి, ఈ జగత్తుకంతటికీ ఆధారమైనవాడు, గగనమువలె సర్వత్రా వ్యాపించినవాడు, మేఘవర్ణుడు, శుభప్రదమైన అంగములు కలవాడు, లక్ష్మీపతి, కమలనయనుడు, ఎల్లవేళల యందు యోగులయొక్క హృదయాలలో నివసించేవాడు, భవబంధాలను నాశనం చేసేవాడు, సర్వలోకాలకు అధిపతి అయిన ఆ శ్రీ మహావిష్ణువుకు నమస్కరిస్తున్నాను.

నిరాకారుడు నిర్గుణస్వరూపుడు పరబ్రహ్మ. అతడు గనక సాకారుడైతే, ఆ రూపమే శ్రీమహావిష్ణువు.

**వేదాలలో శ్రీ మహావిష్ణువు :**

ఇష్ట ప్రాప్తినీ, అనిష్ట పరిహారాన్నీ సాధించటానికి అలౌకికమైన ఉపాయాన్ని చెప్పేదే వేదము. అనగా మానవుడు తనకు కావలసినవి పొందటానికి, అవసరం లేనివాటిని వదిలించుకోటానికి అలౌకికమైన ఉపాయాన్ని చెబుతుంది వేదం.

వేదాలు అపౌరుషేయాలు. సాక్షాత్తూ పరమేశ్వరుడే వాటిని బ్రహ్మదేవుడికి ఇచ్చాడు. కృతయుగము, త్రేతాయుగాల్లో వేదం అంతా ఒకటిగానే ఉండేది. కాని ద్వాపరయుగంలో బ్రహ్మయొక్క ఆజ్ఞానుసారము కృష్ణద్వైపాయనుడు వేదాన్ని

1. ఋగ్వేదము 2. యజుర్వేదము 3. సామవేదము 4. అధర్వణవేదము

అని నాలుగు భాగాలుగా చేశాడు. ప్రతివేదంలోనూ నాలుగు భాగాలుంటాయి అవి.

1. సంహితలు 2. బ్రాహ్మణాలు 3. అరణ్యకాలు 4. ఉపనిషత్తులు

**1. సంహిత :** ఇది మంత్రభాగం. ఇందులో స్తోత్రాలు, ఆవాహనలు ఉంటాయి. దేవతలయొక్క స్తోత్రాలన్నీ ఈ భాగంలోనే ఉన్నాయి.

**2. బ్రాహ్మణాలు :** సంహితలోని విషయాన్ని వివరించేవి బ్రాహ్మణాలు. యజ్ఞయాగాదులు ఏవిధంగా చెయ్యాలి ? వాటి వెనుక రహస్యం ఏమిటి ? యజ్ఞాలవిలువ, వాటి మహాత్మ్యము వీటిలో వివరించబడ్డాయి.

**3. అరణ్యకాలు :** ఇవి బ్రాహ్మణాలకు ఉపనిషత్తులకు మధ్యస్థాయిలో ఉంటాయి. ఇవి కూడా బ్రాహ్మణాలలాగానే కర్మవిధులను బోధిస్తాయి. కాని ఇక్కడ కర్మల యొక్క భౌతిక భాగం ఉండదు. కర్మలవెనక ఉన్న నిగూఢమైన తత్త్వానికి ప్రాముఖ్యత ఇవ్వబడింది.

**4. ఉపనిషత్తులు :** ఇది పూర్తిగా జ్ఞానకాండ. బ్రహ్మవిద్య. జీవాత్మ పరమాత్మ రెండూ ఒకటే అని వివరిస్తాయి.

శ్రీ మహావిష్ణువు బ్రాహ్మణాలలోను, ఇతిహాసాలలోను ప్రాముఖ్యత ఉన్న దేవత. ఋగ్వేదంలో విష్ణువును స్తుతిస్తూ ఐదు సూక్తులు ఉన్నాయి. ఇవికాక ఇంకొక సూక్తంలో కొంతభాగం విష్ణువును గురించి చెప్పబడింది. వీటిలో శ్రీమహావిష్ణువు యొక్క ప్రాధాన్యత ఎక్కువగా చెప్పబడింది. వేదంలో చెప్పినదాన్ని బట్టి విష్ణువుకు మూడు ముఖ్యమైన లక్షణాలున్నాయి. అవి

**1. మూడు అంగలు :** మూడు చోట్ల పాదాలు పెట్టటం. ఇది ఎక్కువసార్లు చెప్పబడింది.

**2. బృహచ్ఛరీరం :** పెద్ద శరీరం కలవాడు. ఈ జగత్తంతా వ్యాపించి ఉంటాడు.

**3. యువకుడు :** ఇతడు బాలుడుకాదు. అలా అని పెద్దవాడు కాదు. నవ యవ్వనుడు.

ఇతడు గొప్ప గమనం గలవాడు. పెద్దపెద్ద అంగలు వేసేవాడు. తన మూడు అంగలతోనే లోకాలన్నీ ఆక్రమిస్తాడు. విష్ణువు యొక్క మూడు అంగలు సూర్యగమనాన్ని సూచిస్తున్నాయి. ఆ మూడు అంగలే త్రిసంధ్యలుగా చెప్పబడుతున్నాయి.

విష్ణువు తన గుర్రాలను (రోజులను) వాటి ఆరు పేర్లతో (ఋతువులతో) చక్రాన్ని త్రిప్పినట్లు కదలించాడని చెప్పబడింది. ఇది 360 రోజులు గల సంవత్సరానికి ప్రతీక. వేదకాలం తరువాత వచ్చిన సాహిత్యంలో విష్ణువుయొక్క ఆయుధం చక్రము (సుదర్శనము). ఆయన వాహనం పక్షిరాజైన గరుడుడు. ఆయన వక్షస్థలాన ఉండే కౌస్తుభరత్నము సూర్యుడే. శ్రీ మహావిష్ణువు భూతలాన్ని కష్టకాలంలో ఉన్న మానవుడి కోసం మూడుసార్లు ఆక్రమించాడు. మానవులకు నివాసంగా ఇవ్వటంకోసం భూమిని ఆక్రమించాడు. భూప్రదేశాలను విశాలమైన నివాసం కోసం ఆక్రమించాడు.

విష్ణువు స్వభావంలో ముఖ్యమైనది ఇంద్రునితో స్నేహం. వృత్రాసురునితో యుద్ధం చేసేటప్పుడు ఇంద్రుడికి సహకరించాడు. అతనితో కలిసి రాక్షససంహారం చేశాడు.

దేవతలు, రాక్షసులు పరస్పరము విరోధులు. వీరి మధ్య ఎప్పుడూ యుద్ధాలు జరుగుతుండేవి. వాటిలో దేవతలు ఓడిపోయి, చివరకు ఏదో ఒక ఉపాయంవల్ల

రాక్షసులను జయించేవారు అని **ఐతరేయ బ్రాహ్మణం**లో చెప్పబడింది. **శతపద బ్రాహ్మణం**లో ఒక కథ చెప్పబడింది. అందులో దేవదానవ సంగ్రామం జరిగింది. ఆ యుద్ధంలో వారిరువురూ విష్ణుమూర్తి మూడడుగులతో ఆక్రమించగలిగే భూమిని దేవతలకు ఇచ్చేటట్లుగా ఒప్పందం చేసుకున్నారు. అప్పుడు విష్ణువు ఈ లోకాలను, వేదాలనూ, వాక్కునూ తన మూడు అడుగులతో ఆక్రమించాడు. ఈరకంగా అసుర సంహారం జరిగింది.

**శతపథ బ్రాహ్మణం**లో 'ఏమూష' అనే పేరుగల వరాహం భూమిని నీటిలో నుంచి పైకి ఎత్తింది అని చెప్పబడింది. **తైత్తిరీయ సంహిత**లో ఆ వరాహమే ప్రజాపతి అవతారమని చెప్పబడింది. అదే వరహావతారము. **శతపథ బ్రాహ్మణం**లో మనువుని ప్రళయం నుంచి ఒకచేప కాపాడుతుంది. అదే మత్స్యావతారము. ప్రజాపతి నీటిలో తిరిగే తాబేలుగా మారాడు. ఇదే కూర్మావతారము.

**యజ్ఞోవైవిష్ణుః** యజ్ఞము విష్ణుస్వరూపము అని వేదంలో చెప్పబడింది. కాబట్టి విష్ణువు కన్న వేరైన స్వరూపములేదు. పద్మపురాణములో పరమేశ్వరుణ్ణి గురించి చెబుతూ...

**వేదపాదో యూపదంష్ట్రః క్రతుహస్త శ్చితీముఖః**
**అగ్నిజిహ్వో ధర్మరోమాః బ్రహ్మశీర్షో మహాతపాః**
**అహోరాత్రేక్షణో దివ్యో వేదాంతశ్రుతి భూషణః**
**స్రువతుండ శ్చాజ్యనాసః సామఘోష్యస్వనో మహాన్**
**ధర్మసత్యమయః శ్రీమాన్ క్రమవిక్రమ సత్క్రియః**
**ప్రాయశ్చిత్తనఖో ధీరః పశుజానుర్మహా భుజః**
**ఔద్గాత్రాంత్రో హోమలింగః ఫలబీజ మహౌషధిః**
**వాయ్వంతరాత్మా మంత్రస్ఫిగ్వికృతః సోమశోణితః**
**వేదస్కంధో హవిర్గంధో హవ్యకవ్యాతి వేగవాన్**
**ప్రాగ్వంశకాయో ద్యుతిమాన్ నానాదీక్షాభిరర్చితః**
**దక్షిణాహృదయో యోగీ మహామంత్రమయో మహాన్**
**ఉపాకర్మోష్టచుబుకః ప్రవర్గ్యావర్తభూషణః**
**నానాచ్ఛందోగతిపథో గుహ్యోపనిషదాసనః**
**ఛాయాపత్నీ సహాయోవై మేరు శృంగ ఇవోచ్ఛ్రితః**

| | | | |
|---|---|---|---|
| వేదాలే | – అతనిపాదాలు | ఔద్గాత్రమే | – ఆంత్రము (ప్రేగు) |
| యూపస్తంభాలు | – కోరలు | హోమమే | – లింగము |
| క్రతువులు | – హస్తాలు | ఫలములే | – అవయవాలు |
| యాగార్థమైనకాష్టములచితి | – ముఖము | వాయువు | – అతని అంతరాత్మ |
| అగ్నియే | – నాలుక | మంత్రాలు | – పెదవులు |
| ధర్మాలే | – రోమాలు | సోమరసము | – రక్తము |
| తపోవంతులైన బ్రాహ్మణులే | – తల | వేదాలు | – భుజాలు |
| అహోరాత్రాలు | – చూపులు (దృష్టి) | వేది | – స్కందము |
| వేదాంతశ్రుతులు | – చెవికమ్మలు (అలంకారాలు) | హవిస్సు | – గంధము |
| | | హవ్యకవ్యములు | – వేదాలు |
| స్రువమే | – తుండము | ప్రాగ్వంశికలు | – దేహము |
| ఆజ్యమే | – ముక్కు | దానము | – హృదయము |
| సామఘోషయే | – గొప్పధ్వని | ఉపకర్మలు | – పెదవులు, గడ్డము |
| సత్క్రియలే | – అతని క్రమ విక్రమములు | ప్రవర్గ్యలు | – భూషణములు |
| | | నానాఛందస్సులు | – మార్గాలు |
| ప్రాయశ్చిత్తములే | – నఖములు | గుహ్యోపనిషత్తు | – అతని ఆసనము |
| పశువు | – జానువు | ఛాయ | – పత్ని |

అతడు ధర్మసత్యమయుడు, నానాదీక్షలచే అర్చించబడినవాడు, పర్వతమువలె ఉన్నతుడు అని చెప్పబడింది. విష్ణువు కోరికలు తీర్చే దేవత కూడా. వేదంలో విష్ణువు యొక్క శ్రేష్ఠమైన రూపంగల కుమారుణ్ణి ప్రసాదించమని ప్రార్థనకూడా ఉన్నది.

**విష్ణోశ్రేష్టేన రూపేణాస్యాం నార్యాంగ వీన్యాం ।**
**పుమాసం పుత్రానాదేహి దశమే మాసి సూతవే ॥**

ఓ విష్ణువా ! మంచి రూపం గల మగపిల్లవాణ్ణి కలిగించు.

ఈ రకంగా శ్రీ మహావిష్ణువు మూడు అంగలలో భూమిని ఆక్రమించినవాడుగా, పెద్దరూపం గలవాడుగా, అసురులను సంహరించేవాడుగా, మానవుల కోరికలు తీర్చేవాడుగా, వేదాలలో చెప్పబడింది.

ఇక ఉపనిషత్తుల విషయానికి వస్తే, నాలుగు వేదాలకు కలిపి 1180 ఉపనిషత్తులు ఉన్నాయి. వాటిలో ముఖ్యమైనవి 108.

| | | |
|---|---|---|
| ఋగ్వేదానికి సంబంధించినవి | - | 10 |
| కృష్ణయజుర్వేదానికి సంబంధించినవి | - | 32 |
| శుక్ల యజుర్వేదానికి సంబంధించినవి | - | 19 |
| సామవేదానికి సంబంధించినవి | - | 16 |
| అధర్వణవేదానికి సంబంధించినవి | - | 31 |
| మొత్తం | | 108 |

వీటిలో వైష్ణవసిద్ధాంతాన్ని బోధించేవి 14. అవి

1. అవ్యక్తోపనిషత్తు
2. కలిసంతరణోపనిషత్తు
3. కృష్ణోపనిషత్తు
4. గరుడోపనిషత్తు
5. గోపాలతాపిన్యుపనిషత్తు
6. తారసారోపనిషత్తు
7. మహానారాయణోపనిషత్తు
8. దత్తాత్రేయోపనిషత్తు
9. నారాయణోపనిషత్తు
10. నృసింహతాపిన్యుపనిషత్తు
11. రామతాపిన్యుపనిషత్తు
12. రామరహస్యోపనిషత్తు
13. వాసుదేవోపనిషత్తు
14. హయగ్రీవోపనిషత్తు

ఈ 14 ఉపనిషత్తులలోనూ దేవతలందరిలో శ్రీమహావిష్ణువే అధికుడని, అతడే సృష్టిస్థితిలయకారకుడైన పరబ్రహ్మ అని చెప్పబడింది. ఉదాహరణకు **నారాయణోపనిషత్తు**ను చూద్దాం. ఇది కృష్ణ యజుర్వేదానికి సంబంధించినది. దీనిలో

**ఓం. అథపురుషో హ వై నారాయణోఽకామయత, ప్రజాః సృజేయేతి, నారాయణా త్ప్రాణో జాయతే, మన స్సర్వేంద్రియాణిచ, ఖం వాయుర్జ్యోతి రాపః పృథివీ విశ్వస్యధారిణీ, నారాయణా ద్బ్రహ్మాజాయతే, నారాయణాద్రుద్రో జాయతే, నారాయణా దింద్రో జాయతే, నారాయణా త్ప్రజాపతిః ప్రజాయతే, నారాయణా ద్ద్వాదశాదిత్యా రుద్రా వసవ స్సర్వాణి ఛందాంసి, నారాయణాదేవ సముత్పద్యంతే, నారాయణా త్ప్రవర్తంతే, నారాయణే ప్రలీయంతే, ఏత దృగ్వేదశిరోఽధీతే.**

సృష్టి ప్రారంభంలో ఉన్నవాడు పరమపురుషుడైన నారాయణుడొక్కడే. అతడు సృష్టి చెయ్యాలి అనుకున్నాడు. అప్పుడు నారాయణుని శరీరం నుంచి సూక్ష్మరూపి అయిన హిరణ్యగర్భుడు పుట్టాడు. ఆ తరువాత ఆకాశాది పంచభూతాలు పుట్టినాయి. ఈ రకంగా

నారాయణుని నుండి బ్రహ్మ, రుద్రుడు, ఇంద్రుడు, మరీచి, కశ్యపుడు మొదలైన ప్రజాపతులు, ఏకాదశరుద్రులు, ద్వాదశాదిత్యులు, అష్టవసువులు, సకల వేదాలు ఉద్భవించాయి. ఒకటేమిటి ? చరాచరజగత్తంతా నారాయణుని నుంచే పుట్టింది. ఇవన్నీ అసలు నారాయణునిలోనే ఉన్నాయి. చివరకు నారాయణుని యందే లయమవుతున్నాయి. ఈ తత్త్వము ఋగ్వేదంలో చెప్పబడింది.

**అథ నిత్యో నారాయణః, బ్రహ్మోనారాయణః, శివశ్చ నారాయణః శక్రశ్చ నారాయణః, ద్యావాపృథివ్యౌ చ నారాయణః, కాలశ్చ నారాయణః, దిశశ్చ నారాయణః ఊర్ధ్వంచ నారాయణః, అధశ్చ నారాయణః, అంతర్బహిశ్చ నారాయణః, నారాయణ ఏవేదగ్ంసర్వం, యద్భూతం యచ్చభవ్యం, నిష్కళంకో నిరంజనో నిర్వికల్పో, నిరాఖ్యాతశ్శుద్ధో దేవ ఏకో నారాయణః, న ద్వితీయోఽస్తి కశ్చిత్, య ఏవం వేదస విష్ణు రేవ భవతి స విష్ణురేవ భవతి, ఏత ద్యజుర్వేద శిరోఽధీతే.**

నారాయణుడే సత్యము నిత్యము అయినవాడు. నారాయణుడే బ్రహ్మ, నారాయణుడే శివుడు. అతడే ఇంద్రుడు, భూమి, ఆకాశము, కాలము, దశదిశలు అంతా నారాయణుడే. ఊర్ధ్వభాగాన ఉన్నది నారాయణుడే. అధోభాగాన ఉన్నది నారాయణుడే. మధ్యభాగాన ఉన్నది నారాయణుడే. బాహ్యాంభ్యంతరములందంతటా ఉన్నది నారాయణుడే. భూతభవిష్య ద్వర్తమానాలు నారాయణుడే. అతడు నిష్కళంకుడు, నిరంజనుడు, నిర్వికల్పుడు, పరిశుద్ధమైనవాడు, అద్వితీయుడు. అతన్ని వాక్కులతో నిర్వచించలేము. నారాయణుడు తప్ప వేరెవ్వరూ లేరు. ఈ విషయం గ్రహించిన వాడు కూడా నారాయణుడే అవుతాడు. ఈ విషయము యజుర్వేదంలో చెప్పబడింది.

**ఓమి త్యగ్రే వ్యాహరేత్, నమఇతిపశ్చాత్ నారాయణాయేత్యుపరిష్టాత్, ఓమిత్యేకాక్షరమ్, నమఇతి ద్వే అక్షరే, నారాయణాయేతి పంచాక్షరాణి, ఏతద్వై నారాయణస్యాష్టా క్షరం పదమ్, యోహవై నారాయణస్యాష్టాక్షరం పదమధ్యేతి, అనపబ్రు వస్సర్వమాయు రేతి, విందతే ప్రాజాపత్యమ్, రాయస్పోషం గౌపత్యమ్, తతోఽమృతత్వ మశ్నుతే తతోఽమృతత్వమశ్నుత ఇతి, ఏత త్సామవేద శిరోఽధీతే.**

ముందుగా 'ఓం' అనాలి. తరువాత 'నమో' అనాలి. ఆ తరువాత 'నారాయణాయ' అని చెప్పాలి. **ఓం నమోనారాయణాయ** అనేది ఎనిమిది అక్షరాలు గల అష్టాక్షరీ మహామంత్రం. ఈ మంత్రాన్ని భక్తిశ్రద్ధలతో జపించేవాడు పూర్ణాయుష్కుడవుతాడు.

ధనధాన్యాలు పొందుతాడు. స్వర్గాన్ని పొందుతాడు. బ్రహ్మపదవి పొందుతాడు. చివరకు అమృతత్త్వాన్ని కూడా పొందుతాడు అని సామవేదంలో చెప్పబడింది.

**ప్రత్యగానందం బ్రహ్మ పురుషం ప్రణవస్వరూపమ్, అకార ఉకారో మకార ఇతి, తానే కధా సమభవ త్తదేవత దోమితి య ముక్త్వా ముచ్యతే యోగీ జన్మసంసారబంధనాత్, ఓం నమోనారాయణాయేతి మంత్రోపాసకః, వైకుంఠభవనం గమిష్యతి, తదిదం పరం పుండరీకం విజ్ఞానఘనం తస్మాత్తటిదాభమాత్రమ్, బ్రహ్మణ్యో దేవకీపుత్రో బ్రహ్మణ్యో మధుసూదన ఇతి, సర్వభూతస్థ మేకం వై నారాయణం కారణపురుష మకారణం పరంబ్రహ్మోమ్, ఏతదధర్వశిరోఽధీతే.**

అకార ఉకార మకారములు కలిసి 'ఓం' అనే ప్రణవము అవుతున్నది. ఈ ప్రణవానికి అర్థం – ప్రత్యగాత్మ. ఓం కారాన్ని అర్థయుక్తంగా జపించేవాడు జనన మరణాది సంసార బంధనాలనుండి విముక్తుడవుతాడు. అష్టాక్షరీమంత్రోపాసన చేసినవాడు వైకుంఠం చేరతాడు.

సర్వాంతర్యామి అయిన పరబ్రహ్మ హృదయపద్మంలో ప్రకాశిస్తుంటాడు. పరబ్రహ్మ స్వరూపుడైన నారాయణుడు దేవకీపుత్రుడు, మధుసూదనుడు. జీవకోటి యందంతటా అంతర్యామిగా ప్రకాశిస్తున్నాడు. అతడు సర్వవ్యాపి. ఈ జగత్తుకు కారణభూతుడు తనకు వేరొక కారణము లేనివాడు. ఈ విషయము అధర్వవేదంలో చెప్పబడింది.

**ప్రాతరధీయానో రాత్రి కృతింపాపం నాశయతి, సాయమధీయానో దివసకృతం పాపం నాశయతి, తత్సాయంప్రాతరధీయానః అపాపో భవతి, మాధ్యందిన మాది త్యాభి ముఖోఽధీయానః పంచమహాపాతకోఽపపాతకా త్ప్రముచ్యతే, సర్వవేద పారాయణపుణ్యం లభతే, నారాయణసాయుజ్య మవాప్నోతి, శ్రీమన్నారాయణ సాయుజ్య మవాప్నోతి, య ఏవం వేద, ఇత్యుపనిషత్.**

ఈఉపనిషత్తును ఉదయంపూట పారాయణచేస్తే రాత్రిచేసిన పాపం నశించిపోతుంది. సాయంత్రం పారాయణ చేస్తే పగలు చేసిన పాపం నశిస్తుంది. మధ్యాహ్నకాలంలో సూర్యుని ఎదురుగా కూర్చుని ఈ ఉపనిషత్తును పారాయణచేస్తే పంచమహాపాతకాలు నశిస్తాయి. **నారాయణోపనిషత్తు**ను పారాయణచేస్తే నాలుగు వేదాలు పారాయణ చేసిన ఫలితము దక్కుతుంది. అంత్యకాలంలో నారాయణుని సాయుజ్యం లభిస్తుంది. ఈ రకంగా దీన్ని గురించి తెలుసుకున్నవాడు కూడా సాయుజ్యం పొందుతాడు. అందుచేతనే ఐతిహాసికులు, పౌరాణికులు

**సత్యం సత్యం పునసత్యం ఉద్ధృత్య భుజముద్యతే ।**

**వేదశాస్త్రాత్పరంనాస్తి న దైవం కేశవాత్పరమ్ ॥**

వేదం కన్న గొప్పదైన ప్రమాణంలేదు. కేశవుని కన్న పరదైవములేదు. అది ముమ్మాటికీ నిజము అంటున్నారు.

రామానుజాచార్యుల వారి ఆశీస్సులతో వారి శిష్యులు శ్రీ పరాశరభట్టరుస్వామి వారు **భగవద్గుణ దర్పణము** అను పేర విష్ణుసహస్రనామాలకు వ్యాఖ్య వ్రాశారు. అందులో విష్ణుసహస్రము యొక్క ప్రాశస్త్యాన్ని వివరిస్తూ.

**మహాభారతసారత్వాత్ ఋషిభిః పరిగానతః ।**

**వేదాచార్యసమాహారాత్ భీష్మోత్కృష్టమతత్వతః ॥**

**పరిగ్రహాతిశయతః గీతాద్యైకార్థ్య తశ్చనః ।**

**సహస్రనామ్నామధ్యాయః ఉపాదేయ తమోమతః ॥**

విష్ణుసహస్రం ఉత్తమమైనది అని చెప్పటానికి ఆరు కారణాలున్నాయి.

1. పంచమ వేదంగా ప్రసిద్ధిపొందిన భారతంలో ఈ అధ్యాయము శ్రేష్ఠమైనది.

2. భగవంతుని సాక్షాత్కారం పొందిన మహర్షులు ఆ భగవత్తత్త్వాన్ని నామాలుగా చెప్పారు.

3. ఈ నామాలు సాక్షాత్తు శ్రీ మహావిష్ణువు స్వరూపమైన వ్యాసభగవానుడు రచించిన భారతంలోవి.

4. ధర్మపరుడు, విజ్ఞాననిధి అయిన భీష్మపితామహుడు ఈ నామాలను చెప్పటం జరిగింది.

5. ఉపనిషత్తులలాగానే ఈ నామాలు భగవన్నిరూపణ చేస్తాయి.

6. సహస్రనామ పారాయణ భక్తులకు ఇహము పరము కూడా ప్రసాదిస్తుంది.

దేవతలందరిలోకీ శ్రేష్ఠుడు, దుష్టశిక్షకుడు, శిష్ఠరక్షకుడు, ఆద్యంతరహితుడు, సృష్టి స్థితి లయ కారకుడు శ్రీమన్నారాయణుడు. అతడు తప్ప వేరే దైవంలేదు. అతడే పరబ్రహ్మ. మోక్షప్రదాత. అతని పాదారవిందములను చేరటమే కైవల్యప్రాప్తి.

శ్రీ మహావిష్ణువును వివిధరకాలుగా వర్ణించే వేయినామాలనే **'విష్ణుసహస్రనామములు'** అంటారు. ఈ నామాల అర్థాన్ని గనక పూర్తిగా తెలుసుకున్నట్లైతే సాధకుడికి కైవల్యం సిద్ధిస్తుంది. అంటే కైవల్య ప్రాప్తికి విష్ణుసహస్రనామాలు దారి చూపుతాయన్న మాట.

అందుచేతనే విష్ణుసహస్రనామాలు కైవల్యానికి సారథి వంటివి. ఆ కారణంవల్లనే ఈ గ్రంథానికి **శ్రీ కైవల్యసారథి** అని నామకరణం చేయటం జరిగింది. బమ్మెరపోతనామాత్యుడు కూడా భాగవతంలోని మొదటి పద్యంలో కైవల్యప్రాప్తి కోసమే తాను భాగవతరచన చేస్తున్నానంటాడు.

**శ్రీ కైవల్య పదంబుఁ జేరుటకునై చింతించెదన్ లోకర**
**క్షాకరంభకు, భక్తపాలన కళాసంరంభకున్, దానవో ।**
**ద్రేకస్తంభకుఁ గేళీలోలవిలసద్దృగ్జాల సంభూతనా**
**నాకంజాత భవాండకుంభకు మహానందాంగనాడింభకున్ ॥**

విష్ణుసహస్రానికి మొదటగా భాష్యం వ్రాసిన మహానుభావుడు శంకర భగవత్పాదుల వారు. తరువాత వారంతా వారిని అనుసరించినవారే.

**ఆదినాథ సమారంభాం శంకరాచార్య మధ్యమాం ।**
**అస్మ దాచార్య పర్యంతాం వందే గురు పరంపరాం ॥**

ముందుగా నా గురు పరంపర విరజానందనాథ, సదానందనాథ, శుకానంద నాథులకు నమస్కరించి హిందూ ధర్మపరిరక్షణ కోసం ఏర్పాటయిన శృంగేరీ, పూరి, బదరి, ద్వారక, కంచి పీఠాధిపతులకు ప్రణమిల్లి, పుష్పగిరి, కుర్తాళం పీఠాధిపతులకు వందనాలర్పించి, గన్నవరం భువనేశ్వరీ పీఠాధిపతులకు, గుంటూరు శృంగేరీ శ్రీ విరూపాక్ష పీఠాధిపతులకు, ప్రణామాలర్పించి, గణపతి సచ్చిదానందస్వామివారికి నమస్కరించి, పెదపులిపాక లలితా పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ వాసుదేవానందగిరి స్వామి వారికి, మాతా శివచైతన్యవారికి, చంద్రకాళీమాతాజీ వారికి నమోవాకములర్పించి, శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ చినజియర్‌స్వామి వారికి పాదాభివందనముచేసి, శంకరభగవత్పాదుల వారి భాష్యాన్ని ప్రాతిపదికగా తీసుకుని దానికి మత్స్యపురాణము, కూర్మపురాణము, వరాహపురాణము, బ్రహ్మపురాణము, విష్ణుపురాణము, విష్ణుధర్మోత్తరపురాణము, 108 ఉపనిషత్తులు, ప్రత్యేకించి వైష్ణవ ఉపనిషత్తులు, భగవద్గీత, శ్రీ మహాభాగవతము, తిరుప్పావై వంటి గ్రంథాలను జోడించి, విష్ణుసహస్రనామాలలో ఉన్న విషయం సామాన్య మానవుడికి కూడా అతి తేలికగా విపులంగా అర్థంకావాలనే ఉద్దేశ్యంతో, అతి సులభశైలిలో హరితస గోత్రీకుడనైన **క్రోవి పార్థసారథి** అను నేను **శ్రీ కైవల్యసారథి** అను పేర విష్ణుసహస్ర నామాలకు భాష్యం చెబుతున్నాను. పండితులు, విష్ణుభక్తులు అందరూ నా యీ సాహసాన్ని మన్నించి, నన్ను ఆశీర్వదింతురుగాక.

# ౨. వేదవ్యాసుడు

**వ్యాసం వసిష్ఠనప్తారం శక్తేః పౌత్రమ కల్మషం ।**
**పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్ ॥**

బ్రహ్మ మానసపుత్రుడు వసిష్ఠుడు. వసిష్ఠుని కుమారుడు శక్తి. శక్తికుమారుడు పరాశరుడు. పరాశరుని కుమారుడు – వ్యాసుడు. మహాతపస్వి, శుకమహర్షి యొక్క తండ్రి అయిన వ్యాసమహర్షికి నమస్కారము.

వేదాలు అపౌరుషేయాలు. అవి ఎవరిచేత వ్రాయబడలేదు. ప్రత్యక్షంగా బ్రహ్మముఖం నుండే వచ్చినాయి. ఇక్కడ బ్రహ్మ అంటే పరమేశ్వరుడు. సృష్టి, స్థితి, లయ కారకుడు. ఆది మధ్యాంతరహితుడు. పరమేశ్వరుడు ఈ వేదాలను సృష్టికారకుడైన ప్రజాపతికి ఇచ్చాడు. కాలక్రమేణా ఈ వేదాలు గరుపరంపరగా భూలోకంలో వ్యాప్తిచెందాయి.

త్రేతాయుగం వరకు ఈ వేదం అంతా ఒకటిగానే ఉండేది. ఆ తరువాత కాలంలో అంటే ద్వాపరయుగంలో కలగా పులగంగా ఉన్న ఈ వేదాన్ని అర్థంచేసుకోవటం కష్టమైంది. అందుచేత ప్రజాపతి, అపాంతరతముడు అనే మానసపుత్రుణ్ణి సృష్టించి, వేదాన్ని భూలోకంలో బాగా ప్రచారం చేసి రమ్మన్నాడు. అపాంతరతముడు ఋగ్, యజు, స్సామ అధర్వణములు అని వేదాన్ని నాలుగు భాగాలుగా చేసి బహుళప్రచారంలోకి తెచ్చి, తన తండ్రియైన బ్రహ్మదగ్గరకు వెళ్ళి ఈ విషయం చెప్పాడు. దానికి బ్రహ్మ చాలా సంతోషించి ప్రతి మహాయుగంలోని ద్వాపరయుగంలోనూ వేదాలను ఈ రకంగానే విభజనచేసి ప్రచారం చెయ్యవలసినదిగా అపాంతరతముణ్ణి ఆదేశించాడు.

నాలుగు యుగాలు కలిస్తే ఒక మహాయుగం. ప్రతి మహాయుగంలోని ద్వాపరయుగం లోనూ ఈ వేదాలు బ్రహ్మయొక్క ఆదేశానుసారము విభజన చేయబడుతుంటాయి.

ఇది ఇరవై ఎనిమిదవ మహాయుగము. అంటే ఇప్పటికి ఇరవై ఎనిమిది సార్లు వేదాలను విభజించటం జరిగింది. వేదాలను విభజించినటువంటివాడు వేదవ్యాసుడు అనబడతాడు. ఈ మహాయుగంలో వేదాలను విభజించినవాడు కృష్ణద్వైపాయనుడు. అతడే మనకు తెలిసిన వేదవ్యాసుడు.

పరాశరమహర్షి తీర్థయాత్రలు చేస్తూ కాళిందీ నదీతీరాన్ని చేరి, ఆ నదిని దాటించమని దాశరాజును అడిగాడు. ఆ సమయంలో దాశరాజు భోజనం చేస్తున్నాడు. అందుచేత, తన ప్రక్కనే ఉన్న తనకుమార్తెను ఆ పని చెయ్యమన్నాడు. దాశరాజు కుమార్తె

మత్స్యగంధి పడవలో మహర్షిని ఎక్కించుకొని బయలుదేరింది. పడవ నది మధ్యకి చేరింది. దైవికంగా మహర్షి మనస్సు మత్స్యగంధి మీదకు పోయింది. ఆపుకోలేని తమకంతో మహర్షి ఆమె చెయ్యి పట్టుకున్నాడు. అప్పుడు మత్స్యగంధి "స్వామీ ! నేను దుర్వాసన వేస్తున్నాను కదా. మీకు అసహ్యం కలగటం లేదా ?" అన్నది. ఆ మాట విన్న వెంటనే మహర్షి, ఆమె ఉన్నచోటునుంచి యోజనదూరం కస్తూరి వాసనలు వెదజల్లేటట్లుగా వరమిచ్చాడు. అప్పటినుంచే మత్స్యగంధి కాస్తా 'యోజనగంధి' అయింది. అప్పుడు ఆమె "స్వామీ ! ఇది పగలు. లోకమంతా చూస్తుంది. అదీగాక, దివాసంగమం నిషిద్ధం కదా ?" అన్నది. మహర్షి తనతపశ్శక్తితో ఆ ప్రాంతమంతా చిమ్మచీకట్లు ఆవరింపచేశాడు. అప్పుడు ఆమె "నేను కన్యను. నీ పని నువ్వు చేసుకుపోతావు. మరి నా సంగతి ఏమిటి?" అంది. ఆమె కన్యత్వము చెడకుండా వరమిచ్చాడు మహర్షి. ఈ రకంగా తన కన్యత్వము చెడకుండ, తండ్రికి తెలియకుండ, తనకు నిత్యయవ్వనము, నిత్యసుగంధము ఉండేటట్లు, పరాశరునితోపాటు సమానమైన కుమారుడు కలిగేటట్లు వరాలు పుచ్చుకుని మహర్షి కోర్కె తీర్చింది. మహర్షి సంతుష్టి చెంది "నీకు విష్ణ్వంశ సంభూతుడు, ముల్లోకాలలోను ఖ్యాతిని ఆర్జించేవాడు, వేదవిభజన చేసేవాడు, పురాణకర్త అయిన కుమారుడు పుడతాడు" అని ఆమెను దీవించి తనదారిని తాను వెళ్ళిపోయాడు.

యోజనగంధి సద్యోగర్భాన ఒక కుమారుణ్ణి కన్నది. అతడు పుడుతూనే మునివేషంలో దండకమండలాలు ధరించి ఉన్నాడు. పుట్టిన వెంటనే తల్లికి నమస్కరించి, అవసరమై నప్పుడు స్మరణమాత్రంచేతనే ప్రత్యక్షమవుతాను అని తల్లికిమాట ఇచ్చి, తపస్సు చేసుకోవటానికి వెళ్ళిపోయాడు. ఈ విధంగా కృష్ణద్వీపమున (చీకటిగా ఉన్న ద్వీపము నందు) జన్మించినవాడు కావటంచేత ఆ బాలకుడు కృష్ణద్వైపాయనుడైనాడు. వేదవిభజన చేసి వేదవ్యాసుడు అయినాడు. ఈయనే వ్యాసమహర్షి. ఋషులలో అనేక భేదాలున్నాయి. 1. మహర్షులు – వ్యాసుడు మొ॥వారు. 2. పరమఋషులు – ఖేలాదులు. 3. దేవర్షులు – నారుదుడు, కణ్వుడు మొ॥వారు. 4. బ్రహ్మర్షులు – వసిష్ఠాదులు 5. శ్రుతర్షులు – శుశ్రుతాదులు 6. రాజర్షులు – విశ్వామిత్రాదులు 7. కాండర్షులు – జైమిన్యాదులు. ఈ ఋషులందరిలోను వ్యాసుడు ప్రముఖుడు.

ఆ రోజుల్లో వేదంలో ఉన్న విషయం సామాన్యుడికి చేరటం కష్టమైంది. అందుచేతనే వేదసారాన్నంతటినీ పురాణాల రూపంలో కథలుగా చెప్పాడు వ్యాసుడు. మొత్తం అష్టాదశపురాణాలను వ్రాశాడు. అవి

**మద్వయం భద్వయంచైవ బ్రత్రయం వ చతుష్టయమ్ ।**

**అనాపలింగ కూస్కాని పురాణాని పృథక్ పృథక్ ॥**

| | | | |
|---|---|---|---|
| మద్వయం | – | 1. మత్స్యపురాణము | 2. మార్కండేయపురాణము |
| భద్వయం | – | 1. భవిష్యద్పురాణము | 2. భాగవతము |
| బ్రత్రయం | – | 1. బ్రహ్మపురాణము | 2. బ్రహ్మాండపురాణము |
| | | 3. బ్రహ్మ వైవర్తపురాణము | |
| వచతుష్టయమ్ | – | 1. వామనపురాణము | 2. వాయుపురాణము |
| | | 3. విష్ణుపురాణము | 4. వరాహపురాణము |

| | | | | | |
|---|---|---|---|---|---|
| అ | – | అగ్నిపురాణము | గ | – | గరుడపురాణము |
| నా | – | నారదపురాణము | కూ | – | కూర్మపురాణము |
| ప | – | పద్మపురాణము | స్కా | – | స్కాందపురాణము |
| లిం | – | లింగపురాణము | | | |

వీటినేకాక శ్రీ మహాభారతాన్ని వ్యాసమహర్షే వ్రాశాడు. అంతేకాదు. ఇవన్నీ వ్రాసిన తరువాత చివరగా బ్రహ్మసూత్రాలను వ్రాసి అద్వైతమతాన్ని స్థాపించిన మహానుభావుడు వేదవ్యాసుడు.

చంద్రవంశరాజుల చరిత్ర అయిన ఇతిహాసాన్ని 'భారతము' అనే పేరుతో వ్యాసుడు వ్రాసాడు అని ముందే చెప్పాం. అయితే వ్యాసుడు కేవలము మహాభారతకథను వ్రాయటమే కాదు. అందులో జీవించాడు. ఆ కథతో, ఆ చరిత్రతో అతడికి ప్రత్యక్ష సంబంధమున్నది. సత్యవతీనందనుడు వ్యాసుడు. సత్యవతికి జన్మించిన విచిత్రవీర్యుడు చిత్రాంగదుల కుమారులే ధృతరాష్ట్రుడు, పాండురాజు. వీరి కుమారులే కౌరవ పాండవులు. అంటే వ్యాసుడు కౌరవపాండవులకు తాత. అంతేకాదు అతడు జన్మించిన వెంటనే 'తలచినంత మాత్రంచేతనే ప్రత్యక్షం అవుతాను'. అని తల్లి అయిన సత్యవతికి వరమిచ్చి, తపోవనాలకు వెళ్ళిపోయాడు. విచిత్రవీర్యుడు, చిత్రాంగదుడు మరణించిన తరువాత, తల్లి కోరిక మీద ధృతరాష్ట్ర, పాండురాజులకు జన్మనిచ్చాడు. అంతేకాదు అవసరం అయినప్పుడల్లా ప్రత్యక్షమై వారి వారి సందేహాలు తీరుస్తుండేవాడు. యుద్ధం జరిగే రోజుల్లో సంజయుడు యుద్ధభూమి అంతా తిరిగి విషయసేకరణచేసుకునేందుకు వీలుగా అతనికి శక్తిని ప్రసాదించాడు.

అటువంటి వ్యాసమహర్షి భారంతలోని అనుశాసనిక పర్వంలో భీష్ముని నోటిద్వారా విష్ణుసహస్రాన్ని ధర్మజుడికి చెప్పిస్తాడు. ఈరకంగా ఇన్ని పురాణాలు, మహాభారతము, బ్రహ్మసూత్రాలు వ్రాసి, అద్వైతమతస్థాపనచేసిన వ్యాసమహర్షి సాక్షాత్తూ పరమేశ్వర స్వరూపుడే అందుకే విష్ణుపురాణంలో

**కృష్ణద్వైపాయనం వ్యాసం విద్ధి నారాయణం ప్రభుం ।**
**కోహ్యన్యో భువి మైత్రేయ । మహాభారత కృద్భవేత్ ॥**

ఓ మైత్రేయా ! కృష్ణద్వైపాయనుడై పుట్టిన వ్యాసుడు సాక్షాత్తూ నారాయణుడే కాకపోతే మహాభారత రచన సాధ్యంకాదు. అని చెప్పబడింది.

**వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే ।**
**నమో వై బ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమోనమః ॥**

వసిష్ఠుని వంశంలో పుట్టిన, విష్ణుస్వరూపుడైన వ్యాసునికి నమస్కారము.



# 3. శంకరభగవత్పాదులు

శ్రుతిస్మృతి పురాణానామాలయం కరుణాలయం ।
నమామి భగవత్పాదం శంకరం లోకశంకరం ॥

శంకరం శంకరాచార్యం కేశవం బాదరాయణం ।
సూత్రభాష్యకృతౌవందే భగవంతౌ పునః పునః ॥

కేరళదేశంలో పూర్ణానదీ తీరంలో కాలడి అనే గ్రామం ఉన్నది. ఆ గ్రామంలో ఆర్యాంబ, శివగురువు అనే నంబూద్రి దంపతులుండేవారు. వారికి చాలాకాలం వరకు పిల్లలులేరు. అప్పుడు వారు త్రిచూరునందలి 'వృషాచలేశ్వరస్వామి'ని ఆరాధించగా, ఆ స్వామి దయవల్ల ఒక కుమారుడు కలిగాడు. ఆ కుమారుడికి శంకరుడు అని నామకరణం చేసి అల్లారుముద్దగా పెంచసాగారు. శంకరుడికి మూడు సంవత్సరాల వయసు వచ్చేసరికి అతని తండ్రి శివగురువు పరమపదించారు.

అప్పటినుండి తల్లి ఆర్యాంబయే కుమారుణ్ణి పెంచుతూ ఐదవయేట ఉపనయనం చేసింది. ఆర్యాంబ తన ఇంటివద్ద నున్న ఆలయంలో నిత్యం కాత్యాయనీ దేవిని అర్చిస్తూ ఉండేది. ఒకరోజు తనకు ఆలయానికి వెళ్ళటానికి వీలుపడక బాలశంకరుణ్ణి పంపింది. ఆయన నైవేద్యానికి పాలు తీసుకువెళ్ళాడు. ఆలయంలో దేవిని అర్చించి శంకరుడు దేవికి నైవేద్యంగా పాలు సమర్పించాడు. ఎంతకీ దేవి పాలు త్రాగలేదు. అది చూసి శంకరుడు గుక్కపెట్టి ఏడవటం మొదలుపెట్టాడు. శంకరుడి అవస్థచూసి ఆ పరమేశ్వరి గిన్నెలోని పాలను త్రాగి వెళ్ళింది. శంకరుడు కళ్ళు తెరిచి చూసేసరికి గిన్నె ఖాళీగా కనిపించింది. శంకరుడు మళ్ళీ ఏడుపు మొదలుపెట్టాడు. శంకరుడు ఎందుకు ఏడుస్తున్నాడో ఆ దేవికి అర్థంకాలేదు. అప్పుడు పరమేశ్వరి దేవి ప్రత్యక్షమై అతని ఏడుపుకు కారణం అడిగింది. "నీకు నైవేద్యం పెట్టిన తరువాత మా అమ్మ ఆ గిన్నెలోని పాలను నాకిచ్చేది. ఇప్పుడు పాలన్నీ నువ్వే త్రాగేశావు. నాకు ఆకలి వేస్తోంది. నేనేం త్రాగాలి ?" అన్నాడు. దానికి ఆ పరమేశ్వరి చలించి శంకరుడికి స్తన్యం ఇచ్చింది. ఆ విధంగా దేవిస్తన్యం గ్రోలినందువల్లనే శంకరుడు అంత గొప్పవాడయ్యాడని ప్రతీతి.

శంకరుడు జన్మించటానికి ముందు భారతదేశంలో వేదవిరుద్ధమైన మతాలు బాగా వ్యాప్తిలో ఉన్నాయి. శైవవైష్ణవ మతాలు బాగా చెలరేగి ప్రజలను అశాంతి పాలు చేస్తున్నాయి. వర్ణాశ్రమ వ్యవస్థ తారుమారయింది. బౌద్ధ, జైన మతాలు అహింసను

మాత్రం ప్రచారం చేస్తున్నాయి. యజ్ఞయాగాదులను నిరశిస్తున్నాయి. కాపాలికులు భైరవోపాసకులై నరబలి ఇస్తున్నారు. నాస్తికులు 'దేవుడు లేడు. వేదము ప్రమాణము కాదు' అన్న వాదన లేవదీశారు. శివుడు గొప్పవాడని కొందరు, విష్ణువు గొప్పవాడని కొందరు యుద్ధాలు కూడా చేస్తున్నారు. ప్రజలు నిత్యం భయభ్రాంతులై బ్రతుకును వెళ్ళదీస్తున్నారు.

అటువంటి సమయంలో కుమారస్వామి ఈ లోకంలో కుమారిలభట్టు అనే పేరుతో అవతరించి అవైదికచర్యలను ఖండిస్తున్నాడు. ఆ సమయంలో శంకరభగవత్పాదులు జన్మించారు. సుమారుగా క్రీ॥శ॥ 6, 7 శతాబ్దాలకాలమది.

శంకరుణ్ణి విద్యాభ్యాసం కోసం గురుకులంలో చేర్పించింది తల్లి. మధుకరవృత్తి చేస్తూ విద్యాభ్యాసం కొనసాగిస్తున్నాడు శంకరుడు. ఒకరోజున శంకరుడు ఒక ఇంటికి వెళ్ళి 'భవతీ భిక్షాందేహి' అన్నాడు. ఆ ఇంటి ఇల్లాలు తాము కడుపేదవారమని, తన భర్త కూడా భిక్షాటనకు వెళ్ళాడనీ తెలిపింది. అప్పుడు శంకరుడు ఆమెతో 'ఇంట్లో ఏది ఉంటే అది వెయ్యి' అన్నాడు. ఆ ఇల్లాలు ఇల్లంతా వెతికింది. ఒక పండిన ఉసిరికాయ మాత్రం కనిపించింది. దాన్నే ఆమె శంకరుడికి భిక్షగా వేసింది. అది చూసి చలించిన శంకరుడు లక్ష్మీదేవిని ప్రార్థించాడు. వారింటి ముంగిట బంగారు ఉసిరికాయల వర్షం కురిసింది. ఆ సమయంలో శంకరుడు లక్ష్మీదేవిని చేసిన స్తోత్రమే "కనకధారాస్తవము"గా పేరుపొందింది.

ఏకసంధాగ్రాహి అయిన శంకరుడు కేవలం రెండు సంవత్సరాలలోనే విద్యాభ్యాసం పూర్తి చేశాడు. అసమాన పండితుడని పేరు పొందాడు. శంకరుని కీర్తి ప్రతిష్టలు దశదిశలా వ్యాపించాయి. కేరళ రాజ్యాధిపతి శంకరునికి సాష్టాంగ ప్రణామం ఆచరించి కానుకలర్పించగా, శంకరుడు వాటిని పేదవారికి పంచి, రాజును ఆశీర్వదించాడు. క్రాంగనూరులో ఉన్న ఆలయంలో దేవి ఉగ్రమూర్తిగా ఉన్నదని విని, తనతపశ్శక్తితో ఆమెను ప్రసన్నమూర్తిగా మార్చేశాడు.

ఒకనాడు గౌతమాది మహర్షులు వచ్చి శంకరుల ఆతిథ్యం అందుకుని, వారు చేయవలసిన మహత్కార్యాన్ని గుర్తుచేశారు. అప్పుడు శంకరుడు తాను నిర్వహించవలసిన మహత్కార్యానికి ముందుగా గృహత్యాగం చేసి సన్యాసం స్వీకరించాలని సంకల్పించాడు.

ఒకరోజున తల్లితో కలిసి శంకరుడు నదీస్నానానికి వెళ్ళగా, అక్కడ ఒక మొసలి శంకరుని కాలుపట్టుకుంది. అప్పుడు శంకరుడు తానింక బ్రతకనని, సన్యసించటానికి

అనుజ్ఞ ఇమ్మని తల్లిని వేడుకోగా, ఆ తల్లిదుఃఖిస్తూనే సరేనంది. ఆతుసన్యాసం స్వీకరించాడు శంకరుడు. విచిత్రం మొసలి శంకరుణ్ణి వదలి వెళ్ళిపోయింది. శంకరులు నర్మదానదీతీరానికి వెళ్ళి, అక్కడ గోవిందపాదాచార్యుల వారివద్ద సంప్రదాయ బద్ధంగా సన్యాసం స్వీకరించాడు.

ఒకరోజు నర్మదా నదికి వరద వచ్చి ఊరును ముంచెత్తుతున్నది. ప్రజలు భయభ్రాంతు లౌతున్నారు. అప్పుడు శంకరుడు నర్మదానదీ ప్రవాహాన్ని తన కమండలంలోకి ఆవాహన చేసి ప్రజలను రక్షించాడు. అది చూసిన గోవింద భగవత్పాదాచార్యుల వారు పరమానందం చెందారు. ఎందుకంటే గతంలో ఒకసారి వ్యాసమహర్షి గోవిందభగవత్పాదాచార్యుల వద్దకు వచ్చి 'నర్మదానదిని కమండలంలో పట్టివేసే శిష్యుడు నీకు లభిస్తాడు. అతడే బ్రహ్మసూత్రాలకు భాష్యాలు వ్రాస్తాడు' అని చెప్పాడు. ఆ మాటలు ఇప్పుడు గుర్తు వచ్చి గోవిందభగవత్పాదాచార్యులు శంకరుణ్ణి కాశీ వెళ్ళి విశ్వేశ్వరుని దర్శనం చేసుకుని బ్రహ్మసూత్రాలకు భాష్యం వ్రాయమని ఆశీర్వదించి పంపారు.

మార్గమధ్యంలో ఒక అడవి గుండా వెడుతుండగా చీకటి పడింది. శంకరుడు ఒక వటవృక్షం క్రింద విశ్రమించాడు. ఒక రాత్రివేళ ఆ చెట్టుమీదున్న బ్రహ్మరాక్షసుడు శంకరుణ్ణి పట్టుకుని పీడించాడు. అప్పుడు శంకరుడు అతని ప్రశ్నలకు సమాధానాలు చెప్పగావిని, సంతసించి, వ్యాసమహర్షిని దర్శించే ఉపాయం చెప్పి శాపవిమోచనం పొంది అంతర్ధానం అయ్యాడు.

కాశీలో శంకరుడు కొంతమంది శిష్యులను ఏర్పరచుకుని బదరికావనానికి వెళ్లి, మందాకినీ నదీ తీరాన నివసిస్తూ ప్రస్థానత్రయము అని చెప్పబడే ఉపనిషత్తులు, భగవద్గీత, బ్రహ్మసూత్రాలతోపాటుగా 18 భాష్యములు, 40 ప్రకరణ గ్రంథములు, 74 లఘు గ్రంథములు వ్రాశాడు. వ్యాస మహర్షి వృద్ధ బ్రాహ్మణ రూపంలో వచ్చి, బ్రహ్మసూత్రాలకు శంకరుడు వ్రాసిన భాష్యం విని ఆనందించి అద్వైతమత స్థాపన చెయ్యమని చెప్పి అంతర్ధానం అయ్యాడు.

పండితులందర్నీ వాదనలో ఓడిస్తూ అద్వైత మతస్థాపన చేస్తూ, తన సంచారంలో ప్రయాగలో కర్మసిద్ధాంతవాది అయిన కుమారిలభట్టును వాదనకు పిలువగా ఆయన శంకరుడు సాక్షాత్తూ శంకరుడని గ్రహించి ఓటమినంగీకరించి, తన శిష్యుడైన మండనమిశ్రుణ్ణి గెలవమని చెప్పాడు. శంకరుడు మహిష్మతీ నగరంచేరి, వాదనలో మండనమిశ్రుణ్ణి ఓడించి ఆయనకు 'సురేశ్వరాచార్యులు' అని నామకరణంచేసి శిష్యునిగా చేర్చుకున్నారు.

ఎంతకాలానికీ శంకరుడికి దేవీ తత్వం గురించి పూర్తిగా అవగాహన కాలేదు. అప్పుడు తన గురువైన గోవింద భగవత్పాదాచార్యుల వద్దకు వెళ్ళి దేవీతత్వాన్ని గురించి అడగగా, వారు తమకు గురువైన గౌడపాదాచార్యుల వద్దకు వెళ్ళమని సూచించారు.

అప్పుడు శంకరుడు తన పరమగురువైన గౌడపాదాచార్యుల వారి వద్దకు వెళ్ళి దేవీ తత్వాన్ని గురించి అడగగా వారు తాము వ్రాసిన సుభగోదయస్తుతిని చదవమని చెప్పారు. ఆ రకంగా సుభగోదయ స్తుతి చదివిన తరువాత శంకరుడు శ్రీశైలక్షేత్రానికి వచ్చి శివానన్దలహరి, సౌన్దర్యలహరి అనే గ్రంథాలు వ్రాశారు. మూకాంబా క్షేత్రంలో పుట్టినదగ్గర నుండి జడుడు లాగా ఉన్న ప్రభాకరుడన్న బాలుణ్ణి అనుగ్రహించి అతనికి సన్యాసమిచ్చి 'హస్తామలకుడు' అని పేరు పెట్టారు. శంకరులు శృంగేరి చేరి, ఒకమఠాన్ని స్థాపించి, దానికి సురేశ్వరాచార్యులను పీఠాధిపతిగ చేశారు. అక్కడ మందబుద్ధి అయిన ఒక బాలుణ్ణి, కేవలం సంకల్పమాత్రంచేత పండితుణ్ణి చేసి, సన్యాసమిచ్చి 'తోట కాచార్యులు' అని పేరు పెట్టారు.

శంకరుడు జైత్రయాత్ర చేస్తూ ద్వైతులను, శాక్తేయులను, లక్ష్మీఉపాసకులను, వీరశైవులను, వైష్ణవులను, పాంచరాత్రులను, హిరణ్యగర్భులను, సూర్య, అగ్ని, గణపతి ఉపాసకులను ఓడించి అద్వైత మత స్థాపన చేశారు.

తన జైత్రయాత్రలో భాగంగా మగధ చేరాడు. అక్కడ ప్రజలు "అన్నీ తెలిసిన మీ బోటి వారికి నిర్గుణోపాసన తగి ఉన్నది. కాని మావంటి వారి సంగతి ఏమిటి? అని ప్రశ్నించగా, శంకరుడు వారి కోరిక మన్నించి సగుణోపాసనకు అనువుగా షణ్మత స్థాపన చేసి, ఉపాసనా పద్ధతులు, బహు దేవతాస్తుతులు రచించాడు. అర్చన విధులలో అందరూ విధిగా అర్చించాలని నియమం ఏర్పాటుచేసి, వివిధ దేవతా సంపుటి అయిన పంచాయతనం ప్రవేశపెట్టారు. పంచాయతనం అంటే అదిత్యుడు అంబిక, గణపతి, శివుడు, విష్ణువు. పంచాయతనం పంచభూతాలకూ ప్రతీక.

| | | |
|---|---|---|
| 1. | వాయుతత్వాత్మకుడు | సూర్యుడు |
| 2. | అగ్ని తత్వాత్మక | పరాశక్తి (అంబిక) |
| 3. | పృథివీతత్వాత్మకుడు | గణపతి |
| 4. | ఆకాశ తత్వాత్మకుడు | సదాశివుడు |
| 5. | జలతత్వాత్మకుడు | నారాయణుడు |

ఈ ఐదుకాక సుబ్రహ్మణ్యేశ్వరుడికి కూడా ప్రత్యేకమైన అర్చన చెప్పాడు.

కాశ్మీరదేశంలో ఉన్న సర్వజ్ఞ శారదాపీఠం అధిష్టించినవాడే జగద్గురువని విని అక్కడికి బయలుదేరారు. ఆ పీఠానికి ఎనిమిది దిక్కులందు, ఎనిమంది ఉద్దండులైన పండితులుంటారు. వారందరిని ఓడించి పీఠాన్ని అధిష్టించబోతుండగా సరస్వతీ దేవి ప్రత్యక్షమై 'స్త్రీ సంగమ దోషం నీకున్నది కాబట్టి ఈ పీఠం అధిష్టించటానికి నీవు అర్హుడవు కాదు' అన్నది దానికి శంకరుడు 'వేరొక శరీరంతో చేసిన పాపం ఆత్మను అంటదు' అని సమాధానమిచ్చి, ఆమెను నిరుత్తరను చేసి శారదా పీఠం అధిష్టించి జగద్గురువయ్యాడు.

అద్వైత ప్రచారంకోసం భారతదేశానికి నాలుగువైపులా నాలుగుపీఠాలు స్థాపించారు. దక్షిణాన శృంగేరి యందు, పడమరన ద్వారక యందు, ఉత్తరాన బదరి యందు, తూర్పున పూరియందు, ఆమ్నాయపీఠాలు ఏర్పాటుచేసి వాటియందు వరుసగా సురేశ్వర, హస్తామలక, తోటకాచార్య, పద్మపాదులను పీఠాధిపతులుగా నియమించి, కేదారముచేరి శిష్యులను ఆశీర్వదించి దత్తాత్రేయ గుహలోకి వెళ్ళి అదృశ్యులై పోయారు.

**శంకరుడు - అద్వైతము :**

శంకరాచార్యులవారు అద్వైత మతప్రచారంచేశారు. అద్వైతాన్ని శంకరులు ప్రబోధించలేదు. అద్వైతాన్ని చెప్పినవాడు వ్యాసభగవానుడు. దాన్ని పునః ప్రతిష్ఠచేసినవాడు శంకరుడు.

జీవాత్మ పరమాత్మ ఒక్కటే. సృష్టిచేసిన తరువాత ఈ దేహంలోకి ప్రవేశించాలి అనుకున్నాడు పరమాత్మ. బ్రహ్మ రంధ్రం ద్వారా ప్రవేశించాడు. ఈ రకంగా పరమేశ్వరుడు జగత్తంతా నిండి ఉన్నాడు. దేహంలో ఉన్నది జీవాత్మ. జీవాత్మ పరమాత్మ ఒక్కటే. దేహంలో ఉండటంచేత ఆత్మకు సుఖదుఃఖాలు, గుణదోషాలు అంటినట్లు కనిపిస్తాయి. కాని ఆత్మకు అవేవి అంటవు. జీర్ణమైన వస్త్రాన్ని వదలి ఇంకొక మంచి వస్త్రాన్ని ధరించినట్లే జీవాత్మ ఒక దేహాన్ని వదలి ఇంకొక దేహాన్ని ఆశ్రయిస్తున్నది.

వేదం చదవటం వల్లగాని శాస్త్ర పాండిత్యంవల్లగాని, కర్మలు చెయ్యటంవల్లగాని ముక్తిరాదు. జ్ఞాని అయినవాడే ముక్తికి అర్హుడు. ప్రతిజీవియందు పరమాత్మ ఉన్నాడు. అయితే తానే పరబ్రహ్మ స్వరూపాన్ని అనే విషయం గ్రహించలేకపోతున్నాడు. జ్ఞాని అయిన వాడు సకలజీవులను, జగత్తును తనయందే చూడగలుగుతాడు. అదే బ్రహ్మత్వసిద్ధి అదే సాయుజ్యం. సాయుజ్యము అంటే జీవాత్మ పరమాత్మలో ఏకం కావటం. అలా అని పరమాత్మ ఎక్కడోలేడు. తానే పరమాత్మ తానే పరబ్రహ్మ అని తెలుసుకోవటం.

ముక్తి అంటే విముక్తి. ఈ భవబంధాల నుంచి విముక్తి పొందటమే ముక్తి. అరిషడ్వర్గాలను, నేను నాది అనే అహంకార మమకారాలను జయించినవాడే దీనికి అర్హుడు.

భగవంతుడికి రూపంలేదు. ఏ రూపంతో పిలిస్తే ఆ రూపంతో పలుకుతాడు. శైవము, వైష్ణవము, శాక్తేయము, ఇత్యాది భేదాలు లేవు. జ్ఞానదృష్టి గలవారందరూ మోక్షానికి అర్హులే. ఈరకంగా వ్యాసభగవానుడు పురాణాలలోను, బ్రహ్మసూత్రాలలోనూ ప్రతిపాదించిన అద్వైతసిద్ధాంతాన్ని శంకరుడు పునః ప్రతిష్టచేశాడు.

శంకరులవారు అతి తక్కువ కాలంలో బ్రహ్మసూత్రభాష్యము, సౌందర్యలహరి, వివేకచూడామణి, అపరోక్షానుభూతి, ఆత్మబోధ, ఆత్మానాత్మవివేకము, విష్ణుసహస్రభాష్యము, వంటి గ్రంథాలు, కనకధారాస్తవము, తోటకాష్టకము, లలితాపంచరత్నము, చంద్రశేఖరాష్టకము వంటి అనేక స్తోత్రాలు వ్రాసి వైదిక ధర్మానికి ఎనలేని సేవచేశారు.

విష్ణుసహస్రానికి భాష్యం వ్రాసిన తొలి భాష్యకారుడు శంకరభగవత్పాదులే.



# 4. రామానుజాచార్యులు

**యో నిత్యమచ్యుతపదాంబుజయుగ్మరుక్మ**
**వ్యామోహత స్తదితరాణి తృణాయ మేనే ।**
**అస్మద్గురోః భగవతోఽ స్య దయైక సింధోః**
**రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే ॥**

రామానుజాచార్యులవారు శాలివాహన శకం 939 కలియుగం 4118 క్రీస్తుశకం 1017 సంవత్సరం పింగళనామ సంవత్సర వైశాఖ మాసంలో ఆర్ద్రానక్షత్రంలో జన్మించారు. కాని అది వైశాఖమాసంకాదు చైత్రమాసము అని చరిత్రకారుల అభిప్రాయం. ఇతడు సాక్షాత్తూ అదిశేషుని అవతారమని వైష్ణవుల నమ్మకం.

వీరు తమిళనాడు రాష్ట్రంలోని **శ్రీ పెరంబుదూరు** అనే గ్రామంలో ఆసూరి కేశవాచార్యులు, కాంతిమతి తాయారు అనే పుణ్యదంపతులకు నోములపంటగా జన్మించారు. ఆ దంపతులకు పిల్లలులేరు. వారు చాలాకాలం సంతానం కోసం చింతించి అప్పటి మద్రాసు పట్టణంలోని పార్థసారథి కోవెలకువెళ్ళి, స్వామిని అర్చించి, అక్కడే 'పుత్రకామేష్ఠి' చేశారు. ఆ యాగఫలంగా అనతికాలంలోనే కాంతిమతీదేవి గర్భవతి అయి పండంటి మగబిడ్డను ప్రసవించింది. అతడే శ్రీరామానుజాచార్యుడు.

యథావిధిగా వైదిక సంస్కారములు పూర్తి అయిన తరువాత కాంచీపురంలోని 'యాదవప్రకాశ గురువు' వద్ద వేదాంత శాస్త్రాన్ని అభ్యసించారు. యాదవ ప్రకాశుడు అద్వైతపండితుడు. రామానుజుడికి అద్వైతం మీద గురి కుదరలేదు. అతడు వసుతః ఏకసంధాగ్రాహి. ఆ రోజుల్లో కాంచీపురాన్ని పాలించే రాజుగారి కుమార్తెను ఒక బ్రహ్మ రాక్షసి పట్టి పీడిస్తోంది. దాన్ని వదిలించటం ఎవరి తరమూ కాలేదు. చివరకు రామానుజుడు రాకుమార్తెకు తీర్థమిచ్చి బ్రహ్మరాక్షసి చెర నుంచి విడిపించాడు. యాదవ ప్రకాశుడు శ్రుతికి భాష్యం చెబుతూ పరమేశ్వరుని నేత్రాలను "కోతి పిర్రవంటి కమలములవలె ఎర్రని నేత్రములు" అంటాడు. ఈ అర్థం అశ్లీలంగాను, నీచంగాను ఉన్నది అని రామానుజుడు దాన్ని ఖండించి "లోతైన నీటిలో బలమైన కాడపై నిలిచి, సూర్యకిరణములచే విచ్చుకోబడిన ఎర్రకలువవలె భగవానుని నేత్రములు ఎర్రగా, విశాలంగా ఉంటాయి." అని విశదీకరించాడు. దీంతో యాదవ ప్రకాశకుడికి కోపము, అసూయ కలిగి రామానుజుడి మీద హత్యాప్రయత్నం చేశాడు. అయితే ఆ విషయం ముందుగా పసిగట్టిన రామానుజుడు సురక్షితంగా బయటపడ్డాడు.

ఇతడికి పదహారవయేట 'తంజమాంబ' అనే ధనికకుటుంబంలో పుట్టిన కన్యతో వివాహం జరిగింది. రామానుజులు తమ 32వ ఏట అనగా క్రీ॥శ॥ 1049లో సన్యాసాశ్రమం స్వీకరించి కాంచీపురంలో వరదరాజస్వామివారి ఆలయం దగ్గరలో ఒక మఠాన్ని స్థాపించారు. వారి మేనల్లుడు 'దాశరథి' అనే ఆయన వీరి మొదటి శిష్యుడు. రెండవ శిష్యుడు 'కూరేశుడు' అనే ధనవంతుడు. అళవందారు మరణించిన తరువాత రామానుజులు శ్రీరంగం వచ్చి శ్రీరంగనాథుని ఆలయం పునరుద్ధరణ గావించి, పూజా విధానంలో మంచి కట్టుబాట్లు ఏర్పాటు చేశారు. ఆ తరువాత వైష్ణవ మతప్రచారానికి సిద్ధపడ్డారు.

ఆ రోజుల్లో పెరియ తిరుమలై నంబి ఆ గవందారు శిష్యుడు, నాథముని మనుమడైన యామునాచార్యులవారు ఆళవందారుగా ప్రసిద్ధులు. రామానుజుడు పెరియనంబి గారివద్ద మంత్రోపదేశం పొంది మంత్రార్థం తిరుక్కోట్టి యార్ నంబి గారివద్ద తెలుసుకున్నారు. ఆ మరునాడు అక్కడ ఉన్న ఆలయ గోపురం ఎక్కి తాను తీసుకున్న మంత్రాన్ని ప్రజలందరికీ బోధించాడు. దానికి కోపగించిన తిరుక్కోట్టియార్ నంబి రామానుజులను మందలించగా, మంత్రం విన్న ఇంతమంది ముక్తులైనప్పుడు, నేనొక్కడిని నరకానికి వెడితే ఇబ్బంది ఏమిటి? అని ప్రశ్నిస్తాడు. రామానుజుల విశాలబుద్ధికి సంతోషించిన తిరుక్కోట్టి యార్నంబి రామానుజులను 'ఎంబెరుమా' మా ప్రభువా ! అనిసంబోధించారు. అప్పటి నుంచి రామానుజులు 'ఎంబెరుమానార్' అని పిలువబడ్డారు.

రామానుజుడు ఆలయగోపురం ఎక్కి ప్రజలందరికీ వినిపించిన మంత్రం **"ఓం నమోనారాయణాయ"** ఇది అష్టాక్షరీమంత్రం. ఈ మంత్రాన్ని స్మరించినంత మాత్రంచేతనే మోక్షం పొందుతారు అని చెప్పారు రామానుజులు. నాటినుండి ఇది 'రామానుజ సిద్ధాంతము' గా ప్రసిద్ధి పొందింది.

ఆ రోజుల్లో శైవమతం బాగా ప్రచారంలో ఉండేది. ఆ కారణంచేత మతావేశ పూరితుడైన చోళరాజు రామానుజుని వధించటానికి ప్రయత్నించగా, రామానుజులు హెూయసాలరాజైన విష్ణువర్ధనుని ఆశ్రయించి అతన్ని వైష్ణవుడుగా మార్చారు. చోళరాజు మరణించిన తరువాత రామానుజుడు మళ్ళీ శ్రీరంగంచేరి వైష్ణవ మఠాధిపత్యం వహించారు.

రామానుజులు ఆశేతుహిమాచల పర్యంతము వైష్ణవమతం ప్రచారం చేశారు. స్వయంగా తానే కాకుండా, తన శిష్యులలో పండితులైన వారిని కూడా మతప్రచారానికి పంపారు. రామానుజులు 'విశిష్టాద్వైతాన్ని'ప్రచారం చేశారు. దానికి అనుగుణంగా వేదార్థ

సంగ్రహం, శ్రీభాష్యం, గీతాభాష్యం, వేదాంతదీపం, వేదాంతసారం, శరణాగతిగద్య, శ్రీరంగగద్య, వైకుంఠగద్య అనే గ్రంథాలు వ్రాశారు. రామానుజుల వారి ప్రకారం :

1. భగవంతుడు ఒక్కడే. అతడు సాకారుడు. అతడే నారాయణుడు. కళ్యాణ గుణధాముడు. నిర్మల జ్ఞానానందస్వరూపుడు. అతడే పరబ్రహ్మ.

2. విశిష్టాద్వైతంలో ఈశ్వరుడు, జీవుడు, ప్రకృతి ఈ మూడు సత్యమైనవి. ఇక్కడ ఈశ్వరుడు ఒక్కడే స్వతంత్రుడు. జీవి, ప్రకృతి పరతంత్రులు.

3. నిప్పు నుండి రవ్వలు వచ్చినట్లుగా పరమాత్మ నుండి ఆత్మ జన్మిస్తుంది.

4. జీవాత్మ పరమాత్మ సన్నిధి చేరుతుంది. అదే మోక్షం.

5. మోక్షానికి సాధనం అచంచలమైన విష్ణుభక్తి.

6. భక్తితోపాటుగా ప్రపత్తికూడా కావాలి. ప్రపత్తి అంటే తనను తానుగా భగవంతునికి అర్పణ చేసుకోవటం. మనసా వాచా కర్మణా భగవంతుడికి అంకితంకావటం.

7. మానవులందరూ సమానులు. కులవిచక్షణలేదు. మోక్షానికి అందరూ అర్హులు.

8. విష్ణువును పూజించి, చక్రాంకితాలు చేయించుకుని, మంత్రోపదేశం పొంది ఊర్ధ్వపుండ్రధారణ చేసిన వారందరూ వైష్ణవులే. దీనికి కులమతలింగ ప్రసక్తి లేదు.

9. శంకరుని అద్వైతాన్ని ఖండించటము.

ఈ రకంగా కేవలము భక్తి ద్వారానే మోక్షము పొందవచ్చునని, మోక్షానికి అందరూ అర్హులేనని బహుళప్రచారం చేసిన రామానుజులు క్రీ॥శ॥ 1137లో శ్రీమన్నారాయణుని సన్నిధికి చేరారు. అంటే వీరు 120 సంవత్సరములు జీవించిన పూర్ణజీవి. వీరు బోధించిన సూత్రాలను 'రామానుజ దర్శనము' అని ప్రత్యేకంగా పిలుస్తారు. ఇప్పుడు దర్శనాన్ని కూడా చూద్దాం.

**రామానుజ దర్శనము :**

రామానుజుని మతం 'విశిష్టాద్వైతము'. చిదచిద్విశిష్టుడు, కళ్యాణ గుణధాముడు శ్రీ మన్నారాయణుడు. అతడే సృష్టి, స్థితి, లయాలకు మూలమైనవాడు.

చిత్తు - జీవుడు. అచిత్తు - ప్రకృతి.

ఈ రెండూ ఆయనకు శరీరము. సూక్ష్మ చిదచిద్విశిష్టుడుగా ఉన్న పరమేశ్వరుడు, స్థూల చిదచిద్విశిష్టుడు కావటమే సృష్టి. సాంఖ్యులు చెప్పినట్లుగానే ప్రకృతి మూలంగానే

ఈ జగత్తు అంతా సృష్టించబడుతున్నది. శ్రీ మహావిష్ణువు వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ అనే రూపాలు పొందుతాడు.

వాసుదేవుడు తన భక్తులయందలి వాత్సల్యము వలన ఐదుమూర్తులుగా అయినాడు. అవి

1. అర్చ 2. విభవ 3. వ్యూహ 4. సూక్ష్మ 5. అంతర్యామి

1. అర్చ అనగా - దేవాలయాలలోని ప్రతిమలు.

2. విభవ అనగా - రాముడు, కృష్ణుడు మొ॥ అవతారమూర్తులు.

3. వ్యూహ అనగా - వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న అనిరుద్ధులు.

4. సూక్ష్మ అనగా - సంపూర్ణమైన షడ్గుణ సంపన్నమైన శ్రీ యశోవీర్యజ్ఞాన వైరాగ్యమహిమలు గల వాసుదేవాఖ్యమైన పరబ్రహ్మ.

5. అంతర్యామి అనగా - సకల జీవనాయకుడు.

భగవంతుడు అనుగ్రహం కావాలంటే భక్తి ప్రపత్తులే ముఖ్యం.

1. అభిగమనము 2. ఉపాదానము 3. ఇజ్య 4. స్వాధ్యాయము 5. యోగము

ఈ ఐదువిధాలుగాను ఉపాసన చేసిన భక్తుడు భగవంతుని కృపకుపాత్రుడై వైకుంఠం చేరతాడు.

విష్ణుసహస్రానికి రామానుజులు వారు మాత్రం భాష్యం వ్రాయలేదు.



# 5. భీష్మ-యుధిష్ఠిర సంవాదము (పూర్వాంగము)

**శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం ।**
**ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే ॥**

**వ్యాసం వసిష్ఠ నప్తారం శక్తేః పౌత్రమకల్మషం ।**
**పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్ ॥**

**వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే ।**
**నమో వై బ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమోనమః ॥**

తెల్లని వస్త్రాలు ధరించినవాడు, సర్వవ్యాపి అయినవాడు, నాలుగు భుజములు గలవాడు ప్రసన్నవదనుడు అయిన గణపతి సమస్త విఘ్నాలను నిర్మూలించాలని ప్రార్థిస్తున్నాను.

వ్యాసభగవానుని కుమారుడు - శక్తి
శక్తి యొక్క కుమారుడు - పరాశరుడు
పరాశరునికుమారుడు - వ్యాసుడు

అటువంటి నిర్మల మనస్కుడు, తపశ్శక్తి సంపన్నుడు అయిన వ్యాసభగవానునికి నమస్కారము.

ద్వాపరయుగంలో వేదవిభజన చెయ్యటం కోసం వసిష్ఠ మహర్షి వంశంలో శ్రీ మహావిష్ణువు అంశతో జన్మించిన వ్యాసభగవానునికి నమస్కారము.

**అవికారాయ శుద్ధాయ నిత్యాయ పరమాత్మనే ।**
**సదైకరూప రూపాయ విష్ణవే సర్వజిష్ణవే ॥**

**యస్య స్మరణమాత్రేణ జన్మసంసారబంధనాత్ ।**
**విముచ్యతే నమస్తస్మై విష్ణవే ప్రభవిష్ణవే ॥**
**ఓం నమో విష్ణవే ప్రభవిష్ణవే ॥**

నిరాకారుడు, పరిశుద్ధుడు, నిత్యమైనవాడు అన్ని రూపాలు తానే అయినవాడు, ఆత్మస్వరూపుడు అయిన శ్రీమహావిష్ణువుకు నమస్కారము. ఎవరిని తలచినంత మాత్రంచేత సంసారబంధనాలు తొలగి జన్మరాహిత్యం కలుగుతుందో అటువంటి శ్రీమహావిష్ణువుకు నమస్కారము. సర్వవ్యాపి అయిన విష్ణుమూర్తికి నమస్కారము.

**శ్రీ వైశంపాయన ఉవాచ :**

> **శ్రుత్వాధర్మా నశేషణ పావనాని చ సర్వశః ।**
> **యుధిష్ఠిర, శ్శాంతనవం, పునరేవాభ్యభాషత ॥**

వైశంపాయనుడు జనమేజయుడికి మహాభారత కథ వినిపిస్తున్నాడు.

పూర్వకాలంలో వేదం అంతా ఒకటిగానే ఉండేది. దానిని అలాగే పఠించేవారు. ద్వాపరయుగం వచ్చేసరికి అది వారికి కష్టసాధ్యమైంది. అప్పుడు బ్రహ్మదేవుడు 'అపాంతరతముడు' అనే మానస పుత్రుని సృష్టించి వేదాన్ని భూలోకంలో ప్రచారం చెయ్యమన్నాడు. అపాంతరతముడు వేదాన్ని నాలుగు భాగాలుగా విభజించి ప్రచారం చేసి ఈ విషయాన్ని బ్రహ్మకు తెలియచేశాడు. బ్రహ్మదేవుడు చాలా సంతోషించి, "ప్రతి మహాయుగంలోని ద్వాపరయుగంలో ఈ రకంగా వేదాలను ప్రచారం చెయ్యవలసినది" అన్నాడు. అప్పటినుంచి ప్రతి మహాయుగంలోనూ ద్వాపరయుగంలో వేదవిభజన జరుగుతోంది. ఈ రకంగా వేదాలను విభజించినవాడు 'వేదవ్యాసుడు' అని పిలువబడ్డాడు. ఇప్పటికి 27 మహాయుగాలయినాయి. ఇది 28వ మహాయుగం. ఇందులో ద్వాపరయుగం పూర్తి అయి కలియుగం నడుస్తోంది. ఇప్పటి వరకు 28 మంది వేదవ్యాసులున్నారు. వారిలో 28వ వాడు కృష్ణద్వైపాయనుడు. అతడే మనం చెప్పుకునేవాడు. అష్టాదశ పురాణాలు, బ్రహ్మసూత్రాలు వ్రాసినవాడు.

అతనికి నలుగురు శిష్యులు వారు

1. పైలుడు 2. వైశంపాయనుడు 3. జైమిని 4. సుమంతుడు

వీరిలో వైశంపాయనుడు యజుర్వేదాన్ని పఠించాడు.

కురుక్షేత్ర సంగ్రామం పూర్తికావచ్చింది. కౌరవులు అందరూ గతించారు. ఆ దశలో అశ్వత్థామ ఉపపాండవులను చంపేశాడు. అతన్ని బంధించటానికి భీముడు వెళ్ళగా, భీముడికి రక్షణగా కృష్ణార్జునులు వెంట వెళ్ళారు. అశ్వత్థామ బ్రహ్మశిరోనామ కాస్త్రాన్ని ప్రయోగించాడు. శ్రీకృష్ణుని ప్రయత్నంమీద అది ఉత్తరగర్భంలో శిశువును సంహరించింది. ఆ శిశువును పునర్జీవింపచేశాడు శ్రీకృష్ణ భగవానుడు. గర్భంలో తనకు కనిపించిన పరమేశ్వర స్వరూపమే ఈ జగత్తంతా ఆవరించి ఉన్నది అని పరీక్షగా చూస్తున్నాడు ఆ బాలుడు. అందుచేతనే అతడికి పరిక్షిత్తు అని పేరు వచ్చింది. ఇతడు అభిమన్యుని కుమారుడు.

ధర్మరాజు తన తరువాత పరిక్షిత్తుకు పట్టం కట్టాడు. ప్రజారంజకంగా రాజ్యం చేస్తున్నాడు పరిక్షిత్తు.

ఒకసారి పరిక్షిన్మహారాజు వేటకి వెళ్ళి అలసిపోయి దగ్గరలో ఉన్న శమీకమహర్షి ఆశ్రమానికి వెళ్ళి దాహం అడిగాడు. తపోనిష్ఠలో ఉన్న మహర్షికి ఆ మాటలు వినిపించలేదు. కావాలనే మహర్షి తనను అవమానిస్తున్నాడనుకుని మహారాజు. ఆ దగ్గరలో చచ్చిపడి ఉన్న ఒక పామును తెచ్చి శమీకుని మెడలో వేసి వెళ్ళాడు. శమీకుని కుమారుడు శృంగి ఈ దృశ్యం చూసినవాడై "తన తండ్రి మెడలో పాము కళేబరాన్ని వేసినవాడు నేటికి ఏడవ రోజున తక్షకుని కాటుకు మరణిస్తాడు" అని శపించాడు. ఈ విషయం తెలిసిన పరిక్షిత్తు శుక మహర్షితో మహాభాగవత ప్రవచనం చేయించుకుని స్వర్గలోకాలకు పోయాడు.

పరిక్షిన్మహారాజు కుమారుడు జనమేజయుడు. ఈ జనమేజయునికి మహాభారత కథ వినిపించటం కోసం తన శిష్యుడైన వైశంపాయనుణ్ణి పంపించాడు వ్యాసమహర్షి"

కురుక్షేత్ర సంగ్రామానంతరము శ్రీకృష్ణపరమాత్మ పాండవులందరినీ తీసుకుని భీష్ముని దగ్గరకు వెళ్ళి "పితామహా ! ధర్మరాజుకు ఏవో కొన్ని సందేహాలున్నాయట వాటిని తీర్చగల సమర్థుడవు నీవే. కాబట్టి ధర్మనందనుని సందేహన్నివృత్తి చెయ్యవలసినది" అన్నాడు. దానికి భీష్ముడు "దేవదేవా ! నేను క్షతగాత్రుడనై అంపశయ్య పైన ఉన్నాను నా దేహం గాయాలతో బాధపడుతున్నది. జ్ఞాపకశక్తి నశించిపోయింది. శరీరం కృంగిపోతున్నది. చెప్పేశక్తి లేదు" అన్నాడు అప్పుడు శ్రీకృష్ణుడు భీష్మునికి

1. అతనికి తెలిసినవన్నీ జ్ఞాపకం వచ్చేటట్లు
2. పూర్వం ఉన్న శక్తి ఇప్పుడు ఉండేటట్లు
3. శరీరం బాధించకుండా ఉండేటట్లు

వరాలిచ్చాడు. అప్పుడు గాంగేయుడు యుధిష్ఠిరుని సందేహాలు తీర్చటం ప్రారంభించాడు. పాండవాగ్రజుడు ముందుగా ధర్మ సందేహాలు అడిగాడు. వాటిని తీర్చాడు భీష్ముడు. ఇప్పుడు వైశంపాయనుడు చెబుతున్నాడు. "జనమేజయ మహారాజా! సకల ధర్మాలు పాపాలను పోగొట్టే విధాలను తెలుసుకున్న ధర్మజుడుతిరిగి భీష్మునితో అంటున్నాడు.

**యుధిష్ఠిర ఉవాచ :**

**కిమేకం దైవతం లోకే కిం వాఽప్యేకం పరాయణం ।**

**స్తువంతః కం కమర్చంతః ప్రాప్నుయుర్మానవాః శుభమ్ ॥**

**కోధర్మః సర్వధర్మాణాం భవతః పరమో మతః ।**

**కిం జపన్ముచ్యతే జంతుర్జన్మ సంసార బంధనాత్ ॥**

1. లోకంలో ముఖ్యమైన దైవము ఏది ?
2. ప్రధానమైన శుభస్థానమేది ?
3. ఎవరిని పూజించటం వల్ల మానవులు శుభములు పొందుతారు ?
4. సమస్థ ధర్మాలలోను గొప్ప ధర్మము ఏది ?
5. జన్మ పరంపరతో కూడిన సంసార బంధం నుంచి తరించాలంటే ఏ మంత్రాన్ని జపించాలి?

**శ్రీ భీష్మ ఉవాచ :**

**జగత్ప్రభుం దేవదేవం అనంతం పురుషోత్తమం ।**

**స్తువన్నామసహస్రేణ పురుషః సతతోత్థితః ॥**

**తమేవ చార్చయన్నిత్యం భక్త్యా పురుషమవ్యయం ।**

**ధ్యాయన్ స్తువన్నమస్యంశ్చ యజమానస్తమేవ చ ॥**

ధర్మజుని ప్రశ్నలు విన్న భీష్ముడు చెబుతున్నాడు. జగత్ప్రభువు దేవదేవుడు అనంతుడు పురుషోత్తముడు అయిన శ్రీమహావిష్ణువును శ్రద్ధాభక్తులతో వేయి నామాలతో స్తుతించినవాడు అతని నుండి రక్షణ పొందుతాడు. సత్యము నిత్యము అయినవాడు, నాశరహితుడు, అయిన విష్ణువును భక్తితో అర్చించినవాడు తరిస్తాడు.

**అనాది నిధనం విష్ణుం సర్వలోకమహేశ్వరం ।**

**లోకాధ్యక్షం స్తువన్నిత్యం సర్వదుఃఖాతిగో భవేత్ ॥**

**బ్రహ్మణ్యం సర్వధర్మజ్ఞం లోకానాం కీర్తివర్ధనం ।**

**లోకనాథం మహద్భూతం సర్వభూతభవోద్భవమ్ ॥**

**ఏష మే సర్వధర్మాణాం ధర్మోఽధిక తమోమతః ।**

**యద్భక్త్యా పుండరీకాక్షం స్తవైరర్చేన్నరః సదా ॥**

**పరమంయో మహత్తేజః పరమంయో మహత్తపః ।**

**పరమంయో మహద్బ్రహ్మ పరమంయః పరాయణమ్ ॥**

ఆద్యంతములు లేనివాడు, సకల లోకనాయకుడు, లోకాలను శాసించేవాడు అయిన విష్ణువును ప్రతిదినము స్తోత్రం చేసినట్లైతే సర్వదుఃఖాలు తొలగిపోతాయి.

వేదపురుషుడు, ధర్మస్వరూపుడు, లోకాల కీర్తిని పెంపొందించేవాడు, అన్నింటికన్నా అధికుడు, సమస్త జీవరాశి పుట్టుకకు కారణమైనవాడు అయిన విష్ణువును కీర్తిస్తే కష్టాలు తొలగిపోతాయి.

పుండరీకాక్షుడైన శ్రీమహావిష్ణువును స్తోత్రం చేసి పూజించటమే అన్ని ధర్మాలలోకీ ఉత్తమమైనది.

అతడు తేజస్సులకు తేజస్సు, తపస్సులకు తపస్సు, అతడే పరబ్రహ్మ. పరమపదాన్నిచ్చే పరాత్పరుడు జీవులందరికీ అతడే పరమాగతి.

**పవిత్రాణం పవిత్రంయో మంగలానాం చ మంగలం ।**

**దైవతం దేవతానాం చ భూతానాం యోఽవ్యయః పితా ॥**

**యతః సర్వాణి భూతాని భవన్త్యాదియుగాగమే ।**

**యస్మింశ్చ ప్రలయంయాంతి పునరేవ యుగక్షయే ॥**

**తస్య లోకప్రధానస్య జగన్నాథస్య భూపతే ।**

**విష్ణోర్నామసహస్రం మే శ్రుణు పాప భయాపహమ్ ॥**

**యాని నామాని గౌణాని విఖ్యాతాని మహాత్మనః ।**

**ఋషిభిః పరిగీతాని తాని వక్ష్యామి భూతయే ॥**

పవిత్రులైన వారికి పవిత్రుడు, శుభాలకు శుభుడు, దేవతలకు దేవుడు, శాశ్వతుడు అయిన శ్రీమహావిష్ణువే దైవము.

సృష్టి ప్రారంభంలో ఈ జగత్తంతా అతని నుంచే ఆవిర్భవిస్తున్నది. ప్రళయ సమయంలో అతనియందే లీనమవుతున్నది.

ధర్మనందనా ! లోకాలకు మూలకారకుడు, జగన్నాథుడు అయిన శ్రీమహావిష్ణువు యొక్క వేయి నామాలు పాపాలను, భయాన్ని పోగొడతాయి. ఆ నామాలను నా ముఖతః వినవలసినది.

ఈ నామాలు శ్రీమహావిష్ణువు యొక్క గుణాలై ప్రసిద్ధిగాంచినాయి. అవి మునులు చేత గానం చెయ్యబడ్డాయి. పురుషార్థ ప్రాప్తికి అటువంటి విష్ణు సహస్రనామాలను నీకు వివరిస్తాను.

**ఋషిర్నామ్నాం సహస్రస్య వేదవ్యాసో మహామునిః ।**
**ఛందోఽనుష్టుప్ తథా దేవో భగవాన్ దేవకీసుతః ॥**

**అమృతాంశూద్భవో బీజం శక్తిర్దేవకినందనః ।**
**త్రిసామా హృదయం తస్య శాంత్యర్థే వినియుజ్యతే ॥**

**విష్ణుం జిష్ణుం మహావిష్ణుం ప్రభవిష్ణుం మహేశ్వరం ।**
**అనేకరూపదైత్యాంతం నమామి పురుషోత్తమమ్ ॥**

సహస్రనామ మాలామంత్రానికి వేదవ్యాసుడు - ఋషి

అనుష్టుప్ - ఛందస్సు, దేవకీనందనుడు - దేవత

అమృతాంశూద్భవ - బీజం, దేవకీనందనుడు - శక్తి

త్రిసామ - హృదయం. మనశ్శాంతి కోసం విష్ణు సహస్రనామ మాలామంత్రం జపించబడుతోంది.

విశ్వవ్యాపకుడు, మహేశ్వరుడు, అపజయమెరుగనివాడు, దానవులను సంహరించిన వాడు, పురుషోత్తముడు అయిన శ్రీమహావిష్ణువుకు నమస్కారము.

అంటూ అంగన్యాస కరన్యాసాలు చెప్పి 'విష్ణు సహస్రనామ మాలామంత్రాన్ని' ప్రారంభిస్తున్నాడు భీష్మాచార్యుడు.

ఈ రకంగా విష్ణు సహస్రనామాలు భగవానుడైన శ్రీకృష్ణుని సన్నిధానంలో గాంగేయునితో యుధిష్ఠిరునికి చెప్పబడ్డాయి.



# 6. విష్ణుసహస్రనామ స్తోత్రపారాయణక్రమము

అస్య శ్రీవిష్ణోర్దివ్య సహస్ర నామస్తోత్ర మహామంత్రస్య । శ్రీవేదవ్యాసో భగవాన్ ఋషిః । అనుష్టుప్ ఛందః । శ్రీ మహావిష్ణుః పరమాత్మా శ్రీమన్నారాయణో దేవతా । అమృతాంశూద్భవో భానురితి భీజం । దేవకీనందనః స్రష్టేతి శక్తిః । ఉద్భవః క్షోభణో దేవ ఇతి పరమోమంత్రః । శంఖభృన్నందకీ చక్రీతి కీలకం । శార్ఙ్గధన్వాగదాధర ఇత్యస్త్రం । రథాంగపాణి రక్షోభ్య ఇతి నేత్రం । త్రిసామాసామగః సామేతి కవచం । ఆనందం పరంబ్రహ్మేతి యోనిః। ఋతుస్సుదర్శనః కాల ఇతి దిగ్బంధః। శ్రీ విశ్వరూప ఇతి ధ్యానమ్।

శ్రీ మహావిష్ణు ప్రీత్యర్థే సహస్రనామ జపే వినయోగః ॥

**కరన్యాసః :**

విశ్వం విష్ణుర్వషట్కార ఇత్యంగుష్ఠాభ్యాం నమః

అమృతాంశూద్భవో భానురితి తర్జనీభ్యాం నమః

బ్రహ్మణ్యో బ్రహ్మకృత్ బ్రహ్మేతి మధ్యమాభ్యాం నమః

సువర్ణబిందు రక్షోభ్య ఇతి అనామికాభ్యాం నమః

నిమిషోఽనిమిషః స్రగ్వీతి కనిష్ఠికాభ్యాం నమః

రథాంగపాణి రక్షోభ్య ఇతి కరతలకరపృష్ఠాభ్యాం నమః

**అంగన్యాసః :**

సువ్రతస్సుముఖస్సూక్ష్మ ఇతిజ్ఞానాయ హృదయాయ నమః

సహస్రమూర్తిః విశ్వాత్మా ఇతి ఐశ్వర్యాయ శిరసే స్వాహా

సహస్రార్చిః సప్తజిహ్వ ఇతిశక్త్యై శిఖాయై వషట్

త్రిసామాసామగస్సామేతి బలాయ కవచాయహుం

రథాంగపాణి రక్షోభ్య ఇతి నేత్రాభ్యాం వౌషట్

శార్ఙ్గధన్వాగదాధర ఇతి వీర్యాయ  అస్త్రాయఫట్

ఋతుస్సుదర్శనః కాల ఇతి దిగ్బంధః

**ధ్యానమ్ :**

క్షీరోదన్వత్, ప్రదేశే, శుచిమణి, విలసత్ సైకతే, మౌక్తికానాం

మాలాక్ల్ప్తా సనస్థః, స్పటికమణినిభైః, మౌక్తికైర్మండితాంగః ।

శుభ్రైరభ్రైరదభ్రై రుపరివిరచితై ర్ముక్త పీయూష వర్షైః

ఆనందీ నః పునీయా దరినలిన గదా శంఖపాణి ర్ముకుందః ॥

భూః పాదౌయస్య నాభిర్వియదసురనిలశ్చంద్ర సూర్యౌ చ నేత్రే
కర్ణావాశాః శిరోద్యౌ ర్ముఖమపి దహనో యస్య వాస్తేయ మబ్దిః ।
అంతస్థం యస్య విశ్వం సుర నరఖగగో భోగి గంధర్వదైత్యైః
చిత్రం రంరమ్యతే తం త్రిభువనవపుషం విష్ణుమీశం నమామి ॥

శాన్తాకారం భుజగశయనం పద్మనాభం సురేశం
విశ్వాధారం గగన సదృశం మేఘవర్ణం శుభాంగం ।
లక్ష్మీకాంతం కమలనయనం యోగి హృద్ధ్యాన గమ్యం
వందే విష్ణుం భవభయహరం సర్వలోకైకనాథమ్ ॥

మేఘశ్యామం పీతకౌశేయవాసం
శ్రీవత్సాంకం కౌస్తుభోద్భాసితాంగం
పుణ్యోపేతం పుండరీకాయతాక్షం
విష్ణుం వందే సర్వలోకైకనాథమ్
సశంఖచక్రం సకిరీట కుండలం
సపీతవస్త్రం సరసీరుహేక్షణం
సహార వక్షస్థ్సల శోభి కౌస్తుభం
నమామి విష్ణుం శిరసా చతుర్భుజమ్
ఛాయాయాం పారిజాతస్య హేమ సింహాసనోపరి
ఆసీనమంబుద శ్యామ మాయతాక్ష మలంకృతమ్
చంద్రాననం చతుర్బాహుం శ్రీవత్సాంకిత వక్షసం
రుక్మిణీ సత్యభామాభ్యాం సహితం కృష్ణమాశ్రయేః

**పంచపూజలు :**

లం = పృథివ్యాత్మనే, గంధం సమర్పయామి

హం = ఆకాశాత్మనే, పుష్పైః పూజయామి

యం = వాయ్వాత్మనే, ధూప మాఘ్రాపయామి

రం = అగ్న్యాత్మనే, దీపం దర్శయామి

వం = అమృతాత్మనే, నైవేద్యం సమర్పయామి

సం = సర్వాత్మనే, సర్వోపచార, పూజాన్ మనసా సమర్పయామి

గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః
గురుః స్సాక్షాత్ పరబ్రహ్మా తస్మై శ్రీ గురవే నమః

హరిః ఓమ్

విశ్వం విష్ణుర్వషట్కారో భూతభవ్య భవత్ ప్రభుః ।
భూతకృద్ భూతభృద్భావో భూతాత్మా భూతభావనః ॥ 1

పూతాత్మా పరమాత్మా చ ముక్తానాం పరమాగతిః ।
అవ్యయః పురుషః సాక్షీ క్షేత్రజ్ఞోఽక్షర ఏవచ ॥ 2

యోగో యోగవిదాం నేతా ప్రధాన పురుషేశ్వరః ।
నారసింహవపుః శ్రీమాన్ కేశవః పురుషోత్తమః ॥ 3

సర్వః శర్వః శివస్థాణుః భూతాదిర్నిధి రవ్యయః ।
సంభవో భావనో భర్తా ప్రభవః ప్రభురీశ్వరః ॥ 4

స్వయంభూః శంభురాదిత్యః పుష్కరాక్షో మహాస్వనః ।
అనాదినిధనో ధాతా విధాతా ధాతు రుత్తమః ॥ 5

అప్రమేయో హృషీకేశః పద్మనాభోఽమరప్రభుః ।
విశ్వకర్మా మనసుస్త్వష్టా స్థవిష్ఠః స్థవిరో ధ్రువః ॥ 6

అగ్రాహ్య శ్శాశ్వతః కృష్ణో లోహితాక్షః ప్రతర్దనః ।
ప్రభూతః త్రికకుబ్ధామ పవిత్రం మంగళం పరమ్ ॥ 7

ఈశానః ప్రాణదః ప్రాణో జ్యేష్ఠః శ్రేష్ఠః ప్రజాపతిః ।
హిరణ్యగర్భో భూగర్భో మాధవో మధుసూదనః ॥ 8

ఈశ్వరో విక్రమీధన్వీ మేధావీ విక్రమః క్రమః ।
అనుత్తమో దురాధర్షః కృతజ్ఞః కృతిరాత్మవాన్ ॥ 9

సురేశం శరణం శర్మ విశ్వరేతాః ప్రజాభవః ।
అహస్సంవత్సరో వ్యాళః ప్రత్యయః సర్వదర్శనః ॥ 10

అజ స్సర్వేశ్వరస్సిద్ధః సిద్ధి స్సర్వాది రచ్యుతః ।
వృషాకపిరమేయాత్మా సర్వయోగ వినిస్సృతః ॥ 11

వసుర్వసుమనాస్సత్యః సమాత్మా సమ్మితస్సమః ।
అమోఘః పుండరీకాక్షో వృషకర్మా వృషాకృతిః ॥ 12

రుద్రో బహుశిరా బభ్రుః విశ్వయోని శ్శుచిశ్రవాః ।
అమృత శ్శాశ్వత స్థాణుః వరారోహో మహాతపాః ॥ 13

సర్వగః సర్వవిద్భానుః విష్వక్సేనో జనార్దనః ।
వేదోవేదవిదవ్యంగో వేదాంగో వేదవిత్కవిః ॥ 14

లోకాధ్యక్షః సురాధ్యక్షో ధర్మాధ్యక్షః కృతాకృతః ।
చతురాత్మా చతుర్వ్యూహః చతుర్దంష్ట్రః చతుర్భుజః ॥ 15

భ్రాజిష్ణుః భోజనం భోక్తా సహిష్ణుః జగదాదిజః ।
అనఘో విజయో జేతా విశ్వయోనిః పునర్వసుః ॥ 16

ఉపేంద్రో వామనః ప్రాంశుః అమోఘః శుచిరూర్జితః ।
అతీంద్రః సంగ్రహస్సర్గో ధృతాత్మా నియమో యమః ॥ 17

వైద్యోవైద్యః సదాయోగీ వీరహా మాధవో మధుః ।
అతీంద్రియో మహామాయో మహోత్సాహో మహాబలః ॥ 18

మహాబుద్ధిః మహావీర్యో మహాశక్తిః మహాద్యుతిః ।
అనిర్దేశ్యవపుః శ్రీమాన్ అమేయాత్మా మహాద్రి ధృక్ ॥ 19

మహేష్వాసో మహీభర్తా శ్రీనివాసః సతాంగతిః ।
అనిరుద్ధః సురానందో గోవిందో గోవిదాం పతిః ॥ 20

మరీచిః దమనో హంసః సువర్ణో భుజగోత్తమః ।
హిరణ్యనాభః సుతపాః పద్మనాభః ప్రజాపతిః ॥ 21

అమృత్యుః సర్వదృక్సింహః సంధాతా సంధిమాన్ స్థిరః ।
అజో దుర్మర్షణః శాస్తా విశ్రుతాత్మా సురారిహా ॥ 22

గురుర్గురుతమో ధామ సత్యస్సత్య పరాక్రమః ।
నిమిషోఽనిమిషః స్రగ్వీ వాచస్పతి రుదారధీః ॥ 23

అగ్రణీః గ్రామణీః శ్రీమాన్ న్యాయోనేతా సమీరణః ।
సహస్రమూర్ధా విశ్వాత్మా సహస్రాక్షః సహస్రపాత్ ॥ 24

ఆవర్తనో నివృత్తాత్మా సంవృతః సంప్రమర్దనః ।
అహస్సంవర్తకో వహ్నిః అనిలో ధరణీధరః ॥ 25

సుప్రసాదః ప్రసన్నాత్మా విశ్వదృగ్విశ్వ భుగ్విభుః ।
సత్కర్తా సత్కృతస్సాధుః జహ్నుర్నారాయణోనరః ॥ **26**

అసంఖ్యేయోఽ ప్రమేయాత్మా విశిష్టః శిష్టకృచ్ఛుచిః ।
సిద్ధార్థః సిద్ధ సంకల్పః సిద్ధిదస్సిద్ధి సాధనః ॥ **27**

వృషాహీ వృషభో విష్ణుః వృషపర్వా వృషోదరః ।
వర్ధనో వర్ధమానశ్చ వివిక్తః శ్రుతిసాగరః ॥ **28**

సుభుజో దుర్ధరో వాగ్మీ మహేంద్రో వసుదో వసుః ।
నైకరూపో బృహద్రూపః శిపివిష్టః ప్రకాశనః ॥ **29**

ఓజస్తేజో ద్యుతిధరః ప్రకాశాత్మా ప్రతాపనః ।
ఋద్ధః స్పష్టాక్షరో మంత్రః చంద్రాంశు ర్భాస్కర ద్యుతిః ॥ **30**

అమృతాంశూద్భవో భానుః శశబిందు స్సురేశ్వరః ।
ఔషధం జగతః సేతుః సత్యధర్మ పరాక్రమః ॥ **31**

భూతభవ్య భవన్నాథః పవనః పావనోఽనలః ।
కామహా కామకృత్కాంతః కామః కామప్రదః ప్రభుః ॥ **32**

యుగాది కృద్యుగావర్తో నైకమాయో మహాశనః ।
అదృశ్యో వ్యక్తరూపశ్చ సహస్రజిదనంతజిత్ ॥ **33**

ఇష్టోఽవిశిష్టః శిష్టేష్టః శిఖండీ నహుషో వృషః ।
క్రోధహా క్రోధకృత్కర్తా విశ్వబాహుః మహీధరః ॥ **34**

అచ్యుతః ప్రథితః ప్రాణః ప్రాణదో వాసవానుజః ।
అపాం నిధి రధిష్ఠాన మప్రమత్తః ప్రతిష్ఠితః ॥ **35**

స్కందః స్కందధరో ధుర్యో వరదో వాయు వాహనః ।
వాసుదేవో బృహద్భానుః ఆదిదేవః పురందరః ॥ **36**

అశోకస్తారణ స్తారః శూరః శౌరిర్జనేశ్వరః ।
అనుకూలః శతావర్తః పద్మీపద్మనిభేక్షణః ॥ **37**

పద్మనాభోఽరవిందాక్షః పద్మగర్భః శరీరభృత్ ।
మహర్ధిః ఋద్ధో వృద్ధాత్మా మహాక్షో గరుడధ్వజః ॥ **38**

అతులః శరభో భీమః సమయజ్ఞో హవిర్హరిః ।
సర్వలక్షణ లక్షణ్యో లక్ష్మీవాన్ సమితింజయః ॥ **39**

విక్షరో రోహితో మార్గో హేతు ర్దామోదర స్సహః ।
మహీధరో మహాభాగో వేగవానమితాశనః ॥ **40**

ఉద్భవః క్షోభణో దేవః శ్రీగర్భః పరమేశ్వరః ।
కరణం కారణం కర్తా వికర్తా గహనో గుహః ॥ **41**

వ్యవసాయో వ్యవస్థానః సంస్థానః స్థానదో ధ్రువః ।
పరర్ధిః పరమస్పష్టః తుష్టః పుష్టః శుభేక్షణః ॥ **42**

రామో విరామో విర (తో) జో మార్గోనేయో నయోఽనయః ।
వీరః శక్తిమతాం శ్రేష్ఠో ధర్మోధర్మవిదుత్తమః ॥ **43**

వైకుంఠః పురుషః ప్రాణః ప్రాణదః ప్రణవః పృథుః ।
హిరణ్యగర్భః శత్రుఘ్నో వ్యాప్తో వాయురధోక్షజః ॥ **44**

ఋతుః సుదర్శనః కాలః పరమేష్ఠీ పరిగ్రహః ।
ఉగ్రః సంవత్సరో దక్షో విశ్రామో విశ్వదక్షిణః ॥ **45**

విస్తారః స్థావరః స్థాణుః ప్రమాణం బీజమవ్యయం ।
అర్థోఽనర్థో మహాకోశో మహాభోగో మహాధనః ॥ **46**

అనిర్విణ్ణః స్థవిష్ఠోభూర్ధర్మయూపో మహామఖః ।
నక్షత్రనేమి ర్నక్షత్రీ క్షమః క్షామ స్సమీహనః ॥ **47**

యజ్ఞఇజ్యో మహేజ్యశ్చ క్రతుస్సత్రం సతాంగతిః ।
సర్వదర్శీ నివృత్తాత్మా సర్వజ్ఞో జ్ఞానముత్తమమ్ ॥ **48**

సువ్రతః సుముఖః సూక్ష్మః సుఘోషః సుఖదః సుహృత్ ।
మనోహరో జితక్రోధో వీరబాహు ర్విదారణః ॥ **49**

స్వాపనః స్వవశో వ్యాపీ నైకాత్మా నైకకర్మకృత్ ।
వత్సరో వత్సలో వత్సీ రత్నగర్భో ధనేశ్వరః ॥ **50**

ధర్మగుబ్ధర్మకృద్ధర్మీ సదసత్ క్షరమక్షరం ।
అవిజ్ఞాతా సహస్రాంశుః విధాతా కృతలక్షణః ॥ **51**

గభస్తినేమిః సత్త్వస్థః సింహో భూతమహేశ్వరః ।
ఆదిదేవో మహాదేవో దేవేశో దేవభృద్గురుః ॥ 52

ఉత్తరో గోపతిర్గోప్తా జ్ఞానగమ్యః పురాతనః ।
శరీరభూతభృత్ భోక్తా కపీంద్రో భూరిదక్షిణః ॥ 53

సోమపోఽమృతపస్సోమః పురుజిత్ పురుసత్తమః ।
వినయో జయః సత్యసంధో దాశార్హః సాత్వతాంపతిః ॥ 54

జీవో వినయితాసాక్షీ ముకుందోఽమిత విక్రమః ।
అంభోనిధిరనంతాత్మా మహోదధిశయోఽన్తకః ॥ 55

అజో మహార్హః స్వాభావ్యో జితామిత్రః ప్రమోదనః ।
ఆనందో నందనోనందః సత్యధర్మా త్రివిక్రమః ॥ 56

మహర్షిః కపిలాచార్యః కృతజ్ఞో మేదినీపతిః ।
త్రిపదః త్రిదశాధ్యక్షో మహాశృంగః కృతాన్తకృత్ ॥ 57

మహావరాహో గోవిందః సుషేణః కనకాంగదీ ।
గుహ్యో గభీరో గహనో గుప్తశ్చక్రగదాధరః ॥ 58

వేధాః స్వాంగోఽజితః కృష్ణో దృఢః సంకర్షణోఽచ్యుతః ।
వరుణో వారుణో వృక్షః పుష్కరాక్షో మహామనాః ॥ 59

భగవాన్ భగహాఽఽనందీ వనమాలీ హలాయుధః ।
ఆదిత్యో జ్యోతిరాదిత్యః సహిష్ణుర్గతిసత్తమః ॥ 60

సుధన్వా ఖండపరశుః దారుణో ద్రవిణప్రదః ।
దివస్పృక్ సర్వదృగ్వ్యాసో వాచస్పతిరయోనిజః ॥ 61

త్రిసామా సామగః సామ నిర్వాణం భేషజం భిషక్ ।
సన్న్యాసకృచ్ఛమః శాంతో నిష్ఠా శాంతిః పరాయణః ॥ 62

శుభాంగః శాంతిదః స్రష్టా కుముదః కువలేశయః ।
గోహితో గోపతిర్గోప్తా వృషభాక్షో వృషప్రియః ॥ 63

అనివర్తీ నివృత్తాత్మా సంక్షేప్తా క్షేమకృచ్ఛివః ।
శ్రీవత్సవక్షాః శ్రీవాసః శ్రీపతిః శ్రీమతాంవరః ॥ 64

శ్రీదః శ్రీశః శ్రీనివాసః శ్రీనిధిః శ్రీవిభావనః ।
శ్రీధరః శ్రీకరః శ్రేయః శ్రీమాన్ లోకత్రయాశ్రయః ॥ 65

స్వక్షః స్వంగః శతానందో నందిః జ్యోతిర్గణేశ్వరః ।
విజితాత్మా విధేయాత్మా సత్కీర్తిశ్ఛిన్నసంశయః ॥ 66

ఉదీర్ణః సర్వతశ్చక్షు రనీశః శాశ్వతస్థిరః ।
భూశయో భూషణో భూతిః విశోకః శోకనాశనః ॥ 67

అర్చిష్మా నర్చితః కుంభో విశుద్ధాత్మా విశోధనః ।
అనిరుద్ధోఽప్రతిరథః ప్రద్యుమ్నోఽమిత విక్రమః ॥ 68

కాలనేమినిహా వీరః శౌరిః శూరజనేశ్వరః ।
త్రిలోకాత్మా త్రిలోకేశః కేశవః కేశిహా హరిః ॥ 69

కామదేవః కామపాలః కామీ కాంతః కృతాగమః ।
అనిర్దేశ్యవపుః విష్ణుః వీరోఽనంతో ధనంజయః ॥ 70

బ్రహ్మణ్యో బ్రహ్మకృత్ బ్రహ్మా బ్రహ్మ బ్రహ్మవివర్ధనః ।
బ్రహ్మవిత్ బ్రాహ్మణో బ్రహ్మీ బ్రహ్మజ్ఞో బ్రాహ్మణప్రియః ॥ 71

మహాక్రమో మహాకర్మా మహాతేజా మహోరగః ।
మహాక్రతు ర్మహాయజ్వా మహాయజ్ఞో మహాహవిః ॥ 72

స్తవ్యః స్తవప్రియః స్తోత్రం స్తుతిఃస్తోతా రణప్రియః ।
పూర్ణః పూరయితా పుణ్యః పుణ్యకీర్తిరనామయః ॥ 73

మనోజవః తీర్థకరో వసురేతా వసుప్రదః ।
వసుప్రదో వాసుదేవో వసుర్వసుమనా హవిః ॥ 74

సద్గతిః సత్కృతిః సత్తా సద్భూతిః సత్పరాయణః ।
శూరసేనో యదుశ్రేష్ఠః సన్నివాసః సుయామునః ॥ 75

భూతావాసో వాసుదేవః సర్వాసునిలయోఽనలః ।
దర్పహా దర్పదో దృప్తో దుర్ధరోఽథాపరాజితః ॥ 76

విశ్వమూర్తి ర్మహామూర్తిః దీప్తమూర్తి రమూర్తిమాన్ ।
అనేక మూర్తిరవ్యక్తః శతమూర్తిః శతాననః ॥ 77

ఏకో నైకః సవః కః కిం యత్తత్పదమనుత్తమం ।
లోకబంధుః లోకనాథో మాధవో భక్తవత్సలః ॥ 78

సువర్ణవర్ణో హేమాంగో వరాంగశ్చందనాంగదీ ।
వీరహా విషమః శూన్యో ఘృతాశీరచలశ్చలః ॥ 79

అమానీ మానదో మాన్యో లోకస్వామీ త్రిలోక ధృత్ (క్) ।
సుమేధా మేధజో ధన్యః సత్యమేధా ధరాధరః ॥ 80

తేజోవృషో ద్యుతిధరః సర్వశస్త్ర భృతాంవరః ।
ప్రగ్రహో నిగ్రహో వ్యగ్రో నైకశృంగో గదాగ్రజః ॥ 81

చతుర్మూర్తిః చతుర్బాహుః చతుర్వ్యూహశ్చతుర్గతిః ।
చతురాత్మా చతుర్భావః చతుర్వేదవిదేకపాత్ ॥ 82

సమావర్తోఽనివృత్తాత్మా దుర్జయో దురతిక్రమః ।
దుర్లభో దుర్గమో దుర్గో దురావాసో దురారిహా ॥ 83

శుభాంగో లోకసారంగః సుతంతుః తంతువర్ధనః ।
ఇంద్రకర్మా మహాకర్మా కృతకర్మా కృతాగమః ॥ 84

ఉద్భవః సుందరః సుందో రత్ననాభః సులోచనః ।
అర్కో వాజసనః శృంగీ జయంతః సర్వవిజ్జయీ ॥ 85

సువర్ణబిందు రక్షోభ్యః సర్వవాగీశ్వరేశ్వరః ।
మహాహ్రదో మహాగర్తో మహాభూతో మహానిధిః ॥ 86

కుముదః కుందరః కుందః పర్జన్యః పావనోఽనిలః ।
అమృతాశోఽమృతవపుః సర్వజ్ఞః సర్వతోముఖః ॥ 87

సులభః సువ్రతః సిద్ధః శత్రుజిత్ శత్రుతాపనః ।
న్యగ్రోధో దుంబరోఽశ్వత్థః చాణూరాంధ్రనిషూదనః ॥ 88

సహస్రార్చిః సప్తజిహ్వః సప్తైధాః సప్తవాహనః ।
అమూర్తి రనఘోఽచింత్యో భయకృద్భయ నాశనః ॥ 89

అణుర్బృహత్ కృశః స్థూలో గుణభృన్నిర్గుణో మహాన్ ।
అధృతః స్వధృతః స్వాస్యః ప్రాగ్వంశో వంశవర్ధనః ॥ 90

భారభృత్కథితో యోగీ యోగీశః సర్వకామదః ।
ఆశ్రమః శ్రమణః క్షామః సుపర్ణో వాయువాహనః ॥ **91**

ధనుర్ధరో ధనుర్వేదో దండోదమయితా దమః ।
అపరాజితః సర్వసహో నియంతాఽనియమోఽయమః ॥ **92**

సత్త్వవాన్ సాత్త్వికః సత్యః సత్యధర్మపరాయణః ।
అభిప్రాయః ప్రియార్హోఽర్హః ప్రియకృత్ప్రీతివర్ధనః ॥ **93**

విహాయసగతిర్జ్యోతిః సురుచిః హుతభుగ్విభుః ।
రవిర్విలోచనః సూర్యః సవితా రవిలోచనః ॥ **94**

అనంతో హుతభుగ్ భోక్తా సుఖదో నైకదోఽగ్రజః ।
అనిర్విణ్ణః సదామర్షీ లోకాధిష్ఠాన మద్భుతః ॥ **95**

సనాత్ సనాతనతమః కపిలః కపిరవ్యయః ।
స్వస్తిదః స్వస్తికృత్ స్వస్తి స్వస్తిభుక్ స్వస్తిదక్షిణః ॥ **96**

అరౌద్రః కుండలీ చక్రీ విక్రమ్యూర్జితశాసనః ।
శబ్దాతిగః శబ్దసహః శిశిరః శర్వరీకరః ॥ **97**

అక్రూరః పేశలో దక్షో దక్షిణః క్షమిణాం వరః ।
విద్వత్తమో వీతభయః పుణ్యశ్రవణకీర్తనః ॥ **98**

ఉత్తారణో దుష్కృతిహా పుణ్యో దుస్స్వప్ననాశనః ।
వీరహా రక్షణః సంతో జీవనః పర్యవస్థితః ॥ **99**

అనంతరూపోఽనంత శ్రీః జితమన్యుః భయాపహః ।
చతురశ్రో గభీరాత్మా విదిశో వ్యాదిశో దిశః ॥ **100**

అనాదిః భూర్భువో లక్ష్మీః సువీరో రుచిరాంగదః ।
జననో జనజన్మాదిః భీమో భీమపరాక్రమః ॥ **101**

ఆధారనిలయోఽధాతా పుష్పహాసః ప్రజాగరః ।
ఊర్ధ్వగః సత్పథాచారః ప్రాణదః ప్రణవః పణః ॥ **102**

ప్రమాణం ప్రాణనిలయః ప్రాణభృత్ ప్రాణజీవనః ।
తత్త్వం తత్త్వవిదేకాత్మా జన్మమృత్యు జరాతిగః ॥ **103**

భూర్భువః స్వస్తరుస్తారః సవితా ప్రపితామహః ।
యజ్ఞో యజ్ఞపతిర్యజ్వా యజ్ఞాంగో యజ్ఞవాహనః ॥ 104

యజ్ఞభృత్ యజ్ఞకృత్ యజ్ఞీ యజ్ఞభుక్ యజ్ఞసాధనః ।
యజ్ఞాన్తకృత్ యజ్ఞ గుహ్య మన్నమన్నాద ఏవచ ॥ 105

ఆత్మయోనిః స్వయంజాతో వైఖాన స్సామగాయనః ।
దేవకీనందనః స్రష్టా క్షితీశః పాపనాశనః ॥ 106

శంఖభృన్నందకీ చక్రీ శార్జ్గధన్వా గదాధరః ।
రథాంగపాణి రక్షోభ్యః సర్వప్రహరణాయుధః ॥ 107

(శ్రీ సర్వప్రహరణాయుధ ఓం నమ ఇతి)

వనమాలీ గదీ శార్జ్గీ శంఖీ చక్రీ చ నందకీ ।
శ్రీమన్నారాయణో విష్ణుః వాసుదేవోఽభిరక్షతు ॥ 108



# 7. ఓం కారము

**హరిః ఓమ్**

**ఓమిత్యే కాక్షరం బ్రహ్మ**

ప్రియశిష్యులారా ! ఓం కారమనేది పరబ్రహ్మ స్వరూపము. నిరాకారుడు నిర్గుణ స్వరూపుడు పరబ్రహ్మ. అతడే గనక ఒక ఆకారం ధరించినట్లైతే దాని పేరే ఓంకారము.

**ఓంకార మంత్ర సంయుక్తం నిత్యం ధ్యాయన్తు యోగినః ।**

**కామదం మోక్షదం తస్మై ఓంకారాయ నమోనమః ॥**

ఓం కారమనే మంత్రాన్ని గనక ధ్యానించినట్లైతే, సాధకుడికి ఇహము పరము కూడా సిద్ధిస్తుంది. అంటే ఈ లోకంలో కావలసిన భోగభాగ్యాలు, సిరిసంపదలు, అష్టైశ్వర్యాలు, లభించటమేగాక చివరిదశలో మోక్షం కూడా లభిస్తుంది. అందుచేత అటువంటి పరబ్రహ్మ స్వరూపమైన ఓం కారానికి నమస్కరిస్తున్నాను.

ఓంకారము యొక్క పవిత్రత, ప్రాముఖ్యతల గురించి ఉపనిషత్తులలో అనేకచోట్ల వివరించబడింది. **మాండూక్యోపనిషత్తు**లో ఈ విధంగా చెప్పబడింది.

**ఓమిత్యే దక్షరమిదగ్ం సర్వం**

అది హిమాలయ పర్వత ప్రాంతం. వెండిలాగా మెరుస్తున్న తెల్లని మంచు పర్వతాలు. గలగలాపారే గంగానది. ప్రశాంతమైన వాతావరణం ఆ పర్వతప్రాంతంలో ఋష్యాశ్రమం. ఆ ఆశ్రమ ప్రాంగణంలో ఒక చెట్టుక్రింద కొంచెం ఎత్తైన ప్రాంతంలో బ్రహ్మజ్ఞాని అయిన గురువుగారు. అతడి ఎదురుగా కొద్దిగా దిగువన భక్తిశ్రద్ధలతో కూడిన బ్రహ్మజిజ్ఞాసి అయిన శిష్యుడు.

ఈ శిష్యుడు పరమనిష్ఠాగరిష్ఠుడు. సాకార బ్రహ్మోపాసనలో ఆరితేరినవాడు. అతణ్ణి అనుమానం పట్టిపీడిస్తోంది. చరాచర జగత్తు అంతా నడుస్తున్నది కదా ? ఈ జగత్తుకు మూలకారణం ఏది ? నానాత్వ విశిష్టమైన ఈ ప్రపంచం వెనుక సత్యమైన తత్త్వము ఏదైనాఉన్నదా? ఇదే ప్రశ్న గురువుగారి ముందుంచాడు ఇప్పుడు గురువుగారు చెబుతున్నారు

**ఓమిత్యే తదక్షరమిదగ్ం సర్వం**

ఓంకారమనే అక్షరం ఈ జగత్తంతా నిండి ఉన్నది. ఆశ్చర్యపోయాడు శిష్యుడు. చరాచరజగత్తు అంటే సామాన్యమైనదికాదు. కొన్నివేల, లక్షల, కోట్ల, కోటానుకోట్లమైళ్ళ

దూరం ఆక్రమించి ఉన్నది. ఇందులో బోలెడన్ని అడవులు, కొండలు, కోనలు, పర్వతాలు, నదులు, సముద్రాలు, మహాపట్టణాలు ఉన్నాయి. అనేక రాజ్యాలు ఉన్నాయి. రాజులున్నారు ఇంతమందితో కూడిన ఈ జగత్తును ఓంకారము అనే చిన్న అక్షరం ఆక్రమించి ఉన్నదా? చాలా ఆశ్చర్యంగా ఉందే ? అనుకుంటూ గురువుగారి ముఖంలోకి చూశాడు. అర్థమయింది గురువుగారికి అందుకే చెబుతున్నాడు. **తస్యోపవ్యాఖ్యానమ్** ఆ విషయాన్ని వివరిస్తున్నాడు.

కొన్నివేల కుండలు తయారు చేసినప్పటికీ, ఆ కుండలన్నిటికీ మూలము మట్టి అయినట్టుగానే దృశ్యమానమైన ఈ ప్రపంచానికి శాశ్వతమైన ఒక దివ్యశక్తి మూలమై ఉన్నది. ఆ కుండలన్నీ మట్టిలోనే పుట్టిమట్టితోనే పెరిగి చివరకు మళ్ళీ మట్టిలోనే కలిసిపోతాయి. అలాగే ఈ ప్రపంచం కూడా పరమేశ్వరుని కృపతోనే సృష్టించబడింది. పరమేశ్వరుని వల్లనే రక్షించబడుతోంది. చివరకు పరమేశ్వరునిలోనే లీనమైపోతుంది. ఈరకంగా సృష్టి స్థితి లయాలకు ఆధారమైన సర్వవ్యాపి, శుద్ధ చైతన్యమే ఓంకారము. ప్రపంచాన్ని ఒక శబ్దం ద్వారా సూచిస్తే, ఆ శబ్దమే ఓంకారము. ప్రతి వస్తువుకూ ఒకరూపం ఉంటుంది. ఆ రూపానికి ఒకే పేరు ఉంటుంది. జగత్తు అనే పరబ్రహ్మకు నామం ఓం కారము.

**భూతం భవద్భవిష్యదితి సర్వ మోంకార ఏవ ।**
**యచ్చాన్యత్ త్రికాలాతీతం త దప్యోం కార ఏవ ॥**

భూతభవిష్యద్వర్త మానకాలలు ఓంకారమే. త్రికాలాతీతమైనది ఏదైనాఉంటే, అది కూడా ఓంకారమే.

ఇది సమస్తలోకాలకు, జగత్తులకూ ప్రతీక. పరమేశ్వరుని దృశ్యరూపం విశ్వమయితే శబ్దం ఓంకారమవుతుంది ఇక్కడ చిన్న అనుమానం వస్తుంది. పరమేశ్వరుడు త్రికాలములకు ప్రతీక. అంతేకాని కాలాతీతమైన దానితో ఆయనకు సంబంధం ఉండదుకదా ? అని అలా కాదు. పరమేశ్వరుడు పరిమితమైన దానికి, అపరిమితమైన దానికి కూడా ప్రతీకయే. అందుచేతనే అతడు త్రికాలాలకే కాదు, కాలాతీతమైన దానికి కూడా ప్రతీక. కాలజ్ఞానమనేది మనసు యొక్క ఇంద్రజాలము. మనసు లేకపోతే కాలం ఉండదు. ఆ మనసు జడము, అచేతనము. అటువంటి అచేతనమైన మనసు జీవము పొందినట్లైతే చేతనమవుతుంది. అంటే జీవము పొందిన మనస్సే చలిస్తుంది. చలనవంత మవుతుంది. కాబట్టి త్రికాలాతీతమైనది ఆ దివ్యచైతన్యము తప్ప వేరు కాదు. దానివల్లనే ఈ శరీరంలోని మనసు, బుద్ధి కూడా పని చెయ్యగలుగుతున్నాయి. ఆ చైతన్యమే ఓంకారము.

ప్రశ్నోపనిషత్తులో సత్యకాముడు పిప్పలాదమహర్షికి నమస్కరించి "మహర్షీ ! మానవుడు మరణించే దాకా ఓంకార ధ్యానం చేస్తే ఏ లోకాలకు పోతాడో వివరించండి" అని అడుగుతాడు. దానికి పిప్పలాదుడు.

సత్యకామా ! ఓంకారమనేది పరబ్రహ్మము, అపరబ్రహ్మము కూడా. పరబ్రహ్మము అంటే – సర్వాతీత నిర్గుణబ్రహ్మ. అపరబ్రహ్మము అంటే సాకారము – వ్యక్తరూపం గల హిరణ్యగర్భుడు అందుచేత పండితుడు, జ్ఞానులు ఓంకారాన్నే ఉపాసిస్తారు.

ఓంకారము నాదబ్రహ్మము. దీన్నే ప్రణవము అంటారు. దీన్నుంచే సమస్త శబ్దాలు, మంత్రాలు ఉత్పన్నమైనాయి. అందుచేతనే ఓంకారము సర్వమంత్రాలకు హేతువు.

సగుణ బ్రహ్మను ఓంకారంతో ఉపాసించవచ్చు. అలాగే అవ్యక్తమైన పరబ్రహ్మని శబ్దంతో సూచించటానికి ఓంకారమే గుర్తు. ఓంకారంలో అకార, ఉకార, మకారాలు అనే మూడు అక్షరాలున్నాయి. ఓంకారమనేది మూడు వేదాలకు ప్రతీక. ఇందులోని

అ కారము – ఋగ్వేదము

ఉ కారము – యజుర్వేదము

మ కారము – సామవేదము

దీనిలో ఒక అక్షరాన్ని మాత్రమే ధ్యానించినట్లైతే సాధకుడు మరణానంతరము స్వర్గసుఖాలనుభవించి, తరువాత భూలోకంలో మళ్ళీ జన్మిస్తాడు. రెండు అక్షరాలను కలిపి ధ్యానిస్తే సాధకుడు సూక్ష్మశరీరంతో చంద్రలోకానికి పోయి అక్కడ సుఖాలనుభవించి తిరిగి మానవలోకంలో జన్మిస్తాడు. మూడు అక్షరాల రూపమైన ఓంకారాన్ని గనక ధ్యానిస్తే సాధకుడు తేజోవంతమైన సూర్యలోకానికి పోతాడు. పాముకుబుసాన్ని వదిలినట్లుగా జీవి తన శరీరానికి అంటుకున్న పాపాలు వదిలించుకుంటాడు. ఆ తరువాత సామవేద భావంచేత బ్రహ్మలోకానికి పోతాడు. కల్పాంతము వరకు అక్కడ ఉండి, ఆ తరువాత పరబ్రహ్మలో లీనమవుతాడు.

ఓంకారము యొక్క మూడు మాత్రలను విడివిడిగా ధ్యానించేవాడు మృత్యుంజయుడు కాలేడు. మూడు మాత్రలను కలిపి ధ్యానించేవాడు అచంచలమైన ఆత్మనిష్ఠను పొందుతాడు. ఓం కారోపాసకుడు.

ఋగ్దేవతలచే – భూలోకము

యజుర్దేవతలచే – చంద్రలోకము

సామదేవతలచే – బ్రహ్మలోకము

పొందుతాడు. ఓంకారము ద్వారానే జ్ఞాని అయినవాడు శాశ్వతమైన బ్రహ్మలోకాన్ని పొంది కల్పాంతాన పరబ్రహ్మలో లీనమవుతాడు." అని సమాధానం చెప్పాడయ్యా ! ఇదేవిధంగా **ఛాందోగ్యోపనిషత్తు**లో కూడా ఓంకారోపాసన గురించి వివరించబడింది. దాన్ని మీకు చెబుతాను వినండి.

**ఓమిత్యే తదక్షర ముద్గీథ ముపాసీత**

ఓంకారాన్ని 'ఉద్గీత' దృష్టితో ఉపాసించాలి. యజ్ఞంచేసేటప్పుడు సామగీతాలు గానంచేసేవాడు 'ఉద్గాత'. అతడు చేసే సామగాన భాగాన్ని 'ఉద్గీత' అంటారు. ఓంకారాన్ని ఉద్గీత దృష్టితో ఉపాసించాలి. అంటే ఓంకారము, ఉద్గీత రెండు ఒకటే అని భావించి ఉపాసన చెయ్యాలి.

ఓంకారము పరబ్రహ్మకు శబ్ద ప్రతీక. ఇది కేవలం ఉపాసన కోసం ఏర్పరచుకొన్న చిహ్నము. ఉపాసన అంటే ఒకే శబ్దాన్ని జపించటం మాత్రమేకాదు. మనసును పూర్తిగా దానిమీద లగ్నంచేసి, ఆ శబ్దాన్ని నిరంతరం ధ్యానం చెయ్యటమే ఉపాసన. కర్మకాండలో ఒక భాగంగా, పరబ్రహ్మకు శబ్దప్రతీకగా ఓంకారము ఉపయోగించబడుతుంది.

ఓంకారంతోనే త్రయీ విద్యలో చెప్పబడిన వైదికకర్మలన్నీ ప్రారంభమవుతాయి. త్రయీ విద్య అంటే వేదవిద్య. ముందుగా ఓంకారాన్ని ఉచ్చరించే దేవతాస్తుతిగాని, కర్మ ప్రారంభంగాని జరుగుతుంది. వేదోక్తమైన కర్మ అంతా ఓంకారాన్ని పూజించటానికే జరుగుతుంది. ఓంకారము పరబ్రహ్మ స్వరూపము కాబట్టి, ఆ పరబ్రహ్మను అర్చించటానికే ఈ కర్మకాండ అంతా జరుగుతుంది. ఓంకారము యొక్క మహిమవల్ల, ఓంకారోపాసన వల్లనే వైదికకర్మలు నిర్వహించబడుతున్నాయి. యజ్ఞమనేది ప్రాణము, అన్నములతో నిర్వహించబడుతున్నది. ప్రాణము, అన్నము కూడా ఓంకారము. కాబట్టి యజ్ఞము కూడా ఓంకారమే దీని ఫలింతగానే సూర్యుని ద్వారా వర్షం కురుస్తుంది. ఆ వర్షం ద్వారా అన్న ప్రాణాలు ఉత్పత్తి అవుతాయి. ఓంకారమనే అక్షరాన్ని ఈ విధంగా తెలుసుకున్నవాడు తెలుసుకోనివాడు ఇద్దరూ కర్మని చేస్తూనే ఉంటారు. కాని ఈ విషయం తెలియకుండా కర్మచేసేకన్న తెలుసుకుని కర్మని ఆచరిస్తే ఫలితము కొన్నిరెట్లు అధికంగా ఉంటుంది.

ఓంకారాన్ని గురించి అధర్వణవేదానికి సంబంధించిన **'అధర్వశిఖోపనిషత్తు'**లో పూర్తిగా వివరించబడింది. ఇప్పుడు ఆ ఉపనిషత్తును మీకు వివరిస్తాను వినండి.

## అధర్వశిఖోపనిషత్తు :

**ఓం. అథ హైనం పైప్పలా దోఽంగిరాం సనత్కుమారశ్చా థర్వణ మువాచ (1) భగవన్కి మాదౌ ప్రయుక్తం ధ్యానం ధ్యాయితవ్యం కిం తత్ ధ్యానం కోవా ధ్యాతా కశ్చ ధ్యేయః (2) సఏభ్యోఽ థర్వాప్రత్యువాచ, ఓ మిత్యేత దక్షర మాదౌప్రయుక్తం ధ్యానం ధ్యాయితవ్య మితి (3)**

పైప్పలాదుడు, ఆంగిరసుడు, సనత్కుమారుడు అనేవారు ముగ్గురు అధర్వణముని దగ్గరకు వెళ్ళి నమస్కరించి, "గురుదేవా ! సృష్టి సమయంలో బ్రహ్మాది దేవతలు ఏమి ఉపయోగించారు ? ధ్యానమంటే ఏమిటి ? ధ్యానింపతగినది ఏది ? ధ్యానానికి సాధనము ఏది ? శ్రేష్ఠమైన ధ్యాత ఏది ? ధ్యేయము ఏది ? వీటిని మాకు వివరించవలసినది" అని అడిగారు. ఆ మాటలు విన్న అధర్వణమహర్షి చెబుతున్నాడు. "నాయనలారా ! బ్రహ్మజిజ్ఞాసువులారా ! ప్రణవాక్షరమే మొదటగా ఉపదేశింపబడినది. అదియే ధ్యానము. ఆ ప్రణవమే ధ్యానింపబడవలసినది.

**ఏత దక్షరం పరంబ్రహ్మాస్య పాదా శ్చత్వారో వేదా శ్చతుష్పా దిద మక్షరం పరం బ్రహ్మ (4) పూర్వాస్యమాత్రా పృథివ్యకార స్సఋగ్భి రృగ్వేదో బ్రహ్మ, వసవో గాయత్రీ, గార్హపత్యః (5) ద్వితీయాంతరిక్షగ్ం స ఉకార స్స యజుర్భి ర్యజుర్వేదో విష్ణు రుద్రాస్త్రిష్టు బ్దక్షిణాగ్ని (6) తృతీయా ద్యౌస్సమకార స్ససామభి స్సామ వేదో రుద్రా ఆదిత్యా జగత్యాహవనీయః (7)**

ప్రణవాక్షరము పరబ్రహ్మస్వరూపము. దీనికి నాలుగు పాదాలు (మాత్రలు) ఉన్నాయి. ఈ నాలుగుపాదాలే వేదాలు. దీనిలో మొదటి మాత్ర అకారము దీనికి భూతము పృథివి. ఇది ఋక్కులతో కూడి ఉన్నది. దీనికి అధిదేవత – బ్రహ్మ పితృదేవతలు – అష్టవసువులు, గాయత్రి ఛందస్సు, గార్హపత్యాగ్ని.

| | | |
|---|---|---|
| రెండవ మాత్ర | – | ఉకారము |
| దీనికి భూతము | – | ఆకాశము. యజస్సులతో కూడినది. |
| అధిదేవత | – | విష్ణువు |
| పితృదేవతలు | – | ఏకాదశరుద్రులు |
| చందస్సు | – | త్రిష్టుప్ చందస్సు. దక్షిణాగ్ని |

| | | |
|---|---|---|
| మూడవమాత్ర | – | మకారము |
| దీనికి లోకము | – | స్వర్గము. సామగానములతోకూడినది |
| అధిదేవత | – | రుద్రుడు |
| పిత్రుదేవతలు | – | ద్వాదశాదిత్యులు |
| చందస్సు | – | జగతిచ్ఛందస్సు. ఆహవనీయాగ్ని |

**యాఽవసానేఽస్య చతుర్థ్యర్థమాత్రా స సోమలోక ఓంకార స్సాథర్వణ మంత్రై రథర్వవేద స్సంవర్తకోఽగ్నిర్మరుతో విరాదే కర్షి ర్భాస్వతీః స్మృతాః (8) ప్రథమా రక్తపీతా మహద్బ్రహ్మ దైవత్యా, ద్వితీయా విద్యుమతీ కృష్ణా విష్ణుదైవత్యా, తృతీయా శుభాశుభాశుక్లా రుద్రదైవత్యా, యావసానేఽస్యచతుర్థ్యర్థమాత్రా సా విద్యుమతీ సర్వవర్ణా పురుషదైవత్యా (9) స ఏష హ్యోంకారః, చతురక్షర శ్చతుష్పాద శ్చతుశ్శిర శ్చతురర్ధమాత్ర స్థూలమేతద్ధ్రస్వదీర్ఘ ప్లుతఇతి, ఓం 1 ఓం 2 ఓం 3 ఇతి (10)**

**త్రిరుక్తా చతుర్థ శ్శాంత ఆత్మా ప్లుత ప్రణవ ప్రయోగేన సమస్త మోమితి ప్రయుక్త ఆత్మజ్యోతి స్సకృదావర్తతే (11) సకృదుచ్చారితమాత్ర సఏష ఊర్ధ్వమున్నామయ తీత్యోంకారః (12) ప్రాణాం త్సర్వా న్ప్రలీయత ఇతి ప్రళయః ప్రాణాం త్సర్వా న్పరమాత్మని ప్రణామయతీ త్యేతస్మా త్ప్రణవః చతుర్థావస్థితఇతి సర్వదేవ వేదయోనిస్సర్వవాచ్యవస్తు ప్రణవాత్మకమ్ (13)**

| | | |
|---|---|---|
| నాల్గవది | – | అర్ధమాత్ర |
| దీనికి లోకము | – | సోమలోకము. అధర్వణవేదము |
| మరుత్తులు | – | విరాట్టు |
| ఋషి | – | భాస్వతి |

అకార ఉకార మకారములకు చివర ఉండే సూక్ష్మమైన అర్థమాత్రమే నాదము. ఇప్పుడు ప్రథమమాత్ర – ఎరుపురంగులో ఉంటుంది. దీనిశక్తి స్వర్ణకాంతి గలది. దీనికి అధిదేవత బ్రహ్మ.

రెండవమాత్ర – నలుపురంగులో ఉంటుంది. దీనిశక్తి విద్యుత్కాంతిగలది. అధిదేవత విష్ణువు.

మూడవ మాత్ర – తెల్లగా ఉంటుంది. దీని శక్తి శుక్లవర్ణము. అధిదేవత రుద్రుడు.

నాల్గవ మాత్ర - అర్ధమాత్ర, లక్ష్మీదేవి వంటి వర్ణము గలది. దీని శక్తి సమస్త వర్ణాలతోను ఉంటుంది. దీనికి అధిదేవత పరమాత్మ. ఈ రకంగా ఓంకారానికి నాలుగు పాదాలు ఉన్నాయి.

3, 4 మాత్రలు గల ప్రణవాన్ని ఉచ్చరించి, నాల్గవసారి ఐదుమాత్రలు గల ప్రణవాన్ని ఉచ్చరించాలి. ఈ రకంగా ఉపాసనచేసినట్లైతే శాంతము, ఆత్మస్వరూపము, ప్రణవము అయిన ఆత్మ జ్యోతి ఒక్కసారిగా ప్రకాశిస్తుంది.

ఒక్కసారి ప్రణవాన్ని ఉచ్చరించినంత మాత్రంచేత ఉత్తమస్థానాలు లభిస్తాయి. పరమపదము లభిస్తుంది. కాబట్టి ఇది - ఓంకారము అనబడుతుంది. ప్రాణాలన్ని ఇందులోనే లయం చెందుతాయి. కాబట్టి 'ప్రళయము' అనబడుతుంది. సకలప్రాణులను పరమాత్మయందు లీనం చేస్తుంది. కాబట్టి 'ప్రణవము' అనబడుతుంది.

నాలుగుపాదాలతో కలిసి ఉండటంచేత - సకల దేవతలకు, వేదములకు కూడా యోనిస్థానము అయి ఉన్నది.

**దేవాశ్చేతి సంధత్తాం సర్వేభ్యో దుఃఖభయేభ్య స్సంతారయతీతి తారణా త్తారః (14) సర్వే దేవాః సంవిశంతీతి విష్ణుః, సర్వాణి బృంహ యతీతి బ్రహ్మ, సర్వస్యాంతః స్థానేభ్యోఽ ధ్యే యేభ్యోప్రదీపవ త్ప్రకాశ యతీతి ప్రకాశః (15) ప్రకాశేభ్య స్సదోమి త్యంతఃశరీరే విద్యుద్వ ద్ద్యోతయతి ముహుర్ముహురితి విద్యుద్వత్ప్రతీయా ద్దిశం దిశం భిత్వా సర్వాన్లోకా న్వ్యాప్నోతి వ్యాపయతీతి వ్యాపనా ద్వ్యాపీ మహాదేవః (16)**

సమస్త దేవతలు ప్రణవస్వరూపమే. సమస్త దుఃఖములనుండి, భయములనుండి తరింపచేయునది కాబట్టి 'తారణము' అనబడుతుంది. తారణము చేస్తుంది. కాబట్టి - 'తారకము' అనబడుతుంది.

సమస్త దేవతలు విశ్రమించే స్థానాన్ని 'విష్ణు' స్థానము అంటారు. అన్ని ప్రాణులను మళ్ళీ సృష్టిస్తుంది. కాబట్టి 'బ్రహ్మ' అనబడతాడు. ప్రాణుల యొక్క హృదయమందు దీపమువలె ప్రకాశిస్తుంది కాబట్టి 'ప్రకాశము' అనబడుతుంది. అన్ని వెలుగులకు వెలుగై దేహములోపల ఓం అని మెరుపువలె ప్రకాశిస్తుంది. కాబట్టి 'విద్యుత్తు' అనబడుతుంది. సమస్త దిక్కులందు అంతర్యామిగా ఉండి లోకములన్నింటినీ వ్యాపించి ఉంటుంది. కాబట్టి 'మహాదేవుడు' అనబడుతుంది.

**పూర్వాస్యమాత్రా జాగర్తిజాగరితం ద్వితీయా స్వప్నం తృతీయా సుషుప్తి శ్చతు తురీయం మాత్రా మాత్రాః ప్రతిమాత్రా గతా స్సమ్య క్సమన్తానపి పాదాఞ్జయతీతి స్వయం ప్రకాశ స్స్వయం బ్రహ్మ భవతీ త్యేషసిద్ధికర ఏతస్మాద్ధ్యానాదౌ ప్రయుజ్యతే (17) సర్వకరణోపసంహారత్వా ద్ధార్య ధారణా ద్బ్రహ్మతురీయమ్, సర్వకరణాని మనసి సంప్రతిష్ఠాప్య ధ్యానం విష్ణుః (18)**

| | | |
|---|---|---|
| ప్రణవము యొక్క మొదటి మాత్ర | – | జాగ్రదవస్థ |
| రెండవమాత్ర | – | స్వప్నావస్థ |
| మూడవమాత్ర | – | సుషుప్తి |
| నాల్గవమాత్ర | – | తురీయము. |

ఒక్కొక్క మాత్ర, విభిన్న మాత్రలయందు లయం చెందుతాయి. ఓంకారము స్వయం ప్రకాశమైనది. దీనిని శ్రద్ధగా ధ్యానంచేస్తే మోక్షం సిద్ధిస్తుంది. కాబట్టే ఓంకారము ధ్యానము, ధారణ, సమాధులయందు వినియోగించబడుతున్నది. స్థూలశరీరంలోని దశేంద్రియాలను మనస్సునందు లయం చేసి ధ్యానించటమే విష్ణువు. (విష్ణుస్థితి)

**ప్రాణం మనసి సహకరణై స్సంప్రతిష్ఠాప్య ధ్యాతా రుద్రః, ప్రాణం మనసి హకరణై ర్నా దాంతే పరమాత్మని సంప్రతిష్ఠాప్య ధ్యా యీ తేశానం ప్రధ్యాయితవ్యగ్ం (19) సర్వ మిదం బ్రహ్మవిష్ణు రుద్రేంద్రాస్తే సంప్రసూయంతే సర్వాణి చేంద్రి యాణి సహభూతై ర్న కారణం కారణానాంధాతాధ్యాతా కారణంతు ధ్యేయ స్సర్వైశ్వర్య సంపన్నస్సర్వేశ్వర శ్శంభు రాకాశమధ్యే (20) ధ్రువం స్తబ్ధ్వాధికం క్షణ మేకం క్రతు శతస్యాపి చతు స్సప్తత్యాయత్ఫలం త దవాప్నోతి (21)**

సూక్ష్మదేహంలోని తత్త్వాలను, ఇంద్రియాలను మనసులో లయంచేసి ధ్యానించేవాడు ఇంద్రుడు. ప్రాణమును, ఇంద్రియాలను మనసున చేర్చి నాదాంతమైన పరమాత్మయందు నిలిపి ఆ పరమేశ్వరుణ్ణి ధ్యానించాలి. ఆ పరమేశ్వరుడు ఆది మధ్యాంతములు లేనివాడు. నాశనరహితుడు. సమస్త కారణములకు కారణమైనవాడు. సకల సంపదలకు ఆలవాలమైనవాడు. అతడే సర్వేశ్వరుడు, ఓంకారరూపంలో ఉంటాడు. ఆ పరమాత్మయే ధ్యానింపదగిన ధ్యేయ వస్తువు. ఈ రకంగా ఒక్కసారి ధ్యానము చేసినవాడు, శతాధిక యజ్ఞములు 74సార్లు చేసిన ఫలితము పొందుతాడు. అంటే 7400 యజ్ఞములుచేసిన ఫలితాన్ని పొందుతాడు.

**కృత్స్న మోంకారగతిం చ సర్వధ్యాన యోగజ్ఞానానాం యత్ఫల మోంకారో వేద పర ఈశోవా (22) శివ ఏకో ధ్యేయ శ్శివంకర స్సర్వమన్య త్పరిత్యజ్య సమస్తాథర్వశి ఖైతా మధీత్య ద్విజో గర్భవాసాద్విముక్తో విముచ్యత ఏతామధీత్య ద్విజోగర్భవాసా ద్విముక్తో విముచ్యత ఇత్యోగ్ం సత్య మిత్యుపనిషత్ (23) (అధర్వశిఖోపనిష త్సమాప్తా)**

ఓంకార ధ్యానము చేసినవాడు సమస్త ప్రణవస్వరూపము, సకల విధములైన ధ్యానములు, సకల యోగములు, సకల జ్ఞానములు, వాటి ప్రయోజనములు తెలుసుకొనగలుగుతాడు.

ఈవిధంగా అధర్వశిఖోపనిషత్తును తెలుసుకున్నవాడు జననమరణములనుండి, సకల దుఃఖముల నుండి విముక్తుడవుతాడు. అంటోంది. ఈ ఉపనిషత్తు.

కాబట్టి ఏదైనా ఒక శుభకార్యము ప్రారంభించాలి అంటే ఓంకారముతోనే ప్రారంభించాలి. అందుచేత విష్ణు సహస్రనామ భాష్యాన్ని కూడా ముందుగా ఓంకారముతోనే ప్రారంభిస్తున్నాను. ఇక భాష్యాన్ని వినండి అంటూ **శ్రీ కైవల్యసారథి** అనే పేరుగల విష్ణుసహస్రనామ భాష్యాన్ని ప్రారంభించాడు రత్నాకరుడు.



# 8. పరమేశ్వరుడు సర్వాంతర్యామి

నిరాకారుడు, నిర్గుణ స్వరూపుడు అయిన పరబ్రహ్మ బిందురూపంలో ఉన్నాడు. ఆ నిరాకారుడు గనక సాకారుడైనట్లైతే, అతడే శ్రీ మహావిష్ణువు. సామవేదానికి సంబంధించిన **మహోపనిషత్తు**లోని మొదటి అధ్యాయంలో ఈవిధంగా చెప్పబడింది.

"ఈ సృష్టికి ముందు నారాయణశాఖ పరబ్రహ్మతత్త్వము ఒక్కటి మాత్రమే ఉన్నది. ఆసమయంలో బ్రహ్మలేదు, రుద్రుడులేదు. నీరులేదు, అగ్నిలేదు, వాయువులేదు, భూమిలేదు, ఆకాశంలేదు, నక్షత్రాలు లేవు. సూర్యచంద్రులు లేరు. ఈతడు ఏకాకిగా ఉన్నాడు. ఏకాకిగా ఉన్న ఆ పరమేశ్వరుడు తనయొక్క వైభవాన్ని తను అనుభవించక పోవటమనేది లోపంగా భావించి 'స్తోమము' అను పేరుగల ఒక మహాయజ్ఞాన్ని చేసి, ఈ సృష్టిని చేశాడు. ఆ పరమపురుషుని నుండి 14 మంది పురుషులు, ఒక కన్య జన్మించారు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| జ్ఞానేంద్రియాలు | - | 5 | దేహము | - | 1 |
| కర్మేంద్రియాలు | - | 5 | బుద్ధి | - | 1 |
| మనస్సు | - | 1 | పంచతన్మాత్రలు | - | 5 |
| అహంకారము | - | 1 | పంచభూతాలు | - | 5 |
| ప్రాణము | - | 1 | వెరసి | - | 25 |

ఈ రకంగా 25 తత్త్వాలతో కలసిన విరాట్పురుషుడు జన్మించాడు. ఈ సృష్టిలో పరమాత్మ అధిష్ఠాన రూపంలో ప్రవేశించాడు. ఆ తరువాత విరాట్పురుషుని నుండి కాలస్వరూపంలో సంవత్సరాలు పుట్టినాయి. తరువాత శ్రీమన్నారాయణుడు ఇంకొక సంకల్పముతో ధ్యానం చేశాడు. అప్పుడు నారాయణుని లలాటము నుంచి త్రినేత్రుడు, త్రిశూలపాణి అయి జన్మించాడు. అతని యందు యశస్సు, సత్యము, బ్రహ్మచర్యము, తపస్సు, వైరాగ్యము ఇవి అన్నీ ప్రకాశిస్తున్నాయి. అందుచేతనే అతడు ఈశానుడు, మహాదేవుడు అని పిలువబడుతున్నాడు.

ఆ తరువాత నారాయణుడు ఇంకొక సంకల్పముతో ధ్యానంచేశాడు. అప్పుడు నారాయణుని లలాటమునుంచి స్వేదము పుట్టింది. ఆ స్వేదమే, సర్వత్రవ్యాపించి జలమయింది. ఆ జలం నుండి బంగారు కాంతిలో గల ఒక అండము పుట్టింది. ఆ అండమునుండి చతుర్ముఖ బ్రహ్మ జన్మించాడు. ఈ బ్రహ్మ తూర్పుదిక్కుకు తిరిగి ధ్యానం

చేశాడు. అప్పుడు భూః అనే వ్యాహృతి, గాయత్రీఛందస్సు, ఋగ్వేదము, అగ్నిదేవత ఆవిర్భవించినాయి. మళ్ళీ బ్రహ్మ పశ్చిమదిక్కుకు తిరిగి ధ్యానం చేశాడు. అప్పుడు భువః అనే వ్యాహృతి, త్రిష్టుప్ ఛందస్సు, యజుర్వేదము, వాయుదేవత ఆవిర్భవించాయి.

తరువాత బ్రహ్మ ఉత్తరాభిముఖుడై ధ్యానం చేశాడు. అప్పుడు 'స్వః' అనే వ్యాహృతి, జగతీచ్ఛందస్సు, సామవేదము, సూర్యదేవత జన్మించారు. తరువాత బ్రహ్మ దక్షిణాభిముఖుడై ధ్యానము చేయగా 'మహః' అనే వ్యాహృతి, అనుష్టుప్ఛందస్సు, అధర్వణవేదము, సోమదేవత ఉద్భవించినాయి. బ్రహ్మ మళ్ళీ ధ్యానంచేసి క్షీరసాగర మధ్యలో ఒక దేవుని దర్శించాడు. ఆ దేవత వేయి శిరస్సులతో, అనేక బాహువులతో, దేదీప్యమానంగా ప్రకాశిస్తున్నాడు. అతడు విశ్వకళ్యాణకారకమై, విశ్వాతీతమై, నిత్యమై, సర్వస్వరూపమై విలసిల్లుతున్నాడు. అతడే శ్రీహరి, శ్రీమన్నారాయణుడు. ఈ సమస్త జగత్తూ ఆ పురుషుడే. సకల జగత్తుకూ అతడే జీవనాధారము. ఆ నారాయణుడే విశ్వపతి, విశ్వేశ్వరుడు, విశ్వరూపుడు. అధోముఖంగా ఉన్న పద్మము యొక్క మొగ్గలాగా, మానవహృదయంలో ఉన్నాడు. హృదయంలో అనేక నాడులు ఉన్నాయి. దానిమధ్యభాగంలో నాలుగువైపులా మహాజ్వాలలతో వైశ్వానరాగ్ని వెలుగుతూ ఉంటుంది. ఆ అగ్నిమధ్యన అతిసూక్ష్మమైన దీపపు శిఖలాగా ఊర్ధ్వముఖంగా ఉంటుంది. ఆ శిఖామధ్యభాగంలో పరమాత్మ ప్రకాశిస్తున్నాడు. అతడే బ్రహ్మ. అతడే ఈశానుడు, అతడే దేవేంద్రుడు, అతడే అక్షరుడు, పరమతత్త్వము, మూలవిరాట్టు." ఈ రకంగా నారాయణుడే పరబ్రహ్మ అని చెప్పబడింది.

**ముద్గలోపనిషత్తు**లో మొదటి రెండు మంత్రమలలోను పురుషసూక్తానికి అర్థం చెప్పి వాసుదేవుడు ఇంద్రుడితో అంటున్నాడు.

"ఇంద్రాకళ్యాణ ప్రదుడైన ఆ పురుషుడు మోక్షము నిచ్చే వేషాన్ని స్వీకరించాడు. ఆ వేషముతో లోకాలన్నింటినీ వ్యాపించాడు. ఆ పురుషుడే నారాయణుడు. త్రికాలముల యందు ఉన్నవాడు. త్రికాలాతీతుడు. మోక్షప్రదాత. అతడు అన్నిటికన్న, అందరికన్న గొప్పవాడు. ఆ మహాపురుషుడు తనను నాలుగు భాగాలు చేసుకుని, మూడు భాగాలతో ఆకాశాన్ని వ్యాపించి నాల్గవభాగంతో జగత్తును సృష్టించాడు. జగత్తును సృష్టించటానికి ప్రకృతిని పుట్టించాడు. అతడు పూర్ణకాముడు. కోరికలు నిండినవాడు. కోరికలు ఫలించినవాడు. కోరికలు లేనివాడు. అతను ఒక్కడే అనేక విధాలుగా కనిపిస్తాడు. అతడికి పుట్టుకలేదు. కాని అనేక విధాలుగా పుట్టినట్లు అనిపిస్తాడు. అతణ్ణి

| | | | | |
|---|---|---|---|---|---|
| అధర్వులు | - | అగ్ని అని | అసురులు | - | మాయ అని |
| ఛందోగులు | - | సామమని | పితృదేవతలు | - | స్వధా అని |
| దేవతలు | - | ఉర్గ్అని | గంధర్వులు | - | రూపమని |
| మనుష్యులు | - | ధనమని | అప్సరసలు | - | గంధమని |

పిలుస్తుంటారు" అని చెప్పబడింది.

ఈ రకంగా పరమేశ్వరుడు పూర్ణపురుషుడు. అతని నుంచే స్థావర జంగమాత్మకమైన ఈ జగత్తంతా ఆవిర్భవించింది. **ఐతరేయోపనిషత్తు**లో చెప్పినట్లుగా ప్రాణికోటిని సృష్టించిన తరువాత ఆ జీవరాశిలో తాను ప్రవేశించాలనుకున్నాడు. బ్రహ్మరంధ్రం ద్వారా ప్రవేశించాడు

అయితే ఈ జగత్తు స్థావర జంగమాత్మకమైనది అని ముందే చెప్పాం. అలాంటప్పుడు జీవరాశిలో తప్ప మిగిలిన వాటిలో ఆ పరబ్రహ్మ లేడా ? అని అనుమానం వస్తుంది. ప్రాణమున్నవి, ప్రాణములేనివి, చలనమున్నవి, చలనములేనివి. అన్నింటియందు ఆ పరమేశ్వరుడు ఉన్నాడు. నదులకు, కొండలకు, పర్వతాలకు కూడా ప్రాణమున్నది అని చెప్పబడుతోంది. లక్ష్మీదేవియొక్క శాపంతో సరస్వతి నదిగా మారింది. గంగానది శివుని రెండవ భార్య. వింధ్యపర్వతం అహంకరించి తన ఆకారాన్ని పెంచేసింది. ఇత్యాది ఉపమానాలచేత జగత్తులోని ప్రతివస్తువుకూ ప్రాణమున్నది అని తెలుస్తున్నది. అటువంటి జగత్తునంతా ఆక్రమించినవాడు, జగత్తంతా వ్యాపించినవాడు ఆ పరమేశ్వరుడు. అతడు త్రికాలములందు ఉంటాడు. అంతేకాదు త్రికాలాతీతుడు కూడా. ఈవిషయం **మాండూక్యోపనిషత్తు**లో చెప్పబడింది.

ఈ విధంగా సర్వేశ్వరుడు సర్వవ్యాపి. అన్నిటా ఈ జగత్తంతటా నిండి ఉన్నాడు. **బృహదారణ్యకోపనిషత్తు**లో ఈ విధంగా ఉంది.

పూర్వకాలంలోవి దేహదేశాన్ని పరిపాలిస్తున్నాడు జనక మహారాజు ఆయన ఒకసారి ఒక యాగం చేశాడు. ఇలా యజ్ఞయాగాదులలో భూరి దక్షిణలివ్వటం పరిపాటి. అందుచేత ఆ యజ్ఞంలో భాగంగా ఆధ్యాత్మిక ప్రపంచంలో గొప్ప వాడెవరో తెలుసుకోవాలి అనుకున్నాడు. అనుకున్నదే తడవుగా గోశాలలో బాగా బలసిన వేయి ఆవులు, ఆబోతులు తెప్పించి, వాటి గిట్టలకు కొమ్ములకు బంగారు తొడుగులువేసి, వాటి మీద పట్టువస్త్రాలు కప్పి, సభలోని పండితులనుద్దేశించి "బ్రాహ్మణశ్రేష్ఠులారా ! మీలో అందరికన్నా గొప్ప బ్రహ్మవేత్త అయినవాడు ఈ గోవులను తోలుకు పోవచ్చును" అన్నాడు.

ఆ పని చెయ్యటానికి అక్కడ ఎవరికీ ధైర్యం చాలలేదు. పరిస్థితిని గమనించిన యాజ్ఞవల్క్యుడు తన శిష్యుణ్ణి పిలిచి 'ఈ గోసంపదను ఇంటికి తోలుకుపోవలసినది' అన్నాడు. ఆ మాటలువిన్న పండితులు ఆశ్చర్యపోయారు. కోపగించారు. యాజ్ఞవల్క్యుడు తమకన్న ఏరకంగా గొప్పవాడు ? ఏరకంగా బ్రహ్మవేత్త ? అనుకుని అతణ్ణి పరీక్షించాలని తీర్మానించుకున్నారు. మొట్టమొదటగా అక్కడ జరిగే యాగంలో హోత అయిన ఆశ్వలుడు యాజ్ఞవల్క్యుడితో వాదనకు దిగి ఓడిపోయాడు.

ఆ తరువాత జరాత్కరువు వంశానికి చెందిన ఋతభాగుని కుమారుడు ఆర్తభాగుడు, లహ్యుని మనుమడైన భుజ్యుడు, చక్రుని కుమారుడు ఉషస్తి, కుషీతుని కుమారుడు కహోలుడు, అరుణుని కుమారుడైన ఉద్దాలకుడు, ఒకరి తరువాత ఒకరుగా వాదనకు దిగారు. ఇప్పుడు ఉద్దాలకుడు అడుగుతున్నాడు "యాజ్ఞవల్క్యా! అంతర్యామిగా ఉండే నియామకుని గురించి చెప్పవలసినది" యజ్ఞావల్క్యుడు. ఎవడు భూమిపైన, భూమిలోపలా ఉంటాడో, తనలో ఉన్నప్పటికీ ఎవరిని ఆ భూమి ఎరుగదో, ఎవని శరీరమే భూమియో, భూమిలో ఉంటూనే భూమిని నియంత్రించే వారెవరో, అతడే అంతర్యామి. నీ ఆత్మ.

అగ్నిలో ఉంటాడు. అగ్ని అతన్నెరుగదు. అగ్నిలో ఉంటూనే అగ్నిని నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి నీ ఆత్మ. వాయువులో ఉంటాడు. వాయువు అతన్నెరగదు. వాయువులో ఉంటూనే వాయువును నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి నీ ఆత్మ.

జలంలో ఉంటాడు. జలం అతణ్ణెరుగదు. జలంలో ఉంటూనే జలాన్నినియంత్రిస్తాడు. అతడే అంతర్యామి నీ ఆత్మ. ఆకాశంలో ఉంటాడు. ఆకాశం అతణ్ణెరుగదు. ఆకాశంలో ఉంటూనే ఆకాశాన్ని నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి నీ ఆత్మ. ద్యులోకంలో ఉంటాడు. ద్యులోకమతణ్ణెరుగదు. ద్యులోకంలో ఉంటూనే ద్యులోకాన్ని నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి నీ ఆత్మ. ఆదిత్యలోకంలో ఉంటాడు. ఆదిత్య లోకం అతణ్ణెరుగదు. ఆదిత్య లోకంలోఉంటూ, ఆదిత్య లోకాన్ని నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి నీ ఆత్మ. దిక్కుల యందుంటాడు. దిక్కులు అతణ్ణెరుగవు. దిక్కులయందుంటూనే, దిక్కులను నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి నీఆత్మ. చంద్రలోకంలో ఉంటాడు. చంద్రలోకం అతణ్ణెరుగదు. చంద్ర లోకంలో ఉంటూ చంద్రలోకాన్ని నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి నీ ఆత్మ" అంటాడు.

ఆత్మ అంటే జీవాత్మ. జీవాత్మ పరమాత్మ రెండూ ఒకటే వేరుకాదు. అందుచేత పరమేశ్వరుడు దశదిశలా వ్యాపించి ఉన్నాడు. పంచభూతాల యందున్నాడు. అన్ని లోకాల యందు ఉన్నాడు. ఈరకంగా పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు సర్వవ్యాపి. ఈ విషయాన్నే మొదటి నాలుగు నామాలయందు వివరించబడింది.

ఇక నామాలను చూద్దాం.

# 1. విశ్వమ్

సర్వత్ర పూర్ణుడు.

**విశ్వం సర్వత్ర పూర్ణత్వాత్** జగత్తంతా నిండి ఉన్నవాడు. ఈ జగత్తుకు కారణమైనవాడు. చరాచరజగత్తంతా వ్యాపించి ఉన్నవాడు.

**విశనాద్విశ్వమిత్యాహుః లోకానాం కాశిసత్తమ ।**
**లోకాంశ్చ విశ్వమేవేతి ప్రవదన్తి నరాధిప ॥**

రాజా ! సర్వేశ్వరుడు సకల ప్రాణులయందు ప్రవేశించుటచే అతనిని 'విశ్వము' అంటారు. అటువంటి విశ్వరూపి అయిన భగవానుడు వ్యాపించి ఉండటంచేత ఈ లోకమంతా విశ్వము అనబడుతున్నది. విశ్వాన్ని ఆవరించి ఉన్నవాడే వైశ్వానరుడు.

**మాండూక్యోపనిషత్తు**లో ఈవిషయం చెప్పబడింది.

**సర్వం హ్యేతద్బ్రహ్మ, అయమాత్మా బ్రహ్మ, సోఽయమాత్మా చతుష్పాత్**

ఈ కనిపించే జగత్తంతా బ్రహ్మమే. ఇక్కడ బ్రహ్మ కేవలము దృశ్యమే కాదు ద్రష్టకూడా. అదేమాటను ఖచ్చితంగా చెబుతున్నాడు. **సర్వంహ్యేతద్ బ్రహ్మ** కనిపించే జగత్తంతా బ్రహ్మమే. ఆ పరబ్రహ్మ ఎక్కడో లేదు. నాలోనే ఉన్నది. ఇక్కడ 'నేను' అంటే దేహం కాదు. ఆత్మ. కాబట్టి ఆత్మకూడా బ్రహ్మమే. ఈ రకంగా జీవాత్మ, పరమాత్మ రెండూ ఒక్కటే. అటువంటి ఆత్మకు నాలుగు పాదాలున్నాయి. పాదమంటే భాగము అని అర్థం. ఆ భాగాలే

1. జాగ్రదావస్థ 2. స్వప్నావస్థ 3. సుషుప్తి 4. తురీయావస్థ

**అయమాత్మా బ్రహ్మ** అనే మహావాక్యం ఈ ఉపనిషత్తులోనే చెప్పబడింది. నా ఆత్మ కూడా బ్రహ్మమే అంటే బ్రహ్మ వేరు ఆత్మ వేరు అని కాదు. ఆత్మ అనేది వేరేలేదు. ఆకాశం అంతా ఒక్కటే. అదే మహదాకాశం. అదే ఆకాశం గదిలోనూ ఉన్నది. కుండలోనూ ఉన్నది. అంతమాత్రంచేత దాన్ని గది ఆకాశము, ఘటాకాశము అనరు. అన్నిచోట్ల ఉన్నది ఒక్కటే. అదే మహదాకాశము. అదేవిధంగా పరబ్రహ్మ సర్వవ్యాపి.

**ఐతరేయం**లో చెప్పినట్లుగా, సృష్టిచేసిన తరువాత ఆ పరమేశ్వరుడు ప్రాణులయొక్క శరీరంలో ప్రవేశించాలి అనుకున్నాడు. అందుకు రెండే మార్గాలున్నాయి. ఒకటి పైనుంచి బ్రహ్మరంధ్రంద్వారా రెండవది క్రిందనించి అయితే క్రింద నించి ప్రవేశించటం సేవకుల ధర్మం. కాబట్టి పైనుంచే ప్రవేశించాడు. అందుచేతనే హుకాసంజ్ఞ గల పరమేశ్వరుడు సకార సంజ్ఞ గల ప్రకృతితో కలిసి హంసరూపమైన శబళ బ్రహ్మమై బ్రహ్మరంధ్రం

ద్వారా మానవ దేహంలో ప్రవేశించి, నవద్వారాలు గల ఈ పట్టణంలో ఇంద్రియాలు, ప్రాణాలు, మనస్సుతో కూడినవాడై, పంజరంలో బంధించబడిన పక్షిలాగా బయటకు పోయే ఉపాయం తెలియక, ప్రాపంచిక బంధనాలతో కొట్టుమిట్టాడుతున్నాడు. అటువంటి హంస అనే జీవుడికి

| | | | | |
|---|---|---|---|---|
| అగ్ని, చంద్రమండలాలు | - రెక్కలు | జ్ఞాననేత్రము | - ముఖము |
| ఓంకారము | - శిరస్సు | హకారసకారములు | - పాదాలు |

ఈ రకంగా పరమాత్మ పాలలో కలిసిన నెయ్యిలాగా సమస్త ప్రాణికోటినీ ఆవరించి ఉన్నాడు. చరాచరజగత్తునంతటినీ ఆవరించి ఉన్నాడు. అందుచేతనే 'విశ్వమ్' అనబడుతున్నాడు. ఆత్మ నాలుగు భాగాలుగాఉన్నది అని చెప్పాం. అవే జాగ్రత్, స్వప్న, సుషుప్తి, తురీయావస్థలు.

**జాగరితస్థానోబహిః ప్రజ్ఞః సప్తాంగ ఏకోనవిం ।**
**శతిముఖః స్థూలభుగ్ వైశ్వానరః ప్రథమపాదః ॥**

ఆత్మయొక్క మొదటిపాదం వైశ్వానరుడు. వైశ్వానరుడు అంటే - విశ్వములోని నరులందరికీ ప్రతినిధి. స్థూలమైన శరీరము ఎవరికైతే ఉన్నదో వారందరికీ ప్రతినిధి.

శంకరభగవత్పాదులవారు తమ **వివేకచూడామణి**లో స్థూలదేహాన్ని వివరిస్తూ

**మజ్జాస్థిమేథః మలరక్తచర్మ త్వగాహ్వయైర్ధాతుభిరేభిరన్వితమ్**
**పాదోరు వక్షో భుజ పృష్ఠ సమస్తకైర్ అంగై ఉపాంగై రుపయుక్త మేతత్ ।**
**అహం మమేతి ప్రథితం శరీరం**
**యోహాస్పదం స్థూలమితీర్యతే బుధైః ॥**

చర్మము, రక్తము, మాంసము, నరాలు, మేధ, మజ్జ, ఎముకలు మొదలైన వాటితోనూ, కాళ్ళు, చేతులు మొ॥ అంగ, ఉపాంగములతోను కలిసి ఉండి నేను నాది అనే మోహానికి ఆశ్రయమైన ఈదేహాన్ని స్థూలదేహము అంటారు.

ఆకాశము వాయువు మొదలైన పంచభూతాలు, వాటి అంశలైన తన్మాత్రలు సూక్ష్మరూపం పొంది ఒకదానితో ఒకటి కలియటంచేత స్థూలంగామారి, స్థూలశరీరానికి కారణమవుతున్నాయి.

భోగాలు అనుభవించటానికి ఈ దేహమే ఆధారము స్థూలశరీరం ఎప్పుడూ జాగ్రదావస్థలోనే అనుభవం పొందుతుంది. మానవుడు చేసిన పాపపుణ్యాలన్నీ ఈ

శరీరంతోనే అనుభవిస్తాడు. జరామరణాలు, సుఖదుఃఖాలు, మానావమానాలు అన్నీ ఈ శరీరానికే ఇటువంటి స్థూలదేహానికి ప్రతినిధి వైశ్వానరుడు అతడికి

**సప్తాంగ ఏకోనవింశతి ముఖః**

ఏడు అంగములు. పంధొనిమిదినోళ్ళు ఉంటాయి. సప్తాంగాలు అంటే

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1. | స్వరము | - శిరస్సు | 5. | జలం | - | మూత్రస్థానం |
| 2. | సూర్యుడు | - కన్ను | 6. | భూమి | - | పాదాలు |
| 3. | వాయువు | - ప్రాణం | 7. | ఆహవనీయాగ్ని | - | నోరు |
| 4. | ఆకాశం | - శరీరం | | | | |

ముఖము అంటే శిరస్సు అనికాదు. అనుభవించే స్థానం అని అర్థం. కళ్ళు, ముక్కు, చెవులు, నాలుక, నోరు వీటిద్వారానే విషయవాంఛలు అనుభవించటం జరుగుతుంది. ఇక్కడ వైశ్వానరుడికి 19 ముఖాలు. అవి

| | | | |
|---|---|---|---|
| 1. | జ్ఞానేంద్రియాలు | - | 5 |
| 2. | కర్మేంద్రియాలు | - | 5 |
| 3. | ప్రాణాలు | - | 5 |
| 4. | అంతఃకరణ చతుష్టయం (మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము) | - | 4 |
| | మొత్తం ముఖాలు | | 19 |

ఈ రకంగా పరమేశ్వరుడు ఈ విశ్వంలోని ప్రాణులన్నిటికీ ప్రతీక అయి ఈ విశ్వమంతా ఆవరించి ఉన్నాడు. అందుచేతనే 'విశ్వమ్' అనబడుతున్నాడు.

**ఓమిత్యేకాక్షరమ్ బ్రహ్మ** ఓంకారమనేది పరబ్రహ్మస్వరూపము. అందుచేత 'విశ్వం' అంటే ఓంకారము అని అర్థం.

**కఠోపనిషత్తు**లో ఈరకంగా చెప్పబడింది. పూర్వకాలంలో గౌతముడు అని గొప్ప పండితుడు ఉండేవాడు. అతడు వేదవేదాంగవిదుడు. మహా తపస్వి. ఇతనికి 'వాజశ్రవుడు' అని ఇంకొక పేరు కూడా ఉన్నది. మరణానంతరము ఉత్తమలోకాలు పొందటం కోసం 'విశ్వజిత్' అనే యాగం చెయ్యాలనుకున్నాడు గౌతముడు. ఈ యాగం చేసేవారు తమ సర్వస్వాన్నీ దానం చెయ్యాలి. సన్యాసం తీసుకునే ముందు గృహస్థు కూడా తన ఆస్థినంతా ఇతరులకు దానం చేస్తాడు. విశ్వజిత్ యాగము కూడా ఇంచుమించు అలాంటిదే.

వాజశ్రవుడు యాగము ప్రారంభించాడు. విశ్వజిద్యాగము నిర్విఘ్నంగా పూర్తయింది. యాగంలో ఆఖరుదశ దానధర్మాలు చెయ్యటం. దానం తీసుకునేందుకు పండితులంతా వచ్చి ఉన్నారు. అంతా కోలాహలంగా ఉంది. వాజశ్రవుడు దానాలు చేస్తున్నాడు. పండితులు స్వీకరిస్తున్నారు. గోదానము మొదలుకాబోతోంది. గౌతముని గోశాలలో ఉన్న గోవులన్నింటినీ తోలుకువచ్చారు. ఆ గోవులు తమ ఆఖరిగ్రుక్క నీటిని కూడా త్రాగి వేసినాయి. ఆఖరిగడ్డిపరకను కూడా తినివేసినాయి. వాటికి ఇంకా నీరు త్రాగటానికిగాని, మేతమెయ్యటానికిగాని ఓపికలేదు. కదలలేని స్థితిలో ఉన్నాయి. ఇంతెందుకు ? చావుకు సిద్ధంగా వున్నాయి.

వాజశ్రవుని కుమారుడు నచికేతుడు. మహా గుణశాలి. తండ్రిమీద భక్తి ప్రపత్తులు ఉన్నవాడు. అతడు ఆ ఆవులను చూసి “ఈ ఆవులు నీరు త్రాగినాయి గడ్డి తిన్నాయి. వాటికి పాలుపితికారు. ఇప్పుడివి శక్తిహీనములై ఉపయోగం లేకుండా పోయినాయి. ఇవి మళ్ళీ నీరు త్రాగుతాయని, మేత మేస్తాయని నమ్మకం లేదు. ఏ క్షణాన అయినా చావటానికి సిద్ధంగా ఉన్నాయి. ఇటువంటి ఆవులను దానం చెయ్యటంవల్ల ‘ఆనందము’ అనే నరకం వస్తుంది. నా తండ్రిస్వర్గం పొందాలనే కోరికతో నరకలోకాలు కొనితెచ్చుకుంటున్నాడు. ఏవిధంగానైనా అతణ్ణి పాపలోకాలనుంచి రక్షించాలి” అని భావించినవాడై, తండ్రి దగ్గరకు వెళ్ళి “తండ్రీ! ఈ యాగంలో మీకున్న సర్వసంపదా దానం చెయ్యాలి కదా ! నేను మీ సంపదలో ఒకడిని. మరి నన్ను ఎవరికి దానం చేస్తారు ?” అన్నాడు.

ఆ మాటలు విని కూడా వాజశ్రవుడు సమాధానం ఇవ్వలేదు. నచికేతుడు మళ్ళీ అడిగాడు. ఎవరితోనో మాట్లాడుతున్నట్లుగా ప్రక్కకు తిరిగాడు తండ్రి. నచికేతుడు వదల్లేదు. తండ్రిని నిర్బంధించాడు. దాంతో విసిగిపోయిన వాజశ్రవుడు “నిన్ను మృత్యుదేవతకు దానమిస్తాను” అన్నాడు. తొందరలోమాటైతే అన్నాడు కాని వెంటనే పశ్చాత్తాపం చెందాడు.

తండ్రి మాటలు విన్న నచికేతుడు చాలా దుఃఖించాడు. దూరంగా పోయి వంటరిగా కూర్చుని “నా తండ్రికి ఉన్న పుత్రులలోగాని, శిష్యులలోగాని నేను ఉత్తమశ్రేణిలోనే ఉన్నాను. అలాకాదనుకున్నా మధ్యమశ్రేణిలోనైనా ఉంటాను. అంతేకాని అధమశ్రేణిలో మాత్రం ఉండను. మరి తండ్రి నన్నెందుకు యముడికి దానమిస్తానన్నాడు ? యముడి దగ్గరకు పోయి నేనేమి చెయ్యాలి ? ఏమైనా సరే తండ్రి మాట జవదాటరాదు. ఆయనకు అసత్యదోషం అంటనీయరాదు. యమపురికి వెళ్ళి తీరాల్సిందే.” అని నిశ్చయించుకుని తండ్రి దగ్గరకువెళ్ళి, అతన్ని ఒప్పించి యమపురికి బయలుదేరాడు.

ఆ సమయంలో యముడు బ్రహ్మ దర్శనానికి వెళ్ళాడు. కాబట్టి నచికేతుడు యమపురి చేరేసరికి యముడు అక్కడలేడు. మృత్యుదేవత తిరిగివచ్చేవరకు నచికేతుడు అక్కడే ఉన్నాడు. ఈ రకంగా యముని గృహంలో మూడు రోజులు గడిచాయి. తిరిగివచ్చిన యముడికి భటులు బ్రహ్మ తేజస్సుతో వెలుగొందుతున్న బాలుని వృత్తాంతముచెప్పి "ప్రభూ ! అగ్నిదేవుడే మనింట్లో అతిథిరూపంలో ప్రవేశించాడు. మీరు లేనప్పుడు అతిథిగావచ్చాడు. ఈ మూడు దినాలు అతడు అన్నపానీయాలు కూడా ముట్టలేదు. గృహస్థాశ్రమ ధర్మప్రకారం అతణ్ణి సాదరంగా ఆహ్వానించండి" అన్నారు.

అప్పుడు యముడు నచికేతుడు దగ్గరకు వెళ్ళి, "ఓ విప్రుడా ! నీకు నమస్కారము. నాయింటికి అతిథిగా వచ్చి, మూడు రోజులు భోజనం లేకుండా ఉన్నావు. అందుచేత నువ్వు భోజనం చెయ్యని ఒక్కొక్క రోజుకు ఒక్కొక్కటి చొప్పున మూడు వరాలిస్తాను. కోరుకోవలసినది" అన్నాడు.

దానికి నచికేతుడు "దేవా ! నీ దగ్గరనుంచి తిరిగి ఇంటికి వెళ్ళేటప్పుడికి నా తండ్రి కోపం లేకుండా శాంతచిత్తముతో నన్ను అక్కున చేర్చుకోవాలి" అన్నాడు. అలాగే అన్నాడు యముడు. తరువాత నచికేతుడు యముణ్ణి రెండోవరంగా "యమధర్మరాజా ! స్వర్గంలో మృత్యుభయంలేదు. ఆకలిదప్పికలు ఉండవు. ముసలితనం ఉండదు. శోకము ఉండదు. అటువంటి స్వర్గాన్ని పొందటానికి 'అగ్నిచయనము' అనే క్రతువున్నది. అది నీకు బాగా తెలుసు. దాన్ని నాకు ఉపదేశించు" అన్నాడు.

యమధర్మరాజు అగ్నిచయనము క్రతువంతా పూర్తిగా నిచికేతుడికి ఉపదేశించాడు. నచికేతుడు దాన్ని అత్యంత శ్రద్ధతో విని అది తనకు తెలిసింది అనటానికి నిదర్శనంగా తు.చ. తప్పకుండా యముడికి వప్పగించాడు. నచికేతుని మేధాశక్తికి అబ్బురపడిన యముడు, తాను ఇస్తానన్న వరాలు మూడింటికీ అదనంగా ఇంకొక వరాన్నిస్తూ అగ్నిచయనము అనే యాగము ఇకమీదట 'నాచికేతాగ్ని చయనము'గా పిలువబడుతుంది అన్నాడు. ఇక మూడవ వరంగా నచికేతుడు "ఓ మృత్యుదేవతా ! మానవుడి మరణంమీద నాకు అనేక అనుమానాలున్నాయి. మరణించిన తరువాత ఇంద్రియాలు, అవయవాలు, మనస్సు మొదలైన వాటితో జీవాత్మకు సంబంధం ఉండదని కొందరు ఉంటుందని మరికొందరు అంటారు. ఇందులో ఏది నిజం? నాకు వివరంగా చెప్పవలసినది" అన్నాడు.

నచికేతుడు అడిగింది ఆత్మజ్ఞానం గురించి అది అర్హత ఉన్నవాళ్ళకు తప్ప ఇతరులకు చెప్పరాదు. మరి నచికేతుడికి ఆ అర్హత ఉన్నదా ? ముందుగా ఈ విషయం తెలియాలి.

అందుకే అతడికి ధన, కనక, వస్తు వాహనాలు ఇస్తానన్నాడు. రాజ్యమిస్తానన్నాడు. పుత్రపౌత్రాదులను ప్రసాదిస్తానన్నాడు. అనేక విధాలుగా ప్రలోభపెట్టాడు. కాని నచికేతుడు మాత్రం తన పట్టువదల్లేదు. ఆత్మజ్ఞానాన్ని గురించి వివరించవలసినదిగా వేడుకున్నాడు.

అతడి పట్టుదలకు సంతోషించినవాడై యమధర్మరాజు ఆత్మజ్ఞానాన్ని వివరిస్తూ "నచికేతా ! వేదాలన్నీ ముక్తకంఠంతో దేన్ని గురించైతే చెబుతున్నాయో, తపస్సువల్లదేన్ని పొందుతాయో, బ్రహ్మచర్యాదినియమాలు, వ్రతాలు దేనికోసం ఆచరిస్తారో, అది 'ఓం' అనే పదం. ఇదే పరబ్రహ్మ పేరు లేదా గుర్తు. ఓంకారాన్ని ఏ రూపంలో ఉపాసిస్తే సాధకుడు ఆరూపాన్నే పొందుతాడు. పరబ్రహ్మను చేరాలంటే ఓం కారోపాసన మాత్రమే చెయ్యాలి. శరీరంలో ఉండేది ఆత్మ. ఆత్మకు చావు పుట్టుకలు లేవు. అది స్వయంభువు. నాశనములేనిది. శాశ్వతమైనది. శరీరం నశించినా ఆత్మ మాత్రం నశించదు. ఆత్మ అనేది పరమేశ్వరుని రూపమే. ఈ ఆత్మ ప్రతిజీవియందు ఉంటుంది. అంటే ఆత్మసర్వవ్యాపి. చరాచర జగత్తంతా వ్యాపించి ఉంటుంది. విశాలమైన విశ్వమంతా వ్యాపించి ఉంటుంది. అంటే పరమేశ్వరుడు విశ్వమంతా వ్యాపించిఉన్నాడు." అని చెబుతాడు. ఈ కారణంగానే 'విశ్వమ్' అంటే జగత్తంతా వ్యాపించి ఉన్న పరమేశ్వరుడు అని అర్థం.

**ఛాందోగ్యోపనిషత్తు**లో **బ్రహ్మచారికథ** ఒకటి ఉన్నది. పూర్వకాలంలో ఒక అరణ్యంలో ఒక ఆశ్రమం ఉండేది. అందులో ఇద్దరు మహర్షులు ఉండేవారు. శౌనకుడు, అభిప్రతారి అని వారి పేర్లు. వాయుదేవుడు వారి ఆరాధ్యదైవము. ఒకరోజు మధ్యాహ్నం వారు భోజనం చెయ్యబోయే సమయంలో తలుపు తట్టిన చప్పుడయింది. "భవతీ భిక్షాం దేహి" అని వినిపించింది. ఎవరో బ్రహ్మచారి భిక్షాటనకు వచ్చాడు. "ఇది సమయంకాదు వెళ్ళు" లోపల నుంచి సమాధానం వచ్చింది. బిక్షకుడికి లేదు అనటం కొత్త ఏమీకాదు. కాని ఋష్యాశ్రమంలో తిరస్కారానికి ఆశ్చర్యపోయాడు బ్రహ్మచారి. ఈ ఆశ్రమవాసులను తేలికగా వదలకూడదు అనుకున్నాడు. వెంటనే లోపలనున్న వారి నుద్దేశించి "ఆర్యా ! తమరు ఏ దేవతను పూజిస్తారు ?" అని ప్రశ్నించాడు.

"నువ్వు చాలా మొండివాడిలా ఉన్నావు. మా ఉపాసనాదైవం వాయువు. ఆయననే ప్రాణం అని కూడా అంటారు" అన్నాడు ఆశ్రమం లోపలనుంచి ఒక ఋషి.

"స్వామీ ! ఈ ప్రపంచం అంతా ప్రాణంవల్ల రూపం దాల్చింది. సృష్టి అంతా తిరిగి ప్రాణంలోనే లయమవుతున్నది. ఈ విషయం తమకు తెలుసుగదా ? ప్రాణమనేది కనుపించే వస్తువులయందు, కనిపించని వస్తువులయందుకూడా ఉన్నది కదా ?" అన్నాడు బ్రహ్మచారి.

"ఆ విషయం మాకు తెలుసునయ్యా ! నువ్వు చెప్పేదంతా మాకు తెలిసినదే. క్రొత్తది ఏమీ కాదు" అన్నాడు ఋషి.

"అయితే సరే. ప్రస్తుతం అన్నం తినబోతున్నారు కదా ! ఆ అన్నము ఎవరి కోసం తయారు చేశారు ? ఎవరికి నివేదన చేస్తారు?" తిరిగి ప్రశ్నించాడు బ్రహ్మచారి.

"ఆ మాత్రం తెలియదా ? మేము ఆరాధించే వాయుదేవుడికి సమర్పించటానికి" చాలా తేలిక భావంతో సమాధానం చెప్పాడు ఋషి.

"అయితే వినండి. ప్రాణమనేది విశ్వమంతా వ్యాపించి ఉన్నది. ఆ ప్రాణానికి నైవేద్యంగా మీరు అన్నం వండారు. ఈ ప్రపంచంలో నేను కూడా ఒక భాగమే. నాలో కూడా ప్రాణమున్నది. మీరు ఉపాసించే పరబ్రహ్మ ప్రాణరూపంలో మీలో ఉన్నది. నాలో కూడా ఉన్నది. అలాంటప్పుడు ఆకలితో ఉన్న బ్రహ్మచారి రూపంలో ఈ ఉపాస్యదైవమైన వాయుదేవుడే మిమ్మల్ని బిక్ష అడుగుతుంటే మీరు ఎందుకు లేదంటున్నారు ? ఋషీశ్వరులారా ! నాకు బిక్ష పెట్టకుండా పొమ్మంటే, నాలో ఉన్న ప్రాణాన్ని, అంటే మీ ఆరాధ్యదైవాన్ని తిరస్కరించినట్లేకదా ? పరమేశ్వరుడు విశ్వవ్యాపి అనేమాట మరచి పోయారా ? మీరు ఏ దేవత కోసం అన్నం వండారో, ఆ దేవతకు ఆహారం ఇవ్వననటం న్యాయమేనా ?" అన్నాడు బ్రహ్మచారి.

ఆ మాటలకు చాలా సిగ్గుపడినటువంటి వాళ్ళై ఋషులు బ్రహ్మచారిని సాదరంగా లోపలికి ఆహ్వానించారు అని చెప్పబడింది. ఈ కథలో పరమేశ్వరుడు విశాలమైన విశ్వమంతా ఆవరించి ఉన్నాడు అని చెప్పబడింది. అందుచేతనే ఆయన 'విశ్వమ్' అని పిలువబడుతున్నాడు.

అలాగే **సత్యకామ జాబాలికథ.** పూర్వకాలంలో జాబాలి అనే పేరుగల ఒక స్త్రీ దాసీ వృత్తితో జీవిస్తూ ఉండేది. ఆమె కుమారుడు సత్యకాముడు. అతడు విద్యాభ్యాసం పూర్తిచేసి బ్రహ్మజ్ఞాన సముపార్జన చెయ్యాలి అనుకున్నాడు. అంటే పరబ్రహ్మను గురించి తెలుసుకోవాలి అనుకున్నాడన్న మాట. ఆ రోజుల్లో గౌతముడు వేదవేదాంగవిదుడు, బ్రహ్మవేత్త. అందుచేత జాబాలికుమారుడైన సత్యకాముడు గౌతముడివద్దకుపోయి నమస్కరించి బ్రహ్మవిద్యను ఉపదేశించమని అడిగాడు. ఆ మాటలు విన్న గౌతముడు సత్యకాముణ్ణి చూసి నీ తండ్రి ఎవరు ? గోత్రము ఏమిటి ? అని అడిగాడు. దానికి సత్యకాముడు ఆ వివరాలు తనకు తెలియవని, తల్లిని అడిగి చెబుతానని చెప్పి ఇంటికి వచ్చి తన తల్లిని అడిగాడు. దానికి ఆమె. "నాయనా ! యవ్వనంలో ఉండగా నేను

అనేక గృహాలలో దాసీవృత్తి చేశాను. నిన్ను కన్నాను. కాబట్టి నీ తండ్రి ఎవరో నాకు తెలియదు. నీ పేరు సత్యకాముడు. నాపేరు జాబాలి కాబట్టి నువ్వు 'సత్యకామజాబాలి' అని పిలువబడతావు అని చెప్పింది.

ఆ మరునాడు తన తల్లి చెప్పిన మాటలే గౌతముడికి చెప్పాడు సత్యకాముడు. ఆ మాటలు విన్న గౌతముడు చాలా ఆనందించాడు. నిజం చెప్పినందుకు సత్యకాముణ్ణి, అతని తల్లిని కూడా పరిపరివిధాల ప్రశంసించి, సంప్రదాయబద్ధంగా అతడికి బ్రహ్మచర్య దీక్ష నిచ్చాడు. సత్యకాముడు బ్రహ్మచర్యం పాటిస్తూ గౌతముని ఆశ్రమంలోనే ఉంటున్నాడు.

ఇలా చాలారోజులు గడిచినాయి. సత్యకాముడు గురువుగారికి సేవలు చేస్తున్నాడు. ఒకరోజు గౌతముడు సత్యకాముణ్ణి పిలిచి బక్కచిక్కిన నాలుగువందల ఆవులను, ఆబోతులను చూపించి "సత్యకామా ! వీటిని అడవికి తీసుకుపోయి మేపు వీటిసంఖ్య వేయి అయ్యే వరకు తిరిగి రాకు" అన్నాడు. గురువుగారి ఆజ్ఞ ప్రకారం సత్యకాముడు పశువులను మేపుతూ అరణ్యంలోనే కాలం గడుపుతున్నాడు.

ఇలా చాలా ఏళ్ళు గడిచినాయి. సత్యకాముడు బ్రహ్మజ్ఞానం కోసం పరితపిస్తున్నాడు. అరణ్యంలో కనిపించే ప్రతివస్తువూ, ప్రతి దృశ్యమూ అతడికి ఏదో ఒక పాఠం చెబుతూనే ఉన్నది. పశువుల సంఖ్య కూడా గణనీయంగా పెరిగింది.

ఒకనాడు సత్యకాముడు అరణ్యంలో ఒక చెట్టు క్రింద కూర్చుని దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు. ఆ సమయమంలో ఒక ముసలి ఆబోతు అతడి దగ్గరకు వచ్చి, "సత్యకామా ! నువ్వు గురువుగారి దగ్గరకు తిరిగివెళ్ళే సమయం ఆసన్నమయింది. నీ కర్మకూడా పరిపక్వమైంది. బ్రహ్మజ్ఞానాన్ని గురించి చెబుతాను. వినవలసినది. బ్రహ్మతత్త్వ విజ్ఞానము నాలుగుపాదాలుగా ఉంటుంది. అందులో ఒక పాదాన్ని నీకు చెబుతాను" అన్నది. సరేనన్నాడు సత్యకాముడు.

ముసలి ఆబోతు మళ్ళీ చెప్పటం మొదలుపెట్టింది "సత్యకామా ! ఈ విశాలవిశ్వంలో నాలుగుదిక్కులూ, బ్రహ్మతత్త్వంలో ఒక భాగము ఇక రెండవ భాగాన్ని అగ్నిదేవుడు ఉపదేశిస్తాడు" అన్నది.

సత్యకాముడు గౌతముని ఆశ్రమానికి తిరుగు ప్రయాణం కట్టాడు. త్రోవలో సంధ్యాసమయమయింది. చీకట్లు ఆవరిస్తున్నాయి. సత్యకాముడు నిప్పు అంటించి దాని ఎదురుగా కూర్చున్నాడు. అప్పుడు ఆ అగ్ని నుంచి ఒక సందేశం వచ్చింది "ఓ సత్యకామా ! పరబ్రహ్మతత్త్వాన్ని గురించి రెండవపాదం వివరిస్తున్నాను. భూమి, ఆకాశము, సముద్రాలు,

నదులు, కొండలు, పర్వతాలు అన్నీ బ్రహ్మపదార్థంలోని అంతర్భాగాలే ఇక మూడవపాదాన్ని ఒక హంస చెబుతుంది.”

ఆ మాటలు విన్న సత్యకాముడు బ్రహ్మతత్త్వాన్ని గురించి ఆలోచిస్తూ ముందుకు సాగిపోతున్నాడు. మూడవనాటి సాయంత్రం అతని సమీపంలో ఒక హంస వచ్చి వాలి ఇలా చెప్పటం మొదలుపెట్టింది. “కుమారా ! బ్రహ్మతత్త్వంలో మూడవ పాదాన్ని వివరిస్తున్నాను. అగ్ని, సూర్యుడు, చంద్రుడు, విద్యుల్లతలు అన్నీ పరబ్రహ్మలోని భాగాలే. నాల్గవ పాదాన్ని ఒక నీటి పక్షి, నీకు వివరిస్తుంది” అన్నది. ఆ మరునాటి సాయంత్రం ప్రార్థనా సమయంలో ఒక నీటి పక్షి వచ్చి సత్యకాముడి దగ్గర వాలి “సత్యకామా ! బ్రహ్మతత్త్వంలో నాల్గవపాదాన్ని వివరిస్తున్నాను. ప్రాణం బ్రహ్మ, దృష్టి బ్రహ్మ, శ్రవణం బ్రహ్మ, మనస్సు బ్రహ్మ” అన్నది.

సత్యకాముడు గౌతముని ఆశ్రమం చేరాడు. అతని ముఖం బ్రహ్మ తేజస్సుతో వెలుగొందుతోంది. గురువుగారు అతణ్ణి చూసి, జరిగిన విషయం తెలుసుకుని సత్యకాముడికి సర్వవిజ్ఞానాన్నీ ఉపదేశించారు.

ఈ కథలో పరబ్రహ్మ తత్త్వాన్ని చెబుతూ విశాల విశ్వంలోని

1. నాలుగు దిక్కులూ బ్రహ్మమయం.

2. భూమి, ఆకాశము, సముద్రాలు, నదులు, పర్వతాలు, కొండలు, లోయలు పరబ్రహ్మ స్వరూపం.

3. అగ్ని, సూర్యుడు, చంద్రుడు, విద్యుల్లతలు అన్నీ పరబ్రహ్మలోని భాగాలే.

4. ప్రాణం బ్రహ్మ, దృష్టి బ్రహ్మ, శ్రవణం బ్రహ్మ, మనస్సు బ్రహ్మ.

ఈ రకంగా పరమేశ్వరుడు చరాచరజగత్తునంతటనూ ఆవరించి ఉన్నాడు. విశాలమైన విశ్వమంతటనూ ఆవరించి ఉన్నాడు. అందుకే ‘విశ్వమ్’ అంటే పరబ్రహ్మ స్వరూపము.

అదేవిధంగా **‘ఉపకోశలుడు’** అని ఒక కథ ఉంది. అందులో సత్యకామజాబాలి గృహస్థాశ్రమం స్వీకరించి గురుకులం స్థాపించాడు. ఉపకోశలుడు అనేవాడు సత్యకాముని దగ్గర శిష్యరికం చేస్తున్నాడు. ఈరకంగా సంవత్సరాలు గడిచినాయి. ఉపకోశలుడు దీక్షతో గురువుగారికి సేవలు చేస్తున్నాడు. అయినా గురువుగారికి కరుణ కలగలేదు. ఉపకోశలుడితో పాటు అనేకమంది శిష్యులు ఉన్నారు. వారి అర్హతలను బట్టి వారందరికీ

ఉపదేశం చేసి పంపేశాడు సత్యకాముడు. కాని ఉపకోశలుణ్ణి మాత్రం పట్టించుకోలేదు. గురుపత్నికూడా ఉపకోశలుణ్ణి కనికరించమని చెప్పింది. మౌనం వహించాడు సత్యకాముడు.

ఒకరోజున వేరే పనిమీద గ్రామాంతరం వెడుతూ ఉపకోశలుణ్ణి పిలిచి ఆశ్రమంలోని అగ్నులను జాగ్రత్తగా చూస్తుండమని చెప్పాడు. ఉపకోశలుడు విచారగ్రస్తుడైనాడు. అన్న పానీయాలు విసర్జించాడు. చివరకు వ్యాధిగ్రస్తుడు కూడా అయినాడు. అది చూసి గురుపత్ని చాలా బాధపడింది. పుత్ర వాత్సల్యంతో ఆహారం తీసుకోమని బ్రతిమాలింది. దానికి ఉపకోశలుడు "తల్లీ ! నా మనస్సు ఇంకా పవిత్రం కాలేదు. అందుకే గురువుగారు ఇంకా నన్ను పరీక్షిస్తున్నారు. నా హృదయంలో ఇంకా అనేకమైన దుస్సంకల్పాలున్నట్టు ఉన్నాయి. అందుకే నేను అన్నం ముట్టను" అన్నాడు. అతని బాధకు ఆశ్రమంలోని అగ్నులు కూడా చలించిపోయినాయి. అవి తమలో తాము "ఈ బ్రహ్మచారి అనేక సంవత్సరాలుగా దీక్ష వహించి ఉన్నాడు. తపస్సు చేస్తున్నాడు. మునులను ఆరాధిస్తున్నాడు. శాస్త్రోక్తంగా తృప్తిపరుస్తున్నాడు. గురువుగారు అతడికి ఉపదేశం చెయ్యలేదు. మనమే చేద్దాం పదండి" అనుకుని ఉపకోశలుడికి ఒక సందేశమిచ్చాయి.

"ఉపకోశలా ! ప్రాణమే బ్రహ్మ. ఆకాశమే బ్రహ్మ. ఆనందమే బ్రహ్మ. హృదయమందే బ్రహ్మతత్త్వముంటుంది. ఆనందమనేది ఆ బ్రహ్మతత్త్వము యొక్క నిజస్వరూపము." అన్నాయి. అప్పుడు వాటిలో ఒక అగ్ని "భూమి, సూర్యుడు, చంద్రుడు, ఆ పరబ్రహ్మ రూపాలే. సూర్యునిలో ఉన్న తత్త్వము నీలో ఉన్న తత్త్వము ఒకటే. తూర్పు, పడమర, ఉత్తర దక్షిణాలు, నక్షత్రాలు, నేల, నీరు, నింగిలలో ఉన్న తత్త్వము నీలో ఉన్న తత్త్వము ఒక్కటే. ఆకాశంలోని మెరుపులో ఏ తత్త్వమైతే ఉన్నదో, అదే నీలోనూ ఉన్నది. చరాచర జగత్తంతా వ్యాపించి ఉన్నది. ఆ తత్త్వమే బ్రహ్మతత్త్వము" అన్నది.

ఆ తరువాత గృహస్థులు ఆరాధించే గార్హపత్యాగ్ని ఒక రూపాన్ని పొంది అంతటా వ్యాపించి బ్రహ్మతత్త్వాన్ని పొంది అతనికి కనిపించింది. ఆ సమయంలో సూర్యుడు, చంద్రుడు, ఆకాశము, విద్యుల్లతలు, ఒకటేమిటి ? జగత్తు అంతా అతడికి అగ్నిరూపమై బ్రహ్మరూపమై సాక్షాత్కరించింది. గ్రామాంతరం వెళ్ళిన సత్యకాముడు తిరిగివచ్చి జరిగిన విషయం తెలుసుకుని ఉపకోశలుడికి బ్రహ్మ జ్ఞానాన్ని పూర్తిగా ఉపదేశించాడు.

ఈ కథలో కూడా భూమి, సూర్యుడు, చంద్రుడు, ఆకాశము, నక్షత్రాలు, విద్యుల్లతలు అంతా పరబ్రహ్మస్వరూపమే అని చెప్పబడింది. అంటే పరమేశ్వరుడు స్థావరజంగమాత్మకమైన ఈ విశ్వమంతా ఆవరించి ఉన్నాడు. అందుచేతనే 'విశ్వమ్' అంటే పరబ్రహ్మ స్వరూపము.

అధర్వణవేదంలో **'అధర్వశిరోపనిషత్తు'** అని ఉన్నది. అందులో ఈ విధంగా చెప్పబడింది.

**ఓం. దేవా హ వై స్వర్గం లోక మగమం స్తే రుద్ర మపృచ్ఛన్ కో భవా నితిసోఽబ్రవీ దహ మేకః ప్రథమ మాసం వర్తామి చ భవిష్యామి చ నాన్యః కశ్చిన్మత్తో వ్యతిరిక్త ఇతి.**

**సోఽంతరా దంతరం ప్రావిశ ద్దిశ శ్చాంతరం, ప్రావిశ త్సోఽహం నిత్యానిత్యోఽహం బ్రహ్మోహం ప్రాంచః ప్రత్యంచోఽహం దక్షిణాం చోదం చోహ మధశ్చోర్ధ్వంచ దిశశ్చ విదిశశ్చాహం పుమా నపుమాం స్త్రియ శ్చాహం గా యత్ర్యహం సావిత్ర్యహం సరస్వత్యహం త్రిష్టు జ్జగ త్యనుష్టుప్చాహం ఛందోఽహం గార్హపత్యోఽహం దక్షిణాగ్ని రాహవనీయోఽ హం సత్యోఽహం గౌరహం గౌర్యహం జ్యేష్ఠోఽహం శ్రేష్ఠోఽహం వరిష్ఠోఽహమాపోఽహం తేజోఽహమృగ్యజుస్సామాథర్వాంగి రసోఽహమక్షర మహం క్షరమహం గోప్యోఽహం గుహ్యోఽహ మరణ్యోఽహం పుష్కర మహం పవిత్ర మహమగ్రంచ మధ్యంచ బహిశ్చ పురస్తాద్దశసు దిక్ష్వవస్థిత మనవస్థితంచ జ్యోతిరి త్యహమేక స్సర్వేచ మామేవ మాంయో వేద సర్వాం దేవా న్వేద గాం గోభిర్బ్రాహ్మణాన్ బ్రాహ్మణేన హవీగ్ంషి హవిషాయు రాయుషా సత్యగ్ం సత్యేన ధర్మం ధర్మేణ తర్పయామి స్వేన తేజసా తతో దేవా రుద్రం నాపశ్యం స్తే దేవా రుద్రం ధ్యాయంతి తతో దేవా ఊర్ధ్వబాహవ స్తున్వంతి.**

పూర్వకాలంలో దేవతలు శ్రీ మహారుద్రుడు నివసించే స్వర్గలోకానికి వెళ్ళారు. అక్కడ రుద్రుని చూసి "దేవా ! నువ్వు ఎవరవు ?" అని ప్రశ్నించారు. అప్పుడు ఆ రుద్రుడు...

"నేను ఒక్కడనే. మొదటగా ఉన్నాను. ఇప్పుడు ఉన్నాను. ఇంకా భవిష్యత్తులో కూడా ఉంటాను. నాకన్న భిన్నమైనది వేరే ఏదీలేదు. నేను నిత్యుడను. త్రికాలాతీతుడను. కన్ను, ముక్కు, చెవి మొదలైన ఇంద్రియాలన్నీ నారూపమే. మనస్సు నేనే, తూర్పు, పడమర, ఉత్తర, దక్షిణ దిక్కులు నేనే. విదిక్కులు నేనే. పురుషుడు నేనే, స్త్రీరూపమునేనే. అలాగని నపుంసక రూపము కూడా నాదే. సావిత్రి స్వరూపము నేనే, గాయత్రి స్వరూపము నేనే. త్రిష్టుప్, అనుష్టుప్, జగతీ మొదలైన ఛందస్సులు నేనే, గార్హపత్యాగ్నిని నేనే, దక్షిణాగ్నిని నేనే, ఆహవనీయాగ్నిని నేనే, సత్యస్వరూపుడను నేనే, గోమాతగా ఉన్నది నేనే, గౌరీదేవిని

నేనే, జ్యేష్ఠుడను నేనే, శ్రేష్ఠుడను నేనే, అధికుడను నేనే, అల్పుడను నేనే, చతుర్వేదములు నేనే, ప్రణవాక్షరమును నేనే, అరణ్యరూపము నేనే, పుష్కర రూపము నేనే, పవిత్రము నేనే, అపవిత్రము నేనే, అగ్రభాగము, మధ్యభాగము, అథోభాగము, ముందు, వెనుక, ప్రక్కలు అంతా నేనే, పది దిక్కులలో ఉన్నట్టి భాగము, లేనట్టి భాగము కూడా నేనే, నేనే జ్యోతిరూపుడను. అందరూ నన్నే సేవిస్తుంటారు. నన్ను సేవించేవారు దేవతలనందరినీ తెలుసుకోగలుగుతారు.

| | | |
|---|---|---|
| భూమిని | – | సూర్యకిరణములచేత |
| బ్రాహ్మణుని | – | వేదాధ్యయనముచేత |
| హవిస్సులను | – | ఆజ్యముచేత |
| ప్రాణమును | – | ప్రాణావస్థానముచేత |
| పంచభూతాలను | – | బ్రహ్మముచేత |
| ధర్మమును | – | సత్కర్మలచేత |

అభివృద్ధి చేయుచున్నాను." అని చెప్పాడు. అతడే బ్రహ్మ. అతడే విష్ణువు అతడే మహేశ్వరుడు, అతడే ఉమాదేవి, అతడే వినాయకుడు, అతడే ఇంద్రుడు, అతడే స్కందుడు, అతడే అగ్ని, ఊర్ధ్వలోకాలు అతడే. అథోలోకాలు అతడే. పంచమహాభూతాలు, సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు, గ్రహాలు, ప్రాణము, కాలము, యముడు, మృత్యువు, అమృతము, భూతభవిష్యద్వర్తమాన కాలాలు అతడే. త్రికాలాతీతుడు అతడే. అతడే విశ్వము. అతడే సమస్త ప్రపంచము. అతడే సత్యము నిత్యము అయిన సర్వేశ్వరుడు. అతడే పరబ్రహ్మ అని చెప్పబడింది. ఈ రకంగా పరమేశ్వరుడు ఈ విశ్వమంతా ఆవరించి ఉన్నాడు కాబట్టి 'విశ్వమ్' అనబడుతున్నాడు.

**భగవద్గీత**లోని ఎనిమిదివ అధ్యాయం **'అక్షర పరబ్రహ్మయోగం'**లోని 13వ శ్లోకంలో అర్జునుడు శ్రీకృష్ణ భగవానుణ్ణి పరబ్రహ్మ అంటే ఏది ? అని అడుగుతాడు. భగవానుడు దానికి సమాధానం చెబుతూ "అర్జునా ! 'ఓం' అనే అక్షరము పరబ్రహ్మ వాచకమైనది. దాన్నే ప్రణవము అంటారు. ఓంకారాన్ని ఉచ్చరిస్తూ ఓంకారస్వరూపుడనైన నన్ను ధ్యానించాలి.

**ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మా మనుస్మరన్ ।**
**యః ప్రయాతి త్యజన్ దేహం స యాతి పరమాం గతిమ్ ॥**

నా రూపమే అయిన ఓం అనే అక్షరాన్ని ఉచ్చరిస్తూ, నన్నే ధ్యానిస్తూ శరీరాన్ని విడిచిపెట్టినవాడు నాతో సమానమయిన ఆకారము గల శుద్ధాత్మ స్వరూపాన్ని పొందుతాడు.

"ప్రణవోపాసకులు దేవయానం గుండా బ్రహ్మలోకం చేరతారు. వారికి పునర్జన్మ ఉండదు" అంటాడు. కాబట్టి ఓంకారమనేది పరమేశ్వర స్వరూపం. అందుచేతనే 'విశ్వమ్' అనబడుతుంది. అదేవిధంగా **భగవద్గీత**లోని పదవ అధ్యాయం **'విభూతియోగం'**లోని 25వ శ్లోకంలో శ్రీకృష్ణ భగవానుడు తన యొక్క విభూతులను వివరిస్తూ

**మహర్షీణాం భృగురహం గిరామస్మి ఏకమక్షరం ।**
**యజ్ఞానాం జపయజ్ఞోஉస్మి స్థావరాణాం హిమాలయః ॥**

| | | |
|---|---|---|
| అర్జునా ! మహర్షులలో | – | భృగు మహర్షిని నేను |
| అర్థవంతమైన శబ్దములలో | – | ఓంకారమును నేను. |
| యజ్ఞములలో | – | జపయజ్ఞమును నేను |
| పర్వతములలో | – | హిమాలయము నేను |

అంటాడు. అంటే ఓంకారమనేది పరమేశ్వర స్వరూపము. అది విశ్వమంతా వ్యాపించి ఉన్నది. అందుచేతనే 'విశ్వం' అనబడుతోంది.

**శ్రీమద్భాగవతం**లోని **ప్రహ్లాదచరిత్ర**లో తండ్రి అయిన హిరణ్యకశ్యపుడు 'హరి ఎక్కడ ఉన్నాడు ?' అని కుమారుడైన ప్రహ్లాదుణ్ణి అడుగుతాడు. దానికి ప్రహ్లాదుడు.

**ఇందుగల డందులేడను**
**సందేహము వలదు సర్వోపగతుండు చక్రి**
**ఎందెందు వెతకి చూచిన**
**అందందే గలడు దానవాగ్రణి వింటే ॥**

తండ్రీ ! ఆ పరమేశ్వరుడైన శ్రీ మహావిష్ణువు ఇక్కడ ఉన్నాడని, అక్కడ లేదని చెప్పటానికి వీలుకాదు. భక్తిశ్రద్ధలతో గనక వెతికినట్లైతే ఎక్కడ చూచినా అతడే కనిపిస్తాడు అంటాడు. అంటే పరమేశ్వరుడైన శ్రీమహావిష్ణువు సర్వవ్యాపి. జగత్తంతా ఆవరించి ఉన్నాడు అని చెబుతున్నాడు. అదేవిధంగా **'గజేంద్రమోక్షం'**లో గజేంద్రుడు.

**అన్ని రూపులు నీరూపమైన వాడ**
**ఆది మధ్యాంతములు లేక అలరువాడ**

అంటాడు. ఈ లోకంలో 84 లక్షల జీవరాసులున్నాయి. వాటన్నింటి రూపము నువ్వే. అంతేకాదు. స్థావరజంగమాత్మకమైన ఈ జగత్తంతా ఆ పరమేశ్వరమయమే.

ఈరకంగా విశ్వమంతా ఆవరించి ఉన్నాడు. కాబట్టి పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు 'విశ్వమ్' అనబడుతున్నాడు. **లలితాసహస్రం**లో 256వ నామం **విశ్వరూపా**

# 2. విష్ణుః

అంతటా వ్యాపించి ఉన్నవాడు. 258, 657 కూడా ఇదే నామము.

**చరాచరేషు భూతేషు విశనా ద్విష్ణు రుచ్యతే** తన యొక్క విభూతులైనటువంటి చరాచరాత్మకములైన భూతములన్నింటి యందు వ్యాపించి ఉన్నవాడు.

**విశతీతి విష్ణుః**

స్థావర జంగమాత్మకమైనటువంటి తన విభూతియందంతటను వ్యాపించి ఉన్నవాడు.

**శుక్లాం భరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం ।**
**ప్రసన్నవదనం ధ్యాయే సర్వవిఘ్నోపశాంతయే ॥**

నీలమేఘశ్యాముడు, నాలుగు భుజములు గలవాడు, తెల్లని వస్త్రములు ధరించినవాడు, ప్రసన్నవదనుడు, సర్వవ్యాపి అయిన ఆ పరమేశ్వరుడు సమస్త విఘ్నములను ఉపశమింపచేయుగాక.

**శాంతాకారం భుజగశయనం పద్మనాభం సురేశం**
**విశ్వాధారం గగన సదృశం మేఘవర్ణం శుభాంగం ।**
**లక్ష్మీకాంతం కమలనయనం యోగి హృద్యానగమ్యం**
**వందే విష్ణుం భవభయ హరం సర్వలోకైకనాథం ॥**

శాంతస్వరూపుడు, శేషశాయి, పద్మనాభుడు, దేవతలకు ప్రభువు, జగత్తుకు ఆధారమైనవాడు, ఆకాశముతో సమానమైనవాడు, మేఘవర్ణుడు, శుభలక్షణములు గల అంగములు గలవాడు, లక్ష్మీకాంతుడు, పద్మములవంటి కనులుగలవాడు, సదా యోగీశ్వరుల హృదయముల యందు సంచరించేవాడు, భవబంధాలను హరింపచేసేవాడు, సర్వలోకాలకు అధినాధుడు అయిన ఆ విష్ణుమూర్తికి నమస్కరిస్తున్నాను.

ఇక్కడ విష్ణువు అంటే సర్వవ్యాపి అని అర్థం.

'విశ్వం' అంటే – విశ్వమంతా ఆవరించినవాడు.

'విష్ణువు' అంటే – స్థావరజంగమాత్మకమైన జగత్తంతా ఆవరించినవాడు.

ఈ రెండు పదాలు ఒకే అర్థంలో వాడబడినాయి.

భారతంలోని శాంతిపర్వంలో "భూమ్యాకాశాలు, భూనభోంతరాళాలు నాచే ఆవరించబడటంచేత నేను 'విష్ణువు' అని చెప్పబడితిని" అంటాడు.

**మహానారాయణోపనిషత్తులో** 'పరమతత్త్వము' తెలుసుకోవాలనే కోరికతో దేవమానము ప్రకారము వేయి సంవత్సరాలు తపస్సు చేశాడు బ్రహ్మ. అతని తపస్సుకు మెచ్చి శ్రీమహావిష్ణువు ప్రత్యక్షము కాగా బ్రహ్మదేవుడు "దేవదేవా ! పరమతత్త్వరహస్యాన్ని వివరించేవారు నీకన్న మరొకరులేరు. నీవే సర్వజ్ఞుడవు. నీవే సర్వశక్తివి. నీవే సర్వాధారుడవు. సర్వస్వరూపుడవు. నీవే సర్వేశ్వరుడవు. నీవే సర్వప్రవర్తకుడవు. నీవే సదసదాత్మకుడవు. నీవే అంతర్బహిర్వ్యాపకుడవు. సూక్ష్మాతి సూక్ష్మమైనవాడవు. మహత్తులన్నింటిలోకీ మహత్తు అయినవాడవు. నీవే మూలవిద్యవు. నీవే విద్యాధారకుడవు. నీవే విద్యావేద్యుడవు. విద్యాతీతుడవు. సర్వకారణకారకుడవు నీవే. సర్వకారణ వ్యష్టి, సమష్టికుడా నీవే. అఖండా నందుడవు. పరిపూర్ణుడవు. నిరతిశయానందుడవు. తురీయుడవు. తురీయాతీతుడవు. నీవే అఖిలశాస్త్రవిదుడవు. నీవే బ్రహ్మవు. నీవే రుద్రుడవు. సర్వదేవతాస్వరూపము నీవే. సర్వ ఆగమములసారము నీవే. అమృతమయుడవు. సర్వప్రపంచము నీవే. మోక్షమునీవే. మోక్షసాధనము కూడా నీవే. సర్వప్రాణి రూపుడవు. నీవే సర్వవ్యాపివి" అంటాడు. ఈరకంగా శ్రీమహావిష్ణువు సర్వవ్యాపి అని చెప్పబడింది.

**ఆత్మబోధోపనిషత్తు**లో "ప్రత్యగానందస్వరూపుడు, ఓంకారరూపుడు, పరమపురుషుడే పరబ్రహ్మ. అకార, ఉకార, మకారములతో కూడిన ప్రణవాన్ని జపించినవాడు. సంసారబంధాలనుండి విముక్తుడవుతాడు. అలాగే **ఓంనమో నారాయణాయ** అనే మంత్రాన్ని జపించినవాడు వైకుంఠాన్ని పొందుతాడు.

దేవకీపుత్రుడే పరబ్రహ్మ. మధుసూదనుడు, పుండరీకాక్షుడు, విష్ణువు, అచ్యుతుడు ఆ పరబ్రహ్మమే. అతడు సర్వభూతములయందు ఉన్నాడు. శోకమోహరహితుడై నటువంటి శ్రీమహావిష్ణువును గనక ధ్యానించినట్లైతే ద్వైతాద్వైతములనుండి, భవబంధాలనుండి విముక్తుడవుతాడు" అని చెప్పబడింది. ఈ రకంగా శ్రీమన్నారాయణుడు సర్వభూతముల యందు ఉన్నాడు. స్థావర జంగమాత్మకమైన ఈ జగత్తు అంతా ఆవరించి ఉన్నాడు. అందుచేతనే 'విష్ణుః' అనబడుతున్నాడు.

## 3. వషట్కారః

సర్వాన్నీ తన వశము చేసుకొనువాడు.

**స్వేచ్ఛయా యో వశే సర్వం వషట్కారః కరోతి యః**

తన సంకల్ప మాత్రముచేతనే సమస్తమును తన ఇష్టము వచ్చినట్లుగా సంచరింప చేయువాడు అని అర్ధం చెబుతోంది 'నిరుక్తము'.

**వషట్ కరోతీతి వషట్కారః** సమస్తమును తన వశము నందుంచుకొనువాడు. 'వషట్కారము' అనేది యజ్ఞముల యందు ఉపయోగించబడే పదము. ఏ యజ్ఞమునందు వషట్క్రియ చేయబడుతుందో, ఆ యజ్ఞము వషట్కారమనబడుతుంది.

ఏ వషట్కారాది మంత్రరూపంలో దేవతలను తృప్తి పరచుతామో అది వషట్కారమన బడుతుంది. దేవీ **సప్తశతి**లోని మొదటి అధ్యాయంలో మధుకైటభులవధ వివరించబడింది.

సృష్టి ప్రారంభానికి ముందు పాలసముద్రంలో శ్రీ మహావిష్ణువు వటపత్రశాయి అయి యోగనిద్రలో ఉన్నాడు. అతడి నాభి నుండి ఉద్భవించిన కమలమునుండి బ్రహ్మ ఆవిర్భవించాడు. చతుర్ముఖుడు చుట్టూ చూశాడు. అంతా జలమయం. నీరు తప్ప ఎక్కడా ఏమీ కనపడలేదు. ఆ సమయంలో బ్రహ్మకు వేదాలను అనుగ్రహించాడు పరాత్పరుడు. బ్రహ్మదేవుడు తన నాలుగు ముఖాలతోను వేదాలను వల్లె వేస్తున్నాడు. ఇంతలో పెద్దగా అరుపు వినిపించింది.

బ్రహ్మదేవుడికి క్రిందుగా నీటిలో ఇద్దరు వ్యక్తులు తిరుగాడుతున్నారు. వారే మధుకైటభులు. విష్ణుమూర్తి యొక్క చెవిలోని మలిన పదార్థం నుండి ఉద్భవించారు. మదోన్మత్తులైన వారిరువురూ బ్రహ్మను చూసి "మాతో యుద్ధానికి రా" అని పిలుస్తున్నారు. పైకి ఎగురుతున్నారు. "మాతో యుద్ధం చేస్తావా? లేక మాకు దాసుడిగా ఉంటావా?" అంటూ మీదిమీదికి వస్తున్నారు.

వారిని చూసిన బ్రహ్మ భయపడ్డాడు. వారిని ఎదిరించే శక్తిలేక తాను కూర్చున్న తామర తూడు గుండా క్రిందికి దిగాడు. సాగరగర్భంలో శ్రీమన్నారాయణుడు నిద్రావస్థలో ఉన్నాడు. "తండ్రీ ! రాక్షసులు నన్ను సంహరిస్తామంటున్నారు. లేచి వారిని సంహరించు. నన్ను రక్షించు" అంటూ మొరపెట్టుకున్నాడు. విష్ణువు లేవలేదు. అతన్ని యోగమాయ ఆవరించి ఉన్నది. అప్పుడు బ్రహ్మదేవుడు తన తండ్రిని విడిచి పెట్టమని

**త్వం స్వాహా త్వం స్వధా త్వం హి వషట్కారః సర్వాత్మికా ।**
**సుధా త్వమక్షరేనిత్యే త్రిధామాత్రాత్మికా స్థితా ॥**

**అర్ధమాత్రా స్థితానిత్యా యాను చ్చార్యా విశేషతః ।**
**త్వమేవసా త్వం సావిత్రీ త్వం దేవజననీ పరా ॥**

ఓ తల్లీ ! దేవతలకు ఆహుతు అర్పించేటప్పుడు చేప్పే 'స్వాహా' మంత్రము నీవే. పితృదేవతలకు తర్పణలిచ్చేటప్పుడు చెప్పే 'స్వధా' మంత్రము నీవే. వషట్కారము

(వేదయజ్ఞము) నీవే. నీవు శాశ్వతమైన దానవు. నాశములేనిదానవు. అంటూ పమేశ్వరిని (యోగమాయను) ప్రార్థిస్తాడు.

**ప్రజాపతిశ్చవషట్కారశ్చ** అనే శ్రుతిని బట్టి దేవత వషట్కారము అని చెప్పబడుతోంది.

**చతుర్భిశ్చ చతుర్భిశ్చ ద్వాభ్యాం పంచభి రేవచ ।**
**హూయతే చ పునర్ద్వా భ్యాం సమే విష్ణుః ప్రసీదతు ॥**

నాలుగు నాలుగు అక్షరములు కల 'అశ్రావయ', 'అస్తుశ్రౌషట్' రెండు అక్షరములు కల 'యజు', ఐదు అక్షరములు కల 'యే యజామహే', రెండు అక్షరములు కల 'వషట్' మంత్రములచేత హూయమానుడగు ఆ విష్ణువు నా యెడల ప్రసన్నుడగుగాక. అని స్మృతి చెబుతున్నది.

ఈ జగత్తులో ఉన్నవాడు పరమేశ్వరుడు ఒక్కడే. అతడు ఏకాకి. అతనితో సమానమైన వారు కాని, అతనికన్న అధికులు కాని ఎవరూ లేరు. జగత్తులోని చరాచరములన్నీ అతని అధీనంలో ఉన్నాయి. అతనికి వశమై ఉన్నాయి. పరమేశ్వరుడు ఉన్నాడనే భయంతోనే గాలి సవ్యంగా వీస్తున్నది. సూర్యుడు ఎండ కాస్తున్నాడు. చంద్రుడు చల్లదనాన్ని ఇస్తున్నాడు. సముద్రాలు తమ చెలియలికట్టను దాటటం లేదు. పరమేశ్వరుని యెడ భయంతోనే అష్టదిక్పాలకులు తమ విధులను జాగ్రత్తగా నిర్వహిస్తున్నారు. గ్రహాలు గతులు తప్పకుండా సంచరిస్తున్నాయి. ఈ రకంగా లోకములో ఉన్న వస్తుసముదాయము, ప్రాణసముదాయము అంతా పరమేశ్వరునికి అధీనమై ఉన్నది. ఆ పరమేశ్వరుడే శ్రీ మహావిష్ణువు. అందుకే అతడు 'వషట్కారము' అని చెప్పబడుతున్నాడు.

## 4. భూత భవ్య భవత్ప్రభుః

భూతభవిష్యద్వర్తమానాలకు స్వామి, అధిపతి.

**త్రికాలవర్తినాం శేషీ భూతభవ్య భవత్ప్రభుః**

భూతభవిష్యద్వర్తమానకాలాలలో అన్నింటికీ ప్రభువు.

**భూత భవ్య భవతామ్ ప్రభుః**

త్రికాలములందు సకలపదార్థాలకు అధినాధుడు స్వామి. పరమాత్మయొక్క ప్రభుత్వము కాలపరిచ్ఛిన్నము లేక సన్మాత్రరూపమైన ఈశ్వరత్వము గలది.

**మాండూక్యోపనిషత్తు**లోని మొదటి మంత్రంలో

**భూతం భవద్భవిష్యదితి సర్వమోకార ఏవ ।**

**యచ్చాన్యత్ త్రికాలాతీతం తదస్యోంకార మేవ ॥**

ఇంతకుముందు మంత్రభాగంలో పరమాత్మకు ప్రతిరూపమే 'ఓంకారము' అన్నారు. ఇప్పుడు భూతభవిష్యద్వర్త మానకాలాలు కూడా ఓంకారమే అంటున్నారు. అంతేకాదు త్రికాలాతీతమైనది కూడా పరమేశ్వరస్వరూపమే. పరమేశ్వరుడు పరిమితమైనదానికి, అపరిమితమైన దానికి కూడా ప్రతీక. కాలజ్ఞానము మనసు యొక్క ఇంద్రజాలము. మనసు లేకపోతే కాలము ఉండదు. ఆ మనసు జడము. అచేతనము. అటువంటి అచేతనమైన మనసు జీవము పొందితే, దానికి చలనము వస్తుంది. అంటే జీవము పొందిన మనసు చలిస్తుంది. కాబట్టే త్రికాలాలు, వాటికి అతీతమైనది కూడా ఆ దివ్యచైతన్యము తప్ప వేరొకటి లేదు అని చెప్పబడింది.

ఆ దివ్యచైతన్యమే పరబ్రహ్మ స్వరూపము. అదే శ్రీమహావిష్ణువు.

అధర్వశిరోపనిషత్తులో మహారుద్రుడు బ్రహ్మాది దేవతలకు పరమతత్త్వాన్ని వివరిస్తూ "నేను ఒక్కడనే మొట్టమొదట ఉన్నాను. ఇప్పుడున్నాను. భవిష్యత్తులో ఉంటాను. నాకన్న వేరైనవారెవరూ భూతభవిష్యద్వర్త మానాలలో లేరు. త్రికాలతీతుడను నేను. నేనే నిత్యుడను. నేనే బ్రహ్మను" అంటాడు. ఈ విషయమంతా 'విశ్వం' అనే మొదటి నామంలో వివరించాం.

ఈ రకంగా భూతభవిష్యద్వర్తమానాలకు ఆ పరమేశ్వరుడే అధినాధుడు. అంతేకాదు త్రికాలాతీతమైనది కూడా అతని రూపమే అందుచేతనే శ్రీ మహావిష్ణువు. 'భూత భవ్య భవత్ప్రభుః' అనబడుతున్నాడు.

ఈరకంగా శ్రీమహావిష్ణువు సర్వవ్యాపియేకాదు సర్వాంతర్యామి కూడా అన్నాడు రత్నాకరుడు.

# 9. సృష్టి స్థితి లయాలు

సృష్టి స్థితి లయాలు పరమేశ్వరుని లక్షణాలు. ఈ పనులుచేసేటందుకు ప్రత్యేకమైన వారిని నియమిస్తాడు. వారే త్రిమూర్తులు. వారు కూడా ఆ పరమేశ్వరుని అంశలే. సృష్టి రజోగుణంవల్ల జరుగుతుంది. సత్వగుణంవల్ల స్థితి అంటే పాలన, పోషణ జరుగుతాయి. తమోగుణంవల్ల లయం జరుగుతుంది. త్రిమూర్తులలో సత్వగుణప్రధానుడు – విష్ణువు. అతడే ఈ జగత్తుయొక్క పాలన, పోషణ బాధ్యతలు స్వీకరించాడు. బ్రహ్మ – రజోగుణ ప్రధానుడు. సృష్టికార్యం చూస్తుంటాడు. రుద్రుడు తమోగుణ ప్రధానుడు. ఈ సృష్ఠిని లయంచేస్తుంటాడు.

**బృహదారణ్యకోపనిషత్తు**లో సృష్టికి పూర్వం మానవాకారంలో ఉన్న విరాడాత్మ మాత్రమే ఉన్నది. అతని కన్న భిన్నమైనదేదీ లేదు. పురుషాకారంలో ఉన్న ప్రజాపతి తాను ఒక్కడే అయి ఉండికూడా భయభ్రాంతుడైనాడు. కాని తాను తప్ప ఇంకెవరూలేరనే ఆలోచనతో ఆభయాన్ని పోగొట్టుకున్నాడు. అయితే ఒంటరిగా ఉన్న ప్రజాపతి, ఆ వంటరితనాన్ని భరించలేక స్త్రీని కోరాడు. అలా కోరిన వెంటనే స్త్రీపురుషులు పరస్పరాలింగనము చేసుకున్నట్లుగా రూపుదాల్చాడు. తన శరీరాన్ని రెండు భాగాలుగా చేశాడు. ఆ భాగాలే పతి, పత్ని. అతడే మనువు. ఆమె పేరు 'శతరూప'.

ప్రజాపతివల్ల కలిగిన శతరూప "కుమార్తెతో రమించటం నిషిద్ధం కదా ? తన నుండి పుట్టిన నాతో ప్రజాపతి ఏవిధంగా రమిస్తాడు ? ఎందుకయినా మంచిది" అని తాను ఆవుగా మారింది. ఇది చూసిన పురుషుడు తాను వృషభమై సంభోగించాడు. అందువల్ల గోసంతతి వృద్ధి చెందింది. తరువాత శతరూప ఆడుగుర్రమైంది. పురుషుడు మగగుర్రమైనాడు. అశ్వసంతతి వృద్ధి చెందింది. తరువాత ఆమె ఆడగాడిద అయింది. పురుషుడు మగగాడిద అయినాడు. గాడిద సంతతి వృద్ధి చెందింది. ఈ రకంగా చీమనుండి ఏనుగు వరకు 84 లక్షల జీవరాశి అభివృద్ధి చెందింది.

ఈ రకంగా సృష్టిచేసిన తరువాత ప్రజాపతి ఈసృష్టి అంతా తానేఅని తెలుసుకున్నాడు. అందుచేతనే సృష్టి అనేది ప్రజాపతికి మారు పేరయింది.

నామరూపాత్మకమైన సృష్టికి ఆరంభంలో ఉన్నది పరబ్రహ్మ స్వరూపము. అంటే విరాడ్రూపంలో ఉన్న అగ్ని. అదే బ్రాహ్మణ రూపం. అంతవరకు క్షత్రియాది ఇతర వర్ణాలులేవు. క్షత్రియులు లేకపోవటంచేత పాలనావ్యవహారాలు కష్టమైనాయి. అప్పుడు విరాట్ బ్రహ్మ క్షత్రియుల్ని సృష్టించాడు. వారు బ్రాహ్మణులకు రక్షకులు.

క్షత్రియుల్ని సృష్టించిన తరువాత కూడా బ్రహ్మ తన పనిలో కృతకృత్యుడు కాలేదు. సంపాదించేవాడు, ధనం కూడబెట్టేవాడు అవసరమైనాడు. అప్పుడు వైశ్యులను సృష్టించాడు. వసువులు, రుద్రులు, అదిత్యులు, విశ్వేదేవులు, మరుత్తులు మొదలైన దేవతలు గణాలుగా ఉంటారు. వీరిలో

| | | | | | |
|---|---|---|---|---|---|
| వసువులు | - | 8 మంది | విశ్వేదేవులు | - | 13 మంది |
| ఆదిత్యులు | - | 12 మంది | మరుద్గణాలు | - | 49 మంది |
| రుద్రులు | - | 11 మంది | | | |

వీరంతా దేవవైశ్యులు.

ఆ తరువాత సేవకులు, వ్యవసాయము, పశుపోషణ చూసేవారు లేకపోయారు. అందుచేత శూద్రులను సృష్టించాడు ప్రజాపతి. పూషుడు శూద్రవర్ణుడు. పూషాదేవి అంటే - భూమి. అందరినీ పోషిస్తుంది అని సృష్టిని గురించి చెప్పబడింది.

**ఐతరేయోపనిషత్తు**లో సృష్టిని వివరిస్తూ "జీవాత్మ, పరమాత్మా రెండూ ఒక్కటే. మరణానంతరము జీవాత్మ పరమాత్మలో లీనమైపోతుంది. ఆత్మయే ఆలోచనా పూర్వకంగా ఈ లోకాలను సృష్టించింది. సృష్టి జరగటానికి ముందు జగత్తంతా బ్రహ్మమయంగా ఉండేది. దాన్నే ఆత్మ అని కూడా అంటారు. ఆత్మయే లోకాలను సృష్టించాలి అనుకుంది. కొంతకాలానికి ఆత్మ అంభస్సు, మరీచి, ఆపః, మర అనే లోకాలను సృష్టించింది. ఈ లోకాలన్నీ పంచభూతాలచే నిర్మించబడ్డాయి.

లోకాలను సృష్టించిన తరువాత "ఈ లోకాలను రక్షించే వాళ్ళు లేకపోతే అవి నాశనమయి పోతాయి. కాబట్టి లోకపాలకులను సృష్టించాలి" అని ఆలోచించి జలంతో అవయవాలు గల మానవాకారాన్ని సృష్టించింది. ఆ ఆకారమే 'విరాడ్రూపము'.

ఆ తరువాత పరమాత్మ విరాడ్రూపాన్ని దృష్టిలో పెట్టుకుని తీవ్రమైన ఆలోచన చేశాడు. అదే తపస్సు. దాని ఫలితంగా విరాడ్రూపానికి నోరు వచ్చింది. ఆ నోటినుండి మాట, మాటకు అభిమాన దేవత అయిన అగ్ని ఉత్పన్నమైనాయి. తరువాత ముక్కు రంధ్రాలు వచ్చాయి. వాటినుండి ప్రాణం ఉత్పన్నమైంది. అంటే వాసన చూసేశక్తి వచ్చింది. దానినుంచి వాయువు పుట్టింది. తరువాత నేత్రాలు ఏర్పడ్డాయి. వాటినుండి సూర్యుడు ఉద్భవించాడు. తరువాత చెవులు. వాటినుంచి దిశలు ఏర్పడ్డాయి. ఆ తరువాత చర్మము. దానినుంచి స్పర్శకు కారణమైన రోమాలు వచ్చాయి. ఆ తరువాత హృదయం, దానినుండి

మనస్సు, మనస్సు నుంచి చంద్రుడు వచ్చారు. తరువాత నాభి దానినుండి అపానము, మృత్యువు వచ్చాయి. ఈ రకంగా విరాట్పురుషుని అవయవాలనుండి ఇంద్రియాలు వాటి అధిష్టానదేవతలు పుట్టారు.

పరమేశ్వరుడు విరాడ్రూపానికి ఆకలిదప్పికలు కలుగచేశాడు. అప్పుడు దేవతలందరూ "మేముకూర్చుని భుజించేందుకు వీలుగా ఒక స్థానాన్ని ప్రసాదించమని" ప్రజాపతిని కోరారు.

అప్పుడు దేవతల కోసం పరమేశ్వరుడు ఆవును సృష్టించాడు. 'ఇది మాకు సరిపోదు' అన్నారు దేవతలు. గుర్రాన్ని సృష్టించాడు ప్రజాపతి. 'ఇదీ కాదు' అన్నారు దేవతలు. అప్పుడు విరాడ్రూపాన్ని పోలిన పురుషశరీరాన్ని సృష్టించాడు ప్రజాపతి. ఇది చాలా బాగుంది అని దేవతలు వారి వారి స్థానాలలో ప్రవేశించారు. అంటే

అగ్ని వాగ్రూపం ధరించి నోటిలో ప్రవేశించాడు. వాయువు ప్రాణరూపంలో ముక్కునందు, సూర్యుడు దృష్టి రూపంలో నేత్రములయందు, దిక్కులు చెవులయందు, ఓషధులు, వనస్పతులు చర్మమునందు, చంద్రుడు మనస్సునందు, మృత్యువు అపానరూపంలో నాభియందు,జలం వీర్యరూపంలో జననేంద్రియమునందు ప్రవేశించాయి. ఈరకంగా దేవతలంతా వెళ్ళిపోగా మిగిలినవి ఆకలిదప్పికలు. వీరిద్దరినీ పరమేశ్వరుడు దేవతలందరిలోనూ భాగస్వాములుగ చేశాడు. దీనివల్ల ఏ దేవతకు హవిస్సు ఇచ్చినా, దానిలో ఆకలిదప్పికలకు కూడా భాగం ఉంటుంది. కంటికి ఆకలి దప్పిక అంటే – చూడాలనే కోరిక. చెవులకు వినాలనే కోరిక.

ఈరకంగా ఇంద్రియాలను, వాటి అధిష్టాన దేవతలను సృష్టించిన తరువాత అన్నము సృష్టించవలసిన అవసరం వచ్చింది. అప్పుడు జలము నుంచి ఆహారము సృష్టించాడు. అదే అన్నము.

ఆ విధంగా దేవతలకోసం సృష్టించబడ్డ అన్నము దేవతలనుచూసి 'వారు తన పాలిట మృత్యుదేవతలని' తలపోసి పారిపోయింది. అప్పుడు విరాడ్రూపుడు అన్నాన్ని తన వాక్కుతో పట్టుకోవాలనుకున్నాడు. పట్టుకోలేకపోయాడు. ఒకవేళ వాక్కుతో గనక పట్టుకుని ఉన్నట్లైతే 'అన్నము' పేరు ఉచ్చరించినంత మాత్రంచేతనే ఆకలి తీరిపోయేది.

చక్షువులతో అన్నాన్ని పట్టుకోవాలనుకున్నాడు. పట్టుకోలేకపోయాడు. ఒకవేళ చక్షువులతో గనక అన్నాన్ని పట్టుకొని ఉంటే కనులతో అన్నాన్ని చూసినంత మాత్రంచేతనే ఆకలి తీరిపోయేది.

ఈరకంగా ఏ ఇంద్రియంతోనూ అన్నాన్ని పట్టుకొనలేకపోయాడు. చివరకు 'అపానం'తో గ్రహించగలిగాడు. నోటితో లోపలికి పీల్చబడే వాయువే అపానము. ఇదే అన్నాన్ని గ్రహిస్తుంది.

ఇప్పుడు పరమేశ్వరుడు మానవశరీరంలో ప్రవేశించాలనుకున్నాడు. అందుకు రెండే మార్గాలున్నాయి. 1. పైనుంచి బ్రహ్మరంధ్రం ద్వారా 2. క్రింద నుంచి

క్రిందనుంచి వెళ్ళటం సేవకుల లక్షణం. కాబట్టి బ్రహ్మరంధ్రంద్వారా మానవదేహంలో ప్రవేశించాడు" అని చెప్పబడింది. ఈ విధంగా పరమేశ్వరుడు సృష్టినిచేసి, జీవులకు కావలసిన ఆహారాన్ని, రక్షణనుకూడా సమకూర్చాడు. ఆ విషయాన్ని ఇక్కడ వివరించారు.

**లలితాసహస్రం**లో కూడా

| | | | |
|---|---|---|---|
| 264 | సృష్టికర్త్రీ | 265 | బ్రహ్మరూపా |
| 266 | గోప్త్రీ | 267 | గోవిందరూపిణీ |
| 268 | సంహారిణీ | 269 | రుద్రరూపా |
| 270 | తిరోధానకరీ | 271 | ఈశ్వరీ |
| 272 | సదాశివా | 273 | అనుగ్రహదా |

అంటూ పరమేశ్వరుని యొక్క పంచకృత్యములను వివరించారు. ఈ విషయాలను 5 నుంచి 9 వరకు గల నామాలలో వివరించారు.

ఇక నామాలను చూద్దాం.

## 5. భూతకృత్

భూతములను సృష్టించువాడు.

**భూతానియోఽసౌ సృజతి స్వాతన్త్రేణ స భూతకృత్**

భూతములను సృష్టిస్తాడు. కాబట్టి 'భూతకృత్' అనబడుతున్నాడు.

రజోగుణాన్ని ఆసరాగా తీసుకుని చతుర్ముఖ బ్రహ్మరూపంలో సమస్త భూతాలను సృష్టిస్తాడు. అలాగే తమోగుణాన్ని ఆసరాగా తీసుకుని రుద్రరూపంలో భూతములను హింసిస్తూ ఉంటాడు. లయం చేస్తుంటాడు.

జగన్నిర్మాణమనేది రజోగుణప్రధానమైన బ్రహ్మ పని. బ్రహ్మ అంటే – ఇక్కడ కర్మబ్రహ్మ అని అర్థం. ఆయనే చతుర్ముఖ బ్రహ్మ. త్రిమూర్తులలో మొదటివాడు.

**బ్రహ్మ చతుర్ముఖః తాదృశ ఈశ్వరః స ఏవం రూపం యస్యాః**

బ్రహ్మ అనగా నాలుగు ముఖాలు కలవాడు. చతుర్ముఖుడు.

సృష్టి చెయ్యటము అనేది రజోగుణప్రధానమైనది. త్రిగుణాత్మకమైన రూపాలలో రజోగుణ ప్రధానుడు బ్రహ్మ. అందుచేత అతడే ఈ సృష్టికార్యము నిర్వర్తిస్తాడు. పరమేశ్వరుడు మూలప్రకృతి రూపం పొంది సృష్టి చేస్తాడు. అంటే గతంలో క్షయం కాకుండా ఉన్న జీవుల కర్మానుసారము వారికి ఉత్తరజన్మలను ఇస్తాడు. అసలు సృష్టి అనేది గుణాల ఆధారంగా జరుగుతుంది. అందుచేతనే సృష్టి మూడు విధాలు. అవి.

1. ఏకగుణసృష్టి 2. ద్విగుణసృష్టి 3. త్రిగుణసృష్టి.

**1. ఏకగుణసృష్టి :** ఇందులో ఒకే గుణముంటుంది.

సత్వగుణము వల్ల - బ్రహ్మాది దేవతలు

రజోగుణం వల్ల - మానవులు, మృగాలు, పక్షులు, జలచరాలు

తమోగుణంవల్ల - చెట్లు, చేమలు, పర్వతాలు ఉద్భవిస్తాయి.

**2. ద్విగుణసృష్టి :** ఇందులో ప్రతిగుణము మళ్ళీ మూడుభాగాలవుతుంది. దానినుంచి ప్రాణికోటి ఉద్భవిస్తుంది.

సత్వసత్త్వము నుంచి - విరాట్పురుషాదులు

సత్వరజము నుంచి - దేవర్షులు, వాలఖిల్యులు, వైఖానసులు

సత్వతమస్సు నుంచి - యక్ష రాక్షస విద్యాధరులు

రజసత్త్వమున - మానవులు

రజోరజమున - పశువులు, మృగాలు

రజోతమస్సున - స్వేదజాలు, అండజాలు, జలచరాలు

తమస్సులో సత్వమువల్ల - పైరులు, గడ్డిపంటలు

తమోరజమువల్ల - చెట్లు, పొదలు, తీగెలు

తమోతమమువల్ల - భూములు, కొండలు, బండలు

**3. త్రిగుణసృష్టి :** ఇందులో ప్రతిగుణంలోనూ మూడుభాగాలుంటాయి. మళ్ళీ అవి ఒక్కొక్కటి మూడుభాగాలవుతాయి. ఈ రకంగా మొత్తం 27 భాగాలవుతాయి.

| | | |
|---|---|---|
| సత్వంలో తమోతమము | – | శేషుడు, వాసుకి మొ॥వారు |
| సత్వంలో తమోరజము | – | దేవతలు, అంగిరసుడు మొ॥వారు |
| సత్వంలో తమోసత్వము | – | కర్మదేవతలు, నవగ్రహాలు |
| సత్వంలో రజోతమము | – | సిద్ధులు, సాధ్యులు |
| సత్వంలో రజోరజము | – | సప్తరుషులు, శుకవామదేవాదులు |
| సత్వంలో రజోసత్త్వము | – | దిక్పాలకులు, పంచబ్రహ్మలు |
| సత్వంలో సత్వతమస్సు | – | విరాట్టు, హిరణ్యగర్భుడు |
| సత్వంలో సత్వరజస్సు | – | సూత్రాత్మ, నిర్వికల్ప సమాధి నిష్ఠులు |
| సత్వంలో సత్వసత్వము | – | సర్వజ్ఞత్వము, సర్వేశ్వరత్వము, సర్వాంతర్యామిత్వము |
| రజంలో తమోతమము | – | కందిరీగలు, తేళ్ళు, చీమలు, పాములు |
| రజంలో తమోరజము | – | మొసళ్ళు, పీతలు, నత్తలు |
| రజంలో తమోసత్వము | – | కాకులు, పిచ్చుకలు, చిలకలు, గోరువంకలు |
| రజంలో రజోతమము | – | సింహాలు, పులులు, ఎలుగుబంట్లు |
| రజంలో రజోరజము | – | ఏనుగులు, గుర్రాలు, కోతులు, మేకలు |
| రజంలో రజోసత్త్వము | – | కర్రిఆవులు, చమరీమృగాలు, జింక, దుప్పి |
| రజంలో సత్వతమము | – | శూద్రులు, మంగలి, మాల, చాకలి |
| రజంలో సత్వరజము | – | పుణ్యకర్మలు చెయ్యటం, దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేసే పాలకులు |
| రజంలో సత్వసత్వము | – | బ్రహ్మవాదులు, వేదవిదులు. దశవిధ బ్రాహ్మణులు |
| తమంలో తమోతమం | – | కొండలు, బండలు, ముళ్ళచెట్లు, నిర్జన ప్రదేశాలు, చవిటి నేలలు. |
| తమంలో తమోరజస్సు | – | మంచి పంటపండే నేలలు, తపస్సు, యజ్ఞము చేసే ప్రాంతాలు. దేవబ్రాహ్మణనివాసాలు |
| తమంలో తమోసత్త్వము | – | పుణ్యక్షేత్రాలు, పుణ్యనదులు |
| తమంలో రజోతమము | – | ముష్టి, వేము, బలురక్కసి, నాగజెముడు, తాడి, ఈతచెట్లు |
| తమంలో రజోరజము | – | నిమ్మ, దానిమ్మ, బత్తాయి, మర్రి, జమ్మి |

తమంలో రజోసత్త్వము - అరటి, పనస, మామిడి, వెలగ, పద్మ, కలువ పారిజాతాదులు

తమంలో సత్వతమము - ఉలవ, జొన్న, ఆరిగ, ధాన్యాలు

తమంలో సత్వరజము - కంది, నువ్వు, మినుము, నల్లవరి

తమంలో సత్వసత్త్వము - తెల్లవరి, సన్నవరి, పెసలు, చెరకు

దశవిధ బ్రాహ్మణులు అంటే – వేద విద్యా సంపన్నులు, ఆచారవంతులు అయిన ఆంధ్ర, కర్ణాటక, ద్రావిడ, ఘూర్జర, మహారాష్ట్రులు. వీరు పంచద్రావిడులు. ఉత్కల, మైథిల, గౌడ, కన్యాకుబ్జ, సారస్వతులు వీరు పంచగౌడులు. వీరు మొత్తం కలిపి దశవిధ బ్రాహ్మణులు. ఈ రకంగా త్రిగుణాల ఆధారంగా సృష్టి చేస్తాడు పరమేశ్వరుడు. అదేవిధంగా ఈ జగత్తును నాశనం చెయ్యటమనేది తమోగుణప్రధానుడైన రుద్రుడు చేసే పని.

రుద్రుడు అంటే – శివుడు, ఈశ్వరుడు, రోదించువాడు అని అర్ధము. వేదంలో 'అతడు ఏడ్చెను. అది రుద్రుని రుద్రత్వము' అని చెప్పబడింది.

**రుదంద్రావయతీతి రుద్రః** సంసారబంధనాలను పోగొట్టువాడు రుద్రుడు. ఈ రుద్రులు పదకొండుమంది వారినే ఏకాదశరుద్రులు అంటారు.

**బృహదారణ్యకోపనిషత్తు**లో శాకల్యుడు యాజ్ఞవల్క్యుణ్ణి అడుగుతాడు. 'రుద్రులెంతమంది ? వారెవరు ?' దానికి యాజ్ఞవల్క్యుడు.

జ్ఞానేంద్రియాలు 5, కర్మేంద్రియాలు 5, మనస్సు జీవియొక్క కర్మ సమాప్తి అయినప్పుడు వీరు శరీరం నుంచి నిష్క్రమిస్తారు. ఈ రకంగా శరీరంనుంచి నిష్క్రమంచి బంధువులను రోదింపచేస్తారు. కాబట్టి రుద్రశబ్దంచేత పిలువబడతారు అంటాడు.

ఈ రకంగా బ్రహ్మరూపంలో సృష్టి, రుద్రునిరూపంలో లయము చేస్తాడు. కాబట్టి శ్రీ మహావిష్ణువు 'భూతకృత్' అనబడుతున్నాడు.

## 6. భూతభృత్

భూతములను భరించువాడు.

**భూతభృ ద్భూత భరణాత్** భూతములన్నింటినీ ధరించువాడు.

**భూతాని భిభర్తీతి భూతభృత్** లోకాలనన్నింటినీ భరించువాడు.

**శింశు మారాత్మనా విష్ణుః భూరాదీనూర్ధ్వత స్థితాన్ ।**
**దధ్రే శేషతయాలోకాన్ సప్తలోకాన్ అథస్థితాన్ ॥**

శ్రీ మహావిష్ణువు శింశుమార (మొసలి) రూపంలో ఊర్ధ్వలోకాలను, ఆదిశేషుని రూపంలో అథోలోకాలను ధరించి ఉన్నాడు. లోకాలయొక్క రక్షణ బాధ్యత శ్రీమహావిష్ణువుదే. అందుచేతనే సత్వగుణము నాశ్రయించి జీవులన్నింటినీ పాలిస్తున్నాడు. పోషిస్తున్నాడు. కాబట్టే 'భూతభృత్' అనబడుతున్నాడు.

## 7. భావః

విశిష్టాకారుడు.

**శ్లిష్టత్వాత్ భావ ఈరితః** సకల విభూతులతోను కూడి ఉన్నవాడు.

**భవతీతి భావః** సకల భూతములను శరీరముగా గలవాడు.

**భగవద్గీత**లోని పదవ అధ్యాయం **విభూతి యోగం**లో భగవానుడు తన విభూతులను వివరిస్తాడు.

**అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః ।**
**అహమాదిశ్చ మధ్యం చ భూతానామంత ఏవ చ ॥**

ఓ అర్జునా ! సమస్త ప్రాణుల హృదయములయందున్న ఆత్మను నేనే. సకల భూతముల (ప్రాణుల) ఆదియు, మధ్యస్థితియు, అంతము నేనే (ప్రాణులయొక్క సృష్టి, స్థితి లయములకు కారణము నేనే).

**ఆదిత్యానామహం విష్ణుః జ్యోతిషాం రవిరంశుమాన్ ।**
**మరీచిర్మరుతామస్మి నక్షత్రాణామహం శశీ ॥**

అదితియొక్క ద్వాదశపుత్రులైన ఆదిత్యులలో విష్ణువును నేను. జ్యోతిర్మయ స్వరూపులలో నేను సూర్యుడను. 49 మంది వాయుదేవతలలోని 'తేజము'ను నేను. నక్షత్రాధిపతియైన చంద్రుడను నేను.

**వేదానాం సామవేదోఽస్మి దేవానామస్మి వాసవః ।**
**ఇంద్రియాణాం మనశ్చాస్మి భూతానామస్మి చేతనా ॥**

వేదములలో నేను సామవేదమును. దేవతలలో ఇంద్రుడను నేను. ఇంద్రియములలో నేను మనస్సును. ప్రాణులలో చైతన్యమును (ప్రాణశక్తిని) నేను.

**రుద్రాణాం శంకరశ్చాస్మి విత్తేశో యక్షరక్షసామ్ ।**
**వసూనాం పావకశ్చాస్మి మేరుశ్శిఖరిణామహమ్ ॥**

ఏకాదశ రుద్రులలో శంకరుడను నేను. యక్షరాక్షసులలో ధనాధిపతియైన కుబేరుడను నేను. అష్టవసువులలో అగ్నిని నేను. పర్వతములలో 'సుమేరు' పర్వతమును నేను.

**పురోధసాం చ ముఖ్యం మాం విద్ధి పార్థ ! బృహస్పతిమ్ ।**
**సేనానీనామహం స్కందః సరసామస్మి సాగరః ॥**

పురోహితులలో ముఖ్యుడైన బృహస్పతిని నేనే. సేనాపతులలో కుమారస్వామిని నేను. జలాయములలో నేను సాగరుడను.

**మహర్షీణాం భృగురహం గిరామస్మ్యేకమక్షరమ్ ।**
**యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి స్థావరాణాం హిమాలయః ॥**

మహర్షులలో భృగువును నేను. శబ్దములలో ఏకాక్షరమును అనగా ఓంకారమును నేను. యజ్ఞములయందు జపయజ్ఞమును నేను. స్థావరములలో హిమాలయమును నేను.

**అశ్వత్థ స్సర్వవృక్షాణాం దేవర్షీ ణాం చ నారదః ।**
**గంధర్వాణాం చిత్రరథః సిద్ధానాం కపిలో మునిః ॥**

వృక్షములలో నేను అశ్వత్థమును (రావిచెట్టును). దేవర్షులలో నారదుడను నేను. గంధర్వులలో నేను చిత్రరథుడను. సిద్ధులలో నేను కపిల మునిని.

**ఉచ్చైశ్శ్రవసమశ్వానాం విద్ధి మామమృతోద్భవమ్ ।**
**ఐరావతం గజేంద్రాణాం నరాణాం చ నరాధిపమ్ ॥**

అశ్వములలో పాలసముద్రము నుండి అమృతముతో పుట్టిన ఉచ్చైఃశ్రవమును నేను. భద్రగజములలో ఐరావతమును నేను. మనుష్యులలో ప్రభువును నేను.

**ఆయుధానామహం వజ్రం ధేనూనామస్మి కామధుక్ ।**
**ప్రజనశ్చాస్మి కందర్ప స్సర్పాణామస్మి వాసుకిః ॥**

ఆయుధములలో వజ్రాయుధమును నేను. పాడి ఆవులలో కామధేనువును నేను. శాస్త్రవిహితరీతిలో సంతానోత్పత్తికి కారణమైన మన్మథుడను నేను. సర్పములలో వాసుకిని నేను.

**అనంతశ్చాస్మి నాగానాం వరుణో యాదసామహమ్ ।**
**పితౄణామర్యమా చాస్మి యమ స్సంయమతామహమ్ ॥**

నాగజాతివారిలో ఆదిశేషుడ (అనంతుడ)ను నేను. జలచరములకు అధిపతియైన వరుణుడను నేను. పితరులలో అర్యముడను (పితృగణప్రభువును) నేను. శాసకులలో యమధర్మరాజును నేను.

**ప్రహ్లాదశ్చాస్మి దైత్యానాం కాలః కలయతామహమ్ ।**
**మృగాణాం చ మృగేంద్రోఽహం వైనతేయశ్చ పక్షిణామ్ ॥**

దైత్యులలో నేను ప్రహ్లాదుడను. గణించువారిలో (గణకులలో) నేను కాలమును. మృగములలో మృగరాజు ఐన సింహమును నేను. పక్షులలో పక్షిరాజైన గరుత్మంతుడను నేను.

**పవనః పవతామస్మి రామశ్శస్త్రభృతామహమ్ ।**
**ఝషాణాం మకరశ్చాస్మి స్రోతసామస్మి జాహ్నవీ ॥**

పవిత్రమొనర్చు వారిలో వాయువును నేను, శస్త్రధారులలో శ్రీరామచంద్రుడను నేను. మత్స్యములలో మొసలిని నేను. నదులలో గంగానదిని నేను.

**సర్గాణామాదిరంతశ్చ మధ్యం చై వాహమర్జున ।**
**అధ్యాత్మవిద్యా విద్యానాం వాదః ప్రవదతా మహమ్ ॥**

ఓ అర్జున ! సృష్టికి ఆదిమధ్యాంతములు నేను. (సృష్టి, స్థితిలయ కారకుడను నేను) విద్యలలో అధ్యాత్మవిద్య అనగా బ్రహ్మవిద్యను నేను. పరస్పర వాదవివాదములలో తత్త్వనిర్ణయమునకై చేయు 'వాదము'ను నేను.

**అక్షరాణామకారోఽస్మి ద్వంద్వ స్సామాసికస్య చ ।**
**అహమేవాక్షయః కాలో ధాతాహం విశ్వతోముఖః ॥**

అక్షరములలో "అ" కారమును నేను. సమాసములలో 'ద్వంద్వ' సమాసమును నేను. అక్షయకాలము అనగా మహాకాలమును నేను. అట్లే విశ్వతోముఖుడైన విరాట్ పురుషుడను నేను. అందరిని ధరించువాడను. పోషించువాడను నేను.

**మృత్యుస్సర్వహరశ్చాహం ఉద్భవశ్చ భవిష్యతామ్ ।**
**కీర్తి శ్శ్రీర్వాక్చ నారీణాం స్మృతిర్మేధా ధృతిః క్షమా ॥**

అన్ని ప్రాణములను హరించు మృత్యువును నేను. సమస్త ప్రాణుల ఉత్పత్తి హేతువును గూడ నేనే. స్త్రీలలో కీర్తి, శ్రీ, వాక్కు, స్మృతి, మేధా, ధృతి, క్షమా అను వారందఱున నేనే.

**బృహత్సామ తథా సామ్నాం గాయత్రీ ఛందసామహమ్ ।**
**మాసానాం మార్గశీర్షోఽహంఋతూనాం కుసుమాకరః ॥**

గానము చేయుటకు అనువైన శ్రుతులలో బృహత్సామమును నేనే. ఛందస్సులలో 'గాయత్రీఛందస్సు'ను నేను. మాసములలో మార్గశీర్షమును, ఋతువులలో వసంత ఋతువును నేనే.

**ద్యూతం ఛలయతామస్మి తేజస్తేజస్వినామహమ్ ।**
**జయోఽస్మి వ్యవసాయోఽస్మి సత్త్వం సత్త్వవతామహమ్ ॥**

వంచకులలో జూదమును నేనే. ప్రభావశాలురలోని ప్రభావమును నేను. విజేతలలో విజయమును నేను, నిశ్చయాత్మకులలో నిశ్చయమును, సాత్త్విక పురుషులలో సాత్త్విక భావమును నేనే.

**వృష్ణీనాం వాసుదేవోఽస్మి పాండవానాం ధనంజయః ।**
**మునీనామప్యహం వ్యాసః కవీనాముశనా కవిః ॥**

వృష్ణివంశజులలో వాసుదేవుడను నేను. పాండవులలోధనంజయుడను నేను. అనగా నీవే నేను. మునులలో వేదవ్యాసుడను నేను. కవులలో శుక్రాచార్యుడను నేను.

**దండో దమయతామస్మి నీతిరస్మి జిగీషతామ్ ।**
**మౌనం చైవాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతామహమ్ ॥**

శిక్షించువారిలో దండమును అనగా దమనశక్తిని నేనే. జయేచ్ఛ కలవారి నీతిని నేనే. గోప్యవిషయరక్షణమున 'మౌనము'ను నేను. జ్ఞానులయొక్క తత్త్వజ్ఞానమును నేనే.

**యచ్చాపి సర్వభూతానాం బీజం తదహమర్జున ।**
**న తదస్తి వినా యత్స్యాత్, మయా భూతం చరాచరమ్ ॥**

ఓ అర్జునా ! సర్వప్రాణుల ఉత్పత్తికి కారణమైన బీజమును నేనే. ఏలనన నేనులేని చరాచరప్రాణియేదియును లేదు.

**నాంతోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప ।**
**ఏష తూద్దేశతః ప్రోక్తో విభూతేర్విస్తరో మయా ॥**

ఓ పరంతప ! నా దివ్యవిభూతులకు అంతమే లేదు. నా విభూతుల విస్తృతిని గూర్చి నేను నీకు చాలా సంక్షిప్తముగా వివరించితిని.

**యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవ వా ।**
**తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోంశసంభవమ్ ॥**

విభూతి యుక్తమైన అనగా ఐశ్వర్యయుక్తము, కాంతియుక్తము, శక్తియుక్తము ఐన వస్తువేదైనను నా తేజస్సు యొక్క అంశమునుండియే కలిగినదిగా తెలిసికొనుము. ఈరకంగా సకల భూతములను శరీరముగా గలవాడు. కాబట్టే 'భావః' అనబడుతున్నాడు.

## 8. భూతాత్మా

భూతములకు ఆత్మ.

**శరీరభూత భూతానాం భూతాత్మాఽఽ త్మతయా స్థితః** తనకు శరీరము లాగా పరతంత్రమై ఉన్న సమస్త భూతములకు అంతర్యామిగా ఉన్నవాడు.

**భూతానామ్ ఆత్మా భూతాత్మా.** సమస్త భూతములందు ఆత్మగా ఉన్నవాడు.

**సర్వసారోపనిషత్తు**లో "తనతో కూడి ఉండు కూటస్తుడు మొదలైనవారితో భేదములు గల స్వరూపాన్ని తెలుసుకొనే విషయంలో హేతువుగను, సకల దేహములయందు మణులలో దారములాగా వరుసగా లోపల ఉండి నియమించువాడుగను, ప్రకాశించు ఆత్మయే అంతర్యామి" అని చెప్పబడింది. **ఐతరేయోపనిషత్తు**లో చెప్పినట్లుగా "పరమేశ్వరుడు జీవరాశిని సృష్టించిన తరువాత, ఆ శరీరంలో తాను ప్రవేశించాలి అనుకున్నాడు. బ్రహ్మరంధ్రం గుండా ప్రవేశించాడు" ఈ విషయం లోగడ వివరించాం. ఈ రకంగా అన్ని ప్రాణులయందు అంతర్గతంగా ఉన్నాడు కాబట్టే 'భూతాత్మా' అనబడుతున్నాడు.

## 9. భూత భావనః

భూతములను వృద్ధి చేయువాడు.

**దారకాది ప్రదానేన యశ్చ వర్ధయతి స్వయం భూతాని నిత్యం ఝటితి స తు స్యా ద్భూత భావనః** తాను సృష్టించిన భూతములన్నింటికీ, తానే స్వయముగా పోషణభారం వహించేవాడు.

**భూతాని భావయతీతి భూతభావనః** భూతములను పాలించువాడు.

పై నామాలలో సృష్టి,లయము చెప్పి ఈ నామంలో స్థితిని వివరిస్తున్నాడు. సృష్టి, స్థితి లయాలు మూడు పరమేశ్వరునియొక్క కర్మలే. సత్వగుణ ప్రధానుడైన పరమేశ్వరుడు ఈ సృష్టిని రక్షిస్తాడు. **బృహదారణ్యకోపనిషత్తు** లో ఈవిధంగా ఉన్నది.

"ప్రజాపతి జ్ఞానంద్వారా, కర్మలద్వారా సప్తాన్నాలను సృష్టించాడు. అందులో ఒక అన్నం మనమంతా తినేది. ప్రజాపతి హతము, ప్రహృతము అనే రెండు రకాల అన్నాలను

దేవతల కోసం ఇచ్చాడు. అందుకే గృహస్థుడు బలి (నైవేద్యముగా ఇచ్చేది) హవనము (దేవతల కోసం హోమం చేసేది) ఇస్తుంటారు. దేవతలకు ఇచ్చే ఈరెండు అన్నాలను దర్శము, పూర్ణమాసము అనే యజ్ఞాలు అంటారు.

పాలు అనే ఆహారాన్ని సృష్టించి పశువులకు ఇచ్చాడు ప్రజాపతి. పశువులతోపాటుగా మానవుడు కూడా ముందుగా పాలు త్రాగే బ్రతుకుతున్నాడు. పాలతో హనం చేసేవాడు మృత్యువును జయిస్తాడు. ఈ రకంగా పరమేశ్వరుడు ఆహారాన్ని అందించి, జగత్తును పాలిస్తున్నాడు.

| | | |
|---|---|---|
| రజోగుణప్రధానుడైన బ్రహ్మరూపంలో | – | సృష్టి చేస్తాడు |
| సత్త్వగుణ ప్రధానుడైన విష్ణువురూపంలో | – | సృష్టిని రక్షిస్తాడు. |
| తమోగుణ ప్రధానుడైన రుద్రునిరూపంలో | – | లయం చేస్తాడు |

ఈ రకంగా త్రిమూర్తులరూపంలో ఆ పరమేశ్వరుడు సృష్టిస్థితిలయాలు మూడింటినీ చేస్తాడు. అంటూ పరమేశ్వరుని లక్షణాలైన సృష్టిస్థితి లయాలను వివరించాడు రత్నాకరుడు.

# 10. భూతాత్మ

నిరాకారుడు నిర్గుణస్వరూపుడు అయిన పరబ్రహ్మ అంతటా తానే అయి ఉన్నాడు. సృష్టికి పూర్వము పరబ్రహ్మ ఏకాకిగా జగత్తంతా ఆవరించి ఉన్నాడు. అతనితో సమానులు గాని, అతనికన్న అధికులుగాని ఎవరూలేరు. ఇలా కొంతకాలం గడచిన తరువాత, గతంలో ప్రళయం సంభవించినప్పుడు కర్మక్షయం కాకుండా తనలో కలిసిపోయిన జీవుల కర్మను క్షయంచేసి, వారికి మోక్షం కలిగించాలనే ఉద్దేశ్యంతో మళ్ళీ సృష్టి చెయ్యాలనుకున్నాడు. పంచభూతాలను, తన్మాత్రలను, ఇంద్రియాలను, ఇంద్రియాధిదేవతలను సృష్టించాడు. ఈరకంగా జీవులన్నింటినీ సృష్టించాడు. ఈ రకంగా జీవులన్నింటినీ సృష్టించిన తరువాత, తాను ఆ శరీరంలో ప్రవేశించాలి అనుకున్నాడు. బ్రహ్మరంధ్రం ద్వారా ప్రవేశించాడు. ఈరకంగా ప్రతిజీవి యొక్క శరీరంలోను జీవాత్మగా ఉన్నాడు.

నిజానికి జీవాత్మ, పరమాత్మ వేరుకాదు. ఆ రెండూ ఒక్కటే. కాని వేరుగా కనిపిస్తున్నాయి. **ముండకోపనిషత్తు**లో చెప్పినట్లుగా ఒకే చెట్టు కొమ్మమీద ఒకే ఆకారము, రంగు, కలిగిన రెండు పక్షులున్నాయి. అందులో ఒకటి దొరికిన ఫలాలు తింటున్నది. రెండవది ఏమీ తినకుండా దిక్కులు చూస్తున్నది. ఆ వృక్షమే సంసారము పండ్లు తినేది జీవాత్మ అవి కర్మఫలాలు. రెండవది పరమాత్మ. దానికి కర్మవాసనలు లేవు. ఈ రెండు పక్షులూ వేరువేరుగా కనిపించినప్పటికీ, నిజానికి ఆ రెండూ ఒక్కటే. జీవాత్మకూ పరమాత్మకూ బేధంలేదు. అజ్ఞానంచేత భేదమున్నది అనుకుంటున్నాము. ఎప్పుడైతే ఈ రెండింటికీ భేదములేదని తెలిసిందో, ఆ రెండూ ఒక్కటే అయిపోతాయి.

ఆత్మ పరిశుద్ధమైనది. దానికి ఏ రకమైన గుణదోషాలు అంటవు. కాని శరీరంలో ఉన్నది కాబట్టి ఆత్మకు సుఖదుఃఖాలు, పాపపుణ్యాలు అంటినట్లు కనిపిస్తుంది. ఈ ఆత్మ అన్ని భూతములయందు ఆవరించి ఉన్నది. భవబంధాలనుండి విడివడటమే ముక్తి. ముక్తి పొందినవారు పరబ్రహ్మలో లీనమైపోతారు. పరమేశ్వరుడు నాశనం లేనివాడు. శాశ్వతమైనవాడు. త్రికాలముల యందు ఉంటాడు. అతడే పురుషుడు అనబడుతున్నాడు. ఆ పరమేశ్వరుడే భూతభవిష్యద్వర్తమానాలకు సాక్షి. అతడు అనాదిగా ఉన్నవాడు. అన్నీ చూస్తున్నాడు. కాబట్టి అతడికి సాక్షి ఇంకొకరు లేరు. అతడే క్షేత్రజ్ఞుడు అంటే ఈ శరీరాన్ని గురించి తెలుసుకున్నవాడు. అక్షరుడు. అతడే యోగము. అనగా ఆనందము, అదృష్టము. యోగము గురించి తెలిసిన వారిలో శ్రేష్ఠుడు. ప్రకృతి పురుషులకు నియామకుడు.

ఈ రకంగా శ్రీమన్నారాయణుడే సకల భూతాత్మ అని 10 నుంచి 20 వరకు నామాలలో వివరించబడింది. ఇక నామాలను చూద్దాం. శుద్ధ స్వభావుడు.

## 10. పూతాత్మా

శుద్ధ స్వభావుడు

**శరీరత్వాచ్చ జగతః తద్దోషైర్నకదాచన ।**
**లిప్యతే యస్వ పూతాత్మా న భుజ్క్తే చ ఫలాని యః ॥**

ఈ జగత్తంతా పరమేశ్వరుని రూపమే. ప్రతిజీవిలోను తాను అంతర్యామిగా ఉన్నాడు. అయినప్పటికీ శరీరము యొక్క దోషములు ఆత్మకు అంటవు. శరీరసంబంధమైన సుఖదుఃఖములను ఆతడు అనుభవించడు.

**పూతః ఆత్మా యస్యసః పూతాత్మా**

ఆత్మపరిశుద్ధమైనది. కాబట్టి దానికి ఏ దోషములు అంటవు. శరీరం అశాశ్వతమైనది. ఆత్మశాశ్వతమైనది. శాశ్వతమైన ఆత్మకు అశాశ్వతమైన శరీరం ఆవాసంగా ఉంటుంది. శరీరం ఉన్నంతకాలము ఆత్మకు గుణదోషాలు, సుఖదుఃఖాలు అంటినట్లుగాను, వాటితో శతమతమవుతున్నట్లుగాను అనిపిస్తుంది. ఆత్మ శరీరంతో సంబంధం ఏర్పరచుకోవటంవల్ల జీవులకు సుఖదుఃఖాలతో సంబంధం ఏర్పడుతుంది. మానవుడు మాసిన వస్త్రాన్ని వదలి నూతనవస్త్రాన్ని ధరించినట్లే ఆత్మ జీర్ణమైన ఈ దేహాన్ని వదలి వేరే దేహాన్ని ఆశ్రయిస్తుంది. ఆత్మ శరీరం నుంచి విడిపోతే భౌతికబంధాలనుండి విడివడుతుంది.

**ఐతరేయోపనిషత్తు**లో చెప్పినట్లుగా "ప్రాణులను సృష్టించిన తరువాత పరమేశ్వరుడు ఆ దేహంలో ప్రవేశించాలనుకున్నాడు. బ్రహ్మరంధ్రం ద్వారా ప్రవేశించాడు. ఈవిధంగా శరీరంలో ప్రవేశించి జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు మనస్సులతో కూడినవాడై ప్రాపంచిక భోగాలు అనుభవిస్తూ, పంజరంలో బంధించబడిన పక్షిలాగా బయటకుపోయే మార్గం తెలియక కొట్టుమిట్టాడుతున్నాడు" అందుచేతనే ఆత్మకు సుఖదుఃఖాలు, గుణదోషాలతో సంబంధం ఉన్నట్లుగా అనిపిస్తుంది. కాని ఆత్మ వచ్చిన దారిగుండానే బయటకు వెళ్ళగలిగితే అంటే బ్రహ్మరంధ్రం గుండా బయటకు పోగలిగితే పరమాత్మను చేరుతుంది.

**ముండకోపనిషత్తు**లో "ఒకే పేరు, ఒకే రూపముగల రెండు పక్షులు ప్రపంచమనే వృక్షాన్ని ఆశ్రయించి ఉన్నాయి. అందులో ఒకటి జీవాత్మ. ఇది తన కర్మల వల్ల వచ్చిన ఫలితాన్ని అనుభవిస్తుంది. రెండవది పరమాత్మ, కర్మఫలం ఏమీలేకుండా చూస్తూకూర్చుంది.

ఈ శరీరమే ఆ వృక్షం. ఆపక్షులే క్షేత్రజ్ఞ పరమాత్మలు. వారిద్దరు వేరుకాదు. వారిద్దరూ కలిసి ఒకేచోట ఉన్నప్పటికీ జీవుడు మోహానికి వసుడై అజ్ఞానంవల్ల అనేక బాధలు పడుతుంటాడు.

అతడే యోగీశ్వరులచేత సేవించబడేవాడు అని తెలిసినప్పుడు, అనగా మోహం నశించినప్పుడు ఆ జీవి శోకంనుంచి విముక్తుడౌతాడు. ఈ జీవుడు ఎప్పుడైతే చైతన్యరూపుడు అవుతాడో, జగన్నిర్మాత అయిన ఆ పరమేశ్వరుని దర్శించగలుగుతాడో అప్పుడు ద్వైతభావం వదలి అద్వైతభావం పొందుతాడు”అని చెప్పబడింది.

ఈ రకంగా ఆత్మకు చావుపుట్టుకలు లేవు. సుఖదుఃఖాలు లేవు. గుణదోషాలు లేవు. కాబట్టి ఆత్మపరమపవిత్రమైనది. అందుకే ‘పూతాత్మా’ అనబడుతున్నది.

## 11. పరమాత్మా

తనకు పైన ఇంకొక ఆత్మలేనివాడు.

**యేన భూతా న్యాత్మవన్తి నాయమన్యేన చాత్మవాన్ ।**
**అతో హ్యాత్మేశ్వరత్వాచ్చ పరమాత్మా ప్రకీర్తితః ॥**

అన్ని భూతములకు ఆత్మగా ఉన్నవాడు. తనకంటూ ప్రత్యేకంగా ఆత్మలేనివాడు స్వతంత్రుడు. తనకన్న వేరైనవారు లేనివాడు.

**పరమస్య అసౌ ఆత్మా చ** సర్వోత్తమమైన ఆత్మ ఇది. కార్యకారణములకన్న విలక్షణమైనది. శుద్ధబుద్ధ ముక్త స్వభావము గలది.

**బృహదారణ్యకోపనిషత్తు**లో ఈ సృష్టికి పూర్వం విరాడాత్మ ఒక్కటే ఉన్నది. దానికన్న భిన్నమైనది ఏదీలేదు. సర్వాత్మభావంతో తనను మాత్రమే చూచుకున్నాడు. అంతటా నేనే ఉన్నాను అనుకున్నాడు అని చెప్పబడింది. కాబట్టి సృష్టికి ముందు ఉన్నది ఆత్మ ఒక్కటే. అది సర్వోత్తమమైనది. యాజ్ఞవల్క్యుడు తన భార్యమైత్రేయికి బ్రహ్మవిద్యనుపదేశిస్తూ “లోకంలో ఉన్నదంతా ఆత్మే. ఆ ఆత్మయే అందరిలోనూ ఉన్నది. ఆత్మ నుంచే అన్నీ పుట్టి, మళ్ళీ అందులోనే లయం చెందుతాయి” అంటాడు. కాబట్టి ఆత్మ సర్వోత్తమమైనది.

**సర్వసారోపనిషత్తులో సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ, సత్య మవినాశి, అవినాశినామ, దేశకాలవస్తు నిమిత్తేషు వినశ్యత్సు య న్నవినశ్యతి తదవినాశి, జ్ఞానం నామో త్పత్తివినాశరహితం నైరన్తర్యం చైతన్యంజ్ఞాన మిత్యుచ్యతే, అనన్తంనామ మృద్వికారేషు మృదివ స్వర్ణవికారేషు స్వర్ణమివతంతువికారేషు తంతురివావ్యక్తాది సృష్టి ప్రపంచేషు పూర్ణం వ్యాపకం చైతన్య మనంత మిత్యుచ్యతే.**

"సత్యము, జ్ఞానము అనంతమైనది బ్రహ్మము. సత్యమనగా–నశించనిది. అవినాశి–నాశనములేనిది. దేశకాలవస్తు నిమిత్తములన్నీ నశించగా, ఏది నశించకుండా ఉంటుందో అదే అవినాశి. జ్ఞానము అంటే–ఉత్పత్తి వినాశరహితమైనది, ఎడతెగక ఉండేది, అయిన స్వయంప్రకాశమైనదే జ్ఞానము. అనంతము అంటే – మట్టితో చేసిన కుండలో మట్టిగా, బంగారంతో చేసిన ఆభరణాలలో బంగారంలాగా, నూలుతో తయారుచేసిన బట్టలయందు నూలులాగా ఈసృష్టి యందు అంతటా వ్యాపించి ఉండే చైతన్యము.

**ఆనందం నామ సుఖచైతన్యస్వరూపోఽ పరిమితానన్దసముద్రోఽ వశిష్టసుఖ స్వరూపశ్చానంద ఇత్యుచ్యతే, ఏత ద్వస్తు చతుష్టయం యస్యలక్షణం దేశకాలవస్తు నిమిత్తేష్వవ్యభిచారీ తత్పదార్థః పరమాత్మే త్యుచ్యతే త్వంపదార్థా దౌపాధికా త్తత్పదార్థా దౌ పాధికభేదా ద్విలక్షణ మాకాశవ త్సూక్ష్మం కేవలసత్తామాత్రస్వభావం పరం బ్రహ్మేత్యుచ్యతే, మాయా నామ అనాది రన్తవతి ప్రమాణాప్రమాణసాధారణా న సతీ నా సతీ న సదసతీ స్వయమధికా వికార రహితా నిరూప్యమాణా సతీ తరలక్షణశూన్యా సా మాయే త్యుచ్యతే.**

ఆనందము అనగా – సుఖచైతన్యస్వరూపము. అపరిమితానందసముద్రము. అవశిష్టమగు సుఖస్వరూపము. ఈ నాలుగు వస్తువులు దేని లక్షణమో, అది 'పరమాత్మ' అని చెప్పబడుతున్నది అన్నారు.

ఈరకంగా సత్యజ్ఞానమనంతానందమైనది, నిత్యశుద్ధబుద్ధముక్త స్వభావం కలది కాబట్టే శ్రీమన్నారాయణునిరూపం 'పరమాత్మా' అనబడుతోంది.

## 12. ముక్తానాం పరమా గతిః

ముక్తులకు పరమగతి అయినవాడు.

**బ్రహ్మసాధర్మ్యమాపన్నా ముక్తా స్తేషాం పరాగతిః ।**
**ముఖ్యప్రాప్య స్తత శ్శేషీ ముక్తానాం పరమాగతిః ॥**

పరబ్రహ్మ సాయుజ్యము పొందినవారు ముక్తులు అనబడతారు. ముక్తులైన వారందరూ పొందదగినది. కాబట్టి పరబ్రహ్మ 'ముక్తానాం పరమాగతిః' అనబడుతున్నది.

ముక్తులకు అత్యుత్తమమగు దేవత. ఆ రూపము పొందినవారికి పునరావృత్తి ఉండదు. కాబట్టి అది 'పరమాగతి' అనబడుతున్నది.

ముక్తి అంటే విముక్తి. భవబంధాలనుండి విముక్తిని పొందటమే ముక్తి. మానవుడు కామ, క్రోధ, లోభ, మద, మాత్సర్యములనబడే అరిషడ్వర్గముతోను, నేను, నాది అనే అహంకార మమకారములతోను నిండి ఉంటాడు. ఈ దేహమే తాను అనుకుంటాడు. అలాంటివాడు ఈ లోకంలో కర్మలు చేస్తాడు. కర్మలవల్ల పాపపుణ్యాలు తద్వారాస్వర్గనరకాలు వస్తాయి. స్వర్గసుఖాలనుభవించిన తరువాత కర్మశేషము అనుభవించటానికి ఈ లోకంలో తిరిగి జన్మిస్తాడు. మళ్ళీ కర్మలుచేస్తాడు. ఈరకంగా గానుగకు కట్టిన ఎద్దులాగా సంసారమనే బండిచక్రంలో పడి తిరుగుతూ ఉంటాడు. కర్మలు చెయ్యటంవల్ల ముక్తి రాదు. కేవలము జ్ఞానమువల్లనే ముక్తి లభిస్తుంది. అంతామిథ్య. ఈ జగత్తులో పరమేశ్వరుడొక్కడే శాశ్వతుడు. మిగిలినవన్నీ అశ్వాశతమైనవి.

**కఠోపనిషత్తు**లో అగ్నిచయనాన్ని వివరిస్తూ యమధర్మరాజు నచికేతునితో “నచికేతా! కర్మలు చెయ్యటంవల్ల మోక్షం రాదు. ఆ విషయం నాకు తెలుసు. తెలిసి కూడా ‘అగ్నిచయనము’ అనే ఈ కర్మను చేశాను. ఫలితంగా మృత్యుదేవతనాయ్యాను” అంటాడు.

ఒకవేళ భక్తిమార్గంలో భగవంతుణ్ణి చేరాలి అంటే అందులో తాదాత్మ్యత కావాలి. భవబంధాలన్నింటినీ వదలివెయ్యాలి. గజేంద్ర మోక్షంలో గజేంద్రుడు తనకు ఎదురు లేదు అనుకున్నాడు. అరిషడ్వర్గాలనబడే ఆర్గురు భార్యలతో నీటిమడుగులో దిగాడు. ఆమడుగునంతా చెల్లాచెదరుచేశాడు. అప్పుడు ‘సంచితకర్మ’ అనే మొసలి పట్టుకున్నది. చేతనైనంతవరకూ దానితో పోరాడాడు. లాభం లేకపోయింది. తన బలం చాలలేదు. అప్పుడు పరమేశ్వరుణ్ణి ప్రార్థించాడు.

**నీవే తప్ప వితః పరం బెరుగమన్నిపన్ దగున్ దీనునిన్**

కాబట్టి నన్ను రక్షించు అన్నాడు. ఆ భక్తిలో ప్రపత్తి కావాలి. మనసావాచా కర్మణాతాను భగవంతుడికి అంకితం కావాలి. అప్పుడే అతడికి ముక్తి లభిస్తుంది. ముక్తి 5 రకాలు అంటారు అద్వైతులు. ముక్తిని గురించి తెలుసుకోవాలంటే ముందుగా పూజావిధానం గురించి కొద్దిగానైనా తెలియాలి. పూజ రెండురకాలు 1. బాహ్యపూజ 2. అంతఃపూజ

**1. బాహ్యపూజ :** భగవంతుని ప్రతిమను ఎదురుగా ఉంచుకుని దాన్ని పూజించటం. దీనివల్ల ఐహికమైన కోరికలు తీరతాయి.

**2. అంతఃపూజ :** భగవంతుని మన శరీరంలోనే ఊహించుకుని షట్చక్రాలలోనూ ఆయనను అర్చించటం. ఇది ముక్తిదాయకం. షట్చక్రాలు అంటే

**మూలా ధారం గుదస్తానం స్వాధిష్ఠానంతు మేహనం**
**నాభిస్తు మణిపూరాఖ్యాం హృదయంచాబ్జ మనాహతమ్ ।**
**తాలుమూలం విశుద్ధాఖ్యాం ఆజ్ఞాంచ నిటలాంబుజమ్**
**తస్మాదూర్ధ్వమథోముఖమ్ వికసితమ్ పద్మం సహస్రచ్ఛందం ॥**

1. మూలాధారము – గుదస్థానంలో ఉంటుంది. దీనికి నాలుగు దళాలుంటాయి.
2. స్వాధిష్ఠానము – లింగస్థానంలో ఉంటుంది. దీనికి ఆరు దళాలుంటాయి
3. మణిపూరము – నాభిస్థానంలో ఉంటుంది. దీనికి పది దళాలుంటాయి
4. అనాహత చక్రము – హృదయస్థానంలో ఉంటుంది. దీనికి పన్నెండు దళాలుంటాయి.
5. విశుద్ధి చక్రము – కంఠస్థానంలో ఉంటుంది. దీనికి పదహారు దళాలుంటాయి.
6. ఆజ్ఞాచక్రము – భృకుటిస్థానంలో ఉంటుంది. దీనికి రెండు దళాలుంటాయి.
7. సహస్రారము – బ్రహ్మరంధ్రం దగ్గర ఉంటుంది. దీనికి వేయి దళాలుంటాయి

షట్చక్రాలమీద మరిన్ని వివరాలకు నాచే వ్రాయబడిన **శ్రీవిద్యాసారథి**ని చూడండి.

ఈ చక్రాలలో ఆధారస్వాధిష్ఠానాలు అంధకారబంధురాలు. కౌళులకే అక్కడ ప్రవేశము. మోక్షవాదులు మణిపూరమునుంచే భగవంతుని పూజించాలి. షట్చక్రాలలోనూ ఒక్కొక్కచక్రంలో భగవంతుని పూజించిన సాధకుడికి ఒక్కొక్క రకమైన ఫలితం వస్తుంది.

1. మణిపూరంలో భగవంతుని అర్చించినవారు భగవంతునిపురమునకు దగ్గరగా ఇంకొకపురము నిర్మించుకుని ఉండగలుగుతారు. ఇది 'సార్ష్టిరూప ముక్తి'.

2. అనాహతంలో భగవంతుని అర్చించినవారు భగవంతుని పట్టణంలోనే నివశించగలుగుతారు. ఇది 'సాలోక్యముక్తి'

3. విశుద్ధిచక్రంలో భగవంతుని అర్చించినవారు భగవంతునికి అతిదగ్గరగా సేవకులుగా ఉంటారు. ఇది 'స్వామీప్యముక్తి'

4. ఆజ్ఞాచక్రంలో భగవంతుని అర్చించినవారు వేరే దేహం ధరించి భగవంతునితో సమానమైనరూపంలో ఉంటారు. ఇది 'సారూప్యముక్తి'.

5. సహస్రారంలో భగవంతుని ఆరాధించేవారు పరమేశ్వరునిలో లీనమవుతారు. ఇది సాయుజ్యం. వీరికి పునర్జన ఉండదు.

అద్వైతుల వాదము ప్రకారము. జీవాత్మ పరమాత్మ ఒక్కటే. జీవాత్మ పరమాత్మను చేరటమే సాయుజ్యము. అదే ముక్తి. జన్మరాహిత్యము. విశిష్టాద్వైతులవాదము ప్రకారము జీవాత్మ పరమాత్మ వేరువేరు. జీవాత్మ పరమాత్మయొక్క సన్నిధికి చేరటమే ముక్తి. జన్మరాహిత్యము.

ఏదిఏమైనప్పటికీ ముక్తి పొందిన వారికి పొందదగినది ఆపరమేశ్వరి స్వరూపమే. అది పరబ్రహ్మ అయిన శ్రీమన్నారాయణుడే. అందుచేతనే అతడు "ముక్తానాం పరమాగతిః" అనబడుతున్నాడు.

**శేతాశ్వరోపనిషత్తులో**

**ఘృతాత్పరం మండ మివాతి సూక్ష్మం జ్ఞాత్వాశివగ్ం సర్వభూతేషు గూఢమ్, విశస్త్యైకం పరివేష్టితారం జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైః**

"నేయిలో దాగికున్న సూక్ష్మమైన మీగడ ఉన్నట్లుగా పరమేశ్వరుడు సర్వప్రాణుల యందు నిగూఢముగా ఉన్నాడు. విశ్వవ్యాపకుడైన ఆ పరమేశ్వరుని తెలుసుకున్నవాడు సకల పాశములనుండి విముక్తి పొందుతాడు" అని చెప్పబడింది. ఈరకంగా ముక్తిపొందిన వారు చేరే అత్యున్నతస్థానమే పరమపదము. అందుకే అది "భక్తానాం పరమాగతిః" అనబడుతోంది.

## 13. అవ్యయః

అంతము, నాశనము లేనివాడు.

**న వీయ్యతే చ వైకుణ్ఠా న్ముక్తోఽథస్తా దతోఽవ్యయః**

అవ్యయుడు – వ్యయము లేనివాడు, నాశనములేనివాడు అని అర్థం. పరమేశ్వరుడు నిత్యమైనవాడు, సత్యమైనవాడు. శాశ్వతుడు అని చెబుతోంది వేదం. **అధర్వశిరోపనిషత్తు**లో రుద్రుడు దేవతలకు "త్రికాలాతీతుడను నేనే. నిత్యుడను నేనే, పరబ్రహ్మమును నేనే, నేను అనంతుడను. అవ్యయుడను. ఆ రుద్రుడే శ్రీ మహావిష్ణువు" అని చెబుతాడు.

**మాండూక్యోపనిషత్తు**లో "ఓంకారమే పరబ్రహ్మ స్వరూపము. ఆ పరబ్రహ్మ భూతకాలంలో ఉన్నాడు. వర్తమానకాలంలో ఉన్నాడు. రాబోయే భవిష్యత్‌లో కూడా ఉండాలి. అతడు త్రికాలములందు ఉంటాడు. త్రికాలాతీతుడు కూడా అతడే."

**అధ్యాత్మోపనిషత్తులో**

**అన్తః శరీరే నిహితో గుహాయా మజ ఏకో నిత్యమస్య పృథివీ శరీరం యః పృథివీ మన్తరే సఞ్చర న్యం పృథివీ నవేద,య స్యాఽపః శరీరం య ఆపోఽన్తరే సఞ్చరన్యం తేజోనవేద, యస్య వాయుశ్శరీరం యోవాయుమన్తరే సఞ్చరన్యంవాయుర్న వేద, యస్యా ఽకాశ శ్శరీరం య ఆకాశ మన్తరే సఞ్చర న్య మా కాశో నవేద, యస్య మనశ్శరీరం యోమనోన్తరే సఞ్చర న్యం మనో నవేద, యస్య బుద్ధి శ్శరీరం యో బుద్ధి మన్తరే సఞ్చరన్యం బుద్ధిర్న వేద, యస్యాఽహఙ్కార శ్శరీరం యోఽహఙ్కార మంతరే సఞ్చర న్య మహఙ్కారో నవేద, యస్యచిత్తం శరీరం యశ్చిత్త మన్తరే సఞ్చర న్యం చిత్తం సవేద, యస్యాఽవ్యక్తం శరీరం యోఽవ్యక్త మన్తరే సఞ్చర న్య మవ్యక్తం సవేద, యస్యా క్షరం శరీరం యోఽక్షర మన్తరే సఞ్చర న్య మక్షరం నవేద, యస్య మృత్యుశ్శరీరం యో మృత్యు మన్తరే సఞ్చర న్యం మృత్యుర్న వేద, స ఏష సర్వభూతాఽన్తరాఽత్మాఽ పహతపాప్మా దివ్యో దేవ ఏకో నారాయణః**

దేహము లోపలబుద్ధి అనే గుహయందున్నవాడు, అజుడు, ఒక్కడు, నిత్యుడు ఆ పరమాత్మ. అతడు సర్వత్రా వ్యాపించి ఉన్నాడు.

1. అతడు ఈ పృథ్విలో ఉన్నాడు. పృథ్విలో సంచరిస్తున్నాడు. కాని పృథ్వి అతణ్ణి తెలుసుకోలేదు.

2. అతడు జలమందున్నాడు. జలమే అతని దేహము జలములో సంచరిస్తున్నాడు. కాని జలము అతణ్ణి తెలుసుకోలేదు.

3. అతడు తేజస్సునందున్నాడు. తేజస్సే అతని దేహము. తేజస్సునందు సంచరిస్తున్నాడు. కాని తేజస్సు అతణ్ణి తెలుసుకోలేదు.

4. అతడు వాయువునందున్నాడు. వాయువే అతని శరీరము. వాయువునందు సంచరిస్తున్నాడు. కాని వాయువు అతణ్ణి తెలుసుకోలేదు.

5. అతడు ఆకాశమునందున్నాడు. ఆకాశమే అతని దేహం. ఆకాశమునందు సంచరిస్తున్నాడు. కాని ఆకాశం అతణ్ణి తెలుసుకోలేదు.

ఈరకంగా బుద్ధియందు, అహంకారమునందు, చిత్తమునందు, అవ్యక్తము నందు, అక్షరమునందు, చివరకు మృత్యువునందు కూడా ఉన్నాడు. అతడే ఆత్మ. ప్రత్యగాత్మ అతడే నారాయణుడు ఈరకంగా పరమేశ్వరుడు సర్వత్రా వ్యాపించి ఉన్నాడు. అతడు నిత్యుడు. శాశ్వతుడు అవ్యయుడు, అనంతుడు అని చెప్పబడింది.

కాబట్టే పరబ్రహ్మ అయిన శ్రీమహావిష్ణువు అవ్యయుడు అని పిలువబడుతున్నాడు. అవ్యయుడు అంటే తనను చేరిన వారిని అనగా ముక్తులను తిరిగి భూలోకానికి పంపనివాడు అని కూడా అర్థమున్నది.

## 14. పురుషః

ఎక్కువగా ఇచ్చేవాడు. 406 నామం కూడా ఇదే.

**ముక్తేభ్య స్త్వాత్మ పర్యన్త దానా త్పురుష ఈరితః ॥**

ముక్తులైనవారికి తన గుణములను, విభవములను విశేషముగా ఇచ్చేవాడు. నవద్వారములు గల పురమునందు శయనించేవాడు. మహాభారతంలో ఈవిధంగా ఉన్నది.

**నవద్వారం పురం పుణ్య మేతై ర్భావై స్సమన్వితం ।**
**వ్యాప్యశేతో మహాత్మా యస్తస్మా త్పురుష ఉచ్యతే ॥**

నవద్వారాలుగల పుణ్యమైన పురమునందు వ్యాపించి, శయనించువాడగుటచే పురుషుడు అని చెప్పబడుతున్నాడు. **ఐతరేయోపనిషత్తు**లో "జీవులన్నింటినీ సృష్టించిన తరువాత, తానుకూడా ఈ దేహంలో ప్రవేశించాలి. అనుకున్నాడు. అందు రెండు దారులు ఉన్నాయి.

1. పై నుంచి బ్రహ్మరంధ్రం ద్వారా 2. క్రింద నుండి

క్రింద నుండి ప్రవేశించటమనేది సేవకాలక్షణము కాబట్టి, పైనుండి బ్రహ్మరంధ్రం ద్వారా ప్రవేశించాడు. ఆ రకంగా మానవశరీరంలో ప్రవేశించిన పరమేశ్వరుడు, ఇంద్రియాలతో ప్రాపంచిక సుఖాలను అనుభవిస్తూ, బయటకుపోయే మార్గం తెలియక నవద్వారములతో కూడిన శరీరమనే పట్టణంలో పంజరంలో బంధించబడిన పక్షిలాగా ఉండిపోయాడు" అని చెప్పబడింది. కన్నుచూడలేదు. కంటికి చూసేశక్తినిచ్చేది చైతన్యము, ఆ చైతన్యమే ఆత్మ. అలాగే చెవులకు వినే శక్తినిచ్చేది ఆత్మ. ముక్కుకు వాసనచూసేశక్తినిచ్చేది ఆత్మ. నోటికి మాట్లాడే శక్తినిచ్చేది ఆత్మ. అంటే ఆ పరమేశ్వరుడే.

శరీరంలోని ఇంద్రియాలు – పరమేశ్వరుడే

ఇంద్రియాధిష్టాన దేవతకూడా – పరమేశ్వరుడే

ఈ రకంగా ఇంద్రియాలన్నీ తానే అయి శరీరమంతా వ్యాపించి ఉన్నాడు. కాబట్టే అతడు 'పురుషుడు' అనబడుతున్నాడు. శ్రుతులలో "పూర్వమేనేనిందున్నాను" అని

చెప్పబడింది. అదే పురుషునియొక్క పురుషత్వము. **నారాయణోపనిషత్తు**లో ఈ సృష్టి ప్రారంభములో పరమపురుషుడగు నారాయణుడు ప్రాణులను సృష్టించాడు. అతని దేహము నుండే ఇంద్రాది దేవతలు, పంచభూతాలు ఈ జగత్తు వచ్చినాయి అని చెప్పబడింది. అంటే సృష్టికి ముందే ఆ పరమపురుషుడు ఉన్నాడు.

**ఐతరేయోపనిషత్తు**లో సృష్టి ప్రారంభానికి ముందు పరబ్రహ్మ ఒక్కడే ఉన్నాడు. ఈజగత్తంతా బ్రహ్మమయంగా ఉండేది. అప్పుడు ఆత్మయే ఆలోచనా పూర్వకంగా ఈ లోకాలను సృష్టించింది అని చెప్పబడింది. అంటే సృష్టికి ముందు పరమేశ్వరు డొక్కడే ఉన్నాడు. అందుచేతనే పురుషుడు అనబడుతున్నాడు.

**మహోపనిషత్తు**లో సృష్టికిముందు నారాయణశాఖ పరబ్రహ్మతత్వము ఒక్కటి మాత్రమే ఉండేది. అప్పుడు బ్రహ్మలేడు, రుద్రుడులేడు, నీరులేదు, అగ్నిలేదు, ఆకాశంలేదు. సూర్యుడు లేడు, చంద్రుడులేడు. ఉన్నది ఒక్కడే. అదే పరబ్రహ్మయిన నారాయణుడు అని చెప్పబడింది.

ఈరకంగా సృష్టికి పూర్వము ఉన్నది పరమేశ్వరుడొక్కడే అని అనేకచోట్ల చెప్పబడింది. కాబట్టే అతడు 'పురుషుడు' అనబడుతున్నాడు. పూర్ణత్వముగలవాడు కాబట్టి పురుషుడు అనబడుతున్నాడు.

సృష్టి ప్రారంభానికి ముందు నిరాకారుడు, నిర్గుణస్వరూపుడు అయిన పరబ్రహ్మ బిందురూపంలో ఉన్నాడు. గడిచినకల్పంలో కర్మ క్షయం గాకుండా తనలో కలిసి ఉన్న జీవులకర్మ క్షయంచేసి, వారికిమోక్షమియ్యాలనే తలంపుతో సృష్టినిచెయ్యాలని ఆలోచించాడు. కర్మక్షయంగాని జీవులు బ్రహ్మను ఎలా చేరతాయి అనేది ప్రశ్న. దానికి సమాధానము.

ప్రళయం సంభవించే నాటికి కర్మక్షయమైన జీవులన్నీ పరబ్రహ్మలో లీనమవుతాయి. కాని కర్మక్షయం కాని జీవులు తమయొక్క కర్మను తమతో మూటకట్టుకుని ఆ పరమేశ్వరునిలో చేరతాయి. అయితే వాటికి కర్మశేషం ఇంకా ఉన్నది. ఈరకంగా ప్రళయం జరిగిన తరువాత కొంతకాలానికి... అంటే ఈ కాలము ఎంత ?...

ఏదైనా ఒక పని చెయ్యగానే దాని ఫలితంరాదు. కొంచెం సమయం పడుతుంది. పరీక్షలు వ్రాసిన తరువాత వాటిఫలితాలురావాలంటే కొంత సమయం కావాలి. పప్పు పదార్ధాలు బాగా తింటే కడుపునొప్పి వెంటనే రాదు. కొంత సమయం పడుతుంది. ఈ రకంగానే చేసిన కర్మకు ఫలితం రావాలంటే కొంత సమయం పడుతుంది. అప్పుడు గాని ఆ కర్మఫలాన్ని అనుభవించటానికి లేదు.

అందుచేత జీవులు గతంలో తాము చేసిన కర్మఫలాలు అనుభవించేసినాయి. ఇక ఇప్పుడు చేసిన కర్మఫలాలు అనుభవించాలి. అంటే ఆ కర్మ పరిపక్వం చెందే దాకా ఆగాలి. జీవుల యొక్క కర్మఫలితాలు పూర్తి కాగానే ప్రళయం సంభవిస్తుంది. మళ్ళీ చేసిన కర్మపరిపక్వం చెందే దాకా సృష్టి జరగదు. ప్రళయం జరిగినప్పుడు కర్మక్షయంకాని జీవులు తమ కర్మను తమతోనే మూటకట్టుకుని ఆపరమేశ్వరుని చేరతాయి. ఆ కర్మపరిపక్వం అయిన తరువాత, దాని ఫలితము అనుభవించటానికి మళ్ళీపుడతాయి. ఇదే సృష్టి.

ఇప్పుడు పరమేశ్వరుడు ఈ జీవులకర్మను కూడా క్షయం చేసి వాటికి ముక్తిని ప్రసాదించాలనే కోరికతోనే ఈ సృష్టిని చెయ్యాలనుకున్నాడు. అనుకున్నదే తడవుగా తనలోని కొంతభాగాన్ని బయటకు పంపాడు. అదే శక్తి మాయ, దానినుంచే ఈజగత్తంతా ఆవిర్భవించింది. అయితే పరమేశ్వరుని నుంచి కొంతభాగము బయటకు వచ్చింది కదా ? అప్పుడు అతని పూర్ణత్వానికి భంగం వాటిల్లదా ? అంటే – వాటిల్లదు.

**పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్ పూర్ణముదచ్యతే ।**
**పూర్ణస్య పూర్ణ మాదాయ పూర్ణమేవావ శిష్యతే ॥**

ఆ కనుపించనిది అనంతం. కనుపించే జగత్తు కూడా ఆనంతమే. అనంతమైన పరబ్రహ్మ నుండే అనంతమైన జగత్తు ఉద్భవించింది. అయినప్పటికీ అనంతమైన పరబ్రహ్మ అనంతంగానే ఉన్నది. అంటే బిందురూపుడైన పరబ్రహ్మ నుంచి కొంతభాగం బయటకు వచ్చినా, ఆ బిందువు యొక్క పూర్ణత్వానికి హాని జరగదు. సున్నకుసున్న కలిపినా, సున్న నుండి సున్న తీసివేసినా దాని విలువ మారదు. అందుకే పరమేశ్వరుడు పూర్ణత్వము గల 'పురుషుడు' అనబడుతున్నాడు.

## 15. సాక్షీ

చూచువాడు

**వ్యయ మానన్దయన్ తృప్యన్ సాక్షీ సాక్షాత్కరోతి సః**

భక్తులను ఆనందపరుస్తూ, తాను తృప్తి చెందుతూ, వారికి సాక్షాత్కరించేవాడు.

స్వరూపజ్ఞానముచేత సర్వాన్నీ వ్యవధానము లేకుండా చూస్తూ ఉండేవాడు.

జగత్తులో జరిగే ప్రతి విషయాన్నీ పరమేశ్వరుడు పంచభూతాలు, సూర్యుడు, చంద్రుడు, కాలము, యుముడు అనే చక్షువులతో చూస్తుంటాడు. అందుకే ఆయన అన్నింటికీ 'సాక్షి' గా ఉంటాడు. గజేంద్ర మోక్షంలో గజేంద్రుడు పరమేశ్వరుణ్ణి ప్రార్థిస్తూ

**ఒక పరిజగముల వెలినిడి**

**ఒకపరిలోపలికి గొనుచు । నుభయము గనుచున్**

**సకలార్థసాక్షి యగున**

**య్యకలంకుని నాత్మమయుని । నర్చింతుమదిన్**

సృష్టికి ప్రళయానికి కారణము ఆ పరమేశ్వరుడే. ప్రళయము అంటే ఈ జగత్తును తనలో కలిపేసుకోవటము. సృష్టి అంటే తనలో ఉన్న జగత్తును బయటకు పంపటము. ఈ రెండు పనులుచేస్తూ, ఆ రెండింటికీ సాక్షీభూతుడుగా ఉన్నపరమేశ్వరునికి నమస్కరిస్తున్నాను.

కాబట్టి పరమేశ్వరుడు సృష్టి, స్థితి, లయాలకు, కర్మాకర్మలకు పాపపుణ్యాలకు అన్నింటికీ సాక్షీభూతుడు, అతనికి ఇంకొక సాక్షిలేదు. అందుచేతనే 'సాక్షి' అనబడుతున్నాడు. ఇదే నామాన్ని, **లలితాసహస్రం**లో 'విశ్వసాక్షిణీ' అని వివరించటం జరిగింది.

## 16. క్షేత్రజ్ఞః

శరీరాన్ని ఇచ్చేవాడు.

**క్షేత్రస్తు పరమవ్యోమ ముక్తేభ్యో వేత్తి నిత్యశః ।**

**ధాతుం స్వానుభవం యశ్చ క్షేత్రజ్ఞ స్సతు కథ్యతే ॥**

క్షేత్రము అంటే–పరమపదము. అది భగవద్భోగాన్ని కొన్ని వందలరెట్లు వృద్ధిచేస్తుంది. ముక్తి పొందిన తన భక్తులకు పరమపదములో ఆ భోగము స్థిరముగా ఉంటుందని తెలిసినవాడు క్షేత్రజ్ఞుడు. అంటే ముక్తిపొందినవారు పరమపదమునందు శాశ్వతమైన ఆనందాన్ని అనుభవిస్తారని తెలిసినవాడు అని అర్థం చెప్పబడింది.

కాని క్షేత్రము అంటే శరీరము. క్షేత్రాన్ని గురించి తెలుసుకున్నవాడు క్షేత్రజ్ఞుడు. అంటే స్వస్వరూపజ్ఞానం పొందినవాడు, బ్రహ్మవేత్త. **బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి.** ఎవరైతే బ్రహ్మను గురించి తెలుసుకుంటాడో, వాడు కూడా పరబ్రహ్మ స్వరూపమే.

**భగవద్గీత**లో 13వ అధ్యాయం **క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగము**లోని మొదటి శ్లోకం. అందులో భగవానుడు

**ఇదం శరీరం కౌంతేయ క్షేత్రమిత్యభి ధీయతే ।**

**ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః ॥**

అర్జునా ! ఈ శరీరానికి 'క్షేత్రము' అనిపేరు. క్షేత్రము అంటే పంటభూమి. నాటిన విత్తనాలకు తగిన ఫలితాన్నిస్తుంది. అలాగే ఈ శరీరంతో చేసినకర్మలకు పాపపుణ్యాలనే ఫలితం వస్తుంది. మంచి ఫలితం రావాలి అంటే మంచి పనులు చెయ్యాలి. భూమియొక్క మంచి చెడులను గుర్తించి దానితో లాభసాటి పంటను వేసినట్లుగానే, దేహము ఒక మంచి క్షేత్రము అని నమ్మి మంచి కర్మలుచెయ్యాలి. ఈ రకంగా క్షేత్రాన్ని గురించి తెలుసుకున్నవాడు 'క్షేత్రజ్ఞుడు' అనబడతాడు.

అర్జునా ! ఈ శరీరము ఆత్మకన్న వేరైనది అని తెలుసుకున్నవాడే క్షేత్రజ్ఞుడు. కాబట్టి క్షేత్రంవేరు. క్షేత్రజ్ఞుడు వేరు. అర్జునా ! అన్ని క్షేత్రములలోనూ క్షేత్రజ్ఞుడిని నేనే.

పార్థా ! పంచభూతాలతో కూడినది ఈ దేహం. అందుకే దీన్ని పాంచభౌతికమైనది అంటారు. మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అనేవి దేహాన్ని ఆశ్రయించి ఉండే తత్త్వాలు. జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సు అనే పదకొండూ దేహానికి ఇంద్రియాలు. జ్ఞానేంద్రియాలు పంచతన్మాత్రల వల్ల ఏర్పడ్డాయి.

| | | | |
|---|---|---|---|
| శబ్దము | – | (ఆకాశము) | చెవి |
| స్పర్శ | – | (వాయువు) | చర్మము |
| రూపము | – | (తేజస్సు) | కన్ను |
| రసము | – | (జలము) | నాలుక |
| గంధము | – | (భూమి) | నాశిక |

ఇచ్ఛ, ద్వేషము, సుఖము, దుఃఖము, మనోవృత్తి, ధైర్యము ఇవన్నీ దేహము చేసే పనులు. వీటిని క్షేత్ర వికారాలంటారు. ఇచ్ఛా, ద్వేషము, సుఖము, దుఃఖము అనేవి ఆత్మధర్మాలు అయినప్పటికీ శరీరధర్మం వల్ల వచ్చాయి. కాబట్టి క్షేత్రవికారాలయినాయి. ఈరకంగా భూతసమూహమైనది ఈ క్షేత్రము ఇదే శరీరము.

ఆత్మ ఈ శరీరంలో ఉన్నంతవరకు శరీర సంబంధమైన సుఖదుఃఖాలు, గుణదోషాలు ఆత్మకు కూడా అంటినట్లుగా కనిపిస్తాయి. కాని నిజానికి ఆత్మకు ఏ దోషము అంటదు. అర్జునా ! ఈ విధంగా శరీరమనే క్షేత్రాన్ని గురించి తెలుసుకున్నవాడే క్షేత్రజ్ఞుడు.

ఇక్కడనే అంటే ఈ దేహము కాదు, ఆత్మ అని ముందే చెప్పాం. కాబట్టి ఆత్మని గురించి తెలుసుకున్నటువంటివాడు కూడా **బ్రహ్మవిద్ బ్రహ్మైవభవతి.** ఆత్మస్వరూపుడే అవుతాడు. అందుచేత 'క్షేత్రజ్ఞుడు' అంటే ఆ పరమాత్మయే తప్ప వేరుకాదు.

# 17. అక్షరః

తరగనివాడు, క్షరముకానివాడు.

**సదాను భూ యమానో౭పి నిస్సీమ గుణగౌరవాత్ ।**
**ముక్తైః క్వచిన్నక్షరతీ త్యక్షరః పరికీర్తితః ॥**

ముక్తి పొందినవారిచేత అనుభవింపబడుతున్నాడు. కాని ఆ విధంగా అనుభవింపబడటంచేత అతని గుణములు తరగవు. 16వ నామంలో చెప్పిన క్షేత్రజ్ఞుడు అక్షరుడు. క్షరము లేనివాడు. నాశనము లేనివాడు. శాశ్వతమైనవాడు.

**ఈశావాశ్యోపనిషత్తు**లో "అనిత్యము, అశాశ్వతము అయిన ఈ ప్రపంచంలో పరివర్తనా శీలమైనది ఏదైతే ఉన్నదో, అదంతా పరమేశ్వరుడిచేతనే ఆవరించబడి ఉన్నది. మన కళ్ళకు కనిపించేదంతా ఆత్మస్వరూపము, పరమేశ్వరమయము. ఈ ఐశ్వర్యము నిత్యముకాదు. భోగభాగ్యాలు శాశ్వతం కాదు. కాబట్టి అశాశ్వతమైన ప్రాపంచిక సుఖాల మీద కోరికను వదలిపెట్టు, ఇతరుల ధనాన్ని ఆశించకు. ఇతరుల సంపద మీద ఆధారపడకు. సృష్టిలోని వస్తువులన్నీ పరమాత్మస్వరూపమే. అయినప్పటికీ నామరూప క్రియాదులచేత వేరుగా కనిపిస్తాయి. ఈషణత్రయాన్ని (ధనేషణ, దారేషణ, పుత్రేషణ) చంపుకో. సంపదలకోసం ప్రాకులాడకు. శిరిసంపదలు శాశ్వతం కాదు. సర్వమూ పరమేశ్వరమయం కాబట్టి నిష్కామ్యకర్మ చెయ్యి. దొరికిన దానితో తృప్తి పొందు. అందులోనే శాశ్వతమైన ఆనందాన్ని అనుభవించు" అని చెప్పబడింది. ఈ లోకంలో శాశ్వతమైనది ఆనందము ఒక్కటే. అదే బ్రహ్మానందము. అదే పరబ్రహ్మ స్వరూపము.

**అధర్వశిరోపనిషత్తులో** దేవతలంతా శ్రీ మహారుద్రుని వద్దకు పోయి 'దేవా ! నీవెవరవు?' అని ప్రశ్నించారు. దానికి రుద్రుడు "నేను ఒక్కడనే. మొదట ఉన్నాను. ఇప్పుడు ఉన్నాను. ఇకమీదట భవిష్యత్తులో కూడా ఉంటాను. నా కన్న అధికుడు, నాకన్న వేరైనవాడు, భూతభవిష్యద్వర్తమానకాలంలో ఎవరూ లేరు" అంటాడు. అనగా త్రికాలముల యందు ఉండేవాడు, సత్యము, నిత్యము, శాశ్వతము అయినవాడు పరమేశ్వరుడు ఒక్కడే.

**బ్రహ్మోపనిషత్తులో** పూర్ణపురుషుడైన పరబ్రహ్మకు నాభి, హృదయము, కంఠము, శిరస్సు అనే నాలుగుస్థానాలున్నాయి. ఆ నాలుగుస్థానాలలోనే పరబ్రహ్మ నాలుగు పాదాలుగా ప్రకాశిస్తున్నది.

| | | | |
|---|---|---|---|
| జాగ్రదవస్థలో | – చతుర్ముఖబ్రహ్మగాను | సుషుప్తిలో | – రుద్రుడుగాను |
| స్వప్నావస్థలో | – విష్ణువుగాను | తురీయస్థితిలో | – పరమాత్మగాను |

ప్రకాశిస్తున్నది. సూర్యుడు, విష్ణువు, ఈశ్వరుడు ఆ పరమాత్మయే. ఆ ఆత్మ మనస్సు లేనిదిగ, శ్రవణేంద్రియములులేనిదిగ, కాలు చేతులు లేనిదిగ, జ్యోతిస్వరూపముగ తెలియబడుచున్నది. ఏ పరమాత్మయందు, లోకములు లోకములుగా లేవో, దేవతలు దేవతలుగా ఉండరో, వేదములు వేదముకావో, యజ్ఞములు యజ్ఞములు కావో, తల్లి తల్లికాదో, తండ్రి తండ్రికాడో, ఛండాలుడు ఛండాలుడుకాడో, సన్యాసి సన్యాసికాదో, తపస్వి తపస్వికాదో, అటువంటి పరబ్రహ్మ అఖండముగ, నిర్వాణ స్వరూపముగ ప్రకాశిస్తున్నాడు." అని చెప్పబడింది. ఇక్కడ అఖండము అంటే ఖండము కానిది, ఎడతెరిపిలేనిది, శాశ్వతమైనది అని అర్థం. ఈవిధంగా అక్షరస్వరూపుడు అనగా శాశ్వతమైనవాడు ఆ పరబ్రహ్మ తప్ప వేరెవరూ కాదు.

**మహానారాయణోపనిషత్తు**లోని రెండవ అధ్యాయంలో శిష్యుడు గురువుగారిని "గురువర్యా !" వైకుంఠానికి, నారాయణునికి నిత్యత్వము చెప్పబడింది. అతడే తురీయము అని కూడా అన్నారు. సాకారము అనిత్యమని, నిరాకారము నిత్యమని వేదాలు చెబుతున్నాయి. ఈ రెండూ అతడే ఎలా అవుతాడు ?" అని అడుగుతాడు. దానికి గురువుగారు వివరణ ఇస్తూ "సాకారము రెండు రకాలు.

1. సోపాదిక సాకారము. 2. నిరుపాదిక సాకారము

సోపాదిక సాకారము అవిద్యతో కూడినది. అది అనిత్యము. నిరుపాదిక సాకారము నిత్యసాకారము, ముక్తసాకారము అని రెండు రకాలు. నిత్యసాకారము ఆద్యంత శూన్యము. శాశ్వతమైనది ఉపాసనచే ముక్తిని పొందిన వారి సాకారము ముక్తసాకారము" అంటాడు.

**గమనిక :** అవకాశం వచ్చినప్పుడు దీని వివరణ పూర్తిగ ఇవ్వగలము. కాబట్టి వైకుంఠంలో ఉన్న పరబ్రహ్మ స్వరూపమైన శ్రీమన్నారాయణుడు శాశ్వతుడు. నాశనము లేనివాడు. అందుచేతనే 'అక్షరః' అనబడుతున్నాడు.

## 18. యోగః

ఉపాయమైనవాడు.

**సాక్షాన్మోక్షైక హేతుత్వాత్ యోగిత్యభిధీయతే ॥**

కర్మయోగాలవలెకాక, తానే స్వయంగా మోక్షాన్నిచ్చేటటువంటివాడు.

**యుజ్యతే ప్రాప్యతే అనేనేతి యోగః** దీనిచే మోక్షము పొందబడునుగాన యోగమనబడుతున్నది. మోక్షము అంటే 'బ్రహ్మానందము' అని చెప్పాం. బ్రహ్మసూత్రాలలో

తద్ధేతు వ్యపదేశాచ్చ అటువంటి ఆనందానికి హేతువు బ్రహ్మ, కాబట్టి ఆనందమయుడంటే ఆ పరమాత్మయేగాని వేరుకాదు.

**యోగచ్ఛిత్త వృత్తి నిరోధకః** యోగము మనసుయొక్క వికారాలనునిరోధిస్తుంది. **అమృతబిందూపనిషత్తు** యోగాన్ని గురించి ఈ విధంగా చెబుతోంది.

మనస్సు శుద్ధము, అశుద్ధము అని రెండు రకాలు.

| | | |
|---|---|---|
| కామసంకల్పములు గల మనస్సు | – | అశుద్ధము |
| కామసంకల్పములు లేని మనస్సు | – | శుద్ధము |

మానవుడియొక్క బంధమోక్షాలకు కారణము మనస్సు. కాబట్టి విషయవాంఛల యందు ఆసక్తి గల మనస్సు – ఐహికబంధనాలను కోరుతుంది. కాగా విషయవాంఛల యందు ఆసక్తిలేనివాడి మనస్సు – మోక్షాన్ని కోరుతుంది. మనసుకు గనక మోక్షం పొందాలని కోరిక కలిగితే, ఇక విషయవాంఛల జోలికిపోదు. ఈరకంగా విషయవాంఛలు గనక వదలివేసినట్లైతే మనస్సు ఆత్మరూపాన్ని పొందదగినది అగుతున్నది. అయితే హృదయమందు సంకల్పములు పూర్తిగా క్షయం అయ్యేవరకు మనసును నిరోధించాలి. ఇదే జ్ఞానము ఇదే ధ్యానము.

**వాయుపురాణము**లో ఈవిధంగా ఉంది.

"తపస్సుకు, యోగానికి మొదటిమెట్టు ప్రాణాయామము. ప్రాణాయామము అంటే ప్రాణములను బిగపట్టి నియమించుట అని అర్థము. ఇది మూడు విధాలుగా ఉన్నది.

1. మందము 2. మధ్యము 3. ఉత్తమము

1. ప్రాణాయామము పన్నెండు మాత్రల కాలము చెయ్యాలి. మాత్ర అనగా – చిటికెవేసినంత సమయము. ఇది మందము.

2. ఇరవై ఒక్క మాత్రలకాలము కుంభకములో ఉండేది. ఇది మధ్యమము.

3. ముప్పైఆరు మాత్రలకాలము కుంభకములోఉండేది ఉత్తమము.

ప్రాణాయామములో 1. పూరకము 2. కుంభము 3. రేచకము అని మూడు అవస్థలున్నాయి.

| | | |
|---|---|---|
| 1. గాలిని లోపలికి పీల్చటము | – | పూరకము |
| 2. పీల్చినగాలిని లోపల కొంతసేపు బిగపట్టి ఉంచటము | – | కుంభకము |
| 3. కుంభించిన గాలిని క్రమంగా బయటకు వదలటము | – | రేచకము |

యోగములో ఎనిమిది అంగాలున్నాయి. అవే **అష్టాంగములు.**

1. ఎడమముక్కుతో గాలిని పీల్చి కొంతసేపు ఆగి కుడిముక్కుతో వదలాలి. అలాగే కుడిముక్కుతో గాలిని పీల్చి ఎడమముక్కుతో వదలాలి.

ఈ ప్రాణాయామము వల్ల మన వశంలో ఉండని ప్రాణాన్ని మనం అదుపులోకి తీసుకురావచ్చును. యమము అంటే – సంయమము లేక అదుపు అని అర్థం. యమమే యామము అనబడుతుంది. ప్రాణాయామము అంటే – శరీరంలో ఉన్న ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమాన వాయువులను పూర్తిగా అదుపులో పెట్టటము. ఈరకంగా ప్రాణాయమంతో ప్రాణాలు, ఇంద్రియాలు కూడా మనవశంలోకి వస్తాయి.

వాయువును గనక కుంభకము చేసి లోపల నిలుపగలిగినట్లైతే శరీరంలోని కల్మషాలను, మలినాలను అది దహించి వేస్తుంది. ప్రాణాయామము చేసేవాడికి సర్వ దోషాలు, సర్వరోగాలు నశించిపోతాయి. సత్వగుణము అభివృద్ధి చెందుతుంది. తపస్సుకన్న, వ్రతములకన్న, ఉపవాసాలకన్న, యజ్ఞాలకన్న ఒక్క ప్రాణాయామమే అధికఫలమునిస్తుంది.

నెలకు ఒకసారి ఒక్క నీటిచుక్కను మాత్రమే ఆహారంగా తీసుకుంటూ నూరు సంవత్సరాలు తపస్సుచేస్తే ఎంత ఫలితము వస్తుందో, ఒక్క ప్రాణాయామంచేస్తే అంత ఫలితము వస్తుంది. అందుచేతనే యోగములో ఇది మొదటి దశ.

2. రెండవదశ ధారణ అంటే ధరించునది. శరీరములోపల ఏప్రదేశంలోనైనా సరే సాధకుడు తన చిత్తాన్ని నిల్పటాన్ని ధారణ అంటారు. ధారణసిద్ధి పొందినట్లైతే సంచితకర్మలు, ఆగామికర్మలు అన్నీ నశించిపోతాయి.

3. మూడవదశ ప్రత్యాహారము. దీనివల్ల ఇంద్రియాలను విషయభోగాల నుండి మరలించవచ్చును. అసలు ప్రత్యాహారము అంటే – మనసును విషయాలనుంచి మరల్చి, తన యొద్దకు తెచ్చుకొనుట.

4. నాల్గవది ధ్యానము. దీన్ని సాధనవల్ల అరిషడ్వర్గాలను జయించటం జరుగుతుంది. భూతదయ, తత్త్వచింతన కలిగి జీవాత్మ పరమాత్మలకు బేధములేదనే భావం వెలుగుతుంది.

5. ఐదవది యమము. మనసు చలించకుండా ఒకే విషయం మీద లగ్నం చెయ్యటము. ఏకాగ్రత సాధించటము.

6. ఆరవది నియమము. తనకు తానే కొన్ని నియమాలు ఏర్పరచుకుని వాటిని ఖచ్చితంగా పాటించటము.

7. ఏడవది ఆసనము. ఆధ్యాత్మిక చింతన చెయ్యాలంటే ముందు కుర్చోవాలి. అలా కూర్చుండటానికి సుఖమైన ఆసనం ఏర్పరచుకోవాలి.

8. ఎనిమిదివ దశ సమాధి. పైన చెప్పినవన్నీ తప్పకుండా ఆచరించి సాధన చేస్తే అనగా ధ్యానము, ధారణ, ధ్యేయము ఏకీకృతమైనట్లైతే చివరికి సిద్ధించేది నిశ్చలమైన సమాధి. సమాధి స్థితిలోకి వెళ్ళినవాడికి బయటికి విషయాలేవీ తెలియవు. కేవలము నిరాకారమైన పరబ్రహ్మలో లీనమై ఉండటమే సమాధి. ఈ రకంగా సాధన చేసిన వారికి పునర్జన్మ ఉండదు. కైవల్యము సిద్ధిస్తుంది.

ఈ ఎనిమిది అంగాలు కల్గినదే యోగము. అటువంటి యోగముచేత పొందదగిన వాడు కాబట్టి పరమేశ్వరుడు 'యోగః' అనబడుతున్నాడు.

## 19. యోగ విదాం నేతా

యోగవిత్తులను నిర్వహించేవాడు.

**ఉపాయభక్తి విషయే తే చ యోగవిద స్మృతాః ।**
**తేషాం చ ఫలపర్యన్త నేతా నిర్వాహకశ్చ యః ॥**

కర్మయోగము, భక్తియోగములను అనుసరించేవారికి, అవి ఫలించే వరకు విచ్ఛిన్నము కాకుండా నిర్వహించేవాడు. అందుకే గీతలో **యోగక్షేమం వహామ్యహమ్** అన్నాడు భగవానుడు.

యోగవిదుడు అంటే యోగము తెలిసినవాడు, యోగము పొందినవాడు అని అర్థం. అటువంటి యోగవిదులకు నేత ఆ పరమేశ్వరుడు. ఈ యోగాన్ని గురించి ప్రత్యేకంగా అనేకచోట్ల చెప్పబడింది. ఉపనిషత్తులలో కూడా యోగోపనిషత్తులు 20 ఉన్నాయి.

**క్షురికోపనిషత్తు**లో "యోగధారణ స్మరించువారికి పునర్జన్మ లేదు. సాధకుడు ఆసనం మీద కూర్చుని, తాబేలు తన అవయవాలను లోపలికి, బయటకు తెచ్చేటట్లుగా పన్నెండు సూత్రాలు గల యోగాన్ని సాధన చెయ్యాలి. అన్ని ద్వారాలను నిరోధించి, గాలిని పీల్చి 48 మాత్రల కాలము కుంభకము చెయ్యాలి.

ఇడానాడితో గాలిని పీల్చి కుంభకము చేసి పింగళనాడి ద్వారా వదలాలి. అలాగే పింగళానాడితోగాలి పీల్చి కుంభకము చేసి ఇడా నాడితో వదలాలి. ఈ రకంగా పాదములు, ఊరువులు, బాహువులు, జానువులు ఒకటేమిటి ? అన్ని అవయవములందు కుంభకము చేసి (ధారణ చేసి) ఆ అవయవములనుండి రేచకము చేస్తున్నట్లుగా భావించాలి. అప్పుడు

అవయవాలన్నీ ప్రత్యాహారము పొందుతాయి. అంటే విషయవాంఛలను వదలి, సాధకుని అధీనంలోకి వస్తాయి. ఇడ పింగళనాడుల మధ్యన సుషుమ్నానాడి ఉన్నది. అదే శ్రేష్ఠమైనది. సాధకుడు పూరకము చేసి మూలాధారాది షట్చక్రాల యందు కుంభకము చేస్తూ, ఒకటి తరువాత ఒకటిగా సహస్రారం దాకా చేరాలి. ఆ తరువాత పరబ్రహ్మ స్వరూపాన్ని నేనే అని భావించాలి. ఈరకంగా యోగసాధన చేసి తానే పరబ్రహ్మ అని తెలుసుకున్నవాడు మోక్షం పొందుతాడు. అతడి జీవాత్మయే పరమాత్మ అని తెలుసుకుంటాడు. అతడికి పునర్జన్మ ఉండదు.

**తేజోబిందూపనిషత్తు**లో "యమము, నియమము, త్యాగము, మౌనము, దేశము, కాలము, ఆసనము, మూలసంబంధము, దేహసామ్యము, దృక్స్థితి, ప్రాణసంయమనము, ప్రత్యాహారము, ధారణ, ఆత్మధ్యానము, సమాధి అనేవి యోగానికి అంగములు. సర్వము పరమేశ్వర మయము. ఈ యోగాంగాల ద్వారానే సాధకుడు పరమేశ్వరుని చేరాలి" అని చెప్పబడింది.

**యోగతత్త్వోపనిషత్తు**లో "బ్రహ్మదేవుడు శ్రీమహావిష్ణువును ఆరాధించి అష్టాంగ సహిత యోగతత్త్వమును వివరించమని ప్రార్థించాడు. అప్పుడు శ్రీ మహావిష్ణువు బ్రహ్మనుచూసి "బ్రహ్మదేవా ! తృష్ణ, లజ్జ, భయము, దుఃఖము, విషాదము, హర్షము మొదలయిన దోషముల నుండి విముక్తుడైన జీవుడు పరమాత్మగా తలచబడతాడు. కాబట్టి దోషముల వినాశనం కోసం నీకు ఉపాయము చెబుతున్నాను. యోగము లేకుండా జ్ఞానము మోక్ష మివ్వలేదు. అలాగే జ్ఞానము లేని యోగము మోక్షమివ్వలేదు. కాబట్టి యోగము జ్ఞానము రెండింటినీ అభ్యసించి సాధన చెయ్యాలి. అజ్ఞానము వల్లనే జీవికి సంసారబంధనాలు ఏర్పడుతున్నాయి. జ్ఞానంవల్ల జీవుడు ఈ బంధనాల నుంచి విముక్తుడవుతున్నాడు. కాబట్టి ముందుగా జ్ఞానసముపార్జన చెయ్యాలి. ఇక యోగాన్ని గురించి చెబుతాను వినవలసినది.

బ్రహ్మదేవా ! యోగములు అనేక రీతులుగా ఉన్నాయి. వాటిలో మంత్రయోగము, లయయోగము, హఠయోగము, రాజయోగము, ముఖ్యమైనవి. అన్ని యోగములకు ఆరంభము, ఘటము, పరిచయము, నిష్పత్తి అనే నాలుగు అవస్థలున్నాయి. ఇప్పుడు ఈ యోగములయొక్క లక్షణాలను చెబుతాను.

1. మంత్రయోగములో బీజములతో కూడిన మంత్రాన్ని పన్నెండు సంవత్సరాలు జపించేవాడు అణిమాది అష్టసిద్ధులతో కూడిన జ్ఞానాన్ని క్రమంగా పొందుతాడు. అయితే అల్పబుద్ధులు, అధములు మాత్రమే ఈ సాధన చేస్తారు.

2. లయయోగమనేది చిత్తలయము. అని కోటిసార్లు చెప్పబడింది. లయయోగము నడుస్తున్నప్పుడు సాధకుడు నిలబడి ఉన్నప్పుడుకాని, కూర్చున్నప్పుడు కాని, పడుకున్నప్పుడు కాని, ఆహారం తినేటప్పుడు కాని నిష్కళంకమయిన పరమాత్మను ధ్యానం చెయ్యాలి.

3. హఠయోగంలో యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, భ్రూమధ్యమున ధ్యానము, సమాధి. అనే ఎనిమిది అంగాలుంటాయి. యమమునందు మితాహారం తీసుకోవటము చాలా ముఖ్యము.

నియమములయందు అహింస ముఖ్యమైనది. ఆసనములలో సిద్ధాసనము, పద్మాసనము, సింహాసనము, భద్రాసనము అనేవి ముఖ్యమైనవి.

**రాజయోగము :**

అష్టాంగమార్గం ద్వారా స్వస్వరూప జ్ఞానం సంపాదించటమే రాజయోగము.

షట్చక్రభేదన చేసి ఆజ్ఞాచక్రం చేరతాడు సాధకుడు. ఆజ్ఞాచక్రం నుంచి – సహస్రారం దాకా తొమ్మిది సూక్ష్మచక్రాలున్నాయి. అవి :

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | బిందువు | 4. | నాదము | 7. | వ్యాపిక |
| 2. | అర్ధచంద్రము | 5. | నాదాంతము | 8. | సుమన |
| 3. | రోదిని | 6. | శక్తి | 9. | ఉన్మన |

సాధకుడు సూక్ష్మచక్రాలలో సంచారము చేసేటప్పుడు కొన్ని దృశ్యాలు కనిపిస్తాయి. అలాగే కొన్ని ధ్వనులు కూడా వినిపిస్తాయి. వాటి వివరాలు

| | **కనుపించే మండలం పేరు** | | **వినిపించే ధ్వని** |
|---|---|---|---|
| 1. | వియన్మండలము | – | అంతర్గతప్రాణఘోష |
| 2. | తమోమండలము | – | చిణినాదము |
| 3. | మేఘమండలము | – | చిణిచిణినాదము |
| 4. | విద్యున్మండలము | – | ఘంటానాదము |
| 5. | తారామండలము | – | శంఖనాదము |
| 6. | జ్యోతిర్మయమండలము | – | తంత్రీనాదము |
| 7. | సూర్యమండలము | – | వేణునాదము |
| 8. | చంద్రమండలము | – | భేరీనాదము |
| 9. | అగ్నిమండలము | – | మృదంగనాదము |
| 10. | హిరణ్మయమండలము | – | మేఘనాదము |

సాధకుడు షణ్ముఖీముద్రతో చెవులను బంధించి జాగ్రత్తగా విన్నట్లైతే ఓంకారము మొదటగా చిణి అని వినిపిస్తుంది. ఆ తరువాత ఆ శబ్దము హెచ్చి చిణిచిణి అని ఘోషిస్తుంది. తరువాత ఘంటానాదము వినిపిస్తుంది. అది క్రమముగా విజృంభించి శంఖనాదముగా మారుతుంది. అది అతిమనోహరంగా మారి వీణానాదమవుతుంది. వీణానాదము క్రమంగా వేణునాదమవుతుంది. ఆ తరువాత అరిషడ్వర్గాలను జయించిన చిహ్నంగా భేరీనాదము మ్రోగుతుంది. ఆ తరువాత విజయోత్సవ చిహ్నంగా రమణీయమైన మృదంగనాదము వినిపిస్తుంది. తరువాత వర్షపాతము పడుతున్నట్లుగా మేఘనాదము వినిపిస్తుంది. అదే ఆనందస్థితి. ఈ స్థితిలో సహస్రారము నుంచి అమృతము జాలువారి సాధకుని శరీరములోని 72వేల నాడీమండలాన్ని తడుపుతుంది.

క్రమంగా ఈ నాదాలన్నీ పరానాదంతో లీనమైపోతాయి. ఈ స్థితిలో సాధకుని మనస్సు, ప్రాణములు నాదబిందుకళలతో లీనమైపోతాయి. జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనసు ఏవీ పని చెయ్యవు. బాహ్య ప్రపంచముతో అతడికి ఏ రకమైన సంబంధము ఉండదు. మనసుకూడా పని చెయ్యని స్థితి కాబట్టే దీనిని 'ఉన్మన' అంటారు. దీనినే **'అమనస్క యోగము'** అనికూడా అంటారు.

ఈ స్థితికి చేరిన సాధకుడు స్వయంగా తానే పరబ్రహ్మ అవుతాడు. అతడికి పునర్జన్మ ఉండదు. రాజయోగము, సూక్ష్మచక్రాలవివరణ **యోగినీ హృదయము**లో ఇవ్వబడింది.

బ్రహ్మదేవా ! యోగసిద్ధి ప్రారంభదశలో తనను తాను పొగడుకొనుట, దుష్టులతో సంభాషణ, బంగారము తయారుచేయటము, స్త్రీ వశ్యము, లాంటి లక్షణాలు వస్తాయి. అవి ప్రమాదకరమైనవి. వాటిని విసర్జించాలి.

సాధకుడు చిన్నగా, చూడటానికి అందంగా ఉండే ఒక మఠం నిర్మించి అందులో ఎత్తైన ఒక అరుగులాంటి ఆసనంమీద దర్భాసనము, దానిపై జింకచర్మము, దానిమీద వస్త్రము వేసి అప్పుడు ఆసనంమీద పద్మాసనంలో కూర్చోవాలి. ఇప్పుడు ఇడానాడితో పూరకము చేసి కుంభించిన గాలి పింగళనాడితోను, పింగళనాడితో పూరించి కుంభకము చేసినగాలి ఇడానాడితోను రేచకము చెయ్యాలి. ఈ రకంగా ధ్యానం చేసేవాడికి బరువు తగ్గిపోతుంది. ఆకలి బాగా వేస్తుంది. శరీరము సన్నబడుతుంది. సాధకులు ఉప్పు, ఆవాలు, చింతపండు, వేడిచేసే ఇతర పదార్థాలు తినరాదు. స్త్రీ సంగమము కూడదు. సాధన చేసేటప్పుడు పాలు, నెయ్యిలతో కలిపిన భోజనము ఉత్తమము. గోధుమలు, పెసలు, వరి అన్నము తిన్నట్లైతే యోగసిద్ధి కలుగుతుంది. రేచక, పూరక, కుంభకములు సిద్ధించిన వారికి కానిపనులు ఏవీ ఉండవు.

సాధనగనక బాగా చేసినట్లైతే ముందు కప్పలాగా దూకగలుగుతాడు. ఇంకా బాగా సాధన చేస్తే భూమిపైనుండి ఎగిరే శక్తి వస్తుంది. మానవాతీతమైన పనులు చేసే సమర్థత కలుగుతుంది. ఇటువంటి యోగికి మలమూత్రములు, నిద్ర తక్కువగా ఉంటాయి. చెవిలో గులిని, కంటిలో పుసి, చొల్లు, చెమట, నోటిదుర్వాసన వంటివి ఉండవు. అతడు అతి బలవంతుడౌతాడు. పులి, సింహము, శరభమువంటి జంతువులను ఈ యోగి చేత్తో కొట్టినట్లైతే, అవి ఆ క్షణమే మరణిస్తాయి.

ఇతడు మన్మథుని లాంటి సౌందర్యవంతుడవుతాడు. స్త్రీలను మోహింపచేస్తాడు. ఇతడు స్త్రీ సంభోగము చేస్తే శుక్లనష్టము జరుగుతుంది. కాబట్టి దాన్ని పరిత్యజించాలి.

ఆ తరువాత గతంలో చేసిన పాపాలు పోవటం కోసము ప్రణవాన్ని జపించాలి. ఈ రకంగా ఓంకారోపాసన గనక చేసినట్లైతే జీవాత్మ, పరమాత్మలు రెండూ ఒకటే అని తెలుసుకోగలుగుతాడు. కంటికి కనిపించేవి, చెవికి వినిపించేవి ఈ జగత్తులోని సర్వమూ పరబ్రహ్మ స్వరూపమని భావించగలుగుతాడు. ఈ స్థితినే 'ఈశ్వర ప్రణిధానము' అంటారు.

ధ్యానంలో కూర్చున్న సాధకుడు గాలిని కుంభించి, సుషుమ్నద్వారా సహస్రారం చేరినట్లైతే, తానే పరబ్రహ్మ అనే అనుభూతి పొందుతాడు. అతడికి భవబంధాలు, సుఖదుఃఖాలు, పాపపుణ్యాలు ఉండవు. ఇష్టార్థసిద్ధి కలుగుతుంది. పునర్జన్మ ఉండదు. అదే సాయుజ్యము" అని చెప్పబడింది.

**హంసోపనిషత్తు**లో గౌతముడు సనత్కుమారుని వద్దకు పోయి బ్రహ్మవిద్యా ప్రబోధము ఏ ఉపాయమువల్ల తేలికగా జరుగుతుందో వివరించమంటాడు. దానికి సనత్కుమారుడు "మహర్షి ! యోగులు కాని వారికి చెప్పకూడని రహస్యమిది నీకు చెబుతున్నాను.

ఎడమకాలి మడమతో గుదస్థానాన్ని మూసి, గాలినీపీల్చి, కుంభించి ఆధారచక్రంలో నిద్రాణమై ఉన్న కుండలిని మేల్కొలిపి, స్వాధిష్ఠానము చేరి బ్రహ్మగ్రంధిని బేధించి, తరువాత మణిపూర అనాహతములు దాటి విష్ణుగ్రంధిని బేధించి, విశుద్ధి, ఆజ్ఞా చక్రాలు దాటి రుద్రగ్రంధిని చేధించి సహస్రారము చేరిన యోగి పరబ్రహ్మ స్వరూపుడవుతాడు. అతడే పరమహంస అని చెప్పబడింది.

యామళ గ్రంథాలలో కూడా ఈ విషయం చెప్పబడింది **వామకేశ్వర తంత్రము**లో

**భుజంగాకార రూపేణ మూలాధారం వమాశ్రితా ।**

**శక్తిః కుండలినీ నామ బిసతంతు విభాఉఉ శుభా ॥**

**మూలకందం ఫణాగ్రేణ దష్ట్వా కమలకందవత్ ।**

**ముఖేవ పుచ్ఛం సంగృహ్య బ్రహ్మరంధ్రం సమాశ్రితా ॥**

**వజ్రాసన గత స్వస్థో గుద మాకుంచ్యసాధకః ।**

**వాయుమూర్ధ్వగతిం కుర్వన్ కుంభకావిష్టమానసః ॥**

**వాయ్వాఘాత వశా దగ్నిః స్వాధిష్ఠానగతో జ్వలన్ ।**

**జ్వలనాఘాత పవనాఘాతై రున్నిద్రితోऽహిరాట్ ॥**

**రుద్రగ్రంథిం తతో భిత్త్వా విష్ణుగ్రంథిం భినత్త్యతః ।**

**బ్రహ్మగ్రంథించ భిత్త్వైవ కమలాని భిన త్తి షట్ ॥**

**సహస్రకమలే శక్తిః శివేన సహమోదతే ।**

**పాచావస్థా పరా జ్ఞేయా సై వనిర్వృతి కారణమ్ ॥**

1. భుజంగాకారము ధరించి ఆ భగవతి మూలాధారము నాశ్రయించినదై కుండలని శక్తిగా పిలవబడుతూ, తామరతూడులోని దారమువలె సన్నగా, మెరుపు తీగవలె ప్రకాశిస్తున్నది.

2. ఆ శక్తి ఆధార కమలమూలకందమును నోటితో తామర దుద్దువలె కరచి పట్టుకుని బ్రహ్మరంధ్రము నాశ్రయించి ఉన్నది.

3. సాధకుడు వజ్రాసనంలో కూర్చుని, మడమను గుదస్థానమును సంధించి శ్వాసనుపైకి వదులుతూ కుంభకము కూర్చవలెను. అనగా వాయువును లోన నిలపవలెను.

4. ఆ వాయువు తాకిడకి స్వాధిష్టానమున ఉన్న అగ్ని ప్రజ్వరిల్లి కుండలినీ శక్తి మేల్కొంటుంది.

5. 6. అంత ఆశక్తి బ్రహ్మగ్రంధి, విష్ణుగ్రంధి, రుద్రగ్రంధులు ఛేదించుకుని సహస్రారము చేరి సదాశివునితో సుఖిస్తూ ఉంటుంది. ఆ స్థితిలో ఉన్న ఆమెయే పరాశక్తి నిత్య సుఖకారిణి. **'తంత్రసారము'**లో కూడా ఈ విషయం చెప్పబడింది.

**కుండల్యేవ భవేఛ్ఛక్తి స్తాంతు సంచాలయే ద్బుధః ।**

**స్వస్థానా దాభ్రువోర్మధ్యం శక్తిచాలన ముచ్యతే ॥**

**మూలాధారాది షట్చక్రం శక్తిస్థాన ముదీరితం ।**

**కంఠా దుపరిమూర్ధాంతం శాంభవస్థాన ముచ్యతే ॥**

**మూలాధారేధ్వనిం శ్రుత్వా ప్రబుద్ధా శక్తికుండలీ ।**
**జ్వల త్పావకసంకాశా సూక్ష్మతేజ స్స్వరూపిణీ ॥**

**శక్తిః కుండలినీ నామ బిసతంతు నిభా శుభా ।**
**సాచ విద్యుల్లతాకారా బ్రహ్మద్వారం మనోమయమ్ ॥**

**ముఖేనాచ్ఛాద్య తద్ద్వారం ప్రసుప్తా పరమేశ్వరీ ।**
**సార్ధత్రివలయాకారా గ్రంథిత్రయ విభేదినీ ॥**

**పృథ్వ్యాప్య చక్రద్వితయం రుద్రగ్రంథి పదోదితం ।**
**వహ్ని సూర్యమయం చక్రద్వయం తేజోమయంమహత్ ॥**

**విష్ణుగ్రంథి పదేనోక్తం తైజసం సర్వసిద్ధిదం ।**
**వాయ్వాకాశ ద్వయీరూపం చక్రద్వితయ ముత్తమమ్ ॥**

**బ్రహ్మగ్రంథిపదే నోక్తం మంగళాయతనంమహత్ ।**
**రుద్రగ్రంథిం తతోభిత్వా విష్ణుగ్రంథి భినత్త్యతః ॥**

**బ్రహ్మగ్రంథించ భిత్త్వైవ కమలాని భినత్తిషట్ ।**
**సహస్రకమలేశక్తిః శివేన సహమోదతే ॥**

ఇదే విషయం **లలితా సహస్రం**లో కూడా చెప్పబడింది.

**మూలాధారైకనిలయా బ్రహ్మగ్రంథివిభేదినీ ।**
**మణిపూరాంత రుదితా విష్ణుగ్రంథివిభేదినీ ॥**

**ఆజ్ఞాచక్రాంతరాళస్థా రుద్రగ్రంథివిభేదినీ ।**
**సహస్రారాంబుజారూఢా సుధాసారాభివర్షిణీ ॥**

ఆధారచక్రము అనే నాలుగు దళములు కల చక్రంలో కుండలినీ శక్తి నిద్రిస్తూ ఉంటుంది. ఆ శక్తిని మేల్కొల్పినట్లైతే, అది ఊర్ధ్వముఖంగా బయలుదేరి బ్రహ్మగ్రంథిని ఛేదిస్తుంది. అంటే మాయను తొలగించి స్వస్వరూపాజ్ఞానం కలిగిస్తుంది. సృష్ట్యాది సంబంధాలను తొలగించి పునర్జన్మ రహితమైన ముక్తిని కలిగిస్తుంది. ఆ తరువాత జీవన భారమైన విష్ణుగ్రంథిని ఛేదించి సాధకుడుకి అంతా మిథ్య అను జ్ఞానము కలిగిస్తుంది. తరువాత రుద్రగ్రంథిని ఛేదిస్తుంది. అంటే సృష్ట్యాదులు జీవదశ, లయాదులు అంతా మిథ్య అనే విషయాన్ని తెలియజేసి చిదానందాన్ని కలిగిస్తుంది. తరువాత ఆశక్తి సహస్రారం

చేరుతుంది. అది దేవి ఉండే ప్రదేశము. అక్కడ దేవి విద్యుల్లతవలె ప్రకాశిస్తూ ఉంటుంది. సహస్రారంలో దేవిని కొలిచిన వారికి అమృతత్వం లభిస్తుంది. సాధకుడికి నేను అనే భ్రాంతి తొలగి జీవాత్మ పరమాత్మ ఒకటే అని తెలుసుకుంటాడు. ఈ రకంగా యోగప్రక్రియలను తెలిసినవారు యోగవిధులు. అట్టి యోగవిధులకు నేత కాబట్టి పరమేశ్వరుడయిన శ్రీమన్నారాయణుడు "యోగవిదాంనేత" అనబడుతున్నాడు.

యోగము మీద మరిన్ని వివరాలకు 849, 850 నామాలను చూడండి.

## 20. ప్రధాన పురుషేశ్వరః

ప్రకృతికి, జీవులకు నియామకుడు

**బన్ధహేతోః ప్రధానస్య బధ్యమాన నృణాఞ్చ యః ।**
**నియామః స్సర్వదా సః ప్రధాన పురుషేశ్వరః ॥**

సంసారబంధనానికి కారణమైన ప్రకృతికి, దానివల్ల బంధించబడే జీవులకు ఎల్లకాలము లందు నియామకుడుగా ఉండేవాడు.

**ప్రధానస్య పురుషాణాం చ ఈశ్వరః** ప్రకృతికి, జీవులకు నియామకుడు.

**శ్వేతాశ్వరోపనిషత్తు**లో 'ఆ పరమాత్మయే విశ్వ నిర్మాత, అతడే సర్వజ్ఞుడు, జ్ఞానస్వరూపుడు, కాలమునకు కర్త, సర్వగుణములు కలవాడు, సర్వవిదుడు, ఈతడే ప్రధానమునకు, క్షేత్రజ్ఞునకు పతి, సత్త్వరజస్తమోగుణములకు ప్రభువు, సంసారబంధనాలకు కారణభూతుడు అని చెప్పబడింది

ప్రధానము అంటే ప్రకృతి. మాయ అని అర్ధం. పురుషుడు అనగా జీవుడు. వీరిద్దరికీ ఈశ్వరుడు కాబట్టి శ్రీమన్నారాయణుడు 'ప్రధాన పురుషేశ్వరుడు' అనబడుతున్నాడు.

ఈ రకంగా శ్రీమన్నారాయణుడే సకలభూతాత్మ అంటూ వివరించాడు రత్నాకరుడు.

## 11. సౌందర్యము

"గురువుగారూ ! సాకారము పొందిన పరమేశ్వరుడు సౌందర్యరూపుడు. మూర్తీభవించిన సౌందర్యము గలవాడు అని చెబుతారు కదా ! ఆ విష్ణుమూర్తి యొక్క అందాన్ని వర్ణించండి." అన్నాడు నారాయణభట్టు వివరించటం ప్రారంభించాడు రత్నాకరుడు.

జగత్తులో ఉన్నవన్నీ పరమేశ్వరునిలో ఉన్నవే. పరమేశ్వరుడంటేనే చరాచర జగత్తు కదా ! అందుకని అతనితో లేనిది ఈ జగత్తులోనే ఉండదు. జగత్తులో అందమైన ప్రతి వస్తువు, విలువైన ప్రతివస్తువు ఆ పరమేశ్వరునిదే. అతని కాంతులవల్లనే సూర్యచంద్రులు ప్రకాశిస్తున్నారు. ఆయన ధరించటంవల్లనే పూవులకు సువాసనలు వస్తున్నాయి. ఆభరణాలకు కాంతి, ప్రాముఖ్యత వస్తున్నది. అందుచేతనే పరమేశ్వరుడు మూర్తీభవించిన సౌందర్యరాసి. దివ్యమంగళ విగ్రహము అని చెప్పబడుతోంది.

అతడు సుందరాకారుడు. సాముద్రిక శాస్త్రములో చెప్పిన రీతిగా శరీరభాగాలు గలవాడు. మహాసుందరాంగుడు. ప్రశస్తమైన నల్లని కేశములు గలవాడు. పురుషోత్తముడు. ఈ జగత్తంతా వ్యాపించి ఉన్నాడు. ప్రాణులయొక్క దుఃఖాలను నశింపచేస్తాడు. మంగళప్రదుడు. తన భక్తులకు సుఖాలనిస్తాడు. స్థిరమైనవాడు. అతడు మహా అందగాడు కాబట్టి జగత్తులోని జీవులన్నీ అతన్ని కనులారా ఒకసారయినా చూడాలనుకుంటాయి. అంతులేనటువంటి నిధులుగలవాడు. నిధిలా ఉండి కూడా రాముడు కృష్ణుడు మొదలైన అవతారాలెత్తి, తనను కోరిన వారిని తృప్తిపరచేవాడు. రకరకాల అవతారాలెత్తి సజ్జనులను రక్షిస్తాడు. భక్తసులభుడు. తమయొక్క జన్మరహస్యం తెలిసిన వారికి జన్మరాహిత్యం కలుగచేసేవాడు. మానవులకే కాక దేవతలకుకూడా ఇహపరసుఖాలనివ్వగల సమర్థుడు ఉపాధితో పని లేకుండానే సిద్ధించిన ఐశ్వర్యముగలవాడు. అతడు స్వయంభువు. తనంత తానుగా, స్వేచ్ఛగా అవతరిస్తాడు. తన భక్తులకు సుఖాన్ని ఇచ్చేవాడు.

## 21. నారసింహవపుః

నృసింహరూపుడు

**నరవత్సింహవద్రూపం యోభిభర్త్యభయ ప్రదమ్ ।**

**యథా కామన్తు భక్తానాం నారసింహవపు శ్చ వః ॥**

తనభక్తులయొక్క భయాన్ని పోగొట్టటానికి, వారు కోరిన మరుక్షణమే, వారియొక్క కోరిక మేరకు నరుడు, సింహము, రెండూ కలసిన రూపము ధరించినవాడు.

**నారసింహస్య వపుః యస్యసః నారసింహవపుః**

తనభక్తుడైన ప్రహ్లాదుని యొక్క భయమును తీర్చుటకై, అతడు కోరిన వెంటనే దివ్యమైనటువంటి నరసింహరూపము ధరించినవాడు.

నరునియొక్క, సింహముయొక్క అవయవములు గల శరీరము గలవాడు.

భక్తులు మనోవాక్కాయ కర్మలతో "అన్యదాశరణం నాస్తి త్వమేవ శరణం మమ" "ఓదేవదేవా ! నన్ను రక్షించటానికి నీవు తప్ప వేరేవరూలేరు. కాబట్టి నన్ను కాపాడవలసినది" అని ప్రార్థించినట్లైతే, వారి కోరికను మన్నించి, ఆ సమయములో ఏ రూపము అవసరమో, ఆ రూపము ధరించి, వారిని కాపాడతాడు. అయితే ఇంతకు ముందు చెప్పినట్లుగా అహంకార, మమకారాలన్నీ వదలి సర్వమూ ఆ పరమేశ్వరునకు అర్పించాలి. ఈ జగత్తంతా పరమేశ్వరమయము అని భావించాలి. అణువణువు నందూ ఆ పరమేశ్వరుని దర్శించగలగాలి. అటువంటి తాదాత్మ్యస్థితి చేరిన భక్తులను రక్షించటానికి ఏ రూపాన్నయినా ధరిస్తాడు ఆ పరమేశ్వరుడు.

హిరణ్యకశ్యపుని వలన అనేక బాధలు అనుభవించాడు ప్రహ్లాదుడు. హిరణ్యకశ్యపుని అహం మితిమీరిపోయింది. 'ఎక్కడ ఉన్నాడురా హరి ?' అని ప్రహ్లాదుని అడిగాడు.

"హరి సర్వాంతర్యామి. ఒకచోట ఉన్నాడు. ఇంకొకచోట లేడు అని లేదు. ప్రతిచోటా, అణువణువునా ఉన్నాడు." సమాధానం చెప్పాడు ప్రహ్లాదుడు.

"అయితే ఈ స్తంభమునందు చూపగలవా ? అంటూ చేతిలోని గదతో స్తంభాన్ని పగులకొట్టాడు. హిరణ్యకశ్యపుడికి శాపవిమోచనం కావాలి. అందుకని, అతడు కోరినట్లుగానే అటు మనిషి కాకుండా, ఇటు జంతువు. కాకుండా, సగము మనిషి, సగము సింహము ఆకారము ధరించి నరసింహుడుగా ప్రత్యక్షమై, హిరణ్యకశ్యపునికి శాపవిమోచనము కలిగించాడు. నృసింహావతారము గురించి 200 నుంచి 210 వరకు నామాలలో వివరించబడింది. ఈ రకంగా భక్తుల కోరికలు తీర్చేవాడు కాబట్టి విష్ణుమూర్తి 'నారసింహ వపుః' అనబడ్డాడు.

## 22. శ్రీమాన్

సుందరాకారుడు 178, 220, 613 కూడా ఇదే నామము.

**విరుద్ధాకారవత్త్వేఽపి శ్రీమాన్ సర్వమనోహరః** పరస్పరము విరుద్ధమైన ఆకారములు ధరించి ఉన్ననూ లోకములోని జనులందరినీ ఆకర్షించు శరీరము కలవాడు.

శ్రీమన్నారాయణుడు తన భక్తుల కోరికలు తీర్చటానికి, ఈ లోకాలను రక్షించటానికి వివిధ రకాలయిన అవతారాలు ఎత్తాడు. వాటిలో కొన్ని జలచరములు. కొన్ని భూచరములు మరికొన్ని ఉభయచరములు. అలాగే కొన్ని పశురూపము. కొన్ని మానవరూపము నృసింహావతారము అటు మనిషీ కాదు ఇటు మృగమూకాదు. ఈ రకంగా విరుద్ధమైన అవతారాలు ఎత్తినప్పటికీ జనులందరి మనసులనూ ఆకర్షించు శరీరము కలవాడు కాబట్టి 'శ్రీమాన్' అనబడుతున్నాడు. అటు మనిషి, ఇటు మృగము కాని నృసింహావతారము నందు జనులెవ్వరూ ఆ ఆకారము చూసి ఏవగించుకోలేదు. పైపెచ్చు వేనోళ్ళకొనియాడారు. కీర్తించారు. వివిధ రకాలుగా స్తుతించారు.

**యస్య వక్షసి నిత్యం వసతిశ్రీః స శ్రీమాన్** ఎవని వక్షస్థలమునందు ఎల్లప్పుడూ శ్రీ అనగా లక్ష్మీదేవి నివసిస్తుందో అట్టివాడు 'శ్రీమాన్' అనబడతాడు.

పూర్వకాలంలో అమృతం కోసం దేవదానవులు క్షీరసాగర మథనం చేశారు. అప్పుడు ఆ సముద్ర గర్భమునుంచి అనేక వస్తువులు, ప్రాణులు ఉద్భవించినాయి. ముందుగా

| | | |
|---|---|---|
| కాలకూటము ఉద్భవించింది | – | దాన్ని శివుడు మింగేశాడు |
| చంద్రరేఖ వచ్చింది | – | శివుడు శిరసున ధరించాడు |
| కౌస్తుభము వచ్చింది | – | విష్ణువు తీసుకున్నాడు |
| ఉచ్చైశ్రవము వచ్చింది | – | ఇంద్రుడు తీసుకుపోయాడు |

ఆ తరువాత లక్ష్మీదేవి ఉద్భవించింది. ఆమె లోకోత్తర సౌందర్యవతి. క్షీరాబ్ది యందు ఉదయించిన ఆమెను శ్రీ మహావిష్ణువు తన హృదయ స్థానమునందు (వక్షస్థలమునందు) ధరించాడు. అని **విష్ణు ధర్మోత్తర పురాణము**లోని 42వ అధ్యాయములో చెప్పబడింది. అందుచేతనే లక్ష్మి అష్టోత్తరశత నామాలలో 97వ నామము **విష్ణువక్షస్థలస్థితాయై నమోనమః** అని చెప్పబడింది. కాబట్టి లక్ష్మీదేవి విష్ణువు యొక్క వక్షస్థలము నందుంటుంది. అందుచేతనే శ్రీ మహావిష్ణువు 'శ్రీమాన్' అనబడుతున్నాడు.

## 23. కేశవః

కేశములు గలవాడు. 648వ నామము కూడా ఇదే.

**ప్రశస్త నీలకేశత్వాత్ కేశవః పరికీర్తితః**

ప్రశస్తమైన, సన్నని, నల్లని, వంకరలు తిరిగిన తలవెంట్రుకలు కలవాడు.

**ప్రశస్తాః కేశాః అస్యసన్తీతి కేశవః**

ఆశ్చర్యములు, కుటిలములు అగు నీలవర్ణము కలిగిన కేశములు కలవాడు.

**అభిరూపాః కేశాః యస్య సః కేశవః** ప్రశస్తమైన కేశములు కలవాడు. కేశ అనే శబ్దము త్రిమూర్త్యాత్మకము. క – బ్రహ్మ, అ – విష్ణువు, ఈశ – ఈశ్వరుడు. ఈ త్రిమూర్తులు ఎవరికి వశమై ఉంటారో, అతడు కేశవుడు. ఆద్యంతములు లేనివాడు, సృష్టిస్థితి లయకారకుడు ఆ శ్రీమన్నారాయణుడు. అయితే జగత్పాలనకోసము.

| | | |
|---|---|---|
| సృష్టికర్తగా | – | బ్రహ్మను |
| స్థితికర్తగా | – | విష్ణువును |
| లయకారకుడుగా | – | రుద్రుని (ఈశ్వరుడు) |

నియమించాడు. వీరు ముగ్గురూ పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుని ఆజ్ఞకుబద్ధులై ఉంటారు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు – 'కేశవుడు' అనబడుతున్నాడు.

'కేశి' అను రాక్షసుని సంహరించినవాడు కాబట్టి 'కేశవుడు' అనబడుతున్నాడు. **విష్ణుపురాణము**లో కేశి అనే రాక్షసుడు కంస మహారాజుకు ప్రియమిత్రుడు. గోకులములో ఉన్న బాలకృష్ణుని చంపటానికి పూతన శకటాసురుడు మొదలైన రాక్షసులను పంపినట్లే కేశినికూడా పంపాడు కంసుడు. కేశి అశ్వరూపుడు.

శ్రీకృష్ణుని చంపటానికి గుర్రం రూపంలో బయలుదేరాడు కేశి. బృందావనం చేరాడు. గుర్రము పెద్ద పెట్టున సకిలించింది. భువనభోంతరాళాలు దద్దరిల్లి పోయినాయి. గిట్టలతో నేలను దున్నుతున్నది. ఆ దెబ్బకు భూమి కంపించిపోతోంది. ఉన్నట్టుండి జూలు విదిలించింది. సముద్రాలు అల్లకల్లోలమై పోయినాయి. ఒక్కసారిగా చంద్రసూర్యలోకాలను ఆక్రమించి వేసింది. భయంకరమైన ఆ గుర్రాన్ని చూసిన గోపాలకులు భయకంపితులై పోయారు. దిక్కు తోచక పరుగులు తీశారు. "ఆపద్బాంధవా ! అనాథరక్షకా ! శ్రీకృష్ణా ! పాహిమాం ! పాహిపాహి !! అంటూ శ్రీకృష్ణుని శరణుజొచ్చారు.

జరిగిందంతా విన్నాడు కృష్ణుడు. రాక్షస సంహారానికి బయలుదేరాడు. ఆ గుర్రానికి ఎదురుగా నిలబడి "ఓరీ దుష్టుడా! నేను శ్రీకృష్ణుడను రారా ! ఒక్కదెబ్బతో పళ్ళు రాలగొట్టి, నీ మదము అణచుతాను" అన్నాడు. భయంకరంగా సకిలిస్తూ ఆ గుర్రము ఒక్కసారిగా శ్రీకృష్ణుని మీదకు దూకింది. కృష్ణుని మ్రింగి వెయ్యటానికి నోరుబాగా తెరిచింది. శ్రీకృష్ణ పరమాత్ముడు తన చేతిని బాగా పెంచి ఒక్కసారిగా గుర్రము నోట్లో దూర్పేశాడు. ఆ చెయ్యి అలా లోపల పెరిగిపోతుంది. రాక్షసుడి మాయలు అంతరించిపోయినాయి. మంత్రం వేసినట్లుగా అతడి పళ్ళన్నీ నేలమీద రాలిపోయినాయి. గుర్రము శరీరంలో ఉన్న కృష్ణుని

చెయ్యి ఇంకా పెరిగిపోయింది. రాక్షసుడికి చెమటలు పోసినాయి. నవరంధ్రాల నుండి రక్తంకారటం మొదలు పెట్టింది. అంతలోనే 'పటపట'మనే శబ్దం. గుర్రము ఎముకలు విరిగిపోతున్నాయి. అది నేలమీద నిలబడలేక పోతోంది. కాళ్ళతో నేలమీద తన్నుకుంటోంది చూస్తుండగానే దాని శరీరము నిలువునా రెండు ముక్కలైంది. ఒక్కొక్క ముక్కకు ఒక కన్ను, ఒక చెవి, రెండు కాళ్ళతో గుర్రము నేలమీద పడిపోయింది. కేశి అని రాక్షసుడు కృష్ణుని చంపుదామని వచ్చి, చివరకు అతడి చేతిలోనే మరణించాడు.

ఈ దృశ్యాన్ని చూసిన నారద మహర్షి

**యస్మాత్త్వయైషదుష్టాత్మా హతః కేశీ జనార్దన ।**
**తస్మా త్కేశీవనా మ్నాత్వం లోకేఖ్యాతో భవిష్యసి ॥**

"జనార్దనా ! కేశి అను రాక్షసుని సంహరించావు కాబట్టి ఇక నుంచి నువ్వు 'కేశవుడు' అను పేరుతో ప్రసిద్ధి చెందుతావు." అన్నాడు.

ఈ రకంగా కేశి అనే రాక్షసుని సంహరించినవాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు 'కేశవుడు' అనబడుతున్నాడు.

## 24. పురుషోత్తమః

పురుషులలో ఉత్తముడు

**బుద్ధాదిపురుషేభ్యో యో హ్యుత్కృష్టః పురుషోత్తమః**

బద్ధులు, ముక్తులు, నిత్యులు అనబడు జీవులకన్న గొప్పవాడు. బద్ధులు అనగా–కర్మకు బద్ధులు. మానవ జన్మ ఎత్తి కర్మలు చేస్తుంటారు. ఆ కర్మల ఫలితము అనుభవించటానికి మళ్ళీ జన్మిస్తారు. మళ్ళీ కర్మ చేస్తారు. ఈ రకంగా సంసారమనే బండిచక్రములో పడి గానుగకు కట్టిన ఎద్దులాగా తిరుగుతుంటారు. ముక్తులు అనగా – ముక్తి పొందినవారు. ముక్తి అనగా విముక్తి. సంసార బంధనాల నుండి విముక్తి పొందినవారు. అరిషడ్వర్గాలను జయించినవారు. ఇటువంటివారు పరమేశ్వరుని తమలోనే చూడగలుగుతారు. వీరికి బాహ్యపూజ ఉండదు. చరాచర జగత్తంతా పరబ్రహ్మ స్వరూపమే. తమచుట్టూ ఉన్న ప్రతివస్తువునందు ప్రతిప్రాణి యందు ఆ పరబ్రహ్మను చూడగలుగుతారు. వీరు కర్మలు చెయ్యరు. ఒకవేళ చేసినా అది లోకకల్యాణార్థము మాత్రమే చేస్తారు. కాబట్టి ఆ కర్మవలన ఫలితము వీరికి రాదు. ఇటువంటివారు ఈ శరీరాన్ని వదలిన తరువాత అంటే మరణానంతరము ఆ పరబ్రహ్మలో లీనమవుతారు. ఇక్కడ లీనమవటమనే పదము

వ్యావహారికంలో వాడబడింది. అంతే కాని 'బ్రహ్మపదార్థము వేరే ఎక్కడో ఉన్నది. ఈ జీవుడు ఆ బ్రహ్మలో కలుస్తాడు' అని మాత్రం కాదు. ఉన్నదంతా ఒక్కటే. అదే పరబ్రహ్మ. ముక్తి పొందిన మానవుడు తానుకూడా పరబ్రహ్మ అవుతాడు.

**ముండకోపనిషత్తు**లో అంగిరసుడు, శౌనకునికి బ్రహ్మజ్ఞానాన్ని వివరిస్తూ "శౌనకా! ఒకేపేరు, ఒకే రూపముగల రెండు పక్షులు ప్రపంచమనే వృక్షాన్ని ఆశ్రయించి ఉన్నాయి. అందులో ఒకటి జీవుడు. ఇది తనకర్మవల్ల వచ్చిన ఫలితాన్ని అనుభవిస్తోంది. రెండవది పరమేశ్వరుడు. కర్మఫలము ఏమీ లేకుండా చూస్తూ కూర్చున్నది. శరీరమే ఆ వృక్షము. ఆ పక్షులే క్షేత్రజ్ఞ పరమాత్మలు. వారిద్దరూ వేరు కాదు. ఈ రెండూ ఒకేచోట ఉన్నప్పటికీ జీవుడు మోహానికి వసుడై శోకాన్ని అనుభవిస్తూ ఉంటాడు. అజ్ఞానంవల్ల అనేక బాధలు పడుతుంటాడు.

కాని, అతడే యోగీశ్వరులచేత సేవించబడేవాడు అని తెలిసినప్పుడు, అంటే మోహం నశించినప్పుడు శోకంనుంచి విముక్తుడవుతాడు. ఈ జీవుడు ఎప్పుడైతే చైతన్యరూపుడు, స్వయంప్రకాశి, జగన్నిర్మాత అయిన పరమాత్మను దర్శించగలుగుతాడో, అనగా స్వస్వరూప జ్ఞానం పొంది తానే పరబ్రహ్మ స్వరూపమని తెలుసుకుంటాడో, అప్పుడు భేదభావాలు ఉండవు. జీవుడు అద్వైత భావన పొందుతాడు. ఇదే సాయుజ్యము లేదా ముక్తి.

నిత్యులు అనగా – ఐహిక బంధనాల నుంచి విడివడినవారు కర్మలు చెయ్యరు. వీరికి కర్మ ఫలితము ఉండదు. **సనత్కుమార సంహితలో**

**అంతరారాధన పరా వైదికా బ్రహ్మవాదినః ।**
**జీవన్ముక్తా శ్చరం త్యేతే త్రిషులోకేషు సర్వదా ॥**

బ్రహ్మవాదులు అంతరారాధన మాత్రమే చేస్తారు. అనగా స్వస్వరూప జ్ఞానం కలిగి తామే పరబ్రహ్మ స్వరూపము అని తెలుసుకోగలుగుతారు. అటువంటివారు జీవన్ముక్తులై ముల్లోకాలలోనూ సదా సంచరిస్తూ ఉంటారు. పరమేశ్వరుడు వీరి ముగ్గురికన్నా గొప్పవాడు. ముక్తులైనవారికి ముక్తిని ఇచ్చేది అతడే. కర్మచేసే వారికి కర్మ ఫలితాన్ని ఇచ్చేది అతడే. జీవన్ముక్తులకు నిత్యత్వము ఇచ్చేదికూడా అతడే. కాబట్టి పరమేశ్వరుడు వీరందరికన్నా గొప్పవాడు. అందుచేతనే పురుషోత్తముడు అనబడుతున్నాడు.

**పురుషేభ్యః ఉత్తమః పురుషోత్తమః** లోకములోని జనులందరికీ ఉన్న లక్షణాలే పరమేశ్వరుడికీ ఉన్నాయి కదా ? మరి అతడు కూడా సామాన్యుడే కాదా ? అనుకుంటే తప్పు. అతడు జీవులన్నింటికన్న ఉత్తముడు. అందుకే పురుషోత్తముడు అనబడుతున్నాడు.

**పురుషాణాం ఉత్తమః** పురుషులలో అనగా చేతన తత్త్వములన్నింటిలోనూ ఉత్తముడు. **భగవద్గీతలోని** 15వ అధ్యాయము **పురుషోత్తమ ప్రాప్తియోగము**లోని 1, 2, 3, 4 శ్లోకాలలో భగవానుడు అర్జునునితో

**ఊర్ధ్వమూల మధశ్శాఖం అశ్వత్థం ప్రాహు రవ్యయం ।**
**ఛన్దాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్ ॥**

అర్జునా ! ఈ సంసారము అశ్వత్థవృక్షము వంటిది. దీని మొదలు బ్రహ్మ. ఈయన ఊర్ధ్వలోకంలో ఉంటాడు. దీనికి కొమ్మలు క్రింది లోకాలయందుంటాయి. జీవనది యొక్క నీటి ప్రవాహమువలె ఈ వృక్షము నిత్యమైనది. దీనిని పెంచే ఆకులే కామ్యకర్మలు. దీన్ని ఛేదించే ఉపాయము వేదములో చెప్పబడింది.

**అధశ్చోర్ధ్వం ప్రసృతాస్త స్య శాఖాః గుణప్రవృద్ధా విషయ ప్రవాళాః ।**
**అధశ్చమూలా న్యనుసన్తతాని కర్మానుబన్ధీని మనుష్యలోకే ॥**

ఆ వృక్షము యొక్క శాఖలు క్రింద ఉన్న భూలోకానికి పైన ఉన్న స్వర్గాది లోకాలకు వ్యాపించి ఉన్నాయి. అవి సత్వరజస్తమోగుణాలతో వృద్ధి పొందుతూ ఉంటాయి. శబ్దాది విషయములనబడే చిగుళ్ళను కలిగి ఉన్నాయి. దానికర్మ రూపమైన వ్రేళ్ళు భూలోకంలో కర్మకు సంబంధించి ఉన్నాయి.

**న రూపమస్యేహ తథోపలభ్యతే నాన్తో న చాదిర్న చ సంప్రతిష్ఠా ।**
**అశ్వత్థమేనం సువిరూఢమూలం అసఙ్గశస్త్రేణ దృఢేన ఛిత్వా ॥**

ఈ వృక్షానికి బ్రహ్మ మూలము. మనుష్యాదులు శాఖలు. విషయాదులు చిగుళ్ళు అని ఈ లోకస్థులైన సంసారులకు తెలుసు. కాని దీని స్వరూపముగాని, ఆదిగాని, అంతముగాని, దీనిస్థితి గాని ఈ లోకస్థులకు తెలియదు.

**తతః పదం తత్పరిమార్గితవ్యం యస్మిన్గతా న నివర్తన్తి భూయః ।**
**తమేవ చాద్యం పురుషం ప్రపద్యే యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ ॥**

ఏ పురుషుని వలన పురాతనమైన ఈ గుణమయ భోగ సంగమునందు ప్రవృత్తి కలిగినదో అట్టి ఆదికారణుడైన పరమపురుషునే శరణు పొందవలసి ఉన్నది. అతడి ఆజ్ఞను ఉల్లంఘించటం చేతనే ఈ బంధము కలిగింది. కాబట్టి, అతణ్ణి ప్రసన్నుడిగా చేసుకుంటే ఆ బంధనాల నుండి విడివడతారు అని చెబుతాడు. పైన చెప్పిన పరమపురుషుడే పురుషోత్తముడు. అతడే శ్రీమన్నారాయణుడు.

పూరీజగన్నాధానికి 'పురుషోత్తమక్షేత్రము' అని పేరు. ఇది చాలా మహిమగల క్షేత్రము. దీన్ని గురించి **బ్రహ్మపురాణము**లో చెప్పబడింది.

పూర్వకాలంలో యింద్రద్యుమ్న మహారాజు అవంతీనగరాన్ని రాజధానిగా చేసుకుని మాళవ దేశాన్ని పాలిస్తున్నాడు. అతడు గొప్ప విష్ణుభక్తుడు.

యింద్రద్యుమ్నుడు జగన్నాధుని ఆలయం నిర్మించాలి అనుకొని సామంతరాజుల సహకారముతో అశ్వమేధయాగం పూర్తిచేసి ఆలయం ఏ విధంగా నిర్మించాలి ? విగ్రహాలు ఎలా తయారుచేయించాలి అని ఆలోచిస్తూ నిద్రపోయాడు. ఆ రాత్రి జగన్నాధుడు రాజుకు కలలో కనిపించి 'సముద్రతీరములో అతిపెద్దదైన అశ్వత్థ వృక్షము ఒకటి ఉన్నది. దాన్ని నరికి, ఆ చెక్కతో జగన్నాధుని విగ్రహము చేయించవలసినది' అని చెప్పాడు. రాజు నిద్రలేచి, తనకు వచ్చిన కలగురించి అందరికీ వివరించాడు.

ఆ మరునాటి ఉదయమే బయలుదేరి సముద్రతీరాన ఉన్న అశ్వత్థవృక్షానికి నమస్కరించి, శాస్త్రోక్తంగా పూజాదికములు నిర్వహించి ఆ చెట్టును నరికివేశాడు. ఇంతలో శ్రీమన్నారాయణుడు విశ్వకర్మతో కలసి అక్కడికి వచ్చాడు. అతడి ఆజ్ఞమేరకు విశ్వకర్మ, ఆ చెట్టును ముక్కలుగా చేసి బలరామ, శ్రీకృష్ణ, సుభద్రల విగ్రహాలు తయారుచేశాడు.

భగవానుడు చెప్పిన ముహూర్తానికే మహారాజు దేవతా విగ్రహాలను ఆగమశాస్త్ర విధంగా ప్రతిష్ఠ చేశాడు.

క్షేత్రాలన్నింటిలోకి పురుషోత్తమ క్షేత్రము మహామహిమోపేతమైనది. ఇక్కడ శుద్ధద్వాదశి నాడు జగన్నాధుని దర్శించినట్లైతే, ఒంటికాలిమీద నుంచుని డెబ్బైరెండు వేల సంవత్సరాలు తపస్సుచేసిన ఫలితము వస్తుంది. జ్యేష్ఠమాసములో పంచమీ తీర్ధయాత్ర చేసి జగన్నాధుని దర్శించినవారికి విష్ణులోకము లభిస్తుంది. ఇంద్రద్యుమ్నుని పేరుతో వెలసిన తీర్ధమే పంచమీ తీర్ధము. ఈ తీర్ధములో స్నానం చేసిన వారికి పుణ్యలోకాలు లభిస్తాయి. ఇక్కడ పిండప్రదానము చేసినట్లైతే పిత్రుదేవతలు తరిస్తారు. పిండప్రదానము చేసినవాడు ఇరవై ఒక్క తరాలవారిని తరింపచేస్తాడు.

**బ్రహ్మపురాణము**లోని 69వ అధ్యాయములో పురుషోత్తమ క్షేత్ర మాహాత్మ్యము వివరించబడింది. ఆ క్షేత్రాన్ని దర్శించకపోయినప్పటికీ, క్షేత్రమాహాత్మ్యాన్ని చదివినట్లైతే పుణ్యలోకాలు ప్రాప్తిస్తాయి. అందుచేత ఆ క్షేత్రమాహాత్మ్యము కూడా ఇక్కడ ఇవ్వబడింది.

సత్యం సత్యం మునిశ్రేష్ఠా భవద్భిః సముదాహృతమ్ ।
పురుషాఖ్యసం క్షేత్రం నా స్త్యత్ర పృథివితలే ॥

సంతి యాని తు తీర్థాని పుణ్యా న్యాయతనాని చ ।
తాని శ్రీపురుషాఖ్యస్య కళాం నార్హంతి షోడశీమ్ ॥

యథా సర్వేశ్వలో విష్ణుః సర్వదేవూత్తమోత్తమః ।
తథా సమస్త తీర్థానాం వరిష్ఠం పురుషోత్తమమ్ ॥

ఆదిత్యానాం యథా విష్ణుః శ్రేష్ఠత్వే సముదాహృతః ।
తథా సమస్త తీర్థానాం వరిష్ఠం పురుషోత్తమమ్ ॥

నక్షత్రాణాం యథా సోమః సరసాం సాగరో యథా ।
తథా సమస్త తీర్థానాం వరిష్ఠం పురుషోత్తమమ్ ॥

వసూనాం పావకో యద్వ ద్రుద్రాణాం శంకరో యథా ।
తథా సమస్త తీర్థానాం వరిష్ఠం పురుషోత్తమమ్ ॥

వర్ణానాం బ్రాహ్మణో యద్వ ద్వైనతేయశ్చ పక్షిణామ్ ।
తథా సమస్త తీర్థానాం వరిష్ఠం పురుషోత్తమమ్ ॥

శిఖరిణాం యథా మేరుః పర్వతానాం హిమాలయః ।
తథా సమస్త తీర్థానాం వరిష్ఠం పురుషోత్తమమ్ ॥

ప్రమదానాం యథా లక్ష్మీః సరితాం జాహ్నవీ యథా ।
తథా సమస్త తీర్థానాం వరిష్ఠం పురుషోత్తమమ్ ॥

ఐరావతో గజేంద్రాణాం మహర్షీణాం భృగుర్యథా ।
తథా సమస్త తీర్థానాం వరిష్ఠం పురుషోత్తమమ్ ॥

సేనానీనాం యథా స్కందః సిద్ధానాం కపిలో యథా ।
తథా సమస్త తీర్థానాం వరిష్ఠం పురుషోత్తమమ్ ॥

ఉచ్చైః శ్రవా యథాఽశ్వానాం కవీనాముశనా కవిః ।
తథా సమస్త తీర్థానాం వరిష్ఠం పురుషోత్తమమ్ ॥

మునీనాం చ యథా వ్యాసః కుబేరో యక్షరక్షసామ్ ।
తథా సమస్త తీర్థానాం వరిష్ఠం పురుషోత్తమమ్ ॥

ఇంద్రియాణాం మనో యద్వ ద్భూతానా మవనీ యథా ।
తథా సమస్త తీర్థానాం వరిష్ఠం పురుషోత్తమమ్ ॥

అశ్వత్థః సర్వవృక్షాణాం పవనః ప్లవతాం యథా ।
తథా సమస్త తీర్థానాం వరిష్ఠం పురుషోత్తమమ్ ॥

భూషణానాం తు సర్వేషాం యథా చూడామణి ర్ద్విజాః ।
తథా సమస్త తీర్థానాం వరిష్ఠం పురుషోత్తమమ్ ॥

గంధర్వాణాం చిత్రరథః శస్త్రాణాం కులిశో యథా ।
తథా సమస్త తీర్థానాం వరిష్ఠం పురుషోత్తమమ్ ॥

అకారః సర్వవర్ణానాం గాయత్రీ ఛందసాం యథా ।
తథా సమస్త తీర్థానాం వరిష్ఠం పురుషోత్తమమ్ ॥

సర్వాంగేభ్యో యథా శ్రేష్ఠ ముత్తమాంగం ద్విజోత్తమాః ।
తథా సమస్త తీర్థానాం వరిష్ఠం పురుషోత్తమమ్ ॥

అరుంధతీ యథా స్త్రీణాం సతీనాం శ్రేష్ఠతాం గతా ।
తథా సమస్త తీర్థానాం వరిష్ఠం పురుషోత్తమమ్ ॥

యథా సమస్తవిద్యానాం మోక్షవిద్యా పరా స్మృతా ।
తథా సమస్త తీర్థానాం వరిష్ఠం పురుషోత్తమమ్ ॥

మనుష్యాణాం యథా రాజా ధేనూనా మపి కామధుక్ ।
తథా సమస్త తీర్థానాం వరిష్ఠం పురుషోత్తమమ్ ॥

సువర్ణం సర్వరత్నానాం సర్పాణాం వాసుకిర్యథా ।
తథా సమస్త తీర్థానాం వరిష్ఠం పురుషోత్తమమ్ ॥

ప్రహ్లాదః సర్వదైత్యానాం రామః శస్త్రభృతాం యథా ।
తథా సమస్త తీర్థానాం వరిష్ఠం పురుషోత్తమమ్ ॥

ఝషాణాం మకరో యద్వ న్మృగాణాం మృగరాడ్యథా ।
తథా సమస్త తీర్థానాం వరిష్ఠం పురుషోత్తమమ్ ॥

సముద్రాణాం యథాశ్రేష్ఠః క్షీరోదః సరితాం పతిః ।
తథా సమస్త తీర్థానాం వరిష్ఠం పురుషోత్తమమ్ ॥

వరుణో యాదసాం యద్వ ద్యమః సంయమినాం యథా ।
తథా సమస్త తీర్థానాం వరిష్ఠం పురుషోత్తమమ్ ॥

దేవర్షీణాం యథా(శేష్ఠో నారదో మునిసత్తమాః ।
తథా సమస్త తీర్థానాం వరిష్ఠం పురుషోత్తమమ్ ॥

ధాతూనాం కాంచనం యద్వ త్పవిత్రాణాం చ దక్షిణా ।
తథా సమస్త తీర్థానాం వరిష్ఠం పురుషోత్తమమ్ ॥

ప్రజాపతిర్యథా దక్ష ఋషీణాం కశ్యపో యథా ।
తథా సమస్త తీర్థానాం వరిష్ఠం పురుషోత్తమమ్ ॥

గ్రహాణాం భాస్కరో  యద్వ న్మంత్రాణాం ప్రణవోయథా ।
తథా సమస్త తీర్థానాం వరిష్ఠం పురుషోత్తమమ్ ॥

అశ్వమేధస్తు యజ్ఞానాం యథా శ్రేష్ఠః ప్రకీర్తితః ।
తథా సమస్త తీర్థానాం క్షేత్రంచై తద్ద్విజోత్తమాః ॥

ఓషధీనాం యథా ధాన్యం తృణేషు తృణరాద్యథా ।
తథా సమస్త తీర్థానాం ముత్తమం పురుషోత్తమమ్ ॥

యథా సమస్తతీర్థానాం ధర్మః సంసారతారకః ।
తథా సమస్తతీర్థానాం శ్రేష్ఠం తత్పురుషోత్తమమ్ ॥

ఈ శ్లోకాలకు అర్థం తేలికగానే తెలుస్తుంది. దేవతలలో విష్ణుమూర్తి, నక్షత్రాలలో చంద్రుడు, వసువులలో పావకుడు, రుద్రులలో శంకరుడు, వర్ణములలో బ్రాహ్మణుడు, పక్షులలో గరుత్మంతుడు, శిఖరములలో మేరువు, పర్వతములలో హిమాలయము, నదులలో గంగ, ఏనుగులలో ఐరావతము, మహర్షులలో  భృగువు, సేనానులలో కుమారస్వామి, సిద్ధులలో కపిలుడు, అశ్వములలో ఉచ్చైశ్రవము, మునులలో వ్యాసుడు, యక్షులలో కుబేరుడు, ఇంద్రియాలలో మనస్సు, భూతములలో భూమి, వృక్షములలో అశ్వత్థము, ఆభరణములలో చూడామణి, గంధర్వులలో చిత్రరథుడు, వర్ణములలో అకారము, ఛందస్సులలో గాయత్రి, అంగములలో శిరస్సు, పతివ్రతలలో అరుంధతి, విద్యలలో మోక్షవిద్య, ధేనువులలో కామధేనువు, లోహములలో బంగారము, సర్పములయందు వాసుకి, దైత్యులలో ప్రహ్లాదుడు, మృగములలో సింహము, దేవఋషులలో నారదుడు శ్రేష్ఠమైనట్లే, అన్ని తీర్థములలోకీ పురుషోత్తమ తీర్థము శ్రేష్ఠమైనది.

# 25. సర్వః

అంతటా వ్యాపించినవాడు.

**చరాచర శరీరేషు వ్యాప్తిమాన్ సర్వ ఈరితః**

స్థావర జంగమాత్మకమైన ఈ జగత్తంతా వ్యాపించి ఉన్నవాడు.

**సరతి గచ్ఛతీతి సర్వః** దేనిని అపేక్షించకుండా అంతటా వ్యాపించి ఉండువాడు. **మహాభారతము**లోని ఉద్యోగ పర్వంలో

**అసతశ్చ సతశ్చైవ సర్వస్య ప్రభవా ఉ ప్యయాత్ ।**
**సర్వస్వ సర్వదా జ్ఞా నాత్ సర్వ మేనం ప్రచక్షతే ॥**

రూపమున్న వాటికి, రూపము లేని వాటికి అన్నింటికీ ఉత్పత్తి, స్థితి, లయకారకుడు తానే అగుటచేత, సర్వకాలములందు సర్వమును తెలియువాడగుటచేత అతడు 'సర్వుడు' అనబడుచున్నాడు అని చెప్పబడింది. నిరాకారుడు నిర్గుణ స్వరూపుడు అయిన పరబ్రహ్మ ఈ బ్రహ్మాండమంతా ఆవరించి ఉన్నాడు.

**బృహదారణ్యకోపనిషత్తులో** ఈ విధంగా చెప్పబడింది. సృష్టికి పూర్వము మానవాకారంలో ఉన్న విరాడాత్మ మాత్రమే ఉన్నది. అతనికన్న భిన్నమైనదేదీ లేదు. సర్వాత్మభావంతో తనను మాత్రమే చూసుకున్నాడు. అంతటా నేనే అనుకున్నాడు.

పురుషాకారంలో ఉన్న ప్రజాపతి తాను ఒక్కడే అయి కూడా భయభ్రాంతుడైనాడు. ఆ సమయంలో ఒంటరిగా ఉన్న ప్రజాపతి, ఒంటరితనంలోని ఆనందాన్ని అనుభవించలేక పోయాడు. అందుచేత ప్రజాపతి స్త్రీని కోరాడు. అలా కోరిన వెంటనే స్త్రీపురుషులు పరస్పరాలింగనము చేసుకున్నట్లుగా రూపుదాల్చాడు. అప్పుడు తన శరీరాన్ని రెండు భాగాలుగా చేశాడు. ఆ భాగాలే భార్యాభర్తలు. అందుచేతనే లౌకిక శరీరము రెండు దళాలున్నటువంటి ధాన్యపుగింజలోని ఒక దళం లాంటిది. ఒక పప్పుబద్దలాంటిది. అందులోని రెండు బద్దలూ స్త్రీ పురుషులకు సంకేతాలు. ఆ కారణంచేతనే వివాహము అయితేనేగాని పురుషునికి పూర్ణత్వము లభించదు. ఆ తరువాత మైథునక్రియవల్ల పునరుత్పత్తి జరుగుతుంది.

ప్రజాపతివల్ల కలిగిన 'శతరూప' కుమార్తెతో రమించటం నిషిద్ధం కదా ! తననుండి పుట్టిన నాతో ఈ ప్రజాపతి ఏ రకంగా రమిస్తాడు ? ఎందుకయినా మంచిది అనుకుని తాను ఆవుగా మారింది. ఇది చూసిన పురుషుడు తాను వృషభమై సంభోగించాడు. ఈ

విధంగా గో సంతతి అభివృద్ధి చెందింది. తరువాత శతరూప ఆడు గుర్రము అయింది. పురుషుడు మగగుర్రము అయినాడు. అశ్వసంతతి వృద్ధి అయింది. ఈ రకంగా శతరూప అనేక రూపాలు ధరించింది. పురుషుడు కూడా అన్ని రూపాలు ధరించాడు. ఆ కారణంగా పిపీలికాది బ్రహ్మ పర్యంతము 84 లక్షల జీవరాసులు ఏర్పడినాయి. అంటే ఈ జగత్తంతా పరమేశ్వరమయమే నన్నమాట.

**ఐతరేయోపనిషత్తు**లో చెప్పినట్లుగా పరమేశ్వరుడు జీవరాసి అంతటిని సృష్టించాడు. ఇప్పుడు ఇంద్రియాలతో కూడిన శరీరములో ప్రవేశించాలనుకున్నాడు. బ్రహ్మరంధ్రం ద్వారా ప్రవేశించాడు. ఈ రకంగా పరమేశ్వరుడు జీవకోటియందు ప్రవేశించినవాడై ఈ జగత్తంతా తానే అయినాడు.

నిరాకారుడు నిర్గుణ స్వరూపుడు అయిన పరబ్రహ్మ, కర్మపరిపక్వం కాకుండా మిగిలిపోయిన జీవరాసికంతటికీ కర్మక్షయం చేసి, వాటికి మోక్షం కల్పించాలనే ఉద్దేశ్యంతో ఈ సృష్టి చెయ్యాలని సంకల్పించినవాడై మొదటగా తననుండి కొంత శక్తిని బయటకు పంపాడు. ఆ శక్తే ప్రజాపతి. దానినుంచే తన్మాత్రలు, పంచభూతాలు, త్రిగుణాలు ఆవిర్భవించినాయి. వీటియొక్క కలయిక చేతనే స్థావర జంగమాత్మకమైన ఈ జగత్తు ఏర్పడింది. కాబట్టి ఈ సృష్టి అంతా పరమేశ్వరమయమే. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'సర్వుడు' అనబడుతున్నాడు.

**తస్యా శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః ।**
**సబ్రహ్మ, సశివ, సహరి, స ఇంద్ర, స్సోఽక్షర పరమస్వరాట్ ॥**

మానవుని శరీరములో నాభికి పై భాగములో జఠరాగ్ని ఉన్నది. దాని నడుమ సూక్ష్మమైన అగ్నిశిఖ ఊర్ధ్వముఖంగా ప్రకాశిస్తూ ఉంటుంది. ఆ అగ్నిశిఖ మధ్యన పరమాత్మ ఉంటాడు. అతడే బ్రహ్మ, అతడే శివుడు, అతడే విష్ణువు, అతడే ఇంద్రుడు, నాశరహితుడు, అన్నిటికీ మూలకారణమైనవాడు. అని వేదం చెబుతోంది. కాబట్టి పరమేశ్వరుడు ఈ జగత్తంతా ఆవరించి ఉండి 'సర్వుడు' అనబడుతున్నాడు.

**నారాయణోపనిషత్తు**లో చెప్పినట్లుగా ఈ జగత్తులో నారాయణుడే నిత్యుడు. అతడే బ్రహ్మ, అతడే విష్ణువు అతడే రుద్రుడు, అతడే ఇంద్రుడు, అతడే భూమి, అతడే ఆకాశము, అతడే కాలము, అతడే దిక్కులు పైనున్నది అతడే, క్రిందనున్నది అతడే, మధ్యనున్నది అతడే. లోపల ఉన్నది అతడే, బయట ఉన్నది అతడే, భూతభవిష్యద్వర్తమానములు అతడే. ఈ సమస్తమూ అతడే. అతడు నిష్కళంకుడు, నిరంజనుడు, నిర్వికల్పుడు. ఈ

జగత్తులో శ్రీమన్నారాయణుడు తప్ప వేరెవరూ లేరు. అతడు జగత్తంతటా ఆవరించి ఉన్నాడు. అందుచేతనే 'సర్వుడు' అనబడుతున్నాడు.

ఈ విషయాలన్నింటినీ గతంలో ఇంకా విపులంగా వివరించటం జరిగింది.

## 26. శర్వః

హింసించువాడు

**స్వశరీర జగందుఃఖం । శర్వ స్స స్స్య చ్ఛృణాతి యః**

తనకు శరీరమువలె పరతంత్రులగు సకల ప్రాణులదుఃఖమును నశింపచేయువాడు.

**అశుభం శృణాతి హింసతీతి శర్వః**

తనకు శరీరభూతులైన ప్రాణులయొక్క అనిష్ఠములను నశింపచేయువాడు.

**శృణాతి ఇతి శర్వః** ప్రళయకాలమందు భూతములను హింసించువాడు – శివుడు. సంహార సమయములో సకల ప్రాణులను సంహరించువాడు.

పరమేశ్వరుడు సృష్టి స్థితిలయాలను చేస్తుంటాడు.

బ్రహ్మరూపంలో – సృష్టిని విష్ణువు రూపంలో – స్థితిని
రుద్రుని రూపంలో – లయముగావిస్తుంటాడు.

వీటిలో మూడవదైన లయము గురించి ఇక్కడ చెప్పటం జరిగింది. శ్రీమన్నారాయణుడే పరమేశ్వరుడు. అతడే సృష్టిస్థితి లయాలకు కారకుడు. **లలితాసహస్రం**లో కూడా ఈ రకంగానే చెప్పబడింది.

సృష్టికర్త్రీ – బ్రహ్మరూపా
గోప్త్రీ – గోవిందరూపిణీ
సంహారిణీ – రుద్రరూపా
తిరోదానకరీ – ఈశ్వరీ
సదాశివా – అనుగ్రహదా

సృష్టి, స్థితి, లయ, తిరోదాన, అనుగ్రహములు పరమేశ్వరుని కృత్యములు.

## 27. శివః

మంగళప్రదుడు. 600 నామం కూడా ఇదే.

**శుభాన హనత్వా ద్భక్తానాం । శివ ఇత్య భిధీయతే ॥**

తన భక్తులకు సుఖములనిచ్చువాడు.

**శేరతే తే అస్మిన్ ఇతి శివః** వారందరికీ శుభములనిచ్చువాడు. తన భక్తులకు, భక్తులు కాకపోయినప్పటికీ తనను తలచినవారికి సర్వశుభములు కలుగచేయువాడు.

**క్రూరాత్ముండజామీళుడు**
**నారాయణ యనుచు నాత్మనందను బిల్వన్ ।**
**ఏ రీతి నేలుకొంటివి**
**యేరీ నీ సాటి వేల్పులెందును కృష్ణా ॥**

అజామీళుడు అనే ఒక బ్రాహ్మణుడు. వేదవేదాంగవిదుడు. ధర్మపరుడు. ఒకరోజున అతని తండ్రి అతన్ని పిలిచి దేవతార్చనకు పూలు తీసుకురమ్మన్నాడు. చాలాదూరం వెళ్ళాడు అజామీళుడు. కావలసినన్ని పూలు కోశాడు తిరిగి ఇంటికి ప్రయాణమైనాడు. మార్గమధ్యంలో ఒక చిన్న పొదరింటిలో నిండు యవ్వనంలో ఉన్న స్త్రీ పురుషులు మన్మథ క్రీడలలో తేలియాడుతున్నారు. ఆ దృశ్యం చూసేసరికి అజామీళుని మనస్సు చెదిరిపోయింది. వేదవేదాంగాలు మరిచిపోయాడు. త్రోవలో ఒక శూద్ర స్త్రీ కనిపించింది. ధర్మాధర్మ విచక్షణ కోల్పోయాడు. ఆమె వెనక వెళ్ళిపోయాడు. కేవలము రతిక్రియయే ప్రధానంగా ఆమెతో సుఖిస్తున్నాడు. అనేక పాపకృత్యాలు చేశాడు సంతానంకలిగింది. కుమారుడికి నారాయణుడు అని పేరు పెట్టాడు. ఆ బాలుడంటే అజామీళుడికి చాలా ఇష్టం. భార్యాబిడ్డలను పోషించటానికి అనేకమైన దుష్కృత్యాలు చేశాడు. క్రూరాతిక్రూరమైన పనులన్నీ చేశాడు. ఏళ్ళు గడిచినాయి. వృద్ధాప్యం వచ్చింది. మంచానపడ్డాడు. అవసానకాలంలో కుమారుణ్ణి 'నారాయణా ! నారాయణా !' అని పలకరిస్తూనే ప్రాణాలు వదిలాడు.

అతణ్ణి తీసుకుపోవటానికి యమదూతలు వచ్చారు. వైకుంఠం నుంచి విష్ణుదూతలు వచ్చారు. పాపాత్ముడు కాబట్టి నరకలోకాని తీసుకుపోవాలి అన్నారు యమదూతలు. అవసాన దశలో శ్రీమన్నారాయణుని స్మరించాడు కాబట్టి విష్ణులోకానికి తీసుకుపోవాలి అని విష్ణుదూతలు వాదులాడుకున్నారు. చివరకు విష్ణుదూతలు అజామీళుని వైకుంఠానికి తీసుకుపోయారు. ఈ రకంగా చాలాకాలము వైకుంఠములో ఉండి మళ్ళీ పుణ్యఫల మనుభవించటానికి సద్బ్రాహ్మణుడుగా జన్మించాడు అని **బ్రహ్మపురాణము**లో చెప్పబడింది.

ఈవిధంగా దుర్మార్గుడైనప్పటికీ, అవసాన దశలో తనను తలచినంత మాత్రంచేతనే పుణ్యలోకాలను ప్రసాదించినవాడు శ్రీమన్నారాయణుడు. అటువంటివాడు తన భక్తులను ఏవిధంగా రక్షిస్తాడనేది వేరే చెప్పాలా ?

**హరియను రెండక్షరములు**

**హరియించును పాతకముల నంబుజనాభా ।**

**హరినీనామమాహాత్మ్యము**

**హరియని పొగడంగ వశమె హరిశ్రీకృష్ణా ॥**

కేవలము 'హరి' అనే రెండక్షరములు పలికినంత మాత్రం చేతనే సర్వపాపములు హరిస్తాయి. అందుచేతనే తనభక్తులందరికీ శుభములనిచ్చువాడైన శ్రీమన్నారాయణుడు 'శివః' అని చెప్పబడుతున్నాడు.

వేదంలో **సబ్రహ్మా, సశివ, సహరిశ్చేంద్ర సోక్షరః పరమస్వరాట్** అతడే బ్రహ్మా, అతడే విష్ణువు, అతడే శివుడు, అతడే ఇంద్రుడు, నాశనము లేనివాడు. శాశ్వతుడు, స్వయంప్రకాశము కలవాడు. అతడే శ్రీమన్నారాయణుడు.

## 28. స్థాణుః

స్థిరమైనవాడు.

**సంశమయ్యా శివం సర్వం । విశ్రాణ్యాపి శివం బహు**

**స్వయం న విశ్రామ్యతి య । సస్థాణుః పరికీర్తితః ॥**

తన భక్తులయొక్క కష్టములన్నీ తొలగించి, వారు కోరిన కోరికలన్నీ తీర్చి, తాను హాయిగా విశ్రమించినటువంటివాడు.

**తిష్ఠతీతి స్థాణుః** అనుగ్రహ విషయమున స్థిరముగ నిలచువాడు.

భగవంతుని యొక్క అనుగ్రహము నిత్యమైనది. శాశ్వతమైనది. ఇవాళ్ళ ఉండి, రేపు పోయేది కాదు. యజ్ఞయాగాదులు చెయ్యటంవలన, దానధర్మాలు చెయ్యటం వలన ఫలితము వస్తుంది. కొంతకాలము ఆ పుణ్యఫలాన్ని అనుభవించాక, అది క్షయమైపోతుంది. కాని భగవంతుని యొక్క అనుగ్రహము అలాంటిది కాదు. అది అన్ని రకాలైన అశుభములను తొలగించి వేస్తుంది. భక్తుడియొక్క కోరికలన్నింటినీ తీర్చివేస్తుంది. ఈ రకంగా భక్తులందరి కోరికలు తీరిన తరువాత పరమేశ్వరుడు విశ్రాంతి తీసుకుంటాడు.

**శ్వేతాశ్వరోపనిషత్తు**లో ఈవిధంగా చెప్పబడింది.

**నిత్యోనిత్యానాం, చేతనశ్చేతనానాం, ఏకోబహూనాం యో విదధాతి కామాన్, తత్కారణగ్ం సాంఖ్యయో గాధిగమ్యం జ్ఞాత్వాదేవం ముచ్యతే సర్వపాశైః ॥**

ఆ పరమేశ్వరుడు నిత్యులగు జీవుల లోపల నిత్యుడు. చేతనుల లోపల చేతనుడు, తాను ఒక్కడే అయికూడా సమస్త జీవులయొక్క కోరికలు తీర్చువాడు. సర్వకారణుడు. అతడిని జ్ఞానము చేత మాత్రమే పొందగలము. అట్టి పరమేశ్వరుని గురించి తెలుసుకున్న వాడు సర్వపాశముల నుండి అనగా అన్ని బంధములనుండి విముక్తుడవుతాడు.

అనగా ఆ పరమేశ్వరుడు సకల జీవరాశియొక్క కోరికలు తీరుస్తాడు.

**స్థాణువు అనగా :** స్థిరమైనది, కదలనిది, శివుడు అని అర్థము.

పరమేశ్వరుడు – నిరాకారుడు, నిర్గుణ స్వరూపుడు, నిరంజనుడు, అన్ని జీవుల యందు సమానమైన భావము కలిగినవాడు, తరతమ బేధములు లేనటువంటివాడు, స్థిరమైనటువంటివాడు, శాశ్వతమైనటువంటివాడు. ఈ జగత్తంతా నాశనమై పోయిన తరువాత అనగా ప్రళయము సంభవించిన తరువాత, ఆ పరమేశ్వరుడు ఒక్కడే స్థిరంగా ఉంటాడు. అందుచేతనే స్థాణువు అనబడుతున్నాడు.

## 29. భూతాదిః

ప్రాణులచేత గ్రహించబడువాడు

**భూతైర్యః ప్రాణాభిర్నిత్యం । స్పృహణీయ తమత్వతః ।**
**ఉపాదానాద్ధి భూతాది । రుచ్యతే సున్దరాకృతిః ॥**

పరమేశ్వరుడు మిక్కిలి సుందరమైన ఆకారముగలవాడు. జగత్తులోని అందమంతా అతని యందే ఉన్నది. అందుచేత జీవులన్నింటిచేత కోరబడతాడు. కాబట్టి సమస్త జీవులచేత ఎల్లప్పుడూ గ్రహింపబడుతూ ఉండేవాడు.

**భూతైః ఆదీయతే ఉపాదీయతే ఇతి భూతాదిః** అన్ని భూతములకు ఆదికారణమైన వాడు. ఉపాధి అయినవాడు కాబట్టి 'భూతాదిః' అనబడుతున్నాడు.

**భూతానాం ఆదిః** భూతములన్నింటికీ కారణమైనవాడు.

ప్రళయం జరిగిన తరువాత నిరాకారుడు నిర్గుణ స్వరూపుడు అయిన పరబ్రహ్మ ఈ జగత్తంతా వ్యాపించి ఉన్నాడు. ఇలా కొంతకాలం జరిగిన తరువాత ఆ పరమేశ్వరుడు సృష్టి చెయ్యాలని సంకల్పించాడు. అప్పుడు తనలోని కొంతశక్తిని బయటకు పంపాడు. ఆ శక్తి త్రికోణాకారంలో ఉన్నది. అదే మహాయోని. దానినుంచే తన్మాత్రలు, పంచభూతాలు పుట్టినాయి. వర్ణసమామ్నాయము కూడా పుట్టింది. పంచభూతాలు పంచీకరణము చెందినాయి. అవి త్రిగుణాలతో కలసినాయి. అప్పుడు జగత్తులోని జీవరాసి అంతా

ఏర్పడింది. అలాగే ఓంకారము నుండి వర్ణ సమామ్నాయము వచ్చింది. దానినుంచి పదాలు, మాటలు, వాక్యాలు, మంత్రాలు, వేదాలు, శాస్త్రాలు, పురాణాలు, ఛందస్సు అన్నీ ఆవిర్భవించినాయి. ఈ రకంగా ఆ పరమేశ్వరుని నుండే జీవరాసి అంతా ఏర్పడింది కాబట్టే అతడు 'భూతాదిః' అనబడుతున్నాడు.

**ముండకోపనిషత్తు**లో అంగిరసుడు శౌనకునికి పరబ్రహ్మ తత్త్వాన్ని వివరిస్తూ "శౌనకా! ప్రజ్వరిల్లిన అగ్ని నుండి అదే విధములైన ఆకారము, గుణముగల వేలకొలది నిప్పురవ్వలు వెలువడినట్లే, పరబ్రహ్మనుండి అనేకమైన శరీరాలు, రూపాలు వెలువడి, మళ్ళీ అందులోనే లీనమైపోతున్నాయి. పరబ్రహ్మ స్వయంప్రకాశం కలవాడు. అతనినుండే ప్రాణము, మనస్సు, ఇంద్రియాలు, పంచభూతాలు పుడుతున్నాయి. ఈ పరబ్రహ్మకు

| | | | | | |
|---|---|---|---|---|---|
| అగ్ని | - | శిరస్సు | వాయువు | - | ప్రాణం |
| సూర్యచంద్రులే | - | నేత్రాలు | జగత్తే | - | హృదయం |
| దిక్కులే | - | చెవులు | భూమి | - | పాదాలు |
| వేదాలే | - | వాక్కు | | | |

అతడే సమస్త భూతాలలోనూ ఉండే అంతరాత్మ.

ఆ పరమేశ్వరుని నుంచే చతుర్వేద మంత్రాలు పుట్టినాయి. మౌంజీ బంధనాది దీక్షలు, అగ్నిహోత్రాది యజ్ఞాలు, దక్షిణలు, కాలప్రమాణము, లోకాలు, ఉత్తరాయణ, దక్షిణాయన మార్గాలు, అష్టవసువులు, ఏకాదశ రుద్రులు, ద్వాదశాదిత్యులు, కర్మాధికారముగల మానవులు, పశువులు, పక్షులు, ఉచ్ఛ్వాస నిశ్వాసలు ధాన్యాలు తపస్సు, శ్రద్ధ, మితభాషణ, హితభాషణ పుట్టినాయి. 84 లక్షల జీవరాశి కూడా ఆ పరమేశ్వరుని నుంచే పుట్టింది.

**నారాయణోపనిషత్తు**లో ఈ విధంగా ఉంది. ఈ సృష్టి ప్రారంభంలో పరమపురుషుడైన నారాయణుడు ప్రాణులను సృష్టించాలి అనుకున్నాడు. అప్పుడు హిరణ్యగర్భుడు ఉదయించాడు. ఆ తరువాత ఆకాశాది పంచభూతాలు ఉద్భవించినాయి. ఈ రకంగా శ్రీమన్నారాయణుని నుండే బ్రహ్మ, రుద్రుడు, ఇంద్రుడు మరీచి కశ్యపుడు మొదలైన ప్రజాపతులు, ఏకాదశరుద్రులు, ద్వాదాశాదిత్యులు, అష్టవసువులు, సకల వేదాలు ఉద్భవించినాయి. ఈ రకంగా స్థావర జంగమాత్మకమైన జగత్తంతా శ్రీమన్నారాయణుని నుంచే ఆవిర్భవించింది.

ఈవిధంగా జగత్తంతా పరమేశ్వరుని నుంచే ఆవిర్భవించింది. కాబట్టి అతడు భూతములన్నింటికీ మూలకారణమైనవాడు. అందుచేతనే 'భూతాదిః' అనబడుతున్నాడు.

## 30. నిధిరవ్యయః

అంతములేని నిధి కలవాడు.

**య స్వదాపద్ధన మివ నిధేయ త్వా న్నిధి స్మృతః ।**
**సదోపభుజ్యమానోఽపి కలయాప్యనుప క్షయాత్ ॥**

ఆపద సమయంలో ఉపయోగిస్తుంది అని దాచిపెట్టిన ధనాన్ని 'నిధి' అంటారు. అటువంటి మహానిధివలె ఎల్లకాలము రక్షించువాడు. మామూలుగా దాచిపెట్టే నిధి అయితే వాడుకున్న కొద్దీ తరిగిపోతుంది. కానీ పరమేశ్వరుడు అనబడే ఈ నిధిని ఎంతగా వాడుకున్నప్పటికీ తరగదు సరికదా పెరుగుతూ ఉంటుంది.

**అవ్యయః నిధిః** నాశనము లేనటువంటి నిధి. ఎంతగా తీసినా తరగని నిధి.

**దేవీభాగవతం**లో పరమేశ్వరిని గురించి చెబుతూ

**యస్యాస్తు పార్శ్వభాగేస్తు నిధౌతా శంఖపద్మకౌ ।**
**నవరత్న మహానద్య స్త దావై కాంచన స్రవా ॥**

అక్కడ ఆ పరమేశ్వరికి ఇరువైపులా శంఖపద్మనిధులు ఉంటాయి. బంగారము, రతనాలతో కలసిన నదులు ప్రవహిస్తుంటాయి.

ఆ నిధులు అక్షయమైనవి. వాటినుండి ఎంత తీసినప్పటికీ అవి తరగవు. ఈ నిధులన్నీ కుబేరుని అధీనంలో ఉంటాయి. శివపురాణంలో కుబేరుని గురించి ఈ విధంగా ఉంది.

పూర్వకాలంలో యజ్ఞదత్తుడనే పండితుడు ఉండేవాడు. అతడి కుమారుడు గుణనిధి. ఇతడు కడుజారుడు చోరుడు. పైపెచ్చు జూదరి. అందుచేత తండ్రికి భయపడి ఇంటినుంచి వెళ్ళిపోయాడు. గుణనిధికి ఎక్కడికి వెళ్ళాలో, ఏం చెయ్యాలో తెలియలేదు. తినటానికి తిండికూడా దొరకలేదు. గత మూడు రోజులుగా పస్తులున్నాడు.

అక్కడికి దగ్గరలో ఉన్న శివాలయంలో అర్చన జరుగుతోంది. ఆ రోజు మహాశివరాత్రి. భక్తులందరూ ఉపవాసము ఉండి, రాత్రంతా మేల్కొని శివుణ్ణి పూజిస్తున్నారు. భజనలు చేస్తున్నారు. తెలతెలవారుతుండగా భక్తులంతా స్నానాలు చెయ్యటానికి వెళ్ళారు. ఆలయంలో ఎవరూ లేరు. చీకటిగా ఉంది. వెలుతురు కోసం గుణనిధి దేవుని దగ్గర దీపారాధన

చేశాడు. ప్రసాదం తీసుకుని బయటకు పోబోతున్నాడు. ఇది చూచిన భక్తులు దొంగ దొంగ అని అరిచి పట్టుకోబోయారు. పారిపోబోయి కాలుజారి నందీశ్వరునిమీద పడి ప్రాణాలు విడిచాడు గుణనిధి. అతన్ని తీసుకుపోవటానికి యమదూతలు వచ్చారు. శివదూతలకూడా వచ్చారు గుణనిధిని తీసుకుపోయే విషయంలో వారిద్దరికీ వాదోపవాదాలు జరిగినాయి. చివరకు శివదూతలే నెగ్గారు. అతణ్ణి కైలాసానికి తీసుకుపోయారు. చాలాకాలం అక్కడ సుఖాలనుభవించాడు గుణనిధి. మరుజన్మలో ఈశ్వరుని కృపవలన కుబేరుడైనాడు. ఈశ్వరుడు ఇతన్ని అలకాపురికి ప్రభువును చేశాడు. నవనిధులకు అధిపతిని చేశాడు. ఉత్తరదిక్కుకు అధిపతిగా చేశాడు.

**దేవీభాగవతం**లో మణిద్వీపానికి 16వది అయిన మరకత ప్రాకారమున్నది. అక్కడ షట్కోణపద్మమున్నది. దానియొక్క ఆగ్నేయకోణంలో రత్నకుంభము, మణికదండకము చేతులయందు ధరించిన కుబేరుడు లక్ష్మీసహితుడై ఉంటాడు. అతడు నవనిధులకు అధిపతి. ఇవి అక్షయమైన నిధులు అని చెప్పబడింది. ఇక ఆ నిధులు :

| | | |
|---|---|---|
| 1. మహాపద్మము | 4. మకరము | 7. కుందము |
| 2. పద్మము | 5. కచ్ఛపము | 8. నీలము |
| 3. శంఖము | 6. ముకుందము | 9. ఖర్వము |

అయితే కొన్నిచోట్ల పేర్లు ఇంకోవిధంగా కూడా ఉన్నాయి.

| | | |
|---|---|---|
| 1. కాళము | 4. మాళవకము | 7. శంఖము |
| 2. మహాకాళము | 5. వైసర్పము | 8. పద్మము |
| 3. పాండుకము | 6. సర్వరత్నము | 9. పింగళకము |

ఇక్కడ శివుడు అన్నా, పరమేశ్వరి అన్నా, విష్ణువు అన్నా అంతా ఆ పరమేశ్వర స్వరూపంగానే భావించాలి. కాబట్టి ఈ నిధులన్నీ పరమేశ్వరుని అధీనంలోనే ఉన్నాయి. అందుచేతనే అతడు అవ్యయమైనటువంటి నిధులు కలవాడు, 'నిధిరవ్యయః' అని చెప్పబడుతున్నాడు. ప్రళయకాలమునందు అన్నీ ఇతని యందే లయమవుతాయి. కాబట్టి పరమేశ్వరుడు 'నిధి' అనబడతాడు.

సృష్టి జరిగిన కొంతకాలానికి మహాప్రళయం సంభవిస్తుంది. అప్పుడు ఈ జగత్తంతా లయమై పోతుంది. సృష్టిలోని చరాచరములన్నీ నాశనమయి పంచభూతాలలో ఒకటయిన భూమిలో కలిసిపోతాయి. భూమి–జలంలో కలసిపోతుంది.

| | | |
|---|---|---|
| జలం | – | అగ్నిలో కలిసిపోతుంది |
| అగ్ని | – | వాయువునందు లీనమైపోతుంది |
| వాయువు | – | ఆకాశంలో కలిసిపోతుంది |
| ఆకాశం | – | శక్తి స్వరూపమయిన మాయలో కలిసిపోతుంది. |
| మాయ | – | పరబ్రహ్మలో లీనమవుతుంది. |

ఈ రకంగా జగత్తంతా పరమేశ్వరునిలో లీనమయిపోతుంది. అందుచేతనే అతడు నిధి అనబడుతున్నాడు. మళ్ళీ ఆ పరమేశ్వరుని నుండే ఈ సృష్టి అంతా ఆవిర్భవిస్తుంది. అయినప్పటికీ పరమేశ్వరుని పూర్ణత్వానికి ఏ రకమైన భంగము రాదు. అందుచేతనే పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు 'నిధిరవ్యయః' అనబడుతున్నాడు.

## 31. సంభవః

అంతటా అవతరించేవాడు.

**నిధివ జ్ఞాతిగూఢోఽపి రామకృష్ణాది భేదతః ।**
**సమన్తాద్బహుధా జాత స్సమ్భవ పరికీర్తితః ॥**

పైన చెప్పినట్లుగా నిధిలాగా ఉండికూడా రాముడు, కృష్ణుడు మొదలైన అనేకమైన అవతారములెత్తి, తనను కోరినవారిని తృప్తి పరచువాడు.

**సమంతాత్ భవః యస్యసః** నిధిలాగా జాగ్రత్తగా పెట్టబడి కూడా తనను కోరినవారి కోరికలు తీర్చటం కోసము అనేక రూపములు, అవతారములు, ఎత్తినాడు.

తన భక్తుడైన ప్రహ్లాదుని రక్షించటం కోసం శ్రీహరి నరసింహావతారంతో స్తంభంలో నుంచి బయటకు వచ్చాడు.

యశోదాదేవి శ్రీకృష్ణుని వివాహం చూడలేదని బాధపడింది. ఆమె కోరిక తీర్చటానికి మరుజన్మలో తాను శ్రీవేంకటేశ్వరుడుగా జన్మించాడు. యశోదాదేవి వకుళాదేవిగా జన్మించింది. ఈ రకంగా జన్మించి శ్రీ వేంకటేశ్వరస్వామి, పద్మావతిల కల్యాణం కనులారా వీక్షించే అవకాశం యశోదాదేవికి కల్పించాడు అందుచేతనే 'సంభవః' అనబడుతున్నాడు.

**స్వేచ్ఛయా సిద్ధం సమీచీనం భవనం సంభవః** మిగిలిన జీవుల మాదిరిగా కర్మవశాన గాక, లోకాలకు మేలు చెయ్యాలనే తలంపుతో వివిధరకాలైన అవతారాలు ఎత్తినవాడు.

**పరిత్రాణాయ సాధూనాం వినాశాయ దుష్కృతాం ।**

**ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే ॥**

ఆర్తత్రాణ పరాయణుడైన శ్రీమన్నారాయణుడు దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేయటం కోసం ప్రతియుగంలోనూ ఉద్భవిస్తుంటాడు. అని **భగవద్గీత**లో చెప్పబడింది. అలాగే **దేవీసప్తశతి**లో

**ఇత్థం యదాయాదాబాధా దానవో ద్ధా భవిష్యతి ।**

**తదాతదావతీర్యాహం కరిష్యామరి సంక్షయమ్ ॥**

ఓ దేవతలారా ! మీకు ఎప్పుడైతే రాక్షసుల వలన బాధలు కలుగుతామో, అప్పుడు నేను భూలోకంలో అవతరించి శత్రునాశనము చేస్తాను. అని చెప్పబడింది.

ఈ రకంగా స్థితికారకుడుగా ఉన్న విష్ణుమూర్తి అవతారాలెత్తిన విధానం గురించి **దేవీభాగవతం**లో ఒకకథ ఉన్నది.

అనాదిగా దేవదానవుల యుద్ధాలు జరుగుతూనే ఉన్నాయి. ఆ యుద్ధంలో ముందుగా రాక్షసులే గెలిచినా, చివరకు ఏ మాయోపాయం చేతనైనా దేవతలే గెలిచేవారు. ఈ పరిస్థితిని సమీక్షించారు రాక్షసులు. తమను కాపాడగలిగినవాడు తమ గురువు శుక్రాచార్యుడు తప్ప వేరెవరూ లేరని భావించారు. ఒకరోజున రాక్షసులందరూ శుక్రాచార్యుని వద్దకు వచ్చి "గురుదేవా ! నువ్వే మాకు దిక్కు. యుద్ధంలో దేవతలు గెలవకుండా, రాక్షసులకే విజయం సిద్ధించేటట్లుగా ఏదైనా ఉపాయం ఆలోచించండి" అన్నారు. తీవ్రంగా ఆలోచించాడు శుక్రాచార్యుడు. "దేవతలకు రక్షణ కల్పిస్తున్నవాడు శ్రీమహావిష్ణువు అతనితో సమానమైనవాడు ఈశ్వరుడొక్కడే. కాబట్టి ఏదో రకంగా ఈశ్వరుణ్ణి మంచి చేసుకుంటే రాక్షసులు జయించవచ్చు" అని ఆలోచించినవాడై, రాక్షసులతో "ఓ దానవులారా ! నేను వెళ్ళి ఈశ్వరుణ్ణి ప్రసన్నుణ్ణి చేసుకుని వస్తాను. అంతవరకూ మీరు దేవతలతో యుద్ధానికి దిగకండి. మునివేషాలు ధరించి తాపసులలాగా తిరగండి. దేవతలకు మీకు వైరం లేదని, ఇక దేవతలజోలికి పోమని ఇంద్రుడికి కూడా కబురు చెయ్యండి. నేను హిమాలయాలకు వెళ్ళి ఈశ్వరుణ్ణి గురించి తపస్సు చేస్తాను." అన్నాడు. గురువుగారు చెప్పినట్లే తాపస వేషాలు ధరించారు రాక్షసులు. తాము దేవతలతో యుద్ధానికి రామని ఇంద్రుడికి కబురుకూడా చేశారు. ఆ మాటలు దేవతలుకూడా నమ్మారు.

కాలం గడుస్తోంది. శుక్రాచార్యుడు భీకరమైన తపస్సు చేశాడు. ఈశ్వరుడు ప్రత్యక్షమై 'ఏ వరం కావాలో కోరుకో' అన్నాడు. 'దేవతలమీద ఎప్పుడూ రాక్షసులు విజయం

సాధించేలా వరం కావాలి' అన్నాడు శుక్రుడు. ఆలోచనలో పడ్డాడు ఈశ్వరుడు. వరం ప్రసాదిస్తాను అన్నాడు కాబట్టి "ఓ శుక్రాచార్యా ! చుట్టూ పచ్చికట్టెలు పెట్టుకుని, నిప్పు రాజేసి, దాని పొగపీలుస్తూ, తలక్రిందులుగా నిలబడి పదివేల సంవత్సరాలు తపస్సు చేస్తే నీ కోరిక నెరవేరుతుంది" అన్నాడు. సరేనన్నాడు ఆచార్యుడు. ఈశ్వరుడు చెప్పిన విధంగానే తపస్సు చెయ్యటం ప్రారంభించాడు.

దేవతల నాశనం కోసం శుక్రాచార్యుడు తపస్సు చేస్తున్నాడు. రాక్షసులు మునీశ్వరులవటమనేది కపట నాటకము అనే విషయాన్ని చారులద్వారా విన్నాడు ఇంద్రుడు. వెంటనే దేవసైన్యాన్ని వెంట పెట్టుకుని రాక్షసుల వెంటపడ్డాడు. దేవతల దాటికి తట్టుకోలేక రాక్షసులు పలాయనం చిత్తగించారు. అయినా వదల్లేదు దేవతలు. అలా పారిపోయి పారిపోయి చివరకు శుక్రాచార్యుని ఆశ్రమంలో దూరారు.

ఆ సమయంలో శుక్రాచార్యుడు హిమాలయాలలో ఉన్నాడు. ఆయన తండ్రి అయిన భృగుమహర్షికూడా తపోనిష్ఠలో ఉన్నాడు. ఇక భృగుమహర్షి భార్య ఒక్కతే ఆశ్రమంలో ఉంది. రాక్షసులు ఆమె పాదాలు పట్టుకున్నారు. ప్రాణభిక్ష పెట్టమన్నారు. అభయమిచ్చింది భృగుపత్ని. ఇంతలో దేవతలుకూడా ఆశ్రమంలో ప్రవేశించారు. రాక్షసులను వదిలివేయమని తాము వారిని సంహరిస్తామని అన్నారు. వారికి తాను అభయమిచ్చానన్నది భృగుపత్ని. రాక్షసులను చంపబోయారు దేవతలు. రాక్షసులంతా ఆమె వెనక దాక్కున్నారు. భృగుపత్ని సమ్మోహనాస్త్రం ప్రయోగించింది. దేవతలందరూ మైకంలో పడిపోయారు. ఇంద్రుడు మాత్రం పారిపోయాడు. అతడి వెంటపడ్డది సమ్మోహనాస్త్రం. అలా పరుగెత్తి పరుగెత్తి విష్ణువును శరణుజొచ్చాడు ఇంద్రుడు. అభయమిచ్చాడు విష్ణువు. సమ్మోహనాన్ని తిరిగి వెళ్ళి పొమ్మన్నాడు. అస్త్రం మాటవినలేదు. 'ఇంద్రుని వదలకపోతే నిన్నుకూడా సంహరిస్తాను' అంటూ మీదికి వచ్చింది. చేసేదిలేక సుదర్శనాన్ని ప్రయోగించాడు విష్ణుమూర్తి. అది సమ్మోహనాన్ని నాశనంచేసి, సమ్మోహనాస్త్రాన్ని ప్రయోగించిన భృగుపత్నిని కూడా సంహరించింది. భృగుపత్ని శరీరం రెండు ముక్కలై రక్తపుమడుగులో పడిపోయింది.

ఈ దృశ్యం చూసిన రాక్షసులు హాహాకారాలు చేస్తూ వెంటనే ఈవార్తను భృగుమహర్షికి తెలియచేశారు. రక్తపుమడుగులోపడి ఉన్న భార్యను చూశాడు భృగువు. అతని కోపం కట్టలు తెంచుకుపోయింది. తన భార్యను ఈరకంగా సంహరించిన విష్ణుమూర్తిని భూలోకంలో నానాయోనులయందు జన్మించమని శపించాడు.

ఈ విషయం తెలిసి చాలా దుఃఖించాడు విష్ణువు. ఒకసారి జన్మించటమంటేనే అది నరకయాతన. గర్భవాసము చాలా బాధాకరమైనది. ఆ తరువాత జన్మించటము. బాల్యంలో

ఉండే కష్టాలు. సంసార లంపటం వృద్ధాప్యం. ఆ తరువాత మరణం. తలచుకుంటేనే భయం వేస్తుంది. ఇలా ఒకసారి కాదు. అనేకసార్లు దేవతలకు మేలు చెయ్యబోయి అనవసరంగా తను చిక్కుల్లోపడ్డాడు. ఈ రకంగా ఆలోచిస్తున్నాడు.

అప్పుడు పరమేశ్వరి, ఆదిపరాశక్తి ప్రత్యక్షమై "స్థితికారకా! విష్ణుమూర్తీ! దుఃఖించకు భృగుమహర్షి ఇచ్చిన శాపాన్ని నేను నీకు వరంగా మారుస్తాను. భూలోకంలో ఎప్పుడైతే అధర్మము పెచ్చురిల్లుతుందో, అప్పుడు నువ్వు భూలోకంలో జన్మించి ధర్మసంస్థాపన చెయ్యి." అన్నది. ఈ విధంగా ఆ పరమేశ్వరి ఆజ్ఞమేరకు విష్ణుమూర్తి వివిధ రకాలయిన అవతారాలు ఎత్తాడు.

ఈ రకంగా, మిగిలిన జీవులలాగా కర్మవశాన కాకుండా, స్వేచ్ఛగా, ధర్మసంస్థాపన కోసం వివిధ అవతారాలు ఎత్తాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు 'సంభవః' అనబడుతున్నాడు.

## 32. భావనః

ఉజ్జీవింపచేయువాడు.

**జనిత్వో జ్జీవయతి యో జనాన్స్యా ద్భావనస్తు సః ॥** పైన చెప్పిన విధంగా రకరకాల అవతారాలుఎత్తి సజ్జనులను అన్నివిధాల రక్షించేవాడు.

**భావయతి ఉజ్జీవయతీతి భావనః** అవతారము ఎత్తి, సాధువులకు, సజ్జనులకు అనిష్టమైనవాటిని నశింపచేసి, వారిని ఉద్ధరించువాడు. భగవద్గీతలో చెప్పినట్లుగా దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేయువాడు. అందుచేతనే 'భావనః' అనబడుతున్నాడు.

## 33. భర్తా

పోషించువాడు.

**యస్తాన్పుష్ణాత్యాత్మ దానాత్ । స భర్తా పరికీర్తితః ॥**

తన భక్తులకు తానే అధీనమైపోయి, వారిని పోషించువాడు.

**బిభర్తి పుష్ణాతీతి భర్తా** తననే ఇచ్చి పోషించువాడు.

**ప్రపంచస్య అధిష్ఠానతయా తం బిభర్తి**

ప్రపంచమును అధిష్ఠానరూపమున భరించేవాడు కాబట్టి 'భర్తా' అనబడుచున్నాడు. చరాచర జగత్తంతా ఆ పరమేశ్వరుని గర్భంలోనే ఉన్నది.

**శ్రీమద్భాగవతంలోని గజేంద్రమోక్షంలో**

**ఒకపరిజగముల వెలినిడి**

**ఒకపరిలోపలికి గొనుచు ఉభయము గనుచున్**

ఓ దేవదేవా ! నీ గర్భంలో ఉన్న లోకాలను ఒకసారి బయటకు పంపుతావు. అంటే సృష్టి చేస్తావు. అలాగే ఒకసారి లోపలికి తీసుకుంటాయి. అనగా ఈ జగత్తును లయం చేస్తావు. అంటూ పరమేశ్వరుణ్ణి ప్రార్థిస్తాడు. ఆ పరమేశ్వరుని గర్భంలోనే లోకాలన్నీ ఉన్నాయని ఇక్కడ భావన.

**శివపురాణం**లో పార్వతీ పరమేశ్వరులకు వివాహం జరిగింది. శివుడు తన వీర్యాన్ని అగ్నిలో విడిచాడు. ఆ విషయం తెలిసి దేవతలకు సంతానం కలుగుకుండు గాక ! అని శపించింది పార్వతీదేవి. ఆ సమయమంలో శివుడు ఆమెను ఊరడిస్తూ "దేవీ ! నీ గర్భకోశంలో చతుర్దశ భువనాలు నిండి ఉన్నాయి. నా ప్రథమవీర్యము వలన అవి దహించుకుపోతాయి. అందుచేత దాన్ని అగ్నిలో వదిలాను" అంటాడు. **శ్రీకృష్ణపరమాత్ముని** బాల్యక్రీడలను వర్ణిస్తున్నప్పుడు బాలకృష్ణుడు మన్ను తింటున్నాడని గోపాలురు యశోదకు చెబుతారు. ఆ మాటలు విన్న యశోదా దేవి కోపంతో కృష్ణుని చెవి మెలివేసి నోరు తెరిపిస్తుంది. అప్పుడు ఆమెకు శ్రీకృష్ణపరమాత్ముని నోటిలో చతుర్దశ భువనాలు కన్పిస్తాయి.

ఈరకంగా అనేకచోట్ల చెప్పటం జరిగింది. ఇక్కడ శివుడన్నా, కేశవుడన్నా, శక్తి అన్నా, కృష్ణుడు అన్నా ఆ పరమేశ్వరుడే అని మరచిపోరాదు. అతడే శ్రీమన్నారాయణుడు. లోకాలను భరించేవాడు కాబట్టి 'భర్తా' అనబడుతున్నాడు.

## 34. ప్రభవః

ఉత్కృష్టమైన జన్మకలవాడు.

**దేవాదిజనవైజాత్యాత్ ప్రకృషోత్పత్తి మత్త్వతః ।**

**అవిద్యాదోషవైదుర్యాత్ ప్రభవః పరికీర్తితః ॥**

దేవతలకుగాని, మానవులకుగాని వారి కర్మఫలితాన్ని బట్టి ఉత్తరజన్మలు వస్తాయి. వారికికూడా అవిద్యాదోషము ఉంటుంది. అటువంటి దోషాలు ఏవీలేక, తమ జన్మ రహస్యము తెలిసినటువంటి వారికి జన్మరాహిత్యము కలుగజేసేటటువంటి జన్మకలవాడు.

**ప్రకృష్టః భవః జన్మ యస్యసః**

అతిశయమయిన జన్మకలవాడు. దోషములు లేనటువంటి జన్మకలవాడు.

లోకాలను రక్షించటం కోసం పరమేశ్వరుడు వివిధ అవతారాలు ఎత్తాడు. అంటే భూలోకంలో మిగిలినజీవులలాగానే జన్మించాడు. అయితే అవి సాధారణమైన మానవజన్మల వంటివి కాదు. జీవి చేసినటువంటి కర్మ ఫలితాన్ని బట్టి ఉత్తరజన్మలు వస్తాయి. అని చెప్పటం జరిగింది. దైవత్వము అనేదికూడా మానవులు చేసే కర్మ వల్లనే వస్తుంది. దేవతలలో కర్మదేవతలు అని ఉన్నారు. వీరు గత జన్మలో తాముచేసిన కర్మ ఫలితమువల్ల, ఈ జన్మలో దైవత్వము పొంది ఉన్నారు. అలాగే గంధర్వులలో మానుష గంధర్వులు కూడా ఈ కోవకు చెందినవారే. ఈ విషయాలన్నీ ఉపనిషత్తులలో చెప్పబడ్డాయి.

మానవులకే కాకుండా దేవతలకు కూడా అవిద్య (అజ్ఞానము) ఉంటుంది. దాని కారణం చేతనే ఇంద్రపదవిలో ఉన్న నహుషుడు అతఃపతనం చెందాడు. అజ్ఞానంవల్లనే ఇంద్రుడు అహల్య దగ్గరకు పోయి, గౌతముడిచ్చిన శాపానికి లోనయ్యాడు.

పరమేశ్వరుడు అవతారమెత్తినప్పుడు, దానికి ఏదో ఒక బలమైన కారణముంటుంది. అంతేగాని తాను చేసిన కర్మ ఫలితంగా ఈ జన్మరాదు. అదే విధంగా ఈ అవతార పురుషుడికి అవిద్య ఉండదు. ఉదా॥ కృష్ణావతారంలో పాండవ పక్షపాతిగా కనుపించిన కృష్ణుడు వారికి చేసింది ఏమీ లేదు. కురుక్షేత్ర సంగ్రామంలో 18 అక్షోహిణీల సైన్యాన్నీ నాశనం చేయించాడు. కౌరవులకే కాదు పాండవులకు కూడా వంశనిర్మూలనమై పోయింది. యాదవ వంశంకూడా నాశనమైంది. చివరకు బోయవాడి చేతిలో తను కూడా ప్రాణాలు వదిలాడు. పైపెచ్చు 'రామావతారంలో చెట్టు చాటు నుండి వాలిని చంపినందుకు ఈ శిక్ష అనుభవిస్తున్నాను' అన్నాడు.

ఈరకంగా అజ్ఞానమనేది లేకుండా, తన జన్మకు కారణం ఏమిటి ? అనే విషయం తెలిసి ఉంటాడు. కేవలము భూభారం తగ్గించటానికే కృష్ణావతారము, రాక్షస సంహారం చెయ్యటానికి రామావతారము ఎత్తాడు. ఇలా అవతారమెత్తినప్పుడు తనను నమ్మినవారికి ఎందరికో శుభములనిచ్చాడు. ముక్తిని ప్రసాదించినాడు. ఈరకంగా ప్రతి అవతారంలోనూ జ్ఞాని అయి ఉండటము, తన జన్మ రహస్యాన్ని తెలుసుకొని ఉండటము, దుష్టశిక్షణ, ఆర్తత్రాణ పరాయణత అనే లక్షణాలు కలిగి ఉంటాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు ప్రభువు అనబడుతున్నాడు.

అన్ని భూతములు ఇతనినుంచే పుడుతున్నాయి. ఇతనిలోనే లయమవుతున్నాయి. ఆ పరమేశ్వరుడు ఉన్నాడనే భయంతోనే గాలిసవ్యంగా వీస్తున్నది. దిక్పాలకులు తమ తమ విధులను సక్రమంగా నిర్వర్తిస్తున్నారు. ఈ జగత్తంతా అతని ఆజ్ఞకు బద్ధమై ఉన్నది. అందుచేతనే అతడు ప్రభువు అనబడుతున్నాడు.

## 35. ప్రభుః

సమర్థుడు 299కూడా ఇదే నామము.

**బ్రహ్మాదీనాఞ్చ సర్వేషాం । భోగ మోక్ష సమర్పణే ।**

**సమర్థః ప్రభు రిత్యుక్తః । సర్వేష్ట ఫలదో మనుః ॥**

బ్రహ్మాదిదేవతలందరికీ లౌకిక, పారలౌకిక సుఖములు అనగా భోగమోక్షములను ఇవ్వగలిగిన సమర్థత కలవాడు.

**ప్రభవతీతి ప్రభుః** మానవజన్మ ఎత్తికూడా, బ్రహ్మాదిదేవతలకు కూడా దుర్లభమైన భోగము మోక్షములను ఇవ్వగలిగినవాడు. అన్ని పనులయందు సమర్థుడు.

పరమేశ్వరుడు మామూలు మానవుడుగా జన్మించినప్పటికీ అసాధ్యమైన పనులు కూడా చేయగలిగినవాడు. శ్రీమన్నారాయణుడు దశరథనందనుడుగా జన్మించి మామూలు మానవుడిగా మనమధ్య తిరుగుతూ వరబలసంపన్నుడైన వారిని సంహరించాడు. వాలి సామాన్యుడు కాదు. ఎదుటపడిన శత్రువు యొక్క సగం బలం తనకు వచ్చేటట్లుగా వరము పొందినవాడు. రావణబ్రహ్మనే సప్తసముద్రాలలోనూ ముంచి ఊపిరి ఆడకుండా చేసినవాడు. అటువంటి వాలిని ఒక్క దెబ్బతో సంహరించాడు. అనితర సాధ్యమైన సేతువు నిర్మించాడు. ముల్లోకాలను జయించిన రావణ బ్రహ్మను సంహరించాడు. తనను సేవించిన శబరికి మోక్షాన్ని ప్రసాదించాడు.

అదే విధంగా కృష్ణావతారమెత్తి అనేకమంది రాక్షసవీరులను చిన్నప్పుడే చంపేశాడు. కాళిందిమడుగులో విషం క్రక్కుతున్న కాళీయుని మర్దించాడు. గోపాలకుల మీద కోపం వచ్చి ఇంద్రుడు వడగళ్ళ వానకురిపిస్తే, గోవర్ధనోద్ధరణము చేసి వారిని రక్షించాడు. శిశుపాలుని సంహరించాడు. దగ్గర ఉండి జరాసంధుని చంపించాడు. సైంధవుని చంపటానికి తనచక్రం అడ్డుగావేసి లోకాలకు సూర్యాస్తమయ మయిందన్న భ్రాంతిని కలిగించాడు. ద్రౌపదిమాన సంరక్షణ చేశాడు. ఈరకంగా అనితరసాధ్యమైన పనులు ఎన్నో చేయగల సామర్థ్యం ఆ పరమేశ్వరుడొక్కడికి మాత్రమే ఉన్నది. అందుచేతనే అతడు 'ప్రభుః' అనబడుతున్నాడు.

## 36. ఈశ్వరః

ఐశ్వర్యము కలవాడు, అధికుడు. 74కూడా ఇదే నామము.

**మనుష్యాద్యవతారేఽపి । బ్రహ్మాదీంశ్చ ప్రయోజనే ।**

**నియన్తా త్వీశ్వరః ప్రోక్తః । ప్రాధాన్యఫలదోమనుః ॥**

తాను ఒక మానవుడిగా జన్మించినప్పటికీ, బ్రహ్మాది దేవతలను తనకోసం ఉపయోగించుకోగల శక్తి సామర్థ్యములు గలవాడు.

**ఈష్టే ఇతి ఈశ్వరః** తాను పరమేశ్వరుడుగా పరమపదములో ఉండేకన్న, అవతారాలెత్తినప్పుడు తన శక్తి ఎక్కువగా ఉపయోగిస్తుంది. కాబట్టి అవతారముల యందు ఎక్కువగా ఇష్టము గలవాడు.

తాను పరమేశ్వరుడుగా ఉన్నప్పుడు అన్నిపనులు సక్రమంగా జరుగుతూనే ఉంటాయి. కాని దుష్టశిక్షణ శిష్టరక్షణ చెయ్యాలంటే తాను వేరొక జన్మ ఎత్తాలి. కాబట్టి ఈ రకంగా అవతారాలెత్తి ధర్మసంస్థాపన చెయ్యటములో ఆసక్తి గలవాడు.

**నిరుపాధికం ఐశ్వర్యం అస్య అస్తి :** ఉపాధితో పని లేకుండానే సిద్ధించిన ఐశ్వర్యము గలవాడు. సృష్టి చెయ్యాలంటే మాయకావాలి. ఆ మాయ కూడా అతని అధీనంలోనే ఉంటుంది. అతని కన్న అధికులు ఎవరూ లేరు. అతని శక్తి స్వతః సిద్ధమైనది. **మాండూక్యోపనిషత్తు**లో ఈ విధంగా ఉంది.

**ఏష సర్వేశ్వర ఏషసర్వజ్ఞ ఏషోఽ౦ తర్యామ్యేషయోనిః ।**
**సర్వస్వ ప్రభవాస్య ఘౌ హి భూతానామ్ ॥**

అతడే అన్నింటికీ ప్రభువు. వాటియొక్క జ్ఞాతా, అంతర్యామీ, నియామకుడూ, కారణము, ఉత్పత్తీ, వినాశమూ అన్నీ అతడే. కాబట్టే అతడు ఈశ్వరుడనబడుతున్నాడు.

## 37. స్వయంభూః

స్వేచ్ఛగా అవతరించేవాడు.

**భవతి స్వేచ్ఛయా యోఽసౌ స్వయమ్భూః పరికీర్తితః**

బ్రహ్మాదులవలె తనయొక్క కర్మఫలము వలన కాకుండా, సంకల్ప మాత్రము చేతనే అవతరించువాడు. **స్వయమేవ భవతీతి స్వయంభూః** స్వేచ్ఛగా, తన యొక్క కోరిక ప్రకారము అవతరించేవాడు.

**స్వయం ఏవ భవతి** తనకు తానుగానే కలుగువాడు.

**బృహదారణ్యకోపనిషత్తు**లో ఈవిధంగా ఉంది. సృష్టికి పూర్వం మానవాకారములో ఉన్న విరాడాత్మ మాత్రమే ఉండేది. అతని కన్న వేరైనది ఏదీ లేదు. పురుషాకారములో ఉన్న ప్రజాపతి తాను ఒక్కడే అయికూడా భయభ్రాంతుడైనాడు. ఒంటరిగా ఉన్న ప్రజాపతి,

ఆ ఒంటరితనంలోని ఆనందాన్ని అనుభవించలేక స్త్రీని కోరాడు. అలా కోరిన వెంటనే స్త్రీ పురుషులు ఆలింగనము చేసుకున్నట్లుగా రూపుదాల్చాడు. తన శరీరాన్ని రెండు భాగాలుగా చేశాడు. ఆ భాగాలే భార్యాభర్తలు.

**శ్రీమద్రామాయణము**లో దేవతలు, మహర్షులు అందరూ వైకుంఠానికి వెళ్ళి రావణబ్రహ్మ ఆగడాలు మితిమీరి పోతున్నాయని, అతని బారి నుండి తమను రక్షించమని ప్రాధేయపడతారు. అప్పుడు శ్రీమహావిష్ణువు "అదిలక్ష్మి సీతగా మిథిలానగరంలో జన్మిస్తుంది. శంఖచక్రాలు – భరత శతృఘ్నులుగా, ఆదిశేషుడు – లక్ష్మణుడుగా, తాను – శ్రీరామచంద్రుడుగా దశరథ మహారాజు కుమారులుగా పుడతాము." అని చెబుతాడు.

ద్వాపరయుగంలో 'భూభారం పెరిగిపోతుంది. భరించలేకపోతున్నాను' అని భూదేవి మొరపెట్టుకున్నప్పుడు, దేవకి అష్టమగర్భాన జన్మించి నీ భారాన్ని తగ్గిస్తాను అన్నాడు. ఈ రకంగా స్వేచ్ఛగా అవతరిస్తాడు కాబట్టే 'స్వయంభూః' అనబడుతున్నాడు.

## 38. శంభుః

శుభమునిచ్చేవాడు.

**సౌన్దర్యాది గుణానాం యో । హ్యావిష్కారేణ శం సుఖమ్ ।**
**పుంసాం సమ్యగ్భావయతి । స శమ్భుః పరికీర్త్యతే ॥**

తనయొక్క భక్తులకు తన సౌందర్యాది గుణాలను ఆవిష్కరింపచేసి బాగా సౌఖ్యమును ఇచ్చేవాడు. **శభావయతీతిశంభుః** శం అనగా సుఖమును కలిగించువాడు. తన సౌందర్యము, సౌశీల్యము మొదలైన గుణాలను ప్రకటిస్తూనే జనులకు సుఖమును కలుగచేయువాడు.

**యచ్చకించి జ్జగత్సర్వం దృశ్యతే శ్రూయతే ఽపివా**
**అంతర్బహిశ్చత త్సర్వం వ్యాప్యనారాయణ స్థితః**
**అనంతమవ్యయం కవిగ్ం సముద్రేఽంతం విశ్వశంభువమ్ ॥**

బ్రహ్మాండంలో స్వల్పమైనటువంటి ఈ జగత్తు ఘటాకాశములాగా వేరుగా ఉన్నట్లు అనిపిస్తుంది. దానికి బయటాలోపలా అంతటా శ్రీమన్నారాయణుడే వ్యాపించి ఉన్నాడు. అతడు అంతములేనివాడు అనంతుడు, నాశనము లేనివాడు – శాశ్వతుడు. సంసార సాగరమునుండి విముక్తిని కలిగించి సుఖమును ప్రసాదించేది ఇతడే.

**భక్తానాం శంభావయతీతి శంభుః** తన భక్తులకు సుఖమును కలిగించువాడు.

సుఖము అనగా – అనందము, తృప్తి, దుఃఖరాహిత్యము, సౌలభ్యము, క్షేమము, స్వర్గము. అని అర్థం చెబుతోంది సూర్యరాయాంధ్ర నిఘంటువు. సుఖము అంటే ఆనందం. ఈ ఆనందము రెండు రకాలు : 1. క్షణికానందము 2. శాశ్వతానందము

1. అనుభవించిన తరువాత తీరిపోయేది క్షణికానందము. ఇది కొద్దిసేపు మాత్రమే ఉంటుంది. ఇంద్రియాల ద్వారా పొందేది ఈ రకమైన ఆనందము. తినటము, త్రాగటము, వినటము, మైథునక్రియ ఇత్యాదులవల్ల పొందేది.

2. రెండవది శాశ్వతమైన ఆనందము. ఇదే మహదానందము బ్రహ్మానందము. ఈ రకమైన ఆనందము అనిర్వచనీయమైనది. మానుషానందానికి కొన్నికోట్ల రెట్లు ఉంటుంది.

పరమేశ్వరుడు ఆనందస్వరూపుడు. పంచకోశముల నడుమ ఆనందమయ కోశమందు ఉంటాడు. నిరంతరము చిన్మయానందములో తేలియాడుతుంటాడు. అటువంటి పరమేశ్వరుడు తన ఆనందాన్ని, తన భక్తులకు కూడా పంచి ఇస్తాడు. ఈ ఆనందము ఎంతగా అనుభవించినా తరగదు. శాశ్వతమైనది.

ఈ రకంగా శ్రీమన్నారాయణుడు తన భక్తులకు ఇహ, పరసుఖములను కలుగచేస్తాడు కాబట్టే 'శంభుః' అనబడుతున్నాడు.



# 12. ప్రభావిద్య

"గురువుగారు ! ప్రభావిద్య అంటే ఏమిటి ? శ్రీమహావిష్ణువును భానుమండలములో ఉపాసించాలి అనా? లేక సూర్యభగవానుడే శ్రీమహావిష్ణువు అనా ? ఈ విషయం వివరంగా చెప్పండి' అని అడిగాడు నారాయణభట్టు. ఆ మాటలు విన్న రత్నాకరుడు ఒక్క క్షణం మౌనం వహించి ఆ తరువాత చెప్పటం ప్రారంభించాడు.

నారాయణ భట్టారకా ! ప్రత్యక్ష దైవము అయిన సూర్యభగవానుడే శ్రీమహావిష్ణువు. అంతేకాదు. అంతఃపూజ చేసేవారు ఆపరమేశ్వరుణ్ణి మణిపూర చక్రమునుంచే ఆరాధించాలి. ఈ రెండు విషయాలు ఇక్కడ చెప్పబడ్డాయి. వాటిని వివరిస్తాను వినండి.

**ప్రశ్నోపనిషత్తు**లో కబంధి అనేవాడు పిప్పలాదమహర్షిని "దేవా ! జగత్తులో ప్రాణికోటి ఏ రకంగా ఉద్భవిస్తున్నది?" అని అడుగుతాడు. దానికి పిప్పలాదుడు "కబంధా ! ప్రజాపతి సంతానాన్ని పొందగోరినవాడై తపస్సు చేశాడు. ఇక్కడ తపస్సు అంటే పూర్వకల్పంలో తాను చేసిన సృష్టిని ధ్యానించటమే.

ఈ రకంగా తపస్సు చేసి 'రయి' 'ప్రాణము' అనే జంటను సృష్టించాడు. 'రయి' అంటే అన్నము, పదార్థము, చంద్రుడు అని అర్థం. చంద్రుని వల్లనే భూమిమీద ద్రవ్యత్వము, రసము కలుగుతున్నాయి. చంద్రుడే ఓషధులకు, వనస్పతులకు కారకుడు. ఓషధులు, వనస్పతులే అన్నము. ఈ రకంగా పదార్థము అంటే చంద్రుడు, అన్నము. ఇక శక్తికి ప్రతీక సూర్యుడు, ఇతడు అగ్నితత్వాత్మకుడు. అగ్నియే ప్రాణము. కాబట్టి అన్నము ప్రాణము ద్వారానే జీవము వర్థిల్లుతున్నది.

సూర్యుడు తూర్పుదిక్కున ఉదయించి అక్కడి ప్రాణులపై తన కిరణములను ప్రసరింప చేస్తున్నాడు. సూర్యకిరణాలలో ప్రాణమున్నది. ఆ కిరణములు తూర్పుదిక్కు అంతా వ్యాపించి ఉంటాయి. కాబట్టి ఆ దిక్కున ఉన్న ప్రాణులన్నింటినీ తనలోలీనం చేసుకుంటాడు. అదే విధంగా దక్షిణము, పడమర, ఉత్తరము, ఊర్ధ్వలోకాలు, అధోలోకాలు ప్రవేశించి సర్వప్రాణులను తన కిరణాలతో ధరిస్తున్నాడు. ఈ రకంగా ఎక్కడైతే జీవము, ప్రాణము ఉన్నాయో, అదంతా సూర్యుని ప్రభావమే. అతడే సమస్త చరాచరములకు, అగ్నికీ ఆత్మ. అతడే సర్వభోక్త జ్ఞానసంపన్నుడు. కాంతి స్వరూపుడు వేడిని ఇచ్చేవాడు. అద్వితీయుడైన ఆ సూర్యుడే ఆత్మస్వరూపుడు. లోకంలోని ప్రాణులను రక్షించటానికి నిత్యమూ ఉదయిస్తుంటాడు" అంటాడు. **దేవీభాగవతము**లో "సూర్యుడికి ఉదయాస్తమానాలు లేవు.

అయితే అతడు కనిపించటము, లేకపోవటాన్ని బట్టి అవి చెప్పబడ్డాయి. మేరుపర్వతము అన్ని ద్వీపాలకు, అన్ని వర్షాలకు ఉత్తరంగానే ఉన్నది. ఎవరికి ఎక్కడ సూర్యుడు ఉదయిస్తున్నట్లు కనిపిస్తే అది వారికి తూర్పుదిక్కు అస్తమించేది పడమర దిక్కు.

సూర్యుడు ఉత్తరాయణంలో ఆరోహణ క్రమంలోను, దక్షిణాయనంలో అవరోహణ క్రమంలోను తిరుగుతాడు. అందుచేతనే ఉత్తరాయణంలో మందగతి అంటే పగటి పొద్దు ఎక్కువ. దక్షిణాయనంలో శీఘ్రగతి – రాత్రి పొద్దు ఎక్కువ. సూర్యుడు, మేష, తులారాసుల యందున్నప్పుడు రాత్రింపగళ్ళు సమానంగా ఉంటాయి. వృషభరాశి నుంచి కన్యారాశి వరకు అహః ప్రమాణము ఎక్కువ. వృశ్చికము నుంచి మీనం వరకు రాత్రి సమయం ఎక్కువ.

| | | |
|---|---|---|
| తూర్పుదిక్కున | – | ఇంద్రుని నివాసమైన స్వర్గము |
| దక్షిణ దిక్కున | – | యముని నివాసమైన సంయమనీ నగరము |
| పశ్చిమదిక్కున | – | వరుణుని నగరమైన విమ్లోచని |
| ఉత్తరదిక్కున | – | కుబేరుని నగరమైన విభావరి ఉన్నాయి. |

సూర్యుడు తూర్పున ఇంద్రపురంలో ఉదయించి రెండు ఝాములకు యమపురి చేరి, వరుణపురిలో అస్తమిస్తాడు. మళ్ళీ అక్కడ నుంచి కుబేర నగరానికి, ఇంద్రపురికి చేరే కాలము రాత్రి ఈరకంగా సూర్యుడు స్వగతిలో ప్రయాణం చేసి మేరు పర్వతానికి ప్రదక్షిణ చేస్తుంటాడు. అందుచేతనే పగలు, రాత్రి ఏర్పడతాయి. అని చెప్పబడింది.

**సప్తయంజంతి రథమేకచక్ర ఏకోవహతి సప్తనామాః** సూర్యుని రథానికి 'సప్త' అనేపేరుగల ఒకటే గుర్రము. ఒకటే చక్రము ఉంటాయి. ఆ చక్రానికి పన్నెండు ఆకులు ఉంటాయి. పన్నెండు ఆకులే మాసాలు. రథచక్రము ఒకసారి తిరిగితే సంవత్సరము అవుతుంది. ఇదే కాలచక్రము. **హాయనాత్మామహాదేవః ప్రజాపతిరితిస్మృతి** అతడే కాలపురుషుడు, ప్రజాపతి అని యామళ గ్రంథాలు చెబుతున్నాయి.

ఆకాశంలో కనిపించే సూర్యభగవానుడే ప్రత్యక్షనారాయణుడు. అతడే పరమేశ్వరుడు. ఆదిమధ్యాంతములు లేనివాడు. సర్వజీవులకు ప్రాణదాత. సూర్యకిరణముల ప్రభావంచేతనే చరాచర జగత్తు అంతా మనగలుగుతున్నది.

అధర్వణవేదములో ప్రత్యేకంగా **సూర్యోపనిషత్తు** ఉన్నది. దానిలో "సూర్యభగవానుడు ఎర్రని పద్మమునందు ఆసీనుడై ఉంటాడు. అతని రథానికి 'సప్త' అనే పేరుగల అశ్వము

ఉంటుంది. అతడికి నాలుగు చేతులున్నాయి. వాటిలో రెండు చేతులయందు పద్మములు, మిగిలిన రెండింటియందు అభయ వరదముద్రలు ధరించి ఉంటాడు. ఈ జగత్తుకు సూర్యుడే ఆత్మ. అతనివల్లనే ప్రాణులు పుడుతున్నాయి. అతనివల్లనే యజ్ఞము, పర్జన్యుడు, అన్నము కలుగుతున్నాయి. కంటికి ఎదురుగా కనపడే సూర్యుడే బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు. అతడే ఋక్కు. అతడే యజస్సు, అతడే సామము, అతడే అధర్వణవేదముకూడా. సూర్యునివల్లనే వాయువు, జలము, అగ్ని, ఆకాశము, భూమి మొదలైన పంచభూతాలు ఉద్భవించినాయి. అతనివల్లనే దేవతలు ఉద్భవించారు. అతనివల్లనే వేదాలు పుట్టినాయి.

ఆదిత్యుడే ఈ జగత్తును ప్రకాశింపచేస్తున్నాడు. ఆదిత్యుడే బ్రహ్మ. అతడే అంతః కరణము, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అతడే, ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమానవాయువులు అతడే. ఆదిత్యుడే శ్రోత్రము, త్వక్కు, చక్షువు, జిహ్వ, నాసిక. ఈరకంగా జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, పంచతన్మాత్రలు కూడా ఆదిత్యుడే. అతడు విజ్ఞాన మయుడు, ఆనందమయుడు, విజ్ఞానఘనుడు, అతనివల్లనే ప్రాణులు ఉద్భవిస్తున్నాయి. రక్షింపబడుతున్నాయి. చివరకు అతనియందే లయమవుతున్నాయి. అటువంటి ఆదిత్యునికి నేను నమస్కరించుచున్నాను." అని చెప్పబడింది. ఈ రకంగా ఆదిత్యుడే పరబ్రహ్మ.

మంత్రశాస్త్రంలో సూర్యుడికి ప్రత్యేకమైన ఉపాసనకూడా ఉన్నది. దీనినే సౌరోపాసన అంటారు. ఇందులో అష్టాక్షరి, నవాక్షరి, దశాక్షరి అని అనేక మంత్రాలు ఉన్నాయి.

రామరావణ సంగ్రామం జరుగుతోంది. ఆ యుద్ధంలో శ్రీరామచంద్రుడు బాగా అలసిపోయాడు. రావణుని వధించే మార్గం తెలియక విచారగ్రస్తుడై ఉన్న సమయంలో అగస్త్య మహర్షి శ్రీరామునివద్దకు వచ్చి సర్వశత్రు సంహారకరి, పరమపావనము అయిన **"ఆదిత్య హృదయాన్ని"** అతడికి ఉపదేశిస్తాడు.

**తతో యుద్ధపరిశ్రాన్తం సమరే చిన్తయాస్థితిమ్ ।**
**రావణం చాగ్రతో దృష్ట్వా యుద్ధాయ సముపస్థితమ్ ॥**
**దైవతైశ్చ సమాగమ్య ద్రష్ట మభ్యాగతో రణమ్ ।**
**ఉపాగమ్యా బ్రవీద్రామ మగస్త్యో భగవాన్ ఋషిః ॥**

రామ రావణ యుద్ధమును చూచుటకు దేవతలతోకూడ వచ్చియున్న అగస్త్య మహాముని, యుద్ధము చేయుటవలన అలసియున్నవాడును, రావణుని ఎలా వధించాలి అను విచారముతో కూడినవాడును, ఎదుటనున్న రావణుని చూచి యుద్ధమునకు సిద్ధపడిన వాడునునైన రాముని సమీపించి యిట్లు పేర్కొన్నాడు.

**రామరామ మహాబాహో శ్రుణు గుహ్యం సనాతనమ్ ।**
**యేన సర్వానరీన్ వత్స సమరే విజయిష్యసి ॥**

**ఆదిత్య హృదయం పుణ్యం సర్వ శత్రు వినాశనమ్ ।**
**జయావహం జపేన్నిత్య మక్షయ్యం పరమం శివమ్ ॥**

**సర్వమంగళ మాంగళ్యం సర్వపాప ప్రణాశనమ్ ।**
**చిన్తాశోక ప్రశమన మాయుర్వర్ధన ముత్తమమ్ ॥**

మహాబాహువులు గల ఓ రామా ! నీ కొరక సనాతనమైన రహస్యమును చెప్పుచున్నాను వినుము. ఈరహస్యమువలన నీవు శత్రువులనందరినీ జయింపగలవు. ఆదిత్యహృదయ మను స్తోత్రము కలదు. అది పావనమయినది. సకల శత్రునాశకమయినది, జయమును కలిగించునది, అక్షయఫలము నిచ్చునది, సర్వమంగళప్రదమైనది, సమస్త పాపములను పోగొట్టునది, దీర్ఘాయువును కలుగజేయునది, చింతా శోకముల నివారించునది, ఉత్తమోత్తమమైనది. దానిని జపించవలయును.

**రశ్మిమంతం సముద్యన్తం దేవాసుర నమస్కృతమ్ ।**
**పూజయస్వ వివస్వన్తం భాస్కరం భువనేశ్వరమ్ ॥**

నిత్యసూర్యుల మధ్య ప్రకాశించువాడును, లోకమును కర్మప్రవృత్తము చేయువాడును, దేవాసుర సమస్కృతుడును, సర్వవ్యవహారకారకుడును, జ్ఞానజ్ఞేయములను తెలియచేయు వాడును, లోకములకు ప్రభువునగు నారాయణుని పూజింపుము.

**సర్వదేవాత్మకో హ్యేష తేజస్వీ రశ్మిభావనః ।**
**ఏష దేవాసురగణాన్ లోకాన్ పాతి గభ స్తిభిః ॥**

సవితృమండల మధ్యవర్తియైన నారాయణుడు సమస్తదేవతలు తన శరీరముగా గలవాడు. పరులనెదిరించు సామర్థ్యము గలవాడు. నిత్యుల, ముక్తుల నిర్వాహకుడు, దైవాసుర ప్రవృత్తులు గలవారిని, ప్రజలను రక్షించుచున్నాడు.

**ఏష బ్రహ్మా చ విష్ణుశ్చ శివ స్కన్ధః ప్రజాపతిః ।**
**మహేన్ద్రోధనదః కాలో యమ స్సోమో హ్యపాం పతిః ॥**

ఈతడు సమస్త దేవతల శరీరములందు వ్యాపించియుండును. బ్రహ్మ, విష్ణు, శివ, స్కంధ, ప్రజాపతులు, ఇంద్ర, కుబేర, మృత్యు, యమ, చంద్ర, వరుణుల యొక్కయు శరీరములందు వ్యాపించి యుండును.

**పితరో వసవ స్సాధ్యా హ్యశ్వినౌ మరుతో మనుః ।**

**వాయుర్వహ్నిః ప్రజాప్రాణా ఋతుగర్తా ప్రభాకరః ॥**

పితృదేవతలయందును, వసువులయందును, సాధ్యులయందును, అశ్వినీదేవతల యందును, మరుత్తులయందును, మనువునందును, వాయ్వగ్నులందును అంతర్యామియై నున్నవాడును, జనుల ప్రాణరూపుడును, ఋతుప్రవక్తయు, ఆదిత్యమండలాంతర్వర్తియు ఈ నారాయణుడే !

**ఆదిత్యః సవితా సూర్యః ఖగః పూషా గభ స్తిమాన్ ।**

**సువర్ణ సదృశో భాను ర్హిరణ్యరేతా దివాకరః ॥**

ఓ దేవా ! నీవు భూమికి భర్తవు, లోకములను సృజించువాడవు. స్థావర జంగమాత్మక మగు లోకమునకు అంతర్యామివి, దహరాకాశమును పొందినవాడవు, లోకములను పోషించువాడవు, దిక్కులంతటను వ్యాపించు లక్ష్మీదేవిని కలవాడవు, బంగారు మేనిఛాయ గలవాడవు, ప్రకాశించువాడవు, జ్ఞానమును ప్రసాదించువాడవు – అనగా అజ్ఞానమును పోగొట్టి జ్ఞానమును ప్రసాదించువాడవు.

**హరిదశ్వః సహస్రార్చి స్సప్తసప్తిర్మరీచిమాన్ ।**

**తిమిరోన్మథనశ్శంభు స్త్వష్టా మార్తాండ అంశుమాన్ ॥**

ఓ దేవా ! నీవు మనోహర వాహనుడవు, సర్వమంగళ గుణశీలుడవు సప్తాశ్వునికి అంతర్యామివి, శత్రువులను ధ్వంసముచేయు చక్రాది ఆయుధములు ధరించినవాడవు, జ్ఞానాటంక నిరోధివి, సుఖప్రదాతవు, ప్రళయానంతరము మరల లోకములను సృష్టించువాడవు, ప్రపంచము లోపల వెలుపల వ్యాపించువాడవు.

**హిరణ్యగర్భ శ్శిశిర స్తపనో భాస్కరో రవిః ।**

**అగ్నిగర్భోఽదితేః పుత్రః శంఖ శ్శిశిరనాశనః ॥**

ఓ దేవా ! నీవు హిరణ్మయ బ్రహ్మాండమును సృష్టించినవాడవు, తాపత్రయ నివారణుడవు, భక్తుల శత్రువులను నిర్మూలించువాడవు, సర్వవస్తు పరిజ్ఞానమునకు కారణభూతుడవు, బ్రహ్మకు వేదములను ఉపదేశించినవాడవు, కాలాగ్ని రుద్రుడు గర్భమునందు గలవాడవు, అదితి పుత్రుడగు యింద్రుని రక్షించినవాడవు, సతతము ఆనందమూర్తివి, శీతబాధానివారకుడవు.

**వ్యోమనాథ స్తమోభేదీ ఋగ్యజుస్సామ పారగః ।**

**ఘనవృష్టి రపాం మిత్రో వింధ్య వీథీ ప్లవంగమః ॥**

ఓ దేవా ! నీవు గగన నిర్మాతవు, భక్తుల తమోగుణమును పోగొట్టువాడవు, ఋగ్యజుస్సామ వేదములచే తెలియదగినవాడవు, సర్వకర్మ ఫలరూప వర్షదాతవు, సముద్ర జలమున శయనించువాడవు, దుర్గమమైన సుషుమ్నా పథమునందు భక్తులు పోవునట్లు చేయువాడవు – అనగా మోక్షమును ప్రసాదించువాడవు.

**ఆతపీ మండలీ మృత్యుః పింగళ స్సర్వతాపనః ।**

**కవి ర్విశ్వో మహాతేజా రక్తః సర్వ భవోద్భవః ॥**

ఓ దేవా ! నీవు మహాజ్ఞానివి, కౌస్తుభాది భూషణములు గలవాడవు, లయకారకుడవు, సర్వవ్యాపకుడవు, బ్రహ్మాండమునంతటిని దహింపజేయువాడవు, సర్వజ్ఞుడవు, విశ్వరూపుడవు, మహాసామర్థ్యశాలివి, భక్తులపాలిటి అనురాగముగలవాడవు, సర్వకారణభూతుడవు.

**నక్షత్ర గ్రహ తారాణా మధిపో విశ్వభావనః ।**

**తేజసామపి తేజస్వీ ద్వాదశాత్మ న్నమోఽస్తుతే ॥**

ఓ దేవా ! నీవు నక్షత్ర గ్రహతారలయందు అంతర్యామివి. విశ్వస్థితి హేతుడవు, ఇతర తేజస్సులను అణచివేయు మహాతేజస్వివి, ద్వాదశాదిత్యులయందు అంతర్యామివి అయిన నీ కిదే నమస్కారము.

**నమః పూర్వాయ గిరయే పశ్చిమే గిరయే నమః ।**

**జ్యోతిర్గణానాం పతయే దినాధిపతయే నమః ॥**

ఓ దేవా ! తూర్పు పడమటికొండలయందు అంతర్యామివై యున్న నీకు నమస్కారము. ముక్తుల సముదాయమునకు నాయకుడవైన నీకు నమస్కారము. దినమణియగు సూర్యునియందు అంతర్యామివైన నీకు నమస్కారము.

**జయాయ జయభద్రాయ హర్యశ్వాయ నమో నమః ।**

**నమో నమ స్సహస్రాంశో ఆదిత్యాయ నమో నమః ॥**

ఓ దేవా ! భక్తులు సంసారసాగరమును తరింప తోడ్పడు నీకు నమస్కారము. జయమంగళప్రదుడవగు నీకు నమస్కారము. శ్రేష్ఠవాహనుడివైన నీకు నమస్కారము. అమిత తేజస్వియగు నీకు నమస్కారము. సూర్యమండలాంతర్వర్తియైన నీకు నమస్కారము.

**నమ ఉగ్రాయ వీరాయ సారంగాయ నమో నమః ।**

**నమః పద్మ ప్రబోధాయ మార్తాండాయ నమో నమః ॥**

భక్తులు కానివారికి ఉగ్రుడవును, కర్మప్రోత్సాహివియునగు నీకు నమస్కారము. ప్రణవప్రతిపాద్యుడవయిన నీకు నమస్కారము. భక్తుల హృదయకమలముల వికసింపజేయు నీకు నమస్కారము. ప్రళయానంతరము బ్రహ్మాండమును మరల సృజించు నీకు నమస్కారములు.

**బ్రహ్మేశానాచ్యుతేశాయ సూర్యాయాదిత్యవర్చసే ।**

**భాస్వతే సర్వభక్షాయ రౌద్రాయ వపుషే నమః ॥**

త్రిమూర్తులకు నాయకుడవైన పరబ్రహ్మస్వరూపుడవును, ప్రాణికోటి కర్మాచరణ నియంతవును, సూర్యమండల తేజస్స్వరూపియు, మహాతేజస్వియు, సమస్తమును సంహరించువాడవును, రౌద్రాకారుడవును నైన నీకు నమస్కారము.

**తమోఘ్నాయ హిమఘ్నాయ శత్రుఘ్నాయామితాత్మనే ।**

**కృతఘ్నఘ్నాయ దేవాయ జ్యోతిషాం పతయే నమః ॥**

అజ్ఞానమును నిర్మూలించువాడవు, భక్తులకు సుఖదుఃకాది ద్వంద్వములను సహించు శక్తి నొసగువాడవు, అరిషడ్వర్గనాశకుడవు, అపారమహిమోపేతుడవు, మహాపాపుల శిక్షించు వాడవు, సూర్యచంద్రాది జ్యోతిర్వర్గమునకు కాంతినిచ్చువాడవు అగు నీకు నమస్కారము.

**తప్తచామీకరాభాయ వహ్నయే విశ్వకర్మణే ।**

**నమస్తమోఽభి నిఘ్నాయ రుచయే లోకసాక్షిణే ॥**

బంగారు వన్నె దేహముచాయవాడవు, అగ్నిస్వరూపుడవు, సమస్త లోకమునకు ఆధారభూతుడవు, అజ్ఞానమును నశింపజేయువాడవు. ప్రకాశమూర్తివి, సర్వజనులు చేయు కర్మలకు సాక్షిభూతుడవు అగు నీకు నమస్కారము.

**నాశయ త్యేషవై భూతం తదేవ సృజతి ప్రభుః ।**

**పాయత్యేష తప త్యేష వర్ష త్యేష గభ స్తిభిః ॥**

సర్వనియామకుడైన ఈతడు జగత్తులను లయింపచేసి మరల సృజించును. తన రశ్మిచేత తాపము కలిగించి యెండింపజేసి వర్షము కురిపించును.

**ఏవ సు ప్తేషు జాగర్తి భూతేషు పరినిష్ఠితః ।**

**ఏషచైవాగ్నిహోత్రం చ ఫలం చైవాగ్నిహోత్రిణామ్ ॥**

ప్రాణికోటి సుషుప్తియందుండగా, ఈతడు సర్వత్ర వ్యాపించి (అంతర్యామియై) మేలుకొని యుండును. అగ్నిహోత్రము, అగ్నిహోత్రార్చన ఫలము గూడ నీయనే.

**వేదాశ్చ క్రతవశ్చైవ క్రతూనాం ఫలమేవ చ ।**

**యాని కృత్యాని లోకేషు సర్వ ఏష రవిః ప్రభుః ॥**

వేదములకు, క్రతువులకు, క్రతుఫలములకు, లోక కృత్యములన్నిటికీ ప్రభువు ఈ ఆదిత్యుడే (సూర్యమండలవర్తి నారాయణుడే)

**ఏనమాపత్సు కృచ్ఛ్రేషు కాంతారేషు భయేషు చ ।**

**కీర్తయన్ పురుషః కశ్చిన్నావసీదతి రాఘవః ॥**

ఓ రామా ! ఆపత్కాలమున, కష్టములు వచ్చినపుడు, భీకరారణ్యములో చిక్కుకున్నప్పుడు, భయస్థితులలో మానవుడు ఈ ఆదిత్య హృదయమును పఠించినచో ఆ యాపదలనుండి బయటపడి సుఖించును.

**పూజయస్వైన మేకాగ్రా దేవదేవం జగత్పతిమ్ ।**

**ఏతత్త్రిగుణితం జప్త్వా యుద్ధేషు విజయిష్యసి ॥**

ఓ రామా ! నీవు ఏకాగ్రచిత్తుడవై దేవదేవుడు, జగత్పతియగు నీయనను పూజింపుము. ఈ ఆదిత్యహృదయమును ముమ్మారు జపింపుము. యుద్ధములో నీకు తప్పక విజయము చేకూరును.

**అస్మిన్ క్షణే మహాబాహో రావణం త్వం వధిష్యసి ।**

**ఏవముక్త్వా తదాగస్త్యో జగామ చ యథాగతమ్ ॥**

“మహాబాహూ ! నీవీ రీతిగా చేసిన క్షణములో రావణుని వధింపగలవు” అని చెప్పి అగస్త్య మహాముని తాను వచ్చిన దారినే పోయెను.

**ఏతచ్ఛ్రుత్వా మహాతేజా నష్టశోకోఽభవత్తదా ।**

**ధారయామాస సుప్రీతో రాఘవః ప్రయతాత్మవాన్ ॥**

మహాతేజస్వియైన శ్రీరాముడు దీనిని విని, మనస్సులోని చింతను విడిచి, మిగుల సంతోషించి, ఏకాగ్రమైన మనస్సుతో యీ స్తోత్ర ప్రతిపాదిత దైవమును ధ్యానించెను.

**ఆదిత్యం ప్రేక్ష్య జప్త్వాతు పరం హర్ష మవాప్తవాన్ ।**

**త్రిరాచమ్య శుచిర్భూత్వా ధనురాధాయ వీర్యవాన్ ॥**

మహావీరుడగు శ్రీరాముడు ఆచమనము చేసి, శుచియై, సూర్యుని చూచి (సూర్యమండలాంతర్వర్తియైన భగవంతుని ధ్యానించి) మూడుసార్లు ఈ ఆదిత్య హృదయమును జపించి, అమిత సంతోషముతో వింటిని గ్రహించెను.

**రావణం ప్రేక్ష్య హృష్టాత్మా యుద్ధాయ సముపాగతమ్ ।**

**సర్వయత్నేన మహతా వధే తస్య ధృతోఽభవత్ ॥**

రావణుని చూచి శ్రీరాముడు యుద్ధము చేయుటకు ఉత్సాహముతో వానిని సమీపించెను. ఆ రావణుని చంపుటకు దృఢ నిశ్చయుడయ్యెను.

**అథ రవి రవద న్నిరీక్ష్య రామం ముదితమనాః పరమం ప్రహృష్యమాణః ।**

**నిశిచరపతి సంక్షయం విదిత్వా సురగణమధ్యగతో వచస్త్వరేతి ॥**

ఇట్లు శ్రీరాముడు దేవదేవుని ధ్యానింపగా సూర్యుడు (సూర్యమండలాంతర్వర్తి యగు నారాయణుడు) మిక్కిలి సంతసించెను. దేవతా సమూహమంతయును తన్ను పరివేష్టించి యుండగా ఆయన శ్రీరామునికి విదితుడై రాక్షసరాజునకు మృత్యువాసన్న మైనదని, "ఓ రామా ! నీవు ఆలసింపకుము, పోరు సలుపుము' అని హెచ్చరించెను.

ఈ రకంగా సూర్యభగవానుడే పరబ్రహ్మ. అతడే శ్రీమన్నారాయణుడు. శరీరంలో షట్చక్రాలున్నాయి. వాటిలో రెండు రెండు చక్రాలు కలిసి ఒక మండలముగా చెప్పబడ్డాయి.

ఆధార స్వాధిష్ఠానాలు – అగ్ని మండలము

మణిపూర అనాహతాలు – సూర్యమండలము

విశుద్ధి ఆజ్ఞాచక్రాలు – చంద్రమండలము

వీటిలో పరమేశ్వరుణ్ణి అర్చించేటప్పుడు ఆధార స్వాధిష్ఠానాలు అంధకార బంధురాలు. అక్కడ కేవలము ఐహిక సుఖాలు కోరేవారు మాత్రమే పరమేశ్వరుణ్ణి అర్చించాలి. మోక్షవాదులు భానుమండలము నుండి పరమేశ్వరుణ్ణి అర్చించాలి అని చెప్పబడింది. శంకర భగవత్పాదుల పరమగురువైన గౌడపాదాచార్యులవారు.

**సూర్య మండల మధ్యస్థాం దేవీం త్రిపురసుందరీమ్ ।**

**పాశాంకుశ బాణహస్తాం ధారయంతీం ప్రపూజయేత్ ॥**

నాలుగు చేతులయందు పాశము అంకుశము ధనుర్బాణములు ధరించిన ఆ పరమేశ్వరిని సూర్యమండలమునందే అర్చించాలి అన్నారు. లొల్లా లక్ష్మీధరుడు.

**యేచింతయంత్యరుణ మండల మధ్యవర్తీం** అంటూ ఆ పరమేశ్వరి భానుమండల మధ్యవర్తి అని చెప్పాడు.

**లలితాసహస్రం**లోని 275, 393, 394 నామాలలో **భానుమండల మధ్యస్థా, ప్రభావతీ, ప్రభారూపా** అంటూ పరమేశ్వరిని స్తుతించారు. (వీటిమీద వివరణకు నాచే వ్రాయబడిన **శ్రీవిద్యాసారథి** లలితా రహస్యనామ భాష్యము చూడండి)

ఆదిత్యుడు అంటే – విష్ణువు అని అర్థం. సూర్యులు పన్నెండు మంది. వారినే ద్వాదశాదిత్యులు అంటారు. వారు

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | ఇంద్రుడు | 5. | పూష | 9. | విష్ణువు |
| 2. | ధాత | 6. | ఆర్యముడు | 10. | అంశుమంతుడు |
| 3. | పర్జన్యుడు | 7. | భగుడు | 11. | వరుణుడు |
| 4. | త్వష్ట | 8. | వినస్వంతుడు | 12. | మిత్రుడు |

కాబట్టి పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడే ఆదిత్యుడు. భక్తానుగ్రహకారకుడు వేదములచే మాత్రమే తెలియదగినవాడు. ఆదిమద్యాంత రహితుడు. ఈ విషయం 39 నుంచి 42 వరకు నామాలలో వివరించబడింది. ఇకనామాలను చూద్దాం.

## 39. ఆదిత్యః

సూర్యమండలవాసి

**నివాస స్సవితా యస్య । స ఆదిత్యః పరికీర్తితః**

సూర్యమండలము తనకు నివాసముగ కలవాడు.

**ఆదిత్యః నివాసః అస్యేతి ఆదిత్యః** పరమేశ్వరుడు సూర్యమండలమునందు నివసిస్తాడు కాబట్టి 'ఆదిత్యుడు' అనబడుచున్నాడు. బ్రహ్మసూత్రాలలో 1–1–20

**అంతస్తద్ధర్మోపదేశాత్** ఆదిత్యమండలములోని పురుషుడు, అక్షిలోని పురుషుడు, సంసారబంధనాలలో చిక్కుకున్న జీవుడు కాదు. అతడు సాక్షాత్తూ పరమేశ్వరుడే. పరమాత్మ పాపరహితుడు. ఈ ధర్మము అక్షియందున్న పురుషుడికి కూడా చెప్పబడింది కాబట్టి ఆదిత్యమండలములోని పురుషడే కాదు, అక్షియందు పురుషుడు కూడా పరమేశ్వరుడే. అతడే ఋక్కు, అతడే యజస్సు, అతడే సామము. అతడే బ్రహ్మ. అని చెప్పబడింది. **ఛాందోగ్యోపనిషత్తు**లో సనత్కుమారుడు నారదుడికి బ్రహ్మవిద్యను ఉపదేశిస్తూ ఆత్మ సర్వవ్యాపకమైనది. ఊర్ధ్వలోకాలలోను, అధోలోకాలలోనూ కూడా అది వ్యాపించి ఉంటుంది." అంటాడు. అనగా ఆత్మసర్వత్రా వ్యాపించి ఉన్నది. కాబట్టి ఆదిత్యుడు అంటే ఆ సర్వేశ్వరుడు తప్ప వేరుకాదు.

ఆత్మజ్ఞానం పొందిన సాధకుడు ఈ శరీరాన్ని వదిలిన తరువాత పరబ్రహ్మలో లీనమవుతాడు. పరలోకాలకు ప్రయాణమయ్యేటప్పుడు అంటే అవసానకాలంలో ముందుగా కర్మేంద్రియాలు పని చెయ్యటం మానివేస్తాయి. కాళ్ళుచేతులు కదలవు. మాట్లాడలేదు

కళ్ళు చూస్తాయి. చెవులు వింటాయి. ఏదో చెబుదామని ఉంటుంది. కాని నోరు ఆడదు. మాటరాదు. తరువాత జ్ఞానేంద్రియాలు కూడా నెమ్మదిగా పని చెయ్యటం మానివేస్తాయి. కేవలం మనసు మాత్రమే పని చేస్తుంది. విషయం తెలుస్తుంది. ఏమీ చెయ్యలేని స్థితి. ఏదో చెప్పాలని తపన. ఇప్పుడు ఇంద్రియాలన్నింటినీ కలుపుకున్న మనస్సు ప్రాణంలో చేరుతుంది. అంటే మనోవ్యాపారము కూడా అంతరించిపోతుంది. ఇక లోకంలో జరిగే విషయాలు అతడికి తెలియవు. సైన్సు పరిభాషలో దీన్నే "కోమాలోకి వెళ్ళిపోవటము" అంటారు. ఈ స్థితిలో క్రమంగా ప్రాణము జీవునితో కలసిపోతుంది. ఎగశ్వాస, దిగశ్వాస, సకలేంద్రియ వ్యాపారము అంతరించగానే అతడు చేసిన పాపపుణ్యాలు అతణ్ణి ఆవరిస్తాయి. సకలేంద్రియాలతోనూ కలసిన జీవుడు శబ్ద స్పర్శాదులైన తన్మాత్రలతో కలిసి పరలోక యాత్రకు సిద్ధమవుతాడు. జీవి బయలుదేరే వరకూ దేహం వేడిగా ఉంటుంది. ఆ తరువాత శరీరం చల్లబడిపోతుంది. బంధువులు స్థూలదేహానికి అంత్యక్రియలు చేస్తారు. సూక్ష్మదేహం పరలోక యాత్రకు బయలుదేరుతుంది.

లోకంలో కర్మను కొంతమంది ఫలాపేక్షతో చేస్తే మరికొంతమంది ఫలాపేక్ష లేకుండా అంటే నిష్కామ్యకర్మ చేస్తారు దేహాన్ని వదలిన తరువాత జీవుడు బయలుదేరటానికి రెండు రకాలవారికి తేడా లేదు. ముందుగా జీవుడు హృదయాన్ని చేరతాడు. అక్కడ నుంచి వీరి ప్రయాణం మొదలవుతుంది. శరీరములో 72వేల నాడీమండలమున్నది. నాడీమండలమే వీరి ప్రయాణానికి సిద్ధంగా ఉన్న వాహనాలు. ఇవి నవరంధ్రాలలోనూ ఏదో ఒక మార్గము గుండా జీవిని బయటకు పంపుతాయి.

**అర్థాగృహే నివర్తంతే స్మశానే మిత్రబాధవాః ।**
**సుకృతం దుష్కృతంచైవ గచ్ఛం తమను గచ్ఛతి ॥**

అతడు సంపాదించిన ఆస్తిపాస్తులు అతని వెంటరావు. నగదు నట్రా ఇనప్పెట్టిలో పెట్టి తాళం పెడతారు. ఇల్లు వాకిలి అక్కడే ఉండిపోతాయి. అతని మరణానంతరము వారసులు ఆస్తికోసం పోట్లాడుకుంటారు. ఇంత కష్టపడి ఆస్తులు సంపాదించినా నక్షత్రం మంచిది కాదనో, ఇతర కారణాల వల్లనో, వాకిట్లో చాపమీద పడుకోపెడతారు.

మరణించబోయే ముందు ఆఖరిదశలో అతడు చేసిన కర్మలు అతడికి గుర్తుకు వస్తాయి. పాపపుణ్యాలు తెలుస్తాయి. తన ఉత్తర జన్మ ఏమిటి అనేది తెలుసుకోగలుగుతాడు. పాపకర్మలు ఇంతకన్న హీనమైన, నీచమైన జన్మ తనకు రాబోతోందని తెలిసి ఏడుస్తాడు. కళ్ళవెంబడి నీరు కారుతుంది. జీవి శరీరం విడిచిపెట్టి పోవటానికి ఇష్టపడదు. చివరకు

శరీరము నుంచి గెంటివేయబడుతుంది. సామాన్యంగా పాపకర్ముల మరణాలు నీచంగాను, పుణ్యచరితుల మరణాలు అనాయాసంగానూ ఉంటాయి.

కామ్యకర్మలు చేసిన జీవి మరణానంతరం తానుచేసిన పాపపుణ్యాలకు ఫలితముగా స్వర్గనరకాలు అనుభవించి, మళ్ళీ ఉత్తమ జన్మ ఎత్తుతాడు. నిష్కామ్యకర్మ చేసిన జ్ఞానియొక్క ఆత్మసుషుమ్నా నాడిద్వారా బ్రహ్మరంధ్రంచేరి, కపాలమోక్షమయి అక్కడ నుండి పరలోకానికి పోతాడు. పరలోకమే బ్రహ్మలోకము. బ్రహ్మలోకానికి తలవాకిలి సూర్యమండలము.

బ్రహ్మలోకానికి పోయే మార్గము అతికాంతివంతమైన బింబముచే ఆవరించబడి ఉంటుంది. ఆ కాంతిని మనం చూడలేము. సాధకుడు "ఆ కాంతిని కొద్దిగా తొలగించి బ్రహ్మ లోకానికి దారి చూపమని" పరమేశ్వరుణ్ణి ప్రార్థిస్తాడు. **ఈశావాశ్యోపనిషత్తులో**

**హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపి హితం ముఖం ।**

**తత్త్వం పూషన్నపావృణు సత్యధర్మా య దృష్టమే ॥**

ఓ సూర్యభగవానుడా ! ఓ పరమేశ్వరా ! బ్రహ్మలోకము యొక్క ముఖద్వారము అనేక వేలకోట్ల సూర్యచంద్రుల కాంతితో కప్పబడి ఉన్నది. ఓ దేవా ! సత్యము, ధర్మము ఆచరించిన నాకోసం నీకాంతిని ఒక్కసారి ఉపసంహరించవలసినది. అప్పుడు నేను ఆ ద్వారం గుండా బ్రహ్మలోకం యొక్క మార్గాన్ని చూడగలుగుతాను.

**పూషన్నేకర్షేయమ సూర్యప్రాజాపత్య వ్యూహరశ్మీన్**

**తేజోయత్ తే రూపం కల్యాణతమం సమూహ**

**తత్తే పశ్యామి యోఽసానసౌ పురుషః సోహమస్మి ॥**

ఓ సూర్యుడా ! ఓ ప్రజాపతీ ! సర్వవీధిలో విహరించే ఓ బాటసారీ ! సర్వపోషకా! సర్వనియంతా ! నీ కిరణాలను ఒక్కసారి తొలగించు వాటి కాంతిని ఉపసంహరించు. నీ అనుగ్రహంచేత మంగళప్రదమైన నీ రూపాన్ని నేను చూడగలుగుతాను. నీలో ఉండే ఆ పురుషుణ్ణి నేనే, అనే విషయాన్ని నేను గ్రహించాను. అని చెప్పబడింది. అనగా ఇక్కడ సూర్యుడు అంటే ఆ పరమేశ్వరుడు తప్ప వేరు కాదు అని అర్థం.

## 40. పుష్కరాక్షః

తామరపూలవంటి కనులు గలవాడు. 556 నామం కూడా ఇదే.

**అక్షిణీపుణ్డరీకేవ భక్తానుగ్రహకారిణీ ।**

**యస్యాసౌపుణ్డరీకాక్ష స్స్వోష్టవర్ణస్తు పావకః ॥**

తనభక్తులను అనుగ్రహించటానికి తామరపూవులను బోలిన రెండు కనులుగలవాడు.

**పుష్కరవత్ పుణ్డరీకవత్ అక్షిణీయస్యసః**

పరమేశ్వరుడు తామరలవంటి కనులు కలిగి ఉన్నాడు.

పుష్కరము అనగా – పద్మము అని అర్ధము. పరమేశ్వరుని నయనాలు అందంగా ఉంటాయని ఈ నామంలో చెప్పటం జరిగింది. లక్ష్మీ అష్టోత్తరనామాలలో

**పద్మప్రియాయై నమః, పద్మహస్తాయై నమః, పద్మాక్ష్యైనమః**

అని చెప్పబడింది. అలాగే 'శ్రీసూక్తము'లో **పద్మాననే పద్మఊరూ పద్మాక్షీ పద్మసంభవీ** అని చెప్పబడింది. కాబట్టి సాకారుడైన పరమేశ్వరుని నేత్రములు పద్మములలాగా ప్రకాశిస్తుంటాయి.

## 41. మహాస్వనః

పూజ్యమగు శబ్దము గలవాడు.

**మహాన్పూజ్య స్త్రయీరూపః స్వనో యస్య మహస్వనః**

వేదములచే మాత్రమే ఎరుగదగినవాడు.

**మహాన్ స్వనః యస్యసః మహాస్వనః**

పూజ్యమగు శబ్దము కలవాడు కాబట్టి మహాస్వనుడు.

**మహాన్ ఊర్జితః స్వనో నాదో వా శ్రుతిలక్షణో యస్యస మహాస్వనః**

గొప్పదయిన నాదముగలవాడు. ఋగ్వేదాది రూపమయిన శబ్దప్రపంచము గలవాడు కాబట్టి ఆ పరమేశ్వరుడు 'మహాస్వనుడు' అనబడుతున్నాడు.

సృష్టి ఆరంభము కాకముందు నిరాకారుడైన పరమేశ్వరుడు ఒక్కడే ఉన్నాడు. అతడే ఈ జగత్తునంతా ఆవరించి ఉన్నాడు. గతంలో మహాప్రళయము సంభవించినప్పుడు కర్మక్షయం కాకుండా తనలో కలిసిపోయిన జీవులయొక్క కర్మను క్షయంచేసి, వాటికి మోక్షం ప్రసాదించాలనే ఉద్దేశ్యముతో మళ్ళీ సృష్టి చెయ్యాలని సంకల్పించాడు. అలా సంకల్పించిన పరమేశ్వరుడు తనలో నుంచి కొంతశక్తిని బయటకు పంపాడు. దానినుంచే నామరూపాత్మకమైన జగత్తు ఏర్పడింది అని గతంలో చెప్పటం జరిగింది. నామాత్మకమైన జగత్తులో మొదటగా ఉన్నది 'ఓం'కారము. అది పరమేశ్వర స్వరూపము.

ఓంకారము నుండి - అక్షరాలు

అక్షరాల నుండి - పదాలు

పదముల నుండి - వాక్యాలు

వాక్యముల నుండి - మంత్రాలు, వేదాలు, వేదాంగాలు, శాస్త్రములు, సంగీతము, సాహిత్యము. ఈ రకంగా నామాత్మకమైన జగత్తు ఏర్పడింది. ఈవిధంగా ఏర్పడిన నామాత్మకమైన జగత్తే రూపముగా గలవాడు కాబట్టి పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు 'మహాస్వనుడు' అనబడుతున్నాడు.

## 42. అనాది నిధనః

ఆద్యంతములు లేనివాడు.

**యస్యాది నిధనం నాస్తి అనాదినిధన శ్చసః ।**

**అనాదినిధనోపాస్యో నిత్యయౌవన విగ్రహః ॥**

నిత్యయవ్వనము గలవాడు. జనన మరణములు లేనివాడు.

**న విద్యతే ఆదినిధనే అస్యేతి అనాది నిధనః**

చావుపుట్టుకలు లేక నిత్యయవ్వనముతో ప్రకాశించువాడు.

**ఆదిః జన్మనిధనం వినాశః తద్ద్వయం యస్య న విద్యేతేస అనాదినిధనః**

జన్మ, నాశనము రెండూ లేనివాడు కాబట్టి అనాదినిధనుడు అనబడుతున్నాడు.

పరమేశ్వరుడు నిరాకారుడు నిర్గుణస్వరూపుడు సర్వవ్యాపి. అతడే శ్రీమన్నారాయణుడు సత్యము నిత్యమైనవాడు. సృష్టిస్థితిలయాలకు కారణమైనవాడు. ఆదిమధ్యాంతరహితుడు. గజేంద్రమోక్షంలో గజేంద్రుడు ఆ పరమేశ్వరుణ్ణి

**అన్నిరూపులు నీ రూపమైన వాడ**

**ఆది మధ్యాంతములు లేక అలరువాడ**

**భక్తజనుల దీనుల పాలివాడ**

**దీవన లొసంగికాపాడు దేవదేవ**

అంటూ ప్రార్థిస్తాడు. ఈ విషయం అనేకచోట్ల చెప్పబడింది. **అధ్యాత్మోపనిషత్తు**లో

ఆ పరమేశ్వరుడు దేహము లోపల బుద్ధి అనబడే గుహయందున్నాడు. అతడే సత్యము, నిత్యము, సర్వాంతర్యామి ఈ పృథివే అతని దేహము. అతడు ఈ పృథ్విలో

ఉన్నాడు కాని పృథ్వి అతన్నెరుగదు. జలమే అతని దేహము. జలమునందే అతడు సంచరిస్తున్నాడు. కాని జలము అతన్నెరుగదు. తేజస్సే అతని దేహము, తేజస్సులోనే అతడు సంచరిస్తున్నాడు కాని తేజస్సు అతన్నెరుగదు. వాయువే అతని దేహము. వాయువునందే సంచరిస్తున్నాడు కాని వాయువు అతన్నెరుగదు. ఆకాశమే అతని దేహము. ఆకాశంలోనే అతడు సంచరిస్తున్నాడు కాని ఆకాశం అతన్నెరుగదు. అని చెబుతూ అతడు సర్వభూతాంతరాత్ముడు. పాపరహితుడు, దివ్యుడు దేవుడు అయిన శ్రీమన్నారాయనుడే అని చెప్పబడింది. చరాచర జగత్తంతా ఆవరించి ఉన్న పరమేశ్వరుడికి ఆది అంతము ఏ రకంగా ఉంటాయి ? అందుచేతనే అతడు అనాది నిధనుడు.

**దేవీభాగవతము**లోని సప్తమస్కంధములో "తారకుని బాధలు పడలేక దేవతలంతా పరమేశ్వరిని పరిపరివిధాల ఆరాధిస్తారు. అప్పుడు చైత్రశుద్ధ నవమి శుక్రవారము నాడు ఆ దేవి వారికి దర్శనమిస్తుంది. ఆ సమయంలో ఆమె ఎలా ఉన్నది అంటే

**చతుర్దిక్షుచతుర్వేదమూర్తి మద్భిర భిష్టుతమ్ ।**
**కోటిసూర్య ప్రతీకాశం చంద్రకోటి సుశీతలమ్ ॥**

**విద్యుత్కోటి సమానాభమరుణం తత్పరం మహః ।**
**నైవచోర్ధ్వం న తిర్వక్చున మధ్యే పరిజగ్రభత్ ॥**

**ఆద్యంతరహితం తత్తు నహస్తా ద్యంగ సంయుతమ్ ।**
**నస్త్రీ రూపమథవా న పుంరూప మథోభయమ్ ॥**

ఆ పరమేశ్వరి తేజము రూపుదాల్చిన నాలుగు వేదముల చేత స్తుతించబడుతున్నది. కోట్లకొలది సూర్యచంద్రులకాంతితో విరాజిల్లుతున్నది. ఆ రూపము కొన్నికోట్ల మెరుపు తీగలు ఒక్కసారిగా తళుక్కున మెరిసినట్లున్నది. దానికిపైన, క్రింద, మధ్య, అడ్డము అనే తేడాలులేవు. దానికి ఆద్యంతములు లేవు. కాలు చేతులులేవు. స్త్రీ, పురుష; నపుంసక బేధాల కూడాలేవు అనిచెప్పబడింది. ఈరకంగా పరమేశ్వరుడికి ఆద్యంతములుండవు. అందుచేతనే అతడు అనాదినిధనుడు. సృష్టి ప్రారంభంకాకముందు పరమేశ్వరుడు ఒక్కడే ఉన్నాడు. అతడు నిరాకారుడు, నిర్గుణ స్వరూపుడు. ఆది మధ్యాంతములు లేనివాడు. సత్యము నిత్యమైనవాడు. శాశ్వతుడు. అని అనేకచోట్ల చెప్పబడింది. అందుచేతనే పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు "అనాది నిధనుడు" అనబడుతున్నాడు.

**లలితాసహస్రము**లోని 296వ నామము 'అనాది నిధనా' అని చెప్పబడింది. ఇది పరమేశ్వరతత్త్వము. అంటూ ప్రభావిద్యను పూర్తిచేశాడు రత్నాకరుడు.

# 13. బ్రహ్మాదిదేవతల కన్న విలక్షణుడు

"గురువుగారూ ! జగత్తులో 84 లక్షల జీవరాశిని సృష్టించినవాడు బ్రహ్మ. వాటియొక్క ఆలన పాలన చూస్తున్నవాడు విష్ణువు. సంహారం చేస్తున్నవాడు రుద్రుడు. భక్తుల కోరికలను తీరుస్తున్నవారు విష్ణువు, శివుడు, లక్ష్మి, పార్వతి, సరస్వతి ఇత్యాది దేవతలు. పరబ్రహ్మ వీరందరికన్నా విలక్షణమైనవాడా ? దయచేసి అనుమానం తీర్చండి" అన్నాడు కృష్ణశర్మ ఆ మాటలు విన్న రత్నాకరుడు కొంచెంసేపు మౌనం వహించి, ఆ తరువాత చెప్పటం మొదలుపెట్టాడు.

ఆది, అనాది అయినవాడు పరమేశ్వరుడు. అతడే సత్యము నిత్యము అయినవాడు. మహాప్రళయం సంభవించినప్పుడు జీవజాలమంతా నశించిపోతుంది. పంచభూతాలు కూడా తమ ఉనికిని కోల్పోతాయి. భూమి నీటిలో కలసిపోతుంది. నీరు–నిప్పులో, నిప్పు–గాలిలో, రాత్రి–ఆకాశంలో కలసిపోగా ఆకాశం మహామాయలో కలిసిపోతుంది. ఆ మహామాయ పరమేశ్వరుడిలో లీనమైపోతుంది. ఈ రకంగా అంతా శూన్యం ఏర్పడుతుంది. ఈ జగత్తు అంతా పరమేశ్వరమయం.

అలా కొంతకాలం జరిగిన తరువాత అనగా – ప్రళయకాలంలో కర్మక్షయం కాకుండా నశించిన జీవులకర్మ పరిపక్వము అయిన తరువాత పరమేశ్వరుడు మళ్ళీ సృష్టి చెయ్యాలని సంకల్పిస్తాడు. అప్పుడు ముందుగా తనలోని మాయను బయటకు పంపుతాడు. అంటే అవ్యక్తము నుంచి వ్యక్తము, దానినుంచి మహత్తత్త్వము, దాని నుంచి అహంకారము ఉద్భవిస్తాయి. శబ్దస్పర్శరూప రసగంధాలనబడే తన్మాత్రలు, వాటినుంచి పంచభూతాలు ఆవిర్భవిస్తాయి. పరబ్రహ్మయొక్క మహద్రూపమైన మూలప్రకృతి సర్వప్రాణులకు జన్మస్థానము. జడమైనటువంటి ప్రకృతియందు చేతనమనే బీజాన్ని స్థాపిస్తాడు పరమాత్మ. ఆ జడచేతనముల సంయోగముచేతనే ఈ ప్రాణులన్నీ పుడుతున్నాయి. ఇక్కడ మూలప్రకృతే మహాయోని. చరాచర జగత్తు ఆ ప్రకృతినుంచే పుడుతుంది.

పరమేశ్వరుడు బ్రహ్మ అనే గర్భాన్ని ధరించి, అది పరిపక్వత చెందగానే స్వయంగా దాన్ని ఆవిర్భవింపచేస్తాడు. అంటే పరమేశ్వరుడు సృష్ట్యాదిలో చతుర్ముఖ బ్రహ్మను సృష్టించి అతనికి వేదాలను అందించాడు. ఆవిధంగా తన చేత సృష్టించబడిన కర్మ బ్రహ్మ కన్న పరబ్రహ్మ గొప్పవాడు.

మనం ఆరాధించే బ్రహ్మ, విష్ణువు, శివుడు, మొదలైన దేవతలను భక్తులు దర్శించ గలరు. కాని పరమేశ్వరుడు లీలామానుషుడు. అతన్ని గురించి ఎవరూ తెలుసుకోలేరు. ఉపనిషత్తులలో చెప్పినట్లుగా కంటికి చూపునిచ్చేది, చెవికి వినికిడి శక్తినిచ్చేది, మనసుకు ఆలోచనాశక్తినిచ్చేది ఆ పరబ్రహ్మాయే అదే ఆత్మ. అందుచేత ఆత్మను ఇంద్రియాలతో తెలుసుకోవటం సాధ్యపడదు. ఇంద్రియాలన్నీ జడాలు. వాటికి చైతన్యశక్తి ప్రసాదించేది ఆత్మయే. అందుచేతనే పరమాత్మను ఇంద్రియాలతో గాని, శాస్త్రపాండిత్యమువల్లగాని తెలుసుకోలేము. ఏ ప్రమాణానికీ అతడు అందడు. దేవతలు, మానవులు ఒకటేమిటి సకల జీవరాశులయొక్క ఇంద్రియాలను నియంత్రించేది పరబ్రహ్మాయే.

అంతదాకా ఎందుకు ? ఈ జగత్తును సృష్టించిన బ్రహ్మ పద్మములో పుట్టాడు. ఆ పద్మమే నాభియందుకల శ్రీమన్నారాయణుడు ఆ బ్రహ్మకన్న గొప్పవాడే కదా ? దేవతల నందరినీ సృష్టించినది ఆ పరమేశ్వరుడే. వారి కర్మఫలాన్నిబట్టి జీవులకు ఉత్తరజన్మలు కల్పించాడు. దానిలో భాగంగా దేవతలను సృష్టించి, వారికి అధికారాలిచ్చాడు. వారికేదైనా ఆపద వస్తే తాను అండగా నిలుస్తాడు. ఈ జగత్తు సృష్టించటానికి ముందు, సృష్టించిన తరువాతకూడా జగత్తు యొక్క వ్యాపార లక్షణాలే పరబ్రహ్మ లక్షణాలు. తన సంకల్ప లేశముచేతనే ఈ పనులన్నీ చేస్తాడు. దేవతలు, మానవులు, పశువులు, పక్షులు అనే భేదాలతో నామరూపాత్మకంగా జగత్తును విస్తరింపచేయువాడు. ఇంకా చెప్పాలంటే నామరూపాలు లేనటువంటి చేతనా చేతనములను నామరూపాలు కలవిగా చేసేవాడు. అతడు దేనికీ, ఎవరికీ అధీనుడు కాదు. అన్నీ అందరూ అతని అధీనంలోనే ఉంటారు. అతడికి రూపము, గుణము, జనన మరణాలు, వృద్ధి క్షయాలు అనే వికారాలు లేవు. అందుచేతనే అతడు గ్రహించటానికి వీలులేనివాడు. అతడికి ఎవరియందు ప్రేమ, అభిమానము, ఆప్యాయత, పక్షపాతము లేవు. ప్రళయకాలంలో అందరినీ సంహరిస్తాడు. ఈ జగత్తులో ఉన్నవన్నీ అంటే సిరిసంపదలు, భోగభాగ్యాలు, జ్ఞానము, ఈశ్వరత్వము అన్నీ అతడికి సమృద్ధిగా ఉన్నాయి.

ఊర్ధ్వదిక్కు, అధోదిక్కు, మధ్యదిక్కు అనబడే మూడు దిక్కులకు ఆశ్రయమైన వాడు. ఒక్క భూలోకాన్నే కాదు అనేక కోట్ల బ్రహ్మాండాలను సృష్టించినవాడు అతడు ఎప్పుడూ పరమపదములో ఆనంద డోలికలలో తేలియాడుతుంటాడు.

మానవశరీరంలో అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశాల నడుమ ఆనందమయ కోశంలో చిదానంద స్వరూపుడుగా ఉంటాడు. సహస్రదళ పద్మములో

మహాశూన్యమున్నది. దానిని దేవతలు రహస్యంగా సేవిస్తూ ఉంటారు. అక్కడే పరమేశ్వరుడుంటాడు. మనోవాక్కాయ కర్మలతో త్రికరణశుద్ధిగా ఆ పరమేశ్వరుణ్ణి సేవించిన వారికి ముక్తిని ప్రసాదిస్తాడు.

పరమపవిత్రమైనటువంటి వాడతడు. అతని దర్శనమాత్రంచేతనే సమస్త పాపాలు క్షయమయిపోతాయి. భక్తులకు ఎప్పుడూ శుభాన్నే కలుగజేస్తాడు. అతడే లోకపాలకుడు, లోకరక్షకుడు. ప్రాణి జీవించటానికి, తనను ధ్యానించటానికి తగిన బలము, శక్తి ఇచ్చేవాడు అంతెందుకు జీవులకు అతడే జీవము, ప్రాణము అయి ఉన్నాడు. అతడే జ్యేష్ఠుడు, శ్రేష్ఠుడు, ప్రజాపతి.

ఈరకంగా ఆ పరబ్రహ్మ బ్రహ్మాదిదేవతలకన్న భిన్నమైన లక్షణాలు కలవాడు. 43 నుంచి 70వ నామం దాకా ఈ విషయాలు వివరించబడ్డాయి. ఇక నామాలను చూద్దాం.

## 43. ధాతా

ధరించువాడు.

**అచిత్సమష్టి భూతాయాం ప్రకృతౌ చిత్సమష్టికమ్ ।**
**గర్భం వేదాత్మకం ధత్తే యస్తు ధాతే తిచక్షతే ॥**

అచిత్సమష్టియగు ప్రకృతియందు చిత్సమష్టియగు బ్రహ్మ అను గర్భమును ధరించువాడు. చతుర్ముఖ బ్రహ్మను సృష్టించువాడు. అజ్ఞానమనే ప్రకృతియందు జ్ఞానమనే బ్రహ్మను సృష్టించినవాడు.

**గర్భం దధాతీతి ధాతా** గర్భము ధరించువాడు కాబట్టి ధాతా అనబడుతున్నాడు. **భగవద్గీత**లోని పధ్నాల్గవ అధ్యాయం **గుణత్రయవిభాగ యోగము**లోని 3వ శ్లోకంలో భగవానుడు.

**మమ యోనిర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భందధామ్యహమ్ ।**
**సంభవస్సర్వభూతానాం తతో భవతి భారత ॥**

అర్జునా ! నా మహద్బ్రహ్మ రూపమైన మూలప్రకృతి సర్వప్రాణులకు జన్మస్థానము. దానియందు చేతన సముదాయరూపమైన బీజమును స్థాపించెదను. ఆ జడచేతనముల సంయోగముచేతనే సర్వభూతములూ పుట్టుచున్నవి. అంటాడు.

సమస్త జగత్తుకూ కారణమైనది మూలప్రకృతి దీన్నే 'అవ్యక్తము' అంటారు. ఇక్కడ 'యోని' అనేది గర్భాధానమునకు ఆధారమైనది. అదే మూలప్రకృతి. చరాచర జగత్తు

ఆవిర్భవించటానికి కారణము మూలప్రకృతి కాబట్టే మూలప్రకృతిని యోని అన్నారు. మహాప్రళయము జరిగినప్పుడు కర్మక్షయం కానటువంటి జీవజాలము అంతా తమ తమ కర్మను తమతో మూట కట్టుకుని పరమేశ్వరునిలో లీనమవుతున్నది. కొంతకాలం జరిగిన తరువాత, కర్మక్షయం కాకుండా తనలో లీనమైన జీవరాశికి కర్మక్షయం చేసి, వాటికి ముక్తి కలిగించాలనే కోరికతో పరమేశ్వరుడు సృష్టి చెయ్యాలని సంకల్పించినవాడై ఆ జీవసముదాయానికి ప్రకృతితో సంబంధము కలిగిస్తున్నాడు మాయా స్వరూపము ప్రకృతి. చేతనారూపుడు పరమేశ్వరుడు. ప్రకృతిరూపమైన యోనియందు గర్భమును స్థాపన చెయ్యటము అంటే ఇదే. ఈ ప్రాణులు తమతమ సంస్కారములను బట్టి అనగా, తమ కర్మ ఫలాన్ని అనుసరించి పశువులు, పక్షులు, దేవతలు, మానవులు, చెట్లు, కొండలు, బండలు మొదలైన రూపాలు ధరిస్తాయి. ఈ రకంగా జడచేతన సంయోగముచేతనే హిరణ్యగర్భుని దగ్గర నుంచి అన్ని ప్రాణులు అనగా, పిపీలికాది బ్రహ్మ పర్యంతము, బ్రహ్మము మొదలు స్తంభము వరకు ప్రాణుల ఉత్పత్తి జరుగుతున్నది.

పరమేశ్వరుడికి లింగభేదము లేదు. అతడు పురుషుడు కాదు, స్త్రీ కాదు, అలా అని నపుంసకుడు కూడా కాదు. గర్భం ధరించటమనేది స్త్రీ లక్షణము కాబట్టి అతనికి స్త్రీత్వమాపాదించబడుతున్నది.

**ఒకపరి జగముల వెలినిడి**

**ఒకపరి లోపలికి గొనుచు ఉభయము గనుచున్**

మహాప్రళయ సమయంలో లోకములన్నీ తన గర్భమునందు ఉంచు కుంటున్నాడు. కాబట్టి ధాతా అనబడుతున్నాడు.

## 44. విధాతా

ఆవిర్భవింపచేయువాడు. 484 కూడా ఇదే నామము.

**తద్గర్భ పరిణామేస్యా దావిర్భావయతి స్వయమ్ ।**

**ధారణా ల్లీలాయస్మాత్ సూధాతా ఽ యం ప్రకీర్తితః ॥**

'బ్రహ్మ' అనే గర్భాన్ని ధరించి, అది పరిపక్వత చెందగానే దానిని స్వయముగా ఆవిర్భవింప చేసేవాడు.

**తంగర్భం విదధాతి ఆవిర్భావయతీతి విధాతా**

గర్భమును ధరించి, దానిని ఆవిర్భవింపచేయువాడు.

**శ్వేతాశ్వరోపనిషత్తు**లో ఈ విధంగా ఉన్నది.

"ఈ భువన మధ్యభాగమందు అజ్ఞానమును నశింప చేయకలవాడు ఆ పరమాత్మ ఒక్కడే. అతనిని గురించి తెలుసుకోగలిగినవారు మరణానంతరము పరమేశ్వరుని పొందుచున్నారు. ఆ పరమాత్మయే విశ్వనిర్మాత. అతడు సర్వజ్ఞుడు, జ్ఞానస్వరూపుడు. కాలమునకు కర్త. సర్వసుగుణములు కలవాడు. సర్వవిదుడు సంసార మోక్ష స్థితి బంధములకు కారణభూతుడు. ఏ పరమాత్మ ఈ జగత్తుకు పాలకుడై ఉన్నాడో, అతడు జ్యోతిస్వరూపుడు. అమృతుడు. జ్ఞానస్వరూపుడు. సర్వగతుడు ఈ లోకానికి పాలకుడు.

**యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యావై వేదాగ్ంశ్చ**
**ప్రహిణోతి తస్మై, తగ్ం హదేవ మాత్మబుద్ధి**
**ప్రకాశం ముముక్షుర్వై శరణమహం ప్రపద్యే**

ఏ పరమేశ్వరుడు సృష్ట్యాదిలో చతుర్ముఖ బ్రహ్మను సృష్టించి, అతనికి వేదములు ఉపదేశించాడో, అటువంటి పరమేశ్వరుని నేను శరణుజొచ్చుచున్నాను."

అనంతమైన జీవులకర్మను బట్టి ఫలితాన్ని ఇచ్చేవాడు విధాత. అష్టదిగ్గజములు, కులపర్వతములతో ఈ భూమిని ధరించువాడు కాబట్టి 'విధాతా' అనబడుతున్నాడు.

'అష్టదిగ్గజాలు' అంటే ...

1. ఐరావతము
2. పుండరీకము
3. వామనము
4. కుముదము
5. అంజనము
6. పుష్పదంతము
7. సార్వభౌమము
8. సుప్రతీకము

అయితే 'మహాసంకల్పము'లో అష్టదిగ్గజాలు వేరుగా చెప్పబడ్డాయి.

**ఆధారశక్తి, శ్రీకూర్మ, వరాహ, వైష్ణ, వానంత, నాగ, శేష, తక్ష కాష్టదిగ్గజో పరివేష్ఠితే ...**

కులపర్వతాలు అంటే ...

**మహేంద్రో మలయ స్సహ్య శ్శుక్తిమాన్ గంధమాదనః ।**
**వింధ్య శ్చ పారియాత్రశ్చ స్సప్తైతే కులపర్వతాః ॥**

1. మహేంద్రగిరి
2. మలయగిరి
3. సహ్యగిరి
4. హిమవద్గిరి
5. గంధమాదనము
6. వింధ్య
7. పారియాత్రము

వీటన్నిటి రూపంలోనూ భూమిని ధరించేవాడు కాబట్టి పరమేశ్వరుడు 'విధాతా' అనబడుతున్నాడు. **లలితాసహస్రనామాలలోని** 337వ నామము **విధాత్రి**

## 45. ధాతు రుత్తమః

బ్రహ్మదేవునికన్న కూడా గొప్పవాడు.

**యోవైస్యాద్ధాతు రుత్కృష్టః స చ స్యాత్ ధాతు రుత్తమః**

ఆ విధంగా తనచేత సృష్టించబడినటువంటి తనవలన జన్మించినటువంటి బ్రహ్మకన్న గొప్పవాడు. **ధాతుః ఉత్తమః** బ్రహ్మదేవునికన్న ఉత్తముడు ధరించునది ధాతువు. ఈ జగత్తును ధరించేటటువంటి అష్టదిగ్గజాలను, కులపర్వతాలను కూడా తన శక్తిచేత నిలుపువాడు. కాబట్టి ఉత్తముడు.

'తాను సృజించిన బ్రహ్మకన్న గొప్పవాడు' అన్నప్పుడు ఇక్కడ చెప్పిన బ్రహ్మ - కర్మబ్రహ్మ త్రిమూర్తులలో మొదటివాడు. సృష్టికర్త. పరబ్రహ్మయే కర్మబ్రహ్మను సృష్టించాడు కాబట్టి చతుర్ముఖ బ్రహ్మకన్న ఆ పరబ్రహ్మయే గొప్పవాడు. సృష్టికర్త జగత్తులోని ప్రాణులను సృష్టించాడు. కాని పరబ్రహ్మ చేతనారూపంలో ప్రతిజీవి యందు ఉన్నాడు. అందుచేత కర్మబ్రహ్మకన్న పరబ్రహ్మ శ్రేష్ఠుడు. అందుచేతనే 'ధాతు రుత్తమః' అనబడుచున్నాడు. **ఓంధాతవే ఉత్తమాయ నమః**

## 46. అప్రమేయః

అపరిచ్ఛేద్యుడు

**బ్రహ్మాదీనాఞ్ కరణైః నో మాతు మపిశక్యతే ।**
**ద్రష్టుం హ్యపా వప్రమేయః వచసా మప్య గోచరః ॥**

బ్రహ్మాదులకైననూ ఇంద్రియములచేత చూడటానికిగాని, ఇంత పరిమాణము గలవాడని తెలుసుకోవటానికి గాని వీలుకానివాడు. అవాంజ్మానసగోచరుడు.

**ప్రమాతుం అర్హః - ప్రమేయః**
**ప్రమేయోనభవతి - ఇతి అప్రమేయః**

తన తత్త్వాన్ని వాస్తవరూపమున ఎరుగబడుటకు యోగ్యమైనది ప్రమేయము. అలా కానటువంటిది అప్రమేయము. ప్రమా-అంటే తత్త్వ యథార్థజ్ఞానము. ఏది ఏదో దానిని దానినిగా తెలుసుకోవటము. ఇటువంటి జ్ఞానాన్ని పొందటానికి సాధనములు ప్రమాణాలు.

అటువంటి ప్రమాణములచేత తెలుసుకోవటానికి వీలు కానిది అప్రమేయము. శ్రీమన్నారాయణుడు అప్రమేయుడు. ఎందుచేతనంటే 1. జ్ఞానేంద్రియాలు ప్రత్యక్ష ప్రమాణాలు. శబ్దస్పర్శరూప రసగంధాలు వాటికి తెలుస్తాయి. అయితే పరమేశ్వరుని యందు ఇవేవీ లేవు కాబట్టి జ్ఞానేంద్రియములచేత అతన్ని తెలుసుకోవటానికి వీలుకాదు.

**కేనోపనిషత్తు**లో శిష్యుడు గురువు గారికి నమస్కరించి "గురుదేవా ! ఎవరి ఆజ్ఞవలన చక్షురాది ఇంద్రియములకు శక్తి కలుగుతున్నది ? ఇంద్రియాలను శాసించేది ఎవరో తెలియజేయవలసినది" అని అడిగాడు.

ఆ మాటలు విన్న గురువుగారు ఆత్మ పదార్థాన్ని గురించి శిష్యుడికి ఉపదేశిస్తున్నాడు.

**శ్రోత్రస్యశ్రోత్రం మనసో మనో యద్ వాచోహ**
**వాచం స ఉ ప్రాణస్యప్రాణః చక్షుషశ్చక్షు**
**రతిముచ్యధీరాః ప్రేత్యాస్మాల్లోకాదమృతాభవంతి**

నాయనా ! అన్నింటికీ కారణము ఆత్మ. ఈ ఆత్మ అనేది చెవికి – చెవి, మనస్సుకు – మనస్సు వాక్కుకు – వాక్కు. ప్రాణానికి – ప్రాణము. కన్నుకు – కన్ను అయి ఉన్నది. ఇంద్రియాలన్నీ జడాలు. వాటికి చైతన్యం లేదు. కాని చైతన్యం ఉన్నట్లు కనిపిస్తాయి. ఆత్మశక్తి వాటి వెనుక ఉండి నడిపిస్తున్నది. అజ్ఞాని ఇంద్రియాలు చేతనములు అనుకుంటాడు కాని ఇంద్రియసుఖాలను వదలివేసిన మహాజ్ఞానులు మాత్రమే ఆ ఆత్మను దర్శించగలరు.

**నతత్ర చక్షుర్ గచ్ఛతి నవా గ్గచ్ఛతి నోమనః**
**విద్యోన విజానీయో యధైత దనుశిష్యా దన్యదేవ**
**తద్విదితా దథో అవిదితాదధి**

ఆత్మ ఎక్కడైతే ఉన్నదో అక్కడికి కన్ను పోలేదు. అంటే ఆత్మను కంటితో చూడటానికి వీలుకాదు. మనసుతో గుర్తించటానికి వీలుకాదు. ఈ రకంగా ఇంద్రియాలు ఆత్మను గుర్తించలేవు. ఇంద్రియాలను ప్రేరేపించేదే ఆత్మ. కాబట్టి ఇంద్రియాలు తమను నడిపించే ఆత్మను చేరలేవు. ఇంద్రియములచేత తెలుసుకోటానికి వీలుకాని వాడు కాబట్టి ఆ పరమేశ్వరుడు 'అప్రమేయుడు'

2. లింగమును బట్టి వస్తువును తెలుసుకోవటము అనుమాన ప్రమాణము. అయితే పరమాత్మతో సంబంధముగల వస్తువు ఏదీ లేదు. అతడు కేవలము జ్ఞానస్వరూపుడు. అందుచేత అనుమాన ప్రమాణముచే తెలియబడడు.

3. ఇది దానివలె ఉన్నది. అని పోలికద్వారా వస్తువును తెలుసుకోవటము 'ఉపమాన ప్రమాణము' అయితే పరమేశ్వరునితో సమానమైనది ఏదీ లేదు. కాబట్టి అతణ్ణి దేనితోనూ పోల్చలేము అంటే ఉపమాన ప్రమాణానికి అందదు.

4. ఇది లేకపోతే ఇది జరగదు. అనే హేతువుతో వస్తువుల ఉనికిని కాని, లక్షణాలను కాని నిర్ణయించటము 'అర్ధాపత్తి' ప్రమాణము. పరమాత్మ లేకపోవుట కాని, అతడు లేనందువల్ల ఇంకొకటి సిద్ధించకపోవటంకాని ఉండదు. కాబట్టి ఆ పరమాత్మ అర్ధాపత్తి ప్రమాణము చేత తెలియబడదు.

5. అభావప్రమాణము చేతకూడా పరమేశ్వరుని తెలుసుకోలేము. అతడు దేశ కాలమాన పరిస్థితులకు లోబడనివాడు. కాబట్టి అభావప్రమాణానికి గోచరుడు కాడు.

6. శాస్త్రప్రమాణముచేత కూడా పరమాత్మను తెలుసుకోలేము. అతడు నిర్విశేషుడు. నిరతిశయుడు. నిరవయవుడు. సజాతీయత, విజాతీయతలు లేనివాడు. అందుచేత శాస్త్రప్రమాణములచేత అతన్ని తెలుసుకోవటానికి వీలుకాదు.

పరమాత్మ సర్వాంతర్యామి. ఈ జగత్తంతా ఆవరించి ఉన్నాడు. జగత్తులో జరిగే విషయాలన్నింటికీ సాక్షీభూతుడు. కేవలము జ్ఞానము వలన తప్ప ఇంద్రియాలతో అతన్ని తెలుసుకోలేము. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'అప్రమేయుడు'.

**లలితా సహస్రంలో** 413వ నామము 'అప్రమేయా'

# 47. హృషీకేశః

ఇంద్రియాలకు అధిపతి.

**ఇన్ద్రియాణాం నియన్తృత్వాత్ హృషీకేశః ప్రకీర్తితః**

దేవతలు, మానవులు మొదలైన సకల ప్రాణులయొక్క ఇంద్రియములను నియంత్రించువాడు. ఇంద్రియములను నియమించువాడు. హృషీకములు అంటే – ఇంద్రియాలు. **హృషీకాణామ్ ఇంద్రియాణామ్ ఈశః** ఇంద్రియములను నియమించు వాడు. హరివంశములో 'కేశవా ! ఇంద్రియము లన్నింటికీ ఈశ్వరుడవగుటచేత నిన్ను వేదములు 'హృషీకేశుడు' అంటున్నాయి అని చెప్పబడింది.

**ఐతరేయోపనిషత్తులో** "ఈ లోకాలన్నీ పంచభూతాలచే నిర్మించబడ్డాయి. లోకాలను సృష్టించిన తరువాత "ఈ లోకాలను రక్షించేవారు లేకపోతే అవి నాశనమైపోతాయి కాబట్టి లోకపాలకులను సృష్టించాలి" అని ఆలోచించి, పంచభూతాలలోనూ ప్రధానమైన

జలాన్ని తీసుకుని, దానితో అవయవాలుగా ఒక మానవాకారాన్ని సృష్టించాడు పరబ్రహ్మ. ఆ ఆకారమే 'విరాట్స్వరూపము'. ఇక ఇంద్రియాధిష్టానదేవతల సృష్టి ఎలా జరిగిందంటే–

పరమాత్మ విరాట్స్వరూపాన్ని దృష్టిలో ఉంచుకొని తీవ్రమైన ఆలోచన చేశాడు. అదే తపస్సు. దాని ఫలితంగా విరాట్స్వరూపానికి నోరు వచ్చింది. ఆ నోటినుంచి మాట, మాటనుంచి వాణికి అభిమాన దేవత అయిన అగ్ని ఉత్పన్నమైనాయి. తరువాత ముక్కు రంధ్రాలు వచ్చాయి. వాటినుండి ప్రాణం ఉత్పన్నమైంది. అంటే వాసనచూసే శక్తి పుట్టింది. ఆ ఘ్రాణశక్తి నుండి వాయువు పుట్టింది. తరువాత నేత్రాలు ఏర్పడ్డాయి. వాటినుండి సూర్యుడు ఉద్భవించాడు.

తరువాత చెవులు – వాటి నుండి దిక్కులు ఏర్పడ్డాయి. ఆ తరువాత చర్మము. దానినుండి స్పర్శకు కారణమైన రోమాలు ఏర్పడ్డాయి. చర్మమునుండే ఓషధులు, వనస్పతులు పుట్టినాయి. ఆ తరువాత హృదయము. దానినుండి మనస్సు. దాని నుండి చంద్రుడు పుట్టారు. తరువాత నాభి – దాని నుండి అపానము దాని నుండి మృత్యువు ఉద్భవించాయి. ఆ తరువాత పురుష జననేంద్రియము, దాని నుండి వీర్యము, దానికి అధిష్ఠాన దేవత అయిన జలము ఉద్భవించాయి. ఈరకంగా విరాట్స్వరూపుని అవయవాలనుంచి ఇంద్రియాలు, వాటినుండి ఇంద్రియాల అభిమాన దేవతలు పుట్టారు.

ఈవిధంగా ఇంద్రియాలను, ఇంద్రియముల అభిమాన దేవతలను సృష్టించినవాడు, వాటిని నియమించేవాడు, నియంత్రించేవాడు కూడా పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడే. అందుచేతనే అతడు 'హృషీకేశుడు' అనబడుతున్నాడు. హృషీకములకు ఈశుడు. శరీరములో చైతన్యరూపములో ఉండి ఇంద్రియాలను తమ తమ విషయములందు ప్రవర్తిల్లచేయువాడు.

సూర్యరూపుడుగాను, చంద్రరూపుడుగాను ఉండు ఎవని కేశములు (కిరణములు) జగత్తునకు ప్రీతికరములో, అటువంటి పరమాత్ముడు శ్రీమన్నారాయణుడు.

## 48. పద్మనాభః

పద్మమును నాభియందు గలవాడు. 196, 346 కూడా ఇదే నామము.

**కాలాత్మకం తు యత్పద్మం నాభౌ యస్య స ఉచ్యతే**
**పద్మనాభ శ్చాష్టవర్ణో మహాసన్తానదో మనుః**

కాలాత్మకమైన పద్మమును నాభియందు కలవాడు. ఈ నామాన్ని **ఓం పద్మనాభాయ నమః** అని మహా మంత్రముగా జపం చేసినట్లైతే సత్సంతానము కలుగుతుంది.

ప్రాణులయొక్క ఆయుష్షును లెక్కపెట్టే బ్రహ్మకు 'కాలుడు' అని పేరు. అటువంటి చతుర్ముఖుని కలిగిన పద్మమును నాభియందు కలవాడు – శ్రీమహావిష్ణువు.

**పద్మః నాభౌ యస్యసః పద్మనాభః** బ్రహ్మదేవుడు జన్మించిన పద్మమును నాభియందు గలవాడు. సర్వజగత్కారణ మయిన పద్మమును నాభియందు గలవాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు పద్మనాభుడు అనబడుచున్నాడు.

## 49. అమరప్రభుః

దేవతలకు రాజు

**సృష్ట్యాదిష్వపి దేవానాం అధికార ప్రదానతః ।**
**అమర ప్రభు రిత్యుక్తో నవార్ణ స్సర్వదో మనుః ॥**

దేవతలకు సృష్టి స్థితి లయము మొదలైన అధికారము ఇచ్చినవాడు. ఈ నామాన్ని మహామంత్రముగా జపించినట్లైతే సకలాభీష్టములు ఈడేరుతాయి.

**అమరాణామ్ ప్రభుః** దేవతలకు ప్రభువు, రక్షకుడు. కష్టకాలంలో, దేవతలను రక్షించేవాడు. ఆపద సమయములో దేవతలను ఆదుకొనేవాడు. త్రిమూర్తులలో విష్ణువు స్థితికారకుడు. ఈ జగత్తును పోషించటము, రక్షించటము అనే బాధ్యతలు అతనివి.

వజ్రాంగుని కుమారుడు తారకాసురుడు. బ్రహ్మదేవుని గురించి ఘోరతపస్సు చేసి అనేక వరాలు పొందాడు. వరబల గర్వముతో ముల్లోకాలను జయించాడు. దేవతలను ఆపదలపాలు చేశాడు. దేవతలంతా విష్ణుమూర్తిని శరణు వేడారు. అప్పుడు శ్రీమహావిష్ణువే తారకాసుర సంహారానికి మార్గం చూపాడు. తారకాసురుడు కుమారస్వామి చేతిలో మరణించాడు.

తారకుడికి ముగ్గురు కుమారులు వారు 1. తారకాక్షుడు 2. కమలాక్షుడు 3. విద్యున్మాలి తారకుడు మరణించగానే అతని భార్య కుమారులను తీసుకుని పాతాళానికి పారిపోయింది. అక్కడే వారిని పెంచి పెద్ద చేసింది. శుక్రాచార్యుని వద్ద విద్యాబుద్ధులు నేర్పించింది. బాలురు దినదిన ప్రవర్ధమానులై సకల శాస్త్రకోవిదులైనారు. తమ తండ్రి మరణ వృత్తాంతము తల్లివల్ల పూర్తిగా తెలుసుకున్నారు. తండ్రి మరణానికి కారణమైన దేవతలమీద పగ తీర్చుకోవాలి అనుకున్నారు. అనుకున్నదే తడవుగా మేరుపర్వతం దగ్గరకు పోయి పరమేష్ఠిని గురించి పదివేల సంవత్సరాలు తపస్సు చేశారు. వారి తపస్సుకు మెచ్చి బ్రహ్మదేవుడు ప్రత్యక్షమై ' ఏ వరం కావాలో కోరుకోండి' అన్నాడు. 'చావు లేకుండా

వరం కావాలి' అన్నారు దానవులు. "ఈ జగత్తులో నేనే శాశ్వతం కాదు. నాకు లేనిది మీకు ఎలా ఇవ్వగలను ? కాబట్టి ఇంకేదైనా వరం కోరుకోండి" అన్నాడు విధాత. ఆలోచించారు తారకుని పుత్రులు.

"పరమేష్ఠీ ! రథము కాని రథమెక్కి, విల్లుకాని విల్లు ధరించి, నారి కాని నారిని తొడిగి, బాణము కాని బాణము సంధించి ఒక్కదెబ్బతో చంపగల వీరుని చేతియందు తప్ప, ఇతరులవల్ల మాకు మరణం లేకుండా వరం ప్రసాదించు" అన్నారు రాక్షసులు 'తథాస్తు' అన్నాడు బ్రహ్మ. "విధాతా ! అంతేకాదు మేము నివసించటానికి సకల సదుపాయములు కలిగి, లోహనిర్మితమై, కామగమనము కల మూడు పురములు కావాలి. అవి సకలైశ్వర్యాలకు, సకల భోగాలకు నెలవుగా ఉండాలి." అన్నారు. వారి కోరికలను అనుగ్రహిస్తూ "ఆ మూడు పురములూ ఒకచోట కలియరాదు. అలా కలిసినట్లైతే అవి నాశనమైపోతాయి" అన్నాడు బ్రహ్మ.

బ్రహ్మవలన వరాలు పొంది, విశ్వకర్మను పిలిపించి మూడు లోహపురములు నిర్మించుకున్నారు రాక్షసులు. వాటిలో ఎక్కి తలా ఒక దిక్కుకూ బయలుదేరారు. ఈరకంగా గగన విహారం చేస్తూ భూలోకంలోని పట్టణాలమీద ఒక్కసారిగా దించేవారు. దాంతో అక్కడి జనావాసాలు నాశనమైపోయేవి. అదిచూసి అమితానందంతో మళ్ళీ పైకి ఎగిరి పోయేవారు. ఈ రకంగా మూడు లోకాలలోనూ సంచరిస్తూ రాక్షస కృత్యాలు చేస్తున్నారు కాబట్టి వారు 'త్రిపురాసురులు' అని పిలువబడ్డారు.

త్రిపురాసురుల ఆగడాలు మితిమీరి పోయినాయి. దేవతలు, మునులు, ఋషులు, సాధువులు, సజ్జనులు ఉన్నచోట ఆ పురములు దించి, ఆ ప్రదేశాలు నాశనం చేస్తున్నారు. మహర్షులు, దేవతలు అంతా కలిసి బ్రహ్మదగ్గరకు పోయి త్రిపురాసురుల ఆగడాలను వివరించారు. బ్రహ్మ వారందరినీ తీసుకుని శ్రీహరివద్దకు వెళ్ళి త్రిపురాసురులు లోకాలను పీడిస్తున్నారని, లోకాలను రక్షించమని వేడుకున్నాడు.

అప్పుడు విష్ణుమూర్తి వేదవేదాంగవిదులు, కర్మిష్ఠులు అయిన త్రిపురాసురులను సంహరించటం అంత తేలిక అయిన పనికాదు. ముందుగా వారిని వేదదూరులుగా చెయ్యాలి. అని ఆలోచించి బౌద్ధమతాన్ని ప్రచారం చేయించాడు.

బౌద్ధ ధర్మాన్ని నమ్మిన త్రిపురాసురులు వేదాలను విడిచి పెట్టేశారు. నియమ నిష్ఠలను గాలికి వదిలేశారు. వావివరుసలు, వర్ణవ్యవస్థ నాశనమై పోయాయి. ధర్మము భ్రష్టుపట్టిపోయింది. అటువంటి సమయంలో శివుని సాయంతో, వారికి బ్రహ్మవరం ఇచ్చినట్లుగానే

| భూమి | - | రథముగా | బ్రహ్మదేవుడు | - | సారథి |
|---|---|---|---|---|---|
| రవిచంద్రులు | - | చక్రాలు | మేరుపర్వతము | - | విల్లు |
| నాలుగువేదాలు | - | గుర్రాలు | శ్రీహరి | - | అస్త్రముగా |

త్రిపురాసురసంహారం జరిగింది.

ఇలా ఒక్కసారి కాదు. దేవతలకు ఆపద సంభవించినప్పుడల్లా వారిని రక్షించాడు. అంతేకాదు.

**పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం ।**
**ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే ॥**

దుష్టశిక్షణ, శిష్టరక్షణ చెయ్యటానికి అవసరమైనప్పుడల్లా ఈ లోకంలో జన్మిస్తాను అని చెప్పాడు. ఈ రకంగా దేవతలను, సజ్జనులను రక్షిస్తాడు కాబట్టే శ్రీమన్నారాయణుడు 'అమరప్రభువు' అనబడతాడు.

ఉపనిషత్తులలో చెప్పినట్లుగా శ్రీమన్నారాయణుడే దేవతలను వారి విధులను నిర్వర్తించటానికి నియమించాడు. అందుచేతనే అతడు అమరప్రభువు అనబడతాడు.

## 50. విశ్వకర్మా

సకల వ్యాపారాలు గలవాడు.

**విశ్వస్య జగతః కర్మ వ్యాపారో యస్య లక్షణమ్ ।**
**ప్రాగ్బ్రహ్మ సృష్టే దూర్ధ్వఞ్చ విశ్వకర్మేతి కథ్యతే ॥**

బ్రహ్మ పుట్టటానికి ముందు, తరువాత కూడా జగత్తుయొక్క వ్యాపారములను తనకు లక్షణముగా కలవాడు ఇక్కడ బ్రహ్మ అంటే - కర్మ బ్రహ్మ త్రిమూర్తులలోని వాడు.

**విశ్వంకర్మ జగద్వ్యాపారః యస్యసః విశ్వకర్మా**

జగద్వ్యాపారము ఎవరికైతే ఉన్నదో, అతడు విశ్వకర్మ అనబడతాడు. ఈ జగత్తును సృష్టించిన పరమేశ్వరుడు శ్రీమన్నారాయణుడే కాబట్టి అతడే విశ్వకర్మ.

**విశ్వం కర్మ యస్యసః** ఈ విశ్వమును సృష్టించటము ఎవరి పనో, అతడు విశ్వకర్మ. విశ్వము తనచేత నిర్మించబడినదిగా గలవాడు.

**విశ్వం - కర్మ - విచిత్ర ప్రకారా నిర్మాణశక్తిః యస్య**

చిత్రవిచిత్రరీతులలో ఈ విశ్వమును నిర్మించటానికి శక్తి గలవాడు.

మహాప్రళయము సంభవించిన తరువాత కొంత కాలం గడిచింది. గతంలో కర్మక్షయం కాకుండా తనలో లీనమయిన జీవులకు పునర్జన్మ నిచ్చి, వాటి కర్మను క్షయంచేసి, తద్వారా ఆ జీవులకు మోక్షం ప్రసాదించాలనే కోరికతో స్థావర జంగమాత్మకమైన ఈ జగత్తును మళ్ళీ సృష్టించటానికి పూనుకున్నాడు పరమేశ్వరుడు. జీవుల యొక్క కర్మఫలాన్ని బట్టి వాటికి పునర్జన్మను ప్రసాదించాడు. తమ కర్మ ఫలంగానే కొండలు, కోనలు, పర్వతాలు, లోయలు, నదులు, సముద్రాలు, చెట్లు, చేమలు 84 లక్షల జీవరాశి ఉద్భవించింది. ఈ విధంగా, చిత్రవిచిత్రమైన శైలిలో జగన్నిర్మాణము చేసినవాడు ఆ పరమేశ్వరుడు తప్ప వేరుకాదు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'విశ్వకర్మా' అనబడుతున్నాడు.

## 51. మనుః

మననము చేయువాడు.

**సఙ్కల్పలవ మాత్రాచ్చ మనవా న్మనురుచ్యతే**

తనయొక్క సంకల్పములోని కొద్దిభాగము చేతనే ఈ పనులన్నీ చేయువాడు.

**మన్యతే ఇతి మనుః** సంకల్ప లేశము చేతనే సకల వ్యాపారములను చేయువాడు.

సృష్టిలో అనేక రకాల జీవరాసులున్నాయి. పశుపక్ష్యాదులకు, క్రిమికీటకాదులకు అన్నింటకీ ఆహార నిద్రామైథునాలు సర్వసామాన్యము. అయితే సంకల్ప వికల్పాలకు కారణమైన మనస్సు మానవుడికి మాత్రమే ఉన్నది. అందుచేతనే అతడు మంచి చెడు, పుణ్యము పాపము, ధర్మాధర్మాలు, నీతినియమాల గురించి ఆలోచించ గలుగుతాడు.

జీవి తాను చేసిన కర్మఫలితాన్ని బట్టి ఉత్తర జన్మ ఎత్తుతుంది. ఆ జన్మలో కర్మ ఫలితము అనుభవించటమే దాని పని. అయితే ఆ కర్మ నుండి తప్పించుకోవటానికిగాని, మళ్ళీ కర్మ చెయ్యటానికి గాని అవకాశము మానవులకు తప్ప దేవతలకు కూడా లేదు. దేవతలు అశరీరులు. కాబట్టి వాళ్ళు కర్మ చెయ్యటానికి సమర్థులు కారు. ఒకవేళ దేవతలు కర్మ చెయ్యాలి అనుకుంటే, వారుకూడా ఒక ఆకారం ధరించాలి. అనగా సాకారులు కావాలి.

కర్మక్షయం కోసం మానవులు చేసే ప్రక్రియలలో మంత్రజపము ఒకటి. **మననాత్త్రాయత ఇతి మంత్రః** మననము చెయ్యటంవలన, మననము చేసేవాడిని రక్షించేది మంత్రము. ఒకే అక్షరాన్ని గాని, పదాన్నిగాని, వాక్యాన్నిగాని, కొన్ని అక్షరాలనుగాని కలిపి మంత్రము అంటారు. ఆ మంత్రాన్ని పదేపదే ఉచ్చరించటాన్నే మంత్రజపము అంటారు. ఈ మంత్రాలు మూడు రకాలుగా ఉంటాయి. అవి

1. వైదిక మంత్రాలు 2. తాంత్రిక మంత్రాలు 3. అపభ్రంశములు. ఈ మంత్రాలను మననము లేదా జపము చేసినట్లైతే, దానివల్ల ఫలితము వస్తుంది. మనస్సుచేసే సంకల్ప వికల్పాత్మక వ్యాపారమే 'మననము' అటువంటి మననము చేసే మూలతత్త్వమే విష్ణువు. అందుచేతనే అతడు 'మనువు' అనబడుతున్నాడు.

మానవులకు ఆదిపురుషుడు మనువు. ఈ మనువులు 14 మంది వారు :

| | | | |
|---|---|---|---|
| 1. | స్వాయంభువమనువు | 8. | సూర్యసావర్ణికమనువు |
| 2. | సార్వోచిషమనువు | 9. | దక్షసావర్ణికమనువు |
| 3. | ఉత్తమ మనువు | 10. | బ్రహ్మసావర్ణికమనువు |
| 4. | తామస మనువు | 11. | రుద్రసావర్ణిక మనువు |
| 5. | రైవత మనువు | 12. | ధర్మసావర్ణిక మనువు |
| 6. | చాక్షుష మనువు | 13. | రౌచ్య మనువు |
| 7. | వైవస్వత మనువు | 14. | భౌచ్యమనువు |

పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడే మనువు రూపంలో అవతరించి సృష్టిని గావించాడు. **బృహదారణ్యకోపనిషత్తు**లో పురుషాకారంలో ఉన్న ప్రజాపతి తాను ఒక్కడే అయి ఉండి కూడా భయభ్రాంతుడైనాడు. ఒంటరిగా ఉన్న ఆ ప్రజాపతి ఒంటరితనంలోని ఆనందాన్ని పొందలేక స్త్రీని కోరాడు. అలా కోరిన వెంటనే స్త్రీ పురుషులు పరస్పరాలింగనము చేసుకున్నట్లుగా రూపుదాల్చాడు. అంటే తనశరీరాన్ని రెండు భాగాలుగా చేశాడు. ఆ భాగాలే పతిపత్ని.

కాలక్రమేణా వీరికే స్వాయంభువ మనువు శతరూప అని నామకరణం చేయటం జరిగింది. వీరినే ఆదాము, అవ్వ అని చెబుతోంది క్రైస్తవమతము వీరి వల్లనే 84 లక్షల జీవరాశి వృద్ధి చెందింది. అని చెప్పబడింది. ఈరకంగా ఆ పరమేశ్వరుడు మనువు అయి ఈ జగత్తును సృష్టించాడు. అందుచేత 'మనువు' అనబడుతున్నాడు. ఇప్పుడు మనకు వైవస్వత మన్వంతరము జరుగుతున్నది.

## 52. త్వష్టా

విభజించువాడు.

**నామరూప వ్యాకరణాత్ త్వష్టా స్పష్టస్య గద్యతే**

ఈ జగత్తును దేవతలు, మానవులు అనే భేదములచేత నామరూపాత్మకముగా విస్తరింపచేయువాడు **త్వక్షతి తనూకరోతీతి త్వష్టా** తాను నిర్మించిన జగత్తును నామ రూపాలతో చిత్రవిచిత్రముగా విభజించువాడు.

త్వక్షతి - ఇతిత్వష్టా

సంహారసమయంలో రుద్రరూపంతో ప్రాణులను క్షీణింపచేయువాడు. కాబట్టి శ్రీమన్నారాయణుడు 'త్వష్టా' అనబడుతున్నాడు.

'త్వష్ట' అనేవాడు ఒక ప్రజాపతి. ఇంద్రునిమీద గల కోపంతో మూడు తలలు కలిగిన విశ్వరూపుడు అనేవాడిని సృష్టించాడు. కాని ఇంద్రుడు అతణ్ణి వధించాడు. ఆ కోపముతో ఇంద్రుని సంహరించటానికి హోమంచేసి వృత్రాసురుని సృష్టించాడు. అయితే త్వష్టప్రజాపతి కూడా పరమేశ్వరాంశ సంభూతుడు.

## 53. స్థవిష్ఠః

స్థూలమైనవాడు 436వ నామం కూడా ఇదే.

**బహుభవంశ్చ సూక్ష్మాణాం స్థూలావస్థతయా చ సః ।**

**నిస్తారవత్త్వా ద్య స్థూలః స్థవిష్ఠః పరికీర్తితః ॥**

నామరూపాలు లేనటువంటి అవస్థలో ఉన్న చేతనా చేతనములను నామరూపములు కలవిగా చేయ సంకల్పించినవాడై, వాటిని భోక్తలు, భోజ్యములు, భోగస్థానములుగా విస్తరింపచేశాడు. ఇక్కడ

భోక్తలు అంటే - పృథివి ఆపః తేజోవాయురాకాశములు (పంచభూతాలు)
భోగ్యములు అంటే - శబ్దస్పర్శరూప రసగంధములు (తన్మాత్రలు)
భోగస్థానములు అంటే - చతుర్దశభువనాలు

మహాప్రళయం సంభవించింది. ఆ సమయంలో జీవజాలము అంతా నాశన మయింది. జీవులలో కర్మక్షయం అయిన వాటికి మాత్రమే ముక్తి లభిస్తుంది. కర్మక్షయంకాని జీవులు తమకర్మను తమతో మూట కట్టుకుని పరమేశ్వరునిలో లీనమవుతాయి. **ఛాందోగ్యపనిషత్తు**లో ఉద్దాలక మహర్షి తనకుమారుడైన శ్వేతకేతువుకు ఆత్మజ్ఞానం బోధిస్తూ

"జీవి ఏ రూపంలో ఉన్నప్పటికీ అంటే పులి, సింహము, ఆవు, మనిషి ఏదైనా కాని అనంత చైతన్యసముద్రంలో కలిసిపోయినతరువాత అంటే మరణానంతరము తనరూపాన్ని పోగొట్టుకుని అనంతమైన ఏకత్వంలో కలిసిపోతాయి. అదే బ్రహ్మ. అది అద్వితీయమైనది, సూక్ష్మమైనది, సర్వవ్యాపకమైనది.

నదులు తూర్పునుంచి పడమరకు ప్రవహించినా పడమర నుంచి తూర్పుకు ప్రవహించినా చివరకు అవన్నీ సముద్రములోనే కలుస్తాయి. నీరు ఒక సముద్రంలోంచి

ఇంకొక సముద్రంలోకి చేరుతుంది. సూర్యరశ్మికి సముద్రంలోని నీరు ఆవిరయ్యి మేఘాలుగా మారుతుంది. ఆ మేఘాలు వర్షించి జలాన్నిస్తాయి. ఆ జలం కొండలమీద నుంచి ప్రవహించి నదుల్లో కలుస్తుంది. ఆ నదులు చాలా దూరం ప్రవహించి చివరకు సముద్రంలోకి చేరతాయి. సముద్రంలో కలిసే వరకు ఆ నదులను గంగ, కృష్ణ, గోదావరి అని వివిధరకాల పేర్లతో పిలుస్తారు. కాని సముద్రంలో కలిసినతరువాత ఏ నీరు ఏ నది నుంచి వచ్చిందో తెలియదు. అలాగే విడిగా రకరకాలుగా ఉండే జీవరాశులు పరబ్రహ్మలో కలిసిపోయినప్పుడు వాటికి నామరూపాలు ఉండవు. ఈ జీవాత్మలు పరమాత్మలో కలిసిపోయినప్పుడు, అవన్నీ పరబ్రహ్మలోని భాగాలే.

ఈరకంగా కర్మక్షయం కాకుండా తమ నామరూపాలను కోల్పోయి తనలో లీనమయిన జీవులకు కర్మక్షయం చేసి వాటికి మోక్షం కల్పించాలనే ఉద్దేశ్యంతో ఆ జీవులకు నామరూపాలను ప్రసాదించి పంచభూతాలుగా, తన్మాత్రలుగా 14 లోకాలుగా చిత్రవిచిత్రంగా సృష్టి చేస్తున్నాడు. కాబట్టి 'స్థవిష్ఠాయ' అనబడుతున్నాడు.

**అయమతిశయేన స్థూలః స్థవిష్ఠః** సూక్ష్మావస్థలో ఉండేవాడు స్థూలరూపం దాలుస్తాడు. అంటే తన సంకల్పము ప్రకారము విస్తరింపదలచినవాడై సూక్ష్మరూపి అయిన పరమేశ్వరుడు పంచభూతాలు, తన్మాత్రలు, చతుర్దశ భువనాలుగా అనగా స్థావర జంగమాత్మకమైన జగత్తుగా విస్తరిస్తున్నాడు.

**అతిశయేన స్థూలః** ఎక్కువ లావు అయినవాడు. **మహతోమహీయాన్** మహత్తులకన్న మహత్తు అయినవాడు. గొప్పవాటికన్న గొప్పయైనవాడు. స్థౌల్యాతిశయము గలవాడు.

**భగవద్గీత**లోని పదవ అధ్యాయం **విభూతియోగం**లోని 19వ శ్లోకం భగవంతుని యోగ విభూతులను సమగ్రముగా వర్ణించమని అర్జునుడు శ్రీకృష్ణభగవానుణ్ణి అడుగుతాడు. అప్పుడు భగవానుడు.

> **హంతతే కథయిష్యామి దివ్యా హ్యాత్మవిభూతయః ।**
> **ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ నాస్త్యంతో విస్తరస్య మే ॥**

ఓ అర్జునా ! నా దివ్యవిభూతుల విస్తృతికి అంతమే లేదు. వాటిలో ప్రధానమైనవి నీకు వివరిస్తున్నాను అంటాడు.

జగత్తంతా పరమేశ్వరుని స్వరూపమే. వస్తువులన్నీ ఆయన యొక్క విభూతులే. కాని అవన్నీ ఆయన దివ్య విభూతులు కావు. భగవంతుని తేజస్సు, బలము, విద్య, ఐశ్వర్యము, కాంతి, శక్తి మొదలైన వాటితో కూడిన వస్తువులు లేక ప్రాణులను మాత్రమే

ఆయన దివ్యవిభూతులుగా భావించాలి. అలాంటి దివ్యవిభూతులు అనంతములు. అవన్నీ వివరించటానికి వీలుపడదు. అందుచేత వాటిలో ముఖ్యమైన వాటిని మాత్రమే ఇప్పుడు వివరిస్తాను అంటాడు శ్రీకృష్ణభగవానుడు. అంటే చరాచర జగత్తంతా పరమేశ్వరుని రూపమే. ఈ రకంగా జగత్తంతా ఆవరించి ఉన్నవాడు. **ఐతరేయోపనిషత్తు**లో చెప్పినట్లుగా ప్రాణికోటిని సృష్టించినతరువాత పరమేశ్వరుడు ఆ వస్తువులు లేదా ప్రాణులయందు ప్రవేశించాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'స్థవిష్ఠః' అనబడుతున్నాడు.

## 54. స్థవిరోధ్రువః

అన్ని కాలములందు చలించకుండా ఉండేవాడు. పరాశరభట్టరువారు దీన్ని 'స్థవిరః' 'ధృవః' అని రెండు నామాలుగా చెబుతున్నారు. ముందుగా ఈ రెండు నామాలను విడివిడిగా చూద్దాం.

**స్థవిరః :** అన్నికాలములందు ఉండేవాడు.

**కాలతంత్రతయాదుగ్ధ దద్యాదిభ్యో విలక్షణః ।**
**విద్యతే యస్సర్వకాలం స్థవిరః పరికీర్తితః ॥**

కాలానికి అధీనమై పరిణామము చెందే పాలు, పెరుగు వంటి వాటిలాగా కాకుండా, కాలము లాగానే అన్నింటినీ తనవశము నందుంచుకొనువాడు.

**సర్వకాలం తిష్ఠతీతి స్థవిరః**

సంకల్పముచేతనే సకలమునకు కారణమైనవాడు. అన్నింటికన్న విలక్షణుడు అయిన పరమేశ్వరుడు, ఇతడు కాలానికి వశుడు కాడు. కాలమే ఇతనికి వశమై ఉంటుంది.

**హాయనాత్మా మహాదేవః ప్రజాపతి రితిస్మృతి**

కాలపురుషుడే ప్రజాపతి అని యామళగ్రంథాలు చెబుతున్నాయి.

**ధ్రువః :** చలించనివాడు.

**అప్రచ్యాన్య స్వస్వరూపాత్ సదాయోஉసౌధ్రువ స్మృతః**

ఈ జగత్తులో అనేక పదార్థాలుగా, అన్నీ తానే అయి ఉన్నప్పటికీ, తన అసలు రూపం వదలకుండా నిర్వికారుడుగా ఉండేవాడు.

**ధ్రువతీతిధ్రువః** అనేక రూపాలు పొందినప్పటికీ, తనకు ఏ వికారము లేక స్థిరముగా ఉండేవాడు.

ఈ జగత్తంతా పరమేశ్వర స్వరూపమే. నిరాకారుడు, నిర్గుణ స్వరూపుడు అయిన పరబ్రహ్మ చరాచర జగత్తంతా ఆవరించి ఉన్నాడు. అంతటాతానై ఉన్నాడు. అన్నీ తానే అయి ఉన్నాడు.

**నారాయణోపనిషత్తు**లో శ్రీమన్నారాయణుడు నిత్యుడు. అతడే సత్యము, బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, ఇంద్రుడు, భూమి, ఆకాశము, కాలము, దిక్కులు, నారాయణ స్వరూపమే. ఊర్ధ్వభాగము, అథోభాగము నారాయణుడే. మధ్యభాగము కూడా శ్రీమన్నారాయణుడే. బాహ్యాంభ్యంతరములు, భూతభవిష్యద్వర్తమానములు అన్నీ నారాయణుడే. అతడు నిరాకారుడు, నిష్కళంకుడు, నిరంజనుడు, నిర్వికల్పుడు, అద్వితీయుడు ఈ జగత్తులో అతడు తప్ప వేరేవరూ లేరు అని చెప్పబడింది. ఈ రకంగా జగత్తంగా అతని రూపమే అయినప్పటికీ, తన అసలు రూపాన్ని అనగా నిరాకారాన్ని మాత్రం వదలలేదు. **విష్ణుపురాణములో**

**అవికారాయశుద్ధాయ నిత్యాయ పరమాత్మనే ।**
**సదైకరూప రూపాయ విష్ణవే సర్వజిష్ణవే ॥**

అవికారాయ అనగా వికారములు లేనట్టివాడు. వికారములు ఆరు. అవి.

| | | |
|---|---|---|
| 1. ఉనికి | 3. పెరుగుట | 5. పరిణమించుట |
| 2. పుట్టుట | 4. తరుగుట | 6. నశించుట |

వీటిని షడ్విధవికారములు అంటారు. పరమేశ్వరునికి ఈ రకమైన వికారములు లేవు. అతడు శుద్ధుడు ఎటువంటి గుణాలు లేనివాడు. నిత్యము సత్యమైనవాడు. సర్వవ్యాపి అని చెప్పబడింది.

ధ్రువుడు అనగా – బ్రహ్మ, విష్ణువు, శివుడు, ఉత్తానపాదుని కుమారుడు, అష్టవసువులలో ఒకడు. అని చెబుతోంది సూర్యరాయాంధ్ర నిఘంటువు.

అనంతా స్వాయంభవుల కుమారుడు ఉత్తానపాదులు ఇతనికి సునీతి (సూనృత) సురుచి అని ఇద్దరు భార్యలు సునీతి యందు ధ్రువుడు, సురుచియందు ఉత్తముడు అనే కుమారులు జన్మించారు. ఉత్తానపాదుడికి రెండవ భార్యయందు ప్రేమ ఎక్కువ. బాల్యంలో ఒకరోజున ధ్రువుడు తన తండ్రి తొడమీద కూర్చుని ఉండగా చూసిన అతని సవతితల్లి "ఇది నా కుమారుడు కూర్చునే చోటు. ఇక్కడ నువ్వు కూర్చొనరాదు" అని ధ్రువుణ్ణి తండ్రి ఒడి నుంచి దించివేసింది. దానికి ధ్రువుడు కోపగించి, తల్లి అనుమతి తీసుకుని అరణ్యాలకు వెళ్ళి తీవ్రమైన తపస్సు చేసి శ్రీమహావిష్ణువు వల్ల అనేక వరాలు పొందాడు.

వసువులు ఎనిమిది మంది వీరిని అష్టవసువులంటారు.

| | | | |
|---|---|---|---|
| 1. ఆపుడు | 2. ధ్రువుడు | 3. సోముడు | 4. అధర్వుడు |
| 5. అనిలుడు | 6. ప్రత్యూషుడు | 7. అనలుడు | 8. ప్రభాసుడు |

వీరందరూ విష్ణ్వంశ సంభూతులే. నహుషుని కుమారుని పేరుకూడా ధ్రువుడు ఈ రకంగా విష్ణువు చాలాకాలంగా (అనాదిగా) ఉండేవాడు. సర్వవ్యాపి స్థిరమైనవాడు అని ఈ రెండు నామాలకు అర్థం.

అయితే శంకర భగవత్పాదులవారు 'స్థవిరోధ్రువః' అని దీన్ని ఒకే నామంగా చెప్పారు. ఇక్కడ

స్థవిరః – అనాదియైనవాడు ధ్రువః – స్థిరమైనవాడు

శ్రీమన్నారాయణుడు ప్రాచీనమైనవాడు. అనాదియైన వాడు. సృష్టి జరగక ముందు నుంచే ఉన్నవాడు. స్థిరమైనవాడు. ఇందులో మొదటి పదము విశేషణము కాగా రెండవది విశేష్యము.

## 55. అగ్రాహ్యః

గ్రహించటానికి వీలు లేనటువంటివాడు. స్వాధీనము కానటువంటివాడు. పరమేశ్వరుడు.

**అగ్రాహ్యోయో ఉనధిష్ఠేయో మృత్తి కేవ కులాలకైః ।**

కుండలు తయారుచెయ్యటానికి కారణమైన మన్ను కుమ్మరికి స్వాధీనమై ఉంటుంది. కాని ఈ జగత్తుకు కారణమైన పరమాత్మ ఎవరికీ స్వాధీనము కాదు.

**గ్రహీతుం శక్యః గ్రాహ్యః న గ్రాహ్యః అగ్రాహ్యః**

గ్రహించటానికి వీలైనది గ్రాహ్యము. పరమాత్మ గ్రహించటానికి వీలు కానటువంటి వాడు. అందుచేత అగ్రాహ్యుడు. **'తైత్తిరీయనారాయణము'**లో

**నైనమూర్ధ్వ న్న తిర్యక్చ న మధ్యే పరిజగ్రభత్** ఆ పరమేశ్వర స్వరూపాన్ని పైన, క్రింద, మధ్యన ఎక్కడా కూడా గ్రహింపజాలము అని చెప్పారు.

**'దేవీభాగవతము'**లో తారకాసురుని బాధలు పడలేక దేవతలు, మునులు, ఋషులు, బ్రహ్మ, విష్ణువులతో కలిసి హిమాలయాలకు వెళ్ళి పరమేశ్వరిని పరిపరివిధాల అర్చించారు. అప్పుడు చైత్రశుద్ధ నవమి శుక్రవారం ఒక దివ్యమైన కాంతిపుంజము వారి ఎదుట ప్రత్యక్షమైంది. ఆ పరంజ్యోతి ఎలా ఉన్నది అంటే

**నైనచోర్ధ్వం న తిర్యక్చ నమధ్యే పరిజగ్రభత్ ।**

**ఆద్యంతరహితం తత్తు న హస్తాద్యంగసంయుతమ్ ॥**

పైన, క్రింద, అడ్డము అనే తేడాలేదు. అంతటా దివ్యమైన కాంతులు వెదజల్లుతున్నది. దానికి ఆద్యంతాలు లేవు. కాలు చేతులు మొదలైన అంగములు కూడా లేవు. అది స్త్రీ మూర్తి కాదు. పురుషుడు కాదు. అలా అని రెండూ కానిదీ కాదు. అని చెప్పబడింది. అంటే పరమేశ్వరుని రూపము ఇది అని చెప్పటానికి లేదు. ఇంద్రియ పరిజ్ఞానంవల్ల కాని, శాస్త్రపరిజ్ఞానమువల్ల కాని అతడు గ్రహించటానికి వీలు కాదు. అందుచేతనే 'అగ్రాహ్యుడు' అనబడుతున్నాడు.

ఇంద్రియాలతో ఆ పరమేశ్వరుణ్ణి గుర్తించలేము. **నచక్షుర్గచ్ఛతి న వాగ్గచ్ఛతి నోమనః** పరమేశ్వరుడున్న చోటికి ఇంద్రియాలు చేరలేవు. అనగా ఇంద్రియాల సహాయంతో అతన్ని గుర్తించటం సాధ్యంకాదు. అలా అని మనసుతో అతని రూపాన్ని గుర్తించలేము. వేదములు, శాస్త్రములు చదవటంవలన కూడా ఆ పరమేశ్వరుడు తెలియబడడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు అగ్రాహ్యుడు అనబడుతున్నాడు.

## 56. శాశ్వతః

శాశ్వతమైనవాడు. నిత్యుడు.

**అవ్యుచ్ఛిన్నాస్తతస్త్వేతే సర్గస్థిత్యన్త సంయమాః ।**

**అత స్సదా ప్రవాహత్వా న్నిత్యశ్శాశ్వత ఉచ్యతే ॥**

జగత్తుయొక్క సృష్టిస్థితిలయాదులను నిరంతరము కొనసాగిస్తూ ఉండేవాడు.

**శశ్వత్ భవః శాశ్వతః** జగద్వ్యాపారాన్ని ఎప్పుడూ ప్రవాహమువలె చేస్తూ ఉండేవాడు.

**విష్ణుపురాణంలో**

**అనాదిభగవాన్ కాలోనాన్తోస్య ద్విజ విద్యతే ।**

**అవ్యుచ్ఛిన్నాస్తతస్త్వేతే సర్గస్థిత్యంత సంయమాః ॥**

పరమేశ్వరుడు కాలస్వరూపుడు. సృష్టి స్థితి సంహారములనే జగద్వ్యాపారాలను నిత్యము చేస్తూనే ఉంటాడు అని చెప్పబడింది. అంటే ఆ పరమేశ్వరుడు శాశ్వతమైనవాడు, నిత్యుడు.

**విశ్వతః పరమాన్నిత్యం విశ్వం నారాయణగ్ం హరిం**

**విశ్వమేవేదం పురుషస్త ద్విశ్వముపజీవతి ।**

**పతింవిశ్వస్యాత్మేశ్వరగ్ం శాశ్వతగ్ం శివమచ్యుతమ్**

**నారాయణం మహాజ్ఞేయం విశ్వాత్మానం పరాయణమ్ ॥**

విశ్వానికి అతీతుడు, విశ్వమే తానుగా అయినవాడు, నిత్యుడు, సర్వవ్యాపకుడు, విశ్వానికి జీవనాధారమైనవాడు, విశ్వపతి, విశ్వానికి ఈశ్వరుడు, శాశ్వతుడు, మంగళకరుడు, నాశనము లేనివాడు, తెలిసికొనదగిన పరమాత్ముడు, విశ్వపరాయణుడు అయిన శ్రీమన్నారాయణునికి నమస్కారము.

కాబట్టి పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు శాశ్వతుడు, నిత్యుడు. అందుచేతనే 'శాశ్వతః' అనబడుతున్నాడు.

## 57. కృష్ణః

కృష్ణుడు - కృష్ణ (నలుపు) వర్ణము గలవాడు, దైత్యుల మర్దించువాడు, భక్తుని హృదయముల నాకర్షించువాడు, శ్రీమహావిష్ణువు యొక్క అవతారము. 550 కూడా ఇదే నామము.

**ఏకాన్తలీలారసతో నిర్వృతః కృష్ణ ఉచ్యతే ।**

**కృషిర్భూవాచక శ్శబ్దః ణశ్చనిర్వృతి వాచకః ॥**

లీలారసముతో నిరంతరము ఆనందించువాడు. కృష్ అనగా - భూమి (అపరిచ్ఛిన్నము, శాశ్వతము) ణ అనగా - ఆనందము. అపరిచ్ఛిన్నమైన, శాశ్వతమైన ఆనందమే స్వభావముగా గలవాడు.

**కృష్ణతీతి కృష్ణః** లీలారసముచేత మిక్కిలి ఆనందము పొందువాడు. భారతములోని ఉద్యోగ పర్వములో

**కృషిర్భూవాచకశ్శబ్దో ణశ్చనిర్వృతివాచకః విష్ణుః ।**

**స్తద్భావయోగాచ్చ కృష్ణోభవతి శాశ్వతః ॥**

'కృషి' అనేది భూవాచకము 'ణ' ఆనందమునకు వాచకము. ఈ రెండూ కలసి సకల జగత్తుకు ఆనందమునిచ్చువాడు కాబట్టి కృష్ణుడు అనబడుతున్నాడు అని చెప్పబడింది. ఇక్కడ భూమి అనగా సత్తా-కాలవశమున కూడా చెడనటువంటిది. శాశ్వతమైనది అని

అర్థం. ఈ రకంగా పరమాత్మ శాశ్వతుడు అని చెబుతోంది. ఇక్కడ శాశ్వతము, ఆనందములతోపాటు భగవంతుని లక్షణమైన జ్ఞానాన్ని కూడా తీసుకున్నట్లైతే 'కృష్ణ' శబ్దము పరమాత్ముని యొక్క సచ్చిదానందస్వరూపాన్ని తెలుపుతుంది.

కృష్ణవర్ణముగలవాడు కాబట్టి కృష్ణుడు అనబడతాడు. భారతములోని శాంతిపర్వములో

**కృషామి పృథివీం పార్థ । భూత్వాకార్ ష్ణాయసోహం: ।**

**కృష్ణోవర్ణశ్చమేయస్మా త్తస్మా త్కృష్ణోఽహ మర్జున ॥**

అర్జునా ! నేను నల్లని ఇనుము (ఉక్కు)తో తయారైన నాగటి కర్రుగానై ఈభూమిని దున్నుతాను. నాదేహము నల్లని వర్ణములో ఉంటుంది. అందుచేత నేను కృష్ణుడు అనబడతాను. అని చెప్పబడింది.

దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేయటానికి ఆర్తత్రాణ పరాయణుడైన శ్రీమన్నారాయణుడు ద్వాపరయుగములో దేవకి యొక్క అష్టమగర్భాన, వసుదేవుని కుమారుడుగా జన్మించి కంసాది దానవులనేకమందిని సంహరించాడు.

**అష్టమిరోహిణి ప్రొద్దున**

**అష్టమగర్భమున బుట్టి యా దేవకికిన్**

**దుష్టుని కంసువధింపవె**

**సృష్టిప్రతిపానంబు సేయగ కృష్ణా ॥**

చివరకు కురుక్షేత్ర మహాసంగ్రామం జరిపించి 18 అక్షోహిణీల సైన్యాన్ని నాశనం చేశాడు. ఈ భూమి మీద మళ్ళీ ధర్మాన్ని నాలుగు పాదాల నడిపించిన మహానుభావుడు. ఇది శ్రీమన్నారాయణుని అవతారమే కాని వేరు కాదు. కృష్ణావతారము గురించి 697 నుంచి 700 వరకు గల నామాలలో వివరించబడింది.

## 58. లోహితాక్షః

ఎర్రని కనులు గలవాడు – శ్రీమహావిష్ణువు

**రక్తరాజీవనయనో లోహితాక్షః ప్రకీర్తితః** ఎర్రతామరల వంటి కనులు గలవాడు

**లోహితే అక్షిణీ యస్యసః లోహితాక్షః**

ఎర్రతామరలవంటి నేత్రములు ఎవరికి కలవో అటువంటివాడు లోహితాక్షుడు.

**అసావృషభోలోహితాక్షః**

ఈతడు ఋషభుడను (శ్రేష్ఠుడను) లోహితాక్షుడు అని వేదం చెబుతున్నది.

ఆనందాన్ని ప్రకటించే ఎర్రతామరలవంటి నేత్రములు కలవాడు.

పరమేశ్వరుని యొక్క కన్నులు ఎప్పుడూ ఆనందాన్ని ప్రకటిస్తూ ఉంటాయి. అందుచేతనే అవి మనసుకు ఆహ్లాదాన్ని కలిగించే పద్మములతో పోల్చబడ్డాయి. విష్ణుమూర్తి ధ్యానశ్లోకంలో

**లక్ష్మీకాంతం, కమలనయనం** అని చెప్పబడింది. శ్రీ సూక్తంలో

**పద్మాసనే పద్మఊరూ పద్మాక్షీ పద్మసంభవీ** అని చెప్పబడింది.

లక్ష్మీ అష్టోత్తరములో **పద్మప్రియా, పద్మహస్తా, పద్మాక్షీ, పద్మసుందరీ** అని చెప్పబడింది. సరస్వతీ ధ్యానంలో

**సరస్వతీ నమస్తుభ్యం వరదేకామరూపిణీ ।**
**విద్యారంభం కరిష్యామి సిద్ధిర్భవతు మే సదా**
**పద్మపత్ర విశాలాక్షీ పద్మకేసర వర్ణినీ ॥**

అని చెప్పబడింది. సరస్వతీ అష్టోత్తరశతనామావళిలో

**సరస్వతీ మహాభద్రా మహామాయా వరప్రదా ।**
**శ్రీపదా పద్మనిలయా పద్మాక్షీ పద్మవక్త్రకా ॥**

ఈరకంగా ఎక్కడైనా సరే పరమేశ్వర స్వరూపాన్ని చెప్పేటప్పుడు కనులను వర్ణిస్తూ అవి పద్మములు లేదా ఎర్రతామరలవలె ఉంటాయి అని చెప్పటం జరుగుతుంది. అందుచేత ఇక్కడ పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుని నేత్రాలను ఎర్రతామరలతో పోల్చుతూ, 'లోహితాక్షుడు' అనటం జరిగింది.

## 59. ప్రతర్దనః

ప్రతర్దనుడు – సంహరించువాడు.

**యస్య చ బ్రహ్మక్షత్రఇఛ్ఛ హ్యోదనం భవతస్సదా ।**
**ప్రతర్దన స్సవిజ్ఞేయః సంహర్తృత్వప్రదోమనుః ॥**

బ్రహ్మక్షత్రియాది చతుర్వర్ణములతోను, అనేక జీవరాశులతోను కూడిన సమస్త ప్రపంచమును ఆహారముగా కలవాడు. సంహారకర్త. ఈ నామాన్ని గనక **ఓం ప్రతర్దనాయ నమః** అని మంత్రంగా జపించినట్లైతే శత్రుసంహారము జరుగుతుంది.

**ప్రతర్దయతి సంహారతీతి ప్రతర్దనః**

సృష్టించినవాడే అన్నింటినీసంహరిస్తాడు. బ్రహ్మసూత్రాలలో **అత్తాచరాచర గ్రహణాత్**

స్థావర జంగమాత్మకమైన ఈ ప్రపంచాన్ని గ్రహించటంవలన భుజించేవాడు పరమాత్మయే. లోకాలను భుజించేశక్తి పరమాత్మ ఒక్కడికే ఉన్నది. బ్రహ్మక్షత్రియులు అంటే బ్రహ్మక్షత్రియాదిగాగల మానవులు మొత్తం అని అర్థం. ఇక భుజించటము అంటే తనలోకి తీసుకోవటము అనగా లయం చేసుకోవటము ఒక్క మానవులేమిటి? ఈ జగత్తు అంతా తనలో లయం చేసుకుంటాడు పరమాత్మ. అయితే ఇక్కడ చిన్న అనుమానం వస్తుంది. **ముండకోపనిషత్తు**లో

ఒకేపేరు, ఒకేరూపము గల పక్షులు రెండు ప్రపంచమనే వృక్షాన్ని ఆశ్రయించి ఉన్నాయి. అందులో ఒకటి జీవాత్మ. ఇది తనకర్మవల్ల వచ్చిన ఫలితాలను అనుభవిస్తోంది. రెండవది పరమాత్మ. ఇది ఏ రకమైన ఫలాలను తినటం లేదు. అని చెప్పబడింది. ఇక్కడ ఈశ్వరుడు ఏ ఫలమూ అనుభవించకుండా చూస్తూ ఉన్నాడు అంటే పరమాత్మకు కర్మఫలం లేదు అని అర్థం. జీవుడు కర్మఫలాన్ని అనుభవిస్తాడు. పరమాత్మ ఈ కర్మ ఫలితము లేనందువల్ల చూస్తూ కూర్చున్నాడు.

పరమేశ్వరుడు ఐదురకాల పనుల చేస్తాడు. అవి సృష్టి, స్థితి, లయము, తిరోదానము, అనుగ్రహము. వీటినే పంచకృత్యములు అంటారు. సంహారము అనేది అతడియొక్క పని కాబట్టి జగత్తునంతా తనలోలయం చేసుకుంటాడు. అందుచేత శ్రీమన్నారాయణుడు 'ప్రతర్దనుడు' అని చెప్పబడుతున్నాడు.

**ప్రలయే భూతాని ప్రతర్దయతి** ప్రళయ కాలమందు భూతములను (జీవులను) హింసించువాడు కాబట్టి పరమేశ్వరుడు 'ప్రతర్దనుడు' అనబడుతున్నాడు.

## 60. ప్రభూతః

ప్రభూతుడు అనగా సమృద్ధుడు అని అర్థం.

**భోగో కరణం నిత్యం నిర్మర్యాదం పరం పదమ్ ।**

**యస్య తేన సమృద్ధత్వాత్ ప్రభూత ఇతి కథ్యతే ॥**

నిత్యమైన పరమపదముతో సమృద్ధిగా ఉన్నవాడు.

ఈ జగత్తునంతా సంహరించేసాడు. కాని తాను మాత్రం అలాగే ఉన్నాడు. మహాప్రళయము తరువాత మళ్ళీ సృష్టి జరిగేవరకు శ్రీమన్నారాయణుడు ఒక్కడే ఆ పరమపదములో ఉంటాడు.

**జ్ఞానైశ్వర్యాది గుణైః సంపన్నః**

జ్ఞానము ఈశ్వరత్వము మొదలైన గుణములతో నిండినవాడు. **మహానారాయణోప నిషత్తు**లో పరబ్రహ్మను గురించి చెబుతూ "బ్రహ్మకాలత్రయమున అబాధితమైనది. సర్వకాలములందు ఉండునది, సగుణ నిర్గుణస్వరూపము, ఆదిమధ్యాంతరహితము, అఖండము, పరిపూర్ణము, అద్వితీయము, పరమానందము, శుద్ధ బుద్ధ ముక్త స్వభావము, సత్యస్వరూపము, అపరిచ్ఛిన్నము, పరిపూర్ణము, అద్వితీయము, స్వప్రకాశము, మనోవాచానుగోచరము, వేదాంతవేద్యము, సర్వపరిపూర్ణము" అని చెప్పబడింది. ఈరకంగా జ్ఞానము ఈశ్వరత్వము మొదలైన గుణాలు సమృద్ధిగా గలవాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు 'ప్రభూతుడు' అనబడుచున్నాడు.

భక్తులయొక్క కోరికలు తీర్చటానికి అష్టసిద్ధులు, నవనిధులు సమృద్ధిగా గలవాడు. తన భక్తులకు ఎంత ఇచ్చినప్పటికీ తరగని ఐశ్వర్యము గలవాడు. శంఖ, పద్మనిధులను చేతులయందు ధరించినవాడు కాబట్టి భక్తులు కొంచెం అర్పించినా, వారికి కొండంత ఫలితము అందిస్తాడు. ఈ రకంగా సిరిసంపదలు, అష్టసిద్ధులు, నవనిధులు జ్ఞానము, ఈశ్వరత్వము సమృద్ధిగా గలవాడు. కాబట్టి 'ప్రభూతుడు' అనబడుతున్నాడు.

## 61. త్రికకుబ్ధామ

త్రిపాద్విభూతిని స్థానముగ కలవాడు.

**త్రిపాద్విభూతి స్త్రికకుత్ సై వస్థానం విశేషతః**
**యస్య స త్రికకుద్ధామ ॥**

త్రికకుత్ అంటే – పరమపదము. ధామ అనగా – దానిని ప్రధానమైన నివాస స్థానముగ కలవాడు. పరమపదమును స్థానముగ కలవాడు.

**(ఊర్ధ్వాధోమధ్య భేదేన) తిసృణాం కకుభాం (అపి) ధామ**

ఊర్ధ దిక్కు, అధో దిక్కు, మధ్య దిక్కు అనే భేదముతో ఉన్న మూడు దిక్కులకు ఆశ్రయమైన వాడు. త్రివిధ దశలకు ఆశ్రయమైనవాడు.

ఈ నామాన్ని మూడు రకాలుగా చెబుతున్నారు.

**1. త్రికకుద్ధామ :** త్రిపాద్విభూతిని స్థానముగ కలవాడు. సృష్టిస్థితి సంహారము అనేవి పరమేశ్వరుడు చేసే పనులలో కొంచెము మాత్రమే, మిగిలినది ఇంకా మూడు రెట్లు ఉన్నది. మనం చూస్తున్నది ఒక బ్రహ్మాండాన్నే, ఇలాంటివి ఇంకా అనేక కోట్లు సృష్టిస్తున్నాడు పరమేశ్వరుడు. అందుచేతనే పరమేశ్వరతత్వాన్ని చెబుతూ **అనేక కోటి బ్రహ్మాండ జననీ** అనటం జరిగింది.

సృష్టి ప్రారంభంలో పరమేశ్వరుడు, ఈ సృష్టిని చెయ్యగోరినవాడై తననుంచి కొంతశక్తిని బయటకు పంపాడు. ఆశక్తివల్లనే స్థావర జంగమాత్మకమైన ఈ జగత్తు సృష్టించబడింది. ఈ జగత్తంతా పరమేశ్వరమయమే. కాని ఈ జగత్తే పరమేశ్వరుడు కాదు.

పురుషసూక్తములో **పాదోస్యవిశ్వాభూతాని త్రిపాదస్యామృతందివి**. పరమేశ్వరుని విభూతులలో ఈ జగత్తు నాల్గవ భాగము మాత్రమే. అని చెప్పబడింది. మరి మిగిలిన మూడు భాగాలు ఎక్కడ ఉన్నాయి అంటే – అదే పరమపదము.

**2. త్రికకుబ్ధామ :** ఆరు రకాలైన గుణాలు గలవాడు పరమేశ్వరుడు అవి.

| | | |
|---|---|---|
| 1. జ్ఞానము | 3. శక్తి | 5. బలము |
| 2. వీర్యము | 4. ఐశ్వర్యము | 6. తేజస్సు |

ఈ గుణాలు కల పరమేశ్వరుడు 'త్రికకుద్ధాముడు' అనబడతాడు.

**3. త్రికకుత్ - ధామ :** త్రికకుత్తు అంటే–మూడు శిఖరములు కలది. త్రికూటపర్వతము.

మానవశరీరంలో ఇడ, పింగళ, సుషుమ్న నాడులు కలిసే ప్రదేశము భృకుటి అదే ఆజ్ఞాచక్రము దీన్నే త్రికూటము అంటారు.

త్రికకుత్ అనగా–మూడు పురములు గలది. వరాహము అనికూడా అర్థం చెప్పారు. అటువంటి వరాహరూపం ధరించిన తేజోమూర్తి కాబట్టి 'త్రికకుత్ధామ' అనబడుతున్నాడు.

మేరు పర్వతము బంగారు పర్వతమని ప్రసిద్ధి. ఈ పర్వతంమీద త్రికోణాకారంలో మూడు శిఖరాలున్నాయి. వాటిమధ్యన ఇంకొక శిఖరమున్నది. దుర్వాస మహర్షి 'లలితాస్తవరత్నము'లో "మేరుపర్వతము లోకాలన్నింటిలోకి గొప్పదై ప్రకాశిస్తున్నది. ఆ పర్వతముమీద మూడు శిఖరాలున్నాయి. ఆ మూడు శిఖరాలు త్రిమూర్తులకు నిలయమై ఉన్నాయి. వాటిమధ్యన నాల్గవ శిఖరమున్నది. ఆ శిఖరము 400 యోజనాల ఎత్తున్నది. అదే దేవి నివాసస్థానము" అని చెప్పాడు. ఇక్కడ పరమేశ్వరుడన్నా పరమేశ్వరి అన్నా ఒక్కటే.

**లలితాసహస్రం**లో ఆ శిఖరాన్ని గురించి చెబుతూ అమ్మవారిని 'సుమేరుమధ్యశృంగస్థా' అని చెప్పటం జరిగింది. అంటే పరబ్రహ్మ స్వరూపమైన పరమేశ్వరి మేరుపర్వత శృంగము నందు ఉంటుంది. ఆ శిఖరమునందే పరమేశ్వరుడున్నాడు.

ఆ శిఖరము దేవతలచే పూజించబడుతున్నది. అందుచేతనే అది సామాన్యులకు కనిపించదు. మానవ శరీరములో చెప్పబడే సహస్రదళ పద్మమే మేరుపర్వతము. యోగి ఆజ్ఞాచక్రం దాటిన తరువాత మహానాదాన్ని దర్శిస్తాడు. అతడికి వాక్సిద్ధి కలుగుతుంది. మహానాదము నాగలిరూపంలో ఉంటుంది. అది శాంతమైనది. వరప్రదాయని. ప్రకాశమైనది. విసర్గకు క్రిందగా సహస్రదళ పద్మమున్నది. అది పూర్ణచంద్రుని లాగా ప్రకాశిస్తుంటుంది. అథోముఖముగా ఉంటుంది. దాని కిరణాలు సూర్యకిరణాల కన్న ఎక్కువగా ప్రకాశిస్తుంటాయి. అది కేవలము ఆనందరూపమైనది.

సహస్రదళ పద్మములో కళంకరహితుడైన చంద్రుడున్నాడు. ఆ చంద్రమండలము మధ్యన త్రికోణమున్నది. దానియందు మహాశూన్యమున్నది. దానిని దేవతలు రహస్యంగా సేవిస్తూ ఉంటారు. ఆశూన్య ప్రదేశము చాలా రహస్యమైనది అతి ప్రయత్నము మీదగాని దాన్ని పొందలేరు. అది అపరిమితమైన సంతానరాశి. పరమేశ్వరుడు అక్కడే ఉంటాడు. ఆయన సర్వాంతర్యామి. అజ్ఞానాన్ని మోహాన్ని పోగొడతాడు. అని రాజయోగములో చెప్పబడింది.

ఆ మూడు శిఖరములయందు కామగిరి, పూర్ణగిరి, జాలంధర పీఠాలున్నాయి. వాటి మధ్యన ఓడ్యాణ పీఠము ఉన్నది. అదే బిందు మండలము. అందులో పరమేశ్వరి ఉంటుంది అని లలితా సహస్రంలో చెప్పబడింది.

ఈ రకంగా పరమేశ్వరుడు పరమపదమునందుంటాడు. మానవశరీరంలో బ్రహ్మరంధ్రం దగ్గర ఉంటాడు. అందుచేతనే పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు త్రికకుత్ ధాముడు అనబడుతున్నాడు.

## 62. పవిత్రమ్

పవిత్రమైనవాడు, పరిశుద్ధుడు.

**గుణస్యవిభవానాఞ్చ రూపస్య చ నిరన్తరమ్**

**నిరూపకస్య సర్వైశ్చ తన్ని రూప్యం స్వరూపకమ్**

**అనుప్ర విశ్వవసం స పవిత్ర మితిస్మృతమ్ ॥**

జ్ఞానము, శక్తి మొదలైన గుణములచేత, ఉభయ విభూతి నాయకత్వాది మహిమచేత, దివ్యమంగళ విగ్రహాదులచేత, క్రమముగా తెలియబడే స్వరూపము గలవాడు. ఇటువంటి రూపముతో, గుణాలతో అన్నింటియందు ప్రవేశించి ఉన్నవాడు.

**పూతో భవతీతి పవిత్రమ్** అన్ని రకాలయిన చెడు గుణాలకు వ్యతిరేకం కావటంచేత పవిత్రుడు అనబడుతున్నాడు.

**యేన పునాతి తత్ – పవిత్రమ్**

దేనిచేత ఇతరమైన వాటిని శుద్ధి చేస్తారో అది పవిత్రమైనది. పాపకర్ముడు గంగానదిలో స్నానం చేస్తే అతడి పాపాలు పోతాయి. అంటే గంగానది పరమ పవిత్రమైనది.

**సాధూనాం దర్శనం పుణ్యం స్పర్శనం పాపనాశనం**

సత్వగుణ ప్రధానులై నిరంతరము భగవన్నామ స్మరణతోను, భగవచ్చింతన తోనూ కాలం గడిపే సర్వసంగపరిత్యాగులు సాధువులు అటువంటివారిని దర్శించిన మాత్రం చేతనే పుణ్యం కలుగుతుంది. వారి పాదాలను స్పృశించి నమస్కరిస్తే సర్వపాపాలు హరిస్తాయి. అటువంటి సాధువులు పవిత్రులు అయితే

**యః పునాతి – సః – పవిత్రమ్** ఎవని నామస్మరణ చేత సకల ప్రాణులు పరిశుద్ధమవుతాయో అతడు పవిత్రుడు. అతడు శ్రీమహావిష్ణువు కాక వేరు కాదు.

**హరి యను రెండక్షరములు**
**హరియించును పాతకములనంబుజనాభా**
**హరినీనామ మాహాత్మ్యము**
**హరిహరి పొగడంగ వశమె హరిశ్రీకృష్ణా ॥**

‘అజామీళుడు’ అనే బ్రాహ్మణుడు పరమక్రూరుడు. అయినప్పటికీ తన అవసాన కాలంలో, తన కుమారుని మీద మమకారంతో “నారాయణా !” అంటూ కుమారుణ్ణి పిలిచాడు. అంతమాత్రం చేతనే మరణానంతరము అజామీలుడు వైకుంఠానికి వెళ్ళాడు. ఈ కథగతంలో వివరించటం జరిగింది. ఎంతటి క్రూర కర్ముడైనా సరే పరమేశ్వరుణ్ణి స్మరించినంత మాత్రం చేతనే అతని పాపాలన్నీ పటాపంచలై పోతాయి. అతడు పునీతుడౌతాడు, విష్ణుసహస్రనామ పూర్వ పీఠికలో

**యస్య స్మరణ మాత్రేణ జన్మసంసారబంధనాత్ ।**
**విముచ్యతే నమస్తస్మై విష్ణవే ప్రభవిష్ణవే ॥**

ఎవరిని తలచినంత మాత్రంచేతనే సంసారబంధనాలు, పరంపరలు తొలగిపోతాయో అటువంటి శ్రీమహావిష్ణువుకు నమస్కారము అని చెప్పబడింది. ఇతరుల పాపాలను నాశనం చేసేవాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు పవిత్రుడు, పరిశుద్ధుడు.

# 63. మంగళం పరమ్

పరమమంగళప్రదమైన వాడు.

**సర్వహేయ ప్రత్యనీక మనన్తావస్థ లక్షణమ్ ।**

**వేదాన్త పారగం నిత్యముచ్యతే మఙ్గళం పరమ్ ॥**

సమస్త దుర్గుణాలకు సహజశత్రువు, సచ్చిదానందమే రూపముగ గలవాడు అని వేదాలు చెబుతున్నాయి. బ్రహ్మసూత్రాలలో

**ఆనందమయోఽభ్యాసాత్** ఆనందమయుడు అనే శబ్దాన్ని పరబ్రహ్మను సూచించటానికే ఉపనిషత్తులలో పలుసార్లు వాడటం జరిగింది. అందుచేత 'ఆనందమయుడు' అంటే ఆ పరమాత్మ తప్ప వేరుకాదు.

**తైత్తిరీయోపనిషత్తు**లో వరుణ మహర్షి కుమారుడు భృగుమహర్షి. విద్యాభ్యాసం పూర్తి చేశాడు. అంటే వేదవేదాంగాలు అభ్యసించాడు. యజ్ఞయాగాది కర్మలు చెయ్యటంలో నిష్ణాతుడు. తన తండ్రి దగ్గరకు వచ్చి బ్రహ్మవిద్యను ఉపదేశించమని అడిగాడు. 'ఒకరు చెబితే వచ్చేది కాదు బ్రహ్మవిద్య. ఎవరికి వారే అనుభవ పూర్వకంగా తెలుసుకోవాలి. అందుచేత వెళ్ళి తపస్సు చెయ్యి' అన్నాడు.

అరణ్యాలకు వెళ్ళాడు భృగుమహర్షి. పన్నెండు సంవత్సరాలు తపస్సు చేశాడు. అతడికి అప్పుడు తెలిసింది. 'అన్నమే పరబ్రహ్మ స్వరూపము' అని తిరిగి వచ్చి ఆ విషయం తండ్రికి తెలియచేశాడు. అన్నం పరబ్రహ్మ స్వరూపమే. కాని అన్నమే పరబ్రహ్మ కాదు. మళ్ళీ తపస్సు చెయ్యి అన్నాడు తండ్రి. మళ్ళీ పన్నెండు సంవత్సరాలు తపస్సు చేశాడు భృగువు. ఈసారి 'ప్రాణమే పరబ్రహ్మ' అని తెలిసింది. ఆ మాటే తండ్రికి చెప్పాడు కాదు. మళ్ళీ తపస్సు చెయ్యి అన్నాడు తండ్రి. మళ్ళీ తపస్సు చేశాడు భృగువు. ఈసారి 'మనస్సే పరబ్రహ్మ' అని తెలిసింది. ఆ విషయం తండ్రికి చెప్పాడు. కాదు మళ్ళీ తపస్సు చెయ్యి అన్నాడు తండ్రి. ఈసారి 'విజ్ఞానమే పరబ్రహ్మ' అని తెలిసింది. ఆ సంగతి తండ్రికి చెప్పాడు కాదన్నాడు తండ్రి మళ్ళీ తపస్సు చేశాడు భృగువు. ఈసారి "ఆనందమే పరబ్రహ్మ' అని తెలిసింది. సర్వమూ ఆనందం నుంచే జనిస్తుంది. అందులోనే లయం అవుతుంది. ఈ విషయం తండ్రికి చెప్పాడు

మహదానందం చెందాడు తండ్రి. అప్పుడు చెప్పాడు "కుమారా ! అన్నింటికన్నా ఉత్తమంగా పరమతత్త్వాన్ని స్పష్టం చేసే తత్త్వం ఆనందము. అన్నము, ప్రాణము, మనసు, విజ్ఞానము కూడా పరబ్రహ్మ స్వరూపాలే. ఇవి ఒక దానికన్న ఒకటి మరీ సూక్ష్మమైనవి. అన్నింటినీ మించినది ఆనందము. ఈఆనందము క్షణికమైనదికాదు శాశ్వతమైనది. ఆనందస్వరూపుడైన పరబ్రహ్మ అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశముల మధ్య ఆనందమయకోశమందుంటాడు. ఆనందమే అతని స్వరూపము' అంటూ వివరించాడు.

ఆనందము రెండు రకాలు క్షణికము, శాశ్వతము లౌకికమైన సుఖాలు పొందితే వచ్చేది క్షణికానందము ఈ ఆనందము అనుభవించగానే తీరిపోతుంది. ఒక వస్తువును అనుభవించాలి అనుకున్నాము అనుభవించాము. ఆఆనందాన్నిపొందాము అయిపోయింది. ఇంకొకసారి అనుభవిస్తే అటువంటి ఆనందము మళ్ళీ రాదు. లౌకికమైన సుఖాలవల్ల పొందిన ఆనందం తరువాత మనకు మిగిలేది దుఃఖమే అనుభవించిన క్షణం వరకే ఆనందం ఉంటుంది. ఆ తరువాత ఉండదు. అందుకే దీన్ని క్షణికానందము అంటారు.

రెండవది శాశ్వతమైన ఆనందం. ఇదే బ్రహ్మానందము. **తైత్తిరీయోపనిషత్తు**లోని **ఆనందవల్లి**లో సాధకుని శరీరంలోనే పరబ్రహ్మ ఉంటాడు. ఇక్కడ అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశాలనడుమ ఆనందమయకోశమున్నది. జీవికి మూడు శరీరాలుంటాయి.

1. **స్థూలశరీరము :** అన్నమయకోశము, ఇంద్రియాలతో నిండినది.
2. **సూక్ష్మశరీరము :** ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయముల సముదాయము
3. **కారణశరీరము :** స్థూలసూక్ష్మశరీరాలకు కారణమైనది. ఆనందమయ కోశము.

పరమేశ్వరుడు ఆనందస్వరూపుడు. ఆ ఆనందము శాశ్వతము, నిత్యము అయినది. అదే బ్రహ్మానందము. ఈ లోకంలోని సంపద అంతా యువకుడు సదాచార సంపన్నుడు, వేదాధ్యాయి బలము, ఆరోగ్యము కలవాడు అనుభవించటానికే ఉన్నది. సదాచార సంపన్నుడు, వేదవేదాంగవిదుడు, కర్మిష్ఠి సిరిసంపదలు కల బ్రాహ్మణుడు పొందే ఆనందము మానుషానందము.

| | | |
|---|---|---|
| మానుషానందానికి నూరు రెట్లు | – | మానుషగంధర్వానందము |
| మానుషగంధర్వానందానికి నూరురెట్లు | – | దేవగంధర్వానందము |
| దేవగంధర్వానందానికి నూరురెట్లు | – | చిరలోకపితరానందము |

| | | |
|---|---|---|
| చిరలోకపితరానందానికి నూరురెట్లు | - | అజానజ దేవానందము |
| అజానజదేవానందానికి నూరురెట్లు | - | కర్మదేవానందము |
| కర్మదేవానందానికి నూరురెట్లు | - | దేవానందము |
| దేవానందానికి నూరురెట్లు | - | ఇంద్రానందము |
| ఇంద్రానందానికి నూరురెట్లు | - | బృహస్పతి ఆనందము |
| బృహస్పతి ఆనందానికి నూరురెట్లు | - | ప్రజాపతి ఆనందము |
| ప్రజాపతి ఆనందానికి నూరురెట్లు | - | బ్రహ్మానందము |

ఈ బ్రహ్మానందమే పరమేశ్వరుని స్వరూపము. తనని సేవించినవారికి ఎప్పుడూ శుభములనే చేకూర్చుతాడు. అందుచేతనే పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు పరమ మంగళప్రదుడు అని చెప్పబడుతున్నాడు. విష్ణుపురాణంలో చెప్పినట్లుగా ఏ పరబ్రహ్మను స్మరించినంత మాత్రంచేతనే అశుభాలు తొలగిపోయి శుభం చేకూరుతుందో ఆ శ్రీమన్నారాయణుడు మంగళప్రదుడు.

## 64. ఈశానః

పాలకుడు

**సర్వావస్థాసు సర్వేషాం వ్యవస్థాపనశీలతః ।**
**వస్తూనాం భగవాన్ సాక్షాత్ ఈశానః పరికీర్తితః ॥**

సర్వకాల సర్వావస్థలయందు అన్ని పదార్థాలను కూడా వాటివాటి హద్దులు మీరకుండా నియమించువాడు.

**ఈష్టే ఇతి ఈశానః** ఇతర దేవతలవలెగాక అన్ని సమయములయందు అన్ని వస్తువులను, అన్ని ప్రాణులను పాలించే స్వభావము కలవాడు.

జీవులకు వాటి కర్మ ఫలితాన్ని బట్టి ఉత్తరజన్మ కల్పించాడు. అందులో భాగంగానే దేవతలను నియమించాడు. దిక్పాలకులను నియమించాడు. పరబ్రహ్మ ఉన్నాడనే భయంతోనే గాలి సవ్యంగా వీస్తున్నది. సూర్యుడు ప్రకాశిస్తూ కాంతిని వెదజల్లుతున్నాడు. వానలు కురుస్తున్నాయి. దిక్పాలకులు వారి విధులను సరిగా నెరవేరుస్తున్నారు. ఈ రకంగా పరబ్రహ్మ లోకాలను సరిగా పాలిస్తున్నాడు.

దేవీభాగవతంలో చింతామణి గృహాన్ని గురించి చెబుతూ

**తదేవ దేవీసదనం మధ్యభాగే విరాజితే ।**

**సహస్రస్తంభసంయుక్తా శ్చత్వారస్తే షుమండపాః ॥**

**శృంగారమండపశ్చైకో ముక్తిమండప ఏవచ ।**

**జ్ఞానమండప సంజ్ఞస్తు తృతీయ పరికీర్తితః ॥**

**ఏకాంతమండపశ్చైవ చతుర్ధః పరికీర్తితః ।**

చింతామణి గృహంలో వేయిస్తంభాలు కలిగిన మండపాలు నాలుగు ఉన్నాయి.

1. శృంగార మండపము
2. ముక్తిమండపము
3. జ్ఞానమండపము
4. ఏకాంతమండపము

**చతుర్ధే మండపేచైవ జగద్రక్షా వివించనమ్ ।**

**మంత్రిణీ సహితా నిత్యం కరోతి జగదంబికా ॥**

వీటిలో నాల్గవదయిన ఏకాంత మండపంలో ఆ పరమేశ్వరి తన మంత్రిణులతో కూడి లోకరక్షణ గురించి ఆలోచిస్తూ ఉంటుంది. అంటే పరమేశ్వరరూపము ఎప్పుడూ ఈలోకాలను పాలిస్తూ ఉంటుంది అని అర్థం.

**ఈష్టే - సర్వభూతాని - సర్వవ్యాపారేషు నియమయతి** సర్వభూతాలను తమ తమ వ్యాపారములందు నియమించువాడు. ప్రవర్తిల్ల చేయువాడు ఆ పరమేశ్వరుడు.

**నావిష్ణుర్ పృథివీపతిః** అందుచేతనే విష్ణ్వంశ లేనివాడు దేశాన్ని పాలించేరాజు కాలేదు అని చెప్పబడింది.

ఈశానుడు - అష్టదిక్పాలకులలో ఒకడు. ఈశాన్య దిక్కుకు అధిపతి. ఇతడు వృషభవాహనమెక్కి, స్ఫటిక వర్ణముతో, చేతియందు త్రిశూలము ధరించి ఉంటాడు.

## 65. ప్రాణదః

బలము నిచ్చువాడు. 321, 408, 956 కూడా ఇదే నామము.

ప్రాణము అనగా - ఊపిరి, హృదయమందలి గాలి, పంచప్రాణములలో ఒకటి, బలిమి, బలము, జీవుడు అంటూ అనేకమైన అర్థాలు చెబుతోంది సూర్యరాయాంధ్ర నిఘంటువు. ఇక్కడ ప్రాణము అనే శబ్దము బలము, శక్తి అనే అర్థంలో వాడబడింది.

**సూరిభ్యః పరిచర్యాదౌ బలదః ప్రాణదస్స్మృతః** తనయొక్క భక్తులకు ఎల్లప్పుడూ తనను దర్శించటానికి, తనకు సేవలు చెయ్యటానికి తగిన బలము, శక్తి ఇచ్చేవాడు.

**ప్రాణం దదాతీతి ప్రాణదః** ప్రాణమునిచ్చువాడు ప్రాణదుడు

**య ఆత్మదాః బలదాః**

భగవానుడు భక్తులకు తనను అనుభవించటానికి తగిన బలము నిచ్చుచున్నాడు.

శరీరములో 72వేల నాడీమండలమున్నది. ఈనాడులయందు రెండు రకాల వాయువులు సంచరిస్తూ ఉంటాయి. అవి 1. ప్రధాన వాయువులు 2. ఉపవాయువులు ప్రధాన వాయువులనే ప్రాణవాయువులు అంటారు. ఇవి ఐదు రకాలు

1. ప్రాణవాయువు 2. అపానవాయువు 3. వ్యానవాయువు
4. ఉదానవాయువు 5. సమానవాయువు

**1. ప్రాణవాయువు :** ఇది వక్షస్థలమునందు ఉంటుంది. దీని అధిష్ఠానదేవత 'విశిష్టకుడు' ఇది శ్వాసాదులను ఇడ, పింగళనాడుల ద్వారా బయటకు పంపుతుంది.

**2. అపానవాయువు :** ఇది గుదస్థానంలో ఉంటుంది. దీనికి అధిష్ఠానదేవత 'విశ్వకర్త'. ఇది అధోముఖంగా సంచరిస్తూ శుక్ల, మలమూత్రాలను, రక్తకుహూ, సినీవాలి నాడులద్వారా బయటకు పంపుతుంది. దీనివల్లనే మలమూత్రాలు అధోముఖంగా విసర్జించబడతాయి.

**3. వ్యానవాయువు :** ఇది శరీరమంతా ప్రసరించి ఉంటుంది. దీనికి అధిష్ఠానదేవత. 'విశ్వయోని'. ఇది బయటి శీతోష్ణాలను లోపలకు, లోపలి వాటిని బయటకు పంపుతూ ఉంటుంది. భుజించిన ఆహారాన్ని శరీరమంతా వ్యాప్తి చేస్తుంది.

**4. ఉదానవాయువు :** ఇది కంఠస్థానంలో ఉంటుంది. దీనికి అధిష్ఠానదేవత 'అజుడు'. ఇది మనసు యొక్క సంకల్పవికల్పాలను మాటల రూపంలో వెల్లడి చేస్తుంది. సుషుప్త్యవస్థలో ఇంద్రియాలను స్వాధీనం చేసుకుని తనకు కారణమైన అజ్ఞానంలో మునిగిపోతుంది. జాగ్రదవస్థలో ఇంద్రియాలను వాటివాటి స్థానాలలో నిలబెడుతుంది. ఈ వాయువు సుషుమ్నా మార్గంగుండా సహస్రారం వరకు సంచరిస్తుంది.

**5. సమానవాయువు :** ఇది నాభిప్రదేశంలో ఉంటుంది. దీనికి అధిష్ఠానదేవత 'జయుడు' ఇది జఠరాగ్నిని ప్రజ్వలింపజేసి, భుజించిన ఆహారాన్ని అరిగించి శరీరంలోని 72వేల నాడీ మండలానికీ సమంగా అందిస్తుంది.

అదే విధంగా ఉపవాయువులు కూడా ఐదు. అవి నాగ, కూర్మ, కృకర, దేవదత్త, ధనంజయములు.

1. నాగవాయువు - వాంతిని కలిగిస్తుంది.
2. కూర్మవాయువు - కనురెప్పలను కదలిస్తుంది
3. కృకరవాయువు - తుమ్ములను కలిగిస్తుంది
4. దేవదత్త వాయువు - ఆవలింతలు కలిగిస్తుంది.
5. ధనంజయవాయువు - శరీరమంతా వ్యాపించి శరీరాన్ని అభివృద్ధి పరుస్తుంది.

ఈ వాయువులే శరీరం కదలటానికి, పనులు చెయ్యటానికి కావలసిన శక్తినిస్తాయి. ఈ వాయువు ఉన్నంతవరకే ప్రాణి జీవించి ఉంటుంది. శంకర భగవత్పాదుల వారు తమ **భజగోవింద** శ్లోకాలలో

**యావత్పవనో నివసతిదేహే తావత్ పృచ్ఛతి కుశలం గేహే**
**గతవతివాయౌ దేహాపాయే భార్యాబిభ్యతి తస్మిన్ కాయే**

శరీరంలో ఊపిరి ఉన్నంతవరకు ఇంటిలోని వారంతా జీవి ఎలా ఉన్నాడు? ఏమిటి? అంటూ కుశలము విచారిస్తారు. కాని ఆ ఊపిరి ఆగిపోయి తద్వారా మరణము సంభవించి నప్పుడు ఆ కళేబరము దగ్గరకు రావటానికి అతని భార్యకూడా భయపడుతుంది అంటారు.

ఊపిరాడే వరకే నేను, నావి అనే మమకారాలు ఆ తరువాత ఏ రకమైన తేడాలు ఉండవు, కాబట్టి ప్రాణము అనేది జీవి జీవించటానికి అత్యంత ముఖ్యమైనది. అటువంటి ప్రాణాన్ని ఇచ్చేవాడు పరమేశ్వరుడు. ఆ పరమేశ్వరుడే గనక లేకపోతే జీవులకు ప్రాణం పోసేవాడు ఎవరూ ఉండరు, అటువంటి పరమేశ్వరుడు శ్రీమన్నారాయణుడు తప్పవేరు కాదు.

## 66. ప్రాణః

ప్రాణమగువాడు. 320, 407 కూడా ఇదే నామము

**ఉజ్జీవనస్య హేతుత్వాత్ నరాణాం ప్రాణ ఈరితః**

మానవులందరూ జీవించటానికి కారణమైనవాడు. ఇక్కడ మానవులు అంటే కేవలము మానవులు అనే కాదు. జీవులు అని అర్థం.

**ప్రాణితి అనేన ఇతి ప్రాణః** జీవులకు జీవన హేతువు కాబట్టి ప్రాణము అయినవాడు. జీవరూపము ఉన్న విష్ణువు. జీవులకు ప్రాణశక్తిని ఇచ్చే పరమాత్మ.

జీవి జీవించి ఉండటానికి ముఖ్యమైనది ప్రాణము. ఈ విషయం ఉపనిషత్తులలో అనేకచోట్ల చెప్పబడింది. **ప్రశ్నోపనిషత్తు**లో

కౌశల్యుడు అనేవాడు పిప్పలాదమహర్షిని అడుగుతున్నాడు. "గురుదేవా ! ప్రాణం ఎక్కడ నుంచి పుట్టింది ? శరీరంలోకి ఏవిధంగా వచ్చింది ? శరీరంలో నుంచి ఏవిధంగా బయటకు పోతున్నది? ఈ విషయాలు తెలియచెయ్యండి" దానికి సమాధానం చెబుతున్నాడు పిప్పలాదుడు.

ఆత్మనుంచి ప్రాణం పుడుతున్నది. శరీరాన్ని ఆశ్రయించినీడ ఉన్నట్లుగా ఆత్మపైన ఇది విస్తరించి ఉన్నది. నీడకు స్వతంత్రమైన అస్థిత్వం లేనట్లే ప్రాణానికి కూడా స్వతంత్రమైన అస్థిత్వం లేదు. మనసులో పుట్టిన సంకల్పాలవల్లనే ఇది శరీరంలోకి వస్తుంది. రాజు దేశాలను పాలించటానికి అధికారులను నియమించినట్లుగా ముఖ్యప్రాణము మిగిలిన వాటిని వివిధ పనులలో వినియోగిస్తుంది. వీటిలో పాయు ఉపస్థలయందు మలమూత్ర విసర్జన కోసం అపానవాయువును నియమించింది. తాను కన్ను, చెవి, ముక్కు, నోరునందు ఉంటుంది. సమానవాయువు మధ్యలో ఉండి మనం తీసుకున్న ఆహారాన్ని శరీరంలోని అన్ని భాగాలకు సమానంగా పంచిపెడుతుంది. దీనివల్లనే మనం తీసుకున్న ఆహారం జీర్ణమయి వంటబడుతుంది. దానినుంచే కళ్ళు, ముక్కులు, చెవులు, నోరు అనే ఏడు జ్వాలలు పుడుతున్నాయి. జీవాత్మ హృదయాకాశంలో ఉన్నది. హృదయంలో నూటఒక్క ప్రధాన నాడులున్నాయి. ప్రతినాడికీ వందశాఖలున్నాయి. వీటిలో ప్రతిశాఖకూ డబ్బైరెండు చొప్పున ఉపశాఖలున్నాయి. ఈ రకంగా శరీరంలో 72000 నాడీమండలమున్నది. వీటన్నింటిలోనూ వ్యానవాయువు సంచరిస్తుంది. నాడీమండలంలో ప్రధానమైనది సుషుమ్నానాడి. దీని ద్వారానే ఉదానవాయువు జీవులకర్మ ననుసరించి పుణ్య, పాపలోకాలకు, ఉత్తరజన్మలో మానవలోకాలకు తీసుకుపోతుంది. ప్రాణము యొక్క సూక్ష్మాంశమే ఉదానము. చనిపోయిన తరువాత ఆత్మ ఉండే సూక్ష్మ శరీరాన్ని ఇదే నియమిస్తుంది. భూమి ఆకాశాలు మధ్య ఉండేది సమానవాయువు. తేజస్సే ఉదాన వాయువు. ఉదానవాయువు తగ్గిందంటే జీవి శరీరాన్ని విడచి వెళ్ళటానికి సిద్ధంగా ఉన్నదన్న మాట. మరణకాలం ఆసన్నమైనప్పుడు, జీవుడు దేన్నైతే స్మరిస్తాడో, ఆ ఆలోచనతో సహా ముఖ్య ప్రాణమందు లయమవుతాడు. ఆ ముఖ్య ప్రాణము ఉదాన వాయువుతో కలిసి జీవాత్మను సంకల్పానుసారమైన లోకాలకు తీసుకుపోతుంది" అన్నాడు పిప్పలాద మహర్షి

ఈవిధంగా ప్రాణంవల్లనే జీవి ఉత్తర జన్మలు ఎత్తుతుంది. శరీరములో అనేక ఇంద్రియాలున్నాయి. వాటన్నింటిలోకి ప్రాణము ఒక్కటే జీవించటానికి కారణమైనది. ఈ విషయం **ఛాందోగ్యోపనిషత్తు**లో చెప్పబడింది.

పూర్వకాలంలో ఒకసారి ఇంద్రియాలన్నీ తమలో తాము పోట్లాడుకోవటం మొదలు పెట్టాయి. దీనికి కారణము తమలో ఎవరు గొప్ప అనే విషయం తేలకపోవటమే. ఆ వాదన ఎంతకీ తెగలేదు. చివరకు అన్నీ కలిసి ఒక నిర్ణయానికి వచ్చి, తమకు జన్మనిచ్చిన ప్రజాపతి దగ్గరకు పోయి "ప్రజాపతీ ! మాలో శ్రేష్ఠులెవరో మీరు తేల్చి చెప్పండి" అన్నాయి.

ప్రజాపతి ఒకక్షణం ఆలోచించి "మీలో ఎవరు శ్రేష్ఠులో తేల్చుకునే ఉపాయం ఒకటి చెబుతాను వినండి. మీలో ఏది లేకపోతే ఈ శరీరం పనికి రాకుండా పోతుందో, పని చెయ్యకుండా పోతుందో, అది అన్నిటికన్నా శ్రేష్ఠమైనదిగా గుర్తించండి. ఈ విషయం తేలాలంటే ఒక్కొక్క ఇంద్రియము ఒక సంవత్సరం పాటు ఈశరీరాన్ని విడిచి వెళ్ళండి" అన్నాడు. ఆ సలహా ఇంద్రియాలకు నచ్చింది.

ముందుగా వాక్కు శరీరం నుంచి నిష్క్రమించింది. అది ఒక సంవత్సరం పాటు శరీరానికి దూరంగా ఉండి తరువాత తిరిగి వచ్చి మిగిలిన ఇంద్రియాలను అడిగింది. "నేను లేనప్పుడు మీరెలా జీవించి ఉండగలిగారు" అని

"నువ్వు వెళ్ళిపోవటంవల్ల శరీరానికి పెద్దనష్టం ఏదీ జరగలేదు. కేవలం వాక్కు మాత్రం మూగబోయింది. అంతేగాని శరీరం యధాతథంగా పని చేసింది. ఉచ్ఛ్వాస నిశ్వాసలు మామూలుగానే జరిగాయి. కళ్ళు చూస్తూనే ఉన్నాయి. చెవులు వింటూనే ఉన్నాయి. ఆలోచనలు సాగుతూనే ఉన్నాయి. ఆ రకంగా మిగిలిన పనులన్నీ జరిగాయి. పసిపిల్లవాడికి మాటలు రావు. అయినా వాడు బ్రతకటం లేదా ? మూగవాడు జీవించటం లేదా? అలాగే ఈ శరీరం జీవించే ఉన్నది." అన్నాయి మిగిలిన అవయవాలు. ఆ మాటలు విన్న వాక్కు శరీరంలో ప్రవేశించింది.

తరువాత శరీరంనుంచి దృష్టి నిష్క్రమించి ఒక సంవత్సరం తరువాత తిరిగివచ్చి "నేను లేనప్పుడు మీరు ఎలా ఉన్నారు?" అని మిగిలిన అవయవాలను అడిగింది. అప్పుడు అవి "నువ్వు లేకపోతే చెప్పుకోతగ్గ ఇబ్బంది ఏమీ కలగలేదు. గ్రుడ్డివాడు బ్రతకటం లేదా? అలాగే ఈ శరీరం తిరిగింది. కేవలం చూపుమాత్రం లేదు. అంతేకాని శరీరంలోని మిగిలిన వ్యాపారాలన్నీ సజావుగానే సాగినాయి. ఊపిరి ఆడుతూనే ఉంది. నోరు తింటూనే ఉంది. మాట్లాడుతూనే ఉంది. ఆలోచనలుకూడా బాగానే ఉన్నాయి అన్నాయి. మారుమాట్లాడకుండా శరీరంలో ప్రవేశించింది దృష్టి.

తరువాత శ్రవణశక్తి శరీరాన్ని వదిలి వెళ్ళిపోయి ఒక సంవత్సరం తరువాత తిరిగివచ్చి "నేను లేకపోతే ఎలా ఉన్నది?" అని మిగిలిన అవయవాలను అడిగింది. దానికి మిగిలిన

ఇంద్రియాలు "ఓ శ్రవణేంద్రియమా! నువ్వు లేని ఈ శరీరం చెవిటిది అయింది. అంతే కన్ను చూస్తోంది. నోరు మాట్లాడుతోంది. మిగిలిన అవయవాలన్నీ మామూలుగానే పనిచేస్తున్నాయి. కాబట్టి మేమంతా ఈ శరీరంలో సుఖంగానే ఉన్నాము." అన్నాయి. మారుమాట్లాడకుండా శరీరంలో ప్రవేశించింది శ్రవణేంద్రియము.

తరువాత మనస్సు శరీరంనుంచి వెళ్ళిపోయి సంవత్సరం తరువాత తిరిగివచ్చి "నేను లేకపోతే వెలితిగా లేదా ?" అని అడిగింది. దానికి మిగిలిన అవయవాలు "ఓ మనసా! నీవు సంకల్ప వికల్పాలకు మూలమైనదానవు. నువ్వు లేకపోతే ఈ శరీరానికి సంకల్పం ఉండదు. ఆలోచనా శక్తి ఉండదు. ఆలోచన లేదన్న మాటే గాని శ్వాస ఆడుతుంది. కాలు చేతులు వాటిపని అవి చేస్తున్నాయి. నోరు తింటోంది. మిగిలిన అవయవాలు వాటి పని అవి సక్రమంగా చేస్తూనే ఉన్నాయి. పసిపిల్లవాడు మనసు లేకుండా బ్రతకటం లేదా ? పిచ్చివాడు జీవించటం లేదా ? అలాగే నువ్వు లేకపోయినా ఈశరీరం జీవించే ఉన్నది" అన్నాయి ఇంక మారుమాట్లాడకుండా మనసు శరీరంలో ప్రవేశించింది.

ఆఖరుకు ప్రాణం వంతు వచ్చింది. ప్రాణం బయటకు పోవటానికి సమాయత్త మవుతోంది. అప్పుడు శరీరానికి ఇంద్రియాలతోఉన్న బంధనాలను త్రెంచి పారేసినట్లు అనిపించింది. ఊపిరి అందటం కష్టమయింది. కళ్ళు కనిపించటం లేదు. చెవులు వినిపించటం లేదు. నోట్లో నుంచి మాట రావటం లేదు. కాలు చేతులు కదలటం లేదు. శరీరం గాలిలో తేలుతున్నట్లనిపిస్తున్నది. ఇంద్రియాలకు భయం పట్టుకున్నది. దాంతో అవన్నీ ప్రాణం చుట్టూ చేరి "నువ్వు మాత్రం శరీరము నుంచి బయటకు వెళ్ళకు. నువ్వు వెడితే శరీరము చచ్చిపోతుంది. అప్పుడు మేమంతా ఉపయోగం లేకుండా పోతాము. మా అందరిలోకీ శ్రేష్ఠుడివి నువ్వేనని మేము అంగీకరిస్తున్నాము. నువ్వు ఇక్కడే ఉండి మమ్మల్ని జీవింపచెయ్యి అని వేడుకున్నాయి.

ఈరకంగా ఇంద్రియాలన్నీ ప్రాణం లేకపోతే తమ ఉనికి లేదని ఒప్పుకున్నాయి. అందుచేతనే వాక్కు, చక్షువు, శ్రోత్రము, మనస్సనే పేర్లతోగాక అవన్నీ ప్రాణవంతములైతేనే పనిచేస్తాయి. అందుకనే అవన్నీ ప్రాణాలనే సంకేతముతో పిలువబడతాయి. ప్రాణం లేకుండా వాటికి స్వేచ్ఛ లేదు. అసలు ప్రాణమే ఇన్ని రూపాలుగా మారింది. అందుచేతనే ఇంద్రియాలన్నింటిలోకీ ప్రాణముగొప్పది. అటువంటి ప్రాణస్వరూపుడు శ్రీమన్నారాయణుడు ఇతడు ప్రాణానికే ప్రాణము.

# 67. జ్యేష్ఠః

పెద్దవాడు, వృద్ధుడు, పొగడదగినవాడు.

**సర్వదానుభవే ప్యేత్తై రదృష్టా పారభూతితః జ్యేష్ఠః** ముముక్షువులచే నిత్యము అనుభవించబడుతూ కూడా అనంతమైన ఐశ్వర్యము కలవాడు. **అయమతిశయేన ప్రశస్యః వృద్ధ ఇతి వా జ్యేష్ఠః** అతిశయముచేత కొనియాడబడదగినవాడు.

పరబ్రహ్మను సేవించే ముముక్షువులు నిత్యము అతణ్ణి పొందుతూ ఉంటారు. అంటే బ్రహ్మానందాన్ని అనుభవిస్తూ ఉంటారు. అది ఎలా అంటే – సాధకుడు సాధన అనగా యోగము చేస్తున్నప్పుడు మూలాధారంలో నిద్రావస్థలో ఉన్న కుండలినీ శక్తిని జాగృతం చేస్తాడు. అప్పుడు ఆశక్తి గ్రంథిత్రయాన్ని అనగా బ్రహ్మగ్రంథి, విష్ణుగ్రంథి, రుద్రగ్రంధులను ఛేదించి సహస్రారం చేరి అక్కడ సహస్రదళ పద్మాన్ని నోటితో కరిచి పట్టుకుంటుంది. సహస్రదళ పద్మమే చంద్రమండలము అక్కడ అమృతము ఘనీభవించి ఉంటుంది. సాధకుడు ప్రాణాయామం చేసినప్పుడు స్వాధిష్ఠానములో ఉన్న అగ్ని ప్రజ్వరిల్లి సుషుమ్న గుండా సహస్రారం చేరుతుంది. ఆ వేడికి సహస్రదళ పద్మములో ఉన్న అమృతం ద్రవరూపం చెందుతుంది. కుండలినీ శక్తి ఎప్పుడైతే సహస్రదళ పద్మాన్ని తననోటితో కరచి పట్టుకున్నదో, అప్పుడు, ఆ పంటిగాట్ల ద్వారా, ద్రవీభవించిన అమృతం క్రిందికి జాలువారి యోగియొక్క దేహంలోని 72 వేల నాడీమండలాన్ని తడుపుతుంది. అప్పుడు అతడు పొందే ఆనందము వర్ణనాతీతము. అనిర్వచనీయము అనుభవైక వేద్యము.

సహస్రదళ పద్మమునందు పరమేశ్వరుడుంటాడు. కుండలినీశక్తి సహస్రదళ పద్మం చేరింది అంటే జీవాత్మ పరమాత్మలు ఏకీభావం పొందినాయి అని అర్థం. అప్పుడు సాధకుడు పొందేది బ్రహ్మానందము. ఇటువంటి ఆనందాన్ని ముముక్షువులు నిరంతరము పొందుతున్నప్పటికీ కూడా అది తరగనటువంటి ఐశ్వర్యము. ఈ రకంగా అపారమయిన ఐశ్వర్యముగలవాడు కాబట్టి పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడ జ్యేష్ఠుడు అనబడుతున్నాడు.

జ్యేష్ఠుడు అనగా – వృద్ధుడు అనికూడా అర్థమున్నది.

**బృహదారణ్యకోపనిషత్తు**లో సృష్టికి పూర్వం మానవాకారంలో ఉన్న విరాడాత్మ మాత్రమే ఉన్నది అతనికన్న భిన్నమైనది ఏదీలేదు. అని చెప్పబడింది.

**ఐతరేయోపనిషత్తు**లో సృష్టి జరగటానికి ముందు ఈ జగత్తు అంతా పరబ్రహ్మ మయంగా ఉండేది. దానికన్న భిన్నమైన పదార్థం ఏమీ లేదు. దాన్నే ఆత్మ అనికూడా అంటారు. ఈ ఆత్మయే లోకాలను సృష్టించింది అని చెప్పబడింది.

**నారాయణోపనిషత్తు**లో "ఈ సృష్టి ప్రారంభంలో పరమపురుషుడగు నారాయణుడు ప్రాణులను సృష్టించెను" అని చెప్పబడింది.

**అధర్వశిరోపనిషత్తు**లో "దేవతలందరూ శ్రీమహారుద్రుడు నివసించునట్టి స్వర్గలోకానికి వెళ్ళి "దేవా ! నీవెవరవు ?" అని అడిగారు. అప్పుడు రుద్రుడు "నేను ఒక్కడనే మొట్టమొదట ఉన్నాను. ఇప్పుడు ఉన్నాను. భవిష్యత్తులో కూడా ఉంటాను. నాకన్న భిన్నమైన వారెవరూ లేరు. నేను త్రికాలాతీతుడను. నిత్యానిత్యుడను. బ్రహ్మమును చక్షురాది ఇంద్రియాలు నేను వాగాది ఇంద్రియాలు నేనే. శ్రోత్రాది ఇంద్రియాలు నేను. ఊర్ధ్వ దిక్కు, అధో దిక్కు, మధ్యదిక్కు నేనే. స్త్రీ, పురుష, నపుంసక స్వరూపము నేనే" అని చెబుతాడు. ఈరకంగా సృష్టికి ముందు ఉన్నది ఆ పరబ్రహ్మ ఒక్కడే. అందుచేతనే అతడు జ్యేష్ఠుడు అనబడతాడు. శ్రీమన్నారాయణుడే పరమేశ్వరుడు కాబట్టి అతడు జ్యేష్ఠుడు అని చెప్పబడుతున్నాడు.

## 68. శ్రేష్ఠః

ఉత్తముడు, స్తుతింపదగినవాడు.

**శ్రేష్ఠ శ్చైతైర్నిత్యం స్తుతత్వా దభిధీయతే॥** ప్రీతితో నిత్యము స్తోత్రము చేయబడువాడు. ముముక్షువులు సర్వకాల సర్వావస్థలయందు ఆ పరమేశ్వరుణ్ణి స్తుతి చేస్తుంటారు.

**ముక్త సంగులైన మునులు దిద్రుక్షులు**
**సర్వభూతహితులు సాధుచిత్తులు**
**అసద్రుశవ్రతాఢ్యులు గొల్తురెవనిదివ్యపదము**

మోక్షార్థులైనవారు, లోకంలోని జీవరాశికంతటికీ మేలు జరగాలని కోరేవారు, సాధుస్వభావులు, సత్వగుణప్రధానులు, వివిధ రకాల దీక్షలతో శరీరాన్ని శుష్కింపచేసి ఎల్లవేళల యందు ఆ పరమేశ్వరుణ్ణి ఆరాధిస్తుంటారు.

**అయమతిశయేన ప్రశస్యతమః శ్రేష్ఠః** భగవంతుని ముముక్షువులు ఎల్లవేళలయందు అనుభవించటంచేత పొందిన ఆనందంతో స్తుతి చేస్తుంటారు.

బ్రహ్మానందాన్ని అనుభవిస్తున్న మునీశ్వరులు, ఋషీశ్వరులు ఆ పరమేశ్వరుణ్ణి ఎల్లప్పుడు స్తోత్రం చేస్తుంటారు. **సుబాలోపనిషత్తు**లో

"సృష్టికి ముందు ఏమీ లేదు. అప్పుడు దివ్యుడైన శ్రీమన్నారాయణుడొక్కడే ఉన్నాడు. నేత్రము, ద్రష్టవ్యము నారాయణుడే. శ్రోత్రము, శ్రోత్రవ్యము నారాయణుడే. ఘ్రాణము, ఘ్రాతవ్యము నారాయణుడే. అహంకారము, అహంకర్తవ్యము, చిత్తము చేతయితవ్యము, వాక్కు వక్తవ్యము అంతా నారాయణుడే. వరుణుడు, ఆర్యముడు, చంద్రుడు, కల, కవి,

దాత, బ్రహ్మ ప్రజాపతి, ఇంద్రుడు, దినములు, ఊర్ధ్వభాగము, అథోభాగము, దిక్కులు, భూతభవిష్యద్వర్తమానాలు అంతా నారాయణుడే. శ్రీమహావిష్ణువు యొక్క పరమపదమును విద్వాంసులు (జ్ఞానులు) ఎప్పుడూ చూస్తూనే ఉంటారు. ద్యులోకమున తేజస్సు వ్యాపించి ఉంటుంది. పండితులైన విప్రులు జాగరూకులై దానినెరుగుదురు" అని చెప్పబడింది.

ఈ కారణాలవల్ల శ్రీమహావిష్ణువే జ్యేష్ఠుడు, శ్రేష్ఠుడు అని చెప్పబడుతున్నది.

## 69. ప్రజాపతిః

నిత్యసూరులకు స్వామి. 197 కూడా ఇదే నామము

**బద్ధాద్యుత్కృష్టతో యే చ జాయన్తే సూరయః ప్రజాః ।**
**తేషాం యో నిత్యసూరీణాం పతిస్సస్యాత్ ప్రజాపతిః ॥**

బద్ధులు, ముక్తులకన్నా కూడా గొప్పవారు నిత్యసూరులు. అటువంటి నిత్యసూరులచే నిరంతరము వరించబడువాడు.

**బద్ధులు :** బంధించబడినవారు. ఇక్కడ బంధనాలు అంటే ఐహిక బంధనాలు కాదు. పరమేశ్వరుని యందు గల అపేక్షతో, అతని యందు అను రాగబద్ధులు.

**ముక్తులు :** ముక్తిని కోరేవారు. ముక్తి అంటే విముక్తి. ఐహికబంధనాల నుండి విముక్తి మానవులను కట్టిపడేసే బంధనాలలో ముఖ్యమైనవి రాగము, క్రోధము.

ఏదైనా ఒక వస్తువుయందుకాని, జీవియందు గాని మనకు గల ఇష్టతనే రాగము, అనురాగము అంటారు. ఇది ఎంతటి విద్వాంసుడినైనా సరే కట్టిపడేస్తుంది. మనం కోరింది గనక నెరవేరకపోతే క్రోధము వస్తుంది. దానికి కారణమయినవారి మీద కక్ష, కార్పణ్యము పెరుగుతాయి. ఫలితం హింస. అందుచేతనే క్రోధము వల్ల ఎదుటివారిని బాధించటం జరుగుతుంది. మానవుడు నేను, నాది అనే అహంకార మమకారాలు గనక వదిలి వేసినట్లైతే కామక్రోధాలను జయించగలుగుతాడు. లలితాసహస్రంలో ఈ కామక్రోధాలను పరమేశ్వరి చేతిలోనే ఆయుధాలుగా వర్ణించారు.

**రాగస్వరూపపాశాఢ్యా, క్రోధాకారాంకుశోజ్జ్వలా** రాగము (కామము) అమ్మవారి చేతిలోని పాశంగాను క్రోధము ఆమె చేతిలోని అంకుశముగాను చెప్పారు. ఈ రెండింటినీ విడిచి పెట్టినట్లైతే సాధకుడు ముక్తి పొందుతాడు. **వామకేశ్వర తంత్రం**లో

**పాశాంకుశౌ తదీయౌతు రాగద్వేషాత్మకౌ స్మృతౌ ।**
**శబ్దస్పర్శాదయో బాణాః మనస్తస్యాభవద్ధనుః ॥**

**కరణేంద్రియ చక్రస్థాం దేవీం సంవిత్స్వరూపిణీం ।**

**విశ్వాహంకార పుష్పేణ పూజయే త్సర్వసిద్ధిబాక్ ॥**

సాధకుడు తన రాగద్వేషాలను దేవిచేతులలోని పాశము అంకుశములుగా, మనస్సును దేవి యొక్క ధనుస్సుగా పంచతన్మాత్రలు దేవియొక్క బాణాలుగా భావించి అహంకారమనే పుష్పంతో ఆమెను అర్చించినట్లైతే, అనగా – నిరహంకారుడైనట్లైతే – అతడికి సర్వసిద్ధులు కలుగుతాయి. అలాకాకుండా అహంకారమమకారాలు వీడి, తానే సాక్షాత్తు పరమేశ్వర స్వరూపము అని భావించిన వాడికి సాయుజ్యం లభిస్తుంది.

ఈరకంగా బద్ధులు, ముక్తులకన్న కూడా గొప్పవారు నిత్యసూరులు. వీరినే **లలితా సహస్రం**లో 'మహావీరేంద్రులు' అన్నారు. 494వ నామం **మహావీరేంద్ర వరదా** అని చెప్పబడింది నిరంతరము వరించబడువాడు అంటే–ఎల్లప్పుడూ కోరబడువాడు నిత్యసూరులు ఎల్లప్పుడూ పరమేశ్వరుని దర్శించాలి, బ్రహ్మానందం పొందాలి అనే కోరుకుంటారు.

**ప్రజానాంనిత్యసూరీణాం పతిః ప్రజాపతిః** ఇక్కడ ప్రజలు అంటే – నిత్యసూరులు

**బద్ధముక్తేభ్యః ప్రకర్షేణ జాయన్తే ఇతిప్రజాః సూరయః తేషాం పతిః**

ఇందాక చెప్పినట్లుగానే బద్ధులు, ముక్తులు అయిన వారికన్న అనేక రెట్లు గొప్పవారు. నిత్యసూరులు అటువంటి వారిచేత ఎల్లప్పుడు పరిచర్యలు చేయబడువాడు. అర్చించబడువాడు – శ్రీమహావిష్ణువు పురుష సూక్తంలో

**తద్విష్ణో పరమం పదగ్ం సదా పశ్యన్తి సూరయః** నిత్యసూరులు విష్ణువు యొక్క పరమపదమును సదా సేవిస్తుంటారు. అని చెప్పబడింది.

**ప్రజానాం పతిః** తానే ఈశ్వరుడవటం చేత ప్రజలందరికీ తండ్రివంటివాడు. ఇక్కడ పతి అంటే రక్షకుడు అని అర్థం. ప్రజలయొక్క రక్షకుడు.

ఈ చరాచర జగత్తులో సృష్టికి ముందునుంచే ఉన్నవాడు, ఆదిమధ్యాంతములు లేనివాడు, జగత్తుకు కారణమైనవాడు, జీవులు చేసిన కర్మను బట్టి వారికి ఉత్తరజన్మలు ప్రసాదించేవాడు, దిక్పాలకులకు, దేవతలకు వారి యోగ్యతలను, కర్మఫలాన్ని బట్టి వారికి అధికారాలిచ్చేవాడు, అనాథరక్షకుడు, ఆపద్బాంధవుడు, భక్తసులభుడు, ముక్తి ప్రదాత ఆ శ్రీమన్నారాయణుడొక్కడే అందుచేత అతడే ప్రజాపతి.

## 70. హిరణ్యగర్భః

బంగారుమయమైనవాడు, గర్భమున హిరణ్యము గలవాడు. బ్రహ్మ పరమపదమున నివసించువాడు. 411 కూడా ఇదే నామము.

**హిరణ్యం పరమం ధామ హిరణ్యస్య సమావతః ।**
**హిరణ్యగర్భ స్సప్రోక్తః తస్మిన్ వసతి యస్సదా ॥**

వైకుంఠం బంగారంతో పోల్చబడింది. ఇక్కడ బంగారము అంటే – ప్రశస్తమైనది, ఉన్నతమైనది, ఉత్కృష్టమైనది, రమణీయమైనది అని అర్థం. అందుచేతనే పరమసత్యము, స్వయంప్రకాశము, సర్వాపేక్షితము, సర్వోత్కృష్టము, నిత్యము, సత్యము అయిన వైకుంఠము బంగారంతో పోల్చబడింది. ఆ వైకుంఠమే పరమపదము. అటువంటి పరమపదములో ఎల్లప్పుడూ నివసించేవాడు శ్రీమహావిష్ణువు. అందుచేతనే అతడు హిరణ్యగర్భుడు. **ముండకోపనిషత్తు**లో శౌనకుడికి అంగిరసుడు బ్రహ్మతత్త్వాన్ని వివరిస్తూ

"శౌనకా ! పరతత్త్వం సాక్షాత్కారమైన తరువాత ఆ జీవియొక్క హృదయగ్రంథులు విడిపోతాయి. అంటే అజ్ఞానంతో కూడిన కోరికలు నశిస్తాయి. సందేహాలు తీరిపోతాయి. ఆరబ్ధకర్మలు ఈ జన్మలో అనుభవించటం వల్ల నశిస్తాయి. ప్రారంభంకాని కర్మలు పూర్తిగా నశించిపోతాయి. ఈరకంగా పూర్తిగా కర్మక్షయం అవుతుంది. అజ్ఞానము మొదలైన కళంకాలు లేనివాడు, స్వయంప్రకాశము గలవాడు అయిన పరబ్రహ్మ 'హిరణ్మయకోశము' అనబడే హృత్పద్మములో ఉన్నాడు. ఆత్మజ్ఞానం పొందిన వారు మాత్రమే అతణ్ణి దర్శించ గలరు. మన అందరి ఎదుట ఉన్నది పరబ్రహ్మయే. ఈ జగత్తు మొత్తం ఆ పరబ్రహ్మ స్వరూపమే. అజ్ఞానం పోగానే భ్రాంతి తొలగిపోయి సత్యం గోచరిస్తుంది అంటాడు.

ఇక్కడ హృదయ పద్మము హిరణ్మయకోశము అని చెప్పబడింది. అందులోనే పరమేశ్వరుడుంటాడు. కాబట్టి శ్రీమన్నారాయణుడు హిరణ్యగర్భుడు అనబడుతున్నాడు.

**బ్రహ్మపురాణము**లో "పరబ్రహ్మ మొదటగా నీటిని సృష్టించి అందులో తన వీర్యాన్ని వదిలాడు. వీర్యము అంటే సృష్టి చెయ్యాలనే సంకల్పము. తానే అనేక రూపాలుగా పుట్టాలి అని సంకల్పించాడు.

జలమునకు 'నారము' అని పేరు. అదేనరుల సృష్టికి మూలమైనది. నారమే మొదటి గమ్యస్థానమైనందున అతడు నారాయణుడని పిలువబడ్డాడు. ఆయన వదలిన వీర్యము బంగారు గ్రుడ్డు అయి నీటిమీద తేలియాడింది. ఆ అండములో బ్రహ్మ తానే స్వయంభువుగా జన్మించాడు. అందుచేతనే అతనికి 'హిరణ్యగర్భుడు' అనే పేరు వచ్చింది" అని చెప్పబడింది.

అందుచేత శ్రీమన్నారాయణుడు 'హిరణ్యగర్భుడు' అని పిలువబడుతున్నాడు. **లలితాసహస్రం**లో 638వ నామము **"స్వర్ణగర్భా".**

ఈరకంగా శ్రీమన్నారాయణుడు దేవతలందరివలెకాక, "బ్రహ్మాదుల కన్న విలక్షణుడు" అంటూ ఈ ప్రకరణాన్ని పూర్తిచేశాడు రత్నాకరుడు.

# 14. విశేషములు

"గురువుగారూ! పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు బ్రహ్మాదిదేవతలకన్న గొప్పవాడు అన్నారు. మరి ఆయన విశేషాలు ఏమిటో వివరించండి" అన్నాడు నారాయణభట్టు.

"నారాయణభట్టారకా ! పరమేశ్వరుడు దేవతలకన్న విలక్షణమైనవాడు. అంతేకాదు. అతనికి అంటూ కొన్ని విశేషాలున్నాయి. కొంత ప్రాముఖ్యత ఉన్నది. ఆ విషయాలను వివరిస్తాను వినవలసినది.

పరమేశ్వరుడు సృష్టి స్థితి లయాలకోసం త్రిమూర్తులను సృష్టించాడు. అయితే అవి వారికి కష్టమైనప్పుడు స్వయంగా తానే వాటిని నిర్వహిస్తాడు. వాటిలో భాగంగానే దుష్టశిక్షణ, శిష్టరక్షణ చెయ్యటానికి అవతారాలు ఎత్తుతుంటాడు.

ఈ భూమండలాన్ని కంటికి రెప్పలాగా కాపాడేది ఆ పరమేశ్వరుడే. ఇంకా చెప్పాలంటే భూమిని కడుపులో పెట్టుకుని అంటే అంత జాగ్రత్తగా కాపాడతాడు. లోకంలో అందరికీ కావలసినవి సరిసంపదలు, భోగభాగ్యాలు. అటువంటి వాటిని అనుగ్రహించేది లక్ష్మీదేవి. ఆ లక్ష్మీదేవికి భర్త. అంటే లక్ష్మీదేవి కూడా ఆ పరమేశ్వరుని అధీనంలోనే ఉంటుంది. ఆయన రాక్షససంహారం చేసి ధర్మసంస్థాపన చేస్తాడు. రాక్షసులు అంటే హిరణ్యకశ్యప, హిరణాక్ష్యుల వంటివారేకాదు. శరీరంలో ఉండే చెడు భావాలు, అంటే మానవుడు ఇంద్రియ లాలసుడు కాకుండా, ఆ ఇంద్రియాలను అదుపులో ఉంచుతాడు. అతడు సమర్థుడైన పాలకుడు. లోకంలో ఎక్కడ ఏమి జరుగుతున్నదో ఎప్పటికప్పుడు వేగుల ద్వారా తెలుసుకుంటాడు. సూర్యుడు, చంద్రుడు, కాలము, యముడు, పంచభూతాలు అతని వేగులు. అతడు మహాపరాక్రమవంతుడు. అతనిని గెలవటం ఎవరికీ సాధ్యం కాదు. అతని సంకల్పానికి వ్యతిరేకంగా చేసేవారిని అంతం చేస్తాడు. సాటిలేని పరాక్రమవంతుడు అనటానికి నిదర్శనంగా అతనిచేతిలో 'శార్గము' అనే ధనుస్సు ఉంటుంది. అతడు మహామేధావి. సర్వజ్ఞుడు. అతనికి తెలియనిది అంటూ లేదు, అతడు ఎంత పరాక్రమవంతుడంటే కేవలం మూడు అంగలలో భూమ్యాకాశాలను ఆక్రమించేయగలడు. అతివేగవంతమైన పక్షిరాజు గరుడుడు. అతడి వాహనము. పరమేశ్వరుడు లోకాలన్నీ ఆక్రమించటంచేత, సంసార క్రమాన్ని కాపాడటంచేత 'క్రముడు' అనబడుతున్నాడు. అతనిని మించిన గొప్పవారులేరు. ఉత్తములలోకి ఉత్తముడు, అతన్ని మించిన పరతత్త్వములేదు. అతడు సముద్రమువలె గంభీరుడు. దేనికీ చలించడు. అయితే చేసిన మేలు మాత్రం మరచిపోడు. ఎవరు ఏ

పనిచేసినా, దానికి ఫలితం తిరిగి వారికి ఇస్తాడు. అర్హులైన వారికి మోక్షము కూడాఇస్తాడు. అతని అనుగ్రహముతోనే గాలి వీచగలుగుతున్నది, సూర్యుడు ప్రకాశిస్తున్నాడు, మానవులు కర్మలు చేయగలుగుతున్నారు. అతనికి ఎవరి సహాయసహకారాలు అవసరంలేదు. తన శక్తితోనే అన్ని పనులను నిర్వహించగలడు. అతడు దేవతలకు ప్రభువు. అందరికీ రక్షకుడు. ఆనందస్వరూపుడు. 71 నుంచి 87 వరకు నామాలలో ఈ విషయాలన్నీ వివరించబడ్డాయి. ఇక నామాలను చూద్దాం.

## 71. భూగర్భః

భూమిని గర్భము నందు కాపాడువాడు.

**యస్య భూర్భరణీనీయా౨ భూత్ భూగర్భో౨ నుభవేన సః ॥**

భూదేవిని ఎల్లవేళలయందు గర్భమును కాపాడినట్లు కాపాడువాడు.

**భూః గర్భే యస్య సః** ఎవని గర్భమునందు భూమి ఉన్నదో అటువంటివాడు.

**భూః గర్భః యస్యసః భూగర్భః** భూమిని గర్భమునందు ధరించినవాడు. భూదేవికి ఎల్లప్పుడు తన అనుభవము నిచ్చికాపాడువాడు. విష్ణుమూర్తి స్థితికారకుడు. భూలోకంలో ఎప్పుడు ధర్మము నాశనము అయిపోయినా, ధర్మాన్ని ఉద్ధరించటము అతని పని.

పూర్వకాలంలో వైకుంఠంలోని అభ్యంతర మందిరములో శ్రీమహావిష్ణువు సతీసమేతుడై ఉన్నాడు. ఆయన దర్శనార్థం సనకసనందనాది మహర్షులు వచ్చారు. వారు లోపలికి వెళ్ళటానికి వీలులేదన్నారు ద్వారపాలకులయిన జయవిజయులు. మహర్షులకు కోపం వచ్చింది. 'విష్ణువును ఎడబాసి భూలోకంలో జన్మించండి' అని శపించారు. జయవిజయులు పరమ విష్ణుభక్తులు. తమ స్వామిని వదలి ఉండలేమని విలపించారు. అప్పుడు శ్రీ మహావిష్ణువు వారిని కనికరించి "మహర్షులమాట తప్పదు. కాబట్టి విరోధంతో మూడు జన్మలు ఎత్తుతారా ? లేక భక్తులుగా ఏడు జన్మలు ఎత్తుతారా ?" అని అడిగాడు. దానికి జయవిజయులు "ఏడుజన్మలు ఉండలేము. విరోధులుగానైనా సరే. మూడు జన్మలు మాత్రమే ఎత్తుతాము" అన్నారు. అలాగే చేయండి అన్నాడు శ్రీమహావిష్ణువు.

మొదటి జన్మలో దితికశ్యపుల కుమారులు హిరణ్యకశ్యపుడు, హిరణ్యాక్షుడుగా జన్మించారు. వేదవేదాంగాలను అభ్యసించారు. బ్రహ్మను గురించి ఘోరమైన తపస్సుచేసి దివ్యమైన వరాలు పొందాడు హిరణ్యాక్షుడు. వరబల గర్వంతో ముల్లోకాలను గడగడ లాడించాడు. రాక్షస ప్రవృత్తి కాబట్టి దేవతలను చిత్రహింసల పాలుచేశాడు. ఆ జన్మ

శత్రువు శ్రీ మహావిష్ణువుతో యుద్ధం చెయ్యాలని సంకల్పించాడు. భూమిని చాపలాగా చుట్టి పాతాళంలో పారేశాడు.

శ్రీ మహావిష్ణువు వరాహరూపంలో భూమిని రక్షించి, హిరణ్యకశ్యపుని సంహరించాడు. ఈ రకంగా భూమిని తన కడుపులో పెట్టుకుని అంటే – అతి జాగ్రత్తగా, వేయి కళ్ళతో కాపాడతాడు కాబట్టే శ్రీ మహావిష్ణువు 'భూగర్భుడు' అనబడుతున్నాడు.

అంతేకాదు ఈ భూమికి ఎప్పుడు ఎటువంటి కష్టమువచ్చినా, అంటేధర్మానికి ఇబ్బంది కలిగినప్పుడల్లా దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేస్తుంటాడు. ఇది పరమేశ్వరుని లక్షణం. భగవానుడు గీతలో చెప్పినట్లుగా

**పరిత్రాణాయ సాధూనాం వినాశయ చ దుష్కృతాం ।**
**ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే ॥**

**చండీసప్తశతిలో** శుంభనిశుంభులను సంహరించిన తరువాత దేవతలంతా పరమేశ్వరిని స్తుతించి ఎల్లవేళలయందు మా శత్రువులను సంహరించమని కోరతారు. అప్పుడు దేవి వైవస్వత మన్వంతరంలో, 28వ మహాయుగంలో నందగోపుని ఇంట శ్రీకృష్ణునిగా జన్మించి శుంభనిశుంభులను సంహరిస్తాను అంటూ మొదలుపెట్టి

**ఇత్థం యదాయదా బాధా దానవోద్థా భవిష్యతి ।**
**తదాతదా వతీర్యాహం కరిష్యామరి సంక్షయమ్ ॥**

రాక్షసుల వలన మీకు బాధలు కలిగినప్పుడల్లా నేను అవతరించి వారిని సంహరిస్తాను అంటుంది. ఈ రకంగా భూభారాన్ని తగ్గించటము, లోకాలను రక్షించటము, దుష్టశిక్షణ, శిష్టరక్షణ అనేవి పరమేశ్వరుని కృత్యములు. అందుచేతనే పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు 'భూగర్భుడు' అనబడుతున్నాడు.

## 72. మాధవః

లక్ష్మీదేవి యొక్క భర్త, యదువు యొక్క కుమారుడైన యదువంశమున అవతరించిన వాడు, శత్రువులను భయపెట్టువాడు – శ్రీకృష్ణుడు, ప్రఖ్యాత గ్రంథకర్త మాధవాచార్యుడు. ఇతడు సాయనభోగనాధుని సోదరుడు. ఇతడే మాధవ విద్యారణ్యుడు. 167, 735 కూడా ఇదే నామము.

**శ్రియశ్శ్రద్ధాది నామ్న్యాశ్చ పతిర్మాధవ ఇష్యతే ॥**

శ్రద్ధ మొదలైన వారు పేరులు గల లక్ష్మీదేవికి భర్త. **బ్రహ్మవైవర్త పురాణంలో**

"సృష్టి ఆరంభంలో గోలోకమున శ్రీకృష్ణుడు ఒక్కడే ఉన్నాడు. అప్పుడు అతని ఎడమభాగమునుండి ఒక అందమైన స్త్రీమూర్తి ఉద్భవించింది. తరువాత ఆ స్త్రీ మూర్తి రెండు రూపాలు ధరించింది. అందులో ఒక రూపము రాధ కాగా రెండవది లక్ష్మి. శ్రీకృష్ణ పరమాత్ముడు కూడా రెండురూపాలు దాల్చాడు. అందులో ఒకటి నాలుగుచేతులు గల విష్ణుమూర్తి. అతడే నారాయణుడు. అతడు లక్ష్మిని తీసుకుని స్వర్గలోకానికి వెళ్ళిపోయాడు. మిగిలిన రెండవరూపము శ్రీకృష్ణుడు. అతడు రాధాసమేతుడై గోలోకములో ఉన్నాడు." అని చెప్పబడింది.

**దేవీభాగవతం**లో మధుకైటభులవధానంతరము త్రిమూర్తులు ఒక దివ్య విమానమెక్కి మణిద్వీపం చేరతారు. అక్కడ పరమేశ్వరి వారికి దర్శనమిస్తుంది. వారామెను పరిపరివిధాల స్తుతిచేస్తారు. అప్పుడు దేవి సంతసించి తన ప్రతిరూపాలయిన మహాకాళి, మహాలక్ష్మి, మహాసరస్వతులను త్రిమూర్తులకిచ్చి వీరు మీకు సృష్టి కార్యక్రమంలో సహాయంగా ఉంటారు. వీరిని ఎప్పుడూ అవమానించవద్దు. అని చెబుతుంది. ఆ విధంగా లక్ష్మీదేవి విష్ణుపత్ని అయింది అని చెప్పబడింది. లక్ష్మీదేవి అనేక పేర్లతో పిలువబడుతూ ఉంటుంది. **లక్ష్మి అష్టోత్తరశతనామావళిలో**

**ప్రకృతిం వికృతిం విద్యాం సర్వభూత హితప్రదాం ।**
**శ్రద్ధాం విభూతిం సురభిం నమామి పరమాత్మికాం ॥**

అంటూ 14 శ్లోకాలలో లక్ష్మీదేవిని స్తుతించటం జరిగింది. అలాగే **లక్ష్మీసహస్రనామాలలో**

**నిత్యాగతానంత నిత్యానందినీ జనరంజనీ ।**
**నిత్యప్రకాశినీ చైవ స్వప్రకాశ స్వరూపిణీ ॥**
**మహాలక్ష్మీ ర్మహాకాళీ మహాకన్యా సరస్వతీ ।**
**భోగ వైభవ సంధాత్రీ భక్తానుగ్రహ కారిణీ ॥**

అంటూ స్తుతించారు. ఈ రకంగా వివిధనామాలతో పిలువబడే లక్ష్మీదేవి భర్త - మాధవుడు. అతడే శ్రీ మహావిష్ణువు.

**మాయాః ధవః** మాయ అనగా - లక్ష్మిదేవి. ఆమె భర్త శ్రీ మహావిష్ణువు. మౌన, ధ్యాన యోగములచే ఎరుగబడువాడు. మధువిద్యచే ప్రతిపాదించబడువాడు - మాధవుడు.

**బృహదారణ్యకోపనిషత్తు**లో మధువిద్య చెప్పబడింది. యాజ్ఞవల్క్యుడికి కాత్యాయని, మైత్రేయి అని ఇద్దరు భార్యలు. కాత్యాయని సామాన్య గృహిణి కాగా మైత్రేయి అధ్యాత్మిక

విషయాలలో అందెవేసిన చెయ్యి. ఒక రోజున యాజ్ఞవల్క్యుడు తన భార్యలతో "నేను సన్యాసం స్వీకరించాలనుకుంటున్నాను. అందుచేత నాకున్న ఆస్తినంతా మీరిద్దరికీ పంచి పెట్టేస్తాను" అన్నాడు. దానికి మైత్రేయి "నాథా! లౌకికమైన ఈ సిరిసంపదలన్నీ కాత్యాయినికే ఇవ్వండి. నాకు అవేవీ వద్దు. శాశ్వతమైన ఆనందాన్నిచ్చే బ్రహ్మజ్ఞానాన్ని నాకు ఉపదేసించండి" అన్నది. మైత్రేయి కోరిన ప్రకారం ఆమెకు బ్రహ్మోపదేశం చేస్తూ.

మైత్రేయీ! పిపీలికాది బ్రహ్మ పర్యంతము సృష్టియే జగత్తు. తేనెటీగలు అసంఖ్యాకంగా చేరి తేనెతుట్టెను నిర్మించినట్లుగా సమస్త భూతాలు చేరి ఈ పృథివిని నిర్మించాయి. సమస్త భూతాలకు ఈ భూమియే మధువు. తేనెతుట్టే తేనేటీగలకు ఆశ్రయం అయినట్లుగా, భూతాలన్నింటికీ భూమి ఆశ్రయం ఆహారం అవుతోంది. అందుకే భూమిని కూడా మధువు అంటారు. ఈ పృథివిలో చిన్మాత్రుడు, ప్రకాశమయుడు, అమృతమయుడు అయిన పురుషుడే ఈ అధ్యాత్మ శరీరంలోని తేజోమయుడైన, అమరణధర్ముడైన పురుషుడు. ఈ ఇద్దరూ ఒక్కటే. అదే ఆత్మ. ఈ ఆత్మజ్ఞానమే అమృతత్త్వానికి సాధనం. వీటన్నింటిలో ఉన్న ఏకత్వమే బ్రహ్మ. అదే సర్వరూపం. పృథివి అనేది శరీరానికి ప్రతీక. ఈ బ్రహ్మజ్ఞానమే సమస్తమూ తాను అవటానికి సాధనము.

అదేవిధంగా జలం సమస్తభూతాలకు, ప్రాణాలకు మధువు. భూతాలు జలానికి మధువు. జలాన్ని రేతస్సు అంటారు. జలంలో ఉన్న ప్రకాశమయుడు, అమృత స్వరూపుడే ఈ శరీరాల్లో బీజంగా ఉన్న ప్రకాశమయుడు, అమృతమయుడు. అదే ఆత్మ. ఈ రెంటిలో ఉన్న ఏకత్వమే బ్రహ్మ. ఈ బ్రహ్మజ్ఞానమే సర్వమూ తాను అవటానికి సాధనం.

జీవులన్నింటికీ అగ్ని మధువు లాంటిది. అలాగే అగ్నికి ఈ ప్రాణులన్నీ మధువు లాంటివి. అగ్నిలో ఉన్న తేజోమయుడైన పురుషుడే శరీరంలో వాగ్రూపంలో ఉన్న పురుషుడు. ఈ ఇద్దరూ ఒకటే. ఇదే బ్రహ్మ. అదే అమృతము.

వాయువు జీవరాశులన్నింటికీ మధువువంటిది. ఈ జీవరాశులు వాయువుకు మధువువంటివి. వాయువులో ఉన్న తేజోమయుడు, అమృతమయుడు అయిన పురుషుడు శరీరంలో ప్రాణరూపంలో ఉండే తేజోమయుడైన పురుషుడు ఇద్దరూ ఒకటే. అదే ఆత్మ. అదే అమృతం.

సూర్యుడు అన్ని భూతాలకు మధువు. అన్ని భూతాలు ఆదిత్యునికి మధువులాంటివి. ఆదిత్యునిలో ఉన్న ప్రకాశవంతుడైన పురుషుడే శరీరంలోని కనులలో ఉండే తేజోమయుడైన పురుషుడు. వీరిద్దరూ ఒకటే. అదే ఆత్మ. అదే అమృతం. అదే బ్రహ్మ.

దిక్కులన్నీ సమస్త భూతాలకు మధువు వంటివి. అలాగే సమస్త భూతాలు దిక్కులన్నింటికి మధువు వంటివి. ఈ దిక్కులలో ఉన్న తేజోమయుడైన పురుషుడే శరీరంలో ఉండే శ్రౌత్రపురుషుడు. శ్రవణ సమయంలో ఉండే పురుషుడు. ఈ ఇద్దరూ ఒకటే. అతడే ఆత్మ అతడే బ్రహ్మస్వరూపుడు.

చంద్రుడు సమస్త భూతాలకు, మధువు వంటివాడు. అలాగే సమస్త భూతాలూ చంద్రునికి మధువులాంటివి. చంద్రునిలో ఉన్న తేజోమయుడైన పురుషుడు, శరీరంలో ఉన్న మనస్సంబంధమైన అమృతమయుడైన పురుషుడు, ఇద్దరూ ఒకటే. అదే అమృతం. అదే బ్రహ్మ. అదే సర్వరూపం.

విద్యుత్తు సమస్త జీవకోటికి మధువు. అలాగే సమస్త జీవరాసులు విద్యుత్తుకు మధువు. విద్యుత్తులో ఉండే ప్రకాశవంతమైన పురుషుడూ, శరీరంలో ఉండే తేజోమయుడైన అమృతమయుడు ఇద్దరూ ఒకటే. అతేడ ఆత్మ. అతడే అమృతమయుడు, అతడే బ్రహ్మ.

సమస్త భూతాలకు మేఘం మధువు. అలాగే సమస్త భూతాలు మేఘానికి మధువు. మేఘంలో ఉన్న తేజోమయుడైన పురుషుడు, శరీరంలో శబ్దము, స్వరము రూపంలో ఉన్న పురుషుడు, ఇద్దరూ ఒకటే. ఆదే ఆత్మ. అదే అమృతం. అతడే బ్రహ్మ.

సమస్త భూతాలకు ఆకాశం మధువు. అలాగే సమస్త జీవులు ఆకాశానికి మధువు. ఆకాశంలో ఉండే తేజోమయుడైన పురుషుడు శరీరంలోని హృదయాకాశంలో ఉండే తేజోమయుడైన పురుషుడు ఇద్దరూ ఒకటే. అదే ఆత్మ. అమృతమయమైనది. అదే బ్రహ్మ.

ధర్మమనే పేరుతో వ్యవహరింపబడి మనం ఆచరించదగ్గది అయిన ధర్మము ఈ భూతాలన్నింటికి మధువు. ఈ భూతాలన్నీ ఆ ధర్మానికి మధువు లాంటివి. ధర్మంలో ఉండే తేజోమయుడైన పురుషుడు, శరీరంలో ఉండే తేజోమయుడైన పురుషుడు ఇద్దరూ ఒకటే. అతడే ఆత్మ. అతడే అమృతుడు. అతడే బ్రహ్మ.

సత్యమనేది సమస్త భూతాలకు మధువు. అలాగే సమస్త భూతాలు సత్యానికి మధువు. సత్యంలో ఉండే తేజోమయుడైన పురుషుడు, శరీరంలో ఉండే తేజోమయుడైన పురుషుడు ఇద్దరూ ఒకటే. అతడే ఆత్మ. అతడే అమృతడు. అతడే బ్రహ్మ.

మనుష్యాది జాతులన్నీ భూతాలకు మధువు. భూతాలన్నీ మనుష్యాది జాతులకు మధువు. భూతాలలో ఉన్న తేజోమయుడైన పురుషుడే శరీరానికి సంబంధించిన తేజోమయుడైన పురుషుడు. అతడే ఆత్మ. అతడే బ్రహ్మ.

విజ్ఞానమయుడైన ఆత్మయే సమస్త భూతాలకు అధిపతి. సమస్త భూతాలకు రాజు. సమస్త దేవతలు, సమస్త లోకాలు, సమస్త ప్రాణులు, అన్నీ పరమాత్మలో ఇమిడి ఉన్నాయి. ఆ ఆత్మయే పరబ్రహ్మ. అంటూ వివరించాడు యాజ్ఞవల్క్యుడు. ఈ మధువిద్య చేత తెలియబడేవాడు మాధవుడు. అతడే పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు. మాధవ విద్యారణ్యుడు కూడాపరమేశ్వరరూపమనే ప్రతీతి.

## 73. మధుసూదనః

ఇంద్రియములను శిక్షించువాడు, మధువను రాక్షసుని సంహరించినవాడు – విష్ణువు.

**మధ్వాఖ్య మసురం హన్తి సూరీణాం కరణఇ్చ వా ।**

**ఉపసంహరతి స్వస్మిన్ మధుసూదన ఇష్యతే ॥**

'మధువు' అనే రాక్షసుని సంహరించినవాడు. నిత్యసూరులు తమ ఇంద్రియాలను తనయందే లగ్నము చేయునట్లు చేయువాడు.

**మధుమ్ సూదయతీతి మధుసూదనః** మధువు అనే రాక్షసుని సంహరించినవాడు. **దేవీభాగవతం**లో ఈకథ సవిస్తరంగాచెప్పబడింది.

క్షీరసాగంలో శ్రీ మహావిష్ణువు శేషశాయియై నిద్రిస్తున్నాడు. అప్పుడు ఆయన చెవిలో నుంచి వచ్చిన గుబిలి నుంచి ఇద్దరు రాక్షసులు పుట్టారు. ఒకడి పేరు మధువు. రెండవవాడు కైటభుడు. వాళ్ళిద్దరూ నీళ్ళతో ఆడుతూ, ఆ మహాసముద్రాన్ని చూసి ఇంతనీరు ఇక్కడ ఎలా నిలిచింది? దీనికి ఆధారం ఏమిటి? అలాగే మనపుట్టుకకు ఆధారం ఏమిటి? అని విచారిస్తుండగా వారికి వాగ్బీజం వినిపించింది. దాన్నే మంత్రంగా తీసుకుని నిరాహారులై వేయిసంవత్సరాలు వారు తపస్సు చేశారు. వారి దీక్షకు మెచ్చి ఆ జగన్మాత ప్రత్యక్షమై ఏదైనా వరం కోరుకోండి అంది, వెంటనే వారు మాకు స్వచ్ఛంద మరణం కావాలన్నారు. 'తథాస్తు' అన్నది పరమేశ్వరి.

వారు ఆ జలాలలో తిరుగుతూ కొంతకాలానికి పద్మాసనుడైన బ్రహ్మను చూసి మాతో యుద్ధానికి రా ! అన్నారు. బ్రహ్మ సమాధానం చెప్పలేదు. దానికి అసురులు కినిసి మాతో యుద్ధం చేస్తావా ? లేక మాచేతిలో చస్తావా ? ఏదో ఒకటి త్వరగా తేల్చుకో అన్నారు. భయంతో బ్రహ్మ పద్మాసనం వదిలిపెట్టి, దాని కాడగుండా క్రిందికి దిగాడు. అక్కడ విష్ణుమూర్తి యోగ నిద్రలో ఉన్నాడు. తనను రక్షించవలసిందిగా తండ్రి దగ్గర మొరపెట్టుకున్నాడు. విష్ణువు ఉలకలేదు. పలకలేదు. బ్రహ్మరోదన అంతా అరణ్యరోదన

అయింది. విష్ణుమూర్తి గనక నిద్రలేస్తే ఆ రాక్షసులను తప్పకుండా సంహరిస్తాడు. అది మామూలు నిద్రకాదు యోగనిద్ర. మాయచే ఆవరించబడి ఉన్నాడు. ఆయన నిద్రలేవాలంటే ఆ మాయ కరుణించి అయన్ను వదలాలి. ఆపరాశక్తి స్వరూపమే మాయ. అందుకని బ్రహ్మ ఆపరాశక్తిని ప్రార్థించటం మొదలుపెట్టారు.

త్వం స్వాహా త్వం స్వధా త్వం హి వషట్కారః సర్వాత్మికా ।
సుధా త్వమక్షరే నిత్యే త్రిధామాత్రాత్మికా స్థితా ॥

అర్ధమాత్రా స్థితా నిత్యా యానుచ్చార్యా విశేషతః ।
త్వమేవ సా త్వం సావిత్రీ త్వం దేవజననీ పరా ॥

త్వయైతద్ధార్యతే విశ్వం త్వయైతత్ సృజ్యతే జగత్ ।
త్వయైతత్ పాల్యతేదేవి త్వమత్స్యన్తే చ సర్వదా ॥

విసృష్టౌ సృష్టిరూపా త్వం స్థితి రూపా చ పాలనే ।
తథా సంహృతి రూపాన్తే జగతోస్య జగన్మయే ॥

మహావిద్యా మహామాయా మహామేధా మహాస్మృతిః ।
మహామోహా చ భవతీ మహదేవీ మహాసురీ ॥

ప్రకృతి స్త్వం చ సర్వస్య గుణత్రయవిభావినీ ।
కాళరాత్రిర్మహారాత్రిర్మోహరాత్రిశ్చ దారుణా ॥

త్వం శ్రీ స్త్వమీశ్వరీ త్వం హ్రీం స్త్వం బుద్ధిర్బోధలక్షణా ।
లజ్జా పుష్టిస్తథా తుష్టిస్త్వం శాన్తిః క్షాన్తిరేవ చ ॥

ఖడ్గినీ శూలినీ ఘోరా గదినీ చక్రిణీ తథా ।
శఙ్ఖినీ చాపినీ బాణ భుశుణ్డీ పరిఘాయుధా ॥

సౌమ్యా సౌమ్యతరా శేషసౌమ్యేభ్యస్త్వతి సున్దరీ ।
పరాపరాణాం పరమా త్వమేవ పరమేశ్వరీ ॥

యచ్చ కిఞ్చిత్క్వచిద్వస్తు సదసద్వాఖిలాత్మికే ।
తస్య సర్వస్య యాశక్తిః సా త్వం కిం స్తూయసే మయా ॥

యయా త్వయా జగత్ స్రష్టా జగత్పాతాత్తి యో జగత్ ।
సో పి నిద్రావశం నీతః కస్త్వాం స్తోతుమహేశ్వరః ॥

విష్ణుఃశరీరగ్రహణమహమీశాన ఏవచ ।
కారితా స్తే యతో తస్త్వాం స్తోతుం శక్తి మాన్భవేత్ ॥

సాత్వమిత్థం ప్రభావైః స్వై రుదారైర్దేవి సంస్తుతా ।
మోహయైతౌ దురాధర్షా వసురౌ మధుకైటభౌ ॥

ప్రబోధం చ జగత్స్వామీ నియతా మచ్యుతో లఘు ।
బోధశ్చ క్రియతా మస్య హన్తుమేతౌ మహాసురౌ ॥

తల్లీ దేవతలకు హోమములో అహుతులర్పించేటప్పుడు చెప్పే స్వాహ మంత్రము నీవే. పితృదేవతలకు తర్పణలిచ్చేటప్పుడు చెప్పే స్వధామంత్రమూ నీవే. యజ్ఞము నీవే, యజ్ఞము వలన సాధించబడే స్వర్గమూ నీవే. యజ్ఞములందు చెప్పే వషట్కారము నీవే. నీవు అమృతవు. నాశనములేనిదానివి. శాశ్వతమైన దానివి త్రిమాత్రలతో కూడిన (అఉమ్) ఓంకారమునీవే. ప్రణవము చివరనుండు నాదమూ నీవే. దేవమాత సావిత్రివినీవే.

నీచేతనే ఈ విశ్వము 'సృష్టింపబడుచున్నది. నీచేతనే పాలింపబడుచున్నది. నీచేతనే లయముకావింపబడుచున్నది. సృష్టికాలములో సృజనశక్తివి, స్థితికాలమున పాలనాశక్తివి. లయకాలమున సంహారశక్తివి. అజ్ఞానమయివి నీవే. మహాజ్ఞాన మయివినీవే. బుద్ధి, స్మరణశక్తి, భ్రాంతానీవే. మహాఅసురివి నీవే. మహాదేవివినీవే. అన్నింటికీ మూలమైన ప్రకృతివి నీవే త్రిగుణాత్మకవు నీవే. కల్పాంతాన కాళరాత్రివి. ప్రళయకాలంలో మహారాత్రివి, భయంకరమైన మోహరాత్రివి నీవే. నీవు లక్ష్మివి, ఈశ్వరివి, బుద్ధి, లజ్జ, పుష్టి, తుష్టి, శాంతి, ఓరిమి  అన్నీనీవే. ఖడ్గము, శూలము, గద, చక్రము, ధనుస్సు, బాణములు, భుశుండి, పరిఘ (ఇనపకట్లగద) ధరించిన భయంకర స్వరూపిణివినీవే. శాంతమూర్తివి, శుభంకరివినీవే. సత్తు, అసత్తునీవె. వస్తువులకు గల గుణము నీవే.

తల్లీ ! సృష్టి స్థితి లయాలు చెయ్యమని మమ్మల్ని నియమించాడు. స్థితికారకుడైన శ్రీ మహావిష్ణువు నీమాయతో యోగినిద్రలో ఉన్నాడు. ఈ రాక్షసులు నన్ను చపంటానికి వస్తున్నారు. కాబట్టి ఓ తల్లీ ! నువ్వు ఆ విష్ణువును వదలినట్లైతే  అతడు లేచి రాక్షస సంహారం చేస్తాడు. దయచేసి నన్ను రక్షించవలసింది.

బ్రహ్మదేవుని ప్రార్థన ఆలకించిన పరమేశ్వరి స్వరూపమైన మాయ విష్ణువును వదిలింది. అప్పుడు విష్ణువు మేల్కొని బ్రహ్మను చూసి 'కుమారాః తపస్సు విడిచి ఎందుకిలా వచ్చావు. నీదిగులుకూ, భయానికీ కారణం ఏమిటి ? అన్నాడు. పద్మాసనుడు జరిగిన వృత్తాంతమంతా వివరించి ఆ రాక్షసులబారినుండి తనను కాపాడమని వేడుకున్నాడు.

ఇంతలో మధుకైటభులు బ్రహ్మను వెతుక్కుంటూవచ్చి "మమ్మల్ని తప్పించుకుని పారిపోదామనుకుంటున్నావా ? ఎక్కడదాక్కున్నా వచ్చి నీపని పడతాం. చచ్చేవాడివి నువ్వు ఒక్కడివీ చావకుండా ఈపెద్దమనిషిని కూడా నీతో తీసుకుపోదామనుకుంటూన్నావా? భలేవాడివి. ఒక్కమాట విను చేస్తావా మాతో యుద్ధం చెయ్యి, లేదా ఓడిపోయాను మీ సేవకుడను అని ఒక్కమాట అను అన్నారు.

అప్పుడు విష్ణువు తనకుమారుణ్ణి తనవెనుకదాచి నేనుండగా మీరు అతడి జోలికి వెళ్ళలేరు జాగ్రత్త అని బెదిరించాడు. అదే అదనుగా తీసుకుని ఆ రాక్షసులు విష్ణుమూర్తితో తలపడ్డారు. వాళ్ళలో మొదటివాడైన మధువు ముందుగా విష్ణువుతో యుద్ధానికి దిగాడు. రెండవవాడు విచిత్రం చూస్తున్నాడు. మధుసూదనుల మధ్యఘోరమైన పోరుజరుగుతోంది. ఆపోరుకు సముద్రం అతలాకుతలమవుతోంది. కొంతకాలానికి మధువు అలసిపోయాడు. అదిచూసి కైటభుడు మాధవునితో తలపడ్డాడు. మధువు విశ్రాంతి తీసుకుంటూ వినోదం చూస్తున్నాడు. ఈ రకంగా మధుకైటభులు ఒకరి తరువాత ఒకరుగా విష్ణువుతో యుద్ధం చేస్తున్నారు. ఈరకంగా ఐదు వేలసంవత్సరాలు గడిచింది. విష్ణువు చాలా ఆలసిపోయి వీరిని జయించటం ఎలాగా ? అని ఆలోచిస్తున్నాడు అది కనిపెట్టి రాక్షసులు భయపడకు. మమ్మిల్ని జయించే శక్తిలేకపోతే మీదాసుణ్ణి అని ఒక మాట అను. బ్రతికిపోతావు. లేదా ముందు నిన్ను, ఆతరువాత పద్మాసనుణ్ణీ చంపేస్తాం అన్నారు.

అలసిఉన్న వాడితోను, భయంతో క్రిందపడిపోయిన వాడితోను, పారిపోతున్న వాడితోను యుద్ధం చెయ్యకూడదు. అదీగాక మీరిద్దరు నేను ఒకణ్ణి. మీరు ఒకరి తరువాత ఒకరు విశ్రాంతి తీసుకుంటున్నారు. నాకు విశ్రాంతిలేదు. కాబట్టి నాకు కొంతసేపు విశ్రాంతి ఇవ్వండి. తరువాత మీతో యుద్ధంచేస్తాను అన్నాడు విష్ణుమూర్తి.

ఆ రాక్షసులిద్దరూ కొంతసేపు ఆలోచించి సరే అలాగే కానీ, మేము కూడా కొంతసేపు విశ్రమిస్తాము అన్నారు. విశ్రాంతి తీసుకుంటున్న విష్ణువు. ఈ రాక్షసులు ఆ పరమేశ్వరివల్ల వరం పొంది ఉన్నారు. వీళ్ళని చంపటంసాధ్యంకాదు. అది ఆ దేవివల్లనే జరగాలి. అని ఆమెను ప్రార్థించాడు. జగన్మాత ప్రత్యక్షమై 'మాధవా' వాళ్ళమీద నామాయ ప్రయోగిస్తాను. నువ్వు వాళ్ళను హతమార్చు అంది. విష్ణువు ఈసారి వాళ్ళతో యుద్ధానికి దిగుతూనే ఒక్క దెబ్బతో వారిని కింద పడేశాడు. ఆ దెబ్బకు నివ్వెరపోయిన రాక్షసులతో "ఏమిటి ? ఒక్కదెబ్బకే అలా పడిపోయారు. గతంలో నేను చాలమందిరాక్షసులతో యుద్ధంచేశాను. కాని

ఇంతకాలం నన్ను ఎదిరించి నాతో యుద్ధంచేసిన వాళ్ళులేరు. మీశక్తిని మెచ్చుకుంటున్నాను. ఏవరం కావాలో కోరుకోండి ఇస్తాను అన్నాడు. ఆమాటకు మధుకైటభులు ఒక్కసారిగా ఉలిక్కిపడి నువ్వు వరం ఇవ్వటమూ, మేం పుచ్చుకోవటమూనా? మా ఖర్మం ఏంకాలి పోయింది? నీకేం కావాలో కోరుకో మేమే ఇస్తాము అన్నారు.

అవకాశాన్ని చేజార్చుకోలేదు విష్ణువు. వెంటనే నాతో యుద్ధం చేసి నాచేతిలో మీరు చావాలి. ఇదే నాకోరిక అన్నాడు. దానికి ఆ రాక్షసులు అలాగే నీ కోరిక తీరుస్తాం. కానీ నీరు లేనిచోట మాతో యుద్ధంచెయ్యి అన్నారు. అప్పుడు విష్ణుమూర్తి తన తొడలను విశాలంగా పెంచాడు. రాక్షసులు తమ శరీరాలను పెంచారు. విష్ణువు వారిశరీరాలకన్న తన ఊరువులను బాగా కొన్ని రెట్లు పెద్దవిగా పెంచేశాడు. రాక్షసుల శరీరాలు విష్ణువుయొక్క ఊరువుల క్రింద పడి అణిగి పోసాగాయి. అప్పుడు విష్ణుమూర్తి సుదర్శన చక్రాన్ని ప్రయోగించి మధుకైటభుల తలలు తెగనరికాడు. ఆదెబ్బకి రాక్షసుల మెదడు సముద్రంలో పడి ఆ ప్రదేశమంతా పెద్దదిబ్బగా అయిపోయింది. అప్పటినించీ భూమికి మేదిని అనిపేరు వచ్చింది.

ఈ కథ మహాభారతంలో కూడా చెప్పబడింది. ఈ విధంగా మధువు అనే రాక్షసుని సంహరించినవాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు మధుసూదనుడు అనబడుతున్నాడు.

## 74. ఈశ్వరః

ధనవంతుడు సమర్ధుడు, యజమాని, రాజు, భర్త, ప్రభువు నియమించువాడు శివుడు, పరమేశ్వరుడు పరమాత్మ 36వ నామము ఇదే.

**ఈశానా ద్రమణా చ్చాపి ఈశ్వరః పరికీర్తితః** తనయొక్క భోగభూమిఅయిన పరమపదము అపారముగా ఉన్నప్పటికీ, దాన్ని తన ఇష్టానుసారముగ నియమిస్తుండేవాడు.

**సర్వశక్తిమాన్ ఈశ్వరః** సర్వశక్తిమంతుడు ఈశ్వరుడు.

ఈ లోకంలో అతనికన్న శక్తికలది ఏదీలేదు. అతడే అధికుడు. అతనితో సమానమైన వారుకాని, అతనికన్న అధికులు కానిలేరు. అతడు శాశ్వతుడు. నిత్యము సత్యము అయినవాడు. భూతభవిష్యద్వర్తమానాలలో ఉండేది అతడే. సృష్టి, స్థితి లయ కారకుడు అతడే. జన్మమృత్యుజరాదులు లేనటువంటివాడు. కాబట్టి పరమేశ్వరుడనబడుతున్నాడు.

శుద్ధసత్వము గలవాడు. పరాహింతభావమే స్వతంత్రము, చిత్స్వరూపము అటువంటి భావము కలవాడు. మాయను తన వశమునందుంచుకొనినవాడు. ఈ జగత్తు అంతా మాయచేతనే సృష్టించబడుచున్నది. మాయ అనేది నీటిగుంటలో తేలియాడే నాచువంటిది.

ఈ నాచును దూరంగా తోసి వేస్తే వెళ్ళిపోతుంది. కాని మళ్ళీ వచ్చి చేరుతుంది. అలాగే వేదాంత విచారము సజ్జనసాంగత్యము చేసినంతకాలము ఈ మాయ వదలివేసినట్లు కనిపిస్తుంది. కాని ఆ తరువాత వెంటనే వచ్చి చేరుతుంది. విషయవాంఛలయందు మనస్సు ఎప్పుడు లగ్నమవుతుందో, అప్పుడు మాయ ఆవరించిందన్నమాట.

ఈ మాయ పరమేశ్వరుణ్ణి ఆవరించి ఉంటుంది. అయితే దానివల్ల ఆయనకు ఏ ప్రమాదమూ ఉండదు. జగత్తులో ప్రతి ప్రాణీ మాయకులోబడే ఉంటుంది. కాని పరమేశ్వరుడు ఒక్కడే మాయకు అతీతుడు.

పాము కోరలయందు విషముంటుంది. దానివల్ల పాముకు ఏరకమైన హాని జరగదు. ఈ విషము పాముని బాధించదు. దాని కాటు తగిలిన ఇతర ప్రాణులకు మాత్రం హాని కలుగచేస్తుంది. అలాగే పరమేశ్వరుణ్ణి ఆవరించిన మాయ అతణ్ణి ఏమీ చేయదు.

ఈరకంగా మాయకు అతీతుడు పరమేశ్వరుడు.

సృష్టి, స్థితి, లయము, తిరోదానము, అనుగ్రహము అనే వాటిని 'పంచకృత్యములు' అంటారు. ఈ పనులు చెయ్యటం పరమేశ్వరుని లక్షణం. వీరు పంచబ్రహ్మలు. వీరిలో నాల్గవవాడు ఈశ్వరుడు. కల్పాంతములో ఈశ్వరుడు 'తిరోధానము' చేస్తాడు. తిరోధానము అంటే - సంపూర్ణనాశనము. అణువులను కూడా ప్రకృతిలో లయం చెయ్యటం. మళ్ళీ సృష్టి ఆరంభించాలి అనుకున్నప్పుడు మాయ యొక్క సహాయంతో ఈ సృష్టిని చేస్తాడు. అప్పుడు అన్ని ప్రాణులకు బుద్ధి, ఇంద్రియాలు తానే అవుతాడు.

జీవులు చేసిన కర్మను బట్టి వాటికి ఫలితములు ఇచ్చి, ఆ ఫలితాన్ని ఆ జీవులు అనుభవించేటట్లుగా చేసేవాడు. అందుకే అతడు కర్మ ఫలస్వరూపుడు, సర్వసాక్షి, సర్వజీవపోషకుడు.

ఎవరియొక్క సంకల్పం వ్యర్థంకాకుండా వెంటనే ఫలిస్తుందో, అతడు ఈశ్వరుడు. నిర్గుణబ్రహ్మమే ఈశ్వరుడు. మాయతో కూడిన శ్రీమన్నారాయణుడే ఈశ్వరుడు.

# 75. విక్రమీ

పరాక్రమము కలవాడు. 909 వ నామము ఇదే.

**విక్రమం పౌరుషం ప్రోక్తం తద్వత్త్వా ద్విక్రమీ బుధైః**

విక్రమము అంటే పౌరుషము. తనయొక్క సంకల్పాన్ని నిరాఘాటంగా కొనసాగించు కొనగల శక్తియుక్తులు గలవాడు. **విక్రమః అస్యాస్తీతి విక్రమీ** తన సంకల్పానికీ ఎవరైనా

వ్యతిరేకంగా చెయ్యాలి. అనిచూస్తే, వాళ్ళని అంతమొందించే పరాక్రమము గలవాడు. గొప్పదైన శౌర్యము పరాక్రమము గలవాడు.

**విష్ణుపురాణము**లో పరమేశ్వరుడు సృష్టి స్థితిలయ కారకుడు. వాటిని ఆయనతన ఇష్టానుసారము చేస్తాడు. అటువంటి పరమేశ్వరుడు తన సంకల్పానికి విరుద్ధంగా చేయతలచిన వాళ్ళను నిర్జిస్తాడు అనటంలో ఆశ్చర్యంలేదు. అని చెప్పబడింది.

# 76. ధన్వీ

ధనుస్సు గలవాడు.

**పౌరుషానుగుణం శార్ఙ్గం యస్య ధన్వీ స కథ్యతే ॥** తనయొక్క పౌరుషము, పరాక్రమము చూపటానికి సామర్థ్యంగల 'శార్ఙ్గము' అనే ధనుస్సు కలవాడు.

**ధనుః అస్యాస్తీతి ధన్వీ**

సాటిలేని పరాక్రమమునకు నిదర్శనముగా శార్ఙ్గమను ధనుస్సును ధరించినవాడు.

ఆయుధం ధరించటమనేది వీరుల లక్షణం. పరాక్రమానికి చిహ్నం. అయితే వీరులు అనేకరకాలయిన ఆయుధాలు ధరించి యుద్ధం చేస్తారు. కత్తి, గొడ్డలి, బరిసె, ఈటె, బల్లెము, హలాయుధము, తోమరము, గద మొదలైనవి రకరకాల ఆయుధాలు. వీరుని యొక్క ఇష్టాన్ని, నైపుణ్యాన్ని బట్టి వీటిని ధరించటం జరుగుతుంది. వీరులలో గొప్పవారు ధనుర్బాణాలు ధరిస్తారు. వాటితోనే శత్రు సంహారం చేస్తారు. ఇటువంటి వీరులను వారివారి పరాక్రమాన్ని బట్టి రథుడు, అర్ధరథుడు, మహారథుడు అని మూడు రకాలుగా విభజిస్తారు. మహారథుడు అనగా గొప్పయోధుడు. ఒకేసారి పదివేలమంది విలుకాండ్రతో అనన్యసామాన్యంగా పోరి గెలువగలిగినవాడు. మహాభారతంలో భీష్మాచార్యుడు, ద్రోణాచార్యుడు, అర్జునుడు మొదలైనవారు ఈ కోవకు చెందినవారు.

అంతకన్న ఎక్కువ శౌర్యపరాక్రమాలు కలవాడు ఆ పరమేశ్వరుడు. అతనిచేతిలోని ధనుస్సుకు 'శార్ఙ్గము' అనిపేరు.

త్రిపురాసుర సంహార సమయంలో మహాదేవుడు ఈ భూమిని – రథముగా, రవిచంద్రులు – చక్రాలుగా, నాలుగు వేదాలు – గుర్రాలుగా, బ్రహ్మదేవుడే – సారిధిగా, మేరు పర్వతము – విల్లుగా ధరించి రాక్షససంహారము చేశాడు అని చెప్పబడింది.

నిమిచక్రవర్తి తరువాత వంశంలో ఆరవవాడు దేవరాతుడు పరమభక్తుడు. దక్షయజ్ఞము ధ్వంసముచేసిన సమయంలో శివుడు ఉపయోగించిన ధనుస్సును దేవతలకు ఇచ్చాడు. దేవరాతుని భక్తికి మెచ్చి ఆ ధనుస్సును దేవతలు అతనికిచ్చారు. అదే

“శివధనుస్సు” దేవరాతుని సంతతివారు ఆ ధనుస్సును పూజామందిరంలో ఉంచి పూజించారు. సీతాస్వయంవర సమయంలో శ్రీరామచంద్రుడు విరిచిన విల్లు అదే.

**సౌందర్యలహరి**లో పరమేశ్వరియొక్క మహిమలు చెబుతూ “మన్మథుడు అనంగుడు. అంటే కాలుచేతులు మొదలైన అంగాలు ఏమీ లేనివాడు. అతని చేతిలో ఉన్నది–చెరకువిల్లు, పూలబాణాలు, రథము చూద్దామా – దక్షిణకొండగాలి చెలికాడు – వసంతుడు. ఇన్ని అవలక్షణాలు గల వసంతుడు లోకంలో మహామహిమోపేతులైన మునీశ్వరుల, ఋషీశ్వరుల మీదికి యుద్ధానికి వెళ్ళి వారి తపస్సు భంగం చేస్తున్నాడు అంటే అది నీమహిమ తప్ప ఇంకేది కాదు” అంటారు శంకర భగవత్పాదులు.

పరమేశ్వరి రూపాన్ని వర్ణించేప్పుడు **మనోరూపేక్షుకోదండా** అనటం జరిగింది. జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు అనేవి ప్రతిజీవికి ఉంటాయి. ఆహారనిద్రామైథునాలు జీవులన్నింటికీ సమానంగానే ఉంటాయి. సంకల్పవికల్పాలకు కారణమైనది మనస్సు. అది మానవుడికి మాత్రమే ఉంటుంది. అందుచేతనే ధర్మాధర్మాలు, నీతిన్యాయాలు నిర్ణయించగలశక్తి, యుక్తాయుక్త విచక్షణా జ్ఞానము మానవుడికి ఉంటుంది

వీరుడు ధనుస్సును ఎడమచేత్తో పట్టుకుని కుడిచేత్తో బాణాన్ని సంధించి వదులుతాడు. మనస్సు పరమేశ్వరిచేతిలోని విల్లుతో పోల్చబడింది. మనస్సు చంచలమైనది. కోతి ఒక కొమ్మ మించి ఇంకొక కొమ్మమీదకు ఏవిధంగా గెంతుతుందో, అదేవిధంగా మనస్సు కూడా ఒక విషయం మించి ఇంకొక విషయం మీదకు వెడుతూ ఉంటుంది. మనసును నిశ్చలం చెయ్యగలిగితే సమాధి స్థితి లభించినట్లే సమాధిలోకి వెళ్ళిన మానవుడికి ఆత్మసాక్షాత్కారమయిందన్నమాటే.

జీవియొక్క స్థూలదేహము నశిస్తుంది. కాని సూక్ష్మదేహం నశించదు. అది గతజన్మలో చేసిన పాపపుణ్యాలవల్ల లభించే స్వర్గనరకాలనుభవించి, కర్మఫలశేషాన్ని అనుభవించటానికి ఇంకొక జన్మ ఎత్తుతుంది. గతజన్మ చివరలో ఏ కోరికలుంటాయో, దేన్ని గురించైతే మానవుడు మరణకాలంలో తీవ్రంగా ఆలోచిస్తుంటాడో, వాటి వాసనలు ఈ జన్మలో కూడా ఉంటాయి. వాటికి తోడుగా క్రొత్తవి కూడా వస్తాయి. వీటన్నింటినీ ప్రవర్తింప చేసేవాడు పరమేశ్వరుడు. మనస్సు అనేది క్రియాశక్తి. అందుచేతనే క్రియాశక్తి రూపమయిన ధనుస్సు మనస్సుగా చెప్పబడుతోంది.

పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుని చేతిలోని ధనుస్సుకు ‘శార్ఙ్గము’ అనిపేరు. మళ్ళీ 996వ నామంలో ఈ ధనుస్సును గురించి చెప్పబడింది.

# 77. మేధావీ

సర్వజ్ఞుడు

**నిస్సీమ భూమానుగుణ నిత్య సార్వజ్ఞ్య లక్షణా ।**

**మేధా యస్యాస్తి స ప్రోక్తః మేధావీతి విచక్షణైః ॥**

అపారమైన తన మహిమకు తగినటువంటి, స్వతస్సిద్ధమైన సర్వజ్ఞత్వము గలవాడు.

**మేధా అస్యాస్తీతి మేధావీ** మేధ అంటే స్వభావసిద్ధంగా ఉండే సర్వజ్ఞత. ఇది శాస్త్రపరిజ్ఞానంతోనో, అభ్యాసంతోనో సమకూరేదికాదు. అటువంటి సర్వజ్ఞత గలవాడు. మేధ అంటే – బహుగ్రంథాలను తన బుద్ధి యందు నిల్పుకొను శక్తి. అటువంటి శక్తి కలవాడు పరమేశ్వరుడు.

మేధ అంటే – బుద్ధి అని అర్థం. సకలశాస్త్రసారమైనది మేధ. సర్వభూతములందు ఆ పరమేశ్వరుడు మేధారూపంలో ఉన్నాడు.

కాశ్మీరమండలంలో 'మేధాదేవి' పూజించబడుతున్నది అని పద్మపురాణంలో చెప్పబడింది. **లలితాసహస్రం**లో 539వ నామము 'మేధా'.

తల లోపల ఉండే మెత్తని తెల్లని పదార్థాన్నే 'మేధస్సు' అంటారు. ఇదే మెదడు. సిద్ధేశ్వరీ అనే దేవత మేధోధాతువు నందుంటుంది. అని దేవీపురాణంలో చెప్పబడింది. **లలితాసహస్రం**లో 510వ నామము 'మేధోనిష్ఠా'.

పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు సర్వజ్ఞుడు. ఆ సర్వజ్ఞత ఆయనకు స్వతసిద్ధముగా వచ్చినదే తప్ప అభ్యాసము వలన కాదు. జ్ఞానులందరూ సర్వజ్ఞులే. పరమేశ్వరుడు మహాజ్ఞాని. అందుచేతనే శ్రీమన్నారాయణుడు మేధావీ అనబడుతున్నాడు.

# 78. విక్రమః

విక్రమ – ప్రభవాది సంవత్సరాలలో ఒకటి

విక్రమణము – విష్ణువు యొక్క అంగ

విక్రమము – అడుగు, అంగ, గెలుచుట, వీర్యము, పరాక్రమము, బలము, శక్తి అని అర్థం చెబుతోంది సూర్యరాయాంధ్ర నిఘంటువు.

**గమనం పక్షిరాజేన యస్య విక్రమ ఉచ్యతే ॥**

పక్షిరాజైన గరుడుని వాహనముగా చేసుకుని స్వేచ్ఛగా సంచరించువాడు.

**వినా క్రమః యస్యసః విక్రమః**

'వి' అనగా – విహంగము – ఆకాశమున చరించేది పక్షి. **భగవద్గీత**లోని పదవ అధ్యాయం విభూతియోగంలోని 30వ శ్లోకంలో పరమాత్ముడైన భగవానుడు తన విభూతులను తెలుపుతూ

**ప్రహ్లాదశ్చాస్మి దై త్యానాం కాలః కలయతామహమ్ ।**
**మృగాణాం చ మృగేంద్రోఽహం వైనతేయశ్చ పక్షిణామ్ ॥**

దైత్యులలో ప్రహ్లాదుడను, గణించువారిలో (గణకులలో) కాలమును, మృగములలో మృగరాజయిన సింహమును, పక్షులలో గరుత్మంతుడను నేనే అంటాడు.

వినతాసుతుడైన గరుడుడు పక్షులకు రాజు. పైగా ఈతడు శ్రీమహావిష్ణువుకు వాహనము. పరమభక్తాగ్రేశ్వరుడు. అత్యంత పరాక్రమశాలి.

కశ్యపప్రజాపతికి వినత, కద్రువ భార్యలు. వినతవలన పక్షులు, కద్రువవలన సర్పములు జన్మించాయి. వినతకు ఇద్దరు కుమారులు. 1. అనూరుడు, 2. గరుత్మంతుడు.

వినత, కద్రువలు ఇద్దరూ దక్షప్రజాపతి సంతానమే. అంటే స్వయాన అక్కా, చెల్లెలు. ఇద్దరూ గర్భవతులైనారు. పిల్లలను కాకగ్రుడ్డను ప్రసవించారు. కద్రువ పెట్టిన గ్రుడ్లు పాములై పాకటం మొదలుపెట్టినాయి. కాని వినత పెట్టినగ్రుడ్లు పగలలేదు. చాలాకాలం చూసిన తరువాత ఇంక ఆగలేక వినత ఒక గ్రుడ్డును పగులకొట్టింది. అందులోనుంచి శరీరముపైభాగము మాత్రమే ఏర్పడిన బాలుడు బయటకువచ్చి "నన్ను పూర్తిగా పెరగనీకుండా చేశావు కాబట్టి పదివేల సంవత్సరాలు నీ సవతికి దాసిగా ఉంటావు" అని శపించి తాను ఆకాశంలోకి వెళ్ళిపోయాడు. అతడే సూర్యుని రథసారథి 'అనూరుడు' అతను చెప్పినమీదట రెండవగ్రుడ్డు పగులకొట్టకుండా ఉన్నది.

ఒకరోజు వినత, కద్రువలు సముద్రతీరంలో విహరిస్తుండగా అక్కడ 'ఉచ్చైశ్వరము' కనిపించింది. అది తెల్లగా మెరుస్తోంది. ఆ గుర్రాన్ని చూడగానే వినత "ఈ అశ్వము ఎంత తెల్లగా మెరుస్తున్నదో" అన్నది. వెంటనే కద్రువ "అది తెలుపు రంగులో లేదు. నల్లగా ఉన్నది" అన్నది. వారిద్దరికీ మాటామాటా పెరిగి పందెం దాకా వెళ్ళింది. ఈ పందెంలో ఎవరు ఓడిపోతే వారు రెండవ వారికి దాస్యం చెయ్యాలి. ఆ గుర్రము మీద నలుపురంగు కనిపిస్తే వినత దాస్యం చెయ్యాలి. అది పూర్తిగా తెల్లగా ఉంటే కద్రువ దాస్యం చెయ్యాలి. దగ్గరగా చూడటానికి ఆ రోజు చీకటి పడిపోయింది. కాబట్టి మరునాటికి పందెం వాయిదా వేశారు.

ఆ రోజు రాత్రి కద్రువ తన బిడ్డలయిన పాములను పిలచి ఈ రాత్రి మీరు పోయి ఆ గుర్రము తోకకు చుట్టుకోండి. అప్పుడు అది నల్లగా కనిపిస్తుంది అని చెప్పింది. తల్లిమాట ప్రకారం గుర్రపుతోకను చుట్టుకున్నాయి సర్పాలు. మరునాడు వినత, కద్రువలు సముద్రం తీరంచేరి గుర్రాన్ని పరిక్షించారు. దానితోక నల్లగా ఉన్నది. కాబట్టి వినత కద్రువకు దాస్యం చెయ్యటానికి ఒప్పుకుంది. దాస్యంచేస్తోంది.

వినత దాసిగా ఉన్నప్పుడు రెండవ గ్రుడ్డు పగిలి గరుడుడు బయటకువచ్చాడు. అతడు దాసి కుమారుడు కాబట్టి అతడికి పుట్టుకతోనే దాస్యం వచ్చింది. కద్రువ కుమారులను వీపున ఎక్కించుకుని తిరుగుతున్నాడు.

ఒకరోజున సర్పాలను వీపున ఎక్కించుకుని ఆకాశంలోకి ఎగిరాడు. సూర్యుని వేడికి ఆ సర్పాలు మాడిపోయి క్రింద పడ్డాయి. కద్రువ గరుడుడిని బాగా అవమానించింది. అప్పుడతడు తన తల్లి దగ్గరకు పోయి "అమ్మా ! మనం వీరికెందుకు దాస్యం చెయ్యాలి?" అని అడిగాడు. విషయం చెప్పింది తల్లి. అతడు కద్రువ దగ్గరకు పోయి దాస్య విముక్తిని కోరాడు. అమృతం తెచ్చి ఇస్తే వారిని విముక్తి చేస్తాను అన్నది కద్రువ. తల్లి అనుమతి తీసుకుని స్వర్గానికి అమృతం తీసుకు వస్తుండగా, దేవేంద్రుడు వెంబడించి వజ్రాయుధం విసిరాడు. ఆ దెబ్బకు గరుత్మంతుడి శరీరంలో ఒక ఈక మాత్రం రాలిపోయింది. ఆ తరువాత గరుడుడు అమృతభాండము తెచ్చి కద్రువకిచ్చి తన తల్లికి దాస్యవిముక్తి కలిగించాడు.

గరుడుని శౌర్యపరాక్రమాలకు మెచ్చి విష్ణుమూర్తి అతడికి అమరత్వము నిచ్చి తనకు వాహనముగా చేసుకున్నాడు. ఈ కథ **మహాభారతము**లో ఉన్నది.

ఈ రకంగా పక్షిరాజైన గరుడుని ఎక్కి విహరించువాడు – శ్రీ మహావిష్ణువు.

వేదంలో విష్ణువు గొప్ప గమనం కలవాడు. పెద్దపెద్ద అంగలు వేసేవాడు. తన మూడు అంగలతోనే ఈ లోకాలన్నీ ఆక్రమించాడు అని చెప్పబడింది. విష్ణువుయొక్క మూడు అంగలు సూర్యగమనాన్ని సూచిస్తాయి. ఆ మూడు అంగలే త్రిసంధ్యలు.

వామనావతారంలో విష్ణుమూర్తి రెండు అడుగులతో భూమ్యాకాశాలను ఆక్రమించి మూడవ అడుగుతో బలిచక్రవర్తిని పాతాళానికి త్రొక్కేశాడు. అందుచేతనే 'త్రివిక్రముడు' అని పిలువబడ్డాడు.

దేవదాన సంగ్రాహమం జరిగినప్పుడు తన పరాక్రమంతో దానవసంహారం చేశాడు. అందుచేతనే శ్రీ మహావిష్ణువు 'విక్రముడు' అనబడుతున్నాడు.

బలిసినవాడు.

**క్రమణా త్క్రమహేతుత్వాత్ క్రమ ఏవ ఉదాహృతః**

నిత్యవిభూతిని కలిగి ఉండుటచేత బలిసి ఉన్నవాడు. లోకాలన్నింటినీ ఆక్రమించటం చేత, సంసారక్రమాన్ని కాపాడటంచేత 'క్రముడు' అని చెప్పబడుతున్నాడు.

**క్రమతే ఇతి క్రమః** మహావిభూతి కలిగి ఉండటంచేత బలిసినవాడు.

**అనేజదేకం మనసో జనీయః**

ఆ పరతత్త్వము అమితమైన వేగము గలది. కదలకుండానే అన్నిచోట్లకూపోతుంది.

**కఠోపనిషత్తు**లో పూర్వకాలంలో 'వాజశ్రవసుడు' ఇతడికే 'గౌతముడు' అనికూడా పేరు. గౌతముడు మహాపండితుడు. గొప్ప తపస్వి. మరణానంతరము ఉత్తమలోకాలు పొందాలి. అనే తలంపుతో 'విశ్వజిత్' అనే యాగము చెయ్యాలని సంకల్పించాడు. ఈ యాగంలో యాగం చేసేవారు తమ సర్వస్వాన్ని దానం చెయ్యాలి.

యాగము పూర్తికావస్తోంది. ఆఖరుదశలో దానాలు ఇవ్వాలి. దానాలు కూడా చాలావరకు పూర్తి అయినాయి. గోదానం జరగబోతోంది. గౌతముడి గోశాలలోని ఆవులు తమ ఆఖరు గడ్డిపరకను కూడా తినేసినాయి. ఆఖరు గుక్కనీరు కూడా త్రాగేసినాయి. అంటే వాటికి ఇంక గడ్డి తినేందుకు, నీరు త్రాగేందుకు కూడా ఓపికలేదు. చావుకు సిద్ధంగా ఉన్నాయి. ఇటువంటి గోవులను దానంచేస్తే పుణ్యం రాకపోగా పాపం కూడా వస్తుంది. కాబట్టి తండ్రితో ఈ పని మాన్పించాలి అనుకున్నాడు గౌతముని కుమారుడైన నచికేతుడు. తండ్రి వద్దకుపోయి "నన్ను ఎవరికి దానం ఇస్తున్నావు ?" అని అడిగాడు. విసిగిపోయిన గౌతముడు 'యముడికి దానం ఇస్తాను' అన్నాడు.

తండ్రి మాట ప్రకారం యమలోకానికి పోయాడు నచికేతుడు. యముని నుండి అనేక వరాలు పొందాడు. చివరగా బ్రహ్మజ్ఞానం బోధించమని అడిగాడు. యమధర్మరాజు నచికేతుడుణ్ణి అనేక రకాలుగా పరీక్షించి, అతడు బ్రహ్మవిద్యకు అర్హుడే అని నిర్ధారించుకుని బ్రహ్మోపదేశం చేస్తూ

"నచికేతా ! వేదాలన్నీ ముక్తకంఠంతో దేన్ని గురించి చెబుతున్నాయో, తపస్సువల్ల దేన్ని పొందుతామో, బ్రహ్మచర్య నియమాలు, వ్రతాలు దేనికోసం ఆచరిస్తామో, అది ఓంకారము. అదే పరబ్రహ్మ.

బ్రహ్మప్రాప్తికి ఓంకారాన్ని ఆశ్రయించటమే మంచిది. ఆత్మకు చావుపుట్టుకలు లేవు. ఆత్మ తనంతతానుగా పుట్టినది. స్వయంభువు, నాశనము లేనిది. శరీరం నశించినా ఆత్మ నశించదు. ఆత్మ చంపేది, చంపబడేది కాదు. సూక్ష్మమైన వాటికన్న సూక్ష్మమైనది. మహత్తులన్నింటిలోకీ మహత్తయినది. ఇది జీవియొక్క హృదయ పద్మములోనే ఉంటుంది. జితేంద్రియుడు ఆత్మయొక్క గొప్పదనాన్ని తెలుసుకుని సుఖదుఃఖాలనుండి దూరమవుతాడు. ఇంద్రియలోలురు ఆత్మను గుర్తించలేరు. ఆత్మకదలకుండా ఒకచోటనే కూర్చుని చాలాదూరం పోతుంది. నిద్రపోతూనే అన్ని ప్రదేశాలలోనూ తిరుగుతుంది. అనిత్యమైన శరీరాలమధ్య శరీరంలేనిదిగా, అశాశ్వతమైన వాటి మధ్య శాశ్వతమైనదిగా ఉంటుంది. ఆత్మ నిత్యము, సత్యము, సర్వవ్యాపకమైనది" అంటాడు. కాబట్టి కదలకుండా అన్నిచోట్లకూ వెళ్ళగల పరతత్త్వమైన శ్రీమన్నారాయణుడు "క్రముడు" అనబడుతున్నాడు.

## 80. అనుత్తమః

తనకన్న ఉత్తముడు లేనివాడు. ఉత్తములందరిలోకీ ఉత్తముడు.

**ఉత్తమో నాస్తి యస్మా త్స అనుత్తమ ఉదాహృతః** తనను మించిన గొప్పవాడు లేనివాడు.

**అవిద్యమానః ఉత్తమః యస్మాత్ సః అనుత్తమః**

తనకన్న ఉత్తముడైనవాడు లేనటువంటివాడు.

**తస్మా ద్ధా న్యన్న పరః కించినాస** వానిని మించిన పరతత్త్వము వేరొకటిలేదు.

**బృహదారణ్యకోపనిషత్తు**లో ఈ సృష్టికి పూర్వం మానవాకారంలో ఉన్న విరాడాత్మ మాత్రమే ఉన్నది. అతని కన్న భిన్నమైనది ఏదీలేదు.

**ఐతరేయోపనిషత్తు**లో సృష్టిజరగటానికి ముందు ఈ జగత్తు అంతా బ్రహ్మమయంగానే ఉండేది. దానితో సమానమైనదిగాని, అధికమైనదిగాని ఏదీలేదు.

**అథర్వశిరోపనిషత్తు**లో దేవతలంతా శ్రీ మహారుద్రుడు దగ్గరకు వెళ్ళి "దేవా ! నీవెవరవు ?" అని అడుగుతారు. దానికి రుద్రుడు నేను ఒక్కడనే మొదట ఉన్నాను. ఇప్పుడు ఉన్నాను. భవిష్యత్తులో కూడా ఉంటాను. నాకన్న భిన్నమైనది భూతభవిష్యద్వర్త మానాలయందు ఏదీ లేదు" అంటాడు. ఈరకంగా పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుని కన్న పరమైనది ఏదీలేదు. అందుచేతనే అతడు 'అనుత్తముడు' **భగవద్గీత**లో

**మత్తః పరతరం నాన్యత్ కించి దస్తి ధనంజయ ।**
**మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ ॥**

ఓ ధనుంజయా ! నాకన్న పరమకారణమైనది ఏదీ లేదు. ఈ జగత్తులోని అన్ని వస్తువులు సూత్రమున సూత్రమణులవలె నాయందే కూర్చబడి ఉన్నాయి.

మహాకాశము మేఘానికి కారణము. దాని కార్యమైన మేఘము ఆ ఆకాశము యొక్క స్వరూపము. నిజంగా చూస్తే మేఘము తనకు కారణమైన ఆకాశము కన్న భిన్నమైనదికాదు. పరమాత్మ ఈ జగత్తుకు కారణము, ఆధారము. అందుచేత జగత్తు అతని స్వరూపమే. అతనికన్న వేరుకాదు కాబట్టి పరమాత్మే ఈజగత్తుకు పరమకారణము. సూత్రము, సూత్రమునందలి మణులు ఉదాహరణతో భగవానుడు అన్ని రూపాలు తనవే అని, అంతటా తానే వ్యాపించి ఉన్నానని, తనకన్న వేరైనది ఏదీలేదని చెబుతున్నాడు.

ఈరకంగా పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుని కన్న వేరైనది ఏదీలేదు. కాబట్టే అతడు 'అనుత్తముడు' అనబడుతున్నాడు.

## 81. దురాధర్షః

చలించనివాడు.

**అపాన్నిదివ దక్షోభ్యః దురాధర్ష ఇతీరితః**

సముద్రమువలె గంభీరుడు కాబట్టి ఎవరినీ కలత పెట్టనివాడు.

**దుఃఖేనాపి ఆధర్షితుమ్ ప్రధర్షితుమ్ అశక్యః దురాధర్షః**

గాంభీర్యముతో సముద్రములాగా ఎవరి వలన చలింపబడనివాడు.

**మహోదధి మివాక్షోభ్యమ్**

సముద్రమువలె కలత పెట్టనివాడు. అంటే ఇక్కడ సముద్రుడు కలత పెడతాడు అని అర్థంకాదు. సముద్రమువలె గంభీరంగా ఉండి కలత పెట్టనివాడు.

**దైత్యాభిః దుఃఖేనాపి ఆ దర్షయిత్ం న శక్యతే**

దైత్యులచే ఎంతదుఃఖము కలిగినా కూడా కొంచమైననూ చలించనివాడు.

దర్షణము అనగా – బెదిరించటము, అణచటము, లొంగతీసుకొనుచు అని అర్థము.

ఎవరిచేతా కూడా బెదిరించబడనివాడు. ఎవరివలనా అణచబడనివాడు. ఎవరూ అతణ్ణి లొంగతీసుకోలేరు. అతడు అవిక్రమ పరాక్రమవంతుడు. అతన్ని జయించే శక్తి ఈ జగత్తులో ఇంకొకటి లేదు. కాబట్టి శ్రీమహావిష్ణువు 'దురాధర్షుడు' అనబడతాడు.

**లలితాసహస్రంలో** 772వ నామము **దురాధర్షా**

## 82. కృతజ్ఞః

చేసిన మేలు మరువనివాడు. 532వ నామము ఇదే.

**ప్రాణిభి ర్య త్కృతం కర్మ తద్జ్ఞాత్వా ఫలదోయతః ।**

**పత్రపుష్పాదినా తుష్టః కృతజ్ఞో మోక్షదానతః ॥**

ప్రాణులు చేసిన పాపపుణ్యాలకు తగిన ఫలితము ఇచ్చేవాడు. భక్తులు తనకు సమర్పించిన పత్రము, పుష్పము, ఫలములకు ఆనందించి వారికి మోక్షమును అనుగ్రహించేవాడు.

**కృతం జానాతీతి కృతజ్ఞః** చేసిన దానిని గుర్తుంచుకొనువాడు. చేసిన మేలు మరువనివాడు.

ఈ జగత్తుకు కారణం పరబ్రహ్మ. సృష్టి స్థితి లయాలకు కారణము అతడే. అతడియొక్క అనుజ్ఞతోనే ఈ జగత్తు ప్రవర్తిల్లుతున్నది. అనే విషయం మరచిపోయి, అజ్ఞానంతో అంతా తన ప్రయోజకత్వము అని విర్రవీగే అజ్ఞానులు ఒక్కసారి ఆ పరమేశ్వరుణ్ణి ధ్యానిస్తే చాలు. దాని ఆధారంగా వారికి మేలుచేసేవాడు.

ఒకానొక రోజున కత్తి గీసుకుని కృష్ణుని చేతికి చిన్నగాయం అయింది. అది చూసిన ద్రౌపది తల్లడిల్లిపోయి తన చీర చెంగు చింపి అతని వ్రేలుకు కట్టుకట్టింది. దీని ఆధారంగానే నిండుకొలువులో ద్రౌపది వస్త్రాపహరణం జరిగినప్పుడు శ్రీకృష్ణ పరమాత్ముడు ఆమెకు మానసంరక్షణ చేశాడు.

చిన్ననాటి మిత్రుడు కుచేలుడు తనను చూడటానికి వస్తూ తనతో పాటుగా గుప్పెడు అటుకులు తెచ్చాడు. ఆ ఆటుకులను తీసుకున్న శ్రీకృష్ణపరమాత్ముడు కుచేలుడికి భోగభాగ్యాలు అష్టైశ్వర్యాలు అనుగ్రహించాడు.

అజామీలుడు అనే క్రూరకర్ముడు అవసానదశలో తన కుమారునియందు వ్యామోహితుడై 'నారాయణా!' అన్నంతమాత్రంచేతనే అతడికి స్వర్గసుఖాలుకలుగచేసినవాడు.

ఈ రకంగా తన భక్తులు తన పరంగా గోరంత చేసినప్పటికీ, దానికి ప్రతిఫలముగా కొండంత ఇచ్చేవాడు. **భగవద్గీతలో**

**అపి చేత్సు దురాచారో భజతే మామనన్యభాక్ ।**

**సాధురేవ సమంతవ్యః సమ్యగ్వ్యవసితో హి సః ॥**

మిక్కిలి దురాచారుడైనప్పటికీ, అనన్యభక్తితో నన్ను భజించినట్లైతే అతణ్ణి సత్పురుషుడుగానే భావించాలి. ఎందుచేతననగా పరమాత్మను సేవించటంతో సమానమైనది ఏదీలేదు అని అతడు గట్టిగా నమ్మి ఉంటాడు.

దురాచారుడు అంటే అత్యంత దూషితమైన ప్రవర్తన గలవాడు. ఆహారవిహారాల యందు భ్రష్టుడైనవాడు చెడు అలవాట్లకు లోనైనవాడు. అటువంటివాడు భగవానుణ్ణి గురించి విన్నాస్తుతించినాకూడా అతనియందు కృతజ్ఞత గలిగి అతనిని అనుగ్రహించువాడు.

అంతేకాదు భగవానుడు తనుచేసే వాటికి ప్రత్యుపకారాలను కోరడు. కౌరవసభలో నుండి ద్రౌపది మానసంరక్షణ చెయ్యమని కోరితే ద్వారకలో ఉన్న భగవానుడు చలించిపోయాడు. అలాగే నీటిమడుగులో గజేంద్రుడు రక్షించమని వేడితే, వైకుంఠంతో సహా కదలివచ్చాడు. ఈరకంగా భక్తులను అనుగ్రహిస్తున్నాడు కాబట్టే 'కృతజ్ఞుడు' అనబడుతున్నాడు. మానవులు చేసిన కర్మలకు, బదులుగా వారికి పుణ్యలోకాలు, ఉత్తమజన్మలు ఇచ్చేవాడు.

**లలితాసహస్రంలో** 374వ నామము **కృతజ్ఞా**

ప్రాణులయొక్క పాపపుణ్యాలను గురించి తెలుసుకునేవాడు.

**సూర్యస్సోమో యమః కాలో మహాభూతాని పంచ చ ।**
**ఏతే శుభాశ్శుభస్యేహ కర్మణో నవ సాక్షిణః ॥**

సూర్యుడు, చంద్రుడు, యముడు, కాలము, పంచభూతాలు ఈ తొమ్మిది జీవులు చేసే శుభాశుభకర్మలకు, పాపపుణ్యాలకు సాక్షులు. వీరి వలన జీవులుచేసే కర్మలు గురించి పరమేశ్వరుడు తెలుసుకొని, వాటికి తగిన ఫలితము వారికి ఇస్తాడు.

## 83. కృతిః

చేయుట, పని ప్రయత్నము.

**యస్మా త్ప్రసన్నా త్సుకృతం తేషాం సకృతి రిష్యతే ॥**

తన అనుగ్రహముతోనే జీవులు సత్కర్మలు చెయ్యగలగుతున్నాయి. కాబట్టి కృతి అనబడుతున్నాడు.

**క్రియతే ఇతి కృతిః**

చేయువాడు కాబట్టి కృతి అనబడుతున్నాడు. కౌషీతకీ బ్రాహ్మణములో

**ఏష ఏవ సాధు కర్మకారయతి, తమ్ యమేభ్యో లోకేభ్య ఉన్నినీషతి** పరమేశ్వరుడు ఎవరికైతే సద్గతులు కలిగించాలి అనుకుంటాడో, వారిచేత మంచి పనులు చేయిస్తాడు.

జీవులు చేసే ప్రయత్నానికి కృతి అనిపేరు. పరమాత్మ సర్వాత్మకుడు. అన్ని రూపాలు అతనివే. జగత్తులో కనిపించే ప్రతి వస్తువు, ప్రతి రూపము తానే అయి ఉన్నాడు.

**బృహదారణ్యకోపనిషత్తు**లో సృష్టికి ముందు జగత్తు అంతా పరమేశ్వరమయంగా ఉండేది. ఒంటరిగాఉన్న ప్రజాపతి. స్త్రీని కోరాడు. వెంటనే స్త్రీపురుషులు పరస్పరాలింగనము చేసుకున్నట్లుగా రూపుదాల్చాడు. వారే మొట్టమొదటి స్త్రీ పురుషులు. వీరే స్వాయంభువ మనువు, శతరూప అని చెప్పబడుతున్నారు. వీరే క్రైస్తవ మతానుసారము ఆదాము, అవ్వ.

ప్రజాపతికి నేను కుమార్తెను. కుమార్తెతో సంభోగము నిషిద్ధము కదా. అని ఆలోచించి శతరూప ఆవుగా మారిపోయింది. ప్రజాపతి వృషభమై సంభోగించాడు. గో సంతతి వృద్ధి చెందింది. ఆమె మేక అయింది. ప్రజాపతి మేకపోతు అయినాడు. ఆమె గొర్రె అయింది. ప్రజాపతి గొర్రెపోతు అయినాడు. ఈ రకంగా అనేక రూపాలు దాల్చింది శతరూప, ప్రజాపతి కూడా పురుషాకారంలో అన్ని రూపాలు ధరించాడు. 84 లక్షల జీవరాశి వృద్ధి చెందింది. ఈ రకంగా సృష్టి చేసిన తరువాత ప్రజాపతి ఈ సృష్టి అంతా తానే అయి ఉన్నాడు. అందుచేతనే సృష్టి ప్రజాపతికి మారు పేరయింది.

ఈ రకంగా ప్రజాపతి సర్వాత్మకుడైనాడు. జగత్తులోని అన్ని రూపాలు అతనివే. అందుచేతనే అతడు కృతి అనబడుతున్నాడు.

**ఐతరేయోపనిషత్తు**లో పరమేశ్వరుడు ఇంద్రియాలను, ఇంద్రియాధిష్ఠాన దేవతలను సృష్టించిన తరువాత, ఇంద్రియాలతో కూడిన శరీరంలో ప్రవేశించాలనుకున్నాడు. ప్రవేశించాడు. ఆ రకంగా సృష్టిలోని అన్ని జీవుల యందు తానే అయి ఉన్నాడు. అందుచేతనే పరమేశ్వరుడు సర్వాత్మకుడు.

**అధర్వశిరోపనిషత్తు**లో దేవతలంతా రుద్రునివద్దకువెళ్ళి "దేవా ! నీవెవరవు?" అని అడుగుతారు. దానికి రుద్రుడు నేను త్రికాలాతీతుడను. నిత్యానిత్యుడను. బ్రహ్మమును నేనే, చక్షురాది ఇంద్రియములు నేనే, వాగింద్రియము నేనే, శ్రోత్రేంద్రియము నేనే, మనస్సు నేనే, ఊర్ధ్వదిక్కు, అధో దిక్కు కూడా నేనే, పురుషుడు, స్త్రీ, నపుంసకుడు కూడా నేనే, గార్హపత్యాగ్ని, దక్షిణాగ్ని, ఆహవనీయాగ్ని నేనే, సత్యస్వరూపడను నేనే, గోవును నేనే, గౌరిదేవిని నేనే, జ్యేష్ఠుడను, శ్రేష్ఠుడను కూడా నేనే, జలము నేనే, తేజస్సు నేనే, అంతటా ఉన్నది నేనే, అంతటా లేనిదీ నేనే" అంటాడు.

ఈ రకంగా పరమేశ్వరుడు సర్వాంతర్యామి. జగత్తంతా పరమేశ్వరమయం. ఆయన సర్వాత్మకుడు. అన్ని రూపములు తానే అయి ఉన్నాడు. అందుచేత పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు 'కృతి' అనబడుతున్నాడు.

## 84. ఆత్మవాన్

ఆత్మలను కలవాడు.

**యేషా మాత్మ శరీరాది నిరాసా దథవాఽఽత్మవాన్ ।**

**స్వేమహిమ్ని ప్రతిష్ఠానా దాత్మనా నభిధీయతే ॥**

సత్కర్మలు చేసే వారి స్వరూపము, ప్రవృత్తి తన అధీనమున గలవాడు.

ఇతరుల యొక్క సహాయసహకారాలు లేకుండా తనయొక్క శక్తితోనే అన్ని పనులను నిర్వహించేవాడు.

**ఆత్మానః అస్య సన్తీతి ఆత్మవాన్**

సకల ఆత్మలను కలవాడు కాబట్టి ఆత్మవాన్ అనబడుతున్నాడు. మంచి పనులు చేసే అన్ని ఆత్మలస్వరూపము పరమేశ్వరుని అధీనంలోనే ఉంటుంది.

'ఆత్మా' అనగా - తాను

'ఆత్మనః' అనగా - మహిమ, గొప్పదనము, మహత్పరిమాణము అని అర్థము

తాను లేదా తన మహిమ చోటుగా గలవాడు.

**ఛాందోగ్యోపనిషత్తు**లో ఒకసారి నారదమహర్షి సనత్కుమారునివద్దకు వెళ్ళి, తనకు ఆత్మానుభూతిని కలుగచేయమని కోరతాడు. దానికి సనత్కుమారుడు 'గతంలో నువ్వు ఏ విద్యను అభ్యసించావు ? అని అడుగుతాడు.

"స్వామీ ! వేదవేదాంగాలు చదివాను. ఎన్నో కళలు నేర్చుకున్నాను. శాస్త్రాలు అభ్యసించాను. సంగీత సాధన చేశాను. కాని నాకు మనశ్శాంతి దొరకలేదు. ఆత్మజ్ఞానం కలగలేదు. ఆత్మజ్ఞానం వల్ల సర్వదుఃఖాలు నశిస్తాయని విన్నాను. కాబట్టి ఆత్మజ్ఞానాన్ని ఉపదేశించి నాకు దుఃఖవిమోచన చెయ్యేండి" అన్నాడు నారదుడు.

దానికి సనత్కుమారుడు "నారదా ! నువ్వు ఇంతవరకు అభ్యసించింది. కష్టసాధ్యమైన విద్యకాదు. నీకు ఎన్నో సిద్ధాంతాలు తెలుసు. కాని వాటి ఆచరణలేదు. వాటి అంతర్యం నీకు తెలియదు. నీకు తెలిసనదంతా "అపరావిద్య" అదంతా పదాలగారడి కాబట్టి వాటిని

వదలిపెట్టి విశ్వమంతా వ్యాపించి ఉన్న ఆత్మతత్త్వాన్ని తెలుసుకో. అదే పరావిద్య అది సాధించాలంటే మానసిక పవిత్రత కావాలి. మనస్సు మలినరహితమైతేనే ఆత్మానుభవం కలుగుతుంది. అంతఃకరణ నిర్మలమవుతుంది. అప్పుడు సత్యదర్శనమవుతుంది. సత్యం అప్పుడు బాలభానునివలె పసిడి కాంతులతో హృదయాంతరాళాల్లో ప్రకాశిస్తుంది. అదే పరావిద్య. దానివల్లనే శాశ్వతమైన ఆనందం కలుగుతుంది.

లోకంలో అన్నింటికన్న శ్రేష్ఠమైనది ఆత్మవిజ్ఞానం. ఆత్మయే సర్వానికి అధిష్ఠానము. మానవుడు అనేక పనులు తలబెడతాడు. వాటివల్ల తనకు ఆనందం లభిస్తుందని భావిస్తాడు. ఆనందం దొరకదు అనుకుంటే ఏ పనీ చెయ్యడు. ఆ ఆనందము కలిమిలో ఉన్నది. లేమిలో లేదు. ఉనికిలో ఉంది. శూన్యంలో లేదు. వాంఛలో ఆనందం లేదు. వాంఛాపూర్తిలో ఆనందమున్నది. అయితే ఈ జగత్తులో ఏ వస్తువూ, ఏ పనీ కూడా అమితానందాన్ని ఇవ్వలేవు. అపరిమిత ఆత్మానందమే పరిపూర్ణానందాన్ని ప్రసాదిస్తుంది. అపరిమితానందము ఒక్క తురీయావస్థ ద్వారానే లభిస్తుంది. ఇది ఇంద్రియాల పరిధికి దాటిన స్థితి. ఆత్మకు భిన్నంగా ఉన్న దాన్ని మనం చూడటం, వినటం, తెలుసుకోవటం ప్రారంభించాలని ప్రయత్నించటమే దుఃఖానికి నాంది. ఆత్మస్వతః ప్రజ్ఞవలే నిలబడి ఉంటుంది. తత్త్వవేత్త అయినవాడు. మృత్యువును చూడడు. రోగాన్ని కూడా చూడడు. అతడికి జరామృత్యువులు లేవు. విద్వాంసుడు అనగా జ్ఞాని అయినవాడు అన్నింటినీ తనలోనే ఆత్మభావంతో చూస్తాడు. అందుకనే అతడు అన్నింటినీ పొందుతాడు. ఆత్మజ్ఞానం పొందటంలో ఉన్న ఆనందం ఇల్లుకట్టినా, పాడిపంటలు సమృద్ధిగా ఉన్నా, ధనధాన్యాలు సంపాదించినా రాదు.

ఆత్మసర్వవ్యాపకమైనది. ఊర్ధ్వలోకాలలో, అధోలోకాలలో కూడా అది వ్యాపించి ఉంటుంది. ఆత్మానందము అనిర్వచనీయము. ఆత్మజ్ఞాని తనకు తానే ప్రభువు. తనను నియంత్రించే శక్తి తానే అయి ఉంటాడు" అని చెబుతాడు.

ఈరకంగా ఇతరుల సహాయసహకారాలు లేకుండా తనయొక్క శక్తితోనే అన్ని పనులను నిర్వహించేవాడు. సకల ఆత్మలను కలవాడు. కాబట్టి శ్రీమన్నారాయణుడు 'ఆత్మవాన్' అనబడుతున్నాడు.

## 85. సురేశః

సురులకు ఈశుడు. దేవతలకు ప్రభువు, స్వామి.

**బ్రహ్మాదీనాం ఫల్గుపద లిప్సూనాం స్త్రిదివౌకసామ్ ।**
**సంవిధాతాసురేశశ్చ ప్రోచ్యతే విబుధోత్తమైః ॥**

స్థిరత్వములో కూడా అల్పమైన దాన్ని కోరుతున్నారు. ఊర్ధ్వలోకవాసులు. అంటే బ్రహ్మాది దేవతలు శాశ్వతం కాదు. కొంతకాలం తరువాత వారికి కూడా క్షయం తప్పదు. అటువంటి బ్రహ్మాది దేవతలకు ఫలమును ఇచ్చేవాడు.

**సురాణాం ఈశః** దేవతలకు అధిపతి, రాజు, నాథుడు.

**విష్ణుపురాణం**లో "ఏ మహావిష్ణువు యొక్క అనుగ్రహంచేత నేను ఈ జగత్తును సృష్టిస్తున్నానో, ఎవరికోపముచేత రుద్రుడు సర్వనాశనము చేస్తున్నాడో, అటువంటి శ్రీ మహావిష్ణువే పరమేశ్వరుడు" అంటాడు బ్రహ్మ. శుభమునుకలుగచేసేవారు సురులు. అటువంటి సురులకు పరమాత్మ కాబట్టి 'సురేశుడు' అనబడతాడు.

ఇష్టకామ్యార్థసిద్ధి జరగాలంటే దేవతలను అర్చించటం జరుగుతుంది. ధనధాన్యాలు కావాలి అంటే లక్ష్మీదేవిని అర్చిస్తాము. చదువుకోసం సరస్వతిని, శక్తికోసం కాళిని, భూతప్రేతపిశాచాల బారినుంచి రక్షణకోసం ఆంజనేయస్వామిని, ఈవిధంగా దేవతలను అర్చిస్తాము. యజ్ఞయాగాదులు కూడా చేస్తాము. దీక్షలు అవలంభిస్తాము. దీక్షలలో మండలదీక్షలు, అర్ధమండలము, చాతుర్మాస్యము వంటివి. తరువాత దేవతలకు ముడుపులు కట్టటము వంటి పనులు చేస్తాము. ఆ తరువాత వ్రతాలుచేసి దానాలు ఇస్తాం. దీనివల్ల ఆయా దేవతలు అనుగ్రహించి దేవతలకు ఆ దైవత్వాన్ని ప్రసాదించేది పరమేశ్వరుడు.

జీవులు చేసిన కర్మననుసరించి, వాటికి ఉత్తరజన్మలు ప్రసాదిస్తాడు పరమేశ్వరుడు. ఆ జీవి ఉత్తమకర్మలు చేసినట్లైతే మానవజన్మ కన్న మంచి జన్మలు ఎత్తుతాడు. అవే సిద్ధులు, సాధ్యులు, విద్యాధరులు, కిన్నెరలు, కింపురుషులు, గంధర్వులు, దేవతలు. అందుచేతనే యజ్ఞయాగాది కర్మలు చేసినట్లైతే స్వర్గప్రాప్తి జరుగుతుందని చెప్పబడింది. కఠోపనిషత్తులో వాజశ్రవసుడు ఉత్తమలోకాలు పొందటానికి 'విశ్వజిద్' అనే యాగము చేశాడు.

అగ్నిచైనము చేసినవారు శాశ్వతంగా పుణ్యలోకాలు పొందుతారు అంటారు యముడు ఈ రకమైన కర్మలను చెయ్యటం వల్ల దేవతలు తృప్తి చెంది కర్త వాంఛితము నెరవేర్చుతారు. అటువంటి దేవతల కోరికలు తీర్చేవాడు పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు.

శ్రీ మహావిష్ణువే దేవతలకు ప్రభువు. దేవతలకు, సత్పురుషులకు, సాధువులకు కష్టం కలిగినప్పుడు వారిని రక్షిస్తాడు కాబట్టి దేవతలకు నాథుడు. ఈ రకంగా 'సురేశుడు' అంటే దేవతలకు నాథుడు ప్రభువు, రక్షకుడు అయిన శ్రీమన్నారాయణుడు.

# 86. శరణమ్

రక్షకుడు, ఆర్తత్రాణ పరాయణుడు.

**ఆర్తినా మూర్తి హన్తృత్వా చ్ఛరణం పరికీర్తితః ॥**

ఆ పన్నులయొక్క కష్టాలను పోగొట్టేవాడు కాబట్టి శరణము అనబడుతున్నాడు.

**యదుపాసా ద్భయందుఃఖం పాపంబంధో న బాధతే**

**ప్రతిష్ఠా చ సుఖం జ్ఞానం భేవచ్ఛరణమిత్యపి ॥**

ఎవరిని ఉపాసించటంవల్ల కష్టాలు, భయము, పాపము, సంసారబంధనాలు తొలగిపోతాయో, ఎవరిని ధ్యానించటంవల్ల ప్రతిష్ఠ, సుఖము, జ్ఞానము కలుగుతాయో అటువంటి పరమేశ్వరుడు శ్రీమన్నారాయణుడు.

**శృణాతి రక్షతీతి శరణం** సకలజీవులను సృష్టించి, వాటికి రక్షణ కల్పించువాడు.

**సుబాలోపనిషత్తులో నైవేహ కిఞ్చనాగ్ర ఆసీ దమూలమనాధారా ఇమాః ప్రజాః ప్రజాయంతే దివ్యో దేవ ఏకో నారాయణ శ్చక్షుశ్చ ద్రష్టవ్యం చ నారాయణ శ్శ్రోత్రం చ శ్రోతవ్యం చ నారాయణో ఘ్రాణశ్చ ఘ్రాతవ్యం చ నారాయణో జిహ్వా చ రసయితవ్యంచ నారాయణో త్వక్చ స్పర్శయితవ్యంచ నారాయణో మనశ్చ మన్తవ్యంచ నారాయణో బుద్ధిశ్చ బోద్ధవ్యంచ నారాయణో ఉహఙ్కార శ్చాహఙ్కర్తవ్యం చ నారాయణ శ్చిత్తంచ చేతయితవ్యంచ నారాయణో వాక్చ వక్తవ్యంచ నారాయణో హస్తౌ చాదాతవ్యంచ నారాయణః పాదౌచ గన్తవ్యంచ నారాయణః పాయుశ్చ విసర్జయితవ్యం చ నారాయణ ఉపస్థశ్చాఽనన్దయితవ్యంచ నారాయణో ధాతా విధాతా కర్తా వికర్తా దివ్యో దేవ ఏకో నారాయణః (1)**

సృష్టికి ముందు ఏమీలేదు. అందుచేత ఏరకమైన ఆధారం లేకుండానే సృష్టి జరిగింది. అప్పుడు ఉన్నది దివ్యుడైన నారాయణుడొక్కడే. నేత్రము, దృష్టి, ద్రష్టవ్యము నారాయణుడే. శ్రోత్రము, శ్రోత్రవ్యము నారాయణుడే. ఘ్రాతము, ఘ్రాతవ్యము నారాయణుడే. అతడే జిహ్వ, రసయిత్వము. చర్మము, స్పర్శజ్ఞానము, బుద్ధి, బోద్ధవ్యము. చిత్తము చేతయితవ్యము, ఈరకంగా నారాయణుడే ధాత, విధాత. కర్త, వికర్త.

**ఆదిత్యా రుద్రామరుతో వసవోఽశ్వినావృచో యజూగ్ంషి సామాని మన్త్రా అగ్ని రాజ్య మాహుతి ర్నారాయణ ఉద్భవ స్సమ్భవో దివ్యో దేవ ఏకొనారాయణో**

**మాతా పితా భ్రాతా నివాస శ్శరణం సుహృద్గతి ర్నారాయణో విరాజా సుదర్శనా జితా సౌమ్యా. మోఘా కుమారామృతా సత్యా సుమధ్యమా నాసీరా శిశురాసురా సూర్యా భాస్వతీ విజ్ఞేయాని నాడీనామాని దివ్యాని గరతి రాయతి వా వర్షతి.**

ఆదిత్యులు, రుద్రులు, మరుత్తులు, వసువులు, అశ్వినీదేవతలు, ఋక్కులు, సామములు, యజస్సులు, మంత్రాలు, అగ్ని, ఆజ్యము, ఆహుతి అన్నీ నారాయణుడే. సృష్టి కారకుడు నారాయణుడొక్కడే. తల్లి, తండ్రి, అన్నదమ్ములు, నివాసము, దిక్కు, నాడీమండలము అంతానారాయణ స్వరూపము.

**వరుణోఽ ర్యమాచన్ద్రమా కలా కవిర్ధాతా బ్రహ్మ ప్రజాపతిర్మఘవా దివసాశ్చాఽ ర్ధ దివసాశ్చ కలాః, కల్పా శ్చోర్ధ్వం చ దిశశ్చ సర్వం నారాయణః పురుష ఏవేదగ్ం సర్వం యద్భూతం యచ్చభవ్యం తద్విష్ణో పరమం పదగ్ం సదా పశ్యన్తి సూరయః దివీవ చక్షురాతతం తద్విప్రాసో విపన్యవో జాగృవాగ్ం స స్సమిన్ధ తే విష్ణో ర్యత్పరమం పదమ్ తదేతన్ని ర్వాణాఽ నుశాసన మితి వేదాఽ నుశాసన మితి వేదానుశాసనమ్.**

వరుణుడు, ఆర్యముడు, చంద్రుడు, కల, కవి, ధాత బ్రహ్మ, ప్రజాపతి, ఇంద్రుడు, దినములు, అర్ధదినములు, కలలు, కల్పములు, ఊర్ధ్వభాగము, దిక్కులు, దిశలు, అంతా నారాయణస్వరూపమే.

ఈ జగత్తుకు రక్షకుడు, స్నేహితుడు, ఉపాయము అంతా శ్రీమన్నారాయణుడే. అతన్ని జ్ఞానులు మాత్రమే దర్శించగలుగుతారు. అని చెప్పబడింది.

ఈ రకంగా ఉన్న పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుని శరణువేడినట్లైతే కష్టాలు తొలగిపోతాయి. భయమనేది ఉండదు. సంసారబంధనాలు ఉండవు. ఐహికబంధనాలు కూడా ఉండవు. అతన్ని ధ్యానించటంవల్ల సుఖము, శాంతి లభిస్తాయి. అన్ని జీవులకు సృష్టికర్త, స్థితికారకుడు కూడా అతడే. కాబట్టే అతడే 'శరణ్యుడు'.

## 87. శర్మన్

ఆనందస్వరూపుడు.

**పరమానన్దరూపత్వా చ్ఛర్మ హింసాది మన్థనాత్ ॥**

క్రూరులు, దుర్మార్గులు, హింసను చేసేవారిని శిక్షించి తద్వారా మనకు ఆనందము కలుగచేస్తాడు. కాబట్టి పరమేశ్వరుడు 'శర్మన్' అనబడుతున్నాడు.

**శృణాతి సుఖయతీతి శర్మ**

శర్మ అనగా – సుఖము. పరమపురుష స్థానము. ఆనందస్వరూపము.

పరమేశ్వరుడు చిదానందస్వరూపుడు. పంచకోశములయందు ఐదవదయిన ఆనందమయ కోశమునందు ఉంటాడు. తనను ఆరాధించిన వారికి శాశ్వతమైన ఆనందము కలుగజేస్తాడు.

**తైత్తిరీయోపనిషత్తు**లోని 'ఆనందవల్లి'లో సాధకుని శరీరములోనే పరబ్రహ్మ ఉంటాడు. ఇక్కడు అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయకోశాలనడుమ ఆనందమయ కోశమున్నది. అందులో పరబ్రహ్మ ఉంటాడు.

"ఆనందమయుడే విజ్ఞానమయుడికి ఆత్మ. విజ్ఞానమయుని లోపల ఆనందమయుడు ఉంటాడు. చరాచరజగత్తంతా పరబ్రహ్మ స్వరూపమే. ఆకాశానికి కారణం బ్రహ్మ. సృష్టికి ముందు అంతా శూన్యంగా ఉండేది. ఆ శూన్యంలో పరబ్రహ్మ ఒక్కడే ఉండేవాడు. అతడే ఈ జగత్తును సృష్టించాడు. అతడు ఆనందకారకుడు. అతన్ని సాక్షాత్కరింప చేసుకున్నవాడు ఆనందం పొందుతాడు" అని చెప్పబడింది.

ఈ రకంగా పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు ఆనందస్వరూపుడు కాబట్టి 'శర్మన్' అనబడతాడు. అంటూ పరమేశ్వరుని విశేషాలు, ప్రాముఖ్యాలను వివరించాడు రత్నాకరుడు.



# 15. ఉపాయ ఉపేయములు

"గురువుగారూ ! జగత్తంతా పరమేశ్వరమయమే. అంతటా ఆయన యొక్క రూపమే నిండి ఉన్నది. కష్టము, సుఖము, దుఃఖము, ఆనందము అన్నీ ఆపరమేశ్వరుడే అయినప్పుడు ఉపాయము, ఉపేయము కూడా ఆయనే అవుతాడు కదా ! కొంచెం వివరంగా చెప్పండి" అన్నాడు కృష్ణశర్మ. చెప్పటం మొదలుపెట్టాడు రత్నాకరుడు.

ఉపాయము అంటే – సాధనము. ఏదైనా ఒక పని చెయ్యాలంటే, అది ఏవిధంగా చేస్తే పూర్తి అవుతుంది ? ఎలా చేస్తే తేలికగా అవుతుంది? ఈ రకంగా ఆ పని పూర్తి చెయ్యటానికి ఉపయోగించే సాధనము లేదా మార్గము ఉపాయమనబడుతుంది. ఆ ఉపాయం ద్వారా సాధించేది ఏదైతే ఉన్నదో అది ఉపేయము. అదే సాధ్యము అనబడుతుంది.

జగత్తంతా పరమేశ్వరమయమయినప్పుడు సాధనము సాధ్యము అంటే ఉపాయము, ఉపేయము ఈ రెండూ కూడా పరమేశ్వర స్వరూపమే కదా ? దీనికి ఏ విధమైన అనుమానముగాని, సంకోచముగాని ఉండవు. ఆ పరమేశ్వరుడు జగత్తులోని అన్నింటినీ కార్యముగా కలిగి ఉన్నాడు. ఈ సంసారాన్ని నిర్మించాడు. మానవులంతా తనను గురించి తెలుసుకోవటానికి, తనకు పరిచర్యలు చెయ్యటానికి, వారికి ఇంద్రియాలతో కూడిన శరీరాన్నిచ్చాడు. తాను ప్రసాదించిన అవయవాలు, శరీరము గల ప్రజలందరినీ తన వారినిగా చేసుకుంటాడు. అందుచేతనే ఆయన్ను ఆరాధించే వారిలో ఒకడు కూడా హీనుడు ఉండడు. తనను ఆరాధించేవారికి అజ్ఞానపు చీకట్లు తొలగిపోగానే జ్ఞానజ్యోతులు ప్రసాదించటానికి ఎల్లప్పుడూ సిద్ధంగా ఉంటాడు. భక్తులందరికీ అభయప్రదానంచేసి, వారిని తన అధీనములోనే ఉంచుకుంటాడు. భక్తులందరికీ తనంటే నమ్మకము కలుగచేస్తాడు. దీనికోసం భక్తులకు తన మహిమలు తెలియచేస్తాడు. అవసరమైతే మహిమలు చూపిస్తాడు. భక్తులు తనను చేరకుండా ఏవైనా ప్రతిబంధకాలు ఏర్పడితే, వాటిని నిరోధిస్తాడు. భక్తులు పుణ్యచరితులైనా సరే, పాపచరితులైనా సరే తనను శరణుకోరిన వారి కష్టాలు తొలగిస్తాడు. వారి కష్టాలు తొలగించటానికి అన్నివేళలా సిద్ధముగా ఉంటాడు. ఈ రకంగా భక్తులకు తనమీద నమ్మకాన్ని పెంచి, సాధన మార్గాన్ని చూపుతాడు. అయితే భక్తులు చివరకు సాధించేది కూడా ఆ పరమేశ్వరుణ్ణే.

ఆ పరమేశ్వరుడు ధర్మస్వరూపుడు. యజ్ఞవరాహరూపంలో భూమిని జలము నుంచి రక్షించాడు. అతడు ఇంతటివాడు అని చెప్పటానికి వీలుకాదు. అతన్ని ఏ ఉపాయంతోనైనా

ఆరాధించవచ్చు. అతడికి దేనితోనూ సంబంధము లేదు. అతడికి భక్తులు అంటే అపారమైన ప్రేమ. అందుచేత వారియందే ఉంటాడు. సత్పురుషులఎడ పరమసాధువుగా ఉంటాడు. ఆశ్రితులు ఉచ్ఛనీచాలు చూడకుండా అందరి పట్ల సమానభావంతో ఉంటాడు. అందుచేతనే భక్తులు అతన్ని తమవాడుగా భావిస్తాడు. అతడు అమోఘమైనవాడు. పరమపదములో ఉండే వారిని కంటికి రెప్పలా కాపాడుతుంటాడు. ఏ పనిలోనైనా సరే ధర్మాధర్మవిచక్షణ చేస్తాడు. ధర్మమే స్వరూపముగా గలవాడు. తన చేష్టలతో, మహిమలతో భక్తులను ఆనందపరవశులుగా చేస్తాడు. అనేక శిరస్సులు గలవాడు. అనేక రూపాలు ధరిస్తాడు. భూభారాన్నంతటినీ మోస్తున్నవాడు. అతడే ఈ జగత్తుకు మూలకారణం. భక్తులు చేసే విన్నపాలు శ్రద్ధగా వింటాడు. అతడు అమృతమయుడు. భక్తులకు శాశ్వతమైన, స్థిరమైన, మోక్షాన్ని ప్రసాదిస్తాడు. ఈ రకంగా ఉపాయము, ఉపేయము కూడా ఆ పరమేశ్వరుడే. ఈవిషయం 88 నుంచి120 వరకు నామాలలో వివరించబడింది. ఇక నామాలనుచూద్దాం.

## 88. విశ్వరేతాః

అన్నింటినీ కార్యముగా కలవాడు.

**విశ్వం రేతో భగవతో విశ్వరేతా హరిస్మృతః**
**జ్ఞానేన్ద్రియాదికం విశ్వం పరిచర్యార్థ మేవ హి**
**యః ప్రజానాం కరోతీతి విశ్వరేతా శ్చ సస్మృతః**

తనచేత నిర్మించబడిన సంసారము కలవాడు. మానవులంతా తనను గురించి తెలుసుకోవటానికి, తనకు పరిచర్యలు చెయ్యటానికి వారికి ఇంద్రియాలతో కూడిన శరీరమును ఇచ్చినవాడు.

**విశ్వమ్ రేతః కార్యం యస్యసః విశ్వరేతాః** తనను గురించి తెలుసుకుని, తనకు సేవలు చెయ్యటానికే ప్రజలకు ఇంద్రియాలను ఇచ్చినవాడు. **విష్ణుతత్త్వములో**

**విచిత్రదేహసంపత్తిః ఈశ్వరాయ నివేదితుమ్ ।**
**పూర్వమేవ కృతా బ్రహ్మన్ హస్తపాదాది సంయుతా ॥**

కాళ్ళు చేతులు మొదలైనవాటితో కూడిన విచిత్రమైన ఈ దేహము ఆ పరమేశ్వరుని సేవించటానికని పూర్వకాలంలోనే సృష్టించబడింది. అందుకే పరమేశ్వరుడైన విష్ణుమూర్తిని వీక్షించని కనులు కనులుకావు. అతని నామము వినని చెవులు చెవులుకావు అంటే **శ్రీ మద్భాగవతములో** ప్రహ్లాదుడు తన తండ్రి అయిన హిరణ్యకశ్యపుడికి చెబుతాడు.

**సీ॥ కమలాక్షు నర్చించు కరములు కరములు శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ**
**సురరక్షకునిఁ జూచు చూడ్కులు చూడ్కులు శేషశాయికి మ్రొక్కు శిరము శిరము**
**విష్ణు నాకర్ణించు వీనులు వీనులు మధువైరిఁ దవిలిన మనము మనము**
**భగవంతు వలగొను పదములు పదములు పురుషోత్తముని మీఁది బుద్ధి బుద్ధి**

**తే॥ దేవదేవునిఁ జింతించు దినము దినము**
**చక్రహస్తునిఁ బ్రకటించు చదువు చదువు**
**కుంభినీధవుఁ జెప్పెడి గురుఁడు గురుఁడు**
**దండ్రి ! హరిఁ జేరు మనియెడి తండ్రి తండ్రి**

**సీ॥ కంజాక్షునకుఁ గాని కాయంబు కాయమే ? పవన గుంభిత చర్మభస్త్రి గాక**
**వైకుంఠుఁ బొగడని వక్త్రంబు వక్త్రమే ? ఢమఢమ ధ్వనితోడి ఢక్క గాక**
**హరిపూజనము లేని హస్తంబు హస్తమే ? తరుశాఖ నిర్మిత దర్వి గాక**
**కమలేశుఁ జూడని కన్నులు కన్నులే ? తను కుడ్య జాల రంధ్రములు గాక**

**ఆ॥ చక్రిచింత లేని జన్మంబు జన్మమే ?**
**తరళ సలిల బుద్బుదంబు గాక**
**విష్ణుభక్తి లేని విబుధుండు విబుధుఁడే ?**
**పాదయుగము తోడి పశువు గాక.**

'రేతస్సు' అంటే వీర్యము. ప్రాణులను ఉత్పత్తి చేసేది. రేతస్సు ప్రాణులను ఏరకంగా ఉత్పత్తి చేస్తున్నదో, అదేవిధంగా పరమేశ్వరుడు ఈ జగత్తు యొక్క ఉత్పత్తికి కారణమవుతున్నాడు. ఈరకంగా విశ్వానికి కారణమైనవాడు కాబట్టి శ్రీమహావిష్ణువు 'విశ్వరేతాః' అనబడుతున్నాడు.

## 89. ప్రజాభవః

ప్రజలందరూ తన వారే అయినవాడు.

**తద్దత్తైరేవ కరణై స్తస్మిన్నభిముఖాః ప్రజాః**
**సర్వాశ్చైవ భవన్తీతి ప్రజాభవ ఉదాహృతః**

తాను ప్రసాదించినటువంటి అవయవములు, శరీరముగల ప్రజలందరినీ తన వారినిగా చేసుకొనేవాడు.

**ప్రజాః భవన్తి అస్మాత్**

ప్రజలందరూ ఇతనినుండే జన్మించారు. ఇక్కడ ప్రజలు అంటే ప్రాణులు అని అర్థం. లోకంలోని ప్రాణికోటి, జీవజాలము అంతా ఇతనినుండే ఉద్భవించింది.

సృష్టి ప్రారంభానికి ముందు ఈ జగత్తంతా శూన్యంగా ఉండేది. అప్పుడు జగత్తంతా పరమేశ్వరుడే ఆక్రమించి ఉండేవాడు. తరువాతకొంతకాలానికి పరమేశ్వరుడు సృష్టి చెయ్యాలని సంకల్పించాడు. అప్పుడు తనలోనుంచి కొంతశక్తిని బయటకు పంపాడు. అదే మాయ. దానినుండే ఈ జగత్తంతా ఉద్భవించింది. **ఐతరేయోపనిషత్తు**లో చెప్పినట్లుగా

లోకాలను సృష్టించిన తరువాత ఈ లోకాలను రక్షించటానికి లోకపాలకులను సృష్టించాలి అనుకున్నది. అలా అనుకుని జలాన్ని తీసుకుని దానితో అవయవాలు గల ఒక మానవాకారాన్ని సృష్టించింది. ఆ ఆకారమే విరాట్స్వరూపము. ఆ తరువాత ఇంద్రియాలను, ఇంద్రియాధిష్టాన దేవతలను సృష్టించింది “మేము కూర్చుని భుజించటానికి వీలుగా మాకు ఒక స్థానాన్ని ప్రసాదించవలసినది” అని ఇంద్రియాధిష్ఠాన దేవతలు పరమేశ్వరుణ్ణి కోరారు. వారికోసం విరాట్పురుషుణ్ణి పోలిన శరీరాన్ని సృష్టించాడు. దేవతలంతా శరీరంలో తమతమ స్థానాలలో (ఇంద్రియాలలో) ప్రవేశించారు.

ఈ రకంగా పరమేశ్వరుడు ఇంద్రియాలను, ఇంద్రియాలతో కూడిన మానవుడినీ సృష్టించాడు. ఈరకంగా సృష్టించబడిన వారందరూ తమ కరచరణాదులచే ఆ పరమేశ్వరుణ్ణి ధ్యానించి మళ్ళీ అతని దగ్గరకే చేరతారు. ఈ విధంగా ప్రజలందరినీ తానిచ్చిన అవయవాలతో తనవారుగా చేసుకుంటున్నాడు.

## 90. అహః

హీనులు లేనివాడు.

**న సన్తిహీనా యస్యేతి అహ స్స పరికీర్తితః**
**అనాద్యవిద్యా విద్రాయాం స్వధీ హేతుతయా హ్యహః ॥**

తన భక్తులలో ఒక్కడు కూడా హీనుడు లేనివాడు అజ్ఞానాంధకారము నుంచి బయటపడిన వారికి స్వరూపజ్ఞానాన్నిచ్చేవాడు.

**అహః అహీనం** పరమేశ్వరుని ఆరాధించే వారిలో హీనుడైన వాడుండడు. ఎందుచేతనంటే శంకరభగవత్పాదులవారు తమ సౌందర్యలహరిలో చెప్పినట్లుగా

**ప్రణంతుం స్తోతుంవా కథమకృతపుణ్యప్రభవతి.**

ఆ పరమేశ్వరుడి పేరు ఉచ్చరించాలన్నా, ఆయనకు నమస్కరించాలన్నా, ఆయనను దర్శించాలన్నా, పూర్వజన్మ సుకృతం ఉండి తీరాలి.

పూర్వజన్మ సుకృతం ఉన్నవాడు హీనుడు కాలేడు. కాబట్టి పరమేశ్వరుడైన శ్రీమహావిష్ణువు యొక్క భక్తులలో హీనుడైనవాడు ఉండడు. మనోవాక్కాయకర్మలతో ఎవడైతే శ్రీమన్నారాయణుని అర్చిస్తారో అతడు అరిషడ్వర్గాలను జయిస్తాడు. అజ్ఞానాంధకారము నుంచి బయటపడతాడు. ఐహికబంధాలనుండి విముక్తుడవుతాడు. అరిషడ్వర్గాలను జయించటము అంటే నేను, నాది అనే అహంకారమమకారాలను వదలివేయటం. లోకంలో అన్ని పాపకర్మలకు, అన్ని దుఃఖాలకు హేతువులు ఇవే. కాబట్టి వాటిని జయించిన వాడికి స్వరూపజ్ఞానం కలుగుతుంది. **అహంబ్రహ్మోస్మి.** నేను పరబ్రహ్మను. అనుకో గలుగుతాడు. ఈ జగత్తునంతా తనలోనే దర్శించగలుగుతాడు.

**భగవద్గీత**లోని ఆరవఅధ్యాయము **ఆత్మసంయమనయోగము**లోని 40వ శ్లోకంలో అర్జునుడు శ్రీకృష్ణపరమాత్మని అడుగుతాడు. "శ్రీకృష్ణా ! శ్రద్ధాభక్తులతో యోగాన్ని ఆచరిస్తున వాడికి మనసు చలించినట్లైతే ఉభయభ్రష్టుడై అధోగతి పాలు కాడా ?" దానికి భగవానుడు

**పార్థ నై వేహ నాముత్ర వినాశస్తస్య విద్యతే ।**
**న హి కల్యాణకృత్కశ్చిత్‌దుర్గతిం తాతఃగచ్ఛతి ॥**

ఓ పార్థా ! యోగభ్రష్టుడైన వాడు ఈ లోకంలోగాని పరలోకంలోగాని అధోగతిపాలు కాడు. భగవత్ప్రాప్తికి కర్తవ్య కర్మలు చేసేవాడెవడూ దుర్గతిపాలు కాడు.

యోగభ్రష్టుడైనవాడు ఇంకా దుర్గతులు పొందడు. ఎందుకంటే యోగభ్రష్టుడు కావటమే దుర్గతి. అయితే వానప్రస్థములో ఉన్న జడభరతుడు జింకపిల్లగా జన్మించలేదా? అనే ప్రశ్న వస్తుంది. జడభరతుడు గొప్పయోగ సాధకుడు. కాని భూతదయ, మోహము. వీటివల్ల జింకపిల్ల మీద మమకారము పెంచుకున్నాడు. అందుచేత అవసానదశలో భగవంతుని మీద మనస్సు నిలువలేదు. 'అంత్యకాలంలో దేనియందు మనసు లగ్నమైతే ఆ జన్మనే పొందుతాడు' అనేది తిరుగులేని సత్యము. అందుచేతనే జింకపిల్లగా పుట్టాడు. అయినా పూర్వజన్మ జ్ఞానం కలిగి ఉన్నాడు. జింక రూపంలో కూడా గొప్ప సాధకుడులాగానే ఉన్నాడు. రాలిన ఆకులు మాత్రమే తిన్నాడు. మరుజన్మలో బ్రాహ్మణుడుగా పుట్టి చాలా త్వరగా పరమపదము చేరాడు. కాబట్టి ఎవరైతే అజ్ఞానాంధకారము నుంచి బయట పడతాడో, అటువంటి వాడికి కైవల్యాన్ని ప్రసాదిస్తాడు శ్రీమన్నారాయణుడు.

అహః అంటే–పగలు అని అర్థం. పరమేశ్వరుడు స్వయంప్రకాశకుడు. కాలపురుషుడు. అందుచేతనే 'అహః' అనబడుతున్నాడు.

# 91. సంవత్సరః

వశించువాడు

**ఇత్థం తేషు ప్రబుద్ధేషు వసత్యుద్ధరణాయ యః సంవత్సరః ॥**

తనభక్తులైన వారికి అజ్ఞానపు చీకట్లు తొలగిపోగానే వారికి జ్ఞానజ్యోతిని ప్రసాదించటానికి సర్వకాలములందు ఎదురుచూస్తుంటాడు.

**సంవసతీతి సంవత్సరః** ఆత్మఅనాదియైన అవిద్యనుంచి మేల్కొనగానే తననుసరించిన జ్ఞానాన్ని ఇవ్వటానికి సిద్ధముగా ఉన్నవాడు **భగవద్గీత**లోని పదవ అధ్యాయము **విభూతి యోగము**లోని 10వ శ్లోకంలో

**తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్ ।**
**దదామి బుద్ధియోగం తం యేన మాముపయాంతి తే ॥**

నిరంతరము ధ్యానాదులద్వారా నాయందే మనసులగ్నం చేసి, నన్నే భజించే వారికి నేను తత్త్వజ్ఞానాన్ని ప్రసాదిస్తాను. దానిద్వారా నన్ను చేరగలుగుతారు. పన్నెండవ అధ్యాయము **భక్తియోగము**లోని 7వ శ్లోకంలో

**తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్ ।**
**భవామి న చిరాత్పార్థ మయ్యావేశిత చేతసామ్ ॥**

ఓ అర్జునా ! నాయందే మనసును లగ్నము చేసిన పరమ భక్తులను నేను శీఘ్రముగా మృత్యురూప సంసార సాగరము నుంచి ఉద్ధరిస్తాను. మనస్సును, బుద్ధిని సర్వకాలములందు ఆ భగవంతుని యందే లగ్నము చేసిన, అనన్యసామాన్యులైన భక్తులను సంసారసాగరము నుంచి ఉద్ధరిస్తాను అంటున్నాడు భగవానుడు.

సంసారబంధనాలు దుఃఖహేతువులు సారములేనిదే సంసారము. ఇందులో మనం పొందేదంతా క్షణికమైనటువంటి సుఖము. అనుభవించగానే ఆ ఆనందము తీరిపోతుంది. ఈ సుఖము దుఃఖానికి హేతువు. ఇక సంసారము మృత్యురూపము అంటున్నారు. పుట్టిన ప్రతి ప్రాణీ మరణించక తప్పదు. మర్త్యలోకంలో మరణము సర్వసాధారణము. ఎటువంటి కర్మలు చేసినవారైనా సరే మరణానంతరము ఆ కర్మల ఫలితంగా స్వర్గ, నరకాలనుభవించి, ఆ కర్మలు శేషఫలాన్ననుభవించటానికి మళ్ళీ భూలోకంలో జన్మించవలసి ఉంటుంది. ఈ రకంగా జన్మించటము, కర్మలు చెయ్యటము, దాని ఫలితంగా మళ్ళీ జన్మించటము జరుగుతుంది. అందుకే శంకరభగవత్పాదుల వారు తమ **భజగోవింద శ్లోకా**లలో

**పునరపి జననం పునరపి మరణం పునరపి జననే జఠరేశయనం ।**

**ఇహసంసారే బహుదుఖారే కృపయా పారే పాహి మురారే ॥**

కర్మలు చేసిన మానవుడు పుడుతూ ఉంటాడు, చస్తూ ఉంటాడు. ఈ రకంగా గానుగకు కట్టిన ఎద్దులాగా సంసారమనే బండిచక్రంలో పడి గిరగిరా తిరుగుతూ ఉంటాడు. అందులో నుంచి బయట పడాలంటే బుద్ధిని మనసును భగవంతుని మీద లగ్నం చేసి, ఆ పరమేశ్వరుణ్ణి ఆరాధించాలి. అటువంటి వారిని పరమేశ్వరుడు ఎప్పుడూ అనుగ్రహిస్తాడు. వారికి జ్ఞానజ్యోతులను ప్రసాదిస్తాడు. వారికర్మ శేషం పూర్తికాగానే జీవితం నుంచి శాశ్వతంగా విముక్తులను గావిస్తాడు. కైవల్యాన్ని ప్రసాదించి పరమపదం చేరుస్తాడు.

**కాలాఽఽత్మనా స్థితోవిష్ణుః** సంవత్సరము కాలస్వరూపంలో ఉండే శ్రీమహావిష్ణువు.

**హయనాత్మా మహాదేవః ప్రజాపతి రితి స్మృతి**

ప్రజాపతియే కాలపురుషుడు. అందుచేతనే 'సంవత్సరః' అనబడుతున్నాడు.

## 92. వ్యాలః

తన అధీనము కావించుకొనేవాడు

**తానాత్మసాత్ వ్యాళ ఉక్తః కరోతి యః**

వారికి అంటే తన భక్తులకు అభయమిచ్చి, వారిని తన అధీనములో ఉంచుకొనేవాడు.

**వ్యాలాతి ఆదత్తే ఇతి వ్యాలః**

అభయమిచ్చి భక్తులను తన అధీనములో ఉంచుకొనువాడు.

కష్టాలు వచ్చినప్పుడు దేవతలకు, మానవులకు కూడా అభయమిచ్చి రక్షించేవాడు. దుష్టులు, దుర్మార్గులు, క్రూరులు అనేకమంది జన్మించి, సాధుపుంగవులను ఇక్కట్లపాలు చేస్తుంటారు. అలాంటి సమయంలో వారంతా శ్రీమహావిష్ణువు దగ్గరకు వెళ్ళి ఆ దుర్మార్గుల బారినుండి తమను రక్షించమని వేడుకొంటారు. అప్పుడు శ్రీహరి వారికి అభయమిచ్చి, సమయం చూసి శత్రుసంహారం చేస్తాడు. ఈ రకంగా దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేస్తాడు. కాబట్టి జగత్తులోని సాధువులు, సత్వగుణ ప్రధానులు, ముముక్షువులు అందరూ ఆ పరమేశ్వరుని అధీనంలోనే ఉంటారు.

హిరణ్యకశ్యపుడు బ్రహ్మనుంచి వరాలు పొంది మితిమీరిన గర్వంతో దేవతలను నానాబాధలు పెట్టాడు. యజ్ఞయాగాదులు నాశనం చేశాడు. మునులను, ఋషులను

నానాహింసల పాలుచేశాడు. అది సహించలేక వారందరూ శ్రీమహావిష్ణువు వద్దకు పోయి మొరపెట్టుకున్నారు. వారందరికీ అభయమిచ్చి పంపాడు. సమయం కోసం వేచి చూసి, నృసింహుడు అవతరించి స్తంభము నుంచి బయటకు వచ్చి ఆ రాక్షసుడు కోరినట్లుగానే అతన్ని సంహరించాడు.

అలాగే రావణబ్రహ్మ ఆగడాలు మితిమీరినప్పుడు, తానే స్వయంగా భూలోకంలో జన్మించి సాధువులను, సజ్జనులను కాచి రక్షిస్తాను అని అభయమిచ్చాడు. తనిచ్చిన మాట ప్రకారం మంచిక్షేత్రాన్ని ఎన్నుకుని దశరథ కుమారుడుగా కౌసల్య గర్భాన జన్మించాడు. పితృవాక్యపరిపాలన కోసం అడవులకు వెళ్ళి రాక్షససంహారము చేశాడు. చివరకు వానరసాయంతో లంకేశ్వరుణ్ణి నిర్జించి సాధు, సజ్జనులకు రక్షణ కల్పించాడు.

ఈ రకంగా ఎప్పుడైతే రాక్షసులవల్ల సజ్జనులకు కష్టాలు కలుగుతాయో, అప్పుడు తాను భూలోకంలో అవతరించి దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేస్తుంటాడు. ఇలా అభయమిచ్చి రక్షణ కల్పిస్తాడు. కాబట్టే భక్తులంతా ఆ పరమేశ్వరుని అధీనంలో ఉంటారు.

వ్యాలము అంటే – క్రూరసర్పము. క్రూరసర్పము దేన్నైనాసరే మహాగట్టిగా పట్టుకుంటుంది. దాని పట్టు నుంచి వదిలించుకోవటం సాధ్యం కాని పని. అదేవిధంగా సర్పమువలె గ్రహింప శక్యము కానివాడు. కాబట్టి 'వ్యాలః' అనబడుతున్నాడు.

## 93. ప్రత్యయః

నమ్మకము కలుగచేసేవాడు.

**యోఽ సౌ ప్రత్యాయయతి తాన్ ప్రత్యయ స్సముదాహృతః**

వారికి అంటే తన భక్తులకు తనయందు విశ్వాసము కలుగచేయువాడు.

**ప్రత్యేతీతి ప్రత్యయః** వారికి తనయందు నమ్మకము కలుగజేయువాడు.

రాక్షసులు పెట్టే బాధలు భరించలేక శ్రీమహావిష్ణువుకు మొరపెట్టుకుంటారు దేవతలు, ఋషులు. వారికి అభయమిస్తాడు శ్రీహరి. అయితే ఇచ్చిన మాటను నిలబెట్టుకుంటాడు. లేకపోతే ఆశ్రయించిన వారికి నమ్మకముండదు.

రావణబ్రహ్మ ఆగడాలు భరించలేక తనను ఆశ్రయించిన దేవతలకు అభయమిచ్చిన తరువాత లక్ష్మీదేవిని భూజాతగా, ఆదిశేషుని లక్ష్మణునిగా, శంఖుచక్రాలను భరతశతృఘ్నులుగా, దేవతలందరినీ వానరసైన్యంగా జన్మించమన్నాడు. వారు ఒక్కొక్కరే భూలోకంలో అవతరిస్తున్నారు. భక్తులకు ఆహరి భూలోకంలో అవతరిస్తాడు అని నమ్మకం

కలుగుతోంది. శ్రీరామ జననం తరువాత రాక్షససంహారంకోసం ఉద్భవించిన శ్రీహరి యితడే. రావణబ్రహ్మకు చావు తప్పదు. రాక్షస నాశనం తప్పదు. అని మునులు, ఋషులు అందరూ నమ్మారు. చివరగా శ్రీరామచంద్రుడు రాక్షససంహారం చేసి చూపించాడు. దేవతలంతా హరిని వేనోళ్ళకొని యాడారు.

ద్వాపరయుగంలో అనేకమంది మహాబలశాలురు ఒక్కసారిగా జన్మించారు.

| | | |
|---|---|---|
| కాలనేమి అంశతో | – | కంసుడు |
| సూర్యుని అంశతో | – | కర్ణుడు |
| వాయువు అంశతో | – | భీముడు |
| యముని అంశతో | – | విదురుడు, ధర్మరాజు |
| కామక్రోధాల అంశతో | – | అశ్వత్థామ |
| అరిష్టనేమికుమారుడు | | |
| హంసుని అంశతో | – | ధృతరాష్ట్రుడు |
| కలి అంశతో | – | దుర్యోధనుడు |
| ద్వాపరఅంశతో | – | శకుని |
| అగ్ని అంశతో | – | దుష్టద్యుమ్నుడు |
| రాక్షసాంశతో | – | శిఖండి |
| హిరణ్యకశ్యపుడి అంశతో | – | శిశుపాలుడు |
| విప్రజిత్తు అంశతో | – | జరాసంధుడు |

వీరందరూ గొప్పవారే. వీరిలో ఏ ఒక్కరైనాసరే యావద్భారతాన్నీ ఒంటిచేత్తో నడిపించగలరు. వీరికి ఎదురులేదు. ఎవరికివారు సైన్యాన్ని సమీకరించారు. భూభారం బాగా పెరిగిపోయింది. భూదేవి శ్రీ మహావిష్ణువుతో మొరపెట్టుకుంది. భూభారాన్ని మోయలేకుండా ఉన్నాను. తగ్గించమంది. "నేను భూలోకంలో అవతరించి నీ భారం తగ్గిస్తాను" అన్నాడు శ్రీహరి. అన్నమాట ప్రకారం దేవకీవసుదేవుల అష్టమగర్భాన జన్మించాడు. కురుక్షేత్రమహాసంగ్రామం జరిపించి పద్దెనిమిది అక్షోహిణీల సైన్యాన్ని నాశనం చేశాడు. దేశంలో మహాయోధుడు అనేవాడు లేకుండా చేసి భూదేవికిచ్చిన మాటను నిలబెట్టుకున్నాడు. ఈరకంగా భూలోకంలో అధర్మము పెచ్చుమీరిపోయినప్పుడు దుష్టశిక్షణ, శిష్టరక్షణ కోసం తాను భూలోకంలో ఏదో ఒకరూపంలో అవతరిస్తాను అని చెప్పాడు. చెప్పిన పనిచేసి చూపించాడు. అందుచేతనే భక్తులకు, ముముక్షువులకు పరమేశ్వరునిమీద పూర్తి నమ్మకముంటుంది. ప్రత్యయః అంటే కేవలము నిర్విషయక జ్ఞానము. అదే పరబ్రహ్మతత్త్వము.

# 94. సర్వదర్శనః

సర్వమును దర్శించువాడు.

**మహిమానం సర్వసహం తేషాం దర్శయతీతి సః ।**

**సర్వ దర్శన అభ్యాతో నవార్ణో లోచనప్రదః ॥**

సర్వాన్ని సహించేటటువంటి తన మహిమను వారికి చూపేవాడు. ఈ నామము తొమ్మిది అక్షరాలు గల మంత్రముగా భావించి **ఓంసర్వదర్శనాయ నమః** అని జపం చేస్తే దృష్టి దోషాలు పోతాయి. కళ్ళులేనివారికి కళ్ళు వస్తాయి.

**సర్వం దర్శయతీతి సర్వ దర్శనః** తన భక్తులకు తన మహిమను పూర్తిగాచూపేవాడు.

**సర్వాణి దర్శనాని యస్య** అన్నింటినీ చూసేవాడు. పరమేశ్వరుడు సర్వాంతర్యామి. ఈ జగత్తంతా ఆవరించి ఉన్నాడు. కాబట్టి జగత్తులో జరిగే ప్రతివిషయాన్ని ప్రత్యక్షంగా చూడ గలుగుతున్నాడు. అందుకే అతడు సర్వదర్శి. పరమేశ్వరుడికి

**చంద్రమామనసోజాతః చక్షోసూర్యో అజాయత**

**ముఖా దింద్రశ్చాగ్నిశ్చ ప్రాణాద్వాయుర జాయత**

చంద్రుడు - మనస్సు

సూర్యుడు - కనులు అని చెప్పబడింది.

కాబట్టి సూర్యరశ్మి ప్రసరించినంతమేర అతడు దృష్టిని సారించగలడు. అందుకే సర్వదర్శనుడు అనబడతాడు.

**సహస్రశీరుషం దేవం విశ్వాక్షం విశ్వశంభువం**

ఆ పరమేశ్వరుడికి ఈ విశ్వమంతా కనులే అని చెప్పబడింది.

**శ్వేతాశ్వరోపనిషత్తులో విశ్వతశ్చక్షు రుత విశ్వతో ముఖో విశ్వతో బాహు రుత విశ్వత స్పాత్, సంబాహుభ్యాం ధమతి సంపతత్రైర్ద్యావా పృథివీ జనయందేవ ఏకః॥**

ఆత్మరూపుడు, అద్వితీయుడు అయినపరమాత్మ ఆకాశమును, భూమినిసృష్టిస్తున్నవాడై అంతటనూ నేత్రములు గలిగిఉన్నాడు. అంతటను ముఖములు, బాహువులు, పాదములు కలిగి ఉన్నాడు. అని చెప్పబడింది. **ముండకోపనిషత్తులో**

**నాయమాత్మా ప్రవచనేన లభ్యోనమేధయా న బహూనా శ్రుతేన, యమేవైష వృణుతే తేనలభ్యస్తస్యైష ఆత్మా వివృణుతే తనూంస్వామ్ ॥**

ఆత్మ అధికముగా ప్రవచనములు చేయటంచేతగాని, మేధాశక్తిచేతగాని పొందదగినది కాదు. ఎవరైతే ఆత్మను పొందాలి అని త్రికరణశుద్ధిగా భావిస్తాడో అతనికి మాత్రమే లభ్యమవుతుంది. ఈ ఆత్మవిద్వాంసునికి తన స్వరూపాన్ని ప్రకాశింప చేస్తుంది. అని చెప్పబడింది. అంటే తన భక్తులకు, తనను తెలుసుకొనగోరువారికి తన మహిమను ఆత్మరూపుడైన పరమేశ్వరుడు చూపుతాడు.

పరమేశ్వరుడు తన చారుల ద్వారా జగత్తులోని ప్రతివిషయాన్ని గమనిస్తుంటాడు. ఆ చారులు తొమ్మిదిమంది అవే పంచభూతాలు, సూర్యుడు, చంద్రుడు, కాలము, యముడు. అందుచేతనే పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు 'సర్వదర్శనః' అనబడుతున్నాడు.

## 95. అజః

నిరసించువాడు. 204, 521 కూడా ఇదే నామము.

**ప్రత్యర్థిన స్స్వ సద్రూప్రాప్తౌ ప్రజానాం క్షిపతీ త్యజః**

తనయొక్క భక్తులను తన దగ్గరకు రానీయకుండా ఆటంకపరచేటటువంటి ప్రతిబంధకాలన్నింటినీ పారద్రోలేవాడు.

**అజతి క్షిపతీతి అజః**

తనను పొందకుండా చేసే విరోధులను నిరసించేవాడు – పరమేశ్వరుడు.

**భగవద్గీతలో**ని 18వ అధ్యాయం **మోక్షసన్యాస యోగము**లోని 66వ శ్లోకము.

**సర్వధర్మాన్పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ।**
**అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః ॥**

సర్వధర్మాలను, సమస్త కర్తవ్యాలను నాకు సమర్పించి సర్వాధారుడను, సర్వశక్తిమంతుడను పరమేశ్వరుడను అయిన నన్నే శరణుజొచ్చుము. అన్ని పాపములనుండి నిన్ను నేను విముక్తుని గావిస్తాను. నీవు శోకించవద్దు అంటాడు భగవానుడు.

ఇక్కడ సర్వధర్మాన్ అంటే వర్ణాశ్రమ ధర్మాలు, స్వభావ పరిస్థితులను అనుసరించి శాస్త్రములచే నిర్దేశించబడిన మానవకర్మలు. ఆ కర్మలన్నింటినీ అన్నివిధాలుగా భగవంతుడికి అర్పించి వెయ్యాలి అదే త్యాగము.

క్షాత్రధర్మమైన యుద్ధాన్ని వదిలిపెట్టకుండా, అన్నికర్మలను భగవంతుడికి అర్పించి యుద్ధము చేయవలసినది అని శ్రీకృష్ణభగవానుడు అర్జునునికి చాలాసార్లు చెప్పాడు.

గీతోపదేశం పూర్తి అయిన తరువాత "ఓ కృష్ణా ! నీ ఆజ్ఞను శిరసావహిస్తాను" అంటూ అర్జునుడు యుద్ధము చేశాడు. కాబట్టి సమస్త కర్మలను భగవంతుడికి అర్పణ చెయ్యటము అంటే, సర్వమూ భగవంతునిదే అని భావించి, శరీరము, ఇంద్రియాలు, మనస్సు వాటిద్వారానే చెయ్యబడే కర్మలు, వాటివలన వచ్చే ఫలితము మొదలైన వాటియందు ఆసక్తి, కోరికలను సర్వదా పరిత్యజించాలి. భగవంతుడియొక్క ఆజ్ఞలు, ప్రేరణల ప్రకారము నడచుకోవటమే "సర్వధర్మాలను పరిత్యజించటము అనబడుతుంది. అంతేకాని భౌతికంగా వాటిని వదలిపెట్టమని అర్థంకాదు.

ఈ రకంగా కర్మలను వదలి, భగవంతుడే తనకు పరమప్రియుడు, పరమహితైషి, ఆత్మీయుడు, పరమాధారుడు, పరమప్రాప్యుడు, పరమగతి, అతడే తనకు స్వామి, భర్త, సంరక్షకుడు అని భావించి కూర్చున్న, నిలుచున్న, పడుకున్న, నడుస్తున్న ఏ పని చేస్తున్నప్పటికీ సర్వకాల సర్వావస్థలయందు అతని ఆజ్ఞలను పాటిస్తూ, అనన్య భక్తిశ్రద్ధలతో నిరంతరము అంతనిని గురించే ఆలోచించాలి. అన్నిరకాలుగా ప్రహ్లాదుడిలాగా శ్రీమన్నారాయణుడినే భారం ఉంచాలి. ఇది శరణాగతి, అప్పుడు భగవంతుడు, భక్తుడిని అన్ని పాపాలనుంచి విముక్తుడుగా చేస్తాడు.

శుభాశుభకర్మల ఫలరూపమైన కర్మబంధాలతో బంధించబడిన మానవుడు జన్మాంతరమునందు నానాయోనులయందు జన్మిస్తూ ఉంటాడు. అటువంటి కర్మబంధములను సూచించేదే పాపము. ఆ కర్మబంధనాలనుండి విముక్తుడుగా చేయటమే 'పాపముల నుండి విముక్తుని చెయ్యటము'. అందుకే భగవానుడు "నన్ను శరణుజొచ్చినట్లైతే, సర్వపాపములనుండి నిన్ను విముక్తుని చేస్తాను" అని చెప్పాడు.

ఈరకంగా తనభక్తులను తనదగ్గరకు రానీయకుండా అడ్డుపడే ప్రతిబంధకాలన్నింటినీ తొలగించే పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు 'అజః' అనబడుతున్నాడు.

అజుడు – జన్మలేనివాడు. ఇంతకు పూర్వము జన్మించలేదు. ఇకముందు జన్మించబోడు. పరమాత్మ స్వయంభువు. నిత్యము, సత్యము అయినవాడు.

ఎప్పుడూ, ఏ కాలమందూ జన్మలేనివాడు. సర్వభూతాలకు క్షేత్రజ్ఞుడు అయిన పరమేశ్వరుడు అజుడు అనబడతాడు.

# 96. సర్వేశ్వరః

అందరినీ వేగంగా పొందేవాడు. సర్వులకు ఈశ్వరుడు. చరాచరజగత్తుకు అధినేత.

**అశక్తానాఞ్చ శక్తానాం వై రూప్యం శరణైషిణామ్ ।**
**అశ్నుతే పరిహర్తుం యః స సర్వేశ్వర ఈరితః ॥**

సమర్థులైనా, అసమర్థులైనా తనను శరణుజొచ్చిన వారి అనిష్టముల పోగొట్టేవాడు.

ఇక్కడ సమర్థులు అసమర్థులు అంటే పుణ్యచరితులు, పాపచరితులు అని అర్థం. అజామీళుడు అనే పాపచరితుడు, దుష్కరుడు అవసానకాలంలో 'నారాయణ' అని స్మరించినంతమాత్రంచేతనే అతన్ని విష్ణులోకానికి తీసుకుపోయారు విష్ణుదూతలు. ఈ విషయం గతంలో వివరించాం. అదేవిధంగా **శివపురాణము**లో గుణనిధి కథ ఉన్నది.

పూర్వకాలంలో కాంపిల్య నగరంలో యజ్ఞ దత్తుడనే బ్రాహ్మణుడుండేవాడు. అతడు వేదవేదాంగవిదుడు. శాస్త్రవేత్త. పరమనిష్టాగరిష్టుడు. రాజాదరణతో పాటుగా ప్రజల మన్ననలు కూడా పొందాడు. సదాచార సంపన్నుడు అని మంచి పేరు తెచ్చుకున్నాడు. అతని భార్య సోమిదమ్మ భర్తకు తగిన ఇల్లాలు. వారి ఏకైక సంతానము 'గుణనిధి'.

ఒకడే కుమారుడు కావటంచేత అతన్ని అల్లారుముద్దుగా పెంచారు. పిల్లవాడికి ఏడవయేడు రాగానే ఉపనయనము కూడా చేశారు. విద్యాభ్యాసానికి పంపారు. కాని అతడు చదువు సంధ్యలు మాని సోమరియై చెడు స్నేహాలకు అలవాటు పడ్డాడు. ఈ విషయం తెలిసినా ఒక్కగానొక్క కొడుకు కావటంచేత తల్లి గారాబం చేస్తుండేది. దండించేది మాత్రం కాదు. రాజుగారి కొలువు, పండిత చర్చలతోనే తండ్రికి కాలం సరిపోయేది. కుమారుణ్ణి గురించి పట్టించుకునేవాడు కాదు. గుణనిధి క్రమంగా పెరిగి పెద్దవాడయినాడు. అతడితో పాటే అతని చెడు అలవాట్లు కూడా పెరిగినాయి. దుర్జన సాంగత్యము, మద్యపానము, జూదము వంటి వ్యసనాలు అలవడ్డాయి. రాత్రి, పగలు లేదు. ఎప్పుడో ఇంటికి వచ్చి అన్నం తినిపోయేవాడు. ఒకవేళ ఎప్పుడైనా తండ్రి కుమారుణ్ణి గురించి అడిగితే 'వేదాధ్యయనంలో తీరిక లేకుండా ఉన్నాడు' అని చెప్పేది తల్లి.

కుమారుడు ఇంటికి వచ్చినప్పుడు కంటతడి పెట్టుకునేది తల్లి. చెడు తిరుగుళ్ళుమాని చదువుకోమని చెప్పేది. అతడు వినేవాడు కాదు. కాని పుత్రప్రేమతో అతడు అడిగినంత డబ్బు ఇచ్చి పంపేది. ఈ రకంగా తల్లికి తెలిసి కొంత, తెలియకుండా కొంత తీసుకువెళ్ళి జూదమాడేవాడు గుణనిధి. ఈ రకంగా కొంతకాలం గడిచింది. ఒకనాడు గుణనిధి

తల్లిని డబ్బిమ్మని అడిగాడు. అతడు అడిగినంత ఆమె ఇవ్వలేకపోయింది. ఆ కారణంగా తల్లికి తెలియకుండా లోపల పెట్టెలో ఉన్న వజ్రపుటుంగరాన్ని తీసుకుపోయాడు గుణనిధి.

గుణనిధి ఆ ఉంగరాన్ని జూదంలో ఓడిపోయాడు. గెలిచినవాడు ఆ ఉంగరాన్ని తీసుకుని రాజవీధిలో పోతుండగా యజ్ఞదత్తుడు చూశాడు. తన ఉంగరం ఇతడి చేతికి ఎలా వచ్చింది ? వెంటనే అతన్ని నిలువరించి "ఈ ఉంగరం నీకెక్కడిది ? ఎవరిచ్చారు ? నిజం చెప్పకపోతే రాజాస్థానానికి తీసుకుపోతాను" అన్నాడు. ఆ మాటలకు భయపడ్డ జూదరి నిజం చెప్పేశాడు. అతడి మాటలు వినగానే స్థాణువులా చలనరహితుడైపోయాడు యజ్ఞదత్తుడు. అతనికి ఇవ్వవలసిన బాకీ చెల్లించి ఆ ఉంగరాన్ని తీసుకుని ఇంటికి వచ్చాడు.

భర్త ఇంటికి రాగానే కాళ్ళకు నీళ్ళిచ్చింది భార్య. యజ్ఞదత్తుడు హతాశుడై నేలమీద కూలబడ్డాడు. అతడి కళ్ళు బైర్లు కమ్మినాయి. భార్య అతని కాళ్ళు కడిగి "నాథా ! నీ విచారానికి కారణము ఏమి ?" అని అడిగింది. యజ్ఞదుత్తుడు కొద్దిగా తేరుకుని "రాజుగారు నాకు బహుకరించిన వజ్రపు ఉంగరం ఏదీ?" అన్నాడు.

"ఓస్ ! దానికోసమేనా ఇంత ఇది. ఆ ఉంగరం లోపలపెట్టెలో భద్రంగా ఉంది" అంది సోమిదేవమ్మ. 'ఒక్కసారి దాన్ని తీసుకురా !' అన్నాడు యజ్ఞదత్తుడు. 'ముందు స్నానంచేసి భోజనం చెయ్యండి. ఆ ఉంగరం ఎక్కడికీ పోదు. లేవండీ' అంటూ మాట తప్పించటానికి ప్రయత్నించింది భార్య.

దానికి కోపగించిన యజ్ఞదత్తుడు "ఓసీ ! పాపిష్ఠిదానా ! నిజం చెప్పు. నీ కొడుకు వేదమంత్రాలు వల్లిస్తున్నాడా ? అసలు గురువు దగ్గరకు వెడుతున్నాడా ? స్నానము, సంధ్యావందనము, జపము, అగ్నిహోత్రము ఈ మాటలైనా వాడికి తెలుసా? నీ మాటలు నిజమని ఇంతకాలం నమ్మాను. నీ మూలంగా ఈ రోజున నా పరువు ప్రతిష్ఠలు పూర్తిగా పోయినాయి. ఎంత పనిచేశావు?" అంటూ గద్దించాడు. భార్య మారు మాట్లడలేదు. కంటతడి పెట్టింది. ఈ విషయం గుణనిధికి తెలిసింది. ఇంటికి వెళ్ళే ధైర్యం చాలలేదు. ఏం చెయ్యాలో తెలియక ఊరు వదలి పారిపోయాడు. ఉన్నప్పుడు తినటం, లేనప్పుడు పస్తు. ఎక్కడికి వెళ్ళాలి? ఏం చెయ్యాలి? ఇలా ఆలోచిస్తూ ఒక గ్రామం చేరాడు. ఆ ఊళ్ళో ఒక శివాలయం ఉంది. ఎక్కడికి వెళ్ళాలో తెలియని గుణనిధి శివాలయంలోకి వెళ్ళాడు.

ఆ రోజు శివరాత్రి. ఆ రాత్రంతా భక్తులు అక్కడ చేరి భజనలు చేస్తున్నారు. గత రెండు రోజులుగా భోజనం చెయ్యలేదు గుణనిధి. నీరశించి పోతోంది శరీరం. శరీరం

తూలిపోతోంది. నిద్రపోదామంటే అంతా భజన గోలగా ఉంది. ఇంతలో భక్తుల పూజలు పూర్తయినాయి. భగవంతుడికి నివేదనలు చేశారు. వారంతా ఆ రోజు ఉపవాసమున్నారు కాబట్టి ఆ ప్రసాదము ఎవరూ తినలేదు. తెలవారబోతున్నది. భక్తులు స్నానసంధ్యలు పూర్తిచేసుకోటానికి బయటకు వెళ్ళారు. ఆలయంలో ఎవ్వరూ లేరు. దేవుని విగ్రహం దగ్గర అనేక రకాలయిన తినుబండారాలు. ఘుమఘుమ వాసనలు. ఆకలి బాధతో అలమటిస్తున్న గుణనిధికి శివుని అనుగ్రహం లభించినట్లనిపించింది. మెల్లగా లేచి గర్భాలయంలోకి ప్రవేశించాడు. అక్కడ దీపారాధన కొండెక్కింది. పైనున్న బట్ట చింపి నూనెలో ముంచి వెలిగించాడు. ఆ వెలుతురులో ప్రసాదమున్న పాత్రలు చేతిలోకి తీసుకున్నాడు. ఇంతలో బయట ఎవరో వస్తున్న అలికిడి అయ్యింది. వాళ్ళు వచ్చి తనని అడ్డగిస్తారేమో అని భయపడి పారిపోబోయాడు. అతని చూసిన భక్తులు 'దొంగ దొంగ' అని అరిచి పట్టుకో ప్రయత్నించారు. ఆ కంగారులో గర్భగుడి బయటకు వచ్చి అక్కడ ఉన్న నందీశ్వరుడి మీద పడ్డాడు. తలకు బలమైన గాయమైంది. స్పృహ కోల్పోయి కొద్ది క్షణాలలోనే మరణించాడు.

గుణనిధి ప్రాణాలు తీసుకుపోవటానికి యమదూతలు వచ్చారు. అతని కోసం శివభటులు కూడా వచ్చారు. 'ఇతడు పాపి, జూదరి, దొంగ కాబట్టి యమలోకానికి రావాలి' అన్నారు. యమకింకరులు. 'మహాశివరాత్రి నాడు ఉపవాసం ఉన్నాడు. రాత్రంతా జాగారం చేశాడు పైగా తెలవారకుండానే ప్రాణాలు కూడా వదిలాడు కాబట్టి కైలాసానికి రావాలి' అన్నారు శివభటులు.

ఈ రకంగా వీరి మధ్య వాదోపవాదములు జరుగుతుండగా ఆకాశం నుండి దివ్య విమానము ఒకటి వచ్చింది. అప్పుడు శివదూతలు "ఓ యమభటులారా ! లోకంలో ఎవరైనా సరే తెలిసిగాని, తెలియకగాని శివరాత్రి ఉపవాసముండి జాగారము చేసినట్లైతే వారికి కైలాసప్రాప్తి కలుగుతుంది. ఇతడు ఆ రెండు పనులూ చేశాడు. పైపెచ్చు శివరాత్రిరోజున మరణించాడు. కాబట్టి ఇతడికి శాశ్వతంగా కైలాసంలో ఉండే యోగ్యత లభించింది. అందుచేత గుణనిధిని కైలాసానికి తీసుకుపోతున్నాము' అంటూ అతన్ని దివ్య విమానము ఎక్కించి కైలాసానికి తీసుకునిపోయారు.

గుణనిధి కైలాసములో చాలాకాలము ఉండి తరువాత కళింగదేశపు రాజకుమారుడుగా జన్మించాడు. తండ్రి తరువాత ఇతడే రాజయినాడు. ఇతని పేరు 'అరిందముడు' ఇతడు గొప్ప శివభక్తుడు. శివాలయాలు కట్టించాడు. యజ్ఞయాగాలు చేశాడు. పండితులకు అగ్రహారాలు

దానం చేశాడు. శివకేశవులకు భేదంలేదు అని ప్రచారం చేశాడు. నిరతాన్నదానం చేశాడు. చివరకు అవసానకాలంలో అష్టాక్షరీ మంత్రాన్ని జపిస్తూ ప్రాణాలు వదిలాడు.

బ్రహ్మ మానసపుత్రుడు పులస్త్యుడు. అతని కుమారుడు 'విశ్రువు'. విశ్రువు భరద్వాజుని కుమార్తె దేవవర్ణిని వివాహమాడాడు. ఆరిందముడు మరణించిన తరువాత స్వర్గసుఖాలనుభవించి దేవవర్ణి గర్భాన వైశ్రావణుడుగా జన్మించాడు. ఇతడే కుబేరుడు.

కుబేరుని అందచందాలు, బలపరాక్రమాలు చూసి, ముచ్చటపడి పాతాళలోకంలో ఉన్న సుమతి, తన కుమార్తె కైకసిని పిలిచి, 'నువ్వు ఏకరంగానైనా సరే విశ్రువుని వివాహమాడి అతడి వల్ల కుబేరుని వంటి కుమారుని కనవలసినది' అన్నాడు. తండ్రిమాట శిరసావహించి కైకసి విశ్రువు వద్దకు వెళ్ళింది. ఆమె మనోభీష్టాన్ని గ్రహించి మహర్షి ఆమె కోర్కెను మన్నించాడు. అది అసురసంధ్య కావటం చేత ఆమెకు రాక్షసులు జన్మించారు. వారే రావణ కుంభకర్ణులు. కుబేరుడు శివుని గురించి తపస్సుచేసి వరాలు పొందాడు. విశ్వకర్మ లంకానగరాన్ని నిర్మించి కుబేరుడికిచ్చాడు. రావణుడు కుబేరుని ఓడించి లంకానగరాన్ని స్వాధీనం చేసుకున్నాడు.

కుబేరుడు కాశీనగరముచేరి, అన్నపానీయాలు విసర్జించి శివుని గురించి ఘోరతపస్సు చేశాడు. అతని తపస్సుకు మెచ్చి శివుడు 'అలకాపురి' పట్టణాన్ని ఇచ్చాడు. అందులో చైత్రరథము అనే మనోహరమైన ఉద్యానవనాన్ని నిర్మించాడు. కుబేరుణ్ణి యక్షులకు నాయకుడుగా చేశాడు. నవనిధులకు అధిపతి చేశాడు.

ఈరకంగా తెలిసిగాని, తెలియకగాని తనను శరణుకోరిన వారిని కరుణించి వారికి శుభాన్ని చేకూర్చుతాడు.

**సర్వాన్ ఆశు అశ్నుతే వ్యాప్నోతీతి సర్వేశ్వరః** శక్తి ఉన్నవైనా, శక్తిలేనివైనా తనను శరణు కోరిన జీవుల అనిష్టములను పారద్రోలేవాడు. **మాండుక్యోపినిషత్తులో**

**ఏషసర్వేశ్వర ఏష సర్వజ్ఞ ఏషోఽ ంతర్యామ్యేష**
**యోనిః సర్వస్యప్రభవాప్య యౌ హి భూతానమ్**

ఇతడే అన్నింటికీ ప్రభువు. అంతర్యామి నియామకుడు, కారణము,ఉత్పత్తి, వినాశము అన్నీ ఇతడే. అదే ఆత్మ. అదే పరమేశ్వరుడు. ఈరకంగా ఈశ్వరులకు ఈశ్వరుడు కాబట్టి శ్రీమన్నారాయణుడు సర్వేశ్వరుడు అనబడుతున్నాడు.

# 97. సిద్ధః

సిద్ధమైనవాడు.

**స్వరూపేణైవ భక్తానాం సిద్ధత్వాత్సిద్ధ ఉచ్యతే**

అటువంటి భక్తులు ఇతర సాధనములద్వారా తనను పొందనవసరము లేకుండా అన్నివేళలయందు వారికి సిద్ధముగ నుండువాడు. అటువంటి భక్తులు అంటే – తనను ఆశ్రయించినవారు. తనను పొందగోరువారు. ముముక్షువులు. ఇతర సాధనముల ద్వారా అంటే పరమాత్మని ధ్యానించటానికి, అతన్ని చేరటానికి అనేక మార్గాలున్నాయి భక్తి. ధ్యానము, యోగము, తపస్సు మొదలైనవి. పరమేశ్వరుణ్ణి చేరాలంటే ఆ సాధనాలు ఏవీ అవసరంలేదు. మనోవాక్కాయకర్మలతో ఆ పరమేశ్వరుణ్ణి ధ్యానిస్తే చాలు. అయితే వారు చేసే ధ్యానంలో గాని, వారి భక్తిలోగాని తాదాత్మ్యత ఉండాలి. అంటే భక్తుడు ఆత్మార్పణ చేసుకోవాలి. ఈ జగత్తులోని సర్వప్రాణులు అంటే మానవులేకాదు, క్రిమికీటకాలతో సహా అన్నింటినీ తనతో సమానంగా చూడగలగాలి. అన్నింటిలోనూ పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుని చూడగలగాలి. తుకారామ్, నామదేవుడు, పండరీబాయి, మీరాబాయి మొదలైన వారంతా ఈ కోవకు చెందినవారే.

తుకారామ్ పండిన పంటనంతా ఊరిలోని వారికి పంచిపెట్టేసి ఆనందంగా వెళ్ళిపోతాడు. నామదేవుడు ఒకరోజున తినటానికి రొట్టెలు తెచ్చుకుంటాడు. వాటిని కుక్క ఎత్తుకుపోతుంది. అప్పుడు నామదేవుడు ఆ కుక్క వెంట పడతాడు. ఆ రొట్టెలు తెచ్చుకోటానికి కాదు. శ్రీమన్నారాయణుడే ఆ కుక్కరూపంలో వచ్చాడని భావించి "స్వామీ! రొట్టెలు గట్టిగా ఉన్నాయి. వాటికి వెన్నరాచి పెడతాను ఉండు" అని అరుస్తూ, చివరకు కుక్క దగ్గరనుంచి రొట్టెలులాక్కుని, వాటికి వెన్నరాచి 'ఇప్పుడు తీరికగా, సుఖంగా తిను స్వామీ !' అంటూ ఆ కుక్కను ఒడిలో పడుకోబెట్టుకుని, దానితో వెన్నరాచిన రొట్టెలు తినిపిస్తూ, సాక్షాత్తూ దేవదేవుడే ఆ రొట్టెలు ఆరగిస్తున్నాడని ఆనందిస్తాడు.

ఈ రకంగా భక్తిలోకూడా తాదాత్మ్యత కావాలి. అటువంటి భక్తులకు ఇతర సాధనలతో పనిలేకుండా, అన్నివేళలయందు వారికి సిద్ధముగా ఉండేవాడు.

పరమేశ్వరుని శరణుపొందిని వారు ఏదో ఒక సాధన, అనుష్టానము అవసరం లేకుండానే వారికోసం సిద్ధంగా ఉంటాడు.

నిత్యనిష్పన్నరూపుడు కాబట్టి 'సిద్ధః' అనబడుతున్నాడు.

# 98. సిద్ధిః

సాధింపదగినవాడు.

**అయమేవ హ్యుపాయైశ్చ సిద్ధిస్స్యా త్సాధ్యతే యతః**

వేరువేరు ఉపాయాలతో కూడా సాధింపబడువాడు.

**సేధ్యతే ఇతి సిద్ధిః** ఇతర ఉపాయములతో కూడా సాధింపతగినవాడు. పరమాత్ముడు కేవలము అనుభవరూపుడు. సాధకుడికి కలిగే అనుభవమే అతని సాధనవలన కలిగే సిద్ధి. అంటే ఒకడు మంత్రజపం చేస్తున్నాడు అనుకోండి. అక్షరలక్షలు చేస్తే మంత్రం సిద్ధిస్తుంది అంటారు. అంటే ఆ మంత్రంలో ఎన్ని అక్షరాలున్నాయో, అన్ని లక్షలసార్లు ఆ మంత్రాన్ని జపించాలి. అష్టాక్షరీ మంత్రాన్ని ఎనిమిది లక్షలసార్లు జపించాలన్నమాట. ఇలాచేస్తే మంత్రసిద్ధి కలుగుతుంది. అంటే తాను ఆరాధించే దేవత అతడికి కలలోకాని, జపం చేస్తుండగా గాని సాక్షాత్కరిస్తుంది. అతడు కోరినప్పుడు దర్శనమిస్తానని చెబుతుంది. అదేపనిగా జపంచేసే మహానుభావుడికి దేవత పిలిస్తే పలుకుతుంది. ఇదంతా అతడు చేసే సాధన మీద ఆధారపడి ఉంటుంది. కాబట్టి మంత్రం సిద్ధించిందా లేదా అంటే సాధకుడి అనుభవమే దానికి సాక్షి.

పరమేశ్వరుని అర్చించటానికి అనేక ఉపాయాలున్నాయి. దేవీభాగవతములో తారకాసురసంహారం కోసం దేవతలంతా హిమాలయాలకు వెళ్ళి పరమేశ్వరుని అర్చిస్తారు.

**అభవంశ్చ పరాః సర్వే పునశ్చరణ కర్మిణః ।**
**అంబాయజ్ఞ విధానజ్ఞా అంబాయజ్ఞంచ చక్రిరే ॥**
**తృతీయాది వ్రతన్యాసు చక్రు సర్వే సురానృప ।**
**కేచిత్సమాధినిష్ణాతా కే చిన్నామపరాయణా ॥**
**కేచిత్సూక్తపరాః కేచిన్నామ పారాయణోత్సుకా ।**
**మంత్రపారాయణ పరాకేచి చ్ఛ్రాద్ధాధికారిణః ॥**
**అంతర్యాగపరా కేచి త్కేచిన్న్యాస పరాయణాః ।**
**హృల్లేఖయా పరాశక్తేః పూజాం చ క్రురతంద్రితా ॥**

అక్కడ దేవతలంతా దేవీమంత్ర పునశ్చరణ చేయసాగారు. విధివిధానము తెలిసిన వారు అంబాయాగము చేస్తున్నారు. కొందరు తృతీయాది వ్రతము చేస్తున్నారు. కొందరు

సమాధిలో ఉన్నారు. కొందరు దేవీనామపారాయణ, మరికొందరు దేవీ సూక్తపఠనము చేస్తున్నారు. కొందరు నవార్ణమంత్రజపం చేస్తున్నారు. కొందరు చాంద్రాయణవ్రతం చేస్తున్నారు. కొందరు అంతర్యాగం చేస్తున్నారు. కొందరు న్యాసం చెబుతున్నారు. అని చెప్పబడింది. ఇవన్నీ పరమేశ్వరి మంత్రసిద్ధి పొందటానికి సాధనాలు. అందుచేతనే ఆ పరమేశ్వరుడు ఇతర సాధనములచేత కూడా సాధింపబడువాడు అనబడుతున్నది భాగవతము **గజేంద్రమోక్షములో**

**ముక్త సంగులైన మునులు**
**దిద్రుక్షులు సర్వ భూత హితులు**
**సాధుచిత్తులు అసదృశవ్రతాఢ్యులు**
**గొల్తు రెవని దివ్యపదము....**

అంటాడు గజేంద్రుడు. ఇన్ని రకాల సాధనాలచేత ఆ పరమేశ్వరుని పొందవచ్చు.

## 99. సర్వాదిః

అన్నింటికీ మొదలు, సకలపురుషార్థాలకు మొదటివాడు.

**సర్వేషాం పురుషార్థానాం మూలం సర్వాది రీరితః ॥**

తన భక్తులకు సకల పురుషార్థాలు సిద్ధించటానికి మూలమైనవాడు.

**సర్వాన్ కామాన్ ప్రాప్నువంతే విశాలాన్ త్రై లోక్యేస్మిన్ కృష్ణనామాభి ధానాత్**

శ్రీకృష్ణ పరమాత్ముని పేరు గనక స్మరించినట్లైతే అన్ని రకాలయిన కోరికలు తీరతాయి.

అన్నిభూతాలకు ఆదికారణమైనవాడు. కాబట్టి 'సర్వాదిః' అనబడుతున్నాడు. అధర్వశిర నారాయణ మొదలైన ఉపనిషత్తులలో "ఈ జగత్తుకు కారణమైనవాడు పరమేశ్వరుడు. అతని నుంచే ఊర్ధ్వలోకాలు, అథోలోకాలు, కొండలు, పర్వతాలు, సముద్రాలు, నదులు, లోయలు, అన్ని ప్రాణులు ఉద్భవించినాయి. త్రిమూర్తులను, అష్టదిక్పాలకులను, సూర్యచంద్రులను అందరినీ ఆ పరమేశ్వరుడే సృష్టించాడు" అని చెప్పబడింది.

**బృహదారణ్యకోపనిషత్తు**లో పరమేశ్వరుడు లోకాలను సృష్టించాలి అనుకున్నాడు. ముందుగా ఒంటరిగా ఉన్న తనకు ఒక స్త్రీతోడు కావాలనుకున్నాడు. వెంటనే స్త్రీపురుషులు పరస్పరాలింగనము చేసుకున్నట్లుగా ఉద్భవించారు. అందులో పురుషుడే పరమేశ్వరుడు. స్వాయంభువ మనువు. స్త్రీ శతరూప వీరివల్లనే 84 లక్షల జీవరాశి ఉద్భవించింది అని చెప్పబడింది.

ఈరకంగా అన్ని రకాలయిన భూతాలకు ఆదియైనవాడు ఆ పరమేశ్వరుడు. అందుచేతనే అతడు 'సర్వాది' అనబడుతున్నాడు.

## 100. అచ్యుతః

నాశనము లేనటువంటివాడు. 318వ నామము ఇదే.

**భక్తేభ్యోఽచ్యుత పూర్వత్వాత్ అచ్యుతః పరికీర్తితః ।**
**ఆశ్రితానాంచ్యుతిర్యస్మా న్నాప్తి సోచ్యుఽ త ఈరితః ॥**

తన భక్తుల కొరకు మరుగుపడనటువంటివాడు. తనను శరణన్నవారిని ఎప్పుడూ వదలిపెట్టనివాడు. **న చ్యుతః అచ్యుతః** శరణుపొందిన వారిని విడువకుండా రక్షించువాడు. **శ్రీమద్భాగవతము**లో అంబరీషుని వృత్తాంతమున్నది. నాభాగుని కుమారుడు అంబరీషుడు. వేదవేదాంగవిదుడు. గొప్ప విష్ణుభక్తి పరాయణుడు. చాలా అశ్వమేధ యాగాలు కూడా చేశాడు. రాజ్యం చేసేటప్పుడు అన్ని పనులు మంచిగాని, చెడుగాని విష్ణు పరంగానే చేశాడు. మహాజ్ఞాని, మట్టినీ బంగారాన్నీ సమంగా చూసేవాడు.

ఒకసారి ఈ మహారాజు ద్వాదశీవ్రతం చేసి బ్రాహ్మణ సమారాధన పూర్తిచేసి, ఇక తాను భోజనానికి ఉపక్రమించబోయే తరుణంలో దుర్వాసమహర్షి వచ్చాడు. రాజు సాదరంగా అతణ్ణి ఆహ్వానించి 'మహర్షీ! మీరు భోజనానికి లేవండి' అన్నాడు. దుర్వాసుడు స్నానం చేసి వస్తాను అని నదీతీరానికి వెళ్ళాడు. వెళ్ళినవాడు ఎంతకీ తిరిగిరాలేదు. ప్రొద్దుపోతున్నది. ద్వాదశి ఘడియలు కూడా మించిపోతున్నాయి. ద్వాదశి వెళ్ళిపోయిన తరువాత గనక భోజనంచేస్తే వ్రతం చేసిన ఫలందక్కదు. పోనీ భోజనం చేద్దామా ? మహర్షిని రమ్మని చెప్పాం. అతిథిరాకుండా భోజనం చెయ్యటం మహాపరాధము. పోనీ ఆయన వచ్చేవరకు ఆగుదామా ? ద్వాదశి వెళ్ళిపోతోంది. ఏం చెయ్యాలో తెలియలేదు మహారాజుకు. పెద్దలతో సంప్రదించాడు. వారంతా 'ఉదకపారణ' చెయ్యమన్నారు. దానివల్ల వ్రతం యొక్క ఫలితము దక్కుతుంది. అతిథి రాకుండా భోజనం చేసినట్లుకాదు. కాబట్టి ఆ పాపము రాదు. అని తీర్మానించారు. రాజు ఉదకపారాణ చేశాడు.

ఇంతలో దుర్వాసుడు రానే వచ్చాడు. అతడు రాగానే అంబరీషుడు ఉదకపారణ చేసిన విషయం తెలిసింది. వెంటనే కోపగించాడు మహర్షి. తన జడలోనుంచి ఒక వెంట్రుకను పీకి నేలమీద వేశాడు. దానినుండి 'మహాకృత్య' అనే గొప్ప శక్తి ఉద్భవించి, మహర్షి ఆజ్ఞప్రకారము అంబరీషుడి మీద దుమకపోయింది. జరిగిన దానికి విచారించాడు

రాజు ఆ శక్తి తన మీదకు వస్తోంది. రెండు కళ్ళూ మూసుకుని శ్రీహరిని ప్రార్థించాడు. 'దేవదేవా ! నీకు ఏది ఉచితమో అది చెయవలసినది' అన్నాడు.

శరణనన్నవారిని, తన భక్తులను రక్షించటమే ధ్యేయంగాగల శ్రీహరి తన చక్రాయుధాన్ని ప్రయోగించాడు. చక్రాయుధము మహాకృత్యను సంహరించి, దానిని ప్రయోగించిన దుర్వాసమహర్షి మీదికి వెళ్ళింది. చూశాడు దుర్వాసుడు. సుదర్శన చక్రం తనను సంహరించబోతున్నది. ఏం చెయ్యాలో తెలియలేదు. వెంటనే సత్యలోకానికి పరుగెత్తి బ్రహ్మను రక్షించమన్నాడు. తనవల్ల కాదన్నాడు బ్రహ్మ. కైలాసానికి పరుగెత్తాడు. తనవల్ల కాదన్నాడు శివుడు. వైకుంఠానికి పరుగెత్తి విష్ణువును శరణు వేడాడు మహర్షి. "నేను నా భక్తులకు దాసుడను, వారి అధీనంలోనే ఉంటాను. నువ్వు నా భక్తుని సంహరించబోయావు. అటువంటి నిన్ను నేను రక్షించలేను. వెళ్ళి ఆ మహారాజు అంబరీషుడినే శరణువేడవలసింది" అన్నాడు శ్రీమహావిష్ణువు. చేసేది లేక దుర్వాసుడు, అంబరీషుడి వద్దకు వచ్చి, అతణ్ణే శరణు కోరాడు. అప్పుడు అంబరీషుడు శ్రీహరిని ప్రార్థించి, దుర్వాసుని రక్షించాడు.

ఈ విధంగా శ్రీమహావిష్ణువు తనను శరణు అన్న వారిని, తన భక్తులను ఎప్పుడూ వదలడు. స్వస్వరూపసామర్థ్యముచేత ఏ కాలమందు కూడా నాశనము లేనివాడు.

**స్వరూపసామర్థ్యాత్ నచ్యుతః నచ్యవతే నచ్యవిష్యతే**

తన స్వరూపశక్తి నుండి ఇంతకుముందు తొలగి ఉండలేదు. ఇప్పుడు తొలగటం లేదు. ఇక ముందు కూడా తొలగడు.

**పతిం విశ్వస్యాత్మేశ్వరగ్ం శాశ్వతగ్ం శివ మచ్యుతమ్**
**నారాయణం మహాజ్ఞేయం విశ్వాత్మానం పరాయణం**

విశ్వానికి అతీతుడు, విశ్వమే తానుగ అయినవాడు నిత్యుడు, సర్వవ్యాపకుడు, విశ్వానికి జీవనాధారమైనవాడు, విశ్వపతి, విశ్వానికి ఈశ్వరుడు, శాశ్వతుడు,మంగళకరుడు, నాశనరహితుడు, తెలుసుకోదగిన పరమాత్ముడు, విశ్వాత్ముడు విశ్వపరాయణుడు అయిన నారాయణునికి నమస్కారము.

## 101. వృషాకపిః

ధర్మవరాహ స్వరూపి.

**కపిర్వ్వరాహశ్రేష్ఠశ్చ ధర్మశ్చ వృష ఉచ్యతే**
**తస్మా ద్వృషా కపిః ప్రోక్తో వస్వర్ణో౽ భీష్టదో మనుః**

'వృష' అంటే – ధర్మము. 'కపి' అంటే – వరాహము ధర్మస్వరూపమైన శ్రేష్టమైన వరాహము. ఈ నామాన్ని **ఓం వృషాకపయే నమః** అని మంత్రంగా భావించి జపం చేసినట్లైతే, అన్ని కోరికలు తీరతాయి.

**వృషశ్చాసౌ కపిశ్చ వృషాకపిః**

ధర్మవరాహ స్వరూపము గలవాడు. మహాభారతము నందలి శాంతిపర్వములో

**కపిర్వరాహ శ్రేష్ఠశ్చ ధర్మశ్చ వృష ఉచ్యతే**
**తస్మా ద్వృషా కపిం ప్రాహ కాశ్యపోమాం ప్రజాపతిః**

కపి అనగా వరాహశ్రేష్ఠము. వృష అనగా ధర్మము ధర్మవరాహమవటంచేత 'వృషాకపి' అంటారు. అంటాడు కశ్యపుడు.

**సర్వాన్ కామాన్ వర్షతి – ఇతి ధర్మస్యనామః**

అన్ని కోరికలను తీరుస్తుంది. కాబట్టి ధర్మానికి 'వృష' అని పేరు. క అనగా – జలము. అపాత్ – ఉద్ధరించినది కపి. ఇది వరాహావతారము.

**విష్ణు ధర్మోత్తరపురాణములో** యజ్ఞవరాహప్రాదుర్భావాన్ని ఈ విధంగా చెప్పారు.

**బ్రహ్మరాత్ర్యాంవ్యతీతాయాం విబుద్ధే పద్మసంభవే ।**
**విష్ణుస్సిసృక్షు ర్భూతానాం జ్ఞాత్వాభూమిం జలాంతగామ్ ॥**

**జలక్రీడారుచి శుభం కల్పాదిషు యథాపురా ।**
**వారాహ మా శ్రితో రూప ముజ్జహార వసుంధరామ్ ॥**

**వేదపా ద్యూప దంష్ట్ర శ్చ చతుర్వక్త్ర శ్చతుర్ముఖః ।**
**అగ్నిజిహ్వో దర్భరోమా బ్రహ్మశీర్ష్ణో మహాతపాః ॥**

**అహోరాత్రేక్షణోదివ్యో వేదాంగశ్రృతిభూషణః ।**
**ఆజ్యనాస స్రువతుండ స్సామఘోష స్వనోమహాన్ ॥**

**ధర్మస్సత్యమహాః శ్రీమాన్ కర్మవిక్రమ సత్కృతః ।**
**ప్రాయశ్చిత్తమయోధీరః ప్రాయజానుర్మహాయశాః ।**
**ఉద్గాత్రాంత్రో హోమలింగః ఫలబీజ మహౌషదిః ॥**

**వాయ్వంతరాత్మా మంత్రాస్థి ర్వికటస్సోమశోణితః ।**
**వేదస్కంధో హవిర్గంధోహవ్య కవ్యాతివేగవాన్ ॥**

ప్రాగ్వంశ కాయో ద్యుతిమాన్ నానాదీక్షాభి రన్వితః ।
దక్షిణా హృదయో యోగీ మహాక్రతు మయోమహాన్ ॥

ఉపాకర్మేష్టిరుచిరః ప్రవర్గ్యావర్తభూషణః ।
మాయా పత్నీ సహాయోవై మహాశృంగఇవోదితామ్ ॥

మహీం సాగర పర్యంతాం సశైలవనకాననామ్ ।
ఏకార్ణవజలభ్రష్టా మేకార్ణవ గతః ప్రభుః ॥

దంష్ట్రాగ్రేణ సముద్ధృత్య లోకానాం హిత కామ్యయా ।
అది దేవో మహాయోగీ చకారజగతీం పునః ॥

ఏవంజ్ఞాత్వా వరాహేణ భూత్వాభూత హితార్థినా ।
ఉద్ధృతా పృథివీదేవీ జలమధ్యగతాపురా ॥

ఉద్ధృత్య భూమిం సవిభుర్మహాత్మా వరాహరూపేణ జలాంతరస్థామ్ ।
చక్రే విభాగం జగతస్తదీశో యథాయథా తచ్ఛృణు రాజసింహ ॥

బ్రహ్మదేవుడికి రాత్రి గడిచింది. అంటే తెల్లవారింది. నిద్రలేచాడు. సృష్టి చెయ్యాలి. భూమి లేదు. శ్రీమహావిష్ణువుతో మొరపెట్టుకున్నాడు. అప్పుడు శ్రీహరి గత కల్పములో చేసినట్లుగానే వరాహ రూపం ధరించి సముద్రజలాల నుంచి భూమిని ఉద్ధరించాడు. ఆ యజ్ఞవరాహమూర్తి రూపం ఏ రకంగా ఉన్నది అంటే

| | | | | | |
|---|---|---|---|---|---|
| నాలుగుపాదములు | – | చతుర్వేదాలు | సామఘోష | – | ధ్వని |
| యూపస్తంభములు | – | కోరలు | ఘర్మము (చెమట) | – | సత్యతేజస్సు |
| అగ్ని | – | నాలుక | కర్మ | – | విక్రయము (అడుగులు వేయుట) |
| రోమాలు | – | దర్భలు | | | |
| బ్రహ్మ | – | శిరస్సు | ఉద్గాత | – | ప్రేవులు |
| అహోరాత్రములు | – | నేత్రాలు | హోమము | – | లింగము |
| వేదాంగాలు | – | కర్ణాభరణాలు | ఓషధులు | – | ఫలబీజములు (వృషణాలు) |
| ఆజ్యము | – | ముక్కు | | | |
| స్రువము | – | తుండము (ముట్టె) | అంతరాత్మ | – | వాయువు |
| | | | మంత్రములు | – | ఎముకలు |

| | | | |
|---|---|---|---|
| సోమము | – రక్తము | ప్రాగ్వంశము | – నానావిధ దీక్షలతో ప్రకాశించే శరీరము |
| హవిస్సు | – వాసన | | |
| హవ్యకవ్యములు | – వేగములు | దక్షిణ | – హృదయము |

ఈ రకంగా యజ్ఞవరాహమూర్తి అయిన శ్రీమహావిష్ణువు పెద్దపెద్ద నదులు, పర్వతాలు, లోయలు, కొండలతోకూడి, నీటిలో మునిగి పోయిన భూమిని లోకహితము కోసము ఉద్ధరించి బయటకు తెచ్చాడు.

అందుచేతనే శ్రీమహావిష్ణువు 'వృషాకపి' అనబడుతున్నాడు.

## 102. అమేయాత్మా

అపరిభేద్యమైనది. 179వ నామము ఇదే.

**ఇయా నిత్యపరిచేద్య స్వభావాత్సర్వతోఽధికః**
**అమేయాత్మా సమద్దిష్టో హ్యాన్నత్య ఫలదోమనుః**

పరమేశ్వరుడు సర్వాధికుడు కాబట్టి అతడు ఇంతటివాడు అని చెప్పటానికి వీలులేదు.

**అమేయః ఆత్మాయస్యసః అమేయాత్మా**

ఆశ్రితులైనవారిని అనుగ్రహించే విషయంలో ఇంత పరిమితి అని చెప్పటానికి వీలుకానిది.

అధర్వణవేదంలో **ఆత్మోపనిషత్తు**లో ఆత్మ మూడు రకాలు అని చెప్పబడింది. అవి 1. బాహ్యాత్మ 2. అంతరాత్మ 3. పరమాత్మ.

**1. బాహ్యాత్మ:** జన్మించటము, మరణించటము ధర్మాలుగా గల చర్మము, మాంసము, రోమాలు, పృష్ఠము, నఖములు, గుల్ఫము, ఉదరము, నాభి, మేఢ్రము, కటి, ఊరువులు, కపోలములు, శ్రోత్రములు, లలాటము, బాహువులు, పార్శ్వములు, శిరస్సు, నేత్రములు, శ్రోత్రములు ఇవన్నీ కలిసి బాహ్యాత్మ.

**2. అంతరాత్మ:** పృథి వ్యాపస్తేజో వాయురాకాశమయుడై, ఇచ్ఛాద్వేషాలతో, సుఖదుఃఖాలతో, కామమోహాలతో, వికల్పనాదులతో, జ్ఞాపకశక్తి, ఉదాత్త, అనుదాత్త, హ్రస్వ, దీర్ఘ, గర్జిత, స్ఫుటిత, ముదిత మొదలైన అనుభవాలతో, శ్రవణము చేయువాడై, ఘ్రాణము చేయువాడై, ఆనందించువాడై నియంతయై, బోధకుడై, కర్తృత్వము గలవాడై, విజ్ఞానాత్మయై ఉండే పురుషుడే అంతరాత్మ.

**3. పరమాత్మ :** పరమాత్మ అక్షరరూపంలో ఉపాసించదగినవాడు. అష్టాంగ మార్గముతో, వివిధ ప్రమాణాలతో, వటబీజములాగా, ధాన్యపుగింజయొక్క ములికివలె ఉన్నాడు. అతడు పొందబడడు. జన్మించడు, మరణించడు. శుష్కించడు, తడుపబడడు, దహింపబడడు, కదలించబడడు, భేదించబడడు, అతడు నిర్గుణుడు, సాక్షి, భూతభావనుడు, పరిశుద్ధుడు, అవయవరహితుడు, కేవలుడు, సూక్ష్ముడు, మమకారము లేనివాడు, నిర్వికారుడు, నిరంజనుడు, శబ్దస్పర్శరూప రసగంధాలు లేనివాడు. నిర్వికల్పుడు, ఆకాంక్షలు లేనివాడు. సర్వము వ్యాపించి ఉన్నవాడు. చింతించటానికి వీలుకానివాడు. వర్ణములు లేనివాడు. అశుద్ధాన్ని శుద్ధము చేసేవాడు. అపవిత్రాన్ని పవిత్రము చేసేవాడు. క్రియాశూన్యుడు. అతడికి సంసారబంధనాలు లేవు.

అమేయము – కొలవటానికి వీలు కానిది. పరమేశ్వరుని కొలవటం వీలుకాదు. అతనికి మించినదిగాని, అతనితో సమమైనదిగాని ఇంకేదీ ఈ జగత్తులో లేదు. లింగపురాణంలో చెప్పినట్లుగా చతుర్దశభువనాలలోను, ఈ బ్రహ్మాండమంతటిలోనూ కొలవదగినది. ఆ పరమేశ్వర రూపమే. కొలిచేవాడు ఈశ్వరుడు అంతేకాని వేరెవరూకాదు.

ఆత్మ అంటే – జీవుడు. అగ్నిలో నిప్పురవ్వలు ఏరకంగా ఉంటాయో, అలాగే పరమేశ్వరునిలో ఈ జీవులందరూ ఉంటారు. శివుని యొక్క ఎనిమిదవ మూర్తి ఆత్మ. ఇది మిగిలిన ఏడుమూర్తులను వ్యాపించి ఉన్నది కాబట్టి విశ్వమంతా వ్యాపించిఉన్నది అనిఅర్థం.

ఆత్మ అంటే – పరబ్రహ్మమే. ఆ పరబ్రహ్మయే జీవులన్నింటి యందు బ్రహ్మరంధ్రం గుండా ప్రవేశించాడు అని చెప్పటం జరిగింది.

ఆత్మ అనేది **అణోరణీయాం మహతోమహీయాం** అణువుకన్న చిన్నదైనది. మహత్తు కన్న పెద్దదైనది. ఆది మధ్యాంతములు లేనిది. సృష్టిస్థితిలయాలకు కారణభూతమైనది. నిరాకారమైనది, నిర్గుణమైనది అన్నింటికీ సాక్షీభూతమైనది, జీవులు చేసిన కర్మలకు తగిన ఫలితాన్ని ఇచ్చేది, సత్యము, నిత్యము అయినది, జ్ఞానమయమైనది, ఆనంతమైనది, అపరిచ్ఛిన్నమైనది, ఆనందమయమైనది, స్వతంత్రము, స్వతఃసిద్ధము, స్వతః ప్రమాణము గలది, నిర్మలము, నిశ్చయము, శుద్ధము, అనంతము అయినది. ఇదే ఆత్మ. ఆత్మ అంటే – పరబ్రహ్మమే.

ఆత్మ అనేది అమేయము. ఇది సర్వవ్యాపి. ఈ జగత్తంతా వ్యాపించి ఉన్నది కాబట్టి దీన్ని కొలవటానికి వీలులేదు. ఆత్మను తెలుసుకోవటం కష్టము. ఇంద్రియాలచేత ఇది తెలుసుకోబడదు. ఆత్మ ఉండే చోటికి కనులుగాని, చెవులుగాని, మనస్సుగాని పోలేవు.

ఇంద్రియాలకు అతీతమైనది. ఇంద్రియాలకు ఆ శక్తినిచ్చేదే ఆత్మ. కళ్ళకు చూసే శక్తిని ఇచ్చేది ఆత్మ. చెవులకు వినికిడి శక్తిని ఇచ్చేది ఆత్మ. మనసుకు ఆలోచించే శక్తిని ఇచ్చేది ఆత్మ. ఈ రకంగా ఇంద్రియాలకు వాటిశక్తినిచ్చేదే ఆత్మ.

కాబట్టి ఆత్మను ఇంద్రియాల ద్వారా తెలుసుకోలేము. అందుకే అది అమేయాత్మా అనబడుతున్నది. **లలితాసహస్రం**లో 617వ నామము **అమేయాత్మా.**

## 103. సర్వయోగ వినిః సృతః

సకలోపాయములచే పొందదగినవాడు. అన్నివిధాలైన సంబంధముల నుండి వెలికి వచ్చినవాడు.

**సర్వైరుపాయైః ప్రాప్యశ్చ సర్వయోగవినిస్సృతః**

సకలోపాయములచేత పొందదగినవాడు.

**సర్వయోగైరపి వినిసృతః ప్రాప్యః సర్వయోగ వినిసృతః**

అన్ని ఉపాయాలతోను పొందదగినవాడు.

**సర్వేభ్యో యోగేభ్యః వినిసృతః** అన్నివిధాలయిన సంబంధములనుండి వెలికి వచ్చినవాడు. ఎవరితోను ఏ సంబంధము లేనివాడు.

నానాశాస్త్రములచే చెప్పబడిన యోగమునుండి బయటకు వచ్చినవాడు. యోగమువల్ల తెలియదగినవాడు.

పరమాత్మణ్ణి గురించి తెలుసుకోవాలి అంటే భక్తి, జ్ఞానము,యోగము మొదలైనవన్నీ సాధనాలే, వీటిలో దేనిద్వారానైనా సరే అతణ్ణి గురించి తెలుసుకోవచ్చును.

ఉపనిషత్తులలో చెప్పినట్లుగా పరమేశ్వరుడు నిరాకారుడు, నిర్గుణస్వరూపుడు. ఆది మధ్యాంతములు లేనివాడు. అతడికి ప్రేమ, అనుబంధము, ఆప్యాయత, అనురాగము వంటివేవీ ఉండవు. రాగద్వేషాలకు అతీతుడు. అతడు సర్వాంతర్యామి. **బృహదారణ్యకోపనిషత్తు**లోని నాల్గవ అధ్యాయంలో జనకమహారాజుచేత అలంకరించబడిన ఆవులను వాటిమీద ఉన్న ఆభరణాలతో సహా తొలుకుపోవటానికి ఉద్యుక్తుడైన యాజ్ఞవల్క్యుడిని సభలోని పండితులు ప్రశ్నించటం మొదలుపెట్టారు. అందులో భాగంగా 'అంతర్యామిగా ఉండే నియామకుని గురించి చెప్పవలసినది' అన్నాడు. ఉద్దాలకుడు చెప్పటం మొదలు పెట్టాడు యాజ్ఞవల్క్యుడు.

"అతడు భూమిలోపల, పైన కూడా ఉంటాడు. భూమే అతని శరీరము. భూమి లోపల ఉన్నప్పటికీ భూమి అతన్నెరుగదు. భూమిలోపల ఉంటూనే భూమిని నియంత్రిస్తాడు అతడే ఆత్మ."

నీటిలో ఉంటాడు. నీటిలోఉన్నప్పటికీ ఆ నీరు అతన్నెరుగదు. నీటిలోపల ఉంటూనే నీటిని నియంత్రిస్తాడు.

అంతరిక్షంలో ఉంటాడు. కాని అంతరిక్షం అతన్నెరగదు. అంతరిక్షంలో ఉంటూనే అంతరిక్షాన్ని నియంత్రిస్తాడు. వాయువులో ఉంటాడు. కాని వాయువు అతన్నెరగదు. వాయువులో ఉంటూనే వాయువును నియంత్రిస్తాడు.

అగ్నిలో ఉంటాడు. కాని అగ్ని అతన్నెరగదు. అగ్నిలో ఉంటూనే అగ్నిని నియంత్రిస్తాడు. ద్యులోకంలో ఉంటాడు. కాని ద్యులోకం అతన్నెరగదు. ద్యులోకంలో ఉంటూనే ద్యులోకాన్ని నియంత్రిస్తాడు.

దిగంతరాళాల్లో ఉంటాడు. కాని దిక్కులు అతన్నెరగవు. దిక్కులలో ఉంటూనే దిక్కులను నియంత్రిస్తాడు. చంద్రునిలో ఉంటాడు. కాని చంద్రుడు అతన్నెరగడు. చంద్రునిలో ఉంటూనే చంద్రుని నియంత్రిస్తాడు.

ఆకాశంలో ఉంటాడు. కాని ఆకాశమతన్ని ఎరగదు. ఆకాశంలో ఉంటూనే ఆకాశాన్ని నియంత్రిస్తాడు. అంధకారంలో ఉంటాడు. కాని అంధకార మతన్ని ఎరగదు. అంధకారంలో ఉంటూనే అంధకారాన్ని నియంత్రిస్తాడు.

అతడు కనిపించడు. కాని చూస్తాడు. వినిపంచడు కాని వింటాడు. అతడు తెలియబడడు కాని అతనికి అన్నీ తెలుసు. అందరికీ అతనితో సంబంధమున్నది. కాని ఎవరితోనూ అతనికి సంబంధం లేదు" అంటాడు.

భాగవతంలో **వామనావతారఘట్టం**లో బలిచక్రవర్తి వామనుణ్ణి చూసి, నువ్వెవరు? నీ పేరేది ? ఊరేది ? తల్లితండ్రులు ఎవరు ? అంటాడు. దానికి వామనుడు.

**ఎవ్వరి వాడనంచు ఏమని పల్కుదు నా అంతవాడనై నడువనేర్తు**

**ఇదినా నడవడి అని ఎట్లు వక్కాణింతు పూని ముప్పోకలు పోవనేర్తు**

**అది నేర్తునిదినేర్తునని ఏలచెప్పంగనేరుపులన్నియు నేనెనేర్తు**

**ఒరులుగారునాకు ఒరులకు నేనౌదు ఒంటివాడను చుట్టమొకడులేడు.**

అంటాడు. ఈరకంగా అన్నిరకాల సంబంధాలనుండి, బయటకు వచ్చినవాడు. ఏ సంబంధబాంధవ్యాలు లేనివాడు. అందుకే 'సర్వయోగ వినిఃసృతః' అనబడుచున్నాడు.

# 104. వసుః

వసించువాడు. 270, 696 నామాలు ఇదే.

**వసతీతి వసుస్తేషు ప్రీత్యా పరమయా స్వయమ్ ॥**

తన భక్తులందు అపారమగు ప్రీతితో స్వయముగా వసించువాడు.

**వసతీతి వసుః** ఆశ్రితులయందు మిక్కిలి ప్రీతితో వసించువాడు.

**వసంతి అస్మిన్ – ఇతి** ఈతనియందు సర్వభూతములు నివసించును.

**వసతి – ఇతి – వసుః** ఇతడు సర్వభూతములందు వసించును.

తనను ఆశ్రయించినవారిని, సజ్జనులను సదాకాచి రక్షిస్తుంటాడు. విరోచనుని కుమారుడు బలిచక్రవర్తి. వేదవేదాంగవిదుడు. మహాపండితుడు. ధర్మపరుడు. అయినప్పటికీ సహజలక్షణము దేవతలతో వైరము. కాబట్టి ఇంద్రుణ్ణి పదభ్రష్టుడుగా చేశాడు. దేవతలను నానాబాధలు పెట్టాడు. ముల్లోకాలకు ప్రభువైనాడు.

బలిచక్రవర్తి యాగం చేస్తున్నాడు. యాగానికి వచ్చిన బ్రాహ్మణులకు, పండితులకు భూరిదక్షిణలిస్తున్నాడు. శ్రీమహావిష్ణువే వామనుడి రూపంలో యజ్ఞశాలకు వచ్చాడు. వచ్చిన వటువును సాదరంగా ఆహ్వానించి, కుశలప్రశ్నలువేసి ఏంకావాలో కోరుకోమన్నాడు బలిచక్రవర్తి. మూడడుగులనేల దానం ఇప్పించమన్నాడు వామనుడు. సరేనన్నాడు బలి. ఇంతలో శుక్రాచార్యుడు వచ్చి “ఆ వచ్చినవాడు సామాన్యుడుకాదు. సాక్షాత్తు శ్రీమహావిష్ణువు. కాబట్టి మూడడుగులనేల దానం ఇస్తే, నిన్ను వంశనాశనం చేస్తాడు. దానం ఇవ్వద్దు” అని పరిపరివిధాల చెప్పాడు.

సాక్షాత్తూ శ్రీమహావిష్ణువు వచ్చి దానమడిగితే కాదని ఎలా అంటాను ? దానం ఇచ్చి తీరతాను అంటూ మూడడుగుల నేలదానం చేశాడు బలిచక్రవర్తి. రెండడుగులతో భూమ్యాకాశాలు ఆక్రమించాడు. మూడవఅడుగు ఎక్కడ ? అన్నాడు. తన శిరస్సు చూపించాడు బలి. అధోలోకాలకు అణగద్రొక్కాడు విష్ణుమూర్తి బలిచక్రవర్తిని, బలిచక్రవర్తి ధర్మనిరతికి మెచ్చి, అతనికి ఏరకమైన ఆపదాకలుగకుండా అతని వాకిలిదగ్గర తాను కాపలాగా ఉన్నాడు.

హిరణ్యకశ్యపుని కుమారుడు ప్రహ్లాదుడు. విష్ణుభక్తితత్పరుడు. ఈ విషయంలో తండ్రికి, తనయుడికి సరిపడలేదు. చివరకు విసిగిపోయిన తండ్రి “ఎక్కడ ఉన్నాడురా హరి ?” అని అడిగాడు.

“ఇందుగలడు అందులేడు అనే సందేహం వద్దు. ఎక్కడైనా ఉన్నాడు” అన్నాడు కుమారుడు.

“అయిన ఈ స్తంభమునందు చూపగలవా ?” అడిగాడు రాక్షసరాజు.

“ఉన్నాడు చూడు” అన్నాడు కుమారుడు.

ఆయుధంతో స్తంభాన్ని పగులకొట్టేడు తండ్రి అయిన హరిణ్యాకశ్యపుడు. ప్రహ్లాదుని మాటమన్నించి ఆ స్తంభంలోనుంచి బయటకు వచ్చాడు నృసింహావతారుడైన విష్ణుమూర్తి.

ఈ రకంగా భక్తులు, ఆశ్రితులయందే ఉంటాడు. వారు ఏది కావాలంటే అది చేస్తాడు. అందుకే ‘వసుః’ అనబడ్డాడు.

కల్పాంతమునందు మహాప్రళయము సంభవిస్తుంది. అప్పుడు భూతజాలము అంతా నాశనము అయిపోతుంది. అప్పుడు కర్మక్షయం అయిన జీవులకు ముక్తి లభిస్తుంది. కర్మక్షయంకాని జీవులన్నీ, తమతమ కర్మలను తమతోపాటుగా మూట గట్టుకుని ఆ పరమేశ్వరునిలో కలిసిపోతాయి. మళ్ళీ సృష్టి ఆరంభమైన తరువాత, పరమేశ్వరునిలో దాగి ఉన్న జీవజాలమంతా బయటకువచ్చి, వాటికర్మానుసారము ఉత్తరజన్మలు ఎత్తుతుంది.

ఈ రకంగా భూతజాలమంతా ఇతని యందు ఉంటుంది కాబట్టి ‘వసుః’ అనబడతాడు.

సృష్టికి పూర్వము ఏకాకిగా ఉన్న పరబ్రహ్మ తాను అనేకం కావాలనుకున్నాడు. అనుకున్నదే తడవుగా 84 లక్షల జీవరాశిగా ఆవిర్భవించాడు.

**ఐతరేయోపనిషత్తు**లో చెప్పినట్లుగా ఇంద్రియాలతో భూతజాలాన్ని సృష్టించిన తరువాత, తాను ఆ శరీరంలో ప్రవేశించాలనుకున్నాడు. ప్రవేశించాడు. ఈ రకంగా పరమేశ్వరుడు జగత్తులోని అన్ని ప్రాణుల యందు ఉన్నాడు కాబట్టి ‘వసుః’ అనబడతాడు.

**భగవద్గీత**లోని పదవ అధ్యాయం **విభూతియోగం**లోని 23వ శ్లోకంలో శ్రీకృష్ణపరమాత్ముడు అర్జునుడికి తన విభూతులను చెబుతూ

**రుద్రాణాం శంకరశ్చాస్మి విత్తేశో యక్షరక్షసామ్ ।**
**వసూనాం పావకశ్చాస్మి మేరుశ్శిఖరిణామహమ్ ॥**

ఏకాదశరుద్రులలో శంకరుడను నేను. యక్షరాక్షసులలో ధనాధిపతియైన కుబేరుడను నేను. అష్టవసువులలో అగ్నిని నేను, పర్వతశిఖరాలలో సుమేరువును నేను అంటాడు.

వసువులు ఎనిమిదిమంది. వారినే అష్టవసువులు అంటారు.

**ధరోధ్రువశ్చ సోమశ్చ అహశ్చైవానిలోఽ నలః ।**

**ప్రత్యూషశ్చప్రభాసశ్చ వసవోఽ ష్టౌప్రకీర్తితా ॥**

1. ధరుడు 2. ధ్రువుడు 3. సోముడు 4. అహస్సు

5. అనిలుడు 6. అనలుడు 7. ప్రత్యూషుడు 8. ప్రభాసుడు

వీరిలో పావకుడు అనగా అగ్ని – అనలుడు వసువులకు రాజు. దేవతలకు హవిస్సు నందించేవాడు. పరమేశ్వరుని ముఖము ఇతడే.

## 105. వసుమనాః

నిధియందువలెనే భక్తులయందు కూడా ప్రీతి గలవాడు. 697వ నామము ఇదే.

**వసునీవ నిధౌ తేషు మనో యస్యాప్తి సర్వదా ।**

**సర్వై ర్వసుమనాః ప్రోక్తో మాతృవత్పోషకో మనుః ॥**

మానవులకు తమయొక్క ధనంమీద, భాగ్యము మీద, సంపదమీద, మనసు ఏరకంగా లగ్నమై ఉంటుందో, అదేవిధంగా నిరంతరము తన భక్తులయందు మనసు లగ్నమై ఉండువాడు.

**వసునీవ మనః యస్యసః వసుమనాః** నిధియందు ఎంత ప్రీతి ఉంటుందో, అంతటి ప్రీతిని ఆశ్రితులయందు కలవాడు.

వసు అంటే – ధనము అని అర్థము. ఈ లోకములో ధనానికి ఉన్న ప్రాముఖ్యత మరిదేనికీ లేదు. అందుచేతనే మానవుడి దృష్టి లేక మనసు ఆ ధనముమీదనే అధికంగా లగ్నమై ఉంటుంది. అదేవిధంగా పరమేశ్వరుని మనసు తన భక్తులయందు లగ్నమై ఉంటుంది.

**వసు – మనః – యస్యసః** ప్రశస్తమైన మనసు కలవాడు. పరమేశ్వరుని మనసు మహాప్రశస్తమైనది. ఏ రకమైన దుష్టసంకల్పాలు లేనటువంటిది. సర్వకాలసర్వావస్థల యందు, అందరికీ శుభమునే కోరేది. రాగద్వేషాలు అసలు కనిపించవు. అటువంటి పవిత్రమైన మనసు కలవాడు. పరమేశ్వరుడు అందుకే “వసుమనాః” అనబడుతున్నాడు.

**భగవద్గీత**లోని ఏడవ అధ్యాయం **విజ్ఞానయోగము**లోని 19వ శ్లోకంలో

**బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్మాం ప్రపద్యతే ।**

**వాసుదేవస్సర్వమితి స మహాత్మా సుదుర్లభః ॥**

అనేక జన్మలు ఎత్తిన తరువాత జ్ఞానయైనవాడు. సర్వము వాసుదేవమయమని భావించి నన్ను శరణు పొందుతాడు. అటువంటివారు చాలా తక్కువగా ఉంటారు.

జగత్తంతా వాసుదేవుని రూపమే. జగత్తులో ఇంకొకడికి అసలు అస్థిత్వమే లేదు. ఆ విషయాన్ని గురించే ఆలోచిస్తూ ఉంటే అది బలపడుతుంది.

## 106. సత్యః

సాధువులకు తగినవాడు. 212, 869వ నామాలు ఇదే.

**సత్సు సాధు స్సత్య ఇతి**

సత్పురుషుల ఎడల పరమసాధువు. ఆ సాధువులకు తగినవాడు.

సత్య – సత్యము, నిత్యము, శాశ్వతము అయినవాడు. జగత్తులో ప్రతివస్తువూ నశించేది. కాకపోతే దాని జీవితకాలములో తేడా ఉంటుంది. క్రిమికీటకాలు కొద్దిరోజులు మాత్రమే బ్రతుకుతాయి. మరికొన్ని జీవులు చాలాకాలం జీవిస్తాయి. అందుకే సుమతీశతకంలో

**ఉడుముండదెనూరేండ్లును**
**పడిఉండదెపేర్మి పాముపదినూరేండ్లున్**
**మడుగున కొక్కెర ఉండదె.**

అన్నారు. ఇవన్నీ చాలాకాలం జీవిస్తాయి. అంతేకాని ఏదీ శాశ్వతం కాదు. ఎప్పుడో ఒకప్పుడు మరణించాల్సిందే. మరము – మృత్యువు ధర్మముగా గలిగినది మర్త్యలోకము. భూలోకంలోనే కాదు ఎక్కడైనా సరే పుట్టిన ప్రతిజీవి మరణించి తీరాల్సిందే.

అంతదాకా ఎందుకు ? సృష్టికర్త అయిన బ్రహ్మ కూడా తన కల్పము పూర్తికాగానే వెళ్ళిపోయి పరబ్రహ్మలో లీనమైపోతాడు. మనం చెప్పుకునే ఇంద్రుడు మొదలైన దేవతలు, గంధర్వులు, యక్షులు అందరూ తమ కర్మఫలం తీరిపోగానే తిరిగి జన్మించాల్సిందే. మానవులు చేసిన కర్మలఫలితాన్ని బట్టి వారికి ఉత్తర జన్మలు వస్తాయి. మంచికాని, చెడుకాని ఏ రకమైన కర్మ చేసినప్పటికీ ఆ ఫలితం అనుభవించటానికి మళ్ళీ జన్మించాలి. కర్మను అనుభవించిన తరువాత మరణించాలి.

ఈ రకంగా చూసినట్లైతే ఈ జగత్తులో ఏదీశాశ్వతంకాదు. ఎవరూ శాశ్వతం కాదు. ఆ పరమేశ్వరుడొక్కడే శాశ్వతమైనవాడు. జననమరణాలు లేనటువంటివాడు. ఆది మధ్యాంతరహితుడు. అందుకే అతడు 'సత్యము' అని చెప్పబడుతున్నాడు.

సత్ అంటే – మూర్తములు. త్యమ్ అంటే – అమూర్తములు. ఈ రెండూ కూడా ఆ పరమేశ్వరుడే. వీటిని గురించి **బృహదారణ్యకోపనిషత్తు**లో చెప్పబడింది.

"ఇంద్రియాలకు, శరీరానికి కారణభూతమైన పంచభూతాలను 'సత్యము' అంటారు. విజ్ఞులు నేతి నేతి అంటూ పరబ్రహ్మతత్త్వాన్ని తెలుసుకోవటానికి ప్రయత్నిస్తారు. పంచభూతాలతో కూడిన స్థూల, సూక్ష్మశరీరాలతో సంబంధమున్న పరబ్రహ్మకు రెండు రూపాలున్నాయి. 1. మూర్తము 2. అమూర్తము. అవే మర్త్యరూపము 3. అమృతరూపము. అంటే నశించేది. నశించనిది.

పంచభూతాలలో పృథివి, జలము, అగ్ని ఈ మూడు మూర్తములు. స్థూలమైనవి. స్థావరములు. కంటికి కనిపిస్తాయి. నశిస్తాయి. వీటిని నిర్వచించటానికి వీలవుతుంది. వీటిసారమే ఆకాశంలో ప్రకాశించే సూర్యుడు.

పంచభూతాలలో మిగిలిన రెండూ వాయువు, ఆకాశము. ఇవి అమూర్తాలు. అస్థిరములు. వీటిని నిర్వచించటానికి వీలులేదు. వీటిసారమే సూర్యునిలో ఉండే పురుషుడు.

ప్రాణంకన్న భిన్నమైనది, దేహంలోఉన్న ఆకాశం కన్న భిన్నమైనది, వాయువు, ఆకాశం కాకుండా మిగిలిన మూడు భూతములచేత నిర్మించబడిన శరీరమంతా మూర్తము, మర్త్యము, స్థావరము. అది నాశనమవుతుంది. వీటిసారమే కనులు. అంటే పృథివి, జలము, అగ్ని యొక్క సారమే నేత్రగోళములు.

ప్రాణములు, శరీరంలో ఉన్న ఆకాశం అదే మహదాకాశం. ఈ రెండూ అమూర్తాలు. శాశ్వతమైనవి. నాశనంలేనివి. అనంతమైన, అనిర్వచనీయమైన అమూర్తానికి కుడికంటిలో ఉన్న పురుషుడే సారభూతమైనవాడు.

లింగశరీరరూపమైన పురుషుని వాసనామయ స్వరూపం తెల్లని ఉన్ని వస్త్రంలాగా, పసుపుతో ముంచిన వస్త్రంలాగా, వర్షాకాలంలో కనిపించే ఎర్రని ఆరుద్రపురుగులాగా, అగ్నిజ్వాలలాగా, తెల్లని పద్మంలాగా మెరుపుకాంతిలాగా ఉంటుంది. ఈ విషయం తెలుసుకున్నవాడి సంపద విద్యుత్ప్రకాశంలాగా అంతటా వ్యాపించి ఉంటుంది.

బ్రహ్మ మనేది ఆసత్యానికి సత్యం, ప్రాణానికి సత్యం. బ్రహ్మయొక్క సత్యత్వమే సమస్త ప్రపంచంతో తాదాత్మ్యం చెంది గోచరిస్తుంది.

ఈ రకంగా సత్యమంటే పరబ్రహ్మ స్వరూపయిన శ్రీమన్నారాయణుడు తప్ప వేరుకాదు.

# 107. సమాత్మా

సమానమైన మనసు గలవాడు.

**సమాత్మా సమచిత్తతః** తనను ఆశ్రయించిన వారియొక్క ఉచ్ఛ, నీచభావాలను చూడకుండా, అందరినీ ఒకేరీతిగా చూచేవాడు.

**సమః ఆత్మా యస్యసః సమాత్మా** సమానమైన మనసు గలవాడు. జీవులయొక్క హెచ్చు తగ్గులు విచారించకుండా అందరి యందు సమానమైన బుద్ధితో ఉండేవాడు.

**భగవద్గీత**లోని 9వ అధ్యాయము **రాజవిద్యారాజగుహ్యయోగము**లోని 29వ శ్లోకము

**సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తిన ప్రియః**
**యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్ ॥**

అర్జునా ! నేను సకలభూతాలయందు సమభావముతో వ్యాపించి ఉంటాను. నాకు ప్రియమైనవాడుగాని, అప్రియమైనవాడుగాని ఎవడూలేడు. కాని నన్ను భక్తితో భజించేవారు నాయందే ఉంటారు. నేను కూడా వారియందు ప్రత్యక్షముగా ఉంటాను.

పిపీలికాది బ్రహ్మపర్యంతము అన్ని ప్రాణులయందు పరమాత్ముడు సమానమైన భావముతో అంతర్యామిగా వ్యాపించి ఉంటాడు. కాబట్టి పరమేశ్వరుడికి అందరియందు సమభావమే ఉంటుంది. ఆయనకు రాగద్వేషాలు ఉండవు. ఎవరియందు ప్రేమగాని, అయిష్టతగాని ఉండవు. అందుచేతనే ఆయనకు ప్రియులు, అప్రియులు ఉండరు. అన్నిజీవులయందు సమభావం కలిగిఉంటాడు.

రాగద్వేషాలు లేనటువంటివాడు. దోషరహితమైనవాడు. పరిశుద్ధుడు. తాను ఒక్కడే అయి కూడా లోకములోని జీవులన్నిటియందు ఉచ్ఛ, నీచభేదము లేకుండా వ్యాపించి ఉన్నవాడు. అందుచేతనే 'సమాత్మా' అనబడుతున్నాడు.

# 108. సమ్మితః

పరిచ్ఛేదింపబడినవాడు.

**మితత్వాచ్చ తథా భక్తైః సమ్మితః పరికీర్తితః**

తన భక్తులతో తాను 'మావాడు' అని హద్దుపెట్టబడువాడు.

**సమ్యక్ మితః సమ్మితః**

చక్కగా పరిచ్ఛేదించబడినటువంటివాడు. తన భక్తులతో 'తమకు ఒదిగి ఉండేవాడు' అని భావింపబడతాడు.

బాలకృష్ణుడు అల్లరిచేస్తున్నాడు. ఏ రకంగానయినాసరే అతన్ని కట్టడి చెయ్యాలి అని ఆలోచించిన యశోద అతన్ని ఒక రోటికి కట్టివేస్తుంది. అంటే కృష్ణుడు తన పిల్లవాడు. అతణ్ణి అల్లరి చెయ్యకుండా ఆపగలిగాను అని భావిస్తుంది. అంతేకాని అతడు జగన్నాథుడు అని గుర్తించలేకపోతుంది. బాలుడు ఆ రోటిని లాక్కుపోయి నలకూబర, మణిగ్రీవులకు శాపవిమోచనం చేశాడు.

తన నాథుడు జగన్నాథుడు అని తెలియక సత్యాదేవి పుణ్యకవ్రతాన్ని ఆచరిస్తుంది. ఈ రకంగా పరమేశ్వరుని అర్చించే భక్తులు అతడు తమవాడు అని ఒక హద్దు పెడుతుంటారు.

ఈ నామాన్ని సమ్మితః, అసమ్మితః అని రెండు రకాలుగాను అర్థం చెప్పవచ్చును అన్నారు శంకరభగవత్పాదులవారు. ముందుగా

**సమ్మితః : సమ్యక్ మితః - సమ్మితః**

కంటికి కనిపించే పదార్థాలన్నీ పరమాత్మయందు ఆరోపించబడేవే. కాబట్టి తానే ఆ పదార్థాలుగా పరిచ్ఛేదించబడేవాడు. ఆయా ప్రమాణాలతో విచారించబడువాడు.

**అసమ్మితః :** వాస్తవంగా చూసినట్లైతే కంటికి కనిపించేవేవీ పరమేశ్వర స్వరూపంకాదు. అందుచేత అతడు పరిచ్ఛిన్నుడు కాడు. అపరిచ్ఛిన్నుడు.

ఈ రకంగా పరమాత్మ 'సమ్మితః' అని చెప్పబడుతున్నాడు.

# 109. సమః

సమమైనవాడు.

**జ్ఞాతేఽ పరిచితే చాపి సమత్వాత్సమ ఉచ్యతే ॥** పరిచితులు అపరిచితులు అనేభేదం లేకుండా అందరియందు సమానంగా ఉండేవాడు.

పరమేశ్వరుడికి రాగద్వేషాలు లేవు. అందరూ తనవారే. పిపీలికాది బ్రహ్మ పర్యంతము అతనికి సంబంధించిన శ్రీకృష్ణభగవానుడికి అర్జునిడి మీద ప్రేమలేదు. సుయోధనుడిమీద కోపము లేదు. ఎవరి కర్మనుబట్టి వారికి ఫలితాలను అందించాడు. అర్జునుడి కుమారుడైన అభిమన్యుని ఏమీ రక్షించలేదు. బాలుడని కనికరించలేదు. సూక్ష్మంగా పరిశీలిస్తే

మహాభారతయుద్ధంలో కౌరవులకుగాని, పాండవులకుగాని ఎవరికీ చేసింది ఏమీలేదు. వారికర్మను బట్టి ఫలితాన్నిచ్చాడు. పద్దెనిమిది అక్షోహిణీల సైన్యాన్ని నాశనం చేశాడు. కాబట్టి పరమేశ్వరుడి దృష్టిలో అందరూ సమానమే. అందుకే 'సమః' అనబడతాడు.

గతంలో ఉన్నాడు. ఇప్పుడున్నాడు, ఇకముందుకూడా ఉంటాడు. సర్వకాలసర్వావస్థల యందు ఏ విధమైన వికారములు లేనివాడు. ఒకేలాగా ఉండేవాడు అందుచేతనే 'సముడు' అనబడతాడు.

## 110. అమోఘః

వ్యర్థము కానివాడు. 154వ నామము ఇదే.

**వితథస్పర్శ రహితః సహ్యమోఘః ప్రకీర్తితః**

తనను ఆశ్రయించటము వ్యర్థము అనే మాటను కూడా సహించనివాడు.

**న మోఘః అమోఘః**

ఆశ్రితులకు, తనకు మధ్య గల సంబంధము వ్యర్థము కాకుండా ఫలింపచేయువాడు.

**శ్రీమద్రామాయణంలో**

**అమోఘం దర్శనం రామ నచ మోఘస్తవః తవ**
**అమోఘాస్తే భవిష్యన్తి భక్తి మన్తశ్చయే నరాః**

రామా ! నీ దర్శనము, నీ స్తోత్రము వ్యర్థము కానివి. మానవజన్మ ఎత్తినీయందు భక్తి గలిగి ఉండువారు తప్పక ఫలితాన్ని పొందుతారు.

**మోఘః నభవతి.** వ్యర్థుడుకాడు. పరమేశ్వరుడు ఎప్పుడూ వ్యర్థుడుకాదు. అతనిని అర్చించటము వ్యర్థంకాదు. అతడు పూజించబడేవాడు, స్తుతించబడేవాడు, స్మరించబడే వాడు. తనను పూజించిన, స్తుతించిన, లేక స్మరించిన వారికి సర్వఫలములను ఇచ్చువాడు. భక్తులయొక్క పూజలను వ్యర్థము కానీయడు. కాబట్టి అమోఘుడు. మోఘము అనగా వ్యర్థము అని అర్థము. అమోఘము – వ్యర్థముకానిది. అమోఘమైన సంకల్పము ఎవరికి ఉన్నదో వాడు సత్యసంకల్పుడు.

శ్రీకృష్ణుని బాల్యమిత్రుడు కుచేలుడు. కడు దరిద్రుడు. గంపెడు సంసారం. ఈ దరిద్రాన్ని వదలించుకోవాలని బాల్యమిత్రుడైన శ్రీకృష్ణుని దగ్గరకు బయలుదేరాడు. వచ్చేటప్పుడు వట్టిచేతులతో వెళ్ళటం మంచిదికాదని కుచేలుని భార్య గుప్పెడు అటుకులు చెంగున మూటకట్టింది.

వచ్చిన చిన్ననాటి స్నేహితుణ్ణి సాదరంగా ఆహ్వానించాడు శ్రీకృష్ణుడు. కుశలప్రశ్నలు అయిన తరువాత 'ఇంతకాలానికి కలిశాము కదా ! నా కోసం ఏంతెచ్చావు ?' అన్నాడు. అటుకులు తెచ్చానని చెప్పటానికి సిగ్గుపడ్డాడు కుచేలుడు అది గ్రహించిన శ్రీకృష్ణుడే ఆ మూట విప్పి అటుకులు నోట్లో పోసుకున్నాడు. సంతుష్టాంతరంగుడైనాడు. కుచేలుడు బయలుదేరి ఇంటికి వెళ్ళేటప్పటికి ధనకనక వస్తువాహనాలు, దాసదాసీజనము, మేడలు, మిద్దెలు ఉన్నాయి. తన పూరి ఇల్లు కనపడలేదు. భార్య ఎదురొచ్చి ఈ మేడలే తమనివాసము అని తీసుకువెళ్ళింది.

అంతేకాదు మొసలతో పోరాడి అలిసిపోయిన గజేంద్రుడు తనను ఆశ్రయించగా, మొసలిని చంపి కరిని కాపాడాడు. ఈరకంగా తనను ఆశ్రయించినవారి కోరికలు తప్పక తీరుస్తాడు. అంతేకాని "పరమేశ్వరుణ్ణి ఆశ్రయించటము వ్యర్థము' అనే మాట రావటం కూడా సహించలేనివాడు. అందుచేతనే శ్రీమహావిష్ణువు 'అమోఘః' అనబడుతున్నాడు.

## 111. పుండరీకాక్షః

వైకుంఠవాసులకు నేత్రమైనటువంటివాడు, పుండరీకములవంటి కనులు గలవాడు.

**పుణ్డరీకం వరం ధామ నిత్యమక్షర మవ్యయమ్**
**తద్గతానా మక్షి భూతః పుణ్డరీకాక్ష ఈరితః**

పుండరీకము అంటే నాళరహితమై నిత్యమై వికార శూన్యమై ప్రకాశించే పరమపదము అని అర్థం. ఆ పరమపదంలో ఉండే వారిని కంటికి రెప్పలాగా కాపాడేవాడు. **పుండరీకస్య అక్షీవ పుండరీకాక్షః** వైకుంఠవాసులకు నేత్రములవంటివాడు. మహాభారతంలో

**పుండరీకం పరంధామ నిత్యమక్షర మవ్యయం తద్భవాన్ పుండరీకాక్షః**

పుండరీకము అనగా నిత్యము, సత్యము, శాశ్వతము అయిన పరమపదము. దానికి నిర్వాహకుడు కాబట్టి శ్రీహరి పుండరీకాక్షుడు అనబడతాడు అని చెప్పబడింది.

**పుండరీకం - హృదయమధ్యస్థం - అశ్నుతే ఇతి**

హృదయానికి మధ్యన ఉండే పుండరీకము (పద్మము)ను చేరి ఉండువాడు.

**యచ్చకించి జ్జగత్సర్వం దృశ్యతే శ్రూయతేఽ పివా**
**అంతర్భహిశ్చ త త్సర్వం వ్యాప్య నారాయణ స్థితః**
**అనంతమవ్యయం కవిగ్ం సముద్రేఽ_ంతం విశ్వశంభువమ్**

బ్రహ్మాండములో స్వల్పమైన ఈ జగత్తు మహదాకాశంలో వేరుగా కనిపించే ఘటాకాశములాగా ఉన్నది. పైన కనిపించేదంతా మహదాకాశమే. గదిలో ఒక కుండను ఉంచినట్లైతే అందులో కూడా ఆకాశం కనిపిస్తుంది. కుండలో కనిపించే ఆకాశాన్ని ఘటాకాశము అంటారు. ఈ ఘటాకాశము ఆ మహదాకాశము కన్న వేరైనదికాదు. అలాగే ఈ జగత్తుకూడా బ్రహ్మాండము కన్నవేరుగా కనిపిస్తున్నది. నిజానికి బ్రహ్మాండము కన్న జగత్తు వేరుకాదు. జగత్తు కూడా బ్రహ్మాండములోని భాగమే. దానికి బయటాలోపలా అంతటా కూడా పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడే నిండి ఉన్నాడు. ఆదిమధ్యాంత రహితుడు, శాశ్వతుడు అయిన ఈ పరమేశ్వరుడు అర్హులైన వారికి సంసారబంధనాల నుంచి విముక్తి కలిగిస్తాడు.

**పద్మకోశ ప్రతీకాశగ్ం హృదయం చాప్యథోముఖమ్**

కంఠానికి క్రిందిభాగంలో, నాభికి పైభాగంలో పన్నెండు అంగుళాల ప్రమాణం కలిగి అథోముఖంగా ముకుళించి ఉన్న పద్మాన్ని బోలిన హృదయమున్నది.

**అథోనిష్ట్యా వితస్త్యాంతే నాభ్యాముపరితిష్ఠతి**

**జ్వాలమాలాకులంభాతి విశ్వస్యాఽ యతనంమహత్**

**సంతతగ్ం శిలాభిస్తు లంబత్యాకోశ సన్నిభమ్**

**తస్యాంతే సు షిరగ్ం సూక్ష్మం తస్మిన్ త్సర్వం ప్రతిష్ఠితమ్**

**తస్యమధ్యే మహానగ్ని ర్విశ్వార్చి ర్విశ్వతోముఖః**

**సోఽగ్రభుగ్విభజంతిష్టన్నాహార మజరః కవిః**

**తిర్యగూర్ధ్వమధశ్శాయీ రశ్మయ స్తస్యసంతతా**

ఆ హృదయ పద్మాన్ని ఆశ్రయించి, జ్వాలాసమూహంతో వెలుగుతూ, జీవులకు ప్రధానస్థానమై, అనేక నాడీసమూహాలకు ఆలంబనమై, అరవిరిసిన పద్మాన్ని బోలిన హృదయాగ్రభాగంలో సూక్ష్మమైన కమలం ఒకటున్నది. దానిలోనే సర్వము ప్రతిష్ఠితమై ఉన్నది. దానిమధ్యలో అంతటా జ్వాలలు వ్యాపించు గొప్ప అగ్నిదేవుడున్నాడు. అదే జఠరాగ్ని

**సంతాపయతి స్వం దేహమాపాదతల మస్తకః**

**తస్య మధ్యేవహ్నిశిఖా అణీయోర్ధ్వా వ్యవస్థితః**

భుజించినటువంటి ఆహారాన్ని ఆ జఠరాగ్ని సమానమైన భాగాలుగా విభజించి అన్నివైపులకు పంపుతుంది. ఆ అగ్నికిరణాలు ఆపాదమస్తకము వ్యాపించి ఉన్నాయి.

**నీలతో యద మధ్యస్థా ద్విద్యుల్లేఖేన భాస్వరా**
**నీవార శూకవత్తన్వీ పీతా భాస్వత్యణూపమా**

ఈ జఠరాగ్ని నడుమ సూక్ష్మమైన అగ్ని శిఖఊర్ధ్వముఖంగా పైకెగుస్తున్నది. అది నీలమేఘము మధ్య మెరుపువలె ప్రకాశిస్తున్నది. వరిధాన్యపు ముల్లు లాగా సూక్ష్మమై పచ్చనిరంగు కలిగి అది అణువు ప్రమాణంలో ఉన్నది.

**తస్యాశిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః**
**సబ్రహ్మ సశివసహరిస్సేంద్ర సోఽక్షరః పరమస్వరాట్**

ఆ అగ్నిశిఖమధ్యలో పరమాత్మ ఉంటాడు. అతడే బ్రహ్మ, అతడే శివుడు, అతడే విష్ణువు, అతడే ఇంద్రుడు. నాశనము లేనివాడు, శాశ్వతుడు, అన్నింటికీ మూలకారణమైన వాడు, స్వయంప్రకాశము కలవాడు ఆ పరమాత్మయే. పుండరీకాక్షుడు అంటే - హృదయపద్మమును చేరి ఉండువాడు అని శంకరుల వ్యాఖ్య.

## 112. వృషకర్మా

ధర్మమైన కార్యము గలవాడు.

**శ్రేయస్కరం ధర్మరూపం కర్మయవ్య ప్రచక్షతే**
**వృషకర్మేతి విఖ్యాతః శుభకర్మ ప్రదోమనుః**

భక్తులకు శ్రేయోదాయకమైన ధర్మము అనబడే కర్మ గలవాడు. ఈ నామాన్ని మంత్రంగా జపం చేస్త శుభకర్మలు జరుగుతాయి.

**వృషమ్ కర్మ యస్యసః వృషకర్మా** ధర్మకార్యము గలవాడవటంచేత 'వృషకర్మా' అని పేరు. పరమేశ్వరుడు పరమోత్కృష్టుడు. అంత తేలికగా పొందదగినవాడు కాదు. అయినప్పటికీ తన భక్తులకు మేలునే చేస్తూ ఉంటాడు. వృషరూపమైన కర్మలు అనగా ధర్మరూపమైన కర్మలు చేసేవాడు - పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు.

అతడు ఏ పనిలోనైనా సరే ధర్మాధర్మవిచక్షణ చూపుతాడు. కేవలము ధర్మాన్ని మాత్రమే ఆచరిస్తాడు. మహాభారతంలో కర్ణపర్వం. కురుక్షేత్ర సంగ్రామం జరుగుతోంది. కర్ణుడు, అర్జునుడు ముఖాముఖి తలపడ్డారు. కర్ణుని రథం శాపవశానభూమిలో కూరుకుపోయింది. ఆ సమయంలో కర్ణుడి మీద బాణం వెయ్యమన్నాడు. వాసుదేవుడు 'కృష్ణా ! ఇది అధర్మం. నేను రథంలేని వాడను' అన్నాడు కర్ణుడు. అప్పుడు చెప్పాడు

భగవానుడు. 'అధర్మపరుని దగ్గర ధర్మప్రసక్తి అవసరంలేదు. గతంలో ద్రౌపదివస్త్రాపహరణ సమయంలోగాని, అభిమన్యు కుమారుని సంహరించే సమయంలోగాని నువ్వు అధర్మంగానే ప్రవర్తించావు. కాబట్టి ఇప్పుడు నీ పై బాణం ఎక్కుపెట్టటం ధర్మమే'

రామాయణంలో వాలి సుగ్రీవుల మధ్య పోరు జరుగుతోంది. చెట్టుచాట నుంచి బాణం సంధించి వాలిని కొట్టాడు రాముడు. అప్పుడు వాలి "శ్రీరామా ! నువ్వు చాలా గొప్పవాడవంటారు కదా ! నీకు నాకు విరోధం ఏమీలేదు. మరినన్నెందుకు కొట్టావు ? ఒకవేళ నాతో యుద్ధం చెయ్యాలనిపిస్తే చెట్టుచాటు నుంచి ఎందుకు ? ఎదురుగానే రావచ్చును కదా ?" అని అడుగుతాడు. దానికి శ్రీరాముడు "వానరోత్తమా! నీకు నాకు విరోధం లేదు నిజమే. కాని నా స్నేహితుని విరోధి నాకూ విరోధే. అందుకే సుగ్రీవుణ్ణి రక్షించటానికి నిన్ను కొట్టాను. ఇక ఎదురుగా వచ్చి యుద్ధం చేస్తే, అవతల వాడిలో గల సగంశక్తి నీకు వస్తుందని నీకు వరమున్నది. కాబట్టి ఎదురుగా యుద్ధంచేసి నీతో ఎవరూ గెలవలేరు. పైగా నువ్వు వానరుడవు. అంటే మృగానివి. మృగాన్ని చాటుగా మాటువేసి చంపటమనేది ధర్మమే కదా ?" అంటూ ధర్మ సూక్ష్మాన్ని వివరిస్తాడు.

ధర్మమనేది మనకందరికీ కనిపిస్తుంది. కాని ధర్మసూక్ష్మము తెలుసుకోవటం చాలా కష్టమైన పని. అటువంటి ధర్మసూక్ష్మాన్ని కూడా గ్రహించి తన వారికి మేలుచేసిన వాడు కాబట్టే పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు 'వృషకర్మా' అనబడుతున్నాడు.

## 113. వృషాకృతిః

ధర్మమగు రూపము గలవాడు. ధర్మమే స్వరూపముగా గలవాడు.

**ధర్మరూపాకృతిర్యస్య స వృషాకృతి రుచ్యతే**

ధర్మస్వరూపమైన ఆకారము గలవాడు.

**తాపత్రయాగ్ని దగ్ధానాం సుధేవాత్యన్త శీతలమ్**
**రూపం కర్మ చయస్యాప్తి వృషకర్మా వృషాకృతిః**

తాపత్రయాలతో తపిస్తున్నటువంటి తన భక్తులకు అమృతమువలె చల్లనైన రూపము, సుఖము ఇచ్చేటటువంటి ధర్మకర్మములు గలవాడు.

తాపత్రయములు – వీటినే త్రివిధ తాపములు అంటారు. అవి 1. ఆధ్యాత్మికము 2. ఆధిభౌతికము 3. ఆదిదైవికము.

**1. ఆధ్యాత్మికములు :** శరీరములో కలిగే వ్యాధులు, మానసికమైన కామము, క్రోధము, జ్వరము, అలసత్వము, కపటము, అబిశ్వాసము, అశ్రద్ధము మొదలైనవి.

**2. ఆది భౌతికములు :** అగ్ని, వరద, భూకంపము, కుక్కలఏడుపులు, గుడ్లగూబల అరుపులు, కుక్కలు, నక్కలు, పాములు, పులులు మొదలగు వాటివల్ల కలిగే బాధలు.

**3. ఆదిదైవికములు :** దేవతా విగ్రహాలకన్నీరు, ఎండ, వాన, గాలి, యక్ష రాక్షస పిశాచాదుల వలన కలిగే బాధలు,

తాపము అనేది – అగ్నియొక్క గుణము. కాబట్టి ఇది అగ్ని లాగానే దహించివేస్తుంది.

తన భక్తులయొక్క తాపత్రయాలు తీర్చివారికి ఉపశమనము కలిగిస్తాడు. తద్వారా వారికి సుఖము లభిస్తుంది.

**వృషాఆకృతిః యస్యసః వృషాకృతిః** వృష అనగా – చల్లదనము. చల్లని ఆకారము గలవాడు. కాబట్టి వృషాకృతిః అనబడతాడు. మన తాపత్రయాలు పోగొట్టటానికి అమృతమువలె చల్లనైనవాడు. తాపత్రయాలను ఉపశమింపచేయువాడు.

**భగవద్గీతలోని జ్ఞానకర్మ సన్యాసియోగంలో**

**పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం ।**

**ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే ॥**

సత్పురుషులను రక్షించి, దుర్మార్గులను శిక్షించి ధర్మసంస్థాపన చెయ్యటానికి ప్రతియుగమునందు నేను భూలోకములో అవతరిస్తుంటాను.

ఇక్కడ **సాధువులు** అంటే – అహింస, సత్యము, బ్రహ్మచర్యము వంటి నియమాలు పాటించాలి. దొంగతనము లాంటిపని చెయ్యకూడదు. ఇవి సామాన్య ధర్మాలు. వీటితోపాటుగా యజ్ఞము, దానము, తపస్సు చేస్తూ వర్ణాశ్రమధర్మాలు పాటిస్తూ, ఇతరులకు మేలును చేసేవారు, సద్గుణ నిధులు, సదాచార సంపన్నులు, భక్తిశ్రద్ధలతో ఆ పరమేశ్వరుని లీలావిశేషాలను వినేవారు, కీర్తించే వారు. వీరందరూ సాధువులే.

ఇటువంటి సాధువర్తనుల మీద దుష్టులు, దుర్మార్గులు, దురాచారాలు చేస్తుంటారు. అటువంటి దురాగతాలనుండి వారిని కాపాడటము, వారికి ఉత్తమగతులు ప్రసాదించటము, తాను వారికి సాక్షాత్కరించి వారి పాపాలను పటాపంచలు చెయ్యటము. వారికి శుభము కలుగచెయ్యటము, వారికి మోక్షమార్గాన్ని చూపటము. ఇవన్నీ సాధువులను రక్షించటంలోని భాగాలు.

**దుష్కృతులు** అంటే – సదాచార సంపన్నులు, తప్పుచెయ్యనివారు, అమాయకులు వీరిపై దురాగతాలు చేసేవారు, అసత్యము, హింస, మోసము, దొంగతనము, వ్యభిచారము, అన్యాయము, అధర్మమార్గంలో ధనార్జన, ఎప్పుడూ భగవంతుని ద్వేషించటము మొదలైన పనులు చేసేవారు. ఇటువంటి దుష్టులను శిక్షించి పైన చెప్పిన సాధుపుంగవులను రక్షిస్తాడు భగవానుడు. ధర్మాన్ని స్థాపించటము అంటే – ధర్మశాస్త్రంలో చెప్పినట్లుగా చెయ్యటము. వేదాలు, శాస్త్రాలు, పురాణాలు, పరలోకము, మహాపురుషులు, భగవంతుడు మొదలైన విషయాలమీద ప్రజలకు నమ్మకం కలిగించటం కోసమని, సహేతుకమైన పద్ధతుల ద్వారా ఉపన్యాసాలివ్వటము, తిరుగులేని విధంగా ఆదేశాలివ్వటము, సదాచారులు, సద్గుణవంతులను గౌరవించటము మొదలగు విషయాలు జనులందరూ ఆచరించేటట్లుగా చూడటమే ధర్మసంస్థాపన.

ధర్మదేవతకు నాలుగు పాదాలుంటాయి. అవి

1. అహింస 2. సత్యము 3. శాంతి 4. దయ

ఇక్కడ పాదము అంటే భాగము. ధర్మమనేది నాలుగు భాగాలుగా ఉన్నది. ఆ నాలుగుభాగాలు పూర్తిగా పోయినప్పుడు, అంటే ధర్మము పూర్తిగా నాశనమయినప్పుడు పరమేశ్వరుడవతరించి, ఈ లోకంలో మళ్ళీ ధర్మసంస్థాపన చేస్తాడు. అందుచేతనే పరమేశ్వరుడు ధర్మస్వరూపుడు.

**రామోవిగ్రహవాన్ ధర్మః** శ్రీరామచంద్రుడు మూర్తీభవించిన ధర్మస్వరూపుడు.

## 114. రుద్రః

రోదింపచేయువాడు.

**ఈదృగ్రూపై శ్చేష్టితైశ్చ భక్తా నానన్దభాష్పయన్**

**రోదయన్ రుద్ర ఉద్దిష్టః సర్వసంతోషదో మనుః**

పై నామాలలో చెప్పిన రూపము, చేష్టలతో తన భక్తులను ఆనందపరవశులు గావించి, కండ్లనుండి ఆనంద భాష్పములు రప్పించి ఏడ్పించువాడు. ఈ నామాన్ని మంత్రముగా జపించినట్లైతే సకలసంతోషాలు సమకూరతాయి.

**రోదయతీతి రుద్రః** ఏడ్పించువాడు కాబట్టి రుద్రుడు. తన రూపము, చేష్టలు చూపించి, చూసేవారి హృదయాలను కరిగించి, వారంతా ఆనందబాష్పాలతో ఏడిచేటట్లుగా చేసేవాడు. **బృహదారణ్యకోపనిషత్తు**లో ఒకసారి జనకమహారాజు యాగం చేస్తున్నాడు.

ఆ సమయంలో సంప్రదాయం ప్రకారము సాయంత్రపువేళలయందు, ఆధ్యాత్మికచింతన, ప్రవచనాలు సాగుతున్నాయి. ఇలా జరుగుతుండగా ఒకరోజున 'ఆధ్యాత్మికలోకానికి చక్రవర్తి ఎవరు ?' అనే అనుమానం వచ్చింది మహారాజుకి. అనుకున్నదే తడవుగా తన గోశాలలోని బాగా బలిసిన వెయ్యి ఆవులను, ఆబోతులను వాటి కాలిగిట్టలకు కొమ్ములకు బంగారు తొడుగులు అమర్చి, వాటి వీపులమీద పట్టువస్త్రాలు కప్పి సభలోకి తోలుకువచ్చారు. అప్పుడు జనకమహారాజు లేచి "పండితులారా ! విద్వాంసులారా ! మహాజ్ఞానులారా ! ఆధ్యాత్మిక లోకానికి చక్రవర్తి ఎవరో, వారు గోవులను తోలుకు పొండి" అన్నాడు.

సభలో అందరూ చూస్తున్నారు. కాని ఎవరూ లేవలేదు. యాజ్ఞవల్క్యుడు తన శిష్యుని పిలిచి గోవులను తోలుకు పొమ్మన్నాడు. అంతవరకు మాట్లాడని పండితులు ఇప్పుడు గుసగుసలాడటం మొదలుపెట్టారు. ఏమైనాసరే యాజ్ఞవల్క్యుడు ఆ గోవులను తీసుకుపోవటానికి ఒప్పుకోకూడదు. అతన్ని అన్నివిధాలా పరిక్షించాలి అని నిర్ణయించుకున్నారు. ఒక్కొక్కరే పరిక్షించటం మొదలుపెట్టారు. ముందుగా ఆశ్వలుడు లేచాడు. తరువాత ఆర్తభాగుడు, భుజ్యుడు, ఉషస్తి, ఉద్దాలకుడు, గార్గి మొదలైన వారంతా యాజ్ఞవల్క్యుని ప్రశ్నించారు. తరువాత శాకల్యుడు లేచి అడగటం మొదలుపెట్టాడు.

**శా** : దేవతలెంతమంది ?

**యా** : ముప్పై ముగ్గురు.

**శా** : అష్టవసువులు ఎవరు ?

**యా** : అగ్ని, పృథివి, వాయువు, అంతరిక్షము, ఆదిత్యుడు, ద్యులోకము, చంద్రుడు, నక్షత్రాలు. వీటిలోనే జగత్తంతా వ్యాపించి ఉన్నది. కర్మఫలాన్ని బట్టి ఇవే జీవి దేహంగా మారతాయి.

**శా** : రుద్రులు ఎవరు ?

**యా** : జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సు. వీటినే ఏకాదశ రుద్రులు అంటారు. ప్రాణియొక్క కర్మ పరి సమాప్తమైనప్పుడు వీరు శరీరం నుంచి ఉత్క్రమిస్తారు. ఈ రకంగా శరీరాన్ని వదలి బంధువులను రోదింప చేస్తారు కాబట్టి ఇవి రుద్రశబ్దంతో పిలువబడతాయి అన్నాడు. రోదింపచేసేవి కాబట్టి వీటికి రుద్రశబ్దం ఉపయోగించబడింది.

దుఃఖాన్ని లేదా దుఃఖకారణాన్ని తరిమి వేసేవాడు రుద్రుడు. అని శివపురాణంలో చెప్పబడింది.

# 115. బహుశిరాః

అనేక శిరస్సులు గలవాడు.

**ఫణాశ్చ బహవోయస్య సవై బహు శిరామతః** అనేక శిరస్సులు గలవాడు.

**బహూని శిరాంసి యస్యసః బహుశిరాః**

అనంతమైన రూపముతో అనేక తలలు గలవాడు.

**పురుషసూక్తములో సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్**

ఆ పరమపురుషునకు అనేక వేల శిరస్సులు, కనులు, పాదాలున్నాయి.

పరమేశ్వరుని రూపము ఇంత అని చెప్పటానికి వీలులేనిది. అణువుకన్న చిన్నవాడు. మహత్తు కన్న పెద్దవాడు. చరాచరజగత్తంతా ఆశ్రయించి ఉన్నాడు. ఈ జగత్తులోని ప్రతి అణువు ఆ పరమేశ్వరుని రూపమే. **బృహదారణ్యకోపనిషత్తు**లో చెప్పినట్లుగా ఆ పరమేశ్వరుడే స్వాయంభువ మనువు, శతరూప. అనే పేర్లతో స్త్రీ పురుషులగా అయినాడు. ఈ జగత్తులోని 84 లక్షల జీవరాసి అతని నుండే ఉద్భవించింది. **ఐతరేయోపనిషత్తు**లో చెప్పినట్లుగా జీవులను సృష్టించిన తరువాత ఆ శరీరములో తాను లేకపోతే ఎలా ? అనుకున్నాడు. అందుకే నవరంధ్రాలతో కూడిన దేహము నందు ప్రవేసించాడు. ఈ రకంగా చరాచరజగత్తంతా పరమేశ్వరమయముగా ఉన్నది. సృష్టిలో ఉన్న రూపాలన్నీ అతడివే. సృష్టి ప్రారంభములో ఏకాకిగా ఉన్న పరమేశ్వరుడు తాను అనేకం కావాలనుకున్నాడు. ఈ జగత్తంతా తానే అయి విస్తరించాడు. కాబట్టి జగత్తులో ఎన్ని రకాల జీవరాసులున్నాయో, అవన్నీ అతని రూపమే. అందుచేతనే 'విశ్వరూపము' చిత్రాన్ని గీసేటప్పుడు ఆ రూపానికి మనిషి, గుర్రము, ఏనుగు, ఒంటె, పాము, తేలు, కొంగ, సింహము, పులి ఈ రకంగా సృష్టిలోని అన్ని జీవుల శిరస్సులు చూపటం జరుగుతుంది. అలాగే అనేక వేల చేతులు, కాళ్ళు కూడా చూపబడతాయి. **భగవద్గీత**లోని పదకొండవ అధ్యాయం **'విశ్వరూపసందర్శనయోగము'**లోని 15, 16వ శ్లోకాలు అర్జునుడు ఆ పరమేశ్వరుని యొక్క దివ్యవిభూతులు తెలుసుకున్నటువంటివాడై "దేవదేవా ! నీయొక్క విశ్వరూపాన్ని చూడాలని ఉన్నది." అని అడుగుతాడు. శ్రీకృష్ణపరమాత్ముడు అతడికి దివ్యచక్షువులను ప్రసాదించి, తన విశ్వరూపాన్ని చూపించాడు. ఆ రూపం చూసిన అర్జునుడు రెండు చేతులూ జోడించి.....

**"పశ్యామి దేవాంస్తవ దేవః దేహే సర్వాంస్తథా భూతవిశేషసంఘాన్**

**బ్రహ్మాణమీశం కమలాసనస్థం ఋషీంశ్చ సర్వానురగాంశ్చ దివ్యాన్**

ఓ పరమేశ్వరా ! దేవదేవా ! నీ శరీరములో సమస్త ప్రాణికోటినీ, సకల దేవతలను, బ్రహ్మదేవుని, శంకరుని, సమస్త ఋషులను దివ్యసర్పములను చూచుచున్నాను.

**అనేకబాహూదరవక్త్ర నేత్రం పశ్యామి త్వాం సర్వతోఽ నంతరూపమ్**

**నాంతం న మధ్యం న పునస్తవాదిం పశ్యామి విశ్వేశ్వర విశ్వరూప ॥**

"ఓ విశ్వేశ్వరా ! విశ్వరూపా ! నీ బాహువులు, ఉదరములు, నేత్రములు అసంఖ్యాకములు. అనంతమైనటువంటి నీ రూపము సర్వతోముఖముగ విలసిల్లుతున్నది. నీవు ఆదిమధ్యాంతరహితుడవు." అంటాడు.

ఇక్కడ విరాట్స్వరూపానికి అనేక బాహువులు, అనేక నేత్రములు, అనేక శిరస్సులు ఉన్నాయని చెప్పబడింది. **లలితాసహస్రం**లో 109వ శ్లోకంలో

**సహస్రదళపద్మస్థా సర్వవర్ణోప శోభితా ।**

**సర్వాయుధ ధరాశుక్ల సంస్థితా సర్వతోముఖీ ॥**

సహస్ర దళపద్మమునందు ఉండే పరమేశ్వరి అన్నివర్ణములతోను, అన్నిరకాలయిన ఆయుధములతోనూ, అన్ని దిక్కులకు గల ముఖములతోనూ ప్రకాశిస్తున్నది అని చెప్పబడింది. ఈ దేవతకు అన్నివైపులా ముఖాలుంటాయి. జగత్తులోని జీవరాసి అంతా కూడా ఈ దేవి రూపమే. ఇదే విశ్వరూపము. కాబట్టి 'బహుశిరాః' అంటే అనేక శిరస్సులు గలవాడు. ఆ పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు అని అర్థం. **లలితాసహస్రం**లోని 533వ నామము సర్వతోముఖీ.

## 116. బభ్రుః

భరించువాడు.

**అనన్త రూపో యోధత్తే పృథ్వీం బభ్రు స్స ఈరితః**

అనంతరూపములను ధరించి భూమినంతటినీ భరించువాడు.

**భరితీతి బభ్రుః** భరించువాడగుటచే బభ్రుః అనబడుతున్నాడు.

**యస్యసా సకలా పృథ్వీ ఫణామణి శిరారుణా భి భర్తి మాలాం లోకానామ్॥**

ఈ భూమండలమంతా ఎవని పడగలలో నుండు మాణిక్యములయొక్క కాంతిచే ఎర్రగా ప్రకాశిస్తున్నదో, అతడే ఈ లోకాన్ని భరిస్తున్నాడు. **వామకేశ్వరతంత్రచతుశ్శతిలో**

**శింశు మారాత్మనావిష్ణుః భూరాదీ నూర్ధ్వతస్థితాన్**
**దధ్రేశేషతయాలోకాన్ సప్త లోకాన్ అధస్థితాన్ ॥**

శ్రీ మహావిష్ణువు శింశుమార రూపము (మొసలి)లో ఊర్ధ్వలోకాలను, ఆదిశేషుని రూపములో అథోలోకాలను ధరిస్తూ ఉన్నాడు.

ఊర్ధ్వలోకాలు ఏడు. అవి

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | భూలోకము | 3. | సువర్లోకము | 5. | జనోలోకము |
| 2. | భువర్లోకము | 4. | మహాలోకము | 6. | తపోలోకము |
| 7. | సత్యలోకము. | | | | |

అథోలోకాలు ఏడు. అవి

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | అతల | 3. | సుతల | 5. | రసాతల |
| 2. | వితల | 4. | తాలతల | 6. | మహాతల |
| 7. | పాతాళములు | | | | |

లోకాలను రక్షించటమనేది స్థితికారకుడైన శ్రీమహావిష్ణువు యొక్క పని. పరమేశ్వరుడే విష్ణుమూర్తి రూపంలో ఈ రకంగా చేస్తున్నాడు. కాబట్టి 'బభ్రుః' అనబడుతున్నాడు.

## 117. విశ్వయోనిః

అందరినీ తనలో చేర్చుకొనువాడు. జగత్తుకు మూలకారణము.

149వ నామము కూడా ఇదే.

**విశ్వేషాం భేజుషాం న్వేన విశ్వయోనిస్తు మిశ్రనోత్** తనను ఆశ్రయించిన వారందరినీ తనతో సమానమైన రూపమిచ్చి తనతో చేర్చుకొనువాడు.

**విశ్వేషాం యోనిః విశ్వయోనిః** అందరినీ తనతో చేర్చుకొనువాడు.

**విశ్వానాం యోనిః**

లోకములన్నింటికీ యోని మూలకారణము. లేదా ఆశ్రయస్థానము.

కల్పాంతమునందు మహాప్రళయం సంభవిస్తుంది. ఆ సమయంలో కర్మక్షయం కాకుండా ఉన్న జీవులన్నీ వాటి కర్మలతో సహా ఆ పరమేశ్వరుని యందు లీనమవుతాయి.

తరువాత కొంతకాలానికి అంటే జీవులయొక్క కర్మ పరిపక్వం చెందిన తరువాత పరమేశ్వరుడు మళ్ళీ సృష్టి చెయ్యాలని సంకల్పించి, తనలో ఉన్న జీవులను వాటి కర్మ ఫలాలతో సహా బయటకు పంపుతాడు. ఈ రకంగా జగత్తులోని జీవులన్నింటినీ తనలో చేర్చుకునే వాడు ఆ పరమేశ్వరుడు. తిరిగి వాటికి జన్మనిచ్చే వాడు కూడా ఆ పరమేశ్వరుడే. అందుచేతనే అతడు 'విశ్వయోని' అనబడుతున్నాడు.

అనంతమైన-లెక్కించటానికి సాధ్యం కానటువంటి బ్రహ్మాండాలను సృష్టించినవాడు.

స్థూలమైన పంచభూతాలు చేరికయే బ్రహ్మాండము. ఆ బ్రహ్మాండాభిమాని విరాడ్రూపుడు. ఆ విరాడ్రూపుని సృష్టించినది పరమేశ్వరుడు. వేదంలో విరాట్పురుషుడు బ్రహ్మాండానికి ఆత్మ. స్వరాట్ స్వరూపము అని చెప్పబడింది. అంటే బ్రహ్మాండానికి ఆత్మ. శరీరము అయిన విరాట్, స్వరాట్‌లను దేవతలను సృష్టించినవాడు.

ఇన్నికోట్ల బ్రహ్మాండాలను సృష్టించినది పరమేశ్వరుడు. మనం నివసించే ఈ జగత్తు దిక్పాలకులతో, సూర్యచంద్రాది గ్రహాలతో, త్రిమూర్తులు, త్రిశక్తులు మొదలైన వారితో నిండి ఉన్నది. ఈ రకంగా ఉన్న స్థావరజంగమాత్మకమైన జగత్తే ఒక బ్రహ్మాండము. ఇటువంటివి అనేక కోటిబ్రహ్మాండాలను సృష్టించింది ఆ పరమేశ్వరుడు.

మహాసంకల్పంలో

**మహాజలౌఘస్య మధ్యే పరిభ్రమమాణానాం అనేకకోటి బ్రహ్మాండానాం ఏకతమే**

మహా జలరాశి నడుమ పరిభ్రమిస్తున్నటువంటి అనేక కోట్ల బ్రహ్మాండాలయందు ఒకదానిలో మనము ఉన్నాము. మనమున్నది భూలోకం. దీని క్రింద ఏడు లోకాలున్నాయి. అలాగే పైన ఆరులోకాలున్నాయి.

**అతల వితల సుతల తలాతల రసాతల మహాతల పాతాళ సప్తలోకానాం ఉపరితలే......**

**భూ, ర్భువ, స్సువ, ర్మహ, ర్జన, సప్త, స్సత్యమితి సప్తలోకానాం అథోభాగే...**

అని చెప్పబడింది. మనం ఎలా ఉన్నామో ఆ లోకాల వారు కూడా అలాగే ఉంటారు. సైన్సు ప్రకారం ఇతర గ్రహాలలో కూడా నీరున్నది. అక్కడ జీవులు నివసించే ఛాయలున్నాయి. కాబట్టి మనకు తెలియనివి. కంటికి కనిపించనివి అనేక లోకాలున్నాయి. వాటన్నింటినీ సృష్టించినది పరమేశ్వరుడే. అందుకే 'విశ్వయోని' అనబడుతున్నాడు.

**లలితాసహస్రంలోని** 620వ నామము **అనేకకోటి బ్రహ్మాండ జననీ.**

## 118. శుచిశ్రవాః

శుద్ధమైన చెవులు కలవాడు.

**భక్తైరుక్తా న్యవశ్యం య శ్శృణోతి సశుచిశ్రవాః ॥**

భక్తులు తనకు భక్తితో విన్నవించుకొను విన్నపములను శ్రద్ధగా వినేవాడు.

**శుచీని శ్రుణోతీతి శుచిశ్రవాః** పరిశుద్ధమగు వాటిని వింటాడు కాబట్టి 'శుచిశ్రవుడు' అనబడతాడు. మహాభారతములో

**శుచీని శ్రవణీయాని శృణోమిహ దనంజయ**
**నచపాపాని గృహ్ణామి తతోఽహం వై శుచిశ్రవాః ॥**

అర్జునా ! శుద్ధములు, మధురములు అయిన విషయాలను నేను ఇక్కడ వింటున్నాను. పాపపు విషయాలను నా చెవులతో వినను. అందుచేతనే నన్ను 'శుచిశ్రవుడు' అంటారు. అని చెప్పబడింది.

**శుచీని పవిత్రాణి - శ్రవాంసి శ్రవణీయాని - నామాని యస్య - సః**

పవిత్రములు, ఇంపైన మాటలు మాత్రమే వినువాడు. పరమేశ్వరుడు ధర్మస్వరూపుడు. జ్ఞానస్వరూపుడు. పవిత్రమూర్తి, పరిశుద్ధుడు. తాను చెప్పేవి, చేసేవి, చేయించేవి, చూసేవి అన్నీ పవిత్ర కర్మలే. అటువంటి పరమేశ్వరుడు పవిత్రమైన విషయాలను మాత్రమే వింటాడు. అందుచేత శుచిశ్రువుడు అనబడతాడు.

## 119. అమృతః

అమృతమయుడు.

**జరామృత్యోర్వారణేన హ్యతృప్తేర్వాపి సేవనాత్**
**అమృతస్యాన్నిరతిశయ మాధుర్యేతి చ సర్వదా ॥**

తన భక్తులకు జరామృత్యువులు లేకపోయినప్పటికీ అమృతమువలె నిరతిశయ మాధుర్యముతో నుండువాడు.

**న మ్రి యతే అనేనేతి అమృతః**

ఆశ్రితులకు మధురముగా ఉండి, జరామరణములు లేకుండా చేయువాడు. ఎంత అనుభవించినప్పటికీ తృప్తి కలగకపోవటంచేత అమృతమువలె ఉండేవాడు.

ఆ పరమేశ్వరుని దర్శించినవారు అమృతపానము గావించిన వారివలె తృప్తిపొందరు.

యోగశాస్త్రములో ఆధారచక్రంలో నిద్రావస్థలో ఉన్నకుండలినీశక్తిని జాగృతం చేసినట్లైతే అది మేల్కొని ఫూత్కారంచేస్తూ గ్రంధిత్రయాన్ని దాటి సహస్రదళపద్మముచేరి, దానియొక్క దుద్దునునోటితో గట్టిగా పట్టుకుంటుంది. ఆ పంటిగాట్ల ద్వారా సహస్రారంలో ద్రవీభవించిన అమృతం క్రిందికి జాలువారి యోగి శరీరంలోని 72వేల నాడీమండలాన్నీ తడుపుతుంది. అప్పుడు యోగి పొందే ఆనందము అనిర్వచనీయము. అనుభవైక వేద్యము. అందుచేతనే అమృతపానముచేసిన వారికి ఎంత పానము చేసినా తృప్తి కలగదు.

అమృతము – జరామృత్యువులు లేనిది. మోక్షము. అని చెప్పబడింది. **బృహదారణ్యకోపనిషత్తు**లో జనకమహారాజు యాజ్ఞవల్క్యుడికి నమస్కరించి దేవా ! మానవుడు మరణాన్ని ఏ రకంగా జయిస్తాడు ? అమృతప్రాయమైన మోక్షము ఏరకంగా వస్తుంది ? వివరించండి అని అడుగుతాడు. దానికి యాజ్ఞవల్క్యుడు........

ఆత్మ ఎప్పుడూ దుర్బలం కాదు. కాని దుర్బలమైనట్లు కనిపిస్తుంది. ఆ స్థితిలో వివేకాన్ని కోల్పోతాడు మానవుడు. అంటే ఏమీ తెలుసుకోలేని స్థితికి చేరతాడు. అదే స్పృహకోల్పోవటము. అప్పుడు వాక్కు మొదలైన ప్రాణాలన్నీ ఆత్మకు ఎదురుగా నిలబడతాయి. అప్పుడు ఇంద్రియాలు తమ తేజస్సును ఉపసంహరించుకుంటాయి. కంటికి అధిదేవత అయిన ఆదిత్యుడు అన్ని వైపుల నుండి వేరైపోతాడు. అంటే కళ్ళను అనుగ్రహించటం మానివేసి ఆదిత్యరూపం పొందుతాడు. అప్పుడు మానవుడికి కంటిచూపు పోతుంది. అంటే నేత్రం లింగాత్మతో ఏకంకాగానే కంటి చూపుపోతుంది. ఘ్రాణేంద్రియం లింగాత్మతో ఏకంకాగానే వాసనచూసే శక్తిపోతుంది. ఊపిరి అందదు. రసేంద్రియం ఆత్మతో ఏకంకాగానే రుచిచూసే శక్తి పోతుంది. గొంతు మ్రింగుడుపడదు. వాగింద్రియం ఆత్మతో ఏకంకాగానే మాటపోతుంది. శ్రోత్రేందిర్యం ఆత్మతో ఏకంకాగానే వినిపించదు. మనస్సు ఆత్మతో ఏకంకాగానే ఆలోచనాశక్తి పోతుంది. త్వగింద్రియం ఆత్మతో ఏకంకాగానే స్పర్శజ్ఞానం పోతుంది. బుద్ధి కూడా ఆత్మతో ఏకంకాగానే అతడికి ఏమీ తెలియదు.

అప్పుడు జీవాత్మ శరీరం నుంచి బయటకు పోవటానికి మార్గం కనిపిస్తుంది. ఆ స్థితిలో ఆత్మ శిరస్సు ద్వారాగాని, మిగిలిన అవయవాల ద్వారా గాని బయటకు పోతుంది. దాంతో పాటే ప్రాణం కూడా బయటకు పోతుంది. ప్రాణం శరీరం నుంచి బయటకు రాగానే ఇంద్రియాలన్నీ శక్తి హీనమవుతాయి. ఆ స్థితిలో జీవుడు మంచి విజ్ఞానవంతుడుగా ఉంటాడు. విజ్ఞానంతో కూడిన ప్రదేశానికి పోతాడు. అతనితోపాటు అతని జ్ఞానము, అతడు చేసిన కర్మ, పూర్వ జన్మ సంస్కారము అతని వెంట వెడతాయి.

గొంగళిపురుగు ఒక ఆకును పూర్తిగా అనుభవించి, దాన్ని నిస్సారం చేసి వేరొక ఆకుమీద ఆశ్రయం సంపాదించి అంటే ఇంకొక ఆకును పట్టుకుని శరీరాన్ని కుంచించి వేస్తుంది. అందువల్ల మొదటి ఆకు నుండి పూర్తిగా ఇవతలకు వచ్చేస్తుంది. అలాగే ఆత్మ తానున్న శరీరాన్ని చంపి, వేరొక శరీరాన్ని ఆశ్రయంగా పొందుతుంది.

బంగారం కరిగించి కొత్త ఆభరణము తయారు చేసినట్లుగా, ప్రస్తుతం ఉన్న శరీరాన్ని పాడుచేసి గంధర్వ, దేవ, బ్రహ్మలోకాలు పొందటానికి అనువైన శరీరాన్ని ఆత్మ ఏర్పాటు చేసుకుంటుంది. ఇది అతను చేసిన కర్మల మీద ఆధారపడి ఉంటుంది. ఉత్తమ కర్మలు చేసినవారు ఉత్తమ జన్మ ఎత్తుతారు. కాగా పాపకర్మలు చేసిన వారు పశువులు, పక్షులు, కుక్కలు, పిల్లులు చివరకు పిశాచాలుగా కూడా జీవిస్తారు.

ఆత్మే బ్రహ్మవిజ్ఞానము. ఈ బ్రహ్మము మనోమయము, ప్రాణమయము, చక్షుర్మయము, శ్రోత్రమయము, పృథివీమయము, జలమయము, వాయుమయము, ఆకాశమయము, తేజోమయము, ధర్మమయము, అధర్మమయము, క్రోధమయము, అక్రోధమయము. ఈవిధంగా సృష్టిలో కనుపించే ప్రతివస్తువు బ్రహ్మమయమే. ఆత్మ పురుషుడు దేనితో తాదాత్మ్యం చెందితే దానిలాగే కనిపిస్తాడు. పుణ్యకర్మలతో తాదాత్మ్యుడైతే పుణ్యాత్ముడు. పాపకర్మలతో తాదాత్మ్యం చెందితే పాపాత్ముడు.

జీవుడు చేసిన కర్మకు తగిన ఫలాన్ని పొంది, మళ్ళీ కర్మ చెయ్యటానికి భూలోకానికి వస్తాడు. భూలోకం కర్మభూమి. ఇతరలోకాల్లో కర్మను చెయ్యలేరు. కోరికలున్న వాడు అతడు చేసిన శుభాశుభాలను బట్టి ఫలితము పొందుతాడు.

కోరికలు లేనివాడు నిష్కాముడు. ఆకాముడు, ఆప్తకాముడు, ఆత్మకాముడు అనబడతాడు. అతడు తత్త్వజ్ఞాని. అతని ప్రాణాలు శరీరం నుంచి ఉత్క్రమించవు. అంటే బయటకు పోవు. అతనికి కర్మశేషం లేదు. కాబట్టి మరుజన్మ ఉండదు. అతడు తత్త్వవేత్త బ్రహ్మజ్ఞాని. బ్రహ్మ స్వరూపాన్ని పొంది బ్రహ్మమే అవుతాడు.

సామాన్యుడి దృష్టిలో తత్త్వజ్ఞాని ప్రాణాలు ఉత్క్రమణి చేసినట్లు ఉంటుంది. కాని అది నిజంకాదు. హృదయంలోని కోరికలు పూర్తిగా నాశనమయ్యేదాకా అతడు మరణిస్తూనే ఉంటాడు. కోరికలు పోయిన తరువాత అమరుడౌతాడు. ప్రస్తుతమున్న శరీరంతోనే అతడు బ్రహ్మను పొందుతాడు. తత్త్వవేత్త పాము కుబుసాన్ని విడిచినట్లుగా కోరికలను విడిచేస్తాడు. అప్పుడు అతనికి శరీరమున్నా లేనట్లే లెక్క. శ్వాస తీసుకున్నా లేనట్లె లెక్క. సంసారం అతన్ని బంధించదు. దీనికంతకూ కారణం కోరికలు లేకపోవటం. అదే ముక్తి.

శరీరం మీద కోరికలు లేనికారణంగా అది చచ్చినట్లే కోరికలు లేవు. కర్మ శేషం లేదు. కాబట్టి మళ్ళీ జన్మలేదు. అదే జీవన్ముక్తి.

జ్ఞాన మార్గాన్ని తెలుసుకోవటం చాల కష్టం. అది చాలా సూక్ష్మమైనది. ఇది మోక్షానికి తీసుకుపోతుంది. జ్ఞానమార్గం ద్వారానే బ్రహ్మవేత్తలంతా జీవించి ఉండగానే ముక్తులైనారు. అంటే కోరికలు నశించి ఆప్తకాములయినారు. కాబట్టి శరీర సంబంధం వదలిపోతుంది. ఇంక ప్రారబ్ధకర్మ క్షయంకాగానే మోక్షం లభిస్తుంది. పునర్జన్మ ఉండదు.

కర్మనుపాసించే వారు అంధకారంలో ప్రవేసిస్తారు. త్రయీవిద్యనుపాసించేవారు అంటే వేదవిహిత కర్మలు చేసేవారు అంధకారంలో పడిపోతారు. ఉపనిషత్తులలో చెప్పిన జ్ఞానమార్గాన్ని వదలి కేవలం కర్మలు, వేదాధ్యయనం చేసేవారు అంధకారంలో కూరుకుపోతారు. వీరు పోయే లోకాలు సుఖం లేనివి. ఘోరమైన అంధకారంతో కూడి ఉంటాయి. కర్మిష్ఠులకు, వేదాధ్యయనపరులకు మోక్షం లభించదు. వీరికి స్వర్గం మాత్రమే లభిస్తుంది. ఆ తరువాత కర్మఫలాన్ని బట్టి జనన మరణాలు కలుగుతాయి. ఇవన్నీ సుఖ దుఃఖాలను కలుగచేస్తాయి. ఆత్మజ్ఞానమే మోక్షానికి ఏకైక సాధనం.

మానవుడు జ్ఞానం ద్వారా 'నేను నిత్యుడను, శుద్ధ బుద్ధ ముక్త స్వభావం గల బ్రహ్మను' అని తెలుసుకోగలిగితే అటువంటివాడు కోరేది ఏదీ ఉండదు. ఆత్మజ్ఞానికి కోరికలు ఉండవు కదా ! అటువంటి జ్ఞాని భోగాలకోసం శరీరం వెంటపడరు. ఆత్మ దర్శియైన సాధకుణ్ణి జననమరణాది దుఃఖాలేవీ బాధించవు.

శరీరము అనేక అనర్థాలతో కూడిన విషమస్థానం. అటువంటి శరీరంలో ప్రవేశించి ఉన్న ఆత్మను గురించి తెలుసుకున్నవాడు వివేకవంతుడు. అతడే మహాజ్ఞాని అతడు కర్మలు చెయ్యకపోయినా చేసినట్లే. లోకమంతా అతనిదే. అతడే సర్వాంతర్యామి అయిన ఆత్మ. ఈ శరీరంలో ఉంటూనే ఆత్మ తత్త్వాన్ని గురించి తెలుసుకున్నవాడు మృత్యువును జయిస్తాడు. అలా ఆత్మను గురించి తెలుసుకోలేనివాడు జనన మరణాది దుఃఖాలు పొందుతూనే ఉంటాడు. గురువు యొక్క ఉపదేశాలు వినటం ద్వారా, శాస్త్రాలు చదవటం ద్వారా ఆత్మను గురించి తెలుసుకోవచ్చు.

పరమాత్మకు లోబడే కాలచక్రం తిరుగుతూ ఉంటుంది. అన్నింటికి వెలుగునిచ్చేవాడు ఆ పరమాత్మయే. అతడు మరణం లేనివాడు, శాశ్వతుడు. కాలనియంత అయిన ఆ పరమాత్మను దేవతలు ఆయుర్దాయంకోసం ఆయుర్బ్రహ్మ రూపంలో ఉపాసిస్తారు.

పరమాత్మలో ఐదేసి చొప్పున ఐదు సమూహాలున్నాయి.

1. గంధర్వులు, పితరులు, దేవతలు, అసురులు, రాక్షసులు.

2. బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్ర, నిషాదులు.

3. ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమానములు.

4. పంచభూతాలు

5. జ్ఞానేంద్రియాలు.

ఇటువంటి ఆత్మయే అవినాశమైన పరబ్రహ్మ. ఇందుకు భిన్నమైనది పరబ్రహ్మకాదు. అవిద్యతో ఉన్నంతవరకు మృతుడుగానే ఉన్నాను. ఇప్పుడు అజ్ఞానం తొలగిపోయింది. కాబట్టి ఈ ఆత్మను తెలుసుకో గలిగిన నేను బ్రహ్మవేత్తను. అమృతుడను.

పరమార్ధ జ్ఞానంతో, పరిశుద్ధమైన మనస్సుతో మాత్రమే గురూపదేశం పొందటం ద్వారా పరబ్రహ్మను దర్శించాలి. పరమార్ధ జ్ఞానము, పరిశుద్ధమైన మనస్సు ఈ రెండూ ముఖ్యం. ఆ తరువాతనే గురూపదేశం. పరబ్రహ్మలో అనేకత్వం లేదు. పరబ్రహ్మలో నానాత్వం చూసేవాడు ఒక మృత్యువు నుండి ఇంకొక మృత్యువుకు పోతాడు. భేదదృష్టికి కారణం అజ్ఞానం. ఆ జ్ఞాని చావుపుట్టుకలతో సతమతమవుతాడు.

బుద్ధిమంతుడైనవాడు బ్రహ్మను గురించి మాత్రమే తెలుసుకొని, ఇతర విషయాలను వదలిపెట్టి, బ్రహ్మ మీదనే మనస్సు లగ్న చెయ్యాలి. ఇతర విషయాలను ఆలోచించకూడదు. ఎక్కువ మాట్లాడితే శ్రమ తప్ప ఇంకే ఫలము ఉండదు.

ఆత్మ పురుషుడు హృదయాకాశంలోనే ఉంటాడు. అతడే ఇంద్రియాలన్నిటికీ అధిపతి అతడు శుభకర్మలవల్ల వృద్ధిపొందదు. అశుభకర్మలవల్ల క్షీణించదు. శుభాశుభాలు అతడికి అంటవు. అతడు సర్వేశ్వరుడు. సర్వభూతాలకు అధిపతి. అట్టి బ్రహ్మను బ్రాహ్మణులు వేదాధ్యయనము, కర్మానుష్ఠానము ద్వారా తెలుసుకోవాలనుకుంటారు. ఆత్మలోకాన్ని కోరేవారు సమస్తాన్ని త్యజించి సన్యసిస్తారు. ఏషణత్రయాన్ని భిక్షాటన చేస్తూఉంటారు. ఆత్మను గురించి మహావాక్యాలలో చెప్పబడింది. ఆత్మ గ్రహించటానికి వీలుకానిది. పట్టుబడనిది. నాశనము లేనిది. దేనిచేత బంధింపబడదు.

ఆత్మజ్ఞానిని సుఖదుఃఖాలు బాధించవు. కష్టసుఖాలకు, పాపపుణ్యాలకు, సుఖదుః ఖాలకు అతడు అతీతుడు. అందుచేత అతడికి కర్మలు ఫలితాన్ని ఇవ్వవు. అతడు కర్మ చేసినా చెయ్యకపోయినా ఒకటే.

బ్రహ్మదర్శనం చేసినవాడు కర్మలు చేస్తే అతడి మహిమ పెరగదు. చెయ్యకపోతే తగ్గదు. ఈ విషయాలు తెలుసుకున్నవాడికి ధర్మాధర్మాలు ఫలితము అంటదు. ఈ విషయం

తెలుసుకున్నవాడు ఇంద్రియ వ్యాపారాలను వదలివేసి, కోరికలు లేనివాడై తనలోనే ఆత్మదర్శనం చేసుకుంటాడు. తనలోనే అందరినీ చూస్తాడు. అతణ్ణి పాపపుణ్యాలు, ధర్మాధర్మాలు అంటవు. అతడు పాపపుణ్యాలకు అతీతుడు. అతడే సమస్త పాపాలను తపింపచేస్తాడు. భస్మం చేస్తాడు. అతడు పాపరహితుడు, వాంఛారహితుడు. అతడే బ్రహ్మవేత్త. ఓ జనక మహారాజా !

బ్రహ్మవేత్త అయినవాడు ఈ శరీరం వదలిన తరువాత బ్రహ్మలోకాలకు పోతాడు. అతడికి జన్మమృత్యు జరాదులుండవు. ఎల్లవేళలయందు అమృతమయమైన బ్రహ్మానందాన్ని అనుభవిస్తాడు. అతడు అమృతమయుడు. రాజా ! అమృతమయుడైన పరబ్రహ్మను గురించి తెలుసుకున్న వాడు కూడా అమృతమయుడే" అని అమృతమయుడైన పరబ్రహ్మను గురించి చెబుతాడు. కాబట్టి తన భక్తులకు జన్మమృత్యుజరాదులు లేకుండా చేసే శ్రీమన్నారాయణుడు 'అమృతః' అనబడుతున్నాడు.

## 120. శాశ్వత స్థాణుః

నిత్యము, స్థిరము అయినవాడు.

**భోగ్యో హ్యపునరావృత్త్యా భోక్తృభ్యో రోచతే యతః ।**
**స్వయం నిత్యస్సదాయోఽసౌ శాశ్వతస్థాణు రుచ్యతే ॥**

తానెప్పుడు నిత్యముగా ఉంటాడు. కాబట్టి తన భక్తులైన నిత్యముక్తులకు పునర్జన్మ లేనటువంటి భోగ్యవస్తువైనవాడు.

**శాశ్వతశ్చాఽసౌ స్థాణుశ్చ శాశ్వతస్థాణుః**

అతడు ఈశ్వరుడు, స్థిరుడు. కాబట్టి శాశ్వత స్థాణువనబడుతున్నాడు.

పరమేశ్వరుడు అమృతమువలె నిత్యమైనవాడు. తన భక్తులకు శాశ్వతమైన స్థిరత్వాన్ని ఇస్తున్నాడు. అంటే వారికి పునర్జన్మ లేకుండా చేస్తున్నాడు. త్రికరణశుద్ధిగా తనను అర్చించిన వారికి అర్హతను బట్టి మోక్షాన్ని ప్రసాదిస్తాడు. ఎవరికైతే సాయుజ్యము లభించిందో వారికి ఉత్తరజన్మ ఉండదు. వారు కూడా పరబ్రహ్మ స్వరూపులే అవుతారు. అటువంటి శాశ్వతత్వాన్ని భక్తులకు కలిగిస్తాడు. కాబట్టి పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు 'శాశ్వతస్థాణుః' అనబడుతున్నాడు.

ఈ విధంగా సాధనము, సాధ్యము అంటే ఉపాయఉపేయాలు రెండూ ఆ పరమేశ్వరుడే. అంటూ వివరించాడు రత్నాకరుడు.

# 16. చతుర్వ్యూహములు

"గురువుగారూ! వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ అనేవి చతుర్వ్యూహములు అంటారు కదా ! వాటిని వివరించండి" అన్నాడు నారాయణభట్టు. వివరించటం మొదలు పెట్టాడు రత్నాకరుడు.

వేదాలలో చెప్పబడిన శివ, శంభు, ఈశ్వర మొదలైన శబ్దాలు లక్ష్మీపతి అయిన శ్రీమన్నారాయణుని ఉద్దేశించి చెప్పినవే కాని వేరుకావు. జగత్తులో సమస్తము శ్రీమన్నారాయణుని అధీనంలోనే ఉంటుంది. సర్వేశ్వరుడికి చెప్పిన సర్వజ్ఞత మొదలైన లక్షణాలన్నీ శ్రీమన్నారాయణుడికే చెందుతాయి. సర్వేశ్వరుడు నియంత. అతడు కేవలము జీవుల సమిష్టి రూపము కాదు. సకల జగత్తునందు అంతర్యామి. సకల జగద్రూపుడు. అటువంటి సర్వేశ్వరుడు.

1. పర 2. వ్యూహ 3. విభవ 4. అంతర్యామి 5. అర్చ

అనే ఐదు అవతారాలుగా ఉంటాడు.

**1. పర :** నీలమేఘశ్యాముడు. చతుర్భుజుడు, పద్మపత్రాక్షుడు, పీతాంబరధారి, శేషశాయి అయి దివ్యమంగళవిగ్రహముగా ఉంటాడు. ఆ పరమపురుషుడికి

| | | |
|---|---|---|
| పురుషుడు (జీవుడు) | – | కౌస్తుభమణి |
| ప్రకృతి | – | శ్రీవత్సచిహ్నము |
| మహత్తు | – | గదాయుధము |
| జ్ఞానము | – | ఖడ్గము |
| అజ్ఞానము | – | కత్తివర |
| తామస అహంకారాలు | – | శార్ఙ్గము, చక్రము |
| ఇంద్రియాలు | – | శరములు |
| భూతములు | – | వనమాల |

ఈ రకంగా ఉన్న సర్వేశ్వరుడు లక్ష్మీసమేతుడై వైకుంఠమునందుంటాడు.

దీనిని 'నిత్యవిభూతి', 'పరావ్యూహము' అంటారు. ఈ ప్రపంచాన్ని లీలావిభూతి అంటారు. అయితే ఈశ్వరుడు ఈ రెండు విభూతులకు నాయకుడు.

శ్రీరామానుజులవారు **శరణాగతి గద్యలో** "సమస్త గుణదోషాలకు దూరమై, కళ్యాణగుణములకు మాత్రము నెలవై తనకన్న వేరైనటువంటి సమస్త వస్తువులకన్న విలక్షణమై, దేశకాలవస్తు పరిచ్ఛేదరహితమై జ్ఞానానందైక స్వరూపమై ఉండే పరమేశ్వరుడు, తనకభిమతమైనది, తగినది, మార్పులేనిది, చింతించనలవికానిది, అప్రాకృతమైనది, అద్భుతమైనది, శాశ్వతమైనది, నిరవద్యమైనది, సాటిలేనిది, ప్రకాశము గల్గినది, సౌందర్యము, లావణ్యము, యవ్వనము మొదలైన గుణాలకు నెలవైనది, అయిన దివ్యమంగళమూర్తి. తనకు మాత్రము స్వభావముగ గలవై అంతకన్న ఎక్కువగా లేనట్టి జ్ఞానము, బలము, ఐశ్వర్యము, వీర్యము, శక్తి, తేజస్సు, సౌశీల్యము, వాత్సల్యము, మృదుత్వము, ఆర్జనము, సౌహార్దము, సామ్యము, కారుణ్యము, మాధుర్యము, గాంభీర్యము, ఔదార్యము, చాతుర్యము, స్థైర్యము, ధైర్యము, శౌర్యము, పరాక్రమము, సత్యకామము, సత్యసంకల్పము, కృతిత్వము, కృతజ్ఞత్వము, అనేటటువంటి అనంతమైన కళ్యాణ గుణాలనబడే ప్రవాహానికి సముద్రము వంటివాడు." అంటూ పరమేశ్వరుని కీర్తించారు.

**2. వ్యూహ :** వ్యూహము అంటే కామమోక్షాలను సృజించగోరినటువంటివాడై, దానికోసం సృష్టిస్థితి లయాలు, శాస్త్రాలు, శాస్త్రార్థాలు, శాస్త్రఫలితాలు, ధ్యానము, ఆరాధన, లీల అనే పనులకు తగినట్లుగా తన రూపాన్ని, గుణాలను విభజించుకుని, లీలావిభూతిని నిర్వహించి ముక్తికి సాధనమై 1. వాసుదేవ 2. సంకర్షణ 3. ప్రద్యుమ్న 4. అనిరుద్ధ అని నాలుగు రకాలుగా ఉండే స్థితి. దీనిలో వాసుదేవుని వ్యూహము – పరమపదము. మిగిలిన మూడు క్షీరాబ్ధిలోని శ్వేతద్వీపము అని, వ్యూహవైకుంఠమని, విష్ణులోకమని, అవతారకందమని పిలువబడే స్థానము. ఇక్కడనుంచే అవతారాలు వస్తాయి. ఈవ్యూహాలలో

1. వాసుదేవుడు – మోక్షప్రదాత కాగా
2. సంకర్షణుడు – జ్ఞానము, బలము
3. ప్రద్యుమ్నుడు – ఐశ్వర్యము, వీర్యము
4. అనిరుద్ధుడు – శక్తి, తేజస్సులను ఇస్తారు.

ఇదే షాడ్గుణ్యపూర్తి.

**3. విభవ :** ప్రపంచములో ధర్మానికి హాని కలిగినప్పుడు, దుష్టశిక్షణ, శిష్టరక్షణచేసి ధర్మసంస్థాపన చెయ్యటం కోసము వైకుంఠములో ఉన్న సర్వేశ్వరుడు భూలోకానికి రావటమే 'విభవము' అంటారు. తనయొక్క షడ్గుణైశ్వర్యాది దైవసంపదకు ఎటువంటి లోపము కలుగకుండ అనేకరూపాలతో, అనేకసార్లు ఈ భూలోకములో అవతరించాడు. ఈ

అవతారాలు ఏ పని పూర్తి చెయ్యటానికి వచ్చినాయో, ఆ పని పూర్తికాగానే ఆ అవతార సమాప్తి కూడా జరుగుతుంది. రాముడు, కృష్ణుడు మొదలైన అవతారాలు ఈ కోవకు చెందినవే. జీవులు తమ కర్మానుసారము జన్మిస్తారు. కాని భగవంతుని అవతారము అలాకాదు. అవతారములోని శరీరము పాంచభౌతికమైనది కాదు. శుద్ధ సత్త్వప్రధానమైనది. ఈ అవతారాలు రెండు రకాలు 1. ప్రాదుర్భావములు 2. ఆవేశములు.

1. ప్రాదుర్భావము అంటే – ఒక జీవునిద్వారా గాక సాక్షాత్తు స్వరూపము ధరించటము. దీనిలో మళ్ళీ 1. పూర్ణము. 2. అంశము అని రెండు రకాలున్నాయి. నృసింహ, రామ, కృష్ణ అవతారాలు పూర్ణావతారాలు. మత్స్య, కూర్మాది అవతారాలు అంశావతారాలు.

2. ఆవేశము అంటే – జీవుని ద్వారా అవతార పరిగ్రహము. ఇది మళ్ళీ రెండు విధాలు. 1. స్వరూపావేశము 2. శక్త్యావేశము.

ఏ శరీరములో భగవదంశ ప్రవేశిస్తున్నదో అది స్వరూపావేశావతారము. ఉదా॥ పరశురాముడు.

ఎవని యందు భగవంతుని శక్తి ప్రవేసిస్తుందో అది శక్త్యావేశావతారము. ఉదా॥ కృష్ణద్వైపాయనుడు.

**4. అంతర్యామి :** చేతనాచేతనాత్మకమగు ఈ ప్రపంచములోని అన్నింటియందు అంతర్యామిగా ఉండి వాటి స్థితి, ప్రవృత్తి, నివృత్తులకు హేతువై సాక్షీభూతుడై ఉండటము.

ఈశ్వరుడు అన్ని జీవులయందు నీలమేఘము మధ్యన మెరుపుతీగలా ఉంటాడు. నమ్మాళ్వారు చెప్పిన దాని ప్రకారము **ఒరువనడి యేనుళ్ళానే** అనగా – అద్వితీయుడైన ఆశ్రీపతి, దాసులయొక్క హృదయమందు ఉన్నాడు. **అడియేనుళ్ళా నుడలుళ్ళా నండగత్తాన్ పురుత్తుళ్ళాన్** – అండాతరవర్తులైన సకల పదార్థములకు అంతర్యామి, అండ బహిర్భూతములైన మహదాదులకు అంతర్యామి అయిన ఆ శ్రీపతి, దాసునియొక్క హృదయమందు, శరీరమందు ఉన్నాడు. సర్వాంతర్యామియైన సర్వేశ్వరుని స్వరూపమును భావించుకుని అనుసంధానము చేసుకోవటానికి శక్తిలేనివారు హృదయపద్మము నందుండు నీలమేఘశ్యాముడు, చతుర్భుజుడు, శంఖము, చక్రము మొదలైన ఆయుధములు ధరించినవాడు అయిన సర్వేశ్వరుని అష్టాంగయోగము వలన, ధ్యానమువలన అనుసంధానము చేసుకుంటారు.

**5. అర్చావతారము :** అందరికీ కంటికి కనిపిస్తూ, ఆశ్రయించిన వారి కోరికలు తీర్చటానికి వారు కోరిన రూపాలు ధరించి, వారి ఆనందము కోసము సర్వజ్ఞుడైన తాను అజ్ఞానిలాగా, సర్వశక్తిమంతుడైకూడా–అశక్తుడిలాగా నిరపేక్షకుడైనతాను – అపేక్షకునిలాగా, ఆలయాలలో ప్రతిష్టించి పూజించబడటానికి వీలుగా విగ్రహరూపము ధరించటము.

విభవావతరాలు ఎప్పుడు కావాలంటే అప్పుడు వచ్చేవి కావు. అందుచేత అవతారము లేని కాలములో వారి దర్శనం జరగదు. కాబట్టి భక్తులను అనుగ్రహించటం కోసం అర్చావతారము దరిస్తాడు. అంటే–శిలారూపంలో ఆరాధన కోసము తిరుముఖమండలము, తిరునేత్రములు, చతుర్భుజములు, శంఖుచక్రములు మొదలైన ఆయుధాలతో భక్తులకు దర్శనమివ్వటానికి, వారిచేత ఆరాధించబడటానికి అనకూలముగా ఉండటము. ఇటువంటి అర్చామూర్తికి కైంకర్యము చెయ్యటము – వైకుంఠములో ఉన్న లక్ష్మీనారాయణునికి కైంకర్యము చేయటం వంటిదే.

ఇప్పుడు చెప్పిన 1. పర 2. వ్యూహ 3. విభవ 4. అంతర్యామి అవతారాల కన్న దేవాలయములోను, ఇండ్లలోను కంటికి కనిపించే అర్చావతారములే శ్రేష్ఠమైనవి. ఎందుకంటే – ఆ అవతారాలను ఆ సమయంలోనే దర్శించాలి. అలాకాక అర్చావతార మూర్తులను భక్తులు ఎప్పుడైనా దర్శనం చేసుకోవచ్చు. బాగా దాహంతో ఉన్నవాడికి భూగర్భంలో నుంచి అప్పుడే తోడిన నీరులాగా ఈ అర్చావతారము భక్తులకు ఆనందాన్ని కలిగిస్తుంది.

ఇక్కడ చెప్పినటువంటి వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ వ్యూహాలను 121 నుంచి 126 వరకు నామాలలో వివరించటం జరిగింది. 127 నుంచి 144 వరకు నామాలలో సంకర్షుని శాస్త్రప్రదాతృత్వము చెప్పారు. అంటే సంకర్షణుడు లోకాలకు వేదాలు, శాస్త్రాలు ప్రసాదిస్తాడు. అతడు వేదాల అర్థాన్ని పూర్తిగా తెలిసినవాడు. వేదాల అర్థాలు తెలుసుకోవటానికి శిక్షణ, వ్యాకరణము వంటి వేదాంగాలు తానే కల్పించాడు. తాను వేదాలను అంగములుగా, శరీరముగా గలవాడు. అంటే వేదమూర్తి. అంతేకాదు వైదికధర్మాన్ని అనుష్టింపచేసేవాడు. పండితుడు, కవి. అతడు లోకాలకు అధిపతి. దేవతలకు అధిపతి, ధర్మానికి అధిపతి. ప్రవృత్తి, నివృత్తి ధర్మస్వరూపుడు. పరమేశ్వరుడైన వాసుదేవుడు వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ అని నాలుగురూపాలు గలవాడు. నాలుగు వ్యూహాలు గలవాడు. నాలుగు కోరలు, నాలుగు భుజాలు గలవాడు. దేదీప్యమానంగా ప్రకాశిస్తుంటాడు. తన భక్తులచే ఆనందంగా భజించబడుతూ ఉంటాడు. భక్తులు అర్పించేది

స్వల్పమైనా, అల్పమైనా ప్రేమతో ఆరగిస్తాడు. తన భక్తులు హద్దుమీరి ప్రవర్తించినా వారియందున్న మమకారంతో వారిని సహిస్తాడు.

ఇంతవరకు వ్యూహవైభవము చెప్పి ఇప్పుడు 145 నుంచి 150 వరకు నామాలలో పరమేశ్వరుని విభవము చెబుతున్నారు.

పరమేశ్వరుడు చరాచరజగత్తుకు ఆదియైనవాడు. బ్రహ్మాదిదేవతలను ఆయనే నియమించాడు. అతడు నిష్కళంకుడు. పాపరహితుడు. జయకారణుడు. సమస్త దేవతల విజయానికి కారణమైనవాడు. బ్రహ్మ, రుద్రాదులను తన ఇష్టానుసారము నియమించిన వాడు. ఆ పరమేశ్వరుడే జగత్కారణుడు. బ్రహ్మాది దేవతలలోనే కాకుండా జీవులందరిలోనూ అంతర్యామిగా ఉంటాడు. ఈ విషయాలను 121 నుంచి 150 వరకు గల నామాలలో వివరించటం జరిగింది.

ఇక నామాలను చూద్దాం.

## 121. వరారోహః

శ్రేష్ఠమగు ప్రాప్తినిగలవాడు.

**పరమంత్కృష్ట మారోహం యస్య స్వప్రాప్తి లక్షణమ్**
**వర్తతే న వరారోహః ప్రకృష్ట స్థానదోమనుః ॥**

అన్నింటికీ మిన్న అయిన తనను పొందుట అనే ఊర్ధ్వప్రాప్తి కలవాడు.

**వరః ఆరోహః యస్యసః వరారోహః** శ్రేష్ఠమైన ఆరోహము కలవాడు.

ధర్మార్థకామ మోక్షములనేవి చతుర్విధ పురుషార్థాలు. వీటిలో మొదటి మూడింటికన్నా నాల్గవది అత్యుత్తమమైనది.

**ఏతేవై నిరయాస్తాత స్థానస్య పరమాత్మనః**

పరమేశ్వరుని యొక్క సాయుజ్యముతో పోల్చి చూసినట్లైతే మిగిలినవన్నీ నరకప్రాయమైనవి.

పరమేశ్వరుని చేరిన భక్తులు అతని వడిలో కూర్చుంటారు. అది మహాభాగ్యము. పరమాత్ముని చేరిన వారికి పునరుత్పత్తి అంటే ఉత్తర జన్మ ఉండదు. **ఛాందోగ్యోపనిషత్తు**లో ఈ విషయం వివరించబడింది.

పూర్వకాలంలో ఒకసారి ప్రజాపతి ఆత్మతత్త్వాన్ని గురించి ఒక ప్రకటన చేశాడు.

"ఆత్మకు పాపం అంటదు. ముసలితనం రాదు. మృత్యువు దాన్ని కబళించదు. శోకం తాకదు. దానికి ఆకలి దప్పికలు లేవు. మానవుడు సత్యకాముడు, సత్య సంకల్పుడు అయి ఆత్మజిజ్ఞాసను అలవరచుకోవాలి. ఆత్మకోసం అన్వేషించినవాడు. ఆత్మను అనుభవించినవాడు ఆత్మస్వరూపాన్ని పొందుతాడు. పూర్ణస్థితి అతనికి వస్తుందన్నమాట."

దేవతలు, రాక్షసులు కూడా ఆ మాటలు విన్నారు. "ఆత్మను గురించి మనం కూడా అన్వేషిద్దాం. ఆత్మవల్ల అన్ని కోరికలు తీరతాయని బ్రహ్మచెప్పాడు కదా !" అని వారు భావించారు.

దేవతలరాజు ఇంద్రుడు, రాక్షసుల రాజు విరోచనుడు ఇద్దరూ ఆత్మజ్ఞానం సంపాదిద్దామని చేతితో దర్భలు పట్టుకుని బ్రహ్మవద్దకు వెళ్ళారు. బ్రహ్మ వీరిద్దరినీ ముప్పైరెండు సంవత్సరాలు, బ్రహ్మచర్యదీక్ష వహించమని చెప్పాడు. దీక్ష పూర్తి చేశారిద్దరూ.

"వత్సలారా ! మీరు నా కోసం దేనికి వచ్చారు ?" అన్నాడు బ్రహ్మ.

"భగవాన్ ! ఆత్మ తత్త్వాన్ని గురించి చెప్పిన విషయాలు విన్నాం. ఆత్మను గురించి ప్రత్యక్షంగా తమ నోటి మీదుగా వినాలని వచ్చాం" అన్నారు. ఇంద్ర విరోచనులు.

"మనుష్యుల కనుపాపలలో మెదలుతూ కనుపించే పురుషుడే ఆత్మ. ఆత్మ అభయం. అమృతమయం. అదే బ్రహ్మం" అన్నాడు బ్రహ్మ.

అది విన్నవారు "భగవాన్ ! నీటిలో కనుపించే ప్రతిబింబం, అద్దంలో కనిపించే ప్రతిబింబం. ఈ రెంటిలో ఏది ఆత్మరూపం ?" అని అడిగారు.

"నేను మొదటగా కళ్ళలో మెరిసే ఏ పురుషుని వర్ణన చేశారో వీటన్నింటిలోనూ ప్రతి ఫలించేది ఆ పురుషుడే. ఒకసారి నీళ్ళలోను, అద్దంలోను మీ రూపాలు చూసుకుని మీ అనుభవాలు నాకు చెప్పండి" అన్నాడు బ్రహ్మ. ఇంద్ర విరోచనులిద్దరూ అలాగే చేసి ప్రజాపతి దగ్గరకు వెళ్ళారు. ప్రజాపతి వీరిని చూసి "మీరు ఏం చూశారు?" అన్నాడు.

నఖశిఖ పర్యంతము కేశపాశాలతో మా శరీరాల ప్రతిరూపమే మాకు నీళ్ళలోనూ, అద్దంలోనూ కూడా కనిపించింది" అన్నారు వారు.

"నాయనలారా ! శరీరాలు శుభ్రపరచుకుని, మంచి వస్త్రాలు ఆభరణాలు ధరించి నీటిలో మీ ముఖాన్ని చూసుకోండి. తరువాత ఏంచూశారో నాకు చెప్పండి" అన్నాడు బ్రహ్మ 'అలాగే' అని చెప్పి ఇద్దరూ వెళ్ళిపోయారు. మరునాడు తిరిగి వచ్చి "స్వామీ ! ఈ చక్కని వస్త్రాలతో ఆభరణాలతో అలంకరించిన మా శరీరాలే నీటిలో కనిపించాయి." అన్నారు.

"ఆభయమూ, అమృతమయమూ అయిన ఆత్మ అదే, అదే బ్రహ్మము" అన్నాడు ప్రజాపతి.

అదివిన్న ఇంద్ర విరోచనులు ఆత్మను గురించి తమకు అంతా తెలిసిందనుకుని తిరిగి వెళ్ళిపోయారు. అలా వెళ్ళిపోతున్నవారిని చూసి "అసలు ఆత్మజ్ఞానం లభించకుండానే వారు తెలిసింది అనుకుని వెళ్ళిపోతున్నారు. వారు దేవతలైనా, రాక్షసులైనా శరీరాన్నే ఆత్మ అని భావించటం పతన హేతువు" అనుకున్నాడు.

విరోచనుడు ఆత్మని గురించిన ఈ సిద్ధాంతంతోనే తృప్తి చెంది, రాక్షస జాతికంతటికీ ఈ సిద్ధాంతాన్నే బోధించాడు. అసలైన పరమ సత్యం తనకు లభించిందని తృప్తి చెందాడు. దేహమే ఆత్మ అని ప్రచారం చేశాడు.

ఇంద్రుడు దేవలోకానికి బయలుదేరాడు. దారిలో తాను నేర్చుకున్న దానిలో ఏదో లోపం కనిపించింది. తను నేర్చుకున్న సిద్ధాంతాన్ని ఒకసారి సమీక్షించు కున్నాడు. విషయాన్ని విమర్శచేసి చూశాడు. బాగా అలంకరించుకుంటే అలంకరించినట్లు, మంచి వస్త్రాలు ధరిస్తే ధరించినట్లు, కుంటివాడైతే కుంటివాడిలాగా, గ్రుడ్డివాడైతే గ్రుడ్డివాడిలాగా శరీర ప్రతిబింబం కనిపిస్తుంది. మరణానంతరం శరీరం లేనప్పుడు ఆత్మ ఏమౌతుంది. మృత్యువువాత పడే ఈ శరీరాన్ని అమృతమయమగు ఆత్మ అనటంలో అర్ధంలేదు. ఇంద్రుడి సంశయాలు తీరలేదు. సంతృప్తి లభించలేదు. వెనక్కి తిరిగి ప్రజాపతి దగ్గరకు వెళ్ళి నుంచున్నాడు.

తిరిగి వచ్చిన ఇంద్రుణ్ణి చూసి ప్రజాపతి "ఇంద్రా ! నువ్వు విరోచనుడితో వెళ్ళిపోయావు కదా ! మళ్ళీ ఎందుకు తిరిగి వచ్చావు ?" అని అడిగాడు.

ఇంద్రుడు తన అనుమానాలన్నీ వివరించాడు. "ప్రభూ ! శరీరంలోగాని, శరీరచ్ఛాయలో గాని నాకు ఏమీ విశేషం కనబడలేదు. అందుకని గతంలో నేర్చుకున్నది తృప్తిని కలిగించలేదు. ఆత్మజ్ఞానాన్ని మీవద్ద అభ్యసించాలని మళ్ళీవచ్చాను" అన్నాడు.

ఇంద్రుడి జిజ్ఞాసకు ఆనందించాడు బ్రహ్మ. ఇంద్రుణ్ణి మళ్ళీ ముప్ఫైరెండు సంవత్సరాలు బ్రహ్మచర్యదీక్ష పాటించమన్నాడు. ఇంద్రుడు దీక్షతో బ్రహ్మవద్దనే గడిపాడు. దీక్ష పూర్తి అయిన తరువాత ప్రజాపతి ఇంద్రుడితో "స్వప్న ప్రపంచంలో ప్రభువులాగా స్వేచ్ఛగా విహరించే చైతన్యమే ఆత్మ" అన్నాడు.

ఈ మాటతో ఇంద్రుడు తృప్తిపడి తిరిగి వెళ్ళిపోవటానికి బయలుదేరాడు. అలా వెడుతుంటే త్రోవలో మళ్ళీ అనుమానం వచ్చింది. "స్వప్నాలు అనుభవించే చైతన్యమే

ఆత్మ ఎలా అవుతుంది. మనకు ఒక్కొక్కసారి కలలో ఎవరో పీడిస్తునట్లు వినిపిస్తుంది. మనం దుఃఖిస్తాము. పాపరహితము, అభయము అయిన ఆత్మ ఈ రకంగా దుఃఖించటంలో అర్థం లేదు. ఇది సత్యంకాదు" అనిపించింది. మళ్ళీ తిరిగి వచ్చాడు ఇంద్రుడు. ప్రజాపతి ఆదేశం మేరకు మళ్ళీ కొన్ని సంవత్సరాలు బ్రహ్మచర్య దీక్ష గడిపాడు. అప్పుడు ప్రజాపతి ఇంద్రుడితో ఈ విధంగా చెప్పాడు. "గాఢసుషుప్తిలో సంతృప్తిగా ఆనందాన్ని అనుభవించేదే ఆత్మ."

ఇంద్రుడు ఈమాట నిజమే అని నమ్మి దేవలోకానికి బయలుదేరాడు. మార్గమధ్యంలో ఇంద్రుడికి మళ్ళీ అనుమానం వచ్చింది. గాఢనిద్ర అనుభవిస్తున్నదే ఆత్మ అనుకుంటే ఆత్మ తనను తాను తెలుసుకోలేని స్థితిలో ఉంటుందన్నమాట. తనను గురించి తాను తెలుసుకోలేని అవ్యక్తతత్త్వం ప్రకాశవంతమైన ఆత్మ ఎలా అవుతుంది ? ఈ అనుమానంతో ఇంద్రుడు తిరిగి ప్రజాపతి దగ్గరకు వచ్చాడు. ఈ సారి ప్రజాపతి ఇంద్రుణ్ణి కేవలం ఐదు సంవత్సరాలు తన దగ్గర బ్రహ్మచర్య దీక్షతో ఉండమన్నాడు.

గడువు పూర్తయింతరువాత ఇంద్రుడి పట్టుదలకు మెచ్చి ఆత్మతత్త్వాన్ని పూర్తిగా వివరించాడు.

ఇంద్రా ! నీ పట్టుదలకు మెచ్చాను. ఆత్మానుభవం పొందటానికి నువ్వు పూర్తిగా అర్హుడవు. శరీరం అశాశ్వతమైనది. అఖరుక్షణాలు ఆసన్నంకాగానే శరీరాన్ని మృత్యువు కబళిస్తుంది. శాశ్వతమైన ఆత్మకు అశాశ్వతమైన శరీరమే ఆవాసం. శరీరం ఉన్నంత కాలంలో ఆత్మకు సుఖదుఃఖాలు, గుణదోషాలు అంటినట్లూ, వాటితో సతమతమవుతున్నట్లు కనిపిస్తుంది. ఆత్మ శరీరంతో సంబంధం ఏర్పరచుకోవటం వల్లనే జీవులకు సుఖదుఃఖాలు ఏర్పడతాయి. శరీరం ఆత్మనుండి విడివడితే ఈ బంధంనుండి విముక్తి లభిస్తుంది.

భౌతిక విషయాలనుండి విముక్తి పొంది ఆత్మను మనస్సుకు, ఇంద్రియాలకు విలక్షణమైనదిగా గ్రహించి, తేజోమయమని భావించి అనుభవజ్ఞుడు ఆనందిస్తాడు. ఆత్మజ్ఞానం పొందినవాడు ముక్తి సామ్రాజ్యంలో విహరిస్తాడు.

శాస్త్రోక్తంగా గురుకులవాసం పూర్తిచేసి, పెండ్లాడి, గృహస్థుడయి, పవిత్రమైన చోట సాధ్యయనం చేస్తూ, పుత్రుల్ని, శిష్యుల్ని ధర్మపరాయణులుగా తీర్చిదిద్దుతూ, ఇంద్రియాలను అదుపుచేసి, శాస్త్రవిరుద్ధమైన జీవహింస చేయకుండా జీవితాన్ని గడిపేవాడు. చివరకు బ్రహ్మలోకం పొందుతాడు. అక్కడ నుండి మళ్ళీ తిరిగిరాడు. ఈ విధంగా అర్చిరాది మార్గం ద్వారా బ్రహ్మలోకం చేరిన ఉపాసకుడు, బ్రహ్మలోకమున్నంతవరకు అక్కడ

దివ్యభోగాలనుభవించి, తరువాత పరబ్రహ్మలో లీనమవుతాడు. అతడికి పునరావృత్తి ఉండదు. అని ప్రజాపతి, దేవేంద్రుడికి ఆత్మజ్ఞానాన్ని ఉపదేసించాడు.

కాబట్టి పరబ్రహ్మను చేరిన వారికి పునర్జన్మ ఉండదు. **భగవద్గీత**లో 15వ అధ్యాయమైన **'పురుషోత్తమప్రాప్తి యోగము'**లోని 6వ శ్లోకము.

**న తద్భాసయతే సూర్యో న శశాఙ్కో న పావకః**

**యద్గత్వా న నివర్తన్తే తద్ధామ పరమం మమ ॥**

స్వయంప్రకాశరూపమైన నా పరంధామమును సూర్యుడుగాని, చంద్రుడుగాని, అగ్నిగాని ప్రకాశింపచేయలేరు. అటువంటి పరంధామమును చేరిన పుణ్యాత్ములు మరల ఈ జగత్తున ఉద్భవించరు.

పరబ్రహ్మ స్వరూపమైన పురుషోత్తముని చంద్ర, సూర్యాగ్నులు ప్రకాశింప చేయలేరు. అంటే అది అప్రమేయము, అచింత్యము, అనిర్వచనీయము. ఆ పరంధామాన్ని ప్రకాశింప చేసే శక్తి మరిదేనికీలేదు. అది స్వయంప్రకాశమైనది. దాని కాంతులవలననే చంద్ర సూర్యాగ్నులు మొదలైన వాటికి ప్రకాశము వస్తుంది. **పరబ్రహ్మోపనిషత్తు**లో చెప్పినట్లుగా

**యతోవాచో నివర్తన్తే అప్రాప్యమనసాసహ** ఆ పరమాత్మను మనస్సు, వాక్కు మొదలైన ఇంద్రియాలు కూడా చేరలేవు. **కేనోపనిషత్తు**లో

**న చక్షుర్గచ్ఛతి న వాగ్గచ్ఛతి నోమనః** "ఆత్మ ఉన్నచోటికి కనులుగాని, వాక్కుగాని, మనసుగాని వెళ్ళలేవు. అంటే ఆత్మ ఇంద్రియాలతో తెలియబడేదికాదు" అని చెప్పబడింది.

ఆత్మ వీటన్నింటికీ అతీతమైనది. అందుచేతనే దాని స్వరూపాన్ని వివరించటానికి వీలుకాదు. ఆత్మను చేరిన వారికి పునర్జన్మ ఉండదు. అటువంటి ఉత్తమ ఆరోహణము (మోక్షము) ఎవనియందు కలదో అటువంటివాడు. అందుకే శ్రీమన్నారాయణుడు 'వరారోహః' అనబడుతున్నాడు. ఈనామములో పరా వాసుదేవుని విషయము చెప్పబడింది.

## 122. మహాతపాః

పూజ్యమగు స్థానము గలవాడు.

**మహత్పూజ్యం తపోజ్ఞానం యస్యేతి స మహాతపాః ॥**

పూజ్యమైన జ్ఞానము గలవాడు. బద్ధులయొక్క సంసార దుఃఖాలను తొలగించాలి అనే సంకల్పము గలవాడు.

**మహత్ పూజ్యమ్ తపః జ్ఞానం యస్యసః మహాతపాః** మహత్ అనగా – పూజ్యము, తపః అంటే – జ్ఞానము. పూజ్యమగు జ్ఞానము గలవాడు.

ఈ నామంలో జ్ఞానాన్ని వివరిస్తున్నాడు. మామూలు అర్థంలో జ్ఞానము అంటే ఆత్మజ్ఞానము. తానెవరు ? ఎక్కడి నుంచి వచ్చాడు ? మరణించిన తరువాత ఎక్కడికి పోతాడు ? ఈ సృష్టికి మూలకారణము ఎవరు ? ఇత్యాది ప్రశ్నలకు సమాధానం పొందటమే మహాజ్ఞానము. కాని ఇక్కడ జ్ఞానము అంటే – సంసారసాగరంలో పడికొట్టుమిట్టాడుతున్న తన భక్తులను ఆ లంపటంలోనుంచి బయటపడేయాలనే కోరిక.

తన భక్తుల కష్టాలు తీర్చి వారిని బంధవిముక్తులుగా చెయ్యాలనే కోరిక గలవాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు "మహాతపాః" అనబడుతున్నాడు.

**ముండకోపనిషత్తు**లో శౌనకుడు అంగిరసమహర్షి దగ్గరకు పోయి "గురుదేవా! దేన్ని గురించి తెలుసుకుంటే సర్వమూ తెలుస్తుందో దాన్ని దయచేసి నాకు తెలియచెయ్యండి" అని అడుగుతాడు. దానికి అంగిరసుడు "లోకంలో తెలుసుకోవలసిన విద్యలు రెండున్నాయి. 1. పరావిద్య 2. అపరావిద్య.

పరమేశ్వరునికి సంబంధించినది పరావిద్య. జ్ఞానేంద్రియాలకు లొంగనిది, కర్మేంద్రియాల విషయం కానిది, గోత్రము, వర్ణము, నేత్రములు, శ్రోత్రములు, కాళ్ళు చేతులు లేనిది, నిత్యమై అన్నింటియందు ఉన్నది. సూక్ష్మాతి సూక్ష్మమైనది, అవ్యయమైనది, పంచభూతాలకు కారణమైనది, పరబ్రహ్మతత్త్వము. అట్టి పరబ్రహ్మతత్త్వాన్ని జ్ఞానియైనవాడు సర్వత్ర చూడగలడు" అని చెబుతాడు.

ఈ రకంగా జ్ఞానియైనవాడు మాత్రమే పరమేశ్వరుని దర్శించగలుగుతాడు. ఆ పరమేశ్వరుడు మహాజ్ఞాని. మహాప్రళయకాలంలో కర్మక్షయం కాకుండా తనలో లీనమయిన జీవులకు కర్మక్షయం చేసి, వారికి మోక్షం కలిగించాలనే కోరికతోనే ఈ సృష్టి చెయ్యాలని సంకల్పించాడు. అందుచేతనే పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు 'మహాతపాః' అనబడుతున్నాడు. ఈ నామంలో సంకర్షణమూర్తికి గల జ్ఞానము వివరించబడింది.

## 123. సర్వగః

అన్నింటినీ చేరువాడు.

**ధారయన్ సంహృతాద్యోవై గచ్ఛతీతి స సర్వగః** అన్నింటిని తన శక్తితో ధరించి, సంహరించి, మళ్ళీ సృష్టించి వాటియందు ప్రవేసించువాడు.

**సర్వాన్ గచ్ఛతీతి సర్వగః** అన్నింటినీ చేరేవాడెవరో అతడు 'సర్వగః' అనబడతాడు.

పరమేశ్వరుడు సృష్టి స్థితి లయకారకుడు. బ్రహ్మగా ఈ జగత్తును సృష్టి చేస్తున్నాడు. విష్ణువుగా లోకాలను కాపాడుతున్నాడు. రుద్రుడుగా లయం చేస్తున్నాడు. మరణించిన జీవులన్నీ తమతమ పాపపుణ్యాలు అనుభవించిన తరువాత, కర్మశేషము అనుభవించటానికి వాటికి పునర్జన్మనిస్తున్నాడు. జీవుల కర్మను క్షయం చేసి వాటికి మోక్షం కలిగించాలనే దృష్టితోనే వాటికి ఉత్తమజన్మలనిస్తున్నాడు. ఈ రకంగా జీవులను సృష్టించి వాటియందు తాను ప్రవేసిస్తున్నాడు. **ఐతరేయోపనిషత్తు**లో జీవాత్మ, పరమాత్మరెండూ ఒక్కటే. మరణాంతరము మానవుని జీవాత్మపరమాత్మలో లీనమైపోతుంది. ఆత్మయే ఆలోచనా పూర్వకంగా ఈ లోకాలను సృష్టించింది. సృష్టి జరగటానికి ముందు ఈ జగత్తు అంతా బ్రహ్మమయంగానే ఉండేది. దానికి భిన్నమైన పదార్థం ఏమీలేదు. దాన్నే ఆత్మ అనికూడా అంటారు. ఆ ఆత్మయే లోకాలను సృష్టించాలనుకుంది. కొంతకాలానికి ఆత్మ అంభస్సు, మరీచి, ఆపః, మర అనే పేర్లు గల లోకాలను సృష్టించింది. ద్యులోకానికి అవతల ఉన్నది అంభస్సు, దానికి ఆశ్రయము స్వర్గము. అదే సువర్లోకము. దానికింద భువర్లోకమున్నది. దాని కింద భూలోకమున్నది. ఇది మరము అంటే మరణము గుణముగా గలది. ఇక్కడ పుట్టిన ప్రతిప్రాణీ మరణిస్తుంది. భూలోకానికి క్రింద జలలోకమున్నది. అది క్రిందనున్న లోకాలచే పొందబడుచున్నది కాబట్టి అపోలోకమనబడుతుంది. ఈ లోకాలన్నీ పంచభూతాలచే నిర్మించబడ్డాయి.

లోకాలను సృష్టించిన తరువాత "ఈ లోకాలను రక్షించే వాళ్ళు లేకపోతే అవి నాశనమయిపోతాయి. కాబట్టి లోకపాలకులను సృష్టించాలి" అని ఆలోచించి, పంచభూతాలలోనూ ప్రధానమైనదైన జలాన్ని తీసుకుని దానితో అవయవాలు గల ఒక మానవాకారాన్ని సృష్టించింది. ఆ ఆకారమే "విరాట్స్వరూపము". ఇక ఇంద్రియాధిష్టాన దేవతా సృష్టి ఏ విధంగా జరిగింది అంటే.....

పరమాత్మ ఈ విరాట్స్వరూపాన్ని దృష్టిలో ఉంచుకుని తీవ్రమైన ఆలోచన చేశాడు. అదే తపస్సు. దాని ఫలితంగా విరాట్స్వరూపానికి నోరు వచ్చింది. ఆ నోటి నుండి మాట, మాట నుండి వాణికి అభిమాన దేవత అయిన అగ్ని ఉత్పన్నమైనాయి. తరువాత ముక్కు రంధ్రాలు వచ్చాయి. వాటి నుండి ప్రాణం ఉత్పన్నమైనది. అనగా వాసన చూసే శక్తి పుట్టింది. ఆఘ్రాణశక్తి నుండి వాయువు పుట్టింది. తరువాత నేత్రాలు ఏర్పడ్డాయి. వాటి నుండి సూర్యుడు ఉద్భవించాడు.

తరువాత చెవులు, వాటి నుండి దిక్కులు ఏర్పడ్డాయి. ఆ తరువాత చర్మం, దాని నుండి స్పర్శకు కారణమైన రోమాలు ఏర్పడ్డాయి. చర్మము నుండే ఓషధులు, వనస్పతులు పుట్టినాయి. ఆ తరువాత హృదయం, దాని నుండి మనస్సు, దాని నుండి చంద్రుడు పుట్టారు. తరువాత నాభి, దాని నుండి అపానము, దాని నుండి మృత్యువు ఉద్భవించాయి. ఆ తరువాత పురుష జననేంద్రియము దాని నుంచి వీర్యము, దానికి అధిష్ఠానమైన జలము పుట్టాయి. ఈ రకంగా విరాట్స్వరూపుని అవయవాల నుండి ఇంద్రియాలు వాటి నుండి అభిమాన దేవతలుపుట్టారు.

ఈ విధంగా పరమేశ్వరునిచే లోకపాలకులుగా సృష్టించబడ్డ అగ్ని మొదలైన ఇంద్రియాభిమానులైన దేవతలు అవిద్యతోకూడిన మహాసముద్రంలో పడ్డారు. దానికి అంతం లేదు. అది ఇంద్రియాలవల్ల కలిగే క్షణిక సుఖాలతో కూడి ఉంటుంది.

పరమేశ్వరుడు ఆ విరాట్స్వరూపానికి ఆకలి దప్పికలు కలిగేలా చేశాడు. అప్పుడు దేవతలందరూ "మేము కూర్చుని భుజించేటందుకు వీలుగా, మాకు తగిన స్థానాన్ని ప్రసాదించమని వేడుకున్నారు." ఆకలి తీరాలంటే ఆహారంకావాలి. అన్ని ఇంద్రియాలకూ ఆహారం అన్నమేకాదు. వాటి ఆహారము వేరువేరుగా ఉంటుంది.

అప్పుడు దేవతల కోసం పరమేశ్వరుడు ఆవును సృష్టించాడు. దేవతలు ఇది మాకు సరిపోదు అన్నారు. గుర్రాన్ని సృష్టించాడు. అదీ చాలదన్నారు. అప్పుడు విరాట్ స్వరూపాన్ని పోలిన పురుష శరీరాన్ని సృష్టించాడు. దాన్ని చూసిన దేవతలు ఇది చాలాబాగుంది అని సంతసించారు. భగవంతుని ఆజ్ఞానుసారం దేవతలంతా వారి వారి స్థానాల్లో ప్రవేశించారు. అంటే అగ్ని వాగ్రూపం ధరించి ఆ పురుషుని నోటిలో ప్రవేశించాడు. వాయువు ప్రాణంరూపంతో ముక్కునందు, సూర్యుడు దృష్టి రూపంతో నేత్రాలలో, దిక్కులు చెవులయందు, ఓషధులు, వనస్పతులు చర్మమునందు, చంద్రుడు మనోరూపం దాల్చి హృదయంలోను, మృత్యువు అపాన రూపం దాల్చి నాభియందు, జలం వీర్యరూపం దాల్చి జననేంద్రియమందు ప్రవేశించాయి. ఈ రకంగా దేవతలందరూ వెళ్ళిపోగా ఇంకా మిగిలినవి ఆకలి దప్పికలు. వీరిద్దరినీ పరమేశ్వరుడు దేవతలందరిలోనూ భాగస్వాములుగా చేశాడు. దీనివల్ల ఏ దేవతకు హవిస్సు ఇచ్చినా వాటిలో ఆకలి దప్పికలకు కూడా భాగం కలుగుతుంది. కంటికి ఆకలి దప్పికలంటే చూడాలనే కోరిక, చెవులకువినాలనే కోరిక.

ఈ రకంగా ఇంద్రియాలను, వాటి అధిష్టాన దేవతలను సృష్టించిన తరువాత అన్నము సృష్టించవలసిన అవసరం వచ్చింది. అప్పుడు జలం నుంచి ఆహారం సృష్టించాడు. అదే అన్నము.

ఆ విధంగా దేవతల కోసము సృష్టించబడ్డ అన్నము దేవతలను చూసి వారు తన పాలిట మృత్యుదేవతలని తలపోసి పారిపోసాగింది. అప్పుడు ఆ ఆదిపురుషుడు అన్నాన్ని తన ఇంద్రియాలైన వాక్కు, చక్షువు మొదలైన వాటితో పట్టుకోవాలనుకున్నాడు. కాని వీలుకాలేదు. చివరకు అన్నాన్ని అపానంతో గ్రహించగలిగాడు. నోటితో లోపలికి పీల్చబడే వాయువే అపానము. ఇదే అన్నాన్ని గ్రహిస్తుంది.

ఇప్పుడు పరమేశ్వరుడు ఇంద్రియాలతో కూడిన మానవ శరీరంలో ప్రవేశించాలను కున్నాడు. దానికి రెండు మార్గాలున్నాయి. 1. పాదాల చివర నుంచి 2. శిరస్సు నుంచి సృష్టికర్త అయిన పరమేశ్వరుడు శిరస్సులోని బ్రహ్మరంధ్రం ద్వారా మానవదేహంలో ప్రవేశించాడు. ఈ మార్గం ద్వారానే పరమేశ్వర దర్శనం కూడా కలుగుతుంది. అందుకే ఇది ఆనందకరమైనది.

ఈ విధంగా జీవభావంతో ఈ శరీరంలో ప్రవేశించిన పరమేశ్వరుడు పంచభూతాలను తాదాత్మ్యభావంతో గ్రహించాడు. నేను నాది అనే మమకారాన్ని పెంచుకున్నాడు. అనగా పరమేశ్వరుడు సాకారుడైనాడు అని చెప్పబడింది.

**బృహదారణ్యకోపనిషత్తు**లో ఒంటరిగా ఉన్న పరమేశ్వరుడు తాను జంట కావాలనుకున్నాడు. అనుకున్నదే తడవుగా స్త్రీ పురుషులు ఉద్భవించారు. వారే స్వాయంభువ మనువు, శతరూప వారివలననే 84 లక్షల జీవరాసి ఉత్పన్నమయింది.

ఈరకంగా పరమేశ్వరుడు జగత్తును సృష్టించి, జీవులలో ప్రవేసించాడు. సృష్టి అంతా పరమేశ్వరమయము అని చెప్పబడింది. అందుకే 'సర్వగః' అనగా అన్నిటినీ చేరువాడు, సర్వత్ర వ్యాపించి ఉండువాడు పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు అని చెప్పబడింది. ఈ నామములో సంకర్షమూర్తియొక్క బలము వివరించబడింది.

## 124. సర్వవిద్ భానుః

శంకరభగవత్పాదులు ఈ నామాన్ని ఒకటిగా చెప్పారు.

**సర్వంవేత్తి** ప్రతియొక్క దానిని తెలిసినవాడు.

సర్వం విదంతి సమస్తమును పొందినవాడు. ఇంక పొందవలసినది ఏదీ లేనివాడు.

భానుః అనగా స్వయంప్రకాశము గలవాడు. అతని ప్రకాశము వలననే ఈ జగత్తంతా ప్రకాశిస్తున్నది. **భగవద్గీత**లోని 15వ అధ్యాయము **పురుషోత్తమప్రాప్తి యోగము**లోని 12వ శ్లోకం.

**యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలమ్**
**యచ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్**

సమస్త జగత్తును ప్రకాశింపచేసే సూర్యుని తేజస్సును, చంద్రుని తేజస్సును, అగ్ని తేజస్సును నా తేజస్సే అని ఎరుంగుము.

ఇదే విషయాన్ని **భైరవయామళం**లో శివుడు పార్వతికి చెబుతాడు.

**జ్యోతిరూపా పరాకారా యస్యాదేహోద్భవాశ్శివే ॥**
**కిరణాశ్చసహస్రంచ ద్విసహస్రంచ చ లక్షకమ్ ।**
**కోటిరర్బుదమే తేషాం పరాసంఖ్యా న విద్యతే**

ఆ పరమేశ్వరి శరీరము నుంచి వేలు, లక్షలు, కోట్లు, కోటానుకోట్ల కిరణాలు ప్రకాశిస్తున్నాయి.

**తేషాం అనంతకోటీనాం మయూఖానాం మహేశ్వరీ**
**అష్టోత్తరశతంవహ్నే షోడశోత్తరశతం రవేః ।**
**షట్త్రింశతదుత్తరశతం చంద్రస్య కిరణాశ్శివే ॥**
**బ్రహ్మాండం భాసయంతస్తే పిండాండమపిశాంకరీ ।**

ఆ రకంగా ఉన్న కోటానుకోట్ల కిరణాలనుంచి 108 కిరణములను అగ్ని, 116 కిరణములను సూర్యుడు, 136 కిరణములను చంద్రుడు గ్రహించగలిగారు. ఆ కిరణముల ఆధారంగానే పిండాండబ్రహ్మాండాలు ప్రకాశిస్తున్నాయి. అది కూడా ఏ విధంగా అంటే

**దివా సూర్యౌ తథా రాత్రౌసోమో వహ్నిశ్చ సంధ్యయోః**

పగటిపూట సూర్యుని వెలుగులతోను, రాత్రిపూట చంద్రుని వెలుగులతోనూ సంధ్యవేళలయందు అగ్నియొక్క అంటే దీపపుకాంతులతోను ఈ జగత్తు ప్రవర్తిల్లుతున్నది.

చంద్రసూర్యాగ్నులు కూడా స్వయం ప్రకాశకులు కారు. ఆ పరమేశ్వరుని నుంచి వచ్చిన కాంతుల చేతనే తాము ప్రకాశిస్తూ ఈ జగత్తును ప్రవర్తిల్లచేస్తున్నారు. స్వయంప్రకాశము గలవాడు అన్నీ తెలిసినటువంటి ఆ పరమేశ్వరుడు తప్ప వేరెవరూ కాదు. అందుకే శ్రీమన్నారాయణుడు 'సర్వవిద్భానుః' అనబడుతున్నాడు.

ఈ విషయం **బృహదారణ్యకోపనిషత్తు**లో కూడా వివరించబడింది.

ఒకసారి యాజ్ఞవల్క్యుడు విదేహాధిపతి అయిన జనకుని ఆస్థానానికి వెళ్ళాడు. గురువుగారిని చూడగానే ఎదురేగి స్వాగత సత్కారాలు అందించి కుశలప్రశ్నలు అయిన తరువాత జనకమహారాజు అంటున్నాడు.

"గురుదేవా ! నాకు చిన్న అనుమానం వచ్చింది. అది తీర్చి పుణ్యం కట్టుకోండి." ఆ మాటవినగానే అదేమిటో చెప్పమన్నాడు యాజ్ఞవల్క్యుడు.

**జ** : మహర్షీ ! మానవుడు ఏ వెలుగువల్ల తన నిత్యకృత్యం సాగిస్తున్నాడు.

**యా** : సూర్యుని వెలుతురు వల్ల ఆ వెలుతురు వల్లనే మానవుడు పనిపాటలు నిర్వహించుకుంటాడు. దూరతీరాలకు వెడతాడు. పనులు పూర్తిచేసుకొని తిరిగివస్తాడు. ఆ వెలుగులో వెళ్ళానుకున్నచోటికి వెడతాడు. చేయదలచుకున్న పని చేసుకుంటాడు.

**జ** : మహర్షీ ! మరి సూర్యాస్తమయమైతే పనులు ఏవిధంగా జరుగుతాయి.

**యా** : సూర్యుడు అస్తమించిన తరువాత చంద్రునియొక్క కాంతులలో ఈ పనులన్నీ జరుగుతాయి.

**జ** : సూర్యచంద్రులిద్దరూ అస్తమించినప్పుడు ఏం జరుగుతుంది మహాత్మా!

**యా** : రాజా ! సూర్యచంద్రులు ఇద్దరూ లేనప్పుడు అన్ని వ్యవహారాలు దీపం లేదా అగ్ని వెలుగులో జరుగుతాయి.

**జ** : మహానుభావా ! మరి ఆ అగ్నికూడా లేకపోతే ? సూర్యడస్తమిస్తాడు. చంద్రకాంతి ఉండదు. అగ్ని ఆరిపోతుంది. అప్పుడు మానవుడు ఏం రకంగా పనులు చేస్తాడు ?

**యా** : రాజా ! ఆ వెలుగుల స్థానంలో వాక్కు వ్యవహారానికి సహకరిస్తుంది. చీకటిలో ఏమీ కనిపించదు. కాని ఏదో ధ్వని వినిపిస్తే మానవుడు ధ్వని వినిపించిన వైపుకు సాగిపోతాడు.

**జ** : మరి ఆవాక్కు కూడా ఆగిపోతే ? అంటే ధ్వని కూడా ఏ మాత్రం వినిపించదు. అప్పుడు ఏం జరుగుతుంది ?

**యా** : జనక మహారాజా! శబ్దాలన్నీ సర్దుమణిగిన తరువాత ఏం జరుగుతుంది? అని కదా అడుగుతున్నావు. జాగ్రత్తగా విను. ఈ వెలుగులకన్నిటికీ అవతల ఆత్మజ్యోతి ఉన్నది. ఆ ఆత్మ ప్రకాశములకు ప్రకాశం. కాంతులకు కాంతి అటువంటి ఆత్మవల్లనే మానవుడు మనుగడ సాగిస్తాడు.

అని చెప్పబడింది. కాబట్టి పరమేశ్వరుడు స్వయంప్రకాశము గలవాడు. అందుచేతనే 'సర్వవిద్భానుః' అనబడుతున్నాడు.

అయితే పరాశరభట్టరు (రామానుజాచార్యుల శిష్యులు) వారు ఈ నామాన్ని రెండుగా విభజించారు.

సర్వవిత్ – అన్నింటినీ పొందువాడు.

**ప్రద్యుమ్నత్వేతు కార్యాణి లభతే యస్స సర్వవిత్**

ప్రద్యుమ్న మూర్తియై తనతో సృష్టించబడిన సమస్త కార్యములను లభించువాడు.

**సర్వం విందతీతి సర్వవిత్**

అన్ని రకాల కార్యములను సృష్టించి లభించువాడు. జగసృష్టికి కారణమైనవాడు. ఈ నామంలో ప్రద్యుమ్న మూర్తికి గల ఐశ్వర్యము చెప్పబడింది.

భానుః – ప్రకాశించువాడు.

**భాను సర్వస్య భాతీతి నిర్మాణే స్య వికారతః** అన్ని పదార్థాలను నిర్మించి, తాను కొంచెము కూడా వికారము చెందకుండా ప్రకాశించువాడు.

**భాతీతి భానుః** సకల పదార్థాలు నిర్మించి తాను కొంచెము కూడా వికారము పొందకుండా ప్రకాశించువాడు. ఈ రెండు నామాలలోను మొదటిది జగసృష్టి అనగా ప్రద్యుమ్నుని ఐశ్వర్యము రెండవది వీర్యము తెలుపుతున్నాయి. ఈ నామంలో ప్రద్యుమ్నమూర్తికి గల వీర్యము చెప్పబడింది.

## 125. విష్వక్సేనః

నాలుగు దిక్కులా రక్షకవర్గము కలవాడు.

**ఇనేన స్వామినా సాకం వర్తతే సేన ఇత్యతః**
**విష్వగ్రక్ష్యో జనో యస్య విష్వక్సేన ఇతీరితః**

ఇన అంటే ప్రభువు. అతడితో ఉన్నది సేన. అదే ఇక్కడ పరమాత్మ అంతర్యామిగా ఉండి రక్షించే సంసారము.

**ఇనేన స్వామినా ఈశ్వరేణ సహవర్తతే ఇతిసేనా ।**
**విషూచీసేనా యస్యసః విష్వక్సేనః**

ఇనుడు అంటే – స్వామి. ఆ స్వామితో కూడి ఉన్నది సేన. సేన అంటే – రక్షక వర్గము. అటువంటి రక్షకవర్గాన్ని నాలుగుదిక్కులయందు కలవాడు. కాబట్టి 'విష్వక్సేనుడు' అనబడుతున్నాడు.

తాను యుద్ధానికి ఉద్యుక్తుడవుతున్నాడని తెలిసినంత మాత్రముచేతనే దైత్యసేనలచేత పలాయన మంత్రం పఠింపచేసేవాడు. ఆయన మహావీరుడు. ఆయన పేరు వినగానే రాక్షససేనలు పారిపోతాయి. ఈ నామంలో అనిరుద్ధమూర్తి శక్తిని చెప్పటం జరిగింది.

విష్వక్సేనుడు విష్ణుమూర్తికి సేనాపతి.

## 126. జనార్దనః

జనులను పీడించువాడు.

**భక్తవిద్వేషిణాం తూర్ణం మర్దనాద్ధి జనార్దనః**

తనయొక్క భక్తులను ద్వేషించేవారిని శిక్షించువాడు.

**జనాన్ అర్దయతీతి జనార్దనః** తన భక్తుల విరోధులను నిరపేక్షకుడై నిరసించువాడు.

పరమేశ్వరుడికి తన భక్తుల విరోధులు అంటే తన విరోధులే. ఇక్కడ భక్తులు అంటే ఎప్పుడో ఒకసారి గుర్తు వచ్చినప్పుడు భగవంతుడికి నమస్కరించేవారు, కష్టకాలంలో భగవంతుడిని అర్చించేవారుకాదు. సర్వకాల సర్వావస్థలయందు త్రికరణశుద్ధిగా ఆ పరమేశ్వరునే ఆరాధించేవారు. వీరంతా సాధువర్తనులు. భారం అంతా భగవంతుడి మీదనే వేసి కార్యక్రమాలు నిర్వహిస్తుంటారు. ఇటువంటి వారిని ద్వేషించినప్పటికీ, వారికి హాని కలుగచేసినప్పటికీ చూస్తూ ఊరుకోడు. అటువంటి వారిని శిక్షించి తీరతాడు. యజ్ఞయాగాదులు, తపోవనాలు నాశనం చేసిన రాక్షసులను కఠినంగా శిక్షించాడు. విశ్వామిత్రుని యాగసంరక్షణకోసం సాక్షాత్తూ శ్రీమన్నారాయణుని అవతారమైన శ్రీరామచంద్రుడే స్వయంగా వెళ్ళాడు. సుబాహువును అక్కడే సంహరించి, ఈ విషయం తమ ఏలికతో చెప్పటానికి వీలుగా మారీచుని సుదూరప్రాంతాలలో పడేటట్లుగాకొట్టి, ప్రాణాలతో వదిలేశాడు. అంటే ఇకనుంచి రాక్షసులెవరైనా యజ్ఞయాగాలకు భంగం కలుగజేస్తే వారిని సంహరిస్తాను అని మారీచుడి ద్వారా హెచ్చరిక పంపాడు.

సజ్జనుల, సాధుపుంగవుల ఆవాసాల మీదపడి, వాటిని, వారిని నాశనం చేస్తున్న త్రిపురాసురులను సంహరించాడు. ఈ రకంగా తన భక్తులకు కష్టం గలిగించే వారిని, శిక్షించే స్వభావము గలవాడు. కాబట్టి పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు 'జనార్దనుడు' అనబడుతున్నాడు.

**జనాన్ అర్దయతి** దుష్టులను హింసిస్తాడు. దుర్మార్గులను నరకలోకాలపాలు చేస్తాడు. ఈరకంగా శిష్టులను రక్షిస్తాడు. జనులచేత ఐహికము, ఆముష్మికము కోరబడువాడు. ఇహము, పరము, ఇహము అనగా ఈ లోకంలో పొందే లౌకికమైన సుఖము – శారీరకము,

మానసికమైన ఆనందము. ఆముష్మికము అంటే పరము. పరలోకానికి సంబంధించినది. మరణానంతరము పొందే స్వర్గసుఖాలు, సాయుజ్యము మొదలైనవి.

చతుర్విధపురుషార్థాలు జనులు పరమేశ్వరుని అర్థిస్తారు. కాబట్టి ఆ పరమేశ్వరుడు 'జనార్దనుడు'. ఈ నామంలో అనిరుద్ధమూర్తి తేజస్సు చెప్పబడింది.

పరమేశ్వరుని యందు అన్ని గుణాలు, అన్ని లక్షణాలు ఉన్నాయి. ఆయన దగ్గరలేనివి లోకంలో ఎవరి దగ్గరా ఉండవు. జగత్తులో అందరి దగ్గర ఉండేవీ, ఆ పరమేశ్వరుడి దగ్గర ఉంటాయి. ఐనప్పటికీ కొన్నికొన్ని రూపాలలో కొన్ని లక్షణాలు ప్రత్యేకంగా ఉంటాయి. వాటిని ఇక్కడ వివరించటం జరిగింది.

## 127. వేదః

పొందచేయువాడు.

**సఙ్కర్షణత్వే శాస్త్రార్థ ప్రదత్వాద్వేద ఈరితః**

సంకర్షణమూర్తి రూపంలో లోకానికి శాస్త్రములు, వేదములు ప్రసాదించేవాడు.

**శాస్త్రాణి విదంతి అస్మిన్నితి వేదః**

సృష్టిలో ఇంద్రియాలు కలవారందరూ భగవంతుని నుండి శాస్త్రాలు పొందుతున్నారు.

ఇక్కడ సంకర్షణుని శాస్త్రప్రదాతృత్వము గూర్చి చెబుతున్నారు. సంకర్షణ అంటే – ఉపాయము, ఆగమము, మార్గము, నేత, బ్రాహ్మణుడు, ఆచార్యుడు అని అర్థము. ఇక్కడ సంకర్షణుని శాస్త్రప్రదాతృత్వమును తెలుపుతున్నారు. **భగవద్గీత**లో పదవ అధ్యాయము **'విభూతి యోగము'**లోని 11వ శ్లోకంలో

**తేషామేవానుకంపార్థం అహమజ్ఞానజం తమః**
**నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా ॥**

అర్జునా ! వారి అంతఃకరణములందు స్థితుడై ఉన్న నేను వారిని అనుగ్రహించటం కోసం తేజోమయమైన తత్త్వజ్ఞాన జ్యోతిని వెలిగించి అజ్ఞానాంధకారమును పోగొడతాను.

తన భక్తులను అనుగ్రహించటం కోసం భగవానుడు స్వయముగా వారి అజ్ఞానాంధ కారాన్ని నాశనం చేస్తాడు. జ్ఞానజ్యోతులు వెలిగిస్తాడు. ఈ జ్ఞానజ్యోతులద్వారా అజ్ఞానము పోవటము, భగవత్ప్రాప్తి కలుగుతాయి.

పరమేశ్వరుడు వేదరూపుడు. తనకు ఎవరిమీద అనుగ్రహము కలిగితే, వారికి స్వరూపజ్ఞానాన్ని ఇస్తాడు. అందుచేతనే అతడు 'వేదః' అనబడుతున్నాడు.

# 128. వేదవిత్

వేదార్ధము నెరిగినవాడు. 131వ నామము కూడా ఇదే.

**అసంశయ విపర్యాసం వేదార్థం వేత్తి వేదవిత్ ॥**

సందేహము లేకుండా, పొరపాటు లేకుండా వేదార్థాన్ని పూర్తిగా తెలిసినవాడు.

**వేదం వేదార్థం వేత్తీతి వేదవిత్** వేదము, వేదార్థము పూర్తిగా తెలిసినవాడు. భగవద్గీతలోని 15వ అధ్యాయము **'పురుషోత్తమ ప్రాప్తియోగము'**లోని 15వ శ్లోకము.

**సర్వస్య చాహం హృది సన్నివిష్టో మత్తస్మృతిఃజ్ఞానమపోహనం చ ।**
**వేదైశ్చ సర్వైరహమేవ వేద్యో వేదాన్తకృద్వేదవిదేవ చాహమ్ ॥**

సమస్త ప్రాణుల హృదయాలలోను అంతర్యామిగా ఉన్నవాడను నేనే. నానుండియే స్మృతి, జ్ఞానము, అపోహనము (సందేహనివృత్తి) కలుగుతున్నాయి. వేదాలద్వారా తెలుసుకోదగినవాడను నేనే. వేదాంతకర్తను, వేదజ్ఞుడను కూడా నేనే అంటాడు భగవానుడు.

**వేదం వేదార్థం చ యథావత్ వేత్తి** వేదము, వేదార్థము కూడా వాస్తవంగా తెలిసినవాడు. అసలు వేదము అంటే ఏమిటి ?

ఇష్టప్రాప్తినీ, అనిష్ట పరిహారాన్నీ సాధించటానికి అలౌకికమైన ఉపాయాన్ని చెప్పేదే వేదము. సకలదేవతలను, ధర్మాన్నీ, పరబ్రహ్మతత్త్వాన్నీ ప్రతిపాదిస్తుంది. కనుక వేద సామ్రాజ్యం ప్రత్యక్ష, అనుమాన ప్రమాణాలకు మించి ఉన్నది.

మానవుడు పరిపూర్ణుడు కాడు. అతను చెప్పిన సూక్తులు పరమార్థమని, భ్రాంతి రహితమని ఒప్పుకోలేము. అందుచేత అతీంద్రియ సత్యాలకు సంబంధించినంత వరకూ స్వతఃసిద్ధమూ, స్వతః ప్రమాణము, నిత్యసిద్ధము, బ్రహ్మవాక్కు అయిన వేదాన్ని మాత్రమే నిర్దుష్టమైన అంత్య ప్రమాణంగా స్వీకరించగలం. భారతీయ సంస్కృతి ధార్మికంగానూ, ఆధ్యాత్మికంగానూ వికసిస్తుండటానికి వేదమే కారణము.

వేదాలు అపౌరుషేయాలు. సాక్షాత్తూ పరమేశ్వరుడే వాటిని బ్రహ్మదేవునికిచ్చాడు. వేదాలలో చెప్పిన లౌకిక, ఆధ్యాత్మిక సిద్ధాంతాలు శాశ్వతమైనవి. దివ్య ప్రజాపతులు, ఋషుల కలిసి పరమ పురుషుడే హవిస్సుగా చేసిన మానవ యజ్ఞం నుండి వేదాలు ఉద్భవించాయని పురుష సూక్తంలో చెప్పబడింది. పరమాత్మ బ్రహ్మను సృజించి అతనికి వేదాలు అనుగ్రహించాడు.

వేదం అనే మాటకు సాధారణ అర్థం "విద్య". వేదంలో పరా, అపరా అనే రెండు రకాల విద్యలున్నాయి. వేదంలో రెండు కాండలున్నాయి. 1. జ్ఞానకాండ 2. కర్మకాండ వీటిలో కర్మకాండ అపరావిద్యను అంటే కర్మలు, నియమాలు, విధులు, ఆచారాలు వివరించగా జ్ఞానకాండ ఆత్మ. పరమాత్మ, ప్రపంచము మొదలైన స్వరూపాలను గూర్చి వివరిస్తుంది. మొత్తంమీద నువ్వులలో నూనెలాగా వేదమంతటా వేదాంతం సుప్రతిష్టితమై ఉన్నది.

వేదానికి నిగమము, శ్రుతి, ఆమ్నాయము అనికూడా పేర్లున్నాయి. దాని అర్థమేమంటే

1. నిగమము - అనాదిగా వస్తున్న నిర్ధారితమైన మూలగ్రంథము.
2. శ్రుతి - గురువునుంచి శిష్యుడు వినే దివ్యవాణి.
3. ఆమ్నాయము - ఆవృత్తి లేదా మననం ద్వారా నేర్చుకోబడే విద్య.

కృతయుగంలో వేదం అంతా ఒకటిగానే ఉండేది. ద్వాపరయుగంలో బ్రహ్మదేవుడు 'అపాంతరతముడు' అనే మానసపుత్రుణ్ణి సృష్టించి వేదాలను భూలోకంలో బాగా ప్రచారం చేసి రమ్మన్నాడు. కలగా పులగంగా ఉన్న వేదాన్ని నాలుగు భాగాలుగా విభజించాడు అపాంతరతముడు. దానికి సంతుష్టుడైన బ్రహ్మదేవుడు తన కుమారునికి ప్రతి మహా యుగంలోనూ వేదాన్ని విభజించమని చెప్పాడు. ఆ ప్రకారంగానే ప్రతి మహాయుగంలోనూ వేదం విభజించబడుతూనే ఉన్నది. వేదాలను విభజించిన వ్యక్తినే వేదవ్యాసుడు అంటారు. ప్రస్తుతము 28వ మహాయుగం జరుగుతున్నది. ఈ మహాయుగంలో కృష్ణద్వైపాయనుడు వేదాలను విభజించి వేదవ్యాసుడైనాడు. రాబోయే మహాయుగంలో ద్రోణాచార్యుని కుమారుడు అశ్వద్థామ వేదవ్యాసుడౌతాడు.

వ్యాసుడు వేదాన్ని నాలుగు భాగాలుగా విభజించాడు. అవే 1. ఋగ్వేదము 2. యజుర్వేదము 3. సామవేదము 4. అధర్వణ వేదము. స్తుత్యర్థకమైన మంత్రానికి 'ఋక్కు' అని పేరు. యజ్ఞపరాలైన మంత్రాలకు 'యజస్సులు' అని పేరు. నియమ పూర్వకంగా గానంచేసే మంత్రాలకు "సామదములు" అని పేరు.

**1. ఋగ్వేదము :** వేదాలలో ముఖ్యమైనది ఋగ్వేదము. అన్ని వేదాలలోనూ ఎక్కువ భాగం దీనికి పునరుక్తిగానో, అనుసరణగానో ఉంటుంది. దీనిలో 1028 దేవతాస్తుతులు ఉన్నాయి. వీటిలో అతి పెద్దది 52 శ్లోకాలు గలది. ఈ స్తోత్రాలన్నీ పది మండలాలుగా ఉన్నాయి. తత్త్వ, అలౌకిక విషయాలను వివరించటం వలన పదవమండలం విశేష ఆసక్తికరమైనది. ఐతరేయ, కౌశీతకీ, పైంగి, సాంఖ్యాయన బ్రాహ్మణాలు ఈ వేదానికి సంబంధించినవి. ఐతరేయ, కౌశీతకీ అరణ్యకాలు ఆ బ్రాహ్మణాలకు పరిశిష్టాలుగాను, ఐతరేయ, కౌశీతకీ ఉపనిషత్తులు ఈ అరణ్యకాలకు అంతిమాంశాలుగాను ఉన్నాయి.

**2. యజుర్వేదము :** ఇది రెండు భాగాలుగా ఉన్నది. 1) కృష్ణయజుర్వేదము 2) శుక్లయజుర్వేదము.

**1) కృష్ణయజుర్వేదము :** ఇది చాలా వరకు గద్యరూపంలో ఉంటుంది. దీనికి క్రియావిధులు ఉంటాయి. తైతిరీయ, భాల్లవ, కాత్యాయన, మైత్రాయణ, కరుబ్రాహ్మణాలు ఈ వేదంలోనివే. వీటిలో ప్రసిద్ధమైనది తైత్తిరీయ బ్రాహ్మణము.

**2) శుక్లయజుర్వేదము :** ఇది 40 అధ్యాయాలుగల గ్రంథం. యజ్ఞాలకుసంబంధించిన విషయాలు ఇందులో క్రమబద్ధంగా ఉన్నాయి. ఈ వేదం ముఖ్యంగా మాధ్యందిన, కాణ్వ సంప్రదాయాలలో ఉన్నది. ప్రఖ్యాతమైన శతపథ బ్రాహ్మణము ఈవేదానికి సంబంధించినదే. అత్యంత ముఖ్యమైన అరణ్యకము, ఉపనిషత్తుకూడా అయిన బృహదారణ్యకముతో శతపథ బ్రాహ్మణము పూర్తవుతుంది.

**3) సామవేదం :** దీనిలో 72 మంత్రాలు తప్ప, మిగిలినవన్నీ ఋగ్వేదంలోని 8,9 మండలాల నుంచే తీసుకోబడ్డాయి. ఉద్గాత విధులను వివరించే సామవిధాన, మంత్ర, ఆర్షేయ, వంశ, దైవతాధ్యాయ, తలవకార, తాండ్య, సంహితోపనిషత్తులనబడే ఎనిమిది బ్రాహ్మణాలు ఈ వేదానివే. ఛాందోగ్య, కేనోపనిషత్తులు ఈ వేదంలోవే. దీనికి అరణ్యకాలు లేవు.

**4) అధర్వణ వేదం :** ఈ వేదంలో ముఖ్యంగా ప్రాపంచిక అభ్యుదయాన్ని తేగల మంత్రాలు, తంత్రాలు ఉన్నాయి. దీనికి ఏ అరణ్యకమూ లేదు. గోపథ బ్రాహ్మణము, ముండక, మాండూక్య, ప్రశ్నోపనిషత్తులు ఈ వేదానికి సంబంధించినవే.

కృష్ణద్వైపాయనుడు, వేద విభజన చేసిన తరువాత అతని నలుగురు శిష్యులు.

1. పైలుడు 2. వైశంపాయనుడు 3. జైమిని 4. సుమంతుడు

అదే క్రమంలో వేదాలను బోధించారు. అయితే రానురాను గురుశిష్యుల సంఖ్య పెరిగి కాలక్రమంలో వేదాలకు అనేక శాఖలు వచ్చాయి. ఈ రకంగా

| | | |
|---|---|---|
| ఋగ్వేదానికి | - | 21 శాఖలు |
| కృష్ణ యజుర్వేదానికి | - | 94 శాఖలు |
| శుక్ల యజుర్వేదానికి | - | 15 శాఖలు |
| సామవేదానికి | - | 100 శాఖలు |
| అధర్వణ వేదానికి | - | 50 శాఖలు వచ్చాయి. |

వీటిలో చాలా వరకు ఇప్పుడు కనిపించటం లేదు.

"గురుదేవా ! మిగిలిన 3 వేదాలకూ భాగాలు లేవుకదా. మరి యజుర్వేదము రెండు భాగాలుగా ఎందుకున్నది ?" అడిగాడు నారాయణభట్టు.

"ద్వాపరయుగంలో వ్యాసభగవానుడు వేదవిభజన చేసిన తరువాత, తన శిష్యులైన జైమిని, వైశంపాయనుడు, పైలుడు, సుమంతులకు నాలుగు వేదాలు అప్పగించి వాటిని ప్రచారం చెయ్యమన్నాడు. ఇప్పుడు యజుర్వేద బాధ్యతను వైశంపాయనుడికి అప్పగించారు. వైశంపాయనుడు దాన్ని తన శిష్యులకు బోధించాడు. వైశంపాయనుడి శిష్యులలో యాజ్ఞవల్క్యుడు ముఖ్యమైనవాడు. అతడు ఈ వేదాన్ని క్షుణ్ణంగా అభ్యసించాడు.

ఆకాలంలో ఒకనాడు మేరుపర్వతం మీద దేశంలోని మహర్షులందరూ సభ ఏర్పాటు చేసుకుని, దానికి ఋషులందరూ తప్పకరావాలని ఆంక్ష విధించారు. ఎవరైనా రాకపోతే వారికి బ్రహ్మహత్యాపాతకం చుట్టుకుంటుందని తీర్మానించారు. అనుకున్న ప్రకారం సభ ప్రారంభమైంది. కారణాంతరాల వల్ల దానికి వైశంపాయనుడు రాలేకపోయాడు. అందుచేత ఋషుల తీర్మానం ప్రకారం అతడికి బ్రహ్మహత్యాపాతకం చుట్టుకుంది. ఆ పాపం నుంచి నిష్కృతి కావాలంటే తపస్సుచేసి ధారపోయ్యాలి. ఆకారణంగా వైశంపాయనుని మిగిలిన శిష్యులందరూ తపస్సు చేస్తున్నారు. ఆ సమయమంలో యాజ్ఞవల్క్యుడు తన గురువు దగ్గరకు వచ్చి సహాధ్యాయులు చేస్తున్న తపస్సు చూసి జరిగిన విషయం తెలుసుకుని వైశంపాయనుడితో "గురుదేవా ! వీళ్ళంతా అల్పజ్ఞులు. మీ పాపపరిహారార్థం వీళ్ళేం తపస్సు చేస్తారు ? అనుజ్ఞ ఇవ్వండి. నేను మీ కోసం ఘోరమైన తపస్సు చేస్తాను" అన్నాడు. సహాధ్యాయుల నవమానించిన యాజ్ఞవల్క్యుని చూసి వైశంపాయనుడు "సాటివారిని అవమానించే గర్విష్ఠితో నాకు పనిలేదు. నాకు శిష్యుడిగా ఉండే అర్హతకూడా నీకులేదు. నేను చెప్పిన వేదవిద్యను ఇక్కడే వదిలేసి వెళ్ళు" అన్నాడు.

యాజ్ఞవల్క్యుడు నిజంగానే శక్తిసంపన్నుడు. స్వాభిమాని. గురువుగారన్నమాట అవమానంగా తోచి వెంటనే వైశంపాయనుడు చెప్పిన వేదవిద్య అంతా కక్కేశాడు. ఆ వేదభాగమే కృష్ణయజుర్వేదమయింది.

ఈ రకంగా వేదాన్ని వదిలేసిన యాజ్ఞవల్క్యుడు సూర్యభగవానుణ్ణి ఆరాధించి ఆయన దగ్గర వేదవిద్యనభ్యసించాడు. ఈ భాగమే శుక్లయజుర్వేదము. యాజ్ఞవల్క్యుడు ఈ వేదభాగాన్ని తన శిష్యులైన కణ్వ, మధ్యందినాదులకు బోధించాడు. ఈ భాగమే "వాజసనేయ సంహిత" అని కూడా పిలువబడుతుంది. 'వాజః' అంటే అన్నము. 'సని' అంటే దానము 'వాజసని' అంటే అన్నదానము. యాజ్ఞవల్క్యుని తండ్రి నిరతాన్నదానం

చేసేవాడు. అందుచేత అతనిని 'వాజసని' అనేవారు. వాజసని కుమారుడు కాబట్టి యాజ్ఞవల్క్యుడు 'వాజసనేయుడు' అనబడ్డాడు. అతడు చెప్పిన సంహిత 'వాజసనేయ సంహిత' అయింది. ఇది మొత్తం 40 అధ్యాయాలు. దీనిలోని 39 అధ్యాయాలలో మంత్రాలు కర్మకాండ వివరించబడగా, 40వ అధ్యాయం జ్ఞానబోధకము.

ప్రత్యక్షంగా గాని, పరోక్షంగాగాని ఐహిక సంపత్తిని, మోక్షాన్ని సంపాదించి పెట్టేవి యజ్ఞాలు, యజ్ఞనిర్వహణ చాలా కష్టమైనది. దీనిని చాలా జాగ్రత్తగా పూర్తిచేయటమే వేదాల ప్రయోజనం. యజ్ఞ నిర్వహణకు నలుగురు పురోహితులుంటారు. వారు.

1. హోత : ఋగ్వేదంలోని స్తోత్రాలను క్రమంగా పఠించేవాడు.

2. అధ్వర్యుడు : యజుర్వేదంలో చెప్పిన ప్రకారము యజ్ఞకర్మలను యధావిధిగా నిర్వహించేవాడు.

3. ఉద్గాత : సామగీతాలు గానం చేసేవాడు.

4. బ్రహ్మ : అధర్వణవేదపండితుడు. యజ్ఞాన్ని మొదటి నుండి చివరిదాకా పర్యవేక్షించేవాడు. ఇతడు యజ్ఞకళకు, వేదసాహిత్యానికీ ప్రతీక.

ప్రతి వేదాన్నీ మళ్ళీ నాలుగు భాగాలుగా విభజించారు.

1. సంహితలు 2. బ్రాహ్మణాలు 3. అరణ్యకాలు 4. ఉపనిషత్తులు

**1. సంహితలు :** ఇవి మంత్ర భాగం. ఇందులో స్తోత్రాలు, ఆవాహనలు ఉంటాయి. ఋగ్, యజు, సామ సంహితలు సూక్తాలుగా ఉంటాయి.

**2. బ్రాహ్మణాలు :** సంహితలోని విషయాన్ని వివరించేవి బ్రాహ్మణాలు. యజ్ఞయాగాదులెలా చెయ్యాలి ? వాటి వెనుక రహస్యము. యజ్ఞాల విలువ, వాటి మహిమ చెప్పబడింది.

**3. అరణ్యకాలు :** ఇవి బ్రాహ్మణాలకూ, ఉపనిషత్తులకూ మధ్యస్థాయిలో ఉంటాయి. ఇవి కూడా బ్రాహ్మణాలలాగానే కర్మ విధులను ప్రతిపాదిస్తాయి. కాని వీటిలో కర్మల యొక్క భౌతిక భాగం ఉండదు. కర్మల వెనుక ఉన్న నిగూఢమైన తత్త్వాల మీద ధ్యానానికి ప్రాముఖ్యత ఇవ్వబడింది. ఏకాంతవాసం స్వీకరించినవారు అరణ్యాలలో నివసించే వారి కోసం ఇవి ఉద్దేశింపబడ్డాయి. విషయంలో అరణ్యకాలకు, ఉపనిషత్తులకు తేడా లేదు.

వేదాలకు అర్థం తెలుసుకోవటానికిగాను మనకు తెలిసినంత వరకు 25 మంది భాష్యం వ్రాశారు. విజయనగర సామ్రాజ్య స్థాపన చేసిన "మాధవ విద్యారణ్యులు" వేదాలకు భాష్యం వ్రాసి, వేదసాహిత్యానికి విశేషమైన సేవ చేసిన వారిలో మనకు అతి దగ్గరవాడు.

**4. ఉపనిషత్తులు :** ఉపనిషత్తులు అంటే బ్రహ్మవిద్య, జీవాత్మ, పరమాత్మ, జ్ఞానము, మోక్షములు గురించి వివరించేవి. నాలుగు వేదాలకు కలిపి 1180 ఉపనిషత్తులున్నాయి. కాని వీటిలో 108 మాత్రమే చదవదగ్గవి అని తేల్చారు. వీటికి 'ఉపనిషద్బ్రహ్మేంద్ర' అనే మహానుభావుడు వ్యాఖ్య వ్రాశాడు.

ఈరకంగా ఉన్న వేదాల అర్థాన్ని పూర్తిగా తెలిసినవాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు 'వేదవిత్' అనబడుతున్నాడు.

## 129. అవ్యంగః

వేదాంగములచే అహీనుడు.

**శిక్షావ్యాకర ణాద్యజైః నహీనోఽ వ్యఙ్గ ఉచ్యతే ॥** శిక్షావ్యాకరణము మొదలైన వేదాంగ ప్రవర్తకుడు తానే. కాబట్టి వాటిలో ఏ మాత్రమూ లేనివాడు.

**విగతాని అఙ్గాని యస్యసః వ్యఙ్గః న వ్యఙ్గః అవ్య ఙ్గః**

శిక్షావ్యాకరణాది వేదాంగములను తానే కల్పించాడు. కాబట్టి వేదాంగములచే హీనుడు (తక్కువవాడు) కాడు.

అవ్యంగుడు - అవయవములు సరిగాలేనివాడు. పరమేశ్వరుడు అంగహీనుడు కాదు. జ్ఞానము, ఐశ్వర్యము, వైరాగ్యము, వీర్యము, యశము, శ్రీ అనేటటువంటి అంగాలతో సమగ్రమైనవాడు.

వ్యంగము - స్పష్టమైన రూపముతో ప్రకాశము పొంది ఎల్లప్రాణులకు సులభుడై గోచరించటమనేది. ఎవరికైతే లేదో అటువంటివాడు 'అవ్యంగుడు' పరమేశ్వరుడు రూపము లేనివాడు. నిరాకారుడు. అందుచేత జీవులన్నింటికీ సులభముగా గోచరించడు కాబట్టి 'అవ్యంగుడు' అనబడతాడు.

**భగవద్గీత**లోని రెండవ అధ్యాయము **'సాంఖ్యయోగము'**లోని 25వ శ్లోకంలో

**అవ్యక్తోఽ యమచింత్యోఽ యమవికార్యోఽ యముచ్యతే ।**
**తస్మాదేవం విదిత్వైనం నానుశోచితుమర్హసి ॥**

ఓ అర్జునా ! ఈ ఆత్మఅవ్యక్తమైనది. అచింత్యమైనది. వికారములు లేనిది. దీనిని గూర్చి ఈ రకంగా తెలుసుకో. దీనికోసం శోకించవద్దు.

ఆత్మ ఇంద్రియాలకు గోచరము కాదు. కంటికి చూపునిచ్చేది ఆత్మ. చెవుకు వినికిడి శక్తినిచ్చేది ఆత్మ. మనసుకు ఆలోచించే శక్తినిచ్చేది ఆత్మ. అందుచేత ఇంద్రియాల ద్వారా ఆత్మను తెలుసుకోలేము. అందుకే ఆత్మను అవ్యక్తము అంటారు. అది మనసుకు అందనిది – అచింత్యము. ఆత్మ అనేది కనుపించే ప్రకృతి కన్న విలక్షణమైనది. కాబట్టి అర్జునా ! ఆత్మనిత్యము, సర్వగతము, అచలము, సనాతనము, అవ్యక్తము, అచింత్యము, నిర్వికారము అని తెలుసుకో. దానికోసం శోకించవద్దు.

ఇక్కడ ఆత్మ అంటే పరమేశ్వర స్వరూపము. ఈ రకంగా శ్రీమన్నారాయణుడు 'అవ్యంగుడు' అనబడుతున్నాడు.

## 130. వేదాంగః

వేదములను అంగములుగా కలవాడు.

**యస్యవేదోఽ నన్త శాఖో వేదాఙ్గోఽఙ్గత దూస్మృతః**

వేదాలను ప్రకాశింపచేయువాడు. కాబట్టి వేదములను శరీరముగ కలవాడనబడుచున్నాడు.

**వేదాః అంగవ్ యస్యసః వేదాంగః**

అనేక శాఖలుగల వేదాలను శరీరముగా గలవాడు. వేదమును ఆజ్ఞగా గలవాడు.

**శ్రుతిస్మృతీ మమైవాజ్ఞా** శ్రుతులు స్మృతులు. అన్నీ నా ఆజ్ఞలే.

**దేవీభాగవతము**లో తారకాసురుని బాధలు పడలేక దేవతలంతా పరమేశ్వరిని ప్రార్థిస్తారు. అప్పుడు ఆమెవారికి సాక్షాత్కరించింది. దేవతలకోరికపై పరమేశ్వరి విరాట్రూపాన్ని ప్రదర్శించింది.

**ద్యౌర్మస్తకం భవేద్యస్య చంద్రసూర్యౌ చ చక్షుషీ**
**దిశః శ్రోత్రో వచోవేదాః ప్రాణో వాయు ప్రకీర్తితః ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| సత్యలోకం | – | శిరస్సు | వేదాలు | – | వాక్కు |
| సూర్యచంద్రులు | – | నేత్రాలు | వాయువు | – | ప్రాణాలు |
| దిశలు | – | శ్రోత్రములు | | | |

అంటూ ఆ రూపాన్ని వర్ణించారు.

ఇక్కడ 'వేదాలు' పరమేశ్వరి వాక్కుగా చెప్పబడినాయి.

**విష్ణుధర్మోత్తరపురాణము**లో యజ్ఞవరాహానికి నాలుగు వేదాలు పాదాలు అని చెప్పబడింది. ఈ విషయం గతంలో వివరించాం.

ఈ రకంగా వేదాలు అంగాలుగా అంటే శరీరభాగాలుగా లేక ఆజ్ఞలుగా గలవాడు కాబట్టే పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు 'వేదాంగః' అనబడతున్నాడు.

## 131. వేదవిత్

వైదిక ధర్మాన్ని అనుష్టింపచేసేవాడు. 128వ నామము ఇదే.

**వేదైర్వేద్యతయా వేదః తదర్థాధర్మ ఉచ్యతే**

**తదనుష్టాపనాన్నిత్యం ప్రద్యుమ్నో వేదవిత్స్మృతః**

ప్రద్యుమ్నమూర్తియై వైదికధర్మాన్ని తన శాసనముల చేత, అనుష్టానముచేత, నిత్యము అనుష్టింపచేయువాడు.

**వేదం విందతి అనుష్టానేన లభతే ఇతి వేదవిత్**

వేదార్థాన్ని అనుష్టింపచేసి పొందువాడు. ఇది ప్రద్యుమ్నుని ధర్మము

**వేదాన్ - వింత్తే - విచారయతిః** వేదముల అర్థాని విచారణచేస్తాడు. కాబట్టి శ్రీమన్నారాయణుడు 'వేదవిత్' అనబడుతున్నాడు.

వేదార్థాన్ని చెప్పిన మహానుభావులు ఇప్పటిదాకా 28 మంది ఉన్నారు. వారిలో రావణబ్రహ్మ ఒకడు. కాగా మాధవవిద్యారణ్యులు మనకు దగ్గరివాడు.

## 132. కవిః

కవి అనగా - కవిత్వము చెప్పేవాడు. పండితుడు, శుక్రుడు, వాల్మీకి, జలపక్షి, కావ్యకర్త, బ్రహ్మ అని అర్థం చెబుతోంది సూర్యరాయాంధ్ర నిఘంటువు. అయితే ఇక్కడ కవి అనే శబ్దాన్ని 'చూసేవాడు' అనే అర్థంలో వాడారు.

**స ఏవ కాన దర్శిత్వాత్ కవిరిత్యుద్యతే బుధైః**

భక్తులకు మధురముగా కనిపించువాడు.

**కౌతి పశ్యతీతి కవిః** వాడే మధురములను చూచువాడు. ఇంద్రియాలకు అగోచరమైన విషయాలను చూసేవాడు. కంటికి కనిపించే వస్తువులనే కాదు, కనిపించని వస్తువులను కూడా చూడగలుగుతాడు కవి అందుకే

**రవిగాంచనిచో కవిగాంచునే కదా !** అన్నారు. కవి తన ఊహామాత్రంచేత ఎక్కడెక్కడి దృశ్యాలను కూడా చూడగలుగుతాడు.

**కనిపించేవి మాత్రమే చూస్తాడు రవి**
**కనిపించనివి కూడా చూస్తాడు కవి.**

పరమేశ్వరుడు సర్వదర్శి. జగత్తులో జరిగే వాటినన్నింటినీ చూస్తూనే ఉంటాడు. ఈ జగత్తులో అతనికి తెలియనిదికాని, అతనిని మించినదికాని ఏదీలేదు. జ్ఞాత, జ్ఞానము, జ్ఞేయము. ఈ మూడింటినీ త్రిపుటి అంటారు. లోకములో ఈ మూడూ అతడే. అతనిని మించి తెలుసుకోవలసినది ఏదీలేదు. అందుచేత అందరిలోకీ ఉత్తముడైన కవి అతడే.

**ఈశావాస్యోపనిషత్తు**లో ఆత్మను గురించి వివరిస్తూ "ఆత్మనాశనము లేనిది. శాశ్వతమైన సత్యస్వరూపమే ఆత్మ. ఇది చాలా వేగంగా ప్రయాణం చేస్తుంది. శరీరంలోని ఇంద్రియాలకు అధిపతి మనస్సు. ఇది చాలావేగంగా ప్రయాణం చేస్తుంది. కాని ఆత్మ మనసు కన్న వేగంగా ప్రయాణం చేస్తుంది. ఆత్మసర్వవ్యాపి. ఇంద్రియాలు దీన్ని ఎరగవు. ఇది అన్ని లోకాలలోను, లోపలా బయటా కూడా ఉంటుంది. అందుచేతనే ఆత్మ తాను ఒక్క అడుగైనా కదపకుండానే అన్నింటికన్నా ముందు ఉంటుంది. ఆత్మ ఉండటంవల్లనే అంతరిక్షంలోని వాయువు సమస్త ప్రాణులకు కర్మలు చేసేటందుకు కదలికఇస్తాడు. అంటే – ఆత్మయే ప్రాణశక్తిని వాయువునందుంచి అతని ద్వారా జీవకోటిని చైతన్యం చేస్తోంది. ఆత్మకు చలనమున్నది, చలనం లేదు. అంటే, నిజమైన స్థితిలో ఆత్మ చలించదు. ఆత్మ నిశ్చలమైనప్పటికీ మనసుకు ఆధారం కావటంచేత చలించినట్లు కనిపిస్తుంది. ఆత్మ దూరంలో ఉన్నది. దగ్గరగానూ ఉన్నది. అంటే ఆత్మ సర్వత్రా వ్యాపించి ఉన్నది. అజ్ఞానులకు మాత్రం దూరంగా ఉన్నది. వారు దానిని చేరుకోలేరు. జ్ఞానులకు చాలా దగ్గరలో ఉన్నది. ఆత్మలోపలాబయటా ఉన్నది. సృష్టికి అతీతమైనది. అది ఉపాధియుతము, ఉపాధిరహితము కూడా. అందుచేతనే అంతటా వ్యాపించి ఉన్నది. అన్ని భూతాలనూ తనలో చూడగలిగినవాడు ఎవరినీ ద్వేషించడు. అతణ్ణి సమదర్శి అంటారు. ఆత్మ స్వయంభువు. సర్వవ్యాపి, అశరీరి, అస్నాయువు, పాపరహితుడు, కళంకరహితుడు, ఉజ్వలుడు, పరిపూర్ణుడు, సర్వవిదుడు, సర్వదర్శి" అని చెప్పబడింది.

ఈ రకంగా పరమాత్మ సర్వదర్శి. జగత్తులోని అన్నింటినీ చూసేవాడు. కాబట్టి 'కవిః' అనబడుతున్నాడు.

## 133. లోకాధ్యక్షః

లోకాలకు స్వామి.

**ధర్మాధికారిణో లోకాః** తాము ధర్మాన్ని ఆచరిస్తూ, ఇతరులచేత ఆచరింపచేసేవారు లోకులు. అటువంటి లోకులకు అధిపతి.

**లోకానాం అధ్యక్షః లోకాధ్యక్షః** లోకాలకన్నింటికీ అధ్యక్షుడు. స్వామి, ప్రభువు, రాజు.

ఈ లోకాలకు పైగా, లోకాలకు అవతలగా, ఉంటూ ఈ లోకాలను చూస్తున్నాడు. పరమేశ్వరుడు ఈ లోకాలలో ఉండడు. ఇక్కడ లోకాలు పధ్నాలుగు ఊర్ధ్వలోకాలు ఏడు. అథోలోకాలు ఏడు. ఈ లోకాలలో ఎక్కడా అతడుండడు. శ్రీమహావిష్ణువు వైకుంఠములో ఉంటాడు. అక్కడ ఉంటూ ఈ లోకాలను పాలిస్తూ ఉంటాడు. **శ్రీమద్భాగవతము**లో చెప్పినట్లుగా

**అలవైకుంఠపురంబులో నగరిలో** అక్కడ వైకుంఠంలో ఉంటాడు. అక్కడ ఉండే లోకపాలన చేస్తుంటాడు. **దేవీభాగవతము**లో "మణిద్వీపంలో వేయిస్తంభాల మంటపాలు నాలుగున్నాయి. అందులోని

**చతుర్థేమంటపే చైవ । జగద్రక్షావివించనమ్**
**మంత్రిణీ సహితానిత్యం । కరోతి జగదంబికా ॥**

నాల్గవ మంటపంలో ఆ పరమేశ్వరి తన మంత్రులతో కలసి లోకరక్షణ గురించి ఆలోచిస్తుంటుంది.

**తైత్తిరియోపనిషత్తు**లో ఆత్మను గురించి వివరిస్తూ "సృష్టికి ముందు అంతా శూన్యంగా ఉండేది. ఆ శూన్యంలో పరబ్రహ్మ ఒక్కడే ఉండేవాడు. అతడే నామరూపాత్మకమైన ఈ జగత్తును సృష్టించాడు. అతడు స్వయంభువు. ఆనందకారకుడు. అతన్ని సాక్షాత్కరింప చేసుకున్న వారు ఆనందం పొందుతారు. దహరాకాశంలో గనక ఆ పురుషుడు లేకపోతే ఊపిరి పీల్చేదెవరు ? అందుచేతనే హృదయపద్మములోనే పరమేశ్వరుడున్నాడు. సాధకుడు "తానే పరబ్రహ్మ" అని తెలుసుకుంటే భయముండదు. బ్రహ్మకు – తనకు భేదభావం కలిగితే భయం కలుగుతుంది. భేదదృష్టి గలవాడు విద్వాంసుడైనా సరే బయపడతాడు. సృష్టి నాశనానికి ఎవరో ఉన్నారనే భావమే భయానికి కారణము. తాను వేరు, బ్రహ్మవేరు అనే భావం తొలగిపోతే సాధకుడికి మోక్షం లభిస్తుంది.

పరబ్రహ్మను గూర్చిన భయంతోనే గాలి సవ్యంగా వీస్తోంది. సూర్యుడు సక్రమంగా ఉదయిస్తున్నాడు. ఆ భయంతోనే దేవతలు కూడా తమ విధులు సక్రమంగా నిర్వర్తిస్తున్నారు" అని చెప్పబడింది. ఈ రకంగా పరబ్రహ్మ ఉన్నాడు కాబట్టే లోకపాలన సక్రమంగా సాగుతున్నది. అందుచేతనే అతడు 'లోకాధ్యక్షః' అనబడుతున్నాడు.

**కేనోపనిషత్తు**లో ఒక కథ ఉన్నది. పూర్వకాలంలో దేవదానవ సంగ్రామం మహాభీకరంగా జరిగింది. ఆ సంగ్రామంలో చివరకు దేవతలు గెలుపొందారు. ఇప్పుడు వారందరూ విజయోత్సవం నిర్వహిస్తున్నారు. అందులో దేవతలు అహంకరించినవారై, ఈ గెలుపుకు కారణము తామే అని ఎవరికి వారు చెప్పుకుంటున్నారు. అగ్నిదేవుడు చెబుతున్నాడు తాను అగ్నిశిఖలు ప్రజ్వరిల్లచేస్తుంటే, వాటి ధాటికి తట్టుకోలేక రాక్షసులు మలమలా మాడిపోయారు. వాయువు చెబుతున్నాడు తాను పెనుగాలులు వీస్తుంటే ఆ గాలికి రాక్షసులు కొట్టుకుపోయారు. ఈరకంగా విజయానికి తామే కారణము అంటున్నారు దేవతలు.

బ్రహ్మతత్త్వం ఇందతా గమనించి, వాళ్ళకి గుణపాఠం నేర్పాలనుకున్నది. వెంటనే పెద్ద ఆకారంలో వారి ఎదుట ప్రత్యక్షమైంది. ఆ భూతాన్ని చూసి భయపడ్డారు దేవతలు. ఆ తత్త్వమేమిటో అర్థంకాలేదు వారికి. అందుకని అగ్నిదేవుని దగ్గరకు వెళ్ళి "అగ్నిదేవా! దేవతల విజయానికి ముఖ్యకారణం నువ్వే కదా ? అందుచేత మమ్మల్ని రక్షించు. ఆ భూతము ఏమిటో తెలుసుకుని రావలసినది" అన్నారు. సరే అన్నాడు అగ్నిదేవుడు. బయలుదేరి ఆ భూతం దగ్గరకు వెళ్ళాడు.

'ఎవరు నువ్వు' అడిగింది భూతం 'నేను అగ్నిని. జగత్తులోని దేన్నయినా క్షణంలోనే భస్మం చెయ్యగలను అన్నాడు అగ్ని.

'అయితే ఈ గడ్డిపోచను దగ్ధం చెయ్యి' అన్నది భూతం. ఒక గడ్డిపరకను అగ్నిముందు పెట్టింది. అగ్నిదేవుడు బ్రహ్మాండమైన మంటలను సృష్టించాడు. గడ్డిపోచ కసికందలేదు. చేసేది లేక అగ్ని వెనక్కి వచ్చేశాడు.

దేవతలు వాయుదేవుని శరణువేడారు. వారి మొరాలకించినవాడై వాయుదేవుడు ఆ భూతం దగ్గరకు వెళ్ళాడు. 'ఎవరు నువ్వు' అడిగింది భూతం.

నేను వాయుదేవుడను. క్షణంలో దేన్నైనా నా గాలులతో ఎగరకొట్టగలను అన్నాడు వాయుదేవుడు.

ఇందాకటి గడ్డిపోచనే ఇప్పుడు కూడా వాయువు ముందుంచి 'ఎగురగొట్టు' అన్నది.

చండప్రచండ గాలులు వీచాడు అగ్ని గడ్డిపరక కదలను కూడా లేదు. వెనుతిరిగాడు వాయువు.

ఇప్పుడు దేవతలంతా ఇంద్రుడి దగ్గరకు పోయి "దేవా ! ఆ తత్త్వమేమిటో నువ్వే కనుక్కోవాలి" అన్నారు. సరేనని బయలుదేరాడు ఇంద్రుడు. ఇంద్రుడు వెళ్ళేసరికి ఆ శక్తి మాయమైపోయింది. దానిస్థానంలో ఉమాదేవి ప్రత్యక్షమైంది. అప్పుడు ఇంద్రుడు ఆమెను "అమ్మా ! ఇప్పటిదాకా ఇక్కడ ప్రత్యక్షమైన తత్త్వము ఏమిటి ?" అని అడిగాడు. దానికి ఉమాదేవి..... "ఆ శక్తియే పరబ్రహ్మ ! దేవేంద్రా ! బ్రహ్మవల్లనే మీరు విజయం పొందారు. మీ గొప్పదనానికి కారణము బ్రహ్మ. ఆ బ్రహ్మతత్త్వమే మీ శరీరంలో శక్తిని వ్యాపింప చేస్తోంది. దానివల్లనే మీరు అసురులను సంహరించగలిగారు. అంతేగాని ఈ విజయము మీ గొప్పదనం కాదు" అని చెప్పింది.

పరబ్రహ్మతత్త్వాన్ని చూసినందువల్లనే అగ్ని, వాయువు, ఇంద్రుడు మిగిలిన దేవతలకన్న గొప్పవారైనారు" అని చెప్పబడింది.

దీనివల్ల మానవులకే కాదు దేవతలకు కూడా శక్తిని ప్రసాదించేది పరబ్రహ్మమే. ఈ జగత్తును పాలించేది పరబ్రహ్మమే అని తెలుస్తోంది. అందుచేతనే పరబ్రహ్మస్వరూపమైన శ్రీమన్నారాయణుడు 'లోకాధ్యక్షః' అనబడుతున్నాడు.

## 134. సురాధ్యక్షః

దేవతలకు ప్రభువు

**తదారాధ్యా స్సురాస్తథా**

ధర్మపరులచే ఆరాధించబడువారు దేవతలు. అటువంటి దేవతలకు ప్రభువు.

**సురానాం అధ్యక్షః సురాధ్యక్షః**

సురలకు అధ్యక్షుడు. సురలు అంటే – ఆరాధింపబడే దేవతలు.

దేవతలయొక్క యోగక్షేమాలు విచారించేవాడు. మానవులకే కాదు దేవతలకు కూడా ఏ రకమైన కష్టం వచ్చినాసరే ఆదుకునేవాడు.

సోమకాసురుడు వేదాలను ఎత్తుకు వెళ్ళిపోయి సముద్రంలో దాక్కున్నాడు. వేదాలు లేకపోవటంచేత మానవులు యజ్ఞయాగాదులు చెయ్యటం మానివేశారు. ఫలితంగా దేవతల తేజస్సు తగ్గిపోతున్నది. శ్రీమహావిష్ణువు మత్స్యావతారమెత్తి సోమకాసురుని సంహరించి వేదాలను రక్షించాడు.

దేవతలు అమృతం కోసం రాక్షసుల సాయంతో క్షీరసాగర మధనం చేస్తున్నారు. కవ్వముగా తెచ్చుకున్న మందరగిరి పర్వతం నీటిలో మునిగిపోవటం మొదలు పెట్టింది. శ్రీమహావిష్ణువు కూర్మావతారమెత్తి ఆ పర్వతం మునిగిపోకుండా కాపాడాడు. అమృతం కన్న హాలాహలం ముందుగా పుట్టింది. ఆ పరమేశ్వరుడు హాలాహలాన్ని మ్రింగేశాడు.

హిరణ్యకశ్యపుడు ముల్లోకాలను జయించాడు. దేవతలను నానాకష్టాల పాలుచేశాడు. శ్రీహరి నృసింహావతారమెత్తి హిరణ్యకశ్యపుని సంహరించాడు.

అదేవిధంగా దేవతలకు, సజ్జనులకు, సాధుపుంగవులకు కష్టం కలిగినప్పుడల్లా శ్రీమన్నారాయణుడు వారిని రక్షిస్తూనే ఉన్నాడు. అందుకే ఆయన 'సురాధ్యక్షుడు' అనబడుతున్నాడు.

మహాప్రళయం తరువాత సృష్టి చెయ్యాలని సంకల్పించినవాడై త్రిమూర్తులను సృష్టించి సృష్టి స్థితి లయాలు చూడమన్నాడు. ఇంద్రాగ్ని యమిత్యాది దేవతలను సృజించి వారిని దిక్పాలకులుగా చేశాడు. సూర్యచంద్రులకు ప్రకాశాన్ని ఇచ్చి లోకాలను ప్రవర్తిల్ల చేయమన్నాడు. దేవ, గంధర్వ, గరుడ, యక్ష, కిన్నెర, కింపురుష, సిద్ధ, సాధ్యగణాలను సృజించాడు. చతుర్దశభువనాలను సృష్టించి జీవులకు నివాసము కల్పించాడు. తాను మాత్రం వీటన్నింటికీ పైగా వైకుంఠములో లక్ష్మీసమేతుడై ఉన్నాడు. ఆ పరమేశ్వరుడున్నాడనే భయంతోనే గాలి సవ్యంగా వీస్తున్నది. సూర్యుడు సరిగా ప్రకాశిస్తున్నాడు. దిక్పాలకులు వారి వారి పనులను సక్రమంగా నిర్వహిస్తున్నారు. ఈ విధంగా పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడే దేవతలను శాసిస్తున్నాడు. అతని శాసనములు అనుల్లంఘనీయములు. అతడే దేవతలకు ప్రభువు, స్వామి, రాజు కాబట్టే 'సురాధ్యక్షుడు' అనబడుతున్నాడు.

# 135. ధర్మాధ్యక్షః

ధర్మానికి ప్రభువు.

**ధర్మస్త త్సాధనం తేషా మధ్యక్ష స్త్సాత్త్వి నామవాన్**
**లోకాధ్యక్ష స్సురాధ్యక్షో ధర్మాధ్యక్ష ఇతిక్రమాత్**
**అనిరుద్ధ స్స విజ్ఞేయో లోకాధ్యక్షాది నామవాన్ ॥**

తనను ఆశ్రయించిన వారికి, ఉపాయము, ధర్మము. అన్నింటికీ తానే ప్రభువు. అంటే అనిరుద్ధమూర్తియై, చేసిన కర్మలు మంచివిగాని, చెడ్డవిగాని, వ్యర్థముగాకుండా, చెయ్యనివి వచ్చిపడకుండా తగిన ఫలితాన్ని మాత్రమే ఇచ్చేవాడు.

**ధర్మస్య అధ్యక్షః ధర్మాధ్యక్షః** ధర్మానికి అధ్యక్షుడు. ధర్మమే అతడికి సాధనము వీటన్నింటికీ స్వామి. అదృష్టస్థానములో ఉండి ఫలితాన్ని ఇచ్చేవాడు. ఇక్కడ అనిరుద్ధుని స్వరూపము చెప్పబడింది.

పరమేశ్వరుడు ధర్మాన్ని, అధర్మాన్ని కూడా ఒకలాగానే చూస్తాడు. కాకపోతే జీవులకు వారు చేసిన కర్మల ననుసరించి ఫలితాన్ని ఇస్తాడు. ఆ పనిచేసినవారు ఎవరైనాసరే దాని ఫలితాన్ని అనుభవించి తీరవలసినదే ఇది పరమేశ్వరుని నీతి. గౌతముని భార్య అహల్య వద్దకు పోయాడు ఇంద్రుడు. వెళ్ళినవాడు దేవరాజు అని క్షమించలేదు. ఘోరమైన శాపాన్ని పొందాడు. అతడి వృషణాలు రెండూ తెగి క్రింద పడిపోయినాయి.

వృత్రాసురుడు రాక్షసుడే. అయినప్పటికీ అతన్ని కపటంతో, మాయోపాయంతో సంహరించాడు ఇంద్రుడు. ఫలితంగా ఇంద్రుని తేజస్సు తగ్గిపోయింది.

ఎవరిదాకానో ఎందుకు ? రామావతారంలో శ్రీరామచంద్రుడు వాలిని చెట్టుచాటు నుంచి సంహరించాడు. ఫలితంగా కృష్ణావతారంలో వాలి బోయవాడుగా జన్మించి శ్రీకృష్ణభగవానుని నిర్యాణానికి దోహదం చేశాడు.

అంతదాకా ఎందుకు ? కురుక్షేత్ర సంగ్రామంలో 18 అక్షోహిణీలసైన్యాన్ని సర్వనాశనం చేశాడు. కురువంశాన్ని సమూలంగా చెరిపేశాడు. వందమంది కుమారులను చంపి గాంధారికడుపులో ఆరని చిచ్చుపెట్టాడు. ఫలితంగా యాదవ వంశానికి మొసలం పుట్టి, యదువంశం పూర్తిగా నాశనమవుతుంది. అని గాంధారి శాపం పెట్టింది. ఆ కర్మఫలాన్ని నవ్వుతూ ఆనందంగా స్వీకరించాడు భగవానుడు.

కాబట్టి పరమేశ్వరుడికి ధర్మాచరణలో తరతమ భేదాలులేవు. ధర్మాన్ని నాలుగు పాదాలా నడిపిస్తాడు. ధర్మానికి అధిపతి. అందుకే 'ధర్మాధ్యక్షుడు' అనబడుతున్నాడు.

## 136. కృతాఽకృతః

ప్రవృత్తి నివృత్తి ధర్మస్వరూపి.

**అనిత్య నిత్య ఫలదౌ ప్రవర్తక నివర్తకౌ**
**దదౌ యస్య స్వరూపం సః కృతాకృత ఇతీరితః**

కృతము అనగా – ఐహికఫలాన్నిచ్చే ప్రవృత్తి ధర్మము. ఇది అనిత్యము.

అకృతము అనగా – నిత్యము, శాశ్వతము అయిన మోక్షఫలానిచ్చే నివృత్తి ధర్మము.

ఈ రెండింటినీ స్వరూపంగా గలవాడు.

**కృతశ్చాసౌ అకృతశ్చ కృతాకృతః** కృతము అకృతము, ప్రవృత్తి, నివృత్తి ధర్మాలు రెండూ అనిరుద్ధుని స్వరూపమే.

పరమేశ్వరుడు జీవులు చేసిన కర్మలననుసరించి వారికి ఫలితాన్ని ఇస్తాడు. చెడు కర్మలు చేసిన వారు పాపం మూటకట్టుకుంటారు. మరీ దుష్కర్మలు చేసిన వారు రౌరవాది నరకాలు అనుభవిస్తారు. మరణానంతరము నరకలోకంలో వారు చేసిన కర్మలకు శిక్ష అనుభవించి, కర్మ శేషం అనుభవించటానికి భూలోకంలో మళ్ళీ జన్మిస్తారు. పాపకర్ములు గతంలోకన్న నీచమైన జన్మలు ఎత్తుతారు.

జీవులు మంచికర్మలు అంటే – బావులు, చెరువులు త్రవ్వించటం, అన్నసత్రాలు కట్టించటం, శాశ్వత అన్నదానాలు చెయ్యటము, యజ్ఞయాగాది క్రతువులు, అర్చనలు, వ్రతాలు, దానధర్మాలవంటి పనులు చేస్తే మరణానంతరము ఉత్తమలోకాలకుపోతారు. అక్కడ పుణ్యఫలాన్ననుభవించి, కర్మశేషాన్ననుభవించటానికి ఉత్తరజన్మలు ఎత్తుతారు. అవి గతజన్మలకంటె ఉన్నతంగానూ, ఉత్తమంగానూ ఉంటాయి. ఈ జన్మలో శ్రీమంతులైన వారందరూ గతజన్మలో ఉత్తమ కర్మలు చేసినవారే. అటువంటి వారు ధనవంతులే కానవసరంలేదు. పండితులు, శాస్త్రవేత్తలు, అధికారులుగా జన్మించవచ్చు.

ఐతే ఈ రకమైన పాపపుణ్యాలు, సుఖదుఃఖాలు, సిరిసంపదలు, భోగభాగ్యాలు అన్నీ అశాశ్వతమైనవి. పోయేటప్పుడు ఇవేవీ వెంటరావు. కాబట్టి మానవుడు నిత్యము, శాశ్వతము అయిన ఫలితమునిచ్చే కర్మలు మాత్రమే చెయ్యాలి. ఇవే నివృత్తి కర్మలు. కర్మలు చేసిన ప్రతివారికి ఫలితం వచ్చి తీరుతుంది. అందుచేత మోక్షగాములైనవారు కర్మలు చెయ్యరు. ఎల్లప్పుడూ ఆ భగవంతుని చింతనలోనే కాలం గడుపుతారు. ఒకవేళ వారు గనక కర్మలు చేయవలసి వస్తే నిష్కామ్యకర్మలు చేస్తారు. అంటే ఆ కర్మలవల్ల ఏ రకమైన ఫలితాన్ని ఆశించరు. పరమేశ్వరుని పరంగా కర్మ చేస్తారు. అందుచేత వారికి కర్మఫలం అంటదు. అటువంటివారు సమదృష్టితో ఉంటారు. అంటే – జగత్తులోని జీవులన్నింటినీ సమానదృష్టితో చూడగలుగుతారు. జగత్తునంతటినీ తమలోనే దర్శించగలుగుతారు. అటువంటివారికి ఉత్తరజన్మ ఉండదు. కర్మలు చెయ్యలేదు కాబట్టి అనుభవించటానికి కర్మఫలితం లేదు. వారు జీవన్ముక్తులు. వారికి ఏ రకమైన బంధనాలు ఉండవు. ఈ లోకంలో ఉంటూ కూడా, దేనితోనూ సంబంధము లేకుండా ఉంటారు. అటువంటివారు మరణానంతరము అర్చిరాది మార్గంద్వారా బ్రహ్మలోకంచేరి, కల్పాంతము

వరకు అక్కడే ఉండి, ఆ తరువాత నిత్యము, శాశ్వతము అయిన పరబ్రహ్మరూపాన్ని పొందుతారు. ఇది నివృత్తి ధర్మము.

ఈ రకంగా ప్రవృత్తి, నివృత్తి ధర్మాలు రెండూ ఆ పరమేశ్వరుని స్వరూపమే. అందుచేతనే అతడు 'కృతాఽకృతః అనబడుతున్నాడు.

## 137. చతురాత్మా

నాలుగురూపాలు గలవాడు. 769వ నామము ఇదే.

**వాసుదేవాది రూపత్వా చ్చతురాత్మేతి కథ్యతే ॥**

వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ అని నాలుగురూపాలు గలవాడు.

**చత్వారః ఆత్మానః యస్యసః చతురాత్మా** వాసుదేవాది నాలుగురూపములు గలవాడు. ఆత్మ అంటే – మూర్తి. శరీరము అని అర్థం.

**చత్వారః ఆత్మానః యస్య సః**

సృష్టిస్థితి లయల యందు నాలుగు మూర్తులు, వేరు వేరు విభూతులు కలవాడు.

**విష్ణుపురాణము**లో పరిపాలనా సామర్థ్యము సర్వేశ్వరుడగు విష్ణువును వదలి మరి ఎవరికీ ఉండదు. ఇతడు సృష్టికాలములో రజోగుణప్రధానుడై సృష్టిని, స్థితికాలములో సత్వగుణ ప్రధానుడై పరిపాలనా భారాన్ని, ప్రళయకాలములో తమోగుణ ప్రధానుడై సంహారమును నాలుగు భాగాలుగా చేస్తున్నాడు. జనార్దనుడు నాలుగు అంశలు కలవాడు సృష్టి సమయంలో రజోగుణప్రధానుడై

| | | |
|---|---|---|
| ఒక అంశతో | – | బ్రహ్మగా అవ్యక్తరూపుడైనాడు. |
| రెండవ అంశ | – | మరీచి మొదలైన ప్రజాపతులు |
| మూడవ అంశ | – | కాలము |
| నాల్గవ అంశ | – | సర్వభూతములు. అయినాడు. |

స్థితిసమయములో సత్వగుణప్రధానుడై

| | | |
|---|---|---|
| మొదటి అంశ | – | విష్ణువు |
| రెండవ అంశ | – | మనువులు |
| మూడవ అంశ | – | కాలము |
| నాల్గవ అంశ | – | సర్వప్రాణులు అయి పాలన చేస్తున్నాడు. |

అంత్యకాలములో తమోగుణప్రధానుడై

| | | |
|---|---|---|
| మొదటి అంశ | – | రుద్రుడు |
| రెండవ అంశ | – | అగ్ని, అంతకుడు |
| మూడవ అంశ | – | కాలము |
| నాల్గవ అంశ | – | సర్వభూతములు అయి లయము చేస్తున్నాడు. |
| | | ఈ విభాగము సార్వకాలికము. |

**బ్రహ్మాదక్షా దయః కాలస్తథైవాఖిల జంతవః ।**
**విభూతయోహరే రేతా జగత స్సృష్టి హేతవః ॥**

**విష్ణుమ న్వాదయః కాలస్సర్వభూతాని చ ద్విజ ।**
**స్థితే నిమిత్త భూతస్య విష్ణోరేతా విభూతయః ॥**

**రుద్రః కాలాంతకాద్యాశ్చ సమస్తాశ్చైవ జంతవః ।**
**చతుర్థాప్రళయాయైతా జనార్దన విభూతయః ॥**

**జగదాదౌ తథామధ్యే సృష్టిరా ప్రళయాద్ద్విజ ।**
**ధాత్రా మరీచి మిశ్రైశ్చ క్రియతే జంతుభిస్తథా ॥**

బ్రహ్మ, దక్షుడు, కాలుడు, జంతువులు. ఇవన్నీ సృష్టికారణములైన హరివిభూతులు.

విష్ణువు, మన్వాదులు, కాలము, సర్వభూతములు ఇవన్నీ స్థితిరూపమైన విష్ణువు యొక్క విభూతులు. రుద్రుడు, కాలుడు, అంతకుడు, సమస్త జంతువులు ఇవన్నీ ప్రళయము నిమిత్తము జనార్దనుని విభూతులు.

ఈ రకంగా సృష్టిస్థితి లయాలయందు నాలుగు చొప్పున విభూతులు కలిగి ఉన్నాడు. కాబట్టి శ్రీమహావిష్ణువు 'చతురాత్మా' అనబడుతున్నాడు.

## 138. చతుర్వ్యూహః

నాలుగు వ్యూహములు గలవాడు. 767వ నామము ఇదే.

**జాగ్రత్స్వప్న సుషుప్త్యాదౌ వ్యూహావస్థా చతుష్టయే ।**
**ఏతైర్విశిష్టమూర్తిత్వాత్ చతుర్వ్యూహ ఇతీరితః ॥**

జాగ్రస్వప్న సుషుప్తి మొదలైన అవస్థలయందు, వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ అనబడు వ్యూహావస్థలయందు నాలుగువిధముల ఆకారములతో ఉన్నవాడు.

**చత్వారః వూహాః యస్యసఃచతుర్వ్యూహః**

గతంలో చెప్పినట్లుగా సృష్టిస్థితి సంహారములు చేయటానికి ధ్యానింపదగిన రూపము ఇది అని తెలియచేయటం కోసము కళ్యాణ గుణాలను విభజించి, వాటివలన ఏర్పడిన అవయములు, వర్ణము, ఆయుధములు, వాహనము, ధ్వజము మొదలైన వాటితోను, జాగ్రదాది నాలుగు అవస్థలతోను కలిసి నాలుగు విధాలుగా విభజించబడి ఉండేవాడు.

**చత్వారః వ్యూహా యస్యసః** నాలుగు విధాలయిన వ్యూహాలు గలవాడు.

**వ్యూహాఽఽత్మానం చతుర్ధా వై వాసుదేవాదిమూర్తిభిః**
**సృష్ట్యాదీన్ ప్రకరో త్యేష విశ్రుతాత్మా జనార్దనః**

పరమేశ్వరుడైన జనార్దనుడు వాసుదేవుడు, సంకర్షణుడు, ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు అని నాలుగు వ్యూహాలుగా తనను తాను విభజించుకుని సృష్ట్యాది కార్యక్రమాలు చేస్తున్నాడు.

అందుచేతనే అతడు 'చతుర్వ్యూహ' అనబడుతున్నాడు.

## 139. చతుర్దంష్ట్రః

నాలుగు కోరలు కలవాడు.

**దంష్ట్రా చతుష్కయుక్తత్వాత్ చతుర్దంష్ట్ర ఇతిస్మృతః ॥**

మహాపురుష లక్షణమైన నాలుగుకోరలు కలవాడు.

**చతురస్రః దంష్ట్రాః యస్యసః చతుర్దంష్ట్రః** వ్యూహమూర్తులకు కారణమైనటువంటి పరవాసుదేవ స్వరూపముతో నాలుగుకోరలు గలవాడు.

ఈ రకంగా కోరలు ఉండటము మహాపురుషుల లక్షణము. **శ్రీమద్రామాయణము**లోని సుందరకాండలో ఆంజనేయుడు లంకలోని అశోకవనములో సీతామాత దగ్గర శ్రీరామచంద్రుని అంగాంగాలు వర్ణిస్తూ ....

**చతుర్దశ సమద్వన్ద్వ శ్చతుర్దంష్ట్రశ్చతుర్గతిః**
**మహోష హనునాసశ్చ పంఙ్క్తి స్నిగ్ధోఽష్టవంశవాన్**

"పద్నాలుగు జంటలు సమానంగా ఉన్నవాడు, నాలుగు కోరలు, నాలుగింటి (సింహము, పులి, ఏనుగు, వృషభము) నడకగలవాడు, పెద్దపెద్దకణతలు, ముక్కు గలవాడు, సన్ననయిన అవయవములు (కన్నులు, పళ్ళు, చర్మము, పాదాలు) కలవాడు, ఎనిమిది పొడవైన ఎముకలు గల అవయవాలు గలవాడు" అంటాడు. ఇక్కడ శ్రీరామచంద్రునికి

నాలుగుకోరలున్నాయని చెప్పబడింది. ఇది మహాపురుష లక్షణము. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'చతుర్దంష్ట్రః' అనబడుతున్నాడు.

**చతస్రః దంష్ట్రాః యస్యసః** నాలుగు కోరలు గలవాడు. నృశింహావతారము ఎత్తినప్పుడు విష్ణుమూర్తికి కోరలున్నాయి. దంష్ట్ర అనగా – కోర, పల్లు అని అర్థము.

మన నోటిలో ముందు వైపు ఉండే పళ్ళను కోరలు అంటారు. ఇవి పైనవైపున రెండు, క్రింద వైపున రెండు మొత్తం నాలుగుంటాయి. అందుకే జనార్దనుడు 'చతుర్దంష్ట్ర' అనబడతాడు.

## 140. చతుర్భుజః

నాలుగు భుజములు గలవాడు.

**మహాపురుష రూపత్వా దుచ్యతేహి చతుర్భుజః**

మహాపురుషుల లక్షణమైన నాలుగు భుజములు గలవాడు.

**చత్వారః భుజాః యస్యసః చతుర్భుజః** నాలుగు భుజములు గలవాడు.

**శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం**
**ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వ విఘ్నోప శాంతయే ॥**

ఇక్కడ విఘ్నేశ్వరుడికి కూడా నాలుగు భుజాలున్నాయని చెప్పబడింది. అలాగే కాళిదాసు కాళీదేవిని ప్రార్థిస్తూ **చతుర్భుజే చంద్రకళావతంసే** అంటాడు.

అదేవిధంగా పరమేశ్వరస్వరూపంగా భావించేటప్పుడు ఆ దేవతకు నాలుగు చేతులు ఉండటమనేది సర్వసాధారణం. ఈ చేతులతో వివిధ ఆయుధాలు ధరించి ఆ భగవానుడు భక్తులను కాపాడతాడు. ఇక్కడ శ్రీమహావిష్ణువే పరమేశ్వరస్వరూపము. కాబట్టి ఆయన 'చతుర్భుజః' అనబడుతున్నాడు.

## 141. భ్రాజిష్ణుః

ప్రకాశించువాడు.

**ఉపాసితృభ్యో భ్రాజిష్ణుః స్వప్రకాశనశీలతః**

తనను ఉపాసన చేసే భక్తులుకు జ్ఞానదీపికలతో ప్రకాశించాలనే కోరికతో తాను ప్రకాశించువాడు.

**భ్రాజతే ఇతి భ్రాజిష్ణుః**

ప్రకాశించేవాడు కావటంచేత శ్రీమహావిష్ణువు భ్రాజిష్ణువు అనబడుతున్నాడు. తనను ఉపాసనచేసే భక్తులకోసం స్వరూపము, గుణము, విభూతి మొదలైన వాటితో ప్రకాశిస్తాడు.

**భ్రాజతే** – ప్రకాశించుచుండును. పరమేశ్వరుడు ప్రకాశైకస్వరూపుడు.

యామళగ్రంధాలలో చెప్పినట్లుగా

**జ్యోతిరూపా పరాకారా యస్యాదేహోద్భవాశ్శివే ॥**
**కిరణాశ్చ సహస్రంచ ద్విసహస్రంచ లక్షకమ్ ।**
**కోటిరర్బుదమే తేషాం పరాసంఖ్యాన విద్యతే ॥**

పరారూపమైన పరమేశ్వరి శరీరము జ్యోతిరూపంతో దేదీప్యమానంగా వెలుగుతుంది. ఆ శరీరము నుండి అనేక వేలు, లక్షలు, కోట్లు, కోటానుకోట్లు కిరణాలు వెలువడుతున్నాయి. అని చెప్పటం జరిగింది.

ఈ రకంగా పరమేశ్వరుడు దివ్యమైన కాంతులతో ప్రకాశిస్తున్నాడు కాబట్టే 'భ్రాజిష్ణుః' అనబడతాడు.

సృష్టి ప్రారంభం కాకముందు అంతా శూన్యంగా ఉండేది. అప్పుడు పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు ఒక్కడే ఉన్నాడు. అతడు దివ్యమైన కాంతులతో దేదీప్యమానంగా ప్రకాశిస్తున్నాడు.

## 142. భోజనమ్

భుజింపబడువాడు.

**సుఖేన భోజనం ప్రాహుః యో భక్తై రనుభూయతే ॥**

ఉపాసించే భక్తులచే ఆనందముగా అనుభవించబడేవాడు.

**భుజ్యతే ఇతి భోజనమ్**

అనుభవించబడువాడగుటచే భోజనము అనబడుతున్నాడు.

మాయా రూపప్రకృతే జీవులకు భోజ్యరూపమున ఉన్నది కాబట్టి భోజనంఅని చెప్పబడుతుంది.

భోజనము అనగా – ఆకలి తీర్చే పదార్థము. అది అన్నమే కానవసరంలేదు. ఇంద్రియాలన్నింటికీ ఆకలిదప్పికలుంటాయి. వాటన్నింటికీ ఆకలిని తీర్చేది కేవలము అన్నముకాదు. అలాగే జగత్తులో వివిధ రకాల జీవజాలమున్నది. వీటన్నింటికీ ఒకే

రకమైన ఆహారం అవసరం లేదు. పశువులు గడ్డి తింటాయి, మృగాలు మాంసాహారులు, పక్షులలో కొన్ని శాఖాహారులు, కొన్ని మాంసాహారులు, కొన్ని ఉభయాహారులు. అదేవిధంగా చెట్లలోకూడా శాఖాహారులు, మాంసాహారులు ఉన్నాయి. ఏ జీవి దేన్ని ఆహారంగా తీసుకుంటే అదే దాని అన్నము.

**ఐతరేయోపనిషత్తు**లో లోకాలను సృష్టించిన తరువాత ఆ పరమేశ్వరుడు లోకపాలకులను సృష్టించాలనుకున్నాడు. ముందుగా విరాడ్రూపాన్ని సృష్టించాడు.

పరమాత్మ విరాట్స్వరూపాన్ని దృష్టిలో పెట్టుకుని తీవ్రమైన ఆలోచన చేశాడు. అదే తపస్సు. దాని ఫలితంగా విరాడ్రూపానికి ఇంద్రియాలు వచ్చినాయి. ఇంద్రియాలనుంచి వాటి అభిమాన దేవతలు పుట్టారు.

పరమేశ్వరుడు విరాడ్రూపానికి ఆకలిదప్పికలు కలిగేలాచేశాడు. అప్పుడు దేవతలందరూ మేము కూర్చుని తినేందుకు వీలుగా, మాకు తగిన స్థానాన్ని ప్రసాదించమని పరమేశ్వరుణ్ణి వేడుకున్నారు. అప్పుడు విరాడ్రూపాన్ని పోలిన మానవాకారాన్ని సృష్టించాడు. భగవంతుని ఆజ్ఞానుసారము దేవతలంతా వారివారిస్థానాల్లో ప్రవేసించారు. అంటే

అగ్నివాగ్రూపం ధరించి ఆ పురుషుని నోటియందు ప్రవేసించింది.

| | | |
|---|---|---|
| వాయువు | – | ప్రాణరూపంలో ముక్కునందు |
| సూర్యుడు | – | దృష్టిరూపంలో నేత్రాలయందు |
| దిక్కులు | – | చెవులయందు |
| ఓషధులు, వనస్పతులు | – | చర్మమునందు |
| చంద్రుడు | – | హృదయమందు |
| మృత్యువు | – | అపానరూపంతో నాభియందు |
| జలం | – | వీర్యరూపంతో జననేంద్రియమందు |

ప్రవేశించాయి. ఈ రకంగా దేవతలంతా వెళ్ళిపోగా ఇంక మిగిలినవి ఆకలి దప్పికలు. ఈ రెండింటినీ పరమేశ్వరుడు దేవతలందరిలోనూ భాగస్వాములుగా చేశాడు. దీనివల్ల ఏ దేవతకు హవిస్సు ఇచ్చినా వాటిలో ఆకలిదప్పికలకు కూడా భాగం గలుగుతుంది.

| | | |
|---|---|---|
| కంటికి ఆకలి అంటే | – | చూడాలనే కోరిక |
| చెవులకు ఆకలి అంటే | – | వినాలనే కోరిక |
| నోటికి ఆకలి అంటే | – | మాట్లాడాలనే కోరిక |

| | | |
|---|---|---|
| చేతులకు ఆకలి అంటే | – | స్పృశించాలి (తాకాలి) అనే కోరిక |
| కాళ్ళకు ఆకలి అంటే | – | తిరగాలనే కోరిక |
| పొట్టకు ఆకలి అంటే | – | తినాలనే కోరిక |

ఈ రకంగా ఇంద్రియాలు, వాటి అధిష్ఠాన దేవతలను సృష్టించిన తరువాత, ఆహారాన్ని సృష్టించాడు. కాబట్టి భోజనము అంటే – ఆకలి తీర్చే పదార్థము. ఇది అన్నింటికీ ఒకటే కాదు. జీవులకు వివిధరకాల పదార్థమవుతున్నది. ఇంద్రియాలకు వివిధ విషయాలవుతున్నాయి. భోజనము అంటే ప్రకృతి తప్ప వేరేదీకాదు. జగత్తులో చైతన్యమేకాదు. జడరూపమయిన ప్రకృతి కూడా పరమేశ్వరస్వరూపమే. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'భోజనమ్' అనబడతున్నాడు.

## 143. భోక్తా

భుజించువాడు. 500, 888 నామాలు ఇదే.

**భోక్తాఽఽర్పితస్య భోక్తృత్వాత్ భోక్తాస్యా దమృత స్వ వా ॥**

భక్తులు ప్రేమతో అర్పించే పదార్థము అల్పమ్ అయినప్పటికీ, ఆనందముగా స్వీకరించువాడు.

**భుంక్తే ఇతి భోక్తా** భుజించేవాడు కాబట్టి భోక్త. భక్తులు ప్రీతితో అర్పించినది ఏదైనా సరే ఆనందముగా తీసుకుంటాడు. **భగవద్గీత**లోని తొమ్మిదవ అధ్యాయము **'రాజవిద్యా రాజగుహ్య యోగము'**లోని 26వ శ్లోకం.

**పత్రం పుష్పం ఫలం తోయం మో మే భక్త్యా ప్రయచ్ఛతి ।**
**తదహం భక్త్యుపహృతమ్ అశ్నామి ప్రయతాత్మనః ॥**

నిర్మలమైన బుద్ధితో, నిష్కామ భావముతో పరమభక్తుని చేత సమర్పింపబడిన పత్రముగాని, పుష్పముగాని, ఫలముగాని, జలముగాని, నేను స్వయముగాప్రీతితో ఆరగిస్తాను.

సామాన్య మానవులకు కూడా ఏ రకమైన శ్రమ, ఖర్చులేకుండా తేలికగా దొరికే ఏ వస్తువైనా భగవదర్పణ చేయవచ్చును. పరమేశ్వరుడు పూర్ణకాముడు. కాబట్టి అతడికి ఏ కోరికలు ఉండవు. అతడు ఏ వస్తువునూ ఆశించడు. కేవలము భక్తిని మాత్రమే కోరతాడు. అటువంటి భక్తుడు సమర్పించే ఏ వస్తువైనాసరే చాలా ప్రీతితో స్వీకరిస్తాడు.

మహాభారతంలో పాండవులు అరణ్యవాసము అజ్ఞాతవాసము పూర్తిచేశారు. రాజ్యభాగం కోసం శ్రీకృష్ణపరమాత్ముని రాయబారిగా పంపారు. వచ్చిన భగవానుని దుర్యోధనుడు విందుకు ఆహ్వానించాడు. సున్నితంగా తిరస్కరించాడు భగవానుడు. తాను సుయోధనుని ఆహ్వానం తిరస్కరించటానికి రెండు కారణాలు చెప్పాడు.

1. ప్రేమ గల చోట ఏది పెట్టినా తృప్తిగానే ఉంటుంది.

2. ఆకలితో ఉన్నవాడికి ఎవరు ఏమిచ్చినా అమృతం లాగానే ఉంటుంది.

ఇక్కడ నా మీద మీకు ప్రేమలేదు. నేను ఆకలితోలేను. కాబట్టి నీ విందుకు రాను అని చెప్పి భక్తాగ్రేశ్వరుడైన విదురుని ఇంటికి పిలువకుండానే వెళ్ళి విందారగించాడు.

బాల్యమిత్రుడైన కుచేలుడు తన వద్దకు వస్తూ గుప్పెడు అటుకులు మూటకట్టుకు వచ్చాడు. వాటినే తృప్తిగా ఆరగించాడు భగవానుడు.

పాండవులు అరణ్యవాసం చేస్తున్నరోజులవి. సూర్యభగవానుడు ధర్మరాజుకు అక్షయపాత్రనిచ్చాడు. పాండవులు, ద్రౌపది కూడా భోజనం చేశాక, ఇక ఆ పాత్రలోనుంచి ఏ వస్తువూరాదు. ఈ విషయం తెలిసిన దుర్యోధనుడు దుర్వాసమహర్షిని ఆయన శిష్యపరివారం పదివేలయందితో సహా ధర్మరాజు వద్దకు పంపాడు.

మహర్షి వచ్చేటప్పటికి అపరాహ్ణము దాటిపోయింది. ద్రౌపది కూడా భోజనంచేసి విశ్రాంతి తీసుకుంటున్నది. వచ్చిన మహర్షిని స్నానంచేసి రమ్మన్నాడు ధర్మజుడు. ద్రౌపది చింతాక్రాంత అయింది. ఏంచెయ్యాలో పాలుపోలేదు. శ్రీకృష్ణభగవానుని ప్రార్థించింది. భగవానుడు ప్రత్యక్షమై 'ఆకలిగా ఉన్నది. తినటానికి ఏదైనాపెట్టు' అన్నాడు ద్రౌపదిని. జరిగిన సంగతి వివరించింది ద్రౌపది. అక్షయపాత్రలో ఏ కొంచెమయినా మిగిలి ఉన్నదేమో చూడు అన్నాడు భగవానుడు. అక్షయపాత్రలో అంచున ఒక మెతుకు అంటుకుని ఉంది. ఆ ఒక్క మెతుకు తిని పరమేశ్వరుడైన శ్రీకృష్ణభగవానుడు తృప్తి చెందాడు. దాంతో ఈ జగత్తంతా తృప్తి చెందింది. దుర్వాసమహర్షి కూడా తృప్తి చెందాడు.

శబరి భిల్ల స్త్రీ. దండకారణ్య ప్రాంతములో మహర్షులకు సేవలు చేస్తుండేది. అది చూసి ఆనందించిన మతంగమహర్షి ఆమెకు రామనామముపదేసించి శ్రీరామచంద్రుని దర్శించి, సేవించి తరిస్తావు అని చెప్పాడు. ఆ రోజు నుంచి రామనామస్మరణతోనే కాలం గడిపింది. శ్రీరాముడు వస్తే కూర్చోవటానికి మట్టితో ఆసనం ఏర్పాటు చేసింది. ముగ్గులతో అలంకరించింది. అడవిఅంతా తిరిగి పండిన పండ్లు తెచ్చింది. అవి తియ్యగా ఉన్నాయోలేదో రుచిచూసి మరీ తెచ్చింది. శ్రీరాముడు రానే వచ్చాడు. శబరి అతన్ని

సాదరంగా ఆహ్వానించింది. ఆ పిలుపులో తన్మయత్వం, తాదాత్మ్యత. శబరి ఆతిధ్యాన్ని ఎంతగానో ఆనందించాడు పరమాత్ముడు.

రంతిదేవుడు ఒక మహారాజు మహాభక్తుడు. మిక్కిలి దయాగుణం గలవాడు. తనకున్నదంతా పేదలకు దానంచేశాడు. కడు దరిద్రుడైపోయాడు. ఒకసారి 48 రోజులు అతడి కుటుంబము తిండిలేక అలమటించిపోయింది. ఆ మరునాడు అతడికి సమృద్ధిగా ఆహారం దొరికింది తీరా తినబోయే సమయానికి ఒక బ్రాహ్మణుడు అతిధిగా వచ్చాడు. అతిధి రూపంలో వచ్చినవాడిని సాక్షాత్తూ శ్రీహరిగానే భావించి భోజనం పెట్టాడు రంతిదేవుడు. తరువాత ఒక శూద్రుడు అన్నార్తియై వచ్చాడు. అతడికి భోజనం పెట్టాడు రంతిదేవుడు. ఇంతలో ఇంకొకడు కొన్ని కుక్కలతో వచ్చి నాకు, నా కుక్కలకు భోజనం పెట్టమన్నాడు. మిగిలిన అన్నాన్ని అతడికి పెట్టేశాడు రాజు. ఇప్పుడు రాజు దగ్గర త్రాగటానికి సరిపోయే నీరు మాత్రమే ఉన్నది. ఆ నీరు త్రాగబోయే సమయంలో ఒక ఛండాలుడు వచ్చి బాగా దప్పికగొని ఉన్నాను. త్రాగటానికి నీరు ఇవ్వమన్నాడు. వచ్చినవాడు శ్రీహరిగానే భావించి మిగిలిన నీటిని కూడా దానం చేశాడు రాజు. ఆ నీటిని కూడా త్రాగకపోతే తానుబ్రతకడు. అయినాసరే వచ్చిన అతిధి సాక్షాత్తూ నారాయణుడే అని భావించి ఆ నీటిని కూడా దానంచేశాడు రంతిదేవుడు.

ఈ రకంగా భక్తులు ప్రేమతో సమర్పించే వస్తువు ఏదైనాసరే చాలా ఇష్టంగా స్వీకరిస్తాడు పరమాత్ముడు. ఆ వస్తువు స్వల్పమా, అధికమా అనికాదు. దాన్ని అర్పించటంలో అతని భక్తి ఎంతవరకు ఉన్నది ? అనేదే ప్రధానం. భక్తులు ప్రేమతో సరమర్పించే పదార్థాలను స్వీకరిస్తాడు. కాబట్టే శ్రీమన్నారాయణుడు 'భోక్తా' అనబడుతున్నాడు.

500, 888 నామాలు కూడా ఇవే.

**గంగి గోవుపాలు గంటెడైనను చాలు**
**కడివెడైనను ఏమి ఖరము పాలు**
**భక్తి కలుగుకూడుపట్టెడైనను చాలు**

## 144. సహిష్ణుః

సహించువాడు. 565వ నామము ఇదే.

**స్వభక్త విషయాణాం చ నిర్మర్యాద కృతైనసామ్ ।**
**సహనైక స్వశీలత్వాత్ సహిష్ణు రితి విశ్రుతః ॥**

తన భక్తులైనవారు హద్దుమీరి చేసినటువంటి పాపాలన్నీ సహించేవాడు.

**సహతే ఇతి సహిష్ణుః** సహించువాడవటంచేత 'సహిష్ణుః' అనబడుతున్నాడు.

తన భక్తులమీద అమితమైన ప్రేమ, ఆదరములు గలవాడు. అందుచేత వారు తెలిసిగాని, తెలియకగాని, చేసిన పాపాలను క్షమిస్తాడు. తనను అవమానించినా, నిందించినా సహిస్తాడు.

తన భక్తులు తనను ఆరాధిస్తున్నారు. అయినప్పటికీ పూర్వజన్మ కృతం వల్ల బాధపడుతూనే ఉన్నారు. వారి కష్టాలు తొలగిపోలేదు. పరమేశ్వరుణ్ణి అర్చించినా కష్టాలు తొలగిపోలేదు. అందుచేత విసిగిపోయి "ఉన్నావా ! అసలు నువ్వు ఉన్నావా! ఉంటే నాకీ కష్టాలు ఏమిటి ? నిన్ను నిత్యమూ అర్చిస్తున్న నేను ఎందుకు అవమానాలు పొందుతున్నాను?" అంటూ ఆ పరమేశ్వరుని అవమానిస్తాడు తిడతాడు. అన్నింటినీ నవ్వుతూ భరిస్తాడు పరమేశ్వరుడు.

హిరణ్యకశ్యపుడు, హిరిణ్యాక్షుడు మొదలైన రాక్షసులు మహాభక్తులు. బ్రహ్మను గురించి ఘోరమైన తపస్సు చేశారు. అనేక వరాలు పొందారు. ఆ తరువాత జాతివైరంతో యజ్ఞ యాగాదులు నాశనం చెయ్యటము, సాధువులను సజ్జనులను బాధించటము, పీడించటము వంటి పనులు అనేకం చేశారు. చివరకు వైకుంఠం మీదకు కూడా దండయాత్ర చేశారు. అయినా భరించాడు. శ్రీమహావిష్ణువు. అందుకే 'సహిష్ణుః' అనబడుతున్నాడు.

## 145. జగదాదిజః

త్రిమూర్తులలో ఒకడు, జగత్తుకు ఆదియందు జనియించువాడు, హిరణ్యగర్భుడు మొదలైన తత్త్వాలలో ఒకడు.

**జగతామాదిభూతాసు మూర్తి ష్వన్యత మత్వతః**
**జాతత్వా ద్విష్ణు రూపేణ ప్రోచ్యతే జగదాదిజః ॥**

జగత్తులో ఆదిగా నున్నటువంటి త్రిమూర్తులలో ఒకడైన స్థితికర్త, రక్షకుడు విష్ణువుగా అవతరించాడు.

**జగతః ఆదిషు జాయతే ఇతి జగదాదిజః**

ఈ జగదుత్పత్తిలో మొదటగా ఉన్న త్రిమూర్తులలో ఒకడుగా అవతరించినవాడు.

**విష్ణుపురాణములో** బ్రహ్మదేవుడు చెబుతాడు. అచ్యుతుని అనుగ్రహముచేతనే నేను ప్రాణులను సృష్టించగలిగాను, అతనివల్లనే రుద్రుడు లయాకారకుడైనాడు.

**నారాయణోపనిషత్తు**లో "ఈ సృష్టి ప్రారంభమునందు పరమపురుషుడగు నారాయణుడు ప్రాణులను సృష్టించదలచాడు. అప్పుడు సమిష్టి, సూక్ష్మశరీరరూపి అయిన హిరణ్యగర్భుడు పుట్టాడు. ఆ తరువాత పంచభూతాలు నారాయణుని నుంచే జన్మించాయి. అటుపిమ్మట బ్రహ్మ, రుద్రుడు, ఇంద్రుడు, మరీచి, కశ్యపుడు, ద్వాదశాదిత్యులు, ఏకాదశరుద్రులు, అష్టవసువులు, నారాయణుని నుంచే ఆవిర్భవించినాయి. ఈ రకంగా సకలచరాచరము అంతానారాయణుని నుంచే ఉద్భవించింది. నారాయణుని యందే ఇవి అన్నీ ఉన్నాయి. చివరకు ఇవన్నీ అతని యందే లీనమవుతున్నాయి." అని చెప్పబడింది. కాబట్టి ఈ సృష్టిలో మొదటగా ఉన్నవాడు శ్రీమన్నారాయణుడే.

**మహోపనిషత్తు**లో ఈ సృష్టికి ముందు నారాయణ శాఖపరబ్రహ్మతత్త్వము ఒక్కటి మాత్రమే ఉండేది. ఆ సమయంలో బ్రహ్మలేడు, రుద్రుడులేడు, అగ్నిలేదు. నీరులేదు, వాయువు లేదు, భూమి ఆకాశాలులేవు. నక్షత్రాలు లేవు, సూర్యచంద్రులులేరు. ఏకాకిగా ఉన్న ఆ పరమపురుషుడు తన వైభవము తాను అనుభవించకపోవటము లోపముగా ఉన్నదని భావించి 'స్తోమము' అనే మహాయజ్ఞముచేసి ఈ సృష్టిని చేశాడు. ఆ పరమపురుషుని నుండి 14 మంది పురుషులు, ఒక కన్య జన్మించారు. జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు పుట్టినాయి. మనస్సు పుట్టింది. అహంకారము, ప్రాణము, దేహము, బుద్ధి, తన్మాత్రలు, పంచభూతాలు, ఈ రకంగా 25 తత్త్వములతో నిండిన విరాట్పురుషుడు జన్మించాడు. విరాట్పురుషుని నుండి సంవత్సరాలు కాలస్వరూపంలో పుట్టినాయి.

తరువాత శ్రీమన్నారాయణుడు ఇంకొక సంకల్పము చేశాడు. అప్పుడు నారాయణుని

లలాటమునుండి – త్రినేత్రుడు, త్రిశూలపాణి జన్మించాడు. అతని నుండి యశస్సు, సత్యము, బ్రహ్మచర్యము, తపస్సు, వైరాగ్యము, వ్యాహృతులు, వేదాలు, ఛందస్సులు పుట్టినాయి.

నారాయణుడు మళ్ళీ సంకల్పముచేశాడు. అప్పుడు అతని లలాటము నుంచి స్వేదము పుట్టింది. అదే సర్వత్రా వ్యాపించి జలమయింది. ఆ నీటి నుండి ఒక అండము పుట్టింది. దానినుంచి చతుర్ముఖబ్రహ్మ పుట్టాడు. ఆ బ్రహ్మ తూర్పువైపు తిరిగి ధ్యానము చేయగా – భూః అనే వ్యాహృతి, గాయత్రి ఛందస్సు, ఋగ్వేదము, అగ్నిదేవత పుట్టినాయి.

పడమరవైపుకు తిరిగి ధ్యానము చెయ్యగా భువః అనే వ్యాహృతి, త్రిష్టుప్ ఛందస్సు, యజుర్వేదము, వాయుదేవత పుట్టినాయి. అతడు ఉత్తరముఖుడై ధ్యానము చెయ్యగా – సువః అనే వ్యాహృతి, జగతీ, ఛందస్సు, సామవేదము, సూర్యదేవత ఉద్భవించాయి.

బ్రహ్మ దక్షిణదిశకు తిరిగి ధ్యానము చెయ్యగా – మహః అనే వ్యాహృతి, అనుష్టుప్ ఛందస్సు, అధర్వణవేదము, సోమదేవత జన్మించాయి.

తరువాత బ్రహ్మ మళ్ళీ ధ్యానముచేసి క్షీరసాగరమధ్యలో ఒక దేవుని దర్శించాడు. అతడు సహస్రశీర్షుడు, సహస్రనేత్రుడు. ఆ దేవత విశ్వకల్యాణకారకమై, విశ్వాతీతమై, నిత్యమై, సర్వస్వరూపమై, విలసిల్లుతున్నాడు. అతడే శ్రీహరి. శ్రీమన్నారాయణుడు. ఈ సమస్త జగత్తుకూ అతడే ఆది పురుషుడు అతడే జీవనాధారము" అని చెప్పబడింది. ఈ రకంగా శ్రీమన్నారాయణుడే జగత్తుకు ఆదిపురుషుడు కాబట్టే "జగదాదిజః' అనబడుతున్నాడు.

## 146. అనఘః

పాపరహితుడు. 831వ నామము ఇదే.

**పాపప్రతి స్పర్ధ్యనఘః** పాపములకు శత్రువైనవాడు.

**న అఘః అనఘః** అఘము – పాపము న అఘము. పాపరహితము. ఈ జగత్తులో అవతరించినప్పటికీ పాపము లేనివాడు.

నిరాకారుడు, నిర్గుణస్వరూపుడు అయినవాడు పరబ్రహ్మ. అతడికి ఎవరి మీదగాని దేనిమీదగాని ప్రేమ, అభిమానము, ఆప్యాయత, అనురాగము ఉండవు. అతడు నిత్యశుద్ధుడు. పరిపూర్ణుడు. నిష్కాముడు ఏ కోరికలు లేనివాడు, నిష్కర్ముడు – ఏకర్మలు చెయ్యనివాడు రాగద్వేషాలను జయించినవాడు. కాబట్టి కర్మలు చేయడు. అందుచేత అతడికి పాపపుణ్యాలుండవు. కాబట్టే 'అనఘ' అనబడతాడు.

## 147. విజయః

జయకారణుడు.

**విజయో జగతాంజయీ**

బ్రహ్మ, రుద్రుడు, ఇంద్రుడు మొదలైన సమస్త దేవతల విజయానికి కారణమైనవాడు.

**విజయతే అస్మాదితి విజయః**

దేవతలందరూ తమతమ పనులందు విజయము సాధించటానికి కారణము ఇతడే కాబట్టి 'విజయః' అనబడుతున్నాడు.

జ్ఞానము, వైరాగ్యము, ఐశ్వర్యము మొదలైన గుణాలచేత ఈ విశ్వాన్ని జయించేవాడు. అంటే ఈగుణములు పరమేశ్వరునివద్ద ఉన్నంతగా ఇంకెవరి వద్ద ఉండవు.

**కేనోపనిషత్తు**లో దేవాసుర యుద్ధంలో రాక్షసులను జయించటానికి తామే కారణము అని దేవతలు విజయగర్వంతో విర్రవీగుతున్నప్పుడు, పరమేశ్వర తత్త్వము వారి ఎదుట ఉమాదేవి రూపంలో ప్రత్యక్షమై "మీ విజయానికి కారణము పరబ్రహ్మ. అంతేకాని వేరు కాదు. ఈ విజయం మీ వల్లనే సిద్ధించింది అని విర్రవీగకండి" అని చెబుతుంది.

మహిషాసురుడు, శుంభనిశుంభులు, రావణ కుంభకర్ణులు, హిరణ్యాక్ష, హిరణ్యకశ్యపులు ఇత్యాది రాక్షసులను ఏ రూపంలో సంహరించినప్పటికీ, ఆ సంహారం వెనకగలశక్తి పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణునిదే. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'విజయః' అనబడుతున్నాడు.

## 148. జేతా

స్థాపించినవాడు.

**స్వాభిప్రాయే స్థాపయితా ఔతాస్యాద్విధి శఙ్కరౌ ॥**

బ్రహ్మ, రుద్రుడు మొదలైన వారిని తన ఇష్టానుసారముగ స్థిరముగ నుంచువాడు.

**జయతీతి జేతా ।**

త్రిమూర్తులను తన ఇష్టప్రకారము స్థాపించినవాడు. తనయొక్క స్వభావము చేతనే సర్వభూతములను అతిశయించువాడు.

నిర్గుణస్వరూపుడైన పరబ్రహ్మ మహాప్రళయం తరువాత కొంతకాలానికి మళ్ళీ సృష్టి చెయ్యాలనుకున్నాడు. అనుకున్నదే తడవుగా తననుండి కొంతశక్తిని బయటకు పంపాడు. దానినుంచే నామరూపాత్మకమైన జగత్తు ఏర్పడింది. రూపాత్మకము అంటే తన్మాత్రలు, పంచభూతాలు పంచీకరణం చెందటంవల్ల సృష్టి జరిగింది. అలాగే నామాత్మక మైనది అనగా అక్షరములు, పదాలు, వాక్యాలు, మంత్రాలు, వేదాలు, వేదాంగాలు, పురాణాలు, ఇతిహాసాలు, శాస్త్రాలు, సంగీతము, సాహిత్యము వచ్చినాయి. ఈరకంగా నామరూపాత్మకమైన జగత్తు ఏర్పడింది. దీనికంతటికి ఆ పరమేశ్వరుడే కారణము.

**నారాయణోపనిషత్తు**లో చెప్పినట్లుగా సృష్ట్యాదిలో శ్రీమన్నారాయణుడొక్కడే ఉన్నాడు. అతడే దేవతలను, మానవులను అన్నింటినీ సృష్టించాడు. ఈ విషయం గతంలో చాలాసార్లు వివరించటం జరిగింది.

**అధర్వశిరోపనిషత్తు**లో కూడా సృష్ట్యాదిన ఉన్నది రుద్రుడు ఒక్కడే. అతడే ఈ జగత్తునంతా సృష్టించాడు అని చెప్పబడింది. దీన్నికూడా గతంలో వివరించాం.

**బృహదారణ్యకోపనిషత్తు**లో సృష్టికి ముందు ఏకాకిగా ఉన్న పరమేశ్వరుడు తాను అనేకం కావాలనుకున్నాడు. స్వాయంభువ మనువు, శతరూపలను సృష్టించాడు. వారివల్లనే 84 లక్షలజీవరాసి ఉద్భవించింది అని చెప్పబడింది.

ఈ రకంగా తనయొక్క స్వభావంతోనే సర్వభూతాలను సృష్టిస్తున్నాడు. కాబట్టి శ్రీమన్నారాయణుడు 'జేతా' అనబడుచున్నాడు.

## 149. విశ్వయోనిః

జగత్కారణుడు. 117వ నామము కూడా ఇదే.

**విశ్వం తత్కార్య వర్గస్యాత్ యోనిస్తస్యతు కారణమ్ ।**
**తస్య బ్రహ్మాది ముఖతః విశ్వయోని రితీరితః ॥**

విశ్వము అంటే శ్రీమన్నారాయణునిచేత నిర్మించబడిన సంసారము. యోని అనగా – ఆ సంసారమునకు కారణమైనది. అంటే చరాచర జగత్తుకు కారణమభూతమైనవాడు.

**విశ్వస్య కార్యప్రపంచస్యయోనిః కారణమ్ విశ్వయోనిః**

బ్రహ్మాది మూలంగా సృష్టించబడిన ఈ జగత్తుకు కారణభూతుడు.

**విశ్వం యోని యస్యసః**

ఈ విశ్వము ఎవరికైతే యోని (ఆశ్రయస్థానము) అయి ఉన్నదో, అట్టివాడు.

విశ్వము అంటే – ప్రకృతి. ఈ ప్రకృతే యోనిగా కలవాడు.

చైతన్యమయుడైన పరమేశ్వరుడు, జడమైన ఈ ప్రకృతియనబడే యోనియందు, బ్రహ్మ అనబడే వీర్యాన్ని స్థాపించాడు.

ముందుగా ప్రకృతిని సృష్టించి అందులోనుంచి పంచభూతాలు, తన్మాత్రలు, త్రిగుణాలు కలయికతో జగత్తును సృస్టించాడు పరమేశ్వరుడు. ఈ విషయం గతంలో వివరించటం జరిగింది.

ఈ రకంగా విశ్వమే యోనిగా గలవాడు. కాబట్టి 'విశ్వయోనిః' అనబడుతున్నాడు.

# 150. పునర్వసుః

మళ్ళీ వసించువాడు.

**బ్రహ్మాదిష్వపి దేవేషు అన్తరాత్మ తయా చ యః**

**పునర్వసనా న్నిత్యం పునర్వసు రుదాహృతః ॥**

బ్రహ్మాది దేవతలను, సకలభూతాలను పుట్టించటమేకాక, వారిలో మళ్ళీ అంతర్యామిగా ఉన్నాడు.

**పునః అంతరాత్మ తయా వసతీతి పునర్వసుః**

బ్రహ్మాది దేవతలయందు తిరిగి అంతరాత్మగా నివసించువాడు.

**పునః పునః వసతి శరీరేషు క్షేత్రజ్ఞరూపేణ**

ప్రాణులయొక్క శరీరములో జీవుని రూపంలో పునః పునః జన్మపరంపరలో పరమేశ్వరుడు నివసిస్తాడు. అందుచేతనే 'పునర్వసుః' అనబడతాడు.

**ఐతరేయోపనిషత్తు**లో "ఇప్పుడు పరమేశ్వరుడు ఇంద్రియాలతో కూడిన మానవ శరీరంలో ప్రవేశించాలనుకున్నాడు. అలా ప్రవేశించటానికి రెండు మార్గాలున్నాయి. 1. పాదాల చివరనుంచి 2. బ్రహ్మరంధ్రం నుంచి. సృష్టికర్త అయిన పరమేశ్వరుడు శిరస్సు దగ్గర నుంచి బ్రహ్మరంధ్రం ద్వారా మానవదేహంలో ప్రవేశించాడు" అని చెప్పబడింది. **భావనోపనిషత్తు**లో

**మూలాధారాది బ్రహ్మ బిలపర్యంతం, బ్రహరంధ్రాది**

**మూలాధారపర్యంతం గతాగతరూపేణ ప్రాదక్షిణ్యమ్**

శరీరంలో ప్రాణవాయువు ఆధారచక్రం నుండి సహస్రారంవరకు, సహస్రారం నుంచి ఆధారచక్రం వరకు సుషుమ్నా మార్గం గుండా తిరుగుతూ ఉంటుంది. ఈరకంగా ప్రాణవాయువు సంచారం చెయ్యటమే ఆత్మరూపంలో ఉన్న పరమేశ్వరునకు ప్రదక్షిణ చెయ్యటము. దీనికే 'అజపారూపహంస' మని పేరు.

హకారసంజ్ఞ గల పరమేశ్వరుడు సకారసంజ్ఞ గల ప్రకృతితో కలసి హంసరూపమైన శబళబ్రహ్మ అవుతాడు. ఈ శబళబ్రహ్మము తొమ్మిది ద్వారాలుగల మానవశరీరము అనే పట్టణంలో ప్రవేశించి ఇంద్రియాలు, ప్రాణాలు, మనస్సుతో కూడినవాడై పంజరంలో

బంధించబడిన పక్షిలాగా, బయటకు వచ్చే ఉపాయం తెలియక ప్రాపంచిక బంధనాలతో కొట్టుమిట్టాడుతున్నాడు. అటువంటి హంస అనే జీవుడికి

| | | |
|---|---|---|
| అగ్ని చంద్రమండలాలు | – | రెక్కలు |
| ఓంకారము | – | శిరస్సు |
| జ్ఞాననేత్రము | – | ముఖము |
| హకారసకారములు | – | పాదాలు |

ఈ రకంగా ఉన్న హంస అనే జీవుడు పాలలో ఉన్న నెయ్యిలాగా సమస్త ప్రాణికోటినీ ఆశ్రయించి ఉన్నాడు.

ఈ రకంగా అన్ని భూతములయందు అంతర్యామిగా ఉన్నాడు కబట్టే పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు "పునర్వసుః" అనబడుతున్నాడు. "పునర్వసు" అనేది 27 నక్షత్రాలలో ఒకటి. అంటూ చతుర్వ్యూహాలను, సంకర్షుని శాస్త్ర ప్రదాతృత్వాన్ని, పరమేశ్వరుని వైభవాన్ని పూర్తిగా వివరించాడు రత్నాకరుడు.



# 17. వామనావతారము

"గురువుగారూ ! శ్రీ మహావిష్ణువు వామనావతారము ఎత్తాడు కదా ! అందులోని విశేషాలను వివరించండి" అన్నాడు నారాయణభట్టు. చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

వైకుంఠము నందు శ్రీమహావిష్ణువు యొక్క ద్వారపాలకులు జయవిజయులు. ఒక రోజున విష్ణుమూర్తి లక్ష్మీసమేతుడై ఏకాంతముగా ఉన్న సమయములో సనక సనందనాది మహర్షులు విష్ణు దర్శనార్థము అక్కడికి వచ్చారు. మహర్షులను లోనికి పోకుండా అడ్డగించారు జయవిజయులు. దాంతో ఆగ్రహించారు ఋషులు. 'భూలోకంలోకిపోయి శ్రీమహావిష్ణువుకు దూరంగా బ్రతకండి' అని శపించారు. విష్ణుమూర్తిని శరణువేడారు జయవిజయులు 'స్వామీ' నిన్ను విడిచి మేము బ్రతకలేము' అన్నారు. కరుణించాడు విష్ణుమూర్తి 'మహర్షుల శాపం వట్టిగా పోదు. కాబట్టి భక్తితో ఏడు జన్మలు ఎత్తుతారా ? శత్రువులుగా మూడు జన్మలు ఎత్తుతారా? తేల్చుకోండి" అన్నాడు.

ఆలోచించారు జయవిజయులు. శ్రీమహావిష్ణువుతో శత్రుత్వము కలలోకూడా ఊహించలేరు. అయినప్పటికీ ఏడు జన్మలపాటు శ్రీహరికి దూరంగా ఉండలేరు. అందుచేత ఇష్టం లేకపోయినా శత్రువులుగా మూడు జన్మలలో తిరిగి రావటానికే అంగీకరించారు జయవిజయులు.

దితికశ్యపులకు ఒక దుర్ముహూర్తాన జన్మించారు హిరణ్యకశ్యప, హిరణ్యాక్షులు. ఇది జయవిజయుల మొదటి జన్మ. వీరు మహాక్రూరులు, భయంకరులు. మానవులను, దేవతలను కూడా తృణప్రాయముగా అదిమి వేసేవారు. వీరి ధాటికి ముల్లోకాలు గడగడలాడిపోయినాయి. హిరణ్యాక్షుడు భూమిని చాపగా చుట్టి సముద్రంలో పారేశాడు. శ్రీమహావిష్ణువు వరాహ రూపంలో హిరణ్యాక్షుని సంహరించి భూమిని ఉద్ధరించాడు.

హిరణ్యకశ్యపుడు బ్రహ్మను గూర్చి చాలా సంవత్సరాలు తపస్సు చేసి విచిత్రమైన వరాలు పొంది లోకాలను బాధించటం మొదలుపెట్టాడు. నరసింహావతారమెత్తి అతన్ని సంహరించాడు శ్రీహరి.

హిరణ్యకశ్యపుని కుమారుడు ప్రహ్లాదుడు. మహాభక్తుడు. పరమ భాగవతోత్తముడు. అతని కుమారుడు విరోచనుడు. విరోచనుని కుమారుడు బలిచక్రవర్తి.

బలిచక్రవర్తి వేదవేదాంగవిదుడు. గొప్ప పండితుడు. కాని జాతివైరము కారణంగా ఇంద్రుణ్ణి పదభ్రష్టునిగా చెయ్యటానికి స్వర్గలోకము మీద దండయాత్ర చేశాడు. ఇతని

దాటికి తట్టుకోలేక బృహస్పతి సలహా మీద ఇంద్రుడు అడవులకు పారిపోయాడు. దానితో ముల్లోకాలను ఆక్రమించాడు బలిచక్రవర్తి. దేవతలంతా శ్రీమహావిష్ణువును శరణువేడారు.

భాద్రపదశుద్ధ ద్వాదశి, శ్రవణానక్షత్రము మొదటి పాదములో అభిజిన్ముహూర్తములో అదితి కశ్యపులకు శ్రీమన్నారాయణుడు వామనుడుగా జన్మించాడు. అతనికి ఉపనయనము అయింది.

నర్మదానదికి ఉత్తరభాగాన భృగుకచ్ఛపతీర్థము నందు బలిచక్రవర్తి అశ్వమేధ యాగంచేస్తున్నాడు. అక్కడికి వెళ్ళాడు వామనుడు. వచ్చిన వాడెవరో మహానుభావుడు అని గుర్తించి, స్వాగత సత్కారాలు చేసి 'బాలకా ! నీవెవరవు ? నీ తల్లిదండ్రులెవరు? నీ రాకతో యజ్ఞం పవిత్రమైంది. నా పిత్రుదేవతలు తరించారు. నిన్ను సత్కరించాలను కుంటున్నాను. నీకు ఏంకావాలి ? రత్నాలా ? ధనమా ? ధాన్యమా ? గుర్రాలా ? ఏనుగులా ? లేక నా సామ్రాజ్యము మొత్తము ఇమ్మంటావా ? అని అడిగాడు బలిచక్రవర్తి. 'మూడడుగులు నేల మాత్రం ఇప్పించు మహారాజా ! నాకది చాలు' అన్నాడు వామనుడు సరేనన్నాడు బలి. వచ్చినవాడు సాక్షాత్తు శ్రీమహావిష్ణువు. నీ తేజస్సు, రాజ్యము, సంపద అంతా హరించేస్తాడు. కాబట్టి అతడికి దానం ఇవ్వద్దు అని అడ్డుపడ్డాడు రాక్షస గురువైన శుక్రాచార్యుడు వినలేదు బలిచక్రవర్తి. అసత్యమాడను అన్నాడు పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుని వంటివాడు వచ్చి అడిగితే ఏరకంగా కాదనగలను ? దానం ఇస్తాను అన్నాడు. దానం ఇచ్చాడు. త్రివిక్రముడైనాడు వామనుడు.

రెండడుగులతో భూమ్యాకాశాలను ఆక్రమించి, మూడవ అడుగెక్కడ ఉంచను? అన్నాడు హరి. 'నా శిరసున ఉంచవలసినది' అన్నాడు బలి. అతని భక్తిప్రపత్తులకు మెచ్చాడు శ్రీహరి. బలిచక్రవర్తిని సుతలలోకానికి పంపి, అతని ద్వారానికి కాపలా ఉన్నాడు.

శ్రీమహావిష్ణువు వ్యర్థముగాని ప్రభావము గలవాడు. బలిచక్రవర్తిని, ఇంద్రుని కూడా ఒకేసారి కృతార్థులుగా చేశాడు. అతడు పరిశుద్ధుడు. ఉపకారం చేస్తాడు. కాని ప్రత్యుపకారం ఆసించడు. మహాబలిష్ఠుడు, అడ్డు వచ్చిన శత్రువులను సంహరిస్తాడు. ఇంద్రునికన్నగూడా గొప్పవాడు. భక్తసులభుడు. బ్రహ్మాదిదేవతల నుద్ధరించటానికి తనకు తానుగా సృజించ బడుతుంటాడు. తన భక్తులను శత్రువులైన వారిని అణచివేస్తాడు. జగత్తులో సమస్తాన్నీ అనుకూలంగా, విరోధం లేకుండా సృష్టి చేస్తాడు. జగత్తులో అతడే తెలుసుకోవలసినవాడు. విద్యనెరిగినవాడు. తనను ఉపాసించేవారికి జ్ఞానాన్ని ప్రసాదిస్తాడు. ధ్యానము, తపస్సులను చెడగొట్టే వారిని సంహరిస్తాడు. అతడే పరావిద్యకు అధిపతి. తనభక్తులకు తేనెలాగా

తియ్యగా ఉంటాడు. అతన్ని ఇంద్రియాలవల్ల తెలుసుకోలేము. పరమేశ్వరుడైన శ్రీమహావిష్ణువును జ్ఞానముద్వారానే తెలుసుకోవాలి.

ఈ విషయాలను 151 నుంచి 170వరకు నామాలలో వివరించటం జరిగింది. ఇక నామాలను చూద్దాం.

## 151. ఉపేంద్రః

ఇంద్రుని తమ్ముడు

**ఇంద్రస్యాప్యనుజత్వేన జాతశ్చోపేంద్ర ఉచ్యతే ॥**

ఇంద్రునికి తమ్ముడై పుట్టినవాడు.

**ఉపగతః ఇన్ద్రమ్ ఉపేంద్రః** ఇంద్రుని తమ్మునిగా సమీపించినటువంటివాడు.

**జఘన్యజస్ససర్వేషాం ఆదిత్యానాంగుణాధికః ।**
**ద్వాదశేవాదితేః పుత్రాః శక్రముఖ్యా; నరాధిపః ।**
**తేషామవరజోవిష్ణుః యత్రలోకాః ప్రతిష్ఠితాః ॥**

రాజా ! అదితి పుత్రులలో చివరివాడు కాని గుణములలో పెద్దవాడు, సకల లోకపాలకుడు సాక్షాత్తూ శ్రీమహావిష్ణువేనయ్యా !

ఇంద్రునియొక్క అనుజుని రూపములో ఉన్నవాడు. ప్రసిద్ధుడైన ఇంద్రునికన్న కూడా పైగా ఉన్నవాడు (గొప్పవాడు) **హరివంశము** నందు

**"మమోపరి యథేంద్రస్త్వం స్థాపితోగోభిరీశ్వరః ।**
**ఉపేంద్ర ఇతికృష్ణ । త్వాం గాస్యంతి భువిదేవతా ॥**

కృష్ణా ! నేను ఏ విధంగా ఇంద్రుడనో, అలాగే నీవు నాకుపైగా, ఇంద్రుడుగా, ఈశ్వరుడుగా, స్వామిగా, గోవులచేత నిలుపబడ్డావు. అందుచేత నిన్ను భూలోకములో మానవులు, స్వర్గములో దేవతలుకూడా 'ఉపేంద్రుడు' అని అంటారు" అని చెప్పబడింది.

ఇంద్రుడు అదితి కశ్యపుల కుమారుడు. శ్రీ మహావిష్ణువు అతని తరువాత అతని తమ్ముడుగా అదితిగర్భాన జన్మించాడు. ఇంద్రుని భార్య శచీదేవి. జయంతుడు – కుమారుడు. జయంతి – ఇంద్రుని కుమార్తె. ఐరావతమనే ఏనుగు, ఉచ్ఛైశ్రవమనే గుర్రము, ఇంద్రుని వాహనాలు. వజ్రాయుధము ఇంద్రుని ఆయుధము. ఇంద్రుని తమ్ముడు శ్రీమహావిష్ణువు.

# 152. వామనః

సుఖానిచ్చేవాడు.

**ద్రష్టౄన్ స్వకాన్త్యా వామాని సుఖాని నయతీతియః స వామనో ...**

తనను సేవించేవారికి తన దివ్యకాంతులచే సుఖమునిచ్చేవాడు.

చూపరులకు తన కాంతులతో సుఖాన్నిచ్చేవాడు. **సవామనోదివ్యశరీరధృత్**

దివ్యమైన శరీరమును ధరించి ఉండుటచే అతడు వామనుడు అనబడుతున్నాడు.

బలిచక్రవర్తి స్వర్గముమీద దండయాత్రకు వెళ్ళాడు వచ్చిన బలిచక్రవర్తి యొక్క తేజస్సును చూసి ఇంద్రునితోసహా దేవతలు స్వర్గము వదలిపారిపోయారు. అది సహించలేని దేవమాత అదితి చాలా విచారించింది. అట్టి స్థితిలో ఒక రోజున కశ్యపుడు అదితి దగ్గరకు వచ్చాడు. యధావిధిగా ఆ మహనీయుణ్ణి ఆహ్వానించి సత్కరించింది అదితి. విచారగ్రస్తమైన ఆమె ముఖాన్ని చూసి "దేవీ ఏమైంది? నీ విచారానికి కారణము ఏమిటి? ధర్మము సక్రమంగా నడుస్తున్నదా ? అతిధి సత్కారము బాగానే జరుగుతున్నది కదా ! బ్రాహ్మణులకు ఏవైనా ఆపదలు వచ్చినాయా? నీ సంతానము కుశలమేనా?" అని అడిగాడు.

అదితికి దుఃఖము పొంగి పొరలిపోయింది. గద్గద స్వరముతో "నాధా ! నీ దయవల్ల ధర్మానికి ఏ లోటూ రాలేదు. అగ్ని సంస్కారము యధావిధిగా జరుగుతూనే ఉంది. బ్రాహ్మణులకు, అతిధులకు అనాదరణా జరగలేదు. అంతా సవ్యంగానే జరుగుతున్నది. కాని నా బిడ్డలకే నిలువ నీడ లేకుండా పోయింది. దితి సంతతి పెరిగిపోయింది. వారు నా బిడ్డలను తమస్థానాల నుంచి గెంటివేశారు. వాళ్ళకి ఇల్లు వాకిలి లేకుండా పోయింది. చెట్టుకు ఒకరు, పుట్టకు ఒకరు అయినారు. వారి ఆపదలు తీర్చే ఉపాయం ఏదైనా ఆలోచించండి. నా పిల్లలకు పోయిన సంపదను తిరిగి ప్రసాదించండి" అని ప్రార్ధించింది.

ఆ మాటలు విన్న కశ్యప ప్రజాపతి "దేవీ ! అందరి హృదయాలలోనూ నివసించే వాసుదేవుని ఆరాధిస్తే నీ కోరిక తీరుతుంది" అన్నాడు. ఆ మాట విన్న అదితి "స్వామీ ! వాసుదేవుడు త్వరగా ప్రత్యక్షమయ్యే ఉపాయము నాకు ఉపదేశించండి" అని అర్ధించింది. అప్పుడు కశ్యప ప్రజాపతి అదితికి **పాలకవ్రతము** అనే వ్రతాన్ని ఉపదేశించి ఫాల్గుణ శుద్ధ పాడ్యమి మొదలు ద్వాదశి వరకు కేవలము పాలు మాత్రమే ఆహారంగా తీసుకుంటూ పరమభక్తితో శ్రీమన్నారాయణుని అర్చించాలి. అంటూ వ్రతవిధులన్నీ తెలియచేశాడు.

అదితి భర్త ఉపదేశానుసారము పాలకవ్రతమాచరించింది. ఆ మరునాడు పీతాంబరధారి, శంఖచక్రగదా పద్మధరుడు అయిన శ్రీహరి ప్రత్యక్షమై "నీ కోరిక తీరటానికి

కశ్యపుని తేజస్సుతో నీ గర్భాన జన్మించి నీ సంతానాన్ని రక్షిస్తాను" అని చెప్పి అదృశ్యమైనాడు. దివ్యజ్ఞానముగల కశ్యపుడు హరి తనలో ప్రవేశించాడని గ్రహించి, తన వీర్యమును అదితి గర్భాన ప్రవేశపెట్టాడు. ఆ తరువాత

**రవి మధ్యాహ్నమునుం జరింపగ్రహతారాబద్ధ చంద్రస్థితిన్**
**శ్రవణ ద్వాదశినాడు శ్రోణనభిజిత్సంజ్ఞాత లగ్నంబునన్ ।**
**భువనాధీశుడు పుట్టె వామనగతిం బుణ్య ప్రతోపేతకున్**
**దివిజాధీశ్వరు మాతకుం పరమ పాతివ్రత్య విఖ్యాతకున్ ॥**

భాద్రపద శుద్ధ ద్వాదశి, శ్రవణానక్షత్రము మొదటిపాదములో, అభిజిన్ముహూర్తములో శ్రీహరి అదితి కశ్యపుల కుమారుడుగా జన్మించాడు. శ్రీమన్నారాయణుడు సర్వాయుధాలు, సర్వాభరణాలు ధరించి అదితి గర్భాన జన్మించాడు. జన్మించిన కొద్దిసేపటికే దేవదేవుడు వామనబ్రహ్మచారిగా మారిపోయాడు.

నర్మదానదీ తీరములో బలిచక్రవర్తి అశ్వమేధయాగము చేస్తున్నాడు అని విన్నాడు. యజ్ఞశాలకు బయలుదేరాడు.

## 153. ప్రాంశుః

పొడవైనవాడు.

**.... వ్యాప్తిమత్త్వాత్ ప్రాంశుశ్చ సరికీర్తితః ॥**

వెంటనే పెరిగి ఉన్నతుడై అంతటా వ్యాపించినవాడు.

**ప్రాశ్నుతే సర్వం వ్యాప్నోతీతి ప్రాంశుః**

శీఘ్రముగ అంతటా వ్యాపించి పొడవైనవాడు.

**స ఏవజగత్త్రయం క్రమమాణః ప్రాంశురభూత్ – ఇతి**

ఆ వామనుడే జగత్రయమమును తన అడుగులతో వ్యాపిస్తూ 'ప్రాంశువు' అయినాడు. హరివంశములో

**తోయోతుపతితేహస్తే వామనో ఽభూదవామనః ।**
**సర్వదేవమయం రూపం దర్శయా మాసవై ప్రభుః ।**
**భూః పాదౌ ద్యౌః శిరశ్చాస్య చంద్రాదిత్యా చ చక్షుషీ ॥**

బలిచక్రవర్తి మూడడుగులనేలను దానమిస్తూ నీటిని వామనుని చేతిలో వదిలాడు. ఆ నీరు చేతిలో పడగానే వామనుడు ప్రాంశువైనాడు. అప్పుడు అతని శరీరములో సర్వదేవతలు కనిపించారు.

భూమి – పాదాలు      ద్యులోకము – శిరస్సు      సూర్యచంద్రులు – నేత్రాలు

ఈ రకంగా దేవతలంతా అతనిలో కనిపిస్తుండగా అతడు జగత్తునంతా ఆక్రమించాడు. అని చెప్పబడింది. **శ్రీమద్భాగవతములో**

యజ్ఞశాలలో ఉన్న శుక్రాచార్యుడు మొదలైన మహానుభావులంతా బాలభానుడి లాగా వెలిగిపోతూ, నడచి వస్తున్నటువంటి వామనుని చూశారు. అతని తేజస్సుకు ఆశ్చర్యం పొందారు. అతన్ని చూసి యజ్ఞశాలకు సూర్యుడో, అగ్నిదేవుడో, సనత్కుమారుడో వస్తున్నాడు అనుకొన్నారు. వామనుడు యజ్ఞశాలలో ప్రవేశించాడు. అక్కడి వారందరూ లేచి నిలుచున్నారు. స్వాగతము పలికారు. బలిచక్రవర్తి వామనుడికి ఉచితాసనం వేసి కాళ్ళు కడిగి శిరస్సున జల్లుకుని, వినమ్రుడై ...

బ్రాహ్మణోత్తమా ! నీవెవరవు ? నీ తల్లిదండ్రులెవరు ? నువ్వు ఇక్కడికి రావటం చేత నా యజ్ఞము పరమపవిత్రమైంది. నా పిత్రుదేవతలు తరించారు. నా జన్మకడు ధన్యమైంది. యజ్ఞం జరుగతుండగా వచ్చావు. నీకేం కావాలో కోరుకో ...

**వరచేలంబులో మాడలోఫలములో వన్యంబులో గోవులో**
**హరులో రత్నములో రథంబులో వి మృష్టాన్నంబులో కన్యలో ।**
**కరులో కాంచనమో నికేతనములో గ్రామంబులో భూములో**
**ధరణీఖండమో కాకేమడిగెదోధాత్రీసురేంద్రోత్తమా ॥**

రత్నాలు కావాలా ? రథాలు కావాలా ? ఏనుగులు, గుర్రాలు, బంగారము, ఏం కావాలన్నా ఇస్తానయ్యా చివరకు ఈ భూమండలమైనా సరే”. అన్నాడు బలి ఆ మాటలు విన్న వామనుడు దానవేంద్రా నేను ఎవరు అనికదా అడిగావు. ... విను

**ఇది నాకు నెలవని ఏ రీతి బలుకుదు ఒకచోటనక నిండి ఉండనేర్తు**
**నెవ్వాడనంచేమని పలుకుదు నాయంత వాడనైననడువనేర్తు ।**
**నీనడవడి అని ఎట్లు వక్కాణింతు బూనిముప్పోకల బోవనేర్తు**
**నదినేర్తు నిదినేర్తునని యేల చెప్పంగనే రూపులన్నియు నేననేర్తు ॥**

**నొరులుగారునాకు నొరులకు నేనొదు**

**నొంటివాడ జుట్ట మొకడు లేడు ।**

**సిరియు దొల్లిగలదు సెప్పెద నాటెంకి**

**సుజనులందు తరచు జొచ్చియుందు ॥**

అయినా మహారాజా ! నాకు ఏం కావాలి అని అడిగావు కదా ? నాకు ఎవరూ లేరయ్యా ! నేను ఒంటరిని

**ఒంటివాడ నాకు నొకటి రెండడుగల**

**మేర ఇమ్ము సొమ్ముమేర యొల్ల ।**

**గోర్కెతీర బ్రహ్మకూకటి ముట్టెద**

**దానకుతుకసాంద్ర ! దానవేంద్ర ॥**

నాకు మూడడగుల నేల మాత్రం ఇవ్వు చాలు. దాంతోనే నేను బ్రహ్మానందము చెందుతాను అన్నాడు సరే. నీ కోరిక ప్రకారమే మూడడుగుల నేల దానమిస్తాను అన్నాడు బలిచక్రవర్తి.

శుక్రాచార్యుడు అడ్డుపడ్డాడు. "వచ్చినవాడు సామాన్యుడు కాదు. సాక్షాత్తూ శ్రీమహావిష్ణువు. మూడడుగులతో చతుర్దశ భువనాలను ఆక్రమించి దేవతలకు ఇస్తాడు. కాబట్టి దానం ఇవ్వద్దు" అన్నాడు గురువుగారి మాటలు వినలేదు బలిచక్రవర్తి ఆడి తప్పనన్నాడు. పైగా సాక్షాత్తూ శ్రీమహావిష్ణువే తనదగ్గరకు వచ్చి యాచిస్తున్నప్పుడు అంతకన్న కావలసినది ఏమున్నది? అన్నాడు. బలిచక్రవర్తి భార్య వింధ్యావళి బంగారుపాత్రతో నీరు తెచ్చింది. అప్పుడు బలిచక్రవర్తి.

**విప్రాయ ప్రకట వ్రతాయ భవతే విష్ణు స్వరూపాయ వే**

**దప్రామాణ్యవిదే తిపాద ధరణీం దాస్యామి యంచుంగ్రియా ।**

**క్షిప్రుండై దనుజేశ్వరుండు వడుగుంజేసాచి పూజించె బ్ర**

**హ్మప్రీతమ్మని ధారవోసె భువనం భాశ్చర్యముం బొందగన్ ॥**

పరమేశ్వరార్పణముగా, అంటే వచ్చిన వామనమూర్తిని సాక్షాత్తూ శ్రీమహావిష్ణువుగా భావించి బ్రహ్మార్పణమంటూ మూడడుగులనేలను దానం చేశాడు. ఆ నీరు చేతిలో పడగానే వామనుడు త్రివిక్రముడైనాడు.

**ఇంతింతై వటుడింతమై మరియుదానింతై నభోవీధిపై**

**నంతై తోయద మండలాగ్రమునకల్లంతై ప్రభారాశిపై ।**

**నంతై చంద్రునికంతయై ధ్రువుని పైనంతై మహర్వాటిపై**

**నంతై సత్యపదోన్నతుండగుచు బ్రహ్మాండాంత సంవర్ధియై ॥**

ఈరకంగా మూడడుగులతో జగత్తునంతా వ్యాపించాడు కాబట్టి శ్రీమహావిష్ణువు 'ప్రాంశువు' అనబడతాడు.

## 154. అమోఘః

వ్యర్ధముగాని ప్రభావముగలవాడు. 110 వ నామము ఇదే.

**బలేశ్చ వాసవస్యాపి కృతార్థీ కరణాత్ప్రమమ్ ।**

**మానాతీత ప్రభావత్వా దమోఘః పరికీర్తితః ।**

**నమోఘం చేషితం యస్య సోఽమోఘః పరికీర్తితః ॥**

బద్ధశత్రువులైనటువంటి బలిచక్రవర్తి, దేవేంద్రులను ఇద్దరి కోరికలు ఒకేసారి తీర్చాడు కాబట్టి 'అమోఘమైన మహిమగలవాడు' అని చెప్పబడుతున్నాడు.

**నాస్తిమోఘః యస్యసః అమోఘః**

బలిచక్రవర్తికి, ఇంద్రుడికి కూడా భేదము లేకుండా ఇద్దరినీ కృతార్థులుగా చేశాడు. ఇంద్రుడి స్వర్గాధిపత్యాన్ని ఇంద్రుడికిచ్చాడు. బలిచక్రవర్తిని పాతాళానికి పంపి అతని కోరిక ప్రకారము అతని ద్వారానికి కాపలా ఉన్నాడు. **విష్ణుధర్మము** నందు

**అనుగ్రహం చాపి బలేరనుత్తమమ్ చకార యశ్చేంద్రపదో**

**సమంక్షనాత్ । సురాశ్చ యజ్ఞాంశభుజః ॥**

ఒకే క్షణములో బలిచక్రవర్తికి ఇంద్రపదవితో సమానమైన పదవిని, దేవతలకు యజ్ఞములో హవిర్భాగాన్ని ఇచ్చినవాడు కాబట్టి అమోఘమైనవాడు అనబడుచున్నాడు.

శ్రీమద్భాగవతములో బలిదైత్యులలో అగ్రగణ్యుడు. జయించరాని మాయను జయించినాడు. ఎన్నికష్టాలు వచ్చినా నిశ్చలంగా ఉన్నాడు. ధనమంతా పోయింది. స్థాన భ్రంశము కలిగింది. రెండడుగులతో త్రివిక్రముడు భూలోక సువర్లోకాలను ఆక్రమించాడు. మూడవ అడుగు తన నెత్తిన పెట్టమన్నాడు బలిచక్రవర్తి. తన మాట కాదన్నందుకు గురువైన శుక్రాచార్యుడు శాపం కూడా పెట్టాడు. ఈరకంగా అన్నింటినీ కోల్పోయాడు

బలి అయినా ధైర్యము పోలేదు. కొంచెంకూడా చలించలేదు అబద్ధం ఆడలేదు. కాబట్టి దేవతలకు కూడా దుర్లభమైన పదవిని బలిచక్రవర్తికి ఇస్తున్నాను. సావర్ణి మన్వంతరంలో ఇతడు ఇంద్రుడు అవుతాడు. అంతవరకు సుతలలోకంలో ఉంటాడు. ఆ లోకంలో ఉండేవారికి శారీరిక మానసిక వ్యాధులుండవు. వారికి ఏరకమైన విఘ్నములు కలగవు.

ఓ బలిచక్రవర్తీ ! నేను నీకు ద్వారపాలకుడునై ఉంటాను. అక్కడ నిన్ను ఎవరూ జయించలేరు. నిన్ను, నీ అనుచరులను నేను కంటికి రెప్పలా కాపాడతాను" అని చెబుతాడు వామనరూపంలో వచ్చిన విష్ణుమూర్తి.

ఈరకంగా ఇంద్రునికి అతని పదవిని, దేవతలకు యజ్ఞములందలి హవిస్సులను ఇచ్చిన శ్రీమహావిష్ణువు బలిచక్రవర్తికి కూడా ఉన్నతమైనది, ఉత్తమమైనది అయిన పదవిని ఇచ్చి, అతనికి ద్వారపాలకుడుగా ఉన్నాడు. అందుచేతనే శ్రీమహావిష్ణువు 'అమోఘః' అనబడుతున్నాడు.

## 155. శుచిః

పరిశుద్ధుడు. 251వ నామము ఇదే.

**స్వయంకృతోప కారేషు యత్కించిత్ప్రత్యుపక్రియామ్ ।**
**అనపేక్షస్థితో యోఽసౌ శుచిస్స్యాద్ధర్మదో మనుః ॥**

స్వయంగా తాను మానవులకు ఉపకారం చేస్తాడు కాని వారినుంచి ఏవిధమైన ప్రతిఫలాన్నీ ఆశించడు. ఎవరికి ఉపకారం చేసినా, వారినుంచి ప్రత్యుపకారము ఆసించనివాడు కాబట్టి పరిశుద్ధుడు. శుచిః అంటే పవిత్రుడు, పవిత్రత కలిగించువాడు. తనను స్మరించేవారిని, అర్చించే వారిని, ఆరాధించే వారికి పవిత్రులుగా చేసేవాడు.

పరమేశ్వరుడు కోరికలు లేనివాడు. అతడికి కోరికలనేవి ఉండవు. దానికి కారణము అన్ని అతనిదగ్గరే ఉన్నాయి. ధనధాన్యాలు కావాలి - ధనధాన్యాలకు అతడే అధిపతి. నవనిధులు అతని అధీనంలోనే ఉంటాయి. శౌర్యపరాక్రమవంతుడు ఇంకొకడు లేడు. శాశ్వతమైన సుఖము (ఆనందము) కావాలి. అతడెప్పుడూ ఆనంద సముద్రంలో ఓలలాడుతుంటాడు. ఈరకంగా స్థైర్యము, ధైర్యము, శార్వనము, సిరిసంపదలు, భోగభాగ్యాలు అన్ని అతడి అధీనంలోనే ఉంటాయి. అవి కావాలని కోరిన భక్తులకు వాటిని ప్రసాదిస్తుంటాడు పరమేశ్వరుడు. ఇవ్వటమే కాని తీసుకోవటం తెలియనివాడు. తన భక్తులు ఏ రకమైన కోరికలు కోరినా తీర్చేస్తాడు.

కుచేలుడి అటుకులు తిని, అతనికి అష్టైశ్వర్యాన్ని ప్రసాదించేశాడు. అలాగే తన భక్తుల కోరికలు ఏరకమైన ఆలోచన లేకుండానే తీరుస్తాడు.

గజాసురుడు ఘోరమైన తపస్సు చేసి ఈశ్వరుణ్ణి తన హృదయములో ఉండి పొమ్మన్నాడు. సరే అన్నాడు బోళాశంకరుడు. అతడి దగ్గర నుంచి ఏ రకమైన ప్రతిఫలాన్ని ఆశించకుండానే అతడికి వరాలిచ్చాడు. చివరకు స్థితికర్త అయిన విష్ణుమూర్తి గంగిరెద్దుల వాడి రూపంలో వచ్చి శివుణ్ణి రక్షించాడు. అలాగే భక్తుల కోరికలు తీర్చటానికి ఎంతటి భయంకరమైన వరాన్నయినా ఇచ్చేస్తాడు. భస్మాసురుడు తనచేతులు ఎవరి నెత్తిన పెడితే వారు భస్మం అయ్యేటట్లు వరమడిగాడు. వెనక ముందు ఆలోచించలేదు. కోరిక తీర్చేశాడు. దాంతో తన మనుగడకే ముప్పు వాటిల్లింది. చివరకు భస్మాసురుడు తన వెంటపడితే, అతని బారినుండి తప్పించుకోవటానికి శ్రీమహావిష్ణువును ఆశ్రయించవలసి వచ్చింది.

ఈవిధంగా పరమేశ్వరుడు తన భక్తుల కోరికలు తీర్చటానికి, ఏ పని చెయ్యటానికి వెనకాడడు. అందుకే అతడు పరిశుద్ధమైనవాడు 'శుచి' అనబడతాడు.

భగవంతుడు భక్తుల కోరికలు తీర్చటం కోసం ఎప్పుడూ సిద్ధంగానే ఉంటాడు. ఏ రూపంలో అయినా సరే అంటే – బ్రహ్మ, రుద్రుడు, పరమేశ్వరి రూపాలలో భక్తుల కోరికలను తీరుస్తుంటాడు. వారినుంచి ఏ ఫలితమూ ఆశించడు. అందుచేతనే అతడు పరిశుద్ధుడు 'శుచిః' అనబడతాడు.

## 156. ఊర్జితః

బలిష్ఠుడు.

**ఊర్జాబలం యస్య నిత్యం సంజాతే త్యూర్జితస్మృతః**

దినదినాభివృద్ధి చెందుతున్న బలము గలవాడు.

**ఊర్జాబలం అస్య సంజ్ఞతా ఊర్జితః**

అడ్డువచ్చిన శత్రువులను సంహరించటంలో మహాబలం గలవాడు.

**బలప్రకర్షశాలీ** బలమునందు ఆధిక్యముగలవాడు. జగత్తులోని అందరికన్నా, అన్నింటికన్నా అత్యధికమైన బలముగలవాడు. ఊర్జము అంటే – బలము అని అర్థము.

పరమేశ్వరుడు లోకంలో అన్నింటికన్నా బలవంతుడు. అతనికన్న బలవంతులు వేరెవరూ లేరు. అతనితో సమానమైన బలం కలవారు కూడా ఎవరూ లేరు. వరబలగర్వంతో

విర్రవీగుతున్న రాక్షసులను ఎంతోమందిని అలవోకగా సంహరించాడు. అప్పటికి ఇంకా సృష్టి ప్రారంభం కాలేదు. విష్ణుమూర్తి వటపత్ర శాయియై క్షీరాబ్ధిలో యోగనిద్రలో ఉన్నాడు. అతడి నాభినుంచి ఒక పద్మము, అందులో నుంచి బ్రహ్మ ఉద్భవించారు. బ్రహ్మకు వేదాలనిచ్చాడు పరమేశ్వరుడు. తన నాలుగు ముఖాలతోనూ వేదాలను పారాయణ చేస్తున్నాడు సృష్టికర్త. ఆ తరుణంలో యోగనిద్రలో ఉన్న విష్ణుమూర్తి చెవిలోనుంచి వచ్చిన గుబిలినుండి పుట్టారు మధుకైటభులనే రాక్షసులు. ఐతే చెవిలోని గుబిలి నుంచి ప్రాణులు జన్మించటం ఏమిటి ? అనే ప్రశ్న వస్తుంది. జీవులయొక్క జననాన్ని గురించి **ఐతరేయోపనిషత్తు**లో ఈవిధంగా ఉంది.

లోకంలో ప్రాణులు నాలుగు రకాలుగా జన్మిస్తాయి.

1. అండజాలు - గ్రుడ్డు నుంచి పుట్టినవి
2. జారజాలు - స్త్రీ జననేంద్రియము నుంచి పుట్టినవి
3. స్వేదజాలు - బురద లేక చమట నుంచి పుట్టినవి
4. ఉద్భిజాలు - భూమినుండి పుట్టినవి

**ఛాందోగ్యోపనిషత్తు**లో స్థావరజంగమాత్మకమైన జీవులన్నీ పుట్టుకరీత్యా అనేక విధాలుగా ఉన్నాయి.

1. అండజములు - గ్రుడ్డు నుండి పుట్టేవి (పక్షులు, పాములు)
2. జీవజములు - జీవులవల్ల పుట్టేవి (మానవులు, పశువులు)
3. ఉద్భిజములు - విత్తనాలవల్ల భూమినుంచి పుట్టేవి (చెట్లు, చేమలు)
4. స్వేదజములు - చెమటవల్ల పుట్టేవి
5. ఊష్మజములు - వెచ్చదనంవల్ల పుట్టేవి (క్రిమికీటకాలు)

ఈ విషయాన్ని ఉద్దాలక అరుణి తనకుమారుడైన శ్వేతకేతువుకు వివరిస్తాడు.

ఈరకంగా విష్ణుమూర్తి చెవిగుబిలిలో నుంచి ఉద్భవిస్తారు మధుకైటభులు. పుట్టగానే చూశారు చుట్టూ జలమయం. కనుచూపు మేరలో ఎక్కడా ఏమీ కనిపించటం లేదు నీరు తప్ప, ఇంకొంత దూరం పోతే ఏమైనా కనిపిస్తుందేమోనని పదివేల సంవత్సరాలు జలమంతా కలియ తిరిగారు. ఏమీ కనిపించలేదు.ఇంక లాభం లేదు అనుకుని పదివేల సంవత్సరాలు పరమేశ్వరుణ్ణి గురించి తపస్సు చేశారు. తపస్సు నుంచి లేచి మళ్ళీ నీరంతా తిరగటం మొదలుపెట్టారు. అలా తిరుగుతున్న వారికి ఏదో శబ్దం వినిపించింది

ఏమిటా ? అని పైకి చూశారు. పైన ఒక పద్మములో చతుర్ముఖుడు వేదపారాయణ చేస్తూ కనిపించాడు. ఆశ్చర్యపోయారు అసురులు. తాము కాకుండా ఇంకొక ప్రాణి కనిపించింది. తమోగుణ ప్రభావం కలవారు కావటంచేత యుద్ధం చెయ్యాలనే కోరిక కలిగింది. పద్మాసనుణ్ణి చూసి వచ్చి మాతో యుద్ధం చెయ్యి అని కేకపెట్టారు. వినిపించుకోలేదు బ్రహ్మ. వేద పారాయణ చేస్తున్నాడు. మళ్ళీ గట్టిగా పిలిచారు. పలకలేదు బ్రహ్మ. క్రింది నుంచి పైకి ఎగురుతున్నారు. యుద్ధానికి రమ్మని కవ్విస్తున్నారు. వచ్చి మాతో యుద్ధం చేస్తావా ? ఛస్తావా ? అంటున్నారు. చూశాడు బ్రహ్మదేవుడు. వారి చేష్టలకు అరుపులకు భయపడ్డాడు. ఏంచెయ్యలేక తాను కూర్చుని ఉన్న తామరతూడులో నుంచిక్రిందికి దిగివచ్చాడు. శ్రీమన్నారాయణుడు యోగనిద్రలో ఉన్నాడు. తండ్రీ ! ఎవరో నన్ను చంపుతానని బెదిరిస్తున్నారు. నిద్రలే. నన్ను కాపాడు అన్నాడు. నారాయణుడు నిద్రలేవలేదు. అతన్ని మాయ ఆవరించి ఉన్నది. అప్పుడు మాయను ప్రార్థించాడు బ్రహ్మ. విష్ణువును వదలిపెట్టవలసినది అని ప్రార్థించాడు. యోగమాయ ప్రక్కకి తొలగి వెళ్ళింది శ్రీమహావిష్ణువు నిద్రలేచాడు.

రాక్షసులు మీది మీదికి వస్తున్నారు. అతన్నివతలకు పంపు, లేకపోతే నిన్నుకూడా చంపుతాము అన్నారు. కుమారుడైన బ్రహ్మను వెనక్కి పంపి, రాక్షసులతో యుద్ధానికి తలపడ్డాడు శ్రీమహావిష్ణువు, చాలాకాలం యుద్ధం ఘోరంగా జరిగింది. నారాయణుడు ఒక్కడు, వారిద్దరు. అందులోనూ వారు ఒకరి తరువాత ఒకరుగా వచ్చి యుద్ధం చేస్తున్నారు. ఒకడు యుద్ధం చేస్తుంటే, రెండవవాడు విశ్రాంతి తీసుకుంటూ చోద్యం చూస్తున్నాడు. మొదటివాడు అలసిపోగానే, రెండవవాడు యుద్ధానికి వస్తున్నాడు. మొదటివాడు విశ్రాంతి తీసుకుంటున్నాడు. నారాయణునికి మాత్రం విశ్రాంతి లేదు.

ఈరకంగా యుద్ధం చాలాకాలం జరిగింది. ఒకనాడు నారాయణుడు మధుకైటభులతో "మీరు ఇద్దరు ఒకరి తర్వాత ఒకరుగా యుద్ధం చేస్తున్నారు. విశ్రాంతి తీసుకుంటున్నారు. మరి నాకు విశ్రాంతి అవసరం లేదా ?" అన్నాడు. దానికి రాక్షసులు "సరే నువ్వు కూడా విశ్రాంతి తీసుకో" అన్నారు. నారాయణుడు విశ్రాంతి తీసుకుంటూ ఆలోచించాడు.

మళ్ళీ పోరు మొదలైంది. ఈసారి నారాయణుడు ఒక్కదెబ్బతో వారిద్దరినీ పడగొట్టి "ఇంత కాలంగా నేను ఎంతో మంది రాక్షసులను సంహరించాను. కాని ఇంతసేపు నాతో యుద్ధం చేసినవారు లేరు. మీ బలపరాక్రమాలకు సంతసించాను. ఏదైనా వరం కోరుకోండి ఇస్తాను" అన్నాడు.

ఆ మాట విన్న రాక్షసులకు అహం దెబ్బ తిన్నది. 'నువ్వు మాకిచ్చేదేమిటి ? మేమే నీకు వరమిస్తాము. ఏం కావాలో కోరుకో' అన్నారు. వచ్చిన అవకాశం వృధా చేసుకోలేదు విష్ణుమూర్తి. "మీరు నా చేతులలో మరణించాలి" అని అడిగాడు. ఖంగు తిన్నారు రాక్షసులు. వెంటనే తెప్పరిల్లి "అలాగే, నీ కోరిక తీరుస్తాం. ఐతే ఒక్క షరతు నీరు లేని ప్రదేశంలో మమ్ములను సంహరించు" అన్నారు.

సరే నన్నాడు శ్రీమహావిష్ణువు. ఒక్కసారిగా తనశరీరాన్ని పెంచేసి మధుకైటభులను తన తొడలమీద పడుకోపెట్టి చక్రాయుధంతో వారి శిరస్సులను ఖండించాడు.

ఈరకంగా మహాబలిష్ఠులైన రాక్షసులను సునాయాసంగా సంహరించినవాడు కావటంచేత శ్రీమహావిష్ణువు "ఊర్జితః" అనబడుతున్నాడు.

## 157. అతీంద్రః

ఇంద్రుని మీరినవాడు. ఇంద్రునికన్న గొప్పవాడు.

**ఇన్ద్రామజత్వేప్యైశ్వర్యా దదీతోఽతీన్ద్ర ఉచ్యతే ॥**

ఇంద్రునికి తమ్ముడే అయినప్పటికీ ఐశ్వర్యములో అతన్ని మించినవాడు.

**ఇన్ద్రమ్ అతిక్రాన్త అతీన్ద్రః** ఇంద్రునిమించిన వాడు. ఇంద్రునికి తమ్ముడయినప్పటికీ ఐశ్వర్యము, పరాక్రమముల యందు అతన్ని మించినవాడు.

**అతివాయ్వింద్ర కర్మాణామ్**

ఇంద్రుడు, వాయువు మొదలైన వారి పనులను మించిన పనులు గలవాడు.

అదితిగర్భాన ఇంద్రుని తరువాత, ఆఖరుగా జన్మించినవాడు శ్రీమహావిష్ణువు. కాని మహదైశ్వర్యవంతుడు. ఐశ్వర్యము అనగా – పరాక్రమము, వీర్యము, సంపద అని అర్థము.

ఇంద్రుడు అనేకసార్లు రాక్షసులచేతిలో ఓడిపోయి అడవుల పాలయినాడు. అలా జరిగిన ప్రతిసారీ శ్రీమహావిష్ణువు ఇంద్రుని రాజ్యాన్ని అతడికి తిరిగి ఇప్పించాడు. రాక్షసులతో యుద్ధం చేసి వారిని సంహరించాడు. మహాబలపరాక్రమ సంపన్నుడు. ఇంద్రుని యొక్క పదవిని, ఐశ్వర్యాన్ని అతడికి తిరిగి ఇచ్చేశాడు. ఈరకంగా ఇంద్రునికన్న ఎక్కువగా బలపరాక్రమాలు, ఐశ్వర్యము ఉన్నటువంటివాడు కాబట్టే శ్రీమహావిష్ణువు 'అతీంద్రః' అనబడుతున్నాడు అతనికి స్వతసిద్ధంగా జ్ఞానము, ఈశ్వరత్వము ఉన్నాయి కాబట్టే 'అతీంద్రః' అనబడతాడు.

# 158. సంగ్రహః

గ్రహించబడువాడు.

**భక్తైర వ్యప్రయత్నేన సంగ్రాహ్య స్సంగ్రహ స్మృతః**

భక్తులతో ఎక్కువగా ప్రయత్నము లేకుండానే, తేలికగా సేవింపతగినవాడు.

**సమ్యక్ గృహ్యతే ఇతిసంగ్రః**

బాగా గ్రహించబడేవాడు కాబట్టి 'సంగ్రహః' అనబడుతున్నాడు.

పరమేశ్వరుణ్ణి అర్చించాలి అంటే ఎక్కువగా ప్రయత్నము అవసరముండదు. తంత్రము, మంత్రము అవసరం లేదు. యోగప్రక్రియ తెలియనవసరం లేదు. వివిధ రకాల అర్చన విధానాలు తెలియనవసరం లేదు. కేవలము భక్తిప్రపత్తులు చాలు. త్రికరణశుద్ధిగా పరమేశ్వరుని ధ్యానించగలిగితే చాలు. ఎంత చేశాము అనేది కాదు ముఖ్యం. చేసినదాంట్లో తాదాత్మ్యత ఎంత ఉన్నది? అనేది ముఖ్యం. అందుచేత కష్టమైన మార్గాలు కాకుండా తేలికమార్గం ద్వారానే భగవంతుని సేవించవచ్చును.

**సంగృహ్ణాతి** – సంగ్రహించును. అన్నింటినీ ఒకచోటికి చేర్చును అని అర్థం.

ప్రళయము రెండు రకాలు 1. పాక్షిక ప్రళయము. 2. మహాప్రళయము. పాక్షిక ప్రళయము అనేది ప్రకృతి వైపరీత్యాలవల్ల అంటే భూకంపము, వరద, ఉప్పెన మొదలగు వాటిద్వారాగాని యుద్ధాలవల్లగాని జరిగే జననష్టము. మహాప్రళయము కల్పాంతాన వస్తుంది. అప్పుడు ఈ సృష్టిలో ఏమీ గలదు. అంతా సర్వనాశనమై పోతుంది. ఆ సమయంలో కర్మక్షయం అయిన జీవులకు మోక్షం సిద్ధిస్తుంది. అంటే వాటికి ఉత్తరజన్మ ఉండదు. మరి కర్మ **క్షయం** కాని జీవులసంగతి ఏమిటి ? అవి కర్మఫలాన్ని అనుభవించి తీరాలి. అయితే పరిపక్వమైన కర్మఫలాన్ని అవి అనుభవించాయి. కాని వాటికి కొంత కర్మ పరిపక్వం కాలేదు. అందుచేత ఆ కర్మఫలాన్ని అనుభవించటానికి కొంతకాలం పడుతుంది. ఈ మధ్యకాలంలోనే మహాప్రళయం సంభవించింది. ఇప్పుడు కర్మపరిపక్వం గాని జీవులు తమ కర్మను తమతో మూట కట్టుకుని ఆ మాయలో ప్రవేశిస్తాయి. అంతే గాకుండా ప్రళయకాలంలో పంచభూతాలు నశించిపోతాయి. భూమి జలంలో కలిసి పోతుంది. జలం అగ్నిలో కలిసిపోతుంది. అగ్నివాయువునందు, వాయువు ఆకాశమునందు

కలిసిపోతాయి. ఇప్పుడు ఈ భూతాలనన్నింటినీ తనలో కలుపుకున్న ఆకాశం మాయలో కలిసిపోతుంది. ఈరకంగా కర్మ పరిపక్వం కాని జీవులను, పంచభూతాలను కూడా తనలో కలుపుకున్న మాయ పరమేశ్వరునిలో లీనమవుతుంది. సృష్టి ప్రారంభించాలి అనుకున్నప్పుడు పరమేశ్వరుడు ఈ మాయను తననుండి బయటకు పంపుతాడు.

ఈరకంగా ప్రళయకాలంలో అన్నింటినీ ఒకచోటికి చేర్చుతాడు. కాబట్టి పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు 'సంగ్రహః' అనబడుతున్నాడు.

## 159. సర్గః

సృజించబడువాడు.

**బ్రహ్మాదిభ్య స్సృజ్యతేయః సర్గస్తం పరిచక్షతే ॥**

బ్రహ్మాదిదేవతలను ఉద్ధరించటానికి తనకు తానుగా సృజించబడేవాడు.

దేవతలకు మాటిమాటికీ కష్టాలు వస్తూనే ఉంటాయి. దేవదానవులకు జాతి వైరమున్నది. కాబట్టి ప్రతిసారీ రాక్షసులు తపస్సు చేసి అమోఘమైన శక్తులు సంపాదించి దేవతలమీద దండయాత్ర చేసి వారిని అడవులకు పారద్రోలతారు. ఈ సందర్భంగా దేవతలకు స్థానభ్రంశం కలిగి అనేక ఇబ్బందులు పడుతూ, తమ కష్టాలను గట్టెక్కించమని విష్ణుమూర్తిని ప్రార్థిస్తారు. అప్పుడు శ్రీమహావిష్ణువు ఏదో ఒక అవతారంగా భూమిమీద అవతరించి ధర్మ సంస్థాపన చేస్తాడు. అందుకే

**ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే ॥**

అవసరమైనప్పుడల్లా శ్రీమన్నారాయణుడు భూలోకంలో అవతరించి ధర్మసంస్థాపన చేస్తుంటాడు. ఇందులో భాగంగానే వామనుడుగా పుట్టిన శ్రీమహావిష్ణువు త్రివిక్రముడుగా విజృంభించాడు. ఈరకంగా దేవతలను ఉద్ధరించటానికి తనను తాను సృజించుకుంటాడు కాబట్టి శ్రీమహావిష్ణువు 'సర్గః' అనబడుతున్నాడు.

**సృజ్యతే ఇతిసర్గః** సృజించుకొనేవాడు కాబట్టి 'సర్గః' అనబడుతున్నాడు. త్రివిక్రమావతారంలో రెండడుగులతో లోకాలన్నీ ఆక్రమించిన శ్రీమహావిష్ణువు భక్తజనోద్ధరణ కోసం ఈ లోకంలో తనకుతానుగా జన్మిస్తున్నాడు.

ఈ జగత్సృష్టికి కారణము అతడే. చరాచర జగత్తంతా పరమేశ్వర స్వరూపమే. అతడే ఈ సృష్టికి హేతువు. అందుచేతనే అతడు 'సర్గః' అనబడుతున్నాడు.

# 160. ధృతాత్మా

ఆత్మలను ధరించువాడు.

**యేనాత్మానో ధృతా నిత్యం స ధృతాత్మేతి కీర్త్యతే ॥**

తనచేతనే ఆత్మలన్నీ నిత్యము ధరించబడతాయి.

**ధృతాః ఆత్మానః యేనసః ధృతాత్మా** ధరించిన ఆత్మలు గలవాడు.

ఇక్కడ తాను అంటే పరమాత్మ. ఆత్మ అంటే–జీవాత్మ ఈ రెండింటికీ భేదం లేదు. **ముండకోపనిషత్తు**లో చెప్పిన విధంగా ఒకేరూపము గల రెండు పక్షులు సంసారమనే వృక్షశాఖయందు కూర్చుని ఉన్నాయి. వాటిలో ఒకటి దొరికిన ఫలాలను ఆరగిస్తూ, దిక్కులు చూస్తూ ఉంది. రెండవది ఏవిధమైన ఫలాలు. తినకుండా నిశ్చలంగా ఉన్నది. వీటిలో మొదటిది జీవాత్మ. రెండవది పరమాత్మ. జీవాత్మకు కర్మఫలమున్నది. కాబట్టి ఆ కర్మఫలాన్ని అనుభవిస్తోంది. పరమాత్మకు కర్మఫలం లేదు అందుచేతనే అది నిశ్చలంగా ఉన్నది.

జీవాత్మ, పరమాత్మలు రెండూ ఒకటే. వీటికి భేదం లేదు. అయితే మాయచేత భేదమున్నట్లుగా కనిపిస్తోంది. జీవాత్మకి కూడా కర్మఫలం క్షయమైపోతే, అదికూడా పరమాత్మ అయిపోతుంది. అప్పుడు జీవాత్మ పరమాత్మ రెండూ ఒక్కటే అనే విషయం తెలుస్తుంది. అంతదాకా అవి వేరువేరు అనే భావనే ఉంటుంది.

ఈరకంగా జీవాత్మ పరమాత్మలు రెండూ ఒకటే **ఐతరేయోపనిషత్తు**లో పరమేశ్వరుడు ఇంద్రియాలను, ఇంద్రియాధిష్ఠానదేవతలను సృష్టించిన తరువాత ఆ దేవతలు ఉండటానికి అనువుగా విరాట్పురుషుని బోలిన మానవదేహం సృష్టించాడు. ఈ దేహంలో ఇంద్రియాధిష్ఠాన దేవతలు ప్రవేశించారు. ఈరకంగా మానవ సృష్టి జరిగిన తరువాత నవరంధ్రాలతో కూడిన ఈశరీరంలో తాను ప్రవేశించాలి అనుకున్నాడు. బ్రహ్మరంధ్రం గుండా ప్రవేశించాడు. పరమేశ్వరుడు మానవదేహంలో ప్రవేశించి నవరంధ్రాలు, ఇంద్రియాలు మనస్సు మొదలైన వాటితో సర్వసుఖాలు అనుభవిస్తూ ఈశరీరంలోనుంచి బయటకు వచ్చే మార్గం గోచరించక పంజరంలో బంధించబడిన పక్షిలాగా బందీగా ఉండిపోయాడు. ఈరకంగా మానవశరీరంలో ఉన్న ఆత్మయే జీవాత్మ. బయటది పరమాత్మ. ఈ రెండూ వేరుకాదు ఒకటే" అని చెప్పబడింది.

పరమేశ్వరుడు తనకుతానుగా అనేక భాగాలయి జీవులలో ప్రవేశించాడు. జీవులలో ఉన్న ఆత్మయే జీవాత్మ.

ఈరకంగా ఆత్మలను ధరించేవాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు 'ధృతాత్మా' అనబడుతున్నాడు.

జన్మ మృత్యు జరాదులు లేనివాడు. ఆది మధ్యాంతములు లేనివాడు. కాబట్టి 'ధృతాత్మా' అనబడతాడు. **అధ్యాత్మోపనిషత్తు**లో చెప్పినట్లుగా

"అతడు పృథివిలో ఉన్నాడు, పృథివే అతని దేహము కాని పృథివి అతన్నెరగదు. జలంలో ఉన్నాడు, జలమే అతని దేహము కాని జలము అతన్నెరగదు. అగ్నిలో ఉన్నాడు. అగ్నే అతని దేహము కాని అగ్ని అతన్నెరగదు, వాయువు నందున్నుడు. వాయువే అతని దేహము కాని వాయువు అతన్నెరగదు. ఆకాశమునందున్నాడు ఆకాశమే అతని దేహము. ఆకాశము అతన్నెరుగదు. మనస్సులో ఉన్నాడు. మనసే అతని దేహము. కాని మనసు అతన్నెరగదు. బుద్ధియందున్నాడు. బుద్ధే అతని దేహము. కాని బుద్ధి అతన్నెరగదు. అహంకారము నందున్నాడు. అహంకారమే అతని దేహము. కాని అహంకారము అతన్నెరగదు. మృత్యువు నందున్నాడు. మృత్యువే అతని దేహము. కాని మృత్యువు అతన్నెరుగదు. అతడు సర్వభూతాంతరాత్ముడు, పాపరహితుడు, దివ్యుడు, నిత్యుడు, శాశ్వతమైనవాడు, జన్మమృత్యుజరాదులు లేనివాడు" అని చెప్పబడింది.

ఈరకంగా ఆద్యంతములు, జన్మమృత్యు జరాదులు లేనివాడు కాబట్టి ఒకే రూపంతో అన్ని కాలములందు తనచే నిలుపుకొనబడిన ఆత్మకలవాడు కాబట్టి పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు 'ధృతాత్మా' అనబడుతున్నాడు.

## 161. నియమః

అణచివేయువాడు.

**నియమ్యతే జగద్యేన నియమస్స ఉదీరితః**

ఈ జగత్తంతా తనచేతనే కర్మానుగుణంగా నిర్మించబడుతుంది. తనయొక్క భక్తులకు విరోధులు, శత్రువులు మొదలైన వారిని ఆ పరమేశ్వరుడు అణచివేస్తాడు.

**నియమ్యన్తే అనేనేతి నియమః** తనకు దగ్గర అయిన వారి విరోధులను అణచి వేయువాడు. తన భక్తులకు ఎవరైనా సరే కష్టం కలిగిస్తే సహించడు. భక్తులయొక్క విరోధులను నాశనం చేస్తాడు.

హిరణ్యకశ్యపుని కుమారుడు ప్రహ్లాదుడు. పరమ విష్ణుభక్తుడు. హిరణ్య కశ్యపునికి కుమారుని యందు ప్రేమ ఉన్నప్పటికీ, అతడు ఆరాధించే విష్ణువునందు గల ద్వేషముతో, కుమారుడైన ప్రహ్లాదుని అనేక కష్టాలపాలు చేశాడు. ఈరకంగా తన భక్తుడికి కష్టాలు కలిగిస్తున్న హిరణ్యకశ్యపుడిని శ్రీమహావిష్ణువు నృసింహావతారమెత్తి సంహరించాడు.

మునీశ్వరులకు, ఋషిపుంగవులకు కష్టాలు కలిగిస్తున్న రాక్షసులను శ్రీరామచంద్రుడుగా సంహరించాడు. కబంధుడిని సంహరించాడు. తాటకను, సుబాహువును సంహరించాడు. చివరకు లంకేశ్వరునికూడా సంహరించాడు.

మోహినీరూపంలో దానవులను వంచించి అమృతాన్ని దేవతలకు పంచాడు.

కృష్ణావతారంలో శకటాశురుడు, పూతన, చివరకు కంసునివంటి రాక్షసులనేకుల్ని నాశనం చేశాడు. కురుక్షేత్ర సంగ్రామం జరిపించి కేవలం పాండవులను మాత్రమే రక్షించాడు. ద్రౌపది మాన సంరక్షణచేసి, ఆమె నవమానించిన దుష్టచతుష్టయాన్ని శిక్షించాడు.

ఈరకంగా తన భక్తులయొక్క విరోధులను శిక్షిస్తాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు 'నియమః' అనబడతాడు.

ప్రాణులను తమతమ అధికారములందు నియమించువాడు జీవులు చేసిన కర్మలను బట్టి వాటికి ఉత్తరజన్మ వస్తుంది. పుణ్యకర్మలు చేసినవారు ఉత్తమయోనుల యందు జన్మిస్తారు. నీచకర్మలు చేసినవారు పశువులు, పక్షులుగా జన్మిస్తారు. అంతకన్న పాపపు కర్మలు చేసినవారు క్రిమికీటకాలుగా జన్మిస్తారు. అని చెప్పబడింది. కాబట్టి పరమేశ్వరుడు జీవులు చేసిన కర్మలననుసరించి వారికి ఉత్తరజన్మలు ఇస్తాడు. శివరాత్రి యందు రోజంతా ఉపవాసము ఉండి, ఆ రాత్రి జాగారము చేసి, మరునాటి ఉదయం శివాలయంలో ప్రాణాలు వదలిన గుణనిధిని రెండు జన్మల తరువాత యక్షులకు రాజును చేశాడు. అతడిని కుబేరునిగా చేశాడు పరమేశ్వరుడు. బలిచక్రవర్తికి సావర్ణి మన్వంతరంలో ఇంద్రపదవి నిచ్చాడు. అంతవరకు 'సుతల' లోకంలో అతని ద్వారానికి కాపలాగా ఉన్నాడు.

అంతేకాదు నూరు అశ్వమేధయాగాలు చేసిన నహుషుడికి ఇంద్రపదవి ఇచ్చాడు. అనేక యాగాలు, దానాలు చేసిన ఇంద్రద్యుమ్న మహారాజులకు అనేక వేల సంవత్సరాలు స్వర్గలోక నివాసము కల్పించాడు.

ఈరకంగా జీవులు చేసిన కర్మను బట్టివారికి ఉత్తమగతులు, ఉత్తరజన్మలు ఇస్తాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు 'నియమః' అనబడుతున్నాడు.

# 162. యమః

ఇచ్చువాడు

**ఆకట్ణకం చానుకూలం యచ్ఛతీ త్యఖిలం యమః**

ఈ జగత్తు తన భక్తులకు అనుకూలంగా, విరోధం లేకుండా ఉండేటట్లు చేసేవాడు.

**యచ్ఛతీతి యమః**

సమస్తాన్నీ విరోధం లేకుండా, అనుకూలంగా ఉండేటట్లుగా సృష్టించేవాడు.

యమము అనగా - అణచివేయటము, వశములో ఉంచుకొనుట అని అర్ధం. జగత్తులోనే ఉంటూ, ఆ జగత్తును నియంత్రించేవాడు.

**బృహదారణ్యకోపనిషత్తు**లో జనకమహారాజు యాగం చేస్తున్నాడు. అందులో భాగంగా ప్రతిరోజూ సాయంత్రము వేదాంతగోష్ఠి జరుగుతున్నది. ఒకరోజున జనకుడు ఆధ్యాత్మికప్రపంచానికి చక్రవర్తి ఎవరో తెలుసుకోవాలనుకుని, తన గోశాలనుంచి బాగా బలిసిన వేయి ఆవులు, ఆబోతులను బంగారు ఆభరణాలు, పట్టువస్త్రాలతో అలంకరించి, "ఆధ్యాత్మిక ప్రపంచానికి చక్రవర్తి ఎవరో, వారు వీటిని తోలుకుపోండి" అన్నాడు. సభలో ఎవ్వరూ కదలలేదు. అప్పుడు యాజ్ఞవల్క్యుడు తన శిష్యుని పలిచి ఆవులను తోలుకుని ఆశ్రమానికి పొమ్మన్నాడు. అప్పుడు సభలోని పండితులు యాజ్ఞవల్క్యుని ప్రశ్నించటం ప్రారంభించారు. ఉద్దాలకుడు అడుగుతున్నాడు. "యాజ్ఞవల్క్యా అంతర్యామిని వివరించ వలసినది." యాజ్ఞవల్క్యుడు సమాధానం చెబుతున్నాడు.

నీటిలో నివసించేవాడు. నీటిలో ఉన్నప్పటికీ ఆ నీరు అతన్ని ఎరుగదు. ఆ నీరే అతని శరీరం. అగ్నిలో ఉంటాడు. అగ్ని అతన్నెరుగదు. కాని అగ్నిలో ఉంటూ అగ్నిని నియంత్రిస్తాడు. అతడే నీలో ఉన్న అంతర్యామి అయిన ఆత్మ. అంతరిక్షంలో ఉంటాడు. కాని అంతరిక్షం అతన్నెరుగదు. అతడి శరీరమే అంతరిక్షం. అంతరిక్షంలో ఉంటూ, అంతరిక్షాన్ని నియంత్రిస్తాడు. అతడే నీలో ఉన్న అంతర్యామి అయిన ఆత్మ.

వాయువులో ఉండి వాయువును నియంత్రిస్తాడు.కాని వాయువు అతన్నెరుగదు. అతడే నీలో ఉన్న అంతర్యామి అయిన ఆత్మ. ద్యులోకంలో ఉంటాడు. అదే అతని శరీరం. ద్యులోకం అతన్నెరుగదు. అక్కడే ఉంటూ ద్యులోకాన్ని నియంత్రిస్తాడు. అతడే నీ అంతర్యామి అయిన ఆత్మ. ఆదిత్యలోకంలో ఉంటాడు. ఆదిత్య లోకం అతన్నెరుగదు. ఆదిత్యలోకమే అతని శరీరం ఆదిత్య లోకంలో ఉంటూ, ఆదిత్య లోకాన్ని నియంత్రిస్తాడు.

అతడే నీ అంతర్యామి ఆత్మ. దిగంతరాళాల్లో ఉంటాడు. అయినా దిక్కులకు అతనెవరో తెలియదు. అక్కడ ఉంటూ దిక్కులను శాసిస్తాడు. అతడే నీ అంతర్యామి ఆత్మ. చంద్రునిలోను, నక్షత్రాలలోనూ ఉంటాడు. కాని అవి అతన్నెరుగవు. అక్కడ ఉంటూనే వాటిని శాసిస్తాడు. అతడే నీ అంతర్యామి, ఆత్మ. ఆకాశంలో ఉంటాడు. కాని ఆకాశం అతన్నెరుగదు. ఆకాశమే అతని శరీరం ఆకాశంలో ఉంటూ, ఆకాశాన్ని శాసిస్తాడు. అతడే నీ ఆత్మ. అంధకారంలో ఉంటాడు. కాని అంధకారం అతణ్ణి ఎరుగదు. అంధకారమే అతని శరీరం. అంధకారంలో ఉంటూనే, అంధకారాన్ని శాసిస్తాడు. అతడే నీ ఆత్మ.

"ఎవడు భూమిపైన, భూమిలోపల ఉంటాడో, తనలో ఉన్నప్పటికీ ఎవనిని భూమి ఎరుగదో, ఎవని శరీరమే భూమియో, లోపల ఉంటూనే ఎవడు భూమిని నియమిస్తుంటాడో అతడే నీ ఆత్మ. నీ అంతర్యామి. ప్రాణులు భూమిపైన ఉంటాయి. భూమిలో తాదాత్మ్యం చెందిన దేవతల లోపల ఉంటాయి.ప్రతిమానవుడి శరీరము భూమియే అవయవాలు భూమియే. కాని తనలో ఉన్నవాడిని ఈ శరీరము అవయవాలు ఎరుగవు. శరీరాన్ని, అవయవాలను నియంత్రించేది లోపల ఉన్న ఆత్మ. జగత్తులోపల ఉంటాడు. ఈ జగత్తు అతన్ని ఎరగదు. జగత్తులోపల ఉంటూనే జగత్తును నియంత్రిస్తాడు. అతడే నీ అంతరాత్మ. అంటూ జగాన్నియంతని గురించి వివరిస్తాడు.

ఈ విషయము **అధ్యాత్మోపనిషత్తు**లో కూడా వివరించబడింది. ఆ ఉపనిషత్తు 160వ నామంలో వివరించబడింది.

ఈరకంగా సర్వజగత్తునూ వశముతో ఉంచుకుంటాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు 'యమః' అనబడుతున్నాడు.

## 163. వేద్యః

తెలుసుకోవలసినవాడు.

**సర్వైశ్చ వేదితుం శక్యః సౌలభ్యాద్వే ద్యఈరితః**

సౌలభ్యాతిశయముచేత అందరికీ తేలికగా తెలుసుకోటానికి వీలైనవాడు.

**వేదితుమ్‌శక్యః వేద్యః** పరమేశ్వరుడు ఇంద్రియముల ద్వారా తెలుసుకోటానికి వీలుపడడు. అంటే ఇంద్రియాల వల్ల అతన్ని తెలుసుకోలేము. అతడు తనను తాను ప్రకాశింప చేసుకుంటున్నాడు కాబట్టి అతన్ని సులభముగా తెలుసుకోవచ్చును.

**వేత్తుం అర్హతి** – తెలుసుకోటానికి తగినవాడు.

**నిఃశ్రేయసార్థిభిః వేదానాం అర్హతి** ఆముష్మికము అంటే – పరలోక సుఖము కావాలని కోరుకొనేవారిచేత తెలుసుకో దగినవాడు.

పరమేశ్వరుని రెండు కోర్కెలు తీరటానికి అర్చన చేస్తాం. 1. ఇహము 2. పరము.

ఇహము అంటే – ఈ లోకంలో, ఈ జీవితంలో, ఈ శరీరంతో అనుభవించేవి. సంసార సుఖము, భార్యా, పిల్లలు, ధనధాన్యాలు, భోగభాగ్యాలు, కీర్తిప్రతిష్టలు, అధికారము మొదలైనవి కావాలని భగవంతుని ప్రార్థించటము. పరము అంటే – మరణించిన తరువాత పొందే సుఖాలు, స్వర్గలోకంలో పొందే సుఖము. శాశ్వతమైన ఆనందము అదే బ్రహ్మానందము. అది ముక్తి పొందినవారికే లభిస్తుంది.

ఈ రెండు రకాల కోరికల కోసం పరమేశ్వరుణ్ణి ప్రార్థిస్తాం. ఇక్కడ ముముక్షువులు తెలుసుకోదగిన దాన్ని వివరిస్తున్నారు.

ఇహలోక సుఖాలు కావాలి అనుకున్నవారికి భగవస్సాక్షాత్కారము అవసరం లేదు. వారి కోరికలు తీరితే చాలు. కాని పరలోక సుఖం అంటే శాశ్వతమైన ఆనందం కావాలనుకున్న వారికే ఆత్మసాక్షాత్కారం కావాలి.

పరలోక సుఖము అంటే స్వర్గ సుఖాలు కాదు. ఉత్తరజన్మలు లేకుండా, చిరకాలము పొందే ఆనందము అదే బ్రహ్మానందము. అది మానవుడు పొందే ఆనందానికి కోటానుకోట్ల రెట్లు ఉంటుంది. అది అనిర్వచనీయమైనది. అనుభవైక వేద్యము. అటువంటి ఆనందం కావాలనుకునే వారు పరమాత్ముని గురించి తెలుసుకోటానికి, అతన్ని దర్శించటానికి పరితపిస్తారు. అట్టి ముముక్షువులచే తెలియతగినవాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు 'వేద్యః' అనబడుతున్నాడు.

## 164. వైద్యః

విద్యనెరిగినవాడు.

**వేదితౄణాం భవాఖ్యస్య గదస్య వినివర్తినీమ్ ।**

**విద్యా మధీతే వేదేతి యోవైద్య స్సముదాహృతః ॥**

తనను ఉపాసించేవారిని భవబంధాల నుంచి విముక్తులుగా చేసి, విద్యను (జ్ఞానాన్ని) తెలియచేయువాడు.

**విద్యామధీతే ఇతి వైద్యః** విద్యనెరిగినవాడు కాబట్టి 'వైద్యః' అనబడతాడు. అన్ని విద్యలు తెలిసినవాడు. సకల విద్యలకు నిధి.

తనను ఉపాసించే వారికి జ్ఞానాన్ని ఇస్తాడు.

గతంలో చెప్పినట్లుగా అర్చన రెండు రకాలు. 1) ఐహిక సుఖాల కోసం చేసేది. 2) సాయుజ్యం కోసం చేసేది.

సాయుజ్యం కోసం పరమేశ్వరుని అర్చించేవారు డంభాలజోలికి పోరు. మోక్షప్రాప్తికి జ్ఞాన, భక్తి, కర్మ మార్గాలు అని మూడు మార్గాలున్నాయి. వీటిలో ఏ కష్టమూ లేకుండా హాయిగా, తేలికగా ఉండేది భక్తిమార్గము. మానవుల గుణబేధాల ననుసరించి భక్తి మూడు రకాలు. 1. దంభాచారంతో ఇతరులకు బాధ కలిగించేది తామసభక్తి. ఇది మచ్చరము కోపము కలిగి ఉంటుంది.

2. స్వార్థము చూసుకోవటము రాజసభక్తి. ఈ రకమైన వారు భోగభాగ్యాలు, కీర్తిప్రతిష్టలు, ఫలప్రాప్తి కోరతారు. ఈరకంగా జీవుడు దేవుడు వేరువేరు అని అర్చిస్తారు.

3. పరమేశ్వరుని వేరుగా తలచినప్పటికీ, ధృఢదీక్షతో ఆయన ప్రీతికోసం మాత్రమే చేసేది సాత్త్వికభక్తి. ఈ రకమైన భక్తివలన పరాభక్తి సాధ్యమవుతుంది. తామస, రాజసభక్తి మార్గాలు పరాభక్తికి దోహదం చెయ్యవు. పరాభక్తివల్ల అంటే – ఆ పరమేశ్వరుని యందే చిత్తము నిలిపి, తైలధారలాగా నిత్యము ఆయననే ధ్యానం చెయ్యటంచేత సార్ష్టి, సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్యములు పొందుతారు.

1. సార్ష్టిరూపముక్తి అంటే – సాధకుడు పరమేశ్వరుని పురమునకు దగ్గరగా ఇంకొకపురము నిర్మించుకొని ఉండటము.
2. సాలోక్యముక్తి అంటే – పరమేశ్వరుని పురములోనే ఒకచోట ఉండటము.
3. సామీప్యముక్తి అంటే – పరమేశ్వరునికి అతిదగ్గరగా సేవకులుగా ఉండటము
4. సారూప్యముక్తి అంటే – పరమేశ్వరునితో సమానమైన రూపంలో ఉండటము.
5. సాయుజ్యము అంటే – జన్మరాహిత్యము. ఈ స్థితి చేరినవారికి ఉత్తర జన్మలు ఉండవు.

అన్ని జీవులయందు పరమేశ్వరుని రూపాన్ని దర్శిస్తూ, తనయందున్న ప్రేమనే ఇతరులయందు కూడా చూపటము, ప్రాణులందరిలోనూ జీవచైతన్యమున్నది కాబట్టి, జీవునకు, దేవునికీ భేదం లేదు అని చెప్పటము, ఎవరియందు భేదబుద్ధి, ద్రోహబుద్ధి చూపకుండా ఛండాలుని మొదలు ఈశ్వరుని దాకా గౌరవించటము, దివ్యక్షేత్రములు, పుణ్యక్షేత్రములు, మహాభక్తులను దర్శించటము, గౌరవించటము, మంత్ర తంత్రము లందు, శాస్త్ర శ్రవణమందు భక్తి చూపటము, పరమేశ్వరుని భక్తియందు ఓలలాడటము, ఆనంద

పారవశ్యంలో మునిగి తేలటము, సర్వకాల సర్వావస్థలయందు ఆ పరమేశ్వరునే అర్చించటము, వ్రతాలు, మహోత్సవాలు చెయ్యటము, అహంకారము, దేహాభిమానము పారద్రోలి దివ్యనామ సంకీర్తన చెయ్యటము. ఇవన్నీ కలిగిన భక్తి పరాభక్తి అనబడుతుంది.

ఈరకంగా భక్తితత్పరతతో తనను అర్చించేవారికి జ్ఞానాన్ని ఇస్తాడు. కాబట్టే శ్రీమన్నారాయణుడు 'వైద్యః' అనబడుతున్నాడు.

పరమేశ్వరుడు అన్ని రకాల విద్యలకు నెలవైనవాడు.

పరావిద్య, అపరావిద్య ఈరెండూ కూడా ఆ పరమేశ్వరునియందే ఉన్నాయి.

**ముండకోపనిషత్తు**లో శౌనకుడు విద్యాభ్యాసం పూర్తిచేశాడు. వేదవేదాంగాలు, శాస్త్రాలు చదివాడు. యజ్ఞయాగాదులు నిర్వహించటంలో శ్రేష్ఠుడైనాడు. వివాహం చేసుకుని గృహస్థాశ్రమాన్ని స్వీకరించటానికి విముఖుడైనాడు. గురువుగారి దగ్గరకు వెళ్ళి బ్రహ్మోపదేశం చెయ్యమని అడిగాడు. అప్పుడు గురువుగారైన అంగిరసుడు, శౌనకునికి విద్యను గురించి వివరిస్తూ

"లోకంలో మనం తెలుసుకోవలసిన విద్యలు రెండు ఉన్నాయి. 1) పరావిద్య, 2) అపరావిద్య. పరమేశ్వరుడికి సంబంధించిన విద్య పరావిద్య. ధర్మములు, కర్మలు వాటి సాధన మొదలైన విషయాలకు సంబంధించింది అపరావిద్య.

చతుర్వేదాలు శిక్ష, వ్యాకరణము,ఛందస్సు, నిరుక్తము, జ్యోతిష్యము అనేవన్నీ అపరావిద్య. ఆత్మతత్త్వాన్ని బోధించేది పరావిద్య. ముందుగా పరావిద్యను గూర్చి వినవలసినది. జ్ఞానేంద్రియాలకు లొంగనిది, కర్మేంద్రియాల విషయం కానిది గోత్రము, వర్ణము, నేత్రములు, శ్రోత్రములు, కాళ్ళు, చేతులు లేనిది, నిత్యయై అన్నిటియందు ఉన్నది. సూక్ష్మాతిసూక్ష్మమైనది. అవ్యయమైనది, పంచభూతాలకు కారణమైనది పరబ్రహ్మతత్త్వము. అటువంటి తత్త్వాన్ని జ్ఞానియైనవాడు సర్వత్ర చూడగలడు.

సాలెపురుగు ఏ సహాయం లేకుండానే తన శరీరం నుంచి మంచి దారాలను తయారుచేసి, వాటిని మళ్ళీ తానే మింగేస్తుంటుంది. భూమినుండి ఓషధులు పుడుతున్నట్లుగా, మానవదేహం మీద రోమములు పుడుతున్నట్లుగా అక్షర పరబ్రహ్మ నుండి ఈ జగత్తు పుడుతున్నది. కుమారుడు పుట్టాలని తండ్రి కోరుకున్నట్లుగానే ఆ పరబ్రహ్మ జ్ఞానరూపమైన తపస్సు ద్వారా స్థూలభావాన్ని పొందుతాడు. ఆ తరువాత పరబ్రహ్మ నుండి ప్రాణులకు అవసరమైన అన్నం పుడుతోంది. అన్నం నుంచి ప్రాణం, మనస్సు, మనస్సు మంచి పంచభూతాలు, వాటి నుండి లోకాలు, వారికోసం కర్మలు,

కర్మనుండి ఫలము పుడుతున్నాయి. పరమేశ్వరుడు సర్వజ్ఞుడు, సర్వవేత్త జ్ఞాని, తపస్వి. ఆయన నుండి హిరణ్యగర్భ రూపుడైన బ్రహ్మ. అతని నుండి నామరూపాత్మకమైన జగత్తు ఆవిర్భవించింది.

**అపరావిద్య:** ఇది లౌకిక ప్రయోజనాలకుపకరిస్తుంది. బుద్ధి సంపన్నులైన మహర్షులు వేదాలలో స్వర్గ సాధనాలయిన యజ్ఞకర్మలను కనుక్కొన్నారు. కర్మాచరణ పరాయణులు, కర్మవాదులు అందరూ ఆ కర్మలనాచరించి సత్ఫలితాలు కూడా పొందారు. కాబట్టి కర్మఫలాన్ని కోరితే అగ్నిహోత్రాది కర్మాలనాచరించు సమిధలతో జ్వాలమండుతున్న అగ్నిలో 'స్వాహా' కారంతో ఆహుతులు సమర్పించాలి. అగ్నిహోత్రాది కర్మలు విధిగా జీవితాంతం చెయ్యాలి యజ్ఞం అమావాస్యనాడు చేస్తే ధర్మము, పౌర్ణమినాడు పూర్ణము అగ్నిహోత్రాది కర్మలు, చాతుర్మాస్యము, అతిథిపూజ, వైశ్వ దేవము మొదలైన కర్మలు చేయనివాడు ఏడు తరాల వారిని నాశనం చేస్తున్నాడు. ఆహుతులను మింగటానికి అగ్నిహోత్రునికి ఏడు నాల్కలున్నాయి. అందుకే అగ్నికి సప్తజిహ్వుడు అని పేరు. అవి.

| | | | |
|---|---|---|---|
| 1. | కాళి | – | నల్లనిది |
| 2. | కరాళి | – | భయంకరమైనది |
| 3. | మనోజవ | – | మనస్సు వంటి వేగము గలది |
| 4. | సులోహిత | – | ఎర్రని రంగుగలది |
| 5. | సుధూమ్ర వర్ణ | – | దట్టమైన పొగ రంగుగలది |
| 6. | విస్ఫులింగిని | – | రవ్వలు ఎగజిమ్మునది |
| 7. | దేవి | – | అనేక కిరణాలు కలది. |

ఆహుతులు దేవతలకు చేరినట్లుగానే, అగ్నిహోత్రాలు చేసే యజమానిని కూడా ఇంద్రుడు ఉండే చోటికి తీసుకుపోతారు. అంటే అగ్నిహోత్రము చేసిన వాడికి ఫలితము స్వర్గము. ఈ ఆహుతులు యజమానిని ప్రియమైన మాటలతో స్తుతిస్తూ, పూజిస్తూ స్వర్గానికి చేరుస్తాయి. అనగా కర్మఫలితము స్వర్గము. కర్మలుచేసిన వారికి ధనధాన్యాలు, సిరిసంపదలూ, వస్తు వాహనాలూ, ఉన్నత పదవులు, కీర్తిప్రతిష్ఠలు లభిస్తాయి. మోక్షం మాత్రం కాదు. యజ్ఞసాధనాలు మొత్తం పద్దెనిమిది. అవి పదహారు మంది ఋత్విక్కులు, యజమాని, అతని భార్య.

జ్ఞానరహితమైనవి యజ్ఞాలు యజ్ఞసాధనాలు అస్థిరమైనవి. అశాశ్వతమైనవి. ఈ కర్మలే మోక్షసాధనాలనిభావించే అజ్ఞానులు మాటిమాటికీ మృత్యువును పొందుతూనే

ఉంటారు. అంటే యజ్ఞంవలన స్వర్గం వస్తుంది. అక్కడ తన పుణ్యఫలము అనుభవించి, తరువాత మళ్ళీ భూలోకంలో పుడతాడు. అందుచేత ఈ కర్మలు శాశ్వత ఫలితాన్ని ఇవ్వవు. కర్మలవల్ల శాశ్వతమైన మోక్షం రాదు.

అజ్ఞానులు తమను తామే గౌరవనీయులుగా, పండితులుగా ఊహించుకొని విర్రవీగుతుంటారు. కృతార్థులమైనామని గర్విస్తుంటారు. కర్మిష్ఠులు ఫలాపేక్షతోనే ఉంటారు. కాని తత్త్వాన్ని తెలుసుకోరు. కర్మఫలం పూర్తికాగానే వీరు మళ్ళీ జన్మిస్తారు.

ఇష్టాపూర్తి కర్మలే సర్వోత్తమమైనవిగా భావించే వారు మూఢులు. వారు ఇతరమైన వాటిని శ్రేయోసాధనాలుగా భావించరు. అందుకనే వారు కర్మఫలాన్ని అనుభవించి కర్మశేషాన్ని అనుభవించటానికి మళ్ళీ జన్మిస్తారు.

శాంతస్వభావులు అడవులలో ఉంటూ భిక్షకులుగా జీవిస్తూ ఉంటారు. తపస్సు చేస్తుంటారు. వీరు పుణ్యపాపాలనుండి విడివడి ఉత్తరాయణ మార్గం ద్వారా సత్యలోకం చేరతారు. ప్రజాపతి, హిరణ్యగర్భుడు అంతా సాకారులే. వీరికి పరబ్రహ్మప్రాప్తి లేదు.

కాబట్టి శౌనకా ! మోక్షవాది అయినవాడు. బ్రహ్మోదిష్ఠుడైన గురువు వద్దకు వెళ్ళాలి. అప్పుడు బ్రహ్మవేత్త అయిన గురువు, శిష్యునకు పరావిద్యను ఉపదేశిస్తాడు. దానివల్ల శిష్యునకు బ్రహ్మజ్ఞానం కలుగుతుంది. తానే పరబ్రహ్మ. ఈ జగత్తంతా తనలోనే ఉన్నదనే భావం కలుగుతుంది. అటువంటివాడు మరణానంతరము బ్రహ్మ లోకం చేరి, కల్పాంతము వరకు అక్కడే ఉండి, కల్పాంతాన పరబ్రహ్మలో లీనమవుతాడు" అన్నాడు అంగీరసుడు.

పరావిద్య, అపరావిద్య రెండూ పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడే కాబట్టి అతడు 'వైద్యః' అనబడుతున్నాడు.

## 165. సదాయోగీ

ఎల్లప్పుడూ మేల్కొని ఉండువాడు. 741, 927 నామాలుకూడా ఇదే.

**చికిత్సాయాం జాగరూకః సదాయోగీతి కథ్యతే ॥**

తనసుపాసించే వారికి జ్ఞానాన్ని ప్రసాదించటము అనే విద్యను బాగా తెలిసినవాడు. దానిలో నిరంతరము జాగరూకుడై ఉండెడువాడు.

**సదాయోగః అస్యాస్తీతి సదాయోగీ ॥** ఎప్పుడూ మేల్కొని ఉండువాడు.

యోగము అనగా – స్వస్వరూపముతో గల సంబంధము ఆ రకమైన సంబంధము గలవాడు యోగి. ఎల్లవేళల యందు ఆ సంబంధము గలవాడు కాబట్టి 'సదాయోగీ'

అనబడతాడు. సర్వకాల సర్వావస్థలయందు స్వయం ప్రకాశమానమైన స్వరూప జ్ఞానము గలవాడు. అసలు భగవంతుడు లేదా పరమేశ్వరుడు అంటే ఎవరు ? జ్ఞానశక్తి. జ్ఞానమే పరమేశ్వరుని రూపము. అందుకే పరమేశ్వరుని రూపాన్ని

**కోటిసూర్యప్రతీకాశం చంద్రకోటి సుశీతలమ్**

కొన్ని కోట్ల సూర్యులయొక్క వెలుగులతో ప్రకాశిస్తున్నవాడు. ఒక సూర్యునిలోని వేడికే మనం మలమల మాడిపోతున్నాము కదా ? మరికొన్ని కోట్ల సూర్యుల కాంతిలో ఉండే వేడికి ఈ జగత్తు మసి అయిపోదా ? అలా జరగదు. అక్కడ ఉండేది కేవలము కాంతి మాత్రమే. అందులో వేడి ఉండదు. మరి ఏముంటుంది? కొన్ని కోట్ల చంద్రులలో ఉండే చల్లదనము. ఇక్కడ చంద్రుడు అంటే శరత్కాలములో ఉండే పున్నమినాటి చంద్రుడు, పరమేశ్వరుని రూపం అంత తేజోవంతముగా, చల్లగా ఉంటుంది.

**నైవచోర్ధ్వం న తిర్యక్చ నమధ్యే పరిజగ్రభత్ ।**
**ఆద్యంత రహితం తత్తు నహస్తాద్యంగ సంయుతం ।**
**న చస్త్రీ రూప మధవా న పుంరూప మధోభయమ్ ॥**

దానికి పైన, క్రింద, అడ్డము అనేవి ఏవీ లేవు. ఆద్యంతాలు లేవు. కాళ్ళు, చేతులు మొదలైన అవయవాలు లేవు. అది స్త్రీ కాదు. పురుషుడు కాదు. అలా అని నపుంసకమైనది అంతకన్నా కాదు. ఇది పరమేశ్వరుని రూపము. అయితే సాధనకోసం ఆ నిరాకారానికి ఒక సాకారము కల్పిస్తున్నాము. అదికూడా సాధకుని కోరికలు తీరటానికి ఏ రూపం కావాలో, ఆ రూపాన్ని పరమేశ్వరునికి ఆపాదిస్తున్నాము. అందుచేతనే

**సాధకానాం హితార్ధాయ బ్రహ్మణో రూపకల్పనా** సాధకుని కోరికలు తీర్చటం కోసం బ్రహ్మకు ఒక రూపాన్ని కల్పించటము జరిగింది. అంతేకాని పరబ్రహ్మకు రూపమనేది లేదు. ఆ పరబ్రహ్మ స్వయంప్రకాశము గలది. అదే ఈ లోకాలన్నీ ప్రకాశింపచేస్తున్నది. అది స్వరూప జ్ఞానము గలది. జ్ఞానము అంటే – పరమేశ్వర సంబంధమైన విషయ పరిజ్ఞానము. స్వరూప జ్ఞానము అంటే – తను ఎవరు ? ఎక్కడ నుంచి వచ్చాడు ? ఈ రూపం రాకముందు గతజన్మలో ఎక్కడ, ఏ రూపంలో ఉన్నాడు, మరణానంతరము ఎక్కడికి పోతాడు ? మొదలైన విషయ పరిజ్ఞానము.

జ్ఞాని అయినవాడు చరాచర జగత్తంతా తనలోనే చూడగలుగుతాడు. పిపీలికాది బ్రహ్మ పర్యంతము తనతో సమానంగా చూడగలుగుతాడు. జ్ఞాని అయినవాడు సాక్షాత్తూ పరమేశ్వర స్వరూపమే. ఆ పరమేశ్వరునకు, జ్ఞానికి తేడా లేదు. పరమేశ్వరుడు సర్వకాల,

సర్వావస్థలయందు సర్వత్రా వ్యాపించి ఉంటాడు. అందుకే **ముండకోపనిషత్తు**లో "సంసారమనే వృక్షము మీద రెండు పక్షులు ఒకేరూపముగలవి, ఒకే నామము గలవి కూర్చుని ఉన్నాయి. అందులో ఒకటి జీవాత్మ. రెండవది పరమాత్మ. ఈ రెండింటికీ తేడా లేదు. కర్మఫలితాన్ని అనుభవించేది జీవాత్మ. కర్మఫలం లేనిది పరమాత్మ. ఈ విషయం తెలుసుకుని, కర్మక్షయం చేసుకుంటే జీవాత్మకూడా పరమాత్మ అయిపోతుంది." అని చెప్పబడింది. అంటే స్వరూపజ్ఞానం పొందిన జీవుడే దేవుడు, పరమేశ్వరుడవుతాడు. ఆ పరమేశ్వరుడు స్వయంప్రకాశి. అతడు ఎక్కడ నుండి ఉద్భవించాడు? అంటే – జ్ఞానాగ్నిలో నుంచి అందుకే లలితా సహస్రములో **చిదగ్నికుండ సంభూతా** అని చెప్పబడింది.

అందుచేతనే జ్ఞానాగ్నిలో నుంచి ఆవిర్భవించి, జ్ఞానమయుడై, స్వరూపజ్ఞానముతో ప్రకాశించే పరమేశ్వర స్వరూపుడైన శ్రీమన్నారాయణుడు 'సదాయోగి' అనబడుతున్నాడు.

## 166. వీరహా

వీరులను జయించువాడు.

**స్వధ్యాన భఞ్జకా న్వీరాన్ హన్తి యస్సతు వీరహా ॥**

తన ధ్యానాన్ని చెడగొట్టు వీరులను సంహరించువాడు.

**వీరాన్ హంతీతి వీరహా ॥**

తనను తెలుసుకోవాలి అనుకునే వారి విరోధులను సంహరించువాడు.

**భగవద్గీత**లోని 16వ అధ్యాయము <u>**దైవాసురసంపద్విభాగయోగము**</u>లోని 8వ శ్లోకంలో

**అసత్యమప్రతిష్ఠం తే జగదాహురనీశ్వరమ్ ।**
**అపరస్పరసంభూతం కిమన్యత్కామ హైతుకమ్ ॥**

ఈ జగత్తుకు ఆధారమైనది ఏదీ లేదు. ఇదంతా అబద్ధము. దేవుడనేవాడు లేడు. కామప్రేరితులైన స్త్రీ పురుష సంయోగమువల్లనే జీవులు పడుతున్నాయి. కాబట్టి సృష్టికి కామముతప్ప ఇంకొక కారణము ఏదీలేదు. అని రాక్షస లక్షణాలు గలవారు అనుకుంటారు.

**ఏతాం దృష్టి మవష్టభ్య నష్టాత్మానోఽల్పబుధ్ధయః**
**ప్రభవన్త్యుగ్రకర్మణః క్షయాయ జగతోఽహితాః**

అసంబద్ధమైన ఇటువంటి మిధ్యావాదము చేసే భౌతికవాదులు ఆత్మనుగురించి ఆలోచించరు. ఆత్మయొక్క అస్థిత్వాన్ని విశ్వసించరు. వారు అందరికీ అపకారము చేసే క్రూరులు. వారిశక్తి సామర్థ్యాలు ప్రపంచ వినాశనానికి మాత్రమే ఉపయోగపడతాయి.

అసుర స్వభావముగలవారి పనులన్నీ, నాస్తిక సిద్ధాంతము ప్రకారమే సాగుతాయి. నాస్థిక సిద్ధాంతాలను నమ్మేవారు భౌతికవాదులు. దేన్నైనా సరే వీరు భోగదృష్టితోనే చూస్తారు. ఎందుచేత అంటే **ఛాందోగ్యోపనిషత్తు**లో

పూర్వకాలంలో ఒకసారి ప్రజాపతి ఆత్మతత్త్వాన్ని గురించి ఒక ప్రకటన చేశాడు.

"ఆత్మకు పాపం అంటదు. ముసలితనం రాదు. మృత్యువు దాన్ని కబళించదు. శోకం తాకదు. దానికి ఆకలి దప్పికలు లేవు. మానవుడు సత్యకాముడు, సత్యసంకల్పుడు అయి ఆత్మజిజ్ఞాసను అలవరచుకోవాలి. ఆత్మకోసం అన్వేషించిన వాడు, ఆత్మను అనుభవించినవాడు ఆత్మస్వరూపాన్ని పొందుతాడు. పూర్ణస్థితి అతనికి వస్తుందన్నమాట."

దేవతలు, రాక్షసులుకూడా ఆమాటలు విన్నారు. "ఆత్మను గురించి మనం కూడా అన్వేషిద్దాం. ఆత్మవల్ల అన్ని కోరికలు తీరతాయని బ్రహ్మచెప్పాడు కదా !" అనివారు భావించారు.

దేవతలరాజు ఇంద్రుడు, రాక్షసుల రాజు విరోచనుడు ఇద్దరూ ఆత్మజ్ఞానం సంపాదిద్దామని చేతితో దర్భలు పట్టుకుని బ్రహ్మవద్దకు వెళ్ళారు. బ్రహ్మ వీరిద్దరినీ ముప్పైరెండు సంవత్సరాలు. బ్రహ్మచర్యదీక్ష వహించమని చెప్పాడు. దీక్షపూర్తి చేశారిద్దరూ.

"వత్సలారా ! మీరు నాకోసం దేనికి వచ్చారు?" అన్నాడు బ్రహ్మ.

"భగవాన్ ! ఆత్మతత్త్వాన్ని గురించి చెప్పిన విషయాలు విన్నాం. ఆత్మను గురించి ప్రత్యక్షంగా తమ నోటి మీదుగా వినాలని వచ్చాం" అన్నారు. ఇంద్ర విరోచనులు.

"మనుష్యుల కనుపాపలలో మెదలుతూ కనుపించే పురుషుడే ఆత్మ. ఆత్మ అభయం. అమృతమయం. అదే బ్రహ్మం" అన్నాడు బ్రహ్మ.

అది విన్నవారు "భగవాన్ ! నీటిలోకనుపించే ప్రతిబింబం, అద్దంలో కనిపించే ప్రతిబింబం. ఈ రెంటిలో ఏది ఆత్మరూపం?" అని అడిగారు.

"నేను మొదటగా కళ్ళలో మెరిసే ఏ పురుషుని వర్ణన చేశానో వీటన్నింటిలోనూ ప్రతిఫలించేది ఆ పురుషుడే. ఒకసారి నీళ్ళలోను, అద్దంలోను మీ రూపాలు చూసుకుని మీ అనుభవాలు నాకు చెప్పండి" అన్నాడు బ్రహ్మ. ఇంద్ర విరోచనులిద్దరూ అలాగే చేసి ప్రజాపతి దగ్గరకు వెళ్ళారు. ప్రజాపతి వీరిని చూసి "మీరు ఏం చూశారు?" అన్నాడు.

"నఖశిఖ పర్యంతము కేశపాశాలతో మా శరీరాల ప్రతిరూపమే మాకు నీళ్ళలోనూ, అద్దంలోనూ కూడా కనిపించింది" అన్నారు వారు.

"నాయనలారా ! శరీరాలు శుభ్రపరచుకుని, మంచి వస్త్రాలు ఆభరణాలు ధరించి నీటిలో మీ ముఖాన్ని చూసుకోండి. తరువాత ఏంచూశారో నాకు చెప్పండి" అన్నాడు బ్రహ్మ 'అలాగే' అని చెప్పి ఇద్దరూ వెళ్ళిపోయారు. మరునాడు తిరిగి వచ్చి "స్వామీ ! ఈ చక్కని వస్త్రాలతో ఆభరణాలతో అలంకరించిన మా శరీరాలే నీటిలో కనిపించాయి" అన్నారు.

"అభయమూ, అమృతమయమూ అయిన ఆత్మ అదే. అదే బ్రహ్మము" అన్నాడు ప్రజాపతి. అదివిన్న ఇంద్రవిరోచనులు ఆత్మను గురించి తమకు అంతా తెలిసిందనుకుని తిరిగి వెళ్ళిపోయారు. అలా వెళ్ళిపోతున్నవారిని చూసి "అసలు ఆత్మజ్ఞానం లభించకుండానే వారు తెలిసింది అనుకుని వెళ్ళిపోతున్నారు. వారు దేవతలైనా, రాక్షసులైనా శరీరాన్నే ఆత్మ అని భావించటం పతన హేతువు" అనుకున్నాడు.

విరోచనుడు ఆత్మని గురించిన ఈ సిద్ధాంతంతోనే తృప్తి చెంది, రాక్షస జాతికంతటికీ ఈ సిద్ధాంతానే బోధించాడు. అసలైన పరమ సత్యం తనకు లభించిందని తృప్తి చెందాడు. దేహమే ఆత్మ అని ప్రచారం చేశాడు.

ఇంద్రుడు దేవలోకానికి బయలుదేరాడు. దారిలో తాను నేర్చుకున్న దానిలో ఏదో లోపం కనిపించింది. తను నేర్చుకున్న సిద్ధాంతాన్ని ఒకసారి సమీక్షించుకున్నాడు. విషయాన్ని విమర్శచేసి చూశాడు. బాగా అలంకరించుకుంటే అలంకరించినట్లు, మంచి వస్త్రాలు ధరిస్తే ధరించినట్లు, కుంటివాడైతే కుంటివాడిలాగా, గ్రుడ్డివాడైతే గ్రుడ్డివాడిలాగా శరీర ప్రతిబింబం కనిపిస్తుంది. మరణానంతరం శరీరం లేనప్పుడు ఆత్మ ఏమౌతుంది. మృత్యువాత పడే ఈ శరీరాన్ని అమృతమయమగు ఆత్మ అనటంలో అర్థంలేదు. ఇంద్రుడి సంశయాలు తీరలేదు. సంతృప్తి చెందలేదు. వెనక్కి తిరిగి ప్రజాపతి దగ్గరకు వెళ్ళినుంచున్నాడు.

తిరిగి వచ్చిన ఇంద్రుణ్ని చూసి ప్రజాపతి "ఇంద్రా ! నువు విరోచనుడితో వెళ్ళిపోయావు కదా ! మళ్ళీ ఎందుకు తిరిగి వచ్చావు ?" అని అడిగాడు.

ఇంద్రుడు తన అనుమానాలన్నీ వివరించాడు "ప్రభూ ! శరీరంలోగాని, శరీరచ్ఛాయలో గాని నాకు ఏమీ విశేషం కనబడలేదు. అందుకని గతంలో నేర్చుకున్నది తృప్తిని కలిగించలేదు. ఆత్మజ్ఞానాన్ని మీవద్ద అభ్యసించాలని మళ్ళీ వచ్చాను" అన్నాడు.

ఇంద్రుడి జిజ్ఞాసకు ఆనందించాడు బ్రహ్మ. ఇంద్రుణ్ణి మళ్ళీ ముప్పై రెండు సంవత్సరాలు బ్రహ్మచర్యదీక్ష పాటించమన్నాడు. ఇంద్రుడు దీక్షతో బ్రహ్మవద్దనే గడిపాడు.

దీక్ష పూర్తి అయిన తరువాత ప్రజాపతి ఇంద్రుడితో "స్వప్న ప్రపంచంలో ప్రభువులాగా స్వేచ్ఛగా విహరించే చైతన్యమే ఆత్మ" అన్నాడు.

ఈ మాటతో ఇంద్రుడు తృప్తిపడి తిరిగి వెళ్ళిపోవటానికి బయలుదేరాడు. అలా వెడుతుంటే త్రోవలో మళ్ళీ అనుమానం వచ్చింది. "స్వప్నాలు అనుభవించే చైతన్యమే ఆత్మ ఎలా అవుతుంది మనకు ఒక్కొక్కసారి కలలో ఎవరో పీడిస్తున్నట్లు వినిపిస్తుంది. మనం దుఃఖిస్తాము. పాపరహితము, అభయము అయిన ఆత్మ ఈ రకంగా దుఃఖించటంలో అర్ధం లేదు. ఇది సత్యం కాదు." అనిపించింది. మళ్ళీ తిరిగి వచ్చాడు ఇంద్రుడు. ప్రజాపతి ఆదేశం మేరకు మళ్ళీ కొన్ని సంవత్సరాలు బ్రహ్మచర్య దీక్ష గడిపాడు. అప్పుడు ప్రజాపతి ఇంద్రుడితో ఈ విధంగా చెప్పాడు. "గాఢసుషుప్తిలో సంతృప్తిగా ఆనందాన్ని అనుభవించేదే ఆత్మ."

ఇంద్రుడు ఈ మాట నిజమే అని నమ్మి దేవలోకానికి బయలుదేరాడు. మార్గ మధ్యంలో ఇంద్రుడికి మళ్ళీ అనుమానం వచ్చింది. గాఢనిద్ర అనుభవిస్తున్నదే ఆత్మ అనుకుంటే ఆత్మ తనను తాను తెలుసుకోలేని స్థితిలో ఉంటుందన్నమాట. తనను గురించి తాను తెలుసుకోలేని అవ్యక్తతత్త్వం ప్రకాశవంతమైన ఆత్మ ఎలా అవుతుంది? ఈ అనుమానంతో ఇంద్రుడు ఇరిగి ప్రజాపతి దగ్గరకు వచ్చాడు. ఈ సారి ప్రజాపతి ఇంద్రుణ్ణి కేవలం ఐదు సంవత్సరాలు తన దగ్గర బ్రహ్మచర్య దీక్షతో ఉండమన్నాడు.

గడువు పూర్తయిం తరువాత ఇంద్రుడి పట్టుదలకు మెచ్చి ఆత్మతత్త్వాన్ని పూర్తిగా వివరించాడు.

ఇంద్రా ! నీ పట్టుదలకు మెచ్చాను. ఆత్మానుభవం పొందటానికి నువ్వు పూర్తిగా అర్హుడవు. శరీరం అశాశ్వతమైనది. అఖరు క్షణాలు ఆసన్నం కాగానే శరీరాన్ని మృత్యువు కబళిస్తుంది. శాశ్వతమైన ఆత్మకు అశాశ్వతమైన శరీరమే ఆవాసం. శరీరం ఉన్నంత కాలంలో ఆత్మకు సుఖదుఃఖాలు, గుణదోషాలు అంటినట్లూ, వాటితో సతమతమవుతున్నట్లు కనిపిస్తుంది. ఆత్మ శరీరంతో సంబంధం ఏర్పరచుకోవటం వల్లనే జీవులకు సుఖదుః ఖాలు ఏర్పడతాయి. శరీరం ఆత్మనుండి విడివడితే ఈ బంధంనుండి విముక్తి లభిస్తుంది.

భౌతిక విషయాల నుండి విముక్తి పొంది ఆత్మను మనస్సుకు, ఇంద్రియాలకు విలక్షణమైనదిగా గ్రహించి, తేజోమయమని భావించి అనుభవజ్ఞుడు ఆనందిస్తాడు. ఆత్మజ్ఞానం పొందినవాడు ముక్తిసామ్రాజ్యంలో విహరిస్తాడు.

శాస్త్రోక్తంగా గురుకుల వాసం చేసి గురుకులం నుండి సమావర్తనం పూర్తి చేసి పెండ్లాడి, గృహస్థుడయి పవిత్రమైనచోట స్వాధ్యయనం చేస్తూ పుత్రుల్ని, శిష్యుల్ని ధర్మ పరాయణులుగా తీర్చిదిద్దుతూ ఇంద్రియాలను అదుపుచేసి అంటే జితేంద్రియుడై శాస్త్ర విరుద్ధమైన జీవహింస చేయకుండా జీవితాన్ని గడిపేవాడు చివరకు బ్రహ్మలోకం పొందుతాడు. అక్కడ నుండి మళ్ళీ తిరిగిరాడు. ఈ విధంగా అర్చిరాది మార్గం ద్వారా బ్రహ్మలోకానికి పోయిన ఉపాసకుడు బ్రహ్మలోకమున్నంత వరకు అక్కడ దివ్యభోగాలను అనుభవించి తరువాత పరబ్రహ్మలో లీనమవుతాడు. అతడికి పునరావృత్తి ఉండదు."

అని చెప్పబడింది కాబట్టి ఈ దేహమే పరబ్రహ్మ స్వరూపమని నమ్మేవారు అసురులు.

**భగవద్గీత**లోని 16వ అధ్యాయం **దైవాసుర సంపద్విభాగయోగం**లోని 10 నుండి 20 వరకు శ్లోకాలు.

**కామమాశ్రిత్య దుష్పూరం దమ్భమానమదాన్వితాః ।**
**మోహాద్గృహీత్వాసద్గ్రాహాన్ ప్రవర్తన్తేఽశుచివ్రతాః ॥**

దంభం, దురభిమానము, మదములతో కూడినటువంటి అసుర లక్షణాలు గలవారు యుక్తాయుక్త విచక్షణా జ్ఞానాన్ని కోల్పోయి, ఏదో విధంగా తమ కోరికలు తీర్చుకోటానికి ఇష్టపడతారు. అజ్ఞానము మూలంగా మిథ్యాసిద్ధాంతాన్ని ఆశ్రయించి, శాస్త్రవిరుద్ధముగా భ్రష్టులైచరిస్తారు.

**చిన్తామపరిమేయాం చ ప్రలయాన్తాముపాశ్రితాః ।**
**కామోపభోగపరమాః ఏతావదితి నిశ్చితాః ॥**

మరణించేదాకా వారు అంతులేని ఆలోచనలతోనే మునిగిపోతారు. విషయ భోగాలలో తేలియాడుతూ అదే నిజమైన సుఖమని భావిస్తారు.

**ఆశాపాశశతై ర్బద్ధాః కామక్రోధ పరాయణాః ।**
**ఈహన్తే కామభోగార్థం అన్యాయేనార్థ సంచయాన్ ॥**

వారు ఆశాపాశముతో ఎప్పుడూ బంధింపబడి ఉంటారు. కామక్రోధాలతో చరిస్తుంటారు. విషయభోగాల కోసము అన్యాయమార్గల ద్వారా ధనార్జనకు పాల్పడతారు.

అసుర స్వభావంగలవారిలో అనేక రకాలైన కామప్రకోపాలు చెలరేగు తుంటాయి. వాటిని తీర్చటం కోసం అనేక రకాలైన ఆశాపాశాలతో బంధించ బడుతుంటారు. వారి మనసులు క్షణానికి ఒక విషయమందు లాగబడుతుంటాయి. ఈ రకంగా ఆశ అనే

సాలెగూటిలో చిక్కుకుపోతారు. విషయభోగాల కోసము దొంగతనము, దోపిడి, కపటము, మోసము, హింస, జూదము మొదలైన శాస్త్ర విరుద్ధమైన పద్ధతుల ద్వారా ఇతరుల సొమ్ము అపహరించటానికి ప్రయత్నిస్తారు.

**ఇదమద్య మయా లబ్ధం ఇమం ప్రాప్స్యే మనోరథమ్ ।**
**ఇదమస్తీదమపి మే భవిష్యతి పునర్ధనమ్ ॥**

నేను మిక్కిలి పురుషార్థిని కాబట్టి నాకు కావలసిన వస్తువులన్నీ పొందగలిగాను. ఇప్పటికే నాదగ్గర చాలా ధనమున్నది. ఇంకా చాలా సంపాదించగలను అనుకుంటారు.

**అసౌ మయా హత శ్శత్రుః హనిష్యే చాపరా నపి ।**
**ఈశ్వరో ఽహమహం భోగీ సిద్ధో ఽహం బలవాన్సుఖీ ॥**

నేను ఈ శత్రువును వధించాను మిగిలినవారిని కూడా వధించగలను. నేనే సర్వాధిపతిని. సమస్త భోగాలను అనుభవించగలవాడను నేనే. నేను గొప్ప బలవంతుడను.

**ఆఢ్యోఽఽభిజనవానస్మి కో ఽన్యో ఽస్తి సదృశో మయా ।**
**యక్ష్యే దాస్యామి మోదిష్యే ఇత్యజ్ఞాన విమోహితాః ॥**
**అనేకచిత్తవిభ్రాన్తాః మోహజాలసమావృతాః ।**
**ప్రసక్తాః కామభోగేషు పతన్తి నరకేఽశుచౌ ॥**

నేను గొప్ప ధనవంతుడిని నాకు ఎక్కువ పరివారమున్నది. నాతో సమానమైె వారు లేరు. నేను యజ్ఞాలు చెయ్యగలను. దానాలు ఇవ్వగలను ఇష్టానుసారము చెయ్యగలను. అనుకుంటూ అజ్ఞానాంధకారంలో కూరుకుపోయిన వారు విషయభోగాల యందు ఆసక్తులై ఘోరమైన నరకమందు పడిపోతారు.

**ఆత్మ సంభావితాస్తబ్ధా ధనమానమదాన్వితాః ।**
**యజంతేనామయజ్ఞైస్తే దమ్భేనా విధిపూర్వకమ్ ॥**

వారు తమకు తామే గొప్పవారమని భావిస్తారు. గర్వోన్నతులై ధనమదాంధకారంతో కనుమిన్ను గానక ప్రవర్తిస్తారు. ఆడంబరంగా, పేరుకు మాత్రమే యజ్ఞయాగాది క్రతువులు చేస్తారు.

**అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః ।**
**మామాత్మపరదేహేషు ప్రద్విషన్తో ఽభ్యసూయకాః ॥**

అహంకారము, బలము, దర్పము, కామక్రోధాలకు వశులై ఇతరులను నిందిస్తూ, తమ శరీరములోను, ఇతరుల శరీరములోను అంతర్యామిగా ఉన్న నన్ను ద్వేషిస్తారు.

**తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్ ।**

**క్షిపామ్యజస్రమశుభాన్ ఆసురీష్వేవ యోనిషు ॥**

ఈరకంగా ఇతరులను ద్వేషించే పాపాత్ములను, క్రూరులైన నరాధములను, మాటిమాటికీ అసురయోనుల యందు పడేస్తుంటాను. అనగా - వారికి అటువంటి అసురజన్మలే కలుగుతుంటాయి.

**ఆసురీం యోనిమాపన్నాః మూఢా జన్మని జన్మని ।**

**మామప్రాప్యైవ కౌన్తేయ ! తతో యాన్త్యధమాం గతిమ్ ॥**

ఓ అర్జునా ! రాక్షసప్రవృత్తి గల ఈ మూఢులు నన్ను పొందకుండానే ప్రతి జన్మలోనూ రాక్షసయోనుల యందు, అంతకన్న హీనమైన యోనులందు పుడతారు. అంటే ఘోరమైన నరకములందు పడతారు. అని చెప్పబడినది.

ఈరకంగా అసుర లక్షణాలు గలవారిని తన దగ్గరకు రానీయకుండా అంటే వారికి ముక్తి లేదు. అంతేకాకుండా అసురులను ధర్మరక్షణ కోసం సంహరిస్తాడు. కాబట్టి శ్రీమన్నారాయణుడు 'వీరహా' అనబడుతున్నాడు.

## 167. మాధవః

'మా' అనే పరావిద్యకు స్వామి. మౌన, ధ్యానయోగాలు గలవాడు. లక్ష్మీదేవికి భర్త. యదువు యొక్క కుమారుడైన మధువు యొక్క వంశమున జన్మించినవాడు.

72, 735వ నామాలు కూడా ఇదే.

**మా విద్యాచహరేః ప్రోక్తా తస్యా స్స్వామీ ధవస్మృతః**

**తస్మా న్మాధవనామాஉ సౌ బ్రహ్మవిద్యా ప్రదోమనుః**

**మౌనా ద్ధ్యానాచ్చ యోగాచ్చ మాధవః పరికీర్తితః ॥**

'మా' అంటే పరావిద్య. దానికి ధవుడు భర్త. కాబట్టి మాధవుడు అనబడుతున్నాడు.

**మాయాః ధవః మాధవః** మా అనబడే పరావిద్యకు నాధుడు. **హరివంశములో**

**మా విద్యాచ హరేః ప్రోక్తా తస్యా ఈశోయతోభవాన్ ।**

**తస్మాన్మాధవనామాని ధవః స్వామీతి శబ్దితః ॥**

ఓ హరీ ! మా అంటే పరావిద్య. దానికి నీవు స్వామి అవటంచేత 'మాధవుడు' అనబడుతున్నావు. **భారతం**లోని ఉద్యోగపర్వంలో

**మౌనాత్ ధ్యానాచ్చయోగాచ్చ విద్ధి భారతమాధవమ్ ॥**

మౌన ధ్యాన యోగములు కలవాడగుటచే మాధవుడు అని అనబడతాడు.

పరమేశ్వరునికి సంబంధమైన విద్య పరావిద్య దానిని 'మా' విద్య అని అంటారు. దీనిని గతంలో (164వ నామంలో) వివరించటం జరిగింది.

## 168. మధుః

తేనెవంటివాడు.

**భక్తేభ్యో లబ్ధవిద్యేభ్యో స్వదమానతయా మధుః**

మోక్షసాధనకోసం పరావిద్య నాశ్రయించిన వారికి మధువువలె తియ్యగా ఉండేవాడు.

**మన్యతే ఇతి మధుః** తేనెలాగా తియ్యగా ఉండేవాడు.

**భగవద్గీత**లోని ఏడవ అధ్యాయం **'జ్ఞానవిజ్ఞాన యోగము'** లోని 17వ శ్లోకము

**తేషాం జ్ఞానీ నిత్యయుక్తః ఏకభక్తిర్విశిష్యతే ।**
**ప్రియో హి జ్ఞానినోఽ త్యర్థంహం స చ మమ అప్రియః ॥**

అర్జునా ! చతుర్విధ భక్తులలో నిరంతరము నాయందే మనసు లగ్నంచేసే జ్ఞాని ఉత్తముడు. నాతత్త్వాని తెలుసుకున్న జ్ఞానికి నేను మిక్కిలి ఇష్టుడను. అతడు నాకు ఇష్టుడు. చతుర్విధ భక్తులు అంటే

1. అర్థార్థులు 2. ఆర్తులు 3. జిజ్ఞాసువులు 4. జ్ఞానులు

1. అర్థార్థులు – ధనధన్యాలు, సిరిసంపదలు, భోగాలు కోరతారు వాటికోసం భగవంతుని ప్రార్థిస్తారు.
2. ఆర్తులు – వీరు శారీరక సుఖాలు, గౌరవప్రతిష్ఠలు అంటే ఇష్టపడతారు. కాబట్టి కొన్నిసార్లయినా భగవంతుని కోరికలు కోరతారు.
3. జిజ్ఞాసువులు – వీరు ఇహపరాలను అపేక్షించరు. లౌకిక విపత్తులకు భయపడరు. భగవంతుని తత్త్వము తెలుసుకోటానికి ప్రయత్నిస్తారు.
4. జ్ఞానులు – చరాచర జగత్తునూ తమలోనే చూచేవారు. పిపీలికాది బ్రహ్మ పర్యంతము తమతో సమానంగా భావించేవారు.

భగవంతుని తత్త్వము తెలుసుకున్న వారికి అన్నిచోట్ల భగవత్స్వరూపమే కనిపిస్తుంది. అతని దృష్టిలో భగవస్వరూపము తప్ప ఇతరమేదీ లేదు. అతడికి ఐహిక సుఖాలన్నీ తృణప్రాయము. అతడికి పరమేశ్వరుడు మధువువంటివాడు.

**యథామధు పరాంప్రీతిం ఉత్పాదయతి అయమపి తథా ॥**

తేనె ఏరకంగా మహదానందాన్ని కలిగిస్తుందో అలాగే ఇతడుకూడా తన ఉపాసకులకు సర్వాతిశయమయిన ఆనందము కలిగిస్తాడు. **బృహదారణ్యకోపనిషత్తు**లో

శిష్యులారా ! యాజ్ఞవల్క్యుడికి మైత్రేయి, కాత్యాయని అని ఇద్దరు భార్యలు. కాత్యాయని సామాన్యగృహిణి. కాగా మైత్రేయి అధ్యాత్మిక చర్చలలో పాల్గొనేది. ఒకరోజు యాజ్ఞవల్క్యుడు తనభార్యలతో "నేను సంసారాన్ని వదిలిపెట్టి సన్యాసాశ్రమం స్వీకరించాలనుకుంటున్నాను. అందుచేత నా ఆస్తిని మీ ఇద్దరికీ సమానంగా పంచి ఇచ్చేస్తాను" అన్నాడు ఆ మాటలువిన్న మైత్రేయి "స్వామీ ! ప్రపంచంలో ఉన్న ధనధాన్యాలన్నీ నా ముందు కుప్పగా పోసినా నాకు ఆనందం లభించదు. అమరత్వం సిద్ధించదు. తమరు ఇస్తాననే సిరిసంపదలు అన్నీ అశాశ్వతాలు. వీటివల్ల జీవితంలో కొంతవరకు సుఖం అనుభవించవచ్చు. కాని అవేవీ శాశ్వతమైన ఆనందాన్ని ఇవ్వలేవు. మోక్షాన్ని ప్రసాదించలేని ఈ ధనధాన్యాలవల్ల నాకేమిటి ప్రయోజనం? కాబట్టి మోక్షకారకమైన బ్రహ్మవిద్యను నాకు ఉపదేశించండి" అన్నది. ఆ మాటలకు ఆనందభరితుడైన యాజ్ఞవల్క్యుడు మైత్రేయికి బ్రహ్మోపదేశం చేశాడు. ఆ విషయాన్నిమీకు వివరిస్తాను వినండి" అంటూ యాజ్ఞవల్క్యుడు చెప్పిన విషయాన్ని వివరించటం ప్రారంభించాడు రత్నాకరుడు.

"మైత్రేయీ ! ఆత్మ ప్రయోజనం కోసమే ఒకరికొకరు ప్రియులౌతారు. భార్యభర్తను ప్రేమిస్తోంది అంటే ఈ ప్రేమ భర్తకోసం కాదు. కేవలం భార్య ప్రయోజనం కోసమే. అలాగే భర్తకూడా తన ప్రయోజనం కోసమే భార్యను ప్రేమిస్తాడు. తల్లిదండ్రులు పుత్రులను తమ ప్రయోజనం కోసమే ప్రేమిస్తున్నారు. అంతేకాని పుత్రుల ప్రయోజనం కోసం కాదు. అదేవిధంగా ధనాన్ని మన ప్రయోజనం అంటే ఆత్మప్రయోజనం కోసమే ప్రేమిస్తున్నాము. ఈ విధంగా లోకాలను, క్షత్రియులను, పంచభూతాలను ఒకటేమిటి ? లోకం దేన్నయినా సరే ఆత్మ ప్రయోజనం కోసమే ప్రేమిస్తున్నాము. కాబట్టి ఈ ఆత్మ ఒక్కటే దర్శనీయమైనది, తెలుసుకోతగినది. ముందుగా దీన్ని గురించి గురువుద్వారా వినాలి. శాస్త్రాలు చదవాలి. ఇతరులతో తర్కించాలి. ఆత్మతత్త్వాన్ని గూర్చి దర్శనం, శ్రవణం, మననం, విజ్ఞానంద్వారా అన్నీ తెలుస్తాయి. రజ్జుసర్పభ్రాంతి కలిగినప్పుడు, అది కేవలం త్రాడు అని తెలిస్తే అది సర్పమనే భ్రాంతి తొలగిపోతుంది. విజ్ఞానం కలగగానే ఆత్మస్వరూపం గోచరిస్తుంది.

బ్రాహ్మణజాతిని ఎవరైనా ఆత్మకన్న భిన్నమైనదిగా భావిస్తే వాళ్ళను ఆజాతి నిర్లక్ష్యం చేసి దూరంగా త్రోసివేస్తుంది. పురుషార్థాల నుండి భ్రష్టుల్ని చేస్తుంది. అదే విధంగా క్షత్రియజాతిని ఎవరైనా ఆత్మకన్న భిన్నమైనదిగా భావిస్తే వాళ్ళని ఆ జాతి త్రోసివేస్తుంది. దేవతలను ఆత్మకన్న భిన్నంగా భావించిన వారిని దేవతలు తృణీకరిస్తారు ఈ విధంగా బ్రాహ్మణ జాతి. క్షత్రియజాతి, లోకాలు, దేవతలు, పంచభూతాలు ఒకటేమిటి ? కంటికి కనుపించే ప్రతిదీ ఆత్మస్వరూపమే. ఆత్మకన్న భిన్నమైనది ఏదీలేదు. అన్నీ ఆత్మనుండే పుడుతూ, ఆత్మలోనే లీనం అవుతున్నాయి.

ఏది లేకుండా ఒక వస్తువును మనం గ్రహించలేమో, అది దానియొక్క తత్త్వము, ధర్మము అవుతుంది. ఒక నగారాను కర్రతోకొట్టినప్పుడు దానినుంచి వచ్చే స్వరాలు దానియొక్క సామాన్యస్వరానికి భిన్నం కావు. ఎన్నిరకాల శబ్దాలు వచ్చినా అవి సామాన్య స్వరంతో కలిసిపోతాయి. వాటికి ప్రత్యేకమైన అస్థిత్వం ఉండదు. ముందుగా సామాన్య స్వరం గ్రహిస్తే తరవాత విశేష శబ్దం పట్టుబడుతుంది. అలాగే ముందు చిదాత్మనుగ్రహిస్తే, తరువాత దానిలోని కల్పితమైన నామరూపాత్మకమైన జగత్తు పట్టుబడుతుంది. కన్ను ముందుగా వెలుగును గ్రహించిన తరువాతనే నీలము, ఎరుపు, నలుపు రంగులను చూడగలము. అదే విధానంగా చిదాత్మను దర్శించిన తరువాతనే నామరూపాత్మకమైన జగత్తును చూడగలము.

శంఖాన్ని ఊదినప్పుడు వెలువడే ప్రత్యేకమైన శబ్దాలను గ్రహించగలిగితే దానినుండి వెలువడిన శబ్దాలు వాటంతటవే పట్టుబడతాయి. కాబట్టి ముందు సామాన్య శబ్దం పట్టుపడాలి. తడిసినకట్టెను నిప్పులో వేసినట్లైతే రకరకాల పొగలు వస్తాయి. తరువాత రవ్వలు వస్తాయి. ఈ రవ్వలు ఆ అగ్ని కన్న వేరైనవి కావు. అలాగే వేదాలు, పురాణాలు, ఉపనిషత్తులు, మంత్రాలు, కళలు, సూత్రాలు ఇవన్నీ పరమాత్మ యొక్క స్వరూపాలు. ప్రయత్నం లేకుండానే ఇవన్నీ విజ్ఞానఘనుడైన పరమాత్మ నుంచి ఉత్పన్నమైనాయి. రవ్వలు, జ్వాలలు రావటానికి ముందు అంతా అగ్నిమయమే. అలాగే నామరూపాత్మక స్థితికి ముందు జగత్తంతా ప్రజ్ఞానఘనుని స్వరూపమే.

అన్ని నదులకు గమ్యస్థానం సముద్రమే. సముద్రంలో చేరగానే నదులు తమ అస్థిత్వాన్ని కోల్పోతాయి. అలాగే

అన్నిరకాల స్పర్శలకు గమ్యస్థానం – చర్మము

అన్నిరకాల వాసనలకు ప్రళయస్థానం – నాసిక

అన్ని రుచులకు ప్రళయ స్థానం - నాలుక
అన్ని శబ్దాలకు ప్రళయ స్థానం - చెవులు
అన్ని ఆలోచనలకు ప్రళయ స్థానం - మనస్సు
అన్ని విద్యలకు ప్రళయ స్థానం - హృదయం
అన్ని కర్మలకు ప్రళయ స్థానం - చేతులు
అన్ని సుఖాలకు ప్రళయ స్థానం - జననేంద్రియము
అన్ని నడకలకు గమ్యస్థానం - కాళ్ళు

ఈ విధంగా విషయాలకు గమ్యస్థానం - ఇంద్రియాలు. ఈ రకంగా కార్యాలన్నీ కారణాలలో కలిసిపోయి ఇవన్నీ ప్రజ్ఞాన ఘనుడిలో చేరిపోతాయి.

నీళ్ళలో ఉప్పువేస్తే అది కరుగుతుంది. అంటే ఆ ఉప్పు నీరంతా వ్యాపించి ఉంటుంది. అదే విధంగా అద్భుతమైన శక్తిగల పరమాత్మ అనంతుడు, అవ్యయుడు, విజ్ఞానఘనుడు. అతడే దేహాది ఉపాధులతోబాటుగా కలిసిపోయి, అవి నాశనమయినప్పుడు తానుకూడా నాశనమయినట్లు కనిపిస్తాడు. దేహంనుండి విడివడిన తరువాత విశేషసంజ్ఞలు ఏమీ ఉండవు.

లోకంలో ఉన్నదంతా ఆత్మే. ఆత్మయే అందరిలోనూ సమానంగా ఉన్నది. ఆత్మనుండే అన్నీ పుట్టినాయి. మళ్ళీ ఆత్మలోనే లయం అవుతాయి. అందుచేతనే ఆత్మను గురించి తెలుసుకుంటే మిగిలిన విషయాలన్నీ తెలుసుకున్నట్లే.

ఈ జగత్తులోని ప్రతి వస్తువు, ప్రతి ప్రాణి ఒకదానికొకటి ఉపకార్య, ఉపకారిక స్వభావాలు కలిగి ఉంటాయి.

పిపీలికాది బ్రహ్మపర్యంతము సృష్టియే జగత్తు. తేనెటీగలు అసంఖ్యాకంగా చేరితేనెతుట్టెను నిర్మించినట్లుగా సమస్తభూతాలు చేరి ఈ పృథివిని నిర్మించాయి. సమస్త భూతాలకు ఈ భూమియే మధువు. తేనేతుట్టె తేనెటీగలకు ఆశ్రయం అయినట్లుగా భూతాలన్నింటికీ భూమి ఆశ్రయం, ఆహారం అవుతోంది. అందుకే భూమినికూడా మధువు అంటారు. ఈపృథివిలో చిన్మాత్రుడు, ప్రకాశమయుడు, అమృతమయుడు అయిన పురుషుడే ఈ అధ్యాత్మ శరీరంలోని తేజోమయుడైన, అమరణ ధర్ముడైన పురుషుడు కూడా! ఇద్దరూ ఒకటే. అదే ఆత్మ. ఈ ఆత్మ జ్ఞానమే అమృతత్త్వానికి సాధనం. వీటన్నింటిలో ఉన్న ఏకత్వమే బ్రహ్మ. అదే సర్వస్వరూపం. పృథివి అనేది శరీరానికి ప్రతీక. ఈ బ్రహ్మజ్ఞానమే సమస్తమూ తాను అవటానికి సాధనం.

అదేవిధంగా జలం సమస్త భూతాలకు, ప్రాణాలకు మధువు. భూతాలు జలానికి మధువు. జలాన్ని రేతస్సు అంటారు. జలంలో ఉన్న ప్రకాశమయుడు. అమృత స్వరూపుడే ఈ శరీరాల్లో బీజంగా ఉన్న ప్రకాశమయుడు, అమృతమయుడు. అదే ఆత్మ. ఈ రెంటిలో ఉన్న ఏకత్వమే బ్రహ్మ. ఈ బ్రహ్మజ్ఞానమే సర్వమూ తాను అవటానికి సాధనం.

జీవులన్నింటికీ అగ్ని మధువులాంటిది. అలాగే అగ్నికి ఈ ప్రాణులన్నీ మధువు లాంటివి. అగ్నిలో ఉన్న తేజోమయుడైన పురుషుడే శరీరంలో వాగ్రూపంలో ఉన్న పురుషుడు. ఈ ఇద్దరూ ఒకటే. ఇదే బ్రహ్మ. అదే అమృతము.

వాయువు జీవరాశులన్నింటికీ మధువువంటిది. ఈ జీవరాశులు వాయువుకు మధువువంటివి. వాయువులో ఉన్న తేజోమయుడు, అమృతమయుడు అయిన పురుషుడు శరీరంలో ప్రాణరూపంలో ఉండే తేజోమయుడైన పురుషుడు ఇద్దరూ ఒకటే. అదే ఆత్మ. అదే అమృతం. సూర్యుడు అన్ని భూతాలకు మధువు. అన్ని భూతాలు ఆదిత్యునికి మధువు లాంటివి. ఆదిత్యునిలో ఉన్న ప్రకాశవంతుడైన పురుషుడే శరీరంలోని కనులలో ఉండే తేజోమయుడైన పురుషుడు. వీరిద్దరూ ఒకటే. అదే ఆత్మ. అదే అమృతం. అదే బ్రహ్మ.

దిక్కులన్నీ సమస్థ భూతాలకు మధువువంటివి. అలాగే సమస్థ భూతాలు దిక్కులన్నింటికి మధువు వంటివి. ఈ దిక్కులలో ఉన్న తేజోమయుడైన పురుషుడే శరీరంలో ఉండే శ్రౌత్రపురుషుడు. శ్రవణ సమయంలో ఉండే పురుషుడు. ఈ ఇద్దరూ ఒకటే. అతడే ఆత్మ అతడే బ్రహ్మ, సర్వరూపుడు. చంద్రుడు సమస్త భూతాలకు, మధువు వంటివాడు. అలాగే సమస్తభూతాలూ చంద్రునికి మధువులాంటివి. చంద్రునిలో ఉన్న తేజోమయుడైన పురుషుడు. శరీరంలో ఉన్న మనస్సంబంధమైన అమృతమయుడైన పురుషుడు, ఇద్దరూ ఒకటే. అదే అమృతం. అదే బ్రహ్మ అదే సర్వరూపం.

విద్యుత్తు సమస్త జీవకోటికి మధువు. అలాగే సమస్త జీవరాసులు విద్యుత్తుకు మధువు. విద్యుత్తులో ఉండే ప్రకాశవంతమైన పురుషుడూ, శరీరంలో ఉండే తేజోమయుడైన అమృతమయుడు ఇద్దరూ ఒకటే. అతడే ఆత్మ. అతడే అమృతమయుడు, అతడే బ్రహ్మ.

సమస్తభూతాలకు మేఘం మధువు. అలాగే సమస్త భూతాలుమేఘానికి మధువు. మేఘంలో ఉన్న తేజోమయుడైన పురుషుడు. శరీరంలో శబ్దము, స్వరము రూపంలో ఉన్న పురుషుడు, ఇద్దరూ ఒకటే. అదే ఆత్మ. అదే అమృతం. అతడే బ్రహ్మ.

సమస్తభూతాలకు ఆకాశం మధువు. అలాగే సమస్త జీవులు ఆకాశానికి మధువు. ఆకాశంలో ఉండే తేజోమయుడైన పురుషుడు శరీరంలోని హృదయాకాశంలో ఉండే తేజోమయుడైన పురుషుడు ఇద్దరూ ఒకటే. అదే ఆత్మ. అమృతమయమైనది. అదే బ్రహ్మ.

ధర్మమనే పేరుతో వ్యవహరింపబడి మనం ఆచరించదగ్గది అయిన ధర్మము ఈ భూతాలన్నింటికి మధువు. ఈ భూతాలన్నీ ఆ ధర్మానికి మధువు లాంటివి. ధర్మంలో ఉండే తేజోమయుడైన పురుషుడు, శరీరంలో ఉండే తేజోమయుడైన పురుషుడు ఇద్దరూ ఒకటే. అతడే ఆత్మ. అతడే అమృతుడు. అతడే బ్రహ్మ.

సత్యమనేది సమస్త భూతాలకు మధువు. అలాగే సమస్త భూతాలు సత్యానికి మధువు. సత్యంలో ఉండే తేజోమయుడైన పురుషుడు శరీరంలో ఉండే తేజోమయుడైన పురుషుడు ఇద్దరూ ఒకటే. అతడే ఆత్మ. అతడే అమృతుడు. అతడే బ్రహ్మ.

మనుష్యాది జాతులన్నీ భూతాలకు మధువు. భూతాలన్నీ మనుష్యాది జాతులకు మధువు. భూతాలు ఉన్న తేజోమయుడైన పురుషుడే శరీరానికి సంబంధించిన తేజోమయుడైన పురుషుడు. అతడే ఆత్మ. అతడే బ్రహ్మ.

విజ్ఞానమయుడైన ఆత్మయే సమస్త భూతాలకు అధిపతి. సమస్త భూతాలకు రాజు. సమస్త దేవతలు, సమస్త లోకాలు, సమస్త ప్రాణులు, అన్నీ పరమాత్మలో ఇమిడి ఉన్నాయి. ఆ ఆత్మయే పరబ్రహ్మ.

ఇదే మధువిజ్ఞానము. పూర్వకాలంలో దీనిని దధ్య మహర్షి తన శిష్యులయిన అశ్వనీ దేవతలకు వివరించాడు.'' అని యాజ్ఞవల్క్యుడు తన భార్య మైత్రేయికి బ్రహ్మతత్త్వాన్ని వివరించాడు. కాబట్టి మధువు అంటే పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడే తప్ప వేరు కాదు.

## 169. అతీంద్రియః

ఇంద్రియాలను అతిక్రమించువాడు.

**జ్ఞానోపకరణవ్రాత మతిక్రాన్తో హ్యతీన్ద్రియః** ఇంద్రియాలకు కనుపించనివాడు

**ఇంద్రియాణి అతిక్రాంతః అతీంద్రియః** ఇంద్రియాలను అతిక్రమించినవాడు.

ఇంద్రియముల అనుభవమునకు అందనివాడు. **కేనోపనిషత్తు**లో ఆత్మచైతన్యాన్ని గురించి

ఇంద్రియాలు వేరు ఆత్మవేరు. ఇంద్రియాలే ఆత్మ కాదు. చెవికి శబ్దగ్రహణ శక్తిని, మనస్సుకు ఆలోచనాశక్తిని, వాక్కుకు సంభాషణాశక్తిని, కంటికి దృశ్యశక్తిని ప్రసాదించే చైతన్యమూర్తి 'ఆత్మ'. కాబట్టి ఇంద్రియాలే ఆత్మ అనే భ్రాంతిని వీడి వాటికి వసుడు కానివాడు అమరుడౌతాడు.

ఇంద్రియాలను ప్రేరేపించేది ఆత్మ. కాబట్టి వాటికి ఆత్మతత్త్వము ఏమిటో తెలియదు. ఆత్మయొక్క శక్తిచేతనే కన్ను చూస్తోంది. చెవి వింటోంది. నోరు మాట్లాడుతోంది. మనస్సు ఆలోచిస్తోంది. ప్రాణం పనిచేస్తోంది. కాబట్టి వాటికి ఆత్మను గురించి తెలియదు. అటువంటి ఆత్మను ఇంద్రియాల నుండి వేరుచేసి, ఇంద్రియాలకు లోబడకుండా జీవించేవాడు మృత్యువుని జయిస్తాడు. ఇంద్రియాలన్నీ జడాలు. వాటికి చైతన్యం లేదు. కాని చైతన్యం ఉన్నట్టు కనిపిస్తాయి. ఆత్మశక్తి వాటి వెనుక ఉండి నడిపిస్తున్నది. అజ్ఞాని ఇంద్రియాలు చేతనాలు అనుకుంటాడు. జ్ఞాని ఆత్మస్వరూపం తెలుసుకుంటాడు. ఆత్మను గుర్తించటం ఎలా ? అంటే ...

ఆత్మ ఎక్కడైతే ఉన్నదో అక్కడికి కన్నుగాని, మాటలుగాని పోలేవు. అందుచేత ఇంద్రియాలతో ఆత్మను గుర్తించటం వీలుకాదు. ఇంద్రియాలను ప్రేరేపించేదే ఆత్మ కాబట్టి ఇంద్రియాలు తమను నడిపించే ఆత్మను చేరలేవు. ఆత్మ ఇంద్రియాలకే కనిపించనప్పుడు, వాటిద్వారా ఆత్మను మనమెలా చూడగలం ? ఆత్మ అనేది మనకు తెలిసిన దానికన్న భిన్నమైనది. తెలియని దానికన్న అతీతమైనది. అంటే అవ్యక్తమైనది. దాన్ని అనుభవం ద్వారా మాత్రమే తెలుసుకోవాలి. ఇది ప్రమాణాలకు, తర్కానికి అందదు. అందుచేత గురువుద్వారా మాత్రమే ఆత్మను గురించి తెలుసుకోవాలి.

మాటలు, దేనిని ప్రకటించలేవో, దేనివల్ల మాటలు ప్రకాశితమౌతున్నాయో అదియే బ్రహ్మము, ఆత్మ. సామాన్యజనులుపాసించే దేవతాప్రతిమలు బ్రహ్మము కాదు. వాటి రూపంలో ప్రకాశించే మూలతత్త్వమే బ్రహ్మ. కనులు ఆత్మను చూడలేవు. కాని కనులకు చూసేశక్తిని ప్రసాదిస్తున్నదే ఆత్మ. మానవుడు చెవులద్వారా దేనిని వినలేడో, ఏది చెవులకు వినికిడి జ్ఞానం ప్రసాదిస్తున్నదో అది ఆత్మ. ముక్కు ఆత్మను వాసన చూడలేదు. కానీ ముక్కుకు వాసన చూసే శక్తిని ప్రసాదించేది ఆత్మ. ఈ రకంగా ఇంద్రియాలన్నీ పనిచేసే శక్తిని ఆత్మద్వారానేపొందుతాయి. ఇంద్రియాల కార్యకలాపాలకు సాక్షి. నియంత కూడా ఆత్మే. ఈరకంగా ఇంద్రియాలకు శక్తిని ప్రసాదించే బ్రహ్మమును గురించి ఇంద్రియాలు తెలుసుకోలేవు.

"నాయనా! 'పరబ్రహ్మ స్వరూపమును నేను తెలుసుకున్నాను' అని ఎవరైనా అంటే అది వట్టి అబద్ధము. అతని జ్ఞానము అత్యల్పమైనది. మానవులేకాదు, ఈ మాట దేవతలు చెప్పినా అబద్ధమే. నేను బ్రహ్మమును బాగా తెలుసుకున్నాను అని అన్నవాడికి తెలిసింది చాలా తక్కువ. అతడు తెలుసుకోవలసినది చాలా ఉన్నది." అన్నాడు.

గురువుగారి మాటలకు శిష్యుడు ఆలోచించి బ్రహ్మను సాక్షాత్కరింపచేసుకుని "గురువర్యా నేను బ్రహ్మము గూర్చి తెలుసుకున్నాను" అన్నాడు. దానికి గురువుగారు.

నాయనా ! నీవు తెలుసుకున్నది చాలా తక్కువ బ్రహ్మజ్ఞానం పొందినవాడు బ్రహ్మమే సర్వస్వము అంటాడు. బ్రహ్మము గురించి ఎవరికి తెలియదో అతనికి తెలుసు. ఎవరికి తెలుసో అతనికి తెలియదు. ఎందుచేతనంటే పండితులకు బ్రహ్మము తెలియదు. జ్ఞానులకు తెలుసు. బ్రహ్మము మానసిక భావాలకతీతమైనది. ఎవరైతే బ్రహ్మసాక్షాత్కారం పొందుతారో వారుమాత్రమే దాన్ని గురించి గ్రహిస్తారు. మానసిక వికారంద్వారా ఆత్మస్ఫూర్తిని గోచరింప చేసుకునేవాడు అమరత్వం పొందుతాడు. అమరత్వం పొందటమంటే ఆత్మయొక్క స్వభావాన్ని పొందటం. అ జ్ఞానమనేది సంసారబంధనానికి కారణం మనోవికారాలన్నిటి లోనూ ఆత్మ కలిసి ఉంటుంది. ఆ వికారాలకు స్ఫూర్తినిచ్చేది ఆత్మ. ఆత్మసాక్షాత్కారం పొందినవాడు ప్రతివికారంలోనూ ఆత్మను చూడగలుగుతాడు.

జ్ఞానంవల్ల భేదదృష్టి పోయికష్టసుఖాలు, లాభనష్టాలు అన్నీ ఒకటే అవుతాయి. దీపం వల్ల చీకటి తొలగిపోయినట్లుగా జ్ఞానంవల్ల అజ్ఞానం నశిస్తుంది. అజ్ఞానం నశించిన వాడికి ఆత్మసాక్షాత్కారమవుతుంది. అదే జీవన్ముక్తి."

ఈరకంగా ఇంద్రియాలకు అందనివాడు కాబట్టే శ్రీమన్నారాయణుడు 'అతీంద్రియుడు' అనబడుతున్నాడు.

## 170. మహామాయః

గొప్ప మాయకలవాడు.

**మాయా యస్యా ప్రవన్నానాం సర్వేషా మస్తి మోహినీ ।**
**మహామాయ స్సవిజ్ఞేయః వస్స్వర్ణో మనురుజ్వలః ॥**

తనను శరణు పొందనివారిని మాయలో పడవేసేవాడు.

**మహతీమాయా యస్యసః మహామాయః** గొప్పదయిన మాయకలవాడు.

**భగవద్గీత**లోని ఏడవ అధ్యాయము **'జ్ఞానవిజ్ఞాన యోగము'**లోని 14వ శ్లోకంలో

**దేవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా ।**
**మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే ॥**

"అర్జునా ! నా మాయ త్రిగుణాత్మకమైనది. అలౌకికమైనది. దీనిని అధిగమించటము సాధ్యము కాదు. నిరంతరము నన్నే భజించేవారు ఈ మాయను అధిగమించి సంసార సాగరము నుండి బయటపడగలరు." అంటారు భగవానుడు. శంకర భగవత్పాదుల వారు తమ **భజగోవింద శ్లోకాలలో**

**మాకురు ధనజన యవ్వనగర్వం హరతి నిమేషా త్కాలస్సర్వమ్ ।**
**మాయామయమిద మఖిలం హిత్వా బ్రహ్మపదం త్వం ప్రవిశవిదిత్వా ॥**

ధనము పరివారము, యవ్వనము ఉన్నాయని గర్వించవద్దు. కాలము క్షణంలో వీటన్నింటినీ హరించి వేస్తుంది. ఇదంతా మాయ, మిధ్య, అశాశ్వతము అని గ్రహించి జ్ఞానివై పరబ్రహ్మ పదము పొందుము అంటారు.

మాయ నీటిగుంటలో తేలియాడే నాచువంటిది. ఈ నాచును దూరంగా తోసివేస్తే వెళ్ళిపోతుంది. కాని మళ్ళీ వచ్చి చేరుతుంది. అలాగే వేదాంతవిచారము, సజ్జన సాంగత్యము చేసినంత కాలము ఈ మాయ వదలివేసనట్లు కనిపిస్తుంది. కాని తరువాత వెంటనే వచ్చి చేరుతుంది. అంటే, విషయ వాంఛలయందు మనసు ఎప్పుడు లగ్నమవుతుందో, అప్పుడు మాయ ఆవరిస్తుంది. ఈ మాయ పరమేశ్వరుణ్ణి ఆవరించి ఉంటుంది. మాయవల్ల ఆయనకు ఏరకమైన అపాయము ఉండదు.

జగత్తులో ప్రతిప్రాణీ మాయకు లోబడే ఉంటుంది. పరమేశ్వరుడు ఒక్కడే మాయకు అతీతుడు. పాముకోరల యందు విషం ఉండటంవలన పాముకు ఏ అపాయము ఉండదు. ఈ విషము పాముని ఏరకంగానూ బాధించదు. కాని దాని కాటు తగిలిన ఇతర ప్రాణులకు మాత్రం హాని కలుగచేస్తుంది. అలాగే భగవంతుణ్ణి ఆవరించి ఉన్న మాయ అతడికి హాని చేయదు.

మాయచే కప్పబడిన మానవుడు 'తాను మాయా ప్రభావంలో ఉన్నాను' అని తెలుసుకున్నట్లైతే మరుక్షణమే మాయ అతన్ని విడిచిపోతుంది. జీవాత్మ పరమాత్మల మధ్య మాయ అనే తెర ఉన్నది. అది పరమాత్మ దర్శనం కానీదు. ఆ తెరను గనక తొలగించగలిగినట్లైతే పరమాత్మ దర్శనం కలుగుతుంది.

మాయ రెండు విధాలుగా ఉంటుంది. 1. విద్యామాయ 2. అవిద్యామాయ

విద్యామాయ భగవంతుడి సన్నిధికి తీసుకుపోతుంది. ఇది వివేకము, వైరాగ్యము అని రెండు రకాలు. దీనిని ఆశ్రయించిన జీవులు భగవంతుని శరణు పొందుతారు.

2. అవిద్యామాయ ఇదే అజ్ఞానము. ఇది కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములు అని ఆరు రకాలు. దీనివల్లనే మానవుడికి నేను, నాది అనే అహంకార మమకారాలు పుడతాయి. దీని కారణంగానే మానవుడు సంసారానికి బందీ అవుతాడు.

విద్యామాయ వ్యక్తం కాగానే అవిద్యామాయ తొలగిపోతుంది. మురికిగా ఉన్న నీటిలో సూర్యచంద్రుల ప్రతిబింబము కనిపించదు. అలాగే మాయ అనే తెర తొలగనంతవరకు అంటే – నేను నాది అనే అహంకార మమకారాలు నశించనంత వరకు పరమాత్మ సాక్షాత్కారము కలగదు.

పరమేశ్వరుడు అనే సూర్యుడు ఈ జగత్తును ప్రకాశింపచేస్తున్నాడు. కాని చిన్న మబ్బు తునక గనక అడ్డు వచ్చినట్లైతే, సూర్యుడు కంటికి కనుపించడు. అలాగే మాయ అనే తెర మనం పరమేశ్వరుని చూడకుండా అడ్డు పడుతుంది.

చెరువులో నాచుపేరుకొని ఉంది. దాన్ని చెదరగొట్టినా మళ్ళీ వచ్చి యథాస్థితికి చేరుతుంది. కాని ఆ నాచుకు ఏదైనా ఒకకఱ్ఱ అడ్డు వేసినట్లైతే, అది తిరిగిరాదు. అలాగే జ్ఞానము అనే కఱ్ఱతో మాయను నిరోధించినట్లైతే పరమాత్మ దర్శనము కలుగుతంది.

నిర్మలమైన ఆకాశంలో సూర్యుడు ప్రకాశిస్తున్నాడు. అలాంటప్పుడు ఒక్కసారిగా ఆకాశం మేఘావృతమైతే సూర్యుడు కనిపించడు. ఆ సమయంలో జ్ఞానజ్యోతులు అనే పెనుగాలులు వీచినట్లైతే అజ్ఞానపు చీకట్లు తొలగిపోయి పరమేశ్వర సాక్షాత్కార మవుతుంది.

ఒకప్పుడు నారదుడు సత్యలోకం నుంచి బయలుదేరి విష్ణుదర్శనం చేసుకోవాలనే సంకల్పంతో వైకుంఠం చేరాడు. అక్కడ పీతాంబరాలు, శంఖుచక్రగదా పద్మాలు ధరించి, రకరకాల ఆభరణాలతో ఆదిశేషుని మీద శ్రీమహావిష్ణువు శయనించి ఉన్నాడు. శ్రీదేవి అతడి పాదాలు వత్తుతున్నది. నీలమేఘశ్యాముణ్ణి సమీపించాడు నారదుడు. నారదుణ్ణి చూడగానే చప్పున లేచి లోపలికి వెళ్ళిపోయింది లక్ష్మీదేవి.

నారదుడు సన్యాసి అందులోనూ మహర్షి మాయను జయించినవాడని ప్రతీతి. మరి అతణ్ణి చూసి లక్ష్మీలోపలికి వెళ్ళిపోయిందెందుకని ? అదే మాటను విష్ణుమూర్తిని అడిగాడు నారదుడు. దానికి శ్రీ మహావిష్ణువు "నారదా పతివ్రత అయిన ఇల్లాలు పరునిముందు ఉండదు. అది గృహిణి ధర్మం. ప్రపంచంలో ఎంతటి వివేకవంతులైనా మాయకు లోబడి ఉండేవారే. సామాన్య మానవులైనా, మునులైనా, ఋషులైనా, దేవతలైనా చివరకు హరిహరబ్రహ్మాదులైనా సరే మాయకు లోబడి ఉండవలసినదే. ఆ పరమేశ్వరి యొక్క ప్రతిరూపం మాయ. ఆవిడకు ఈజగత్తు సర్వమూ అధీనమయి ఉంటుంది.

పండితులూ, పామరులూ, యోగులూ అందరూ దానికి బద్ధులే. మాయ ఈరకంగా ఉంటుందని చెప్పలేము. అన్ని రూపాలు దానివే” అన్నాడు. ఆ మాటలు విన్న నారదుడు సంసారబంధంలో చిక్కిన నీబోటివారికి తప్పదు. కానీ సన్యాసిని పైగా మహర్షిని అయిన నాకుకూడా మాయతప్పదా ? అన్నాడు.

విష్ణుమూర్తి చిన్నగానవ్వి కొంచెసేపాగి ‘నిజమే నారదా ! నీబోటి సన్యాసిని మాయ ఏంచెయ్యలేదు. నీవు మాయకు అతీతుడవు కదా ! అన్నాడు. నారదుడు నిజమే అన్నట్టుగా నవ్వేశాడు. అంతలో గరుడ వాహనం వచ్చింది విష్ణుమూర్తి దానిమీదకెక్కిరా నారదా ! అన్నాడు. ఇద్దరూ ఎక్కిన తరువాత గాలిలోకి లేచాడు గరుడుడు.

అడవులు, కొండలు, నదులు దాటుకుంటూ చాలాదూరం వెళ్ళి ఒకవనంలో ఆగింది గరుడ వాహనం. దానిమీదనుంచి ఇద్దరూ దిగాక విష్ణువు అన్నాడు. “చూడు నారదా ! ఈ పట్టణం ఎంత అందంగా ఉన్నదో ! మనం ఇంతవరకూ ఎప్పుడూ చూడలేదు. అంతరమణీయంగా ఉంది. ఈ వనం కూడా చాలా చక్కగా ఉన్నది. చల్లని గాలి వీస్తోంది. గలగలాపారే ఈసెలయేరు. నారదా ముందుగా ఈ సెలయేట్లో స్నానం చేసి, సేద తీర్చుకుని, ఇక్కడి ఫలాలు ఆరగించి ఆ తరువాత ఆ పట్టణంలోకి వెడదాం. ముందుగా నువ్వు స్నానం చేసిరా ఆ తరువాత నేను చేస్తాను” అన్నాడు.

ఆ మాటలు విన్న నారదుడు ఆ పరిసరాల అందచందాలకు ముగ్దుడౌతూ సరే అని తన వీణ, లేడిచర్మము, రుద్రాక్షలు ఒకచెట్టుక్రింద పెట్టి ఆచారప్రకారం కాళ్ళు చేతులూ కడుక్కుని ఆచమనం చేసి నీటిలోకి దిగి ఒక మునుగు మునిగాడు. పైకి లేచేసరికి ఏముంది ? ఒక స్త్రీ అయిపోయాడు. ఒక్కసారి ఒళ్ళంతా చూసుకున్నాడు. నిజమే తాను స్త్రీయే. ఒడ్డున చెట్టు కింద తన కృష్ణాజినము. రుద్రాక్షలు, వీణ లేవు విష్ణుమూర్తి గరుడ వాహనం కూడా లేవు. అంతా వింతగా ఉంది. ఇప్పుడేం చెయ్యాలి? కాలం గడుస్తున్న కొద్దీ తాను నారదుణ్ణనే విషయం గుర్తుండటం లేదు. సెలయేట్లోంచి బయటకు వచ్చాడు ఒకచెట్టు క్రింద కూర్చున్నాడు పాతజ్ఞాపకాలు పూర్తిగా పోయినాయి. ఇప్పుడు తానొక స్త్రీ అందమైన అతివ. అంతే ఏమీ తెలియటం లేదు.

తాళధ్వజుడనే మహారాజు సపరివారంగా అటువైపు వెడుతూ చెట్టుక్రింద ఒంటరిగా కూర్చున్న స్త్రీని చూసి, ఆమె అపురూప సౌందర్యానికి ముగ్ధుడై, ఆమెను సమీపించి “లలనా ! ఎవ్వరు నువ్వు ? నా కోసం దేవలోకం నుంచి దిగివచ్చిన దేవకన్యవా ? గంధర్వకాంతవా ? లేక అప్సరాంగనవా ? నన్ను వివాహమాడు. సుఖించు. జీవితాంతం

నీ అడుగులకు మడుగులొత్తుతాను. నన్ను కటాక్షించు" అన్నాడు దానికి ఆ స్త్రీ మీకెలా మంచిదనిపిస్తే అలా చేయండి అన్నది.

అన్నదే తడవుగా తాళధ్వజుడు ఆ స్త్రీని తన నగరానికి తీసుకుపోయి వివాహమాడాడు. వారి జీవితం సుఖశాంతులతో, ఆనందంగా గడచిపోతోంది. వారికి పదిమంది కుమారులు కలిగారు. వాళ్ళకి పెళ్ళి చేశారు. కొడుకులు, కోడళ్ళు, మనమలు అబ్బో ! ఇల్లంతా ఒకటే సందడి.

ఇలా ఉండగా ఒకనాడు దూరదేశపు రాజు ససైన్యంగా వచ్చి తాళధ్వజుడి మీద యుద్ధం ప్రకటించాడు. తాళధ్వజుడు, అతని కుమారులు, అందరూ యుద్ధానికి వెళ్ళారు. పోరు ఘోరంగా సాగింది. ఆ యుద్ధంలో తాళధ్వజుడుని కుమారులు, మనుమలు అందరూ మరణించారు. తాళధ్వజుడు మాత్రం ప్రాణాలరచేత పట్టుకుని పారిపోయాడు.

కొడుకులు, మనుమలు అంతా మరణించారన్న వార్త విని తాళధ్వజుని భార్య గుండెలవిసేలా విలపించింది. ఆ బాధను తట్టుకోలేక నేలమీద పడి పొర్లిపొర్లి ఏడుస్తోంది.

అంతలో ఒక ముసలి బ్రాహ్మణుడు వచ్చి "అమ్మా ! ఎందుకు ఏడుస్తావు.పుట్టిన ప్రతివాడు మరణించక తప్పదు. మరణించిన ప్రతివాడూ మళ్ళీ పుట్టకా తప్పదు. అంతా మాయ. ఎవరి కాలం పూర్తయితే వారు వెళ్ళిపోతారు. నువ్వు ఎక్కడినుంచి వచ్చావో నీకు తెలుసా ? ఎంతమంది ఈ ఇంటికి వచ్చారు ? ఎంతమంది వెళ్ళారు ? చావుపుట్టుకలు దైవాధీనాలు. ఈ జగత్తు అంతా మిధ్య. ఏడవకు. పోయిన వాళ్ళకు కర్మలు చేయించాలి కదా ! వెళ్ళి ఆసెలయేట్లో స్నానం చేసిరా" అన్నాడు.

తాళధ్వజుని భార్యమంత్రం వేసినట్టుగా ఆ బ్రాహ్మణుడి వెంట వెళ్ళి నీటిలో మునిగి పైకి లేచేటప్పటికి ఏముంది ? ఎదురుగా చెట్టుకింద విష్ణుమూర్తి ప్రక్కన తన కృష్ణాజనం, వీణ, రుద్రాక్షలు, ఇప్పుడు జరిగినదంతా విష్ణుమాయ అనుకున్నాడు నారదుడు. నీళ్ళలోంచి పైకి లేస్తుండగా పిలిచాడు విష్ణువు ఎంతసేపు నారదా ! త్వరగా రా !

బయటకు వచ్చిన నారదుడు కృష్ణాజినం, రుద్రాక్షలు, వీణ తీసుకుంటుండగా తాళధ్వజుడు వచ్చి విష్ణువును చూసి "స్వామీ ! నన్ను కరుణించు, నా భార్య అంటే నాకు ప్రాణం. ఆమెకు నేనన్నా అంతే. మేం ఒకరినొకరు విడిచి బ్రతకలేము. నాభార్యని మునీశ్వరుడుగా చేసి తీసుకెళ్ళిపోవటం నీకు ధర్మమా ! రక్షించు ప్రభూ ! కటాక్షించు నా భార్యను నాకు ఇచ్చెయ్యి" అన్నాడు.

అప్పుడు విష్ణువు నారదుడి వైపు తిరిగి ఇతడెవరు నారదా ! నిన్ను పట్టుకుని తన భార్య అంటాడు. అనేసరికి నారదుడు “తాతా క్షమించు, నేను సన్యాసినని మాయను జయించాననీ అహంకరించాను. మాయ పరమేశ్వర స్వరూపము. మాయకు అందరూ అధీనులే” అన్నాడు.

మాయకు ఎవరూ అతీతులు కారు. జ్ఞానజ్యోతులతోనే మాయను ఛేదించాలి.

ఈరకంగా పరమేశ్వరుడే మాయ కాబట్టే శ్రీమన్నారాయణుడు ‘మహామాయ’ అనబడుతున్నాడు.

**లలితా సహస్రం**లో 215వ నామము **మహామాయా.**

ఈ విధంగా విష్ణుమూర్తి యొక్క వామనావతార ఘట్టాన్ని ఇక్కడ వివరించటం జరిగింది. అంటూ పూర్తిచేశాడు రత్నాకరుడు.

# 18. షాడ్గుణ్య పరిపూరితుడు

'గురువుగారూ ! పరమేశ్వరుడు 'షాడ్గుణ్య పరిపూరితుడు' అంటారు కదా ! అది ఏవిధంగానో వివరించండి' అన్నాడు కృష్ణశర్మ. వివరించటం ప్రారంభించాడు రత్నాకరుడు.

నిరాకారుడు, నిర్గుణస్వరూపుడు పరబ్రహ్మ అంటే అతడికి రూపం లేదు. గుణం లేదు. అన్ని రూపాలు అతడివే. అన్ని గుణాలు అతనియందే ఉన్నాయి. అన్ని లక్షణాలు అతనియందే ఉన్నాయి. అతడు సర్వజ్ఞుడు. అన్ని విషయాలు, అన్ని శాస్త్రాలు, వేద వేదాంగాలు తెలిసినవాడు. భూతభవిష్యద్వర్తమానాలు తెలిసినవాడు. అతడికి ఏ కోరికలు ఉండవు. మానవుల కోరికలన్నీ అతడే తీరుస్తాడు. ఆది అనాది అతడే పరమేశ్వరుడు సర్వస్వతంత్రుడు. దేనికీ ఎవరిమీద ఆధారపడడు. అన్నింటికీ, అందరూ అతనిమీదే ఆధారపడతారు. అతడు సత్యము, నిత్యము అయినవాడు. శాశ్వతుడు. అనంతమైనవాడు గతంలో ఉన్నాడు ఇప్పుడు ఉన్నాడు, ఇకముందు కాలంలోకూడా ఉంటాడు.

పరమేశ్వరునికి ముఖ్యమైన గుణాలు ఆరు ఉన్నాయి. అవే షడ్గుణాలు.

**ఐశ్వర్యస్య చ సర్వస్య వీర్యస్య యశసః శ్రియః ।**
**జ్ఞానవైరాగ్య యోశ్చైవ షణ్ణాం భగఇతీరిణా ॥**

| | | |
|---|---|---|
| 1. ఐశ్వర్యము | 3. యశము | 5. జ్ఞానము |
| 2. వీర్యము | 4. శ్రీ | 6. వైరాగ్యము |

అనేటటువంటి పురాణాలలో చెప్పబడిన గుణాలతో పరిపూర్ణమైనటువంటివాడు కాబట్టి పరమేశ్వరుడు 'షాడ్గుణ్య పరిపూరితుడు' అనబడతాడు. అయితే వీటిని ఇంకొక రకంగా కూడా చెప్పారు.

### 1. షడ్విధ ఐశ్వర్య గుణములు

1. ఉత్పత్తి, 2. లయము 3. ప్రాణులరాకడ, 4. ప్రాణుల పోకడ 5. విద్య, 6. అవిద్య. అంతేకాకుండా విద్యార్థి కల్పతరువులో

| | | |
|---|---|---|
| 1. జ్ఞానము | 3. ధనము | 5. వీర్యము |
| 2. శక్తి | 4. బలము | 6. ఓజస్సు |

వీటిని షడ్గుణాలు అన్నారు.

పరమేశ్వరుడు జగత్తును సృష్టించటము అనే గొప్పదైన ఐశ్వర్యముగలవాడు. ఇతరుల సహాయ సహకారములు లేకుండానే సృష్టిచేసే బలముగలవాడు. ఏవిధమైన సంశయము లేనటువంటి మహత్తరమైన జ్ఞానమే స్వరూపముగా గలవాడు. ఏ వికారాలు పొందనివాడు. ఉపాదాన, నిమిత్త, సహకారి అనే మూడు కారణాలు తానే అయిన గొప్పశక్తి కలవాడు. స్వయముగా ప్రకాశించేవాడు. షడ్గుణాలచేత సాటి లేనటువంటి తేజోమయమైన దివ్య మంగళ విగ్రహము గలవాడు. దివ్యాభరణ భూషితుడు. గంభీరమైన స్వభావము గలవాడు. క్షీరసాగర మథన సమయమందు మందర గిరిని మోసినవాడు. ప్రచండమైన కోదండము గలవాడు. భూభారాన్ని మోసేవాడు. అతడే శ్రీనివాసుడు. తనను శరణుకోరిన వారికి ప్రియమును కలుగచేసేవాడు. తనభక్తులను రక్షించటానికి అనేకమైన పనులు చేసేవాడు.

ఈ రకంగా షాడ్గుణ్య పరిపూరితుడైన పరమేశ్వరుణ్ణి గురించి 171 నుంచి 185 వరకు నామాలలో వివరించబడింది. ఇక నామాలను చూద్దాం.

## 171. మహోత్సాహః

గొప్ప ఉత్సాహము గలవాడు.

**మహదుత్సహనం యస్య హ్యైశ్వర్యం కర్తృలక్షణమ్ ।**
**మహోత్సాహస్సవిజ్ఞేయో మనురైశ్వర్య దాయకః ॥**

సకల జగత్తును సృష్టించటము అనే గొప్పదైన ఐశ్వర్యము గలవాడు.

**మహాన్ ఉత్సాహః యస్యసః**

గొప్ప ఉత్సాహము గలవాడు. ఉత్సాహము అంటే – కర్తృత్వము అనే ఐశ్వర్యము. దీనిని గొప్పగా గలవాడు. కాబట్టి శ్రీమన్నారాయణుడు 'మహోత్సాహః' అనబడుతున్నాడు.

ఈ నామములో సాంఖ్యులవాదాన్ని ఖండిస్తున్నాడు. సాంఖ్యుల వాదము ప్రకారము పరమేశ్వరుడు ఈ సృష్టికి కర్తకాదు. సాంఖ్య దర్శనాన్ని 529 నుంచి 586 వరకు గల నామాలలోని 'కపిలావతారము' నందు వివరించటం జరిగింది.

అయితే ఇతరుల ప్రేరణ అనేది లేకుండా సంకల్ప మాత్రంచేతనే ఈ జగత్తును సృష్టించాడు పరమేశ్వరుడు. అయితే ఈ సంకల్పము తన ఇష్టానుసారము కాదు. అంటే – జీవులకు తనకు నచ్చిన ఫలితాలనివ్వడు. ఎవరి కర్మానుసారము వారికి ఫలితములను ఇస్తాడు.

జగత్తుయొక్క సృష్టి, స్థితిలయములయందు మంచి ఉత్సాహము చూపేవాడు.

**మహోపనిషత్తు**లో ఈ సృష్టికి ముందు నారాయణశాఖ పరబ్రహ్మతత్త్వము ఒకటే ఉండేది. అప్పుడు బ్రహ్మ, రుద్రుడు, పంచభూతాలు, తన్మాత్రలు, నక్షత్రాలు, సూర్యచంద్రులు ఏవీలేవు. అప్పుడు శ్రీమన్నారాయణుడు 'స్తోమము' అనే యజ్ఞంచేసి ఈ సృష్టిని ప్రారంభించాడు. అప్పుడు ఆ పరమపురుషుని నుంచి 14 మంది పురుషులు, ఒక కన్య, దశేంద్రియాలు, మనస్సు, అహంకారము, ప్రాణము, బుద్ధి, తన్మాత్రలు ఈ రకంగా 25 తత్త్వములు పుట్టినాయి. ఈ తత్త్వములతో విరాట్పురుషుడు జన్మించాడు. తరువాత విరాట్పురుషుని నుండి సంవత్సరముల రూపంలో కాలము పుట్టింది.

శ్రీమన్నారాయణుడు ఒక సంకల్పము చేశాడు. అప్పుడు నారాయణుని లలాటము నుంచి త్రిశూలపాణి జన్మించాడు. అతనియందు యశస్సు, సత్యము, బ్రహ్మచర్యము, తపస్సు, వైరాగ్యము, వేదములు, ఛందస్సులు అన్నీ ప్రకాశిస్తున్నాయి. అతడే ఈశానుడు మహాదేవుడు. తరువాత శ్రీమన్నారాయణుడు మళ్ళీ సంకల్పం చేశాడు. అప్పుడు ధ్యానములో ఉన్న నారాయణుని లలాటము నుంచి స్వేదము పుట్టింది. అదే జలముగా మారింది. ఆ నీటినుంచి బంగారురంగులోఉన్న ఒక గ్రుడ్డు పుట్టింది. ఆ అండము నుంచి చతుర్ముఖబ్రహ్మ ఉదయించాడు.

ఆ బ్రహ్మ విడివిడిగా నాలుగుదిక్కులకు తిరిగి ధ్యానం చేశాడు. అప్పుడు అన్ని వేదాలు, ఛందస్సులు పుట్టినాయి. బ్రహ్మ మళ్ళీ ధ్యానంచేసి క్షీరసాగరము మధ్యలో ఒక దేవుణ్ణి దర్శించాడు. అతడు సహస్రశీర్షుడు, సహస్రపాదుడు, సహస్రనేత్రుడు, సహస్ర బాహువు. అతడు నిత్యము, సర్వస్వరూపము విశ్వకల్యాణకారకము, విశ్వాతీతము అయి విరాజిల్లుతున్నాడు. అతడే శ్రీహరి. శ్రీమన్నారాయణుడు. ఈ జగత్తుకంతటికీ అతడే జీవనాధారము" అని చెప్పబడింది.

ఈ రకంగా సృష్టికార్యములో ఎక్కువ ఐశ్వర్యము గలవాడు కాబట్టి శ్రీమహావిష్ణువు 'మహోత్సాహః' అనబడుతున్నాడు.

## 172. మహాబలః

గొప్ప బలము కలవాడు.

**కర్త్రన్తరాన పేక్షో యః సృష్టేస్స స్యాన్మహా బలః ॥**

ఇతరుల సహాయసహకారాలు లేకుండానే సృష్టి చేసే బలము గలవాడు.

**మహత్ బలం యస్యసః మహాబలః**

గొప్ప బలము గలవాడు. జగస్సృష్టిలో మహాబలము గలవాడు. కేవలము సంకల్పముచేతనే అనితరసాధ్యమైన పనులు చేయగలవాడు.

పరమేశ్వరుడు అందరికన్న బలవంతుడు. జగత్తులోని అందరికీ శక్తినిచ్చినది అతడే. అతడిచ్చిన బలముతోనే రాజులు రాజ్యాలు ఏలుతున్నారు.

అర్జునుడు మహావీరుడు. అతడికి సాటి అతడే గాని ఇంకొకరు లేరు. పాశుపతాస్త్రము కోసము అతడు తపస్సు చేసినప్పుడు సాక్షాత్తూ పరమేశ్వరుడే అర్జునుని చేతిలో ఓడిపోయాడు. సైంధవుడు శివుని గురించి తపస్సు చేశాడు. శివుడు ప్రత్యక్షమై ఏ వరం కావాలి ? అని అడిగాడు. అప్పుడు సైంధవుడు. 'నేను ఒక రోజున పాండవులనందరినీ యుద్ధంలో గెలవాలి' అని అడిగాడు. దానికి శివుడు 'అర్జునుని తప్ప మిగిలిన వారందరినీ గెలుస్తావు. ఎందుకంటే అర్జునుని గెలవటం నాకే సాధ్యం కాదు' అని చెప్తాడు. అంతటి మహావీరుడు అర్జునుడు. అతడికి ఆ బలాన్ని, శక్తిని ఇచ్చింది కూడా పరమేశ్వరుడే.

కురుక్షేత్ర సంగ్రామము అయిపోయింది. పాండవులు రాజ్యం చేస్తున్నారు. శ్రీకృష్ణుడు అవతారం చాలించాడు. ఆ మాట విని కృష్ణుని యొక్క భార్యలందరినీ సురక్షితంగా తెమ్మని అర్జునుణ్ణి పంపిస్తాడు ధర్మరాజు. కృష్ణుని అష్టభార్యలను తీసుకుని వస్తుంటాడు అర్జునుడు. దారిలో దొంగలు వీరి నగలు మొత్తం దోచేస్తారు. అచేతనుడై చూస్తుంటాడు అర్జునుడు. దొంగలను ఎదిరించటానికి అతని శక్తి చాలదు. శ్రీకృష్ణ పరమాత్ముడు అర్జునునికి తాను ఇచ్చిన శక్తిని తనతో పాటు తీసుకు వెళ్ళిపోయాడు.

ఈ రకంగా జగత్తులోని అందరికీ, అన్నింటికీ శక్తిని, బలాన్ని ఇచ్చేది పరమేశ్వరుడే. సృష్టి కార్యక్రమము ఇతరుల సహాయము లేకుండా సంకల్ప మాత్రం చేతనే చేస్తాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు 'మహాబలః' అనబడుతున్నాడు.

**లలితా సహస్రంలో** 222వ నామము **మహాబలా.**

## 173. మహా బుద్ధిః

గొప్ప జ్ఞానము గలవాడు.

**మహాబుద్ధి ర్మహ ద్జ్ఞానం స్వరూపం యస్యచోచ్యతే ॥** ఏ మాత్రము సంశయము లేనటువంటి మహత్తరమైన జ్ఞానమే స్వరూపముగ గలవాడు.

**మహతీబుద్ధిః యస్యసః మహాబుద్ధిః** గొప్పజ్ఞానము గలవాడు మహాబుద్ధి అనబడుతున్నాడు. ఏ రకమైన సంశయాలు, భ్రమలు లేనటువంటి జ్ఞానము గలవాడు.

ఈ జ్ఞానము అన్ని దేశాలయందు, అన్ని కాలాలయందు అన్ని స్వభావము లందు, అన్నింటియందు ఉండే వాటిని గ్రహిస్తుంది. ఇక్కడ జ్ఞానము అంటే పరమేశ్వర స్వరూపమే కాని అంతకన్న వేరు కాదు. పరమేశ్వరుడు లోకంలో ఎక్కడ ఏ మూల ఏం జరిగినా మరుక్షణంలోనే తెలుసుకుంటాడు. పరమేశ్వరుడికి సూర్యుడు, చంద్రుడు, పంచభూతాలు, కాలము, యముడు అనే తొమ్మిది మంది వేగులున్నారు. వీరు అన్ని విషయాలను ఆయనకు వెంటనే నివేదిస్తారు. అందుచేతనే చెవులు లేకుండానే పరమేశ్వరుడు అన్నీ వినగలడు. కళ్ళు లేకుండానే చూడగలడు. ఈ రకంగా జగత్తులో జరిగే అన్ని విషయాలను తెలుసు కుంటాడు కాబట్టే పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు 'మహాబుద్ధిః' అనబడుతున్నాడు.

**లలితా సహస్రంలో** 223వ నామము **మహాబుద్ధిః**

## 174. మహావీర్యః

గొప్ప వీర్యము గలవాడు.

**హేతౌ సతి వికారిత్వే ష్యవికారిత్వ లక్షణమ్ ।**
**మహద్ధివీర్యం యస్యేతి మహావీర్య స్స చ స్మృతః ॥**

వికారాలకు కారణమున్నప్పటికీ, వికారము పొందకుండ ఉండటము వీర్యము అనబడుతుంది. అటువంటి గొప్పవీర్యము గలవాడు.

**మహత్ వీర్యం యస్యసః** గొప్ప వీర్యము గలవాడు. వీర్యము అంటే – వికారములు పొందటానికి తగిన కారణము ఉండి కూడా వికారము పొందకుండా ఉండటము.

పాలు కాచి తోడు వేస్తే పెరుగుగా మారుతుంది. పెరుగునకు మూలకారణము పాలు. పాలు వికారము పొందితేనే పెరుగు అవుతుంది. జగత్తుకు కారణమైన సర్వేశ్వరుడు పాలమాదిరిగా ఏ రకమైనవిరకారము పొందడు. అందుచేతనే అతడు 'మహావీర్యః' అనబడతాడు.

పరమేశ్వరుడు ఎల్లవేళల యందు ఒకే స్థితిలో ఉంటాడు. సృష్టిలో చిన్నగా ఉన్న పిల్లవాడు పెద్దవాడవుతాడు. పెద్దవాడు ముసలివాడవుతాడు. ముసలివాడు మరణిస్తాడు. ఈ రకంగా జీవియొక్క రూపం మారుతుంది. దీన్నే వికారము పొందటము అంటాం. అంటే – తనకున్న ఆకారం కోల్పోయి ఇంకొక రూపం రావటమన్న మాట. గొంగళీపురుగు – సీతాకోకచిలుక అయినట్లుగా ఇది రూపమున్నప్పుడే సాధ్యపడుతుంది. పరమేశ్వరుడికి

అసలు రూపమనేదే లేదు. అలాంటివాడి రూపం మారటం ఎలా వీలవుతుంది ? అందుచేతనే పరమేశ్వరుడు ఏ వికారాలు లేనివాడు 'మహావీరః' అనబడతాడు.

**లలితా సహస్రంలో** 221వ నామము మహావీర్యా

## 175. మహాశక్తిః

గొప్పశక్తి కలవాడు.

**శక్తిశ్చ మహతీ యస్య మహాశక్తి స్సకీర్తితః ॥** నిమిత్త, ఉపాదాన, సహకారి అనే మూడు కారణాలు తానే అయిన గొప్పశక్తి గలవాడు.

**మహతీశక్తిః యస్యసః మహాశక్తిః**

గొప్పదైన శక్తిగలవాడెవడో, వాడు 'మహాశక్తిః' అనబడతాడు.

ప్రతివస్తువు పరిణామము పొందాలి అంటే కొన్ని కారణాలుండాలి. పరిణామము పొందటము అనగా మార్పు చెందటము. పాలు పెరుగుగా మారటము మట్టికుండగా మారటము వంటివి. ఈ కారణాలు ముఖ్యంగా మూడు రకాలు 1. ఉపాదాన కారణము, 2. నిమిత్త కారణము, 3. సహకారి కారణము

ఉపాదాన కారణము అంటే – ముఖ్యమైన కారణము ఇది లేకపోతే అది జరగదు. పాలు లేకపోతే పెరుగు రాదు.

నిమిత్త కారణము అంటే – ఇది అదిగా మారటానికి నిమిత్తమైనది. మట్టికుండగా మారటానికి కారణము కుమ్మరివాడు.

సహకారి కారణము అంటే – ఈ మార్పులో నిమిత్తానికి సహాయకారి. కుమ్మరి కుండలు చెయ్యటానికి సహాయకారి అయిన కర్ర, కుమ్మరిసారె మొదలైనవి. కాబట్టి మట్టికుండగా మారటానికి

| | | |
|---|---|---|
| కుండకు ఉపాదానకారణము | – | మట్టి |
| నిమిత్త కారణము | – | కుమ్మరి |
| సహకార కారణము | – | కర్ర, సారె మొ॥వి. |

ఇదేవిధంగా ప్రతివస్తువుకు, ప్రతివికారానికి ఈ కారణాలుంటాయి. అయితే ఈ జగత్తు ఏర్పడటానికి ఈ మూడు రకాలయిన కారణములు – ఆ పరమాత్మయే. ఇది ఏవిధంగా సాధ్యము అంటే – **ముండకోపనిషత్తు**లో "సాలెపురుగు ఏ సహాయం లేకుండానే

తన నోటి నుంచి దారాలను తయారుచేసి, వాటిని మళ్ళీ తానే మ్రింగేస్తుంది. భూమి నుంచి ఓషధులు పుడుతున్నట్లుగా, మానవదేహంమీద రోమాలు పుడుతున్నట్లుగా అక్షర పరబ్రహ్మనుండి ఈ జగత్తు పుడుతున్నది." అని చెప్పబడింది. ఈ కారణాలచేతనే పరమేశ్వరుడు మహాశక్తివంతుడు అని చెప్పటం జరిగింది.

**లలితాసహస్రం**లో 217వ నామము **మహాశక్తిః**

## 176. మహాద్యుతిః

గొప్ప కాంతి కలవాడు.

**తేజోఽ న పేక్షరూపం స్వం మహద్యస్య మహాద్యుతిః**

ఇతరమైన తేజస్సుల సహాయము లేకుండా స్వయముగా ప్రకాశించేవాడు.

**మహతీ ద్యుతిః యస్యసః** మిక్కిలి తేజస్సుతో కూడినవాడు.

లోపల, బయట కూడా అద్భుతమైన కాంతిగలవాడు. పరమేశ్వరుడు స్వయం ప్రకాశము గలవాడు. అతని కాంతి ఇంత అని వర్ణించలేము. కొన్నివేలకోట్ల సూర్యచంద్రుల కాంతులతో ప్రకాశిస్తుంటాడు. అతని రూపము ఎంత ప్రకాశవంతముగా ఉంటుందంటే

**కోటిసూర్య ప్రతీకాశం చంద్రకోటి సుశీతలమ్** అనేకవేల కోట్ల సూర్యులయొక్క కాంతితో, చంద్రులయొక్క చల్లదనముతో ప్రకాశిస్తున్నది. **భైరవయామళం**లో పరమేశ్వరుడు పరమేశ్వరికి ఆ పరతత్త్వాన్ని గురించి వివరిస్తున్నాడు.

**జ్యోతిరూపా పరాకారా యస్యాదేహోద్భవాశ్శివే ।**
**కిరణాశ్చ సహస్రంచ ద్విసహస్రంచ లక్షకమ్ ।**
**కోటిరర్బుదమేతేషాం పరాసంఖ్యాన విద్యతే ॥**

పరమేశ్వరీ ! జ్యోతిరూపమైనటువంటి ఆ పరతత్త్వము నుండి అనేక వేలు, లక్షలు, కోట్లకొలది కిరణాలు ప్రసరిస్తున్నాయి.

**తేషాం అనంతకోటినాం మయూఖానాం మహేశ్వరీ ।**
**అష్టోత్తరశతంవహ్నే షోడశోత్తరశతం రవేః ।**
**షట్త్రింశ తదుత్త రశతం చంద్రస్య కిరణాశ్శివే ॥**

ఆ కిరణముల నుంచి అగ్నిదేవుడు 108, సూర్యభగవానుడు 116, చంద్రుడు 132 కిరణములను మాత్రము తీసుకోగలిగారు.

**బ్రహ్మాండం భాసయంతస్తే పిండాండమపి శాంకరీ ।**

**దివాసూర్యౌ తథా రాత్రౌ సోమో వహ్నిశ్చ సంధయోః ॥**

**ప్రకాశయంతః కాలాంస్తే తస్మాత్కాలాత్మకస్త్రయః ।**

**షష్ట్యుత్త రంచ త్రిశతం దినాన్యేనచహాయనమ్ ॥**

**హాయనాత్మా మహాదేవః ప్రజాపతి రిత్మిశ్రుతిః ।**

ఆ కిరణములచేతనే పిండాండ బ్రహ్మాండములు ప్రకాశిస్తున్నాయి. పగటి పూట సూర్యుని వెలుగులతోను, రాత్రిపూట చంద్రుని కాంతులతోను, సంధ్యవేళలయందు అగ్ని యొక్క కాంతులతోను జగత్తు ప్రకాశిస్తున్నది. ఇటువంటి 360 రోజులు ఒక సంవత్సరము. అదే కాలపురుషుడు. ఆ కాలపురుషుడే ప్రజాపతి అని యామళగ్రంధాలు చెబుతున్నాయి.

ఈ రకంగా పరమేశ్వరుని కాంతిచేతనే జగత్తంతా ప్రకాశింపబడుతున్నది. అంతేకాని పరమేశ్వరుని ప్రకాశానికి ఎవరి ప్రమేయము అవసరంలేదు. అతడు స్వయంప్రకాశము గలవాడు. **బృహదారణ్యకోపనిషత్తు**లో "ఒకసారి యాజ్ఞవల్క్యుడు విదేహాధిపతి అయిన జనక మహారాజు ఆస్థానానికి వచ్చాడు. గురువుగారిని చూడగానే ఎదురేగి స్వాగత సత్కారాలు ఆచరించి కుశలప్రశ్నలు అయిన తరువాత, జనకుడు అడుగుతున్నాడు.

**జ** : గురుదేవా ! లోకంలో జీవులు వెలుగులు వల్ల నిత్యకృత్యములు సాగిస్తున్నారు ?

**యా** : సూర్యుని వెలుతురువల్ల ఆ వెలుగువల్లనే మానవుడు ప్రతినిత్యము పనిపాటలు నిర్వహిస్తున్నాడు. దూరతీరాలకు వెడతాడు. పనులు పూర్తి చేసుకుని తిరిగి వస్తాడు. ఆ వెలుగులో వెళ్ళాలనుకున్నచోటికి వెడతాడు. పనులు చూసుకుంటాడు.

**జ** : మహర్షీ ! సూర్యాస్తమానమైనప్పుడు అంటే సూర్యుని వెలుగు అప్పుడు ఉండదు కదా ! మరి అప్పుడు పనులు ఏవిధంగా జరుగుతాయి ?

**యా** : సూర్యుడు అస్తమించిన తరువాత చంద్రుని కాంతులలో ఆ పనులు జరుగుతాయి.

**జ** : సూర్యచంద్రులిద్దరూ లేనప్పుడు ఏం జరుగుతుంది ?

**యా** : రాజా ! సూర్యచంద్రులు ఇద్దరూలేనప్పుడు అగ్నియొక్క వెలుగులో అంటే దీపపుకాంతులలో ఈ పనులన్నీ జరుగుతాయి.

**జ** : గురుదేవా ! సూర్యుడు లేడు. చంద్రుడు లేడు, అగ్ని లేదు. మరి అప్పుడేమవుతుంది ?

**యా** : రాజా! ఆ వెలుగుల స్థానంలో వాక్కు పనులు చేయటానికి సహకరిస్తుంది. చీకటిలో ఏమీ కనపడదు కాని ఏదో ధ్వని వినిపిస్తే, మానవుడు ఆ ధ్వని వినిపించిన వైపుకు వెడతాడు. చెప్పిన పనులు చేస్తాడు.

**జ** : గురువర్యా ! సూర్యుడులేడు, చంద్రుడు లేడు, అగ్నిలేదు, వాక్కు లేదు. అప్పుడు ఏమవుతుంది ?

**యా** : రాజా ! ఈ వెలుగులన్నింటికీ అవతల ఆత్మజ్యోతి ఉన్నది. ఆది వెలుగులకు వెలుగు, కాంతులకు కాంతి అటువంటి ఆత్మప్రకాశమువల్లనే మానవుడు మనుగడ సాగిస్తున్నాడు." అని చెప్పబడింది.

కాబట్టి ఆత్మ అనేది స్వయంప్రకాశమైనది. దేనిచేత ప్రకాశింపబడదు. జగత్తంతా ఆత్మయొక్క తేజస్సువల్లనే ప్రకాశిస్తున్నది. ఇక్కడ ఆత్మ అంటే పరమేశ్వరుడు తప్ప వేరుకాదు.

**శ్రీమద్భాగవతంలో** గజేంద్రుడు

**లోకంబులు లోకేశులు**
**లోకస్థులు దెగినతుది న లోకం బగు పెం**
**జీకటి నవ్వల నెవ్వడు**
**నేకాకృతి వెలుగు నతనిని నే సేవింతున్**

అని ప్రార్థిస్తాడు. ఈ రకంగా లోకాలన్నింటికీ కాంతుల నిచ్చే శ్రీమన్నారాయణుడు 'మహాద్యుతిః' అనబడతాడు. **ఈశావాశ్యోపనిషత్తులో** 15వ మంత్రం.

**హిరణ్మయేన పాత్రేణసత్యస్యాపిహితం ముఖం ।**
**తత్త్వం వృణుసత్యధర్మాయ దృష్టయే ॥**

అంతరారాధనపరుడైన ముముక్షువుకు కర్మశేషం లేకుండా పోయింది. అవసాన కాలంలో అతని ప్రాణాలు బ్రహ్మరంధ్రంద్వారా బయటకు వచ్చినాయి. అతని ఆత్మ బ్రహ్మలోకానికి ప్రయాణమైంది. బ్రహ్మలోకానికి తలవాకిలి సూర్యబింబము. అది దివ్యప్రభలతో వెలుగుతున్నది. అవి సూర్యుని వెలుగులు కాదు. పరమేశ్వరుని నుండి వచ్చే జ్ఞానజ్యోతులు. ఆ కాంతులలో బ్రహ్మలోకానికి ద్వారం ఎక్కడ ఉన్నదో ఈ జీవి చూడలేకపోతున్నది. అప్పుడు పరమేశ్వరుణ్ణి ప్రార్థిస్తున్నాడు. "ఓ పరమేశ్వరుడా ! దివ్యమైన

నీ వెలుగులలో బ్రహ్మలోకానికి ద్వారం ఎక్కడ ఉన్నదో నాకు కనిపించటంలేదు. కాబట్టి నీ వెలుగులను కాస్త ఉపసంహరించవలసినది.”

ఈ రకంగా పరమేశ్వరుడు దివ్యమైన కాంతులతో ప్రకాశిస్తుంటాడు కాబట్టే శ్రీమన్నారాయణుడు ‘మహాద్యుతిః’ అనబడతాడు.

# 177. అనిర్దేశ్యవపుః

నిర్దేశింపజాలని శరీరము గలవాడు

**జ్ఞానాది షాడ్గుణ్య మయం ఉపమాన విసర్జితమ్ ।**
**వపుర్యస్యాతి తేజిష్ఠ అనిర్దేశ్యవపుర్హ్విసః ॥**

జ్ఞానము మొదలైన షడ్గుణాలచేత సాటిలేనటువంటి, మిక్కిలి తేజోవంతము, పూర్ణమయము అయిన దివ్యమంగళవిగ్రహము గలవాడు.

**అనిర్దేశ్యమ్ వపుః యస్యసః అనిర్దేశ్యవపుః** అతని దేహము ఇటువంటిది అని ఎవరికి చెప్పలేమో అతడు ‘అనిర్దేశ్యవపుః’ అనబడతాడు.

**షాడ్గుణ్య విగ్రహమ్ దేవమ్ భాసజ్వలన తేజసమ్**

ఆరు గుణాలు ప్రకాశించే దేహముగలవాడు. పరమేశ్వరుడు ‘షాడ్గుణ్య పరిపూరితుడు’ అంటూ ఆ ఆరు గుణాలను గతంలో వివరించాము.

పరమేశ్వరుడు నిరాకారుడు నిర్గుణస్వరూపుడు. అతడు కేవలము జ్ఞానజ్యోతి. అతనికి కొన్ని లక్షణాలున్నాయి. అవే షడ్గుణాలు అంటారు. ఆ గుణాలచేత ప్రకాశించేవాడు. పరమేశ్వరుని శరీరాన్ని సాధకుడు మాత్రమే తెలుసుకోగలుగుతాడు. ఇది అనుభవవైక వేద్యము. అనిర్వచనీయము. అందుచేతనే అది ‘ఇది’ అని చెప్పటానికి వీలుకాదు.

**కఠోపనిషత్తు**లో యమధర్మరాజు నచికేతుడికి ఆత్మజ్ఞానాన్ని బోధిస్తూ “నచికేతా! పరబ్రహ్మను ఏ రూపంలో ఉపాసనచేస్తే సాధకుడు ఆ రూపాన్ని పొందుతాడు. ఆత్మకు చావుపుట్టుకలు లేవు. తనంత తానుగా ఉద్భవించింది. స్వయంభువు. నాశనములేనిది. శాశ్వతమైనది. శరీరం మరణించినా ఆత్మ మరణించదు. ఆత్మ చంపేది కాదు. చంపబడేది కూడా కాదు. అది **అణోరణీయాం మహతోమహీయాం ।** సూక్ష్మమైన వాటికన్న సూక్ష్మమైనది. మహత్తు గల వాటికన్న మహత్తు గలది. అంటే పెద్దవాటికన్న కూడా ఇంకా పెద్దది. జితేంద్రియుడు ఆత్మ గొప్పదనాన్ని గుర్తించి దుఃఖాలనుంచి దూరమవుతాడు. ఇంద్రియలోలురు ఆత్మను గుర్తించలేరు” అంటాడు.

ఈ రకంగా ఆత్మ ఇంత ఉంటుంది అని నిర్దేశించలేము. అది కంటిలో చూడలేనంత పెద్దది. అంతేకాదు కంటికి కనిపించనంత చిన్నది. చరాచరజగత్తంతా ఆవరించి ఉంటుంది. ఈ రకంగా ఆత్మను నిర్దేశించలేము కాబట్టే ఆత్మస్వరూపుడైన శ్రీమన్నారాయణుడు 'అనిర్దేశ్యవపుః' అనబడుతున్నాడు.

## 178. శ్రీమాన్

ఆభరణ సంపద గలవాడు. 22, 220, 613 నామాలు కూడా ఇదే.

**దివ్యభూషణ సంపద్భిః యుక్తశ్శ్రీమాన్ సదాస్మృతః**

నిరంతరము దివ్యాభరణములు ధరించి ఉన్న దివ్యమంగళ శరీరుడు.

**శ్రీః అస్యాస్తీతి శ్రీమాన్**

పరమేశ్వరునిది దివ్యమైన శరీరము. దానికి తగిన దివ్యాభరణాలు ధరించినవాడు.

శ్రీమాన్ - శ్రీనిగలవాడు. ఇక్కడ శ్రీ అంటే ఐశ్వర్యము. ఈశ్వరత్వము అనే ఐశ్వర్యము గలవాడు.

పరమేశ్వరుడు అఖండమైన ఐశ్వర్యము గలవాడు. అతడు అణిమాది అష్టసిద్ధులకు, నవనిధులకు అధిపతి. ఆ నిధులనుంచి ఎంత తీసుకున్నా, ఎంతగా వాడుకున్నా తరిగిపోనివి.

పరమేశ్వరుడు సాటిలేని ఈశ్వరత్వము గలవాడు. ఈశ్వరత్వము అనగా - సృష్టిస్థితిలయములు చేసే శక్తి, సామర్థ్యము. దీనితోనే అతడు ఈ జగన్నిర్మాణము కావిస్తున్నాడు. ఈ శక్తి వేరెవరికీ లేదు. దీనిలో అతడికి అతడే సాటి. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'శ్రీమాన్' అనబడుతున్నాడు.

## 179. అమేయాత్మా

గంభీరస్వభావము గలవాడు. 102వ నామము కూడా ఇదే.

**సిన్ధుగమ్భీర భావయో హ్యమే యాత్మా సకీర్తితః**

సముద్రములాగా గంభీరమైన స్వభావము గలవాడు.

**అమేయః ఆత్మాయస్యసః అమేయాత్మా ॥** తనకున్న దివ్యదేహానికి, గుణాలకు తగినట్లుగా మిక్కిలి గంభీరమైన స్వభావము గలవాడు.

అమేయమైన అంటే ఇది అంత అని నిర్ణయించటానికి వీలుకానటువంటి ఆత్మ అనగా బుద్ధి గలవాడు.

పరమేశ్వరుడు చరాచరజగత్తంతా ఆవరించి ఉన్నాడు. అతడు జ్ఞానమయుడు. అతని బుద్ధి ఇంత అని నిర్ణయించటానికి వీలుకాదు. ఎందుకంటే జగత్తులో ఉన్న ప్రతిజీవి, ప్రతివస్తువు అతని రూపమే. **దేవీసప్తశతి**లోని మొదటి అధ్యాయములో “క్షీరసాగరమధ్యలో శ్రీమహావిష్ణువు యోగనిద్రలో ఉన్నాడు. ఆయన నాభి నుంచి వచ్చిన పద్మము నుంచి బ్రహ్మ ఉద్భవించి వేదపారాయణ చేస్తున్నాడు. ఆ సమయంలో విష్ణుమూర్తి చెవిలో నుండి వచ్చిన గుబిలినుండి మధుకైటభులు ఉద్భవించారు. బ్రహ్మను తమతో యుద్ధానికి రమ్మన్నారు. బ్రహ్మ పద్మము యొక్క కాడ గుండా క్రిందికి దిగి తండ్రిని నిద్రలేపటానికి ప్రయత్నించాడు. విష్ణువును యోగమాయ ఆవరించి ఉంది. చూశాడు బ్రహ్మ. అప్పుడు ఆ పరమేశ్వరిని ప్రార్థిస్తున్నాడు.

**త్వంశ్రీస్త్వమీశ్వరీ త్వంహ్రీస్త్వం బుద్ధిర్బోధలక్షణా ।**
**లజ్జాపుష్టి స్తథా తుష్టి స్త్వం శాన్తిః క్షాన్తిరేవచ ॥**

తల్లీ నీవే లక్ష్మివి, నీవే ఈశ్వరివి, వినమ్రతవు, జ్ఞాన చిహ్నమైన బుద్ధివినీవే. లజ్జ, తుష్టి, పుష్టి, శాంతి, ఓరిమిగల దానవు నీవే. అంటూ ఆ పరమేశ్వర స్వరూపాన్ని ప్రార్థిస్తున్నాడు. ఈ రకంగా పరమేశ్వరస్వరూపమైన శ్రీమహావిష్ణువు అమేయమైన బుద్ధి గలవాడు కాబట్టి ‘అమేయాత్మా’ అనబడుతున్నాడు.

**లలితాసహస్రం**లో 617వ నామము **అమేయాత్మా**

## 180. మహాఽద్రిధృక్

మందరగిరిని మోసినవాడు.

**మహాన్తం మన్దరం యోహిధృతవాన్ స మహాద్రిధృత్**

మిక్కిలి పెద్దదైన మందర గిరిపర్వతము సముద్రములో మునిగిపోకుండా కాపాడినవాడు.

**మహాతం అద్రింధరతీతి మహాద్రిధృత్** గొప్పదైన పర్వతము ధరించి, అది సముద్రములో మునిగిపోకుండా కాపాడినవాడు కాబట్టి ‘మహాద్రిధృత్’ అనబడుతున్నాడు.

దేవాసుర యుద్ధంలో దేవతలు ఓడిపోతున్నారు. రాక్షసవీరుల చేతిలో మరణిస్తున్నారు. దేవతలకు మరణం లేకుండా ఉండాలి. ఈ విషయం బాగా ఆలోచించారు. “అమృతపానం

చేస్తే మరణము ఉండదు. తేజస్సు పరాక్రమము రెట్టింపు అవుతాయి. కాబట్టి అమృతాన్ని సాధించండి. క్షీరసాగర మథనం చేస్తే అమృతం దొరుకుతుంది. దేవతలారా ! మీ ఒక్కరివల్ల ఆ పని సాధ్యం కాదు. అందుచేత రాక్షసుల సహాయము అర్థించండి" అన్నాడు దేవగురువైన బృహస్పతి.

దేవదానవులు క్షీరసాగర మథనం మొదలుపెట్టారు. మందరగిరి పర్వతము – కవ్వముగా, వాసుకి – త్రాడుగా ఆ మథనం సాగుతోంది. అప్పుడు పర్వతం నీటిలో మునిగిపోతున్నది. అది చూసిన దేవతలు శ్రీహరి దగ్గరకు పరుగెత్తారు. ఆ హరి కూర్మావతారంలో వచ్చి మందరగిరి పర్వతం నీటిలో మునిగిపోకుండా కాపాడాడు. అందుచేతనే శ్రీమహావిష్ణువు 'మహాఉద్రి ధృక్' అనబడతాడు.

## 181. మహేష్వాసః

గొప్ప బాణములు విడచువాడు.

**మహేష్వాస స్సువిజ్ఞేయః చణ్డ కోదణ్డ మణ్డితః** ప్రచండమైన కోదండము గలవాడు.

**ఇషూణామ్ అసః ఇష్వాసః మహాన్ ఇష్వాసః యస్య సః మహేష్వాసః**

గొప్పవైన బాణములను విడచువాడు. రాక్షస సంహారము చేయటానికి పదునైన బాణములను ప్రయోగించినవాడు. రావణ సంహార సమయములో తిరుగులేని బాణములను ప్రయోగించినవాడు, ఎంత దూరాన ఉన్న లక్ష్యాన్నైనా సరే గురి చూసి బాణము వేయగలడు.

**శ్రీమద్రామాయణము**లోని కిష్కింధకాండలో సీతను వెతుకుతూ వస్తున్న రామచంద్రుని చూశాడు సుగ్రీవుడు. ఆంజనేయుడు వెళ్ళి శ్రీరాముని వివరాలు తెలుసుకుని ఋష్యమూక పర్వతం మీదికి సగౌరవంగా తీసుకువచ్చాడు రామలక్ష్మణులను, సుగ్రీవుడితో మైత్రి చెయ్యటానికి ఒప్పుకున్నాడు రాముడు. వాలిని సంహరిస్తాను అని మాట ఇచ్చాడు. నమ్మకం కలగలేదు సుగ్రీవుడికి అప్పుడు అడిగాడు. "రామా ! మా అన్న వాలి చాలా బలవంతుడు. నువ్వు అతన్ని సంహరించగలవనే నమ్మకం నాకు కలగాలి అంటే దూరంగా ఉన్న ఏడు మద్దిచెట్లను ఒకే బాణంతో పడగొట్టాలి" ఆ మాటలు విన్న శ్రీరాముడు ఒకే బాణంతో ఏడు వృక్షాలను పడగొడతాడు. అలాగే లంకను చేరటానికి దారి ఇమ్మని సముద్రుణ్ణి అడుగుతాడు రాముడు. సముద్రుడు ఉలకడు, పలకడు. దాంతో కోపించినవాడై ఒక్క బాణంతో సముద్రములోని జలచరాలన్నీ మరణించేటట్లుగా చేస్తాను. అంటూ

పదునైన బాణాన్ని సంధిస్తాడు. అప్పుడు సముద్రుడు ప్రత్యక్షమవుతాడు. ఈ రకంగా పదునైన, మహా భయంకరమైన బాణాలను ప్రయోగించేవాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు 'మహేష్వాసః' అనబడుతున్నాడు.

## 182. మహీభర్తా

భూమికి భర్త, భూమిని ధరించువాడు.

**ధరణీధృత కీలస్సః మహీభర్తేతి శబ్ద్యతే ॥**

వరహావతారము నందు భూమిని తన కోరలతో రక్షించినవాడు.

**మహీంభిభర్తీతి మహీభర్తా** భూమిని ధరించువాడు

**శింశు మారాత్మనా విష్ణుః భూరాదీ నూర్ధ్వత స్థితాన్ ।**
**దద్రేశేష తయాన్ లోకాన్ సప్తలోకాన్ అథ స్థితాన్ ॥**

శ్రీ మహావిష్ణువు ఊర్ధ్వలోకాలను శింశుమార అనగా మొసలి రూపంలోను, అథోలోకాలను ఆదిశేషుని రూపముతోనూ మోస్తున్నాడు. **మహాసంకల్పములో**

**అథ అనంత వీర్యస్య భగవతో మహాపురుషస్య శ్రీమదాదినారాయణస్య**

అనంతమైన శక్తిగల భగవానుడగు మహాపురుషుడు శ్రీమదాది నారాయణుని యొక్క

**అచింత్యా పరిమిత శక్త్యా భ్రియమాణ స్య**

ఊహించరాని, పరిమితి చెప్పలేని శక్తిచే భరించబడుచున్నటువంటి

**మహాజలౌఘస్య మధ్యే పరిభ్రమమాణానాం అనేక కోటి బ్రహ్మాండానాం ఏకతమే**

మహాజలరాశి నడుమ పరిభ్రమించుచున్నటువంటి అనేక కోట్ల బ్రహ్మాండముల యందు ఒకటయినటువంటి

**వ్యక్తా వ్యక్త మహదహంకార పృథివ్యాపస్తేజో వాయు ఆకాశా ద్యావరణైః ఆవృతే**

వ్యక్తము, అవ్యక్తము, మహత్తు, అహంకారము, నేల, నీరు, నిప్పు, గాలి, ఆకాశములను ఆవరణములతో ఆవరించబడినటువంటి

**అస్మిన్ మహత్రిబ్రహ్మాండ ఖండయోః మధ్యే** పెద్ద బ్రహ్మాండఖండము మధ్యభాగమున

**ఆధారశక్తి, శ్రీకూర్మ, వరాహ, వైష్ణ, వానంత,**
**నాగ, శేష, తక్షకాష్టదిగ్గజోపరిప్రతిష్ఠితే**

ఆధారశక్తి, శ్రీకూర్మము, వరాహము, వైష్ణవము అనంత, నాగ, శేష, తక్షక అను అష్టదిగ్గజములు అనబడు ఎనిమిది శక్తుల మీద ఎనిమిది దిక్కులయందు నిలుపబడినట్టి

**అతల, వితల, సుతల, తలాతల, రసాతల, మహాతల, పాతాళ, సప్తలోకానాం ఉపరితలే** అతలము మొదలైన అధోలోకములపై భాగాన

**భూ, ర్భువ, స్సువ, ర్మహ, ర్జన, స్తప, సత్య, మితి సప్త లోకానాం అధోభాగే.**

ఊర్ధ్వలోకములక్రిందిభాగాన

**చక్రవాళశైల మధ్యగత మహాసుమేరోః సహస్ర**
**శిఖరానువర్తిని మహానాళాయ మాన ఫణిరాజ**
**రాజస్య శేషస్య సహస్రఫణా మణిమండల మండితే**

చక్రవాళ పర్వతము నడుమ, మేరుపర్వతము యొక్క శిఖరములను చుట్టి నాళముగా నిలచిన, సర్పరాజగు శేషుని యొక్క వేయిపడగలమణుల నడుమ అలంకరించబడినటు వంటి అంటూ భూమండలము యొక్క గుర్తును చెప్పటం జరుగుతుంది. ఈ విధంగా ఉన్న భూమండలము మొత్తాన్ని శ్రీమహావిష్ణువు తన వేయి పడగలతో మోస్తున్నాడు. కాబట్టి 'మహీభర్తా' అనబడతాడు. ప్రళయకాలములో ఏకార్ణవమున తడిసిన భూదేవిని తన శక్తితో భరించేవాడు.

## 183. శ్రీనివాసః

లక్ష్మిని గలవాడు.

**మథనానీత లక్ష్మీవాన్ శ్రీనివాస స్సఈరితః**

క్షీరసాగర మథనము చేస్తున్నప్పుడు లభించినటువంటి లక్ష్మి గలవాడు.

**శ్రియః నివాసః శ్రీనివాసః** లక్ష్మికి నివాసమైనవాడు.

అమృతంకోసం దేవదానవులు క్షీరసాగరమథనంచేస్తున్నారు. మందరగిరి పర్వతం మునిగిపోతోంది. శ్రీమహావిష్ణువు ఆదికూర్మమై పర్వతాన్ని ఆపాడు. మథనం జరుగుతున్నది. ఆ సమయంలో క్షీరసాగరంలో నుంచి అనేకమైనవి ఉద్భవించాయి. వాటిని దేవతలు తీసుకుపోయారు.

ఉచ్చైశ్వరము అనే గుర్రము పుట్టింది – ఇంద్రుడు తీసుకుపోయాడు

ఐరావతమనే ఏనుగు పుట్టింది – ఇంద్రుడు తీసుకుపోయాడు

| | | |
|---|---|---|
| పారిజాతము పుట్టింది | – | ఇంద్రుడు తీసుకుపోయి దేవలోకంలో నాటాడు |
| చంద్రుడు ఉద్భవించాడు | – | పరమేశ్వరుడు శిరస్సున అలంకరించాడు. |
| కామధేనువు, కల్పవృక్షము పుట్టినాయి | – | దేవలోకానికి తీసుకుపో బడ్డాయి |
| లక్ష్మీదేవి పుట్టింది | – | శ్రీమహావిష్ణువు తీసుకుపోయి వక్షస్థలాన ధరించాడు. |
| కౌస్తుభము పుట్టింది | – | శ్రీమహావిష్ణువు తీసుకుపోయి వక్షస్థలాన ఆభరణంగా ధరించాడు. |

అందుచేతనే ఆమె **విష్ణువక్షస్థలస్థితా** అనబడుతోంది. ఈ రకంగా శ్రీని వక్షమునందు ధరించాడు. కాబట్టి శ్రీనివాసుడనబడుతున్నాడు.

## 184. సతాంగతిః

ఆశ్రితులకు ఉపాయమైనవాడు.

**ప్రణతానాం ప్రియకర స్సతాఙ్గతిరిహోచ్యతే ॥**

శరణాగతులకు ప్రియమును గూర్చువాడు. ఆశ్రితులకు ప్రియమును కూర్చేవాడు కావటంచేత వారికి అన్నివేళలయందు పొందదగినవాడు. వైదికమతానుయాయుల పురుషార్థములు సాధించుకోవటానికి హేతువైనవాడు. పురుషార్థాలు నాలుగు. అవి – ధర్మార్థకామమోక్షములు. ప్రపంచములో ఏది సాధించినా, ఏది సంపాదించినా మానవుడి చివరి గమ్యము మోక్షమే. మోక్షము రావాలంటే ఆ పరమేశ్వరుణ్ణి శరణువేడాల్సిందే. ఈ రకంగా తనను శరణు కోరినవారికి ప్రియమును కూర్చువాడు.

## 185. అనిరుద్ధః

అడ్డగించటానికి సాధ్యము కానివాడు. 638వ నామము కూడా ఇదే.

**అనన్తచేష్టాయుక్తత్వాత్ అనిరుద్ధ ఉదాహృతః**

భక్తులను రక్షించటానికి అనేకమైన పనులు చేసేవాడు.

**న నిరుద్ధః అనిరుద్ధః** అడ్డగింప సాధ్యము కానివాడు కాబట్టి అనిరుద్ధుడు. తన భక్తుల యొక్క విరోధులను సంహరించి సమస్త జీవలోకానికి రక్షణ కలిగించువాడు.

తన ప్రాదుర్భావసందర్భములో ఎవరిచేతను అడ్డగించబడనివాడు. ఈ రకంగా పరమేశ్వరుని షాడ్గుణ్యపరిపూర్ణత్వాన్ని వివరించటం జరిగింది" అన్నాడు రత్నాకరుడు.

# 19. హంసావతారము

"గురువుగారూ ! శ్రీమహావిష్ణువు అనేక అవతారాలెత్తాడు. అందులో అందరికీ తెలిసినవి. దశావతారాలు. ఇవిగాక ఇంకా కొన్ని అంశావతారాలున్నాయి కదా ! వాటిలో హంసావతారము ఒకటి. ఇప్పుడు హంసావతారాన్ని వివరించండి" అన్నాడు కృష్ణశర్మ. చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు ఆదిపురుషుడు. ప్రతికల్పములోను తనను తానే సృష్టించుకుని దుష్టశిక్షణ చేస్తాడు. ధర్మాన్ని స్థాపిస్తాడు. ధర్మాన్ని బోధిస్తాడు. వీటినే అవతారాలు అంటారు. వీటిలో కొన్ని పూర్ణావతారాలు కాగా, కొన్ని అంశావతారాలు వీటిలో ఒకటి హంసావతారము.

హంస అంటే సాక్షాత్తూ పరమేశ్వరుడు తప్ప వేరుకాదు. అది జ్ఞానస్వరూపము.

సృష్టి ప్రారంభ సమయములో బ్రహ్మ సృష్టి చెయ్యాలని సంకల్పించినవాడై పదిమందిని సృష్టించాడు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | నారదుడు | – ఒడి నుంచి | 6. | పులహుడు | – నాభినుంచి |
| 2. | దక్షుడు | – బ్రొటనవ్రేలు నుంచి | 7. | పులస్త్యుడు | – చెవి నుంచి |
| 3. | వసిష్ఠుడు | – ప్రాణము నుంచి | 8. | అంగీరసుడు | – ముఖము నుంచి |
| 4. | భృగువు | – చర్మము నుంచి | 9. | అత్రి | – నేత్రముల నుంచి |
| 5. | క్రతువు | – చేతి నుంచి | 10. | మరీచి | – మనసునుంచి |

వీరు బ్రహ్మమానస పుత్రులు. వీరు కాక ఇంకా చాలామంది బ్రహ్మనుండి ఉద్భవించారు.

ఈరకంగా బ్రహ్మయొక్క వడి నుండి ఉద్భవించాడు నారదుడు. అయితే **బ్రహ్మ వైవర్తపురాణంలో** నారదుడు బ్రహ్మ కంఠమునుంచి ఉద్భవించాడు అని చెప్పబడింది. నారదుడు బ్రహ్మతొడల నుంచి పుట్టాడు అని కొన్నిచోట్ల చెప్పబడింది. **శ్రీమద్భాగవతము**లో సాక్షాత్తూ శ్రీమహావిష్ణువే నారదుడనే దేవర్షియై వైష్ణవ తంత్రాన్ని చెప్పాడు అని చెప్పబడింది.

అటువంటి నారదుడు బ్రహ్మచారి. వేదవేదాంగవిదుడు. సర్వశాస్త్రాలు అభ్యసించాడు. సంగీతసాధన చేశాడు కాని ఆత్మజ్ఞానం కలగలేదు. అందువల్ల మనశ్శాంతి లేకుండా పోయింది. అటువంటి స్థితిలో శ్రీమహావిష్ణువు హంసరూపంలో వచ్చి భాగవత జ్ఞానాన్ని నారదుడికి బోధించాడు.

పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు నిరంతరము దేవతలను ఆనందింప చేస్తాడు. ఇతడు చేసిన ఉపకారానికి సంతుష్టులైన దేవతలు శ్రీమహావిష్ణువును అనేక విధాల స్తుతిస్తుంటారు. శ్రీమన్నారాయణుడు వేదపురుషుడు. వేదవిదుడు. వేదవేత్తలను రక్షిస్తుంటాడు. అతడు కాంతిమయుడు. స్వయంప్రకాశి. అతని కాంతులవల్ల ఈ జగత్తు ప్రకాశిస్తున్నది. అతడు తన భక్తులయొక్క సంసార తాపాన్ని తగ్గిస్తాడు. అతడే హంస స్వరూపుడు. పరమాత్మ. సంసార బంధమునుండి దరిచేర్చేవాడు. పక్షిరాజైన గరుడుడు అతడి రూపమే. సర్పములకు రాజైన ఆదిశేషునకు ప్రభువు. హితము, రమణీయము అయిన నాభికలవాడు. మంచి జ్ఞానము గలవాడు. అతడే పద్మనాభుడు. ప్రజాపతి.

ఈరకంగా 186 నుంచి 197వరకు గల నామాలలో హంసావతారాన్ని వివరించటం జరిగింది. ఇక నామాలను చూద్దాం.

## 186. సురానందః

దేవతలను ఆనందింపచేయువాడు.

**సురానన్దస్సురాన్ సర్వా నానన్దయతి య స్సదా ॥**

దేవతలను నిరంతరము ఆనందింపచేయువాడు.

**సురాః ఆనన్దన్తి అస్మాదితి సురానందః**

దేవతలను ఆనందింపచేయువాడు కాబట్టి 'సురానందః' అనబడుతున్నాడు.

ఆపదలు వచ్చినప్పుడు దేవతలకు అన్నివిధాల బంధువై, రక్షించువాడు.

**భగవద్గీత**లోని నాల్గవ అధ్యాయము **'జ్ఞానకర్మ సన్యాసియోగము'**లోని 7, 8 శ్లోకాలలో

**యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత ।**

**అభ్యుత్థానమధర్మస్య తదాఽఽత్మానం సృజామ్యహమ్ ॥**

ఓ అర్జునా ! అధర్మము పెరిగిపోయి ధర్మానికి హాని కలిగినప్పుడు నన్ను నేను సృష్టించుకుని సాకారముతో ఈ లోకములో అవతరిస్తాను.

భగవానుడు ఈ యుగంలోనే అవతరించాలి. ఈ సమయంలోనే అవతరించాలి అనే నిశ్చయము ఏదీ లేదు. ప్రతియుగంలోనూ ఇన్నిసార్లు మాత్రమే అవతరించాలి అనే నియమము అంతకన్న లేదు. మరి ఎప్పుడు అవతరిస్తాడు అంటే, ధర్మానికి హాని కలిగినప్పుడు, అధర్మము పెచ్చు మీరినప్పుడు, ఇక "తాను అవతరించక తప్పదు" అని

భావించినప్పుడు, భగవానుడు ఈ లోకంలో అవతరిస్తాడు. అంటే ధర్మానికి హాని జరగాలి. అది ఏ స్థాయిలో జరగాలి? దుర్మార్గుల దురాగతాలు మితిమీరి పోయినప్పుడు, మహర్షులు, ధార్మికులు, భగవంతుని భక్తులు, సదాచార సంపన్నులు, నిరపరాధులు, బలహీనులు దుర్మార్గులచేత బాధింపబడుతున్నప్పుడు, ధర్మానికి హాని జరిగినట్లు లెక్క. కృతయుగంలో హిరణ్యకశ్యపుడి దురాగతాలు మితిమీరిపోయినాయి. యజ్ఞయాగాది క్రతువులు ఆగిపోయినాయి. దేవతలకు పూజలు, బలులు ఆగిపోయినాయి. దేవతలు హింసించ బడుతున్నారు. స్థానభ్రంశము పొందారు. నిరపరాధులైన ప్రహ్లాదునిలాంటి భక్తులు శిక్షింప బడ్డారు. అప్పుడు పరమేశ్వరుడు నృశింహావతారమెత్తి హిరణ్యకశ్యపుని సంహరించాడు.

**పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్ ।**
**ధర్మసంస్థాపనార్థాయ సమ్భవామి యుగే యుగే ॥**

ఈ రకంగా ధర్మానికి హాని కలిగినప్పుడు దుష్టశిక్షణ, శిష్టరక్షణ చెయ్యటానికి ఆర్తత్రాణ పరాయణుడైన శ్రీమన్నారాయణుడు ప్రతియుగంలోనూ అంటే అవసరమైనప్పుడల్లా భూలోకంలో ఉద్భవిస్తుంటాడు.

అంటే దేవతలు, దైవసమానులైన సత్పురుషులు. వారే సాధుపుంగవులు. సత్యసంధులు, అహింసావాదులు, నియమ నిష్ఠలతో కాలం గడిపేవారు, సర్వకాల సర్వావస్థల యందు భగవంతుణ్ణే స్మరిస్తూ ఉండేవారు. సత్వగుణ ప్రధానులు మునీంద్రులు, మహర్షులు, వీరికి కష్టాలు కలిగినప్పుడు ఆ పరమేశ్వరుడు భూలోకంలో అవతరించి దేవతలకు ఆనందం కలిగిస్తాడు. అనగా రాక్షస సంహారం జరిగినప్పుడు, తమ కష్టాలు తొలగిపోయినాయి అని చాలా ఆనందించి పరమేశ్వరుని పరిపరివిధాల స్తుతి చేస్తారు.

ఈరకంగా దేవతలకు ఆనందము కలిగిస్తాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు 'సురానందః' అనబడుతున్నాడు.

## 187. గోవిందః

స్తుతించబడినవాడు 593వ నామము కూడా ఇదే.

**గవాం స్తుతిగిరాం విన్దో గోవిన్ద స్స ఉదాహృతః ॥**

లోకులు చేసే స్తోత్రాలన్నీ తనకే చేసినట్లుగా భావించేవాడు.

**గాః వాచః విందతీతి గోవిందః** దేవతల స్తోత్రరూపమైన వాక్కులు పొందినవాడు.

దేవతలు పరమేశ్వరుని రెండుసార్లు స్తుతి చేస్తారు. 1. తమను కష్టాల నుంచి కాపాడవలసి వచ్చినప్పుడు. 2. దుష్టశిక్షణ చేసి తమను రక్షించినప్పుడు

భూలోకంలో హిరణ్యకశ్యపుని ఆగడాలు మితిమీరిపోతున్నాయి. సాధు సజ్జనులు ఆ బాధలు భరించలేక పోతున్నారు. అప్పుడు వారంతా శ్రీమహావిష్ణువును అనేక విధాల స్తుతిచేసి తమని రక్షించమని కోరారు. రావణబ్రహ్మ దురాగతాలు పెచ్చు మీరిపోతున్నాయి. దేవతలంతా వైకుంఠానికి పోయి శ్రీమహావిష్ణువును శరణు వేడారు.

ఈరకంగా తమకు కష్టకాలం వచ్చినప్పుడు ఆ కష్టాల కడలినుంచి రక్షించవలసినదిగా పరమేశ్వరుని ప్రార్థిస్తారు. ఆ ప్రార్థన లాలకించి పరమేశ్వరుడు ఏదో ఒక అవతారమెత్తి దుష్టశిక్షణ చేస్తాడు ఈ రకంగా రాక్షస సంహారం జరిగినప్పుడు దేవతలు పూలవాన కురిపిస్తారు. అప్సరసలు ఆడతారు. గంధర్వులు పాడతారు. మహర్షులు స్వస్తివాక్యాలు పలుకుతారు. ఈవిధంగా దేవతలచే స్తుతించబడు వాడు కాబట్టి శ్రీమహావిష్ణువు 'గోవిందః' అనబడుతున్నాడు. **మహాభారతం**లోని శాంతిపర్వంలో

**నష్టాంవై తరిణీం పూర్వమవింద ద్య ద్గుహాగతాం ।**
**గోవిందఇతి తేనాఽహం దేవ్యై ర్వాగ్భిరభిష్టుతః ॥**

పూర్వకాలంలో కంటికి కనిపించకుండా పోయి భూమి పాతాళ లోకం చేరింది. దానిని యజ్ఞవరాహ రూపంలో రక్షించాడు పరమేశ్వరుడు. కాబట్టి గోవింద అనబడుతున్నాడు. హరివంశమునందు

**అహకితేంద్రో దేవానా । త్వం గవా మింద్రతాం గతః ।**
**గోవింద ఇతి లోకాస్త్వాం స్తోష్యంతి భువిశాశ్వతమ్ ॥**

నేను దేవతలకు ఇంద్రుడుగా ప్రసిద్ధుడను, నువ్వు గోవులకు ప్రభువువు. కాబట్టి గోవులకు ఇంద్రుడవు. అందుచేత భూలోకమునందు నిన్ను శాశ్వతముగా 'గోవిందుడు' అంటారు. ఈ కారణాలచేత శ్రీమహావిష్ణువు గోవిందుడు అనబడుతున్నాడు.

**లలితా సహస్రం**లో 267వ నామము **గోవిందరూపిణీ.**

## 188. గోవిదాం పతిః

వేదవేత్తలను రక్షించేవాడు.

**గావో వేదగిరః ప్రోక్తాఃగోవిందస్త త్సుపాలనాత్ ।**
**గోవిదాం పతిరుద్దిష్టో వేదవిద్వ్రత్రపదోమనుః ॥**

గోవులు అంటే – వేదవాక్కులు. వారికి పతి రక్షించువాడు.

జ్ఞానము చేతను, జ్ఞానయజ్ఞము చేతను ఆరాధించబడుతూ, వారిని రక్షించేవాడు.

**గో:** అనగా వాక్కు **గాంవిదంతి ఇతిగోవిందః** వాక్కు యొక్క తత్త్వము తెలిసినవారిని గోవిందులు అంటారు. అటువంటి వారిని రక్షించేవాడు.

ఇష్టప్రాప్తినీ, అనిష్టపరిహారాన్ని సాధించటానికి అలౌకికమైన ఉపాయాన్ని చెప్పేదే వేదము. సకల దేవతలను, ధర్మాన్ని, పరబ్రహ్మ తత్త్వాన్ని ప్రతిపాదిస్తుంది. కాబట్టి వేదసామ్రాజ్యము ప్రత్యక్ష అనుమాన ప్రమాణాలకు మించి ఉన్నది.

వేదాలు అపౌరుషేయాలు. సాక్షాత్తూ పరమేశ్వరుడే వాటిని బ్రహ్మదేవుడికిచ్చాడు. వేదాలలో చెప్పిన లౌకిక, ఆధ్యాత్మిక సిద్ధాంతాలు శాశ్వతమైనవి. పరమాత్మ బ్రహ్మను సృజించి అతడికి వేదాలను అనుగ్రహించాడు. బ్రహ్మవేదాలను పారాయణ చేస్తున్నాడు. సృష్టి ప్రారంభమైంది. కృతయుగము, త్రేతాయుగము రెండు యుగాలు పూర్తి అయి పోయినాయి. ద్వాపరయుగం వచ్చింది. మానవులకు వేదవాంగ్మయము అర్థం కాలేదు. మరి వేదాలలో చెప్పిన విషయాలు చాలాగొప్పవి. అటువంటి వేదాలు అర్థం కాకుండా అనాదరణకు గురి అయితే అసలు వేదమే అంతరించి పోతుంది. ఈ రకంగా ఆలోచించి బ్రహ్మదేవుడు 'అపాంతరతముడు' అనే మానస పుత్రుణ్ణి సృజించి భూలోకంలో వేదాలను సవ్యంగా ప్రచారము చెయ్యవలసినది' అన్నాడు. బ్రహ్మయొక్క మాటను శిరసా వహించాడు కుమారుడు. వేదాలను బాగా ప్రచారం చేశాడు. దానికి చాలా సంతోషించాడు బ్రహ్మ. "ప్రతి మహాయుగంలోని ద్వాపర యుగంలోను, నువ్వు భూలోకానికి వెళ్ళి, వేదాలను బాగా ప్రచారం చెయ్యవలసినది" అన్నాడు. తండ్రి ఆజ్ఞప్రకారము చేస్తున్నాడు కుమారుడు.

ద్వాపరయుగంలో పుట్టిన 'అపాంతరతముడు' చదువరుల సౌలభ్యం కోసము వేదాన్ని నాలుగు భాగాలుగా చేశాడు. అవే 1. ఋగ్వేదము. 2. యజుర్వేదము 3. సామవేదము 4. అధర్వణవేదము. ఈ రకంగా వేదాన్ని విభజించాడు కాబట్టి అతడికి 'వేదవ్యాసుడు' అని పేరు వచ్చింది. అప్పటి నుంచీ ప్రతి మహాయుగంలోనూ వేదవిభజన జరుగుతూనే ఉన్నది. ఇది 28వ మహాయుగం. ఈ యుగంలో 'కృష్ణద్వైపాయనుడు' వేదాలను విభజించి వేదవ్యాసుడైనాడు. కృష్ణద్వైపాయనుడికి నలుగురు శిష్యులు.

1. పైలుడు 2. వైశంపాయనుడు 3. జైమిని 4. సుమంతుడు.

ఈ నలుగురికీ వేదాలను అదే క్రమంలో అంటే –

| | | |
|---|---|---|
| పైలుడికి | - | ఋగ్వేదము |
| వైశంపాయనుడికి | - | యజుర్వేదము |
| జైమినికి | - | సామవేదము |
| సుమంతుడికి | - | అధర్వణవేదము |

బోధించాడు. రాను రాను గురుశిష్యుల సంఖ్య పెరిగి

| | | |
|---|---|---|
| ఋగ్వేదానికి | - | 21 శాఖలు |
| యజుర్వేదానికి | - | 94 శాఖలు |
| శుక్లయజుర్వేదానికి | - | 15 శాఖలు |
| సామవేదానికి | - | 100 శాకలు |
| అధర్వణ వేదానికి | - | 50 శాఖలు వచ్చినాయి. |

ఈరకంగా గురుశిష్య పరంపరగా వేదవాంగ్మయము విలసిల్లుతున్నది. ఈ రకమైన వేదవిదులను రక్షించేవాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు 'గోవిదాంపతిః అనబడుతున్నాడు.

## 189. మరీచిః

కిరణమువంటివాడు.

**అన్ధేభ్యోఽపి చ జస్తుభ్యోః హంసగ్రీవావతారతః ।**
**ప్రకాశిత స్వరూపత్వాత్ మరీచి రితికథ్యతే ॥**

గ్రుడ్డివారికి కూడా నిర్మలమైన హంసావతారమును తెలిపి, తన రూపమును ప్రకాశింపచేయువాడు.

మరీచి అంటే - తేజస్సు అని అర్థం.

**తేజస్వినాం అపి తేజః అతః మరీచిః**

తేజస్సు కలిగిన సూర్యచంద్రులకు కూడా ఇతడే తేజస్సు. కాబట్టి ఇక్కడ మరీచి అంటే శ్రీమహావిష్ణువు తప్ప వేరు కాదు.

**భగవద్గీత**లోని పదవ అధ్యాయము **'విభూతి యోగము'**లోని 36వ శ్లోకంలో

**ద్యూతం ఛలయతామస్మి తేజస్తే జస్వినామహమ్ ।**
**జయోఽస్మి వ్యవసాయో ఽస్మి సత్త్వం సత్త్వవతామహమ్ ॥**

అర్జునా ! వంచకులలో జూదమును నేను. ప్రకాశవంతులలో ప్రకాశమును నేను. విజేతలలో విజయమును నేను, నిశ్చయాత్మకులలోని నిశ్చయమును నేను, సాత్త్విక పురుషులలో సాత్త్విక భావముకూడా నేనే.

అంతకుముందు ఈ జగత్తంతా నా స్వరూపమే. నా విభూతులు అనేకమున్నాయి. వాటిలో ముఖ్యమైన వాటిని చెబుతాను అంటూ మొదలుపెట్టి తనయొక్క వివిధ విభూతులను చెబుతున్నాడు. అందులో ప్రకాశవంతులలో ప్రకాశవంతుడను నేనే. అంటాడు. దీని అర్థము గతంలో వివరించాం. కాని ఇప్పుడు మళ్ళీ చెబుతున్నాం.

పరమేశ్వరుని శరీరం నుంచి కొన్ని కోట్లకొలది కిరణములు ప్రసరిస్తున్నాయి. వాటిలో అగ్ని 108, సూర్యుడు 116, చంద్రుడు 136 కిరణములను తీసుకోగలిగారు. ఈ మొత్తం కలిపి 360 కిరణాలవుతున్నాయి. అదే సంవత్సరానికి ప్రతీక. ఆ సంవత్సరమే కాలపురుషుడు. అతడే ప్రజాపతి.

ఈరకంగా కాంతిని ప్రసరించేవాడు పరమేశ్వరుడు. కాబట్టి శ్రీమన్నారాయణుడు 'మరీచిః' అనబడతాడు. **మహాభారతం**లో

బ్రహ్మమానసపుత్రుడు మరీచి. ఇతనికి కళ, సంభూతి అని ఇద్దరు భార్యలు. ఇతని కుమారుడే కశ్యపుడు అని చెప్పబడింది.

**శ్రీమద్భాగవతం**లో మరీచి యొక్క భార్య వర్ష వీరికి ఆరుగురు కుమారులు ఉన్నారు. ఒకరోజున బ్రహ్మదేవుడు తనకుమార్తె పై వ్యామోహముతో ఆమె వెనక పరుగెడుతుండగా చూసి వీరు పకపకా నవ్వుతారు. దాంతో బ్రహ్మ కోపించి వీరిని రాక్షసయోనులయందు జన్మించమని శపించాడు. వీరు హిరణ్యకశ్యపుని కుమారులుగ పుడతారు. తరువాత జన్మలో దేవకి గర్భాన జన్మించారు.

## 190. దమనః

శమింపచేయువాడు

**భవతాపస్యదమనాత్ కా న్యాదమన ఈరితః**

తనయొక్క చల్లని కరుణ చేత భక్తులకు సంసారతాపమును శమింపచేయువాడు.

**దామ్యతీతి దమనః**

కాంతి అనే గంగా ప్రవాహము చేత సంసారతాపమును శమింపచేయువాడు.

**స్వాధికారాత్ ప్రమాద్యతః ప్రజాః వైవస్వాది రూపేణ దమయితుం శీలం అస్య**

తమయొక్క కర్తవ్యమునుంచి ఏమరుతున్నటువంటి ప్రజలను తాను యముడు మొదలైన రూపములతో ఉండి దమించువాడు. కాబట్టి శ్రీమహావిష్ణువు 'దమనః' అనబడుతున్నాడు.

తాపము అంటే – వేడి, బాధ, కష్టము అని అర్థము. జీవులు మూడు రకాల తాపములతో సంసారికమైన బాధలు అనుభవిస్తుంటాయి. అవి

1. ఆధ్యాత్మికము 2. ఆధిభౌతికము 3. ఆధిదైవకము

**1. ఆధ్యాత్మికములు :** శరీరములో కలిగే వ్యాధులు.

మానసికమైన కామక్రోధాలు, జ్వరము, అలసత్వము,కపటము, అవిశ్వాసము, అశ్రద్ధ మొదలైనవి.

**2. ఆధిభౌతికములు:** అగ్ని, వరద, భూకంపములు, కుక్కల ఏడుపులు, గుడ్లగూబల అరుపులు, కుక్కలు, నక్కలు, పులులు, పాములు మొదలగు వాటివల్ల కలిగే బాధలు.

**3. ఆధిదైవికములు :** దేవతా విగ్రహాల నుంచి కన్నీరు కారటము, ఎండ, వాన, గాలి, యక్ష, రాక్షస, పిశాచాల వలన కలిగే బాధలు.

ఈ మూడింటినీ కలిపి తాపత్రయాలు అంటారు. తాపము అనేది అగ్నియొక్క గుణము. కాబట్టి ఇది అగ్ని లాగానే దహించి వేస్తుంది. ఇటువంటి తాపాన్ని కూడా పరమేశ్వరుడు ఆహ్లాదంగా మార్చుతాడు. ఆ బాధలను శమింపచేస్తాడు. కాబట్టే శ్రీమన్నారాయణుడు 'దమనః' అనబడుతున్నాడు.

లలితా సహస్రంలో **357**వ నామము **తాపత్రయాగ్ని సంతప్త సమాహ్లాదన చంద్రికా.**

## 191. హంసః

హంస స్వరూపుడు, పరమాత్మ యోగవిశేషము, శరీర వాయు విశేషము.

**హంసా వేవం విధోహన్తి గచ్ఛతీతి మనోహరమ్ హంసః**

మనోహరమైన నాలుగువిధాలైన నడకలు నడచేవాడు. సుందరమైన రెక్కలు గలవాడు.

**హంతిమనోహరం గచ్ఛతీతి హంసః** మనోహరమైన నడక గలవాడు. ఇదే స్త్రీ రూపం చెప్పినట్లైతే మరాళీ, మందగమనా అంటారు.

**అహంబ్రహ్మాస్మి** అనేది మహావాక్యము. నేనే పరబ్రహ్మ స్వరూపాన్నిఅని దీని అర్థం.

**'అహంసః' ఇతితాదాత్మ్య భావనః సంసారభయం హంతీతి హంసః**

నేనే ఆ పరమాత్మను అని భావించేవారికి సంసార భయము లేకుండా చేస్తాడు. **అహంసః** అనే దానిలో 'అ'కారము లోపించి 'హంసః' అయింది.

నాలుగు వేదాలలోనూ కలిపి మహావాక్యాలు నాలుగున్నాయి.

| | | | |
|---|---|---|---|
| 1. | ప్రజ్ఞానం బ్రహ్మ | - ఐతరేయోపనిషత్తు | - ఋగ్వేదం |
| 2. | అహం బ్రహ్మాస్మి | - బృహదారణ్యకోపనిషత్తు | - శుక్లయజుర్వేదం |
| 3. | తత్త్వమసి | - ఛాందోగ్యోపనిషత్తు | - సామవేదం |
| 4. | అయమాత్మాబ్రహ్మ | - మాండూక్యోపనిషత్తు | - అధర్వణవేదం |

ఈ వాక్యాలలో చరాచర జగత్తంతా పరమేశ్వర స్వరూపమే. ఆ పరమేశ్వరుడను నేనే. అని చెప్పబడింది. ఇక్కడ హంసః అంటే – అర్థం అదే. కాబట్టి శ్రీమన్నారాయణుడే 'హంసః' అనబడుతున్నాడు.

శరీరంలోని ప్రాణవాయువును హంస అంటారు. ఉచ్ఛ్వాస నిశ్వాసల మీద ఎవరైతే పట్టు లేదా నియంత్రణ సాధిస్తాడో అతడు 'పరమహంస' అనబడతాడు. ఇది యోగప్రక్రియ.

**హంసహంసే తియోబ్రూయాత్ హంసో నామసదాశివః ॥**

## 192. సుపర్ణః

అందమైన రెక్కలు గలవాడు, సంసార బంధమునుండి దరి చేర్చువాడు.

855వ నామము కూడా ఇదే.

**శోభన పర్ణత్వాత్ సుపర్ణ ఇతి కథ్యతే**
**సంసారపార నయనాత్ సుపర్ణ ఇతి వా మతః**

సంసార సాగరము నుండి కడతేర్చువాడు.

**శోభనే పర్ణే పక్ష్యౌ యస్యసః సుపర్ణః** అందమైన రెక్కలు గలవాడు.

**సుష్ఠుపారం నయతీతి సుపర్ణః** సంసారము నుండి దరిజేర్చువాడు.

**శోభనే (ధర్మాఉధర్మరూపే) పర్ణే అస్య**

శోభనములు అయిన ధర్మా ఉ ధర్మ రూపమయిన రెక్కలు గలవాడు.

'సు'అనగా శోభనము అని అర్థం. కాబట్టి శోభనమైన రెక్కలుగలవాడు గరుత్మంతుడు.

భగవద్గీతలోని పదవ అధ్యాయం '**విభూతియోగము**'లోని 30వ శ్లోకము.

**ప్రహ్లాదశ్చాస్మి దైత్యానాం కాలః కలయతామహమ్ ।**

**మృగాణాం చ మృగేంద్రోఽ హం వైనతేయశ్చ పక్షిణామ్ ॥**

అర్జునా ! దైత్యులలో ప్రహ్లాదుడను, గణకులలో కాలమును, మృగములలో సింహమును, పక్షులలో గరుత్మంతుడను కూడా నేనే.

వినతాసుతుడైన గరుడుడు. పక్షులకు రాజు ఇతడు పక్షులన్నింటిలోకి పెద్ద ఆకారము గలవాడు కాబట్టి శ్రేష్ఠుడు. శ్రీమహావిష్ణువుకు వాహనము పరమభక్తుడు. అత్యంత బలశాలి. కాబట్టే భగవానుడు గరుత్మంతుడు కూడా తన రూపమే అని చెబుతున్నాడు.

వినత, కశ్యప ప్రజాపతులకు జన్మించినవాడు గరుత్మంతుడు. అనూరుని సోదరుడు. వినత, కద్రువ ఇద్దరూ దక్షప్రజాపతి కుమార్తెలే. స్వయానా సోదరీ మణులు. అయినప్పటికీ కద్రువ, వినతను మోసం చేసి, మాయోపాయంతో ఓడించి తనకు దాసిగా చేసుకుంది. ఆ తరువాత వినతకు పుట్టిన గరుడుడుకూడా దాసీ పుత్రుడైనాడు. తల్లి దాస్యం విడిపించటం కోసం గరుడుడు దేవలోకానికి పోయి, కావలి వారిని సంహరించి అమృతభాండాన్ని తీసుకు పోయాడు. ఇతడు చేసిన పనికి మెచ్చుకుని శ్రీమహావిష్ణువు అతడికి అమరత్వము ప్రసాదించాడు. తనకు వాహనముగా చేసుకున్నాడు. గరుడునే ధ్వజంగాకూడా చేసుకున్నాడు.

గరుడుడు అమృత భాండం తీసుకుపోతున్నాడని తెలిసి ఇంద్రుడు వజ్రాయుధాన్ని ప్రయోగించాడు. దానికి సమాధానంగా రెండు ఈకలు రాల్చి వెళ్ళిపోయాడు గరుడుడు. అతడి పర్ణములు (రెక్కలు) అంతగట్టివి కాబట్టే అతడికి 'సుపర్ణుడు' అని పేరు వచ్చింది. ఈ రకంగా 'సుపర్ణుడు' అంటే శ్రీమన్నారాయణుడు తప్ప వేరు కాదు.

**ముండకోపనిషత్తు**లో సంసారమనే వృక్షము మీద ఒకే పేరు, ఒకే రూపము గల పక్షులు రెండు ఉన్నాయి. అందులో ఒకటి జీవాత్మ. రెండవది పరమాత్మ.

కాబట్టి ఇక్కడ పక్షి అంటే శ్రీమన్నారాయణుడే.

## 193. భుజగోత్తమః

సర్పములలో ఉత్తముడు.

**భుజగస్యోత్తమ శ్శేషీ భుజగోత్తమ ఉచ్యతే ॥**

భుజగములలో ఉత్తమమయిన ఆదిశేషునకు ప్రభువు.

భుజగము – **భుజేనగచ్ఛంతి ఇతి భుజగాః** భుజముతో నడచునది – సర్పము.

**భుజగానాం ఉత్తమః** భుజగములలో ఉత్తముడు – ఆదిశేషుడు

**భగవద్గీత**లోని పదవ అధ్యాయము **'విభూతయోగము'**లోని 28, 29వ శ్లోకములు.

**ఆయుధానామహం వజ్రం ధేనూనామస్మి కామధుక్ ।**

**ప్రజనశ్చాస్మి కందర్పః సర్పాణామస్మి వాసుకిః ॥**

ఆయుధములలో వజ్రాయుధాన్ని నేను. గోవులలో కామధేనువును నేను. సంతానోత్పత్తి కారణమయిన మన్మథుడను నేను. సర్పములలో వాసుకుని నేను.

**అనంతశ్చాస్మి నాగానం వరుణో యాదసామహమ్ ।**

**పిత్రూణామర్యమా చాస్మి యమస్సంయమతామహమ్ ॥**

నాగజాతిలో ఆదిశేషుడను (అనంతుడను) నేను. జలచరాలకు అధిపతి అయిన వరుణుడను నేను పిత్రుదేవతలలో అర్యముడను నేను. శాసకులలో యమధర్మరాజును నేనే.

వాసుకి సర్పములకు రాజు. గొప్ప భక్తుడు. కాబట్టి సర్పాలలో అతడు శ్రేష్ఠుడు.

ఆదిశేషుడు నాగజాతికి ప్రభువు. వేయి పడగలు గలవాడు. శ్రీమహావిష్ణువుకు శయ్యగా ఉన్నవాడు. అనేకసార్లు ఆయనతో పాటుగా అవతరించినవాడు. ఇతడు కూడా భగవానుని నుండే ఉద్భవించాడు.

ఈ రకంగా ఆదిశేషుడు, వాసుకి మొదలైన వారంతా ఆ శ్రీమహావిష్ణువే. కాబట్టే ఆయన 'భుజగోత్తముడు' అనబడుతున్నాడు. గతంలో చెప్పినట్లుగా

**శింశుమారాత్మనా విష్ణుః భూరాదీనూర్ధ్వతస్థితాన్ ।**

**దద్ధ్రేశేషతయాన్ లోకాన్ సప్తలోకాన్ అథస్థితాన్ ॥**

శ్రీమహావిష్ణువు శింశుమార(మొసలి)రూపంలో ఊర్ధ్వలోకాలను, ఆదిశేషుని రూపంలో అథోలోకాలను మోస్తున్నాడు. కాబట్టి శ్రీమన్నారాయణుడు 'భుజగోత్తమః' అనబడుతున్నాడు

## 194. హిరణ్యనాభః

స్వర్ణమయమైన నాభి కలవాడు.

**హిరణ్యనాభ సౌన్దర్య నాభిర్యస్యేతి సస్స్మృతః** అందమైన నాభి కలవాడు.

**హిరణ్యమ్ నాభౌ యస్యసః హిరణ్యనాభః** స్వర్ణమయమైన నాభి కలవాడు.

బంగారమువలె శుభమయమైన నాభికలవాడు. హితము రమణీయము అయిన నాభికలవాడు.

# 195. సుతపాః

మంచి జ్ఞానము గలవాడు.

**తపో బుద్ధిస్సైవతనుః సుతపా యస్య స స్మృతః**

తపస్సు అనగా - జ్ఞానము, జ్ఞానమే శరీరముగా గలవాడు.

**శోభనం తపః జ్ఞానం యస్యసః సుతపాః** తపః అంటే - జ్ఞానము మంచి జ్ఞానము గలవాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు 'సుతపాః' అనబడుతున్నాడు.

శోభనము, లోకశుభకరము అయిన తపస్సు గలవాడు.

తపస్సు అంటే - మనసుకు, ఇంద్రియాలకు ఏకాగ్రత చేకూర్చటము. ఒకే లక్ష్యముతో నిలకడగా ఉండటము. అదే మంచి తపస్సు.

ప్రశ్నోపనిషత్తులో పిప్పలాద మహర్షిని కత్యుని ముని మనుమడైన కబంధి అడుగుతున్నాడు. "ఓ మహర్షీ! ప్రాణికోటి అంతా ఎక్కడ నుండి పుడుతున్నది?" దానికి పిప్పలాదమహర్షి సమాధానం చెబుతున్నాడు. "కబంధా! ప్రజాపతి సంతానాన్ని పొందగోరినవాడై తపస్సు చేశాడు. ఇక్కడ తపస్సు అంటే పూర్వకల్పంలో తాను చేసిన సృష్టిని ధ్యానించటము. ఈ రకంగా తపస్సు చేసినవాడై 'రయి' 'ప్రాణము' అనే జంటను సృష్టించాడు" అంటూ ఉపనిషత్తును కొనసాగిస్తాడు.

తైత్తిరీయోపనిషత్తులో వరుణమహర్షి కుమారుడు భృగుమహర్షి. విద్యాభ్యాసం పూర్తిచేసి తండ్రివద్దకు వచ్చిబ్రహ్మోపదేశం చెయ్యమంటాడు. "బ్రహ్మోపదేశం ఒకరు చెబితే వచ్చేది కాదు. ఎవరికి వారు తపస్సు చేసి సాధించాలి. కాబట్టి వెళ్ళి తపస్సు చెయ్యి అన్నాడు తండ్రి. పన్నెండు సంవత్సరాలు తపస్సు చేశాడు. 'అన్నమే పరబ్రహ్మ' అని తెలుసుకున్నాడు. ఇవే మాటలు తండ్రికి చెప్పాడు. కాదు. మళ్ళీ తపస్సు చెయ్యి అన్నాడు తండ్రి మళ్ళీ 12 సంవత్సరాలు తపస్సు చేశాడు. 'ప్రాణమే బ్రహ్మ' అని తెలుసుకున్నాడు. అదే మాట తండ్రికి చెప్పాడు. కాదన్నాడు తండ్రి. మళ్ళీ తపస్సు చెయ్యమన్నాడు. మళ్ళీ 12 సంవత్సరాలు తపస్సు చేశాడు తనయుడు. ఇప్పుడు 'మనస్సే బ్రహ్మ' అని తెలుసుకున్నాడు. ఆ మాటే తండ్రికి చెప్పాడు. కాదన్నాడు తండ్రి. మళ్ళీ తపస్సు చెయ్యమన్నాడు. మళ్ళీ 12 సంవత్సరాలు తపస్సు చేశాడు. 'విజ్ఞానమే బ్రహ్మ' అని తెలుసుకున్నాడు. ఆ మాటే తండ్రికి చెప్పాడు. కాదు మళ్ళీ తపస్సు చెయ్యి అన్నాడు తండ్రి. మళ్ళీ 12 సంవత్సరాలు తపస్సు చేశాడు. 'ఆనందమే బ్రహ్మ' అని తెలుసుకున్నాడు.

ఈరకంగా అరవైసంవత్సరాలు తపస్సు చేస్తేనే గాని బ్రహ్మతత్త్వం తెలియలేదు. ఇక్కడ తపస్సు అంటే ఏకాగ్రతతో ఆలోచించటము.

**ఛాందోగ్యోపనిషత్తు**లో ఆత్మను గురించి ఒక ప్రకటన చేశాడు ప్రజాపతి "ఆత్మకు పాపం అంటదు. ముసలితనం రాదు. మృత్యువు దాన్ని కబళించదు. శోకంతాకదు, దానికి ఆకలి దప్పికలు లేవు. సత్యాన్వేషి, ఆత్మను అనుభవించినవాడు మాత్రమే ఆత్మను పొందుతారు."

ఈ మాటలు విన్న దేవరాజు ఇంద్రుడు, రాక్షసరాజు విరోచనుడు బ్రహ్మ దగ్గరకు పోయి ఆత్మతత్త్వాన్ని చెప్పమని అడిగారు.

మనుష్యుల కంటిపాపలలో కనుపించే పురుషుడే ఆత్మ. అది అభయము, అమృతమయం, అదే బ్రహ్మ" అన్నాడు చతుర్ముఖ బ్రహ్మ.

ఈ విషయం విన్న విరోచనుడు తన కళ్ళలో తన దేహమే కనిపిస్తున్నది. కాబట్టి దేహమే ఆత్మ. అని తనవారందరికీ ప్రచారం చేశాడు. కాని ఇంద్రుడు మాత్రం అనేక సంవత్సరాలు బ్రహ్మచర్యాది నియమాలతో తపస్సుచేసి చివరకు బ్రహ్మజ్ఞానాన్ని తెలుసుకున్నాడు.

ఈ రకంగా తపస్సు చెయ్యటము అంటే – అదే విషయాన్ని గురించి తీవ్రంగా ఆలోచించటము. ఆ రకంగా లోకాలకు శుభములు చేకూర్చటానికే తపస్సు చేస్తాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు 'సుతపాః' అనబడుతున్నాడు.

## 196. పద్మనాభః

పద్మమును నాభియందు గలవాడు. 48, 346 నామాలు కూడా ఇదే.

**పార్థివం భూరి పద్మన్తు నాభావష్టదళం మహత్**

**య స్స హేమమయీ దివ్యా కర్ణికా మేరు రుచ్యతే**

**యస్య నాభౌ తదుత్పత్తి పద్మనాభ స్స ఉచ్యతే ॥**

బంగారమయమైన మేరు పర్వతము దుద్దుగా గలిగి, ఎనిమిది దళాలతో అలరారుతున్న పృథివీ సంబంధమైన పద్మమును నాభియందు గలవాడు.

**పద్మమ్ నాభాయస్య సః పద్మనాభః** పద్మమును నాభియందు గలవాడు.

**బ్రహ్మాండపురాణంలో**

**కదా చిత్తస్య సుప్తస్య నాభ్యామ్ కామాదజాయత ।**

**దివ్యమష్టదలం భూరి పంకజం పార్థివం మహత్ ।**

**యస్య హేమమయీ దివ్యకర్ణికా మేరురుచ్యతే ॥**

"సంకల్పముచేత నిద్రలో ఉన్నవాడి నాభినుండి పృథివీ సంబంధమైన అష్టదళ పద్మము కలిగింది. దానికి సువర్ణమయమైన మేరు పర్వతమే తామరదుద్దు అయింది" అని చెప్పబడింది.

ఈ రకంగా శ్రీమన్నారాయణుడే 'పద్మనాభుడు'

## 197. ప్రజాపతిః

ప్రజలకు నాయకుడు. 69వ నామము కూడా ఇదే.

**నైమిత్తి కేత్రు యే సృష్టాః ప్రజాబ్రహ్మముఖాస్తథా ।**

**తేషాం చైవ పతిస్స్వామీ ప్రజాపతి రిహోచ్యతే ॥**

నైమిత్తిక కృషిలో సృష్టించబడిన పరబ్రహ్మ మొదలైనవారికి రాజైనాడు.

**ప్రజానాం పతిః ప్రజాపతి** సకల జగత్తుకూ స్వామి ప్రజలకు, తండ్రి, స్వామి.

అంటూ హంసావతారాన్ని పూర్తిచేశాడు రత్నాకరుడు.

# ౨౦. నృసింహావతారము

కశ్యపుడు ఒక ప్రజాపతి. దక్షప్రజాపతి కుమార్తెలను వివాహం చేసుకున్నాడు. వీరివల్లనే 84 లక్షల జీవరాశి ఉద్భవించింది.

జయవిజయులు వైకుంఠంలో శ్రీమహావిష్ణువుకు ద్వారపాలకులుగా ఉండేవారు. ఒకనాడు సకనసనందనాది మహర్షులు విష్ణు దర్శనార్థం వచ్చారు. ఆ సమయంలో శ్రీమహావిష్ణువు లక్ష్మీదేవితో ఏకాంత మందిరంలో ఉన్నాడు. అందుచేత ద్వారపాలకులైన జయవిజయులు మహర్షులు లోపలికి వెళ్ళటానికి అనుమతించలేదు. దాంతో కోపగించిన మహర్షులు జయవిజయులను భూలోకంలో పుట్టి శ్రీమహావిష్ణువుకు దూరంగా ఉండండి అని శపించారు. అది భరించలేక జయవిజయులు విష్ణుమూర్తి పాదాలు పట్టుకున్నారు. మహర్షుల మాట వ్యర్థం కాదు. అందుచేత భక్తితో ఏడు జన్మలు ఎత్తుతారా ? విరోధంతో మూడు జన్మలలోనే తిరిగి వస్తారా ? నిర్ణయించుకోండి అన్నాడు. ఏడు జన్మల కాలం మేము ఉండలేము. విరోధంతోనైనా సరే మూడు జన్మలలోనే తిరిగి వస్తాము అన్నారు జయవిజయులు.

మొదటిజన్మగా కశ్యపుని ఇంట దితిగర్భాన హిరణ్యకశ్యప హిరణ్యాక్షులుగా జన్మించారు. వీరు అతిక్రూరులు. భయంకరులుగా పేరుపొందారు. హిరణ్యాక్షుడు భూమిని సముద్రంలో పారేశాడు. శ్రీమహావిష్ణువు వరాహరూపంలో అతన్ని సంహరించాడు. హిరణ్యకశ్యపుడు బ్రహ్మను గురించి ఘోరమైన తపస్సు చేశాడు. బ్రహ్మప్రత్యక్షమై ఏవరం కావాలో కోరుకోమన్నాడు. చావులేకుండా వరమడిగాడు రాక్షసుడు. ఇది నావల్ల కాదు.

నేనే శాశ్వతం కాను. కాబట్టి ఇంకేదైనా వరం కోరుకో అన్నాడు బ్రహ్మ. అప్పుడు బాగా ఆలోచించి మనిషిచేతగాని, మృగంచేతగాని, ఇంటి బయటగాని, ఇంటి లోపలగాని, ఆయుధంతోగాని, ఆయుధం లేకుండాగాని, పగలుగాని, రాత్రిగాని నాకు చావు రాకూడదు. అంటూ విచిత్రమైన కోరిక కోరాడు హిరణ్యకశ్యపుడు 'తథాస్తు' అన్నాడు బ్రహ్మ.

వరబలంతో రాక్షస సేనలను వెంట బెట్టుకుని విజృంభించాడు హిరణ్యకశ్యపుడు. ముల్లోకాలనూ జయించాడు. ఇతడి ధాటికి ఆగలేక దేవతలు స్వర్గం వదలి పారిపోయారు. విష్ణుమూర్తి కూడా ఇతడికి కనిపించకుండా, అతడి ముక్కు రంధ్రాలలోనే దాక్కున్నాడు. దేవతలను, మునులను, ఋషులను నానాహింసలకు గురిచేశాడు రాక్షసరాజు. యజ్ఞయాగాది క్రతువులు మాన్పించాడు. కుమారుడైన ప్రహ్లాదుడు మాత్రం విష్ణుభక్తుడు. కుమారుని పిలిచి విష్ణుభక్తి మానమన్నాడు ప్రహ్లాదుడు వినలేదు. అతనిని అనేకరకాలుగా

హింసిచాడు. కొండలమీంచి క్రిందికి త్రోయించాడు. సముద్రంలో పారేయించాడు. ఏనుగులతో త్రొక్కించాడు. పాములతో కరిపించాడు. అయినా ప్రహ్లాదుడు విష్ణుభక్తి మానలేదు. చివరికి విసిగిపోయి ఎక్కడ ఉన్నాడు ఆ హరి అని అడిగాడు. ఈ జగత్తులో అణువణునా ఉన్నాడు అన్నాడు కుమారుడు. అయితే ఈ స్తంభంలో ఉన్నాడా ? అన్నాడు రాక్షసుడు వెటకారంగా ఉన్నాడు అని నిశ్చయంగా చెప్పాడు ప్రహ్లాదుడు. గదతో స్తంభాన్ని పగులకొట్టాడు దానవేంద్రుడు. నృసింహావతారియైన శ్రీమహావిష్ణువు స్తంభంలోనుంచి ఉద్భవించి, హిరణ్యకశ్యపుడు కోరిన ప్రకారమే అతన్ని పగలు రాత్రి కాకుండా సంధ్యవేళలో, ఇంటాబయటా కాకుండా గుమ్మంమీద, మనిషి మృగముకాని నారసింహుడు, ఆయుధాలు కాని గోళ్ళతో చీల్చిచంపేశాడు.

పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు మృత్యువు లేనటువంటివాడు. శాశ్వతమైన వాడు. సత్యము, నిత్యము అయినవాడు. అతడు లోకంలో జరిగే విషయాలన్నింటినీ చూస్తూనే ఉంటాడు. సింహరూపం గలవాడు. తనభక్తులను రక్షించేవాడు. భక్తులతోనే కలసి ఉంటాడు. భక్తులు ఏదైనా అపచారంచేసినా వారిని వదలడు. అతడికి జన్మ అనేది లేదు. నారసింహుడుగా స్తంభంనుంచి ఉద్భవించాడు అంతేగాని ఇతర జీవులవలె యోని సంభవుడు కాడు. శత్రువులెవరు ఇతన్ని భరించలేరు. పరమేశ్వరుడు దుర్మార్గులను, దుష్టులను శిక్షిస్తాడు. ధర్మశాస్త్రాలు వ్రాసి మానవుల నడవడి ఎలా ఉండాలో నిర్ణయించాడు. అవతారాలన్నింటిలోకీ విలక్షణమైనది, ప్రసిద్ధమైనది అయిన నరసింహావతారానికి ఘనమైన చరిత్రకలవాడు. దేవతలకు, మునులకు, ఋషులకు సత్పురుషులకు బాధలు కలిగించే వారిని సంహరించి, సజ్జనులకు ఆనందాన్ని కలిగిస్తాడు.

ఈ విషయాలన్నీ 198 నుంచి 208 వరకు గల నామాలలో వివరించటం జరిగింది. ఇక నామాలను చూద్దాం.

## 198. అమృత్యుః

మృత్యువు లేనటువంటివాడు, మృత్యువుకు విరోధి.

**మృత్యో ర్విరోధి రూపో యో మృత్యు మృత్యు స్వరూపతః ।**
**అమృత్యురితి తం ప్రాహుః సన్తార్ణో మృత్యునాశకః ॥**

మృత్యువుకు విరోధి కాబట్టి తన భక్తులకు మృత్యువు లేకుండా చేసేవాడు.

ఇతడు మృత్యువుకు మృత్యువు.

పరమేశ్వరుడు సత్యము నిత్యము అయినవాడు. శాశ్వతుడు. అతడికి ఆద్యంతములు లేవు. జన్మమృత్యుజరాదులు లేవు.

ప్రతి మానవుడు ఈ భూమిమీద జన్మించిన తరువాత కొన్ని కర్మలు చేస్తాడు. అవి మంచి కావచ్చు లేదా చెడు కావచ్చు. మంచి కర్మలు చేస్తే పుణ్యము చెడు కర్మలు చేస్తే పాపము మూటకట్టుకుంటాడు. మానవుని చివరిదశలో అతడు చేసిన కర్మఫలితము తప్ప ఇంకేదీ అతని వెంట రాదు. అతడు సంపాదించిన ఆస్తిపాస్తులు, ఇల్లు వాకిలి, పొలాలు స్థలాలు, ధనధాన్యాలు ఇవన్నీ ఇంటివద్దే ఉండిపోతాయి. అతని బంధువులు మిత్రులు అతడితో పాటు స్మశానం దాకా వస్తారు. ఆ తరువాత అతడితో పాటు వెళ్ళేవి అతడు చేసిన కర్మ ఫలితాలు మాత్రమే.

మరణానంతరము అతడు స్వర్గనరకాలలో తాను చేసిన కర్మల ఫలితము అనుభవిస్తాడు. ఆ తరువాత కర్మశేషము అనుభవించటానికి మళ్ళీ ఈ భూమిమీద జన్మిస్తాడు. మళ్ళీ కర్మలు చేస్తాడు. మానవుడు జన్మిస్తుంటాడు. కర్మలు చేస్తాడు. కర్మఫలితం అనుభవించటానికి మళ్ళీ జన్మిస్తాడు. ఈరకంగా గానుగకు కట్టిన ఎద్దులాగా సంసారమనే బండిచక్రంలో పడి గిరగిరా తిరుగుతుంటాడు.

కర్మలు చేసేది మానవుడొక్కడే. ఇతర జీవులేవీ కర్మలు చేయవు. పశుపక్ష్యాదులు కర్మలు చెయ్యలేవు. దేవతలకు శరీరం లేదు కాబట్టి, వారికి కర్మ చేసే శక్తి లేదు. అందుచేతనే కర్మ చెయ్యాలి అంటే ఈ భూమిమీదికి రావలసినదే కాబట్టే ఇది కర్మభూమి.

యోగి అయినవాడు, ముముక్షువు కర్మలు చేయరు. కాబట్టి వారికి కర్మ ఫలితముండదు. గతంలో చేసిన ప్రారబ్ధకర్మల ఫలితము ఈ జన్మలో అనుభవిస్తారు. ఈ జన్మలో కర్మ చెయ్యలేదు కాబట్టి మరుజన్మ ఉండదు. కర్మశేషము లేకపోతే జన్మ ఉండదు. మంచిగాని, చెడుగాని ఏ పనిచేసినా, దాని ఫలితము అనుభవించి తీరాల్సిందే. అంటే మళ్ళీ జన్మ ఎత్తి తీరాలి. ఆ కారణంగానే ముముక్షువులు కర్మ చెయ్యరు. ఒకవేళ కర్మ చేయవలసివస్తే పరమేశ్వరపరంగా చేస్తారు. దానివలన వచ్చే ఫలితముతో అతడికి ఏ సంబంధమూ ఉండదు.

ఈరకంగా కర్మఫలం లేదు కాబట్టి ఉత్తరజన్మ లేదు. జన్మే లేనివాడికి మరణం ఎక్కడనించి వస్తుంది ? పరమేశ్వరుడికి రూపంలేదు. కాబట్టి కర్మ చెయ్యలేడు. అందుచేత అతడికి జన్మలేదు, మరణం లేదు. ఈ విధంగా మృత్యువు లేనివాడు పరమేశ్వరుడు. అతడే మృత్యువుకు మృత్యువు. కల్పాంతాన అందరి దేవతలతో పాటుగా మృత్యుదేవతను కూడా లయం చేస్తాడు. కాబట్టి శ్రీమన్నారాయణుడు 'అమృత్యుః' అనబడుతున్నాడు.

# 199. సర్వదృక్

సర్వాన్నీ చూసేవాడు.

**అనుకూలాన్ తటిస్థాం శ్చ ప్రతికూలా నపి స్వయమ్**

**నియన్తుం చ యథాయోగ్యం యః పశ్యతి స సర్వదృక్**

భగవంతుడు సర్వజ్ఞుడు కాబట్టి తన భక్తులను, శత్రువులను కూడా వారికర్మలకు తగినట్లుగా నియమిస్తాడు.

**సర్వాన్ పశ్యతీతి సర్వదృక్**

అందరినీ చూస్తూ ఉంటాడు కాబట్టి 'సర్వదృక్' అనబడతాడు. అందరినీ శాసిస్తాడు.

పరమేశ్వరుడు జగత్తంతా వ్యాపించి ఉన్నాడు. కాబట్టి ఎప్పుడు, ఎక్కడ, ఏమి జరుగుతున్నదో అంతా గమనిస్తూనే ఉంటాడు. అతనికి పంచభూతాలు, సూర్యుడు, చంద్రుడు, యముడు, కాలము అనే తొమ్మిది మంది వేగులున్నారు. వీరివల్ల ఎప్పటికప్పుడు విషయాలను సేకరిస్తాడు.

పరమేశ్వరుడు సర్వతోముఖుడు. అన్నివైపులకు ముఖాలు కలవాడు. కాబట్టి జగత్తునంతా పరిక్షిస్తుంటాడు. జీవులు చేసిన కర్మలను ఎప్పటికప్పుడు సేకరిస్తాడు. కాబట్టి మరణానంతరము అతడికర్మలకు తగిన ఫలితాన్నే అతడికి ఇస్తాడు. ఇందులో ఏ విధమైన తేడాలు ఉండవు. అతడికి బంధుత్వాలుండవు, పక్షపాతముండదు. తనవారు అనేది ఎవరూ ఉండరు. అతడికి ఎవరూ ఏమీకారు. కాని అతడు అందరికీ అవుతాడు. అందుచేత ఎవరి కర్మ ఫలితాన్ని వారికి సజావుగా పంచుతాడు. కర్మశేషము అనుభవించటానికి ఉత్తరజన్మలు కూడా అలానే ఇస్తాడు. తన భక్తులుగాని, తనను ద్వేషించేవారు. గాని, వారి కర్మలకు తగినట్లుగా వారిని నియమిస్తాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'సర్వదృక్' అనబడుతున్నాడు.

# 200 సింహః

సింహ స్వరూపముగలవాడు. 488వ నామముకూడా ఇదే.

**రిపుద్విపానాం నిష్శేష భీషణ స్సింహ ఉచ్యతే ।** తన భక్తులకు శత్రువులనే మదగజాలను సంహరించే భయంకరమైన సింహాకారము ధరించువాడు.

**సించతీతి సింహః**

శత్రుసంహారము చేసే ఉగ్రనరసింహుడు. 'హింసి' అనే పదమే 'సింహి'గ మారింది. కాబట్టి సింహము అంటే – హింసించువాడు అని అర్థము. **భగవద్గీత** పదవ అధ్యాయము **'విభూతి యోగము'**లోని 30వ శ్లోకము.

**ప్రహ్లాదశ్చాస్మి దైత్యానాం కాలః కలయతామహమ్**

**మృగాణాం చ మృగేంద్రోఽహం వైనతేయశ్చ పక్షిణామ్**

దైత్యులలో ప్రహ్లాదుడను. గణుకులలో కాలమును, మృగములలో మృగరాజైన సింహమును, పక్షులలో గరుత్మంతుడను నేనే.

సింహము మృగాలన్నింటిలోకీ బలమైనది. పరాక్రమము గలిగినది. పైగా మృగరాజు. అందుచేతనే శ్రీమహావిష్ణువు ఆ సింహము తన రూపమే అని చెబుతున్నాడు.

హిరణ్యకశ్యపుడు తన భక్తుడైన ప్రహ్లాదుని అనేక బాధలకు గురిచేశాడు. అది భరించలేక చివరకు నృసింహావతారమెత్తి ఆ రాక్షసుని సంహరించాడు శ్రీమహావిష్ణువు. అందుచేతనే ఆయన 'సింహము' అనబడుతున్నాడు.

## 201. సంధాతా

చేరతీయువాడు

**ప్రహ్లాదాద్యైశ్చ సన్ధాతా సంశ్లేష కరణాచ్చ సః** సింహమువంటి భయంకరమైన రూపము దాల్చికూడా ప్రహ్లాదుడు మొదలైన భక్తులను రక్షించువాడు.

**సందధాతీతి సంధాతా**

శత్రువులను సంహరించి ఆశ్రితులను రక్షించువాడు. హిరణ్యకశ్యపుడు. హరిభక్తి మానమన్నాడు. అలా చేయలేదని కుమారుణ్ణి కొండలమీదనుంచి క్రిందికి తోయించాడు. ఏనుగులతో త్రొక్కించాడు, పాములతో కరిపించాడు, నడి సముద్రంలో పారేయించాడు. చివరకు కాలకూటం త్రాగించాడు. అయినా హరినామస్మరణ మానలేదు ప్రహ్లాదుడు. ఇంక ఏం చెయ్యాలో తెలియలేదు హిరణ్యకశ్యపుడికి హరి ఎక్కడ ఉన్నాడో చూపమన్నాడు. "అతడు పరమేశ్వరుడు. సర్వాంతర్యామి. ఒకచోట అని ఏమిటి ? ఎక్కడబడితే అక్కడే ఉన్నాడు. నేలమీద నింగిలోనూ, నీటిలోనూ, భూమిమీద, ఆకాశంలోను అంతరిక్షంలోనూ, పాతాళంలోనూ అంతటా ఉన్నాడు." అన్నాడు ప్రహ్లాదుడు. కోపం కట్టలు తెంచుకున్నది రాక్షసరాజుకు. అయితే ఈ స్తంభములో చూపగలవా ? అన్నాడు ప్రక్కనే ఉన్న ఒక స్తంభాన్ని చూపించి 'అలాగే చూపిస్తాను' అన్నాడు ప్రహ్లాదుడు. ఆ మాటలకు మహోగ్రుడై

తనగదా దండముతో ఆ స్తంభాన్ని ఒక్క దెబ్బవేశాడు. ఆ దెబ్బకు స్తంభం నిలువునావిచ్చి పోయింది. అందులోనుంచి మహాఉగ్రుడైన నరసింహమూర్తి ప్రత్యక్షమైనాడు. ఆ రూపం చూడటానికి మహాభయంకరంగా ఉంది. గాండ్రిస్తూ ముందుకు దూకాడు. హిరణ్యకశ్యపుణ్ణి ఎత్తుకుని అతడు కోరినవిధంగానే ఇంటా బయటా కాకుండా, గుమ్మంమీద, పగలు రాత్రి కాకుండా సంధ్యవేళలో మనిషి మృగముకాని నరసింహుడు చీల్చి చంపేశాడు.

ఈరకంగా తన భక్తులయొక్క శత్రువులను సంహరించి భక్తులను రక్షిస్తాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు 'సంధాతా' అనబడుతున్నాడు.

## 202. సంధిమాన్

చేరి ఉండువాడు.

**ప్రహ్లాదాద్యై ర్నిత్యసన్ధి ర్యస్యాస్యా త్సంధిమాన్ స్మృతః ॥**

ప్రహ్లాదాది భక్తులతో ఎల్లప్పుడూ కలసి ఉండేవాడు.

**సంధిః అస్యాస్తీతి సంధిమాన్** నిత్యము సజ్జనులతో చేరి ఉండేవాడు.

పరమేశ్వరుడు ఎక్కడ ఉంటాడు ? అంటే సత్యము, ధర్మము, న్యాయము, నీతి ఎక్కడ ఉంటాయో, వేదవేదాంగ విదులు ఎక్కడ ఉంటారో, శాస్త్రపండితులు ఎక్కడ ఉంటారో, పురాణ పఠనము ఎక్కడ జరుగుతుంటుందో, ఎక్కడ సజ్జనులు గౌరవించబడు తుంటారో, యజ్ఞయాగాది క్రతువులు ఎక్కడ జరుగుతుంటాయో, దానధర్మాలు ఎక్కడ జరుగుతుంటాయో అక్కడ పరమేశ్వరుడు ఉంటాడు.

వామనావతార ఘట్టంలో యజ్ఞశాలకు వచ్చిన వామనుని చూసి బలిచక్రవర్తి "ఓవటువా! నీవెవరు? నీ తల్లిదండ్రులెవరు? నీ గురువుగారి పేరు ఏది? ఏ ఊరి నుంచి వచ్చావు? ఎక్కడ ఉంటావు?" అని అడుగుతాడు. దానికి వామనమూర్తి "రాజా! నాకు ఒక చోటు అంటూ ఏదీలేదు. దేశం అంతా తిరుగుతుంటాను. నావారు అంటూ ఎవరూ లేరు. అందరికీ నేను మాత్రమున్నాను. ఇక ఏమి చదివాను అంటావా? అది ఇది అని ఎందుకు? అన్ని శాస్త్రాలు చదివాను. గతంలో లక్ష్మీదేవి నాదగ్గర ఉండేది ఇప్పుడు అదికూడా లేదు. ఇక నా నివాసము అంటావా **సుజనులందు తరచు సొచ్చి ఉందు**" అంటాడు.

అష్టాదశ పురాణాలు వ్రాసినవాడు వ్యాసుడు. ఇతడుకూడా విష్ణుమూర్తి అవతారమే.

పూర్వకాలంలో వారణాశిలో వేదవిదుడు అని ఒక పండితుడుండేవాడు. అతని భార్య వేదవతి. వీరు చాలా బీదవారు. ఉన్నదాంతో హాయిగా కాలం వెళ్ళబుచ్చుతున్నారు.

కాని వీరికి పిల్లలు లేరు. ఒకరోజున ఒక మహానుభావుడు కనిపించి మధ్యాహ్నం పన్నెండు గంటల సమయంలో వేదవ్యాసుడు గంగానదిలో స్నానం చేస్తాడు. అతన్ని శరణువేడు. నీకు సంతానం కలుగుతుంది. అని చెప్పాడు.

మరునాడు మధ్యాహ్నం గంగానదీ తీరానికి వెళ్ళికూర్చున్నాడు వేదవిదుడు. అపరాహ్నమవుతున్నది. ఇంకా స్నానం చెయ్యటానికి ఎవరూ రావటం లేదు. వ్యాసుడు ఎప్పుడు వస్తాడో, ఏ రూపంలో వస్తాడో తెలియదు. అయినా వదలకూడదు. అనుకుని జాగ్రత్తగా చూస్తున్నాడు. ఇంతలో ఒక భిక్షకుడు నదీ స్నానానికి వచ్చాడు. సరిగ్గా అపరాహ్నం. సందేహం లేదు. ఇతడే వ్యాసుడు అని నిర్ధారించుకుని వేగంగా వెళ్ళి ఆ భిక్షకుని పాదాలు పట్టుకున్నాడు. విదిలించుకున్నాడు బిక్షకుడు. కరుణించమన్నాడు వేదవిదుడు. అసహ్యించుకున్నాడు, ఛీత్కారం చేశాడు బిక్షువు. ప్రాధేయపడ్డాడు వేదవిదుడు. కరుణించి సాక్షాత్కరించాడు వ్యాసుడు. ఆ మరునాడు తన తండ్రి ఆబ్దీకము. కాబట్టి ఇంటికి రమ్మన్నాడు సరేనన్నాడు వ్యాసుడు.

మరుసటి రోజు వేదవిదుని ఇంటికి వచ్చాడు. బిక్ష తీసుకుంటుండగా వేదవిదుడికి సంతానం లేదని తెలిసింది. అతన్ని కనికరించి సంతానప్రాప్తి, ధనధాన్యాలు, భోగభాగ్యాలు కలుగుతాయని దీవించాడు వ్యాసుడు. అప్పుడు 'మళ్ళీ మీ దర్శనం చేసుకోవాలంటే ఎలా ?' అని అడిగాడు వేదవిదుడు. దానికి వ్యాసుడు 'పురాణాలు, వేదాలు, భాష్యాలు, ఆధ్యాత్మిక ఉపన్యాసాలు, చెప్పేవారిలో నేనుంటాను, సజ్జనులయందుంటాను' అంటాడు.

ఈరకంగా పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు 'సంధిమాన్' అనబడుతున్నాడు.

## 203. స్థిరః

స్థిరమైనవాడు, చలనము లేనివాడు.

**అపచారేష్వ చాల్యత్వా త్సన్థానే స్థిర ఉచ్యతే ॥** తనభక్తులు అపచారము చేసినప్పటికీ వారిని వదలకుండా, వారితోనే కలసి ఉండువాడు.

**తిష్ఠతీతి స్థిరః** చలించకుండా స్థిరంగా ఉండేవాడు. తాను భక్తుల దగ్గరకు వెళ్ళినప్పుడు వారు చేసే అపచారములు చూసి చలించనివాడు.

**సదా ఏకరూపః** ఎల్లప్పుడూ ఒకే రూపంలో ఉండేవాడు.

శ్రీకృష్ణ భగవానుడు విదురుని ఇంటికి అతిధిగా వెళ్ళాడు. అనుకోకుండా వచ్చిన వాసుదేవుని చూసి మహా ఆనంద పడిపోయాడు విదురుడు. స్వాగతం పలికాడు. భక్తితో

వినమ్రుడై శ్రీకృష్ణునికి ఫలాహారం ఇస్తున్నాడు. అరటిపళ్ళు నివేదన చేస్తున్నాడు. పరమాత్ముడు అంత ప్రేమగానూ స్వీకరిస్తున్నాడు. కొంతసేపటికి విదురుని భార్య లోపల నుంచి వచ్చింది చూసింది. అపచారం జరిగింది అంటూ బాధపడి శ్రీకృష్ణ పరమాత్ముని క్షమించమని కోరింది. అప్పుడు చూశాడు విదురుడు. అరటిపండు తోలు తీసి, పండు క్రింద పడేసి పొరపాటున ఆ తోలును పరమాత్మునికి నివేదన చేస్తున్నాడు. తాదాత్మ్యంలో అది గమనించలేదు. మహాపరాధం. అయినా పరమాత్ముడు ప్రేమతోనే స్వీకరించాడు గాని కోపగించలేదు. విదురుని మీద ఆప్యాయత చూపుతూనే ఉన్నాడు.

ఈరకంగా భక్తులు చేసే అపరాధాలను, అపచారాలను సహించి వారితోనే ఉంటాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు 'స్థిరః' అనబడుతున్నాడు.

పరమేశ్వరుడు ఎప్పుడూ ఒకే రూపంలో ఉంటాడు. ఎందుచేతనంటే అతడు నిరాకారుడు. నిర్గుణ స్వరూపుడు. ఒక రూపము అంటూ ఉంటే దానికి జన్మించటము, వృద్ధి చెందటము, నశించటము మొదలైనవి ఉంటాయి. కాని పరమేశ్వరుడు ఆది అనాది లేనివాడు. జన్మజరా మృత్యువులు లేనివాడు. ఎప్పుడూ నిండు యవ్వనములోనే ఉండేవాడు. **సదాషోడశ వర్షీ యాం** పరమేశ్వరుడు ఎప్పుడూ పదహారు సంవత్సరాల వయసులోనే ఉంటాడు. అందుచేతనే ఎప్పుడూ ఒకేరూపంలో ఉంటాడు. అతడికి ఏ రకమైన చలనము లేదు. స్థిరంగా ఉంటాడు. అందుచేతనే పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు 'స్థిరః' అనబడుతున్నాడు.

## 204 అజః

జన్మ లేనటువంటివాడు. 95, 521 నామాలు కూడా ఇదే.

**స్తంభజత్వాదితరవ న్నజాతత్వా దజస్స్మృతః**

స్తంభమునుంచి ప్రత్యక్షమైనవాడు. అంతేకాని యోని సంభవుడు కాదు.

**నజాయతే ఇతి అజః** పుట్టుక లేనటువంటివాడు.

**న జాయతే జనిత్ర్యామ్ యదజస్తస్మా దనేకజిత్** జన్మనిచ్చే ప్రకృతిలో అనగా ఇతరుల వలె పుట్టనివాడు. తన ఇష్టానుసారము ఉద్భవించిన వాడు.

**అజతి–గచ్ఛతి భక్తానాం హృదయేషు** భక్తులయొక్క హృదయాలలోకి చొచ్చుకుపోతాడు.

**అజతి – క్షిపతి దుష్టాన్** దుష్టులను, దుర్మార్గులను దూరంగా ఉంచుతాడు.

ఈ నామంలో నారసింహుని జన్మవృత్తాంతాన్ని వివరిస్తున్నారు. హిరణ్యకశ్యపుడు 'ఎక్కడ వున్నాడు ఆ హరి' అని అడిగాడు కుమారుణ్ణి. 'జగత్తంతా విష్ణుమయమే. ఒక చోట అని ఏమిటి ? ఎక్కడబడితే అక్కడ ఉన్నాడు ప్రతిచోటా ఉన్నాడు' అన్నాడు ప్రహ్లాదుడు. "“అలాగయితే ఈ స్తంభము నందు ఉన్నాడా ?” అన్నాడు ఎగతాళిగా ఉన్నాడు అన్నాడు ప్రహ్లాదుడు. హిరణ్యకశ్యపునికి పౌరుషం వచ్చింది. పట్టుదల హెచ్చింది. దాంతోగద తీసుకుని స్తంభాన్ని ఒక్కదెబ్బ వేశాడు. మరుక్షణమే ఆ స్తంభంలో నుంచి బయటకు వచ్చాడు నారసింహుడు. ఇక్కడ పరమేశ్వరుడు అందరికిమల్లే ఏ స్త్రీ గర్భాన జన్మించలేదు. అయోనిజుడుగా స్తంభము నుండి బయటకు వచ్చాడు. భయంకరమైన రూపంలో ఉన్నాడు దేదీప్యమైన కాంతులతో వెలుగుతన్నాడు. భీషణ గర్జనలు చేస్తున్నాడు. కంఠము దగ్గరనుంచి క్రిందిభాగము మనిషి. తలమాత్రము సింహము. అదే నరసింహము. మిగిలినవారిలా కాక ఈ స్వామి అయోనిజుడుగా వచ్చాడు. అందుచేతనే నృసింహుని రూపంలో ఉన్న శ్రీమహావిష్ణువు 'అజః' అనబడుతున్నాడు.

## 205. దుర్మర్షణః

సహించలేనివాడు.

**దుష్కరం మర్షణం యస్య పరై ర్దుర్మర్షణస్స్మృతః ॥**

శత్రువులచే సహింపబడజాలనివాడు.

**దుఃఖేనాపి మర్షితుమ్ అశక్యః దుర్మర్షణః** విరోధులచే సహింపజాలనివాడు.

పూర్వకాలము నుంచీ కూడా దేవదానవ సంగ్రామం జరుగుతూనే ఉన్నది. చాలామంది రాక్షసులు వంశపారం పర్యంగా వస్తున్న జాతివైరాన్ని అనుసరిస్తూనే ఉన్నారు. కాని వారెవరికీ శ్రీమహావిష్ణువును గెలవటం సాధ్యంకాలేదు. వారందరూ అతని చేతిలోనే మరణముకూడా పొందారు. అంతదాకా ఎందుకు హిరణ్యాక్షుడు విష్ణువుపైన ఉన్న జాతివైరంతో అతన్ని సంహరించాలని ప్రయత్నించాడు. అతని ప్రయత్నాలు సఫలం కాలేదు. చివరకు శ్రీమహావిష్ణువే అతన్ని వరహావతారమెత్తి సంహరించాడు. ఈరకంగా రావణ కుంభకర్ణులు, మధుకైటభులు మొదలైనవారు శ్రీమహావిష్ణువును సంహరించాలి అనుకుని, చివరకు అతని చేతిలోనే మరణం పొందారు.

దుష్టులు దుర్మార్గులు ఎంత చేసినా సరే వారిని సహించడు. వారు ఎంత శ్రమచేతను కూడా సంహరించబడటానికి శక్యుడుకాడు. కాబట్టే శ్రీమహావిష్ణువు 'దుర్మర్షణః' అనబడుతున్నాడు.

# 206. శాస్తా

శిక్షించువాడు.

**సమస్తాన్ కణ్టకాన్ శాస్తీ త్యతశ్శాస్తేతి కీర్త్యతే** లోకకంటకులైన దుర్జనులను శిక్షించువాడు. **శాస్తీతి శాస్తా** సమస్త దుర్జనులను ఈదేహముతో శిక్షించువాడు. ఈతనిని చూడగానే దైత్యులు పారిపోతారు.

పరమేశ్వరుడు ధర్మపరుడు, ధర్మరక్షకుడు. ధర్మపరులను ఎల్లవేళలా కాపాడుతుంటాడు. దుర్జనులు, దురాత్ములు, ధర్మానికి హాని కలిగించినట్లైతే వారిని కఠినంగా శిక్షిస్తాడు. మహర్షులయొక్క తపస్సుకు విఘ్నాలు కలుగచేసే రక్కసి మూకలను ఎప్పటికప్పుడు సంహరించేశాడు తాటకను వధించాడు. సుబాహువును సంహరించాడు. మారీచుని చావు దెబ్బకొట్టి రాక్షసి మూకలకు గుర్తుగా వదిలాడు. ఖరదూషణాదులను సంహరించాడు. తద్వారా మిగిలినవారికి హెచ్చరికలు పంపాడు. అయినప్పటికి మంచి మార్గానికి రాని రావణ కుంభకర్ణులను సమూలంగా నాశనం చేశాడు.

కృష్ణావతారంలో ధేనుకాసురుడు, ప్రలంబాసురుడు, పూతన, శకటాసురుడు, వృషభాసురుడు, కేశి ఇత్యాది రాక్షసులను సంహరించాడు. కాళింది నదిలో భీభత్సము సృష్టిస్తున్న కాళీయుని మద మణచాడు. తద్వారా కంస మహారాజును హెచ్చరించాడు. ఆ హెచ్చరికలు పెడచెవిన పెట్టిన కంసుని సంహరించాడు. ఈ రకంగా దుర్మార్గంగా వ్యవహరించేవారు, అహంకార పూరితులు అయిన రుక్మిని సంహరించాడు. శిశుపాలుని కుత్తుకను ఉత్తరించాడు. జరాసంధుని చంపించాడు. ఈవిధంగా అనేకమందిని వారు చేసిన దుష్కృత్యాలకు తగినట్లుగా శిక్షించాడు. అందుచేతనే శ్రీమహావిష్ణువు 'శాస్తా' అనబడుతున్నాడు.

**శ్రుతిస్మృత్యాదిభిః సర్వేషాం అనుశిష్టం - అనుశాసనం కరోతి** శ్రుతులు, స్మృతులద్వారా జనులందరినీ ఈరకంగా నడచుకోండి అని శాసించినవాడు.

లోకంలో ఉత్తమమైన పనులు చేసేది పరమేశ్వరుడే. అతడే వేదాలను బ్రహ్మదేవుడికి ఇచ్చాడు. ఆ వేదాలు అర్థం కానటువంటి సమయంలో తానే వ్యాసుని రూపంలో వేదాలను విభజించాడు. అప్పుడు కూడా అవి అర్థం కాలేదు. ఆ సమయంలో వేదసారాన్ని పురాణాల రూపంలో వ్రాశాడు. ఏ పనిచెయ్యాలి ? ఏది చెయ్యకూడదు అనే మీమాంశ వచ్చినప్పుడు మనువుగా జన్మించి ధర్మసూత్రాలు వ్రాశాడు. ఈరకంగా శ్రుతులు, స్మృతులు వ్రాసి వాటిద్వారా మానవులు ఏవిధంగా నడుచుకోవాలి ? అనే మార్గాన్ని నిర్దేశించాడు. అలా చెయ్యనివాళ్ళను శిక్షించాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'శాస్తా' అనబడుతున్నాడు.

# 207. విశ్రుతాత్మా

సుప్రసిద్ధమైన చరిత్ర గలవాడు.

**విస్మయేన స్మృతం దేవైః సైంహం యస్యాపదానకమ్**
**శీలం తైర్విశ్రుతాత్మనః మహత్కీర్తి ప్రదోమనుః**

దేవతలందరూ ఆశ్చర్యంగా చెప్పుకుంటున్నటువంటి నృసింహావతారములో అద్భుత వ్యాపారములు చేసినవాడు.

**విశ్రుతః ఆత్మాయస్యసః విశ్రుతాత్మా** సర్వకాల సర్వావస్థలయందు, అందరినీ ఆశ్చర్యపరచేటటువంటి, ప్రసిద్ధమైనటు వంటి నరసింహావతార చరిత్ర గలవాడు.

శ్రీమహావిష్ణువుఎత్తిన అవతారాలలో నరసింహావతారము ప్రత్యేకమైనది. హిరణ్యకశ్యపుడు తపస్సు చేసినప్పుడు బ్రహ్మ ప్రత్యక్షమయి ఏ వరం కావాలో కోరుకో మన్నాడు. 'నాకు మృత్యువు లేకుండా వరం ప్రసాదించు ప్రజాపతీ' అన్నాడు దానవేంద్రుడు. 'అది మాత్రం కుదరదు. ఎందుకంటే పుట్టిన ప్రతిప్రాణీ మరణించాల్సిందే. అది సృష్టిధర్మం. పైగా నేనే శాశ్వతమైనవాడిని కాను. మానవ కాలమానం ప్రకారము 4,32,00,00,000 సంవత్సరాలు అనగా 1,20,00,000 దివ్యసంవత్సరాలు. ఇది బ్రహ్మకు ఒక పగటి కాలము. రాత్రి కాలముకూడా అంతే ఉంటుంది. ఈరకంగా వంద సంవత్సరాలు గడిస్తే బ్రహ్మకల్పము పూర్తి అవతుంది. అప్పుడు బ్రహ్మ ఆయుర్దాయం తీరిపోతుంది. అతడు పరబ్రహ్మలో లీనమవుతాడు. కాబట్టి నాకే శాశ్వతత్త్వం లేదు. అలాంటి నేను నీకు మృత్యువు లేకుండా వరము ఎలా ఇవ్వగలను? అందుచేత ఇంకేదైనా వరం కోరుకో అన్నాడు బ్రహ్మ. ఆలోచించాడు హిరణ్యకశ్యపుడు. అప్పుడు మనిషిచేతగాని, మృగంచేతగాని, ఇంటిలోపల గాని, బయటగాని, ఆయుధంతోగాని, ఆయుధం లేకుండాగాని, పగలుగాని, రాత్రిగాని చావు లేకుండా వరమడిగాడు. దానవేంద్రుడు. తథాస్తు అన్నాడు బ్రహ్మ. దేవతల గుండెలు గుభేలుమన్నాయి. పరమ కిరాతకుడైన ఈ రాక్షసుని సంహరించేదెలా? ఇక వీడికి చావురాదు. అని నిశ్చయించుకున్నారు. స్వర్గాధిపత్యము అతడికి వదలి అడవులకు పారిపోయారు. ఇక 'శాశ్వతంగా తమగతి ఇంతే' అని సరిబుచ్చుకున్న తరుణంలో, ఎవరూ ఊహించని రీతిగా, అత్యద్భుతంగా, నృసింహావతారమెత్తి హిరణ్యకశ్యపుని, అతను కోరిన ప్రకారమే సంహరించాడు. ఈరకంగా అవతారాలన్నింటిలోకీ గొప్పదయినటు వంటిది, ప్రసిద్ధమైన చరిత్ర గలది అయిన నృసింహావతారమెత్తిన శ్రీమహావిష్ణువు 'విశ్రుతాత్మా' అనబడుతున్నాడు.

సత్యము, జ్ఞానము, అనంతము అయిన ఆత్మతత్త్వ విశేషము ఎవరితో విశేషముగా శ్రవణము చేయబడుతున్నదో ఆ శ్రీమన్నారాయణుడు 'విశ్రుతాత్మా' అనబడుతున్నాడు. జగత్తులోని జీవులన్నీ ఆ పరమాత్మ స్వరూపమే. వివిధ రూపాలలో ఆ పరమేశ్వరుడే ఆత్మతత్త్వాన్ని అనేకసార్లు శ్రవణం చేసి ఉన్నాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'విశ్రుతాత్మా' అనబడతున్నాడు.

# 208. సురారిహా

హిరణ్యకశ్యపుని చంపినవాడు. దేవతలయొక్క శత్రువులను సంహరించువాడు.

**హిరణ్యకశిపోర్హన్తా కీర్త్యతే ససురారిహా** తనభక్తులకు, దేవతలకు, శత్రువైన హిరణ్యకశ్యపుని చంపినవాడు. **సురారిహంతీతి సురారిహా** దేవతల విరోధి అయిన హిరణ్యకశ్యపునిచంపినవాడు. **సురారీన్ హంతి** దేవతల శత్రువులను చంపువాడు.

దితికశ్యపుల కుమారుడు హిరణ్యకశ్యపుడు. నిజానికి అతడికి దేవతలతో ఏరకమైన వైరము లేదు. కాని జాతివైరమున్నది. అతడు బ్రహ్మను గురించి తపస్సు చేసి వరాలు పొందగానే, గతంలో రాక్షస రాజుల మరణంతో పలాయనం చిత్తగించి పాతాళానికి పారిపోయిన రాక్షససేనలు తిరిగి భూలోకానికి వచ్చాయి. హిరణ్యకశ్యపుడి చుట్టూ చేరి నువ్వే మా ఏలికవు. అన్నాయి. గతంలో దేవతలు మన పూర్వీకులను మోసం చేసి సంహరించారు. దానికి ప్రతీకారం తీర్చుకోవాలి. మీ అన్న హిరణ్యాక్షుని మరణానికి కూడా ప్రతీకారం తీసుకోవాలి. అంటూ అతన్ని ఎగదోసినాయి. రాక్షస గురువు శుక్రాచార్యుని సలహాతో దేవలోకంమీద దండయాత్ర చేశాడు. హిరణ్యకశ్యపుడు. అతడి తేజస్సు, పరాక్రమము చూసి దేవతలు స్వర్గం వదిలి పారిపోయారు. శ్రీమహావిష్ణువు కూడా చేసేది లేక చిన్న కీటకము రూపంలో రాక్షసుని ముక్కు రంధ్రంలో దాక్కున్నాడు.

హిరణ్యకశ్యపుని ఆగడాలకు హద్దు లేకుండా పోయింది. దేవతలను నానాబాధలు పెడుతున్నాడు. యజ్ఞయాగాదులు మాన్పించాడు. హవిర్భాగము అందకపోవటంచేత దేవతలు కాంతిహీనులయ్యారు. మునీశ్వరులను, ఋషీశ్వరులను చిత్రహింసలు పెడుతున్నాడు. కుమారుడైన ప్రహ్లాదుని హరిభక్తి మానమన్నాడు. అతడు మానలేదు. దాంతో ప్రహ్లాదుని చిత్రహింసలకు గురిచేశాడు. ఈరకంగా దేవతలను, మునులను, ఋషులను, విష్ణుభక్తులను నానాబాధలు పెడుతున్నాడు. అటువంటి సమయంలో శ్రీమహావిష్ణువు స్తంభము నుంచి నృసింహావతారియై ఉద్భవించి హిరణ్యకశ్యపుని గుండెలు చీల్చి చంపేశాడు. ఈవిధంగా దేవతల శత్రువైన హిరణ్యకశ్యపుని సంహరించాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు 'సురారిహా' అనబడుతున్నాడు. అంటూ నృసింహావతార ఘట్టాన్ని పూర్తిచేశాడు రత్నాకరుడు.

# 21. మత్స్యావతారము

"గురుదేవా ! శ్రీమహావిష్ణువు మత్స్యావతారమెత్తి వేదాలను రక్షించాడు కదా! ఆ కథను వివరించండి" అన్నాడు కృష్ణశర్మ. వివరించటం ప్రారంభించాడు రత్నాకరుడు.

వెనుకటి కల్పాంతంలో బ్రహ్మదేవుడు నిద్రపోయాడు. పాక్షిక ప్రళయము వచ్చింది. భూలోకంతో సహా కొన్ని లోకాలు జలమయమైనాయి. ఆ సమయంలో నిద్రపోతున్న బ్రహ్మ దగ్గర నుండి వేదాలను 'హయగ్రీవుడు' అనే రాక్షసుడు ఎత్తుకుపోయాడు. ఇతన్నే 'సోమకాసురుడు' అని కూడా అంటారు. ఆ వేదాలను తిరిగి తీసుకురావటం కోసము శ్రీమహావిష్ణువు మత్స్యావతారము ఎత్తాడు.

ద్రవిడదేశాన్ని సత్యవ్రతుడు అనే మహారాజు పరిపాలిస్తున్నాడు. అతడు వేదవిదుడు. గొప్ప ధర్మవేత్త. ఒకరోజున సత్యవ్రతమహారాజు "కృతమాలిక" నది ఒడ్డున తర్పణం విడుస్తుండగా ఒక చిన్న చేపపిల్ల అతడి చేతిలోకి వచ్చింది. రాజు ఆ చేపను నదిలో విడిచిపెట్టాడు. అప్పుడు ఆ చేప "రాజా ! ఇక్కడ పెద్దచేపలు నన్ను తినేస్తాయి. అందుకే నేను నీ చేతిలోకి వచ్చాను. నువ్వు నన్ను ఈ రకంగా మళ్ళీ నదిలో విడిచిపెట్టటము భావ్యమా ?" అన్నది. ఆ మాటలు విన్నరాజు చేపమీద జాలిపడి, దాన్ని కమండలంలో వేసి ఇంటికి తీసుకువచ్చాడు.

రాత్రికి రాత్రి ఆ చేప కమండలమంత అయిపోయింది. మరునాటి ఉదయం 'రాజా ! నేను ఇందులో ఉండలేను. విశాలమైన ప్రదేశంలో ఎక్కడైనా నన్ను వెయ్యవలసినది' అన్నది. రాజు దాన్ని ఒక గంగాళంలో వేశాడు. చేప గంగాళం అంత అయింది. 'రాజా! ఇక్కడ ఉండలేను. ఇంతకన్న విశాలమైన చోట నన్ను ఉంచు' అన్నది. రాజు ఆ చేపను ఒక సరస్సులో వదిలాడు క్షణంలోనే చేప సరస్సు అంతా ఆక్రమించి'రాజా ! నన్ను వేరోచోటికి మార్చు అంది. రాజు ఆ చేపను సముద్రంలో వదిలాడు. అప్పుడు ఆ చేప "రాజా ! సముద్రంలో మొసళ్ళు నన్ను తినేస్తాయి కదా ! నన్ను ఇక్కడ వదలటం నీకు భావ్యమా ?" అన్నది. ఆ మాటలు విన్న సత్యవ్రతుడు ఈ చేపకు నమస్కరించి అయ్యా నీవెవరవు ? చేపరూపంలో నాకు ఎందుకు మోహం కలిగిస్తున్నావు? కొద్దిసేపటిలోనే నువ్వు ఇంతగా పెరిగిపోయావు. నువ్వు సామాన్యుడివి కావు. సాక్షాత్తూ శ్రీహరివి అయి ఉంటావు. దేవదేవా ! నీకు నమస్కారము" అన్నాడు.

అప్పుడు ఆ చేప "రాజా ! ఇవాల్టి నుంచి ఏడవరోజున ప్రళయం వస్తుంది. భూమి అంతా జలంలో మునిగిపోతుంది. ఆ సమయంలో నీ దగ్గరకు ఒక పెద్ద పడవ వస్తుంది.

అందు అన్నిరకాల ఓషధులు, ధాన్యము వేసి సప్తఋషులతో కలిసి ఆ పడవ ఎక్కు. వాసుకిని త్రాడుగా చేసి ఆ పడవను నా కొమ్ముకు కట్టవలసినది. అప్పుడు ఆ సముద్రంలో నీ ప్రయాణము సుఖముగా సాగుతుంది" అని చెప్పి అంతర్ధానమయింది.

ఆ చేప చెప్పినట్లుగానే ఏడవరోజున భూమి అంతా నీటిలో మునిగిపోయింది. సత్యవ్రతుడు తన దగ్గరకు వచ్చిన ఓడలో ఓషధులు, వివిధరకాల ధాన్యము వేసి, సప్తఋషులతో కలిసి అందులో ఎక్కాడు. భూమి పూర్తిగా మునిగిపోయింది. అప్పుడు వాసుకిని త్రాడుగా చేసి ఆ చేప కొమ్ముకు కట్టాడు. ఆ మత్స్యమును ప్రార్థించి ఆత్మతత్త్వము ఉపదేశించవలసినదిగా కోరాడు. సత్యవ్రతుడు. నీటిలో ఈదుతూనే తత్త్వోపదేశం చేసింది చేప. ప్రళయం ముగిసిపోయింది. బ్రహ్మనిద్ర లేచాడు. శ్రీహరి సోమకాసురుని సంహరించి వేదాలను బ్రహ్మకిచ్చాడు. సత్యవ్రతుడు వైవస్వత మనువు అయినాడు. అతడు ఓడలో వేసిన ఓషధులు, వనస్పతుల నుంచే మళ్ళీ సృష్టి ప్రారంభమైంది. ఈరకంగా మత్స్యవతారమెత్తి, సోమకుని సంహరించి వేదాలను రక్షించాడు శ్రీమహావిష్ణువు.

ఆ పరమేశ్వరుడు అందరికీ బోధించేవాడు. అధ్యాపకుడు, గురువులందరిలోకి ఉత్తముడైన గురువు. సత్యవ్రతుడికి ఆత్మవిద్యను బోధించాడు. చరాచర జగత్తుకూ ఆధారమైనవాడు. సత్పురుషులను రక్షించేవాడు. సత్పురుషులను రక్షించటంలో ఏవిధమైన కపటములేనివాడు భక్తులమీద తప్పవారి శత్రువులమీద తన కృపాదృష్టిని పడనివ్వనివాడు. పరతత్త్వానికి సూచకంగా వైజయంతి మాలను ధరిస్తాడు. అతడే వాచస్పతి బ్రహ్మణస్పతి. గంభీర హృదయుడు. తనభక్తులకు అనితర సాధ్యమైన పరమ పదాన్ని ఇస్తాడు. మహాజ్ఞానులను ఉచితమైన వృత్తులయందు నియమిస్తాడు. మహదైశ్వర్యము గలవాడు. స్వయంప్రకాశి. అందరికీ న్యాయమే చేస్తాడు. మంచి నిర్వాహకుడు భక్తులయొక్క కోరికలు తీరుస్తాడు. ఈ రకంగా 209 నుంచి 223 వరకు నామాలతో మత్స్యావతారము వర్ణించబడింది. ఇక నామాలను చూద్దాం.

## 209 గురుః

బోధించువాడు, అధ్యాపకుడు. మంత్రోపదేశం చేసినవాడు.

**సర్వాః విద్యాః ఉపదిశతి** అన్ని విద్యలను ఉపదేశించేవాడు.

గురువు అంటే – తండ్రి. ప్రాణులన్నింటికీ, జగాలన్నింటికీ తండ్రి కాబట్టి శ్రీమన్నారాయణుడు 'గురుః' అనబడుతున్నాడు.

**గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః**
**గురుస్సాక్షాత్ పరంబ్రహ్మ తస్మై శ్రీగురవే నమః**

అజ్ఞానమనే అంధకారాన్ని పారద్రోలి, జ్ఞానజ్యోతిని వెలిగించేవాడు గురువు. సాధకునకు మంత్రోపదేశంచేసి, దీక్ష ఇచ్చి, సాధనావిధానము చెప్పి, ముక్తిమార్గం చూపేవాడు గురువు.

ఏ మహాత్ముడు నీకు బాగా గుర్తు ఉంటాడో, ఏ మహానుభావుని రూపం నీ మనస్సులో సదానిలిచి పోతుందో ఏ సన్యాసి నీకు స్వప్నంలో కూడా కనుపించి సన్మార్గాన్ని బోధిస్తుంటాడో, ఏ సాధువు చెప్పిన ధర్మసూత్రాలు నీ మదిలో నిలిచిపోతాయో, ఏ మహనీయుని దగ్గరకు వెళ్ళగానే నీకు అనుమానాలు తీరిపోతాయో, ఏ వ్యక్తి దగ్గరనీకు ప్రశాంతత ఆనందము కలుగుతాయో, ఏ వ్యక్తి మీద నీకు నమ్మకము, గురి కలుగుతాయో ఆ మహనీయుడే నీకు గురువు. అలాగే గురువు చెప్పిన భక్తి జ్ఞానవైరాగ్యాలు, ధర్మసూత్రాలు గుర్తుంచుకుని మరచిపోకుండా ఉండేవాడే శిష్యుడు. స్థూలంగా చెప్పాలంటే తన శిష్యునకు సన్మార్గాన్ని బోధించి, తరుణోపాయం చూపేవాడు గురువు.

మనకు మొత్తం ఏడు రకాల గురువులున్నారని చెప్పబడింది వారు :

1. సూచకగురువు – చదువు చెప్పేవాడు
2. వాచకగురువు – కులధర్మాలు, ఆశ్రమధర్మాలు బోధించేవాడు.
3. బోధకగురువు – మహామంత్రాలనుపదేశం చేసేవాడు
4. నిషిద్ధగురువు – వశీకరణ, మారణ, ప్రయోగాలు నేర్పువాడు
5. విహితగురువు – విషయభోగముల మీద విరక్తి కలిగించేవాడు
6. కారణగురువు – జీవబ్రహ్మైక్యాన్ని బోధించేవాడు.
7. పరమగురువు – జీవాత్మ, పరమాత్మ ఒకటే అని ప్రత్యక్షానుభవాన్ని కలిగించేవాడు.

గురువు శిష్యునకు ఉపదేశం చేసి దీక్ష ఇస్తాడు. ఈ దీక్ష నాలుగు రకాలు.

**1. స్పర్శదీక్ష:** గురువు శిష్యుని తాకినంత మాత్రం చేతనే శిష్యునకు శక్తి వస్తుంది.

**2. ధ్యానదీక్ష :** గురువు దూరంగాఉన్నప్పటికి శిష్యుని ఉద్ధరణ కోసం ధ్యానం చేస్తుంటారు. దానివల్లనే శిష్యునకు శక్తి వస్తుంది.

**3. దృగ్దీక్ష:** ఇది కంటిచూపుతోనే ఇచ్చే దీక్ష, దీనిలో శిష్యుడు పవిత్రుడు కావాలనే తలంపుతో గురువు తన దృష్టిసారిస్తాడు.

**4. మంత్రదీక్ష:** గురువు శిష్యునకు ధర్మసూత్రాలు చెప్పి మంత్రదీక్ష ఇచ్చి అతనికి తరణోపాయం చూపుతాడు.

ఈరకంగా అనేక రకాలయిన గురువులు, వారిచ్చు దీక్షా పద్ధతులు చెప్పబడినాయి. గురువు ఏ జాతివాడైనా, ఏ మతంవాడైనా, ఏ కులంవాడైనా సరే అతనిని పూజించాలి గౌరవించాలి. ఆరాధించాలి. లోకంలో అస్థిరమైనవి, ఐహిక సుఖాలనిచ్చేవి ఎన్ని సంపాదించినా గురుకటాక్షం పొందలేకపోతే, ఇవన్నీ నిష్ప్రయోజనం. ఈ విషయాన్ని శంకర భగవత్పాదులు తమ 'గుర్వష్టకమ్'లో వివరిస్తూ గురువు అంటే ఆ భగవంతుడే అని చెప్పారు.

**శరీరం సురూపం తథా వా కలత్రం య శశ్చారు చిత్రం ధనం మేరు తుల్యమ్।**
**మనశ్చే న్న లగ్నం గురో రంఘ్రివద్మే తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్॥**

**కలత్రం ధనం పుత్రపౌత్రాది సర్వం గృహం బాన్ధవాః సర్వమే తద్ధి జాతమ్ ।**
**మనశ్చే న్న లగ్నం గురో రంఘ్రిపద్మే తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్॥**

**షడఙ్గాది వేదో ముఖే శాస్త్రవిద్యా కవిత్వాది గద్యం మపద్యం కరోతి ।**
**మనశ్చే న్న లగ్నం గురో రంఘ్రిపద్మే తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్॥**

**విదేశేషు మాన్యః స్వదే శేషు ధన్యః సదాచార వృత్తేమ మత్తోన చాన్యః ।**
**మనశ్చే న్న లగ్నం గురో రంఘ్రిపద్మే తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్॥**

**క్షమామణ్డలే భూప భూపాలబృన్దైః సదా సేవితం యస్య పాదార విన్దమ్ ।**
**మనశ్చే న్న లగ్నం గురో రంఘ్రిపద్మే తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్॥**

**యశో మే గతం దిక్షు దానప్రతాసా జ్జగద్వస్తు సర్వం కరే యత్ప్రసాదాత్ ।**
**మనశ్చేన్న లగ్నం గురో రంఘ్రిపద్మే తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్॥**

**న భోగే న యోగే న వా వాజిరాజౌ న కాన్తాముఖేనైవ న విత్తేషు చిత్తమ్ ।**
**మనశ్చే న్న లగ్నం గురో రంఘ్రిపద్మే తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్॥**

**అరణ్యే నవా స్వస్య గేహేన కార్యే నదేహే మనోవర్తతే మేత్వనర్ఘే ।**
**మనశ్చే న్న లగ్నం గురో రంఘ్రిపద్మే తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్॥**

ఈ లోకంలో ధనము, అందమైన భార్య, విద్య పేరు ప్రఖ్యాతులెన్నున్నా, ఇవేవీ గురుకటాక్షం కన్న ఎక్కువకాదు. అని పై శ్లోకాల అర్థం.

**న గురోరధికం తత్వం న గురోరధికం తపః ।**
**తత్త్వ జ్ఞానాత్ పరం నాస్తి తస్మై శ్రీగురవే నమః ॥**

గురువుకన్న ఎక్కువైన తత్త్వం లేదు, తపస్సు లేదు. జ్ఞానం లేదు.

**అఖండ మండలాకారం వ్యాప్తంయేవ చరాచరం ।**
**తత్పదం దర్శితం యేన తస్మై శ్రీగురవే నమః ॥**

**అజ్ఞానతిమిరాంధస్య జ్ఞానాంజన శలాకయా ।**
**చక్షురున్మీలితం యేన తస్మై శ్రీగురవేనమః ॥**

విశాలమైన ఈ విశ్వమంతా వ్యాపించినవాడు, శిష్యుని అజ్ఞానాన్ని పారద్రోలి, జ్ఞాన జ్యోతిని వెలిగించేవాడు, అయిన గురువు పాదాలకు నమస్కరిస్తున్నాను.

సాధకుని కర్మఫలాన్ని బట్టి గురువు లభించటం జరుగుతుంది. కొంతమందికి ఏళ్ళ తరబడి ఎదురు చూచినా సద్గురువు లభ్యంకాడు. ఆ గురు అన్వేషణలో అడవుల వెంబడి తిరుగుతూ, తనువు చాలించిన వారనేకమంది ఉన్నారు. మరికొందరికి చాలా తేలికగా, గురువే శిష్యుణ్ణి వెతుక్కుంటూ వస్తాడు. ఇదంతా సాధకుని పూర్వజన్మ కర్మఫలంమీద ఆధారపడి ఉంటుంది. వివేకానందునకు రామకృష్ణ పరమహంసలాగా, మంచి గురువు దొరకటమనేది జన్మజన్మల ఫలం అని గుర్తించాలి.

అటువంటి గురువు సృష్టి, స్థితి లయకారకులైన ఆ త్రిమూర్తుల స్వరూపము, అతడే సాక్షాత్తూ పరబ్రహ్మ. గురుకటాక్షం లేనిదే కార్యసాధన జరగదు. గురువు భౌతికంగా లేకపోయినా, అదృశ్యంగా ఉండి తన శిష్యుణ్ణి సదా కాపాడుతూ ఉంటాడు. తప్పుమార్గంలో పోతే హెచ్చరించి, సన్మార్గానికి త్రిప్పుతాడు.

**బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం**
**ద్వంద్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాది లక్ష్యం ।**
**ఏకం నిత్యం విమల మచలం సర్వధీ సాక్షిభూతం**
**భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి ॥**

గురువు ఏ జాతివాడైనా ఏ కులంవాడైనా ఏ మతంవాడైనా సరే అతన్ని గౌరవించాలి.

**గురుమూర్తి వచ్చుచో గూర్చుండగారాదు గురుశిష్యులొకశయ్య గూర్కరాదు**
**ముందుగా దనయంత భుజియింపగారాదు పోరిదొంగత్రోవల బోవరాదు**

**గురునింద వినరాదు కూడి సేయగరాదు గురుని కప్రియమును గూర్పరాదు**
**సద్గురు విడిన శాసనము మీరగరాదు హెచ్చి దా గురుని శాసింపరాదు**
**గురుడు బోధింపనెంచిన నురుగరాదు అతడు బోధింపకుండిన నడుగరాదు**

**శ్రీ గురుమూర్తి చేరినంతనె నమస్కారంబు ముందుగా సలుపవలయు**
**లజ్జాభిమానకులంబు వీడి పాద చారియై సద్భక్తి జేరవలయు**
**సుతుడైన హితుడైన సోదరుడైనను గులహీనుడైనను గొలువవలయు**
**గురునాజ్ఞ వర్తించి గురుడిచ్చు తృణమైన మేరువుగా నెంచి మెలగవలయు**
**గురుని ప్రభువంచు స్వామి దేవర యటంచు బిలుచుచును లోభగుణముల దొలచవలయు**

ఈ రకంగా గురుకటాక్షం పొందితేనే సాఫల్యముంటుంది. మంత్ర సిద్ధి కలుగుతుంది.

అటువంటి మంత్రాన్ని ఉపదేశించేవాడు గురువు. కాబట్టే పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు 'గురుః' అనబడుతున్నాడు.

ఈ జగత్తునంతటినీ సృష్టించినది ఆ పరమేశ్వరుడే కాబట్టి అతడే ఈ లోకాలకు తండ్రి అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'గురుః' అనబడుతున్నాడు.

## 210. గురుతమః

గురువులందరిలోకి గొప్పవాడు. వేదాలను బ్రహ్మకిచ్చినవాడు. దేవతలందరికీ ఆత్మ తత్త్వాన్ని బోధించినవాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'గురుతమః' అనబడుతున్నాడు.

శంకర భగవత్పాదులవారు ఈ రెండు నామాలను విడివిడిగా వ్రాయగా రామానుజలవారి శిష్యుడైన పరాశరభట్టరు వారు రెండు కలిపి ఒకే నామంగా చెప్పారు.

**గురుః గురుతమః : అశేష విద్యాచార్యత్వాత్ స్మృతో గురుతమో గురుః**

సమస్త విద్యలకు ప్రవర్తకుడైన ఆచార్యుడు. కాబట్టి శ్రీమహావిష్ణువు 'గురుః గురుతమః' అనబడుతున్నాడు.

## 211. ధామ

ఆధారమైనవాడు.

**చరాచరధారతయా ధామేతి పరిచక్షతే** చరాచరములన్నింటికీ ఆధారమైనవాడు.

సంహార కాలంలో నశించేటటువంటి చరాచరము లన్నింటికీ ఆధారమైనవాడు.

ఈ జగత్తులో అనేక ప్రాణులు, అనేక వస్తువులు ఉన్నాయి. వాటిని ప్రాణమున్నవి, ప్రాణములేనివి, చలనమున్నవి, చలనము లేనివి. అని విభజించటం జరిగింది. సృష్టిలో ప్రతిదానికి ప్రాణమున్నది అనే మన పురాణాలు చెబుతున్నాయి. రామాయణంలో సముద్రుడు వారధి నిర్మించే విషయంలో శ్రీరామచంద్రునికి కనుపించి మాట్లాడాడు. అలాగే సరస్వతి, శబరి వంటి నదులు కూడా. సరస్వతీ దేవి శాపవశాన నదిగా మారింది. శబరి పరమ పవిత్రమూర్తి కాబట్టి నదిగా ప్రవహించమన్నాడు రామచంద్రుడు. ఈ రకంగా నదులకు, సముద్రాలకు కూడాప్రాణమున్నది. అంతేకాదు హిమవంతుని కుమార్తె హైమావతి. ఆకాశరాజు కుమార్తె పద్మావతి. హిమవంతుని కుమారుడు మైనాకుడు ఇంద్రుడు పర్వతాల రెక్కలు తెగకొడుతుంటే, భయపడి సముద్రంలో దాక్కున్నాడు.

ఈ రకంగా నదులు, సముద్రాలు, కొండలు, బండలు, పర్వతాలు అన్నింటికీ ప్రాణమున్నది. అయితే అన్నింటికీ చలనము లేదు. చెట్లు, చేమలు, కొండలు ఇత్యాదులు నడవలేవు. ఇవి అచలనములు. ఈరకంగా ఉన్న చరాచరములన్నింటికీ ఆధారము శ్రీమన్నారాయణుడే. అందుకే 'ధామ' అనబడుతున్నాడు.

ధామన్ అనగా – జ్యోతిస్సు అని అర్థం. శ్రీమన్నారాయణుడు పరంజ్యోతి.

**నారాయణ పరోజ్యోతి రాత్మానారాయణః పరః**

**నారాయణ పరంబ్రహ్మ తత్త్వం నారాయణః పరః**

**నారాయణ పరోధ్యాతా ధ్యానం నారాయణః పరః**

నారాయణుడే పరంజ్యోతి. పరమాత్మ స్వరూపుడు. అతడే పరబ్రహ్మ, అతడే పరతత్త్వము. ధ్యానము చేసేవాడు, ధ్యానము కూడా నారాయణుడే. అతడే ఆత్మ. **బృహదారణ్యకోపనిషత్తు**లో ఆత్మయే పరబ్రహ్మకు ఉత్కృష్టమైన స్థానము అని చెప్పబడింది. కాబట్టి 'ధామ' అంటే శ్రీమన్నారాయణుడు తప్ప వేరుకాదు.

## 212. సత్యః

సత్పురుషులకు తగినవాడు.

**మన్వాదిష్వపి సాధుత్వాత్ సత్య ఇత్యభిధీయతే ॥** మత్స్యావతారకాలంలో తనను ఆశ్రయించిన మనువు మొదలైన వారిపట్ల సాధువృత్తితో సంచరించినవాడు.

**సత్సు సాధుః సత్యః**

సత్పురుషులకు సాధువుగా ఉన్నవాడు. ఆశ్రితులకు తగినట్లుగా ఉన్నవాడు.

మత్స్యావతారకాలంలో సత్యవ్రత మహారాజు తన దోసిలిలో దొరికిన చేప క్షణక్షణానికీ పెరిగిపోవటం చూసి ఆశ్చర్యపడి, 'స్వామీ ! నీవు పురుషోత్తముడివి తప్ప వేరుకావు. నన్ను రక్షించవలసినది' అంటూ నమస్కరించాడు అప్పుడు ఆ చేప తాను జనార్దనుడను అని చెప్పి, "ఇంకా ఏడు రోజులలో ప్రళయం వస్తుంది ఆ సమయంలో ఒక పెద్ద పడవ నీ దగ్గరకు వస్తుంది. దానిలో, ఓషధులు, ధాన్యము వేసి, సప్తఋషులతో కలిసి నువ్వు ఎక్కవలసింది. వాసుకుని తాడుగా చేసి, ఆ పడవకు, నా కొమ్ముకు కలిపి కట్టవలసినది" అని చెప్పి అదృశ్యమైపోయింది. సరిగ్గా ప్రళయం వచ్చిన రోజున ఆ చేప చెప్పినట్లే చేశాడు సత్యవ్రతుడు. అతన్ని రక్షించాడు జనార్దనుడు. సత్యవ్రత మహారాజే "వైవస్వత మనువు".

ఈ రకంగా మన్వాదులను రక్షించాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు 'సత్యః' అనబడుతున్నాడు.

## 213. సత్య పరాక్రమః

సత్యమైన వ్యాపారములు గలవాడు.

**వృత్తి ర్వ్య కైతవా యస్య సస్స్యాత్సత్య పరాక్రమః**

తన భక్తులయందు ఏ విధమైన కపటము లేని వ్యాపారము గలవాడు.

**సత్యః పరాక్రమః వ్యాపారః యస్యసః సత్యపరాక్రమః** సత్యమైన పరాక్రమము గలవాడు. నిష్ఫలము గాని పరాప్రమముగలవాడు. అతని పరాక్రమానికి ఎదురు లేదు. యుద్ధభూమిలో అతన్నెదిరించి ఎవరూ నిలువలేరు. అతడికి అతడేసాటి.

పరమేశ్వరుడికి ఏరకమైన పక్షపాతముగాని, అభిమానంగాని లేవు. వీరు తనవారని, వీడుపరుడని లేదు. అందరూ ఒకటే. ఎవరినైనా ఒకే రకంగా చేస్తాడు. వారు చేసిన కర్మకు తగిన ఫలితాన్ని మాత్రమే ఇస్తాడు. అతడి నడవడిలో ఏ మాత్రం లోపం ఉండదు. శత్రువైనాసరే, మంచి పనులు చేస్తే మంచి ఫలితాన్నే ఇస్తాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'సత్యపరాక్రముడు' అనబడుతున్నాడు.

## 214. నిమిషః

చూడకుండా ఉండేవాడు.

**యోఽసౌ సతాం నేక్షతే హి నిమిషస్స విరోధినం**

తన భక్తుల శత్రువులమీద ఎప్పుడూ తనయొక్క కృపాదృష్టిని పడనియ్యని వాడు.

**న నిమిషతీతి నిమిషః** ఆశ్రితుల విరోధుల వంక కన్నెత్తి కూడా చూడనివాడు.

పరమేశ్వరుని లక్ష్యం ఒక్కటే. అది తన భక్తులను రక్షిస్తుండటము. తనను ఆశ్రయించిన వారికి సర్వకాల సర్వావస్థలయందు వెన్నంటి కాపాడుతూ ఉంటాడు. వారికి ఏ విధమైన కష్టాలు రానివ్వడు. లౌకికపరంగా చూసినట్లైతే భక్తులు కష్టాలను ఎదుర్కొంటున్నారు అంటారు. కాని అది నిజంకాదు. ఆ భక్తులు ఏమి కావాలనుకుంటున్నారో అది వారికిస్తాడు. వారికి మోక్షం కావాలి. పునర్జన్మ అవసరం లేదు. అలాంటివారికి సంసార బంధనాలు ఉండకూడదు. అందుకే క్రమేణా ఆ బంధనాలను త్రెంచి వేస్తాడు. ముందుగా భార్యా, బిడ్డలు మొదలైన అనుబంధాలు పోతాయి. ఆ తరువాత అహంకార మమకారాలు పోతాయి. అన్ని బంధనాల నుండి విముక్తి కలిగితేనే గాని, అతడికి ముక్తి రాదు. అందుకే వారికి భవబంధనాలను ఒకటొకటిగా తొలగిస్తాడు. ఆ భక్తులయొక్క విరోధులు అంటే – వారిని మోక్షమార్గం గుండాపోనీయకుండా అడ్డు పడేవారు. వారికి కష్టాలు కలిగించేవారు అటువంటి వారియందు ఏ రకమైన దయ, కరుణ, జాలిచూపడు.

తాపసోత్తములు పరమేశ్వరుని దివ్యపదము చేరాలని తహతహలాడుతుంటారు. అటువంటి వారి మార్గానికి అడ్డుపడుతుంటారు రాక్షసులు. అందుచేతనే రాక్షసుల మీద ఎప్పుడూ పరమేశ్వరుడు తనయొక్క దయను ప్రసరింపచేయడు.

**నిమిషతి నేత్రే** తనయొక్క రెండు కనులను మూసుకొని ఉండేవాడు.

**యోగనిద్రా రతస్య అస్యనేత్రే నిమీలితే**

యోగనిద్రాసక్తుడగు అతని కనులు ఎప్పుడూ మూసుకునే ఉంటాయి. "పరమేశ్వరుడు ఎప్పుడూ యోగనిద్రలోనే ఉంటాడు. సృష్టి ప్రారంభం కాకముందు శ్రీమహావిష్ణువు పాలసముద్రంలో యోగనిద్రలో ఉన్నాడు. అతడి నాభికమలం నుంచి పద్మాసనుడు ఉద్భవించాడు. విష్ణువు చెవి గుబిలి నుంచి ఉద్భవించిన మధుకైటభులు బ్రహ్మను చంపబోయారు. బ్రహ్మ తామరతూడు గుండా క్రిందికి దిగి వచ్చి యోగనిద్రలో ఉన్న శ్రీమహావిష్ణువును లేపాడు" అని చెప్పబడింది. అంటే పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు ఎల్లవేళలయందు యోగనిద్రలో ఉంటాడు కాబట్టి 'నిమిషః' అనబడుతున్నాడు.

## 215. అనిమిషః

చూచేవాడు

**సద్రక్షణే జాగరూకః స్మృతోహ్యనిమిషశ్చ సః**

తన భక్తులను కాపాడటానికి ఎల్లవేళల యందు జాగరూకుడై ఉండేవాడు.

సత్పురుషులను ఎల్లప్పుడూ శ్రద్ధతో కనులు తెరచి చూస్తుండేవాడు.

శ్రీ మహావిష్ణువు మత్స్యావతారంలో తనను ఆశ్రయించిన సత్యవ్రత మహారాజు మొదలైనవారిని అతిశ్రద్ధతో కనులు కాయలుగా చేసుకొని రక్షించాడు. సత్యవ్రతుడికి దర్శనమిచ్చి మరి ఏడు రోజులలో ప్రళయం రాబోతున్నది. ఆ సమయంలో నీవు ఓషధులు, ధాన్యములను ఓడలో వేసుకుని సప్తఋషులతో పాటు బయలుదేర వలసినది. నీ పడవను నా కొమ్ముకు కట్టి ఆ సముద్రంలో మునిగిపోకుండా నిన్ను రక్షిస్తాను అని చెప్పాడు. అదే ప్రకారంగా రక్షించాడు. సత్యవ్రతుడు తెచ్చిన పదార్థాలతోనే మళ్ళీ సృష్టి ప్రారంభమైంది. ఆ సృష్టికి అతడే మనువు. ఇలాగే అనేకసార్లు.

కృష్ణావతారంలో పాండవులను లక్క ఇంట్లో దగ్ధం చెయ్యాలనుకున్నాడు సుయోధనుడు. ఆ విషయం గ్రహించిన శ్రీకృష్ణ పరమాత్ముడు పాండవులను అక్కడి నుంచి తప్పించాడు.

మహాభారత యుద్ధం అయిపోయింది. పాండవులను విజయలక్ష్మి వరించింది. కృష్ణార్జునుల రథం ఆగింది. అర్జునుని ముందు రథం దిగమన్నాడు కృష్ణుడు. అది సంప్రదాయ విరుద్ధం. ముందుగా సారథి దిగాలి. తరువాతే రథికుడు దిగాలి. కాని ముందుగా అర్జునుని దింపి, తరువాత తాను దిగాడు పరమాత్ముడు. ఆయన దిగిన మరుక్షణమే రథం మండి పోయింది. ఈ రకంగా సత్పురుషులను, తనను నమ్మినవారిని ఎల్లప్పుడూ కాపాడుతుంటాడు కాబట్టే శ్రీమన్నారాయణుడు 'అనిమిషః' అనబడుతున్నాడు.

మత్స్యావతారంలో భగవంతుడు ఎప్పుడూ కనులు తెరచి ఉంచి భక్తులను రక్షించాడు. చేపలకు కనురెప్పలు ఉండవు. అందుచేతనే పరమేశ్వరిని 'మీనాక్షి' అని సంబోధించటం జరుగుతుంది. పరమేశ్వరుడు కనులు తెరిస్తే సృష్టి. కనులు మూస్తే లయము జరుగుతుంది. అని శంకరభగవత్పాదుల వారు తను **సౌందర్యలహరి**లోని 55వ శ్లోకంలో అంటారు.

**నిమేషాన్మేషాభ్యాం ప్రళయముదయం యాతి జగతి**
**తవేత్యాహు స్సంతో ధరణీధరరాజన్యతనయే**
**త్వదున్మే షాజ్ఞాతం జగదిద మశేషం ప్రళయతః**
**పరిత్రాతుం శంకే పరిహృత నిమేషా స్తవదృశః**

అమ్మా ! నువ్వు కనులు తెరిస్తే సృష్టి, కనులు మూస్తే లయము జరుగుతాయి. ఈ జగత్తును నాశనం కాకుండా రక్షించటానికే నువ్వు రెప్పపాటు లేకుండా ఉన్నావు.

పరమేశ్వరుడు నిత్యబుద్ధస్వరూపుడు. మహాజ్ఞాని. అందుచేతనే ఆయన కనులు మూయడు. శ్రీమన్నారాయణుడు ఆత్మస్వరూపుడు కాబట్టి 'అనిమిషః' అనబడుతున్నాడు.

# 216. స్రగ్వీ

మాలను ధరించినవాడు.

**పరత్వసూచనీయా చ వైజయన్తీతి కీర్తితా**

**తయా స్రజానిత్యయోగాత్ స్రగ్వీతి పరికీర్త్యతే**

మత్స్యావతారి అయినప్పటికీ తనయొక్క పరతత్త్వాన్ని సూచించటానికి వైజయంతి మాలను నిత్యము ధరించువాడు. వైజయంతి అంటే – వనమాల, శ్రీమహావిష్ణువు మెడను ధరించే మాల. పంచతన్మాత్రలే ఇవి.

**స్రక్ అస్యాస్తీతి స్రగ్వీ**

తిర్యక్కుగా ఉండికూడా పరతత్త్వ సూచకమైన వనమాలను మెడన ధరించినవాడు.

శ్రీమహావిష్ణువు సాక్షాత్తూ పరమేశ్వరుడు తప్పవేరుకాదు. ఆయన పరతత్త్వానికి సూచకంగా మెడలో తన్మాత్రలను మాలగా వేసుకుంటాడు. పంచభూతాల యొక్క లక్షణాలే తన్మాత్రలు. వీటితోనే సృష్టి జరిగింది.

ఈ సృష్టిలో ముందుగా శబ్దము, శబ్దము నుంచి స్పర్శ, స్పర్శ నుండి రూపము, రూపము నుండి రసము, రసము నుండి గంధము ఏర్పడినాయి. తరువాత తన్మాత్రల స్థూలరూపమైన పంచభూతాలు ఆవిర్భవించినాయి. ముందుగా ఆకాశము ఉద్భవించింది.

ఆకాశము నుండి – వాయువు      వాయువు నుండి – అగ్ని

అగ్ని నుండి – నీరు      నీటి నుండి – భూమి

ఈరకంగా పంచభూతాలు ఏర్పడ్డాయి. వీటి పంచీకరణ వల్లనే 84 లక్షల జీవరాశి ఆవిర్భవించింది. ఈసృష్టికంతటికీ మూలమైనవాడు శ్రీమహావిష్ణువు **నారాయణోపనిషత్తు**లో "ఈ సృష్టి ప్రారంభంలో పరమపురుషుడైన నారాయణుడు ప్రాణులను సృష్టించదలచాడు. అప్పుడు సమిష్టి సూక్ష్మశరీరుడైన హిరణ్య గర్భుడు పుట్టాడు. తరువాత ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి పుట్టినాయి. ఈ రకంగా నారాయణుని నుంచే బ్రహ్మ, రుద్రుడు, ఇంద్రుడు, మరీచి, కశ్యపుడు, అష్టవసువులు, ఏకాదశరుద్రులు, ద్వాదశాదిత్యులు, వేదాలు, చరాచర జగత్తు ఆవిర్భవించింది." అని చెప్పబడింది. ఈ పరతత్త్వాన్ని సూచించటానికే శ్రీమన్నారాయణుడు వైజయంతిమాలను ధరించి 'స్రగ్వీ' అనబడుతున్నాడు.

# 217. వాచస్పతి రుదారధీః

ఇది వాచస్పతి, ఉదారధీ అని రెండు నామాలు, కాని శంకర భగవత్పాదుల వారు ఈ మొత్తాన్ని ఒకే నామంగా చెప్పారు. ఇక్కడ వాచస్పతి అనగా – విద్యకు అధిపతి వాక్కుకు రక్షకుడు అని అర్థం. ఉదారదీ అనగా –

**సర్వార్థ విషయా ధీ–అస్యః** సర్వ విషయములను గోచరింపచేయగల బుద్ధి అని అర్థం.

**బృహదారణ్యకోపనిషత్తు**లో "సత్యము యొక్క రూపాంతరమే వాక్కు. ఈ వాక్కును త్రయా రూపాత్మకమైన ధేనువుగా భావించి ఉపాసించాలి. వాగ్రూపమైన ఆవుకు నాలుగు స్తనాలున్నాయి. అవి 1. స్వాహాకారము 2. వషట్కారము 3. హం 4. స్వధాకారము

వీటిలో మొదటి రెండింటి ద్వారా దేవతలకు హవిస్సులు ఇస్తారు. హంత అంటూ అన్నదానం చేస్తారు. స్వధాకారంతో పిత్రుతర్పణ చేస్తారు. అనగా ఈ నాలుగుస్తనాల ద్వారా దేవతల, మానవుల, పిత్రుదేవతల కోరికలు తీరుతున్నాయి. అంటే వాగ్రూపమైన ధేనువుకు వారు దూడలవంటివారు. ప్రాణమే ఆ ధేనువుకు వృషభం. ప్రాణం ద్వారానే వాక్కు వస్తుంది. మనస్సు ద్వారా ఆలోచించిన విషయంలో వాక్కుయొక్క ప్రవృత్తి ఉంటుంది. అందుచేత మనస్సే దాని దూడ. ఈ విషయాలు తెలుసుకుని వాగ్బ్రహ్మోపాసన చేసిన వాడికి వాగ్రూపమైన బ్రహ్మప్రాప్తి కలుగుతుంది" అని చెప్పబడింది.

కాబట్టి వాచస్పతి, బ్రహ్మణస్పతి అంటే సాక్షాత్తూ శ్రీమన్నారాయణుడే.

పరమేశ్వరుడు అసామాన్యుడు. అన్ని విషయాల మీద పూర్తిగా అవగాహన, పట్టు ఉన్నవాడు. అతడికి తెలియని విషయం ఈ లోకంలోనే లేదు. భూతభవిష్య ద్వర్తమానాలతో సహా అన్ని విషయాలను తెలుసుకోగల శక్తి అతడికి ఉన్నది.

పరాశర భట్టరువారు ఈ రెండింటినీ వేరువేరుగా, రెండు నామాలుగా చెబుతున్నారు.

1. వాచస్పతి – వాగీశుడు.

**వేదోప బృహణత్వాద్ధి వాచస్పతిరితి శ్రుతః** వేదాలకు ఉపబృహణములైన ధర్మశాస్త్రాలు, పురాణాలు, ఇతిహాసాలను ప్రవర్తింప చేసినవాడు.

**వాచః పతిః వాచస్పతిః** వేదము యొక్క వివరణ అయిన మత్స్య పురాణాన్ని రచించటం చేత పరమేశ్వరుడు వాక్కుకు పతి అనబడతాడు.

2. ఉదారధీ – గంభీర హృదయుడు

**సర్వోపజీవ్యసార్వజ్ఞ్యా దుచ్యతే స ఉదారధీ**

లోకంలో అందరూ జీవించాలనే గంభీరమైన సంకల్పం కలవాడు.

**ఉదారాధీః యస్యసః ఉదారధీః** ఉదారమైన బుద్ధిగలవాడు.

ఈ జగత్తులో అందరూ జీవించాలనే కోరిక గలవాడు. కర్మక్షయం కాని వారందరికీ కర్మక్షయం చేసి మోక్షము ప్రసాదించాలనే కోరికతో సృష్టి చేసినవాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు 'ఉదారధి' అనబడుతున్నాడు.

## 218. అగ్రణీః

పైకి తీసుకుపోయేవాడు

**మహోదారతయా భక్తాన్ అగ్రిమం పశ్చిమం పదమ్**
**నయతీత్యగ్రణీః ప్రోక్తో భక్త మోక్ష ప్రదోమనుః**

పరమేశ్వరుడు కడు ఉదార స్వభావుడు కాబట్టి తన భక్తులకు పరమోత్కృష్టమైన పరమపదమును ఇస్తాడు.

**అగ్రం నయతీతి అగ్రణీ** ఆశ్రితులైన భక్తులను ఉత్తమస్థానానికి తీసుకుపోయేవాడు.

**అగ్రం (ప్రకృష్టం పదం) నయతి ముముక్షూన్**

అగ్రము అంటే – ఉన్నతమైనది. ఉత్కృష్ఠమైనదైన స్థానము.

మోక్షము కోరేవారికి అత్యున్నతమైన స్థానము సాయుజ్యము, జీవాత్మ పరమాత్మల ఏకీభావము. అదే పరమపదము.

యోగప్రక్రియలో ఐదురకాల ముక్తులు చెప్పబడ్డాయి. అసలు ముక్తి అంటే – విముక్తి అని, సంసార బంధనాలనుండి విడివడటమే ముక్తి అని చెప్పటం జరిగింది.

యోగప్రక్రియ అంటే అంతరారాధన. శరీరంలోనే భగవంతుణ్ణి ఊహించి చేసే అర్చనా విధానము. ఈ ప్రక్రియలో షట్చక్రాలలోనూ పరమేశ్వరుని ఆరాధించటము.

ఆధార స్వాధిష్ఠానాలు అంధకార బంధురాలు. కాబట్టి లౌకికవాదులు మాత్రమే అక్కడ పరమేశ్వరుని అర్చిస్తారు. ఇక మోక్షవాదులు మణిపూరము నుండి పరమేశ్వరుని అర్చన చేస్తారు.

1. మణిపూరంలో పరమేశ్వరుని అర్చించేవారు క్షీరాబ్ధిలో శ్వేతద్వీపానికి దగ్గరగా ఒక గృహం నిర్మించుకుని అందులో ఉండగలుగుతారు. ఇది **'సార్షిరూపముక్తి'**

2. అనాహతంలో అర్చించేవారు. శ్వేతద్వీపంలోనే ఒక మూల నివశించగలుగుతారు. ఇది **'సాలోక్యముక్తి'**

3. విశుద్ధి చక్రంలో అర్చించేవారు పరమేశ్వరుడికి అతిదగ్గరగా సేవకులుగా ఉండగలుగుతారు. ఇది **'సామీప్యముక్తి'**

4. ఆజ్ఞాచక్రంలో అర్చించేవారు పరమేశ్వరునితో సమానమైన కాంతి, శక్తి కలిగి వేరే రూపంలో ఉంటారు.

ఇది **'సారూప్యముక్తి'** రాఘవేంద్రస్వామి, సాయిబాబా ఈ కోవకు చెందినవారే.

5. సహస్రారంలో అర్చించేవారికి మరుజన్మ ఉండదు. ఇది శాశ్వతమైన ముక్తి. దీన్ని **'సాయుజ్యం'** అంటారు.

పైన చెప్పిన వాటిలో మొదటి నలుగురూ, తమ కర్మఫలం పూర్తి అయిపోయిన తరువాత మళ్ళీ జన్మించాల్సిందే కాని సాయుజ్యము పొందినవారికి మాత్రము మరుజన్మ ఉండదు. ఇది మహా ఉత్కృష్టమైనది. శ్రీమన్నారాయణుడు తన భక్తులకు సాయుజ్యము నిస్తాడు కాబట్టి 'అగ్రణీః' అనబడుతున్నాడు.

## 219. గ్రామణీః

సమూహమును చేర్చువాడు.

**గ్రామం సమాజం సూరీణాం నయతి గ్రామణీశ్చయః**

నిత్యసిద్ధులను తన ఇష్టము వచ్చినట్లు నడిపించువాడు.

**గ్రామం సమాజం నయతీతి గ్రామణీ**

గ్రామము అనగా సమాజము, సమూహము అని అర్థం. నిత్యసూరి సమూహమును చేర్చేవాడు కాబట్టి 'గ్రామణి' అనబడతాడు.

సూరి అనగా - విద్వాంసుడు, పండితుడు.

ఇక్కడ విద్వాంసుడు అంటే జ్ఞాని అని అర్థం. కాబట్టి సూరి అంటే - జ్ఞాని నిత్యసూరులు అనగా - నిత్య జ్ఞానులు.

చరాచర జగత్తును తమలో చూడగలిగినవారు మహాజ్ఞానులు. భగవానుడు గీతలో పండితా **సమదర్శనః** అంటాడు. అక్కడ పండితుడు అనగా - మహాజ్ఞాని పండితుల సమూహమును వారికి ఉచితమైన వృత్తులయందు నియమించువాడు.

**అంతరారాధన పరావైదికా బ్రహ్మావాదినః** వేద సమ్మతములైన పనులు చేసేవారు, బ్రహ్మావాదులు అంతరారాధన చేస్తారు. వీరు

**జీవన్ముక్తాః చరంతేతే త్రిషులోకేషు సర్వదా**

జీవన్ముక్తులై ఎల్లకాలములందు, ముల్లోకాలలోనూ చరిస్తూ ఉంటారు.

వీరుసిద్ధ పురుషులు. కాబట్టి భూమిమీద ఎవరైనా ఒక మంచి పని చేస్తుంటే దానికి సహకరిస్తారు. కొన్ని అసాధారణమైన పనులు వీరిద్వారా జరగుతూ ఉంటాయి. పరమేశ్వరుడు సూక్ష్మశరీరులైన ఈ సిద్ధ పురుషులను తన ఇష్టం వచ్చినట్లు నడిపిస్తాడు. భగవంతుడి ఇష్టము అంటే లోకోపకారము ధర్మసంస్థాపన తప్ప వేరుకాదు. అందుచేత నిత్యసూరులు అనబడే సిద్ధపురుషులను ధర్మపరిరక్షణకు, లోకోద్ధరణకు నియమిస్తాడు కాబట్టి పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు 'గ్రామణీః' అనబడుతున్నాడు.

## 220. శ్రీమాన్

సంపన్నుడు 22, 178, 613 నామాలుకూడా ఇదే.

**మత్స్యరూపా వతారేఽపి శ్రీమాన్ కమలనేత్రతః**

విష్ణుమూర్తి మత్స్యావతారము ఎత్తాడు. అంటే చేప రూపంలో ఉన్నాడు. అయినప్పటికీ అందమైన పద్మములవంటి నేత్రములు కలిగి ఉన్నాడు. అందుచేత నిత్యవిభూతి నాయకుడని తెలుస్తోంది.

**శ్రీః అస్యాస్తీతి శ్రీమాన్** ఐశ్వర్యము గలవాడు కాబట్టి శ్రీమాన్ అనబడుతున్నాడు.

**మత్స్యః కమలలోచనః** మత్స్యావతారుడై ఉండికూడా అతడు కమలలోచనుడు. అందుచేత శ్రీమాన్ అనబడుతున్నాడు.

**సర్వాతిశయాని శ్రీఃక్రాంతిః అస్య** అందరియొక్క కాంతులను మించిన కాంతి కలవాడు. పరమేశ్వరుడు తేజోమయమైన కాంతిపుంజము. అతడు కొన్నివేలకోట్ల సూర్యుల యొక్క కాంతితో ప్రకాశిస్తున్నాడు. **భైరవయామళం**లో పరమేశ్వరి స్వరూపాన్ని వివరిస్తూ

**జ్యోతిరూపా పరాకారా యస్యాదేహోద్భవా శ్శివే**
**కిరణాశ్చ సహస్రం చ ద్విసహస్రం చ లక్షకమ్**
**కోటిరర్బుదమే తేషాం పరాసంఖ్యా నవిద్యతే**

ఆ పరమేశ్వరి జ్యోతిరూపంతో ప్రకాశిస్తున్నది. ఆమె యొక్క దేహము నుండి వందలు, వేలు, లక్షలు, కోట్లు, కోటానుకోట్లు కిరణాలు ప్రసరిస్తున్నాయి.” అని చెప్పబడింది. ఆ పరమేశ్వరి స్వయంప్రకాశము గలది. **దేవీభాగవతము**లో తారకాసురుని బాధలు పడలేని దేవతలు హిమాలయాలకు వెళ్ళి పరిపరివిధాల పరమేశ్వరిని ప్రార్థిస్తారు. అప్పుడు చైత్రశుద్ధ నవమి శుక్రవారమునాడు ఆ దేవి వారికి దర్శనమిచ్చింది. ఆ సమయంలో ఆమె ఎలా ఉన్నదంటే –

**చతుర్దిక్షు చతుర్వేదమూర్తి మద్భిరభిష్ఠతమ్**
**కోటి సూర్యప్రతీకాశం చంద్రకోటి సుశీతలమ్ ॥**
**విద్యుత్కోటి సమానాభమరుణం తత్పరం మహః**

ఆ పరమేశ్వరుని చతుర్వేదములు రూపుదాల్చినవై స్తుతి చేస్తున్నాయి. ఆమె కొన్ని కోట్ల మెరుపులు ఒక్కసారి తళుక్కున మెరసినట్లున్నది” అని చెప్పబడింది.

కాబట్టి పరమేశ్వరుడు కాంతిమయుడు అందరియొక్క కాంతులను మించిన కాంతి గలవాడు. అతని కాంతులచేతనే లోకాలన్నీ ప్రవర్తిల్లుతున్నాయి. (ఈ విషయం గతంలో చెప్పాము) కాబట్టే పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు ‘శ్రీమాన్’ అనబడుతున్నాడు.

## 221. న్యాయః

న్యాయము చేయువాడు

**న్యాయో హి యుక్తకారిత్వాత్ భక్తేష్వేన విశేషతః**

భక్తుల విషయంలో తనకు ఉచితమైన ధర్మమునుండి చలించనటువంటివాడు.

భక్తుల విషయంలో న్యాయము చేసేవాడు.

భగవంతుని తత్త్వాన్ని నిర్ణయించటానికి సాధనాలు ప్రమాణాలు. అటువంటి ప్రమాణాలద్వారా జీవాత్మ, పరమాత్మ రెండు ఒక్కటే’ అనే అభేద ప్రతిపత్తిని కలిగించేది తర్కము. ఆ తర్కాన్నే న్యాయము అంటారు. పరమాత్ముడైన శ్రీమహావిష్ణువు అటువంటి ‘న్యాయ’స్వరూపుడు.

ప్రమాణత్రయము ఇవి 1. ప్రత్యక్ష ప్రమాణము 2. అనుమాన ప్రమాణము 3. ఆప్తవచనము ప్రమాణపంచకము : ప్రత్యక్ష, అనుమాన, ఉపమాన, శబ్దార్థాపత్తులు.

ఈరకంగా ప్రమాణాలు అనేక రకాలున్నాయి. వాటివల్లనే భగవంతుని తత్త్వాన్ని నిర్ణయించటం జరుగుతోంది.

# 222. నేతా

నిర్వాహకుడు

**భక్తైర్నియుక్తం యత్కర్మనేతా తత్కరణాదపి**

భక్తులకు తనకు మించిన పనిచేసేవాడు. సంసార సాగరంలో మునిగిపోయిన భక్తులను రక్షించువాడు.

**న యతి నిర్వహితీతి నేతా** మంచి నిర్వాహకుడు కాబట్టి 'నేతా' అనబడుతున్నాడు.

పుణ్యఫలము సంపాదించిన వారిని, ఉత్తములను ఉచితమైన స్థానములందు నియమిస్తాడు. దేవతలను, దిక్పాలకులను వారికి అర్హమైన స్థానాలలో నియమిస్తాడు. మిగిలినవారికి వారు చేయవలసిన పనులను సమయోచితంగా కేటాయిస్తాడు. కాబట్టి శ్రీమన్నారాయణుడు 'నేతా' అనబడుతున్నాడు.

జగత్తు అనే ఈ యంత్రాన్ని నిర్వహిస్తాడు. సృష్టి స్థితి లయలతో ఈ జగత్తును ముందుకు తీసుకుపోతాడు.

సృష్టిస్థితి సంహారములు చెయ్యటానికి త్రిమూర్తులను నియమిస్తాడు. ఈరకంగా జగత్తుయొక్క వ్యాపారము అవిచ్ఛిన్నంగా చేస్తాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు 'నేతా' అనబడుతున్నాడు.

# 223. సమీరణః

ఇష్టముల నొనరించువాడు

**భక్తేష్ట చేష్టా శీలత్వాత్ సమీరణ ఉదాహృతః**

తన భక్తులకు ఇష్టమైన పనులు చేసే స్వభావము గలవాడు.

**సమీర్తే ఇష్టచేష్టో భవతీతి సమీరణః** ఇష్టము వచ్చినట్లు చేసేవాడు కాబట్టి సమీరణుడు. పరమేశ్వరుడు భక్తసులభుడు. వారియొక్క ఇష్టములను, కోరికలను నెరవేర్చటమే అతని పని. భక్తులయొక్క హృదయములయందే ఉంటాడు.

ఉఛ్వాస నిశ్వాసల రూపంలో అన్ని ప్రాణులయందు ఉంటాడు. ఈ రకంగా ఉండి ఆయా ప్రాణులు తమ తమ పనులు సవ్యంగా నిర్వర్తించేటట్లు చూస్తాడు. కాబట్టే పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు 'సమీరణః' అనబడుతున్నాడు.

అంటూ మత్స్యావతార ఘట్టాన్ని పూర్తిచేశాడు రత్నాకరుడు.

# 22. మహామహిమాన్వితుడు

"గురువుగారూ ! పరమేశ్వరుడు మహామహిమోపేతుడు కదా. మరి ఆయన మహిమలని ఏ రకంగా చెప్పారో ఒకసారి వివరించండి" అన్నాడు నారాయణభట్టు. చెప్పటం మొదలుపెట్టాడు రత్నాకరుడు.

పరమేశ్వరుడు అతిశక్తివంతుడు. అతనితో సమానమైనవారు గాని, అతనికన్న అధికులుగాని ఎవరూ లేరు. అందుచేతనే అతడు 'ఏకాకి' అని చెప్పబడుతున్నాడు. అతడు సర్వవ్యాపి. ఈ జగత్తంతా ఆవరించి ఉన్నాడు. ఈ జగత్తంతా పరమేశ్వరుని స్వరూపమే. స్థావరజంగమాత్మకమైన ఈ జగత్తులో అణువణువూ అతని రూపమే. అతని దగ్గర లేనిది ఈ జగత్తులో ఏదీ లేదు. అతడు ఏ పని అయినా చేయగల సమర్థుడు. అతడి మహిమలను వర్ణించటము దేవతలకు కూడా సాధ్యం కాదు.

ఆ పరమేశ్వరుడు సహస్రశీర్షుడు. అంటే వేయి తలలు కలిగినవాడు. జగత్తులోని ప్రాణికోటి అంతా అతని రూపమే. ఈ జగత్తుకే ప్రభువు. అన్ని ప్రాణులయందు అంతర్గతంగా ఉన్నాడు. అనేక పాదాలు, కన్నులు గలవాడు అంటే విశ్వరూపుడు. జీవులను వారి కర్మననుసరించి సంసారమనే బండిచక్రంలో గిరగిర త్రిప్పుతుంటాడు. తాను మాత్రం నిత్యవిభూతిని స్థానంగా కలిగి ఉంటాడు. తమోగుణం కలవారికి, మూఢులకు కనిపించడు. ఆయన్ని ధ్యానించటంచేత తమస్సు, మోహము నశిస్తాయి. అతడే కాలపురుషుడు. అతడే అగ్నిదేవుడు. అతడే వాయుదేవుడు. ఈ భూమండలానికి ఆధారమైనవాడు. తన భక్తుల యందు మంచి దయగలవాడు. నిర్మలమైన మనస్సు గలవాడు. ఈ విశ్వాన్ని సృష్టించినది అతడే. లోకాలను పాలించేదికూడా అతడే. సాధువులను, సజ్జనులను ఆదరిస్తాడు.

పూజనీయులైన వారిచే పూజింపబడతాడు. తన భక్తులకు సేవలు చేస్తాడు. తన భక్తులు కాని వారికి మాత్రం తన మహిమలను తెలియనివ్వడు. సర్వవ్యాపి. నాశనము లేనివాడు. అనేక రూపాలతో ఉన్నాడు. అన్నింటికన్నా అధికుడు. నిర్మలమైనవాడు. నిరంజనుడు. పూర్ణకాముడు. సిద్ధసంకల్పుడు. కోరినవారికి అణిమాది అష్టసిద్ధులను ప్రసాదిస్తాడు. సిద్ధిరూపమైన సాధన గలవాడు. అతన్ని దర్శించగలిగే రోజే పరమ పవిత్రమైనది. అతడు తన భక్తుల సంసార తాపాన్ని తగ్గిస్తాడు. కోరికలు అనే అమృత వర్షాన్ని కురిపిస్తాడు. అతడే శ్రీమహావిష్ణువు. అతన్ని చేరటానికి ధర్మమే మెట్లుగా గలవాడు. ధార్మికమైన ఉదరము గలవాడు. భక్తులను కడుపులో పెట్టుకుని కాపాడతాడు.

వారి కోరికలు తీరుస్తూ, వారిని వృద్ధి చేస్తాడు. అతడు ఏకాకి వేదాలకు గని. భక్తులను రక్షించటానికి అవసరమైన అందమైన భుజములు గలవాడు. గొప్ప పరాక్రమవంతుడు. ఆ పరాక్రమాన్ని ఇతరులు అడ్డుకోలేరు. మృదుమధురమై వాక్కుగలవాడు. పూజింపదగిన ఐశ్వర్యము గలవాడు. భక్తుల కోరికను బట్టి వారికి ధనము, రాజ్యము ఇస్తాడు. మహాత్ములైన వారికి సర్వమూ ఆ పరమేశ్వరుడే అందుచేత వారికి ధనధాన్యాలు, సిరిసంపదలు కూడా ఆ శ్రీమన్నారాయణుడే.

ఈ విషయం 224 నుండి 270 వరకు నామాలలో వివరించబడింది. ఇక నామాలను చూద్దాం.

## 224. సహస్రమూర్ధా

అనేక శిరస్సులు గలవాడు.

**సహస్రశబ్దో హ్యానన్త్య లక్షక స్సముదాహృతః**
**సహస్రమూర్ధా సో ఽ నన్త శిరస్కః కీర్త్యతే తతః**

సహస్రము అంటే వేయి అని అర్ధం కాదు. అనేకము కాబట్టి పరమేశ్వరుడు అనేక శిరస్సులు గలవాడు.

**సహస్రమూర్ధా సస్స్యాద్వా పుంసూక్తాద్యుక్త నామవాన్**

పురుషసూక్తములో చెప్పినట్లుగా సహస్రశీర్షుడు.

**సహస్రమే మూర్ధానః యస్యసః సహస్రమూర్ధా** అనేక శిరస్సులు కలవాడు.

**సహస్రాణి మూర్ధానః అస్యః** పరమేశ్వరునికి వేలకొలది శిరస్సులున్నాయి.

**సహస్రశీర్షాపురుషః సహస్రాక్ష స్స హస్రపాత్** ఆ పరమ పురుషుడికి అనేక వేల శిరస్సులు, అనేక వేల కనులు, అనేక వేల పాదాలు ఉన్నాయి.

**ముద్గలోపనిషత్తులో "సహస్రశీర్షా పురుషః" :** అన్నిచోట్ల సహస్రము అనే పదము –అనంతము అనే అర్ధంలో వాడబడింది. అంటే పరమేశ్వరునికి అనేక వేల శిరస్సులు ఉన్నాయి. ఆ పురుషుడు నామరూప జ్ఞానములకు గోచరము కాడు. అతడు దేవతలు మొదలైన వారి బాధలను ఉపశమింపచేసే కోరికతో వేలకొలది అవయవములు కలిగి, తన దృష్టితోనే మోక్షమును ఇచ్చే వేషాన్ని ధరించాడు. అంటే సత్పురుషుల బాధను పోగొట్టి వారికి మోక్షాన్ని అనుగ్రహిస్తాడు.

అతడు భూమి ఆకాశాలను వ్యాపించి అనంత యోజన ప్రదేశము నాక్రమించి ఉన్నాడు. ఆ పురుషుడే నారాయణుడు. అతడు త్రికాలములందు ఉంటాడు. మోక్షప్రదుడు. అతడు అన్నింటికన్నా గొప్పవాడు. అతనికన్న గొప్పవారు లేరు. ఆ మహాపురుషుడు తనను నాలుగు భాగాలుగా చేసి, మూడు భాగాలతో ఆకాశాన్ని ఆక్రమించాడు. నాలుగవ పాదంతోనే ఈ జగత్తు ఏర్పడింది. ఈ జగత్తును సృష్టించటానికి నారాయణుడు ప్రకృతిని పుట్టించాడు. అతడు పూర్ణకాముడు. కోరికలు నిండినవాడు. కోరికలు ఫలించినవాడు, కోరికలు లేనివాడు. కాబట్టి అతడు సృష్టి చెయ్యలేదు. అనిరుద్ధ నారాయణునికి సృష్టిని ఉపదేశించాడు." అని చెప్పబడింది. కాబట్టి సహస్రశీర్షుడు అంటే – శ్రీమన్నారాయణుడు తప్ప వేరు కాదు.

**భగవద్గీత**లోని పదకొండవ అధ్యాయము **విశ్వరూప దర్శనయోగము** 'శ్రీకృష్ణా! దివ్యమైన, తేజోమయమైన నీయొక్క విశ్వరూపాన్ని నాకు చూపవలసినది' అని అడిగాడు అర్జునుడు. శ్రీకృష్ణ భగవానుడు తన విశ్వరూపాన్ని చూపాడు. అప్పుడు ఆ రూపము ఎలా ఉన్నదంటే 10, 11 శ్లోకాలు.

**అనేక వక్త్రనయనం అనేకాద్భుతదర్శనమ్ ।**
**అనేకదివ్యాభరణం దివ్యానేకోద్యతాయుధమ్ ॥**

**దివ్య మాల్యాంబరధరం దివ్యగంధానులేపనమ్ ।**
**సర్వాశ్చర్యమయం దేవం అనన్తం విశ్వతోముఖమ్ ॥**

అనేక ముఖములతోడను, అనేక నయనములతోడను, అద్భుతములైన దృశ్యములతోడను, దివ్యాభరణములతోడను, ఆ పరమేశ్వరుడు దివ్యాస్త్రములు ఎక్కుపెట్టి ఉన్నాడు. అతడు దివ్యమైన వస్త్రములు ధరించి, దివ్యాభరణములతో ప్రకాశిస్తున్నాడు. ఆ రూపము సర్వాశ్చర్యకరము, విశ్వతోముఖము అయి ఉన్నది.

ఇక్కడ ఆ పరమేశ్వరునికి 'అనేకవక్త్రమ్' అన్నారు అంటే అసంఖ్యాకమైనటు వంటివి. అనేక విధాలైనవి అయిన ముఖాలు అని అర్థం.

పరమేశ్వరుడు చరాచర జగత్తంతా వ్యాపించి ఉన్నాడు. సృష్టిలోని ప్రాణులు అతని రూపమే. కాబట్టే పరమేశ్వరుడు అనేకములైన శిరస్సులు గలవాడు అని చెప్పబడింది. సృష్టిలోని ప్రతిజీవి అతని రూపమే కాబట్టి ప్రతిశిరస్సు అతనిదే. అంటే పిపీలికాది బ్రహ్మపర్యంతము 84 లక్షల జీవరాశుల శిరసులు అతడివే. అందుకే శ్రీమన్నారాయణుడు 'సహస్రమూర్ధా' అనబడుతున్నాడు. **లలితా సహస్రం**లో **282**వ నామము **సహస్రశీర్షవదనా**

# 225. విశ్వాత్మా

విశ్వానికే ఆత్మ.

**అభ్యాం చ జ్ఞానకర్మభ్యాం విశ్వాత్మా వ్యాపనాత్ స్మృతః**

పరమేశ్వరుడు సర్వజ్ఞుడు. సర్వశక్తిమయుడు. ప్రపంచమంతా వ్యాపించి ఉన్నాడు. అన్ని జీవులయందు ఆత్మగా ఉన్నాడు. కాబట్టి ఈ జగత్తుకంతటికి ఆత్మ అని చెప్పబడుతున్నాడు.

**విశ్వస్య ఆత్మా విశ్వాత్మా**

జ్ఞానశక్తితో అంతటా వ్యాపించి ఉన్నాడు కాబట్టి విశ్వాత్మా అనబడుతున్నాడు.

**విశ్వం ఆత్మా యస్యసః** విశ్వమే తన రూపముగా గలవాడు.

**పురుషసూక్తంలో సభూమింవిశ్వతోవృత్వా** భూమినంతటినీ వ్యాపించినవాడు.

**భగవద్గీత**లోని పదవ అధ్యాయం **'విభూతియోగము'**లోని 20వ శ్లోకంలో

**"అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః ।**

**అహమాదిశ్చ మధ్యం చ భూతానామంత ఏవచ ॥**

అర్జునా ! సమస్థ ప్రాణుల హృదయమందున్న ఆత్మను నేనే. సకల ప్రాణుల ఆది, మధ్యము, అంతమునేనే." అని చెప్పబడింది.

సమస్త ప్రాణులయందు ఉండే చైతన్యమును 1. పరాప్రకృతి, 'క్షేత్రజ్ఞుడు' అంటారు. ఆ విషయం చెప్పటానికే ఇక్కడ 'సర్వభూతాశయస్థితః' అనే పదం వాడారు. ఇక్కడ 'ఆత్మ' అంటే – భగవంతుని అంశ.

నిరాకారుడు, నిర్గుణ స్వరూపుడు అయిన పరబ్రహ్మ స్థావర జంగమాత్మకమైన జగత్తునంతా ఆవరించి ఉన్నాడు. **ఐతరేయోపనిషత్తు**లో చెప్పినట్లుగా 'భగవంతుడు ఈ లోకాలను సృష్టించాలి అనుకున్నాడు. ముందుగా ఇంద్రియాలను, తరువాత ఇంద్రియాధిష్ఠాన దేవతలను సృష్టించాడు. వారికి ఆహారం ఏర్పాటు చేశాడు. వారు కూర్చుని భుజించటానికి వీలుగా విరాట్పురుషుని ఆకారంలో మనిషిని సృష్టించాడు. ఇప్పుడు ఈ మనిషిలో నేను లేకపోతే ఎలాగ ? అనుకున్నవాడై బ్రహ్మరంధ్రం ద్వారా మానవదేహంలో ప్రవేశంచాడు. ఈ రకంగా చరాచర జగత్తులోని జీవకోటి యందంతటా తానే ఉన్నాడు" అని చెప్పబడింది. అందుకే శ్రీమన్నారాయణుడు 'విశ్వాత్మా' అనబడతాడు.

ఈ జగత్తంతా ఆ పరమేశ్వరుని రూపమే. **బృహదారణ్యకోపనిషత్తు**లో చెప్పినట్లుగా "లోకాలను సృష్టించాలి అనుకున్నాడు. అనుకున్నదే తడవుగా స్త్రీ పురుషులు అతడి ఎదుట ప్రత్యక్షమైనారు. అందులో పురుషుడు స్వాయంభువ మనువు. స్త్రీ శతరూప. వీరిద్దరూ పరమేశ్వరుని అంశలే. వీరివల్లనే 84 లక్షల జీవరాశి ఉద్భవించింది.

కశ్యప ప్రజాపతి దక్షప్రజాపతి కుమార్తెలను వివాహం చేసుకున్నాడు. వీరివల్లనే ఈ జగత్తంతా ఉద్భవించింది. అందుచేతనే శ్రీమన్నారాయణుడు జగత్తంతా ఆవరించి ఉండి 'విశ్వాత్మా' అని పిలువబడుతున్నాడు.

## 226. సహస్రాక్షః

అనేక నేత్రములు కలవాడు.

**అక్షి పాదపదే జ్ఞానకర్మేన్ద్రియ నిదర్శకే**

అక్షి అనగా - జ్ఞానేంద్రియాలు. పాద అంటే కర్మేంద్రియాలు. సహస్రము అంటే - అనేకము అని అర్థం. అనంతమైన జ్ఞానకర్మ ఇంద్రియాలచే చేయవలసిన కర్మలను అతితేలికగా, తనకర్మతోనే చేయగలవాడు.

**సహస్రమ్ అక్షి యస్యసః సహస్రాక్షః** అనేక నేత్రములు గలవాడు.

వేలకొలది కనులు లేదా ఇంద్రియాలు గలవాడు.

పరమేశ్వరుడు ఈ జగత్తంతా ఆవరించి ఉన్నాడు. చరాచర జగత్తంతా అతని రూపమే. సృష్టిలోని ప్రాణికోటి అంతా అతని రూపమే. అటువంటప్పుడు జీవకోటికనులన్నీ ఆ పరమేశ్వరునివే కదా ! అందుచేతనే లెక్కలేనన్ని కనులు గలవాడు ఆ శ్రీమన్నారాయణుడు అని చెప్పబడుతున్నాడు.

**లలితా సహస్రం**లో 283వ నామము సహస్రాక్షీ

## 227. సహస్రపాత్

అనేక పాదాలు గలవాడు.

**తేనానన్త జ్ఞానకర్మా సహస్రాక్ష సహస్రపాత్**

అనేక పాదములు గలవాడు. అనేకమైన కర్మేంద్రియాలు గలవాడు.

**సహస్రమ్ పాదాయస్యసః సహస్రపాత్** అనేక పాదాలు గలవాడు.

**సహస్ర శీర్షా పురుషః సహస్రాక్ష స్సహస్రపాత్** అనేక వేల శిరస్సులు, అనేక వేల కనులు, అనేక వేల పాదాలు గలవాడు ఆ పరమేశ్వరుడు. అతడే భూమిని అన్నివైపుల నుంచి చుట్టి ఉన్నాడు వేదాది వాక్కులకు అతీతుడుగా ఉన్నాడు.

**భగవద్గీత**లోని 13వ అధ్యాయం **క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగం**లోని 14వ శ్లోకం

**సర్వతః పాణిపాదం తత్ సర్వతోஉక్షి శిరోముఖమ్ ।**

**సర్వత శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి ॥**

ఆ పరమాత్ముని పాదాలు, చేతులు, కనులు, చెవులు, శిరస్సులు, ముఖములు సర్వత్ర స్థితములై ఉన్నాయి. అతడు సర్వాన్నీ ఆవరించి ఉన్నాడు.

పరబ్రహ్మ చేతులు అన్ని దిక్కులయందు వ్యాపించి ఉన్నాయి. ఆయనకు ఏ వస్తువైనా సరే, ఎక్కడ నుండి సమర్పించినా సరే, అక్కడ నుండే అతడు దానిని స్వీకరిస్తాడు. అలాగే ఆయన పాదాలు కూడా అన్ని వైపులకు వ్యాపించిఉన్నాయి. ఏ భక్తుడైనా, ఎక్కడి నుండియైనా ఆయన పాదాలకు నమస్కారం చెయ్యవచ్చు. ఆయన సర్వశక్తిమంతుడు. కాబట్టి అన్ని స్థానాలయందు, అన్నిఇంద్రియాల ద్వారా ఆయా పనులు చేస్తుంటాడు. అతని చేతులయొక్క గ్రహణశక్తి, కాళ్ళయొక్క చలనశక్తి సర్వత్రా వ్యాపించి ఉన్నది.

అతని కనులు సర్వత్రా వ్యాపించి ఉన్నాయి. ఈ జగత్తులో అతడు చూడని స్థలమే లేదు. అతనికి తెలియని విషయము లేదు. అతని శిరస్సులు సర్వత్ర వ్యాపించి ఉన్నాయి. భక్తులు ఏ ప్రాంతమునుండి పరమేశ్వరునికి పూలు సమర్పించినా, అవి ఆయన శిరస్సులోనే అలంకృతమవుతాయి. ఈ జగత్తులో ఆయన శిరస్సు లేని స్థానమే లేదు. ఆయన ముఖాలు కూడా సర్వత్రా వ్యాపించి ఉంటాయి. భక్తులు ఏ పదార్థము, ఎచ్చటినుండి సమర్పించినా అతడు దానిని స్వీకరిస్తాడు. ఆయన ముఖములు లేని స్థలమే లేదు. జ్ఞేయరూపుడైన పరమాత్మ సర్వసాక్షి. అందరి పూజలు, నివేదనలు ఏకకాలంలో స్వీకరించగలడు. అతని చెవులుకూడా సర్వత్రా వ్యాపించి ఉన్నాయి కాబట్టి ఎవరు ఎక్కడ ఏ రకంగా పిలిచినా, ఏ విధంగా స్తుతించినా వినగలడు. కోరికలు, విన్నపాలు ఆలకించగలడు.

పరమేశ్వరుడు సర్వత్రా వ్యాపించి ఉన్నాడు. ఆజ్ఞేయతత్త్వము యొక్క సర్వవ్యాపకత్వమే ఇక్కడ చెప్పబడుతున్నది. గాలి, నీరు, నిప్పు, భూమి వీటికి కారణమైన ఆకాశము సర్వత్రా వ్యాపించి ఉన్నట్లే, జ్ఞేయరూపుడైన పరమాత్ముడు కూడా జీవకోటితో కూడి సర్వత్రా వ్యాపించి ఉన్నాడు. ఈ కారణాలవల్ల శ్రీమన్నారాయణుడు 'సహస్రపాత్' అనబడుతున్నాడు.

**లలితా సహస్రం**లో 284వ నామము సహస్రపాత్

# 228. ఆవర్తనః

త్రిప్పించువాడు.

**సంసారాఖ్యఘటీయన్త్రే పరివర్తనశీలతః**

**చక్రవచ్చ విశేషణ హ్యావర్తన ఇతీరితః**

జీవులను సంసారము అనే రంగుల రాట్నమునందు ప్రవేశపెట్టి వారి కర్మానుసారము త్రిప్పుతూ ఉండేవాడు.

**ఆవర్త యంతీతి ఆవర్తనః** సంసారమనే బండిచక్రాన్ని త్రిప్పేవాడు.

**ఆవర్తయితుం సంసారచక్రం శీలం అస్య** సంసారమనే చక్రాన్ని త్రిప్పటము ఇతని శీలము.

జగత్తును సృష్టించిన తరువాత జీవులు కర్మలు చేస్తుంటారు. ఆ కర్మలకు తగిన ఫలితము పాపపుణ్యాల రూపంలో వస్తుంది. మరణానంతరము పాపపుణ్యాలను అనుభవించిన జీవి, కర్మ శేషాన్ననుభవించటానికి ఈ భూమిమీద పుట్టవలసి వస్తుంది.

పుట్టినజీవి మళ్ళీ కర్మలు చేస్తుంది. ఈరకంగా జన్మించటము, కర్మలు చెయ్యటము. ఆ కర్మ ఫలితము అనుభవించటానికి మళ్ళీ జన్మించటము. **పునరపి జననం పునరపి మరణం.** ఈ రకంగా జీవి సంసారమనే బండి చక్రంలో పడి గిరగిరా తిరుగుతుంటాడు. ఈ చక్రాన్ని త్రిప్పేది ఆ పరమేశ్వరుడు. అందుకే శ్రీమన్నారాయణుడు 'ఆవర్తనః' అనబడుతున్నాడు. **మహాభారతం**లోని ఉద్యోగపర్వంలో

**కాలచక్రం జగచ్చక్రం యుగచక్రం చ కేశవః**

**ఆత్మయోగేన భగవాన్ పరివర్తయతే ऽ నిశమ్ ॥**

కాలచక్రము, జగచ్చక్రము, యుగచ్చక్రము వీటన్నింటినీ శ్రీమన్నారాయణుడు (కేశవుడు) తన సంకల్పముతో ఎప్పుడూ త్రిప్పుతూనే ఉన్నాడు.

**భగవద్గీత**లోని 18వ అధ్యాయం **మోక్షసన్యాస యోగం**లోని 61వ శ్లోకం

**ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేऽర్జున తిష్ఠతి ।**

**భ్రామయన్సర్వభూతాని యంత్రారూఢాని మాయయా ॥**

అర్జునా ! శరీరముయొక్క రూపంలో ఉన్న యంత్రాలను అధిరోహించిన సర్వజీవుల యందు అంతర్యామిగా ఉన్న ఆ పరేమేశ్వరుడు, తన మాయతో వారి వారి కర్మలను అనుసరించి భ్రమింపచేస్తున్నాడు.

రైలు ఎక్కి కూర్చున్నవాడు నిజంగా కదలడు. కాని రైలు కదలటంతో అతడుకూడా కదలినట్లు అవుతుంది. అలాగే నిశ్చలమైన ఆత్మకు శారీరక క్రియలతో ఏ రకంగానూ సంబంధము లేదు. అయినప్పటికీ అజ్ఞానము వలన శరీరంతో సంబంధమున్నట్లుగా భావించబడుతుంది. రైలు నడిపేవాడు కూడా, ఆ రైలులోనే కూర్చుని ఉంటాడు. అలాగే పరమాత్మ సమస్త ప్రాణులయందు ఉండి వారి కర్మానుసారము, వారిని భ్రమింపచేస్తాడు. ఇది ఈశ్వర సంకల్పము. ఇందులో ఏ విధమైన లోపము ఉండదు.

ఈరకంగా సంసారచక్రము త్రిప్పుతాడు కాబట్టే శ్రీమన్నారాయణుడు 'ఆవర్తనః' అనబడుతున్నాడు.

## 229. నివృత్తాత్మా

శ్రేష్ఠమైన స్వరూపము గలవాడు. 597వ నామము ఇదే.

**త్రిపాద్విభూతి కత్వేన భవపాద విభూతితః ।**

**ఉద్గతాత్మ స్వరూపత్వాత్ నివృత్తాత్మేతి కథ్యతే ॥**

నిత్యవిభూతిని స్వస్థానముగా గలవాడు కాబట్టి, సంసారమనే లీలావిభూతి స్వభావాలు ఏవీ తనకు అంటకుండా నిర్వహిస్తుంటాడు.

**నివృత్తః ఉద్గతః ఆత్మా స్వరూపం యస్యసః నివృత్తాత్మా**

లీలా విభూతికన్న గొప్పదైన నిత్యానుభూతిని స్వరూపంగా గలవాడు. **నివృత్తా ఆత్మా అస్యసః** సంసారబంధము నుండి మరలిన ఆత్మస్వరూపము గలవాడు.

**కఠోపనిషత్తు**లో గౌతముని కుమారుడు నచికేతుడు తండ్రి 'విశ్వజిత్' అనే యాగాన్ని చేస్తున్నాడు. ఆ యజ్ఞంలో చివరిభాగము దానాలు. గౌతముడు నచికేతుని యముడికి దానం ఇస్తాడు. నచికేతుడు యమపురికి బయలుదేరి వెళ్ళాడు. ఆ సమయంలో యముడు ఇంట్లోలేడు. అతడికోసం మూడు రోజులు ఎదురు చూశాడు. యమధర్మరాజు వచ్చిన తరువాత నచికేతుని క్షమించమని కోరి అతడు ఎదురుచూసిన ఒక్కొ రోజుకు ఒక్కొక్క వరం చొప్పున, మూడు రోజులకు మూడు వరాలిస్తాను. కోరుకోమన్నాడు. నచికేతుడు కోరిన రెండు వరాలు ఇచ్చాడు యముడు. ఇప్పుడు మూడవ వరం కోరాడు. అదే బ్రహ్మజ్ఞానం. ఆ బ్రహ్మజ్ఞానాన్ని వివరించమని కోరాడు నచికేతుడు. యముడు అనేక రకాలుగా పరిక్షించి, చివరకు బ్రహ్మోపదేశం చెయ్యటం ప్రారంభించాడు

"నచికేతా ! శ్రేయస్సు, ప్రేయస్సు అని రెండు విషయాలను శ్రుతులు చెబుతున్నాయి. ఇక్కడ శ్రేయస్సు అంటే విద్య, ప్రేయస్సు అంటే – అవిద్య. పునరావృత్తి రహితమైన మోక్షమార్గమే శ్రేయో మార్గము అదే నివృత్తి మార్గము కాగా ఐహిక సుఖాలలో ఓలలాడించేది ప్రేయోమార్గము. మానవుడు ఈ రెంటిలోనూ ఏదో ఒక మార్గాన్ని ఎన్నుకోవాలి. ఈ రెండు మార్గాలు కలిసి ఉన్నట్లుగానే కనిపిస్తాయి. జ్ఞానియైనవాడు శ్రేయో మార్గాన్ని ఎన్నుకుంటాడు. ఈ రెండూ విరుద్ధ స్వభావాలు గలవి. వీటిలో శ్రేయోమార్గము కాంతి. కాగా ప్రేయోమార్గము చీకటి. అవిద్యలో మునిగినవాడు. తనను తాను పండితునిగా భావిస్తాడు. ధనధాన్యాలు, సిరిసంపదలు, భోగభాగ్యాలు, భార్యాపుత్రులు ఇవే లోకము అనుకుంటాడు. ఇలాంటివాడు జనన మరణాలతో బాధ పడుతుంటాడు.

ఆత్మజ్ఞానం అనే పదం వినటానికి కూడా చాలామందికి అర్హత ఉండదు. కొందరికి విన్నా ఇది అర్థం కాదు. అందుచేతనే వాళ్ళు దీనికిష్టపడరు.

కర్మలవల్ల తత్త్వం లభించదు. కర్మలు అనిత్యమైనవి. ఆత్మ ఒక్కటే నిత్యమైనది. లౌకిక ప్రయోజనాలకు ఉపయోగించే ప్రవృత్తి మార్గాన్ని వదలి, నివృత్తి మార్గాన్ని ఆచరించినవారే మోక్షానికి అర్హులు.

పరమేశ్వరుడు మహాజ్ఞాని, కాబట్టి ఆయనకు ప్రవృత్తిమార్గముండదు. అంటే లౌకిక విషయాలమీద ఆసక్తి ఉండదు. అందుచేతనే తనను శరణువేడిన వారికి కూడా నివృత్తి మార్గాన్ని ప్రబోధిస్తాడు. కాబట్టే శ్రీమన్నారాయణుడు 'నివృత్తాత్మా' అనబడుతున్నాడు.

## 230. సంవృతః

దాగి ఉండేవాడు.

**తామసానాంతు మూఢానాం గూఢత్వా త్సంవృతస్మృతః**

తామసులకు, మూఢులకు కనిపించనివాడు.

తమోగుణ ప్రధానులకు కనిపించకుండా దాగి ఉండువాడు.

ఏరకంగానైనా సరే శ్రీహరిని సంహరించాలి అనే కోరికతో వైకుంఠానికి వెళ్ళాడు హిరణ్యకశ్యపుడు. అక్కడ విష్ణుమూర్తి లేడు. 'ఎక్కడికి పోయాడు రా మీ హరి ?' అంటూ ఆదిశేషుని హుంకరించాడు హిరణ్యకశ్యపుడు. సమాధానం చెప్పలేదు శేషుడు. తలవంచుకున్నాడు. దాంతో విర్రవీగిపోయాడు హిరణ్యకశ్యపుడు. "పిరికిపంద పారిపోయాడు' అనుకుంటూ అక్కడనుంచి వెళ్ళిపోయాడు రాక్షసుడు. కాని నిజంగా

పారిపోలేదు హరి. అప్పటికి హిరణ్యకశ్యపుడి తపశ్శక్తి ఇంకా ఉంది. అతడి పాపం పండలేదు. ఆ సమయంలో అతన్ని ఎదిరించి ఉపయోగం లేదు. అందుచేత, తమోగుణ ప్రధానుడైన హిరణ్యకశ్యపుడికి కనిపించటం ఇష్టం లేక, ఇంకెక్కడా దాగి ఉండేచోటులేక సూక్ష్మరూపంలో అతని శ్వాసరంధ్రంలోనే దాక్కున్నాడు.

ఈరకంగా తమోగుణ ప్రధానులకు కనిపించడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు. 'సంవృతః' అనబడుతున్నాడు.

**ఆచ్ఛాదికయా అవిద్యయా** అవిద్యచేత కప్పబడినవాడు. తన స్వరూపము తెలియనీయకుండా అవిద్యచేత కప్పబడినవాడు.

పరమేశ్వరుడు తనస్వరూపాన్ని అందరికీ తెలియనీయడు. తన స్వరూపము అంటే జ్ఞానము. ఆ జ్ఞానజ్యోతులను అందరియందు ప్రకాశింపచెయ్యడు. ఎందుకని అంటే, సాధకుడు అజ్ఞాని అయినప్పుడు, అతనికి ఉన్న భ్రాంతి తొలగనప్పుడు, నేను నాది అనే అహంకార మమకారాలు అతన్ని వీడనప్పుడు అతడికి పరమేశ్వర తత్త్వము అర్థం కాదు. అంటే అజ్ఞానమనే పొర అతన్ని కప్పి ఉంచుతుంది. ఆ తెర తొలగితేనే కాని భగవస్సాక్షాత్కారము కాదు. భగవంతుడికి, భక్తుడికి మధ్యన ఉండేదే అజ్ఞానపు తెర. ఇది తొలగిపోతేనే కాని అంటే తెరతీస్తేనే గాని స్టేజిమీద నటుడు కనిపించనట్లుగా, అజ్ఞానపు తెర తీస్తేనే కాని భగవద్దర్శనము కాదు ఈ రకంగా అజ్ఞానపు తెరలతో కప్పబడి ఎవరికీ కనిపించకుండా ఉండేవాడు కాబట్టే శ్రీమన్నారాయణుడు 'సంవృతః' అనబడుతున్నాడు.

## 231. సంప్రమర్ధనః

నశింపచేయువాడు.

**తమస్స్వవిద్యయా సమ్యక్మర్దనా త్ప్రమ్మర్దనః**

పరమేశ్వరుని ఉపాసించటంవలన, జ్ఞానాన్ని ఆవరించి ఉండే తమస్సు అణగద్రొక్కబడుతుంది. పరమేశ్వరుడు సత్వగుణ ప్రధానుడు. కాబట్టి రజస్తమో గుణాలను అణచివేస్తాడు. **సంప్రమర్థయతీతి సంప్రమర్దనః** తనను తెలుసుకోవటంచేత, తమస్సును నశింపచేయువాడు.

**తమేవం విద్వాన్ అమృత ఇహభవతి**

ఈ రకంగా అతనిని తెలుసుకున్నటువంటివాడు అమృతుడవుతున్నాడు.

రుద్రుడు, కాలుడు మొదలైన రూపాలలో ప్రాణులను మర్దించువాడు.

పరమేశ్వరుడు సత్త్వగుణప్రధానుడు. అతడు మహాజ్ఞాని రజస్తమోగుణాలు అతని దరిచేరలేవు. **బ్రహ్మవిద్బ్రహ్మైవభవతి** పరబ్రహ్మను గురించి తెలుసుకున్నవాడు కూడా పరబ్రహ్మమే అవుతాడు. అంటే జ్ఞానస్వరూపాన్ని తెలుసుకున్నవాడు కూడా మహాజ్ఞానియే. కాబట్టి పరమేశ్వర స్వరూపాన్ని తెలుసుకున్నవారికి తమోగుణము ఉండదు. అది నాశనము అయిపోతుంది. పరమేశ్వరుడు అనేది జ్ఞానాగ్ని. దానిలో అజ్ఞానము అంతా కాలిపోతుంది. అందుచేతనే అతన్ని తెలుసుకున్నంత మాత్రం చేత తమోగుణము నశిస్తుంది.

సృష్టి ప్రారంభంలో నారాయణ స్వరూపము ఒక్కటే ఉన్నది. దానినుంచి బ్రహ్మాది దేవతలు, అష్టదిక్పాలకులు, అష్టవసువులు, అందరూ ఉద్భవించారు. ఈ రకంగా రుద్రుడు, కాలుడు కూడా అతని నుంచే ఆవిర్భవించారు. సంహార సమయంలో రుద్రుడు, కాలుడు రూపంలో జగత్తులోని ప్రాణులను మర్దిస్తూ సంహారం చేస్తుంటాడు. కాబట్టి పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు 'సంప్రమర్దనః' అనబడుతున్నాడు.

## 232. అహః సంవర్తకః

కాలమును త్రిప్పువాడు.

**అహర్లక్షిత కాలస్య పరివృత్తేశ్చ సాధనమ్ ।**
**అహస్సంవర్తక ఇతి ప్రాహుర్వేదాన్త పారగాః ॥**

అహ అనే శబ్దానికి – కాలము అని అర్ధము. దాన్ని కలా, కాష్ఠ, ముహూర్తము మొదలైన రూపముగా ప్రవర్తింపచేయువాడు. **అహః సంవర్తయతీతి అహస్సంవర్తకః** పగలు, రాత్రి మొదలైన కాలము తిరిగేటట్లు చేయువాడు.

**సర్వేనిమేషాః జజ్ఞిరే విద్యుతః పురుషాదధి**

అన్ని నిమిషములు విద్యుత్పురుషుడగు భగవానుని నుండే జన్మించాయి.

**అహాని సమ్యక్ నర్తయతి** సూర్యుని రూపంలో పగళ్ళను వర్తింపచేయువాడు.

పరమేశ్వరుడు ఒక జ్ఞానజ్యోతి. అతని నుండి అనేక కోట్ల కిరణములు ప్రసరిస్తున్నాయి. వాటిలో అగ్ని–108, సూర్యుడు – 116, చంద్రుడు – 136 కిరణములను మాత్రమే తీసుకోగలిగారు. ఈమొత్తం కలిసి 360 కిరణములు అవుతాయి. 360 రోజులు ఒక సంవత్సరము పరమేశ్వరుడు కాలపురుషుడు. అని గతంలో వివరించటం జరిగింది.

శుంభ నిశుంభులను సంహరించిన తరువాత ఇంద్రాది దేవతలు పరమేశ్వరిని స్తుతి చేస్తూ

**కలాకష్ఠాది రూపేణ పరిణామ ప్రదాయినీ**

| | | |
|---|---|---|
| కాష్ఠ అనగా | - | 18 రెప్పపాట్ల కాలము |
| కల అనగా | - | 30 కాష్టల కాలము |

ఈ రకంగా కాలంలో మార్పులు కలిగించే ఓ దేవీ !" అని ప్రార్థిస్తారు.

| | | |
|---|---|---|
| రెండు పరమాణువులు | - | ఒక అణువు |
| మూడు అణువులు | - | ఒక త్రసరేణువు |
| మూడు త్రసరేణువులు | - | ఒక తృటి |
| వంద తృటులు | - | ఒక వేధ |
| మూడువేధలు | - | ఒక లవము |
| మూడు లవములు | - | ఒక నిమిషము |
| మూడు నిమిషములు | - | ఒక క్షణము |
| ఐదు క్షణములు | - | ఒక కాష్ఠ |
| పదిహేను కాష్ఠలు | - | ఒక లఘువు |
| పదిహేను లఘువులు | - | ఒక ఘడియ |
| రెండు దండలు | - | ఒక ముహూర్తము |
| ఏడు ముహూర్తములు | - | ఒక ఝాము (2 1/2 ఘడియలు) |
| ఎనిమిది జాములు | - | ఒక రోజు (రాత్రి, పగలు) |
| పదిహేను రోజులు | - | ఒక పక్షము |
| రెండు పక్షములు | - | ఒక మాసము |
| రెండు మాసములు | - | ఒక ఋతువు |
| మూడు ఋతువులు | - | ఒక అయనము |
| రెండు అయనములు | - | ఒక సంవత్సరము (దేవతలకు ఒకరోజు) |
| ఒక సంవత్సరము | - | సూర్యుడు 12 రాశులయందు సంచరించే కాలము. |

| | | |
|---|---|---|
| 17,28,000 సంవత్సరాలు | - | కృతయుగము |
| 12,96,000 సంవత్సరాలు | - | త్రేతాయుగము |
| 8,64,000 సంవత్సరాలు | - | ద్వాపరయుగము |
| 4,32,000 సంవత్సరాలు | - | ఒక మహాయుగము |
| 72 మహాయుగాలు | - | ఒక మన్వంతరము |
| 1000 మహాయుగాలు | - | ఒక కల్పము |

ఈ రకంగా కాలచక్రాన్ని పరిభ్రమింపచేస్తాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు 'అహః సంవర్తకః' అనబడుతున్నాడు.

## 233. వహ్నిః

వహించువాడు, అగ్నిదేవడు

**విశ్వస్య దేశరూపేణ వహనా ద్వహ్ని రుచ్యతే ॥**

పరమాకాశము, గగానాది సమస్త దేశములు, బద్ధ, ముక్తనిత్యాది రూపమైన సమస్త ప్రపంచాన్ని వహించేవాడు.

**వహతీతి వహ్నిః** వహించువాడు కాబట్టి వహ్ని అనబడుతున్నాడు. ఈ లోకాలను వహిస్తున్నాడు కాబట్టి పరమేశ్వరుడు 'వహ్ని' అనబడుతున్నాడు.

దేవతల కోసము హవిస్సును తీసుకుపోతాడు కాబట్టి 'వహ్ని అనబడతాడు.

పూర్వకాలంలో విశ్వానరుడనే పండితుడు ఉండేవాడు. ఇతడి భార్య శుచిష్మతి. వీరికి సంతానము లేదు. అందుకని విశ్వానరుడు కాశీనగరంలో గంగానదీ తీరాన పుత్రార్థియై తపస్సు చేశాడు. అతడి తపస్సుకు మెచ్చి ఈశ్వరుడు ప్రత్యక్షమై 'నీకు కుమారుడు కలుగుతాడు' అని వరమిచ్చాడు. తరువాత కొంతకాలానికి శుచిష్మతి గర్భవతియై మగపిల్లవాడిని కన్నది. ఆ బాలుడికి 'వైశ్వానరుడు' అని పేరు పెట్టారు దేవతలు.

ఒకరోజున నారదమహర్షి వచ్చి ఈ బాలుని చూసి "ఇతడికి పన్నెండవ ఏట గండమున్నది" అని చెప్పాడు. విశ్వానరుడు అతని భార్య శుచిష్మతి కూడా భయపడసాగారు. వైశ్వానరుడు తల్లిదండ్రులకు ధైర్యము చెప్పి కాశికిపోయి శివుని గురించి తపస్సు చేశాడు. అతడి తపస్సుకు మెచ్చి ఇంద్రుడు ప్రత్యక్షమైతే 'నేను శివుణ్ణి గురించి తపస్సు చేస్తున్నాను. నీ వరం నాకు అవసరం లేదు" అన్నాడు. దానికి కోపించిన ఇంద్రుడు ఆ బాలుడిపై

వజ్రాయుధం ప్రయోగించాడు. ఆ దెబ్బకు బాలుడు మూర్ఛపోయాడు. అప్పుడు ఈశ్వరుడు ప్రత్యక్షమై ఆ బాలుడికి దీర్ఘాయుష్షు ప్రసాదించి, అతణ్ణి అగ్నిలోకానికి అధిపతిగా చేశాడు. ఈ రకంగా వైశ్వానరుడు అగ్నిలోకాధిపతి అయినాడు. ఆగ్నేయ దిక్కుకు అధిపతి కూడా అయినాడు.

బ్రహ్మదేవుడు లోకాలను సృష్టించిన తరువాత, దేవతలంతా బ్రహ్మదగ్గరకు పోయి 'విధాతా' ఆకలిబాధ తట్టుకోలేకుండా ఉన్నాము. దీనికి ఏదైనా ఉపాయం చెప్పండి' అని అడిగారు. దానికి బ్రహ్మ 'ఇలాంటి విషయాలు చూసేవాడు శ్రీమహావిష్ణువు. కాబట్టి అతని దగ్గరకు వెళ్ళండి' అన్నాడు. ప్రజాపతి సలహా మేరకు దేవతలు విష్ణువును ప్రార్థించారు.

అప్పుడు శ్రీమహావిష్ణువు 'దేవతలారా ! భూలోకంలో బ్రాహ్మణులు, క్షత్రియులు చేసే యజ్ఞాలకు సంబంధించిన హవ్యము మీ ఆకలిని పోగొడుతుంది. ఆ హవ్యము మీ పేరు చెప్పి అగ్నిలో వేస్తారు. కాబట్టి దాన్ని అగ్ని మూలంగా మీకు అందించే శక్తి వేరే ఉన్నది. ఆ శక్తి కోసం మీరంతా ఆ పరదేవతను ప్రార్థించండి. ఆవిడ ప్రసన్నురాలై ఆ శక్తిని పంపుతుంది' అన్నాడు.

దేవతలంతా పరమేశ్వరిని అత్యంత శ్రద్ధాభక్తులతో ప్రార్థించారు. వారి భక్తికి మెచ్చి పరమేశ్వరి ఆ శక్తిని పంపింది. బ్రహ్మదేవుడు ఆ శక్తికి నమస్కరించి "తల్లీ ! నువ్వు అగ్నిదేవునికి దాహకశక్తివై, అతనియందు హోమం చేసిన హవ్యాన్ని దేవతలకు అందించు" అన్నాడు. దానికి ఆ శక్తి 'నేను శ్రీహరికి తప్ప ఇతరులకు చెందను. అగ్నికి దాహకశక్తిగా ఉండను' అని చెప్పి తపోవనానికి వెళ్ళిపోయింది.

కొంత కాలానికి శ్రీహరి ఆమెకు ప్రత్యక్షమై 'దేవీ ! నీ మనసు నాకర్థమయింది. మరుజన్మలో నగ్నజిత్తు అనే రాజుకు కుమార్తెగా పుట్టి, నా అంశతో పుట్టిన శ్రీకృష్ణుని వివాహమాడు. ఇప్పుడు మాత్రం 'స్వాహా' అనే పేరుతో అగ్నిదేవునికి ఇల్లాలివై, దాహకశక్తివై ఉండు' అన్నాడు ఆ తరువాత అగ్నిదేవుడికి, స్వాహాదేవికి వివాహం జరిగింది. వారికి ముగ్గురు కుమారులు కలిగారు. వారే.

1. ఆహవనీయాగ్ని 2. గార్హపత్యాగ్ని 3. దక్షిణాగ్ని

స్వాహాకారంతో అగ్నిదేవునిలో వేసిన హవిస్సును దేవతలకు అందిస్తాడు అగ్నిదేవుడు. ఈ రకంగా దేవతలకోసం హవిస్సును తీసుకుపోతాడు కాబట్టే అగ్నిరూపుడైన శ్రీమన్నారాయణుడు 'వహ్నిః' అనబడుతున్నాడు. **ఛాందోగ్యోపనిషత్తు**లో వైశ్వానరాత్మను గురించి వివరించబడింది.

పూర్వకాలంలో ఉపమన్యుని కుమారుడు – ప్రాచీనశీలుడు, పులుషుని కుమారుడు సత్యయజ్ఞుడు, భల్లవుని కుమారుడు ఇంద్రద్యుమ్నుడు, శర్కరాక్షుని కుమారుడు జనుడు, అశ్వతరాశ్వుని కుమారుడు బుడిలుడు. వీరైదుగురు మంచి మిత్రులు. సదాచార సంపన్నులు, ఉత్తమ గృహస్థులు, పరమశ్రోత్రీయలు. ఒకరోజున వీరంతా ఒకచోట చేరి 'ఆత్మ అంటే ఏమిటి ? బ్రహ్మతత్త్వం అంటే ఏమిటి?' అని చర్చ సాగించారు. ఆ అంశం ఎంతకీ తేలలేదు. ఆ రోజుల్లో అరుణమహర్షి కుమారుడు ఉద్దాలకుడికి ఈ విషయాలు తెలుసునని ప్రతీతి. అందుచేత వీరందరూ అతనివద్దకు వెళ్ళాలని నిశ్చయించుకున్నారు. అనుకున్నదే తడవుగా ఉద్దాలకుడి దగ్గరకు బయలుదేరి వెళ్ళి ఆయనకు నమస్కరించి వైశ్వానరాత్మను గూర్చి ఉపదేశం చెయ్యమని వేడుకున్నారు. ఆ విషయం విన్న ఉద్దాలకుడు "వీరంతా వైశ్వానరాత్మను గురించి తెలుసుకోవటానికి నా దగ్గరకు వచ్చారు. కాని వీరి అనుమానాలు తీర్చేశక్తి సామర్థ్యాలు నాకు లేవు. వీరి సందేహాలు నేను తీర్చలేకపోయినా, వీరికి వైశ్వానరాత్మను గురించి వివరించగల మంచి గురువును చూపవలసిన బాధ్యత నాకున్నది. అని ఆలోచించినవాడై వారితో "ఆత్మ స్వరూపులారా! వైశ్వానరాత్మను గురించి క్షుణ్ణంగా తెలిసినవాడు అశ్వపతి మహారాజు. ఆయన కేకయదేశపు రాజు. మీతోపాటు నేను కూడా వస్తాను. మనమంతా అతనివద్దకు పోయి సందేహ నివృత్తి చేసుకుందాం" అన్నాడు. వారందరూ కలిసి కేకయదేశం బయలుదేరారు.

అశ్వపతి మహారాజు వీరందరినీ సాదరంగా ఆహ్వానించి అందరినీ సత్కరించాడు. మరునాడు ఉదయం వారిని పిలిచి "బ్రాహ్మణులారా ! నా రాజ్యంలో దొంగలు లేరు. ధనముండి దానధర్మాలు చెయ్యనివారు లేరు. మద్యం త్రాగి అల్లరి చేసే త్రాగుబోతులూ లేరు. అగ్నిహోత్ర విధులు నిర్వహించని బ్రహ్మచారులుగాని, గృహస్థులుగాని లేనేలేరు. అందరూ విద్వాంసులే. రాజ్యమంతా ఎన్నిసార్లు వెదికినా విద్వాంసుడు కానివాడంటూ దొరకడు. ఇప్పుడు నేను యజ్ఞం నిర్వహిస్తున్నాను. అందులో ఋత్విక్కులకిచ్చే దక్షిణలే మీక్కూడా ఇస్తాను. ఇక్కడే ఉండి మీరుకూడా యజ్ఞంలో పాల్గొనండి" అన్నాడు.

ఆ మాటలకు బ్రాహ్మణులు రాజు చెప్పిన దానికి ఒప్పుకుని "రాజా ! వైశ్వానరాత్మను గురించి తెలుసుకోవటానికి నీ దగ్గరకు వచ్చాము. అది తెలుసుకోకుండా ఇక్కడ నుంచి వెళ్ళము" అన్నారు.

ఆ మాటలకు అశ్వపతి మహారాజు సంతోషించాడు. వారి ఆధ్యాత్మిక జిజ్ఞాసను కొనియాడాడు. తరువాత రేపు ఉదయాన్నే ఈ విషయం గురించి చర్చిద్దాం విశ్రాంతి తీసుకోండి" అన్నాడు.

మరునాడు తెల్లవారకుండానే వారి పనులు ముగించుకుని, చేత సమిధలు పట్టుకుని వినయంగా రాజు వద్దకు వెళ్ళారు.

అప్పుడు రాజు ఔపమన్యుని కుమారుడైన ప్రాచీన శీలుణ్ణి పిలిచి "నీవు వైశ్వానరాత్మను ఏ విధంగా ఉపాసన చేస్తున్నావు?" అన్నాడు.

"రాజా ! నేను ద్యులోకాన్ని వైశ్వానరాత్మగా భావించి ఉపాసన చేస్తున్నాను" అన్నాడు ప్రాచీనశీలుడు దానికి అశ్వపతి మహారాజు" నువ్వు ఉపాసించేది "సుతేజ" అనే పేరుతో ప్రసిద్ధి చెందిన వైశ్వనరాత్మ. ఈఉపాసన వల్ల నీ కులంవారు తరతరాలుగా కర్మ నిష్ఠపర తంత్రులౌతారు. సుతేజమనే ఈ ఆత్మ వైశ్వానరాత్మలో నాల్గవభాగం మాత్రమే. అది వైశ్వానరాత్మకు శిరోభాగము వంటిది. నువ్వు ఈ కొంచెం భాగాన్నే మొత్తము అనుకొని ఉపాసనచేస్తే నీ తలతెగి క్రింద పడిపోతుంది. నువ్వు ఇక్కడికి వచ్చి ఈ విషయం తెలుసు కోవటం మంచిదయింది" అన్నాడు. తరువాత రాజు అదే ప్రశ్న సత్యయజ్ఞుని అడిగాడు.

ఆ మాటలు విన్న మహారాజు "నువ్వు ఉపాసించే ఆకాశము వైశ్వానరాత్మ యొక్క మధ్యభాగము. దీన్ని ఉపాసించటంవల్లనే నీ వశంలోనివారు అంతులేని ధనాన్ని పొందుతారు. ప్రియమైన వస్తుదర్శనం చేసుకుంటారు. కాని ఇది వైశ్వానరాత్మలో ఒక భాగమని తెలియకుండా గనక ఉపాసన చేస్తే సాధకుని మధ్యభాగం నాశనమై పోతుంది" అన్నాడు. ఆ తరువాత బుడిలుడిని అదే ప్రశ్న అడిగారు. దానికి బుడిలుడు "రాజా ! నేను జలాన్ని వైశ్వానరాత్మగా భావిస్తున్నాను" అన్నాడు. ఆ మాటలు విన్న రాజు "నువ్వు ఉపాసించేది ధనసంజ్ఞ గల వైశ్వానరాత్మ. దీన్ని ఉపాసించినవారు ధనవంతు లవుతారు. బ్రహ్మతేజస్సు పొందుతారు. కాని ఇదే వైశ్వానరాత్మ పూర్తిరూపమని ఉపాసనచేస్తే, సాధకుని మూత్రకోశం బ్రద్దలైపోతుంది" అన్నాడు.

తరువాత గౌతముణ్ణి "నువ్వు ఆ ఏ ఆత్మను ఉపాసన చేస్తావు?" అని అడిగాడు. దానికి గౌతముడు "రాజా ! నేను పృథివిని వైశ్వానరాత్మగా ఉపాసిస్తాను" అన్నాడు. ఆ మాటలు విన్నరాజు ఈ విధంగా అన్నాడు. "కుమారా ! నీవుపాసించే భూమి వైశ్వానరాత్మకు పాదాలు. అంతేకాని అదే పూర్ణరూపం కాదు. దీని ఉపాసనవల్ల సంతానము, పశుసంపద కలుగుతాయి. కాని ఇదే పరిపూర్ణమని ఉపాసన చేసినవాడి పాదాలు శిథిలమైపోతాయి"

ఓ బ్రాహ్మణ కుమారులారా ! సంపూర్ణ వైశ్వానరాత్మను నేనే అని భావించేవాడు వైశ్వనరావేత్త అయి అనభక్షణ చేస్తాడు. అంటే సమస్త లోకాల్లోనూ, ప్రాణాల్లోనూ, ఆత్మల్లోనూ తానే ఉండి అన్నీ భక్షణ చేస్తాడు. ఆ వైశ్వానరునికి శిరస్సు – ద్యులోకం,

నేత్రాలు – ఆదిత్యుడు, ప్రాణం – వాయువు; శరీరమధ్యభాగం – ఆకాశం; మూత్రకోశం – జలం, పాదాలు – పృథివి. వక్షస్థలమే – వేదిక; రోమాలు – దర్భలు, హృదయం – గార్హపత్యాగ్ని, మనస్సు – దక్షిణాగ్ని, నోరు – ఆవాహనీయాగ్ని.

ఈ సిద్ధాంతం ప్రకారం వైశ్వానరోపాసకుడు భోజన సమయంలో ముందుగా వడ్డించిన అన్నాన్ని హవనం చెయ్యాలి. ప్రాణాహుతులివ్వాలి. మొదటి ఆహుతి ప్రాణాయస్వాహా అంటే ప్రాణం తృప్తి పొందుతుంది. దీనివల్ల నేత్రము, ఆదిత్యుడు, ద్యులోకము, దేవతలు తృప్తి పొందుతారు. అందువల్ల భోక్తసంతానము, పశువులు, తేజస్సు, బ్రహ్మవర్చస్సు పొందుతారు.

రెండవ ప్రాణాహుతి 'వ్యానాయస్వాహ' దీనివల్ల వ్యానవాయువు తృప్తి పొందుతుంది. దీనివల్ల శ్రోత్రము, చంద్రుడు, దిక్కులు, దిక్కులకు అధిష్ఠాన దేవతలు తృప్తి పొందుతారు. అందువల్ల భోక్త సంతానము, పశువులు, శరీర తేజస్సు, బ్రహ్మవర్చస్సు పొందుతాడు.

మూడవ ఆహుతి 'అపానాయస్వాహా!' దీనివల్ల అపానవాయువు తృప్తి పొందుతుంది. దీనివల్ల అగ్ని పృథివి, పృథివికి అధిష్ఠాన దేవతలు తృప్తి పొందుతారు. భోక్తకు సంతానము, పశువులు, తేజస్సు, బ్రహ్మవర్చస్సు లభిస్తాయి. నాల్గవ ఆహుతి 'సమానాయ స్వాహ' దీనివల్ల సమాన వాయువు తృప్తి పొందుతుంది. దానివల్ల మనస్సు, పర్జన్యుడు, విద్యుత్తు, వీరి అధిష్ఠాన దేవతలు తృప్తి చెందుతారు. భోక్తకు ఇందాకటి ఫలమే వస్తుంది.

ఐదవ ఆహుతి 'ఉదానాయ స్వాహా' దీనివల్ల ఉదాన వాయువు తృప్తి చెందుతుంది. దాని వలన చర్మము, వాయువు, ఆకాశము, వాటి అధిష్ఠాన దేవతలు తృప్తి చెందుతారు. సాధకుడికి ఇందాకటి ఫలమే వస్తుంది.

వైశ్వానర విద్యను తెలుసుకోకుండా అగ్నిహోత్రం చేస్తే, నిప్పులేని బూడిదలో ఆజ్యం పోసినట్లు అదంతా వ్యర్థమే. ఈ విద్యను తెలుసుకుని అగ్నికార్యం చేసేవాడి పాపాలన్నీ క్షణంలో కాలి బూడిద అయిపోతాయి. ఈ రకంగా పరమేశ్వరుడైన శ్రీమన్నారయాణుడే వైశ్వానరుడు కాబట్టి 'వహ్నిః' అనబడుతున్నాడు.

## 234. అనిలః

ఉజ్జీవింపచేయువాడు, ప్రాణులకు జీవనాధారమైన వాడు – వాయుదేవుడు.

812వ నామము కూడా ఇదే.

**బద్ధాదేర నవాద్యోసౌ అనిలః పరికీర్తితః** బద్ధముక్త నిత్యాత్ములను ఉజ్జీవింప చేయువాడు.

**అనితి ఉజ్జీవయతీతి అనిలః** అందరను ఉజ్జీవింపచేయువాడు కాబట్టి అనిలుడు అనబడతాడు.

ప్రాణులకు జీవనాధారమైనది వాయువు. **ఐతరేయోపనిషత్తు**లో పరమేశ్వరుడు లోకాలను సృష్టించిన తరువాత "ఈ లోకాలను రోదించే వాళ్ళు లేకపోతే అవి నాశనమైపోతాయి కాబట్టి లోకపాలకులను సృష్టించాలి' అని ఆలోచించి, నీటిని తీసుకుని విరాట్స్వరూపాన్ని తయారుచేశాడు. ఆ తరువాత ఇంద్రియాధిష్ఠాన దేవతలను సృష్టించాడు. అప్పుడు ముక్కు రంధ్రాలు ఏర్పడ్డాయి. వాటినుండి ప్రాణం ఉత్పన్నమైంది. అంటే వాసన చూసే శక్తి పుట్టింది. ఆ ప్రాణశక్తి నుంచి వాయువు పుట్టింది. అని చెప్పబడింది.

**కాశీఖండము**లో "పూర్వకాలంలో 'పూతాత్ముడు' అనే బ్రాహ్మణుడు ఉండేవాడు. ఇతడు కశ్యపుడికి దాయాది. పూతాత్ముడు కాశీనగరంలో శివుని గూర్చి అనేక వేల సంవత్సరాలు తపస్సు చేశాడు. అతడి తపస్సుకు మెచ్చి ఈశ్వరుడు ఇతడిని వాయువ్య దిక్కుకు అధిపతిగా చేశాడు. ప్రాణాపానాది పంచమూర్తిత్వము నిచ్చాడు" అని చెప్పబడింది.

1. ప్రధాన వాయువు 2. ఉపవాయువులు

వీటిలో ప్రధాన వాయువులనే ప్రాణవాయువులు అంటారు. ఇవి ఐదు రకాలు.

**1. ప్రాణవాయువు :** ఇది వక్షస్థలంలో ఉంటుంది. దీని అధిష్ఠానదేవత 'విశిష్ఠకుడు' ఇది శ్వాసాదులను ఇడపింగళనాడీ మార్గం గుండా బయటకు పంపుతుంది.

**2. అపానవాయువు :** ఇది గుదస్థానంలో ఉంటుంది. దీనికి అధిష్ఠానదేవత 'విశ్వకర్త' ఇది అధోముఖంగా సంచారం చేస్తూ శుక్ల, మల, మూత్రాలను కుహు, రక్త, సినీవాలి నాడులద్వారా బయటకు పంపుతుంది. దీనివల్లనే మలమూత్రాలు అధోముఖంగా విసర్జించబడతాయి.

**3. వ్యానవాయువు :** ఇది శరీరమంతా ప్రసరించి ఉంటుంది. దీనికి అధిష్ఠానదేవత 'విశ్వయోని' ఇది బయటి శీతోష్ణాలను లోపలకు, లోపలి వాటిని బయటకు పంపుతూ ఉంటుంది. తీసుకున్న ఆహారాన్ని శరీరమంతా వ్యాపింప చేస్తుంది.

**4. ఉదాన వాయువు :** ఇది కంఠస్థానంలో ఉంటుంది. దీనికి అధిష్ఠాన దేవత 'అజుడు'. ఇది మనసుయొక్క సంకల్ప వికల్పాలను మాటల రూపంలో వెల్లడి చేస్తుంది. సుషుప్తిలో ఇంద్రియాలను స్వాధీనం చేసుకుని తనకు కారణమైన అజ్ఞానంలో మునిగి పోతుంది. జాగ్రదవస్థలో ఇంద్రియాలను వాటివాటి స్థానాలలో నిలబెడుతుంది. ఈ వాయువు సుషుమ్న గుండా సహస్రారం దాకా సంచరిస్తుంది.

**5. సమాన వాయువు :** ఇది నాభి ప్రదేశంలో ఉంటుంది. దీనికి అధిష్ఠాన దేవత 'జయుడు' ఇది జఠరాగ్నిని ప్రజ్వలింపచేసి, తిన్న ఆహారం అరగించి, శరీరంలోని 72 వేల నాడీ మండలానికి సమానంగా అందిస్తుంది.

ఇదే విధంగా ఉపవాయువులు కూడా ఐదు రకాలు

1. నాగవాయువు - వాంతిని కలిగిస్తుంది.
2. కూర్మవాయువు - కనురెప్పలను కదలిస్తుంది.
3. కృకర వాయువు - తుమ్ములను కలిగిస్తుంది.
4. దేవదత్త వాయువు - ఆవలింతలు కలిగిస్తుంది
5. ధనుంజయ వాయువు - శరీరమంతా వ్యాపించి, శరీరాభివృద్ధిని కలిగిస్తుంది.

ఈ రకంగా వాయువే పరమేశ్వర స్వరూపమయి జీవులకు ప్రాణాధార మవుతున్నది.

**ఛాందోగ్యోపనిషత్తు**

పూర్వకాలంలో అరణ్యంలో ఒక ఆశ్రమం ఉండేది. అందులో ఇద్దరు ఋషులు ఉండే వారు శౌనకుడు, అభిప్రతారి అని వారి పేర్లు. వాయుదేవుడు వారి ఆరాధ్యదైవం. ఒకరోజు మధ్యాహ్నం వారు భోజనం చేయబోయే సమయంలో తలుపు తట్టిన చప్పుడయింది. "భవతీ ! భిక్షాం దేహి" అని వినిపించింది. ఎవరో బ్రహ్మచారి భిక్షాటనకు వచ్చాడు. "ఇది సమయంకాదు. వెళ్ళు" లోపల నుంచి సమాధానం. భిక్షకుడికి లేదనటం విచిత్రం ఏమీకాదు. కాని ఋష్యాశ్రమంలో తిరస్కారానికి ఆశ్చర్యపోయాడు బ్రహ్మచారి. ఈ ఆశ్రమవాసులను తేలికగా వదలకూడదు అనుకున్నాడు. వెంటనే లోపలున్న వారినుద్దేశించి "ఆర్యా ! తమరు ఏ దేవతనుపాసిస్తారు"? అని ప్రశ్నించాడు బ్రహ్మచారి.

"నువ్వు చాలా మొండివాడిలా ఉన్నావయ్యా ! మా ఉపాసనా దైవం వాయువు. ఆయననే ప్రాణం అని కూడా అంటారు."అన్నాడు ఆశ్రమం లోపల నుంచి ఒక ఋషి.

"స్వామీ ! ఈ ప్రపంచం అంతా ప్రాణం వల్ల రూపం దాల్చింది. సృష్టి అంతా తిరిగి ప్రాణంలోనే లయం అయిపోతుంది. ఈ విషయం తమకు తెలుసుగదా ! ప్రాణమనేది కనుపించే వస్తువులయందు,కనుపించని వాటి యందు (వ్యక్తావ్యక్తముల యందు) కూడా ఉన్నది కదా !" అన్నాడు బ్రహ్మచారి.

'ఎందుకు తెలియదయ్యా ! నువ్వు చెప్పేదంతా మాకు తెలిసిందే. క్రొత్త ఏమీ కాదు' అన్నాడు లోపలి ఋషి.

"అయితే సరే ! ప్రస్తుతం అన్నం తినబోతున్నారు కదా ! మరి ఆ అన్నం ఎవరి కోసం తయారుచేశారు ? ఎవరికి నివేదన చేస్తారు ?" తిరిగి ప్రశ్నించాడు బ్రహ్మచారి.

"ఆ మాత్రం తెలియదా ! మేము ఆరాధించే వాయుదేవుడికి సమర్పించటానికి" చాలా తేలిక భావంతో సమాధానం చెప్పాడు ఋషి.

"అయితే వినండి. ప్రాణమనేది విశ్వమంతా వ్యాపించి ఉన్నది. ఆ ప్రాణానికి నైవేద్యంగా మీరు అన్నం వండారు. ఈ ప్రపంచంలో నేను కూడా ఒక భాగమే. అంటే నాలోకూడా ప్రాణమున్నది. మీరు ఉపాసించే పరబ్రహ్మ ప్రాణరూపంలో మీలో ఉన్నది. అదే నాలో కూడా ఉన్నాది. అలాంటప్పుడు ఆకలితో ఉన్న బ్రహ్మచారి రూపంలో మీ ఉపాసనాదైవమైన వాయుదేవుడే మిమ్మల్ని భిక్ష అడుగుతుంటే మీరు ఎందుకు లేదంటున్నారు?" అని ప్రశ్నించాడు బ్రహ్మచారి.

ఈ వివరణకు ఆశ్రమంలోని ఋషులు చాలా సంతోషించారు. "సత్యం బ్రహ్మచారీ, నువ్వు చెప్పింది ముమ్మాటికీ సత్యం" అన్నారు.

"ఋషీశ్వరులారా ! నాకు భిక్ష పెట్టకుండా పొమ్మంటే, నాలో ఉన్న ప్రాణాన్ని అంటే మీ ఆరాధ్యదైవాన్ని తిరస్కరించినట్లే గదా ! మీరు ఎవరికోసం అన్నం వండారో ఆ దేవునికే ఆహారం ఇవ్వననటం న్యాయమేనా?" అన్నాడు బ్రహ్మచారి.

ఈ మాటలకు ఋషీశ్వరులు చాలా సిగ్గుపడ్డారు. వెంటనే లేచి గౌరవంగా ఆ బ్రహ్మచారిని లోపలికి తీసుకుని వచ్చారు. దేవతల యొక్క బాహ్యారూపాన్నే కాకుండా, ఆంతర్యం తెలుసుకుని ఆరాధించాలి అని అర్థం చేసుకున్నవారై బ్రహ్మచారికి భోజనం పెట్టి పంపారు.

ఈ రకంగా వాయువే పరమేశ్వరుడు. కాబట్టి పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు 'అనిలః' అనబడుతున్నాడు.

## 235. ధరణీధరః

భూమిని ధరించువాడు.

**భూత ధాత్ర్యాశ్చధరణేః ధారిణాద్ధరణీ ధరః**

సమస్త భూతాలను ధరిస్తుంది ధరణి. ఆ భూమిని ధరించేవాడు శ్రీమహావిష్ణువు. అందుచేత అతడు 'ధరణీధరః' అనబడుతున్నాడు.

**ధరణీమ్ ధరతీతి ధరణీ ధరః**

భూమిని ధరించువాడు. భూమికి ఆధారమైనవాడు **కౌషీతకీబ్రాహ్మణములో**

**"సదాధార పృథివీం ద్యాముతే మామ్**

పరమపురుషుడు భూమిని, ఆకాశాన్ని కూడా మోస్తున్నాడు" అని చెప్పబడింది.

**శింశు మారాత్మ నా విష్ణుః భూరాదీ నూర్ధ్వతస్థితాన్ ।**

**ధద్రేశేషతయాన్ లోకాన్ సప్త లోకాన్ అధస్థితాన్ ॥**

శ్రీమహావిష్ణువు మొసలి రూపంలో ఊర్ధ్వలోకాలను, ఆదిశేషుని రూపంలో అధోలోకాలను ధరిస్తున్నాడు. ఇక్కడ ఆదిశేషుడు అంటే విష్ణువు తప్ప వేరు కాదు.

**భగవద్గీత** పదవ అధ్యాయము **'విభూతియోగము'**లోని 29వ శ్లోకంలో

**అనంతశ్చాస్మి నాగానాం వరుణో యాదసామహమ్ ।**

**పిత్రూణామర్యమా చాస్మి యమసంయమతామహమ్ ॥**

నాగులలో ఆదిశేషుడను నేను. జలచరాలకు అధిపతి అయిన వరుణుడును నేను. పిత్రుదేవతలలో అర్యముడను, శాసకులలో యమధర్మరాజును నేనే.

ఆదిశేషుడు నాగజాతికి ప్రభువు వేయిపడగలు గలవాడు. శ్రీమహావిష్ణువుకు శయ్య. అత్యంత భక్తుడు. చాలాసార్లు విష్ణువుతో పాటుగా అనేకసార్లు తానుకూడా అవతారాలెత్తాడు. అందుచేతనే నాగులలో ఆదిశేషుడు శ్రీమహావిష్ణువే. అతడు భూమి మోస్తున్నాడు కాబట్టి శ్రీమహావిష్ణువు 'ధరణీ ధరః' అనబడుతున్నాడు.

## 236. సుప్రసాదః

మంచి కృపగలవాడు.

**ప్రసాద పరమత్వాచ్చ సుప్రసాదః ప్రకీర్తితః**

తన భక్తులను కటాక్షించేవాడు. భక్తులపట్ల నిరతిశయమైన అనుగ్రహము గలవాడు.

**శోభనః ప్రసాదః యస్యసః సుప్రసాదః** మంచి కృప గలవాడు **శ్వేతాశ్వరోపనిషత్తులో**

**తమక్రతుమ్ పశ్యతి వీతశోకః ధాతుప్రాసాదాత్**

ప్రయత్నము చేత కూడా సాధించజాలని వానిని సర్వరక్షకుడగు వాని అనుగ్రహంతో ఏ రకమైన శోకము లేకుండా చూసేవాడు.

తనభక్తులకు మోక్షమునిచ్చేవాడు. శిశుపాలుడు మొదలైనవారు తప్పులు చేసినప్పటికీ వారి మీద కోపగించక వారికి శుభము కలుగచేయువాడు.

# 237. ప్రసన్నాత్మాః

నిర్మలమైన మనసు కలవాడు.

**అవాప్త సర్వకామత్వాత్ రాగాది రహితం మనః ।**

**యస్యాప్తి స ప్రసన్మాత్మా చిత్తతుష్టిప్రదోమనుః ॥**

పరమేశ్వరుడికి కోరికలు అనేవి లేవు. నిష్కాముడు. అందుచేత రాగద్వేషాలు లేవు.

ప్రసన్నః **ఆత్మాయస్యసః** ప్రసన్నాత్మా నిర్మలమైన మనసు కలవాడు

**రజస్తమోభ్యాం అకలుషితం అంతఃకరణం అస్య**

రజస్తమోగుణములచే కలుషితము కానటువంటి అంతఃకరణము – ప్రసన్నాత్మ అనబడుతుంది. అటువంటి ప్రసన్నమైన ఆత్మ కలవాడు.

కరుణా స్వభావము, నిర్మల స్వభావము గలవాడు. కరుణాశీలి తీరిన కోరికలు గలవాడు. పూర్ణకాముడు.

**ఛాందోగ్యోపనిషత్తు**లో భౌతికమైన ఆకాశం మన కళ్ళకు కనిపించేది అది బయట ఎంత ఉన్నదో హృదయంలో ఉన్న ఆకాశం కూడా అంతే ఉంటుంది. ఈ హృదయాకాశంలో ద్యులోకము, పృథివి రెండూ ఇమిడి ఉన్నాయి.

అలాగే అగ్ని వాయువు కూడా ఉన్నాయి. సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు, విద్యుత్తు కూడా మనలోనే ఉన్నారు. ఆత్మలోకంలో ఆత్మీయ పదార్థంగా ఉన్నదీ, లేనిదీ, భవిష్యత్తులో ఉండనిదీ, అన్నీ ఈ హృదయాకాశములో ఇమిడి ఉంటాయి.

శరీరం వార్ధక్యాన్ని పొందినప్పుడు అంతరాకాశంలో ఉన్న బ్రహ్మ జీర్ణం కాదు. శరీరాన్ని ఆయుధాలతో నరికి చంపివేసినా లోపల ఉన్న ఆత్మనాశనం కాదు. ఆత్మ వధించబడదు. ఈ బ్రహ్మపురంలో సమస్త కోరికలు ఉన్నాయి. ఆత్మకి ధర్మాధర్మాలతో పని లేదు. ముసలితనం లేదు. ఆకలి లేదు. శోకం లేదు. దాహం లేదు. ఆత్మ సత్యకామము, సత్య సంకల్పము అయినది. సాంసారిక పురుషులకు లాగా ఆత్మకు అసత్యకామన, అసత్య సంకల్పాలు ఉండవు.

లోకంలోని ప్రజలు రాజులను సేవిస్తూ, ధనధాన్యాలు సంపాదిస్తారు. ఇవన్నీ నశించిపోయేవే. అంటే కామ్యకర్మలద్వారా పొందినవన్నీ నశించిపోతాయి. యజ్ఞ యాగాదులవల్ల పొందిన స్వర్గసుఖాలు కూడా కాలం తీరగానే నష్టమైపోతాయి. భూలోకం కర్మాధికారం గల లోకము. ఆత్మను గురించి తెలుసుకోకుండానే మరణించిన వారికి

అన్ని లోకాల్లోనూ విహరించే అధికారం ఉండదు. జీవించి ఉండగా ఎవరైతే ఆత్మజ్ఞానం పొందుతారో, వారే సమస్త లోకాల్లోనూ చరించగలుగుతారు. అంటే సత్యకాముడై ఆత్మను తెలుసుకుని శరీర త్యాగం చేసినవాడు, తానే పరబ్రహ్మ అని తెలిసినవాడు సమస్త లోకాల లోను విహరించగలుగుతాడు. సత్యకాముడై దహరాకాశంలో బ్రహ్మను సేవించినవాడు మరణానంతరము పితృలోకాన్ని కోరితే – పితృగణం అతనికి ప్రత్యక్షమవుతుంది. వారితో పితృలోకాలకు పోయి, పితృలోక అనుభవాలతో సంపన్నుడై మహిమాన్వితుడౌతాడు.

అతడు మాతృలోకాలు కోరితే మాతృగణాలతో మాతృలోకాలకు పోయి అక్కడ సుఖాలనుభవిస్తాడు. భ్రాతృలోకాలు కోరితే భ్రాతృగణాలతో ఆ లోకాలకు పోయి అక్కడ సుఖాలనుభవిస్తాడు.

భగినీ (సోదరి) లోకాలు కోరితే ఆ గణాలతో ఆ లోకాలకు పోయి అక్కడ సుఖిస్తాడు.

మిత్రలోకాలు కోరితే మిత్రులంతా ప్రత్యక్షమవుతారు. వారితో ఆ లోకాలలో సుఖిస్తాడు. గంధమాల్య (పూలదండలు, సుగంధద్రవ్యాలు పుష్కలంగా దొరికేచోటు) లోకాలు కోరితే, అక్కడ సుఖిస్తాడు.

అన్నపాన లోకాలు కోరితే, ఆ లోకవాసులతో కలిసి అక్కడ సుఖిస్తాడు.

గీతావాద్య సంబంధమైన లోకాలు కోరితే, ఆ లోకవాసులు ప్రత్యక్షమవుతారు. వారితో అక్కడ సుఖిస్తాడు. స్త్రీ లోకాన్ని కోరితే ఆ లోకవాసులైన స్త్రీలు ప్రత్యక్షమవుతారు. వారితో కలిసి ఆ లోకంలో సుఖిస్తాడు. ఈ రకంగా సత్యకాముడు, సత్యసంకల్పుడు, నిర్మలుడు అయి హృత్పద్మములో ఉన్న ఆత్మను ఉపాసించినట్లైతే, ఉపాసకుడు ఏ లోకాలు కోరితే ఆ లోకవాసులతో కలిసి, అక్కడ సుఖించగలుగుతాడు.

సత్యకాముడు, సత్యసంకల్పుడు, నిర్మలమైన ఆత్మ గలవాడు కాబట్టే శ్రీమన్నారాయణుడు 'ప్రసన్నాత్మా' అనబడుతున్నాడు.

## 238. విశ్వధృక్

ఈ నామాన్ని శంకర భగవత్పాదుల వారు వ్రాశారు. కాగా పరాశరభట్టరు వారు 'విశ్వసృక్' అని వ్రాశారు. విశ్వధృక్ – విశ్వమును దర్శించువాడు.

పరమేశ్వరుడు జగత్తంతా వ్యాపించి ఉంటాడు. కాబట్టి ఎప్పుడు ఎక్కడ ఏమి జరుగుతున్నదో తెలుసుకోగలుగుతాడు. అతడికి సూర్యుడు, చంద్రుడు, యముడు, కాలము, పంచభూతాలు అనే తొమ్మిదిమంది వేగులున్నారు. వారిద్వారా విషయాలను ఎప్పటికప్పుడు సేకరిస్తాడు. విశ్వసృక్ – విశ్వమును సృజించినవాడు.

**విశ్వజగత్సృజతి యః విశ్వసృక్ స ప్రకీర్తితః** జగత్తును సృష్టించినవాడు.

**విశ్వమ్ సృజతీతి విశ్వసృక్** విశ్వమును సృజించువాడు కాబట్టి 'విశ్వసృక్' అనబడుతున్నాడు.

**ఐతరేయోపనిషత్తు**లో చెప్పినట్లుగా ఆత్మయే ఆలోచనాపూర్వకంగా ఈ లోకాలను సృజించింది. సృష్టి జరగటానికి ముందు ఈజగత్తంతా బ్రహ్మమయంగానే ఉండేది. దానికి భిన్నమైన పదార్థం ఏమీ లేదు. దాన్నే 'ఆత్మ' అని కూడా అంటారు. ఆ ఆత్మయే లోకాలను సృష్టించాలనుకున్నది. కొంతకాలానికి అంభస్సు, మరీచి, ఆపః మర అనే పేర్లుగల లోకాలను సృష్టించింది. ద్యులోకానికి అవతల ఉన్నది అంభస్సు. దానికి ఆశ్రయము స్వర్గము. అదే సువర్లోకము. దానిక్రింద భువర్లోకమున్నది. దాని క్రింద భూలోకమున్నది. ఇది మరము. అంటే మరణము గుణముగా గలది. ఇక్కడ పుట్టిన ప్రతి ప్రాణీ మరణిస్తుంది. భూలోకానికి క్రింద జలలోకమున్నది. అది క్రిందనున్న లోకాలచే పొందబడుతున్నది. కాబట్టి అపోలోకమనడుతున్నది. ఈ లోకాలన్నీ పంచభూతాలచే నిర్మించబడ్డాయి.

లోకాలను సృష్టించిన తరువాత "ఈ లోకాలను రక్షించేవారు లేకపోతే అవినాశనమై పోతాయి. కాబట్టి లోకపాలకులను సృష్టించాలి అనుకున్నది. అప్పుడు పంచభూతాలతో ప్రధానమైన జలాన్ని తీసుకుని, దానితో అవయవాలు గల మానవాకారాన్ని సృష్టించింది. ఆ ఆకారమే విరాట్స్వరూపము. ఆ తరువాత ఇంద్రియాధిష్ఠాన దేవతలను సృష్టించింది. అధిష్ఠాన దేవతలను, వారు ఆహారం తీసుకునేటందుకు విరాట్పురుషుని బోలిన మానవాకారాన్ని సృష్టించింది. ఇంద్రియాధిదేవతలకు ఆహారాన్ని సమకూర్చి, బ్రహ్మరంధ్రంగుండా తాను మానవశరీరంలో ప్రవేశించింది.

ఈ రకంగా ఆత్మలోకాలను సృష్టించింది. **బృహదారణ్యకోపనిషత్తు**లో ఈ విధంగా ఉంది.

ఈ సృష్టికి పూర్వం మానవాకారంలో ఉన్న విరాట్ ఆత్మ మాత్రమే ఉన్నది. అతనికన్న భిన్నమైనది ఏదీ లేదు. ఒంటరిగా ఉన్న ప్రజాపతి, ఒంటరితనంలోని ఆనందాన్ని అనుభవించలేకపోయాడు. అప్పుడు స్త్రీని కోరాడు. కోరినదే తడవుగా స్త్రీ పురుషులు అతనియందు ప్రత్యక్ష్యమైనారు. తన శరీరాన్ని రెండు భాగాలుగా చేశాడు ప్రజాపతి. అవే పతి, పత్ని. అందుచేతనే లౌకిక శరీరము ధాన్యపుగింజలోని ఒక బద్దలాంటిది. రెండు దళాలు లేక బద్దలు స్త్రీ పురుషులకు ప్రతీక. అందుచేతనే వివాహమైతేనే గాని పురుషునికి పరిపూర్ణత లభించదు. ఆ తరువాత మైధునక్రియ వల్ల సృష్టి జరుగుతున్నది.

ఈవిధంగా ఆవిర్భవించిన స్త్రీ పురుషులే స్వాయంభువ మనువు, శతరూప. వీరివల్లనే 84 లక్షల జీవరాశి ఆవిర్భవించింది.

మరీచి కుమారుడు కశ్యపుడు. ఇతడు విష్ణ్వాంశ సంభూతుడు. దక్షప్రజాపతి కుమార్తెలను వివాహం చేసుకున్నాడు. వారిలో దితి వలన – దైత్యులు, అదితి వలన – దేవతలు, వినతవల్ల – పక్షులు, కద్రువ వల్ల – పాములు. ఈ రకంగా దక్షుని సంతానంవల్లనే 84 లక్షల జీవరాశి ఆవిర్భవించింది.

పరమేశ్వరుడు ఈ విధంగా జగత్తును సృష్టించాడు కాబట్టి శ్రీమహావిష్ణువు 'విశ్వసృక్' అనబడుతున్నాడు.

## 239. విశ్వభుక్

జీవరూపమున విశ్వమును అనుభవించువాడు ఈశ్వరుడుగా ఈ జగత్తును పాలించేవాడు.

## 240. విభుః

880వ నామం కూడా ఇదే

హిరణ్యగర్భుడు మొదలైన రూపాలతో అన్నీ తానే అవుతున్నాడు.

శంకర భగవత్పాదులవారు ఈ రెండు నామాలను విడివిడిగా చెప్పారు. పరాశర భట్టరువారు మాత్రం ఈ రెండింటినీ కలిపి ఒకటిగానే వ్రాశారు.

**విశ్వభుగ్విభుః :** లోకములను పాలించువాడు.

**తత్సృష్టం వ్యాప్యవై భుఞ్జన్ పాలయన్ విశ్వభుగ్విభుః** తనచేతనే సృష్టించబడిన ఈ జగత్తు అంతటా వ్యాపించి, దానిని అనుభవిస్తూ పాలించేవాడు.

**సర్వాణి రూపాణి విచిత్యధీరః నామానికృత్వా ఽభివదన్ యధాస్తే ...**

సమస్త రూపాలను తన సంకల్పముచేతనే సృష్టించి, నిర్వికారుడై నామాలను ఏర్పరచి, తాను మాత్రం వాటితో సంబంధం పెట్టుకోకుండా ఉండేవాడు.

గతంలో చెప్పినట్లుగా ఆ పరమేశ్వరుడే ఈ జగత్తును సృష్టిస్తున్నాడు. అది ఏ విధంగా అంటే ముందుగా అవ్యక్తమున్నది. అదే పరమేశ్వరుడు. దాని నుంచి వ్యక్తము వచ్చింది. అది హిరణ్యగర్భుడు. ఇప్పుడు అహంకారము ఉద్భవించింది. దానివల్లనే జగత్తు మొత్తం ఆవిర్భవించింది. **జాబాలి ఉపనిషత్తులో**

పిప్పలాదమహర్షి భగవత్స్వరూపుడైన జాబాలి వద్దకు వెళ్ళి పరమతత్త్వ రహస్యాన్ని వివరించమని అడుగుతాడు. అప్పుడు జాబాలి చెబుతున్నాడు.

పశుపతి అయిన ఈశ్వరుడు అహంకారముతో వ్యాపించినప్పుడు సంసార సహితుడై జీవుడవుతున్నాడు. అటువంటి జీవుడే పశువు. సర్వజ్ఞుడు, సృష్టిస్థితి సంహారము, తిరోధానము, అనుగ్రహము అనే పంచకార్య సహితుడు, సర్వేశ్వరుడు అయిన ఈశ్వరుడే పశుపతి. జీవులందరూ పశువులు. జీవులకు (పశువులకు) పతి కాబట్టి ఈశ్వరుడు 'పశుపతి' అనబడుతున్నాడు.

పశువులు గడ్డి తింటూ వివేకశూన్యులై, ఇతరుల ప్రేరణతో వ్యవసాయము మొదలైనపనులు చేస్తూ, సకల దుఃఖాలను భరిస్తూ యజమాని చెప్పుచేతలలో జీవిస్తాయి. అలాగే జీవులుకూడా కర్మఫలితాలనుభవిస్తూ వివేకశూన్యులై సంసార సాగరంలో పడి మునిగిపోతూ, ఆ సాగరంలో కొట్టుకుపోతూ దుఃఖాలనుభవిస్తున్నాడు. ఇటువంటి అజ్ఞానులైన జీవులకు యజమాని పశుపతి. ఈ రకంగా పరమేశ్వరుడు ఈ జీవులను పాలిస్తున్నాడు. అని చెప్పబడింది.

ఈ విధంగా పరమేశ్వరుడు లోకాలను సృజించాడు. జగత్తులోని జీవకోటి అంతా పరమేశ్వర స్వరూపమే. ఆ జీవకోటిని తానే పాలిస్తున్నాడు కాబట్టి పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు 'విశ్వభుగ్విభుః' అనబడుతున్నాడు.

## 241. సత్కర్తా

సత్కరించేవాడు, పూజించేవాడు.

**సత్కర్తా య స్సువిజ్ఞేయః సజ్జన ప్రతిపూజకః**

సజ్జనులకు ఎదురు వెళ్ళి, వారిని గౌరవించువాడు.

**సజ్జనాన్ సత్కరోతీతి సత్కర్తా** సజ్జనులను సత్కరించువాడు.

పూర్వకాలంలో ఒకసారి 'త్రిమూర్తులలో మోక్షము నివ్వగలవారు ఎవరు ?' అనే విషయం మీద మునీశ్వరులు చర్చిస్తున్నారు. వారి వాదన ఎంతకూ తెగలేదు. అప్పుడు వారు భృగుమహర్షి దగ్గరకు వెళ్ళి 'మహర్షీ! త్రిమూర్తులలో మోక్షమివ్వగలవాడు ఎవరు? అది తేల్చగల సమర్థుడవు నీవే అని మేమందరము నిర్ణయించుకున్నాము. కాబట్టి నీవు మా సందేహాన్ని నివృత్తి చెయ్యవలసినది" అని ప్రార్థించారు.

వారి ప్రార్థనకు అంగీకరించిన భృగుమహర్షి బయలుదేరి మొదటగా సత్యలోకానికి వెళ్ళాడు. అక్కడ బ్రహ్మ సరస్వతీ సమేతుడై ఉన్నాడు. మహర్షి లోపలికి వెళ్ళి ఆసనం మీద కూర్చున్నాడు. అది చూసిన బ్రహ్మకు కోపము వచ్చింది. అది గ్రహించిన భృగుమహర్షి 'ఓ బ్రహ్మా' నీవు రజోగుణ ప్రధానుడవు. నీకు భూలోకంలో పూజ ఉండకుండుగాక' అని శపించాడు. ఆ తరువాత కైలాసం చేరాడు మహర్షి. అక్కడ శివుడు పార్వతీ సమేతుడై ఉన్నాడు. అదేమీ చూడకుండా లోపలికి వెళ్లిపోయాడు. భృగువు. దానికి కోపగించాడు శివుడు. అప్పుడు భృగువు. "ఈశ్వరా ! నీవు తమోగుణ ప్రధానుడవు. నీ రూపం భూలోకంలో పూజింపబడకుండు గాక" అని శపించాడు.

అక్కడ నుండి వైకుంఠానికి చేరాడు భృగుమహర్షి. శ్రీ మహావిష్ణువు లక్ష్మీ సమేతుడై ఉన్నాడు. దాంతో కోపము వచ్చిన భృగువు విష్ణువును కాలితో తన్నాడు. అయినా విష్ణుమూర్తికి కోపం రాలేదు. లేచి నమస్కరించి ఆ మహర్షిని ఉచిత రీతిన గౌరవించాడు.

ఈ విధంగా సజ్జనులకు గౌరవ సత్కారాలు అందిస్తాడు కాబట్టి శ్రీమహావిష్ణువు సత్కర్తా అనబడుతున్నాడు. రామావతారమునందుగాని, కృష్ణావతారమందుగాని సత్పురుషులను అనేక విధాలుగా సత్కరించాడు కాబట్టే అతడు 'సత్కర్తా' అనబడుతున్నాడు.

## 242. సత్కృతః

సత్కరించబడినవాడు

**అర్చ్యాదిభిస్సజ్జనైర్యః పూజితస్సత్కృతస్స్మృతః ॥** అర్ఘ్యపాద్యాదులచే పూజించ బడినవాడు. పూజనీయులైన బ్రహ్మ ఉపేంద్రుడు మొదలైన వారిచే పూజింపబడువాడు.

దితికశ్యపుల కుమారుడు హిరణ్యకశ్యపుడు. అతడి కుమారుడు ప్రహ్లాదుడు. ప్రహ్లాదుని కుమారుడు విరోచనుడు. అతడి కుమారుడు బలిచక్రవర్తి. వేదవేదాంగ విదుడు ధర్మవేత్త. అయితే దేవతలకు దానవులకు జాతివైరమున్నది. ఆ కారణంగా, గతంలో తమ వారిని మాయోపాయంతో దేవతలు సంహరించారు. కాబట్టి దేవతలమీద పగ తీర్చుకోవాలి. ఈరెండు కారణాలవల్ల దేవతలమీదకు యుద్ధానికి వెళ్ళాడు. బలిచక్రవర్తి బలపరాక్రమాలకు భయపడి దేవతలు అరణ్యాలకు పారిపోయారు. ముల్లోకాలను జయించాడు బలిచక్రవర్తి. నర్మదా నదీ తీరాన, కచ్ఛప తీర్థం దగ్గర అశ్వమేధ యాగం చేస్తున్నాడు.

తన కుమారులందరూ అడవుల పాలైనారని విని చాలా చింతించింది అదితి. ఏ రకంగానైనా వారి కష్టాలను తీర్చమని కశ్యపుణ్ణి వేడుకుంది. 'వాసుదేవ వ్రతము' ఆచరించమన్నాడు కశ్యపుడు. ఆవ్రత ఫలంగా అదితి గర్భాన వామనుడు జన్మించాడు.

బలిచక్రవర్తి అశ్వమేధ యాగం చేస్తున్నాడని విని, యజ్ఞశాలకు బయలుదేరి వెళ్ళాడు వామనుడు. వచ్చిన వటువును సత్కరించి ఏం కావాలో కోరుకోమన్నాడు మహారాజు. మూడడుగల నేల ఇప్పించమన్నాడు వామనుడు. సరే అని మూడడుగులు దానమిచ్చాడు బలిచక్రవర్తి. అప్పుడు వామనుడు త్రివిక్రముడై ఒక అడుగుతో భూమిని, రెండవ అడుగుతో ఆకాశాన్ని ఆక్రమించేశాడు. ఆ సమయంలో బ్రహ్మాది దేవతలు, మహర్షులు అందరూ కూడా శ్రీమహావిష్ణువు యొక్క పాదాన్ని కడిగి పూజించారు. ఈ విధంగా దేవతలతోను, మహర్షులతోను పూజించబడ్డాడు కాబట్టి 'సత్కృతః' అనబడుతున్నాడు.

ద్వాపరయుగంలో పాండవులు రాజసూయం చేశారు. ఆ యాగములో చివరి భాగంగా ఒక మహాపురుషుని పూజించాలి. ఉత్తముడిని సత్కరించాలి. భీష్ముని యొక్క అనుమతితో పాండవులు శ్రీకృష్ణభగవానుని మహాపురుషుడుగా ఎన్నుకున్నారు. సభలో గౌరవించారు. సత్కరించారు.

త్రేతాయుగంలో శ్రీరామచంద్రుడు భార్యా వియోగంతో అడవుల వెంట తిరుగు తున్నాడు. అప్పుడు శబరి కనిపిస్తుంది. ఆమె ఒక గిరిజన స్త్రీ. శ్రీ రామచంద్రుని కోసం చాలాకాలంగా ఎదురుచూస్తోంది. అతడు కూర్చోవటానికి మట్టితో ఒకఅరుగు తయారు చేసింది. అలికి ముగ్గులు పెట్టింది. రాముడు తినటానికని అడవిలో తిరిగి చెట్లనుంచి కాయలు పండ్లు తెచ్చి, అవి తియ్యగా ఉన్నాయో లేదో కొరికి చూసి మరీ దాచిపెట్టింది. ఆ శుభముహూర్తం రానే వచ్చింది. శ్రీరామచంద్రుడు వచ్చాడు. ఇన్ని రోజుల నిరీక్షణ ఇంతకాలానికి ఫలించింది. ఆ మహాపురుషుని తనివితీరా దర్శించింది. గౌరవించింది, సత్కరించింది, పూజించింది, అర్చించింది, ఆరాధించింది. శబరి సత్కారానికి ఎంతగానో ఆనందించాడు శ్రీరామచంద్రుడు శబరిని పుణ్యనదివై ప్రవహించమన్నాడు.

ఈ రకంగా అనేకసార్లు, అనేకచోట్ల, అనేక మంది సత్పురుషులచే సత్కరించ బడినవాడు కాబట్టి శ్రీమహావిష్ణువు 'సత్కృతా' అనబడుతున్నాడు.

## 243. సాధుః

సాధించువాడు.

**సేవాం సారథ్యదూత్యాద్యాం సాధు సాధయతీతి సః**

తన భక్తులకు రథముతోలటము, దూతకృత్యములు మొ॥వి నెరవేర్చువాడు.

**సాధ్నోతీతి సాధుః** సాధించేవాడు కాబట్టి 'సాధుః' అనబడతాడు.

ద్వాపరయుగంలో పాండవులు శ్రీకృష్ణభగవానుణ్ణి పూర్తిగా నమ్మారు. నీటముంచినా, పాలముంచినా, నీదే భారము అన్నారు. వారిని వెన్నంటి ఉన్నాడు. భగవానుడు. ఎన్నో ఆపదలనుంచి కాపాడాడు. ప్రాణాపాయస్థితి నుంచి కూడా తప్పించాడు. ద్రౌపది మానసంరక్షణ చేశాడు. అజ్ఞాతవాసము పూర్తయింది. రాజ్యభాగం కోసం పాండవదూతగా, రాయబారిగా ఆ పరమేశ్వరుడే వెళ్ళాడు. సంధిపొసగలేదు. యుద్ధం అనివార్యమైంది. ఆ సందర్భంలో అర్జునుడికి సారధిగా ఉన్నాడు. కురుక్షేత్ర మహాసంగ్రామం జరిపించాడు. 18 అక్షోహిణిల సైన్యాన్ని నాశనం చేశాడు. వీరుడు అనేవాడు లేకుండా చేశాడు. తన భక్తులైన పాండవులకు విజయం సాధించిపెట్టాడు.

న్యాయమార్గాన మాత్రమే చరించేవాడు. అతడు ధర్మపురుషుడు. ధర్మానికి ప్రతీక. ధర్మాన్ని మాత్రమే ఆచరిస్తాడు. కాబట్టి శ్రీమన్నారాయణుడు 'సాధుః' అనబడుతున్నాడు.

## 244. జహ్నుః

దాగజేయువాడు

**అభక్తేష్వాత్మ మాహాత్మ్య విహ్నుతే ర్జహ్ను రుచ్యతే ॥** భక్తులు కానివారికి తన మహిమను చూపనివాడు. తన మహిమ కనిపించ కుండా దాచివేయువాడు.

**అపహ్నుతే ఇతి జహ్నుః** దాగునట్లు చేయువాడు.

జూదంలో సర్వస్వమూ ఓడిపోయి అరణ్య వాసానికి వెళ్ళారు పాండవులు. అజ్ఞాతవాసం కూడా పూర్తి చేశారు. తిరిగి వచ్చారు. రాజ్యభాగం కోసం సంధి ప్రయత్నాలు ప్రారంభించారు. శ్రీకృష్ణ పరమాత్ముడు రాయబారిగా వెళ్ళాడు. అర్ధరాజ్యం కాదు ఐదు ఊళ్ళైనా ఇమ్మని చెప్పాడు. నశేమిరా! అన్నాడు సుయోధనుడు, ఒకవేళ యుద్ధమే జరిగితే జరుగబోయే విపరీత పరిణామాలను వివరించాడు శ్రీకృష్ణుడు. కోపగించిన కౌరవులు పరమాత్ముణ్ణి అంతం చెయ్యాలనుకున్నారు. ఆ పన్నాగంలో నుంచి బయటపడి తన విశ్వరూపాన్ని చూపించాడు. ఆ దివ్యతేజస్సును చూడలేక పాపకర్ములైన కౌరవులు అందరూ కళ్ళు తిరిగి పడిపోయారు. స్పృహ కోల్పోయారు. భీష్మద్రోణకృపాది మహాపురుషులు విశ్వరూపాన్ని దర్శించగలిగారు. చివరకు ధృతరాష్ట్రునికి దివ్యదృష్టిని ప్రసాదించాడు భగవానుడు. అంతేకాని పాపకర్ములు మాత్రం ఆ రూపాన్ని వీక్షించలేకపోయారు.

ఈ రకంగా తన భక్తులు కాని వారికి, తనను నమ్మని వారికి తన మహిమను ప్రదర్శించనివాడు కాబట్టే శ్రీమహావిష్ణువు 'జహ్నుః' అనబడుతున్నాడు.

**చక్రంతద్వాసు దేవస్య మాయయా నర్తతే విభోః పాపహ్నా వం కౌరవేషు**

వాసుదేవుని చక్రము మాయతో తిరుగుతూ ఉంటుంది. భక్తి లేనటువంటి కౌరవులు దానిని చూడలేరు. తత్త్వజ్ఞులు కానివారికి తన మాహాత్మ్యము తెలియజేయడు. అజ్ఞానులకు తన మహిమను చూపనివాడు.

**సంహార సమయే జనాన్ అపనయతి** ప్రళయకాలమందు జనులను తొలగిస్తాడు.

జగత్తును సృష్టించటానికి పరమేశ్వరుడు త్రిమూర్తులను సృష్టించాడు. వారు ముగ్గురూ అతని అంశలే. వీరిలో

సృష్టికర్త – బ్రహ్మ, స్థితికర్త – విష్ణువు, సంహారకారకుడు – రుద్రుడు.

సంహార సమయము అంటే ప్రళయం సంభవించినప్పుడు రుద్రుడు సంహారం చేస్తాడు. ఈ విధంగా సంహరిస్తాడు కాబట్టి శ్రీమహావిష్ణువు 'జహ్నుః' అనబడతాడు.

## 245. నారాయణః

సర్వవ్యాపకుడు

**అన్తర్బహిశ్చ తత్సర్వం వ్యాప్యనారాయణ స్స్మృతః**

సమస్త వస్తువులకు లోపల బయట అంతట వ్యాపించి ఉండేవాడు.

**నరాణామ్ సమూహాః నారాః నారాః అయనమ్ యస్యసః నారాయణ**

నారములు అంటే – నిత్యము ఉపయోగించే వస్తువులు. వాటిని ఆశ్రయముగా గలవాడు. వాటియందు తాను ప్రవేశించి, అవి తనకు ఆశ్రయము అగునట్లు ఉండేవాడు. నారములకు స్థానమైనవాడు. మహాప్రళయం సంభవించింది. అప్పుడు ఈజగత్తు అంతా నాశనము అయిపోతుంది ఇక్కడ ఒక్క అణువుకూడా మిగలదు. ఆ సమయంలో కర్మ పూర్తిగా క్షయం అయిపోయిన జీవులకు ముక్తి లభిస్తుంది. కాని కర్మ పరిపక్వం కాని జీవులకు ముక్తి లభించదు. ఆ జీవులు తమ కర్మను తమతో పాటుగా మూట కట్టుకుని మాయలో ప్రవేశిస్తాయి. అలాగే పంచభూతాలు కూడా ముందుగా

భూమి – జలంలో కలిసిపోతుంది

జలం – అగ్నిలో ఆవిరైపోతుంది

అగ్ని – వాయులో లీనమైపోతుంది

వాయువు – ఆకాశంలో లీనమైపోతుంది

వీటన్నింటినీ తనలో లీనం చేసుకున్న ఆకాశము కూడా ఆ మాయలో ప్రవేశిస్తుంది. ఈ రకంగా జగత్తు అంతా తనలో కలుపుకున్న మాయ పరమేశ్వరునిలో లీనమవుతుంది.

ఈ రకంగా ప్రళయ కాలమునందు జగత్తునంతటినీ సూక్ష్మరూపంలో తనయందు ఉంచుకుని, దానికి స్థానమైనవాడు కాబట్టే పరమేశ్వరుడు 'నారాయణుడు' అనబడుతున్నాడు

**విశ్వతః పరమాన్నిత్యం విశ్వం నారాయణగ్ం హరిమ్**
**విశ్వమే వేదం పురుషస్త ద్విశ్వముప జీవతి ।**
**పతి విశ్వస్యాత్మే శ్వరగ్ం శాశ్వతగ్ం శివమచ్చుతమ్**
**నారాయణం మహాజ్ఞేయం విశ్వాత్మానం పరాయణమ్ ॥**

విశ్వానికి అతీతుడు, విశ్వమే తానుగా అయినవాడు, నిత్యుడు, సర్వవ్యాపకుడు, విశ్వానికి జీవనాధారమైన వాడు, విశ్వపతి, విశ్వానికి ఈశ్వరుడు, శాశ్వతుడు, మంగళకరుడు, నాశనము లేనివాడు,తెలిసికొనదగిన పరమాత్ముడు, విశ్వాత్ముడు, విశ్వ పరాయణుడు అయిన నారాయణునకు నమస్కారము.

**నారాయణ పరోజ్యోతి రాత్మా నారాయణః పరః**
**నారాయణ పరంబ్రహ్మ తత్త్వం నారాయణః పరః**
**నారాయణ పరోధ్యాతా ధ్యానం నారాయణః పరః**

నారాయణుడే పరంజ్యోతి, పరమాత్మ స్వరూపుడు. అతడే పరబ్రహ్మ. అతడే పరతత్త్వము. ధ్యానము చేసేవాడు, ధ్యానము కూడా ఆ నారాయణుడే.

**యచ్చకించి జ్జగత్సర్వం దృశ్యతే శ్రూయతేఽ పివా**
**అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్యనారాయణ స్థితః**
**అంతనమవ్యయం కవిగ్ం సముద్రేంఽ తం విశ్వశంభువమ్ ॥**

బ్రహ్మాండములో ఈ స్వల్పమైన జగత్తు మహదాకాశములో వేరుగా కనిపించే ఘటాకాశములా కనిపిస్తుంది. దానికి బయట, లోపలా అంతటా నారాయణుడే వ్యాపించి ఉన్నాడు. అనంతుడు, నాశనము లేనివాడు అయిన ఈ దేవుడు సంసార సాగరము నుంచి విముక్తిని ప్రసాదించి, ప్రపంచానికి సుఖం కలిగిస్తాడు.

**నరాజ్జాతాని తత్త్వాని నారాణీతి తతోవిదుః**
**తాన్యేవ చాయనం తస్య తేన నారాయణ స్మృతః**

ఆకాశాది తత్త్వములు నరుని నుండి అనగా ఆత్మ నుండి ఉద్భవించాయి. అందుచేత వాటిని నారములు అంటున్నారు. ఆ నారములను ఆశ్రయముగా గలవాడు కాబట్టి ఆ పరమేశ్వరుడు 'నారాయణుడు' అనబడుతున్నాడు. **మహోపనిషత్తు**లో

ఈ సృష్టికి ముందు నారాయణశాఖ పరబ్రహ్మ తత్త్వము ఒకటి మాత్రమే ఉండేది. అప్పుడు బ్రహ్మ, రుద్రుడు, సూర్యుడు, చంద్రుడు, పంచభూతాలు, ఏవీ లేవు. ఏకాకిగా ఉన్న ఆ పరమపురుషుడు తన వైభవము తాను అనుభవించకపోవట మనేది దోషమని భావించి 'స్తోమము' అనే యజ్ఞం చేసి ఈ సృష్టిని చెయ్యటం మొదలుపెట్టాడు. ఆ పరమపురుషుని నుండి 14 మంది పురుషులు, ఒక కన్య జన్మించారు. జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనసు, అహంకారము, ప్రాణము, దేహము, బుద్ధి, పంచతన్మాత్రలు, పంచభూతాలు, ఈ రకంగా 25 తత్త్వములతో నిండిన సృష్టిగా విరాట్పురుషుడు జన్మించాడు. అప్పుడు పరమాత్మ అందులో ప్రవేశించాడు. ఆ తరువాత, ఆ విరాట్పురుషుని నుండి కాలము సంవత్సరముల రూపంలో పుట్టింది. ఆ తరువాత –

నారాయణుడు ఇంకొక సంకల్పముతో ధ్యానం చేశాడు. ధ్యానములో ఉన్న నారాయణుని లలాటమునుండి త్రినేత్రుడు, శూలపాణి అయిన పురుషుడు జన్మించాడు. అతనియందు సత్యము, బ్రహ్మచర్యము, తపస్సు, వైరాగ్యము, వ్యాహృతులు, వేదములు, ఛందస్సులు అన్నీ ప్రకాశిస్తున్నాయి. అందుచేతనే ఆ పురుషుడు ఈశానుడు, మహాదేవుడు అనబడ్డాడు.

తరువాత నారాయణుడు ఇంకొక సంకల్పముతో ధ్యానము చేశాడు. ధ్యానములో ఉన్న నారాయణుని లలాటము నుంచి స్వేదము పుట్టింది. అదే జలమై సర్వత్రా వ్యాపించింది. ఆ జలమునుంచి బంగారుకాంతి గల అండము పుట్టింది. దాని నుంచి చతుర్ముఖ బ్రహ్మ పుట్టాడు. బ్రహ్మ పూర్వముఖంగా ఉండి ధ్యానం చేశాడు. అప్పుడు 'భూః' అనే వ్యాహృతి, గాయత్రీ ఛందస్సు, ఋగ్వేదము, అగ్నిదేవత ఆవిర్భవించినాయి.

బ్రహ్మ పశ్చిమాభిముఖుడై ధ్యానం చేశాడు. అప్పుడు 'భువః' అనే వ్యాహృతి, త్రిష్టుప్ ఛందస్సు, యజుర్వేదము వాయుదేవత ఆవిర్భవించినాయి.

బ్రహ్మ ఉత్తరముఖంగా ధ్యానం చేశాడు. అప్పుడు 'సువః' అనే వ్యాహృతి, జగతీ ఛందస్సు, సామవేదము సూర్యదేవత జన్మించినాయి.

బ్రహ్మ దక్షిణ ముఖంగా ధ్యానం చేశాడు. అప్పుడు 'మహః' అనే వ్యాహృతి, అనుష్టప్ ఛందస్సు, అథర్వణ వేదము, సోమదేవత పుట్టినాయి.

బ్రహ్మ మరల ధ్యానం చేసి క్షీరసాగరము మధ్యలో ఒక దేవుని దర్శించాడు. ఆ దేవుడు సహస్ర శీర్షములతో, సహస్ర బాహువులతో, సహస్ర పాదాలతో, సహస్ర నేత్రాలతో ప్రకాశిస్తున్నాడు. ఆ దేవత విశ్వకల్యాణకారకమై, విశ్వాతీతమై, నిత్యమై, సర్వస్వరూపమై విలసిల్లుతున్నాడు. అతడే శ్రీహరి. అతడే శ్రీమన్నారాయణుడు. అతడే పరమపురుషుడు. చరాచర జగత్తుకు ఆ శ్రీమన్నారాయణుడే ఆధారము. అతడే విశ్వపతి, విశ్వేశ్వరుడు, విశ్వరూపుడు, అధోముఖముగా ఉన్న తామర మొగ్గలాగా హృదయ భాగంలో క్రిందికి వ్రేలాడుతున్నాడు. హృదయ భాగంలో అనేకనాడులున్నాయి. వాటి మధ్యన వైశ్వానరాగ్ని వెలుగుతుంటుంది. దాని మధ్యభాగంలో దీపశిఖలాగా ఒకజ్వాల ఊర్ధ్వముఖంగా వెలుగుతూ ఉంటుంది. ఆ శిఖా మధ్యభాగంలో పరమాత్మ ప్రకాశిస్తున్నాడు. అతడే బ్రహ్మ, అతడే ఈశానుడు, అతడే ఇంద్రుడు, అతడే అక్షరుడైన శ్రీమన్నారాయణుడు" అని చెప్పబడింది.

**ఆత్మబోధోపనిషత్తు**లో ప్రత్యగానంద స్వరూపుడు, ఓంకార రూపుడు అయిన పరమపురుషుడే పరబ్రహ్మ. అకార ఉకార మకారముల కలయికయే ప్రణవము. ఆ ప్రణవాన్ని జపించే బ్రహ్మజ్ఞాని సంసార బంధనాల నుండి విముక్తి పొదుతున్నాడు. "ఓం నమోనారాయణాయ, శంఖచక్ర గదాధరాయ" అనే మంత్రము ఉపాసించినవాడు కూడా వైకుంఠము చేరుతున్నాడు.

పద్మమువంటి బ్రహ్మ పట్టణము తటిల్లత వలె, దీపమువలె ప్రకాశిస్తున్నది. దేవకీ పుత్రుడే పరబ్రహ్మ. మధుసూదనుడు, పుండరీకాక్షుడు, విష్ణువు, అచ్యుతుడు. ఆ పరబ్రహ్మమే అతడే సర్వభూతములందు ఉన్నవాడు. కారణపురుషుడు. అతడే ఓంకారము అతడే నారాయణుడు. ఆ దేవదేవుని ధ్యానించినట్లైతే మానవుడు ద్వైతాద్వైతముల నుండి, భయమునుండి విముక్తుడవుతాడు." అని చెప్పబడింది.

**తారాసారోపనిషత్తు**లో "ఓం నమోనారాయణాయ" అనే మంత్రమే ఉపాసింప దగినది." అని చెప్పబడింది. ఈ రకంగా నారాయణోపనిషత్తు, మహానారాయణోప నిషత్తులలో కూడా శ్రీమన్నారాయణుడే పరబ్రహ్మ అనిచెప్పబడింది.

నృసింహావతారానంతరము నృసింహుని తల, నారాయణుడుగాను, మొండెము నరుడుగాను అయినాయి. వారే నరనారాయణులు. వీరు సహస్రకవచుడు అనే రాక్షసునితో యుద్ధం చేశారు. యుద్ధంలో అన్ని కవచాలు పోగా ఆఖరి కవచంతో పారిపోయి సూర్యభగవానుని దగ్గర దాక్కున్నాడు. తరువాత అతడే కర్ణుడుగా సహజ కవచకుండలాలతో జన్మించాడు. నర నారాయణులు కృష్ణార్జునులుగా జన్మించారు.

# 246. నరః

నశించనివాడు.

**రఃక్షయో యస్య సహ్యాస్తి స నరస్సముదాహృతః**

ర అనగా నాశనము. నాశనము లేనివాడు.

**నరః అస్యాస్తీతి నరః**

నాశనము లేని చేతనాచేతనములను విభూతిగా గలవాడు. ప్రాణులను సృష్ట్యాదులచేత తమ తమ వ్యాపారములందు ముందుకు తీసుకుని పోయేవాడు.

సృష్టి పరిణామము ఆరు విధాలు

**జాయతేస్తి పరిణమతే వర్ధతే క్షీయతే వినశ్యతి**

అని నిరుక్తములో చెప్పబడింది.

| | | |
|---|---|---|
| జాయతే | – | పుడుతున్నది. |
| అస్థి | – | అస్థిత్వము పొందుతున్నది |
| పరిణిమతే | – | పరిణామము పొందుతున్నది |
| వర్ధతే | – | వర్ధిల్లుతున్నది, పెరుగుతున్నది |
| క్షీయతే | – | క్షీణిస్తున్నది |
| నశ్యతి | – | నశించుచున్నది |

అయితే ఈ ఆరు దశలు ఒకదానితో ఒకటి కలిసి మొత్తం మూడు దశలు అవుతున్నాయి.

| | | |
|---|---|---|
| పుట్టుక, అస్థిత్వము | – | సృష్టి |
| పరిణామము పొందటము, వర్ధిల్లటము | – | స్థితి |
| క్షీణించటము, నశించటము | – | లయము |

ఈ దశలన్నింటికీ కారణము పరబ్రహ్మ అతడు ఈ దశలతో ఈ జగత్తును ముందుకు తీసుకుపోతున్నాడు. ఇలా జరిగిన సృష్టి క్రమంలో మానవులు కొంతమంది పారలౌకిక విషయాలను గురించి ఆలోచిస్తారు. అటువంటి వారికి, తన భక్తులకు జ్ఞానోపదేశం చేస్తాడు. ఆ జ్ఞానులలో అర్హులైన వారికి ముక్తిని ప్రసాదిస్తాడు. ముక్తి అంటే విముక్తి ఐహిక బంధనాల నుంచి విముక్తి. నేను నాది అనే అహంకార మమకారాలను వదిలిపెట్టిన

వాడికి, అరిషడ్వర్గాన్ని జయించిన వాడికి ఆత్మ సాక్షాత్కారమవుతుంది. దాన్నే 'స్వస్వరూప జ్ఞానము' అంటారు. అంటే చరాచర జగత్తు తనలోనే ఉన్నది. తనకు, ఈ జగత్తులోని మిగిలిన జీవరాశికీ తేడా లేదు. తనలో ఉన్న ఆత్మ క్రిమికీటకాదులలో ఉన్న ఆత్మ ఒక్కటే. ఆకాశంలో మిలమిలా ప్రకాశిస్తున్న సూర్యునిలో ఉన్న తేజస్సే తనలో కూడా ఉన్నది. ఈ రకంగా జగత్తంతా పరమేశ్వరమయము. అని తెలుస్తుంది. ఈ విషయం తెలుసుకున్నవాడు బ్రహ్మత్వ సిద్ధి పొందుతాడు.

**బృహదారణ్యకోపనిషత్తు**లో చెప్పినట్లుగా **బ్రహ్మవిద్ బ్రహ్మైవభవతి** పరబ్రహ్మను గురించి తెలుసుకున్నవాడు కూడా సాక్షాత్తూ పరబ్రహ్మే అవుతాడు. అతడికి జనన మరణాలుండవు. అదే సాయుజ్యము, ముక్తి అని చెప్పబడింది.

సృష్టి స్థితి లయాదులను చెయ్యటంద్వారా పరమేశ్వరుడు అర్హులైన తన భక్తులకు జ్ఞానాన్ని ప్రసాదించి, వారికి ముక్తినిస్తున్నాడు. అందుకే శ్రీమన్నారాయణుడు 'నరః' అనబడుతున్నాడు.

## 247. అసంఖ్యేయః

అసంఖ్యాకములైన నరసమూహములు గలవాడు.

**అగణ్య నరసంఖ్యేయః సోఽసంఖ్యేయః పరికీర్తితః**

లెక్కకు మించిన నరసమూహములు కలవాడు.

**అసంఖ్యేయాః అస్య సంతీతి అసంఖ్యేయః**

సంఖ్యకు మించిన నరసమూహములు గలవాడు.

పరమేశ్వరుడు ఒక్కడే. అతడు నిరాకారుడు, నిర్గుణ స్వరూపుడు. అతడికి ఏ రూపము లేదు. కాని అన్నిరూపాలు అతనివే. పరమేశ్వరుడు జగత్తులోని ప్రతి వస్తువు యందు, ప్రతిజీవి యందు ఆవరించి ఉన్నాడు. కాబట్టి అతడు పైన నరసమూహములు అనేకానేకములుగా ఉన్నాడు అవి లెక్కకు మించినవి.

అలాగే పరమేశ్వరుడికి రూపం లేదు కాని ఉపాసన కోసం అతనికి ఒకరూపం కల్పించబడుతోంది.

**సాధకానాం హితార్థాయ బ్రహ్మణోరూపకల్పనా**

సాధకుని కోరికలు తీరటం కోసం అతడికి రూపం కల్పించబడింది.

మనకు ధనం కావాలి అంటే – చేతులలో పద్మనిధులను, పూర్ణకుంభము ధరించిన లక్ష్మీదేవిని సృష్టించటం జరిగింది. విద్య కావాలి అంటే – చేతులయందు అక్షరమాల, పుస్తకము, రెండు చేతుల యందు వీణ, ధరించి తెల్లని వస్త్రములు, తెల్లచందనము దాల్చిన సరస్వతీ దేవిరూపాన్ని సృష్టించాము.

శక్తి కావాలి అంటే – చేతులయందు వివిధ రకాలైన ఆయుధాలు ధరించిన శక్తి స్వరూపిణి కాళిని సృష్టించటం జరిగింది.

ఈ రకంగా మన కోరికల కనుగుణంగా వివిధ దేవతలను సృష్టించారు. ఆ పరమేశ్వరుడు ఇన్ని పేర్లతోనూ పిలువబడుతున్నాడు. అందుచేతనే లెక్కలేనన్ని నర సమూహములు గల పరమేశ్వర స్వరూపుడైన శ్రీమన్నారాయణుడు 'నరః' అనబడుతున్నాడు.

## 248. అప్రమేయాఽఽత్మా

అమితమైన స్వరూపము గలవాడు.

**ఏకైకశో ఽప్రమేయాయా హ్యసజ్ఖ్యాతా విభూతయః ।**
**తాసాంచైవా ఽప్రమేయాత్మా న్యాపనా ద్బహిరన్తతః ॥**

చేతనా చేతనములైన విభూతులు లెక్కకు మించి ఉన్నాయి. వాటిలోపల, బయట, అంతటా వ్యాపించి ఉన్నవాడు.

సంఖ్యకు మించి చేతనాచేతనములందు వ్యాపించి ఉండటంచేత అమితమైన స్వరూపం గలవాడు అని చెప్పబడుతున్నాడు.

స్థావర జంగమాత్మకమైనది ఈ జగత్తు. **బృహదారణ్యకోపనిషత్తులో**

ఇంద్రియాలకు, శరీరానికి కారణభూతమైన పంచభూతాలను సత్యం అంటారు. విజ్ఞులు నేతి, నేతి ఇది కాదు అంటూ బ్రహ్మతత్త్వాన్ని తెలుసుకోటానికి ప్రయత్నిస్తారు. పంచభూతాలతో కూడినటువంటి స్థూల సూక్ష్మ శరీరాలతో సంబంధమున్న బ్రహ్మకు రెండు రూపాలున్నాయి. అవే మూర్తము, అమూర్తము. అవే స్థూలరూపము, సూక్ష్మరూపము. స్థావరము – స్థిరంగా ఉండేది. జంగమము – కదిలేది. అని చెప్పబడింది.

స్థావరములు – స్థిరంగా ఉండేవి. ఏ మాత్రం కదలిక లేకుండా ఉండేవి. పర్వతాలు, కొండలు, వృక్షాలు మొదలైనవి. జంగమము అంటే – కదలిక ఉన్నది. పంచభూతాలలో కదలిక గలిగినది వాయువు. అలాగే ఒకచోటి నుంచి, వేరొక చోటికి పోగల ప్రాణులు.

ఇవన్నీ కదలిక గలవి. పరమేశ్వరుడు చేతనాచేతనములందు అంతటా వ్యాపించి ఉన్నాడు. **ఐతరేయోపనిషత్తు**లో చెప్పినట్లుగా 'పరమేశ్వరుడు మానవుని సృష్టించి బ్రహ్మరంధ్రంగుండా మానవశరీరంలోకి ప్రవేశించాడు. ఈ రకంగా ప్రాణికోటియందంతట పరమేశ్వరుడు ఉన్నాడు. అంతేకాదు.

**బృహదారణ్యకోపనిషత్తు**లో చెప్పినట్లుగా పరమేశ్వరుడు పురుషుని, స్త్రీని కలిపి సృష్టించాడు. వారే స్వాయంభువ మనువు, శతరూప. వీరివల్లనే 84 లక్షల జీవజాతి అభివృద్ధి చెందినది. ఇదంతా పరమేశ్వర స్వరూపమే.

కశ్యప ప్రజాపతి దక్షప్రజాపతి కుమార్తెలను వివాహం చేసుకున్నాడు. వారి యందు వివిధ సముదాయాన్ని వృద్ధి చేశాడు.

వినతయందు – పక్షులు, కద్రువ యందు – పాములు

ఈ రకంగా చెట్లు, చామలు, కొండలు, బండలు కూడా జన్మించాయి. ఇవన్నీ పరమేశ్వరుని రూపమే. అందుచేత పరమేశ్వరుడు ఈ జగత్తు అంతా వ్యాపించి ఉన్నాడు. అందుచేత అతని రూపము ఇంత అని చెప్పటానికి వీలులేదు. **కఠోపనిషత్తు**లో యమధర్మరాజు. నచికేతుడికి ఆత్మవిద్య ఉపదిశిస్తూ ....

**అణోరణీయాం మహతోమహీయాం** ఆత్మ స్వరూపము అణువు కన్న చిన్నది మహత్తుకన్న పెద్దది అన్నాడు. ఈ రకంగా ఆత్మచేతనాచేతనము లందు అన్నిటా వ్యాపించి ఉన్నది. అంటే ఆత్మ విశ్వవ్యాపకమైనది. సర్వత్రా వ్యాపించి ఉన్నది. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'అప్రమేయాత్మా' అనబడుతున్నాడు.

**అప్రమేయః ఆత్మా యస్యసః** ఆత్మస్వరూపము గలవాడు. ప్రత్యక్ష అనుమానాది ప్రమాణాల ద్వారా తెలుసుకోలేనివాడు. ఆత్మ, రూపం లేనిది. కాబట్టి అది ఇంత ఉన్నది అని నిర్ణయించటానికి వీలు లేనిది.

## 249. విశిష్టః

విలక్షణమైనవాడు.

**విలక్షణో విశిష్టోయః సర్వాం స్తానపేక్ష్యసః**

వాటి అపేక్ష లేకుండానే, వాటికన్న అధికుడై, విలక్షణముగా ఉండేవాడు.

**విశిష్యతే ఇతి విశిష్టః**

ఇతర అపేక్షలు లేకుండానే స్వయముగా విలక్షణమైనవాడు. అధికుడు.

అన్నింటినీ మించి ఉండువాడు. అన్నింటికన్నా అధికుడు.

**అధర్వశిరోపనిషత్తు**లో దేవతలంతా మహారుద్రుడు నివసించే స్వర్గానికి వెళ్ళారు. అప్పుడు దేవతలు ఆయనను 'దేవా' నీవెవరవు?' అని ప్రశ్నించారు. దానికి రుద్రుడు.

నేను ఒక్కడనే మొదట ఉన్నాను. ఇప్పుడున్నాను. ముందుకూడా ఉంటాను. నాకన్న వేరైనవాడు లేడు. నేను త్రికాలాతీతుడను. నిత్యుడను. బ్రహ్మము నేను చక్షురింద్రియములు నేనే. వాగింద్రియము నేనే. శ్రోత్రేంద్రియము నేనే. మనస్సు నేనే. దశ దిక్కులు నేనే. స్త్రీ, పురుష, నపుంసకులు నేనే. గాయత్రిని నేనే. ఛందస్సులు నేనే. గార్హపత్యాగ్ని, దక్షిణాగ్ని, ఆహవనీయాగ్ని కూడా నేనే. సత్యస్వరూపము నేనే. గోవు నేనే. గౌరీదేవి నేనే. జ్యేష్ఠుడను, శ్రేష్ఠుడను నేనే. అందరికన్న అధికుడను నేనే. అగ్ని నేనే, జలము నేనే. చతుర్వేదాలు నేనే, ఓంకారము నేనే. ఈ రకంగా జగత్తంతా నేనే. జగత్తులో అన్నింటికన్నా అధికుడను నేనే" అంటాడు.

**భగవద్గీత**లోని పదవ అధ్యాయం **'విభూతియోగము'**లోని 20 శ్లోకం

**అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః ।**

**అహమాదిశ్చ మధ్యం చ భూతానామంత ఏవ చ ॥**

అర్జునా ! సమస్త ప్రాణుల హృదయమందున్న ఆత్మను నేనే. సకల ప్రాణుల ఆది, మధ్య, అంతము కూడా నేనే.

ఈ రకంగా పరమేశ్వర స్వరూపుడై భగవానుడు అన్నిటికన్నా తానే అధికుడు కాబట్టి శ్రీమన్నారాయణుడు 'విశిష్టః' అనబడతాడు.

## 250. శిష్టకృత్

శుభములను గూర్చువాడు.

శిష్టం అంటే – శాసనము. **శిష్టం కరోతి.** శాసనము చేయువాడు. ఇక్కడ శాసనము అంటే వేదరూపమయిన ఆజ్ఞ. 'ఈ రకంగా జీవించండి' అని ప్రజలకు ఆజ్ఞలను జారీ చేయువాడు. ఈ ఆజ్ఞలు వేదరూపంలో ఉంటాయి. వేదంలో ఏది చెయ్యాలో, ఏది చెయ్యకూడదో వివరించబడింది. "ఇష్టాపూర్తికి, అనిష్ట పరిహారానికి అలౌకిక మార్గాన్ని చూపేదే వేదము" అని సాయనుడు నిరుక్తంలో వ్రాశాడు. అంటే – మనకు కావలసినవి సంపాదించుకోవటానికి, అలాగే అవసరం లేనివాటిని వదిలించుకోవటానికి ఒక మార్గాన్ని చూపుతుంది వేదము. అదే విధంగా వేదంలో రెండు రకాల విద్యలు చెప్పబడ్డాయి.

**ముండకోపనిషత్తు**లో శునకుని కుమారుడు శౌనకుడు. విద్యాభ్యాసం పూర్తిచేసిన తరువాత మోక్షమార్గాన్ని ఎంచుకున్నాడు.

అప్పుడు అంగిరసుని దగ్గరకు వెళ్ళి ఏ విషయాన్ని గురించి తెలుసుకుంటే అన్ని విషయాలు పూర్తిగా తెలుస్తాయో దాన్ని వివరించమని అడుగుతాడు. దానికి సమాధానంగా ఆత్మజ్ఞానమే అన్నింటికీ సాధనము అని చెబుతూ వేదంలో పరావిద్య, అపరావిద్య అని రెండు రకాల విద్యలున్నాయి. అపరావిద్య అంటే లౌకికవిద్య, వేదాలు, శాస్త్రాలు, పురాణాలు, ఇతిహాసాలు, సంగీతము, సాహిత్యము, వ్యాకరణము, ఛందస్సు, జ్యోతిషము ఇవన్నీ అపరావిద్యకు సంబంధించినవి. వీటిని అభ్యసించటం వలన ఆత్మజ్ఞానం రాదు. పరావిద్య అనేది మోక్షవిద్య. దానివల్ల ఆత్మజ్ఞానం వస్తుంది." అంటూ వివరిస్తాడు. ఈ విధంగా మానవుడు తనకు కావలసినది ఏ రకంగా సంపాదించుకోవాలో, ఏ రకంగా ప్రవర్తించాలో వివరిస్తుంది వేదము.

**తైత్తిరీయోపనిషత్తు**లోని **శిక్షావల్లి**లో విద్యాభ్యాసం పూర్తి అయిన తరువాత ఆ విద్యార్థి ఏ విధంగా జీవించాలి. ఏ పనులు చెయ్యాలి? ఏ పనులు చెయ్యకూడదు? అనే విషయాలను వివరిస్తుంది. కాబట్టి మానవుడు ఏ రకంగా నడుచుకోవాలి అనేది వేదం రూపంలో ఆజ్ఞలుగా జారీ చేస్తున్నాడు పరమేశ్వరుడు. అందుచేతనే అతడు 'శిష్టకృత్' అనబడుతున్నాడు. **శిష్టాన్ కరోతి** సజ్జనులను పాలన చేయువాడు.

సజ్జనులు అంటే – అబద్ధము ఆడనివారు. హింస చేయనివారు. దొంగతనము, దోపిడీలు చేయనివారు, పరుల సొమ్ము ఆసించనివారు, న్యాయ సమ్మతముగా, ధర్మ సమ్మతముగా జీవితాన్ని వెళ్ళబుచ్చేవారు. నిరంతరము దైవచింతనలోనే కాలము గడిపేవారు. ఇతరులకు చేతనైనంత వరకు సాయము చేసేవారు, కలలో కూడా ఇంకొకరికి హాని తలపెట్టనివారు, సత్వగుణ ప్రధానులు. అటువంటి వారిని పాలించేవాడు.

## 251. శుచిః

నిర్మలమైన వాడు, నిరంజనుడు, 155వ నామము కూడా ఇదే.

ఆ పరమేశ్వరుడు ఏమీ అంటనివాడు, నిర్మలుడు, నిరంజనుడు, పవిత్రుడు, కాబట్టే 'శుచిః' అనబడుతున్నాడు.

ఈ రకంగా శంకర భగవత్పాదుల వారు ఈ రెండు నామాలను విడివిడిగా వ్రాశారు. పరాశరభట్టరువారు ఈ రెండింటినీ రెండు నామాలుగా లెక్క పెట్టినప్పటికీ, అర్థం చెప్పటానికి ఒక నామంగానే పరిగణించారు.

**శిష్టకృత్-శుచిః:** తనకు అనుకూలమైన వారికి శుభమును చేకూర్చే కాంతి గలవాడు.

**స్వానుకూలశుభాన్ కుర్వన్ స్వసంబంధేన తాన్ స్వయం**

**అనాధేయ మహాదీప్తిః శిష్టకృచ్ఛు చిరుచ్యతే ॥**

తన సంబంధముతో అన్నింటినీ స్వయముగా తనకు అనుకూలమయ్యేటట్లుగా శుభముగ చేసేవాడు. స్వయంప్రకాశియై వెలుగొందేవాడు.

తన సంబంధముగల వారందరినీ తనకు అనుగుణంగా చేసుకోగల కాంతి గలవాడు. కాబట్టి 'శిష్టకృత్–శుచిః' అనబడుతున్నాడు.

## 252. సిద్ధార్థః

సిద్ధించిన కోరికలు గలవాడు.

**సిద్ధాః ప్రాప్తాయస్య సత్వే హ్యర్థా స్సిద్ధార్థ ఈరితః**

పూర్ణకాముడు అవటంచేత అతడికి అన్ని కోరికలు తీరినాయి.

పూర్ణకాముడు అనగా – కోరికలు పరిపూర్ణమైనవాడు. కోరికలు తీరినవాడు.

**సిద్ధః అర్థః యస్యసః సిద్ధార్థః** సకలము సిద్ధించినవాడు కాబట్టి సిద్ధార్థుడు. ఈతనిచే కోరబడు కోరిక సిద్ధముగా అయినది. ఇతని కోరికలన్నీ గతంలోనే నెరవేరి ఉన్నాయి. అందుచేత ఇతడు పూర్ణకాముడు. ఇతడు కోరవలసిన కోరికలు ఇంక లేవు. అందుచేత నిష్కాముడు. కోరికలన్నీ సిద్ధించినాయి కాబట్టి సిద్ధకాముడు. అదే – సిద్ధార్థుడు అనబడుతున్నాడు. **ఛాందోగ్యోపనిషత్తు**లో 'హృత్పద్మాన్ని' వివరిస్తూ "భౌతికమైన ఆకాశం మనకళ్ళకు కనిపించేది. అది బయట ఎంత ఉన్నదో హృదయంలో ఉన్న ఆకాశం కూడా అంతే ఉన్నది. ఈ హృదయాకాశంలో ద్యులోకము, పృథివి, రెండూ ఇమిడి ఉన్నాయి. అలాగే అగ్ని వాయువు కూడా ఉన్నాయి. సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు, విద్యుత్తుకూడా అందులోనే ఉన్నాయి.

శరీరం వార్ధక్యాన్ని పొందినప్పుడు అంతరాకాశంలో ఉన్న బ్రహ్మజీర్ణం కాదు. శరీరాన్ని ఆయుధాలతో నరికి చంపేసినా, లోపల ఉన్న ఆత్మచావదు. ఆత్మనాశనం కాదు. ఆత్మ వధించబడదు. ఈ బ్రహ్మపురములో సమస్త కోరికలు ఉన్నాయి. ఆత్మకి ధర్మాధర్మాలతో సంబంధం లేదు. ముసలితనం లేదు. ఆకలి లేదు శోకం లేదు. దాహం లేదు. ఆత్మ సత్యకామము, సత్యసంకల్పము అయినది. సాంసారిక పురుషులకు లాగా ఆత్మకు అసత్య కామన, అసత్య సంకల్పము ఉండవు." అని చెప్పబడింది.

**నారాయణోపనిషత్తులో అథనిత్యోనారాయణః, బ్రహ్మోనారాయణః, శివశ్చ నారాయణః, శక్రశ్చనారాయణః, ద్యావాపృథివ్యౌచ నారాయణః, కాలశ్చనారాయణః దిశశ్చనారాయణః, ఊర్ధంచనారాయణః, అథశ్చనారాయణః, అంతర్బహిశ్చ నారాయణః, నారాయణ ఏవేదగ్ం సర్వం, యద్భూతం యచ్చభవ్యం, నిష్కళంకో, నిరంజనో, నిర్వికల్పో, నిరాఖ్యాత శుద్ధోదేవ ఏకో నారాయణః, న ద్వితీయోఽస్తి కశ్చిత్, య ఏవం వేద, స విష్ణురేవ భవతి, సవిష్ణురేవభవతి, సవిష్ణురేవ భవతి. ఏతద్యజుర్వేద శిరోఽధీతే ॥**

నారాయణుడే నిత్యుడు. బ్రహ్మ, శివుడు, ఇంద్రుడు, భూమ్యాకాశాలు, కాలము, దిక్కులు, పైన, క్రింద, ప్రక్కల ఉన్నదంతా నారాయణుడే. బాహ్యాభ్యంతరము లందున్నది నారాయణుడే. ఈ సమస్తము నారాయణుడే. అతడు నిష్కళంకుడు, నిరంజనుడు, నిర్వికల్పుడు, శుద్ధుడు, దేవుడు, అద్వితీయుడు. అతనిని వాక్కులతో నిర్వచించలేము. జగత్తులో నారాయణుడు తప్ప వేరెవరూ లేరు. ఈ విషయం గ్రహించినవాడు కూడా నారాయణుడే అవుతున్నాడు. ఈవిధంగా సంకల్ప వికల్పాలు లేనివాడు. పూర్ణకాముడు, ఆప్తకాముడు కాబట్టే నారాయణుడు 'సిద్ధార్థః' అనబడుతున్నాడు.

## 253. సిద్ధ సంకల్పః

సిద్ధించిన సంకల్పముగలవాడు.

**సత్య సంకల్ప వత్త్వాచ్చ సిద్ధసంకల్ప ఈరితః** సిద్ధించిన సంకల్పము గలవాడు.

**సిద్ధః సంకల్పః యస్యసః సిద్ధసంకల్పః** సత్యసంకల్పము, సిద్ధించిన సంకల్పము గలవాడు. ఈతని సంకల్పము నెరవేరి ఉన్నది. పరమేశ్వరుడు ఏది చెయ్యాలి అనుకుంటే అది చేయగలడు. అలా చెయ్యాలి అనుకోవటమే సంకల్పము.

**ఐతరేయోపనిషత్తు**లో "జీవాత్మ, పరమాత్మ రెండూ ఒక్కటే. మరణానంతరము జీవాత్మ పరమాత్మలో లీనమవుతుంది. ఆత్మయే ఆలోచనా పూర్వకంగా ఈ లోకాలను సృష్టించింది. సృష్టికి ముందు ఈ జగత్తంతా బ్రహ్మమయంగానే ఉండేది. దానికి భిన్నమైన పదార్థం ఏమీ లేదు. ఆత్మయే 'లోకాలను సృష్టించాలి' అనుకొంది. అంభస్సు, మరీచి, ఆపః, మర అనే పేర్లు గల లోకాలను సృష్టించింది.

లోకాలను సృష్టించిన తరువాత 'లోకాలను రక్షించేవాళ్ళు లేకపోతే అవి నాశనమై పోతాయి. కాబట్టి లోకపాలకులను సృష్టించాలి' అని ఆలోచించి ముందుగా విరాట్పురుషుని

సృష్టించింది. ఆ తరువాత ఇంద్రియాలను, ఇంద్రియాధిష్ఠాన దేవతలను సృష్టించింది." అని చెప్పబడింది. ఇక్కడ ఆత్మ అంటే ఆ పరమేశ్వరుడే. ఆత్మ ఏం చెయ్యాలి అనుకుంటే అది చేస్తుంది. అదే సిద్ధసంకల్పము.

**బృహదారణ్యకోపనిషత్తు**లో "సృష్టికి పూర్వం మానవాకారంలో ఉన్న విరాట్ ఆత్మ ఒక్కటే ఉన్నది. అతనికన్న భిన్నమైనది ఏదీ లేదు. ఒంటరిగా ఉన్న ఆ ప్రజాపతి, ఒంటరితనంలోని ఆనందాన్ని అనుభవించలేకపోయాడు. అందుచేత ఒక స్త్రీని కోరాడు. అలా కోరిన వెంటనే స్త్రీ పురుషులు పరస్పరాలింగనం చేసుకున్నట్లుగా రూపుదాల్చాడు. తన శరీరాన్ని రెండు భాగాలుగా చేశాడు. అవే పతి, పత్ని, వీరే స్వాయంభువ మనువు, శతరూపం వీరివల్లనే 84 లక్షల జీవరాశి ఆవిర్భవించింది" అని చెప్పబడింది. ఈ రకంగా పరమేశ్వరుడు సిద్ధసంకల్పుడు. అసలు సిద్ధసంకల్పము అంటే ఏమిటి ?

సంకల్పము రెండు రకాలు 1. సిద్ధ సంకల్పము. 2. అసిద్ధ సంకల్పము

ఏదైనా ఒక విషయాన్ని గురించి 'ఇది ఈ రకంగా ఉంటుంది' అని సంకల్పం చేసినప్పుడు, దానికి విరుద్ధమైన సంకల్పాలు కలగకుండా ఉంటే అది సిద్ధసంకల్పము అవుతుంది. ఉదాహరణకు ఒక వస్తువు ఈ రకంగా ఉండాలి. అని సంకల్పించాము. మళ్ళీ అది కాదేమో అనే ఆలోచన రాకూడదు. అంటే మొదట చేసిన సంకల్పము ధృడంగా ఉండాలి. దానిమీద ఏ రకమైన అనుమానాలు రాకూడదు. అటువంటప్పుడు ఆ సంకల్పం సిద్ధిస్తుంది. ఒకదానియందే 'ఇది సత్యము' అని సంకల్పం చేస్తే అది సిద్ధిస్తుంది. పరమేశ్వరుడు ఈ జగత్తును సత్యము అని భావించాడు. ఈ లోకంలోని వారందరూ కూడా అదే భావంతో ఉన్నారు. అందుకే ఆ జగత్తు అందరికీ ఉన్నట్లుగానే కనిపిస్తోంది. ఇందులో ఏ ఒక్కడైనా 'ఇది సత్యం కాదు' అనుకుంటే, అతడికి ఈ జగత్తు అసత్యమే అవుతుంది. ఈ రకంగా సిద్ధ సంకల్పం చేస్తాడు కాబట్టే పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు 'సిద్ధసంకల్పః' అనబడుతున్నాడు.

## 254. సిద్ధిదః

సిద్ధులను ఇచ్చేవాడు.

**సిద్దదో హ్యణిమాద్యష్ట సిద్దేర్థః కాయదానతః**

తన భక్తులకు అణిమాది అష్టసిద్ధులను ఇచ్చువాడు.

**సిద్ధీః దదాతీతి సిద్ధిదః** సాధకులకు అష్టసిద్ధులను ఇచ్చువాడు.

ఇవి ఎనిమిది రకాలయిన సిద్ధులు.

1. అణిమ - శరీరము అతిచిన్నదిగా చేయటము
2. మహిమ - శరీరము అతిపెద్దదిగా చేయటము
3. గరిమ - శరీరము బరువు విపరీతంగా పెంచటము
4. లఘిమ - శరీరము అతితేలికగా చేయటము
5. ప్రాప్తి - కావలసిన వస్తువులు పొందటము
6. ప్రాకామ్య - ఆకాశ సంచారము
7. ఈశిత్వము - సమస్తానికి అధికారము పొందటము
8. వశిత్వము - సమస్త భూతాలను లోబరచుకోవటము

ఈ సిద్ధులను తన భక్తులకు ఇచ్చేవాడు.

కర్మలు చేసినవారికి ఆ కర్మ ఫలితమును వారి యోగ్యతను బట్టి ఇచ్చేవాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు 'సిద్ధిదః' అనబడుతున్నాడు.

## 255. సిద్ధి సాధనః

సిద్ధిరూపమైన సాధన గలవాడు.

**తత్సిద్ధేశ్చాపి హేతుత్వాత్ సిద్ధిసాధన ఈరితః**

అటువంటి సిద్ధికి తానే కారణమైనవాడు. అంటే తనను పొందటానికి ఏదైనా సాధనాన్ని అవలంబిస్తున్నప్పుడు కూడా భక్తులయందు ప్రియముగా ఉండేవాడు.

**సిద్ధిః సాధనం యస్యసః** సిద్ధిరూపమైన సాధనము గలవాడు.

**భగవద్గీత**లోని పన్నెండవ అధ్యాయము **'భక్తియోగము'**లోని 20వ శ్లోకము

**యే తు ధర్మ్యామృతమిదం యథోక్తం పర్యుపాసతే ।**
**శ్రద్దధానా మత్పరమాః భక్తాస్తేఽ తీవ మే ప్రియాః ॥**

ఉపర్యుక్త ధర్మామృతాన్ని సేవిస్తూ నిష్కాములై, భక్తి శ్రద్ధలతో నన్ను సేవించే భక్తులు నాకత్యంత ప్రియులు. ఇక్కడ ఉపర్యుక్త ధర్మామృతాన్ని సేవిస్తూ అంటే - గతంలో చెప్పినటువంటి ఉత్తమగుణాలను కలిగి ఉండి' అని అర్థం. అవి

1. నిందాస్తుతులకు చలించనివాడు 2. మననశీలుడు
3. శరీర నిర్వహణకు దొరికిన దానితో తృప్తిపడేవాడు.
4. నివాస స్థానములందు మమతాసక్తులు లేనివాడు. 5. స్థితప్రజ్ఞుడు

ఈ గుణాలు ఉన్నవారు తనకు ఇష్టులు అని 19వ శ్లోకంలో చెప్పాడు. ఇక్కడ

1. నిందాసక్తులకు చలించనివాడు అంటే – భక్తుడికి తన పేరు ప్రతిష్ఠల మీద గాని, దేహము మీదగాని అభిమానము ఉండదు. కాబట్టి ఇతరులు తనను పొగిడితే ఆనందించడు. నిందిస్తే దుఃఖించడు. ఆ రెండింటియందు సమభావమే ఉంటుంది.

2. మననశీలుడు అనగా – మనిషి కేవలము వాక్కుతోనే కాక, మనసుతో కూడా మాట్లాడతాడు. ఎప్పుడూ ఏదో ఒకవిషయము ఆలోచిస్తూ ఉండటాన్నే మనసుతో మాట్లాడటము అంటారు. భక్తుని మనస్సు పూర్తిగా భగవంతుని మీదనే లగ్నమయి ఉంటుంది. కాబట్టి ఆ భగవంతుణ్ణి స్మరించటంలోనే నిమగ్నమై ఉంటాడు. ఈ రకంగా మనోవాక్కాయ కర్మలతో ఎల్లప్పుడూ భగవంతుడినే ధ్యానించేవాడు మననశీలుడు.

3. శరీర నిర్వహణకు దొరికిన దానితో తృప్తిపడేవాడు అనగా – నిరంతరము భగవచ్చింతన గలిగిన భక్తుడికి ఇక ఏ ఇతర ఆలోచనా ఉండదు. ప్రారబ్ధానుసారము దొరికిన దానితో తృప్తిపడతాడు.

4. నివాస స్థానమున మమతాసక్తులు లేనివాడు అనగా – సన్యాసులు, జ్ఞానులు, భక్తులు ఏ స్థానమునందు కూడా మమతాసక్తులు పెంచుకోరు. వీరి దృష్టిలో ఇల్లు, వాకిలి, శరీరము అన్నీ భగవంతుడికి చెందినవే.

5. స్థితప్రజ్ఞుడు అనగా – స్థిరమైన బుద్ధిగలవాడు. భగవంతుడు ప్రత్యక్షం కావటం వలన భక్తుడికి సంశయాలన్నీ తీరిపోతాయి. భగవంతుని మీద ధృడ విశ్వాసము ఏర్పడుతుంది. సామాన్యుడిలాగా అతడు కామక్రోధాది వికారాలకు లోనుకాడు.

ఈ లక్షణాలు గల భక్తులు తనకు అత్యంత ప్రియులు అంటున్నాడు భగవానుడు. భగవంతుని పొందటానికి భక్తులు ఈ లక్షణాలను కలిగి ఉన్నారని, ఈ సాధనాలను అవలంభిస్తున్నారని తెలిసినప్పటికీ, ఆ భక్తులయందు అమితమైన వాత్సల్యముతో ఉండేవాడు కాబట్టే శ్రీమన్నారాయణుడు 'సిద్ధిసాధనః' అనబడుతున్నాడు.

## 256. వృషాహీః

ధర్మరూపమైన దినము గలవాడు.

**వృషోహి ధర్మస్తద్రూప మహర్యస్య దినం స్మృతమ్ ।**

**ప్రధమాభి గమనాఖ్యం వృషాహీ న ప్రకీర్తితః ॥**

వృషము అంటే – ధర్మము అని అర్థం. అటువంటి ధర్మరూపమైన దినము కలవాడు. అంటే ఆ పరమేశ్వరుణ్ణి దర్శించే (పొందే) మొదటిరోజు సమస్త శుభములకు తొలిరోజులాగా ధర్మస్వరూపమై ఉంటుంది. అందుచేత పరమేశ్వరుడు ధర్మరూపమగు దినముగలవాడని చెప్పబడింది.

**వృషంచ తత్ అహశ్చ వృషాహః వృషాహః అస్యాస్తీతి వృషాహీ ॥**

ఇతనిని పొందే మొదటి రోజు సకల శ్రేయస్సులకు ప్రారంభ దినములాగా ధర్మ రూపంగా ఉంటుంది.

**విష్ణు మహాపురాణము**లో అనమిత్రుని కుమారుడు పృశ్ని. అతని కుమారుడు శ్వఫల్కుడు. వేదవేదాంగ విదుడు. వానలు లేనిచోట ఇతడు పాదము మోపితే చాలు వర్షాలు పడతాయని ప్రతీ. ఇతడు కాశిరాజు కుమార్తె 'గాంధిని'ని వివాహం చేసుకున్నాడు. వీరి కుమారుడే అక్రూరుడు. మహాభక్తుడు కంసుని ఆస్థానంలో ఉండేవాడు. కంస మహారాజు బలరామకృష్ణులను సంహరించాలని అనేక ఎత్తులు వేశాడు అవన్నీ వృథా అయినాయి. చివరగా ధనుర్యాగము చేస్తున్నామని, దానిని చూడటానికి రమ్మని కబురుచేసి, వారిని తీసుకురావటానికి అక్రూరుణ్ణి పంపాడు. శ్రీకృష్ణ భగవానుని దర్శనము అవుతుంది కదా అని అక్రూరుడు మధురకు బయలుదేరి వెళ్ళాడు. అలా వెడుతూ తనలో అనుకుంటున్నాడు.

**అద్యమేస ఫలంజన్మ సుప్రభాతాచ మేనిశా ।**

**యదున్ని ద్రాబ్జపత్రాక్షం విష్ణోర్ద్ర≡క్ష్యామ్యహంముఖమ్ ॥**

**పాపం హరతియత్పుంసాం స్మృతం సంకల్పనామయమ్ ।**

**తత్పుణ్డరీకనయనం విష్ణోర్ద్ర≡క్ష్యామ్యహంముఖమ్ ॥**

**వినిజ≡గ్మయ≡తో వేదావేదాజ్గాన్యఖిలానిచ ।**

**ద్రక్ష్యామితత్పరంధామధామ్నాంభగవతోముఖమ్ ॥**

**యజ్ఞేషుయజ్ఞపురుషః పురుషైః పురుషోత్తమః ।**

**ఇజ్యతేయోఖిలాధార స్తంద్రక్ష్యామిజగత్పతిమ్ ॥**

**ఇష్ట్వాయమిన్ద్రోయజ్ఞానాంశతే నామరరాజతామ్ ।**

**అనాపతమన న్తాదిమహంద్రక్ష్యామి కేశవమ్ ॥**

న బ్రహ్మేనేన్ద్రరుద్రాశ్వివస్వాదిత్యమరుద్గణాః ।
యస్యస్వరూపం జాన న్తిప్రత్యక్షం యాతిమేహరిః ॥

సర్వాత్మా సర్వవిత్సర్వస్సర్వ భూతేష్వవస్థితః ।
యోహ్యచిన్త్యోఽ వ్యయోవ్యాపీ సవక్షతిమయాసహ ।

మత్స్యకూర్మవరాహాశ్వసింహరూపాదిభిఃస్థితిమ్ ।
చకారజగతోయోజనోస్సోద్యమా మాలపిష్యతి ॥

సాంప్రవతంచ జగత్స్వామీకార్యమాత్మహృదిస్థితమ్ ।
కర్తుం మనుష్యతాంప్రాప్తస్స్వేచ్ఛాదేహధృదవ్యయః ॥

యోఽన న్తఃపృథివీందత్తే శేఖరస్థితి సంస్థితామ్ ।
సోఽ వతీర్ణో జగత్యర్థే మామ క్రూరేతినక్ష్యతి ॥

పితృపుత్రసుహృద్భ్రాతృ మాతృబన్ధుమయీమిమామ్ ।
యన్మాయాంనాలము త్తర్తు జగత్తస్మై నమోనమః ॥

ఇప్పుడు నా జన్మ సఫలమయింది. తెల్లవారుతున్నది. అప్పుడే వికసించిన తామర రేకులవంటి కనులు గల ఆ గోవిందుని దర్శించబోతున్నాను. సంకల్పనాత్మకమైన పాపాన్ని హరించేవాడు, పద్మములవంటి కనులు గలవాడు అయిన విష్ణువును చూడబోతున్నాను. వేదములు, వేదాంగములకు మూలపురుషుడైన ఆ భగవంతుని చూడబోతున్నాను. యజ్ఞాలలో యజ్ఞపురుషుడు, పురుషులలో పురుషోత్తముడు, సర్వాధారుడు అయిన ఆ జగదీశ్వరుని దర్శించబోతున్నాను. ఇంద్రుడు నూరు యజ్ఞాలు చేసి ఎవరిని అర్చించి ఆ పదవి చేపట్టాడో, ఆ స్వామిని నేను దర్శించబోతున్నాను. బ్రహ్మ, రుద్రుడు, వసువులు, మరుద్గణాలు ఎవరి రూపాన్ని దర్శించాలనుకుంటున్నారో, ఆ మహాపురుషుని నేను దర్శించబోతున్నాను. సర్వాత్మకుడు, సర్వ భూతాంతఃస్థుడు, అచింత్యుడు, అవ్యయుడు, సర్వవ్యాపి అయిన శ్రీమహావిష్ణువు నాతో మాటాడబోతున్నాడు. మత్స్యకూర్మాది రూపములతో జగత్తును రక్షించిన ప్రభువు నాతో మాట్లాడబోతున్నాడు. ఇప్పుడు ఆ పరమేశ్వరుడు మనుష్యాకారుడై ఉన్నాడు. ఆదిశేషుడై భూమిని మోసే ఆ భగవానుడు నన్ను 'అక్రూరా' అని పిలుస్తున్నాడు. పుత్ర, మిత్ర, కళత్రము అనే మాయను మనం జయించలేము. ఆ మాయకు అధిపతి ఆ పరమేశ్వరుడే. అటువంటి మాధవుడికి నమస్కారము అని చెప్పబడింది.

ఈ రకంగా పరమేశ్వరుని దర్శించుటే మహాభాగ్యము. అలా దర్శించినరోజు శుభదినము. వృషః అంటే – ధర్మము లేదా పుణ్యము అని అర్థం. వృషమే – అహస్సు (పగలు) అనికూడా చెప్పబడింది.

ఈవిధంగా ధర్మప్రకాశము, పుణ్యప్రకాశము అయిన 'ద్వాదశాహః' మొదలైన శ్రౌత యజ్ఞాలకు వృషాహిః అని పేరు అటువంటి యజ్ఞాలు తనను ఉద్దేశించి చెయ్యబడేవి. కాబట్టి శ్రీమన్నారాయణుడు వృషాహీః అనబడుతున్నాడు.

## 257. వృషభః

వర్షించువాడు

**అభిగచ్ఛద్భక్త జనాన్ సుధావర్షత్తోఽవ్యహమ్ ।**
**వృషభశ్చ సమాఖ్యాతః సిఞ్చన్ భయహరో మనుః ॥**

తనకు అభిముఖులైన భక్తవర్యులకు సంసారతాపము ఉపశమించేటట్లుగా ప్రతిదినము అమృతము వర్షించి తడపుతూ ఉండేవాడు.

**వర్షతీతి వృషభః** తనను ఆశ్రయించినటువంటి భక్తులకు సంసారతాపము తీరేటట్లుగా అమృతాన్ని వర్షించేవాడు.

**భక్తేభ్యః కామాన్ వర్షతి** భక్తుల కొరకు కోరికలను వర్షించువాడు.

పరమేశ్వరుడు తనను నమ్మినవారిని ఆదుకుంటాడు. వాళ్ళకోరికలు తీరుస్తాడు. వారికి ఏ విధమైన చింత లేకుండా చూస్తాడు.

శ్రీకృష్ణభగవానుడి బాల్యమిత్రుడు కుచేలుడు పరమభక్తుడు. కడుదరిద్రుడు. పైగా గంపెడు సంసారం తినటానికి సరిగా తిండి కూడా లేదు. అటువంటి స్థితిలో గుప్పెడు అటుకులు మూటకట్టుకుని కృష్ణ మందిరానికి వచ్చాడు. వచ్చిన మిత్రుణ్ణి సాదరంగా ఆహ్వానించి, అతడు తెచ్చిన అటుకులు స్వీకరించి, దానికి బదులుగా ఎనలేని సంపద అనుగ్రహించాడు.

ద్రౌపది సాధ్వీమణి శ్రీకృష్ణపరమాత్మనే నమ్ముకుంది. పాండవులు జూదంలో సర్వము కోల్పోయారు. తమను తాము బానిసలుగా చేసుకున్నారు. అస్థితిలో కులసతి ద్రౌపదిని నిండుసభలోకి ఈడ్చి వలువలు ఊడదీయించటానికి ప్రయత్నించాడు సుయోధనుడు. తనను రక్షించేవారు ఎవ్వరూ లేరు. అప్పుడు ఆసాధ్వి తను నమ్మిన దైవం శ్రీకృష్ణ పరమాత్మున్ణే ప్రార్థించింది. భగవానుడు ఆమె మానం కాపాడాడు.

గజేంద్రుడు కొలనులో విహారం చేస్తున్నాడు మొసలి పట్టుకున్నది. శాయశక్తులా దానితో పోరాడాడు. ఇక లాభం లేదని తెలుసుకున్నాడు. చివరకు పరమేశ్వరుని శరణు వేడాడు.

ఈ రకంగా తన భక్తులందరిమీద కోర్కెల వర్షం కురిపిస్తాడు. కాబట్టే శ్రీమన్నారాయణుడు 'వృషభః' అనబడుతున్నాడు.

పరమేశ్వరుని అర్చించే మార్గంలో యోగమార్గం ఒకటి. ఆధారచక్రంలో స్వయంభూ లింగానికి మూడున్నర చుట్లు చుట్టుకుని నిద్రావస్థలో ఉంటుంది కుండలినీశక్తి. ఆ కుండలినీ శక్తిని గనక జాగృతం చెయ్యగలిగితే, అది నిద్రలేచి, గ్రంధిత్రయాన్ని ఛేదించి సహస్రారాన్ని చేరి, అక్కడ సుధాధారలు కురిపిస్తుంది. ఆ అమృతపు ధారలతో యోగియొక్క శరీరంలోని 72 వేల నాడీ మండలము తడుపబడుతుంది. అప్పుడు ఆ యోగి అనిర్వచనీయమైన ఆనంద పొందుతాడు. ఆ ఆనందము అనుభవైక వేద్యము.

ఈ రకంగా తన భక్తులమీద అమృతపు ధారలు కురిపిస్తాడు కాబట్టే శ్రీమన్నారాయణుడు 'వృషభః' అనబడుతున్నాడు.

## 258. విష్ణుః

వ్యాపించి ఉండువాడు. 2, 657 నామాలు కూడా ఇదే.

**విష్ణు స్స్యాదవినాభావా ద్వ్యాప్యవ్యాపక భావతః**

జగత్తులో ఉండే పదార్థములన్నింటి యందు వ్యాపించి ఉండేవాడు.

**వేవేష్టీతి విష్ణుః** సకల జీవులకు ఆయా కాలములందు కావలసిన వాటిని ఇస్తూ, అంతటా వ్యాపించి ఉండేవాడు.

**భగవద్గీత**లోని పదవ అధ్యాయం **'విభూతియోగం'**లోని 39వ శ్లోకంలో

**యచ్చాపి సర్వభూతానాం బీజం తీదహమర్జున ।**
**న తదస్తి వినా యత్స్యాత్ మయా భూతం చరాచరమ్ ॥**

అర్జునా ! సర్వప్రాణుల ఉత్పత్తికి కారణమైన బీజమును నేనే. నేను లేనటువంటి ప్రాణి ఏదీ లేదు. పరమేశ్వరుడే సకల ప్రాణులకు ఆధారమైనవాడు. అతడి నుండియే అన్నీ ఉద్భవిస్తున్నాయి. కాబట్టి అతడే అన్నింటికీ బీజము లేక మహాకారణము.

**భగవద్గీత**లోని ఏడవ అధ్యాయం **'విజ్ఞాన యోగము'**లోని 10వ శ్లోకంలో

**బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థః సనాతనమ్ ।**

**బుద్ధిర్బుద్ధి మతామస్మి తేజస్తేజస్వినామహమ్ ॥**

అర్జునా ! సమస్తభూతములకు నన్ను శాశ్వతమైన బీజముగా ఎరుంగుము. ప్రజ్ఞానవంతులలో ప్రజ్ఞను, తేజోవంతులలో తేజస్సును నేనే. శాశ్వతమైనది, ఎన్నడు నాశనము కానిది సనాతనము అనబడుతుంది. పరమేశ్వరుడే సమస్త చరాచరములకు మూలాధారము. అతని నుండే అన్నీ పుడుతున్నాయి. కాబట్టి అన్నింటికీ అతడే సనాతన బీజము. **భగవద్గీత**లోని తొమ్మిదవ అధ్యాయము **'రాజవిద్యా రాజగుహ్యాయోగము'**లోని 18వ శ్లోకము

**గతిర్భర్తా ప్రభుసాక్షీ నివాసశ్శరణం సుహృత్ ।**

**ప్రభవః ప్రళయః స్థానం నిధానం బీజమవ్యయమ్ ॥**

పరమగతి అయిన పరమధామమునకు జగత్తును భరించి పోషించేవాడిని నేనే. అందరికీ స్వామిని అందరి శుభాశుభములను చూసేవాడను నేను అందరికీ నివాస స్థానమును, శరణు పొందదగినవాడను కూడా నేనే. ప్రత్యుపకారము ఆశించకుండా హితము చేసేవాడను, అందరియొక్క ఉత్పత్తి, సంహారములకు హేతువును నేనే. వారి స్థితికి ఆధారము, నిధానము,  శాశ్వతకారణము కూడా నేనే.

అని చెప్పబడింది కాబట్టి ఈ జగత్తుకు కారణమైన వాడు, సర్వవ్యాపి అయిన శ్రీమన్నారాయణుడు 'విష్ణుః' అనబడుతున్నాడు.

'వి' అనగా – పాదన్యాసము అడుగు వేయుట

పాదన్యాసమును – విక్రమము అని అంటారు.

అన్ని వైపులకు తన పాదన్యాసము గలవాడు. అన్ని వైపులకు అడుగులు వేసినవాడు. ఒక్క అడుగుతో భూమిని, రెండవ అడుగుతో ఆకాశాన్ని ఆక్రమించి జగత్తంతా వ్యాపించాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు 'విష్ణువు అనబడుతున్నాడు.

## 259. వృషపర్వా

ధర్మములను మెట్లుగా గలవాడు.

**వృషావర్ణాశ్రమా ధర్మాః పర్వాణ్యారోహణే తు తే**

**యస్యసన్తి సదా సోఽయం వృషపర్వా ప్రకీర్తితః**

అతను పొందటానికి వర్ణాశ్రమ ధర్మాలను పంక్తిగా కలవాడు.

**వృషాః పర్వాణి యస్యసః వృషపర్వా**

పరమేశ్వరుణ్ణి చేరటానికి వర్ణాశ్రమ ధర్మాలు మెట్లుగా గలవాడు.

పరమేశ్వరుని చేరాలి అంటే ధర్మాన్ని ఆచరించాలి. మానవుడికి ఆశ్రమధర్మాలు ఉన్నాయి. అవి నాలుగు

1. బ్రహ్మచర్యము
2. గృహస్థాశ్రమము
3. వానప్రస్తము
4. సన్యాసము

బ్రహ్మచర్యము అంటే విద్యార్థిదశ. బాలుడికి ఏడవ ఏడురాగానే ఉపనయనం చేసి గురుకులానికి పంపుతారు. అక్కడ గురువుగారికి సేవలు చేస్తూ విద్యాభ్యాసం చెయ్యాలి.

విద్యాభ్యాసం పూర్తి అయిన తరువాత మంచి సంప్రదాయం గల పిల్లను చూసి వివాహం చేసుకుని గృహస్థు కావాలి. ధర్మబద్ధంగా సంతానాన్ని కని, వారికి వివాహం చేసి తన బాధ్యతలు నెరవేర్చాలి. ఆ తరువాత

వానప్రస్థానికి వెళ్ళాలి. అంటే ఇల్లు వాకిలి వదిలేసి అరణ్యాలకు పోయి కర్మలు చేస్తూ జీవితం గడపాలి.

ఆ తరువాత సన్యాసం స్వీకరించాలి. వానప్రస్థంలో వేదంలోని మూడవ భాగమైన అరణ్యకాలు వల్లే వేస్తారు. ఇది కర్మతో కలిసిన జ్ఞానకాండ అంటే యజ్ఞయాగాది క్రతువులు చేసి పరమేశ్వరుణ్ణి ప్రసన్నం చేసుకోవటం. సన్యాసం స్వీకరించిన తరువాత కర్మలన్నీ పరిత్యజించాలి. గతంలో కర్మచేస్తే వచ్చే ఫలితము, ఇప్పుడు కర్మ చేయకపోయినా వస్తుంది అని తెలుసుకోవాలి. అంతవరకు చేసిన బాహ్యపూజలకు, కర్మలకు స్వస్థి పలికి, ఇప్పుడు అంతఃపూజ చెయ్యాలి. తన శరీరంలోనే పరమేశ్వరుని దర్శించాలి. అదే ఆత్మదర్శనం ఆత్మజ్ఞానం. స్వస్వరూప జ్ఞానం అనబడుతుంది. సన్యాసం తీసుకున్నవారు కేవలము ఉపనిషత్తుల ఆధారంగానే పరమేశ్వరుణ్ణి ఆరాధించాలి. కేవలము మోక్షదాయకమైన ప్రణవాన్ని మాత్రమే జపించాలి. ఈ రకంగా త్రికరణశుద్ధిగా పరమేశ్వరుని సేవించినవాడు మరణానంతరము అర్చిరాది మార్గాలద్వారా బ్రహ్మలోకం చేరి, కల్పాంతమువరకు అక్కడే ఉండి, కల్పాంతాన కర్మ బ్రహ్మతో కలిసి పరమేశ్వరునిలో లీనమవుతాడు.

ఈ రకంగా చతురాశ్రమాలు ఆ పరమేశ్వరుని చేరటానికి మెట్లు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'వృషపర్వా' అనబడుతున్నాడు.

పరమేశ్వరుని యొక్క ఉన్నత స్థానము 'పరమపదము' దానిని చేరటానికి సత్యము, ధర్మము, తపస్సు, జ్ఞానము అనేవి మెట్లు. వీటిలో ఒక్కొక్క దాన్నే అధిరోహిస్తూ మూడవ

దశలో తపస్సు చేసి జ్ఞానాన్ని సంపాదించాలి జ్ఞానియైన వాడు ముక్తి పొందుతాడు. ఆ పరమపదము చేరగలుగుతాడు. అతని ఆత్మ పరమాత్మలో లీనమవుతుంది. కాబట్టి పరమేశ్వర స్వరూపుడైన శ్రీమన్నారాయణుడు 'వృషపర్వా' అనబడుతున్నాడు.

వృషపర్వుడు దానవేశ్వరుడు. దనువునందు కశ్యపునికి జన్మించినవాడు. ఇతని కుమార్తె శర్మిష్ఠ శుక్రాచార్యుని కుమార్తె దేవయానిని అవమానించి దాని ఫలితంగా ఆమెకు దాస్యం చేసింది.

వృషపర్వుడు ఒకరాజ ఋషి. అరణ్యవాసం చేస్తున్న పాండవులు ఇతని ఆశ్రమంలో కొంతకాలం ఉన్నారు.

## 260. వృషోదరః

ధార్మికమగు ఉదరముగలవాడు.

**భక్తైరుపాహృతాం పూజాం ఉపహారాంశ్చ ధర్మతః ।**
**కృత్వాదరే యోజయతి స వృషోదర ఉచ్యతే ॥**

భక్తులు సమర్పించిన పూజలు, నైవేద్యములను గర్భమున ధరించువాడు.

**వృషః ఉదరం యస్యసః వృషోదరః**

భక్తులు సమర్పించిన దానిని సంపూర్ణముగా స్వీకరిస్తాడు కాబట్టి, ఆర్తులు ఆశ్రయించే స్థలం కాబట్టి ధార్మికమైన ఉదరము గలవాడు అని చెప్పబడుతున్నాడు.

**వర్షతి ఇతి వృషమ్** వర్షించునది కాబట్టి వృషము అనబడుతుంది. ఇతడు జగత్తు సృష్టికర్త. కాబట్టి ఇతని ఉదరము ప్రాణులను వర్షిస్తున్నట్లుగా కనపడుతున్నది.

**భగవద్గీత**లోని తొమ్మిదవ అధ్యాయం **'రాజవిద్యారాజగుహ్యయోగము'**లోని 26వ శ్లోకం

**పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి ।**
**తదహం భక్త్యుపహృతమ్ అశ్నామి ప్రయతాత్మనః ॥**

అర్జునా ! నిర్మలమైన బుద్ధితో, నిష్కామ భావంతో పరమభక్తునిచే సమర్పించబడిన ఆకులుగాని, పూలుగాని, ఫలముగాని, చివరకు నీరైనా సరే నేను స్వయంగా స్వీకరిస్తాను అన్నాడు భగవానుడు. ఇక్కడ కులము, మతము, జాతి భేదాలు లేవు. ఎవరు ఏమి ఇచ్చినా వాటిని స్వీకరిస్తాడు. కాబట్టే 'వృషోదరుడు' అనబడుతున్నాడు.

సృష్టి జరిగింది. మహాకల్పము పూర్తయింది. కల్పాంతాన మహాప్రళయము జరిగింది. అప్పుడు భూమిమీద ఉన్న వస్తువులన్నీ నాశనమౌతాయి. కర్మక్షయం అయిపోయిన జీవులు ముక్తిని పొందుతాయి. కర్మక్షయం కాని జీవులు ఆ కర్మను తమతోపాటుగా మూటకట్టుకుని మాయలో కలిసిపోతాయి. ఆ మాయ వీటన్నింటితో సహా పరబ్రహ్మలో లీనమవుతుంది. ఈ రకంగా జగత్తంతా ఆ పరమేశ్వరునిలోనే లీనమయిపోతుంది. అతని గర్భంలో ఉంటుంది ఈవిధంగా జగత్తునంతటినీ తనఉదరమునందు ఉంచగలుగుతున్నాడు కాబట్టే అతడు వృషోదరుడు అనబడుతున్నాడు.

పరమేశ్వరుడు కన్ను తెరిస్తే సృష్టి, కన్ను మూస్తే సృష్టి జరుగుతాయి. అందుచేతనే పరమేశ్వరుడు 'వృషోదరః' అనబడుతున్నాడు.

## 261. వర్ధనః

వర్ధిల్లచేయువాడు.

**మాతృవజ్జఠరే కృత్వా భక్తాన్వర్ధయతి స్వయం ।**
**వర్ధనః ప్రోచ్యతే నిత్యం నప్తార్ణో వృద్ధిదోమనుః ॥**

తన భక్తులను కడుపులో పెట్టుకుని జాగ్రత్తగా పోషించేవాడు.

**వర్ధయతీతి వర్ధనః** భక్తులను తల్లిలాగా గర్భమున ఉంచుకుని వర్ధిల్ల చేసేవాడు.

వర్ధయతి – వృద్ధి కలిగించేది.

పరమేశ్వరుడే ఈ జగత్తును సృష్టించాడు. అతడే రక్షిస్తున్నాడు, వృద్ధి చేస్తున్నాడు. గోవిందుని రూపంలో జగత్తును రక్షిస్తున్నాడు.

పరమేశ్వరుడికి కొన్ని లక్షణాలున్నాయి. అవి

**జాయతేస్తి విపరిణమతే వర్ధతే క్షీయతే వినశ్యతి**

| | | |
|---|---|---|
| జాయతే | – | పుడుతున్నది |
| అస్థి | – | అస్థిత్వము పొందుతున్నది |
| పరిణమితే | – | ఆకారాన్ని పొందుతన్నది |
| వర్ధతే | – | పెరుగుతున్నది |
| క్షీయతే | – | క్షీణిస్తున్నది |
| నశ్యతి | – | నశిస్తున్నది |

ఈ లక్షణాలు గలవాడు పరమేశ్వరుడు. అందులో వృద్ధి అనేది ఒకటి. అంటే పెరుగుతున్నది. లోకంలో ప్రాణులను వృద్ధి చేసేవాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు 'వర్ధనః' అనబడుతున్నది.

## 262. వర్ధమానః

వృద్ధిని పొందేవాడు.

**వర్ధయంస్తాన్ స్వయమపి వర్ధమానశ్చ వర్ధనాత్**

తన భక్తులను వృద్ధి పొందిస్తూ తానుకూడా వృద్ధి పొందేవాడు.

**వర్ధతే ఇతి వర్ధమానః** వారిని వర్ధిల్లచేసి తానుకూడా వృద్ధి పొందేవాడు. అపరిమితమయిన సమృద్ధి గలవాడు.

పరమేశ్వరుడు కోరికలు లేనివాడు, పూర్ణకాముడు అని గతంలో చెప్పాము. అతడు పరిపూర్ణుడు. జగత్తులో ఉన్నవన్నీ ఆ పరమేశ్వరుని దగ్గర నుండి వచ్చినవే. అసలు జగత్తంతా పరమేశ్వరమయం కదా ! అతని దగ్గర లేనటువంటిది ప్రత్యేకంగా జగత్తులో ఏ రకంగానూ రాదు. అన్ని వర్ణములు ఆ పరమేశ్వరుని యందే ఉన్నాయి. అన్ని ఆయుధములు అతని వద్దనే ఉన్నాయి. అన్ని వేదాలు అతని దగ్గరే ఉన్నాయి. అన్ని విద్యలూ అతని దగ్గరే ఉన్నాయి. అన్ని సంపదలు అతని దగ్గరే ఉన్నాయి. భోగభాగ్యాలు అతని దగ్గరే ఉన్నాయి. అష్టసిద్ధులు, నవనిధులు అతని దగ్గరే ఉన్నాయి. అవన్నీ అక్షయమైనవి. ఎంతతీసినా తరిగిపోవు. ఎంతగా వాడుకున్నా ఖర్చైపోవు. ఈ రకంగా అన్నింటినీ సమృద్ధిగా గలవాడు కావటం చేతనే శ్రీమన్నారాయణుడు 'వర్ధమానః' అనబడుతున్నాడు.

ఆ పరమేశ్వరుడు వృద్ధి పొందుతున్నాడు అంటే అతడికి రూపం లేదు. అది అతనియొక్క వ్యక్తిగతమైన అభివృద్ధి కాదు. ఇక్కడ వృద్ధి అంటే ఈ జగత్తు రూపంలో అభివృద్ధి దినదిన ప్రవర్ధమానుడవుతున్నాడు అంటే చరాచర జగత్తు రూపంలో అభివృద్ధి పొందుతున్నాడు. ప్రకృతి, అడవులు, కొండలు, ఎడారులు, క్రిమికీటకాలు, పశువులు, పక్షులు, మానవులు ఇవన్నీ అభివృద్ధి చెందుతూనే ఉన్నాయి. వాటి రూపంలో పరమేశ్వరుడు అభివృద్ధి చెందుతున్నాడు. జగత్తంతా పరమేశ్వరమయమే. పరమేశ్వరుని స్వరూపమే. అందుచేత పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు స్థావర జంగమాత్మకమైన ఈ జగత్తు రూపంలో అభివృద్ధి చెందుతున్నాడు కాబట్టే అతడు 'వర్ధమానః' అనబడుతున్నాడు.

# 263. వివిక్తః

ఏకాంతమైనవాడు.

**లోకోత్తరార్థి వృత్తాన్తాత్ స్వై కాన్తాగణ బృంహితాత్**

**వివిక్త ఇతి విఖ్యాతః పాపవత్త్వప్రదో మనుః**

లోకవిలక్షణమైన వృత్తాంతము గలవాడు అవటంవలన, అసాధారణమైన కల్యాణ గుణసమూహము కలవాడవటం వలన లోకాతీతుడవుతున్నాడు.

**వివిచ్యతే ఇతి వివిక్తః** లోకోత్తరమైన వృత్తాంతము కలవాడు కాబట్టి (వివిక్తః) ఏకాంతుడు అని చెప్పబడుతున్నాడు.

ఇందాకటి నామంలో చెప్పినట్లుగా ఆ పరమేశ్వరుడు ప్రపంచ రూపంలో వృద్ధి పొందుతున్నాడు. అయినప్పటికీ ఆ ప్రపంచముతోగాని, అందులో ఉండే పదార్ధాలతోగాని ఏ విధమైన సంబంధము లేక వేరుగా ఏకాంతముగా ఉన్నాడు.

**బృహదారణ్యకోపనిషత్తు**లో చెప్పినట్లుగా అతడు భూమిపైనా, భూమిలోపల కూడా ఉంటాడు. భూమే అతని శరీరము. కాని భూమే అతన్ని ఎరగదు. జలం లోపల ఉంటాడు. జలమే అతని శరీరం కాని జలం అతన్నెరగదు. అగ్ని లోపల ఉంటాడు. అగ్నే అతని శరీరము కాని అగ్ని అతన్నెరగదు. వాయువులోపల ఉంటాడు. వాయువే అతని శరీరము. కాని వాయువు అతన్నెరగదు. ఆకాశంలో ఉంటాడు. ఆకాశమే అతని శరీరము. కాని ఆకాశం అతన్నెరగదు. అంతరిక్షంలో ఉంటాడు. అంతరిక్షమే అతని శరీరం. కాని అంతరిక్షం అతన్నెరగదు. ద్యులోకలంలో ఉంటాడు. ద్యులోకమే అతని శరీరము. కాని ద్యులోకము అతన్నెరగదు. ఆదిత్యలోకంలో ఉంటాడు. ఆదిత్యలోకమే అతని శరీరము. కాని ఆదిత్యలోకం అతన్నెరగదు. దిగంతరాళాలలో ఉంటాడు. దిక్కులే అతని శరీరము కాని దిక్కులు అతన్నెరగవు. చంద్రునిలో ఉంటాడు. చంద్రుడే అతని శరీరము. కాని చంద్రుడు అతన్నెరగడు. నక్షత్రాలలో ఉంటాడు. నక్షత్రాలే అతని శరీరము. కాని నక్షత్రాలు అతన్నెరగవు. అంధకారంలో ఉంటాడు. అంధకారమే అతని శరీరము. కాని అంధకారం అతన్నెరుగదు. తేజస్సులో ఉంటాడు. తేజస్సే అతని శరీరము. కాని తేజస్సు అతన్ని ఎరగదు. ఈ రకంగా పరమేశ్వరుడు జగత్తంతా ఆవరించి ఉంటాడు. కాని జగత్తుతో అతనికి ఏ విధమైన సంబంధము లేదు. అతడు కనుపించడు. కాని చూస్తాడు. వినిపించడు కాని వింటాడు. తెలియబడడు. కాని అతనికి అన్నీ తెలుసు. అతడే పరమాత్ముడు.

అందుచేతనే పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు 'వివిక్తః' అనబడుతున్నాడు. అతడు ఏకాకి. అతనితో సమానమైన వారు కాని, అతనికన్న అధికులు కాని ఇంకొకరు లేరు.

## 264. శ్రుతి సాగరః

వేదములకు సముద్రము వంటివాడు.

**నదీనాం సాగర ఇవ స్వగుణోక్తి విధాజుషామ్ ।**
**శ్రుతీనా మవసానత్వాత్ కథ్యతే శ్రుతిసాగరః ॥**

నదులన్నీ సముద్రంలో కలుస్తాయి. **నదీనాం సాగరోగతే** అంటే నదులకు చివరి స్థానము లేదా ముగింపు స్థానము సముద్రము. అలాగే వేదవాక్యాలకు, మహావాక్యాలకు పర్యవసానమైన వాడు.

**శ్రుతీనాం సాగర ఇవశ్రుతి సాగరః**

నదులన్నింటికీ సముద్రంలాగా, శ్రుతులన్నింటికీ చివరిస్థానమైనవాడు.

**భగవద్గీత**లోని 15వ అధ్యాయం **'పురుషోత్తమ ప్రాప్తి యోగము'**లోని 15వ శ్లోకం

**సర్వస్య చాహం హృది సన్నివిష్టోమత్తస్స్మృతిః జ్ఞానమపోహనం చ ।**
**వేదైశ్చ సర్వైరహమేవ వేద్యో వేదాన్త కృద్వేదవిదేవ చాహమ్ ॥**

అర్జునా ! సమస్త ప్రాణుల హృదయముల యందు అంతర్యామిగా ఉన్నవాడను నేనే. నా నుండియే స్మృతి, జ్ఞానము, అపోహనము (సందేహములు తొలగటము) కలుగుతున్నాయి. వేదములద్వారా తెలుసుకోదగినవాడను నేనే. వేదాంతకర్తను, వేదజ్ఞుడను నేనే.

సర్వశక్తివంతుడైన పరమేశ్వరుడే వేదములన్నింటి ద్వారా తెలియదగినవాడు. అంటే వేదాలలో వివరించబడిన కర్మకాండ, ఉపాసనాకాండ, జ్ఞానకాండల అంతిమ లక్ష్యము ఆత్మసాక్షాత్కారము పొందటమే. వీటిద్వారా భగవంతుని స్వరూపాన్ని తెలుసుకున్నవారే వేదాలకు అర్థాన్ని సరియైన రీతిలో వివరించగలరు. అలా కాని వారు అనగా సంసారిక భోగములందు మునిగిపోయినవారు వేదాల అర్థాన్ని గ్రహించలేరు.

వేదాంతము అంటే – వేదముల యొక్క అంతము. వేదముల చివరి భాగము. వేదాలు నాలుగు భాగాలు

1. సంహితలు 2. బ్రాహ్మణాలు 3. అరణ్యకాలు 4. ఉపనిషత్తులు

వేదముల యొక్క సారాన్ని వివరించే ఉపనిషత్తులే వేదాంతము అనబడతాయి. ఇది జ్ఞానకాండ. దీనివల్ల తెలుసుకునేది ఆ పరమేశ్వర స్వరూపాన్నే.

వేదాలయొక్క సారాన్ని ఉపనిషత్తులు చెబుతాయి. ఈ ఉపనిషత్తుల సారాన్ని మహావాక్యాలలో చెప్పారు. ప్రతివేదంలోను ఒక మహావాక్యమున్నది. ఈ రకంగా నాలుగు వేదాలలోను నాలుగు మహావాక్యాలున్నాయి.

| | మహావాక్యాలు | ఉపనిషత్తు | వేదము |
|---|---|---|---|
| 1. | ప్రజ్ఞానం బ్రహ్మ | ఐతరేయోపనిషత్తు | ఋగ్వేదము |
| 2. | అహంబ్రహ్మాస్మి | బృహదారణ్యకోపనిషత్తు | శుక్లయజుర్వేదము |
| 3. | తత్త్వమసి | ఛాందోగ్యోపనిషత్తు | సామవేదము |
| 4. | అయమాత్మా బ్రహ్మ | మాండూక్యోపనిషత్తు | అధర్వణ వేదము |

వేదాలు చదివినంత మాత్రం చేత బ్రహ్మజ్ఞానం కలగదు. శ్రుతుల, స్మృతులు పరమేశ్వరుని స్థూలరూపాన్ని మాత్రమే తెలియచేస్తాయి. కాని పరమేశ్వరుని తత్త్వాన్ని తెలియచేయవు. ఆ తత్త్వము కేవలము జ్ఞానము వల్లనే తెలుస్తుంది. ఆ జ్ఞానము ఉపనిషత్తులను జీర్ణం చేసుకోవటం వల్ల వస్తుంది. పరమేశ్వరుడు జ్ఞానరూపుడు. అందుచేతనే వేదవిజ్ఞానానికి నిధివంటివాడు 'శ్రుతిసాగరుడు' అనబడతాడు.

పరమేశ్వర తత్త్వాన్ని వేదప్రమాణాలతో తెలుసుకోలేము. వేదవిజ్ఞానాన్ని పఠనం చేస్తూ 'నేతి' 'నేతి' ఇది కాదు ఇది కాదు అనుకుంటూ పోగాపోగా ఆ పరమేశ్వర తత్త్వం బోధపడుతుంది.

లలితా సహస్రంలో 290వ నామము **సకలాగమ సందోహ శక్తి సంపుట మౌక్తికా** ఇదే అర్థాన్ని వివరిస్తోంది.

## 265. సుభుజః

అందమైన బాహువులు కలవాడు.

**ప్రసన్నభరణే ధుర్య భుజోయ స్సుభుజస్తు సః**

భక్తులయొక్క భారము వహించదగిన అందమైన భుజములు గలవాడు.

**శోభనాః భుజాః యస్యసః సుభుజః**

ఆశ్రితుల భారాన్ని భరించగల భుజములు గలవాడు.

**జగద్రక్షకరా భుజాః అస్యసః**

జగద్రక్షణ చేయగల భుజములు గలవాడు. శ్రీ మహావిష్ణువు అమితబలశాలి. అతడే పరమాత్మ కాబట్టి అతన్ని మించిన బలశాలులు లేరు. అతని భుజములు తన భక్తులయొక్క శత్రువులను సంహరించి వారిని రక్షించటానికి వీలైనంత బలము గలవి.

సృష్టికి పూర్వం శ్రీమహావిష్ణువు పాలసముద్రంలో యోగనిద్రలో ఉన్నాడు. అతని నాభికమలము నుంచి పుట్టిన బ్రహ్మదేవుడు వేదపారాయణ చేస్తున్నాడు. ఆ సమయంలో విష్ణుమూర్తి చెవిలో నుంచి వచ్చిన మలిన పదార్ధము గుబిలి నుండి మధుకైటభులు ఉద్భవించారు. వారికి బ్రహ్మదేవుడు కనిపించాడు. అతనితో యుద్ధం చెయ్యాలి అనుకున్నారు. యుద్ధానికి రమ్మనిపిలిచారు. బ్రహ్మ వీరిని వినిపించుకోలేదు. మీది మీదికి వెళ్ళారు. తమతో యుద్ధం చెయ్యమని భయపెట్టసాగారు. బ్రహ్మదేవుడు తామరతూడు నుంచి క్రిందికి వచ్చి తన తండ్రిని లేపి జరిగినది వివరించాడు. బ్రహ్మకు అభయమిచ్చాడు విష్ణుమూర్తి. ఇంతలో అక్కడికి చేరుకున్నారు మధుకైటభులు బ్రహ్మను చూసి, అతనిమీదకు దుముకబోయారు. వాళ్ళని అడ్డుకున్నాడు శ్రీమహావిష్ణువు. తాను ఒక్కడే ఆ ఇద్దరు రాక్షసులతోనూ కొన్ని వేల సంవత్సరాలు యుద్ధం చేసి, చివరకు వారిని సంహరించాడు.

ఈ రకంగా తనను శరణు కోరినవారిని రక్షించగల అందమైన భుజములు గలవాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు 'సుభుజః' అనబడుతున్నాడు.

శ్రీకృష్ణుని బాల్యంలో గోపాలకులంతా ఇంద్రుని ప్రీతికై యాగము చేయబోయారు. వారిని యాగము చేయవద్దని వాదించాడు శ్రీకృష్ణుడు. దాంతో కోపము వచ్చిన ఇంద్రుడు వడగళ్ళ వాన కురిపించాడు. గోపాలకులంతా కృష్ణుని శరణువేడారు.

అప్పుడు శ్రీకృష్ణ పరమాత్ముడు గోవర్ధనోద్ధరణము చేసి గోవులను, గోపాలకులను కాపాడాడు. ఈ రకంగా ఆశ్రితులను రక్షించగల అందమైన బాహువులు గలవాడు కావటంచేత శ్రీమన్నారాయణుడు 'సుభుజః' అనబడుతున్నాడు.

## 266. దుర్ధరః

ధరింపజాలనివాడు. 715వ నామము ఇదే

**పరైర్దుర్వార వేగో యః దుర్ధరస్స చ కథ్యతే ॥** ఇతరులచేత ఆపబడజాలని వేగము గలవాడు.

**ధర్తుం అశక్యః దుర్ధరః** ప్రళయ కాలంలో సముద్రం పొంగిపోతుంది. అప్పుడు దాని వేగాన్ని ఇసుక తిన్నెలు ఆపలేవు. అదే విధంగా అతని భుజములయొక్క వేగాన్ని (పరాక్రమాన్ని) ఇతరులు ఆపలేరు. అడ్డగించలేరు. అంతటి పరాక్రమవంతుడు

## 267. వాగ్మీ

వాక్కుగలవాడు.

**వేదలక్షణ వక్తృత్వాత్ వాగ్మీ ప్రియహితో క్తితః**

పరమేశ్వరుడు వేదరూపము, జయశీలము, మధురము, గంభీరము, హితము, ప్రియము అయిన వాక్కుగలవాడు కాబట్టి "వాగ్మీ" అనబడుతున్నాడు.

**వాక్ అస్యాస్తీతి వాగ్మీ** కొనియాడదగిన వాక్కు గలవాడు.

పరమేశ్వరుడు మధురమైన వాక్కు గలవాడు.

**లలితాసహస్రంలో నిజసల్లాపమాధుర్య వినిర్భర్సిత కచ్ఛపీ**

అని చెప్పబడింది. 'కచ్ఛపి' అనేది సరస్వతీదేవి వీణ పేరు. సరస్వతీ దేవి పరమేశ్వరి దగ్గర కూర్చుని ఆమె భర్త అయిన పరమేశ్వరుని వీర గాథలను తన వీణమీద గానం చేస్తున్నది. ఆ వీణానాదానికి ముగ్ధురాలైన పరమేశ్వరి, సరస్వతీదేవిని మెచ్చుకోలుగా 'బాగు' 'బాగు' అన్నది. పరమేశ్వరి నోటినుంచి వచ్చిన ఆ పలుకులు, సరస్వతీదేవి వీణానాదంకన్న కూడా చాలా మధురంగా ఉన్నాయి. దానికి సిగ్గు చెందిన సరస్వతీ దేవి తనవీణను దివిసెన గుడ్డతో కనిపించకుండా కప్పివేసింది.

అంటే ఆ వీణానాదం కన్న కూడా పరమేశ్వరి పలుకులే మధురంగా ఉన్నాయి. ఈ రకంగా మధురమైన పలుకులు గలవాడు పరమేశ్వరుడు. అందుచేతనే 'వాగ్మీ' అనబడుతున్నాడు.

**వాగ్వి వృత్తాశ్చవేదాః** అతని వాక్కు నుంచి వచ్చినవన్నీ వేదాలే.

వేదరూపమయిన వాక్కు విశ్వరూప సమయంలో ఇతని నుండి వెలువడింది.

## 268. మహేంద్రః

పూజింపతగిన ఐశ్వర్యము గలవాడు.

**పరమైశ్వర్య వత్త్వేన మహేన్ద్ర ఇతిశబ్ద్యతే**

పరమైశ్వర్య సంపన్నుడు కావటంచేత మహేంద్రుడు అనబడుతున్నాడు.

**మహాంశ్చాసౌ ఇంద్రశ్చ మహేంద్రః** అతని ఐశ్వర్యము జగత్తంతా వ్యాపించి ఉంటుంది. ఆ రకంగా కొనియాడబడిన ఐశ్వర్యము గలవాడు.

ఇతడు గొప్పవాడైన ఇంద్రుడు. ఇంద్రులకు ఇంద్రుడు. ఈశ్వరులకు ఈశ్వరుడు.

ఇంద్రుడు తూర్పుదిక్కుకు అధిపతి. దేవలోకానికి రాజు కూడా. ఇంద్రుడు అనేది ఒకని పేరు కాదు. అది ఒక పదవి. ఆ పదవిలో ఉన్న ప్రతివాడు ఇంద్రుడే. ఆ పదవి ప్రతిమన్వంతరానికి మారుతూ ఉంటుంది. భూలోకంలో నూరు అశ్వమేధయాగాలు చేసిన ప్రతివాడూ ఇంద్ర పదవికి అర్హుడే.

| | | |
|---|---|---|
| ఉత్తమ మన్వంతరములో | – | సుశాంతుడు |
| రైవతమన్వంతరములో | – | విభుడు |
| చాక్షుష మన్వంతరములో | – | మనోజవుడు |
| సావర్ణి మన్వంతరములో | – | బలిచక్రవర్తి |

ఇంద్రపదవిని అలంకరిస్తారు. ఇక్ష్వాకు వంశస్థుడైన నహుషుడు నూరు అశ్వమేధాలు చేసి ఇంద్రపదవిని అలంకరించాడు. కాని అనతికాలంలోనే దాన్ని పోగొట్టుకుని శాపగ్రస్తుడైనాడు.

పరమేశ్వరుడు దేవరాజైన ఇంద్రునికి కూడా ప్రభువు. అందుచేతనే ఇంద్రులకు ఇంద్రుడు. మహేంద్రుడు అనబడుతున్నాడు.

## 269. వసుదః

ధనమునిచ్చువాడు.

**వసుదో ధనదావాచ్చ ధనాయద్భ్యోవిశేషతః**

ధనమును కోరే ఇంద్రుడు, కుబేరుడు వంటి వారికి ధనాన్నిచ్చేవాడు.

**వసుద దాతీతి వసుదః**

పరమేశ్వరుడు మహదైశ్వర్య సంపన్నుడు అయికూడా ధనమువంటి అల్ప పురుషార్థాలను కోరేవారికి దానినే ఇస్తుంటాడు. అందుచేతనే 'వసుదః' అనబడుతున్నాడు.

దేవేంద్రుడు ముల్లోకాలకు ఆధిపత్యాన్ని కుబేరుడు ధనాన్ని అడిగారు.

దేవదానవులకు చాలా కాలంగా యుద్ధం జరుగుతూనే ఉన్నది. ఆ యుద్ధంలో దానవులదే విజయం. దేవతలు యుద్ధంలో ఓడిపోయి అరణ్యాలకు పారిపోయి ప్రాణాలు కాపాడుకుంటారు. ఆ తరువాత పరమేశ్వరుడైన శ్రీమహావిష్ణువును శరణువేడి, తమకష్టాలు తీర్చమని వేడుకుంటారు. అప్పుడు శ్రీమహావిష్ణువు ఏదో ఒక ఉపాయంతో రాక్షసులను

సంహరించి దేవతల సౌభాగ్యాన్ని వారికిప్పిస్తాడు. ఈ రకంగా ధనాన్ని, రాజ్యాన్ని, భోగభాగ్యాలను ఇస్తున్నాడు కాబట్టే శ్రీమన్నారాయణుడు 'వసుదః' అనబడుతున్నాడు.

## 270. వసుః

ధనముగా ఉండేవాడు. 104, 696 నామాలు కూడా ఇదే.

**సర్వస్య హరిరూపత్వాత్ ధనం యస్మా ద్యనుస్తతః** మహాత్ములైన వారికి సర్వమూ ఆ దేవదేవుడే కాబట్టి వారికి ధనం కూడా తానే అవుతాడు.

**వాసుదేవ స్సర్వమితి స మహాత్మా సు దుర్లభః**

సకలము వాసుదేవుడే అని భావించే మహాత్ములకు తానే ధనముగ ఉండేవాడు.

269వ నామంలో పరమేశ్వరుడు ధనము, రాజ్యము ఇస్తాడు అని చెప్పాం. ఇప్పుడు ఆ ధనము, రాజ్యము కూడా పరమేశ్వరుడే.

వసుః అంటే వాయువు. ఇతడు

అంతరిక్ష మందు ఉంటాడు. అంతరిక్షమందు చరిస్తుంటాడు కాబట్టే మాతరిశ్వుడు అనబడతాడు. వాయువు కూడా పరమేశ్వరుని రూపమే. ఈ విషయం **ఛాందోగ్యోపనిషత్తు**లో వివరించబడింది. దీన్ని గతంలో చెప్పాం. ఒక బ్రహ్మచారి తనకు బిక్షపెట్టము అన్న పండితులతో వాదనకు దిగి, వారు ఆరాధించే పరమేశ్వరుడైన వాయువే వారిలోనూ, తనలో, జగత్తంతా వ్యాపించి ఉన్నాడు అని వారికి తెలియచేస్తాడు.

ఈ రకంగా వాయురూపుడైన పరమేశ్వరుడు కాబట్టి 'వసుః' అనబడుతున్నాడు.

నస అనగా ఆచ్ఛాదన. తన స్వరూపం ఇతరులకు కనిపించకుండా మాయతో కప్పి ఉంచేవాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు 'వసుః' అనబడుతున్నాడు.

అంటూ పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుని మహిమలను వివరించాడు రత్నాకరుడు.

# 23. విశ్వరూపము

"గురువుగారూ ! జగత్తంతా ఆవరించి ఉండేది విశ్వరూపం కదా ! మరి ఆ విశ్వరూపాన్ని ఇక్కడ ఏ రకంగా వివరించారో చెప్పండి" అన్నాడు కృష్ణశర్మ చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు. విశ్వరూపాన్ని గురించి చెప్పబోయే ముందు సృష్టి ఏరకంగా జరిగిందో ముందు చూద్దాం. సృష్టి క్రమంలో ముందుగా ఆవిర్భవించింది తపస్సు. ఆ తరువాత మహత్సృష్టి జరిగింది. ఆ తరువాతనే అహంకారము వచ్చింది. దాని నుండి పంచతన్మాత్రలు వచ్చినాయి. అవే శబ్దస్పర్శరూప రసగంధాలు.

ఇవి సూక్ష్మరూపంలో ఉంటాయి. వీటిలో ఐదు జ్ఞానశక్తులు, ఐదుక్రియాశక్తులు ఉన్నాయి. వీటిలో ఉన్న జ్ఞానశక్తులు జ్ఞానేంద్రియాలను ఏర్పరుస్తున్నాయి. అవి

| | | |
|---|---|---|
| శబ్దము | – | చెవి |
| స్పర్శ | – | చర్మము |
| రూపము | – | కన్ను |
| రసము | – | నాలుక |
| గంధము | – | నాసిక |

సమిష్టిగా అంతఃకరణ ఏర్పడుతున్నది. ఆ తరువాత క్రియాశక్తులవల్ల కర్మేంద్రియాలు ఆవిర్భవిస్తున్నాయి. ఇవి సమిష్టిగా ప్రాణాలను పుట్టిస్తున్నాయి. తన్మాత్రలు పంచభూతాలను సృష్టిస్తున్నాయి. ఇప్పుడు పంచభూతాలు, తన్మాత్రలు, కారణ ఉపాధులతో కూడిన చైతన్యము క్రమంగా విశ్వతైజసప్రాజ్ఞ అనబడుతున్నది. వాటితో కూడిన సమిష్టితత్వము వైశ్వానర, హిరణ్యగర్భ ఈశ్వరులవుతున్నారు. అంతఃకరణకు కారణమైన పరమాత్మే హిరణ్యగర్భుడు. ప్రాణాకారంతో కూడినవాడు సూత్రాత్మ. వేరుగాని, విడిపోనటువంటి ఈ రెండు కారణాలను అనుసరించి కూడినటువంటివాడు అంతరాత్మ అని చెప్పబడుతున్నాడు. ఇప్పుడు ఈ మూడు అంటే 1. పరమాత్మ 2. సూత్రాత్మ 3. అంతరాత్మలే బ్రహ్మ విష్ణు రుద్రులు. వ్యష్టిగా విశ్వతైజసప్రాజ్ఞులకు, సమిష్టిగా వైశ్వానర, హిరణ్యగర్భ సూత్రాత్మలకు భేదము ఉపనిషత్తులననుసరించి చెప్పబడింది. ఉపనిషణ్మతములో జీవాత్మ, పరమాత్మలకు ప్రత్యేకంగా ఐదువిభాగాలు ఏర్పడుతున్నాయి. అవి సృష్టి స్థితి లయ జీవాత్మ పరమాత్మలు. కొంతమంది ఈ జగత్తుకు మూడే కారణాలు అంటారు. అవే సృష్టి స్థితి లయాలు. వీరిద్దరికీ తేడాలేదు. ఎందుచేతనంటే స్థూలకారణాలు మూడు. కాగా సూక్ష్మకారణాలు ఐదు. వీటన్నింటినీ **మాండూక్యోపనిషత్తు**లో వివరించారు.

**సర్వంహ్యేతద్ బ్రహ్మ, అయమాత్మా బ్రహ్మ, సోఽయమాత్మా చతుష్పాత్**

ఈ చరాచరజగత్తంతా బ్రహ్మమయమే. ఆత్మ కూడా పరబ్రహ్మయే. ఆత్మకు నాలుగుపాదాలున్నాయి.

**జాగరితస్థానో బహిః ప్రజ్ఞః సప్తాంగ ఏకోనవింశతి**
**ముఖః స్థూలభుగ్ వైశ్వానరః ప్రథమపాదః**

విశ్వములోని జీవులన్నింటి స్వరూపము అయినవాడు వైశ్వానరుడు. జాగ్రదవస్థ ఇతని సంచారస్థానం. అలాగే రెండవవాడు తైజసుడు. స్వప్నమే ఇతని సంచారస్థానం. మూడవవాడు ప్రాజ్ఞుడు. సుషుప్తి అవస్థ ఇతని సంచారస్థానము. ఈ రకంగా ఉపనిషత్తు చెబుతుంది.

సుషుప్తిలో ప్రాజ్ఞుడికి బ్రహ్మభావం కలుగుతుంది. **ఛాందోగ్యోపనిషత్తు**లో ఉద్దాలకుడు తన కుమారుడైన శ్వేతకేతువుకు సుషుప్తిని గురించి వివరిస్తాడు. కుమారా ! గాఢనిద్రలో ఉన్నప్పుడు అతడు సుషుప్తిలో ఉన్నాడు అంటారు. ఆ స్థితిలో జీవుడు పరమసత్తను పొందుతాడు. అంటే తన నిజస్వరూపాన్ని పొందుతాడు. తన ఆత్మను తాను పొందుతాడు. కాబట్టి అతన్ని గురించి చెప్పేటప్పుడు అతను నిద్రిస్తున్నాడు అంటారు.

అద్దంలో చూసినప్పుడు మన ప్రతిబింబం మనకు కనిపిస్తుంది. కాని అద్దం తియ్యగానే అది మాయమైపోతుంది. మన నిజరూపం మాత్రమే మిగులుతుంది. అదేవిధంగా సుషుప్తావస్థలో మనస్సు ఇంద్రియాలు పనిచెయ్యటం మానేస్తాయి. అప్పుడు మిగిలేది ఆత్మ మాత్రమే. ఆ ఆత్మ నిజరూపంలో మిగులుతుంది. ప్రతిబింబంలాంటి జీవభావంపోయి ఆత్మభావం మిగులుతుంది. ఆ స్థితిలో ఆత్మను 'స్వపితి' అంటారు. తన ఆత్మ తనలోనే ఉన్నాడని, నిద్రిస్తున్నాడని అంటారు. ఇంద్రియాలన్నీ అలసట చెంది ఒక్కొక్కటి మనసులో లీనమైపోతాయి. మనసు ప్రాణంలో లీనమైపోతుంది. అంటే సుషుప్తావస్థలో ప్రాణం ఒక్కటే మేల్కొని ఉంటుంది. ఆ ప్రాణమే ఇంద్రియాల యొక్క, మనసు యొక్క అలసటను తీరుస్తుంది. మనసుకు బందనస్థానమైన ప్రాణమే పరదేవత.

**బృహదారణ్యకోపనిషత్తు**లో అజాతశత్రువు అనే రాజు బాలాకి అనే బ్రాహ్మణబాలుడికి సుషుప్తి గురించి వివరిస్తాడు.

సుషుప్తిలో జీవికి బ్రహ్మభావం కలుగుతుంది. అప్పుడు అతణ్ణి ప్రాజ్ఞుడు అంటారు. కాని జీవుడు అవిద్యతో కలిసి ఉంటాడు. అందుచేత అతడు పరమాత్మకాడు. అందుకని సుషుప్తి పొందిన జీవుణ్ణి కారణశరీరమని, తురీయావస్థ పొందిన జీవుణ్ణి మహాకారణ

శరీరము అని అంటారు. తురీయావస్థ పైన ఉండేది తురీయాతీతము. ఇది ఐవద అవస్థ. ఈ స్థితిలో జీవి శివతుల్యుడు అవుతాడు. **ముండకోపనిషత్తు**లో 'నిరంజనుడు అంతకన్న పరమసామ్యము పొందుతాడు' అని చెబుతోంది. పరమసామ్యము అంటే – ఐక్యము. ఈ స్థితిలో పూర్ణజీవత్వము పూర్ణశివత్వాలు వేరుగా లేవు.

ఐదు విధాలయిన జీవోపాధులు పంచకోశాలుగా వ్యవహరించబడుతున్నాయి. పరమాత్మకు తిరోధానము అనుగ్రహము అనబడే బంధమోక్షాలు ఉపాధులు కావటంచేత బహిరున్మేషుడు (ప్రత్యక్షము అయ్యేవాడు – శివుడు) అవుతున్నాడు. సదాశివుడు నిమేషాంతుడు. అంటే – కొంత ప్రత్యక్షము, కొంత అప్రత్యక్షము. కాబట్టి తిరోధాన అనుగ్రహముల స్థితులు రుద్రుని కన్న వేరైనవి.

విశ్వ అంటే – జాగరిదావస్థ. స్థూలరూపం గల చైతన్యము గల జీవులు. ఆ జీవుల సమష్టిరూపమే వైశ్వానరుడు.

పరమేశ్వరి ధర్మాధర్మవర్జితా అని చెప్పబడింది. కాబట్టి జగత్తుకు, పరమేశ్వరునికి భేదం లేదు. అందుచేత పరమేశ్వరుని రూపము విశ్వరూపము అవుతున్నది. ఈ విశ్వానికి ఆధారము అతడే. అందుచేత దర్మీభూతమైన ఇంకొక శరీరము అతడికి లేదు.

విష్ణుపురాణంలో "అరటిచెట్టు ఆకులకన్న వేరుగా కనిపించినట్లుగానే, ఓ పరమేశ్వరీ! ఈ విశ్వమంతా నీ యందే ఉన్నది. విశ్వము నీకన్నవేరైనదికాదు" అని చెప్పబడింది. **దేవీభాగవతం**లో ఆ పరమేశ్వరి శ్రీ మహావిష్ణువుతో "ఈ సమస్తము నేనే. నాకన్న సనాతనమైనది వేరేలేదు" అంటుంది.

విశ్వరూపము అని గ్రహించిన బ్రహ్మ యొక్క జీవభావము మిక్కిలి నీచరూపము. అటువంటి నీచ రూపము ఎవరి మహిమవల్ల నాశనమవుతుందో ఆమె విశ్వరూప. ఆమె అనుగ్రహము వలననే నీచమైన సేవ వంటి అనుగ్రహము లభించును.

**దేవీభాగవతం**లోని సప్తమస్కంధంలోని 31వ అధ్యాయంలో తారకాసురుని బాధలు పడలేక దేవతలంతా ఆ పరమేశ్వరిని ప్రార్థిస్తారు. అప్పుడు ఆమె వారికి సాక్షాత్కరించింది. హిమవంతుడు. "తల్లీ ! నీ విశ్వరూపం చూడాలని కోరికగా ఉన్నది. దేవతలంతా కూడా ఇదే కోరుతున్నారు. ఒకసారి మాకు చూపవలసినది. అని అడుగుతాడు. అప్పుడు ఆ పరమేశ్వరి తన విరాడ్రూపం వారికి చూపింది.

**ద్యౌ ర్మస్తకం భవేద్యస్య చంద్రసూర్యౌ చ చక్షుషీ ॥**

**దిశః శ్రోత్రే వచో వేదాః ప్రాణోవాయుః ప్రకీర్తితః ।**

**విశ్వం హృదయమిత్యాహుః పృథివీజఘనం స్మృతమ్ ॥**

నభస్తలం నాభసరో జ్యోతిశ్చక్రమురః స్థలమ్ ।
మహర్లోకస్తు గ్రీవా స్యా జ్జనోలోకో ముఖంస్మృతమ్ ॥

తపోలోకో లలాట స్తు సత్యలోకాదధః స్థితః ।
ఇంద్రాదయో బాహవః స్యు శబ్దః శ్రోత్రం మహేశితుః ॥

నాసత్య దస్రౌ నాసేస్తో గంధోఘ్రాణం స్మృతోబుధైః ।
ముఖమగ్నిః సమాఖ్యాతో దివారాత్రీ చ పక్ష్మణీ ॥

బ్రహ్మస్థానం భ్రూవిజృంభో ऽ ప్యాపస్తాలుః ప్రకీర్తితా ।
రసోజిహ్వాసమాఖ్యాతా యమోదంష్ట్రాః ప్రకీర్తితాః ॥

దంతాః స్నేహకలా యస్య హాసోమాయా ప్రకీర్తితా ।
సర్గస్త్వపాంగమోక్షః స్యాద్రీబోర్ధ్వోష్ఠో మహేశితుః ॥

లోభః స్యాదధరోష్ఠో ऽ స్యా ధర్మమార్గ స్తు పృష్ఠభూః ।
ప్రజాపతి శ్చ మేఢ్రం స్యాదః స్రష్టా జగతీతలే ॥

కుక్షిః సముద్రా గిరయో ऽ స్థీని దేవ్యా మహేశితుః ।
సద్యోనాద్యః సమాఖ్యాతా వృక్షాః కేశాః ప్రకీర్తితాః ॥

కౌమారయౌవజనరా వయో ऽ స్య గతిరుత్తమా ।
బలాహకాస్తు కేశాః స్యుః సంధ్యే తే వాససీ విభోః ॥

రాజన్ శ్రీజగదంబాయాశ్చంద్రమాస్తు మనః స్మృతః ।
విజ్ఞాన శక్తి స్తు హరీ రుద్రో ऽ ంతఃకరణం స్మృతమ్ ॥

అశ్వాహి జాతయః సర్వాః శ్రోణిదేశే స్థితా విభోః ।
అతలాదిమహాలోకాః కట్యధోభాగతాం గతాః ॥

అంటూ దేవి విశ్వరూపాన్ని వర్ణిస్తారు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| సత్యలోకం | – | శిరస్సు | సూర్యచంద్రులు | – | కనులు |
| దిక్కులు | – | చెవులు | వేదాలు | – | వాక్కు |
| వాయువు | – | ప్రాణం | ప్రపంచం | – | హృదయం |
| భూమి | – | కటి | ఆకాశం | – | నాభి |
| నక్షత్రగణం | – | రొమ్ము | మహర్లోకం | – | కంఠం |
| జనలోకం | – | ముఖం | తపోలోకం | – | నుదురు |

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఇంద్రాదులు | – | బాహువులు | ఆశ్వినులు | – | నాసికారంధ్రాలు |
| గంధం | – | నాసిక | రాత్రిపగలు | – | కనురెప్పలు |
| బ్రహ్మస్థానం | – | కనుబొమ్మలు | జలం | – | దవడలు |
| రసం | – | నాలుక | యముడు | – | దంష్ట్రలు |
| స్నేహం | – | దంతాలు | నవ్వు | – | మాయ |
| కడగంటి చూపు | – | సృష్టి | లజ్జ | – | పైపెదవి |
| లోభము | – | క్రిందపెదవి | సముద్రాలు | – | కడుపు |
| ధర్మము | – | వీపు | కొండలు | – | ఎముకలు |
| నదులు | – | నాడులు | చెట్లు | – | కేశాలు |
| చంద్రుడు | – | మనస్సు | రుద్రుడు | – | అంతఃకరణ |
| మేఘాలు | – | రోమాలు | విజ్ఞానశక్తి | – | విష్ణువు |

అనేక బాహువులు, వేలతలలు, నానారకాల ఆయుధాలు ధరించి కోట్లకొలది సూర్యులకాంతితో ప్రకాశిస్తున్నది ఆ పరమేశ్వరి.

శ్రీమద్భాగవతంలోకూడా శ్రీ మహావిష్ణువును ఈ రకంగానే వర్ణించటం జరిగింది.

**బ్రహ్మోవాచ :**

**వాచాం వహ్నేర్ముఖం క్షేత్రం ఛందసాం సప్తధాతవః ।**
**హవ్యకవ్యామృతాన్నానాంజిహ్వా సర్వరసస్య చ ॥**

**సర్వాసూనాంచ వాయోశ్చ తన్నాసే పరమాయనే ।**
**అశ్వినోరోషధీనాం చ ఘ్రాణోమోద ప్రమోదయోః ॥**

**రూపాణాం తేజసాం చక్షుర్దివః సూర్యస్య చాక్షిణీ ।**
**కర్ణౌదిశాంచతీర్థానాం శ్రోత్రమాకాశ శబ్దయోః ।**
**తద్గాత్రం వస్తు సారాణాం సౌభగ్యస్య చ భాజనం ॥**

**త్వగస్య స్పర్శవాయోశ్చ సర్వమేధస్య చైవ హి ।**
**రోమాణ్యు ద్భి జ్జజాతీనాం యైర్వాయజ్ఞస్తు సంభృతః ॥**

**కేశ శ్మశ్రు నఖాన్యస్య శిలా లోహాభ్రవిద్యుతామ్ ।**
**బాహవో లోకపాలానాం ప్రాయశః క్షేమకర్మణాం ॥**

**విక్రమో భూర్భువః స్వశ్చక్షేమస్య శరణస్య చ ।**
**సర్వకామ వరస్యాపి హరేశ్చరణ ఆస్పదమ్ ॥**

అపాం వీర్యస్య సర్గస్య పర్జన్యస్య ప్రజాపతేః ।
పుంసః శిశ్న ఉపస్థస్తు ప్రజాత్యానంద నిర్వృతేః ॥

పాయుర్యమస్య మిత్రస్య పరిమోక్షస్య నారద ।
హింసాయా నిర్రుతేర్మృత్యోర్నిరయస్య గుదః స్మృతః ॥

పరాభూతేరధర్మస్య తమసశ్చాపి పశ్చిమః ।
నాడ్యోనదనదీనాం తు గోత్రాణామాస్థి సంహతిః ॥

అవ్యక్త రస సింధూనాం భూతానాం నిధనస్యచ ।
ఉదరం విదితం పుంసో హృదయం మనసః పదమ్ ॥

ధర్మస్య మమ తుభ్యం చ కుమారాణాం భవస్యచ ।
విజ్ఞానస్యచ  సత్త్వస్య పరస్యాత్మా పరాయణమ్ ॥

అహం భవాన్ భవశ్చైవ త  ఇమే మునయోఽగ్రజాః ।
సురాసురనరా నాగాః ఖగా మృగ సరీసృపాః ॥

గంధర్వాప్సరసో యక్షా రక్షోభూతగణోరగాః ।
పశవః పితరః సిద్ధా విద్యాధ్రా శ్చారణా ద్రుమాః ॥

అన్యేచ వివిధా జీవా జలస్థలనభౌకసః ।
గ్రహరకేతవస్తారా స్తడితః స్తనయిత్నవః ॥

సర్వం పురుష ఏ వేదం భూతం భవ్యం భవశ్చయత్ ।
తేవేదమావృతం విశ్వం వితస్తిమధి తిష్ఠతి ॥

స్వధిష్ణ్యం ప్రతపన్ ప్రాణో బహిశ్చ ప్రతపత్యసౌ ।
ఏవం విరాజం ప్రతపంస్తపత్యన్తర్బహిః పుమాన్ ॥

సోఽమృ తస్యాభ యస్యే శో మర్త్యమన్నం యదత్యగాత్ ।
మహిమైష తతోబ్రహ్మన్ పురుషస్య దురత్యయః ॥

పాదేషు సర్వభూతాని పుంసః స్థితిపదోవిదుః ।
అమృతం క్షేమమభయం త్రిమూర్ధ్నోఽధాయి మూర్ధసు ॥

పాదాస్త్రయో బహిశ్చాసన్న ప్రజానాం య ఆశ్రమాః ।
అంతస్త్రిలోక్యాస్త్వపరో గృహమేధోవ ఉబృహద్వ్రతః ॥

సృతీ విచక్రమే విష్వజ సాశనానశనే ఉభౌ ।
యదవిద్యా చ విద్యాచ పురుష స్తూభయాశ్రయః ॥

యస్మాదండం విరాడ్ జజ్ఞే భూతేంద్రియ గుణాత్మకః ।
తద్ ద్రవ్యమత్యగాద్ విశ్వం గోభిః సూర్యయివాతపన్ ॥

బ్రహ్మదేవుడు నారదుడికి శ్రీ మహావిష్ణువు యొక్క విశ్వరూపాన్ని వివరిస్తూ

ఊర్ధ్వలోకాలు - కటి ప్రదేశము నుండి ఊర్ధ్వదేహము
అథోలోకాలు - అథోదేహము
భూలోకము - కటిప్రదేశము
భువర్లోకము - నాభి
సువర్లోకము - హృదయము
మహర్లోకము - వక్షము
జనలోకము - మెడ
తపోలోకము - స్తనద్వయము
సత్యలోకము - శిరస్సు
అతలము - జఘనము (పిరుదులు)
వితలము - తొడలు
సుతలము - జానువులు (మోకాళ్ళు)
తలాతలము - జంఘలు (పిక్కలు)
మహాతలము - గుల్ఫములు (చీలమండలు)
రసాతలము - పాదాగ్రము
పాతాళము - పాదాలు
ముఖము - వాక్కు, అగ్ని
రోమాలు - ఉష్టిక్ ఛందస్సు
చర్మము - ధాత్రీ ఛందస్సు
మాంసము - త్రిష్టప్ ఛందస్సు
స్నాయువులు (నరాలు) - అనుష్టప్ ఛందస్సు
అస్థి - జగతీఛందస్సు
మజ్జ - పంక్తి ఛందస్సు
ప్రాణము - బృహతీ ఛందస్సు
రసము - నాలుక
వాయువు - శ్వాస
సూర్యుడు - కనులు
దిశలు - చెవులు
స్పర్శ - దేహము
చెట్లు, చేమలు - రోమాలు
పర్వతాలు - గోళ్ళు
మేఘములు - కేశములు
మెరుపులు - శ్మశ్రువులు (గడ్డము, మీసము)
జలం - తాలు భాగం
రాత్రింబవళ్ళు - కనురెప్పలు
స్నేహకల - పలువరుస
మహామాయ - చిరునవ్వు
సముద్రం - కుక్షి
నదులు - నాడీ సమూహము
కాలం - గమనం
సంధ్య - వస్త్రం
అవ్యక్తం - హృదయం
రుద్రుడు - అహంకారం
మనుష్యులు - విరాట్స్వరూపుని నివాసము
దేవగణాలు - షడ్జమాది స్వరాలు

అంతే కాదు నారదా

నీలకంధరునకు, నీకు నాకు సనత్కు
మారముఖ్య సుతసమాజమునకు
ధర్మసత్వబుద్ధి తత్త్వములకు నీశ్వ
రాత్మవినుము పరమమైన నెలవు ॥

నరసురాసుర పితృనాగకుంజర మృగ, గంధర్వ యక్షరాక్షస మహీజ
సిద్ధ విద్యాధర జీమూతచారణ గ్రహ తారకాప్సరోగణ విహంగ
భూతతటిద్వసు పుంజంబులును, నీవు ముక్కంటియును, మహామునులు, నేను
సలిలనభస్థ్సలచరములు మొదలైన వివిధ జీవులతోడి విశ్వమెల్ల
విష్ణుమూర్తిమయము పుత్ర । వేయేల, బ్రహ్మాండ
మతని జేనలోన నడగియుండు
బుద్ధినెరుగరాదు; భూతభవద్భవ్య
లోకమెల్ల విష్ణులోన నుండు ॥

మండలములోన భాస్కరుఁ
డుండి జంగబులకు దీప్తి నొసఁగెడి క్రియ బ్ర
హ్మాండములోపల నచ్యుతుఁ
డుండుచు బహిరంతరముల నొగి వెలిఁగించున్

విష్ణుధర్మోత్తరపురాణంలో నారదుడు చూసిన విశ్వరూపము.

**మార్కండేయ ఉవాచ :**

స దదర్శ తదా విష్ణుం విశ్వరూపధరం హరిమ్ ।
యుక్తం వర్ణైః శుకప్రఖ్యైః పీతరక్తసితాసితైః ॥
క్వచిన్మేచకసంయుక్తైః క్వచిన్మేచకరంజితైః ।
క్వచిచ్ఛశాంకసంకాశం క్వచిద్ధింగులసన్నిభమ్ ॥
క్వచిన్మరకతప్రఖ్యం పద్మరాగనిభం క్వచిత్ ।
క్వచిత్కనకసంకాశం క్వచిన్నీలోత్పలప్రభమ్ ॥

క్వచిత్పాటలపుష్పాభం క్వచిద్గగనసన్నిభమ్ ।
కుంకుమక్షోదసంకాశం హరిద్రాక్షోద సన్నిభమ్ ॥

క్వచిద్రజోపలప్రఖ్యమింద్రనీలనిభం క్వచిత్ ।
అనిర్దేశ్యాని వర్ణాని తథా బిభ్రత్క్వచిత్క్వచిత్ ॥

నానావిధానాం సత్వానాం వదనాని బహూని చ ।
బ్రహ్మశంకరశక్రాణాం మయస్య వరుణస్య చ ॥

ధనదస్య హుతాశస్య వాయోర్నిర్ృతినస్తథా ।
గ్రహాణామథ ఋక్షాణాం రుద్రాణాం వసుభిః సహ ॥

ఆదిత్యానాం సమరుతాం భృగూణాం చ తథా ద్విజ ।
తథైవాంగిరసో రాజన్సాధ్యానామశ్విభిః సహ ॥

దైత్యానామథ నాగానాం గంధర్వోరగరక్షసామ్ ।
పితృపన్నగయక్షాణాం తథా చ పిశితాశినామ్ ॥

మనుష్యహయనాగానాం గజాశ్వమృగపక్షిణామ్ ।
ద్వీపశార్దూలసింహానాం సర్వేషాం ప్రాణినామథ ॥

కానిచిత్తస్య సౌమ్యాని కానిచిద్భీషణాని చ ।
దదర్శ తస్య వక్త్రాణి శతశోఽథ సహస్రశః ॥

వక్త్రేషు తస్య రౌద్రస్య ప్రాణిసంఘాన్యనేకశః ।
దదర్శ సర్వతశ్చాగ్నిన్గ్రస్యమానాంశ్చ విష్ణునా ॥

సౌమ్యేభ్యస్తస్య వక్త్రేభ్యో నిర్గచ్ఛంత్య స్తథా ప్రజాః ।
వాహాంశ్చ వివిధాం స్తస్య స దదర్శాథ నారదః ॥

హస్తాంశ్చ వివిధాకారాన్న నాముద్రాసమన్వితాన్ ।
యుక్తాన్నానావిధైర్భాండై రాయుధైశ్చ సహస్రశః ॥

స్రుక్స్రువావేదిచమసకుశకృష్ణాజినాగ్నిభిః ।
కేచిచ్చ కలశం ఘంటాం శంఖం పద్మోత్పలాదిభిః ॥

కేచిత్ఖడ్గగదాచక్రచర్మశూలపరశ్వథైః ।
కేచిత్పాశమహాదండకృపాణశరకార్ముకైః ॥

కేచిద్భుశుండీలగుడశక్తివజ్రాశ్మపట్టిశైః ।
బీజపూర్ణాక్షమాలాశ్చ పూర్ణపాత్రై స్తథా పరైః ॥

ఏవం నానావిధైర్భాండైః కరాం స్తస్య సమన్వితాన్ ।
అసంఖ్యేయాన్మహాతేజా దదర్శ మునిసత్తమః ॥

నృత్తశాస్త్రవినిర్దిష్టో నృత్తకర్మణి చాప్యథ ।
శిరాంసి దృష్టయో హస్తాం స్తస్య దేవస్య దృష్టవాన్ ॥

త్రైలోక్యం చ తథా కాయే సకలం మునిసత్తమః ।
దేవదానవగంధర్వసయక్షోరగరక్షసామ్ ॥

ద్వీపాంభోనిధిలోకైశ్చ పాతాలైశ్చైవ సంయుతమ్ ।
జగత్సమగ్రం దేవస్య దేహస్థం దృష్ట వాన్మునిః ॥

స దృష్ట్వా పరమం రూపం భీతో హృష్టశ్చ విస్మితః ।
పపాత పాదయో స్తస్య శిరసా సాశ్రులోచనః ॥

మార్కండేయుడు వజ్రునకు చెబుతున్నాడు. ఆ నారదుడు అపుడంతట విశ్వరూప ధరుడును విష్ణువు (అన్నిట వ్యాపించి ఉన్నవాడు)ను అగు హరిని దర్శించెను. అతడు చిలుకవన్నెవంటివియు పచ్చనివి ఎర్రనివి తెల్లనివి నల్లనివి ఈ వన్నెలే ఒకచోట నలుపుతో కూడినవి. ఒకచోట నలుపుతో మిశ్రితమగు మరియొకవన్నెతో కూడినవి అగు వర్ణములతో కూడినవాడు; ఆ హరి ఒకచోట చంద్రునివలె ప్రకాశించువాడు ఒకచోట హింగుళమువలె ఒకచోట మరకతమువలె ఒకచోట పద్మరాగమువలె ఒకచోట బంగారమువలె ఒకచోట నల్లని కలువవలె ఒకచోట పాటల పుష్పమువలె ఒకచోట ఆకాశమువలె ఒకచోట కుంకుమ పూవువలె ఒకచోట పసుపుపొడివలె ఒకచోట చంద్రకాంతమణివలె ఒకచోట ఇంద్రనీలమణి వలె ప్రకాశించుచుండెను. అతడు ఒక్కొక్కచోట ఇవి ఇట్టివి అని నిర్దేశించనలవికాని బహువర్ణములను ధరించియుండెను. నానావిధ ప్రాణుల బహుముఖములను బ్రహ్మశంకర రుద్రయమవరుణ కుబేరాగ్ని వాయునిర్పతి గ్రహనక్షత్ర వసురుద్రాదిత్యమరుద్ భృగ్వంగిరః సాధ్యాఽశ్విదైత్య నాగగంధర్వ సర్వరక్షః పితృపన్నగయక్షపిశాచ మనుష్య హయనాగ గజాశ్వమృగపక్షి ఖడ్గమృగవ్యాఘ్రు సింహాది ప్రాణివిశేషముల ముఖములను దాల్చి యుండెను. అతని ముఖములు కొన్ని భీషణములును; అతని ముఖములు వందలువేలుగా కనబడుచుండెను. రౌద్రరూపుడగు అతని రౌద్రముఖములందు అతనిచే మ్రింగబడుచున్న

అనేక ప్రాణి సంఘములను అగ్నులను కూడ నారదుడు చూచెను. అతని సౌమ్య ముఖముల నుండి వెలికివచ్చుచున్న అనేక ప్రజలును వివిధ వాహనములను ఆ నారదునకు కనబడెను. నానా ముద్రాసమన్వితములును నానా భాండము (వస్తువు)లతో నానా యుధములతో స్రుక్ – స్రువా – వేది – చమస – కృష్ణాజినములతో కూడిన హస్తములును వేలకొలదిగా అతనికి కనబడెను. ఆ మునిసత్తమునకు ఆ హరి హస్తములు కొన్ని కలశఘంటాశంఖముల పద్మములు కలువలు ఖడ్గ గదాచక్ర చర్మ (డాలు) శూల పరశువులు ధనువులు భుశుండులు లగుడములు (దుడ్డుకర్రలు) శక్తి కాసు అను ఆయుధములు వజ్రములు కొండరాళ్ళు పట్టిశములు పద్మబీజాది బీజములతో నిండిన అక్షమాలలు పూర్ణపాత్రలు ఈ మొదలగు నానావిధ భాండము (వస్తువు)లతో నిండినవిగా లెక్కింపరానన్ని కనబడెను. వృత్తశాస్త్రము నందు వినిర్దేశించబడిన వృత్తాభినయ కర్మమునందు వ్యగ్రములయి ఆ భగవానుని శిరములును దృష్టులును కరములును కొన్ని ఆ నారదునకు కనబడెను. ఆ మునిసయక్ష నాగరక్షోగనములతోను ద్వీపసముద్రాదులతోను పాతాళాది లోకములతోను కూడినదయి సమగ్రమయిన దానిని ఆభగవానుని దేహమునందు–దేహముగానే యున్నదానిని చూశాడు.

**భగవద్గీత**లోని 11వ అధ్యాయం **విశ్వరూప సందర్శనయోగం**లో 15 నుంచి 23 వరకు శ్లోకాలలో శ్రీకృష్ణుని విశ్వరూపాన్ని వర్ణించాడు అర్జునుడు.

**పశ్యామి దేవాం స్తవ దేవ ! దేహే సర్వాం స్తథా భూతవిశేష సంఘాన్ ।**
**బ్రహ్మాణమీశం కమలాసనస్థం ఋషీంశ్చ సర్వానురగాంశ్చ దివ్యాన్ ॥**

శ్రీకృష్ణా ! నీ శరీరమునందు సకల దేవతలను, సమస్త ప్రాణి సమూహములను, చతుర్ముఖ బ్రహ్మను, బ్రహ్మ ఆజ్ఞానువర్తియగు రుద్రుని, సకల ఋషిపుంగవులను, ప్రకాశించు వాసుకి మొదలగు సర్పరాజములను చూచుచున్నాను.

**అనేక బాహూదర వక్త్రనేత్రం పశ్యామి త్వాం సర్వతోఽనంతరూపమ్ ।**
**నాంతం న మధ్యం న పునస్తవాదిం పశ్యామి విశ్వేశ్వర విశ్వరూప ! ॥**

ప్రపంచమునకు నాథుడవగు ఓ విశ్వరూపధరా ! నిన్ననేక భుజములు, కడుపులు, ముఖములు, కన్నులు కలిగి ఇంతింతనరాని యాకారములు కలవానినిగా నంతటను చూచుచున్నాను. పైగా నీయాది మధ్యాంతములు నాకు గోచరించుటలేదు.

**కిరీటినం గదినం చక్రిణం చ తేజోరాశిం సర్వతో దీప్తిమంతమ్ ।**
**పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యం సమంతాత్ దీప్తానలార్కద్యుతిమప్రమేయమ్ ॥**

కాంతిపుంజమై యంతటను నిండిన కాంతివలన చూడశక్యముగాక మండు చున్న నిప్పు, సూర్యులకాంతివంటి కాంతి గలిగి యింతయని హద్దుగా చెప్పదగని నిన్ను కిరీటాది భూషణములను చక్రగదాద్యాయుధములను ధరించియున్నట్లు దర్శించుచున్నాను.

**త్వమక్షరం పరమం వేదితవ్యం త్వమస్య విశ్వస్య పరం నిధానమ్ ।**
**త్వమవ్యయ శ్శాశ్వత ధర్మగోప్తా సనాతనస్త్వం పురుషో మతో మే ॥**

ముండకాది ఉపనిషత్తులలో తెలియదగినదిగా నిర్దేశింపబడిన పరమైన అక్షరము నీవే. ఈ జగత్తునకు సర్వోత్కృష్టమైన ఆధారము నీవే, స్వరూపాదుల యందెల్లప్పుడు నొక్క రూపముతో నుండువాడవు నీవే. నిత్యమైన ధర్మములను కాపాడువాడవు నీవే. పురాణపురుషుడవు నీవే యని నాకిప్పుడు తెలిసినది.

**అనాది మధ్యాంతం అనంతవీర్యం అనంతబాహుం శశిసూర్యనేత్రమ్ ।**
**పశ్యామి త్వాం దీప్తహుతాశవక్త్రం స్వతేజసా విశ్వమిదం తపంతమ్ ॥**

ఆది మధ్యాంతములు లేనట్టియు, అపరిమిత పరాక్రమము కలిగి యున్నట్టియు, లెక్కలేనన్ని చేతులు కలిగియున్నట్టియు, చంద్రునివలె చల్లగను, సూర్యునివలె తీవ్రముగా నుండు కండ్లు కలిగినట్టియు, కాలాగ్నివలె మండుచున్న ముఖము కలిగినట్టి నీ తేజస్సుచేత ఈ ప్రపంచమును తపింపజేయుచున్న నిన్ను జూచుచున్నాను.

**ద్యావాపృథివ్యోరిదమంతరం హి వ్యాప్తం త్వయైకేన దిశశ్చ సర్వాః ।**
**దృష్ట్వాద్భుతం రూపముగ్రం తవేదం లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్ ! ॥**

భూమి ఆకాశముల మధ్యభాగమంతయును అన్ని దిక్కులను నీవే వ్యాపించి యున్నావు. మహాత్మా ! బ్రహ్మాది దేవతావర్గములో అనుకూలురు – ప్రతికూలురు మధ్యస్థులు అనెడు మూడు విధముల వారును అత్యద్భుతమై అతి భయంకరమైయుండు నీ రూపమును జూచి భయపడుచున్నారు. (అర్జునునకు తన ఐశ్వర్యమును జూపుటకై భగవానుడు వీరందరికిని దివ్యదృష్టి నొసంగెను.)

**అమీ హి త్వాం సురసంఘా విశంతి కేచిద్భీతాః ప్రాంజలయో గృణంతి ।**
**స్వస్తీ త్యుక్త్వా మహర్షి సిద్ధసంఘాః స్తువంతి త్వాం స్తుతిభిః పుష్కలాభిః ॥**

ఈ గొప్ప దేవతా సమూహాము నీ సమీపమునకు వచ్చుచున్నది. కొందరు భయపడి చేతులు జోడించి స్తోత్రము చేయుచున్నారు. భృగువు మొదలగు మహర్షులు, సనకాది సిద్ధులును నీకు మంగళాశాసనమును గావించి నీకు తగిన సంపూర్ణస్తోత్రములచే నిన్ను స్తుతించుచున్నారు.

**రుద్రాదిత్యా వసవో యే చ సాధ్యాః విశ్వేఽశ్వినౌ మరుతశ్చోష్మపాశ్చ ।**
**గంధర్వ యక్షాసుర సిద్ధ సంఘాః వీక్షంతే త్వాం విస్మితాశ్చైవ సర్వే ॥**

ఏకాదశ రుద్రులును, ద్వాదశాదిత్యులును, అష్టవసువులును, సకల సాధ్యులును, విశ్వేదేవతలును, ఇద్దరశ్వినీదేవతలును, సప్తమరుత్తులును, పితృదేవతలును, గంధర్వ యక్ష రాక్షస సిద్ధసమూహములున్ను, అందరును ఆశ్చర్యమును పొంది నిన్ను చూచుచున్నారు.

**రూపం మహత్తే బహువక్త్రనేత్రం మహాబాహో ! బహుబాహూరుపాదమ్ ।**
**బహూదరం బహుదంష్ట్రాకరాళం దృష్ట్వా లోకాః ప్రవ్యథితాస్తథాఽహమ్ ॥**

శ్రీకృష్ణా ! అనేక ముఖములను, లెఖ్ఖలేని కన్నులును పరిమితిలేని భుజములును, పెక్కుతొడలును, బహుపాదములును, అనేకములగు కడుపులును, పెక్కు కోరలచేత అతిభయంకరమగు నీ యిట్టి గొప్ప ఆకారమును జూచి జనులందరును అతిభయముతో వణుకుచున్నారు, అట్లే నేనును భయపడుచున్నాను.

వేదంలోని పురుషసూక్తంలో

**సహస్రశీర్షా పురుషః సహస్రాక్ష సహస్రపాత్ .....**

**పద్భ్యాంభూమిః దిశశ్శ్రోత్రాత్ తథా లోకాగ్ం అకల్పయన్** అని చెప్పబడింది.

ఈ రకంగా విశ్వమంతా ఆమెలో నిండి ఉన్నది కాబట్టే విశ్వరూపా అనబడింది.

అలాగే 'విశ్వరూపం' అనేది కృష్ణపక్షంలో పంచమితిథి పగటిపేరు. అంటే తిథులస్వరూపం గలది ఆ దేవి. ఈ రకంగా కృష్ణపక్షంలో పగటితిథులు, రాత్రి తిథులు కూడా ఆ దేవతాస్వరూపమే.

ఈ విధంగా పరమేశ్వరుని విశ్వరూపాన్ని అనేకచోట్ల వర్ణించటం జరిగింది.

శ్రీమహావిష్ణువు అనేక రూపాలు గలవాడు. అతి పెద్దదయిన రూపము గలవాడు. జ్ఞానకిరణములచేత సర్వత్రా వ్యాపించినవాడు. లోకాలన్నింటినీ ప్రకాశింపచేసేవాడు. బలము, పరాక్రమము, కాంతి గలవాడు. స్వయముగా ప్రకాశించేవాడు. తన తేజస్సుతోనే లోకాలన్నింటినీ ప్రకాశింపచేసేవాడు. ధర్మము, జ్ఞానము, వైరాగ్యము మొదలైన ఉత్తమగుణాలు సమృద్ధిగా గలవాడు. స్పష్టమైన వేదాక్షరస్వరూపుడు. మననము చేయువానిని రక్షించే స్వభావము గలవాడు. చల్లనికాంతి గలవాడు. సూర్యుని వంటి తేజస్సు గలవాడు. చంద్రుని జన్మకు కారణమైనవాడు. మిక్కిలి తేజోమయుడు. వక్రమార్గంలో చరించేవారిని నశింపచేస్తాడు. మంచి వారికి మార్గదర్శకుడు. సంసారమనే

విషాన్ని హరించగల దివ్యౌషధము. ఈ జగత్తుకు అతడే సేతువు. మంచి చెడులను ఒకటికానీయడు. శుభప్రదమైన గుణాలు కలవాడు. త్రికాలములకు నాథుడు. సర్వకాల సర్వావస్థలయందు సంచరించే వాయురూపుడు పరమపవిత్రమైనవాడు. కంటికి కనిపించని జఠరాగ్ని రూపంలో ఉంటాడు. తనను దర్శించినవారికి సంసారిక భోగము మాన్పించేవాడు. తన పాదారవిందాలు దర్శించాలనే ఆశ భక్తులకు కలిగిస్తాడు. మనోహరమైనవాడు, సుందరుడు. కోరినకోరికలు తీర్చేవాడు. అన్నిటా సమర్థుడు. అందరికీ ప్రభువు.

అటువంటి శ్రీమన్నారాయణుని విశ్వరూపం 271 నుంచి 299 వరకు నామాలలో వివరించబడుతున్నది. ఇక నామాలను చూద్దాం.

## 271. నైకరూపః

అనేక రూపములు గలవాడు.

**యస్సదా బహురూపశ్చ నైకరూప స్సకీర్తితః**
**తత్తజ్జన జ్ఞానయోగ్యం రూపం యస్య విశేషతః**
**నైకరూప స్సముద్దిష్టః సర్వప్రత్యయగోచరః**

పరమేశ్వరుడికి రూపంలేదు. భక్తులు ఏవిధంగా చూడాలనుకుంటే వారికి ఆ విధంగా దర్శనమిస్తాడు. అంటే తాను ఒకేరూపంలో ఉండకుండా భక్తుల ఇష్టానుసారము రూపాన్ని ధరిస్తూ ఉంటాడు.

**నైకానిరూపాణి యస్యసః నైకరూపః**

భక్తుల ఆలోచనలకు అనుగుణంగా అనేక రూపాలు ధరించేవాడు.

**న ఏకం రూపం అస్య** ఇతనిది ఒక రూపము కాదు.

పరమేశ్వరుడికి రూపంలేదు. అతడు నిరాకారుడు. ఈ సృష్టిలో ఏ వస్తువైనా, ఏ ప్రాణి అయినా అతని రూపమే. అన్ని రూపాలు అతనివే. భక్తులు తమ కోరికలకు అనుగుణంగా భగవంతుని రూపాన్ని ఊహించుకుంటారు.

**సాధకానాంహితార్థాయ బ్రహ్మణో రూపకల్పనా**

భక్తుల కోరికలను అనుసరించి భగవంతుడికి రూపం కల్పించబడింది. మనకి ధనధాన్యాలు కావాలి అంటే లక్ష్మీరూపము, విద్య సంగీతసాహిత్యాలు కావాలంటే సరస్వతీ రూపము పూజిస్తాం. ముక్తి కావాలి అంటే పరమేశ్వరుని నిరాకారాన్ని ఆరాధిస్తాము.

అందుకే పరమేశ్వరుడు కూడా ఎవరికి ఏ విధంగా కావాలో వారికి ఆ విధంగానే దర్శనమిస్తాడు. అందుకే గజేంద్ర మోక్షంలో గజరాజు ఆ పరమేశ్వరుణ్ణి ప్రార్థిస్తూ.

**అన్నిరూపులు నీ రూపమైనవాడ**

**ఆది మధ్యాంతములు లేక అలరువాడ**

అంటారు. జగత్తులోని అన్ని రూపాలు ఆ పరమేశ్వరునివే. **భగవద్గీత**లోని పదకొండవ అధ్యాయం **'విశ్వరూప సందర్శనయోగము'**లోని 16వ శ్లోకంలో

**అనేక బాహూదరవక్త్రనేత్రం పశ్యామి త్వాం సర్వతోఽ నంతరూపమ్ ।**

**నాంతం న మధ్యం న పునస్తవాదిం పశ్యామి విశ్వేశ్వర విశ్వరూప ॥**

విశ్వేశ్వర ! విశ్వరూప ! అనేక బాహువులు, అనేక ఉదరములు, అనేక ముఖములు అనేక నేత్రములు గల అనంతమైన నీ రూపము సర్వతోముఖముగ విలసిల్లుతున్నది. ఆదిమధ్యాంత రహితుడవు నీవు. దివ్యమైన నీ రూపానికి ఆది, మధ్య, అంతము తెలుసుకోలేకుండా ఉన్నాను.

భగవానుడే ఈ సమస్త జగత్తూకూ కర్త, హర్త కూడా. అందరినీ వారి వారి కార్యములందు నియమిస్తాడు. ఈ జగత్తంతా ఆయన యొక్క రూపమే. ఈ జగత్తుకు నిమిత్త కారణము, ఉపాదాన కారణము కూడా ఆయనే.

అర్జునుడు దర్శించిన ఆ రూపములో, అన్నివైపులనుండి అసంఖ్యాకమైన రూపాలు ఉన్నాయి. అంటే భగవానుడిది ఒకే శరీరము. కాని అది వేరువేరు రూపాలతో, అనంతమై అన్నిదిశలకు వ్యాపించినట్లు కనిపిస్తోంది.

ఈరకంగా అనేక రూపాలు ధరిస్తాడు. కాబట్టే శ్రీమన్నారాయణుడు 'నైకరూపః' అనబడుతున్నాడు.

## 272. బృహద్రూపః

పెద్దరూపము గలవాడు.

**వ్యాప్నువ ద్యస్యరూపస్తు బృహద్రూపస్సకీర్తితః ॥** ఆ రూపాలు కూడా అంతా వ్యాపించినట్లు ధరించేవాడు. అంటే అతి పెద్దదైన రూపము గలవాడు.

**బృహద్రూపం యస్యసః బృహద్రూపం**

అనేక రూపాలలో ఒక్కొకటే భూమ్యాకాశాలకు వ్యాపించినట్లు పెద్దదిగా ఉండేవాడు.

**భగవద్గీత**లోని పదకొండవ అధ్యాయం **'విశ్వరూప సందర్శన యోగము'**లోని 20వ శ్లోకంలో

**ద్యావా పృథివ్యో రిదమంతరం హి వ్యాప్తం త్వయైకేన దిశశ్చ సర్వాః ।**
**దృష్ట్వాద్భుతం రూపముగ్రం తవేదం లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్॥**

ఓ మహాత్మా ! భూమ్యాకాశాలు అంతా నీవే పరిపూర్ణుడవై ఉన్నావు. అద్భుతమైన నీ భయంకరరూపాన్ని చూసి ముల్లోకాలు గడగడలాడుతున్నాయి.

పరమేశ్వరుని విరాడ్రూపము భూనభోంతరాళాలను ఆవరించి ఉన్నది. అన్ని దిశలకు వ్యాపించి ఉన్నది. అంటే పరమేశ్వరుడు బృహద్రూపాన్ని ధరించాడు.

**మహద్రూపం యస్యసః** అతిపెద్దదయిన రూపమితడికి ఉన్నది.

వామనావతారంలో త్రివిక్రమమూర్తియై లోకాలన్నింటినీ ఆక్రమించేశాడు.

**కఠోపనిషత్తు**లో పరమేశ్వరుని రూపము. **అణోరణీయాం । మహతోమహీయాం**

అణువు కన్న చిన్నదైనది. మహత్తు అంటే గొప్ప దానికన్న గొప్పదైనది. అందుచే తనే శ్రీమన్నారాయణుడు 'బృహద్రూపః' అనబడుతున్నాడు.

## 273. శిపివిష్టః

కిరణములచే వ్యాపించినవాడు.

**శిపయో రశ్మయః ప్రోక్తా వ్యాప్య తేష్వపి వర్తనాత్ ।**
**శిమివిష్ట స్సమాఖ్యాతః సూర్యేన్ద్వగ్న్యాది రూపవత్ ॥**

శిపులు అనగా-కిరణములు. వాటిలో వ్యాపించి చంద్రసూర్యాగ్నులవలె ప్రకాశించేవాడు.

**శిపిభిః అవిష్టః శిపివిష్టః శిపయోరశ్మయ ఉచ్యన్తే తైరావిష్టః**

శిపి అంటే కిరణములు. వానిచే వ్యాపించినవాడు. పరమేశ్వరుడు జ్ఞానస్వరూపుడు. అందుచేత జ్ఞానకాంతులచే ప్రకాశిస్తుంటాడు. అవే కిరణములు. ఆవిధంగా ప్రకాశిస్తూ చంద్రసూర్యాగ్నులవలె మనకు దర్శనమిస్తాడు.

**బృహదారణ్యకోపనిషత్తు**లో ఒకరోజున యాజ్ఞవల్క్యుడు జనకమహారాజు ఆస్థానానికి వచ్చాడు. వచ్చిన మహర్షికి ఎదురేగి స్వాగతసత్కారాలు అందించాడు జనకుడు. కుశలప్రశ్నలు అయిన తరువాత జనకమహారాజు అడుగుతున్నాడు.

**జ** : మహర్షీ ! మానవుడు దేనివల్ల తన నిత్యకృత్యములు నెరవేర్చుతున్నాడు?

**యా** : సూర్యుని వెలుతురువల్ల. దానివల్లనే మానవుడు పనిపాటలు నిర్వహిస్తున్నాడు. దూరతీరాలకు వెడతాడు. పనిపూర్తి చేసుకుని తిరిగివస్తాడు. ఆ వెలుగులో వెళ్ళాలి అనుకున్న చోటికి వెడతాడు. చేయదలచుకున్న పని పూర్తిచేస్తాడు.

**జ** : మహర్షీ! మరి సూర్యాస్తమయం తరువాత పనులు ఏవిధంగా జరుగుతాయి?

**యా** : సూర్యుడు అస్తమించిన తరువాత చంద్రునికాంతులలో ఈ పనులన్నీ జరుగుతాయి.

**జ** : సూర్యచంద్రులిద్దరూ అస్తమిస్తే ఏమవుతుంది ?

**యా** : రాజా ! సూర్యచంద్రుల్దిరూ లేనప్పుడు అగ్ని లేదా దీపపు వెలుగులో ఈ వ్యవహారాలు జరుగుతాయి.

**జ** : గురుదేవా ! మరి ఆ అగ్ని కూడా లేకపోతే అంటే సూర్యుడు లేడు, చంద్రుడు లేడు, అగ్నిలేదు. అప్పుడు మానవుడు ఏవిధంగా పనులు నెరవేరుస్తాడు ?

**యా** : రాజా ! వాటిస్థానంలో వాక్కు సహకరిస్తుంది. చీకటిలో ఏమీ కనిపించదు. కాని ఏదో ధ్వని వినిపిస్తే, మానవుడు ఆధ్వని వినిపించినవైపుకు సాగిపోతాడు.

**జ** : మరి వాక్కు కూడా ఆగిపోతే ? అంటే ధ్వని కూడా ఏ మాత్రం వినిపించనప్పుడు ఏమవతుంది ?

**యా** : రాజా ! శబ్దాలన్నీ సర్దుమణిగిన తరువాత ఏం జరుగుతుంది? అని కదా అడిగావు. ఈ వెలుగులన్నింటికీ అవతల ఆత్మజ్యోతి ఉన్నది. ఆ ఆత్మ ప్రకాశాలకు ప్రకాశము. కాంతులకు కాంతి. అటువంటి ఆత్మవల్లనే మానవుడు మనుడగసాగిస్తాడు.

అని చెప్పాడు. అంటే లోకాలన్నీ కూడా పరమేశ్వరుని యొక్క కాంతులవల్లనే ప్రకాశిస్తున్నాయి. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'శిపివిష్టః' అనబడుతున్నాడు.

**మహాభారతములో**

**శిపివిష్టేతి యచ్చాస్యపీతం రోమ చ యద్భవేత్ ।**
**తేనాపి విష్టం యత్కించత్ శిపివిష్టం హి తత్స్మృతమ్ ॥**

బంగారు రంగులో ఉండే ఇతని రోమాలకు 'శిపివిష్టము' అని పేరు. దానిచేత వ్యాపించబడిన ప్రతి వస్తువు శిపివిష్టము అనబడుతుంది.

**యజ్ఞోవై విష్ణుః - పశవః శిపిర్యజ్ఞ ఏవ పశుషు ప్రతితిష్ఠతి.**

యజ్ఞమే విష్ణువు. పశువులు శిపి - అనబడతాయి. యజ్ఞమే పశువులందు నిలుచుచున్నది. అంటే - పశువులయందు యజ్ఞము అనురూపముతో నారాయణుడు ప్రవేసించి ఉంటాడు. అనగా శ్రీమహావిష్ణువు తానే యజ్ఞరూపములయిన పశువులందు ప్రవేశించి యజ్ఞములకు సమగ్రత కలిగించి, వాటిని ఫలవంతము చేస్తూ, వాటి యజమానులకు ఫలదానము చేస్తున్నాడు.

## 274. ప్రకాశనః

ప్రకాశింపచేయువాడు.

**దివ్యరూపం దిదృక్షుభ్యః పార్థాదిభ్యో విశేషతః ।**
**రూపం ప్రకాశయతి యః స ప్రకాశద ఈరితః ॥**

తన దివ్యరూపాన్ని చూడగోరే అర్జునుడు మొదలైన వారికి తన విశ్వరూపాన్ని చూపినవాడు.

**ప్రకాశయతీతి ప్రకాశనః** తన రూపమును ప్రకాశింపచేయువాడు.

**భగవద్గీత**లోని పదకొండవ అధ్యాయము **'విశ్వరూప సందర్శనయోగము'**లోని 8వ శ్లోకము.

**న తు మాం శక్యసే ద్రష్టుం అనేనై వ స్వచక్షుషా ।**
**దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరమ్ ॥**

అర్జునా! చర్మచక్షువులతో నా రూపమును నీవు చూడజాలవు. కాబట్టి నీకు అలౌకిక దృష్టిని ప్రసాదిస్తున్నాను. ఆ దృష్టితో ఆ దివ్యరూపము చూడవలసినది.

అర్జునుడు భగవానుని దివ్యరూపాన్ని చూడాలి అనుకున్నాడు. భగవానుడు కూడా తన దివ్యరూపాన్ని అర్జునుడికి చూపాలి అనుకున్నాడు. కాని అర్జునుడు తన చర్మచక్షువుల ద్వారా ఆ దివ్యరూపాన్ని చూడలేకపోయాడు. అప్పుడు భగవానుడు అర్జునుడికి తన దివ్యరూపాన్ని చూసేటందుకు ఒకవిధమైన యోగదృష్టి లేదా దివ్యదృష్టి ప్రసాదించాడు. దానవల్ల అర్జునుడికి అలౌకిక శక్తి, సామర్థ్యము వచ్చాయి. సంజయుడికి వ్యాసుడు కూడా ఇలాంటి శక్తినే ఇచ్చాడు. అటువంటి దృష్టితో అర్జునుని నేత్రాలను ప్రకాశింపచేశాడు. కాబట్టి శ్రీమన్నారాయణుడు 'ప్రకాశనః' అనబడుతున్నాడు.

అదే అధ్యాయంలోని 52వ శ్లోకము.

**సుదుర్దర్శమిదం రూపం దృష్టవానసి యన్మమ ।**
**దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శనకాంక్షిణః ॥**

అర్జునా ! నీవు చూసిన ఈ విశ్వరూప దర్శన భాగ్యము అందరికీ కలుగదు. ఈ రూపాన్ని చూడటానికి దేవతలు కూడా ఎప్పుడూ ఎదురుచూస్తుంటారు.

ఈ చతుర్భుజరూపము మాయాతీతమైనది. దాని దర్శనము కడు దుర్లభము. భగవంతుని కృపకు పూర్తిగా పాత్రులైన వారికి తప్ప అది ఇతరులకు లభ్యముకాదు. దేవతలు అందరూ ఆ రూపాన్ని దర్శించాలని కోరుకుంటారు కాని వారిలో కూడా అందరూ దీన్ని చూడలేరు.

**సర్వేషాం ప్రకాశనం శీలం అస్య** అన్నింటినీ తన ప్రకాశముచే ప్రకాశింపచేయుట అతని శీలము. అందుకే శ్రీమన్నారాయణుడు 'ప్రకాశనః' అనబడుతున్నాడు.

## 275. ఓజస్తేజోద్యుతిధరః

బలము పరాక్రమము, కాంతులను ధరించువాడు.

**అసాధారణ సామర్థ్యం బలయోజః ప్రచక్షతే**
**పరాభి భవసామర్థ్యం తేజశ్చ పరిపఠ్యతే ।**
**కీర్తిర్వాద్యుతి రౌజ్వల్యం తాని దత్తే చ యస్సదా**
**ఓజస్తే జోద్యుతిధరో హ్యేకనామ ప్రకీర్తితః ॥**

ఓజస్సు - అసాధారణమైన బలము
తేజస్సు - శత్రువులను ఓడించుశక్తి
ద్యుతి - కీర్తి లేక కాంతి

వీటన్నింటినీ ఎల్లప్పుడూ ధరించి ఉండేవాడు. ఇది ఒకే నామము.

**ఓజస్తేజోద్యుతీని ధరతీతి ఓజస్తే జోద్యుతి ధరః**

బలము, శత్రువులను జయించే సామర్థ్యము, కాంతులను ధరించినవాడు.

భగవద్గీతలోని 11వ అధ్యాయము **'విశ్వరూప సందర్శనయోగము'**లోని 36వ శ్లోకము.

**స్థానేహృషీకేశ తవ ప్రకీర్త్యా జగత్ప్రహృష్యత్యను రజ్యతే చ ।**
**రక్షాంసి భీతాని దిశో ద్రవంతి సర్వే నమస్యంతి చ సిద్ధసంఘాః ॥**

కేశవా ! నీ నామ గుణ ప్రభావాలను కీర్తిస్తూ ఈ జగత్తంతా హర్షాతిరేకముతో, అనురాగముతో ఉప్పొంగుతున్నది. భయభ్రాంతులైన రాక్షసులు నాలుగువైపులకు పారిపోవుచున్నారు. సిద్ధగణాలన్నీ నీకు నమస్కరిస్తున్నాయి.

అంటే భగవానుని బలపరాక్రమాలు, తేజస్సుల విశేషము ఇక్కడ చెప్పబడింది.

అదే అధ్యాయంలోని 12వ శ్లోకము.

**దివి సూర్య సహస్రస్య భవేద్యుగపదుత్థితా ।**

**యది భాఃసదృశీ సా స్యాత్ భాసస్తస్య మహాత్మనః ॥**

ఆకాశంలో వేలకొలది సూర్యులు ఒక్కసారిగా ఉదయిస్తే కాంతి కూడా, ఆవిరాడ్రూప తేజస్సుకు సాటిరాదు. అంటే పరమేశ్వరుడు గతంలో చెప్పినట్లుగా కొన్ని కోట్ల సూర్యుల వెలుగుతో ప్రకాశిస్తుంటాడు.

ఓజస్సు, తేజస్సు, ద్యుతిని ధరించినవాడు. ఈ మూడింటినీ వేరువేరు నామాలుగా కూడా చెప్పవచ్చును. అప్పుడు 'ఓజః' అంటే **భగవద్గీత**లోని 7వ అధ్యాయము **'విజ్ఞానయోగము'**లోని 11వ శ్లోకము.

**బలం బలవతాం చాహం కామరాగ వివర్జితమ్**

**ధర్మా విరుద్ధో భూతేషు కామోஉస్మి భరతర్షభ**

ఓ భరతశ్రేష్ఠా ! బలవంతులలో కామరాగరహితమైన బలమును నేను. సమస్త భూతములందు ధర్మవిరుద్ధము కానటువంటి కామమును నేనే.

ఇక్కడ బలము ఆ పరమేశ్వరస్వరూపము అని చెప్పబడింది. అదే అధ్యాయంలోని 10వ శ్లోకములో

**బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ సనాతనమ్ ।**

**బుద్ధి ర్బుద్ధి మతామస్మి తేజస్తేజస్వినామహమ్ ॥**

పార్థా ! సమస్త భూతములకు సనాతనమైన శాశ్వతమైన బీజముగా నన్నెరుగుము. ప్రజ్ఞావంతులలో ప్రజ్ఞను, తేజోవంతులలో తేజస్సును నేనే.

ఇక్కడ తేజస్సు పరమేశ్వరస్వరూపమని చెప్పబడింది. ఈ విధంగా ఓజస్సు, తేజస్సు, ద్యుతి ఆ పరమేశ్వర స్వరూపమే అని చెప్పబడ్డాయి. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'ఓజస్తే జోద్యుతిధరః' అనబడుతున్నాడు.

## 276. ప్రకాశాత్మా

ప్రకాశించు స్వభావము గలవాడు.

**మూర్ఖైరపి సదా సమ్యక్ ప్రతిపన్న స్వభావవాన్ యస్స స్యాత్తు ప్రకాశాత్మా**

మూర్ఖులు కూడా అంగీకరించేటట్లుగా, గొప్పగా ప్రకాశించేవాడు. **మహాభారతంలో**

**"త్వమేవ పుండరీకాక్ష సర్వస్య జగతః ప్రభుః ।**

**తస్మాన్మే యాదవశ్రేష్ఠ ప్రసాదంకర్తుమర్హసి ॥**

శ్రీకృష్ణా ! సకలలోకాలకు నీవే ప్రభువువు. నన్ను అనుగ్రహించవలసినది" అని ధృతరాష్ట్రుడు శ్రీకృష్ణుని ప్రార్థిస్తాడు. ధృతరాష్ట్రుడు ఒక మూర్ఖుడు. ఏం జరుగుతోందో అతడికి తెలుసు. ఎలా జరుగుతుందో తెలుసు. జరిగేది అన్యాయము అని కూడా తెలుసు. అయినప్పటికీ తన కుమారులను మాత్రం కాదనలేదు. వారు చేసేది తప్పు అని చెప్పలేదు. అంతటి మూర్ఖుడు కూడా శ్రీకృష్ణుడు సాక్షాత్తూ పరమేశ్వరుడు అని గుర్తించేటట్లుగా భగవానుడు ప్రకాశవైభవము కలిగిఉన్నాడు.

**ప్రకాశస్వరూపః ఆత్మాయస్యసః**

ప్రకాశ స్వరూపముగా గల ఆత్మ ఎవరికి కలదో అట్టివాడు.

ఆత్మస్వయంప్రకాశి. తాను ఎవరి సహాయము లేకుండానే ప్రకాశిస్తుంది. తాను ప్రకాశిస్తూ సూర్యచంద్రాగ్నులకు కూడా ప్రకాశాన్నిస్తుంది. అందుచేతనే ఆత్మపురుషుడైన శ్రీమన్నారాయణుడు 'ప్రకాశనః' అనబడుతున్నాడు.

## 277. ప్రతాపనః

తపింపచేయువాడు.

**తీక్ష్ణభావః ప్రతాపనః** తన తేజస్సుతో లోకాలన్నీ తపింపచేయువాడు.

**ప్రతాపయతీతి ప్రతాపనః** తపింపచేయువాడు. అతడు తన ఉగ్రమయిన కాంతితో లోకాలన్నీ ప్రకాశింపచేస్తాడు.

సూర్యుడు మొదలైన తన దివ్యవిభూతులచే ఈ జగత్తును తపింపచేస్తాడు.

పరమేశ్వరుడు జ్ఞానరూపుడు. అనేక వేలకోట్ల సూర్యులకాంతితో ప్రకాశిస్తున్నాడు. ఆ కిరణములలో 108 కిరణములను అగ్నిదేవుడు, 116 కిరణములను సూర్యుడు, 136 కిరణములను చంద్రుడు తీసుకున్నారు. పగటిపూట సూర్యునికాంతులతోను,

రాత్రిపూట చంద్రునికాంతులతోను, సంధ్యవేళలయందు అగ్ని (దీపపు) కాంతులతోను ఈ జగత్తు ప్రకాశిస్తున్నది. ఈ మొత్తం కలిపి 360 కిరణములు అవుతున్నాయి. ఇది సంవత్సరానికి ప్రతీక. అందుచేతనే ప్రజాపతి కాలపురుషుడు అని చెప్పబడింది. దీనికి అనుగుణంగా **బృహదారణ్యకోపనిషత్తు**లోని జనకుడు – యాజ్ఞవల్క్యుల సంవాదాన్ని కూడా గతంలో వివరించటం జరిగింది. ఈ రకంగా తన కాంతులచేత, విభూతులచేత లోకాలను తపింపచేస్తాడు కాబట్టే పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు 'ప్రతాపనః' అనబడుతున్నాడు.

## 278. ఋద్ధః

సమృద్ధుడు 351వ నామము కూడా ఇదే.

**పార్వణో జలధిర్యద్వత్ వృద్ధిమాన్ ఋద్ధి ఉచ్చతే** అన్ని కాలములందు పొంగుతూ ఉండే సముద్రములాగా ఎప్పుడూ సమృద్ధిగా ఉండేవాడు.

ధర్మము, జ్ఞానము, వైరాగ్యము మొదలైన ఉత్తమ గుణాలను సమృద్ధిగా గలవాడు.

పరమేశ్వరుడు ధర్మపరుడు. ధర్మరక్షకుడు, ధర్మమే స్వరూపముగా గలవాడు. ఏ రకమైన పక్షపాతము లేకుండా ధర్మాన్ని ఆచరించేవాడు ధర్మబద్ధుడు. జ్ఞానమే రూపముగా గలవాడు. మహాజ్ఞాని. జ్ఞాననిధి. అంతేకాదు దేనిమీద మమకారము లేనివాడు. అపేక్ష లేనివాడు. నిష్కాముడు. పూర్ణకాముడు. ఆప్తకాముడు. ఈ రకంగా ఉత్తమగుణాలను సమృద్ధిగా గలవాడు కావటంచేత శ్రీమన్నారాయణుడు 'ఋద్ధః' అనబడుతున్నాడు.

## 279. స్పష్టాఽక్షరః

స్పష్టమైన వేదాక్షరములు గలవాడు.

**స్పష్టీకృతాశ్చ వేదార్ణాః యస్మాత్ స్పష్టాక్షరోమతః**

వేదాక్షరాలన్నీ సార్థకమయ్యేటట్లుగా స్పష్టపరచువాడు.

**స్పష్టం అక్షరం యస్యసః స్పష్టాక్షరః**

వేదానికి స్పష్టమైన అర్థం చెప్పటానికి స్పష్టమైన వేదాక్షరాలు గలవాడు.

స్పష్టము అంటే ఉదాత్తము. ఉదాత్తమైన ఓంకారము వాచకముగ కలవాడు.

వేదం చదివేటప్పుడు ఏరకంగా చదవాలి. స్పష్టమైన అర్థం రావాలి. అంటే అక్షరాలను ఏవిధంగా పలకాలి అనే విషయాలు **తైత్తిరీయోపనిషత్తు**లో చెప్పబడ్డాయి. ఈ ఉపనిషత్తు మూడు భాగాలుగా ఉంటుంది. 1. శిక్షావల్లి 2. భృగువల్లి 3. ఆనందవల్లి.

శిక్షావల్లిలో వేదపారాయణము ఎలా చెయ్యాలో చెప్పారు.

ఇందులో మొత్తము పన్నెండు అనువాకములున్నాయి. మొదటి అనువాకము ప్రార్థన. ఇందులో మిత్రుడు, వరుణుడు, ఆర్యముడు, ఇంద్రుడు, బృహస్పతి, విష్ణువు మాకు సుఖము కలుగజేయుగాక. వాయురూపుడైన బ్రహ్మకు నమస్కారము. వాయుదేవునకు నమస్కారము. నీవే ప్రత్యక్షంగా కనిపించే బ్రహ్మవు. నీవే ఋతమువు. అంటే యజ్ఞయాగాదులైన కర్మవు. నీవు సత్యానివి. వాయుస్వరూపమైన ఓ బ్రహ్మ ! నన్ను, నా గురువును, రక్షించు. ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆది దైవిక తాపములు చల్లారుగాక. ఇది ప్రార్థన. విద్యాభ్యాసము చక్కగా జరగాలని శిష్యుడు చేసిన ప్రార్థన; ముందుగా చెప్పిన మిత్రుడు, వరుణుడు మొదలగు వారంతా శరీరంలోని అవయవాలు చక్కగా పని చెయ్యటానికి కారణభూతులైన దేవతలు. వీరిలో.....

| | | | | | |
|---|---|---|---|---|---|
| మిత్రుడు | – | ప్రాణానికి | ఇంద్రుడు | – | బలానికి |
| వరుణుడు | – | అపానానికి | బృహస్పతి | – | బుద్ధికి |
| అర్యముడు | – | కనులకు | విష్ణువు | – | శక్తికి |

దేవతలు శరీరంలో ఈ భాగాలన్నీ బాగా పనిచేస్తేనే విద్యాభ్యాసం బాగా జరుగుతుంది. అందుకే ముందుగా ఈ దేవతలను ప్రార్థించటం.

ఇందులో వాయువును బ్రహ్మగా చెప్పటం జరుగుతోంది. పరబ్రహ్మ కంటికి కనుపించనిది. కాని వాయువు ప్రత్యక్ష బ్రహ్మ. అది లేకపోతే జీవం ఉండదు. అందుచేత సగుణ బ్రహ్మద్వారా నిర్గుణ బ్రహ్మోపాసన చెప్పబడుతోంది. వాయువు ఐదు విధాలుగా ఉన్నది.

1. ప్రాణవాయువు – ముక్కుతో పీల్చివదిలేది
2. అపానవాయువు – బరువును క్రిందికి లాగేది. ఇదే భూమిని ఆశ్రయించి ఉంటుంది.
3. వ్యాన వాయువు – శరీరమంతటా వ్యాపించి ఉంటుంది.
4. ఉదాన వాయువు – పైకి వ్యాపించే స్వభావం గలది.
5. సమాన వాయువు – ఆకాశంలో వ్యాపించి ఉన్నది.

ప్రార్థన చివరలో శాంతి మూడుసార్లు చెప్పటం జరిగింది. అది మూడు రకాల తాపాలు ఉపశమించాలని కోరటం.

1. అధ్యాత్మిక తాపం – శరీరానికి సంబంధించిన రోగాలు
2. ఆది భౌతికము – దొంగలు మొ॥ వారివల్ల కలిగే బాధలు, ప్రమాదాలు

3. ఆది దైవికము - దైవవశం వల్ల కలిగేవి. యక్షరాక్షసుల వలన కలిగే బాధలు, ప్రమాదాలు.

రెండవ అనువాకంలో ఉపనిషత్తులు పఠించేటప్పుడు అర్థం పూర్తిగా తెలియాలి. అంటే చదవటంలో దోషాలు ఉండకూడదు. చదివేటప్పుడు శ్రద్ధగా చదవాలి. ఇక్కడ వర్ణములు, స్వరములు, మాత్రలు, బలము, సామము, సంతానము అనే ఆరు విషయాలను జాగ్రత్తగా గమనించి చదవాలి.

1. వర్ణములు - అ నుంచి క్ష వరకు ఉండే అక్షరాలు వీటిని చక్కగా ఉచ్చరించాలి.
2. స్వరములు - వేదానికి నాలుగు రకాలు స్వరాలున్నాయి.

| | | | |
|---|---|---|---|
| 1. | అనుదాత్తము | - | క్రిందికి నొక్కి పలకటం |
| 2. | ఉదాత్తము | - | సమాన స్థాయిలో పలకటం |
| 3. | స్వరితము | - | పై స్థాయిలో పలికేది |
| 4. | ధీర్ఘ స్వరితము | - | పై స్థాయిలో దీర్ఘముగా పలికేది |

వీటిని గురుముఖతః నేర్చుకోవాలి. అక్షరము యొక్క హెచ్చు తగ్గులను అంటే ఉచ్చారణ బట్టి దాని అర్థం మారుతుంది.

3. మాత్రలు - మాత్ర అంటే 1/6 వంతు సెకను కాలము. ఇవి మూడు రకాలుగా లెక్కపెట్టబడతాయి. అవి

హ్రస్వము - మాత్రాకాలము. అ,ఇ,ఉ మొదలైన అక్షరాలకు పట్టే ఉచ్చారణ కాలము.

దీర్ఘము - రెండు మాత్రల కాలము.

ప్లుతము - మూడు అంతకన్న ఎక్కువ మాత్రల కాలం.

4. బలము - ఆయా అక్షరాలను ఉచ్చరించేటప్పుడు చేయవలసిన ప్రయత్నం. దీన్నే ఊతము అంటారు.

5. సామము - సమానత్వము. మరీ వేగము, మరీ నెమ్మది కాకుండా ఉచ్చరించటము.

6. సంతానము - సంహిత అర్థాన్ని అనుసరించి కలిపిచదవటం.

ఈ విషయాలు గమనించి చదవకపోతే అర్థభేదం వస్తుంది. అది జ్ఞానానికి ప్రతి బంధకము. అటువంటి పొరపాట్లు జరగరాదనే ఆ విషయాలను ఇక్కడ వివరించటం జరిగింది. ఈ విధంగా శాస్త్రం శిక్షించటం (బోధించటం) వల్లనే దీనిని శిక్షావల్లి అన్నారు.

ఈ రకంగా స్పష్టమైన అక్షరస్వరూపం కలవాడు. కాబట్టే శ్రీమన్నారాయణుడు 'స్పష్టాక్షరః' అనబడుతున్నాడు.

## 280. మంత్రః

మననము చేయువారిని రక్షించువాడు.

**తన్మన్త్రం త్రాయత ఇతి మన్త్రశ్చాప్యభిధీయతే ॥** తనను ధ్యానించే వారిని రక్షించేవాడు.

**దైవాధీనం జగత్సర్వం, మంత్రాధీనంతు దైవతమ్**

చరాచరజగత్తు అంతా దైవము యొక్క అధీనంలోనే ఉంటుంది. ఆ దైవము మంత్రానికి అధీనమై ఉంటుంది. అందుకే మంత్రానికి ప్రాముఖ్యత ఉన్నది.

**మననాత్ త్రాయత ఇతిమంత్రః**

మననము వలన మననము చేయువాడిని రక్షించే దాన్ని 'మంత్రము' అంటారు. దేవతలదయకు పాత్రులు కావాలంటే మంత్రజపం చెయ్యాలి. దీన్నే 'ఉపాసన' అంటారు.

అరణి మథిస్తే అగ్ని ఎలాపుడుతుందో అలాగే మంత్రము జపించినట్లైతే శక్తి పుడుతుంది. ఆ శక్తి సాధకుడికి సర్వార్థాలు చేకూరుస్తుంది. బీజాక్షరాలతో సంపుటం చేయబడిన మంత్రజపంవల్ల దేవతానుగ్రహము త్వరగా కలుగుతుంది. ఆయా దేవతల యొక్క తత్త్వాలకు అనుగుణమైన బీజాక్షరాలు ఋషులచేత మంత్రాలకు సంపుటీకరణ చేయబడ్డాయి. మంత్రాలు మూడు రకాలు. అవి.

1. వైదికములు 2. తాంత్రికములు 3. అపభ్రంశములు.

వేదములందు చెప్పబడిన మంత్రాలను వైదికమంత్రాలు అంటారు. ఇవి జ్ఞానప్రదాలు.

కామ్యప్రదమైనవి తాంత్రికాలు. సంస్కృతంలో కాకుండా ఇతర భాషలలో గల మంత్రాలు అపభ్రంశాలు. మళయాళమంత్రాలు, హిందీ, పార్శీమంత్రాలు.

**వైదికాప్రణవైర్యుతాః ప్రణవేనవిహీనంతు తాంత్రికా ఏవప్ర కీర్తితా ॥**

ఓంకారము ఉన్నవి వైదికమంత్రాలని, ఓంకారము లేనివి తాంత్రిక మంత్రాలని చెప్పబడుతున్నాయి.

మంత్రాలను స్త్రీ, పురుష, నపుంసక మంత్రాలు అని మూడు రకాలుగా విభజించారు.

'స్వాహా' అనే పదము చివర గలవి స్త్రీ మంత్రాలు.

'హుంఫట్' అనే పదము చివరగలవి పురుషమంత్రాలు.

‘నమః’ అనే పదము చివరగలవి పురుషమంత్రాలు.

పురుషదేవతలనుపాసించే వాటిని మంత్రాలని, స్త్రీ దేవతలనుపాసించే వాటిని ‘విద్య’ అని అంటారు. ఈ మంత్రాలలో

| | | |
|---|---|---|
| ఒకే అక్షరము గల వాటిని | – | పిండము |
| మూడు అక్షరాలు గల వాటిని | – | కర్తరులు |
| మూడు నుంచి తొమ్మిది వరకు అక్షరాలు | – | బీజములు |
| పది నుంచి ఇరవై వరకు అక్షరాలు గల వాటిని | – | మంత్రాలు |
| ఇరవైకన్న ఎక్కువ అక్షరాలున్న వాటిని | – | మాలామంత్రాలు |

అంటారు. వైదికమంత్రాలు మోక్షానికి ఉపకరిస్తాయి. శ్రీమన్నారాయణుని ప్రీతి కోసం చేసేది నారాయణమంత్రం. అదే అష్టాక్షరి **నారాయణోపనిషత్తు**లో

**ఓమి త్యగ్రే వ్యాహరేత్, నమఇతిపశ్చాత్ నారాయణాయేత్యుపరిష్టాత్, ఓమిత్యేకాక్షరమ్, నమఇతి ద్వే అక్షరే, నారాయణాయేతి పంచాక్షరాణి, ఏతద్వై నారాయణస్యాష్టా క్షరం పదమ్, యోహవై నారాయణస్యాష్టాక్షరం పదమధ్యేతి, అనపబ్రు వస్సర్వ మాయు రేతి, విందతే ప్రాజాపత్యమ్, రాయస్పోషం గౌపత్యమ్, తతో–మృతత్వ మశ్నుతే తతోఽమృతత్వమశ్నుత ఇతి, ఏత త్సామవేద శిరో–ధీతే**

ముందుగా ‘ఓం’ అని తరువాత ‘నమో’ అనాలి. ఆతరువాత ‘నారాయణాయ’ అనాలి. ఇది అష్టాక్షరీమహామంత్రము – ఈ మంత్రాన్ని శ్రద్ధాసక్తులతో, విశ్వాసముతో ప్రీతితో జపం చేసేవాడు పూర్ణాయువు అవుతాడు. అతడు స్వర్గాధిపత్యము పొందుతాడు. ధనధన్యాలు, సిరిసంపదలు, భోగభాగ్యాలు అన్నీ పొందుతాడు. చివరకు అమృతత్వాన్ని పొందుతాడు. మృత్యుంజయుడవుతాడు” అని చెప్పబడింది.

**తారసారోపనిషత్తు**లో భరద్వాజుడు యాజ్ఞవల్క్యుని దగ్గరకు వెళ్ళి ‘దేవా ! తారకమంత్రము అంటే ఏమిటి ? అది దేన్ని తరింపచేస్తుంది?’ అని అడిగాడు. దానికి యాజ్ఞవల్క్యుడు **“ఓం నమో నారాయణాయ”** అనేది తారకమంత్రము. ఇందులో

| | | |
|---|---|---|
| ఓం అనేది | – | ఆత్మ స్వరూపము |
| నమః అనేది | – | ప్రకృతిస్వరూపము |
| ‘నారాయణాయ’ అనే ఐదు అక్షరాలు | – | పరబ్రహ్మస్వరూపము. |

ఈ విషయం తెలిసినవాడు మృత్యుంజయుడవుతాడు. ఇందులో

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఓంకారము | - | బ్రహ్మ | ర కారము | - | అండము, విరాట్టు |
| న కారము | - | విష్ణువు | య కారము | - | పురుషుడు |
| మ కారము | - | రుద్రుడు | ణ కారము | - | భగవంతుడు |
| న కారము | - | ఈశ్వరుడు | య కారము | - | పరమాత్మ |

ఇదే ఉపాసించవలసిన మంత్రము

ఇది అష్టాత్మలుగా ఎనిమిది విధాలవుతుంది.

| | | | | | |
|---|---|---|---|---|---|
| మొదటి అక్షరము | - | అకారము | ఐదు, ఆరు అక్షరాలు | - | నాదము |
| రెండవ అక్షరము | - | ఉ కారము | ఏడవ అక్షరము | - | కలాతీతము |
| మూడవ అక్షరము | - | మ కారము | ఎనిమిదవ అక్షరము | - | తత్పురుషుడు |
| నాల్గవ అక్షరము | - | బిందువు | | | |

ఇదే తారక మంత్రము. పరబ్రహ్మస్వరూపము అని చెప్పాడు. అదేవిధంగా

**నృసింహతాపిని ఉపనిషత్తు**లో నృసింహమంత్రము **రామరహస్యోపనిషత్తు**లో రామమంత్రము **'గోపాలతాపిని' ఉపనిషత్తు**లో గోపాలమంత్రము చెప్పబడ్డాయి. అవన్నీ పరమేశ్వరుని ప్రతిరూపాలే. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'మంత్రః' అనబడుతున్నాడు.

## 281. చంద్రాంశుః

చల్లనికాంతి గలవాడు.

**క్లమహారి మహాహ్లాద తేజస్కరతయాపి చ ।**
**మంత్రాణా మేవచంద్రాంశు ఆహ్లాదఫలదోమనుః ॥**

నిరంతరము తన నామజపంచేసేవారు, తనను అర్చించేవారు అయిన భక్తుల శ్రమను పోగొట్టి వారికిమహదానందము కలుగచేసే కాంతినిచ్చేవాడు. ఈ నామాన్ని మహామంత్రంగా జపిస్తే మహదానందం కలుగుతుంది.

**చంద్రస్యేవ అంశవః యస్యసః చంద్రాంశుః** మననము చేసేవారి శ్రమను తొలగించి, వారికి ఆహ్లాదము కలుగచేసేవాడు. సంసారతాపము అనే సూర్యుని కిరణములవల్ల తపించేవారికి చంద్రునివలె చల్లనికాంతినిచ్చి ఆహ్లాదము కలిగిస్తాడు.

పరమేశ్వరుడు సూర్యుని వెలుగుతో, చంద్రుని చల్లదనంతో ప్రకాశిస్తుంటాడు. అందుచేత తన భక్తులకు ఆహ్లాదము కలిగిస్తాడు అని చెప్పబడింది. కాబట్టి పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు 'చంద్రాంశుః' అనబడుతున్నాడు.

# 282. భాస్కరద్యుతిః

సూర్యుని వంటి తేజస్సు గలవాడు.

**పరప్రభావాభి భవ లక్షణ ద్యుతిమాంశ్చయః ।**

**సభాస్కరద్యుతిః ప్రోక్తోనేత్రవైమల్యదోమనుః ॥**

శత్రువుల ప్రభావాన్ని అరికట్టే సూర్యుని కాంతి వంటి కాంతి గలవాడు.

ఈ నామాన్ని మంత్రంగా జపిస్తే కళ్ళజబ్బులు పోతాయి.

**భాస్కర స్యే ద్యుతిః యస్యసః భాస్కరద్యుతిః**

శత్రువులను పరాభవింప చేసే తేజస్సు గలవాడు. **భగవద్గీత**లోని పదకొండవ అధ్యాయము **'విశ్వరూప సందర్శన యోగము'**లోని 36వ శ్లోకము.

**స్థానేహృషీకేశ తవ ప్రకీర్త్యా జగత్ప్రహృష్యత్యనురజ్యతే చ ।**

**రక్షాంసిభీతాని దిశోద్రవంతి సర్వే నమస్యంతి చ సిద్ధ సంఘాః ॥**

ఓ అంతర్యామి ! కేశవా ! నీ నామ గుణప్రభావములను కీర్తిస్తూ, జగత్తంతా హర్షాతిరేకముతో, అనురాగముతో ఉప్పొంగిపోతున్నది. భయగ్రస్తులైన రాక్షసులు నలుదిక్కులకు పారిపోతున్నారు. సిద్ధగణాలన్నీ నీకు ప్రణామం చేస్తున్నాయి.

పరమేశ్వరునికి శత్రువులైన రాక్షసులు ఆయన విశ్వరూప ప్రకాశాన్ని చూసి పారిపోతున్నారు. ఈ రకంగా శత్రువులను పరాభవింపచేసే తేజస్సు గలవాడు.

**శ్రీమద్రామాయణము**లోని సుందరకాండలో

**శరజాలాంశుమాన్‌శూరః కపేరామదివాకరః ।**

**శత్రురక్షోమయంతోయముపశోషం నయిష్యతి ॥**

ఓ హనుమా ! శూరుడైన రాముడు అనే సూర్యుడు, కిరణములు అనే తన బాణసమూహముచేత, శత్రువులైన రాక్షసులు అనే నీటిని ఎండింపచేయగలడు. భారతంలో

**ఏవమేషోऽ సురాణాంచ సురాణాం చైవ సర్వశః ।**

**భయాభయకరః కృష్ణః సర్వలోకేశ్వరః ప్రభుః ॥**

ఈ రకంగా శ్రీకృష్ణుడు తన భక్తులయిన దేవతలకు అభయమిస్తున్నాడు. శత్రువులైన రాక్షసులకు భయము కలుగచేస్తున్నాడు.

కాంతిని ప్రసరింపచేయటంలో సూర్యునితో సమాన ధర్మము గలవాడు కాబట్టి 'భాస్కరద్యుతిః' అనబడుతున్నాడు.

నిజంగా చెప్పాలి అంటే పరమేశ్వరుని కాంతి ముందు సూర్యుడు వెలవెలబోతాడు. ఆ పరమేశ్వరుడు కొన్ని కోట్ల సూర్యులకాంతితో ప్రకాశిస్తున్నాడు.

**ఈశావాశ్యోపనిషత్తు**లో అర్చిరాది మార్గాన్ని వివరిస్తున్నాడు. అవసానకాల మందు సామాన్య మానవుని యొక్క ప్రాణాలు ఉత్క్రమిస్తాయి. అంటే శరీరంలో ఉండే ఏదో ఒక మార్గం గుండా బయటకు పోతాయి. కాని యోగి యొక్క ప్రాణాలు ఉత్క్రమింపవు. అవి సుషుమ్నా నాడిగుండా పైకిపోయి బ్రహ్మరంధ్రంగుండా బయటకు పోతాయి.

బ్రహ్మలోకానికి తలవాకిలి సూర్యమండలము. బ్రహ్మలోకానికి పోయే మార్గము అతికాంతివంతమైన బింబముచే కప్పబడి ఉంటుంది. ఆ కాంతిని మనము చూడలేము. అప్పుడు సాధకుడు ఆ కాంతిబింబాన్ని కొద్దిగా అడ్డు తొలగించి బ్రహ్మలోకానికి దారి చూపుమని ఆ పరమేశ్వరుణ్ణి ప్రార్థిస్తున్నాడు.

**హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపి హితముఖం ।**

**తత్త్వం పూషన్నపావృణు సత్యధర్మాయ దృష్టయే ॥**

**పూషన్నే కర్షేయమసూర్య ప్రాజాపత్య వ్యూహ రశ్మీన్ సమూహ ।**

**తేజోయత్ తే రూపం కల్యాణ తమం తత్ తేపశ్యామి యోఽసావసౌ పురుషః సోహమస్మి॥**

ఓ సూర్యభగవానుడా! జ్యోతిర్మయమగు పాత్ర చేత బ్రహ్మలోకముఖద్వారము కప్పబడి ఉన్నది. ఓ దేవా ! సత్యమైన ధర్మాన్ని ఆచరించే వారికోసం ఈ మార్గాన్ని తెరవవలసినది.

"జ్యోతిస్వరూపుడైన సూర్యభగవానుడా ! నీ కిరణాలను తొలగించి ఆ కాంతిని కొంత ఉపసంహరించు. నీ అనుగ్రహంచేత మంగళకరమైన నీ రూపాన్ని చూడగలుగుతాను" అంటాడు. ఇక్కడ సూర్యభగవానుడు అంటే ఆ పరమేశ్వరుడు తప్ప వేరుకాదు. ఈ రకంగా పరమేశ్వరుడు అమితమైన కాంతితో ప్రకాశిస్తుంటాడు. కాబట్టి శ్రీమన్నారాయణుడు 'భాస్కరద్యుతిః' అనబడుతున్నాడు.

## 283. అమృతాంశూద్భవః

చంద్రునకు జన్మస్థలమైనవాడు.

**సర్వతాప హరస్యైవ మృతసంజీవనస్యచ ।**

**అమృతాంశోహి తజ్జత్వా దమృతాం శూద్భవ స్స్మృతః ॥**

తాపములను హరించువాడు, చనిపోయిన వారిని బ్రతికించే శక్తిగల అమృత కిరణముల చంద్రుడు పరమేశ్వరుని మనసు నుంచి ఆవిర్భవించాడు.

**అమృతాంశుః ఉద్భవతి అస్మాదితి అమృతాంశూద్భవః**

సకల తాపములు హరించగలిగే అమృత కిరణములు గల చంద్రుడు ఇతని హృదయము నుండే ఉద్భవించి ఆ హృదయములో ఉన్న చల్లదనము కారణంగా శీతకిరణుడైనాడు. **పురుషసూక్తం**లో

**బ్రాహ్మణోశ్య ముఖమాసీత్ । బాహూ రాజన్యః కృతః**
**ఊరూతదస్యయద్వైశః । పద్భ్యాగ్ం శూద్రో అజాయత**
**చంద్రమానునసోజుతః । చక్షో సూర్యో అజాయత**

ఆ విరాట్స్వరూపుని

| | | | | | |
|---|---|---|---|---|---|
| ముఖము నుండి | - | బ్రాహ్మణులు | పాదములనుండి | - | శూద్రులు |
| బాహువుల నుండి | - | క్షత్రియులు | మనస్సు నుండి | - | చంద్రుడు |
| ఊరువులనుండి | - | వైశ్యులు | కనులనుండి | - | సూర్యుడు |

ఉద్భవించారు అని చెప్పబడింది.

**దేవీభాగవతం**లో తారకాసురసంహారంకోసం దేవతలందరూ పరమేశ్వరిని ప్రార్థిస్తారు. అప్పుడు ఆమె ప్రత్యక్షమైంది. ఆమె యొక్క విరాడ్రూపం చూపమని అడుగుతాడు హిమవంతుడు. ఆ రూపము ఏవిధంగా ఉన్నది అంటే -

| | | | | | |
|---|---|---|---|---|---|
| సత్యలోకం | - | శిరస్సు | ధర్మము | - | వీపు |
| దిక్కులు | - | చెవులు | నదులు | - | నాడులు |
| వాయువు | - | ప్రాణం | చంద్రుడు | - | మనస్సు అని చెప్పబడింది. |

**భగవద్గీత**లోని పదవ అధ్యాయము **'విభూతియోగము'**లోని 21వ శ్లోకము

**ఆదిత్యానామహం విష్ణుః జ్యోతిషాం రవిరంశుమాన్ ।**
**మరీచిర్మరుతామస్మి నక్షత్రాణామహం శశీ ॥**

ద్వాదశాదిత్యులలో విష్ణువును నేను, జ్యోతిర్మయస్వరూపులలో సూర్యుడను నేను. వాయుదేవతలలోని తేజమును నేనే, నక్షత్రములలో చంద్రుడను నేను అని చెప్పాడు.

అశ్వని, భరణి మొదలైన నక్షత్రాలు 27. నక్షత్రాలకు అధిపతి చంద్రుడు. ఆ చంద్రుడు సాక్షాత్తూ తానే అని చెబుతున్నాడు భగవానుడు.

దేవదానవులు అమృతం కోసం క్షీరసాగరాన్ని మథిస్తున్నారు. అప్పుడు అందులో నుంచి కల్పవృక్షము, కామధేనువు, ఐరావతములతోపాటుగా చంద్రుడు కూడా ఉద్భవించాడు. కాబట్టి చంద్రుని ఆవిర్భావానికి కారణము పరమేశ్వరుడే. అందుచేతనే శ్రీమన్నారాయణుడు "అమృతాంశూద్భవః" అనబడుతున్నాడు.

## 284. భానుః

ప్రకాశించేవాడు.

**రవే స్తే జస్వర త్వాచ్చ భాను రిత్య భిధీయతే**

సూర్యుడికి కూడా కాంతులు ప్రసాదించేవాడు.

**భాతీతి భానుః** అధిక ప్రకాశము కలిగిన సూర్యుడు కూడా పరమేశ్వరుని తేజస్సువల్లనే ప్రకాశిస్తున్నాడు.

**యస్యా దిత్యోభా ముపయుజ్యభాతి** ఎవని కాంతివల్ల ఆ సూర్యుడు ప్రకాశిస్తున్నాడో! అంటే ఆ పరమేశ్వరుని కాంతులచేతనే సూర్యుడు ప్రకాశిస్తున్నాడు అని అర్థం.

భైరవయామళంలో శివుడు పార్వతికి పరమేశ్వరిస్వరూపాన్ని వివరిస్తున్నాడు.

**జ్యోతిరూపా పరాకారా యస్యాదేహోద్భవాశ్శివే ॥**

**కిరణాశ్చసహస్రంచ ద్విసహస్రంచ లక్షకమ్ ।**

**కోటిరర్బుద మేతేషాం పరాసంఖ్యాన విద్యతే ॥**

ఆ పరమేశ్వరి జ్యోతి రూపమై ప్రకాశిస్తున్నది. ఆమె దేహము నుండి వేయి, రెండువేలు, లక్ష, కోటి, అర్బుదము. ఇలా అనంతములైన కిరణాలు ప్రసరిస్తున్నాయి.

**తామేవాను ప్రవిశ్యైవ భాతిలోకం చరాచరమ్ ।**

**యస్యాదేవ్యా మహేశాని భాసా సర్వం విభాసతే ॥**

**తద్భాసారహితం కించిత్ నచయచ్చ ప్రకాశతే ।**

**తస్యాశ్చ శివశక్తేశ్చ చిద్రూపా యాశ్చితం వినా ॥**

ఆ కిరణసముదాయము వల్లనే ఈ జగత్తుఅంతా ప్రకాశిస్తున్నది. ఆమె కాంతి గనక లేకపోయినట్లైతే ఏ వస్తువూ ప్రకాశించదు.

**అంధ్యమా పథ్యతే నూనం జగదేవచ్చరాచరమ్ ।**

**తేషాం అనంతకోటీనాం మయూఖానాం మహేశ్వరీ ॥**

**మద్యే ష ష్ట్యుత్తరంతేఽ మీత్రిశతం కిరణాశ్శివే ।**

**బ్రహ్మాండం వ్యశ్ను వానాస్తే సోమ సూర్యానలాత్మనా ॥**

ఈ జగత్తుంతా అంధకారంతో నిండిపోతుంది. పరమేశ్వరీ ! అనంతమైన సంఖ్యలో గల ఆ కిరణములలో మూడు వందల అరవై కిరణాలు సోమసూర్యాగ్నుల ద్వారా జగత్తులో వ్యాపించి ఉన్నాయి.

**అష్టోత్తరశతం వహ్నే షోడశోత్తర శతంరవే**

**షట్త్రింశతదుత్తరశతం చంద్రస్య కిరణాశ్శివే ।**

**బ్రహ్మాండం భాసయంతస్తే పిండాండ మపిశాంకరి**

అందులో 108 కిరణములను అగ్ని, 116 కిరణములను సూర్యుడు, 136 కిరణములను చంద్రుడు గ్రహించారు. ఆ కిరణములవల్ల పిండాండబ్రహ్మాండాలు ప్రకాశిస్తున్నాయి. అని చెప్పబడింది. కాబట్టి ఆ పరమేశ్వరుడు తాను ప్రకాశిస్తు సూర్యచంద్రులను కూడా ప్రకాశింపచేస్తాడు. అందుకే శ్రీమన్నారాయణుడు 'భానుః' అనబడుతున్నాడు.

## 285. శశబిందుః

అన్యాయమార్గములలో తిరిగేవారిని వక్రమార్గాలలో చరించేవారిని నశింపచేసేవాడు.

**శశ ప్లుత గతిః ప్రోక్తో బిన్దుస్తస్య నివర్తకః ।**

**కౌటిల్య గతివిధ్వంసీ శశబిన్దు రుదాహృతః ॥**

శశము – అక్రమ నడవడి. బిందువు – మాపువాడు అక్రమనడవడి గలవారిని శిక్షించువాడు.

**శశానాం కుటిలగతీనాం బిందుః అపలపితా ఇతి శశబిందుః**

వక్రమార్గములో చరించే వారిని, అధర్మపరులను, అన్యాయవర్తనులను శిక్షించువాడు. నశింపచేయువాడు.

కాలనేమి అనే రాక్షసుడు ఉగ్రసేన మహారాజుకు క్షేత్రజుడైన కుమారుడుగా జన్మించాడు. తల్లితండ్రులను చెరసాలలో పెట్టి తాను రాజయ్యాడు. దేవకి ఇతని సోదరి. దేవకీ వసుదేవులకు వివాహం చేశాడు. దేవకి అష్టమ గర్భాన పుట్టినవాడు నిన్ను సంహరిస్తాడు అని అశరీరవాణి చెప్పిన పలుకులు విని దేవకీవసుదేవులను కూడా కారాగృహంలో బంధించాడు. వారికి జన్మించిన కుమారులందరినీ సంహరించాడు.

అష్టమగర్భాన జన్మించిన శ్రీకృష్ణుని సంహరించటానికి అనేకమంది రాక్షసులను పంపించాడు. దుర్మార్గపు పనులు చేశాడు. ఈ రకంగా అన్యాయమార్గవర్తనుడైన కంసుని సంహరించాడు.

నరకాసురుడు. వరహావతారంలో విష్ణుమూర్తికి భూదేవియందు జన్మించినవాడు. బలగర్వముతో దేవతలను, మానవులను నానాబాధలు పెడుతున్నాడు. పదహారు వేలమంది స్త్రీలను చెరపట్టాడు. అదితి కర్ణకుండలములను, వరుణచ్ఛత్రము అపహరించాడు. ఈ రకంగా దుర్మార్గపు పనులు చేస్తున్న నరకాసురుని కృష్ణుడు సత్యభామా సమేతుడై సంహరించాడు.

ఈ రకంగా వక్రమార్గంలో చరించే వారిని శిక్షించే వాడు కాబట్టే శ్రీమన్నారాయణుడు 'శశబిందుః' అనబడుతున్నాడు.

శశము అంటే – కుందేలు. బిందువు అనగా – మచ్చ. కుందేలు వంటి మచ్చ గలవాడు చంద్రుడు. చంద్రునివలె లోకాలను పోషించేవాడు. ప్రశ్నోపనిషత్తులో పిప్పలాదుడు తన శిష్యుడైన కబంధికి ప్రాణికోటి పుట్టుకను గురించి వివరిస్తున్నాడు.

"ప్రజాపతి సంతానాన్ని పొందాలని కోరిక గలవాడై తపస్సు చేశాడు. ఇక్కడ తపస్సు అంటే – పూర్వకల్పంలో తాను చేసిన సృష్టిని ధ్యానించటము.

ఈ రకంగా తపస్సు చేసి రయి, ప్రాణము అనే జంటను సృష్టించాడు.

'రయి' అంటే అన్నము, పదార్థము, చంద్రుడు అని అర్థం. చంద్రునివల్లనే భూమిమీద ద్రవ్యత్వము, రసము కలుగుతున్నాయి. చంద్రుడే ఓషధులకు వనస్పతులకు కారకుడు. ఓషధులు వనస్పతులే అన్నము. ఈ రకంగా పదార్థము అంటే చంద్రుడు, అన్నము. ఈ చంద్రనివల్లనే ప్రాణికోటికి ఆహారం లభిస్తున్నది" **భగవద్గీత**లోని 15వ అధ్యాయం **'పురుషోత్తమప్రాప్తి యోగము'**లోని 13వ శ్లోకం.

**గామావిశ్య చ భూతాని ధారయామ్యహ మోజసా ।**

**పుష్ణామి చౌషధీః స్సర్వాః సోమో భూత్వా రసాత్మకః ॥**

భూమియందు ప్రవేశించి, నా శక్తిద్వారా సకల భూతములను ధరించి పోషిస్తున్నాను. అమృతమయుడైన చంద్రుడనై ఓషధులకు, వనస్పతులకు పుష్టిని చేకూర్చుతున్నాడు.

చంద్రుని స్వరూపము రసమయము. అంటే అమృతమయము. అందుచేతనే పరమేశ్వరుడు చంద్రుని రూపంలో అందరినీ పోషిస్తున్నాడు. కాబట్టే శ్రీమన్నారాయణుడు 'శశబిందుః' అనబడుతున్నాడు.

## 286. సురేశ్వరః

సన్మార్గులకు నిర్వాహకుడు, దేవతలకు రాజు.

**ధర్తా ఋజుగతీనాం యః స సురేశ్వర ఈరితః**

సన్మార్గ వర్తనులకు అండగా ఉండేవాడు.

**సురాణాం ఋజుగతీనాం దేవానాం ఈశ్వరః నిర్వాకః సురేశ్వరః**

సన్మార్గంలో ప్రయాణించే దేవతలకు నిర్వాహకుడు మార్గదర్శి.

దేవతలైనప్పటికీ వారు సన్మార్గంలో చరిస్తేనే వారికి అండగా ఉంటాడు. అంతేకాని చెడ్డ పనులు చేస్తే సహించడు. దేవతలు అమృతంకోసం క్షీరసాగరమథనం చెయ్యాలి అనుకున్నారు. మందరగిరి మునిగిపోతుంటే శ్రీహరి కూర్మమై దాన్ని మోశాడు. మోహిని రూపంలో వచ్చి అమృతాన్ని దేవతలకు పంచాడు.

అదే దేవరాజైన ఇంద్రుడు అహల్యనుకోరి, గౌతముడి ఆశ్రమానికి వెళ్ళి శాపగ్రస్తుడైనాడు. ఆ హరి ఆ సమయమంలో దేవేంద్రుడికి సాయంచెయ్యలేదు. సంసార మార్గం వక్రంగానే ఉంటుంది. బ్రహ్మమార్గము ఋజువుగా ఉంటుంది.

ఈ రకంగా సన్మార్గవర్తనులను మాత్రమే రక్షిస్తాడు. కాబట్టి శ్రీమన్నారాయణుడు 'సురేశ్వరః' అనబడుతున్నాడు.

**సురాణాం దేవానాం ఈశ్వరః**

సురలు – శోభనమైన దానిని ఇచ్చేవారు. అటువంటి దేవతలకు ప్రభువు, రాజు.

బ్రహ్మాది దేవతలకు ఈశ్వరత్వమునిచ్చేవాడు. మోక్షమిచ్చేవాడు. బ్రహ్మకల్పము పూర్తి అయిన తరువాత కర్మబ్రహ్మకు మోక్షం సిద్ధిస్తుంది. ఈ రకంగా వారికి సాయుజ్యము నిచ్చేవాడు. కాబట్టే పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు 'సురేశ్వరః' అనబడుతున్నాడు.

## 287. ఔషధమ్

ఔషధము

**భవతీవ్రవిషం హర్తా ఔషధం య స్స ఉచ్యతే**

సంసారము అనే విషాన్ని హరించగలిగే ఔషధము వంటివాడు.

పరమేశ్వరి విషము, పరమేశ్వరుడు అమృతమయుడు అని చెప్పటం జరిగింది ఎందుకంటే పరమేశ్వరి లోకమాత. కాబట్టి తన భక్తులయొక్క కోరికలు తీరుస్తుంది. ఆ

సమయంలో ఇది మంచి కోరికా ? కాదా ? దీనివలన ఉపయోగము ఏమిటి ? అనే విషయాలు ఆమె చూడదు. కుమారుడు అడిగాడు తల్లి ఇచ్చింది. అంతే అయితే సామాన్యంగా మానవులు కోరే కోరికలు ఐహికానికి సంబంధించి ఉంటాయి. ధనధాన్యాలు, భోగభాగ్యాలు, సిరిసంపదలు ఇవే భక్తులు కోరేవి. భోగము ఉంటే మోక్షమురాదు అని సిద్ధాంతం. కాబట్టి ఆ భక్తులు తమ కోర్కెలు తీర్చుకుని అంతకంతకు లౌకిక విషయాలమీద ఆసక్తి ఎక్కువ చూపుతారు. అంటే సంసారసాగరంలో మునిగిపోతారు. అంతేకాని జన్మరాహిత్యాన్ని గురించి ఆలోచించరు. అందుచేతనే పరమేశ్వరి విషము అని చెప్పబడింది.

పరమేశ్వరుడు అలాకాదు. తనను నమ్మిన వారి ఐహికబంధనాలు ఒక్కొక్కటీ త్రెంచి పారేస్తాడు. చూసేవారికి భక్తుడు చాలా కష్టాలు పడుతున్నాడు అనిపిస్తుంది. కాని అది నిజంకాదు. ఈ బంధనాలన్నీ తెగిపోగా, అతడి మనసు భగవంతుని మీదనే లగ్నమవుతుంది. తద్వారా అతడు ఇంకా ఇంకా మోక్షగామి అయి చివరకు సాయుజ్యం పొందుతాడు. అది మరణములేని స్థితి. అంటే సాయుజ్యం పొందినవాడు తిరిగి జన్మించడు. జన్మించనివాడికి మరణం ఉండదు. ఈ రకంగా పరమేశ్వరుడు అమృతమయుడు. సంసార సాగరంలో మునిగిపోయినవాడిని ఆ పరమేశ్వరుడు వరహావతారంలో శ్రీమహావిష్ణువు భూమిని రక్షించినట్లుగా ఆ పరమేశ్వరుడు రక్షిస్తాడు. కాబట్టే శ్రీమన్నారాయణుడు 'ఔషధమ్' అనబడుతున్నాడు.

## 288. జగతః సేతుః

జగత్తుకు సేతువు వంటివాడు.

**నిరోధా జ్జగత స్సేతుః సదసద్వర్గ సజ్గతే ॥** మంచి, చెడు. ఈ రెండు ఒకటి కాకుండా మధ్యనతాను ఒక సేతువువలె ఉండేవాడు. పుణ్యపాపములు, న్యాయన్యాయములు కలిసిపోకుండా నిరోధించేందుకు ఒక సేతువులాగా ఉండి దేని ఫలితాన్ని దానికి ఇచ్చేవాడు.

లోకంలో యజ్ఞయాగాది ఉత్తమకర్మలు చేసేవారు ఉత్తమయోనులయందు జన్మిస్తారు. నీచకర్మలు చేసేవారు నీచయోనులయందు జన్మిస్తారు. అంతకన్న హీనమైన కర్మలు చేసేవారు క్రిమికీటకాదులుగా జన్మించి తక్కువకాలంలోనే మరణిస్తారు. తాను చేసిన కర్మ ఫలంగానే మానవుడు మళ్ళీ జన్మిస్తాడు. కర్మఫలం జీవిని ఎన్నటికీ వదలదు.

**యథాధేను సహస్రేషు వత్సోవిందతి మాతరం ।**
**తథా పూర్వకృతంకర్మ కర్తారమనుగచ్ఛతి ॥**

ఆవులమందలో  దూడ తన తల్లిని ఏవిధంగా గుర్తు పట్టి దానితోనే ఉంటుందో, అలాగే పూర్వజన్మలో చేసిన కర్మ, ఆ కర్మచేసిన వానిని గుర్తించి అతని వెన్నంటే ఉంటుంది.

అందుచేత ఎవరు చేసిన కర్మవారనుభవించక తప్పదు. రామాయణంలో చెప్పినట్లుగా

**శుభకృచ్ఛుభమాప్నోతి పాపకృత్ పాపమశ్నుతే** మంచి కర్మలు చేసినవాడు మంచి ఫలితము, చెడు కర్మలు చేసినవాడు చెడ్డఫలితముపొందుతాడు.

ఈ రకంగా మంచి చెడులను విభజించి ఫలితాన్ని ఇస్తాడు. కాబట్టి శ్రీమన్నారాయణుడు 'జగతః సేతుః' అనబడతాడు.

జగతః సేతుః అంటే – జగత్తుకు వంతెన. సంసారసాగరాన్ని దాటటానికి వంతెన వంటివాడు. పరమేశ్వరుడు బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రులను నాలుగువర్ణాలను సృష్టించాడు. ఇవి కూడా వారు చేసే కర్మానుసారము ఈ విభజన జరిగింది. ఈ వర్ణవిభజనలో ముఖ్యోద్దేశ్యము వేదాలను రక్షించటము **బృహదారణ్యకోపనిషత్తు**లో "నామరూపాత్మకమైన సృష్టికి ఆరంభంలో ఉన్నది పరబ్రహ్మస్వరూపము. అంటే విరాడ్రూపంలో ఉన్న అగ్ని. అదే బ్రాహ్మణరూపం. క్షత్రియాది ఇతర వర్ణాలు లేవు. అయితే క్షత్రియులు లేకపోవటంవల్ల పాలనా వ్యవహారాలు కష్టమైనాయి. అప్పుడు ఆ విరాడ్బ్రహ్మ "నేను బ్రాహ్మణుడను. ఇవినా విధులు" అని తలచి క్షత్రియరూపాన్ని సృష్టించాడు. దేవతలలో ఇంద్రుడు సోముడు మొదలైనవారు క్షత్రియులు.

క్షత్రియుల్ని సృష్టించి కూడా బ్రహ్మ తన పనిలో కృతకృత్యుడు కాలేకపోయాడు. ధనాన్ని కూడబెట్టేందుకు వైశ్యుని సృష్టించాడు. అప్పటికి కూడా బ్రహ్మ తనపనిలో సమర్థుడు కాలేకపోయాడు. అందుచేత శూద్రులను సృష్టించాడు. పంటలు పండించి లోకాలకు ఆహారాన్ని సమకూర్చటమే వారి పని. ఈ రకంగా చతుర్వర్ణాలు సృష్టించబడినాయి" అని చెప్పబడింది.

అలాగే చతురాశ్రమధర్మాలు. బ్రహ్మచర్యము, గృహస్థాశ్రమము, వానప్రస్తము, సన్యాసము.

ఈ రకంగా చతుర్వర్ణధర్మాలు, చతురాశ్రమధర్మాలు, ఇతర ధర్మాలు ఏవీ కూడా పరస్పరము కలిసిపోకుండా రక్షించేవాడు.

అందుకే శ్రీమన్నారాయణుడు 'జగదః సేతుః' అనబడుతున్నాడు.

# 289. సత్య ధర్మపరాక్రమః

సత్యమైన శుభప్రదమైన గుణాలు కలవాడు.

**సత్యాహ్యా వితథాధర్మాః గుణాః యస్య పరాక్రమః ।**
**చేష్టితాని చ సన్తీతి సత్యధర్మ పరాక్రమః ॥**

ధర్మములు అంటే – సార్ధకములైన కల్యాణగుణాలు పరాక్రమము అంటే – చేష్టలు.

ఈ గుణము, చేష్ట రెండూ సత్యమైనవాడు.

**సత్యాః ధర్మాః పరాక్రమః యస్యసః సత్యధర్మపరాక్రమః**

సత్యమైన ధర్మము, సత్యమైన పరాక్రమము గలవాడు. **భగవద్గీత**లోని పదవ అధ్యాయం **'విభూతియోగం'**లోని 14వ శ్లోకం.

**సర్వమేతదృతం మన్యే యన్మాం వదసి కేశవ ।**
**న హి తే భగవన్ వ్యక్తిం విదుర్దేవా న దానవాః ॥**

కేశవా ! నువ్వు చెప్పినది అంతా సత్యమే. నీ మాయా స్వరూపాన్ని దేవతలుగాని, దానవులుగాని తెలిసికోలేరు.

శ్రీకృష్ణభగవానుడు సమస్త జగత్తుకు హర్త, కర్త, సర్వాధారుడు, సర్వవ్యాపి, సర్వశక్తిమంతుడు, అందరికీ ఆద్యుడు, నియంత, సర్వాంతర్యామి, దేవాది దేవుడు, సాక్షాత్తూ సచ్చిదానంద ఘనపరబ్రహ్మ, పరమాత్మ. ఆయన ఉపదేశాలు సత్యము అని భావించి విశ్వసిస్తున్నాడు అర్జునుడు. ఇక్కడ శ్రీకృష్ణపరమాత్ముడు భగవంతుడు. భగవంతుడు అంటే

**ఐశ్వర్యస్య సమగ్రస్య ధర్మస్య యశసః శ్రియః ।**
**జ్ఞానవైరాగ్య యోశ్చైవ షణ్ణాం భగ ఇతీరిణా ॥**

సమస్తమైన ఐశ్వర్యము, ధర్మము, యశస్సు, సంపద, జ్ఞానము, వైరాగ్యము ఈ ఆరింటినీ భగము అంటారు. వీటిని కలిగినవాడు భగవంతుడు.

**ఉత్పత్తిం ప్రలయంచైవ భూతానా మాగతింగతిమ్ ।**
**వేత్తివిద్యామవిద్యాంచ సవాచ్యో భగవానితి ॥**

ఉత్పత్తి, ప్రళయము, ప్రాణుల ఆగమనము, గమనము, విద్య, అవిద్యలను తెలిసినవాడు భగవంతుడు. అందుచేతనే శ్రీకృష్ణుడు భగవానుడు. అతడు చెప్పేది ధర్మము.

సత్యములు అనగా - నిష్ఫలములు కానివి

ధర్మములు అనగా - జ్ఞానాది గుణములు

కాబట్టి సత్యము, ధర్మము పరాక్రమముగా గల శ్రీమన్నారాయణుడు 'సత్యధర్మపరాక్రమః' అనబడుతున్నాడు.

## 290. భూతభవ్య భవన్నాథః

త్రికాలములకు నాథుడు.

**ఐశ్వర్యం వాథ స్వామ్యం వాత్రికాలేష్వపి యస్యసః ।**

**భూతభవ్యభవన్నాథః ఇత్యుక్త స్సద్భిరాదరాత్ ॥**

పరమేశ్వరుడు త్రికాలములయందు కూడా సకలము నియమించే సామర్థ్యము గలవాడు. అన్నింటికీ స్వామి.

**భూతభవ్యభవతాం నాథః భూతభవ్యభవన్నాథః** త్రికాలములందు మహదైశ్వర్యము గలవాడు. పరమేశ్వరుడు భూతభవిష్య ద్వర్తమానాలకు అన్నింటికీ ప్రభువు. **మాండూక్యోపనిషత్తులో**

**ఓమిత్యే తదక్షరమిదగ్ం సర్వం తస్యోపవ్యాఖ్యానం ।**

**భూతంభవద్భవిష్యదితి సర్వమోంకార ఏవ ।**

**యచ్చాన్యత్ త్రికాలాతీతం తదప్యోంకారమేవ ॥**

కంటికి కనుపించే చరాచరజగత్తంతా ఓంకారమే. భూతభవిష్యద్వర్తమాన కాలాలలో ఉన్నదంతా కూడా ఓంకారమే. ఈ మూడింటినీ అతిక్రమించినది ఏదైనా ఉంటే, అది కూడా ఓంకారమే" అని చెప్పబడింది. ఇక్కడ ఓంకారము అంటే పరమేశ్వరుడే.

**భూతానాం భవ్యానాం భవతానాం చ ప్రాణినాం నాథః**

భూతభవిష్యద్వర్తమాన కాలాలన్నింటిలోనూ జీవులకు ప్రభువు.

త్రికాలములందు ప్రాణులచే యాచించబడువాడు. ఆ ప్రాణులను శాసించువాడు.

త్రికాలములయందలి ప్రాణులు సుఖశాంతులను కోరి, అతనిని ప్రార్థించి, చివరకు అతన్నే చేరతాయి. అందుచేతనే పరమేశ్వరుడు త్రికాలములకు నాథుడు. కాలము అనేది మనసుకు సంబంధించినది. ఏదైనా సంకల్పము చేసినప్పుడే 'కాలము' అనేది తెలుస్తుంది. సంకల్పము గనక ఆగిపోతే కాలము తెలియదు. ఈ రకంగా కాలానికి ఆధారం మనస్సు.

మనస్సుకు ఆధారం చైతన్యము. అటువంటి చైతన్యస్వరూపుడు శ్రీమన్నారాయణుడు. అతడు పరమపవిత్రుడు. అన్నింటినీ పవిత్రం చేస్తాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'భూతభవ్యభవన్నాథః' అనబడుతున్నాడు.

## 291. పవనః

సంచరించువాడు.

**సదాస్వయం తు సర్వత్ర ప్రవాహ ఇవ నిత్యశః**
**పవనః ప్రవహతియః కథ్యతే వేగదో మనుః**

సర్వకాలసర్వావస్థల యందు ప్రవాహమువలె సంచరించువాడు.

**పునాతిగచ్ఛతీతి పవనః** అన్ని ప్రదేశాలయందు ఎల్లవేళలా సంచరించువాడు. పవిత్రత కలిగించేవాడు. వాయురూపుడు.

**భగవద్గీత**లోని10వ అధ్యాయం **'విభూతియోగం'**లోని 31వ శ్లోకం.

**పపనః పవతామస్మి రామ శ్శస్త్రభృతామహమ్ ।**
**ఝషాణాం మకరశ్చాస్మి స్రోతసామస్మి జాహ్నవీ ॥**

పవిత్రమొనరించువారిలో వాయుదేవుడను నేను, శాస్త్రధారులలో శ్రీరామచంద్రుడను. జలచరములలో మొసలిని. నదులలోగంగానది నేను. పవతాం అంటే మిక్కిలి వేగవంతుడు, పవిత్రమైనవాడు అని అర్థం. కాబట్టి మిక్కిలి వేగము గల వారిలో వాయుదేవుడను నేను. అలాగే పవిత్రమొనరించువారిలో వాయుదేవుడను నేను. అంటున్నాడు భగవానుడు. **ఛాందోగ్యోపనిషత్తు**లో ఆ పరమేశ్వరుడే వాయువు అని చెప్పబడింది.

పూర్వకాలంలో అరణ్యంలో ఒక ఆశ్రమం ఉండేది. అందులో ఇద్దరు ఋషులు ఉండేవారు. శౌనకుడు, అభిప్రతారి అని వారి పేర్లు. వాయుదేవుడు వారి ఆరాధ్యదైవం. ఒకరోజు మధ్యాహ్నం వారు భోజనం చేయబోయే సమయంలో తలుపు తట్టిన చప్పుడయింది. "భవతీ ! భిక్షాం దేహి" అని వినిపించింది. ఎవరో బ్రహ్మచారి భిక్షాటనకు వచ్చాడు. "ఇది సమయంకాదు. వెళ్ళు" లోపల నుంచి సమాధానం. భిక్షుకుడికి లేదనంటం విచిత్రం ఏమీకాదు. కాని ఋష్యాశ్రమంలో తిరస్కారానికి ఆశ్చర్యపోయాడు బ్రహ్మచారి. ఈ ఆశ్రమవాసులను తేలికగా వదలకూడదు అనుకున్నాడు. వెంటనే లోపలున్న వారినుదేద్దశించి "ఆర్యా ! తమరు ఏ దేవతలనుపాసిస్తారు"? అని ప్రశ్నించాడు బ్రహ్మచారి.

"నువ్వు చాలా మొండివాడిలా ఉన్నావయ్యా ! మా ఉపాసనాదైవం వాయువు. ఆయననే ప్రాణం అని కూడా అంటారు." అన్నాడు ఆశ్రమం లోపల నుంచి ఒక ఋషి.

"స్వామీ ! ఈ ప్రపంచం అంతా ప్రాణం వల్ల రూపం దాల్చింది. సృష్టి అంతా తిరిగి ప్రాణంలోనే లయం అయిపోతుంది. ఈ విషయం తమకు తెలుసుగదా ! ప్రాణమనేది కనుపించే వస్తువులయందు, కనుపించని వాటియందు (వ్యక్తావ్యక్తముల యందు) కూడా ఉన్నది కదా!" అన్నాడు బ్రహ్మచారి.

"ఎందుకు తెలియదయ్యా ! నువ్వు చెప్పేదంతా మాకు తెలిసిందే, క్రొత్త ఏమీ కాదు" అన్నాడు లోపలి ఋషి.

"అయితే సరే ! ప్రస్తుతం అన్నం తినబోతున్నారు కదా ! మరి ఆ అన్నం ఎవరి కోసం తయారు చేశారు ? ఎవరికి నివేదన చేస్తారు?" తిరిగి ప్రశ్నించాడు బ్రహ్మచారి.

"ఆ మాత్రం తెలియదా ! మేము ఆరాధించే వాయుదేవుడికి సమర్పించటానికి" చాలా తేలిక భావంతో సమాధానం చెప్పాడు ఋషి.

"అయితే వినండి. ప్రాణమనేది విశ్వమంతా వ్యాపించి ఉన్నది. ఆ ప్రాణానికి నైవేద్యంగా మీరు అన్నం వండారు. ఈ ప్రపంచంలో నేను కూడా ఒక భాగమే. అంటే నాలో కూడా ప్రాణమున్నది. మీరు ఉపాసించే పరబ్రహ్మ ప్రాణరూపంలో మీలో ఉన్నది. అదే నాలో కూడా ఉన్నది. అలాంటప్పుడు ఆకలితో ఉన్న బ్రహ్మచారి రూపంలో మీ ఉపాసనాదైవమైన వాయుదేవుడే మిమ్మల్ని భిక్ష అడుగుతుంటే మీరు ఎందుకు లేదంటున్నారు?" అని ప్రశ్నించాడు బ్రహ్మచారి.

ఈ వివరణకు ఆశ్రమంలోని ఋషులు చాలా సంతోషించారు. "సత్యం బ్రహ్మచారీ, నువ్వు చెప్పింది ముమ్మాటికీ సత్యం" అన్నారు.

"ఋషీశ్వరులారా ! నాకు భిక్ష పెట్టకుండా పొమ్మంటే, నాలో ఉన్న ప్రాణాన్ని అంటే మీ ఆరాధ్యదైవాన్ని తిరస్కరించినట్లేగదా ! మీరు ఎవరికోసం అన్నం వండారో ఆ దేవునికే ఆహారం ఇవ్వననటం న్యాయమేనా ?" అన్నాడు బ్రహ్మచారి.

ఈ మాటలకు ఋషీశ్వరులు చాలా సిగ్గుపడ్డారు. వెంటనే లేచి గౌరవంగా ఆ బ్రహ్మచారిని లోపలికి తీసుకుని వచ్చారు. దేవత యొక్క బాహ్యరూపాన్నే కాకుండా, అంతర్యం తెలుసుకుని ఆరాధించాలి అని అర్థం చేసుకున్నవారై బ్రహ్మచారికి భోజనం పెట్టి పంపారు.

కాబట్టి శ్రీమన్నారాయణుడు 'పవనః' అనబడుతున్నాడు.

# 292. పావనః

పరిశుద్ధుడు. 811వ నామము కూడా ఇదే.

**యస్స్వ సంబన్ధి గంగాదీన్ పావయన్ లోకపావనాన్ ।**

**స పావన ఇతి ఖ్యాతః పావనత్వప్రదో మనుః ॥**

తనయొక్క సంబంధముచేతనే గంగ మొదలైన నదులను పవిత్రం చేస్తున్నాడు.

**పావయతీతి పాపనః** పవిత్రము చేసేవాడు.

**పావయతిః** – వీచునట్లు చేయువాడు.

**తైత్తిరీయోపనిషత్తు**లో "పరబ్రహ్మను గూర్చిన భయంతోనే గాలి వీస్తున్నది. సూర్యుడు ఉదయిస్తున్నాడు. ఇంద్రాది దేవతలు తమ విధులను సక్రమంగా నిర్విహిస్తున్నారు" అని చెప్పబడింది. కాబట్టి గాలిని వీచునట్లు చేయువాడు పరబ్రహ్మమే. అతడే శ్రీమన్నారాయణుడు.

**పావన సర్వలోకానంత్వమేవరఘునందన**

రామచంద్రా ! లోకాలను పవిత్ర మొనర్చేవాడవు నీవే అంటాడు అగస్త్యమహర్షి రామాయణంలో చలించే వాయువు అన్నింటినీ పవిత్రం చేస్తుంది. అటువంటి చలనశక్తి ఆ పరమేశ్వరుడే. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'పావనః అనబడుతున్నాడు.

దేవేంద్రుడు అహల్యమీద మనసుపడ్డాడు. గౌతముడులేని సమయంలో, ముని వేషంలో ఆశ్రమానికి వచ్చాడు. విషయం తెలిసింది గౌతముడికి. "వాయుభక్షణచేస్తూ, నిరాహారివై, ఎవరికంటాపడకుండా ఆశ్రమ ప్రాంగణంలోనే దుమ్ముధూళి కొట్టుకుని పడి ఉండు" అని శపించాడు. అహల్య అతని కాళ్ళమీద పడి కనికరించమని వేడుకుంది. శ్రీరామచంద్రునికి ఆతిధ్యమిచ్చి పునీతవుకమ్మన్నాడు మహర్షి.

విశ్వామిత్రుడు యాగం తలపెట్టాడు. ఆ యాగాన్ని పాడు చెయ్యటానికి రాక్షసులు సిద్ధంగా ఉన్నారు. రామలక్ష్మణులను యాగసంరక్షణకు తీసుకువచ్చాడు. యాగం పూర్తి అయింది. జనకమహారాజు సీతాస్వయంవరం ప్రకటించాడు. విశ్వామిత్రుడు రామలక్ష్మణులను మిథిలానగరానికి తీసుకువెడుతున్నాడు. త్రోవలో గౌతముడి ఆశ్రమం వచ్చింది. అహల్య శాపవృత్తాంతము చెప్పి, ఆమెకు శాపవిమోచనం చెయ్యమన్నాడు విశ్వామిత్రుడు సరేనన్నాడు రామచంద్రుడు. అహల్యపునీత అయింది.

ఈరకంగా అహల్యని పవిత్రురాలుగా చేసినవాడు కాబట్టే 'పావనః' అనబడుతున్నాడు.

# 293. అనలః

తృప్తి పొందనివాడు, అగ్నిదేవుడు. 711వ నామం కూడా ఇదే.

**అపర్యాప్తో హిభక్తేభ్యోఽ పృపకృత్యపునః పునః ।**

**అనుగ్రహం యః కరోతి సోఽ నలః పరికీర్తితః ॥**

భక్తులకు అనేకసార్లు, అనేక విధాలుగా ఉపకరించి కూడా తృప్తి పొందనివాడు.

**న అలః అనలః** ఆశ్రితులకు అనేకవిధాలుగా ఉపకరించి కూడా తృప్తి చెందని కృపగలవాడు. ప్రాణధారణకు అవసరమైనది అగ్ని. ఆ అగ్ని స్వరూపుడు పరమేశ్వరుడు. ఈ అగ్ని మన శరీరంలో ఉన్నది.

| | | |
|---|---|---|
| స్వాధిష్ఠానచక్రంలో | - | స్వాధిష్ఠానాగ్ని |
| హృదయం క్రింది భాగంలో | - | జఠరాగ్ని |

**తస్యమధ్యే మహానగ్నిర్విశ్వార్చి ర్విశ్వతోముఖః**

**సోఽగ్రభుగ్విభజంతిష్ఠన్నాహార మజరఃకవిః**

**తిర్యగూర్ధ్వమధశ్శాయీ రశ్మయస్తస్యసంతతా**

హృదయకమలాన్ని ఆశ్రయించి జ్వాలాసమూహంతో వెలుగుతూ, జీవులకు ప్రధానస్థానమై, అనేక నాడీసమూహాలకు ఆలంబనమై, అరవిరిసిన పద్మాన్ని బోలిన హృదయాగ్రభాగంలో సూక్ష్మమైన కమలం ఒకటి ఉన్నది. దానిలో సర్వము ప్రతిష్ఠితమై ఉన్నది. దాని మధ్యలో అంతటా జ్వాలలు వ్యాపిస్తూ అగ్నిదేవుడు ఉన్నాడు. ఆ అగ్నియే జఠరాగ్ని.

**సంతాపయతిస్వందేహ మపాదతలమస్తకః ।**

**తస్యమధ్యే వహ్ని శిఖా అణీ యోర్ధ్వా వ్యవస్థితః ॥**

భుజించిన ఆహారాన్ని ఆ అగ్ని సమానభాగాలుగా విభజించి శరీరంలోని అన్ని భాగాలకు పంపుతున్నది. ఆ అగ్నికిరణాలు ఆ పాదమస్తకము వ్యాపించి ఉన్నాయి. **బృహదారణ్యకోపనిషత్తు**లో మానవ శరీరంలో ఉండేది వైశ్వానరాగ్ని. ఇది భూతాగ్నికాదు. జఠరాగ్ని కంటికి కనిపించదు. దీనివల్లనే తీసుకున్న ఆహారము జీర్ణమవుతుంది. ఈ జఠరాగ్ని ఒకరకమైన శబ్దం చేస్తుంది. రెండు చెవులను చేతివ్రేళ్ళతో మూసివేస్తే ఆ శబ్దం వినిపిస్తుంది. శరీరం నుంచి ప్రాణం పోయినప్పుడు ఈ శబ్దంరాదు." అని చెప్పబడింది.

ఈ రకంగా అగ్నిదేవుడు జీవులు జీవించటానికి ఉపకరిస్తాడు. అంతేకాకుండా యజ్ఞయాగాదులలో దేవతలకు సమర్పించిన ఆహుతులు వారికి చేరేటట్లు చేస్తాడు. అందుచేతనే అతడు పరమేశ్వరుడు. కాబట్టే శ్రీ పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు 'అనలః' అనబడుతున్నాడు.

## 294. కామహా

కామమును హరించువాడు.

**పుంసాం స్వదర్శినాం యోఽసౌ స్పృహాం చ విషయాన్తరే**
**హతవాన్ కామహా ప్రోక్తః సర్వాశాపూరకో మనుః**

తనను దర్శించిన వారికి సాంసారిక భోగమును మాన్పించేవాడు.

**కామం హంతీతి కామహా** తనతత్త్వాన్ని తెలుసుకున్నవారికి విషయవాంఛలను పోగొట్టువాడు. మోక్షార్థులైన వారికి కామమును పోగొట్టేవాడు.

**యత్రాపి భోగో న చ తత్ర మోక్షః యత్రాపి మోక్షో న చ తత్ర భోగః**

భోగము ఉండేచోట మోక్షం ఉండదు. మోక్షం కావాలనుకుంటే భోగాన్ని వదలి వెయ్యాలి.

పూర్వకాలంలో 'దధ్యుడు' అనే మహర్షి ఉండేవాడు. అతడు బ్రహ్మజ్ఞాని. ఒకసారి ఇంద్రుడికి బ్రహ్మజ్ఞానం తెలుసుకోవాలి అనిపించింది. అనుకున్నదే తడవుగా దధ్యుని దగ్గరకు వెళ్ళాడు. దేవతలరాజైన ఇంద్రుడు తన ఆశ్రమానికి వచ్చాడని తెలిసి చాలా ఆనందించాడు దధ్యుడు. ఎదురువెళ్ళి స్వాగతసత్కారాలందించాడు. అతిథి మర్యాదలయిన తరువాత 'మహేంద్రా ! నావల్ల నీకేం కావాలి ?' అని అడిగాడు మహర్షి. దానికి దేవరాజు 'మహర్షీ ! నేను కార్యార్థినై వచ్చాను. నా కోరిక తప్పక తీరుస్తానని మాట ఇవ్వాలి' అన్నాడు. 'అలాగే తీరుస్తాను' అన్నాడు మహర్షి.

దధ్యుడి దగ్గరమాట తీసుకుని తన కోరికను చల్లగా బయటపెట్టాడు దేవేంద్రుడు. బ్రహ్మోపదేశం చెయ్యమని అడిగాడు.

ఒకింత ఆలోచనలో పడ్డాడు మహర్షి. ఇతడు చూస్తేనా దేవతలకు రాజు. నిరంతరము భోగభాగ్యాలలో ఓలలాడేవాడు. అప్సరాగణాలతో ఆడిపాడేవాడు. బ్రహ్మవిద్య విరాగులకుగాని సరిపడదు. ఇస్తే అపాత్రదానం. ఇవ్వకపోతే అసత్యదోషం. ఏంచెయ్యాలి? అని ఆలోచిస్తున్నాడు. ఇంతలో ఇంద్రుడే కల్పించుకుని "మహర్షీ ! ఏమిటి ఆలోచిస్తున్నావు.

నాకు ముందుగానే మాట ఇచ్చావు మరిచిపోయావా ? ఇప్పుడు నాకు బ్రహ్మోపదేశం చేస్తావా ? లేదా ?" అన్నాడు. చేసేది లేక మరునాడు ఉదయం మిగిలిన శిష్యులతో కలిసి రమ్మన్నాడు దధ్యమహర్షి.

ఆ మరునాడు ఉదయం మిగిలిన శిష్యులతో కలిసి కౌపీనధారియై వచ్చి కూర్చున్నాడు ఇంద్రుడు. దధ్యుడు చెప్పటం ప్రారంభించాడు. "నాయనలారా ! ఈ లోకంలో ధనధాన్యాలు, భోగభాగ్యాలు ఏవీ నిజం కాదు. అంతామిధ్య. మనం అనుభవిస్తున్నామనుకుంటున్న సుఖాలన్నీ దుఃఖానికి హేతువులు. అంతామిధ్య" అన్నాడు. ఆ మాటలువిన్న దేవేంద్రుడు కోపంతో లేచి 'మహర్షీ! నువ్వు నన్ను ఎగతాళి చేస్తున్నావు. ఏది అబద్ధం. నా సింహాసనం అబద్ధమా ? ఈ అప్సరసలు అబద్ధమా ? స్వర్గం అబద్ధమా ? నేను ఇక్కడ ఉన్నానని నువ్వు అబద్ధాలు చెబుతున్నావు. ఇలాంటి మాటలు ఇంకెవరికైనా చెబితే నీ తల నా వజ్రాయుధంతో నరికివేస్తాను" అని అక్కడ నుండి వెళ్ళిపోయాడు.

ఆ తరువాత దధ్యుడు బ్రహ్మోపదేశం చెయ్యటం మానేశాడు. తరువాత కొంతకాలానికి అశ్వనీ దేవతలు అతడికి శస్త్రచికిత్సచేసి గుర్రపు తల అంటించారు. అశ్వముఖుడుగా బ్రహ్మోపదేశం చెయ్యటం ప్రారంభించాడు దధ్యుడు. చెప్పినమాట ప్రకారం ఇంద్రుడు వజ్రాయుధంతో మహర్షి శిరస్సు ఖండించాడు. వెంటనే అశ్వనీదేవతలు మహర్షికి అతని శిరస్సు అంటించారు.

కాబట్టి కోరికలు, అహంకారము ఉన్నవాడికి పరబ్రహ్మతత్త్వము వంటబట్టదు. అందుచేత తన తత్త్వాన్ని శోధించేవారి కోరికలను హరింపచేస్తాడు పరమేశ్వరుడు. కాబట్టే శ్రీమన్నారాయణుడు 'కామహా' అనబడుతున్నాడు.

జీవితంలో కోరికలు ఉండకూడదు. కోరికలు తీరితే, క్రొత్త కోరికలు పుడతాయి. అవి తీరకపోతే క్రోధము ఉద్భవిస్తుంది. కాబట్టి కోరిక కలిగిందంటే, అది తీరినా తీరకపోయినా దుఃఖమే. అసలు కోరికలే లేకపోతే ఏ బాధా ఉండదు. అందుచేత కోరికలు కలగకుండా, మోక్షగాములను ఆ మార్గంలోనే ప్రయాణింపచేస్తాడు. 'కామహా' అనబడుతున్నాడు.

## 295. కామకృత్

ఆశను కలిగించువాడు.

**స్వపాద పద్మే రాగాది కరణా త్కామకృత్ త్స్మృతః**

తనయొక్క పాదారవిందములయందు కోరిక పుట్టించేవాడు.

**కామం కరోతీతి కామకృత్** ఇహము పరము కోరేటట్లు చేయువాడు.

**కామాన్ పూర్ణాన్ కరోతి** సత్వగుణ ప్రధానులయిన భక్తులకోరికలను పూరించువాడు.

**కామం ప్రద్యుమ్నం కరోతి – జనయతి**

కామః – ప్రద్యుమ్నుడు. శ్రీకృష్ణుని పుత్రుడు. ఇతనికి జన్మనిచ్చినవాడు.

సనత్కుమారుని అంశతో శ్రీకృష్ణుడు, రుక్మిణీదేవులకు పుట్టినవాడు ప్రద్యుమ్నుడు. పూర్వజన్మలో ఇతడు మన్మథుడు. ప్రద్యుమ్నుడు పుట్టగానే, శంబరాసురుడు ఇతని చేతిలో మరణిస్తాడు అని చెప్పింది అశరీరవాణి. ఆ మాటలు విన్న శంబరుడు భయపడి కాకిరూపం ధరించి ఎనిమిదవరోజు పసిగ్రుడ్డు పద్యుమ్నుని అపహరించి సముద్రంలో పారేశాడు. ఆ బాలుణ్ణి ఒక చేప మింగింది. ఆ చేపను ఒక జాలరి పట్టుకున్నాడు. ఆ చేప చాలా పెద్దదికావటంచేత, దాన్ని తీసుకుపోయి శంబరుని కుమార్తెకు బహుమతిగా ఇచ్చాడు.

గతకాలంలో శివుని మూడవకంటి అగ్నిజ్వాలలకు భస్మమైపోయాడు మన్మథుడు. ఆ సమయంలో పతీవియోగం భరించలేక తీవ్రంగా కలత చెందింది రతీదేవి. అప్పుడు నారదమునీంద్రుడు వచ్చి మన్మథుడు ప్రద్యుమ్నుడుగా జన్మిస్తాడు. అతన్ని సంహరించటానికి శంబరుడు ప్రయత్నిస్తాడు అని చెప్పాడు. ఆ మాటలు విన్న రతీదేవి మాయావతి అనే పేరుతో శంబరాసురుని ఇంట ప్రవేశించి దాసిగా ఉన్నది.

జాలరి తెచ్చిన చేపను మాయావతి కోసింది. అందులో నుంచి బాలుడు బయటకు వచ్చాడు. అది చూసిన మాయావతి నివ్వెరబోయింది. ఇంతలో నారదుడు వచ్చి ఆ బాలుడే మన్మథుడు అని చెప్పాడు. మాయావతి ఆ బాలుని తీసుకుపోయి అతి రహస్యంగా పెంచింది. అతడు పెద్దవాడైన తరువాత "సర్వశత్రు మాయావినాశిని" అనే మంత్రాన్ని ఆ బాలుడికి ఉపదేశించింది మాయావతి. ఆ మంత్రమహిమచేతనే ప్రద్యుమ్నుడు శంబరాసురునితో పోరాడి, అతన్ని సంహరించాడు.

ఇటువంటి ప్రద్యుమ్నుడికి జన్మనిచ్చినవాడు కాబట్టి 'కామకృత్' అనబడుతున్నాడు.

భగవంతుని అర్చించేవారు రెండు రకాలు. 1. లౌకికవాదులు 2. మోక్షవాదులు

1. లౌకికవాదులు ఈలోకంలో కావలసిన సరిసింపదలు, భోగభాగ్యాలు, ధనధాన్యాలు, పదవులు, గౌరవము కోరతారు. 2. మోక్షవాదులు జన్మరాహిత్యం కోరతారు.

పరమేశ్వరుడు భక్తులయొక్క కర్మననుసరించి వారికి కోరికలు పుట్టిస్తాడు. లౌకికవాదులు ఎల్లప్పుడు అసురయోనులందే జన్మిస్తుంటారు. కాని సత్వగుణ ప్రధానులైన

మోక్షవాదులు పరమేశ్వరుని దివ్యపాదారవిందములు దర్శించాలని, అతనిలో ఐక్యం కావాలని కోరతారు. ఈ రకంగా భక్తులకు కోరికలు కలిగిస్తాడు కాబట్టే శ్రీమన్నారాయణుడు 'కామకృత్' అనబడుతున్నాడు.

## 296. కాంతః

మనోహరుడు. 654వ నామం కూడా ఇదే.

సౌందర్యము, సౌకుమార్యము మొదలైన గుణాలతో అతి మనోహరముగా ఉండేవాడు. అతి సుందరమైనవాడు. అద్భుతమైన రూపము గలవాడు. అందరిచేత ఆకర్షింపబడేవాడు. కల్యాణగుణముల చేత మనోహరమైన రూపము గలవాడు.

**శాంతం శివం సుందరం**

పరమశాంతస్వరూపుడు, శుభప్రదుడు అయిన భగవానుడు అతి సుందరుడు. ఇక్కడ భగవంతుడు రూపవంతుడు అంటే అతనికి రూపమున్నదనికాదు. ప్రేమ స్వరూపి. భగవానుని రూపమే ప్రేమ. ప్రేమ స్వరూపమే భగవానుడు. అదే కృష్ణతత్త్వము. ఈ విధంగా పరమేశ్వరుడు ప్రేమమయుడు కాబట్టే అందరిచేత కోరబడుతున్నాడు.

## 297. కామః

సుందరుడు నిరుక్తంలో ఈ రెండు నామాలకు కలిపి అర్థం చెప్పబడింది.

**సౌన్దర్యాదిగుణైః కాన్తః మనోహరతయాధృశమ్**
**వికామ కమనీయత్వాత్ శీలౌదార్యదయాదిభిః**
**కామ ఇత్యుచ్యతే నిత్యం షడర్ణో కామ్యరూపదః ॥**

సౌందర్యాది శరీరగుణాలతో అందరినీ ఆకర్షించేవాడు. శీలము, ఔదార్యము మొదలైన గుణాలతో అందరినీ ఆకర్షించేవాడు.

శీలము, ఉదారత మొదలైన గుణాలతో అతి మనోహరముగా ఉండేవాడు.

పురుషార్థములను అభిలషించువారిచే కోరబడువాడు.

పరమేశ్వరునిలో సౌలభ్యము, సౌశీల్యము మొదలైన లక్షణాలుండటంచేత, అందరిచేత వాంఛించబడుతున్నాడు. లోకంలో ప్రతి జీవి ఆనందాన్నే కోరుకుంటుంది. అయితే ఆనందము రెండు రకాలు. 1. క్షణికానందము 2. శాశ్వతానందము.

లౌకికమైన ఆనందమంతా క్షణికమైనదే. ఏదైనా ఒక వస్తువునుగాని, మరిదేన్నైనా గాని పొందాలి అనుకుంటే అది కోరిక. దాన్ని పొందగానే ఆ ఆనందము తీరిపోతుంది. అందుకే ఇది క్షణికమైన ఆనందము. ఇది దుఃఖహేతువు. దేహము, ఇంద్రియాలు వీటిద్వారా శాశ్వతమైన ఆనందం లభించదు. పరిపూర్ణమైన ఆనందము ఆత్మానందమే. అదే బ్రహ్మానందము. శాశ్వతమైన ఆనందము. ఆ ఆనందంకోసమే సత్వగుణప్రధానులైన భక్తులు ఆ పరమేశ్వరుని కోరతారు.

## 298. కామప్రదః

కోరినవి ఇచ్చేవాడు.

**స్వకామ్య క్షుద్రకామ్యేభ్యో యథార్హం కామ్యదానతః ।**
**కామప్రదస్సమాఖ్యాతో హ్యష్టార్ణో మనురుత్తమః ॥**

తనను కోరువారికి తనను, క్షుద్రపురుషార్థముల కోరువారికి వాటిని, వారి యోగ్యతను బట్టి ఇచ్చేవాడు.

**కామం ప్రదదాతీతి కామప్రదః భక్తులయోగ్యతలను బట్టి వారు కోరినవి ఇచ్చేవాడు. భక్తుల కొరకు కామితఫలములనిచ్చేవాడు.**

**భగవద్గీత**లోని నాల్గవ అధ్యాయం **'జ్ఞానయోగం'**లోని 11వ శ్లోకం.

**యే యథా మాం ప్రపద్యన్తే తాంస్తథైవ భజామ్యహమ్ ।**
**మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః ॥**

పార్థా ! భక్తులు నన్ను సేవించిన రీతిగానే, నేను వారిని అనుగ్రహిస్తాను. మానవులందరూ వివిధరీతులలో నా మార్గాన్నే అనుసరిస్తారు.

భక్తులు భగవంతుని వేరువేరు పద్ధతులలో సేవిస్తారు. తమ భావములననుసరించి వివిధ రూపాలలో భగవంతుని ఆరాధిస్తారు. తమ సంప్రదాయం ప్రకారం ఆయనను అర్చిస్తారు. అందుచేత భగవంతుడు కూడా భక్తుల కోరిక ప్రకారము, వారు కోరిన విధంగానే ప్రత్యక్షమవుతాడు. భగవంతుడికి ఒక ఆకారం కల్పించి అర్చన చేస్తే సాకారుడుగా దర్శనమిస్తాడు. నిరాకారుడు అర్చిస్తే ఆత్మజ్ఞానాన్ని ఇస్తాడు. తనను స్మరించే వారిని అతడు కూడా స్మరిస్తాడు. తన కోసం వ్యాకులపడే వారికోసం తాను వ్యాకులపడతాడు. ఆయన వియోగం సహించలేని భక్తులవియోగం కూడా ఆయన సహించలేడు. సర్వస్వాన్ని తనకు ధారపోసే వారిని సర్వాత్మనా ఆదుకుంటాడు.

గోపాలకులు భగవానుని మిత్రుడుగా భావించారు. వారికి మిత్రుడు. యశోద పుత్రుడుగా భావించింది. ఆమెకు పుత్రుడు. రుక్మిణి భర్తగా భావించింది. ఆమెకు భర్త. హనుమంతుడు స్వామిగా భావించి సేవచేశాడు. అతడికి స్వామి. ఈ రకంగా ఎవరు ఏవిధంగా కోరితే ఆ విధంగా వారి కోరికలు తీరుస్తాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'కామప్రదః' అనబడుతున్నాడు.

## 299. ప్రభుః

సమర్థుడు. 35వ నామం కూడా ఇదే.

**సర్వేషాం చిత్తహరణే ప్రభుః ప్రభవతీతి యః** అందరి చిత్తములను ఆకర్షించటంలో ఆరితేరినవాడు.

**ప్రభవతీతి ప్రభుః** సకలప్రాణుల హృదయములను అపహరించుటలో సమర్థుడు.

మిక్కిలి గొప్పదనముతో ఉండేవాడు.

భగవానుడు సర్వవిధాలా ఉత్తముడు. అన్నింటికీ అతడే అధిష్టాత, ప్రభువు, సర్వానికీ కర్త. ఏ పని అయినా చెయ్యటానికిగాని, చెయ్యకుండా ఉండటానికి గాని, ఇంకొకరకంగా చెయ్యటానికి గాని సామర్థ్యము గలవాడు. లోకంలో అన్నీ అతని ఇష్టానుసారమే జరుగుతాయి. తన ఇష్టప్రాకరమే శివధనుర్భంగము కావించాడు. తన ఇష్టప్రకారమే రావణబ్రహ్మను సంహరించాడు. వాలిని మాయోపాయంతో సంహరించాడు.

కృష్ణావతారంలో వీరులనే వారందరినీ చేరదీసి 18 అక్షోహిణీల సైన్యాన్ని తయారుచేశాడు. అతిరథులు, మహారథులు అయిన యోధులందరినీ కురుక్షేత్ర సంగ్రామంలో మట్టి కరిపించాడు. చివరకు యోధుడు అనేవాడు లేకుండా చేశాడు. భగవానుడు తలుచుకుంటే నిజంగా కురుక్షేత్ర సంగ్రామం ఆపగలిగేవాడే కాని ఆయన అలా అనుకోలేదు.

ప్రపంచంలో జరిగే అన్ని పనులు ఆయన ఇష్టప్రకారమే జరుగుతాయి. అన్నింటికీ ఆయనే కారణము. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'ప్రభుః' అనబడుతున్నాడు.

అతడు దేవతలకు కూడా దేవుడు. రాజులకు రాజు. బ్రహ్మాది దేవతల పూజలు అందుకుంటాడు. ఈ జగత్తులో పరమేశ్వరుని కన్న బలమైనవారుకాని, సమర్థులుకాని వేరెవరూలేరు. అందుచేతనే పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు 'ప్రభుః' అనబడుతున్నాడు. అంటూ విశ్వరూప ఘట్టాన్ని పూర్తిచేశాడు రత్నాకరుడు.

# 24. వటపత్రశాయి

గురువుగారూ ! పరమేశ్వరుడు 'వటపత్రశాయి' అంటారు కదా ! అది ఎలాగో వివరించండి అన్నాడు నారాయణభట్టు. వివరించటం మొదలుపెట్టాడు రత్నాకరుడు.

ప్రళయం సంభవించింది. జగత్తు అంతా జలమయం అయిపోయింది. ఆ మహార్ణవములో శ్రీమహావిష్ణువు ఒక్కడే ఉన్నాడు. అతడు వటపత్రం మీద శయనించి ఉన్నాడు. వృక్షములలో పవిత్రమైనది అశ్వత్థవృక్షము. ఎక్కువదూరం వ్యాపించేది, కాయలో అనేక విత్తనాలుండేది వటవృక్షం. అంటే మర్రిచెట్టు. అది తన ఊడలతో చాలా ప్రదేశం ఆక్రమిస్తుంది. ఇప్పుడు పరమేశ్వరుడు సృష్టి చెయ్యాలి. తన విశ్వరూపంతో ఈ జగత్తంతా ఆక్రమించాలి. అందుకే శ్రీమన్నారాయణుడు వటపత్రశాయి అయినాడు.

అతడు యుగాంతంలోనే తరవాతి యుగానికి పునాదులు వేస్తాడు. యుగధర్మాలు చెడిపోకుండా యుగాలు సంకరము కాకుండా కాపాడుతూ ఉంటాడు. పసిపిల్లవాడులాగా ఉండి కూడా మనము ఊహించలేని అద్భుతాలు చేశాడు. ప్రళయకాలంలో పధ్నాలుగు లోకాలను భక్షించివేస్తాడు. కంటికి కనిపించడు. అలా అని లేకపోలేదు. పరమపురుషులకు తన స్పష్టమైన రూపాన్ని చూపుతాడు. కొన్ని వేల సంవత్సరాలు యోగనిద్రలో ఉంటాడు. అమితమైన ప్రకాశము గలవాడు. అతని ప్రకాశానికి అవధులేలేవు. జీవులన్నింటినీ తన గర్భంలో ఉంచుకుని తల్లిలాగా రక్షిస్తాడు. వివిధరకాల యజ్ఞముల ద్వారా తెలియబడేవాడు. విలక్షణమైనవాడు. శిష్టాచారులకు ఇష్టుడు. నెత్తిన నెమిలి పింఛము గలవాడు. జగత్తులోని జీవులన్నింటినీ తన మాయతో బందీలుగా చేస్తాడు. కాని తాను మాత్రం మాయకు అతీతుడు. అటువంటి వటపత్రశాయి తన భక్తులకు మాత్రం కృపావర్షాన్ని కురిపిస్తాడు. వారి కోరికలను తీరుస్తాడు. ఈ విధంగా 300 నుండి 313 వరకు నామాలలో వటపత్రశాయిని వివరించటం జరిగింది. ఇక నామాలను చూద్దాం.

## 300. యుగాదికృత్

యుగాన్ని ప్రారంభించేవాడు.

**న్యగ్రోధశాయీ భగవాన్ పురాణ పురుషోత్తమః ।**

**కరోత్యాది యుగాస్యాన్తే యుగాది కృదు దీరితః ॥**

పురాణపురుషుడై ఆ పరమేశ్వరుడు ప్రళయకాలంలో వటపత్రశాయియై, ఈ జగత్తు నీటిలో మునిగిపోకుండా కాపాడి, తరువాత కాలంలో యుగాలను ఆరంభిస్తున్నాడు. అందుచేత 'యుగాదికృత్' అనబడుతున్నాడు.

**యుగాదిం కాలవిశేషం కరోతి** యుగాది అనే కాలవిశేషాన్ని ఏర్పరచేవాడు.

**యుగానాం ఆదిం కరోతి** కృతయుగము, త్రేతాయుగము, ద్వాపరయుగము, కలియుగము అనే యుగాలను ఆరంభించేవాడు.

పరమేశ్వరుడు సృష్టి చెయ్యాలని సంకల్పించినవాడై మొదటగా ఈ సృష్టిని ప్రారంభించాడు.

**యుగాదిం కరోతీతి యుగాదికృత్** ప్రళయకాలంలో జగత్తు మునిగిపోకుండా ఆపటంచేత, యుగాంతములో యుగాదిని చేయువాడు. అసలు యుగము ఎప్పుడు ప్రారంభమైంది ?

**చైత్రేమాసి జగద్బ్రహ్మ సవర్ణపథయే అహని**
**వత్సరాదౌ వసంతాదౌ రసరాద్యే తద్దై వచ**

బ్రహ్మదేవుడు తన సృష్టిని బ్రహ్మకల్పం ఆరంభమయ్యే మొదటి యుగాది. అనగా –

| | | |
|---|---|---|
| సంవత్సరాలలో మొదటిదయిన | – | ప్రభవనామ సంవత్సరంలో |
| మాసాలలో మొదటిదయిన | – | చైత్రమాసంలో |
| ఋతువులలో మొదటిదయిన | – | వసంతఋతువులో |
| తిథులలో మొదటిదయిన | – | పాడ్యమినందు |
| వారములలో మొదటిదయిన | – | ఆదివారమునాడు |
| నక్షత్రములలో మొదటిదయిన | – | అశ్వనీ నక్షత్రమందు |
| రాసులలో మొదటిదయిన | – | మేషరాశియందు |

ఈ సృష్టి ప్రారంభమయింది. బ్రహ్మకల్పముతో ప్రారంభమైన ఈ సృష్టి ప్రారంభమై ఇప్పటికి బ్రహ్మదేవుడి ఆయుష్షులో 50 సంవత్సరాలు పూర్తయింది. ఇది 51వ సంవత్సరం. శ్వేతవరాహకల్పము. ఈ కల్పంలో మొత్తం 14 మన్వంతరాలున్నాయి. అందులో ఆరు మన్వంతరాలు పూర్తయినాయి. ఏడవది అయిన వైవసత్వత మన్వంతరము జరుగుతోంది. ఈ వైవస్వత మన్వంతరంలో కూడా ఇది 28వ మహాయుగము. అందులోను కృతయుగము, త్రేతాయుగము, ద్వాపరయుగము పూర్తయి కలియుగం ప్రారంభమయి 5104 సంవత్సరాలు. కృష్ణావతార పరిసమాప్తి అయిన అర్థరాత్రినుంచి కలియుగం ప్రారంభమైంది.

ఈ రకంగా ఒకటి తరువాత ఒకటిగా యుగాలను సృష్టించే వాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు 'యుగాదికృత్' అనబడుతున్నాడు.

## 301. యుగావర్తః

యుగములను మరల్చువాడు.

**ధర్మవ్యవస్థయా స్వస్య యుగాద్యావర్తనాన్ముహుః ।**
**యుగావర్త స్సమాఖ్యాతః కాలరూపధరోహరిః ॥**

కాలపురుషుడైన పరమేశ్వరుడు యుగధర్మాలు చెడిపోకుండా, యుగాలు సంకరము కాకుండా అంటే ఒకదానితో ఒకటి కలిసిపోకుండా కాపాడుతూ, మాటిమాటికీ వాటిని త్రిప్పుతూ ఉండేవాడు.

**యుగాని ఆ వర్త యతీతి యుగావర్తః**

తనయొక్క ధర్మపరాయణత్వముచేత కృతాదియుగాలను మళ్ళీమళ్ళీ రప్పించేసేవాడు.

**కాలాత్మనా కృతాదీని.** పరమేశ్వరుడు కాలస్వరూపుడు. అందుచేత కాలచక్రాన్ని మళ్ళీమళ్ళీ గిరగిరా త్రిప్పేవాడు. యుగధర్మాలను ఏర్పరచి, ఆ ధర్మాలకు అనుగుణంగా కాలచక్రమును త్రిప్పేవాడు. కాలభ్రమణానికి వెనక అధిష్ఠానమై భాసిల్లే సత్తాస్వరూపమైన వాడు. ఇక్కడ మరిచపోకూడని విషయం ఒకటున్నది. కాలము మాయ పరమేశ్వరుడు – మాయ. అందుచేత పరమేశ్వరుడు మాయారూపం ధరించి, మాయామయమైన కాలచక్రాన్ని త్రిప్పుతున్నాడు.

## 302. నైకమాయః

అనేకమైన అద్భుతాలు చేసేవాడు.

**ముగ్ధార్భకత్వ రూపేణ జగన్నిర్భరణాదపి**
**వటైక పత్రశయనాత్ నిరాలమ్బజలే ముహుః**
**అనంతాశ్చర్య సంయుక్తో నైకమాయస్తు స స్మృతః**

ఏమీ ఎరగని పసిపిల్లవాడిలా ఉండికూడా, లోకాలన్నింటినీ తన ఉదరాన ధరించటము, మహాప్రళయం జరిగినప్పుడు లేతమర్రిఆకుమీద సముద్రపు నీటిలో పడుకోవటము వంటి ఆశ్చర్యకరమైన పనులు చేసేవాడు.

**నైకాః మాయాః యస్యసః నైకమాయః** అనేకమైన ఆశ్చర్యములు చేయువాడు.

**న ఏకా మాయా విద్యతే అస్య** ఇతడికి ఒకే మాయలేదు. అనేక రకాలయిన మాయలు ధరించి ఉన్నాడు.

సృష్టి ఆరంభానికి ముందు పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు పసిబాలుని రూపం ధరించి వటపత్రశాయియై క్షీరసాగరంలో శయనించాడు.

అలాగే ద్వాపరయుగంలో దేవకీ వసుదేవులకు అష్టమగర్భాన జన్మించాడు. కాని యశోద, నందుల బాలకుడుగా పెరిగాడు.

బాలకృష్ణుడు మన్ను తింటున్నాడు. అది చూసి కోపగించిన యశోద, కుమారుడి చెవిమెలిపెట్టి మన్ను తినవద్దని గదమాయిస్తూ నోరు తెరవమన్నది. తెరవను అన్నాడు కృష్ణుడు. దాంతో మరీ కోపగించి నోరు తెరిపించింది. ఆ నోట్లో 14 లోకాలు కనిపిస్తున్నాయి. సూర్యచంద్రులు, ఆకాశము కన్పిస్తున్నాయి.

ఈ రకంగా అద్భుతాలు సృష్టించాడు కాబట్టి 'నైకమాయః' అనబడుతున్నాడు.

## 303. మహాఽశనః

ఎక్కువ ఆహారము తినేవాడు.

**భువనానాం నిగరణాత్ మహాశన ఇతీరితః** పధ్నాలుగు లోకాలు ఒక్కసారిగా తినేసేవాడు.

**మహత్ అశనం యస్యసః మాహాశనః** సకలజగత్తును ఆహారముగ స్వీకరించువాడు.

**కల్పాంతౌ సర్వగ్రసనాత్** కల్పాంతమునందు పరమేశ్వరుడు సర్వమును ఆహారముగా గ్రహిస్తాడు. కాబట్టి ఎక్కువ పరిమాణమునందు ఆహారము తీసుకునేవాడు.

పరమేశ్వరుడు జగత్తులో సర్వాన్నీ కబళించి వేస్తాడు కాబట్టి 'మహాశనః' అనబడుతున్నాడు.

కల్పాంతమునందు అంటే మహాప్రళయము సంభవించినప్పుడు, జగత్తంతా లయమైపోతుంది. అంటే అణువులతో సహా నాశనమైపోతుంది. ఇంక ఏమీ మిగలదు. భూమి – జలంలో కలిసిపోతుంది. జలం – అగ్నిలో కలసిపోతుంది. అగ్ని – వాయువునందు, వాయువు – ఆకాశమందు లీనమవుతాయి. ఆకాశము – ఆ పరమేశ్వరుని యందు లీనమవుతుంది.

ఈ రకంగా పరమేశ్వరుడు చరాచరజగత్తును తనలో లీనం చేసుకుంటాడు. ఇక్కడ జగత్తు అంటే మన కంటికి కనిపించే భూమండలమేకాదు. ఊర్ధ్వలోకాలు, అథోలోకాలు మొత్తం పధ్నాలుగు లోకాలను తనలో లీనంచేసుకుంటాడు పరమేశ్వరుడు. అందుకే **'గజేంద్రమోక్షము'**లో గజరాజు తనని రక్షించమని ఆ పరమేశ్వరుని ప్రార్థిస్తూ...

**ఒక పరిజగముల వెలినిడి**
**యొకపరిలోపలికి గొనుచు నుభయము గనుచున్**
**సకలార్థ సాక్షి యగు న**
**య్యకలంకుని నాత్మమయుని నర్థింతు మదిన్ ॥**

లోకాలన్నింటినీ ఒకసారి తన లోపలికి తీసుకుని అంటే సంహారంచేసి, మళ్ళీ ఒకసారి బయటకు పంపి అంటే సృష్టిచేసి, ఈ రకంగా సృష్టి, సంహారాలకు సాక్షియైన ఆ పరమేశ్వరుని నేను శరణువేడుతున్నాను.

ఈ రకంగా అతడు జగత్తునంతటినీ తనలో ఇముడ్చుకుంటున్నాడు. అందుకే యశోదాదేవి కుమారుడు మన్నుతిన్నాడు. అని తెలిసి, బాలుని చెవి మెలివేసి నోరుతెరిచి చూపమన్నది. నోరు తెరిచాడు బాలుడు. ఆ సమయంలో

**చూపితివట నీనోటన్ బాపురే పదునాల్గు భువన భాండమ్ములను**

పధ్నాలుగు లోకాలు తన నోటియందు చూపించాడు. అదేవిధంగా కురుక్షేత్ర సంగ్రామం జరుగుతున్నది. భీష్ముడు విజృంభించాడు. అతన్ని ఆపలేకపోతున్నాడు అర్జునుడు. ఆ సమయంలో భీష్ముని చంపి నిన్ను రక్షిస్తాను అంటూ శ్రీకృష్ణభగవానుడు చక్రాయుధం ధరించి ముందుకు ఉరికాడు. అప్పుడు భీష్ముడు విల్లంబులు క్రిందపడేసి, భగవానుడికి నమస్కరించి

**కుప్పించి ఎగసినకుండలమ్ములకాంతి గగనభాగంబున గ్రప్పికొనగ**

అంటూ "దేవదేవా ! నీ కడుపులో ఉన్న లోకాలన్నీ ఆ వేగానికి కదలిపోతున్నాయి" అంటాడు.

పరమేశ్వరుడు చతుర్దశభువనాలనేకాదు. మనలోని అజ్ఞానాన్ని కూడా హరింప చేస్తాడు. మనలోని వాసనలను మ్రింగివేస్తాడు. అతడు మ్రింగివేస్తున్నట్లు ఇతరులకు తెలియదు. కాని మ్రింగివేయటం జరుగుతుంది. అందుకే శ్రీమన్నారాయణుడు 'మహాశనః' అనబడుతున్నాడు.

# 304. అదృశ్యః

ఊహింపజాలనివాడు, కనిపించనివాడు.

**అతర్క్య వృత్తాన్తతయా జగతః ప్రలయే ఽపియః ।**
**న లబ్ధశ్చిన్త్య మానోఽపి సోఽ దృశ్య ఇతి కథ్యతే ॥**

జగత్తులన్నీ లీనమైపోయిన ప్రళయకాలంలో కూడా ఊహకుగాని, ధ్యానానికి గాని అందనివాడు.

**ద్రష్టుం శక్యః దృశ్యః న దృశ్యః అదృశ్యః** ఇటువంటిది అని ఊహింపరాని వృత్తాంతము గలవాడు.

**సర్వేషాం బుద్ధీంద్రియాణాం అగమ్యః అదృశ్యః** బుద్ధికిగాని, ఇంద్రియాలకుగాని కనపడనివాడు.

దేహంలోని ఇంద్రియాలతో పరమేశ్వరుణ్ణి దర్శించలేము. **కేనోపనిషత్తు**లో చెప్పినట్లుగా ఆత్మ ఉన్నచోటికి కన్ను వెళ్ళలేదు. ఆత్మ ఉన్నచోటికి చెవి వెళ్ళలేదు. ఆత్మ ఉన్నచోటికి మనసు వెళ్ళలేదు. అంటే ఆత్మని కంటితో చూడలేము, చెవితో వినలేము. మనసుతో ఊహించలేము. ఎందుకంటే – కంటికి చూసే శక్తిని ప్రసాదించేది ఆత్మ. చెవికి వినికిడి శక్తిని ప్రసాదించేది ఆత్మ. మనసుకు ఆలోచనా శక్తిని ప్రసాదించేది ఆత్మ. అందుచేత ఇంద్రియాల ద్వారా ఆత్మను తెలుసుకోలేము. అందుచేతనే పరమేశ్వర స్వరూపమైన ఆత్మ 'అదృశ్యః' అనబడుతున్నది.

పరమేశ్వరుడు నిరాకారుడు నిర్గుణస్వరూపుడు. అందుకే కంటికి కనిపించడు. ఉపనిషత్తులలో చెప్పినట్లుగా కళ్ళకు చూసేశక్తి, చెవులకు వినికిడి శక్తిని ఇచ్చేది ఆ పరమేశ్వరుడు. ఇంద్రియాలకు శక్తినిచ్చేవాడు పరమేశ్వరుడు కాబట్టి అతన్ని ఇంద్రియాల ద్వారా తెలుసుకోలేము. అందుకే శ్రీమన్నారాయణుడు 'అదృశ్యః' అనబడుతున్నాడు.

**లలితాసహస్రం**లో 649వ నామము అదృశ్యా

# 305. వ్యక్తరూపః

స్పష్టమైన రూపము గలవాడు. కంటికి కనిపించేవాడు.

**మహాజలే సఞ్చరతో మార్కణ్డేయస్యధీమతః**
**దృశ్యో యో వ్యక్తరూపస్స్యాత్ దివ్యవిగ్రహ ధారణాత్ ॥**

మహాసముద్రంలో మునుగుతూ తేలుతూ ఉన్న మార్కండేయుడికి దివ్యమంగళ విగ్రహముతో దర్శనమిచ్చినవాడు.

**వ్యక్తం రూపం యస్యసః వ్యక్త రూపః** ఆశ్రితులైనవారికి, మార్కండేయాదులకు సుఖముగా దర్శనమిచ్చినవాడు.

ఆయా అవతారాలలో స్పష్టముగా కనిపించేవాడు. స్వయంప్రకాశి కాబట్టి యోగులకు, భక్తులకు దర్శనమిచ్చేవాడు.

పరమేశ్వరుడు ఇంద్రియాలకు గోచరముకాడు. అయినప్పటికీ, ఇంద్రియాలు అంతర్ముఖమై, మనస్సు హృదయమందు అంతర్లీనమైనప్పుడు ఉండే ధ్యానస్థితిలో పరమేశ్వరుడు స్పష్టంగా దర్శనమిస్తాడు.

భృగుమహర్షి కుమారుడు విధాత. విధాత కుమారుడు మృకుండమహర్షి. ఇతని కుమారుడు మార్కండేయుడు. ఇతడిది అల్పాయుషు. అందుచేత తీవ్రమైన తపస్సు చేశాడు. అతని తపస్సుకు భయపడి ఇంద్రుడు అప్సరసలను పంపాడు. అయినా అతడు చలించ లేదు. చివరకు శ్రీమహావిష్ణువు ప్రత్యక్షమై ఏ వరం కావాలో కోరుకోమన్నాడు. దానికి మార్కండేయుడు ఈ శరీరంతోనే అనేక యుగాలు జీవించి ఉండేటట్లుగా వరమడిగాడు. 'తథాస్తు' అన్నాడు శ్రీహరి. ఆ రకంగా మార్కండేయుడు చిరంజీవి అయినాడు.

ప్రళయము సంభవించి లోకాలన్నీ జలమయమై పోయినప్పుడు మార్కండేయుడు ఒక్కడే జీవించి ఉంటాడు. వటపత్రశాయి అయిన హరికి నమస్కరించి, అతని శరీరంలో ప్రవేశించి అనేక సంవత్సరాలు ఆ శరీరంలోపలే తిరిగిన మహానుభావుడు.

అటువంటి వారికి దర్శనమిచ్చేవాడు కాబట్టే శ్రీమన్నారాయణుడు 'వ్యక్తరూపః' అనబడుతున్నాడు. పంచభూతాలతో కూడిన స్థూలసూక్ష్మశరీరాలతో సంబంధం ఉన్న బ్రహ్మకు రెండు రూపాలున్నాయి. అవి 1. మూర్తము 2. అమూర్తము. వీటిని **బృహదారణ్యకోపనిషత్తు**లో వివరించటం జరిగింది.

ఇంద్రియాలకు, శరీరానికి కారణభూతమైన పంచభూతాలను – సత్యం అంటారు. విజ్ఞులు నేతి, నేతి ఇదికాదు, ఇదికాదు అంటూ బ్రహ్మతత్త్వాన్ని తెలుసుకోవటానికి ప్రయత్నించారు. పంచభూతాలతో కూడినటువంటి స్థూల, సూక్ష్మ శరీరాలతో సంబంధం ఉన్న బ్రహ్మకు రెండు రూపాలున్నాయి. మూర్తము, అమూర్తము. అవే స్థూలము, సూక్ష్మము మర్త్యరూపము – అమృతరూపము అంటే నశించేది, నశించనిది; చావు ఉన్నది, చావులేనిది. స్థావరం, స్థిరంగా ఉండేది. జంగమం – కదిలేది. సత్తు – నిర్వచించటానికి వీలైనది. త్యత్తు – నిర్వచించటానికి వీలుకానిది.

పంచభూతాలలో పృథివి, జలము, అగ్ని ఈ మూడు మూర్తములు. స్థూలమైనవి. స్థావరమైనవి. నాశనమయి పోయేవి. ఇవి చక్షురాది ఇంద్రియాలకు గోచరిస్తాయి. వీటిని నిర్వచించటానికి వీలువుతుంది. వీటి సారమే ఆకాశంలో ప్రకాశించే సూర్యుడు. ఈ సూర్యునివల్లనే ఈ మూడు విభజించబడుతున్నాయి.

ప్రాణంకన్న భిన్నమైనది. దేహంలో ఉన్న ఆకాశంకన్న భిన్నమైనది వాయువు. ఆకాశము కాకుండా మిగిలిన మూడు భూతముల చేత నిర్మించబడిన శరీరం అంతా మూర్తము, మర్త్యము, స్థావరము. అది నాశనమవుతుంది. వీటిసారమే కనులు అంటే పృథివి, జలము, అగ్నిల యొక్క సారమే నేత్రగోళములు.

ప్రాణములు, శరీరములో ఉన్న ఆకాశం. అదే దహారాకాశం. ఈ రెండూ అమూర్తాలు. శాశ్వతమైనవి. నాశనంలేనివి. అనంతమైన అనిర్వచనీయమైన అమూర్తానికి కుడికంటిలో ఉన్న పురుషుడే సారభూతమైనవాడు.

లింగశరీరరూపమైన పురుషుని వాసనామయస్వరూపం పసుపులో ముంచిన వస్త్రంలాగా తెల్లని ఉన్ని గుడ్డలాగా, వర్షాకాలంలో కనుపించే ఎర్రని ఆర్ద్రపురుగులాగా, అగ్నిజ్వాలలాగా, తెల్లని పద్మంలాగా, మెరుపుకాంతిలాగా ఉంటుంది. ఈ విషయం తెలుసుకున్నవాడి సంపద విద్యుత్ప్రకాశంలాగా ఒక్కసారిగా అంతటా వ్యాపిస్తుంది. బ్రహ్మను గురించి ఇంతకన్న వర్ణించటం కష్టం. నేతినేతి విషయత్వ రూపంలో మనకు లభించేది బ్రహ్మమేనా ? అని ప్రశ్నించుకుంటూ, ఇది కాదు అని తెలుసుకుంటూ, ఇలా పోగాపోగా చివరకు మిగిలేదే బ్రహ్మము. కనిపించే వస్తువులను విషయాలను నిషేధిస్తూపోతే మిగిలేదే బ్రహ్మ. బ్రహ్మనే దానిపేరు సత్యానికి సత్యం – ప్రాణసత్యం. బ్రహ్మమనేది ఆసత్యానికి, సత్యం, ప్రాణానికి కూడా సత్యమై ఉన్నది. బ్రహ్మయొక్క సత్యత్వమే సమస్త ప్రపంచంతో తాదాత్మ్యం చెంది గోచరిస్తోంది.

ఈ రకంగా వ్యక్తస్వరూపుడు ఆ పరమేశ్వరుడు. కాబట్టి శ్రీమన్నారాయణుడు 'వ్యక్తరూపః' అనబడుతున్నాడు. **లలితాసహస్రం**లో 399వ నామము "వ్యక్తావ్యక్త స్వరూపిణి".

## 306. సహస్రజిత్

కల్పములను జయించినవాడు.

**సహస్రయుగసఙ్ఖ్యాకం సర్వకల్పాన్త మేవ హి ।**

**శయాన ఏవ జయతి సహస్ర జిదితి స్మృతః ॥**

అనేక యుగములు గల కల్పమంతా శయనించి ఉండి జయించువాడు.

**సహస్రం జయతీతి సహస్రజిత్** కల్పాంతము శయనించియే జయించువాడు. భారతంలోని అరణ్యపర్వంలో

**యావద్యుగానాం విప్రర్షే సహస్రం పరివర్తతే తావత్స్వపిమి**

వేయి యుగాలు గడిచే దాకా నేను శయనించే ఉంటాను.

దేవదానవ యుద్ధంలో వేలకొలది రాక్షసులను జయించువాడు. రావణుడు కుంభకర్ణుడు మొదలైన రాక్షసులను సంహరించి 'అనంతజితుడు' అయినాడు. కంసుడు, శిశుపాలుడు మొదలైన రాక్షసులను యుద్ధంలో జయించాడు. అంతేకాకుండా శరీరంలో అంతర్గతంగా ఉన్న కామ, క్రోధలోభ,మోహ, మద, మాత్సర్యములనబడే అరిషడ్వర్గాలను అంతమొందించేవాడు. ప్రతి మానవుడికీ అనంతమైన కోరికలు ఉంటాయి. అనేక రకాల వాసనలు కూడా ఉంటాయి. ఈ రకమైన కోరికలు, అరిషడ్వర్గాలు, వాసనలు అన్నింటినీ అంత మొందించేవాడు. అందుచేతనే పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు 'సహస్రజిత్' అనబడుతున్నాడు.

## 307. అనంతజిత్

అవధులు లేకుండా ప్రకాశించేవాడు.

**మతస్యశిశురూపస్య కదాచిత్కశ్చిదేవ హి ।**
**కథంచి దవధిర్నాస్తి మహిమ్నః పరమాత్మనః ।**
**తస్మాదీనన్త జిదితి వస్వర్ణో జయదో మనుః ॥**

తనకు ఇష్టమైన రూపము దాల్చి అవధులు లేకుండా ప్రకాశించేవాడు.

**అనంతం పరిమిత శిశురూపస్య మహిమావధిం జయతి**
**అభిభవతీతి అంతజిత్ న అంతజిత్ అనంతజిత్**

అతడు చిన్నవాడైనప్పటికీ, తన మహిమ ఏమిటో ఎవరికీ తెలియకుండా ప్రకాశించే వాడు. ఊహించనలవి కాని శక్తిమంతుడు కాబట్టి యుద్ధక్రీడలయందు అనంత భూతములను జయిస్తాడు.

అనూహ్యమైన శక్తిసామర్థ్యములు కలిగి రణరంగములో తనని ఎదిరించేవారిని జయించే శక్తిసామర్థ్యాలు గలవాడు. పరమేశ్వరుడు సత్యస్వరూపుడు. కాబట్టి విజయం

అతనిదే. జీవులయొక్క పాపములను ప్రక్షాళనముచేసి, వారందరికీ కైవల్యము ప్రసాదించేవాడు కాబట్టి 'అనంతజిత్' అనబడుతున్నాడు. అసంఖ్యాకమైన భక్తుల హృదయాలలో రమించువాడై వారిని తనవైపుకు మరలించుకొను శక్తిగలవాడు కాబట్టి 'అనంతజిత్' అనబడుతున్నాడు.

పరమేశ్వరుడు అసాధారణ ధైర్యసాహసాలు, ప్రజ్ఞాపాటవాలు గలవాడు. అతిరథ, మహారథులందరిలోకీ గొప్పవాడు. అతన్నెదిరించి నిలవటము సామాన్యమైన విషయంకాదు. యుద్ధంలో ఎంతటివారైనా సరే అతని చేతిలో మట్టి కరువవలసినదే. సత్యభామ కోర్కె తీర్చటం కోసం పారిజాత వృక్షాన్నే భూలోకానికి తీసుకువద్దామని అమరావతీ నగరానికి వెళ్ళి, సాక్షాత్తూ ఇంద్రుణ్ణే ఓడించినవాడు. అందుచేతనే శ్రీమహావిష్ణువు 'అనంతజిత్' అంటున్నారు.

## 308. ఇష్టః

కోరబడినవాడు, ఇష్టుడు, ప్రీతిపాత్రుడు.

**ఇష్టో విశిష్టః కథితః సర్వరక్షణ తత్పరః** ప్రాణులన్నింటినీ తన గర్భమునందు ఉంచుకుని, తారతమ్యము లేకుండా, తల్లిలాగా కాచి రక్షించువాడు.

**పరమానందాత్మ కత్వేన సర్వేషాంప్రియః**

పరమేశ్వరుడు ఎల్లకాలమందు పరమానందుడు. అందుచేత అందరూ ఆ ఆనంద స్థితిలోనే ఉండాలని కోరుకుంటారు. అందుచేత అతడు 'ఇష్టః' అనబడుతున్నాడు.

వివిధ యజ్ఞములద్వారా తెలియబడువాడు. అసలు యజ్ఞమే పరమేశ్వర స్వరూపము. **యజ్ఞోవైవిష్ణుః** అంటోంది వేదం. అంటే యజ్ఞమే విష్ణువు. కాబట్టి విష్ణువుకన్న వేరుకానటువంటివాడు పరమేశ్వరుడు. **పద్మపురాణం**లో ఈశ్వరుణ్ణి గురించి చెబుతూ

**వేదపాదో యూపదంష్ట్రః క్రతుహస్త శ్చితీముఖః**
**అగ్నిజిహ్వో ధర్మరోమాః బ్రహ్మశీర్షో మహాతపాః**
**అహోరాత్రేక్షణో దివ్యో వేదాంతశ్రుతి భూషణః**
**స్రువతుండ శ్చాజ్యనాసః సామఘోష్యస్వనో మహాన్**
**ధర్మసత్యమయః శ్రీమాన్ క్రమవిక్రమ సత్క్రియః**
**ప్రాయశ్చిత్తనఖో ధీరః పశుజానుర్మహా భుజః**

**ఔద్గాత్రాంత్రో హోమలింగః ఫలబీజ మహౌషధిః**

**వాయ్వంతరాత్మా మంత్రస్ఫిగ్వికృతః సోమశోణితః**

**వేదస్కంధో హవిర్గంధో హవ్యకవ్యాతి వేగవాన్**

**ప్రాగ్వంశకాయో ద్యుతిమాన్ నానాదీక్షాభిరర్చితః**

**దక్షిణాహృదయో యోగీ మహామంత్రమయో మహాన్**

**ఉపాకర్మోష్ఠచుబుకః ప్రవర్గ్యావర్తభూషణః**

**నానాచ్ఛందోగతిపథో గుహ్యోపనిషదాసనః**

**ఛాయాపత్నీ సహాయోవై మేరు శృంగ ఇవోచ్ఛ్రితః**

| | | | | | |
|---|---|---|---|---|---|
| వేదాలే | - | అతనిపాదాలు | ఔద్గాత్రమే | - | ఆంత్రము (ప్రేగు) |
| యూపస్తంభాలు | - | కోరలు | హోమమే | - | లింగము |
| క్రతువులు | - | హస్తాలు | ఫలములే | - | అవయవాలు |
| యాగార్ధమైన | | | వాయువు | - | అతని అంతరాత్మ |
| కాష్టములచితి | - | ముఖము | మంత్రాలు | - | పెదవులు |
| అగ్నియే | - | నాలుక | సోమరసము | - | రక్తము |
| ధర్మాలే | - | రోమాలు | వేదాలు | - | భుజాలు |
| తపోవంతులైన | | | వేది | - | స్కందము |
| బ్రాహ్మణులే | - | తల | హవిస్సు | - | గంధము |
| అహోరాత్రాలు | - | చూపులు (దృష్టి) | హవ్యకవ్యములు | - | వేదాలు |
| వేదాంతశ్రుతులు | - | చెవికమ్మలు | ప్రాగ్వంశికలు | - | దేహము |
| స్రువమే | - | తుండము | దానము | - | హృదయము |
| ఆజ్యమే | - | ముక్కు | ఉపకర్మలు | - | పెదవులు, గడ్డము |
| సామఘోషయే | - | గొప్పధ్వని | ప్రవర్గ్యలు | - | భూషణములు |
| సత్క్రియలే | - | అతని క్రమ విక్రమములు | నానాఛందస్సులు | - | మార్గాలు |
| ప్రాయశ్చిత్తములే | - | నఖములు | గుహ్యోపనిషత్తు | - | అతని ఆసనము |
| పశువు | - | జానువు | ఛాయ | - | పత్ని |

అతడు ధర్మసత్యమయుడు, నానాదీక్షలచే అర్చించబడినవాడు, పర్వతమువలె ఉన్నతుడు అని చెప్పబడింది. **ఆమ్నాయరహస్యంలో**

**ఇంద్రియద్వారసంగృహ్యైః గంధాద్యై రాత్మదేవతాం ।**

**స్వభావేన సమారాధ్య జ్ఞాతు స్సోయం మహామఖః ॥**

ఇంద్రియాలను జయించి మిక్కిలి భక్తితో ఆత్మను ఆరాధించటమే మహాయజ్ఞము అని చెప్పబడింది. అటువంటి ఆత్మారాధన యజ్ఞము కన్న వేరుకాదు.

**కర్మ బ్రహ్మోద్భ వం విద్ధి బ్రహ్మాఽక్షరసముద్భవం ।**
**తస్మా త్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్టితమ్ ॥**

కర్మ వేదం వలన ఏర్పడగా, వేదం పరమాత్మ వలన ఏర్పడింది. ఆ కారణంగా సర్వగతమైన బ్రహ్మ యజ్ఞమందే ప్రతిష్ఠితమై ఉన్నది. ఈ యజ్ఞము జగత్ప్రవర్తక సాధనము.

**అన్నా ద్భవంతి భూతాని పర్జన్యా దన్నసంభవః ।**
**యజ్ఞా ద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః ॥**

| | | |
|---|---|---|
| భూతాలు | - | అన్నం వలన వృద్ధి చెందుతాయి |
| అన్నం | - | మేఘము వలన సంభవిస్తుంది |
| మేఘాలు | - | యజ్ఞం వలన |
| యజ్ఞము | - | కర్మవలన సంభవిస్తాయి |

ఈ రకంగా సర్వదేవతలకు, సర్వజీవులకు తుష్టికారణమైన యజ్ఞరూపంలో ఉంటాడు పరమేశ్వరుడు.

ప్రజాపతి యజ్ఞంవల్ల ప్రజలను సృష్టించి మీరు వర్ణాశ్రమధర్మాలను నెరవేరుస్తూ వేదంలో చెప్పబడ్డట్లుగా యజ్ఞకర్మలు చేస్తుండండి. అప్పుడు దేవతలు మీ కోరికలు నెరవేరుస్తారు అని చెప్పాడు. అందుచేత యజ్ఞాలు మానవకల్పితాలుకావు అని గుర్తించాలి.

యజ్ఞాలు మూడురకాలు. అవి 1. పాకయజ్ఞాలు 2. హవిర్యాగములు 3. సోమసంస్థలు.

**1. పాకయజ్ఞాలు :** ఇవి మళ్ళీ ఏడువిధాలు.

1. ఔపాసన
2. స్థాలీపాకము
3. వైశ్వదేవము
4. అష్టకము
5. మాసశ్రాద్ధము
6. సర్పబలి
7. ఈశానబలి

**2. హవిర్యాగాలు :** ఇవి మళ్ళీ ఏడురకాలు.

1. అగ్నిహోత్రాలు
2. దర్శపూర్ణిమాసలు
3. ఆగ్రయణం
4. చాతుర్మాస్యాలు
5. పిండ, పితృయజ్ఞాలు
6. నిరూఢపశుబంధము
7. సౌత్రామణి

**3. సోమసంస్థలు :** ఇవి మళ్ళీ ఏడురకాలు.

| | | |
|---|---|---|
| 1. అగ్నిష్టోమము | 4. అతిరాత్రము | 6. వాజపేయం |
| 2. అత్యగ్నిష్టోమము | 5. ఆప్తోర్యామం | 7. పౌండరీకం |
| 3. ఉక్థము | | |

ఇవి కాకుండా అంబాయజ్ఞము, అంతర్యాగము, బహిర్యాగము అని కూడా ఉన్నాయి. ఇవన్నీ పరమేశ్వర స్వరూపమే.

**భగవద్గీత**లోని నాల్గవ అధ్యాయం **'జ్ఞానయోగం'**లోని 11వ శ్లోకంలో

**యే యథా మాం ప్రపద్యన్తే తాంస్త థైవ భజామ్యహమ్**
**మమ వర్త్మాను వర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః**

పార్థా ! భక్తులు నన్ను సేవించిన రీతికి అనుగుణంగా నేను వారిని అనుగ్రహిస్తాను. మనుష్యులందరూ వివిధరీతులలో నామార్గాన్నే అనుసరిస్తారు.

భక్తులు భగవంతుని అనేకవిధాలుగా అర్చిస్తారు. తమ తమ భావాలననుసరించి భగవంతుని వివిధరూపాలలో కొలుస్తారు. కాబట్టి తాను కూడా భక్తుల అభీష్టానుసారము వారు కోరిన రూపంలోనే దర్శనమిస్తాను. పరమేశ్వరుడు నిరాకారుడు అనే భావనతో అర్చనచేస్తే, వారికి అలాగే దర్శనమిస్తాను. అంటే అలాంటి వారికి ఆత్మ సాక్షాత్కార మవుతుంది. తనను స్మరించే వారిని తాను కూడా స్మరిస్తాడు. తనకోసం వ్యాకులపడేవారి విషయంలో తాను వ్యాకులపడతాడు. తనకోసం సర్వమూ త్యాగం చేసిన వారిని తాను సర్వాత్మనా ఆదుకుంటాడు.

గోపాలురు అతన్ని మిత్రుడుగా చూశారు. వారిని మిత్రుడుగానే ఆదుకున్నాడు.

యశోదానందులు కుమారునిగా చూశారు వారికి పుత్రుడుగానే ఉన్నాడు. ఈరకంగా రుక్మిణీదేవికి – భర్తగా, హనుమంతుడికి – స్వామిగా వ్యవహరించాడు.

మానవులంతా భగవంతుని మార్గాన్నే అనుసరిస్తారు. భగవంతుడు భక్తులను ప్రేమ, ఆదరములతో కాపాడినట్లుగానే భక్తులు కూడా పరస్పరము అదేవిధంగా వ్యవహరిస్తారు.

కాబట్టి తెలిసిగాని, తెలియకగాని ప్రతిఒక్కడూ సుఖస్వరూపుడైన పరమేశ్వరునే ఆరాధిస్తున్నారు.

**బృహదారణ్యకోపనిషత్తు**లో తన భార్య అయిన మైత్రేయికి బ్రహ్మోపదేశం చేస్తూ యాజ్ఞవల్క్యుడు. "మైత్రేయీ ఆత్మప్రయోజనం కోసమే ఒకరికొకరు ప్రియులవుతున్నారు"

అంటాడు. పరమేశ్వరుడు సర్వాంతర్యామియై సర్వులచేత ప్రేమించబడుతున్నాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'ఇష్టః' అనబడుతున్నాడు.

## 309. అవిశిష్టః

విలక్షణమైనవాడు.

**ఇష్టోవిశిష్టకథితః సర్వలక్షణ తత్పరః** అన్నిజీవులను తన గర్భములో ధరించి తల్లివలె కాపాడువాడు.

**సర్వేషాం అంతర్యామిత్వేన - అవిశిష్టః** అన్ని ప్రాణులకు, అన్ని పదార్థములకు అంతర్యామి. అందరి హృదయాలలోను ఆసీనుడై అందరినీ ప్రేమించి అనుగ్రహించువాడు. దేహము, ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి మొదలైన వాటితో జరిగే సకల వ్యాపారాలకు తానే కర్త అయినవాడు. జీవులు చేసే ప్రతి పని కనిపెట్టి చూస్తూ ఉంటాడు.

అన్నిప్రాణులయందు, అన్ని పదార్థములయందు ఉంటూ, వాటిని తమతమ వ్యాపారములందు ప్రవర్తిల్లునట్లుగా నియమించేవాడు. అదుపులో ఉంచేవాడు. అతడే అన్నింటికీ అంతర్యామి.

**బృహదారణ్యకోపనిషత్తు**లో అంతర్యామిని గురించి వివరించటం జరిగింది.

అంతర్యామిగా ఉండే పురుషుని వివరించమని ఉద్దాలకుడు యాజ్ఞవల్క్యుని అడుగుతాడు. దానికి యాజ్ఞవల్క్యుడు సమాధానం చెబుతున్నాడు.

ఎవడు భూమిపైనా, భూమిలోపలా ఉంటాడో, తనలో ఉన్నప్పటికీ భూమి ఎవరిని ఎరుగదో, ఎవరి శరీరమే భూమియో, భూమిలోపల ఉంటూనే ఎవరు భూమిని నియంత్రిస్తారో అతడే ఆత్మ అంతర్యామి.

ప్రాణులు భూమిపైన ఉంటాయి. భూమిలో తాదాత్మ్యం చెందిన దేవతలలోపల ఉంటాయి. ప్రతి మానవుడి శరీరము భూమియే. అవయవాలు కూడా భూమియే. కాని తనలో ఉన్నవాడిని ఈ శరీరముగాని, ఈ అవయవాలుగాని ఎరగవు. ఈ రకంగా శరీరంలోను, అవయవాలలోను ఉంటూ వాటిని నియంత్రించేదే ఆత్మ. అంతర్యామి. అతడు నీటిలో నివశిస్తాడు. నీరే అతడి శరీరము. కాని నీరు అతన్నెరుగదు. ఈ విధంగా నీటిలో ఉంటూ నీటిని నియంత్రించే వాడే అంతర్యామి.

అగ్నిలో ఉంటాడు. అగ్ని అతన్నెరుగదు. అగ్నే అతని శరీరము. అగ్నిలో ఉంటూనే అగ్నిని నియంత్రిస్తున్నాడు. అతడే అంతర్యామి.

వాయువునందుంటాడు వాయువు అతన్నెరగదు. వాయువే అతని శరీరము. వాయువులో ఉంటూనే వాయువును నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి. ఆకాశంలో ఉంటాడు. ఆకాశం అతన్నెరగదు. ఆకాశమే అతని శరీరము. ఆకాశంలో ఉంటూనే ఆకాశాన్ని నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి. అంతరిక్షంలో ఉంటాడు. అంతరిక్షం అతన్నెరగదు. అంతరిక్షంలో ఉంటూనే అంతరిక్షాన్ని నియంత్రిస్తాడు అతడే అంతర్యామి.

ద్యులోకంలో ఉంటాడు. కాని ద్యులోకమతన్ని ఎరగదు. ద్యులోకమే అతని శరీరము. ద్యులోకంలో ఉంటూనే ద్యులోకాన్ని నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి.

ఆదిత్యలోకంలో ఉంటాడు. ఆదిత్యలోకమతన్ని ఎరగదు. ఆదిత్యలోకమే అతని శరీరము. ఆదిత్యలోకంలో ఉంటూనే ఆదిత్యలోకాన్ని నియంత్రిస్తాడు అతడే అంతర్యామి.

చంద్రునిలో ఉంటాడు. చంద్రుడే అతని శరీరము. కాని చంద్రుడు అతన్నెరగడు. చంద్రునిలో ఉంటూనే చంద్రుని నియంత్రిస్తూ ఉంటాడు. అతడే అంతర్యామి.

దిగంతరాళాల్లో ఉంటాడు. కాని దిక్కులు అతన్నెరగవు. దిక్కులే అతని శరీరము. దిక్కులలో ఉంటూనే దిక్కులను నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి.

అంధకారంలో ఉంటాడు. అంధకారమే అతని శరీరం. కాని అంధకారమతన్ని ఎరగదు. ఈ రకంగా అంధకారంలో ఉంటూ, అంధకారాన్ని నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి.

తేజస్సులో ఉంటాడు. తేజస్సే అతని శరీరం. కాని తేజస్సు అతన్నెరగదు. తేజస్సులో ఉంటూనే తేజస్సును నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి.

అతడు కనిపించడు. కాని చూస్తాడు. వినిపించడు. కాని వింటాడు. అతడు తెలియబడడు. అర్థంకాడు. కాని అతనికి అన్నీ తెలుసు. అతడే అంతర్యామి. శాశ్వతుడు. అతడు తప్ప అన్నీ నాశనమైపోయేవే.

ఈ కారణంచేతనే పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు 'అవిశిష్టః' అనబడుతున్నాడు.

## 310. శిష్టేష్టః

శిష్టులకు ఇష్టుడు.

**మార్కణ్డేయ ద్విజాదీనాం పణ్డితేష్వగ్రయాయనాం ।**
**ఉత్కృష్ట పురుషార్థత్వే నేష్టశిష్టేష్ట ఉచ్యతే ॥**

శిష్టాచారసంపన్నులైన మార్కండేయాది మహర్షులచే ఉత్కృష్టమైన పురుషార్థముగ ప్రార్థింపదగినవాడు.

**శిష్టానాం పరమ పురుషార్థత్వేన ఇష్టః శిష్టేష్టః**

శిష్టాచారులచే కోరదగినది అయిన పురుషార్థ స్వరూపుడు.

**శిష్టానాం ఇష్టః** శిష్టులకు ఇష్టుడు.

**భగవద్గీత**లోని ఏడవ అధ్యాయం **"విజ్ఞాన యోగము"**లోని 17వ శ్లోకము.

**తేషాం జ్ఞానీ నిత్యయుక్తః ఏకభక్తిర్వి శిష్యతే ।**
**ప్రియో హి జ్ఞానినోఽ త్యర్థంహం స చ మమ అప్రియః ॥**

భక్తులందరిలోనూ నిరంతరము నాయందే మనసు లగ్నంచేసినవాడై, అనన్య భక్తియుతుడైన జ్ఞాని అత్యుత్తముడు. వాస్తవంగా, నా తత్త్వాన్ని తెలుసుకున్న జ్ఞానికి నేను మిక్కిలి ఇష్టుడను. అతడు కూడా నాకు మిక్కిలి ఇష్టుడు.

భగవంతుని తత్త్వము బాగా తెలిసినవాడికి సర్వత్ర భగవత్స్వరూపమే కనిపిస్తుంది. అతని దృష్టిలో భగవంతుడు తప్ప వేరెవరూలేరు. అతడు భగవంతుని పరమశ్రేష్ఠుడుగా, పరమప్రియతముడిగా భావిస్తాడు. అతడియందు పరమేశ్వరుడు అత్యంత ప్రేమ గలిగి ఉంటాడు.

శిష్టులయందు ఇష్టము గలవాడు. ఇక్కడ శిష్టములు – విహితకర్మలు. ఇష్టములు – ప్రియమైనవి. ఈ రెండు కర్మలయందు ప్రీతి గలవాడు.

విహితకర్మలచే పూజించబడేవాడు పరమేశ్వరుడు. వర్ణాశ్రమధర్మాలలో చెప్పిన ప్రకారముచేసేదే పూజ. అంతేకాని గంధము, అక్షతలు, పూలు అర్పించటంకాదు. 'ఆచారం నుంచే ధర్మం పుడుతుంది. ధర్మానికి ప్రభువు అచ్యుతుడు' అని బృహన్నారదీయములో చెప్పబడింది. వశిష్టసూత్రాలలో అవయవచాపల్యములేనివారు, వంశపారంపర్య వేదాధ్యయనం చేసేవారు, వేదాలనే ప్రమాణంగా తీసుకునేవారు, శిష్టులు అనబడతారు" అని చెప్పబడింది. అటువంటి శిష్టులచేత పూజించబడేవాడు. శిష్టులయందు ఇష్టము గలవాడు. తేలికగా చెప్పాలి అంటే శిష్టులు అనగా – సదాచారసంపన్నులు. వారియందు, వారి ఆచారములందు ప్రీతి గలవాడు.

**లలితాసహస్రం**లో 411వ నామము **శిష్టేష్టా.**

## 311. శిఖండీ

శిఖరము గలవాడు, నెమిలిపింఛపు కొప్పుగలవాడు.

**అత్యప్రధృష్య మైశ్వర్యం పరం యత్తేజ అస్థితమ్ ।**
**తచ్ఛుఖణ్డంతు యస్యాప్తి తచ్ఛిఖణ్డీతి చక్ష్యతే ॥**

అపరిమితమై, ఎవరికీ ఎదిరించటానికి వీలుకాని ఐశ్వర్యము గలవాడు.

**శిఖండః అస్యాస్త్రీతి శిఖండీ** తిరస్కరింపజాలని ఐశ్వర్యము, తేజస్సు గలవాడు.

**గోపనౌషధరస్య శిఖండః అలంకారః అస్య** గోపనౌషధరుడగు ఇతనికి (శిఖండము) నెమిలి పింఛము అలంకారముగా ఉన్నది.

సృష్టిలో లైంగికవికారములేకుండానే సంతానోత్పత్తి చేసే ప్రాణి 'నెమిలి' అందుకే నెమిలి కామవిజయానికి చిహ్నము. శ్రీకృష్ణపరమాత్ముడు నెమిలి పింఛాన్ని ధరించి తన అస్ఖలితబ్రహ్మచారిత్వాన్ని తెలియచేస్తున్నాడు.

శిఖండము అంటే – తేజస్సు అని కూడా అర్థం. పరమేశ్వరుడు దివ్యతేజోమయుడు.

**ఆసీనం తం నరవ్యాఘ్రం పశ్యామ్యమిత తేజసమ్** అమితమైన తేజస్సు ఆభరణంగా ధరించి ఆ పరమేశ్వరుడు ప్రకాశిస్తున్నాడు. అని మార్కండేయుడు చెబుతున్నాడు.

మాయ అనేది పరమేశ్వరుని అధీనంలో ఉంటుంది. పరమేశ్వరుడు మాయకు అతీతుడు. కాని ప్రాణులన్నింటినీ మాయకు అధీనులుగా చేస్తాడు.

## 312. నహుషః

బంధించువాడు.

**జీవాన్ స్వమాయయా నిత్యం నహుషో నహ్యతీతియః**

మాయ అనే ప్రకృతితో జీవులను కర్మానుగుణముగా బంధించువాడు.

**నహ్యతి బధ్నాతీతి నహుషః** తన మాయచే జీవులను కట్టివేసేవాడు.

**నహ్యతి భూతాని మాయయా** ప్రాణులను తన మాయచే బంధించేవాడు.

ఈ జగత్తంతా మాయాస్వరూపమే. జగత్తులోని ప్రతిప్రాణీ ఆ మాయకులోబడి ఉండేవారే. శంకరభగవత్పాదులవారు తమ **భజగోవిందస్తోత్రములో**

**మాకురు ధన జన యవ్వన గర్వం హరతి నిమేషాత్కాల స్సర్వం ।**
**మాయామయ మిద మఖిలం హిత్వా బ్రహ్మపదం త్వం ప్రవిశ విదిత్వా ॥**

ధనము, పరివారము, యవ్వనము ఉన్నాయి కదా అని గర్వించవద్దు. అవన్నీ క్షణంలో నాశనమైపోతాయి. ఇదంతా మాయ, మిథ్య, అశాశ్వతము అని గ్రహించి జ్ఞానివై పరమపదాన్ని పొందవలసినది.

మాయను జయించటం ఎవరి వల్లాకాదు. నారదుడు మాయను జయించాననుకుని చివరకు శ్రీహరిని శరణువేడాడు. ఈ విషయం **శివపురాణం**లో చెప్పబడింది.

పూర్వకాలంలో నారదుడు ఒకసారి హిమాలయ పర్వతాలలోని మానస సరోవరం దగ్గర పర్ణశాల నొకదాన్ని నిర్మించుకుని భీకరమైన తపస్సుచేస్తున్నాడు. నారదుని తపస్సు భంగము చెయ్యమని దేవేంద్రుడు అప్సరసలను పంపించాడు.

అప్సరసలు నారదుని సమీపించి వీనులవిందుగా గానం చేశారు. కన్నులు పండువుగా నాట్యం చేసారు. మహర్షి చలించలేదు. చివరి అస్త్రంగా అప్సరసలు అంగాంగ ప్రదర్శనం చేశారు. నారదుడు 'శివశివా' అంటూ కనులు మూసుకుని తపస్సు కుపక్రమించాడు.

అప్సరాంగనలు దేవేంద్రుని వద్దకు పోయి నారదుని తపస్సు భంగము చెయ్యలేక పోయామని చెప్పి సిగ్గుతో తలలు వంచుకున్నారు. నారదుడు ఆ తపస్సును ఇంద్ర పదవికోసం చెయ్యటం లేదు. పరమేశ్వరుని అనుగ్రహం కోసము చేస్తున్నాడు అని తెలుసుకుని దేవేంద్రుడు కూడా శాంతించాడు.

అప్సరసల వయ్యారములకు లొంగక ఇంద్రియ నిగ్రహము పాటించినందుకు నారదుడు తనను తానే అభినందించుకున్నాడు. లోలోన సంతసించాడు. క్రమంగా ఆ సంతోషము గర్వముగా మారింది. 'అప్సరాంగనలకు లొంగలేదు. కాబట్టి మాయను జయించినట్లే' అని తీర్మానించుకున్నాడు.

ఇలా ఉండగా ఒక రోజున నారదుడు సత్యలోకానికి వెళ్లి, బ్రహ్మదేవుడితో తను తపస్సు చేసిన విధానము, అప్సరాంగనలను జయించిన విధానము వివరించి "తండ్రీ ! ఇదేకదా మాయ. ఆ మాయను నేను జయించగలిగాను" అన్నాడు. ఆ మాటలు విన్న పరమేష్ఠి నవ్వి ఊరుకున్నాడు. తరువాత నారదుడు కైలాసానికి వెళ్ళి, శివుడికి నమస్కరించి "దేవదేవా ! శివ మాయను జయించటం వల్ల నేను ధన్యుడనైనాను" అన్నాడు. ఆ మాటలు విన్న ఈశ్వరుడు "నారదా ! శివ మాయ అంటే ఏమిటో పూర్తిగా నాకే తెలియదు. దాన్ని జయించానంటున్నావు. ఎందుకయినా మంచిది. జాగ్రత్తగా ఉండు" అన్నాడు. తరువాత నారదుడు వైకుంఠంచేరి, విష్ణువుకు నమస్కరించి, తాను చేసిన తపస్సు గురించి తెలిపి, "తాతా ! శివమాయను జయించాను. విష్ణుమాయ కూడా నన్నేమీ చెయ్యలేదు"

అన్నాడు. ఆ మాటలు విన్న విష్ణుమూర్తి. "నారదా ! త్రిమూర్తులకు మించిన శక్తి ఇంకొకటి ఉన్నది. అదే పరమ శక్తి. మహామాయ దానిని గురించి తెలియనివారు విష్ణుమాయ, శివమాయ అనుకుంటారు. కాని మహామాయ త్రిమూర్తులను కూడా బద్ధులను చేస్తుంది. మాయకు అతీతుడైన వారెవరూ లేరు. కాబట్టి నువ్వు మాత్రం జాగ్రత్తగా ఉండవలసినది" అన్నాడు. ఆ మాటలు విన్న నారదుడు సరే అని తల ఊపి భూలోకానికి బయలుదేరాడు.

భూలోకంలో కళ్యాణ పురము అని పట్టణమున్నది. అది సస్యశ్యామలమై ఉన్నది. ఆ రాజ్యాన్ని పాలించే మహారాజుకు యుక్తవయస్కురాలైన కుమార్తె ఉన్నది. కుమార్తెకు వివాహం చేద్దామని నిశ్చయించి దేశం నలుమూలలా చాటింపు వేయించాడు మహారాజు. రాజభవనముతో పాటు కళ్యాణపురమంతా అందంగా అలంకరించారు. అంతా కోలాహలంగా ఉన్నది. ఆ రాజ్యానికి చేరాడు నారదుడు. రాజభవనానికి వచ్చాడు. మహర్షిని చూడగానే రాజు అర్ఘ్యపాద్యాదులు ఇచ్చి స్వాగతం పలికాడు. సుఖాసీనుడైనాడు నారదుడు. మహర్షిని ఘనంగా సత్కరించాడు మహారాజు, చెలికత్తెలు రాకుమారిని తోడ్కొని వచ్చారు. రాజహంసలా వచ్చిన రాకుమారి అతివయ్యారంగా నమస్కరించింది.

నిండు యవ్వనంలో ఉన్న రాకుమారి అపురూప సౌందర్యరాశి. ఆమెను చూడగానే నారదుని మనస్సు పరిపరివిధాల పోయింది. ఆమె పేరు రమాదేవి.

ఆమె అందచందాలకు ముగ్ధుడైన మహర్షి "రాజా! నీకు అభ్యంతరం లేకపోతే నీ కుమార్తెను నేను వివాహం చేసుకుంటాను" అన్నాడు. ఆ మాటలు విన్నరాజు "మునీంద్రా ! అంతకన్నా నాకు అదృష్టం ఇంకేదైనా ఉంటుందా ? నీ కోరిక తప్పక మన్నించాలి. కాని నా కుమార్తె "శ్రీహరిని తప్ప వేరెవరినీ వివాహమాడను" అంటోది. అంతా భగవదేచ్ఛ. రేపే కదా స్వయంవరము ? మీరు కూడా స్వయంవరానికి విచ్చేయండి" అన్నాడు. 'అలాగే తప్పనిసరిగా రేపటి స్వయంవరానికి వస్తాను' అని చెప్పి వైకుంఠానికి బయలుదేరాడు నారదుడు.

వైకుంఠంలో శ్రీమన్నారాయణుడు శేషశాయియై ఉన్నాడు. నారదుడు వైకుంఠంచేరి శ్రీహరిని చూసి "మహాప్రభో ! సుఖాల, భోగాలు అనుభవించటంలో నీకు మించినవాడు ఈ జగత్తులో మరెవరూ లేరు. నేను సన్యాసిని ఏకాకిని, "స్వామీ! కళత్రసుఖము, స్వర్గసుఖము కన్నా కూడా మిన్న" అంటారు. భూలోకంలో కళ్యాణపురాధీసుడు తన కుమార్తెకు స్వయంవరం ప్రకటించాడు. ఆమె అందాలరాశి. అపరంజి బొమ్మ. నేను ఆమెను వివాహమాడాలనుకుంటున్నాను. మరి ఆమె శ్రీహరిని తప్ప అన్యులను

వివాహమాడను అంటున్నది. కాబట్టి ఓ జగన్నాథా ! నీ హరి రూపము నాకు ప్రసాదించి నన్ను ఒక ఇంటి వాణ్ణి చేసి పుణ్యం కట్టుకో !" అంటూ అనేక విధాల ప్రార్థించాడు. ఆ మాటలు విన్న విష్ణుమూర్తి "నారదా ! వివాహము అంటే ఒక స్త్రీని కట్టుకుని ఆమెతో కాపురం చెయ్యటమే కదా ? మాయలో పడ్డవాడు ఆ మాయ నుండి బయటపడే మార్గమున్నది. కాని సంసారంలో పడ్డవాడికి దానిలోనుంచి బయటపడే మార్గమే లేదు. "సారము లేనిది సంసారము" అని పండితులు చెబుతారు. సంసారివై మాయలో పడితే నిన్ను రక్షించేవారెవరు ? ఒక్కసారి ఆలోచించు" అన్నాడు. ఆ మాటలకు కోపించిన నారదుడు "తాతా ! వివాహం చేసుకున్నంత మాత్రం చేతనే మాయలో పడిపోతానా ? శివ మాయ, విష్ణు మాయలను జయించినవాణ్ణి, ఇప్పటివరకూ నిన్ను ఏమీ అడగలేదు. ఈ ఒక్కటీ అడుగుతున్నాను. నీ హరి రూపాన్ని నాకు ప్రసాదించు" అన్నాడు. 'తథాస్తు' అన్నాడు విష్ణువు.

భూలోకంలో కళ్యాణపురం పెళ్ళిసందడితో కలోహలంగా ఉంది. దేశవిదేశాల నుండి రాజులు, మహారాజులు, రారాజులు, లెక్కలేనంత మంది స్వయంవర మంటపానికి విచ్చేశారు. వారందరూ రతనాల హారాలు ధరించారు. వజ్రాలు పొదిగిన కిరీటాలు ధరించారు. వారు ధరించిన వజ్రవైడూర్యములు కాంతులతో స్వయంవర మంటపము కొత్త కాంతులీనుతోంది. స్వయంవర మంటపం ప్రవేశించాడు నారదుడు. రాకుమారి కోరినట్లుగానే తాను హరిరూపము ధరించి వచ్చాడు. అందాల రాశి తప్పక తననే వరిస్తుంది. అని ఆలోచిస్తూ ఒకచోట ఆసీనుడైనాడు.

రాకుమారి వరమాలను చేత ధరించివరాన్వేషణలో బయలుదేరింది. ఆమెతో పాటు చెలికత్తెలు ముందు నడుస్తూ అక్కడ ఆసీనులైన రాజుల వివరాలు తెలియచేస్తున్నారు. రాకుమారి మౌనంగా ముందుకు సాగిపోతోంది. రాకుమారి దగ్గరకు రాగానే కూర్చున్న రాజులు మెడలు ముందుకు సాచుతున్నారు. మందంగా నడచిపోతుంది రాకుమారి. అలా నడచి నడచి నారదుని వద్దకు వచ్చింది. చెలికత్తెలు ఏమో చెప్పారు. వరమాలకోసం మెడను ముందుకు వంచాడు నారదుడు. చిరునవ్వు నవ్వింది రాకుమారి. ఘొల్లుమన్నారు చెలికత్తెలు. ఆ కోలాహలానికి అటువైపు చూసిన రాజులు కూడా పగలబడి నవ్వారు. రాకుమారి ముందుకుసాగిపోయింది. దూరంగా చివరన కూర్చున్నాడు శ్రీ మహావిష్ణువు. వరమాల ఆయన కంఠసీమనలంకరించింది. రాకుమార్తెను తీసుకుని గరుడ వాహనం మీద వైకుంఠానికి వెళ్ళిపాయడు విష్ణుమూర్తి. ఆ విషయం ఎవరూ పట్టించుకోలేదు. స్వయంవర మంటపంలోని రాజులు అందరూ తననే చూసి ఇంకా నవ్వుతూనే ఉన్నారు. ఏం

జరిగిందో అర్థం కాలేదు నారదుడికి. చివరకు ఉండబట్టలేక అడిగాడు "వారందరూ తనను చూసి ఎందుకు నవ్వుతున్నారని? దానికి రాజులంతా "ఏమయ్యా ! నువ్వెవరో పిచ్చివాడిలాగున్నావు. వంటి మీద ఉన్న వస్త్రాలు, ఆభరణాలు చూస్తే శ్రీనాధుడిలాగున్నావు. కాని నీ ముఖం ఒకసారి చూసుకో. కోతిలాగా ఉన్నది. అట్టి నిన్ను రాకుమారి ఏ రకంగా వరిస్తుందనుకున్నావు ?" అంటూ ఎగతాళి చేశారు.

నారదుడికి విషయం అర్థం అయ్యింది. తనకు శ్రీహరి రూపాన్నిమ్మంటే, కోతి రూపాన్నిచ్చాడు విష్ణుమూర్తి. ఈ కారణంగా సభలో తీరని పరాభవం జరిగింది. తలవంపులయింది. దీనికి కారణమైన విష్ణువును క్షమించరాదు అనుకుంటూ, కోపంతో ఊగిపోతూ హుటాహుటిన వైకుంఠం చేరాడు. అక్కడ శ్రీమహావిష్ణువుని చూసి, నారాయణా! నీవు ఇంత మోసం చేస్తావనుకోలేదు. దేశదేశాల నుంచి వచ్చిన రాజుల మధ్య నన్ను ఘోరంగా అవమానించావు. దీనికి ఫలితంగా నీకు శాపం ఇస్తున్నాను. "భార్య కోసం నేను ఏ విధంగా తల్లడిల్లిపోయానో, అలాగే నువ్వు కూడా నీ భార్య కోసం నానా కష్టాలు పడతావు. నాకు కోతి ముఖం ప్రసాదించావు కాబట్టి ఆ వానర మూకలే నీకు కష్టకాలంలో సాయంగా నిలుస్తాయి" అన్నాడు.

ఆ మాటలు విన్న శ్రీ మహావిష్ణువు "నారదా ! శివ మాయ నిన్ను అవహించింది. హరి రూపము కావాలని కదా నువ్వు అడిగావు. హరి అంటే కోతి అని అర్థం నీకు తెలియదా ? జ్ఞాన వైరాగ్యాలు కోల్పోయి ఈ రకంగా కోరటం నీకు తగినదా ? ఒక్కసారి ఆలోచించు. నిన్ను నేను మోసగించానా ? నువ్వు మాత్రం నన్ను ఆకారణంగా శపించావు. నీ శాపం నిష్ఫలం కాదు. అయితే త్రేతాయుగంలో శ్రీరామ చంద్రుడుగా దశరధుని ఇంటపుట్టి, నీ శాపాన్ని అనుభవిస్తాను. నవ్వు నన్ను శపించినా, నేను మాత్రం నీకు వరమిస్తున్నాను. కలహప్రియుడవైనప్పటికీ ముల్లోకములందు గౌరవించబడుతూనే ఉంటావు" అన్నాడు.

ఆ మాటలు విన్న నారదుడు విష్ణుమూర్తి కాళ్ళపైబడి "స్వామీ ! క్షమించవలసినది" నా తప్పులను మన్నించు సదా నీ అనుగ్రహానికి పాత్రుడయ్యేటట్లు నన్ను అనుగ్రహించు" అని వేడుకున్నాడు. ఆ తరువాత విష్ణుమూర్తి ఆశీస్సులందుకొని తీర్థయాత్ర చెయ్యటానికి బయలేదేరాడు నారదుడు.

ఈ రకంగా అందరినీ మాయతో బంధిస్తాడు కాబట్టే శ్రీమన్నారాయణుడు 'నహుషః' అనబడుతున్నాడు.

# 313. వృషః

వర్షించువాడు.

**సాగరస్యోదరే నిత్యం వసన్న మృతరూపయా**

**స్వదేహకాన్త్యా వా చాపి సమ్యగాశ్వాస యన్ముహుః**

**బహుశప్సిఇచ్ఛ యతి యః వృషస్స పరిపఠ్యతే ॥**

నిత్యము సముద్ర గర్భంలో నివసించువాడై, అమృతాన్ని బోలిన దేహకాంతులతోను, మధురమైన మాటలతోను మార్కండేయాదులను చల్లగా ఓదార్చేవాడు.

**వర్షతీతి వృషః** సాగరమధ్యంలో ప్రవేశించి, వటపత్రశాయియై తన చల్లని కాంతులచేత, తీయని పలుకులచేత మార్కండేయాది మహర్షులను ఊరడిల్లచేయువాడు.

**వర్షతికామాన్ – ఇతివృషః** కామఫలములను వర్షించువాడు కాబట్టి 'వృషః' అనబడుతున్నాడు.

**భారతం**లోని శాంతిపర్వంలో

**వృషోహి భగవాన్ ధర్మః స్మృతో లోకేషు భారత ।**

**వైఘంటుక పదాఖ్యానై ర్పిద్ధిమాం వృషయుత్తమమ్ ॥**

"భరతవంశ సంజాతుడా ! నిఘంటుకారులు చేసే పదముల నిర్వచనాన్ననుసరించి భగవానుడు ధర్ముడు. 'వర్షతి' అనే ఉత్పత్తిచేత వృషః అని లోకములందు తలంచ బడుచున్నాడు." అంటాడు భగవానుడు.

ధర్మము అంటే విశాల భావమున్నది. వస్తువు యొక్క సుస్థిరమైన మనుగడకు కారణమైనది. ఏదో అది ఆ వస్తువుయొక్క ధర్మము. అగ్నికి ధర్మము వేడి. నీటికి ధర్మము – చల్లదనము. వేడిలేని అగ్నిగాని, చల్లదనము లేని నీరుగాని ఉండవు. అలాగే మనిషి మనుగడకు ఆధారము – ఆత్మ. అందుచేత ఆత్మయే మానవధర్మము. దేహము ఇంద్రియాలు, మనస్సు, బుద్ధిలలో కలిగే చలనానికి ఆత్మే కారణము.

ఆత్మస్వరూపుడైన శ్రీమన్నారాయణుడు తనను ఆశ్రయించిన భక్తులను కనికరించి వారిపై కృపాధారలు కురిపిస్తాడు. అందుచేతనే అతడు 'వృషః' అనబడుతున్నాడు.

అంటూ 'వటపత్రశాయి'ని గురించి వివరించాడు రత్నాకరుడు.

# 25. పరశురామావతారము

గురువుగారూ ! పరశురాముడు 21 సార్లు దండయాత్ర చేసి క్షత్రియవంశాలను నిర్మూలనం చేశాడు కదా ! ఆ అవతారప్రాశస్త్యాన్ని వివరించండి అన్నాడు కృష్ణశర్మ. వివరించటం మొదలుపెట్టాడు రత్నాకరుడు.

సూర్యుని యొక్క కుమారుడు రేవంతుడు. మంచి అందగాడు, వీరుడు. అశ్వశాస్త్ర ప్రవీణుడు. అశ్వాలకు శిక్షణ ఇవ్వటంలోను, అశ్వాలను నడపటంలోను, వాటిమీద స్వారీ చెయ్యటంలోను అతడికి అతడేసాటి. ఒకనాడు అతడు ఉచ్ఛైశ్రవం ఎక్కి విష్ణుమూర్తిని దర్శించటానికని వైకుంఠానికి వచ్చాడు. ఉచ్ఛైశ్రవం అంటే ఇంద్రుడి గుర్రం కదా ! దాన్ని రేవంతుడు ఎలా ఎక్కగలిగాడు ? అని అనుమానం రావచ్చు. ఉచ్ఛైశ్రవము అంటే నిక్కిన చెవులు గల గుర్రము అని అర్థం. అయితే ఇంద్రుడి గుర్రం పేరు కూడా ఉచ్ఛైశ్రవమే. రేవంతుడు ఎక్కి వచ్చిన గుర్రం చాలా అందంగా ఉంది. ఐదు రంగులతో నిక్కిన చెవులు, పొడవాటి తోక చూడగానే ఆకర్షించేటట్టుగా ఉన్నదా గుర్రం.

మేడ మీద ఉన్న లక్ష్మీదేవి ఆ గుర్రాన్ని చూసింది. గుర్రం మీదనుంచి మనసు, దృష్టి కూడా మరలలేదు. తదేక ధ్యానంతో అలాగే చూస్తోంది. ఇంతలో విష్ణువు వచ్చి ఆమెను పిలిచాడు. ఆమె పలకలేదు. ఆవిడ ధ్యాస అంతా ఆ గుర్రం మీదనే ఉంది. విష్ణువు దగ్గరకు వచ్చి లక్ష్మీదేవిని పిలిచాడు. అయినా ఆమె పలకలేదు. ఈ లోకంలో ఉంటేకదా పలకటానికి గుర్రం ధ్యాసలో నిమగ్నురాలైపోయింది. అది చూసి విష్ణువు" ఓ చపల చిత్తులారా ! గుర్రాన్ని చూసి మనసుపడ్డావా ? అశ్వాన్ని చూసి అనురాగ వతివయ్యావు కాబట్టి బడబగా జన్మించు అన్నాడు" బడబ అంటే ఆడగుర్రం. ఆ మాట వినగానే లక్ష్మీదేవి స్పృహలోకి వచ్చింది. "ఎంతపొరపాటు జరిగింది. విష్ణుమూర్తి వస్తే గమనించలేదా ? ఆయన పిలిచినా పలకలేదా ? ఎంత పొరపాటు. ఒక గుర్రాన్ని చూసి నేను మాయకు లోనుకావటమా ? మాయకులోనైన నన్ను విష్ణువు శపించటమా ? ఏమిటీ గ్రహపాటు. విష్ణువును విడిచి నేను భూలోకంలో గుర్రం జన్మ ఎత్తాలా ? ఆయనను విడిచి నేనెలా ఉండగలను" అని విలపించి పతి పాదాలపైబడి అనుగ్రహించమని వేడుకుంది.దానికి విష్ణువు "నా శాపం తప్పదు. నాతో సమానమైనవాడు నీ కుమారుడుగా పుట్టిన తరువాత నీకు శాపవిమోచనం కలుగుతుంది" అని చెప్పాడు.

లక్ష్మీదేవి భూలోకంలో ఆడగుర్రంగా పుట్టి తమసానది, కాళిందినది మధ్య పచ్చికబీళ్ళలో నివాసం ఏర్పరచుకుని పరమేశ్వరుణ్ణి ధ్యానిస్తూ కొన్ని వందల సంవత్సరాలు

కాలం గడిపింది. ఎట్టకేలకు పశుపతి ఆమె తపస్సుకు మెచ్చి ప్రత్యక్షమై తల్లీ ! నీ భర్త విష్ణువు అన్నిటా సమర్థుడు. మరి అలాటివాణ్ణి కాదని నన్ను ధ్యానిస్తున్నావు దేనికి ? అన్నాడు. ఆ మాటలు విన్న లక్ష్మీదేవి "స్వామీ ! నాకు ఈ శాపం ఇచ్చింది నా భర్తే. శాపవిమోచనం చెప్పమంటే తనలాటి కుమారుణ్ణి నేను కనాలట. ఆయన వైకుంఠంలో ఉన్నాడు. నేనేమో ఇక్కడ భూలోకంలో గుర్రం రూపంలో ఉన్నాను. మరినాకు పుత్రోదయం కావటం ఎలా సాధ్యం ? నువ్వే ఏదో ఒకదారి చూపాలి. అయినా ఇంకోమాట. ఒకసారి నా భర్త ధ్యానముద్రలో ఉండగా "స్వామీ అందరూ పూజించేది నిన్నేకదా ! మరి నువ్వు ఎవరిని ధ్యానిస్తున్నావు?" అని అడిగాను. దానికి ఆయన నేను శివుణ్ణి ధ్యానిస్తున్నాను. అతడు నన్ను ధ్యానిస్తాడు. మా ఇద్దరికీ భేదం లేదు అన్నాడు. అందుకని నిన్ను ధ్యానిస్తున్నాను. స్వామీ ఈ దుర్దశనుంచి నువ్వే నన్ను రక్షించాలి అన్నది.

అప్పుడు ఆ పార్వతీవల్లభుడు లక్ష్మీదేవితో "నీ భర్త అశ్వరూపుడై వస్తాడు. నీకు ఒక కుమారుడుపుడతాడు. వాడు ఏకవీరుడౌతాడు. అతని కారణంగానే ఆ వంశానికి హైహయ వంశము అని పేరువస్తుంది. అతణ్ణి హైహయుడు అనికూడా పిలుస్తాడు. ఆ తరువాత నువ్వు నీ భర్తతో కలసి వైకుంఠంలో సుఖంగా ఉంటావు. నీకు ఈ స్థితి రావటానికి అసలు కారణం నువ్వు పరదేవతను మరిచిపోవటమే. అందుకని ఈ క్షణం నుంచీ ఆ దేవినీ ఏకాగ్రతతో ధ్యానించు. ఆమె దయవల్ల నీకు సర్వమూ శుభం కలుగుతుంది." అన్నాడు. లక్ష్మీదేవి పరమేశ్వరీ ధ్యానం చెయ్యటం మొదలు పెట్టింది.

శివుడు కైలాసానికి వెళ్ళి చిత్రరూపుడు అనే సేవకుణ్ణి పిలిచి "నువ్వు వైకుంఠానికి వెళ్ళి విష్ణువుకు లక్ష్మీదేవి నీకోసం ఎదురుచూస్తున్నది తపస్సు చేస్తున్నది, పరితపిస్తున్నది. కాళిందీ నదీ సమీపాన పచ్చిక బయళ్ళలో తపస్సు చేస్తూ ఆ పరమేశ్వరీ ధ్యానం చేస్తున్నది. నువ్వు వెంటనే మగ గుర్రంగావెళ్ళి ఆమె కోర్కెతీర్చు. ఆమెకు శాపవిమోచనం చెయ్యి" అని చెప్పి రమ్మన్నాడు.

శివుని మాటలు విన్న వెంటనే విష్ణువు మగ గుర్రంగా మారి కాళిందీ నదీతీరానికి పరుగులు తీశాడు. ఆ వచ్చినవాడు విష్ణువని గ్రహించి ఆడగుర్రం దాని దగ్గరకు వెళ్ళింది. ఆ రెండు గుర్రాలూ కోరిక తీరేదాక ఆప్రదేశంలో తిరిగాయి. కొంతకాలానికి గుర్రం రూపంలో ఉన్న లక్ష్మీదేవి అందమైన కొడుకును కన్నది. అప్పుడు విష్ణువు లక్ష్మిని చూసి ఇంక ఈ రూపం వదిలి, వైకుంఠానికి పద అన్నాడు. పిల్లవాడిని వదిలి వెళ్ళటానికి మనస్కరించలేదు లక్ష్మీదేవికి. ఆమె భర్తతో ఈ పసికందును ఇక్కడ వదిలి వెళ్ళటానికి నా మనసు అంగీకరించటంలేదు అంది.

దానికి విష్ణుమూర్తి "లక్ష్మీ ! మన పిల్లవాడు దిక్కులేని వాడెలా అవుతాడు. యయాతి కుమారుడు తుర్వసుడు, మంచివాడు. పుత్ర సంతతికోసం తపస్సు చేస్తున్నాడు. అతడు వచ్చే వరకు ఈ పిల్లవాడికి ఏ అపదా రాకుండా రక్షణ కల్పిస్తున్నాను" అన్నాడు.

ఆ తరువాత విష్ణుమూర్తీ. లక్ష్మీదేవీ వైకుంఠానికి వెళ్ళిపోయారు.

యయాతీ దేవయానుల పుత్రుడు తుర్వసుడు. యయాతి శుక్రుని వల్ల శాపగ్రస్తుడై, తన ముసలితనాన్ని తీసుకుని తుర్వసుని యౌవనాన్ని తనకిమ్మని అడిగాడు. అందుకు తిరస్కరించాడు తుర్వసుడు. అందుచేత అతని వంశమువారు రాజ్యార్హులు కారని శపించాడు. తుర్వసుడికి పుత్ర సంతానం లేదు. అందుకని సంతానం కోసం విష్ణువును గూర్చి తపస్సు చేశాడు. విష్ణుమూర్తి ప్రత్యక్షమై వరం కోరుకోమనగానే తుర్వసుడు పుత్రుడు కావాలి అన్నాడు. అప్పుడు విష్ణుమూర్తి "రాజా ! తమసా, కాళిందీ నదీ సంగమ స్థలంలో ఒక పిల్లవాడు ఉన్నాడు. వాణ్ణి తెచ్చి పెంచుకో" అన్నాడు.

తుర్వసుడు ఆ నదీతీరానికి వెళ్ళి అక్కడ ఒక పిల్లవాణ్ణి చూశాడు. అతడి ఆనందానికి హద్దులు లేవు. లక్ష్మీనారాయణులకు నమస్కరించి ఆ పిల్లవాణ్ణి తీసుకుని వెళ్ళి తన భార్యకు బహూకరించాడు. రాజదంపతులు ఆ పిల్లవాడికి ఏకవీరుడు అని నామకరణం చేసి అల్లారుముద్దుగా పెంచారు. అతడు వేదవేదాంగాలు, శాస్త్రాలు, కత్తి యుద్ధము, ధనుర్విద్య పూర్తిగా అభ్యసించి మహావీరుడైనాడు. అతడే హైహయుడు.

ఈరకంగా ఆ దేవి కరుణ వల్ల హైహయ వంశము ప్రారంభమైంది.

హైహయవంశపు రాజు కృతవీర్యుడు. ఇతని కుమారుడు కార్తవీర్యార్జునుడు. వింధ్య పర్వత ప్రాంతంలోగల మహిష్మతీపురాన్ని రాజధానిగా చేసుకుని పరిపాలిస్తున్నాడు. ఇతని పురోహితుడు 'గర్గుడు'. గర్గుని భోదనల వల్ల ప్రభావితుడై దత్తాత్రేయుని అపానవాయు జనితానలము వల్ల ఇతడి చేతులు కాలిపోయినాయి. అయినా ఉపాసన మానలేదు కార్తవీర్యుడు. చివరకు దత్తాత్రేయుడు ప్రత్యక్షమై 'నేను స్త్రీలోలుడను. నన్నెందుకు ఆరాధిస్తున్నావు?" అన్నాడు. "స్వామీ ! నువ్వు శ్రీమహావిష్ణువువని నాకు తెలుసు. అందుకే ఆరాధిస్తున్నాను" అన్నాడు కార్తవీర్యుడు. దత్తాత్రేయుడు సంతృప్తి చెంది ఏ వరం కావాలో కోరుకోమన్నాడు. దానికి కార్తవీర్యుడు. తనకు వెయ్యి చేతులు కావాలని, యుద్ధంలో ఎప్పుడూ గెలుపేకావాలని, రాజ్యం కావాలని అడిగాడు. తధాస్తు అన్నాడు దత్తాత్రేయుడు.

ఒకసారి అగ్నిదేవుడు తనకు ఆహారం కావాలి అని కార్తవీర్యుని దగ్గరకు వచ్చాడు. వింధ్యపర్వత ప్రాంతంలో ఉన్న అరణ్యాన్నంతా బక్షించమన్నాడు కార్తవీర్యుడు. ఆ ప్రాంతంలోనే వరుణుని కుమారుడైన మైత్రావరుణుని ఆశ్రమం ఉంది. అగ్నిదేవుడు ఆ

ఆశ్రమాన్ని కూడా దహించివేశాడు. దాంతో మైత్రావరుణుడు కోపించి, దీనికంతటికీ కారణమైన కార్తవీర్యుని సహస్రబాహువులు పరశురామునిచే ఖండించబడుగాక అని శపించాడు.

కార్తవీర్యుడు ఒకసారి వేటకువెళ్ళి జమదగ్ని ఆశ్రమానికి వెళ్ళాడు. మహర్షి రాజుకు స్వాగతసత్కారాలందించి గౌరవించాడు. అతని దగ్గర కామధేనువు ఉన్నది. అది ఏ సమయంలో ఏదికావాలంటే అది ఇస్తుంది. కామధేనువు సాయంతో రాజుకు, అతని సేనకు కూడా మృష్టాన్న భోజనాలు ఏర్పాటుచేశాడు మహర్షి. కార్యవీర్యుడు ఆ ధేనువును తన కిమ్మని అడిగాడు. ఇవ్వనన్నాడు జమదగ్ని. దాంతో కోపగించిన కార్తవీర్యుడు ఆ జమదగ్నిని సంహరించి కామధేనువును తీసుకుపోయాడు.

'ఋచీకుడు' అనే మహర్షి కుమారుడు జమదగ్ని. జమదగ్ని కుమారుడు పరశురాముడు. ఇతని అసలు పేరు 'రాముడు' ఇతడు హిమాలయ పర్వతాలలో ఈశ్వరుణ్ణి గురించి ఘోరతపస్సు చేశాడు. ఆ తపస్సుకు మెచ్చి శివుడు ప్రత్యక్షమై ఈతనికి పరశువును బహుమతిగా ఇచ్చాడు. అప్పటినుంచి ఈ రాముడు పరశురాముడైనాడు.

గాధిరాజు కుమార్తె సత్యవతి. ఈమెను 'ఋచీకుడు' వివాహం చేసుకున్నాడు. ఈమె చాలా పతివ్రత. ఈమె భక్తికి మెచ్చి ఏదైనా వరం కోరుకోమన్నాడు ఋచీకమహర్షి. సత్యవతి ఆలోచించి తనకొక కుమారుడు, తన తల్లికి ఒక కుమారుడు కలిగేటట్లుగా వరమడిగింది. మహర్షి రెండు పాత్రలలో మంత్రజాలాన్నిఇచ్చి చెరి ఒకపాత్ర త్రాగమన్నాడు. కాని ఆ పాత్రలను తీసుకునే సమయంలో పొరపాటున ఒకరిపాత్ర ఒకరు తీసుకోవటం జరిగింది. అది తెలుసుకున్న ఋచీకుడు సత్యవతితో 'నీ గర్భాన క్షత్రియుడు, నీ తల్లిగర్భాన బ్రాహ్మణుడు జన్మిస్తారు అన్నాడు. ఆ మాటలకు విచారించిన సత్యవతి క్షత్రియుడు నా గర్భాన కాక, నా కుమారుని గర్భాన అవతరించేటట్లుగా అనుగ్రహించమని వేడుకున్నది. అనుగ్రహించాడు ఋచీకుడు. అప్పుడు సత్యవతి తల్లిగర్భాన పుట్టినవాడే విశ్వామిత్రుడు. సత్యవతి గర్భాన పుట్టినవాడు జమదగ్ని. జమదగ్ని కుమారుడు పరశురాముడు.

జమదగ్ని, ప్రసేనజిత్తుని కుమార్తె రేణుకను వివాహం చేసుకున్నాడు. ఈమెకి ఐదుగురు కుమారులు కలిగారు. అందులో అఖరువాడు రాముడు. రేణుక నీరు తీసుకురావటానికి నదికి వెళ్ళి, ఆ నదిలో జలకాలాడుతున్న చిత్రరధుడనే గంధర్వుణ్ణి చూస్తూ అలా కొంతకాలము ఉండిపోయింది. దాంతో ఇల్లు చేరటం ఆలస్యమయింది. చిత్రరధునితో ఈమె వ్యభిచరించింది అని జమదగ్ని కోపించి, కుమారులను పిలిచి రేణుకను సంహరించమన్నాడు. వారందుకు అంగీకరించలేదు. అందుకని వారిని

భస్మంచేసి, చివరగా రాముణ్ణి పిలిచి తల్లిని సంహరించమన్నాడు. తండ్రి మాటకు ఎదురాడకుండా, తల్లిని సంహరించి, ఈ వార్తను తండ్రికి తెలియచేశాడు రాముడు. దానికి జమదగ్ని ఆనందించి ఏదైనా వరం కోరుకోమన్నాడు. తల్లిని, సోదరులను మళ్ళీ బ్రతికించమన్నాడు రాముడు. ఈ రకంగా రేణుక ఆమె పుత్రులు పునర్జీవితులైనారు.

హయహయుడనే మహారాజు, జమదగ్ని మహర్షిని సంహరించాడు. భర్త శవంమీద పడి రేణుక విలపిస్తూ, ఇరవై ఒక్కసార్లు గుండెలు బాదుకున్నది. అది చూసిన పరశురాముడు ఇరవై ఒక్కసార్లు క్షత్రియులతో యుద్ధంచేసి, వారందర్నీ సంహరిస్తాను అని శపథం చేశాడు. అన్నమాట ప్రకారం ఇరవై ఒక్కసారి దండయాత్ర చేసి బాలురను, వృద్ధులను వదిలి మిగిలిన రాజులందర్నీ సమూలంగా నాశనం చేశాడు. ఈ రకంగా క్షత్రియకులాన్ని నాశనం చేసిన పరశురాముడు, రామావతారంతో, తన అవతారం పరిసమాప్తి గావించి మోక్షగామియై దత్తాత్రేయుణ్ణి గురువుగా ఎంచుకుని త్రిపురారహస్యాన్ని తెలుసుకుని సాయుజ్యం పొందాడు.

పరశురాముడిది అంశావతారము. లోకంలో పెచ్చుమీరిన క్షత్రియబలగాన్ని నాశనంచేసేటందుకే అతడు జన్మించాడు.

క్షత్రియజాతిని సంహరించిన తరువాత కాశ్యపమహర్షి ప్రార్థనచేత శాంతించాడు. సాధుజనుల రక్షించేవాడు. సాధువులకు అపకారంచేసే దైత్యసంతతి మీద కోపగించాడు. లోకకంటకులందరినీ నిర్మూలించాడు. భూమియొక్క భారాన్ని తగ్గించాడు. తన భక్తుల పూజలు అందుకుంటాడు. ఇతడు పరమేశ్వరుడు. నాశనములేనివాడు అచ్యుతుడు. సృష్టి స్థితి లయాలు చెయ్యటంచేత ప్రసిద్ధుడు. జీవులన్నింటికీ ఇతడే ప్రాణము. ఇంద్రియాలన్నింటిలోకీ ముఖ్యమైనది ప్రాణము. ఆ ప్రాణము పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడే.

ఈ విషయం 314 నుంచి 320 నామాలవరకు చెప్పబడింది. ఇక నామాలను చూద్దాం.

## 314. క్రోధహా

కోపమును జయించినవాడు.

**కాశ్యపస్య ప్రార్థనయా యః క్రోధం క్షత్రహానిదం ।**
**హతవాన్ క్రోధహా ప్రోక్తః షడర్ణ క్రోధనాశకః ॥**

క్షత్రియజాతిని నాశనం చెయ్యాలి అని ధరించిన క్రోధాగ్నిని కాశ్యపమహర్షి ప్రార్థనతో ఉపసంహరించినవాడు.

**క్రోధం హంతీతి క్రోధహా** ఇరవై ఒక్కసార్లు దండయాత్రచేసి క్షత్రియులను నాశనంచేసిన తరువాత, కాశ్యపమహర్షి ప్రార్థనచే ఆ కోపము పోగొట్టినవాడు.

**సాధూనాం క్రోధం హంతి** సాధుజనుల క్రోధము నశింపచేయును.

సాధకులలో క్రోధాన్ని నశింపచేసి 'క్రోధహా' అనబడుతున్నాడు. పరమేశ్వరుడు క్రోధరహితుడు. తనను ఆశ్రయించే పండితులు, జ్ఞానులు కూడా క్రోధరహితులు.

రాగము అనేది పాశము. క్రోధము అంకుశము. క్రోధము అంటే – 'ద్వేషము' అనే పేరుగల మనోవ్యాపారము. ఇచ్ఛాజ్ఞానక్రియాశక్తులలో, ఇచ్ఛ గనక బాగా కలిగితే, అంటే ఒక మనిషియందు అత్యంతమైన ప్రేమ, అనురాగము ఉన్నాయి అనుకుందాం. అప్పుడు ప్రతి విషయంలోనూ వారే ఉన్నతులుగా ఉండాలి అనుకుంటాం. ఒకవేళ మనం అనుకున్నట్లుగా వారు కాలేకపోతే మనం భరించలేం. ఎదుటివారి గొప్పదనాన్ని ఒప్పుకోలేం. వారమీద ఏదో కారణంగా కోపం పెంచుకుని వారిని అసహ్యించుకుంటాం. దీనికి కారణము, మనకు వారియందున్న ఆసక్తి. అదే రాగము. దీనివల్లనే వారుచేసిన తప్పులు కూడా ఒప్పులుగానే కనిపిస్తాయి. ఎదుటివారు చేసిన ఒప్పులు – తప్పులుగా కనిపిస్తాయి. మితిమీరిన రాగమే క్రోధంగా మారుతుంది. మనమీద మనకు నమ్మకముంటుంది. ఆత్మాభిమానం ఉంటుంది. అంతవరకు మంచిదే. కాని అది బాగా పెరిగిపోతే దురభిమానము అవుతుంది. అదే ఆవేశకావేశాలకు కారణము. అదే క్రోధం.

**క్రోధో ద్వేషాఖ్యా చిత్త వృత్తిః** క్రోధమనేది 'ద్వేషము' అనే పేరుగల చిత్తవృత్తి. సాధకులలో ఇది ఉండరాదు.

**క్రోధః ప్రాణహారః** క్రోధము ప్రాణాన్ని హరిస్తుంది.

కోరికలు లేనివాడికి క్రోధముండదు. ఏ కోరికలు లేకపోతే క్రోధముండదు. పరమేశ్వరుడు ఏ కోరికలు లేనివాడు. అందుకే క్రోధరహితుడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'క్రోధహాః' అనబడుతున్నాడు.

సత్వగుణము ప్రధానంగా గల వారు సాధుజనులు. వారు కామక్రోధలోభమోహ మద, మాత్సర్యాలను జయించినవారు. వారికి కోపము ఉండదు. అటువంటి వారికి మాత్రమే పరమేశ్వరుడు మోక్షాన్ని ప్రసాదిస్తాడు. భవబంధనాల నుండి విముక్తిని కలుగచేస్తాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'క్రోధహా' అనబడుతున్నాడు.

## 315. క్రోధకృత్-కర్తా

కోపగించువాడు.

**అసాధుషు విషయే క్రోధం కరోతి** అసాధుజనుల విషయమున కోపగించువాడు. సాదుజనులను బాధించే రాక్షసుల విషయమున కోపగించువాడు. క్రోధాత్ములైన వారిని నిర్మూలించువాడు. తన భక్తుల హృదయములందు క్రోధాగ్నిని చల్లార్చువాడు.

శంకరభగవత్పాదులవారు ఈ నామాన్ని ఒకటిగా చెప్పారు. కాని పరాశరభట్టరువారు దీన్ని రెండు నామాలుగా వ్రాశారు.

**క్రోధకృత్ :** కోపము కలిగించినవాడు.

**క్రోధకృత్ క్షత్రియేభ్యో యః పూర్వంక్రోధం కరోతి సః**

క్షత్రియులకు ముందుగా కోపము తెప్పించువాడు.

**క్రోధం కరోతీతి క్రోధకృత్** మొదటగా క్షత్రియులకు కోపము కలిగించినవాడు.

**కర్తా :** తెగగొట్టినవాడు.

**కృద్ధేతోః కార్తవీర్యస్యఛేత్తా కర్తేతి శబ్ద్యతే**

తన కోపానికి కారణమైన కార్తవీర్యుని చీల్చి చెండాడినవాడు. ఈ రకంగా కార్తవీర్యునికి కోపం తెప్పించి, అతనితో యుద్ధంచేసి, అతన్ని చీల్చి చెండాడినవాడు.

## 316. విశ్వబాహుః

వ్యాపించిన బాహువులు గలవాడు.

**విశ్వస్మై బాహూ యస్యేతి విశ్వబాహుః ప్రకీర్తితః**

లోకకంటకులను నిర్మూలించి సాధుపుంగవులను రక్షించగల బాహువులు గలవాడు.

**విశ్వస్మై బాహూ యస్యసః విశ్వబాహుః** దుష్టశిక్షణార్ధమై వ్యాపించిన బాహువులు గలవాడు.

ప్రాణులన్నింటికీ ఆలంబనమైనవాడు. పరమేశ్వరుడు లోకరక్షకుడు. సహస్రబాహువు. ఇక్కడ సహస్రము అంటే–అనంతము అని అర్థం. అనంతమైన బాహువులు కలవాడు. అన్నివైపులకు చేతులు గలవాడు. ఇది విశ్వరూపము జగత్తులోని జీవులకు ఉన్న చేతులన్నీ అతనివే. జగత్తులోని జీవులన్నీ అతడే.

సాధువులను, సజ్జనులను రక్షించటానికి, దుష్టశిక్షణ చెయ్యటానికి తనచేతులను ఈ జగత్తంతా వ్యాపింపచేశాడు. ఎవరికి ఎక్కడ ఏ రకమైన కష్టము వచ్చినా వెంటనే చేతులు చాచి రక్షించేవాడు. **శ్వేతాశ్వరోపనిషత్తులో**

**విశ్వతశ్చక్షురుత విశ్వతోముఖో విశ్వతోబాహురుత విశ్వతస్పాత్ ।**
**సంబాహుభ్యాం ధమతి సంపత త్రైర్ ద్యావా పృథివీ జనయన్ దేవ ఏకః ॥**

అద్వితీయుడైన ఆ పరబ్రహ్మ భూలోకాన్ని ద్యులోకాన్ని సృష్టిస్తూ (భూమ్యాకాశాలను) వారివారి సంస్కారాలననుసరించి ధర్మాధర్మనిర్వహణ కోసం మానవులకు రెండు చేతులు, పక్షులకు రెక్కలు ప్రసాదించాడు. పూర్వజన్మ సంస్కారాన్ని బట్టి మానవుడికి ఉత్తరజన్మ వస్తుంది. ఉత్తమకర్మలు చేసినవాడు ఉత్తమజన్మ ఎత్తుతాడు. నీచకర్మలు చేసినవాడు నీచజన్మలు ఎత్తుతాడు. జీవులు తమకు తగిన కర్మలే నిర్వర్తిస్తూ ఉంటాయి. అందుచేత సృష్టిలోని సమస్త జీవులకు కాళ్ళు, చేతులు, ముఖాలు, కళ్ళు అన్నీ ఆ పరబ్రహ్మాయే. అందుచేతనే పరమేశ్వరుడు విశ్వచక్షువు, విశ్వముఖుడు, విశ్వతోబాహుడు. సృష్టిలోని సమస్త కర్మలకు ప్రేరణ ఇచ్చి చేయించేది ఆ పరమేశ్వరుడే. ఈ రకంగా అందరి బాహువులు తనవే అయి ఉండటంచేత శ్రీమన్నారాయణుడు 'విశ్వబాహుః' అనబడుతున్నాడు.

## 317. మహీధరః

భూమిని ధరించినవాడు. 369వ నామం కూడా ఇదే.

**భారావతరణం కృత్వా గాం ధత్తే సమహీధరః** భారమంతా తొలగించి భూమిని ధరించువాడు.

**మహీం ధరతీతి మహీధరః** భూభారాన్ని తొలగించి ఆ తరువాత భూమిని ధరించువాడు.

పరమేశ్వరుడు భూమిని ధరిస్తాడు. గతంలో చెప్పినట్లుగా శ్రీమన్నారాయణుడు శింశుమార రూపంలో ఊర్ధ్వలోకాలను, ఆదిశేషుని రూపంలో అధోలోకాలను ధరిస్తాడు. అయితే కేవలము భూమిని ధరించటమేకాదు. భూభారాన్ని కూడా తగ్గిస్తాడు. అసురసంపత్తి పెరిగిపోయినప్పుడు పరమేశ్వరుడు ఏదో ఒక అవతారమెత్తి, దాన్ని నాశనం చేస్తాడు.

మహి అంటే – పూజ అని అర్థం. పరమేశ్వరుడు భక్తులు అందించే పూజలను స్వీకరిస్తాడు. ఈ పూజలు బాహ్యపూజ, అంతఃపూజ అని రెండు రకాలు.

బాహ్యపూజ అంటే మన ఎదుట భగవంతుని ప్రతిమను ఏర్పాటుచేసుకుని అర్చించటము. బాహ్యపూజ మళ్ళీ రెండు రకాలు 1. వైదికము 2. తాంత్రికము. వేదంలో చెప్పినరీతిగా భగవదారాధనచెయ్యటం వైదికపూజ అనబడుతుంది.

తంత్రశాస్త్రములందు చెప్పినవిధంగా భగవదారాధన చెయ్యటం త్రాంత్రికమనబడు తుంది. ఇది కేవలము లౌకికమైన కోరికలు తీరటానికి చేసేది. శరీరంలోనే భగవంతుని ఊహించుకుని చేసే పూజావిధానాన్ని అంతఃపూజ అంటారు. ఇవి మళ్ళీ రెండు రకాలు. 1. సాధారము 2. నిరాధారము. మంత్రాన్ని ఆధారంగా చేసుకుని చేసే పూజ సాధారము. మంత్రం లేకుండా చేసేది నిరాధారము. ఇక్కడ మంత్రము అంటే–మలత్రయము. అవి

1. అణవమల 2. మాయికమల 3. కార్మికమల అని మూడు రకాలు.

1. శరీరంలోని ఇంద్రియాలే తాను అనుకోవటం అణవమల.

2. అన్ని జీవుల దేహాలను స్వపరభేదన కావించటం మాయికమల.

3. సాదకుడు ప్రపంచంలోని శక్తిని తను ఉపయోగించుకునేటప్పుడు ఒక భావన, తాను ప్రపంచానికి ఉపయోగపడేటప్పుడు ఇంకొక భావన కలిగిఉండటమే కార్మికమల.

మలము అంటే - మడ్డి, పాపము, వ్యర్థము అని అర్థం. ఈ రకంగా మలత్రయరహితంగా చేసేది నిరాధారమనబడుతుంది.

వీటిలో ఏ విధమైన పూజలు చేసినా సరే భక్తులనుండి స్వీకరించేవాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు 'మహీధరః' అనబడుతున్నాడు.

## 318. అచ్యుతః

నాశనములేనివాడు, జారనివాడు. 100వ నామం కూడా ఇదే.

**చ్యవనోత్పత్తి యుక్తేషు బ్రహ్మేన్ద్రవరుణాదిషు**

**యస్మా న్నచ్యవతే స్థానాత్ తస్మా త్సంకీర్త్యతేఽచ్యుతః ।**

**సాధర్మ్యేణావతారేఽపి బ్రహ్మేన్ద్ర వరుణాదిభిః**

**న స్వైశ్వర్యాత్ప్రచ్యుతో యః అచ్యుతః పరికీర్తితః ॥**

బ్రహ్మ, ఇంద్రుడు, వరుణుడు మొదలైన దేవతలతో సమానంగా అవతరించినప్పటికీ, వారికిలాగా తరగని, చెదరని, పదవి, ఐశ్వర్యము గలవాడు.

**న చ్యుతః అచ్యుతః** ఇతర దేవతలలాగా కనిపించినప్పటికీ, వారికి మల్లే తరగని ఐశ్వర్యము గలవాడు.

తనయొక్క స్వరూపస్థితి నుంచి తొలగనివాడు. వికారములు ఏమాత్రము లేనివాడు.

**విశ్వతః పరమాన్నిత్యం విశ్వం నారాయణగ్ం హరిమ్**

**విశ్వమే వేదమ్ పురుషస్త ద్విశ్వముపజీవతి**

**పతిం విశ్వస్యాత్మే శ్వరగ్ం శాశ్వతగ్ం శివమచ్యుతమ్**

**నారాయణం మహాజ్ఞేయం విశ్వాత్మానం పరాయణమ్**

విశ్వానికి అతీతుడు, విశ్వమే తానుగా అయినవాడు. నిత్యుడు, సర్వవ్యాపకుడు, విశ్వానికి జీవనాధారమైనవాడు, విశ్వపతి, విశ్వానికి ఈశ్వరుడు, శాశ్వతుడు, మంగళకరుడు, నాశనములేనివాడు, తెలిసికొనదగిన పరమాత్ముడు, విశ్వాత్ముడు, విశ్వపరాయణుడు అయిన నారాయణునకు నమస్కారము.

**భగవద్గీత**లోని 6వ అధ్యాయము **'ఆత్మసంయమన యోగం'**లోని 30వ శ్లోకం.

**యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి ।**

**తస్యాహం న ప్రణశ్యామి స చ యే న ప్రణశ్యతి ॥**

సకల ప్రాణులయందు ఆత్మరూపంలో ఉన్న నన్ను చూడగలిగినవాడికి, ప్రాణులన్నింటిని నాయందు అంతర్గతంగా ఉన్నట్లు చూసేవాడికి నేను అదృశ్యుడను కాను.

మేఘములయందు ఆకాశమున్నది, ఆకాశమందు మేఘాలున్నాయి. అదేవిధంగా ప్రాణులన్నింటి యందు భగవానుడైన వాసుదేవుడున్నాడు. అన్ని ప్రాణులు ఆ వాసుదేవుని యందే ఉన్నాయి. అందుకే శ్రీమన్నారాయణుడు 'అచ్యుతుడు' అనబడుతున్నాడు.

## 319. ప్రథితః

ప్రసిద్ధుడు.

**అచ్యుతత్వేన లోకేఽస్మిన్ ప్రఖ్యాతః ప్రథిత స్మృతః**

లోకంలో అచ్యుతుడు అని ప్రఖ్యాతి పొందాడు.

**ప్రథతే ఇతి ప్రథితః** ప్రసిద్ధుడైనవాడు.

తాను చేసేటటువంటి సృష్టిస్థితిలయములచేత ప్రసిద్ధుడైనవాడు. వేదము ద్వారా, వేదపారాయణ ద్వారా తన వైభవము దశదిశల వ్యాపించుటచేత ప్రసిద్ధి చెందినవాడు. చరాచరజగత్తంతా తానే అయి ఉన్నాడు. కాబట్టి శ్రీమన్నారాయణుడు 'ప్రథితః' అనబడుతున్నాడు.

# 320. ప్రాణః

ప్రాణముగా ఉండేవాడు.

**పుంసాం జీవితరూపత్వాత్ ప్రాణ ఇత్యభిధీయతే**

తన భక్తులకు ప్రాణమువలె పోషకుడై ఉండేవాడు..

**ప్రాణీతీతి ప్రాణః** తననాశ్రయించిన వారికి ప్రాణముగా ఉండేవాడు.

**కౌషీతకీ బ్రాహ్మణములో ప్రాణోఽస్మి ప్రజ్ఞాత్మా తన్మాయ రమృత మిత్యుపాస్వ**

జ్ఞానమయుడయిన నేను ప్రాణముగా ఉందును. అటువంటి నన్ను ఆయుష్య అని, అమృతమని అంటారు. అంతటా చైతన్యస్వరూపుపమై ఉండి జీవులను కదలించేవాడు.

**ప్రాణోవా అహమస్మి** 'నేను ప్రాణముగా ఉన్నాను' అన్ని జీవులయందు సూత్రాత్మమై, అంతర్యామిగా ఉంటాను. కాబట్టి పరమేశ్వరుడు 'ప్రాణము' అని పిలువబడుతున్నాడు.

శరీరంలోని అవయవాలు పనిచెయ్యాలి అంటే వాటికి చైతన్యము కావాలి. అవయవాలకు, ఇంద్రియాలకు చైతన్యాన్నిచ్చేది ప్రాణము. అందుకే ప్రాణము పరమేశ్వర స్వరూపము. అదే జ్యేష్ఠము, శ్రేష్ఠము. **ఛాందోగ్యోపనిషత్తులో**

పూర్వకాలంలో ఒకసారి ఇంద్రియాలన్నీ తమలోతాము పోట్లాడుకోవటం మొదలుపెట్టాయి. దీనికి కారణం తమలో ఎవరు గొప్ప అనే విషయం తేలకపోవటమే. ఆ వాదన ఎంతకీ తెగలేదు. చివరకు అన్నీ కలిసి ఒక నిర్ణయానికి వచ్చి తమకు జన్మనిచ్చిన ప్రజాపతి దగ్గరకుపోయి "ప్రజాపతీ ! మాలో శ్రేష్ఠులెవరో మీరు తేల్చి చెప్పండి" అన్నాయి.

ప్రజాపతి ఒక క్షణం ఆలోచించి "మీలో ఎవరు శ్రేష్ఠులో తేల్చుకునే ఉపాయం ఒకటి చెబుతాను వినండి. మీలో ఏది లేకపోతే ఈ శరీరం పనికి రాకుండా, పనిచెయ్యకుండా పోతుందో అది అన్నింటికన్న శ్రేష్ఠమైనదిగా గుర్తించండి. ఈ విషయం తేలాలంటే ఒక్కొక్క ఇంద్రియము ఒక సంవత్సరం పాటు ఈ శరీరాన్ని విడిచి వెళ్ళండి" అన్నాడు. ప్రజాపతి సలహా ఇంద్రియాలకన్నింటికీ నచ్చింది.

ముందుగా వాక్కు శరీరం నుంచి నిష్క్రమించింది. అది ఒక సంవత్సరం పాటు శరీరానికి దూరంగా ఉండి తరువాత తిరిగి వచ్చి మిగిలిన ఇంద్రియాలను అడిగింది "నేను లేనప్పుడు మీరెలా జీవించి ఉండగలిగారు".

"నువ్వు వెళ్ళిపోవటం వల్ల శరీరానికి పెద్ద నష్టం ఏదీ జరగలేదు. కేవలం వాక్కు మాత్రం మూగబోయింది. అంతేగాని మిగిలిన శరీరం యధాతథంగా పనిచేసింది.

ఉచ్ఛ్వాసనిశ్వాసలు మామూలుగానే జరిగాయి. కళ్ళు చూస్తూనే ఉన్నాయి. చెవులు వింటూనే ఉన్నాయి. ఆలోచనలు సాగుతూనే ఉన్నాయి. ఆ రకంగా మిగిలిన పనులన్నీ జరిగాయి. పసిపిల్లవాడికి మాటలు రావు. అయినా వాడు బ్రతకటంలేదా ? మూగవాడు జీవించటం లేదా ? అలాగే శరీరం జీవించే ఉన్నది." అన్నాయి మిగిలిన అవయవాలు. ఆ మాటలు విన్న వాక్కు శరీరంలో ప్రవేశించింది.

తరువాత శరీరం నుంచి దృష్టి నిష్క్రమించి ఒక సంవత్సరం తరువాత తిరిగివచ్చి మిగిలిన అవయవాలను అడిగింది. "నేను లేనప్పుడు మీరంతా ఎలా ఉన్నారు?" అని.

అప్పుడవి 'నువ్వు లేకపోతే చెప్పుకోతగ్గ ఇబ్బందేం కలగలేదు. గ్రుడ్డివాడు బ్రతకటం లేదా ? అలాగే ఈ శరీరం తిరిగింది. కేవలం చూపు మాత్రం లేదు. అంతేకాని శరీరంలోని మిగిలిన వ్యాపారాలన్నీ సజావుగానే సాగినాయి. ఊపిరి ఆడుతూనే ఉంది. నోరుతింటూనే ఉంది. మాట్లాడుతూనే ఉన్నది. ఆలోచనలు బాగానే ఉన్నాయి.'' అన్నాయి. మారుమాటాడకుండా దృష్టి శరీరంలో ప్రవేశించింది.

ఆ తరువాత శ్రవణశక్తి విడిచి వెళ్ళిపోయి ఒక సంవత్సరం తరువాత తిరిగి వచ్చి నేను లేకపోతే ఎలా ఉన్నది ? అని అడిగింది.

దానికి మిగిలిన ఇంద్రియాలు "ఓ శ్రవణేంద్రియమా ! నీవు లేని శరీరం చెవిటిదయింది. అంతేకాని కన్ను చూస్తోంది. నోరు మాట్లాడుతోంది. ఈ రకంగా మిగిలిన ఇంద్రియాలన్నీ వాటిపని అవిచేస్తూనే ఉన్నాయి. కాబట్టి మేమంతా ఈ శరీరంలో సుఖంగానే ఉన్నాము" అన్నాయి. శ్రవణశక్తి శరీరంలో ప్రవేశించింది.

ఆ తరువాత మనస్సు శరీరం నుంచి నిష్క్రమించి ఒక సంవత్సరం తరువాత తిరిగి వచ్చి "నేను లేకపోతే వెలితిగా లేదా ?" అని అడిగింది.

దానికి మిగిలిని ఇంద్రియాలు "ఓ మనసా ! నీవు సంకల్ప వికల్పాలకు మూలమైన దానవు. నువ్వు లేకపోతే శరీరానికి సంకల్పం ఉండదు. ఆలోచనాశక్తి ఉండదు. ఆలోచన లేదన్న మాటేగాని శ్వాస ఆడుతుంది. కాళ్ళు చేతులు వాటి పనిచేస్తాయి. నోరు తింటుంది. మాట్లాడుతుంది. ఈ రకంగా మిగిలిన ఇంద్రియాలు వాటి పని ఆవి చేస్తూనే ఉంటాయి. పసిపిల్లవాడు మనస్సు లేకుండా బ్రతకటం లేదా ? అలాగే శరీరం నువ్వు లేకుండా జీవించే ఉన్నది. మిగిలిన కార్యములన్నీ యధాతథంగా జరుగుతూనే ఉన్నాయి" అన్నాయి. మారు మాట్లాడకుండా మనస్సు శరీరంలో ప్రవేశించింది.

ఆఖరుకు ప్రాణం బయటకు పోవటానికి వస్తూఉంది. అప్పుడు ఇంద్రియాలతో తనకున్న బందనాలన్నిటినీ త్రెంచిపారేస్తున్నట్లనిపించింది. శరీరానికి ఊపిరి అందటం

కష్టమవుతున్నది. కళ్ళు కనిపించటం మానివేశాయి. చెవులు వినిపించటం మానివేశాయి. నోరు మాట్లాడటం కష్టమయింది. అలాగే కాళ్ళు చేతులు కదలటం మానివేశాయి. శరీరం గాలిలో తేలిపోతున్నట్లయింది. దాంతో ఇంద్రియాలకు భయంపట్టుకుంది. అప్పుడు అవన్నీ ప్రాణం చుట్టూచేరి" ప్రాణమా ! నువ్వు మాత్రం శరీరం నుంచి బయటకు వెళ్ళకు. ఇక్కడే ఉండు నువ్వు శరీరం నుంచి బయటకు వెళ్ళిపోతే శరీరం చచ్చిపోతుంది. అప్పుడు మేమంతా ఉపయోగం లేకుండా పోతాము. మా పని సున్నా అవుతుంది. మా అందరిలోకీ శ్రేష్టుడివి నువ్వే. ఈ మాట మేమందరం అంగీకరిస్తున్నాం. నువ్వు ఇక్కడే ఉండి మమ్మల్ని జీవింపచెయ్యి" అని వేడుకున్నాయి.

ఈ రకంగా ఇంద్రియాలన్నీ ప్రాణం లేకపోతే తమ ఉనికి లేదని ఒప్పుకున్నాయి. అందుకనే వాక్కు, చక్షువు, శ్రోత్రము, మనస్సు అనే పేర్లతోగాక, అవన్నీ ప్రాణవంతములైతేనే పనిచేస్తాయి. అందుకే అవన్నీ ప్రాణాలనే సంకేతంతో పిలువబడతాయి. అంటే ప్రాణం కాకుండా వాటికి స్వేచ్ఛ లేదు. అసలు ప్రాణమే ఇన్ని రూపాలుగా మారింది. అందుచేతనే ఇంద్రియాలన్నింటిలోకీ ప్రాణమే గొప్పది.

ఈ రకంగా ప్రాణం శరీరాన్ని విడిచిపోకుండా ఉండి మిగిలిన ఇంద్రియాలతో "మీ మాట ప్రకారము నేను ఇక్కడే ఉంటాను. మరి నాకు అన్నము ఏది ?" అని అడిగింది. "కుక్కలు, పిల్లులు, పక్షులు మొదలైన జీవ జంతువుల ఆహారమే నీకు ఆహారము" అన్నాయి. ఇది ఏవిధంగా అంటే శరీరంలో ముఖ్యమైన ప్రాణం వల్లనే మిగిలిన ఇంద్రియాలు పనిచేస్తున్నాయి. కాబట్టి అన్నింటి ఆహారము ప్రాణానికి ఆహారమవుతోంది. విరాట్ ప్రాణానికి విరాట్ అన్నమే ఆహారము. ఈ విషయము తెలిసినవాడికి తినరానిది ఏదీ ఉండదు.

ప్రాణం మళ్ళీ అడిగింది "మరి నాకు ఆచ్ఛాదనకు వస్త్రం ఏదీ ?" దానికి ఇంద్రియాలు "జలమే నీకు ఆచ్ఛాదన" అన్నాయి. విద్వాంసులు భోజనానికి ముందు, తరువాత కూడా ప్రాణాన్ని జలంతో ఆచ్ఛాదిస్తున్నారు. భోజన సమయంలోచేసే ఆపోసనా, ఉత్తరాపోపసలే ప్రాణానికి వస్త్రం. ఈ విషయం తెలుసుకున్నవాడు వస్త్రాన్ని పొంది నగ్నత్వం లేనివాడవుతున్నాడు.

పూర్వకాలంలో సత్యకామజాబిలి ఈ విషయాన్ని వ్యాఘ్రపాదుని కుమారుడైన గోశ్రుతి అనేవాడికి చెప్పాడు.

ఈ రకంగా ఇంద్రియాలన్నింటిలోకీ ముఖ్యమైనది. ప్రాణము. అది పరమాత్మ స్వరూపము. అందుకే శ్రీమన్నారాయణుడు ప్రాణః' అనబడుతున్నాడు. అంటూ పరశురామావతారాన్ని పూర్తిచేశాడు రత్నాకరుడు.

# 26. కూర్మావతారము

"గురువుగారూ ! శ్రీమహావిష్ణువు కూర్మావతారం ఎత్తాడు కదా ! దాన్ని వివరించండి" అన్నాడు నారాయణభట్టు. వివరించటం ప్రారంభించాడు రత్నాకరుడు.

పూర్వకాలంలో ఒకసారి దుర్వాసమహర్షి దేశసంచారంచేస్తూ ఆ సమయంలో ఒకచోట విద్యాధరకన్య ఎదురువచ్చి, మహర్షికి నమస్కరించి పూలమాలను సమర్పించింది. ఆ మాలను శిరస్సున ధరించి వెడుతున్నాడు దుర్వాసుడు. అలాపోతూ ఉండగా త్రోవలో ఇంద్రుడు ఐరావతము మీద వస్తూ కనిపించాడు. దుర్వాసుడు పూలమాలను ఇంద్రుడికిచ్చాడు. దేవేంద్రుడు ఆ మాలను తీసుకుని ఐరావతము మీద ఉంచాడు. ఆ ఏనుగుకు పూలవాసన తగిలింది. వెంటనే తుండము సాచి ఆ మాలను అందుకుని నేలమీదికి విసిరింది. అది చూసిన దుర్వాసుడు, దేవేంద్రుడు కావాలనే ఆ పని చేయించాడు అని తలచి 'నీ సంపద అంతా నశించుగాక' అని శపించాడు. ఇంద్రుడు మహర్షి పాదాలమీద పడ్డాడు. ఏమీ ప్రయోజనం లేకపోయింది. మహర్షి కనికరించలేదు.

మహర్షి శాపం ఫలించటం మొదలుపెట్టింది. భూలోకంలో అసుర సంపత్తి పెరగసాగింది. యజ్ఞయాగాదులు నశించాయి. దేవతలకు హవిర్భాగములు అందటంలేదు. దాంతో దేవతల తేజస్సు తగ్గటం మొదలుపెట్టింది. క్రమంగా ఇంద్రుని సంపద క్షీణించసాగింది. దిక్పాలకులంతా కలసి ఆలోచించారు. వారికి ఏ ఉపాయము తోచలేదు. వారంతా కలిసి బ్రహ్మదేవుని దగ్గరకు పోయారు.

బ్రహ్మదేవుడు ఒక్కసారిగా తన దగ్గరకు వచ్చిన ఇంద్రాదిదేవతలను చూశాడు. కళావిహినమైన వారి ముఖాలను చూశాడు. లోకంలో అసురసంపత్తి పెచ్చు పెరిగిందని అర్థమయింది. ఇటువంటి సమయంలో దేవతలను రక్షించగలవాడు ఆ శ్రీహరి తప్ప ఇంకెవరూలేరు. అందుచేత అవ్యయుడు, అనంతుడు అయిన శ్రీహరి దగ్గరకు ఇంద్రాది దేవతలతో సహా బయలుదేరాడు.

దేవతలంతా వైకుంఠంచేరి శ్రీహరిని స్తుతించటం ప్రారంభించారు.

దేవదేవా ! నీవు నిర్వికారుడవు. అనంతుడవు. ఆది మధ్యాంతరహితుడవు. ఉత్తముడవు. పూజ్యుడవు. అశరీరుడవు. సర్వాంతర్యామివి. లోకాతీతుడవు. అవ్యక్తుడవు. జ్ఞానరూపివి. దేవతలు, మునులు, ఋషులు అంతా నీ శరీరము నుంచే ఉద్భవిస్తున్నారు. వారంతా నీ నుంచి జన్మించి కూడా నిన్ను గురించి తెలుసుకోలేకుండా ఉన్నారు. నీకు

| | | | | |
|---|---|---|---|---|
| భూమి | - | పాదాలు | సూర్యుడు | - | నేత్రాలు |
| జలము | - | వీర్యము | వాయువు | - | ప్రాణము |
| చంద్రుడు | - | మనస్సు | చెవులు | - | దిక్కులు |
| అగ్ని | - | నోరు | | | |

నీ నాభినుంచి ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమాన వాయువులు పుట్టినాయి. ఐదు ప్రాణాలకు, పది ఇంద్రియాలకు ఆశ్రయమైన ఆకాశం పుట్టింది. నీ యొక్క

| | | | | | |
|---|---|---|---|---|---|
| బలముతో | - | ఇంద్రుడు | వీపున | - | అధర్మము |
| ప్రసన్నతతో | - | దేవతలు | శిరస్సున | - | స్వర్గము |
| కోపముతో | - | రుద్రుడు | నీ విహారమున | - | అప్సరసలు పుట్టారు. |
| బుద్ధితో | - | బ్రహ్మ | నీ క్రింది పెదవి నుండి | - | లోభము |
| శరీరరంధ్రముల నుండి | - | వేదాలు, ఋషులు | పై పెదవి నుండి | - | ప్రీతి |
| జననాంగము నుండి | - | ప్రజాపతి పుట్టారు | ముక్కు నుండి | - | కాంతి |
| నీ వక్షమున | - | లక్ష్మి | భృకుటినుండి | - | యముడు |
| నీ నీడలో | - | పిత్రుదేవతలు | కనురెప్పల | | |
| నీ స్తనమందు | - | ధర్మము | వెంట్రుకలు నుండి | - | కాలము పుట్టినాయి |

ఓ దేవదేవా ! ఆత్రత్రాణ పరాయణా ! శరణాగతవత్సలా ! నిన్ను దర్శించాలని దేవతలంతా వచ్చారు. మాకు నీ దర్శనభాగ్యము ప్రసాదించవలసినది" అని వేడుకున్నారు.

దేవతలు చేసిన స్తోత్రములను హరి విన్నాడు వారిని కనికరించి దర్శనమిచ్చాడు. వేయిసూర్యులు ఒక్కసారిగా ప్రకాశిస్తున్నట్లుగా మహోజ్వలమైన కాంతితో ప్రకాశించాడు. దేవతలంతా ఆశ్చర్యపోయారు వారికి ఆ కాంతిలో ఏదీ కనపడలేదు. భూమ్యాకాశాలే కాదు చివరకు తమదేహము కూడా కనిపించలేదు.

ఆ సమయంలో దేవతలంతా "ఓ పరమేశ్వరా ! అగ్నిహోత్రము నుంచి విడివడిన రేణువులలాగా మేమంతా నీ నుంచి విడవడి ప్రకాశిస్తున్నాము.

ఈ లోకంలో మాకు క్షేమం లేదు. గోవులకు, బ్రాహ్మణులకు శుభం కలిగే విధానం మాకు తెలియచెయ్యవలసినది" అని ప్రార్థించారు.

దేవతల ప్రార్థన ఆలకించాడు శ్రీహరి. అప్పుడు వారితో "దేవతలారా ! మీ క్షేమం కోసం దానవులతో సంధి చేసుకోండి. ఆ తరువాత క్షీరసాగరమధనము చెయ్యండి. ఆ

సాగరంలో గడ్డి, తీగలు, ఔషధములు పడవెయ్యండి. మందరగిరిని కవ్వముగా, వాసుకిని త్రాడుగా చేసి క్షీరసాగర మథనం చెయ్యండి. మీకు శుభం జరుగుతుంది" అన్నాడు.

శ్రీమహావిష్ణువు మాటలు విన్న దేవతలు విష్ణువుకు నమస్కరించి రాక్షసరాజైన బలిచక్రవర్తి దగ్గరకు వెళ్ళి, తాము వారితో సంధి చేసుకుంటున్నామని, క్షీరసాగర మథనం చేసి అందులో నుంచి వచ్చినవి చెరిసగం తీసుకుందామని చెప్పారు. రాక్షసులు దానికి అంగీకరించారు. దేవదానవులిద్దరూ అమృతం కోసం క్షీరసాగర మథనం చెయ్యటానికి సిద్ధపడ్డారు.

దేవదానవులిద్దరూ మందరగిరి దగ్గరకు వెళ్ళారు. దాన్ని పెకలించారు. ఈ లోపుగా ఆ పర్వతం క్రిందపడి అనేకమంది దేవతలు, రాక్షసులు కూడా చనిపోయారు. ఆ సమయంలో శ్రీహరి వచ్చి చనిపోయినవారిని బ్రతికించాడు. గరుడుడు ఆ పర్వతాన్ని సముద్రపు ఒడ్డున దించి వెళ్ళాడు. అప్పుడు మందర పర్వతాన్ని కవ్వముగా చేసి, వాసుకిని త్రాడుగా చుట్టారు. వాసుకి తలభాగాన రాక్షసులు, తోకను దేవతలు పట్టుకున్నారు.

పర్వతం చాలా బరువుగా ఉంది. దాని క్రింద ఆధారం ఏమీలేదు. దాంతో అది మునిగిపోవటం మొదలుపెట్టింది. దేవదానవులు విశ్వప్రయత్నం చేశారు. పర్వతం తేలటంలేదు. అది గమనించిన శ్రీమహావిష్ణువు.

సీ॥ సవర నై లక్షయోజనముల వెడలుపై కడుఁ గఠోరం బైన కర్పరమున
నద నైన బ్రహ్మాండ మైన నాహారించు ఘనతరం బగు ముఖగహ్వరంబు
సకల చరాచర జంతురాసుల నెల్ల మ్రింగి లోఁగొనునట్టి మేటి కడుపు
విశ్వంబుపై వేఱు విశ్వంబు పైఁబడ్డ నాఁగినఁ గదలనియట్టి కాళ్ళు

తే॥ వెలికి లోనికిఁ జనుదెంచు విపులతుండ
మంబుజంబులఁ బోలెడి యక్షియుగము
సుందరంబుగ విష్ణుండు సురలతోడి
కూర్మి చెలువొంద నొకమహాకూర్మ మయ్యె

మ॥ కమఠంబై జలరాశిఁ జొచ్చి లఘు ముక్తాశుక్తి చందంబునన్
నమ దద్రీంద్రము నెత్తె వాసుకి మహానాగంబుతో లీలతో
నమరేంద్రాదులు మౌళికంపములతో నౌ నౌఁ గదే బాపురే
కమలాక్షా ! శరణంచు భూ దిశలు నాకాశంబునన్ మ్రోయఁగాన్

ఆవిధంగా శ్రీహరి మహాకూర్మమై మునిగిపోతున్న పర్వతం క్రిందికి చేరి దానికి ఆధారమైనాడు. తన వీపుమీద మందరగిరి పర్వతాన్ని పైకెత్తాడు. ఈ రకంగా పరమేశ్వరుడు నీటిలో ఉండి దేవదానవులశక్తిని ఇనుమడింపచేశాడు. వాసుకుకి నిద్రమత్తు కల్పించాడు.

దేవదానవులు అత్యంత ఉత్సాహంతో క్షీరసాగరమథనం చేశారు.

ఈ విధంగా దేవదానవులకు అత్యంత బలాన్నిచ్చినవాడు. ఇంద్రునియొక్క తమ్ముడు. మథనం చేస్తున్న సముద్రాన్ని ధరించటంచేత జలానికి ఆధారమైనవాడు, జలమునకు స్థానమైనవాడు, భక్తులయొక్క కోరికలు తీర్చటానికి సర్వకాల సర్వావస్థలయందు సిద్ధముగా ఉండేవాడు. స్థిరముగా ఉండేవాడు, అసుర ప్రవృత్తి గలవారిని శోషింపచేసేవాడు, దేవతలసేనాపతి అయిన కుమారస్వామిని తన విభూతిగా గలవాడు, లోకముల భారమును మోసేవాడు, దేవతలకు కూడా వరాలిచ్చేవాడు, వాయువు యొక్క కదలికకు కూడా కారణమైనవాడు అయిన శ్రీహరి కూర్మావతారియై దేవదానవులతో క్షీరసాగరమథనం పూర్తి చేయించాడు.

ఈ విషయం 321 నుంచి 331 వరకు నామాలలో వివరించబడింది. ఇక నామాలను చూద్దాం.

## 321. ప్రాణదః

ప్రాణము లేదా బలము నిచ్చువాడు. 64, 408, 956 నామాలు కూడా ఇదే.

**మరుతాం బలదానాద్ధి సముద్రమథనే భృశమ్ ।**
**ప్రాణదశ్చ సముద్దిష్ట కూర్మరూపతయా హిసః ॥**

క్షీరసాగర మథనం చేసేటప్పుడు తాను కూర్మరూపం ధరించి, దేవతలకు ఎక్కువ బలాన్నిచ్చినవాడు.

**ప్రాణం బలం దదాతీతి ప్రాణదః**

సముద్రమథనంచేసేటప్పుడు దేవతలకు కావలసినంత బలమునిచ్చేవాడు.

**సురాణాం ప్రాణందదాతి. అసురాణాం ప్రాణంద్యతి - ఖండయతి.**

దేవతలకు ప్రాణమునిచ్చువాడు. అసురల ప్రాణములు తీయువాడు.

క్షీరసాగరాన్ని మథించేటప్పుడు సురాసురులకు ఇద్దరికీ కావలసిన శక్తిని తనే ఇచ్చాడు. పరమేశ్వరుడు దేవతల పక్షపాతికదా ! మరి రాక్షసులకు ఎందుకు శక్తినిచ్చాడు?

అనే ప్రశ్న ఉదయిస్తుంది. దేవదానవులిద్దరూ కలిసి చేస్తేనే క్షీరసాగరమథనం జరుగుతుంది. వీరిలో ఎవరు వెనక్కి తగ్గినా సాగరమథనం జరగదు. అమృతం బయటకురాదు. అందుచేతనే సముద్రాన్ని మథించటానికి దేవతలతో పాటుగా రాక్షసులకు కూడా కావలసిన బలాన్ని ఇచ్చాడు శ్రీమహావిష్ణువు. అందుకే 'ప్రాణదః' అనబడుతున్నాడు. దేవదానవులిద్దరూ కలిసి సాగరమథనం చేస్తున్నారు. మందరగిరి పర్వతం నిలవటంలేదు. సముద్రంలో మునిగిపోతోంది. అప్పుడు శ్రీహరి కూర్మావతారమెత్తి ఆ పర్వతాన్ని మోశాడు.

సజ్జనులకు శక్తినిచ్చి కాపాడే పరమేశ్వరుడే దుర్జనులను శిక్షిస్తాడు. వారి శక్తిని హరిస్తాడు.

గతంలో చెప్పినట్లుగా దేహంలోకల ఇంద్రియాలన్నింటికీ చైతన్యాన్ని ప్రసాదించేది ఆ పరమేశ్వరుడే. అతడు ప్రాణం రూపంలో ఉంటాడు. ప్రాణం లేకపోతే అవయవాలు పనిచెయ్యవు. అందుకే దేహంలో ఉండే అవయవాలిన్నింటిలోకీ జ్యేష్ఠము, శ్రేష్ఠము అయినది ప్రాణము అని **బృహదారణ్యకోపనిషత్తు**లో చెప్పబడింది.

ఈ రకంగా పరమేశ్వరుడు ఇంద్రియాలకు అధిష్ఠానదేవతఅయి, వాటికి పనిచేసే శక్తిని ఇస్తున్నాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'ప్రాణదః' అనబడుతున్నాడు.

## 322. వాసవాఽనుజః

ఇంద్రునియొక్క తమ్ముడు.

**వాసవస్యానుజస్యేన జాతత్వా ద్వాసవానుజః**

దేవేంద్రుడికి తమ్ముడిగా, అదితికస్యవుల గర్భాన ఉపేంద్రుడిగా జన్మించినవాడు.

**వాసవం అనుజాయతే ఇతివాసవానుజః** ఇంద్రుని తరువాత పుట్టినవాడు.

**వాసవస్య అనుజః** ఇంద్రునకు తమ్ముడు

బలిచక్రవర్తి ముల్లోకాలను జయించాడు. దేవతలు అడవులకు పారిపోయారు. నిలువనీడ లేకుండా ఉన్నారు. అప్పుడు అదితి కస్యపప్రజాపతిని ప్రార్థించి తన కుమారుల కష్టాలను కడతేర్చుమని అడిగింది. శ్రీహరిని ఉపాసన చెయ్యమన్నాడు కస్యప ప్రజాపతి. హరిని ఉపాసించింది అదితి. అప్పుడు ఆ హరి ప్రత్యక్షమై నీ గర్భాన వామనుడిగా జన్మిస్తాను అని వరిమిచ్చాడు. ఆ ప్రకారమే అదితి గర్భాన వామనుడిగా జన్మించి బలిచక్రవర్తిని సుతలలోకానికి పంపాడు. ఈ రకంగా అదితి గర్భాన, ఇంద్రుని తరువాత జన్మించాడు. కాబట్టి ఆ శ్రీమన్నారాయణుడు 'వాసవానుజః' అనబడుతున్నాడు.

# 323. అపాంనిధిః

జలమునకు స్థానమైనవాడు.

**అపాన్నిధి ర్మథ్యమాన మహార్ణవ విధారణాత్ ॥**

మధించబడుతున్న సముద్రాన్ని ధరించటంచేత నీటికి ఆధారమైనవాడు, జలమునకు నిధి.

జలమునకు నిధి సముద్రము. **అపః యత్ర నిధీయంతే**

నీరు ఎక్కడ ఎక్కువగా ఉంటుందో, అది సముద్రము. సముద్రము విష్ణుమూర్తి రూపమే.

**భగవద్గీతలో**ని 10వ అధ్యాయం **విభూతియోగం**లోని 24వ శ్లోకం

**పురోధసాం చ ముఖ్యం మాం విద్ధి పార్థ ! బృహస్పతిమ్ ।**
**సేనానీనామహం స్కందః సరసామస్మి సాగరః ॥**

పురోహితులలో ముఖ్యుడైన బృహస్పతిని నేనే. సేనాపతులలో కుమారస్వామిని నేనే. జలాశయములలో సాగరడును నేనే.

భూమియందలి జలాశయములలో సముద్రమే చాలా గొప్పది. ఇక్కడ సాగరము అంటే అన్ని సముద్రములయొక్క సమిష్టి రూపము అని గుర్తుంచుకోవాలి. ఆ సముద్రం చాలా విశాలమైనది, లోతైనది. కాబట్టి విశిష్టమైనది. అందుచేతనే జలాశయాలన్నింటిలోకీ సాగరుడు ఆ పరమాత్ముడే తప్ప వేరుకాదు. **బ్రహ్మవైవర్తపురాణములో**

"శ్రీకృష్ణభగవానుడు గోలోకంలో ఉన్నాడు. అతనికి 'విరజ' అనే స్త్రీవల్ల ఏడుగురు కుమారులు కలిగారు. ఒక రోజున ఆ కుమారులు ఆడుకొంటుండగా ఆఖరువాడు తన అన్నలతో పోట్లాడి తల్లిదగ్గరకు ఏడుస్తూ వచ్చాడు. ఇతన్ని తన అన్నలతో కలపటానికి విరజ శ్రీకృష్ణుని వదిలిపెట్టి వెళ్ళింది. ఆమె తిరిగివచ్చేటప్పటికి కృష్ణుడు మాయమైనాడు. ఇలా జరగటానికి తనకుమారులే కారణము అని భావించి కుమారులను సప్తసముద్రములు కమ్మని శపించింది" అని చెప్పబడింది.

ఈ రకంగా శ్రీకృష్ణుని కుమారులే సముద్రాలు తండ్రియొక్క ప్రతిరూపమే కుమారులు కాబట్టి ఈ సముద్రము పరమేశ్వర స్వరూపమే అనబడుతోంది అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'అపాంనిధిః' అనబడుతున్నాడు.

# 324. అధిష్ఠానమ్

ఆధారమైనవాడు.

**భ్రమమాణం వన్దరాద్రిం ధృతవాన్ యో మహాబలే ।**

**అధిష్ఠానం తమేవాహుః అధిష్ఠాన్‌ప్రదో నమః ॥**

సముద్రమథనం చేస్తున్నారు. దేవదానవులు. మందరగిరి పర్వతాన్ని కవ్వముగా చేశారు. వాసుకుని త్రాడుగా చుట్టారు. కవ్వము గిరగిరా తిరుగుతున్నది. ఆ సమయంలో పర్వతము మునిగిపోకుండా, దానికి ఆధారమైనవాడు.

**అధి తిష్ఠత్యస్మిన్నితి అధిష్ఠానం** సాగరమథనము జరిపేటప్పుడు దానికి ఆధారమైనవాడు.

అధిష్ఠానమ్ ఆధారమైనవాడు, ఆశ్రయరూపుడు అని అర్థం.

పరమేశ్వరుడు ఈ జగత్తుకు ఆధారమైనవాడు. సకల భూతములకు ఉపాదాన కారణమైనవాడు. ఉపాదాన కారణము అంటే - ముఖ్యమైన కారణము, ప్రధానమైన కారణము. కుండకు మట్టి ఉపాదాన కారణము. సృష్టికి పూర్వము ఈ జగత్తంతా శూన్యంగా ఉండేది. అప్పుడు పరమేశ్వరుడు ఒక్కడే ఉన్నాడు. అతడు ఈ జగత్తంతా ఆవరించి ఉన్నాడు. అతనివల్లనే చరాచర జగత్తు సృష్టించబడింది. ఈ జగత్తుకు అతడే ఆధారము.

**భగవద్గీత**లోని తొమ్మిదవ అధ్యాయం **'రాజవిద్యారాజగుహ్యాయోగము'**లోని 4వ శ్లోకము.

**మయా తతమిదం సర్వం జగదవ్యక్త మూర్తినా ।**

**మత్‌స్థాని సర్వభూతాని న చాహం తేష్వవస్థితః ॥**

నిరాకార పరబ్రహ్మనైన నాచేతనే ఈ జగత్తంతా జలముతో మంచులాగా పరిపూర్ణమై ఉన్నది. ప్రాణులన్నీ నా సంకల్పము ఆధారంగానే, నాయందే అంతర్గతమై ఉన్నాయి. కాని నేను మాత్రం వాటియందుండను.

వాయువు, తేజస్సు, జలము, పృథ్వి అనే వాటిలో ఆకాశము దాగి ఉన్నది. ఆభరణాల యందు బంగారమున్నట్లుగానే, కుండయందు మట్టి ఉన్నట్లుగానే పరమేశ్వరుడు ఈ జగత్తంతా ఆవరించి ఉన్నాడు. **ఈశావాశ్యోపనిషత్తు**లో

**ఈశావాస్య మిదం సర్వం యత్కించ జగత్యాం జగత్**

ఈ జగత్తులో జగడము, చైతన్యము రెండు పదార్థాలు కూడా ఆ పరమేశ్వరుని చేతనే ఆవరించబడి ఉన్నాయి.

క్షీరసాగర మథన సమయంలో శ్రీహరి మందర పర్వతానికి ఆధారమైనవాడు కాబట్టి 'అధిష్ఠానము' అనబడుతున్నాడు.

పెరుగు చిలికేటప్పుడు కవ్వము గిన్నె అడుగు భాగాన తాకరాదు. అలా తాకితే మథనం జరగదు. అందుచేత పర్వతం సముద్రపు అడుగు భాగాన్ని తాకకుండా ఆపి, తన వీపున మోశాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు' అధిష్ఠానమనబడుతున్నాడు.

## 325. అప్రమత్తః

జాగ్రత్తగలవాడు, అప్రమత్తుడు

**అత్యన్తా వహితస్త్రాణే హ్యప్రమత్తః ప్రకీర్తితః** భక్తులను రక్షించటానికి, వారి కోరికలు తీర్చటానికి ఎల్లవేళలయందు సిద్ధముగా ఉండేవాడు.

**న ప్రమత్తః అప్రమత్తః** రక్షించే విషయంలో చాలా జాగ్రత్తగా ఉండేవాడు.

మానవుడు కర్మలు చేస్తాడు. ఆ కర్మలవల్ల పుణ్యాపాపాలు వస్తాయి. దానివల్ల స్వర్గనరకాలు వస్తాయి. ఆ కర్మఫలం అనుభవించటానికి ఆ జీవి ఉత్తర జన్మలను ఎత్తుతాడు. ఈ రకంగా జన్మించేటప్పుడు అతడియొక్క సంచితకర్మ ఆధారంగానే ఈ జన్మ వస్తుంది. ఆ కర్మ ననుసరించి మంచి పనులు చేసిన వారు మంచి జన్మలు ఎత్తుతారు. చెడ్డపనులు చేసినవారుతక్కువ జన్మలు, హీనమైన నీచమైన జన్మలు ఎత్తుతారు. జీవియొక్క కర్మానుసారమే అతనికి ఉత్తర జన్మలు ప్రసాదించేటప్పుడు అతిజాగ్రత్తగా, అప్రమత్తుడై ఉంటాడు. అందుకే శ్రీమన్నారాయణుడు 'అప్రమత్తః' అనబడుతున్నాడు. భగవద్గీత 3వ అధ్యాయము **'కర్మయోగము'**లోని 24వ శ్లోకం.

**ఉత్సీదేయరిమే లోకాఃన కుర్యాం కర్మ చేదహమ్**
**సంకరస్య చ కర్తా స్యాం ఉపహన్యామిమాః ప్రజాః**

నేను కర్మలను ఆచరించటం మానేస్తే, ఈ లోకాలన్నీ నశించిపోతాయి. లోకాలలో అల్లకల్లోలము చెలరేగుతుంది. ప్రాణనష్టం, జననష్టం కూడా జరుగుతుంది. దానికి కూడా నేనే కారణము అంటాడు భగవానుడు.

భక్తులను ఉద్ధరించటానికి భగవానుడు ఎల్లవేళలందు అప్రమత్తుడై ఉంటాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'అప్రమత్తః' అనబడుతున్నాడు.

# 326. ప్రతిష్ఠితః

స్థిరముగా ఉండేవాడు.

**స్వే మహిమ్ని స్థితో యస్తు స ప్రతిష్ఠిత ఉచ్యతే** ఇతరమైన అపేక్షలు లేకుండా తన మహిమ యందు మాత్రమే ఆధారపడి ఉండేవాడు.

ఇతరమైనవేవీ అపేక్షించకుండా తనమహిమలో తానే స్థిరముగా ఉండేవాడు.

**ఛాందోగ్యోపనిషత్తు**లో ఒకసారి నారదమహర్షి సనత్కుమారుని వద్దకువెళ్ళి తనకు ఆత్మానుభూతిని కలుగజేయమని కోరాడు. దానికి సనత్కుమారుడు. 'గతంలో ఏఏ విద్యలు అభ్యసించావు?' అన్నాడు.

"స్వామీ ! వేదవేదాంగాలు చదివాను. ఎన్నో కళలు నేర్చుకున్నాను. శాస్త్రాలు అభ్యసించాను. సంగీత సాధన చేశాను. కాని నాకు మనశ్శాంతి లభించలేదు. ఆత్మజ్ఞానం కలుగలేదు. ఆత్మజ్ఞానం వల్ల సర్వదుఃఖాలు నశిస్తాయని విన్నాను. కాబట్టి ఆత్మజ్ఞానాన్ని ఉపదేశించి నాకు దుఃఖవిమోచనం కలుగచేయండి" అన్నాడు నారదుడు.

అప్పుడు సనత్కుమారుడు "నారదా ! నువ్వు ఇంతవరకు అభ్యసించినది కష్ట సాధ్యమైన 'పరావిద్య' కాదు. నీకు ఎన్నో సిద్ధాంతాలు తెలుసు. కాని వాటి ఆచరణలేదు. వాటి ఆంతర్యం నీకు తెలియదు. నీకు తెలిసినదంతా 'అపరావిద్య'. అదంతా పదాల గారడి. కాబట్టి వాటన్నిటినీ వదలిపెట్టి విశ్వమంతా వ్యాపించి ఉన్న ఆత్మతత్త్వాన్ని తెలుసుకో. అదే పరావిద్య. అది సాధించాలంటే మానసికపవిత్రత కావాలి. మనస్సు మలినరహితమైతేనే ఆత్మానుభవం కలుగుతుంది. అంతఃకరణ నిర్మలమవుతుంది. అప్పుడు సత్యదర్శనమవు తుంది. సత్యం అప్పుడు బాలభానుని వలె పసిడికాంతులతో హృదయాంతరాళల్లో ప్రకాశిస్తుంది. అదే పరావిద్య. దానివల్లనే శాశ్వతమైన ఆనందం లభిస్తుంది.

నారదా ! నువ్వు తెలుసుకున్నదంతా పదాలు మాత్రమే. అది పారిభాషిక పరిజ్ఞానము. ఆ పదజాలం ఏం సాధించగలదో అదే నీకు లభిస్తుంది. అంతకన్నా నీకేమి దొరకదు.

ఇంతవరకు నీవు తెలుసుకున్నది నామమాత్రమైనది. నువ్వు చదివిన వేద శాస్త్రాలన్నిటికీ పేరు ఉన్నది. ఋగ్వేదము అనేది ఒక పేరు. అలాగే మిగిలిన వేదాలు, పురాణాలు అన్నీ పేర్లే. వ్యాకరణం, శ్రాద్ధకల్పం, తర్కం, జ్యోతిషం, నీతిశాస్త్రం, నిరుక్తం, ధనుర్వేదం, సర్పశాస్త్రం, సంగీతం. ఇవన్నీ పేర్లే కాబట్టి ఒక ప్రతిమలో విష్ణురూపాన్ని భావించి ఉపాసించినట్లు వీటి నామాలన్నీ పరబ్రహ్మ స్వరూపమనే బుద్ధితో ఉపాసించు.

నామాన్ని పరమాత్మగా ఉపాసించేవాడు నామం వ్యాపించి ఉన్నంతమేర స్వేచ్ఛగా సంచరించ గలుగుతాడు. అంటే ఆ ఉపాసకుడు విశ్వమంతా సంచరించగలుగుతాడు" అన్నాడు.

అది విన్న నారదుడు "నామం కన్నా గొప్పది ఏది ?" అని ప్రశ్నించాడు. నామంకన్నా గొప్పది వాక్కు. వాక్శక్తి కనక లేకపోతే పదాలు లేవు. వేదాలు లేవు. వేదాలలో చెప్పబడిన సత్యాసత్యాలు లేవు. శుభాశుభములు లేవు. వాక్కే బ్రహ్మగా ఉపాశించేవాడు వాక్కు వ్యాపించి ఉన్నంతమేర అంటే శబ్దం, స్వరం వ్యాపించి ఉన్నంతమేర స్వేచ్ఛగా సంచరించ గలుగుతాడు.

అది విన్న నారదుడు "దేవా ! వాక్కుకన్న శ్రేష్ఠమైనదేమైనా ఉన్నదా?" అన్నాడు

"ఉన్నది మహర్షీ ! వాక్‌శక్తి కన్న గొప్పది మనస్సు. ఒక మనిషి వేదాలు నేర్చుకుంటాడు. మనస్సులోంచి వచ్చిన ఆలోచన మూలంగా వేదమంత్రాలను సొంతగా చెప్పుకుంటాడు. ఆలోచనే రాకపోతే ఆ పని చెయ్యడు. ఏ పని చెయ్యాలన్నా ఆలోచన రావాలి. అందుచేతనే ఆలోచన చేసే మనస్సు వాక్కు కన్న గొప్పది. మనస్సే బ్రహ్మ అని ఉపాసన చేసేవాడు మనస్సు పొందగలిగినంతమేర స్వేచ్ఛగా విహరించగలుగుతాడు" అన్నాడు సనత్కుమారుడు.

అది విన్న నారదుడు "స్వామీ ! మనస్సుకన్న శ్రేష్ఠమైనది ఏది ?" అన్నాడు.

"ఆలోచించే మనస్సుకన్న గొప్పది సంకల్పం. అసలు సంకల్పమనేది కలగకపోతే జరిగేది ఏమీలేదు. సంకల్పమంటూ చేస్తే, దాన్ని క్రియ అనుసరిస్తుంది. ఈ సంకల్పమే సమస్త క్రియాకలాకల్పాన్ని కట్టిపెట్టి ఉంచుతుంది. మనస్సు, వాక్కు, నామం, మంత్రం, కర్మ మొదలైనవన్నీ సంకల్పంలోనే లయమవుతాయి. కాబట్టి సంకల్పమే బ్రహ్మ అని ఉపాసన చేసేవాడు భగవంతుడిచేత సంకల్పించబడిన లోకాలన్నీ పొందుతాడు అన్నాడు సనత్కుమారుడు.

"అలాగయితే సంకల్పం కన్న గొప్పది ఏదైనా ఉన్నదా?" అన్నాడు నారదుడు.

"సంకల్పం కన్న గొప్పది చిత్తం, చిత్తం వలన అన్ని పనులను గురించిన ఆలోచన ప్రవర్తిల్లుతుంది. చిత్తంవల్లనే సంకల్పం కలుగుతుంది. ఇది ఆలోచనా ప్రేరకమైన చిత్తప్రక్రియను అనుసరిస్తుంది. వాక్కు వస్తుంది. పదాలు ఆకారం దాలుస్తాయి. ఒక మనిషి యొక్క చిత్తం చిన్నాభిన్నమైపోతే అతనికి స్పృహ తప్పుతుంది. అప్పుడు ఏ పనీ చెయ్యలేడు ఈ చిత్తమే బ్రహ్మ అని ఉపాసన చేసేవాడు శోకహీనుడై శోకరహితమైన లోకాలు పొందుతాడు" అన్నాడు సనత్కుమారుడు.

"స్వామీ ! చిత్తం కన్న శ్రేష్ఠమైనది ఏమైనా ఉన్నదా ?" అన్నాడు నారదుడు.

"ధ్యానం అనేది చిత్తంకన్నా గొప్పది. ధ్యానంతో చిత్తానికి స్థాయి, స్థిరత్వము ఏర్పడతాయి. ఈ భూమి, ఆకాశం, పర్వతాలు అన్నీ ధ్యాననిష్ఠలో ఉన్నట్లు, క్రమం తప్పకుండా, స్థిరత్వం కోల్పోకుండా నిలిచి ఉన్నాయి. ఆ ధ్యానస్థితే లేకపోతే ఏదీ స్థిరంగా నిలబడలేదు. ధ్యానమే బ్రహ్మ అనే భావనతో ఉపాసన చేసేవాడు ధ్యానానికి ఎంత వరకు వ్యాప్తి ఉంటుందో అంతవరకు స్వేచ్ఛగా సంచరిస్తాడు." అన్నాడు సనత్కుమారుడు.

"దేవా ! ధ్యానాన్నిమించినది ఇంకా ఏదైనా ఉన్నదా?" అన్నాడు నారదుడు.

"ధ్యానంకన్న గొప్పదివిజ్ఞానం, శుభాశుభాలు, సత్యాసత్యాలు, పురాణాలు, ఇహపరాలు, అన్నీ విజ్ఞానంవల్లనే గ్రహింపుకు వస్తాయి. విజ్ఞానమే బ్రహ్మ అని ఉపాసించేవాడు జ్ఞానంతో కూడిన లోకాలు పొందుతాడు." అన్నాడు సనత్కుమారుడు.

నారదుడు "స్వామీ ! ఇంతకన్న శ్రేష్ఠమైనదేమయినా ఉందా?" అన్నాడు.

"ఉన్నది విజ్ఞానం కన్న మించినది బలం. ఒక బలవంతుడు తన విజ్ఞాన విశేషాలతో వందమందిలోనైనా భయాన్ని రేకెత్తించగలడు. ఒక బలవంతుడు విద్యావంతుడైనప్పుడు, మేధావిగా, ఋషిగా, కర్మిష్ఠిగా మారినప్పుడు అందరిలోకీ అతనిదే పైచేయి అవుతుంది. మర్త్యలోకంలోగాని, స్వర్గలోకంలోగాని వాటిని సాధించి పెట్టేది భౌతికబలం. భూమ్యాకాశాలను, పర్వతాలను పశుపక్ష్యాదులను, దేవసమూహాలనూ, అందరినీ నిలబెట్టగలిగేది భౌతికశక్తే కాబట్టి బలమే బ్రహ్మ అని తెలుసుకుని ఉపాసన చేసేవాడు బలానికి వ్యాప్తి ఉన్నంత మేర స్వేచ్ఛగా విహరిస్తాడు" అన్నాడు సనత్కుమారుడు.

"దేవా ! ఇంతకంటే శ్రేష్ఠమైనదేదైనా ఉన్నదా ?" అన్నాడు నారదుడు.

"శారీరకబలంకన్న మించినది అన్నం. మనిషి కొన్నిరోజులపాటు అన్నం తినకుండా మాడితే చచ్చిపోతాడు. కొంతకాలం బ్రతికినా నీరసంతోమాట పడిపోతుంది. నడవలేడు. చూడలేడు. ఏ పనీచెయ్యలేడు. వినే శక్తి కూడా పోతుంది. ఆలోచనా శక్తి హరించుకుపోతుంది. ఆహారం తీసుకోవటం ప్రారంభిస్తే తిరిగి అన్ని శక్తులూ పొందుతాడు. మునుపటిలాగా పనిచేయగలుగుతాడు" అన్నమే బ్రహ్మ అనిఉపాసన చేసినవాడు అన్నం ఉన్నంతమేర స్వేచ్ఛగా సంచరించగలుగుతాడు. అన్నాడు సనత్కుమారుడు.

"స్వామీ ! అన్నంకంటె శ్రేష్ఠమైనదేమైనా ఉన్నదా? అన్నాడు నారదుడు.

"నారదా ! మేఘాలు వర్షించకపోతే పంటలు పండవు. ఆహారం దొరకదు. నీరు లేకపోతే అన్ని జీవరాశులు మొగం వాచి చావుకు సిద్ధమవుతాయి. తొలకరిలో వర్షాలు

కురవటం ప్రారంభం కావటంతో జీవులన్నీ ఆనందంతో చిందులు వేస్తాయి. జలమే బ్రహ్మ అని ఉపాసన చేసేవాడు తాను కోరిన వస్తువులన్నీ పొంది తృప్తి చెందుతాడు. జలం ఉన్నంతమేర స్వేచ్ఛగా తిరుగుతాడు” అన్నాడు సనత్కుమారుడు.

“స్వామీ ! జలంకన్న శ్రేష్ఠమైనదేది?” అన్నాడు నారదుడు.

“జలం కన్న శ్రేష్ఠమైనది తేజస్సు. ఆ తేజస్సే లేకపోతే భూమిమీద నదులలోను, సముద్రాలలోను నీరు ఆవిరి అవదు. నీరు ఆవిరి కాకపోతే మేఘాలు వర్షించవు. కాబట్టి తేజస్సే బ్రహ్మ అని ఉపాసించేవాడు. తాను తేజస్వియై, తేజోసంపన్నమైన లోకాలు పొందుతాడు. అన్నాడు సనత్కుమారుడు.

“స్వామీ ! తేజస్సు కన్న గొప్పది ఏది ?” అని అడిగాడు నారదుడు.

“తేజస్సు కన్న గొప్పది ఆకాశం. ఆకాశం అంటూ ఉంది కాబట్టే అన్ని వస్తువులూ అందులో ఇముడుతున్నాయి. సూర్యుడు, చంద్రుడు, భూమి, గ్రహగోళాలు, నక్షత్రాలు మొదలైన తేజోమండలమంతా ఆకాశంలోనే చోటు చేసుకుని ఉన్నాయి. ఆకాశం శబ్ద తరంగాలకాధారం శబ్దాన్ని మన చెవులు గ్రహించటానికి కారణం ఆకాశం. కాబట్టి ఆకాశమే బ్రహ్మగా ఉపాసించేవాడు విశాలమైన, దుఃఖములేని, ప్రకాశవంతమైన లోకాలు పొందుతాడు. ఆకాశం వ్యాపించినంతమేర స్వేచ్ఛగా మనగలుగుతాడు.” అన్నాడు సనత్కుమారుడు.

“ఇంతకన్న శ్రేష్ఠమైనది ఏమైనాఉన్నదా?” అన్నాడు నారదుడు.

“అంతఃకరణ యొక్క ధర్మమైన స్మరణ ఇంతకన్న శ్రేష్ఠమైనది ఈ స్మరణయే జ్ఞాపకశక్తి. ఇది లేకపోతే మానవుడు వినవలసిన దానిని వినలేడు. మాట్లాడవలసిన దానిని మాట్లాడలేడు. ఆలోచించనూలేడు. స్మరణయే బ్రహ్మ అని భావించి ఉపాసన చేసేవాడు స్మరణశక్తి వెళ్ళగలిగినంత మేర స్వేచ్ఛగా సంచరించగలుగుతాడు” అన్నాడు. సనత్కుమారుడు.

“ఇంతకన్న గొప్పది ఏది ?” అన్నాడు నారదుడు.

“ఆశ ! ఆశతో స్మరణశక్తి ఎక్కువ అవుతుంది. మానవుడు ఆశతోనే వేదమంత్రాలు చదువుతాడు. ఫలితాన్ని పొందుతాడు. ఆ ఫలితమే పుత్రులు, పశువులు, ధనము మొదలైనవి. ఆశనే బ్రహ్మగా ఉపాసించేవారి కోరికలన్నీ నెరవేరతాయి. అతని ప్రార్థనలు వ్యర్థం కావు” అన్నాడు సనత్కుమారుడు.

“అంతకన్న శ్రేష్ఠమైనదేది?” అన్నాడు నారదుడు.

"ఆశకన్న శ్రేష్ఠమైనది ప్రాణం. బండి చక్రంలోని కుండలో ఆకులన్నీ ఉన్నట్లుగా, సమస్త ప్రపంచమూ శరీరంలోని ముఖ్యప్రాణంలో అమరిఉన్నది. ఈ ముఖ్యప్రాణమే జీవాత్మ. ఈ ప్రాణమే తనశక్తి అయిన ప్రాణంద్వారా నడుస్తోంది. అంటే ప్రాణమే ప్రాణానికి ప్రాణం ఇస్తోంది. ఇచ్చేది, ఇవ్వబడేది కూడా ప్రాణమే కాబట్టి ఈ ప్రాణమే తల్లి, తండ్రి, గురువు వీరందరిలో ఉన్నది ప్రాణమే. ప్రాణంపోయిన తరువాత వారిక ఆ పేర్లతో పిలువబడరు. చరాచర జగత్తు అంతా ప్రాణమయమే" అన్నాడు సనత్కుమారుడు.

"ప్రాణం కన్న శ్రేష్ఠమైనదేది?" అన్నాడు నారదుడు.

"ప్రాణంకన్న శ్రేష్ఠమైనది ఆత్మవిజ్ఞానం. ఆత్మయే సర్వానికి అధిష్ఠానమని గుర్తించు. మానవుడు అనేకమైన పనులు తలబెడతాడు. వాటివల్ల అతడికి ఆనందం లభిస్తుందనే భావిస్తాడు. ఆనందం దొరకదు అనుకుంటే మనిషి ఏ పనీ చెయ్యడు. ఈ ఆనందం అనేది కలిమిలో ఉంది కాని లేమిలోలేదు. ఉనికిలో ఉంది కాని శూన్యంలోలేదు. వాంఛలో ఆనందం లేదు. వాంఛాపూర్తిలో ఆనందం ఉంది. జగత్తులోని ఏ వస్తువూ అపరిమితా నందం ఇవ్వలేదు. అపరిమిత ఆత్మానందమే పరిపూర్ణానందాన్ని ప్రసాదిస్తుంది. అపరమితా నందము ఒక్క తురీయావస్త ద్వారానే సాధ్యము. అది ఇంద్రియాల పరిధికి దాటినస్థితి. ఆత్మకు భిన్నంగా ఉన్న దాన్ని చూడటం, వినటం, తెలుసుకోవటం ప్రారంభించాలని ప్రయత్నించటమే దుఃఖానికి నాంది. ఆత్మ స్వతఃప్రజ్ఞవల్లే నిలబడి ఉంటుంది. తత్త్వవేత్త అయినవాడు మృత్యువును చూడడు. రోగాన్ని కూడా చూడడు. అతడికి జరామృత్యువులు లేవు. విద్వాంసుడు అంటే జ్ఞానియైనవాడు అన్నిటినీఆత్మభావంతో చూస్తాడు. అందుకనే అతడు అన్నింటినీ పొందుతాడు. ఆత్మజ్ఞానం పొందటంలో ఉన్న ఆనందం ఇల్లుకట్టినా, పాడిపంటలు సమృద్ధిగా ఉన్నా, ధనధన్యాదులు సంపాదించినా రాదు.

ఆత్మ సర్వవ్యాపకమైనది. ఊర్ధ్వలోకాలలో, అధోలోకాలలో కూడా అది వ్యాపించి ఉంది. ఆత్మానందం అనిర్వచనీయం. ఆత్మజ్ఞాని తనకు తానే ప్రభువు. తనను నియంత్రించే శక్తి తానే.

ఆత్మానుభూతి పొందాలంటే మనస్సు పరిశుభ్రం కావాలి. పవిత్రమూ, పరిశుభ్రమూ అయిన ఆహారం తీసుకున్నప్పుడే మనస్సు పరిశుభ్రమవుతుంది. పరిశుభ్రమైన వెన్నెలతో ప్రకాశించే వ్యక్తికే ఆత్మసాక్షాత్కారం కలుగుతుంది. అతడే జీవన్ముక్తుడు'' అని సనత్కుమారుడు నారదుడికి "భూమావిద్య'ను ఉపదేశించాడు అని చెప్పబడింది.

ఇక్కడ అన్నింటియందు స్థిరంగా ఉండేది ఆత్మ. అదే పరమేశ్వరుడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'ప్రతిష్ఠితః' అనబడుతున్నాడు.

## 327. స్కందః

శోషింపచేయువాడు.

**అసురాదీన్ శోషయతి స్కందఃస్కందయతీతి యః** అసుర ప్రవృత్తి గల నాస్తికులను శోషింపచేయువాడు.

**స్కందయతి శోషయతీతి స్కందః** అసురాదులను శోషిల్లచేయువాడు.

స్కందించుట – పోవుట

శోషించుట – ఎండించుట

**స్కందతి – గచ్ఛతి, ప్రసరతి**

అమృతరూపంలో ప్రవహింపచేయుటము, వాయురూపంలో శోషింప చేయటము అంటే ఎండింపచేయటము. ఈ రెండూ కూడా విష్ణుమూర్తి యొక్క విభూతులే.

అమృతరూపంలో స్రవించువాడై భగవానుడు స్కందుడు అనబడుతున్నాడు. భక్తజనుల నుద్ధరించటంకోసం పరమేశ్వరుడు అమృతస్వరూపంలో ప్రవహిస్తాడు కాబట్టి 'స్కందః' అనబడతాడు.

తన భక్తులను సజ్జనులను అమృతరూపంలో రక్షిస్తూ, దుర్జనులను వాయువు రూపంలో ఎండింపచేస్తాడు. సుబ్రహ్మణ్యస్వామికి 'స్కందుడు' అని పేరు

## 328. స్కందధరః

స్కందుని ధరించినవాడు. స్కందుడు అనగా సుబ్రహ్మణ్యుడు.

**స స్కందధర అభ్యాతః షడానన విధాగణాత్**

దేవతల సేనాపతి అయిన కుమారస్వామిని తన విభూతిగా ధరించినవాడు.

**స్కందం ధరతీతి స్కంద ధరః** దేవతల సేనాని కుమారస్వామిని తన విభూతిగ గలవాడు.

**భగవద్గీతలో**ని 10వ అధ్యాయము **'విభూతియోగము'**లోని 24వ శ్లోకం.

**పురోధసాంచ ముఖ్యం మాం విద్ధి పార్థ ! బృహస్పతిమ్ ।**
**సేనానీనామహం స్కంధః సరసామస్మి సాగరః ॥**

పురోహితులలో బృహస్పతిని, సేనాపతులలో కుమారస్వామిని, జలాశయములలో సాగరమును నేనే.

స్కందుడికి ఇంకొక పేరు కార్తికేయుడు. ఇతడు షణ్ముఖుడు. 12 చేతులు గలవాడు. శివుని కుమారుడు. దేవతలకు సేనాని. జగత్తులోని సేనాపతులందరిలోను ప్రసిద్ధుడు. అందుచేతనే భగవానుడు ఇతన్ని తన రూపముగా చెబుతున్నాడు.

స్కంద అనే శబ్దానికి మార్గము అని కూడా అర్థమున్నది. కాబట్టి స్కందధరః అంటే – ధర్మమార్గాన్ని నిలిపేవాడు అని అర్థం.

ధర్మమార్గమును నిలుపుతాడు. కాబట్టి పరమేశ్వరుడు 'స్కందధరః' అనబడతాడు. పాడైపోతున్న ధర్మాన్ని సరిదిద్దేవాడు. ధర్మమార్గంలో చరించే భగవానుడు ఆ ధర్మాన్ననుసరించి సృష్టిస్థితి లయాలు నిర్వహిస్తుంటాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు స్కందధరుడు.

# 329. ధుర్యః

భారమును మోయువాడు.

**భువనం ధృతవాన్ ధుర్యోః** లోకముల భారము వహించువాడు.

**ధరం వహతీతి ధుర్యః** జగత్తుయొక్క భారము వహించువాడు.

ధురం అనగా – **సమస్త భూత జన్మస్థితి భంగ నిర్వహణ**

**లక్షణాం ధురం.** సమస్త జీవులయొక్క ఉత్పత్తి, స్థితి, సంహారములను నిర్వహించటాన్నే 'ధురం' అంటారు. ఈ రకమైన భారము వహిస్తాడు కాబట్టి 'ధుర్యః' అనబడతాడు.

సమస్త జీవులయొక్క సృష్టి స్థితి లయాలను ఏ తొట్రుపాటు లేకుండా నడిపించే భారము వహిస్తాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు 'ధుర్యః' అనబడుతున్నాడు.

# 330. వరదః

వరములనిచ్చేవాడు.

**వరదోఽభీష్టదః స్మృతః** లోకాలు పాలించే దేవతలకుకూడా వరముల నిచ్చువాడు.

**వరాన్ దదాతీతి వరదః** వరములిచ్చేవాడు కాబట్టి పరమేశ్వరుడు వరదుడు అనబడతాడు.

భక్తులకు కావలసిన కోరికలు తీరుస్తాడు. **గౌర్వైవరః** గోవే వరము. యజ్ఞ సమయంలో యజమాని ఋత్విక్కులకిచ్చే దక్షిణ ఇక్కడ గోవే – దక్షిణ. యజ్ఞము

విష్ణుస్వరూపము అని గతంలో చెప్పాం. శ్రీమహావిష్ణువే యజమాని రూపంలో ఉండి భక్తులకు గోరూపంలో దక్షిణ ఇచ్చేవాడు.

భక్తుల అభీష్టములు తీర్చేవాడు. వారికి కావలసిన చతుర్విధపురుషార్థాలను ఇచ్చేవాడు. ఇహము, పరము. సాధకుని యోగ్యతను బట్టి వారికి కోరికలు తీర్చేవాడు.

## 331. వాయువాహనః

వాయువు వీచేటట్లు చేయువాడు. 856వ నామం కూడా ఇదే.

**జగత్ప్రాణం వహతి యో వాయువాహన ఉచ్యతే**

జగత్తుకు ప్రాణకారకమైన వాయువును ప్రవహింప చేయువాడు.

**వాయుం వాహయతీతి వాయువాహనః** గాలి వీచేటట్లుగా చేయువాడు.

వాయువు ఏడు రకాలుగా ఉంటుంది.

1. ఆవహుడు
2. ప్రవహుడు
3. అనువహుడు
4. సంవహుడు
5. వివహుడు
6. పరావహుడు
7. పరివహుడు వీటిని సప్తవాయువులు అంటారు.

1. మేఘమండలానికి, భూమికిమధ్యసంచరించేది – ఆవహము.
2. మేఘమండలము, రవిమండలము నడుమ ప్రసరించేది – ప్రవహము.
3. రవి మండలము, చంద్రమండలము మధ్య ప్రసరించేది అనువహము.
4. చంద్రమండలము, నక్షత్రమండలము మధ్య ప్రసరించేది సంవహము.
5. నక్షత్రాలకు, గ్రహాలకు మధ్య చరించేది వివహము.
6. గ్రహమండలానికి, సప్తఋషిమండలానికి మధ్య సంచరించేది పరావహము.
7. సప్తఋషులకు, ధ్రువమండలానికి మధ్య చరించేది పరివహము.

ఈ రకంగా ఉన్న ఏడు రకాలైనగాలుల్నీ చలింపచేసేవాడు. కాబట్టి 'వాయువాహనః' అనబడుతున్నాడు.

అంటూ కూర్మావతార ఘట్టాన్ని పూర్తిచేశాడు రత్నాకరుడు.

# 27. వాసుదేవుడు

"గురువుగారూ ! శ్రీమహావిష్ణువే వాసుదేవుడు. అతడే పరమేశ్వరుడు. మరి అతడు తన భక్తులను ఏ రకంగా రక్షిస్తాడో వివరించండి" అన్నాడు కృష్ణశర్మ. వివరించటం ప్రారంభించాడు రత్నాకరుడు.

వాసుదేవుడు అంటే వసుదేవుని కుమారుడు అనేకాదు. సకల జీవకోటిని తనయందు వసింపచేయగలవాడు కాబట్టి 'వాసు' అని, ప్రకాశించేవాడు కాబట్టి దేవుడు అని మొత్తంమీద వాసుదేవుడు అంటే జగత్తులోని జీవరాశిని అంతటినీ తనయందు వశింప చేస్తూ, ప్రకాశించేవాడు అని అర్థం. సూర్యుడు తన కిరణములతో జగత్తును ఆక్రమించి ఉంటాడు. అన్నింటియందు అంతర్యామిగా ఉంటూ, అన్నింటికీ రక్షణ కల్పిస్తాడు. అతడు జగత్తంతా వ్యాపించదగిన, పెద్ద పెద్ద కిరణ సముదాయము గలవాడు. ఈ జగత్తులో ఆది అనాది అయినవాడు అతడే. అతనినుంచే బ్రహ్మ, రుద్రుడు, ఇంద్రుడు, అగ్ని, సూర్యుడు, చంద్రుడు, సప్తఋషులు, ఇతర దేవతలు ఉద్భవించారు. వేదాలు, వేదాంగాలు కూడా అతని నుంచే ఉద్భవించినాయి. అతడు ఆర్తత్రాణ పరాయణుడు. తన భక్తులను ఎల్లప్పుడూ రక్షిస్తూ ఉంటాడు. తారకాసురుని కుమారులు త్రిపురాసులు చెలరేగి లోకాలను పీడిస్తున్నప్పుడువారిని సంహరించాడు. భక్తులయొక్క అజ్ఞానాన్ని నాశనం చేస్తాడు. అజ్ఞానం వల్లనే శోకం కలుగుతుంది. కాబట్టి వారికి జ్ఞానజ్యోతులు ప్రసాదించి, వారికి శోకనివృత్తి కలుగచేస్తాడు. రోగములు, శత్రువులు, దొంగలు మొదలైన ఆది భౌతికములయిన బాధలనుంచి రక్షణ కల్పిస్తాడు. తన భక్తులను భవబంధాలనుంచి విముక్తులను చేస్తాడు.

ధర్మసంస్థాపన కోసము అనేక అవతారాలెత్తాడు. అనేకమంది రాక్షసులను సంహరించాడు. అతడు శూరసేనుని మనుమడు. వసుదేవుని పుత్రుడు. రామావతార సమయంలో మునీశ్వరులంతా శ్రీరామచంద్రుని దివ్యసుందర విగ్రహం చూసి, ఒక్కసారి తనివితీరా కౌగిలించుకోవాలి అనుకున్నారు. వారి కోరిక తీర్చటానికి వారిని గోపికలుగా చేసి, తాను శ్రీకృష్ణుడుగా జన్మించాడు. ఈ రకంగా భక్తుల కోరికలు తీర్చటానికి సాక్షాత్తూ వైకుంఠాన్నే కదలించి తీసుకువచ్చాడు. లోకంలో అన్నింటినీ అధిగమించే ఐశ్వర్యము గలవాడు. అందరికీ ప్రభువు. తనభక్తులకు మాత్రం ఎప్పుడూ వసుడై ఉంటాడు. అవధులు లేని ఐశ్వర్య సంపన్నుడు అది అనర్హులకు చేరకుండా అడ్డుకట్టవేసి దాన్ని సద్వినియోగం చేస్తాడు. చేతిలో పద్మాన్ని ధరించి భక్తులకు జ్ఞానజ్యోతులు ప్రసాదిస్తుంటాడు. పద్మములతో సమానమైన కనులు గలవాడు. అతడు పద్మనాభుడు. హృదయాకాశము నందుండే

పద్మమునందుంటాడు. పద్మగర్భుడు. అన్నము రూపంలోగాని, ప్రాణరూపంలో గాని ఉండి జీవులయొక్క శరీరములు నిలుపుతాడు.

పరమేశ్వరుడికి గొప్పదైన బుద్ధి అంటే విభూతి, సంపద లేక శక్తి ఉన్నది. భక్తులయొక్క యోగక్షేమాలు విచారించటానికి అపారమైన శక్తి గలవాడు. భక్తులు సమృద్ధిగా ఉంటే తానుకూడా సమృద్ధిగా ఉంటాడు. దివ్యమైన ఆత్మ స్వరూపము గలవాడు.

వేదమయుడైన గరుడుని వాహనము గరుడ ధ్వజము గలవాడు అవటంచేత లోకంలో సాటిలేనివాడు. ఎవరైనా తన ఆజ్ఞను అధిగమించినట్లైతే శిక్షిస్తాడు. ఆ శిక్ష చాలా భయంకరంగా ఉంటుంది. అందుకే అతడు అతిభయంకరుడు. నియమము, కాలము, వ్రతము తెలిసినవాడు. భక్తులకు సంపదనిచ్చి, వారినుంచి హవిస్సులందుకుంటాడు. అతని హృదయస్థానమున మహాలక్ష్మి పాదముద్రలు ఉంటాయి. కాబట్టి సర్వత్ర శుభలక్షణాలు గలవాడు. లక్ష్మీదేవితో నిత్యము కూడి ఉండేవాడు. యుద్ధంలో అవలీలగా విజయం సాధించేవాడు. తన భక్తులమీదఉన్న ప్రేమ ఎన్నటికీ తరగనివాడు. ఎర్రని రంగుగలవాడు. తమ అభీష్ట సిద్ధి కోసం ఉపాసకులచే వెదకబడుతుంటాడు. సకలాభీష్ట సిద్ధికి కారణభూతుడు. దామమును ఉదరమునందు ధరించినవాడు. తన భక్తులు తనను ఇబ్బంది పెట్టినా సహిస్తాడు. అందరినీ ధరిస్తాడు. ఎవరు ఏంచేసినా ఓర్చుకుంటాడు. దుష్టశిక్షణ గావించి భూమిని ధరించినవాడు, మహాసౌభాగ్యము గలవాడు. అమితమైన వేగము గలవాడు. అమితంగా భుజించేవాడు ప్రళయకాలంలో జగత్తునంతా భుజించివేస్తాడు. త్రెంచి వేస్తాడు. మహాప్రళయం సంబవించిన తరువాత, మళ్ళీ సృష్టి జరగటానికి ప్రకృతిని, జీవులను క్షోభింపచేసినవాడు. జీవులను మాయతో బంధించి, వారికి కర్మానుసారము  వివిధ రూపాలనిచ్చి ఆనందిస్తాడు. లక్ష్మీదేవిని వర్ధిల్లచేస్తాడు. అందరికన్నా అధికుడు. అందరికీ ప్రభువు. భక్తులు తనను పొందటానికి చాలా తేలిక అయిన సాధనము అయినవాడు ఇంద్రియాలు భక్తుల ఇష్టానుసారము పనిచేసేటట్లు చేసేవాడు తన భక్తుల కర్మఫలాలను తానుకూడా అనుభవించేవాడు. భక్తులు కష్టసుఖాలు అనుభవిస్తుంటే వారితోపాటు తనుకూడా వికారము పొందేవాడు. అగోచరమైనవాడు. కంటికి కనుపించడు. కాని ఈ జగత్తును మాత్రం రక్షిస్తుంటాడు.

ఈ విషయాలన్నీ 332 నుంచీ 383 వరకు నామాలలో వివరించబడ్డాయి. ఇక నామాలను చూద్దాం.

# 332. వాసుదేవః

సర్వత్రా వ్యాపిస్తూ క్రీడించేవాడు. 695, 709 నామాలు కూడా ఇవే.

**సర్వభూతాన్ వాసయతి వాసుస్స పరికీర్తితః ।**
**దివ్ ధాతో రపిక్రీడా దృర్థకత్వాద్విశేషతః ॥**

**వాసుశ్చసౌ దేవశ్చేతి వాసుదేవః ప్రకీర్తితః ।**
**సర్వభూతే ష్వపి వసన్ స్వస్మిన్ భూతాని వాసయన్ ॥**

**యః క్రీడతి ముదా యద్వా వాసుదేవ స్స ఉచ్యతే ।**
**సర్వత్రాసౌ సమస్తం చ వసత్యత్రేతి వై యతః ॥**

**తత స్స వాసుదేవేతి విద్వద్భిః పరికీర్తితః ।**

సకల జీవులను తనయందు వసింపచేయగలవాడు కాబట్టి 'వాసు' అనబడుతున్నాడు. దేవుడు అనగా – క్రీడించువాడు, జయించగోరువాడు, ప్రకాశించువాడు, స్తుతించబడువాడు అని అర్థము.

కాబట్టి వాసుదేవుడు అంటే – జగత్తంతా వ్యాపించి ప్రకాశించేవాడు అని అర్థం.

ప్రాణులన్నింటియందు నివశిస్తూ, వాటితో ఆనందముగా క్రీడించేవాడు. తాను అన్నింటియందు ఉంటాడు. అన్నీ తనయందు ఉండేటట్లుగా చూస్తాడు. కాబట్టి వాసుదేవుడు అనబడుతున్నాడు.

**వాసుశ్చాసౌ దేవశ్చ వాసుదేవః** వాసుః అంటే సూర్యుడు. సూర్యుడు తన కిరణములచే ఆవరించినట్లుగా పరమేశ్వరుడు ప్రపంచమును ఆవరించి, దానిని తన యందు వశింపచేసి, దానియందు తాను వశించువాడు. దేవః అంటే – క్రీడించువాడు. వాసుదేవః అంటే చరాచర జగత్తంతా వ్యాపించి క్రీడించువాడు అని అర్థము.

ఆ పరమేశ్వరుడు అన్నింటియందు అంతర్యామిగా ఉంటాడు. అన్నింటినీ తనయందు వశింపచేసుకుంటున్నాడు. అన్నిటికీ రక్షణ కల్పిస్తున్నాడు. జగత్తుయొక్క సృష్టి స్థితిలయాది వ్యాపారము నిర్వహిస్తుంటాడు. దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేస్తుంటాడు. జగత్తులో జీవ రూపముగా ప్రకాశిస్తుంటాడు. అతడు స్వయం ప్రకాశకుడు. ఈ లక్షణాలన్నీ కలిగి ఉండటంచేతనే వాసుదేవుడు అనబడుతున్నాడు. **మహాభారతము**లోని శాంతిపర్వములో

**"ఛాదయామి జగత్సర్వం భూత్వా సూర్య ఇవాంశుభిః ।**
**సర్వభూతాది వాసశ్చ వాసుదేవ స్తుతః స్మృతః ॥**

నేను సూర్యుడు అయి కిరణములతో ఈ జగత్తును కప్పి వేస్తున్నాను. సర్వభూతములు అధి వశించు ఆశ్రయస్థానము కూడా అయి ఉన్నాను. అందుచేతనే తత్త్వజ్ఞులు నన్ను వాసుదేవుడు అంటారు." అని చెప్పబడింది. ఉద్యోగపర్వములో

**వాసనాత్ సర్వభూతానాం వసుత్వాద్ దేవయోనితః ।**
**వసుదేవస్తతోవేద్యో యోగిభిస్తత్వ దర్శిభిః ॥**

సర్వభూతాలను కప్పివేయుటవలన, దేవతలకు మూలస్థానమవటం వల్లను, అతడు వాసుదేవుడనబడుతున్నాడు. **విష్ణుపురాణంలో**

**సర్వత్రాఽసౌ సమస్తం చ వసత్యత్రేతి వైయతః ।**
**తతః స వాసుదేవేతి విద్వద్భి పరిపఠ్యతే ॥** అన్నింటియందు అతడు ఉంటాడు. అతనియందు సమస్తము ఉంటాయి. అందు వలన ఇతడు వాసుదేవుడు అనబడుతున్నాడు.

**సర్వాణి తత్ర భూతాని వసంతి పరమాత్మని ।**
**భూతేషు చ స సర్వాత్మా వాసుదేవస్తతః స్మృతః ॥**

ఈ పరమాత్మ యందు సర్వమూ ఉన్నాయి. అలాగే అన్నింటియందు ఇతడున్నాడు. అందుకే అతడు వాసుదేవుడు.

## 333. బృహద్భానుః

గొప్ప కిరణములు గలవాడు.

**బృహంతో భానవోయస్య స బృహద్భాను రుచ్యతే ॥** అంతటా వ్యాపించిన కిరణములు గలవాడు.

**బృహంతః భానవః యస్యసః బృహద్భానుః** జగత్తంతా వ్యాపించిన కిరణ సముదాయము గలవాడు. పెద్దవైన కిరణములు గలవాడు.

**బృహంతో భావనోయస్య చంద్రసూర్యాదిగామినః**
**తైర్విశ్వం భాసయతియః స బృహద్భాను రుచ్యతే**

చంద్రసూర్యులను కూడా చేరునటువంటి పెద్ద కిరణములు కలిగి, వాటిచేతనే ఈ విశాల విశ్వమును భాసింపచేయువాడు.

ప్రకాశవంతమైన తన కిరణాలతో ఈ విశ్వాన్ని ప్రకాశింపచేసేవాడు. సూర్య చంద్ర గతమైన తన ప్రకాశము చేతనే ఈ జగత్తును ప్రకాశింపచేయువాడు.

సృష్టికి పూర్వము మానవాకారములో ఉండే నారాయణ స్వరూపము ఒకటే ఉండేది. దానినుంచే సూర్యుడు, చంద్రుడు, అగ్ని, నక్షత్రాలు, బ్రహ్మ, రుద్రుడు, ఇంద్రుడు, సప్తఋషులు, సమస్త దేవతలు ఉద్భవించారు. అతనినుండే ఈ జగత్తు ఉద్భవించింది. అతనియొక్క కాంతిచేతనే చంద్రసూర్యాగ్నులు ప్రకాశిస్తున్నారు. ఈ జగత్తు ప్రభవిల్లుతున్నది.

ఆ పరమేశ్వరుడు ఒక పెద్ద జ్ఞానజ్యోతి. అతని శరీరమునుండి వందలు, వేలు, లక్షలు, కోట్లు, కోటానుకోట్ల కొలది కిరణములు ప్రసరిస్తున్నాయి. అందులో అగ్ని 108, సూర్యుడు 176, చంద్రుడు 136 కిరణములను మాత్రము తీసుకోగలిగారు. ఈ కిరణముల చేతనే అంటే పగటిపూట సూర్యుని వెలుగులతో, రాత్రిపూట చంద్రునికాంతులతో, సంధ్యవేళలయందు అగ్ని కాంతులతో ఈ జగత్తు ప్రకాశిస్తున్నది. అని **భైరవయామళము**లో చెప్పబడింది. ఈ విషయాన్ని గతంలో వివరించాం.

**ఈశావాశ్యోపనిషత్తు**లో అర్చిరాది మార్గము వివరించబడింది. అందులో

బ్రహ్మరంధ్రం దగ్గర సాధన చేసిన యోగీశ్వరుని ప్రాణములు ఉత్క్రమింపవు. ఉత్క్రమించటము అంటే ఏదో ఒక నాడీమండలం గుండా బయటకు పోవటము. యోగీశ్వరుని ప్రాణాలు బ్రహ్మరంధ్రంగుండా బయటకుపోతాయి. బ్రహ్మలోకానికి తలవాకిలి సూర్యలోకము. అక్కడ బంగారుకాంతితో ప్రకాశిస్తున్న పరమేశ్వరుడుంటాడు. అప్పుడు సాధకుడు

**"హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపి హితం ముఖం**
**తత్త్వంపూషన్న పావృణు సత్యధర్మాయ దృష్టయే"**

ఓ పరమేశ్వరా ! నీ బంగారు బింబము బ్రహ్మలోకమార్గాన్ని మూతలాగా కప్పి ఉన్నది. దాన్ని గనక కొంచెం తొలగించినట్లైతే, ఆ కాంతిని కొద్దిగా ఉపసంహరించినట్లైతే నేను ఆ ద్వారాన్ని దర్శించగలుగుతాను." అంటూ ప్రార్థిస్తాడు.

**సూర్యోపనిషత్తు**లో ఎర్రని పద్మమునందున్నవాడు, సప్త అనే అశ్వమును పూనిన రథముగలవాడు, బంగారు వర్ణముగలవాడు, చతుర్భుజుడు, రెండుచేతులయందు పద్మములు, మరి రెండు చేతులయందు అభయవరదముద్రలు ధరించినవాడు, కాలపురుషుడు, అయిన సూర్యభగవానుడే పరమ పురుషుడు. ఈజగత్తుకు అతడే ఆత్మ. సూర్యునివల్లనే భూతములు పుడుతున్నాయి. సూర్యునివల్లనే యజ్ఞము, పర్జన్యుడు, అన్నము, ఆత్మ కలుగుతున్నాయి. అటువంటి సూర్యభగవానుడే ప్రత్యక్షదైవము. అతడే బ్రహ్మ, అతడే విష్ణువు. అతడే రుద్రుడు. అతడే ఋక్కు. అతడే యజస్సు, అతడే సామము.

అతడే అధర్వణవేదము, అతడే చందస్సు, అతనివల్ల వాయువు, భూమి, జలము, జ్యోతిస్సు, ఆకాశము కలుగుతున్నాయి.

ఆదిత్యుడే ఈ మండలాన్ని ప్రకాశింపచేస్తున్నాడు. ఆదిత్యుడే బ్రహ్మ. ఆదిత్యుడే అంతఃకరణ, అతడే మనస్సు. అతడే బుద్ధి, అతడే చిత్తము. అతడే అహంకారము. ఆదిత్యుడే ప్రాణము, అతడే అపానము, అతడే వ్యానము, అతడే ఉదానము. అతడే సమానము. ఆదిత్యుడే జ్ఞానేంద్రియాలు. ఆదిత్యుడు కర్మేంద్రియాలు. అటువంటి ఆదిత్యునికి నమస్కారము. ప్రకాశించే స్వభావము గలవాడు, విశ్వానికి ఆధారమైనవాడు అయిన ఆదిత్యునికి నమస్కారము. ఆ సూర్యునివల్లనే ప్రాణులు పుడుతున్నాయి. రక్షింపబడు తున్నాయి. సూర్యునియందే లయమవుతున్నాయి. లోకాలన్నింటినీ ప్రకాశింపచేయునట్టి ఆ సూర్య భగవానునికి నమస్కారము.” అని చెప్పబడింది. కాబట్టి ఈ లోకాలన్నింటినీ ప్రకాశింపచేసేది ఆదిత్య రూపంలో ఉన్న పరబ్రహ్మస్వరూపుడైన శ్రీమన్నారాయణుడే. అందుకే అతడు ‘బృహద్భానుః’ అనబడుతున్నాడు.

## 334. ఆదిదేవః

మొదటగా ఉన్నవాడు. పరమేశ్వరుడు. 490వ నామము కూడా ఇదే.

**యః క్రీడతీత్యాది దేవః పాదాత్మక విభూతిభిః**

ఈ లోకాలలో సృష్టి స్థితిలయాది వ్యాపారాలతో ఆడుతూ ఉండేవాడు.

**ఆదిశ్చాసౌదేవశ్చ ఆదిదేవః**

ఈ లోకాలకు మూలకారణమై ఉండి సృష్టి స్థితి లయాదులచే క్రీడించువాడు.

**ఆదిః చ అసౌదేవః చ** సృష్టికి ఆదికారణమైనవాడు

**బృహదారణ్యకోపనిషత్తు**లో “సృష్టి ప్రారంభానికి పూర్వం మానవాకారంలో ఉన్న విరాడాత్మ మాత్రమే ఉండేది. అతనికన్న భిన్నమైనది ఏదీ లేదు. పురుషాకారంలో ఉన్న ప్రజాపతి తాను ఒక్కడే అయి ఉండి, ఒంటరితనంలోని ఆనందాన్ని భరించలేకపోయాడు. అందుచేత స్త్రీని కోరాడు. అలా కోరిన మరుక్షణమే స్త్రీ పురుషులు పరస్పరాలింగనం చేసుకున్నట్లుగా రూపుదాల్చాడు” అనిచెప్పబడింది.

**ఐతరేయోపనిషత్తు**లో ఆత్మయే ఆలోచనా పూర్వకంగా ఈ లోకాలను సృష్టించింది. సృష్టి జరగటానికి ముందు జగత్తంతా పరబ్రహ్మమయంగానే ఉండేది. దానికి భిన్నమైన పదార్థం ఏదీ లేదు. దాననే ఆత్మ అనికూడా అంటారు. ఆ ఆత్మయే లోకాలను సృష్టించాలి

అనుకున్నది. కొంతకాలానికి అంభస్సు, మరీచి, ఆసః అనే లోకాలను సృష్టించింది" అని చెప్పబడింది.

ఈ రకంగా అనేకచోట్ల చెప్పబడింది.

సృష్టి కార్యము ప్రారంభించినవాడై, ప్రకాశవంతుడైన పరమేశ్వరుడే ఆదిదేవుడు. ఈ చరాచర జగత్తుకు అతడే కారణభూతుడు. ఆది, మధ్య, అంతము లేనివాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు 'ఆదిదేవః' అనబడుతున్నాడు.

## 335. పురందరః

త్రిపురాసురులను నాశనము చేసినవాడు.

**పురందర ఇతిఖ్యాతః త్రిపురాణాం విదారణాత్** త్రిపురములను హరించినవాడు

**పురాణిదారయతీతి పురందరః** త్రిపురాసురుల యొక్క మూడు పురములను కూల్చివేసినవాడు. పుర అంటే - పురములను, దర అనగా - ధ్వంసము చేయువాడు.

దితికశ్యపుల కుమారుడు వజ్రాంగుడు. అతని భార్య వరాంగి. వీరి కుమారుడు తారకాసురుడు. బ్రహ్మవరప్రసాది. ముల్లోకాలను గడగడలాడించిన దానవేంద్రుడు. చివరకు ఉమా మహేశ్వరుల పుత్రుడు. దేవసేనాని అయిన కుమారస్వామి చేతిలో మరణించాడు. తారకాసురునికి ముగ్గురు కుమారులు. వారు 1) తారకాక్షుడు 2) కమలాక్షుడు, 3) విద్యున్మాలి. తారకుడు మరణించగానే, అతని భార్య కుమారులను తీసుకుని పాతాళానికి పారిపోయింది. అక్కడే వారినిపెంచి పెద్ద చేసింది. శుక్రాచార్యుని వద్ద విద్యాబుద్ధులు నేర్పించింది. బాలురు దినదినప్రవర్థమానమై సకలశాస్త్ర కోవిదులైనారు. తమ తండ్రి మరణ వృత్తాంతము తల్లివల్ల పూర్తిగా తెలుసుకున్నారు. తండ్రి మరణానికి కారణమైన దేవతల మీద పగ తీర్చుకోవాలని నిర్ణయించుకుని మేరు పర్వతం దగ్గర పరమేష్టిని గురించి పదివేల సంవత్సరాలు తపస్సు చేశారు. వారి తపస్సుకు మెచ్చి బ్రహ్మదేవుడు ప్రత్యక్షమై ఏ వరంకావాలో కోరుకోమన్నాడు. రాక్షస ప్రముఖులందరూ అడిగినట్లే చావు లేకుండా వరం కావాలి అన్నారు దానవులు. 'అది మాత్రం సాధ్యం కాదు. ఎందుచేతనంటే నాకే శాశ్వతత్త్వము లేదు. బ్రహ్మకల్పము పూర్తికాగానే నేను కూడా వెళ్ళిపోతాను. అట్టి నేను నాకు సాధ్యం కాని దాన్ని మీకెలా ఇవ్వగలను. ఇంకేదైనా వరం కోరుకోండి" అన్నాడు ఆలోచించారు తారకాసురుని పుత్రులు. "పరమేష్ఠి ! రథము కాని రథమెక్కి, విల్లు కాని విల్లు ధరించి, నారి కాని నారిని తొడిగి, బాణము కాని బాణము సంధించి,

ఒక్కదెబ్బతో చంపగల వీరుని చేతియందు తప్ప మాకు మరణం లేకుండా వరం ప్రసాదించు" అన్నారు. తథాస్తు అన్నాడు బ్రహ్మ. "విధాతా ! అంతేకాదు మేము ముగ్గరము నివసించటానికి సకల సదుపాయాలు కలిగి లోహనిర్మితమై, కామగమనం కల మూడు పురములు కావాలి. సకలైశ్వర్యాలకు, సకల భోగాలకు ఆ పురములు నెలవుగా ఉండాలి" అన్నారు. వారి కోరికలను అనుగ్రహిస్తూ "ఆ మూడు పురములు ఒకచోట ఎప్పుడూ కలియరాదు. అలా గనక కలిస్తే అవి నాశనమైపోతాయి' అన్నాడు బ్రహ్మ.

బ్రహ్మవలన వరాలు పొంది, విశ్వకర్మను పిలిపించి గగన విహారం చేసే మూడు లోహపట్టణాలు నిర్మించమన్నారు త్రిపురాసురులు నిర్మించాడు విశ్వకర్మ. వాటిలో ఎక్కి తలో దిక్కుకూ బయలుదేరారు తారకుని కుమారులు. ఈ రకంగా గగన విహారం చేస్తూ భూలోకంలోని పట్టణాల మీద వాటిని ఒక్కసారిగా దించేవారు. దాంతో ఆ పట్టణాలు, జనావాసాలు సర్వనాశనమై పోయేవి. అమితానందంతో మళ్ళీ పైకి ఎగిరిపోయేవారు రాక్షసులు. ఈ రకంగా ఆ రాక్షసులు త్రిపురములలో సంచరిస్తున్నారు కాబట్టి 'త్రిపురాసురులు' అని పిలువబడ్డారు.

త్రిపురాసురుల ఆగడాలు మితిమీరి పోతున్నాయి. దేవతలు, మునులు, ఋషులు, సాధువులు, సజ్జనులు ఉన్నచోట ఆ పురములను దింపి ఆ ప్రదేశాలను నాశనం చేస్తున్నారు. జననష్టం కలిగిస్తున్నారు. మహర్షులు. దేవతలు అంతా కలిసి బ్రహ్మ వద్దకు పోయి త్రిపురాసురుల దౌర్జన్యాన్ని వివరించారు. బ్రహ్మ వారందరితో కలిసి శ్రీహరిని సమీపించి తారకాసురుని కుమారులు లోకాలను పీడిస్తున్నారని, లోకాలను రక్షించమని వేడుకున్నారు. అప్పుడు శ్రీమహావిష్ణువు వారితో "దేవతలారా! మహర్షులారా ! త్రిపురాసురులు రాక్షసులన్నది నిజమే కాని వారు శివభక్తులు. వేదవేదాంగవిదులు, నిత్యాగ్నిహోత్రములను నిర్వర్తిస్తారు. వైదిక కర్మలను శాస్త్రానుసారము ఆచరిస్తారు. కాబట్టి వారనిచంపటము ఏ మాత్రము వీలుకాదు. కాబట్టి వారిని వంచించి, ధర్మమార్గము నుండి తప్పించి అంతమొందించాలి. దీనికి ఒక ఉపాయమున్నది.

బౌద్ధమతాన్ని సృష్టించి, శిష్యప్రశిష్యులతో త్రిపురములయందు సభలను ఏర్పాటు చేసి బౌద్ధమత ప్రచారము కావించండి. నేను సమయం చూసి వారిని సంహరిస్తాను" అన్నాడు.

దేవతల వ్యూహము ప్రకారము త్రిపురములయందు బౌద్ధమతము బాగా ప్రచారము పొందింది. సృష్టి అంటే స్త్రీ పురుష సంయోగము. వర్ణ వ్యవస్థ, ఆచార వ్యవహారాలు, నియమనిష్ఠలు మానవ కల్పితాలు. దేవుడనే వాడు లేడు. కర్మలకు అర్థం లేదు. వేదాలు

కొందరు స్వార్థపరులు వ్రాసుకున్న గ్రంథాలు. ఈ రకమైన ప్రచారము త్రిపురాసురులకు కూడా నచ్చింది. వారికి వినాశకాలం దాపురించింది. విపరీత బుద్ధులు పుట్టినాయి. అప్పటిదాకా వల్లె వేసిన వేదాలు పనికిమాలిన వయినాయి. నియమనిష్టలు గంగలో కలిసి పోయినాయి. వావి వరుసలు లేవు. వర్ణ వ్యవస్థ లేదు. ధర్మము భ్రష్టు పట్టిపోయింది. కర్మలు గాలిలో కలిసిపోయాయి. ఈ అదను కోసమే వేచి ఉన్నారు దేవతలు.

విష్ణుమూర్తి నాయకత్వములో పినాకపాణి దగ్గరకు పోయి త్రిపురాసురులను సంహరించి లోకాలను రక్షించమని వేడుకున్నారు. బ్రహ్మ వరం ఇచ్చినట్లుగానే

| | | | | | |
|---|---|---|---|---|---|
| భూమి | - | రథము | బ్రహ్మదేవుడు | - | సారధి |
| రవి, చంద్రులు | - | రథచక్రాలు | మేరుపర్వతము | - | విల్లు |
| నాల్గు వేదములు | - | హయములు | శ్రీహరి | - | శస్త్రము |

ఈ రకంగా రథమెక్కి పరమేశ్వరుడు త్రిపురాసురుల మీద యుద్ధం ప్రకటించాడు. పాశుపతాస్త్రాన్ని సంధించి త్రిపురాసురులను వధించాడు. మూడు పురములూ కూడా బూడిదరాసులై పోయినాయి.

ఈ రకంగా త్రిపురాలను నాశనం చేశాడు కాబట్టి 'పురందరుడు' అనబడుతున్నాడు.

పురము అంటే శరీరము. గతజన్మలో చేసిన కర్మఫలాన్ననుసరించి జీవి ఉత్తరజన్మలు ఎత్తుతున్నాడు. **ఐతరేయోపనిషత్తు**లో చెప్పినట్లుగా మానవదేహము, ఇంద్రియాలు, ఇంద్రియాధి దేవతలను సృష్టించిన తరువాత ఆ దేహంలో తాను ప్రవేశించాలి అనుకున్నాడు. అందుకు రెండే మార్గాలు. ఒకటి క్రింద నించి రెండవది పై నుంచి క్రింది ప్రవేశించటము సేవకా ధర్మము కాబట్టి బ్రహ్మరంధ్రం ద్వారా ప్రవేశించాలి అనుకున్నాడు. ప్రవేశించాడు. ఈ విధంగా పరమాత్మ మానవ దేహంలో ప్రవేశించి దశేంద్రియాలతోను, నవరంధ్రాలతోను ప్రాపంచిక సుఖాలనుభవిస్తూ బయటకు పోయే మార్గం తెలియక, పంజరంలో బంధించబడిన పక్షిలాగా శరీరములో బందీ అయిపోయాడు.

అటువంటి జీవాత్మ బ్రహ్మ జ్ఞానము కలగగానే, పరబ్రహ్మ స్వరూపమయి పోతుంది. ఈ రకంగా జ్ఞానాన్ని ప్రసాదించే శ్రీమన్నారాయణుడే పురందరుడు.

## 336. అశోకః

శోకమును నాశనము చేయువాడు.

**అశోకః శోకమోహాది నాశకః పరికీర్తితః** భక్తులయొక్క దుఃఖము, అజ్ఞానము నాశనము చేయువాడు.

**న శోకః అశోకః** శోకము, మోహము, ఆకలి మొదలైన ఆధ్యాత్మిక విషయములను నశింపచేయువాడు.

**శోకాది షడూర్మి రహితః అశోకః** శోకము, మోహము, ఆకలి, దప్పిక, జర, మరణము, ఈ ఆరింటినీ 'షడూర్ములు' అంటారు. ఈ రకమైన షడూర్ములు లేనివాడు.

అసలు శోకము అనేది ఎందుకు వస్తుంది ? అజ్ఞానంవల్ల అంటే – శోకము అనేది రెండు కారణాలవల్ల వస్తుంది. 1. కోరుకున్నవి రాకపోవటంవల్ల 2. వచ్చినవి వదలక పోవటంవల్ల. మానవుడు ధనధాన్యాలు, భోగభాగ్యాలు, సిరిసంపదలను కోరుకుంటాడు. అవి గనక అతడికి దక్కకపోయినట్లైతే, అవి తనకు రాలేదని దుఃఖిస్తాడు. తను కోరుకున్నవి పొందలేకపోయానని బాధపడతాడు. అంతేకాదు తనకు పట్టిన పీడ వదల్లేదని బాధపడతాడు. దాన్ని వదలించుకునే మార్గం తెలియక దుఃఖిస్తాడు. ఈ రెండూ కేవలము అజ్ఞానంవల్లనే కలుగుతాయి. అటువంటి అజ్ఞానాన్ని పోగొట్టి జ్ఞానజ్యోతులు ప్రకాశింపచేసేవాడు. కాబట్టే శ్రీమన్నారాయణుడు 'అశోకః' అనబడుతున్నాడు.

## 337. తారణః

రక్షించువాడు

**యస్తారణ స్తారయతి వైరివ్యాద్యాది భౌతికః**

రోగములు, శత్రువలు మొదలైన భయముల నుండి తన భక్తులను రక్షించువాడు.

**తారయతీతి తారణః** ఆదిభౌతికములయిన శత్రువులు, రోగాలు, దొంగలు వంటి వాటి నుంచి రక్షించువాడు.

**సంసార సాగరాత్ తారయతి** సంసార సాగరమును దాటించువాడు. అనిత్యమైన సంసార సాగరంలో మునిగిన జీవి తనకు తానుగా ఒడ్డుకు చేరలేడు. ఈశ్వరానుగ్రహము ఒక్కటే అతన్ని రక్షిస్తుంది. సంసార సాగరంలో పడి దరి అంతు తెలియకుండా కొట్టుకుపోతున్న అతడికి శ్రీమన్నారాయణుడే రక్షకుడు. అందుచేతనే అతడు 'తారణః' అనబడుతున్నాడు.

## 338. తారః

తప్పించేవాడు

**తార స్సంసార భయతోనిత్యం తారయతీతి సః** భక్తులను భవబంధనాల నుండి రక్షించువాడు.

**తారయతీతి తారః** సంసార సాగరమునుంచి రక్షించువాడు.

**గర్భజన్మ జరామృత్యు లక్షణా ది భయాత్ తారయతి** గర్భవాసము, జన్మ, ముసలితనము, మృత్యువు వలన వచ్చే భయాన్ని నశింప చేసేవాడు.

**జన్మదుఃఖం జరాదుఃఖం జాయా దుఃఖం పునః పునః ।**
**సంసార సాగరం దుఃఖం తస్మాత్ జాగ్రత జాగ్రత ॥**

అసలు ఈ లోకంలో జన్మించటము అంటేనే చాలా కష్టం. మాతృగర్భంలో తలక్రిందులుగా వ్రేలాడుతూ ప్రాణాలు అరచేత్తో పట్టుకుని, మలమూత్రాలతో కలుషితమైన స్థితిలో శిశువుగా ఉండటంకన్న దురవస్థ ఇంకేదీ ఉండదు. క్రిమికీటకాలు కరుస్తూ ఉంటాయి. ఆకలి వేస్తుంది. వత్తి గిల్లటానికి, ప్రక్కకు తిరగటానికి వీలుండదు. ఈ రకంగా పదినెలలు గడవాలి. కల్పాంతం అంటే దాదాపు 42 కోట్ల సంవత్సరాలైనా నరకం అనుభవించవచ్చు గాని, ఒక్కగంట కూడా గర్భవాసం అనుభవించలేము. గర్భం నుండి బయటకు రావటంకూడా భరించరాని బాధ. భూమిమీద పడ్డప్పటినుండి బాల్యయవ్వన కౌమారాది అవస్థలు. వీటిలో కడు దుర్భరమైంది ముసలితనం కళ్ళు కనపడవు. చెవులు వినపడవు. తిరగలేడు. కూర్చోలేడు. పడుకోలేడు. తన పనులు తాను చేసుకోలేడు. అన్నింటికీ ఇంకొకరిమీద ఆధారపడాలి. పిల్లలు విసుక్కుంటారు. కడుదయనీయమైన స్థితి ఆ తరువాత మృత్యువు. అది ఏ రూపంలో వస్తుందో తెలియదు. మహాత్ములకు మాత్రం అనాయాస మరణం లభిస్తుంది. పాపాత్ములు నీచమైన చావు చస్తారు. ఆ సమయంలో శరీరంలోనుంచి ప్రాణాలు ఒక్కసారిగా బయటకు పోవు. జీవి ఈ శరీరాన్ని వదిలి పెట్టటానికి ఇష్టపడడు. చివరకు శరీరమునుంచి గెంటి వేయబడతాడు.

ఈ రకమైన భయాలు పోవాలంటే భగవన్నామస్మరణ ఒక్కటే మార్గం. ఆ పరమేశ్వరుని ఆరాధించిన వారికి పునర్జన్మ ఉండదు. ఈ రకంగా సంసారిక బాధలను తొలగించేవాడు కాబట్టే శ్రీమన్నారాయణుడు 'తారః' అనబడుతున్నాడు.

## 339. శూరః

జయశీలుడు

**విజిగీషుతయాజైత్రః సమర్థశ్శూర ఉచ్యతే** జయించు కోరికగలవాడవటం చేత సమర్థుడైన శూరుడు, జయశీలుడు అనబడుతున్నాడు. పురుష ప్రయత్నమైన విక్రమము లేక పరాక్రమము ప్రదర్శించటంలో సమర్థుడు.

**విక్రమణాత్ సూరః** పరాక్రమ విశేషము కలిగి శూరుడు అనబడుతున్నాడు. అపజయమనేది ఎరగనివాడు.

శ్రీమన్నారాయణుడు ధర్మసంస్థాపన కోసం అనేక అవతారాలెత్తాడు. అనేకమంది రాక్షసులను సంహరించాడు. అందుచేతనే అజేయ పరాక్రముడు అని పిలువబడ్డాడు.

బాహ్యాశత్రువులే కాదు. అంతః శత్రువులను కూడా జయించినవాడు. అరిషడ్వర్గాలే అంతశ్శత్రువులు. అటువంటి కామక్రోదాదుల జయించినవాడు. నేను, నాది అనే అహంకరా మమకారాలు లేనివాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'శూరః' అనబడుతున్నాడు.

## 340. శౌరిః

శూరసేనుని మనుమడు (కృష్ణుడు) 644వ నామం కూడా ఇదే.

**శూరస్య వసుదేవస్య యోఽసత్యం శౌరి రుచ్యతే**

మాధుర్యము, శూరసేనము అనే దేశాలను పాలించినవాడు శూరసేనుడు. మధురా నగరము ఇతని రాజధాని. ఇతని కుమారుడు వసుదేవుడు. వసుదేవుని పుత్రుడు కృష్ణుడు.

**శూరస్య వసుదేవస్య అపత్యం శౌరిః** శూరుడయిన వసుదేవుని పుత్రుడు. దేవకీ వసుదేవులకు జన్మించగానే తన మహిమను చూపినవాడు.

**శూరస్యా ఽపత్యం వసుదేవస్య సుతః శౌరి** శూరసేనుని మనుమడు. వసుదేవుని కుమారుడు శ్రీకృష్ణుడు.

అధర్వణ వేదాంతర్గతమైన **కృష్ణోపనిషత్తు**లో శ్రీకృష్ణావతార కారణము వివరించబడింది.

**ప్రథమః ఖండః**

**ఓం శ్రీ మహావిష్ణుగ్ం సచ్చిదానంద లక్షణగ్ం రామచంద్రం దృష్ట్వా సర్వాంగసుందరం మునయో వనవాసినో విస్మితా బభూవు స్తగ్ం హోచుర్నో ఽ వద్యమవతారా న్వై గణ్యంతే ఆలింగామోభవంత మితి భవాంతరే కృష్ణావతారే యూయం గోపికాభూత్వా మా మాలింగథ, అన్యే యేఽవతారా స్తేహి గోపా నస్త్రీ శ్చ నో కురు, అన్యోన్యవిగ్రహం ధార్యం తవాంగస్పర్శనాదిహా, శశ్వత్స్పర్శయితాఽ స్మాకం గృహ్ణోమోఽవతారావయమ్, రుద్రాదీనాం వచ శ్రుత్వా ప్రోవాచ భగవాన్ స్వయమ్**

రామావతారంలో సర్వాంగసుందరుడైన రామచంద్రుని చూసి మునీశ్వరులందరూ "శ్రీరామచంద్రా ! నిన్ను ఆ లింగనముచేసుకునే భాగ్యము మాకు ప్రసాదించ వలసినది" అని వేడుకున్నారు. ఆ మాటలు విన్న రామచంద్రుడు "కృష్ణావతారంలో మీరు గోపికలుగా జన్మించండి. మీ కోరిక తప్పక తీరుతుంది" అన్నాడు. దానికి వారంతా గోపికలు, గోపాలురుగా జన్మించటానికి సంతోషంతో ఒప్పుకున్నారు.

**అంగసంగం కరిష్యామి భవద్వాక్యం కరోమ్యహమ్, మోదితాః తే సురాస్సర్వే కృతకృత్యా ధునావయమ్, యోనందః పరమానందో యశోదా మౌక్తిగేహినీ, మాయా సా త్రివిధా ప్రోక్తా సత్వ రాజస తామసీ, ప్రోక్తా చ సాత్వికీ రుద్రే భక్తే బ్రహ్మణి రాజసీ, తామసీ దైత్యవక్షేషు మాయా త్రేధా హ్యుదాహృతా, అజేయా వైష్ణవీ మాయా జప్యేన సాఽజితాపురా, దేవకీ బ్రహ్మపుత్రా సా యా వేదై రుపగీయతే**

వారి అవతారాలు వరుసగా

| | | |
|---|---|---|
| నందుడు | – | పరమానందము |
| యశోద | – | ముక్తికాంత |
| మాయ మూడు రకాలు | | |
| బ్రహ్మదగ్గర ఉన్నది | – | రాజసమాయ |
| రుద్రునిదదగ్గర ఉన్నది | – | సత్వమాయ |
| దైత్యులదగ్గరున్నది | – | తామస మాయ |
| వైష్ణవమాయ అజేయమైనది. | | |
| వేదములచే చెప్పబడే బ్రహ్మపుత్రిక | – | దేవకి |

**నిగమో వసుదేవో యా వేదార్థః కృష్ణరామయోః, స్తువంతి సతతం యన్మే సోవతీర్ణో మహీతలే, వనే బృందావనే క్రీడ గోపగోపీసురైస్సహ, గోప్యోగావ ఋచస్తస్య యష్టి కా కమలాసనః, వంశస్తు భగవాన్రుద్ర శృంగ మింద్రస్సఖానురః, గోకులవనం వైకుంఠం తాపసా స్తత్ర తే ద్రుమాః, లోభ క్రోధభయాదైత్యాః కలికాల స్తిరస్కృతః, గోపరూపో హంస్సాక్షా న్మాయావిగ్రహధారణః**

| | | | | | |
|---|---|---|---|---|---|
| వేదము (నిగమము) | – | వసుదేవుడు | బ్రహ్మ | – | వాటిని కట్టేసే కర్ర |
| వేదార్థము | – | కృష్ణుడు | రుద్రుడు | – | వెదురుకర్ర |
| ఋక్కులు | – | గోపికలు, గోవులు | ఇంద్రుడు | – | శిరస్సు |

| | | | |
|---|---|---|---|
| దేవతలు | - స్నేహితులు | రాక్షసులు | - క్రోధము, లోభము, భయము |
| గోపకులము | - వైకుంఠము | తిరస్కరింపబడువాడు | - కవి |
| అక్కడి చెట్లు | - మహర్షులు | శ్రీకృష్ణుడు | - సాక్షాత్తు శ్రీ మహావిష్ణువు |

**దుర్బోధం కుహకం తస్య మాయయా మోహితం జగత్, దుర్జయా సా సురై స్సర్వై ర్వృష్టిరూపో భవద్విధిః రుద్రోయేన కృతోవంశ స్తస్య మాయా జగత్కథమ్, బలం జ్ఞానగ్ం సురాణాంవై తేషాం జ్ఞానగ్ం హృతం క్షణాత్, శేష నాగో భవేద్రామః కృష్ణో బ్రహ్మైవ శాశ్వతమ్, అష్టావష్టసహస్రే ద్వే శతాధికాః స్త్రియ స్తథా**

ఈ రకంగా వైష్ణవమాయ ఆవిర్భవించింది. ఆ మాయను జయించటం ఎవరికీ శక్యం కాదు. ఆ మాయవల్లనే రుద్రుడు కర్రరూపం దాల్చాడు. దేవతల జ్ఞానము, బలము క్షణంలో హరించి వేయబడినాయి. ఆదిశేషుడే బలరాముడు. శ్రీకృష్ణుడు- సత్యము నిత్యము అయిన పరబ్రహ్మ.

**ఋచోపనిషద స్తావై బ్రహ్మరూపా ఋచః స్త్రియః, ద్వేష శ్చాణూరమల్లోఽయం మత్సరో మష్టికోఽజయః, దర్పః కువలయాపీడో గర్వోరక్షః ఖగో బకః, దయా సా రోహిణీ మాతా సత్యభామా ధరేతివై, అఘాసురో మహావ్యాధిః కలిః కగ్ంస స్సభూవతిః, శమో మిత్ర స్సుదామాచ సత్యా క్రూరోద్ధవో దమః**

| | | | |
|---|---|---|---|
| ఋక్కులు, ఉపనిషత్తులు | - స్త్రీలు | సత్యభామ | - భూదేవి |
| చాణూరమల్లుడు | - ద్వేషము | అఘాసురుడు | - మహావ్యాధి |
| ముష్టికుడు | - మత్సరము | కంసుడు | - కలిపురుషుడు |
| కువలయ పీడనము (ఏనుగు) | - దర్పము | సుదాముడు | - శమము |
| బకాసురుడు | - గర్వము | అక్రూరుడు | - సత్యము |
| రోహిణీమాత | - దయ | ఉద్ధవుడు | - దమము |

**యశ్శం ఖస్స స్స్వయం విష్ణు ర్లక్ష్మీరూపో వ్యవస్థితః, దుగ్ధసింధౌ సముత్పన్నో మేఘ ఘోషస్తు సంస్కృతః దుగ్ధోదధీకృత స్తేన భగ్నభాండో దధిః గృహే, క్రీడతే బాలకోభూత్వా పూర్వవచ్చ మహోదధౌ, నగ్ంహారార్థంచ శత్రూణాం రక్షణాయచ సంస్థితః, కృపార్థే సర్వభూతానాం గోప్తారం ధర్మమాత్మజమ్**

పాలసముద్రంలో పుట్టిన మేఘధ్వని గల శంఖము - లక్ష్మీరూపమైనవిష్ణువు.

పాలకుండలు - పాలసముద్రం

శ్రీమహావిష్ణువు బాలుడై పాలసముద్రములో క్రీడించాడు. శత్రువుల సంహరించటానికి, మిత్రుల రక్షించటానికి, ధర్మరక్షణకు, అన్ని జీవులయందు దయ చూపటానికి శ్రీమహావిష్ణువు కృష్ణుడుగా అవతరించాడు.

**యత్సృష్ట మీశ్వరేణాసీత్తచ్చక్రం బ్రహ్మరూపధృత్, జయంతి సంభవో వాయు శ్చమరోధర్మ సంజ్ఞితః, యస్యాసౌ జ్వలనా భాసం ఖడ్గరూపో మహేశ్వరః, కశ్యపోలూఖలః ఖ్యాతో రజ్జుర్మాతాஉదితి స్తథా, చక్రగ్ం శంఖంచ సగ్ంసిద్ధిం బిందుం వై సర్వమూర్ధని, యావంతి దేవరూపాణి వదంతి విబుధా జనాః, నమంతి దేవరూపేభ్య ఏవ మాది నసగ్ంశయః, గదాచ కాళికా సాక్షాత్సర్వశత్రు నిబర్హిణీ, ధనుశ్శార్ఙ్గం స్వమాయాచ శరత్కాల స్సుభోజనః, అబ్జకాండం జగద్బీజం ధృతం పాణౌ స్వలీలయా, గరుడో వటభాండీర స్సుదామా నారదో మునిః, బృందాచక్తిః ప్రియాబుద్ధిః సర్వజంతు ప్రకాశినీ, తస్మాన్నభిన్నం నాభిన్నమాభి ర్భిన్నో నవై విభుః భూ పుత్తారితం సర్వం వైకుంఠం స్వర్గవాసిన మిత్యుపనిషత్**

| | | | |
|---|---|---|---|
| బ్రహ్మయే | – చక్రము | విష్ణుమాయ | – శార్ఙ్గవమనే ధనుస్సు |
| అక్కడి వాయువు | – చామరము | శరత్కాలమే | – భోజనము |
| మహేశ్వరుడు | – ఖడ్గము | తామరకాడ | – జగద్బీజము |
| కశ్యపుడు | – రోలు | గరుడుడు | – వటవృక్షము |
| అదితి | – త్రాడు | బృందాదేవి | – భక్తి |
| కాళిక | – గద | | |

ఈ రకంగా పరమేశ్వరుని కన్న ఏవీ భిన్నమైనవి కాదు. సాక్షాత్తూ వైకుంఠమే భూమికి దిగి వచ్చింది.

ఈవిధంగా దేవకీ వసుదేవుల గర్భాన జన్మించిన శ్రీమన్నారాయణుడు పుట్టీ పుట్టగానే తల్లిదండ్రులకు మహిమలు చూపాడు. అందుచేతనే అతడు 'శౌరిః' అనబడుతున్నాడు.

## 341. జనేశ్వరః

జనులకు ఈశ్వరుడు.

**ప్లవనోజ్జ్వల నైశ్వర్య మహౌఘస్స్వోజ్జనేశ్వరః** అన్నింటినీ అధిగమించే తేజస్సు, ఐశ్వర్యము గలవాడు కావటంచేత జనులందరికీ ప్రభువు.

**జనానాం ఈశ్వరః జనేశ్వరః** అన్నింటినీ మించిన ఐశ్వర్యముగలవాడు కాబట్టి జనేశ్వరుడు అనబడతాడు.

జనులకు అంటే ప్రాణులకు అని అర్థం తీసుకోవాలి.

సర్వప్రాణులకు ఈశ్వరుడు. కాబట్టి జనేశ్వరుడు సకలైశ్వర్య గుణసంపన్నుడు, ఎవరి సహాయం లేకుండానే, ఏ పనినైనా చేయగల సమర్థుడు. అందుచేతనే శ్రీ మహావిష్ణువు 'జనైశ్వరః' అనబడుతున్నాడు.

## 342. అనుకూలః

భక్తులకు వశుడు.

**స్వభావతో మహత్త్వేఽపి మద విస్మయ వర్జనాత్**
**భక్తైక ప్రవణో నిత్యం అనుకూల ఇతి స్మృతః**

సహజమైనటువంటి మహత్త్వము కలిగి ఉండికూడా ఆ పరమేశ్వరుడు మదము, గర్వము లేనివాడు. అందుచేత భక్తులకు వశుడు.

**వీర్యవాన్ న చ వీర్యేణ మహతా స్వేన విస్మతః**

వీడు మహావీరుడు అయికూడా తన వీరత్వానికి గర్వపడడు.

**హస్తావలంబకోహ్యేకః భక్తిక్రీతో జనార్దనః**

పరమేశ్వరుడైన జనార్దనుడు భక్తితో మాత్రమే వశుడవుతాడు.

**సర్వేషాం ఆత్మత్వాత్ - అనుకూలః** అన్ని ప్రాణులకు ఆ పరమేశ్వరుడే ఆత్మ. అందుచేత అతడు అన్ని ప్రాణులకు అనుకూలుడు. మనలో ఏ విధమైన భావము రేకెత్తినప్పటికీ, దానిని ప్రకాశింపచేసేది ఆ పరమేశ్వరుడే, అందుకే అతడు అందరికీ అనుకూలుడు.

## 343. శతావర్తః

నూరు సుడులు గలవాడు.

**ఐశ్వర్య జృంబితాభిఖ్యాః ఆవర్తా యస్య నిత్యశః**
**శతం సంతిశతావర్తః వస్వర్ణో భుక్తిముక్తిదః**

ఐశ్వర్య విజృంభణము అనే సుడిగుండాలు అనేకము గలవాడు.

ఈ నామాన్ని మంత్రంగా జపిస్తే భుక్తిని ముక్తిని ప్రసాదిస్తుంది.

**శతన్ ఆవర్తాః యస్యసః శతావర్తః**

అవధులు లేని ఐశ్వర్యము హద్దు మీరకుండా అడ్డగించటంచేత, ఆ ప్రవాహము అటు ఇటు పోయేదారి లేక పరవళ్ళు త్రొక్కుతూ, సుళ్ళు తిరుగుతూ ఉంటుంది.

పరమేశ్వరుడు మహదైశ్వర్య సంపన్నుడు. ఆ ఐశ్వర్యాన్ని ఒక పద్ధతిలో భక్తులకు అందచేస్తాడు. అది త్రోవ తప్పి అనర్హులను చేరకుండా అడ్డు కట్ట వేశాడు. ఈ రకంగా మహదైశ్వర్యము ప్రవహించే త్రోవ సన్ననవటంవల్ల, ఆ ప్రవాహము వేగము పెరిగి, పరవళ్ళు త్రొక్కుతూ, సుడులు తిరుగుతూ ఉంటుంది. అందుచేతనే శ్రీమన్నారాయాణుడు 'శతావర్తః' అనబడుతున్నాడు.

**ధర్మరక్షణార్థాయ శతం ఆవర్తనాని యస్య** ధర్మాన్ని రక్షించటం కోసం అనేక అవతారాములెత్తిన వాడు. శతాదిక కల్యాణ గుణసంపన్నుడు

సకలనాడుల యందు ప్రాణరూపంలో ఉంటాడు. పూర్ణావతారాలే కాకుండా అంశావతారులుగా గాని ఇతరములుగా గాని జన్మించువాడు.

పరమేశ్వరుడు జ్ఞానస్వరూపుడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'శతావర్తః' అనబడుతున్నాడు.

## 344. పద్మీ

లీలారవిందము గలవాడు.

**లీలా పద్మధరో నిత్యం పద్మీతి పరికీర్త్యతే ॥** విలాసం కోసము ఎల్లకాలమునందు చేతిలో పద్మాన్ని ధరించేవాడు.

**పద్మమ్ నిత్యమ్ అస్యాస్తీతి పద్మీ ॥** తన లీలారవిందములతో ప్రతినిత్యము ప్రకాశించేవాడు.

ఈ భగవానుని చేతియందు పద్మమున్నది.

పద్మమనేది జ్ఞానానికి చిహ్నాము. మనచేతులు చాల చిన్నవి అవి భగవానుని చేరలేవు. కాని భగవంతుని చేతులు చాలా పెద్దవి. ఎక్కడికైనా వెళ్ళగలవు. అందుచేత శ్రీమహావిష్ణువు 'పద్మీ' అనబడుతున్నాడు.

## 345. పద్మనిభేక్షణః

పద్మములవంటి కనులు గలవాడు.

**స్వచ్ఛాంబుజాత సదృశ మీక్షణం శ్రీమహారి చ ।**
**యస్యాప్తి భక్తరక్షకాయాం స స్యాత్పద్మవిభేక్షణః ॥**

భక్తులను రక్షించేవాడు, ఈ రక్షణలో సంసార తాపాన్ని పోగొట్టేందుకు, మంచి నీటిలో ఉన్న తామరపువ్వులాంటివాడు.

**పద్మనిభమ్ ఈక్షణమ్ యస్యసః పద్మనిభేక్షణః**

భక్తులయొక్క శ్రమను తీర్చటానికి నిర్మలమైన పద్మమువంటివాడు.

అందమైన, స్వచ్ఛమైన పద్మాన్ని చూసినప్పుడు ఆ భక్తులు తమ శ్రమను మరచిపోతారు. ఈ రకంగా భక్తుల శ్రమను పోగొట్టేవాడు.

**పద్మనిభే ఈక్షణే అస్య** పద్మములతో సమానమైన కనులు గలవాడు. అనగా జ్ఞాననేత్రములు గలవాడు అని అర్థం. తన జ్ఞానదృష్టి ద్వారా భక్తులయొక్క అజ్ఞానాన్ని పటాపంచలు చేస్తాడు. సమదర్శనమే జ్ఞానదృష్టి.

**పండితాస్సమదర్శనః** పండితుడు (జ్ఞాని) అన్నింటినీ సమానమైన దృష్టితో చూడగలుగుతాడు. దృష్టి గనక జ్ఞానమయమైతే, సృష్టి అంతా బ్రహ్మమయంగా కనిపిస్తుంది. అప్పుడు దృష్టికి, సృష్టికి తేడా ఉండదు. అదే అద్వైతానుభూతి. అందుకే శ్రీమన్నారాయణుడు 'పద్మనిభేక్షణః' అనబడతాడు.

## 346. పద్మనాభః

పద్మము వంటి నాభి కలవాడు. 49, 196 నామాలు కూడా ఇదే.

**నాభిశ్చ పద్మవద్యస్య పద్మనాభ స్స ఉచ్యతే ॥** పద్మమును పోలిన నాభి కలవాడు.

**పద్మమివనాభిః యస్యసః పద్మనాభః** పద్మము వంటి నాభి గలవాడు.

**పద్మస్యనాభౌమధ్యే కర్ణికాయాంస్థితః** హృదయ పద్మముయొక్క నాభియందున్నవాడు.

**పద్మకోశ ప్రతీకాశగ్ం హృదయం చా ప్యధోముఖమ్** కంఠానికి క్రింది భాగంలో నాభికి పైభాగంలో పన్నెండు అంగుళాల ప్రమాణం కలిగి అధోముఖంగా, ముకుళించి ఉన్న పద్మమున్నది. ఆ పద్మమునందు మధ్య భాగంలో పరమేశ్వరుడున్నాడు. అతడే శ్రీమహావిష్ణువు. భక్తులయొక్క హృదయ పద్మములందు ప్రకాశిస్తాడు కాబట్టి పద్మనాభుడు అనబడుతున్నాడు.

# 347. అరవిందాక్షః

అరవిందములవంటి కనులు గలవాడు

**రక్తారవిందనయనస్త్వరవిందాక్ష ఈరితః** ఎర్ర తామరల వంటి కనులు గలవాడు.

**అరవిందే ఇవ అక్షిణి యస్యసః అరవిందాక్షః** తామరపూలవలె అందమైన కనులు గలవాడు.

**అరవింద సదృశే అక్షిణీ అస్య** పద్మములతో సమానమైన కనులు గలవాడు.

కమలములరేకులవంటి కనులు గలవాడు. పద్మము సూర్యోదయాన వికసించి, సూర్యాస్తమాన సమయానికి ముడుచుకుపోతుంది. అలాగే భగవంతుడు జ్ఞానులను చూచినప్పుడు వికశించి అజ్ఞానులను చూసినప్పుడు ముడుచుకుంటాడని భావము.

# 348. పద్మగర్భః

పద్మమున వశించువాడు.

**యోగిహృత్పుండరీకస్థః పద్మగర్భ స్స ఉచ్యతే ॥**

తనను ఉపాసించే రోగులయొక్క హృదయములందుండు వాడు.

**పద్మేన గౌర్యతే స్వాంతః అవస్థాప్యతే ఇతి పద్మగర్భః** మృదువైన పద్మాన్ని ఆసనంగా గలవాడు తన ఉపాసకుల హృదయాలలో నివసించేవాడు.

**పద్మస్య హృదయాఖ్యస్య గర్భే – మధ్యే – ఉపాస్యః** హృదయ పద్మము నడుమన ఉండువాడు.

హృదయ కమలము మధ్యభాగాన నివసించేవాడు. మానవ శరీరమే దేవాలయము. అందుకే ఆలయం వంటి దేహంలో హృదయ కమలము మధ్యన ఆసీనుడై ఉండువాడు.

**దహరం పుండరీకం వేశమ్** హృదయాకాశమున ఉన్న పద్మమునందుండువాడు. పంచకోశముల నడుమున ఉన్న ఆనందమయకోశమందు ఉన్నాడు పరబ్రహ్మ.

# 349. శరీరభృత్

శరీరమును పోషించువాడు.

**యోగిహృన్మధ్యకఞ్జస్థః స్వదేహం తంబిభర్తియః శరీర భృత్వ కథితః వస్వర్ణో భుక్తి ముక్తిదః**

యోగీశ్వరుల హృదయమునందు తన శరీరాన్ని శకింపచేయువాడు.

**శరీరం, స్వశరీర భూతం ఉపాసకంభిభక్తి పుష్ణాతీతి శరీరభృత్ ?**

యోగుల హృదయకమలనుండి ఋషులు, మునులను పోషిస్తాడు.

**పోషయన్ అన్నరూపేణ** ప్రాణుల శరీరములను పోషించువారిని పోషించువాడు.

జీవుల శరీరములను రక్షించును. అందుకే పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు 'శరీరభృత్' అనబడుతున్నాడు.

పరమేశ్వరుడు అన్నము రూపంలోగాని, ప్రాణం రూపంలోగాని ఉంటూ, జీవుల యొక్క శరీరములు నిలుపుతాడు. తనమాయ చేత అనేక రూపాలు ధరిస్తాడు.

**రక్షతే భగవాన్ విష్ణుః భక్తానాత్మ శరీరవత్** జీవుల శరీరములను వేరుగా చూడకుండా, వాటిన్నింటినీ తన శరీరమువలెనే భావించి రక్షిస్తాడు. శరీరములోని కదలికలకు కారణమైన చైతన్యము ఆ పరమేశ్వరుడే. అందుకే అతడు 'శరీర భృత్' అనబడుతున్నాడు.

## 350. మహర్ధిః

సంపన్నుడు

**తద్యోగక్షేమవహనే నిర్మర్యాద విభూతితః మహర్ధిః** భక్తులయొక్క యోగక్షేమాలు వహించటానికి యోగ్యమైన, విస్తారమైన విభూతికలవాడు.

**మహతీ ఋద్ధియస్యసః మహర్ధి**

భక్తులయొక్క యోగక్షేమాలు చూడటానికిగాను అపారమైన విభూతిగలవాడు.

పరమేశ్వరునకు గొప్పదైన బుద్ధి అనగా విభూతి, సంపద లేక శక్తి ఉన్నది.

మహావిభూతులుకల భగవానుడు 'మహర్ధి' అనబడుతున్నాడు. అతనిదగ్గర శక్తి, సంపద రెండూ కలిసి ఐశ్వర్యముగా ఉన్నాయి. అటువంటి ఐశ్వర్యము చాలా గొప్పగా గలవాడు.

అతని చిన్ననాటి స్నేహితుడు సుదాముడు. దరిద్రంతో అలమటిస్తున్నాడు. కడుపు నిండా తిండి లేదు. వంటి నిండా బట్టలేదు. దయనీయమైన స్థితిలో ఉండి, చిన్ననాటి స్నేహితుణ్ణి చూడటానికి వచ్చాడు. వచ్చేటప్పుడు గుప్పెడు అటుకులు మాత్రం తెచ్చాడు. అతడు తెచ్చిన అటుకులనే అమృతంలాగా ఆరగించాడు భగవానుడు. అతడు అడగకుండానే ఊహించలేనంత ఐశ్వర్యాన్ని ఇచ్చాడు. మేడలు, మిద్దెలు, వెండి, బంగారం, గుర్రాలు, రథాలు, ఏనుగులు, గోవులు, దాసదాసీజనం. ఈ రకంగా అతడికి మహదైశ్వర్యాన్ని

ప్రసాదించాడు. అయినప్పటికీ ఆ పరమేశ్వరుని ఐశ్వర్యము తరిగిపోదు. ఇంకా, ఇంకాఎంత తీసినా తరగనిది ఆ ఐశ్వర్యము.

అతడు అనంతమైన శక్తి గలవాడు. ఈ జగత్తుకు సృష్టికర్త అతడే. ఇతరుల సహాయ సహకారాలు లేకుండానే జగత్కార్యము అయిన సృష్టి స్థితిలయాలను చేస్తుంటాడు.

ఈ రకంగా పరమేశ్వరుడు మహదైశ్వర్య సంపన్నుడు.

## 351. ఋద్ధః

సమర్ధుడు. 278వ నామం కూడా ఇదే.

**తత్సమృద్ధ్యాయః సమృద్ధస్త్వృద్ధ ఉచ్యతే**

భక్తులయొక్క సమృద్ధిచేత తాను కూడా సమృద్ధుడై ఉంటాడు.

తన భక్తులు సుఖంగా ఉంటే తానుకూడా సుఖంగా ఉంటాడు. **శ్రీమద్రామాయణం**లో

**"అభిషిచ్యచ లంకాయాం రాక్షసేంద్రం విభీషణం ।**

**కృతకృత్యః తదారామః విజ్వరః ప్రముమోద హ ॥**

రామచంద్రుడు లంకలో రాక్షసరాజుగా విభీషణునికి పట్టాభిషేకం జరిపి, చింతలన్నీ తీరిపోయినాయి అని సంతసించాడు." అని చెప్పబడింది.

జగత్తును సృష్టించి, అందులోని ప్రతివస్తువు, ప్రతిప్రాణి తానే అయి జగత్తంతా ప్రకాశిస్తున్నాడు. **బృహదారణ్యకోపనిషత్తు**లో చెప్పినట్లుగా ఒంటరిగా ఉన్న ఆ పరమేశ్వరుడు, తనకు తోడుగా ఒక స్త్రీ కావాలనుకున్నాడు. వెంటనే పరస్పరాలింగనం చేసుకున్న స్త్రీ పురుషులు ప్రత్యక్షమైనారు. వారే స్వాయంభువ మనువు, శతరూప. వారివల్లనే 84 లక్షల జీవరాశి ఉత్పన్నమైంది. అంటే జగత్తంతా పరమేశ్వరమయమే.

స్థావర జంగమాత్మకమైన జగత్తులో ప్రాణమున్నవి, ప్రాణం లేనివి, చలనమున్నవి, చలనం లేనివి, అన్నీ పరమేశ్వరుని రూపాలే. ఈ రకంగా జగన్నిర్మాణం కావించటంలో సమర్ధుడు కాబట్టే శ్రీమన్నారాయణుడు 'ఋద్ధః' అనబడుతున్నాడు.

## 352. వృద్ధాత్మా

పెరిగిన స్వరూపముగలవాడు.

**మహిమానాం చళకయన్ సమృద్దస్సర్వతోఽధికమ్**

**ఆత్మాస్వరూపం యస్యేతి సవృద్ధాత్మేతి కథ్యతే**

ఈ మహిమ అంతా ఒక మూల ఉండేటట్లుగా సర్వాధికముగ పెరిగిన దివ్యమైన ఆత్మస్వరూపము గలవాడు.

**వృద్ధః ఆత్మాయస్యసః వృద్ధాత్మా** తన మహిమను ఒక్కసారి అణిచినట్లుగా, పెరిగిపోయిన దివ్యమైన ఆత్మస్వరూపము గలవాడు.

వృద్ధము, అతిపురాతనము అయిన ఆత్మ ఎవరికి గలదో అటువంటివాడు.

పరమేశ్వరుడు ఆదిపురుషుడు. సృష్టికి పూర్వం ఈ జగత్తంతా మహాశూన్యంగా ఉండేది. ఆ శూన్యాన్ని ఆక్రమించి ఉన్నాడు పరమేశ్వరుడు.. అంటే సృష్టి జరగటానికి ముందు నుంచీ ఉన్నాడు. అతిపురాతనుడు. అతి ప్రాచీనుడు.

అతిచిన్నగా ఉండికూడా పెద్దగా పెరిగినవాడు. పరమేశ్వరుడు **అణోరణీయాం మహతో మహీయాం** అణువుకన్న చిన్నవైనవాడు. మహత్తుకన్న పెద్దదైనవాడు. బలిచక్రవర్తి అశ్వమేధ యాగం చేస్తున్నాడు. శ్రీమహావిష్ణువు వామనుడుగా యజ్ఞశాలకు వచ్చాడు. వచ్చిన బుడుతడిని చూసి ముచ్చటపడ్డాడు బలి. ఏ వరం కావాలో కోరుకోమన్నాడు. మూడడుగులనేల ఇస్తే చాలు అన్నాడు వామనుడు. ఇచ్చానన్నాడు బలిచక్రవర్తి. అప్పటి దాకా అతిచిన్నవాడుగా ఉన్న వామనుడు ఒక్కసారిగా త్రివిక్రముడైనాడు. ఒక అడుగుతో నేలను రెండవ అడుగుతో ఆకాశాన్ని ఆక్రమించేశాడు. అందరితోబాటుగా ఆశ్చర్యపోయి చూస్తున్నాడు  బలిచక్రవర్తి. మూడవ అడుగు ఎక్కడ ? అని అడిగాడు త్రివిక్రముడు. తననెత్తిన ఉంచమన్నాడు బలిచక్రవర్తి. ఈ విధంగా అనంతంగా పెరిగిపోయిన విరాడాత్మయే వృద్ధాత్మ అనబడుతుంది. ఈతడు దేశకాలమానములకు అతీతుడు.

## 353. మహాక్షః

గరుడ వాహనుడు.

**అక్షస్తుతార్యోవహనాత్ రథా యవ సామ్యతః**
**మహాపూజ్యస్స యస్యాస్తి స మహాక్ష ఇతి స్మృతః**

అక్షము అంటే – రథము. ఇక్కడ గరుడుని రథముగా చెబుతున్నారు. పూజ్యుడైన గరుత్మంతుని వాహనముగ కలవాడు.

**మహాన్ అక్షః యస్యసః మహాక్షః** వేదమయుడైన గరుడుని రథముగా గలవాడు.

కశ్యప ప్రజాపతి దక్షప్రజాపతి కుమార్తెలైన వినత, కద్రువ, దితి మొదలైన వారిని వివాహం చేసుకున్నాడు. వినతకు పక్షులు, కద్రువకు పాములు సంతానంగా జన్మించారు.

వినత, కద్రువ ఇద్దరూ దక్షప్రజాపతి సంతానమే అయినప్పటికీ అసూయ, మత్సరము బాగా పెరిగి, కద్రువ వినతను మోసం చేసి తనకు దాసిగా చేసుకున్నది. వినత కుమారులు వైనతేయులు. పెద్దవాడు అనూరుడు. సూర్యుని సారథి. రెండవ వాడు గరుడుడు.

గరుత్మంతుడు కద్రువ దగ్గరకు పోయి తన తల్లికి దాస్యవిముక్తి ప్రసాదించమని వేడుకున్నాడు. దానికి సమాధానంగా దేవలోకం నుంచి అమృతాన్ని తెచ్చి ఇమ్మంది కద్రువ. సరేనన్నాడు గరుత్మంతుడు. దేవలోకం పోయి అక్కడ అమృతానికి కాపలా ఉన్నవారితో యుద్ధం చేసి, వారందరినీ ఓడించి, అమృత భాండము తీసుకుని ఆకాశానికి ఎగిరాడు. ఇతడు చేసిన పనిని శ్రీమహావిష్ణువు మెచ్చుకుని అతడికి అమరత్వాన్ని ప్రసాదించాడు.. తనకు వాహనంగా చేసుకున్నాడు. తన రథానికి ధ్వజంగాకూడా చేశాడు.

ఈ రకంగా శ్రీమహావిష్ణువుకు వాహనమయినాడు గరుత్మంతుడు. అతడే విష్ణువు యొక్క రథం. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'మహాక్షః' అనబడుతున్నాడు.

అధర్వణ వేదములో **గారుడోపనిషత్తు** ఉన్నది. అందులోవైనతేయుడైన గరుడుడు 'విదషహారి' అని చెప్పబడింది.

దక్షిణ పాదము స్వస్తికము, ఎడమపాదము కుంచితముగా ఉండి నమస్కరిస్తున్న గరుడుని ధ్యానింతును. హరికి ఇష్టుడైన గరుడుని ధ్యానింతును.

| | | | |
|---|---|---|---|
| అనంతుడు | – వామకటకము | దక్షిణ కర్ణమున | – పద్ముడు |
| వాసుకి | – యజ్ఞసూత్రము | వామకర్ణమున | – మహాపద్ముడు |
| తక్షకుడు | – కటిసూత్రము | తలమీద | – శంఖుడు |
| కర్కోటకుడు | – హారము | భుజముల మధ్య | – గుళికుడు |

కలిగి, నాగులచే సేవించబడుతున్న కపిలాక్షుడు, బంగారుకాంతి గలవాడు, పొడవైన బాహువులు, పెద్దమూపు, నాగాభరణ భూషితుడు మోకాళ్ళనుండి బంగారు రంగు గలవాడు, మొలపైన తెలుపురంగు, కంఠమువరకు ఎరుపురంగు, వంద చంద్రుల కాంతిగల ముక్కు, కిరీటము, గల విష్ణువాహనుడైన గరుడునికి నమస్కారము." అంటూ ఆ గరుత్మంతుని పేరు తలచినంతనే సర్వవిషములు హరించి పోతాయి అని చెప్పబడింది.

**భగవద్గీత**లోని పదవ అధ్యాయం **'విభూతియోగం'**లోని 30వ శ్లోకం

**ప్రహ్లాదశ్చాస్మి దైత్యానాం కాలః కలయతామహమ్ ।**

**మృగాణాం చ మృగేంద్రోఽహం వైనతేయశ్చ పక్షిణామ్ ॥**

దైత్యులలో ప్రహ్లాదుడను, గణకులలో కాలమును, మృగాలలో సింహాన్ని, పక్షులలో గరుత్మంతుడను నేనే.

వినతాసుతుడైన గరుత్మంతుడు పక్షులకు రాజు అన్నింటిలోకి పెద్ద పక్షి. పరమభక్తుడు, పరాక్రమశాలి.

**మహతీ-అక్షిణి, మహాన్తి-అక్షిణీ వా-అస్య:**

ఇతనికి గొప్పవైన రెండు కనులు లేదా, అనేక కనులు గలవు.

## 354. గరుడధ్వజః

గరుడుని ధ్వజముగా గలవాడు.

**స ఏ వతు ధ్వజోయస్య స ఉక్తో గరుడధ్వజః** గరుత్మంతుని ధ్వజముగ గలవాడు.

**గరుడః ధ్వజః యస్యసః గరుడధ్వజః** పక్షిరాజైన గరుడుని ధ్వజముగ గలవాడు.

గరుత్మంతుడు వేదస్వరూపుడు. వేదాలే శ్రీమన్నారాయణుని పతాక చిహ్నాలు. అందుకే జ్ఞానరూపమైన గరుడుని పతాకమందు ధరించి 'గరుడధ్వజః' అనబడుతున్నాడు.

## 355. అతులః

సాటిలేనివాడు.

**గరుడధ్వజ సత్వాద్ధి అతులోఽనుపమస్స్మృతః**

గరుడు ధ్వజము గలవాడు కాబట్టే లోకమందు సాటిలేని మేటి అవుతున్నాడు.

**న విద్యతే తులా యస్యసః అతులః** సాటిలేనివాడు

"సృష్టి ప్రారంభానికి ముందు జగత్తంతా బ్రహ్మమయంగా ఉండేది. పరబ్రహ్మాయే ఈ జగత్తంతా వ్యాపించి ఉన్నాడు. అతనితో సమానమైనవారు గాని, అతనికన్న అధికులైనవారు గాని ఎవరూ లేరు." అని ఉపనిషత్తులలో అనేకసార్లు చెప్పటం జరిగింది.

**తులా - ఉపమానం అస్య న విద్యతే** అతనికి తుల-ఉపమానము ఏదీ లేదు. అతనితో పోల్చదగినది ఏదీ లేదు. **శ్వేతాశ్వరోపనిషత్తులో**

**నైనమూర్ధ్వం నతిర్వంచం నమధ్యే పరిజగ్రభతు**

**నతస్య ప్రతిమాస్తి యస్యనామ మహద్యశః**

ఈ పరమాత్మను ఊర్ధ్వదిక్కులయందు గాని, అధోదిక్కులయందుగాని గ్రహించటానికి వీలు లేదు. అనంతకీర్తితో వెలుగొందుతున్న ఆ పరమాత్మతో పోల్చటానికి మరెవరూ లేరు.

ఈ రకంగా పరమేశ్వరునితో పోల్చదగ్గ వస్తువు ఏదీ ఇంకొకటి లేదు. అందుచేతనే అతడు 'అతులః' అనబడుతున్నాడు.

**భగవద్గీత**లోని 11వ అధ్యాయం **'విశ్వరూప సందర్శనయోగం'**లోని 43వ శ్లోకం.

**పితాఽసి లోకస్య చరాచరస్య త్వమస్య పూజ్యశ్చ గురుర్గరీయాన్**
**నత్వత్సమోఽస్త్యభ్యధికః కుతోఽన్యో లోకత్రయేఽ ప్యప్రతిమ ప్రభావః**

ఓ అనుపమప్రభావా ! ఈ సమస్త చరాచర జగత్తుకు నీవే తండ్రివి. నీవు పూజ్యుడవు. నీవు గురువువు. సర్వశ్రేష్ఠుడవు. ముల్లోకాలలోను నీతో సమానులెవరూ లేరు. ఇంక నీకన్న అధికులు ఎలా ఉంటారు ?

అర్జునుడు చెబుతున్నాడు. "ఈ జగత్తంతా నీ వల్లనే ఉద్భవించింది. కాబట్టి దీనికి నీవే తండ్రివి. జగత్తులోని దేవతాశ్రేష్ఠులు, మహర్షులు, ఇతరులకన్న బ్రహ్మశేష్ఠుడు. ఎందుకంటే, వీరందరికన్నా ముందు అతడు ఉద్భవించాడు. అతడే అందరికీ జ్ఞానాన్ని ప్రసాదిస్తాడు. కానీ, ఆ బ్రహ్మకూడా నీనుండే ఉద్భవించాడు. ఆయనకు కూడా జ్ఞానము నువ్వు ఇచ్చినదే. కాబట్టి ఓ సర్వేశ్వరా ! నీవు గురువులకు గురువు. సర్వశ్రేష్ఠుడవు. లోకంలోని ఋషులకు, దేవతలకు నువ్వు పూజ్యుడవు. బ్రహ్మాది దేవతలు, వశిష్ఠాది మహర్షులు నిన్ను పూజించటం అదృష్టంగా భావిస్తారు. కాబట్టి పూజ్యులైన వారికి పూజ్యుడవు. మహాగుణములు, ఐశ్వర్యము, మహిమలు గల నీతో సరితూగగలవాడు ఈ లోకంలో ఎవరూ లేరు. నీకు నువ్వే సాటి. నీతో సమానమైనవాడే లేనప్పుడు, నీకన్న అధికుడు ఏ విధంగా ఉంటాడు ?

కాబట్టి పరమేశ్వరునితో సమానమైన వారు గాని అధికులుగాని ఎవరూ లేరు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'అతులః' అనబడుతున్నాడు.

## 356. శరభః

శిక్షించువాడు.

**స్వాజ్ఞాతిశాఙ్గివః పుంసః శిక్షణాచ్ఛరభిస్స్మృతః** తన ఆజ్ఞను మీరిన వారిని శిక్షిస్తాడు.

**శృణాతీతి శరభః** తన హద్దు మీరిన వారిని శిక్షించును.

పరమేశ్వరుడు చండశాసనుడు. అతడు ఉన్నాడనే భయంతోనే గాలిసవ్యంగా వీస్తోంది. దిక్పాలకులు వారి విధులను సక్రమంగా నెరవేరుస్తున్నారు. అతని ఆజ్ఞను మీరిన వారిని కఠినంగా శిక్షిస్తాడు.

శరీరములందు ప్రత్యగాత్మగా ప్రకాశిస్తాడు కాబట్టి 'శరభః' అనబడతాడు. శిథిలమయ్యేవి కాబట్టి శరములు శరీరములు అనబడతాయి. అటువంటి శరీరము లందు ప్రకాశిస్తాడు కాబట్టి శరభుడు అనబడతాడు.

పరమేశ్వరుడు శివావతారముద్వారా ఎనిమిది కాళ్ళు కలిగిన 'శరభము' అనే జంతువుగా అవతరించి సింహములను హతమార్చాడు. అందుచేత శరభః అనబడు తున్నాడు. సర్వులకు భీతి కలిగిస్తాడు కాబట్టి శరభుడు అనబడుతున్నాడు.

# 357. భీమః

భయంకరుడు. 948వ నామం కూడా ఇదే.

**భీమో యస్మాద్బిభ్యతి తు శరభాతి పవనాదయః**

తన ఆజ్ఞను ఉల్లంఘించిన వారిని శిక్షిస్తాడు కాబట్టి అతనికి అందరూ భయపడతారు.

**తైత్తిరీయోపనిషత్తు**లో చెప్పినట్లుగా పరమేశ్వరుడున్నాడనే భయంతోనే గాలి సవ్యంగా వీస్తున్నది. సూర్యుడు ప్రకాశిస్తున్నాడు. దిక్పాలకులు వారి వారి విధులను నిర్వర్తిస్తున్నారు.

పరమేశ్వరుని ఆజ్ఞకు అందరూ బద్ధులే. ఎవరైనా అతని ఆజ్ఞ మీరితే వారిని అతడు భయంకరంగా శిక్షిస్తాడు.

**బిభ్యత్యస్మాదితి భీమః** ఈ రకంగా శిక్షించటం చేత, వారందరికీ భయంకరంగా కనిపిస్తాడు.

అయితే పరమేశ్వరుడు దుర్మార్గుల పాలిట భయంకరుడు. అదే సన్మార్గుల పాలిట అభయంకరుడు. ఎవరి భయముచే ఇంద్ర, అగ్ని, వాయు, సూర్యాది దేవతలు వారి వారి పనులను సక్రమంగా నిర్వర్తిస్తున్నారో, అటువంటి పరమేశ్వరుడు 'భీముడు' అని చెప్పబడింది.

దుర్మార్గులకు భయాన్ని, సన్మార్గులకు రక్షణ కల్పించటం ద్వారా జీవులన్నీ సమదర్శనం చేయగల ఉన్నత స్థితికి తీసుకుపోయేవాడు.

# 358. సమయజ్ఞః

నియమము, కాలము, వ్రతము తెలిసినవాడు.

**అగ్న్యాదీనాం చ సమయః ఊర్ధ్వాగ్రజ్వలనాదికమ్ ।**
**యో జానాత్యధికారంచ సమయజ్ఞ స్స కీర్తితః ॥**

అగ్నిపైకి మండటము, గాలి ఎప్పుడూ వీచటము మొదలైన లక్షణాలు కలవాడు. కాబట్టే 'సమయజ్ఞః' అనబడుతున్నాడు.

**'సమయం జానాతీతి సమయజ్ఞః'** అగ్నిపైకే మండాలి, సూర్యుడు ప్రకాశించాలి. ఈ రకంగా దేవతల కోసం నియమాలు చాలా ఉంటాయి. అటువంటి నియమములు బాగా ఎరిగినవాడు కాబట్టే 'సమయజ్ఞః' అనబడుతున్నాడు.

భక్తులకు అభయప్రదానమునిచ్చే కాలము తెలిసినవాడు.

హిరణ్యకశ్యపుని ఆగడాలు మితిమీరినాయి. వైకుంఠంమీదికి పోయి 'ఏడిరాహరి?' అన్నాడు. శ్రీహరి హిరణ్యకశ్యపుని శ్వాశరంధ్రంలో దాక్కున్నాడు. అంతేకాని ఎదురు పడలేదు. కారణం అది కాని కాలము. ఆ సమయంలో ఆ రాక్షసుడిదే బలము. అలా కొంతకాలం జరిగింది. రాక్షసుడి తేజస్సు తగ్గింది. నృసింహరూపంలో వచ్చి హిరణ్యకశ్యపుణ్ణి చీల్చి చెండాడాడు.

అదేవిధంగా రావణబ్రహ్మ లోకాలను హింసిస్తున్నాడు. దేవతలు, ఋషులు పోయి శ్రీహరికి మొరపెట్టుకున్నారు. కొంతకాలం ఓపిక పట్టండి అన్నాడు. తాను శ్రీరాముడిగా జన్మించాడు. సీతాపహరణం జరిగిన తరువాత రావణ సంహారం జరిగింది. అంటే అప్పటికిగాని అతనికి ఆయువు తీరలేదు. ఈ విధంగా రాక్షసుల బారినుండి తన భక్తులకు అభయమివ్వటమే వ్రతముగా గలవాడు కాబట్టే శ్రీమన్నారాయణుడు 'సమయజ్ఞః' అనబడుతున్నాడు. రాక్షస సంహారము చెయ్యటానికికూడా కావలసిన కాలము నెరిగినవాడు.

**సృష్టిస్థితి సంహారాణాం ప్రత్యేకశః సమయం జానాతి**

సృష్టిస్థితి సంహారాలను విడివిడిగా ఏది ఎప్పుడు ఆచరించాలో బాగా తెలిసినవాడు.

**షట్ సమయాన్ జానాతి** ఋతురూపములగు ఆరు సమయములను తెలిసినవాడు. అవి తెలిసి ఆ ఋతుధర్మాలను ప్రవర్తింపచేయువాడు.

అన్ని భూతములందు సమానమైన భావము గలవాడు. **విష్ణుపురాణంలో**

**సమత్వ మారాధన మచ్యుతస్య** అన్ని భూతములందు సమతాభావమే అచ్యుతుని ఆరాధన.

అంటే లోకంలోని మిగిలిన జీవులన్నింటినీ, నీతోబాటు సమానంగా చూడాలి. పిపీలికాది బ్రహ్మ పర్యంతము పరమేశ్వర రూపమే అనే భావనతో చూడటమే శ్రీహరిని ఆరాధించటము. ఈ కారణాలచేత శ్రీమన్నారాయణుడు 'సమయజ్ఞః' అనబడుతున్నాడు.

## 359. హవిర్హరిః

హవిస్సులను తీసుకునేవాడు.

**సమయం శ్రుతిసిద్ధం యో జ్ఞాత్వా తేభ్య శ్రియం ముదా**
**దత్తే హుతం హవిస్తైశ్చ దీయతే స హవిస్స్మృతః ।**
**హరతీతి హరిర్విఘ్నాన్ అన్నదానేషు నిత్యశః**
**హవిర్హరిరితి ప్రోక్తః హ్యష్టార్ణశ్చైకనామతః ॥**

వేదోక్తమయిన సమయము తెలిసి తన భక్తులకు సంపదలనిచ్చువాడు.

భక్తులచే అగ్నియందు వేయు హవిస్సును తీసకొనువాడు.

భక్తులు చేసే అన్నదానము మొదలైన పుణ్యకార్యములకు కలిగే విఘ్నములను పోగొట్టేవాడు.

**హవిః హరరీతి హవిర్హరిః** యజ్ఞయాగాదులలో హవిర్భాగము తీసుకునేవాడు.

యజ్ఞము చేసేవారికి సిరిసంపదలు, భోగభాగ్యాలు ఇచ్చి, వారి నుంచి హవిర్భాగము పుచ్చుకునేవాడు. భక్తులయొక్క పాపములను హరించువాడు. తెలిసి చేసినా, తెలియక చేసినా ఒకే ఫలితమునిచ్చేవాడు.

**కాళహస్తీశ్వర మాహాత్మ్యము**లో తిన్నడు ఒక బోయవాడు. కేవలము భుజబలమే కాని దైవబలము లేదని నమ్మేవాడు. అటువంటి వాడు ఒక రోజున వేటకు వెళ్ళాడు. ఆ రోజంతా తిరిగాడు. అడవి అంతా గాలించాడు. ఎక్కడా వేట దొరకలేదు. వేటాడకుండా ఇంటికి పోరాదని నిశ్చయించుకున్నాడు. ఇంతలోనే బాగా చీకటి పడిపోయింది. ఒక కొలను దగ్గర చెట్టు ఎక్కి కూర్చున్నాడు. నీరు త్రాగటానికి ఏ జంతువైనా రాకపోతుందా? అని ఎదురు చూస్తున్నాడు. ఏ జంతువూ రాలేదు. ఏం చెయ్యాలో తోచక చెట్టుమీద కూర్చుని ఆకులు కోసి క్రిందపడేస్తున్నాడు. ఆ చెట్టు క్రింద శివలింగమున్నది. అది

మారేడు చెట్టు. త్రాగటానికి తెచ్చుకున్న సొరకాయ బుర్రకు చిల్లిపడి నీరు కారి క్రింద ఉన్న శివలింగం మీద పడ్డాయి. ఆ రోజు మహాశివరాత్రి. శివుడికి అభిషేకం అయింది. తాను క్రిందపడేసిన మారేడు దళాలు శివలింగం మీద పడ్డాయి. అర్చన అయింది. ఆ రోజు ఆహారం దొరకలేదు. ఉపవాసం ఉన్నాడు. రాత్రంతా ఏ జంతువన్నా రాకపోతుందా? అని కాపలా కాశాడు. జాగారమయింది. ఇవన్నీ అతడికి తెలియకుండానే జరిగాయి. పరమేశ్వరుడు కరుణించాడు. చివరకు సాయుజ్యం లభించింది.

అదేవిధంగా **దేవీభాగవతం**లో పూర్వకాలంలో హిమాలయ ప్రాంతంలో చక్రవాకపు పక్షి ఒకటి ఉండేది. అది దేశాల వెంబడి తిరుగుతూ ఒకనాడు కాశీ పట్టణానికి వచ్చింది. ఆ రోజు దానికి ఆహారం దొరకలేదు. ఆహారం వెతుక్కుంటూ కాశీపట్నం అంతా తిరిగింది. అయినా లాభం లేకపోయింది. చివరకు అన్నపూర్ణా దేవి ఆలయానికి వెళ్ళింది. అక్కడ ఆహారం వెదుకుతూ ఆలయం చుట్టూ తిరిగింది. అప్పటికి అపరాహ్ణమైంది. ఉదయం నుంచీ దానికి తినటానికి ఏమీ దొరకలేదు. అలా కాలే కడుపుతో మూడుసార్లు ఆలయం చుట్టూ తిరిగింది. ఆ తరువాత చచ్చిపోయింది. ఉపవాసం చేసి, అన్నపూర్ణాదేవికి ప్రదక్షిణాలు చేసింది కాబట్టి స్వర్గానికి పోయింది. చాలా కాలం స్వర్గసుఖాలనుభవించి మరుజన్మలో క్షత్రియ కులంలో పుట్టి రాజయింది.

ఈ రకంగా తెలిసిచేసినా, తెలియకచేసినా ఫలితం ఫలితమే. కాబట్టి చేసిన కర్మకు తగిన ఫలితాన్నిచ్చేవాడు ఆశ్రీమన్నారాయణుడు. అందుచేతనే 'హవిర్హరిః' అనబడుతున్నాడు.

**హవిర్భాగం హరతి** యజ్ఞములందు హవిర్భాగాన్ని తీసుకుంటాడు. భగవద్గీతలోని 9వ అధ్యాయం 'రాజవిద్యా రాజగుహ్యయోగము'లోని 24వ శ్లోకము

**అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ ।**
**న తు మామభిజానంతి తత్త్వేనాఽ తశ్చ్యవంతి తే ॥**

సకల యజ్ఞములకు భోక్తను స్వామిని కూడా నేనే వారు నా పరమేశ్వర తత్త్వము నెరుగరు. అందుచేత పునర్జన్మను పొందుతారు.

ఈ విశ్వమంతా భగవంతుని విరాడ్రూపమే. అందువలన వేరువేరు యజ్ఞ పూజాది కర్మలకు భోక్తలుగా భావించబడు దేవతలంతా ఆ పరమేశ్వరుని అంగములే. భగవానుడే వారందరికీ ఆత్మ. కాబట్టి ఆయా దేవతల రూపంలో భగవానుడే సమస్త యజ్ఞ కర్మలకు భోక్త. తనయోగశక్తిద్వారా జగత్తుయొక్క సృష్టిస్థితిలయాలను చూస్తున్నాడు. వారి వారి యోగ్యతల ననుసరించి వారిని నియమిస్తున్నాడు. ఇంద్రుడు, ప్రజాపతి, వరుణుడు,

ఇతర దేవతా గణాలన్నింటినీ నియమించేది అతడే. అందుచేత అందరికీ ప్రభువు ఆ పరమేశ్వరుడే.

**బృహదారణ్యకోపనిషత్తు**లో "యజ్ఞంలో హవిర్భాగం తీసుకునే దేవతల సంఖ్య 33 అని చెప్పబడుతుంది.

| | | |
|---|---|---|
| ఏకాదశరుద్రులు | - | 11 |
| ద్వాదశాదిత్యులు | - | 12 |
| అష్టవసువులు | - | 8 |
| ఇంద్రుడు, ప్రజాపతి | - | 2 |
| మొత్తం | | 33 |

వీరిలో అష్టవసువులు అంటే

1. అగ్ని
2. పృథివి
3. వాయువు
4. అంతరిక్షము
5. ఆదిత్యుడు
6. ద్యులోకము
7. చంద్రుడు
8. నక్షత్రాలు

వీటిలోనే జగత్తు అంతా వ్యాపించి ఉన్నది. కర్మఫలాన్ని బట్టి ఇవి దేహంగా మారతాయి.

ఏకాదశరుద్రులు అంటే – జ్ఞానేంద్రియాలు 5, కర్మేంద్రియాలు 5, మనస్సు 1 వెరసి 11. ప్రాణియొక్క కర్మ పరిసమాప్తమైనప్పుడు వీరు శరీరం నుండి ఉత్క్రమిస్తారు. ఈ రకంగా శరీరాన్ని వదలి బంధువులను రోదింపచేస్తారు కాబట్టి ఇవి రుద్రశబ్దంచేత పిలువబడతాయి.

ద్వాదశాదిత్యులు అంటే – పన్నెండు నెలలతో కూడిన సంవత్సరమే ఆదిత్యుడు. ప్రాణులయొక్క ఆయుర్దాయాన్ని 'అదదానా' అంటే గ్రహిస్తుంది కాబట్టి ఇవి ఆదిత్యులన బడ్డాయి. ఇంద్రుడు ప్రజాపతి అంటే – మేఘమే ఇంద్రుడు. మేఘదేవత కూడా ఇంద్రుడే. "యజ్ఞమే ప్రజాపతి." అని చెప్పబడింది.

## పురుషసూక్తంలో అబధ్నన్ పురుషం పశుం

"దేవతలు తాము చేసే యజ్ఞానికి విరాట్పురుషునే పశువుగా బంధించారు" అని చెప్పటం చేత హరి 'హవి' అనబడుతున్నాడు. ఇక హరి అంటే స్మరించినంత మాత్రముచేతనే జీవుల పాపములను హరించువాడు అని అర్థం. పచ్చని వర్ణము గలవాడు కాబట్టి 'హరి' అనబడుతున్నాడు. ఈ రకంగా శ్రీమన్నారాయణుడు 'హవిర్హరిః' అనబడుతున్నాడు.

## 360. సర్వలక్షణ లక్షణ్యః

సకల లక్షణములతోను ఉన్నట్లు ఎరుగదగినవాడు.

**సర్వలక్షణ లక్షణ్యో లక్ష్మీచరణ చిహ్నతః** మహాలక్ష్మి పాదముద్రల చిహ్నమైన వక్షస్థలము గలవాడు కాబట్టి సర్వత్ర సమస్త శుభలక్షణములు గలవాడు.

**సర్వలక్షణైః లక్షణ్యః సర్వలక్షణ లక్షణ్యః** సాక్షాత్తూ లక్ష్మీదేవిని సదా ఆ లింగనము చేసికొని ఉండువాడు. సర్వలక్షణముల తోను ఎరుగబడినవాడు.

**ధ్యాయేత్కమల గర్భాభమ్ దేవం లక్ష్మీపతిస్తతః**
**కమలాలయహితీశ విభూషిత కరద్వయమ్**

శంఖు చక్రములు ధరించి తామరపూవుయొక్క అంతర్భాగము లాగా ఉన్న లక్ష్మీపతిని భజింతును. లక్షణం అనేది–ప్రమాణానికి, ప్రమాణమువలన సిద్ధించే జ్ఞానానికి పేరు కాబట్టి

**సర్వైః లక్షణైః ప్రమాణైః యత్ లక్షణం – జ్ఞానం**
**జాయతే తత్ సర్వలక్షణ లక్షణమ్**

అన్ని లక్షణములచేత (ప్రమాణముల చేత) ఏ జ్ఞానం కలుగుతున్నదో, అది 'సర్వ లక్షణ లక్షణం' అనబడుతుంది.

అన్ని రకాలయిన ప్రత్యక్ష, అనుమానాది ప్రమాణములచేత కలిగే జ్ఞాన విషయమున ఉత్తముడుగా గోచరించువాడు కాబట్టి శ్రీమహావిష్ణువు 'సర్వ లక్షణ లక్షణ్యః' అనబడుతున్నాడు.

అన్ని ప్రమాణాలచేత తెలియదగినవాడు పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడే.

## 361. లక్ష్మీవాన్

లక్ష్మితో కూడినవాడు

**లక్ష్మ్యాచ నిత్యయుక్తత్వాత్ లక్ష్మీవానితి కథ్యతే** శ్రీదేవితో నిత్యము కూడి ఉండువాడు.

**లక్ష్మీః అస్మిన్నస్తీతి లక్ష్మీవాన్** సదా లక్ష్మీదేవితో కూడి ఉండువాడు.

**అక్ష్మీః అస్య వక్షసి నిత్యం అస్తి** లక్ష్మీదేవి నిత్యము ఇతని వక్షస్థలమందు ఉంటుంది. సర్వలక్షణ సమన్వితుడైన శ్రీమన్నారాయణుడు వక్షస్థలమందు లక్ష్మీదేవిని గలిగి శోభిల్లుతున్నాడు.

ఋగ్వేదంలోని **సౌభాగ్యలక్ష్మీ ఉపనిషత్తు**లో దేవతలంతా శ్రీమన్నారాయణుని దగ్గరకు పోయి "దేవా ! మాకు సౌభాగ్యలక్ష్మి విద్యను ఉపదేశించండి" అని అడిగారు. దానికి పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు ఈవిధంగా చెప్పాడు.

దేవతలారా ! తురీయ, తురీయాతీత, సర్వోత్కట, సర్వమంత్రాసనగత, పీఠ, ఉపపీఠ, దేవతా పరివృత, చతుర్భుజ అయిన లక్ష్మిని (శ్రీని) హిరణ్మయము చేసి 15 ఋక్కులలో ధ్యానం చెయ్యండి. ఈ శ్రీ సూక్తానికి ఆనంద, కర్దమ, చిక్లీత ఇందిరా సుతులు – ఋషులు. శ్రీ రిత్యాదులు ఋక్కులు. పధ్నాలుగు ఋక్కులకు ఆనందాదులు ఋషులు. హిరణ్యవర్ణాం మొదలైన మూడు ఋక్కులకు – అనుష్టుప్ ఛందస్సు.

| | | |
|---|---|---|
| కాంసోస్మిత అనేది | – | బృహతీఛందస్సు |
| తరువాత రెండింటికీ | – | త్రిష్టుప్ ఛందస్సు |
| తరువాత ఎనిమిదింటికి | – | అనుష్టుప్ ఛందస్సు |
| మిగిలిన దానికి ప్రస్తార పంక్తి అగ్ని | – | దేవత |

హిరణ్యవర్ణాం – బీజము. కాంసోస్మితి ఇతి శక్తిః" అంటూ శ్రీ సూక్తాంతర్గతమైన సౌభాగ్యలక్ష్మీ మంత్రాన్ని ఉపదేశిస్తాడు. అటువంటి లక్ష్మీదేవిని వక్షస్థలమందు ధరించిన వాడు కాబట్టి శ్రీమహావిష్ణువు 'లక్ష్మీవాన్' అనబడుతున్నాడు.

## 362. సమితింజయః

యుద్ధమున జయించువాడు.

**చేతనానాం సదా సత్వ వివాదం జయతీతియః**

**సమితింజయ అఖ్యాతః సర్వదుఃఖసమాశ్రయః**

తన భక్తులైన జ్ఞానులు తనను సేవించటానికి నేను నేను అని తగవులాడు కుంటున్నప్పుడు వారి వివాదాన్ని తీర్చి, వారియొక్క సమస్త దుఃఖాలను బాపేవాడు.

**సమితింజయతీతి సమితింజయః**

అన్ని లోకాలకు తండ్రి అయిన తనకు దాస్యం చెయ్యటానికి తగవులాడుకొనే జీవకోటిని లక్ష్మీచేత వివాదములో జయించి వశమొనర్చుకొనేవాడు.

యుద్ధమున జయించువాడై భగవానుడు సమితింజయుడు అనబడుతున్నాడు. శ్రీహరి లక్ష్మీపతి. అష్టాదశశక్తి పీఠాలలోని **కొల్హాపుర్యాం మహాలక్ష్మీ** కొల్హాపూరు (కరవీరము) నందున్న దేవత మహాలక్ష్మి **మైలారతంత్రం**లో

**మహాలసనామకం దైత్యం స్యతిక్షపయతీతిచ ।**

**మహాలసా మహాలక్ష్మీ రితిచ ఖ్యాతి మాగతా ॥**

మహాలసుడు అనే రాక్షసుని సంహరించింది. కాబట్టి ఆమె మహాలస, మహాలక్ష్మి అని ప్రసిద్ధి చెందినది. ఆమె పడమటి సముద్రతీరాన సహ్యాద్రిచరియలో ఉన్నది.

ధనలక్ష్మి, ధాన్యలక్ష్మి, ధైర్యలక్ష్మి, విద్యాలక్ష్మి, విజయలక్ష్మి, సంతానలక్ష్మి, అంటూ ఎనిమిది మంది దేవతలున్నారు. వారు అష్టలక్ష్ములు. సప్తశతిలో మహిషాసురుని సంహరించిన దేవత మహాలక్ష్మి.

**నమస్తేస్తు మహామాయే శ్రీ పీఠే సురపూజితే ।**

**శంఖచక్రగదా హస్తే మహాలక్ష్మీ ర్నమోస్తుతే ॥**

అటువంటి లక్ష్మీపతి కాబట్టే శ్రీమన్నారాయణుడు యుద్ధమందు విజయము పొందుతాడు.

## 363. విక్షరః

తగ్గకుండా ఉండేవాడు.

**ఉక్తస్నేహస్యాక్షరణాత్ విక్షరః పరికీర్తితః** భక్తులమీద ఉన్న ప్రేమ తరగనివాడు.

**విగతః క్షరః యస్యసః విక్షరః** భక్తులమీద ఉన్న ప్రేమ, ఆదరణ తగ్గనివాడు. పరమేశ్వరుడికి తన భక్తులయందు అపారమైన ప్రేమ, అభిమానము ఉంటాయి. భక్తులు ఏవైనా తప్పులు చేసినప్పటికీ వాటిని ఒప్పులుగానే భావిస్తాడు. వారికి మేలునే చేస్తాడు.

విక్షరః - నాశనము లేనివాడు. ఆకారమున్నది ఏదైనా సరే నశించిపోతుంది. కాని పరమేశ్వరుడికి ఆకారం లేదు. అందుచేత అతడికి నాశనములేదు. కాలవశాన ఉద్భవించినవి కాలగర్భంలోనే కలిసిపోతాయి. పరమేశ్వరుడు కాలస్వరూపుడు. కాలాతీతుడు కూడా. అందుచేత అతడికి నాశనము లేదు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'విక్షరః' అనబడుతున్నాడు.

## 364. రోహితః

ఎర్రనివాడు

**పద్మస్య గర్భాభతయా రోహితః ప్రకీర్తితః**

పద్మము యొక్క మధ్యభాగమందున్న ఎర్రని రంగు గలవాడు.

పరమేశ్వరుడు మత్స్యరూపం ధరించాడు కాబట్టి రోహితుడనబడుతున్నాడు. ఒకానొకసారి బ్రహ్మ నిద్రపోతున్న సమయంలో సోమకాసురుడనే రాక్షసుడు వేదాలను బ్రహ్మదగ్గర నుంచి దొంగిలించుకుని పోయి సముద్రంలో దాక్కున్నాడు. అతణ్ణి సంహరించటానికి శ్రీమహావిష్ణువు మత్స్యావతారియైనాడు. (ఈ వివరాలన్నీ మత్స్యావతార ఘట్టంలో వివరించబడ్డాయి) అందుచేత రోహితుడనబడుతున్నాడు.

శ్రీహరి తన ఇష్టానుసారము ఎర్రని రూపము ధరించాడు కాబట్టి రోహితుడు అనబడుతున్నాడు.

## 365. మార్గః

వెదుకబడువాడు. 397వ నామం కూడా ఇదే.

**ఉపాసకై ర్మృగ్యమాణో మార్గోవాంఛిత సిద్ధయే ॥** తమ అభీష్టసిద్ధికి ఉపాసకులచేత వెతకబడువాడు

**మృగ్యతే ఇతిమార్గః** తమ కోరికలు తీరటానికి భక్తులు ఇతన్ని వెతకుతుంటారు. ముముక్షువులచేత వెతకబడువాడు.

**ముక్తసంగులైన మునులు దిద్రుక్షులు**
**సర్వభూతహితులు సాధుచిత్తులు**
**అసదృశ వ్రతాద్యు లైకొల్తు రెవ్వని**
**దివ్యపదమువాడు దిక్కు నాకు**

సంసారబంధనాలు విడిచి, బ్రహ్మ సాక్షాత్కారము కోసం శరీరాన్ని నియమ నిష్ఠలతో శుష్కింపచేసి, వ్రతాలు దీక్షలు ఆచరిస్తూ ఉండే మహర్షులు ఎవరి దివ్య పాదార విందములను పూజిస్తారో, అతడిని నేను ప్రార్థిస్తున్నాను అంటాడు గజేంద్రుడు.

ఈ రకంగా బ్రహ్మ సాక్షాత్కారం కోసం వెతకబడే వాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు 'మార్గః' అనబడతాడు.

## 366. హేతుః

కారణభూతుడు.

**వాంచితార్థనిదానత్వాత్ హేతు రిత్యభిధీయతే**

సకల అభీష్టముల సిద్ధికి ఆదికారణమైనవాడు. ఇష్టసిద్ధికి కారణమైన వాడు.

మానవుడికి కావలసినది ఇహము లేదా పరము. ఇహము అంటే లౌకికమైన కోరికల సాధన, ధనధాన్యాలు, భోగభాగ్యాలు, సిరిసంపదలు, గౌరవము, పేరు ప్రతిష్ఠ వంటివి. వీటన్నింటినీ తీర్చేవాడు పరమేశ్వరుడు. వీటన్నింటికీ కారణభూతుడు అతడే. అలాగే పరము. అంటే మోక్షము. అదే సాయుజ్యము జీవాత్మ పరమాత్మల ఏకీభావము. దీనికి మార్గం చూపేవాడు ఆ పరమేశ్వరుడు. జ్ఞానాన్ని ప్రసాదించేది పరమేశ్వరుడు. ముక్తినిచ్చేది ఆ పరమేశ్వరుడే. అందుచేతనే అతడు 'హేతుః' అనబడతాడు. ఈ సృష్టికి కారణమైన వాడు పరమేశ్వరుడు దేనికైనా సరే ముఖ్యమైన కారణాలు రెండు.

1. ఉపాదాన కారణము. 2. నిమిత్త కారణము కుండను తయారుచెయ్యటానికి మట్టి ఉపాదాన కారణము కాగా కులాలుడు నిమిత్త కారణము. ఈ రెండు కారణాలు పరమేశ్వరుడే. ఆ పరమేశ్వరుని వల్లనే జగత్తు సృష్టించబడుతున్నది. స్థితి సంహారములు కూడా అతనివల్లనే గావించబడుతున్నాయి. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'హేతుః' అనబడుతున్నాడు.

## 367. దామోదరః

దామమును ఉదరమునందు ధరించినవాడు.

**దామాని లోకనామాని హ్యుదరే యస్య సంతినః**

**దామోదర ఇతి ఖ్యాతో యశోదా ధదామ బంధనాత్**

**దేవానాం సుఖశంసిత్వాత్ దామాత్ దామోదరో పి వా ॥**

లోకాలు అనే దామములను గర్భమునందు గలవాడు. యశోదచేత కడుపున త్రాడుతో కట్టబడినవాడు. దేవతలకు సుఖమునిచ్చేవాడు.

**విష్ణుపురాణంలో తతస్స దామోదరతాం ప్రయయౌదామ బంధనాత్**

తనను ఆశ్రయించిన ఆశ్రితుల యందు గల వాత్సల్యము వలన యశోద యొక్క త్రాటికి కట్టుబడి ఉదరమున త్రాడుగలవాడయ్యాడు.

చిన్నతనంలో శ్రీకృష్ణ పరమాత్ముడు చాలా అల్లరి చేసేవాడు. అతని అల్లరి చేష్టలకు అందరూ ఆనందించేవారు. గోపాలుర ఇళ్ళలో దూరి పాలు వెన్న దొంగతనంగా తినేసేవాడు. ఒకసారి గోపకాంతలు యశోద దగ్గరకు వచ్చి నీ కుమారుడు బాగా అల్లరి చేస్తున్నాడు. అని ఫిర్యాదు చేశారు. ఆ మాటలకు నొచ్చుకున్న యశోద బాలకృష్ణుని రోటికి కట్టివేసింది. ఈ విధంగా యశోద త్రాటికి కట్టుబడి ఉదరమున త్రాడు గలవాడయినాడు.

బ్రహ్మపురాణంలో

**దదర్శచాల్పదంతాస్యం స్మిత హాసంచ బాలకమ్**
**తయోర్మధ్య గతం బద్ధం దామ్నా గాఢం తథోదరే**
**తతశ్చ దామోదరతాం సయమో దామబంధనాత్**

చిన్నదంతములు కలిగి, చిరునవ్వు నవ్వుతూ, యశోదాదేవిచే ఉదరమందు త్రాటిచే కట్టబడినవాడై నలకూబరుడు, మణిగ్రీవుడు అనే మద్దిచెట్ల మధ్య నుంచి పోయిన బాలుని గోపబాలురు చూశారు. అప్పటినుంచే అతడు దామోదరుడని పిలువబడ్డాడు.

**దామాని ఉదరేయస్యసః దామోదరః** లోకములను కడుపులో గలవాడు.

బాలకృష్ణుడు బాగా అల్లరి చేస్తున్నాడు. ఒకనాడు గోపాలురు పరుగు పరుగున వచ్చి యశోదతో 'కృష్ణుడు మన్ను తింటున్నాడు' అని చెప్పారు.

దాంతో కోపగించిన యశోద కృష్ణుణ్ణి మన్ను తిన్నావా ? అని అడిగింది కోపంగా లేదు అన్నాడు బాలుడు. దాంతో అబద్ధం చెబుతావా ? ఏదీ నీ నోరు తెరు అంటూ చెవి మెలి వేసింది. నోరు తెరిచాడు కృష్ణుడు. ఆ నోటిలో ఊర్ధ్వలోకాలు, అథోలోకాలు మొత్తం 14 లోకాలు కనిపించినాయి ఆ తల్లికి. ఈ రకంగా లోకాలను కడుపులోగలవాడు.

**దామానిలోకనామాని తాని యశ్యోదరాంతరే** దమములు అంటే లోకాలు. అవి ఇతని ఉదరమందుండటం చేత దామోదరుడని పిలువబడుతున్నాడు.

దమము అంటే సుఖము. దేవతలకు సుఖమునిచ్చేవాడు

## 368. సహః

సహించినవాడు.

**యశోదాకృత బందాది సహనాత్సహ ఈరితః** యశోదాదేవి వేసిన బంధనాలను సహించువాడు,

**సహతే ఇతి సహ** సహించినవాడు. యశోద తనను త్రాడుతో రోలుకు కట్టివేస్తే సహించినవాడు. అందరినీ భరిస్తాడు. ఎవరేమి చేసినా ఓర్చుకుంటాడు. సహనశీలుడైన పరమేశ్వరుడు. భక్తుల తప్పులను క్షమించేవాడు. సహనముతో సర్వాన్నీ భరించేవాడు. రాయభార ఘట్టంలో దుర్యోధనుడు చేసిన అవమానాలు, పెట్టిన బాధలు సహించి ఊరుకున్నాడు. యశోద రోలుకు కట్టివేసినప్పుడు సహించి ఉన్నాడు. అటువంటి సహనంతోనే భూమిని కూడా ధరిస్తున్నాడు.

అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'సహః' అనబడుతున్నాడు.

# 369. మహీధరః

భూమిని ధరించినవాడు. 317వ నామము కూడా ఇదే.

**భూభారనాశనేన జ్యా ధారణా త్సమహీధరః**

దుష్టశిక్షణ కావించి భూభారాన్ని తగ్గించి, దానిని ధరించువాడు.

**మహ్యాః ధరః మహీధరః**

భూభారాన్ని తొలగించి, భూమిని రక్షించువాడు. భూమిమీద అన్యాయము అక్రమము పెరిగిపోయినప్పుడు అంటే ధర్మం సన్నగిల్లి, అధర్మం పెచ్చు మీరినప్పుడు

**పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం**
**ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే**

దుష్టశిక్షణ, శిష్టరక్షణ చెయ్యటానికి ఆర్తత్రాణ పరాయణుడైన శ్రీమన్నారాయణుడు ప్రతియుగంలోను ఉద్భవించి దుష్టశిక్షణ చేసి భూభారాన్ని తగ్గించి, ఆ భూమిని తాను ధరిస్తాడు. అందుకే అతడు మహీధరుడనబడుతున్నాడు.

**శింశుమారాత్మనా విష్ణుః భూరాదీ నూర్ధ్వతస్థితాన్**
**దధ్రేశేషతయాలోకాన్ సప్తలోకాన్ అధస్థితాన్**

శ్రీమహావిష్ణువు మొసలి రూపంలో ఊర్ధ్వలోకాలను, ఆదిశేషుని రూపంలో అధోలోకాలను ధరిస్తున్నాడు. **మహాసంకల్పము**నందు

**అస్మిన్ మహతి బ్రహ్మాండఖండయోః మధ్యే ...** పెద్ద బ్రహ్మాండపు తునక నడుమ

**ఆధారశక్తి, శ్రీకూర్మ, వరాహ, వైష్ణవ, అనంత, నాగ,**
**శేష, తక్షక అష్టదిగ్గజో పరివేష్టితే ...**

| | | | |
|---|---|---|---|
| 1. ఆధారశక్తి | 3. వరాహము | 5. అనంతము | 7. శేష |
| 2. శ్రీకూర్మము | 4. వైష్ణవము | 6. నాగ | 8. తక్షక |

అనే అష్టదిగ్గజాలు ఎనిమిది దిక్కులందు నిలువగా ఊర్ధ్వలోకాలకు క్రిందభాగాన, అధోలోకాలకు పై భాగాన

**చక్రవాళ శైలమధ్యగత మహాసుమేరోః సహస్ర**
**శిఖరానువర్తిని మహానాయమాన ఫణిరాజ**
**రాజస్య శేషస్య సహస్ర ఘణా మణి మండం మండితే**

చక్రవాళము మొదలైన పర్వతములను, కులపర్వతములు అంటారు.

ఈ కులపర్వతాల రూపంలో పరమేశ్వరుడు ఈ భూమిని మోస్తున్నాడు. అందుచేతనే "మహీధరః" అనబడుతున్నాడు. భూమిని నిలువుగా ఉంచటమే ఈ పర్వతాల ప్రత్యేకత.

**వనాని విష్ణు ర్గిర మోదిశశ్చ**

విష్ణువే అడవులు, విష్ణువే పర్వతాలు అంతా విష్ణు స్వరూపమే శ్రీ మహావిష్ణువే లోకాలన్నింటికీ ఉపాదాన కారణము. అందుచేత అతడు మహీధరః అనబడుతున్నాడు.

## 370. మహాభాగః

మహాసౌభాగ్యము గలవాడు.

**రుక్మిణ్యాది బహు స్త్రీభిః మహాభాగ స్స్వయంవృతః**

రుక్మిణీ మొదలైన ఉత్తమ జాతి స్త్రీలచే కోరి వరించబడినవాడు.

**మహాన్ భాగః సౌభాగ్యం యస్యసః మహాభాగః**

అష్టభార్యలు, పదహారు వేలమంది గోపకాంతలచే కోరి వరించబడినవాడు.

వీరందరూ శ్రీకృష్ణ పరమాత్ముని కోరి వరించిన వారే. రామావతార సమయంలో మునులు శ్రీరాముని సుందర రూపము చూసి మోహితులై తమని కౌగిలించుకొమ్మని అడిగారు. వారి కోరికను కృష్ణావతారంలో తీరుస్తానని, వారిని గోపికలుగా జన్మించమని చెప్పాడు రాముడు. ఆ ప్రకారం వారు జన్మించి శ్రీకృష్ణునితో సరససల్లాపాలతో కాలం గడిపారు.

తన ఇష్టానుసారము అనేక అవతారాలు దాలుస్తూ, తన కోరిక ప్రకారము శరీరాన్ని ధరిస్తూ ఉండేవాడు తనయోగము ప్రకారము ఉత్కృష్టమైన భోజనాలనుభవించేవాడు.

**గోవర్దనోద్ధరణము** సమయమున గోపాలులందరూ గోపోత్సవము చేస్తున్నారు. అప్పుడు వారు కృష్ణుని ఆజ్ఞమేరకు నివేదనము ఇంద్రునికి ఇవ్వకుండా గోవర్ధనగిరికి నైవేద్యము సమర్పించారు. అప్పుడు గోపాలురు వండిన పదార్థాలన్నింటినీ పరమాత్ముడు ఒక్కడే తిని, 'మహాభాగాః' అని కీర్తించబడ్డాడు.

## 371. వేగవాన్

వేగము గలవాడు.

**దుర్వార పరమైశ్వర్య ప్రసరత్వా ద్విశేషతః ।**
**మనుష్య ధర్మే బాల్యేఽపి వేగానితి శబ్ద్యతే ॥**

మనుష్యుడుగా అవతరించాడు. బాలుడుగా ఉన్నాడు. కాని అపరిమితమైన పరమైశ్వర్యశక్తి యొక్క వేగాతిశయము గలవాడు.

**వేగః అస్యాస్తీతి వేగవాన్** మానవులలాగా ఆటలాడేటప్పుడు అమితమైన వేగము గలవాడు.

**వేగః-జపః అస్యఅస్తిః** జపశీఘ్రం గమన యోగ్యత ఇతడికి ఉన్నది. **ఈశావాశ్యోపనిషత్తులో**

**అనేజదేకం మనసో జనీయోనైన ద్దేవా ఆప్నువన్ పూర్వమర్షతు**

**తద్ధానతో ఽన్యానత్యేతి నిష్ఠ త్తస్మినపో మాతరిశ్వా దధాతి**

ఆత్మ ఒక్కటే చలన రహితమైనది. అయినప్పటికీ అది మనసుకన్న వేగంగా పోతుంది. మనసు కన్న ముందు పోవటంచేత అది ఇంద్రియాలకు అందదు. నిత్యమూ స్థిరమైనది అయినప్పటికీ, పరిగెత్తే వాటికన్న ముందుకు పోతుంది. ఆత్మ తన సన్నిధి మాత్రం చేత ప్రాణికోటుల కార్యకలాపాలను భరించటానికి ప్రాణశక్తిని సమర్థం చేస్తున్నది.

ఈ రకంగా ఆత్మ అన్నింటికన్నా ముందే వెడుతుంది. కాబట్టి ఆత్మ స్వరూపుడైన శ్రీమన్నారాయణుడు 'వేగవాన్' అనబడుతున్నాడు.

## 372. అమితాశనః

అమితముగా భుజించినవాడు.

**ఇంద్రాయ కల్పితం గోపైః అమితం చానశం స్వయమ్**

**భుక్తవాన్ యశ్చ నిశ్శేషం ప్రోచ్యతే సోఽమితాశనః** గోపజనం అంతా ఇంద్రుని కోసం అన్నాదిభక్ష్యాలు ఉంచగా, వాటిని భగవానుడు స్వయముగా భుజించాడు.

**అమితం అశనం యస్యసః అమితాశనః**

ఇంద్రునికోసం తయారుచేసిన భక్ష భోజ్యాలను తానే ఆరగించినవాడు. ఇతను ఆ విధంగా భుజించటం చూసిన గోపాలురు నమస్కరించి 'పరమపురుషా ! నీవు దేవుడవా? లేక దానవుడవా' అని అడిగారు ఈ విషయం **విష్ణుపురాణం**లో చెప్పబడింది.

అమితమయిన పరిమాణము గల అశనము గలవాడు.

ప్రళయ సమయంలో లోకాలన్నింటినీ మ్రింగిచూస్తూ ఉండేవాడు. చరాచర జగత్తును తనలో లీనం చేసుకొనేవాడు.

ఆత్మానుభవములో కనుపించే దృశ్య ప్రపంచమంతటినీ కబళించువాడు. సంహార సమయంలో ఈ విశ్వమంతా అతనికి ఆహారమవుతుంది. అందుకే శ్రీమన్నారాయణుడు 'అమితాశనః' అనబడుతున్నాడు.

శివాది క్షితి పర్యంతము గల తత్త్వాలన్నీ ఆహారముగ గలవాడు.

**లలితా సహస్రంలో 753వ నామము మహాశనా.**

# 373. ఉద్భవః

సంసార నివర్తకుడు. 790వ నామం కూడా ఇదే.

**సముద్గతో భవో యస్మాత్ ఉద్భవః పరికీర్తితః**

తనతో బంధము పెట్టుకున్నవారికి సంసార బంధనాలు లేకుండా చేసేవాడు.

**ఉదతః భవః యస్మాత్సః ఉద్భవః** తన భక్తులను సంసార బంధనాల నుండి దూరం చేసేవాడు.

**విష్ణుపురాణంలో దామోదరం బంధహారం**

భక్తులు ఎవరైతే తనను సేవిస్తుంటారో వారికి భవబంధాలను దూరం చేసేవాడు.

భగవంతుణ్ణి చేరాలి అంటే సంసార బంధనాలు పూర్తిగా పోవాలి.

భక్తులు రెండు రకాలు 1. ఐహికవాదులు 2. మోక్షవాదులు. ఐహికవాదులు. ఈ లోకంలో సుఖంగా జీవించటానికి అవసరమయ్యే కోరికలు కోరతారు. అంటే సిరిసంపదలు, భోగభాగ్యాలు, పదవులు, ధనము, ధాన్యము. మొదలైనవి కావాలి అని అడుగుతారు. వీరు కర్మలు చేస్తారు. ఆ కర్మఫలితంగా తమకు కావలసిన వాటిని పొందుతారు.

మోక్షవాదులకు కావలసినది ఐహిక సుఖాలుకాదు. పాపపుణ్యాలతో వీరికి పని లేదు. వీరికి కావలసింది కేవలము జీవాత్మ పరమాత్మల ఏకీభావము. అదే సాయుజ్యము. అటువంటి వారికి భవబంధనాలు ఉండకూడదు. ఈ లోకంతో ఏ రకమైన సంబంధము లేని వారే ఆ స్థితిని చేరతారు. అటువంటి వారికి ఆ బంధాలు త్రెంచి వేసేవాడు.

పూర్వకాలంలో ఒకసారి కృష్ణార్జునులిద్దరూ కలిసి వెడుతున్నారు. త్రోవలో ఒక బిక్షగాడు ఆకలితో అలమటిస్తూ ఒక ఇంటిముందు నుంచుని బిక్ష అడుగుతున్నాడు. ఇంటియజమాని అప్పుడే భోజనం చేసి, ఉయ్యాల మీద కూర్చుని ఊగుతూ తాంబూలం వేసుకుంటున్నాడు. బయట నుంచి బిచ్చగాడి అరుపులు వినిపించినాయి. 'ఏం లేదు

ఫో' అన్నాడు. బిచ్చగాడు మళ్ళీ అరిచాడు. 'పొమ్మంటుంటే నీక్కాదూ ? ఫో–ఫో' అన్నాడు ధనవంతుడు. ఇదంతా చూస్తున్న పరమాత్ముడు' ఆ ధనవంతుడి ధనం పదిరెట్లు పెరగాలి' అని దీవించాడు.

ఇంకా కొంతదూరం వెళ్ళేసరికి ఒక ఇంటిలో వృద్ధ బ్రాహ్మణుడు భోజనం చెయ్యబోతున్నాడు. అతడు చాలా బీదవాడు. సరిగ్గా ఆ సమయంలో వాకిట్లో నుంచి ఒక బిచ్చగాడు కేకలు పెట్టాడు. 'భోజనం చేసి మూడు రోజులయింది. ప్రేగులు ఉండచుట్టుకు పోతున్నాయి. పట్టెడు అన్నం ఉంటే పెట్టండి' అని అరుస్తున్నాడు. బ్రాహ్మణుడు తను తినబోయే అన్నాన్ని అతడికి దానం చేశాడు. పరమాత్ముడు 'నీకు ఇదికూడా లేకుండా పోవుగాక' అన్నాడు.

ఆ మాటలు విన్న అర్జునుడికి చాలా బాధ కలిగింది. "పిల్లికి కూడా బిచ్చం పెట్టనివాడి సంపద పదిరెట్లు కావాలి అన్నావు. ఇలా దానం చేసిన బ్రాహ్మణుడికి ఇదికూడా లేకుండా పోవాలి" ఇదేమి న్యాయము ? అంటూ కృష్ణుణ్ణి అడిగాడు. దానికి ఆ పరాత్పరుడు

"అర్జునా ! ధనవంతుడి సంపద ఇంకా ఇంకా పెరిగితే అతడు నన్ను తలవను కూడా తలవడు. కేవలము ధనం సంపాదించి సంసార బంధనాల్లో కూరుకుపోయి గానుగకు కట్టిన ఎద్దులాగా తిరుగుతుంటాడు. ఇక ఈ బ్రాహ్మణుడు ఉన్నాడే అతడు పరమభక్తుడు. మోక్షవాది. అతడికి సాయుజ్యం రావాలంటే భవబంధనాలు పూర్తిగా తెగిపోవాలి. అందుకే అలా అన్నాను" అంటాడు.

ఈ రకంగా తనను చేరాలి అనుకునే వాళ్ళ భవబంధాలను తెంచివేస్తాడు శ్రీమన్నారాయణుడు 'ఉద్భవః' అనబడుతున్నాడు.

ఇతని నుండే జగత్తు ఆవిర్భవించింది. ఇతని నుండే సంసారము ఉద్భవించింది. అన్నింటికీ కారణము ఇతడే కాని ఇతడికి మాత్రం సంసారం లేదు. ఏ రకమైన బంధనాలు లేవు.

**వరులుగారు నాకు వరులకు నేనౌదు**
**వంటివాడను చుట్టమొకడు లేడు**

అంటాడు 'వామనావతార ఘట్టం'లో అతడికి ఎవరూ లేరు. ఎవరితోనూ పని లేదు. కేవలము ఏకాకి ఆది మధ్యాంతరహితుడు. జన్మమృత్యు జరాదులు లేనివాడు.

# 374. క్షోభణః

కలత పెట్టువాడు.

**ప్రకృతే ర్బందనార్హాణాం క్షోభణాత్ క్షోభణ స్స్మృతః**

ప్రకృతిని దానిచే బంధించబడిన జీవరాశులను క్షోభింపచేసి జన్మించునట్లు చేయువాడు.

**క్షోభయతీతి క్షోభణః** బంధించబడిన జీవరాశులను, వాటిని బంధించిన ప్రకృతిని క్షోభింపచేసి మరల సృష్టించువాడు.

మహాప్రళయం సంభవించింది. అప్పుడు జగత్తు అంతా లయమైపోయింది. జీవరాశి అంతా నశించిపోయింది. ఇందులో కర్మక్షయం అయిన జీవులకు సాయుజ్యం లభిస్తుంది. కాని అన్ని జీవులకు ఒకేసారి కర్మక్షయం కాదు. మరి అటువంటి కర్మక్షయం కాని జీవులు తమ కర్మను తమతో మూటకట్టుకొని మాయలో కలుస్తాయి. అలాగే

భూమి – నీటిలో కలిసిపోతుంది
నీరు – అగ్నిలో కలిసి పోతుంది
అగ్ని – వాయువులో కలిసిపోతుంది
వాయువు – ఆకాశంలో కలిసి పోతుంది

మిగిలిన భూతాలన్నింటినీ తనలో కలుపుకున్న ఆకాశం మాయలో లీనమై పోతుంది.

ఈ రకంగా అన్నింటినీ తనలో కలుపుకున్న మాయ, ఆ పరమేశ్వరునిలో లీనమై పోతుంది. ఇప్పుడు పంరమేశ్వరునిలో కర్మక్షయం కాని జీవరాశి అంతా చేరి ఉన్నదన్న మాట. ఈ జీవరాశి చేసిన కర్మ పరిపక్వం కాగానే మళ్ళీ సృష్టి జరుగుతుంది. ఈ కర్మ పరిపక్వం చెదంటానికి క్షోభణ కలిగించేవాడే పరమేశ్వరుడు. **విష్ణుపురాణంలో**

**ప్రకృతిం పురుషం చైవ ప్రవిశ్యాత్మేచ్ఛ యా హరిః ।**
**క్షోభయా మాస భగవాన్ సర్గకాలే వ్యయావ్యయౌ ॥**

శ్రీహరి తన ఇష్టానుసారము సృష్టి కాలమందు ప్రకృతి పురుషులయందు ప్రవేశించి క్షోభింపచేశాడు.

అంతేకాదు. ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి మొదలైన వాటిలో సంచలనం కలగటానికి కారణం ఆత్మ. అసలు ఆత్మే లేకపోతే ఇంద్రియాలకు చైతన్యమే ఉండదు. అందుకే ఆత్మస్వరూపుడైన శ్రీమన్నారాయణుడు 'క్షోభణః' అనబడుతున్నాడు.

# 375. దేవః

క్రీడించువాడు

**వ్యాఘ్రాదివ జీవతతేః మాయాపాశేన బంధనమ్ ।**

**కృత్వా నిత్యం క్రీడయతి యః స దేవః పరికీర్తితః ॥**

జీవులను మాయ అనే పాశముచేత బంధించి సింహము, మేక, పులి, ఏనుగు, అంటూ వివిధ రకాల ఆకారాలను ఇచ్చి ఆడించేవాడు.

**దీవ్యతి క్రీడతీతి ఇతి దేవః** మాయాపాశముతో జీవులను బంధించి క్రీడించేవాడు.

సృష్టి మొదలైన వ్యాపారములతో క్రీడించువాడు.

జీవులు చేసిన కర్మను బట్టి వాటికి ఉత్తరజన్మ కలగటం జరుగుతుంది. ఉత్తమమైన కర్మలు చేసినవారు ఉత్తమ యోనులందు జన్మిస్తారు. నీచకర్మలు చేసిన వారు నీచ యోనులందు పశుపక్ష్యాదులుగా జన్మిస్తారు. అంతకన్నా ఘోరమైన కర్మలు చేసినవారు క్రిమికీటకాలుగా జన్మించి అనతికాలంలోనే మరణిస్తారు. ఈ రకంగా సృష్టి వ్యాపారముతో క్రీడించేవాడు ఆ పరమేశ్వరుడు.

పరమేశ్వరుని ముఖ్యమైన లక్షణము దుష్టులను, దుర్మార్గులను శిక్షించటము అసుర ప్రవృత్తి గల వారిని అంటే – సత్త్వగుణ ప్రధానులను హింసించేవారు, యజ్ఞ యాగాదులు నాశనం చేసేవారు, 'దేహమే ఆత్మ' అని ప్రచారం చేసేవారు. వీరందరినీ నాశనం చెయ్యాలనే తలంపుగలవాడు.

పరమేశ్వరుడు సర్వవ్యాపి. సర్వాంతర్యామి అన్నింటియందు ఉన్నాడు. **బృహదారణ్యకోపనిషత్తు**లో చెప్పినట్లుగా అతడు భూమి, ఆకాశము, అంతరిక్షము, సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు. ఒకటేమిటి ? ప్రతిచోటా ఉన్నాడు. అన్నింటిలోనూ ఉంటూ అన్నింటినీ తానే నియంత్రిస్తున్నాడు.

మానవులంతా దేవతలను పూజిస్తారు. ఆ దేవతలచేత పూజింపబడే దేవాదిదేవుడు అటువంటి పరమేశ్వరుడు 'దేవః' అనబడతాడు. **శ్వేతాశ్వరోపనిషత్తు**లో

**ఏకోదేవః సర్వభూతేషు గూఢః**

అన్ని భూతములందు అంతర్గతంగా ఉండి ప్రకాశించేది ఆ పరమేశ్వరుడే.

అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'దేవః' అనబడుతున్నాడు.

# 376. శ్రీగర్భః

లక్ష్మిని వర్ధిల్లి చేయువాడు.

**శ్రీః క్రీడా భోగసాహిత్యాత్ వర్ధనీయా హరే రితి శ్రీగర్భః**

లక్ష్మీదేవి శ్రీమన్నారాయణునికి సృష్ట్యాది క్రీడలయందు భోగములందు చేదోడు వాదోడుగా ఉండి, వాటిని రసవంతముగా చేస్తుంది. కాబట్టి అతడికి ఆమె గర్భమువలె వృద్ధి పొందించదగినదిగా ఉంటుంది.

**శ్రీగర్భః యస్యసః శ్రీగర్భః**

భోగము, క్రీడ సహాయంతో లక్ష్మిని సంతసింపచేసి వర్ధిల్లి చేయువాడు.

**దేవీభాగవతం**లో మధుకైటభుల సంహారం జరిగింది. ఆ సమయంలో రుద్రుడు కూడా అక్కడకు వచ్చాడు. ఇప్పుడు త్రిమూర్తులు ముగ్గురూ అక్కడే ఉన్నారు. ఆ సమయంలో దివ్యమైన విమానం ఒకటి వచ్చి అక్కడ ఆగింది. అందులోనుంచి ఒక స్త్రీమూర్తి క్రిందికి దిగి త్రిమూర్తులను అందులో ఎక్కమంది. మారుమాట్లాడకుండా విమానం ఎక్కారు వారు. విమానం బయలుదేరింది. అడవులు, కొండలు, కోనలు, సముద్రాలు దాటిపోతున్నది. త్రోవలో సత్యలోకం కనిపించింది. బ్రహ్మ దేవుడు వాణీ సమేతుడై అక్కడ ఉన్నాడు. ఆశ్చర్యపోయారు త్రిమూర్తులు. బ్రహ్మ తమ వద్దనే ఉన్నాడు మరి ఆ బ్రహ్మ ఎవరు ? ఇలా ఆలోచిస్తుండగానే వైకుంఠం వచ్చింది. అక్కడ శ్రీమహావిష్ణువు ఉన్నాడు. ఇంకా ముందుకు వెళ్ళింది విమానం కైలాసం కనుపించింది. శివుడు పార్వతీ సమేతుడై ఎద్దునెక్కి పోతున్నాడు. ఇంతలో అనేక లోకాలు దేవతలు, గంధర్వులు అందరూ కనిపిస్తున్నారు. తాము ఇంకా సృష్టి ప్రారంభించలేదు. మరి వీరంతా ఎక్కడినుంచి వచ్చారు? అలా కొంతదూరం వెళ్ళి విమానం ఒక ద్వీపం దగ్గర ఆగిపోయింది. అదే మణి ద్వీపమయి ఉంటుంది. చిత్రవిచిత్రకాంతులతో ధగధగాయమానంగా మెరుస్తోంది. అక్కడ శ్రీచక్రంమీద ఒక స్త్రీమూర్తి ఆసీనురాలై ఉన్నది. ఆవిడే పరమేశ్వరి కాబోలు అనుకున్నారు. త్రిమూర్తులు ఆ దేవిని వివిధ రకాలుగా స్తుతించారు. అప్పుడు బ్రహ్మ ఆ దేవిని 'అమ్మా' నీవెవరు ? నీ తత్త్వం ఏమిటి ? అని అడిగాడు. అప్పుడు ఆమె తన తత్త్వాన్ని వివరించి, తన నుంచి మూడు శక్తులను సృష్టించి, వీరు మీ ముగ్గురికీ సృష్టికార్యంలో సహాయకారిగా ఉంటారు. అంటూ బ్రహ్మదేవుడికి – సరస్వతీదేవిని, విష్ణుమూర్తికి – లక్ష్మీదేవిని, రుద్రుడికి – కాళిని ప్రసాదించి, బ్రహ్మ సృష్టికార్యము చేస్తాడు. మీరిద్దరూ ఆయనకు సహాయకారులుగా ఉండండి. అని చెప్పి పంపుతుంది.

ఆ రకంగా విష్ణుమూర్తికి, లక్ష్మీదేవి లభించింది. విష్ణుపురాణంలో చెప్పినట్లుగా

**విష్ణోరేషాఽనపాయినీ** లక్ష్మివిష్ణువును వదలి ఉండదు. అటువంటి లక్ష్మిని వర్ధిల్ల చేయువాడు. శ్రీఅనగా–జగద్రూపమైన విభూతి. అటువంటి విభూతిని గర్భమునందు గలవాడు.

సకలైశ్వర్యములు గలవాడైన పరమేశ్వరుడు 'శ్రీగర్భః' అనబడతాడు. ఈ జగత్తునంతా తనకుక్షియందు దాచుకున్నాడు కాబట్టి 'శ్రీగర్భః' అనబబడతాడు.

# 377. పరమేశ్వరః

పరమేశ్వరుడు

**పారమైశ్వర్య యుక్త త్వాత్పరమేశ్వరః** ఈ రకంగా లక్ష్మి ఉండటంచేత పరమైశ్వర్యము గలవాడు.

**పరమశ్చాసౌ ఈశ్వరశ్చ పరమేశ్వరః**

లక్ష్మి తనతో ఉండటంచేత పరమైశ్వర్య ఫలము పొందినవాడు.

పరబ్రహ్మ అందరికన్నా అధికుడు. సర్వులకు ఈశ్వరుడు (ప్రభువు) కాబట్టి సర్వేశ్వరుడు. పరమపదానికి ఈశ్వరుడు కాబట్టి పరమేశ్వరుడు. అతడిని మించినవారు కాని, అతనితో సమానవమైన వారుగని వేరెవరూ లేరు. అన్నింటికన్నా అతడే ఉత్కృష్టమైన పరమపదము. చరాచర జగత్తుకూ కారణము అతడే. సృష్టి స్థితిలయాలకు కారణం అతడే. జీవులు చేసిన కర్మననుసరించి వారికి ఫలితాన్ని ఇస్తాడు. ఉత్తరజన్మలు ఇస్తాడు. జీవుల కర్మననుసరించే వారికి దేహము ఇంద్రియాలు వస్తాయి. కర్మ నశించినప్పుడే దేహము కూడా నశిస్తుంది. మళ్ళీ కర్మ చెయ్యటానికి ఈ లోకంలో పుడుతుంది.

ఈ రకంగా జీవి ఈ లోకంలో జన్మిస్తూ, కర్మచేస్తూ, కర్మఫలాన్ని అనుభవించి మరణిస్తూ ఉంటుంది. కర్మక్షయమయ్యేదాకా ఇలానే జరుగుతుంది. ఏ రకమైన కర్మ సంబంధం లేనివాడు పరమేశ్వరుడు.

**లలితా సహస్రంలో 396వ నామము పరమేశ్వరీ**

# 378. కరణమ్

సాధనంగా ఉండేవాడు.

**స్వప్రాప్తేః కారణతమం జీవానాం కరణం విదుః** కరణము అంటే – చాలా తేలిక అయిన సాధనము భక్తులు తనను పొందటానికి తానే తేలిక అయిన సాధనముగా ఉండువాడు.

**క్రియతే ఇతి కరణమ్** స్వప్రాప్తి సాధనలో శ్రేష్ఠమైనవాడు. స్వప్రాప్తి సాధన అంటే తనను పొందటానికి తానే సాధన అనటము. **మహోపనిషత్తు**లో

నేత్రానికి కనిపించేది నారాయణుడే. శ్రోత్రానికి వినిపించేది నారాయణుడే. సర్వమూ నారాయణుడే. అని చెప్పబడింది. కాబట్టి భక్తులు చేరవలసినది శ్రీమన్నారాయణునే. చేరే సాధనము కూడా శ్రీమన్నారాయణుడే.

జగదుత్పత్తికి సాధనము తానే అయి భగవానుడు. 'కరణమ్' అని తెలియబడు తున్నాడు **సాధనతమం కరణం** ఏ పనినైనా సాధించటానికి ఉపయోగించే సాధనాన్ని కరణము అంటారు. సృష్టి విషయంలో పరమేశ్వరుడే సాధనము కాబట్టి అతడే 'కరణం' అనబడుతున్నాడు. పరమేశ్వరుని పొందే మార్గము, సాధనము కూడా ఆ పరమేశ్వరుడే. అందుకే శ్రీమన్నారాయణుడు 'కరణమ్' అనబడుతున్నాడు.

# 379. కారణమ్

రక్షించువాడు

**జీవానాం చక్షురాదీన్యో హేతూన్ కారయతీతి యః ప్రోచ్యతే కారణం**

భక్తుల యొక్క ఇంద్రియాలను వారు కోరిన పనులు చేసేటట్లు చేయువాడు.

**కారయతీతి కారణమ్**

ఆయా సాధనములచేత ప్రాణులకు ఆయా కార్యములు ఒనర్చుదేవతగా ఉండువాడు.

ఇంద్రియాలు తమ భక్తుల ఇష్టానుసారము పని చెయ్యాలి. అలా కావాలంటే ఇంద్రియాలలో చైతన్యము కావాలి. ఆ చైతన్యము పరమేశ్వరుడే కన్ను స్వయంగా చూడలేదు. కంటికి చూపునిచ్చేది చైతన్యము. చెవికి వినికిడి శక్తినిచ్చేది చైతన్యము. అదే ఆత్మ. మనసుకు ఆలోచించే శక్తినిచ్చేది ఆత్మ. అదే పరమేశ్వరుడు.

ఈ రకంగా పరమేశ్వరుడు ఇంద్రియాలకు ఆ పని చేసే శక్తినిచ్చి రక్షిస్తున్నాడు.

జగదుత్పత్తికి ఉపాదాన కారణము, నిమిత్తకారణముకూడా అతడే. జగత్తులో జరిగే ప్రతి పనికీ కారణము ఆ పరమేశ్వరుడే. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'కారణమ్' అనబడుతున్నాడు.

# 380. కర్తా

కారణభూతుడు.

**కర్తా స్వతంత్రః పరికీర్తితః** కర్మఫలమయిన సుఖదుఃఖాలను జీవులు తమవిగా భావిస్తారు. పరమేశ్వరుడు వాటిని అంతకన్నా ఎక్కువగా తనవిగా భావిస్తాడు.

**కరోతీతి కర్తా**

కర్మఫలము అనుభవిస్తున్న జీవుడు తన సుఖదుఃఖాలను ఏ రకంగా అభిమానిస్తాడో అలాగే పరమేశ్వరుడు కూడా జీవుల సుఖదుఃఖాలను వారికన్న ఎక్కువగా అభిమానిస్తాడు.

**రామాయణం**లో శ్రీరాముడు మనుష్యులకు కష్టాలు వచ్చినప్పుడు ఎక్కువగా దుఃఖిస్తాడు. వారు ఆనందంగా ఉన్నప్పుడు తండ్రివలె ఆనందిస్తాడు అని చెప్పబడింది.

స్వతంత్రుడైన భగవానుడు 'కర్తా' అనబడతాడు. లోకంలో పరమేశ్వరుడొక్కడే స్వతంత్రుడు. తాను స్వతంత్రుడైనప్పటికీ సంసార సాగరంలో పడి నలిగిపోతున్న వారి మీద దయ కలిగి ఉంటాడు. అన్ని కర్మలు తన సాన్నిధ్యమునందే నడపబడుతుండటం చేత భగవానుడు 'కర్తా' అనబడుతున్నాడు.

## 381. వికర్తా

స్వతంత్రుడు

**వికుర్వాణో వికర్తాయో హర్షశోకాదిభిస్స్మృతః** తన భక్తులు సుఖదుఃఖాలనుభవిస్తుంటే చూసి వారితో పాటుగా తనుకూడా వికారము పొందేవాడు.

**వికరోతీతి వికర్తా** జీవులు కర్మఫలము అనుభవిస్తుంటే చూసి తానుకూడా మనోవికారము పొందేవాడు.

**విచిత్రం భువనం క్రియతే ఇతి వికర్తా**

ఇతనిచేత అనేక విధాలయిన ప్రపంచము నిర్మించబడుతున్నది.

విచిత్రమైన భువన నిర్మాతమై వికర్తా అనబడుతున్నాడు. పరమేశ్వరుని అవతార విశేషములు చిత్రవిచిత్రముగా ఉండటంచేత ఆయన 'వికర్తా' అనబడతాడు. జీవుల సుఖ దుఃఖములను చూస్తున్నాడు కాబట్టి ఇతని శక్తి సామర్థ్యములను తేలికగా తెలుసుకోలేము.

## 382. గహనః

వికారము పొందేవాడు. 544వ నామం ఇదే.

**బుధ్యాయతన భోగోపకరణాదిషు దేహినామ్**

**తదభిన్నాభిమానాత్మా మహాగుణ గణేషు చ**

**గహనోహ్యతి భూమిత్వాత్ ॥**

భక్తులయొక్క జ్ఞానానికి ఆధారమైన ఆత్మయొక్క భోగాలు, భోగసాధనాలు తానే, అవి తనవే అని భావించేవాడు.

అగోచరుడుగా ఉండేవాడు. ఇటువంటివాడు అని చెప్పటానికి వీలు కానివాడు.

అతడు ఆకాశంలో ఉంటాడు. ఆకాశం అతన్నెరగదు. నీటిలో ఉంటాడు. నీరు అతన్నెరగదు. దేవతలతోనే ఉంటాడు. కాని దేవతలు కూడా అతన్నెరగరు. ఇతని స్వరూపముగాని, సామర్థ్యముగాని, ఇటువంటిది అని ఎవరికీ తెలియదు.

గ్రహించశక్యము కానివాడు భగవానుడు. భగవానుడు స్వరూపము అగ్రాహ్యాము. అనూహ్యాము ప్రవర్తనకూడా అనిర్వచనీయము. ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి అన్నీ అతని చేతనే నడపబడుతుంటాయి. భక్తులమీద అతనికి ఉన్న ప్రేమ అపారము.

## 383. గుహః

అగోచరమైనవాడు

**రాక్షతీతి గుహస్స్మృతః** లోకాలను రక్షించువాడు

**గుహతీతిగుహః** కంటికి కనిపించనివాడు. తనస్వభావముతో స్వరూపమును కప్పి పుచ్చుకొనువాడు. **భగవద్గీత**లోని ఏడవ అధ్యాయం **'జ్ఞానయోగం'**లోని 25వ శ్లోకంలోవి.

**నాహం ప్రకాశ సర్వస్య యోగమాయాసమావృతః**

**మూఢోఽయం నాభిజానాతి లోకో మామజమవ్యయమ్**

నా యోగమాయ యందు దాగి ఉన్న నేను అందరికీ గోచరించను. కాబట్టి అజ్ఞానులు నన్ను జన్మరహితునిగా, శాశ్వతునిగా తెలుసుకోలేరు. అంటారు.

భగవంతుడు తను కనిపించకుండానే అన్నింటినీ కనిపెట్టి పోషించేవాడు. అతడు హృదయము అనే గుహలో ఉంటాడు కాబట్టి 'గుహుడు' అనబడతాడు.

**భాగవతంలో గూఢోగుహాశయః సాక్షీ మహాపురుష ఈశ్వరః**

**శ్వేతాశ్వరోపనిషత్తులో సర్వభూతేషుగూఢః**

**ముండకోపనిషత్తులో నిహితం గుహాయాం**

అని చెప్పబడింది. పరమేశ్వరుడు అన్ని భూతములందు రహస్యముగా ఉన్నాడు. అంతర్యామిగా ఉన్నాడు. అందుకే శ్రీమన్నారాయణుడు 'గుహః' అనబడుతున్నాడు.

అంటూ వాసుదేవుని గూర్చి వివరించాడు రత్నాకరుడు.

# 28. ధ్రువమూర్తి

గురువుగారూ !ఉత్తానపాదుని కుమారుడైన ధ్రువుడు కూడా విష్ణుమూర్తి అవతారమే కదా ! ఆ ధ్రువమూర్తిని వివరించండి అన్నాడు నారాయణభట్టు. వివరించటం మొదలు పెట్టాడు రత్నాకరుడు.

బ్రహ్మ మానసపుత్రుడు స్వాయంభువ మనువు. అతని భార్య శతరూప. వారికి ఇద్దరు కుమారులు.

1. ప్రియవ్రతుడు 2. ఉత్తానపాదుడు.

ఉత్తానపాదుడికి ఇద్దరు భార్యలు. 1. సురుచి 2. సునీతి.

సురుచి కుమారుడు – ఉత్తముడు

సునీతి కుమారుడు – ధ్రువుడు

ఉత్తానపాదుడికి సురుచి అంటే అభిమానం ఎక్కువ.

ఒకరోజున ఉత్తానపాదుడు సురుచి కుమారుడైన ఉత్తముని తొడమీద కూర్చొబెట్టుకుని ముద్దులాడుతున్నాడు. ఆ సమయంలో ఐదు సంవత్సరాలవాడైన ధ్రువుడు అక్కడికి వచ్చాడు. తండ్రి దగ్గరకు వచ్చి అతనివడిలో కూర్చోబోయాడు. ఉత్తానపాదుడు సురుచికి భయపడి ధ్రువుణ్ణి దగ్గరకు తీసుకోలేదు.

సురుచి ధ్రువుణ్ణి ప్రక్కకు నెట్టివేసి “నువ్వు నా కడుపున పుట్టలేదు కాబట్టి నీకు తండ్రిగారి తొడపైన కూర్చునే అర్హతగాని, సింహాసనమధిష్టించే అధికారముగాని లేవు. నీకు ఆ అర్హత, అధికారము కావాలి అంటే అడవులకు పోయి తపస్సుచేసి భగవంతుణ్ణి ప్రార్థించు. ఆయన అనుగ్రహము సంపాదించు. ఆ తరువాత నా కుమారుడిగ పుట్టు. అప్పుడు నీకా అదృష్టం దక్కుతుంది” అన్నది.

ఆ మాటలు విన్న ధ్రువుడు ఏడుస్తూ తన తల్లి దగ్గరకు వెళ్ళాడు. జరిగిన అవమానం పరిచారికల వల్ల తెలుసుకుని ధ్రువుని తల్లి సునీతి కూడా బాధపడింది. కాని ఏమీ చెయ్యలేదు. అందుచేత కొంతసేపటికి తెప్పరిల్లి “నాయనా ! నీ సవతి తల్లి చెప్పిన మాటలు నిజము. నువ్వు నీ తండ్రి వడిలో కూర్చోవాలంటే ఆ విష్ణుమూర్తిని శరణువేడాల్సిందే. అతడు తప్ప ఇంకెవరూ నీ దుఃఖాన్ని తొలగించలేరు” అన్నది.

తల్లి బాధను అర్థం చేసుకున్నాడు ధ్రువుడు. పట్టణాన్ని వదిలి అడవులవైపు ప్రయాణం సాగించాడు. త్రోవలో నారదమహర్షి కనిపించాడు. ధ్రువుడి పరిస్థితి అర్థం చేసుకున్నాడు.

నారదమహర్షి ఆ బాలకుడితో "నాయనా ! చేసిన కర్మనుబట్టి దుఃఖము వస్తుంది. ఏది వచ్చినాదైవేచ్ఛ అని తృప్తిపడటం బుద్ధిమంతుల లక్షణం. నువ్వు తపస్సు చెయ్యలేవు. తిరిగి ఇంటికి వెళ్ళు" అన్నాడు.

ఆ మాటలు విన్న ధ్రువుడు "నారదమునీంద్రా ! నాకు అవన్నీ తెలియవు. నువ్వు చెప్పే మాటలు నాకు అర్ధం కావు. నా సవతి తల్లి మాటలతో నా హృదయం చిల్లులుపడింది. నువ్వు త్రిలోకసంచారివి. అన్ని విషయాలు తెలిసినవాడవు. నా పూర్వులెవరూ పొందని పదవి పొందాలని నా కోరిక. దానికి ఏదైనా మార్గం తెలియచెయ్యవలసినది" అన్నాడు.

ధ్రువుని మాటలకు సంతసించిన నారదమహర్షి "యమునానదీతీరంలో 'మధు వనము' అనే పవిత్రమైన వనమున్నది. అక్కడ నదిలో స్నానంచేసి భగవంతుణ్ణి ధ్యానం చేస్తూ కూర్చో. అతడు కరుణించేదాకా లేవవద్దు" అన్నాడు. మహర్షి చెప్పినట్లే చేశాడు ధ్రువుడు. అతడి భక్తికి, పట్టుదలకు సంతసించి శ్రీహరి ప్రత్యక్షమై "బాలకా ! నీ కోరిక నాకు తెలిసింది. అనితరసాధ్యమైన ధ్రువలోకము నీకివ్వగలను. అది శాశ్వతమైనది. కల్పాంతమందు కూడా నశించనిది. నక్షత్రాలతో పాటుగా యముడు, కశ్యపుడు, ఇంద్రుడు, సప్తఋషులు దానికి ప్రదక్షిణలు చేస్తారు. నీవు ఆ లోకానికి అధిపతివి అవుతావు. నీ తండ్రి నిన్ను రాజును చేసి అడవులకు వెడతాడు" అని చెప్పి అంతర్ధానమైనాడు.

భగవదనుగ్రహం పొందిన ధ్రువుడు తిరిగి రాజ్యానికి వెళ్ళాడు. కుమారుని తపస్సు, భగవదనుగ్రహము మొదలైన విషయాలను నారదుని వల్ల విన్న ఉత్తానపాదుడు, రాజ్యాన్ని ధ్రువునకు అప్పగించి వానప్రస్థానికి వెళ్ళిపోయాడు.

తరువాత 20 వేల సంవత్సరాలు జనరకంజకంగా రాజ్యంచేసి తదనంతరము ధృవలోకానికి అధిపతి అయినాడు ఉత్తానపాదుని కుమారుడైన ధ్రువుడు. ఇతన్ని ఆ లోకానికి అధిపతిగా చేసిన ధ్రువమూర్తి అయిన శ్రీమన్నారాయణుడు.

అతడు నక్షత్రాలకు ఆధారమైన ఆకాశము శరీరముగా కలవాడు. కల, కాష్ఠ, ముహూర్తము మొదలైన భాగాలతో కాలాన్ని విభజించిన కాలపురుషుడు. జీవులకు ఆఖరిస్థానము అదే గమ్యస్థానము అతడే. ప్రళయకాలంలో జీవులన్నీ అతని యందే లీనమైపోతాయి. అతడే పరమపదము నిచ్చేవాడు. తనను ఆరాధించే వారికి, తన తత్త్వాన్ని తెలుసుకొన్నవారికి పరమపదమైన వైకుంఠాన్ని ప్రసాదించి తనలో లీనం చేసుకుంటాడు. అతడే శ్రీమన్నారాయణుడు. సామాన్యమైన ధ్రువుడికి ఉన్నత స్థానమిచ్చి 'ధ్రువమూర్తి' అనబడుతున్నాడు.

ఈ విషయం 384 నుంచి 388 వరకు నామాలలో వివరించబడింది. ఇక నామాలను చూద్దాం.

## 384. వ్యవసాయః

బంధించువాడు.

**జ్యోతిశ్చక్రమ్ ధృవేనిత్యం సీయ తే బంధ్యతే యతః**
**వ్యవసాయస్తతో జ్ఞేయో భగణాధార మూర్తిమాన్**

నక్షత్రాలకు ఆధారమైన ఆకాశము శరీరముగా కలవాడు. అక్కడ ఉండే జ్యోతిశ్చక్రాన్ని తన యందు బంధించుకొని ఉండేవాడు.

**విశేషేణ అవసీ యతే బధ్యతే జ్యోతిశ్చక్రమితి వ్యవసాయః**

ధృవుడు నక్షత్రాల కాధారమైన ఆకాశాన్ని శరీరముగ గలవాడు. తేజశ్చక్రాన్ని తనయందు బంధించుకొన్నవాడు.

వ్యవసాయః అంటే – నిశ్చయాత్మకమైన జ్ఞానము. పరమేశ్వరుడు నిరాకారుడు, నిరంజనుడు, నిర్గుణుడు. కేవలము జ్ఞానస్వరూపుడు. పరమేశ్వర స్వరూపము అంటే తేజోమయమైన కాంతిపుంజము. అదే జ్ఞానజ్యోతి. ఆ కాంతులవల్లనే లోకాలన్నీ ప్రవర్తిల్లుతున్నాయి. అందుకే పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు 'వ్యవసాయః' అనబడుతున్నాడు.

ఎన్ని అడ్డంకులు వచ్చినా మానవాభ్యుదయానికి కృషిచేస్తాడు కాబట్టి 'వ్యవసాయః అనబడుతున్నాడు. వ్యవసాయము అంటే – యోగము అని కూడా అర్థము. గమ్యముచేరే వరకు చేసే తీవ్ర ప్రయత్నమే వ్యవసాయము. **భగవద్గీత**లోని రెండవ అధ్యాయము **'సాంఖ్యయోగము'**లోని 41వ శ్లోకము.

**వ్యవసాయాత్మికా బుద్ధిః ఏకేహ కురునందనః ।**
**బహుశాఖా హ్యనంతాశ్చ బుద్ధయోఽ వ్యవసాయినామ్ ॥**

ఓ అర్జునా ! నిష్కామకర్మయోగమందు నిశ్చయాత్మకమైన బుద్ధి ఒకటే ఉంటుంది. కాని బోగాసక్తులైన వివేకహీనుల బుద్ధులు చంచలములై ఒకదారీ తెన్నూ లేక కోరికల వెంట నాలుగువైపులకూ పరుగులు తీస్తూ అనంతములుగా ఉంటాయి.

సమభావంతో కూడిన నిశ్చలమైన బుద్ధినే ఇక్కడ వ్యవసాయము అంటారు.

కర్మయోగములో నిశ్చయముతో కూడిన బుద్దే ఉండాలి. అదే బుద్ధితో భగవానుడు సర్వవ్యవస్థితికి ఆధారమై ఉన్నాడు.

## 385. వ్యవస్థానః

వ్యవస్థను కావించువాడు.

**కలాముహూర్తాది మయః ధ్రువే కాలోఽ పతిష్టతే**
**యస్మాత్తస్మా ద్వవస్థానో హ్యష్టార్ణ స్థానదోమనుః**

కల, ముహూర్తము మొదలగు కాలమంతా తనయందే ఆధారపరచి ఉండేవాడు.

**వ్యవతిష్ఠతే అస్మిన్నితి వ్యవస్థానః**

వివిధరకాలుగా విభజించబడే కాలమును తనయందే స్థాపించబడి ఉండేవాడు.

సప్తశతిలో శుంభనిశుంభుల వధానంతరము ఇంద్రాది దేవతలు ఆ పరమేశ్వరిని పరిపరివిధాల ధ్యానిస్తారు.

**కలాకాష్ఠాది రూపేణ పరిణామప్రదాయిని ।**
**విశ్వస్యోపరతౌశక్తే నారాయణి నమోస్తుతే ॥**

| | | |
|---|---|---|
| కాష్ఠ అంటే | – | 18 రెప్పపాట్లకాలము |
| కల అంటే | – | 30 కాష్ఠలకాలము |
| ముహూర్తము అంటే | – | 12 క్షణాలకాలము |

ఈ రకంగా కాలంలో మార్పులు కలిగించేదేవీ నారాయణీ ! నీకు నమస్కారము.

ఈరకంగా కాలాన్ని వివిధరకాలుగా విభజించి, తనయందే స్థాపించుకున్నవాడు. అనగా పరమేశ్వరుడు కాలపురుషుడు.

వ్యవస్థానం అంటే – అమరిక అని అర్థం.

అన్ని వ్యవహారాలను యధావిధిగనడిపేవాడు. కాబట్టి 'వ్యవస్థానః' అనబడుతున్నాడు. సర్వానికి తానే ఆధారమైనవాడు. జగద్రక్షణ చేసేవాడు. జీవులను అండజములు, స్వేదజములు, జారజములు, ఉద్భిజములు అని విభజించినవాడు. మానవులను వారి వృత్తులను బట్టి బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రులుగా విభజించినవాడు. బ్రహ్మచర్యము, గృహస్త్రాశ్రమము, వానప్రస్తము, సన్యాసము అనే చతురాశ్రమాలను ఏర్పరచినవాడు. ఈ రకంగా అన్నింటినీ విభజించి వ్యవస్థను ఏర్పాటుచేశాడు. కాబట్టి 'వ్యవస్థానః' అనబడుతున్నాడు.

## 386. సంస్థానః

సమాప్తిగా ఉండేవాడు.

**ధృవేసమాప్యత ఇతి సంస్థాన సర్వముచ్యతే**

అన్నీ అతనియందే సమాప్తమయ్యేటట్లుగా ఉండేవాడు.

**సంతిష్ఠతే సమాప్యతే అస్మిన్నితి సంస్థానః** సమస్తము తనయందే ముగియునట్లు ఉండేవాడు. సంస్థానం – లెస్స అగు నిలకడ. ప్రళయకాలంలో అన్నిజీవులు అతనియందు నిలకడగా ఉంటాయి. ఆ సమయంలో జగత్తులోని అన్ని ప్రాణులు, తత్త్వములు కూడా ఆ పరమేశ్వరుని యందే చేరతాయి. అన్నీ అతనిలోనే లమయవుతాయి.

జీవులకు గమ్యస్థానమైనవాడు కాబట్టి 'సంస్థానః' అనబడుతున్నాడు. ప్రళయకాలంలో జీవులన్నింటికీ స్థానమైనవాడు కావటంచేత 'సంస్థానః' అనబడుతున్నాడు. జగత్తంతా అతనిలోనే లయమవుతుంది. కాబట్టి అంతిమ విశ్రాంతి స్థానమైనాడు. మళ్ళీ సృష్టి జరిగినప్పుడు జీవులయొక్క కర్మననుసరించి వారికి పునర్జన్మను ఇస్తుంటాడు. కాబట్టి శ్రీమన్నారాయణుడు 'సంస్థానః' అనబడతాడు.

## 387. స్థానదః

పరమపదము నిచ్చువాడు.

**స ఏవ పరమాకాశప్రాప్తౌ హేతుత్వతః సదా**
**ప్రోచ్యతే స్థానద ఇతి సప్తార్ణో మనునాయకః**

ఎల్లవేళలయందు కూడా పరమపదము నివ్వటానికి కారణమైనవాడు.

**ఓం స్థానదాయ నమః** ఇది సప్తాక్షరీ మంత్రము. దీన్ని మంత్రరాజము అంటారు.

**స్థానః దదాతీతి స్థానదః** పరమపదము నిచ్చేవాడు.

పరమ – ఉత్కృష్టమైన, పదము – స్థానము.

అదే వైకుంఠము. శ్రీమహావిష్ణువు నివసించే విష్ణులోకము. **బ్రహ్మపురాణం**లోని 68వ అధ్యాయంలో విష్ణులోకం వర్ణించబడింది. మునీశ్వరులంతా బ్రహ్మ దగ్గరకు వచ్చి విష్ణులోక ప్రాశస్త్యాన్ని వివరించమని అడిగారు. అప్పుడు బ్రహ్మ చెబుతున్నాడు.

శృణుధ్వం మునయః సర్వే యత్పరం పరమం పదమ్ ।
భక్తానామీహితం ధన్యం పుణ్యం సంసారనాశనమ్ ॥

ప్రవరం సర్వలోకానాం విష్ణ్వాఖ్యం వదతో మమ ।
సర్వాశ్చర్యమయం పుణ్యం స్థానం త్రైలోక్యపూజితమ్ ॥

అశోకైః పారిజాతైశ్చ మందారైశ్చంపకద్రుమైః ।
మాలతీ మల్లికాకుందై ర్వకుళైర్నాగకేసరైః ॥

పున్నాగై రతిముక్తైశ్చ ప్రియంగతగరార్జునైః ।
పాటలాచూతఖదిరైః కర్ణికార వనోజ్జ్వలై ॥

కపిత్థై ర్నారికేళ్తైః శ్చ తాళైః శ్రీఫలసంభవైః ।
కల్పవృక్షైరసంఖ్యైశ్చ వన్యైరన్యైః సుశోభనైః ॥

సరళైశ్చందనై ర్నీపై ర్దేవదారు శుభాంజనైః ।
జాతీలవంగకంకోళైః కర్పూరామోదవాపిభిః ॥

తాంబూలపత్రవిచయై స్తథా పూగీఫలద్రుమైః ।
అన్యైశ్చ వివిధైర్వృక్షైః సర్వర్తుఫలశోభితైః ॥

పుష్పైర్నానావిధైశ్చైవ లతాగుచ్ఛసముద్భవైః ।
నానాజలాశయైః పుణ్యై ర్నానాపక్షిరుతైర్వరైః ॥

దీర్ఘికాశసంఘాతై స్తోయపూర్ణైర్మనోహరైః ।
కుముదైః శతపత్రైశ్చ పుష్పైః కోకనదైర్వరైః ॥

రక్తనీలోత్పలైః కాంతైః కల్హారైశ్చ సుగంధిభిః ।
అన్యైశ్చ జలజైః పుష్పై ర్నానావర్ణైః సుశోభనైః ॥

హంసకారండవాకీర్ణై శ్చక్రవాకోపశోభితైః ।
కోయష్టికైశ్చ దాత్యూహైః కారండవ రవాకులైః ॥

చాతకైః ప్రియపుత్రైశ్చ జీవంజీవక జాతిభిః ।
అన్యైర్ద్విజైర్జలచరై ర్విహార మధురస్వనైః ॥

ఏవం నానావిధైర్దివ్యై ర్నానాశ్చర్య సమన్వితైః ।
వృక్షైర్జలాశయైః పుణ్యై ర్భూషితం సుమనోహరైః ॥

తత్ర దివ్యైర్విమానైశ్చ నానారత్నవిభూషితైః ।
కామగైః కాంచనైః శుభ్రైః దివ్యగంధర్వనాదితైః ॥

తరుణాదిత్యసంకాశై రప్సరోభి రలం కృతైః ।
హేమశయ్యాసనయుతై ర్నానా భోగసమన్వితై ॥

ఖేచరైః పపతాకైశ్చ ముక్తాహారావలంబిభిః ।
నానావర్ణై రసంఖ్యాతై ర్జాతరూపపరిచ్ఛదైః ॥

నానా కుసుమగంధాఢ్యై శ్చందనాగురుభూషితైః ।
సుఖప్రచారబహుళై ర్నానావాదిత్రని స్వనైః ॥

మనోమారుతతుల్యైశ్చ కింకిణీ స్తబకాకులైః ।
విహరంతి పురే తస్మి న్వైష్ణవే లోకపూజితే ॥

నానాంగనాభిః సతతంగంధర్వాప్సరసాదిభిః ।
చంద్రాననాభిః కాంఆభి ర్యోషద్భిః సుమనోహరైః ॥

పీనోన్నతకుదాగ్రాభిః సుమధ్యాభిః సముంతతః ।
శ్యామావదాత వర్ణాభి ర్మత్తమాతంగ గామిభిః ॥

పరివార్య నరశ్రేష్ఠం వీజయంతి స్మ తాః స్త్రియః ।
చామరైః కుర్మదండైశ్చ నానారత్న విభూషితైః ॥

గీత నృత్యై స్తథా వాద్యై ర్మోదమానైర్మదాలసైః ।
యక్షవిద్యాధరై స్సిద్ధై ర్గంధర్వై రప్సరోగణైః ॥

సురసంఘైశ్చ ఋషిభిః శుశుభే భువనోత్తమమ్ ।
తత్రప్రాప్య మహాభోగా న్ప్రాప్నువంతి మనీషిణః ॥

వటరాజ సమీ పేతు దక్షిణస్యోదధేస్తటే ।
దృష్టో యై ర్భగవాన్కృష్ణః పుష్కరాక్షో జగత్పతిః ॥

క్రీడంత్య ప్సరసైః సార్ధం యావద్వ్యోశ్చంద్రతారకమ్ ।
ప్రతప్తహేమసంకాశా జరామరణవర్జితాః ॥

సర్వదుఃఖవిహీనాశ్చ తృష్ణాగ్లాని వివర్జితాః ।
చతుర్భుజా మహావీర్యా వనమాలా విభూషితాః ॥

శ్రీవత్సలాంఛనై ర్యుక్తాః శంఖచక్ర గదాధరాః ।
కేచిన్నీలోత్పలశ్యామాః కేచిత్కాంచన సంనిభాః ॥

కేచిన్మరకతప్రఖ్యాః కేచిద్వైఢూర్యసంనిభాః ।
శ్యామవర్ణాః కుండలిన స్తథ్యానే వజ్రసంవిభాః ॥

నతాదృక్సర్వదేవానాం భాంతి లోకా ద్విజోత్తమాః ।
యాదృగ్భాతి హరేర్లోకః సర్వాశ్చర్య సమన్వితః ॥

న తత్ర పునరావృత్తి ర్గమనాజ్జాయతే ద్విజా ।
ప్రభావా త్తస్య దేవస్య యావదాభూతసంప్లవమ్ ॥

నిచరంతి పురేదివ్యే రూపయౌవన గర్వితాః ।
కృష్ణం రామం సుభద్రాంచ పశ్యంతి పురుషోత్తమే ॥

ప్రతప్తహేమ సంకాశం తరుణాదిత్యసంనిభమ్ ।
పురమధ్యే హరేర్భాతి మందిరం రత్నభూషితమ్ ॥

అనేకశతసాహస్రైః పతాకైః సమలంకృతమ్ ।
యోజనాయత విస్తీర్ణం హేమ ప్రాకారవేష్టితమ్ ॥

నానావర్ణైర్ధ్వజైశ్చిత్రైః కల్పితైః సుమనోహరైః ।
విభాతి శారదోయద్వ న్నక్షత్రైః సహచంద్రమాః ॥

చతుర్ద్వారం సువిస్తీర్ణం కంచుకీభిః సురక్షితమ్ ।
పురసప్తకసంయుక్తం మహోత్సేకం మనోహరమ్ ॥

ప్రథమం కాంచనం తత్ర ద్వితీయం మరకతై ర్యుతమ్ ।
ఇంద్రనీలం తృతీయంతు మహానీలం తతః పరమ్ ॥

పురంతు పంచమం దీప్తం పద్మరాగమయం పురమ్ ।
షష్ఠం వ్రజమయం విప్రా వైఢూర్యం సప్తమం పురమ్ ॥

నానారత్నమయైర్వేమ ప్రవాళాంకురభూషితైః ।
స్తంఖైరద్భుత సంకాశై ర్భాతి తద్భవనం మహత్ ॥

దృశ్యంతే తత్ర సిద్ధాశ్చ భాసయంతి దిశోదశ ।
పౌర్ణమాస్యాం స నక్షత్రో యథా భాతి నిశాకరః ॥

ఆరూఢ స్తత్ర భగవా న్సలక్ష్మీకో జనార్దనః ।
పీతాంబరధరః శ్యామః శ్రీవత్సలక్ష్మసంయుతః ॥

జ్వలత్సుదర్శనం చక్రం ఘోరం సర్వాస్త్రనాయకమ్ ।
దధారదక్షిణే హస్తే సర్వతేజోమయం హరిః ॥

కుందేందురజత ప్రఖ్యం హారగోక్షీర సంవిభమ్ ।
ఆదాయం తం మునిశ్రేష్ఠాః సవ్యహస్తేన కేశవః ॥

యస్యశబ్దేన సకలం సంక్షోభం జాయతే జగత్ ।
విశ్రుతం పాంచజన్యేతి సహస్రావర్త భూషితమ్ ॥

దుష్కృతాంతకరీం రౌద్రాం దైత్యదానవనాశినీమ్ ।
జ్వలద్వహ్నిశిఖాకారాం దుఃసహాం త్రిదశైరపి ॥

కౌమోదకీం గదాం చాసౌ ధృతవాన్దక్షిణేకరే ।
వామే విస్ఫురిత్యిహస్య శార్ఙ్గం సూర్యసమప్రభమ్ ॥

శరైరాదిత్య సంకాశై ర్జ్వాలమాలాకులైర్వరైః ।
యోఽసౌ నంహరతే దేవ స్త్రైలోక్యం సచరాచరమ్ ॥

సర్వానందకరః శ్రీమా న్సర్వశాస్త్రవిశారదః ।
సర్వలోక గురుర్దేవః సర్వైర్దేవైర్నమస్కృతః ॥

సహస్రమూర్ధా దేవేశః సహస్ర చరణేక్షణః ।
సహస్రాఖ్యః సహస్రాంగః సహస్ర భుజవాన్ప్రభుః ॥

సింహాసనగతో దేవః పద్మపత్రాయతేక్షణః ।
విద్యుద్విస్పష్టసంకాశో జగన్నాథో జగద్గురుః ॥

పరీతః సురసిద్ధైశ్చ గంధర్వాప్సరసాం గణైః ।
యక్షవిద్యాధరైర్నాగై ర్మునిసిద్ధైః సచారణైః ॥

సుపర్ణైర్దానవైర్దైత్యై రాక్షసైర్గుహ్యకైం నరైః ।
అన్యైర్దేవగణైర్దివ్యైః స్తూయమానో విరాజితే ॥

తత్రస్థా సతతం కీర్తిః ప్రజ్ఞామేధా సరస్వతీ ।
బుద్ధిర్మతి స్తథా క్షాంతిః సిద్ధిర్మూర్తిస్తథా ద్యుతిః ॥

గాయత్రీ చైవ సావిత్రీ మంగళా సర్వమంగళా ।
ప్రభామతి స్తథా కాంతి స్తత్ర నారాయణీ స్థితా ॥

శ్రద్ధా చ కౌశికీ దేవీ విద్యుత్సౌదామినీ తథా ।
నిద్రా రాత్రి స్తథా మాయా తథా న్యాఽమరయోషితః ॥

వాసుదేవస్య సర్వాస్తా భవనే సంప్రతిష్ఠితాః ।
అథ కిం బహునో క్తేన సర్వం తత్ర ప్రతిష్ఠితమ్ ॥

ఘృతాచీ మేనాక రంభా సహజన్యా తిలోత్తమా ।
ఊర్వశీచైవ విమ్లోచా తథాఽ న్యా వామనాపరా ॥

మండోదరీ చ సుభగా విశ్వాచీ విపులాననా ।
భద్రాంగీ చిత్రసేనాచ ప్రమ్లోచా సుమనోహరా ॥

మునిసం మోహనీ రామా చంద్ర మధ్యా శుభాననా ।
సుకేశీ నీలకేశాచ తథా మన్మథదీపినీ ॥

అలంబుషా మిశ్రకేశీ తథాఽన్యా ముంజికస్థలా ।
క్రతుస్థలా వరాంగీచ పూర్వచిత్తి స్తథా పరా ॥

పరావతీ మహారూపా శశిలేఖా శుభాననా ।
హంసలీలానుగామిన్యో మత్తవారణగామినీ ॥

బింబోష్ఠీ నవగర్భా చ విక్యాతాః సురయోషితః ।
ఏతాశ్చాన్యా అప్సరసో రూపయౌవనగర్వితాః ॥

సుమధ్యాశ్చారువదనాః సర్వాలంకారభూషితాః ।
గీత మాధుర్యసంయుక్తాః సర్వలక్షణసంయుతాః ॥

గీతవాద్యే చ కుశలాః సురగంధర్వయోషితః ।
నృత్యంత్యనుదినం తత్ర యత్రాసౌ పురుషోత్తమః ॥

న తత్ర రోగో నో గ్లాని ర్న మృత్యుర్న హిమాతపౌ ।
న క్షుత్పిపానా చ జరా న వైరూప్యం న చాసుఖమ్ ॥

పరమానంద జననం సర్వకామఫలప్రదమ్ ।
విష్ణులోకాత్పరం లోకం నాత్ర పశ్యామి భోద్విజాః ॥

యే లోకాః స్వర్గలోకే తు శ్రూయంతే పుణ్యకర్మణామ్ ।
విష్ణులోకస్య తే విప్రాః కళాం నార్హంతి షోడశీమ్ ॥

ఏవం హరేః పురస్థానం సర్వభోగగుణాన్వితమ్ ।
సర్వ సౌఖ్యకరం పుణ్యం సర్వాశ్చర్యమయం ద్విజాః ॥
న తత్ర నాస్తికా యాంతి పురుషా విషయాత్మకాః ।
న కృతఘ్నా న పిశునా నోస్తేనా నాజితేంద్రియాః ॥
యేఽర్చయంతి సదా భక్త్యా వాసుదేవం జగద్గురుమ్ ।
తే తత్ర వైష్ణవాయాంతి విష్ణులోకం న సంశయః ॥

దక్షిణస్యోఽదధేస్తీరే క్షేత్రే పరమదుర్లభే ।
దృష్ట్వా కృష్ణం చ రామంచ సుభద్రాంచ ద్విజోత్తమాః ॥
కల్పవృక్షసమీపేతు యే త్యజంతి కళేబరమ్ ।
తే తత్ర మనుజా యాంతి మృతా యే పురుషోత్తమే ॥

వటసాగరయోర్మధ్యే యః స్మరేత్పురుషోత్తమమ్ ।
తేఽపి తత్ర నరా యాంతి యేమృతా పురుషోత్తమే ॥

తేపి తత్ర పరం స్థానం యాంతి నాస్త్యత్ర సంశయః ।
ఏవం మయా మునిశ్రేష్ఠా విష్ణులోకః సనాతనః ॥
సర్వానందకరః ప్రోక్తో భుక్తిముక్తి ఫలప్రదః ॥

విష్ణులోకము సంసార నాశకము. సర్వాశ్చర్యస్థానము. అశోకాది సర్వవృక్ష సంకులము. కల్పవృక్షస్థానము. అక్కడ అన్నిరకాల పూలు, పళ్ళు లభిస్తాయి. అనేక రకాలైన పద్మములు, కలువలు, దిగుడు బావులు, సరస్సులు ఉంటాయి. దేవతలు బంగారు విమానాల మీద విహరిస్తుంటారు. ఆ విమానాలు వాయువేగ మనోవేగాలతో ప్రయాణం చేస్తాయి. అక్కడికి చేరిన పుణ్యాత్ములను అతి సుందరమైన దేవతా స్త్రీలు తమ నృత్యగీతాదులచే అలరింపచేస్తారు.

విష్ణులోకము మధ్యభాగంలో మేలిమి బంగారు రంగులో నవరత్నములు పొదగబడిన బంగారు ప్రాకారాలతో యోజన విస్తారంతో శ్రీమహావిష్ణువు యొక్క మందిరం ఉంటుంది. అది చుక్కలలో చంద్రునిలాగా ప్రకాశిస్తుంటుంది. ఆయుధధారులైన ద్వారపాలకులు దాని నాలుగు ద్వారాలకు కాపలాకాస్తుంటారు. ఆ వైకుంఠమునందు ఇంద్రనీలము, మహానీలము, పద్మరాగమణిమయము, వజ్రమయము, వైడూర్యమయము అయిన ఏడు పట్టణాలుంటాయి. అక్కడి స్థంభాలన్నీ రత్నమయములు. పగడపుకర్రతో చేయబడినవి. అక్కడ సిద్ధులయొక్క తేజస్సుతో దిశదిశలు ప్రకాశిస్తుంటాయి. వారి నడుమ మేఘశ్యాముడు, పీతాంబరధారి, శ్రీవత్సాంకితుడు అయిన హరి శ్రీదేవితో ఉంటాడు. ఆయన కుడిచేతిలో సుదర్శనము, ఎడమచేతిలో శంఖము ఉంటాయి. ఆ శంఖము పేరు పాంచజన్యము. అది వేయి సుడులు తిరిగి ఉంటుంది. ఆ శంఖనాదముతో సకలజనము సంక్షోభం చెందుతారు. ఆయన కుడిచేతిలో దానవులను నాశనం చేయగల 'కౌమోదకి' అనే గద, ఎడమచేతిలో 'శార్గము' అనే ధనుస్సు ఉంటాయి. అతడు సర్వలోక సృష్టిస్థితిసంహారకుడు. సర్వశాస్త్రపారంగతుడు. జగద్గురువు. సహస్రశీర్షుడు. ఆ ప్రభువు సింహాసనాసీనుడై ఉంటాడు. ఆయన కనులు తామరరేకులు. మెరుపుతీగలాగా మెరుస్తుంటాడు. దేవ, గంధర్వ, యక్ష, కిన్నెర, కింపురుష, సిద్ధ, సాధ్య, గరుడ, నాగ, గణాలు, సప్తర్షులు, మహామునులు అతన్ని పరిపరివిధాల కీర్తిస్తుంటారు. కీర్తి మొదలు మాయవరకు అనేక శక్తులు అక్కడ ఉంటాయి. ఘృతాచి మొదలైన అప్సరాంగనలు ఆడుతూ, పాడుతూ ఉంటారు. అక్కడ జరామరణములు, ఆకలిదప్పికలు ఉండవు. కష్టాలు అసలే ఉండవు. దుఃఖమనే మాటే తెలియదు. విష్ణుభవనము పరమానందమయము. సర్వాభీష్టప్రదము. పుణ్యాత్ములు పొందే లోకాలన్నీ విష్ణులోకము యొక్క 14వ కళకు కూడా సరిరావు. ఈ లోకాన్ని నాస్తికులు, విషయలంపటులు, కృతఘ్నులు, పిసినారులు, దురాచారులు, దొంగలు చేరలేరు. జితేంద్రియులు అంటే అరిషడ్వర్గాలను జయించినవారు, రాగద్వేషాలను త్యజించినవారు మాత్రమే ఈ లోకము చేరగలరు.

ఇదే పరమపదము. పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు తనను నమ్మినవారిని, తన తత్త్వాన్ని తెలుసుకోకలిగినవారిని ఇక్కడికి చేర్చి తనలో లీనం చేసుకుంటాడు. వారి వారి కర్మానుసారము స్థానములనందించువాడు. ధృవుడు మొదలైన వారికి ఉన్నతమైనస్థానములిచ్చాడు. విశ్వానరుని కుమారుడైన వైశ్వానరునికి అగ్నిలోకానికి ఆధిపత్యమునిచ్చాడు. కశ్యపుని దాయాదియైన పూతాత్ముడు అనేవాడి తపస్సుకు మెచ్చి అతన్ని వాయువ్య దిక్కునకు అధిపతిని చేశాడు. గుణనిధి సదాచారానికి, తపస్సుకు మెచ్చి అతన్ని ధనాధిపతిని చేశాడు. అందుచేతనే పరమేశ్వరుడు 'స్థానదః' అనబడుతున్నాడు. పరమేశ్వరుని చట్టాలలో మార్పులు చేర్పులు ఉండవు. ఆయన సర్వజ్ఞుడు. ఆయనకు అన్నీ తెలుసు. అందుచేతనే అన్ని కర్మలకు సరియైన ఫలితాన్నే ఇస్తాడు. అర్హులైన వారికి మోక్షమిస్తాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'స్థానదః' అనబడుతున్నాడు.

## 388. ధృవః :

**ఆర్వాచీనం ధ్రువమసి తుంగస్థాన ప్రదానతః ।**
**ధ్రువీచకార యస్మాద్ధి ధ్రువస్తస్మాత్ప్రకీర్తితః ॥**

సామాన్యమైన ధ్రువుడికి ఉన్న స్థానమిచ్చి 'ధ్రువుడు' అనబడుతున్నాడు.

**ధ్రువతి స్థిరయతీతి ధ్రువః**

ఉత్తమస్థానాన్నిచ్చి అర్వాచీనుడైన ధ్రువుని ధ్రువుడుగా (శాశ్వతుడుగా) చేశాడు.

**భగవద్గీత**లోని 12వ అధ్యాయం **'భక్తియోగము'**లోని 3వ శ్లోకం.

**యే త్వక్షర మనిర్దేశ్యమ్ అవ్యక్తం పర్యుపాసతే**
**సర్వత్రగమచింత్యం చ కూటస్థమచలం ధ్రువమ్**

ఇంద్రియాలను వశపరచుకొనినవారు, సకల భూతములకు హితమునే కోరేవారు, సర్వప్రాణులను సమభావముతో చూచువారు, యోగులు అనబడతారు. వారు స్థిరస్వభావంతో ఉంటారు.

జగత్తుకు పరిణామ ముంటుంది. కాని పరమాత్మకు ఉండదు. తాను సర్వత్రా వ్యాపించి ఉంటాడు. కాబట్టి కదలటానికి వీలులేనివాడు ధ్రువుడు. స్థిరమైనవాడు. ఉత్తానపాదుని కుమారుడైన ధ్రువుని నక్షత్రంగా స్థిరంగా చేసినవాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు ధ్రువుడు అనబడుతున్నాడు.

# 29. రామతత్త్వము

"గురువుగారూ ! విష్ణుమూర్తి అనేక అవతారాలెత్తాడు. అందులో రామావతారము ఒకటి. త్రేతాయుగంలో దశరధుని కుమారుడిగా ! కౌసల్యా నందనుడిగా జన్మించాడు గదా ! మరి ఆయన తత్త్వము ఎలాటిదో వివరించండి" అనిఅడిగాడు కృష్ణశర్మ. వివరించటం మొదలుపెట్టాడు రత్నాకరుడు.

**రహస్యం రామతపనం వాసుదేవం చ ముద్గలమ్ ।**
**శాండిల్యం పైంగలం భిక్షు మహచ్చారీ రకగ్ం శిఖా ॥**

1. రామరహస్యోపనిషత్తు
2. రామతాపినీఉపనిషత్తు
3. వాసుదేవోపనిషత్తు
4. ముద్గలోపనిషత్తు
5. శాండిల్యోపనిషత్తు
6. పైంగలోపనిషత్తు
7. భిక్షుకోపనిషత్తు
8. మహోపనిషత్తు
9. శారీరకోపనిషత్తు
10. యోగశిఖోపనిషత్తు

ఈ పది రామతత్త్వాన్ని చెప్పిన ఉపనిషత్తులు.

**రామరహస్యోపనిషత్తు**లో పూర్వకాలంలో మహర్షులందరూ హనుమంతుడి దగ్గరకుపోయి వాయుపుత్రా! అష్టాదశపురాణాలయందు, చతుర్వేదములందు, సకల శాస్త్రములందు, ఆధ్యాత్మిక విద్యలయందు ఉత్తమమైన తత్త్వము ఏది ? అని అడిగారు. ఆ మాటలు విన్న ఆంజనేయుడు ఓ ఋషీశ్వరులారా ! పరతత్త్వములలో రామతత్త్వమే ఉత్తమమైనది. రాముడే పరబ్రహ్మ. రాముడే పరమతపము. రాముడే పరమతత్త్వము. రాముడే తారకబ్రహ్మ.

విఘ్నేశ్వరుడు, సరస్వతి, దుర్గ, సూర్యుడు, చంద్రుడు, నారాయణుడు, నరసింహుడు, వాయువు, సీత, లక్ష్మణుడు, భరతుడు, శత్రుఘ్నుడు, విభీషణుడు, సుగ్రీవుడు, అంగదుడు, జాంబవంతుడు. వీరందరూ శ్రీరాముని అంగములు అని గుర్తించండి.

అగ్ని బీజము 'ర్' నకు ' ఆ' కారము కలిపి, దానికి సున్నను చేర్చినట్లైతే శ్రీరాముని ఏకాక్షరీ మంత్రము 'రాం' అవుతుంది.

దీనికి బ్రహ్మఋషి, గాయత్రీ ఛందస్సు, శ్రీరాముడు దేవత. రాం, రీం, రూం, రైం, రౌం, రః న్యాసము. ఈ రకంగా ఈ ఉపనిషత్తులో రామమంత్రాలు అనేకం చెప్పబడ్డాయి.

శ్రీరామచంద్రుడు మహదైశ్వర్య సంపన్నుడు. అతడే స్పష్టమైన పరతత్త్వము. అతడు కడుసంతుష్టాంతరంగుడు. పరిపూర్ణుడు. అతనిచేత చూడబడటంకాని, మనం ఆయన దర్శనం చేసుకోవటంకాని శుభప్రదము. తన రూపంతోను గుణంతోను ప్రజలను రమింప చేస్తాడు. అతి క్లిష్టమైన వరాలను ప్రసాదించే దేవతలను, కోరి తీసుకునే రాక్షసులనుకూడా తననుండి విరమింపచేస్తాడు. అతడికి విషయవాంఛలయందు ఆసక్తి లేదు. యోగులకు అమృతత్వాన్ని ప్రసాదించేవాడు. దోషములేని అర్చిరాది మార్గము గలవాడు. భక్తులకు విధేయుడుగా ఉంటాడు. దుర్మార్గులపట్ల వినయవిధేయతలు లేనివాడు వీరుడు. పరాక్రమవంతుడు. మహాశక్తివంతుడు. దర్మస్వరూపుడు. ధర్మజ్ఞులలో శ్రేష్ఠుడు. పదార్థాలన్నింటికీ ఒకదానితో ఒకటిగా సంబంధము కలుగచేస్తాడు. అతడు పరమ పావనుడు. ప్రాణులన్నింటికీ జీవనమైనవాడు. జీవులకు ప్రాణమునిచ్చేవాడు. తన కల్యాణగుణములచే జీవులన్నీ తనకు లోబడి ఉండేటట్లు చేసేవాడు. దశదిశల వ్యాపించిన యశశ్చంద్రికలు గలవాడు. అతడు శ్రీమన్నారాయణుని అవతారము. రామతత్త్వము 389 నుంచి 410 వరకు నామాలలో వివరించబడింది. ఇక నామాలను చూద్దాం.

## 389. పరర్ధిః

మహదైశ్వర్యము గలవాడు.

**కల్యాణానాం పరాణాం చ గుణానామృద్ధి తస్సదా ।**

**పరావస్థ తయా చైవ పరిర్ధిరితి కథ్యతే ॥**

సర్వేశ్వరత్వమును మించిన శుభమైన గుణములు గలవాడు.

**పరాబుద్ధిః యస్యసః పరిర్ధిః**

సర్వేశ్వరత్వముకన్నా కూడా ఉత్కృష్టమైన కల్యాణగుణములు గలవాడు.

**పరా – ఉత్కృష్టా బుద్ధి – అస్య**

ఇతడు ఉత్కృష్టమైన సమృద్ధి గలవాడు. ఉత్కృష్టమైన వైభవము గలవాడు. అనిర్వచనీయమైన విభూతులు గలవాడు. మంగళకరమైన గుణములు గలవాడు.

**భగవద్గీత** పదవ అధ్యాయం **'విభూతియోగము'**లోని 19వ శ్లోకము.

**హంత తే కథయిష్యామి దివ్యా హ్యాత్మవిభూతయః ।**

**ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ నాస్త్యంతో విస్తరస్యమే ॥**

అర్జునా ! నా దివ్యవిభూతుల వ్యాప్తికి అంతమేలేదు. వాటిలో ముఖ్యమైనవి నీకు చెబుతాను. అదే అధ్యాయంలోని 40వ శ్లోకము.

**నాంతోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప ।**
**ఏష తూద్దేశతః ప్రోక్తో విభూతేర్విస్తరో మయా ॥**

పరంతపా ! నా దివ్యవిభూతులకు అంతమే లేదు. ఆ విభూతుల వ్యాప్తి గురించి నీకు వివరించాను.

ఇక్కడ రెండుచోట్లా కూడా నా దివ్యవిభూతులకు అంతములేదు. అంటున్నాడు భగవానుడు. భగవానుని విభూతులను వివరించటం సాధ్యంకాదు. అవి కొన్నివేలు, లక్షలమీద ఉన్నాయి. కాబట్టి వాటిలో ముఖ్యమైనవి నీకు వివరిస్తాను అన్నాడు భగవానుడు.

ఆయన దివ్యవిభూతులే అనంతమైనప్పుడు ఇక ఆయన సామాన్యవిభూతులకు అంతేలేదు. నేల, నీరు మొదలైన వాటిలో పరమాణువులు చాలా ఉంటాయి. వాటిని గురించి తెలియనట్లే, పరమేశ్వరుని విభూతుల గురించికూడా తెలుసుకొనలేము. అటువంటి శ్రీమన్నారాయణుడు మనస్సును జయించినవారికి స్పష్టముగా తెలియబడతాడు. అందుకే శ్రీమన్నారాయణుడు 'పరర్ధిః' అనబడుతున్నాడు.

## 390. పరమ స్పష్టః

స్పష్టమైన పరతత్త్వము గలవాడు.

**సాక్షాద్దృష్ట స్వ పారమ్యః పరమస్పష్ట ఉచ్యతే**

తనయొక్క పరత్వాన్ని స్పష్టముగా గోచరింపచేసేవాడు.

**పరమశ్చాసౌ స్పష్టశ్చ పరమస్పష్టః** తన పరత్వాన్ని ప్రకాశింపచేసేవాడు.

**రామాయణంలో** శ్రీరామచంద్రుడు **వ్యక్తమేవ మహాయోగీ పరమాత్మా సనాతనః**

శ్రీరామచంద్రుడు మహాయోగ సంపన్నుడై, సనాతనుడై ప్రకాశిస్తున్న పరమాత్మ స్వరూపుడు అని చెప్పబడింది. ఉత్కృష్టమైన శోభ గలవాడు. అన్ని కార్యములు అతని అధీనంలోనే ఉంటాయి. అందుచేత కార్యము సిద్ధించక పోవటము అనేది ఉండదు.

అతడు కేవలము సంవిద్రూపుడు. అనుభవంలో చక్కగా తెలుస్తాడు. మిక్కిలి స్పష్టంగా తెలుస్తాడు. ఇతర ఆధారాలు ఏవీ లేకుండానే ప్రకాశిస్తాడు.

పరతత్త్వము అంటే – పరమే అనగా – ఉత్కృష్టము. ఉత్కృష్టమైన తత్త్వము గలవాడు. పరమేశ్వరుని గురించి తెలుసుకోవటం అందరికీ సాధ్యంకాదు. అతడు అందరికీ

తెలియబడడు. మోక్షగాములైనవారు అతి ప్రయత్నంమీద అతన్ని తెలుసుకోగలుగుతారు. రామాయణంలో మండోదరి తన పాతివ్రత్యమహిమచేత రాముణ్ణి గుర్తించింది. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'పరమస్పష్టః' అనబడుతున్నాడు.

## 391. తుష్టః

సంతుష్టాం తరంగుడు.

**లాభాద్ధాశరథి త్వస్య జగతః పాలనస్య చ**

**మనుష్యత్వేఽపి యః ప్రీతః స తుష్ట ఇతి కథ్యతే**

మానవుడుగా పుట్టాడు. కాబట్టి, దశరధుడికి కుమారుడైనాడు. లోకాలకు పాలకుడైనాడు. ఈ రెండింటివల్ల మిక్కిలి ఆనందించాడు. తుష్టిని పొందాడు.

**తుష్యతీతి తుష్టః** సంతుష్టుడైనవాడు.

పరత్వము సామాన్యంగా అధికారమున్నవారికి తప్ప ఇతరులకు ఉపయోగపడని పరత్వము రామావతారంలో సమాన్య మానవులకు ఉపయోగించటం వల్ల శ్రీరామచంద్రుడు మహదానందం చెందాడు. **శ్రీమద్రామాయణంలో**

**పితరం రో చ యామాస తదా దశరథం నృపం**

ఆ సమయంలో శ్రీమహావిష్ణువు దశరథమహారాజును తండ్రిగా వరించాడు.

తుష్టిని పొంది ఉన్నవాడు. తుష్టిఏ తన రూపముగా కలవాడు.

పరమేశ్వరుడు ఆనందస్వరూపుడు. అదే మహదానందము, బ్రహ్మానందము పరమేశ్వరుడు. అన్నమయ, ప్రాణమయ, విజ్ఞానమయ కోశాలనడుమ ఆనందమయ కోశమునందున్నాడు. అందుకే అతడు అనందరూపుడు. ఎప్పుడూ సంతుష్టుడుగా ఉండేవాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'తుష్టః' అనబడుతున్నాడు.

సకల జగత్తుకు ఆధారము అతడే. అతడు జ్ఞానరూపి. పత్రము, పుష్పము, ఫలము, నీరు భక్తితో ఏదిచ్చినా ప్రీతితో స్వీకరించేవాడు.

**లలితాసహస్రంలో 443వ నామము 'తుష్టిః'**

## 392. పుష్టః

పరిపూర్ణుడు.

**గుణై ర్యో హ్యనృశం స్యాద్యైః పూర్ణః పుష్ట ఇతీరితః** దయాదాక్షిణ్యాది గుణాలతో పరిపూర్ణుడు.

**పుష్యతీతి పుష్టః** మహాగుణములచే పరిపూర్ణుడు. రామాయణంలో

**తమేవం గుణసంపన్నం రామం** మంచిగుణముల మేలుకలవాడు. రామచంద్రుడు, పుష్టి – నిండుదనము కలవాడు. పరమేశ్వరుడు సర్వత్ర సంపూర్ణమైనవాడు.

**ఓం పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్ పూర్ణముదచ్యతే ।**
**పూర్ణస్య పూర్ణ మాదాయ పూర్ణమేవావశిష్యతే ॥**

ఆ కనిపించనిది అనంతం, ఈ కనిపించే విశ్వం కూడా అనంతమే. ఆ అనంతం నుండి ఈ అనంత విశ్వం బహిర్గతమైంది. ఈ అనంతవిశ్వం దానినుండి వెలువడినా, అనంతం అనంతంగానే ఉంటుంది.

నిరాకారుడు నిర్గుణస్వరూపుడు పరబ్రహ్మ. అతడు బిందురూపంలో ఉన్నాడు. అతడు ఎంత పరిమాణంలో ఉన్నాడంటే **అణోరణీయాం మహతోమహీయాం** అణువుకన్న చిన్ననైనవాడు. మహత్తు కన్న గొప్పదైనవాడు.

మహాప్రళయం సంభవించినప్పుడు జగత్తంతా లయమైపోయింది. జీవకోటి అంతా ఆ పరమేశ్వరునిలో లీనమైపోయింది. కొంతకాలం తరువాత ఆ పరమేశ్వరుడు మళ్ళీ సృష్టి చెయ్యాలనుకున్నాడు. అలా అనుకున్నదే తడవుగా తనలోని కొంతశక్తిని బయటకు పంపాడు. ఇప్పుడు చిన్న అనుమానం వస్తుంది. 'బిందురూపుడైన పరబ్రహ్మ నుంచి కొంత శక్తి బయటకు వచ్చినట్లైతే ఆ బిందువుయొక్క పూర్ణత్వానికి విఘాతం కలగదా ?'

అలా జరగదు. ఎందుకంటే సున్నలో నుంచి సున్నను తీసివేసినా లేదా సున్నకు కనుక సున్న కలిపినా దాని విలువ మారదు. అంటే పరమేశ్వరుని పూర్ణత్వానికి ఏ మాత్రం భంగం వాటిల్లదు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'పుష్టః' అనబడుతున్నాడు. పరమేశ్వరుడు సర్వాంతర్యామి. జగత్తంతా వ్యాపించి ఉన్నాడు. జగత్తంతా అతని యందే గోచరిస్తుంది. జగత్తు ఆవిర్భవించక ముందు పూర్ణుడే, ఆవిర్భవించిన తరువాత పూర్ణుడే. లయమయిన తరువాత పూర్ణుడే.

## 393. శుభేక్షణః

శుభమైన దర్శనము గలవాడు.

**సౌశీల్యైశ్వర్య పిశునం శీతలం దీర్ఘ మాయుతమ్**
**తామ్రం చ లోచనం యస్య స శుభేక్షణ ఈరితః**
**స్వకర్మ కర్తృకంచైవ శుభ యస్యేతి దర్శనమ్**
**శుభేక్షణ స్స్యాత్.....**

సౌశీల్యము, ఐశ్వర్యము సూచించునట్టి నల్లని పొడవైన, విశాలమైన ఎఱ్ఱని నేత్రములు గలవాడు. తాను చూడటంకాని, తనను చూడటంకాని శుభకరము చేయువాడు.

**శుభం ఈ క్షణం యస్యసః శుభేక్షణః** శుభమైన దర్శనము గలవాడు.

ఐశ్వర్యాన్ని తలదన్నే చల్లని తామరలవంటి కనులు గలవాడు. **శ్రీమద్రామాయణంలో**

**సుభ్రూరాయత తామ్రాక్షః సాక్షాద్విష్ణు రివస్వయం**

అందమైన కనుబొమలు, విశాలమైన ఎఱ్ఱని నేత్రములు గల శ్రీరాముడు సాక్షాత్తు విష్ణుస్వరూపమువలె ప్రకాశిస్తున్నాడు.

ఆ పరమేశ్వరుణ్ణి మనం దర్శించగలిగినట్లైతే మనకు చాలా శుభం కలుగుతుంది. అలాగే అతడి దృష్టి మన మీద ప్రసరించినాసరే మనకు శుభం జరుగుతుంది. అతడు అంత మంగళకరుడు.

**యశ్చరామం న పశ్యేత్తు యంచ రామోనపశ్యతి**
**నిందితస్య వసేల్లోకే స్వాత్మా ప్యేనం విగర్హతే**

రాముని చూడలేనివాడుగాని, రాముని చేత చూడబడనివాడుగాని లోకంలో నిందింపబడుతూ జీవిస్తాడు. చివరకు అతని మనస్సు కూడా అతన్ని నిందిస్తుంది.

ఆ పరమేశ్వరుని దర్శనము శుభప్రదము. ఏ విధంగా అంటే

| | | |
|---|---|---|
| మోక్షము కోరేవారికి | – | మోక్షము లభిస్తుంది |
| భోగము కోరేవారికి | – | భోగము లభిస్తుంది |
| సందేహాలున్నవారికి | – | సందేహాలు తీరుస్తుంది |
| పాపులకు | – | పాపాలను నశింపచేస్తుంది |
| అజ్ఞానులకు | – | అజ్ఞానం పటాపంచలవుతుంది. |

**ముండకోపనిషత్తులో** చెప్పినవిధంగా

పరతత్త్వము సాక్షాత్కారమైన తరువాత, ఆ జీవియొక్క ఆత్మానాత్మ అధ్యాపరూపమై హృదయగ్రంధులు విడిపోతాయి. అంటే జ్ఞానంతో కూడిన కోరికలు విడిపోతాయి. సందేహాలన్నీ నశిస్తాయి. ప్రారంభంకాని కర్మలు నశిస్తాయి. ఆరబ్దకర్మలు ఈ జన్మలో అనుభవించటం వల్లనశిస్తాయి. ఈ రకంగా కర్మ పూర్తిగా క్షయమవుతుంది.

పరమేశ్వరుని దివ్యదర్శనము భక్తులకు మోక్షమిస్తుంది. అటువంటి దర్శనము సకలమైన వాసనలను క్షాళనం చేస్తుంది. అందుకే పరమేశ్వరుడు 'శుభేక్షణః' అనబడుతున్నాడు.

# 394. రామః

రమింపచేయువాడు.

**స్వగుణైః రమ్యతే రామ ఈరితః** తన గుణములచే అందరినీ రమింపచేయువాడు.

**రమ్యతే అస్మిన్నితి రామః** తనరూపముచేత, గుణముచేత వశము అయిన ప్రాణులను తనయందు రమించునట్లు చేయువాడు.

శ్రీరామచంద్రుడు రమింపచేయు వారలలో శ్రేష్ఠుడు. ఈమాటనే **శ్రీమద్రామాయణంలో రామోరమయతాంశ్రేష్ఠః** అన్నారు.

రాముడు నిత్యానందస్వరూపుడు. ఈతని సాక్షాత్కారమయినంతమాత్రంచేత యోగులు ఆనందిస్తారు. **పద్మపురాణంలో**

**రమంతే యోగినో యస్మిన్ నిత్యానందే చిదాత్మని**
**ఇతి రామపదేనైతత్ పరం బ్రహ్మాభిధీయతే**

ఏ నిత్యానంద చిదాత్మని దర్శనంవల్ల యోగులు ఆనందిస్తారో, అటువంటి పరబ్రహ్మ స్వరూపుడే శ్రీరాముడు అని చెప్పబడింది.

**రమయతి - స్వేన రమణీయేన వపుషా - ఇతి రామః**

తన సుందర శరీరముచే ఆనందపరచువాడు.

నిత్యానంద చైతన్యంలో యోగులు ఎల్లప్పుడు రమిస్తుంటారు కాబట్టి పరమేశ్వరుడు 'రామః' అనబడుతున్నాడు.

శ్రీరామచంద్రునియొక్క మనోహరమైన రూపంచేత, కల్యాణగుణములచేత ప్రపంచము రంజిల్లబడుచున్నది. కాళిదాసు రఘువంశములో 'వశిష్ఠమహర్షి రాముని యొక్క సౌందర్యాన్ని చూసి ముగ్ధుడై లోకములకు అత్యంత శుభకరమైన 'రామ' అనే నామాన్ని ఆ బాలుడికి ప్రసాదించాడు' అని చెప్పబడింది.

యోగులు కుండలినీశక్తిని జాగృతంచేసి, గ్రంధి భేదనముచేసి, ఆ శక్తిని సహస్రారానికి చేర్చినట్లైతే, అక్కడి చంద్రమండలము నుండి జాలువారే అమృతపు జల్లులు చేత శరీరంలోని 72 వేల నాడీ మండలము తడుపబడుతుంది. అప్పుడు యోగి అనిర్వచనీయమైన ఆనందం పొందుతాడు. ఇదే పరమేశ్వర సాక్షాత్కారము. ఆత్మ సాక్షాత్కారము అంటారు. ఈ ఆనందము అనిర్వచనీయమైనది. అనుభవైకవేద్యము. అటువంటి ఆనందాన్ని ఇచ్చేవాడు కాబట్టే శ్రీమన్నారాయణుడు 'రామః' అనబడుతున్నాడు.

# 395. విరామః

తొలగించువాడు.

**వరప్రదైః బ్రహ్మముఖ్యైః అవధ్యత్వాదిభిర్వరైః**
**యస్మిన్విరమ్యత ఇతి స విరామ ప్రకీర్తితః**

వారలిచ్చే బ్రహ్మాదిదేవతలు, వారిచ్చే (చావు లేకుండా) వరాలు, ఆ వరాలు పొందిన రాక్షసులు వీరందరినీ తనయందు విరమించునట్లు చేయువాడు.

**నిసర్గనై రపేక్ష్యేణ రాజ్యాదేః కృపాణాద్ధియః**
**విరాగీ విరతస్స్యాత్ సప్తార్ణః పరమాద్భుతః**

సహజముగా దేనియందూ అపేక్షలేనివాడవటంచేత, నీచమైనటువంటి రాజ్యాధికారమును త్యజించినవాడు.

**మృగ్యమాణతయా మార్గో భరద్వాజాది భిస్సదా ॥**

భరద్వాజాది మహర్షులచే నిరంతరము వెతుకబడువాడు.

**విరమ్యతే అస్మిన్నితి విరామః** ఉత్కృష్టమైన వరాలిచ్చిన బ్రహ్మాది దేవతలను, వాటిని పొందిన రాక్షసులను కూడా తొలగించువాడు.

అనేకమంది రాక్షసులు బ్రహ్మను గురించి ఘోర తపస్సు చేశారు. బ్రహ్మదేవుడు ప్రత్యక్షమై ఏ వరం కావాలో కోరుకోమన్నాడు. నరవానరులతో తప్ప ఇతరు లెవరితోనూ మరణం రాకుండా వరం కావాలి అన్నాడు రావణుడు. ఇంటిలోపలగాని, ఇంటి బయట గాని, పగలుగాని, రాత్రిగాని, ఆయుధంతో గాని, ఆయుధం లేకుండాగాని, భూమిమీదగాని, ఆకాశంమీదగాని, మనుషులవల్లగాని, జంతువులవల్లగాని మరణం రాకుండా ఉండాలి. అన్నాడు హిరణ్యకశ్యపుడు. ఈ రకంగా రాక్షసులు చిత్రవిచిత్రమైన కోరికలు కోరారు. దేవతలు వాటిని తీర్చారు. వాటి ప్రభావంతో లోకకంటకులైనారు రాక్షసులు. ఇప్పుడు ఆ రాక్షసుల పీడ వదిలించాలి అంటే వరాలిచ్చిన దేవతలను, వారిచ్చిన వరాలను, తీసుకున్న రాక్షసులను అందరినీ కాదనాలి. ఆ రకంగా అందరినీ తొలగించువాడు కాబట్టే శ్రీమన్నారాయణుడు 'విరామః' అనబడుతున్నాడు.

బ్రహ్మ మొదలైన దేవతలెవరూ కూడా ఆ పరమేశ్వరుని చేతిలో చంపబడే వారిని కాపాడలేరు.

ప్రాణులకు ప్రళయసమయంలోగాని, మోక్షమునిచ్చిగాని వారికి విరామము కలిగించువాడు.

సకల జీవులు తనయందే విశ్రాంతి పొందటం చేత పరమేశ్వరుడు 'విరామః' అనబడుతున్నాడు.

## 396. విరతః

ఆసక్తి లేనివాడు.

**గతం రతం అస్య** విషయవాంఛలయందు ఆసక్తి లేనివాడు.

పరమేశ్వరుడు చిదానంద స్వరూపుడు. పూర్ణకాముడు. అతడికి తీరవలసిన కోరికలు ఏవీలేవు. అందుకే విషయసుఖములయందు ఆసక్తి లేనివాడు.

విషయాలు విషసమానము. వాంఛలు దుఃఖహేతువులు కోరికలు గుర్రాలు. ప్రపంచంలో ఉండే విషయాలు, వస్తువులు అజ్ఞానియైన మానవుని ప్రేరేపిస్తాయి. ఎండమావులయందు నీరు లభించినట్లే విషయవాంఛలవల్ల ఆనందం సంప్రాప్తించదు. మాయా ప్రపంచమిది. ఇక్కడ ఆనందము కుందేటికొమ్ములాంటిది. అసలు ఆనందము ఆత్మలోనే ఉంటుంది. అదే ఆత్మానందము. శ్రీమన్నారాయణుడే ఆత్మ. కాబట్టి అతడికి ఇంకా వాంఛలు ఉండవు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'విరతః' అనబడుతున్నాడు.

## 397. మార్గః

మార్గము. 365వ నామము కూడా ఇదే.

యోగులు ఎవనివలన, ఏ జ్ఞానముతో అమృతత్త్వాన్ని పొందగలుగుతున్నారో అతడు ఆజ్ఞానము.

వేదపారాయణవల్ల మోక్షంరాదు. శాస్త్రాలు చదవటంవల్ల మోక్షంరాదు. వేదాంత ప్రవచనాలు చెయ్యటంవల్ల మోక్షంరాదు. వినటంవల్ల అంతకన్నా మోక్షంరాదు. అది కేవలము జ్ఞానమువల్లనే వస్తుంది. జ్ఞానం అంటే జగత్తులోని ప్రతిప్రాణి, ప్రతివస్తువు తన స్వరూపమే అని భావించటం అది కేవలము జ్ఞానంతోనే వస్తుంది. అందుచేతనే జ్ఞానముచేతనే జ్ఞానసముపార్జన చెయ్యాలి అని చెప్పబడింది. ఈ రకంగా జ్ఞానసముపార్జన చేసే మార్గము శ్రీమన్నారాయణుడు కాక వేరుకాదు. అందుచేత మోక్షానికి మార్గము కూడా తానే అయిన పరమేశ్వరుడు 'మార్గః' అనబడుతున్నాడు.

శంకరభగవత్పాదులు ఈ రెండు నామాలను విడివిడిగా వ్రాయగా, పరాశరభట్టరు వారు వాటిని కలిపి ఒకే నామముగా చెప్పారు.

**విరజోమార్గః :** దోషములేని మార్గము గలవాడు.

**పాఠస్తు విరజో మార్గ ఇతినిర్దోష దర్శితః**

**సంధాస్యాద్యేన విరజోమార్గ స్సన్మార్గ దర్శనాత్ ॥**

పరమపదానికి చేరే అర్చిరాది మార్గమును తన భక్తులకు చూపినవాడు.

**విరజామార్గః యస్యసః విరజోమార్గః** దోషరహితమైన మార్గమును చూపువాడు. మోక్షమార్గమైన అర్చిరాది మార్గము చూపువాడు.

మానవులు తామాచరించే కర్మ ననుసరించి వారు ప్రయాణించే మార్గాలు నిర్దేశించబడతాయి. మానవులు రెండు రకాలకర్మలనాచరిస్తారు.

1. ఉత్తరాయణ మార్గము (శుభమార్గము)
2. దక్షిణాయణ మార్గము (అశుభమార్గము)

**1. ఉత్తరాయణమార్గము :** దీనినే అర్చిరాది మార్గము దేవయానము అని కూడా అంటారు. సాధకులు ఏ కోరిక లేకుండా కేవలం పరలోక చింతనతో, చేసే కర్మను ఉత్తరాయణ మార్గము అంటారు. ఈ మార్గంలో పరబ్రహ్మ తత్త్వానుభవం కలిగి కృతకృత్యు లయినవారు పరబ్రహ్మలో లీనమవుతారు. వీరు మోక్షసాధన కోసం వేదవిహితమైన కర్మలు కూడా (యజ్ఞయాగాదులు) చేస్తుంటారు.

**2. దక్షిణాయణ మార్గము :** కేవలము ఐహిక వాంఛలతో కొట్టుమిట్టాడుతూ, వాటికోసం కర్మలను ఆచరించటాన్ని దక్షిణాయణమార్గము అంటారు. ఈ మార్గంలో పయనించేవారు పితృలోకాలకు పోతారు. వీరు పరలోకంలో తమ కర్మఫలాలు అనుభవించి మళ్ళీ భూలోకంలో పుడతారు. ఈ రకంగా సంసార చక్రంలో పడి తిరుగుతూ ఉంటారు. దీన్ని ధూమమార్గము పితృయానము అని కూడా అంటారు.

ఈ రెండు మార్గాలు తెలియనివారు క్రిమికీటకాలు, పక్షులు, పాములు, జెర్రులుగా పుడతారని **బృహదారణ్యకోపనిషత్తు**లో చెప్పబడింది.

**"అథమ ఏతౌ పంథానౌ నవిదు స్త్రీ కీటాః పతంగా మదిదం దందసూకమ్ "**

పరబ్రహ్మతత్త్వము తెలిసిన సాధకుడు ఈ శరీరాన్ని వదలిన తరువాత పరబ్రహ్మలో లీనమవుతాడు. అంతేకాని ఎక్కడికీవెళ్ళడు. అంటే బ్రహ్మజ్ఞాని యొక్క ప్రాణములు

ఉత్క్రమింపవు, ఉత్క్రమణ అంటే దేవయాన, పితృయానములద్వారా పైకిపోవటము. సాధకుడు పరలోకాలకు ప్రయాణమయ్యే సమయంలో అంటే అవసానదశలో, అతడి ఇంద్రియాలన్నీ జీవుడి దగ్గరకు చేరతాయి, అప్పుడు ఆ జీవియొక్క తత్తరపాటు, అవస్థలు, వర్ణణాతీతం అతనికి ఊపిరి సలపక సతమతమవుతాడు క్రమంగా కర్మేంద్రియాలు జ్ఞానేంద్రియాలు వశం తప్పుతాయి. కేవలం మనస్సు ఒక్కటే పనిచేస్తుంది. విషయం మాత్రం తెలుస్తుంది. కాని మాట్లాడలేడు. ఈ స్థితిలో ఇంద్రియాలన్నీ కూడతీసుకున్న మనసు ప్రాణముతో ఏకమవుతుంది. అంటే మనో వ్యాపారంకూడా అంతరిస్తుంది. అప్పుడు ఈ లోకంలో జరిగే విషయాలు అతనికి తెలియవు. క్రమంగా ప్రాణము జీవుడితో కలిసి పోతుంది. ప్రాణి ఎగఊపిరి కొట్టుకుంటాడు. సకలేంద్రియవ్యాపారము అంతరిస్తుంది. ఇప్పుడు అతడు చేసిన పాపపుణ్యాలు అతణ్ణి అవరిస్తాయి. ఈ రకంగా సకలేంద్రియాలను కూడగట్టుకున్న జీవుడు శబ్దస్పర్శాదులైన పంచతన్మాత్రలతో ఏకమయి పరలోకయాత్రకు బయలుదేరతాడు. జీవిబయలుదేరేవరకు దేహము వేడిగా ఉంటుంది. ఆ తరువాత దేహం చల్లబడుతుంది. బంధువులు ఆ దేహానికి అంత్యక్రియలు చేస్తారు. అంటే స్థూలదేహం నశిస్తుంది. సూక్ష్మదేహం పరలోకయాత్రకు బయలు దేరుతుంది.

లోకంలో కొంతమంది కర్మలను ఫలాపేక్షతో చేస్తే మరికొంతమంది నిష్కామకర్మలను చేస్తూ సగుణోపాసన కూడా చేస్తుంటారు. దేహాన్ని వదలి జీవుడు బయలు దేరటానికి ఈ రెండు రకాల వారికి తేడాలేదు. కర్మోపాసకులు ధూమ మార్గమున (దక్షిణాయనంలో) పోగా, రెండువారు అర్చిరాదిమార్గములో పోతారు. ఈ రెండు రకాలవారు కూడా మొదటగా హృదయాన్ని చేరుకుంటారు. అక్కడ నుండి వీరి ప్రయాణం మొదలవుతుంది. శరీరంలో ఉన్న 72 వేల నాడీమండలమే వీరి ప్రయాణానికి సిద్ధంగా ఉన్న వాహనాలు. జీవుడు వారివారి కర్మలననుసరించి దేహము యొక్క కళ్ళు, ముక్కు, నోరు మొదలైన అవయవాల నుంచి బయటకు వస్తాడు. కాని జ్ఞానులకు బ్రహ్మరంధ్రం ద్వారా బయటకు వస్తాడు.

**అర్థాగృహె నివర్తంతే శ్మశానే మిత్రబాంధవాః ।**
**సుకృతం దుష్కృతంచైవ గచ్ఛంతమను గచ్ఛతి ॥**

మానవుడు సంపాదించిన ఆస్తిపాస్తులు అతని వెంటరావు. అతడు సంపాదించిన ఇల్లు వాకిలి, సంపద అన్నీ అక్కడే ఉండిపోతాయి. ఇతని మరణానంతరము వారసులు ఆస్తులకోసం పోట్లాడుకుంటారు. ఇంత కష్టపడి ఆస్తులు సంపాదించినా మరణించేటప్పుడు నక్షత్రం మంచిదికాదనో, ఇతర కారణాలచేతనో అతణ్ణి వాకిట్లోనే చాపవేసి పడుకోబెడతారు. కాబట్టి సంపాదించిన ఆస్తిపాస్తులు ఇక్కడివరకే పరిమితమైపోతాయి. ఇక ఇతడంటే

ఇష్టపడే బంధువులు, మిత్రులు శ్మశానందాకా వెళ్ళి అతణ్ణి సాగనంపుతారు. మహా అయితే అతడికి దహన సంస్కారాలు పూర్తయ్యేదాకా అక్కడ ఉంటారు. చివరకు అతనితో పాటుగా వెళ్ళేది అతడు చేసిన పాపపుణ్యాలే. అతడు మంచి పనులుచేస్తే, అతను మరణించిన తరువాత కూడా అతడు చేసిన పనిని పదిమంది మెచ్చుకుంటారు. ఎంతకాలమైతే అతడి మంచి పనులను జనం కొనియాడుతుంటారో, అంతకాలం అతడు స్వర్గసుఖాలు అనుభవిస్తాడు. అతను మంచివాడని, మహానుభావుడని పదిమంది మెప్పునుపొందటమే స్వర్గసుఖం. అతడు చేసిన పనులవల్ల బాధపడిన వారు అతడు పోయిన తరువాత ఆనందిస్తారు. అదే అతడికి నరకం. అందుచేతనే మరణించిన తరువాత అతడితో వచ్చేవి అతడు చేసిన కర్మ ఫలితాలేకాని వేరుకావు.

మరణించకపోయేముందు, ఆఖరిదశలో అతడు చేసిన పాపపుణ్యాలు అతడికి గుర్తుకువస్తాయి. అతడి మరు జన్మ ఏమిటి అనే విషయాన్ని అతడు తెలుసుకోగలుగుతాడు. పాపకర్ముడు ఇంత కన్నహీనమైన జన్మరాబోతున్నదని తెలిసి విలపిస్తాడు. జీవి ఈ శరీరం విడిచిపోవటానికి ఇష్టపడడు. చివరకు శరీరం నుంచి జీవి గెంటివేయబడతాడు. ఈ కారణంచేతనే పాపకర్ముల మరణాలు సాధారణంగా నీచంగా ఉంటాయి. పుణ్యచరితులకు అనాయాస మరణం లభిస్తుంది.

ఈ రకంగా బయలు దేరిన జీవికి తనమరుజన్మ ఏమిటన్న విషయం తెలుస్తుంది. కర్మలనాచరించిన వారు వాటి ఫలితాలైన పాపపుణ్యాలనుభవించిన తరువాత మళ్ళీ ఈ లోకంలో పుడతారు. నిష్కామకర్మచేసిన జ్ఞాని సుషుమ్నా నాడి ద్వారా బ్రహ్మరంధ్రంచేరి అక్కడ నుండి సూర్యమండలానికి పోతాడు. ఇక్కడ రాత్రి పగలు అనే భేదం లేదు. ఉత్తరాయణము అంటే సూర్యుడు మకర రాసిలో ప్రవేసించిన నాటినుంచీ (జనవరి 14) కర్కాటక రాశిలో ప్రవేసించేవరకు (జులై 17) అని అర్థము కాదు. ఈ మద్యకాలంలో మరణించిన వారు మాత్రమే పుణ్యలోకాలకు పోతారనేది నిజంకాదు. గతంలో చెప్పిన దేవయానాన్నే ఉత్తరాయణమంటారు. జ్ఞాని అయినవాడు దక్షిణాయనంలో మరణించినా సూర్యమండలం చేరతాడు. బ్రహ్మలోకానికి తలవాకిలి సూర్యమండలం. ఉపాసనాపరులు చేరుకోదగినస్థానము బ్రహ్మలోకము ఆ మార్గమే అర్చిరాది మార్గము అర్చిరము అంటే 'అగ్ని' అని అర్థము.

బ్రహ్మలోకానికి పోయే మార్గము అతి కాంతివంతమైన బింబముచే కప్పబడి ఉంటుంది. ఆ కాంతిని మనం చూడలేము. అప్పుడు సాధకుడు, ఆ కాంతిబింబాన్ని తొలగించి, బ్రహ్మలోకానికి దారి చూపుమని సూర్యభగవానుణ్ణి ప్రార్థిస్తాడు.

**హిరిణ్మయేనపాత్రేణ సత్యస్యాపిహితం ముఖమ్ ।**

**తత్త్వం పూషన్న పావృణు సత్య ధర్మాయ దృష్టయే ॥**

**పూషన్నే కర్షే యమ సూర్యప్రాజాపత్య వ్యూహ రశ్మీన్ సమూహ ।**

**తేజోయత్తే రూపం కల్యాణతమం**

**తత్తే పశ్యామి యోஉసావసౌ పురుషఃసో హమస్మి ॥**

ఓ సూర్యభగవానుడా ! జ్యోతిర్మయమగు పాత్రముచేత బ్రహ్మలోకముఖద్వారము కప్పబడి ఉన్నది. ఓ దేవా సత్యమైన ధర్మాన్ని ఆచరించే నా కోసం ఆ మార్గాన్ని తెరవవలసినది.

ఓ సూర్యభగవానుడా ! నీ కిరణాలను తొలగించికాంతిని ఉపసంహరించు. నీ అనుగ్రహంచేత మంగళకరమైన నీరూపాన్ని చూడగలుగుతాను.

**వాయురనిలమమృత మథేదం భస్మాంతం శరీరమ్ ।**

**ఓం క్రతోస్మర కృతంస్మర క్రతోస్మర కృతంస్మర ॥**

ఈనాప్రాణవాయువు, సర్వవ్యాప్తము శాశ్వతము అయిన ప్రాణమందు లీనమగుగాక, ఈ శరీరము బూడిద అగును గాక. ఓ మనసా పూర్వకర్మలను గుర్తు తెచ్చుకో, మరణించబోయే మానవుడి ఆలోచన ప్రధానంగా ఉత్తర జన్మల మీద ఉంటుంది. అందుకనే తనజీవితంలో చేసిన కర్మలను అంటే పాపపుణ్యాలను గుర్తు తెచ్చుకోమని మనస్సును హెచ్చరిస్తున్నాడు.

మానవుడు ఎన్ని దుష్కృత్యాలు చేసినా చివరకు సుఖంగా ఉండాలనీ, స్వర్గసౌఖ్యాలనుభవించాలనీ కోరతాడు. అందుకనే సత్కర్మల నాచరించిన మానవుడు, తనను మంచి మార్గం ద్వారా తీసుకుపొమ్మని అగ్నిదేవుణ్ణి ప్రార్థిస్తాడు.

**అగ్నేనయ సువథారాయే అస్మాన్ విశ్వాని దేవవయునాని విద్వాన్ ।**

**యు మోధ్యస్మజ్జుహురాణమేనో భూయిష్ఠాంతే తమ ఉక్తింవిధేమ ॥**

ఓ అగ్నిదేవా ! నేను చేసిన కర్మలన్నీ నీకు తెలుసు. నాలోని పాపాలను నిర్మూలించు. నేను చేసిన కర్మఫలితాలనుభవించటానికి నన్ను మంచి మార్గంగుండా తీసుకుని పోవలసినది అని ప్రార్థిస్తాడు. ఇక్కడ సూర్యభగవానుడు అంటే ఆ పరమేశ్వరుడే అని గుర్తించాలి.

సాధకుని ప్రార్థన ఆలకించి సూర్యుడు బ్రహ్మలోకానికి అడ్డుగా ఉన్నకాంతి బింబాన్ని తొలగిస్తాడు. ఈ మార్గంలో మొదటగా ఉండేది అగ్నిలోకము. అర్చితము అంటే అగ్ని.

అందుకే దీన్ని అర్చిరాది మార్గము అగ్నిమార్గము అని కూడా అంటారు. ఇది శుభప్రదమైన మార్గము. ఈ మార్గంలో మొదటగా అగ్నిలోకము అహిర్లోకము (పగటిదేవత) శుక్లపక్షదేవత, ఉత్తరాయణదేవత, మాసదేవత, సంవత్సరదేవత, దేవలోకము, యమలోకము, ఆదిత్యలోకము, చంద్రలోకము, విద్యుల్లోకము, వరుణ లోకము ఇంద్రలోకము, ప్రజాపతి లోకము ఉంటాయి. చివరకు బ్రహ్మలోకముంటుంది.

జీవుడికి అవయవములు ఆధీనంలో ఉండవు. అతను ఒకచోటినుండి మరొక చోటికి కదలలేడు అని ముందే చెప్పబడింది. ఇప్పుడు ఆ జీవుడు ఒక లోకం నుంచి ఇంకొక లోకానికి స్వయంగా పోలేడు కాబట్టి ఆయాలోకాలలో ఆయాదేవతలు, మహాపురుషులు అతడి గమనానికి సాయపడతారు. బ్రహ్మమానసపుత్రుడు జీవిని విద్యుల్లోకంనుంచి బ్రహ్మలోకానికి తీసుకుని పోతాడు. ఈ మార్గంలో వరుణ, ఇంద్ర, ప్రజాపతులంతా జీవి ప్రయాణానికి అనుమతిస్తారు. అంతేకాని అడ్డగించరు. ఈ రకంగా జీవుడు బ్రహ్మలోకం చేరతాడు.

సాధకుడు చేసిన కర్మలవల్ల వచ్చే స్వర్గము శాశ్వతం కాదు సాధకుడు స్వర్గంలో పుణ్యఫలమును అనుభవించిన తరువాత మళ్ళీ భూలోకంలో పుడతాడు. కాని బ్రహ్మలోకం చేరిన వారు తిరిగి రారు. కల్పాంతంలో పరబ్రహ్మలో లీనమైపోతారు. అందుకనే బ్రహ్మలోకము చేరే మార్గము ఉత్తమమైనది. అదే అర్చరాది మార్గము. ఈ రకంగా దోషరహితమైన మార్గాన్ని తన భక్తులకు చూపుతాడు. కాబట్టి శ్రీమన్నారాయణుడు 'విరజోమార్గః' అనబడతాడు.

## 398. నేయః

నియమింపదగినవాడు.

**వియోగయోగ్య స్సుహృదాం యోஉసౌ నేయస్స ఉచ్యతే**

భక్తులు పరమేశ్వరుని ఆజ్ఞాపించి పనిచేయించుకుంటారు. కాని పరమేశ్వరుడు మాత్రము వారికి విధేయుడుగానే ఉంటాడు.

**నేతుం అర్హః నేయః** భక్తులచే నియమింపదగినవాడు. అంటే భక్తులు తనను ఏవిధంగా ఆజ్ఞాపిస్తే, ఆవిధంగా ఉండేవాడు.

అత్రిమహర్షి భార్య అనసూయ, దేవహూతి, కర్దముల కుమార్తె. పరమసాధ్వి. భర్తనే దైవముగా నమ్మిన ఇల్లాలు.

ఒకసారి త్రిమూర్తులు తమతమ వాహనాల మీద మేరుపర్వతము వైపుకుపోతున్నారు. అలా కొంతదూరము వెళ్ళేసరికి వారి వాహనాలు కదలలేదు. వాటిని కదపటానికి చాలా ప్రయత్నించారు. కాని ఫలితంలేదు. అప్పుడు గరుత్మంతుడు విష్ణుమూర్తితో "స్వామీ ! ఇక్కడే అత్రిమహర్షి ఆశ్రమము ఉన్నది. ఆయన భార్య మహాపతివ్రత. ఈ ఆశ్రమము మీదగ ఎవరూ వెళ్ళరాదు" అని చెప్పాడు. అప్పుడు త్రిమూర్తులకు అనసూయ పాతివ్రత్యము ఎలాటిదో చూడాలి అనిపించింది. ఆ ముగ్గురూ బ్రాహ్మణరూపాలు ధరించి అత్రిమహర్షి ఆశ్రమానికి పోయారు. మహర్షి వీరికి ఆతిధ్యమిచ్చాడు. అప్పుడు వీరు "మాకు ఒక వ్రతము ఉన్నది. మాకు వడ్డించే వనిత దిగంబరిగా ఉండాలి" అన్నారు. మహర్షి మాట్లాడకుండా భార్యవైపు చూశాడు. ఆమె సరే అలాగే కానివ్వండి' అన్నది. బ్రాహ్మణులు స్నానాలుచేసి పీటలమీద కూర్చున్నారు. అనసూయ వారిమీద మంత్రాక్షతలు జల్లింది. వారు పసిపాపలైపోయారు. వారు కోరిన విధంగానే వడ్డన పూర్తిచేసి మళ్ళీ ఆ పసిపాపలమీద అక్షతలు జల్లింది. వారు బ్రాహ్మణులుగా మారిపోయారు. ఆ తరువాత మారుమాటాడకుండా భుజించారు.

ఈ రకంగా అనసూయ త్రిమూర్తులను పసిపాపలుగా చేసింది.

కౌసికుని భార్య సుమతి. ఈమె మహాపతివ్రత. ఈమె భర్త కుష్ఠురోగి. భర్తను బుట్టలో పెట్టి మోసుకుపోతుండేది. ఒకరోజున కుష్ఠురోగి అయిన కౌశికుడు ఒక కాంతను చూసి మోహించి, భార్యను పిలచి తనను ఆ కాంత దగ్గరకు తీసుకుపొమ్మన్నాడు. పతివ్రత అయిన సుమతి చీకటిపడిన తరువాతభర్తను బుట్టలో ఎత్తుకుని ఆ కాంత ఇంటికి వెడుతున్నది. త్రోవలో మాండవ్యమహర్షి కొరతవేయబడి ఉన్నాడు. చీకటిలో కౌశికుని కాలు అతడికి తగిలి బాధపెట్టింది. దాంతో ఆ మహర్షి, తనను బాధపెట్టినవాడు సూర్యోదయం కాగానే మరణిస్తాడు అని శపించాడు. ఆ మాటలు విన్న సుమతి భర్తప్రాణాలను రక్షించుకోవటానికి సూర్యుడు ఉదయించకుండా చేసింది.

ఈ రకంగా అనేకమంది భక్తులు, వారి ఆజ్ఞప్రకారమే నడచుకున్నాడు పరమేశ్వరుడు. అందుకే శ్రీమన్నారాయణుడు 'నేయః' అనబడుతున్నాడు.

ఆత్మజ్ఞానాన్ని ప్రసాదించి జీవులకు జన్మరాహిత్యముకలుగచేసేవాడు. కాబట్టి 'నేయః అనబడుతున్నాడు. భగవంతుడు భక్తులకు అధీనుడు కాబట్టి 'నేయః' అనబడతున్నాడు.

## 399. నయః

ఆకర్షకుడు.

**యస్మిన్ తపోధనానిత్యం నీయంత ఇతి వై నయః** తపోధనులైన మహర్షి పుంగవులు కూడా తన ఆజ్ఞను ఉల్లంఘించలేనట్లుగా ఆకర్షించేవాడు.

**నీయంతే అస్మిన్నితి నయః** మహానుభావులు కూడా తన మాటలను ఆచరించు నట్లుగా చేయువాడు.

అరణ్యాలలో తపస్సు చేసుకునే మునీశ్వరులు, ఋషీశ్వరులు అందరూ ఆశ్రయించినవాడు.

మహాభారతంలో పాండవులందరూ శ్రీకృష్ణపరమాత్మనే ఆశ్రయించారు.

ఈ రకంగా అందరిచేతా ఆశ్రయింపబడేవాడు. జీవులను మోక్షస్థితికి తీసుకుపోయేవాడు.

సంసారబంధనాలనుంచి విడదీసి జీవులను పరమపదమునకు చేర్చేవాడు. ఈరకంగా భక్తులను మోక్షమార్గాన నడిపించేవాడు, భక్తులచే నడపబడేవాడు, భక్తులకు మార్గమైన వాడు అన్నీ పరమేశ్వరుడే. అందుకే శ్రీమన్నారాయణుడు 'నయః' అనబడుతున్నాడు.

## 400. అనయః

మృదువుకానివాడు, శుభవిషయము లేనివాడు.

**అసుహృద్భిర్నమో యస్య నాస్తీత్యనయ ఉచ్యతే**
**అథవా జగతాం యస్యాత్ నాఽన్యోస్తీ త్యనయోఽథవా ॥**

దుర్మార్గుల పట్ల వినయము లేనివాడు. వారితో మృదువుగా మాట్లాడనివాడు.

జగత్తుకు తనసుమించిన శుభమగు విషయము ఇంకొకటి లేనట్టివాడు.

ఖరదూషణాదులతో ఏ రకమైన మాట పలుకులేకుండా వారిని హతమార్చాడు.

సుగ్రీవుడితో మృదువుగా మాట్లాడిన రాముడు అతడి అన్న వాలితో మహాకటువుగా మాట్లాడాడు. కృష్ణావతారంలో కంసునితో కటువుగా వ్యవహరించాడు.

ఈ రకంగా దుర్మార్గులతోను, దురాచారులతోను కటువుగా వ్యవహరించేవాడు.

పరమేశ్వరుడు లోకాలను నడుపువాడు. కాని అతన్ని నడిపేవారు వేరెవరూలేరు. అతడు సర్వవ్యాపి. అతనితో సమానమైనవారుకాని, అతనికన్న అధికులుగాని ఎవరూలేరు. భక్తితో అతన్ని లొంగదీసుకోగలరు. అంతేగాని అతనిమీద ఆధిపత్యాన్ని చెలాయించలేరు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'అనయః' అనబడుతున్నాడు.

## 401. వీరః

వీరుడు, పరాక్రమవంతుడు.

**వీరః కంపన హేతుత్వాత్ రక్షసా మతిభీమతః**

రాక్షసుల పాలిట భయంకరుడై వణికింపచేయువాడు.

**అజతీతి వీరః** రాక్షసులను భయపెట్టి, పారిపోయేటట్లుగా చేసేవాడు. **శ్రీమద్రామాయణములో**

**బ్రహ్మదండ ప్రకాశానాం విద్యుజ్జ్వలిత వర్చసాం**
**స్మరన్ రాఘవ బాణానాం వివ్యధే రాక్షసేశ్వరః**

బ్రహ్మదండములాగా ప్రకాశించేది మెరుపుతీగలాగా జ్వలించేదిఅయిన రామబాణాన్ని తలచుకుని రాక్షసరాజు మిక్కిలి బాధపొందాడు.

విశ్వామిత్రుని యాగరక్షణకు రామలక్ష్మణులు వచ్చారు. యాగం ప్రారంభమైంది. యధావిధిగా మారీచసుబాహువులు వచ్చారు. రక్తమాంసాలు కుండలతో తెచ్చారు. యజ్ఞకుండంలో కుమ్మరించటానికి ప్రయత్నించారు. అంతకు ముందే రాముడు యజ్ఞకుండంపైన రక్షణ ఏర్పాటుచేశాడు. అందుచేత వారి ప్రయత్నం సాగలేదు. ఏంచెయ్యాలా ? అని ఆలోచిస్తున్నారు రాక్షసులు చూశాడు. రామచంద్రుడు విల్లు ఎక్కుపెట్టి బాణం వదిలాడు. ఆ దెబ్బకు ప్రాణాలు వదిలాడు సుబాహువు. కన్ను మూసి తెరిచేలోపు ఇంకోబాణం సంధించి మారీచుణ్ణి సముద్రంలో పడేటట్టు కొట్టాడు. ఇక్కడ మరీచుడు చావకూడదు. రామబాణం పదునేమిటో అతడికి తెలియాలి. ఆ బాణము శక్తి అతడు బ్రతికున్నంతవరకు గుర్తుండాలి. అదే జరిగింది.

సీతాపహరణ సయమంలో రామబాణానికున్న శక్తిని గురించి రావణుడికి చెబుతాడు మారీచుడు. అటువంటి పదునైన బాణాలు గల పరాక్రమవంతుడు.

అతని పేరు చెబితే చాలు శత్రువుల గుండెలు నీరయిపోతాయి. అతని ధాటికి రాక్షసవీరులు పారిపోతారు. అందుచేత 'వీరః' అనబడతాడు.

ఆత్మజ్యోతి ప్రకాశించగానే అసురభావాలు హృదయము నుండి పరుగులు తీస్తాయి.

## 402. శక్తిమతాం శ్రేష్ఠః

శక్తిమంతులలో శ్రేష్ఠుడు.

**సురాదీనాం శక్తిమతాం యః ప్రశస్యతమస్స్మృతః**

**తస్మాచ్ఛక్తిమతాంశ్రేష్ఠః దశార్ణ శ్రేష్ఠదో మనుః ॥**

శక్తిమంతులైనవారిచేత, దేవతలచేతకొనియాడబడువాడు.

శక్తిగల దేవతాదులచే కొనియాబడినవాడు.

**శ్రీమద్రామాయణములో** పరశురాముడు

**"అక్షయం మధుహంతారం జానామిత్వాం సురేశ్వరమ్ ॥**

మధువను రాక్షసుని సంహరించిన ఓ రామా ! నిన్ను నిరాకారుడైన దేవనాధునిగ తలపోస్తున్నాను" అంటాడు. శక్తివంతులైన బ్రహాదిదేవతలందరిలోకీ శ్రేష్ఠుడు. సర్వశక్తులకు నిలయమైనవాడు పరమేశ్వరుడు. అసలు శక్తులు మూడు రకాలు. 1. ఇచ్ఛాశక్తి 2. జ్ఞానశక్తి 3. క్రియాశక్తి.

| | | |
|---|---|---|
| మనసులో ఉండేది | – | ఇచ్ఛాశక్తి |
| బుద్ధిలో ఉండేది | – | జ్ఞానశక్తి |
| దేహము ద్వారా నడిచేది | – | క్రియాశక్తి |

వీటన్నింటికన్నా శ్రేష్ఠుడు.

పరమేశ్వరుడు ధర్మస్వరూపుడు. అందుచేత ధర్మపథంలో చరించే వారికే లభిస్తాడు. వారిచేతనే పొందబడతాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'శక్తిమతాంశ్రేష్టః' అనబడుతున్నాడు.

## 403. ధర్మః

ధర్మస్వరూపుడు.

**నిశ్రేయసాభ్యుదయాభ్యాం ధర్మస్సర్వస్యధారణాత్** భక్తులకు ఇహము, పరము కాకుండా వారి అర్హతను బట్టి మోక్షము అందిస్తూ ఉంటాడు.

**ధరతీతి ధర్మః** భోగానికి, మోక్షానికి కూడా సాధనము కాబట్టి పరమేశ్వరుడు ధర్మస్వరూపి.

శ్రీరామచంద్రుడు బ్రహ్మవిదులలో శ్రేష్టుడు. లోకంలో గల అన్ని ధర్మాలలోనూ ఆ పరమపురుషుడే శ్రేష్ఠుడు.

సర్వభూతాలను ధరిస్తాడు కాబట్టి 'ధర్మః' అనబడతాడు. ఇది అతిచిన్నదయిన, ఆత్మస్వరూపి అయిన పరమేశ్వరుడు అతిసూక్ష్మముగా ఉంటాడు.

**రామో విగ్రహవాన్ ధర్మః** రాముడు మూర్తీభవించిన ధర్మస్వరూపుడు. పరమేశ్వరుడు సూక్ష్మమైనవాడు. అందుచేత ధర్మము కూడా సూక్ష్మమైనదే.

**అనురేష్మధర్మః** ధర్మముకడు సూక్ష్మమైనది. అందుకే ధర్మము, ధర్మసూక్ష్మము అంటారు. ధర్మము అనేది అందరికీ తెలుస్తుంది. కాని ధర్మ సూక్ష్మాన్ని గ్రహించటం కష్టం.

రావణబ్రహ్మను సంహరించాడు శ్రీరాముడు. అతడికి బ్రహ్మహత్యాపాతకం అంటలేదు. వృత్రాసురుని సంహరించాడు ఇంద్రుడు. అతడికి బ్రహ్మహత్యాపాతకం చుట్టుకుంది. దీనికి కారణం ఏమిటి ? సంహరించబడ్డ వారిద్దరూ బ్రాహ్మణులే. అయినా, ఒకరిని చంపితేనే బ్రహ్మహత్యాపాతకం వచ్చింది. ఎందుకంటే ?

రావణబ్రహ్మను రణరంగంలో ఎదిరించి సంహరించాడు శ్రీరాముడు. వృత్రుడితో సహవాసం చేసి అతణ్ణి నమ్మించి, అతడు తపస్సు చేసుకుంటుండగా సంహరించాడు ఇంద్రుడు. ఇది కపటోపాయము. అందుకే ఇంద్రుడికి బ్రహ్మహత్యాపాతకం అంటింది. శ్రీరామచంద్రుడికి ఆ పాతకం లేదు. ఇది ధర్మసూక్ష్మము.

అటువంటి ధర్మము, ధర్మసూక్ష్మము రెండూ పరమేశ్వరుడే. అందుకే శ్రీమన్నారాయణుడు 'ధర్మః' అనబడుతున్నాడు. భగవానుడు ధర్ముడేకాదు. ధర్మజ్ఞులలో ఉత్తముడు కూడా. **లలితాసహస్రంలో** 958వ నామము **'ధర్మిణీ'**

## 404. ధర్మవిదుత్తమః

ధర్మజ్ఞులలో శ్రేష్ఠుడు.

**వశిష్ఠా ద్యుపజీవ్యో యః ధర్మే ధర్మవిదుత్తమః**

ధర్మసందేహము వచ్చినప్పుడు వశిష్ఠాది మహర్షులకు కూడా సందేహము తీర్చువాడు.

**ధర్మవిత్సు ఉత్తమః ధర్మవిదుత్తమః** ధర్మము తెలిసినవారిలో శ్రేష్ఠుడు. శ్రీరామచంద్రుడు వశిష్ఠుని దగ్గర సకల శాస్త్రాలు చదివాడు. కాని ధర్మసంకటము వచ్చినప్పుడు నివృత్తి గావించేది అతడే. అందుకే రాముడు ధర్మజ్ఞుడు, సత్యసంధుడు అని చెప్పబడుతున్నాడు. **ధర్మవిదాం ఉత్తమః** ధర్మవిదులలో ఉత్తముడు.

ధర్మాన్ని తెలుసుకున్నవారు మహాత్ములు. అటువంటి మహాత్ములు తెలుసుకున్న ధర్మము ఆ పరమేశ్వరుడే. అందుకే అతడు 'ధర్మవిదుత్తమః' అనబడతాడు. ధర్మజ్ఞులు – నదులు. భగవానుడు – సముద్రము.

**నదీనాంసాగరోగతే** నదులన్నీ సముద్రంలో కలుస్తాయి. అలాగే ధర్మజ్ఞులందరూ శ్రీరాముని దగ్గర సందేహాన్ని నివృత్తి చేసుకుంటారు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'ధర్మవిదుత్తమః' అనబడుతున్నాడు.

# 405. వైకుంఠః

సంబంధము కలుగజేసేవాడు వైకుంఠవాసుడు.

**సంశ్లేష ప్రతిఘాతశ్చ కుంఠిధాత్వర్థ ఉచ్యతే**
**విగతస్స చ యేషాం తే వికుంఠా స్స్యురుదీరితాః**
**తేషామేవైష ఇతి హి వైకుంఠ పరికీర్తితః**

అన్ని పదార్థాలు ఒకదానితో ఒకటి సంబంధించి ఉండేటట్లుగా చేయువాడు.

**వికుంఠానాం అయం వైకుంఠః**

**మహాభారతం**లోని శాంతి పర్వములో

**మయాసంశ్లేషితాభూమిః అద్భిర్వ్యోమచ వాయునా**
**వాయుశ్చ తేజసాసార్థం వైకుంఠత్వంచ తతోమమ.**

భూమికి – జలముతో, ఆకాశానికి – వాయువుతో, వాయువుకు – తేజస్సుతో ఈ విధంగా నా చేత సంబంధం కల్పించబడింది. అందుచేతనే నేను వైకుంఠుడను.

వివిధమైన గతి, ప్రతి హని కలిగించే విష్ణువు – వైకుంఠుడు అనబడతాడు. సృష్టి ప్రారంభంలో పంచభూతాలను పంచీకరణచేసిన భగవానుడు 'వైకుంఠః' అనబడతాడు.

ప్రాపంచికమైన విషయవాసనలయందు తగులుకొని బాధపడకుండా భక్తుల మనస్సులనూ ఆకర్షించి, వారి మనస్సులను తనపై లగ్నమయ్యేటట్లుగా చేసే భగవానుడు వైకుంఠుడు. బృందావనములో శ్రీకృష్ణుని మురళీరవమును విన్నంతనే, భర్తలకు భోజనము వడ్డిస్తున్న గోపికలు, ఆ పదార్థాలను, భర్తలను ఎక్కడివక్కడే వదలి శ్రీకృష్ణుని సన్నిధికి పరుగుతీసేవారు. ఈ రకంగా అందరికీ సంబంధము కలుగచేసే వాడు కాబట్టే శ్రీమన్నారాయణుడు వైకుంఠుడనబడతాడు.

జీవాత్మ, పరమాత్మాలకు సంబంధము కలుగచేస్తాడు కాబట్టి అతడు వైకుంఠుడు.

# 406. పురుషః

పరమపావనుడు. 14వ నామము కూడా ఇదే.

**స యత్పూర్వ ఇతిశ్రుత్యా పురుషః పావనత్వతః**
**ప్రూధాతోః పాలనార్థాద్ధి అర్ష ప్రత్యయ యోగతః**
**సర్వపాలకతా లబ్ధ్వా పురుషః ప్రోచ్యతే బుధైః**

'సయత్పూర్వో' అనే శ్రుతి ననుసరించి పరమపావనుడవటం వలన పురుషుడనబడు చున్నాడు. లేక ప్రూ అనే ధాతువుకు – పాలన అని అర్థం. కాబట్టి అందరినీ పాలించువాడు. పరమపావనుడు. రామాయణంలో

**పావనః సర్వలోకానాం త్వమేవరఘునందన** రామచంద్రా ! అన్ని లోకములలోకి పావనుడవు నీవే. అని చెప్పబడింది.

శబరి రాముడితో అంటుంది.

**తవా౭ హంచక్షుషాసౌమ్య పూతాసౌమ్యేవమానద**

రామా ! నీ చల్లని కటాక్షముతో నేను పరిశుద్ధనైనాను.

**పిపర్తి పాలయతీతి పురుషః** సకలమును పాలించువాడు.

**సర్వస్మాత్ పూరాసీదతి** ప్రతిదానికన్న ముందుగానే ఉన్నవాడు. అన్నింటికన్న పూర్వుడు. **బృహదారణ్యకోపనిషత్తులో**

చరాచరజగత్తులోని ప్రతిదానికన్న కూడా అతడు పూర్వుడు. సర్వపాపాలను దహించివేస్తాడు. అందుచేతనే అతడు పురుషుడు అనబడుతున్నాడు అని చెప్పబడింది.

ఈ రకంగా పరమపావనుడు, పాపములను పోగొట్టువాడు. కాబట్టి శ్రీమన్నారాయణుడు పురుషుడు అనబడుతున్నాడు.

**విష్ణుధర్మోత్తరపురాణంలో** పురుషస్వరూపాన్ని వర్ణించటం జరిగింది.

**వజ్ర ఉవాచ**

**సతురాజా మయా బ్రహ్మన్ మాంధాతా భువనేశ్వరః ।**

**మాహేశ్వరేణ శూలేన లవణేన హతః శ్రుతః ॥**

**మార్కండేయః**

**అజేయం వైష్ణవం తేజస్తచ్చ నిత్యంచ జంతుషు ।**

**నాశమాయాన్తి తేసర్వేహీనా వైష్ణవ తేజసా ॥**

**అవినాశి జగత్యస్మిన్ నకించి దథ విద్యతే ।**

**ఋతేతు మహత స్తస్మాత్తేజసో నృప ! వైష్ణవాత్ ॥**

**తేజస్తస్య సుదుర్గ్రాహ్యం దేహిభిః నృప ! సర్వదా ।**

**తస్మాత్తేన విహీనాస్తే క్షయం గచ్ఛన్తి మానద ! ॥**

మత్స్యః కూర్మోవరాహశ్చ నారసింహోఽథవామనః ।
బ్రహ్మా శంభుస్తథైవార్క శ్చంద్రమాశ్చ శతక్రతుః ॥

ఏవమాద్యా స్తథైవాన్యే యుక్తావైష్ణవ తేజసా ।
గజచ్ఛాయానుమానేన వియుజ్యన్తేచ తేజసా ॥

వితేజసశ్చ తే సర్వే పంచత్వ ముపయాన్తిచ ।
పంచభూతాత్మకం స్థూలం యత్కించిజ్జగతీ గతమ్ ॥

సర్వం వినాశి తద్జ్ఞేయం త్వయా పార్థివ సత్తమ ! ।
అవినాశితు తద్విద్ధి యేన విశ్వమిదంతతమ్ ॥

యత్తుగంధ గుణైర్హీనం రూపస్పర్శ వివర్జితమ్ ।
శబ్దహీనంచ విరసం స్వేశం సర్వగం చయత్ ॥

నిర్గుణం తద్గుణాతీత మన్తిక స్థంచదూరగమ్ ।
సర్వేంద్రియ గుణాభాసం సర్వేంద్రియ వివర్జితమ్ ॥

సర్వతః పాణి పాదాంతం సర్వతోఽక్షి శిరోముఖమ్ ।
సర్వేంద్రియగుణం దేవం సర్వతః పరమేశ్వరమ్ ॥

అవినాశి తదేవైకం యస్యోదర గతం జగత్ ।
సదాశివేతి తంకేచిదాహుర్దేవం జగత్పతిమ్ ॥

వాసుదేవేతి చాప్యన్యే కాల మిత్యేవ చాపరే ।
దైవ మిత్యపరే తంచ స్వభావమితి చాపరే ॥

కర్మేతి చాపరేప్రాహుః పురుషేతి తథా వరే ।
ప్రణవాఖ్యం తథా తంచ విదురేద్వవిదో జనాః ॥

తదేవ మజమవ్యక్త మవినాశం నరాధిప ! ।
ఋతే తమేకమీశానమంతవ త్సకలం జగత్ ॥

ఏతత్తవోక్తం భువనస్య పత్యుర్మయా స్వరూపం యదువంశచంద్ర ! ।
భక్తిం వినా బుద్ధిమతాఽపియస్య శక్యం నవక్తుం గ్రహణం నరేణ ॥

వజ్రుడు అనేవాడికి మార్కండేయుడు చెబుతున్నాడు. “విష్ణుతేజస్సు అజేయమైనది. అది జంతువులయందు నిత్యము ఉంటుంది. ఆ వైష్ణవ తేజస్సు లేకపోతే జీవులు నాశనమై పోతాయి. ఆ తేజస్సు తప్ప ఈ జగత్తులో మిగిలినవన్నీ నశించేవే. ఆ విష్ణువు యొక్క తేజస్సును ధరించటం జీవులకు శక్యంకాదు. అందుచేత అది లేనివారు నశిస్తారు. మత్స్యము, కూర్మము, వరాహము, నృసింహము, వామనము, బ్రహ్మ, శంభుడు, అర్కుడు, చంద్రుడు మొదలైన వారందరూ కూడా వైష్ణవతేజస్సును ఎప్పుడో ఒకప్పుడు కోల్పోతారు. అది కోల్పోగానే నశించిపోతారు. జగత్తులో పంచభూతాలతో కూడినది ఏదైనాసరే నాశనమయిపోతుంది. జగత్తంతా నిండి ఉన్నది, నాశనములేనిది, ఒక్కటే ఉన్నది. దానికి శబ్దస్పర్శరూప రసగంధాలు ఉండవు. అది సర్వేశ్వరమయము. నిర్గుణము, గుణాతీతము, అన్ని ఇంద్రియాలను, గుణాలను ప్రకాశింపచేసేది. దానికి మాత్రము ఇంద్రియాలు లేవు. దానికి అన్నివైపులకు కళ్ళు, ముక్కులు, చెవులు, నోరు ఉంటాయి. అదే ప్రకాశరూపము. కేవలము జ్ఞానము. సర్వవ్యాపకము. పరమేశ్వరము. నాశనరహితము. దాని ఉదరమందే జగత్తంతా ఉన్నది. అటువంటి దానిని కొందరు సదాశివుడు అంటారు. కొందరు జగదీశ్వరుడంటారు. కొందరువాసుదేవుడంటారు. కొందరు కాలము అంటారు. కొందరు దైవము అంటారు. కొందరు స్వభావము అని, కొందరు కర్మ అని అంటారు. వేదవేత్తలు దానిని ప్రణవము అంటారు. అది అజము పుట్టనిది. అవ్యక్తము – కంటికి కనిపించనిది, నాశనములేనిది. అదే పురుషస్వరూపము.”

ఈ రకంగా ‘పురుషః’ అంటే శ్రీమన్నారాయణుడే తప్ప వేరుకాదు.

## 407. ప్రాణః

జీవనమైనవాడు. 66, 320 నామాలు కూడా ఇదే.

**ప్రాణస్సర్వ ప్రాణనాద్ధి**

అందిరినీ బ్రతికించువాడు. ఇతని మూలముననే జీవులన్నీ బ్రతుకుతున్నాయి.

**ప్రాణితి అస్మాత్సర్వమితి ప్రాణః** అందరినీ జీవించునట్లు చేయువాడు. అన్ని క్షేత్రములయందు క్షేత్రజ్ఞుడుగా ఉండేవాడు. ప్రాణరూపమున చేష్ట కలిగించువాడు. దేహంలో ఉంటూ ఇంద్రియమనోబుద్ధులను చైతన్యవంతము చేయువాడు. **విష్ణుపురాణం**లో

**చేష్టాం కరోతి శ్వసన స్వ రూపీ** ప్రాణవాయురూపంలో చేష్టలు కల్గించువాడు.

**ఛాందోగ్యోపనిషత్తు**లో ప్రాణాన్ని గురించి ఈ విధంగా చెప్పబడింది.

పూర్వకాలంలో ఒకసారి ఇంద్రియాలన్నీ తమలో తాము పోట్లాడుకోవటం మొదలుపెట్టాయి. దీనికి కారణం తమలో ఎవరు గొప్ప అనే విషయం తేలకపోవటమే. ఆ వాదన ఎంతకీ తెగలేదు. చివరకు అన్నీ కలిసి ఒక నిర్ణయానికి వచ్చి తమకు జన్మనిచ్చిన ప్రజాపతి దగ్గరకుపోయి "ప్రజాపతీ ! మాలో శ్రేష్ఠులెవరో మీరు తేల్చి చెప్పండి" అన్నాయి.

ప్రజాపతి ఒక క్షణం ఆలోచించి "మీలో ఎవరు శ్రేష్ఠులో తేల్చుకునే ఉపాయం ఒకటి చెబుతాను వినండి. మీలో ఏది లేకపోతే ఈ శరీరం పనికి రాకుండా, పనిచెయ్యకుండా పోతుందో అది అన్నింటికన్న శ్రేష్ఠమైనదిగా గుర్తించండి. ఈ విషయం తేలాలంటే ఒక్కొక్క ఇంద్రియము ఒక సంవత్సరము పాటు ఈ శరీరాన్ని విడిచి వెళ్ళండి" అన్నాడు. ప్రజాపతి సలహా ఇంద్రియాలకన్నింటికీ నచ్చింది.

ముందుగా వాక్కు శరీరం నుంచి నిష్క్రమించింది. అది ఒక సంవత్సరంపాటు శరీరానికి దూరంగా ఉండి తరువాత తిరిగి వచ్చి మిగిలిన ఇంద్రియాలను అడిగింది. "నేను లేనప్పుడు మీరెలా జీవించి ఉండగలిగారు".

"నువ్వు వెళ్ళిపోవటం వల్ల శరీరానికి పెద్ద నష్టం ఏదీ జరగలేదు. కేవలం వాక్కు మాత్రం మూగబోయింది. అంతేగాని మిగిలిన శరీరం యధాతథంగా పనిచేసింది. ఉచ్ఛ్వాసనిశ్వాసలు మామూలుగానే జరిగాయి. కళ్ళు చూస్తూనే ఉన్నాయి. చెవులు వింటూనే ఉన్నాయి. ఆలోచనలు సాగుతూనే ఉన్నాయి. ఆ రకంగా మిగిలిన పనులన్నీ జరిగాయి. పసిపిల్లవాడికి మాటలు రావు. అయినా వాడు బ్రతకటం లేదా ? మూగవాడు జీవించటం లేదా ? అలాగే శరీరం జీవించే ఉన్నది." అన్నాయి మిగిలిన అవయవాలు. ఆ మాటలు విన్న వాక్కు శరీరంలో ప్రవేశించింది.

తరువాత శరీరం నుంచి దృష్టి నిష్క్రమించి ఒక సంవత్సరం తరువాత తిరిగి వచ్చి మిగిలిన అవయవాలను అడిగింది. "నేను లేనప్పుడు మీరంతా ఎలా ఉన్నారు?" అని.

అప్పుడవి "నువ్వు లేకపోతే చెప్పుకోతగ్గ ఇబ్బందేం కలగలేదు. గ్రుడ్డివాడు బ్రతకటం లేదా ? అలాగే ఈ శరీరం తిరిగింది. కేవలం చూపు మాత్రం లేదు. అంతేకాని శరీరంలోని మిగిలిన వ్యాపారాలన్నీ సజావుగానే సాగినాయి. ఊపిరి ఆడుతూనే ఉంది. నోరుతింటూనే ఉంది. మాట్లాడుతూనే ఉన్నది. ఆలోచనలు బాగానే ఉన్నాయి'' అన్నాయి. మారుమాటాడకుండా దృష్టి శరీరంలో ప్రవేశించింది.

ఆ తరువాత శ్రవణశక్తి శరీరాన్ని విడిచి వెళ్ళిపోయి ఒక సంవత్సరం తరువాత తిరిగి వచ్చి నేను లేకపోతే ఎలా ఉన్నది ? అని అడిగింది.

దానికి మిగిలిన ఇంద్రియాలు "ఓ శ్రవణేంద్రియమా ! నీవు లేని శరీరం చెవిటిదయింది. అంతేకాని కన్ను చూస్తోంది. నోరు మాట్లాడుతోంది. ఈ రకంగా మిగిలిన ఇంద్రియాలన్నీ వాటిపని అవిచేస్తూనే ఉన్నాయి. కాబట్టి మేమంతా ఈ శరీరంలో సుఖంగానే ఉన్నాము" అన్నాయి. శ్రవణశక్తి శరీరంలో ప్రవేశించింది.

ఆ తరువాత మనస్సు శరీరం నుంచి నిష్క్రమించి ఒక సంవత్సరం తరువాత తిరిగి వచ్చి "నేను లేకపోతే వెలితిగా లేదా ?" అని అడిగింది.

దానికి మిగిలిన ఇంద్రియాలు "ఓ మనసా ! నీవు సంకల్ప వికల్పాలకు మూలమైన దానవు. నువ్వు లేకపోతే శరీరానికి సంకల్పం ఉండదు. ఆలోచనాశక్తి ఉండదు. ఆలోచన లేదన్న మాటేగాని శ్వాస ఆడుతుంది. కాళ్ళు చేతులు వాటి పనిచేస్తాయి. నోరు తింటుంది. మాట్లాడుతుంది. ఈ రకంగా మిగిలిన ఇంద్రియాలు వాటి పని అవి చేస్తూనే ఉంటాయి. పసిపిల్లవాడు మనస్సు లేకుండా బ్రతకటం లేదా ? అలాగే శరీరం నువ్వు లేకుండా జీవించే ఉన్నది. మిగిలిన కార్యములన్నీ యధాతధంగా జరుగుతూనే ఉన్నాయి" అన్నాయి. మారు మాట్లాడకుండా మనస్సు శరీరంలో ప్రవేశించింది.

ఆఖరుకు ప్రాణం బయటకు పోవటానికి వస్తూఉంది. అప్పుడు ఇంద్రియాలతో తనకున్న బంధనాలన్నిటినీ త్రెంచిపారేస్తున్నట్లనిపించింది. శరీరానికి ఊపిరి అందటం కష్టమవుతుంది. కళ్ళు కనిపించటం మానివేసింది. చెవులు వినిపించటం మానివేశాయి. నోరు మాట్లాడటం కష్టమయింది. అలాగే కాళ్ళు చేతులు కదలటం మానివేశాయి. శరీరం గాలిలో తేలిపోతున్నట్లయింది. దాంతో ఇంద్రియాలకు భయంపట్టుకుంది. అప్పుడు అవన్నీ ప్రాణం చుట్టూచేరి" ప్రాణమా ! నువ్వు మాత్రం శరీరం నుంచి బయటకు వెళ్ళకు. ఇక్కడే ఉండు నవ్వు శరీరం నుంచి బయటకు వెళ్ళిపోతే శరీరం చచ్చిపోతుంది. అప్పుడు మేమంతా ఉపయోగం లేకుండా పోతాము. మా పనిసున్నా అవుతుంది. మా అందరిలోకీ శ్రేష్ఠుడివి నువ్వే. ఈ మాట మేమందరం అంగీకరిస్తున్నాం. నువ్వు ఇక్కడే ఉండి మమ్మల్ని జీవింపచెయ్యి" అని వేడుకున్నాయి.

ఈ రకంగా ఇంద్రియాలన్నీ ప్రాణం లేకపోతే ఉనికి లేదని ఒప్పుకున్నాయి. అందుకునే వాక్కు, చక్షువు, శ్రోత్రము, మనస్సు అనే పేర్లతోగాక, అవన్నీ ప్రాణవంతములైతేనే పని చేస్తాయి. అందుకే అవన్నీ ప్రాణాలనే సంకేతంతో పిలువబడతాయి. అంటే ప్రాణం కాకుండా వాటికి స్వేచ్ఛ లేదు. అసలు ప్రాణమే ఇన్ని రూపాలుగా మారింది. అందుచేతనే ఇంద్రియాలన్నింటిలోకీ ప్రాణమే గొప్పది.

ఈ రకంగా ప్రాణం శరీరాన్ని విడిచిపోకుండా ఉండి మిగిలిన ఇంద్రియాలతో "మీ మాట ప్రకారము నేను ఇక్కడే ఉంటాను. మరి నాకు అన్నము ఏది ?" అని అడిగింది. కుక్కలు, పిల్లులు, పక్షులు మొదలైన జీవ జంతువుల ఆహారమే నీకు ఆహారము" అన్నాయి. అది ఏవిధంగా అంటే శరీరంలో ముఖ్యమైన ప్రాణంవల్లనే మిగిలిన ఇంద్రియాలు పనిచేస్తున్నాయి. కాబట్టి అన్నింటి ఆహారము ప్రాణానికి ఆహారమవుతోంది. విరాట్ ప్రాణానికి విరాట్ అన్నమే ఆహారము. ఈ విషయము తెలిసినవాడికి తినరానిది ఏదీ ఉండదు.

ప్రాణం మళ్ళీ అడిగింది. "మరి నాకు ఆచ్ఛాదనకు వస్త్రం ఏదీ?" దానికి ఇంద్రియాలు జలమే నీకు ఆచ్ఛాదన" అన్నాయి. విద్వాంసులు భోజనానికి ముందు, తరువాత కూడా ప్రాణాన్ని జలంతో ఆచ్ఛాదిస్తున్నారు. భోజన సమయంలోనే ఆపోసనా, ఉత్తరాపోసనలే ప్రాణానికి వస్త్రం. ఈ విషయం తెలుసుకున్నవాడు వస్త్రాన్ని పొంది నగ్నత్వం లేనివాడవుతున్నాడు.

పూర్వకాలంలో సత్యకామజాబిలి ఈ విషయాన్ని వ్యాఘ్రపాదుని కుమారుడైన గోశ్రుతి అనేవాడికి చెప్పాడు.

దేవదానవులిద్దరూ ప్రజాపతి పుత్రులే. కాని వారిలో దేవతల సంఖ్య తక్కువ. అసురుల సంఖ్య ఎక్కువ. వారి వారి ప్రవృత్తిని బట్టే దేవాసురుని విభాగం జరిగింది. దేవతలు మంచి చెడులకు, ధర్మాధర్మాలకు, న్యాయా న్యాయాలకు ప్రతీకలు. అందుచేత మంచి, ధర్మము, న్యాయము కలవారంతా దేవతలయ్యారు. అవి లేనివారు అసురులు. వీరిద్దరి మధ్య ఎప్పుడూ యుద్ధం జరుగుతూనే ఉంటుంది. ఆ యుద్ధంలో తాత్కాలికంగా అధర్మం జయించినా, చివరకు ధర్మానికే విజయం లభించేది. ప్రతీసారి అసురులను జయించటం కష్టమయ్యేది. అందుకని దేవతలు ఉద్గీతను ఉపాసించి తద్వారా అసురుల మీద విజయం సాధించాలనుకున్నారు. యజ్ఞంలో సామవేద పారాయణ చేసేవాణ్ణి ఉద్గాత అంటారు.

ఈ విధంగా ఆలోచించిన దేవతలు ముందుగా వాగింద్రియంతో నువ్వు మా కోసం ఉద్గాత చేసే పని చెయ్యమన్నారు. జ్యోతిష్టోమ యాగంలో ఉద్గాత 12 మంత్రాలు చదవాలి. అదే అతడి పని. వాగింద్రియం అందుకు సరేనంది. దేవతల కోసం ఉద్గానం చేసింది. అందులో ఉన్న భోగాన్ని దేవతలకోసం కాగా, అందులోని స్పష్టమైన, నిర్దుష్టమైన ఉచ్చారణను తన కోసం గానం చేసింది. ఈ ఉద్గానం వల్ల దేవతలు తమను జయిస్తారని భయపడ్డ రాక్షసులు పాపంతో వాగింద్రియాన్ని హింసించారు. అందువల్ల వాక్కు తన శక్తిని కోల్పోయింది. మన నోటి వెంట వచ్చే వాటిలో అపశబ్దాలు, అబద్ధాలు, నిషిద్ధమైన

మాటలు ఈ కారణంగానే వస్తాయి. అనరాని మాటలు ఉచ్ఛరించటమే పాపం. అందుచేత వాక్కులో ఉద్గాన మహాత్మ్యం తగ్గిపోయింది.

తరువాత దేవతలు ముక్కును ఆశ్రయించి నువ్వు మా కోసం ఉద్గానం చెయ్యి అన్నారు. సరేనంది ముక్కు, దేవతల కోసం ఉద్గానం చేసింది. అందులోని సామాన్య భోగాన్ని దేవతల కోసం కాగా చక్కటి ఘ్రాణశక్తిని తన కోసం ఉపయోగించుకుంది. అసురులకీ విషయం తెలిసింది. ఈ ఉద్గానం ద్వారా దేవతలు తమను జయిస్తారేమో అని భయపడి ఘ్రాణశక్తిని పాపంతో కొట్టారు. దాని ఫలితంగానే ముక్కు అనర్హమైన వాటిని పీల్చటం మొదలుపెట్టింది.

తరువాత దేవతలు చక్షురింద్రియంతో నువ్వు మా కోసం ఉద్గానం చెయ్యాలి అన్నారు. సరేనంది చక్షువు. ఉద్గానం చేసింది. అందులోని సామాన్య భోగాన్ని దేవతలకిచ్చి మంచి దృశ్యశక్తిని తన కోసం ఉంచుకుంది. దీని ద్వారా దేవతలు తమను జయిస్తారేమో అని భయపడి అసురులు చక్షువును పాపంతో కొట్టారు. దాని ఫలింతగానే చక్షువు చూడకూడని దృశ్యాలు చూస్తున్నది.

ఆ తరువాత దేవతలు శ్రోత్రేంద్రియంతో నువ్వు మా కోసం ఉద్గానం చెయ్యాలి అన్నారు. సరేనంది. శ్రోత్రం ఉద్గానం చేసింది. అందులోని సామాన్య భోగాన్ని దేవతలకిచ్చి మంచి శ్రవణాన్ని తన కోసం ఉంచుకుంది. దీనిద్వారా దేవతలు తమను జయిస్తారేమోనని భయపడి అసురులు పాపంతో శ్రోత్రేంద్రియాన్ని కొట్టారు. దాని ఫలితంగా శ్రోత్రం వినరాని మాటలు వింటున్నది.

తరువాత దేవతలు మనస్సును నువ్వు మా కోసం ఉద్గానం చెయ్యాలి అన్నారు. సరేనంది మనస్సు. ఉద్గానం చేసింది. అందులోని సామాన్య భోగాలను దేవతలకిచ్చి శుభసంకల్పాన్ని తన కోసం ఉంచుకుంది. దీని ద్వారా దేవతలు తమను గెలుస్తారేమో అని భయపడి అసురులు మనస్సును పాపంతో కొట్టారు. దాని ఫలితంగానే మనస్సు చేయకూడని ఆలోచనలు చేస్తున్నది.

తరువాత దేవతలు ప్రాణాన్ని ఆశ్రయించి నువ్వు మా కోసం ఉద్గానం చెయ్యాలి అన్నారు. సరే అంది ప్రాణం. తనను శరణు వేడిన దేవతల కోసం ఉద్గానం చేసింది. దీని ద్వారా దేవతలు తమను గెలుస్తారేమో అనే భయంతో అసురులు ప్రాణాన్ని పాపంతో కొట్టాలనుకున్నారు. కాని రాతికి తగిలిన మట్టి బెడ్డలాగా పొడిపొడి అయిపోయారు. ప్రాణాన్ని ఢీ కొన్న అసురులు దేవతల చేతిలో పరాబూతులైనారు. ఈ విషయాన్ని

తెలుసుకున్నవాడు తాను ప్రజాపతి రూపం పొందుతాడు. అతనిని ద్వేషించే వారంతా అతని చేతిలో పరాభవం పొందుతారు. ఈ విధంగా దైవత్వాన్ని సాధించిన ప్రాణము నోటిలోఉన్నది. అస్యము అంటే నోరు. అందుకే ప్రాణము అయాస్యమయింది.

దోషభూయిష్టమైన ఇతర అవయవాలకు ఆత్మత్వం సిద్ధించలేదు. ముఖ్యప్రాణం పాపరహితమైంది. అందుకే దానికి ఆత్మత్వం సిద్ధించింది. కాబట్టి మిగిలిన ఇంద్రియాలు ముఖ్యప్రాణాన్ని ఆత్మరూపంలో ఆశ్రయించాయి. పవిత్రమైన ప్రాణానికి మృత్యువు ఎప్పుడూ దూరంగానే ఉంటుంది. మృత్యువు ప్రాణాలు తీసింది అనుకోవటం అంతా భ్రమ, ప్రాణం పోయిన తరువాతనే మృత్యువు అసన్నమవుతుంది. ఇక్కడ అజ్ఞానం వల్ల విషయం వాసనలమీద ఉండే మమకారమే పాపం. ఈ విషయం తెలుసుకున్న వాడికి మృత్యువు దూరంగా ఉంటుంది.

ప్రాణదేవత వాగాది దేవతలయొక్క పాపరూపమైన మృత్యువును దిగంతాలకు తీసుకుపోయి అక్కడ నిర్జనమైన ప్రదేశంలో ఆ పాపాన్ని పారేసింది. అందుచేతనే పాపరూపంలో ఉండే మృత్యువు తనను చేరకుండా ఉండాలంటే ఇతరుల సంసర్గానికి పోరాదు. అలాగే సీమోల్లంఘున చేయరాదు. హద్దు మీరరాదు.

ప్రాణ దేవత వాగాది ఇంద్రియాలకు సంక్రమించిన పాపరూపమైన మృత్యువును పోగొట్టి మళ్ళీవాటికి ఆదిదైవికమైన దైవత్వాన్ని కలుగచేసింది. ఇంద్రియాలను మృత్యువు నుండి తరింపచేసింది.

వాక్కు మృత్యువు నుంచి తరించటంచేత అగ్ని అయి దేదీప్యమానంగా వెలుగొందింది. ఘ్రాణశక్తి వాయువైంది. చక్షువు ఆదిత్య రూపం పొందింది. శ్రోత్రం దిక్కులైంది. మనస్సు చంద్రుడైంది. ఈ రకంగా ఇంద్రియాలకు దేహంతోగల సంబంధం ఆదిదైవికంగా మారింది. ఈ రకంగా ప్రాణాన్ని ఉపాసన చేసేవాటిని ప్రాణదేవత మృత్యువు నుండి తరింపచేస్తుంది.

తరువాత ప్రాణం తనకు ఆహారం కావటానికి తగిన భక్ష్యాలను ఆ గానం చేసింది. అప్పుడు ఇంద్రియాలన్నీ 'ఆ అన్నంలో మాకు కూడా భాగం ఇవ్వు' అన్నాయి. ఆ మాట విన్న ప్రాణం 'మీరంతా అన్ని వైపులనుండి నాలో ప్రవేశించండి' అన్నది. ఇంద్రియాలన్నీ ప్రాణంలో ప్రవేశించాయి. అందుకనే ప్రాణంద్వారా అన్నం తినేటప్పుడు ఇంద్రియాలన్నీ తృప్తి చెందుతాయి. ఈ విధంగా చుట్టాలంతా చేరి ఉన్నవాడు, స్వజనులను భరించేవాడు శ్రేష్ఠుడు వారందరికి నాయకుడు అవుతాడు. స్వజనుల్ని పోషించేవాడు అందరికీ అధిపతి అవుతాడు.

ఈ ప్రాణం అన్ని అవయవాలకు రసం (సారం) కాబట్టి 'అంగిరసం' అయింది. అలాగే ఏ ఆధారము లేకుండా నోటిలో (ఆకాశంలో) ఉన్నందున 'అయాస్య' మయింది. ప్రాణం ఏ అవయవంనుంచైనా తప్పుకుంటే ఆ అవయవం నిర్జీవం అవుతోంది.

ప్రాణమే బ్రహ్మణస్పతి. ఎందుకంటే ప్రాణమే యజుస్సులకు పతి. వాక్కే బ్రహ్మ, లేక యజుస్సు, ఆ యజుస్సుకు పతికాబట్టే బ్రహ్మణస్పతి అయింది. ప్రాణమే సామము. సామశబ్దవాచ్యమైన ముఖ్యప్రాణం యొక్క సంపదను తెలుసుకున్నవాడు ధనసంపన్నుడౌతాడు. ఈవిధంగా ప్రాణాన్ని గురించి తెలుసుకుని ఉపాసన చేసినవాడు సమస్త లోకాలు, భోగాలు పొందుతాడు"

ఈ రకంగా జీవనాధారమైనది ప్రాణము. కాబట్టి శ్రీమన్నారాయణుడు 'ప్రాణః' అనబడుతున్నాడు.

## 408. ప్రాణదః

ప్రాణమునిచ్చువాడు. 65, 321, 956 నామాలు కూడా ఇదే.

**తద్దానాత్ప్రాణదస్స్మృతః** ప్రాణములనిచ్చేవాడు.

**ప్రాణాన్ దదాతీతి ప్రాణదః** ప్రాణముల నిచ్చి రక్షించువాడు.

ప్రళయకాలమందు జీవులయొక్క ప్రాణములను ఖండించి మళ్ళీ సృష్టి కాలములో ఇస్తాడు.

**బృహదారణ్యకోపనిషత్తు**లో ప్రాణాన్ని గురించి, కాశీరాజయిన అజాతశత్రువు, బాలాకి ఈ విధంగా ఉపదేసించాడు. ప్రాణమే సత్యం. ప్రపంచం అనేది ఆ సత్యానికి సత్యం – ఆ ప్రాణమనే సత్యానికి చెందినదే ఈ ప్రపంచం అనే సత్యం.

ఆధానము – నివాసము, ప్రత్యాధానము– తిరుగుతూ ఉండే చోటు, దాని కట్టుకొయ్య, పగ్గం మొదలైన వాటితో సహా ఆ కోడెదూడను తెలుసుకున్నవాడు తనకు విరోధులైన ఏడుగురు జ్ఞాతులను వధించగలడు. ఇప్పుడు

| | | |
|---|---|---|
| శరీరంలో ఉండే ప్రాణమే | – | కోడెదూడ |
| శరీరమే | – | దాన్ని కట్టివేసే పాక |
| శరీరంలోని శిరస్సే | – | ప్రత్యాధానము |
| అన్నపానాదుల వల్ల కలిగే శక్తి | – | కట్టుకొయ్య |
| ఆహారమే | – | దాని పగ్గం |

జ్ఞాతులు రెండు విధాలుగా ఉంటారు. 1. విరోధులు 2. హితులు. విరోధులైనవారు ఏడుగురు. ఇవే తలలో ఉండే ఇంద్రియాలు. చెవులు – 2, కనులు – 2, ముక్కు రంధ్రాలు – 2, నోరు – 1 మొత్తం ఏడు. ఈ ఇంద్రియాలన్నీ ఆత్మవైపు చూడవు. వీటికి ఎప్పుడూ విషయవాంఛలందే ఆసక్తి. అందుచేత విరోధులను వధించటమంటే ఇంద్రియనిగ్రహం సాధించటం.

సంచరించే చోట ఉండే కోడెదూడ యొక్క కంటిలో ఉండి ఎప్పుడూ కాపాడుతూ ఉండే ఏడుగురు దేవతలు ప్రాణమనే కోడెను ఎల్లకాలము స్తుతి చేస్తూ ఉంటారు. వారు

1. కనులలో ఉండే ఎర్రని గీరల ద్వారా – రుద్రుడు
2. పొగ మొదలైన కారణాల వల్ల కంటిలో కనుపించే నీటిద్వారా – మేఘుడు
3. కనుపాపద్వారా – ఆదిత్యుడు
4. నల్లగ్రుడ్డు ద్వారా – అగ్ని
5. తెల్లగ్రుడ్డు ద్వారా – ఇంద్రుడు
6. కంటి క్రింది రెప్పద్వారా – భూమి
7. పై రెప్పద్వారా – ద్యులోకము

ప్రాణాన్ని కాపాడుతుంటాయి. ఈ విషయాలు తెలుసుకున్న వాడికి అన్నలోపం ఉండదు.

ఒక గిన్నె ఉన్నది. దాని మూతి క్రిందివైపున తెరిచి ఉంది. పై భాగం ఉబ్బెత్తుగా ఉంది. అనేక విధాలయిన జ్ఞానము దానిలో ఉంది. దాని ప్రక్కనే ఏడుగురు ఋషులు, వేదాల ద్వారా వాదము చేసే ఎనిమిదవదయిన వాక్కు ఉన్నాయి. ఆ గిన్నె – శిరస్సుక్రింద భాగంలో తెరచి ఉన్నదే నోరు. పైన ఉబ్బెత్తుగా ఉన్నది పుర్రె. సోమపాత్రలో రసం ఉన్నట్లుగా శిరస్సులో అనేక విధాలయిన జ్ఞానం ఉన్నది. దాని ప్రక్కన ఉన్న ఏడుగురు ఋషులే కనులు, ముక్కులు, చెవులు, నోరు ఎనిమిదవది వాక్కు వేదాలను పఠించేది నోరే. ఇక్కడ నోరు రెండు రకాలుగా విభజించబడింది. 1. మాట్లాడేది 2. రుచి చూసేది.

ఇక తలలో ఉన్న సప్తఋషులను చెబుతాను వినండి. శిరస్సులో ఉన్న కనులు, ముక్కులు, చెవులు, నోరు ఇవే సప్త ఋషులు. వీటిలో

కుడిచెవి – గౌతముడు
ఎడమ చెవి – భరద్వాజుడు

| | | |
|---|---|---|
| దక్షిణ నేత్రం | – | విశ్వామిత్రుడు |
| వామనేత్రం | – | జమదగ్ని |
| కుడివైపు నాసిక | – | వశిష్ఠుడు |
| ఎడమ వైపునాసిక | – | కశ్యపుడు |
| వాక్కు | – | అత్రి |

ఈ విధంగా ప్రాణము యొక్క యదార్ధ స్వరూపాన్ని గ్రహించినవాడు. అన్నిటిని భక్షించేవాడౌతాడు. అన్నీ అతనికి భోజ్యపదార్థాలవుతాయి. కాని అతడు మాత్రం ఎప్పుడూ భోజ్యంకాడు". శంకరభగవత్పాదుల వారు తమ **భజగోవింద** శ్లోకాలలో

**యావత్పవనోనివసతి దేహే తావత్పృచ్ఛతి కుశలం గేహే**
**గతవతి వాయౌ దేహాపాయే భార్యాబిభ్యతి తస్మిన్ కాయే ॥**

శరీరంలో ఊపిరి ఉన్నంతవరకు ఇంటిలోని వారంతా కుశలం కనుక్కుంటారు. ఆ ఊపిరి గనక ఆగిపోతే అనగా మరణము సంభవిస్తే, భార్య కూడా ఆ కళేబరం దగ్గరకు రావటానికి భయపడుతుంది.

ప్రాణము వాయురూపంలో శరీరంలో ఉంటుంది. శరీరంలో రెండు రకాలయిన వాయువులుంటాయి. 1. ప్రధానవాయువులు 2. ఉపవాయువులు

ప్రధానవాయువులనే 'ప్రాణవాయువులు' అంటారు. ఇవి ఐదు రకాలు.

1. ప్రాణవాయువు
2. అపానవాయువు
3. వ్యానవాయువు
4. ఉదానవాయువు
5. సమానవాయువు

**1. ప్రాణవాయువు :** ఇది వక్షస్థలమందుంటుంది. దీని అధిష్ఠానదేవత 'విశిష్ఠకుడు'. ఇది శ్వాసాదులను ఇడ, పింగళ నాడీ మార్గం గుండా ప్రసరింపచేస్తుంది.

**2. అపానవాయువు :** ఇది గుదస్థానంలో ఉంటుంది. దీనికి అధిష్ఠానదేవత 'విశ్వకర్త'. ఇది అధోముఖంగా సంచారంచేస్తూ శుక్ల, మల, మూత్రాలను రక్త, కుహు, సినీవాలినాడుల ద్వారా బయటకు పంపుతుంది. దీనివల్లనే మలమూత్రాలు అధోముఖంగా బయటకు వస్తాయి.

**3. వ్యానవాయువు :** ఇది శరీరమంతా ప్రసరించి ఉంటుంది. దీనికి అధిష్ఠానదేవత 'విశ్వయోని'. ఇది బయట శీతోష్ణాలను లోపలకు, లోపలి వాటిని బయటకు పంపుతూ ఉంటుంది. భుజించిన ఆహారాన్ని శరీరమంతా వ్యాపింపచేస్తుంది.

**4. ఉదానవాయువు :** ఇది కంఠస్థానంలో ఉంటుంది. దీనికి అధిష్ఠానదేవత 'అజుడు'. ఇది మనసు యొక్క సంకల్ప వికల్పాలను మాటలరూపంలో వెల్లడిచేస్తుంది. సుషుప్తి అవస్థలో ఇంద్రియాలను స్వాధీనం చేసుకుని తనకు కారణమైన అజ్ఞానంలో మునిగిపోతుంది. జాగ్రదవస్థలో ఇంద్రియాలను వాటివాటి స్థానాలలో నిలబెడుతుంది. ఈ వాయువు సుషుమ్నా మార్గంగుండా సహస్రారం వరకు సంచరిస్తుంది.

**5. సమానవాయువు :** ఇది నాభిప్రదేశంలో ఉంటుంది. దీనికి అధిష్టానదేవత 'జయుడు'. ఇది జఠరాగ్నిని ప్రజ్వలింపచేసి, తిన్న ఆహారాన్ని అరిగించి, శరీరంలోని 72 వేలనాడీమండలానికీ సమానంగా పంపుతుంది. ఇదేవిధంగా ఉపవాయువులు ఐదు. అవి.

1. నాగవాయువు – వాంతిని కలిగిస్తుంది.
2. కూర్మవాయువు – కనురెప్పలను కదిలిస్తుంది.
3. కృకరవాయువు – తుమ్ములు కలిగిస్తుంది.
4. దేవదత్త వాయువు – ఆవలింతలు కలిగిస్తుంది.
5. ధనుంజయ వాయువు – శరారాభివృద్ధి కలిగిస్తుంది.

ఈ ప్రాణవాయువువల్లనే జీవి జీవిస్తుంది. అటువంటి ప్రాణవాయువు నిచ్చేవాడు. కాబట్టి శ్రీమన్నారాయణుడు 'ప్రాణదః' అనబడుతున్నాడు.

## 409. ప్రణవః

వంగచేయువాడు. 957 నామం కూడా ఇదే.

**గణైశ్చతాచరం నిత్యం నామనాత్ప్రణమ స్స్మృతః**

తన కల్యాణగుణములచేత జగత్తులోని జీవులన్నింటినీ సర్వదా తనకు అణిగి ఉండేటట్లు చేయువాడు.

**ప్రణమంతాహవై వేదా స్తస్మాత్ప్రణవ ఉచ్యతే** తన గుణములచే చరాచరజగత్తును తనకు లొంగచేసుకున్నవాడు. దేవతలచేత కూడా ఆరాధింపబడువాడు.

**ప్రణమయతీతి ప్రణమః** అతనికి వేదములు కూడా ప్రణమిల్లుతాయి. అందుచేత 'ప్రణవః' అనబడుతున్నాడు.

**గుణైర్దాస్య ముపాగతః** ఆయన కల్యాణ గుణములకు ప్రపంచమంతా దాసోహము అంటున్నది. అని రామాయణంలో చెప్పబడింది.

# 410. పృథుః

లబ్దప్రతిష్టుడు.

**యశోవిశాల వత్వాచ్చపృథురిత్యుచ్యతే బుధైః** దశదిశల వ్యాపించిన కీర్తి గలవాడు.

**ప్రథమే ఇతి పృథుః** యశోచంద్రికలచే విరాజితుడు.

**పృథుశ్రీః పార్థివాత్మజః** రాజకుమారుడైన శ్రీరామచంద్రుడు గొప్ప కీర్తిమంతుడు. పరమేశ్వరుడు ప్రపంచరూపమున విస్తరిల్లినవాడు. జగత్తంతా వ్యాపించినవాడు.

ధృవుని వంశంలో వాడు 'అంగుడు' అనే మహారాజు. అతనికి సంతానము లేదు. అందుచేత పుత్రకామేష్ఠి చేశాడు. ఆ యాగ ఫలితంగా అతనికి ఒక కుమారుడు కలిగాడు. అతడి పేరు 'వేనుడు' తరువాత 'వౌనరాజు'గా పిలువబడ్డాడు. ఇతడు కడు దుర్మార్గుడు. తండ్రి తరువాత ప్రజలకు మంత్రులకు ఇష్టం లేకపోయినా రాజయినాడు. రాజుగా అయిన తరువాత కూడా అతని ప్రవృత్తి మారలేదు. పైగా రాక్షసప్రవృత్తి పెరిగింది. దాంతో మునులందరూ అతడికి శాపంపెట్టారు. ఆ శాపఫలితంగా వేనరాజు మరణించాడు. అతడికి సంతానంలేదు. అందుచేత మునులు అతని భుజాలను మధించారు. అతని భుజములనుంచి ఒక స్త్రీ, ఒక పురుషుడు ఉద్భవించారు. ఆ పురుషుడే – పృథువు. ఆ స్త్రీ పేరు – అర్చి. పృథువు విష్ణుమూర్తి యొక్క అవతారము. కాగా అర్చి లక్ష్మీదేవి అంశ.

మంత్రి సామంతులు, మునీశ్వరులు అందరూ కలిసి పృథువుకు పట్టాభిషేకం చేశారు. ఆ రోజులలో దేశంలో కరువు తాండవిస్తోంది. ప్రజలకు తినటానికి తిండిలేదు. ఏంచెయ్యాలా అని ఆలోచించాడు రాజు. దీనికి కారణం భూదేవి. ఓషధులు, వనస్పతులు తనలో దాచుకున్నది. అందుకే ఈ కరువు వచ్చింది. ఆ విషయం తెలిసిన పృథువు బాణం సంధించి భూదేవిని దండించబోయాడు. భూదేవి గోమాతగా ప్రత్యక్షమై శరణువేడింది. తన పాలు పితికి దేశాన్ని క్షామం నుంచి రక్షించమన్నది. అప్పుడు పృథుచక్రవర్తి స్వాయంభువమనువును దూడగా, తన అరచేతిని పాత్రగాచేసి ఆవురూపంలో ఉన్న భూదేవికి పాలు పితికాడు. దేశం శశ్యశ్యామలమయింది. అటువంటి పృథుచక్రవర్తి రూపంలో ఉన్న వాడు కాబట్టే శ్రీమన్నారాయణుడు 'పృథుః' అనబడుతున్నాడు.

అంటూ రామతత్వాన్ని పూర్తిచేశాడు రత్నాకరుడు.

# ౩౦. భక్తుల కోరికలు

గురువుగారూ ! విష్ణుమూర్తి దుష్టశిక్షణ, శిష్టరక్షణ చెయ్యటం కోసం అనేక అవతారాలెత్తుతున్నాడు. ఈ రకంగా అవతారము ఎత్తినప్పుడు భక్తులను, ఆశ్రితులను రక్షిస్తుంటాడు. కాని ఎప్పుడు ఏదో ఒక అవతారంలో భూమిమీద ఉండడు గదా. మరి అలా అవతారము లేని కాలమందు కూడా భక్తులు ఆ పరమేశ్వరుని ధ్యానిస్తుంటారు కదా ! అటువంటి సమయంలో వారికి ఏవిధంగా ఉపకరిస్తాడో వివరించండి అన్నాడు నారాయణభట్టు. చెప్పటం మొదలుపెట్టాడు రత్నాకరుడు.

ధర్మము నాలుగుపాదాలా నడచినంతవరకు పరమాత్మకు ఈ భూమిమీదికి రావలసిన పని ఉండదు. ఎప్పుడైతే ధర్మానికి హాని జరుగుతుందో, అప్పుడు ఏదో ఒక రూపంలో అవతరిస్తాడు పరమేశ్వరుడు. గతంలో చెప్పినట్లుగా ఈ అవతారమనేది అంశావతారము కావచ్చు, లేదా పూర్ణావతారము కావచ్చు. ఆ విధంగా అవతరించి ధర్మసంస్థాపన చేస్తాడు.

అయితే సామాన్యంగా ఒక అవతారమెత్తి, వెంటనే మళ్ళీ ఇంకొక అవతారం దాల్చటం జరగదు. ఈ రకంగా అవతారం లేని కాలంలో ధర్మానికి హాని జరగలేదు కదా ? అందుకని పరమేశ్వరుడు భక్తులకు రావలసిన సత్ఫలితాలను అందజేస్తాడు.

పరమేశ్వరుడు బంగారు గని వంటివాడు. అతడు ఉండేచోట ఎన్నటికీ తరగని నిధులు ఉంటాయి. భక్తులపైన కృపాకటాక్షవీక్షణాలు ప్రసరిస్తే చాలు ఆ నిధులు వారికి దక్కుతాయి. వారికి ఇహము, పరము ఏది కావాలంటే అది లభిస్తుంది. తన భక్తులను హింసించేవారిని క్రూరంగా శిక్షిస్తాడు. శరీరంలోని ఇంద్రియాలను స్వాధీనపరచి మోక్షమార్గాన్ని చూపుతాడు. అతనికి ఉచ్చనీచభావనలుండవు. ఆశ్రితులందరినీ సమాన భావంతో చూస్తాడు. భక్తులు అతని దగ్గరకు వెళ్ళనవసరములేదు. వారు దూరంగా ఉంటే తానే వెతుక్కుంటూ వారి దగ్గరకు వెడతాడు. భక్తులంతా అతన్ని సేవిస్తున్నప్పటికీ, అతన్ని అనుభవిస్తున్నప్పటికీ అతడు సముద్రములాగా ఏ మాత్రం తరగకుండా ఉంటాడు. అందరికీ ఆనందం కలిగించే కళ్యాణగుణాలు కలిగిఉంటాడు. అతని దర్శనము మహా ఆనందాన్ని కలిగిస్తుంది. అతన్ని ఎంతసేపు చూసినా చూడాలనిపిస్తుంది. అటువంటి దివ్యమంగళవిగ్రహుడు. అతడే కాలపురుషుడు. అతడే పరమపదంలో ఉండి, భక్తులందరికీ పరమపదాన్ని ఇచ్చేవాడు. ఈ విషయమంతా 411 నుంచి 420 వరకు నామాలలో వివరించబడింది. ఇక నామాలను చూద్దాం.

# 411. హిరణ్య గర్భః

హిరణ్యమును గర్భమునందు గలవాడు. బంగారు నిధి వంటివాడు. 70వ నామము కూడా ఇదే.

**హితస్యరమణీయస్య ధ్యాతౄణాం హృదయస్యహి**
**హిరణ్య గర్భస్తత్రస్థః సశుభాశ్రయణస్మృతః**
**యద్వాహిరణ్యగర్భోఽ సౌ హిరణ్యనిధి సామ్యతః**

తనను ధ్యానించే భక్తుల హృదయములందు ఉండేవాడు. బంగారునిధి వంటివాడు.

భక్తుల హృదయములందు ఆసీనుడై ఉండుటచే భగవానుడు హిరణ్యగర్భుడు అనబడుతున్నాడు.

**ధ్యేయః స ఏవ విశ్వాత్మా** విశ్వరూపుడు, విశ్వాత్ముడు అయిన పరమేశ్వరుని హృదయమందు ధ్యానించాలి. **బ్రహ్మపురాణంలో**

స్వయంభువు అయిన పరమేశ్వరుడు మొదటగా జలమును సృష్టించాడు. ఆ జలమునందు తన వీర్యమును వదిలాడు. వీర్యము అంటే సృష్టి సంకల్పము. తానే అనేక రూపాలుగా పుట్టాలనేది అతని సంకల్పము.

జలమునకు నారములు అనిపేరు. అవి నరుల సృష్టికి మూలములు. అది మొదటి గమ్యస్థానము అయినందున పరమేశ్వరుడు నారాయణుడని పేరు పొందాడు. ఆయన వదలిన వీర్యము బంగారు గ్రుడ్డయి నీటియందు తేలింది. ఆ అండమునుండి బ్రహ్మ జన్మించాడు. ఈ రకంగా హరిణ్యమును గర్భమునందు గలవాడు. కాబట్టే నారాయణుడు హిరణ్యగర్భుడు అనబడతాడు.

**మహోపనిషత్తు**లో "ఈ సృష్టికి ముందు నారాయణశాఖ ఒక్కటే ఉండేది. అదే పరబ్రహ్మ. శ్రీమన్నారాయణుడు మనసులో ధ్యానం చేశాడు. అలా ధ్యానములో ఉన్న నారాయణుని లలాటము నుంచి స్వేదము పుట్టింది. ఆ స్వేదము సర్వత్రా వ్యాపించి జలము అయింది. ఆ నీటిలో నుంచి బంగారుకాంతితో ఒక అండము పుట్టింది. ఆ అండమునుండి చతుర్మఖబ్రహ్మ ఉద్భవించాడు" అని చెప్పబడింది.

ఈ రకంగా హిరణ్యమును గర్భమునందు గలవాడు అవటంచేత శ్రీమన్నారాయణుడు 'హిరణ్యగర్భుడు' అనబడుతున్నాడు.

## 412. శత్రుఘ్నః

శత్రువులను మర్దించువాడు.

**శత్రూనింద్రియ వర్గాన్యో హంరితి శత్రుఘ్ను ఉచ్యతే ॥**

తన భక్తుల ఇంద్రియములు, తనను విడచి అటునిటు పోకుండా చూచువాడు.

**శత్రూన్ హంతీతి శత్రుఘ్నః**

తన భక్తులయొక్క శత్రువులను మర్దించువాడు. దేవతలయొక్క శత్రువులను సంహరించువాడు. శత్రువు అంటే – రాక్షసులు అనే అర్థంకాదు. శత్రువులు రెండు రకాలు 1. అంతఃశత్రువులు. 2. బాహ్యాశత్రువులు.

బాహ్యాశత్రువులు అంటే – మనం చేసే మంచి పనికి ఆటంకం కలిగించేవారు. యజ్ఞయాగాదులను పాడు చేసే రాక్షసులు.

అంతఃశ్శత్రువులు అంటే – అరిషడ్వర్గాలు. నేను, నాది అనే అహంకార మమకారాలు. భక్తులు పరిపక్వస్థితిచేరాలంటే అహంకారమమకారాలను వదలివెయ్యాలి. అటువంటి రాగద్వేషాలను నాశనంచేసేవాడు.

రాగద్వేషాలు అజ్ఞానంవల్ల వస్తాయి. కాబట్టి జ్ఞానజ్యోతులు వెలిగించి అజ్ఞానపు చీకట్లను పారద్రోలేవాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'శత్రుఘ్నః' అనబడుతున్నాడు.

## 413. వ్యాప్తః

వ్యాపించినవాడు.

**నీచ పూజ్యోఽ విశేషణ వ్యాపనా ద్వ్యాప్త ఉచ్యతే** స్వపరబేధాలు, ఉచ్చనీచభావనలు లేకుండా తనను సేవించువారిని అందరినీ సమానభావంతో చూసేవాడు.

**వ్యాప్నోతీతి వ్యాప్తః** బాలురు, వృద్ధులు, స్త్రీలు, పురుషులు, ధనవంతులు బీదవారు అనే తేడా లేకుండా అందరినీ సమానమైన వాత్సల్యముతో చూసేవాడు.

శ్రీరామచంద్రుడు ఆంజనేయుడి సేవలతోబాటుగా గిరిజన స్త్రీఅయిన శబరి పూజలు కూడా అందుకున్నాడు. శబరి యందు అమితమైన వాత్సల్యము చూపాడు. ఆమెను పుణ్యనదిగా ప్రవహించమని వరమిచ్చాడు.

పరమేశ్వరుడు సర్వవ్యాపి. చరాచరజగత్తు అంతా వ్యాపించి ఉన్నాడు. పరమేశ్వరుడికి దూరంగా ఎవరూపోలేరు. సముద్రంలోని కెరటాలు సముద్రం దాటిపోలేవు. అలాగే

పరమేశ్వరుని నుంచి ఉద్భవించిన జగత్తు, పరమేశ్వరుని దాటిపోలేదు. ఈ జగత్తుకు కారణము అతడే. అంతేకాదు. జీవులన్నిటిని తన బిడ్డలవలె అమితవాత్సల్యముతో చూస్తాడు. అందుకే శ్రీమన్నారాయణుడు 'వ్యాప్తః' అనబడతాడు.

## 414. వాయుః

పోవువాడు, చలించువాడు.

**తత్రతత్ర స్థితాన్ సర్వాన్ భరద్వాజగుహాదికాన్**

**గచ్ఛతి స్వయమేవైతాన్ సవాయు రితి శబ్ద్యతే ॥**

దూరముగా ఉన్నటువంటి భక్తులైన భరద్వాజుడు, గుహుడు మొదలైన వారి దగ్గరకు తానే స్వయముగా వెళ్ళువాడు.

**వాతీతి వాయుః** అక్కడక్కడ ఉండే వారి దగ్గరకు తానే వెళ్ళేవాడు. రామాయణంలో సీతాన్వేషణలో బయలుదేరిన రాముడు శబరి ఆశ్రమానికి చేరాడు. అని చెప్పబడింది. అలాగే **భరద్వాజాశ్రమం గత్వా** భరద్వాజాశ్రమానికి వెళ్ళి అని చెప్పబడింది. ఈ రకంగా భక్తులను వెతుక్కుంటూ వారికోసం పరమేశ్వరుడు తానే అక్కడకు వెడతాడు.

**భగవద్గీతలో**ని 7వ అధ్యాయము **'జ్ఞానయోగము'**లోని 9వ శ్లోకము.

**పుణ్యో గంధః పృథివ్యాం చ తేజశ్చాస్మి విభావసౌ**

**జీవనం సర్వభూతేషు తపశ్చాస్మి తపస్విషు ॥**

పృథివియందు గంధాన్ని, అగ్నిలో తేజస్సును, సమస్త ప్రాణులయందు చైతన్యము, తాపసులలో తపస్సును నేనే.

ఈ రకంగా చరాచర జగత్తంతా పరబ్రహ్మ స్వరూపమే. పరమేశ్వరుడే వాయు రూపంలో జగత్తంతా ఆవరించి ఉన్నాడు. **ఛాందోగ్యోపనిషత్తు**లోని బ్రహ్మచారి కథలో ఈ విషయం వివరించబడింది. దీన్ని గతంలో చెప్పాం. ఈ రకంగా శ్రీమన్నారాయణుడు 'వాయుః' అనబడుతున్నాడు.

## 415. అధోక్షజః

తగ్గకుండా ఉండేవాడు.

**సదోపభుజ్యమా నోఽపి సర్వై రమృత సింధువత్**

**అధో న క్షీయతే జాతు యస్మాత్త స్మా దధోక్షజః ॥**

అందరిచేత అన్నివేళలయందు అనుభవించబడువాడైనప్పటికీ సముద్రమువలె ఉన్నతుడు. కొంచెము కూడా తరగనివాడు.

**అధః న క్షీయతే జాతు ఇతి అధోక్షజః** అందరిచేత అనుభవించబడుతూ ఉండి కూడా అమృతమువలె ఎన్నడు తరగనివాడు.

జగత్తంతా పరమేశ్వరస్వరూపమే. ఈ స్థితి నుంచి ఎప్పుడూ దిగనివాడు. పరమేశ్వరుడు ఎల్లవేళలయందు అంతర్ముఖుడై ఉంటాడు. నాశనములేనివాడు. ఎప్పుడూ ఎండని, తగ్గని సముద్రమువలె ప్రకాశిస్తుండేవాడు.

**అక్షయం మధుహంతారమ్ జానామిత్యాం సురోత్తమమ్**

పరమేశ్వరుడు మధుసూదనుడని, అక్షయుడని సురోత్తముడని చెప్పబడుతున్నాడు.

ఈ రకంగా శ్రీమన్నారాయణుడు 'అధోక్షజః' అనబడుతున్నాడు.

## 416. ఋతుః

గుణయుక్తుడు.

**ఋచ్ఛతీతి ఋతుః ప్రోక్తః సర్వోల్లాసకరై ర్గుణైః**

అందరికి ఆనందానిచ్చే కల్యాణగుణసంపన్నుడు.

**ఋచ్ఛతీతి ఋతుః** అందరికీ ఉల్లాసము కలిగించే సద్గుణసంపన్నుడు. **రామాయణం**లో "గ్రీష్మఋతువులో బాగా తపించిపోయి ఉండే వారు చల్లని మేఘము కోసము ఏ రకంగా ఎదురుచూస్తారో, అదేవిధంగా శ్రీరామచంద్రుని ముఖారవిందము తనవితీరా చూడాలని దశరథుడు ఎల్లకాలము తపిస్తూనే ఉంటాడు" అని చెప్పబడింది.

| | | |
|---|---|---|
| కాలచక్రంలో పదిహేను తిథులు | – | ఒక పక్షము |
| రెండు పక్షములు | – | ఒక మాసము |
| రెండు మాసములు | – | ఒక ఋతువు |

ఈరకంగా పరమేశ్వరుడు కాలవిభజన చేస్తున్నాడు. అందుచేత అతడే కాలపురుషుడు.

**హయనాత్మా మహాదేవః ప్రజాపతి రితి స్మృతిః** అని చెప్పబడింది.

పరమేశ్వర దర్శనం కావాలంటే దృష్టి అంతర్ముఖం కావాలి. అయితే పరమేశ్వరుని వైభావాన్ని ఋతువులద్వారా దర్శించి ఆనందించవచ్చును. ఆయా ఋతువులందు పుష్పించే పూలద్వారా, చిగురించే మొక్కలద్వారా, పెరిగే వృక్షాలద్వారా, గలగలా పారే సెలయేళ్ళ

ద్వారా, పండే పండ్లద్వారా భగవంతుని వైభవాన్ని చూడవచ్చు. అందుకే శ్రీమన్నారాయణుడు 'ఋతః' అనబడుతున్నాడు. అర్చనా విధానంలో ఆయాకాలాలలో (ఋతువులలో) దొరికే పూవులతో భగవానుని అర్చించాలని, అప్పుడు దొరికే పండ్లను మాత్రమే నివేదించాలని చెప్పబడింది.

## 417. సుదర్శనః

చూడదగినవాడు, చక్రాయుధము.

**శుభం చ దర్శనం యస్య మందానాం స సుదర్శనః**

మూర్ఖులకు కూడా చూడదగిన రమణీయమైనవాడు.

**శోభనం దర్శనం యస్యసః సుదర్శనః**

ఏమీ తెలియనివారికి తన దర్శనమే శుభముగా ఉండువాడు.

**సోమవత్ప్రియ దర్శనః** చంద్రునివలె ఇంపైన దర్శనము గలవాడు. ఎంత చూచినా తనివితీరనివాడు. చూసిన కొద్దీ ఇంకా ఇంకా చూడాలనిపించేవాడు. శుభప్రదమైన దర్శనము నిచ్చేవాడు.

భక్తులకు మనోహరమైన దర్శనమునిచ్చేవాడు. పరమేశ్వర దర్శనము అంటే 'ఆత్మసాక్షాత్కారము' అది జరిగిన వాడికి చరాచరజగత్తంతా తనలోనే కనిపిస్తుంది. తానే పరబ్రహ్మ అనే భావన కలుగుతుంది. ఈ జగత్తుకు కారణభూతుడను నేనే. జగత్తులోని ప్రతి వస్తువు, ప్రతిజీవి నా స్వరూపమే అని తెలుస్తుంది. పిపీలికాది బ్రహ్మపర్యంతము తనలోనే చూడగలుగుతాడు. అతడే పరబ్రహ్మ. అటువంటి వ్యక్తికి జన్మరాహిత్యం కలుగుతుంది. ఈ రకంగా మోక్షఫలాన్ని అందించే ఆ పరమేశ్వరుని దర్శనము అత్యంత శుభప్రదమైనది. అందుచేతనే **ప్రహ్లాదచరిత్ర**లో ప్రహ్లాదుడు తండ్రితో...

**సురరక్షకుని చూచుచూడ్కులు చూడ్కులు.** ఇంకొకసారి

**కమలేసుచూడని కన్నులు కన్నులే తనుకుడ్యజాల రంధ్రములుగాగ.**

అంటాడు. ఆ పరమేశ్వరుని దివ్యసుందరవిగ్రహము అంత మనోహరంగా ఉంటుంది. సుదర్శనః అంటే – చక్రాయుధము.

విష్ణుమూర్తిచేతిలోని చక్రాయుధానికి సుదర్శనమని పేరు. ఇది వేయి సూర్యులకాంతితో ప్రకాశిస్తుంటుంది. శ్రీహరి దీన్ని గనక వదలితే శత్రువుల శిరస్సులు ఛేదించి, తిరిగి శ్రీహరి చేతిలోకి వచ్చి చేరుతుంది.

అంబరీషునిమీద దుర్వాసుడు కోపించినప్పుడు ఈ సుదర్శనము దుర్వాసుని తరుముకుంటూ వెళ్ళింది. గజేంద్రునిపట్టి పీడించిన మొసలిని సంహరించి గజరాజును రక్షించింది. ఖాండవవనాన్ని దహనం చేసేటప్పుడు శత్రువులను నిర్జించటానికి అగ్నిదేవుడు దీన్ని శ్రీకృష్ణునకిచ్చాడు. సుదర్శన మహామంత్రం శత్రుంజయము. కార్యసిద్ధి.

## 418. కాలః

కాలపురుషుడు చేర్చుకొనువాడు.

**చిదచిత్కాల నా త్కాలః గుణైరాత్మనిచే దృశైః**

తనకు గల కల్యాణగుణములచే జగత్తునంతా తన వశముగావించుకొనువాడు.

**కలతే సంకలితం భవతి అస్మిన్నితికాలః**

తన ఆత్మగుణములచే చరాచరములన్నింటినీ తనయందు చేర్చుకొనువాడు.

శత్రువులను మృత్యుకుహరములోకి త్రోసేకాలుడు. పరమేశ్వరుడు సాధువులపట్ల పరమసాధువుగా ఉంటాడు. దుర్మార్గులపట్ల కఠినంగా వ్యవహరించి వారికి మరణదండన విధిస్తాడు. కాలాన్ని రోజులు, నెలలు, సంవత్సరాలు అంటూ లెక్క ఏర్పాటుచేశాడు. కాబట్టి అతడే కాలపురుషుడు. **భగవద్గీత**లోని పదవ అధ్యాయం **'విభూతియోగము'**లోని 30వ శ్లోకము.

**ప్రహ్లాదశ్చాస్మి దైత్యానాం కాలః కలయతామహమ్**
**మృగాణాం చ మృగేంద్రోఽహమ్ వైనతేయశ్చ పక్షిణామ్ ॥**

అర్జునా ! దైత్యులలో ప్రహ్లాదుడను నేనే. గణకులలో నేను కాలమును, మృగాలలో సింహాన్ని, పక్షులలో గరుడుడను నేనే.

ఇక్కడ కాలము అంటే క్షణము, ఘడియ, విఘడియ, పక్షము, మాసము మొదలైన పేర్లతో వ్యవహరించబడే సమయము. గణితానికి ఇది ఆధారము. అందుకే భగవానుడు కాలాన్ని తన స్వరూపముగా చెబుతున్నాడు. ఈ రకంగా శ్రీమన్నారాయణుడు 'కాలః' అనబడుతున్నాడు.

## 419. పరమేష్ఠీ

పరమపదంలో ఉండేవాడు. పరమేశ్వరుడు

**పరేపదే స్థితిత్వాచ్చ పరమేష్ఠీ ప్రకీర్తితః** పరమపదమునందు ఉండేవాడు.

**పరమేతిష్ఠతీతి పరమేష్ఠీ** పరమపదమైన వైకుంఠవాసి

రాక్షస సేనలను సంహరించిన తరువాత పరమేశ్వరుడు తిరిగి తన నివాసమైన పరమపదము చేరతాడు. రామావతారంలో రాక్షసులను సంహరించి, లవకుశులకు పట్టంకట్టి, ఆ తరువాత వైకుంఠానికి తిరిగి వెళ్ళిపోయాడు.

ద్వాపరయుగంలో కురుక్షేత్రసంగ్రామం జరిపించిన తరువాత ధర్మజునకు పట్టాభిషేకంచేసి తిరిగి వైకుంఠంచేరాడు.

హృదయమనే గుహయందు ప్రకాశించువాడు. చరాచరజగత్తుకు ఆధారమైనవాడు. జగన్మిరాత. జగత్సృష్టికర్త. సృష్టిస్థితి సంహారకారకుడు. ఆది మధ్యాంతరహితుడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'పరమేష్ఠీ' అనబడుతున్నాడు.

## 420. పరి గ్రహః

పరిగ్రహించువాడు.

**ఇహాముత్ర సమం సర్వ గ్రహణా త్స్యా త్పరిగ్రహః**

తనవారికి, బయటవారికి, అందరికీ పరమపదమును సమానముగ ఇచ్చేవాడు.

**పరితగ్రహః యస్యసః పరిగ్రహః**

మానవులకు, పశువులకు, పక్షులకు కూడా పరమపదమునిచ్చేవాడు.

పరమేశ్వరుని దృష్టిలో అందరూ సమానులే. జీవి చేసిన కర్మ ననుసరించి ఉత్తర జన్మలు సంప్రాప్తిస్తాయి. ఈ జన్మలో మనిషై పుట్టినవారు చెడుకర్మలు చేసినట్లైతే మరుజన్మలో పశువులుగానో, పక్షులుగానో పుట్టవలసి ఉంటుంది. నీచమైన కర్మలు చేస్తే క్రిమికీటకాదులుగ జన్మించవలసి ఉంటుంది. అందుకని పరమేశ్వరుని దృష్టిలో జీవులన్నీ సమానమే. పరమపదంలో వీటన్నింటికీ తరతమ భేదాలు లేకుండా స్థానం కల్పిస్తాడు.

భక్తులకు పరమేశ్వరుడు సర్వత్ర గోచరిస్తాడు. జీవులన్నీ ఆ పరమేశ్వరునే శరణు వేడతాయి. భక్తులు సమర్పించినవి ఎంత చిన్న కానుకలైనా సరే తీసుకుంటాడు. ఇచ్చే కానుకకన్న భక్తి ప్రపత్తులే ప్రధానం. అందుచేత ఎవరేమిచ్చినా తీసుకుని, వారివారి కోరికలు తీరుస్తాడు. కాబట్టే శ్రీమన్నారాయణుడు 'పరిగ్రహః' అనబడుతున్నాడు.

ఈ రకంగా అవతారం లేనికాలంలో కూడా భక్తుల యొక్క కోరికలు తీరుస్తుంటాడు అన్నాడు రత్నాకరుడు.

# 31. కల్కివృత్తాంతము

"గురువుగారూ ! కలికాలం చివర మానవుల స్వభావము గాడిదల స్వభావము ఒకటే అవుతుంది. అంటే మానవులు బుద్ధిహీనులు అవుతారు. గృహస్థులు విషయ లాలసులు అవుతారు. అటువంటి సమయంలో విష్ణుమూర్తి కల్క్యావతారమెత్తి మళ్ళీ ధర్మసంస్థాపన చేస్తాడు. అని చెబుతారు కదా ఆ కల్కి వృత్తాంతాన్ని వివరించండి అన్నాడు కృష్ణశర్మ. వివరించటం మొదలుపెట్టాడు రత్నాకరుడు.

కలికాలంలో రోజురోజుకూ ధర్మము, సత్యము, క్షమ, దయ, ఓరిమి, ఆయువు అన్నీ తగ్గిపోతుంటాయి. ధనవంతుడే కులవంతుడు, గుణవంతుడుగా చెలామణి అవుతాడు. అతడే ఆచారవంతుడు, బలవంతుడు, న్యాయపరుడు, నియంత అవుతాడు. అతడే పెద్ద మనిషిగా గుర్తించబడతాడు. పెళ్ళి చెయ్యాలంటే కులము, శీలము, యోగ్యత అవసరం ఉండవు. నిజాయితీ అనేది ఎక్కడో గాని కనిపించదు. మోసము చెయ్యటము, అసత్యమాడటము చెయ్యగలవాడే వ్యవహార దక్షుడు. స్త్రీ విలువ శీలము మీద కాక ఆమె రతికౌశలము మీద ఆధారపడి ఉంటుంది. బ్రాహ్మణుని బ్రాహ్మణత్వము బ్రహ్మజ్ఞానమున కాక జంధ్యము వలన వ్యక్తమవుతుంది. ఆశ్రమ ధర్మాలు పాటించరు. పెద్దగా, ఎక్కువగా మాట్లాడినవాడు పండితుడు. దౌర్జన్యమే సాధుత్వముగా చెలామణి అవుతుంది. కడుపు నింపుకోవటమే పురుషార్ధము. కుటుంబ పోషణే ఘనకార్యము. కలికాలంలో ఇటువంటి లక్షణాలు గల దుర్జనులచేత లోకమంతా నిండి ఉంటుంది.

ఈ కాలములో కులము కన్న బలానికే ప్రాముఖ్యత ఎక్కువ. బలము గలవాడు రాజు. అధికారంలో ఉన్నవారు పరమనీచులు, నిర్దయులు. వారు ప్రజలను అనేక రకాలుగా బాధ పెడుతుంటారు. అనావృష్టి ఎక్కువ అవుతుంది. ప్రజలకు పన్నుల బాధ ఎక్కువ అవుతుంది. ఒక్కొక్కసారి అతివృష్టి వరదలు దీనితో జననష్టం బాగా జరుగుతుంది. ఆహారధాన్యాలు కొరత ఏర్పడుతుంది. రోగాలు పెరుగుతాయి. మానవుల సగటు ఆయువు తగ్గిపోతుంది. వైదిక ధర్మము రూపు మాసిపోయి, పాషండధర్మము పెరుగుతుంది.

బ్రహ్మ క్షత్రియ వైశ్యులంతా శూద్రులవుతారు. మేఘాలు బాగా వస్తాయి. కాని వర్షం మాత్రం తక్కువ కురుస్తుంది.

కలికాలం చివరలో గృహస్థులు భోగలాలసులవుతారు. అటువంటి స్థితిలో మళ్ళీ ధర్మరక్షణ చెయ్యటానికి పరమేశ్వరుడు అవతారమెత్తుతాడు.

సింహళదేశంలో సంబళనామ గ్రామంలో విష్ణుయశుడనే బ్రాహ్మణుని ఇంట శ్రీమహావిష్ణువు 'కల్కి'గా అవతరిస్తాడు. అతడు దేవదత్తమైన గుర్రాని ఎక్కి ఖడ్గం ధరించి బయలుదేరతాడు. అతని శరీరం మీది రోమకూపాలనుండి అద్భుతమైన కాంతి ప్రసరిస్తుంది. అతడు ప్రపంచమంతా తిరిగి దోపిడి గాంద్రయిన రాజులను, పాలకులను సంహరిస్తాడు. ప్రజలంతా ఆ కల్కిమూర్తిని దర్శించి తరిస్తారు. అతడు ప్రజల భయాన్ని పోగొడతాడు. ధర్మసంస్థాపన చేసి మళ్ళీ కొత్త యుగానికి నాంది పలుకుతాడు.

ఈ రకంగా ధర్మసంస్థాపన చేసిన తరువాత సూర్య వంశపు రాజయిన మరుత్తు (ఇతడు ఇక్ష్వాకులకు తరువాత వాడు) చంద్రవంశపు రాజైన దేవాసి (ఇతడు శాంతనుని అన్నగారు) వీరిద్దరూ రాజ్యాలను వదలి హిమాలయాల్లో తపస్సు చేస్తున్నా వీరికి రాజ్యాన్ని అప్పగిస్తాడు. అప్పుడు వారు మేల్కొని మళ్ళీ సత్యయుగాన్ని స్థాపిస్తారు. దాంతో మళ్ళీ కృతయుగం ప్రారంభమవుతుంది. భూమండలం సస్యశ్యామల మవుతుంది. సకాలంలో వర్షాలు పడతాయి. ఋతువులు సక్రమంగా తిరుగుతాయి. మానవులు తుష్టి, పుష్టి కలిగి దివ్యతేజస్సుతో ప్రకాశిస్తారు.

ఈ రకంగా కలియుగంలో విజృంభించిన అధర్మాన్ని నాశనం చెయ్యటానికి కల్కిగా అవతరించిన శ్రీమహావిష్ణువు అతిభయంకరుడు. ఉగ్రమైనవాడు అధర్మపరులైన పాలకులందరినీ సంహరిస్తాడు. అతడే కాలపురుషుడు. ఈ యుగం అంతమైపోతే మళ్ళీ కొత్తయుగం ప్రారంభించటానికి ఎదురు చూస్తుంటాడు. అవినీతి పరులైనవారిని రెప్పపాటు కాలంలో నాశనం చేస్తాడు. అతడే పరమపురుషుడు. మానవులు పాపఫలం అనుభవించే టప్పుడు విశ్రాంతి స్థానము అతడే. అతడు అందరియందు దయగలవాడు. సద్బ్రాహ్మణులకు భూమినంతటినీ దానం ఇచ్చినవాడు. కలిపురుషుని చంపి వేదసమ్మతమైన ధర్మాన్ని విస్తరింపచేసేవాడు. ఈరకంగా ధర్మాన్ని స్థాపించి హాయిగా విశ్రమించేవాడు. ధర్మాధర్మాలను వివరించి స్థిరమైన వ్యవస్థను ఏర్పాటు చేసినవాడు. అందులో నాశనము లేని బీజములు గలవాడు. కామక్రోధాలను వదలి తననే ఆశ్రయించిన వారికి తానే పురుషార్థము (మోక్షము) అయినవాడు. ఎంత తీసినా తరగని నిధులు గలవాడు గొప్ప భోగములు గలవాడు. అధికమైన సంపదగలవాడు, జగద్వ్యాపారంలో విరామమెరుగని వాడు. విరాడ్రూపుడు. సర్వాధారమైనవాడు. ధర్మాన్ని శిరస్సుగా గలవాడు. యజ్ఞమే అవయవముగా గలవాడు. నక్షత్రాలతోను, రాశులతోను కూడిన జ్యోతిశ్చక్రాన్ని ప్రవర్తింప చేసేవాడు. ఆ చక్రానికి ఇరుసువంటివాడు. నక్షత్ర రూపమైనవాడు. లోకాలన్నింటినీ

ధరించేవాడు. అవాంతర ప్రళయంలో కేవలము నాలుగు నక్షత్రాలుగా ధ్రువమండలము నందు ఉండేవాడు. జీవులందరికీ అర్హతలను బట్టి పదవుల నిచ్చేవాడు. అతడే యజ్ఞస్వరూపుడు. అతడే అన్నికర్మలచేత ఆరాధించబడేవాడు. మహాయజ్ఞస్వరూపి. అగ్నిష్టోమాది క్రతువులచే ఆరాధింపబడేవాడు. సత్రయాగముచే ఆరాధించబడేవాడు. ముముక్షువులకు మోక్షాన్ని ప్రసాదించేవాడు. అతడే సర్వదర్శి. జీవులు చేసే పాపపుణ్యాలను అతిశ్రద్ధతో పరికిస్తూ ఉంటాడు. అతడే శ్రీమహావిష్ణువు. ఈ విషయాలన్నీ 421 నుంచి 451వ నామం దాకా వివరించబడ్డాయి. ఇక నామాలను చూద్దాం.

## 421. ఉగ్రః

ఉగ్రుడు, భయము గొలుపువాడు.

**నష్టేధర్మే కల్కిరూపో హ్యవతార్య మహీభృతః**
**మ్లేచ్ఛాదీన్హ తవాన్యోసౌ ఉగ్ర ఇత్యుచ్యతే బుధైః**

ధర్మము నశించిన తరువాత కల్కి రూపంలో అవతరించి మ్లేచ్ఛులు, మేచ్ఛతుల్యులు అయిన పాలకులను అందరినీ సంహరించువాడు.

**ఉచ్యతీతి ఉగ్రః** యుగాంతంలో పాపము బాగా పెరిగిపోతుంది. వర్ణాశ్రమ వ్యవస్థ నాశనమవుతుంది. ధర్మము పూర్తిగా పోతుంది. న్యాయము నామమాత్రంగా ఉంటుంది. సత్యము ఎక్కడో గాని కనిపించదు. తపస్సు పేరుకు మాత్రమే మిగులుతుంది. అటువంటి పరిస్థితిలో ఉగ్రముగా ప్రకాశించేవాడు.

**కల్కేచ విష్ణుర్భగవాన్ నష్టధర్మాఽవతారకృత్**
**ఉర్వ్యాం మ్లేచ్ఛ గణం హత్వాఽ వస్థితోయః కలౌయుగే ॥**

భూమిమీద ధర్మములన్నీ నశించినప్పుడు శ్రీమహావిష్ణువు కల్కి అవతారమెత్తి, మ్లేచ్ఛగణాలను సంహరిస్తాడు. భయము గొలుపువాడు. **తైత్తిరీయోపనిషత్తులో**

"పరబ్రహ్మను గూర్చిన భయంతోనే గాలి వీస్తోంది. సూర్యుడు ఉదయిస్తున్నాడు. ఇంద్రాది దేవతలు, అష్టదిక్పాలకులు తమ విధులను సక్రమంగా నిర్వర్తిస్తున్నారు. దేవతలు క్రమంగా తమ విధులు నిర్వర్తించటానికి కారణము ఆ పరబ్రహ్మయే." అని చెప్పబడింది. జగత్తు అంతా పరమేశ్వరుని యందే ఉన్నది. కాబట్టి అతన్ని మభ్యపరచలేక భీతిల్లునది. అందుచేతనే శ్రీమహావిష్ణువు 'ఉగ్రః' అనబడుతున్నాడు.

## 422. సంవత్సరః

ఆదిశేషునిపై పవళించువాడు. కాలపురుషుడు. 91వ నామము కూడా ఇదే.

**సంహారస్యోపకరణైః సాకం కాలం ప్రతీక్షయన్**
**సంవత్సర స్యాత్పాతాళే హ్యనంతే వసతీతియః**

సంహారానికి కావలసిన పరికరాలతో కూడి, సమయం కోసం ఎదురుచూస్తూ, పాతాళ లోకంలో శేషపాన్పు మీద శయనించి ఉండేవాడు.

**సంవసతీతి సంవత్సరః** సంహారానికి కావలసిన వాటితో సిద్ధమై, పాతాళంలో శేషశాయిపై పవళించి ఉండినవాడు.

అనంతశయనం మీద ఉండి, మానవాకారము ధరించిన చక్రము మొదలైన ఆయుధములతో పరివేష్ఠితుడు. సృష్ఠి స్థితి లయాలయందు అన్ని భూతములు ఇతనియందే ఉంటాయి. లయం జరిగినప్పుడు కర్మక్షయంకాని జీవులన్నీ ఆ కర్మను తమతోపాటే ఉంచుకొని ఆ పరమేశ్వరునిలో లీనమవుతాయి. మళ్ళీ సృష్టి జరిగేదాకా ఆ పరమేశ్వరునిలోనే ఉండి, ఆ తరువాత బయటకు వస్తాయి.

పరమేశ్వరుడు అంటే చరాచర జగత్తే తప్ప ఇంకేమీ కాదు. అందుకని జీవులన్నీ జగత్తులోనే ఉన్నాయి అంటే ఆ పరమాత్మలోనే ఉన్నాయన్నమాట. ప్రళయకాలంలో ఆ పరమాత్మలోనే లీనమవుతూయి. ఈ రకంగా సృష్టి స్థితి లయాలలో జీవులన్నీ తనయందు వసిస్తాయి. అందుకే శ్రీమన్నారాయణుడు 'సంవత్సరః' అనబడుతున్నాడు. కశ్యపుడు కద్రువల కుమారుడు శేషుడు. తనతల్లి, తమ్ములు కలసి అధర్మంగా, అన్యాయంగా తన పినతల్లి వినతను దాసిగా చేశారు. దానికి చాలా దుఃఖించాడు శేషుడు. తల్లిని, తమ్ములను వదలి హిమాలయాలకు పోయి బ్రహ్మను గూర్చి తపస్సు చేశాడు. బ్రహ్మ ప్రత్యక్షమై గరుడునితో స్నేహం చెయ్యి. భూభారము వహించు, శ్రీమహావిష్ణువుకు పాన్పుగా ఉండు అని చెప్పాడు. అప్పటినుంచి విష్ణువుకు తల్పమయ్యాడు శేషుడు. అందుకే శ్రీమన్నారాయణుడు 'సంవత్సరః' అనబడుతున్నాడు.

## 423. దక్షః

శీఘ్రముగ నుండువవాడు. 917వ నామము కూడా ఇదే.

**శీఘ్రార్థత్వాద్దక్షధాతోః నిమేషాద్దశ్యవోహతాః**
**యేనసస్యా ఛ్ఛీఘ్రకారీ దక్ష ఇత్యుచ్యతే బుధైః ॥**

దక్ష అనగా శీఘ్రము అని అర్థం. రెప్పపాటు కాలంలో మ్లేచ్ఛులను సంహరించినవాడు.

**దస్యువధే దక్షతే ఇతి దక్షః** మ్లేచ్ఛులను సంహరించే విషయంలో శీఘ్రముగా ఉండేవాడు.

**క్షిప్రకారీ జనార్దనః** జనార్దనుడు శీఘ్రముగా పనిచేసేవాడు.

సమస్త కర్మలను శీఘ్రముగా, సమర్ధవంతముగా నిర్వహించేవాడు. జగత్తుకు నిమిత్తకారణము ఆ పరమేశ్వరుడే. అతడు జ్ఞానరూపుడు. అందుచేతనే దక్షః అనబడతాడు.

దక్షుడు. ప్రజాపతులలో ఒకడు. ఇతడు బ్రహ్మయొక్క కుడిచేతి బ్రొటనవేలు నుంచి పుట్టాడు. ఎడమచేతి బ్రొటన వేలు నుంచి పుట్టిన "ధరిణి" అనే కన్యను వివాహం చేసుకున్నాడు. వీరికి యాభై మంది కుమార్తెలు ఐదుగురు కుమారులు కలిగారు.

దక్షుని కుమార్తెలలో పెద్దకుమార్తె సతీదేవి. శివుని భార్య. పన్నెండుమంది కుమార్తెలను కశ్యపునకు ఇచ్చి వివాహం చేశాడు. కశ్యపుడికి వినతయందు పక్షులు, కద్రువయందు పాములు. ఈ రకంగా దక్షప్రజాపతి సంతానంవల్లనే జగత్తు అంతా ఉత్పత్తి అయింది.

## 424. విశ్రామః

విశ్రాంతి పొందే స్థలము

**పాపాని తత్ఫరాన్యేన శ్రాంతా భోక్తుంచ యే జనాః**
**తేషాం విశ్రామ భూమిత్వాత్ విశ్రామః పరికీర్తితః**

తాము చేసిన కర్మల తాలూకు పాపాన్ని, దాని ఫలితమైన దుఃఖాన్ని అనుభవించ వలసిన జనులకు విశ్రాంతి స్థానమైనవాడు.

**విశ్రమయతీతి విశ్రామః** పాపఫలమనుభవించేవారికి అలసట తీర్చుకొనే స్థానము.

చెడ్డకర్మలు చేసిన జీవులకు పాపం వస్తుంది. పాపఫలాన్ని నరకంలో అనుభవించాలి. మొత్తం 28 రకాల నరకాలు ఉన్నాయి. **శివపురాణం**లో వివిధ రకాల నరకాలు, అక్కడ అనుభవించాల్సిన శిక్షలు ఇవ్వబడ్డాయి. మనోవాక్కాయ కర్మలచేత చేసిన తప్పుల వల్ల పాపం కలుగుతుంది. ఆ పాపాలకు మరణానంతరము మానవులు నరకంలో శిక్షలు అనుభవిస్తారు. మొత్తం ఇరవై ఎనిమిది రకాల నరకాలున్నాయి.

1. 'తామిస్ర' నరకము గాడాంధకారముగా ఉంటుంది. ఇతరులను హేళన చేసేవారు. ఇతరుల ధనాన్ని అపహరించేవారు ఇక్కడ రకరకాలుగా శిక్షింపబడతారు.

2. భర్తలను ప్రలోభపెట్టి, సదా మోసపుచ్చి వారి భార్యలను అనుభవించే వారు 'అంధతామిస్ర' నరకంలో ఘోరంగా శిక్షింపబడతారు.

3. కుటుంబ పోషణ కోసము ఇతరులను మోసం చేసేవారు 'రౌరవ'నరకంలో విషజంతువులచే పీడించబడతారు.

4. దయ, దాక్షిణ్యము లేకుండా ధనార్జన చేసేవారు 'మహారౌరవ' నరకంలో పీడించబడతారు.

5. ఎలుకలను, ఉడతలను చంపితినేవాళ్ళు 'కుంభీపాక' నరకంలో సలసలా కాగే నూనెలో త్రోయబడతారు.

6. పెద్దలను, పండితులను దూషించేవారు 'కాలసూత్ర' నరకంలో మాడిపోయే ఇసుకలో పడవేయబడతారు.

7. వేద విరుద్ధమైన పనులు చేసేవారు. 'అసిపత్రవ్రతము' అనే నరకంలో కత్తుల బోనులో పడేసి, ఇనుప కొరడాలతో కొట్టబడతారు.

8. అమాయకులను దండించిన న్యాయాధికారులు 'సూకర ముఖము' అనే నరకంలో శరీరము నుగ్గునుగ్గ అయ్యేటట్లు కొట్టబడతారు.

9. జంతుజాలాన్ని హింసించేవారు 'అంధకూప' నరకంలో శిక్షించబడతారు. తేళ్ళు, జెర్రులు, నల్లులు, దోమలు, వాళ్ళ రక్తం పీల్చి పిప్పి చేస్తాయి.

10. సంపద కలిగి కూడా ఇతరులనాదరించనివారు 'క్రిభోజనము' అనే నరకంలో క్రిమికీటకాలతో బాధించబడతారు.

11. బ్రాహ్మణద్రవ్యము, విలువైన వస్తువులు దొంగతనం చేసేవారికి 'సందశన' నరకములో ఎర్రగా కాల్చిన కడ్డీలచే పొడిచి, చర్మము పలచబడుతుంది.

12. వావివరుసలు లేకుండా చరించినవారిని 'తప్తసూర్మి' నరకంలో ఎర్రగా కాల్చిన లోహపు విగ్రహాలను కౌగిలించుకోమంటారు.

13. మదంతో పశువులతో రమించేవారిని 'వజ్రకంటక' నరకంలో ముళ్ళ పొదలలో పడదోస్తారు.

14. అధర్మపరులైన ఉద్యోగులను, వేదబాహ్యులైన బ్రాహ్మణులను 'వైతరణి' నదిలో తోస్తారు. అది చీము, నెత్తురులతో, క్రిమికీటకాదులతో నిండి ఉంటుంది.

15. కులాచారములు పాటించనివారిని 'పూయదన' అనే మలమూత్రములతో నిండిన సముద్రంలో తోస్తారు.

16. కుక్కలను పెంచి వేటయే వృత్తిగా గల బ్రాహ్మణులను 'ప్రాణరోధ' నరకంలో కత్తులతో పొడుస్తారు.

17. జంతువులను, పశువులను చంపి తినేవాళ్ళు 'వైశస' నరకంలో పడరాని పాట్లు పడతారు.

18. కామాంధుడై, భార్య నోటియందు వీర్యమును వదిలినవాడికి 'లాలాభక్షణ' నరకంలో వీర్యాన్నే తినిపిస్తారు.

19. ఇళ్ళకు నిప్పు పెట్టేవారు, విషం పెట్టేవారు, దారిదోపిడీ చేసేవారిని 'సారమేయోదన' నరకంలో పదునైన కోరలు గల కుక్కలు చీల్చి వారి రక్తం త్రాగుతాయి.

20. దొంగ సాక్ష్యాలు చెప్పేవారు, వ్యాపారంలో మోసం చేసేవారు. 'అవిచింత'మనే నరకంలో కొండలమించి తలక్రిందులుగా క్రిందికి త్రోయబడతారు.

21. దీక్షలు పూని మద్యపానం చేసే బ్రాహ్మణుని 'ఆయుఃపాన' నరకములో సలసలాకాచిన ఇనుముని త్రాగిస్తారు.

22. తమకన్నా పెద్దవారిని నిర్లక్ష్యంగా చూసేవారిని 'క్షారకర్థ' నరకంలో తలక్రిందులుగా వ్రేలాడదీసి బాధిస్తారు.

23. మనుష్యులను, పశువులను చంపేవారిని 'రక్షోగణ భోజన' నరకంలో పదునైన కత్తులతో ముక్కలు ముక్కలుగా నరుకుతారు.

24. అడవి జంతువులను, ఊర జంతువులను చంపేవారిని 'శూలప్రోత' నరకంలో శూలాలతో పొడిచి ఉరి వేస్తారు.

25. సాటి మానవులను హింసించేవారిని 'దండసూకర' నరకములో హింసిస్తారు.

26. మనుషులను చెరబట్టేవారిని, బంధించేవారిని 'అవధ నిరోధనీ' నరకములో పొగలో పడేస్తారు.

27. భోజన సమయంలో వచ్చిన అతిథులను దూషించిన వారిని 'పర్యావర్తన' నరకంలో కళ్ళు కాకులతో పొడిపిస్తారు.

28. ధనగర్వముతో ఇతరులను దూషించేవారిని 'సూచేముఖ' నరకంలో సూదులతో గ్రుచ్చి హింసిస్తారు.

నరకములో ఎన్ని బాధలు పడినా పాపి చావడు. ఎత్తైన కొండ నుండి క్రిందికి పడత్రోసినప్పుడు అతడి శరీరము ముక్కలు ముక్కలవుతుంది. అతడు ఆ బాధ అనుభవిస్తాడు. కాని ఆ ముక్కలన్నీ మళ్ళీ అతుక్కుని, తరువాత శిక్షకు సిద్ధమవుతుంది.

జీవులకు విశ్రాంతి స్థానమైనవాడు. సంసారసాగరంలో పడి కొట్టుకుపోతున్న వారిని వడ్డుకు చేర్చి కాపాడేవాడు. అజ్ఞానమువల్ల ఏర్పడిన అహంకారము నుండి తప్పించి ఆనందమయ స్థితి కలుగచేయువాడు. కర్మఫలంవల్ల బాధలు అనుభవిస్తున్న వారికి తాను విశ్రాంతి స్థానమైనవాడు. ప్రళయకాలంలో జీవులన్నీ ఆ పరమేశ్వరుని యందే విశ్రాంతి పొందుతాయి. అందుకే పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు 'విశ్రామః' అనబడుతున్నాడు.

## 425. విశ్వదక్షిణః

అందరియందు దయగలవాడు. భూమిని దక్షిణగా ఇచ్చినవాడు.

**అపకారిష్వపి క్షాంతో విశ్వదక్షిణ ఉచ్యతే**
**యదా శ్వమేధే పృథివీం దక్షిణాత్వేన దత్తవాన్**
**మహాసుర్యేభ్యః కృత్స్నాంయః స స్మృతో విశ్వదక్షిణః**

తనకు అపకారం చేసినవారిపట్ల కూడా దయగలవాడు. క్షత్రియులను సంహరించి అశ్వమేధ యాగము చేసి ఆ రాజ్యాలనన్నింటినీ బ్రాహ్మణులకు దానమిచ్చినవాడు.

**విశ్వస్మిన్ దక్షతే ఇతి విశ్వదక్షిణః** సన్మార్గులు దుర్మార్గులు అందరి యందు సమానమైన దయగలవాడు. అపకారము చేసినవారిపై కూడా దయచూపేవాడు. రామరావణ యుద్ధం జరుగుతున్నది. రావణబ్రహ్మ కుమారుడు ఇంద్రజిత్తు, తమ్ముడు కుంభకర్ణుడు హతుడైనాడు. ఆ సమయంలో శ్రీరామచంద్రుడు రావణునితో "రాక్షసేశ్వరా! ఇప్పటికైనా మించిపోయింది లేదు. సీతని మాకప్పగించి శరణువేడు." అంటాడు. అది రాముని ఔదార్యానికి నిదర్శనం.

**అశ్వమేధే విశ్వం దక్షిణాయస్యసః విశ్వదక్షిణః** అశ్వమేధ యాగము చేసి బ్రాహ్మణులకు భూమిని దానం చేసినవాడు.

రేణుక జమదగ్ని మహర్షుల కుమారుడు రాముడు. ఇతడే భార్గవరాముడు. హైహయవంశస్థుడైన కార్తవీర్యుడు ఇతని తండ్రిని సంహరించాడు. ఆ దృశ్యం చూసిన ఇతని తల్లి 21సార్లు గుండెలు బాదుకుని ఏడ్చింది. అందుకని కోపించిన భార్గవరాముడు 21సార్లు దండయాత్ర చేసి బాలలు, వృద్ధులతో సహా క్షత్రియ వంశాలు నాశనం చేసి వారి రాజ్యాలను ఆక్రమించుకున్నాడు. ఆ తరువాత ...

పరశురాముడు పితృదేవతలకు తర్పణాలు ఇస్తున్నాడు. అప్పుడు వారు "నాయనా! నువ్వు చేసిన పాపము ఇంకా పోలేదు. వ్రతము చెయ్యవలసింది" అన్నారు. అప్పుడు

పరశురాముడు మహేంద్రగిరికి పోయి అక్కడ తపస్సు చేస్తుండగా కొందరు మునీశ్వరులు వచ్చి అశ్వమేధయాగము చెయ్యమని చెప్పారు. వారి సలహా మేరకు పరశురాముడు అశ్వమేధయాగం చేసి బ్రాహ్మణులకు తాను గెలిచిన భూమినంతా దానం ఇచ్చాడు. అందుచేతనే 'విశ్వదక్షిణః' అనబడుతున్నాడు.

పరమేశ్వరుడు అందరికన్న శక్తివంతుడు, నేర్పరి. అందుచేత 'విశ్వదక్షిణః' అనబడుతున్నాడు.

## 426. విస్తారః

విస్తరింపచేయువాడు.

**ప్రబలంయః కలింహత్వా ప్రవర్త్యచ కృతంయుగం ।**

**విస్తార్య వేదమర్యాదాం స్థితో విస్తార ఉచ్యతే ॥**

కలిపురుషుని చంపి, మళ్ళీ కృతయుగాన్ని ప్రారంభించి వేద సమ్మతమైన మర్యాదలన్నింటినీ విస్తరింప చేసినవాడు.

**తతోఽధర్మవినాశోవై ధర్మవృద్ధిశ్చ భారత**

**భవిష్యతి కృతే ప్రాప్తే క్రియావాంశ్చ జానస్తథా ॥**

కృతయుగము రాగానే అధర్మము పూర్తిగా నాశనమయి ధర్మము అభివృద్ధి జరుగుతుంది. మానవులంతా మంచి పనులను చేస్తారు అని **మహాభారతం**లో చెప్పబడింది.

కల్కి అవతారమెత్తి శ్రీమహావిష్ణువు కలిపురుషుని చంపుతాడు. ఆ తరువాత దయ, ధర్మము, సత్యము, న్యాయాలను ఉద్ధరిస్తాడు. ప్రజలను కన్నబిడ్డలవలె కాపాడే రాజులను ఏర్పరుస్తాడు. అప్పుడు మళ్ళీ కృతయుగం వస్తుంది. సూర్యవంశస్థుడైన 'మరుత్తు', చంద్రవంశీయుడైన 'దేవాసి'లకు భూమండలాన్ని అప్పగిస్తాడు. వీరిలో

మరుత్తు ఇక్ష్వాకు వంశీయుడు. దేవాసి భీష్ముని తండ్రి అయిన శంతనుని అన్నగారు ఆ రోజున వారు రాజ్యం వదలి తపస్సు చేసుకోవటానికి వెళ్ళి 'కలాప' అనే చోట యోగనిష్ఠులై ఉన్నారు.

కల్కివారిని మేల్కొల్పి కర్తవ్యాన్ని ఉపదేశిస్తాడు. అప్పుడు వారు చక్రవర్తులై కృతయుగాన్ని ప్రారంభిస్తారు. సమస్త భూమండలము సస్యసమృద్ధమవుతుంది. సకాలంలో వర్షాలు పడతాయి. ఋతువులు సక్రమంగా తిరుగుతుంటాయి. మానవులు తుష్టి, పుష్టి కలిగి దివ్యతేజస్సుతో ప్రకాశిస్తారు.

సమస్త లోకాలు తనయందే విస్తరించి ఉండటంచేత పరమేశ్వరుడు 'విస్తారః' అనబడుతున్నాడు. ప్రళయకాలంలో లోకాలన్నీ ఆయనలోనే లీనమవుతాయి. ధర్మ నివేద ప్రమాణంగా విస్తరింపచేస్తాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు 'విస్తారః' అనబడుతున్నాడు.

## 427. స్థావర స్థాణుః

స్థాపించి శమించువాడు.

**స్థావకృరీత్య ధర్మాన్యః శమేస్థాస్యతి నిత్యశః ।**
**యేనకేనా ప్యచాల్యస్థః స్థావర స్థాణురుచ్యతే ॥**

ఈ రకంగా ధర్మాన్ని స్థిరపరచి శమించి ఎవరివల్లా కదలకుండా ఉండేవాడు.

**స్థావరశ్చా స్థాణుశ్చ స్థావర స్థాణుః** ధర్మసంస్థాపన చేసి హాయిగా విశ్రమించేవాడు.

స్థిరముగా ఉండేవాడు. ఏ విధమైన కదలికలు లేనివాడు. స్థావరములైన భూమి, కొండలు, పర్వతాలు మొదలైన వాటికి కూడా ఆధారమైనవాడు. సర్వాంతర్యామి.

పృథివ్యాధి పంచభూతాలు ఇతనిలోనే ఉంటాయి. చరాచర జగత్తంతా పరమేశ్వరుని రూపంలోనే ఉంటుంది. అంటే కదలిక ఉన్నవి, కదలిక లేనివి అన్నీ కూడా పరమేశ్వరుని యందే ఉన్నాయి. కదలిక లేని భూమి, ఎడారులు, పర్వతాలు, లోయలు, కొండలు, బండలు అన్నీ ఆ పరమేశ్వరునిలోనే ఉన్నాయి కాబట్టి అతడు చలన రహితుడు. అందుకే శ్రీమన్నారాయణుడు "స్థావర స్థాణుః" అనబడుతున్నాడు.

## 428. ప్రమాణమ్

వ్యవస్థను గావించువాడు. 959 నామం కూడా ఇదే.

**హితా హిత స్థాపకత్త్వాత్ ప్రమాణం స్యాత్కృతాదిషు**

కృతయుగంలో ఉన్న జీవులకు మంచి చెడులు చెప్పి స్థిరమైన ఏర్పాటు చేసినవాడు. అంటే ఏది మంచో, ఏది చెడో వివరించి స్థిరమైన విధానాలను ఏర్పాటు చేసినవాడు. స్థిరమైన ప్రమాణాలను ఏర్పరచినవాడు.

**ప్రమీయతే అనే నేతి ప్రమాణమ్** హితము చెప్పి ప్రమాణము నేర్పరచువాడు.

**తచ్ఛీలమనువర్తంతే మనుష్యాః లోకవాసినః**

లోకంలో నివసించేవారంతా ఆ పరమేశ్వరుని శీలాన్నే అనుసరిస్తారు.

పరమేశ్వరుడు జ్ఞానస్వరూపుడు. అందుకే అతడు 'ప్రమాణము' అని చెప్పబడింది. అన్నింటినీ నిర్దేశించేది జ్ఞానము. అన్నింటినీ ప్రకాశింపచేసేది జ్ఞానము. అందుచేతనే జ్ఞానస్వరూపుడైన పరమేశ్వరుడే ప్రమాణము. అన్ని ధర్మాలకు, వాదనలకు అతడే ప్రమాణము. అందుకే శ్రీమన్నారాయణుడు 'ప్రమాణః' అనబడుతున్నాడు.

## 429. బీజమవ్యయమ్

అవినాశమైన బీజము గలవాడు.

**యోవైకలియుగస్యాంతే ముహూర్ధర్మ ప్రరోహణమ్ ।**
**కరోతి భక్త రక్షార్థాం సోచ్యతే బీజమవ్యయమ్ ॥**

ఈ రకంగా యుగాంతంలో ధర్మము నశించిపోతుంది. కాబట్టి తనభక్తులను కాపాడటం కోసం ఆ ధర్మాన్ని తిరిగి అంకురింపచేస్తాడు కాబట్టి నాశనము లేని బీజము గలవాడు అనబడుతున్నాడు.

ప్రతియుగము అంతమయ్యేటప్పుడు ధర్మము పూర్తిగా నాశనమవుతుంది. అసుర ప్రవృత్తి పెరుగుతుంది. ఆ రకంగా జరిగినప్పుడు భగవానుడు అవతరించి దుష్టశిక్షణ, ధర్మసంస్థాపన చేస్తాడు.

కృతయుగంలో హిరణ్యకశ్యపుడు ధర్మాన్ని నాశనం చేశాడు. నృసింహావతారమెత్తి ధర్మసంస్థాపన చేశాడు శ్రీహరి. త్రేతాయుగం ప్రారంభమయింది. ఈ యుగం చివరలో రావణబ్రహ్మ విజృంభించాడు. శ్రీరామచంద్రుడు అవతరించి ధర్మసంస్థాపన చేశాడు.

ద్వాపరయుగం ప్రారంభమయింది. ద్వాపరయుగం చివరలో దేవాసుర గణాలన్నీ భూలోకానికి వచ్చాయి. శ్రీకృష్ణ భగవానుడు జన్మించి మళ్ళీ ధర్మసంస్థాపన చేశాడు. కలియుగం ఆరంభమైంది. కలి అవతరించాడు. ఈ యుగం చివరలో శ్రీ మహావిష్ణువు కల్క్యావతారమెత్తి అధర్మాన్ని నాశనం చేస్తాడు. ధర్మసంస్థాపన జరుగుతుంది. మళ్ళీ కృతయుగం ప్రారంభమవుతుంది.

ఈ రకంగా ప్రతియుగంలోని చివరభాగంలో ధర్మక్షయం జరుగుతుంది. ఆ భగవానుడు అధర్మాన్ని నాశనం చేసి మళ్ళీ ధర్మసంస్థాపన చేస్తాడు. అందుచేతనే అతడు నాశనము లేని బీజములు గలవాడు.

పరమేశ్వరుడు విశ్వానికి ఆధారుడు. వృద్ధి చెందే జగత్తును ప్రకాశింపచేసే తాను మాత్రం అవినాశి ధర్మానికి బీజమైనవాడు. అందుకనే శ్రీమన్నారాయణుడు 'బీజమవ్యయమ్' అనబడుతున్నాడు.

# 430. అర్థః

పురుషార్థము

**పరమైకాంతి భిర్నిత్యం ఈషణత్రయ వర్జితైః ।**

**స్వయం ప్రయోజనతయా యాద్యమానోऽర్థ ఉచ్యతే ॥**

ఈషణత్రయాన్ని వదలి, తననే ఆరాధించు భక్తులచే, తానే పురుషార్థముగా భావించబడువాడు.

ఈషణత్రయము అంటే – లౌకిక బంధాలు మూడు. అవి 1. ధనేషణ, 2. దారేషణ, 3. పుత్రేషణ ఇక పురుషార్థాలు నాలుగు. వీటినే చతుర్విధ పురుషార్థాలు అంటారు. ఇవే ధర్మార్థకామమోక్షాలు.

1. ధర్మము అంటే – జన్మజన్మలకు ఇష్టప్రాప్తిని, అనిష్ట పరిహారాన్ని పొందటానికి సాధనాలను గ్రహించటము.

2. అర్థము అంటే – ఆ సాధనాలను జీవితమంతా అనుష్ఠించటము.

3. కామము అంటే – తాత్కాలిక సుఖాలు పొందటానికి అవసరమైన ఉపాయాలు ఉపయోగించటమే.

4. మోక్షము అంటే – పునర్జన్మ లేకుండా జీవాత్మ పరమాత్మలో ఏకం కావటానికి చేసే సాధన.

**అర్థ్యతే ఇతి అర్థః** భక్తి తత్పరతలు గలవారికి తానే పురుషార్థమైనవాడు. మోక్షమైనవాడు.

**భగవద్గీత**లోని ఏడవ అధ్యాయం **'జ్ఞానయోగము'**లోని 19వ శ్లోకము

**బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే**

**వాసుదేవ స్సర్వమితి స మహాత్మా సుదుర్లభః**

అనేక జన్మల తరువాత జ్ఞానియైనవాడు సర్వము పరమేశ్వరమయము అని భావించి నన్ను శరణు పొందుతాడు.

పరమేశ్వరుడు ఆనందమయుడు. ఆనందరూపుడు అందుచేత ప్రాణులందరి తోను కోరబడతాడు. అదే జీవితానికి అర్థము పరమార్థము. ఆ పరమార్థాన్నిచ్చేవాడు కాబట్టే శ్రీమన్నారాయణుడు 'అర్థః' అనబడుతున్నాడు.

## 431. అనర్థః

ప్రార్థింపబడకుండువాడు.

**అర్థార్థినాఽల్పభాగ్యేన నిర్వ్యాజం నార్థ్యతే యతః**
**తస్మాదనర్థనా మాసౌ వేదవిద్భిః ప్రకీర్తితః**

అశాశ్వతమైన ధనాన్ని పురుషార్థముగా ప్రార్థింపబడినవాడు.

**న అర్థ్యతే ఇతి అనర్థః** అర్థకామాలు అశాశ్వతములు. వీటికోసం పరమేశ్వరుని ప్రార్థించరు. అర్థకామాలకోసం సాకార బ్రహ్మను ప్రార్థించాలి. అంతేకాని నిరాకారుడయిన పరమేశ్వరుని కాదు.

పరమేశ్వరుడు ఆప్తకాముడు. పూర్ణకాముడు. కోరికలన్నీ తీరినవాడు, అతడికి తీరవలసిన కోరికలు ఏవీ లేవు. తాను పొందవలసినది ఏదీ లేదు. అన్నీ అతనియందే ఉన్నాయి. అందుచేత అందరి కోరికలు అతడే తీరుస్తాడు కాని అతనికి ఏ రకమైన కోరికలు ఉండవు. కాబట్టే శ్రీమన్నారాయణుడు 'అనర్థః' అనబడుతున్నాడు.

**లలితాసహస్రం**లో 291వ నామము **పురుషార్థప్రదా**

## 432. మహాకోశః

గొప్ప ధనాగారము గలవాడు.

**శంకపద్మాదినిధయః మహాంతో రోహణోగిరిః ।**
**కోశభాండ గృహాయస్య మహాకోశ స్స ఉచ్యతే ॥**

ఎంత తీసుకున్నా తరగని నిధులు గలవాడు.

**మహాంతఃకోశాః యస్యసః మహాకోశః** ఎన్నటికీ తరగని శంఖ పద్మనిధులు గలవాడు.

**దేవీభాగవతం**లో చింతామణిని ద్వీపములో పరమేశ్వరి ఎలా ఉన్నది అంటే

**యస్యాఽస్తు పార్శ్వభాగేస్తు నిధీతా శంఖపద్మకౌ**
**నవరత్నమహానద్య స్తదా వై కాంచనస్రవా ॥**

దేవికి ఇరువైపులా శంఖ, పద్మనిధులు ఉన్నాయి. బంగారము, రతనాలతో కూడిన నదులు ప్రవహిస్తున్నాయి. అక్కడ రతనాల రాశులు ఉంటాయి. నవనిధులు అంటే

| | | |
|---|---|---|
| 1. కాళ | 4. మాణవక | 7. శంఖ |
| 2. మహాకాళ | 5. వైసర్ప | 8. పద్మ |
| 3. పాండుక | 6. సర్వరత్న | 9. పింగళకములు |

పరమేశ్వరుడు మహాకోశము అనగా ఆనందమయకోశమందుంటాడు. **తైత్తిరీయోపనిషత్తు**లో వరుణమహర్షి కుమారుడు భృగుమహర్షి. విద్యాభ్యాసం పూర్తిచేసి బ్రహ్మజ్ఞానం పొందాలనే కోరికతో తండ్రి దగ్గరకు వెళ్ళి బ్రహ్మతత్త్వాన్ని ఉపదేశం చెయ్యమని అడిగాడు. దానికి తండ్రి "కుమారా ! అన్నము, ప్రాణము, నేత్రము, శ్రోత్రము, మనస్సు, వాక్కు మొదలైనవన్నీ పరబ్రహ్మ సాధనకు మార్గాలే. వీటన్నింటిలోనూ బ్రహ్మతత్వము ఇమిడి ఉంది. అది దేనిలోనించి ఉత్పన్నమైనదో, దేనితో పోషింపబడుతున్నదో, దేనియందు లయమవుతున్నదో, అన్నిటికీ మూలవస్తువు ఏదో తెలుసుకోవాలి. దాన్ని తపస్సు ద్వారానే సాధించాలి. కాబట్టి వెళ్ళి తపస్సు చెయ్యి" అన్నాడు.

తండ్రి ఉపదేశాన్ని అనుసరించి దీక్ష తీసుకుని నియమనిష్ఠలతో తపస్సు చెయ్యటం మొదలుపెట్టాడు భృగుమహర్షి. ఇలా కొంతకాలం జరిగింది. ఆ తరువాత అన్నమే పరబ్రహ్మ స్వరూపము అని తెలిసింది. అన్నంమూలంగానే అన్ని ప్రాణులూ ఉత్పత్తి అవుతున్నాయి. పుట్టిన ప్రాణలన్నీ అన్నంవల్లనే పోషింపబడుతున్నాయి. అన్నం భూమినుంచే ఉత్పత్తి అవుతోంది. మరణించిన తరువాత కూడా ప్రాణాలన్నీ ఈ భూమిలోనే కలిసిపోతున్నాయి. కాబట్టి అన్నమే పరబ్రహ్మ స్వరూపం. ఈ విషయాన్ని తండ్రికి తెలియచేశాడు భృగువు. దానికి వరుణమహర్షి "నాయనా ! బ్రహ్మతత్త్వ సాధనలో నీవు మొదటి మెట్టుమీదనే ఉన్నావు. ఇంకా సాధన చెయ్యాలి." అన్నాడు. మళ్ళీ తపస్సు చెయ్యటం మొదలుపెట్టాడు భృగువు. ఇంకొంత కాలం గడిచింది. ప్రాణమే బ్రహ్మ అనే విషయాన్ని అర్థంచేసుకున్నాడు. లోకంలోని సమస్త జీవరాసులు ప్రాణంవల్లనే జీవిస్తున్నాయి. ఇవన్నీ ప్రాణంవల్లనే రక్షించబడుతున్నాయి. ప్రాణం పోయినప్పుడు మృత్యువులో లయమైపోతున్నాయి. అందుచేత ప్రాణమే సర్వసృష్టికి మూలాధారము అని భావించాడు. ఇదే విషయాన్ని తండ్రికి వివరించాడు.

"నాయనా ! ఇదివరకటి కన్న కొంచెం ముందుకు వెళ్ళావు. అంతేకాని ప్రాణమే బ్రహ్మకాదు. ఇంకా తపస్సుచెయ్యి వెళ్ళు" అన్నాడు వరుణ మహర్షి.

భృగువు మళ్ళీ తపస్సు చెయ్యటం ఆరంభించాడు. కొంతకాలం జరిగింది. మనస్సు వల్లనే ప్రాణులు ఉత్పన్నమవుతున్నాయి. స్త్రీపురుషులు మనసుచేతనే ఆకర్షితులౌతున్నారు. అందువల్లనే ప్రాణులు ఉద్భవిస్తున్నాయి. జన్మించిన తరువాత కూడా ఇంద్రియాల

సాయంతోనే జీవనం సాగుతున్నది. అదేవిధంగా చనిపోయిన తరువాత కూడ ఇంద్రియాలకు జ్ఞానం ప్రసాదించే శక్తి పోతుంది. అవన్నీ మనస్సులో లీనమవుతాయి. కాబట్టి మనస్సే బ్రహ్మ అనుకున్నాడు భృగువు. అదే విషయాన్ని తండ్రికి తెలియచేశాడు. కాదన్నాడు తండ్రి. ఇంకా తపస్సు చెయ్యమన్నాడు.

మళ్ళీ కొంతకాలం తపస్సుచేశాడు భృగువు. ఇప్పుడు అతడికి అర్ధమయింది విజ్ఞానమే బ్రహ్మస్వరూపమని. తండ్రికి తెలియచేశాడు. కాదన్నాడు తండ్రి. మళ్ళీ కొంతకాలం తపస్సు చేశాడు భృగువు. అప్పుడు తెలిసిందతడికి ఆనందమే పరబ్రహ్మ స్వరూపము అని. సర్వమూ ఆనందం నుంచే జనిస్తుంది. ఆనందంలోనే లయం అవుతుంది. ఈ విషయం తండ్రికి తెలియచేశాడు. మహదానందం చెందాడు వరుణమహర్షి. అప్పుడు చెప్పాడు. "కుమారా ! అన్నింటికన్నా ఉత్తమంగా పరమాత్మ తత్త్వాన్ని స్పష్టం చేసే తత్త్వం ఆనందం. అన్నము, ప్రాణము, మనస్సు, విజ్ఞానము కూడా బ్రహ్మస్వరూపాలే. కాని ఇవి ఒకదాని కన్న మరొకటి ఇంకా సూక్ష్మమైనవి. అన్నిటినీ మించినది ఆనందము. ఈ ఆనందము క్షణికమైనది కాదు. శాశ్వతమైనది. పరబ్రహ్మోపాసన క్రమంగా జరగాలి. అంటే ఒక్కొక్క మెట్టు పైకి వెళ్ళాలి. అందుకే అన్నాన్ని ఎప్పుడూ నిందించరాదు. ప్రాణము, మనస్సు అన్నీ అన్నం మీదనే ఆధారపడి ఉన్నాయి. అందుకే అన్నాన్ని నిర్లక్ష్యం చెయ్యరాదు. అయితే మానవుడు తినటం కోసమే జీవించరాదు. జీవించటం కోసం మాత్రమే తినాలి. అన్నాన్ని నియమ ప్రకారమే స్వీకరించాలి. అన్నాన్ని పూజిస్తే తరువాతవన్నీ లభిస్తాయి. అందుకని ఆహారాన్ని వదలకుండా, ప్రాణాన్ని నిలుపుకుంటూ, మనస్సును వికసింప చేసుకుని, విజ్ఞానానుభవంనుండి బ్రహ్మానందం పొందాలి." అని బ్రహ్మతత్త్వాన్ని ఉపదేశించాడు.

పరమేశ్వరుడు మహాకోశమందు (ఆనందమయకోశము) ఉన్నాడు. అందుకే శ్రీమన్నారాయణుడు 'మహాకోశః' అనబడుతున్నాడు.

# 433. మహాభోగః

గొప్ప భోగములు గలవాడు.

**అర్థసాధ్యః కామభోగో యస్మాదేషాం మహానిత్తి**
**మహాభోగ స్సవిజ్ఞేయా హ్యష్టార్ణశ్చింతితార్థదః**

ధనముతో సాధింపదగిన మహత్తరమైన కామభోగాలు తనవల్లనే లభిస్తున్నట్లుండే వాడు. ఈ నామాన్ని **ఓం మహాభోగాయనమః** అనే అష్టాక్షరీ మంత్రముగా జపం చేస్తే కోరిన ధనం దొరుకుతుంది.

**మహాన్‌భోగః యస్మాత్సః మహాభోగః**

అర్థముతో (ధనము) సాధించిన భోగము తనవల్లనే లభించినట్లుగా ఉండేవాడు.

భగవద్గీతలోని ఏడవ అధ్యాయము **'జ్ఞానయోగము'**లోని 22వ శ్లోకము

**స తయా(శ్రద్ధయా యుక్తః తస్యారాధన మోహతే**

**లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్హితాన్**

అటువంటి కామభక్తుడు భక్తి(శ్రద్ధలతో ఆ దేవతనే ఆరాధిస్తాడు. తత్ఫలితముగా నా అను(గ్రహమువల్లనే ఆ దేవత ద్వారా తాను కోరిన భోగములను పొందుతాడు.

**మహాన్‌భోగః నందరూపః అస్యఇతి** ఆనందరూపమయిన గొప్ప భోగము ఇతడికి ఉన్నది. సచ్చిదానంద స్వరూపుడు కాబట్టి పరమేశ్వరుడు 'మహాభోగః' అనబడుతున్నాడు.

తను ఆ(శయించిన వారికి అన్నిరకాల భోగాలు ఇచ్చేవాడు. అందుచేత శ్రీమన్నారాయణుడు 'మహాభోగః' అనబడుతున్నాడు.

## 434. మహాధనః

అధికమైన ధనము గలవాడు.

**అనిరూప్యాతి కృపణ(ప్రదేయం ధన మక్షయం**

**యస్యై వాస్తీతి సతతం స మహాతవ ఈరితః**

అతిపిసినారికి గాని, పరమదరి(ద్రునకుగాని ఎంత ఇచ్చినా తరగని ధనము గలవాడు.

**మహత్ ధనం యస్యసః మహాధనః** అమితమైన ధనము గలవాడు.

మరీచి మొదలైన వారు ఆ పరమేశ్వరుని నుండి ధర్మము, కొంతమంది అమితమైన ఐశ్వర్యము, మరికొంతమంది కామము పొందారు.

చిన్ననాటి స్నేహితుడు సుదాముడు. అతడే కుచేలుడు. కడుబీదవాడు. గంపెడు సంసారం. కడుపునిండా తిండిగాని వంటినిండా బట్టగాని లేనివాడు. భార్య సలహా మేరకు శ్రీకృష్ణభగవానుని చూడటానికి వచ్చాడు. వట్టిచేతులతో రావటం ఇష్టం లేక వచ్చేటప్పుడు గుప్పెడు అటుకులు మా(త్రం తెచ్చాడు. ఆ అటుకులు స్వీకరించిన భగవానుడు కుచేలుడికి అష్టైశ్వర్యాలు (ప్రసాదించాడు.

**మహత్ ధనం భోగసాధన లక్షణం అస్య** ఇతనికి ఇం(ద్రియాల రూపంలో గొప్పధనమున్నది.

పరమేశ్వరుడు గొప్ప ఐశ్వర్యము గలవాడు. భోగాలు అనుభవించే ఐశ్వర్యము గలవాడు. అందుకే శ్రీమన్నారాయణుడు 'మహాధనః' అనబడుతున్నాడు.

## 435. అనిర్విణ్ణః

విరామము లేనివాడు. 892వ నామము కూడా ఇదే.

**అనిర్విణ్ణో జాగరూకో జగద్వ్యాపార సంతతౌ ॥**

జగత్తును సృష్టించటము మొదలైన వ్యాపారములను మళ్ళీ మళ్ళీ విసుగు లేకుండా జాగ్రత్తగా చేసేవాడు.

**నిర్విణ్ణః అనిర్విణ్ణః** విరామ మెరుగక జగద్వ్యాపారము చేయువాడు. సంసారులకు లౌకిక విషయాల యందు ప్రీతి ఎక్కువ. అందుచేత వారు పరమేశ్వరుని అలక్ష్యం చేస్తారు. అయినప్పటికి పరమేశ్వరుడు మళ్ళీ వాళ్ళని స్వాధీనము చేసుకొనే వీలుంటుందేమో అని విసుగు, విరామము లేకుండా ప్రయత్నిస్తుంటాడు.

**అవ్యుచ్ఛిన్నాస్తతస్త్వేతే - సర్గస్థిత్యంత సంశయా ॥** సృష్టి స్థితి సంహారాలు అనాదిగా జరుగుతున్నాయి.

**నిర్వేదం ప్రాప్తః న భవతి** నిర్వేదము - ఇలా ఎంతకాలముండాలో అనే విసుగు పొందనివాడు. పరమేశ్వరుడు పూర్ణకాముడు. అన్ని ఫలితాలు పొందిన ఆనందస్వరూపమే. అందుకే అతనికి నిర్వేదము కలగదు.

వేదన లేనివాడు. కోరికలు దుఃఖానికి కారణాలు కోరికలు ఉండి అవి తీరలేదు అంటే దానివల్ల దుఃఖము వస్తుంది. అయితే పరమేశ్వరుడు అన్ని కోరికలు తీరినవాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు 'అనిర్విణ్ణః' అనబడతాడు.

## 436. స్థవిష్ఠః

గొప్పవాడు, లావుగా ఉన్నవాడు. 53వ నామం కూడా ఇదే.

**శింశు మారా కృతితయా తారారూపేణ సర్వదా**

**స్థౌల్యాత్ స్థవిష్ఠ సంప్రోక్తః సప్తార్ణః పాపనాశనః**

శింశుమార చక్రము మీద నక్షత్రమైనవాడు. ఈ నామము సప్తాక్షరీ మంత్రము. సర్వపాపహరము

**అతిశయేన స్థూలః** మిక్కిలి లావైనవాడు. విరాడ్రూపంతో స్థూల ప్రపంచాభిమాని (వైశ్వానరుడు)గా ఉన్నాడు.

**ముండకోపనిషత్తు**లో "ఈ పరబ్రహ్మకు అగ్ని శిరస్సు, సూర్యచంద్రులు నేత్రాలు, దిక్కులే చెవులు, వేదాలు వాక్కు, వాయువు ప్రాణం, జగత్తే అతని హృదయం. అతని పాదాల నుండి భూమి పుట్టింది. అతడే సమస్త భూతాలలోను ఉండే అంతరాత్మ." అని చెప్పబడింది.

**భగవద్గీత**లోని 11వ అధ్యాయం **'విశ్వరూప సందర్శన యోగం'**లోని 16వ శ్లోకము.

**అనేకబాహూదరవక్త్రనేత్రం పశ్యామి త్వాం సర్వతోఽనంతరూపమ్ ।**
**నాంతం న మధ్యం న పునస్తవాదిం పశ్యామి విశ్వేశ్వరః విశ్వరూపః ॥**

ఓ విశ్వేశ్వరా! విశ్వరూపా! నీ బాహువులు, ఉదరములు, నేత్రములు అసంఖ్యాకములు. అనంతమైన నీ రూపము సర్వతోముఖముగా వర్ధిల్లుతున్నది. నీవు ఆద్యంత రహితుడవు. నీ దివ్యరూపానికి ఆది మధ్య అంతము లేవు.

అంటే పరమేశ్వరుడు జగత్తంతా వ్యాపించి ఉన్నాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'స్థవిష్ఠః' అనబడతాడు.

నక్షత్రమండలమందు శింశుమార రూపియై ప్రకాశించువాడు. **విష్ణుపురాణం**లో

**తారామయంభగవతశ్శింశుమారాకృతిప్రభోః ।**
**దివిరూపంహరేర్యత్తు తస్యపుచ్ఛేస్థితో ధ్రువః ॥**

**నైషభ్రమఞ్భ్రామయతి చన్ద్రాదిత్యాదికాఞ్గ్రహాఞ్ ।**
**భ్రమ స్తమతుతంయాన్తి నక్షత్రాణిచచక్రవత్ ॥**

**సూర్యాచన్ద్రమసౌతారానక్షత్రాణిగ్రహైస్సహ ।**
**వాతానీకమయైబఞ్ధైర్ధ్రుఞ్ వేబద్ధానితానివై ॥**

**శింశుమారాకృతిప్రోక్తం యద్రూపంజ్యోతిషాందివి ।**
**నారాయణోఽయనంధామ్నాం తస్యాధారస్స్వయంహృది ॥**

**ఉత్తానపాదపుత్ర స్తుతమారాధ్యజగత్పతిమ్ ।**
**సతారాశింశుసూరస్యధ్రువఃపుచ్ఛేవ్యవస్థితః ॥**

ఆధారశ్శింశుమారస్యసర్వాధ్యక్షోజనార్దనః ।
ధ్రువస్యశింశుమారశ్చధ్రువేభానుర్వ్యవస్థితః ॥
తదాధారంజగచ్చేదం సదేవాసురమానుషమ్ ॥

యేనవిప్రవిధానేనతన్మమైక మనాశ్శృణు ।
వివస్వానష్టభిర్మాసై రాచాయాపోరసాన్వితాః ।
వర్షత్యేవతతశ్చాన్నమన్నాదప్యఖిలం జగత్ ॥

వివస్వానంశుభిస్తీక్ష్ణైరాదాయ జగతోజలమ్ ।
సోమేముఞ్చత్యథేన్దుశ్చవాయునాడీమయైర్ద్విజ ।
నాలైర్విక్షిపతేఽభ్రేషు ధూమాగ్న్యనిలమూర్తిషు ॥

సభ్రశ్యన్తియత స్తేభ్యోజలాన్యభ్రాణితాన్యతః ।
అభ్రస్థాఃప్రపతన్త్యాపోవాయునాసముదీరితాః ।
సంస్కారంకాలజనితం మైత్రేయాసాద్యనిర్మలాః ॥

సరిత్సముద్రభౌమాస్తుతథాఽఽపఃప్రాణిసంభవాః ।
చతుష్ప్రకారాభగవానాద త్తేసవితామునే ॥

ఆకాశగఙ్గాసలిలంతథాఽఽదాయగభస్తిమాన్ ।
అనభ్రగతమేవోర్వ్యాంసద్యఃక్షిపతిరశ్మిభిః ॥

తస్యసంస్పర్శధూతపాపపఙ్కోద్విజోత్తమ ।
నయాతినరకంమర్త్యో దివ్యస్నానంహితత్ స్మృతమ్ ॥

దృష్టసూర్యంహియద్వారిపతత్యభ్రైర్వినాదివః ।
ఆకాశగఙ్గాసలిలం తద్గోభిఃక్షిప్యతేరవేః ॥

కృత్తికాదిషుఋక్షేషువిషమేష్వమ్బుయద్దివః ।
దృష్టార్కపతితం జ్ఞేయంతద్గాఙ్గందిగ్గజోజ్ఝితమ్ ॥

యుగ్మర్క్షేషుచయత్తోయంపతత్యర్కోన్ఝితందివః ।
తత్సూర్యరశ్మిభిస్సమ్యక్సమాదాయ నిరస్యతే ॥

ఉభయంపుణ్యమత్పథన్ం నృణాంపాపాపహంద్విజ ।
ఆకాశగఙ్గా సలిలం దివ్యంస్నానం మహామునే ॥

యత్తుమేఘైస్సముత్సృష్టం వారితత్ప్రాణినాంద్విజ ।
పుష్ణాత్యోషధయస్సర్వా జీవనాయామృతం హితత్ ॥

తేనవృద్ధింపరాంనీతస్సలిలేనౌషధీగణః ।
సాధకః ఫలపాకాన్తః ప్రజానాంద్విజ ! జాయతే ॥

తేనయజ్ఞాన్ యథాప్రోక్తాన్ మానవాశ్శాస్త్రచక్షుషః ।
కువన్త్యహస్తైశ్చ దేవానాప్యాయయ న్తిచ ॥

ఏవంయజ్ఞాశ్చవణాన్శ్చద్విజపూవన్కాః ।
సవేన్దేవనికాయాశ్చపశుభూతగణాశ్చయే ॥

వృష్ట్యాధృతమిదం సర్వమన్నంనిష్పాద్యతేయయా ।
సాపినిష్పాద్యతేవృష్టిస్సవిత్రామునిసత్తమ ॥

ఆధారభూతస్సవితుర్ధ్రువో మునివరోత్తమ ! ।
ధ్రువస్యశింశుమారోసౌసోపినారాయాణాశ్రయః ॥

హృదినారాయణ స్తస్యశింశుమారస్యసంస్థితః ।
తద్భుతాన్సవన్భూతానామాది భూతస్సనాతనః ॥

భగవానుడైన విష్ణువు నక్షత్రమయమై 'శింశుమార స్వరూపము దివమ్మున వెలుగుచున్నది. దాని తోకయందు ధ్రువుండున్నాఁడు. ఆ శింశుమారాకృతియే, చంద్ర సూర్యాది గ్రహములను, గిఱునఁ ద్రిప్పుచున్నది. అట్లు తిరుగుచున్న దాని వెంట నక్షత్రములు చక్రమువలెఁ దిరుగుచున్నవి సూర్యచంద్రులు, తారా నక్షత్రములు, గ్రహములతోఁ గూడ, వాయుమయములైన గట్టి త్రాళ్ళచే ధ్రువుని యందుఁ గట్టఁ బడియున్నవి. అనగా భూమికి మేఘముల నడుమనున్న ఆవహము, ఆమీది మేఘములకు భాస్కరులకు మధ్యనున్న ప్రవహము, సూర్యునికి జంద్రుకు నడుమనున్న అనువహము, చంద్రునికి నక్షత్రములకు నడుమనున్న సంవహము, నక్షత్రములకు గ్రహములకు మధ్యనున్న వివహము, గ్రహములకు సప్తర్షులకు మధ్యనున్న పురోవహము, సప్తర్షులకు ధ్రువునికి మధ్యనున్న పరివహము అను సప్తవాయువులచే వేగమున సూర్యచంద్రాదులు

ధ్రువమండలము నంటి తిరుగుచున్నవి. జ్యోతిస్స్వరూపమైన యీ శింశుమారాకారము యొక్క హృదయమునందు తారా స్వరూపమున నారాయణుడే స్వయముగా దానికాధారమై యున్నాడు. తారామయమైన శింశుమారముయొక్క తోకయందు, జగత్పతతియైన యా నారాయణు నారాధించుచు, నుత్తాన పాదుని కుమారుఁడగు ధ్రువుడున్నాడు. సర్వాధ్యక్షుడైన జనార్దనుడు శింశుమారమునకును శింశుమారము ధ్రువునకును, ధ్రువుఁడు సూర్యునికి నాధారముగా నున్నారు. ఆ సూర్యుఁడు దేవాసుర మనుష్యులతోగూడి, యీ జగత్తున కాధారముగా ఉన్నాఁడు. అదెట్లన శ్రద్ధగా వినుము : సూర్యుఁడెనిమిది మాసముల రసము గల యుదకముల నాకర్షించి వర్షించును. దానివలన నన్నము, అన్నము వలన, సర్వజగత్తు కలుగుతున్నాయి. తీక్షణమైన కిరణములచే, జగత్తునందలి నీరును బీల్చి, చంద్రునియందు విడచును. చంద్రుఁడు, పొగ, నిప్పు, గాలియను వాని కూడికయై యున్న మేఘములయందు, వాయునాడీమయములయిన నాళముల ద్వారమున (గొట్టములద్వారా) చిమ్మును. ఆ మేఘములందుండి నీరు భ్రంశము నొందదు (పడిపోదు). కాన నానికా (ఆ+భ్ర)మను పేరు వచ్చినది. కాలమువలన సంస్కారము పొంది, యానీళ్ళు నిర్మలములై వాయువుచేఁ బ్రేరేపింపఁబడి భూమిపై వర్షించును. భగవానుఁడైన సూర్యుఁడు నాల్గు తెఱంగులుగా నున్న యుదకము నాకర్షించును. అనగా మేఘ గర్భమునకుఁ జేరుటకు మున్ను నీరు నదులందు, భూమియందును, జీవుల దేహమందును నాల్గు తెఱంగులుగా నుండును. ఆకాశగంగ యందలి నీటిని సూర్యుఁడు పై వలెనే గ్రహించి మేఘముల మూలమున కాకుండ తన కిరణములచేతనే దానిని భూమిపై వర్షించుచున్నాఁడు. దాని స్పర్శచే, మానవుఁడు బాపములు వాసి పుణ్యలోకములకుఁ పోవును. దానికే దివ్యస్నానమని పేరు. సూర్యుడు కనబడుచుండగనే మేఘముల మూలమునఁ గాక' సూర్యుని కిరణములచేత నాకాశ గంగాజలము కృత్తికా నక్షత్రము మొదలుకొనియున్న వానిలో బేసి నక్షత్రముల యందాకాశమునుండి వర్షింపఁబడు నాజలము దిగ్గజములచే వర్షింపబడు గంగోదకమని పేరు గాంచినది. సరినక్షత్రముల యందనగా రోహిణి, ఆర్ద్ర మొదలగు వానియందున్న సూర్యుని కిరణములచే నాకర్షింపఁబడి వర్షింపఁబడు నాకాశ గంగాజలము కూడా చాలా పుణ్యమైనది. పాపహరము. దివ్యస్నానమను వాడుక దీనికే. మేఘములచే వర్షింపఁబడు నీరోషధులను బెంచును. అది జీవనాధారము గాన అమృతమని పేరొందినది. దానిచేఁ బెంపొంది యోషధులు ప్రజల శరీరోత్పత్తి పోషణముల సాధకములగుచున్నవి. అందుచే శాస్త్రదృష్టికల మానవులు వేదవిహితములయిన యజ్ఞము లొనర్చి దేవతలఁ దృప్తి పఱతురు. అట్లు యజ్ఞములు, వేదములు, వర్ణములు, సర్వదేవతలు,

పశువులు, భూతములు మొదలగునివియెల్ల వర్షముచే నిలుచుచున్నవి. అన్నము వృష్టిచే నేర్పడుచున్నది. ఆ వృష్టి కాధారము సూర్యుఁడు అతనికాధారము ధ్రువుడు ధ్రువుని కాధారము శింశుమారము. ఆ శింశుమార చక్రమున కాధారము నారాయణుఁడు దాని హృదయమందే యా నారాయణమూర్తి యున్నాడు. సర్వభూతములకు అతఁడే మొదలయి సనాతనుడయి భరించువాఁడై ఉన్నాడు. ఈవిధంగా నక్షత్రమండలంలో శింశుమార రూపంలో ప్రకాశిస్తున్న శ్రీమన్నారాయణుడు 'స్థవిష్ఠః' అనబడుతున్నాడు.

## 437. అభూః

సర్వాధారమైనవాడు.

**ఔత్తానపాది సంబంధాత్ సర్వాధారతయా తథా ।**
**భవతీతి చ భూః ప్రోక్తః భక్తానాం భూతిదోమనుః ॥**

ధ్రువుడికి ఆధారముగా ఉండే సమస్తానికి ఆధారమైనవాడు. ఈ నామజపం భక్తులకు ఐశ్వర్యాన్ని ప్రసాదిస్తుంది.

**ధ్రువానుబంధేన సర్వాధారో భవతీతి భూః**

ధ్రువుడికే ఆధారమైనవాడు కాబట్టి సమస్తానికి ఆధారమైనవాడు.

ధ్రువమే అన్నింటికీ ఆధారమైంది. అటువంటి ధ్రువమునకు ఆధారమైన శ్రీమన్నారాయణుడు. అందుకే ఆయన 'అభూః' అనబడుతున్నాడు.

**నభవతి, నజాయతే** జన్మించనివాడు. ఉండువాడు.

అంటే జన్మమృత్యుజరాదులు లేనివాడు. శాశ్వతమైన వాడు. స్థిరముగా ఉండేవాడు. ఎల్లప్పుడూ ఉండేవాడు. నిత్యము, సత్యము అయినవాడు. పుట్టుకలేని వాడు. అటువంటి పరమేశ్వరుని ఆశ్రయిస్తే మనకు కూడా జన్మమృత్యుజరాదులు ఉండవు. ఆ పరబ్రహ్మ రూపమే మనకు కూడా వస్తుంది. ఆయన లక్షణాలే వస్తాయి. ఆయన రూపము - నిరాకారము. అందుచేత అతనిని ఆరాధించినవారు కూడా నిరాకారులవుతారు. అనగా సాయుజ్యం పొందుతారు.

జన్మ అనేది శరీరానికే గాని ఆత్మకు కాదు. అందుకనే ఆత్మస్వరూపుడైన భగవానుడు 'అభూః' అనబడుతున్నాడు. అటువంటి ఆత్మస్థితి మనకు కావాలి అంటే కొన్ని సాధనాలు కావాలి. ఆ సాధనాలు కూడా భగవానుని యందే ఉన్నాయి. అందుకే శ్రీమన్నారాయణుడు 'అభూః' అనబడుతున్నాడు.

## 438. ధర్మయూపః

ధర్మాన్ని చేర్చుకొనేవాడు.

**ఉత్తమాంగతయాధర్మ తత్త్వం యౌతీతి సర్వదా ।**
**ధర్మయూప స్సమాఖ్యాతో హ్యష్టారో ధర్మదాయకః ॥**

ధర్మమును శిరస్సుగా గలవాడు.

**ధర్మయౌతీతి ధర్మయూపః** ధర్మమును శిరస్సుగా చేర్చుకున్నవాడు.

**ధర్మోమూర్ధాన మాశ్రితః** ధర్మము వీని శిరస్సును ఆశ్రయించి ఉన్నది.

**తచ్ఛిరో ధర్మః** పరమేశ్వరుని శిరస్సే ధర్మము

**ధర్మాణాం యూపః - ఇవ** ధర్మములకు యూపస్తంభము వంటివాడు.

యూపస్తంభము - యజ్ఞ సమయంలో యజ్ఞ పశువును కట్టి వేసే స్తంభము.

యజ్ఞ సమయంలో యూపస్తంభానికి పశువులను కట్టేసినట్లే, విష్ణువు రూపంలో అన్ని ధర్మాలు కట్టి వేయబడి ఉంటాయి. ఆత్మ సాక్షాత్కారానికి సాధనాలయిన ధర్మాలన్నీ అతని యందే బంధించబడి ఉంటాయి. అందుచేతనే పరమేశ్వరుడు 'ధర్మయూపః' అనబడుతున్నాడు. అంటే పరమేశ్వరుడు ధర్మ స్వరూపుడు. ధర్మమూర్తి. ధర్మము పరమేశ్వరుని శిరస్సు. ధర్మమే అతని సర్వస్వము.

## 439. మహామఖః

పూజ్యమైన యజ్ఞమును అవయవముగా గలవాడు.

**ధర్మదేహతయా పూజ్యోయజ్ఞోఽస్యావయవోయతః**
**అతో మహామఖః ప్రోక్తో హ్యష్వార్ణ కర్మకారకః**

పరమేశ్వరుడు ధర్మమే శరీరముగా గలవాడు. అందుచేత పూజ్యమైన యజ్ఞము అవయవముగ కలవాడు. ఈ నామము అష్టాక్షరీ మంత్రము. పుణ్యకర్మలను చేయిస్తుంది.

**మహాన్మఖః అవయవః యస్యసః మహామఖః**

ధర్మమే శరీరముగా, యజ్ఞమే అవయవముగా గలవాడు.

**మహాన్తః భవంతి మఖాః యజ్ఞాః - నిర్వాణ లక్షణం**
**ఫలం ప్రయచ్ఛంతః సంతః యస్మిన్ సమర్పితా -**

ఎవనియందు సమర్పించబడే యజ్ఞములు గొప్పవిగా అయి మోక్షఫలాన్ని ఇస్తున్నాయో, అట్టి మహానుభావుడు.

తనకు సమర్పించబడే సత్కర్మలన్నీ జన్మరాహిత్యాన్ని ప్రసాదిస్తాయి. అందుకే శ్రీమన్నారాయణుడు 'మహామఖః' అనబడుతున్నాడు. పరమేశ్వరుడే యజ్ఞ స్వరూపుడు.

**యజ్ఞోధర్మశ్చ విజ్ఞేయః** అందుచేతనే పరమేశ్వరుడు 'యజ్ఞమూర్తి' అనబడుతున్నాడు.

కర్మ ఎలాంటిదైనప్పటికీ, పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణునికి సమర్పించటం వల్ల అది ఉత్తమమైన ఫలితాన్ని అంటే మోక్షము నిస్తుంది.

## 440. నక్షత్ర నేమిః

జ్యోతిశ్చక్రమును ప్రవర్తింపచేసేవాడు.

**యన్నక్షత్రాత్మకం చక్రం జ్యోతిరూప మనామయం**
**యస్తన్నిత్యం భ్రామయతి భ్రమంత మనుయాతి చ**
**నక్షత్రనేమి ర్విజ్ఞేయో నవార్ణో భ్రమనాశకః**

తేజోరూపమైనది, ఆరోగ్యప్రదమైనది, అయిన నక్షత్ర రూపచక్రాన్ని నిరంతరము ప్రవర్తింపచేస్తూ, దానిని అనుసరించి చరించేవాడు.

**నక్షత్రం నయతీతి నక్షత్రనేమిః** నక్షత్రములతో కూడినటువంటి జ్యోతిశ్చక్రాన్ని ప్రవర్తింపచేసేవాడు. **విష్ణుపురాణంలో**

**ఏషభ్రమన్ భ్రామయతి చంద్రాదిత్యాది కాన్ గ్రహాన్ ।**
**భ్రమంతమనుతంయాంతి నక్షత్రాణి చ చక్రవత్ ॥**

ఇతని చుట్టూ సూర్యాది గ్రహాలు తిరుగుతాయి. నక్షత్రాలు చక్రమువలె తిరుగుతాయి.

అంతరిక్షములో దీర్ఘగోళపు ఆకృతి సమానమైన ఆకారము గల వ్యూహమునందు తిరుగుతూ ఉండే నక్షత్రముల చక్రానికి ఇరుసు( నేమి) వంటివాడు. చంద్రుడు, సూర్యుడు మొదలైన గ్రహాలన్నీ నక్షత్రములతో కలిసి ధ్రువుడు అనే పేరుగల కట్టు కొయ్యకు బంధించబడి ఉన్నాయి. ఈ రకంగా ఉన్న శింశుమార చక్రాన్ని త్రిప్పుతూ దానితోక యందు నిలకడగా ఉన్నవాడు ధ్రువుడు. ఈ చక్రానికి ఇరుసులా ఉండి, దానిని తన కక్ష్యలో వేగంగా త్రిప్పేవాడు శ్రీమహావిష్ణువు. అందుచేతనే శ్రీమహావిష్ణువు. శింశుమార చక్రానికి హృదయమువంటి వాడని చెప్పబడింది.

జ్యోతిశ్చక్రములో మేషాదిరాశులు మొత్తం 12

| | | | |
|---|---|---|---|
| 1. మేషము | 4. కర్కాటకము | 7. తుల | 10. మకరం |
| 2. వృషభము | 5. సింహము | 8. వృశ్చికం | 11. కుంభం |
| 3. మిధునము | 6. కన్య | 9. ధనుస్సు | 12. మీనం |

ఈ రాసులలో సూర్యుడు నెలకు ఒకరాశి చొప్పున తిరుగుతుంటాడు. ఇక నక్షత్రాలు 27

| | | | |
|---|---|---|---|
| 1. అశ్వని | 8. పుష్యమి | 15. స్వాతి | 22. శ్రవణం |
| 2. భరణి | 9. ఆశ్లేష | 16. విశాఖ | 23. ధనిష్ఠ |
| 3. కృత్తిక | 10. మఖ | 17. అనూరాధ | 24. శతభిషం |
| 4. రోహిణి | 11. పుబ్బ | 18. జ్యేష్ఠ | 25. పూర్వాభాద్ర |
| 5. మృగశిర | 12. ఉత్తర | 19. మూల | 26. ఉత్తరాభాద్ర |
| 6. ఆరుద్ర | 13. హస్త | 20. పూర్వాషాఢ | 27. రేవతి |
| 7. పునర్వసు | 14. చిత్త | 21. ఉత్తరాషాఢ | |

ఒక్కొక్క నక్షత్రానికి 4 పాదాలు ఈ రకంగా 27 నక్షత్రాలకు 27×4 = 108 పాదాలుంటాయి. ఇవి 12 రాశులయందు ఒక్కొక్క దానిలోని 9 పాదాల చొప్పున 12×9 = 108 పాదాలు ఉంటాయి. అందుచేతనే ఒక్కొక్క రాశిలో చంద్రుడు 2 1/2 రోజులు ఉంటాడు. ఈ రకంగా నెల పూర్తయ్యేసరికి 12 రాశులయందు చరిస్తాడు. ఈ రకంగానే మిగిలిన గ్రహాలు కూడా ఈ రాశులయందు చరిస్తాయి.

జ్యోతిశ్చక్రంలో గ్రహాలు తొమ్మిది అవి

| | | |
|---|---|---|
| 1. రవి | 4. బుధుడు | 7. శని |
| 2. చంద్రుడు | 5. గురుడు | 8. రాహువు |
| 3. కుజుడు | 6. శుక్రుడు | 9. కేతువు |

ఈ గ్రహాలు 12 రాశులయందు చరిస్తుంటాయి. అవి ఒక్కొక్క రాశిలో ఉండే కాలము ఈ క్రింది విధంగా ఉంటుంది.

| | | | |
|---|---|---|---|
| 1. రవి | – 30 రోజులు | 6. శుక్రుడు | – 30 రోజులు |
| 2. చంద్రుడు | – 2 1/2 రోజులు | 7. శని | – 2 1/2 సం॥లు |
| 3. కుజుడు | – 45 రోజులు | 8. రాహువు | – 1 1/2 సం॥ము |
| 4. బుధుడు | – 30 రోజులు | 9. కేతువు | – 1 1/2 సం॥ము |
| 5. గురుడు | – ఒక సంవత్సరము | | |

రాశిచక్రంలో గ్రహాలన్నీ సవ్యంగా నడుస్తుంటే రాహుకేతువులు మాత్రం అపసవ్యంగా నడుస్తారు. సప్త ఋషి మండలానికి పదకొండు లక్షల యోజనాలపైన ధ్రువమండల మున్నది. అక్కడ ఇంద్రుడు, అగ్ని, కశ్యపుడు, ధర్ముడు మొదలగువారు చరిస్తుంటారు. పశువులను కట్టేసే కొయ్య చుట్టు తిరిగినట్లుగా, ఈ గ్రహాలన్నీ ధ్రువగతిని అనుసరించి తిరుగుతుంటాయి. ఇదే జ్యోతిశ్చక్రము. దీనికే **శింశుమార చక్ర**మనిపేరు.

శింశుమారము అంటే – నీటిలో తిరిగే మొసలి ఈ జ్యోతిశ్చక్రము మొసలి ఆకారంలో కనిపిస్తుంది. అందుచేతనే దీనికి ఆ పేరు వచ్చింది.

**దేవిభాగవతం**లో ఈ చక్రాన్ని వివరిస్తూ, ఈ చక్రానికి

| | | |
|---|---|---|
| తోకమీద | – | ప్రజాపతి, అగ్ని, చంద్రుడు |
| తోకచివర | – | ధాత, విధాత |
| కటిప్రదేశము | – | సప్తఋషులు |
| దక్షిణ భాగము | – | ఉత్తరాయణ నక్షత్రాలు |
| ఉత్తర భాగము | – | దక్షిణాయన నక్షత్రాలు |
| మఖ మొదలైన నక్షత్రాలు | – | అనులోమంగాను |
| మృగశిర మొదలైనవి | – | విలోమంగాను ఉంటాయి. |
| శతభిషం, జ్యేష్ఠ | – | కుడి, ఎడమ మూపులయందు |
| అగస్త్యుడు | – | పై దవడ |
| యముడు | – | క్రింది దవడ |
| కుజుడు | – | మొగము |
| శని | – | ఉపస్థ |
| బృహస్పతి | – | మూపురము |
| సూర్యుడు | – | వక్షము |
| నారాయణుడు | – | హృదయము |
| చంద్రుడు | – | మనసు |
| స్తనములు | – | అశ్వినులు |
| నాభి | – | శుక్రుడు |
| ప్రాణ, అపానాలు | – | బుధుడు |
| కంఠము | – | రాహుకేతువులు |
| అవయవాలు | – | మిగిలిన నక్షత్రాలు |

శ్రీమన్నారాయణుడే కాలరూపుడైన ప్రజాపతి. అతడే శింశుమార చక్రరూపంలో ఉంటాడు. అందుచేతనే అతడు 'నక్షత్రనేమిః' అనబడుతున్నాడు.

అతడే జ్యోతిశ్చక్రాన్ని ప్రవర్తింపచేసేవాడు. ఆ చక్రానికి హృదయస్థానమందు 'ఇరుసు'లాగా ఉంటాడు. అందుకే శ్రీమన్నారాయణుడు 'నక్షత్రనేమి' అనబడతాడు.

## 441. నక్షత్రీ

నక్షత్రరూపమైనవాడు.

**శింశుమారాకృతిః ప్రోక్తం యద్రూపం జ్యోతిషాం దివి**
**తద్వ్యాప్తి స నక్షత్రీ సప్తార్ణోలోక పావనః**

మొసలి ఆకారము గలిగి ఆకాశమునందు వెలుగొందుతున్న నక్షత్రపుంజమును తన వశమునుందు ఉంచుకుని ధరించువాడు.

**నక్షత్రం అస్మిన్న స్తీతి నక్షత్రీ**

శింశుమార రూపమయిన నక్షత్రరూపము ధరించినవాడు. **విష్ణుపురాణంలో**

**శింశుమారాకృతి ప్రోక్తం యద్రూపం జ్యోతిషాందివి**
**నారాయణోనయన్ ధామ్నామ్ తస్యాధారః స్వయంహృధి**

జ్యోతిర్గణాలకు పైగా శింశుమార చక్రమున్నది. దానికి ఆధారమై, దాని హృదయ స్థానమందు సకల తేజోమయుడైన శ్రీమన్నారాయణుడు ప్రకాశిస్తున్నాడు.

దక్షప్రజాపతికి యాభైమంది కుమార్తెలు. వారిలో అశ్వని, భరణి మొదలైన 27 మందిని చంద్రునకిచ్చి వివాహం చేశాడు. కాబట్టి ఈ నక్షత్రాలన్నీ చంద్రుని ఆశ్రయించి ఉంటాయి. అందుచేత చంద్రుడు నక్షత్రీ అనబడతాడు.

**భగవద్గీత** 10వ అధ్యాయం **'విభూతియోగం'**లోని 21వ శ్లోకము

**ఆదిత్యానామహం విష్ణుః జ్యోతిషాం రవి రంశుమాన్ ।**
**మరీచిర్మరు తామస్మి నక్షత్రాణా మహంశశీ ॥**

ద్వాదశాదిత్యులలో విష్ణుమూర్తిని నేనే. జ్యోతిర్మయ స్వరూపంలో సూర్యుడను నేను. తేజము నేను. నక్షత్రాధిపతి అయిన చంద్రుడను నేను.

27 నక్షత్రాలకు ప్రభువు చంద్రుడు, అందుచేత ఆ చంద్రుడు భగవానుని ముఖ్యవిభూతి చంద్రుని రూపమున ప్రకాశించే భగవానుడు "నక్షత్రీ" అనబడుతున్నాడు.

# 442. క్షమః

వహించువాడు.

**అనాయాసేన నిఖిల భారం చ భువనస్య యః**
**సహతే సః క్షమః ప్రోక్తః షడర్ణః క్షాంతి దాయకః**

చతుర్దశ భువనాలను అవలీలగా వహించువాడు.

**శింశుమారాత్మనా విష్ణుః భూరాధీనూర్ధ్వత స్థితాన్**
**దధ్రేశేషతయాన్ లోకాన్ సప్తలోకాన్ అథస్థితాన్**

శ్రీమహావిష్ణువు శింశుమార రూపంలో ఊర్ధ్వ లోకాలను, ఆదిశేషుని రూపంలో అథోలోకాలను మోస్తున్నాడు.

కశ్యప ప్రజాపతికి కద్రువ వలన సర్పజాతి ఉద్భవించింది. అందులో శేషుడు ఒకడు. తనతల్లి, తమ్ములు మాయోపాయంచేత, పినతల్లి అయిన వినతను మోసం చేసి, ఆమెను దాసిగా చేశారు. ఈ దుశ్చర్యను భరించలేకపోయాడు శేషుడు. బ్రహ్మను గురించి తపస్సు చేశాడు.

బ్రహ్మదేవుడు ప్రత్యక్షమై "నీవు సత్యధర్ముడవు. భూమియొక్క భారము వహించ వలసినది" అని చెప్పాడు. ఈ రకంగా శేషుడు అథోలోకాలను మోస్తున్నాడు. **భగవద్గీత**లోని పదవ అధ్యాయం **'విభూతియోగం'**లోని 29వ శ్లోకం

**అనంతశ్చాస్మి నాగానాం వరుణో యాదసామహమ్**
**పితౄణా మర్యమా చాస్మియమస్సంయమతామహమ్**

నాగజాతిలో ఆదిశేషుడను నేను. జలచరములలో వరుణడను నేను.

ఆదిశేషుడికే 'అనంతుడు' అని కూడా పేరు. ఇతడు నాగజాతికి ప్రభువు. శ్రీమహావిష్ణువుకు శయ్యగా ఉండి ఆయనను సేవిస్తుంటాడు. పరమభక్తుడు, అనేకసార్లు ఆయనతో పాటుగా భూలోకంలో అవతరించాడు. ఇతడు భగవానుని నుండే ఉద్భవించాడు. అందుచేత అనంతుడు శ్రీమహావిష్ణువు యొక్క రూపమే.

**క్షమతే ఇతి క్షమః** అన్ని భూతాలను అనాయాసముగా వహించువాడు. సకల కార్యములు నిర్వహించటంలో సమర్థుడు. అమితమైన ఓర్పు గలవాడు.

సహనశీలుడు భూమివలె, ఓర్పు, సహనము గలవాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'క్షమః' అనబడుతున్నాడు.

# 443. క్షామః

కొరతబడినవాడు. 854వ నామము కూడా ఇదే.

**అవాంతరల యేకైశ్చిత్ క్షీణస్తారాగణైస్మృతః**
**క్షామోధ్రువ సమీపస్థః చతుర్నక్షత్ర సంయుతః**

అవాంతర ప్రళయంలో శింశుమార చక్రమునకు సంబంధించిన నాలుగు నక్షత్రాలు కాకుండా, మిగిలిన కొన్ని నక్షత్రములతో కొరతపడినవాడై, ఆ నాలుగు నక్షత్రములతో కలిసి ధ్రువమండలమునకు సమీపంలో ఉంటాడు. **విష్ణుపురాణంలో**

**తారకాః శింశుమారస్య నాస్తమేతి చతుష్టయమ్**

శింశుమార చక్రములో ఉన్న నాలుగు నక్షత్రాలు నశించవు.

అవాంతర ప్రళయము వచ్చినప్పుడు ధ్రువుడు ఉండే ప్రదేశము వరకు నశిస్తుంది.

**సర్వవికారేషు క్షపితేషు స్వాత్మనాఽ_వతిష్ఠతి** అన్నివికారములు క్షయమయిపోతాయి కాబట్టి పరమేశ్వరుడు కేవలము చిదాత్మ స్వరూపుడుగా ఉంటాడు.

అన్నీ నశించినప్పటికి తాను మాత్రం మిగిలి ఉండేవాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'క్షామః' అనబడుతున్నాడు.

# 444. సమీహనః

నియమించువాడు.

**స్వస్యాధికారే సర్వాన్ హి య స్సమీహతి సృష్టిషు**
**సమీహనస్స విజ్ఞేయః స్త్వష్టార్ణ కార్యదాయకః**

సృష్టిలో అందరినీ తగిన పదవులయందు నియమించువాడు. ఈ నామాన్ని జపం చేస్తే సకల కార్యసిద్ధి జరుగుతుంది.

**సమిహయతి ప్రేషయతీతి సమీహనః** జీవులను వారి వారి అర్హతలను బట్టి యోగ్యమైన పదవులయందు నియమించు వాడు. జీవులు తాము చేసిన కర్మననుసరించి పాపపుణ్యాలను స్వర్గ నరకాల ద్వారా అనుభవిస్తాయి.

కర్మశేషము అనుభవించటానికి మళ్ళీ ఈ లోకంలో పుడతాయి. ఉత్తమ కర్మలు చేసిన వారు ఉత్తమ యోనులయందు, నీచకర్మలు చేసినవారు నీచయోనులయందు

జన్మిస్తారు. అంతకన్న మరీ దుష్కర్మలు చేసినవారు క్రిమికీటకాలుగా జన్మిస్తారు. వీటి జీవితము క్షణభంగురము.

ఈ రకంగా జీవి చేసిన కర్మననుసరించి, వారికి తగిన పదవులయందు నియమిస్తాడు పరమేశ్వరుడు. కఠోపనిషత్తులో యమధర్మరాజు నచికేతుడికి 'అగ్నిచయనము' అనే కర్మను చెబుతూ "నచికేతా ! ఈ కర్మను చేసినవారు శాశ్వతంగా స్వర్గలోకంలో ఉండిపోతారు. అంతేకాని వారికి మోక్షం రాదు. ఆ విషయం తెలిసి కూడా నేను అగ్నిచయనము చేశాను. అందుకే యమలోకానికి అధిపతిని అయ్యాను" అంటాడు. అలాగే విశ్వానరుడి కుమారుడు వైశ్వానరుడికి అగ్నిలోకాధిపత్యము, గుణనిధికి ధనాధిపత్యాన్ని ఇచ్చాడు పరమేశ్వరుడు.

ఇదే విధంగా ఉత్తమకర్మలు చేసిన వారందరికీ ఉత్తమజన్మలే ప్రాప్తిస్తాయి. అలా చేసేది శ్రీమన్నారాయణుడే. అందుకే అతడు 'సమీహనః' అనబడుతున్నాడు.

# 445. యజ్ఞః

యజ్ఞస్వరూపి. 971వ నామం కూడా ఇదే.

**యాజ్ఞారాధ్యతయా యజ్ఞః**

యజ్ఞములన్నింటిచేత ఆరాధించబడేవాడు. యజ్ఞము అతడే. యజ్ఞసాధనము కూడా అతడే అందుచేత శ్రీమహావిష్ణువు యజ్ఞస్వరూపి అనబడుతున్నాడు.

**యజ్ఞోవైవిష్ణుః** అంటోంది వేదం. అంటే యజ్ఞమే విష్ణువు. కాబట్టి విష్ణువుకన్న వేరుకానటువంటి పరమేశ్వరి యజ్ఞరూప అనబడుతోంది. **పద్మపురాణం**లో ఈశ్వరుణ్ణి గురించి చెబుతూ

**వేదపాదో యూపదంష్ట్రః క్రతుహస్త శ్చితీముఖః**

**అగ్నిజిహ్వో ధర్మరోమాః బ్రహ్మశీర్షో మహాతపాః**

**అహోరాత్రేక్షణో దివ్యో వేదాంతశ్రుతి భూషణః**

**స్రువతుండ శ్చాజ్యనాసః సామఘోష్యస్వనో మహాన్**

**ధర్మసత్యమయః శ్రీమాన్ క్రమవిక్రమ సత్క్రియః**

**ప్రాయశ్చిత్తనఖో దీరః పశుజానుర్మహా భుజః**

**ఔద్గాత్రాంతో హోమలింగః ఫలబీజ మహౌషధిః**

**వాయ్వంతరాత్మా మంత్రస్పిగ్విృకృతః సోమశోణితః**

**వేదస్కంధో హవిర్గంధో హవ్యకవ్యాతి వేగవాన్**

**ప్రాగ్వంశకాయో ద్యుతిమాన్ నానాదీక్షాభిరర్చితః**

**దక్షిణాహృదయో యోగీ మహామంత్రమయో మహాన్**

**ఉపాకర్మో ఉ ష్టచుబుకః ప్రవర్గ్యావర్తభూషణః**

**నానాచ్ఛందోగతిపథో గుహ్యోపనిషదాసనః**

**ఛాయాపత్నీ సహాయోవై మేరు శృంగ ఇవోచ్ఛ్రితః**

| | | | | | |
|---|---|---|---|---|---|
| వేదాలే | - | అతనిపాదాలు | ఔద్గాత్రమే | - | ఆంత్రము (ప్రేగు) |
| యూపస్తంభాలు | - | కోరలు | హోమమే | - | లింగము |
| క్రతువులు | - | హస్తాలు | ఫలములే | - | అవయవాలు |
| యాగార్థమైన | | | వాయువు | - | అతని అంతరాత్మ |
| కాష్టములచితి | - | ముఖము | మంత్రాలు | - | పెదవులు |
| అగ్నియే | - | నాలుక | సోమరసము | - | రక్తము |
| ధర్మాలే | - | రోమాలు | వేదాలు | - | భుజాలు |
| తపోవంతులైన | | | వేది | - | స్కందము |
| బ్రాహ్మణులే | - | తల | హవిస్సు | - | గంధము |
| అహోరాత్రాలు | - | చూపులు (దృష్టి) | హవ్యకవ్యములు | - | వేదాలు |
| వేదాంతశ్రుతులు | - | చెవికమ్మలు | ప్రాగ్వంశికలు | - | దేహము |
| స్రువమే | - | తుండము | దానము | - | హృదయము |
| ఆజ్యమే | - | ముక్కు | ఉపకర్మలు | - | పెదవులు, గడ్డము |
| సామఘోషయే | - | గొప్పధ్వని | ప్రవర్గ్యలు | - | భూషణములు |
| సత్క్రియలే | - | అతని క్రమ విక్రమములు | నానాఛందస్సులు | - | మార్గాలు |
| ప్రాయశ్చిత్తములే | - | నఖములు | గుహ్యోపనిషత్తు | - | అతని ఆసనము |
| పశువు | - | జానువు | ఛాయ | - | పత్ని |

అతడు ధర్మసత్యమయుడు, నానాదీక్షలచే అర్చించబడినవాడు, పర్వతమువలె ఉన్నతుడు అని చెప్పబడింది. అమ్నాయరహస్యంలో

**ఇంద్రియద్వారసంగృహ్యైః గంధాద్యై రాత్మదేవతాం ।**
**స్వభావేన సమారాధ్య జ్ఞాతు స్సోఽయం మహోముఖః ॥**

ఇంద్రియాలను జయించి మిక్కిలి భక్తితో ఆత్మను ఆరాధించటమే మహాయజ్ఞము అని చెప్పబడింది. అటువంటి ఆత్మారాధన యజ్ఞము కన్న వేరుకాదు. ఆ రూపంలోనే పరమేశ్వరుడు ఉంటాడు.

**కర్మ బ్రహ్మోద్భ పం విద్ధి బ్రహ్మా౽క్షరసముద్భవం ।**
**తస్మా త్సర్వగతం బ్రహ్మానిత్యం యజ్ఞే ప్రతిష్టితమ్ ॥**

కర్మవేదం వలన ఏర్పడగా, వేదం పరమాత్మ వలన ఏర్పడింది. ఆ కారణంగా సర్వగతమైన బ్రహ్మాయజ్ఞమందే ప్రతిష్ఠితమై ఉన్నది. ఈ యజ్ఞము జగత్ప్రవర్తక సాధనం.

**అన్నాద్భవంతి భూతాని పర్జన్యా దన్నసంభవః**
**యజ్ఞా ద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః**

| | | |
|---|---|---|
| భూతాలు | – | అన్నంవలన వృద్ధి చెందుతాయి. |
| అన్నం | – | మేఘము వలన సంభవిస్తుంది |
| మేఘాలు | – | యజ్ఞంవలన |
| యజ్ఞము | – | కర్మవలన సంభవిస్తాయి. |

ఈ రకంగా సర్వదేవతలకు, సర్వజీవులకు తుష్టికారణమైన యజ్ఞరూపంలో ఉంటాడు పరమేశ్వరుడు.

ప్రజాపతి యజ్ఞంవల్ల ప్రజలను సృష్టించి మీరు వర్ణాశ్రమధర్మాలను నెరవేరుస్తూ వేదంలో చెప్పబడ్డట్లుగా యజ్ఞకర్మలు చేస్తుండండి. అప్పుడు దేవతలు మీ కోరికలు నెరవేరుస్తారు అని చెప్పాడు. అందుచేత యజ్ఞాలు మానవకల్పితాలు కావు అని గుర్తించాలి.

యజ్ఞాలు మూడు రకాలు. అవి. 1. పాకయజ్ఞాలు 2. హవిర్యాగములు 3. సోమసంస్థలు

**1. పాకయజ్ఞాలు :** ఇవి మళ్ళీ ఏడు విధాలు

| | | |
|---|---|---|
| 1. ఔపాసన | 4. అష్టకము | 6. సర్పబలి |
| 2. స్థాలీపాకము | 5. మాసశ్రాద్ధము | 7. ఈశానబలి |
| 3. వైశ్వదేవము | | |

**2. హవిర్యాగాలు :** ఇవి మళ్ళీ ఏడు రకాలు.

| | | |
|---|---|---|
| 1. అగ్నిహోత్రాలు | 4. చాతుర్మాస్యాలు | 6. నిరూఢపశుబంధము |
| 2. దర్శపూర్ణిమాసలు | 5. పిండ, పితృయజ్ఞాలు | 7. సౌత్రామణి |
| 3. అగ్రయణం | | |

**3. సోమసంస్థలు :** ఇవి మళ్ళీ ఏడురకాలు

| | | |
|---|---|---|
| 1. అగ్నిష్టోమము | 4. అతిరాత్రము | 6. వాజపేయం |
| 2. అత్యగ్నిష్టోమము | 5. ఆప్తోర్యామం | 7. పౌండరీకం |
| 3. ఉక్థము | | |

ఇవి కాకుండా అంబాయజ్ఞము, అంతర్యాగము, బహిర్యాగము అని కూడా ఉన్నాయి. ఇవన్నీ పరమేశ్వర స్వరూపమే. **లలితా సహస్రం**లో 769వ నామము **యజ్ఞరూపా.**

## 446. ఇజ్యః

ఆరాధించబడువాడు

**ఇజ్యః కర్మభి రర్చితః** అన్ని కర్మలచేత తానే అర్చించబడువాడు.

**ఇజ్యా మర్హతీతి ఇజ్యః** కామ్యఫలములు కోరేవారు అంటే లౌకికమైన కోరికలు కోరేవారు బ్రహ్మ, ఇంద్రుడు వంటి దేవతలను ఆరాధిస్తారు. కాని మోక్షము కోరే వారు మాత్రం పరమేశ్వరునే ఆరాధిస్తారు. **భారతం**లో

**యే యజంతి పిత్రూన్ దేవాన్ బ్రాహ్మణాన్ సహుతాశనాన్**
**సర్వభూతాంతరాత్మానం విష్ణుమేవ యజంతి తే ॥**

ఎవరైతే దేవతా, బ్రాహ్మణ, పిత్రుదేవతలను, అగ్నిని ఆరాధిస్తారో, వారు సర్వభూతాలకు అంతరాత్మ అయిన శ్రీమహావిష్ణువునే ఆరాధిస్తున్నారు.

**భగవద్గీత**లోని తొమ్మిదవ అధ్యాయము **'రాజవిద్యా రాజగుహ్యాయోగము'**లోని 23వ శ్లోకము

**యేஉ ప్యన్య దేవతా భక్తా యజంతే శ్రద్ధయాన్వితాః ।**
**తేஉ పి మామేవ కౌంతేయ యజంత్య విధి పూర్వకమ్ ॥**

అర్జునా ! కామ్యఫలములు కోరేవారు ఇతర దేవతలను పూజించినప్పటికీ, వారు నన్ను పూజించినట్లే. కాని వారి పూజలు అజ్ఞానముతో కూడినవి.

ఇతర దేవతలు కూడా పరమేశ్వరుని యొక్క స్వరూపమే. అందుచేత ఇతర దేవతలను పూజించినప్పటికీ, ఆ పూజ పరమేశ్వరునకే చెందుతుంది.

పూర్వకాలంలో రంతిదేవుడు అనేరాజు అతిధి, అభ్యాగతులను సాక్షాత్తు భగవత్స్వరూపులుగా భావించి అన్నదానం చేసేవాడు. తాను తినకుండా కూడా దానం చేస్తుండేవాడు. అదే భగవంతుని సేవ అని భావించేవాడు. దాని ఫలితముగానే అతడు కైవల్యము పొందాడు.

ఈ విధంగా ఎవరైనా సరే, దేవతలను, గురువును, తల్లిదండ్రులను, అతిధులను, ఎవరినైనా సరే భగవత్స్వరూపులుగా భావించి, సేవించినట్లైతే, ఆ సేవ అంతా పరమేశ్వరుడికే చెందుతుంది.

**ఆత్మాన మాత్మనా నిత్యం విష్ణుమేవ యజంతి తే**

నిత్యము పుణ్యయజ్ఞములచే దేవతలను, పితరులను అర్చిస్తారో, వారు సాక్షాత్తూ శ్రీమహావిష్ణువునే ఆరాధిస్తున్నారు.

అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'ఇజ్యః' అనబడుతున్నాడు.

## 447. మహేజ్యః

మహాయజ్ఞస్వరూపి

**ఇజ్యా హి మహతీ యస్య స మహేజ్య ఉదాహృతః**

ఫలాపేక్ష లేకుండా తననే కోరటము అనే మహాయజ్ఞము స్వరూపముగ గలవాడు.

**మహతీ ఇజ్యా యస్యసః మహేజ్యశ్చ**

కోరికలు లేనివారు సాక్షాత్తూ తనను ఆరాధించటమనే మహాయజ్ఞము గలవాడు.

**భగవద్గీత** 12వ అధ్యాయం **'భక్తియోగము'**లోని ఆరవశ్లోకము

**యే తు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః**
**అనన్యేనైవ యోగేన మాం ధ్యాయంత ఉపాసతే**

అర్జునా ! సర్వకర్మలను నాకు అర్పించి మత్పరులై, నిష్కాములై నన్ను ఉపాసించేవారికి సంసార బంధనాలను తొలగిస్తాను.

మనోవాక్కాయ కర్మలచే పరమేశ్వరునే ధ్యానించేవారికి, తత్పరత గల వారికి సంసార బంధనాలు త్రెంచి మోక్షమార్గం సుగమము చేస్తాను.

దేవతలందరికన్నా గొప్పవాడు. అందుచేతనే ఇతర దేవతలు కామ్యఫలాలనిస్తే, పరమేశ్వరుడు మోక్షానిస్తాడు. అందుకే శ్రీమన్నారాయణుడు 'మహేజ్యః' అనబడుతున్నాడు.

## 448. క్రతుః

ఆరాధింపబడువాడు.

**అగ్నిష్టోమాదయా స్సప్త సంస్థాః క్రతవ ఈరితః ।**

**ఆరాధ్యః క్రియతే తైస్తై ఇతిక్రతురుదీరితః ॥**

అగ్నిష్టోమాదులనబడే ఏడు యాగములచే ఆరాధించబడువాడు.

**క్రియతే ఇతి క్రతుః** అగ్నిష్టోమము మొదలైన యాగములచే ఆరాధించబడువాడు. ఈ యజ్ఞాలు ఏడు రకాలు

1. అగ్నిష్టోమము
2. అత్యగ్నిష్టోమము
3. ఉక్థము
4. అతిరాత్రము
5. ఆప్తోర్యామము
6. వాజపేయము
7. పౌండరీకము

యూపసహితమైన యజ్ఞానికి క్రతువు అని పేరు. అటువంటి క్రతువు శ్రీమహావిష్ణువు యొక్క స్వరూపము. అందుకే శ్రీమన్నారాయణుడు 'క్రతుః' అనబడుతున్నాడు.

## 449. సత్త్రమ్

సత్రయాగముచే ఆరాధించబడువాడు.

**బహుకాలానేక యజమానకే విధిచోదితే ।**

**సత్రే సదారాధ్యత యా సత్రం స్సాత్సీదతీతి చ ॥**

శాస్త్రంలో చెప్పబడి, అనేకమంది చేత అనేకసార్లు చేయబడే సత్రయాగముచే ఆరాధించబడువాడు. సత్రయాగము అంటే 18 మొదలు 100 రోజుల వరకు చేసే ఒక యజ్ఞము.

**సతతం సీదతీతి సత్రం**

చాలామంది కలిసి చాలా కాలము చేసే సత్రయాగముచే ఆరాధించబడువాడు.

సజ్జనులను రక్షించువాడు. కాబట్టి శ్రీమన్నారాయణుడు 'సత్రం' అనబడుతున్నాడు.

# 450. సతాం గతిః

సత్తులకు గతి అయినవాడు. 184వ నామం కూడా ఇదే.

**ప్రవృత్తి ధర్మనిష్టానాం గతిర్యస్స సతాంగతిః**

**నివృత్తి ధర్మనిష్ఠా నాం గతిర్యస్స సతాంగతిః**

ఐహిక బంధాలతో శతమతమవుతూ కర్మాచరణ చేసేవారికి, కేవలము మోక్ష మార్గాన్ని మాత్రమే ఎంచుకుని పరమేశ్వరుణ్ణి ఆరాధన చేసే ముముక్షువులకు కూడా ఫలితాన్ని ఇచ్చేవాడు.

నివృత్తి మార్గంలో చరించేవారికి గతియైనవాడు. **విష్ణుపురాణంలో**

**నిర్ధూత దోషపంకానాం యతీనాం సంయుతాత్మనాం ।**

**స్థానం తత్పరమం విప్ర పుణ్యపాప పరిక్షయే ॥**

బ్రాహ్మణోత్తమా ! దోషము అనే బురదను కడిగి పుణ్యపాపములు నశించిన నా భక్తులకు పరమపదము లభించును.

సజ్జనులకు సాధుపుంగవులకు మోక్షమిచ్చేవాడు శ్రీమన్నారాయణుడే. అందుచేతనే అతడు 'సతాంగతిః' అనబడుతున్నాడు.

వేదాలు పర, అపరా. అనే రెండు విద్యలను చెబుతున్నాయి. **ముండకోపనిషత్తులో**

"గురువర్యా ! ఓ అంగిరస మహర్షి ! దేన్ని గురించి తెలుసుకుంటే సర్వమూ తెలుస్తాయో దాన్ని దయచేసి నాకు వివరించండి" అన్నాడు దానికి అంగిరసుడు.

"లోకంలో మనం తెలుసుకోవలసిన విద్యలు రెండు ఉన్నాయి 1. పరావిద్య 2. అపరావిద్య. పరమేశ్వరుడికి సంబంధించిన విద్య పరావిద్య. ధర్మములు, కర్మలు వాటి సాధన మొదలైన విషయాలకు సంబంధించింది. అపరావిద్య.

చతుర్వేదాలు, శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిష్యము అనేవన్నీ అపరావిద్య. ఆత్మతత్త్వాన్ని బోధించేది పరావిద్య. ముందుగా పరావిద్యను గూర్చి వినవలసినది. జ్ఞానేంద్రియాలకు లొంగనిది, కర్మేంద్రియాల విషయం కానిది గోత్రము, వర్ణము, నేత్రములు, శ్రోత్రములు, కాళ్ళు చేతులు లేనిది, నిత్యయై అన్నిటియందు ఉన్నది, సూక్ష్మాతిసూక్ష్మమైనది, అవ్యయమైనది, పంచభూతాలకు కారణమైనది పరబ్రహ్మతత్త్వము. అటువంటి తత్వాన్ని జ్ఞానియైనవాడు సర్వత్ర చూడగలడు.

సాలెపురుగు ఏ సహాయం లేకుండానే తన శరీరం నుంచి దారాలను తయారుచేసి, వాటిని మళ్ళీ తానే మ్రింగేస్తుంటుంది. భూమినుండి ఓషధులు పుడుతున్నట్లుగా, మానవ దేహం మీద రోమములు పుడుతున్నట్లుగా అక్షర పరబ్రహ్మ నుండి ఈ జగత్తు పుడుతున్నది. కుమారుడు పుట్టాలని తండ్రి కోరుకున్నట్లుగానే ఆ పరబ్రహ్మ జ్ఞానరూపమైన తపస్సు ద్వారా స్థూలభావాన్ని పొందుతాడు. ఆ తరువాత పరబ్రహ్మ నుండి ప్రాణులకు అవసరమైన అన్నం పుడుతోంది. అన్నం నుంచి ప్రాణం, మనస్సు, మనస్సు నుంచి పంచభూతాలు, వాటి నుండి లోకాలు, వారి కోసం కర్మలు, కర్మ నుండి ఫలము పుడుతున్నాయి. పరమేశ్వరుడు సర్వజ్ఞుడు, సర్వవేత్త, జ్ఞాని, తపస్వి. ఆయన నుండి హిరణ్యగర్భరూపుడైన బ్రహ్మ, అతని నుండి నామరూపాత్మకమైన జగత్తు ఆవిర్భవించింది.

**అపరావిద్యా:** ఇది లౌకిక ప్రయోజనాలకుపకరిస్తుంది. బుద్ధి సంపన్నులైన మహర్షులు వేదాలలో స్వర్గ సాధనాలయిన యజ్ఞకర్మలను కన్నుక్కున్నారు. కర్మాచరణ పరాయణులు, కర్మవాదులు అందరూ ఆ కర్మలనాచరించి సత్ఫలితాలు కూడా పొందారు. కాబట్టి కర్మఫలాన్ని కోరితే అగ్నిహోత్రాది కర్మలనాచరించు. సమిధలతో జ్వాలమందుతున్న అగ్నిలో 'స్వాహా' కారంతో ఆహుతులు సమర్పించాలి. అగ్నిహోత్రాది కర్మలు విధిగా జీవితాంతం చెయ్యాలి. యజ్ఞ అమావాస్యనాడు చేస్తే ధర్మము, పౌర్ణమినాడు చేస్తే పూర్ణము. అగ్నిహోత్రాది కర్మలు, చాతుర్మాస్యము, అతిథిపూజ, వైశ్యదేవము మొదలైన కర్మలు చేయనివాడు ఏడుతరాల వారిని నాశనం చేస్తున్నాడు. ఆహుతులను మింగటానికి అగ్నిహోత్రునికి ఏడు నాల్కలున్నాయి. అందుకే అగ్నికి సప్తజిహ్వుడు అని పేరు. అవి ...

1. కాళి – నల్లనిది
2. కరాళి – భయంకరమైనది
3. మనోజవ – మనస్సు వంటి వేగము గలది
4. సులోహిత – ఎర్రని రంగుగలది
5. సుధూమ్రవర్ణ – దట్టమైన పొగ రంగుగలది
6. విస్ఫులింగిని – రవ్వలు ఎగజిమ్మునది
7. దేవి – అనేక కిరణాలు కలది.

ఆహుతులు దేవతలకు చేరినట్లుగానే, అగ్నిహోత్రాలు చేసే యజమానిని కూడా ఇంద్రుడు ఉండేచోటికి తీసుకుపోతారు. అంటే అగ్నిహోత్రము చేసిన వాడికి ఫలితము స్వర్గము. ఈ ఆహుతులు యజమానిని ప్రియమైన మాటలతో స్తుతిస్తూ, పూజిస్తూ స్వర్గానికి

చేరుస్తాయి. అనగా కర్మ ఫలితము స్వర్గము. కర్మలు చేసిన వారికి ధనధాన్యాలు, సిరిసంపదలూ, వస్తు వాహనాలు, ఉన్నత పదవులు, కీర్తి ప్రతిష్ఠలు లభిస్తాయి. మోక్షం మాత్రం కాదు. యజ్ఞసాధనాలు మొత్తం పద్దెనిమిది. అవి పదహారు మంది ఋత్విక్కులు, యజమాని. అతని భార్య.

జ్ఞానరహితమైనవి యజ్ఞాలు. యజ్ఞసాధనాలు అస్థిరమైనవి. అశాశ్వతమైనవి. ఈ కర్మలే మోక్షసాధనాలనిభావించే అజ్ఞానులు మాటిమాటికీ మృత్యువును పొందుతూనే ఉంటారు. అంటే యజ్ఞం వలన స్వర్గం వస్తుంది. అక్కడ తన పుణ్యఫలము అనుభవించి, తరువాత మళ్ళీ భూలోకంలో పుడతాడు. అందుచేత ఈ కర్మలు శాశ్వత ఫలితాన్ని ఇవ్వవు. కర్మలవల్ల శాశ్వతమైన మోక్షంరాదు.

అజ్ఞానులు తమను తామే గౌరవనీయులుగా, పండితులుగా ఊహించుకొని విఱ్ఱవీగుతుంటారు. కృతార్థులమైనామని గర్విస్తుంటారు. కర్మిష్ఠులు ఫలాపేక్షతోనే ఉంటారు. కాని తత్వాన్ని తెలుసుకోరు. కర్మఫలం పూర్తికాగానే వీరు మళ్ళీ జన్మిస్తారు.

ఇష్టాపూర్తి కర్మలే సర్వోత్తమసాధనాలని భావించేవారు మూఢులు. వారు ఇతరమైనవి శ్రేయోసాధనాలుగా భావించరు. అందుకనే వారు కర్మఫలాన్ని అనుభవించి, కర్మశేషాన్ని అనుభవించటానికి మళ్ళీ జన్మిస్తారు.

శాంతస్వభావులు, సన్యాసులు అడవులలో ఉంటూ బిక్షుకులుగా జీవిస్తూ, తపస్సు చేస్తూ ఉంటారు. వీరు పుణ్య పాపాలనుండి విడివడి ఉత్తరాయణ మార్గం ద్వారా సత్యలోకం చేరతారు. ప్రజాపతి, హిరణ్యగర్భుడు అంతా సాకారులే. కాబట్టి వీరికి పరబ్రహ్మ ప్రాప్తిలేదు.

కాబట్టి మోక్షవాది వైరాగియై బ్రహ్మనిష్ఠుడైన గురువు వద్దకు వెళ్ళాలి. అప్పుడు బ్రహ్మవేత్త అయిన ఆ గురువు శిష్యునకు పరావిద్యనుపదేశిస్తాడు. దానివల్ల శిష్యునకు పరబ్రహ్మను గూర్చిన జ్ఞానం కలుగుతుంది. తానే పరబ్రహ్మ, జగత్తంతా తనలోనే ఉన్నదనే భావం కలుగుతుంది. అట్టివాడు మరణానంతరము బ్రహ్మలోకం చేరి, కల్పాంతమున పరబ్రహ్మలో లీనమవుతాడు" అని అంగిరసుడు శౌనకునకు ఉపదేశించాడు"

**కఠోపనిషత్తు**లో యమధర్మరాజు నచికేతుడితో నచికేతా ! శ్రేయస్సు ప్రేయస్సు అని రెండు విషయాలను శ్రుతులు చెబుతున్నాయి. ఇక్కడ శ్రేయస్సు అంటే విద్య. ప్రేయస్సు అంటే అవిద్య. పునరావృత్తి రహితమైన మోక్షమార్గమే శ్రేయస్సు. కాగా ఐహిక సుఖాలలో ఓలలాడించేది ప్రేయోమార్గము. మానవుడు ఈ రెండింటిలో ఏదో ఒక మార్గాన్ని అనుసరించి తీరాలి. ఈ రెండు మార్గాలు కలిసి ఉన్నట్టుగానే కనిపిస్తాయి.

విజ్ఞుడైనవాడు దీన్ని విభజించి శ్రేయోమార్గాన్నే ఎన్నుకుంటాడు. ఈ రెండూ విరుద్ధ స్వభావాలు గలవి. వీటిలో శ్రేయోమార్గము కాంతికాగా ప్రేయస్సు చీకటి. అవిద్యలో మునిగినవాడు తనను తాను గొప్పపండితుడుగా భావించుకుంటాడు. ధనధాన్యాలు దారాపుత్రులు ఇవే లోకమనుకుంటాడు. ఇలాంటివాడు జనన మరణాలతో బాధపడుతుంటాడు.

ఆత్మజ్ఞానం అనే పదం వినటానికి కూడా చాలామందికి అర్హత ఉండదు. అందుకే వాళ్ళు దాన్ని ఇష్టపడరు. కొందరికి విన్నా అది అర్థం కాదు. అసలు దీన్ని గురించి చెప్పే గురువు దొరకటం కూడా చాలా విశేషం. 'నేను బ్రహ్మని' అనే జ్ఞానం పొందిన గురువుద్వారా ఈ విషయాన్ని తెలుసుకోవటం పూర్వజన్మ సుకృతం'

కర్మవల్ల లభించే ఫలితం అనిత్యము. దానివల్ల ఆ తత్త్వం లభించదు. కర్మలు అనిత్యం. ఆత్మ నిత్యం. ఈ విషయం తెలిసికూడా నేను అగ్నిచయనం చేశాను. దాని ఫలితంగా మృత్యుదేవతనయ్యాను. నచికేతా ! మానవుడు ఆత్మను ఇంద్రియాల నుండి వేరుచేసి శాశ్వత ఆనందానిచ్చే ఆత్మతత్త్వాన్ని పొందుతాడు. నీవు దానికి పూర్తిగా అర్హుడవు.

వేదాలన్నీ ముక్తకంఠంతో దేన్ని గురించి చెబుతున్నాయో, తపస్సువల్ల దేన్ని పొందుతామో, బ్రహ్మచర్యాది నియమాలు, వ్రతాలు దేని కోసం ఆచరిస్తారో, అది 'ఓం' అనేపదం. ఇదే పరబ్రహ్మపేరు లేదా గుర్తు. శబ్దం కాబట్టి ఇది అపరబ్రహ్మ (హిరణ్యగర్భుడు)

ఇదే పరబ్రహ్మ. ఓంకారాన్ని ఏ రూపంలో ఉపాసిస్తే ఆ సాధకుడు ఆ రూపాన్నే పొందుతాడు. బ్రహ్మప్రాప్తికి ఓంకారాన్ని ఆశ్రయించటమే మంచిది. ఆత్మకు చావు పుట్టుకలు లేవు. ఆత్మ తనంత తానుగా పుట్టినది. స్వయంభువు నాశరహితమైనది. శాశ్వతమైనది శరీరం మరణించి ఆత్మ మరణించదు. ఆత్మ చంపేదీ కాదు, చంపబడేదీ కాదు. ఆత్మ సూక్ష్మమైన వాటికన్న సూక్ష్మమైనది. పెద్దవైనవాటి కన్న ఇంకా పెద్దది. ఇది జీవియొక్క హృదయ పద్మంలోనే ఉంటుంది. జితేంద్రియుడు ఆత్మ గొప్పదనాన్ని గ్రహించి దుఃఖాల నుండి దూరమవుతాడు. ఇంద్రియలోలులు ఆత్మను గుర్తించలేరు. ఆత్మ కదలకుండా ఒకచోట కూర్చునే చాలా దూరం పోతుంది. నిద్రపోతూనే అన్ని ప్రదేశాలు తిరుగుతుంది. అనిత్యమైన శరీరాల మధ్యన శరీరం లేనిదిగా, అశాశ్వతమైన వాటి మధ్య శాశ్వతమైనదిగా ఉంటుంది. ఆత్మ నిత్యము, సత్యము, సర్వవ్యాపకమైనది. అటువంటి ఆత్మను గుర్తించగలిగిన వాడికి దుఃఖం లేదు.

ఆత్మసాక్షాత్కారం వేదాలు వల్లించటంవల్ల, గ్రంథాలు చదవటంవల్ల, ధారణశక్తివల్ల, వినటం, ఉపదేశం పొందటంవల్ల లభించదు. అది ఆత్మవల్ల మాత్రమే సాధ్యమవుతుంది. అర్హుడైన వ్యక్తికి ఆత్మ తన నిజస్వరూపం చూపుతుంది.

వేదాలలో చెప్పిన పాపకర్మలు వదలిపెట్టనివాడు ఇంద్రియలోలుడు, ఏకాగ్రత లేనివాడు, మనశ్శాంతి లేనివాడు బ్రహ్మజ్ఞానం పొందడు.

శరీరంలో పరబ్రహ్మ ఉండేచోట ఇద్దరున్నారు. వారిలో ఒకడు కర్మఫలం అనుభవించే వాడు. రెండవవాడు సంసారబంధనాలు లేనివాడు. ఈ రకంగా ఆ ఇద్దరూ విలక్షణమైన తత్త్వాలు కలిగి ఉంటారు. వీరిద్దరే వెలుగు, నీడ.

ఈ శరీరం రథంవంటిది. కర్మఫలాన్ని అనుభవించే జీవాత్మ దాని యజమాని. బుద్ధే సారథి. మనస్సే కళ్ళెం. ఇంద్రియాలే గుర్రాలు, విషయమే మార్గం. కాబట్టి ఇంద్రియాలను నడిపే సారథి నేర్పరి కాకపోతే, గుర్రాలు అదుపులో ఉండవు. అందుకనే

| | | |
|---|---|---|
| ఇంద్రియాలు | – | మనస్సు అధీనంలోనూ |
| మనస్సు | – | బుద్ధి అధీనంలోనూ |
| బుద్ధి | – | యజమాని అధీనంలోనూ ఉండాలి |

విజ్ఞానహీనుడు మనసును అదుపులో ఉంచుకోలేడు. తాను చేరవలసిన గమ్యం చేరలేడు. మోక్షాన్ని పొందలేడు. వివేకవంతమైన బుద్ధిని కలిగినవాడు, మనస్సును అదుపులో ఉంచగలిగినవాడు, పరమపదాన్ని చేరతాడు.

| | | |
|---|---|---|
| ఇంద్రియాలకన్న | – | వాటి విషయాలు (లక్షణాలు) శ్రేష్ఠమైనవి |
| విషయాలకన్న | – | మనస్సు శ్రేష్ఠమైనది |
| మనస్సుకన్న | – | బుద్ధి శ్రేష్ఠమైనది |
| బుద్ధికన్న | – | మహతత్త్వం శ్రేష్ఠమైనది |
| మహత్తత్త్వముకన్న | – | అవ్యాకృత ప్రకృతి గొప్పది |
| ప్రకృతికన్న | – | సూక్ష్మరూపి అయిన పురుషుడు గొప్పవాడు |

అంతకు మించినది ఇంకేమీలేదు. ఇదే పరాకాష్ఠ. అతణ్ణి చేరిన తరువాత తిరిగి రావటం లేదు. అతడే శ్రీమన్నారాయణుడు. అందుకే ఆయన 'నివృత్తిః' అనబడతాడు.

## 451. సర్వ దర్శీ

అన్నింటినీ చూడువాడు, ప్రవృత్తి నివృత్తి ధర్మములను చూచువాడు.

**ధర్మాధర్మాచ తౌ సర్వౌ అధ్యక్షయితు మాదరాత్ ।**

**సర్వదా శీలమస్యేతి సర్వదర్శీ తత స్మృతః ॥**

జీవులు చేసే పాప పుణ్యాలను ఎల్లప్పుడు శ్రద్ధతో పరికించువాడు.

**సర్వ్యౌద్విధావపి ప్రవృత్తినివృత్తి ధర్మౌ ద్రష్టమ్ శీలమస్యేతి సర్వదర్శీ**

ప్రవృత్తి నివృత్తి ధర్మాలను చూస్తూ ఉండేవాడు.

తనజ్ఞానదృష్టిచేత ప్రాణులు ఆచరించిన కృతము, ఆచరించని అకృతము అంతా చూస్తు ఉండేవాడు.

లోకంలో జనులు యజ్ఞయాగాది కర్మలు చేసి, వాటివల్ల మోక్షము వస్తుంది అనుకుంటారు. కాని అలా జరగదు. **ఈశావాస్యోపనిషత్తు**లో

**అంధం తమః ప్రవిశంతియోఽవిద్యాముపాసతే ।**
**తతోభూయ ఇవతే తమోయ విద్యాయాగ్ంరతాః ॥**

అవిద్య (యజ్ఞకర్మ)ను ఉపాసించేవారు గాఢాంధకారంలో ప్రవేశిస్తారు. యజ్ఞతత్త్వాన్ని ఆరాధించేవారు అంతకన్న నిబిడాంధకారంలో ప్రవేశిస్తారు.

కాబట్టి యజ్ఞయాగాది కర్మలు చెయ్యటంవలన, ఇష్టాపూర్తకర్మలు ఆచరించటం వలన మోక్షం రాదు. కేవలము జ్ఞానము వల్లనే మోక్షము వస్తుంది. అయితే పరమేశ్వరుడు తన తొమ్మిదిమంది చారుల సాయంతో

(పంచభూతాలు 5, సూర్యుడు, చంద్రుడు, కాలము, యముడు) మానవులు చేసే కర్మలన్నీ చూస్తూనే ఉంటాడు అంటూ కల్కి వృత్తాంతాన్ని పూర్తిచేశాడు రత్నాకరుడు.



# 32. నరనారాయణులు

"గురువుగారూ ! నరనారాయణులంటే ఎవరు ? వారిని గురించి వివరించండి అన్నాడు" నారాయణభట్టు. వివరించటం ప్రారంభించాడు రత్నాకరుడు.

మనువులు 14 మంది. వారిలో ధర్మసావర్ణి ఒకడు. ఇతనినే 'ధర్ముడు' అని కూడా అంటారు. ఇతడు బ్రహ్మయొక్క దక్షిణస్తనము నుంచి పుట్టాడు.

దక్షప్రజాపతి మనువుయొక్క కుమార్తె ప్రసూతిని వివాహమాడాడు. ప్రసూతికి పదహారు మంది కుమార్తెలు. వారిలో పదముగ్గురిని ధర్ముడికిచ్చి వివాహంచేశాడు. వారిలో 'మూర్తి' ఒకతె.

హరిణ్యకశ్యపుని సంహరించిన తరువాత నరసింహావతారము రెండు భాగాలుగా అయింది. అందులో నరభాగము నరుడు అయింది. సింహభాగము నారాయణుడయింది.

ఈవిధంగా నరనారాయణులు శ్రీమహావిష్ణువు 'ధర్ముడు' అనే మనువుకు 'మూర్తి' గర్భాన జన్మించాడు. వారు జన్మించినప్పుడు దేవదుందుభులు మ్రోగినాయి. దేవతలు పూలవాన కురిపించారు. అప్సరసలు ఆడారు. గంధర్వులు పాడారు. విశ్వమంతా ఆనందతాండవం చేసింది. బ్రహ్మాది దేవతలు వారిని వివిధరకాలుగా స్తుతి చేశారు.

నరనారాయణులు రాక్షససంహారం చెయ్యటంకోసం ఈ లోకంలో అవతరించారు. పూర్వకాలంలో సహస్రకవచుడు అనే రాక్షసుడు ఒకడుండేవాడు. అతని శరీరము మీద వేయి కవచాలున్నాయి. వెయ్యి సంవత్సరాలు తపస్సుచేసినవాడు మాత్రమే అతనితో యుద్ధం చెయ్యగలడు. అప్పుడు అతని కవచములలో ఒకటి వూడిపోతుంది.

ఈ కారణంగా నరనారాయణులు బదరికావనములో తపస్సు చేస్తున్నారు. అది చూసిన ఇంద్రుడు వీరి తపస్సుకు భంగం కలిగించటానికి అప్సరసలను పంపాడు. అకాలంగా వసంతం వచ్చింది. అప్సరాంగనలు అక్కడ ప్రత్యక్షమైనారు. చూశారు నరనారాయణులు. ఇది ఇంద్రుని మాయ అని గ్రహించారు. అప్సరసలను చూసిన నారాయణుడు తన ఊరువును చేతితో రాచాడు. వెంటనే ఆ ప్రదేశం నుంచి అతి సౌందర్యవతి అయిన స్త్రీ పుట్టింది. ఆమె ఊర్వశి. ఆమెను చూసి అప్సరసలు వెనక్కివెళ్ళిపోయారు. తరువాత ఇంద్రుడు కూడా నరనారాయణులు తపస్సు చేస్తున్నది ఇంద్ర పదవికోసం కాదని తెలిసి ఊరుకున్నాడు.

నరనారాయణులు తపస్సు చేస్తున్నారు. వేయి సంవత్సరాలు పూర్తయింది. నరుడు లేచి సహస్రకవచునితో యుద్ధానికి వెళ్ళాడు. వేయి సంవత్సరాలు యుద్ధం చేశాడు. ఆ

రాక్షసుడికి ఒక కవచము ఊడి పోయింది. నరుడు మళ్ళీ తపోనిష్ఠలో కూర్చున్నాడు. నారాయణుడు యుద్ధానికి వెళ్ళాడు. ఈ విధంగా తొమ్మిదివందలతొంభై తొమ్మిది కవచాలు ఊడిపోయినాయి. మిగిలిన ఒక్క కవచంతో ఆ రాక్షసుడు సూర్యభగవానుని శరణుజొచ్చాడు. అతడే కుంతీదేవి గర్భాన కర్ణుడుగా జన్మించాడు. మళ్ళీ అతన్ని సంహరించటానికి నరనారాయణులు కృష్ణార్జునులుగా జన్మించారు.

నరనారాయణులుగా జన్మించిన శ్రీమహావిష్ణువుని వృత్తిధర్మాన్ని ప్రచారం చేశాడు. అంటే వైరాగ్యమార్గాన్ని బోధించాడు. అతడు అన్నీ తెలిసినవాడు. స్వరూపజ్ఞానం గలవాడు. తనను తాను ఎరిగినవాడు. భక్తులకోసం మంచి వ్రతాలు చేస్తాడు. తన భక్తులకు ప్రసన్నుడైఉంటాడు. సూక్ష్మరూపి. ఉపనిషత్సారమైనవాడు. తన బక్తులకు ఇహ, పరసుఖాలు అందించేవాడు. ఈ విషయాలన్నీ 452 నుంచి 459వ నామం వరకు వివరించబడ్డాయి. ఇక నామాలను చూద్దాం.

## 452. విముక్తాఽఽత్మా

మరలిన మనస్సు గలవాడు.

**నివృత్తి ధర్మాచార్యత్వాత్ విషయేభ్యోనివృత్తిమత్**
**మనోయస్య నివృత్తాత్మా నరనారాయణాత్మకః**

నివృత్తి మార్గము అంటే వైరాగ్య మార్గము. అటువంటి నివృత్తి ధర్మాలను నరనారాయణుల అవతారమెత్తి బోధించాడు శ్రీహరి. అందుచేతనే విషయభోగములనుండి మరల్చబడిన మనసు గలవాడు.

**నివృత్తః ఆత్మా యస్యసః నివృత్తాత్మా** వైరాగ్యాన్ని ప్రకటించటంకోసం విషయముల నుండి మరల్చిన మనసు గలవాడు.

ఈ నామాన్ని పరాశరభట్టరువారు 'నివృత్తాత్మా' అంటే శంకరభగవత్పాదులవారు **'విముక్తాత్మా'** అన్నారు.

**విముక్తః ఆత్మా యస్యసః** స్వభావసిద్ధంగానే, అంటే ఏ సాధనంతోనూ పనిలేకుండానే ముక్తిని పొందిన ఆత్మ గలవాడు.

అంటే పరమేశ్వరుడికి వేరే ఒక ఆత్మ ఉన్నది అనికాదు. పరమేశ్వరుడు ఆత్మస్వరూపుడు. అసలు ఆత్మ అంటేనే పరమేశ్వరుడు అని అర్థం. ఆయన స్వభావసిద్ధంగానే ముక్తినొందినవాడు. భవబంధాలు లేనివాడు.

**విముక్తః చ అసౌ ఆత్మాచ** ఈ ఆత్మ వస్తుతత్త్వమున విముక్తమే. పరమేశ్వరుడికి సంసారబంధనాలు లేవు. నా అనేవారు లేరు.

**ఒరులుగారునాకు ఒరులకునేనౌదు**

**ఒంటివాడను చుట్టమొకడులేడు.**

ఏ రకమైన బంధములేనివాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు 'నివృత్తాత్మా' అనబడుతున్నాడు.

## 453. సర్వజ్ఞః

అన్నీ తెలిసినవాడు, తనను తానెరిగినవాడు. 815వ నామం కూడా ఇదే.

**సర్వాత్మనా స్వమాత్మానం యశ్చ జానాతి కేవలమ్**

**సర్వజ్ఞ స్సతు విజ్ఞేయః సప్తార్ణో జ్ఞానదో మనుః ॥**

జగత్తులో ఉన్నటువంటి జీవులన్నింటికీ తానే అంతరాత్మ అని తెలిసినవాడు. ఈ నామము సప్తాక్షరీ మంత్రము. జ్ఞానప్రదము.

**ఆత్మానం సర్వం జానాతీతి సర్వజ్ఞః** తానే సర్వాంతర్యామి అని ఎరిగినవాడు.

సర్వము తానే అయినవాడు. తనకు తెలియని విషయములు లేనివాడు.

భూతభవిష్యద్వర్తమానాలు పూర్తిగా తెలిసినవాడు త్రికాలాతీతుడు. జగత్తులో ఉన్న జీవులన్నింటికీ తానే ఆత్మ. **ఐతరేయోపనిషత్తు**లో చెప్పినట్లుగా పరమేశ్వరుడు జీవులను సృష్టించిన తరువాత బ్రమ్మరంధ్రం ద్వారా ఆ దేహంలో ప్రవేశించాడు. "ఈ రకంగా జీవులన్నింటిలోనూ ఆత్మగా ఉన్నాడు. అంతేకాదు. ఆ పరమేశ్వరుడికి అన్నీ తెలుసు. ఆది అంతము లేనివాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'సర్వజ్ఞః' అనబడుతున్నాడు.

**లలితాసహస్రం**లో 196వ నామం **'సర్వజ్ఞా'**

## 454. జ్ఞానముత్తమమ్

ఉత్తమమైన జ్ఞానము గలవాడు.

**పరశ్చ వైష్ణవో దర్మః సర్వో౽స్మిన్ జ్ఞాయతే యతః**

**సర్వేషాం శ్రేయసాం మూలం సజ్జ్ఞేయం జ్ఞానముత్తమమ్ ॥**

సకలశ్రేయస్సులకు మూలమైన వైష్ణవ ధర్మాలను పూర్తిగా తెలిసినవాడు.

ఉత్తమమైన వైష్ణవధర్మాలు తెలిసిన జ్ఞానస్వరూపి. పాంచరాత్రాగమము పూర్తిగా తెలిసినవాడు. భగవానుని జ్ఞానము నిత్యమైనది. సత్యమైనది. నిరవధికమైనది. అది నిర్వికల్పము, నిరంజనము, నిర్మలము. నిర్గుణము కూడా. అందుచేతనే అది ఉత్తమమైన జ్ఞానము కాబట్టే శ్రీమన్నారాయణుడు 'జ్ఞానముత్తమమ్' అనబడుతున్నాడు.

## 455. సువ్రతః

మంచివ్రతములు చేసేవాడు. 818వ నామము ఇదే.

**భక్తార్థం వ్రతవాన్ యోఽసౌ సువ్రత స్స ప్రకీర్తితః**

పరమేశ్వరుడు మంచి వ్రతాలు చేస్తాడు. కాని అవి తన స్వార్థం కోసం మాత్రంకాదు. తన భక్తులకోసం ఆ వ్రతాలు చేస్తాడు.

**శోభనం వ్రతం యస్యసః సువ్రతః** శోభనమైన వ్రతములు కలవాడు.

పరమేశ్వరుడికి కర్తవ్యమనేది లేదు. అందుచేత ఏ రకమైన వ్రతాలు చెయ్యడు. **భగవద్గీత**లోని మూడవ అధ్యాయం **'కర్మయోగము'**లోని 22వ శ్లోకంలో

**న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన**
**నానవాప్తమవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి ॥**

అర్జునా ! ముల్లోకములయందు నాకు కర్తవ్యమనేది ఏదీలేదు. అలా పొందదగిన వాటిలో, అనగా కర్మలు చేసిపొందగలిగే ఫలముతో నేను పొందనిది ఏదీలేదు. అయినప్పటికీ నేను కర్మలయందే ప్రవర్తిల్లుతున్నాను.

మానవుడికి కేవలము ఈ మర్త్యలోకంతో మాత్రమే సంబంధము ఉంటుంది. అందుచేత చతుర్విధపురుషార్థసిద్ధి కోసం ఈ లోకంలోనే కర్మలు చేస్తారు. కాని భగవానుడు మానవుడుకాదు. సాక్షాత్తు పరమేశ్వరుడు. కాబట్టి స్వర్గమర్త్య పాతాళములందు అతడు వ్యాపించి ఉంటాడు. ఆ పరమేశ్వరుడికి ఏలోకంలోనూ ఏ కర్తవ్యమూలేదు. ముల్లోకాలలోను అతడు పొందవలసినది ఏదీలేదు. అతడు పూర్ణకాముడు. ఆప్తకాముడు. అయినప్పటికీ లోకహితార్థమై, జీవులయందు గల వాత్సల్యము చేత కర్మలు చెయ్యటంలో నిమగ్నమైనాడు. కర్మత్యాగము చెయ్యడు. ఏ మానవుడైనా తనకు భోగాసక్తి లేకపోతే కర్మని ఎందుకుచేస్తాడు?

మోక్షార్థియైనవాడు కర్మలు చెయ్యడు. కాని భగవానుడు చెప్పినట్లుగా లోకహితం కోసం కర్మలు చెయ్యాలి. అందుకోసమే భగవానుడు మంచికర్మలు చేస్తాడు.

తనను నమ్మినవారిని, శరణువేడినవారిని రక్షించటము పరమేశ్వరుని లక్షణము. మనోవాక్కాయ కర్మలతో ఆ పరమేశ్వరుని ఎవరు ప్రార్థిస్తారో, వారిని ఆ పరమేశ్వరుడు రక్షిస్తాడు. **శ్రీమద్రామాయణం**లో శ్రీరాముడు.

**సకృదేవప్రసన్నాయ తవాఽస్మీతి చ యాచతే**
**అభయం సర్వ భూతేభ్యో దదామ్యేత ద్వ్రతంమమ ॥**

నన్ను శరణు వేడినవారికి పంచభూతములనుండి అభయము ఇస్తున్నాను అంటాడు.

చక్కని వ్రతదీక్షగలవాడు. అందరికీ అభయమిచ్చేవాడు. అటువంటి శ్రీమన్నారాయణుడు 'సువ్రతః' అనబడుతున్నాడు.

## 456. సుముఖః

అందమైన ముఖము గలవాడు.

**ధ్యాతౄణాం విషయే యస్య సుప్రసన్నం**
**మనోహరమ్ ముఖమస్తీతి సుముఖః**

తనను ధ్యానించేవారు, ఉపాసించేవారు అయిన భక్తుల విషయంలో ప్రసన్నమైన ముఖము గలవాడు.

**శోభనం ముఖం యస్యసః సుముఖః** వికారములేని అందమైన ముఖము గలవాడు. తామరపువ్వు దళమువలె నిర్మలమైన నేత్రములు గలవాడు.

**ఆనందామృతసంపూర్ణ వదనేనేందు కాంతినా ।**
**కలాకృతి రూపేణ కరస్థేన విరాజితమ్**

ఆనందామృతము నిండిఉన్న చంద్రునిలాగా ప్రకాశించే వదనంతో అమృతకలశము ధరించినట్లుగా అందమైన ముఖము గలవాడు. ప్రసన్నవదనమైనవాడు.

**ప్రసన్నవదనం చారు పద్మపత్రాయ తేక్షణమ్**

ప్రసన్నవదనుడు, కమలముల రేకులవంటి కనులు గలవాడు.

శ్రీరామచంద్రుడు అరణ్యాలకు వెడుతూ, రాజ్యాన్ని వదలుతూ కూడా పరమానందన్ని కలిగిఉన్నాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'సుముఖః' అనబడుతున్నాడు.

# 457. సూక్ష్మః

సూక్ష్మరూపి

**సూక్ష్మ సూక్ష్మ స్వరూపతః**
**అసురేషు నిగూఢాభిప్రాయత్వాత్ సూక్ష్మ ఉచ్యతే**

అన్ని జీవులలోకి ప్రవేశించగల సూక్ష్మరూపి. రాక్షసులను శిక్షించే విషయంలో ఎవరికీ కనిపించని భావాలు గలవాడు.

తనకుతానే సూక్ష్మముగా సాక్షాత్కరించినవాడు. పరమేశ్వరస్వరూపము ఇంత అని చెప్పటానికి వీలులేదు. **అణోరణీయాం మహతోమహీయాం** అణువుకన్న చాలా చిన్నది. మహత్తుకన్న అతి గొప్పది. **ఐతరేయోపనిషత్తు**లో చెప్పినట్లుగా పరమేశ్వరుడు జీవిని సృష్టించిన తరువాత సూక్ష్మమైన ఆత్మరూపంలో బ్రహ్మరంధ్రం గుండా ఆ జీవి యందు ప్రవేశించాడు.

సృష్టి ప్రారంభంలో పరమేశ్వరుని నుండి ఆకాశం వచ్చింది. దాని గుణము శబ్దము.

| | | |
|---|---|---|
| ఆకాశము నుండి | – | వాయువు దాని గుణము స్పర్శ. |
| వాయువు నుండి | – | అగ్ని. దాని గుణము రూపము. |
| అగ్ని నుంచి | – | జలము. దాని గుణము రసము. |
| జలము నుంచి | – | భూమి. దాని గుణము గంధము. |

పరమాత్ముని యందు శబ్దస్పర్శరూపాది గుణాలు ఏవీలేవు. పంచభూతాలకు కారణమైనవాడు ఆత్మ. అతిసూక్ష్మమైనవాడు. అందుకే 'సూక్ష్మః' అనబడుతున్నాడు.

**ముండకోపనిషత్తు**లో చెప్పినట్లుగా ఆత్మ సర్వత్రాఉండేది. అత్యంత సూక్ష్మమయినది. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'సూక్ష్మః' అనబడుతున్నాడు. సర్వవ్యాపి అవటంచేత అతడు 'సూక్ష్మః' అనబడుతున్నాడు.

# 458. సుఘోషః

మంచి ఘోషము గలవాడు.

**స్వాధ్యాయ ఘోషో యస్యాస్తి సుఘోష స్స తు కీర్తితః** ఉపనిషత్సంబంధమైన మంచి ఘోష గలవాడు. ఉపనిషత్తులతో ప్రతిపాదించబడినవాడు.

**శోభనం ఘోషః యస్యసః సుఘోషః** ఉపనిషత్సారమైనవాడు.

వేదరూపమయిన మనోహరమైన ధ్వనిగలవాడు. మంగళకరమైన వేదరూపనాదము గలవాడు. ఇక్కడ వేదఘోషయే సుఘోష. పరమేశ్వరుడు సూక్ష్మరూపి. అవాంగ్మానస గోచరుడు. అతణ్ణి వేదవాంగ్మయము ద్వారా మాత్రమే అనుభవంలోకి తెచ్చుకోవాలి.

వేదాలు అపౌరుషేయాలు. అవి సాక్షాత్తూ బ్రహ్మముఖం నుంచి మాత్రమే వచ్చినాయి. వేదములయొక్క సారమే ఉపనిషత్తు. ఇది వేదంలో ఆఖరిభాగము. ఉపనిషత్తు అంటే బ్రహ్మవిద్య. బ్రహ్మవిద్యా పరిశీలకులైన విద్వాంసులకు కర్మ, జన్మ, మరణాలను లేకుండా చేసేది. ఆ జన్మాదిమరణాదికమైన దానిని నశింపచేసేది. బ్రహ్మ పదార్థలాభం కలుగచేసేది.

వేదాలు మొత్తం మూడు భాగాలు (కాండలు)గా ఉంటాయి. 1. కర్మకాండ, 2. ఉపాసనకాండ. 3. జ్ఞానకాండ, వీటిలో ఉపాసన, జ్ఞానకాండలను 'ఉపనిషత్తు' అంటారు. ఈ ఉపనిషత్తులన్నీ గురుశిష్యసంవాదంగానే ఉంటాయి. బ్రహ్మశోధకుడైన శిష్యుడు. బ్రహ్మజ్ఞాని అయిన గురువును సమీపించి, ఆయన దగ్గర నియమనిష్ఠలతో కొంతకాలం గనక ప్రసన్నుడైతే బ్రహ్మోపదేశం చేస్తాడు. అప్పుడు శిష్యుడు తన అనుమానాలను అడుగుతుంటాడు. గురువు వాటిని తీరుస్తుంటాడు. అందుచేతనే ఉపనిషత్తులు గురుశిష్య సంవాదంగా ఉంటాయి. అయితే కొన్నిచోట్ల గురుశిష్యుల పేర్లు తెలియవు. నాలుగు వేదాలకు కలిపి 1108 ఉపనిషత్తులున్నాయి. వాటిలో ముఖ్యమైనవి. 108 వాటిలో కూడా 10 ఉపనిషత్తులు శ్రేష్ఠమైనవని చెప్పారు శంకరభగవత్పాదులవారు. అవి.

**ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండూక్య, తిత్తిరి**
**ఐతరేయంచ ఛాందోగ్యం బృహదారణ్యకం దశః**

1. ఈశావాస్యోపనిషత్తు
2. కేనోపనిషత్తు
3. కఠోపనిషత్తు
4. ప్రశ్నోపనిషత్తు
5. ముండకోపనిషత్తు
6. మాండూక్యోపనిషత్తు
7. తైత్తిరీయోపనిషత్తు
8. ఐతరేయోపనిషత్తు
9. ఛాందోగ్యోపనిషత్తు
10. బృహదారణ్యకోపనిషత్తు

కాగా వైష్ణవసంబంధమైన ఉపనిషత్తులు 14. అవి.

1. నారాయణోపనిషత్తు
2. మహానారాయణోపనిషత్తు
3. నృసింహతాపిని ఉపనిషత్తు
4. రామరహస్యోపనిషత్తు
5. రామతాపినీ ఉపనిషత్తు
6. వాసుదేవోపనిషత్తు

7. అవ్యక్తోపనిషత్తు
8. తారసారోపనిషత్తు
9. గోపాలతాపిని ఉపనిషత్తు
10. కృష్ణోపనిషత్తు
11. హయగ్రీవోపనిషత్తు
12. దత్తాత్రేయోపనిషత్తు
13. గరుడోపనిషత్తు
14. కలిసంతరణోపనిషత్తు

ఈ ఉపనిషత్తులలో ప్రతిపాదించినది కేవలము పరబ్రహ్మస్వరూపాన్నే. సృష్టి ప్రారంభంకాకముందు అంటే మహాప్రళయం తరువాత జగత్తంతా శూన్యంగా ఉండేది. పరమేశ్వరుడే ఈ మహాశూన్యాన్ని ఆక్రమించి ఉండేవాడు.

నిరాకారుడు నిర్గుణస్వరూపుడు పరబ్రహ్మ. అతడు బిందురూపంలో ఉంటాడు. ఈ జగత్తంతా ఆవరించి ఉంటాడు.

సృష్టి ఆరంభంలో మానవాకారంలో ఉన్న విరాడాత్మ మాత్రమే ఉన్నది. అతని కన్న భిన్నమైనదిలేదు. పురుషాకారంలో ఉన్న ప్రజాపతి ఒంటరితనంలోని ఆనందాన్ని భరించలేకపోయాడు. అందుచేత ఒక స్త్రీ కావాలని కోరుకున్నాడు. అలా కోరిన వెంటనే స్త్రీ పురుషులు పరస్పరాలింగనం చేసుకున్నట్లుగా దర్శనమిచ్చారు. అంటే ప్రజాపతి తన శరీరాన్ని రెండు భాగాలుగా చేశాడు. అవే పతి, పత్ని వారే స్వాయంభువ మనువు. శతరూప. వారినుండే 84 లక్షల జీవరాశి ఆవిర్భవించింది. ఈ రకంగా జగత్తంతా పరమేశ్వరమయమే. అంటోంది **బృహదారణ్యకోపనిషత్తు**.

సృష్టి జరగటానికి ముందు అంతా బ్రహ్మమయంగానే ఉండేది. అదే ఆత్మ. ఆ ఆత్మయే లోకాలను సృష్టించింది. పంచభూతాలను సృష్టించింది. ఇంద్రియాలను, ఇంద్రియాధిష్ఠానదేవతలను సృష్టించింది. ఈ రకంగా ఇంద్రియాలతోపాటుగా జీవిని సృష్టించింది. ఈ రకంగా ఇంద్రియాలతోపాటుగా జీవిని సృష్టించిన తరువాత, ఆ శరీరంలో ప్రవేశించాలి. అనుకున్నది. బ్రహ్మరంధ్రం గుండా ప్రవేశించింది. ఈ విధంగా జగత్తులోని ప్రాణికోటి అంతా పరమేశ్వరమయం అయింది అంటోంది **ఐతరేయోపనిషత్తు**

ఆత్మ నాలుగుపాదాలుగా ఉంటుంది.

1. ఈ విశాలవిశ్వంలో నాలుగుదిక్కులూ బ్రహ్మతత్త్వంలో ఒక భాగము.
2. భూమి, ఆకాశము, సముద్రాలు, పర్వతాలు అన్నీ బ్రహ్మపదార్థంలోని అంతర్భాగాలే.
3. అగ్ని, చంద్రుడు, సూర్యుడు, విద్యుల్లతలు. అన్నీ పరబ్రహ్మలోని భాగాలే.
4. ప్రాణం బ్రహ్మ, దృష్టి బ్రహ్మ, శ్రవణం బ్రహ్మ, మనస్సు బ్రహ్మ. అని **ఛాందోగ్యోపనిషత్తు**లో చెప్పబడింది.

ఈ రకంగా చరాచరజగత్తు అంతా పరబ్రహ్మ స్వరూపమే. ఈ జగత్తులో పిపీలికాది బ్రహ్మపర్యంతము నేల, నింగి, నీరు, ఆకాశము, గాలి, నదీనదాలు, సముద్రాలు, కొండలు, కోనలు, పర్వతాలు, లోయలు, ఎడారులు, అరణ్యాలు, క్రిమికీటకాలు, పశువులు, పక్షులు, జంతువులు, మృగాలు, మానవులు ఒకటేమిటి? కంటికి కనిపించేదంతా పరబ్రహ్మ స్వరూపమే. అందుకే పరబ్రహ్మసర్వాంతర్యామి. ఆదిఅనాది లేనివాడు, జన్మమృత్యుజరాదులు లేనివాడు. నిత్యముసత్యము అయినవాడు.

బ్రహ్మజ్ఞానం సంపాదించినవాడు ప్రతిజీవిలోనూ, ప్రతి వస్తువులోనూ ఆ పరబ్రహ్మను చూడగలుగుతాడు. ఈ జగత్తంతా తన స్వరూపమే అని భావించగలగుతాడు. ఇదే ఉపనిషత్తులసారము.

ఈరకంగా ఉపనిషత్తులవల్ల ప్రతిపాదించినబడిన పరమేశ్వరస్వరూపుడైన శ్రీమన్నారాయణుడు 'సుఘోషః' అనబడుతున్నాడు.

## 459. సుఖదః

సుఖము నిచ్చువాడు.

**సమాధ్యనుష్టానేన తదనుష్ఠాన శీలినామ్ ।**

**సుఖంబాహు దదాతీతి సుఖదం పరికీర్తితః ॥**

ధ్యాననిష్ఠను ప్రచారంచేసి, అలానిష్ఠతో ధ్యానించిన భక్తులకు అపరిమితసుఖము నొసంగువాడు.

**సుఖం దదాతీతి సుఖః** సదాచారమైన జపము, తపము, సమాధిస్థితులను తెలియచేసి, ఆ ప్రకారం తనను ధ్యానించే వారికి సుఖాన్నిచ్చేవాడు.

లోకంలో సుఖము అనేది రెండు రకాలుగా ఉంటుంది. 1. ఇహము 2. పరము. లౌకికము, పారలౌకికము. మానవుడు జీవించటానికి, జీవితంలో గౌరవమర్యాదలు పొందటానికి, కోరుకునేవి లౌకికమైన కోరికలు. అవి సిరిసంపదలు, ధనధాన్యాలు, భోగభాగ్యాలు, పరువు, ప్రతిష్ఠ, గౌరవము, అధికారము, విద్య మొదలైనవి. వీటివల్ల మానవుడు సమాజంలో ఒక గుర్తింపు పొందుతాడు. ఈ సుఖాలు అశాశ్వతాలు. అనుభవించగానే తీరిపోతాయి. ఈ సుఖము దుఃఖానికి హేతువు.

ఇక రెండవది శాశ్వతమైన సుఖము లేక ఆనందము. అదే పరమానందము, బ్రహ్మానందము అని చెప్పబడుతుంది. మానవుడు పొందే ఆనందానికి అది కొన్ని వేలకోట్ల రెట్లు ఉంటుంది. అదే సాయుజ్యము. ముక్తి పొందిన మానవుడికి మాత్రమే అది లభిస్తుంది.

సదాచారమైన అర్చనవిధానము, జపము, తపము, హోమము, యోగము మొదలైన వాటిద్వారా ఈ సుఖాన్ని పొందటం జరుగుతుంది. సాకారులైన దేవతామూర్తులను అర్చిస్తే ఇహలోకసుఖాలు లభిస్తాయి. నిరాకారమైన పరబ్రహ్మను అర్చిస్తే ముక్తి లభిస్తుంది. ఈ రకంగా పరమేశ్వరుడు తన భక్తులకు ఎవరికి ఏదికావాలంటే అది సమకూరుస్తాడు. అందుకే పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు 'సుఖదః' అనబడుతున్నాడు.

అంటూ నరనారాయణుల వృత్తాంతాన్ని పూర్తిచేశాడు రత్నాకరుడు.



# 33. క్షీరసాగరమథనము

"గురుదేవా ! శ్రీ మహావిష్ణువు కూర్మావతారము ఎత్తాడు అని చెప్పుకున్నాం కదా! మరి క్షీరసాగరమథనం ఏరకంగా జరిగింది ? అమృతాన్ని దేవతలకు ఏవిధంగా పంచాడో వివరించండి" అన్నాడు కృష్ణశర్మ. చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

దేవతలు రాక్షసులు అమృతం కోసం క్షీరసాగర మథనం చెయ్యటానికి ఉద్యుక్తులయ్యారు. పర్వతం నీటిలో మునిగిపోవటం మొదలుపెట్టింది. అప్పుడు శ్రీ మహావిష్ణువు కూర్మావతారమెత్తి ఆ పర్వతాన్ని వీపున మోయ్యసాగాడు.

పర్వతం గిరిగిరా తిరగసాగింది. సముద్రంలో ఉన్న జీవులు క్షోభిస్తున్నాయి. వాసుకి వేయినోళ్ళ నుంచి పొగలు మంటలు రావటం మొదలుపెట్టినాయి. ఆ మంటలకు రాక్షసులు నిస్తేజులైపోయారు. మంటలలో మాడిన వృక్షాలలాగా నల్లగా అయిపోయారు. దేవతలు కూడా ఆ మంటలకు మాడిపోవటం మొదలుపెట్టారు. అప్పుడు శ్రీహరి వారిపై వర్షం కురిపించాడు. చల్లని గాలులు వీచసాగినాయి. దేవతలు, రాక్షసులు ఉపశమనం పొందారు. ఈ రకంగా చాలాకాలం సాగరమథనం జరిగింది. అమృతం మాత్రం రాలేదు. చివరకు వారంతా విసిగిపోయి ఈ ప్రయత్నం మానేద్దాం అనుకున్నారు. అప్పుడు శ్రీ మహావిష్ణువే స్వయంగా సముద్రమథనం చెయ్యటం మొదలుపెట్టాడు. పర్వతం వేగంగా తిరుగుతోంది. సాగరం అల్లకల్లోలమైంది.

ఇంతలో హాలాహలం పుట్టింది. దాని విషపుజ్వాలలు అన్నిలోకాలకు వ్యాపించినాయి. దేవదానవులు పోయి ఈశ్వరుని శరణువేడారు. హాలాహలం బారినుండి లోకాలను రక్షించమని వేడుకున్నారు. దయామయుడైన పరమేశ్వరుడు హాలాహలాన్ని మ్రింగివేశాడు. హాలాహలము అంటే పాలసముద్రంలోఉండే పాపాలరాశి. దాని ప్రభావంచేతనే శివుడు గరళకంఠుడు అయినాడు. శివుడు హాలాహలం త్రాగుతుంటే ఒక బొట్టు జారి నేలమీద పడింది. దానిని తేళ్ళు, జెర్రులు, పాములు, ఓషధులు తీసుకున్నాయి.

దేవదానవులు ఇనుమడించిన ఉత్సాహంతో సాగరమథనం చేస్తున్నారు. కామధేనువు పుట్టింది. బ్రహ్మలోకాన్ని కోరే బ్రహ్మవాదులు దాన్ని తీసుకుపోయారు.

ఉచ్చైశ్రవము పుట్టింది – దాన్ని బలిచక్రవర్తి తీసుకుపోయాడు

ఐరావతం పుట్టింది – ఇంద్రుడు పట్టుకుపోయాడు

కౌస్తుభమణి పుట్టింది – విష్ణుమూర్తి తీసుకున్నాడు

| | | |
|---|---|---|
| కల్పవృక్షము, పారిజాతము పుట్టినాయి | - | స్వర్గలోకంలో ఉంచారు |
| అప్సరసలు పుట్టారు | - | స్వర్గలోకానికి పోయారు |
| లక్ష్మీదేవి పుట్టింది | - | సర్వగుణసంపన్నుడైన హరిని వరించింది |
| వారుణీదేవి పుట్టింది | - | దైత్యులు తీసుకున్నారు |

ఆఖరున శ్రీమహావిష్ణువు అంశావతారమైన ధన్వంతరి అమృతభాండముతో ఆవిర్భవించాడు. రాక్షసులు అతడి మీదపడి ఆభాండాన్ని లాక్కుపోయారు. దేవతలు చేసేదిలేక శ్రీహరిని ఆశ్రయించారు.

శ్రీ మహావిష్ణువు తన మాయను ప్రయోగించాడు. జగన్మోహిని అవతారం ధరించాడు.

ఆమె నల్లకలువవలె శ్యామలవర్ణంతో ఉంది. అపురూపసౌందర్యవతి. అతిలోక లావణ్యవతి. అంతటి సౌందర్యరాశిని అంతకుముందు ఎన్నడూ, ఎక్కడా ఎవరూ చూడలేదు.

జగన్మోహినీ అవతారం చూసి దైత్యులు విరహంతో వేగిపోయారు. వారి బుద్ధి పనిచెయ్యటం మానివేసింది. వారంతా ఆమె వెనకబయలుదేరారు. వారిని ఓరకంట చూసింది. చిరునవ్వు నవ్వింది. ఆమె చిరునవ్వు కోసం ప్రాణాలు అర్పించటానికైనా సిద్ధపడ్డారు రాక్షసులు. అమృతభాండం తీసుకున్నది. దేవదానవులను విడివిడిగా వరుసలో కూర్చోమన్నది. అందరూ కూర్చున్నారు.

మోహిని అమృతభాండం తీసుకుని రాక్షసుల దగ్గరకు వచ్చింది. వారికి అమృతం కనిపించటంలేదు. మోహిని సౌందర్యమే వారి కనులముందు సాక్షాత్కరిస్తోంది. ఆమె చిరునవ్వు నవ్వింది. పయ్యెద జార్చింది. రాక్షసులు తదేకంగా ఆమెనే చూస్తున్నారు. ఆ సమయంలో గిరుక్కున వెనుదిరిగి దేవతల పంక్తి చేరి అమృతం పంచటం ప్రారంభించింది. దానవులు ఆమెకు దాసులైపోయారు. ఆమెనే చూస్తున్నారు. రాహువు మాత్రం మోసం జరుగుతున్నది అని గ్రహించాడు. దేవతావేషం ధరించి దేవతల పంక్తిలో కూచ్చున్నాడు. మోహిని అతడికికూడా అమృతం పోసింది. అతడి ప్రక్కన ఉన్న సూర్యచంద్రులు. ఇతడు రాక్షసుడు అని చెప్పారు. శ్రీమహావిష్ణువు సుదర్శనచక్రంతో రాహువు శిరస్సు ఖండించాడు. సమయం మించిపోయింది. బ్రహ్మ రాహువునుగ్రహంగా చేశాడు. ఆ కక్షతోనే సూర్యచంద్రులను మింగుతున్నాడు రాహువు. మోహిని మాయమైపోయింది. శ్రీహరి సాక్షాత్కరించాడు.

జరిగిన మోసం తెలుసుకున్నారు రాక్షసులు. దేవతలతో యుద్ధానికి దిగారు. భీకరసంగ్రామం జరిగింది. బ్రహ్మదేవుడి మాట ప్రకారం అప్పటికి యుద్ధం ఆపుచేశారు. చావగా మిగిలిన అసురులు బలిచక్రవర్తి నేతృత్వంలో అస్తగిరికి వెళ్ళారు. శుక్రాచార్యుడు మృతసంజీవినీవిద్యలో చనిపోయిన రాక్షసులను తిరిగి బ్రతికించాడు.

ఈ రకంగా క్షీరసాగర మథనం జరిగి అమృతం లభ్యంకావటంవల్ల దేవతలు, రాక్షసుల మీద విజయం సాధించగలిగారు.

పరమేశ్వరుడు మంచి మనసు గలవాడు. అపకారికి కూడా ఉపకారం చేసే స్వభావం గలవాడు. ప్రత్యుపకారం అపేక్షించకుండా ఇతరులకు సహాయం చేస్తాడు. అటువంటి మంచి మనసుతో శత్రువులను కూడా ఆకట్టుకుంటాడు. అతడు కడు శాంతమూర్తి. క్రోధాన్ని జయించినవాడు. మహాపరాక్రమవంతుడు. బలమైన బాహువులు గలవాడు. దివ్యమైన ఆయుధాలతో శత్రువులను చీల్చి చెండాడతాడు. అమృతం త్రాగిన రాహువు తలను ఒక్క వ్రేటుతో తెగనరికాడు. అమృతం కోసం యుద్ధం చేస్తున్న రాక్షసులను మోహినీ రూపంలో సమ్మోహితులుగా చేశాడు. అతడు తన ఇష్టప్రకారమే నడుస్తాడు. జగత్తంతా వ్యాపించి ఉంటాడు. సాగరమథనం చేస్తున్నప్పుడు దేవదానవుల శక్తి సన్నగిల్లింది. అప్పుడు వారందరియందు సమంగా వ్యాపించి వారి శక్తిని వృద్ధి పరిచాడు. అనేక రూపాలు ధరించాడు. మహాకూర్మముగా, ధన్వంతరిగా, మోహినిగా ఒక్కసారే అనేకరూపాలు దాల్చాడు. క్షీరసాగరమథనం జరగటానికి గరుడుని సాయంతో మందరగిరిని తెప్పించాడు. వాసుకిని త్రాడుగాచేశాడు. పర్వతం మునిగిపోతుంటే కూర్మమై వీపున మోశాడు. ఈశ్వరుని రూపంలో హాలాహలాన్ని మ్రింగాడు. మోహిని రూపంలో అమృతాన్ని పంచాడు. ఇన్ని కార్యాలుచేసి సన్మార్గులైన దేవతలకు అమృతమందించాడు. ఈవిషయాలన్నీ 460 నుంచి 469 వరకు నామాలలో వివరించబడ్డాయి. ఇక నామాలను చూద్దాం.

## 460. సుహృత్

మంచి మనసు గలవాడు.

**కి మస్మిన్కరవాణీతి హ్యపకారిణి శోభనమ్**

**యస్యాప్తి హృదయం చాసౌ సుహృరిత్యభి ధీయతే ॥**

అపకారంచేసిన వాడికి కూడా. ఇతడికి నేనేవిధమైన ఉపకారం చెయ్యగలను అని ఆలోచించే మంచి మనసు గలవాడు.

**శోభనం హృదయం యస్యసః సుహృత్**

తనకు అనుకూలంకాని వారికి కూడా, తాను ఏ రకంగా మేలు చెయ్యగలనో అనిఆలోచించేవాడు. దేవతలకు కూడా సుఖము చేకూర్చాలని ఆలోచించేవాడు.

**ప్రత్యుపకారనిరుపేక్షతయా ఉపకారశీలం**

ప్రత్యుపకారము అపేక్షించకుండా ఇతరులకు ఉపకారం చేసేవాడు.

పరమేశ్వరుడు నిరాకారుడు, నిరంజనుడు. అతడికి ఏ రకమైన కోరికలు లేవు. నిష్కాముడు. పూర్ణకాముడు. అన్ని కోరికలు తీరినవాడు. కాబట్టి తనకు ఏదీ అవసరంలేదు. తాను ఎవరిదగ్గర నుంచీ ఏదీ తీసుకోవలసిన అవసరం అంతకన్నాలేదు. అతని దగ్గర అన్నీ ఉన్నాయి. అవి కూడా అంతులేని పరిమాణంలో ఉన్నాయి. కాబట్టి భక్తుల కోరికలు తానే తీరుస్తాడు. అలా చేసేటప్పుడు వీరి కోరికలు తీరిస్తే నాకు ఏమొస్తుంది ? అని ఆలోచించడు. అవతలివాడు ఎవరైనా సరే తనను గనక శరణువేడితే అతన్ని రక్షిస్తాడు. అపకారం చేసే రాక్షసులకు కూడా సాధ్యమైనంతవరకు ఉపకారం చెయ్యటానికే ప్రయత్నిస్తాడు. తనకు అపకారం చెయ్యతలపెట్టిన శిశిపాలుని అనేకసార్లు క్షమించాడు. దుర్యోధనుడు అధర్మవర్తి అని తెలిసి కూడా భారతయుద్ధం ఆపటానికే ప్రయత్నించాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'సుహృత్' అనబడుతున్నాడు.

## 461. మనోహరః

మనసును హరించువాడు.

**ఏవం విసర్గ సౌహార్థాత్ తేషాం హృదయహారకః**
**మనోహర స్సమాఖ్యాతో హ్యష్టార్ణాశ్శాంతి దాయకః**

ఇటువంటి మంచి మనసుతో శత్రువులను కూడా ఆకట్టుకుంటాడు. ఈ నామము అష్టాక్షరీమంత్రము శాంతిదాయకము.

**మనః హరతీతి మనోహరః** మనసును హరించువాడు.

రామరావణ సంగ్రామంలో శ్రీరామచంద్రుని రూపాన్ని చూసి రావణబ్రహ్మ "ఎంత మనోహరమైన రూపమది. యుద్ధంలో మరణిస్తే ఇలాంటివాని చేతిలోనే మరణించాలి" అనుకుంటాడు. అంతగా శత్రువు యొక్క మనసును కూడా హరించేవాడు.

తనకన్న గొప్పది లేని ఆనందమే స్వరూపముగా గలవాడు. పరమానంద స్వరూపుడు. అందుచేతనే ఎంతటి వారి హృదయాలనైనా ఆకర్షించగలుగుతాడు. ఎటువంటి వారికైనా, అంటే దేవతలకుగాని, మానవులకుగాని, రాక్షసులకుగాని ఎవరికైనాసరే కావలసినది సుఖము, ఆనందము. అది ఇహం కావచ్చు, పరం కావచ్చు. శారీరకం కావచ్చు, మానసికం కావచ్చు, వారికి కావలసిన ఆనందాన్ని అందించి వారి మనసును హరించేవాడు. అమితమైన ఆనందాన్ని రూపంగా కలిగి ఆనందమయకోశమునందుండేవాడు. చిదానంద

స్వరూపుడు. కాబట్టే అందరి మనసులను హరించగలుగుతున్నాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'మనోహరః' అనబడుతున్నాడు.

## 462. జితక్రోధః

కోపమును జయించినవాడు.

**రక్షసాం దేవవిషయే యేన క్రోథో వినిర్జితః**
**స జితక్రోధ అఖ్యాతో హ్యష్టార్థః క్రోధనాశకః**

దేవతలవిషయంలో రాక్షసులకు గల క్రోధాన్ని పరిమార్చినవాడు. ఈ నామము అష్టాక్షరీమంత్రము. క్రోధనాశనము.

**జితః క్రోధః యేనసః జితక్రోధః** కోపాన్ని జయించినవాడు.

ఆశ్చర్యము ప్రకటించి రాక్షసులకు దేవతలయందు గల కోపాన్ని జయించినవాడు.

ఎవరియందు కోపము లేనివాడు. పరమేశ్వరుడు జితేంద్రియుడు. అతడికి రాగద్వేషాలుండవు. అనురాగము, క్రోధము ఉండవు. మరి కోపం లేకపోతే రాక్షసులను ఎందుకు సంహరించాడు ? అంటే అది రాక్షసుల మీద ద్వేషంతోకాదు. ధర్మసంస్థాపన. భగవానుడు రాక్షసులందరినీ సంహరించలేదు. ప్రహ్లాదుని వంటి వారికి కైవల్యము ప్రసాదించాడు. బలి చక్రవర్తి లాంటి వారికి ఉత్తమ పదవులిచ్చాడు. రావణబ్రహ్మ తమ్ముడు విభీషణుడికి రాజ్యపట్టాభిషేకం చేశాడు. రాక్షసులలో కూడా మరీ విర్రవీగిపోయిన వారిని మాత్రమే సంహరించాడు. అది కూడా కేవలం ధర్మసంస్థాపన కోసమే.

సుగ్రీవుని అన్న వాలిని చెట్టుచాటు నుండి సంహరించాడు శ్రీరామచంద్రుడు. అప్పుడు వాలి అడిగాడు "రామా ! నీకూ నాకూ విరోధంలేదు. మరి నన్నెందుకు సంహరించావు?" దీనికి సమాధానం చెబుతూ "వాలీ ! నువ్వు రాజువు. అయినా ధర్మంతప్పావు. రాజే అధర్మపరుడైతే దేశంలో ధర్మం ఎలా నిలుస్తుంది ? అంటాడు. కాబట్టి పరమేశ్వరుడికి క్రోధమనేదిలేదు. తనను నమ్మినవారికి క్రోధం లేకుండా చేస్తాడు. అందుకే శ్రీమన్నారాయణుడు 'జితక్రోధః' అనబడుతున్నాడు.

## 463. వీరబాహుః

బలమైన బాహువులు గలవాడు.

**విక్రాంతా బాహవో యస్య వీరబాహుస్తు స స్మృతః**

మహాపరాక్రమము గల బాహువులు గలవాడు.

**వీరాః బాహువః యస్యసః వీరబాహువః** రత్నకంకణములు, కేయూరములు ధరించిన, పరాక్రమముగల బాహువులు గలవాడు.

దేవతల శత్రువులయిన రాక్షససంహారము చెయ్యటానికి వేదధర్మాన్ని నిలబెట్టటానికి అవసరమైన పరాక్రమముగల బాహువులు కలవాడు.

ధర్మహీనులను, ధర్మదూరులను చీల్చి చెండాడటానికి వీలుగా మహాపరాక్రమముగల బాహువులుగలవాడు కాబట్టే శ్రీమన్నారాయణుడు 'వీరబాహుః' అనబడుతున్నాడు.

## 464. విదారణః

చీల్చినవాడు.

**హేత్యాద్యై రాయుధైర్దివ్యైః దారణాచ్చ విదారణః**

హేతి మొదలైన దివ్యాయుధములచే రాక్షసులను చీల్చువాడు.

హేతి అంటే – బాణము. దివ్యమైన బాణాలతో రాక్షసులను చీల్చి చెండాడినవాడు.

**విదారయతీతి విదారణః**

దివ్యాయుధాలతో రాహువు మొదలైన వారిని చీల్చి చెండాడినవాడు.

అధార్మికులను, దుష్టులను చీల్చివేసినవాడు. నరసింహావతారమెత్తి హిరణ్యకశ్యపుని చీల్చివేసినవాడు. కేశి అనే రాక్షసుని నోటియందు చెయ్యిపెట్టి శరీరాన్ని రెండు భాగాలుగా చీల్చివేసినవాడు. అందుకే శ్రీమన్నారాయణుడు 'విదారణః' అనబడుతున్నాడు.

## 465. స్వాపనః

నిద్రింపచేయువాడు, మాయలోపడవేయువాడు.

**కటాక్ష భ్రూవిలాసాద్యైః నష్టశిష్టాన్ జనానపి**
**యోఽసౌసమ్య మోహయతి స్వాపనః పరికీర్తితః**

నశించగా మిగిలిన రాక్షసులను తన మోహినీ రూపమందలి క్రీగంటి చూపులతో సమ్మోహనము చేయువాడు.

**స్వాపయతీతి స్వాపనః** రాక్షసులను అందమైన తన చిరునవ్వుతోను, కనుల కదలికలతోను మైమరచునట్లు చేయువాడు. ప్రాణులను నిదురింపచేయువాడు. తన మాయచేత ఆత్మజ్ఞానములేని వారిగా చేసేవాడు.

పరమేశ్వరుని మాయ దాటటానికి వీలుకానిది. అందుకనే జీవులను అజ్ఞానంలో పడేసి నిద్రపుచ్చుతున్నాడు. 'దేహమే ఆత్మ' అనుకునేవారు అజ్ఞానులు. **ఛాందోగ్యోపనిషత్తు**లో దీన్ని వివరించటం జరిగింది. పూర్వకాలంలో ప్రజాపతి ఆత్మను గురించి ఒక ప్రకటన చేశాడు. "ఆత్మకు పాపం అంటదు. ముసలితనం రాదు, మృత్యువు దాన్ని కబళించదు. శోకం తాకదు. దానికి ఆకలిదప్పికలు ఉండవు".

దేవతలు రాక్షసులు కూడా ఈ మాటను విన్నారు. 'ఆత్మను గురించి తెలుసుకుందాం అని రాక్షసులరాజైన విరోచనుడు. దేవతలరాజైన ఇంద్రుడు బ్రహ్మ దగ్గరకు వెళ్ళారు. వీరి పరిస్థితి తెలుసుకున్న బ్రహ్మ వీరిద్దరినీ 32 సం॥లు తపస్సు చెయ్యమన్నాడు. తపస్సు పూర్తిచేసి వచ్చారు దేవరాజు, దానవరాజు. ఆత్మను గురించి వివరించమని ప్రాధేయపడ్డారు.

'మానవులకనుపాపలలో మెదలుతూ కనిపించే పురుషుడే ఆత్మ' అన్నాడు బ్రహ్మ.

అది విన్నటువంటి దేవదానవులు నీటిలో కనుపించే ప్రతిబింబం, అద్దంలో కనిపించే ప్రతిబింబం. ఈ రెంటిలోనూ ఏది ఆత్మ, అని అడిగారు.

నేను మొదటగా కళ్ళలో మెరిసే ఏ పురుషుని వర్ణించానో, జగత్తులోని అన్నింటిలోను ప్రతిఫలించేది అతడే. ఒకసారి నీళ్ళలో మీ రూపాలు చూసుకుని నాకు చెప్పండి" అన్నాడు బ్రహ్మ. ఇంద్రవిరోచనులు ఇద్దరూ అలాగేచేసి బ్రహ్మ దగ్గరకు వెళ్ళారు. ప్రజాపతి వీరిని ఏం చూశారు ? అని అడిగాడు బ్రహ్మ. నఖశిఖపర్యంతము కేశాలతో కప్పబడిననూ శరీరాల ప్రతిరూపమే నీటిలో కనుపించింది అన్నారు.

'నాయనలారా ! మీర శరీరాలు శుభ్రపరచుకుని మళ్ళీ ప్రయత్నించండి అన్నాడు బ్రహ్మ మళ్ళీ నీటిలో తమ ముఖాలు చూసుకున్నారు. అవి అందంగా అలంకరించి కనపడ్డాయి. అప్పుడు బ్రహ్మ 'అదే పరబ్రహ్మ రూపము అని చెప్పాడు.

ఇదే మాటను విరోచనుడు రాక్షసులకు ఉపదేశంచేశాడు. దేహమే ఆత్మ అని బోధించాడు ఇంద్రుడు మాత్రం తిరిగి వెళ్ళి, మళ్ళీ వచ్చి తన అనుమానాలను నివృత్తి చేసుకుని బ్రహ్మవిద్యను తెలుసుకున్నాడు. అందుకే దేవతలు జ్ఞానులైనారు. దేహమే ఆత్మ అని తెలుసుకున్న రాక్షసులు అజ్ఞానులైనారు. సంసారబంధనాలలో పడి కొట్టుకుంటున్నారు.

ఈరకంగా జీవులను అజ్ఞానంలో నిదురింప చేసేవాడు. కాబట్టి శ్రీమహావిష్ణువు 'స్వాపనః' అనబడుతున్నాడు.

## 466. స్వవశః

తన అధీనమునందుండేవాడు. తన ఇష్టప్రకారము నడిచేవాడు.

**స్వకియై స్సహ సుప్తేషు తేషు స్వైర విహారవాన్**

**భవతి స్వవశస్సోఽపి నాన్యా ధీనత్వదో మనుః**

రాక్షసులను సమ్మోహితులుగా చేసి, తనను ఆరాధించే దేవతలతో యదేచ్ఛగా విహరించువాడు.

**స్వస్యవశః స్వవశః** రాక్షసులు అజ్ఞానాంధకారంలో మునిగి ఉండగా దేవతలతో స్వేచ్ఛగా విహరించువాడు.

పరమేశ్వరుడు సర్వస్వతంత్రుడు. ఎవరి ఆజ్ఞకూ బద్ధుడుకాడు. తనంతటతానే చరిస్తాడు. సృష్టిస్థితిలయాలను తన ఇష్టానుసారమే సాగిస్తాడు. జగద్వ్యాపారములో ఎవరి సాయము అతడికి అవసరంలేదు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'స్వవశః' అనబడుతున్నాడు.

## 467. వ్యాపీ

వ్యాపించినటువంటివాడు.

**దేవరక్షో మంథరేషు వాసుకి ప్రభృతి ష్వపి**

**ఆప్యాయనాయ శక్త్యా చ వ్యాపీ స్వాద్వ్యాసనాదసౌ ॥**

క్షీరసాగరమధనం జరుగుతోంది. దేవతలకు రాక్షసులకే కాకుండా వాసుకికి కూడా శక్తిసన్నగిల్లుతున్నది. అప్పుడు శ్రీమహావిష్ణువు వారిశక్తిని వృద్ధి పరచటానికి వీరందరియందు సమానముగా వ్యాపించాడు.

**వ్యాప్తుం శీలమస్యేతి వ్యాపీ** వ్యాపించు స్వభావముగలవాడు.

ఆకాశమువలె అన్నింటియందు వ్యాపించి ఉండేవాడు. ఆకాశము అంటే శూన్యము అని అర్ధం. ఇక్కడ శూన్యము అంటే ఏమీలేనిది. ఖాళీప్రదేశము. **ఆకాశాత్ గగనం శూన్యం.**

ఆకాశము అంటే అవకాశమిచ్చేది. పైకిగాని, ప్రక్కలకుగాని పెరగటానికి అవకాశమిచ్చేది. మనం కూర్చునిఉన్నాం. పైకి లేవాలి అంటే పైన శూన్యప్రదేశముండాలి. అప్పుడే మనం లేవగలుగుతాము. అలాకాకుండా పైన కూడా ఏదైనా పదార్ధమున్నట్లైతే మనం లేవటం కుదరదు. ఈ రకంగా ఆకాశము ఉన్నది. కాబట్టే పక్షులు ఎగరగలుగుతున్నాయి. చెట్లు పెరగ గలుగుతున్నాయి.

ఈ ఆకాశము సర్వత్రా వ్యాపించి ఉంటుంది. ఆరుబయట ప్రదేశంలో మనకు పైన కనిపించేదంతా ఆకాశమే. గదిలోపల కనిపించేది ఆకాశమే. హృదయంలో కనిపించేది ఆకాశమే. కుండలో కనిపించేది ఆకాశమే. ఈ రకంగా ఆకాశములాగా సర్వత్రా వ్యాపించి ఉన్నవాడు పరమేశ్వరుడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'వ్యాపీ' అనబడుతున్నాడు.

ఆకాశమువలె అన్నింటిలోనూ ఉండేవాడు. నిత్యమైనవాడు. ఏ పని జరగాలన్నా కారణము, కార్యము కూడా ఆ పరమేశ్వరుడే. అందుచేతనే 'వ్యాపీ' అనబడుతున్నాడు.

## 468. నైకాత్మా

అనేక రూపాలు గలవాడు.

**తదాతనైర్బ్రహ్మకౌర్మ మోహిన్యాద్యవతారకైః**
**నైకార్మేతి శ్రుత స్సమ్యక్ మున్యర్ణో బహురూపదః ॥**

బ్రహ్మకూర్మమోహిన్యాది అనేక అవతారములతో ఏకరూపముగా ఉన్నవాడు. ఈ నామము సప్తాక్షరీ మంత్రము. సౌందర్యప్రాప్తి.

**నైకే ఆత్మానః యస్యసః నైకాత్మా** ఆకాలంలో బ్రహ్మరూపంలో, కూర్మరూపంలో, మోహినీరూపంలో ఈ రకంగా అనేక రూపాలు ధరించినవాడు.

**న ఏకః ఆత్మా యస్యసః** ఒకటే కాని ఆత్మగలవాడు. అనేకాత్మలు గలవాడు. సృష్టిస్థితిలయాలయందు కనుపించే శక్తులతో అనేకవిధములుగా ఉండేవాడు.

**ఐతరేయోపనిషత్తు**లో చెప్పినట్లుగా ఆత్మయే ఆలోచనాపూర్వకంగా ఈ లోకాలను సృష్టించింది. సృష్టి జరగటానికి ముందు జగత్తంతా బ్రహ్మమయంగానే ఉండేది. దానికి భిన్నమైన పదార్థం ఏదీలేదు. ఆ ఆత్మయే లోకాలను సృష్టించాలనుకున్నది. ఆ ప్రకారంగా లోకాలను, పంచభూతాలను సృష్టించింది.

లోకాలను సృష్టించిన తరువాత లోకపాలకులను సృష్టించింది. ఇంద్రియాధిష్ఠాన దేవతలను సృష్టించింది. చివరగా 'ఇంద్రియాలతో కూడిన శరీరంలో ప్రవేశించాలి' అనుకున్నది. బ్రహ్మరంధ్రం ద్వారా ప్రాణియొక్క శరీరంలో ప్రవేశించింది.

ఈ రకంగా జగత్తులో ఉన్న 84 లక్షల జీవరాసులయందు పరమేశ్వరుడు ప్రవేశించాడు. అందుచేతనే అన్ని రూపాలు కలిగిఉన్నాడు. చరాచరజగత్తులోని కంటికి కనిపించే రూపాలన్నీ ఆ పరమేశ్వరునివే. అందుకే శ్రీమన్నారాయణుడు అనేకాత్మలు గలవాడు అని చెప్పబడుతున్నాడు.

**బృహదారణ్యకోపనిషత్తు**లో ఏకాకిగా ఉన్న పరబ్రహ్మ తాను అనేకం కావాలను కున్నాడు. తానే రెండు భాగాలయినాడు. అవే పతి పత్ని. వారి పేర్లు స్వాయంభువమనువు. శతరూప. వారివల్లనే 84 లక్షల జీవరాశి వృద్ధి చెందింది.

ఈ రకంగా పరమేశ్వరుడు అనేక రూపాలయినాడు. అందుకే శ్రీమన్నారాయణుడు 'నైకాత్మా' అనబడుతున్నాడు.

# 469. నైక కర్మకృత్

అనేక కార్యములు ఒనర్చినవాడు.

**సముద్రమథనేనైక కర్మకృన్నైక కర్మకృత్**

సముద్రమథనం జరిగిన తరువాత అమృతం పుట్టింది. ఆ అమృతాన్ని దేవతలకు పంచిపెట్టాడు. రాక్షససంహారం చేశాడు. ఇలాంటి అనేక కార్యాలు చేసినవాడు.

**నైకానికర్మాణి కరోతీతి నైకకర్మకృత్** సముద్రమథనం చెయ్యటానికి మందరగిరి పర్వతాన్ని తెచ్చాడు. పర్వతం మునిగిపోతుంటే కూర్మరూపంలో దాన్ని మోశాడు. సముద్రంనుంచి హాలాహలం వస్తే ఈశ్వరుని రూపంలో మ్రింగివేశాడు. అమృతాన్ని మోహినిరూపంలో దేవతలకు పంచాడు. రాక్షససంహారంచేశాడు. ఇలా అనేక కర్మలు చేసినవాడు.

**న ఏకాని కర్మాణి కరోతి ఇతి** ఒకటికాని కర్మలనాచరించువాడు.

సృష్టి, స్థితి, సంహారము, లయము, విపత్తులు, ఆపదలు నాశనము వంటి కర్మల నెన్నింటినో చేసినవాడు. అంటూ క్షీరసాగరమథనవృత్తాంతాని పూర్తిచేశాడు రత్నాకరుడు.



# 34. ధర్మస్వరూపి

"గురువుగారూ ! పరమేశ్వరుడు ధర్మస్వరూపి అంటారు గదా ! అది ఎలాగో వివరించండి" అన్నాడు నారాయణభట్టు. వివరించటం ప్రారంభించాడు రత్నాకరుడు.

**రామోవిగ్రహవాన్ ధర్మః** శ్రీరామచంద్రుడుమూర్తీభవించిన ధర్మస్వరూపుడు. రాముడు అంటే ఆ పరమేశ్వరుని స్వరూపమే. శ్రీమన్నారాయణుని అవతారము. ధర్మానికి నాలుగుపాదాలుంటాయి. అవి 1. సత్యము 2. న్యాయము 3. దానము 4. తపస్సు. ఇక్కడ పాదము అంటే కాలు అని కాదు. భాగము అని అర్థము. జగత్తులో ధర్మము నాలుగుపాదాలా చరిస్తుంటుంది. కాని రానురాను దుష్టులు, దురాచారులు, దుర్మార్గులు ఎక్కువైపోవటంతో ధర్మము అంతరిస్తుంటుంది. అంటే సత్యవాక్పరిపాలన అవసరం లేదు. వారిజాక్షులందు వైవాహికములందు, ప్రాణవిత్తమానభంగమందు అసత్యమాడవచ్చు అనేది శుక్రనీతి. 'తనకు మాలిన ధర్మంలేదు' అనేది తరువాత కాలంలో నీతి. ఈరకంగా లోకంలో ధర్మము పలచబడుతుంది. అలా జరిగి చివరకు ధర్మం లేకుండాపోతుంది. పాలకులే అధర్మవర్తనులవుతారు. జీవితంలో కేవలము అర్థకామాలకే ప్రాధాన్యత ఉంటుంది. అలా జరిగినప్పుడు ధర్మసంస్థాపన కోసం శ్రీమహావిష్ణువు భూలోకంలో జన్మించి ధర్మసంస్థాపన చేస్తాడు.

పురుషార్థాలను మర్యాదకాపాడటానికి, వాటిని వ్యవస్థీకరించటానికి పరమేశ్వరుడు అందరి హృదయాలలోను నివసిస్తాడు. ఆవుకు తన బిడ్డమీద ఎంత ప్రేమ ఉంటుందో పరమేశ్వరుడికి తన భక్తులమీద అంతప్రేమ ఉంటుంది. అతడు తన గుణాలతో అలరారే ఆత్మలను ఎప్పుడూ పోషిస్తాడు. ధనము ఐశ్వర్యము కోరి తనను సేవించే వారికి కోరినంత ధనమీయగలవాడు. అతడే ధనాధిపతి. ధర్మాధిపతి. ధర్మరక్షకుడు. ధర్మాన్ని ఆచరించేవాడు. ధర్మము గలవాడు. ధర్మస్వరూపుడు. సద్గుణాలను దండలా ధరిస్తాడు. అతడే సత్తు. అతడే అసత్తుకూడా. అతడే క్షరము–నాశనముగలవాడు. అక్షరుడు–నాశనరహితుడు. తన భక్తులు బుద్ధిపూర్వకంగా పాపము చేసినా పట్టించుకోడు. అమిత జ్ఞానసంపన్నుడు. యముడుకూడా ఆ పరమేశ్వరుని అంశే. అందుచేతనే పాపము చేసిన అతని భక్తులు శిక్షింపబడరు. అతనికి అంటూ ప్రత్యేకంగా లక్షణాలు ఏవీ ఉండవు. ఉపాసనకోసం ఆయనకు చెప్పే లక్షణాలన్నీ కల్పితాలే. ఆశ్రితులను రక్షించటానికి పదునైన చక్రాయుధము ధరించి ఉంటాడు. అతడు భక్తుల హృదయాలలోనే ఉండి, వారిని శిక్షించబోయే నరకలోకపాలకులను హింసిస్తాడు.

అతడే భూతములకు అధిపతి. ఇంద్రాదిదేవతలను కూడా వారి అర్హతలను బట్టి ఆయాస్థానములందు నియమిస్తాడు. అతడే ఆదిదేవుడు, మహాదేవుడు ఆత్మజ్ఞానసంపన్నుడు. దేవతలకుకూడా ప్రభువు. అంతేకాదు. బ్రహ్మకు వేదాలు ఇచ్చాడు. ఈరకంగా దేవతలకు గురువు.

దేవతలను ఆపదలనుంచి కాపాడతాడు. వాక్కుకు అధిపతి. ఛందస్సుకు అధిపతి. అతడే నాదము. నాద బ్రహ్మ అతడే. అతన్ని జ్ఞానముచేత మాత్రమే తెలుసుకోవాలి. ఈ జగత్తులో ఆది అనాది అతడే. శరీరంలో ఉండే శివాదిక్షితి పర్యంతము తత్త్వములను భరిస్తున్నాడు. అతడు సర్వభోక్త. హవ్యకవ్యాలను అతడే ఆరగిస్తాడు. అతడే పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు. తన భక్తుల హృదయాలలో ఉంటూ ధర్మాన్ని రక్షిస్తాడు.

ఈ విషయాలన్నింటినీ 470 నుంచి 500 వరకు నామాలలో వివరించటం జరిగింది. ఇక నామాలను చూద్దాం.

## 470. వత్సరః

వశించువాడు.

**పురుషార్థ స్థాపనాయ సర్వాంతర్య సనాచ్ఛతాః ।**
**ధర్మాత్మా వత్సరస్సస్యాత్ మున్యర్ణో ఒ_భీష్టదో మనుః ॥**

పురుషార్థముల మర్యాదను కాపాడటానికి అందరియందు నివసించే ధర్మాత్ముడు. ఈ నామము సప్తాక్షరీమంత్రము. కోరిన కోరికలు తీరతాయి.

**వసతీతి వత్సరః**

పురుషార్థములను వ్యవస్థీకరించటానికి అందరి హృదయములందు వసించేవాడు.

**నీలతో యదమధ్యస్థా ద్విద్యుల్లేఖేవభాస్వరా**
**నీవార సూకవర్తన్వీ పీతాభా స్వస్త్యణూపమా**

ఈ జఠరాగ్ని నడుమ సూక్ష్మమైన అగ్నిశిఖ ఊర్ధ్వముగా పైకి ఎగయుచున్నది. అది నీలమేఘమందలి మెరుపులాగా ప్రకాశిస్తున్నది. ధ్యాన్యపుగింజ ములికివలె సూక్ష్మమైన, పచ్చని వన్నె గలిగి పరమాణువు రూపంలో ఉన్నది.

**తస్యా శిఖాయామధ్యే పరమాత్మా వ్యవస్థితః ।**
**సబ్రహ్మసశివ సహరిశ్చేంద్రఘోక్షరః పరమస్వరాట్ ॥**

ఆ అగ్నిశిఖమధ్యలో పరమాత్మ ఉంటాడు. అతడే బ్రహ్మ. అతడే విష్ణువు, అతడే ఇంద్రుడు, నాశరహితుడు. స్వయంప్రకాశము గలవాడు. అతడే పరమాత్మ.

ఈ రకంగా పరమాత్మ మానవులందరి హృదయాలలోను నివసిస్తాడు. అందుకే శ్రీమన్నారాయణుడు 'వత్సరః' అనబడుతున్నాడు.

ఈతనియందు అఖిలమును వసించును. అంటే చరాచరజగత్తంతా ఇతని యందే వసిస్తుంది. కాబట్టి ఇతడు 'వత్సరః' అనబడతాడు.

## 471. వత్సలః

ప్రీతిగలవాడు.

**సర్వస్యాంతర్నివసనే హేతు స్స్యా ద్వత్సల స్మృతః ।**
**వత్సేదో నోరివ యతో వత్సల శ్శరణాగతే ॥**

అందరియందు గల వాత్సల్యమువల్లనే వారియందుంటాడు. పుట్టినబిడ్డమీద ఆవుకు ఎంత ప్రేమ ఉంటుందో, శరణాగతుడి మీద పరమేశ్వరుడికి అంత ప్రేమ ఉంటుంది.

**వత్సాః అస్య సన్తీతి వత్సలః** ఆవు దూడను ప్రేమించినట్లుగా, తన భక్తులను ప్రేమించువాడు. ఆ భక్తుడు క్రొత్తవాడైనా, పాతవాడైనాసరే, శరణు అని గనక ఇతని దగ్గరకు వస్తే, వెనకముందు ఆలోచించకుండా తత్తరపడుతూ ఆ భక్తునిపై ప్రేమ చూపిస్తాడు.

భక్తులయందు అమితమైన ప్రేమ గలవాడు. భక్తులమీద సదాప్రేమను చిందించువాడై ఉన్నాడు. ఆశ్రితులకు ప్రేమనందించేవాడై ఉన్నాడు.

వత్స అంటే – దూడ. కాబట్టి ఆవుకు దూడమీద ఉన్నట్లుగా భక్తులమీద ప్రేమ చూపుతాడు కాబట్టి 'వత్సలః' అనబడతాడు.

భక్తులమీద అపారమైన ప్రేమ చూపుతాడు. వాళ్ళని తానే వెతుక్కుంటూ వెడతాడు. శబరిని వెతుక్కుంటూ వెళ్ళాడు శ్రీరామచంద్రుడు. కాబట్టి ప్రేమస్వరూపుడైన భగవానుడు జీవులందరికీ తండ్రి వంటివాడు.

## 472. వత్సీ

ఆత్మ వర్గము గలవాడు.

**నిత్యపోష్యాత్మ గుణవత్ వత్సభూయస్త్వత స్సదా ।**
**వత్సీస్యాద్ధి విశేషేణ షడర్ణో గోపదో మనుః ॥**

ఆత్మగుణాలతో అలరారే ఆత్మలను ఎప్పుడూ పోషించేవాడు. అటువంటి వారే అంతముగా గలవాడు. ఈ నామము షడక్షరీ మంత్రము. రక్షణ ఇస్తుంది.

ఆత్మగుణములతో అలరారువారు. అంటే – పరమేశ్వరుడు – ఆత్మ అని కూడా పిలువబడతాడు. ఇక్కడ ఆత్మగుణము అంటే తనయొక్క గుణములు. అనగా పరమేశ్వరుని గుణములు. కేవలము ఆత్మ సాక్షాత్కారం పొందిన వారికే ఈ గుణాలుంటాయి.

**బ్రహ్మవిద్ బ్రహ్మైవభవతి** ఎవరైతే పరబ్రహ్మ సాక్షాత్కారం పొందారో, ఎవరికైతే ఆత్మసాక్షత్కారం లభించిందో వారు కూడా పరబ్రహ్మ స్వరూపులే. కుండలినీశక్తిని జాగృతం చేసి సహస్రారానికి తీసుకుపోయి అక్కడ కేవలము మూడు ముహూర్తములున్నటు వంటి వాడు 'శివయోగి' అనబడతాడు అని **భావనోపనిషత్తు** చెబుతోంది. అతడు కూడా సాక్షాత్తూ పరబ్రహ్మ స్వరూపుడే.

**ఇదం స్థానం జ్ఞాత్వానియతి నిజ చిత్తో నవరో**
**న భూయాత్ సంసారే పునరపి న బద్ధ స్త్రి భువనే ।**
**సమగ్రాశాక్తః స్వాన్నియమ మనసస్తస్యకృతినః**
**సదాకర్తుంఖగరపి వాణీ సువిమలా ॥**

ఈ స్థానాన్ని తెలుసుకున్నవాడికి పునర్జన్మ ఉండదు. ఈ లోకంతో బంధముండదు. అతడికి పాపపుణ్యాలు ఉండవు. సంసారబంధనాలు ఉండవు. అతడికి ఇష్టార్ధసిద్ధి కలుగుతుంది. అక్కడ షోడశీకళ ఉంటుంది. అది బాలభానుని వలె ప్రకాశిస్తుంటుంది. అదే పరమేశ్వర తత్త్వము. ఆమెయే జ్ఞానధాత్రి. త్రిభువనజనని ఆమె యందు నిత్యమైన శివపదమున్నది. అది నిత్యానందమయమైనది. జ్ఞానరూపమైనది. దీనినే బ్రహ్మము, హంసము, ఆత్మజ్ఞానము, విష్ణుపదము, మోక్షపదము అంటారు. ఇదే పరమపదము. ఇక్కడకు చేరిన యోగికి సాయుజ్యం లభిస్తుంది.

అటువంటివాడు సమస్త జగత్తునూ తనలోనే చూడగలుగుతాడు. పిపీలికాది బ్రహ్మపర్యంతము తనలోనే ఉన్నదని భావించగలుగుతాడు. జీవులన్నింటినీ సమానదృష్టితో చూడగలుగుతాడు. అతడే పరబ్రహ్మస్వరూపుడు. ఆత్మస్వరూపుడు. ఇటువంటి ఆత్మరూపులను పోషించేవాడు. ఇదే అఖరుస్థితి. దీని తరువాత ఇంక పొందవలసినది ఏదీ లేదు.

**వత్సా అస్య సంతీతి వత్సీ**

నిత్యము తనచేత పోషింపబడే ఆత్మవర్గములను దూడలుగా గలవాడు.

శ్రీకృష్ణభగవానుడు గోవులు కాచే గోపాలుడు. అందుచేత వత్సీ అనబడుతున్నాడు.

జగత్తులోని ప్రాణులన్నీ పరమేశ్వరుని బిడ్డలే. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'వత్సీ' అనబడతున్నాడు. భక్తుల కోరికలు నిరాటంకముగా తీర్చేవాడు.

# 473. రత్న గర్భః

విశేష ధనము గలవాడు.

**ధనాయదర్థ్యో యధారామం ప్రదేయ ధనవత్త్వతః ।**
**రత్నగర్భ స్సమాఖ్యాతో హ్యష్టార్ణో ధనదో మనుః ॥**

ధనము, ఐశ్వర్యము కోరి తనను సేవించే వారికి కోరినంత ధనము ఈయగలవాడు. ఈ నామాన్ని మంత్రముగా జపం చేస్తే ధనప్రాప్తి.

**రత్నం గర్భే యస్యసః రత్నగర్భః** రత్నాలను గర్భమునందు గలవాడు. అశేష ధనసంపన్నుడు.

పరమేశ్వరుని దగ్గరలేనిది ఏమీలేదు. సృష్టిలో ఉన్నవన్నీ ఆయన దగ్గరనుంచి వచ్చినవే. ధనధాన్యాలు, భోగభాగ్యాలు, అష్టసిద్ధులు, నవనిధులు అన్నీ ఆయన దగ్గరనుంచే వచ్చినాయి. దేవిభాగవతంలో మణిద్వీపంలో ఉన్న పరమేశ్వరుని గురించి చెబుతూ

**యస్తాస్యపాలిర్శ్వభాగేస్తు నిధీతౌ శంఖపద్మకౌ ।**
**నవరత్న మహానద్య సదావై కాంచనస్రవా ॥**

ఆ పరమేశ్వరికి ఇరుప్రక్కలా ఎంతతీసినా తరిగిపోని శంఖ, పద్మనిధులున్నాయి. అక్కడ బంగారము రతనాలతో కూడిన నదులు సదాప్రవహిస్తున్నాయి అని చెప్పబడింది.

**బ్రహ్మపురాణం**లో విష్ణులోకాన్ని వర్ణిస్తూ "ఆ లోకము అంతా స్వర్ణమయము. అక్కడ నవరత్నాలతో నిండిన ఏడు ప్రాకారాలున్నాయి. అక్కడి స్తంభములు కూడా రత్నమయములు" అని చెప్పబడింది.

కాబట్టి పరమేశ్వరుని అర్చించినవారికి కోరినంత దనం ఇవ్వగలడు. అందుకే శ్రీమన్నారాయణుడు 'రత్నగర్భః' అనబడుతున్నాడు.

రత్నగర్భః – రత్నములను గర్భమునందు గలవాడు – సముద్రుడు.

అందుచేతనే సముద్రుణ్ణి 'రత్నాకరుడు' అని కూడా అంటారు.

**బ్రహ్మవైవర్తపురాణం**లో ఈవిధంగా ఉంది. గోలోకంలో విరజ అనే కాంతకు కృష్ణుని వలన ఏడుగురు కుమారులు కలిగారు. ఒకరోజున వారందరూ ఆడుకుంటూ ఉండగా, ఆఖరువాడు తన్న అన్నలతో పోట్లాడి తల్లి దగ్గరకు వచ్చి ఏడస్తున్నాడు. ఆ కుమారుని వాడి అన్నలదగ్గర దింపటానికి ఆమె శ్రీకృష్ణుని వదలిపెట్టివెళ్ళింది. ఆమె తిరిగివచ్చేసరికి శ్రీకృష్ణుడు లేడు. తనకు శ్రీకృష్ణునితో కలిగిన విరహానికి తన కుమారులే కారణము అని భావించివారిని సప్తసముద్రాలు కమ్మని శాపం పెట్టింది. ఆరకంగా వారే సప్త సముద్రాలైనారు.

ఈ రకంగా సముద్రము అంటే శ్రీమహావిష్ణువే తప్పవేరుకాదు. అందుచేతనే అతడు 'రత్నగర్భః' అనబడుతున్నాడు.

## 474. ధనేశ్వరః

ధనాధిపతి, ధనమునిచ్చువాడు.

**తత్తదిష్ట ద్రవ్యదానే శీఘ్రకారీ ధనేశ్వరః**

భక్తుల కోరికలు తీర్చటానికి అతి త్వరగా ధనరాసుల నిచ్చువాడు.

**ధనస్య ఈశ్వరః ధనేశ్వరః** కోరిన ధనము శీఘ్రముగా ఇచ్చువాడు. భగవంతుని ఆరాధించేవారు రెండు రకాలు. 1. కామ్యవాదులు 2. మోక్షవాదులు.

కామ్యవాదులు అంటే – ఈ లోకంలో జీవించటానికి అవసరమయినవి. సుఖించటానికి అవసరమైనవి అయిన కోరికలు కోరతారు. ధనధాన్యాలు, భోగభాగ్యాలు, సిరిసంపదలు, అధికారము, పదవి, రాజ్యము మొదలైనవి. వీరు భార్య, పిల్లలు, మిత్రులు, బంధువులు అనే బంధనాలలో మునిగిఉంటారు. చతుర్విధపురుషార్ధాలలోను అర్ధకామాలే వీరు కోరతారు. వీరు కర్మలను ఆచరిస్తారు. ఇష్టాపూర్తికర్మలు ముఖ్యమైనవి.

ఇష్టకర్మలు అంటే – అగ్నిహోత్రము, జపము, సత్యవాక్పాలన, వేదాధ్యయనము, అతిథిపూజ, వైశ్యదేవము మొదలైనవి. పూర్తి కర్మలు అంటే – తోటలు పెంచటము, జలాశయాలు త్రవ్వించటము, సత్రాలు కట్టించటము, దేవాలయాలు నిర్మించటము, అన్నదానాలు చెయ్యటము మొదలైనవి.

ఈ రెండు రకాల కర్మలుచేసేవారికి, వారి వారి సంకల్పానుసారము కోరికలు తీరతాయి. ధనధాన్యాలు కావలసిన వారికి – ధనధాన్యాదులు సిద్ధిస్తాయి.

అలాగే ఎవరు ఏది కోరితే, వారికి అది లభిస్తుంది. ధనం కోరేవారికి పుష్కలంగా ధనం లభిస్తుంది. అలా వారికి శీఘ్రంగా ధనాన్నిచ్చే వాడు కాబట్టే శ్రీమన్నారాయణుడు 'ధనేశ్వరః' అనబడుతున్నాడు.

## 475. ధర్మగుప్

ధర్మాన్ని రక్షించేవాడు.

**కామం దత్యాప్యర్థ కామౌ వివర్త్యవిషయాంతరాత్**

**తాభ్యాం హితస్య ధర్మస్య రక్షణాత్ ధర్మగుప్ స్మృతః**

అర్ధకామాలు కోరేవారికి వాటిని ఇచ్చి, క్రమంగా వారి బుద్ధిని మరల్చి, వారికి హితమైన ధర్మమునందు ప్రవేశపెట్టి ధర్మాన్ని కాపాడేవాడు.

**ధర్మం గోపయతీతి ధర్మగుప్** తాను ఇచ్చిన అర్ధకామాలు వ్యర్ధంకాకుండా చూస్తూ, వీటివల్లనే ధర్మాన్ని కాపాడేవాడు.

చతుర్విధపురుషార్ధాలలోను ముఖ్యమైనవి. ధర్మము, మోక్షము. అయితే ముందుగా ధర్మాన్ని ఆచరించటానికి ప్రతివాడు ఇష్టపడడు. ధర్మాన్ని ఆచరించాలంటే భగవంతుడిమీద నమ్మకం కావాలి. అలా నమ్మకం రావాలంటే భగవంతుడివల్ల తనకు ఏదైనా మేలు జరగాలి. అదికూడా తనుకోరుకున్నది జరగాలి. మానవుడికి కావలసినది అర్ధకామాలు. అందుచేత ముందుగా అతడికి కావలసిన ధనధాన్యాలు, భోగభాగ్యాలు ఇస్తాడు భగవంతుడు. తద్వారా అతడికి భగవంతుడి మీద నమ్మకం, భక్తి పెరుగుతాయి. ఆ నమ్మకాన్ని, భక్తిని ఆసరాగా తీసుకుని భగవంతుడు తన భక్తులకు ధర్మమార్గాన్ని ఉపదేశిస్తాడు. ఈ రకంగా ధర్మాన్ని కాపాడతాడు.

**భగవద్గీత**లోని నాల్గవ అధ్యాయం **'కర్మసన్యాస యోగము'**లోని 8వ శ్లోకము.

**పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం ।**
**ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే ॥**

దుష్టశిక్షణ, శిష్టరక్షణ చెయ్యటానికి, ధర్మసంస్థాపన చెయ్యటానికి ప్రతియుగంలోను నేను భూమిమీద అవతరిస్తాను.

ఇక్కడ ధర్మసంస్థాపనార్ధాయ అంటే – ధర్మశాస్త్రములలో చెప్పినట్లుగా తాను ప్రవర్తించి, ధర్మాన్ని ప్రచారం చెయ్యటము. వేదాలు, శాస్త్రాలు, పురాణాలు, ఇతిహాసాలు, పరలోకము మహాపురుషులు, భగవంతుడు మొదలైన వాటిమీద గట్టి విశ్వాసాన్ని ఏర్పరచటానికిగాను, అందరి హృదయాలలోను పాతుకుపోతున్నట్లుగా సహేతుకము, సమర్ధము అయిన ప్రవచనాల ద్వారా ఉపదేశాలు ఇవ్వటము, తిరుగులేని విధంగా ఆదేశాలివ్వటము, సదాచారాలపట్ల శ్రద్ధను పెంపొందింపచేయటము, వంటి పనులుచేస్తూ, ఇవన్నీ ప్రజల హృదయాలలో నాటుకుపోయేటట్లుగా చెయ్యటం. వీటిని ప్రజలు ఆచరించేటట్లుగా చెయ్యటము.

ధర్మం గతి తప్పినప్పుడు భగవానుడు ఏదో ఒక రూపంలో ఈ భూమిమీద అవతరించి ధర్మసంస్థాపన చేస్తాడు. అందుకే శ్రీమన్నారాయణుడు 'ధర్మగుప్' అనబడుతున్నాడు.

## 476. ధర్మకృత్

ధర్మాన్ని ఆచరించేవాడు.

**సర్వం జనం ధార్మికయన్ లీలానుగ్రహలక్షణమ్ ।**

**ధర్మం కరోతి యస్మాద్ధి తస్మా ద్ధర్మకృదుచ్యతే ॥**

లోకంలో ప్రజలందరినీ ధార్మికులుగా చెయ్యటానికి, ధర్మాన్ని ముందుగా తాను ఆచరిస్తూ, ఇతరులచేత కూడా ఆచరింపచేయువాడు.

**ధర్మం కరోతీతి ధర్మకృత్** ప్రజలందరినీ ధార్మికులుగా చెయ్యటంకోసం ముందుగా తాను ధర్మము నాచరించువాడు.

పరమేశ్వరుడు ధర్మాధర్మాలకు అతీతుడు. అందుకే **లలితాసహస్రం**లో పరమేశ్వరి **ధర్మాధర్మవివర్జితా** అని చెప్పబడింది. అతనికి ఆచరించవలసిన ధర్మము ఏదీలేదు. కాని 'ఉత్తముడు ఏదైతే ఆచరిస్తాడో, సామాన్యుడు కూడా దాన్నే ఆచరిస్తాడు' అనేది ఆర్యోక్తి. అందువలన ప్రజలచేత ధర్మాన్ని ఆచరింపచెయ్యటంకోసం భగవంతుడు స్వయంగా తాను ధర్మాన్ని ఆచరిస్తాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'ధర్మకృత్' అనబడుతున్నాడు.

## 477. ధర్మః

ధర్మము గలవాడు, ధర్మస్వరూపుడు.

**సాదారణోపకరణం ధర్మోయస్యాస్తి కేవలం ।**

**స వై ధర్మీతి విజ్ఞేయం షడర్ణో ధర్మదోమనుః ॥**

లోకంలో ప్రసిద్ధమైన ధర్మాన్ని జగద్రక్షణకోసం సాధనముగా గ్రహించువాడు. ఈ నామము షడక్షరి ధర్మప్రదము.

**ధర్మః అస్యాస్తీతి ధర్మీ** జగద్రక్షణ గావించటానికి లోకంలో ప్రసిద్ధమైన ధర్మమే ఇతనికి సాధారణమైన ఉపకరణము. ఈ ధర్మముతోనే అతను లోకాలను రక్షిస్తాడు.

జగద్రక్షణ గావించటానికి కేవలము ధర్మమే అతడికి సాధనం. రామావతారంలో 'రాముడు మూర్తీభవించిన ధర్మస్వరూపుడు' అని చెప్పబడ్డాడు. ధర్మమార్గాన్ని తప్పి తమ్ముని భార్యను చెరబట్టిన వాలిని వధించాడు. ఆ తరువాత వాలి 'రామా నన్నెందుకు వధించావు?' అని అడిగినప్పుడు' నువ్వు రాజువు. ధర్మంతప్పావు. తమ్ముని భార్యను చెరబట్టావు. రాజే అధర్మపరుడైతే, దేశం ఏమవుతుంది ? ధర్మం ఎలా నిలుస్తుంది ? అందుచేత ధర్మాన్ని

నిలపటానికి నేను నిన్ను సంహరించాను' అన్నాడు. అలాగే ధర్మం తప్పాడు కాబట్టే రావణబ్రహ్మను వధించటం జరిగింది.

అదేవిధంగా కురుక్షేత్ర సంగ్రామంలో విరథుడైన కర్ణుని చంపటం ధర్మమే అన్నాడు. దుర్యోధనుని ఊరు భాగంలో కొట్టటంలో తప్పులేదు. అది భీముడు చేసిన ప్రతిజ్ఞలో భాగము అన్నాడు.

ఈ రకంగా ఎవరైతే ధర్మంతప్పుతారో, వారిని ఆధర్మమే సాధనంగా చేసుకుని సంహరిస్తాడు. ధర్మాన్ని నిలబెడతాడు. అందుకే శ్రీమన్నారాయణుడు 'ధర్మ' అనబడుతున్నాడు.

## 478. సత్

సత్స్వరూపి.

**నిరుపాదిక సద్భావాత్ నిత్యసాద్గుణ్య యోగతః ।**
**సచ్ఛద్దేనోచ్యతే విష్ణుః వేదవేదాంత పారగైః ॥**

సహజమైన సత్తుగలవాడు, సద్గుణాలను తావళముగా ధరించాడు, అందుచేత శ్రీమన్నారాయణుడు వేదవేదాంతపారంగతులచేత 'సత్తు' అని చెప్పబడుతున్నాడు.

ధర్మాలచేత సాధించబడే భగవానుడు సచ్ఛబ్దవాచ్యుడు.

సత్ అనగా – సత్యము, నిత్యమైనవాడు. **ఛాందోగ్యోపనిషత్తు**లో 'సృష్టికి పూర్వము ఈ జగత్తంతా సత్తుగానే ఉండేది' అని చెప్పబడింది.

ఉద్దాలక అరుణి మహర్షి కుమారుడు శ్వేతకేతువు. కుమారుడికి పన్నెండు సంవత్సరాలు నిండగానే తండ్రి అతణ్ణి పిలిచి "నాయనా శ్వేతుకేతూ ! గురుకుల ఆశ్రమానికి వెళ్ళి బ్రహ్మచర్య దీక్షతో అక్కడ నివసించు. మన వంశంలో పుట్టినవారెవరూ బ్రహ్మజ్ఞానం లేనివారు కాదు. కాబట్టి నువ్వు కూడా వెళ్ళి విద్యావంతుడవుకా" అన్నాడు.

తండ్రి మాటమీద పన్నెండు సంవత్సరాల పాటు గురుకులంలో ఉండి వేదాధ్యయనంచేసి, వేదానికి అర్థం తెలుసుకున్నాడు. అయితే సర్వంతనకే తెలుసుననే అహంకారంతో గర్వంతో, దర్పంతో ఇంటికి తిరిగి వచ్చాడు. ఈ విధంగా దుడుకు స్వభావంతో వచ్చిన కుమారుని అవివేకాన్ని, ఆత్మవంచనను, గుర్తించినవాడై ఉద్దాలకుడు "నాయనా శ్వేతకేతూ ! శ్రవణ గోచరం కాని తత్త్వం ఇంద్రియ గోచరమయ్యే విధానము గురించి మీ గురువుగారిని ఎప్పుడైనా అడిగావా ?" అన్నాడు.

"ఏమిటా విషయం?" అన్నాడు శ్వేతుకేతు, "నాయనా ! మట్టిని గురించి తెలిస్తే మట్టితో చేసేవివిధ రకాల వస్తువులకు పేర్లలో తేడా ఉన్నా వాటిని గురించి తెలుస్తుంది. బంగారం గురించి క్షుణ్ణంగా తెలిస్తే దానితో తయారుచేసిన నగలకు ఏ పేరుపెట్టినా వాటిలో ఉన్నది బంగారమే అని తెలుస్తుంది.

అలాగే ఏ విషయం తెలుసుకున్నందువల్ల అన్ని విషయాలు మనకు బోధపడతాయో దానిని గురించి తెలుసుకోవాలి. ప్రతి విషయంలోనూ అంతర్గతంగా ఉండే తత్త్వం ఏదో తెలుసుకున్నావనుకో అప్పుడు మిగిలినదంతా పదాలగారడీ అని తెలుస్తుంది." అన్నాడు ఉద్దాలకుడు. దానికి శ్వేతకేతువు "నాన్నగారూ ! మీరు చెప్పిన విషయాలు మా గురువర్యులకు తెలియదనుకుంటాను. ఒకవేళ వారికి తెలిస్తే తప్పకుండా నాకు చెప్పేవారే. కాబట్టి పరమోత్కృష్టమైన ఆ విద్యను మీరే నాకు బోధించి నన్ను కృతార్థుణ్ణి చెయ్యండి" అన్నాడు.

"సరే ! నీకా తత్త్వాన్ని చెబుతాను. వినవలసినది" అంటూ ప్రారంభించాడు ఉద్దాలకుడు.

"శ్వేతకేతూ ! సృష్టికి పూర్వం ఈ ప్రపంచం నామరూపాలతో కూడిలేదు. అప్పుడు కేవలం అద్వితీయమైన 'సత్తు' మాత్రమే ఉండేది. నామరూపాలు, పదార్థాలు ఏవీలేవు. సత్తు అంటే – ఉనికి, సత్యం అని అర్థం. అసత్తు అంటే లేనిది, అసత్యం అని అర్థం. అన్నింటికన్నా పూర్వమైనది, రెండుకానిది, మొదటగా ఉన్నది ఏకైకమై పరబ్రహ్మ ఆ తత్త్వం అనేకం కావాలనుకుంది. రకరకాల రూపాలతో వస్తువులుగా, జీవులుగా రూపుదాల్చింది. ద్రవ, ఘన, వాయు పదార్థాలుగా మార్పుచెంది అనేక రూపాలతో సృష్టి ఆకారం పొందింది. ఈ రకంగా మొదటగా ఉన్న పరబ్రహ్మలో నుంచే ఇవన్నీ వచ్చినాయి.

స్థావర జంగమాత్మకమైన జీవులన్నీ పుట్టుకరీత్యా అనేక విధాలుగా ఉన్నాయి.

1. అండజములు – గ్రుడ్డ నుండి పుట్టేవి (పక్షులు, పాములు)
2. జీవజములు – జీవుల వల్లపుట్టేవి (మనుష్యులు, పశువులు)
3. ఉద్భిజములు – విత్తనాల వల్ల భూమి నుంచి పుట్టేవి. (చెట్లు, చేమలు)
4. స్వేదజములు – చెమట వల్ల పుట్టేవి.
5. ఊష్మజాలు – వెచ్చదనం వల్ల పుట్టేవి. (క్రిమికీటకాలు)

జీవరాశులను చెప్పేటప్పుడు పై మూడు రకాలు మాత్రమే చెప్పాలి. అవే ముఖ్యమైనవి.

తాను అనేకం కావాలనుకున్న 'సత్తు' ముందుగా అగ్నిని సృష్టించింది. అగ్ని నుండి జలము, జలమునుండి భూమి ఉద్భవించాయి. వీటివల్లనే అన్నం పుట్టింది. అప్పుడు సత్తు అగ్ని జలము అన్నములలో ప్రవేశించాలనుకుంది. అంటే ఈ మూడింటిలోనూ వ్యక్తమయి అనేక రూపాలు పొందింది. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'సత్' అనబడుతున్నాడు. **లలితాసహస్రం**లో 818వ నామము 'సత్యరూపా'.

# 479. అసత్

అసత్స్వరూపి.

**అసతాం యస్సదానంత భవఖ్యాష ప్రదానతః అసదిత్యుచ్యతే సద్భిః**

దుర్మార్గులైన వారికి అనేక జన్మలను ఎత్తటానికి కారణమైన పాపము నిచ్చేవాడు.

లోకంలో మానవులు కర్మలు చేస్తుంటారు. కర్మల వలన పాపపుణ్యాలు వస్తాయి. వాటిని అనుభవించటానికి స్వర్గనరకాలున్నాయి.

అవసానకాలంలో మానవుడి యొక్క ప్రాణాలు నవరంధ్రాలలోను ఏదో ఒక రంధ్రం గుండా పోతాయి. నీచమైన కర్మలు చేసిన వారి ప్రాణాలు క్రింది నుంచి పోతాయి. మిగిలిన వారికి పైనుంచి పోతాయి. అయితే ఈ కర్మలు చేసినవారు స్వర్గనరకాలను అనుభవించి, కర్మశేషాన్ని అనుభవించటానికి మళ్ళీ జన్మించాలి. ఉత్తమకర్మలు చేసినవారు ఉత్తమయోనులయందు జన్మిస్తారు. నీచకర్మలు చేసినవారు నీచయోనులయందు పశువులు, పక్షులుగా జన్మిస్తారు. ఇంకా హేయమైన కర్మలు చేసిన వారు క్రిమికీటకాలుగా జన్మించి, అతి కొద్దికాలానికే మరణిస్తూ ఉంటారు.

జీవితంలో పాపపుకర్మలు చేసినవారు, ఆ పాపాన్ని అనుభవించటానికి మళ్ళీ జన్మిస్తారు. మళ్ళీ పాపం చేస్తారు. మళ్ళీ జన్మిస్తారు. ఈ రకంగా పాపకర్మలు చేస్తూ, ఫలితాన్ని అనుభవించటానికి భూలోకంలో జన్మిస్తూ ఉంటారు. పాపకర్మలను సంసారమనే బండిచక్రంలో పడేసి గిరగిరా త్రిప్పుతూ ఉంటాడు. కాబట్టే శ్రీమన్నారాయణుడు 'అసత్' అనబడుతున్నాడు.

**భగవద్గీత**లోని తొమ్మిదవ అధ్యాయము '**రాజవిద్యారాజగుహ్యయోగము**'లోని 19వ శ్లోకము

**తపామ్యహమహం వర్షం నిగృహ్ణామ్యుత్సృజామి చ ।**
**అమృతం చైవ మృత్యుశ్చ సదసచ్చాహమర్జున ॥**

అర్జునా ! సూర్యరూపమున నేనే తపించుచున్నాను. సముద్రమునుంచి నీటిని తీసుకుని వర్షం రూపంలో మళ్ళీ వదుల్తాను. అమృతాన్ని నేనే. మృత్యువును కూడా నేనే. సత్తును అసత్తును కూడా నేనే.

సత్తు అంటే–శాశ్వతమైన ఆత్మ. అసత్తు అంటే సమస్త వస్తుజాలము. అశాశ్వతమైనవి.

ఎన్నడు నశింపని శాశ్వతమైన ఆత్మ సత్ అనబడుతుంది. అనిత్యమైన వస్తువు 'అసత్' అనబడుతుంది. ఈ రెండూ పరమేశ్వరుడు పరా, అపరా ప్రకృతులు. ఈరెండు భగవంతునికన్న వేరైనవికావు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'అసత్' అనబడుతున్నాడు.

## 480. క్షరమ్

వికరించువాడు.

**తస్మాదేవ క్షరం చ నః** అందువలననే అతడు క్షరమని చెప్పబడుతున్నాడు. పరమేశ్వరుని నీచభావంతో ఆశ్రయించిన వారి విషయంలో అసత్తుగా ఉంటాడు.

నీచకర్మలకోసం ఆశ్రయించటము అంటే ఐహిక సుఖాలకోసం పరమేశ్వరుని అర్చించటం. అలా అర్చించిన వారికి అసత్తుగా ఉంటాడు. అనగా వారికి కావలసినవి ఐహికమైన ధనధాన్యాలు, భోగభాగ్యాలు. అవన్నీ అశాశ్వతమైనవి. దుఃఖాన్ని కలిగించేవి. పైగా వారు ఆరాధించేది సాకారుడైన భగవంతుణ్ణి. ఆకారం ఎప్పుడైతే ఉన్నదో, అది నాశనమైతీరుతుంది. అందుకే అది అసత్తు. ఈ లోకంలో నిరాకారుడైన పరబ్రహ్మ తప్ప అందరూ నశించేవారే. దేవతలలో మొదటివాడైన బ్రహ్మకూడా, బ్రహ్మకల్పం పూర్తికాగానే పరబ్రహ్మలో లీనమవుతాడు. అందుకని లౌకికమైన కోరికలు, సుఖాలు, వాటినిచ్చే దేవతలు అందరూ క్షరమైపోయేవారే. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'క్షరః' అనబడుతున్నాడు. **కౌషీతకీఉపనిషత్తు**లో "వీడు ఎవరిని ఉద్ధరించ కోరతాడో, వారిచే సత్కర్మలు చేయిస్తాడు. ఎవరిని క్రిందపడెయ్యాలను కుంటాడో వారిచే దుష్కర్మలు చేయిస్తాడు." అని చెప్పబడింది. ఇక్కడ సత్కర్మలు అంటే – మోక్షానికి దారితీసేవి. దుష్కర్మలు అంటే – లౌకికమైన సుఖాల నిచ్చేవి. **భగవద్గీత**లోని 15వ అధ్యాయం **'పురుషోత్తమప్రాప్తి యోగం'**లోని 16వ శ్లోకము.

**ద్వావిమౌపురుషౌలోకే క్షరశ్చాక్షర ఏవ చ ।**
**క్షరః స్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే ॥**

ఈ లోకంలో క్షరుడు, అక్షరుడు అని పురుషులు రెండువిధాలుగా ఉన్నారు. సకల జీవుల శరీరాలన్నీ అశాశ్వతములు. ఆత్మ ఒక్కటే నాశనములేనిది.

# 481. అక్షరమ్

నాశనము లేనివాడు.

**అపక్షయవినాశాది వర్జితోఽక్షర ఉచ్యతే** తరుగుట, విరుగుట మొదలైన వికారములు లేనివాడు. నాశనరహితుడు, సత్యము నిత్యము అయినవాడు. ఆది అనాది అయినవాడు. జన్మమృత్యుజరాదులు లేనివాడు. సృష్టి జరగకముందు ఉన్నవాడు. ఇప్పుడు ఉన్నవాడు. ఇకముందు కూడా ఉండేవాడు. సృష్టిస్థితి లయాలకు కారణభూతుడు. అతడే పరబ్రహ్మ. ఇందాకటి 480వ నామంలో చెప్పినట్లుగానే జీవుల శరీరాలన్నీ అశాశ్వతాలు. ఆత్మ ఒక్కటే శాశ్వతమైనది. అందుకే శ్రీమన్నారాయణుడు 'అక్షరమ్' అనబడుతున్నాడు.

# 482. అవిజ్ఞాతా

రుగకుండువాడు.

**ప్రపన్నకృత పాపానాం కించ దప్య విచారణాత్**
**అవిజ్ఞాతేతి కథితః బుధై సద్గుణసాగరైః**

ప్రసన్నులు బుద్ధిపూర్వకంగా పాపాలు చేసినప్పటికీ ఏ మాత్రమూ పట్టించుకోనివారు.

ఇక్కడ ప్రసన్నులు అంటే – పరమేశ్వరుడు ఎవరియందు ప్రసన్నుడైనాడోవారు. పరమేశ్వరుని కృపాకటాక్షవీక్షణాలను పొందినవారు. ఆశ్రితులు.

**న విజ్ఞాతా అవిజ్ఞాతా** ఆశ్రితుల అపరాధములనెరుగనివాడు. ఆశ్రితులు తప్పుచేసినా పట్టించుకోనివాడు.

రామదాసు తాసీలుగావసూలైన ఆరు లక్షల రూపాయలతో సీతారాములకు ఆభరణాలు చేయించాడు. గుడికట్టించాడు. తాసీలు సొమ్ముఖజానాకు జమచెయ్యలేదని తానీషా ఖైదు చేయించి కొరడాలతో కొట్టిస్తున్నాడు. అపుడు రామదాసు సీతమ్మకు చేయిస్తి చింతాకు పతకము అంటూ కులుకుతూ తిరిగెదవెవడబ్బ సొమ్మని అని శ్రీరామచంద్రుణ్ణి దూషిస్తాడు. ఆ రకంగా దూషించినప్పటికీ అతని మీద కోపం తెచ్చుకోలేదు రాముడు. పైగా ప్రేమను పెంచుకున్నాడు.

ప్రతి దానికి కర్తా, భోక్తా రెండూ పరమాత్ముడే. విజ్ఞాత, అవిజ్ఞాత రెండూ అతడే. విజ్ఞాత అంటే – శుద్ధచైతన్యరూపుడైన పరమాత్మ. అవిజ్ఞాత – దీనికి విలక్షణమైనవాడు.

తెలుసుకొనువానికన్న కూడా విలక్షణమైనవాడు. అతడే పురుషోత్తముడు.

భగవద్గీతలోని 15వ అధ్యాయం **'పురుషోత్తమప్రాప్తి యోగము'**లోని 18వ శ్లోకము.

**యస్మాత్ క్షరమతీతోఽ హం అక్షరాదపి చోత్తమః**

**అతోఽస్మి లోకేవేదే చ ప్రథితః పురుషోత్తమః**

అర్జునా ! క్షేత్రముకన్న నేను సర్వదా అతీతుడను. నాశరహితమైన జీవాత్మకన్న ఉత్తముడను. కాబట్టి ఈ జగత్తునందు, వేదాలయందు కూడా పురుషోత్తముడు అని ప్రసిద్ధి కెక్కాను.

పరమేశ్వరుడు క్షరుని కన్న అతీతుడు. అక్షరుని కన్న శ్రేష్ఠుడు. ఎందుచేతనంటే - క్షరపురుషునికన్న విలక్షణుడు. అతనితో అనగా అపరాప్రకృతితో ఏ రకమైన సంబంధము లేనివాడు. శరీరము, క్షేత్రము అనబడే సమస్త జడవర్గము నుండి అతడు నిర్లిప్తుడు. అక్షరుని కన్న ఉత్తముడు. ఇతడు శాశ్వతుడు. చేతనాత్మకుడు. అక్షరుడు ప్రకృతికి లోబడి ఉంటాడు. కాని పరమాత్మ ప్రకృతికీ, గుణాలకు అతీతుడు. అక్షరుడు అల్పజ్ఞుడు. భగవానుడు సర్వజ్ఞుడు. అతడు నియమింపబడేవాడు. ఇతడు నియామకుడు. అతడు ఉపాసకుడు. అల్పశక్తిసంపన్నుడు. ఇతడు సర్వశక్తిమయుడు. కాబట్టి అక్షరునికన్న భగవంతుడు అన్నివిధాలా ఉత్తముడు.

క్షేత్రము - క్షరము. క్షేత్రజ్ఞుడు అక్షరము. క్షేత్రము ఉన్నంతవరకు క్షేత్రజ్ఞుడు ఉంటాడు. అతడే జీవుడు. క్షేత్రం లేకపోతే క్షేత్రజ్ఞుడు కూడాలేడు. అక్కడ కేవలము చైతన్యమే ప్రకాశిస్తుంది. కాబట్టి ఆ చైతన్యమే క్షేత్రాన్ని, క్షేత్రజ్ఞుని ఇద్దరినీ ప్రకాశింపచేస్తున్నది. ఈ రెండింటికీ విలక్షణుడు కాబట్టే శ్రీమన్నారాయణుడు 'అవిజ్ఞాతా' అనబడుతున్నాడు.

## 483. సహస్రాంశుః

అమితమైన జ్ఞానము గలవాడు.

**అంశవో బుద్ధయః ప్రోక్తాః సహస్రం సంతి యస్య తే ।**

**సహస్రాంశురితి ఖ్యాతో హ్యష్టార్ణోధీపదో మనుః ॥**

అంశ అంటే - బుద్ధి అని అర్థము. అటువంటి అంశలు ఇతనికి అపారముగా ఉన్నాయి. ఈ నామము అష్టాక్షరీ మంత్రము. జ్ఞానప్రదము.

**సహస్రం అంశవః యస్యసః సహస్రాంశుః**

అంశువు అంటే జ్ఞానము. అపరిమితమైన జ్ఞానము గలవాడు. సర్వజ్ఞుడు. తన యందు భక్తి తత్పరత ఉన్నవాడు. ఎన్ని తప్పులు చేసినా ఉపేక్షించి ఊరుకుంటాడు.

**దోషాయద్యపితస్యస్యాత్** వానికి దోషాలు ఉన్నప్పటికీ నేను గమనించను' అంటాడు. శ్రీరాముడు రామాయణంలో

**భగవద్గీత**లోని 9వ అధ్యాయం **'రాజవిద్యారాజగుహ్య యోగము'**లోని 30వ శ్లోకము.

**అపిచేత్ సుదురాచారో భజతే మామనన్యభాక్**

**సాధురేవ స మంతవ్యః సమ్యగ్వ్య వసితో హి సహ**

అర్జునా ! ఎంతటి దురాచారుడైనప్పటికీ అనన్యభక్తితో ననుభజించినట్లైతే అతనిని సత్పురుషునిగానే భావిస్తాను. యదార్ధంగా అతడు నిశ్చయబుద్ధి గలవాడు. పరమాత్ముని సేవించటంతో సమానమైనది ఇంకొకటి లేదు అని గట్టిగా నిశ్చయించుకున్నటువంటివాడు.

అంశువు అంటే – కిరణము. వేలకొలదిగా కిరణములు గలవాడు. అందుకే సూర్యునకు 'సహస్రాంశువు' అని పేరు. సూర్యునియందుండే కిరణాలు పరమాత్మవే. కాబట్టి సూర్యుడు పరమాత్మ స్వరూపమే. పరమేశ్వరుని నుంచి అనేక కోట్ల కిరణములు ప్రసరిస్తున్నాయి. వాటిలో సూర్యుడు 116 కిరణములను తీసుకోగలిగాడు. ఆ కిరణముల తోనే లోకాలన్నీ జీవిస్తున్నాయి. ఈ విషయం గతంలో ప్రస్తావించాం.

**భగవద్గీత**లోని 15వ అధ్యాయము **'పురుషోత్తమప్రాప్తియోగము'**లోని 12వ శ్లోకము.

**యదాదిత్య గతం తేజో జగద్భాసయతే ఽ ఖిలమ్ ।**

**యచ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్ ॥**

సమస్త జగత్తును ప్రకాశింపచేసే సూర్యుని తేజస్సు, చంద్రుని తేజస్సు, అగ్ని తేజస్సు కూడా నా తేజస్సే అని ఎరుంగుము. **భైరవయామళం**లో

**"అనేకకోటిసంఖ్యానాం మయూఖానాం మహేశ్వరీ**

**అష్టోత్తరశతం వహ్నే షోడశోత్తరశతం రవేః**

**షట్త్రింశతదుత్తరశతం చంద్రస్య కిరణాశ్శివే ॥**

పరమేశ్వరుని నుంచే అనేక కోట్ల కిరణాలలో 108 కిరణములను అగ్ని, 116 కిరణములను సూర్యుడు, 136 కిరణములను చంద్రుడు తీసుకోగలిగారు. లోకాలన్నీ ఈ కిరణకాంతుల వల్లనే ప్రవర్తిల్లుతున్నాయి" అని చెప్పబడింది.

**బృహదారణ్యకోపనిషత్తు**లో యాజ్ఞవల్క్యుడు జనక మహారాజుకు ఈ విషయాన్ని వివరిస్తాడు. ఒకసారి యాజ్ఞవల్క్యుడు విధేహాధిపతి అయిన జనకుని ఆస్థానానికి వెళ్ళాడు. గురువుగారిని చూడగానే ఎదురేగి స్వాగత సత్కారాలు అందించి కుశలప్రశ్నలు అయిన తరువాత జనకమహారాజు అంటున్నాడు.

"గురుదేవా ! నాకు చిన్న అనుమానం వచ్చింది. అది తీర్చి పుణ్యం కట్టుకోండి." ఆ మాటవినగానే అదేమిటో చెప్పమన్నాడు యాజ్ఞవల్క్యుడు.

**జ** : మహర్షీ ! మానవుడు ఏ వెలుగువల్ల తన నిత్యకృత్యం సాగిస్తున్నాడు.

**యా** : సూర్యుని వెలుతురు వల్ల. ఆ వెలుతురు వల్లనే మానవుడు పనిపాటలు నిర్వహించుకుంటాడు. దూరతీరాలకు వెడతాడు. పనులు పూర్తిచేసుకొని తిరిగివస్తాడు. ఆ వెలుగులో వెళ్ళాలనుకున్నచోటికి వెడతాడు. చేయదలచుకున్న పని చేసుకుంటాడు.

**జ** : మహర్షీ ! మరి సూర్యాస్తమయమైతే పనులు ఏవిధంగా జరుగుతాయి.

**యా** : సూర్యుడు అస్తమించిన తరువాత చంద్రునియొక్క కాంతులలో ఈ పనులన్నీ జరుగుతాయి.

**జ** : సూర్యచంద్రులిద్దరూ అస్తమించినప్పుడు ఏం జరుగుతుంది మహాత్మా!

**యా** : రాజా ! సూర్యచంద్రులు ఇద్దరూ లేనప్పుడు అన్ని వ్యవహారాలు దీపం లేదా అగ్ని వెలుగులో జరుగుతాయి.

**జ** : మహానుభావా ! మరి ఆ అగ్నికూడా లేకపోతే ? సూర్యుడస్తమిస్తాడు. చంద్రకాంతి ఉండదు. అగ్ని ఆరిపోతుంది. అప్పుడు మానవుడు ఏ రకంగా పనులు చేస్తాడు ?

**యా** : రాజా ! ఆ వెలుగుల స్థానంలో వాక్కు వ్యవహారానికి సహకరిస్తుంది. చీకటిలో ఏమీ కనిపించదు. కాని ఏదో ధ్వని వినిపిస్తే మానవుడు ధ్వని వినిపించిన వైపుకు సాగిపోతాడు.

**జ** : మరి ఆ వాక్కు కూడా ఆగిపోతే ? అంటే ధ్వని కూడా ఏ మాత్రం వినిపించదు. అప్పుడు ఏం జరుగుతుంది?

**యా** : జనకమహారాజా ! శబ్దాలన్నీ సర్దుమణిగిన తరువాత ఏం జరుగుతుంది? అని కదా అడుగుతున్నావు. జాగ్రత్తగా విను. ఈ వెలుగులకన్నిటికీ అవతల ఆత్మజ్యోతి ఉన్నది. ఆ ఆత్మప్రకాశములకు ప్రకాశం. కాంతులకు కాంతి. అటువంటి ఆత్మవల్లనే మానవుడు మనుగడ సాగిస్తాడు.

అందుచేతనే శ్రీమన్నారాయణుడు సహస్రాంశువు అనబడుతున్నాడు. పరమేశ్వరుని నుంచి

**కోటిరర్బుదమేతేషాం పరాసంఖ్యానవిద్యతే** కొన్నికోట్లకిరణాలు ప్రసరిస్తున్నాయి కాబట్టి శ్రీమన్నారాయణుడు 'సహస్రాంశువు' అనబడుతున్నాడు.

## 484. విధాతా

విధించువాడు. 44వ నామం కూడా ఇదే.

**తాదధీన్యాద్య మాదీనాం విధాతేత్యుచ్యతే బుధైః**

యముడు మొదలైన వారు కూడా తన అధీనులే కాబట్టి, వీరిని బాధింపనివాడు.

**విదధాతీతి విధాతా** పాపకర్మలు చేసినవారికి యమయాతనలుండవా ? అనేది ప్రశ్న. ఉండవు. ఎందుకని? యముడు మొదలైన దిక్పాలకులు కూడా ఆ పరమేశ్వరునిచేత నియమించబడ్డవారే. అతనికి అధీనులే.

**కఠోపనిషత్తు**లో యముడు నచికేతునితో "అగ్ని చయనము' అనే యజ్ఞము చేస్తే మోక్షంరాదు. శాశ్వతస్వర్గలోకము వస్తుంది. ఆ మాట తెలిసికూడా నేను ఆక్రతువును చేశాను. ఈ రకంగా యమలోకానికి అధిపతిని అయ్యాను" అంటాడు. యముణ్ణి ఆ లోకానికి అధిపతిగా చేసింది ఆ పరమేశ్వరుడే. అందుచేతనే పాపకర్మలు చేసినప్పటికీ తత్పరులను యమదూతలు బాధించరు.

అజామీళుడు మహాక్రూరుడు. అవసానకాలంలో 'నారాయణ' అంటూ మనసారా తన కుమారుని పిలిచాడు. మరణానంతరము విష్ణుదూతలు అతన్ని స్వర్గానికి తీసుకుపోయారు.

గుణనిధి. మహావ్యసనపరుడు. కానీ మహా శివరాత్రినాడు ఉపవాసముండి, జాగారం చేసి మరణించాడు. శివుని దూతలు అతన్ని కైలాసానికి తీసుకుపోయారు.

ఈ రకంగా పరమేశ్వరుణ్ణి సదా ధ్యానంచేసే తత్పరాయణులు తప్పులు చేసినప్పటికీ యమదూతలు కూడా వారిని బాధించరు.

విధాతా – అన్ని భూతములను ధరించే ఆదిశేషుని, అష్టదిగ్గజాలను కూడా ధరించేవాడు. అందుకే శ్రీమన్నారాయణుడు 'విధాతా' అనబడుతున్నాడు.

**లలితాసహస్రం**లో 337వ నామము విధాత్రీ.

## 485. కృతలక్షణః

లక్షణములనేర్పరచినవాడు.

**కృతం హి లాంఛనం యేన ఉపాదేయేషు జంతుషు**

**పరమాత్మా హృషీకేశః స తు స్యాత్ కృతలక్షణః**

ఇంద్రియాలకు ప్రేరకుడైన పరమాత్మ, తాను సృష్టించిన ప్రాణులకు స్వయంగానే గుర్తులను తెలిపినవాడు.

**కృతం లక్షణం యేన సః కృత లక్షణః** విష్ణుసంబంధము గలవాడు ఉపాదేయుడు. అనగా స్వీకరింపతగినవాడు. విష్ణు సంబంధము లేనివాడు త్యాజ్యుడు విసర్జింపతగినవాడు.

**విష్ణుతంత్రములో**

**చక్రాదిధారణం పుంసాం పరసంబంధవేదనం**
**పతివ్రతానిమిత్తం హి వలయాది వి భూషణమ్**

వలయాదులు సుమంగళీ చిహ్నాలు. అలాగే చక్రాంకితాలు భగవత్సంబంధ సూచకాలు.

కృతము అనగా – కల్పితము. కల్పితమైన లక్షణాలు గలవాడు.

శ్రీ మహావిష్ణువు నిత్యనిష్పన్న చైతన్యరూపుడు. అంటే శాశ్వతమైన చైతన్యము గలవాడు. కాబట్టి అతనిని గురించి గుర్తించటానికి లక్షణాలేవీ ఉండవు. అయినప్పటికీ ఉపాసనకోసము కొన్నింటిని చెబుతున్నారు. అవి కూడా కల్పితాలే. అందుచేతనే శ్రీమహావిష్ణువు 'కృతలక్షణుడు' అనబడుతున్నాడు.

వేదశాస్త్రములను చెప్పినవాడు కల్పించినవాడు.

**వేదశాస్త్రాణి విజ్ఞాన మేతత్సర్వం జనార్దనం** వేదాలు, శాస్త్రాలు మొదలైన విజ్ఞానమంతా ఆ జనార్దనుని నుండే జన్మించినది.

అన్ని పదార్థాలను వాటితో సజాతీయమైన వాటినుండి, విజాతీయమైన వాటినుండి, వేరుపరచు లక్షణములను ఏర్పరచినవాడు.

వక్షస్థలమందు 'శ్రీవత్సము' అనే కౌస్తుభలక్షణము గలవాడు.

## 486. గభస్తి నేమిః

ప్రకాశమైన చక్రము గలవాడు.

**జ్యోతిర్విశిష్ట నేమ్యాయత్ లక్షితమ్ చక్రముత్తమమ్ ।**
**గభస్తినేమిర్య స్యాస్తి నవార్ణః పాపనాశనః ॥**

మహాప్రకాశవంతములైన అంచులతో కూడియున్న, ఉత్తమమైన చక్రాయుధము గలవాడు. **గభస్తిఃనేమిః యస్యసః గభస్తినేమిః**

ఆశ్రితులను రక్షించటానికి సహస్ర కోణములుగల చక్రము ఆయుధముగా గలవాడు.

గభస్తులు అంటే – కిరణములు. గభస్తి చక్రమునకు నేమివంటివాడు. నేమి అనగా – ఇరుసు. కిరణములతో ఏర్పడిన చక్రానికి నడుమభాగంలో నేమిలాగా సూర్యుడు ఉన్నాడు. సూర్యభగవానుడు కూడా విష్ణువుయొక్క విభూతియే. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'గభస్తినేమిః' అనబడుతున్నాడు.

## 487. సత్త్వస్థః

హృదయమునందుండువాడు.

**సత్త్వేహృది సితత్వాద్ది సత్వస్థ స్సముదీరితః** భక్తుల హృదయమందుండువాడు.

**సత్త్వేహృదయే తి ష్ఠతీతి సత్త్వస్థః** సత్త్వము అంటే – హృదయము. దానియందు స్థిరంగా ఉండటంచేత 'సత్వస్థః' అనబడుతున్నాడు. పరమేశ్వరుడు ఉండే చోట కర్మలు ఉండవు. అతడు భక్తులహృదయములందు ఉంటాడు. కాబట్టి వారి కర్మలు భస్మమైపోతాయి. వీరిని పీడించేకర్మలు లేవు కాబట్టే, యమధర్మరాజు లేదా ఆయన దూతలు వారి జోలికిరారు.

**విష్ణుపురాణంలో** "ఆ పరమేశ్వరుడు ఎవరి హృదయమందు నివశిస్తాడో, వారి పాపములు సూర్యునిముందు చీకటిలాగా నశించిపోతాయి". స్పటికమణిలాగా నిర్మలంగా ప్రకాశించే శ్రీమహావిష్ణువు నివసించే భక్తుల హృదయములందు దోషములు ఉండవు. అందుచేతనే యమునిచేతగాని, యమకింకరుల చేతగాని యాతనలు వారికిలేవు" అని చెప్పబడింది.

సత్త్వస్థః అనగా – సత్వగుణ ప్రధానుడు. సర్వప్రాణులయందు అంతర్యామిగా ఉండేవాడు. హకారసంజ్ఞగల పరమేశ్వరుడు, సకార సంజ్ఞగల ప్రకృతితో కలసి శబళ బ్రహ్మమై బ్రహ్మరంధ్రం గుండా మానవదేహంలో ప్రవేశించాడు. అటువంటి హంస అనబడే ఆ పరమేశ్వరుడికి

| | | |
|---|---|---|
| అగ్ని, చంద్రమండలాలు | – | రెక్కలు |
| ఓంకారము | – | శిరస్సు |
| జ్ఞాననేత్రము | – | పాదాలు. |

ఈ రకంగా ఉన్న హంస అనే జీవుడు పాలలో ఉన్న నెయ్యి లాగా సమస్త ప్రాణికోటినీ ఆశ్రయించి ఉన్నాడు. అతడే అంతర్యామి. ఈ రకంగా శంఖు, చక్ర, గదాధారియై శ్రీమహావిష్ణువు ఉండగా అక్కడికి అసురలక్షణాలు చేరవు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'సత్త్వస్థః' అనబడుతున్నాడు.

## 488. సింహః

హింసించువాడు, మహాపరాక్రమశాలి. 200వ నామము కూడా ఇదే.

**హరిభక్తాయ విజ్ఞాయ దండే ప్రయతమానసాన్**
**హినస్తి చ యమాదీప్యః స సింహపరికీర్తితః**

విష్ణుభక్తులు అని తెలియక వారిని శిక్షించబోయే యమాది దేవతలను హింసించువాడు.

**హినస్తీతి సింహః** శ్రీ మహావిష్ణువు భక్తుల హృదయాలలో ఉంటాడు. అతడున్న దరిదాపులకు కూడా అసుర లక్షణాలు చేరవు. అటువంటి విష్ణుభక్తులను యాతనలకు గురిచెయ్యాలనే సంకల్పంతో యమధర్మరాజుగాని, అతని భటులుగాని, వారి జోలికి వెళ్ళినట్లైతే, వారిని హింసించేవాడు.

లోకంలో మోక్షగాములైన వారందరికీ వాసుదేవుడే గతి. అందుచేత ఆ శ్రీమహావిష్ణువును అర్చించే వైష్ణవుడికి ఏ పాపము ఉండదు. అటువంటి వైష్ణవుని చూసి దేవతలు కూడా నమస్కరించి వెళ్ళిపోతారు. సూర్యుని కుమారుడైన యమధర్మరాజు కూడా అతడికి నమస్కరిస్తాడు. విష్ణుభక్తులను సాక్షాత్తు శ్రీ మహావిష్ణువుగా ఎంచి అర్చించే వారికి సాయుజ్యం లభిస్తుంది. అని **విష్ణుపురాణం**లో మార్కండేయుడు చెప్పాడు.

**విష్ణుతంత్రం**లో విష్ణుభక్తులకు శ్రీమన్నారాయణుడే ప్రభువు. కాబట్టి వారిని చూసి అందరూ దూరంగా పోతారు. దేవతలుగాని, నరకాధిపతిగాని వారిని చూసి భయపడతారు. వారిని అవమానపరిస్తే లోకమంతా నశిస్తుంది. శ్రీ మహావిష్ణువు ప్రభావంచేత ఇంతవరకు విష్ణుభక్తులెవ్వరూ నరకంలో పడలేదు.

**నరకేపచ్యమానస్తు యమేన పరిభాషితః**
**కింత్వయా నార్చితః దేవః కేశవః క్లేశనాశయః**

నరకంలో బాధపడుతున్న వారిని చూసి యమధర్మరాజు 'నువ్వు ఇంతవరకు కేశవుని ఎందుకు పూజించలేదు' అని అడుగుతాడని **విష్ణుధర్మం**లో చెప్పబడింది.

సింహములాగా పరాక్రమశాలి. నృసింహావతారమెత్తాడు కాబట్టి సింహ అనబడుతున్నాడు. సింహాన్ని చూసిన లేడి పిల్లపారిపోయినట్లుగా శ్రీహరి నామము వింటేనే పాపాలు పటాపంచలైపోతాయి. అంటూ 'ధర్మస్వరూపి' వృత్తాంతాన్ని పూర్తిచేశాడు రత్నాకరుడు.

## 489. భూతమహేశ్వరః

భూతములకు అధిపతి.

**భూతేశ్వరాణాం స బ్రహ్మ యమాదీనాం నియన్త్రణాత్ ।**

**కారణం జగతాం యశ్చ పస్యాద్భూత మహేశ్వరః ॥**

దిక్పాలకులైన యమాదులను నియమించటంవలన సమస్త జగత్తుకు కారణం అవటంచేత పరమేశ్వరుడు 'భూతమహేశ్వరుడు' అనబడుతున్నాడు.

**భూతానాం మహేశ్వరః భూతమహేశ్వరః** సర్వభూతములకు అధిపతి. ఇక్కడ భూతములు అంటే ప్రాణులు అని అర్థం. లోకంలోని సమస్త జీవజాలానికి అధిపతి పరమేశ్వరుడు అంతేకాదు. దేవతలకు కూడా అధిపతి ఆయనే **నారాయణోపనిషత్తు**లో చెప్పినట్లుగా

"సృష్టి ప్రారంభంలో పరమపురుషుడైన నారాయణుడు ప్రాణులను సృష్టించాలి అనుకున్నాడు. అప్పుడు సూక్ష్మరూపి అయిన హిరణ్యగర్భుడు పుట్టాడు. ఆ తరువాత పంచభూతాలు ఉద్భవించినాయి. ఆ నారాయణుని నుండే మొదటగా బ్రహ్మ, తరువాత రుద్రుడు, ఇంద్రుడు, మరీచి, కశ్యపుడు మొదలైన ప్రజాపతులు, అష్టవసువులు, ఏకాదశ రుద్రులు, ద్వాదశాదిత్యులు, సకలవేదాలు పుట్టినాయి. సకలచరాచరములు ఆ నారాయణుని నుంచే ఉద్భవించినాయి."

కాబట్టి చరాచర జగత్తంతా నారాయణునినుంచే ఉద్భవించింది. అందుచేతనే అతడు సర్వానికీ అధిపతి. సర్వభూతాలకు ఈశ్వరుడు. భూతమహేశ్వరుడు అనబడుతున్నాడు. సకల భూతములకు అతడే ఈశ్వరుడు.

నిజముగా అతడే గొప్ప ఈశ్వరుడు.

నారాయణుడే సత్యము, నిత్యమైనవాడు. బ్రహ్మనారాయణుడే. శివుడు నారాయణుడే. ఇంద్రుడు, భూమి, ఆకాశము, కాలము, దశదిక్కులు, ఊర్ధ్వభాగము, అధోభాగము, మధ్యభాగము అంతా నారాయణుడే. బాహ్యాభ్యంతరములయందంతా నారాయణుడే. భూతభవిష్యద్వర్తమానాలు నారాయణుడే. సర్వమూ నారాయణుడే. అతడే నిష్కళంకుడు. నిరంజనుడు, నిర్వికల్పుడు, శుద్ధుడు, అద్వితీయుడు. ఈ జగత్తులో నారాయణుడు తప్ప ఇంకెవ్వరూలేరు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'భూతమహేశ్వరుడు' అనబడుతున్నాడు.

# 490. ఆదిదేవః

ఆదిదేవుడు. 334వ నామం కూడా ఇదే.

**ఆది దేవోహి భవతి బ్రహ్మాది భ్యో విశేషతః** బ్రహ్మాదిదేవతలకుకూడా కారణమైన వాడు.

**ఆదిశ్చా సౌ దేవశ్చ ఆదిదేవః** సృష్టికి ఆది, అనాది అయినవాడు.

**సర్వాని భూ తాని ఆదీయంతే అనేన** ప్రళయకాలమందు అన్ని జీవులు ఇతనిలోనే లీనమవుతున్నాయి. అందుకే ఇతడు 'ఆది' అనబడుతున్నాడు.

పరమేశ్వరుడు తనవల్లనే తాను మనుగడ సాగిస్తూ మరి ఒకరి అవసరంలేకుండా ఉన్నవాడు. జగత్తంతా అతనినుంచే ఆవిర్భవిస్తుంది. మళ్ళీ అతనియందే లయమవుతుంది. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'ఆదిదేవః' అనబడుతున్నాడు.

# 491. మహాదేవః

క్రీడించువాడు.

**బ్రహ్మాదిభిః క్రీడతి యో మహాదేవ స్స ఉచ్యతే ॥** బ్రహ్మాదులతో క్రీడించువాడు.

**మహాంశ్చా సౌ దేవశ్చ మహాదేవః** బ్రహ్మాదులతో ఆటలాడువాడు.

అన్నిభావాలను వదలి మహాగొప్పదైన ఆత్మజ్ఞానయోగానికి ఈశ్వరుడుగా ఉండేవాడు. ఆత్మానంద స్వరూపుడైనవాడు. సృష్టి కారణమునకు కారణమైనవాడు.

జగత్తును సృష్టించటానికి కారణము ఇతడే. మహాప్రళయం జరిగిన కొంతకాలానికి కర్మక్షయం కాని జీవులకు కర్మక్షయం చేసి వాటికి మోక్షాన్ని ఇవ్వాలనే కోరికతో సృష్టి చెయ్యాలని సంకల్పించాడు. అప్పుడు ముందుగా పంచభూతాలను, తన్మాత్రలను సృష్టించాడు. ఆ తరువాత సృష్టికర్త బ్రహ్మను సృష్టించాడు. తరువాత స్థితికారకుడైన విష్ణువు, సంహారకారుడైన రుద్రులను సృష్టించాడు. వీరికి సృష్టి కార్యము వప్పచెప్పాడు. ఈ రకంగా బ్రహ్మాది దేవతలను సృష్టించి, వారి అర్హతలను బట్టి వారికి స్థితులు కల్పించాడు. మళ్ళీ జగత్తును లయంచేసినప్పుడు చరాచరములన్నింటినీ తనలోనే కలుపుకుంటాడు. అందుచేతనే బ్రహ్మాదిదేవతలతో ఆటలాడేవాడు అని చెప్పబడతాడు.

ఇతడికి ఏ రకమైన కోరికలు ఉండవు. పూర్ణకాముడు. ఆప్తకాముడు. అన్ని కోరికలు అతనియందే ఉంటాయి. అతడు ఎప్పుడూ చిదానంద స్వరూపుడుగానే ఉంటాడు. ఏ రకమైన భావాలు అతనికి ఉండవు. కేవలము జ్ఞానసంపన్నుడు. బ్రహ్మానందస్థితిలోనే ఉంటాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'మహాదేవః' అనబడుతున్నాడు.

**లలితాసహస్రంలో 209 నామము 'మహాదేవీ'**

# 492. దేవేశః

దేవతలకు ఈశ్వరుడు.

**బ్రహ్మాదీనాం చ దేవేశో యథార్థ్వ వినియోజకః**

బ్రహ్మాది దేవతలను తనకు ఇష్టము వచ్చినట్లు ఉపయోగించుకునేవాడు.

**దేవానం ఈశః దేవేశః** బ్రహ్మాది దేవతలను తమతమ అధికారములందు నియమించువాడు.

ఎల్ల ప్రాణులకు ఈశ్వరుడు. అంతేకాక దేవతలకు కూడా అధిపతి.

ఒకసారి దేవదానవ సంగ్రామం మహాభీకరంగా జరిగింది. అందులో దేవతలు విజయం సాధించారు. ఆ విజయం తమవల్లనే సాధించబడిందని, దానికి కారణం తామేనని దేవతలలో ప్రతివారూ గర్వంతో విర్రవీగిపోయారు. దీనికంతటికీ కారణమైన పరబ్రహ్మను మరచిపోయారు. విజయోత్సాహంతో దేవతలంతా సభతీర్చారు. అందులో ఎవరి ప్రతాపాన్ని వారు చెప్పుకోవటం మొదలుపెట్టారు. ముందుగా అగ్ని దేవుడు తను అగ్ని జ్వాలలు ప్రజ్వలింప చేస్తే, ఆ అగ్ని శిఖలలో రాక్షసులు మాడిపోతూ దిక్కుతోచక పలాయనం చిత్తగించారు. అంటూ తన శక్తిసామర్థ్యాల గురించి గర్వంతో చెప్పాడు. తరువాత వాయువు లేచి తను చండప్రచండంగా గాలులు వీస్తుంటే వాటి తాకిడికి నిలవలేక రాక్షసులు పలాయనం చిత్తగించారు అన్నాడు. ఈ రకంగా దేవతలంతా తమ పరాక్రమాన్ని గొప్పగా చెప్పుకుంటున్నారు.

బ్రహ్మతత్త్వం ఇదంతా గమనిస్తోంది. దేవతల అహంకారం పోగొట్టాలని నిర్ణయించుకుంది. అనుకున్నదే తడవుగా వారి ఎదుట భయంకరమైన యక్షరూపంలో ప్రత్యక్షమైంది. చూశారు దేవతలు. అదేమిటో వారికి అర్థం కాలేదు. ఆ రూపాన్ని చూసి భయపడ్డారు. ఏంచెయ్యాలో పాలుపోలేదు.

దేవాసుర సంగ్రామంలో రాక్షసులను భయంకరమైన అగ్ని కీలలతో కాల్చివేశానని చెప్పినవారు అగ్నిదేవుడు. అందుకని దేవతలందరూ అగ్నిదేవుని సమీపించి "ఓ అగ్నిదేవా! ఏదో భయంకరమైన తత్త్వం ఇక్కడ ప్రత్యక్షమైంది. అదేమిటో మా బుద్ధికి అర్థం కావటం లేదు. కాబట్టి నీవు వెళ్ళి దాన్నిగురించి తెలుసుకుని రావలసినది" అన్నారు.

'సరే' అని బయలుదేరాడు అగ్నిదేవుడు. ఆ తత్త్వాన్ని సమీపించాడు. భూతంలాంటి ఆ తత్త్వం అగ్నిదేవుని చూసి అడిగింది "ఎవరు నువ్వు" ?

"నేను అగ్ని దేవుడను. లోకంలో అందరూ నన్ను 'జాతవేదుడు' అంటారు.

“అయితే నీ శక్తి సామర్థ్యాలేమిటి ?

“లోకంలోని ఏ వస్తువునైనా సరే క్షణంలో కాల్చి బూడిద చేస్తాను”.

‘అంత గొప్పవాడివా’? అయితే ఈ గడ్డిపోచను దగ్ధంచెయ్యి’ అంటూ ఒక గడ్డి పరకను అక్కడ ఉంచింది ఆ తత్త్వం.

ఆ గడ్డిపరకను చూచి చాలా తేలికభావంతో మంటలు సృష్టించాడు అగ్నిదేవుడు. గడ్డిపరక కాలలేదు. భయంకరమైన అగ్ని శిఖలు సృష్టించాడు. లాభం లేకపోయింది. గడ్డిపోచ అలానే ఉంది. అగ్నిదేవుడు వెనుక్కు తిరిగి దేవతల వద్దకు వెళ్ళి “ఆ తత్త్వం ఏమిటో నాకూ పాలుపోలేదు. దాన్ని అర్థం చేసుకోవటానికి నా శక్తి చాలలేదు” అన్నాడు.

అప్పుడు దేవతలంతా వాయుదేవుని సమీపించి “దేవా ! నీవు చాలా గొప్పవాడివి కదా ! ఆ తత్త్వం ఏమిటో నువ్వైనా కనుక్కో” అన్నారు.

‘సరే’ అని బయలుదేరాడు వాయువు, ఆ తత్త్వాన్ని సమీపించాడు. పూర్వంలో లాగానే ఆ తత్త్వం ప్రశ్నించింది.

“ఎవరు నువ్వు ?”

‘నేను వాయుదేవుడను. ఆకాశంలో సంచరిస్తుంటాను. కాబట్టి నన్ను ‘మాతరిశ్వుడు’ అని కూడా అంటారు’

“నీ శక్తి ఏమిటి ?

లోకంలో ఏ వస్తువునైనా సరే నాగాలులతో ఎగురగొట్టగలను”.

“అయితే దీన్ని ఎగరగొట్టు” అంటూ ఇది వరకటి లాగానే గడ్డిపోచను అక్కడ ఉంచింది ఆ తత్త్వం. వాయుదేవుడు తన బలాన్ని కూడగట్టుకుని ముందుకు వెళ్ళాడు, భయంకరమైన గాలులు వీచాడు. గడ్డిపోచ కదలలేదు. వచ్చిన దారినే వెనక్కు వెళ్ళి దేవతలతో “ఆ తత్త్వం ఏమిటో నాకు అర్థం కాలేదు” అన్నాడు.

అప్పుడు దేవతలందరూ తమ ప్రభువైన ఇంద్రుని దగ్గరకు వెళ్ళి అతనికి జరిగిన సంగతంతా వివరించి “దేవేంద్రా ! ఆ విచిత్రమైన తత్త్వం ఏమిటో నువ్వైనా కనుక్కోవలసినది” అన్నారు.

‘సరే’ అంటూ తన వజ్రాయుధం తీసుకుని ఆ తత్త్వం దగ్గరకు వెళ్ళాడు దేవేంద్రుడు. వెంటనే ఆ శక్తి మాయమై పోయింది. దాని స్థానంలో మహా సౌందర్యరాశియైన ఒక స్త్రీమూర్తి కనిపించింది. ఆమె హిమవంతుని కుమార్తె హైమవతి. ఆమెను ఉమాదేవి అని కూడా అంటారు.

ఆశ్చర్యంగా చూసిన ఇంద్రుడు ఉమాదేవిని ప్రశ్నించాడు "అమ్మా ! దేవతలనందరినీ భయభ్రాంతులతో ముంచివేసిన ఆ యక్షుడెవడు ? ఆ తత్త్వము ఏమిటి" ?

"ఆ శక్తియే బ్రహ్మము" అని ఉమాదేవి సమాధాన మిచ్చింది. ఆ తరువాత ఇంద్రునితో "ఓ దేవేంద్రా ! బ్రహ్మము వల్లనే కదా మీరు విజయం పొందింది. మీ గొప్పదనానికి కారణము బ్రహ్మము. మీ అల్పబుద్ధివల్ల ఇప్పటివరకు కనుపించిన తత్త్వమే బ్రహ్మమని గుర్తించలేకపోయారు. ఆ బ్రహ్మత్త్వమే మీ శరీరంలో శక్తిని వ్యాపింపచేస్తోంది. దానివల్లనే మీరంతా అసురులను సంహరించగలిగారు. దానివల్లనే ఈ మహాత్మ్యము మీరు పొందగలిగారు. అంతేగాని అదంతా మీ గొప్పదనం అని అహంకరించకండి" అని చెప్పి అదృశ్యమైపోయింది.

పరబ్రహ్మతత్త్వాన్ని చూసినందువల్లనే అగ్ని, వాయువు, ఇంద్రుడు మిగిలిన దేవతల కన్న గొప్పవారైనారు. బ్రహ్మాన్ని ముందుగా తెలుసుకున్నవారు వారే. ఆ శక్తియే బ్రహ్మమని ముందుగా తెలుసుకున్నవాడు ఇంద్రుడు. అందుకనే అతడు దేవతలలో శ్రేష్టుడైనాడు. దేవతలగొప్పదనానికి, వారి శక్తికి కారణము బ్రహ్మము. వారి ప్రాణమే బ్రహ్మము.

ఈ జగత్తులోని మెరుపుతీగ బ్రహ్మము. మానవుని రెప్పపాటు కూడా బ్రహ్మమే. దానివల్లనే మనస్సు బాహ్య ప్రపంచాన్ని గురించి తెలుసుకుంటుంది. తెలుసుకున్న దాన్ని జ్ఞాపకం ఉంచుకుంటుంది. దానివల్ల ఇతరమైన వాటిని ఊహిస్తుంది.

మనస్సుకున్న శక్తులు మూడు.

1. విషయాన్ని గ్రహించటం 2. జ్ఞాపకముంచుకోవటం. 3. ఊహించటం. వీటన్నింటికీ కారణము బ్రహ్మమే.

అదే అన్నిజీవులకు ఆత్మ. అందుచేత పూజనీయమైనది. ఈ విషయం తెలిసినవాడిని అన్ని జీవులూ ప్రేమిస్తాయి. అన్ని జీవులూ తమ ఆత్మగా భావిస్తాయి. అతడే పరమాత్మ స్వరూపుడు.

"తపస్సు, ఇంద్రియనిగ్రహము, యజ్ఞయాగాదులు బ్రహ్మజ్ఞానానికి ముఖ్యమైనవి. వేదాలు చదవటంవల్ల బ్రహ్మజ్ఞానం పొందటానికి అవసరమైన శక్తి వస్తుంది. శమ దమాదులు, కర్మలు దీనికి గోడలవంటివి. బ్రహ్మజ్ఞానాన్ని పొందినవాడు సాక్షాత్తు బ్రహ్మస్వరూపుడు. అంటూ **కేనోపనిషత్తు**లో చెప్పబడింది.

అందుచేతనే పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు 'దేవేశః' అనబడుతున్నాడు.

## 493. దేవభృద్గురుః

దేవతలకు గురువు.

దేవతలను భరించువాడు. పోషించువాడు. ఇతడే ఇంద్రుడు. గురుః అనగా – పూజ్యుడు. దేవతలచేత పూజింపబడువాడు. దేవరాజైన ఇంద్రునికి జ్ఞానోపదేశం చేసినవాడు. సకలవిద్యలకు నిలయమైనవాడు.

ఈ నామాన్ని శంకర భగవత్పాదులవారు ఒకటిగా చెప్పారు. కాని పరాశరభట్టరు వారు మాత్రం దీన్ని రెండు నామాలుగా చెప్పారు. అవి.

దేవభృత్ – దేవతలను భరించువాడు.

**బ్రహ్మశక్రమయాదీనాం భరణాత్ దేవభృత్ స్మృతః**

బ్రహ్మ, ఇంద్రుడు, యముడు మొదలైన దేవతలను భరించువాడు.

**దేవాన్ బిభర్తీతి దేవభృత్**

బ్రహ్మాది దేవతలను ఇష్టానుసారము వినియోగిస్తూ వారిని భరించేవాడు.

గురుః – గురువు.

**బ్రహ్మేంద్ర వరుణాదిభ్యో గురుర్వేదోపదేశనాత్**

బ్రహ్మ, ఇంద్ర, వరుణాది దేవతలకు వేదోపదేశము గావించి వారికి గురువైనాడు.

వేదములచేత దేవతలకు వారివారి అధికారాలను తెల్పినవాడు.

సృష్టి ప్రారంభంలో బ్రహ్మను సృష్టించి అతనికి వేదాలను సమర్పించినవాడు. కాబట్టి బ్రహ్మాది దేవతలకు గురువు అయినాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'గురుః' అని చెప్పబడుతున్నాడు.

## 494. ఉత్తరః

తప్పింపచేసేవాడు, లేచువాడు.

**అపదుత్తరణాద్యోఽసౌ బ్రహ్మాదేరుత్తరస్స్మృతః** బ్రహ్మాదులను ఆపదలనుంచి రక్షించువాడు

**ఉత్తరంతి అస్మాదితి ఉత్తరః** దేవతలకు రాక్షసులచే కలిగే ఆపదలను తప్పింపచేయువాడు.

దేవతలచే స్తుతించబడిన తరువాత, వారి కార్యసిద్ధ్యర్థము లేస్తాడు.

రాక్షసుల బాధలు భరించలేని దేవతలు శ్రీ మహావిష్ణువు వద్దకువెళ్ళి ఆయనను పరిపరివిధాల స్తుతిస్తారు. అప్పుడు శ్రీహరి వారి కష్టాలను తీర్చటానికి ఉద్యుక్తుడవుతాడు.

అందరికన్న అధికుడు. జీవులను సంసారసాగరము నుండి దాటించువాడు. రాక్షసులవల్ల ఏర్పడే ప్రమాదాల నుండి రక్షించువాడు.

## 495. గోపతిః

గోవులకు అధిపతి, వాక్కుకు అధిపతి. 592వ నామంకూడా ఇదే.

**ఛందో భాషా వేషవాచాం నిర్వాహాత్ గోపతిస్స్మృతః**

ఛందోరూపంగాను, భాషారూపంగాను ఉండి వాక్కులను నిర్వహించేవాడు.

**గవాం పతిః గోపతిః** ఛందస్సు, భాష అని పిలువబడే సకల వాక్కులకు అధిపతి.

ఛందస్సు అంటే – పద్యము యొక్క లక్షణాన్ని తెలిపే శాస్త్రము. ఛందస్సులు మొత్తం 26.

1. ఉక్త
2. అత్యుక్త
3. మధ్య
4. ప్రతిష్ఠ
5. సుప్రతిష్ఠ
6. గాయత్రి
7. ఉష్ణిక్కు
8. అనుష్టుప్పు
9. బృహతి
10. పంక్తి
11. త్రిష్టుప్పు
12. జగతి
13. అతిజగతి
14. శక్వరి
15. అతిశక్వరి
16. అష్టి
17. అత్యష్టి
18. ధృతి
19. అతిధృతి
20. కృతి
21. ప్రకృతి
22. ఆకృతి
23. వికృతి
24. సంకృతి
25. అతికృతి
26. ఉత్కృతి

ఈ ఛందస్సులరూపంలో వాక్కును నిర్వహించేవాడు. వాక్కు నాలుగురకాలు.

1. పర 2. పశ్యంతి 3. మధ్యమ 4. వైఖరి ఛందస్సు అంటే – వేదము.

పరమేశ్వరుడు నాదబ్రహ్మ. నాదమే వర్ణమయింది. వర్ణమే వాక్కయింది. అదే వేద మయింది. ఈరకంగా వాక్కుకు అధిపతి కాబట్టి పరమేశ్వరుడు 'గోపతి' అనబడుతున్నాడు.

వేదములను సృష్టించినవాడు. వేదములచేతనే తెలుసుకొనదగినవాడు. వేదసారమే తానైనవాడు. గోవులకు రక్షకుడు.

గౌః అనగా భూమి. కాబట్టి భూ భర్త.

గో శబ్దానికి – ఇంద్రియము అనే అర్థం కూడా ఉన్నది.

కాబట్టి ఇంద్రియాలకు అధిపతి, ఇంద్రియాలకు రక్షకుడు. కాబట్టి 'శ్రీమన్నారాయణుడు', 'గోపతిః' అనబడుతున్నాడు.

# 496. గోప్తా

రక్షకుడు 593వ నామము కూడా ఇదే.

**పాలనాత్ సర్వ విద్యానాం గోప్తేతి పరికీర్తితః** సకల విద్యలను పాలించువాడు.

**గోపాయతీతి గోప్తా** సకలవిద్యలకు రక్షకుడు.

**రక్షతిసమస్తభూతానాం** సమస్త భూతములను రక్షించువాడు.

పరమేశ్వరుడు జగద్రక్షణ కార్యము నెరవేరుస్తుంటాడు. బ్రహ్మదేవుని రూపంలో సృష్టి కార్యము కొనసాగిస్తున్నాడు. విష్ణువు రూపంలో సమస్త లోకాలకు రక్షణ కల్పిస్తున్నాడు. అందుచేత శ్రీమన్నారాయణుడు 'గోప్తా' అనబడుతున్నాడు.

**లలితాసహస్రంలో 266వ నామము 'గోప్త్రీ'**

# 497. జ్ఞానగమ్యః

జ్ఞానముచే మాత్రమే పరమేశ్వరుని తెలుసుకోవచ్చును.

**పరయా విద్యయా వేద్యో జ్ఞానగమ్య ఇతిస్మృతః** పరావిద్యచేత మాత్రమే ఎరుగదగినవాడు.

**జ్ఞానేనగమ్యః జ్ఞానగమ్యః** పరావిద్య అదే జ్ఞానవిద్యచేతమాత్రమే పొందదగినవాడు.

శ్రీ మహావిష్ణువు కర్మచేతగాని, యోగముచేతగాని పొందబడడు. కేవలము జ్ఞానము చేతనే అతనిని పొందాలి.

**ముండకోపనిషత్తు**లో శునకుని యొక్క కుమారుడు శౌనకుడు. విద్యాభ్యాసం పూర్తిచేశాడు. గృహస్థాశ్రమం స్వీకరించటం ఇష్టం లేదు. అప్పుడు గురువుగారి దగ్గరకు వెళ్ళి "గురువర్యా! ఓ అంగిరస మహర్షి! దేన్ని గురించి తెలుసుకుంటే సర్వమూ తెలుస్తాయో దాన్ని దయచేసి నాకు వివరించండి" అన్నాడు. దానికి అంగిరసుడు...

"లోకంలో మనం తెలుసుకోవలసిన విద్యలు రెండు ఉన్నాయి. 1. పరావిద్య 2. అపరావిద్య. పరమేశ్వరుడికి సంబంధించిన విద్య పరావిద్య. ధర్మములు, కర్మలు వాటి సాధన మొదలైన విషయాలకు సంబంధించినది అపరావిద్య.

చతుర్వేదాలు, శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిష్యము అనేవన్నీ అపరావిద్య. ఆత్మతత్త్వాన్ని బోధించేది పరావిద్య. ముందుగా పరావిద్యను గూర్చి వినవలసినది. జ్ఞానేంద్రియాలకు లొంగనిది, కర్మేంద్రియాల విషయం కానిది గోత్రము, వర్ణము, నేత్రములు, శ్రోత్రములు, కాళ్ళు చేతులులేనిది. నిత్యమై అన్నిటియందు ఉన్నది. సూక్ష్మాతి సూక్ష్మమైనది. అవ్యయమైనది, పంచభూతాలకు కారణమైనది పరబ్రహ్మతత్త్వము. అటువంటి తత్త్వాన్ని జ్ఞానియైనవాడు సర్వత్ర చూడగలడు.

సాలెపురుగు ఏ సహాయం లేకుండానే తన శరీరం నుంచి దారాలను తయారుచేసి, వాటిని మళ్ళీ తానే మ్రింగేస్తుంటుంది. భూమి నుండి ఓషధులు పుడుతున్నట్లుగా, మానవ దేహం మీద రోమములు పుడుతున్నట్లుగా అక్షర పరబ్రహ్మ నుండి ఈ జగత్తుపుడుతున్నది. కుమారుడు పుట్టాలని తండ్రి కోరుకున్నట్లుగానే ఆ పరబ్రహ్మ జ్ఞానరూపమైన తపస్సు ద్వారా స్థూలభావాన్ని పొందుతాడు. ఆ తరువాత పరబ్రహ్మ నుండి ప్రాణులకు అవసరమైన అన్నం పుడుతోంది. అన్నం నుంచి ప్రాణం, మనస్సు, మనస్సు నుంచి పంచభూతాలు, వాటి నుండి లోకాలు, వారికోసం కర్మలు, కర్మ నుండి ఫలము పుడుతున్నాయి. పరమేశ్వరుడు సర్వజ్ఞుడు, సర్వవేత్త జ్ఞాని, తపస్వి. ఆయన నుండి హిరణ్యగర్భరూపుడైన బ్రహ్మ, అతని నుండి నామరూపాత్మకమైన జగత్తు ఆవిర్భవించింది.

జ్ఞానరహితమైనవి యజ్ఞాలు. యజ్ఞసాధనాలు అస్థిరమైనవి. అశాశ్వతమైనవి. ఈ కర్మలే మోక్షసాధనాలనిభావించే అజ్ఞానులు మాటిమాటికీ మృత్యువును పొందుతూనే ఉంటారు. అంటే యజ్ఞం వలన స్వర్గం వస్తుంది. అక్కడ తన పుణ్యఫలము అనుభవించి, తరువాత మళ్ళీ భూలోకంలో పుడతాడు. అందుచేత ఈ కర్మలు శాశ్వత ఫలితాన్ని ఇవ్వవు. కర్మలవల్ల శాశ్వతమైన మోక్షంరాదు.

అజ్ఞానులు తమను తామే గౌరవనీయులుగా, పండితులుగా, ఊహించుకొని విర్రవీగు తుంటారు. కృతార్థులమైనామని గర్విస్తుంటారు. కర్మిష్ఠులు ఫలాపేక్షతోనే ఉంటారు. కాని తత్త్వాన్ని తెలుసుకోరు. కర్మఫలం పూర్తికాగానే వీరు మళ్ళీ జన్మిస్తారు.

ఇష్టాపూర్తి కర్మలే సర్వోత్తమసాధనాలని భావించేవారు మూఢులు. వారు ఇతరమైనవి శ్రేయోసాధనాలుగా భావించరు. అందుకనే వారు కర్మఫలాన్ని అనుభవించి, కర్మశేషాన్ని అనుభవించటానికి మళ్ళీ జన్మిస్తారు.

శాంత స్వభావులు, సన్యాసులు అడవులలో ఉంటూ భిక్షకులుగా జీవిస్తూ, తపస్సు చేస్తూ ఉంటారు. వీరు పుణ్య పాపాలనుండి విడివడి ఉత్తరాయణ మార్గం ద్వారా సత్యలోకం చేరతారు. ప్రజాపతి, హిరణ్యగర్భుడు అంతా సాకారులే, కాబట్టి వీరికి పరబ్రహ్మ ప్రాప్తిలేదు.

కాబట్టి మోక్షవాది వైరాగియై బ్రహ్మనిష్ఠుడైన గురువు వద్దకు వెళ్ళాలి. అప్పుడు బ్రహ్మవేత్త అయిన ఆ గురువు శిష్యునకు పరావిద్యనుపదేశిస్తాడు. దానివల్ల శిష్యునకు పరబ్రహ్మను గూర్చిన జ్ఞానం కలుగుతుంది. తానే పరబ్రహ్మ, జగత్తంతా తనలోనే ఉన్నదనే భావం కలుగుతుంది. అట్టివాడు మరణానంతరము బ్రహ్మలోకం చేరి, కల్పాంతమున పరబ్రహ్మలో లీనమవుతాడు" అని అంగీరసుడు శౌనకునకు ఉపదేశించాడు".

"నాయనలారా ! గుణాలున్నా ఎన్ని విషయాలు తెలిసినా, ఆత్మజ్ఞానం లేకపోతే, ఆత్మానుభూతి కలగకపోతే లక్ష్యాన్ని చేరలేడు. ఆత్మజ్ఞానం తప్ప మోక్షానికి వేరే సాధనం లేదు. నారదుడు గొప్ప మహర్షి. ధర్మాల నాచరించాడు. జ్ఞాన సముపార్జన చేశాడు. గాని ఆత్మానుభూతి కలుగలేదు. ఆత్మానుభూతికోసం సనత్కుమారునివద్ద శిష్యరికం చేశాడు. ఆ విషయాన్ని మీకు వివరిస్తాను వినండి" అంటూ భూమావిద్యను ఛాందోగ్యోపనిషత్తులో వివరించారు.

ఒకసారి నారదమహర్షి సనత్కుమారుని వద్దకువెళ్ళి తనకు ఆత్మానుభూతిని కలుగజేయమని కోరాడు. దానికి సనత్కుమారుడు. 'గతంలో ఏఏవిద్యలు అభ్యసించావు?" అన్నాడు.

"స్వామీ ! వేదవేదాంగాలు చదివాను. ఎన్నో కళలు నేర్చుకున్నాను. శాస్త్రాలు అభ్యసించాను. సంగీత సాధన చేశాను. కాని నాకు మనశ్శాంతి లభించలేదు. ఆత్మజ్ఞానం కలుగలేదు. ఆత్మజ్ఞానం వల్ల సర్వదుఃఖాలు నశిస్తాయని విన్నాను. కాబట్టి ఆత్మజ్ఞానాన్ని ఉపదేశించి నాకు దుఃఖవిమోచనం కలుగచేయండి" అన్నాడు నారదుడు.

అప్పుడు సనత్కుమారుడు "నారదా ! నువ్వు ఇంతవరకు అభ్యసించినది కష్టసాధ్యమైన 'పరావిద్య' కాదు. నీకు ఎన్నో సిద్ధాంతాలు తెలుసు. కాని వాటి ఆచరణలేదు. వాటి అంతర్యం నీకు తెలియదు. నీకు తెలిసినదంతా 'అపరావిద్య'. అదంతా పదాల గారడి. కాబట్టి వాటన్నింటినీ వదలిపెట్టి విశ్వమంతా వ్యాపించి ఉన్న ఆత్మతత్త్వాన్ని తెలుసుకో. అదే పరావిద్య. అది సాధించాలంటే మానసిక పవిత్రత కావాలి. మనస్సు మలిన రహితమైతేనే ఆత్మానుభవంకలుగుతుంది. అంతఃకరణ నిర్మలమవుతుంది. అప్పుడు సత్య దర్శనమవుతుంది. సత్యం అప్పుడు బాలభానునివలె పసిడికాంతులతో హృదయాంతరాళాల్లో ప్రకాశిస్తుంది. అదే పరావిద్య. దానివల్లనే శాశ్వతమైన ఆనందం లభిస్తుంది.

నారదా ! నువ్వు తెలుసుకున్నదంతా పదాలు మాత్రమే. అది పారిభాషిక పరిజ్ఞానము. ఆ పదజాలం ఏం సాధించగలదో అదే నీకు లభిస్తుంది. అంతకన్నా నీకేమీ దొరకదు.

ఇంతవరకు నీవు తెలుసుకున్నది నామమాత్రమైనది. నువ్వు చదివిన వేద శాస్త్రాలన్నిటికీ పేరు ఉన్నది. ఋగ్వేదము అనేది ఒక పేరు. అలాగే మిగిలిన వేదాలు, పురాణాలు అన్నీ పేర్లే. వ్యాకరణం, శ్రాద్ధకల్పం, తర్కం, జ్యోతిష్యం, నీతి శాస్త్రం, నిరుక్తం, ధనుర్వేదం, సర్పశాస్త్రం, సంగీతం. ఇవన్నీ పేర్లే కాబట్టి ఒక ప్రతిమలో విష్ణురూపాన్ని భావించి ఉపాసించినట్లు వీటి నామాలన్నీ పరబ్రహ్మ స్వరూపమనే బుద్ధితో ఉపాసించు. నామాన్ని పరమాత్మగా ఉపాసించేవాడు నామం వ్యాపించి ఉన్నంత మేర స్వేచ్ఛగా సంచరించగలుగుతాడు. అంటే ఆ ఉపాసకుడు విశ్వమంతా సంచరించగలుగుతాడు" అన్నాడు.

అది విన్న నారదుడు "నామం కన్నా గొప్పది ఏది?" అని ప్రశ్నించాడు. నామం కన్నా గొప్పది వాక్కు. వాక్శక్తి కనక లేకపోతే పదాలు లేవు. వేదాలు లేవు. వేదాలలో చెప్పబడిన సత్యాసత్యాలు లేవు. శుభాశుభములు లేవు. వాక్కే బ్రహ్మగా ఉపాసించేవాడు వాక్కు వ్యాపించి ఉన్నంత మేర అంటే శబ్దం, స్వరం వ్యాపించి ఉన్నంత మేర స్వేచ్ఛగా సంచరించగలుగుతాడు.

అది విన్ననారదుడు "దేవా ! వాక్కు కన్న శ్రేష్ఠమైనదేమైనా ఉన్నదా ?" అన్నాడు.

"ఉన్నది మహర్షీ ! వాక్ శక్తికన్నా గొప్పది మనస్సు. ఒక మనిషి వేదాలు నేర్చుకుంటాడు. మనస్సులోంచి వచ్చిన ఆలోచన మూలంగా వేదమంత్రాలను సొంతగా చెప్పుకుంటాడు. ఆలోచనే రాకపోతే ఆ పని చెయ్యడు. ఏ పని చెయ్యాలన్నా ఆలోచన రావాలి. అందుచేతనే ఆలోచన చేసే మనస్సు వాక్కు కన్న గొప్పది. మనస్సే బ్రహ్మ అని ఉపాసన చేసేవాడు. మనస్సు పొందగలిగినంత మేర స్వేచ్ఛగా విహరించగలుగుతాడు" అన్నాడు సనత్కుమారుడు.

అది విన్న నారదుడు "స్వామీ ! మనస్సుకన్న శ్రేష్ఠమైనది ఏది?" అన్నాడు.

"ఆలోచించే మనస్సుకన్న గొప్పది సంకల్పం. అసలు సంకల్పమనేది కలగకపోతే జరిగేది ఏమీలేదు. సంకల్పమంటూ చేస్తే, దాని క్రియ అనుసరిస్తుంది. ఈ సంకల్పమే సమస్త క్రియాకలాకల్పాన్ని కట్టిపెట్టి ఉంచుతుంది. మనస్సు, వాక్కు, నామం, మంత్రం, కర్మ మొదలైనవన్నీ సంకల్పంలోనే లయమవుతాయి. కాబట్టి సంకల్పమే బ్రహ్మ అని ఉపాసన చేసేవాడు భగవంతుడిచేత సంకల్పించబడిన లోకాలన్నీ పొందుతాడు. అన్నాడు సనత్కుమారుడు.

"అలాగయితే సంకల్పం కన్న గొప్పది ఏదైనా ఉన్నదా ?" అన్నాడు నారదుడు.

"సంకల్పం కన్న గొప్పది చిత్తం. చిత్తం వలన అన్ని పనులను గురించిన ఆలోచన ప్రవర్తిల్లుతుంది. చిత్తంవల్లనే సంకల్పం కలుగుతుంది. ఇది ఆలోచనా ప్రేరకమైన

చిత్తప్రక్రియను అనుసరిస్తుంది. వాక్కు వస్తుంది. పదాలు ఆకారం దాలుస్తాయి. ఒక మనిషి యొక్క చిత్తం చిన్నాభిన్నమైపోతే, అతనికి స్పృహ తప్పుతుంది. అప్పుడు ఏ పనీ చెయ్యలేడు. ఈ చిత్తమే బ్రహ్మ అని ఉపాసన చేసేవాడు. శోకహీనుడై శోకరహితమైన లోకాలు పొందుతాడు" అన్నాడు సనత్కుమారుడు.

"స్వామీ ! చిత్తం కన్న శ్రేష్ఠమైనది ఏమైనా ఉన్నదా?" అన్నాడు నారదుడు.

"ధ్యానం అనేది చిత్తం కన్నా గొప్పది. ధ్యానంతో చిత్తానికి స్థాయి, స్థిరత్వము ఏర్పడతాయి. ఈ భూమి, ఆకాశం, పర్వతాలు అన్నీ ధ్యాన నిష్ఠలో ఉన్నట్లు, క్రమం తప్పకుండా, స్థిరత్వం కోల్పోకుండా నిలిచి ఉన్నాయి. ఆ ధ్యానస్థితే లేకపోతే ఏదీ స్థిరంగా నిలబడలేదు. ధ్యానమే బ్రహ్మ అనే భావనతో ఉపాసన చేసేవాడు ధ్యానానికి ఎంత వరకు వ్యాప్తి ఉంటుందో అంతవరకు స్వేచ్ఛగా సంచరిస్తాడు." అన్నాడు నారదుడు.

"దేవా ! ధ్యానాన్నిమించినది ఇంకా ఏదైనా ఉన్నదా ?" అన్నాడు నారదుడు.

"ధ్యానంకన్న గొప్పది విజ్ఞానం, శుభాశుభాలు, సత్యాసత్యాలు, పురాణాలు, ఇహపరాలు, అన్నీ విజ్ఞానం వల్లనే గ్రహింపుకు వస్తాయి. విజ్ఞానమే బ్రహ్మ అని ఉపాసించేవాడు జ్ఞానంతో కూడిన లోకాలు పొందుతాడు." అన్నాడు సనత్కుమారుడు.

నారదుడు "స్వామీ ! ఇంతకన్న శ్రేష్ఠమైనదేమయినా ఉందా ?" అన్నాడు.

"ఉన్నది విజ్ఞానం కన్న మించినది బలం. ఒక బలవంతుడు తన విజ్ఞాన విశేషాలతో వందమందిలోనైనా భయాన్ని రేకెత్తించగలడు. ఒక బలవంతుడు విద్యావంతుడైనప్పుడు, మేధావిగా, ఋషిగా, కర్మిష్ఠిగామారినప్పుడు అందరిలోకీ అతనిదే పై చేయి అవుతుంది. మర్త్యలోకంలోగాని, స్వర్గలోకంలోగాని వాటిని సాధించి పెట్టేది భౌతికబలం. భూమ్యాకాశాలను, పర్వతాలను పశుపక్ష్యాదులను, దేవసమూహాలనూ, అందరినీ నిలబెట్ట గలిగేది భౌతికశక్తే కాబట్టి బలమే బ్రహ్మ అని తెలుసుకుని ఉపాసన చేసేవాడు బలానికి వ్యాప్తి ఉన్నంతమేర స్వేచ్ఛగా విహరిస్తాడు" అన్నాడు సనత్కుమారుడు.

"దేవా ! ఇంత కంటె శ్రేష్ఠమైనదేదైనా ఉన్నాదా ?" అన్నాడు నారదుడు.

"శారీరకబలం కన్న మించినది అన్నం. మనిషి కొన్ని రోజులపాటు అన్నం తినకుండా మాడితే చచ్చిపోతాడు. కొంతకాలం బ్రతికినా నీరసంతో మాట పడిపోతుంది. నడవలేడు. చూడలేడు. ఏ పనీచెయ్యలేడు. వినే శక్తి కూడా పోతుంది. ఆలోచనా శక్తి హరించుకుపోతుంది. ఆహారం తీసుకోవటం ప్రారంభిస్తే తిరిగి అన్ని శక్తులూ పొందుతాడు. మునుపటిలాగా పనిచేయగలుగుతాడు." అన్నమే బ్రహ్మ అని ఉపాసన చేసినవాడు అన్నం ఉన్నంతమేర స్వేచ్ఛగా సంచరించగలుగుతాడు. అన్నాడు సనత్కుమారుడు.

"స్వామీ ! అన్నం కంటే శ్రేష్ఠమైనదేమైనా ఉన్నదా"? అన్నాడు నారదుడు.

"నారదా ! మేఘాలు వర్షించకపోతే పంటలు పండవు. ఆహారం దొరకదు. నీరు లేకపోతే అన్ని జీవరాశులు మొగంవాచి చావుకు సిద్ధమవుతాయి. తొలకరిలో వర్షాలు కురవటం ప్రారంభం కావటంతో జీవులన్నీ ఆనందంతో చిందులు వేస్తాయి. జలమే బ్రహ్మ అని ఉపాసన చేసేవాడు. తాను కోరిన వస్తువులన్నీ పొంది తృప్తి చెందుతాడు. జలం ఉన్నంతమేర స్వేచ్ఛగా తిరుగుతాడు" అన్నాడు సనత్కుమారుడు.

"స్వామీ ! జలంకన్న శ్రేష్ఠమైనదేది ?" అన్నాడు నారదుడు.

"జలం కన్న శ్రేష్ఠమైనది తేజస్సు. ఆ తేజస్సే లేకపోతే భూమిమీద నదులలోను, సముద్రాలలోను నీరు ఆవిరి అవదు. నీరు ఆవిరికాకపోతే మేఘాలు వర్షించవు. కాబట్టి తేజస్సే బ్రహ్మ అని ఉపాసించేవాడు తాను తేజస్వియై, తేజోసంపన్నమైన లోకాలు పొందుతాడు. అన్నాడు సనత్కుమారుడు.

"స్వామీ ! తేజస్సు కన్న గొప్పది ఏది ?" అని అడిగాడు నారదుడు.

"తేజస్సుకన్న గొప్పది ఆకాశం. ఆకాశం అంటూ ఉంది కాబట్టే అన్ని వస్తువులూ అందులో ఇముడుతున్నాయి. సూర్యుడు, చంద్రుడు, భూమి, గ్రహగోళాలు, నక్షత్రాలు మొదలైన తేజోమండలమంతా ఆకాశంలోనే చోటు చేసుకుని ఉన్నాయి. ఆకాశం శబ్ద తరంగాలకాధారం. శబ్దాన్ని మన చెవులు గ్రహించటానికి కారణం ఆకాశం. కాబట్టి ఆకాశమే బ్రహ్మగా ఉపాసించేవాడు విశాలమైన, దుఃఖము లేని, ప్రకాశవంతమైన లోకాలు పొందుతాడు. ఆకాశం వ్యాపించినంతమేర స్వేచ్ఛగా మనగలుగుతాడు." అన్నాడు సనత్కుమారుడు.

"ఇంతకన్న శ్రేష్ఠమైనది ఏమైనా ఉన్నదా?" అన్నాడు నారదుడు.

"అంతఃకరణ యొక్క ధర్మమైన స్మరణ ఇంతకన్న శ్రేష్ఠమైనది ఈ స్మరణయే జ్ఞాపకశక్తి. ఇది లేకపోతే మానవుడు వినవలసిన దానిని వినలేడు. మాట్లాడవలసిన దానిని మాట్లాడ లేడు. ఆలోచించనూలేడు. స్మరణయే బ్రహ్మ అని భావించి ఉపాసన చేసేవాడు స్మరణశక్తి వెళ్ళగలిగినంత మేర స్వేచ్ఛగా సంచరించగలుగుతాడు." అన్నాడు సనత్కుమారుడు.

"ఇంతకన్న గొప్పది ఏది?" అన్నాడు నారదుడు.

"ఆశ ! ఆశతో స్మరణ శక్తి ఎక్కువ అవుతుంది. మానవుడు ఆశతోనే వేదమంత్రాలు చదువుతాడు. ఫలితాన్ని పొందుతాడు. ఆ ఫలితమే పుత్రులు, పశువులు, ధనము మొదలైనవి. ఆశనే బ్రహ్మగా ఉపాసించేవారి కోరికలన్నీ నెరవెరతాయి. అతని ప్రార్థనలు వ్యర్థంకావు" అన్నాడు సనత్కుమారుడు.

"అంతకన్న శ్రేష్ఠమైనదేది?" అన్నాడు నారదుడు.

"ఆశకన్న శ్రేష్ఠమైనది ప్రాణం. బండి చక్రంలోని కుండలో ఆకులన్నీ ఉన్నట్లుగా, సమస్త ప్రపంచమూ శరీరంలోని ముఖ్యప్రాణంలో అమరి ఉన్నది. ఈ ముఖ్యప్రాణమే జీవాత్మ. ఈ ప్రాణమే తనశక్తి అయిన ప్రాణం ద్వారా నడుస్తోంది. అంటే ప్రాణమే ప్రాణానికి ప్రాణం ఇస్తోంది. ఇచ్చేది, ఇవ్వబడేది కూడా ప్రాణమే కాబట్టి ఈప్రాణమే తల్లి, తండ్రి, గురువు వీరందరిలో ఉన్నది ప్రాణమే. ప్రాణంపోయిన తరువాత వారిక ఆ పేర్లతో పిలువబడరు. చరాచర జగత్తు అంతా ప్రాణమయమే" అన్నాడు సనత్కుమారుడు.

"ప్రాణం కన్న శ్రేష్ఠమైనదేది?" అన్నాడు నారదుడు.

"ప్రాణంకన్న శ్రేష్ఠమైనది ఆత్మవిజ్ఞానం. ఆత్మయే సర్వానికి అధిష్ఠానమని గుర్తించు. మానవుడు అనేకమైన పనులు తలబెడతాడు. వాటివల్ల అతడికి ఆనందం లభిస్తుందనే భావిస్తాడు. ఆనందం దొరకదు అనుకుంటే మనిషి ఏ పనీ చెయ్యడు. ఈ ఆనందం అనేది కలిమిలో ఉంది కాని లేమిలో లేదు. ఉనికిలో ఉంది కాని శూన్యంలోలేదు. వాంఛలో ఆనందంలేదు. వాంఛాపూర్తిలో ఆనందం ఉంది. జగత్తులోని ఏ వస్తువూ అపరిమితానందం ఇవ్వలేదు. అపరిమిత ఆత్మానందమే పరిపూర్ణానందాన్ని ప్రసాదిస్తుంది. అపరిమితానందము ఒక్కతురీయావస్త ద్వారానే సాధ్యము. అది ఇంద్రియాల పరిధికి దాటినస్థితి. ఆత్మకు భిన్నంగా ఉన్న దాన్ని చూడటం, వినటం, తెలుసుకోవటం ప్రారంభించాలని ప్రయత్నించటమే దుఃఖానికి నాంది. ఆత్మ స్వతఃప్రజ్వల్లే నిలబడి ఉంటుంది. తత్త్వవేత్త అయినవాడు మృత్యువును చూడడు. రోగాన్ని కూడా చూడడు. అతడికి జరామృత్యువులులేవు. విద్వాంసుడు అంటే జ్ఞానియైనవాడు అన్నింటినీ ఆత్మభావంతో చూస్తాడు. అందుకనే అతడు అన్నింటినీ పొందుతాడు. ఆత్మజ్ఞానం పొందటంలో ఉన్న ఆనందం ఇల్లుకట్టినా, పాడిపంటలు సమృద్ధిగా ఉన్నా, ధనధాన్యాదులు సంపాదించినారాదు.

ఆత్మ సర్వవ్యాపకమైనది. ఊర్ధ్వలోకాలలో, అధోలోకాలలో కూడా అది వ్యాపించి ఉంది. ఆత్మానందం అనిర్వచనీయం. ఆత్మజ్ఞాని తనకు తానే ప్రభువు. తనను నియంత్రించే శక్తి తానే.

ఆత్మానుభూతి పొందాలంటే మనస్సు పరిశుభ్రం కావాలి. పవిత్రమూ, పరిశుభ్రమూ అయిన ఆహారం తీసుకున్నప్పుడే మనస్సు పరిశుభ్రమవుతుంది. పరిశుభ్రమైన వెన్నెలతో ప్రకాశించేవ్యక్తికే ఆత్మసాక్షాత్కారం కలుగుతుంది. అతడే జీవన్ముక్తుడు" అని సనత్కుమారుడు నారదునికి భూమావిద్యను ఉపదేశించాడు.

ఈ విధంగా జ్ఞానసంపన్నుడైనవాడే మోక్షం పొందుతాడు. జ్ఞానమనేది పరావిద్య వల్ల మాత్రమే వస్తుంది. కేవలము పరావిద్యవల్ల మాత్రమే తెలుసుకోగలిగినవాడు. ఆ పరమేశ్వరుడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'జ్ఞానగమ్యః' అనబడుతున్నాడు.

**లలితాసహస్రంలో 981వ నామము 'జ్ఞానగమ్యా'.**

## 498. పురాతనః

అనాదియైనవాడు.

**విద్యా ప్రద్యోతనాద్యో ఽసౌప్రతికల్పం పురాతనః**

ప్రతికల్పమందు విద్యను ప్రకాశింపచేయువాడు.

**పురాపూర్వం భవతీతి పురాతనః** ప్రతికల్పంలోనూ విద్యను ప్రవర్తింపచేస్తూ అనాదిగా ఉండేవాడు. ఇతడికి కాలముచే పరిమితి నిర్ణయించబడలేదు. ఇతడే కాలపురుషుడు.

**కఠరుద్రోపనిషత్తు**లో దేవతలంతా రుద్రుని దగ్గరకు పోయి "దేవదేవా ! ఎవరు నువ్వు ?" అని అడుగుతారు. దానికి పరమేశ్వరుడు "గతంలో ఉన్నాను. ఇప్పుడు ఉన్నాను. ఇకముందు కూడా ఉంటాను. భూతభవిష్యద్వర్తమానకాలాలలో ఉండేది నేనే. ఆది అనాది కూడా నేనే" అని చెబుతాడు. నారదుడు శ్రీమహావిష్ణువును కీర్తిస్తూ.

**ఆది అనాదియు నీవే దేవా । అంతట నీవే ఉండెదవూ** అంటాడు.

**బృహదారణ్యకోపనిషత్తు**లో "సృష్టికి పూర్వం మానవాకారంలో ఉన్న విరాడాత్మ ఒక్కటే ఉండేది. దానికన్న భిన్నమైనది ఏదీలేదు." అని చెప్పబడింది.

**ఐతరేయోపనిషత్తు**లో "సృష్టి జరగటానికి ముందు ఈ జగత్తంతా బ్రహ్మమయంగానే ఉండేది. దానికి భిన్నమైన పదార్థం ఏమీలేదు. అదే ఆత్మ" అని చెప్పబడింది.

ఈ విధంగా ఆత్మతత్త్వము ఆది అనాది అయినది. ప్రతికల్పములోనూ అదే జ్ఞాన వీచికలను ప్రసరింపచేస్తుంది. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'పురాతనః' అనబడతాడు.
**లలితాసహస్రంలో 802వ నామము 'పురాతనా'**

## 499. శరీరభూతభృత్

శరీరముగాఉండే తత్త్వాలను భరించేవాడు.

**దేహభూతం జగత్తత్త్వం ప్రకృత్యాది ధరాస్తకమ్ ।**
**శరీరభూత భృత్ప్రోక్తో బిభర్తీతి తతోఽక్షరః ॥**

ప్రకృతి మొదలు భూమిదాకా గల తత్త్వాలతో కూడిన జగత్తును శరీరముగా చేసికొని భరించువాడు.

**శరీరభూతం భిభర్తీతిశరీరభూతభృత్** తనకు శరీరముగా నుండు తత్త్వములను భరించువాడు.

శరీరాన్ని నిర్మించే భూతాలు శరీరభూతాలు. తను ప్రాణరూపుడై శరీరభూతాలను భరించేవాడు. ఆ భూతాలు చెదరిపోకుండా చూసేవాడు.

శరీరము నవధాతువులచే నిర్మించబడింది. **కామికాతంత్రంలో**

**త్వగసృగ్మాంసమేదోఽస్థిధాతవశ్శక్తి మూలకాః**
**మజ్జా శుక్ల ప్రాణ జీవధాతవశ్శివమూలకాః**
**నవధాతురయం దేహోనవయోని సముద్భవః ॥**

చర్మము, రక్తము, మాంసము, మెదడు, ఎముకలు అనే ఐదు ధాతువులు శక్తి మూలకాలు. ఈ దేహము నవయోనులందుపుట్టి, నవధాతుమయమైనది.

**ఏవం పిండాండముత్పన్నం తద్వద్బ్రహ్మాండముద్భవౌ ।**
**పంచభూతాని శాక్తాని మాయాదీనిశివస్యతు ॥**

**మయాచశుద్ధ విద్యాచ హహేశ్వర సదాశివౌ ।**
**పంచవింశతి తత్త్వాని తత్రైవాంతర్భవంతితే ॥**

ఈ రకంగానే అండపిండ బ్రహ్మాండాలన్నీ ఉద్భవిస్తున్నాయి. వీటిలో పంచభూతాలు శక్తి సంబంధాలు. మాయాదులు శివసంబంధాలు. ఇవన్నీ కలిసి 25 తత్త్వాలయి నవయోనులందు అంతర్భావం పొందుతున్నాయి.

శివాదిక్షితి పర్యంతము తత్త్వము 51 అని, 36 అని కాదు 98 అని రకరకాల వాదనలున్నాయి. అయితే ఇందులో కొన్ని తత్త్వాలు కొన్నింటిలో కలిసిపోతాయి.

ఈ తత్త్వాలను క్రింద వివరించటం జరిగింది. 51 తత్త్వాలు ఈ క్రింద ఇవ్వబడ్డాయి.

**పంచభూతాని తన్మాత్ర పంచకం చేంద్రియాణిచ ।**
**జ్ఞానేంద్రియాణి పంచైవ తథా కర్మేంద్రియాణిచ ॥**

**త్వగాది ధాతవ స్సప్త పంచ ప్రాణాది వాయవః ।**
**మనశ్చాహంకృతిః ఖ్యాతిర్గుణాః ప్రకృతి పూరుషా ॥**

**రాగో విద్యా కలాచైవ నియతిః కాల ఏవచ ।**

**మాయాచ శుద్ధవిద్యాచ మహేశ్వర సదాశివౌ ॥**

**శక్తిశ్చ శివతత్త్వంచ తత్త్వాని క్రమశో విదుః ।**

| | | |
|---|---|---|
| పంచభూతాలు | – | 5 |
| తన్మాత్రలు | – | 5 |
| జ్ఞానేంద్రియాలు | – | 5 |
| కర్మేంద్రియాలు | – | 5 |
| త్వగాది ధాతువులు | – | 7 |
| (చర్మము, రక్తము, మాంసము, మెదడు, ఎముకలు, మజ్జ, శుక్లము) | | |
| ప్రాణములు | – | 5 |
| మనస్సు | – | 1 |
| అహంకారము | – | 1 |
| ఖ్యాతి | – | 1 |
| గుణములు | – | 3 |
| ప్రకృతి (మూలప్రకృతి) | – | 1 |
| పురుషుడు (జీవుడు) | – | 1 |
| రాగము (ఇచ్ఛ) | – | 1 |
| విద్య | – | 1 |
| కళలు | – | 1 |
| నియతి (నియామకశక్తి) | – | 1 |
| కాలము (సంహరణ కాలము) | – | 1 |
| మాయ | – | 1 |
| శుద్ధవిద్య (మోక్షజ్ఞానము) | – | 1 |
| మహేశ్వరుడు | – | 1 |
| (రజోగుణుడైన సృష్టికర్త) | | |
| సదాశివుడు (సృష్టికర్త) | – | 1 |
| శక్తి (సృష్టి, స్థితి లయకారిణి) | – | 1 |
| శివతత్త్వము (శుద్ధ, బుద్ధ, ముక్తి స్వరూపము) | – | 1 |
| మొత్తం తత్త్వాలు | | 51 |

కాశ్మీర దేశ శాక్తేయుల ప్రకారం తత్త్వాలు 36. అవి

| | | |
|---|---|---|
| పంచభూతాలు | - | 5 |
| తన్మాత్రలు | - | 5 |
| జ్ఞానేంద్రియాలు | - | 5 |
| కర్మేంద్రియాలు | - | 5 |
| త్వగాది ధాతువులు | - | 7 |
| ప్రాక్ పశ్చిమ దక్షిణ ఉత్తర వాయువులు | - | 4 |
| మనస్సు | - | 1 |
| మాయ, శుద్ధవిద్య, మహేశ్వరుడు, సదాశివుడు | - | 4 |
| మొత్తం తత్త్వాలు | - | 36 |

కాని గౌడపాదులవారు వీటిని కాదన్నారు. ఒకవేళ తత్త్వాలు పైన చెప్పినట్లుగా ఉన్నప్పటికి కొన్ని తత్త్వాలు కొన్నిటియందు కలిసి ఉంటాయి.

అవి ముందుగా 51వ తత్త్వాలలో

| | | | |
|---|---|---|---|
| 1. | త్వగాది ధాతువులు | - | పంచభూతములందు |
| 2. | పంచప్రాణములు | - | వాయువునందు |
| 3. | అహంకారము | - | మనస్సునందు |
| 4. | ఖ్యాతి | - | విద్యయందు |
| 5. | గుణములు | - | ప్రకృతియందు |
| 6. | ప్రకృతి | - | శక్తి యందు |
| 7. | పురుషుడు | - | మహేశ్వరుని యందు |
| 8. | కళ | - | శుద్ధవిద్యయందు |
| 9. | కాలము | - | మహేశ్వరునియందు |
| 10. | నియతి | - | శక్తియందు |
| 11. | శక్తి | - | శుద్ధవిద్యయందు |
| 12. | శివతత్త్వము | - | సదాశివ తత్త్వమునందు |

ఈ విధంగా కాశ్మీర శాక్తేయులు చెప్పిన 36 తత్త్వాలలోని కొన్ని తత్త్వాల అంతర్భావం ఉంది.

1. త్వగాదిధాతువులు (7) - పంచభూతాలయందు

2. ప్రాక్ పశ్చిమ దక్షిణ ఉత్తర వాయువులు (4) - వాయువునందు

ఈ రకంగా తత్త్వాలు కలిసిపోగా మిగిలేవి 25 మాత్రమే అవి.

| | | | |
|---|---|---|---|
| 1. | పంచభూతాలు | - | 5 |
| 2. | తన్మాత్రలు | - | 5 |
| 3. | జ్ఞానేంద్రియాలు | - | 5 |
| 4. | కర్మేంద్రియాలు | - | 5 |
| 5. | మనస్సు | - | 1 |
| 6. | మాయ, శుద్ధవిద్య, మహేశ్వరుడు, సదాశివుడు | - | 4 |
| | మొత్తం తత్త్వాలు | - | 25 |

ఈ రకంగా శరీరములో ఉన్న భూతాలన్నింటినీ భరించేవాడు కాబట్టే శ్రీమన్నారాయణుడు 'శరీరభూతభృత్' అనబడుతున్నాడు.

## 500. భోక్తా

భుజించువాడు. 143, 888వ నామాలు కూడా ఇదే.

**హ్యవ్యం కవ్యం చ యోభుజ్తే స భోక్తా పరికీర్తితః**

హవ్యకవ్యములను భుజించువాడు.

హవ్యము - దేవతలకు సమర్పించేది.

కవ్యము - పితృదేవతలకు సమర్పించేది.

ఈ రకంగా దేవతలకు ఇచ్చే దానిని, పితృదేవతలకు ఇచ్చే దానిని కూడా తానే ఆరగిస్తాడు. కాబట్టి భోక్తా అనబడుతున్నాడు. అంతా పరమేశ్వరుడు. అంతటా అతని రూపమే గోచరిస్తుంది. సప్తశతిలో

విష్ణుమూర్తి యోగనిద్రలో ఉన్నాడు. అతని నాభి కమలంనుంచి బ్రహ్మ ఉద్భవించాడు. మధుకైటభులు అతన్ని సంహరింపజూశారు. అప్పుడు బ్రహ్మవచ్చి విష్ణువును నిద్రలేపుతాడు. అతడు లేవలేదు. అప్పుడు విష్ణువు ఆవరించిన యోగమాయను ప్రార్థిస్తాడు. ఆమె పరమేశ్వరి.

**త్వంస్వాహా త్వంస్వధా త్వంహి వ షట్కారః సర్వాత్మికా ।** అమ్మా ! నీవే 'స్వాహా' కారానివి. హోమం చేస్తూ దేవతలకు ఆహుతులు సమర్పించేటప్పుడు చెప్పే మంత్రం. నీవే 'స్వధా' కారానివి. పితృదేవతలకు తర్పణలు ఇచ్చే సమయంలో చెప్పే మంత్రము.

నీవే వషట్కారానివి. వేదయజ్ఞము అని చెబుతూ నీవే నాదము, నాదాంతము, ఓంకారము, కాళరాత్రి, మహారాత్రి, మోహరాత్రి, అంతా నువ్వే అంటాడు. అదే పరమేశ్వరతత్త్వము.

ఇక్కడ భోక్తా అంటే సర్వాన్నీ భుజించేవాడు. దేవతలకు ఇచ్చేదాన్ని, పితృదేవతలకు సమర్పించే దాన్నే కాదు మహాప్రళయం సంభవించినప్పుడు ఈ జగత్తు మొత్తాన్ని మ్రింగివేస్తాడు. చరాచరజగత్తంతా ఆ పరమేశ్వరుని యందు లీనమై పోతుంది. అందుచేతనే శ్రీమహావిష్ణువు 'భోక్తా' అనబడుతున్నాడు.

ఈ విధంగా శ్రీమన్నారాయణుడు ధర్మస్వరూపి అని వివరించాడు రత్నాకరుడు.



# 35. రామావతారము

"గురువుగారూ ! శ్రీమహావిష్ణువే శ్రీరామచంద్రుడుగా, కౌశల్యా గర్భాన దశరథ నందనుడుగా జన్మించాడు కదా. మరి రామావతార వృత్తాంతాన్ని వివరించండి" అన్నాడు కృష్ణశర్మ. వివరించటం ప్రారంభించాడు రత్నాకరుడు.

కృతయుగంలో రావణబ్రహ్మ జన్మించాడు. అతని తల్లి కైకసి అతన్ని పిలిచి 'కుబేరుని కన్న గొప్ప వాడివికావాలి' అన్నది. సరేనన్నాడు రావణుడు. బ్రహ్మను గురించి తపస్సుచేసి అనేక వరాలు పొందాడు. తిరిగివచ్చి లంకానగరాన్ని కైవశం చేసుకున్నాడు. రాక్షసవీరుల సమాయత్తం చేశాడు. యజ్ఞయాగాదులు ధ్వసంచేశాడు. ముల్లోకాలను జయించాడు. ధర్మాన్ని భ్రష్టు పట్టించాడు. ధర్మదేవత విలవిలలాడిపోయింది.

దేవతలు, మునులు, ఋషులు అంతా వైకుంఠవాసుని శరణువేడారు. రావణుడు నరునిచేతిలో తప్ప ఇతరులచేతిలో మరణం లేకుండా వరం పొందాడు. కాబట్టి శ్రీహరి నరుడిగా భూమిమీద అవతరించాలి అని అడిగారు.

అయోధ్యానగరాన్ని పాలిస్తున్నాడు అజమహారాజు కుమారుడు దశరథమహారాజు ధర్మపరుడు. సంతానంలేదు. పుత్రకామేష్టి యాగం చేస్తున్నాడు. ఇదే మంచి అదును శ్రీహరిని దశరథ తనయుడుగా జన్మించమని ప్రార్థించారు దేవతలు. శ్రీహరి–శ్రీరాముడిగా, ఆదిశేషుడు–లక్ష్మణుడిగా, శంఖుచక్రాలు, భరత, శతృఘ్నులుగా జన్మించారు. దేవతలంతా తమ అంశలతో కోతులు, కొండముచ్చులు, ఎలుగుబంట్లుగా జన్మించారు. వీరంతా వేదవేదాంగవిదులు, అన్ని విద్యలలోను ఆరితేరినవారు, యుద్ధవిద్యలో మహానిపుణులు, శస్త్రాస్త్రప్రయోగ ఉపసంహారాలలో దిట్టలు, మహాబలవంతులు. ఈరకంగా రావణ సంహారానికి రంగం సిద్ధమైంది.

విశ్వామిత్రుని యాగపరిరక్షణ పేరుతో తాటకను, సుబాహుని సంహరించి మారీచునితో రాక్షసరాజుకు హెచ్చరిక పంపాడు రాముడు. ఫలితం లేకపోయింది. చివరకు రామరావణ సంగ్రామం జరిగింది. రావణ సంహారంతో కథ పూర్తయింది.

శ్రీ మహావిష్ణువు రామావతారమెత్తి, వానరులుగా ఉద్భవించిన కపీశ్వరులకు అధిపతి అయినాడు. రామచంద్రుడు ధర్మసంస్థాపన కోసం అనేక క్రతువులు చేసి బ్రాహ్మణులకు భూరిదక్షిణలిచ్చాడు. యజ్ఞాలు చేసి సోమపానం చేశాడు. ఆయనే పరమేశ్వరుడు కాబట్టి అమృతపానం కూడా చేశాడు. అతడే అమృతమయుడు. ముక్తులైన వారికి అమృతము వంటివాడు. సత్యముతో – పుణ్యలోకాలను, దానంతో – దరిద్రులను, శుశ్రూషతో –

గురువులను, పరాక్రమంతో – శత్రువులను జయించినవాడు. ఉత్తములైన మహాపురుషుల యందుంటాడు. తన వీరత్వముచే మారీచ సుబాహుల క్రౌర్యాన్ని అణచివేసినవాడు. ఆశ్రితవత్సలుడు. సత్యసంధుడు, తన భక్తులకు తనను అర్పించుకున్నవాడు. సత్వగుణ ప్రధానులైన భాగవతులకు ప్రభువు. భక్తులకు ఆత్మనాశనము కాకుండా కాపాడి జీవింపచేయువాడు. శరీరములో ప్రాణాలను నిలుపువాడు. భక్తులయొక్క వినయానికి మెచ్చి, వారియందు ఆధ్యాత్మికతను పెంపొందింపచేయువాడు. వారికి ముక్తిని ప్రసాదించే వాడు. భక్తులు తనను ధ్యానించేటప్పుడు అనేక రకాలైన ప్రక్రియలు చేస్తుంటారు. వాటన్నింటినీ భరించగల బలవంతుడు. ఆధారశక్తితో తాబేలు రూపం ధరించి భూమిని మోసేవాడు. ఆ కూర్మముపైనున్న సమస్త జగత్తుకు ఆధారమైన అనంతుని రూపంలో ఉన్నవాడు. ప్రళయకాలంలో శేషపాన్పుపై సాగరమధ్యంలో పవళించి ఉంటాడు. నాశరహితుడు. ప్రళయకాలంలో తత్త్వాలన్నీ నశించిపోగా ఓంకారములోని 'అ'కార స్వరూపుడు. ప్రణవస్వరూపంగా పూజించబడేవాడు. ఆత్మజ్ఞానం పొందటానికి వీలుగా భక్తులకు అహంకారమమకారాలను పోగొట్టేవాడు. తనతో అనుసంధానము ఏర్పాటు చేసుకున్న వారికి మహదానందము కలిగించేవాడు.

ఈ విధంగా రామావతారాన్ని గురించి 501 నుంచి 525 వరకు నామాలలో వివరించబడింది. ఇక నామాలను చూద్దాం.

## 501. కపీంద్రః

వానరరూపమెత్తిన దేవతలకు ప్రభువు.

**కపిరూపం ప్రసన్నానాం దేవానా మీశ్వరత్వతః**
**కపీంద్ర ఇతివిఖ్యాతః సప్తార్ణోమనునాయకః**

రామావతారంలో వానరరూపమెత్తిన దేవతలకు ప్రభువై, వారిని యధేచ్ఛగా నియమించువాడు.

**కపీనాం ఇంద్రః కపీంద్రః** శ్రీమహావిష్ణువు రామావతారమెత్తి, వేదోక్తకర్మలు నిర్వహించి, వానరరూపమెత్తిన దేవతలకు ప్రభువుగా ఉన్నవాడు. **శ్రీమద్రామాయణంలో**

**సర్వలోకేశ్వరస్సాక్షాత్ లోకానాం హితకామ్యయా**
**సర్వైః పరివృతోదేవ్వైః వానరత్వ ముపాగతైః**

లోకేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు లోకహితమును గోరి వానరరూపమెత్తిన సకల దేవతలతోను పరివేష్టితుడై ఉన్నాడు.

దశరధ మహారాజు అశ్వమేధయాగం చేశాడు. పుత్రకామేష్టి కూడా చేశాడు. అప్పుడు యజ్ఞపురుషుడు వచ్చి పాయసమందించాడు. దశరధుడు ఆ పాయసాన్ని తన భార్యలకు ఇచ్చాడు. వారందరూ గర్భవతులైనారు.

శ్రీమహావిష్ణువు దశరథనందనుడిగా జన్మించబోతున్న తరుణంలో బ్రహ్మదేవుడు దేవతలందరినీ పిలిచి "శ్రీమహావిష్ణువు భూలోకంలో జన్మించబోతున్నాడు. అతనికి సేనగా బలిష్ఠులు, కామరూపులు, మాయలు తెలిసినవారు, పరాక్రమవంతులు, వాయువేగ మనోవేగాలతో చరించగలవారు. యుక్తిపరులు, బుద్ధిమంతులు, విష్ణువుతో సమానమైన బలపరాక్రమాలు గలవారు.

అసహాయసూరులు, సామదాన భేద దండోపాయములు తెలిసినవారు, దివ్యదేహము గలవారు, శస్త్రాస్త్రప్రయోగ ఉపసంహారములందు దిట్టలు, చావులేనివారు, అయిన వానరులను ఉత్తమ అప్సరసలయందు, గంధర్వకాంతలయందు జన్మింపచేయండి. యెలుగు బంట్లలో శ్రేష్ఠుడైన జాంబవంతుడు పూర్వమే నాచే సృజించబడినాడు" అని చెప్పాడు.

అప్పుడు దేవతలంతా తమ అంశలతో వానరులను సృష్టించారు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఇంద్రుడు | - | వాలిని | అగ్ని | - | నీలుని |
| సూర్యుడు | - | సుగ్రీవుని | అశ్వనీదేవతలు | - | మైందుడు, ద్వివిదులను |
| బృహస్పతి | - | తారుని | వరుణుడు | - | సుషేణుని |
| కుబేరుడు | - | గంధమాధనుని | పర్జన్యుడు | - | శరభుని |
| విశ్వకర్మ | - | నలుడు అనే వానిని | వాయుదేవుడు | - | హనుమంతుని |

సృష్టించారు. ఈ రకంగా అనేకవేలమంది రావణ వధయందు ఆసక్తులైనవారు. బలపరాక్రమసంపన్నులు, కామరూపులు, మహోన్నతమైనవారు, ధృడమైనవారు, మహాబలాఢ్యులు అయిన కోతులు, కొండముచ్చులు, ఎలుగుబంట్లుగా రావణ సంహారం కోసం ఈ భూమిమీద జన్మించారు. అటువంటి వానరరూపులతో శ్రీరామచంద్రుడు పరివేష్ఠితుడై ఉన్నాడు. అందుకే శ్రీమన్నారాయణుడు 'కపీంద్రః' అనబడుతున్నాడు.

## 502. భూరిదక్షిణః

అధికమైన దక్షిణలిచ్చువాడు.

**హయమేదాది భిర్యజ్ఞైః జగదాచార్య కాయవై ।**

**యజమానస్సువిజ్ఞేయ సర్వదా భూరి దక్షిణః ॥**

లోకంలోని ప్రజలతో కర్మలు చేయించతలచినవాడై, తానే స్వయంగా అశ్వమేధాది యజ్ఞాలు అనేకంచేసి బ్రాహ్మణులకు అధికమైన దక్షిణలిచ్చినవాడు.

**భూరయః దక్షిణాః యస్యసః భూరిదక్షిణః** అనేక క్రతువులనుచేసి భూరిదక్షిణ లిచ్చినవాడు.

**అశ్వమేధశతైరిష్ట్వాతథా బహుసువర్ణకైః**
**గవాం కోట్యయుతం దత్వా బ్రహ్మలోకం గమిష్యతి**

శ్రీరామచంద్రుడు వంద అశ్వమేధయాగాలు చేసి కోట్లకొలది ఆవులను, బంగారాన్ని దానంగా ఇచ్చి పరమపదం చేరాడు. అని శ్రీమద్రామాయణంలో చెప్పబడింది.

మానవులు కర్మలు చెయ్యాలి. అలా చెయ్యాలని చెబితే ఎవరూ చెయ్యరు. రాజు ముందుగా ఆ కర్మలు చేసి చూపాలి. అప్పుడు రాజును అనుసరించే ప్రజలు కూడా కర్మలు చేస్తారు. ఇది ధర్మస్థాపన చేసే పద్ధతి. అంటే ముందుగా రాజు ధర్మాన్ని ఆచరించి, అదే ధర్మం ఆచరించమని ప్రజలకు కూడా చెప్పాలి. ఆ రకంగానే ధర్మసంస్థాపనలో భాగంగా శ్రీరామచంద్రుడు అనేక కర్మలు శతాధికంచేసి ఉత్తములైన బ్రాహ్మణులకు గోదానము, సువర్ణదానము మొదలైన దానాలు ఇచ్చాడు.

యజ్ఞము విష్ణుస్వరూపము. యజ్ఞము చేసే కర్త కూడా విష్ణుస్వరూపమే. అందుచేతనే శ్రీమన్నారాయణుడు అవతారమైన శ్రీరామచంద్రుడు 'భూరిదక్షిణః' అని చెప్పబడుతున్నాడు.

# 503. సోమపః

సోమపానము చేసినవాడు.

**హయమేధే సోమపో యః సోమపః పరికీర్తితః**

అశ్వమేధమునందు సోమపానము చేసినవాడు.

**సోమంపి బతీతి సోమపః** సోమపానం చేసినవాడు.

యజ్ఞము విష్ణుస్వరూపము అని గతంలో వివరించాం. యజ్ఞపురుషుడు సాక్షాత్తూ శ్రీమహావిష్ణువే. అందుచేత అతడు అన్ని యజ్ఞములందు పూజింపబడతాడు. సోమపానం చేస్తాడు. అందుకే శ్రీమన్నారాయణుడు 'సోమపః' అనబడుతున్నాడు.

లోకంలో ధర్మాన్ని స్థాపించటం కోసం శ్రీరామచంద్రుడు అనేక యజ్ఞాలు చేసి, యజమానిగా తాను సోమపానము చేశాడు. అందుచేత 'సోమపః' అనబడుతున్నాడు.

# 504. అమృతపః

అమృతపానము చేసినవాడు.

**పరిణామోఽస్య హవిషాం పీయూషమితి చోద్యతే**
**తత్పానాత్స్యాదమృతపః పరమేవ్యోమ్ని వాస్థితః**
**ముక్తేభ్యో యః స్వానుభవం పాతీత్యమృతపః స్మృతః ॥**

అగ్నిలో హోమంచేసిన ద్రవ్యాలన్నీ అమృతంగా మారతాయి. అటువంటి అమృతాన్ని పానం చేసినవాడు. పరమపదమునందు ఉండేవాడు.

పరమపదములో ఉండి ముక్తులకు తన అనుభవాన్ని అందించేవాడు.

**అమృతం పిబతీతి అమృతపః** అమృతమును త్రాగినవాడు.

**యత్కించి ద్ధూయతేవహ్నౌ హవిర్మంత్రైర్విధానతః ।**
**తత్సర్వమమృతంకృత్వా విష్ణవే సంప్రయచ్ఛతి ॥**

అగ్నిలో హోమం చేసిన ద్రవ్యాలను అమృతముగా చేసి విష్ణువుకు అందిస్తాడు.

**భగవద్గీత**లోని 9వ అధ్యాయం **'రాజవిద్యారాజ గుహ్యాయోగం'**లోని 24వ శ్లోకము.

**అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభు రేవ చ ।**
**న తు మామభిజానంతి తత్త్వేనాఽతశ్చ్యవంతి తే ॥**

సకల యజ్ఞములకు భోక్తను, స్వామిని కూడా నేనే. వారు నా పరమేశ్వర తత్త్వమును ఎరుగరు. అందుచేతనే పతనమవుతున్నారు. అంటే పునర్జన్మ పొందుతున్నారు.

విశ్వమంతా భగవంతుని విరాడ్రూపము. కాబట్టి యజ్ఞాదికర్మలకు భోక్తలుగా భావించబడే దేవతలంతా పరమేశ్వరుని అంగాలే. భగవానుడే వారందరికీ ఆత్మ. అందుచేత ఆయా దేవతలరూపంలో భగవానుడే సమస్త యజ్ఞకర్మలకు భోక్త. పరమేశ్వరుడే సర్వదేవతలను వారి వారి యోగ్యతలను బట్టి వారికి ఉచితమైన స్థానాలలో నియమిస్తాడు. ఈ రకంగా దేవగణాలన్నింటికీ అతడే నియంత. అందరికీ ప్రభువు. స్వామి. పరమేశ్వరుని తత్త్వాన్ని తెలుసుకోలేనివారు మరుజన్మ ఎత్తుతారు. వారికి జన్మరాహిత్యము ఉండదు" అని చెప్పబడింది.

ఈ రకంగా యజ్ఞంలో పూజించబడేవాడు, యజ్ఞమును అనుభవించేవాడు, యజ్ఞ ఫలమునిచ్చేవాడు కూడా శ్రీమహావిష్ణువు. అందుచేతనే అతడు అమృతపానము చేసినవాడు అని చెప్పబడింది.

**అమృతం పాతీతి అమృతపః**

తనను అనుష్ఠించినవారికి పరమపదము అనే అమృతాన్నిచ్చేవాడు.

స్వాత్మానందము అనే అమృతరసాన్ని తాగేవాడు. ఆత్మజ్ఞానము, స్వరూపజ్ఞానము పొందినవాడు. భక్తులకు ఆత్మానందాన్నిచ్చేవాడు.

క్షీరసాగరమథనం చేసినప్పుడు ఉద్భవించిన అమృతాన్ని తానుత్రాగి, దేవతలకు కూడా పంచినవాడు.

## 505. సోమః

అమృతముగ నుండువాడు.

**సోమస్సుధాయమానత్వాత్ ముక్తానాం పరికీర్తితః** ముక్తులైన వారికి అమృతరసము వంటివాడు. ఇక్కడ సోమము అనగా - అమృతము అని అర్థం. పరమేశ్వరుడు తనకు, తనను అనుభవించు వారికి కూడా అమృతము వంటివాడు. **శ్రీమద్రామాయణం**లో

**"మహతాతపసారామ మహతా చాపికర్మణా ।**

**రాజ్ఞా దశరథేనాసి లబ్ధోఽ మృతమపి వామరైః ॥**

రామా ! నీ తండ్రి దశరథుడు గొప్ప తపస్సుచేసి, అనేక పాట్లుపడి, దేవతలు అమృతము పొందినట్లుగా నిన్ను పొందాడు" అని చెప్పబడింది.

సోముని రూపంలో ఉండి ఓషధులను పోషించే పరమాత్ముడు.

**ప్రశ్నోపనిషత్తు**లో పిప్పలాదమహర్షిని కబంధి అనే శిష్యుడు అడుగుతున్నాడు. "మహర్షీ! జగత్తులోని ప్రాణికోటి అంతా ఎక్కడ నుంచి పుడుతున్నది?" దానికి పిప్పలాదుడు చెబుతున్నాడు.

ప్రజాపతి సంతానాన్ని పొందాలనే కోరిక గలవాడై తపస్సు చేశాడు. ఈ రకంగా తపస్సుచేసి రయి, ప్రాణము అనే జంటను సృష్టించాడు.

రయి అంటే అన్నము, పదార్థము, చంద్రుడు అని అర్థం. చంద్రునివల్లనే భూమిమీద ద్రవత్వము, రసము కలుగుతున్నాయి. చంద్రుడే ఓషధులకు, వనస్పతులకు కారకుడు. ఓషధులు వనస్పతులే అన్నము. ఈ రకంగా చంద్రుడే ఓషధులను పోషించేవాడు.

అందుకే పరమాత్ముడు 'సోమః' అనిచెప్పబడ్డాడు. స ఉమః సోమః ఉమతో కూడినవాడు శివుడు. శివుడు కూడా విష్ణుమూర్తియొక్క విభూతియే.

# 506. పురుజిత్

అనేకులను జయించినవాడు.

**లోకాన్ దీనాన్ గురూన్ శత్రూన్ సత్యదానానువర్తనైః ।**

**ధనుషాజితవాన్ యశ్చ పురుజిత్ సస్మృతో బుధైః ॥**

| | | |
|---|---|---|
| పుణ్యలోకాలను | – | సత్యముతోను |
| దరిద్రులను | – | దానముతోను |
| ఆచార్యులను | – | శుశ్రూషతోను |
| శత్రువులను | – | ధనుస్సు (పరాక్రమం)తోను |

జయించినవాడు.

**పురూన్ జయతీతి పురుజిత్** అనేకమందిని జయించినవాడు. **రామాయణంలో**

**సత్యేనలోకాన్ జయతి దీనాన్ దానేనరాఘవః ।**

**గురూన్ శుశ్రూషయా వీరః ధనుషాయధిశాత్రవాన్ ॥**

పైన చెప్పిన రీతిగానే శ్రీరామచంద్రుడు అందరినీ జయించినవాడు.

అనేకమందిని జయించిన మహాబలసంపన్నుడు.

| | | |
|---|---|---|
| బాల్యంలో అల్లరితో, ప్రేమతో | – | తల్లితండ్రులను |
| యాగసంరక్షణచేసి | – | విశ్వామిత్రాది మహర్షులను |
| శివధనుర్భంగముచేసి | – | సీతాదేవి మనసును |
| పరాక్రమంతో | – | ఖరదూషణాది రాక్షసులను |
| రావణ సంహారంచేసి | – | దేవతల మనసును |
| శిష్యరికం చేసి | – | గురువును |

ఈ రకంగా శ్రీరామచంద్రుడు అనేకమందిని జయించాడు.

శ్రీరాముడు తాను ఒక్కడే అనేకమందిని ఎదిరించి జయించిన పరాక్రమశాలి. జయించటమనేది కేవలము భౌతికంగానే కాదు. పైన చెప్పిన విధంగా శ్రీరామచంద్రుడు అందరిమనసులను జయించాడు. అందుకే శ్రీమన్నారాయణుడు 'పురుజిత్' అనబడుతున్నాడు.

## 507. పురుసత్తమః

మహనీయులయందుండువాడు.

**మహత్వస్తిత మత్వాద్యోహ్యాఞ్జనేయాదిషుస్వయమ్ ।**
**పురుసత్తమ అఖ్యాతో నవార్ణ స్స్వస్థిధోమనుః ॥**

ఆంజనేయాది మహాత్ములయందు నిత్యముగ ఉండేవాడు. ఈ నామము నవాక్షరీ మంత్రము. మంగళప్రదము.

**పురుషసత్తమః పురుసత్తమః**

ఉత్తములైన పురుషులయందు ఉండేవాడు. శ్రీమద్రామాయణంలో ఆంజనేయుడు.

**స్నేహోమే పరయోరాజన్ త్వయినిత్యం ప్రతిష్ఠితః ।**
**భక్తిశ్చనియతావీర భావోనాన్యత్ర గచ్ఛతి ॥**

రామా ! నాకు నీయందే స్నేహము పూర్ణముగా ఉన్నది. నా మనస్సు నీయందు తప్ప, ఇతర విషయములందు లగ్నము కాదు" అంటాడు.

పురు – అనేకరూపములు గలవాడు. విశ్వరూపుడు.

సత్యముడు – సజ్జనులందరిలోకి ఉత్కృష్టుడు.

పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు జగత్తు అంతా ఆవరించి ఉన్నాడు. అనేక రూపాలలో ఉన్నాడు. అన్ని రూపములు అతనివే. అంతేకాక ఉత్కృష్టమైనవాడు. వేదశాస్త్ర పురాణాదివిద్యలతో అతన్ని పొందలేరు. కేవలము జ్ఞానమువల్లనే పొందదగినవాడు. అందుచేతనే 'పురుసత్తమః' అనబడుతున్నాడు.

## 508. వినయః

అణచివేసినవాడు.

**కుంభకర్ణ మహాకాయ ఖరమారీచరావణాః ।**
**దమ్యంతే విక్రమైర్యేవ వినయస్సముదాహృతః ॥**

మహాకాయుడైన కుంభకర్ణుడు, ఖరదూషణాదులు, మారీచుడు, రావణుడు ఇత్యాది రాక్షసులను తన పరాక్రమముచే అణచివేసినవాడు.

**వినీయంతే అస్మాత్ ఇతి వినయః** మారీచుడు, సుబాహువు మొదలైన దుర్మార్గులను తన వీరత్వముచే అణగగొట్టినవాడు.

**దండం కరోతి దుష్టానామితి వినయః**

దుష్టులను లొంగదీసుకోవటానికి దండోపాయము నుపయోగించినవాడు.

దశరథ మహారాజు కొలువు తీర్చి ఉన్నాడు. విశ్వామిత్ర మహర్షి వేంచేశాడు. అతిథి సత్కారాలు చేశాడు మహారాజు. మహర్షికి ఉచితాసనమిచ్చి గౌరవించాడు. కుశలప్రశ్నలు అయిన తరువాత అడిగాడు మహారాజు 'వచ్చిన కార్యము ఏది ? ఈ సేవకుని వలన తమకేం కావాలి ?' అప్పుడు చెప్పాడు మహర్షి "రాజా ! నేనకొయజ్ఞం చేస్తున్నాను. యజ్ఞయాగాదులను రాక్షసులు పాడుచేస్తున్నారు. అందుచేత యాగ రక్షణకు రామలక్ష్మణులను పంపవలసినది" అన్నాడు. అయిష్టంగానే ఒప్పుకున్నాడు మహారాజు. మహర్షితో పాటు కుమారులను యాగ సంరక్షణకు పంపాడు.

అరణ్యప్రాంతంలోకి అడుగుపెట్టారు వారు. ఉన్నట్టుండి. భీకరధ్వనులు వినిపించసాగాయి. అడవి కంపించిపోవటం మొదలుపెట్టింది. తాటకి అనే రాక్షసి రంగప్రవేశం చేసింది. ఆడది అని ఆలోచించవద్దు. ముందుగా దాన్ని సంహరించు అన్నాడు మహర్షి. సంహరించాడు రాముడు.

యజ్ఞం ప్రారంభమైంది. మారీచ సుబాహులు కడవలతో రక్తమాంసాలు తెచ్చి యజ్ఞకుండంలో పోయబోయారు. బాణంసంధించాడు రాముడు. నేలకొరిగాడు సుబాహువు. మళ్ళీ బాణం ఎక్కుపెట్టాడు రాముడు. మారీచుడు వెళ్ళి సముద్రంలో పడ్డాడు. 'ఈ విషయం తమ ఏలికకు చెప్పుకుంటాడు. అందువలనైనా ఇక రాక్షసకృత్యాలు మానతారు' అనే ఉద్దేశ్యంతో మారీచుని ప్రాణాలు హరించకుండా వదిలాడు.

ఈ రకంగా అనేకమంది రాక్షసులను సంహరించాడు. అందుకే శ్రీమన్నారాయణుడు 'వినయః' అనబడుతున్నాడు.

## 509. జయః

ఆశ్రితులచే జయించబడినవాడు.

**ఆశ్రితైర్జీయతే యస్మాత్ విధేయీక్రియతే జయః ॥**

పరమేశ్వరుడు ఆశ్రితవత్సలుడు. అందుచేత వారిచే జయింపబడతాడు. అనగా ఆశ్రితులకు దాసుడు.

**జీయతే ఆజ్ఞప్యతే ఇతి జయః** ఆశ్రితులకు విధేయుడగా ఉండువాడు.

దశరథమహారాజు యజ్ఞం చేస్తున్నాడు. తమతమ హవిర్భాగాలందుకోవటానికి దేవతలు అక్కడికి వచ్చారు. ఆరకంగా దేవ, గంధర్వ, మహర్షి, సిద్ధ, సాధ్య, గణాలన్నీ అక్కడచేరి బ్రహ్మతో తమగోడు చెప్పుకున్నాయి.

"బ్రహ్మదేవా ! నీ అనుగ్రహముచే వరాలనుపొందిబలగర్వితుడైన రావణుడు లోకకంటకుడైనాడు. మమ్ములను పీడిస్తున్నాడు. అతడు నీవరప్రభావంచేత ఎవరికీ ఎదిరించవీలుకాకుండా ఉన్నాడు. అతడికి భయపడి సూర్యుడుకూడా సరిగా ఎండకాయటం లేదు. గాలి సరిగా వీచటంలేదు. కాబట్టి అతన్ని వధించే ఉపాయమేదైనా ఆలోచించ వలసినది" అన్నారు. దానికి బ్రహ్మదేవుడు "మహానుభావులారా ! అతడు వరమడిగేటప్పుడు యక్ష, గరుడ, గంధర్వ, కిన్నెర, కింపురుష, సిద్ధ, సాధ్య, నాగ, దేవగణాలచే మరణము రాకూడదు అన్నాడు. మానవులను మాత్రం మరిచిపోయాడు. కాబట్టి అతడు మానవులచేతిలో మరణిస్తాడు" అన్నాడు.

ఇంత శ్రీమహావిష్ణువు కూడా అక్కడకు వచ్చాడు. అప్పుడు దేవతలంతా శ్రీమన్నారాయణునితో "స్వామీ ! నీవు దశరథమహారాజు పత్నులయందు మానవుడవై జన్మించి రావణబ్రహ్మను సంహరించవలసినది. నీవు తప్ప ఇంక దిక్కులేదు. కాబట్టి మానవుడిగా జన్మించి రావణకుంభకర్ణాధి రాక్షసులను నాశనం చెయ్యవలసినది" అని ప్రార్థించారు.

ఆ రకంగా ఆశ్రితవత్సలుడై శ్రీమన్నారాయణుడు భూలోకంలో జన్మించాడు. అందుకే అతడు 'జయః' అనబడుతున్నాడు.

వామనావతారంలో బలిచక్రవర్తి మూడు అడుగులనేలను దానం చేశాడు. ఒక అడుగుతో నేల రెండవ అడుగుతో నింగి ఆక్రమించాడు హరి. మూడవ అడుగుకు చోటెక్కడ ? అన్నాడు. త్రివిక్రముని నిశ్చేష్టుడై చూస్తున్న బలి ఉలిక్కిపడ్డాడు. వెంటనే తడుముకోకుండా "నా శిరస్సున ఉంచు మహానుభావా !" అన్నాడు. బలిచక్రవర్తిని సుతలలోకానికి పంపించాడు శ్రీహరి. అతని వాకిలికి కాపలాగా ఉన్నాడు.

ఈ విధంగా తనను ఆశ్రయించినవారు చెయ్యమన్న పనులు చేసేవాడు. వారికి దాసానుదాసుడు. సమస్త భూతములను జయించువాడు.

## 510. సత్యసంధః

సత్యమగు ప్రతిజ్ఞ గలవాడు.

**సత్యా ప్రతిజ్ఞా యస్యేతి సత్యసంధః స ఉచ్యతే ॥**

ఎన్ని అడ్డంకులు వచ్చినా చేసిన ప్రతిజ్ఞను పూర్తిచేసేవాడు.

**సత్యాసంధాయస్యసః సత్యసంధః** చేసిన ప్రతినలు తీర్చినవాడు.

**శ్రీమద్రామాయణం**లోని అరణ్యకాండలో

**"అప్యహంజీవితం జహ్యాం త్వాంవాసీతే స లక్ష్మణాం ।**
**నతుప్రతిజ్ఞాం సంశ్రుత్య బ్రాహ్మణేభ్యో విశేషతః ॥**

సీతా ! నే ప్రాణాలైనా విడుస్తాను. నిన్నుగాని, లక్ష్మణునిగాని విడిచిపెడతాను. అంతేగాని చేసిన ప్రతిజ్ఞను మాత్రం విడువను" అంటాడు.

**సత్యా - సంధా - యస్యసః**

సత్యసంకల్పము గలవాడు.

**ఛాందోగ్యోపనిషత్తు**లో హృత్పద్మాన్ని వివరిస్తూ "భౌతికమైన ఆకాశం మన కళ్ళకు కనిపించేది. అది బయట ఎంత ఉన్నదో, హృదయంలో ఉన్న ఆకాశం కూడాఅంతే ఉన్నది. ఈ హృదయాకాశంలో ద్యులోకము, పృథివీ రెండూ ఇమిడి ఉన్నాయి. అలాగే అగ్ని, వాయువుకూడా ఉన్నాయి. సూర్యచంద్రులు, నక్షత్రాలు, విద్యుత్తు కూడా అందులోనే ఉన్నాయి. ఆత్మలోకంలో ఆత్మీయపదార్థంగా ఉన్నది, లేనిది, భవిష్యత్తులో ఉండనిదీ, అన్నీ ఈ హృదయాకాశంలో ఇమిడి ఉంటాయి.

శరీరం వార్ధక్యాన్ని పొందినప్పుడు అంతరాకాశంలోఉన్న బ్రహ్మ జీర్ణంకాదు. శరీరాన్ని ఆయుధాలతో నరికిచంపేసినా, లోపల ఉన్న ఆత్మనాశనంకాదు. ఆత్మ వధించబడదు. ఈ బ్రహ్మపురంలో సమస్త కోరికలు ఉన్నాయి. ఆత్మకి ధర్మాధర్మాలతో సంబంధం లేదు. ముసలితనం లేదు. ఆకలిలేదు. శోకంలేదు. దాహంలేదు. ఆత్మసత్యకామము, సత్య సంకల్పము అయినది. సాంసారిక పురుషులకు లాగా అసత్యకామన, అసత్య సంకల్పము దానికి ఉండవు." అని చెప్పబడింది.

అందుకే ఆత్మస్వరూపుడైన శ్రీమన్నారాయణుడు 'సత్యసంధః' అనబడుతున్నాడు.

## 511. దాశార్హః

దానమునకు తగినవాడు.

**ఆత్మనోవార్పణంభక్తైః తేభ్యోవా స్వాత్మనోఽర్పణం ।**
**దాశస్తుమర్హతి చ యః దాశార్హ స్సతుకీర్తితః ॥**

దాశ అనగా - దానము, దాశకు అర్హుడు. దానానికి తగినవాడు. తనను తన భక్తులకు అర్పించుకున్నవాడు. భక్తులు తమను తనకు సమర్పించటానికి తగినవాడు.

**దాశమ్ దానమ్ అర్హతీతి దాశార్హః**

దానానికి తగినవాడు. దశార్హవంశము అంటే – యదువంశము

**దశార్హాశ్యాయమ్ దాశార్హః** యదువంశమున ఉద్భవించినవాడు.

ఏదైనా దానము ఇవ్వాలి అంటే, అది ఉత్తముడైన బ్రాహ్మణుడికి దానమివ్వాలి. లేదా పరమేశ్వరుడికి దానమివ్వాలి. ఆయన పూజించదగిన దైవము అందుచేత దానం గ్రహించటానికి అర్హుడు.

దశార్హము అంటే యదుదేశము. యదుదేశమందు, యాదవ వంశమందు జన్మించిన వాడు శ్రీకృష్ణుడు. అందుచేత శ్రీమన్నారాయణుడు 'దాశార్హుడు' అనబడుతున్నాడు.

## 512. సాత్వతాం పతిః

సాత్త్వికులకు నాధుడు.

**యే సాత్వతా భాగవతాః తేషాం యః పతిరీశ్వరః ।**

**సాత్వతాం పతిరిత్యుక్తో నవార్ణ స్సాధు రక్షకః ॥**

సాత్త్వికులు అంటే భాగవతులు. వారికి ప్రభువు

భాగవతులు అంటే – ఎల్లవేళల యందు త్రికరణ శుద్ధిగా ఆ పరమేశ్వరునే ఆరాధించే వారు. వారికి ప్రభువు. అనగా వారిచేత ఆరాధించబడేవాడు. వారిచేత పొందబడేవాడు.

పరమభక్తులైన వారు సృష్టిలోని ప్రతివస్తువు నందు, ప్రతిప్రాణియందు ఆ పరమేశ్వరునే చూడగలుగుతారు. వారు పరమ జ్ఞానులు. పరమపదము చేరటమే వారి లక్ష్యం. శ్రీమన్నారాయణుని సేవకే వారి జీవితం అంకితం. తులసీదాసు, కబీరుదాసు, జ్ఞానదేవుడు, నామదేవుడు వంటివారు.

నామదేవుడు తినటానికి రొట్టెలు తెచ్చుకుంటాడు. వాటిని గట్టుమీద పెట్టి పని చేసుకుంటూ ఉంటాడు. ఇంతలో ఒక కుక్క వచ్చి ఆ రొట్టెలు ఎత్తుకుపోతూ ఉంటుంది. అది చూచిన తోటివారందరూ ఆ కుక్కని అరుస్తారు. కాని నామదేవుడు ఆ కుక్కని ఆగమని వెంటపడతాడు. దానితోపాటు పరుగెత్తి చివరకు దాన్ని పట్టుకుంటాడు. అలా పట్టుకుని, దాని నోట్లోనుంచి రొట్టెముక్క లాక్కుని "స్వామీ! ఇది చాలా గట్టిగా ఉన్నది. దీన్ని నువ్వు తినలేవు. దీనికి వెన్న రాచి ఇస్తాను. అప్పుడు అది మెత్తనవుతుంది. నువ్వు దాన్ని తేలికగా తినవచ్చు" అంటూ దానికి వెన్న రాచి ముక్కలు చేసి, ఆ శునకమే

శ్రీమన్నారాయణుని రూపంగా భావించి రొట్టెముక్కలు దాని నోటికి అందిస్తాడు. ఆ కుక్క ఆ ముక్కలు తింటూంటే తాను మహదానందం చెందుతాడు. ఇటువంటి వారు పరమభాగవతోత్తములు. వీరికి నాథుడు.

'సాత్వతము' అనేది ఒక తంత్రం. ఆ తంత్రాన్ని అనుసరించేవారికి ప్రభువు. పరమ భాగవతులు కోరేది సాయుజ్యము. తంత్రవాదులు కోరేది కూడా సాయుజ్యమే. ఇటువంటి వారికి మోక్షము నిచ్చేవాడు. పరమపదమునందు ఉండేవాడు. అందుకే శ్రీమన్నారాయనుడు 'సాత్వతాంపతిః' అనబడుతున్నాడు.

## 513. జీవః

జీవింపచేయువాడు.

**తానాత్మనాశా ద్వ్యావర్త్య సత్వాన్యశ్చ స్వసేవయా ।**
**ఉజ్జీవయతి జీవస్సః భక్తక్లేశా సహోమనుః ॥**

తనయొక్క భక్తులను ఆత్మనాశనము నుంచి కాపాడి, సేవలు చేసి, ఉజ్జీవింప చేయువాడు.

**జీవయతీతి జీవః** భాగవతులకు ఆత్మనాశనము కలగకుండా చూసి, రక్షించి జీవింపచేయువాడు. పరమేశ్వరుడైన వాసుదేవుడు తన భక్తులను దుఃఖించనీయడు.

భాగవతులు పరమపదాన్నే కోరతారు. పిపీలికాది బ్రహ్మ పర్యంతము ఆ పరమేశ్వరుడుగానే భావిస్తారు. జగత్తంతా ఒకటిగా, సమానంగానే చూడగలుగుతారు. అటువంటివారికి సుఖదుఃఖాలు ఉండవు. కోపతాపాలు ఉండవు. శత్రువులు, మిత్రులు ఉండరు. వారికి సంకల్పసిద్ధి కలుగుతుంది. ఇష్టార్థ సిద్ధి కలుగతుంది. అటువంటి వారికి సేవలు చేసి, వారికి సాయుజ్యం ప్రసాదిస్తాడు.

జీవింపచేయువాడు - ప్రాణములను నిలుపువాడు. శరీరంలో పరమేశ్వరుడే ప్రాణము. ఆ ప్రాణం లేకపోతే శరీరం జీవించదు. కాబట్టి ప్రాణరూపంలో శరీరాన్ని జీవింపచేయువాడు.

**బృహదారణ్యకోపనిషత్తు**లో ప్రాణమే శ్రేష్ఠమని చెప్పబడింది.

శ్రేష్ఠమైన దానిని, జ్యేష్ఠమైన దానిని తెలుసుకున్నవాడు తనవారిలో జ్యేష్ఠుడు, శ్రేష్ఠుడు అవుతాడు. మిగిలిన అన్ని ఇంద్రియాలకన్న ప్రాణమే ముందు పుట్టింది. కాబట్టి అదే జ్యేష్ఠము, శ్రేష్ఠము అయినది. ఈ విషయాన్ని తెలుసుకున్నవాడు తనవారిలోనే కాదు మిగిలిన వారిలో కూడా జ్యేష్ఠుడు, శ్రేష్ఠుడు అవుతాడు.

వసిష్ఠమైన దానిని తెలుసుకున్నవాడు ఈ భూమిమీద సకాలంలో ప్రతిష్టుడౌతాడు. అంతేకాదు దుర్గమ స్థానంలోను, అడవులయందు, ఎడారుల యందు కూడా ఆశ్రయం పొందుతాడు. ఇక్కడ చక్షువే ప్రతిష్ఠ చక్షువులచే తనే దేశాన్ని, భూమిని మిగిలిన వాటిని గుర్తించగలుగుతున్నాడు. కాబట్టి ప్రతిష్ఠాగుణం కలిగిన చక్షువునుపాసించేవాడు మంచి రోజుల్లోను, చెడ్డరోజుల్లోను కూడా ఆశ్రయం పొందుతాడు.

ప్రతిష్ఠను గురించి తెలుసుకున్నవాడు ఈ భూమిమీద సకాలంలో ప్రతిష్టుడౌతాడు. అంతేకాదు దుర్గమస్థానంలోను, అడవులయందు, ఎడారులయందు కూడా ఆశ్రయం పొందుతాడు. ఇక్కడ చక్షువే ప్రతిష్ఠ, చక్షువులచే తనే దేశాన్ని, భూమిని మిగిలిన వాటినీ గుర్తించగలుగుతున్నాడు. కాబట్టి ప్రతిష్ఠాగుణం కలిగిన చక్షువునుపాసించేవాడు మంచి రోజుల్లోను, చెడ్డరోజుల్లోనూ కూడా ఆశ్రయం పొందుతాడు.

సంపదను గూర్చి తెలుసుకున్నవాడు కోరిన భోగాలు, సుఖాలు పొందుతాడు. శ్రోత్రమే సంపద, శ్రోత్రం ద్వారానే వేదాలన్నీ వింటాము. శ్రోత్రమున్నవాడే వేదాధ్యయనం చెయ్యగలుగుతాడు. ఈ విషయం తెలిసి ఉపాసన చేసినవాడు భోగాలు, సంపదలు అన్నీ అనుభవించగలుగుతాడు.

మనస్సు ఆయతనం, మనస్సు యొక్క సంకల్పాన్ని బట్టి మిగిలిన ఇంద్రియాలు ఆయా పనులలో నిమగ్నమవుతాయి. ఈ విషయం తెలిసి ఉపాసన చేసినవాడు సర్వ జనులకు ఆశ్రయమవుతాడు.

రేతస్సే ప్రజాపతి. ప్రజాపతిని తెలుసుకున్నవాడు మంచి సంతానము, పశువులు కలిగి ఉంటాడు. ఈ విషయం తెలిసి ఉపాసన చేసినవాడు మంచి సంతానము, పశుసంపద పొందుతాడు.

పూర్వకాలంలో ఒకసారి ఇంద్రియాలన్నీ తమలోతాము పోట్లాడుకోవటం మొదలు పెట్టాయి. దీనికి కారణం తమలో ఎవరు గొప్ప అనే విషయం తేలకపోవటమే ఆ వాదన ఎంతకీ తెగలేదు. చివరకు అన్నీ కలిసి ఒక నిర్ణయానికి వచ్చి తమకు జన్మనిచ్చిన ప్రజాపతిదగ్గరకు పోయి "ప్రజాపతి ! మాలో శ్రేష్ఠులెవరో మీరు తేల్చి చెప్పండి" అన్నాయి.

ప్రజాపతి ఒక క్షణం ఆలోచించి "మీలో ఎవరు శ్రేష్ఠులో తేల్చుకునే ఉపాయం ఒకటి చెబుతాను వినండి. మీలో ఏది లేకపోతే ఈ శరీరం పనికి రాకుండా, పని చెయ్యకుండా పోతుందో అది అన్నిటికన్న శ్రేష్ఠమైనదిగా గుర్తించండి. ఈ విషయం తేలాలంటే ఒక్కొక్క ఇంద్రియము ఒక సంవత్సరంపాటు ఈ శరీరాన్ని విడిచి వెళ్ళండి" అన్నాడు ప్రజాపతి సలహా ఇంద్రియాలకన్నింటికీ నచ్చింది.

ముందుగా వాక్కు శరీరం నుంచి నిష్క్రమించింది. అది ఒక సంవత్సరంపాటు శరీరానికి దూరంగా ఉండి తరువాత తిరిగి వచ్చి మిగిలిన ఇంద్రియాలను అడిగింది. "నేను లేనప్పుడు మీరెలా జీవించి ఉండగలిగారు?"

"నువ్వు వెళ్ళిపోవటంవల్ల శరీరానికి పెద్ద నష్టం ఏదీ జరగలేదు. కేవలం వాక్కు మాత్రం మూగబోయింది. అంతేగాని మిగిలిన శరీరం యథాతథంగా పనిచేసింది. ఉచ్ఛ్వాస నిచ్ఛ్వాసలు మామూలుగానే జరిగాయి. కళ్ళు చూస్తూనే ఉన్నాయి. చెవులు వింటూనే ఉన్నాయి. ఆలోచనలు సాగుతూనే ఉన్నాయి. ఆ రకంగా మిగిలిన పనులన్నీ జరిగాయి. పసిపిల్లవాడికి మాటలు రావు. అయినా వాడు బ్రతకటం లేదా ? మూగవాడు జీవించటం లేదా ? అలాగే శరీరం జీవించే ఉన్నది." అన్నాయి మిగిలిన అవయవాలు. ఆ మాటలువిన్న వాక్కు శరీరంలో ప్రవేశించింది.

తరువాత శరీరం నుంచి దృష్టి నిష్క్రమించి ఒక సంవత్సరం తరువాత తిరిగి వచ్చి మిగిలిన అవయవాలను అడిగింది "నేను లేనప్పుడు మీరంతా ఎలా ఉన్నారు?" అని

అప్పుడవి "నువ్వు లేకపోతే చెప్పుకోతగ్గ ఇబ్బందేం కలగలేదు. గ్రుడ్డివాడు బ్రతకటం లేదా ? అలాగే ఈ శరీరం బ్రతికింది. కేవలం చూపుమాత్రం లేదు. అంతేకాని శరీరంలోని మిగిలిన వ్యాపారాలన్నీ సజావుగానే సాగినాయి. ఊపిరి ఆడుతూనే ఉంది. నోరు తింటూనే ఉంది. మాట్లాడుతూనే ఉన్నది. ఆలోచనలు బాగానే ఉన్నాయి" అన్నాయి మారు మాట్లాడకుండా దృష్టి శరీరంలో ప్రవేశించింది.

ఆ తరువాత శ్రవణశక్తి శరీరాన్ని విడిచి వెళ్ళిపోయి ఒక సంవత్సరం తరువాత తిరిగి వచ్చి "నేను లేకపోతే ఎలా ఉన్నది?" అని అడిగింది.

దానికి మిగిలిన ఇంద్రియాలు "ఓ శ్రవణేంద్రియమా ! నీవు లేని శరీరం చెవిటిదయింది. అంతేకాని కన్ను చూస్తోంది. నోరు మాట్లాడుతోంది ఈ రకంగా మిగిలిన ఇంద్రియాలన్నీ వాటిపని అవి చేస్తూనే ఉన్నాయి. కాబట్టి మేమంతా ఈ శరీరంలో సుఖంగానే ఉన్నాము" అన్నాయి శ్రవణశక్తి శరీరంలో ప్రవేశించింది.

ఆ తరువాత మనస్సు శరీరం నుంచి నిష్క్రమించి ఒక సంవత్సరం తరువాత తిరిగి వచ్చి "నేను లేకపోతే వెలితిగా లేదా ?" అని అడిగింది.

దానికి మిగిలిన ఇంద్రియాలు "ఓ మనసా ! నీవు సంకల్ప వికల్పాలకు మూలమైనదానవు. నువ్వు లేకపోతే శరీరానికి సంకల్పం ఉండదు. ఆలోచనా శక్తి ఉండదు. ఆలోచన లేదన్నమాటే గాని శ్వాస ఆడుతుంది. కాళ్ళు చేతులు వాటి పని చేస్తాయి.

నోరు తింటుంది. మాట్లాడుతుంది. ఈ రకంగా మిగిలిన ఇంద్రియాలు వాటి పని అవి చేస్తూ ఉంటాయి. పసిపిల్లవాడు మనస్సు లేకుండా బ్రతకటం లేదా? అలాగే శరీరం నువ్వు లేకుండా జీవించే ఉన్నది. మిగిలిన కార్యములన్నీ యథాతథంగా జరుగుతూనే ఉన్నాయి," అన్నాయి. మారు మాట్లాడకుండా మనస్సు శరీరంలోకి ప్రవేశించింది.

ఆఖరుకు ప్రాణం బయటకు పోవటానికి వస్తూ ఉంది. అప్పుడు ఇంద్రియాలతో తనుకున్న బంధనాలన్నిటినీ త్రెంచి పారేస్తున్నట్లనిపించింది. శరీరానికి ఊపిరి అందటం కష్టమవుతుంది. కళ్ళు కనిపించటం మానేసాయి. చెవులు వినిపించటం మానివేసాయి. నోరు మాట్లాడటం కష్టమయింది. అలాగే కాళ్ళు చేతులు కదలటం మానేసాయి. శరీరం గాలిలో తేలిపోతున్నట్లయింది. దాంతో ఇంద్రియాలకు భయం పట్టుకుంది. అప్పుడు అవన్నీ ప్రాణం చుట్టూ 'ప్రాణమా ! నువ్వు మాత్రం శరీరం నుంచి బయటకు వెళ్ళిపోతే శరీరం చచ్చిపోతుంది. అప్పుడు మేమంతా ఉపయోగం లేకుండా పోతాము. మా పనిసున్నా అవుతుంది. మా అందరిలోకీ శ్రేష్ఠుడివి నువ్వే. ఈ మాట మేమందరం అంగీకరిస్తున్నాం. నువ్వు ఇక్కడే ఉండి మమ్మల్ని జీవింపచెయ్యి' అని వేడుకున్నాయి.

ఈ రకంగా ఇంద్రియాలన్నీ ప్రాణం లేకపోతే తమ ఉనికి లేదని ఒప్పుకున్నాయి. అందుకనే వాక్కు, చక్షువు, శ్రోత్రము, మనస్సు అనే పేర్లతోగాక, అవన్నీ ప్రాణవంతములైతేనే పని చేస్తాయి. అందుకే అవన్నీ ప్రాణాలనే సంకేతంతో పిలువబడతాయి. అంటే ప్రాణం లేకుండా వాటికి స్వేచ్ఛ లేదు. అసలు ప్రాణమే ఇన్ని రూపాలుగా మారింది. అందుచేతనే ఇంద్రియాలన్నింటిలోకి ప్రాణమే గొప్పది.

ఈ రకంగా ఇంద్రియాల కోరిక మీద ప్రాణం శరీరాన్ని విడిచిపోకుండా ఉండి మిగిలిన ఇంద్రియాలతో 'మీ మాట ప్రకారము నేను ఇక్కడే ఉంటాను. మరి నాకు అన్నము ఏది ?' అని అడిగింది. "కుక్కలు, పిల్లులు, పక్షులు మొదలైన జీవ జంతువుల ఆహారమే నీకు ఆహారము" అన్నాయి. ఇది ఏ విధంగా అంటే శరీరంలో ముఖ్యమైన ప్రాణం వల్లనే మిగిలిన ఇంద్రియాలు పని చేస్తున్నాయి. కాబట్టి అన్నింటి ఆహారము ప్రాణానికి ఆహారమవుతోంది. విరాట్ ప్రాణానికి విరాట్ అన్నమే ఆహారము. ఈ విషయము తెలిసినవాడికి తినరానిది ఏదీ ఉండదు.

ప్రాణం మళ్ళీ అడిగింది "మరి నాకు ఆచ్ఛాదనకు వస్త్రం ఏది ?" దానికి ఇంద్రియాలు "జలమే నీకు ఆచ్ఛాదన" అన్నాయి. విద్వాంసులు భోజనానికి ముందు, తరువాత కూడా ప్రాణాన్ని జలంతో ఆచ్ఛాదిస్తున్నారు. భోజన సమయంలో చేసే ఆపోసనా, ఉత్తరాపోసనలే ప్రాణానికి వస్త్రం ఈ విషయం తెలుసుకున్నవాడు వస్త్రాన్ని పొంది నగ్నత్వం లేనివాడవుతున్నాడు.

ఈ విధంగా ప్రాణ విజ్ఞానాన్ని తెలుసుకున్నవాడు ఎండిన చెట్టు దగ్గర కూర్చుని ప్రాణ విజ్ఞానం చెబితే ఆ చెట్టు చిగురువేస్తుంది" కాబట్టి ప్రాణమే పరమేశ్వర స్వరూపము.

ఈ రకంగా శరీరాన్ని జీవింపచేయువాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు 'జీవః' అనబడుతున్నాడు.

## 514. వినయితా సాక్షీ

భక్తుల యందలి వినయము చూసి సంతృప్తి చెంది ఆధ్యాత్మికముగా వారిని పెంపొందింప చేయువాడు, ఈ నామాన్ని శంకర భగవత్పాదులవారు ఒకటిగా వ్రాశారు. కాని పరాశర భట్టరువారు మాత్రం దీన్ని రెండు నామాలుగా వ్రాశారు.

**వినయితా :** రక్షించువాడు.

**భక్తాన్నిత్యం రాజపుత్ర లాలన న్యాయత స్సుఖమ్ ।**
**రక్షత్యతో వినయితా నయతే రక్షణార్థతః ॥**

భక్తులను నిత్యము రాజపుత్రులు లాగా లాలన చేసి సుఖముగా రక్షించువాడు.

**వినయతే రక్షతి ఇతి వినయితా ॥** భక్తులను బుజ్జగించి రక్షించేవాడు.

**సాక్షీ :** చూచువాడు

**సాక్షాత్కరోతి యస్సాక్షీ తద్వృత్తం రక్షణాయసః ॥**

భక్తులను కాపాడటానికి వారు చేసే పనులన్నింటినీ ప్రత్యక్షముగా చూసేవాడు.

**సాక్షాత్ ద్రష్టాసాక్షీ** భక్తులు చేసే పనులను ప్రత్యక్షముగా చూసేవాడు.

పరమాత్మ సర్వాంతర్యామి. ఈ జగత్తంతా ఆవరించి ఉన్నాడు. కాబట్టి లోకంలో ఎవరు ఏమి చేస్తున్నదీ అతడు గమనిస్తూనే ఉంటాడు. పంచభూతాలు, సూర్యుడు, చంద్రుడు, యముడు, కాలము. ఈ తొమ్మిదిమంది పరమేశ్వరుని చారులు. వీరి సాయంతో ఎప్పుడు ఎక్కడ ఏమి జరుగుతున్నదీ పరమేశ్వరుడు తెలుసుకుంటాడు.

## 515. ముకుందః

మోక్షాన్నిచ్చేవాడు.

**తైః ప్రార్థిత స్వయం ముక్తిం ముకుంద స్యాద్దదాతి సః ॥**

వారిచే ప్రార్థించబడువాడు. వారికి ముక్తి ప్రసాదించువాడు.

**ముక్తింద దాతీతి ముకుందః** భక్తులకు మోక్షమిచ్చువాడు. ముక్తినిచ్చువాడు. ముక్తి అంటే – విముక్తి. సంసార బంధనాల నుండి విముక్తి. నేను, నాది అనే అహంకార మమకారాల నుండి విముక్తి అరిషడ్వర్గాల నుంచి విముక్తి.

అహంకార మమకారాల నుండే కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యము లనబడే అరిషడ్వర్గాలు జనిస్తాయి. వీటినుంచి విముక్తి పొందటమే ముక్తి. సంసారలం పటంలో పడిన మానవుడు ఈషణత్రయముతో సతమతమవుతుంటాడు. ఈషణత్రయము అనగా 1. ధనేషణ, 2. దారేసణ, 3. పుత్రేషణ ధనం సంపాదించాలనే కాంక్ష. నా భార్య, నా పిల్లలు నా సంసారము అనే భ్రాంతి. ఏది నీది. ఊపిరాడే వరకే నేను నాది అనే మమకారాలు.

ఆ ఊపిరి కాస్తా ఆగిపోతే ? అందుకే శంకర భగవత్పాదులవారు తమ **భజ గోవింద శ్లోకాలలో**

**యావత్పవనోనివసతి రేహే తావత్ పృచ్ఛతి కుశలం గేహే ।**
**గతవతి వాయౌ దేహాపాయే భార్యా భిభ్యతి తస్మిన్కాయే ॥**

శరీరంలో ఊపిరి ఉన్నంతవరకే, ఇంటిలోని వారందరూ కుశలము కనుక్కుంటారు. ఆ ఊపిరి ఆగిపోతే, ఆ కళేబరాన్ని సమీపించటానికి ఇంత కాలం నీతో కాపరం చేసిన భార్యకూడా భయపడుతుంది. కాబట్టి ఎవరు నీ వాళ్ళు ?

**అర్థమనర్థం భావయనిత్యం నాస్తి తతస్సుఖలేశస్సత్యమ్ ।**
**పుత్రాదపి ధనభాజాం భీతి సర్వత్రైషా విహితారీతిః ॥**

ధనమనేది ఎప్పుడూ అనర్థాన్నే కలిగిస్తుంది. ధనమువల్ల సుఖము లేదు. ధనవంతుడు తన పుత్రులకు కూడా భయపడతాడు. కాబట్టి లోకంలో నేను, నాది అనేవి ఏవీ లేవు. ఉన్న బంధాలన్నీ బ్రతికి ఉన్నంతవరకే. ఎప్పుడైతే శరీరంలోని జీవం పైకి వెళ్ళిపోయిందో, అప్పుడే ఈ బంధాలన్నీ తెగిపోతాయి.

ఈ బంధాలన్నీ కేవలము అజ్ఞానమువల్లనే కలుగుతాయి. అటువంటి అజ్ఞానాన్ని పారద్రోలి జ్ఞానాన్ని కలుగచేసేది పరమేశ్వరి. జ్ఞానము అంటే ముఖ్యంగా మూడు సూత్రాలు.

1. చరాచర జగత్తంతా పరమేశ్వరుడు వ్యాపించి ఉన్నాడు.

2. పరమేశ్వరుడు అన్నింటి యందు అంతర్యామిగా ఉన్నాడు.

3. అతడు చిదానందరూపుడు. ఆనందమయకోశంలో ఉంటాడు. అదే కారణ దేహము కాబట్టి పరమేశ్వరుడు ఆనందస్వరూపుడు 'అహంబ్రహ్మాస్మి' నేనే పరమేశ్వరుణ్ణి

అని తెలుసుకోవటమే ముక్తి. ఆత్మజ్ఞానం పొందినవాడిని ఐహిక సుఖాలు బాధించవు. సంసార సుఖాలు ఉండవు. అతడికి సంకల్పసిద్ధి కలుగుతుంది. వాక్సుద్ధి గలుగుతుంది. జగత్తంతా తనలోనే ప్రతిబింబిస్తుంది.

ఈ విధంగా పరబ్రహ్మ స్వరాన్ని గురించి తెలుసుకున్న జ్ఞానులు కూడా ఆ పరబ్రహ్మ స్థితికి చేరతారు. వారికి సాయిజ్యం లభిస్తుంది. ఈ రకంగా తన భక్తులకు ముక్తినిచ్చేవాడు.

## 516. అమితవిక్రమః

అతిపరాక్రమవంతుడు. 614వ నామము కూడా ఇదే.

**తేషాం ధ్యానాను సంధేయ  తత్వ సందోహ ధారిణీమ్ ।**
**తాంశక్తిం ధృత వాన్యోసౌ స్మృతో హ్యమితవిక్రమః ॥**

భక్తులు పరమేశ్వరుని ధ్యానించేటప్పుడు వారు అనేకమైన తత్త్వాలను సంధిస్తుంటారు. వాటన్నింటినీ ఆధారశక్తి అనబడే అపరిమిత బలపరాక్రమాలతో ధరిస్తుంటాడు.

**అమితః విక్రమః యస్యసః అమిత విక్రమః** భక్తులు తనను ధ్యానించేటప్పుడు చేసే మంత్ర, తంత్ర యోగాలను భరించగల బలవంతుడు.

ఇతని పరాక్రమము వర్ణించనలవి కాదు. వామనావతారంలో మూడడుగుల నేలను దానంగా కోరి, ఆ నేలను దానం తీసుకోగానే తన ఆకారాన్ని చెప్పలేనంతగా పెంచేసి, కొలవటానికి వీలులేనంత పెద్దపెద్ద పాదాలతో భూమ్యాకాశాలను ఒక్కసారిగా ఆక్రమించిన పరాక్రమవంతుడు.

అనేకమంది రాక్షసులను ఒక్క చేత్తో ఎదిరించిన శౌర్యవంతుడు.

గోవర్ధన గిరిని చిటికెన వ్రేలితో ఎత్తి గోపాలకులను రక్షించినవాడు.

బాలప్రాయంలోనే విషపూరితస్తన్యమివ్వటానికి వచ్చిన పూతనను పాలతోపాటు ప్రాణాలు కూడా లాగేసిన మహానుభావుడు.

అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'అమితవిక్రమః' అనబడుతున్నాడు.

## 517. అంభోనిధిః

సముద్రమునందు నివశించేవాడు.

**ఆధారశక్తి కమఠస్వరూపేణార్ణ వాంబసి ।**
**నిధీయతే స్వయం యేన సహ్యాంభోనిధి రుచ్యతే ॥**

ఆధారశక్తితో తాబేలు రూపం ధరించి సముద్రము నందున్నవాడు.

**అంభసి నిధీయతే ఇతి అంభోనిధిః**

లోకాలను ఉద్ధరించటం కోసం ఆదికూర్మమై సముద్రమునందున్న వాడు.

అంభః అనగా – దేవతలు, మనుష్యులు, పితరులు, అసురులు.

అంభాసి – దేవతలు మొదలైన వారు ఇతని యందు ఉన్నారు.

పరమేశ్వరుడు సర్వవ్యాపి జగత్తునంతా ఆవరించి ఉన్నాడు. అందుచేత దేవతలు, మానవులు, అసురులు అందరూ అతనిలోనే ఉన్నారు. అందుచేతనే అంభస్సులు అన్నీ తనయందే ఇమిడి ఉన్నాయి కాబట్టి 'అంభోనిధిః' అనబడుతున్నాడు.

**భగవద్గీత**లోని పదవ అధ్యాయము **"విభూతియోగము"**లోని 24వ శ్లోకము

**పురోధసాం చ ముఖ్యం మాం విద్ధిపార్థ బృహస్పతిమ్ ।**
**సేనానీ నామహం స్కందః సురసామస్మి సాగరః ॥**

అర్జునా ! పురోహితులలో బృహస్పతిని, సేనాపతులలో కుమారస్వామిని, జలాశయములలో సాగరుడను నేను.

భూమిమీదున్న జలాశయాలలో సముద్రమే గొప్పది. విశాలమైనది. లోతైనది. విశిష్టమైనది. అందుచేతనే సాగరాన్ని భగవానుడు తన రూపముగా చెప్పాడు.

## 518. అనంతాౖఽౖఽత్మా

అనంతుని యొక్క ఆత్మ.

**కమఠేనోపరిజగదాధార స్తంభ బోగినః ।**
**స్వరూపేణ స్థితోయోౖఽసౌ అనంతాత్మా ప్రకీర్తితః ॥**

సమస్త జగత్తుకు ఆధారమైన ఆదికూర్మము పైన ఆదిశేషుని రూపంలో అతనికి అంతరాత్మగా ఉన్నవాడు.

**అనంతస్య ఆత్మా అనంతాత్మా**

ఆదికూర్మముపైన ఉన్న, సమస్త జగత్తుకు ఆధారమైన ఆదిశేషుని ఆత్మస్వరూపుడు.

**ఆధారశక్తే రూపరి విమలం దీప్తవిగ్రహమ్**

**జ్వాలాశత సమాకీర్ణం శంఖచక్ర గదాధరమ్**

**అనంత్ శమ్ న్యశేత్**

ఆధారశక్తి మీద నిర్మలమై ప్రకాశిస్తున్న దివ్యమంగళస్వరూపుడు, అనేక జ్వాలలతో కూడిన వాడు, శంఖచక్రగదాధారి అయి ప్రకాశిస్తున్న అనంతేసుని హృదయస్థానంలో స్థాపించాలి. అని **జయసంహిత**లో చెప్పబడింది.

అనంతమైన ఆత్మస్వరూపి. పరమేశ్వరుడు ఆత్మస్వరూపి అని ముందే చెప్పటం జరిగింది. అయితే ఆ ఆత్మ అనంతమైనది. జగత్తంతా వ్యాపించినది. ఆది మధ్యాంతములు లేనిది. జరామృత్యువులు లేనిది రూపము లేనిది. సర్వజీవులయందు అంతర్యామిగా ఉండేది. గతంలో ఉన్నది. ఇప్పుడు ఉన్నది, రేపు ఉండేది అంటే భూతభవిష్యద్వర్తమాన కాలాల కోసం బంధం లేనిది. త్రికాలాతీతమైనది. దానిని కొలవటానికి వీలులేనిది. అందుకే అది అనంతమైనది. కాబట్టే శ్రీమన్నారాయణుడు 'అనంతాత్మా' అనబడుతున్నాడు.

## 519. మహోదధిశయః

మహాసముద్రమందు శయనించినవాడు

**తస్మిన్ననంత పర్యంకే సముద్రే శయనాచ్చయః ।**
**మహోదధియశః ఖ్యాతో దశార్ణో మనురుత్తమః ॥**

మహాసాగరం మధ్యలో శేషపాన్పుపై పవళించినవాడు. ఈ నామము దశాక్షరి మహామంత్రము.

**మహాదధౌశేతే ఇతి మహోదధిశయః**

ప్రళయకాలంలో శేషశయనుడై సముద్రంలో విశ్రమించాడు.

ప్రళయము సంభవించినప్పుడు జగత్తులోని జీవులన్నీ నాశనమైపోయినాయి. భూమి నీటిలో కలిసిపోయింది. నీరు అగ్నిలో కలిసిపోయింది. అగ్ని వాయువులో కలిసిపోయింది. వాయువు ఆకాశంలో కలిసిపోయింది. ఆకాశం పరమేశ్వరునిలో లీనమయింది. ఈరకంగా జగత్తంతా పరమాత్మలో లీనమయింది. జీవులన్నీ కూడా తమ తమ కర్మలతో కలిసి ఆ పరమేశ్వరుని యందు లీనమై పోయినాయి. ఆ సమయంలో శ్రీమహావిష్ణువు శేషశాయియై సముద్రంమీద విశ్రమించాడు. అందుకే 'మహోదధిశయః' అనబడుతున్నాడు.

## 520. అంతకః

నాశనము చేయువాడు.

**అంతంకరోతి జగతో యోసావంతక ఈరితః**

జగత్తుకు ప్రళయము ప్రసాదించేవాడు.

**అంతం కరోతీతి అంతకః** ప్రళయ కాలంలో సర్వము నాశనము చేయువాడు. పరమేశ్వరుడు జగత్కారణుడు. జగద్వ్యాపారము చెయ్యటం అతని లక్షణము. అదే సృష్టి స్థితిలయాలు.

| | | |
|---|---|---|
| బ్రహ్మరూపంలో | – | సృష్టి కార్యము |
| విష్ణువు రూపంలో | – | స్థితికార్యము |
| రుద్రుని రూపంలో | – | సంహారము |

చేస్తాడు పరమేశ్వరునికి ఈ మూడు పనులే కాక ఇంకా రెండు కూడా ఉన్నాయి. అవే తిరోదానము, అనుగ్రహము. అందుకే లలితాసహస్రంలో

| | | |
|---|---|---|
| సృష్టికర్త్రీ | – | బ్రహ్మరూపా |
| గోప్త్రీ | – | గోవిందరూపిణీ |
| సంహారిణీ | – | రుద్రరూపా |
| తిరోదానకరీ | – | ఈశ్వరీ |
| సదాశివా | – | అనుగ్రహదా |

అని చెప్పబడింది. వీటినే 'పంచకృత్యాలు' అంటారు. అందులో ఒకటి లయము. మహాప్రళయం వచ్చినప్పుడు జగత్తంతా పరమేశ్వరునిలో లయం అయిపోతుంది. ఈ ప్రళయాన్ని కల్పించేది ఆ పరమేశ్వరుడే. అందుకే శ్రీమన్నారాయణుడు 'అంతకః' అనబడుతున్నాడు.

## 521. అజః

భగవంతుడు, బ్రహ్మ, విష్ణువు, శివుడు. అకారార్థమైనవాడు. 95, 204 నామాలు కూడా ఇదే.

**తత్త్వావసానకాలే చ ప్రణవ ప్రకృతిత్వతః ।**
**స్మర్తవ్యత్వాదజః ప్రోక్తః షడర్ణో హ్యూర్మినాశకః ॥**

ప్రళయం జరిగినప్పుడు అన్ని తత్త్వములు నశించిపోతాయి. అటువంటి సమయంలో 'ఓం'కారానికి ఆదియైన అకారముచే చెప్పబడువాడు. ఈ నామము షడక్షరి.

ప్రళయకాలంలో జగత్తంతా నాశనమయిపోతుంది. ఇంక ఏమీ మిగలదు. సృష్టికి కారణమైన తత్త్వాలు కూడా నశించిపోతాయి. అప్పుడు ఆ పరమేశ్వరుని రూపమైన

ప్రణవము మిగులుతుంది. పరమేశ్వరుడు నాద స్వరూపుడు. నాదము నుంచే శబ్దము వచ్చింది. ఆ శబ్దమే ఓంకారము. అదే పరమేశ్వరునికి ప్రతిరూపము. ఈ ఓంకారము అకార ఉకార మకారముల కలయిక. ఇందులోని మొదటి అక్షరము అకారము. అందుచేత ఆ పరమేశ్వరుడు అకారముతో చెప్పబడతాడు.

**భగవద్గీత**లోని పదవ అధ్యాయం **'విభూతియోగము'**లోని 33వ శ్లోకము.

**అక్షరాణామకారోஉస్మి ద్వంద్వః స్సామాసికస్య చ ।**
**అహమేవాక్షయః కాలో ధాతాஉహం విశ్వతోముఖః ॥**

అర్జునా ! అక్షరములలో 'అ' కారమును నేను. సమాసములలో ద్వంద్వమును నేను. మహాకాలమును నేను. విశ్వతోముఖుడైన విరాట్పురుషడను నేను. అందరిని పోషించువాడను నేనే.

అ నుంచి క్ష వరకు ఉండే అక్షరములన్నింటిలోనూ అకారము మొదటిది. అది అన్నింటియందు, అంతటా వ్యాప్తి చెందింది. **ఐతరేయ బ్రాహ్మణంలో అకారోవై సర్వావాక్** వాక్కంతా అకార స్వరూపమే. అందుచేతనే అకారము వర్ణములన్నింటి యందు శ్రేష్ఠమైనది. అందుకే భగవానుడు అకారము తన విభూతి అన్నాడు.

**తస్యప్రకృతి లీనస్వయః పరస్సమహేశ్వరః**

ప్రకృతిలో లయించిన దాని అర్ధమెవరో, అతడే పరమేశ్వరుడు.

'అ' అనగా – విష్ణువు. **అత్ అజాయత ఇతికామః**

**అజః – ఇత్యుచ్యతే** అ నుంచి జనించినవాడు కాముడు. విష్ణువు కుమారుడు. (మన్మథుడు)

**భగవద్గీత**లోని ఏడవ అధ్యాయం **'జ్ఞానయోగము'**లోని 11వ శ్లోకము

**బలం బలవతాం చాహం కామరాగ వివర్జితమ్ ।**
**ధర్మావిరుద్ధోభూతేషు కామోஉస్మి భరతర్షభః ॥**

అర్జునా ! బలవంతులలో కామరాగరహితమైన బలాన్ని నేను. సమస్త భూతములందు శాస్త్ర సమ్మతమైన కామమును నేను.

అందుచేత అజుడు అంటే కామము. ఈ రకంగా సర్వత్రా వ్యాపించిన 'అకారము, అన్ని భూతములయందు ఉన్న కామము ఆ శ్రీమన్నారాయణుడే. అందుకే అతడు అజః అనబడుతున్నాడు.

# 522. మహాఽర్హః

పూజించదగినవాడు.

**స్వరూపాది కృతార్థేన తారేణాత్మ నివేదనమ్ ।**

**మహం పూజాం అర్హతీతి మహార్హ ఇతి కథ్యతే ॥**

ఆత్మజ్ఞాన సముపార్జనకు ఉపయోగించే ప్రణవ స్వరూపంగా ఆత్మను అర్చించటమే 'పూజ' అనబడుతుంది. అటువంటి పూజకు తగినవాడు.

**మహమ్ అర్హతీతి మహార్హః** ప్రణవముచే పూజింపబడువాడు.

**ఆత్మబోధోపనిషత్తు**లో ప్రత్యగానంద స్వరూపుడు, ఓంకార రూపుడు అయిన పరమ పురుషుడే పరబ్రహ్మ. అకార ఉకార మకారము ఆ కలయికయే ప్రణవము. అదే ఓంకారము. ఈ ప్రణవాన్ని జపించే బ్రహ్మజ్ఞాని జన్మ సంసారబంధనాలనుంచి విముక్తి పొందుతున్నాడు. **ఓం నమోనారాయణాయ శంఖచక్రగదాధరాయ** అనే మంత్రాన్ని జపిస్తున్న ఉపాసకుడు వైకుంఠము పొందుతాడు.

పద్మమువంటి బ్రహ్మపట్టణము తటిల్లతవలె దీపమువలె ప్రకాశిస్తున్నది. దేవకీపుత్రుడే పరబ్రహ్మ. మధుసూదనుడు, పుండరీకాక్షుడు, విష్ణువు, అచ్యుతుడు, ఆ పరబ్రహ్మయే. సర్వభూతములందు ఉన్నాడు. అతడే నారాయణుడు, కారణ పురుషుడు. అతడే ఓంకారము" అని చెప్పబడింది.

కాబట్టి పరమపదము పొందగోరేవారు ఓంకారాన్నే అర్చించాలి. అటువంటి అర్చనకు తగినవాడు కాబట్టే శ్రీమన్నారాయణుడు 'మహాఽర్హః' అనబడుతున్నాడు.

పరమేశ్వరుడే ముక్తిప్రదాత. అందుచేతనే అతన్ని పరమేశ్వర స్వరూపమైన ప్రణవంతో అర్చించాలి. ఆరకంగా ప్రణవంతో పూజించబడే శ్రీమన్నారాయణుడు మహార్హః అనబడుతున్నాడు.

# 523. స్వాఽభావ్యః

స్వామిగా ఉండేవాడు.

**మంత్రేణానే నాత్మభిస్తు స్వభూతై రాభిముఖ్యతః**

**అవశ్యం భావనీయ త్వాత్ స్వాభావ్యః పరికీర్తితః ॥**

తన సొత్తుగా ఉన్న జీవులు ప్రణవ మంత్రాన్ని జపిస్తూ తనను ధ్యానించటానికి తగినవాడు.

**స్వైః భావ్యతే ఇతిస్వా భావ్యః** ప్రణవంచేత భక్తులు ఆ పరమేశ్వరుని ఆశ్రయిస్తారు.

నిరంతరము స్వరూపజ్ఞానముతో విరాజిల్లేవాడు. పరమేశ్వరుడు చైతన్యరూపుడు కాబట్టి స్థిరుడై, స్వభావస్థితి యందుండి, పూజకు అర్హమైనవాడు. అంటే అతడు జ్ఞానస్వరూపుడు. ఎల్లప్పుడూ అపరిమితమైన జ్ఞానంతోనే ఉంటాడు. మోక్షార్థులు అటువంటి జ్ఞానస్వరూపుణ్ణే పూజించాలి.

అందుకే తనకు అంకితమైన భక్తులచేత, ఎల్లవేళలయందు తన్మయత్వంతో పూజించబడతాడు. అందుకే శ్రీమన్నారాయణుడు 'స్వాభావ్యః' అనబడుతున్నాడు.

## 524. జితాఽమిత్రః

శత్రువులను జయించినవాడు.

**ఏతద్రహస్య విజ్ఞాన నిరోధిమమతాదయః**

**జితాస్తేషా మనేనేతి జితామిత్రోఽష్ట వర్ణకః**

తన భక్తులు ఈ రకమైన రహస్యార్థాలు తెలుసుకోవటానికి వీలుగా వారి అహంకార మమకారాలను పోగొట్టేవాడు. ఈ నామము అష్టాక్షరీ మంత్రము అహంకారాన్ని పోగొడుతుంది.

**జితాః అమిత్రాః యేనసః జితామిత్రః** రహస్యార్థాలను తెలుసుకోవటానికి వీలుగా వారి అహంకార మమకారాలను హరించేవాడు. **భగవద్గీత**లోని 3వ అధ్యాయము **'కర్మయోగము'**లోని 37 నుండి 43 వరకు గల శ్లోకాలలో

**కామ ఏషక్రోధ ఏష రజోగుణ సముద్భవః**

**మహాశనో మహాపాప్మా విద్ధ్యేనమిహ వైరిణమ్ ॥**

రజోగుణము నుంచి ఉత్పన్నమయ్యేది కామము. ఇదే క్రోధంగా మారుతుంది. ఇది మహాశనము. అనుభవించటంవల్ల ఇది చల్లారదు. అంతులేని పాపకర్మలు చెయ్యటానికి ఇదే ప్రేరణ చేస్తుంది. ఇది పరమ శత్రువు. కామక్రోధాలు రెండూ శత్రువులే. అయితే కామం గనక నశిస్తే, క్రోధము దానంతట అదే నశిస్తుంది.

**ధూమేనావ్రియతే వహ్నిః యథాఽదర్శో మలేన చ ।**

**యథోల్బేనావృతో గర్భః తథా తేనేదమావృతమ్ ॥**

పొగచేత అగ్ని, దుమ్ముచేత అద్దము, మాయచే గర్భము కప్పి వేయబడినట్లుగా జ్ఞానము కామముచే ఆవరించబడి ఉంటుంది.

**ఆవృతం జ్ఞానమేతేన జ్ఞానినో నిత్యవైరిణా ।**
**కామరూపేణ కాంతేయ దుష్పూరేణానల లేన చ ॥**

అర్జునా ! కామము అగ్నితో సమానమైనది. అది ఎన్నటికీ చల్లారదు. జ్ఞానులకు అది నిత్యవైరి. అది మనుష్యుని జ్ఞానాన్ని కప్పివేస్తుంది.

**ఇంద్రియాణి మనోబుద్ధిః అస్యాధిష్ఠానముచ్యతే ।**
**ఏతైర్విమోహయత్యేష జ్ఞానమావృత్య దేహినమ్ ॥**

ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి, కామమునకు నివాస స్థానాలు. కామము మనస్సు, బుద్ధి, ఇంద్రియాల ద్వారా జ్ఞానాన్ని కప్పివేసి జీవాత్మను మోహంలో పడేస్తుంది.

**తస్మాత్త్వ మింద్రియాణ్యాదౌ నియమ్య భరతర్ష భ ।**
**పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాన నాశనమ్ ॥**

కాబట్టి అర్జునా ! మొదట ఇంద్రియాలను వశపరచుకోవాలి. తరువాత జ్ఞాన విజ్ఞాన విషయాలను నశింపచేసే ఈ కామాన్ని సర్వశక్తులు ఒడ్డి రూపుమాపాలి.

**ఇంద్రియాణి పరాణ్యాహుః ఇంద్రియేభ్యః పరం మనః ।**
**మనసస్తు పరాబుద్ధిః యో బుద్ధేః పరతస్తు సః ॥**

స్థూలశరీరము కన్న ఇంద్రియాలు బలమైనవి, సూక్ష్మమైనవి, శ్రేష్ఠమైనవి. ఇంద్రియాలకన్న మనస్సు, దానికన్న బుద్ధి శ్రేష్ఠమైనవి. ఆ బుద్ధికన్న అత్యంత శ్రేష్ఠమైనది, సూక్ష్మమైనది ఆత్మ.

**ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మాన మాత్మనా ।**
**జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్ ॥**

ఈ విధంగా బుద్ధికన్నా ఆత్మసూక్ష్మము, బలీయము, మిక్కిలి శ్రేష్ఠము అని తెలుసుకొని, బుద్ధిద్వారా మనసును వశపరచుకుని కామాన్ని నిర్మూలించాలి.

ఈ రకంగా కామక్రోధాలను జయించాలి అని చెప్పబడింది.

శత్రువులను జయించినవాడు. అరిషడ్వర్గాలనబడే అంతః శత్రువులను జయించిన వాడు. రావణ కుంభకర్ణాది బాహ్య శత్రువులను జయించినవాడు. అందుకే శ్రీమన్నారాయణుడు 'జితామిత్రః' అనబడుతున్నాడు.

# 525. ప్రమోదనః

ప్రమోదము గల్గించువాడు.

**ధ్యానాసక్తేషు భక్తేషు మోదమానః ప్రమోదనః**

తనను శ్రద్ధతో ధ్యానించే భక్తుల విషయంలో  మిక్కిలి ఆనందించువాడు.

**ప్రమోదయతీతి ప్రమోదనః** సంతోషము కలిగించువాడు. తనతో అనుసంధానము ఏర్పరచుకొన్న వారికి మహదానందము కలిగించువాడు.

నిరంతరము పరమేశ్వరుని ధ్యానించే యోగులు కుండలినీ శక్తిని జాగృతం  చేస్తారు. అప్పుడు అది గ్రంధిబేధనము చేసి సహస్రారము చేరుతుంది. అంటే

శరీరంలో షట్చక్రాలున్నాయి. వాటిలో రెండు చక్రాల తరువాత ఒక గ్రంధి ఉంటుంది. గ్రంధి అనగా  కణుపు, ముడి అని అర్థము.

ఆధార, స్వాధిష్ఠానాల తరువాత – బ్రహ్మగ్రంధి

మణిపూర, అనాహతాల తరువాత – విష్ణుగ్రంధి

విశుద్ధి, ఆజ్ఞాచక్రాల తరువాత – రుద్రగ్రంధి

ఉంటాయి. నిద్రావస్థ నుంచి మేల్కొన్న కుండలినీ శక్తి సుషుమ్నా మార్గం గుండా బయలుదేరి, గ్రంధిత్రయాన్ని చేధించి అనగా షట్చక్రాలను దాటి, సహస్రారం చేరి అక్కడ ఉన్న సహస్రదళ కమలంలోని 'దుద్దు'ను తన నోటితో కరచి పట్టుకుంటుంది. అప్పుడు దాని పంటిగాట్ల వల్ల ఏర్పడిన రంధ్రాల గుండా సహస్రారంలో ఉన్న అమృతము క్రిందికి జాలువారి యోగి శరీరంలోని 72 వేల నాడీ మండలాన్ని తడుపుతుంది. అప్పుడు యోగి పొందే ఆనందము అనిర్వచనీయము, అనుభవైక వేద్యము.

అదే జీవాత్మ పరమాత్మల అనుసంధానము తనతో అనుసంధానము ఏర్పరచుకొన్న వారు అంటే ఈ రకంగా యోగప్రక్రియ చేసినవారికి మహదానందం కలిగిస్తాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'ప్రమోదనః' అనబడుతున్నాడు.

ఈ రకంగా  శ్రీమహావిష్ణువే శ్రీరామచంద్రుడు అంటూ రామావతార వృత్తాంతాన్ని పూర్తిచేశాడు. రత్నాకరుడు.

# 36. కపిలమూర్తి

"గురువుగారూ ! కపిలుడు అంటే ఎవరు ? ఆయనకూడా శ్రీమహావిష్ణువు అవతారమేనా ? వివరించండి" అన్నాడు నారాయణభట్టు. వివరించటం ప్రారంభించాడు రత్నాకరుడు.

ప్రజలను సృష్టించటంకోసం బ్రహ్మదేవుడు కొంతమంది మానసపుత్రులను సృష్టించాడు. వారే ప్రజాపతులు. వారిలో 'కర్దముడు' బ్రహ్మయొక్క ఛాయనుంచి జన్మించాడు. కర్దముడు విష్ణువును గురించి కొన్ని వేల సంవత్సరాలు తపస్సు చేశాడు. అతని తపస్సుకు మెచ్చి శ్రీమహావిష్ణువు వివిధాలంకారభూషితుడై, గరుడవాహనమెక్కి, పీతాంబరధారియై కర్దముడికి సాక్షాత్కరించి "కర్దమా ! స్వాయంభువమనువు కుమార్తె అయిన 'దేవహూతి'ని వివాహమాడు. నేను నీ గర్భాన ఉదయిస్తాను. ఆ తరువాత నీవు సన్యాసం స్వీకరించి సాయుజ్యం పొందుతావు. నేను 'కపిలమూర్తి'గా నీ గర్భాన పుట్టి 'సాంఖ్య'శాస్త్రాన్ని ప్రచారం చేస్తాను" అని చెప్పాడు.

అలా జరిగిన కొద్దిసేపటికే స్వాయంభువ మనువు తనభార్య శతరూప, కుమార్తె దేవహూతిలను వెంట పెట్టుకుని కర్దముని ఆశ్రమం చేరి "మహానుభావా ! నా కుమార్తె దేవహూతి. ఈమెను వివాహమాడవలసినది." అన్నాడు సరేనన్నాడు కర్దముడు, సృష్టిలో శాస్త్రోక్తంగా జరిగిన మొదటి వివాహము వీరిదే.

దేవహూతికి కర్దముని వలన తొమ్మిదిమంది కుమార్తెలు, ఒక కుమారుడు కలిగారు. ఈ కుమార్తెలందరినీ ప్రజాపతులకు ఇచ్చి వివాహం చేశాడు కర్దముడు. ఇతని కుమారుడే కపిలుడు. సాక్షాత్తూ విష్ణ్వంశ సంభూతుడు. విష్ణుమూర్తి అవతారాలలో ఇది అంశావతారము.

కుమార్తెల వివాహం చేసిన తరువాత కర్దముడు కపిలుని దగ్గరకు వెళ్ళి, అతని అనుమతితో సన్యాసం స్వీకరించి కొంత కాలానికి సాయుజ్యం పొందాడు. కపిలుడు సాంఖ్యశాస్త్రాన్ని (దర్శనాన్ని) ప్రచారం చేశాడు.

ఒకనాడు దేవహూతి కపిలుని వద్దకు వెళ్ళి, తనకు జ్ఞానోపదేశము చెయ్యమని కోరింది. అప్పుడు కపిలుడు "ప్రకృతి సత్వరజస్తమోగుణాలను కలిగి ఉన్నది. అది జ్ఞానాన్ని కప్పివేస్తుంది. పురుషుడు దానికి మోహితుడు అవుతాడు. ఆ మోహంలో ప్రకృతి వేరు తాను వేరు అని గుర్తించలేడు. ప్రకృతి గుణాలవల్లనే పనులుజరుగుతాయి. వాటికి తానే కర్త అని భావిస్తాడు. అందుచేత అతడికి జన్మమృత్యు జరాదులు ప్రాప్తిస్తాయి. సుఖ దుఃఖాల అనుభూతి మాత్రమే ముఖ్యమవుతుంది. అందువల్ల పురుషుడు ప్రకృతికి అతీతుడు.

ప్రకృతి త్రిగుణాత్మకమైనది. కాబట్టి అది బ్రహ్మ కాదు. అది దేని పరిణామము కూడా కాదు. అవ్యక్తము, నిత్యము, సదసదాత్మకము, కార్యకారణరూపమైనది. ఈ మతం ప్రకారము తత్త్వాలు 24 అవి :

| | | |
|---|---|---|
| పంచభూతాలు | - | 5 |
| తన్మాత్రలు | - | 5 |
| ఇంద్రియాలు | - | 10 |
| అంతఃకరణ చతుష్టయం | - | 4 |
| వెరసి | - | 24 |

ప్రకృతి గుణములు క్షోభపడినప్పుడు చిచ్ఛక్తి రూపమైన తన వీర్యమును పరమ పురుషుడు ప్రకృతి అనే యోనియందు స్థాపించాడు. అప్పుడు ప్రకృతి నుంచి మహత్తత్త్వము పుట్టింది. దానినుంచి అహంకారము పుట్టింది. ఈ అహంకారమే సంకర్షణుడు. అహంకారము మూడు రకాలయింది. అందులో

1. మనస్తత్త్వము (అనిరుద్ధుడు)
2. బుద్ధి, ఇంద్రియాలు (ప్రద్యుమ్నుడు)
3. శబ్దతన్మాత్రము

ఈ శబ్దంనుంచి స్పర్శ, రూపము, రసము, గంధము ఆవిర్భవించాయి. పంచ తన్మాత్రలు మహత్తత్త్వము, అహంకారము అనే ఈ ఏడింటిలోను భగవంతుడు ప్రవేశించగా, దానిలో నుంచి ఒక అండము పుట్టింది. ఈ అండము నుంచి విరాట్పురుషుడు జన్మించాడు. అతని

| | | | | | |
|---|---|---|---|---|---|
| ముఖము | - | అగ్ని | చేతులు | - | ఇంద్రుడు |
| ముక్కుపుటాలు | - | వాయువు | కాళ్ళు | - | ఉపేంద్రుడు |
| కనులు | - | సూర్యుడు | నాడులు | - | నదులు |
| చెవులు | - | దిక్కులు | కడుపు | - | సముద్రము |
| చర్మము | - | ఓషధులు | మనస్సు | - | చంద్రుడు |
| శిశ్నము | - | జలము | బుద్ధి | - | బ్రహ్మ |
| గుదము | - | మృత్యువు | చిత్తము | - | క్షేత్రజ్ఞుడు |
| | | | అహంకారము | - | శివుడు |

ఇతడు నిర్గుణుడు. అయినప్పటికీ ప్రకృతి గుణములతో సంబంధము పెట్టుకుని అహంకార మోహితుడవుతాడు. కర్మదోషంవల్ల జన్మలెత్తి సంసారచక్రంలో పడి తిరుగుతాడు. జీవియొక్క బంధమోక్షాలకు మనసే ప్రధానము. కాబట్టి భక్తి, వైరాగ్యాలతో మనస్సును లొంగదియ్యాలి. యోగసాధన చెయ్యాలి. ఏకాగ్రతతో భగవంతుని కథలు వినాలి. సర్వజీవుల యందు సమభావము కలిగి ఉండాలి. బ్రహ్మచర్యము, మౌనవ్రతము పాటిస్తూ, స్వధర్మాన్ని ఆచరించాలి. మితాహారం తీసుకుంటూ ఏకాంతవాసంచెయ్యాలి. అహంకారమమకారాలను విడిచిపెట్టాలి ఇలా చేసినవారికి ప్రకృతి పురుషుల తత్త్వము అవగతమవుతుంది.

అగ్నిలో దాచిన అరణి, అగ్నివల్ల కాలిపోతుంది. అలాగే ఆత్మను మరుగుపరచిన ప్రకృతి ఆత్మజ్ఞానముతో తొలగిపోతుంది. అంటే జ్ఞానమువల్ల అవిద్యనశిస్తుంది. సాధనవల్ల ఆత్మ ప్రతిబంధకమైన ప్రకృతి క్రమక్రమంగా పురుషుని తొలగిపోతుంది.

నిద్ర పోయినవాడికి కలలు వస్తాయి. మేలుకున్న వాడికి కలలు రావు. అలాగే అజ్ఞానాకి సంసారబంధనాలుంటాయి. జ్ఞానియైనవాడు దృష్టిని భగవంతుని మీద కేంద్రీకరించి అంతర్ముఖుడు కావాలి. అప్పుడు ఆత్మతత్త్వము బోధ పడుతుంది. అప్పుడు ఆత్మ సాక్షాత్కారమవుతుంది. పరమానందం కలుగుతుంది. ఆ స్థితిలో శరీరము నశించి కైవల్యపదము చేరతాడు." అంటూ తల్లికి జ్ఞానోపదేశం చేశాడు కపిలమూర్తి.

పరమేశ్వరుడు ఆనందస్వరూపుడు. అది శాశ్వతమైన ఆనందము. అదే బ్రహ్మానందము. పరమానందము. సర్వకాల సర్వావస్థలయందు కూడా ఆరకమైన ఆనందాన్ని తాను పొందుతూ, తనను ఆశ్రయించిన వారికి కూడా ఆ ఆనందాన్ని పంచి ఇచ్చేవాడు. ఆనందము నందున్న భక్తులు, భోగవస్తువులు, భోగోపకరణముల చేత సమృద్ధుడుగా ఉన్నవాడు. సత్యమైన వ్యాపారము గలిగినవాడు. ఆశ్రుతులను మొదట నుంచీ, చివరిదాకా ఒకేరీతిగా నడిపించువాడు. మూడు వేదములందు వ్యాపించి ఉన్నవాడు. జాగ్రస్వప్న సుషుప్తులయందు పూర్తిగా వ్యాపించినవాడు. అతడు వేదవిదుడు. సాంఖ్యమతాన్ని ప్రచారం చేసిన కపిలాచార్యుడు. అంశుమంతుని ప్రార్థన లాలకించి తనయందు అపరాధము చేసిన సగరపుత్రులను రక్షించినవాడు. అతడే ఈ ధరా మండలానికి ప్రభువు.

ఈ విషయాలన్నీ 526 నుంచి 533 వరకు నామాలలో వివరించటం జరిగింది. ఇక నామాలను చూద్దాం.

# 526. ఆనందః

ఆనందము గలవాడు.

**వల్ల్యామానంద సంజ్ఞాయాం అవాంగ్మానసగోచరః ।**
**ఆనందో యస్స యస్యాస్తీ త్యానందః పరికీర్తితః ॥**

ఆనందవల్లి అనే ఉపనిషత్తునందు చెప్పబడిన మనసుకు, వాక్కుకు అందని ఆనందము గలవాడు.

**ఆనందః అస్యాస్తీతి ఆనందః**

**తైత్తిరీయోపనిషత్తు**లో చెప్పినట్లుగా మనోవాక్కులకు అగోచరమైన ఆనందము గలవాడు. ఆనందమే స్వరూపముగా గలవాడు. ఆనందాన్ని ఆధారంగా చేసుకునే అన్ని జీవులు జీవిస్తున్నాయి.

**తైత్తిరీయోపనిషత్తు** మూడు భాగాలుగా ఉంటుంది.

1. శిక్షావల్లి 2. ఆనందవల్లి 3. భృగువల్లి.

దీనిలో రెండవ భాగము ఆనందవల్లి ఇక్కడ 'పరమేశ్వరుడు ఆనందమయుడు' అనే విషయాన్ని వివరించాడు.

ఆనందమయుడే విజ్ఞానమయునికి ఆత్మ. జ్ఞానమయుని లోపల ఆనంద మయుడు ఉన్నాడు. చరాచర జగత్తంతా బ్రహ్మమే. ఆకాశానికి కారణం బ్రహ్మ. సృష్టికి ముందు అంతా శూన్యంగా ఉండేది. ఆ శూన్యంలో పరబ్రహ్మ ఒక్కడే ఉండేవాడు. అతడే ఈ నామరూపాత్మకమైన జగత్తు సృష్టించాడు. ఆ స్వయంభువు ఆనందకారకుడు. అతన్ని సాక్షాత్కరింప చేసుకున్నవాడు ఆనందం పొందుతున్నాడు. దహరాకాశంలో గనక ఆ పురుషుడులేకపోతే ఊపిరి పీల్చేదెవరు ? కాబట్టి హృదయ పద్మంలోనే పరమేశ్వరుడున్నాడు. సాధకుడు తానే పరబ్రహ్మ అని తెలుసుంటే భయాలుండవు. బ్రహ్మకు తనకు బేధభావం కలిగితే భయం కలుగుతుంది. బేధదృష్టి గల విద్వాంసుడికి కూడా భయముంటుంది. సృష్టినాశనానికి కారణం ఎవరోఉన్నాడనే భావమే భయానికి కారణం. తాను వేరు బ్రహ్మ వేరు అనే భావం తొలగిపోతేనే సాధకుడికి ముక్తి లభిస్తుంది. అజ్ఞానికి మోక్షం రాదు.

పరబ్రహ్మను గూర్చిన భయంతోనే గాలి వీస్తోంది. సూర్యుడు ఉదయిస్తున్నాడు. ఇంద్రాదిదేవతలు తమ విధులను సక్రమంగా నిర్వహిస్తున్నారు. దేవతలు కూడా సక్రమంగా తమ విధులు నిర్వర్తించటానికి కారణం బ్రహ్మ ఉండటమే. ఈ రకంగా భయానికి

కారణమైన బ్రహ్మమే ఆనందము. ఇది క్షణికానందం కాదు. శాశ్వతానందం. విషయవాంఛలవల్ల కలిగేది లౌకికానందం. ఇది క్షణికం. అనుభవించగానే ఆ ఆనందం తగ్గిపోతుంది. అవిద్య అంటే అజ్ఞానము, విషయ వాంఛలు తగ్గిన కొద్దీ ఆ ఆనందం పెరుగుతుంది. అదే మానవుల, మనుష్య గంధర్వుల, దేవగంధర్వుల ఆనందంగా అభివృద్ధి చెంది స్వాభావికమైన పరిపూర్ణానందంగా మారుతుంది. అదే అద్వైతానందం.

ఈ ఆనందం శ్రోత్రియుడు, (వేద కర్మలనాచరించువాడు) సదాచార సంపన్నుడు, నిష్కాముడు అయిన బ్రహ్మవేత్తయే అనుభవించతగ్గది. ఈ మూడు గుణాలు లేనివాడికి ఆనందం లభించదు.

ఈ లోకంలోని సంపద అంతా యువకుడు, సదాచార సంపన్నుడు, వేదాధ్యాయి, బలమైనవాడు అనుభవించటానికి ఉన్నది. దీన్ని అనుభవించటంవల్ల కలిగే ఆనందము మానుషానందము. మానుషానందునికి నూర్రెట్లు మనుష్య గంధర్వానందము. మనుష్య గంధర్వులంటే మానవులై ఉండి పుణ్యకర్మలచేత గంధర్వత్వం పొందినవారు.

మనుష్య గంధర్వానందానికి నూరురెట్లు దేవగంధర్వానందం. సృష్టికాలంలో దేవ లోకంలో గంధర్వుడుగా పుట్టినవాడు దేవగంధర్వుడు. దేవగంధర్వానందానికి నూరురెట్లు చిరలోక పిత్రానందము. చిరకాలం ఉండే లోకంలో ఉన్న పితృదేవతలు చిరలోక పితరులు.

దానికి నూరు రెట్లు అజానజదేవానందము. ఈ లోకము దేవలోకానికి పైన ఉన్నది. అక్కడి వారు అజానజ దేవతలు, దానికి నూరురెట్లు కర్మ దేవానందము. వైదిక కర్మలు చేసినవారు కర్మ దేవతలు

దానికి నూరురెట్లు దేవానందము. యజ్ఞంలో హవిర్భాగము తీసుకునే 33 మంది దేవతలు.

దానికి నూరు రెట్లు ఇంద్రానందము

దానికి నూరు రెట్లు బృహస్పతి ఆనందము

దానికి నూరురెట్లు ప్రజాపతి ఆనందము (విరాట్పురుషుడు)

దానికి నూరు రెట్లు బ్రహ్మానందం. అతడే మానవులందరిలోనూ ఉన్నాడు.

ఎవరైతే సత్యము, జ్ఞానము, అనంతము అయిన బ్రహ్మ తానే అని తలుస్తాడో, అతడు మరణానంతరము అన్నమయాత్మను పొందుతాడు. తరువాత పంచకోశములను ఒక్కొక్కటిగా దాటుకుంటూ ఆనందమయ కోశములోని పరబ్రహ్మను చేరతాడు.

ఆనంద స్వరూపుడైన బ్రహ్మను మన వాక్కుతో తెలుసుకోలేము. వాక్కుకు అర్థం పరిమితము. కాబట్టి పరిమిత వాక్కులతో అపరిమిత బ్రహ్మను వ్యక్తం చెయ్యలేము. అలాగే మనస్సుకు కూడా బ్రహ్మను పొందే శక్తి లేదు. మనస్సు, వాక్కులకు అతీతమైన బ్రహ్మ జ్ఞానంతో తెలుసుకోవాలి. పరబ్రహ్మను తెలుసుకున్న వారికి ఏమీ అంటవు. అతన్ని ఏమీ బాధించవు. అతనికి అజ్ఞానము, బేదబుద్ధి ఉండవు. అందుచేతనే బాధలుండవు.

అతడికి మంచి చెడులతో సంబంధముండదు. కాబట్టి పాప పుణ్యాలుండవు. నరక భయముండదు.

బ్రహ్మజ్ఞాని పాప పుణ్యాలకు, సుఖదుఃఖాలకు అతీతుడు. కాబట్టి నిప్పులో కాలిపోయిన విత్తనం ఏ రకంగా మొలకెత్తదో, ఆ విధంగా అతని దృష్టిలో పుణ్య పాపాలు శక్తిలేనివై పోతాయి. జన్మరాహిత్యం కలుగుతుంది.

అటువంటి ఆనందాన్నిచ్చేవాడు కాబట్టే శ్రీమన్నారాయణుడు 'ఆనందః' అనబడుతున్నాడు.

## 527. నందనః

ఆనందింపచేయువాడు.

**తమానందం యథోక్తాయాం ముక్తౌ ప్రాపయ్య యస్సదా ।**
**ముక్తానిత్యానందయతే నందనస్సతుకీర్తితః ॥**

ఆనందవల్లిలో చెప్పినటువంటి ఆనందాన్ని జ్ఞానులకు ఇచ్చి వారిని నిరంతరము ఆనందింపచేయువాడు.

**నందయతీతి నందనః** అటువంటి ఆనందాన్ని అదే పరమపదాన్నిచ్చి ముక్తులను ఆనందింప చేయువాడు. సర్వులకు ఆనందము నిచ్చువాడు.

జగత్తులో ఉన్నది సుఖమేకాని ఆనందం కాదు. ఆ సుఖము రెండు రకాలు. క్షణికము, శాశ్వతము. ఐహికమైన భోగాలవలన పొందేది క్షణికమైన సుఖము. ఆ భోగము పొందగానే ఈ సుఖము తీరిపోతుంది. ఆ తరువాత అది దుఃఖానికి దారి తీస్తుంది. ఈ రకమైన సుఖాలు ఎంత అనుభవించినా తనివి తీరవు. ఇంకా ఇంకా పొందాలి అనిపిస్తుంది. కోరిక తీరకపోతే దుఃఖం ప్రాప్తిస్తుంది.

నిత్యము సత్యము అయినది శాశ్వతమైనది బ్రహ్మానందం ఒక్కటే. అది జ్ఞానులకు మాత్రమే లభిస్తుంది. ఆ ఆనందము వర్ణనాతీతము. అనిర్వచనీయము, అనుభవైక వేద్యము. జీవాత్మ పరమాత్మలను అనుసంధానం చేసినవారికే అది ప్రాప్తిస్తుంది. మనోవాక్కాయ

కర్మలచే నిరంతరము తనను ఆరాధించేవారికి మాత్రమే ఈ రకమైన ఆనందాన్ని ఇస్తాడు పరమేశ్వరుడు. అందుకే శ్రీమన్నారాయణుడు 'నందనః' అనబడుతున్నాడు.

శంకర భగవత్పాదులు తమ భజగోవింద శ్లోకాలలో

**యోగరతోవా భోగరతోవా సంగరతో వాసంగవిహీనః ।**
**యస్యబ్రహ్మణి రమతేచిత్తం నందతినందతి నందత్యేవ ॥**

యోగి అయినా, భోగి అయినా, ఏకాంతముగా ఉన్నా, బంధుమిత్రులతో కలసి ఉన్న, పరబ్రహ్మయందు మనసులగ్నము చేసినవాడు ఎప్పుడూ ఆనందం పొందుతాడు." అన్నారు.

## 528. నందః

సమృద్ధుడు.

**భోగ్యైః భోగోపకరణైః ర్భోగై ర్భోకృభిరేవచ ।**
**తస్మిన్ సమృధ్యతే నిత్యం ఇతినందః ప్రకీర్తితః ॥**

భక్తులు, భోగవస్తువులు, భోగసాధనములు భోగములతో నిత్యము పరిపూర్ణుడైనవాడు.

**నందంతి అస్మిన్నితి నందః** సమృద్ధుడు

ఆనందంలో ఉన్న అపరిమిత భోక్తలచేత, భోగవస్తువులచేత భోగోపకరణముల చేత సమృద్ధుడుగా ఉన్నవాడు.

విషయ సంబంధాలు లేనటువంటి భగవానుడు 'నందః' అనబడుతున్నాడు.

**ఛాందోగ్యోపనిషత్తు**లో మానవుడు అనేకమైన పనులు తలబెడతాడు. వాటివల్ల ఆనందం లభిస్తుందని భావిస్తాడు. ఆనందం దొరకదు అనుకుంటే ఏ పనీచెయ్యడు. ఈ ఆనందం వాంఛలో లేదు. వాంఛాపూర్తిలో ఉంది. జగత్తులోని ఏ వస్తువూ అపరిమితా నందాన్ని ఇవ్వలేదు. ఆత్మానందమే పరిపూర్ణానందాన్నిస్తుంది. అపరిమితానందము ఒక్క తురీయావస్త ద్వారానే సాధ్యము. అది ఇంద్రియాల పరిధి దాటిన స్థితి. ఆత్మకు భిన్నంగా ఉన్నవాటిని చూడాలని, వినాలని, తెలుసుకోవాలనుకోవటమే దుఃఖానికి నాంది. ఆత్మస్వతః ప్రజ్ఞతవల్లనే నిలబడి ఉంటుంది. తత్త్వవేత్త అయినవాడు మృత్యువును చూడడు. రోగాన్ని చూడడు. అతడికి జరామృత్యువులు లేవు. జ్ఞానియైన వాడు అన్నిటినీ ఆత్మభావంతో చూస్తాడు. అందుకే అతడు అన్నింటినీ పొందుతాడు. ఆత్మజ్ఞానం పొందటంలో ఉన్న ఆనందం ఇల్లు కట్టినా, సిరిసంపదలు, భోగభాగ్యాలు సమృద్ధిగా ఉన్నా రాదు. ఆత్మజ్ఞాని అన్నింటినీ సమృద్ధిగా ఉన్నవాడు. తనకు తానే ప్రభువు. అతడే సాక్షాత్తూ శ్రీమన్నారాయణుడు.

## 529. సత్యధర్మా

సత్యమగు వ్యాపారము గలవాడు.

**ఆప్తక్రమా ధాన్యప్రాప్తే రార్జవాత్సత్యవర్తనః ।**
**యస్యాత్స సత్యధర్మాచ వస్స్వర్ణ స్సత్యధర్మదః ॥**

ఆశ్రితులను మొదటి నుండి చివర వరకు ఒకే రీతిగా నడిపించువాడు. ఈ నామము అష్టాక్షరీ మంత్రము

**సత్యః ధర్మః యస్యసః సత్యధర్మాత్మా**

తనను ఆశ్రయించిన వారిని సత్యమైన మార్గంలో నడిపించువాడు.

పరమేశ్వరుడు జ్ఞానము, ఆనందము సత్యధర్మములుగా గలవాడు. విషయ సుఖాలు అనిత్యాలు. ఆత్మానందమే నిత్యము. సత్యము, అహింస, కరుణ, త్యాగము, భూతదయ అనేవి ధర్మసత్యాలు. పరమేశ్వరునియందు ఈ ధర్మాలన్నీ పరిపూర్ణముగా ఉన్నాయి. అందుకే శ్రీరాముడు మూర్తీభవించిన ధర్మస్వరూపుడు. **రామో విగ్రహవాన్ ధర్మః** అని చెప్పబడింది.

## 530. త్రివిక్రమః

వేదమున వ్యాపించినవాడు.

**త్రీన్ వేదాన్ క్రమతే యేన మహిమ్నా స త్రివిక్రమః**

మూడు వేదములయందు వ్యాపించి ఉండి, వాటిచే తెలియజేయబడువాడు.

**త్రీన్ క్రమతే ఇతి త్రివిక్రమః** వేదమున వ్యాపించినవాడు

**త్రిరిత్యే వంత్రయోవేదాః కీర్తితాః మునిసత్తమ**
**క్రమతే తాన్ తథా సర్వాన్ త్రివిక్రమ ఇతిస్మృతః**

త్రి అంటే మూడు వేదాలు. వేదములందు వ్యాపించి ఉన్నవాడు త్రివిక్రముడు, సకల వేదములయందు ఇతడే వాచ్యుడు.

త్రయీవిద్య. అంటే వేదవిద్య. ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము అనేవి మూడు వేదాలు. ఈ వేదాలలో చెప్పింది పరమేశ్వరుని గురించే అందుకే పరమేశ్వరుడు వేదములయందు వ్యాపించినవాడు. అందుకే అతడు త్రివిక్రముడు.

మూడడుగులతో జగత్తునంతా ఆక్రమించినవాడు. **మాండూక్యోపనిషత్తు**లో **సోయమాత్మాచతుష్పాత్** ఆత్మ నాలుగు పాదాలుగా అంటే నాలుగు భాగాలుగా ఉన్నది.

అవి జాగ్ర, స్వప్న, సుషుప్తి అవస్థలు మూడు. నాల్గవది తురీయము. మొదటి మూడు అవస్థల యందు వ్యాపించినవాడు. నాల్గవదైన తురీయమే పరమేశ్వరుని సహజస్థితి. అందుకే శ్రీమన్నారాయణుడు 'త్రివిక్రముడు' అనబడుతున్నాడు.

## 531. మహర్షిః కపిలాచార్యః

వేదవిదుడైన కపిలమునిగా అవతరించినవాడు. విష్ణుమూర్తి అంశావతారమైన కపిలుడు మహర్షి. అందుచేత 'మహర్షి కపిలాచార్య'

వేదాలను ఎరిగినవాడు 'మహర్షి' కపిలుడు తరచి తరచి చూశాడు కాబట్టి మహర్షి అనబడ్డాడు. దర్శనాలు మొత్తం ఆరు.

**పాణినిర్జైమినిశ్చైవ వ్యాసశ్చ కపిలశ్చ చ ।**

**కణాదశ్చాక్ష పాదశ్చ దర్శనాని షడైవహి ॥**

దర్శనాలు ఎన్ని ఉన్నప్పటికీ ప్రాచీనము పాణిని, జైమిని, వ్యాసుడు, కపిలుడు, కణాదుడు, అక్షపాదుడు. అనే వారు చెప్పిన ఆరింటిని మాత్రమే దర్శనాలు అంటారు. వాటిలో

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | పాణిని | - వ్యాకరణము | 4. | కపిలుడు | - సాంఖ్యము |
| 2. | జైమిని | - పూర్వమీమాంశ | 5. | కణాదుడు | - వైశేషికము |
| 3. | వ్యాసుడు | - ఉత్తరమీమాంశ | 6. | అక్షపాదుడు | - తర్కము |

వీటిలో కపిలమహర్షి బోధించినది సాంఖ్య దర్శనము. ఈ రకంగా సాంఖ్యాన్ని బోధించాడు కాబట్టి 'ఆచార్యుడు' అనబడతాడు. అందుచేతనే 'మహర్షి కపిలాచార్యః' అనబడతాడు.

**శుద్ధాత్మ తత్త్వవిజ్ఞానం సాంఖ్యమిత్యభిధీయతే**పరిశుద్ధమైన ఆత్మజ్ఞానమే సాంఖ్యము

**ఋషిం ప్రసూతం కపిలమ్**

కపిలుడు ఋషిగా జన్మించాడు అని శేతాశ్వరోపనిషత్తులో చెప్పబడింది.

**భగవద్గీత**లోని పదవ అధ్యాయం **'విభూతియోగం'**లోని 26వ శ్లోకంలో

**అశ్వత్థః స్సర్వవృక్షాణాం దేవర్షీణాం చ నారదః ।**

**గంధర్వాణా చిత్రరథః సిద్ధానాం కపిలో మునిః ॥**

అర్జునా ! వృక్షములలో అశ్వత్థ వృక్షమును నేను. దేవ ఋషులలో నారదుడను. గంధర్వులలో చిత్రరథుడను. సిద్ధులలో కపిలుడను నేను.

అన్నివిధాలుగా స్థూల సూక్ష్మ జగత్తుల సిద్ధులు పొందినవారిని, ధర్మము, జ్ఞానము, వైరాగ్యము మొదలగు శ్రేష్ఠ గుణసంపన్నులైన వారిని సిద్ధులు అంటారు. ఇలాంటి సిద్ధులు చాలామంది ఉంటారు. వారిలో కపిలుడు ప్రముఖుడు. అతడు శ్రీమహావిష్ణువు యొక్క అవతారము. కర్దమప్రజాపతి కుమారుడు. తల్లియైన దేవహూతికి జ్ఞానోపదేశం చేసినవాడు. అతడు జన్మించినప్పుడు బ్రహ్మదేవుడు స్వయముగా కర్దముని ఆశ్రమానికి వచ్చి, దేవహూతితో "నీ కుమారుడు సిద్ధగణాలకు అధిపతి అవుతాడు. సాంఖ్యాచార్యుడవుతాడు. లోకంలో కపిలుడు అని పిలువ బడతాడు" అని చెప్పాడు.

కపిలుడు జ్ఞాన, ఐశ్వర్య, ధర్మ, వైరాగ్యాది గుణసంపన్నుడు, సిద్ధులలో ఈయనకు ఈయనే సాటి. అందుచేతనే 'మహర్షి కపిలాచార్యః' అనబడ్డాడు.

ఈ నామాన్ని శంకరాచార్యులవారు ఒకటిగా చెప్పారు. కాని పరాశరభట్టరు వారు మాత్రం రెండు నామాలుగా వ్రాశారు.

**మహర్షిః :** కపిల మహర్షి

**సాక్షాద్ద్రష్టా మంత్రవేదాన్ యోమహర్షి స్సచస్మృతః** మంత్రాత్మకమైన వేదాలను చూచువాడు.

**మహాంశ్చా సౌ ఋషిశ్చ మహర్షిః** వేదములను ప్రత్యక్షముగా చూడగలవాడు. వేదద్రష్ట

**కపిలాచార్యః :** కపిలాచార్యుడు

**తత్త్వప్రవచనాదేవ కపిలాచార్య ఉచ్యతే** తత్త్వమును బోధించినవాడు

**కపిలశ్చా సౌ ఆచార్యశ్చ కపిలాచార్యః** కపిలవర్ణము గల ఆచార్యుడు. తత్త్వ ప్రబోధము గావించినవాడు.

## 532. కృతజ్ఞః

కృతజ్ఞుడు 82వ నామము కూడా ఇదే.

**స్వాభినమ్రత్వ సుక్రుతం కిఞ్చిద్రశుమతాకృతమ్ ।**

**విదితం యేనకారుణ్యాత్ కృతజ్ఞసో ఽభిధీయతే ॥**

అంశుమంతుడు తనకు గావించిన సుకృతము తెలుసుకొని కరుణతో అతని తండ్రులయిన సగరపుత్రుల రక్షించినవాడు.

**కృతమేవ జానాతీతి కృతజ్ఞః** అంశుమంతుని ప్రార్థన లాలకించి, తనయందు అపరాధ మొనర్చిన సగర పుత్రులను రక్షించినవాడు.

సగర మహారాజుకు ఇద్దరు భార్యలు. కేశి, సుమతి. కేశివలన అసమంజసుడు, సుమతివలన ఒక కుమారుడు కలిగారు. సుమతికి పుట్టినవానియందు అరవై వేలమంది శిశువులున్నాయని చెప్పి ఔర్యుడు ఆ బాలకుని అరవైవేల ముక్కలు చేసి వాటిని నేతికుండలో పెట్టించాడు. ఆ కుండ నుండి అరవై వేల కుమారులు పుట్టారు. సగరుని కుమారులందరు దుర్మార్గులు. ఎప్పుడూ దేవబ్రాహ్మణులను బాధిస్తూ ఉంటారు. వారి బాధలు భరించలేని దేవతలు, తమ బాధను బ్రహ్మతో విన్నవించుకున్నారు. కపిలుని చేతిలో వీరందరూ మరణిస్తారని చెప్పాడు.

ఒకసారి సగరుడు అశ్వమేధం చెయ్యాలనుకొని అశ్వాన్ని వదిలాడు. తన అరవై వేలమంది కుమారులను అశ్వరక్షణకుగాను నియమించాడు. అశ్వం నడచి పోతున్నది అలా పోయిపోయి సముద్రంలోకి దిగి మాయమయింది. అశ్వాన్ని ఇంద్రుడు ఎత్తుకుపోయాడు. అశ్వాన్ని వెతుక్కుంటా సగరుని పుత్రులు రసాతలము చేరారు. అక్కడ కపిలుని ఆశ్రమం ఉన్నది. మహర్షి ఆశ్రమ ప్రాంగణంలో అశ్వం కనిపించింది. దానిదగ్గరే కపిలుడు ధ్యాన నిష్ఠలో ఉన్నాడు. అది చూసిన రాకుమారులు కపిలుడే అశ్వాన్ని ఎత్తుకు వచ్చాడని భావించి అతన్ని పరిపరివిధాల దూషించారు. దాంతో తపోభంగం జరిగింది మహర్షికి. కళ్ళు తెరిచాడు. అంతే ఆ కళ్ళ నుంచి వచ్చిన జ్వాలలకు సగరుని కుమారులు ఆహుతై పోయారు.

సగరుడు రాజ్యాన్ని అసమంజసుని కుమారుడైన అంశుమంతునకు అప్పగించి వానప్రస్థానికి వెళ్ళిపోయాడు.

అసమంజసుడు తండ్రులను వెతుక్కుంటూ బయలుదేరి, చివరకు కపిలుని ఆశ్రమం దగ్గర నిలబడి ఉన్న అశ్వాన్ని, బూడిద రాసులను చూసి కపిలమహర్షిని పరిపరివిధముల ప్రార్థించాడు. కపిలమహర్షి సంతసించి సగరపుత్రుల మీద నుంచి గంగను ప్రవహింపచేస్తే వారు ముక్తులవుతారు. అని చెప్పాడు. అంశుమంతుని కుమారుడు భగీరధుడు. తపస్సుచేసి, తన తాతలను పునీతులుగ చేసినవాడు.

అందుకే శ్రీమన్నారాయణుడైన పరమేశ్వరుడు 'కృతజ్ఞః' అనబడతాడు. వేదవిదుడుగా జన్మించి, కపిలమూర్తిగా అవతరించినవాడు. **లలితా సహస్రంలో 374వ నామము 'కృతజ్ఞా'**

## 533. మేదినీపతిః

భూమిని ధరించువాడు, చక్రవర్తి.

**కాపిలంరూప మాస్థాయ యోధారయతి మేదినీమ్**
**సమేది నీపతి ఖ్యాతో నవార్ణో భూప్రదో మనుః**

కపిలరూపము ధరించినవాడు. ఈ నామము నవాక్షరి మంత్రము భూమి నొసంగును.

**మేదిన్యాః పతిః మేదినీపతిః** భూభర్త, రాజు

**యస్యేయం వసుదాస్సర్వా వాసుదేవస్య ధీమతః ।**
**కాపిలం రూపమస్థాయ ధారయత్వ నిశంధరాం ॥**

సర్వజ్ఞుడైన వాసుదేవుడు కపిలుని రూపంలో ఈ భూమిని ధరించి ఉన్నాడు.

శ్రీ మహావిష్ణువు యోగనిద్రలో ఉన్నాడు. ఆ సమయంలో భూదేవి ఇతడిని కామించి, దరిచేరింది. ఆ విషయం గ్రహించాడు హరి. ఆమె కోర్కెను తీర్చాడు. వారికి పుట్టిన కుమారుడే నరకుడు. ఈ విధంగా భూదేవికి భర్త అయినాడు శ్రీమహావిష్ణువు.

చరాచర జగత్తుకు అధినాయకుడు, ప్రభువు, రాజు, ఈశ్వరుడు, ఆ శ్రీహరి. అందుచేతనే అతడు 'మేదినీపతి' అనబడుతున్నాడు.

ఈ జగత్తు అంతా భూదేవికి సంబంధించినదే. ఆమె శ్రీమన్నారాయణుని భార్య. అందుకే శ్రీమన్నారాయణుడు 'మేదినీ పతి'

అంటూ కపిలమూర్తి వృత్తాంతాన్ని పూర్తి చేశాడు రత్నాకరుడు.



# 37. వరహావతారము

"గురువుగారూ ! శ్రీహరి నరసింహావతారమెత్తి హిరణ్యకశ్యపుని సంహరించాడు కదా ! మరి వరాహావతారము ఎందుకు ఎత్తాడు ? దానిని గురించి తెలియచెయ్యండి" అన్నాడు కృష్ణశర్మ. వివరించటం ప్రారంభించాడు రత్నాకరుడు.

జగత్తుయొక్క సృష్టి, స్థితి, లయములను చూసేది శ్రీమన్నారాయణుడు. ఈయన పంచవింశకుడైన పురుషుడని వేదాలు కీర్తిస్తున్నాయి. ఇతడే ఆదిఅంతము లేని పురుషోత్తముడు. ఈయన కనువిప్పు బ్రహ్మకు పగలు. కన్ను మూత రాత్రి ఇదే కల్పము. అతడు అనంతుడు. అతడికి రూపం లేదు. కాళ్ళు చేతులు లేవు. శరీరం లేదు. అంగాలు అసలే లేవు. ఆయన సర్వాన్ని ఆవరించి ఉన్నాడు. అన్ని ఇంద్రియముల గుణాలను ప్రకాశింపచేయుచున్నాడు. అటువంటి పరమపురుషుని పొందినవారు ముక్తులవుతారు. సిద్ధులైన వారికి అతడే పరమాగతి. అతనివలన సర్వము సంభవిస్తుంది. ఆ పురుషుని నుండే హిరణ్యగర్భుడు ఆవిర్భవించాడు. దానినుండి ఆకాశము, వాయువు, తేజస్సు, జలము వచ్చినాయి. జలము నుండి అండము పుట్టింది. అదే హిరణ్మయము. ఈ హిరణ్మయమైన అండమే ప్రజాపతి అని వేదాలు చెబుతున్నాయి. పరమేశ్వరుడు ఈ అండాన్ని రెండుగా విభజించాడు. ఇందులో పై భాగము ఆకాశము. క్రింది భాగము రసాతలము. ఈ అండము నుంచి వచ్చిన మావి జలమునందు పడి మేరుపర్వతమయింది. భూమి ఏర్పడింది. అనేక యోజనాల విస్తీర్ణముగల పర్వతాలతో పీడించబడిన భూమి, ఆ విష్ణు తేజస్సు మోయలేక క్రిందకు క్రుంగిపోయి పాతాళం చేరిపోయింది. అలా క్రిందికి దిగిపోయిన భూమి శ్రీహరిని చూసి

"ఓ మహానుభావా ! శంఖుచక్రగదా ధరా ! నీకు నమస్కారము. నువ్వు ప్రసన్నుడవు కావలసినది. నీ దేహము నుంచే జగత్తు జనించింది. లోకాలను సృష్టించే బ్రహ్మవు నీవే. నీ అనుగ్రహంతోనే ఇంద్రుడు స్వర్గమనుభవిస్తున్నాడు. నీ క్రోధముచేతనే దైత్యులు బెదిరిపోతున్నారు. ధాత, విధాత, సృష్టికర్త అంతా నీ యందే ఉన్నారు. మనువు, అగ్ని, యముడు, వాయువు అంతా నీయందే ఉన్నారు. సముద్రాలు, పర్వతాలు, నదులు, ధర్మము, యజ్ఞము, యజ్ఞక్రియ, సత్యము, శ్రీ,హ్రీ, కీర్తి, ధృతి, క్షమ అన్నీ నీయందే ఉన్నాయి. పురాణాలు, వేదాలు, వేదాంగాలు, శాస్త్రాలు, ఛందస్సులు, త్రికాలములు, గుణములు, త్రిలోకములు, అన్నీ నిన్ను ఆశ్రయించే ఉన్నాయి. ఒకటేమిటి ? ఆది అంతమూ నీవే. ఈ జగత్తంతా నీవే.

భూభారం తగ్గించటానికి ప్రతియుగంలోనూ అవతరిస్తుంటావు. బ్రహ్మాది దేవతలు కూడా నీ తత్త్వాన్ని తెలుసుకోలేరు. స్థావర జంగమాత్మకమైన జగత్తును సృష్టించేది నువ్వే. ప్రళయకాలంలో ఈ జీవరాశినంతటినీ మ్రింగేసేది నీవే.

జలము (నారములు) నందుంటావు కాబట్టి నీవే నారాయణుడవు. ధర్మము (గోవు)ను నీ తత్త్వముగా గలిగి ఉన్నావు. కాబట్టి గోవిందుడవు. హృషీకముల (ఇంద్రియముల)కు అధిపతివి. కాబట్టి హృషీకేశుడవు. యుగాంతంలో భూతములన్నీ నీయందు నశిస్తాయి. నీవు వాటియందుంటావు. అందుకే వాసుదేవుడనబడతావు. ప్రతికల్పమునందు భూతములను నీ దగ్గరకు లాగుకొని లయం చేస్తావు కాబట్టి సంకర్షణుడవు.

దేవాసురులంతా నీ బలంవల్లనే అన్ని తత్త్వములు తెలుసుకుంటున్నారు. అందుచేత ప్రద్యుమ్నుడవు. భూతములలో నీకు మించినది ఏదీ లేదు అందుచేత అనిరుద్ధుడవు. చరాచర జగత్తును నీవే ధరిస్తావు. నీవే ఆదిశేషుడవు. నీవే ఆదికూర్మమువు. నీవే ఆదివరాహమువు. కాబట్టి నేను నిన్ను శరణువేడుతున్నాను. నన్ను రక్షించవలసినది.” అని వేడుకొంది.

ఆమె ప్రార్థనను మన్నించినవాడై శ్రీమహావిష్ణువు యజ్ఞవరాహమై తనకోరలతో భూమిని పైకి తెచ్చాడు.

అతడు వరాహరూపంలో మూడు పురములు గలవాడు. మూడు అడుగులతో త్రివిక్రముడుగా జగత్తును ఆక్రమించినవాడు. బ్రహ్మాది దేవతలకు స్వామి. ఒకే కొమ్ము గల పెద్దవరాహరూపుడు. ఇదే వరాహరూపంలో హిరణ్యాక్షుని కూడా సంహరించాడు. పాతాళానికి కృంగిపోయిన భూమిని తన కోరలతో ఎత్తి కాపాడాడు. ధర్మమే అతని తత్త్వము. పాతాళానికి పోయిన భూమిని మళ్ళీపొందాడు కాబట్టి గోవిందుడనబడుతున్నాడు. ఉపనిషత్తులే శరీరముగాగలవాడు. దివ్యమైన ఆభరణాలు ధరించినవాడు. అతడు రహస్యోపనిషత్తులయందు దాగి ఉంటాడు. మేరుగంభీరుడు లోకపాలకులైన ఇంద్రాది దేవతలు కూడా అతని తత్త్వాన్ని తెలుసుకోలేరు. తన తత్త్వము తెలియనివారి చేత ఎరుగబడనివాడు. శంఖము చక్రము, గదలను ఆయుధములుగా గలవాడు. భక్తులకు ఎప్పుడూ శుభాన్నిచ్చేవాడు.

సార్వభౌమాధికారానికి గుర్తు అయిన ఛత్రచామరములతో కూడినవాడు. ప్రాకృతులకు అజేయుడు. నీలమేఘశ్యాముడు. ధృఢము, స్థూలము అయినవాడు, ప్రళయకాలంలో జీవులన్నింటినీ తన దగ్గరకు లాక్కొనేవాడు. సమస్తాన్ని ఆవరించి

ఉండేవాడు. ఆపన్నుల విషయంలో ఆదరముగలవాడు. సత్పురుషులకు ఆధారమైనవాడు. పోషించే నేత్రాలు గలవాడు. ఉదార హృదయుడు. పరమపూజ్యుడు. షాడ్గుణ్యపరిపూరితుడు సర్వులను ఆనందింపచేస్తాడు. వనమాలను ధరించినవాడు. హలాయుధుడు. అతడే ఆదిత్యుడు. దేవకీసుతుడు. ఆకారము చేతనే పొందదగినవాడు.

ఈ విషయాలన్నీ 534 నుంచి 563 వరకు గల నామాలలో వివరించటం జరిగింది. ఇక నామాలను చూద్దాం.

## 534. త్రిపదః

మూడు పదములుగలవాడు. మూడు జ్ఞానములు గలవాడు. మూడు మూపురములు గలవాడు.

**భోక్తృభోగ్య నియంత్రూణి జ్ఞాప్యాన్యస్య పదానినౌ**

భోక్త, భోగ్య, నియంత అను మూడు తత్త్వములను తెలిసినవాడు.

భోక్త – జీవుడు, భోగ్యము – ప్రకృతి, నియంత – ఈశ్వరుడు

**ప్రణవే త్రీణి వాచ్యాని వాచకాని పదానివాచ**

ప్రణవమున మూడు పదములు గలవాడు.

**వారాహరూప స్యాస్థానే సదానికుకుదానివా**
**యస్యసంతి హ్యసౌనిత్యం త్రిపదః పరికీర్తితః**

మూడు పురములు గలవాడు. అందుచేత త్రిపద అనబడుతున్నాడు.

**త్రీణిపదాని యస్యసః త్రిపదః** చిత్తు, అచ్చిత్తు, ఈశ్వరుడు అనే పదములు తెలిసిన వాడు. వాటిని ప్రకటించినవాడు. ఓంకారము అకార ఉకార మకారముల సమ్మేళనము. ఈరకంగా మూడు పదములుగలవాడు. వరాహరూపంతో మూడు పురములు గలవాడు.

బలిచక్రవర్తి ముల్లోకాలను పాలిస్తున్నాడు. దేవతలను ఓడించి అరణ్యాలకు పారద్రోలాడు. అదితి తన బిడ్డలైన దేవతల కష్టాలు గట్టెంక్కించమని కశ్యపుని కోరింది. ఆయన శ్రీమహావిష్ణువును ప్రార్థించమన్నాడు. అలాగే చేసింది అదితి. శ్రీహరి వామనరూపంలో ఆమె గర్భాన ప్రవేశించాడు.

అశ్వమేధ యాగం చేస్తున్నాడు బలిచక్రవర్తి. అక్కడికి వెళ్ళాడు వామనుడు. వచ్చిన వామనుడికి సత్కారాలు చేసి ఏ వరం కావాలో కోరుకోమన్నాడు బలి. మూడడుగుల

నేల ఇవ్వు. నాకది చాలు అన్నాడు వామనుడు. దానమిచ్చాడు బలి. ఆ మరుక్షణమే మూడు పాదాలతో ముల్లోకాలను ఆక్రమించేశాడు త్రివిక్రముడు.

ఈ రకంగా మూడడుగులతో ముల్లోకాలను ఆక్రమించిన వాడు శ్రీమహావిష్ణువు. అందుకే అతడు 'త్రిపదః' అనబడుతున్నాడు.

## 535. త్రిదశాధ్యక్షః

దేవతలకు స్వామి

**సఖాస్యా త్రిదశాద్యక్ష బ్రహ్మదేవః ప్రళయాపది**

ప్రళయమునందు బ్రహ్మాదుల సఖులను కాపాడువాడు

**త్రిదశానాం అధ్యక్షః త్రిదశాధ్యక్షః** వరాహరూపంలో గల పరమేశ్వరుడే ఆపద సమయంలో దేవతలకు స్వామి. త్రిదశలకు అధ్యక్షుడు. త్రిదశలు అంటే జాగ్రస్వప్న సుషుప్తులు.

త్రిగుణాలకు అధ్యక్షుడు, త్రికాలములకు అధ్యక్షుడు, సృష్టి స్థితి లయాలకు అధ్యక్షుడు, త్రిమూర్తులకు అధిపతి, ఇక్కడ అధిపతి అంటే ఆ మూడింటినీ తన అధీనంలో ఉంచుకొనేవాడు.

జీవులు అనుభవిస్తున్న జాగ్రస్వప్న సుషుప్తులు అనబడే మూడు అవస్థలకు అతీతుడైనవాడు. వీటిన్నింటికీ సాక్షి అయినవాడు. అందుచేత శ్రీమన్నారాయణుడు 'త్రిదశాధ్యక్షః' అనబడుతున్నాడు.

## 536. మహాశృంగః

పెద్దకొమ్ము గలవాడు.

**మహీయస్య చ శృంగాగ్రే మహాశృంగ స కథ్యతే ॥** కోరకొనయందు భూమిని కలవాడు.

**మహాన్ శృంగః యస్యసః మహాశృంగః**

అగ్రభాగంలో భూమండలము ధరించిన సాటిలేని కోరగలవాడు.

**ఏకశృంగో వరాహస్త్వమ్** ఒకే కొమ్ముగల వరాహము నీవే

మత్స్యరూపియై ప్రళయకాలంలో తన కొమ్ముకు నావను కట్టి లాగించినవాడు.

ద్రవిళదేశపు రాజు సత్యవ్రతుడు. ఆయన కృతమాలిక అనే నది ఒడ్డున తర్పణ చేస్తున్న సమయంలో చేతులోకి ఒక చిన్నచేపపిల్ల వచ్చింది. అది రక్షించమని మహారాజును వేడుకుంది. రాజు ఆ చేపపిల్లను తనకమండలంలో వేశాడు. మరునాటికి ఆ చేప పిల్ల కమండలం నిండా అయిపోయి మళ్ళీ నన్ను రక్షించమని వేడుకుంది. రాజు ఆ చేపను బావియందు వేశాడు. మరునాటికి అది బావి అంత అయింది. రాజు ఆ చేపను చెరువులో వేశాడు. మరునాటికి చెరువంతా నిండిపోయింది. ఇంక ఏం చెయ్యాలో తెలియని రాజు ఆ చేపను సముద్రంలో వదలిపెట్టాడు. అది మళ్ళీ పెరిగిపోవటం మొదలుపెట్టింది. అప్పుడు రాజు దానికి నమస్కరించి నీవు రాక్షసుడవా ? ఈశ్వరుడవా ? నువ్వెవరవు ? అని అడిగాడు. దానికి ఆ మత్స్యము 'నేను జనార్దనుడను ఇంక ప్రళయం రాబోతున్నది. అందుచేత వేదాలను, సప్తమహర్షులను, సమస్త ధాన్యాలను ఒక పెద్దనావలో ఉంచి నువ్వుకూడా నావ ఎక్కవలసినది. సముద్రంలో ఆ నావ దిక్కు లేకుండా వెడుతుంటుంది. అప్పుడు వాసుకిని త్రాడుగా చేసి నావను నా కొమ్ముకు కట్టవలసినది. నేను ఆ నావను జాగ్రత్తగా తీరం చేరుస్తాను. ప్రళయం తరువాత నువ్వు వైవస్వతమనువుగా మళ్ళీ ఈ సృష్టిని ప్రారంభించు. అని చెప్పింది.

ఆ మత్స్యము చెప్పినట్లే చేశాడు సత్యవ్రతుడు. ఈ రకంగా తనకొమ్ముకు కట్టిన నావను వడ్డుకు చేర్చినవాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు 'మహాశృంగః' అనబడుతున్నాడు.

హిరణ్యాక్షుడు భూమిని చుట్టగా చుట్టి సముద్రంలో ముంచేశాడు. అప్పుడు శ్రీమహావిష్ణువు వరహావతారమెత్తి, కొమ్మలవంటి తన కోరలపై భూమిని రక్షించాడు. అందుచేతనే శ్రీమహావిష్ణువు 'మహాశృంగః' అనబడుతున్నాడు.

## 537. కృతాంతకృత్

హిరణ్యాక్షుని చంపినవాడు.

**అంతకాభం హిరణ్యాక్షం కృత్తవా ఽన్యః కృతాంతకృత్**
**స్వసిద్ధాంత కరత్వాద్వా స్వాఖ్య స్మృతి పురాణయోః**
**కృతాంతకృదితి ఖ్యాతో వ స్వర్ణో ఽభీష్టదాయకః**

మహా భయంకరుడైన హిరణ్యాక్షుని సంహరించినవాడు. వరాహస్మృతి, వరాహ పురాణాలలో తన సిద్ధాంతమును ప్రకటించినవాడు.

ఈ నామము అష్టాక్షరీ మహామంత్రము. భక్తుల కోరికలను తీరుస్తుంది.

**హతోహిరణ్యాక్ష మహాసురః** హిరణ్యాక్షుడు అనే రాక్షసుని సంహరించినవాడు.

వైకుంఠంలో శ్రీమహావిష్ణువు లక్ష్మీదేవితో ఏకాంతంగా ఉన్నాడు. ఆ సమయంలో సనకసనందనాదులు అక్కడికి వచ్చారు. 'విష్ణువు అభ్యంతర మందిరంలో ఉన్నాడు కాబట్టి మీరు లోపలికి వెళ్ళటానికి వీలు లేదు' అన్నారు ద్వారపాలకులయిన జయవిజయులు. దానికి కోపించినవారై వారిద్దరినీ విష్ణుమూర్తికి దూరంగా భూలోకంలో జన్మించండి అని శపించారు మహర్షులు.

జయవిజయులు విష్ణుమూర్తి కాళ్ళమీద పడ్డారు. విష్ణువు కనికరించి, మహర్షుల శాపం తప్పదు. విరోధంతో మూడు జన్మలెత్తుతారా ? విహితంతో ఏడు జన్మలెత్తుతారా? అని అడిగాడు. చివరకు మూడు జన్మలలోనే తిరిగి రావటానికి వప్పుకున్నారు జయవిజయులు.

మొదటిజన్మగా దితికశ్యపుల గర్భాన హిరణ్యాక్ష, హిరణ్యకశ్యపులుగా జన్మించారు. వీరు మహాక్రూరులు. వీరి ధాటికి ముల్లోకాలు గడగడలాడి పోసాగినాయి. మహర్షులు, దేవతలు నానాబాధలు పడుతున్నారు. యజ్ఞయాగాదులు ఆగిపోయినాయి. హిరణ్యాక్షుడు భూమిని చాపగా చుట్టి సముద్రంలో పారేశాడు. అప్పుడు శ్రీహరి వరహావతారమెత్తి ఆ రాక్షసుని సంహరించి, భూమిని తన కోరలతో ఎత్తిపట్టి రక్షించాడు.

ఈ రకంగా మహాభయంకరుడైన హిరణ్యాక్షుని సంహరించినవాడు కాబట్టి శ్రీహరి 'కృతాంతకృత్' అనబడుతున్నాడు.

**కృతిస్య అంతం కరోతి** తనతో నిర్మించబడినట్టి ఈ జగత్తుకు అంతం కలిగించేవాడు. అంటే ప్రళయాన్ని కలిగించేవాడు. సృష్టిస్థితిలయాలు ఆ పరమేశ్వరుని అధీనంలోనే ఉంటాయి. అందుచేత ప్రళయం సృష్టించి, ఈ జగత్తును నశింపచేసి, మళ్ళీ సృష్టి చేసేవాడు.

మృత్యువుకు మృత్యువు. అంటే, తనను నమ్మిన వారి విషయంలో మృత్యువు లేకుండా చూసేవాడు. వారికి అమరత్వాన్ని ప్రసాదించేవాడు.

## 538. మహావరాహః

గొప్ప వరాహమూర్తి

**రసాతలగతాముర్వీం యశ్చోద్ధృత్యోత్థితః క్షణాత్ ।**
**మహావరాహ ఇతినః స్మృతో హ్యుర్వీ ప్రధోమనుః ॥**

పాతాళానికి కృంగిపోయిన భూమిని తన కోరతో ఎత్తి లేపినవాడు.

**మహాంశ్చాసౌ వరాహశ్చ మహావరాహః**

గొప్ప వరాహమూర్తి. ఇతడు వరాహరూపంలో భూమిని పాతాళం నుంచి పైకి లేపాడు. భూమిని ఉద్ధరించగోరినవాడై శ్వేతవరాహమైనాడు. ఇతని పరిమాణము ఇంత అని ఊహించలేము. సముద్రంలో మునిగిపోయిన భూమిని పైకి తీసుకువచ్చాడు.

బ్రహ్మపురాణంలో యజ్ఞవరాహాన్ని గురించి బ్రహ్మదేవుడు వివరిస్తాడు.

యోఽసౌ చార్ణ వమధ్యస్థో నష్టేస్థావరజంగమే ।
నష్టే దేవాసురనరే ప్రనష్టోరగరాక్షసే ॥

యోద్ధుకామౌ దురాధర్షౌ తావుభౌ మధుకైటభౌ ।
హతౌ భగవతా తేన తయోర్దత్త్వాఽమితం వరమ్ ॥

పురా కమలనాభస్య స్వపతః సాగరాంభసి ।
పుష్కరే తత్రసంభూతా దేవాః సర్షిగణాస్తథా ॥

ఏష పౌష్కరకో నామ ప్రాదుర్భావో మహాత్మనః ।
పురాణం కథ్యతే యత్ర దేవశ్రుతిసమాహితమ్ ॥

వారాహస్తు శ్రుతిముఖః ప్రాదుర్భావో మహాత్మనః ।
యత్ర విష్ణుః సురశ్రేష్ఠో వారాహం రూపమాస్థితః ॥

వేదపాదో యూపదంష్ట్రః క్రతుహస్తోఽశ్వినీముఖః ।
అగ్నిజిహ్వోదర్భరోమా బ్రహ్మశీర్షో మహాతపాః ॥

అహోరాత్రేక్షణో దివ్యో వేదాంగః శ్రుతిభూషణః ।
అజ్యానాసః స్రువతుండః సామఘోషస్వరోమహాన్ ॥

సత్యధర్మమయః శ్రీమాన్క్రమవిక్రమసత్కృతః ।
ప్రాయశ్చిత్తనఖో ఘోరః పశుజాను ర్మఖాకృతిః ॥

ఉద్గీథాంత్రో హోమలింగః ఫలజీవమహౌషధిః ।
వాద్యాంతారాత్మా మంత్రస్పిగ్వికృతః సోమశోణితః ॥

వేదస్కంధో హవిర్గంధో హవ్యకవ్యాతి వేగవాన్ ।
ప్రాగ్వంశకాయో ద్యుతిమా న్నానాదీక్షాభిరన్విత ః ॥

దక్షిణాహృదయో యోగీ మహాసత్రమయో మహాన్ ।
ఉపాకర్మాష్టరుచకః ప్రవర్గ్యావర్త భూషణః ॥

**నానాఛందోగతిపథో గుహ్యోపనిషదాసనః ।**
**ఛాయాపత్నీ సహాయోऽసౌ మణిశృంగ ఇవోత్థితః ॥**

**మహీం సాగరపర్యంతా సశైలవనకాననామ్ ।**
**ఏకార్ణవ జలభ్రష్టా మేకార్ణవ గతఃప్రభుః ॥**

**దంష్ట్రయా యః సముద్ధృత్య లోకానాం హితకామ్యయా ।**
**సహస్రశీర్షో లోకాది శ్చకార జగతీం పునః ॥**

**ఏవం యజ్ఞవరాహేణ భూత్వా భూతహితార్థినా ।**
**ఉద్ధృతా పృథివీ దేవీ సాగరాంబుధరా పురా ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆయన నాలుగు పాదాలు | – | నాలుగు వేదాలు | ఆజ్యము | – | నాసిక |
| కోర | – | యూపస్తంభము | స్రువము | – | ముట్టె |
| క్రతువు | – | చేతులు | సామధ్వని | – | ఘర్ఘరస్వరము |
| ఆశ్వినులు | – | ముఖము | ప్రాయశ్చిత్తము | – | ఘోరమైన ముఖము |
| అగ్ని | – | జిహ్వా | | | |
| దర్భలు | – | రోమాలు | పశువు | – | మోకాళ్ళు |
| బ్రహ్మ | – | శిరస్సు | ఉద్గాత | – | పేగు |
| అహోరాత్రములు | – | కనులు | శరీరము | – | ఆసనము |
| వేదాంగాలు | – | కర్ణభూషణాలు | ఛందస్సులు | – | నడిచే దారులు |

ఈ రకంగా ఉన్న యజ్ఞ వరాహము ఏకార్ణవమున మునిగిపోయిన భూమిని తన కోరలతో ఎత్తిపట్టి రక్షించాడు. అందుకే శ్రీమన్నారాయణుడు 'మహావరాహః' అనబడుతున్నాడు.

## 539. గోవిందః

భూమిని పొందినవాడు. 187వ నామము కూడా ఇదే.

**నష్టాంచ దరణీం పూర్వం గోవిందో య స్స లబ్ధవాన్**

పూర్వము నష్టమైన భూమిని తిరిగి పొందినవాడు.

**గాంవిందతే ఇతి గోవిందః** భూమిని పొందినవాడు. **మహాభారతంలో**

**నష్టాంచ ధరణీం పూర్వమవిందం చ గుహాంగతామ్ గోవింద ఇతి తేనాహమ్**

పూర్వకాలంలో భూమి నష్టమై గుహలో ఉండగా తిరిగి దానిని పొందితిని కాబట్టి నన్ను గోవిందుడు అంటారు.

గో అంటే భూమి అని అర్థం. సముద్ర గర్భంలో భూమి అదృశ్యమైనప్పుడు, వరహావతారమెత్తి శ్రీమహావిష్ణువు ఆ భూమిని బయటకు తెచ్చాడు కాబట్టి గోవిందుడు అనబడతాడు. జగత్తు అంటే ఈ భూమే. భూమికి ఆధారమైన వాడు. కాబట్టి శ్రీమహావిష్ణువు గోవిందుడు అయినాడు. గో అంటే వాక్కు. వాక్కులద్వారా అంటే వేదములద్వారా తెలయబడేవాడు కాబట్టి శ్రీహరి గోవిందుడు.

భక్తులందరూ ఇతనిని అనేక విధాల స్తుతి చేసి ఆయన అనుగ్రహం సంపాదిస్తారు. అందుచేత ఇతనిని గోవిందుడు అంటారు.

## 540. సుషేణః

ఉపనిషత్తులను శరీరముగా కలవాడు.

**పంచోపనిషదంగత్వాత్ సుషేణః పరికీర్తితః**

శుద్ధ సత్త్వమైన పంచోపనిషత్తులను శరీరముగా గలవాడు.

**సుశోభనా సేనా యస్యసః సుషేణః** త్రివిధములైన చేతన కోటిని జయించటానికి సాధనమయిన సేవలాగా శుద్ధ సత్వమయిన పంచోపనిషత్తులను శరీరముగా గలవాడు. త్రివిధములైన చేతన కోటి అంటే – బద్ధులు, ముక్తులు, నిత్యులు అనేవారు.

శోభనమైన పేరుగలవాడు. చక్కని సైన్యము గలవాడు. పరమభక్తులు, జ్ఞానులు, ఋషులు మొదలగువారు సేనగా ఉండటంచేత ఆసేన శోభనమై అలరారుతున్నది. అందుకే శ్రీమన్నారాయణుడు 'సుషేణః' అనబడుతున్నాడు.

## 541. కనకాంగదీః

దివ్యాభరణములు ధరించినవాడు.

**అప్రాకృతాని దివ్యాని భూషణాని చ నిత్యశః ।**
**రత్నానివంతి యస్యాఽసౌ సోచ్యతే కనకాంగదీ ॥**

అప్రాకృతములు, దివ్యములయిన నవరత్న ఖచితమైన ఆభరణాలను ధరించినవాడు.

**కనకాని అంగదాని అస్యసంతీతి కనకాంగదీ** బంగారుమయమైన అనేక ఆభరణాలు ధరించినవాడు. స్వర్ణమయమైన భుజకీర్తులు గలవాడు. అంగదము అంటే భుజమున ధరించే ఆభరణము. భుజకీర్తి.

**లలితా సహస్రంలో** 31వ నామము 'కనకాంగదకేయూరకమనీయభుజాన్వితా'

## 542. గుహ్యః

దాగి ఉండువాడు.

**పంచోపనిషదజ్ఞేన గూఢత్వాద్గుహ్య ఉచ్యతే ॥**

రహస్యమైన పంచోపనిషన్మయములు కాబట్టి నిగూఢమైన అంగములు గలవాడు.

**గుహ్యతే ఇతి గుహ్యః** ఉపనిషత్తులతో కూడిన దివ్యదేహము కాబట్టి దాచబడినవాడు. రహస్యమైన ఉపనిషత్తులచేత మాత్రమే తెలియబడినవాడు.

**శుకరహస్యోపనిషత్తు**లో పూర్వకాలంలో దేవఋషులు, సప్తఋషులు అందరూ బ్రహ్మదేవుని దగ్గరకు వెళ్ళి ఆయనకు నమస్కరించి శుకరహస్యోపనిషత్తును బోధించ వలసినది. అని ప్రార్థించారు. వారి మొర ఆలకించినవాడై బ్రహ్మ ఈ రకంగా చెబుతున్నాడు.

మహర్షులారా ! పూర్వకాలంలో వేదవ్యాసుడు ఒకసారి శంకరుని దగ్గరకు వెళ్ళి "ఓ దేవదేవా! మహానుభావా! నా కుమారుడికి వైదిక సంస్కారము చెయ్యాలను కుంటున్నాను. కాబట్టి ఆ సమయంలో పరమపావనుడవైన నీతోనే బ్రహ్మోపదేశం చేయించాలని నా కోరిక" అన్నాడు. ఆ మాటలు విన్న శంకరుడు "వ్యాసమహర్షీ ! నేను గనక బ్రహ్మోపదేశం చేసినట్లైతే నీ కుమారుడు నీకు దూరమైపోతాడు. మహాజ్ఞాని అవుతాడు. దానికి నువ్వు ఇష్టపడితే చెప్పు" అన్నాడు. దానికి సరేనన్నాడు వ్యాసభగవానుడు. శంకరుడు శుకమహర్షికి బ్రహ్మోపదేశము చేస్తున్నాడు.

శుకా ! వేదములయొక్క సారమంతా ఉపనిషత్తులయందున్నది. ఉపనిషత్తుల సారము మహావాక్యములయందున్నది. ఈ మహావాక్యాలు నాలుగు అవి.

| | | | |
|---|---|---|---|
| 1. | ప్రజ్ఞానంబ్రహ్మ | ఐతరేయోపనిషత్తు | ఋగ్వేదం |
| 2. | అహంబ్రహ్మాస్మి | బృహదారణ్యకోపనిషత్తు | శుక్లయజుర్వేదం |
| 3. | తత్త్వమసి | ఛాందోగ్యోపనిషత్తు | సామవేదం |
| 4. | అయమాత్మాబ్రహ్మ | మాండూక్యోపనిషత్తు | అధర్వణవేదం |

ఈ మహావాక్యాలను షడంగాలతో సహా గురుముఖంగా చెప్పుకోవాలి. ఇది తత్త్వములన్నింటిలోకీ ఉత్తమమైన తత్త్వము. దీన్ని గనక తెలుసుకుంటే మోక్షము సిద్ధిస్తుంది. గురువుగారు ఎప్పుడూ అంగహీనమైన మహావాక్యాలను చెప్పకూడదు. ఏ మంత్రాన్నైనా సరే ఆరు అంగాలతో ఉపదేశం చెయ్యాలి. అప్పుడే ఆ మంత్రం సంపూర్ణ ఫలితమిస్తుంది. షడంగాలు అంటే

| | | |
|---|---|---|
| 1. ఋషి | 3. దేవత | 5. శక్తి |
| 2. ఛందస్సు | 4. బీజము | 6. కీలకము |

ఉపనిషత్తులు సకల వేదాలయొక్క సారము. ఈ రహస్యోపనిషత్తు సకల ఉపనిషత్తులకు సారము. ఈ రహస్యోపనిషత్తులో ప్రతిపాదితమైన పరబ్రహ్మను ధ్యానించే ఆత్మజ్ఞానులకు తీర్థములు, మంత్రములు, శాస్త్రములు, జపములు, అవసరం లేదు. ఋష్యాది పూర్వకంగా ఒక్కసారి ఈ మహావాక్య జపం చేసినట్లైతే శతసంవత్సర ఆయుర్దాయం కలుగుతుంది. ముందుగా షడంగములు చెప్పబడుతున్నాయి. వీటిని గురుముఖంగానే చెప్పుకోవాలి.

**అస్య శ్రీమహావాక్యమంత్రస్య, హంస ఋషిః, అవ్యక్తగాయత్రీ ఛందః, పరమ హంసో దేవతా హం బీజం, సః శక్తిః, సోఽహం కీలకం, మమ పరమహంస ప్రీత్యర్థే మహావాక్యజపే వినియోగః, సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ, అంగుష్ఠాభ్యాం నమః, సత్యానందో బ్రహ్మ, తర్జనీభ్యాగ్ం స్వాహా, నిత్యానందమయం బ్రహ్మ, మధ్యమాభ్యాం వషట్, యోవై భూమా, అనామికాభ్యాం హుం, యోవైభూమాధిపతిః కనిష్ఠికాభ్యాంవౌషట్, ఏకమేవాద్వితీయం బ్రహ్మ కరతలకరపృష్ఠాభ్యాం ఫట్, సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ, హృదయాయ నమః, నిత్యానందో బ్రహ్మ,శిరసే స్వాహా, నిత్యానందమయం బ్రహ్మ, శిఖాయై వషట్, యోవై భూమా, కవచాయ హుం, యోవై భూమాధిపతిః, నేత్రత్రయాయ వౌషట్, ఏకమేవాద్వితీయం బ్రహ్మ, అస్త్రాయఫట్. భూర్భువస్సువరో మితిదిగ్బంధః. ధ్యానం: నిత్యానందం పరమ సుఖదం కేవలం జ్ఞానమూర్తిం। విశ్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాదిలక్ష్యమ్, ఏకం నిత్యం విమల మచలం సర్వధీ సాక్షిభూతం భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తన్నమామి**

**అథమహావాక్యాని చత్వారి, యథా, ఓం ప్రజ్ఞానం బ్రహ్మ, ఓం అహం బ్రహ్మాస్మి, ఓం తత్త్వమసి, ఓం అయ మాత్మా బ్రహ్మ, తత్త్వమసీత్యభేదవాచక మిదం యే**

**జపంతి తే శివసాయుజ్య ముక్తిభాజో భవంతి, తత్పదమహామంత్రస్య, హంసఋషిః అవ్యక్త గాయత్రీఛందః, పరమహంసో దేవతా, హం బీజం, సః శక్తిః, సోహం కీలకం, మమ సాయుజ్యముక్త్యర్థే జపే వినియోగః**

**గమనిక :** అంగన్యాస కరన్యాసాలు తెలుస్తున్నాయి. కాబట్టి మళ్ళీ వ్రాయటంలేదు.

మహావాక్యాలు నాలుగు వీటిలో ప్రధానంగా తత్త్వమసి అనే మహావాక్యాన్ని గనక పూర్తిగా తెలుసుకున్నట్లైతే, మిగిలిన వాటి అర్థం త్వరగా తెలుస్తుంది. అందుచేత తత్త్వమసి అనే వాక్యాన్ని జీవబ్రహ్మైక్య భావంతో జపం చేసేవారు కైవల్యము పొందుతారు. ఈ వాక్యములో మూడు పదాలున్నాయి. **1. తత్ 2. త్వం 3. అసి** ఈ మూడు మహామంత్రాలే. ముందుగా 'తత్' అనే పదాన్ని చూద్దాం. దీనికి

**హంస–ఋషి, అవ్యక్తగాయత్రీ – ఛందస్సు, పరమహంసో – దేవతా, హం – బీజం, సః – శక్తిః, సోహం – కీలకం**

**తత్పురుషా, అం, ఈశానాయ, త – స్వాహా, అఘోరాయ, మధ్య–వౌషట్, సద్యోజాతాయ, అనా–హుం, వామదేవాయ, కనిష్ఠికాభ్యాం వౌషట్, తత్పురుషేశానా ఘోర సద్యోజాత వామదేవేభ్యో నమః, కర–ఫట్, ఏవం హృదయాదిన్యాసః, భూర్భువస్సువరో మితి దిగ్బంధః. ధ్యానం : జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యాదతీతం శుద్ధం బుద్ధం ముక్తమప్యవ్యయం చ, సత్యం జ్ఞానం సచ్చిదానందరూపం, ధ్యాయే దేవం తన్మ హోభ్రాజమానమ్**

**ధ్యానమ్ :** జ్ఞానాజ్ఞేయ స్వరూపుడు, జ్ఞానగమ్యమయిన జ్ఞేయము కన్న అతీతుడు, నాశరహితుడు, సత్యజ్ఞాన స్వరూపుడు, సచ్చిదానందుడు, మహాతేజోమూర్తి అయిన ఆ పరమేశ్వరునకు నమస్కారము. ఇదే 'తత్' అనే పదానికి అర్థము.

**త్వం పదమహామంత్రస్య, విష్ణు ఋషిః, గాయత్రీఛందః, పరమాత్మా దేవతా, ఐం బీజం క్లీం శక్తిః, సౌ కీలకం, మమ ముక్త్యర్థే జపే వినియోగః వాసుదేవాయ – అం – నమః**

**సంకర్షణాయ, త–హా, ప్రద్యుమ్నాయ, మధ్య–వషట్, అనిరుద్ధాయ, అ–హుం, వాసుదేవాయ, కని – వౌషట్, సంకర్షణ వాసుదేవ ప్రద్యుమ్నానిరుద్ధేభ్యః, కర–ఫట్, ఏవం హృదయాదిన్యాసః, భూర్భువస్సువరోమితి దిగ్బంధః ధ్యానమ్ : జీవత్వం సర్వభూతానాం సర్వత్రాఖండ విగ్రహమ్ చిత్తాహంకారయంతారం జీవాఖ్యం త్వం పదం భజే ।**

సకల భూతములకు జీవత్వమైనవాడు, అఖండ స్వరూపుడై ప్రకాశించేవాడు, చిత్తాహంకారములకు నియామకుడైన జీవుడు అనే 'త్వం' పదాన్ని భజిస్తున్నాను. ఇది 'త్వం' పదమునకు అర్ధము.

**అసిపద మహామంత్రస్య, మన ర్పషిః, గాయత్రీఛందః, అర్ధనారీశ్వరో దేవతా అవ్యక్తాదిర్బీజం, నృసింహ శ్శక్తిః, పరమాత్మా కీలకం, జీవబ్రహ్మైకార్థే జపే వినియోగః పృథ్వీ ద్వ్యణు కాయ–అం, అబ్ద్వ్యణుకాయ, త–స్వాహా, తేజోద్వ్యణు కాయ–మధ్య–వషట్, వాయుద్వ్యణుకాయ అనా–హుం, ఆకాశద్వ్యణుకాయ,కని–వౌషట్, పృథివ్య ప్తేజో వాయ్వాకాశద్వ్యణు కేభ్యో నమః, కర ఫట్, భూర్భువస్సువరోమితి దిగ్బంధః ధ్యానమ్ : జీవో బ్రహ్మేతి వాక్యార్థం యావదస్తిమనస్థితిః, ఐక్యం తత్వం లయే కుర్వన్ ధ్యాయే దసిపదం సదా ఏవం మహా వాక్యషడంగాన్యుక్తాని, అథ రహస్యోపనిషద్విభాగశో వాక్యార్థ శ్లోకాః ప్రాచ్యంతే. యేనేక్షతే శృణోతీదం జిఘ్రతి వ్యాకరోతి చ, స్వాద్వస్వాదు విజానాతి తత్ప్రజ్ఞాన ముదీరితమ్**

జీవుడు అంటే బ్రహ్మమే అనే వాక్యార్థము నిశ్చయమయ్యే వరకు జీవబ్రహ్మాలకు ఐక్యమును బోధించే 'అసి' పదాన్ని ధ్యానిస్తున్నాను. ఇది **'అసి'** పదానికి అర్ధం. ఇక మహావాక్యాల అర్థాలు :

పరబ్రహ్మను చూస్తూ, వింటూ వాసన చూస్తూ, విస్తరింపచేస్తూ, మంచి, చెడులను గ్రహించుటయే ప్రజ్ఞానము.

బ్రహ్మాదిదేవతల యందు జగత్తులోని ఇతర జీవులయందు ఏ చైతన్యము ఏకరూపముగా ఉన్నదో అదే పరబ్రహ్మ. అందుచేత నాలో ఉన్న చైతన్యరూపమయిన ప్రజ్ఞానము కూడా పరబ్రహ్మమే. ఆత్మజ్ఞాన సాధనకు యోగ్యమయిన ఈ శరీరములో సర్వత్రా నిండి ఉన్న పరబ్రహ్మ బుద్ధికి సాక్షియై, స్వయంగా ప్రకాశిస్తూ **'అహం'** అనే శబ్దంతో చెప్పబడింది. స్వయంగా సంపూర్ణమైన పరమాత్మ మహావాక్యాలలో **బ్రహ్మ** అనే పదంతో చెప్పబడ్డాడు. **'అస్మి'** అనే పదము జీవ బ్రహ్మైక్యాన్ని చెబుతోంది. అందుచేత నేను కూడా బ్రహ్మనే అవుతాను. సృష్టికి పూర్వము నామరూపాలు లేనటువంటిది, ఏకమైనది, అద్వితీయమైనది, అయిన వస్తువు **తత్** పదము ద్వారా చెప్పబడుతున్నది. జీవునియొక్క శరీరము, ఇంద్రియాలకన్న అతీతమైన సద్వస్తువు మహావాక్యమునందు **'త్వం'** అని చెప్పబడింది. **అసి** అనే పదముతో ఐక్యత చెప్పబడుతోంది.

**అయమ్** అనే పదముతో ఆత్మస్వయంప్రకాశమైనది అని అర్థం చెప్పబడింది. ఇది అహంకారము ఆదిగా గలిగి, స్థూలశరీరము అంతముగా గల జగత్తుకన్న విలక్షణమైన ప్రత్యగాత్మ. బ్రహ్మ. శబ్దము శబ్దము కంటికి కనిపిస్తున్న పంచభూతాత్మకమైన సకల జగత్తుకు యదార్థమైన అధిష్ఠాన వస్తువును తెలుపుతున్నది. ఆ అధిష్ఠాన చైతన్యమే పరబ్రహ్మ. అది స్వయం ప్రకాశమైన ఆత్మరూపంలో ఉన్నది.

పదములకు వాచ్యార్థము, లక్ష్యార్థము అని రెండు రకాల అర్థాలుంటాయి.

**త్వం** అనే పదానికి వాచ్యార్థము – పంచభూతాత్మక శరీరము, ఇంద్రియాలు లక్ష్యార్థము – సచ్చిదానంద పరబ్రహ్మ.

ఇప్పుడు **తత్** అనే పదానికి వాచ్యార్థము – ఈశత్వ సర్వజ్ఞత్వాదులు. లక్ష్యార్థము – సచ్చిదానంద పరబ్రహ్మ

**అసి** అనే పదానికి, పై రెండు పదాలకు అంటే **తత్, త్వం** పదముల అర్థముల కలయిక.

తత్ అనగా వాడు. **త్వం** అనగా నీవు. **అసి** అనగా వాడే నీవు. మీ ఇద్దరూ ఒకటే. ఉన్నది ఒక్కటే. కాని కార్యకారణరూప ఉపాధివల్ల జీవుడు, ఈశ్వరుడు అని బేధము కనిపిస్తుంది. ఈ రెండు ఉపాధులను తిరస్కరించినట్లైతే మిగిలేది ఆ పరబ్రహ్మయే" అని చెప్పబడింది.

ఈ రకంగా గుహ్యమైన రామరహస్య, సరస్వతీ రహస్య, మహావాక్య, శుకరహస్యోప నిషత్తులందు దాగి ఉన్నాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు 'గుహ్యః' అనబడుతున్నాడు.

## 543. గభీరః

గంభీరుడు

**మహాగాంభీర్య యుక్తత్వాత్ గభీర ఇతి కథ్యతే ॥** మిక్కిలి గాంభీర్యముతో నుండువాడు.

నిర్మలమైన తన దివ్యదేహంలో ఈశ్వరత్వానికి తగినటువంటి గాంభీర్యము గలవాడు. ఇతనిని అర్చించినంత మాత్రంచేతనే అవిద్యతో కూడుకున్న సంసారి, చేతనుడు, నిర్మలుడు, అతిగంభీరుడుగా ప్రకాశిస్తాడు.

జ్ఞానము, ఐశ్వర్యము, బలము, వీర్యము మొదలయిన ఉత్తమ లక్షణములు గలవాడు. ఇతనికి జ్ఞానము ఐశ్వర్యము అనే గుణాలు సముద్రంలాగా అతి ఎక్కువగా ఉన్నాయి. ఈతని స్థితిని అర్థం చేసుకోవాలంటే ఉపనిషత్తుల స్థితి పూర్తిగా అవగాహన కావాలి.

వేదాంతోపనిషత్తులు 23 అవి

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | గర్భ | 9. | వజ్రసూచి | 17. | సూర్య |
| 2. | మైత్రాయణ | 10. | ఆత్మబోధ | 18. | అక్ష్య |
| 3. | కౌషీతకీబ్రాహ్మణ | 11. | స్కంద | 19. | అధ్యాత్మ |
| 4. | సుబాల | 12. | ముద్గల | 20. | సావిత్రి |
| 5. | మంత్రిక | 13. | పైంగల | 21. | ఆత్మ |
| 6. | సర్వసార | 14. | మహోపనిషత్తు | 22. | ప్రాణాగ్ని |
| 7. | నిరాలంబ | 15. | ఏకాక్షర | 23. | ముక్తిక |
| 8. | శుకరహస్య | 16. | అన్నపూర్ణ | | |

ఈరకంగా ఉపనిషత్తులవల్ల మాత్రమే తెలుసుకోగలవాడు. అందుచేతనే 'గభీరః' అనబడుతున్నాడు.

## 544.గహనః

చొరజాలకుండువాడు. 382వ నామం కూడా ఇదే.

**పాలైర్దురవగాహత్వాత్ గహనః పరికీర్తితః** లోకపాలకులైన ఇంద్రాది దేవతా సమూహాల చేత కూడా లోపలకు చొర శక్యము కానివాడు.

సముద్రంలో ఉన్న రత్నాలు ఇతర నిధి నిక్షేపాలు బయటకు కనిపించినప్పటికీ, మనము సముద్రంలోకి వెళ్ళటానికి వీలుకానంత లోతుగా ఉంటుంది. అలాగే, పరమేశ్వరుని దివ్యమంగళ విగ్రహము ప్రకాశవంతముగా, కన్నుల పండువగా ఉన్నప్పటికీ, అతని దగ్గరకు మనము చేరలేము. అతన్ని చేరాలి అన్నా, అతని తత్త్వము తెలుసుకోవాలి అన్నా చాలా శ్రమ పడాలి. అతడు త్రిగుణాలకు, త్రికాలాలకు అతీతుడు. సర్వానికి సాక్షి. ఎప్పుడూ తురీయస్థితిలోనే ఉంటాడు. అతన్ని గురించి తెలుసుకోవాలంటే, సాధకుడు కూడా తురీయస్థితికి చేరాల్సిందే. అందుకే శ్రీమన్నారాయణుడు 'గహనః' అనబడుతున్నాడు.

## 545. గుప్తః

దాచబడినవాడు, రక్షించబడినవాడు.

**అన్యై ర్దురవబోధో యః గుప్త ఇత్యభిధీయతే ॥** ఇతరులెవరిచేతా ఎరుగతగనివాడు.

తనను గురించి, తన తత్త్వము గురించి తెలియనివారి చేత తెలియబడనివాడు. తను గురించి తెలిసిన పూర్వాచార్యులచే రక్షింపబడినవాడు.

అవాంగ్మానసగోచరుడు **కఠోపనిషత్తు**లో చెప్పినట్లుగా ఆత్మ అన్నిభూతాలయందు ఉన్నది కాని బయటకు కనపడదు. అతిరహస్యంగా ఉంటుంది.

అందుచేతనే ఆత్మరహస్యంగా రక్షించబడి ఉంటుంది. భగవంతుని జ్ఞానము మహర్షుల హృదయాలలో గుప్తమై ఉన్నది. అది అర్హులైన వారికి మాత్రమే ఇవ్వబడుతుంది. అర్హత లేనివారికి బ్రహ్మవిద్యనుపదేశించరాదు.

పూర్వకాలంలో 'దధ్యుడు' అని ఒక మహర్షి ఉండేవాడు. అతడు మహాజ్ఞాని. ముల్లోకాల యందు కూడా 'దధ్యుడు బ్రహ్మజ్ఞాని' అని చెప్పుకొనేవారు.

ఇంద్రుడు దేవరాజు. స్వర్గాధిపతి. నిరంతరము స్వర్గసుఖాలలో తేలియాడుతుండే వాడు. అటువంటి ఇంద్రుడికి బ్రహ్మవిద్యను తెలుసుకోవాలి అనిపించింది. బ్రహ్మోపదేశం చెయ్యటానికి అర్హుడైన వాడి కోసం వెదుకుతున్నాడు. ఇంతలో దధ్యునిపేరు చెప్పారు మంత్రులు, వెంటనే దధ్యుని దగ్గరకు ప్రయాణమైనాడు.

దేవరాజైన ఇంద్రుడు తన ఆశ్రమానికి వచ్చాడని తెలిసి మహదానందం పొందాడు ఋషి. అర్ఘ్యపాద్యాదులిచ్చి సత్కరించాడు. వచ్చిన పని ఏమిటి ? అని అడిగాడు. పని చేస్తానని ముందుగా మాట ఇస్తేనే చెబుతానన్నాడు ఇంద్రుడు. సరే అన్నాడు దధ్యుడు. ఇప్పుడు చల్లగా చెప్పాడు ఇంద్రుడు. 'బ్రహ్మోపదేశం కావాలి' అని చెప్పేశాడు. ముందుగానే మాటిచ్చాడు మహర్షి. ఇప్పుడు కాదంటే అసత్యదోషము. ఔనంటే అపాత్రదానము. ఏం చెయ్యాలో పాలుపోలేదు దధ్యుడికి అతని వాలకం చూసి ముందుగా మాట ఇచ్చావు అసత్యమాడకు అన్నాడు ఇంద్రుడు చేసేది లేక సరేనన్నాడు మహర్షి. మరునాడు ఆభరణాలన్నీ తీసివేసి, కౌపీనం ధరించి వచ్చి మిగిలిన వారితో కలిసి కూర్చున్నాడు. దధ్యుడు చెప్పటం ప్రారంభించాడు. "ఈ లోకంలో సుఖాలన్నీ ఉపయోగం లేనివి. అవి నిజంగా సుఖాన్నివ్వవు. పైగా దుఃఖాన్నిస్తాయి. ఈ రాజ్యము, అప్సరసలు అంతా మాయ" అన్నాడు మహర్షి. కోపం వచ్చింది ఇంద్రుడికి. నన్ను హేళన చెయ్యటానికే ఈ మాటలు చెబుతున్నావు. ఇంకొకసారి అలా జరిగితే నీ ప్రాణాలు తీసివేస్తాను. అని చెప్పాడు. ఆ రోజు నుంచి బ్రహ్మోపదేశం చెయ్యటం మానివేశాడు దధ్యుడు.

ఈ రకంగా అర్హత లేనివారికి పరబ్రహ్మను గురించి చెప్పరాదు.

**భగవద్గీత**లోని ఏడవ అధ్యాయం **'జ్ఞానయోగము'**లోని 25వ శ్లోకము

**నాహం ప్రకాశ సర్వస్య యోగమాయా సమావృతః ।**

**మూఢోஉయం నాభి జానాతి లోకో మామజమవ్యయమ్ ॥**

యోగమాయ యందు దాగి ఉండి అందరికీ గోచరించడు. అందుచే అజ్ఞానులు అతన్ని జన్మ రహితుడు, పరమేశ్వరుడు, శాశ్వతుడు అంటారు.

అందుకే శ్రీమన్నారాయణుడు 'గుప్తః' అనబడుతున్నాడు.

## 546. చక్రగదాధరః

దివ్యమైన ఆయుధములు ధరించినవాడు.

**యశ్శక్తి మద్దివ్యహేతిః సస్స్యాచ్చక్రగదాధరః**

సామర్థ్యము గల చక్రము, గద మొ॥ ఆయుధములు గలవాడు.

**తమసః పరయో ధాతా శంఖచక్ర గదాధరః**

దివ్యభూషణములు ధరించినట్లే, దివ్యాభరణములు ధరించినవాడు.

**మనస్తత్వాత్మకం చక్రం బుద్ధి తత్త్వాత్మకం గదాం ।**
**ధారయన్ లోకరక్షార్థం ముక్తశ్చక్ర గదాధరః ॥**

మనస్తత్వాత్వకమైన చక్రము, బుద్ధితత్త్వాకమైన గదలను లోకాలను రక్షించటం కోసం ధరించినవాడు. మనస్సు, బుద్ధిల ద్వారా శ్రవణము, మననము, నిధి, ధాసలు జరిపినట్లైతే ఆమహనీయుని దర్శించవచ్చును. రావణబ్రహ్మ గతించిన తరువాత మండోదరి శంఖచక్ర గదాధారుడైన శ్రీమహావిష్ణువును దర్శించింది. అందుచేత శ్రీమహావిష్ణువు 'చక్రగదాధరః' అనబడుతున్నాడు.

## 547. వేధాః

ప్రకాశింపచేయువాడు.

**మహావిభవకల్యాణం సతతం విదధాతి యః ।**
**భక్తేభ్యః పరమం వేధాః షడర్ణో మంగళప్రదః ॥**

తన భక్తులకు ఎల్లప్పుడు మహావైభవమైన మంగళములు సమకూర్చువాడు. ఈ నామము షడక్షరి మంగళప్రదము.

**విదధాతీతి వేధాః** అపరిమితమైన వైభవము సదా ప్రకాశించునట్లు ఉండేవాడు.

**విధత్తే – ఇతి విధాతా – వేధాః** లోకాలను సృష్టిస్తాడు అనే వ్యుత్పత్తిచేత విధాతా, వేధాః అని రెండు రూపాలు అవుతున్నాయి. సృష్టి చేయువాడు సృష్టికర్త. విశ్వపతి

వేధాః అనగా సృష్టికర్త అంటోంది అమరకోశము. అటువంటి సృష్టి చెయ్యటానికి సాధనములు తానే అయిఉన్నాడు. అందుకే శ్రీమన్నారాయణుడు 'వేధాః' అనబడుతున్నాడు.

## 548. స్వాంగః

ఛత్రచామరాది సకల అంగములతో కూడినవాడు.

**స్వాసాధారణ మంగంహి ఛత్రాది పరిబర్హణమ్ ।**

**యస్యాస్తినిత్యం సస్వాంగః షడర్ణః పరివారదః ॥**

ఛత్రచామరములు అనేవి సార్వభౌమాదికారానికి గుర్తు. దేశాన్ని పాలించే రాజు లేదా చక్రవర్తి వాటిని ధరిస్తాడు. పరమేశ్వరుడు ఈ జగత్తుకే చక్రవర్తి. కాబట్టి ఛత్రచామరాలు ధరించి దివ్యమంగళ విగ్రహముగా వెలుగొందుతాడు. ఈ నామము షడాక్షరి. పరివారాన్నిస్తుంది.

**స్వం అంగం యస్యసః స్వాంగః** పరమపదంలో తనరాజ్యాధికారానికి తగిన హంగులు ఛత్రచామరాలతో ఉండేవాడు.

సృష్టి చెయ్యటానికి కావలసిన సాధనసంపత్తి కూడా తానే అయినవాడు. ఏ రకమైన ఇతర పరికరాలు అవసరం లేకుండానే సృష్టి చేస్తాడు. సృష్టి అనే ఉపాదాన నిమిత్తకారణములు రెండూ అతడే. అందుచేతనే అతడు స్వతంత్రంగా, ఎవరి సహాయ సహకారాలు లేకుండా జగత్తును సృష్టించగలవాడు. కాబట్టే స్వాంగః అనబడుతున్నాడు.

ఛత్రచామరాలు ధరించటమే పరమేశ్వరత్వానికి చిహ్నాలు. అందుకే ఆ పరమేశ్వరుడికి

**ధరసింహాసనమై న వంబుగొడుగై**

**తద్దేవలు భృత్యులై పరమామ్నాయములెల్ల**

**వందిగణమై బ్రహ్మాండమాకారమై**

**శ్రీభార్యామణియై విరించి కొడుకై**

**శ్రీగంగ సత్పుత్రియై వరసన్నీగణరాజాసొంపునిజయై**

**వర్ధిల్లునారాయణా ॥**

| | | |
|---|---|---|
| ఈధరామండలమే | – | సింహాసనము |
| ఆకాశమే | – | గొడుగు |
| సకలదేవతాగణము | – | సేవకులు |

| | | |
|---|---|---|
| సకల ఆమ్నాయాలు | - | వందిమాగదులు |
| బ్రహ్మాండము (విశ్వరూపము) | - | ఆకారము |
| లక్ష్మీదేవి | - | భార్య |
| బ్రహ్మ | - | కుమారుడు |
| పవిత్రగంగానది | - | కుమార్తె |

## 549. అజితః

అజిత అనే నగరము గలవాడు

**ప్రాకృతై ర్నజితా యా సా యస్యాస్తి త్యజితాపురీ ।**

**అజితస్తేన విజ్ఞేయః సప్తార్ణో ముక్తిదోమనుః ॥**

ప్రాకృతపురుషులకు అజేయమైన అజిత అనే పట్టణము గలవాడు. ఈ నామము సప్తాక్షరీ మహామంత్రము. మోక్షదాయకము

ఉపనిషత్తులతో ఏర్పడినటువంటి నిత్యమైన 'అజిత' అనే నగరము గలవాడు.

**పురం హిరణ్మయీం బ్రహ్మ వివేశాపరాజితా**

సువర్ణమయమైన అపరాజిత అనే పట్టణంలో పరబ్రహ్మ గలడు.

**దేవీభాగవతం**లో మణిద్వీపంలో పరమేశ్వరిని

**జయాచ విజయాచైవా । హ్యజితాచాపరాజితా**

**నిత్యావిలాసినీ దోగ్ధ్రీ । త్యఘోరా మంగళానవా**

**పీఠశక్తయ ఏవాస్తు । సేవంతే యాపరాంబికాం ॥**

జయ, విజయ, అజిత, అపరాజిత, నిత్య, విలాసిని, దోగ్ధ్రీ, అఘోర, మంగళ అనే తొమ్మిది పీఠశక్తులు ఆ పరమేశ్వరిని సేవిస్తుంటాయి.

ప్రాకృత పురుషులు - లౌకిక లంపటంలో దిగికూరుకుపోయినవారు. సంసారమనే లంపటంలో మునిగిపోయిన వారు - అజ్ఞానులు. వీరు చేరటానికి వీలు లేనటువంటిది, వీరికి అజేయమైనది అయిన 'అజిత' పట్టణమునందుండు వాడు. అక్కడికి జ్ఞానులు, వైరాగ్య సంపన్నులు, తత్పరులు మాత్రమే చేరగలరు.

పరమేశ్వరుడు అతిపరాక్రమవంతుడు. లోకములోని శక్తి అంతా అతనిదే. భక్తులు అతనిని ఆరాధించే దివ్యాస్త్రాలు సంపాదిస్తారు. అటువంటి పరమేశ్వరుని గెలవటం

ఎవరికి సాధ్యం కాదు. అందుచేతనే అతడు ఏ అవతారంలోనూ కూడా ఎవరిచేతా ఓటమి ఎరుగనివాడు. కాబట్టే 'అజితః' అనబడుతున్నాడు.

## 550. కృష్ణః

నల్లని శరీరము గలవాడు. 57వ నామము కూడా ఇదే.

**అప్రాకృతా తిరుచిర మేచకః కృష్ణ ఈరితః**

అప్రాకృతమైన సుందరమైన నలుపురంగులో ఉండేవాడు.

కాలమేఘమువలె నల్లనివాడు.

**కృష్ణామి మేదినీం పార్థభూత్వాకృష్ణాయ సోమహాన్ ।**
**కృష్ణోవర్ణశ్చయే యస్మాత్ తేన కృష్ణోఽ హమర్జున ॥**

అర్జునా ! నేను నల్లని కొయ్యగొడ్డలియై భూమిని చీల్చటం చేతను, కృష్ణవర్ణుడనగుట చేతను, నన్ను కృష్ణుడు అంటారు.

పరమేశ్వరుడు నీలమేఘశ్యాముడు. ఆకాశం నీలంగా ఉంటుంది. నిజానికి ఆకాశంలో రంగు లేదు. కాని అనంతమైన వస్తువు ఏదైనా సరే నీలవర్ణంలో ఉంటుంది. ఆకాశం సర్వత్రా వ్యాపించి ఉంటుంది. అనంతమైనది. కాబట్టే నీలవర్ణంలో కనిపిస్తుంది. అలాగే పరమేశ్వరుడు కూడా సర్వాంతర్యామి కావటంచేత, సర్వవ్యాపి కావటంచేత నీలమేఘశ్యాముడు అవుతున్నాడు.

కృష్ణ అంటే – కృష్ణద్వైపాయనుడు (వ్యాసుడు) అని అర్థం. వ్యాసుడు సాక్షాత్తూ శ్రీమహావిష్ణువు స్వరూపమే.

**కృష్ణద్వైపాయనం వ్యాసం విద్ధినారాయణమ్ ప్రభుమ్ ।**
**కోహ్యన్యః పుండరీకాక్షా న్మహాభారతకృద్భవేత్ ॥**

అలా కాకపోతే అసలు మహాభారతము వ్రాయనే లేదు.

## 551. ధృఢః

బలమైనవాడు, స్థూలమైనవాడు.

**స్థూలత్వాద్బల వత్త్వాచ్చ ధృధ ఇత్యభిధీయతే ॥**

అతడు స్థూలమైనవాడు, బలమైనవాడు, కాబట్టి 'ధృఢః' అని చెప్పబడింది.

పరమేశ్వరుడు నిత్యము, సత్యము అయినవాడు. అయినప్పటికీ ఉపాసకుల కోసము వ్యూహరూపి అవుతున్నాడు అందుచేతనే స్థూలరూపియై 'ధృధః' అనబడుతున్నాడు.

తన రూపమునుంచిగాని, బలము నుంచిగాని తొలగిపోవటమనేది లేనివాడు.

**పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్ పూర్ణముదచ్యతే ।**
**పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే ॥**

కనిపించనిది అంతా అనంతమైనది. కనిపించే విశ్వంకూడా అనంతమైనదే. ఆ అనంతం నుంచే ఈ అనంతం బయటకు వచ్చింది. అయినప్పటికీ ఆ అనంతం యొక్క పూర్ణత్వానికి ఏవిధమైన లోటురాదు. ఆ అనంతం అనంతంగానే ఉంటుంది.

నిరాకారుడు నిర్గుణస్వరూపుడు పరబ్రహ్మ. సృష్టి చెయ్యాలని సంకల్పించినవాడై తనలోనుండి కొంతభాగాన్ని బయటకు పంపాడు. అయినప్పటికీ అతడు బిందురూపుడుగానే ఉన్నాడు. ఆయన బిందుత్వానికి ఏ మాత్రము భంగం రాదు. ఎందుచేతనంటే, సున్నాకు ఇంకొక సున్న కలిపినా, లేక సున్న నుంచి ఇంకొక సున్న తీసివేసినా సున్న విలువ మారదు.

అందుచేత శ్రీమన్నారాయణుడు 'ధృధః' అనబడుతున్నాడు.

## 552. సంకర్షణోఽచ్యుతః :

ప్రళయకాలంలో జగత్తులోని ప్రాణులన్నింటినీ తన దగ్గరకు లాగుకొనేవాడు. నాశనము లేనివాడు. ప్రళయం రెండు రకాలు సంభవిస్తుంది. 1. పాక్షిక ప్రళయము 2. మహాప్రళయము

పాక్షిక ప్రళయం సంభవించినప్పుడు సృష్టిలో కొంతభాగం మిగులుతుంది. మత్స్యావతార సమయం పాక్షిక ప్రళయం. అప్పుడు భూమి అంతా జలమయం అవుతుంది. సత్యవ్రత మహారాజు సప్తఋషులు అంతా ఒక ఓడ ఎక్కి రక్షించబడతారు సత్యవ్రతుడే వైవస్వతమనువుగా తరువాతి మన్వంతరాన్ని ప్రారంభిస్తాడు.

మహాప్రళయం జరిగినప్పుడు జగత్తులో ఏమి మిగలదు. అంతా శూన్యం అయిపోతుంది. ఈ రకంగా ప్రళయకాలంలో అన్ని జీవులను తనదగ్గరకు లాక్కునేవాడు కాబట్టి పరమేశ్వరుడు 'సంకర్షణుడు' అనబడుతున్నాడు.

అచ్యుతుడు – నాశనము లేనివాడు.

శంకర భగవత్పాదులవారు ఈ నామాన్ని ఒకటిగా వ్రాశారు. కాగా పరాశర భట్టరువారు దీన్ని రెండు నామాలుగా వ్రాశారు.

**సంకర్షణః :** సంకర్షణుడు

**యఃకర్షతే చిదచితౌ స సంకర్షణ ఉచ్యతే ॥**

చేతనాచేతనములను వాటి కర్మను అనుసరించి నానాయోనులందు ప్రవేశపెట్టేవాడు.

మానవుడు జన్మించిన తరువాత కర్మ చేస్తాడు. దానివల్ల పాపపుణ్యాలు వస్తాయి. వాటిని అనుభవించిన తరువాత కర్మశేషాన్ని అనుభవించటానికి మళ్ళీ భూలోకంలో జన్మిస్తాడు. ఈ రకంగా జీవులు చేసిన కర్మను బట్టి వాటికి ఉత్తర జన్మలు ప్రసాదిస్తాడు పరమేశ్వరుడు. అందుకే అతడు సంకర్షణుడు

**సంకృషతీతి సంకర్షణః** చేతనాచేతనములన్నింటినీ తనయందు చేర్చుకొనువాడు.

**అచ్యుతః :** జారనివాడు.

**యస్మాన్న చ్యవతే స్థానాత్ బ్రహ్మాది స్యోఽచ్యుత స్స్మృతః**

బ్రహ్మాది దేవతలు తమగతులు తప్పకుండా కాపాడేవాడు.

**న చ్యువతే ఇతి అచ్యుతః** తన స్థానము నుండి జారనివాడు.

## 553. వరుణః

ఆవరించువాడు.

**యస్థిర సర్వమావృత్య వరుణస్సతు కథ్యతే** సమస్తాన్ని ఆవరించి ఉండేవాడు.

**వ్రియతే సర్వమనేనేతి వరుణః** సకలము ఆవరించి ఉన్నవాడు.

వృణోతి కప్పివేయును. తన కిరణములను కప్పి వేసుకుంటాడు. సాయంకాల సమయంలో సూర్యుడు తనకిరణాలు కప్పివేసుకుంటాడు కాబట్టి వరుణుడు అనబడతాడు.

సాయంకాల సమయంలో సూర్యుడు ఏ రకంగా తన కిరణాలను ఉపసంహరించు కుంటాడో, అలాగే పరమేశ్వరుడు తననుండి ఆవిర్భవించిన జగత్తును ఉపసంహరించు కుంటాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'వరుణః' అనబడుతున్నాడు.

## 554. వారుణః

వరించువారలగలవాడు.

**అవస్థావరుణాస్తాసుస్థితో వారుణ ఈరితః**

తనను ఉపాసించే ఆపన్నుల విషయమై ఆదరముతో ఉండేవాడు.

**వృణుతే ఇతివరుణః తత్ర భవః వారుణః**

తనను వరించేవారు అనేకమంది గలవాడు.

**భగవద్గీత**లోని 9వ అధ్యాయం **'రాజ విద్యారాజగుహ్యాయోగము'**లోని 29వ శ్లోకము

**సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః**
**యే భజంతి మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్**

అర్జునా ! జాతి, ఆకారము, స్వభావము, జ్ఞానము మొదలగు వాటిచే గొప్పవారైనా, తక్కువ వారైనా నన్ను ఆశ్రయించటంలో అందరూ సమానులే. వారు గొప్పవారు కదా అని గౌరవించను. తక్కువవారు అని తిరస్కరించను. నన్ను భజించకుండా నిలువలేని నా భక్తులు మాత్రమే నా తోటివారికిమల్లే ప్రవర్తిస్తారు. నేను వారిపట్ల, నాకన్న గొప్పవారిపట్ల ప్రవర్తించినట్లుగానే ప్రవర్తిస్తాను.

నేను సకలభూతములందు సమభావంతోనే ఉంటాను. నాకు ప్రియుడుగాని, అప్రియుడుగాని ఎవరూ లేరు. నన్ను భక్తితో భజించేవారు నాయందే ఉంటారు. నేను కూడా వారియందు ప్రత్యక్షముగా ఉంటాను.

సాకారంతోగాని, నిరాకారంగాకాని భగవంతుణ్ణి భక్తిశ్రద్ధలతో అర్చించినట్లైతే అతడు ఎప్పుడూ నాయందే ఉంటాడు.

భగవానుడు దుర్వాసుడితో "నా భక్తులు నాకు హృదయమువంటివారు. నేను వారికి హృదయము వంటివాడను. వారు నన్ను తప్ప వేరెవరినీ ఎరుగరు. అందుకని వారు తప్ప నామదిలో ఎవరూ మెదలరు.

వరుణిని సంతానమైన వశిస్థుడు, అగస్త్యుడు 'వారుణః' అనబడతారు. వీరుకూడా శ్రీమహావిష్ణువు యొక్క స్వరూపమే.

## 555. వృక్షః

వరించువాడు, ఆధారమైనవాడు.

**సాధూనామాశ్రయ త్వాచ్చ సర్వేన స్సహనాదపి ।**
**సర్వసత్వాప జీవ్యత్వాత్ వృక్ష ఇత్యభిధీయతే ॥**

సత్పురుషులకు ఆధారమైనవాడు. తన భక్తుల సమస్త పాపములు సహించేవాడు, సమస్త ప్రాణులకు బ్రతుకుతెరువైనవాడు. ఈరకంగా అందరికీ ఆధారమైన వాడు కాబట్టి వృక్షము అనబడుచున్నాడు.

**వృక్షతే వృణీతే ఇతివృక్షః** తనను ఆరాధించేవారిలోకూడా ఎవరైతే తన వెంట నీడలా ఉంటారో, వారికి తన సర్వస్వాన్ని ఇచ్చేవాడు. వారి అపరాధములు మన్నించేవాడు.

శ్రీరామచంద్రుడు సాధువులకు నీడనిచ్చి రక్షించే వృక్షమువంటివాడు. ఆపదలో ఉన్నవారికి శరణాగతుడు.

**శ్వేతాశ్వరోపనిషత్తు**లో "ఏ బ్రహ్మముకన్న శ్రేష్ఠమైనది కాని, వేరైనదికాని, పెద్దదికాని, చిన్నదికాని, ఏదీలేదో, ఏది వృక్షములాగా ఆకాశమందు నిలబడి ఉన్నదో, అట్టి బ్రహ్మముచేత సమస్త ప్రపంచము పరిపూర్ణమై, వ్యాప్తమై ఉన్నది" అని చెప్పబడింది.

ఇక్కడ వృక్షానికి ఋతుధర్మము ప్రకారము ఆకురాలటం, చిగురించటం అన్నీ జరుగుతాయి. కాని వృక్షం మాత్రం అలానే ఉంటుంది. అదేవిధంగా పరమాత్మనుంచి ఎందరు జీవులు ఉద్భవించినప్పటికీ, ఎన్ని సృష్టులు జరిగినా పరమాత్మలో ఏ రకమైన మార్పు ఉండదు. అందుకే శ్రీమన్నారాయణుడు 'వృక్షః' అని చెప్పబడ్డాడు

## 556. పుష్కరాక్షః

పోషించు నేత్రములు గలవాడు. 40వ నామము కూడా ఇదే.

**సతాం ప్రసాద వర్షేణ పోషకే యస్యచాక్షిణీ ।**
**పుష్కరాక్ష స్స విజ్ఞేయో హ్యష్టార్ణః ప్రీతివర్ధనః ॥**

సత్పురుషుల మీద తన అనుగ్రహము వర్షించి పోషించు నేత్రములు గలవాడు. ఈ నామము అష్టాక్షరీ మంత్రము ప్రీతికరము.

**పుష్కరే అక్షిణి యస్యసః పుష్కరాక్షః**

సాధువులయందు, సజ్జనులయందు కృప వర్షించి పోషించే నేత్రములు గలవాడు.

పుష్కర అంటే పద్మము. హృదయ పద్మమునందు వ్యాపించి ఉండువాడు.

అక్షః అంటే – వ్యాపించటము అని అర్థం. పుష్కర అనగా – ఆకాశము

ఆకాశమంతా వ్యాపించినవాడు.

**కైవల్యోపనిషత్తు**లో అశ్వలాయన మహర్షి పరమేష్ఠియైన ప్రజాపతివద్దకు వచ్చి "ఓ భగవానుడా ! విద్యలన్నిటిలోకి శ్రేష్ఠమైనది, సత్పురుషులచే ఉపాసించబడేది, మిక్కిలి రహస్యమైనది అయిన బ్రహ్మవిద్యను నాకు ఉపదేశించండి. మిగిలిన బ్రహ్మవేత్తల లాగా నేనుకూడా పాపాలను పోగొట్టుకుని శీఘ్రంగా పరాత్పరుణ్ణి చేరతాను" అన్నాడు. అలా అడిగిన అశ్వలాయనుడితో ప్రజాపతి ఈ విధంగా అంటున్నాడు.

"నాయనా పరబ్రహ్మతత్త్వాన్ని భక్తి, శ్రద్ధ, యోగము, ధ్యానము ద్వారా మాత్రమే తెలుసుకోవాలి. కర్మద్వారా గాని, సంతానం, ధనం మొదలయిన వాటిద్వారాగాని ఎవరూ బ్రహ్మతత్త్వాన్ని తెలుసుకోలేరు. అమరత్వాన్ని పొందలేరు. అమరత్వానికి రూపమే మోక్షము. దాన్ని త్యాగంద్వారా మాత్రమే పొందాలి. త్యాగమంటే దానధర్మాలు చేయటంకాదు. మనకున్నవన్నీ వదిలెయ్యాలి. ముఖ్యంగా రాగద్వేషాలు, కామ్యకర్మలు, అహంకార మమకారాలు త్యాగం చెయ్యాలి. ఆ పరతత్త్వం ఎక్కడో లేదు. నీ హృదయ పద్మంలోనే ఉన్నది. ఇంద్రియ నిగ్రహం గల మహర్షులు మాత్రమే దాన్ని చేరగలుగుతారు. ఓ మహర్షీ ! శమదమాది నియమశీలురైనవారు పరమాత్మలో లీనం కాగలుగుతారు.

వేదాంతము వినటంవల్ల అపరోక్షజ్ఞానం కలుగుతుంది. దానివల్ల పరతత్త్వాన్ని గూర్చిన అవగాహన కలుగుతుంది. నిష్కల్మషమైన హృదయం అపరోక్షజ్ఞానం, గలిగి నియమనిష్ఠలు ఆచరించేవారు సన్యాసయోగం ద్వారా బ్రహ్మలోకాన్ని పొంది కల్పాంతంలో అమరత్వం పొందుతారు. అంటే జనన మరణాల నుండి విముక్తి పొందుతారు. ఇదే క్రమముక్తి. వేదాంత ప్రవచనాలు వినటం, బ్రహ్మను గూర్చి నిశ్చయజ్ఞానం కలగటం, తపస్సు, సన్యాసదీక్ష ఇవన్నీ ఒక క్రమాన్ని తెల్పుతాయి.

అందుచేత సన్యాసాశ్రమంలో ఉన్నవాడు పవిత్రుడై నిర్జన ప్రదేశంలో సుఖాశీనుడై మెడ, తల, శరీరము తిన్నగా నిలుపుకుని, గురువుకు నమస్కరించి బాహ్యేంద్రియాలను నిరోధించి యోగంలో స్థిరంగా ఉండాలి. ఆ తరువాత హృదయ కమలంలో ఉన్న అవాఙ్మానస గోచరుడు. ఇంద్రియాలకు అతీతుడు, శాంతుడు, అవ్యయుడు, ఆదిమధ్యాంత రహితుడు, కల్యాణ స్వరూపుడు అయిన పరమాత్మను ధ్యానం చేసినట్లైతే అర్హత గలవాడు సంసారబంధనాల నుండి విముక్తి పొందుతాడు. మునీశ్వరులందరూ అద్వితీయుడు, అవ్యయుడు, ఆదిమధ్యాంతరహితుడు, నిరాకారుడు, సర్వవ్యాపకుడు, సచ్చిదానంద రూపుడు, ప్రశాంతుడు, సర్వానికీ సాక్షీభూతుడు అయిన పరమేశ్వరుణ్ణి ధ్యానిస్తారు. అతడే బ్రహ్మ, శివుడు, ఇంద్రుడు, సమస్త దేవతా స్వరూపుడు, నాశరహితుడు. అతడే విష్ణువు, హిరణ్యగర్భుడు, కాలము, అగ్ని, చంద్రుడు అన్నీ అతడే. ఈ రకంగా సర్వదేవతా స్వరూపుడు అతడే. భూత భవిష్యద్వర్తమానాలలో ఉన్నవాడు, సనాతనుడు అయిన బ్రహ్మను అనుభవంలోకి తెచ్చుకున్నవాడు మృత్యువును జయిస్తాడు. ఈ రకంగా ఆత్మ, పరమాత్మ రెండూ ఒక్కటే అనే అనుభవం ఒక్కటే మోక్షానికి మార్గం.

అన్నిటినీ సమభావంతో చూసే యోగీశ్వరుడు సమస్త భూతాలలోనూ తన ఆత్మనే చూడగలుగుతాడు. తన ఆత్మలోనే సమస్తాన్ని చూడగలుగుతాడు. ఆత్మను క్రింద ఉండే

అరణిగాను, ప్రణవాన్ని పైన ఉండే ఆరణిగాను చేసుకొని నిరంతరము ధ్యానమనే అభ్యాసం వలన కలిగిన తత్త్వజ్ఞానం ద్వారా పండితుడైనవాడు పాపాలను దహించివేస్తాడు.

అజ్ఞాని దేహాన్నే ఆత్మగా భావిస్తాడు. స్త్రీ సుఖము, అన్నపానాదులచేత ఇంద్రియాలను తృప్తిపరుస్తూ అదే సుఖము అనుకుంటాడు.

మాయా కల్పిత సంసారంలో జీవుడే భోక్త. సుఖదుఃఖాలను అతడే అనుభవిస్తాడు. అజ్ఞానాంధకారంలో ఉన్న జీవుడు గాఢనిద్రలో ఆత్మలో లీనమై అవిద్యచేత ఆచ్ఛాదించబడిన స్వరూపసుఖాన్ని అనుభవిస్తాడు. సుషుప్తిలో నిద్రపోతున్న జీవుడు జన్మాంతరకర్మ సంబంధంచే తాను చేసిన కర్మఫలాన్ని అనుభవించటానికి మళ్ళీ మేల్కొంటాడు. ఈ రకంగా జాగ్రస్వప్న సుషుప్తులలో క్రీడిస్తూ ఉంటాడు. అతనివల్లనే ఈ జగత్తు సృష్టించబడుతోంది. ఎవనిలో స్థూలసూక్ష్మ కారణ శరీరాలు, అవస్థాత్రయము, వీటికి అభిమాని అయిన జీవుడు లయమైపోతారో, అటువంటి పరమాత్మయే ఈ విశ్వానికి మూలకారకుడు, అఖండ జ్ఞానస్వరూపుడు.

ఆ పరమాత్మ వల్లనే ప్రాణము, మనస్సు, ఇంద్రియాలు, ఆకాశం, వాయువు, అగ్ని, జలం, పృథివి అన్నీ పుడుతున్నాయి.

ఏ పరబ్రహ్మ అందరికీ ఆత్మస్వరూపుడైనాడో, ఏ పరమాత్మ ఈ సృష్టికి ఆధారమైనాడో, ఏ మహతత్త్వానికి నిత్యము సత్యము అయి ఉన్నదో, ఆ మహత్తత్త్వానివి నీవే. అవస్థాత్రయాన్ని ప్రకాశింపచేస్తూ, వాటికి సాక్షీభూతుడైన పరబ్రహ్మను నేనే అని తెలుసుకున్నవాడు సమస్త బంధనాలనుండి విముక్తి పొందుతాడు.

సచ్చిదానంద రూపుడను, పరమాత్మను అయిన నానుండే ఈ జగత్తు అంతా ఉద్భవించింది. నాలోనే అన్నీ ఉన్నాయి. అన్నీ నాలోనే లయమవుతున్నాయి. అద్వితీయుడైన పరబ్రహ్మను నేనే. సూక్ష్మాతి సూక్ష్మమైనవాడను నేనే. మహత్తరమైన దానికన్న మహత్తరమైనవాడను నేనే. పురాతనుడను నేనే. ఈ విశ్వానికి కారకుడను, హిరణ్మయ స్వరూపుడను, కల్యాణ స్వరూపుడను నేనే.

అవయవాలు లేనివాడను, ఊహకుకూడా అందని శక్తి స్వరూపుడను. కళ్ళు లేకపోయినా చూడగలను. చెవులు లేకపోయినా వినగలను. నేను అద్వితీయుణ్ణి. నాకు సాటిఅయినవారు లేరు. నేను అనంగుడనైనా అందరినీ ఎరుగుదును. కాని నన్ను గుర్తించగలవారు లేరు. వేదాలలో తెలుసుకో తగ్గవాడను నేను. వేదాంతానికి కర్తను. వేదవేత్తను నేనే. నాకు పుణ్యపాపాలు లేవు. జనన మరణాలు లేవు, దేహము, ఇంద్రియాలు,

బుద్ధులు లేవు. పంచభూతాలు నాచేతనే నిర్మించబడ్డాయి. అంతేగాని పంచభూతాలతో నేను నిర్మించబడలేదు. నన్ను తెలుసుకున్న జీవులు బంధ విముక్తులౌతారు.

ఈ ప్రపంచంతో సంబంధం లేనట్టి, ఈ ప్రపంచానికి సాక్షి అయినటువంటి, పరమాత్మ స్వరూపమైన, వేదాలలో ప్రతిపాదించబడిన తత్త్వాన్ని తెలుసుకున్నవాడు అగ్నిలాగా పరిశుద్ధుడౌతాడు. ఆత్మలాగా పవిత్రుడౌతాడు, సురాపానం, బ్రహ్మహత్య, సువర్ణాపహరణం మొదలైన వాటివల్ల కలిగే పాపాలనుండి విముక్తుడౌతాడు. ఆత్మజ్ఞానం పొందటంవల్ల ఆశ్రమ ధర్మాలు అతిక్రమించిన పాపంకూడా నశిస్తుంది. ఈవిధంగా ఆత్మ స్వరూపుడైన పరమాత్మతో అపరోక్షానుభూతి పొంది అర్హుడైనవాడు మోక్షాన్ని పొందుతాడు.

కాబట్టి ఓ అశ్వలాయన మహర్షీ ! జీవాత్మా, పరమాత్మ రెండు ఒక్కటే. ఆ పరబ్రహ్మ హృదయ కమలంలోనే ఉన్నాడు. సత్యశీలురై, నియమ నిష్ఠలతో కర్మల నాచరించిన జ్ఞానులు మాత్రమే అతణ్ణి దర్శించగలరు. చరాచర జగత్తు పరమేశ్వర మయమని, ఆ పరమేశ్వరుడు తనలోనే ఉన్నాడని, తానే పరమేశ్వర స్వరూపుణ్ణని, పరమేశ్వరునికి తనకూ భేదం లేదని తెలుసుకున్న జ్ఞానియే పరమేశ్వర స్వరూపుడై బ్రహ్మలోకం పొంది, కల్పాంతం వరకు బ్రహ్మలోకంలో ఉండి తరువాత పరబ్రహ్మలో లీనమైపోతాడు. ఈరకంగా దహరాకాశ మంతా వ్యాపించాడు. కాబట్టి శ్రీమన్నారాయణుడు 'పుష్కరాక్షః' అనబడుతున్నాడు.

**ఛాందోగ్యోపనిషత్తు**లో నామరూపాత్మకమైన జగత్తు అంతా పరబ్రహ్మ స్వరూపమే. ప్రపంచమంతా పరబ్రహ్మనుంచే ఉత్పన్నమై చివరకు పరబ్రహ్మలోనే లీనమవుతుంది. సృష్టి స్థితిలయాలు అన్నీకూడా బ్రహ్మమయమే కాబట్టి ఉపాసకుడు రాగద్వేషాలను విడిచి పెట్టి జితేంద్రియుడు కావాలి. పరబ్రహ్మను నిశ్చయాత్మక బుద్ధితో ఉపాసించాలి. పరబ్రహ్మ మనోమయుడుగా కనిపిస్తాడు. అదే విధంగా స్థూలసూక్ష్మ శరీరాలు కలవాడు, చైతన్య స్వరూపుడు, సత్యసంకల్పుడు. అతడు ఆకాశాత్మ. అంటే ఆకాశానికి ఉండే సర్వవ్యాపకత్వము, సూక్ష్మత్వము, రూపం లేకపోవటము, అనేవి ఆకాశ లక్షణాలు. ఈ లక్షణాలు కలవాడవటంచేత ఆకాశాత్మ అనబడుతున్నాడు. సమస్త కర్మలు స్వరూపంగా కలవాడు. సర్వకాముడు – సమస్తమైన సత్కామములు కలవాడు. సర్వకాముడు – సమస్త సత్కారములు గలవాడు. సుఖప్రదమైన సమస్త గంధములు, సమస్త రసములు కలవాడు. అన్నివైపుల నుండి జగత్తును వ్యాపించి ఉండేవాడు. కోరికలు లేనివాడు.

ఆత్మ అనేది సూక్ష్మాతి సూక్ష్మమైనది. అలాగే మహత్తరమైనది. ఈ హృదయ పద్మంలో గల ఆత్మ వరిగింజకన్న, బార్లీగింజకన్న, ఆవగింజకన్న కూడా చాలా సూక్ష్మమైనది.

అలాగే ఆ ఆత్మ ఈ భూమికన్న, స్వర్గలోకం కన్న, సమస్త లోకాల కన్నా కూడా పెద్దది. హృదయకమలంలో నివశించే ఆత్మ, పరబ్రహ్మ రెండూ ఒకటే.

హృదయపద్మంలో ఉండే ఆత్మయే సమస్త కర్మలను నిర్వర్తిస్తుంది. సమస్తమైన మంచి కోరికలు కలిగి ఉంటుంది. సమస్త సుగంధాలు, రసాలు, కలిగి ఈ ప్రపంచాన్ని అన్ని వైపుల నుండి వ్యాపించి ఉంటుంది. ఆత్మను గురించి మాటలతో చెప్పలేము. దానికి ఏ విధమైన కోరికలు ఉండవు. ప్రాణుల కోరికలన్నీ అదే తీరుస్తుంది. ఈ విధంగా హృదయ పద్మంలోని ఆత్మయే పరబ్రహ్మ స్వరూపము. ఈ రెంటికీ భేదం లేదు. ఈ శరీరం నుంచి వేరైనప్పుడు అంటే సాధకుని శరీరం మరణించినప్పుడు, అందులోని జీవాత్మ ఆ పరమాత్మలో మరణానంతరము తప్పక పరబ్రహ్మలో లీనమవుతాడు. దీనినే శాండిల్యవిద్య అంటారు.

ఈ రకంగా హృదయ పద్మంలో ఉండే శ్రీమన్నారాయణుడే 'పుష్కరాక్షః' అనబడతాడు.

## 557. మహామనాః

ఉదార హృదయుడు.

**అగాదోధారవిస్తారం మనోయస్య మహామనాః**

లోతు గలిగి, ఉదారము, విశాలము అయిన మనసుగలవాడు.

**మహత్ మనః యస్యసః మహామనాః** సాధువులయందు మిక్కిలి ఉదార హృదయముగలవాడు.

**మహత్ మనః యస్యసః** మహాశక్తిగల మనస్సు గలవాడు. **విష్ణుపురాణంలో**

**మనసైవ జగత్సృష్టిం సంహారం చ కరోతియః** పరమేశ్వరుడు జగత్కార్యాలను కేవలము మనసుతోనే చేస్తాడు అంటే సంకల్ప మాత్రం చేతనే చేస్తాడు.

అందుచేతనే 'మహామనాః' అనబడుతున్నాడు.

## 558. భగవాన్

పూజ్యుడు.

**సర్వహేయ ప్రత్యనీక కల్యాణ గుణవత్తయా ।**
**పూజ్యాత్పూజ్యతమో యోఽసౌభగవానితి శబ్ద్యతే ॥**

ప్రతి దుర్గుణానికి ఒకకోటి సద్గుణాలు చొప్పున లోకంలో ఉన్న ప్రతిదుర్గుణానికి సద్గుణాలు గలవాడు. అందుచేత పూజ్యులందరిలోకి పూజ్యుడయి భగవానుడు అని పిలువబడుతున్నాడు.

**భగః అస్యాఽస్తీతి భగవాన్**

సకల దోషాలకు విరోధి అయిన సద్గుణ సముదాయము కోకొల్లలుగా గలవాడు.

**ఐశ్వర్యస్య సమగ్రస్య ధర్మస్య యససః శ్రియః**
**జ్ఞానవైరాగ్యయోశ్చైవ షణ్ణాం భగ ఇతీరిణా**

ఐశ్వర్యము, ధర్మము, యశము, శ్రీః జ్ఞానము, వైరాగ్యము ఈ ఆరింటిని భగము అని అంటారు.

ఇటువంటి భగముగలవాడు కాబట్టి పరమేశ్వరుడు భగవంతుడు అనబడుతున్నాడు.

**ఉత్పత్తిం ప్రళయం చైవ భూతానా మాగతింగతిం ।**
**వేత్తి విద్యామవిద్యాం చ స వాచ్యో భగవానితి ॥**

భూతముల యొక్క

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | ఉత్పత్తి | 3. | సృష్టి | 5. | విద్య |
| 2. | ప్రళయము | 4. | సంహారము | 6. | అవిద్య |

ఈ ఆరింటినీ తెలిసినవాడు భగవానుడు పరమేశ్వరుడికి కొన్ని లక్షణాలు ఉంటాయి. అవి

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | సర్వజ్ఞత | 3. | అనాదిబోధ | 5. | నిత్యాలుప్తశక్తి |
| 2. | నిత్యతృప్త | 4. | స్వతంత్రాసక్తి | 6. | అనంతతాశక్తి |

ఈ శక్తులన్నీ గలవాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు 'భగవాన్' అనబడుతున్నాడు.

**లలితా సహస్రంలో** 279వ నామము భగవతీ.

## 559. భగహా

షాడ్గుణ్య పరిపూరితుడు.

**భగైస్తు కల్యాణగుణైః సర్వం సర్వత్రగచ్ఛతి**
**యశ్చాసౌ భగహాప్రోక్తః షడర్ణ సుఖదాయకః**

భగము అంటే ఆరు గుణముల సముదాయము కాబట్టి సాక్షాత్తూ తానే భగవానుడైనప్పటికీ ఈ ఆరుగుణాలను పొందిస్తాడు. ఈ నామము షడక్షరీ మంత్రము సుఖప్రదము.

**భగమ్ షాడ్గుణ్యం హతి ప్రాప్నోతీతి భగహా**

భగము అంటే ఆరు గుణాలను కలిగి ఉండటము. భగము అనగా – అదృష్టము, సుఖస్థితి, కీర్తి, ఘనత, అందము, మాహాత్మ్యము, కామము, యోని, సుగుణము, కాంతి అని అర్థం చెబుతోంది సూర్యరాయుంధ్ర నిఘంటువు. సుఖస్థితిని సంపూర్ణముగా కలిగినవాడు. ఎల్లవేళల యందు బ్రహ్మానందములో తేలియాడేవాడు.

పరమేశ్వరుడు చిదానంద స్వరూపుడు, ఎప్పుడూ పరమానందము నందు మునిగితేలుతుంటాడు. తనను సేవించే భక్తులకు కూడా అటువంటి ఆనందాన్నే ఇవ్వాలని భావిస్తాడు.

**ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్యయశసః శ్రియః**
**జ్ఞానవైరాగ్య యోశ్చైవ షణ్ణాం వర్గోభగస్మృతః**

| | | |
|---|---|---|
| 1. పరిపూర్ణత | 3. కీర్తి | 5. జ్ఞానము |
| 2. వీర్యము | 4. సంపద | 6. వైరాగ్యము |

వీటిని షడ్గుణైశ్వర్యాలు అంటారు.

**భగం హంతీతి భగహా** ఈ షడ్గుణైశ్వర్యాలను ప్రళయ కాలంలో నశింప చేసేవాడు. అందుకే శ్రీమన్నారాయణుడు 'భగహా' అనబడుతున్నాడు.

## 560. ఆనందీ

ఆనందింపచేయువాడు.

**ఆనందః అస్యాస్తీతి ఆనందీ** తన భక్తులకు ఆనంందాన్ని పంచేవాడు.

పరమేశ్వరుడు చిదానందస్వరూపుడు. ఎప్పుడు ఆనందంలో మునిగి తేలుతూనే ఉంటాడు. తనను అనుసరించే వారికి కూడా ఆ ఆనందాన్ని పంచి ఇస్తాడు.

పరమేశ్వరుని సాధనలో కుండలినీ శక్తిని జాగృతం చేసి సహస్ర దళానికి చేర్చినట్లైతే, అక్కడినుండి సుధాధారలు వర్షించి శరీరంలోని 72వేల నాడీమండలాన్నీ తడుపుతాయి. అప్పుడు యోగి పొందే ఆనందము అనిర్వచనీయము, అనుభవైక వేద్యము. అదే జీవాత్మ పరమాత్మల అనుసంధానము. అటువంటి స్థితిని తన భక్తులకు గలిగించేవాడు.

ఈ నామాన్ని ఆనందీ అని కాక 'నందీ' అని చెప్పటం జరిగింది.

**నందీ :** నందుని కుమారుడు.

**నందగోపేన పిత్రుమాన్ నందీతి పరిగీయతే ॥** నందగోపుని తండ్రిగా గలవాడు.

**నందః అస్యాస్తీతి నందీ**

సంకర్షణుడై ఉండి తనబలభద్రావతారముతో నందుని తండ్రిగా పొందినవాడు.

## 561. వనమాలీ

వనమాలను ధరించినవాడు.

ఆకులు, పూలు చేర్చి కట్టిన మాల. దీనినే తోమాల అని కూడా అంటారు.

**స్వసృజ్యభూత సూక్ష్మాణాం మాలయా నిత్యయోగతః ।**
**వనమాలీ సమాఖ్యాతో హ్యష్టార్ణో భూషణప్రదః ॥**

తనచేత సృష్టించబడిన పంచభూతాలను, తన్మాత్రలను మాలగా ధరించినవాడు. ఈ నామము అష్టాక్షరీ మంత్రము. ఆభరణ ప్రదము.

**వనమాలా అస్యాస్తీతి వనమాలీ.**

వైజయంతము అనే పేరుగల వనమాలను ధరించినవాడు. విష్ణుమూర్తి ధరించే మాలపేరు వైజయంతము. పంచభూత తన్మాత్ర రూపమైన వనమాలను ధరించిన వాడు.

శ్రీమహావిష్ణువే సాక్షాత్తు పరమేశ్వరుడు. సృష్టిలోని ప్రతి అణువు అతనిచే సృష్టించ బడిందే. సృష్టిలో ముందుగా ఆవిర్భవించిన తన్మాత్రలు, పంచభూతాలు కూడా ఆయన సృష్టించినవే. పంచభూతములు పంచీకరణ చెందటంవల్లనే ఈ సృష్టి జరుగుతోంది. పంచభూతాలు, తన్మాత్రలు పరమేశ్వరుని అధీనంలోనే ఉంటాయి. దానికి గుర్తుగానే వాటితో చేసిన మాలను ధరించువాడు అని చెప్పటం జరిగింది.

విష్ణుమూర్తికి 'తులసి' అంటే మహాప్రీతి. అందుకే తులసిమాలను మెడన ధరిస్తాడు.

రాజసావర్ణి కుమారుడు వృషధ్వజుడు. అతని కుమారుడు హంసధ్వజుడు. ఇతనికి ఇద్దరు కుమారులు 1. ధర్మధ్వజుడు 2. కుశధ్వజుడు.

ధర్మధ్వజుడు నిజంగానే ధర్మమూర్తి చుట్టుపక్కల గల రాజ్యాలన్నీ జయించి ప్రజారంజకంగా పాలిస్తున్నాడు. ఇతని భార్య మాధవి. గుణవతి, శీలవతి.

కొంతకాలానికి ధర్మధ్వజుడికి మాధవి వలన ఒక ఆడపిల్ల పుట్టింది. ఆ సమయంలో అన్నీ శుభాలే జరిగినాయి. దేవతలు పూలవాన కురిపించారు. పుట్టిన బిడ్డ అందాలరాశి, కుందనపు బొమ్మ. సర్వలక్షణ సమన్వితమైన ఆ బిడ్డకు తులసి అని నామకరణం చేశారు.

నామకరణం కాగానే ఆ పిల్ల పదహారు సంవత్సరాల బాలిక అయిపోయింది. అది చూసి జనులందరూ ఆశ్చర్యపోయారు. నేను విష్ణువును తప్ప అన్యుణ్ణి వివాహమాడను అని చెప్పి బదరికావనానికి వెళ్ళి విష్ణుమూర్తిని గూర్చి తపస్సు చేయటం ప్రారంభించింది తులసి పంచాగ్నుల మధ్యన ఉండి పదివేల సంవత్సరాలు తపస్సు చేసింది. పంచాగ్నులు అంటే ఐదు రకాల అగ్నులు.

1. పూర్వాగ్ని 2. దక్షిణాగ్ని, 3.పశ్చిమాగ్ని 4. ఉత్తరాగ్ని, 5. సూర్యుడు

ఆకులు మాత్రమే ఆహారంగా – పదివేల సంవత్సరాలు

వర్షాకాలంలో నీట మునిగి – పదివేల సంవత్సరాలు

శీతాకాలంలో గాలినే ఆహారంగా ఆరుబయట చలిలోముపై వేల సంవత్సరాలు. ఈ రకంగా మొత్తం లక్ష సంవత్సరాలు తపస్సు చేసింది.

ఆమె తపస్సుకు మెచ్చి బ్రహ్మ ప్రత్యక్షమై ఏ వరం కావాలో కోరుకోమన్నాడు. దానికి తులసి "ఓ దేవా ! పూర్వజన్మలో నేను ఒక గోపికను. నేను కృష్ణునితో ఉండగా చూసిన రాధ నన్ను మానవ జన్మ ఎత్తమని శపించింది. అప్పుడు కృష్ణుడు నన్ను ఓదార్చి నాలుగు చేతులు కలవాడు నా అంశతో పుట్టి నిన్ను వివాహమాడతాడు అని చెప్పాడు. కాబట్టి నా కోరిక ఫలింపచెయ్యి" అన్నది. దానికి బ్రహ్మ.

అమ్మా ! శ్రీకృష్ణుని చెలికాడు సుదాముడు అనే వాడుండేవాడు. ఒకనాడు కృష్ణుడు గోపికలతో విహరిస్తున్న సమయంలో రాధ చూసి శ్రీకృష్ణుడిని పరుషంగా మాట్లాడింది. దానికి కోపించిన సుదాముడు రాధతో నువ్వెందుకు కృష్ణుణ్ణి తిడతావు ? అన్నాడు. అప్పుడామెకు సుదాముడిపై కోపము వచ్చి రాక్షసుడుగా పుట్టమని శపించింది. ఆ సుదాముడు దానవ వంశంలో పుట్టాడు. కృష్ణుని లాగానే నాలుగు చేతులు బ్రహ్మ తేజస్సు కలిగి ఉంటాడు. అతడి పేరు శంఖచూడుడు. అతడే నీకు భర్త అవుతాడు. నీలాగే అతడు కూడా పూర్వజన్మజ్ఞానం కలవాడు.

తరువాత కాలంలో విష్ణువు భూమిమీద పుట్టినప్పుడు విప్రచిత్తుడు. ఇతడు హిరణ్య కశ్యపుని సోదరియైన సింహకను వివాహమాడాడు. ఇతని కుమారుడు దంభుడు. దంభుడు పుత్ర సంతానం కోసం విష్ణుమూర్తిని గురించి ఘోరమైనతపస్సు చేసి శంఖచూడుడు అనే కుమారుణ్ణి కన్నాడు. శంఖచూడుడు బ్రహ్మను గూర్చి తపస్సు చేశాడు. బ్రహ్మ ప్రత్యక్షమై ఇతడికి కృష్ణకవచమిచ్చి అదినీవద్ద ఉన్నంతవరకు నీకు ఏ ఆపదా రాదు. బదరికా వనంలో తులసి ఉన్నది. వెళ్ళి ఆమెను వివాహమాడు అన్నాడు.

బదిరికావనం చేరిన శంఖచూడుడికి ఒంటరిగా ఉన్న తులసి కనిపించింది. దగ్గరకు వెళ్ళి పలకరించాడు. పరిచయాలు కాగానే ఇద్దరి తనువులూ పులకించినాయి. పూర్వ జన్మల బంధం, దైవానుగ్రహం అలా ఉన్నాయి. ఒకరినొకరు కోరుకున్నారు. గాంధర్వవిధిని వారి వివాహం జరిగిపోయింది.

వీరిదాంపత్యం చాలాకాలం సుఖంగా సాగింది. కానీ శంఖచూడుని నైజము మళ్ళీ బయటకు వచ్చింది. యజ్ఞాలు పాడుచేస్తున్నాడు. మునులను బాధిస్తున్నాడు.

శంఖచూడుని దుశ్చర్యలకు తట్టుకోలేక దేవతలు త్రిమూర్తులను ఆశ్రయించారు. వారంతా కలసి ఆలోచించి శంఖచూడునితో యుద్దానికి శివుణ్ణి పంపారు. శివుడు భూతప్రేత గణాలతో పాటుగా కుమారస్వామినీ, కాళినీ వెంట పెట్టుకుని యుద్ధానికి వెళ్ళాడు. దేవతలందరికీ నమస్కరించి శంఖచూడుడు యుద్ధం ప్రారంభించాడు.

పోరుఘోరంగా జరిగింది. కుమారస్వామి ఆ రాక్షసుని చేతిలో చిత్తైపోయాడు. కాళి అతణ్ణి ఏమీ చెయ్యలేకపోయింది. ఆలోచించాడు విష్ణుమూర్తి.

శంఖచూడిని దగ్గర కృష్ణకవచమున్నది. అది ఉన్నంతవరకూ అతనికి అపజయం లేదు. పైగా అతని భార్య పతివ్రత. కాబట్టి అతని కవచం తీసుకోవాలి. అతని భార్య పాతివ్రత్యం చెడగొట్టాలి. అప్పుడు గాని శంఖచూడుడు మరణించడు. అందుకని విష్ణువు వృద్ధ బ్రాహ్మణరూపంలో వచ్చి శంఖచూడుని కవచం దానమడిగాడు. వచ్చినవాడు విష్ణువని, తనకు కాలం తీరిపోయిందని తెలిసికూడా తన కవచాన్ని దానం చేశాడు శంఖచూడుడు. ఆకవచం ధరించి అచ్చు శంఖచూడునిలానే తయారయి తులసి దగ్గరకు వెళ్ళి ఆ రాత్రంతా ఆమెతో సుఖంగా గడిపాడు విష్ణువు. వచ్చినవాడు తన భర్తే అనుకుంది తులసి. ఆమె పాతివ్రత్యం చెడింది. అంతే మరుక్షణంలో శివుడు తన శూలంతో శంఖచూడుని తల నరికేశాడు.

కేళీవిలాసాలలో తేలి ఆడుతున్న తులసి శంఖచూడుని మీద అనుమానం వచ్చి ఎవరు నువ్వు అని గద్దించింది. విష్ణువు తన నిజస్వరూపంతో ప్రత్యక్షమైనాడు. తులసి కోపం హద్దులు దాటిపోయింది. మోసంతో తన భర్తను చంపి, తన శీలాన్ని హరించిన విష్ణువును పాషాణమై పొమ్మని శపించింది. అప్పుడు విష్ణువు తులసిని ఓదారుస్తూ శంఖచూడుని శరీరంలోని ఎముకలు శంఖజాతికి మూలమౌతాయి. వాటిలో పోసిననీరు గంగా జలంలాగా పవిత్రమౌతుంది. శంఖధ్వని వినిపించిన చోట లక్ష్మిదేవి ఉంటుంది. నీవుకూడా ఈ శరీరాన్ని వదలగానే దివ్యరూపం దరిస్తావు. నీ శరీరం గండకీనది రూపంలో ప్రవహిస్తూ ఉంటుంది. నువ్వు పవిత్రమైన తులసి వృక్షం అవుతావు. తులసి దళాలను

తాకినంత మాత్రం చేతనే పాపాలు ప్రక్షాళనమైపోతాయి. తులసి దళాలు నీటిలో వేసి స్నానం చేస్తే కోటి తీర్థాలలో స్నానం చేసిన ఫలితం వస్తుంది. తులసి దళాలు కలిపిన నీటితో అభిషేకం చేస్తే సహస్ర ఘటాభిషేకం చేసిన ఫలం వస్తుంది. తులసి దళం దానం ఇస్తే వేయిగోవులు దానం చేసిన ఫలం వస్తుంది. మరణ సమయంలో తులసి తీర్థం గొంతులో పోస్తే ఆ జీవి పుణ్యాలోకాలకు పోతాడు. నిత్యము తులసి తీర్థం తాగేవాడికి లక్ష అశ్వమేధయాగాలు చేసిన ఫలం వస్తుంది. తులసి దళాలను శరీరం మీద ధరిస్తే వైకుంఠం ప్రాప్తిస్తుంది. తులసి దళాలను అగౌరవ పరచినవాడు నరకం అనుభవిస్తాడు.

నువ్వు గండకీనదిగా ప్రవహిస్తున్నప్పుడు నేను ఆ నదిలో పాషాణ రూపంలో ఉంటాను. ఆ రూపమే సాలగ్రామం. ఇది అనేక రకాలుగా ఉంటుంది.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | లక్ష్మీనారాయణుడు | 6. | దామోదరము | 10. | మధుసూదనము |
| 2. | లక్ష్మీజనార్దనము | 7. | రఘురామము | 11. | హయగ్రీవము |
| 3. | రఘునాధము | 8. | రాజరాజేశ్వరము | 12. | నారసింహము |
| 4. | వామనము | 9. | అనంతము | 13. | లక్ష్మీనృసింహము |
| 5. | శ్రీధరము | | | | |

ఈ రకంగా అనేక రకాలైన సాలగ్రామాలుంటాయి. వీటిని పూజించిన వారికి విష్ణులోకం ప్రాప్తిస్తుంది. ప్రతిరోజూ సాలగ్రామము, తులసి, శంఖాలను పూజించే వాడు సరాసరి వైకుంఠానికి పోతాడు.” అని వరమిచ్చాడు.

అప్పటినుంచీ తులసి వృక్షంగా మారిపోయింది. ఆమె శరీరం గండకీనదిగా ప్రవహించటం మొదలుపెట్టింది. విష్ణువు సాలగ్రామరూపంలో ఆ నదిలో ఉంటున్నాడు.

అందుచేతనే ఇప్పటికీ కూడా గండకీనదిలో సాలగ్రామాలు దొరుకుతాయి.

తులసి చెట్టుకు ఆయుర్వేదంలో కూడా మంచి ప్రాచుర్యమున్నది. ఇది కఫహారి. అందుచేతనే శ్రీమన్నారాయణుడు తులసిమాలను ధరిస్తాడు. ‘తోమాల’ అంటే తులసి దళాలతోను పూలతోను కలిపి కట్టేది.

## 562. హలాయుధః

హలమును (నాగలిని) ఆయుధముగా గలవాడు.

**హలం చ సతతం సీరం ధత్తే యో౽సౌ హలాయుధః ।**
**సీర కార్య సమృద్ధ్యర్థో వ స్వర్ణో మంత్రనాయకః ॥**

ఎల్లవేళలయందు నాగలిని ధరించి ఉండేవాడు. ఈ నామము అష్టాక్షరీ మంత్రము, వ్యవసాయం ఫలిస్తుంది.

**హలమ్ ఆయుధం యస్యసః హలాయుధః** భూమిని దున్ని పంటలు పండించే హలమును ఆయుధముగాగలవాడు. బలరాముని రూపమైన ఇతనికి హలము ఆయుధము.

**బలభద్రం సమృద్ధ్యర్థం సీరకర్మణి చింతయేత్** భూమిని దున్నే కాలంలో పంటలు సమృద్ధిగా పండాలి అని బలరాముడు చింతిస్తాడు. బలరాముడు లేక బలభద్రుడు శ్రీకృష్ణుని సోదరుడు. ఇతడు ఆదిశేషుని అవతారము. ఆదిశేషుడు సాక్షాత్తూ శ్రీమహావిష్ణువు అంశయే. అందుచేత బలభద్రుడు కూడా విష్ణువు అంశయే.

రామావతార సమయంలో ఆదిశేషుడు లక్ష్మణుడుగా పుట్టి రాముని సేవించాడు. ఆ ఋణం తీర్చుకునేటందుకుగాను కృష్ణావతారంలో ఆదిశేషుని తన అన్న అయిన బలరాముడిగా జన్మింపచేసి సేవించాడు శ్రీకృష్ణుడు. బలరాముడు హలాయుధుడు. అంటే సేద్యం చేసి జీవరాశిని పోషించటానికి నిరంతరము కృషి చేసేవాడు. ఈ రోజుకు కూడా చాలా ప్రాంతాలలో వ్యవసాయపు పనులు ప్రారంభించేటప్పుడు బలభద్రునికి నమస్కరించి ఆ తరువాత పని ప్రారంభిస్తారు. ఈ రకంగా బలభద్రుడు శ్రీమహావిష్ణువు యొక్క అంశ కాబట్టే శ్రీమన్నారాయణుడు 'హలాయుధః' అనబడుతున్నాడు.

## 563. ఆదిత్యః

సూర్యుడు అకారముచే పొందదగినవాడు, దేవకీసుతుడు. 39వ నామముకూడా ఇదే.

**అవర్ణా దేవ ప్రాప్యో యః ఆదిత్యః పరికీర్తితః ।**
**అదితిర్దేవకీ తస్యాః ఆదిత్యోవా హ్యపత్యతః ॥**

తనకు బీజాక్షరమైన అకారముచే పొందదగినవాడు. గతజన్మలో అదితిగా ఉన్న దేవకి గర్భాన జన్మించినవాడు.

**ఆతా ఇత్యః ఆదిత్యః** సంకర్షణ బీజమంత్రమైన అకారముతో పొందదగినవాడు.

**ఆదిత్యాః దేవక్యాః అపత్యంపుమాన్ ఆదిత్యః** పూర్వజన్మలో అదితిగా ఉన్న దేవకీపుత్రుడు.

దేవకి వసుదేవుని భార్య. పూర్వజన్మలో ఈమె కశ్యపుని భార్య అయిన అదితి. కద్రువయొక్క శాపం వల్ల దేవకీగా జన్మించింది.

ఉగ్రసేనుని సోదరుడు దేవకుడు. అతనికి ఐదుగురు కుమార్తెలు.

1. దేవకి 2. శ్రుతదేవి 3. మిత్రదేవి 4. శ్రీదేవి 5. యశోధర

వీరిలో దేవకికి వసుదేవునితో వివాహమైంది. ఉగ్రసేనుని కుమారుడు కంసుడు. అంటే దేవకి పినతండ్రి కుమారుడు. దేవకీ వసుదేవులను తీసుకుని బయలుదేరాడు

కంస మహారాజు. ఇంతలో అశరీరవాణి 'దేవకి అష్టమ గర్భాన పుట్టిన బాలుడు నిన్ను సంహరిస్తాడు' అని చెప్పింది. ఆ మాటలు విన్న కంసుడు తన ప్రాణాలు కాపాడుకోవటానికి గాను దేవకిని సంహరించబోగా, వసుదేవుడు అడ్డుపడి దేవకికి పుట్టిన బిడ్డలను చంపమని, దేవకిని బ్రతికించమని బ్రతిమాలాడాడు. ఆ మాటలకు ఒప్పుకున్నాడు కంసుడు. దేవకీ వసుదేవులను కారాగారంలో బంధించాడు. వారికి పుట్టిన కుమారులనందరినీ సంహరించాడు. చివరకు అష్టమ గర్భాన కృష్ణుడవతరించాడు. కృష్ణుడు జన్మించిన మరుక్షణమే వసుదేవుని సంకెళ్ళు ఊడిపోయినాయి. కావలి ఉన్న భటులందరూ నిద్రలో మునిగిపోయారు. యోగమాయ సలహా మేరకు శ్రీకృష్ణుని రేపల్లెలోని నందుని ఇంట చేర్చి అక్కడ యశోదకు జన్మించిన యోగమాయను దేవకి దగ్గరకు చేర్చాడు వసుదేవుడు.

ఈవిధంగా ద్వాపరయుగంలో రాక్షస సంహారం చెయ్యటానికి శ్రీమహావిష్ణువు దేవకీ వసుదేవుల గర్భాన శ్రీకృష్ణ పరమాత్ముడుగా జన్మించాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'ఆదిత్యః' అనబడుతున్నాడు.

**ఛాందోగ్యోపనిషత్తు**లో అంగీరస గోత్రంలో పుట్టిన ఘోరమహర్షి దేవకీపుత్రుడైన శ్రీకృష్ణునికి ఆత్మ యజ్ఞోపాసన గురించి వివరించాడు. ఈ విద్యను అభ్యసించినవాడికి ఇతర విద్యల యందు కోరికలుండవు.

మానవుడు లౌకికమైన కోరికలు తీర్చుకోటానికి యజ్ఞకర్మలు చేస్తాడు. అలాగే పారలౌకిక అసంతృప్తితో, తీవ్రమైన కాంక్షతో ఆత్మయజ్ఞం చేస్తాడు. ఆత్మయజ్ఞాన్ని చేసినవాడు మరణానంతరము బ్రహ్మలోకాలు పొందుతాడు.

శిష్యులారా ! సంకల్ప వికల్పాలకు కారణమైనది మనస్సు. కాబట్టి మనస్సు బ్రహ్మగా ఉపాసించాలి. ఇది ఆత్మ విషయక దర్శనం. తరువాత దేవతా సంబంధమైన ఆకాశాన్ని బ్రహ్మగా ఉపాసించాలి. ఆకాశము, మనస్సు రెండూ సూక్ష్మమైనవే, సర్వవ్యాపకమైనవే, అంతులేనివి కాబట్టే వీటికి బ్రహ్మత్వం ఆపాదించబడింది.

మనస్సు అనే బ్రహ్మకు నాలుగు పాదాలున్నాయి. వీటిలో

మొదటిపాదం - వాక్కు

రెండవ పాదం - ప్రాణం

మూడవ పాదం - నేత్రం

నాల్గవ పాదం - శ్రోత్రం

ఇది అధ్యాత్మిక దృష్టి. ఆదిదైన దృష్టితో చూసినట్లైతే

| | | |
|---|---|---|
| మొదటి పాదం | - | అగ్ని |
| రెండవ పాదం | - | వాయువు |
| మూడవ పాదం | - | ఆదిత్యుడు |
| నాల్గవ పాదం | - | దిక్కులు |

ఈవిధంగా అధ్యాత్మ, ఆదిదేవత దృష్టితో నాల్గు పాదాలుగల బ్రహ్మోపాసన చెయ్యవచ్చు.

ఈ రెండు విధాలను కలిపికూడా ఉపాసించవచ్చు. మనస్సు, ఆకాశం రెండూ ఒక్కటే కదా ! అటువంటి మనో ఆకాశ బ్రహ్మకు.

| | | |
|---|---|---|
| మొదటి పాదం | - | వాక్కు, అగ్ని |
| రెండవ పాదం | - | ప్రాణము, వాయువులు |
| మూడవ పాదం | - | నేత్రము, ఆదిత్యులు |
| నాల్గవ పాదం | - | దిక్కులు, శ్రోత్రము |

ఈ విషయం తెలుసుకుని మనస్సును, ఆకాశాన్ని, బ్రహ్మగా ఉపాసించేవాడు యశస్సుతోను, బ్రహ్మతేజస్సుతోను ప్రకాశిస్తాడు.

'ఆదిత్యుడు బ్రహ్మ' మొట్టమొదటి ప్రపంచమంతా సత్తుగా అంటే నామరూపాత్మకం లేకుండా ఉంది. ఈ విధంగా నామరూపాత్మకంగాని ఆసత్తు కార్యోన్ముక్తమైంది. అది క్రమంగా స్థూలరూపాన్ని పొందుతూ, నీటిలో కలిసి అండంగా తయారైంది. నీటిలో పంచభూతాలు ఉన్నాయి. కాబట్టి పంచభూతాలతో కలిసి అండంగా అయిందన్నమాట. కొంతకాలానికి ఈ అండం పగిలి రెండు ముక్కలయింది. ఆ ముక్కలే వెండి, బంగారాలు, ఇందులో వెండిలాగా కనుపించేది క్రింద ఉండే భూలోకము. బంగారు రంగులో కనిపించేది పైన ఉండే ద్యులోకము. ఈ గ్రుడ్డును కప్పి ఉండే పొర పర్వత సమూహాలు నదులే నాడులు.

ఆ గర్భంలో పుట్టినవాడే ఆదిత్యుడు. ఆదిత్యునితో బాటే దూరప్రాంతాలకు వినిపించే ధ్వనులు, సమస్త జగత్తు, బ్రతకటానికి కావలసిన అన్నవస్త్రాలు పుట్టినాయి. ఇప్పటికీ సూర్యోదయం వల్ల అస్తమించటంవల్ల సమస్త భూతాలు భోగవిషయాలు ఘోషశబ్దంతో పుడుతున్నాయి.

ఇట్టి మహిమాన్వితుడైన ఆదిత్యుని తెలుసుకొని అతనిని బ్రహ్మగా భావించి పూజించేవారు లేక ఆరాధించేవారు స్వయంగా ఆదిత్యుడే అవుతాడు. సుఖజీవనం సాగిస్తాడు. అతని వద్దకు సంతోషకరమైన శబ్దాలు శీఘ్రంగా చేరతాయి.

అంటూ వరహావతార వృత్తాంతాన్ని పూర్తి చేశాడు రత్నాకరుడు.

# 38. నారాయణుడు

"గురుదేవా ! నారాయణుడు అంటే ఎవరు ? అతని వృత్తాంతము ఏమిటో వివరించండి" అన్నాడు నారాయణభట్టు. చెప్పటం ప్రారంభించాడు కృష్ణశర్మ.

పూర్వకాలంలో హిరణ్యకశ్యపుని సంహరించిన తరువాత నరసింహావతారము రెండు భాగాలుగా అయింది. అందులో నరరూపము నరుడుగాను, సింహరూపము నారాయణుడు గాను ఆవిర్భవించారు. వీరిద్దరూ చాలా మంచిమిత్రులు. విష్ణ్వంశ సంభూతులు. బదరికా వనంలో తపస్సు చేసుకుంటున్నారు. ఆ సమయంలో ఇంద్రుడు వీరి తపస్సు భంగము చెయ్యటానికి అప్సరసలను పంపిచాడు. నారాయణుడు తనచేతితో తొడమీద రాచాడు. మరుక్షణమే ఆ అప్సరసల అందాన్ని తలదన్నే సౌందర్యరాశి ఊర్వశి ఆవిర్భవించింది.

వీరు రాక్షస సంహారము కోసమే ఉద్భవించారు. ఆ కాలంలో 'సహస్రకవచుడు' అనే రాక్షసుడు ఉండేవాడు. అతడు బ్రహ్మను గురించి తపస్సు చేసి అమోఘమైన వరాలు పొందాడు. వెయ్యి సంవత్సరాలు తపస్సు చేస్తేనేగాని అతనితో యుద్ధం చేసే శక్తిరాదు. ఈ విధంగా నరనారాయణులు ఒకరు తపస్సు చేస్తుంటే, ఇంకొకరు అతనితో యుద్ధం చేసి అతని శరీరం మీద ఉన్న 999 కవచాలను నాశనం చేశారు. అప్పుడు ఆ రాక్షసుడు సూర్యునిలో దాక్కున్నాడు. తరువాత కాలంలో అతడే కర్ణుడుగా సహజ కవచకుండాలాలతో ఆవిర్భవించాడు. నరనారాయణులే కృష్ణార్జునులు.

నారము అంటే నీరు. దీనినుంచి ఉద్భవించినవాడు. నీటియందు నివసించువాడు నారాయణుడు. అతడే సాక్షాత్తూ శ్రీమహావిష్ణువు. క్షీరసాగరంలో శేషతల్పశాయియై ఉంటాడు. అతడే సాక్షాత్తూ పరమేశ్వరుడు.

సృష్టి ప్రారంభంలో పరమపురుషుడైన శ్రీమన్నారాయణుడే ప్రాణులను సృష్టించాడు. అప్పుడు హిరణ్యగర్భుడు జన్మించాడు. శ్రీమన్నారాయణుని నుంచే పంచభూతాలు, తన్మాత్రలు, బ్రహ్మాదిదేవతలు, సప్తఋషులు, ఇంద్రుడు, సూర్యుడు అందరూ ఆవిర్భవించారు. ఈ జగత్తంతా అతని నుంచే ఆవిర్భవించింది. నారాయణుని గురించి **నారాయణోపనిషత్తు, మహానారాయణోపనిషత్తు**ల యందు వివరించబడింది.

అతడు జ్యోతిష రూపుడైన పురుషుడు. అతని తేజస్సు ముందు సూర్యతేజస్సు కూడా వెలవెలబోతుంది. బ్రహ్మాదిదేవతల అపరాధములను సహిస్తాడు. శీతోష్ణాది ద్వంద్వాలకు లోనుకాడు. ధర్మము విషయంలో అతడే గతి అని నమ్మి ఆశ్రయించ దగినవాడు. శత్రువులను సంహరించేటందుకు అందమైన,, బలమైన, శక్తివంతమైన

ధనుస్సుగలవాడు. పరశురాముడిగా జన్మించి తన గొడ్డలితో శత్రుసంహారము చేసినవాడు. శత్రు భయంకరుడు. బాహ్య శత్రువులనే కాదు అంతః శత్రువులను కూడా జయించినవాడు.

ఈ విషయాలన్నీ 564 నుంచి 569 వరకు నామాలలో వివరించబడ్డాయి. ఇక నామాలను చూద్దాం.

## 564. జ్యోతిరాదిత్యః

జ్యోతిషరూపుడైన ఆదిత్యుడు.

**సమస్తతేజోహరణ జ్యోతిషాదీప్యతే చయః ।**

**స వై స్యాత్ జ్యోతిరాదిత్యః నవార్ణో జ్ఞానదాయకః ॥**

అన్ని తేజస్సులను తనలో ఏకీభవింప చేసుకొనగల తేజస్సుతో ప్రకాశించేవాడు. ఈ నామము నవాక్షరీ మంత్రము జ్ఞానదాయకము.

**జ్యోతిశ్చాసౌ ఆదిత్యశ్చ జ్యోతిరాదిత్యః** ఇతని తేజస్సుముందు సూర్యుని తేజస్సు వెలవెలపోతున్నది. అందుచేత ఇతడు జ్యోతిరాదిత్యుడు అనబడతాడు.

**సవితృమండలే స్థితః ఆదిత్యః జ్యోతిరాదిత్యః** సూర్యమండలమునందు ఉండే ఆదిత్యుడు. సూర్యునియందుండే తేజస్సు ఆత్మతేజస్సు. అది విష్ణు స్వరూపము.

**ధ్యేయః సదాస వితృమండల మధ్యవర్తీ**

**పారాయణః సరసిజాసన సన్నివిష్టః ।**

**కేయూరవాన్ మకరకుండలవాన్ కిరీటీ**

**హరీ హిరణ్మయ వపుర్ధృత శంకచక్ర ॥**

సర్వాలంకార భూషితుడై శంఖుచక్రములను ధరించి పద్మాసనస్థుడై బంగారు కాంతిమయుడై సూర్యుని మధ్యలో ఆసీనుడైన నారాయణుని ధ్యానిస్తున్నారు. అనగా సూర్యభగవానుడే శ్రీమహావిష్ణువు యొక్క స్వరూపము. అతడు కేవలము చైతన్య స్వరూపుడు.

**ఈశావాశ్యోపనిషత్తులో**

**హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపి హితం ముఖం ।**

**తత్ త్వం పూషన్న పావృణు సత్యధర్మాయ దృష్టయే ॥**

యోగనిష్ఠా గరిష్ఠుడైన సాధకుడు అవసాన స్థితికి చేరాడు. అవసాన కాలంలో జీవియొక్క ప్రాణాలు ఉత్క్రమిస్తాయి. శరీరంలో 72 వేల నాడీ మండలమున్నది. ఈనాడులన్నీ నవరంధ్రాలలోను, ఏదో ఒక రంధ్రానికి సంబంధించి ఉంటాయి. కాబట్టి

జీవి యొక్క ప్రాణాలు నవరంధ్రాలలోను ఏదో ఒక రంధ్రం గుండా బయటకు పోతాయి. దీనినే ఉత్క్రమించటము అంటారు. పుణ్యచరితులైన వారి ప్రాణాలు పైనున్న రంధ్రాల గుండా పోతాయి. క్రూర చరితులయొక్కప్రాణాలు క్రింద ఉన్న రంధ్రాల గుండా పోతాయి. వారికి ఇంత కన్న నీచమైన జన్మ లభిస్తుంది.

అయితే జ్ఞానియొక్క ప్రాణాలు ఉత్క్రమించవు. అవి నాడీ మండలం గుండా బయటకు పోవు. కేవలము బ్రహ్మరంధ్రంద్వారా మాత్రమే బయటకు పోతాయి. అలా బయటకువచ్చిన ప్రాణాలు జీవునితో కలిసిపోతాయి. ఆ జీవి అనంతయాత్రకు బయలుదేరుతుంది. అతడు జ్ఞాని కాబట్టి అతని ఆత్మ పరమాత్మలో కలిసిపోతుంది. అందుకని ముందుగా బ్రహ్మరంధ్రం నుండి బయటకు వచ్చిన జీవుడు పరలోకానికి ప్రయాణమవుతాడు. బ్రహ్మలోకపు తలవాకిలి సూర్యలోకము అదేసూర్యబింబము. ఆ బింబము మిలమిలా బంగారుకాంతులతో మెరిసిపోతుంటుంది. ఆ కాంతికళ్ళు మిరుమిట్లు గొలుపుతుంది. ఆ కాంతిని మనకంటితో అంటే చర్మ చక్షువులతో చూడలేము. అప్పుడు ఈ జీవుడు పరమేశ్వరుణ్ణి ప్రార్థిస్తాడు.

ఓ పరమేశ్వరుడా! బంగారు కాంతులతో మిలమిలా మెరుస్తున్న నీ బింబం బ్రహ్మలోక ద్వారాన్ని మూతలా కప్పి ఉన్నది. ఓ సూర్యభగవానుడా ! వ్రతనిష్ఠుడైన నేను, సత్యాన్ని దర్శించటానికి వీలుగా బ్రహ్మలోక ద్వారానికి మూతలాగా ఉన్న నీ కాంతిని ఒక్కసారి ఉపసంహరించుకో అప్పుడు నేను లోని మార్గాన్ని చూడగలుగుతాను. అంటాడు.

ఇక్కడ సాధకుడు చూసేది సూర్యబింబాన్ని కాదు. సూర్యబింబములో ఉన్న శ్రీమన్నారాయణ స్వరూపాన్ని అందుచేత శ్రీమన్నారాయణుడే జ్యోతిరాదిత్యుడు

## 565. సహిష్ణుః

సహించినవాడు. 144వ నామము కూడా ఇదే.

**బ్రహ్మాది మంతుసహనాత్ సహిష్ణు రితి కథ్యతే ॥**

బ్రహ్మాదుల అపరాధములను సహించువాడు.

**సహతే ఇతి సహిష్ణుః** దేవతలయొక్క అపరాధములను సహించినవాడు.

**ప్రసాద యామాస భవః దేవం నారాయణం ప్రభుం**

**శరణం జగతామాద్యం వరేణ్యం వరదం హరిం ।**

**తదైవ వరదో దేవః జితక్రోధః జితేంద్రియః**

**ప్రీతిమాన భవత్తత్ర రుద్రేణ సహసంజ్ఞితః ॥**

జగములకు ఆదియైనవాడు, సర్వశ్రేష్ఠుడు, అభీష్టముల నిచ్చువాడు, సకల పాపరహితుడు, సర్వవ్యాపకుడు అయిన శ్రీమన్నారాయణుని రుద్రుడు ప్రార్థించాడు. అప్పుడు శ్రీమన్నారాయణుడు కోపము పోయి, ప్రీతితో రుద్రునితో కలసిపోయాడు.

శీతోష్ణాది ద్వంద్వములను అనాయాసముగ సహించువాడు. ద్వంద్వములను తేలికగా సహిస్తాడు. కాబట్టి అతడు ద్వంద్వాతీతుడు. అతడు దేహము, ఇంద్రియాలు, బుద్ధి, మనస్సులతో జరిగే మార్పులకు లోను గాకుండా ఎల్లప్పుడూ స్వస్వరూపమందే ఉంటాడు. ఆకాశంలో సూర్యచంద్రులు ఇద్దరూ ప్రకాశిస్తున్నారు. సూర్యుని వేడిని, చంద్రుడు చల్లదనాన్ని ఇస్తారు. పరమేశ్వరుడు సూర్యుని యొక్క వేడికిగాని, చంద్రుని యొక్క చల్లదనానికిగాని లోనుగాడు. అందుచేతనే శీతోష్ణాది ద్వంద్వములకు లోనుకాడు. కాబట్టే శ్రీమన్నారాయణుడు 'సహిష్ణుః' అనబడుతున్నాడు.

## 566. గతి సత్తమః

నీవే గతి అని నమ్మి ఆశ్రయింపదగినవాడు.

**ధర్మే ప్రత్యయితతమో గతిసత్తమ ఉచ్యతే ॥** ధర్మము విషయమై మిక్కిలి నమ్మదగినవాడు.

**గతౌ సత్తమః గతి సత్తమః** పరమేశ్వరుడు ధర్మస్వరూపుడు. పరమధర్మములు ఉపదేశించే ఆచార్యుడు. అందుచేత ధర్మము విషయములో నీవేగతి అని నమ్మి ఆశ్రయించదగినవాడు.

**గతిశ్చ అసౌ సత్తమశ్చ** ఈతడే ప్రాణులకు గతి అనగా గమ్యమైనవాడు. సత్తముడు అనగా ఉత్తములలో ఉత్తముడు. జగత్తులోని వారందరికీ ఆ పరమేశ్వరుడే గతి గమ్యస్థానము. ఎవరు ఏ మార్గాన్ని అనుసరించినా చివరకు చేరవలసినది ఆ పరమేశ్వరునే.

అతడు పరమశ్రేష్ఠుడు. తనను నమ్మినవారిని దరిచేర్చేవాడు. ఎవరు ఏ విధంగా ప్రవర్తించినప్పటికీ అంటే ధర్మవర్తనులైనా, అధర్మవర్తనులైనా, ఎవరైనా సరే చివరకు అతణ్ణి చేరవలసినదే. ధర్మపరుడైన వాడు ధర్మమార్గాన ఆ పరమేశ్వరుని ఆరాధించి కైవల్యము పొందుతాడు. అధర్మపరుడు అతనితో శిక్షింపబడి, ధర్మమార్గానికి మారి చివరకు కైవల్యము పొందుతాడు. అందుచేత ధర్మపరులకు, అధర్మపరులకుకూడా గమ్యస్థానము ఆ పరమేశ్వరుడే.

**భగవద్గీత** ఏడవ అధ్యాయం **'జ్ఞానవిజ్ఞానయోగము'**లోని మొదటి శ్లోకం.

**మయ్యాసక్తమనాః పార్థ యోగం యుఞ్జన్మదాశ్రయః ।**

**అసంశయం సమగ్రం మాం యథాజ్ఞాస్యసి తచ్ఛృణు ॥**

పార్థా ! అనన్యమైన భక్తితో నాయందే లగ్నమైన మనసుగలవాడవై ఉండుము. అనన్య భావంతో, నన్నే ధ్యానిస్తూ యోగమునందు నిమగ్నుడవు కావలసినది. అప్పుడు నీవు సకలప్రాణులకు ఆత్మస్వరూపుడుగా నన్ను తెలుసుకొనెదవు.

ఈ రకంగా త్రికరణ శుద్ధిగా ఆ పరమేశ్వరుని ఆశ్రయించినట్లైతే, వారి దేహము, ఇంద్రియాలు, మనస్సు అన్నీ తానే అరికడతాడు. అంటే వారి దృష్టిని బాహ్య విషయాల నుంచి, మరలించి అంతర్ముఖం చేస్తాడు. తద్వారా ఆత్మసాక్షాత్కారం జరుగుతుంది. అందుచేతనే ఎటువంటి వారికైనా సరే పరమేశ్వర స్వరూపుడైన శ్రీమన్నారాయణుడే 'గతి' అని చెప్పబడుతున్నాడు.

## 567. సుధన్వా

మంచి ధనుస్సు గలవాడు.

**సుశోభనం ధనుర్యస్య సుధన్వా పరికీర్తితః** సుందరమైనది, మంగళప్రదమైనది అయిన ధనుస్సు గలవాడు.

**సు శోభనం ధనుః యస్యసః సుధన్వా** క్షీరసాగరమథనం జరిగింది. ఆ సాగరంలో నుంచి చివరిగా అమృతం ఉద్భవించింది. దానికోసం దేవదానవుల మధ్య భీకరమైన పోరు జరిగింది. ఆ సమయంలో ధనుస్సు ధరించి శ్రీమహావిష్ణువు అసుర సంహారం చేశాడు అందుచేత 'సుధన్వా' అనబడుతున్నాడు.

రామావతారంలో కోదండపాణియై శ్రీరామచంద్రుడు యుద్ధానికి దిగితే, అతనిని అడ్డుకొనే శక్తే లేకపోయేది. ఆ విధంగా అరివీర భయంకరంగా విజృంభించి శత్రుసంహారం చేసినవాడు. అందుచేతనే అతడు. సుధన్వుడు.

పరమేశ్వరుని చేతిలోని ఆయుధాలు మానవదేహంలోని ఇంద్రియాలే. **లలితా సహస్రంలో**

**రాగస్వరూపపాశాఢ్యా క్రోధాకారాంకుశోజ్వలా**
**మనోరూపేక్షు కోదండ పంచతన్మాత్ర సాయకా**

రాగము అంటే అనురాగము, ప్రేమ, వాత్సల్యము, ఇష్టము. ఇది పాశరూపంలో జీవిని కట్టి పడేస్తుంది. ఈ రాగము పెరిగినట్లైతే, దాని వికృతరూపమే క్రోధము. అది అంకుశము వంటిది. ఇతరులను బాధిస్తుంది. మనస్సు అనేది ఆమె చేతిలోని ధనుస్సు వంటిది.

జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు అనేవి ప్రతి జీవికీ ఉంటాయి. అందుచేతనే ఆహారనిద్రా మైధునాలు అన్నింటికీ సమానము. సంకల్ప వికల్పాలకు కారణమైనది మనస్సు. ఇది పదకొండవ ఇంద్రియము. మానవుడికి మాత్రమే ఉంటుంది. దీనివల్లనే మానవుడికి యుక్తాయుక్త విచక్షణ ఉంటుంది. ధరాధర్మ నిర్ణయం చెయ్యగలుగుతాడు.

మనస్సు కోతిలాంటిది. కోతి ఒక కొమ్మమించి ఇంకొక కొమ్మ మీదికి ఏ విధంగా గెంతుతుందో, అదే విధంగా మనసుకూడా ఒక విషయం మించి ఇంకొక విషయం మీదకు పెడుతుంది. ఆ మనస్సును నిశల్చం చెయ్యగలిగితే సమాధిస్థితి వచ్చినట్లే. సమాధి స్థితిలోకి వెళ్ళినవాడికి ఆత్మ సాక్షాత్కారం జరిగి తీరుతుంది. అటువంటి వ్యక్తికి ఈ విశ్వమంతా రజ్జు సర్పభ్రాంతి అనిపిస్తుంది. ఆ కారణంగానే మనసును ఏకాగ్రం చెయ్యగలిగినవాడికి ఆత్మ సాక్షాత్కారం త్వరగా కలుగుతుంది.

విషయమే ఆకారంగా గలది మనస్సు. జీవులు యొక్క మనోవృత్తియే పరమేశ్వరుని చేతిలోని కోదండము. మనస్సు అనేది కామనాశక్తి. సంకల్ప వికల్పాలనడే పదకొండు మనోవృత్తులచేత ప్రభావించే కర్మాగారమే మనస్సు అవి

| | | | |
|---|---|---|---|
| 1. కామము | 4. శ్రద్ధ | 7. అధృతి | 10. భీః |
| 2. సంకల్పము | 5. సత్యము | 8. శ్రీః | 11. ధీః |
| 3. వికల్పము | 6. ధృతి | 9. హ్రీః | |

ప్రతి జీవికి తన మనసులో ఉండే ప్రీతి విశ్వాసాలు ఇక్షుభావచితాలు. ఈ పదకొండూ మానసిక  అవాంతర భేదములు. మనసులోని అవాంతరము ప్రాణియొక్క జ్ఞానాన్నిబట్టి ఉంటుంది. ఇవి సామాన్యుడియందు ఒక రకంగా ఉంటే ఉత్తముడి యందు ఒక రకంగా ఉంటాయి. పామరుడికి నిత్యము, సత్యము అనిపించే ఈ జగత్తు జ్ఞానికి అనిత్యము, అస్థిరము  అనిపిస్తుంది.

జీవి స్థూలదేహము నశిస్తుంది. కాని సూక్ష్మదేహం నశించదు. అది గతజన్మలలో చేసిన పాపపుణ్యాలవల్ల లభించే స్వర్గనరకాలను అనుభవించి, కర్మఫలశేషాన్ని అనుభవించటానికి ఇంకొక జన్మ ఎత్తుతుంది. గతజన్మ చివరలో ఏ కోరికలు ఉంటాయో, దేన్ని గురించి మరణ కాలంలో తీవ్రంగా ఆలోచిస్తుంటామో, వాటి వాసనలు ఈ జన్మలో కూడా ఉంటాయి. వాటికి తోడు క్రొత్తవి కూడా వస్తాయి. వీటన్నింటినీ ప్రవర్తింపచేసేవాడు పరమేశ్వరుడు. మనస్సు అనేది క్రియాశక్తి. అందుచేతనే క్రియాశక్తి రూపమైన మనస్సు ధనుస్సుగా  చెప్పబడుతోంది.

ఈ కారణం చేతనే శ్రీమన్నారాయణుడు 'సుధన్వా' అని చెప్పబడుతున్నాడు.

పరశువును ఖండించాడు.

**తీవ్రకోపాత్పరశువారౌద్ర సర్గానుఖండనాత్ ।**

**ఇత్యుక్తః ఖండపరశుః నవార్ణ శ్శోకవినాశకః ॥**

రుద్రునితో యుద్ధము జరిగినప్పుడు మిక్కిలి కోపంతో అతని గండ్రగొడ్డలిని ఖండించినవాడు. ఈ నామమునవాక్షరీ మంత్రము సకల దుఃఖహారిణి.

**ఖండపరశుః యేనసః ఖండపరశుః**

రుద్రసంబంధమైన యుద్ధంలో అతని పరశువును ఖండించినవాడు.

శత్రువులను ఖండిచునది కాబట్టి ఖండ పరశువు అనబడుతున్నది.

రేణుకాజమదగ్నిల కుమారుడు పరశురాముడు. ఈ దంపతులకు ఐదుగురు కుమారులు వీరిలో ఆఖరువాడు రాముడు. ఇది విష్ణుమూర్తి యొక్క అంశావతారము.

జమదగ్నివద్ద ఒక గోవు ఉండేది. అది కామధేనువు వంటిది. కోరిన కోరికలు తీర్చే శక్తి గలది. ఒకరోజు హైహయవంశస్థుడైన కార్తవీర్యార్జునుడు జమదగ్ని ఆశ్రమానికి వచ్చాడు. వచ్చిన మహారాజుకు అతిథి సత్కారాలు చేసి వచ్చిన వారందరికీ షడ్రసోపేతంగా భోజనాలు పెట్టాడు. విందు భోజనము ఆరగించిన మహారాజు, ఆ గోవు కావాలని మహర్షి నడిగాడు. అది మాత్రం ఇవ్వనన్నాడు మహర్షి. దాంతో కోపగించిన కార్తవీర్యుడు జమదగ్నిని సంహరించి ఆ గోవును తీసుకుపోయాడు.

జమదగ్ని మృతదేహం మీద పడి ఆయన భార్య రేణుక బోరున విలపించింది. 21సార్లు గుండెలు బాదుకున్నది. అది చూసిన రాముడు 21 సార్లు క్షత్రియుల మీద దండయాత్ర చేసి శత్రుశేషం లేకుండా చేస్తాను అని ప్రతిజ్ఞ చేశాడు. ఇతడు గతకాలంలో శివుణ్ణి గురించి తపస్సు చేసి అతడి నుండి పరశువు (గొడ్డలి)ని పొందాడు. అప్పటినుండి ఇతడు పరశురాముడు అని పిలువబడ్డాడు. ఆ గొడ్డలి భుజాన ధరించి కార్తవీర్యుని సంహరించాడు. క్షత్రియులతో 21సార్లు యుద్ధం చేసి బాలురు, వృద్ధులతో సహా క్షత్రియ కులాన్ని నాశనం చేశాడు.

ఈ రకంగా పరశువుతో శత్రువులను ఖండించాడు కాబట్టి, శ్రీమన్నారాయణుడు 'ఖండపరశుః' అనబడుతున్నాడు.

## 569. దారుణః

దారుణమైనవాడు. భయంకరుడు.

**బాహ్యాభ్యంతర శత్రూణాం దారణాదపి దారుణః**

బాహ్యాశత్రువులను, అంతఃశత్రువులను కూడా జయించినవాడు

**దారయతీతి దారుణః**

బాహ్యాశత్రువను, అంతః శత్రువులను శిక్షించుటలో అతిభయంకరుడు.

పరమేశ్వరుడైన శ్రీమహావిష్ణువు శత్రువులను శిక్షించటంలో మహాభయంకరుడు. క్రూరాతిక్రూరుడు రామావతారంలో ఖరదూషణాదులను సంహరించాడు. తాటకను హతమార్చాడు. 14 వేల మంది రాక్షసులను జనస్థానంలో మట్టు పెట్టాడు. చివరకు రాక్షసరాజయిన రావణబ్రహ్మను కూడా సంహరించి శత్రుశేషం లేకుండా చేశాడు. అలాగే కృష్ణావతారంలో పూతన, శకటాసురుడు, ధేనుకాసురుడు, కేశి, చాణూర ముష్టికులు, కువలయ పీడనములను సంహరించాడు. చివరకు కంస మహారాజును సంహరించి మళ్ళీ ఉగ్రసేనుని రాజుగా చేశాడు.

ఈ రకంగా బాహ్య శత్రువులనే కాదు. అంతఃశ్శత్రువులను కూడా జయించినవాడు. మానవుడికి ఉండేవి నేను నాది అనే అహంకార మమకారాలు. మమకారము అనేది పాశము అది బాగా పెరిగినట్లైతే అహంకారము పుడుతుంది. వీటినుంచే రాగద్వేషాలు, అరిషడ్వర్గాలు, అన్నీ ఆవిర్భవిస్తాయి. ఇవే అంతఃశ్శత్రువులు. వీటిని జయించినవాడు జితేంద్రియుడు. పరమేశ్వరుడికి రాగద్వేషాలుండవు. అహంకార మమకారాలుండవు. వీటన్నింటికీ అతీతుడు, కేవలము జ్ఞానమూర్తి. అందుకే శ్రీమన్నారాయణుడు 'దారుణః' అనబడుతున్నాడు.



# 39. వ్యాసావతారము

"గురువుగారూ ! వ్యాసుడు అష్టాదశ పురాణాలు వ్రాశాడు. భగవద్గీత, బ్రహ్మసూత్రాలను కూడా రచించి అద్వైతమతాన్ని స్థాపించాడు. అటువంటి వేదవ్యాసుడు కూడా ఆ విష్ణుమూర్తి అవతారమే కదా ! ఆ మహనీయుని గురించి వివరించండి" అన్నాడు కృష్ణశర్మ చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

వ్యాసభగవానుణ్ణి గురించి గతంలోనే వివరించటం జరిగింది. అయినప్పటికీ మళ్ళీ ఒక్కసారి గుర్తు చేస్తున్నాం.

వశిష్ఠుని కుమారుడు శక్తి. శక్తి కుమారుడు పరాశరుడు, పరాశరుని కుమారుడు కృష్ణ ద్వైపాయనుడు. ఇతడు జన్మించటమే గడ్డము, మీసము దండ కమండలాలతో రుద్రాక్ష మాలలతో జన్మించి, తల్లి అనుజ్ఞ తీసుకుని తపోవనాలకు వెళ్ళిపోయాడు. 28వ మహాయుగంలోని ద్వాపరయుగంలో వేదాన్ని నాలుగు భాగాలుగా చేసినవాడు వ్యాసుడు. వేదాలను విభజించినవాడు కాబట్టి 'వేదవ్యాసుడు' అనబడ్డాడు. ఆ కాలంలో వేదసారము సామాన్యులకు అంతుబట్టటం కష్టమయింది. అందుచేత వేదాల సారాన్నంతటినీ రంగరించి అష్టాదశ పురాణాల రూపంలో వ్రాశాడు. ఆ రోజుల్లో సాంఖ్యులు, నైయాయికులు, వైశేషికులు, చార్వాకులు మొదలైనవారు బాగా విజృంభించి వేదాలు అనేవి లేవు. పరమాత్మ లేడు. జగత్తంతా ప్రకృతినుంచే పుట్టింది. అంటూ భిన్నమైన వాదనలు లేవదీశారు. ఆ సమయంలో వీరి వాదనలన్నింటినీ ఖండించి అద్వైత సిద్ధాంతాన్ని ప్రతిష్ఠించాడు వ్యాసుడు. దానికోసం బ్రహ్మసూత్రాలను వ్రాశాడు.

ఈ రకంగా వేదవిభజన చేసినవాడు, అష్టాదశపురాణాలు వ్రాసినవాడు, బ్రహ్మసూత్రాలు వ్రాసి అద్వైతం వ్రాసిన వేదవ్యాసుడు శ్రీమహావిష్ణువు యొక్క అవతారమే. శ్రీమన్నారాయణుడే వ్యాసుని అవతారమెత్తి జనులందరికీ శాస్త్రాలు అనే ధనాన్నిచ్చాడు. ఇతడే తత్త్వరహస్యాన్ని పరమపదాన్ని వివరించినవాడు.

పరమపదాన్ని, అందలి విశేషాలను, రహస్యాలను పరావిద్యతో తెలియచేసిన వాడు. సర్వవిజ్ఞానములకు విస్తారకర్త. వాక్కుకుపతి. విద్యకు ప్రభువు. వేదవిభజన చేసి లోకంలోని మానవులకు జ్ఞానబిక్షను ప్రసాదించినవాడు. మూడు సామములు గలవాడు. స్వరూపా నందముతో గానం చేసేవాడు. పాపాలను నశింపచేసేవాడు. పరమాగతికి కారణమైన వాడు. సంసారబంధనాలకు పరమ ఔషధమైన వాడు భవబంధనాలు తొలగించటానికి గొప్ప వైద్యుడు.

ఈ విషయాలన్నీ 570 నుంచి 579 వరకు నామాలలో వివరించటం జరిగింది. ఇక నామాలను చూద్దాం.

## 570. ద్రవిణప్రదః

ధనము వంటి శాస్త్రములనిచ్చినవాడు.

**శాస్త్రం తదర్థం ద్రవిణిం ప్రదదాతి జనాయ యః ।**
**వ్యాసోభూత్వా హరిస్సాక్షాత్ ద్రవిణ ప్రద ఉచ్యతే ॥**

సాక్షాత్తూ శ్రీమన్నారాయణుడే వ్యాసావతారమెత్తి జనులందరికీ శాస్త్రాలు అనే ధనాన్ని ఇచ్చాడు.

**ద్రవిణం ప్రదదాతీతి ద్రవిణప్రదః** లోకంలో మానవుడికి అత్యంత విలువైంది ధనము. ఆ ధనముకన్న కూడా విలువైనటువంటి శాస్త్రములు, వాటి అర్థములు జనులకు ఇచ్చినవాడు.

**వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే ।**
**నమోవై బ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమోనమః ॥**

వ్యాసుడు సాక్షాత్తూ శ్రీమహావిష్ణువు స్వరూపము. ఆ రకంగా వ్యాసుని రూపంలో ఉన్న విష్ణువుకు, వేద వేదాంగాలకు నిధి అయిన వశిష్ఠుని ముని మనుమడైన వ్యాసునికి నమస్కారము.

**వహన్త్యై వామహస్తేన సర్వశాస్త్రార్థపంచయమ్ ।**
**దక్షిణేనచ శాస్త్రార్థాన్ అదిశంశ్చ యథాస్థితన్ ॥**

సకల శాస్త్రముల అర్థాలను ఎడమచేతితో ధరించి, కుడిచేత్తో వాటి అర్థాలను వ్యాఖ్యానిస్తూ ఉండే వ్యాసమహర్షికి నమస్కారము.

వేదాలలో ఉన్న విషయం ఆ రోజుల్లో జనానికి అర్థం కాలేదు. అందుచేత వేదసార మంతా పురాణాల రూపంలో అష్టాదశ పురాణాలుగా వ్రాశాడు. కలగాపులగంగా ఉన్న వేదాన్ని నాలుగు భాగాలుగా చేసి వేదవ్యాసుడైనాడు. ఆ తరువాత అద్వైత సిద్ధాంతాన్ని ప్రతిపాదించటం కోసం బ్రహ్మసూత్రాలు వ్రాశాడు. అందుకే శ్రీమన్నారాయణుడు ద్రవిణప్రదః అనబడుతున్నాడు.

**ద్రవిణం వాంఛితం భక్తేభ్యః ప్రదదాతి** వాంఛితమైన ద్రవిణము అనగా ధనాన్ని భక్తులకు ఇచ్చేవాడు – శ్రీమహావిష్ణువు.

మానవులలో అనేకమంది లౌకికవాదులే ఉంటారు. మోక్షవాదులు కోటికొక్కడు ఉంటాడు. ఈ లౌకికవాదులకు కావలసినది, లోకంలో సుఖంగా జీవించటానికి అవసరమైన ధనధాన్యాలు, భోగభాగ్యాలు, సిరిసంపదలు మానవుడికి ముందుగా కావలసింది ధనము.

**వేదమూలమిదం బ్రాహ్మ్యంభార్యా మూలమిదం గృహమ్ ।**

**కృషిమూలమిదం ధాన్యం ధనమూలమిదంజగత్ ॥**

అందుకే 'డబ్బు లేనివాడు డుబ్బుకు కొరగాడు' అని సామెత. ధనమే ఈ లోకాన్ని నడిపిస్తుంది. కాబట్టే మానవుడు ధనం కోసం వెంపర్లాడతాడు. అటువంటి ధనాన్ని పుష్కలంగా ఇచ్చేవాడు. శ్రీమహావిష్ణువును గనక అర్చిస్తే, అతడు లోకంలో సాటిలేని ధనవంతుడవుతాడు. ఈ రకంగా భక్తులు అడిగిన ధనాన్ని ఇస్తాడు కాబట్టే శ్రీమహావిష్ణువు 'ద్రవిణప్రదః' అనబడతాడు.

## 571. దివః స్పృక్

పరమపదాన్ని సృష్టించినవాడు.

**పరయావిద్యయా యస్స్వం స్పృశతీతి పరే పదే దివిస్పృక్ సోచ్యతే నిత్యం**

పరమపదము నందుండే తత్త్వ రహస్యాన్ని పరవిద్యచే తెలియచేయువాడు.

**దివిస్పృశతీతి దివిస్పృక్** పరమపదాన్ని గురించిన విశేషాలను, అందలి తత్త్వరహస్యాలను పరావిద్యచే ఉపదేశించినవాడు.

జ్ఞానేంద్రియాలకు, కర్మేంద్రియాలకు లొంగనిది, కులము, గోత్రము, లేనిది, ఇంద్రియాలు లేనిది, నిత్యమైనది, సత్యమైనది, ఆది అనాది అయినది, సూక్ష్మాతి సూక్ష్మమైనది, పంచభూతాలకు కారణమైనది, అదియే పరబ్రహ్మ. ఈ పరబ్రహ్మ సర్వవ్యాపి జగత్తంతా వ్యాపించి ఉంటాడు. అన్ని జీవులయందు అంతర్యామిగా ఉంటాడు. పిపీలికాది బ్రహ్మ పర్యంతము ప్రతి వస్తువునందు అంతర్యామిగా ఉన్నాడు. అటువంటి పరబ్రహ్మను జ్ఞానియైనవాడు మాత్రమే చూడగలడు.

విరాగి, జ్ఞానియైనవాడు మాత్రమే ఈ పరబ్రహ్మను సాధించగలడు. అతడు చిదానందరూపి. ఎల్లప్పుడు పరమపదమునందే ఉంటాడు. అక్కడ సుఖదుఃఖాలు ఉండవు. జరామృత్యువులు అసలు ఉండవు. ఆకలి దప్పికలు ఉండవు. ఉండేది ఒక్కటే. అదే బ్రహ్మానందము. అక్కడికి చేరినవాడికి పునర్జన్మ ఉండదు. అతని ఆత్మపరమాత్మలో లీనమైపోతుంది.

ఈ విధంగా పరమ తత్త్వాన్ని పరమపదాన్ని గురించి వివరించేవాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'దివఃస్పృక్' అనబడుతున్నాడు.

పరమేశ్వరుడు దివిని అంటిపెట్టుకుని ఉన్నాడు. దివి అంటే – ఆకాశము. ఆకాశము అనేది సర్వవ్యాపి జగత్తంతా వ్యాపించి ఉంటుంది. అదే విధంగా పరమేశ్వరుడు కూడా సర్వత్రా వ్యాపించి ఉంటాడు. అతడు అనంతుడు, అవ్యయుడు. ఈ విధంగా కోరిన ధనాన్ని భక్తులకిచ్చేవాడు. ఇక్కడ ధనము అనగా – జ్ఞానధనము. ఈ జ్ఞానాన్ని భక్తులకు పురాణాల ద్వారా పంచినవాడు వేదవ్యాసుడు. వ్యాసుడు శ్రీమహావిష్ణువు యొక్క అంశ. కాబట్టి శ్రీమన్నారాయణుడు 'దివిస్పృక్' అనబడుతున్నాడు.

## 572. సర్వదృగ్వ్యాసః

సర్వజ్ఞానములకు విస్తారకర్మ. అన్ని రకాలైన జ్ఞానములను విస్తరింపచేసినవాడు. అందుచేత శ్రీమన్నారాయణుడు 'సర్వదృగ్ వ్యాసః' అనబడుతున్నాడు. సర్వదృగ్ అంటే సర్వకాలములకు సంబంధించిన జ్ఞానము. భూతభవిష్యద్వర్తమానములకు సంబంధించిన జ్ఞానము. త్రికాలములకు అతీతమైన విషయం కూడా ఇందులోకే చేరుతుంది.

వ్యాసః అంటే వేదమును ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అధర్వణ వేదము అని నాలుగు భాగములుగా చేసినవాడు. వేదవిభజన చేసినవాడు. వ్యాసుని తరువాత గురుశిష్యుల సంఖ్య పెరిగిపోయి.

| | | |
|---|---|---|
| ఋగ్వేదానికి | – | 21 శాఖలు |
| కృష్ణ యజుర్వేదానికి | – | 94 శాఖలు |
| శుక్ల యజుర్వేదానికి | – | 15 శాఖలు |
| సామవేదానికి | – | 100 శాఖలు |
| అధర్వణవేదానికి | – | 50 శాఖలు |

వచ్చినాయి. ఈ రకంగా ముందు వేదవిభజన చేశాడు. ఆ తరువాత వేదాలయొక్క సారాన్ని పురాణాలలో నిక్షిప్తం చేసి వైదిక ధర్మాన్ని, అద్వైత సిద్ధాంతాన్ని ప్రచారం చేసినవాడు.

ఈ నామాన్ని శంకర భగవత్పాదులవారు ఒకే నామంలో వివరిస్తే, పరాశరభట్టరు వారు రెండు నామాలయందు వివరించారు.

**1. దివిసృక్ :** పరమపదమును సృజించువాడు.

**పరయా విద్యయా యస్స్వం స్పృశతీతి పదే పదే దివిసృక్ సోచ్యతే నిచ్యం**

పరమపదంలో ఉండే తత్త్వరహస్యాన్ని పరావిద్యచే తెలిసినవాడు.

**దివిస్పృశతీతి దివిస్పృక్** పరమార్ధము తెలిసినవాడు.

**సర్వదృగ్ :** సమస్తమును చూసినవాడు.

**సర్వదృక్సర్వ దర్శనాత్** అన్నింటినీ చూసినవాడు.

**సర్వం పశ్యతీతి సర్వదృక్** సకల వైభవములను చూసినవాడు.

సమస్తమైన జ్ఞానాన్ని వ్యాసుడు విస్తరింపచేశాడు. అందుచేతనే వ్యాసుడు శ్రీమన్నారాయణుడు.

# 573. వాచస్పతి రయోనిజః

వాచస్పతి – వాక్కునకు పతి. విద్యకు ప్రభువు. రక్షకుడు. వేదవిభజన చేసి లోకంలోని మానవులకు జ్ఞానభిక్షను ప్రసాదించిన వేదవ్యాసుడు అయోనిజుడు.

పరాశర మహర్షిని నదిదాటిస్తున్నది మత్స్యగంధి. నదిలో సగం దూరం వచ్చేసరికి మహర్షి మనస్సు వ్యాకులపడింది. మత్స్యగంధి మీదికి మళ్ళింది. తన కోరికను తీర్చమని అడిగాడు. పరాశరుడు. దానికి ఆమె "మహర్షీ ! నేను చేపలు పట్టే వృత్తి కలదానను. నా శరీరం దుర్వాసన వస్తుంటుంది" అన్నది. ఆమె శరీరం సుగంధాన్ని వెదజల్లేటట్లు, అది మూడు యోజనాల దూరం వ్యాపించేటట్లు వరమిచ్చాడు పరాశరుడు. 'ఇది పగటి సమయము. పగటిపూట సంగమము నిషిద్ధం కదా !' అన్నది. ఆ ప్రాంతమంతా చీకట్లు కమ్మేలాగా చేశాడు. (నేను కన్యను. నా కన్యత్వం చెడిపోతే నా జీవితం ఏం కావాలి?' అన్నది. ఆమె కన్యత్వం చెడకుండా వరమిచ్చాడు. నీ వలన పుట్టే కుమారుడు నీ అంత గొప్పవాడు కావాలి అని అడిగింది సరే అన్నాడు మహర్షి. ఈ రకంగా ఈ విషయం ఇతరులకు తెలియకుండా ఉండేటట్లు, తన వంటి సువాసనలు శాశ్వతంగా ఉండేటట్లు, తన కన్యత్వం చెడకుండా ఉండేటట్లు అనేక వరాలు పుచ్చుకుని పరాశరుని కోరిక తీర్చింది మత్స్యగంధి. మరుక్షణమే ఆమెకు గడ్డాలు, మీసాలతో బాటుగా దండకమండలాలు ధరించిన వ్యాసమహర్షి జన్మించాడు. ఈ రకంగా వాక్కుకు, జ్ఞానానికి అధిపతి అయిన వ్యాసుడు అయోనిజుడయినాడు.

శంకర భగవత్పాదులు ఈ నామాన్ని ఒకటిగా వ్రాశారు. కాని పరాశరభట్టరు వారు మాత్రం దీన్ని రెండు నామాలుగా చెప్పారు.

**వాచస్పతి :** వాక్కుకు అధిపతి.

**వాచ పంచమవేదస్య స్వామీ వాచస్పతి స్మృతః**

పంచమ వేదమని ఖ్యాతిగాంచిన మహాభారతాన్ని వ్రాసినవాడు. వాక్కులకు ప్రభువు.

**అయోనిజః :** అయోనిజుడు.

**సారస్వతావతారేహి భగవన్ముఖ సంభవాత్ ।**
**స్మృతోహ్యయోనిజ ఇతివ స్వర్ణః కర్మనాశకః ॥**

వ్యాసావతారమెత్తి పరమేశ్వరుని వాక్కునుండి ఉద్భవించినవాడు. ఈ నామము అష్టాక్షరీ మంత్రము కర్మనాశకము.

**న యోనిజః అయోనిజ** సారస్వతావతారముగా వాక్కు నుంచి ఆవిర్భవించినవాడు.

## 574. త్రిసామా

మూడు సామములు గలవాడు.

**ప్రోక్తస్త్రిసామా యశ్చాసౌ బృహదాది త్రిసామకః** బృహత్తు, రథంతరము, వామదేవ్యము అనే మూడు సామములచేత పాడబడెడు వాడు.

**త్రీణీ సామాని యస్యసః త్రిసామా** మూడు సామములచే గానము చేయబడువాడు.

**త్రిభిః సామభిః - దేవవ్రత సమాఖ్యాతైః - సామగ్రైః స్తూయతే**

దేవవ్రతములు అనుసంజ్ఞ గల మూడు సామములచేత స్తుతించబడువాడు.

బృహత్, రథంతర, వామదేవము అని ప్రసిద్ధి కెక్కిన దేవవ్రతము అనెడి మూడు సామములచేత, సామగాయకులచేత స్తుతించబడువాడు.

## 575. సామగః

సామము గల గానము చేయువాడు.

**స్వయం సానుభవ ప్రీత్యా గాయతీతి చ సామగః** తనను తాను అనుభవించటం చేత కలిగిన ఆనంద పారవశ్యంలో తానుకూడా స్వయముగా పాడేవాడు. **సామాని గాయతీతి సామగః** అనుభవంతో కలిగిన ప్రీతితో సామములను గానము చేసేవాడు.

తనను తాను అనుభవించటము అంటే ఆత్మసాక్షాత్కారం పొందటం. స్వరూపజ్ఞానం పొందటం, జ్ఞానియైనవాడు చరాచర జగత్తును తనలోనే చూడగలుగుతాడు. పిపీలికాది బ్రహ్మ పర్యంతము జీవకోటినంతటినీ తనలోనే వీక్షించగలిగాడు. అటువంటివాడికి ఆత్మ సాక్షాత్కారం కలుగుతుంది. తానే పరబ్రహ్మ అని తెలుసు కుంటాడు. **బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి.** పరబ్రహ్మను తెలుసుకొన్నవాడు కూడా పరబ్రహ్మ స్వరూపుడే అవుతాడు. అతడే సాక్షాత్తూ పరబ్రహ్మ.

పరబ్రహ్మ ఎప్పుడూ ఆనందస్థితిలోనే ఉంటాడు. అదే పరమానందము. బ్రహ్మానందము. సామాన్య మానవుడు అంటే వయస్సు, ఆరోగ్యము ఉన్నటువంటి వేదవేదాంగ విదుడు, కర్మిష్ఠి, ధనవంతుడు అయిన మానవుడు ఈ లోకంలో పొందే ఆనందము మానుషానందము. దానికి కొన్నివేల కోట్ల రెట్లు ఉంటుంది. బ్రహ్మానందము. ఇది శాశ్వతమైన ఆనందము. చిదానందము. పరబ్రహ్మ ఎల్లవేళలయందు ఈస్థితిలోనే ఉంటాడు.

ఈ రకంగా తనను తాను  అనుభవించటంలో గల ఆనందముతో తానుకూడా గానము చేస్తాడు కాబట్టి 'సామగః' అనబడుతున్నాడు.

## 576. సామ

పాపాలను నశింపచేయువాడు.

**స్వగాయకానాం కాలుష్యనాశక స్సామ ఈరితః**

తనను గానము చేయువారి పాపములను హరింపచేయువాడు.

**స్వగాయకానాం పాపం స్యతి నాశయతీతి సామ**

తనను స్తుతి చేసేవారి పాపాలను క్షయం చేసేవాడు. సామవేద స్వరూపమైనవాడు.

**భగవద్గీత** పదవ అధ్యాయం **'విభూతియోగము'**లోని 22వ శ్లోకము

**వేదానాం సామవేదోఽస్మి దేవానామస్మి వాసవః ।**
**ఇంద్రియాణాం మనశ్చాస్మి భూతానా మస్మిచేతనా ॥**

వేదాలలో సామవేదమును నేను. దేవతలలో ఇంద్రుడను నేను. ఇంద్రియాలలో మనస్సును నేను. ప్రాణులలోని చైతన్యమును నేనే. నాలుగు వేదాలలోను సామవేదము మధురమయింది. సంగీతమయమయింది. పరమేశ్వరుని యొక్క స్తుతులతో కూడుకొని ఉన్నది. అందుచేత వేదాలలో ముఖ్యమైనదిగా భావిస్తున్న సామవేదము పరమేశ్వరుని స్వరూపము. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'సామః' అనబడుతున్నాడు.

# 577. నిర్వాణమ్

పరమాగతికి కారణమైనవాడు.

**నిర్వాణమ్ స్సాత్పరగతేః నిమిత్తం నిర్గతైనసామ్ ॥**

పాపములు నశించిన వారికి పరమపదము ప్రసాదిస్తాడు.

పరమపదము అంటే మోక్షము. జీవి జనిమ్మచిన తరువాత కర్మలు చేస్తాడు. అవి మంచికర్మలు కావచ్చు, చెడు కర్మలు కావచ్చు. చెడు కర్మలు చేసినవారికి పాపము, మంచి కర్మలు చేసినవారికి పుణ్యము లభిస్తుంది. మరణానంతరము జీవి పాపపుణ్యాలను స్వర్గ నరకాలలో అనుభవిస్తాడు. ఇంకా కర్మశేషము అనుభవించటానికి మళ్ళీ ఉత్తరజన్మను ఎత్తుతాడు.

ఈ రకంగా కర్మలను అనుష్టించిన వారు పాపపుణ్యాలనుభవిస్తూ సంసారమనే బండిచక్రంలో పడిగిరగిరా తిరుగుతుంటారు. కర్మలేశము ఉన్నట్లైతే, అది పాపము గాని, పుణ్యముగాని, దానిని అనుభవించటానికి అతడు మళ్ళీ జన్మించాల్సిందే. మోక్షం రావాలి అంటే కర్మశేషం ఉండకూడదు.

మనం అనుభవించే కర్మ రెండు రకాలుగా ఉంటుంది. 1. సంచితకర్త 2. వర్తమానం లోని కర్మ. సంచితకర్మ అనేది ప్రతిజన్మలోనూ కొంత కొంత చొప్పున అనుభవిస్తూ ఉండాలి. ఈ కర్మక్షయం కావాలంటే రెండే మార్గాలు. 1. కర్మను అనుభవించటంచేత ఈ కర్మను అనుభవించి క్షయం చెయ్యాలంటే కల్పాంతందాకా అనుభవించినా అది క్షయం కాదు. అందుచేత ఆ సంచితకర్మను జ్ఞానాజ్ఞిలో దగ్ధం చెయ్యవచ్చును. ఈ విధంగా సంచితకర్మ క్షయమవుతుంది. ఇక వర్తమానం కర్మ. ఇది లాగి వదలిన బాణం లాంటిది. ఇది అనుభవించి తీరాలి. ఈ జన్మలోనే ఇది క్షయం అవుతుంది.

ఈరకంగా కర్మను క్షయం చేసుకోగలిగినవాడు ముక్తిని పొందుతాడు. **ఈశావాశ్యోపనిషత్తులో**

**విద్యాంచా విద్యాంచ యస్తద్వేదో భయగ్ం సహ ।**

**అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయాఽ మృతమశ్నుతే ॥**

విద్యనూ, అవిద్యనూ రెండింటినీ తెలుసుకున్నవాడు అవిద్య అంటే కర్మచేత మృత్యువును జయించి విద్యచేత అనగా జ్ఞానంచేత అమరత్వాన్ని పొందుతాడు.

కాబట్టి కర్మక్షయం జ్ఞానులకు పరమపదాన్నిచ్చే శ్రీమన్నారాయణుడు 'నిర్వాణమ్' అనబడుతున్నాడు.

సంస్కృతంలో 'వ' కారానికీ, 'బ' కారానికీ తేడా లేదు. అందుచేత ఈ నామము 'నిర్బాణము' అని చెప్పవచ్చు. బాణము అనగా – శరీరము నిర్బాణము – శరీరము లేకుండా చేసేవాడు. పునర్జన్మ లేకుండా చేసేవాడు. కైవల్యాన్ని ప్రసాదించేవాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'నిర్వాణమ్' అనబడుతున్నాడు.

**లలితా సహస్రంలో 390వ నామము నిర్వాణ సుఖదాయినీ**

## 578. భేషజమ్

పరమౌషధమైనవాడు.

**అసాధ్యభవరోగస్య భేషజం యస్సదౌషధమ్ ॥**

సంసారమనే మొండిరోగానికి దివ్యౌషధమైనవాడు.

**దేవాః దేవర్షయశ్చైవ యంవిదుః దుఃఖభేషజమ్ ॥** సంసారమనే వ్యాధికి పరమౌషధము.

సంసార బంధనాలు అనేవి శరీరానికి పట్టుకున్న వ్యాధి. ఇది కేవలము శరీరానికే కాదు. మనసుకుకూడా సంబంధించినది. గతజన్మలో గల వాసనల వలన భార్య, పిల్లలు, సంసారము ఏర్పడుతోంది. శంకరభగవత్పాదుల వారు తమ **భజగోవింద శ్లోకాలలో** చెప్పినట్లుగా

**కాతే కాంతాకస్తే పుత్ర స్సంసార్వోఽయ మతీవ విచిత్రం ।**
**కస్యత్వం వాకుత ఆయాతః తత్త్వం చింతయ తది హభ్రాతః ॥**

ఎవరు నీ భార్య ? ఎవరు నీ కుమారుడు ? వారికి నీకు గల సంబంధము ఏమిటి ? అసలు నువ్వెవరు ? ఎక్కడి నుండి వచ్చావు ? ఈ సంసారమే అతి విచిత్రమైనది. ఈ తత్త్వాన్ని ఆలోచించండి.

**దినయామిన్యౌ సాయం ప్రాత పున శ్శిశిరవంతౌ పునరాయాతః ।**
**కాలః క్రీడతి గచ్ఛత్యాయు స్తదిపిన ముం చ త్యాశావాయుః ॥**

రాత్రులు, పగళ్ళు రోజులు గడచిపోతున్నాయి. సంవత్సరాలు దొర్లిపోతున్నాయి. ఆయువు క్షీణించిపోతున్నది. అయినా ఆశాపాశము మాత్రము నిన్ను వదలటం లేదు.

మరణించే ముందు కూడా ఈషణత్రయాన్ని వదలలేదు. అలాంటివారికి సంసార బంధనాలను త్రెంచి ముక్తిమార్గం చూపేవాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'భేషజమ్' అనబడుతున్నాడు.

## 579. భిషక్

వైద్యుడు

**భవరోగ విధానజ్ఞో యోఽసౌ భిషగుదీరితః ॥**

భవబంధానాలకు కారణం తెలుసుకుని చికిత్స చేసేవాడు.

**భిషణ్యతి చికిత్సతీతి భిషక్** సంసారమనే రోగానికి సరియైన చికిత్స చేసేవాడు. భవరోగము వదిలించే వైద్యుడు. వైద్యులలో పరమేశ్వరుడే ఉత్తమవైద్యుడు. ధన్వంతరి సాక్షాత్తు విష్ణు స్వరూపమే. అయితే భవరోగాలను ఏ విధంగా నశింపచేస్తాడు అంటే – సంసారము మీద ఉండే మోహాన్ని నశింపచేయటం ద్వారా భవబంధాలను తొలగిస్తాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'భిషక్' అనబడుతున్నాడు.

అంటూ వ్యాసావతార వృత్తాంతాన్ని పూర్తి చేశాడు రత్నాకరుడు.



# 40. పరమపదము

"గురువుగారూ ! శ్రీ మహావిష్ణువును అర్చించినవారి కోరికలు తీరుస్తాడు అంటారు కదా ! మానవుల కోరికలు ఇహానికీ, పరానికీ కూడా సంబంధించి ఉంటాయి. అలాంటప్పుడు ఎవరి కోరికలు తీరుస్తాడు ? తన భక్తులకు పరమపదాన్ని ఎలా అనుగ్రహిస్తాడు ? ఈ విషయాలను వివరించండి" అన్నాడు నారాయణభట్టు. చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

శ్రీమన్నారాయణుడు ఆశ్రితవత్సలుడు. కోరిన వారి కొంగు బంగారం. తన భక్తుల కోరికలు తీర్చటానికి ఎప్పుడూ సిద్ధంగానే ఉంటాడు. ఎవరు ఏమి ఇచ్చినా తీసుకుంటాడు. ఎవరికి ఏం కావలసినా ఇస్తాడు. చిన్ననాటి మిత్రుడు సుదాముడు ఆయన దగ్గరకు వచ్చాడు. వచ్చేటప్పుడు గుప్పెడు అటుకులు మాత్రం తెచ్చాడు. స్వామిని ఏమీ అడగలేదు. అలాగే వెళ్ళిపోయాడు. కాని అతడికి ఏంకావాలో పరమాత్మడికి తెలుసు. అందుకే అంతులేని ధనరాసులు, దాసదాసీజనాన్ని కానుకగా ఇచ్చాడు.

బలిచక్రవర్తి రాక్షసరాజు. వామనుడు మూడడుగుల నేల దానమిమ్మన్నాడు. వచ్చినవాడు సాక్షాత్తూ శ్రీహరి అని తెలిసికూడా దానమిచ్చాడు బలి. శ్రీహరి అతన్ని సుతల లోకానికి పంపించి వేస్తూ సావర్ణి మన్వంతరంలో నీవే ఇంద్రుడవు. అని చెప్పాడు. సుతల లోకంలో బలిచక్రవర్తి రాజద్వారానికి శ్రీమహావిష్ణువు ద్వారపాలకుడుగా ఉన్నాడు.

ఈ రకంగా భక్తులు అడిగిన దానికన్న వారి కోరికలను ఎక్కువగా తీర్చాడు.

కోరికలు రెండు రకాలు 1. ఇహము 2. పరము

వీటిలో మొదటి రకమైనవి సామాన్యంగా మానవులు కోరుకునేవి. సిరిసంపదలు, భోగభాగ్యాలు, గౌరవము, ప్రతిష్ఠ, పదవులు, అధికారము మొదలైనవి ఇక రెండవ రకము పరము. దీనికి గమ్యము మోక్షము. అదే పరమపదము.

లోకంలో ప్రవృత్తి మార్గము నివృత్తి మార్గము అని రెండు మార్గాలున్నాయి. ప్రవృత్తి మార్గము లౌకికమైనది. అజ్ఞానంతో కూడినది. ఈ మార్గంలో చరించేవారు అశాశ్వతమైన లౌకిక సుఖాలను కోరతారు. నివృత్తి మార్గంలో చరించేవారు శాశ్వతమైన పరమపదాన్ని కోరతారు. ఈ మార్గం కడుదుర్లభమైనది. ఇందులో చరించేవారు 'అన్యథా శరణం నాస్తి' అని భగవంతుని శరణువేడాలి. దాన్నే సాత్త్విక త్యాగము అంటారు. అలా చేసినవారి రజస్తమోగుణాలను పరమేశ్వరుడు నిర్మూలిస్తాడు. పరమేశ్వరుడు ఇచ్ఛ, భయము, క్రోధము

మొదలైనవి లేనివాడు. నివృత్తి మార్గంలో ప్రయాణించే వారికి అవి లేకుండా చేసి శాంతిని ప్రసాదిస్తాడు. శాంత గుణము గలవాడు. భక్తులు సమాధిస్థితిలోకి వెళ్ళినప్పుడు తమను తాము మరచిపోయేటట్లుగా చేస్తాడు. మోక్షము కావాలంటే పరమభక్తి కావాలి. అందుకని పరమ భక్తులకు మాత్రమే మోక్షాన్ని ప్రసాదిస్తాడు. సాధకులు పరమపదము చేరటానికి కావలసిన అష్టాంగ మార్గాన్ని ఉపదేశించాడు. తత్పరులకు సాయుజ్యము అనుగ్రహిస్తాడు. జీవులు చేసే కర్మలననుసరించి వారిని వివిధ రకాలుగా సృష్టిస్తాడు. జీవులు తాము చేసిన కర్మ ఫలాన్ననుసరించి జన్మించి సుఖాలు అనుభవిస్తుంటే చూసి ఆనందించేవాడు. భూమినిచుట్టి ఉన్న సముద్రంలో శేషశాయియై నిద్రిస్తుంటాడు. సంసారమనే విత్తనాలు నాటటానికి తావైన ప్రకృతికి ఆధారమైనవాడు. అతడే స్వర్గానికి అధిపతి. కర్మఫలమయిన సంసారచక్రాన్ని పాలించేవాడు. సంసార చక్రము త్రిప్పటానికి ధర్మము అనే ఇరుసుగల వాడు. ధర్మమును ప్రియముగా గలవాడు. పుణ్యకర్మ లాచరించిన వారిని ధూమ్రమార్గంలో పయనింపచేసి, స్వర్గ సుఖాలనుభవింపచేస్తాడు. ఇదే ప్రవృత్తి మార్గము. నివృత్తి మార్గంలో చరించేవారిని అర్చిరాది మార్గం ద్వారా పరమపదానికి చేర్చేవాడు. ప్రవృత్తి మార్గంలోనివారికి జ్ఞాన జ్యోతులు ప్రకాశింపనీయడు. నివృత్తి ధర్మంలోని వారికి మాత్రమే జ్ఞానజ్యోతులు ప్రకాశింపచేస్తాడు. అతడు మంగళకరుడు. సర్వశుభాలను ఇచ్చేవాడు.

ఈ విషయాలన్నీ 580 నుంచి 600 వరకు నామాలలో వివరించటం జరిగింది. ఇక నామాలను చూద్దాం.

## 580. సంన్యాసకృత్

సాత్త్వికత్యాగముచే భేదించువాడు.

**త్యాగేన సాత్త్వికేనాశు రజస్తమ సయోః పదమ్ ।**

**యః కృన్తతి స సన్యాస కృన్నవార్ణో మనుస్మృతః ॥**

సాత్త్విక త్యాగము అంటే పతివ్రత అయిన స్త్రీ యందే తనరక్షణ భారము ఉంచినట్లుగా, భక్తుడు భగవంతునియందే తన రక్షణ భారముంచటము. ఆ రకంగా సాత్త్విక త్యాగము చేసినవారి రజస్తమో గుణములను నిర్మూలించేవాడు. ఈ నామము నవాక్షరీ మంత్రము.

**సన్న్యాసేన కృంతతీతి సన్యాసకృత్** విషయవాంఛల యందు వైరాగ్యము గలిగించువాడు.

స్త్రీ తన రక్షణ భారము భర్తయందు ఉంచుతుంది. అంటే తనను ఉద్ధరించే భారము భర్తయందు ఉంచుతుంది అని అర్థం. అదే రకంగా తనను ఉద్ధరించే భారాన్ని భగవంతుని యందు ఉంచుతాడు భక్తుడు. అప్పుడు  భగవంతుడు రజోగుణము, తమోగుణాలను హరించివేస్తాడు. అంటే అతడికి విషయవాంఛలయందు విరక్తి గలిగిస్తాడు. వైరాగ్యాన్ని గలిగిస్తాడు. భక్తి తత్పరతలను కలిగిస్తాడు. ఈ విధంగా తనకు చేరువయ్యే మార్గాన్ని అతడికి చూపిస్తాడు. ఈ విధంగా భక్తుడిని సాత్త్విక త్యాగముచే భేదించేవాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు 'సన్యాసకృత్' అనబడుతున్నాడు.

ఆశ్రమాలు నాలుగు అవి

1. బ్రహ్మచర్యము   2. గార్హపత్యము   3. వానప్రస్థము   4. సన్యాసము

వీటిలో సన్యాసాశ్రమము మోక్షానికి మార్గము.

సన్యాసం ఎవరు తీసుకోవాలి ? సన్యాసి ధర్మాలు ఏవి ? అనే విషయం **నారద పరివ్రాజకోపనిషత్తు**లో వివరించబడింది.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | పరివ్రాజక | 5. | నిర్వాణ | 9. | స్కంద |
| 2. | త్రిసిఖి | 6. | మండల | 10. | మహానారాయణ |
| 3. | సీతా | 7. | దక్షిణామూర్తి | 11. | అద్వయ |
| 4. | చూడా | 8. | శరభ | | |

అనే  11 ఉపనిషత్తుల సారమే. ఈ నారద పరివ్రాజకోపనిషత్తు.

పూర్వకాలంలో నారదమహర్షి లోకసంచారం చేస్తూ, తీర్థాలు సేవిస్తూ, విరాగియై, ఇంద్రియ నిగ్రహము గలవాడై పరమపవిత్రమైన నైమిశారణ్యానికి చేరాడు. అక్కడ తనగానామృతంతో నివృత్తి మార్గాన్ని అందరికీ వినిపిస్తున్నాడు.

నైమిశారణ్యంలోని మహర్షులందరూ సత్రయాగం చేస్తున్నారు. 12 సంవత్సరాలు దీక్షలో ఉన్నారు. ఆ ఋషులందరూ నారదుని చేరి మోక్షము లభించే ఉపాయము తమకు  వివరించమని అడిగారు. దానికి నారదుడు.

మంచి వంశంలో పుట్టినవాడు, వేదశాస్త్రాలు బాగా చదివినవాడు, ఉపనయనము మొదలైన 44 సంస్కారములు గలవాడు, 12 సంవత్సరాలు గురుకులంలో శుశ్రూష చేసినవాడు, 25 సంవత్సరాలు బ్రహ్మచర్య దీక్షలో ఉన్నవాడు, 25 సం॥ గృహస్తాశ్రమంలో ఉన్నవాడు, తరువాత వానప్రస్థము స్వీకరించినవాడు, వానప్రస్థ ధర్మాలను తెలుసుకున్న

వాడు, సాధన చతుష్టయము నెరిగినవాడు, సంసార భోగములు పరిత్యజించినవాడు, ఆశారహితుడు, ఈషణత్రయాన్ని వర్జించినవాడు, వాంఛలు శత్రువులు లేనివాడు, శాంత స్వభావుడు, అయినవాడు సన్యాసాశ్రమం స్వీకరించి ధ్యానముతో ముక్తిని తప్పక పొందుతాడు.

గృహస్థాశ్రమం పూర్తి చేసిన తరువాత 25 సం॥లు కేవలము జలస్పర్శన పూర్వకంగా త్రిసంధ్యలయందు స్నానం చెయ్యాలి. ఆ తరువాత ఒంటిపూట భోజనము చేస్తూ ఏకాకిగా అరణ్యాలలో తిరగాలి. పట్టణాలు, పల్లెలలోకి పోరాదు. జనసమూహము లేని చోటులయందే ఉండాలి. విషయవాంఛలు వదలివెయ్యాలి. అన్నింటియందు విరక్తుడు కావాలి. ఆశ, అసూయ, ఈర్ష్య, అహంకారములను వదలివెయ్యాలి. ఇలా చేసినవాడే సన్యాసానికి తగినవాడు. అయితే

1. నపుంసకుడు
2. భ్రష్టుడు
3. అంగహీనుడు
4. స్త్రీ సంపర్కము గలవాడు
5. చెవిటివాడు
6. బాలుడు
7. మూగవాడు
8. నాస్తికుడు
9. చక్రాంతమైనవాడు
10. సన్యసించి ధనవంతుల ఇండ్లలో ఉండేవాడు
11. వైఖానసుడు
12. శివార్చకుడు
13. ధనం కోసం వేదాధ్యయనము
14. కుష్ఠరోగి, అగ్నిహోత్రము చెయ్యనివాడు

వీరు ఎంతటి విరాగులైనా సన్యాసం స్వీకరించటానికి పనికి రాదు. సాధన చతుష్టయము గలవాడే పరమహంస పదవికి యోగ్యుడు. అతడే సన్యాసానికి అధికారి.

1. నపుంసకుడు
2. అంగహీనుడు
3. అంధుడు
4. బాలుడు
5. వాపి
6. పతితుడు
7. జీవనోపాదికి ఇతరుల వాకిట ఉండేవాడు
8. వైఖానసుడు
9. శివార్చకుడు
10. చక్రాంకితుడు
11. పాషండుడు
12. బట్టతలవాడు
13. అగ్నికార్యము చేయనివాడు
14. రెండు మూడుసార్లు సన్యసించినవాడు
15. ధనం కోసం వేదాధ్యయనము చేసినవాడు

వీరు ఆతుర సన్యాసము స్వీకరించినప్పటికీ, సన్యాసానికి అనర్హులు. ఆతురు సన్యాసము అంటే విధి విధానంగా చెప్పబడిన కర్మ సంగ్రహము.

ఆహితాగ్ని అయినవాడు నిరక్తుడైనప్పుడు, దేశాంతరముల యందుండి, ప్రజాపత్య యాగము జలమందు నిర్వహించి, తరువాత సన్యసించాలి. మనసుతోగాని, శాస్త్రప్రకారంగా గాని, మంత్రావృత్తితోగాని, జలమందు వేదోక్తముగా అనుష్ఠానం పూర్తి చేసి విరక్తి భావం గల విద్వాంసుడు మాత్రమే సన్యసించాలి.

ఈ విధంగా సన్యసించినవాడు విధి విధానంగా పరబ్రహ్మను అర్చిస్తే, అతడికి సాయుజ్యం లభిస్తుంది.

ఈ రకంగా మోక్షము పొందటానికి సన్యాసాశ్రమమును ఏర్పరచినవాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు 'సన్యాసకృత్' అనబడుతున్నాడు.

## 581. శమః

శాంతిని ఉపదేశించేవాడు.

**అనుద్వృత్తశ్శమః ప్రోక్తః** ఇచ్ఛ, భయము, క్రోధము మొదలైనవి లేనివాడు.

**శాంత్యుపాయమాచష్టే ఇతిశమః**

శమము కావాలి అంటే రాగద్వేషాలను జయించాలి అని ప్రబోధించినవాడు.

ఇంద్రియ వృత్తులు నిరోధించటాన్నే శమము అంటారు. అంటే ఇంద్రియాలన్నీ కూడా తమ తమ పనులందు లేదా విషయములందు ఆసక్తి చూపకపోవటం **మనుస్మృతిలో**

**యతీనాంప్రశమోధర్మో నియమో వనవాసినాం ।**
**దానమేవ గృహస్థానాం శుశ్రూషా బ్రహ్మ చారిణామ్ ॥**

యతులకు ప్రశమనము, వానప్రస్థులకు నియమము గృహస్థులకు దానము, బ్రహ్మచారులకు శుశ్రూష అనేవి ముఖ్యధర్మములు.

ప్రశమనము – మిక్కిలి శాంతి.

ఇంద్రియాల మీద, అవి చేసే పనులమీద గనక అదుపు ఉన్నట్లైతే శాంతిని సాధించవచ్చు. ముఖ్యంగా దీనికి కావలసినది. కామక్రోధాలను జయించటము. కామము అంటే రాగము. దీన్ని జయించినవాడికి దేనిమీద కోరిక ఉండదు. అవి కావాలి అని ఉండదు, ఇది వద్దు అని ఉండదు, కోరిక ఎప్పుడైతే నశిస్తుందో క్రోధము కూడా నశించిపోతుంది. కామక్రోధాలను జయిస్తే ఈ లోకాన్ని జయించినట్లే అతడే మోక్షానికి అర్హుడు. ఈ విషయం ప్రబోధించినవాడు.

## 582. శాంతః

శాంతగుణము గలవాడు.

**శాంతోఽ వికృతమానసః** ఎటువంటి విషయాలకు వికారము చెందనివాడు.

**శామ్యతీతి శాంతః**

సముద్రములాగా అపారమైన మహిమ కలిగి ఉండి ఏ మాత్రం అహంకారము లేకుండా శాంత స్వభావంతో ఉండేవాడు. **శ్వేతాశ్వరోపనిషత్తు**లో చెప్పినట్లుగా

**నిష్కలం నిష్క్రియం శాంతం** పరమేశ్వరుడు అవయవములు లేనివాడు, క్రియారహితుడు. శాంతమూర్తి.

**నిరంజనం నిరవయవం నిర్గుణం శాంతం బ్రహ్మ.**

కళలకు అతీతమైనవాడు, గుణరహితుడు, అవయవములు లేనివాడు, శాంత స్వభావుడు ఆ పరబ్రహ్మ అని చెప్పబడింది. **నారాయణోపనిషత్తు**లో

**నిష్కళంకో, నిరంజనో, నిర్వికల్పో, నిరాఖ్యాతశుద్ధో దేవ ఏకోనారాయణః**

నారాయణుడు నిష్కళంకుడు, నిరంజనుడు, నిర్వికల్పుడు, వాక్కులతో నిర్వచించటానికి వీలు లేనివాడు, శుద్ధుడు. అద్వితీయుడు అని చెప్పబడింది. అందుకే శ్రీమన్నారాయణుని స్తుతించేటప్పుడు శాంతాకారం భుజగశయనం అంటూ ప్రారంభిస్తారు. అతడు పరమశాంతమూర్తి. తన భక్తులైన వారు నెత్తిమీద కూర్చున్నప్పటికీ ఏ మాత్రమూ కోపగించనివాడు. భక్తులను తల్లి పసిపాపలను లాలించినట్లుగా లాలించేవాడు.

## 583. నిష్ఠా:

స్థిరమైన స్థలముగలవాడు.

**నిష్ఠీయతే హ్యర్థినాం యో హృదినిష్ఠాన కథ్యతే ॥**

భక్తుల హృదయములందు స్థిరనివాసము ఏర్పరచుకొన్నవాడు.

**నిష్ఠీయతే అస్మిన్నితి నిష్ఠా** నివృత్తి మార్గంలో సంచరించే మహనీయుల హృదయాలను తన నివాస స్థానముగా చేసుకొన్నవాడు.

పరమాత్మకు వేరే స్థలం లేదు. తనను నిరంతరం సేవించే భక్తుల హృదయాలలోనే ఉంటాడు. 'భక్తుల హృదయాలలో బందీవై ఉన్నావు' అని ప్రార్థించబడతాడు. గజేంద్ర

మోక్షంలో యజ్ఞశాలకు వచ్చిన వామనుణ్ణి చూసి బలిచక్రవర్తి “బాలకా ! నీ పేరేది ? నీ ఊరేది ? నీ నివాస స్థలంబు ఎక్కడ ? అని అడుగుతాడు. దానికి సమాధానం చెబుతూ

**సిరియుగలదు తొల్లి చెప్పెదనాటెంకి సుజనులందు తరచు సొచ్చియుందు**

సత్పురుషుల హృదయాలలో ఎల్లవేళలయందు దాగి ఉంటాను అంటాడు.

ప్రళయ కాలంలో సర్వభూతాలు అతనియందే ఉంటాయి. అతడే లయకారకుడు. జగత్తునంతటినీ మహాప్రళయ కాలంలో లయింపచేస్తాడు. అప్పుడు కర్మపరిపక్వం కాని జీవులన్నీ తమ కర్మలను తమతోనే మూట కట్టుకుని ఆ పరమ పురుషుని యందు లీనమవుతాయి. కర్మక్షయం అయిన జీవులు ముక్తి పొందుతాయి. ఈ రకంగా జీవులన్నింటినీ తనలోనే లయం చేసుకునేవాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు ‘నిష్ఠాః’ అనబడుతున్నాడు.

## 584. శాంతిః

మరచిపోయేటట్లుగా చేసేవాడు.

**సర్వాధికారాశ్శామ్యంతి సమాధౌ సరమే యతః ।**
**అతః శాంతిరితిః ప్రోక్తః ఋత్వర్ణో భక్తిదోమనుః ॥**

భక్తులు సమాధిస్థితిలో ఉండి తనను ధ్యానించినప్పుడు, వారి వారి అధికారములను మరపింపచేయువాడు. ఈ నామము షడక్షరీ మంత్రము. భక్తిప్రదము.

**శ్యామంతి అస్మిన్నితి శాంతిః** సమాధి స్థితిలో ఉండి తనను అనుభవించేవారు ఆ సమయంలో తమ స్థితిని మరచి పోయేటట్లు చేసేవాడు.

అవస్థా పంచకము ఇవి ఐదు అవస్థలు

1. జాగ్రదావస్థ
2. స్వప్నావస్థ
3. సుషుప్త్యావస్థ
4. తురీయావస్థ
5. తురీయాతీతము

తురీయ స్థితినే సమాధి స్థితి అంటారు. జాగ్రదావస్థలో స్థూలశరీరం పని చేస్తుంటుంది. కాబట్టి జరిగే విషయాలు అన్నీ మానవుడికి తెలిసే జరుగుతుంటాయి. వాటిని అతడు ప్రత్యక్ష్యంగా అనుభవిస్తాడు.

స్వప్నావస్థలో జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు పని చెయ్యవు. ఆ సమయంలో మనసు మాత్రమే పని చేస్తుంది. సూక్ష్మశరీరంతో ఇతడు కలలు కంటాడు. కలలో అన్నింటినీ అనుభవిస్తాడు.

సుషుప్తిలో మనసుకూడా పని చెయ్యదు. అవయవాలన్నీ విశ్రాంతి తీసుకుంటాయి. ప్రాణము ఒక్కటే శరీరమంతా సంచరిస్తుంటుంది. ఇది గాఢనిద్రాస్థితి. తమోగుణ ప్రధానమైనది.

సమాధిస్థితిలో ప్రాణాలు కూడా చలనరహితమవుతాయి. జీవాత్మ పరమాత్మల అనుసంధానం జరుగుతుంది. ఇవి నిర్వికల్పమైన స్థితి. ఈసమయంలో బాహ్య ప్రపంచంలో ఏం జరిగినా అతనికి తెలియని స్థితి. సాధకుడు ఆ పరమేశ్వరుని అనుభవిస్తుంటాడు. ఆ సమయంలో సాధకులు తమ స్థితిని మరిచిపోతారు.

అప్పుడు అవిద్య, అజ్ఞానము అనేవి ఉండవు. అంతా పరమేశ్వరమయం. జగత్తంతా పరబ్రహ్మ పరబ్రహ్మేతను. తానే పరబ్రహ్మ. ఈ జగత్తంతా తనలోనే వ్యాపించి ఉన్నది. పిపీలికాది బ్రహ్మపర్యంతము తనలోనే ఉన్నది. అనే విషయం గుర్తిస్తాడు. ఆ సమయంలో అతడికి ఇక ఏ ఇతర విషయాలు గుర్తుకు రావు.

ఈ రకంగా సమాధిస్థితిలో సాధకుడికి ఏ ఇతర విషయాలు గుర్తుకు రాకుండా ఉండేటట్లు చేసేవాడు కాబట్టే శ్రీమన్నారాయణుడు 'శాంతిః' అనబడుతున్నాడు.

## 585. పరాయణమ్

పరమభక్తిని కలిగించువాడు.

**యస్మాత్తు పరమాభక్తిః చరమప్రాప్తి కామతా ।**
**తస్మాత్ పరాయణమితి స్మృతో హ్యష్టార్ణ ఉత్తమః ॥**

భక్తులకు మోక్షము ప్రసాదించాలి అంటే వారికి పరమభక్తి కావాలి. అటువంటి పరమభక్తిని భక్తులకు కలిగించువాడు. ఈ నామము అష్టాక్షరీ మంత్రము.

**పరమ్ అయనం అస్మాదితి పరాయణమ్** సమాధి స్థితి పొందిన వారికి వెంటనే మోక్షాన్నిచ్చే పరమభక్తిని ప్రసాదించేవాడు. భగవద్గీతలోని 18వ అధ్యాయము **'మోక్షసన్యాస యోగము'**లోని 51 నుంచి 54 వరకు శ్లోకాలు

**బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాఽఽత్మానం నియమ్య చ ।**
**శబ్దాదీన్ విషయాన్, త్యక్త్వారాగద్వేషావ్యుదస్యచ ॥**

**వివిక్తసేవీ లఘ్వాశీ యత వాక్కాయమానసః ।**
**ధ్యానయోగ పరోనిత్యం వైరాగ్యం సముపాశ్రితః ॥**

**అహంకారం బలం దర్పం కామంక్రోధం పరిగ్రహమ్ ।**

**విముచ్య నిర్మమ శ్శాంతో బ్రహ్మభూయాయ కల్పతే ॥**

విశుద్ధమైన బుద్ధిగలవాడై తేలిక అయిన సాత్త్వికమైన ఆహారాన్ని మితంగా భుజించేవాడు, శబ్దాది విషయాలను త్యజించి, పరిశుభ్రమైన ప్రదేశమున ఏకాంతంగా నివశించేవాడు, సాత్త్వికధారణాశక్తి ద్వారా అంతఃకరణమును, ఇంద్రియ సంయమము గలిగి, మనోవాక్కాయములను అదుపులో ఉంచుకొనినవాడు, రాగ ద్వేషాలను త్యజించి వైరాగ్యాన్ని గట్టిగా ఆశ్రయించినవాడు, అహంకారము, బలము, దర్పము, కామక్రోధాలు, పరిగ్రహణలను వదలి, నిరంతరము ధ్యానయోగ పరాయణుడై ఉండేవాడు, మమతారహితుడు, శాంతియుతుడు అయిన పురుషుడు ఆ సచ్చిదానంద పరబ్రహ్మ యందు ఏకీభూతుడవటానికి ప్రాప్తుడు.

ఎటువంటి పాపసంస్కారాలు లేనటువంటి అంతఃకరణయే విశుద్ధ బుద్ధి అనబడు తుంది. అటువంటి అంతఃకరణ గలిగినవాడు 'విశుద్ధ బుద్ధి యుక్తుడు' అనబడతాడు. ఇటువంటివాడు సాధనకు అనుకూలమైన, తేలికగా జీర్ణమయ్యే సాత్త్వికాహారము మాత్రమే తీసుకోవాలి. స్వభావానికి అనుగుణమైనట్లుగా శక్తికి అనుగుణంగా పరిమితంగా భుజించాలి అదే యుక్తాహారము అంటారు.

సాధకుడు ప్రాపంచికమైన ఇంద్రియ సుఖాలన్నింటినీ పరిత్యజించాలి. వీటిని అనుభవించటానికి సమయం వృధా చెయ్యకూడదు. సాధనకు అనుకూలంగా ఉండేటట్లుగా జనసంచారము లేని ఏకాంత ప్రదేశంలో నివసించాలి. అదినదీతీరంగాని, కొండగుహగాని, అడవిగాని కావచ్చు.

ప్రతిఇంద్రియంలోను రాగద్వేషాలు ఉంటాయి. ఇవి సాధనకు పరమశత్రువులు. కాబట్టి భోగములందుగాని, ఏ వ్యక్తులయందు, పదార్థములందు, క్రియలయందు, సంఘటనల యందు రాగద్వేషాలు ఉండకూడదు. అంటే వాటిని రూపుమాపాలి. నిరంతరము వైరాగ్యంతోనే ఉండాలి.

శరీరము, ఇంద్రియాలు, అంతఃకరణ వీటియందు ఆత్మబుద్ధి కలిగి ఉండటాన్నే అహంకారము అంటారు. దీనివల్లనే మనస్సు, బుద్ధి, శరీరముల ద్వారా చేసే పనులకు మానవుడు తానే కర్తగా భావిస్తాడు. కాబట్టి దేహాభిమానము త్యజించినట్లైతే అహంకారము పోతుంది. అన్యాయంగా ఇతరులమీద బలాన్ని ప్రయోగించటము 'బలము' అనబడుతుంది. దీన్నికూడా పరిత్యజించాలి.

ఇహపరభోగాలు, సుఖాలు కావాలనుకోవటమే కామము. ఏ కోరికలు కోరకుండా ఉండటమే కామవిసర్జన. ఈరకంగా అరిషడ్వర్గాలను జయించాలి. ఈ విధంగా చేసినప్పుడే సాధకుడు బ్రహ్మప్రాప్తికి అర్హుడు అవుతున్నాడు. బ్రహ్మ భావాన్ని పొందుతున్నాడు. అతని దృష్టిలో ఆత్మ పరమాత్మల మధ్య తేడా ఉండదు. నేనే సచ్చిదానంద పరబ్రహ్మను అనుకునే స్థితికి చేరతాడు.

**బ్రహ్మభూతః ప్రసన్నాత్మా న శోచతి నకాంక్షతి ।**
**సమః సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్ ॥**

సచ్చిదానంద ఘనబ్రహ్మయందు ఏకీభావ స్థితుడై ప్రసన్న మనస్కుడైన యోగి దేనికీ శోకింపడు. దేనినీ కాంక్షింపడు. సమస్త ప్రాణులయందు సమభావము గల అట్టి యోగి నాపరాభక్తిని పొందుతాడు.

సచ్చిదానంద ఘనబ్రహ్మ యందు అభిన్న భావము పొందినవాడు. బ్రహ్మభూతుడు అనబడతాడు. అతని దృష్టిలో ఆ పరబ్రహ్మకు తప్ప వేరే దేనికీ అస్తిత్వమే లేదు. మహావాక్యాల ననుసరించి పరమాత్మలో ఏకీభావముతో శాశ్వతమైన, నిశ్చలమైన స్థితిని పొందేవాడు. బ్రహ్మభూతము అనబడతాడు. అటువంటివాడికి అన్ని భూతములయందు సమభావమే ఉంటుంది. ఏ ప్రాణినీ తనకన్న వేరుగా భావించడు. ఇదే జ్ఞానము యొక్క పరాకాష్ఠ, తత్త్వజ్ఞానము అని చెప్పబడుతుంది. ఇది పరమాత్మ యొక్క యదార్ధరూపాన్ని తెలియచేసి దానియందు విలీనం చేస్తుంది.

అందుకే 'అహంకార మమకారములు తొలగినవాడు నన్ను చేరగలడు' అంటాడు పరమాత్మ. పరం – ఉత్కృష్టం – పునావృత్తి రహితం

ఆయనం–స్ధానం గొప్పదైన, పునరావృత్తి రహితమైన అయిన స్ధానము. అదే పరమపదము.

ఈ రకంగా పరమపదాన్నిచ్చేవాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు 'పరాయణమ్' అనబడుతున్నాడు.

## 586. శుభాంగః

శుభమైన అంగములు గలవాడు. శుభమైన అంగములను ఇచ్చేవాడు.

782వ నామం కూడా ఇదే.

**స్వశక్త్యుద్భవ కల్యాణ యమాద్యష్టాంగ సంభవః ।**
**యస్మాత్ శుభాంగ సంప్రోక్తః సపార్ణో ధ్యానదాయకః ॥**

భక్తులు తనను పొందటానికి తగిన ఉపాసన చెయ్యటం కోసం యమనియమాది అష్టాంగములను ఇచ్చినవాడు. ఈ నామము సప్తాక్షరీ మంత్రము ధ్యానప్రదము.

**శుభాని అంగాని యస్యసః శుభాంగః** ఉపాసనకోసం అష్టాంగములనిచ్చినవాడు.

అష్టాంగములు అంటే

| | | |
|---|---|---|
| 1. యమ | 4. ప్రాణాయామ | 7. ధ్యాన |
| 2. నియమ | 5. ప్రత్యాహార | 8. సమాధి |
| 3. ఆసన | 6. ధారణ | |

| | | | |
|---|---|---|---|
| వీటిలో **యమము** | – పది రకాలు | ప్రత్యాహారము | – ఐదు రకాలు |
| నియమము | – పది రకాలు | ధారణలు | – ఐదు రకాలు |
| ఆసనములు | – ఎనిమిది రకాలు | ధ్యానము | – రెండు రకాలు |
| ప్రాణాయామము | – మూడు రకాలు | సమాధి | – ఒక్కటి |

**శాండిల్యోపనిషత్తు**లో ఇవన్నీ వివరించబడ్డాయి.

**1. యమము :** ఇంద్రియ నిగ్రహము. ఇది పది రకాలు.

| | | |
|---|---|---|
| 1. అహింస | 5. బ్రహ్మచర్యము | 8. క్షమ |
| 2. సత్యము | 6. దయ | 9. మితాహారము |
| 3. అస్తేయము | 7. అర్జవము | 10. శౌచము |
| 4. దొంగిలింపకుండుట | | |

అస్తేయము అంటే – మనోవాక్కాయ కర్మలచేత పరద్రవ్యమందు కోరిక లేకుండా ఉండటము.

ఆర్జవము అంటే – విహితమైన లేక అవిహితమైన జనులందు ప్రవృత్తిలోగాని, నివృత్తిలోగాని మనోవాక్కాయ కర్మలకు ఒకే రూపము కలిగి ఉండటము.

**2. నియమము :** (ఏర్పాటు) ఇది పది రకాలు

| | | |
|---|---|---|
| 1. సంతోషము | 5. ఈశ్వరపూజ | 8. మతి |
| 2. దానము | 6. సిద్ధాంత శ్రవణము | 9. జపము |
| 3. అస్తిక్యము | 7. హ్రీ | 10. వ్రతము |
| 4. దానము | | |

అస్తిక్యము అంటే – వేదోక్తమైన ధరాధర్మములయందు విశ్వాసము గలిగి ఉండుట.

హ్రీ అనగా – వేదాలలో చెప్పిన లౌకిక మార్గములందు సిగ్గు గలగటము.

మతి అనగా – వేదవిహిత మార్గములయందు శ్రద్ధ.

3. **ఆసనములు :** ఎనిమిది

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | స్వస్తికము | 4. | వీరము | 7. | ముక్తము |
| 2. | గోముఖము | 5. | సింహము | 8. | మయూరము |
| 3. | పద్మము | 6. | భద్రము | | |

వీటిని గురుముఖతహ ప్రత్యక్షంగా తెలుసుకోవాలి. ఎవరికి ఏ ఆసనం సుఖంగా ఉంటే వారు అదే ఆసనం వేయవచ్చు.

4. **ప్రాణాయామము :** ఇది మూడు రకాలు

1. రేచకము 2. కుంభకము 3. పూరకము

5. ప్రత్యాహారము ఐదు రకాలు

5. **ప్రత్యాహారము :** అనగా – ఇంద్రియాల నుండి విషయాన్ని మరల్చుటము

1. విషయములలో సంచరించే ఇంద్రియాలను బలాత్కారంగా వెనక్కి లాగటము
2. చూచిన ప్రతివస్తువూ ఆత్మయే అనే జ్ఞానము.
3. నిత్యవిహితమైన కర్మఫలత్యాగము
4. విషయముల యందు పరాన్ముఖుడై ఉండటము.
5. ప్రతి ఇంద్రియమందు ఆరోహణ, అవరోహణ

6. **ధారణ :** మూడు రకాలు

1. ఆత్మయందు మనసును ధారణ చెయ్యటము
2. దహరాకాశంలో బాహ్యాకాశము ధారణ చెయ్యటము
3. పంచభూతములందు పంచమూర్తి ధారణ

7. **ధ్యానము :** రెండు రకాలు 1. సగుణము 2. నిర్గుణము

8. **సమాధి :** ఒకటే స్థితి

ఇవి అష్టాంగములు అనబడుతున్నాయి. ఈ అష్టాంగ మార్గముతోనే ఆత్మసాక్షాత్కారము కలుగుతుంది.

**శుభాంగః :** శుభమైన అంగములు గలవాడు. శుభమైన అంగములు ఇచ్చేవాడు.

# 587. శాంతిదః

శాంతినిచ్చేవాడు

**ఏవం నిష్పన్నభక్తిభ్యః శాంతిం సాయుజ్య సంగ్నకామ్**

భక్తి తత్పరులకు తనసాయుజ్యము అనే శాంతినిచ్చేవాడు.

**శాంతిం దదాతీతి శాంతిదః**

సర్వకాల సర్వావస్థలయందు త్రికరణ శుద్ధిగా తననే అర్చించేవారికి మళ్ళీ సంసారబంధనాలు కలుగకుండా సాయుజ్యమునిచ్చేవాడు.

**శ్వేతాశ్వరోపనిషత్తు**లో లోకమంతా తానొక్కడే అయి వ్యాపించి ఉండే మంగళకారుడైన ఆ పరమాత్మను తెలుసుకుని సాధకుడు పరమశాంతిని పొందుతున్నాడు. అని చెప్పబడింది.

**భగవద్గీత**లోని 18వ అధ్యాయము **'మోక్ష సన్యాసయోగము'**లోని 62వ శ్లోకము

**తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత ।**
**తత్ప్రసాదాత్పరం శాంతిః స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్ ॥**

అర్జునా ! అన్నివిధాలా ఆ పరమేశ్వరునే శరణుజొచ్చుము. అతని కృప చేతనే పరమశాంతిని, శాశ్వతమైన పరమపదమును పొందగలవు.

పరమేశ్వరుడు సమస్త ప్రాణులయందు అంతర్భావం చెంది ఉన్నాడు. అటువంటి సర్వశక్తిమంతుడు, సర్వాధారుడు, సమస్త ప్రాణులకు ప్రేరకుడు, సర్వాంతర్యామి, సర్వవ్యాపి అయిన ఆ పరమేశ్వరుని మానవుడు తన మనస్సు, బుద్ధి, ఇంద్రియాలు, ప్రాణాలు, ఒకటేమిటి ? సర్వస్వము అతనికే అర్పించి, అతని మీదనే ఆధారపడి ఉండుటయే అన్ని విధాల అతన్ని శరణుజొచ్చుట అనబడుతుంది.

భగవంతుని తత్త్వాన్ని పూర్తిగా అర్థం చేసుకుని, అతడే పరమప్రాప్యుడు, పరమగతి, పరమాశ్రయుడు అని తెలుసుకోవాలి. అతడే తనకు స్వామి, రక్షకుడు అని నమ్మి సేవించాలి. సుఖదుఃఖాలన్నీ భగవంతుని ప్రసాదములే అని నమ్మాలి. జరిగే సంఘటనలన్నీ దైవికములు అని భావించాలి. ఎప్పుడూ అసంతృప్తిని పొందరాదు. ఈ రకంగా చేస్తూ తన గౌరవము, ప్రతిష్ఠలను ప్రక్కన పెట్టి, భగవంతుని యందే మనసు లగ్నము చేసి, అనన్యభక్తితో అతని నామరూప గుణ ప్రభావాలను నిరంతరము శ్రవణము, మననము, కీర్తనములందే కాలం వెళ్ళబుచ్చాలి. ఈ రకంగా చెయ్యటమే శరణుజొచ్చుట అంటారు.

ఈ రకంగా శరణువేడిన భక్తుని మీద పరమ దయాస్వరూపుడు, సర్వశక్తిమంతుడు అయిన పరమేశ్వరుడు తనయొక్క అపారకృపా ప్రవాహాన్ని ప్రవహింపచేస్తాడు. అందుచేత అతని సమస్త దుఃఖములు, బంధములు శాశ్వతంగా తొలగిపోతాయి. అప్పుడు ఆ భక్తుడు సచ్చిదానంద స్వరూపమైన పరమాత్మను పొందుతాడు. దీన్నే పరమపదము పొందటము అంటారు. ఈ విధంగా తత్పరులైన వారికి సంసారబంధనాలను త్రెంచి వేసి శాశ్వతమైన పరమపదాన్నిచ్చేవాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు 'శాంతిదః' అనబడుతున్నాడు.

రాగద్వేషాలను నాశనం చేసి భక్తులకు శాంతినిచ్చువాడు.

## 588. స్రష్టా

సృష్టించేవాడు. 990వ నామం కూడా ఇదే.

**కర్మవైచిత్ర్యత స్సృష్టీన్ స్రష్టాస్యా త్సృజ్యతే చ యః**

జీవులు చేసిన కర్మల ననుసరించి, వారిని వివిధ రకాలుగా సృష్టించినవాడు.

**సృజతీతి స్రష్టా** మోక్షమునందు అపేక్షగలవారిని లౌకికబంధనాలనుండి విడిపిస్తాడు. లౌకిక సుఖాలు కావాలి అనుకునేవారికి, వారి వారి కర్మానుసారము వారిని సృష్టించువాడు.

జన్మించిన తరువాత కర్మచేసి తీరతాడు. ఆ కర్మ వల్ల ఫలితము వస్తుంది. దానివల్ల పాపపుణ్యాలు అనుభవిస్తాడు. ఆ తరువాత కర్మశేషము అనుభవించటానికి మళ్ళీ ఈ లోకంలో పుడతాడు. మంచి కర్మలు చేసినవారు మంచి యోనులయందు జన్మిస్తారు. చెడుకర్మలు చేసినవారు చెడు యోనులయందు జన్మిస్తారు. నీచమైన కర్మలు చేసినవారు క్రిమికీటకాలుగా జన్మించి వెంటనే మరణిస్తుంటారు.

ఈ రకంగా జరిగేటప్పుడు జీవులకు వారి కర్మను బట్టి ఉత్తరజన్మలిచ్చేవాడు. గత జన్మలలో తత్పరత బాగా ఉంటే అతడు సాయుజ్యం పొందుతాడు. లేకపోతే తనకర్మ ఫలితంగా కోరుకున్న కోరికలు తీరతాయి. ఆ రకంగా జన్మ కలుగుతుంది. ఈ విధంగా మానవులను సృష్టించే వాడు కాబట్టి శ్రీమహావిష్ణువు 'స్రష్టా' అనబడుతున్నాడు.

అన్ని భూతాలను సృష్టిస్తాడు కాబట్టి 'స్రష్ట' అనబడతాడు.

## 589. కుముదః

ప్రకృతియందు సంతసించువాడు. 807వ నామము కూడా ఇదే.

**కౌ ప్రాకృతే మండలేయః స్వభోక్త్రూనపి భోజయాన్ ।**
**మోదతే యస్సదాకాలం కుముదస్స తు గీయతే ॥**

కు అంటే లీలావిభూతి. ఆ లీలా విభూతిలో కర్మఫలము అనుభవించవలసిన జీవులను, వారి కర్మానుసారము కర్మఫలాన్ని అనుభవింపచేస్తూ ఆనందించేవాడు.

**కౌ మోదత్ ఇతి కుముదః** పిపీలికాది బ్రహ్మ పర్యంతము జీవులందరూ కర్మని అనుభవించాల్సినవారే. ఉత్తరజన్మలెత్తి కర్మను అనుభవించటం కోసం వారందరినీ భూమండలానికి చేర్చి, వారికి అవసరమైన భోగములు కల్పించువాడు. ఈ రకంగా జీవులు తమ కర్మ ఫలాన్ని అనుభవిస్తుంటే తాను చూసి ఆనందిస్తాడు.

జీవుల రూపంలో శ్రీమహావిష్ణువే భూమిమీద ఉన్నాడు.

కు అంటే భూమి. మద అంటే సంతోషము. భూమి యందు సంతసించే భగవానుడు 'కుముదః' అనబడుతున్నాడు. జీవుల కోరికలకు అనుగుణమైన సృష్టి చేసి సంతసిస్తున్నాడు. తమ కర్మానుసారము జీవులు అనుభవిస్తుంటే చూసి ఆనందిస్తాడు. భక్తులు తనకోసం చేసే సాధన చూసి ఆనందిస్తాడు. భక్తుల సుఖమయ జీవితం చూసి ఆనందిస్తాడు. అందుకే శ్రీమన్నారాయణుడు 'కుముదః' అనబడతాడు.

## 590. కువలేశయః

జీవులు నియమించువాడు.

**కుత్సితం బలమేషాం తే కువలా జీవసంగికాః**
**దేహేంద్రియాదేరీశాస్తే కువలేశా ఇతిస్మృతాః ॥**
**యస్మాన్నియచ్ఛన్యాతీతి కువలేశ ఉచ్యతే**

సంస్కృతంలో వ, బ లకు పెద్దగా తేడా లేదు. ఈ మాట గతంలో చెప్పటం జరిగింది. కాబట్టి కువలలు అంటే – విషయానుభవము గల జీవులు. వారే తమ దేహేంద్రియాలకు ప్రభువులు. అందుచేత కువలేశులు అనబడతారు. అటువంటి వారిని వారి కర్మానుగుణంగా నియమించేవాడు.

**కౌ భూమౌ ఆ సంసారం భ్రామ్యంతీతి కువలాః**
**జీవాః కువలాశ్చతే ఈశాశ్చ కువలేశాః**
**కువలేశాన్ యాతీతి కువలేశయః ॥**

ఈ జగత్తు ఉన్నంతవరకు సృష్టి చేస్తూనే ఉంటాడు. కువలలాః అంటే జీవులు. కువలేశాః అనగా తమదేహాలకు తామే ఈశ్వరులుగా భావించేవారు. దేహమే ఆత్మ అని భావించే అజ్ఞానులు. వారిని అదే రకంగా ఉంచేవాడు.

కు అనగా భూమి. వల అనగా దానిని చుట్టి ఉన్న సముద్రం శయ అనగా శయనించువాడు.

భూమిని చుట్టి ఉన్న సముద్రంమీద శయనించినవాడు. 'కువల' అనగా పాముయొక్క ఉదరభాగము. దానిమీద శయనించువాడు. ఆదిశేషుని మీద శయనించువాడు.

కువల అనగా రేగుపండు. దాని నడుమ శయనించువాడు. పరీక్షిత్తును సంహరించటానికి తక్షకుని రూపంలో రేగుపండునందు శయనించినవాడు.

ఉత్తర అభిమన్యుల పుత్రుడు పరీక్షిత్తు. తల్లి గర్భంలో కనిపించిన దేవుడే లోకమంతా ఉన్నాడు అని గర్భమునుంచే పరీక్షించాడు కాబట్టి పరీక్షిత్తు అనబడ్డాడు. తన మేనమామ ఉత్తరుని కుమార్తె 'ఇరావతి'ని వివాహం చేసుకున్నాడు. ధర్మరాజు లాగానే ప్రజలను కడు ధర్మంగా పాలిస్తున్నాడు.

ఒకనాడు పరీక్షిన్మహారాజు వేటకు వెళ్ళాడు బాగా అలసిపోయిన మహారాజు ఒక ముని ఆశ్రమానికి వచ్చాడు. ఆయనే శమీక మహర్షి. సమాధిలో ఉన్నాడు పరీక్షిత్తు దాహం వేస్తోంది. కాశిని నీరు ఇప్పించమని మహర్షిని అడిగాడు. మహర్షి లేవలేదు. దాంతో విసిగిపోయిన మహారాజు ప్రక్కనే చచ్చిపడి ఉన్న పామును మహర్షి మెడలో వేసి తన దారిన తాను వెళ్ళిపోయాడు.

శమీకుని కుమారుడు శృంగి. ఆశ్రమానికి తిరిగి వచ్చి సమాధి స్థితిలో ఉన్న తండ్రి మెడలో చచ్చిన పామును చూసి, తన తండ్రిని ఈ రకంగా అవమానించిన పరీక్షిన్మహారాజు తక్షకుని కాటువలన మరణిస్తాడు అని శాపం పెట్టాడు.

మహారాజు ఎన్ని జాగ్రత్తలు తీసుకున్నా లాభం లేకపోయిందది. చివరకు తక్షకుడు రేగిపండులో దూరి, రాజును కాటువేశాడు.

ఈరకంగా రేగుపండులో శయనించినవాడు కాబట్టి 'కువలేశయః' అనబడుతున్నాడు.

## 591. గోహితః

ప్రకృతికి వ్యవస్థాపకుడు

**సంసార బీజక్షేత్రస్య ప్రకృతేస్థాపకశ్చయః స గోహితః**

సంసారమనే విత్తనాలు నాటటానికి తావైన ప్రకృతికి ఆధారమైనవాడు.

**గోః ప్రకృతేః హితః గోహితః** సంసారము అనే విత్తనాలు జల్లే భూమియైన ప్రకృతి మండలానికి అధిష్ఠాన దేవత అయి కార్యము చేస్తాడు కాబట్టి ప్రకృతికి వ్యవస్థాపకుడు అవుతున్నాడు.

**గోభ్యహితః - గోహితః** గోవులకు హితము చేయువాడు. గోవర్ధనోద్ధరణము చేసినవాడు.

యాదవుల కులదైవము ఇంద్రుడు. అతడు వర్షాధిపతి. పశుపోషణ, వ్యవసాయం జీవనోపాధిగా ఉన్న యాదవులు ఇంద్రుణ్ణి ఆరాధిస్తారు. తమ ఆరాధనకు సంతసించి, ఇంద్రుడు సకాలంలో వర్షాలు కురిపించి, పాడిపంటల అభివృద్ధికి సహకరిస్తాడని వారి నమ్మకం. అందుకని ప్రతి సంవత్సరము ఇంద్రయాగం పేరుతో ఇంద్రుని పూజించేవారు. ఆ యేడు కూడా ఇంద్రయాగం చేద్దామని గోపాలురంతా నిర్ణయించుకుని శ్రీకృష్ణునితో ఆ మాటచెప్పారు. ఆ మాటలువిన్న కృష్ణుడు "పాలిచ్చేవి పశువులు. వాటిని ఆరాధించండి. పంటలు పండించేది భూదేవి. కాబట్టి భూమాతను ఆరాధించండి. కొండవల్ల చల్లగాలులు వచ్చి మబ్బులు వర్షిస్తాయి కాబట్టి గోవర్ధన గిరిని ఆరాధించండి. వర్షఋతువులో వానకురిపించటం ఇంద్రుని బాధ్యత. ఈసారి మీరు ఇంద్రయాగం చెయ్యవద్దు. ప్రకృతినే సేవించండి" అన్నాడు.

గోపాలురంతా శ్రీకృష్ణుని మాటలు ఆమోదించారు. అతడు చెప్పిన ప్రకారం కొండకు, పశుజాతికి భూమాతకు సమారాధన చేశారు.

గోపాలురు ఇంద్రయాగం చెయ్యటం లేదని, పైపెచ్చు గోవర్ధనగిరిని అర్చిస్తున్నారని తెలిసి ఇంద్రుడు కుపితుడైనాడు. వెంటనే వడగళ్ళవాన కురిపించాడు. గోకులం కకావికలమయింది. గోపాలురు తల్లడిల్లారు. బృందావనం గగ్గోలు పెట్టింది. వడగళ్ళు మీద పడి స్త్రీలు, బాలలు, వృద్ధులు, పశువులు క్షతగాత్రులవుతున్నారు. అందులో భయంకరమైన వర్షం. ఏం చెయ్యాలోపాలు పోలేదు. గోపాలురకు. అందరూ కృష్ణ పరమాత్మడి దగ్గరకు పరుగులెత్తారు. శ్రీకృష్ణుడు వారికి అభయమిచ్చాడు. "మీరంతా గోవర్ధనగిరి దగ్గరకు రండి నేను మీకు రక్షణ కల్పిస్తాను" అన్నాడు.

కృష్ణుని మాటల ప్రకారం గోపాలురంతా తమ గోసంపదతో గోవర్ధనగిరి దగ్గరకు పరుగు తీశారు. శ్రీకృష్ణ పరమాత్ముడు ఆ పర్వతాన్ని చిటికెన వ్రేలుతో పైకెత్తాడు. దానిక్రింద గోపాలురు, గోసంతతి, ఒకరేమిటి బృందావనమంతా ఆశ్రయం పొందింది.

ఇంద్రుడు శాంతించలేదు. ఏడు రోజులు రాత్రీ పగలు తేడా లేకుండా జడివాన కురిపించాడు. శ్రీకృష్ణుడు గోవర్ధనగిరిని ఎత్తే ఉంచాడు. చివరకు ఏడవ రోజున వర్షం శాంతించింది. గోపాలురు బయటకు వచ్చారు. శ్రీకృష్ణుడు గోవర్ధనగిరిని దింపాడు. ఆ బాలగోపాలము శ్రీకృష్ణుని అనేకవిధాల కీర్తించారు.

ఇంద్రుడు సిగ్గుపడి కృష్ణునికి నమస్కరించి వెళ్ళిపోయాడు.

ఈ రకంగా గోవర్ధనగిరిని ఎత్తి గోవులను రక్షించినవాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు 'గోహితః అనబడుతున్నాడు.

# 592. గోపతిః

స్వర్గానికి అధిపతి. 495వ నామము కూడా ఇదే.

**స్వర్గభూమే పతిత్వాద్గోపతి స్స్మృతః** అందరూ అందుకోవాలని ఆసించే స్వర్గానికి ప్రభువు.

**గోః భూమేః పతిః గోపతిః** భోగ భూమి అయిన స్వర్గానికి అధిపతి. భూమికి పతి, రక్షకుడు.

శ్రీమహావిష్ణువు యోగనిద్రలో ఉండగా భూదేవి అతన్ని చేరింది. అప్పుడు వారికి కలిగిన కుమారుడే నరకాసురుడు. ఈ రకంగా శ్రీమన్నారాయణుడు భూమికి భర్తయైనాడు. అందుకే శ్రీమన్నారాయణుడు 'గోపతిః' అనబడుతున్నాడు.

# 593. గోప్తా

రక్షకుడు. 496వ నామం కూడా ఇదే.

**యః కర్మ ఫలచక్రస్య గోప్తాహి పరిపాలనాత్**

కర్మఫలమయిన సంసారచక్రాన్ని పాలించేవాడు.

**గోపాయతీతి గోప్తా** కర్మ భూమిని రక్షించువాడు. జగముల రక్షించువాడు.

దేవతలు అశరీరులు. కాబట్టి వారు కర్మను చెయ్యలేరు. వారికి కర్మచేసే అధికారం లేదు. భూలోకంలో జన్మించినవారు మాత్రమే కర్మ చెయ్యాలి. ఈ లోకంలో జన్మించిన జీవులలోకూడా పశువులు, పక్షులు, క్రిమికీటకాలు మొదలైనవన్నీ తమ యొక్క కర్మఫలాన్ని అనుభవించవలసినదే. అంతే తప్పించి ఇంకా ఏమీ చెయ్యలేవు. దీనికి కారణము జీవులన్నింటికి ఇంద్రియాలు సమానంగానే ఉన్నాయి. అందుచేత ఆహారనిద్రామైధునాలు అన్నింటికీ ఒకటే. మానవుడికి మాత్రమే మనస్సు అనే పదకొండవ ఇంద్రియమున్నది. అందుకే మానవుడికి యుక్తాయుక్త విచ్చక్షణా జ్ఞానమున్నది. ధర్మాధర్మాలను నిర్ణయించ గలుగుతాడు. పాపపుణ్యాలను విడదీయగలుగుతాడు. తాను చేసిన కర్మలఫలాన్ని అనుభవిస్తూన్నే మళ్ళీ కర్మలు చేయగలుగుతాడు. దేవతలు కూడా కర్మచెయ్యాలంటే

సాకారులు కావలసిందే. అందుచేత కర్మభూమి అయిన ఈ జగత్తును రక్షించేవాడు శ్రీమన్నారాయణుడు. కాబట్టే అతడు 'గోప్తా' అనబడుతున్నాడు.

## 594. వృషభాక్షః

ధర్మాన్ని బండి కన్నుగాగలవాడు.

**యస్యాక్షో వృషభో ధర్మో వృషభాక్ష స్స ఉచ్యతే ॥** వృషభము అంటే – ఐహిక, ఆముష్మికఫలాలను వర్షించే ధర్మము. అక్షము అంటే ఇరుసు.

సంసారచక్రము త్రిప్పటానికి ధర్మాన్ని ఇరుసులా ఆధారముగా కలవాడు.

**వృషభః అక్షః యస్యసః వృషభాక్షః** చక్రం గిరగిరా తిరగాలి అంటే అది ఇరుసు మీద ఆధారపడాలి. అసలు ఇరుసు లేకపోతే చక్రం నిలవదు. అందుచేత ఇరుసును ఆధారంగా చేసుకుని చక్రం తిరుగుతుంది. అలాగే ఇరుసు అనే ధర్మాన్ని ఆధారంగా చేసుకుని సంసారమనే బండిచక్రం తిరుగుతుంది. ఆ రకంగా సంసారచక్రాన్ని త్రిప్పేవాడు. కాబట్టే శ్రీమన్నారాయణుడు 'వృషభాక్షః' అనబడుతున్నాడు.

**వర్షతి ఇతివృషః** వర్షించునది.

**వృషభే అక్షిణీఅస్యః** వర్షించు కనులు గలవాడు. తన భక్తులమీద కృపారసము వర్షించు కనులు గలవాడు. భక్తుల యొక్క కోరికలు తీర్చగల కామ్యములను వర్షించు కనులు గలవాడు.

ధర్మనిర్వహణయే కర్తవ్యముగా భావించేవాడు. భక్తుల కోరికలు తీర్చేవాడు. అయిన శ్రీమన్నారాయణుడు 'వృషభాక్షః' అనబడుతున్నాడు.

## 595. వృషప్రియః

ధర్మమును ప్రియముగా కలవాడు.

**ధర్మౌప్రియౌతావస్యేతి ప్రవర్తక నివర్తకౌ**
**వృషప్రియ స్స విజ్ఞేయో హ్యష్టార్ణః ఫలదోమనుః**

ధర్మము రెండు రకాలు. 1. ప్రవృత్తి ధర్మము 2. నివృత్తి ధర్మము. ఈ రెండు రకాల ధర్మములు తనకు ప్రియముగా గలవాడు. ఈ నామము అష్టాక్షరీ మంత్రము ఫలప్రదము.

**వృషౌ ప్రవర్తక నివర్తకౌ ధర్మౌ ప్రియౌయస్యసః వృషప్రియః**

ప్రవృత్తి, నివృత్తి ధర్మములను ప్రియముగా గలవాడు.

ప్రవృత్తి ధర్మము ఇహలోకానికి సంబంధించినది. ఈ లోకంలో జీవించటానికి అవసరమైన సిరిసంపదలు, భోగభాగ్యాలు, ధనధాన్యాలు, పదవులు, గౌరవము, అధికారము, సంసారబంధనాలు ఇవి పొందటానికి ఉపయోగించేది. ఇవి కావాలంటే సాకార బ్రహ్మోపాసన చెయ్యాలి. అంటే కామ్యకర్మలు చెయ్యాలి. యజ్ఞయాగాదులన్నీ దీని క్రిందకే వస్తాయి. ఈ కర్మలను నిర్వర్తించినవాడు. ఈ లోకంలో కావలసిన సుఖ సంతోషాలను పొందుతాడు. ఈ కర్మలు చేసేటప్పుడు భక్తుడు భగవంతుని తనకు నచ్చిన రూపంలో అర్చించవచ్చు. అతడు ఏ రకంగా అర్చించినప్పటికీ, ఆ అర్చన పరమేశ్వరుడికే చెందుతుంది. అతడే వారు ఆరాధించిన దేవతరూపంలో వారి కోరికలు తీరుస్తాడు.

నివృత్తి ధర్మము పరలోకానికి సంబంధించినది. ఇందులో భక్తుడు తత్పరతను పెంచుకుంటాడు. విరాగియై ఉంటాడు. సంసారసుఖాలు కోరకుండా, శాశ్వతమైన ఆనందం పొందాలని ఎదురుచూస్తుంటాడు. ఇటువంటివాడికి జగత్తంతా పరబ్రహ్మ స్వరూపంగానే కనిపిస్తుంది. పిపీలికాది బ్రహ్మపర్యంతము తనలోనే కనిపిస్తుంది. తానే పరబ్రహ్మ అనే భావనకు వస్తాడు. మరణానంతరము ఇతడు పరమపదం చేరతాడు.

ఈ రెండు రకాల భక్తులను, వారు ఆచరించే ధర్మాలను పరమేశ్వరుడు స్వీకరిస్తాడు.

రెండు రకాల ధర్మాలయందు ప్రీతి గలిగి భక్తుల కోరికలు తీరుస్తాడు. కాబట్టి శ్రీమన్నారాయణుడు 'వృషప్రియః' అనబడుతున్నాడు.

## 596. అనివర్తీ

నివర్తింపచేయువాడు.

**పితృయాణ ప్రవృత్తానాం సంసారాన్న నివర్తనాత్**
**అనివర్తీ సమాఖ్యాతో హ్యష్టార్ణోఽభయదో మనుః**

పుణ్యకర్మలాచరించిన వారిని ధూమ్రమార్గంలో పిత్రులోకాల్లో ఫలము అనుభవింపచేసి, తిరిగి సంసారసాగరములో పడవేసేవాడు. ఈ నామము అష్టాక్షరీ మంత్రము. అభయప్రదము.

**ప్రవృత్తిరతాన్ సంసారాత్ న నివర్తయతీతి అనివర్తీ ।**

ప్రవృత్తిమార్గంలో నడచిన వారికి పితృలోకాలలో సుఖాలందించి, కర్మఫల శేషము అనుభవించటానికి వారికి మళ్ళీ ఉత్తరజన్మలు కలిగించేవాడు. **భగవద్గీత** 8వ అధ్యాయము **'అక్షరపరబ్రహ్మయోగము'**లోని 25వ శ్లోకము.

**ధూమోరాత్రిస్థథాకృష్ణః షణ్మాసా దక్షిణాయనమ్ ।**
**తత్రచాంద్రమసంజ్యోతిర్యోగీ ప్రాప్యనివర్తతే ॥**

కర్మలు చేసినవారు పితృయానము ద్వారా స్వర్గలోకం చేరతారు. అక్కడ కర్మఫలము అనుభవించి తరువాత ఉత్తరజన్మలు పొందుతారు.

ఈ మార్గాన్ని ధూమ్రమార్గము అంటారు. దీనికి అధిష్ఠానదేవత అంధకారము. దాని స్వరూపము అంధకారమయము. దీని అధికారము ఈ భూమి మీద మాత్రమే ఉంటుంది. దక్షిణాయన మార్గంలో వెళ్ళేసాధకులు పగటిపూటగాని, రాత్రిపూటగాని ఎప్పుడు మరణించినా, వారిని రాత్రిదేవత దగ్గరకే చేరుస్తారు. రాత్రిదేవతాస్వరూపము అంధకారము. సాధకుడు శుక్లపక్షంలో మరణించినా, కృష్ణపక్షంలో మరణించినా కృష్ణపక్ష దేవతకే అప్పగించబడతాడు. ఆ దేవతాస్వరూపము అంధకారము. కాబట్టి దక్షిణాయనంలో మరణించిన సాదకుడు దక్షిణానాయనాభిమానదేవతకే అప్పగించబడతాడు. ఆ దేవతాస్వరూపము గాఢాంధకారము. అందుకే **ఈశావాస్యోపనిషత్తు**లో

**అంధం తమః ప్రవిశంతి యేఽసంభూతి ముపాసతే ।**
**తతోభూయ ఇవతే తమోయ ఉసంభూత్యాగ్ం రతాః ॥**

ప్రకృతిని ఉపాసించేవారు అంధకారంలో పడిపోతారు. హిరణ్యగర్భుని ఉపాసించే వారు అంతకన్న గాడాంధకారంలో పడిపోతారు.

అంటే యజ్ఞయాగాదికర్మలు చేసేవారుకాని, సాకార బ్రహ్మోపాసన చేసేవారు గాని మరణానంతరము పుణ్యలోకాలకుపోతారు. అక్కడ స్వర్గసుఖాలనుభవించి తిరిగి భూలోకంలో జన్మిస్తారు. అంతేకాని వీరికి మోక్షంరాదు. ఈ రకంగా దక్షిణాయనంలో పయనించే వారికి మోక్షం కలుగకుండా నివర్తింపచేస్తాడు. కాబట్టి శ్రీమన్నారాయణుడు 'అనివర్తీ' అనబడతాడు.

దేవదానవుల సంగ్రామమునుండి మరలనివాడు. పరమేశ్వరుడు ధర్మప్రియుడు, ధర్మరక్షకుడు, కాబట్టి ధర్మాన్ని వదలకుండా యుద్ధంచేస్తాడు. అందుచేత 'అనివర్తీ' అనబడతాడు.

## 597. నివృత్తాత్మా

నివృత్తి ధర్మనిష్ఠులయిన ఆత్మలు గలవాడు. 229వ నామం కూడా ఇదే.

**నివృత్తి ధర్మిణోయస్య హ్యాత్మానస్సంతి సస్మృతః ।**

**నివృత్తా త్మేత్యష్టవర్ణో దుష్కర్మ ఫలయోదకః ॥**

నివృత్తి ధర్మముగల ఆత్మలను తనవారిగా అర్చిరాది మార్గమున స్వీకరించువాడు. ఈ నామము అష్టాక్షరీ మంత్రము. పాపములను పరిహరిస్తుంది.

**నివృత్తాః ఆత్మానః యస్యసః నివృత్తాత్మా** నివృత్తి ధర్మంలో పయనించే ఆత్మలు గలవాడు. వీరందరినీ అర్చిరాది మార్గం ద్వారా బ్రహ్మలోకం చేర్చేవాడు.

మానవులు తామాచరించే కర్మ ననుసరించి వారు ప్రయాణించే మార్గాలు నిర్దేశించబడతాయి. మానవులు రెండు రకాల కర్మలనాచరిస్తారు.

1. ఉత్తరాయణమార్గము (శుభమార్గము) 2. దక్షిణాయణమార్గము (అశుభమార్గము)

**1. ఉత్తరాయణమార్గము :** దీనినే అర్చిరాది మార్గము దేవయానము అని కూడా అంటారు. సాధకులు ఏ కోరిక లేకుండా కేవలం పరలోక చింతనతో, చేసే కర్మను ఉత్తరాయణ మార్గము అంటారు. ఈ మార్గంలో పరబ్రహ్మతత్త్వానుభవం కలిగి కృతకృత్యు లయినవారు పరబ్రహ్మలో లీనమవుతారు. వీరు మోక్షసాధన కోసం వేదవిహితమైన కర్మలు కూడా (యజ్ఞయాగాదులు) చేస్తుంటారు.

**2. దక్షిణాయనమార్గము :** కేవలము ఐహికవాంఛలతో కొట్టుమిట్టాడుతూ, వాటికోసం కర్మలను ఆచరించటాన్ని దక్షిణాయనమార్గము అంటారు. ఈ మార్గంలో పయనించేవారు పితృలోకాలకు పోతారు. వీరు పరలోకంలో తమ కర్మఫలాలు అనుభవించి మళ్ళీ భూలోకంలో పుడతారు. ఈ రకంగా సంసార చక్రంలో పడి తిరుగుతూ ఉంటారు. దీన్ని ధూమ్రమార్గము పితృయానము అని కూడా అంటారు.

ఈ రెండు వర్గాలు తెలియనివారు క్రిమికీటకాలు, పక్షులు, పాములు, జెర్రులుగా పుడతారని **బృహదారణ్యకోపనిషత్తు**లో చెప్పబడింది.

**"అథమ ఏతౌ పంథానౌ నవిదు స్తే కీటాః పతంగా మదిదం దందసూకమ్"**

పరబ్రహ్మతత్త్వము తెలిసినసాధకుడు ఈ శరీరాన్ని వదలిన తరువాత పరబ్రహ్మలో లీనమవుతాడు అంతేకాని ఎక్కడికివెళ్ళడు. అంటే బ్రహ్మజ్ఞానియొక్క ప్రాణములు

ఉత్క్రమింపవు, ఉత్క్రమణ అంటే దేవయాన, పితృయానముల ద్వారా పైకిపోవటము. సాధకుడు పరలోకాలకు ప్రయాణమయ్యే సమయంలో అంటే అవసానదశలో, అతడి ఇంద్రియాలన్నీ జీవుడి దగ్గరకు చేరతాయి. అప్పుడు ఆ జీవియొక్క తత్తరపాటు, అవస్థలు, వర్ణనాతీతం అతనికి ఊపిరి సలపక సతమతమవుతాడు క్రమంగా కర్మేంద్రియాలు జ్ఞానేంద్రియాలు వశం తప్పుతాయి. కేవలం మనస్సు ఒక్కటే పనిచేస్తుంది. విషయం మాత్రం తెలుస్తుంది. కాని మాట్లాడలేడు. ఈ స్థితిలో ఇంద్రియాలన్నీ కూడతీసుకున్న మనసు ప్రాణముతో ఏకమవుతుంది. అంటే మనోవ్యాపారం కూడా అంతరిస్తుంది. అప్పుడు ఈ లోకంలో జరిగే విషయాలు అతనికి తెలియవు. క్రమంగా ప్రాణం జీవుడితో కలిసిపోతుంది. ప్రాణి ఎగఊపిరి దిగఊపిరితో కొట్టుకుంటాడు. సకలేంద్రియవ్యాపారము అంతరిస్తుంది. ఇప్పుడు అతడు చేసిన పాపపుణ్యాలు అతణ్ణి ఆవరిస్తాయి. ఈ రకంగా సకలేంద్రియాలను కూడగట్టుకున్న జీవుడు శబ్దస్పర్శాదులైన పంచతన్మాత్రలతో ఏకమయి పరలోకయాత్రకు బయలుదేరతాడు. జీవిబయలు దేరేవరకు దేహము వేడిగా ఉంటుంది. ఆ తరువాత దేహంచల్లబడుతుంది. బంధువులు ఆ దేహానికి అంత్యక్రియలు చేస్తారు. అంటే స్థూలదేహం నశిస్తుంది. సూక్ష్మదేహం పరలోకయాత్రకు బయలు దేరుతుంది.

లోకంలో కొంతమంది కర్మలను ఫలాపేక్షతో చేస్తే మరికొంతమంది నిష్కామకర్మలను చేస్తూ సగుణోపాసన కూడా చేస్తుంటారు. దేహాన్ని వదలి జీవుడు బయలు దేరటానికి ఈ రెండు రకాల వారికి తేడాలేదు. కర్మోపాసకులు ధూమ మార్గమున (దక్షిణాయనంలో) పోగా, రెండవారు అర్చిరాది మార్గములో పోతారు. ఈ రెండు రకాలవారు కూడా మొదటగా హృదయాన్ని చేరుకుంటారు. అక్కడనుండి వీరి ప్రయాణం మొదలవుతుంది. శరీరంలో ఉన్న 72 వేల నాడీమండలమే వీరి ప్రయాణానికి సిద్ధంగా ఉన్న వాహనాలు. జీవుడు వారివారి కర్మలననుసరించి దేహముయొక్క కళ్ళు, ముక్కు, నోరు మొదలైన అవయవాల నుంచి బయటకు వస్తాడు. కాని జ్ఞానులకు బ్రహ్మరంధ్రం ద్వారా బయటకు వస్తాడు.

**అర్థాగృహే నివర్తంతే శ్మశానే మిత్రబాంధవాః ।**
**సుకృతందుష్కృతంచైవ గచ్ఛంతమను గచ్ఛతి ॥**

మానవుడు సంపాదించిన ఆస్తిపాస్తులు అతని వెంటరావు. అతడు సంపాదించిన ఇల్లు, వాకిలి, సంపద అన్నీ అక్కడే ఉండిపోతాయి. ఇతని మరణానంతరము వారసులు ఆస్తులకోసం పోట్లాడుకుంటారు. ఇంత కష్టపడి ఆస్తులు సంపాదించినా మరణించేటప్పుడు నక్షత్రం మంచిదికాదనో, ఇతర కారణాలచేతనో అతణ్ణి వాకిట్లోనే చాపవేసి పడుకోబెడతారు. కాబట్టి సంపాదించిన ఆస్తిపాస్తులు ఇక్కడివరకే పరిమితమైపోతాయి. ఇక ఇతడంటే

ఇష్టపడే బంధువులు, మిత్రులు శ్మశనాందాకా వెళ్ళి అతణ్ణి సాగనంపుతారు. మహా అయితే అతడికి దహన సంస్కారాలు పూర్తయ్యేదాకా అక్కడ ఉంటారు. చివరకు అతనితో పాటుగా వెళ్ళేది అతడు చేసిన పాపపుణ్యాలే. అతడు మంచి పనులు చేస్తే, అతను మరణించిన తరువాత కూడా అతడు చేసిన పనిని పదిమంది మెచ్చుకుంటారు. ఎంతకాలమైతే అతడి మంచి పనులను జనం కొనియాడుతుంటారో, అంతకాలం అతడు స్వర్గసుఖాలు అనుభవిస్తాడు. అతను మంచివాడని, మహానుభావుడని పదిమంది మెప్పునుపొందటమే స్వర్గసుఖం. అతడు చేసిన పనులవల్ల బాధపడినవారు అతడు పోయిన తరువాత ఆనందిస్తారు. అదే అతడికి నరకం. అందుచేతనే మరణించిన తరువాత అతడితో వచ్చేవి అతడు చేసిన కర్మ ఫలితాలేకాని వేరుకావు.

మరణించబోయేముందు, ఆఖరిదశలో అతడు చేసిన పాపపుణ్యాలు అతడికి గుర్తుకువస్తాయి. అతడి మరు జన్మ ఏమిటి అనే విషయాన్ని అతడు తెలసుకోగలుగుతాడు. పాపకర్ముడు ఇంత కన్నహీనమైన జన్మరాబోతున్నదని తెలిసి విలపిస్తాడు. జీవి ఈ శరీరం విడిచిపోవటానికి ఇష్టపడడు. చివరకు శరీరం నుంచి జీవి గెంటివేయబడతాడు. ఈ కారణంచేతనే పాపకర్ముల మరణాలు సాధారణంగా నీచంగా ఉంటాయి. పుణ్యచరితులకు అనాయాస మరణం లభిస్తుంది.

ఈ రకంగా బయలు దేరిన జీవికి తనమరుజన్మ ఏమిటన్న విషయం తెలుస్తుంది. కర్మలనాచరించిన వారు వాటి ఫలితాలైన పాపపుణ్యాలనుభవించిన తరువాత మళ్ళీ ఈ లోకంలో పుడతారు. నిష్కామకర్మచేసిన జ్ఞాని సుషుమ్నా నాడి ద్వారా బ్రహ్మరంధ్రం చేరి అక్కడ నుండి సూర్యమండలానికి పోతాడు. ఇక్కడ రాత్రి పగలు అనే భేదం లేదు. ఉత్తరాయణము అంటే సూర్యుడు మకరరాసిలో ప్రవేసించిన నాటినుంచీ (జనవరి 14) కర్కాటకరాశిలో ప్రవేసించేవరకు (జులై 17) అని అర్థము కాదు. ఈ మధ్యకాంలో మరణించిన వారు మాత్రమే పుణ్యలోకాలకు పోతారనేది నిజంకాదు. గతంలో చెప్పిన దేవయానాన్నే ఉత్తరాయణమంటారు. జ్ఞాని అయినవాడు దక్షిణాయనంలో మరణించినా సూర్యమండలం చేరతాడు. బ్రహ్మలోకానికి తలవాకిలి సూర్యమండలం. ఉపాసనాపరులు చేరుకోదగిన స్థానము బ్రహ్మలోకము ఆ మార్గమే అర్చిరాది మార్గము. అర్చిరాది అంటే 'అగ్ని' అని అర్థము.

బ్రహ్మలోకానికి పోయే మార్గము అతి కాంతివంతమైన బింబముచే కప్పబడి ఉంటుంది. ఆకాంతిని మనం చూడలేము. అప్పుడు సాధకుడు, ఆ కాంతి బింబాన్ని తొలగించి, బ్రహ్మలోకానికి దారి చూపమని సూర్యభగవానుణ్ణి ప్రార్థిస్తాడు.

**హిరణ్మయేనపాత్రేణ సత్యస్యాపిహితం ముఖమ్ ।**

**తత్త్వం పూషన్న పావృణు సత్య ధర్మాయ దృష్టయే ॥**

**పూషన్నే కర్షే యమ సూర్యప్రాజాపత్య వ్యూహ రశ్మీన్ సమూహ ।**

**తేజోయతేత్ రూపం కల్యాణతమం**

**తత్తే పశ్యామి యోఽసావసౌ పురుషఃసో హమస్మి ॥**

ఓ సూర్యభగవానుడా జ్యోతిర్మయమగుపాత్రముచేత బ్రహ్మలోకముఖద్వారము కప్పబడి ఉన్నది. ఓదేవా సత్యమైనధర్మాన్ని ఆచరించే నాకోసం ఆ మార్గాన్ని తెరవవలసినది.

ఓ సూర్యభగవానుడా ! నీ కిరణాలను తొలగించి కాంతిని ఉపసంహరించు. నీ అనుగ్రహంచేత మంగళకరమైన నీ రూపాన్ని చూడగలుగుతాను.

**వాయురనిల మమృత మథేదం భస్మాంతం శరీరమ్ ।**

**ఓం క్రతోస్మర కృతంస్మర క్రతోస్మర కృతంస్మర ॥**

నా ప్రాణవాయువు, సర్వవ్యాప్తము శాశ్వతము అయిన ప్రాణమందు లీనమగుగాక, ఈ శరీరము బూడిద అగును గాక. ఓ మనసా పూర్వకర్మలను గుర్తు తెచ్చుకో. మరణించ బోయే మానవుడి ఆలోచన ప్రధానంగా ఉత్తర జన్మల మీద ఉంటుంది. అందుకనే తన జీవితంలో చేసిన కర్మలను అంటే పాపపుణ్యాలను గుర్తు తెచ్చుకోమని మనస్సును హెచ్చరిస్తున్నాడు.

మానవుడు ఎన్ని దుష్కృత్యాలు చేసినా చివరకు సుఖంగా ఉండాలనీ, స్వర్గసౌఖ్యాలను భవించాలనీ కోరతాడు. అందుకనే సత్కర్మల నాచరించిన మానవుడు, తనను మంచి మార్గం ద్వారా తీసుకుపొమ్మని అగ్నిదేవుణ్ణి ప్రార్థిస్తాడు.

**అగ్నేనయ సుపథారాయే అస్మాన్ విశ్వాని దేవవయునాని విద్వాన్ ।**

**యు యోధ్యస్మజ్జుహురాణమేనః భూయిష్ఠాంతే తమ ఉక్తింవిధేమ ॥**

ఓ అగ్నిదేవా ! నేను చేసిన కర్మలన్నీ నీకు తెలుసు. నాలోని పాపాలను నిర్మూలించు. నేను చేసిన కర్మఫలితాలనుభవించటానికి నన్ను మంచి మార్గం గుండా తీసుకుని పోవలసినది. ఇక్కడ సూర్యభగవానుడు అంటే ఆ పరమేశ్వరుడే అని గుర్తించాలి.

సాధకుని ప్రార్థన ఆలకించి సూర్యుడు బ్రహ్మలోకానికి అడ్డుగా ఉన్న కాంతి బింబాన్ని తొలగిస్తాడు. ఈ మార్గంలో మొదటగా ఉండేది అగ్నిలోకము. అర్చితము అంటే అగ్ని. అందుకే దీన్ని అర్చిరాది మార్గము అగ్నిమార్గము అనికూడా అంటారు. ఇది శుభప్రదమైన మార్గము. ఈ మార్గంలో మొదటగా అగ్నిలోకము అహిర్లోకము (పగటిదేవత) శుక్లపక్ష

దేవత, ఉత్తరాయణదేవత, మాసదేవత, సంవత్సరదేవత, దేవలోకము, యమలోకము, ఆదిత్యలోకము, చంద్రలోకము, విద్యుల్లోకము, వరుణ లోకము ఇంద్రలోకము, ప్రజాపతి లోకము ఉంటాయి. చివరకు బ్రహ్మలోకముంటుంది.

జీవుడికి అవయవములు ఆధీనంలో ఉండవు. అతను ఒకచోటనుండి మరొకచోటికి కదలలేడు అని ముందే చెప్పబడింది. ఇప్పుడు ఆ జీవుడు ఒక లోకం నుంచి ఇంకొక లోకానికి స్వయంగా పోలేడు కాబట్టి ఆయాలోకాలలో ఆయాదేవతలు, మహాపురుషులు అతడి గమనానికి సాయపడతారు. బ్రహ్మ మానసపుత్రుడు జీవిని విద్యుల్లోకంనుంచి బ్రహ్మలోకానికి తీసుకుని పోతాడు. ఈ మార్గంలో వరుణ, ఇంద్ర, ప్రజాపతులంతా జీవి ప్రయాణానికి అనుమతిస్తారు. అంతేకాని అడ్డగించరు. ఈరకంగా జీవుడు బ్రహ్మలోకం చేరతాడు.

సాధకుడు చేసిన కర్మలవల్ల వచ్చేస్వర్గము శాశ్వతం కాదు సాధకుడు స్వర్గంలో పుణ్యఫలమును అనుభవించిన తరువాత మళ్ళీ భూలోకంలో పుడతాడు. కాని బ్రహ్మలోకం చేరినవారు తిరిగిరారు. కల్పాంతంలో పరబ్రహ్మలో లీనమైపోతారు. అందుకనే బ్రహ్మలోకము చేరే మార్గము ఉత్తమమైనది. అదే అర్చరాది మార్గము అని చెప్పబడింది.

ఈ రకంగా అర్చిరాది మార్గంద్వారా నివృత్తాత్మలను తన దగ్గరకు చేర్చుకుంటాడు. కాబట్టే శ్రీమన్నారాయణుడు 'నివృత్తాత్మా' అనబడుతున్నాడు.

## 598. సంక్షేప్తా

సంకోచింపచేయువాడు.

**స్వాభావికా సంకచితా మేధాయశ్చ ప్రకాశనమ్**
**నివృత్తి ధర్మాణాం కర్తుం శీలం యస్యాస్తి సర్వదా**
**స సంక్షేప్తేతి కథితః షడర్ణోధీవికాసుదః ॥**

నివృత్తి ధర్మములో ఉండే వారి జ్ఞానము దినదినాభివృద్ధి చెందుతూ ఉంటుంది. అటువంటి వారిజ్ఞానమును సర్వదా ప్రకాశింపచేయువాడు. ఈ నామము షడక్షరి బుద్ధివికాసము.

**సంక్షిపతీతి సంక్షేప్తా** ప్రవృత్తి ధర్మములో ఉన్నవారి జ్ఞానము వికసించకుండా సంకోచింపచేయువాడు. ప్రవృత్తి మార్గంలోని వారికి అంటే ఐహికవాదులకు జ్ఞానంతో పనిలేదు. వారికి కావలసినది కామ్యసిద్ధి. వారి కోరికలు తీరటము. అటువంటి వారికి జ్ఞానములేకుండా చేసేవాడు. సంహారసమయంలో జగత్తును సంక్షేపించువాడు.

# 599. క్షేమకృత్

క్షేమము కలిగించువాడు.

**అసంకోచజ్ఞానరూప క్షేమస్యకరణాత్వతామ్ క్షేమకృచ్చాపి సర్వేషాం**

నివృత్తి ధర్మంలో ఉండే వారికి జ్ఞానాన్ని పెంపొందించి మోక్షమిచ్చేవాడు.

**క్షేమం కరోతీతి క్షేమకృత్** నివృత్తి ధర్మంలోనివారికి క్షేమము అంటే మోక్షము కలిగించువాడు. మోక్ష మార్గంలో చరించే విరాగులను, సన్మార్గంలో పయనింపచేసి క్షేమంగా వారిని పరమపదము చేర్చువాడు.

# 600. శివః

మంగళకరుడు. 27వ నామము కూడా ఇదే.

**శివస్యకరుణాచ్ఛివః** మంగళకరుడు. శుభమును కలుగచేయువాడు. భోగమోక్షము లందు అపేక్షగలవారికి శుభము కలిగించువాడు. తన నామము ఉచ్చరించినంత మాత్రంచేతనే వారిని పవిత్రులుగా చేయువాడు. భోగము కావలసిన వారికి భోగము, మోక్షము కావలసినవారికి మోక్షము. ఎవరికి ఏది కావాలంటే అది ఇచ్చేవాడు. అందరికీ శుభాన్నిచ్చేవాడు. కాబట్టే శ్రీమన్నారాయణుడు 'శివః' అనబడుతున్నాడు.

అంటూ 'పరమపదము' అనే ప్రకరణాన్ని పూర్తిచేశాడు రత్నాకరుడు.



# 41. లక్ష్మీపతిత్వము

"గురువుగారూ! విష్ణుమూర్తి లక్ష్మీపతి కదా ! అతను శ్రీధరుడు, శ్రీకరుడు, శ్రీపతి అని చెప్పబడతాడు. కాబట్టి అతనియొక్క 'లక్ష్మీపతిత్వాన్ని' వివరించండి అని అడిగాడు కృష్ణశర్మ. వివరించటం ప్రారంభించాడు రత్నాకరుడు.

దేవదానవులు అమృతాన్ని ఆశించి క్షీరసాగరమథనం చెయ్యటం మొదలుపెట్టారు. అందులోనుంచి మొదటగా హాలాహలము పుట్టింది. దాన్ని శివుడు మ్రింగివేశాడు.

| | | |
|---|---|---|
| కామధేనువు పుట్టింది | - | బ్రహ్మాదులు తీసుకుపోయారు |
| ఉచ్చైశ్రవము పుట్టింది | - | బలిచక్రవర్తి తీసుకుపోయాడు |
| ఐరావతము పుట్టింది | - | ఇంద్రుడు పట్టుకుపోయాడు |
| కౌస్తుభము పుట్టింది | - | విష్ణువు తీసుకున్నాడు |
| పారిజాతము, కల్పవృక్షము పుట్టినాయి | - | దేవేంద్రుడు |
| వాటిని నందనవనానికి తరలించాడు. | | |
| అప్సరసలు పుట్టారు | - | స్వర్గలోకానికి పోయారు. |

ఆ తరువాత లక్ష్మీదేవి ఉద్భవించింది. ఆమె సౌందర్యము, ఒయ్యారము చూసి దేవదానవులు అవాక్కయినారు. దేవేంద్రుడు ఆమెకు ఆసనము సమర్పించాడు. పుణ్యనదులు ఆమెను సేవించినాయి. ఫలాలను అర్పించినాయి. గోవులు పంచగవ్యములు తెచ్చినాయి. ఋషులు ఆమెను అభిషేకించారు. గంధర్వులు పాడారు. అప్సరసలు ఆడారు. దిగ్గజాలు పూర్ణకలశాలతో స్నానం చేయించినాయి. సముద్రుడు వస్త్రాలనిచ్చాడు. వరుణుడు వైజయంతీమాలను సమర్పించాడు. విశ్వకర్మ ఆభరణాలనిచ్చాడు. సరస్వతి ముత్యాలహారాల నిచ్చింది. బ్రహ్మపద్మాన్నిచ్చాడు.

అప్పుడు లక్ష్మీదేవి లేచి తామరపూలమాలను తీసుకుని, సర్వగుణసంపన్నుడైన వాని మెడలో ఆ మాలను వేసి తన భర్తగా వరించాలని బయలుదేరింది.

ఆమె కదలివెడుతున్న బంగారు తీగలా ఉన్నది. ఉత్తమగుణాలు గలవాడు. ఏ దోషములేనివాడు. తనకు భర్తకావాలని కోరుకుంది.

| | | |
|---|---|---|
| గంధర్వులను చూసింది | - | తనకు వరుడుకాదగినవాడులేడు. |
| సిద్ధులను చూసింది | - | కోరినవాడు లేడు |
| చారుణులను చూసింది | - | చాలినవాడు లేడు |
| దేవతలను చూసింది | - | నచ్చినవాడు లేడు |

అక్కడ అనేకమంది మహానుభావులున్నారు. వారిలో

తపశ్శాలులున్నారు – వారు క్రోధాన్ని జయించలేరు
జ్ఞానులున్నారు – వారు ఆసక్తిని వదలలేదు
మహామహులున్నారు – వారు కామాన్ని జయించలేదు.
ఐశ్వర్యవంతులున్నారు – వారు పరాశ్రయులు
ధర్మపరులున్నారు – వారికి ప్రాణముపై ప్రేమ
త్యాగధనులున్నారు – కేవలము త్యాగమువల్ల ముక్తిరాదు
వీరులున్నారు – వారు కాలానికి అధీనులు
విషయాసక్తి లేనివారున్నారు – వారు ఎప్పుడూ సమాధిలోనే ఉంటారు.
చిరంజీవులైన ఋషులున్నారు – వారికి శీలము లేదు.

వీరందరిలో ఆమెకు శ్రీ మహావిష్ణువే తగినవాడు అనిపించాడు. అతడి దగ్గర మంగళప్రదమైన అన్ని గుణాలు ఉన్నాయి. అతడు సర్వశుభగుణాలకు ఆశ్రయమైనవాడు. ఏ కోరిక లేనివాడు. లక్ష్మీదేవి అతన్నే భర్తగా వరించాలి అనుకుంది.

వరమాల శ్రీహరి మెడలో వేసింది. అతని వక్షస్థలమునందు నివసించాలనుకున్నది.

శ్రీహరి లక్ష్మీదేవిని భార్యగా స్వీకరించాడు. తన వక్షస్థలమునందు నివాసము కల్పించాడు. అందుచేతనే అతడు శ్రీవత్సమును వక్షస్థలమునందు గలవాడు. లక్ష్మీదేవికి నివాసస్థానమైనవాడు లక్ష్మీపతి. శ్రీమంతులలో శ్రేష్ఠుడు. లక్ష్మికి జీవనాధారమైనవాడు. లక్ష్మీదేవికి ఈశుడు, భర్త. శ్రీకి నివాస స్థలమైనవాడు. లక్ష్మికి నిధి, లక్ష్మీ సంబంధముచేతనే ప్రసిద్ధి పొందినవాడు. శ్రీని ధరించినవాడు. లక్ష్మీదేవిని తనకు అనుకూలముగా మలచు కొన్నవాడు. ఎల్లప్పుడూ లక్ష్మితో కూడి ఉండేవాడు. ముల్లోకాలకు ఆశ్రయమైనవాడు. జ్ఞాననేత్రములు గలవాడు. దివ్యసుందర విగ్రహుడు. అపరిమితమైన ఆనందము గలవాడు. చిదానందుడు. ఎప్పుడూ ఆనందంలోనే తేలియాడేవాడు. ఆనందమయవిగ్రహుడు. ఆనందాన్ని తన భక్తులకు పంచి ఇచ్చేవాడు. నిత్యసూరులైన తన భక్తులకు, పరిచారకులకు ప్రభువు. ఈ రకంగా 601 నుంచి 619 వరకు నామాలలో వివరించబడింది. ఇక నామాలను చూద్దాం.

## 601. శ్రీవత్సవక్షాః

శ్రీవత్సమును వక్షమున గలవాడు.

**లక్ష్మీవాల్లభ్య సౌభాగ్య చిహ్నం శ్రీవత్సనామకం**
**శ్రీవత్స వక్షా యస్యాస్తి వక్షసీతి స తు స్మృతః ॥**

లక్ష్మీపతి అనే సౌభాగ్యమును సూచించేటటువంటి శ్రీవత్సము అనే చిహ్నాన్ని వక్షస్థలమున గలవాడు.

**వత్సః వక్షసి యస్యసః శ్రీవత్సవక్షాః**

శ్రీవత్సము అనేది లక్ష్మీదేవి గుర్తుగా శ్రీమహావిష్ణువు హృదయస్థానమున ఉన్నటువంటి ఒక మచ్చ. తెల్లని వెంట్రుకల సుడి అని కూడా చెప్పబడుతోంది. ఇది మహాపురుష లక్షణము. అటువంటి శ్రీవత్సమును హృదయమున గలవాడు.

క్షీరసాగర మథనకాలంలో లక్ష్మీదేవి ఉద్భవించింది. ఆమె శ్రీహరిని వరించింది. అతని వక్షస్థలము తనకు ఉనికిపట్టు చేసుకోవాలనుకున్నది. హరి ఆమెను స్వీకరించాడు. తన వక్షస్థలమును ఆమెకు నివాసముగ చేసినాడు. దీనికి దేవతలంతా ఆమోదించారు. అందుచేతనే ఆమె విష్ణువక్షస్థలస్థిత అయింది. లక్ష్మీదేవి ఉండటంచేత శ్రీమహావిష్ణువు వక్షస్థలాన ఒక మచ్చ ఏర్పడింది. అదే శ్రీవత్సము. లక్ష్మీపతిత్వానికి గుర్తు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'శ్రీవత్సవక్షాః' అనబడుతున్నాడు.

## 602. శ్రీవాసః

లక్ష్మీదేవికి నివాసస్థానమైనవాడు.

**శ్రియోవిహారస్థానత్వాత్ శ్రీవాస ఇతి చోచ్యతే**

లక్ష్మీదేవి స్వేచ్ఛగా ఆనందంగా తిరగటానికి స్థానమైనవాడు.

**శ్రీః వసత్యస్మిన్ ఇతిశ్రీవాసః** శ్రీ మహాలక్ష్మీనిత్యము యథేచ్ఛగా విహరించటానికి కల్పవృక్షములతో కూడిన ఉద్యానవనములు గలవాడు. లక్ష్మికి నివాసమైనవాడు.

**అస్య వక్షసిశ్రీః అనపాయనీ వసతి** వక్షమునందు ఎప్పుడూ విడువనిదైన లక్ష్మిని గలవాడు.

ఒక్క క్షణం కూడా ఎడబాయకుండా లక్ష్మీదేవి శాశ్వతంగా శ్రీమహావిష్ణువు వక్ష స్థలమున నివసిస్తుంది. అందుచేతనే శ్రీమహావిష్ణువు సర్వైశ్వర్యములకు నిలయమైనవాడు. అతని వక్షస్థలము కల్పవృక్షములతో నిండి లక్ష్మీదేవి విహరించటానికి అనువుగా ఉంటుంది.

లక్ష్మి అనగా సంపద. ఇది భౌతికమైనదికాదు. ఆధ్యాత్మికసంపద. శ్రీవాసుడు అంటే – ఆధ్యాత్మిక సంపద బాగా కలవాడు.

శ్రీ మహా విష్ణువు షడ్గుణ ఐశ్వర్యసంపన్నుడు. ఐశ్వర్య ప్రదాయిని అయిన లక్ష్మీదేవిని హృదయమందు కలిగి కల్యాణనిధియై వెలుగుతున్నాడు.

లక్ష్మీదేవి విష్ణుమూర్తి హృదయస్థానంలో ఉన్నది. కాబట్టి లక్ష్మీదేవిని ప్రత్యేకంగా ప్రార్థించవలసిన అవసరంలేదు. విష్ణువును ప్రార్థిస్తే, అతనిలో కలసి ఉన్న శ్రీదేవిని కూడా ప్రార్థించినట్లే. అందుచేతనే జ్ఞానులయందు దైవీసంపద అంతర్లీనంగా ఉంటుంది అని చెప్పబడింది.

## 603. శ్రీపతిః

లక్ష్మీపతి.

**స్వయంశ్రియః పతిత్వేన వృత్తత్వాన్ శ్రీపతిస్స్మృతః**

లక్ష్మీదేవి చేత స్వయముగా వరించబడినవాడు.

**శ్రియః పతిః శ్రీపతిః** లక్ష్మీదేవి భర్తకాబట్టి శ్రీపతి అనబడుతున్నాడు.

**హ్రీశ్చతే లక్ష్మీశ్చపత్న్యౌ** శ్రీదేవి, భూదేవి నీ భార్యలు అంటోంది **పురుష సూక్తం.**

**అస్యేశ్యానా జగతో విష్ణుపత్నీ**

విష్ణుమూర్తి భార్య అయిన లక్ష్మీదేవి ఈ జగత్తుకు ఈశ్వరి.

**అమృతమథనే సర్వాన్ సురాసురాదీన్ విహాయ శ్రీః ఏవం వరయామాస ఇతి**

క్షీరసాగర మథనసమయంలో సురాసురులందరినీ వదలి, లక్ష్మీదేవి ఇతన్ని వరించింది.

క్షీరసాగరమథనం జరుగుతోంది. అందులోనుంచి కాలకూటము, కామదేనువు, ఉచ్చైశ్రవము, ఐరావతము, కౌస్తుభము, పారిజాతము, కల్పవృక్షము పుట్టినాయి. అప్సరసలు పుట్టారు. తరువాత లక్ష్మీదేవి పుట్టింది. ఆమె బహు సౌందర్యవతి. ఆమె పుట్టినప్పుడు అప్సరసలు ఆడారు. గంధర్వులు పాడారు. మహర్షులు ఆమెను పరిపరివిధాల స్తోత్రం చేశారు. ఆమె లేచి తామరపూలు మాలను తీసుకుని దానిని సర్వగుణ సంపన్నుడైన వాని మెడలో వెయ్యటానికి బయలుదేరింది.

గంధర్వులను చూసింది. తగినవాడు దొరకలేదు. సిద్ధులను చూసింది. కోరినవాడు లభించలేదు. దేవతలను, చారుణులను చూసింది. నచ్చినవాడు లేడు. వీరిలో తపోవంతులున్నారు. కానివారు క్రోధాన్ని జయించలేదు. జ్ఞానులున్నారు. కానివారు ఆసక్తిని వదలలేదు. మహామహిమోపేతులున్నారు. కాని వారికి కామము పోలేదు. త్యాగధనులున్నారు. కేవలము త్యాగమువల్లనే ముక్తిరాదు. వీరాధి వీరులున్నారు. కాని వారు కాలానికి బద్ధులు. విషయాసక్తిలేని మహానుభావులున్నారు. కాని వారు ఎప్పుడూ సమాధిలోనే ఉంటారు.

ప్రతివారిలోనూ ఏదో ఒక మచ్చ కనిపిస్తోంది. సర్వగుణ సంపన్నుడైనవాడు ఒక్క శ్రీహరిమాత్రమే. అతడు సర్వశుభ లక్షణ సమన్వితుడు. అతడికి ప్రాకృతగుణాలు లేవు. ఏ అపేక్షలూ లేవు. సర్వజ్ఞుడు. సర్వజనాశ్రయుడు. అందుకని అతనిని భర్తగా వరించింది శ్రీమహాలక్ష్మి. అందుచేతనే శ్రీమహావిష్ణువు 'శ్రీపతిః' అనబడుతున్నాడు.

## 604. శ్రీమతాంవరః

శ్రీమంతులలో శ్రేష్ఠుడు.

**దేవానాం శ్రీమతాం శ్రేష్ఠః శ్రీమతాంవర ఉచ్యతే ॥**

లక్ష్మీదేవియొక్క కటాక్షవీక్షణాలతో శ్రేష్ఠులైన దేవతలలో శ్రేష్ఠుడైనవాడు.

సంపన్నులందరిలోకీ శ్రేష్ఠుడు. లక్ష్మీదేవిని సర్వకాల సర్వావస్థలయందు చూసి ఆనందించేవాడు. తనను ఉపాసించిన వారిని ఎప్పుడో ఒకప్పుడు ఏదో ఒక సమయంలో లక్ష్మీదేవి కరుణిస్తుంది. అప్పుడు వారికి ధనధాన్యాలు, రాజ్యము, అధికారము వస్తాయి. అప్పుడు అతడు 'శ్రీమాన్' అని పిలువబడతాడు. ఆరకంగా ఉన్న సంపన్నులందరిలోను శ్రేష్ఠుడు. ఇంద్రాది దేవతలలో శ్రేష్ఠుడు. విష్ణుపురాణంలో

**శుక్ల మాల్యాంబరధరాస్నాతా భూషణ భూషితా**
**పశ్యతాం సర్వదేవానాం య యౌ వక్షస్థలేహరే ॥**
**తయోఽ వలోకితాః దేవాః హరి వక్షస్థల స్థయా**

స్నానముచేసి తెల్లనివస్త్రములు మాలలు ధరించినదై, ఆభరణములచే అలంకరించబడి లక్ష్మీదేవి విష్ణుమూర్తి వక్షస్థలాన కూర్చున్నది అని చెప్పబడింది. అక్కడ కూర్చుని ఆమె దేవతలకు వరాలిస్తున్నది. అందుచేత శ్రీమహావిష్ణువు 'శ్రీమతాంవరః' అనబడుతున్నాడు.

శ్రీని కలవారు శ్రీమతంతులు 'ఆమె కలవారు కలవారు. ఆమె లేనివారు లేనివారు' బ్రహ్మాది దేవతలందరూ శ్రీమంతులే. వారందరిలోకీ శ్రేష్ఠుడు శ్రీమహావిష్ణువు.

త్రయీ విద్యయే నిజమైన సిరి. అటువంటి సిరి గలిగినవారు శ్రీమంతులు. అటువంటి జ్ఞానస్వరూపులైన బ్రహ్మాది దేవతలలో శ్రేష్ఠుడు.

## 605. శ్రీదః

లక్ష్మికి జీవనాధారమైనవాడు.

**యోఽసాశ్రియై స్వపణయ రసద శ్రీద ఈరితః**

లక్ష్మీదేవికి ప్రణయరసమును ప్రసాదించువాడు.

**శ్రియం దదాతీతిశ్రీదః** నిత్యము, నిర్హేతుకము అయిన ప్రేమరస సంపదను లక్ష్మీదేవికి ఇచ్చేవాడు. అంటే శ్రీమహాలక్ష్మికి జీవనాధారమైనవాడు.

లక్ష్మీదేవి శ్రీమహావిష్ణువును విడిచి ఉండలేదు. అందుచేతనే ఎల్లప్పుడూ అతని వక్షమునందే ఉంటుంది.

**శ్రియందదాతి శ్రీదః** భక్తులకు శ్రీని అనగా సిరిసంపదలను ఇచ్చువాడు. శ్రీ మహావిష్ణువు భక్తులకు ఏది కావాలంటే అది ఇస్తాడు. వారి లౌకికభోగాలకోసం సిరిసంపదలు భోగభాగ్యాలు అడిగితే వాటిని ఇస్తాడు. ఈ రకంగా భక్తులకు సిరిసంపదలను ఇచ్చేవాడు. కాబట్టి శ్రీదః అనబడుతున్నాడు.

## 606. శ్రీశః

లక్ష్మికి ఈశుడు, భర్త.

**శ్రీశస్స్యాచ్ఛ్రియ ఈశత్వా దీశాశ్రీరస్య నామతః**

లక్ష్మీదేవికి ప్రభువు. లక్ష్మీదేవిని ప్రభ్విణిగా గలవాడు.

**శ్రియః ఈశః శ్రీశః**

లక్ష్మీదేవికి లక్ష్మీత్వము కలగటానికి కారణము ఇతడే. అందుచేతనే లక్ష్మికి ఈశుడు.

**శ్రీః ఈశాయస్యసః శ్రీశః** సర్వావస్థలయందు లక్ష్మీదేవిని నియామకురాలిగా గలవాడు.

**ఆదావాత్మ గుణత్వేన భోగ్యరూపేణ విగ్రహే**
**ఆధారకస్వరూపేణ దాసీభావేనవా సదా ॥**

ఆదిలో ఆత్మగుణముగాను, విగ్రహమున భోగ్యరూపముగాను, ఆధారస్వరూపంగాను, దాసీభావముతోను ఉంటుంది.

శ్రీదేవికి నాధుడు. భక్తులలో దైవీసంపదను శ్రీదేవి పెంపొందిస్తుంది. ఆమెకు నాధుడైన విష్ణుమూర్తి ఆ భక్తులకు అమృతత్వాన్ని ఇస్తాడు. అందుకే కల్యాణగుణములు కలిగినచోట లక్ష్మీదేవి ఉంటుంది. లక్ష్మి ఉన్నచోట శ్రీమహావిష్ణువు ఉంటాడు.

## 607. శ్రీనివాసః

శ్రీకి నివాసస్థలమైనవాడు. 183వ నామము కూడా ఇదే.

**నిత్యోపఘ్న నివాసత్వాత్ శ్రీనివాస శ్ర్శియస్స్మృతః**

లక్ష్మికి నివాసమై ఎప్పుడూ ప్రాపుగా ఉండేవాడు.

**శ్రీ యోనివాసః శ్రీనివాసః** కల్పకతీగె కల్పవృక్షాన్ని ఆధారంగా చేసుకుని ఉంటుంది. అలాగే తాను లక్ష్మికి ఆధారంగా ఉండేవాడు.

శ్రీనివాసుడు – శ్రీ యందు అంటే శ్రీమంతులయందు నిత్యము నివసించువాడు.

శ్రీమంతులు అంటే ధనవంతులుకాదు. జ్ఞానవంతులు అని అర్థం. 'సుజనులందు తరచు సొచ్చియుందు' అంటాడు. వామనావతార ఘట్టంలో ఇక్కడ జనులు అంటే జ్ఞానవైరాగ్యములు గలవారు.

శ్రీహరి ఉన్నచోట శ్రీ కూడా ఉంటుంది. వారిద్దరూ ఉన్న ప్రదేశమే వైకుంఠము.

## 608. శ్రీనిధిః

లక్ష్మికి నిధి.

**శ్రీరస్మి న్నిహితానిత్యం శ్రీనిధిః పరికీర్తితః** లక్ష్మి తనయందు ఎల్లప్పుడు ఉంచబడి ఉండువాడు.

**శ్రీః నిధీయతే అస్మిన్నితి శ్రీనిధిః** పెట్టెలో పెట్టబడిన రత్నాలమాలలాగా లక్ష్మీదేవి ఇతని యందు ఉంటుంది. పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు సర్వశక్తిమయుడు. ఇతని యందే సర్వసంపదలు ఉన్నాయి. పరమపదములో పురుషుడు ఉన్నాడు. అతని ప్రక్కనే శంఖ, పద్మనిధులు ఉన్నాయి. అవి ఎంతకీ తరగనివి. అందుకే శ్రీమన్నారాయణుడు 'శ్రీనిధిః' అనబడతాయి.

## 609. శ్రీ విభావనః

లక్ష్మిసంబంధముచేతనే ప్రసిద్ధి పొందినవాడు.

**యస్యప్రఖ్యోప్రాఖ్యహేతుః శ్రీస్యాత్ స శ్రీవిభావనః** లక్ష్మి సంబంధముచేతనే ప్రసిద్ధిపొందినవాడు.

**యస్యప్రఖ్యో ప్రాఖ్యహేతుః శ్రీస్యాత్ సశ్రీవిభావనః** లక్ష్మి సంబంధముచే ప్రఖ్యాతి నొందినవాడు.

**శ్రియా విభావ్యతే ఇతి శ్రీవిభావనః** లక్ష్మీదేవి సంబంధము ఉన్నది. కాబట్టే ప్రసిద్ధి పొందాడు. అన్ని జీవులకు వాటివాటి కర్మఫలానికి తగినట్లుగా శ్రీని కలుగచేయువాడు. సిరులను పంచువాడు. కాబట్టే శ్రీమన్నారాయణుడు శ్రీవిభావనః' అనబడుతున్నాడు.

## 610. శ్రీధరః

శ్రీని ధరించువాడు.

**రుచ్యర్చిః కౌముదీగంధాన్ సుధారత్నేందు పుష్పవత్**

**శ్రియం ధరతి నిత్యం యః శ్రీధర స్స తు కీర్తితః ॥**

అమృతమునకు మాధుర్యము సహజము.

రత్నాలకు కాంతి సహజము. చంద్రునికి వెన్నెల సహజము. పూలకు సువాసన సహజము. అలాగే శ్రీమహావిష్ణువు లక్ష్మీదేవిని ధరించి ఉన్నాడు.

**శ్రియంధరతీతి శ్రీధరః** లక్ష్మిని సహజముగానే ధరించినవాడు.

సర్వభూతజనని అయిన లక్ష్మిని వక్షమున ధరించినవాడు.

## 611. శ్రీకరః

లక్ష్మిని తనకు తగినట్లుగా మలచుకొనెడివాడు.

**పరవ్యూహావతారేషు స్వానురూపాం కరోతి తామ్**

**శ్రియం యోఽసౌశ్రీకరస్స్యాత్ మున్యర్ణః శ్రీకరో మనుః**

పర, వ్యూహ అవతారాలలో లక్ష్మిని తనకు తగినట్లుగా చేసికొనెదువాడు. ఈ నామము సప్తాక్షరీమంత్రము లక్ష్మీప్రదము.

**శ్రియం కరోతీతి శ్రీకరః** ఏ అవతారంలోనైనా సరే లక్ష్మిని తనకు తగినట్లుగా చేసుకొనెడివాడు. అది దైవావతారము అయినా సరే, మానవావతారమైనా సరే.

| | | | | | |
|---|---|---|---|---|---|
| నారాయణుడు | – | లక్ష్మి | కృష్ణుడు | – | రుక్మిణి |
| రాముడు | – | సీత | నృసింహుడు | – | లక్ష్మి |

విష్ణువు దేవతారూపము ధరించినప్పుడు దేవతగాను, మానవరూపం ధరించినప్పుడు మానవరూపంతోను, అతనికి తగిన శరీరము ధరించి, అతని వెన్నంటే ఉంటుంది.

**శ్రియంకరోతి శ్రీకరః**

తనను స్మరించే వారికి, స్తుతించే వారికి, అర్చించేవారికి ఈరకంగా భక్తులందరికీ శ్రీనికలుగచేయువాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'శ్రీకరః' అనబడుతున్నాడు.

## 612. శ్రేయః

ఎన్నడూ దూరముకాని సుఖాన్నిచ్చేవాడు. శాశ్వతమైన సుఖాన్నిచ్చేవాడు. నిత్యానందమైన శ్రేయస్సు తానే అయినవాడు, నిత్యానందము అంటే పరమానందము. బ్రహ్మానందము. అది శాశ్వతమైన ఆనందము. అటువంటి బ్రహ్మానందాన్నిచ్చేవాడు.

## 613. శ్రీమాన్

22, 178, 220 నామాలు కూడా ఇవే.

వివిధ రకాలయిన శ్రీలు ఇతడికి ఉన్నాయి. సర్వవిధాలైన ఐశ్వర్యములు గలవాడు. అవి సౌందర్యము, శక్తి, తేజస్సు, ధనము ఈ రకంగా సకల వైభవములు గలవాడు. ముల్లోకాలకు ఆశ్రయమైనవాడు.

శంకరులవారు ఈ రెండు నామాలను విడివిడిగా చెప్పగా, పరాశరభట్టరువారు రెండింటినీ కలిపి ఒకే నామంగా చెప్పారు.

**శ్రేయశ్శ్రీమాన్ :** లక్ష్మితో ఎల్లప్పుడూ కూడి ఉండువాడు.

**శ్రేయసే శ్రయణీయా శ్రీః శ్రేయశ్శ్రీర్నిత్యయోగినీ**
**శ్రేయశ్శ్రీ మా నసావస్య వస్వర్ణః పురుషార్థదః**

సకల పురుషార్థముల కొరకు ఆశ్రయించబడు లక్ష్మితో ఎల్లప్పుడూ కూడి ఉండేవాడు. ఈ నామము అష్టాక్షరీ. సకల పురుషార్థాలను ఇస్తుంది.

**శ్రేయసే శ్రీయతే ఇతి శ్రేయశ్శ్రీః సానిత్యమస్తీతి శ్రేయశ్శ్రీమాన్**

పురుషార్థాలు సిద్ధించటానికి శ్రీమహావిష్ణువు లక్ష్మీదేవితో ఎల్లప్పుడూ కూడి ఉంటాడు. అందుకే శ్రీమన్నారాయణుడు 'శ్రేయశ్శ్రీమాన్' అనబడుతున్నాడు.

## 614. లోకత్రయాఽఽశ్రయః

ముల్లోకాలకు ఆశ్రయమైనవాడు.

**శ్రియా సహ జగన్మాత్రా పితృవత్స కలాశ్రయః**
**లోకత్రయాశ్రయస్స్యాత్ దశార్ణో రక్షక త్వదః**

జగన్మాత అయిన లక్ష్మితో కలసి ఉండి తండ్రిలాగా ఎల్లప్పుడు లోకాలకు ఆశ్రయమైన వాడు. ఈ నామము దశాక్షరీమంత్రము. రక్షణ కలుగచేస్తుంది.

**లోకత్రయస్య ఆశ్రయః లోకత్రయాశ్రయః**

ముల్లోకాలకు ఆశ్రయముగా ఉండేవాడు. లక్ష్మీదేవితో కూడి ముల్లోకాలను సర్వదా రక్షించేవాడు.

లోకాలకు ఏ రకమైన ఉపద్రవము వచ్చినా రక్షించేవాడు శ్రీమహావిష్ణువే.

సోమకాసురుడు వేదాలను ఎత్తుకుపోతే – మత్స్యావతారమెత్తాడు
హిరణ్యాక్షుడు భూమిని సముద్రంలో పారేస్తే – వరాహమైనాడు
మందగిరి సముద్రంలో మునిగిపోతే – ఆది కూర్మమైనాడు
హిరణ్యకశ్యపుని సంహరించటానికి – నారసింహుడైనాడు

ఈ రకంగా లోకంలో ఎప్పుడు ధర్మం నశించినా, లోకాలకు ఎప్పుడు ఆపద వచ్చినా శ్రీహరి ఏదో ఒకరూపంలో ఈ లోకాలను రక్షిస్తూనే ఉన్నాడు. అందుచేత ముల్లోకాలకు ఆశ్రయమైనవాడు అతడే.

## 615. స్వక్షః

మంచి నేత్రములు గలవాడు.

**శ్రీ సౌందర్య సుధాసింధు రపార కరణోహి యః స్వక్షః**

లక్ష్మీదేవి యొక్క సౌందర్యము అనే అమృతసముద్రాన్ని తనవితీరా అనుభవించటానికి మంచి నేత్రములు గలవాడు.

**శోభనం అక్షి యస్యసః స్వక్షః**

సుందరమైన, అనుభవించటానికి తగిన నేత్రములు గలవాడు.

సుందరమైన పద్మములవలె ప్రకాశించు కనులు గలవాడు.

పద్మము జ్ఞానానికి గుర్తు. పద్మముల వంటి కనులు గలవాడు. అంటే జ్ఞానదృష్టి గలవాడు. అదే శుభదృష్టి. అటువంటివే మంచి కనులు. ఆ రకమైన మంచి కనులు గలవాడు. కాబట్టే శ్రీమన్నారాయణుడు 'స్వక్షః' అనబడుతున్నాడు.

## 616. స్వంగః

మంచి అంగములు గలవాడు.

**శ్రియస్స్పృహణీయ దివ్యాంగ స్వంగ ఉచ్యతే ॥**

లక్ష్మీదేవి కూడా కోరగల సుందర శరీరము గలవాడు.

**సుశోభనం అంగం యస్యసః స్వగః**

అందమైన, ఆకర్షణీయమైన అంగములు గలవాడు.

**శోభాని అంగాని అస్య** సుందరమైన అంగములు ఇతనికి ఉన్నాయి. అంగములు అంటే శరీరము అని అర్థం. అందుకే ఇతడు సుందరశరీరుడు. సౌందర్యవంతుడు. ముగ్ధమోహనాకారుడు. అతని ప్రతి అంగము 'ఆనందచిన్మయ సముజ్వలము' అని చెప్పబడుతోంది. అందుచేత శ్రీమన్నారాయణుడు 'స్వంగః' అనబడుతున్నాడు.

## 617. శతానందః

అపరిమితమైన ఆనందము గలవాడు.

**అన్యోన్య ప్రణయానంద సింధో సముదితో హి యః**
**శతానంద స్సవిజ్ఞేయః దంపత్యానందో మనుః**

లక్ష్మీనారాయణులకు ఒకరిపై ఒకరికి అనురాగము ఎక్కువ. ఆ రకమైన అనురాగ సాగరంలో వారిరువురూ ఓలలాడతారు. ఈ నామము అష్టాక్షరీమంత్రము. దంపతులకు ఆనందమునిస్తుంది.

**శతం అపరిమితః ఆనందః యస్యసః శతానందః**

ఈ దంపతులిద్దరూ పరస్పరము అపరిమితమైన ఆనందము గలవారు.

పరమేశ్వరుడు పరమానందస్వరూపుడు. అతని ఆనందముయొక్క అంశతోనే జగత్తులోని జీవులన్నీ జీవిస్తున్నాయి. ఈ ఆనందము అనంతమైనది. శాశ్వతమైనది. పరమేశ్వరుడు పొందే ఆనందాన్ని తైత్తిరీయోపనిషత్తులోని ఆనందవల్లిలో వివరించారు. దాన్ని గతంలో చెప్పటం జరిగింది. ఆ రకమైన బ్రహ్మానందములో తేలియాడేవాడు. శరీరములో ఉన్న అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశాలనడుమ ఆనందమయ కోశమున్నది. అందులోనే పరమాత్మ ఉన్నాడు. అతడు చిదానందరూపుడు.

| | | |
|---|---|---|
| అన్నమయకోశము | – | స్థూలదేహము |
| ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశాలు | – | సూక్ష్మదేహము |
| ఆనందమయకోశము | – | కారణదేహము |
| కారణదేహము | – | సూక్షదేహంలో ఉంటుంది. |
| సూక్ష్మదేహము | – | స్థూలదేహంలో ఉంటుంది. |

కాబట్టి ఆనందమయుడైన పరమేశ్వరుడు ఈ స్థూలదేహంలోనే ఉన్నాడు. అనిర్వచనీయమైన ఆనందాన్ని తానుపొందుతూ, తత్పరులైన భక్తులకు కూడా ఈ ఆనందాన్ని పంచుతాడు. అందుకే శ్రీమన్నారాయణుడు 'శతానందః' అనబడుతున్నాడు.

**లలితాసహస్రంలో** 252వ నామం 'పరమానందా'

## 618. నందిః

సమృద్ధుడు.

**నంది సర్వత్ర నిత్యం సః శ్రియా బుధ్యతి సర్వదా**

అంతగా, అన్నివేళలా లక్ష్మిచే సమృద్ధుడుగా ఉండేవాడు.

**నందితి సమృద్ధ్యతీతి నందిః**

అన్నివేళలయందు, అన్నిచోట్లా లక్ష్మితో కలసి సమృద్ధిగా ఉండేవాడు.

నందిః అనగా ఆనందము అని అర్థం.

పరమాత్మ ఆనందమయ విగ్రహుడు. ఆనందస్వరూపుడు. తనను ఆశ్రయించిన భక్తులకు ఆనందము పంచిపెడతాడు. ఆనందస్వరూపుడు కాబట్టి జ్ఞానస్వరూపుడు. అతని కాంతులచేతనే చంద్రసూర్యాగ్నులు లోకాలను ప్రవర్తిల్ల చేస్తున్నారు. అందుకే శ్రీమన్నారాయణుడు 'నందిః' అనబడుతున్నాడు.

## 619. జ్యోతిర్గణేశ్వరః

నిత్యసూరులకు ఈశ్వరుడు. జ్యోతిర్గణాలకు ఈశ్వరుడు.

**నిత్యసూరి గణానాం యః ఈశోజ్యోతిర్గణేశ్వరః** జ్యోతిర్గణము అంటే అనంతుడు, గరుడుడు మొదలైన పరమభక్తులు. వీరందరికీ ప్రభువు.

**జ్యోతిర్గణస్య ఈశ్వరః జ్యోతిర్గణేశ్వరః**

జ్యోతిర్గణము అంటే పరిచారికాగణము. వారికి ఈశుడు ప్రభువు.

**జ్యోతిషాగణానాం ఈశ్వరః**

సూర్యుడు మొదలైన జ్యోతిర్గణాలకు అధిపతి. పరమాత్మస్వయంప్రకాశి. ఆ పరమేశ్వరుని ఆశ్రయంగా చేసుకొనే మిగిలిన గ్రహాలన్నీ కాంతులను ప్రసరింపచేస్తున్నాయి. చంద్రసూర్యాగ్నులు అతని సహాయంవల్లనే ప్రకాశిస్తున్నారు. వారివల్లనే ఈ జగత్తు అంతా

ప్రవర్తిల్లుతున్నది. కాబట్టి ఈ రకమైన గణాలన్నింటికీ శ్రీమన్నారాయణుడే ప్రభువు. **భగవద్గీత**లోని 15వ అధ్యాయం **'పురుషోత్తమ ప్రాప్తియోగం'**లోని 12వ శ్లోకము.

**యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఖిలమ్**
**యచ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్**

సమస్త జగత్తును ప్రకాశింపచేసే సూర్యుని తేజస్సు, చంద్రుని తేజస్సు, అగ్ని తేజస్సు కూడా నా తేజస్సే అని తెలుసుకోవలసినది.

**బృహదారణ్యకోపనిషత్తు**లో చెప్పినట్లుగా లోకాలన్నీ పగటిపూట సూర్యుని వెలుగులతోను, రాత్రిపూట చంద్రుని వెలుగులతోను, సంధ్యవేళలయందు అగ్నియొక్క వెలుగులతోను ప్రవర్తిల్లుతున్నాయి. చంద్రసూర్యాగ్నుల తేజస్సు ఆ పరమేశ్వరుని నుండే వచ్చింది. అందుచేతనే అతడు 'జ్యోతిర్గణేశ్వరః' అనబడుతున్నాడు.

అంటూ "లక్ష్మీపతిత్వాన్ని" వివరించాడు రత్నాకరుడు.



# 42. విశుద్ధాత్మ

"గురువుగారూ ! పరమేశ్వరస్వరూపుడైన శ్రీమన్నారాయణుడు చాలా గొప్పవాడు. అనేక అవతారాలెత్తి దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేశాడు. తన భక్తులకు అంటే తత్పరులకు సాయుజ్యం ప్రసాదించాడు. అయితే ఈ లోకంలో ఉన్న వారందరికీ ఆయనను దర్శించే అవకాశం లేదుకదా ! మరి వారి సంగతేమిటి ? అతని సౌశీల్యానికి పరమావధి ఏది ? ఈ విషయాన్ని వివరించండి" అన్నాడు నారాయణభట్టు. చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

పరమేశ్వరుడు చాలా గొప్పవాడు. లోకంలోని జీవులన్నింటినీ తన బిడ్డలలాగానే చూసుకుంటాడు. ఎవరి మీదా అతడికి పక్షపాతం ఉండదు. అధికమైన ప్రేమ ఉండదు. ఎవరి మీదా కోపముగాని, విరోధముగాని ఉండవు. అందరి యెడ సమభావంతోనే ఉంటాడు. ఎంతటి దుర్మార్గుడైనా సరే తన తప్పుతాను తెలుసుకుంటే క్షమిస్తాడు. అంతటి గొప్ప మనసుగలవాడు. అందుచేతనే ఎటువంటివాడైనా సరే తనను గనక ఆశ్రయించినట్లైతే అతడికి తేలికగా వశమవుతాడు. భక్తులకు చాలా విధేయుడై ఉంటాడు. ఇటువంటి సద్గుణసంపన్నుడు. భగవంతుడు తమను రక్షిస్తాడా ? లేదా ? అనే సందేహాలను తీరుస్తాడు. అతడికి అసలు సందేహాలు అనేవి ఉండవు. మహాజ్ఞాని త్రికాలములు తెలిసినవాడు. ఆయన దివ్యసుందర విగ్రహం చూడాలంటే ఏదో కొద్దిమంది మహానుభావులకు మాత్రమే సాధ్యమవుతుంది. అయితే సామాన్యులు కూడా చూసేందుకు వీలుగా రాముడు కృష్ణుడు మొదలైన అవతారాలెత్తి అందరినీ అలరింపచేస్తాడు. అందరి దృష్టినీ ఆకర్షించినవాడు. విభిన్నావతారాలెత్తి సామాన్యుల దృష్టిని కూడా ఆకర్షిస్తాడు. తన యొక్క ఉనికి నడవడి కూడా భక్తుల అధీనంలోనే గలవాడు. భక్తులు చెయ్యమన్నట్లుగా చేస్తాడు. భక్తులు తనని సేవించి తరించటానికి వివిధరకాల రూపాలలో స్థిరంగా ఉంటాడు. అంతేకాదు భక్తులు ఎక్కడ ఉండమని ప్రార్థిస్తే అక్కడ వారికి అందుబాటులో ఉంటాడు. అందరియందు సాధారణమైన స్వభావంతో ఒకేవిధంగా ప్రవర్తిస్తాడు. తనను కోరే భక్తులకు తానే సకలైశ్వర్యము అయినవాడు. అతడు శోకము లేనివాడు. భక్తుల శోకము పోగొట్టేవాడు. భక్తులకు తన వియోగము వల్ల దుఃఖము లేకుండా చేసేవాడు, మహాతేజస్వరూపుడు. భక్తులు తనను అర్చించటానికి వీలుగా అర్చావతారము గలవాడు. దేవాలయాలు, గృహాలు, క్షేత్రములయందు వివిధరూపాలతో ఉండి భక్తులచేత సర్వకాల సర్వావస్థలయందు సేవించ బడుతుంటాడు. తనను ఆశ్రయించినవారికి తన సర్వస్వాన్ని అర్పిస్తాడు. క్షేత్రములయందు మరణించిన భక్తులకు పరమపదము అనుగ్రహిస్తాడు.

ఈ విషయాలన్నీ 620 నుంచి 637 వరకు నామాలలో వివరించబడ్డాయి. ఇక నామాలను చూద్దాం.

## 620. విజితాऽऽత్మా

భక్తులచేత జయింపబడిన మనస్సు కలవాడు.

**సౌశీల్యస్యగుణస్యాథ పరమావధి వర్ణనమ్**
**మానసం ప్రణతైర్యస్య విజాతాత్మా జితశ్చసః**

తన భక్తులకు వశమైన మనస్సు కలవాడు.

**విజితః ఆత్మా యస్యసః విజితాత్మా**

తననాశ్రయించిన భక్తులకు వశమైనవాడు. పరమేశ్వరుడు భక్తసులభుడు. తన భక్తులకు తేలికగా వశమవుతాడు. వారి పాపాలను హరిస్తాడు.

**హరియను రెండక్షరములు**
**హరియించును పాతకముల అంబుజనాభా**

కేవలము అతన్ని తలచినంత మాత్రంచేతనే పాతకములన్నీ అగ్నిలో పోసిన సమిధలవలె కాలిబూడిద అయిపోతాయి.

జయించిన ఆత్మ గలవాడు. కాబట్టి 'విజితాత్మా' అనబడుతున్నాడు. సంకల్ప వికల్పాలకు కారణమైనది మనస్సు. బంధాలకు, రాగద్వేషాలకు కారణమైనది మనస్సే. అటువంటి మనసును జయించి, రాగద్వేషాలు లేనివాడై ఆత్మానందాన్ని అనుభవించేవాడు.

భక్తులతో జయింపబడినవాడు. అతడు భక్తులహృదయంలో సదా బందీగా ఉంటాడు. వారి అవసరాలు తీరుస్తాడు. యోగక్షేమాలు సంరక్షిస్తాడు. సర్వదా వారిని కరుణిస్తాడు. వారికి విధేయుడుగా ఉంటాడు. అందుచేత శ్రీమన్నారాయణుడు 'విజితాత్మా' అని పిలువబడుతున్నాడు.

## 621. అవిధేయాऽऽత్మా

భక్తులకు విధేయమైన మనస్సు గలవాడు.

**ఇహాగచ్ఛేహ తిష్ఠేదం భుజ్క్ష్వేతి ప్రణతైస్సదా**
**యోగ్యం విధాతుం యద్రూపం విధేయాత్మా స కీర్తితః ॥**

తన భక్తులచేత ఆజ్ఞలు జారీ చేయబడకుండా తానే వారికి విధేయుడై ఉండేవాడు.

**విధేయః ఆత్మా యస్యసః విదేయాత్మా** భక్తులకు విధేయుడై ఉన్నప్పుడు వారు రమ్మని, కూర్చోమని, తినమని నియమించేటట్లుగా ఉండేవాడు. పరాశరభట్టరువారు ఈ నామాన్ని 'విధేయాత్మా' తన భక్తులకు విధేయుడుగా ఉంటాడు. అని చెబితే, శంకరభగవత్పాదులవారు 'అవిధేయాత్మా' అన్నారు.

విధి అంటే – ఇది ఇలాగున్నది. ఈ రకంగా చెయ్యండి అని చెప్పటము. ఇలా చెప్పటాన్నే విధానము అంటారు. పరమేశ్వరుడు ఈ విధివిధానానికి యోగ్యుడుకాడు. అందుచేతనే 'అవిధేయాత్మా' అనబడుతున్నాడు. విదేయము కాని ఆత్మ గలవాడు. పరమేశ్వరుని స్వరూపం ఇలాంటిది అని చెప్పటం కష్టం. అతను 'నువ్వు ఇది చెయ్యి. ఇది చెయ్యవద్దు అని ఎవరిచేత ఆజ్ఞాపించబడడు. అందుకే శ్రీమన్నారాయణుడు 'అవిధేయాత్మా' అనబడుతున్నాడు.

# 622. సత్కీర్తిః

మంచి కీర్తి గలవాడు.

**ఈదృక్సౌశీల్య సత్త్వాద్ధి సత్కీర్తి రితి కథ్యతే ॥**

ఆ రకంగా భక్తులకు విధేయుడుగా ఉండటము అనే మంచి గుణంవల్ల కీర్తించబడుతుండేవాడు.

**సతీకీర్తియస్యసః సత్కీర్తిః** ఈ రకంగా మంచి గుణములు ఉండి మంచి కీర్తిగలవాడు.

**యధా సర్వేశ్వరః కృష్ణః ప్రోచ్యతే సర్వపండితైః**
**తథాపి స్వల్పమేవోక్తం భూతార్ధే కతమాస్తుతిః ॥**

శ్రీకృష్ణుడు సర్వేశ్వరుడు అని పండితులంటారు. ఆయనను గురించి వారు చెప్పేది చాలా తక్కువ. ఆయనను గురించి చెప్పాలంటే అసలు స్తోత్రమెంత ? అంటే కృష్ణుని గుణగణాలతో బహు కొద్ది మాత్రమే ఈ స్తోత్రాల్లో చెప్పారు. చెప్పనిది ఇంకా చాలా ఉన్నది. ఆయన కీర్తి ప్రతిష్ఠలు అనంతములు.

సత్యమైన కీర్తిని మాత్రమే కలిగి ఉన్నాడు. అసత్యమైన కీర్తి ఏ మాత్రము లేనివాడు. అనగా ఆయనను గురించి చెప్పేదంతా సత్యమే. వేదాలద్వారా తెలియబడిన భగవానుని కీర్తి నిత్యమైనది. ఆయనను గురించి వేదాలలో చెప్పినదంతా నిజమే. కాబట్టి జగత్తులో అతని గురించి ఇంతవరకు ఉన్న స్తుతులు, ప్రశంసలు అన్నీ యదార్థాలే. అందుకే శ్రీమన్నారాయణుడు 'సత్కీర్తిః' అనబడుచున్నాడు.

భగవద్గీతలోని 10వ అధ్యాయం **'విభూతియోగం'**లోని 15వ శ్లోకం.

**స్వయమేవాత్మనాఽఽత్మానం వేత్థ త్వం పురుషోత్తమ**
**భూతభావనః భూతేశః దేవదేవః జగత్పతే ॥**

జగదుత్పత్తి కారకా ! సర్వేశ్వరా ! దేవదేవా ! ఓ పురుషోత్తమా ! నీ తత్త్వాన్ని నువ్వే ఎరుగుదువు. భగవానుడు సమస్త జగత్తుకు ఆద్యుడు. ఆయన యొక్క గుణము, ప్రభావము, మహాత్మ్యము ఇవన్నీ అపరిమితములు. అందుచేతనే ఆయన తత్త్వాన్ని ఎవరూ తెలుసుకోలేరు. ఆయన తత్త్వము ఆయనకే తెలుసును. పరమేశ్వరుడు జ్ఞానస్వరూపుడు. కాబట్టి తనను తానే తెలుసుకుంటాడు. ఇతరులు గ్రహించటానికి సాధ్యంకానివాడు.

## 623. ఛిన్న సంశయః

సందేహాలు తీర్చేవాడు.

**సౌశీల్య ప్రథమాచైవం దుష్కరత్వాది సంశయః**
**ఛిన్నో యేన విశేషేణ న ప్రోక్త ఛిన్న సంశయః**

విధేయత, మంచి కీర్తి మొదలైన మంచి లక్షణాలుండటంచేత, ఇతనిని అర్చించినట్లైతే ఇతడు మనకు లభిస్తాడా ? లభించడా ? అనే సంశయాలను తీరుస్తాడు.

**ఛిన్నః సంశయః యేనసః ఛిన్నసంశయః** భక్తులయొక్క సందేహాలను తొలగించేవాడు.

పరమేశ్వరుడు సౌశీల్యగుణయుక్తుడు. అతన్ని పొందగలమా ? లేదా ? పరమేశ్వరుని ఉపాసన చెయ్యవచ్చునా ? ఆయన మనకు సాధ్యపడతాడా ? అనేటటువంటి అనేకరకాలయిన సందేహాలు జనులకు వస్తాయి. ఇటువంటి సందేహాలన్నింటినీ నివృత్తి చేస్తాడు. అవి ఏవిధంగా నివృత్తి అవుతాయి ? ఈ రకంగా తనను అర్చించిన వారికి సాయుజ్యం ప్రసాదించినట్లైతే, వారిని ఉదాహరణగా తీసుకుని, వారు సాన్నిధ్యం చేరారు. శబరికి మోక్షము వచ్చింది. అంబరీషుని దుర్వాసుని క్రోధాగ్ని నుండి రక్షించాడు. కాబట్టి ఆయన ఆశ్రితవత్సలుడు. ఆయనను నమ్మిన వారికి తప్పనిసరిగా ఆయన లభిస్తాడు. అనేటటువంటి నమ్మకాన్ని కలుగచేస్తాడు. అజామీలుడు వంటి వాడికి మోక్షమిచ్చాడు. కాబట్టి ఆయనను ఆరాధించిన ప్రతివాడికీ కోరిక తీరుతుంది అనే నమ్మకాన్ని కలిగిస్తాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'ఛిన్నసంశయః' అని పిలువబడుతున్నాడు.

**ఛిన్నాసంశయాః యస్యః** సంశయములు లేనటువంటివాడు.

అజ్ఞాని అయినవాడికి సంశయాలుంటాయి. ఆత్మతత్త్వము తెలియనివాడికి సంశయాలుంటాయి. కాని పరమేశ్వరుడు మహాజ్ఞాని. అతనికి అన్ని విషయాలు తెలుసు. ఏ విషయాన్నైనా సాక్షాత్కరింప చేసుకోగలడు. అందుచేతనే కురుక్షేత్ర సంగ్రామంలో అర్జునుడు యుద్ధం చేయను అంటే భగవానుడు గీతోపదేశం చేసి జరిగినవి, జరగబోయేవి అన్నీ వివరించాడు. అంటే అతడు త్రికాలజ్ఞుడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'ఛిన్నసంశయః' అనబడుతున్నాడు.

ఈ రకంగా పరాశరభట్టరులవారు సంశయములు తీర్చేవాడు అని చెప్పగా, శంకరులవారు ఈ నామానికి పరమేశ్వరుడు అసలు సంశయము లేనివాడు అని చెప్పారు.

**లలితాసహస్రం**లో 173వ నామము 'సంశయఘ్నీ'

## 624. ఉదీర్ణః

ప్రకాశించువాడు.

**ప్రత్యక్ష విషయత్వేన హ్యుత్పన్నశ్చర్మ చక్షుషాం**
**ఉదీర్ణ ఇతి స ప్రోక్తః సప్తార్ణోనయనప్రదః**

ప్రాకృతమైన సామాన్య కనులు గలవారికి కూడా ప్రత్యక్షముగా చూసేటట్లుగా అవతరించినవాడు. ఈ మంత్రం సప్తాక్షరీ మంత్రము. మంచి దృష్టిని ప్రసాదిస్తుంది.

సామాన్య మానవులకు ఉండేది చర్మచక్షువులు. వాటితో ఈ లోకాన్ని మాత్రమే చూడగలము. అంటే పాంచభౌతికమైన దేహంలో, పంచభూతాలలోని తేజస్సు ఆధారంగా కనులు పనిచేస్తాయి. కాబట్టి ఆ కనుల వలన పంచభూతములతో నిర్మించబడిన వస్తువులను, జీవులను మాత్రమే చూడగలము.

పరమేశ్వరుడు పంచభూతాలకు అతీతమైనవాడు. కాబట్టి పంచభూతాలచేత గాని, వాటిచేత నిర్మితమైన ఇంద్రియాలచేతగాని చూడబడడు. అటువంటి పరమేశ్వరుని చూడాలంటే దివ్యనేత్రాలు కావాలి. అలాంటప్పుడు సామాన్య మానవుడు ఆయన దర్శనం ఏరకంగా చేసుకో గలగుతాడు? అనేది ప్రశ్న. అలా సామాన్యులు దర్శించేందుకు వీలుగానే రాముడు, కృష్ణుడు మొదలైన అవతారాలెత్తి జనం మధ్యలో తిరిగాడు శ్రీకృష్ణుడుగా జన్మించి గోపబాలలతో కలిసి ఆటలాడాడు. పాటలు పాడాడు. గోవులుకాశాడు. చద్ది తిన్నాడు. ఈ రకంగా సంసారులు కూడా ప్రత్యక్షంగా చూడటానికి వీలుగా అవతారాలు ఎత్తినవాడు.

సర్వజీవులకన్న ఉత్కృష్టమైనవాడు. అతడు ఆత్మస్వరూపుడు. కాబట్టి దృశ్యమానమైన ఈ జగత్తుకన్నా అతీతుడు. నాశనము లేనివాడు. జీవరాసికన్న అధికుడు. జ్ఞానస్వరూపుడు

కావటంచేత దేశకాలమానాలకు పరిమితుడుకాదు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'ఉదీర్ణః' అనబడుతున్నాడు.

## 625. సర్వతశ్చక్షుః

అందరి కనులు తనమీదనే గలవాడు.

**తత్సాక్షాత్కారకర్మాణి సర్వచక్షూం ష్యపిస్వతః**
**అత స్స్యాత్ సర్వతచ్చక్షుః సవార్ణో నేత్రశక్తిదః ॥**

అందరి నేత్రములు తనయందే గలవాడు. ఇలా ఉండటంచేత సంశయానికి అవకాశం లేనివాడవుతున్నాడు. ఈ నామము పది అక్షరాలు గల మంత్రము నుంచి దృష్టిని, కంటికి శక్తిని ప్రసాదిస్తుంది.

**సర్వతః చక్షూంషి యస్యసః సర్వతః చక్షుః** సామాన్య మానవుడైన రాముడు, కృష్ణుడుగా అవతరించి అందరికీ కనిపించటంచేత అందరి కనులు తనయందే గలవాడు.

శ్రీమన్నారాయణుడు దివ్యమంగళ విగ్రహుడు. అతి లోక సౌందర్యము గలవాడు. శుభాంగుడు. పరమపావనుడు. కాబట్టి అతన్ని దర్శించినట్లైతేనే పాపాలన్నీ తొలగిపోతాయి. అందుచేత జనులందరూ స్త్రీ, బాల, వృద్ధులు అందరూ అతని దర్శనానికి ఎదురు చూసేవారు. అందుకే అతడు విభిన్న రూపాలు ధరించి లోకుల మధ్యన తిరిగాడు. శ్రీరామచంద్రుని కనులారా వీక్షించటానికి శబరి కొన్ని సంవత్సరాలు ఎదురుచూసింది. ఇలాగే ప్రతివారూ కూడా. అందుచేతనే వీరందరి కనులూ ఆ మహనీయుని యందే ఉంటాయి. అందుచేతనే అతడు 'సర్వతశ్చక్షుః' అనబడుతున్నాడు.

పరమేశ్వరుడు తన రూపమే అయిన చైతన్యముతో సకలమును చూచుచున్నాడు.

**శ్వేతాశ్వరోపనిషత్తు**లో ఆత్మరూపుడయిన పరబ్రహ్మ భూమిని, ఆకాశాన్ని కూడా సృష్టి చేస్తున్నాడు. అంతటా నేత్రములు గలిగి ఉన్నాడు. అంతటా ముఖములు గలిగి ఉన్నాడు. అంతటా బాహువులు గలిగి ఉన్నాడు. అంతటా పాదములు గలిగి ఉన్నాడు. బాహువులతో మనుష్యులను దగ్గరకు చేర్చుతున్నాడు. రెక్కలతో పక్షులను చేర్చుతున్నాడు" అని చెప్పబడింది. కాబట్టి ఆ పరమేశ్వరుడు సర్వత్ర చక్షువులు కలవాడు. అతడు చైతన్యరూపి. కాబట్టి సర్వత్రా వ్యాపించి ఉంటాడు. అన్నింటినీ చూడగలుగుతాడు.

**భగవద్గీత**లోని 13వ అధ్యాయం **'క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగము'**లోని 14వ శ్లోకం.

**సర్వతః పాణిపాదం తత్ సర్వతోఽక్షి శిరోముఖమ్**

**సర్వతశ్శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి ॥**

ఆ పరమాత్ముని చేతులు, కాళ్ళు, నేత్రాలు, చెవులు, శిరస్సులు, ముఖములు సర్వత్ర స్థితములై ఉన్నాయి. అతడు సర్వాన్ని ఆవరించి ఉన్నాడు.

పరమేశ్వరుడికి సర్వవ్యాపకత్వమున్నది. అతని కనులు (చూపులు) సర్వత్రా వ్యాపించి ఉన్నాయి. అంటే అతడు చూడని చోటులేదు. ఆయన దగ్గర ఏమీ దాచటానికి వీలులేదు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు సర్వతశ్చక్షుః అని చెప్పబడుతున్నాడు.

## 626. అనీశః

పరతంత్రుడు.

**ప్రోక్తో హ్యనీశోయశ్చాసౌ తదాయత్తాఖిలక్రియః** తనయొక్క ఉనికి, నడవడి అన్నీ కూడా భక్తుల అధీనంలోనే కలవాడు. కాబట్టి ఇతడు పరతంత్రుడు.

**న ఈశః అనీశః** స్వతంత్రుడు కానివాడు. అతని స్నానము, పానము, అలంకారము ఒకటేమిటి? అన్నీ భక్తులయొక్క అధీనంలోనే ఉంటాయి. కాబట్టి అతడు పరతంత్రుడు. అందుకే 'అనీశః' అనబడతాడు.

ఈ నామానికి పరాశరభట్టరువారు పరతంత్రుడు అని అర్థం చెబితే శంకర భగవత్పాదులవారు సర్వస్వతంత్రుడు అని అర్థం చెబుతున్నాడు.

**న విద్యతే ఈశః అస్యః**

ఇతని మీద అధికారము చూపగలవారు ఎవరూ లేరు. అందరికన్నా ఇతడే అధికుడు.

**బృహదారణ్యకోపనిషత్తు**లో సృష్టి ఆరంభంలో పరమేశ్వరుడొక్కడే ఉన్నాడు. అతనితో సమానమైన వారుకాని, అతని కన్న అధికులు కాని ఎవరూ లేరు. అని చెప్పబడింది. **ఐతరేయోపనిషత్తు**లో సృష్టి జరగటానికి ముందు ఈ జగత్తంతా బ్రహ్మమయంగానే ఉండేది. దానికి భిన్నమైన పదార్థం ఏమీలేదు అని చెప్పబడింది. **నారాయణోపనిషత్తు**లో "నారాయణుడు నిత్యుడు. బ్రహ్మదేవుడు నారాయణుడే. శివుడు నారాయణుడే, ఇంద్రుడు, భూమి, ఆకాశము, కాలము, దిక్కులు, ఊర్ధ్వభాగము, అధోభాగము, మధ్యభాగము, బాహ్యాంతరములు, అంతా నారాయణుడే. ఈ సమస్తమూ నారాయణుడే. త్రికాలములు నారాయణుడే. అతడు నిష్కళంకుడు, నిరంజనుడు, నిర్వికల్పుడు, శుద్ధుడు, అద్వితీయుడు. ఆ నారాయణుడు తప్ప వేరెవరూలేరు." అని చెప్పబడింది. అందుచేతనే అందరికన్నా

ఉన్నతుడు, దేవాదిదేవుడు ఆ పరమేశ్వరుడు. అతడు అద్వితీయుడు. అతని కన్న అధికులు లేరు. ఆకారణంచేతనే శ్రీమన్నారాయణుడు 'అనీశః' అనబడుతున్నాడు.

# 627. శాశ్వత స్థిరః

ఎప్పుడూ స్థిరంగా ఉండేవాడు.

**బింబాకృత్యాత్మనా బింబే స్థితస్స్యాత్ శాశ్వతస్థిరః** సర్వదా సేవించి తరించటానికి వీలుగా అనేక ప్రతిమలను తనకు శరీరముగా ధరించినవాడై స్థిరముగా ఉన్నవాడు.

**శాశ్వతశ్చాసౌ స్థిరశ్చ శాశ్వతస్థిరః** తను ఆశ్రయించినవారు తనను సేవించి తరించటానికి వీలుగా అనేక మూర్తులుగా అయి శాశ్వతముగా ఉండేవాడు.

భక్తులు పరమేశ్వరుని అనేక రూపాలలో అర్చిస్తారు. భక్తుల కోరికలు అనేక రకాలుగా ఉంటాయి. అందుచేతనే వారి కోరికలననుసరించి, వారి అభిమతాన్ననుసరించి భగవంతుని అర్చిస్తారు. వీరిలో లౌకికమైన కోర్కెల సాధనకోసం అర్చించేవారు కొందరైతే, కైవల్యం కావాలని అర్చించేవారు మరికొందరు లౌకికవాదులు భగవంతుని అనేక రూపాలలో ఆరాధిస్తారు. కొందరు రాముడుగా, కొందరు కృష్ణుడుగా, కొందరు నారసింహుడుగా ఇలా రకరకాలుగా ఆరాధిస్తారు. అయితే ఇంకొంతమంది ఆ పరమేశ్వరుని బ్రహ్మగా, రుద్రుడుగా, ఇంద్రుడిగా, సరస్వతిగా, శక్తిగా ఆరాధిస్తారు. ఇవన్నీ పరమేశ్వరుని రూపాలే. భక్తుల కోరికలను ఆ పరమేశ్వరుడు వారు ఆరాధించే దేవతల రూపంలోనే తీరుస్తాడు. రెండవరకంవారు మోక్షవాదులు. వీరు కేవలము పరమపదాన్ని మాత్రమే కోరతారు. ఈరకంగా ఇంతమంది ఇన్ని రకాలుగా పరమేశ్వరుని అర్చిస్తుంటే, అతడు అన్ని రూపాలలోను భక్తులకోరికలు తీరుస్తూ శాశ్వతంగా స్థిరంగా ఉంటాడు. అందుకే శ్రీమన్నారాయణుడు 'శాశ్వతస్థిరః' అనబడుతున్నాడు.

శ్రీమన్నారాయణుడు సత్యము నిత్యము అయినవాడు. త్రికాలములయందు ఉంటాడు. అంతటా, అన్ని కాలములందు ఉంటాడు. అందుకే 'శాశ్వతస్థిరః' అనబడుతున్నాడు.

# 628. భూశయః

దివ్యదేశములందు ఆవిర్భవించేవాడు.

**స్వయం వ్యక్తాది రూపేణ కౌశేతే భూశయశ్చ సః**

భక్తులు ఎక్కడ ఉండమని ప్రార్థిస్తే అక్కడ వారడిగిన రూపంతో ఆవిర్భవించేవాడు.

**భూషుశేతే ఇతి భూశయః** భక్తులు ఆ పరమేశ్వరుని తమకు అనువైన ప్రదేశాలలో ఉండవలసినదిగా ప్రార్థించగా, వారి కోరిక ప్రకారము, ఇంట్లోగాని, కొండలమీదగాని, దేవాలయంలో గాని ప్రతిష్ఠ చేయబడతాడు. లేదా స్వయంభువుగా వెలుస్తాడు. ఈ రకంగా వివిధ పుణ్యక్షేత్రాలయందు ఆవిర్భవించేవాడు.

చంద్రుని ప్రార్థనమీద పరమేశ్వరుడు ప్రభాసతీర్థంలో సోమనాధుడిగా ఆవిర్భవించాడు.

శ్రీరామచంద్రుని చేత రామేశ్వరంలో ప్రతిష్ఠించబడిందే రామేశ్వరలింగము.

హిమవంతుని కోరిక మేరకు పరమేశ్వరి అతని ఇంట హైమవతిగా జన్మించింది.

| | | |
|---|---|---|
| శ్రీరామచంద్రునిగా | – | భద్రాద్రిమీద |
| శ్రీ వేంకటేశ్వరునిగా | – | తిరుపతిలో |
| నరసింహస్వామిగా | – | అహోబిలంలో |
| రంగనాయకునిగా | – | శ్రీరంగములో |
| పాండురంగడుగా | – | పండరీపురములో |

అనేక పుణ్యక్షేత్రాలయందు వెలసి భక్తులకు దర్శనమిస్తున్నవాడు కాబట్టే శ్రీమన్నారాయణుడు 'భూశయః' అనబడుతున్నాడు.

## 629. భూషణః

శీలము గుణములతో తనను అలంకరించుకొనినవాడు.

**ఏవం విశ్వజనీనేన శీలేన చ శ్రియః పతిః**
**య ఆత్మానం విషయతి భూషణః పరికీర్తితః**

అందరియందు సాధారణమైన స్వభావంతో, అరమరికలులేకుండా ఒకే రీతిగా ప్రవర్తించటము అనే అసాధారణమైన భూషణము గలవాడు.

**భూషయతీతి భూషణః** శ్రియః పతి శీలము, గుణములచే తనను తాను అలంకరించుకొనినవాడు.

శ్రీమంతుడైన తాను దరిద్రుడైన కుచేలుడిచ్చిన అటుకులను ఆరగించటము అనేది శీలభూషణము. శ్రీరామచంద్రుడు శబరిని వెతుక్కుంటూ, ఆమె ఆశ్రమానికి వెళ్ళి, ఆమె ఇచ్చిన విందు ఆరగించటమనేది ఆయనకు శీలభూషణము.

**బహుభిః స్వేచ్ఛావతారైః భూమింభూషయతి** అనేక రకాలయిన స్వేచ్ఛావతారాలెత్తి ఈ భూమిని అలంకరించినవాడు.

మనకు తెలిసిన మత్స్య, కూర్మాది దశావతారాలేగాక పరమేశ్వరుడు అనేక అవతారలెత్తాడు. ఆకూతి గర్భాన సుయజ్ఞుడుగా, కర్దముడికి కపిలుడుగా, అత్రిమహర్షికి దత్తాత్రేయుడుగా, సనకసనందనాదులుగా, నరనారాయణులుగా, ధృవుడుగా, పృథువుగా ఇంకా ఇంకా అనేక అవతారాలు ఎత్తి భూమిని అలంకరించాడు. కాబట్టి శ్రీమన్నారాయణుడు 'భూషణః' అనబడుతున్నాడు.

## 630. భూతిః

భక్తులకు సంపదయైనవాడు.

**యోఽసౌసమృద్ధ మైశ్వర్యం భక్తానాం భూతి రీరితః**

భక్తులకు తానే సకలైశ్వర్యము అయినవాడు.

ఇతరమైన సహాయము లేనివారికి పుత్రమిత్రాది సకలైశ్వర్యము తానే అయినవాడు.

పరమేశ్వరుని అర్చించేవారికి సర్వమూ తానే అయినవాడు, భూతి అనగా – ఉనికి అని అర్థము.

పరమేశ్వరుడు నిత్యము సత్యము అయినవాడు. అనేక రకాలవిభూతులు గలవాడు.

**భగవద్గీత** పదవ అధ్యాయము **'విభూతియోగము'**లోని 19వ శ్లోకము.

**హంత తే కథయిష్యామి దివ్యా హ్యాత్మ విభూతయః**
**ప్రాధాన్యతః కురుశ్రేష్ఠః నాస్త్యంతో విస్తరస్య మే ॥**

అర్జునా ! నా దివ్యవిభూతుల విస్తృతికి అంతమే లేదు. వాటిలో ప్రదానమైన వాటిని నీకు వివరిస్తున్నాను. పరమేశ్వరుడు ఈ జగత్తంతా ఆవరించి ఉన్నాడు. అన్ని రూపాలు అతనివే. అందుచేతనే అతడు 'భూతిః' అనబడుతున్నాడు.

## 631. విశోకః

శోకము లేనివాడు, శోకము పోగొట్టువాడు.

**నాథత్వాచ్ఛాపి సర్వేషాం విశోకస్త్వేన ఈరితః**

సకల ప్రాణములకు అతడే నాథుడు. అందుకని వాటి విషయమై చింతలేదు.

**విగతః శోకః యస్యసః విశోకః**

ఏ ప్రాణినీ ఆ పరమేశ్వరుడు అనాథగా వదలడు. అందరికీ అతడే నాథుడు. అందుచేత ఎవరికీ ఏ రకమైన శోకములేకుండా చూస్తాడు.

జగత్తులోని ప్రాణికోటికంతటినీ రక్షించేవాడు పరమేశ్వరుడు. అది అతని బాధ్యత. ఇందులో ఎవరికీ సుఖాన్నికాని, దుఃఖాన్ని కాని ఇవ్వడు. ఎవరు చేసిన కర్మఫలితాన్ని వారు అనుభవిస్తారు. అంతే తప్పించి తమకు సంబంధించని వాటిని ఎవరూ అనుభవించరు. అటువంటి కర్మవల్లవచ్చే శోకాన్ని కూడా నాశనం చేసేవాడు పరమేశ్వరుడు.

పరమేశ్వరుడు సుఖదుఃఖాలకు అతీతుడు. అతడికి రాగద్వేషాలు లేవు. అందుచే కష్టసుఖాలుండవు. తన భక్తులకు కూడా వాటిని లేకుండా చేస్తాడు. కాబట్టే శ్రీమన్నారాయణుడు 'విశోకః' అనబడతాడు.

## 632. శోకనాశనః

దుఃఖమును తొలగించువాడు.

**భక్తానాం స్వేనసంబంధవ్యతిరేక స్వరూపకమ్**
**యత్తచ్ఛోకం నాశయతి శోకనాశన ఈరితః**

భక్తులకు సేవచేస్తూ వారికి తనవల్ల కలిగే ఎడబాటువల్ల దుఃఖము లేకుండా చేస్తాడు.

**శోకం నాశయతీతి శోకనాశనః** తనవియోగముతో కలుగు దుఃఖమును తొలగించువాడు.

**స్మృతిమాత్రేణ భక్తానాం శోకం నాశయతి**

స్మరణ మాత్రముచేతనే భక్తుల శోకము బాపువాడు.

అజ్ఞానంవల్ల శోకం వస్తుంది. ఆ శోకము మనస్సును దహించివేస్తుంది. చేసిన కర్మలయొక్క ఫలం చెడ్డదైనప్పుడు, దాన్ని భరించలేక శోకం వస్తుంది. అటువంటి కర్మఫలాన్ని క్షయం చెయ్యటానికి రెండే మార్గాలున్నాయి. 1. కల్పాంతము వరకు కర్మను అనుభవించటము 2. జ్ఞానాజ్ఞిలో కర్మఫలాన్ని దగ్ధం చెయ్యటము.

పరమేశ్వరుడు తనను నమ్మినవారికి జ్ఞానాన్నిచ్చి, ఆజ్ఞానాగ్నిలో వారి కర్మఫలాన్ని దగ్ధం చేస్తాడు. అందువల్ల అతడి కర్మక్షయమైపోయి శోకం నశిస్తుంది. ఈ రకంగా భక్తుల శోకాన్ని పోగొడతాడు. కాబట్టే శ్రీమన్నారాయణుడు 'శోకనాశనః' అనబడతాడు.

## 633. అర్చిష్మాన్

తేజస్సు గలవాడు.

**భక్తాభ్యంతరబాహీకచక్షురున్న యవక్షయమ్**

**దివ్యం తేజస్సదా యస్య అర్చిష్మా నితి కథ్యతే ॥**

భక్తుల చర్మచక్షువులను, మనసును కూడా వికసింప చేయగల దివ్యమైన తేజస్సు గలవాడు.

**అర్చిః అస్యాస్తీతి అర్చిష్మాన్**

తేజోసంపన్నుడు. భక్తులయొక్క బాహ్యనేత్రాలను, అంతర్‌నేత్రాలను కూడా తెరిపించగల దివ్యతేజస్సు గలవాడు.

చర్మచక్షువులు అంటే – బాహ్యనేత్రాలు
మనసు అంటే – అంతర్ నేత్రము. అదే మనోనేత్రము.

బాహ్యచక్షువులు కామపు పొరలు కప్పిఉంటాయి. నిరంతరము కోరికల సముదాయముతోకూడి ఉంటాయి. ఆ కోరికలు ఒకటి తీరితే ఇంకొకటి ఆవిర్భవిస్తాయి. కాబట్టి బాహ్యచక్షువులను తెరిపించటం కష్టం. అటువంటి కష్టమైన పని కూడా చేయగల నేర్పరి అతడు. బాహ్యచక్షువులు తెరవబడాలి అంటే రాగద్వేషాలను విడనాడాలి. కాబట్టి రాగద్వేషాలు, అహంకార మమకారాలను పోగొట్టి వారికళ్ళను తెరిపిస్తాడు. అలాగే భక్తులకు ఐహికమైన కోరికలయందు విరక్తిని కలుగచేసి మనోనేత్రాన్ని తెరిపిస్తాడు.

మనసు ఎప్పుడైతే వికసించిందో ఆ మరుక్షణమే ఆత్మసాక్షాత్కారమవుతుంది. సర్వజగత్తు తనలోనే ఉన్నదనే విషయం తెలుస్తుంది. పిపీలికాది బ్రహ్మపర్యంతము నేనే నిండిఉన్నాను అని భావిస్తాడు.

ఈ రకంగా భక్తులయొక్క చర్మచక్షువులు, మనోనేత్రము కూడా తెరిపించి, వాటిని ప్రకాశింపచేస్తాడు. కాబట్టి శ్రీమన్నారాయణుడు 'అర్చిష్మాన్' అనబడుతున్నాడు.

**అర్చీం షి విద్యంతే అస్య:**

అర్చిస్సులు – కిరణములు, జ్వాలలు.

ఇతనికి అనేక జ్వాలలు లేదా కిరణాలు ఉన్నాయి.

**భైరవయామళంలో** చెప్పినట్లుగా

**సహస్రం ద్విసహస్రంచ చ లక్షకమ్ కోటిరర్బుదమేతేషాం పరాసంఖ్యాన విద్యతే**

పరమేశ్వరుని నుండి వేయి, రెండు వేలు, లక్షలు, కోట్లు, కోటానుకోట్లు ఇంకా లెక్కపెట్టలేనన్ని కిరణాలు ప్రసరిస్తున్నాయి.

**తేషాం అనంత కోటీనాం మయూఖానాం మహేశ్వరీ**

అనంతమైన ఆ కిరణసముదాయము నుంచి

**అష్టోత్తర శతంవహ్నే షోడశోత్తరశతం రవేః**
**షట్త్రింశ తదుత్తరశతం చంద్రస్య కిరణాశ్శివే ॥**

108 కిరణములను అగ్నిదేవుడు, 116 కిరణములను సూర్యభగవానుడు

136 కిరణములను చంద్రుడు తీసుకోగలిగారు, 360 కిరణములవల్లనే జగత్తు ప్రవర్తిల్లుతున్నది.

ఈ విషయం **బృహదారణ్యకోపనిషత్తు**లో కూడా వివరించబడింది. దాన్ని గతంలో వివరించాం. అయినా గుర్తు చెయ్యాలి కాబట్టి మళ్ళీ సంక్షిప్తంగా చెబుతున్నాం.

జనకమహరాజు యాజ్ఞవల్క్యుడికి నమస్కరించి "మహానుభావా ! జగత్తులో మానవులంతా ఏవిధంగా తమ పనులు చేసుకోగలుగుతున్నారు?" అని అడిగాడు. దాని యాజ్ఞవల్క్యుడు - సూర్యుని వెలుగులవల్ల అని సమాధానం చెప్పాడు.

**జనకుడు** : సూర్యుడు లేనప్పుడు ఏవిధంగా జరుగుతుంది ?

**యాజ్ఞవల్క్యుడు** : చంద్రునికాంతులలో

**జనకుడు** : సూర్యుడు, చంద్రుడు ఇద్దరూ లేనప్పుడు ?

**యాజ్ఞవల్క్యుడు** : అగ్నివెలుగులలో

పగటిపూట - సూర్యునికాంతులతో

రాత్రిపూట - చంద్రుని వెలుగులలో

సంధ్యవేళలయందు - అగ్ని (దీపము) కాంతులలో

**జనకుడు** : ఈ మూడూ లేనప్పుడు ?

**యాజ్ఞవల్క్యుడు** : వాక్కు సాయంతో

**జనకుడు** : మరి వాక్కు కూడా లేకపోతే ?

**యాజ్ఞవల్క్యుడు** : పరమేశ్వరుని యొక్క కాంతులతో...

అని చెబుతాడు. ఈ రకంగా జగత్తు ప్రకాశించటానికి ఆధారమైనవాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు 'అర్చిష్మాన్' అనబడుతున్నాడు.

## 634. అర్చితః

అర్చావతారము గలవాడు.

**అర్చాహ్యర్చావతారోఽ స్వక్షేత్రాయతన సద్మసు**
**సజ్ఞా తేత్యర్చితః ప్రోక్తః సప్తార్ణో వాంఛితప్రదః**

అర్చా అంటే అర్చావతారము. అది సమస్త క్షేత్రాలలోను, గృహాలయందు, దేవాలయాలయందు ప్రత్యక్షముగా సర్వకాల సర్వావస్థలయందు అందరికీ కళ్ళకు కనిపిస్తుంది. ఈ నామము సప్తాక్షరి సర్వకామప్రదము.

**అర్చా అస్యసఞ్జాతా ఇతి అర్చితః** అర్చావతారము – సర్వకాలసర్వావస్థలయందు అర్చించటానికి వీలైన విగ్రహము.

ఇది దూరంగా ఎక్కడో ఉండదు. ఏదో ఒక కాలమందు మాత్రమే ఉండదు. సర్వకాల సర్వావస్థలయందు అన్ని క్షేత్రములయందు, గృహములయందు, ప్రత్యక్షంగా ఉంటుంది.

అందమైన ప్రతిమను వెండితోగాని, బంగారముతోగాని, రాగితోగాని, తయారుచేసి, దానినే సాక్షాత్తూ పరమేశ్వరస్వరూపంగా తలచి అర్చన చేస్తారు. వీటిలో పంచలోహాలతో చేసినవి, శిలానిర్మితాలు కూడా లభిస్తాయి. దేవాలయాల యందు క్షేత్రములయందు శిలావిగ్రహాలుంటాయి. తిరుమల, శ్రీరంగము వంటి క్షేత్రాలు ప్రసిద్ధమైనవి.

బ్రహ్మాది దేవతలచేతకూడా అర్చించబడినవాడు. మధుకైటభసంహార సమయంలో బ్రహ్మదేవుడు శ్రీ మహావిష్ణువును పరిపరివిధాల ప్రార్థించి నిద్రలేపుతాడు. తారకాసుర సంహారం కోసం దేవతలు విష్ణువును ప్రార్థిస్తారు. ఈ రకంగా బ్రహ్మ, ఇంద్రుడు మొదలైన వారిచేత పరిపరివిధాల అర్చించబడువాడు. అందుచేతనే శ్రీమహావిష్ణువు 'అర్చితః' అనబడుతున్నాడు.

## 635. కుంభః

కోరబడినవాడు.

**కామ్యతే య స్సజాతీయైః గుణైః కుంభైః ప్రకీర్తితః**
**భాతీతి కుంభోనిత్యం హి షడర్ణో భయనాశకః ॥**

ప్రతిమలలో తాను సౌందర్యాది గుణాలతో ఉండటం చేత భక్తులచే కోరబడువాడు. తాను ప్రతిష్ఠింపబడినట్టి, లేదా వెలసినట్టి క్షేత్రములతో సంబంధమున్న వారికి యమకింకరులనుంచి భయము తొలగజేయువాడు. ఈ నామము షడక్షరీమంత్రము. అన్ని రకాల భయాలను పోగొడుతుంది.

**కామ్యతే ఇతి కుంభః**

ఆ ప్రతిమలలో ఉన్న లక్షణాలను చూసి భక్తులందరూ వాటిని చూడాలని కోరతాడు.

**కౌ భాతీతి కుంభః**

ఆ ప్రదేశాలలో జన్మించినవారికి, మరణించినవారికి ఇతరత్రా వాటితో సంబంధమున్నవారికి యమభటుల భయాన్ని తొలగిస్తాడు. అంటే మరణానంతరము వారు యమలోకానికి పోకుండా వైకుంఠానికి తీసుకుపోతాడు. ఈ ప్రదేశాలలో ధ్యానము, ఆరాధన, అర్చన భాగా జరుగుతాయి కాబట్టి అక్కడ గొప్ప మహిమతో ప్రకాశించేవాడు.

**అధ్వావనిషు సర్వాసునిత్యంకుర్వతి సన్నిధిమ్**
**ముక్తయే సర్వభూతానాం విశేషేణతు వైభవి॥**

భూలోకంలోని ప్రాణికోటికి ముక్తి కలిగించటానికి అక్కడక్కడ క్షేత్రాలలో ప్రతిమలరూపంలో వెలసి మహిమతో వెలుగొందుతుంటాడు.

తాను వెలసిన దివ్యక్షేత్రాలలో మరణించిన వారికి తాను ప్రత్యక్షంగానో, పరోక్షంగానో సహాయపడి వారు యమలోకానికి పోకుండాచేసి, వారికి వీలైనంత త్వరలో పరమపదాన్ని ఇచ్చేవాడు.

కుంభము - కడవ. పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు కడవ వంటివాడు. కడవలో నీరు ఉన్నట్లుగానే జగత్తులోని సర్వము ఇతనియందే ప్రతిష్ఠితమై ఉన్నది.

## 636. విశుద్ధాత్మా

పరిశుద్ధస్వభావుడు.

**సర్వాశ్రితే స్వశేషేణ సర్వస్వత్యాగత స్సదా విశుద్ధాత్మా** తన నాశ్రయించిన వారెవరయినా సరే తన సర్వస్వాన్ని అనుగ్రహించే పరిశుద్ధాత్ముడు.

**విశుద్ధశ్చ అసౌఆత్మాచ విశుద్ధాత్మా** ఆశ్రితులయందు తారతమ్యములు లేక సర్వాన్ని ఇచ్చేవాడు.

తనను ఆశ్రయించినవాడు ఎటువంటివాడైనా సరే అంటే అతడు క్రూరుడైనా, సన్మార్గుడైనా, దుర్మార్గుడైనా ఎవరైనాసరే అతడికి సర్వస్వాన్ని అనుగ్రహించేవాడు.

మహాక్రూరుడైన అజామీళుడంతటివాడు కేవలము తనను తలచాడనే నెపంతో అతడికి స్వర్గలోకప్రాప్తి కలుగచేశాడు. రావణబ్రహ్మతో యుద్ధానికి వెళ్ళాడు శ్రీరామచంద్రుడు. విభీషణుడు శరణువేడాడు. అతడు శత్రువర్గంలో వాడని కూడా చూడకుండా అతడికి ఆశ్రయమిచ్చాడు. లంకానగరానికి రాజును చేశాడు. ఈ రకంగా ఆశ్రయించినవారెవరైనా సరే వారికి మేలు చేసి తన సర్వస్వాన్ని ఇచ్చే శ్రీమన్నారాయణుడు 'విశుద్ధాత్మా' అనబడతాడు.

అంతదాకా ఎందుకు ఒకసారి అశ్వద్ధామ శ్రీకృష్ణపరమాత్ముడి దగ్గరకు వెళ్ళి "నా దగ్గర ఉన్న మణి నీకిస్తాను. నీచక్రాయుధం నాకివ్వవలసినది" అని అడిగాడు. దానికి శ్రీకృష్ణుడు "నువ్వు గురుపుత్రుడవు. నీ దగ్గర మణితీసుకుని, దానికి బదులుగా నా ఆయుధం ఇవ్వటం సరికాదు. నాకు ఏ రకమైన ప్రతిఫలం నీనుంచి వద్దు. ఇవి గోనా ఆయుధాలు. వీటిలో నీక్కావలసినవి తీసుకుని వెళ్ళు" అంటూ తన ఆయుధాలన్నింటినీ అతని ముందుంచి "ఇంతకీ ఎవరితో యుద్ధం చెయ్యటానికని నువ్వు చక్రాయుధం కోరుతున్నావు ?" అన్నాడు. దానికి అశ్వత్థామ" ఎవరితోనూ యుద్ధం చెయ్యనవసరంలేదు. ఒకవేళ ఎప్పుడైనా నీతోనే యుద్ధం చేయవలసి వస్తుందేమోనని అడుగుతున్నాను" అన్నాడు.

అశ్వత్థామ తనముందున్న ఆయుధాలలో నుంచి చక్రాయుధాన్ని తీసుకోవటానికి ప్రయత్నించి దానిని ఎత్తలేక తిరిగి వెళ్ళిపోయాడు.

ఈరకంగా తనతో యుద్ధం చెయ్యటానికి తన ఆయుధాన్ని అడిగినా సమర్పించటానికి సిద్ధపడ్డ పరిశుద్ధాత్ముడు శ్రీమన్నారాయణుడు.

పరమేశ్వరుడు త్రికాలాతీతుడు. త్రిగుణాతీతుడు. అందుచేత విశుద్ధాత్మా అనబడతాడు.

## 637. విశోధనః

శోధించువాడు.

**చ పూర్వోక్త విభవస్యాద్విశోదనః**

తన క్షేత్రములలో మరణించిన వారికి తనను చేరేటందుకు వీలుగా ఏర్పాటు చేసినవాడు.

**విశోధయతీతి విశోధనః**

పుణ్యక్షేత్రములందు మరణించిన వారిని వెతికి తన సాన్నిధ్యానికి తెప్పించుకునేవాడు. వారికి వైకుంఠ ప్రాప్తి కలుగచేసేవాడు.

తనను స్మరించిన పాపులకు కూడా వారి పాపములు నశింపచేసేవాడు. అంటూ 'విశుద్ధాత్మ' అనే ప్రకరణాన్ని పూర్తిచేశాడు రత్నాకరుడు.

# 43. వ్యూహ, విభవ

గురువుగారూ ! పరమేశ్వరుడు అనేక రూపాలలో ఉంటాడు కదా ! మరి క్షేత్రవిశేషమందు చెప్పబడినట్లుగా వ్యూహ, విభవలుగా ఉండే విధానము ఏదో శెలవియ్యండి అన్నాడు కృష్ణశర్మ చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

వేదాలలో చెప్పిన శివ, శంభు, ఈశ్వరశబ్దాలు శ్రీమన్నారాయణుని గురించి చెప్పినవే. జగత్తులోని సమస్తము శ్రీమన్నారాయణుని అధీనంలోనే ఉంటుంది. సర్వేశ్వరుడు నియంత. అతడు కేవలము జీవుల సమిష్టి రూపంకాదు. సకల జగత్తునందు అంతర్యామి. సకల జగద్రూపుడు. అటువంటి సర్వేశ్వరుడు.

1. పర 2. వ్యూహ 3. విభవ 4. అంతర్యామి 5. అర్చ అనే ఐదు అవతారాలుగా ఉంటాడు.

వ్యూహ అంటే కామమోక్షాలను సృజించగోరినటువంటివాడై దానికోసం సృష్టి, స్థితి, లయాలు, శాస్త్రాలు, శాస్త్రార్థాలు, శాస్త్రఫలితాలు, ధ్యానము, ఆరాధన, లీల అనే పనులకు తగ్గట్లుగా తన రూపాన్ని, గుణాలను విభజించుకుని లీలావిభూతిని నిర్వహించి ముక్తికి సాధనమై

1. వాసుదేవ 2. సంకర్షణ 3. ప్రద్యుమ్న 4. అనిరుద్ధ అని నాలుగు రకాలుగా ఉండే స్థితి. దీనిలో

| | | |
|---|---|---|
| 1. వాసుదేవుని వ్యూహము | – | పరమపదము అతడు మోక్షప్రదాత |
| 2. సంకర్షణుడు | – | జ్ఞానము, బలము |
| 3. ప్రద్యుమ్నుడు | – | ఐశ్వర్యము, వీర్యము |
| 4. అనిరుద్ధుడు | – | శక్తి, తేజస్సు |

ఇదే షాడ్గుణ్యపూర్తి.

ఇక విభవ అనగా – ప్రపంచంలో ధర్మానికి హాని కలిగినప్పుడు దుష్టశిక్షణ, శిష్టరక్షణచేసి ధర్మసంస్థాపన చెయ్యటం కోసం వైకుంఠంలో ఉన్న పరమేశ్వరుడు భూలోకానికి రావటము. దీన్నే విభవ అంటారు. తన షడ్గుణైశ్వర్య సంపదకు ఎటువంటి లోపము రాకుండా, అనేకరూపాలతో, అనేకసార్లు ఈ భూలోకంలో అవతరించాడు. ఈ అవతారాలు ఏ పని పూర్తి చెయ్యటానికి వచ్చాయో, ఆ పని పూర్తి కాగానే అవతారసమాప్తి అవుతుంది. రాముడు, కృష్ణుడు మొదలైన అవతారాలు ఈ కోవకు చెందినవే. జీవులు

కర్మఫలాన్ని బట్టి జన్మిస్తారు. కాని భగవంతుడు అలాకాదు. అవతారంలోని శరీరం పాంచభౌతికమైనదికాదు. శుద్ధసత్వప్రధానమైనది. ఈ అవతారాలు రెండు రకాలు 1. ప్రాదుర్భావములు 2. ఆవేశములు. ప్రాదుర్భావము అంటే–ఒక జీవి ద్వారాగాక సాక్షాత్తూ తానే ఒక రూపం ధరించటం. దీంట్లో మళ్ళీ పూర్ణము, అంశము అని రెండు రకాలు.

రామ, కృష్ణాది అవతారాలు – పూర్ణావతారాలు

మత్స్య, కూర్మాది అవతారాలు – అంశావతారాలు

ఆవేశము అంటే – జీవునిద్వారా అవతార పరిగ్రహము. ఇది మళ్ళీ రెండు రకాలు. సరూపావేశం, శక్త్యావేశము.

ఏ శరీరంలో భగవంతుడు ప్రవేశిస్తున్నాడో అది స్వరూపావేశావతారము. ఉదా ॥ పరశురాముడు. ఎవనియందు భగవంతుని శక్తి ప్రవేశిస్తుందో, అది శక్త్యావతారము. ఉదా ॥ వ్యాసుడు.

ఈ రకంగా పరమేశ్వరుడు భక్తులను కరుణిస్తుంటాడు. అతడు అనిరుద్ధ స్వరూపుడు. ఈ భూమి మీద జనార్దనుడుగా ఉంటాడు. సాటిలేనివాడు. లోకకంటకులను శిక్షించేవాడు. అతడు ఐశ్వర్య గుణసంపన్నుడు కాబట్టి పురుషోత్తముడు. మహాపరాక్రమవంతుడు. త్రివిక్రముడు. కలిదోషాలను పోగొట్టేవాడు. గొప్ప వీరుడు. యదువంశజుడు శూరులైన వారికి ప్రభువు. ముల్లోకాలలోను తన భక్తులనుద్ధరించటం కోసం తిరుగుతుంటాడు. ముల్లోకాలకు ఈశ్వరుడు.

ఈ విషయాలన్నీ 638 నుంచి 647 వరకు నామాలలో చెప్పబడ్డాయి. ఇక నామాలను చూద్దాం.

## 638. అనిరుద్ధః

అనిరుద్ధ స్వరూపుడు. 185వ నామము కూడా ఇదే.

**వసుభాండాఖ్య భూభాగే నిత్యం సన్నిహిత స్థితః**

**అనిర్దుధ ఇతి ఖ్యాతో వస్వర్ణోమను రుత్తమః ॥**

వసుభాండము అనే భూభాగంలో జనార్దనుడు అనే అపరనామధేయం గల అనిరుద్ధ స్వరూపుడైన పరమేశ్వరుడున్నాడు. ఈ నామము అష్టాక్షరీమంత్రము ఉత్తమమైనది.

**జనార్దనాఖ్య యాదేవస్త్వనిరుద్ధో జగత్ప్రభుః**

**భూభాగే వసు భాండాఖ్యే నిత్య సన్నిహితస్థితః**

అనిరుద్ధుడు జనార్దనుని రూపంతో ఈ భూమిమీద వేంచేసి ఉన్నాడు.

వాసుదేవుడు, ప్రద్యుమ్నుడు, సంకర్షణుడు, అనిరుద్ధుడు. అని నాలుగు వ్యూహములు వీటిలో నాల్గవ వ్యూహము కూడా తానే అయినవాడు.

పరమేశ్వరుడు 1. పర 2. వ్యూహ 3. విభవ 4. అంతర్యామి 5. అర్చ అనే ఐదు అవతారాలుగా ఉంటాడు. వీటిలో రెండవది వ్యూహ. వ్యూహ అంటే కామమోక్షాలను సృజించగోరినవాడై, దానికోసం సృష్టి స్థితి లయాలు, శాస్త్రాలు, శాస్త్రార్ధాలు, శాస్త్ర ఫలితాలు. ధ్యానము, ఆరాధన, లీల అనే పనులకు తగినట్లుగా తన రూపాన్ని, గుణాలను విభజించుకుని, లీలావిభూతిని నిర్వహించి ముక్తికి సాధనమై 1. వాసుదేవ 2. సంకర్షణ 3. ప్రద్యుమ్న 4. అనిరుద్ధ. అనినాలుగు రకాలుగా ఉండే స్థితి. దీనిలో వాసుదేవుని వ్యూహము పరమపదము. మిగిలిన మూడు – క్షీరాబ్దిలోని శ్వేతద్వీపము అని, వ్యూహ వైకుంఠమని, విష్ణులోకమని, అవతారకందమని పిలువబడే స్థానము. ఇక్కడనుండే అవతారాలు వస్తాయి. ఈ వ్యూహాలలో

1. వాసుదేవుడు – మోక్షప్రదాత
2. సంకర్షణుడు – జ్ఞానము, బలము
3. ప్రద్యుమ్నుడు – ఐశ్వర్యము, వీర్యము
4. అనిరుద్ధుడు – శక్తి, తేజస్సులను ఇస్తారు.

ఇదే షాడ్గుణ్యపూర్తి

ప్రద్యుమ్నుని కుమారుడు అనిరుద్ధుడు. మిక్కిలి రూపవంతుడు. ఇతడు రుక్మిమనుమరాలయిన రుక్మలోచన అనే కన్యను వివాహం చేసుకున్నాడు. తరువాత బాణాసురుని కుమార్తె 'ఉష'కు ఇతడు కలలో కనిపించాడు. కాని ఇతడెవరో ఆమె ఎరుగదు. స్వయంవరం కోసము రాజకుమారుల చిత్తరువులు తెప్పించగా అందులో అనిరుద్ధుని చిత్రం చూసి ఇతడే తనకు కలలో కనిపించినవాడు అని నిర్ణయించుకున్నది. ఉష చెలికత్తె చిత్రరేఖ ఆకాశమార్గాన నిద్రపోతున్న అనిరుద్ధుని తీసుకువచ్చి అంతః పురం చేర్చింది. అనిరుద్దుడు నిద్రలేచి ఉషను చూశాడు. ఉషా అనిరుద్ధులు ఒకరంటే ఒకరు ఇష్టపడ్డారు. స్వేచ్ఛావిహారం చేస్తున్నారు. ఈ రకంగా అనిరుద్ధుడు ఉష అంతః పురంలోనే ఉండిపోయాడు. ఉష గర్భవతి అయింది. పరపురుషుడు అంతఃపురంలో ఉన్నట్లు తెలుసుకున్న బాణాసురుడు అనిరుద్ధుని బంధించాడు. ఈ విషయం ప్రద్యుమ్నుడికి తెలిసింది. శ్రీకృష్ణ పరమాత్ముడు సేనాసమేతంగా వచ్చి బాణాసురునితో యుద్ధం చేశాడు.

ఆ యుద్ధంలో బాణాసురుడు ఓడిపోయాడు. ఉషా అనిరుద్ధుల వివాహం జరిగింది. వీరి కుమారుడు 'వజ్రుడు'.

ఎన్నడు శత్రువులచే అడ్డగింపబడనివాడు.

## 639. అప్రతిరథః

సాటిలేనివాడు.

**ప్రతిపక్షస్య రాహిత్యాత్ బహ్వనిష్ట జనార్దనః**
**విఖ్యాతోఽప్రతిరథః నవార్ణ శ్శ త్రునాశనః**

లోకకంటకులను నశింపచేసే స్వభావము కలవాడు. కాబట్టి విరోధులే లేనివాడు. ఈ నామము నవాక్షరి. శత్రునాశనము. **న ప్రతిరథః అప్రతిరథః**

ఎదురుగా వేరొక రథము లేనివాడు. విరోధులను సంహరించుటలో సాటిలేనివాడు.

ఇతనితో పోటీ చెయ్యగలవాడు లేడు. ఇతనిని ఎదిరించిపోరాడగలవాడు లేడు. తననెదుర్కొన గల పరాక్రమవంతుడు లేనివాడు.

పరమేశ్వరుడు మహావీరుడే కాదు కరుణామూర్తి కూడా. సూర్యుని వేడికి మంచు కరిగిపోయినట్లుగా అతని కరుణముందు శత్రువు యొక్క క్రోదావేశాలు కరిగిపోతాయి.

## 640. ప్రద్యుమ్నః

పురుషోత్తముడు.

**ఆత్మప్రద్యోత నత్వాచ్చ ప్రద్యుమ్న ఇతికథ్యతే**
**అధిష్ఠాయ స్థిత స్సాక్షాత్ భక్తానాం సుగతి ప్రదః ॥**

పురుషోత్తముడే ప్రద్యుమ్నుడు.

ద్యుమ్నం అనగా – స్వయముగా ప్రకాశించటము అని అర్థం. ఇది అపరిమితంగా గలవాడు. భక్తుల యందే ఉండి వారిని మోక్షానికి చేర్చేవాడు.

**ప్రకృష్టం ద్యుమ్నం యస్యసః ప్రద్యుమ్నః**

తనను ప్రకాశింపచేయుట అనే ఐశ్వర్యము గలవాడు. ఇతడే పురుషోత్తముడు. చతుర్వ్యూహములలో ఒకటి అయినవాడు. ఉత్తమమైన ఐశ్వర్యము గలవాడు.

సనత్కుమారుని అంశతో రుక్మిణీ కృష్ణులకు పుట్టినవాడు ప్రద్యుమ్నుడు. పూర్వజన్మలో మన్మథుడు. ఇతడు పుట్టగానే శంబరాసురుడు ఇతని చేతిలో హతమవుతాడు అని

ఆకాశవాణి పలికింది. ఆ మాటలు విన్న శంబరుడు ఈ బాలుణ్ణి తీసుకుపోయి సముద్రంలో పారేశాడు. అక్కడ ఒక చేప అతన్ని మింగింది. జాలరులు ఆ చేపను శంబరుని కుమార్తెకు బహుమతిగా ఇచ్చారు. మన్మధుని భార్యరతీదేవి ఆ ఇంట దాసిగా చేరింది. చేపగర్భాన ఉన్న బాలుణ్ణి చూసి అతడే తన భర్త అని నారదుడి వలన విని, అతన్ని పెంచసాగింది. ప్రద్యుమ్నుడు పెద్దవాడై ఆమె వలన 'సర్వశత్రుమాయావినాశిని' అనే మంత్రాని చెప్పుకుని దాని సహాయంతో శంబరాసురుని సంహరించాడు.

## 641. అమితవిక్రమః

మహాపరాక్రమవంతుడు, త్రివిక్రముడు. 516వ నామము కూడా ఇదే.

**లోకత్రయే ప్యపర్యాప్త విక్రమోఽ మిత విక్రమః**

ముల్లోకాలను జయించగలిగిన పరాక్రమము గలవాడు.

**యామునంజలమాశ్రిత్య దేవదేవః త్రివిక్రమః**
**స్థితః కమలసంభూత నృణాంచ సుగతి ప్రదః**

యమునాతీర్థాన ఉన్నటువంటి త్రివిక్రముడు. అమితమైన శక్తి గలవాడు. అమితమైన పాదన్యాసము (అడుగులు వేయుట) గలవాడు. అమితమైన క్రమము గలవాడు.

వేదంలో చెప్పిన విషయాన్ని బట్టి విష్ణువుకు మూడు ముఖ్యలక్షణాలున్నాయి. అవి

1. మూడు అంగలు – మూడుచోట్ల పాదాలు పెట్టటం. ఈ విషయం ఎక్కువసార్లు చెప్పబడింది.

2. బృహచ్ఛరీరం – పెద్ద శరీరం గలవాడు. ఈ జగత్తంతా వ్యాపించి ఉంటాడు.

3. యువకుడు – ఇతడు బాలుడుకాడు. పెద్దవాడు కాడు. నవయవ్వనుడు.

ఇతడు గొప్ప గమనం గలవాడు. పెద్దపెద్ద అంగలు వేసేవాడు. తన మూడు అంగలతోనే లోకాలన్నింటినీ ఆక్రమిస్తాడు. అతని మూడు అంగలు సూర్యగమనాన్ని సూచిస్తున్నాయి. అవే త్రిసంధ్యలు, శ్రీమహావిష్ణువు ఈ భూమండలాన్ని కష్టకాలంలో ఉన్న మానవుడికోసం మూడుసార్లు ఆక్రమించాడు. మానవులకు నివాసంగా ఇవ్వటంకోసం భూమిని ఆక్రమించాడు. భూప్రదేశాలను విశాలమైన నివాసం కోసం ఆక్రమించాడు.

ప్రహ్లాదుని మనుమడు బలిచక్రవర్తి. ముల్లోకాలను జయించాడు. దేవతలందరినీ హింసిస్తున్నాడు. అశ్వమేధయాగం చేస్తున్నాడు బలిచక్రవర్తి. శ్రీమహావిష్ణువు వామనావతారంలో అక్కడికి వచ్చాడు. వచ్చిన వామనుణ్ణి సత్కరించాడు బలి ఏంకావాలో కోరుకోమన్నాడు.

మూడడుగుల నేల ఇమ్మన్నాడు వామనుడు. ధారపోశాడు బలిచక్రవర్తి. వామనుడు త్రివిక్రముడైనాడు. రెండడుగులతో ముల్లోకాలను ఆక్రమించేశాడు. మూడవ అడుగు ఎక్కడ ? అన్నాడు. ఆశ్చర్యపోయాడు బలిచక్రవర్తి. తన శిరస్సు చూపించాడు. అతణ్ణి సుతలలోకానికి పంపించేశాడు త్రివిక్రముడు. అంతటి పరాక్రమవంతుడు కాబట్టే శ్రీమహావిష్ణువు 'అమితవిక్రమః' అనబడుతున్నాడు.

## 642. కాలనేమినిహా

కలిదోషములు పోగొట్టువాడు.

**కాలచక్రస్య యా నేమిః అవిద్యాభ్యా చ దర్దరా**
**తాం నాశయతి యశ్చాసౌ కాలనేమినిహా స్మృతః**
**అష్టాక్షరో మనురయం అవిద్యా మూయోచః**

కాలము అనే చక్రానికి పట్టా అంటే అజ్ఞానము. ఇది కలికల్మషము. దీనినెవరూ దాటలేరు. అటువంటి అజ్ఞానాన్ని విధ్వంసము చేసేవాడు. ఈ నామము అష్టాక్షరీ మంత్రము. అవిద్యను నశింపచేస్తుంది.

**కాలస్యనేమిం నిహంతీతి కాలనేమినిహా** కలికల్మషాలను తొలగించేవాడు.

**కాలనేమిం (అసురం) నిజఘాసః** కాలనేమి అనే అసురుని సంహరించినవాడు.

మారీచుని కుమారుడు కాలనేమి. సముద్రునికి మిత్రుడు. ఇతని కుమార్తె బృంద. ఆమెను జలంధరునకిచ్చి వివాహం చేశాడు. కాలనేమి రావణ బ్రహ్మకు కూడా మిత్రుడు. రామలక్ష్మణులతో యుద్ధం చేస్తున్నప్పుడు లక్ష్మణుడు మూర్ఛపోయాడు. అప్పుడు సంజీవిని తేవటానికి హనుమంతుణ్ణి పంపాడు రాముడు. ఆ విషయం తెలిసిన రావణుడు కాలనేమి దగ్గరకు వచ్చి 'హనుమంతుడు సంజీవిని కోసం వస్తున్నాడు. అతన్నెలాగైనా ఆపవలసినది' అన్నాడు.

కాలనేమి మునివేషంలో మార్గమధ్యంలో కూర్చుని హనుమంతుని చూసి, "నీకు శుభమవుతుంది. పోయి ఎదురుగా ఉన్న కొలనులో స్నానం చేసి రావలసినది" అన్నాడు. ఆ కొలనులో మొసళ్ళున్నాయి. అవి హనుమంతుని చంపుతాయని అతని నమ్మకము. హనుమంతుడు ఆ మొసళ్ళను, వాటితోపాటుగా కపటమునిని కూడా సంహరించాడు. ఈ కాలనేమి అనే రాక్షసుడే కంసునిగా జన్మించి శ్రీకృష్ణుని చేతిలో హతుడైనాడు. ఈరకంగా కాలనేమి అనే రాక్షసుని సంహరించాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు 'కాలనేమినిహా' అనబడుతున్నాడు.

# 643. వీరః

వీరుడు. 401, 658వ నామాలు కూడా ఇదే.

మహాపరాక్రమవంతుడు పరమేశ్వరుడు గొప్ప వీరుడు. భయంకరమైన రాక్షసులను చాలామందిని సంహరించాడు.

ఈ నామాన్ని శంకరుల వారు వ్రాశారు. కాని పరాశరభట్టరువారి భాష్యమందు ఈ నామము కనపడదు.

# 644. శౌరిః

శూరికి మనుమడు – కృష్ణుడు. శౌరి రాజస్వామి.

340వ నామం కూడా ఇదే.

**శౌరవామ్నా స్థితశ్శౌరిః ఉత్పలావదకే శుభే** ఉత్పలావదకము (తిరుకణ్ణపురము) నందు శౌరి అను పేరుతో ఉండేవాడు. వసుదేవుని కుమారుడు.

**ఉత్పలావదకేదేశే శౌరిసంజ్ఞోఽ చ్యుతస్థితః**

ఉత్పలాదకము అనుదేశమందు 'శౌరిరాజు' అనే పేరుతో అర్చామూర్తిగా ఉన్నవాడు.

పలము అంటే మాంసము. అది శుష్కించి పోయినవారు ఉత్పలురు. మునీశ్వరులు, ముముక్షువులు తమ శరీరాన్ని నియమనిష్ఠలతో, ఉపవాసాది వ్రతాలతో శుష్కింప చేస్తారు. అటువంటి వారిని రక్షించేవాడు పరమేశ్వరుడు. **తేషాం మమాఽవతోవాసముత్పలావదకం విదుః** అటువంటి ఉత్పలులను రక్షించే పరమేశ్వరుడు ఉండే స్థలము – ఉత్పలావదకము.

**శూరస్య గోత్రాపత్యం పుమాన్** శూరుడగు యాదవుని వంశమున జన్మించినవాడు. హృషియొక్క కుమారుడు దేవామీఢుడు. అతని భార్య మారిష. వీరి కుమారుడు వసుదేవుడు. ఇతడు పుట్టినప్పుడు ఆకాశంలో దుందుభులు మ్రోగినాయి. అందువలన ఇతడికి 'ఆనకదుందుభి' అనే పేరు కూడా వచ్చింది. ఇతడికి తొమ్మిదిమంది సోదరులు. పునర్వసువు కుమారుడు యాహుకుడు. ఇతని కుమారులు ఉగ్రసేనుడు, దేవలుడు. దేవలుని కుమార్తెలు దేవకి, శాంతి మొదలైన ఏడుగురిని వసుదేవుడు వివాహం చేసుకున్నాడు. వీరు కాకుండా రోహిణి, కౌలస్య మొదలైన నలుగురు భార్యలు కూడా ఉన్నారు.

ఉగ్రసేనుని కుమారుడే కంసుడు. దేవకి కంసుని యొక్క పినతండ్రి కుమార్తె. ఈమెయందు కంసునికి మిక్కిలి అభిమానము. వీరి వివాహము జరిపిన సందర్భంలో

ఆకాశవాణి 'దేవకి అష్టమగర్భాన నీకు మరణం తప్పదు' అని చెప్పింది. ఆ మాటలు విన్న కంసుడు దేవకీ వసుదేవులను ఖైదుచేసి వారి సంతానాన్ని సంహారం చేశాడు. హరి అష్టమగర్భమే శ్రీకృష్ణుడు. అందుచేతనే యదువంశ సంభూతుడు. శౌరి అని పిలువబడుతున్నాడు.

ఇక్కడ శూరః అనే నామం వ్రాశారు పరాశరభట్టరువారు. కాని శంకర భాష్యంలో అది లేదు.

## 645. శూరజనేశ్వరః

శూరులైన వారికి ప్రభువు.

**పరాక్రమ జనే శశ్వత్ స్మృత శ్శూర జనేశ్వరః** మహాశూరులైన జాంబవంతుడు, హనుమంతుడు, సుగ్రీవుడు మొదలగువారికి ప్రభువు.

**శూరజనానాం ఈశ్వరః శూరజనేశ్వరః** శ్రీరామచంద్రుడు శూర్లులైన కపీశ్వరులకు ప్రభువు. జాంబవంతుడు–బ్రహ్మ ఆవులించగా పుట్టినవాడు. భల్లూకరాజు. మహాబలవంతుడు. గరుత్మంతుని కన్న ముందు జన్మించాడు. అనేకసార్లు భూప్రదక్షిణం చేశాడు. బలిచక్రవర్తి యజ్ఞం చేసే సమయంలోనే దేవతల నడిగి అమృతం త్రాగాడు. కొండలను పిండి చేయగలవాడు. అనేకమంది మహావీరులను ఒక్కచేత్తో సంహరించగలవాడు.

హనుమంతుడు – అంజనాదేవికి వాయుదేవుని వరంవల్ల పుట్టినవాడు. ఈశ్వరాంశ. రావణ సంహారంకోసం భూలోకంలో అవతరించిన మహానుభావుడు. శతయోజన విస్తీర్ణమైన సముద్రం దాటి, లంకానగరాన్ని కాల్చి వచ్చినవాడు. మహాబలశాలి. భవిష్యద్బ్రహ్మ.

సుగ్రీవుడు – ఋక్షరజునికి సూర్యునివల్ల కలిగినవాడు. వాలి తమ్ముడు. వాలి మరణానంతరము కిష్కింధకు రాజైనాడు. మహాబలశాలి.

ఇటువంటి శూరజనులకు ప్రభువు కాబట్టే శ్రీమన్నారాయణుడు 'శూరజనేశ్వరః' అనబడుతున్నాడు.

తన శౌర్యముచేత ఇంద్రాది దేవతలకు ప్రభువైనవాడు. శూరులైన ఇంద్రాది దేవతలలోని శక్తి తానే అయినవాడు. భీష్ముడు, ద్రోణుడు, అర్జునుడు మొదలైన మహారథులకు ప్రభువైనవాడు.

# 646. త్రిలోకాత్మా

మూడు లోకములందు తిరుగుతుండేవాడు.

**య స్స్వాతన్త్ర్యేన లోకాన్ త్రీన్ భక్తానుగ్రహ కామ్యయా**

**గచ్ఛతీతి త్రిలోకాత్మా వస్వర్ణో భూతిదాయకః**

భక్తులను అనుగ్రహించటం కోసం ఎల్లప్పుడూ ముల్లోకములందు తిరుగుతుండే వాడు. ఈ నామము అష్టాక్షరీ మంత్రము. ఐశ్వర్యప్రదము.

**మగధా మండలే విప్ర మహామేధ ధరాశ్రితః**

**సంస్థితో లోకనాథాత్మా దేవదేవో జనార్దనః**

మగధ దేశాన వేంచేసి ఉన్న త్రిలోకనాథుడు. భక్తులను అనుగ్రహించటానికి ముల్లోకాలకు వెళ్ళేవాడు.

తన భక్తులు ఏ లోకంలో ఉన్నా సరే వారి దగ్గరకు వెళ్ళేవాడు. భూలోకం వచ్చి ఇక్కడ వారిని కరుణిస్తాడు. దేవలోకంలో ఉండి అక్కడవారిని చూస్తాడు. సుతలలోకంవెళ్ళి బలి వాకిలి దగ్గర కాపలా ఉన్నాడు. ఈ రకంగా భక్తులనుద్ధరించటానికి ఎక్కడికైనా సరే వెళ్ళేవాడు.

**అంతర్యామితయా త్రయాణాం లోకానాం ఆత్మా**

అన్ని జీవులయందు అంతర్యామి. కాబట్టి మూడు లోకాలకు ఆత్మ అతడే. ఈ లోకాలన్నీ అతని స్వరూపాలే. **ఐతరేయోపనిషత్తు**లో పరమాత్మ ఈ లోకాలను సృష్టించాలనుకున్నాడు. ఈ లోకాలను సృష్టించాడు. ఇంద్రియాలను, వాటి అధిదేవతలను సృష్టించిన తరువాత, ఆ శరీరంలో తాను ప్రవేశించకపోతే ఎలా ? అని ఆలోచించి బ్రహ్మరంధ్రం ద్వారా దేహంలో ప్రవేశించాడు. ఈ రకంగా అతడు అన్ని జీవులయందు అంతర్యామిగా ఉండి 'త్రిలోకాత్మా' అనబడుతున్నాడు.

# 647. త్రిలోకేశః

ముల్లోకాలకు ఈశ్వరుడు.

**త్రిలోకానా మీశతయా త్రిలోకేశః ప్రకీర్తితః** ముల్లోకాలకు ప్రభువైనవాడు.

**శుభమాసాద్య భూభాగం ప్రాగ్జ్యోతిషపురే తథా**

**దేవం విశ్వేశ్వరాఖ్యంతు స్థితమేత్య స్వగోచరాత్ ॥**

ప్రాగ్జ్యోతిషపురమున వేంచేసి ఉన్న విశ్వేశ్వరుడు.

పరమేశ్వరుడు చరాచర జగత్తంతా ఆవరించి, ప్రసిద్ధమైన ప్రదేశాలలో ఏదో ఒక పేరుతో అక్కడ స్థిరనివాసం ఏర్పరచుకుంటున్నాడు.

| | | |
|---|---|---|
| పూరీలో | - | జగన్నాథస్వామిగా |
| ద్వారకలో | - | శ్రీకృష్ణునిగా |
| శ్రీరంగంలో | - | రంగనాథునిగా |
| యాదగిరిగుట్టలో | - | నృసింహునిగా |
| కేదారంలో | - | ఈశ్వరుడుగా |
| పాశ్చాత్యదేశంలో | - | క్రీస్తుగా |
| అరబ్బీదేశాలలో | - | అల్లాగా |

అనేక రకాల పేర్లతో, దేశకాలమానాలకు అతీతంగా, కులమతాలకు తావు లేకుండా, వివిధ పేర్లతో వివిధ ప్రాంతాలయందు స్థిరమైన నివాసం ఏర్పాటు చేసుకుని ముల్లోకాలకు ప్రభువైనవాడు. అందుకే అతడు త్రిలోకేశుడు.

మూడు లోకాలకు ప్రభువు. మూడు లోకాలు అతని ఆజ్ఞతో పాలించబడు తున్నాయి. లోకాలన్నింటికీ అతడే ప్రభువు. అతడే దైవము. అతనివల్లనే ప్రతిలోకము మనుగడ సాగిస్తున్నది. ఆ లోకాలు అతనికి దూరమైతే సృష్టిలో లేకుండాపోతాయి. అందుకే లోకాలకు సత్తా స్వరూపమైన శ్రీమన్నారాయణుడు 'త్రిలోకేసుడు' అనబడతాడు. అంటూ ఈ ప్రకరణాన్ని పూర్తిచేశాడు రత్నాకరుడు.



# 44. కేశవుడు

"గురువుగారూ ! శ్రీమన్నారాయణుడు కేశవుడు. 'కేశి' అనే రాక్షసుని సంహరించాడు అన్నారు కదా ! ఆ విషయం ఏమిటో కొంచెం వివరించండి" అన్నాడు నారాయణభట్టు. చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

శ్రీమన్నారాయణుడు పరమేశ్వరుడు లీలామానుషవిగ్రహుడు. ఈ లోకాలను సృష్టించింది అతడే. సృష్టి స్థితిలయాలకు అతడే కారకుడు. ఆ పరమేశ్వరుడు దేవకీ వసుదేవుల కుమారుడుగా జన్మించాడు. దేవకి గర్భాన పుట్టబోయే ఎనిమిదవ సంతానంవల్ల నీకు ప్రాణహాని అని చెప్పింది ఆకాశవాణి. ఆ మాటలు విన్న కంసుడు భయపడ్డాడు. తనకు అపాయం రాకుండా ఉండేందుకుగాను దేవకీ వసుదేవులను ఖైదుచేశాడు. ఆమె గర్భాన పుట్టిన సంతునంతటినీ సంహరించాడు. అష్టమ గర్భాన కృష్ణుడవతరించాడు. ఆ బాలుణ్ణి వ్రేపల్లె చేర్చాడు వసుదేవుడు. దేవకి ప్రక్కన యోగమాయను పడుకోపెట్టాడు. కంసుడు దేవకి ప్రసవించిందని విని హుటాహుటి పరుగెత్తుకువచ్చాడు. బాలిక కనిపించింది. అయినా సరే సంహరించటానికి నిశ్చయించుకున్నాడు. ఆ బాలికను చంప బోయాడు. ఆ బాలిక ఆకాశంలోకి ఎగిరిపోయింది. "నిన్ను చంపేవాడు గోపాలకృష్ణుడు వ్రేపల్లెలో పెరుగుతున్నాడు" అని చెప్పింది. భయపడ్డాడు కంసుడు. పూతనను పిలిచి వ్రేపల్లెలో ఉన్న పసిపిల్లలను చంపమన్నాడు. ఆమె కృష్ణునికి స్తన్యమిచ్చి చంపబోయింది.

గోపాలకృష్ణుడు పూతన ప్రాణాలు హరించాడు. ఆమాటవిన్న కంసుడు శకటాసురుడు, ధేనుకాసురుడు మొదలైన అనేకమంది రాక్షసులను పంపాడు. వారు కూడా కృష్ణుని చేతిలో హతులైనారు. ఇప్పుడు కేశి అనే రాక్షసుని పంపాడు. అతన్ని నిలువునా రెండు ముక్కలుగా చీల్చి చంపేశాడు కృష్ణుడు. కేశిని సంహరించాడు కాబట్టి కేశవుడు అనబడ్డాడు. ఇతడు మంచి కేశములు గలవాడు. భక్తులయొక్క దుఃఖములను హరించేవాడు. భక్తులయొక్క కోరికలు తీరుస్తాడు. వారికి ధర్మార్థకామమోక్షాలను ప్రసాదిస్తాడు. భక్తులు అతన్ని ఆరాధిస్తారు. వారికి ఇవ్వదగినవన్నీ అతని దగ్గర ఉన్నాయి. అతడు పూర్ణకాముడు. కోరికలు లేనివాడు. కోరికలు తీరినవాడు. కల్పాంతమున సృష్టి కర్త అయిన బ్రహ్మకుకూడా విమోచనం కల్పిస్తాడు. అంటే బ్రహ్మ పరబ్రహ్మలో లీనమైపోతాడు. ఈ రకంగా అన్ని జీవులకు పురుషార్థాలనిచ్చే మహానుభావుడు కేశవుడు.

ఈ విషయాలన్నీ 648 నుంచి 654 వరకు నామాలలో వివరించబడ్డాయి. ఇక నామాలను చూద్దాం.

# 648. కేశవః

కేశవుడు. మంచి కేశములు గలవాడు. శ్రీమహావిష్ణువు.

**బ్రహ్మేశయో స్స్వాంగజత్వాత్ కేశవః పరికీర్తితః**

బ్రహ్మ రుద్రాదులను తన శరీరమునుంచి పుట్టించినవాడు.

**కేశవః క్లేశహా లోకే ద్వైరూప్యేణక్షితౌస్థితః**
**మధురాఖ్యే మహాక్షేత్రే వారణాస్యామపి ద్విజ ॥**

క్లేశములను హరించే కేశవుడు మధురయందు, వారణాసి యందు గలడు.

**క ఇతి బ్రహ్మణో నామ ఈశోఽ హం సర్వదేహినాం**
**అవాంతవాంగే సంభూతౌ తస్మాత్ కేశవనామవాన్**

క అంటే బ్రహ్మ. నేను రుద్రుడను. మేము ఇద్దరముకూడా ఓ జనార్దనా నీ శరీరము నుండే ఆవిర్భవించాము. అందుకే నీవు కేశవుడు అనబడుతున్నావు. **నారాయణోపనిషత్తు**లో "ఈ సృష్టి ప్రారంభంలో పరమపురుషుడైన నారాయణుడు ప్రాణులను సృష్టించాలి అనుకున్నాడు. అప్పుడు ముందుగా హిరణ్యగర్భుడు పుట్టాడు. ఆ తరువాత పంచభూతములు నారాయణుని నుంచే పుట్టినాయి. నారాయణుని నుంచే బ్రహ్మ, ఇంద్రుడు, రుద్రుడు, జన్మించారు. మరీచి, కశ్యపుడు మొదలైన ప్రజాపతులు జన్మించారు. నారాయణుని నుంచే అష్టవసువులు, ఏకాదశరుద్రులు, ద్వాదశాదిత్యులు, సకలవేదములు ఆవిర్భవించినాయి. ఈరకంగా చరాచర జగత్తంతా నారాయణుని నుంచే పుట్టింది" అని చెప్పబడింది.

ఈ రకంగా బ్రహ్మోపేంద్ర మహేంద్రాది దేవతలు, చరాచరజగత్తు అంతా శ్రీమన్నారాయణుని నుంచే పుట్టింది. అందుచేతనే 'కేశవ' అనబడుతున్నాడు. పొడవైన కేశములు గలవాడు కాబట్టి నారాయణుడు కేశవుడు అనబడుతున్నాడు. మహాభారతంలో

**అంశవోయేప్రకాశంతే మమతే కేశ సంజ్ఞితాః**
**సర్వజ్ఞాః కేశవంతస్మా న్మామాహుః ద్విజసత్తమా ॥**

సూర్యుని యందలి కిరణములే భగవానుని కేశములు. అందుచేత ప్రకాశవంతమైన కిరణములన్నీ అతని కేశములే. అందుకే సర్వజ్ఞులు అతన్ని కేశవుడు అంటారు. అని చెప్పబడింది.

వేదంలో **త్రయకేశినః** త్రిమూర్తులను కేశములు అంటారు అని చెప్పబడింది.

కాబట్టి శ్రీమన్నారాయణుడు 'కేశవః' అనబడుతున్నాడు.

# 649. కేశి -హా

కేసి అనురాక్షసుని సంహరించినవాడు.

**అసురం కేశివానామం హతవాన్ కేశిహాస్మృతః** కేశి అనబడు రాక్షసుని సంహరించినవాడు.

**కేశినం హంతీతి కేశిహా** కేశి అను రాక్షసుని చంపినవాడు.

వ్రేపల్లెలో పెరుగుతున్నాడు కృష్ణుడు. అతన్ని చంపటంకోసం అనేకమంది రాక్షసులను పంపాడు కంసుడు. వారందరినీ హతమార్చాడు కృష్ణుడు.

కేశి అనే రాక్షసుడు అశ్వరూపం ధరించి వచ్చాడు. అతని గిట్టల ఒత్తిడికి భూమి కంపించి పోతుంది. అతని సకలింపుకు దేవతలు గడగడలాడారు. ఆ అశ్వంజూలు విదిల్చితే వచ్చే గాలికి మేఘాలు చిందరవందర అవుతున్నాయి. నోటిలోని దంతాలు ప్రళయాగ్ని జ్వాలలలాగా మెరుస్తున్నాయి. అతని తోకయమపాశంలాగా ఉంది. కేశి బృందావనం ప్రవేశించాడు. కృష్ణుడు ఎక్కడ ఉన్నాడు ? ఏడి అని అడుగుతున్నాడు. అప్పుడు శ్రీకృష్ణభగవానుడు వచ్చి "ఓ రాక్షసాధమా ! గొల్లపిల్లలను బెదిరించటం వీర ధర్మంకాదు. ఇదిగో ! నేనే వచ్చాను. యుద్ధానికి రా !" అంటూ ఆ రాక్షసుని ఎదిరించాడు.

కేశి తన నోటిని కొండగుహలాగా తెరచి కృష్ణుని మ్రింగటానికి వచ్చాడు. ఆ సమయంలో శ్రీకృష్ణుడు ఆ రాక్షసుని నోటిలోకి తన చేతిని పోనిచ్చాడు. దాంతో ఆ రాక్షసుని పండ్లు జలజలాభూమిమీద రాలిపడినాయి. కృష్ణుడు తన చేతిని రాక్షసుని పొట్టలోకి పంపించి, దాన్ని బాగా విశాలంగా చేశాడు. రాక్షసుడికి ఊపిరి ఆడటం కష్టమైంది. ఒళ్ళంతా చెమట పట్టింది. గుడ్లుమిటకరించి నేలమీద పడి గిలగిల తన్నుకుంటు నిలబడలేక, నేలమీద కూలిపోయాడు. అతని దేహం లోపల కృష్ణుని చెయ్యి ఇంకా పెరిగిపోతోంది. ఇంక అతని దేహము నిలువునా రెండు ముక్కలుగా చీలిపోయింది. ఆ రకంగా కేశి అనే రాక్షసుడు సంహరించబడ్డాడు.

కేశిని సంహరించాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు 'కేశిహా' అనబడుతున్నాడు.

# 650. హరిః

శ్రీమహావిష్ణువు

**భక్తానాం దుఃఖ హరణాత్ వర్ణశ్రైష్ఠ్యాద్ధరిస్మృతః**

భక్తుల దుఃఖములను హరించువాడు. పచ్చని శరీరచ్ఛాయగలవాడు.

**గిరౌగోవర్ధనాఖ్యే తుదేవః సర్వేశ్వరోహరిః సంస్థితః పూజితః స్థానే**

గోవర్ధన పర్వతస్థానమందు హరి అను పేరుతో ఉన్నవాడు. పాపములను హరించువాడు. జననమరణసంసారరూపమైన సాగరాన్ని దాటించేవాడు. భవబంధనాలను త్రెంచివేసేవాడు. జీవుల అవిద్యను హరించివేసేవాడు.

**సహేతుకం సంసారం హిరతీతి హరిః**

జనన మరణ రూపమైన సంసారాన్ని సమూలంగా నాశనం చేసేవాడు.

సారము లేనిది సంసారము. దీనికి కారణము అజ్ఞానము. జీవి అవిద్యవల్ల భార్యా, పిల్లలు, సంసారబంధనాలు అన్నీ నిజం అనుకుంటున్నాడు. శంకరభగవత్పాదులవారు తమ **భజగోవింద శ్లోకాలలో**

**నళినీదళ గతజలమతి తరళం తద్వజ్జీవిత మతిశయ చపలమ్**
**విద్ధి వ్యాధ్యభిమానగ్రస్తం లోకం శోక హతం చ సమస్తమ్ ॥**

తామరాకుపైన నీటిబిందువు చలిస్తూనే ఉంటుంది. అదేవిధంగా జీవితమెంతో చంచలమైనది. లోకులందరూ రోగాలతో బాధపడుతూ దేహాభిమానం విడవక దుఃఖంలో చిక్కుకొని ఉంటారు. మనుష్యుడికి సుఖమనేదే ఉండదు. ఇటువంటి సుఖములేని, సారములేని సంసారాన్ని సమూలంగా హరించి సాయుజ్యం ప్రసాదించేవాడు.

## 651. కామదేవః

కామములను తీర్చువాడు.

**సర్వేషాం కామదత్వాచ్చకామదేవ ఇతీరితః** భక్తులు కోరిన కోరికల నిచ్చువాడు.

**కామదేవస్తు భగవాన్ సర్వేషాం సర్వకామదః**
**శంకరాలయ మాసాద్య సంస్థితోఽ ప్సరసార్చితః ॥**

శంకరాలయము అనే క్షేత్రంలో అందరిచేత పూజించబడుతూ, భక్తుల కోరికలు తీరుస్తూ కామదేవుడు అనే పేరుతో ప్రసిద్ధి చెందినవాడు.

చతుర్విధపురుషార్థాలు కోరేవారి చేత పూజించబడేవాడు. శారీరక, మానసిక అవసరాలను తీర్చే భగవానుడు 'కామ' అనే పురుషార్థాన్నిస్తాడు. ఈ కామంద్వారా లభించిన దానిని భద్రపరచుకొనే జ్ఞానము, సంపద ఇచ్చిన తరువాత అర్థాన్నిస్తాడు. ఈ రకంగా కామము, అర్థము వచ్చిన తరువాత పూర్వజన్మ కర్మనుబట్టి అతడు ధర్మాన్ని ఆచరిస్తాడు. ఇప్పుడు అతని అర్హతను బట్టి మోక్షం పొందుతాడు.

ఈ రకంగా పరమేశ్వరుడు ముందుగా భక్తుల కోరికను తీర్చి, తరువాత అర్థము, ఆ తరువాత ధర్మము ఆ తరువాత మోక్షాన్ని ప్రసాదిస్తాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'కామదేవః' అనబడుతున్నాడు. **లలితాసహస్రంలో 63వనామము 'కామదాయినీ'**

## 652. కామపాలః

పురుషార్థముల పాలించువాడు.

**దత్వాతు పాలనకరః కామపాలః ప్రకీర్తితః**

తాను ఇచ్చిన పురుషార్థాలను తానే కాపాడేవాడు.

**కామం పాలయతీతి కామపాలః** భక్తులకు తాను ఒసంగిన పురుషార్థములను తాను రక్షించువాడు. కోరికలు గల వారి కోరికలు తీర్చి వారిని పాలించువాడు.

మానవుడికి భగవంతుడి మీద నమ్మకం కలగాలి. అప్పుడే అతడు భగవంతుడున్నాడు అని నమ్ముతాడు. అందుచేత ముందుగా మానవుడు భగవంతుణ్ణి నమ్మాలి. అలా నమ్మాలంటే అతనికి ఆపదవచ్చినప్పుడుగాని, లేక అతడు ప్రార్థించినప్పుడుగాని భగవంతుడు అతడికి ఏదో ఒక రూపేణా సాయపడాలి. అంటే అతడి కష్టాలు తీర్చాలి. ఒకసారి భగవంతుడిని అర్చిస్తే అతని కష్టాలు తీరినాయి అనే నమ్మకం గనక వస్తే, ఇక అతను జీవించి ఉండగా భగవంతుని మరచిపోడు. ఎల్లకాలము అర్చిస్తూనే ఉంటాడు.

మానవుడికి ఆశ ఎక్కువ ఎప్పుడైతే తన కోరికలు తీరటం మొదలుపెట్టినాయో, అప్పుడు భగవంతుణ్ణి విపరీతంగా అర్చిస్తాడు. కావలసినవన్నీ అంటే ధనధాన్యాలు, భోగభాగ్యాలు, సిరిసంపదలు అన్నీ కోరతాడు. అతడికి అవన్నీ గనక లభిస్తే చిన్నగా అతడి మనసు ధర్మమువైపుకు ఆ తరువాత మోక్షంవైపుకు వెడుతుంది.

ఈ రకంగా భక్తులకు పురుషార్థాలనిచ్చి, వాటిని తిరిగి తనే రక్షిస్తాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'కామపాలః' అనబడుతున్నాడు. భక్తులు తన నుండి పొందిన పురుషార్థాలు సరిగా ఉపయోగపడేటట్లు చూస్తాడు.

**భగవద్గీత**లోని 9వ అధ్యాయం **'రాజవిద్యారాజగుహ్యయోగము'**లోని 22వ శ్లోకం.

**అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే**
**తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ॥**

పరమేశ్వరుడునైన నన్ను నిరంతరము అనన్యభక్తితో అర్చించే వారి యోగక్షేమములను నేనే చూస్తాను అంటాడు. కాబట్టి పురుషార్థాలనిచ్చిన పరమేశ్వరుడే వాటిని రక్షిస్తాడు.

# 653. కామీ

కోరబడువాడు.

**ప్రదేయాతిశయాత్కామీ** ఇవ్వదగిన వస్తువులు తనవద్ద ఎక్కువగా గలవాడు.

**కామాః అస్యసంతీతి కామీ** పురుషార్థములను అధికముగా ఇచ్చేవాడు.

పరమేశ్వరుడు మహదైశ్వర్య సంపన్నుడు. అతనివద్ద లేనిది అంటూ ఏదీలేదు. శంఖపద్మ నిధులున్నాయి. అవి ఎంతటికీ తరిగిపోనివి. అతడు ఉన్నచోట బంగారము ఇసుకగా, రతనాలు గులకరాళ్ళుగా గల నదులు ప్రవహిస్తున్నాయి. అతడు ధర్మస్వరూపుడు. మోక్షప్రదాత. కాబట్టి భక్తుడికి ఏది కావాలంటే అది ఇవ్వగలవాడు. అందుచేతనే భక్తులచేత రకరకాలుగా కోరబడతాడు. **పూర్ణకామా అస్య:** తీరిన కోరికలు గలవాడు. అతనికి ఇంక ఏ కోరికలులేవు. అతడు పూర్ణకాముడు. ఆప్తకాముడు అని పిలువబడతాడు.

# 654. కాంతః

మనోజ్ఞమైనవాడు. 296వ నామం కూడా ఇదే.

**కాంతస్స్యాత్కమనీయకః** అప్సరసలచేత కూడా అపేక్షించదగిన సౌందర్యము గలవాడు. పరమేశ్వరుడు మహాసౌందర్యవంతుడు.

**పుంసాం మోహనరూపాయ** అన్నారు శ్రీరామచంద్రుని. అతని దివ్యమంగళ విగ్రహాన్ని గనక తిలకించినట్లైతే సామాన్య మానవులు కూడా మోహపరవశులవుతారు. అందుకే శ్రీరామచంద్రుని, మునీశ్వరులంతా "రామా ! నిన్ను ఒక్కసారి కౌగిలించుకోవాలని ఉన్నది." అని అడిగారు. అప్పుడు శ్రీరామచంద్రుడు వారితో "మునీశ్వరులారా ! ద్వాపర యుగంలో నేను శ్రీకృష్ణునిగా జన్మిస్తాను. మీరు గోపికలుగా జన్మించండి. మీ కోరిక తీరుతుంది" అన్నాడు. అతడు మునీశ్వరులకు కూడా మోహం కలిగించే సౌందర్యవంతుడు.

క్షీరసాగర సమయంలో, సముద్రం నుంచి ఉద్భవించిన వారు అప్సరసలు. వీరు దేవవేశ్యలు. అపురూపసౌందర్యవంతులు. వారిని మించిన సౌందర్యవంతులు మరిలేరు. అటువంటి వారిని కూడా సమ్మోహింపచేయగల సౌందర్యవంతుడు.

**క అంతః కాంతః**

క అంటే బ్రహ్మ. బ్రహ్మకు కూడా అంతము కలిగించేవాడు. బ్రహ్మకల్పం పూర్తికాగానే బ్రహ్మ కూడా పరబ్రహ్మలో లీనమైపోతాడు. ఈ రకంగా బ్రహ్మను కూడా అంతం చేస్తాడు కాబట్టి 'కాంతాః' అనబడుతున్నాడు. అంటూ 'కేశవుని' గురించి వివరించాడు రత్నాకరుడు.

# 45. పరమేశ్వరారాధన

"గురువుగారూ ! శ్రీమన్నారాయణుడే పరమేశ్వర స్వరూపము అన్నాము కదా! మరి ఆ పరమేశ్వరుని పొందే మార్గమేమిటో వివరించండి" అన్నాడు కృష్ణశర్మ చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

నిరాకారుడు నిర్గుణస్వరూపుడు పరబ్రహ్మ. ఈ జగత్తంతా వ్యాపించి ఉన్నాడు కాబట్టి సర్వవ్యాపి అనబడతాడు. సమస్త జీవరాశియందు ఉన్నాడు కాబట్టి అంతర్యామి అనబడుతున్నాడు. అతడే శ్రీమన్నారాయణుడు. సృష్టి ప్రారంభంలో ఉన్నది అతని రూపము ఒక్కటే. ఈ చరాచరజగత్తు అంతా అతని నుంచే ఆవిర్భవించింది. మళ్ళీ అతడియందే లయమవుతున్నది. ఈ రకంగా సృష్టి స్థితిలయకారకుడు అతడే. స్థావరజంగమాత్మకమైన ఈ జగత్తులో సర్వమూ అతడే. యక్ష, గరుడ, కిన్నెర, కింపురుష, సిద్ధ, సాధ్య, దేవ, నాగగణాలను సృష్టించినవాడు అతడే. అతడు వేదపురుషుడు. ధర్మస్వరూపుడు.

తనను చేరుకోవటానికి మానవుడికి మంత్రవిద్యను ప్రవచించినవాడు. సప్తకోటి మంత్రాలు అతని అధీనంలోనే ఉంటాయి. అతడి రూపము ఇంత అని నిర్ణయించటానికి వీలులేదు. ఏ యుగంలో ఏ రూపం కావాలో, దాన్ని ధరిస్తాడు. జగత్తంతా వ్యాపించినవాడు. ధర్మసంస్థాపన చేసి సాధువులను, సజ్జనులను కాపాడతాడు. వీరిని హింసించు వారిని తన చక్రాయుధముతో శిక్షిస్తాడు. అతడు ఎక్కడ ఉన్నాడు అంటే అక్కడ ఉన్నాడని, ఇక్కడలేడని చెప్పలేము. అతడు ఈ జగత్తంతా వ్యాపించి ఉన్నాడు. ఏ బంధనాలు లేనివాడు. ఆద్యంతరహితుడు. ధనాన్ని జయించినవాడు. ప్రాకృత ఆత్మలకు హితమైనవాడు. చతుర్ముఖ బ్రహ్మను సృష్టించినవాడు. బ్రహ్మ స్వరూపమైనవాడు. ధర్మస్వరూపుడు. తపస్సు, దానము, ధర్మము, న్యాయము అనే వాటిని అభివృద్ధి చేసినవాడు. బ్రాహ్మణరూపంలో అవతరించినవాడు. సకలము తనదిగా గలవాడు. వేదశాస్త్రాలు బాగా తెలిసినవాడు. వేదం చదవటానికి అర్హతగల బ్రాహ్మణుల యందు ప్రీతి గలవాడు. సంసారమనే పాతాళంలో ఉన్న వారిని రక్షించటానికి భక్తి, జ్ఞాన, వైరాగ్యాలను సోపానాలుగా గలవాడు. నీచాతినీచులు కూడా తనను పొందేటట్లు చేయగలవాడు. గొప్ప కాంతివంతుడు. అతని కాంతిచేతనే చంద్రసూర్యాగ్నులు కాంతులను తీసుకుని ఈ లోకాలను ప్రవర్తిల్లచేస్తున్నారు. భక్తుల హృదయాలలో ప్రవేసించి వారికి జ్ఞానతృష్ణ కలుగచేసేవాడు.

అతడు సులభముగా ఆరాధింపదగినవాడు. ఆరాధనా విషయంలో ఏరకమైన నియమనిష్ఠలు లేనివాడు. ఇతర దేవతలకన్న మిక్కిలి శ్రేష్ఠుడు. అశ్వమేధము వంటి యాగలను చేసేవాడు. యాగ స్వరూపముతానే అయినవాడు.

అజ్ఞానులలో కూడా నారాయణ స్వరూపాన్ని ప్రతిష్ఠింప చేసేవాడు. అతడు స్తుతించటానికి అర్హుడు. స్తోత్రప్రియుడు. స్తోత్రము చేసేవాడు. భక్తులను రక్షించటానికి యుద్ధాలు చేసేవాడు. అతడు పూర్ణపురుషుడు. అతని నామస్మరణచేస్తేనే సమస్త పాపాలు పటాపంచలైపోతాయి. మచ్చలేని కీర్తిమంతుడు. తన భక్తుల యొక్క సంసారబంధనాలను తొలగించేవాడు. భక్తులను రక్షించేందుకు మనోవేగంతో వెళ్ళేవాడు. గంగా మొదలైన పుణ్యనదులకు కారణమైనవాడు. అతన్ని స్మరించినంతమాత్రముచేతనే అన్ని పాపాలను పోగొట్టేవాడు. అటువంటి శ్రీమన్నారాయణుని పొందాలంటే మానసిక ఆరాధనచాలు. అది చేతకాని వారు అతన్ని స్తోత్రము చెయ్యవచ్చు. స్తుతి చేసినంతమాత్రంచేతనే సంతుష్టుడై భక్తుల కోరికలు తీర్చే పరమదయామయుడు. పరమపావనుడు. ఈ విషయాలన్నీ 655 నుంచి 691 వరకు నామాలలో వివరించబడ్డాయి. ఇక నామాలను చూద్దాం.

## 655. కృతాగమః

మంత్రవిద్యను చెప్పినవాడు. 789వ నామము కూడా ఇదే.

**మంత్రవిద్యా వ్యంజకత్వాత్ కృతాగమ ఇతీరితః** అనేకమైన మంత్రవిద్యలను ప్రకటించినవాడు.

**కృతః ఆగమః యేనసః కృతాగమః** మంత్రవిద్యను ఉపదేసించినవాడు.

**నానామంత్రమయీం దివ్యాం వ్యంజయత్వమాత్మనాం**

అనేక రకాలైన మంత్రాలను ప్రవచించినవాడు.

సృష్టి ఆరంభంలో జగత్తు అంతా శూన్యంగా ఉండేది. ఆ సమయంలో నిరాకారుడు నిర్గుణ స్వరూపుడు అయిన పరబ్రహ్మ బిందురూపంలో ఉన్నాడు. అతడు సృష్టి చెయ్యాలని సంకల్పించినవాడై తనలోని కొంతశక్తిని బయటకు పంపాడు. ఈ రకంగా అవ్యక్తమైన పరబ్రహ్మ నుంచి వ్యక్తమైన శక్తి బయటకు వచ్చింది. ఇక ఆ శక్తినుంచి నామరూపాత్మకమైన జగత్తు ఏర్పడింది. రూపాత్మకము అంటే ముందుగా తన్మాత్రలు, పంచభూతాలు ఏర్పడ్డాయి. ఆ పంచభూతాలు పంచీకరణ చెందటంవల్ల సృష్టి జరిగింది. వివిధరకాలయిన జీవులు ఆవిర్భవించాయి. ఇక రెండవ వైపునుంచి నామాత్మకమైన సృష్టి జరిగింది. అంటే – నిరాకారుడైన పరబ్రహ్మకు గుర్తు ఓంకారము. దానినుంచే అ నుంచి క్ష వరకు గల అక్షరసమామ్నాయము ఏర్పడింది. దానినుండి పదములు, వాటినుండి మాటలు, వాక్యాలు, మంత్రాలు, వేదాలు, శాస్త్రాలు, సంగీతము, సాహిత్యము వచ్చినాయి. ఈ రకంగా పరమేశ్వరుని నుండే సర్వమంత్రశాస్త్రము వచ్చింది.

మంత్రశాస్త్రంలో 'ఆమ్నాయాలు' అంటే వేదము, సంప్రదాయము, ఉపదేశము అని అర్థం. ఇవి మొత్తం ఆరురకాల అమ్నాయాలు ఉన్నాయి. వీటినే షడామ్నాయాలు అంటారు. అవి

1. పూర్వామ్నాయము
2. దక్షిణామ్నాయము
3. పశ్చిమామ్నాయము
4. ఉత్తరామ్నాయము
5. ఊర్ధ్వామ్నాయము
6. అనుత్తరామ్నాయము

దేవీభాగవతంలో పరమేశ్వరి దేవతలకు దర్శనమిచ్చినప్పుడు ఆమ్నాయ దేవతలు ఆకారాలు ధరించి ఆ పరమేశ్వరిని స్తుతిస్తున్నాయి అని చెప్పబడింది. ఈ ఆమ్నాయాలకు అంటే మంత్రశాస్త్రానికి అధిపతి – పరమేశ్వరుడు. అతడే ఈ మంత్రశాస్త్రాని చెప్పినవాడు. అందుకే శ్రీమన్నారాయణుడు కృతాగమః అనబడుతున్నాడు.

మంత్రము అంటే కొన్ని బీజాక్షరాల సముదాయము. అక్షరాలు మొత్తం 50. ఇవన్నీ పరమేశ్వరుని నుండే వచ్చినాయి. అంటే ఓంకారము నుంచే వచ్చినాయి. ఆ బీజముల యొక్క సంపుటీకరణమే మంత్రము. అందుచేతనే మంత్రశాస్త్రమంతా ఆ పరమేశ్వరుని నుంచే వచ్చింది.

వేదాలు, శాస్త్రాలు, పురాణాలు వ్రాసినవాడు పరమేశ్వర స్వరూపుడైన వ్యాసుడు. వేదాలు సాక్షాత్తూ బ్రహ్మముఖం నుండే వచ్చినాయి. వ్యాసుడు వేదవిభజన చేశాడు. ఇక అష్టాదశ పురాణాలను వ్యాసుడు వ్రాశాడు. ఇతడు పరమేశ్వరుని అవతారము. ఈ రకంగా వేదశాస్త్రపురాణాదులను రచించాడు కాబట్టి 'కృతాగమః' అనబడుతున్నాడు.

**శృతిస్మృతీ యమైవాజ్ఞే** శృతులు స్మృతులు అన్నీ నా ఆజ్ఞలే. నా ఆదేశాలే.

**వేదాః శాస్త్రాణి విజ్ఞానమే తత్సర్వం జనార్దనమ్**

వేదాలు, శాస్త్రాలు, విజ్ఞానము అంతా జనార్దనుని నుండే ఏర్పడ్డాయి అని చెప్పబడింది. అందుకే శ్రీమన్నారాయణుడు 'కృతాగమః' అనబడుతున్నాడు.

## 656. అనిర్దేశ్యవపుః

నిర్ణయింపజాలని శరీరము కలవాడు. 177వ నామము కూడా ఇదే.

**యుగానుసారి రూపత్వాత్ అనిర్దేశ్య వపుస్మృతః**

ఆ యుగములకు తగిన శరీరము ధరించి అవతరించేవాడు. అందుచేత అతని రూపమిది అని చెప్పటానికి లేదు.

**అనిర్దేశ్యంవపుః యస్యసః అనిర్దేశ్యవపుః** నిర్దేశింపజాలని శరీరము గలవాడు.

**యుగానుకారకాంతిశ్చ** ఆయుగాలకు తగినట్లుగా శరీరము ధరించేవాడు.

పరమేశ్వరుడు అవసరాన్ని బట్టి ఏ రూపమైనా ధరిస్తాడు. అక్కడ కావలసినది కేవలం ధర్మరక్షణ.

సోమకాసురుని సంహరించటానికి – చేపయైనాడు.

మందరగిరి పర్వతంమొయ్యటానికి – ఆదికూర్మమైనాడు

పాతాళానికిదిగిపోయిన భూమిని ఉద్ధరించటానికి – ఆదివరాహమైనాడు

రావణబ్రహ్మను సంహరించటానికి – రాముడైనాడు

అంతేకాదు జగత్తును రక్షించటానికి అనేక అవతారాలెత్తాడు. అంటూ సృష్టిలోని అన్ని రూపాలు అతడివే. అతని రూపము ఇది అని చెప్పటానికి లేదు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'అనిర్దేశ్యవపుః' అనబడుతున్నాడు. నిర్వచించటానికి వీలు కానివాడు. ఊహించటానికి మనసుకు అందనివాడు. త్రిగుణములకు, త్రికాలములకు అతీతుడు. ఏ రూపము లేనివాడు.

## 657. విష్ణుః

వ్యాపించినవాడు. 2,258 నామాలు కూడా ఇదే

**స్వశక్త్యాజగతో వ్యాప్తే యద్వా విక్రమణా త్స్వతః విష్ణు స్స్మృతో విశేషణ** స్వశక్తిచేతనే ప్రపంచమంతా వ్యాపించి ఉండువాడు. ముల్లోకములు ఆక్రమించినవాడు.

**వేవేష్టి వ్యాప్నోతి విష్ణుః** లోకమంతా వ్యాపించినవాడు. **ఆదిత్యపురాణంలో**

**యస్మాద్విష్టమిదం సర్వం తస్యశక్త్యా మహాత్మనః**
**తస్మాత్స ప్రోచ్యతే విష్ణుః విశేర్ధాతోః ప్రవేశనాత్**

ఆ మహనీయుడు తన శక్తిచే ఈ జగత్తునంతా వ్యాపించి ఉన్నాడు. అతడే విష్ణువు.

విష్ణువు అనగా – సర్వవ్యాపి అని అర్థం. **బృహదారణ్యకోపనిషత్తులో**

సృష్టి ప్రారంభం కాకముందు ఈ జగత్తంతా శూన్యంగా ఉండేది. అప్పుడు జగత్తునంతా పరమేశ్వరుడే ఆక్రమించి ఉన్నాడు. ఆ తరువాత లోకాలను సృష్టించాడు. స్వాయంభువమనువు, శతరూప అనే భార్యా భర్తలను సృష్టించాడు. వారివల్లనే 84 లక్షల జీవరాశి ఆవిర్భవించి ఈ జగత్తు ఉద్భవించింది. అని చెప్పబడింది.

**ఐతరేయోపనిషత్తు**లో జగత్తులో ప్రాణులను సృష్టించిన తరువాత, ఆ జీవి శరీరంలో నేను ప్రవేశించకపోతే ఎలా అనుకున్నటువంటివాడై పరమేశ్వరుడు బ్రహ్మ రంధ్రం ద్వారా దేహంలో ప్రవేశించాడు. అని చెప్పబడింది.

ఈ రకంగా అతడు అన్ని రూపాలతోను చరాచర జగత్తంతా వ్యాపించి ఉన్నాడు. అందుకే **ఛాందోగ్యోపనిషత్తు**లో పరబ్రహ్మను గురించి చెబుతూ

జగత్తులోని నాలుగు దిక్కులు పరబ్రహ్మమే. నదులు, సముద్రాలు, కొండలు, పర్వతాలు, లోయలు, చెట్లు, చేమలు, సూర్యుడు, అగ్ని, వాయువు, నక్షత్రాలు, లోకాలు అన్నీ పరబ్రహ్మమే. ప్రాణమున్నవి, ప్రాణం లేనివి, చలనమున్నవి, చలనం లేనివి, అన్నీ పరబ్రహ్మ స్వరూపమే అని చెప్పబడింది. ఈ రకంగా పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు జగత్తంతా వ్యాపించి ఉన్నాడు. అందుకే అతడు 'విష్ణుః' అనబడుతున్నాడు. **మహాభారతం**లో

**వ్యాప్యమే రోదసీ పార్థ కాంతి రభ్యధికాస్థితా ।**
**క్రమణా ద్వాఽప్యంకం పార్థ విష్ణురిత్యభి సంజ్ఞితః ॥**

అర్జునా ! భూమ్యాకాశాలు వ్యాపించినదై, నా వైభవము మిక్కిలి అధికమై ఉన్నది. అందుచేత నేను విష్ణువు అనబడతాను.

వామనావతారంలో బలిచక్రవర్తి నుంచి మూడడుగులనేల దానంగా తీసుకుని రెండు అడుగులతో భూమ్యాకాశాలను ఆక్రమించినవాడు. ఈ రకంగా లోకమంతా వ్యాపించిన శ్రీమన్నారాయణుడు విష్ణువు అనబడుతున్నాడు.

## 658. వీరః

నిరసించువాడు. 410, 463 నామాల కూడా ఇదే

**వీరస్యాత్సాధు దుఃఖహా** సజ్జనులను బాధించేవారిని తన చక్రాయుధంతో నశింపచేస్తాడు.

**అజతిక్షిపతి హినస్తీతి వీరః** సాధుజనులను హింసించువారిని చక్రము, గదా మొదలైన ఆయుధములచే సంహరించువాడు.

**ఆజ్ఞాప్రతీక్ష కేణైవ గదాచక్ర ద్వయేనతు**
**ప్రేరితేన హినస్త్యాశు సాధుసత్తాపకారిణః**

తన ఆజ్ఞకోసం ఎదురు చూసే చక్రాది ఆయుధములు ప్రయోగించి సాధువులను హింసించేవారిని సంహరించువాడు.

ధాతువును సూచించే కర్మలచే నిండి ఉన్నటువంటివాడు. అందుచేతనే వీరుడనబడుతున్నాడు.

**వీగత వ్యాప్తి ప్రజన కాంత్యసన ఖాదనేషు**

వీ అనగా - వ్యాప్తి, గమనము, జననము, కాంతి, పారద్రోలు, భుజించు అని అర్థాలు. ఇవన్నీ కలవాడు కాబట్టి 'వీరః' అనబడుతున్నాడు.

అసుర సంహారం కోసం ఆయుధాన్ని ఎంతదూరమైనా విసరివేస్తాడు.

జగత్తునంతా వ్యాప్తి చెంది ఉంటాడు. ఎక్కడికైనా శీఘ్రముగా వెళ్ళగలవాడు. ఆత్మ కదలకుండానే జగత్తంతా సంచరిస్తుంది అని ఉపనిషద్వాక్యము పరమేశ్వరుడు తేజోమయుడైన కాంతి బింబము. తన భక్తుల హృదయాలలోని అవిద్య అనే చీకటిని పారద్రోలేవాడు.

మహాప్రళయం జరిగినప్పుడు జగత్తునంతా భుజించేవాడు. అందుకే శ్రీమహావిష్ణువు వీరుడు.

## 659. అనంతః

అంతములేనివాడు. అవధులు లేనివాడు. 886వ నామము కూడా ఇదే.

**దేశతః కాలతోవాపి గుణతోవస్తుతోऽపివా ।**

**అవధిర్యస్య నా స్తీతి సోऽనంత స్సముదాహృతః ॥**

దేశకాలమానముల వల్ల హద్దులు లేనివాడు. అంటే

ఇక్కడ ఉన్నాడు - అక్కడ లేడు

ఇప్పుడున్నాడు - అప్పుడు లేడు

గుణాలున్నాయి - ఆ గుణాలు లేవు

ఈ వస్తువునందున్నాడు - ఆ వస్తువునందు లేడు

ఇలాంటి నిబంధనలు ఏవీ లేనివాడు సర్వకాల సర్వావస్థల యందు, సర్వత్ర ఉండేవాడు. ఆది అంతములేనివాడు.

**న అంతః యస్యసః అనంతః** అంతములేనివాడు. అంతటా, సకల విధాలుగా ప్రవర్తించేవాడు. **భగవద్గీత** 10వ అధ్యాయం **'విభూతి యోగము'**లోని 19వ శ్లోకము

**హంత తే కథయిష్యామి దివ్యా హ్యాత్మవిభూతయః ।**

**ప్రాధాన్యతః కురుశ్రేష్ఠః నాస్త్యంతో విస్తరస్య మే ॥**

ఓ అర్జునా ! నా దివ్యవిభూతుల వ్యాప్తికి అంతమే లేదు. వాటిలో ప్రధానమైనవాటిని కొన్నింటిని నీకు చెబుతున్నాను.

పరమేశ్వరుని విభూతులు అనంతములు. అని చెప్పబడింది.

దేవీభాగవతంలో తారకాసుర సంహారం కోసం తపస్సు చేస్తున్న దేవతలకు పరమేశ్వరి సాక్షాత్కరించింది. అప్పుడు ఆమె

**ఆద్యంత రహితం తత్తు న హస్తా ద్యంగ సంయుతం**

ఆది, అంతము లేకుండా కాలు చేతులు మొదలైన అంగములు లేకుండా ఉన్నది. అని చెప్పబడింది. పరమేశ్వర తత్త్వము ఈ జగత్తంతా ఆవరించి ఉన్నది. ఇక్కడ అక్కడ అనే తేడా లేకుండా అంతటా ఆవరించి ఉన్నది. దానికి ఆది అంతము లేవు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'అనంతః' అనబడుతున్నాడు.

## 660. ధనంజయః

ధనమును జయించినవాడు, అర్జునుడు.

**ప్రేప్సోపార్జనలోభాది యోగ్యత్వాధికృత స్తతః**
**మణిమౌక్తిక రత్నాని హేమరౌప్యాదికం ధనమ్**
**యోఽధః కరోతి సతతం ధనంజయ ఇతీరితః ॥**

మణిమాణిక్యాలు, రత్నాలు, బంగారము, వెండి, ధనము మొదలైనవాటిని పొందాలని ఆశ, వాటిని పొందటము, వాటియందు లోభము మొదలైన వికారాలు మానవులకు సహజము. తన భక్తులకు ఆ విధమైన వికారాలు కలగకుండా, తనయందే ఎక్కువ ఆశను పెంపొందింప చేయువాడు. అలౌకిక ధనసంపత్తులను నాశనం చేసేవాడు.

**ధనంజయతీతి ధనంజయః** పరమేశ్వరుడు కావాలా ? ధనధాన్యాలు కావాలా ? అంటే పరమేశ్వరుడే కావాలి అని భక్తులు పరతత్త్వము వైపే మ్రొగ్గుచూపేటట్లుగా చేసేవాడు.

తన భక్తులకు లౌకిక బంధనాలను త్రెంచి వేసి వారు మోక్షం పొందటానికి వీలైన పరతత్త్వాన్ని బోధించేవాడు.

ధనంజయుడు – అర్జునుడు. ఇతడు కూడా పరమాత్ముని విభూతియే. **భగవద్గీత**లోని 10వ అధ్యాయం **'విభూతియోగం'**లోని 37వ శ్లోకము.

**వృష్ణీనాం వాసుదేవోఽస్మి పాండవానాం ధనంజయః**
**మునీనామప్యహం వ్యాసః కవీనాముశనా కవిః**

వృష్ణివంశజులలో వాసుదేవుడను నేను. పాండవులలో ధనంజయుడను నేను. మునులలో వేదవ్యాసుడను నేను. కవులలో శుక్రాచార్యుడను నేను.

అర్జునుడు అంటే ఎవరోకాదు. సాక్షాత్తు పరమేశ్వరుడే. హిరణ్యకశ్యపుని సంహరించిన తరువాత నారసింహుడు తల, మొండెము, రెండు భాగాలయినాడు. వారే నరనరాయణులు. బదరికావనములో తపస్సు చేసి సహస్రకవచుడనే రాక్షసుని 999 కవచాలను విచ్ఛిన్నం చేశారు. ఆ రాక్షసుడు పారిపోయి సూర్యుడిని శరణువేడాడు. అతడే కర్ణుడుగా అవతరించాడు. అతన్ని సంహరించటానికే నరనారాయణులు కృష్ణార్జునులుగా జన్మించారు. అందుకే శ్రీమన్నారాయణుడు ధనంజయుడు అని పిలువబడతాడు.

## 661. బ్రహ్మణ్యః

ప్రాకృత ఆత్మలకు హితమైనవాడు.

**జీవాత్మా ప్రకృతిశ్చాపి బ్రహ్మేతి వ్యపదిశ్చతే**
**తాభ్యాం యస్థ్సితి భోగాదేః సర్వావస్థానుకారణమ్**
**బ్రహ్మణ్య స్స చవిజ్ఞేయః సప్తార్ణో భోగదాయకః**

జీవాత్మ, ప్రకృతి రెండూ బ్రహ్మ అనబడతాయి. ఆ రెండింటి యొక్క స్థితికి, భోగానికి అన్ని అవస్థలలోను కారణమై ఉండువాడు. ఈ నామము సప్తాక్షరి మంత్రము. భోగప్రదము.

**బృహతే హితః బ్రహ్మణ్యః** ప్రకృతికి, ఆత్మకు హితమైనవాడు.

కర్మచెయ్యటంచేత భోగము, జ్ఞానముచేత మోక్షము అనుభవిస్తూ సర్వావస్థలలోను హేతువై ఉండువాడు.

బ్రహ్మను అనుభవించువాడైన భగవానుడు బ్రహ్మణ్యః అనబడతాడు.

**తపోవేదాశ్చ విప్రాశ్చ జ్ఞానంచ బ్రహ్మ సంజ్ఞితమ్**

తపస్సు, వేదములు, విప్రులు, జ్ఞానము, వీటికి బ్రహ్మ అని పేరు. వీటన్నింటియందు ఇష్టతగలవాడు కాబట్టి పరమేశ్వరుడు 'బ్రహ్మణ్యః' అనబడతాడు.

## 662. బ్రహ్మకృత్

బ్రహ్మను కలిగించువాడు.

తపస్సు, వేదములు, విప్రులు, జ్ఞానము కలిగించువాడు. ముముక్షువులకు తపస్సు చెయ్యాలనే తపన కలిగించేవాడు. కర్మ బ్రహ్మకు వేదములు సృష్టించి ఇచ్చినవాడు. తననే స్మరించు భక్తులకు మోక్షసాధనము కోసము జ్ఞానము కలిగించువాడు.

తపస్సు మొదలైన వాటికి తానే కర్త అయినవాడు. తపస్సు, వేదములు, జ్ఞానము తన రూపమే అయినవాడు. బ్రహ్మ అనగా – జీవుడు, ప్రకృతి అని అర్థము.

ప్రకృతికీ, జీవుడికీ ఆధారమై ఉండేవాడు. ఈ రెండూ తననుంచే ఆవిర్భవించినాయి కాబట్టి శ్రీమన్నారాయణుడు 'బ్రహ్మకృత్' అనబడతాడు.

## 663. బ్రహ్మ

కర్మబ్రహ్మ స్వరూపుడు.

ఈ సృష్టి చెయ్యాలి అని సంకల్పించిన పరబ్రహ్మ మొదటగా చతుర్ముఖబ్రహ్మను సృష్టించి అతనికి వేదాలనిచ్చాడు. ఈ రకంగా కర్మ బ్రహ్మను సృష్టించినవాడు.

అసలు పరబ్రహ్మ చతుర్ముఖ బ్రహ్మరూపుడు. జగద్వ్యాపారాలయిన సృష్టి స్థితి సంహారాలు చెయ్యటానికి ఆ పరమేశ్వరుడు మూడురూపాలు ధరించినవాడు. అవే త్రిమూర్తులు. బ్రహ్మవిష్ణువురుద్రులు. వీరిలో ఒకడైన బ్రహ్మ ఆ పరమేశ్వరస్వరూపుడే. పరమేశ్వరుడు చతుర్ముఖబ్రహ్మను సృష్టించగా, చతుర్ముఖ బ్రహ్మనుంచి నామరూపాత్మకమైన జగత్తు సృష్టించబడింది.

శంకరభగవత్పాదులవారు వీటిని రెండు నామాలుగా వ్రాయగా, పరాశరభట్టరువారు ఒకే నామంగా వ్రాశారు.

**బ్రహ్మకృత్‌బ్రహ్మ :** చతుర్ముఖబ్రహ్మను నియమించినవాడు.

**మహదాది తమః కార్యం బ్రహ్మేతి హ్యభి ధీయతే**

**తస్య కర్తా స్వయం బ్రహ్మ నియామ్యే యస్య సర్వదా**

**సతుస్యాద్బ్రహ్మకృద్బ్రహ్మ నవార్ణః సర్వశక్తిదః**

మహదాది వికారాలకు బ్రహ్మ అని పేరు. ఆ వికారాలను పుట్టించేవాడు కూడా బ్రహ్మే. అటువంటి చతుర్ముఖబ్రహ్మ తన అధీనమున గలవాడు. ఈ నామము నవాక్షరీ మంత్రము. సర్వశక్తిప్రదము.

**బ్రహ్మకృతః బ్రహ్మ బ్రహ్మకృద్బ్రహ్మ** మహత్తత్వము, అహంకారము అని ప్రకృతియొక్క కార్యవర్గాన్ని విస్తరింపచేసే చతుర్ముఖబ్రహ్మను నియమించినవాడు.

ఈ జగత్తును సృష్టించిన బ్రహ్మను నియమించినవాడు. ఆది దేవుడైన చతుర్ముఖ బ్రహ్మకు నియామకుడు.

# 664. బ్రహ్మా

బ్రహ్మస్వరూపమైనవాడు.

**వ్యక్తావ్యక్త సమష్ట్యాది పురుషాంశ్చైవ నిత్యశః**
**గుణైశ్చకల్యాణతమైః బ్రహ్మ బ్రహ్మ యతీతి చ ॥**

**రూపై స్వరూపేణ గుణైః విభవైశ్చ స్వయం ముహుః**
**బ్రహ్మేతి స తు వా బ్రమ్మ షడర్ణ వృసంతతి ప్రదః ॥**

వ్యష్టిరూపంగాను, సమిష్టిరూపంగాను ఉండే వ్యక్తావ్యక్తస్వరూపులైన చేతనులను తనయొక్క కల్యాణగుణములచేత వృద్ధిపొందించేవాడు. తాను కూడా స్వరూపగుణ విభవాదులచేత మాటిమాటికీ అభివృద్ధి చెందే వేదాంతవేద్యుడు. ఈ నామము షడక్షరి సంతానకరము.

**బృహంతి వర్ధతేతి ఇతి బ్రహ్మే.** వ్యక్తావ్యక్తమైన వాటిని, వ్యష్టి, సమిష్టి స్వరూపాలను సృష్టిచేస్తూ, తాను నిరతిశయకల్యాణ గుణములచేత ప్రకాశించేవాడు. వేదాంతవేద్యుడు.

జగత్తంతా వ్యాపించి దేదీప్యమానంగా ప్రకాశించేవాడు.

బ్రహ్మయొక్క రూపమే వేదాలు. అతని యొక్క ఆజ్ఞలే ఆగమాలు. అటువంటి వేదాలను పూర్తిగా ఎరిగినవాడు. వేదములచేత ప్రతిపాదితమైనవాడు. వేదములయొక్క సారము, ఉపనిషత్తులు. ఉపనిషత్తులసారము జ్ఞానము. అదే పరబ్రహ్మ స్వరూపము. అటువంటి జ్ఞానస్వరూపుడు కాబట్టే శ్రీమన్నారాయణుడు 'బ్రహ్మ' అనబడుతున్నాడు.

అనంతమైనవాడు బ్రూహి అంటే – పెద్దది అని అర్థం. పరబ్రహ్మ స్వరూపం అతిపెద్దది. ఎంత పెద్దది అంటే ఎంత వెతికినా అంతు చిక్కనిది. అనంతమైనది.

**లింగపురాణం**లో ఈశానకల్పానికి ముందు సంగతి. ప్రళయం సంభవించింది. లోకాలన్నీ నశించిపోయినాయి. అంతా జలమయంగా ఉన్నది. ఆ సమయంలో చతుర్భుజుడైన శ్రీమహావిష్ణువు సముద్రజలం మీద నిద్రపోతున్నాడు. ఆ సమయంలో బ్రహ్మ అక్కడికి వచ్చి "వీడెవడో నాకన్నా ముందుగా వచ్చి సుఖంగా నిద్రపోతున్నాడు. నేను వచ్చాననే విషయంకూడా గుర్తించటంలేదు" అని ఆలోచించి కోపంతో శ్రీమహావిష్ణువును రెండు దెబ్బలు వేశాడు. దాంతో విష్ణువు నిద్రనుంచి లేచి "నువ్వు బాలుడవు. అందుచేతనే తెలివిలేక నన్ను కొట్టావు. మహాయోగులు కూడా నన్ను తెలుసుకోలేరు. నువ్వెలా తెలుసుకుంటావు?" అన్నాడు. దానికి బ్రహ్మ కోపించి "నువ్వు నాకన్న గొప్పవాడివేమిటి.

ఈ జగత్తును సృష్టించింది నేను" అన్నాడు. వారిద్దరి మధ్య వివాదము పెరిగి పెద్దదయింది. శృతి మించి రాగాన పడింది. అప్పుడు వారి మధ్య ఒక దివ్యతేజస్సు దాపురించింది. అదే మహాదేవుడు. మహాదేవుడు 'ఓ దేవతలారా ! ఈ రకంగా మీరు తగవులాడుకోవటం బాగాలేదు. మీ తగవు తీరే విధానం నేనొకటి చెబుతాను వినండి. ఇదిగో ఇది మహా లింగము. రమాపతీనువ్వు క్రిందికివెళ్ళి దాని మూలమెక్కడుందో తెలుసుకో. బ్రహ్మదేవా ! నువ్వు పైకి వెళ్ళి ఈ లింగము యొక్క అంతము తెలుసుకోవలసినది అన్నాడు. మీరిద్దరిలో ఈ రహస్యాన్ని తెలుసుకుని ముందుగా ఎవరు తిరిగివస్తే వారే గొప్పవారు" అన్నాడు.

బ్రహ్మ హంసవాహనంమీద పైకి బయలుదేరాడు. విష్ణువు పాతాళానికి వెళ్ళాడు. కాని ఆ లింగముయొక్క ఆది, అంతము కనుక్కోలేక వారు తిరిగి వచ్చేశారు. తల వంచుకుని నిలబడ్డారు. అప్పుడు ఈశ్వరుడు "ఓ మహానుభావులారా ! నేనే పరమేశ్వరుడను. ఇది నా స్వరూపమైన లింగము. దీనికి ఆద్యంతము తెలుసుకొనగలవాడే జ్ఞాని. "మహానుభావుడు" అంటాడు. ఈ రకంగా పరమేశ్వరతత్త్వము ఆద్యంతములు లేనిది.

**సత్యజ్ఞానమనంతం బ్రహ్మ** సత్యమైనది, జ్ఞానమైనది, అనంతమైనది పరబ్రహ్మ స్వరూపము.

## 665. బ్రహ్మవివర్ధనః

ధర్మములను వృద్ధి చెందించువాడు.

**తపోవిపర్ధ నాన్నిత్యం స్మృతో బ్రహ్మవివర్ధనః**

తపస్సు మొదలైన ధర్మాలనెప్పుడు వృద్ధిపొందించువాడు.

**బ్రహ్మ వివర్ధయతీతి బ్రహ్మవివర్ధనః** ధర్మములను వృద్ధి చేయువాడు.

బ్రహ్మము అనగా ధర్మము అని అర్ధము.

ధర్మానికి నాలుగు పాదాలున్నాయి. ఇక్కడ పాదము అంటే కాలు అని కాదు. భాగము అని అర్ధం. అంటే ధర్మం నాలుగుభాగాలుగా ఉన్నది. అవి

1. సత్యము 2. న్యాయము 3. దయ 4. తపస్సు. వీటిని వృద్ధి చేయువాడు.

పరమేశ్వరుడు ధర్మస్వరూపుడు. ఏదైనా ఒక పనిచెయ్యాలంటే ఆయనకు ధర్మమే ఆయుధం. కాబట్టే ధర్మాన్ని వృద్ధి చేస్తాడు.

**రామోవిగ్రహవాన్ ధర్మః** రాముడు మూర్తీభవించిన ధర్మస్వరూపుడు. భూలోకంలో ఎప్పుడైతే ధర్మానికి హాని జరుగుతుందో అప్పుడు, నేను ఈలోకంలో జన్మించి ధర్మసంస్థాపన

గావిస్తుంటాను. **ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే** అని చెప్పాడు. కాబట్టి పరమేశ్వరుడు సర్వకాల సర్వావస్థలయందు ధర్మాన్ని రక్షిస్తుంటాడు. ధర్మాన్ని వృద్ధి చేస్తుంటాడు. అందుకే శ్రీమన్నారాయణుడు 'బ్రహ్మవివర్ధనః' అనబడతాడు.

# 666. బ్రహ్మవిత్

వేదములనెరిగినవాడు, ఆత్మనెరిగినవాడు.

**యోవేదానంతో వేత్తి స బ్రహ్మవిదుదీరితః** వేదాలను పూర్తిగా తెలిసినవాడు.

**వేదాలు:** ఇష్టప్రాప్తినీ, అనిష్ట పరిహారాన్నీ సాధించటానికి ఆలౌకికమైన ఉపాయాన్ని చెప్పేదే వేదము. సకలదేవతలను, ధర్మాన్నీ పరబ్రహ్మతత్త్వాన్నీ ప్రతిపాదిస్తుంది. కనుక వేద సామ్రాజ్యం ప్రత్యక్ష, అనుమాన ప్రమాణాలకు మించి ఉన్నది.

మానవుడు పరిపూర్ణుడు కాడు. అతను చెప్పిన సూక్తులు పరమార్థమని, భ్రాంతి రహితమని ఒప్పుకోలేము. అందుచేత, ఆతీంద్రియ సత్యాలకు సంబంధించినంతవరకూ స్వతఃసిద్ధమూ, స్వతః ప్రమాణము, నిత్యసిద్ధము, బ్రహ్మవాక్కు అయిన వేదాన్ని మాత్రమే నిర్దుష్టమైన అంత్య ప్రమాణంగా స్వీకరించగలం. భారతీయ సంస్కృతి ధార్మికంగానూ, ఆధ్యాత్మికంగానూ వికసిస్తుండటానికి వేదమే కారణము.

వేదాలు అపౌరుషేయాలు. సాక్షాత్తూ పరమేశ్వరుడే వాటిని బ్రహ్మదేవునికిచ్చాడు. వేదాలలో చెప్పిన లౌకిక, ఆధ్యాత్మిక సిద్ధాంతాలు శాశ్వతమైనవి. దివ్య ప్రజాపతులు, ఋషుల కలిసి పరమ పురుషుడే హవిస్సుగా చేసిన మానవ యజ్ఞం నుండి వేదాలు ఉద్భవించాయని పురుష సూక్తంలో చెప్పబడింది. పరమాత్మ బ్రహ్మను సృజించి అతనికి వేదాలు అనుగ్రహించాడు.

వేదం అనే మాటకు సాధారణ అర్థం "విద్య". వేదంలో పరా, అపరా అనే రెండురకాల విద్యలున్నాయి. వేదంలో రెండు కాండలున్నాయి. 1. జ్ఞానకాండ 2. కర్మకాండ వీటిలో కర్మకాండ అపరావిద్యను అంటే కర్మలు, నియమాలు, విధులు, ఆచారాలు వివరించగా జ్ఞానకాండ ఆత్మ, పరమాత్మ, ప్రపంచము మొదలైన స్వరూపాలను గూర్చి వివరిస్తుంది. మొత్తం మీద నువ్వులలో నూనెలాగా వేదమంతటా వేదాంతం సుప్రతిష్ఠితమై ఉన్నది.

వేదానికి నిగమము, శ్రుతి, ఆమ్నాయము అనికూడా పేర్లున్నాయి. దాని అర్థమేమంటే...

1. నిగమము - అనాదిగా వస్తున్న నిర్ధారితమైన మూలగ్రంథము.
2. శ్రుతి - గురువునుంచి శిష్యుడు వినే దివ్యవాణి.
3. ఆమ్నాయము - ఆవృత్తి లేదా మననం ద్వారా నేర్చుకోబడే విద్య.

కృతయుగంలో వేదం అంతా ఒకటిగానే ఉండేది. ద్వాపరయుగంలో బ్రహ్మదేవుడు 'అపాంతరతముడు' అనే మానసపుత్రుణ్ణి సృష్టించి వేదాలను భూలోకంలో బాగా ప్రచారం చేసి రమ్మన్నాడు. కలగా పులగంగా ఉన్న వేదాన్ని నాలుగు భాగాలుగా విభజించాడు. అపాంతరతముడు. దానికి సంతుష్టుడైన బ్రహ్మదేవుడు తన కుమారునికి ప్రతి మహాయుగం లోనూ వేదాన్ని విభజించమని చెప్పాడు. ఆ ప్రకారంగానే ప్రతి మహాయుగంలోనూ వేదం విభజించబడుతూనే ఉన్నది. వేదాలను విభజించిన వ్యక్తినే వేదవ్యాసుడు అంటారు. ప్రస్తుతము 28వ మహాయుగం జరుగుతున్నది. ఈ మహాయుగంలో కృష్ణద్వైపాయనుడు వేదాలను విభజించి వేదవ్యాసుడైనాడు. రాబోయే మహాయుగంలో ద్రోణాచార్యుని కుమారుడు అశ్వద్ధామ వేదవ్యాసుడౌతాడు.

వ్యాసుడు వేదాన్ని నాలుగు భాగాలుగా విభజించాడు. అవే 1. ఋగ్వేదము 2. యజుర్వేదము 3. సామవేదము 4. అధర్వణవేదము. స్తుత్యర్థకమైన మంత్రానికి 'ఋక్కు' అని పేరు. యజ్ఞపరాలైన మంత్రాలకు 'యజస్సులు' అని పేరు. నియమపూర్వకంగా గానంచేసే మంత్రాలకు "సామదములు" అనిపేరు.

**1. ఋగ్వేదము :** వేదాలలో ముఖ్యమైనది ఋగ్వేదము. అన్ని వేదాలలోనూ ఎక్కువ భాగం దీనికి పునరుక్తిగానో, అనుసరణగానో ఉంటుంది. దీనిలో 1028 దేవతా స్తుతులున్నాయి. వీటిలో అతి పెద్దది 52 శ్లోకాలు గలది. ఈ స్తోత్రాలన్నీ పది మండలాలుగా ఉన్నాయి. తత్త్వ, అలౌకిక విషయాలను వివరించటం వలన పదవమండలం విశేష ఆసక్తికరమైనది. ఐతరేయ, కౌశీతకీ, పైంగి, సాంఖ్యాయన బ్రాహ్మణాలు ఈ వేదానికి సంబంధించినవి. ఐతరేయ కౌశీతకీ అరణ్యకాలు ఆ బ్రాహ్మణాలకు పరిశిష్టాలుగాను, ఐతరేయ, కౌశీతకీ ఉపనిషత్తులు ఈ అరణ్యకాలకు అంతిమాంశాలుగాను ఉన్నాయి.

**2. యజుర్వేదము :** ఇది రెండు భాగాలుగా ఉన్నది. i) కృష్ణయజుర్వేదము ii) శుక్ల యజుర్వేదము.

i) **కృష్ణయజుర్వేదము :** ఇది చాలా వరకు గద్యరూపంలో ఉంటుంది. దీనికి క్రియావిధులు ఉంటాయి. తైత్తిరీయ, భాల్లవ, కాత్యాయన, మైత్రాయణ, కరుబ్రాహ్మణాలు ఈ వేదంలోనివే. వీటిలో ప్రసిద్ధమైనది తైత్తిరీయ బ్రాహ్మణము.

ii) **శుక్ల యజుర్వేదము :** ఇది 40 అధ్యాయాలుగల గ్రంథం. యజ్ఞాలకు సంబంధించిన విషయాలు ఇందులో క్రమబద్ధంగా ఉన్నాయి. ఈ వేదం ముఖ్యంగా మాధ్యందిన, కాణ్వ సంప్రదాయాలలో ఉన్నది. ప్రఖ్యాతమైన శతపథ బ్రాహ్మణము ఈ వేదానికి సంబంధించినదే. అత్యంత ముఖ్యమైన అరణ్యకము, ఉపనిషత్తుకూడా అయిన బృహదారణ్యకముతో శతపథ బ్రాహ్మణము పూర్తవుతుంది.

**3. సామవేదం :** దీనిలో 75 మంత్రాలు తప్ప, మిగిలినవన్నీ ఋగ్వేదంలో 8,9 మండలాల నుంచే తీసుకోబడ్డాయి. ఉద్గాత విధులను వివరించే సామవిధాన, మంత్ర, ఆర్షేయ, వంశ, దైవతాధ్యాయ, తలవకార, తాండ్య, సంహితోపనిషత్తులనబడే ఎనిమిది బ్రాహ్మణాలు ఈ వేదానివే. ఛాందోగ్య, కేనోపనిషత్తులు ఈ వేదంలోవే. దీనికి అరణ్యకాలులేవు.

**4. అధర్వణ వేదం :** ఈ వేదంలో ముఖ్యంగా ప్రాపంచిక అభ్యుదయాన్ని తేగల మంత్రాలు, తంత్రాలు ఉన్నాయి. దీనికి ఏ అరణ్యకమూ లేదు. గోపథ బ్రాహ్మణము, ముండక, మాండూక్య, ప్రశ్నోపనిషత్తులు ఈ వేదానికి సంబంధించినవే.

కృష్ణద్వైపాయనుడు, వేద విభజన చేసిన తరువాత అతని నలుగురు శిష్యులు.

| | |
|---|---|
| 1. పైలుడు | 3. జైమిని |
| 2. వైశంపాయనుడు | 4. సుమంతుడు |

అదే క్రమంలో వేదాలను బోధించారు. అయితే రానురాను గురుశిష్యుల సంఖ్య పెరిగి కాలక్రమంలో వేదాలకు అనేక శాఖలు వచ్చాయి. ఈ రకంగా

| | | |
|---|---|---|
| ఋగ్వేదానికి | – | 21 శాఖలు |
| కృష్ణ యజుర్వేదానికి | – | 94 శాఖలు |
| శుక్ల యజుర్వేదానికి | – | 15 శాఖలు |
| సామవేదానికి | – | 100 శాఖలు |
| అధర్వణ వేదానికి | – | 50 శాఖలు వచ్చాయి. |

వీటిలో చాలా వరకు ఇప్పుడు కనిపించటంలేదు.

"గురుదేవా ! మిగిలిన 3 వేదాలకూ భాగాలు లేవుకదా. మరి యజుర్వేదము రెండు భాగాలుగా ఎందుకున్నది?" అడిగాడు నారాయణభట్టు.

"ద్వాపరయుగంలో వ్యాసభగవానుడు వేదవిభజన చేసిన తరువాత, తన శిష్యులైన జైమిని, వైశంపాయనుడు, పైలుడు, సుమంతులకు నాలుగు వేదాలు అప్పగించి వాటిని, ప్రచారం చెయ్యమన్నాడు. ఇప్పుడు యజుర్వేద బాధ్యతను వైశంపాయనుడికి అప్పగించారు. వైశంపాయనుడు దాన్ని తన శిష్యులకు బోధించాడు. వైశంపాయనుడి శిష్యులలో యాజ్ఞవల్క్యుడు ముఖ్యమైనవాడు. అతను ఈ వేదాన్ని క్షుణ్ణంగా అభ్యసించాడు.

ఆ కాలంలో ఒకనాడు మేరుపర్వతం మీద దేశంలోని మహర్షులందరూ సభ ఏర్పాటు చేసకుని, దానికి ఋషులందరూ తప్పకరావాలని ఆంక్ష విధించారు. ఎవరైనా రాకపోతే

వారికి బ్రహ్మహత్యాపాతకం చుట్టుకుంటుందని తీర్మానించారు. అనుకున్న ప్రకారం సభ ప్రారంభమైనది. కారణాంతరాల వల్ల దానికి వైశంపాయనుడు రాలేకపోయాడు. అందుచేత ఋషుల తీర్మానం ప్రకారం అతడికి బ్రహ్మహత్యాపాతకం చుట్టుకుంది. ఆ పాపం నుంచి నిష్కృతి కావాలంటే తపస్సుచేసి ధారపొయ్యాలి. ఆకారణంగా వైశంపాయనుని మిగిలిన శిష్యులందరూ తపస్సు చేస్తున్నారు. ఆ సమయంలో యాజ్ఞవల్క్యుడు తన గురువు దగ్గరకు వచ్చి సహాధ్యాయులు చేస్తున్న తపస్సుచూసి జరిగిన విషయంతెలుసుకుని వైశంపాయనుడితో "గురుదేవా! వీళ్ళంతా అల్పజ్ఞులు. మీ పాపపరిహారార్థం వీళ్ళేం తపస్సు చేస్తారు? అనుజ్ఞ ఇవ్వండి. నేను మీకోసం ఘోరమైన తపస్సు చేస్తాను" అన్నాడు. సహాధ్యాయుల నవమానించిన యాజ్ఞవల్క్యుని చూసి వైశంపాయనుడు "సాటివారిని అవమానించే గర్విష్టితో నాకు పనిలేదు. నాకు శిష్యుడిగా ఉండే అర్హత కూడా నీకులేదు. నేను చెప్పిన వేదవిద్యను ఇక్కడే వదిలేసి వెళ్ళు" అన్నాడు.

యాజ్ఞవల్క్యుడు నిజంగానే శక్తిసంపన్నుడు. స్వాభిమాని. గురువుగారన్నమాట అవమానంగా తోచి వెంటనే వైశంపాయనుడు చెప్పినవేదవిద్య అంతా కక్కేశాడు. ఆ వేదభాగమే కృష్ణయజుర్వేదమయింది.

ఈ రకంగా వేదాన్ని వదిలేసిన యాజ్ఞవల్క్యుడు సూర్యభగవానుణ్ణి ఆరాధించి ఆయన దగ్గర వేదవిద్యనభ్యసించాడు. ఈ భాగమే శుక్లయజుర్వేదము. యాజ్ఞవల్క్యుడు ఈ వేదభాగాన్ని తన శిష్యులైన కణ్వ, మధ్యందినాదులకు బోధించాడు. ఈ భాగమే "వాజసనేయసంహిత" అని కూడా పిలువబడుతుంది. "వాజః" అంటే అన్నము. 'సని' అంటే దానము 'వాజసని' అంటే అన్నదానము. యాజ్ఞవల్క్యుని తండ్రి నిరతాన్నదానం చేసేవాడు. అందుచేత అతనిని 'వాజసని' అనేవారు. వాజసని కుమారుడు కాబట్టి యాజ్ఞవల్క్యుడు 'వాజసనేయుడు' అనబడ్డాడు. అతడు చెప్పిన సంహిత 'వాజసనేయసంహిత' అయింది. ఇది మొత్తం 40 అధ్యాయాలు. దీనిలోని 39 అధ్యాయాలలో మంత్రాలు కర్మకాండ వివరించబడగా, 40వ అధ్యాయం జ్ఞానబోధకము.

ప్రత్యక్షంగా గాని, పరోక్షంగాగాని ఐహిక సంపత్తిని, మోక్షాన్ని సంపాదించిపెట్టేవి యజ్ఞాలు, యజ్ఞనిర్వహణ చాలా కష్టమైనది. దీనిని చాలా జాగ్రత్తగా పూర్తిచేయటమే వేదాల ప్రయోజనం. యజ్ఞనిర్వహణకు నలుగురు పురోహితులుంటారు. వారు

1. **హోత** : ఋగ్వేదంలోని స్తోత్రాలను క్రమంగా పఠించేవాడు.
2. **అధ్వర్యుడు** : యజుర్వేదంలో చెప్పినప్రకారము యజ్ఞకర్మలను యధావిధిగా నిర్వహించేవాడు.

**3. ఉద్గాత** : సామగీతాలు గానం చేసేవాడు.

**4. బ్రహ్మ** : అధర్వణ వేద పండితుడు. యజ్ఞాన్ని మొదటి నుండి చివరిదాకా పర్యవేక్షించేవాడు. ఇతడు యజ్ఞకళకు, వేదసాహిత్యానికీ ప్రతీక.

ప్రతి వేదాన్నీ మళ్ళీ నాలుగు భాగాలుగా విభజించారు.

1. సంహితలు
2. బ్రాహ్మణాలు
3. అరణ్యకాలు
4. ఉపనిషత్తులు

**1. సంహితలు :** ఇవి మంత్రభాగం. ఇందులో స్తోత్రాలు, ఆవాహనలు ఉంటాయి. ఋగ్, యజు, సామ సంహితలు సూక్తులుగా ఉంటాయి.

**2. బ్రాహ్మణాలు :** సంహితలోని విషయాన్ని వివరించేవి బ్రాహ్మణాలు. యజ్ఞయాగాదులెలా చెయ్యాలి ? వాటి వెనుక రహస్యము. యజ్ఞాల విలువ, వాటి మహిమ చెప్పబడింది.

**3. అరణ్యకాలు :** ఇవి బ్రాహ్మణాలకూ, ఉపనిషత్తులకూ మధ్యస్థాయిలో ఉంటాయి. ఇవి కూడా బ్రాహ్మణాలలాగానే కర్మవిధులను ప్రతిపాదిస్తాయి. కాని వీటిలో కర్మలయొక్క భౌతిక భాగం ఉండదు. కర్మల వెనుక ఉన్న నిఘూఢమైన తత్త్వాల మీద ధ్యానానికి ప్రాముఖ్యత ఇవ్వబడింది. ఏకాంతవాసం స్వీకరించినవారు. అరణ్యాలలో నివసించే వారి కోసం ఇవి ఉద్దేశింపబడ్డాయి. విషయంలో అరణ్యకాలకు, ఉపనిషత్తులకు తేడా లేదు.

వేదాలకు అర్థం తెలుసుకోవటానికిగాను మనకు తెలిసినంత వరకు 25 మంది భాష్యం వ్రాశారు. విజయనగర సామ్రాజ్య స్థాపన చేసిన "మాధవ విద్యారణ్యులు" వేదాలకు భాష్యం వ్రాసి, వేదసాహిత్యానికి విశేషమైన సేవ చేసిన వారిలో మనకు అతి దగ్గరవాడు.

**4. ఉపనిషత్తులు :** ఉపనిషత్తులు అంటే బ్రహ్మవిద్య, జీవాత్మ, పరమాత్మ, జ్ఞానము, మోక్షముల గురించి వివరించేవి. నాలుగు వేదాలకు కలిపి 1180 ఉపనిషత్తులున్నాయి. కాని వీటిలో 108 మాత్రమే చదవదగ్గవి అని తేల్చారు. వీటికి 'ఉపనిషద్బ్రహ్మేంద్ర' అనే మహనుభావుడు వ్యాఖ్యవ్రాశాడు.

వేదాలయొక్క సారమే ఉపనిషత్తులు. వాటిలో ఆత్మస్వరూపాన్ని వివరించటం జరిగింది.

**ఆత్మస్వరూపం :** ముడిపదార్థం గురించి మనకు తెలిసినట్లైతే ఆ పదార్థంతో తయారయిన వస్తువులను గురించి తేలికగా తెలుస్తుంది. ఉదాహరణకు మట్టిని గురించి

తెలిస్తే, దానితో తయారుచేసే కుండలు, బానలు మొదలైన వస్తువులను గురించి తెలుస్తుంది. అలాగే బంగారం గురించి తెలిస్తే దానితో తయారుచేసే నగలపేర్లు వేరుగా ఉన్నా, వాటన్నింటిలో ఉన్నది బంగారమే అని తెలుస్తుంది. అదేవిధంగా ఏ విషయం తెలుసు కోవటంవల్ల అన్ని విషయాలూ తెలుస్తాయో, దాన్ని తెలుసుకోవాలి. ప్రతివిషయంలోను అంతర్గర్భితంగా ఉండే తత్త్వం గనక తెలుసుకుంటే మిగిలిన విషయాలన్నీ తెలుస్తాయి.

నదులు తూర్పునుంచి పడమరకు ప్రవహించినా, పడమర నుంచి తూర్పుకు ప్రవహించినా చివరకు అవి సముద్రంలోనే కలుస్తాయి. సూర్యరశ్మికి నీరు ఆవిరిగా మారి మేఘాల రూపం పొందుతుంది. ఆ మేఘాలు మళ్ళీ వర్షించి నదులుగా ప్రవహిస్తాయి. ఆ నదులన్నీ మళ్ళీ సముద్రంలో కలుస్తాయి. సముద్రంలో కలిసేవరకూ నదులకు గంగ, కృష్ణ, కావేరి అని వివిధ రకాల పేర్లుంటాయి. కాని సముద్రంలో కలిసిన తరువాత ఆ నదీజలాన్ని విడదియ్యలేము. అలాగే అన్ని జీవాత్మలూ పరమాత్మలోని అంతర్భాగాలే.

సృష్ట్యారంభం కాకముందు, కృతయుగారంభంలో పరమేశ్వరుడు నిరాకారుడు నిర్గుణస్వరూపుడు అయి, ఇతరములతో సంబంధంలేకుండా, తనకు సమానమైన వారుగాని, అధికులుగాని లేకుండా, ఏకాకిగా ఉండేవాడు. ఈ రకంగా ఉన్న పరబ్రహ్మాపూర్ణ బిందుస్వరూపుడు. ఆ ఏకైకతత్త్వం అనేకం కావాలని సంకల్పించింది. రకరకాల వస్తువులుగా చిత్రవిచిత్ర సమ్మేళనాలతో రూపుదాల్చింది. ఘన, ద్రవ, వాయు పదార్థాలుగా ఎన్నో రూపాలుగా మార్పుచెంది, భిన్న రూపాలతో ఈ సృష్టి ఆకారం పొందింది. జీవరాసులు ఉత్పన్నమయినాయి. సృష్ఠిలో భాగంగానే హకార సంజ్ఞ కలిగిన పరమాత్మ సకార సంజ్ఞ కలిగిన ప్రకృతితో కలిసి శబళబ్రహ్మమై బ్రహ్మరంధ్రంద్వారా నవరంధ్రములతో నిర్మించ బడిన మానవ దేహంలో ప్రవేశించి జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సు అనబడే పదకొండు ఇంద్రియాలద్వారా ప్రాపంచిక సుఖాల ననుభవిస్తూ, పంజరంలోని పక్షిలాగా ఈదేహంలో బంధించబడి బయటకుపోయే మార్గం తెలియక కొట్టుమిట్టాడుతున్నాడు. జీవాత్మ అనబడే ఈ హంసకు అగ్ని, చంద్రమండలాలే – రెక్కలు, ఓంకారము – శిరస్సు, జ్ఞాననేత్రము–ముఖము, హకార సకారములే పాదాలు. ఈ రకంగా పరమాత్మ అన్ని ప్రాణులలోనూ పాలలో ఉన్న నెయ్యిలాగా ఆవరించి ఉన్నాడు. అన్ని జీవాత్మలూ పరమాత్మ లోని భాగాలే. మర్రిచెట్టు చాలా పెద్దవృక్షం. కాని దానికి కారణమైన విత్తనంలో చూస్తే ఏమీ కనిపించదు. అంటే విత్తనంలో అంత పెద్ద వృక్షానికి కారణమైనది, మనకంటికి కనిపించనంత సూక్ష్మమైనది దాగి ఉన్నది. అదే విధంగా ఆత్మ బయటకు కనిపించకుండా, సూక్ష్మరూపంలో సర్వత్రా వ్యాపించి ఉంటుంది. ఆత్మకు నాశనంలేదు. ముసలితనంలేదు.

ఆత్మకు పాపం అంటదు. శోకం తాకదు. ఆకలి దప్పికలు ఉండవు. స్వప్నప్రపంచంలో ప్రభువులాగా విహరించే చైతన్యమే ఆత్మ. గాఢసుషుప్తిలో తృప్తిగా ఆనందాన్ని అనుభవించేదే ఆత్మ.

ప్రకాశబిందువు పరబ్రహ్మస్వరూపమైన చంద్రమండలం అకారబీజం. విమర్శ బిందువు శక్తిస్వరూపం. అగ్నిమండలం. హకారబీజం. ఈ రెండింటి సామరస్యమే 'అహం'. ఇదే పరబ్రహ్మస్వరూపం. పరమేశ్వరుని ప్రతిబింబమే శక్తి. అదే మాయ. అందుచేతనే శివసంబంధంలేకుండా శక్తిగాని, శక్తి సంబంధం లేకుండా శివుడుగాని ఈ జగత్తును సృష్టించలేరు. ఇక్కడ శివశక్తులు అంటే త్రిమూర్తి ద్వంద్వములోని వారుకాదు. పరమేశ్వరీ పరమేశ్వరులని గుర్తించాలి. వీరిద్దరికలయిక లేనిదే స్వరూపజ్ఞానం కలగదు. అహమనేది ఆత్మస్వరూపం. ఇదే ఆత్మమంత్రం. ఆత్మమంత్రము, హంసమంత్రము రెండూ సమాన ధర్మాలు కలిగి ఉన్నాయి.

శరీరం అశాశ్వతమైనది. శాశ్వతమైన ఆత్మకు అశాశ్వతమైన శరీరము అవాసంగా ఉంటుంది. శరీరము ఉన్నంతకాలము ఆత్మకు గుణదోషాలు, సుఖదుఃఖాలు అంటినట్లు, వాటితో సతమతమవుతున్నట్లు అనిపిస్తుంది. ఆత్మశరీరంతో సంబంధం ఏర్పరచుకోవటం వల్ల, జీవులకు సుఖదుఃఖాలతో సంబంధం ఏర్పడుతుంది. మానవుడు మాసిన వస్త్రాన్ని వదలి నూతన వస్త్రాన్ని ధరించినట్లుగా, ఆత్మ జీర్ణమైన దేహాన్ని వదలి వేరే దేహాన్ని ఆశ్రయిస్తుంది. ఆత్మశరీరంనుంచి విడిపోతే భౌతికబంధాల నుండి విముక్తి కలుగుతుంది.

**ఆత్మజ్ఞానం :** ఒక మనిషికళ్ళకు గంతలు కట్టి అపరిచితమైన అరణ్యం మధ్యలో వదిలేశామనుకోండి. అప్పుడతడు దారితెన్ను తెలియక అన్ని దిక్కులూ తిరుగుతాడు. తననెవరో బంధించినట్లు బాధపడతాడు. తన ఇంటికి దారిచూపమని ఏడుస్తాడు. అప్పుడు ఎవరోవచ్చి కళ్ళకు కట్టిన గంతలు తీస్తారు. అతడికి కళ్ళు కనిపిస్తాయి. కనిపించిన వాళ్ళని దారి అడుగుతూ ఇల్లు చేరతాడు. ఇదేవిధంగా మానవుడి మనస్సుకు అజ్ఞానంతో కొట్టుమిట్టాడుతున్న సాధకుడు జ్ఞానసముపార్జన చెయ్యాలి. జిజ్ఞాసతో ప్రతి అడుగుయొక్క గమ్యం ఆత్మే కావాలి. నీవే ఆత్మ, ఆత్మే నీవు.

ఈ విషయాలను పూర్తిగా తెలుసుకొని పరమేశ్వర ధ్యానం చెయ్యాలి.

**పరబ్రహ్మస్వరూపం :** పరమేశ్వరుడు నిరాకారుడు నిర్గుణస్వరూపుడు అతడు ఈ రకంగా ఉంటాడని ఎక్కడా చెప్పబడలేదు. కాని, అనుభవజ్ఞులైన బ్రహ్మవేత్తలు చెప్పినదానిని బట్టి పరబ్రహ్మస్వరూపం ఈ విధంగా ఉంటుంది.

వరుణమహర్షి కుమారుడు భృగుమహర్షి. అతడు విద్యాభ్యాసం పూర్తిచేసి తండ్రివద్దకు వెళ్ళి బ్రహ్మజ్ఞానాన్ని ఉపదేశించమని అడుగుతాడు. దానికి వరుణమహర్షి "బ్రహ్మజ్ఞానం

చెబితే తెలిసేదికాదు. కొంతకాలం తపస్సు చేస్తే అది నీకు బోధపడుతుంది. వెళ్ళి తపస్సు చెయ్యి." అన్నాడు. తండ్రి సలహామేరకు భృగువు తపస్సు చేశాడు. ఈ లోకంలో జీవించటానికి ఆధారమైనది అన్నము. అన్నమువల్లనే అన్ని ప్రాణులు వృద్ధి చెందుతాయి. మరణించిన తరువాత కూడా అన్న రూపమైన ఈ పృథివిలోనే అన్ని జీవరాసులు కలిసిపోతాయి. అన్నానికి మించిన ఆధారం మరొకటి లేదు. అన్నమే పరబ్రహ్మస్వరూపం. అని భృగువుకు తెలిసింది. ఆశ్రమానికి వచ్చి అదేమాట తండ్రికి చెప్పాడు. తండ్రి ఒప్పుకోలేదు. అన్నం జీవించటానికి ఆధారమే కాని అదే పరబ్రహ్మస్వరూపం కాదు. కాబట్టి ఇంకొంతకాలం తపస్సు చెయ్యి అన్నాడు. భృగువు మళ్ళీ తపస్సు చేశాడు. ఈసారి సమస్త ప్రాణులు ప్రాణమువల్లనే జీవిస్తున్నాయి. జన్మించిన ప్రాణులు ప్రాణము వల్లనే రక్షించబడుతున్నాయి. శరీరంలోంచి ప్రాణము గనకపోతే శరీరం నాశనమయిపోతుంది. కాబట్టి ప్రాణమే బ్రహ్మస్వరూపం అని తెలిసింది. అదేమాట తండ్రికి చెప్పాడు భృగువు కాదు ఇంకొంతకాలం తపస్సు చెయ్యి అన్నాడు తండ్రి  అయిన వరుణమహర్షి ఈసారి భృగువుకు మనస్సు పరబ్రహ్మమని తెలిసింది. మనస్సువల్లనే ప్రాణులు ఉత్పన్నమౌతున్నాయి. స్త్రీపురుషుల మానసికమయిన ప్రేమపూరిత సంబంధ బాంధవ్యాలవల్ల ప్రాణి బీజరూపంలో మాతృగర్భంలో ప్రవేశిస్తుంది. వృద్ధి పొందుతుంది. బయటపడుతుంది. పుట్టిన తరువాత కూడా మనసును ఆధారంగా చేసుకునే ప్రాణి ఇంద్రియాల సాయంతో సర్వజీవనోపయోగ వస్తువులను తనకనువుగా మలచుకుని జీవపరిరక్షణ చేసుకుంటుంది. అలాగే చనిపోయిన తరువాత శరీరంలో నుంచి ప్రాణము ఎగిరిపోతుంది. ఇంద్రియాలకు జ్ఞానం ప్రసాదించే శక్తి మృగ్యమైపోతుంది. ఇంద్రియాలన్నీ మనసునాశ్రయిస్తాయి. ఈ భావనలన్నీ మనస్సే బ్రహ్మమనే నిర్ణయానికి దారితీశాయి. అదేమాట తండ్రికి చెప్పాడు భృగువు. ఇంకొంతకాలం తపస్సు చేయమన్నాడు తండ్రి. ఈసారి విజ్ఞానమే పరబ్రహ్మస్వరూపం అనుకున్నాడు భృగువు కాదన్నాడు తండ్రి. మళ్ళీ తపస్సు చేశాడు భృగువు. ఇప్పుడు తెలిసింది ఆనందమే పరబ్రహ్మస్వరూపము. సర్వమూ ఆనందాన్నుంచే జనిస్తూ, ఆనందాన్ని అనుభవిస్తూ మళ్ళీ ఆనందలోనే లీనమౌతున్నది. ఆనందం అన్నింటికన్నా ఉత్తమంగా పరమాత్మరూపాన్ని స్పష్టంచేసే తత్త్వం. ఇదేమాట తండ్రికి చెప్పాడు భృగువు. అప్పుడు వరుణమహర్షి పరబ్రహ్మరూపాన్ని వివరిస్తూ ఆనందమే పరబ్రహ్మస్వరూపం. అయినా అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశాలుకూడా బ్రహ్మస్వరూపాలే. ఇవి ఒకదానికన్న ఒకటి సూక్ష్మమైనవి. అన్నింటికన్నా మించినది ఆనందమయమైన బ్రహ్మానుభూతి. అన్నబ్రహ్మోపాసనద్వారా క్రమంగా ఆనందబ్రహ్మ సాక్షాత్కారం కలుగుతుంది. కాబట్టి అన్నాన్ని ఎప్పుడూ నిందించరాదు. ప్రాణము, మనస్సు, సర్వస్వమూ అన్నంమీదనే

ఆధారపడి ఉన్నాయి. అందుచేత అన్నాన్ని నిర్లక్ష్యం చేయ్యరాదు. అన్నాన్ని పూజిస్తే ఆ తరువాతవన్నీ లభిస్తాయి. అందుకే అన్నం పరబ్రహ్మస్వరూపం అంటారు. ఆహారాన్ని విసర్జించకుండా ప్రాణం నిలుపుకుంటూ, మనసును వికసింపచేసుకుంటూ, విజ్ఞాన మయానుభవాన్నుంచి బ్రహ్మానందం పొందాలి.

గౌతముని శిష్యుడు సత్యకామజాబాలి. బ్రహ్మజ్ఞాన జిజ్ఞాసి. గురువుగారి ఆజ్ఞమేరకు అడవిలో పశువులు మేపుతుంటాడు. అప్పుడు ఒక ముసలిఆబోతు అతనివద్దకు వచ్చి "సత్యకామా నీకు బ్రహ్మజ్ఞానాన్ని ఉపదేశిస్తాను విను. పరబ్రహ్మస్వరూపం నాలుగు పాదాలుగా ఉంటుంది. అందులో మొదటిపాదాన్ని నేను చెబుతాను. చరాచర జగత్తులోని నాలుగు దిక్కులూ పరబ్రహ్మ స్వరూపమే" అని చెబుతుంది. రెండవపాదాన్ని అగ్నిదేవుడు చెబుతాడు. భూమి ఆకాశము సప్తసముద్రాలు, నదీనదాలు, అడవులు, కొండలు, ఎడారులు అన్నీ బ్రహ్మమయమే. మూడవపాదాన్ని ఒకహంస చెబుతుంది. అగ్ని, సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు, విద్యుల్లతలు అన్నీ పరబ్రహ్మస్వరూపమే. నాల్గవపాదాన్ని ఒక నీటిపక్షి పూర్తి చేస్తుంది. ప్రాణం బ్రహ్మ, దృష్టి, శ్రవణం, మనస్సు ఇవన్నీ బ్రహ్మమయాలే. ఈ రకంగా చరాచరజగత్తు అంతా బ్రహ్మమయమై ఉన్నది.

ఉపకోశలుడికి అగ్నులు బ్రహ్మజ్ఞానాన్ని ఉపదేశిస్తాయి. ఆనందమే బ్రహ్మ, ఆకాశమే బ్రహ్మ, ఆకాశమంటే హృదయకాశం. అక్కడే పరబ్రహ్మ ఉంటుంది. ఆనందమనేది పరబ్రహ్మయొక్క సహజరూపం. పంచభూతాలు, తన్మాత్రలూ బ్రహ్మస్వరూపాలే. సూర్యుని లోను, అగ్నిలోను ఉండే బ్రహ్మతత్త్వం ఒకటే. తూర్పు, పడమర మొదలైన దిక్కులయందు నక్షత్రాలలో, నీటిలో ఉన్న తత్త్వము, మనలో ఉన్నతత్త్వము ఒకటే. ఆకాశంలోని మెరుపులో ఉన్న తత్త్వం, మనలోని తత్త్వం ఒకటే. అన్ని చోట్లా వ్యాపించి ఉన్నది ఆత్మతత్త్వమే. అదే బ్రహ్మతత్త్వం. విశాలమైన విశ్వమంతా వ్యాపించి ఉన్నది అదే. ఆత్మత్త్వం తెలిస్తే సాధకుడికి బాధలు, భారాలు, దూరమవుతాయి. అతడు తామరాకుమీద నీటిబొట్టులాగా మనసును దుష్టప్రభావానికి లోనుకానీయకుండా బ్రహ్మానందం పొందగలుగుతాడు.

ఈ రకంగా ఉపనిషత్తులో అనేకచోట్ల అనేకసార్లు పరబ్రహ్మతత్వాన్ని వివరించటం జరిగింది. వీటిని క్రోడీకరిస్తే బ్రహ్మ సత్యము. అది నిత్యము, శాశ్వతమైనది. అదే ఆది అనాది. పరబ్రహ్మ కంటికి కనిపించేవస్తువులయందు, కనిపించని వస్తువులయందు కూడా ఇమిడి ఉన్నాడు. చరాచర జగత్తులోని నదీనదాలు, అడవులు, కొండలు, ఎడారులు, సముద్రాలు, నేల, నింగి, సూర్యచంద్రులు, నక్షత్రాలు, పంచభూతాలు, తన్మాత్రలు, చెట్లు చేమలు, క్రిమికీటకాలు, సకల జంతుజాలము, సర్వమానవాళి అన్నీ పరబ్రహ్మస్వరూపమే,

మానవుని హృదయాకాశమే పరమాత్మ నివాసస్థానము. అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశాలమధ్యన ఆనందమయకోశంలో పరమాత్మ నివాస ముంటాడు. అందుకే ఆనందమే పరబ్రహ్మస్వరూపం అని చెప్పబడింది. అయితే పరబ్రహ్మ అవిద్య అనబడే అజ్ఞానంతో కప్పబడి ప్రపంచరూపమైన భ్రమ కలిగిస్తుంది. ఇది రజ్జు సర్పభ్రాంతి. స్థాణుపురుషభ్రాంతి. ఆభ్రమయే సంసారము. భగవంతుడు వేరు భక్తుడు వేరు అనుకుంటే ద్వైతభావము. కాని భగవంతుడు వేరు భక్తుడు వేరుకాదు. ఇద్దరూ ఒకటే. ఇదే అద్వైతసిద్ధాంతము. జీవాత్మా పరమాత్మా రెండూ ఒక్కటే. బ్రహ్మసత్యం జగన్ మిధ్య. బ్రహ్మఒక్కటే సత్యము. ఈ జగత్తు అంతా మిధ్య.

పరమేశ్వరుడు నిరాకారుడు నిర్గుణస్వరూపుడు. ఈ బ్రహ్మాండమంతా తానే అయి ఉన్నాడు. నిరాకారుడైన పరబ్రహ్మోపాసన కేవలం యోగులకు, సిద్ధులకు తప్ప ఇతరులెవరికీ సాధ్యంకాదు. సామాన్య మానవులకు అందుబాటులో ఉండటానికే ఆపరబ్రహ్మ స్వరూపం ఆకారందాల్చింది. ఈ ప్రపంచంలో పంచభూతాలు, తన్మాత్రలు సృష్టించింది. సత్వరజ స్తమోగుణాలకు ప్రతీకలైన త్రిమూర్తులను సృష్టించింది. వారికి శక్తులిచ్చింది. వారు ఏఏ పనులు చెయ్యాలో వివరించింది. వాళ్ళకి ఏవైనా అపదలు వచ్చినప్పుడు రక్షిస్తుంది.

దేవకార్యాలు పూర్తి చెయ్యటానికి భూలోకంలో అవతరించి రాక్షస సంహారం చేస్తుంది. ఈజగత్తు అంతా పరమేశ్వరి స్వరూపం. సృష్టించేది, లయం చేసేది కూడా ఆమె. చరాచర జగత్తులో జీవమున్నవి. జీవం లేనివి, చలనమున్నవి, చలనం లేనివి, అన్ని పదార్ధాలు ఆమే. ఆమె కానిది ఏదీలేదు. విద్య ఆమె అవిద్యా ఆమె. సంపదలిచ్చే లక్ష్మి ఆమె. దరిద్రదేవతా ఆమె. కాళరాత్రి, ప్రళయరాత్రి, మోహరాత్రి అన్నీ ఆమే దేవతలకు ఆహుతులర్పించే స్వాహామంత్రము, పితృదేవతలకు తర్పణలందించే స్వధా మంత్రము కూడా ఆమే.

దేవతలకు ఆహారమైన అమృతము ఆమె. ఓంకారము ఆమే. నాదము శబ్దము ఆమే. జ్ఞానమయ ఆమే. అజ్ఞానమయ ఆమే బుద్ధి, మతి భ్రాంతి, లజ్జ, పుష్టి, తుష్టి, శాంతి, ఓరిమి అన్ని రూపాలు ఆమెవే. కత్తి, డాలు, శూలము, శంఖము, చక్రము, గద ధరించిన భయంకర స్వరూపిణి ఆమె. అశుభమూ ఆమే. క్షేమంకరి శుభంకరి కూడా ఆమె. అత్యంత శుభప్రదమయినది ఆ దేవి. వస్తువులకు ప్రాణులకు చలనం కలిగించేది శక్తికూడా ఆమెయే.

ఈ రకంగా అన్ని తానే అయి ఆ పరబ్రహ్మ స్వరూపమైన పరమేశ్వరి తన భక్తుల కోరిక తీర్చి వారికి శాశ్వతమైన ఆనందము అంటే ముక్తిని ప్రసాదిస్తున్నది. తనను నమ్మినవారిని తనలో లీనము చేసికుంటున్నది. అని దేవీభాగవతంలో చెప్పబడింది.

**పరా, అపరా విద్యలు :** విద్య రెండు రకాలు. 1. అపరావిద్య 2. పరావిద్య.

**1. అపరావిద్య :** సంసార సుఖాలనుభవించటానికి కావలసిన ధనము, పలుకుబడి లభిస్తాయి. ఈ విద్య ఐహికంగా ఉన్నతస్థితులకు తీసుకునిపోతుంది. ధర్మాధర్మాల, పుణ్యాపుణ్యాల ప్రసంగాలతో సమన్వితమై ఉంటుంది. నాలుగు వేదాలు, వేదాంగాలు, ఉపవేదాలు అన్నీ ఇందులో అంతర్భూతాలు. కర్మకాండ, ఉపాసనాకాండ ఇవన్నీ లౌకిసుఖాలు సంపాదించటానికి ఏర్పడ్డాయి. వేదశాస్త్రాల పరిచయంవల్ల అజ్ఞానంపోదు. వీటి అధ్యయనం వల్ల సాంసారిక విషయపరిజ్ఞానం కలుగుతుంది. ఈ చదువువల్ల జన్మ జరామృత్యుభయం పోదు. ఇదంతా లౌకిక సమున్నతికి సాధన. ప్రపంచంలో చాలామంది ధనము, కీర్తి సంపాదించటానికి, సుఖాలు అనుభవించటానికి ఇష్టపడతారు. అపరావిద్య వాసనకలవారు స్వర్గంకావాలని, సుఖాలుకావాలని యజ్ఞయాగాదులు చేస్తారు. ఇలాటివారు సంసార లంపటంలోపడి, విషయభోగాలు అనుభవించటానికి సతమతమౌతారు. అయితే కర్మలనాచరించటం వల్ల సంసారపంకిలం నుంచి కొద్దిగా విముక్తిపొంది బ్రహ్మానుభవం పొందటానికి అర్హత కలుగుతుంది. యజ్ఞయాగాది అనుష్టానవిదులను వశిష్ఠాది ఋషులు ప్రతిపాదించారు. ఇది లౌకికులను ఉద్ధరించటానికి ఏర్పాటుచేయబడింది. ఈ మార్గమంతా కామ్యకర్మలతోనిండి ఉంటుంది. ఈ ఇహపరలోకవాంఛలతో చాలమంది ఈ కర్మలకు ప్రలోభులౌతారు. ఈ పద్ధతిలో మంత్రాలు నిరర్థకం కాదు. ఎవరైతే ప్రలోభాలకులోనుకారో, అంటే నిష్కామ్యకర్మ చేసేవారు స్వర్గాన్ని సాధించి, తద్వారా మోక్షప్రాప్తికి ప్రయత్నిస్తారు. దీనినే కర్మమార్గం అంటారు. ఇది వేదసమ్మతమైన మార్గం. కర్మలవల్ల సంసారబంధం పూర్తిగా విచ్ఛేదన కాదు. కర్మఫలం పూర్తయిన వెంటనే జీవుడు మళ్ళీ భూలోకంలో పుడతాడు. జ్ఞానంలేని ఈ కర్మలవల్ల దుఃఖకరమైన ఫలితాలే వస్తాయి. ఈ కర్మల నాచరించేవారిని కర్మిష్టులంటారు. కొంతమంది ఈ కర్మకాండను చిత్తశుద్ధికి ఉపయోగించుకుంటారు. కర్మానుష్ఠానంలో జ్ఞానాన్ని సమ్మిశ్రితం చేసేవాడికి బ్రహ్మదర్శనం జరుగుతుంది. మరణానంతరము వీరు అర్చిరాది మార్గాలద్వారా బ్రహ్మలోకం చేరతారు.

2. పరావిద్య వల్ల పరమాత్మానుభవం, బ్రహ్మలోకప్రాప్తి కలుగుతాయి. మోక్షం సిద్ధిస్తుంది. పరావిద్య సాధన లౌకికలంపటంలో ఇరుక్కున్న వారికి కష్టసాధ్యము. ఈవిద్యను సాధించాలంటే ముక్తిమార్గంలో అచంచల దీక్షతో ముందుకు సాగుతూ పయనించాలి. లక్ష్యం తప్పకుండా ఈ మార్గంలో ముందుకు నడిస్తే బ్రహ్మప్రాప్తి తప్పక కలుగుతుంది. పరావిద్యను వివేకవంతుడు మాత్రమే పొందగలుగుతాడు. ఇది చర్మచక్షువులకు గోచరించదు. ఇంద్రియాలకు అందుబాటులో లేని తత్త్వం అది. కరచరణాది శరీరభాగాలు

లేనిది. సమస్త విశ్వము ఆ తత్త్వముయొక్క అధీనంలోనే ఉంది. ఇది సర్వవ్యాపకమైనది. ఇటువంటి శాశ్వతమైన జ్ఞానాన్ని కలిగించేదే పరావిద్య. ఇదే పరబ్రహ్మతత్త్వజ్ఞానం. బ్రహ్మాన్ని నిర్దేశిస్తూ, బ్రహ్మజ్ఞానులు 'అక్షరం' అనే శబ్దంతో పిలుస్తారు. ఈ అక్షర బ్రహ్మతత్త్వానికి గుణాలు లేవు.

బ్రహ్మపదార్థం ప్రాపంచిక వస్తువుకాదు. ఇది ఈరంగులో ఉంటుందనీ, ఈ రకంగా ఉంటుందనీ చెప్పటానికి వీలులేదు. దీనికి రూపంలేదు. నామంలేదు. అశాశ్వతమైన జగత్తుకు శాశ్వతమైన కారణం అది. అది ప్రకాశమానమైనది. నిర్గుణమైనది. అందుకనే దానిలో ఈ గుణంలేదనికాని, ఈ గుణం ఉందనికాని చెప్పవీలుకాదు. అన్యవస్తువుల అపేక్షలేకుండానే సాలీడునోటిలోని దారంలాగా అక్షరపురుషునినుంచి ఈ జగత్తు సృష్టింపబడుతోంది.

సృష్టి జరగటానికి పూర్వం అక్షరపురుషుడైన బ్రహ్మతత్త్వంలో సృష్టి సంకల్పం కలిగింది. ఏకంగా ఉన్న తత్త్వానికి అనేకమయితే బాగుండుననే సంకల్పమది. ఇదే సృష్టికి ప్రాతిపదిక. అభివ్యక్త చైతన్య శక్తినుంచి మొదటగా అభివ్యక్తమైన దానికి నామం 'హిరణ్యగర్భుడు'. ఈ హిరణ్యగర్భుడు ఆకారం (రూపం) ధరించాడు. దాన్నే 'విరాట్ అంటారు. అన్నింటికన్నా సృష్టిలో ముందుగా ఉత్పన్నమైనది అన్నం. అన్నం సృష్టింపబడిన తరువాతనే ప్రాణులు సృష్టింపబడ్డాయి. ప్రాణం నుండి మనస్సు, మనస్సు నుంచి పంచభూతాలు వాటినుంచి సమస్తలోకాలు ఉత్పన్నమైనాయి. సర్వజ్ఞుడైన పరబ్రహ్మనుండే ఈ సృష్టి ఉద్భవించింది. దానినుంచే లోతైన సముద్రాలు, ఎత్తైన పర్వతాలు వచ్చాయి. ఆ బ్రహ్మము ఈ జగత్తురూపంలోనే ఉంది. జీవాత్మపరమాత్మకన్న భిన్నంకాదని, ఈ జగత్తంతా బ్రహ్మస్వరూపమే అని ఎవరు భావన చేస్తారో వాడు భాగ్యశాలి. సర్వత్రా బ్రహ్మదర్శనం చేసుకున్న వ్యక్తికి సంశయాలన్నీ విడిపోతాయి. అన్ని బంధాలనుండి విముక్తి కలుగుతుంది. ఉత్తమసాధనలో ఉండే సాధకుడికి ఎప్పుడూ బ్రహ్మస్వరూపభావనే మనసులో నిండివుంటుంది. చరాచరజగత్తులో ఉన్న పశుపక్ష్యాదులు, నదీనదాలు, వృక్షాలు, లతలు అన్నీ బ్రహ్మస్వరూపాలే, జగత్తులోని సత్ అసత్తులు, స్థూల సూక్ష్మాలు, మూర్తామూర్తాలు అన్నీ దానిలోనే ఉన్నాయి. ఈ సర్వవస్తుసముదాయము యొక్క అస్తిత్వం బ్రహ్మపదార్థపు అస్థిత్వంమీదనే ఆధారపడిఉన్నది. సూర్యచంద్రులుకూడా ఆ పరమాత్మవల్లనే ప్రకాశిస్తున్నారు.

ఆత్మానుభూతి కేవలం శాస్త్రాధ్యయనం చెయ్యటంవల్ల, పాండిత్యం సంపాదించటం వల్లరాదు. బుద్ధి సూక్ష్మత కలిగినప్పటికీ కేవలం పండితులు దీన్ని పొందలేరు. బహిర్ముఖులైన ప్రజలు బ్రహ్మను గురించి చర్చవింటారు చేస్తారు. కాని బ్రహ్మానుభూతిని

మాత్రం పొందలేరు. బ్రహ్మచర్చవిని అర్థం చేసుకున్నవాడు అంతర్ముఖుడు కావాలి. అవిద్యమూలాన ఆత్మస్వరూపం మరుగున పడిపోతుంది. అవిద్యా మేఘాలను బెదరగొడితే ఆత్మజ్ఞానం కలిగి ముక్తి లభిస్తుంది.

ముక్తి అంటే విడుదల అని అర్థం. అజ్ఞానంవల్ల ఏర్పడ్డ ఈ సాంసారిక వాసనలన్నీ త్రాళ్ళు, ఆ త్రాళ్ళు జీవులను బందీలుగా చేస్తాయి. అజ్ఞానాన్ని పటాపంచలు చేసి ఈ త్రాళ్ళను తెంచుకుని విడుదలకావటమే ముక్తి.

ఎవడు పరతత్త్వాన్నిధ్యానం చేసి తెలసుకుంటాడో, వాడు సాక్షాత్తూ పరమపురుషుడౌతాడు. అతడు సర్వరోగాలనుండి, సర్వశోకాలనుండి, సర్వదుఃఖాలనుండి, సర్వమోహాలనుండి విడివడి, హృదయంలోని గ్రంధులన్నీ భేదించుకుని ముక్తుడై అమరత్వాన్ని సాధించుకుంటాడు.

**శుక, వామదేవ మార్గాలు :** సాధకుడు ముక్తిపొందటానికి రెండు మార్గాలు చెప్పబడ్డాయి. 1. జ్ఞానమార్గము 2. కర్మమార్గము. వీటినే శుక, వామదేవ మార్గాలు అంటారు. ఈ రెండు మార్గాలలో దేనిని అనుసరించినా ముక్తిని పొందుతారు. కాని వాటిలో శుక మార్గముద్వారా ముక్తి పొందటం తేలిక. ఇది సద్యోముక్తి ప్రదమని చెప్పబడింది. ఇది జ్ఞానయోగము. రెండవదయిన వామదేవ మార్గము కర్మయోగము. ఈ మార్గంలో నడిచేవారు యోగము, ప్రాణాయామము మొదలైనవి చేయవలసి ఉంటుంది. వీటి సాధనలో అనేక అడ్డంకులు వస్తాయి. అందుచేత అనేక జన్మలు ఎత్తి జన్మాంతర అభ్యాస పుణ్యము వలన ఈ మార్గంలో సాధకులు కృతకృత్యులవుతారు. ఈ మార్గము క్రమముక్తిప్రదము.

శుకము అంటే పక్షి. ఇది చెట్టు కొమ్మ చివర ఉన్న పండును చూసినప్పుడు వెంటనే వెళ్ళి దాన్ని తినేస్తుంది. అలాగే జ్ఞానయోగి బ్రహ్మతత్త్వము తెలిసినప్పుడు తాను అందులో లీనమై పోతాడు. అందుకే దీనిని శుక మార్గము అంటారు. వామదేవము అంటే చీమ. ఇదికూడా చెట్టుకొమ్మ చివర ఉన్న పండును తినాలనే కోరికతో చెట్టు ఎక్కుతుంది. కాని ఆ ఎక్కటంలో ఎన్నో అడ్డంకులు. వీటన్నింటినీ దాటుకుని ఆ పండును చేరేసరికి చాలాకాలం పడుతుంది. అలాగే కర్మయోగి తన యోగ సాధనతో ముక్తి సాధించటానికి చాలా జన్మలు ఎత్తవలసి ఉంటుంది. అందుకే దీనిని వామదేవ మార్గము అంటారు. ఈ రెండు మార్గాలలోను శుకమార్గము ఉత్తమము అని చెప్పబడింది.

ఈరకంగా వేదసారము నెరిగిన శ్రీమన్నారాయణుడు 'బ్రహ్మవిత్' అనబడుతున్నాడు.

## 667. బ్రాహ్మణః

బ్రాహ్మణుడు, వేదాలను వల్లించువాడు.

**దత్తాత్రేయాది రూపేణ హ్యుదీర్ణో బ్రాహ్మణ స్మృతః**

**పఠనాద్వాథ వేదస్య బ్రాహ్మణః పరికీర్తితః ॥**

దత్తాత్రేయుడు మొదలైన బ్రాహ్మణుల రూపంలో అవతరించినవాడు. నిత్యము వేదపారాయణ చేయువాడు.

అనసూయ, అత్రి మహర్షుల కుమారుడు దత్తాత్రేయుడు. అత్రిమహర్షి విష్ణువుని గూర్చి తపస్సుచేయగా హరిప్రత్యక్షమై 'మునీంద్రా నీకు దత్తుడనైనాను' అన్నాడు. అత్రిమహర్షి సంతానం కావాలి అని తపస్సు చేస్తున్న రోజులలో, అతని కలలో త్రిమూర్తులు కనిపించి వారి అంశలతో కుమారుడు కలుగుతాడు అని చెప్పారు. ఆరకంగా విష్ణ్వంశతో పుట్టినవాడు దత్తాత్రేయుడు. ఇతడి భార్య లక్ష్మి. ప్రహ్లాదుడు మొదలైన వారికి ఆత్మవిద్యను ప్రసాదించిన మహానుభావుడు. గురుసంప్రదాయాన్ని నెలకొల్పినవాడు.

బ్రాహ్మణుడు చేయవలసిన పనులు రెండు. 1. వేదాధ్యయనం చెయ్యటము 2. వాటిని పారాయణ చేస్తూ శిష్యులకు వేదం నేర్పటము.

ఈ రకంగా వేదాలను పారాయణ చేసేవాడు. బ్రాహ్మణ రూపంలో సమస్త లోకాలకు సమస్త జనులకు వేదాలనుపదేసించిన వాడు.

## 668. బ్రహ్మీ

సకలముతనదిగా గలవాడు.

**మానమేయస్వరూపత్వాత్ స్వయంబ్రహ్మీతి శబ్ద్యతే**

ప్రమాణము, ప్రమేయము అనే సమస్తము తనయందే కలవాడు.

**బ్రహ్మ అస్యాస్తీతి బ్రహ్మీ** సకలము తనదిగా కలవాడు.

బ్రహ్మము తనయందు గలవాడు. చరాచరజగత్తు తనయందే గలవాడు. ఆత్మ స్వరూపమైనాడు. సత్యము, న్యాయము, దానము, తపస్సు అనే నాలుగు అంగములుగా గలవాడు. అందుకే శ్రీమన్నారాయణుడు బ్రహ్మీ అనబడుతున్నాడు.

## 669. బ్రహ్మజ్ఞః

వేదార్ధములు తెలిసినవాడు.

**యో వేదా నర్థతోవేత్తి సోఽపి బ్రహ్మజ్ఞ విశ్రుతః** వేదార్ధసారము నెరిగినవాడు.

**బ్రహ్మవేదం జానాతీతి బ్రహ్మజ్ఞః**

బ్రహ్మ అంటే వేదము. వేదాన్ని పూర్తిగా తెలిసినవాడు. **భగవద్గీత**లోని 15వ అధ్యాయం **'పురుషోత్తమప్రాప్తియోగం'**లోని 15వ శ్లోకము.

**సర్వస్య చాహం హృది సన్నివిష్టో మత్త స్మృతి జ్ఞానమపోహనం చ**
**వేదైశ్చ సర్వైరహమేవ వేద్యో వేదాంతకృద్వేదవిదేవ చాహమ్ ॥**

సమస్త ప్రాణుల హృదయములందు అంతర్యామిగా ఉన్నవాడను నేనే. నానుండి యే స్మృతి, జ్ఞానము, అపోహనము (సందేహాలు తొలగిపోవుట) కలుగుతున్నాయి. వేదములద్వారా తెలిసికొనదగినవాడను నేనే. వేదాంతకర్తను, వేదజ్ఞుడను కూడానేనే.

ఆ పరమేశ్వరుడే వేదవేద్యుడు. వేదాలు చెప్పిన కర్మకాండ, ఉపాసనాకాండ, జ్ఞానకాండల యొక్క అంతిమ లక్ష్యము. సంసారవిషయంలో వైరాగ్యం కలుగచేసి, అన్నివిధాలా యోగ్యులైనవారికి జ్ఞానాన్ని ప్రసాదిస్తాడు. వాటిద్వారా భగవత్స్వరూపాన్ని తెలుసుకున్నవారే, వేదాల అర్ధాన్ని తెలుసుకోగలుగుతారు. అంతేకాని సంసారభోగాల యందు చిక్కుకున్న వారికి వేదార్ధము తెలియదు.

వేదము యొక్క అర్ధాన్ని నిర్ణయించటాన్నే అంటే తాత్పర్యము చెప్పటాన్నే వేదాంతము అంటారు. వేదాలలో ఉన్నసందేహాలను తొలగించి పరమాత్మయందే అన్నింటినీ సమన్వయ పరచటము. ఇదే వేదాంతము. ఈ రకంగా వేదార్ధమును పూర్తిగా తెలుసుకున్నవాడు బ్రహ్మజ్ఞుడు. అందుకే శ్రీమన్నారాయణుడు 'బ్రహ్మజ్ఞః' అనబడుతున్నాడు.

వేదప్రతిపాదిత తత్త్వమునే స్వరూపముగా గలవాడు.

## 670. బ్రాహ్మణ ప్రియః

బ్రాహ్మణులయందు ప్రీతి గలవాడు.

**వేదాధికారిణోవిప్రాః ప్రియా యస్యేతి వై సదా**
**బ్రాహ్మణప్రియఇత్యుక్తో నవార్ణో ధర్మదోమనుః**

వేదాన్ని చదవటానికి అర్హత గలవారు బ్రాహ్మణులు. అటువంటి బ్రాహ్మణుల యందు ప్రీతి గలవాడు. ఈ నామము నవాక్షరీమంత్రము ధర్మప్రదము.

**బ్రాహ్మణా ప్రియా యస్యసః బ్రాహ్మణప్రియః**

వేదపారాయణచేసే బ్రాహ్మణులయందు ప్రీతిగలవాడు.

**ఘ్నంతంవదంతం పరుషంవదంతం యోఽబ్రాహ్మణం న ప్రణమే ద్యదార్హమ్**

బ్రాహ్మణుడు కొట్టినప్పటికీ, తిట్టినప్పటికీ అతనిని పూజించాలి. అలా పూజించని వాడు నాకు ప్రియుడుకాడు.

**విప్రప్రసాదా దసురాన్ జయామి** బ్రాహ్మణుల అనుగ్రహముచేతనే రాక్షసులను జయించుచున్నాను.

**భగవద్గీతలో**ని 12వ అధ్యాయము **'భక్తియోగము'**లోని 20వ శ్లోకము.

**యే తు ధర్మ్యామృతమిదం యథోక్తం పర్యుపాసతే**
**శ్రద్ధధానా మత్పరమాః భక్తాస్తేఽ తీవ మే ప్రియాః**

ఉపర్యుక్త ధర్మామృతమును సేవిస్తూ పైన చెప్పిన ఉత్తమగుణాలను కలిగిఉండి, నిష్కామభక్తి శ్రద్ధలతో మత్పరాయణులైన భక్తులు నాకు అత్యంత ప్రియులు.

ధర్మస్వరూపమై, అమృతమయమైన భక్తియోగముతో తత్పరులై నన్ను సేవించేవారు నాకు అత్యంత ప్రియులు.

**యందేవం దేవకీదేవి వసుదేవా దజీజనత్**
**భౌమస్య బ్రహ్మణో గుప్త్యై దీప్త మగ్ని మివారణిః**

బ్రాహ్మణులను రక్షాంచటంకోసమే దేవకీ వసుదేవులకు శ్రీకృష్ణపరమాత్ముడు జన్మించాడు. అని మహాభారతంలో చెప్పబడింది. అందుకే శ్రీమన్నారాయణుడు 'బ్రాహ్మణ ప్రియః' అనబడుతున్నాడు.

**వజ్రసూచికోపనిషత్తు** (సామవేదము)

బ్రహ్మ క్షత్రియవైశ్య శూద్రులని నాలుగు వర్ణాలున్నాయి. వీటిలో బ్రాహ్మణుడు శ్రేష్ఠుడు అని వేద వాక్యం. ఇది ఎందుకని ? బ్రాహ్మణుడంటే ఎవరు ? అతడు జీవుడా? దేహమా ? వర్ణమా ? జ్ఞానమా ? కర్మమా ? ధర్మాన్నాచరించేవాడా ? ఎవరు ?

జీవుడు బ్రాహ్మణుడని చెప్పటానికి వీలుకాదు ఎందుకని అంటే ? గడచిపోయినవి, రాబోయేవి ఇలా అనేక జన్మలు ఈ జీవుడికి సమానము. కర్మాధీనత వలన ఆ జీవుడే

అనేక శరీరములు ధరిస్తున్నాడు. అన్ని శరీరాలలోనూ జీవుడు ఒకే రూపంలో ఉన్నాడు. కాబట్టి జీవుడు – బ్రాహ్మణుడు కాదు. అలాగే 'ఈ శరీరమే బ్రాహ్మణుడు' అనటానికి లేదు. ఈ శరీరము పాంచభౌతికమైంది. మానవులందరికీ ఒకే రూపం ఉన్నది. జరామరణాలు అందరికీ సమానమే. బ్రాహ్మణుడు ఈ రంగులో ఉండాలి అని ఏమీ లేదు. పిత్రాదులను దహనం చేసే సమయంలో పుత్రులచేతిలో దహనం చేసి నందుకుగాను వారికి బ్రహ్మ హత్యాదోషము కూడా సంభవిస్తుంది. అవన్నీ ఈ శరీరానికే. అందుచేత శరీరము బ్రాహ్మణుడు కాదు.

ఇక వర్ణమే బ్రాహ్మణుడా ? ఒకే వర్ణములో వివిధ వర్ణాలున్నాయికదా ? అదీగాక అనేకమంది మహర్షులు అనేక రకాలుగా జన్మించారు. ఉదాహరణకి

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఋష్యశృంగుడు | – | జింక వలన | వ్యాసుడు | – | మత్స్యగంధి వలన |
| కౌశికుడు | – | దర్భలవలన | గౌతముడు | – | కుందేటి వీపునుండి |
| జాంబూకుడు | – | జంబుకము వలన | వసిష్ఠుడు | – | ఊర్వశి వలన |
| వాల్మీకి | – | వల్మీకమునుండి | అగస్త్యుడు | – | కుంభమునుండి |

జన్మించారు. వీరిలో జాతి ప్రసక్తిలేదు. అందుచేత వర్ణమే బ్రాహ్మణుడు అని చెప్పటానికి వీలులేదు.

ఇక జ్ఞానమే బ్రాహ్మణుడా ? క్షత్రియులలో జనక మహారాజు, కాశీరాజు– అశ్వపతి, జానశ్రుతి మొదలైన వారనేకులు బ్రహ్మజ్ఞానులు. కాబట్టి జ్ఞానమున్నవాడు బ్రాహ్మణుడు అనటానికి లేదు.

కర్మ బ్రాహ్మణుడా ? అన్ని జీవులకు ప్రారబ్ధము, సంచితము, ఆగామి అని మూడు కర్మలు సమానంగా ఉన్నాయి. జీవులన్నీ కర్మనుచేస్తూనే ఉన్నాయి. కాబట్టి కర్మ చేసేవాడిని బ్రాహ్మణుడనరాదు.

ధార్మికుడు బ్రాహ్మణుడా ? దానం చేసిన మహానుభావులు శిబిచక్రవర్తి, బలిచక్రవర్తి, కర్ణుడు లాంటి మహానుభావులు అనేకమంది ఉన్నారు. కాబట్టి దానం చేసినవాడు బ్రాహ్మణుడుకాదు.

మరి బ్రాహ్మణుడు ఎవరు ?

షడూర్ములు లేనివాడు. అవి వరుసగా

| | | |
|---|---|---|
| 1. ఋభక్ష | 3. శోకము | 5. జర |
| 2. తృష్ణ | 4. మోహము | 6. మరణము |

వికారము లేనివాడు సత్యజ్ఞానానంద స్వరూపుడు, నిర్వికల్ప సంకల్పుడు, అన్నింటికీ ఆధారమైనవాడు, అన్నింటియందు అంతర్యామిగాఉండేవాడు, ఆకాశంలాగా బాహ్యాంతరాల్లో వ్యాపించి ఉన్నవాడు, అవిచ్ఛిన్నమైన ఆనందము గలవాడు. అప్రమేయుడు, స్వానుభవముతో నిగ్రహింపతగినవాడు, స్వయంప్రకాశి అయిన పరమేశ్వరుని దర్శించినవాడు, దోషరహితుడు, సద్గుణసంపన్నుడు. మోహ, మాత్సర్యాది దోషములు లేనివాడు. దుఃఖానికి అతీతుడు అయినవాడు బ్రాహ్మణుడు అని పురాణాలయందు, ఇతిహాసముల యందు చెప్పబడింది. ఈ లక్షణాలు లేకపోతే బ్రాహ్మణత్వ సిద్ధేలేదు.

అటువంటి బ్రాహ్మణులయందు ప్రీతిగలవాడు.

## 671. మహాక్రమః

గొప్ప క్రమము కలవాడు.

**పరమోన్నతి మాత్మానం సోనిమ్నాద్భవ పాతకాత్**
**జీవాస్సమారోహయతో జ్ఞానభక్త్యాది రూపిణీ**
**సర్వాను పూర్వీ యస్యాస్తి మహాక్రమ ఇతీరితః ॥**

పరమేశ్వరుడు సర్వోత్కృష్టుడు. జీవులందరూ తనను పొందాలనే ఆశతో జ్ఞానము, భక్తి మొదలైన సోపానక్రమము గలవాడు.

**మహాన్క్రమః యస్యసః మహాక్రమః**

సంసారమనే పాతాళంలో ఉన్న జీవులు తనను పొందటంకోసం భక్తి, జ్ఞాన, వైరాగ్యాలనే మెట్లు గలవాడు. ఈ సోపానము మీదుగా జీవులనుద్ధరించేవాడు.

పరమేశ్వరుడు మానవులకు మొదట తనయందు నమ్మకము కలిగించి, ఆ తరువాత భక్తి, ఆ తరువాత తత్పరత, జ్ఞానము, వైరాగ్యము కలిగించి మోక్షాన్ని ప్రసాదిస్తాడు. భగవంతుడి మీద భక్తి గలగాలంటే అనేక జన్మల సుకృతం ఉండాలి.

**జన్మాంతర సహస్రేషు తపోధ్యాన సమాధిభిః**
**నరాణాం క్షీణపాపానాం కృష్ణే భక్తిః ప్రజాయతే ॥**

అనేక జన్మలయందు చేసిన ధ్యానము, తపస్సు, యోగముల వలన పాపాలు నశించి జీవుడికి పరమేశ్వరుడైన కృష్ణునియందు భక్తి గలుగుతుంది.

**భగవద్గీత**లోని 7వ అధ్యాయం **'జ్ఞానవిజ్ఞానయోగము'**లోని 19వ శ్లోకము.

**బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్మాం ప్రపద్యతే**

**వాసుదేవసర్వమితి స మహాత్మా సుదుర్లభః ॥**

అనేక జన్మల తరువాత, జ్ఞానియైనవాడు. సర్వమూ వాసుదేవమయమే అని భావించి నన్ను శరణు పొందుతాడు. అటువంటివారు చాలా తక్కువగా ఉంటారు.

అనేక జన్మలయందు పుణ్యం చేస్తేనే కాని పరమేశ్వరుని ధ్యానం చెయ్యలేడు. అటువంటివాడు పెక్కు జన్మలయందు సుకృతం చేస్తేనే కాని జ్ఞానికాడు. అటువంటి జ్ఞాని పరమేశ్వరుని శరణువేడతాడు.

**భగవద్గీత** 12వ అధ్యాయం **'భక్తియోగం'**లోని 9వ శ్లోకము.

**అథచిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరమ్**

**అభ్యాసయోగేన తతో మామిచ్ఛాప్తుం ధనంజయ ॥**

అర్జునా ! మనసు నాయందే నిలపలేకపోతే అభ్యాసయోగముద్వారా ప్రయత్నించవలసినది.

భగవంతుని పొందటానికి, ఆయన యందే మనసు నిల్పటానికి అనేక ఉపాయాల ద్వారా ప్రయత్నించటమే అభ్యాసయోగము. సాధకుడు భక్తి, శ్రద్ధ, భగవన్నామము, రూపము, ఆయన గుణములు, లీలలు మొదలైన వాటియందు మనస్సు నిల్పి ప్రయత్నం చెయ్యటమే అభ్యాసము.

ఈ రకంగా పరమేశ్వరుని పొందటానికి అనేక సోపానాలు ఉన్నాయి.

1. కర్మానుష్ఠానము
2. శ్రద్ధ
3. అకుంఠితభక్తి
4. భగవత్ప్రేమ
5. ఆత్మజ్ఞానము
6. సమదర్శనజీవనము
7. సాధుజనసేవ
8. సంపూర్ణశరణాగతి

ఈ సోపానాలమీద నడిపిస్తాడు. అందుచేత భక్తుడు ఒకటొకటిగా ఈ సోపానాలను అధిరోహిస్తూ పరమేశ్వరుని చేరతాడు. ఈ సోపానాలను గలవాడు. కాబట్టే శ్రీమన్నారాయణుడు 'మహాక్రమః' అనబడుతున్నాడు.

## 672. మహాకర్మా

గొప్ప కార్యములు గలవాడు.

**అత్యంత హీనాన్ జంతూశ్చ యోగ్యాన్ స్వానుభవస్య చ**

**కరోతి మహదాశ్చర్యం కర్మ యస్యాస్తి సర్వదా ॥**

**మహాకర్మా సవిజ్ఞేయో హ్యష్టార్ణో మనురుత్తమః**

నీచాతినీచులైన వారిని కూడా తనను పొందటానికి వీలుగా చేయగలవాడు. ఈ నామము అష్టాక్షరీ మంత్రము శ్రేష్ఠమైనది.

**మహత్ కర్మ యస్యసః మహాకర్మా** గొప్ప కర్మగలవాడు. క్రిమికీటకాలు, పశుపక్ష్యాదులకు కూడా ఉత్తమజన్మలు కల్పించి మోక్షము నిచ్చేవాడు. పరమేశ్వరుడు నిర్వర్తించే జగద్వ్యాపారము మిక్కిలి గొప్పది. అందుచేతనే శ్రీమన్నారాయణుడు మహాకర్మా అనబడుతున్నాడు.

## 673. మహాతేజాః

గొప్ప కాంతివంతుడు.

**అనాద్య విద్యాఖ్యతమో హారి తేజో మహద్యతః**
**మహాతేజాహ్యతః ఖ్యాతః తేజదో వసువర్ణకః ॥**

జీవికి జన్మతః ఉన్న అజ్ఞానాన్ని సమూలంగా నాశనం చేయగల తేజస్సు గలవాడు. ఈ నామము అష్టాక్షరీ మంత్రము. తేజస్సును ప్రసాదిస్తుంది.

**మహత్ తేజః యస్యసః మహాతేజాః** గొప్పకాంతి గలవాడు.

తమోగుణప్రధానులైన వారికి కూడా జ్ఞానమునివ్వగల తేజోవంతుడు.

పరమేశ్వరుడు గొప్ప కాంతిమయుడు. అతని కాంతులచేతనే లోకములన్నీ ప్రకాశిస్తున్నాయి. చంద్రసూర్యాగ్నులు కూడా అతని కాంతితోనే ప్రకాశిస్తున్నారు.

అతని ప్రకాశము ద్వారానే జీవులకు జ్ఞానజ్యోతులు ప్రజ్వరిల్లుతున్నాయి.

**భగవద్గీత**లోని 15వ అధ్యాయం **'పురుషోత్తమ ప్రాప్తియోగం'**లోని 12వ శ్లోకం.

**యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽ ఖిలమ్**
**యచ్ఛంద్రమసి యచ్ఛాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్ ॥**

సమస్త జగత్తును ప్రకాశింపచేసే సూర్యుని తేజస్సు, చంద్రుని తేజస్సు, అగ్ని తేజస్సు కూడా నా తేజస్సే అని ఎరుంగుము.

చంద్రసూర్యాగ్నుల తేజస్సు ఆ పరమేశ్వరునిదే. అంటే వీరు ముగ్గురూ పరమేశ్వరుని లోని భాగాలే. విరాడ్రూపానికి సూర్యచంద్రులు కనులు, అగ్ని జ్ఞాననేత్రము. చంద్రుడు మనసు. అని చెప్పబడింది. కొన్నిచోట్ల సూర్యుడు – కనులు, అగ్ని – ముఖము, చంద్రుడు – మనస్సు అని చెప్పబడింది. అందుచేతనే చంద్రసూర్యాగ్నులకాంతి ఆ పరమేశ్వరునిదే. వారు అతనిలోని అంతర్భాగాలే.

గొప్పవాడైన తాను హృదయమందుండేవాడు.

**మహోరగ ఇతి ఖ్యాతః చిత్తద్వారా ప్రవేశనాత్** పాము చిన్న కన్నంలో ప్రవేశించి నట్లుగా పరమేశ్వరుడు భక్తుల హృదయాలలో ప్రవేసిస్తాడు.

**ఉరసాగచ్ఛతీతి ఉరగః మహాంశ్చాసౌ ఉరగశ్చ మహోరగః**

గొప్పవాడైన తాను అల్పులైన భక్తుల హృదయములందు ప్రవేసించి వారికి జ్ఞానజ్యోతులు వెలిగించేవాడు.

**మహాన్ చ అసౌ ఉరగః చ** ఇతడు గొప్పదైన ఉరగము.

**భగవద్గీత**లోని 10వ అధ్యాయం **'విభూతియోగం'**లోని 28, 29 శ్లోకములు.

**ఆయుధానామహం వజ్రం ధేనూనామస్మి కామధుక్**

**ప్రజనశ్చాశ్మి కందర్పః సర్పాణామస్మి వాసుకిః ॥ 28**

ఆయుధములలో వజ్రాయుధాన్ని నేను. పాడి ఆవులలో కామధేనువును నేను. శాస్త్ర విహితరీతిలో సంతానోత్పత్తికి కారణమైన మన్మధుడను నేను. సర్పములలో వాసుకిని నేను.

**అనంతాశ్చాస్మినాగానాం వరుణో యాదసామహమ్**

**పిత్రూణా మర్యమా చాస్మి యమః సంయమతామహమ్ ॥ 29**

నాగులలో ఆదిశేషుడను నేను. వరుణుడను నేను. పితరులలో ఆర్యముడను, శాసకులలో యమధర్మరాజును నేను.

ఈరకంగా శ్రీమన్నారాయణుడు 'మహోరగః' అనబడుతున్నాడు.

## 675. మహాక్రతుః

సులభముగా ఆరాధింపదగినవాడు.

**సర్వైశ్చ సుకరాపూజా యస్యస్యాత్సా మహాక్రతుః** ఎటువంటి వారైనాసరే తనను ఆరాధించటానికి వీలైనవాడు.

ఆరాధనలో ఎటువంటి నియమనిష్ఠలు లేనివాడు. భక్తియే ప్రధానమైనవాడు.

**మహాన్క్రతుః యస్యసః మహాక్రతుః** సులభముగా చేయదగిన ఆరాధన గలవాడు. **భగవద్గీత**లోని 9వ అధ్యాయం **'రాజవిద్యారాజ గుహ్యాయోగము'**లోని 27వ శ్లోకం.

**యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్**
**యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్ ॥**

కౌంతేయా ! నీవు ఆచరించే కర్మను, భుజించే ఆహారము, హోమము చేసే హవ్యము, అర్పించే దానము, ఆచరించే తపస్సునాకే సమర్పించవలసింది.

అంటే ఏ రకంగా పూజించినా, అది పరమేశ్వరునికే చెందుతుంది.

**ఆత్మాత్వం గిరిజామతిః పరిజనాప్రాణాశరీరం గృహం**
**పూజాతే విషయోగ భోగరచనా నిద్రాసమాధిస్థితిః**
**సంచాల పదయోః ప్రదక్షిణ నిధిః శ్రోత్రాణిసర్వాంగిరో**
**యద్యత్కర్మకరోమి దత్త దఖిలం శంభో తవారాధనమ్ ॥**

మహాక్రతుః అంటే క్రతువులలో శ్రేష్ఠమైన అశ్వమేధము శ్రీమన్నారాయణుడే.

## 676. మహాయజ్వా

గొప్ప యాజకులను గలవాడు.

**దేవతాంతర యాజిభ్యః స్వయాజ్యుత్కృష్ట కారకః**
**మహాయజ్వా సముద్దిష్టః సత్కర్మఫలదో మనుః ॥**

ఇతర దేవతలనారాధించి పొందే ఫలముకన్న తననారాధించే భక్తులకు ఎక్కువ ఫలితాన్నిచ్చేవాడు. ఈ నామము అష్టాక్షరీ మంత్రము. పుణ్యకర్మ ప్రదము.

**మహాంతః యజ్వానః యస్యసః మహాయజ్వా**

ఇతరులను పూజించేవారి కన్న తనను పూజించేవారు అధికులు కాబట్టి గొప్ప యాజకులను గలవాడు. యాజకులు అనగా యాగము చేసేవారు అని అర్థం.

**తేషామే కాంతినః శ్రేష్ఠాః తే చైవానన్య దేవతాః**

భగవంతుని తప్ప ఇతర దేవతలకు మ్రొక్కరు. కాబట్టి ఇతరుల కన్న వీరు శ్రేష్ఠులు.

**మహాన్ చ అసౌ యజ్వా చః** ఈతడు గొప్పవాడైన యజ్ఞ నిర్వర్తకుడు. లోకము యొక్క ఉపయోగం కోసం యజ్ఞాలు చేస్తాడు. విశ్వశ్రేయస్సుకై యజ్ఞాలు చేసేవాడు. రామావతారంలో అశ్వమేధ యాగం చేశాడు. పరమేశ్వరుడే యజ్ఞ నిర్వాహకుడు. అతడే యజ్ఞ స్వరూపము. మహాయాగమైన అశ్వమేధ యాగంలో అశ్వమే ప్రజాపతి ఈరకంగా అశ్వాన్ని ప్రజాపతిగా భావించి ఉపాసన చేసేవాడికి పునర్జన్మ ఉండదు.

**బృహదారణ్యకోపనిషత్తు**లో కర్మలలో ప్రధానమైనది, అత్యంత ఫలప్రదమైనది అశ్వమేధము. ఇది రాజులు మాత్రమే చేయదగిన యాగము. అంతశక్తి సామర్థ్యాలు లేని సామాన్యులకు ఆ యాగఫలితం రావాలి అంటే, మార్గం– ఉపాసన. కాబట్టి ఆ యాగంలో ప్రధానమైన అశ్వాన్ని ప్రజాపతిగా భావించి ఉపాసన చేస్తే అశ్వమేధ ఫలం వస్తుంది. అందుకనే అశ్వమేధాశ్వ వర్ణనతోనే ఈ ఉపనిషత్తు ప్రారంభమవుతుంది. దీనిలోని మొదటి, రెండవ అధ్యాయాల్లో 'అశ్వప్రజాపతి'ని నిరూపిస్తున్నారు. అంటే యాగాశ్వంలో ప్రజాపతిని భావించి ఉపాసన చెయ్యాలన్నమాట. ఆ విషయాన్ని ఇప్పుడు మీకు వివరిస్తాను వినండి." అంటూ **బృహదారణ్యకోపనిషత్తు**లోని మొదటి అధ్యాయాన్ని ప్రారంభించాడు.

యాగాశ్వం యొక్క శిరోభాగం – బ్రాహ్మీముహూర్తం. అంటే సూర్యోదయానికి 45 నిమిషాలు ముందు
సూర్యుడు – నేత్రాలు
వాయువు – ప్రాణం
వైశ్వానరాగ్ని – నోరు
సంవత్సరం – శరీరం
ద్యులోకం – వీపు
అంతరిక్షం – ఉదరం
భూమి – పాదాలు
దిక్కులు – పార్శ్వభాగాలు
మూలలు – పార్శ్వభాగంలోని ఎముకలు
ఋతువులు – అంగాలు
మాసాలు, పక్షాలు – సంధులు
నక్షత్రాలు – ఎముకలు
మేఘాలు – మాంసం
ఇసుక – సగం జీర్ణమైన అన్నం
నదులు – నాడులు
పర్వతాలు – యకృత్
క్లోమాలు – మాంస ఖండాలు
ఓషధులు, వనస్పతులు – వెంట్రుకలు
మధ్యాహ్న కాలం వరకు పైకి పోయే సూర్యుడు – నాభికి పైభాగం
మధ్యాహ్నం నుండి క్రిందికి దిగే సూర్యుడు – నాభికి క్రింది భాగం
మెరుపు – ఆవలింత
మేఘగర్జన – శరీరాన్ని విదల్చటం
వర్షం – మూత్రం
వాక్కు – సకిలింపు

ఈ రకంగా యాగాశ్వంలో కాలము, లోకాలు, దేవతలు అన్నీ ఆరోపించ బడ్డాయి. అశ్వానికి ముందు భాగంలో ఉంచే స్వర్ణపాత్ర పగలు. దానికి జన్మస్థానం తూర్పు సముద్రం. అశ్వానికి వెనుక ఉంచే వెండి పాత్ర రాత్రి. దాని జన్మస్థానం పశ్చిమ సముద్రం. ఈ గుర్రమే.

| | | |
|---|---|---|
| హయమై | - | దేవతలను మోసింది |
| వాజియై | - | గంధర్వుల్ని మోసింది |
| అశ్వమై | - | మానవుల్ని మోసింది |

సముద్రమే అంటే పరమాత్మయే దీన్ని బంధించి ఉంచేచోటు. పరమాత్మయే దీని ఉత్పత్తిస్థానం.

మనస్సు మొదలైన వాని పుట్టుకకు పూర్వం ఈ విశ్వంలో నామరూపాలుగా విభక్తమైనది ఏదీలేదు. కార్యమూ కారణమూలేవు. అంతా ఆకలి రూపంలో ఉన్న మృత్యుదేవత చేత ఆవరించబడి ఉండేది. ఆకలి కలగగానే దాన్ని తీర్చుకోటానికి దేనినో ఒకదాన్ని చంపుతారు. కాబట్టి ఆకలే మృత్యువు. ఆ సమయంలో హిరణ్యగర్భుడు మనస్సుతో కూడిన వాడుగా ఉండాలనుకొని మనస్సును సృష్టించాడు. అర్చన చేస్తూ ఆచరణ ప్రారంభించాడు. అతడు చేసిన అర్చన వల్ల జలం పుట్టింది. పూజ చేస్తుండగా నాకు జలం లభించింది. కాబట్టి ఇదే 'అర్కా'నికి 'అర్కత్వం' అనుకున్నాడు. అశ్వమేధంలో ఉపయోగించే విరాట్ అగ్నికి 'అర్క' మని పేరు. ఈ విధంగా వచ్చింది. ఈ రకంగా అర్కానికి అర్కత్వం తెలుసుకున్నవాడు నిశ్చయంగా జలాన్ని, సుఖాన్ని పొందుతాడు.

జలమే అర్కము. ఆ జలంలో సారభూతమైన నురుగులాంటిది. నేతి ముద్దలాగా, స్థూల భాగంగా ఘనీభవించి భూమిగా మారింది. అంటే జలంలోంచి భూమి పుట్టింది. ఈ రకంగా భూమి ఉద్భవించేప్పటికి ప్రజాపతి అలసిపోయాడు. అలసిపోయిన అతని శరీరం నుంచి సారవంతమైన తేజోరసం (అగ్ని) పుట్టింది. ఈ విధంగా జలం నుంచి విరాట్స్వరూపమైన అగ్ని పుట్టింది.

ప్రజాపతి తనను తాను మూడు భాగాలు విభజించుకున్నాడు. అగ్ని వాయువులతో పాటు ఆదిత్యుని కూడా గ్రహించాడు. విరాట్ స్వరూపం నుండి పుట్టిన హిరణ్యగర్భుని (అగ్ని) యొక్క అవయవాలు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| తూర్పు దిక్కు | - | శిరస్సు | దక్షిణ, ఉత్తర దిక్కులు | - | పార్శ్వాలు |
| ఈశాన్యము, ఆగ్నేయము | - | భుజాలు | ద్యులోకం | - | పృష్ఠము (వీపు) |
| పశ్చిమ దిక్కు | - | పుచ్ఛం | అంతరిక్షం | - | ఉదరం |
| వాయువ్యము, నైరుతి | - | తొడలు | పృథివి | - | హృదయం |

అగ్ని స్వరూపంలో ఉండే ప్రథమ ప్రజాపతి జలంలో ఉంటాడు. ఈ విధంగా అగ్ని జలంలో ఉన్నట్లు తెలుసుకున్నవాడు ఎక్కడికి వెళ్ళినా స్థిరమైన విశ్రాంతి స్థానం

లభిస్తుంది. ఇది అనుషంగిక ఫలం. అగ్ని జలంలో విశ్రమించటమనే గుణాన్ని ఉపాసించినందువల్ల వచ్చే ఫలం. అంతేగాని ఆ గుణాలు గల ప్రజాపతిని ఉపాసించటంవల్ల వచ్చే ఫలం కాదు.

ఆ హిరణ్యగర్భుడు తనకు రెండవ శరీరం కావాలని కోరుకున్నాడు. అలా అనుకొని, ఆకలి రూపంలో ఉన్న మృత్యుప్రజాపతి తన మనస్సులో వేదత్రయాన్ని గురించి ఆలోచించాడు. అంటే విహితమైన సృష్టి క్రమాన్ని గురించి ఆలోచించాడు. ఆ విధంగా ఆలోచించటంవల్ల కలిగిన వీర్యమే సంవత్సరమైనది. అంతకు పూర్వం సంవత్సరమనేది లేదు. సంవత్సరమనే మృత్యురూపుడైన ప్రజాపతి, గర్భస్థుడై ఉన్నట్టి ప్రజాపతిని సంవత్సకాలం గర్భంలో మోశాడు. సంవత్సర కాలం తరువాత ఆ ప్రజాపతిని సృష్టించాడు. ఆ విధంగా మొట్టమొదటి సారిగా శరీరం ధరించిన ఆ బాలుని మ్రింగటానికి మృత్యు రూపుడైన ప్రజాపతి నోరు తెరిచాడు. స్వాభావికమైన అవిద్యకారణంగా భయపడిన ఆ బాలుడు 'బాణ్' అనే శబ్దం చేశాడు. ఆ శబ్దమే వాక్కు అయింది. ఆ కేక విని మృత్యు ప్రజాపతి "ఈ బాలుణ్ణి తింటే నాకు లభించేది చాలా తక్కువ ఆహారం" అని తలచి ఆ బాలుణ్ణి తినలేదు. ఆ వాక్కు ద్వారా వేదాలు, ఛందస్సు, యజ్ఞం, ప్రజలు, పశువులు వీటిన్నింటినీ సృష్టించాడు. అతడు సృష్టించిన వస్తువులన్నింటినీ తాను తిందామనుకున్నాడు తింటున్నాడు. అందుకనే అతడికి మృత్యురూప ప్రజాపతి అని పేరు వచ్చింది. ఈ విధంగా మృత్యుదేవత యొక్క తినటమనే స్వభావాన్ని తెలుసుకున్నవాడు అన్నింటికి తాను భోక్త అవుతాడు. ఇవన్నీ అతనికి అన్నమవుతాయి.

ప్రజాపతి మళ్ళీ తాను గొప్పదైన అశ్వమేధంలాంటి యజ్ఞాల ద్వారా యజనం చెయ్యాలనుకున్నాడు. తపస్సు చేశాడు తపస్సు చేసి అలసిపోయిన అతని శరీరం నుంచి (మృత్యు ప్రజాపతి శరీరంనుంచి) యశస్సు, బలము దూరమైనాయి. చక్షురాది ఇంద్రియాలు, ప్రాణం ఇవే అతని యశస్సు బలము. ఇంద్రియాలే యశస్సు. ప్రాణమే – వీర్యం. ఈ రెండు దూరమైపోగానే శరీరం ఉబ్బిపోవటం ప్రారంభమైంది. ఇంత జరిగినా మనస్సు మాత్రం శరీరంలోనే ఉన్నది.

"నా యీ శరీరం యజ్ఞానికి యోగ్యమైనదిగా కావాలి. నేను ఈ శరీరంతో శరీరధారిని కావాలి. యశస్సు బలము లేక శరీరం ఉబ్బిపోయింది. కాబట్టి నేను కొత్త శరీరం ధరించాలి" అనుకున్నాడు. యజ్ఞానికి తగిన అశ్వం అయినాడు. అందుకనే ఆ యజ్ఞానికి అశ్వమేధమనే పేరు వచ్చింది. అలా అశ్వరూపంలో ఒక సంవత్సరం ఉండి తరువాత దానిని తన కోసమే బలి ఇచ్చాడు. ఇతరమైన గ్రామ్య, అరణ్యక పశువుల్ని ఇతర దేవతల

కోసం పంపాడు. ఈ మండుతున్న సూర్యుడే అశ్వమేధము. ఈ శరీరమే సంవత్సరం. భూమిమీది అగ్నియే అర్కం. ప్రపంచాలన్నీ అవయవాలు కాబట్టి అగ్ని, సూర్యుడు ఈ రెండూ అర్కము, అశ్వమేధమయినాయి. ఈ రెండూ కలిస్తే ఆ మృత్యుప్రజాపతి.

ఈ అర్కానికి భూఃభువః సువః అనే లోకాలు అవయవాలు. ఈ యాగానికి ఫలం అదిత్యుడు. అగ్ని ఆదిత్యుడు. ఈ రెండింటి తాదాత్మ్యం వల్ల అయిన ఒకే దేవత మృత్యుప్రజాపతి. కాబట్టి 'నేనే అశ్వమేధ రూపమైన మృత్యువుని అశ్వము – అగ్ని ఈ రెండింటి వల్ల సిద్ధించిన దేవతా స్వరూపమే నాది" అని ఉపాసించేవాడికి అశ్వమేధాన్ని ప్రజాపతిగా భావించి ఉపాసన చేసేవాడికి పునర్జన్మ ఉండదు. అతడు దేవతలలో ఒకడౌతాడు' అంటూ అశ్వమేధాన్ని పూర్తిచేశాడు రత్నాకరుడు.

ఈరకంగా అశ్వమేధ యాగము రూపంలో ప్రజాపతిని ఉపాసనచేసే యాజకులు కలవాడు కాబట్టే శ్రీమహావిష్ణువు 'మహాయజ్వా' అనబడుతున్నాడు.

## 677. మహాయజ్ఞః

గొప్ప యాగము కలవాడు.

**అన్యేభ్యోదేవ యాగేభ్యః స్వయాగోత్కృష్టకారకః**
**మహాయజ్ఞ స్సమాఖ్యాత్ హ్యష్టార్ణో హరియాగదః**

ఇతర దేవతలకన్నా, తనయాగము గొప్పదిగా గలవాడు. ఈ నామము అష్టాక్షరీ మంత్రము. హరిపూజా ఫలాన్నిస్తుంది.

**మహాన్ యజ్ఞః యస్యసః మహాయజ్ఞః** ఇతరయాగములకన్న ఉత్కృష్టమైన అభిగమనము, మధుపర్కము మొదలైన యాగాలు గలవాడు.

**యాః క్రియాః సంప్రయుక్తాః స్యుః ఏకాంతగత**
**బుద్ధిభిః తాస్సర్వాః శిరసాదేవః ప్రతిగృహ్ణాతివై స్వయమ్ ॥**

జ్ఞానులు చేసే పూజలను, పరమేశ్వరుడు స్వయంగా తన తలతో స్వీకరిస్తాడు.

**సాత్వతసంహితలో** "ఏకాంతంలో ఉన్న పరమభాగవతోత్తములు చేసే పూజను భగవానుడు శిరస్సుతో స్వీకరిస్తాడు" అని చెప్పబడింది. ఈతడు గొప్ప యజ్ఞము.

**భగవద్గీత** 10వ అధ్యాయము **'విభూతియోగం'**లోని 25వ శ్లోకము.

**మహర్షీణాం భృగురహం గిరిరామస్మ్యేకమక్షరమ్**
**యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి స్థావరాణాం హిమాలయః**

అర్జునా ! మహర్షులలో భృగువును నేను. శబ్దములలో ఓంకారము నేను. యజ్ఞాలలో జపయజ్ఞము నేను. స్థావరములలో హిమాలయమును నేను.

జపయజ్ఞంలో హింస ఏమాత్రమూ ఉండదు. అది భగవత్సాక్షాత్కారము కలిగిస్తుంది.

**మనుస్మృతిలో**

**విధి యజ్ఞాజ్జపయజ్ఞో విశిష్టో దశభిర్గుణైః**

**ఉపాంశుః స్యాచ్ఛత గుణం సాహస్రో మానసః స్మృతః**

విధి యజ్ఞము కన్న జపయజ్ఞము పదిరెట్లు, ఉపాశుజపము నూరురెట్లు, మానస జపము వెయ్యిరెట్లు శ్రేష్ఠమైనవి.

అందుకే యజ్ఞాలలో కూడా జపస్వరూపి అయిన శ్రీమన్నారాయణుడు మహాయజ్ఞః అనబడుతున్నాడు.

## 678. మహాహవిః

గొప్ప హవిస్సు గలవాడు.

**ఆత్మరూపం హవిర్యస్య సమహా హవిరుచ్యతే ॥**

ఆత్మను పరమేశ్వరుని యందు శరణాగతి చెందింపచేయువాడు. ఇలాచేస్తేనే సాయుజ్యం లభిస్తుంది. అందుకే ఆత్మ అనే హవిస్సు గలవాడు.

**మహాంతి హవీంషి యస్యసః మహాహవిః**

హింసాదులు లేని పరమసాత్వికమైన ఆత్మను హవిస్సుగా గలవాడు.

**భగవద్గీత** 4 అధ్యాయం **'జ్ఞానయోగము'**లోని 24, 25 శ్లోకాలు.

**బ్రహ్మార్పణం బ్రహ్మహవిః బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్**

**బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మకర్మసమాధినా ॥**

యజ్ఞ కార్యములందు ఉపయోగించే స్రుక్కు, స్రువము, బ్రహ్మము, హోమము చేసే ద్రవ్యము, బ్రహ్మము అగ్ని బ్రహ్మము, యజ్ఞకర్త, యజ్ఞక్రియ కూడా బ్రహ్మమే. ఈ బ్రహ్మకర్మయందు స్థితుడై ఉండి యోగి ద్వారా పొందబడే యజ్ఞఫలము కూడా బ్రహ్మమే.

ఈరకంగా యజ్ఞము. యజ్ఞకర్త, యజ్ఞకర్మ, యజ్ఞఫలము అంతా పరబ్రహ్మస్వరూపము.

**యజ్ఞానాం జపయజ్ఞోస్మి** యజ్ఞములలో జపయజ్ఞము శ్రీమన్నారాయణుడు. అందుకే అతడు 'మహాహవిః' అనబడుతున్నాడు.

# 679. స్తవ్యః

స్తుతించటానికి తగినవాడు.

**చేతశ్శరీర యోర్ఙ్ఞంతో వ్యాపారారాధ్యతే హరేః**

**ఉక్తం నారాయణస్యాథ నాగారాధ్యత్వముచ్యతే**

**స్మృతస్తు త్యర్హనాత్స్తవ్యః షడర్ణోబంధమోచకః**

స్తుతించటానికి తగిన యోగ్యత కలవాడు కాబట్టి వాస్తవ్యుడు అనబడుతున్నాడు. ఈ నామము షడక్షరి. సంసారబంధనాన్ని త్రెంచి వేస్తుంది.

**స్తోతుమ్ అర్హః స్తవ్యః** స్తోత్రమునకు తగినవాడు.

శ్రీమహావిష్ణువును స్తుతించటానికి అష్టోత్తరము, సహస్రనామావళి వంటివి ఉన్నాయి. ఈ నామాలన్నీ మిక్కిలి మంగళప్రదమైనవి. నిత్యము, నిరవధికము అయినవి. ఆయనకు ఉన్న గుణగణాలను వివరిస్తాయి. అందుచేత భగవానుడు స్తుతింపదగినవాడు.

**ఆదరేణ యథాస్తౌతి ధనవంతం ధనేచ్ఛయా**

**తథాచేద్విశ్వ కర్తారం కోనము చ్యేత బంధనాత్**

ధనం కావలసినవాడు, ఆ ధనం ఉన్నవాణ్ణి స్తుతించి అతని దగ్గర నుంచి ధనం సంపాదిస్తాడు. అలాగే శ్రీమహావిష్ణువును స్తుతించినవాడు సంసారబంధనాలనుండి విడివడతాడు.

పరమేశ్వరుడు ఎవరినీ స్తుతించడు. అందరిచేతా స్తుతించబడతాడు. దేవాసుర సంగ్రామం జరిగినప్పుడల్లా శ్రీమహావిష్ణువు యొక్క పరాక్రమంవల్లనే దేవతలు యుద్ధంలో గెలుస్తున్నారు. ఆవిధంగా విజయం పొందిన తరువాత బ్రహ్మాది దేవతలంతా శ్రీమహావిష్ణువును పరిపరివిధాల కొనియాడారు.

రామరావణసంగ్రామం జరిగింది. రావణబ్రహ్మ సంహరించబడ్డాడు. ఆ సంతోష సమయంలో దేవతలు, యక్షులు, గంధర్వులు అందరూ శ్రీరామచంద్రుని పరిపరివిధాల కీర్తించారు.

కృష్ణావతారంలో కంసుణ్ణి సంహరించాడు. దేశానికి పట్టిన దుర్గతి దాపురించింది అని దేవతలంతా సంతసించారు. శ్రీకృష్ణభగవానుని కీర్తించారు. ఈ విధంగా కీర్తించ బడతాడు. కాబట్టే శ్రీమన్నారాయణుడు 'స్తవ్యః' అనబడుతున్నాడు.

## 680. స్తవప్రియః

స్తోత్రప్రియుడు.

**యయాకయా చిద్భారత్యా యేనకేవాపి జంతునా**
**యథాకథంచి త్కథితో యస్య ప్రియత మస్తవః**
**స్తవప్రియ స్సకథితో వస్వర్ణః ప్రీతివర్ధకః ॥**

పరమేశ్వరుని ఏ భాషలో స్తుతించాలి ? అనే అనుమానం అవసరం లేదు. ఆయన అన్ని భాషలు తెలిసినవాడు. ఎవరు ఏ భాషలో స్తుతించినా ఆయనకు అర్థం అవుతుంది. ఆయన ఆ స్తోత్రాన్ని స్వీకరిస్తాడు. ఈ నామము అష్టాక్షరీ మంత్రము. ప్రేమను వృద్ధి పొందించును.

**స్తవః ప్రియః యస్యసః స్తవప్రియః** స్తోత్రమునందు ప్రీతిగలవాడు.

పూర్వకాలంలో 'ఘంటాకర్ణుడు' అనే పిశాచరాజు ఉండేవాడు. ఇతడి చెవులకు ఘంటలు ఉండేవి. ఇతడు కదలినప్పుడల్లా అవి శబ్దం చేసేవి. ఈ పిశాచాధిపతి తన పిశాచ గణాలతో ఊరిమీదపడి దొరికనవాణ్ణి దొరికినట్లుగా పీక్కు తినేవాడు. ఇతడు హరిభక్తుడు.

శ్రీకృష్ణుడు పుత్రార్థియై కైలాసానికి వెడుతూ ఉన్నప్పుడు బదరికావనంలోఘంటాకర్ణుడు ఎదురైనాడు. అతడు కృష్ణుని చూసి 'నీవెవరవు ? ఎక్కడికి పోతున్నావు?' అని అడిగాడు. దానికి శ్రీకృష్ణుడు 'పుత్రార్థినై కైలాసానికి వెడుతున్నాను' అని బదులిచ్చాడు. ఆ మాటలు విన్న ఘంటాకర్ణుడు" ఈ త్రోవనవంటరిగా వెళ్ళరాదు. ఇక్కడ పిశాచాలు బాధిస్తాయి. అంటూ హరినామస్మరణ చేస్తూ కృష్ణుడికి తోడుగా వెళ్ళాడు. అతని భక్తికి మెచ్చి శ్రీకృష్ణుడు అతడికి దివిజలోకము, ఇంద్రపదవి అనుగ్రహించాడు. అని ఉత్తరహరివంశము నందు చెప్పబడింది. ఈ రకంగా ఘంటాకర్ణుడు పిశాచభాషలో కీర్తించినప్పటికీ ప్రీతితో స్వీకరించినవాడు.

## 681. స్తోత్రమ్

స్తుతిని పూర్తి యొనర్చుకొనువాడు.

**స్వేనైవ నిష్పాద్యతయా స్వస్తుతేః స్తోత్రముచ్యతే** తనను స్తోత్రం చేసేవారికి జ్ఞానాన్ని ప్రసాదించి తన స్తోత్రము తనే చేయించుకునేవాడు.

**స్తూయతే అనేన అయమితి స్తోత్రమ్** భక్తులకు జ్ఞానసంపదనిచ్చి వారిచే స్తోత్రము చేయించుకొనువాడు.

స్వాయంభువ మనువు కుమారుడు ఉత్తానపాదుడు. అతని భార్య సునీతి. వీరి కుమారుడు ధ్రువుడు. చిన్నతనంలో ధృవుడు ఒకనాడు తండ్రి వడిలో ఉండగా, అతడి పినతల్లి వచ్చి ఇతనిని లాగి వేసి తన కుమారుని తండ్రి వడిలో కూర్చుండబెట్టి, దుర్భాషలాడింది. దానికి బాధపడిన ధృవుడు తల్లి అనుమతితో అరణ్యాలకుపోయి శ్రీమహావిష్ణువును గూర్చి గొప్పగా తపస్సు చేశాడు. విష్ణువు ప్రత్యక్షమైనప్పుడు పరిపరివిధాల ఆయనను కీర్తించాడు. శ్రీమహావిష్ణువు ప్రీతుడై ధ్రువుడికి అనేక వరాలిచ్చాడు.

ఈ రకంగా చిన్నవాడైన ధ్రువుడికి జ్ఞానాన్నిచ్చి తన స్తోత్రము చేయించుకున్నాడు.

ఏ భాషలో, ఏరకంగా భగవంతుని విలాసాలను కీర్తించినప్పటికీ, ఆ స్తోత్రమంతా శ్రీమన్నారాయణునకే చెందుతుంది.

## 682. స్తుతిః

స్తోత్రము. స్తుతిచేయుట. ఈ నామాన్ని పరాశరభట్టరువారు 'స్తుతః' అని వ్రాశారు.

**స్తుతః :** స్తోత్రము చేయబడువాడు.

**శేషశేషాశనాద్యైః సూరిభిశ్చాస్మదాదిభిః**

**స్తుతత్వాద విశేషేణ స్తుత ఇత్యభిధీయతే ॥**

నిత్యమూర్తులయిన అనంత, విష్వక్సేన, గరుడాదులచేత, మనచేత కూడా కీర్తించబడువాడు.

**స్తూయతే అయమితి స్తుతః** వేయి తలలు గల ఆదిశేషుడు, వేదస్వరూపుడైన గరుడుడు, బ్రహ్మాదిదేవతలు, సామాన్య మానవులు మొదలైన వారిచేత, తారతమ్యములు లేక ఎల్లకాలము తన ఇష్టార్ధసిద్ధి కోసం స్తోత్రము చేయబడువాడు.

**అశేషదేవేశ నరేశ్వరేశ్వరైః సదాస్తుతుం యచ్చరితం మహాద్భుతం**

సమస్త దేవతలచేత, రాజులచేత, సామాన్యులచేత కూడా స్తుతిచేయబడు అద్భుత చరితుడు. స్తవనక్రియకూడా తానే అయినవాడు. స్తవనక్రియ అంటే స్తోత్రము అని అర్ధము.

## 683. స్తోతా

స్తోత్రము చేయువాడు.

**స్వస్తోతారం పరం స్తోతుం శీలం యస్యాస్తిసర్వదా**

**స్తోతాసస్యాత్యంచవర్ణః సర్వస్తోత్రత్వదో మనుః ॥**

తనను స్తోత్రము చేసేవారిని తానే స్తుతించే స్వభావము గలవాడు. ఈ నామము పంచాక్షరి. అందరిచేత స్తుతించబడేటట్లు చేస్తుంది.

**స్తౌతీతిస్తోతా** స్తుతించువాడు.

స్తోత్రము చేయబడే భగవానుడే స్తుతించే భక్తుడు కూడా. భగవానుడు తనను కీర్తించే వారిని కీర్తిస్తుంటాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'స్తోతా' అనబడుచున్నాడు.

## 684. రణప్రియః

యుద్ధమందు ప్రియము గలవాడు.

**సుహృత్ప్రియం యుద్ధకర్మ యస్యాస్తి సరణప్రియః**

తన ఆశ్రితులైన సుహృత్తులను రక్షించటానికి రాక్షసులతో యుద్ధము చేయుటలో ప్రియము గలవాడు.

**ప్రియః రణః యస్యసః రణప్రియః** యుద్ధము చేయుటయందు ప్రీతి గలవాడు.

దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేయటానికి, ధర్మాన్ని నాలుగుపాదాల నిలబెట్టటానికి శ్రీమన్నారాయణుడు రాక్షసులతో యుద్ధం చెయ్యటానికి ఇష్టపడుతుంటాడు.

**తతస్సకామం సుగ్రీవమంగదం చ మహాబలమ్**
**చకార రాఘవః ప్రీతః హత్వారావణమాహవే ॥**

శ్రీరాముడు యుద్ధంలో రావణ బ్రహ్మను సంహరించి సుగ్రీవుడికి, అంగదుడికి ప్రీతి గలిగించాడు. అని **రామాయణం**లో చెప్పబడింది.

లోకాలను రక్షించటం కోసం శ్రీమన్నారాయణుడు శంఖము, చక్రము, గద, శార్ఙ్గము, కౌమోదకి అనే ఖడ్గము ధరించి ఉంటాడు కాబట్టి ఇతడు రణప్రియుడు అని చెప్పబడుతుంది

భక్తులలో ధర్మాధర్మముల మధ్య జరిగే యుద్ధాన్ని చూసి తృప్తి పొందేవాడు. భక్తులను బాధించే దుర్మార్గులతో యుద్ధం చేసేవాడు. సాధుజనరక్షణయందు పరమానందము గలవాడు.

## 685. పూర్ణః

పూర్ణుడు, పరిపూర్ణమైనవాడు.

**అవాప్త సర్వకామత్వం యస్యాస్తి పూర్ణకథ్యతే ॥**

కావలసినవన్నీ గతంలోనే పొందటంచేత ఏ లోటు లేనివాడు.

ఇతడికి ఏ కోరికలు ఉండవు. అన్ని కోరికలు తీరినవాడు. అందుచేతనే పూర్ణకాముడు, నిష్కాముడు అనబడుతున్నాడు.

పరమేశ్వరుడు బిందు స్వరూపుడు. ఆ బిందువు పూర్ణబిందువు. సృష్టి చెయ్యాలని సంకల్పించినవాడై తనలోని కొంత శక్తిని బయటకు పంపాడు. ఈ రకంగా కొంతశక్తి బయటకు వచ్చినట్లైతే, అతని పూర్ణత్వానికి లోపంరాదా ? అనే అనుమానం కలుగుతుంది. అయితే అతని పూర్ణత్వానికి ఏ లోటురాదు ఎందుకనగా

**ఓం పూర్ణ మదః పూర్ణమిదం పూర్ణాత్ పూర్ణముదచ్యతే**
**పూర్ణస్యపూర్ణ మాదాయ పూర్ణమేవా వశిష్యతే ॥**

కంటికి కనిపించనిది అనంతం అదే పరబ్రహ్మ. కంటికి కనిపించేది అనంతం. అదే జగత్తు. ఆ అనంతం నుంచే ఈ అనంతం వచ్చింది. అంటే పరమేశ్వరుని నుండే జగత్తు ఆవిర్భవించింది. ఈ అనంతవిశ్వం ఆవిర్భవించినా, ఆ అనంతం అనంతంగానే ఉంటుంది. దాని పూర్ణత్వానికి ఏరకమైన భంగమురాదు.

అందుచేతనే సకల కళాప్రపూర్ణుడైన శ్రీమన్నారాయణుడు 'పూర్ణః' అనబడుతున్నాడు.

## 686. పూరయితా

కోరికలు పూర్తి చేయించువాడు.

**సదాపూరయితుంశీలం యస్యస్తోతృమనోరథాన్ సస్యా శ్పూరయితా....**

తనను స్తుతి చేసే వారి కోరికలు తీర్చేవాడు.

పరమేశ్వరుడు పరిపూర్ణుడు అయి కూడా తనను స్తోత్రము చేయించుకుని, స్తోత్రము చేసే వారి కోరికలను తీరుస్తాడు. భక్తులయొక్క కోరికలు తీర్చువాడు. తాను పూర్ణకాముడు. తనను నమ్మినవారి కోరికలు కూడా తీరుస్తుంటాడు.

తననాశ్రయించిన వారికి శుభము కలుగచేయువాడు. తాను పూర్ణుడై భక్తులకు పూర్ణజ్ఞానము కలుగచేయువాడు.

## 687. పుణ్యః

పరిశుద్ధ మొనర్చువాడు. 925వ నామం కూడా ఇదే.

**పుణ్యః యోఽసౌ పాతకి పావనః**

ఎటువంటి పాపాత్ములనైనా పుణ్యచరితులుగ చేసేవాడు.

**పునాతీతి పుణ్యః** తనను స్తుతించిన వారి పాపములను ప్రక్షాళన చేయువాడు.

తనను స్మరించినంత మాత్రంచేతనే వారి సంసార బంధనాలను తొలగించువాడు. వారిని పవిత్రులుగా చేయువాడు. అందుకే శ్రీమన్నారాయణుడు 'పుణ్యః' అనబడుతున్నాడు.

వాల్మీకి కథయే ఇందుకు నిదర్శనము. సత్యయుగంలో ఒకసారి బ్రహ్మదేవుడు స్వర్గాన్ని చూడటానికి వెళ్ళాడు. ఇంద్రుడు, అప్సరసలు అతనికి ఎదురేగి స్వాగతం పలికారు. అప్సరసలను చూసిన బ్రహ్మకు రేః పతనమయింది. అందులో నుండి ఒక బాలుడు జన్మించాడు. ఆ బాలుడు బ్రహ్మ దగ్గరకు పోయి 'తండ్రీ ! ఏమి ఆజ్ఞ ?' అన్నాడు. బ్రహ్మ తనను కాదన్నట్లుగా ప్రక్కకు తిరిగాడు. బాలుడు వదలలేదు. మళ్ళీ మళ్ళీ అదేమాట అడిగాడు. సభలోని వారంతా ఈ బాలుడు ఎవరు ? అని ఆశ్చర్యంతో బ్రహ్మ వంక చూశారు. బ్రహ్మదేవుడు అది అవమానంగా భావించి 'నువ్వు భూలోకంలో బోయలతో కలసి క్రూరకర్మలు చేస్తూ ఉండవలసినది' అన్నాడు. శాపవిమోచనం చెప్పమని ప్రార్థించాడు బాలుడు. రామనామజపంతో పునీతుడవౌతావు అన్నాడు బ్రహ్మ.

ఆ బాలుడు భూలోకంలో బోయవాడుగా జన్మించి వేటాడి భార్యాబిడ్డల పోషించు కుంటున్నాడు. దారులు కాచి దొంగతనం చేస్తున్నాడు. ఒకరోజున సప్తమహర్షులు ఆ త్రోవన వచ్చారు. వారిని కూడా దోచుకోవటానికి ప్రయత్నించాడు బోయవాడు. మహర్షులు తమ దివ్యదృష్టితో అతడి పూర్వవృత్తాంతాన్ని గ్రహించినవారై "ఇలా దొంగతనాలు, దోపిడీలు చేస్తున్నావు కదా ! ఎందుకు ?" అన్నారు. దానికి బోయవాడు నవ్వుతూ 'ఎందుకేమిటి? నా భార్యాబిడ్డలను పోషించుకోవటానికి' అన్నాడు. ఆ మాట విన్న మహర్షులు "ఈ పాపపు ధనంతో వారు సుఖపడుతున్నారు. మరి ఈ పాపం ఎవరు అనుభవిస్తారు?" అని అడిగారు. దానికి ఆబోయవాడు 'సుఖం అనుభవించిన వారు పాపం మాత్రం అనుభవించరా? వాళ్ళే అనుభవిస్తారు' అన్నాడు. ఇంటికి వెళ్ళి ఆ మాటను తన భార్యనడిగి తెలుసుకురమన్నారు ఋషులు.

ఇంటికి వెళ్ళాడు బోయవాడు. భార్యను పిలిచి "నేను చేసే పనివల్ల పాపం వస్తుంది కదా. ఈ ధనాన్ని అనుభవించినట్లే, ఆ పాపంలో కూడా భాగాన్ని అనుభవిస్తావా ?" అని అడిగాడు. అందుకు ఆమె "నాకేమిటి అవసరం. ఆ పాపపుణ్యాలేవో నువ్వే భరించాలి. భర్తగా నన్ను పోషించటం నీ బాధ్యత. అంతే" అంది. ఆ మాటలు విన్న బోయవాడు అవాక్కైపోయాడు. ఆ విషయం మహర్షులకు తెలియచేశాడు. దాంతో అతడికి జీవితం మీద విరక్తి గలిగింది. తరుణోపాయం చూపమని ఋషులను వేడుకున్నాడు. అతడికి రామమంత్రాన్నుపదేశించారు మహర్షులు. అతడు సమాధిస్థితిలోకి వెళ్ళి పోయాడు.

అతడి చుట్టూ పుట్టలులేచాయి. వల్మీకము అంటే – పుట్ట. పుట్టలలోనుంచి బయటకు వచ్చిన బోయవాడు వాల్మీకి మహర్షి అయినాడు.

ఈ రకంగా రామమంత్రాన్ని జపించటంచేతనే కరకుబోయ మహర్షి, ఆదికవి అయినాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'పుణ్యః' అనబడుతున్నాడు.

## 688. పుణ్యకీర్తిః

మచ్చలేని కీర్తి గలవాడు.

**పుణ్యశ్లోకోఽస్తియస్యేతి పుణ్యకీర్తిస్తు నస్స్మృతః** సంకీర్తనము గలవాడు.

**పుణ్యాః కీర్తి యస్యసః పుణ్యకీర్తిః**

సంకీర్తనము చేత సకల పాపములు తొలగి పరిశుద్ధమగువాడు.

పరమేశ్వరుని నామసంకీర్తన చేసినట్లైతే అగ్ని చేత వృక్షాలు దహించబడినట్లుగా, భక్తుని పాపాలు దహించబడతాయి.

అతని నామపారాయణ చేసినట్లైతే అడవిలో సింహాన్ని చూసిన మృగాలు పారిపోయినట్లుగా, పాపములు పటాపంచలవుతాయి.

ఇతడు సకల జీవులకు పుణ్యము కలిగిస్తాడు. కాబట్టి 'పుణ్యకీర్తిః' అనబడుతాడు. అతని కీర్తి పుణ్యమైనది కాబట్టి, అతనిని కీర్తించే భక్తులు కూడా పుణ్యవంతులవుతారు.

**కలౌకేశవనామం సంకీర్తనమ్** కలియుగంలో హరినామస్మరణ చేస్తే చాలు. అన్ని పాపాలు పోతాయి అని చెప్పబడింది. **పద్మపురాణంలో**

**మద్భక్తాయత్ర గాయంతి తత్ర తిష్ఠామినారదా** నా భక్తులు ఎక్కడైతే నన్ను గానం చేస్తారో, నేను అక్కడ ఉంటాను. అని నారదుడితో చెప్పాడు. అతన్ని కీర్తించే భక్తుల హృదయాలలోనే ఉంటాడు. కాబట్టే శ్రీమన్నారాయణుడు 'పుణ్యకీర్తిః' అనబడుతున్నాడు.

## 689. అనామయః

సంసార బంధనాలను తొలగించేవాడు.

**సంసారాఖ్య మహావ్యాధేః నిరోధిత్వా దనామయః ॥** సంసారమనే రోగాన్ని నిరోధించేవాడు.

తనయొక్క సంబంధము అనే దివ్యౌషధముచేత సంసారబంధనాలనబడే వ్యాధిని తగ్గించేవాడు. ఇతనికి ఏ వ్యాధులు, ఏకోరికలు లేవు. కోరికలు చేత పీడించబడనివాడు.

## 690. మనోజవః

మనసు కన్న వేగమయినవాడు.

**భక్తానాం సంపదశీఘ్రం కరోతీతి మనోజవః**

తన భక్తులకు అతి శీఘ్రముగా సంపదలనిచ్చేవాడు.

**మనసః జవః యస్యసః మనోజవః** భక్తులయొక్క భవబంధాలను తొలగించటానికి మనసు కన్న వేగంగా పయనించేవాడు.

**సప్త జన్మకృతం పాపం స్వల్పంవా యదివాబహు**
**విష్ణోరాలయ విన్యాసప్రారంభా దేవవశ్యతి ॥**

విష్ణుమూర్తి ఆలయంలో ఒక్కసారి అడుగుపెడితే ఏడు జన్మల క్రితం చేసిన పాపం కూడా నశిస్తుంది.

పరమేశ్వరుడు మనోవేగం గలవాడు. శరణాగతుల ప్రార్థనలను వెంటనే ఆలకించి రక్షిస్తాడు. గజేంద్రుడి మొరవిన్న వెంటనే వచ్చి అతణ్ణి కాపాడాడు. అందుచేత భక్తులను ఉద్ధరించటానికి అతివేగంగా కదిలే శ్రీమన్నారాయణుడు 'మనోజవః' అనబడతాడు.

## 691. తీర్థకరః

తీర్థములు గలవాడు.

**గంగాతి తీర్థ హేతుత్వాత్ శ్రుతిస్మృత్యోః ప్రవర్తనాత్**
**ఆత్మ ప్రవేశసోపాన కృత్వాతీర్థ కరస్స్మృతః**

గంగా మొదలైన పుణ్యనదీతీర్థాలకు కారణమైనవాడు. శ్రుతులు, స్మృతులను ప్రవర్తింపచేయువాడు. అనితర సాధ్యమైన ఆత్మప్రవేశం చెయ్యటానికి మార్గము వంటివాడు.

**తీర్థాని కరోతీతి తీర్థకరః** స్మరించినంత మాత్రంచేతనే, కీర్తించినంత మాత్రంచేతనే తనలాగా పరిశుద్ధంగా చేసేవాడు. వేదాలు, శాస్త్రాలు, పురాణాలు, ఇతిహాసాలను ప్రవర్తింప చేసినవాడు. సముద్రములాగా అగాధమైన తనను చేరటానికి సోపానాలను ఏర్పాటు చేసినవాడు.

తీర్థములు అంటే – విద్యలు.

**తీర్థం కరోతి** విద్యలు బోధించువాడు. ఇక్కడ విద్యలు అంటే పైన చెప్పినట్లుగా వేదాలు – 4, వేదాంగాలు–6, మీమాంస, న్యాయము, పురాణము, ధర్మశాస్త్రము. మొత్తం 14 రకాల వైదికవిద్యలను ప్రవర్తిల్లచేసినవాడు. సోమకాసురుని చంపి వేదాలను తెచ్చి బ్రహ్మకు ఇచ్చినవాడు. సృష్టి ప్రారంభంలో బ్రహ్మదేవునికి వేదాలను బహూకరించినవాడు.

హయగ్రీవుని అవతారంలో మధుకైటభులను చంపి సమస్త విద్యలను బ్రహ్మకు ఉపదేశించినవాడు.

విష్ణుమూర్తి జలరాశియందు నిద్రించాడు. ఆ తరువాత కొంతకాలానికి నిద్రలేచి సృష్టిచెయ్యాలి అనుకున్నాడు. అప్పుడు అతని నాభికమలమునుంచి బ్రహ్మ జన్మించాడు. మధుకైటభులనే రాక్షసులు వేదాలను ఎత్తుకుపోయి రసాతలములో దాచేశారు. అప్పుడు బ్రహ్మ శ్రీమహావిష్ణువుతో 'వేదాలు లేకుండా సృష్టి చెయ్యటం సాధ్యంకాదు' అని చెప్పాడు. అప్పుడు శ్రీమహావిష్ణువు రసాతలానికి వెళ్ళి, మధుకైటభులను సంహరించి, ఆ వేదాలను తెచ్చి బ్రహ్మకు ఇచ్చాడు. ఈరకంగా వేదాలను ప్రవర్తింపచేశాడు. కాబట్టి శ్రీమన్నారాయణుడు 'తీర్థంకరః' అనబడుతున్నాడు. అంటూ పరమేశ్వరుని ఆరాధనను వివరించాడు రత్నాకరుడు.



# 46. కృష్ణావతారము

"గురుదేవా ! శ్రీమహావిష్ణువు ఎత్తిన అవతారాలలో కృష్ణావతారము అత్యంత ముఖ్యమైనది. మరి దాన్ని గురించి వివరించండి అన్నాడు" నారాయణభట్టు. చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

మనువులలో మొదటివాడు స్వయంభువమనువు. అతని మన్వంతరంలో మరీచి బ్రహ్మమానసపుత్రుడు. అతడి భార్య ఊర్ణి. వీరికి ఆరుగురు కుమారులు కలిగారు. వారు క్రమంగా పెరిగి పెద్దవాళ్ళయ్యారు. ఒకరోజున అరణ్యప్రాంతంలో వారు పోతుండగా ఒక దృశ్యం కనపడింది. ముందు సరస్వతి వెడుతున్నది. ఆమెను చూచి మోహించిన బ్రహ్మ ఆమె వెనుక పరుగెడుతున్నాడు. ఆది చూసిన మరీచి పుత్రులు విరగబడి నవ్వుతూ బ్రహ్మను గేలిచేశారు. దానికి బ్రహ్మ కోపించి వారిని రాక్షస జాతిలో పుట్టండి అని శపించాడు.

తాటకాసునందనుల కుమారుడు మారీచుడు. జయవిజయుల యొక్క కింకరుడు జితుడు. సనకసనందనులచే శపించబడి మారీచునిగా పుట్టాడు. అతని కుమారుడు కాలనేమి. ఇతని కుమార్తె బృంద, జలంధరుని భార్య. కాలనేమి సంజీవిని తీసుకుని రావటానికి వెడుతున్న ఆంజనేయుణ్ణి అడ్డగించబోయి అతడి చేతిలో హతుడైనాడు. బ్రహ్మ వలన శాపం పొందిన మరీచికుమారులు ఆరుగురు కాలనేమి కుమారులుగ జన్మించారు.

జయవిజయులు విష్ణుమూర్తి ద్వారపాలకులు. సనకసనందనాదుల శాపవశాన వారు కశ్యపప్రజాపతికి దితి వల్ల హిరణ్యకశ్యప హిరణ్యాక్షులుగా జన్మించారు. హిరణ్యకశ్యపుడికి ప్రహ్లాదుడుగాక ఇంకా అమహ్లాదుడు, సంహ్లాదుడు, హ్లాదుడు మొదలైన ఆరుగురు మగపిల్లలు ఉన్నారు. ఇదే మరీచి యొక్క సంతానమైన షడ్గర్భ రెండవజన్మ.

వీరు తండ్రికి తెలియకుండా బ్రహ్మను గూర్చి తపస్సు చేశారు. అందుకు కోపించిన హిరణ్యకశ్యపుడు వారిని పాతాళానికి పోయి చాలాకాలం నిద్రావస్థలో ఉండండి. మరుజన్మలో దేవకీదేవి గర్భాన పుట్టండి. గత జన్మలో మీతండ్రి అయిన కాలనేమి కంసుడుగా పుట్టి మిమ్మల్ని చంపుతాడు అని శపించాడు.

పునర్వసుని కుమారుడు యాహుకుడు. అతని కుమారుడు ఉగ్రసేనుడు. అతడు సతీసమేతంగా యమునా తీరాన వ్యాహ్యాళికి వెళ్ళినప్పుడు ఒక రాక్షసుడు ఆమెను చూసి మోహించి ఉగ్రసేనుడి రూపంతో ఆమెతో క్రీడించాడు. అందువలన కాలనేమి అంశతో ఆమెకు పుట్టినవాడే కంసుడు. ఈరకంగా కంసుడు ఉగ్రసేనునికి క్షేత్రజుడైన కుమారుడు. అతనికి ఇంకా కొంతమంది కుమారులు దేవకి అనే కుమార్తె ఉన్నారు.

కంసుడు పెద్దవాడై ఉగ్రసేనుణ్ణి బంధించి తానే రాజైనాడు. దేవకీ వసుదేవుల వివాహం చేశాడు. దేవకి అష్టమగర్భాన పుట్టే వాడి వల్ల తనకు మరణం సంభవిస్తుందని తెలిసి దేవకీవసుదేవులను చెరసాలలో బంధించాడు. ప్రధమ యుగంలో మరీచిపుత్రులు ఆరుగురు కాలక్రమాన హిరణ్యకశ్యపుని శాపం వల్ల దేవకి గర్భాన జన్మించారు. పుట్టిన వెంటనే కంసుడు వారిని చంపివేశాడు.

కొంతకాలం క్రితం దితి ఇంద్రునికన్న బలశాలి అయిన కుమారుడు కావాలని భర్తని కోరింది. తరువాత దితి గర్భవతిగా ఉన్న సమయంలో ఇంద్రుడు ఆమె గర్భంలో ప్రవేశించి లోపలి పిండాన్ని నలభైతొమ్మిది ముక్కలుగా నరికాడు. ఆ ముక్కలే బ్రతికి మరుద్గణాలైనాయి. ఇంద్రుడిచేత ఆదితి ఈపని చేయించిందని కోపించి ఆదితిని కారాగృహంలో బంధించబడి ఉండు నీకు పుట్టిన కుమారులంతా నీకళ్ళముందే చపంబడతారు అని శపించింది. జన్మాంతరంలో ఆదితియే దేవకి. కశ్యపుడే వసుదేవుడు.

ఒకసారి బ్రహ్మ విష్ణువు దగ్గరకు వెళ్ళి భూలోకంలో భారం పెరిగిపోతోంది. పాపులు ఎక్కువ అవుతున్నారు అని చెప్పగా వైకుంఠుడు తెల్లనిది, నల్లనిది రెండు రోమాలు తీసి ఇచ్చాడు. వాటి వల్ల రోహిణికి ఆదిశేషుని అంశతోపుట్టినవాడు బలరాముడు. దేవకికి అష్టమగర్భాన పుట్టినవాడు కృష్ణుడు. ఈరకంగా నరుడు అర్జునుడుగాను నారాయణుడు కృష్ణుడుగాను పుట్టారు.

| | | |
|---|---|---|
| యమధర్మరాజు అంశతో | – | విదురుడు, ధర్మరాజు |
| వాయువు అంశతో | – | భీముడు |
| అశ్వనీ దేవతల అంశతో | – | నకుల సహదేవులు |
| సూర్యుని అంశతో | – | కర్ణుడు |
| బృహస్పతి అంశతో | – | ద్రోణుడు |
| కామక్రోధాల అంశతో | – | అశ్వత్థామ |
| సముద్రాంశతో | – | శంతనుడు |
| అష్టవసువులలో ఆఖరి వాడయిన ప్రభాసుడు | – | భీష్ముడు |
| గంధర్వరాజు అంశతో | – | దేవకుడు |
| మరుత్తుల అంశతో | – | విరాటుడు, కృపుడు, కృతవర్మ |

అరిష్టనేమి కుమారుడు

| | | |
|---|---|---|
| హంసుని అంశతో | - | ధృతరాష్ట్రుడు |
| కలి అంశతో | - | దుర్యోధనుడు |
| ద్వాపరాంశతో | - | శకుని |
| అగ్ని అంశతో | - | దుష్టద్యుమ్నుడు |
| రాక్షసాంశతో | - | శిఖండి |
| సనత్కుమారుని అంశతో | - | ప్రద్యుమ్నుడు |
| వరుణాంశతో | - | ద్రుపదుడు |
| లక్ష్మి అంశతో | - | ద్రౌపది |
| విశ్వేదేవుని అంశతో | - | ఉపపాండవులు |
| సిద్ధి అంశతో | - | కుంతి |
| ధృతి అంశతో | - | మాద్రి |
| మతి అంశతో | - | గాంధారి |
| హిరణ్యకశ్యపుడి అంశతో | - | శిశుపాలుడు |
| విప్రజితు అంశతో | - | జరాసంధుడు |
| ప్రహ్లాదుని రెండవజన్మ | - | శల్యుడు |
| బలికుమార్తె | - | బకి |
| వారాహుడు, కిశోరుడు అనే | | |
| రాక్షసుల అంశతో | - | చాణుర ముషికులు |
| అరిష్టుడు అనే | | |
| రాక్షసాంశతో | - | కంసుని ఏనుగైన కువలయపీడనము |

ఈరకంగా దేవదానవులంతా ఈభూమి మీద మళ్ళీ పుట్టి మహాభారత యుద్ధానికి నాంది పలికారు.

**గోపాలతాపిని ఉపనిషత్తు**లో ఈవిధంగా చెప్పబడింది. పూర్వకాలంలో కొందరు మునీశ్వరులు తపోనిష్ఠా గరిష్ఠుడైన ఒక బ్రాహ్మణుని దగ్గరకుపోయి "బ్రాహ్మణోత్తమా! గొప్పవాడైన దేవుడెవరు? మృత్యువు ఎవరికి భయపడుతుంది? ఎవరిని తెలుసుకున్నందు

వల్ల అన్ని విషయాలు తెలుస్తాయి ? ఈ జగత్తు ఎవరి వల్ల నడుస్తున్నది? ఈ విషయాలన్నీ దయచేసి మాకు వివరించవలసినది" అని అడిగారు. దానికి ఆ ద్విజశ్రేష్ఠుడు "తాపసోత్తములారా ! శ్రీకృష్ణుడు పరదేవత. అతని పేరు వింటేనే మృత్యువు కూడా భయపడుతుది. అతన్ని గురించి తెలుసుకుంటే సర్వమూ తెలుస్తుంది. అతని వల్లనే ఈ జగత్తు నడుస్తున్నది" అన్నాడు. ఆ మాటలు విన్న తాపసులు" అసలు శ్రీకృష్ణుడు ఎవరో మాకు సవివరంగా చెప్పవలసినది" అంటూ ప్రార్థించారు. వారి ప్రార్థన ఆలకించినవాడై, బ్రాహ్మణోత్తముడు....

"అతడే పాపము పోగొట్టే మహానుభావుడు. వేదవిదుడు. అతడే పరబ్రహ్మ. అతన్ని స్మరించినంత మాత్రంచేతనే మృత్యువు తొలగిపోయి, సాదకుడు మృత్యువు లేనివాడు అవుతాడు" అన్నాడు. ఆ మాటలు విన్న మునీశ్వరులు "భూసురేంద్రా ! శ్రీకృష్ణపరమాత్మని రూపము ఏరకంగా ఉంటుంది ? అతన్ని ఏరకంగా ఆరాధించాలి ? మాకు వివరించండి" అని అడిగారు. బ్రాహ్మణుడు చెప్పటం ప్రారంభించాడు.

హిరణ్మయుడు, గోపవేషుడు, మేఘమువంటివాడు, తామరల వంటి కనులు గలవాడు, మెరుపువంటి వస్త్రము కలవాడు, రెండు భుజములవాడు, జ్ఞానముద్రకలవాడు, వనమాల ధరించినవాడు, దివ్యాలంకారభూషితుడు, రత్నపద్మమధ్యగతుడు, కాళిందీ జలకల్లోల మారుతము సేవించేవాడు, అయిన శ్రీకృష్ణుని సేవించినవాడు సంసారబంధనాలనుండి విడివడి ముక్తుడవుతాడు.

అతన్ని సేవించటానికి ఐదు పదములు గల మంత్రమున్నది. అందులో

| | | | |
|---|---|---|---|
| క్లీం కృష్ణాయ | – మొదటిపదము | వల్లభాయ | – నాల్గవపదము |
| గోవిందాయ | – రెండవ పదము | స్వాహా | – ఐదవపదము |
| గోపీ జన | – మూడవపదము | | |

ఈ మంత్రాన్ని ఉపాసన చేసినవాడు బ్రహ్మపదము పొందుతాడు. అతడుఒక్కడే అయి ఉండి అనేకరకాలుగా ప్రకాశిస్తున్నాడు. అతనిని సేవించిన వారికి శాశ్వతసుఖము కలుగుతుంది. అతడే వాసుదేవుడు, సచ్చిదానందుడు, బృందావనంలో కల్పవృక్షనీడన విశ్రమించినవాడు, విశ్వరూపుడు, సృష్టిస్థితిలయాలకు కారణమైన వాడు, విజ్ఞానరూపి, పరమానందుడు, కమలనేత్రుడు, కమలనాభుడు, కమలాపతి, నెమలి పింఛముతో అలరారేవాడు, కంసుని సంహరించినవాడు అతడే శ్రీకృష్ణ పరమాత్ముడు, దేవాదిదేవుడు. సృష్టిస్థితిలయకారకుడు. అతడే పరబ్రహ్మ" అని చెప్పబడింది అన్నాడు రత్నాకరుడు. ఆ మాటలు విన్న కృష్ణశర్మ "గురువుగారూ ! శ్రీకృష్ణుడు పరమాత్ముడు కాబట్టి ధర్మసంస్థాపన

చెయ్యాలి. భక్తులకు పరమపదమునివ్వాలి. అంతవరకు బాగానే ఉన్నది. కాని 16 వేల మంది గోపికలేమిటి? వాళ్ళతో రాసక్రీడలేమిటి ? ఈ విషయం కొంచెం వివరించండి" అన్నాడు. చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

అవతారాలన్నింటిలోకీ కృష్ణావతారం భిన్నమైనది. కృష్ణావతారం యొక్క ప్రాముఖ్యతను వివరిస్తాను వినండి.

కృతయుగంలో శ్రీరామచంద్రుడు వనవాసం చేస్తున్నాడు. ఆయన అతి సుందరాకారుడు. **పుంసాం మోహనరూపాయ** పురుషులను కూడా మోహంలో పడేస్తాడు. అటువంటి రామచంద్రమూర్తిని చూసి వనవాసులైన మునులందరూ మిమ్ము ఆలింగనము చేసుకుంటాము అని అడిగారు. దానికి రామచంద్రుడు నవ్వి ద్వాపరయుగంలో నేను కృష్ణుడుగా జన్మిస్తాను. అప్పుడు మీరు గోపికలుగా జన్మించండి మీ కోరిక తీరుతుంది అన్నాడు. ఆవిధంగానే కృష్ణావతార సమయంలో వారందరూ మళ్ళీ జన్మిస్తారు.

| | | | | |
|---|---|---|---|---|
| నందుడు | – పరమానందము | | స్నేహితులు | – దేవతలు |
| ముక్తికాంత | – యశోద | | గోపకులము | – వైకుంఠము |
| వేదములచే చెప్పబడు | | | అక్కడి చెట్లు | – మహర్షులు |
| బ్రహ్మ పుత్రిక | – దేవకి | | రాక్షసులు | – లోభము, |
| వేదాలు | – వసుదేవుడు | | | క్రోధము, భయము |
| వేదార్థము | – కృష్ణుడు | | తిరస్కరింప | |
| వాటిని కట్టుకర్ర | – బ్రహ్మ | | బడువాడు | – కలి |
| వెదురుకర్ర | – రుద్రుడు | | మాయావిగ్రహరూపుడైన | |
| శిఖరము | – ఇంద్రుడు | | గోపుడు | – సాక్షాత్తూ శ్రీహరి |

ఆ వైష్ణవమాయ దుర్భేధ్యమైనది. ఆ మాయయే జగత్తును మోహింపచేస్తుంది. అదిదేవతలచేత కూడా జయింప వీలుకానిది.

| | | | |
|---|---|---|---|
| ఆదిశేషుడు | – బలరాముడు | బకాసురుడు | – గర్వము |
| శాశ్వతపరబ్రహ్మమే | – శ్రీకృష్ణుడు | సుదాముడు | – శమము |
| 16 వేలమంది గోపికలు | – ఋక్కులు, ఉపనిషత్తులు | అక్రూరుడు | – సత్యము |
| చాణూరమల్లుడు | – ద్వేషము | ఉద్ధవుడు | – దమము |
| ముష్టికుడు | – మత్సరము | పాలసముద్రంలో పుట్టిన శంఖము | – విష్ణుస్వరూపము |
| కువలయపీడనము (ఏనుగు) | – దర్పము | పాలకుండలు | – పాలసముద్రము |

శత్రుసంహారం చెయ్యటానికి, మిత్రుల రక్షించటానికి శ్రీహరి అవతరించాడు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| బ్రహ్మయే | - | చక్రము | మాయ | - | శార్ఙవమనే ధనుస్సు |
| ధర్మము | - | చామరము | శరత్కాలమే | - | భోజనము |
| ఖడ్గము | - | మహేశ్వరుడు | గరుడుడు | - | వటవృక్షము |
| రోలు | - | కశ్యపుడు | నారదుడు | - | సుదాముడు |
| త్రాడు | - | అదితి | బృందాదేవి | - | భక్తి |
| గద | - | శత్రుసంహారిణికాళిమాత | భార్య | - | సర్వజంతుప్రకాశినియైన బుద్ధి |

పరమాత్మకన్న భిన్నమైనది ఏదీలేదు. గోప స్త్రీలకన్న ప్రభువు భిన్నుడుకాడు. ఈ రకంగా వైకుంఠమే క్రిందికి దిగివచ్చింది" అని కృష్ణోపనిషత్తులో చెప్పబడింది.

సాక్షాత్తూ శ్రీమహావిష్ణువే శ్రీకృష్ణుడుగా భూమిమీద అవతరించాడు. అతడు తన దివ్య తేజస్సుచేత అవతారాలకు కారణమైనవాడు. సుతపుడు అనే ప్రజాపతి తపస్సుచేసి శ్రీమహావిష్ణువును కుమారుడిగా కోరాడు. దాని ఫలితంగానే వసుదేవుని కుమారుడుగా హరి జన్మించాడు. అతడే వసుదేవుని కుమారుడు వాసుదేవుడు. లోకక్షేమం కోసం పాలసముద్రంలో ఉంటాడు. కంసుడి నుండి ఏర్పడిన ముప్పు తప్పించుకోవటానికి యశోదానందులచే స్వీకరించబడ్డాడు. ఇతడే సాధువులకు పరమాగతి. సత్కార్యములు గలవాడు. సత్యము, నిత్యము అయినవాడు. సాధువులకు, సజ్జనులకు తానే మహదైశ్వర్య మైనవాడు. భూభారము తగ్గించటానికి శూరులైన యాదవ, పాండవ వీరులను సేనగా చేసుకున్నాడు. పతనమవుతున్న యదువంశాన్ని ఉద్ధరించాడు. సాధువులకు విశ్రాంతి స్థానమైనవాడు. యమునానదిలో జలక్రీడలాడిన పుణ్యచరితుడు. అన్ని భూతములందు ఉంటాడు. అతడే పరమపదాన్నిచ్చేవాడు దేవుడు. సకలప్రాణులకు ఆధారమైనవాడు. భక్తులకు ఎంత చేసినా తృప్తి చెందనివాడు. దేవతల గర్వాన్ని అణచినవాడు. యాదవులందరికీ గర్వము కలిగించినవాడు. అల్పులైనవారు అతన్ని పట్టలేరు. పరాజయము అనేది తెలియనివాడు. ఈ విశ్వమే అతని శరీరము. అతిపెద్దదైన దేహము గలవాడు. జగత్తులో ప్రకాశించేవన్నీ అతని రూపాలే. అతడు అవ్యక్తుడు. అన్నింటి యందు అంతర్యామిగా ఉంటాడు. అనేక రూపాలు ధరించినవాడు. అనేక ముఖములు గలవాడు. అద్వితీయుడు అయిన పరబ్రహ్మ అతడే.

ఈ విషయం 692 నుంచి 725 వరకు నామాలలో వివరించటం జరిగింది. ఇక నామాలను చూద్దాం.

## 692. వసురేతాః

తేజస్సునే కారణముగా గలవాడు.

**వసుశబ్దో జ్యోతిరర్థః రేతస్తత్కరణం మతమ్**
**దివ్యజ్యోతిః కారణత్వాత్ వసురేతాః ప్రకీర్తితః ॥**

వసు అంటే తేజస్సు అని అర్థము. రేత అనగా దానికి కారణము.

తన దివ్య తేజస్సు అవతారాలకు కారణమైనవాడు.

**వసురేతః యస్యసః వసురేతాః** తన దివ్యతేజస్సుతో అవతారాలను దాల్చినవాడు.

బంగారము వంటి వీర్యము గలవాడు. పరమేశ్వరుడు సృష్టి చెయ్యాలని సంకల్పించినవాడై, ముందుగా నీటిని సృష్టించి, అందులో తన వీర్యాన్ని వదిలాడు. అది బంగారుగ్రుడ్డు (హిరణ్మయాండము) అయింది. దానినుంచి బ్రహ్మ ఉద్భవించాడు అని పురాణాలలో చెప్పబడింది. అందుచేతనే పరమేశ్వరుడు హిరణ్యగర్భుడైనాడు.

వసు అనగా తేజస్సు. తేజస్సు నుంచి ఉద్భవించినవాడు శ్రీకృష్ణుడు.

లోకంలోని తమోగుణ ప్రధానుల అజ్ఞానాన్ని పటాపంచలు చెయ్యటానికి శ్రీకృష్ణ పరమాత్ముడు అవతరించాడు. అందుచేతనే అతడు 'వసురేతాః' అనబడుతున్నాడు.

## 693. వసుప్రదః

వసుదేవుడికి తనను తాను కుమారునిగా ఇచ్చినవాడు. 694వ నామముకూడా ఇదే.

**దేవకీవసుదేవాఖ్యం ఆత్మరూపం మహద్ధనం**
**పుత్రత్వేన ప్రకర్షేణ దదాతీతి వసుప్రదః ॥**

దేవకీవసుదేవులకు తాను అనే మహాధనాన్ని పుత్రరూపంగా ప్రసాదించినవాడు.

**వసునిధిమ్ పుత్రత్యేన ప్రదదాతీతి వసుప్రదః**

మహానిధి అయిన తననే దేవకీవసుదేవులకు పుత్రునిగా అనుగ్రహించినవాడు.

స్వాయంభువ మనువు కాలంలో 'సుతపుడు' ఒక ప్రజాపతి. అతని భార్య 'పృశ్ని'. వీరు విష్ణుభక్తులు. వీరు సంతానం కావాలని అనేక సంవత్సరాలు శ్రీహరిని ప్రార్థించారు. శ్రీహరి ప్రత్యక్షమై మీకు ఏవరం కావాలో కోరుకోమన్నాడు. అప్పుడు వారు ఆ హరియే తమ కుమారుడుగా జన్మించాలని కోరుకున్నారు. తరువాత కాలంలో సుతపుడే కశ్యపప్రజాపతిగా, పృశ్ని అదితిగా జన్మించారు. అని **భాగవతం**లో చెప్పబడింది.

ఒకసారి అదితి తన భర్త దగ్గరకు వెళ్ళింది. అప్పుడు అతడు కద్రువతో కూడి ఉన్నాడు. అది చూసిన అదితి కోపించి మీరు నదులై పుట్టండి అని వారిని శపించింది. అప్పుడు కద్రువ "నువ్వు భూలోకంలో పుట్టవలసినది" అని ప్రతి శాపమిచ్చింది. అలా శాపవశాన అదితి భూలోకంలో దేవకిగా జన్మించింది. వసుదేవుడే కశ్యపుడు. అని **బ్రహ్మవైవర్తపురాణం**లో చెప్పబడింది.

ఈరకంగా శ్రీహరి సుతపున కిచ్చిన మాటప్రకారము దేవకీ వసుదేవుల గర్భాన జన్మించాడు.

ధనమును కావలసినంత ఇచ్చువాడు. కాబట్టి శ్రీమన్నారాయణుడు 'వసుప్రదః' అనబడుతున్నాడు. కుబేరుడు ధనాధికారికాదు. ధనానికి కాపలాదారు. అధికారి శ్రీమహావిష్ణువు.

## 694. వసుప్రదః

వసుదేవుని గౌరవించినవాడు. 693వ నామము ఇదే.

**దేవకీ వసుదేవాభ్యాం స్వపితృత్వం మహద్వసు**
**తేజో యః ప్రదాతీతి వసుప్రద ఇతీరితః ॥**

దేవకీ వసుదేవులకు తన తల్లితండ్రులుగా ఉండటము అనే గౌరవాన్నిచ్చినవాడు.

**వసుతేజః ప్రదాతీతి వసుప్రదః** దేవకీ వసుదేవులకు, జగదుత్పత్తి కారకుడైన తనకు తల్లితండ్రులుగా ఉండే మహాతేజము నిచ్చినవాడు.

**వసు - మోక్షాఖ్యం ప్రకృష్టం ఫలం భక్తేభ్యః ప్రదదాతి**

వసువు అనగా - మోక్షము. దీనిని భక్తులకిచ్చేవాడు. అందుచేతనే మోక్షప్రదాతయైన భగవానుడు వసుప్రదః అనబడుతున్నాడు. **బృహదారణ్యకోపనిషత్తు**లో

**విజ్ఞానం ఆనందం బ్రహ్మరాతి ర్దాతుః**
**పరాయణం తిష్ఠ మానస్య తద్విదః**

విజ్ఞానము, ఆనందము తన స్వరూపముగా గల బ్రహ్మ కర్మయోగికి, జ్ఞానయోగికి కూడా పరమాగతియై ఉన్నాడు.

రాక్షసుల సంపదలను హరించువాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'వసుప్రదః' అనబడుతున్నాడు.

## 695. వాసుదేవః

వసుదేవుని కుమారుడు. 332, 709 నామాలు కూడా ఇదే.

**వసుదేవా పత్యతశ్చ వాసుదేవః ప్రకీర్తితః** వసుదేవునికి ఔరసపుత్రుడుగా అవతరించినవాడు.

**వసుదేవస్య అపత్యం పుమాన్ వాసుదేవః** వసుదేవుని కుమారుడు – శ్రీకృష్ణుడు.

విశ్వమంతా నిండి ఉండి సర్వముతో క్రీడించువాడు. విశ్వమంతా నిండి ఉన్నవాడు.

## 696. వసుః

వశించువాడు. 104, 270 నామాలు కూడా ఇదే.

**వసతీతి వసు ర్లోక హితేచ్ఛుః క్షీరసాగరే** లోకక్షేమం కోసం పాలసముద్రంలో వశించువాడు.

**వసతీతి వసుః**

అవతారాలకు మూలమైన శ్రీమన్నారాయణుడు పాలకడలి యందు వశిస్తాడు.

**సలోకానం హితార్థాయ క్షీరోదే వసతి ప్రభుః**

లోకములకు హితము చేయగోరిన పరమాత్ముడు క్షీరసాగరమందు నివసిస్తాడు.

**ఏషనారాయణః క్షీరార్ణవనికేతనః**
**నాగపర్యంక ముత్సృజ్యహ్యాగతో మధురాం పురీమ్**

క్షీరసాగరమందు నివశించే శేషతల్పశాయి అయిన శ్రీమన్నారాయణుడే, ఆ చోటును వదలి మధురానగరికి వచ్చాడు.

**వసంతి భూతాని తత్ర తేష్వయమపివసతీతి వసుః**

అన్ని భూతములు అతని యందే ఉంటాయి. అతడు అన్నింటి యందు ఉంటాడు.

మహాప్రళయం జరిగినప్పుడు జగత్తంతా నశించిపోతుంది. ఈ లోకాలన్నీ అతనిలో లీనమైపోతాయి. అందుచేతనే అన్ని భూతములు అతడియందే ఉంటాయి అని చెప్పబడింది.

**ఐతరేయోపనిషత్తు**లో చెప్పినట్లుగా ఈ లోకాలన్నీ సృష్టించిన తరువాత పరమేశ్వరుడు జీవులను సృష్టించాడు. ఇంద్రియాలను, వాటి అధిదేవతలను సృష్టించినవాడై ఈ దేహంలో నేను లేకపోతే ఎలాగా ? అనుకుని బ్రహ్మరంధ్రం ద్వారా శరీరంలో ప్రవేశించాడు. ఆరకంగా

దేహంలో ప్రవేశించి, నవరంధ్రాలతోను, ఏకాదశ ఇంద్రియాలతోను ఈ సుఖాలను అనుభవిస్తూ, బయటకు వెళ్ళే మార్గం లేక పంజరంలో బంధించబడిన పక్షిలాగా శరీరంలో బందీ అయినాడు. ఈ రకంగా పరమేశ్వరుడు జీవులన్నింటియందు అంతర్యామిగా ఉన్నాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'వసుః' అనబడుతున్నాడు.

## 697. వసుమనాః

వసుదేవునిపై మనసు గలవాడు. 105వ నామం ఇదే.

**జన్మ భూమ్యర్ణవే లక్ష్యాః వసతోయస్య వై మనః**
**అస్తీతి వసుదేహీతి సస్యాద్వసుమనాః పరమ్ ॥**

లక్ష్మీదేవికి పుట్టిల్లయిన పాలసముద్రం మీద పవళించి ఉన్నప్పటికీ వసుదేవుని యందే మనసు లగ్నమైనవాడు.

**వసౌ మనః యస్యసః వసుమనాః**

వసు అనగా – వసుదేవుడు అని అర్థం. ఏదైనా ఒక భావం చెప్పాలంటే దాన్ని పూర్తిగా చెప్పవలసినపనిలేదు. ఆ భావము లేదా పదంలో కొంతభాగం చెబితే చాలు. ఇలా వాడుకలో చాలా పదాలున్నాయి.

| | | |
|---|---|---|
| దత్తాత్రేయుడు | – | దత్తుడు |
| సత్యభామ | – | భామ |
| భీమసేనుడు | – | భీముడు |

అలాగే వసుదేవుడు అనే పదాన్ని 'వసు' అనే మాటతో సూచించటం జరిగింది.

వసుమనా – వసుదేవునియందు మనసు గలవాడు. క్షీరసాగరంలో ఉండి కూడా శ్రీమన్నారాయణుడు వసుదేవుని యందు మనసు గలవాడై ఉన్నాడు.

**అవిశేషేణ సర్వేషు భూతేషు వసతి** అన్ని భూతములందు ఒకేవిధంగా ఉండేవాడు. సర్వత్రా సమానమైన మనసు గలవాడు.

## 698. హవిః

తీసుకుపోబడినవాడు.

**నందగోప యశోదాభ్యాం కంసోపద్రవశాంతయే**
**అదీయతే స్వీక్రియతే స హవిః పరికీర్తితః**

కంసుని నుండి ఏర్పడిన ముప్పు నుండి తప్పించటంకోసం యశోదానందులచే స్వీకరించబడినవాడు.

**హూయతే ఇతి హవిః** తీసుకుపోబడినవాడు.

దేవకీదేవి వివాహం జరుగుతోంది. కంసుడు దగ్గర ఉండి కార్యక్రమం జరిపిస్తున్నాడు. ఇంతలో అశరీరవాణి "దేవకి అష్టమ గర్భంవల్ల నీకు ప్రాణహాని జరుగుతుంది" అని చెప్పింది. ప్రాణినికి భయపడ్డ కంసుడు దేవకిని వధించబోయాడు. కాని వసుదేవుడు అభ్యర్ధనమేరకు వారిద్దరినీ ఖైదుచేశాడు. పుట్టిన ప్రతిబిడ్డనీ సంహరింప చేస్తున్నాడు. ఏడుగురు బిడ్డలు హతులైనారు. అష్టమగర్భం ధరించింది దేవకి. కాపలాకట్టుదిట్టం చేశాడు కంసుడు. దేవకి గర్భాన శ్రీకృష్ణుడు ఉదయించాడు. అప్పుడు అంతా మాయ ఆవరించింది. కాపాలా ఉన్న వారంతా నిద్రావస్థలో ఉన్నారు. బాలుడు ఉద్భవించాడని తెలిస్తే కంసుడు చంపేస్తాడు. అందుచేత అశరీరవాణి సలహామీద శ్రీకృష్ణ పరమాత్ముని వ్రేపల్లెలోని నందగోపుని ఇంటికి చేర్చాడు వసుదేవుడు. ఆసమయంలోనే నందుని భార్య యశోద ఆడబిడ్డను ప్రసవించింది. ఆ బిడ్డను తెచ్చి దేవకి ప్రక్కన ఉంచాడు. ఈరకంగా నందయశోదల దగ్గరకు తీసుకుపోబడ్డవాడు కాబట్టి 'హవిః' అనబడుతున్నాడు.

**భగవద్గీత**లోని నాల్గవ అధ్యాయం **'కర్మసన్యాసయోగం'**లోని 24వ శ్లోకము.

**బ్రహ్మార్పణం బ్రహ్మహవిః బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్**

**బహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మకర్మసమాధినా ॥**

యజ్ఞకార్యములందు ఉపయోగించే స్రుక్కువాదులు – బ్రహ్మము. హోమము – బ్రహ్మము, హోమద్రవ్యము – బ్రహ్మము. అగ్ని – బ్రహ్మము, హోమము చేసే కర్త – బ్రహ్మము, హవనక్రియ – బ్రహ్మము. ఈ బ్రహ్మకర్మ యందు స్థితుడై ఉండే యోగిద్వారా పొందదగిన యజ్ఞఫలము కూడా – బ్రహ్మమే.

బ్రహ్మమే – హవిస్సు. అది బ్రహ్మకే అర్పణచేయబడుతున్నది. యజ్ఞయాగాదు లందు అర్పించే హవిస్సు కూడా బ్రహ్మమే.

## 699. సద్గతిః

సాధువులకు గతియైనవాడు.

**ఉత్పన్న ఏవకంసాది కృతిబాధా పనోదనాత్**

**సతాం ప్రాప్యతయాచైవ సద్గతి స్సముదాహృతః ॥**

పుట్టినతోడనే కంసాది రాక్షసులను కడతేర్చాడు. కాబట్టి సత్పురుషులకు గతియైన వాడు. సాధుజనులకు అతడే పరమాగతి.

**సతాంగతిః సద్గతిః** అవతరించినప్పుడే అసురుల బాధలు పోగొట్టినవాడు కాబట్టి సజ్జనులకు అతడే పరమాగతి.

శ్రీకృష్ణుడు అవతరించగానే వ్రేపల్లె చేర్చాడు వసుదేవుడు. తరువాత కంసుడు వచ్చాడు. ఆడబిడ్డకనిపించింది. ఏదైతే ఏమిటి ? అష్టమగర్భమే కదా ! అని ఆ బిడ్డను సంహరించబోయాడు. అది యోగమాయ. ఆకాశంలోనికి ఎగిరిపోయి 'నీపాలిటమృత్యువు వ్రేపల్లెలో పెరుగుతున్నాడు' అని చెప్పింది.

ఆ మాటలు విన్న కంసుడు పరివారాన్ని పిలిచి వ్రేపల్లెలో పెరుగుతున్న పసిపిల్ల లందరినీ సంహరించమన్నాడు. పూతన, దేనుకాసురుడు, శకటాసురుడు, ప్రలంబాసురుడు, కౌశి, వ్యోమాసురుడు, ఇత్యాది రాక్షసులను పంపించి శ్రీకృష్ణుని సంహరింపచూశాడు. కాని వీరంతా కృష్ణుని చేతిలో హతులైనారు. చివరకు ధనుర్యాగానికి రమ్మని పిలిచాడు. అదే అదనుగా తీసుకుని కువలయపీడనము అనే ఏనుగును, చాణూర ముష్టికులను ఆఖరికి కంసుని సంహరించి ఉగ్రసేవ మహారాజుకు తిరిగి పట్టం కట్టాడు.

ఈరకంగా చిన్నతనంలోనే రాక్షసుల సంహరించి సాధువులకు మేలు చేసినవాడు. కాబట్టి అతడే వారికి పరమాగతి.

'బ్రహ్మమే సత్యము' అని తెలుసుకున్నవారు సజ్జనులు. అటువంటి సజ్జనులతో పొందబడువాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు 'సద్గతిః' అనబడుతున్నాడు.

## 700. సత్కృతిః

సత్కార్యములు గలవాడు.

**రాసక్రీడాది కృతయః సత్యోయస్య చ సత్కృతిః**

తలచినంత మాత్రంచేతనే సంసారబంధనాలను బాపువాడు.

**సత్యః కృతయః యస్యసః సత్కృతిః** సత్కార్యములు గలవాడు.

శ్రీకృష్ణుడు చిన్నతనంలో తోటి వారినందరినీ వెంటపెట్టుకుని గోపకాంతల ఇండ్లలో జొరబడి, వారు దాచుకున్న పాలు, పెరుగు, వెన్న, దొంగతనంగా తిని, దానిని నిద్రపోతున్న వారి మూతికి రాచి వచ్చేవాడు. అది చూసి ఇంట్లోని మిగిలిన వారు వెన్న తిన్నది ఈ మనిషే అనుకునేవారు.

అతడు మరీ అల్లరిచేస్తుంటే, తల్లి యశోద కృష్ణణ్ణి రోటికి బంధించింది. అతడు ఆ రోలును ఈడ్చుకుపోయి గంధర్వుల శాపవిమోచనం చేశాడు.

ఈరకంగా అతడు చేసిన చిలిపి పనులన్నీ చెప్పుకుని, విని తరించారు గోపాలురు.

జగత్కళ్యాణమైన ఉత్తమ పనులను నిర్వహించేవాడు. అందుచేతనే సత్కృతిః అనబడుతున్నాడు.

## 701. సత్తా

సత్తు అయినవాడు.

**స్వయ మేవ సతాం సత్తా యస్మాత్ సత్తేతి కీర్త్యతే ॥**

సత్పురుషులకు తానే సత్తగా ఉండేవాడు. సత్తులకు సత్తుగా ఉండేవాడు.

**భగవద్గీత**లో 10వ అధ్యాయం **'విభూతియోగము'**లోని 39వ శ్లోకము.

**యచ్చాపి సర్వభూతానాం బీజం తదహమర్జున**
**న తదస్తి వినా యత్స్యాత్ మయా భూతం చరాచరమ్ ॥**

అర్జునా సకల ప్రాణుల ఉత్పత్తికీ కారణమైన బీజాన్ని నేనే. నేను లేని ప్రాణిలేనే లేదు.

**ఛాందోగ్యోపనిషత్తు**లో ఉద్దాలకమహర్షి తన కుమారుడైన శ్వేతకేతువుకు ఆత్మజ్ఞానాన్ని బోధిస్తున్నాడు.

"శ్వేతకేతూ ! సృష్టికి పూర్వం ఈ ప్రపంచం నామరూపాలతో కూడిలేదు. అప్పుడు కేవలము అద్వితీయమైన సత్తు మాత్రమే ఉన్నది. నామము, రూపము, పదార్థము ఏమీలేవు. సత్తు అంటే – ఉనికి, సత్యం అని అర్థం. అసత్తు అంటే లేనిది, అసత్యం అని అర్థం. అన్నింటికన్నా పూర్వమైనది, రెండు కానిది, మొదటగా ఉన్నది ఏకైక పరబ్రహ్మ, ఆ పరబ్రహ్మతత్త్వం అనేకం కావాలనుకుంది. రకరకాల రూపాలతో వస్తువులుగా, జీవులుగా రూపుదాల్చింది. ద్రవ, ఘన, వాయు పదార్థాలుగా మార్పుచెంది అనేక రూపాలతో సృష్టి ఆకారం పొందింది. ఈ రకంగా మొదటగా ఉన్న బ్రహ్మపదార్థంలోనుంచే అన్నీ వచ్చినాయి.

తాను అనేకం కావాలనుకున్న సత్తు ముందుగా అగ్నిని సృష్టించింది. అగ్ని నుండి జలము, జలము నుండి భూమి ఉద్భవించాయి. వీటివల్లనే అన్నం పుట్టింది. అప్పుడు సత్తు, అగ్ని, జలము, అన్నములలో ప్రవేశించాలనుకున్నది. అంటే ఈ మూడింటిలోనూ వ్యక్తమయి అనేక రూపాలు పొందింది."

ఈరకంగా సత్తు నుంచే జగత్తంతా ఆవిర్భవించిది. అందుకే శ్రీమన్నారాయణుడు 'సత్తా' అనబడ్డాడు.

## 702. సద్భూతిః

సాధువులకు ఐశ్వర్యమైనవాడు.

**సతాం పుత్ర కళత్రాది భూత్యా సద్భూతి రుచ్యతే ॥**

సజ్జనులకు, సాధువులకు సమస్త బంధువర్గము తానే అయినవాడు.

**సతాంభూతిః సద్భూతిః** సాధుపుంగవులకు పుత్రుడు, మిత్రుడు, బంధువు తానే అయినవాడు.

సత్స్వరూపంతోను, చిత్స్వరూపంతోను పరమాత్మ అద్వితీయుడై ఉన్నాడు. అతడు అన్ని ఐశ్వర్యములకు నిధి. భక్తులకు సర్వము తానేయైనవాడు.

| | | |
|---|---|---|
| దేవకీవసుదేవులకు | – | కన్నబిడ్డ |
| యశోదానందులకు | – | పెంచిన బిడ్డ |
| కుచేలుడికి | – | స్నేహితుడు |
| అర్జునుడికి | – | సారధి |
| రుక్మిణికి | – | భర్త |
| గోపాలురకు | – | చెలికాడు |
| భీష్మునికి | – | భగవానుడు |

ఈరకంగా తానొక్కడే అయి అందరికి అన్నిరకాలుగా ఉండేవాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'సద్భూతిః' అనబడుతున్నాడు.

## 703. సత్పరాయణమ్

సాధువులకు పరమగతిగా ఉండువాడు.

**సతాం పరం స్యా దయనం సనోయస్యోత్త మాయనం**
**స సత్పరాయణం ఖ్యాతో యద్వాస్యాత్సత్పరాయణః ॥**

సత్పురుషులకు తను, తనకు సత్పురుషులు పరమగతిగా ఉండేవాడు.

**సంతం పరాయణం యస్యసః సత్పరాయణః** సాధువులే తనకు పరమగతిగా ఉండువాడు.

**భగవద్గీత** 7వ అధ్యాయం '**జ్ఞానయోగము**'లోని 18వ శ్లోకము.

**ఉదారాస్సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవమే మతమ్**
**అస్థితస్స హి యుక్తాత్మా మామేవానుత్తమాంగతిమ్ ॥**

భక్తులు భగవంతుని యందే మనసు నిల్పి అతన్ని సేవిస్తుంటారు. కాని జ్ఞానియైన వాడు నా స్వరూపమే. అటువంటివాడు బుద్ధిని, మనస్సును నా యందే ఉంచి నన్నే ధ్యానిస్తుంటాడు. ఈవిధంగా అతడు ఎప్పుడూ నాయందే ఉంటాడు. అటువంటి జ్ఞానిని నా ఆత్మగానే తలుస్తాను.

పాండవులు కృష్ణునే ఆశ్రయించారు. అతనివల్లనే బలము గలవారైనారు. అతన్నే నమ్మారు. అటువంటి వారికి శ్రీకృష్ణుడే పరమసాధనము.

సత్ అనబడే వారికి అంటే తత్త్వజ్ఞానము గలవారికి పరమే గమ్యము. ఆ పరమేశ్వరుడే పరమపదము. అతడే గమ్యము. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'సత్పరాయణమ్' అనబడుతున్నాడు.

సత్పురుషులు అంటే – సత్తును గురించి తెలుసుకొనినవారు. అటువంటి సత్పురుషులకు గమ్యమైనవాడు.

## 704. శూరసేనః

శూరులను సేనగా గలవాడు.

**భూభార హరణార్థాయ యాదవాః పాండవాశ్చయే**
**శూరాస్సహాయా యస్యేతి శూరసేన స్స కథ్యతే ॥**

భూభారము తగ్గించటానికి శూరులైన యాదవులను, పాండవులను తనకు సేనగా గలవాడు.

**శూరాః సేనాః యస్యసః శూరసేనః**

మహావీరులైన దేవదానవులంతా భూమిమీద అవతరించారు. వీరందరూ వీరులే. వీరిలో ఎవరిని సంహరించాలన్నా శ్రీమహావిష్ణువు మళ్ళీ ఈ లోకంలో అవతరించాల్సిందే. అందుచేతనే వాళ్ళలో వాళ్ళకు తగవుపెట్టి మహాభారత యుద్ధం జరిపించాడు. అందులో

స్వయంగా తాను ఒక పక్షం అయినాడు. తనకు సేనగా మహావీరులైన యాదవులను, పాండవులను తీసుకున్నాడు. 18 అక్షోహిణీల సైన్యాన్ని కురుక్షేత్రానికి బలిచేశాడు.

ఈరకంగా శూరులైన వారిని సేనగా తీసుకున్నాడు. కాబట్టే 'శూరసేనః' అనబడుతున్నాడు.

**శూరాః - శౌర్యశాలినః హనుమత్ప్రముఖాః సైనికాః**

**యస్యాం సేనాయాం - సా- శూరాసేనా**

శౌర్యశాలులైన హనుమంతుడు, సుగ్రీవుడు, అంగదుడు, జాంబవంతుడు మొదలైన మహావీరులను సేనగా గలవాడు.

అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'శూరసేనః' అనబడుతున్నాడు.

## 705. యదుశ్రేష్ఠః

యాదవులలో శ్రేష్ఠుడు.

**మగ్నంతు యాదవం వంశం ఉద్ధరిష్యతి యశ్చ సః**

**యదుశ్రేష్ఠ ఇతి ఖ్యాతః వస్వార్ణో వంశవర్ధనః**

పతనమవుతున్న యదువంశాన్ని ఉద్ధరించువాడు. ఈ నామము అష్టాక్షరీమంత్రము వంశాభివృద్ధి.

**యదూనాంశ్రేష్ఠః యదుశ్రేష్ఠః**

యయాతి శాపముతో అధోగతి పాలయిన యదువంశాన్ని ఉద్ధరించినవాడు.

యయాతి చంద్రవంశపురాజు. నహుషుని కుమారుడు. ఒకరోజున యయాతివేటకు వెళ్ళి, నూతిలోపడి ఏడుస్తున్న శుక్రాచార్యుని కుమార్తె దేవయానిని చూసి రక్షించాడు. తరువాత కాలంలో యయాతి, దేవయానుల వివాహమైనది. దేవయానికి యదువు, తుర్వసుడు అని ఇద్దరు కుమారులు.

దేవయాని యొక్క దాసి శర్మిష్ట. ఆమె ఋతుస్నాతయై యయాతిని పుత్రబిక్షపెట్టమని వేడుకుంది. యయాతి సరేనన్నాడు.

ఈ సంగతి తెలిసిన దేవయాని, తన భర్త తన దాసితో సంబంధం పెట్టుకున్నాడన్న సంగతి తన తండ్రికి తెలిపింది. శుక్రాచార్యుడు కోపించి యయాతికి ముసలితనం రావాలి అని శాపం పెట్టాడు. అప్పుడు యయాతి శుక్రాచార్యుని పాదాలపైబడి ప్రార్థిస్తూ

"ఋతుస్నాతయైన స్త్రీ పుత్ర బిక్ష అడిగినప్పుడు కాదంటే భ్రూణహత్యాపాతకం చుట్టుకుంటుంది. అందుచేత నేను ఆమె కోరిక తీర్చాను. నన్ను క్షమించి శాపవిమోచనం కలిగించండి" అన్నాడు. అప్పుడు శుక్రుడు కనికిరించి, నీ ముసలితనాన్ని నీ కుమారులలో ఎవరికైనా ఇచ్చి అతని యవ్వనాన్ని నువ్వు అనుభవించవచ్చు" అన్నాడు.

యయాతి మహారాజు దేవయాని కుమారులను పిలిచి తన ముసలితనం తీసుకోమని అడిగాడు. అందుకు వారు నిరాకరించారు. దాంతో కోపగించిన మహారాజు.

యదువంశము వారు రాజ్యానికి అయోగ్యులు తుర్వసునివంశమువారు ధర్మాధర్మ విచక్షణలేక కిరాతకులలాగా తిరుగుతారు అని శపించాడు. ఈరకంగా యదువు వంశం వారికి రాజ్యార్హత లేకుండాపోయింది.

యయాతి పెద్దకుమారుడు యదువు. అతని వంశంలోనే శ్రీకృష్ణపరమాత్ముడు జన్మించాడు. హృదికుమారుడు దేవామీఢుడు. అతని కుమారుడు వసుదేవుడు. ఇతడు ఉగ్రసేనుని తమ్ముడు దేవకుని కుమార్తె దేవకిని వివాహమాడాడు.

దేవకీవసుదేవుల అష్టమగర్భసంజాతుడు శ్రీకృష్ణుడు.

ఈరకంగా రాజ్యాధికారం కోల్పోయినా యదువంశంలోపుట్టి, ఆ వంశాన్ని ఉద్ధరించినవాడు. అందుచేతనే యదుశ్రేష్ఠుడు అనబడ్డాడు.

## 706. సంనివాసః

సాధువులకు విశ్రాంతి స్థానమైనవాడు.

**సనకాది నివాసో హి మానుషత్వేఽపి యస్సదా**

**సన్నివాస స్సవిజ్ఞేయః హ్యష్టార్ణ స్థానదాయకః ॥**

మానవుడుగా అవతరించి కూడా సనకసనందనాది మహర్షులకు ఎప్పుడూ ఉనికి పట్టు అయి ఉండువాడు. ఈ నామము అష్టాక్షరీమంత్రము.

**సతాం నివాసః సన్నివాసః**

సనకసనందనాది సాధుపుంగవులకు విశ్రాంతి స్థానము.

**వామనపురాణం**లో సనక, సనందన, సనత్కుమార, సనస్సుజాత అనే నలుగురు మహర్షులు. ధర్మప్రజాపతి పుత్రులు. సృష్టి చెయ్యటం కోసం బ్రహ్మ వీరిని సృష్టించాడు. కాని వీరు విరాగులై తపస్సు చేసుకోవటానికి వెళ్ళిపోయారని చెప్పబడింది.

**బ్రహ్మపురాణం**లో వీరు నలుగురు బ్రహ్మమానసపుత్రులు. సృష్టి చెయ్యటంకోసం బ్రహ్మ తపస్సుచేసి 'సన' అని పలకటంచేత వీరు ఉద్భవించారు. వీరు ఎల్లప్పుడు కౌమారదశ లోనే ఉంటారు" అని చెప్పబడింది.

ఈరకంగా ఊర్ధ్వరేతస్కులైన సాధుపుంగవులు కోరే గమ్యస్థానము. అదే పరమ పదము. అదే వైకుంఠము.

తత్త్వజ్ఞులకు ఆశ్రయమైనవాడు. విద్వాంసులకు నివాసమైనవాడు.

**భగవద్గీత**లోని 5వ అధ్యాయం **'కర్మసన్న్యాసయోగము'**లోని 27, 28 శ్లోకాలు.

**స్పర్శాన్ కృత్వా బహిర్బాహ్యాం శ్చక్షుశ్చైవాంతరే భ్రువోః**
**ప్రాణాపానౌ సమౌ కృత్వా నాసాభ్యంతర చారిణౌ ॥**

**యతేంద్రియ మనోబుద్ధిః మునిర్మోక్ష పరాయణః**
**విగతేచ్ఛా భయక్రోధో యస్సదా ముక్త ఏవ సః ॥**

బాహ్యభోగవిషయాలను చింతన చేయకుండా వాటిని పారద్రోలాలి. దృష్టిని భ్రూమధ్యంలో స్థిరంగా ఉంచాలి. నాసిక ద్వారా నడుస్తున్న ఉచ్ఛ్వాస, నిశ్వాసలను క్రమంలో నడపాలి. వీటిప్రభావంతో మనస్సు, బుద్ధి, ఇంద్రియాలు కూడాసాధకుని వశంలోకి వస్తాయి. ఇటువంటి సాధనవలన మోక్షపరాయణుడైన మునిఇచ్ఛా భయక్రోధరహితుడై సదాముక్తుడగును.

జీవుడికి బాహ్యవిషయాలతో సంబంధము అనేక జన్మలనుండి వస్తున్నది. అందుచేత వాటి ఛాయలు అంటే విషయముల యొక్క గుర్తులు సాధకుడి అంతఃకరణయందు ముద్రించబడి ఉంటాయి. కాబట్టి సాధకుడు ఈ విషయవాంఛలే సుఖము అనుకుంటాడు. వాటిపట్ల ఆకర్షితుడవుతాడు. సర్వకాలసర్వావస్థలయందు వాటినిగురించే ఆలోచిస్తుంటాడు. అవి గతస్మృతులను అంటే గత జన్మలలో జరిగిన వాటిని గుర్తుకు తెచ్చి అశాంతి రేకెత్తిస్తాయి. అతడు ధ్యానంలో ఉన్నప్పుడు కూడా ఈ విషయవాంఛలు అతన్ని వదలవు. అందుకనే అతని మనస్సు పరమేశ్వరుని మీద ధ్యానం కాదు. దీనికి కారణము నిరంతరము విషయచింతన చేయటమే. ఇప్పుడు సాధకుడు బాహ్యవిషయాలు క్షణభంగురాలు అవి సుఖమయములు కావు, అశాశ్వతములు అని భావించి, వాటి గుర్తులను మనసు నుంచి చెరిపివెయ్యాలి. అప్పుడు చిత్తము ప్రశాంతమవుతుంది. నిశ్చలస్థితి వస్తుంది.

కళ్ళు తెరచి ఉంచితే దృష్టి అన్నివైపులకు పోతుంది. అందుకే కనులు మూసుకోవాలి. ధ్యానంలోకి వెళ్ళాలి. ఇక ఉచ్ఛ్వాసనిశ్వాసలు సమంగా ఉండవు. అవి ఏదో ఒక వైపునుంచే

ప్రసరిస్తుంటాయి. వాటిని రెండు నాసికారంధ్రములనుంచి నడపాలి. ఇది యోగప్రక్రియ. అప్పుడు శ్వాసమీద సాధకుడికి అధికారము వస్తుంది. అటువంటి స్థితిలో సాధకుడు ఇంద్రియాలను కూడా అదుపులో ఉంచగలుగుతాడు.

ఇటువంటి సాధన చేసిన యోగి మోక్షము పొందుతాడు. అంటే పరమేశ్వరుని చేరతాడు. ఈరకమైన సాధనచేసిన వారు చేరేది ఆ భగవానుని సన్నిధికే. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'సన్నివాసః' అనబడుతున్నాడు.

## 707. సుయామునః

యమునానదిలో చేసిన జలక్రీడలే పుణ్యముగా గలవాడు.

**గోపీభిర్య మునాయాంతు శోభనం పావనం మహత్**

**జలక్రీడాది యస్మేతి సుయామున ఇతీరితః ॥**

గోపికా స్త్రీలతో కలిసి యమునానదిలో జలక్రీడలాడినవాడు.

**శోభనం యామునం యస్యసః సుయామునః**

యమునానదిలో చేసిన రాసక్రీడలే పుణ్యముగా గలవాడు.

సజ్జనులకు, యమునాతీరవాసులైన దేవకీ, వసుదేవ, నంద, యశోద, బలరామ, సుభద్ర మొదలైన చక్కని పరివారము గలవాడు. కాబట్టి శ్రీమన్నారాయణుడు 'సుయామునః' అనబడుతున్నాడు.

యమునాతీరవాసులైన గోపాలురచే పరివేష్ఠించబడినవాడు.

యమునాతీరము అనబడే ప్రాపంచిక ఎడారిలో పరిభ్రమించే జీవులకు– నీటిమడుగు లాంటివాడు.

అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'సుయామునః' అనబడతాడు.

## 708. భూతావాసః

అన్ని భూతములకు నివాసస్థానమైనవాడు.

**యస్మిన్వసంతి భూతాని భూతావాస స్సకథ్యతే** తనయందు నివసిస్తున్న సమస్త భూతములు గలవాడు. సకల భూతములకు నివాసస్థానమైనవాడు.

మహాప్రళయం జరిగినప్పుడు జగత్తంతానాశనమైపోతుంది. అప్పుడు కర్మక్షయం జరిగిన జీవులు ముక్తి పొందుతాయి. కర్మక్షయం కాని జీవులు తమ కర్మను తమతోపాటుగా

మూటకట్టుకుని ఆ పరమేశ్వరునియందు లీనమవుతాయి. ఈ రకంగా జీవులన్నీ పరమేశ్వరుని యందే చేరి ఉంటాయి. అందుచేతనే ఆ పరమేశ్వరుడు అన్ని భూతాలకు నివాసస్థానమైనవాడు అని చెప్పటం జరిగింది.

**భూతానాం ఆవాసః భూతావాసః**

పరమేశ్వరుడు శ్రీకృష్ణపరమాత్ముడుగా అవతరించినప్పటికీ, జగత్తులోని సమస్త భూతములకు ఆవాసమైనవాడు కాబట్టే 'భూతావాసః' అనబడుతున్నాడు.

పంచమహాభూతములకు నిలయమైనవాడు.

**వసంత త్వయి భూతాని భూతావాసస్తతోభవాన్**

అన్ని భూతములు అతనియందే ఉంటాయి కాబట్టే పరమేశ్వరుడు భూతనాధుడు.

ఈవిధంగా అన్ని భూతాలు అతనియందే ఉంటాయి. అన్ని భూతాలకు అతడే నివాసస్థానము కాబట్టి శ్రీమన్నారాయణుడు 'భూతావాసః' అనబడుతున్నాడు.

## 709. వాసుదేవః

వాసుదేవ వ్యూహమైనవాడు. 332, 695 నామాలు కూడా ఇదే.

**వసుదేవా సత్యతయా ద్వాదశాధ్యాత్మ మంచసా**

**నియచ్ఛతి సదాయస్తు వాసుదేవ స్సఈరితః ॥**

వసుదేవునిపుత్రుడైన వాసుదేవుడుగా అవతరించి ద్వాదశాక్షరీ మంత్రాన్ని ఉపదేశించినవాడు. వాసుదేవ వ్యూహమైనవాడు.

పరమేశ్వరుడికి ఐదు విధాలయిన స్వరూపమున్నది. అవి

1. పరా
2. వ్యూహ
3. విభవ
4. అంతర్యామి
5. అర్చ

వీటిని 121 నుంచి 150 వరకు నామాలలో వివరించటం జరిగింది.

ఇక్కడ పరాస్థానము నిత్యభోగస్థానము. అప్రాకృతము. నిత్యము ముక్తులైన వారిచేతనే సేవించబడుతుంది. ఇదే పరమపదము, వైకుంఠము. ఇక్కడికి చేరినవారికి పునర్జన్మ ఉండదు. పరాస్థానానికి అధిపతి వాసుదేవుడు. అతడే శ్రీమన్నారాయణుడు.

పరమపదమునందున్న వాసుదేవుని చేరాలి అంటే ఊర్ధ్వపుండ్రములు ధరించాలి. సామవేదాంతర్గతమైన **వాసుదేవోపనిషత్తులో**

“ఒకసారి నారదమహర్షి సర్వేశ్వరుడైన వాసుదేవునికి నమస్కరించి “దేవా! ఊర్ధ్వపుండ్రవిధానము, దానికి అవసరమైన ద్రవ్యము, మంత్రములు మంత్రస్థానములు నాకు వివరించవలసినది” అని అడిగాడు. అప్పుడు పరమేశ్వరుడైన వాసుదేవుడు ఈవిధంగా చెప్పటం ప్రారంభించాడు.

విష్ణు చందనాన్ని గోపికలు ప్రతిరోజూ నా శరీరానికి రాచి, మళ్ళీ కడిగి వేస్తూంటారు. అందుచేత అది గోపీచందనము అని పిలువబడుతుంది. నా శరీరానికి రాయబడేది, పరిశుద్ధమైనది, పసుపురంగులో ఉన్నది అయిన గోపిచందనము పరమపవిత్రమైనది. ఇది మోక్షసాధనము ముందుగా గోపీచందనానికి నమస్కరించి పాపముల నశింపచేసేది, విష్ణుదేహము నుంచి తీసినది, చక్రముచే ముద్రించబడినది, ధరించినంత మాత్రము చేతనే మోక్షమును ప్రసాదించేది అయిన ఓ గోపీచందనమా! నీకు నమస్కారము. అని ప్రార్థనచేసి, **ఇమంమేగంగే** అనే మంత్రంతో నీటిని తీసుకుని **విష్ణోర్నుక** అనే మంత్రంతో చందనాన్ని మర్దనచేసి **అతతోదేవా అవంతున** అనే మంత్రంతోగాని, విష్ణుగాయత్రితోగాని, కేశవనామాలతోగాని గోపీచందనాన్ని ధరించాలి.

బ్రహ్మచారి, వానప్రస్తుడు. వీరిద్దరూ, ముఖమునందు, కంఠమందు, భుజములందు గోపీచందనము ధరించాలి.

గృహస్థుడు ఆ చందనాన్ని మూడుసార్లు మంత్రించి **“శంఖచక్ర గదాపాణీ। ద్వారకానిలయా। అచ్యుతా। గోవిందా। పుండరీకాక్షా। శరణాగతుడైన నన్ను రక్షించుము.** అని ధ్యానం చేస్తూ ఉంగరపువ్రేలితో చందనము శరీరం మీద 12 చోట్ల కేశవాది నామాలు చెబుతూ ధరించాలి.

యతీశ్వరుడు చూపుడువ్రేలుతో శిరస్సు, లలాటము, హృదయములందు ప్రణవమంత్రంతో ధరించాలి. త్రిమూర్తులు, మూడు వ్యాహృతులు మూడువేదాలు, త్రికాలములు, మూడు అవస్థలు, జీవాత్మ, పరమాత్మ, అంతరాత్మ. అనే మూడు ఆత్మలు దక్షిణాగ్ని, ఆహవనీయాగ్ని, గార్హపత్యాగ్ని అనే మూడు అగ్నులు ఇవన్నీ త్రిపుండ్రములుగా ఉన్నాయి. ఊర్ధపుండ్రము అకార ఉకారమకారముల స్వరూపమైన ప్రణవము. అది ఉన్నతపదమునిస్తుంది.

పరమహంస అయినవాడు ప్రణవమంత్రముతో ఒక ఊర్ధ్వపుండ్రము మాత్రమే ధరించాలి. హృదయస్థానంలో అగ్నిశిఖలాగా ప్రకాశించే పరమాత్మను ధ్యానించాలి. ఈ విధంగా హృదయస్థానములో ఉన్న నన్ను ధ్యానించినవాడు ముక్తి పొందుతాడు.

నేను ఒక్కడనే విష్ణువుగా సర్వవ్యాపియై సమస్త భూతములందు ఆత్మగా ఉన్నాను. నువ్వులలో నూనెలాగా, కొయ్యలోని అగ్నిలాగా, పాలలోని వెన్నలాగా, పూలలోని మకరందములాగా నేను సమస్త భూతములందు ఆత్మగా ఉన్నాను. బ్రహ్మరంధ్రమందు, హృదయమందు గోపీచందనము గురించి, చిదాకాశమందున్న సూర్యునిలాగా ప్రకాశించే శ్రీమహావిష్ణువును సేవించేవాడు. పరమపదము పొందుతాడు.

ఊర్ధ్వపుండ్రము, ఊర్ధ్వదండము, ఊర్ధ్వరేతస్సు గల యతీశ్వరుడు పరమపదము చేరతాడు. ప్రతిదినము గోపీచందనము ధరించటం వలన అటువంటి ఉత్తమస్థితి కలుగుతుంది. ఒకవేళ గోపీచందనము దొరకనట్లైతే తులసి చెట్టు వేరునందలి మట్టిని ఊర్ధ్వపుండ్రముగా ధరించాలి. ఈరకంగా ప్రతిరోజు చేసినట్లైతే అపరోక్షజ్ఞానములభిస్తుంది. అతడు పరమపదము చేరతాడు." అని చెప్పబడింది. ఈ విధంగా తన భక్తులకు తేలిక మార్గంలో పరమపదమునిచ్చేవాడు. కాబట్టే శ్రీమన్నారాయణుడు 'వాసుదేవః' అనబడుతున్నాడు.

## 710. సర్వాఽసునిలయః

సకలప్రాణులకు ఆధారభూతుడు.

**సర్వాసునిలయ స్సస్యాత్ సర్వప్రాణావలంబనమ్ ॥**

అందరి ప్రాణములకు ఆధారమైనవాడు.

**సర్వేషాం అసూనాం నిలయః సర్వాసునిలయః**

లోకములోని జీవులన్నింటికీ ఆధారభూతుడు.

**సర్వే ఏవ అసవః - ప్రాణాః జీవాత్మకే యస్మి**
**నాశ్రయే నిలీయంతే - సః - సర్వాఽసునిలయః**

అన్ని ప్రాణములు జీవరూపమైన ఏ ఆశ్రయమందు మిక్కిలిగా లయం చెందుతాయో అతడు 'సర్వాఽసునిలయః' అనబడుతున్నాడు.

సమస్త జీవులకు ప్రాణమైనవాడు. ప్రళయకాలంలో కర్మక్షయం కాని జీవులు తమకర్మను తమతో పాటుగా మూట కట్టుకుని ఆ పరమాత్మునిలో చేరతాయి. కర్మక్షయం అయిన జీవులు అతనిలో చేరి ముక్తి నొందుతాయి. ఈ రకంగా జగత్తులోని జీవకోటి అంతా పరమేశ్వరుని యందే ఉంటుంది. కాబట్టి అతడు 'సర్వాసునిలయః' అనబడతాడు.

పరమేశ్వరుడు నిత్యము సత్యము అయినవాడు. అందుచేత మనలోని ప్రాణాలకు కూడా అతడే ఆధారము.

తృప్తి చెందనివాడు. 293వ నామము కూడా ఇదే.

**సర్వం కృత్వాపి గోపానాం న చ కించిత్మయా కృతం**
**ఇత్యేవ మనితృప్తోయో హ్యనలః పరికీర్తితః**
**స్వభక్తేభ్యః కృతంమన్తుం నాలం పోఢుంసవాఽనలః**

భక్తులకు అన్నీ ఇచ్చి కూడా, ఇంకా వారికి నేనేమీ చెయ్యలేకపోయాను అని తృప్తి చెందనివాడు. ఎవరైనా తన భక్తులకు అపరాధం చేస్తే వాటిని సహించలేనివాడు.

**న అలః అనలః** తన భక్తులకు ఎంత చేసినా తృప్తి చెందనివాడు. మహాభారతంలో

**ఋణం ప్రవృద్ధ మివమే హృదయాన్నా పసర్పతి**

ద్రౌపది 'గోవిందా' అని పిలిచింది. అప్పు పెరిగినట్లుగా ఆమె భక్తి పెరిగిపోతున్నది. నేను ఆమెకు ఏమీ చెయ్యలేకపోతున్నాను." అనుకుంటాడు శ్రీకృష్ణుడు. ఈ రకంగా ఎప్పుడూ భక్తుల గురించి, వారికి చెయ్యవలసిన దాన్ని గురించే ఆలోచిస్తూ, అసంతృప్తుడుగా ఉంటాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'అనలః' అనబడుతున్నాడు. అంతేకాదు. తన భక్తులకు ఎవరైనా అపరాధం చేసినట్లైతే సహించలేనివాడు.

**ద్యౌతుమే వధకాలేఽస్మిన్ నక్షంతవ్యైకథంచన**
**యజ్ఞవిఘ్నకం హన్యాన్ పాండవానాంచదుర్హృదమ్**

చంపవలసిన అవసరం వచ్చినప్పుడు యాగములను విఘ్నము గావించినవారిని, పాండవులకు శత్రువులను ఏమాత్రం క్షమించకుండా చంపి తీరతాను. అంటాడు శ్రీకృష్ణుడు. ఈరకంగా తన భక్తులకు అపకారం చేసినవారిని ఏ మాత్రం సహించడు. అపరిమితమైన శక్తి, సంపద గలవాడు.

**భగవద్గీత**లోని 10వ అధ్యాయం **'విభూతియోగం'**లోని 8వ శ్లోకము.

**అహంసర్వస్య ప్రభవో మత్తసర్వం ప్రవర్తతే**
**ఇతి మత్వా భజంతే మాం బుధా భావసమన్వితాః ॥**

సమస్త జగదుత్పతికీ వాసుదేవుడనైన నేనే మూలకారణము. నా వలననే జగత్తంతా నడుస్తున్నది. ఈ విషయం తెలిసిన జ్ఞానులు నన్నే సేవిస్తారు.

ఈ జగత్తుకంతటికీ నేనే మూలకారణమైనవాడను. అంటే అపరిమితమైన శక్తి సంపదగలవాడను అని అర్థం. అదే అధ్యాయంలోని 40వ శ్లోకము.

**నాంతోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప**

**ఏష తూద్దేశతః ప్రోక్తో విభూతేర్విస్తరో మయా ॥**

అర్జునా ! నా దివ్యవిభూతులకు అంతమే లేదు. వాటిని గురించి సంక్షిప్తంగా వివరించాను.

ఇక్కడ నా విభూతులకు అంతంలేదు. అంటే నా శక్తిసామర్థ్యాలు, ఐశ్వర్యము అనంతములు అని అర్థం.

ఈకరాణాలచేత శ్రీమన్నారాయణుడు అనలుడు అనబడుతున్నాడు.

## 712. దర్పహా

దేవతల గర్వాన్ని అణచినవాడు.

**గోవర్ధనస్యోద్ధరణే పారిజాత పరిగ్రహే**

**బాణదోర్దండ షండానాం ఖండనాదౌతదా తదా**

**దేవానాం వైదర్పమాత్రం హతవాస్య స్సదర్పహ ॥**

గోవర్ధనోద్ధరణమందు, పారిజాతాపహరణసమయమందు, బాణాసురుని భుజములను నరకునప్పుడు దేవేంద్రాదుల గర్వమణచినవాడు.

**దర్పం హంతీతి దర్పహా** దేవేంద్రాదుల దర్పమణచినవాడు.

గోపాలకులంతా "వర్షం కురిపించేవాడు ఇంద్రుడు. కాబట్టి ఇంద్రయాగము చేస్తాము" అన్నారు వద్దన్నాడు కృష్ణుడు. గోవర్ధనగిరిని పూజించండి. దానివల్లనే వర్షాలు పడుతున్నాయి. అందుకని ఆ పర్వతాన్నే పూజించాలి అన్నాడు. సరే అన్నారు గోపాలురు. గోవర్ధనగిరిని పూజించారు.

ఈ విషయం తెలిసిన ఇంద్రుడు కోపించాడు. వెంటనే వడగళ్ళ వానకురిపించాడు. ఆలమందలు గోపాలకులు అంతా చెల్లాచెదరయ్యారు. కృష్ణుని శరణువేడారు. శ్రీకృష్ణ పరమాత్ముడు వారికి అభయమిచ్చాడు. గోవర్ధనోద్ధరణంచేశాడు. గోవులను, గోపాలకులను రక్షించాడు. ఇంద్రుడు సిగ్గుపడి క్షమించమని వేడుకున్నాడు.

నారదుడు దేవలోకం నుంచి పారిజాత పుష్పాన్ని తెచ్చి శ్రీకృష్ణునకిచ్చాడు. కృష్ణుడు ఆ పుష్పాన్ని రుక్మిణీదేవికిచ్చాడు. దాంతో సత్యభామకు కోపం వచ్చింది. ఆమె అలక తీర్చటంకోసం శ్రీకృష్ణుడు సత్యభామాసహితుడై దేవలోకంవెళ్ళి పారిజాత వృక్షాన్ని

పెకలించుకురాబోయాడు. ఇంతలో దేవేంద్రుడు అడ్డుకున్నాడు. ఇద్దరికీ భీకరయుద్ధం జరిగింది. ఇంద్రుడు ఓడిపోయాడు. పారిజాతాన్ని కృష్ణునికిచ్చి పంపాడు. ఈరకంగా అనేకసార్లు ఇంద్రాది దేవతలకు గర్వభంగం జరిగింది.

**కేనోపనిషత్తు**లో ఒక కథ ఉన్నది. ఒకసారి దేవదానవ సంగ్రామం మహాభీకరంగా జరిగింది. అందులో దేవతలు విజయం సాధించారు. ఆ విజయం తమవల్లనే సాధించ బడిందని, దానికి కారణం తామేనని దేవతలలో ప్రతివారూ గర్వంతో విర్రవీగిపోయారు. దీనికంతటికీ కారణమైన పరబ్రహ్మను మరచిపోయారు. విజయోత్సాహంతో దేవతలంతా సభతీర్చారు. అందులో ఎవరి ప్రతాపాన్ని వారు చెప్పుకోవటం మొదలుపెట్టారు. ముందుగా అగ్నిదేవుడు తన అగ్ని జ్వాలలు ప్రజ్వలింపచేస్తే, ఆ అగ్ని శిఖలలో రాక్షసులు మాడిపోతూ దిక్కుతోచక పలాయనం చిత్తగించారు. అంటూ తన శక్తిసామర్థ్యాల గురించి గర్వంగా చెప్పాడు. తరువాత వాయువు లేచి తను చండప్రచండంగా గాలులు వీస్తుంటే వాటి తాకిడికి నిలవలేక రాక్షసులు పలాయనం చిత్తగించారు అన్నాడు. ఈ రకంగా దేవతలంతా తమ పరాక్రమాన్ని గొప్పగా చెప్పుకుంటున్నారు.

బ్రహ్మతత్త్వం ఇదంతా గమనిస్తోంది. దేవతల అహంకారం పోగొట్టాలని నిర్ణయించుకుంది. అనుకున్నదే తడవుగా వారి ఎదుట భయంకరమైన యక్షరూపంలో ప్రత్యక్షమైంది. చూశారు దేవతలు. అదేమిటో వారికి అర్థం కాలేదు. ఆ రూపాన్ని చూసి భయపడ్డారు. ఏంచెయ్యాలో పాలుపోలేదు.

దేవాసుర సంగ్రామంలో రాక్షసులను భయంకరమైన అగ్ని కీలలతో కాల్చివేశానని చెప్పినవాడు అగ్నిదేవుడు. అందుకని దేవతలందరూ అగ్నిదేవుని సమీపించి "ఓ అగ్నిదేవా! ఏదో భయంకరమైన తత్త్వం ఇక్కడ ప్రత్యక్షమైంది. అదేమిటో మా బుద్ధికి అర్థం కావటం లేదు. కాబట్టి నీవు వెళ్ళి దాన్ని గురించి తెలుసుకుని రావలసినది" అన్నారు.

'సరే' అని బయలుదేరాడు అగ్నిదేవుడు. ఆ తత్త్వాన్ని సమీపించాడు. భూతంలాంటి ఆ తత్త్వం అగ్నిదేవుని చూసి అడిగింది "ఎవరు నువ్వు" ?

"నేను అగ్నిదేవుడను. లోకంలో అందరూ నన్ను 'జాతవేదుడు' అంటారు."

"అయితే నీ శక్తిసామర్థ్యాలేమిటి ?"

"లోకంలోని ఏ వస్తువునైనా సరే క్షణంలో కాల్చి బూడిద చేస్తాను."

'అంత గొప్ప వాడివా' ? అయితే ఈ గడ్డిపోచను దగ్ధం చెయ్యి' అంటూ ఒక గడ్డిపరకను అక్కడ ఉంచింది ఆ తత్త్వం.

ఆ గడ్డిపరకను చూచి చాలా తేలికభావంతో మంటలు సృష్టించాడు అగ్నిదేవుడు. గడ్డిపరక కాలలేదు. భయంకరమైన అగ్ని శిఖలు సృష్టించాడు. లాభం లేకపోయింది. గడ్డిపోచ అలానే ఉంది. అగ్నిదేవుడు వెనక్కు తిరిగి దేవతల వద్దకు వెళ్ళి "ఆ తత్త్వం ఏమిటో నాకూ పాలుపోలేదు. దాన్ని అర్థం చేసుకోవటానికి నాశక్తి చాలలేదు" అన్నాడు.

అప్పుడు దేవతలంతా వాయుదేవుని సమీపించి "దేవా ! నీవు చాలా గొప్పవాడివి కదా ! ఆ తత్త్వం ఏమిటో నువ్వైనా కనుక్కో" అన్నారు.

'సరే' అని బయలుదేరాడు వాయువు. ఆ తత్త్వాన్ని సమీపించాడు. పూర్వంలో లాగానే ఆ తత్త్వం ప్రశ్నించింది.

"ఎవరు నువ్వు ?"

'నేను వాయుదేవుడను. ఆకాశంలో సంచరిస్తుంటాను. కాబట్టి నన్ను 'మాతరిశ్వుడు' అని కూడా అంటారు."

"నీశక్తి ఏమిటి ?"

లోకంలో ఏ వస్తువునైనా సరే నాగాలులతో ఎగురగొట్టగలను."

"అయితే దీన్ని ఎగరగొట్టు" అంటూ ఇది వరకటి లాగానే గడ్డిపోచను అక్కడ ఉంచింది ఆ తత్త్వం. వాయుదేవుడు తన బలాన్ని కూడగట్టుకుని ముందుకు వెళ్ళాడు. భయంకరమైన గాలులు వీచాడు. గడ్డిపోచ కదలలేదు. వచ్చిన దారినే వెనక్కు వెళ్ళి దేవతలతో "ఆ తత్త్వం ఏమిటో నాకు అర్థం కాలేదు" అన్నాడు.

అప్పుడు దేవతలందరూ తమ ప్రభువైన ఇంద్రుని దగ్గరకు వెళ్ళి అతనికి జరిగిన సంగతంతా వివరించి "దేవేంద్రా ! ఆ విచిత్రమైన తత్త్వం ఏమిటో నువ్వైనా కనుక్కోవలసినది" అన్నారు.

'సరే' అంటూ తన వజ్రాయుధం తీసుకుని ఆ తత్త్వం దగ్గరకు వెళ్ళాడు దేవేంద్రుడు. వెంటనే ఆ శక్తిమాయమైపోయింది. దానిస్థానంలో మహా సౌందర్యరాశియైన ఒక స్త్రీమూర్తి కనిపించింది. ఆమె హిమవంతుని కుమార్తె హైమవతి. ఆమెను ఉమాదేవి అని కూడా అంటారు.

ఆశ్చర్యంగా చూసిన ఇంద్రుడు ఉమాదేవిని ప్రశ్నించాడు. "అమ్మా ! దేవతలనందరినీ భయభ్రాంతులతో ముంచివేసిన ఆయక్షుడెవరు ? ఆ తత్త్వము ఏమిటి" ?

"ఆ శక్తియే బ్రహ్మము" అని ఉమాదేవి సమాధాన మిచ్చింది. ఆ తరువాత ఇంద్రునితో "ఓ దేవేంద్రా ! బ్రహ్మము వల్లనే కదా మీరు విజయం పొందింది. మీ గొప్పదనానికి

కారణము బ్రహ్మము. మీ అల్పబుద్ధివల్ల ఇప్పటి వరకు కనుపించిన తత్త్వమే బ్రహ్మమని గుర్తించలేకపోయారు. ఆ బ్రహ్మతత్త్వమే మీ శరీరంలో శక్తిని వ్యాపింప చేస్తోంది. దానివల్లనే మీరంతా అసురులను సంహరించగలిగారు. దానివల్లనే ఈ మహాత్మ్యము మీరు పొంద గలిగారు. అంతేగాని అదంతా మీ గొప్పదనం అని అహంకరించకండి" అని చెప్పి అదృశ్యమైపోయింది. ఈరకంగా ధర్మవిరుద్ధమార్గంలో ఉండే దేవతలకు దర్పమణచినవాడు కావటంచేత శ్రీమన్నారాయణుడు 'దర్పహా' అనబడ్డాడు.

## 713. దర్పదః

యాదవులకు గర్వము కలిగించినవాడు.

**మధురాయాం యాదవేభ్యః మధుపానాదినా తతః**
**దర్పం చ దత్తతా న్యోసౌ దర్పదః పరికీర్తితః**

మధురానగరంలో యాదవులు మధుపానంచేసి గర్వించేటట్లు చేసినవాడు.

**దర్పం దదాతీతి దర్పః** మధురానగరాన్ని దుర్భేద్యంగా రూపొందించాడు. దానికి శత్రుభయంలేదు. ఆ నగరంలో సాక్షాత్తూ పరమేశ్వరుడే అయిన శ్రీమన్నారాయణుడే వాసుదేవుని రూపంలో ఉన్నాడు. అతనితోపాటు శంఖ, పద్మనిధులున్నాయి. అంటే మధురానగరి సుసంపన్నమయింది. పారిజాతము ఇక్కడే ఉన్నది. ఇన్ని కలిగిన యాదవవీరులు మధుపానంచేసి, మత్తెక్కి గర్వించి పోయేలా చేసినవాడు.

భక్తులను అనుగ్రహించటంలో వారికి గర్వము ఏర్పడేలాగా అనుగ్రహించేవాడు. గర్వము ఎంతటివారికైనా పతనహేతువు. కాబట్టి గర్వము నశిస్తేనేగాని మోక్షానికి అర్హులు కారు. అందుచేత భక్తులకు గర్వము వచ్చేలాగా చేసేవాడు. కాబట్టే శ్రీమన్నారాయణుడు 'దర్పదః' అనబడతాడు.

## 714. దృప్తః

గర్వించినవాడు.

యశోదాదేవి లాలనము వలన గర్వించినవాడు. తన స్వరూపము అనే అమృతాన్ని పానం చేయటంచేత మిక్కిలి ఆనందించినవాడు.

ఆత్మస్వరూపం తెలిసినవాడుకావటంచేత మిక్కిలి గర్వించినవాడు. స్వాత్మానందములో తన్మయుడై ఉన్నవాడు. **భగవద్గీత** రెండవ అధ్యాయం **'సాంఖ్యయోగం'**లోని 55వ శ్లోకం.

**ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ మనోగతాన్**

**ఆత్మ న్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞస్తదోచ్యతే ॥**

అర్జునా ! మనసులోని కోరికలు పూర్తిగా తొలగిపోయి ఆత్మద్వారా ఆత్మయందు సంతుష్టుడైన వానిని, అనగా పరమాత్మ సంయోగము వలన ఆత్మానందము పొందిన వానిని 'స్థితప్రజ్ఞుడు' అంటారు.

ఈరకంగా ఆత్మానందం పొంది గర్వించినవాడు. ఈ నామానికి శంకరభగవత్పాదుల వారు ఈ రకమైన అర్థం చెబితే పరాశరభట్టరువారు 'అదృప్తః' అని వ్రాశాడు.

**అదృప్తః :** గర్వింపకుండువాడు.

**అధాప్య గర్వితో యోఽసౌ అదృప్త స్సముదాహృతః**

అనన్య సామాన్యమైన పనులు చేసికూడా ఏ మాత్రము గర్వించనివాడు.

**న దృప్తః అదృప్తః** ఏవిధంగానూ తాను గర్వించనివాడు. **మహాభారతం**లో

**ఏవం విధానికర్మాణి కృత్వాగరుడవాహనః**

**న విస్మయ ముపాగచ్ఛత్ పారమేష్ఠ్యేన తేజసా ॥**

ఆ గరుడవాహనుడు ఇటువంటి పనులు చేసి కూడా తన మహిమను గురించి కొంచెము కూడా గర్వించలేదు.

## 715. దుర్ధరః

ధరింపజాలనివాడు, నిగ్రహింపజాలనివాడు. 266 నామం కూడా ఇదే.

**బాలలీలా ప్రసంగేషు యశోదా నంద బాలనాత్**

**దృప్తో మత్తో భవేత్తాభ్యాం దుర్గ్రహో దుర్ధరోమతః**

చిన్నతనంలో ఆటలాడేటప్పుడు శ్రీకృష్ణుడు అల్లరిచేసినా యశోదానందులు అతన్ని శిక్షించలేదు. పైపెచ్చు లాలించారు. అందుచేత గర్వించి పట్టశక్యము కానివాడై భరింపజాలకున్నాడు.

**దుఃఖేనాపి ధర్తుమ్ అశక్యః దుర్ధరః** బాలక్రీడలయందు యశోదానందులచే ధరింపరాని చేష్టలు చేసినవాడు.

ఒకనాడు బాలకృష్ణుని అల్లరికి విసిగి అతన్ని బంధించిన యశోద

**యదిశక్నోషి గచ్ఛత్వమతి చంచలచేష్టితః** ఓరి తుంటరివాడా! ఇంక నీకు చేతనైతే వెళ్ళు.

పరమేశ్వరుడు మహాశక్తివంతుడు. అతన్ని పట్టుకోలేము. నిగ్రహించలేము. **మహాభారతంలో**

**ఇమంహి పుండరీకాక్షం జిఘృక్షంత్యల్పచేతసః**

**పటేనాగ్నిం ప్రజ్వలితం యథాబాలో యథా஽బలాః**

మండుతున్న అగ్నిని బాలుడుగాని బాలికగాని వస్త్రములో పట్టుకోలేనట్లు ఈ అల్పులు శ్రీకృష్ణుని పట్టుకోలేరు.

**దుర్గ్రహః పాణినా వాయుః దుస్పర్శః పాణినాశశీ**

**దుర్ధరాపృథివీ మూర్ధ్నా దుర్గ్రహః కేశవో బలాత్**

వాయువును చేతులతో బంధించలేము. చంద్రుని తాకలేము. అదేవిధంగా కేశవుని కూడా బంధించలేము. ధ్యానించటానికి సులభసాధ్యము కానివాడు.

**భగవద్గీత**లోని 6వ అధ్యాయం **'ఆత్మసంయమనయోగం'**లోని 34వ శ్లోకం.

**చంచలం హి మనః కృష్ణ ప్రమాథి బలవద్దృఢమ్**

**తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్**

కృష్ణా ! నీ మనస్సు మిక్కిలి చంచలమైనది. ధృడమైనది. చాలా బలమైనది. కాబట్టి దానిని నిగ్రహించటము అనేది గాలిని బంధించటంలాగే కష్టమైనది. అందుచేత చంచల స్వభావులు అతన్ని ధ్యానించలేరు.

**భగవద్గీత**లోని 12వ అధ్యాయం **'భక్తియోగము'**లోని 5వ శ్లోకము.

**క్లేశో஽ధికతరస్తేషాం అవ్యక్తాసక్త చేతసామ్**

**అవ్యక్తా హి గతిర్దుఃఖం దేహవద్భిరవాప్యతే ॥**

సచ్చిదానంద ఘన నిరాకార పరబ్రహ్మయందు ఆసక్తచిత్తులైనవారు. తత్ప్రాప్తికై చేయుసాధన మిక్కిలి శ్రమతో కూడినది. ఎందుకంటే దేహాభిమానులకు బ్రహ్మప్రాప్తి జరగదు.

ఈరకంగా శ్రీమన్నారాయణుడు నిగ్రహింపజాలనివాడు. అందుచేతనే 'దుర్ధరః' అనబడుతున్నాడు.

## 716. అపరాజితః

పరాజయము రానీయనివాడు. 862వ నామం కూడా ఇదే.

**దుర్యోధనాదిభిర్నిత్యం దూధమూలైః పరాజయః**
**న యస్య కుత్రచి ద్వాసి సోఽపరాజిత ఈరితః**

ఎంత విరోధమున్నప్పటికీ పాండవులకు దుర్యోధనాదులచేత ఎన్నడూ పరాజయము రానీయనివాడు. పాండవులకు అపజయము రాకుండా చేసినవాడు.

**అపరాజితా అస్య సంతీతి అపరాజితః**

కురుపాండవయుద్ధం నిశ్చయమై పోయింది. అటునుంచి దుర్యోధనుడు, ఇటునుంచి కృష్ణుడు సహాయం అర్థించటం కోసం శ్రీకృష్ణుని దగ్గరకు వెళ్ళాడు. అప్పుడు కృష్ణుడు తన వెనక ఉన్న సైన్యం మొత్తం ఒకవైపు, తాను ఒక్కడూ ఒకవైపు ఉంటాము. యుద్ధంలో తాను మాత్రం ఆయుధం ధరించనని, యుద్ధం చెయ్యనని, ఏదైనా అడిగితే సలహా మాత్రం చెబుతాను అంతే అన్నాడు. ఈ రకంగా సుయోధనుడికి ముందుగానే తనను కోరుకోవటంవల్ల ఉపయోగం లేదు. అని హెచ్చరించాడు. చివరకు దుర్యోధనుడు నిజంగానే కృష్ణుని సేనను తీసుకుని వెళ్ళిపోయాడు. తాను పరమేశ్వరుడు. తను ఎటు ఉంటే అటువైపే గెలుపు తథ్యం. అందుచేత దుర్యోధనుడు తనను కోరకుండా చేసి, అతని చేతిలో పాండవులు ఓటమి పాలుకాకుండా రక్షించాడు.

**యస్యత్వం పురుష వ్యాఘ్ర ముపజగ్మివాన్**
**ధ్రువఏవ జయస్తస్య నతస్యాస్తి పరాజయః**

కృష్ణా ! నువ్వు ఎవరికి సారథిగా ఉంటావో వారికి విజయము నిశ్చయముగా జరుగుతుంది అంటాడు అర్జునుడు.

**శక్తోఽహంధనుపై కేన నిహంత్రుం సర్వపాండవాన్**
**యద్వేషాం భవేద్గోప్తా విష్ణుః కారణ పూరుషః**

శ్రీకృష్ణుడు పాండవులకు రక్షణగా ఉన్నాడు. అతడు గనకలేకపోతే పాండవులను ఒకే ఒక్క బాణంతో చంపుతాను అంటాడు కర్ణుడు. అనగా కృష్ణుడు ఉండగా పాండవులకు అపజయం రాదు అని అర్థం.

పరమేశ్వరుడు అపజయమనేది ఎరుగనివాడు. శత్రువులు రెండు రకాలు 1. అంతః శత్రువులు 2. బాహ్యాశత్రువులు.

అంతః శత్రువులంటే అరిషడ్వర్గాలు. వీటిచేతగాని, బయటి శత్రువులచేతగాని పరాజయమెరుగనివాడు. అటువంటి పరాజయము తన భక్తులకు కూడా రానీయనివాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'అపరాజితః' అనబడుతున్నాడు.

## 717. విశ్వమూర్తిః

విశ్వమును శరీరముగా గలవాడు.

**విశ్వమూర్తిస్తమద్యస్య విశ్వమూర్తిస్తు సస్మృతః**

ప్రపంచమంతా తనకు శరీరముగా గలవాడు.

**విశ్వమ్ మూర్తి యస్యసః విశ్వమూర్తిః** జగత్తును శరీరముగా గలవాడు.

**భగవద్గీత**లోని 10వ అధ్యాయం **'విభూతియోగం'**లోని 20వ శ్లోకము.

**అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః**

**అహమాదిశ్చ మధ్యం చ భూతానామంత ఏవ చ**

అర్జునా ! సమస్త ప్రాణుల హృదయమందున్న ఆత్మను నేనే. సకల ప్రాణుల ఆది, మధ్య, అంతము నేనే. అంటాడు శ్రీకృష్ణపరమాత్మ. అంటే చరాచరజగత్తంతా ఆవరించి ఉన్నది తానే అని చెబుతున్నాడు. సకల ప్రపంచము శరీరముగా గలవాడు.

పరమాత్మ సర్వాత్మకుడు. సర్వము తానే అయి ఉన్నాడు.

పరమేశ్వరుడు అంతటా తానై ఉన్నాడు. **ఐతరేయోపనిషత్తు**లో చెప్పినట్లుగా జీవులను సృష్టించిన తరువాత ఇంద్రియాలను, ఇంద్రియాలకు అధిదేవతలను సృష్టించి, బ్రహ్మరంధ్రం ద్వారా దేహంలో ప్రవేసించి, పాలలో వెన్నలాగా శరీరంమంతా ఆక్రమించినవాడు. అందుకే శ్రీమన్నారాయణుడు విశ్వమూర్తి అనబడతాడు.

## 718. మహామూర్తిః

గొప్పదైన శరీరము గలవాడు. అతని శరీరము అతిపెద్దదై మహాగొప్పదైనది.

**విశ్వైకాశ్రయ మూర్తిత్వాత్ మహామూర్తిరితిస్మృతః**

జగత్తునంతటినీ అతను ఒక్కడే శరీరముగా గలవాడు.

**మహతీ మూర్తిః యస్యః మహామూర్తి**

విశ్వరూపం ప్రదర్శించినప్పుడు జగత్తంతా తనను శరీరము నాశ్రయించే పెద్ద శరీరము గలవాడు. **భగవద్గీత**లోని 11వ అధ్యాయం **'విశ్వరూపయోగం'**లోని విశ్వరూపాన్ని ఆశ్రయించటంచేత జనులందరికీ ఒకటిలాగానే కన్పిస్తాడు.

పరమాత్మ సర్వాత్మికా అనబడుతుంది. సర్వాన్నీ తనయందున్నవాడు. తాను సర్వులయెడ ఉన్న ప్రాణము.

గొప్పమూర్తి గలవాడు. జ్ఞానస్వరూపుడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు మహామూర్తిః అనబడుతున్నాడు.

**భగవద్గీత**లోని 11వ అధ్యాయం **'విశ్వరూప సందర్శనయోగం'**లోని 7వ శ్లోకము.

**ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య సచరాచరమ్**
**మమ దేహే గుడాకేశః యచ్చాన్యద్ద్రష్టుమిచ్ఛసి**

అర్జునా ! నా ఈ రూపంనందు ఒకేచోట స్థితమైఉన్న సమస్త చరాచరజగత్తును చూడుము. అంతేకాదు ఇంకా నువ్వు చూడదలచుకొన్నవన్నీ చూడుము. అంటే చరాచరజగత్తంతా పరమేశ్వరునిలోనే నిండి ఉన్నది. అందుకే అతడు మహామూర్తి అనబడతాడు.

## 719. దీప్తమూర్తిః

ప్రకాశించేవన్నీ అతని రూపాలే.

**యత్కించిత్కేన చిద్దీప్ర గుణే నాత్ర విశేషతః**
**యత్సర్వం మూర్తి రస్యేతి దీప్తమూర్తి రసౌ స్మృతః ॥**

ఏఏ వస్తువు ఏఏ గుణములతో ప్రకాశిస్తున్నదో, ఆ గుణములన్నీ తన రూపమే అయినవాడు.

**దీప్తామూర్తిః యస్యసః దీప్తమూర్తిః** జగత్తులో ప్రకాశించేవన్నీ ఆ పరమేశ్వరుని రూపాలే. భగవద్గీతలోని 10వ అధ్యాయం **'విభూతియోగం'**లోని 41వ శ్లోకం.

**యద్యద్విభూతి మత్సత్త్వం శ్రీమదూర్జిత మేవ వా**
**తత్త దేవావగచ్ఛ త్వం మమ తేజోంశసంభవమ్ ॥**

విభూతియుక్తమైన అంటే ఐశ్వర్య యుక్తము, కాంతియుక్తము, శక్తియుక్తము అయిన వస్తువు ఏదైనాసరే నా తేజస్సు నుండి కలిగినదే అని తెలుసుకో !

స్వయముగా ప్రకాశించే జ్ఞానము గలవాడు. పరమేశ్వరుడు జ్ఞానస్వరూపుడు. అతని నుండి వేలు, లక్షలు, కోట్లు, కోటానుకోట్లు కిరణములు ప్రసరిస్తున్నాయి. వాటివల్లనే లోకమంతా ప్రవర్తిల్లుతున్నది. లోకంలో ఉన్న గొప్ప గుణాలన్నీ అతనివే. మహదైశ్వర్యము, మహాశక్తి, మహాకాంతి అన్నీ అతని నుంచి వచ్చేవే. అందుచేతనే అతడు దీప్తమూర్తి అనబడతాడు.

# 720. అమూర్తిమాన్

అవ్యక్తాదులకు స్వామి.

**అమూర్తి శబ్దేనోచ్యంతే హ్యవ్యక్త పురుషాదయః**

**త ఏవ యస్య స్వమితి సస్మృత స్యా దమూర్తిమాన్**

అమూర్తి అంటే శరీరంలేని ప్రకృతి, పురుషాదులు. వీటిని తనవిగా గలవాడు.

**నాస్తిమూర్తిః యేషాంతే అమూర్తయః**

**అమూర్తయః అస్య సంతీతి అమూర్తిమాన్**

శరీరము లేనటువంటి మూలప్రకృతి, జీవాత్మ తనవిగా గలవాడు.

**యస్యాఽఽత్మా శరీరమ్** ఆత్మయే శరీరమైనవాడు.

**సుబాలోపనిషత్తు**లో "శరీరంలోపల ఉన్న గుహయందు ఏకుడు, నిత్యుడు, అజుడు అయిన ఆత్మ ఉన్నాడు. అతడు పృథివి లోపల ఉన్నాడు. ఆ పృథివే అతని శరీరము కాని పృథివి అతన్నెరుగదు. జలం లోపల ఉంటాడు. జలమే అతని శరీరము. కాని జలము అతన్నెరగదు. తేజస్సులోపల ఉంటాడు. తేజస్సే అతడి శరీరము. కాని తేజస్సు అతన్నెరుగదు. వాయువులోపల ఉంటాడు. వాయువే అతని శరీరము. ఆకాశమే అతని శరీరము. కాని ఆకాశము అతన్నెరుగదు. మనస్సులోపల ఉంటాడు. మనస్సే అతని శరీరము కాని మనస్సు అతన్నెరుగదు. బుద్ధి లోపల ఉంటాడు. బుద్ధే అతని శరీరము. కాని బుద్ధి అతన్నెరుగదు. అహంకారము లోపల ఉంటాడు. అహంకారమే అతని శరీరము కాని అహంకారము అతన్నెరుగదు. చిత్తములోపల ఉంటాడు. చిత్తమే అతని శరీరము. కాని చిత్తము అతన్నెరుగదు. అవ్యక్తమునందుంటాడు. అవ్యక్తమే అతని శరీరము, కాని అవ్యక్తము అతన్నెరుగదు. మృత్యువు లోపల ఉంటాడు. మృత్యువే అతని శరీరము. కాని మృత్యువు అతన్నెరుగదు. అతడే సర్వభూతములకు అంతరాత్మ. పాపములపోగొట్టేవాడు. దివ్యుడు. అతడే శ్రీమన్నారాయణుడు" అని చెప్పబడింది.

ఈవిధంగా భూతములన్నింటి యందు అవ్యక్తంగా ఉండేవాడే పరమేశ్వరుడు. అతడే అంతర్యామి. అతడే నారాయణుడు.

**బృహదారణ్యకోపనిషత్తు**లో కూడా ఈ విషయాన్ని వివరించటం జరిగింది.

జనకమహారాజు యజ్ఞం చేస్తున్నాడు. అందులో భాగంగా ప్రతిరోజు సాయంత్ర వేదాంత చర్చలు జరుగుతున్నాయి. ఒకరోజున జనకుడు ఆధ్యాత్మిక ప్రపంచానికి రారాజు ఎవరో తెలుసుకోవాలని నిర్ణయించుకుని వేయి ఆవులకు పట్టువస్త్రాలు కప్పి, కొమ్ములకు గిట్టలకు బంగారు తొడుగులువేసి సభలోకి తెప్పించి "సభాసదులారా! ఆధ్యాత్మిక ప్రపంచానికి రారాజు ఎవరో, వారు ఈ గోవులను తీసుకుపోవలసినది" అన్నాడు. సభలో ఎవరూ లేవలేదు. ఇంతలో యాజ్ఞవల్క్యుడు లేచి, తన శిష్యుని పిలిచి, ఆ గోవులను తోలుకు పొమ్మన్నాడు. అప్పుడు సభలోనివారు అడ్డుకుని అతనితో వాదనకు దిగారు. దానిలో భాగంగా ఉద్దాలకుడు అంతర్యామిగా ఉండే నియామకుణ్ణి గురించి వివరించ మంటాడు. అప్పుడు యాజ్ఞవల్క్యుడు ఇంచుమించు పైన సుబాలోనిషత్తులో చెప్పిన విషయాన్నే చెబుతాడు.

ఈరకంగా అన్ని భూతములయందు అవ్యక్తంగా ఉంటూ, అన్నింటినీ నియంత్రించే అంతర్యామియే ఆత్మ.

పరమేశ్వరుడికి కర్మఫలంలేదు. అందుచేతనే అతడు అవ్యక్తుడు 'అమూర్తిమాన్' అనబడతాడు.

**లలితాసహస్రంలో 814వ నామము 'అమూర్తా'.**

## 721. అనేకమూర్తిః

అనేక రూపములు ధరించినవాడు.

**షోడశ స్త్రీ సహస్రాణి శతమేకం తతోఽధికం**

**అనేకమూర్తి రిత్యుక్తః తత్సంఖ్యా దేహధారణాత్**

పదహారు వేలమంది గోపికాస్త్రీలు, వందమంది భార్యలు, కలిగిఉండటంచేత అన్ని శరీరములు ధరించి అందరి దగ్గరా ఒక్కసారిగా ఉన్నవాడు.

**అనేకాః మూర్తయః యస్యసః అనేకమూర్తిః** శ్రీకృష్ణుడై ఉండి కూడా వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధమూర్తులను వీడలేదు. **విష్ణుపురాణం**లో

**షోడశస్త్రీ సహస్రాణి శతమేకం తతోధికం**

**తావంతి చక్రే రూపాణి భగవాన్ దేవకీసుతః**

పదహారువేల ఒకవందమందికీ తగినట్లుగా భగవానుడు అన్ని రూపాలు ధరించాడు.

ధర్మసంస్థాపన చెయ్యటం కోసం భగవానుడు అనేక రూపాలు దాల్చాడు. అందుకే శ్రీమన్నారాయణుడు 'అనేకమూర్తిః' అనబడుతున్నాడు.

## 722. అవ్యక్తః

కంటికి కనిపించనివాడు.

అవతారసమయంలో తన మహిమలు బయటపడకుండా ఉన్నవాడు.

**మనుష్యత్వేన సర్వత్ర పరభావాప్ర శనాత్**

**బుధైరవ్యక్త ఇతి చ కథిత స్తత్వపారగైః ॥**

మనుష్యుడుగా అవతరించినప్పటికీ, తన పరత్వాన్ని మరుగుపరచి ప్రవర్తించాడు కాబట్టి తత్త్వవేత్తలు అతన్ని 'అవ్యక్తుడు' అన్నారు.

**న వ్యక్తః అవ్యక్తః** అవతారకాలంలో తన మహిమలు బయటపడకుండా దాచి ఉంచినవాడు.

**భగవద్గీత**లోని 7వ అధ్యాయం **'జ్ఞానవిజ్ఞాన యోగం'**లోని 25వ శ్లోకము.

**నాహం ప్రకాశః సర్వస్య యోగమాయా సమావృతః**

**మూఢోయం నాభిజానాతి లోకోమామజమవ్యయమ్ ॥**

యోగమాయయందు దాగి ఉన్న నేను అందరికీ కనిపంచను. కాబట్టి అజ్ఞానులు జన్మరహితునిగా, శాశ్వతునిగా, పరమేశ్వరునిగా తెలుసుకొనలేరు.

పరమేశ్వరుడు ఈ విధంగా అవ్యక్తుడుగా ఉంటాడు.

**భగవగ్గీత**లోని 11వఅధ్యాయం 'విశ్వరూప సందర్శనయోగం'లోని 53వ శ్లోకం.

**నాహం వేదైర్న తపసా న దానేన న చే జ్యయా**

**శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా ॥**

అర్జునా ! నీవు గాంచిన నా చతుర్భుజరూపాన్ని చూడటానికి వేదపఠనములచేతగాని, తపశ్చర్యలచేతగాని, దానములచేతగాని, యజ్ఞకర్మలచేతగాని శక్యము కాదు.

పరమేశ్వరుని స్వరూపం దర్శించటం ఎవరికీ సాధ్యంకాదు. అది అవ్యక్తమైనది. దర్శించటానికి వీలుకానిది. అందుకే శ్రీమన్నారాయణుడు 'అవ్యక్తః' అనబడుతున్నాడు.

పరమేశ్వరుడు ఇంద్రియాలకు, బుద్ధికి, మనసుకు గోచరముకాడు. **కేనోపనిషత్తు**లో పరమేశ్వరతత్త్వాన్ని ఇంద్రియాలచేతగాని, మనసుచేతగాని, బుద్ధిచేతగాని తెలుసుకోలేము అని చెప్పబడింది. ఈవిధంగా వ్యక్తము కానటువంటి శ్రీమన్నారాయణుడు 'అవ్యక్తః' అనబడుతున్నాడు.

## 723. శతమూర్తిః

అనేక రూపములు గలవాడు.

**అర్జునాయ వ్యక్తాయా చ విశ్వరూప ప్రదర్శనాత్**
**శతమూర్తి రితి ఖ్యాతః శతశోథ సహస్రశః ॥**

అర్జునునికి తన విశ్వరూపాన్ని చూపుతూ వందలువేలు గల తన రూపాలను చూపించాడు. అందుచేతనే శతమూర్తి అనబడుతున్నాడు.

**శతం మూర్తయః శతమూర్తిః**

విశ్వరూప సందర్శనలో అనేక రూపాలను చూపినవాడు.

**భగవద్గీత**లోని 11వ అధ్యాయం '**విశ్వరూప సందర్శనయోగం**'లోని 5వ శ్లోకము.

**పశ్యమే పార్థరూపాణి శతశోఽథ సహస్రః**
**నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీనిచ ॥**

అర్జునా ! అసంఖ్యాకములైన, బహువిధములైన అనేక వర్ణములు ఆకృతులు గల నా అలౌకిక రూపము చూడుము.

చైతన్యస్వరూపమైన తాను అనేక రూపాలు ధరించువాడు. అన్ని వర్ణములు, అన్ని రూపములు తానే అయినవాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'శతమూర్తిః' అనబడుతున్నాడు.

## 724. శతాననః

అనేక ముఖములు గలవాడు.

**అనేకానన సంపత్త్యా శతానన ఇతీరితః**

అనేక ముఖాలను కలిగి ఉండటంచేత అతడు శతాననుడు అని పిలువబడుతున్నాడు.

**శతం ఆననాని యస్యసః శతాననః**

**భగవద్గీత**లోని 11వ అధ్యాయము '**విశ్వరూప సందర్శనయోగం**'లోని 10, 11 శ్లోకాలు.

**అనేక వక్త్రనయనం అనేకాద్భుతదర్శనమ్**
**అనేకదివ్యాభరణం దివ్యానేకోద్యతాయుధమ్ ॥**

**దివ్యమాలాంబరధరమ్ దివ్యగంధానులేపనమ్**
**సర్వాశ్చర్యమయందేవం అనంతం విశ్వతోముఖమ్ ॥**

అనేక ముఖములు, అనేక నేత్రములు, అద్భుతమైన దృశ్యములు గల విరాడ్రూపాన్ని అర్జునుడు చూశాడు. దాని చేతిలో పెక్కు దివ్యాస్త్రాలున్నాయి. దివ్యమాలలు ఉన్నాయి. దివ్యవస్త్రములు ధరించి ఉన్నది. ఆ దేహము నుంచి వచ్చే దివ్యపరిమళము దశదిశలా వ్యాపిస్తున్నది. ఆ రూపము సర్వాశ్చర్యకరము, అనంతము, విశ్వతోముఖము అయి ఉన్నది.

**సహస్రశీర్షా పురుషః సహస్రాక్షసహస్రపాత్** వేయి శిరస్సులు, వేయి కనులు, వేయి పాదాలు ఆ పరమేశ్వరుడికి ఉన్నాయి. ఇక్కడ వేయి అంటే అది ఒక సంఖ్యకాదు. అనేకానేకము. లెక్కకు మించినవి అని అర్థం. ఈరకంగా కొన్నివేల శిరస్సులు కలిగి ఈ జగత్తంతా వ్యాపించి ఉన్నాడు. కాబట్టే శ్రీమన్నారాయణుడు 'శతాననః' అనబడుతున్నాడు.

## 725. ఏకః

అద్వితీయుడు.

**ద్వితీయస్య సజాతీయ రాహిత్యా దేక ఉచ్యతే ॥**

అతనితో సమానమైనవాడు ఇంకొకడు లేడు.

ఇంతవరకు చెప్పిన మహిమలు గలవాడు పరమేశ్వరుడు. అతనితో సమానమైన వారు ఇంకొకరు లేరు.

**బృహదారణ్యకోపనిషత్తు**లో సృష్టి ప్రారంభం కాకముందు జగత్తంతా శూన్యంగా ఉండేది. ఆ శూన్యాన్ని పరమేశ్వరుడు ఆవరించి ఉన్నాడు. అతనితో సమానమైనవారుకాని, అతనికన్న అధికులుకాని ఇంకెవరూలేరు అని చెప్పబడింది.

**ఏకమేవా ద్వితీయం బ్రహ్మ** పరమాత్మ తత్త్వము ఒక్కటే. వేరొకటి లేదు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'ఏకః' అనబడుతున్నాడు.

అంటూ కృష్ణావతార ప్రకరణాన్ని పూర్తిచేశాడు రత్నాకరుడు.

# 47. పరమేశ్వర స్వరూపము

"గురువుగారూ ! ఈ లోకాలను సృష్టించింది శ్రీమన్నారాయణుడు. పోషకుడు నారాయణుడు లయకారకుడు నారాయణుడు. లోకంలో అన్నీ నారాయణస్వరూపమే గదా ! మరి ఆ పరమేశ్వరతత్త్వాన్ని వివరించండి" అన్నాడు కృష్ణశర్మ చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

సృష్టి ప్రారంభంలో ఉన్నది శ్రీమన్నారాయణుడు ఒక్కడే. అతని నుండే పంచభూతాలు, చతుర్వేదాలు, బ్రహ్మాదిదేవతలు, సప్తఋషులు, అందరూ ఉద్భవించారు. అంతదాకా ఎందుకు చరాచరజగత్తంతా శ్రీమన్నారాయణుని నుండే ఉద్భవించింది.

అతడు సర్వవ్యాపి. జగత్తంతా వ్యాపించి ఉన్నాడు. అనేకుడై సకల పదార్థములందు ఉన్నాడు. జగత్తులోని 84 లక్షల జీవరాశి అతని రూపమే. అతడు తన రూపాలను చిన్న పిల్లలు కూడా తెలుసుకునేందుకు వీలుగా చేస్తాడు. సమస్త భూతములందు అంతర్యామిగా ఉంటాడు. ఇలా అన్ని జీవులయందు ఉండి ప్రకాశిస్తుంటాడు. భక్తుల కోరికల సాధనకోసం, అభీష్టఫలసిద్ధి కోసం అడుగ తగినవాడు అతడే. తన భక్తులరక్షణకోసంనిరంతరము ప్రయత్నిస్తూనే ఉంటాడు. భక్తులకు జ్ఞానాన్ని కలిగిస్తాడు. పరమప్రాప్యుడు. ప్రసన్నులకు ప్రధానమైనవాడు. అందరికీ కావలసినవాడు. అన్ని లోకాలవారినీ తన బంధువులుగా భావిస్తాడు. ముల్లోకాలకు స్వామి. ప్రభువు. అతడే లక్ష్మీపతి. యదువంశసంభవుడు. భక్తులయందు వాత్సల్యము గలిగినవాడు. గుణాలకు తగినట్లుగానే బంగారం లాంటివాడు. సుందరమైన శరీరంగలవాడు. దివ్యమంగళవిగ్రహుడు. దివ్యాభరణ భూషితుడు. లోకంలో వీరులైన రాక్షసులను మట్టుపెట్టినవాడు. దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేసేవాడు. ఏ మాత్రము దోషములు లేనివాడు. పాలలోని నేయిలాగా అన్ని జీవుల యందు ఉన్నవాడు స్థిరమైనవాడు చలనం గల వాయురూపుడు. భక్తుల విషయంలో ఏ మాత్రం అహంకారం లేకుండా ఏ పనినైనా సరే చేసేవాడు. సామాన్యులకు ఆత్మాభిమానం కలిగిస్తాడు. తత్వవేత్తలకు ఆత్మాభిమానం లేకుండా చేస్తాడు. పధ్నాలుగు లోకాలకు ప్రభువు. ముల్లోకాలను ఆదిశేషునిగా, ఆది కూర్మముగా, ఆది వరాహముగా ధరించినవాడు. భక్తులయెడ సద్బుద్ధి గలవాడు. యజ్ఞమునందు యజ్ఞేశ్వరుడు. యజ్ఞమే స్వరూపముగా గలవాడు. సత్యమైన జ్ఞానము గలవాడు. గోవర్ధన గిరినెత్తి గోవుల గోపాలకులకాచినవాడు. సూర్యునిరూపంలో కాంతి నిచ్చేవాడు. దివ్యశక్తి సంపన్నుడు. శస్త్రధారులయందు శ్రేష్ఠుడు. భక్తులను తనమాట ప్రకారం నడిపేవాడు. శత్రుసంహారంచేసేవాడు. శత్రుసంహారం కోసం త్వరపడేవాడు.

అనేకరకాలుగా శత్రువులను బాధించేవాడు. మంత్రముగా పుట్టినవాడు వాసుదేవుడు. ఈ మంత్రము వలన పుట్టినవాడు గదుడు.

ఈ విషయాలను 726వ నామం నుండి 764వ నామము వరకు వివరించటం జరిగింది. ఇక నామాలను చూద్దాం.

## 726. నైకః

అనేకుడు.

**నైక స్వవ్యాపారతయా విభూతీనా మితీరితః** తనవిభూతియైన సమస్త పదార్ధములు గలవాడు.

**న ఏకః నైకః** అనేకుడైనవాడు. సకల పదార్ధములు గలవాడై అనేకుడై ఉన్నాడు.

**భగవద్గీత**లోని 10వ అధ్యాయం **'విభూతియోగం'**లోని 40వ శ్లోకము.

**నాంతోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప**
**ఏష తూద్దేశతః ప్రోక్తో విభూతే ర్విస్తరో మయా ॥**

ఓ పరంతపా ! నా విభూతులకు అంతమేలేదు. నా విభూతుల విస్తృతిని గూర్చి నేను నీకు చాలా క్లుప్తంగా వివరించాను.

భగవానుని దివ్యవిభూతులు అనంతములు. అలాంటప్పుడు ఇక సామాన్యవిభూతుల మాట చెప్పేదేమున్నది. నేలలోని అణువులను లెక్కించటానికి వీలుకానట్లే పరమేశ్వరుని దివ్యవిభూతులు కూడా లెక్కకు మించినవే.

ఈరకంగా పరమేశ్వరుడు ఒక్కడే అయి కూడా అనేకుడుగా ఉన్నాడు.

పరమేశ్వరుడు ఒక్కడుగా కనిపిస్తాడు. కాని అతడు ఒక్కడు కాదు. అనేకరూపములు గలిగిఉన్నాడు జగత్తులోని 84 లక్షల జీవరాసి అతని స్వరూపమే. జగత్తంతా అతడు ఆవరించి ఉన్నాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'అనేకః' అనబడుతున్నాడు.

## 727. సవః

సోమయాగరూపంలో ఉండేవాడు సోమయాగము విష్ణురూపమే.

ఈ నామాన్ని శంకరభగవత్పాదులవారు ఒకటిగా వ్రాయగా పరాశరభట్టరువారు రెండు నామాలుగా వ్రాశారు.

**సః :** నిశ్చయింపచేయువాడు.

**సర్వేషుకృష్ణరూపేషు అకుమార ప్రసిద్ధితః**

**అజ్ఞానం యస్య విషయం న్యత్యసౌ స ఇతీరితః**

తన రూపములన్నింటిని చిన్నపిల్లలు కూడా తెలుసుకునేటట్లుగా చేసి తనను అందరికీ తెలియచేసినవాడు. ఈరకంగా తన సిద్ధాంతము నిశ్చయించినవాడు.

**స్యతి నిశ్చయీ కరోతీతి సః** ఇటువంటి సిద్ధాంతాన్ని అందరిచేతా నిశ్చయింప చేసినవాడు.

**వః :** వసించువాడు.

**యధాప్రసిద్ధైర్వాసిత్వాత్ తస్మాద్య వనతేశ్చ సః భూతవాసతయా వ స్యాత్**

అతడు సమస్తభూతములందు ఉంటాడు. సమస్త భూతాలు అతడి యందుంటాయి.

**వసతీతివః** వసించువాడు.

**వసంతి తత్రభూతానిభూతాత్మన్యఖిలాత్మని**

**సచభూతే ష్యశేషేషు నకారార్ధస్తతోమునే ॥**

సకలప్రాణులను శరీరముగా గలిగి, వాటికి అంతరాత్మగా ఉండే పరమపురుషుని యందు సకల భూతాలు ఉంటాయి. అతడు కూడా సకల భూతములందు ఉంటాడు. అందుచేతనే అతడు 'వః' అనబడుతున్నాడు.

ఈవిధంగా ఉంటుంది అని తన రూపాన్ని నిశ్చయింపచేసి, అన్ని భూతములందు తాను ఉండేవాడు. అతనిలో అన్ని భూతాలు ఉంటాయి. అతడే శ్రీమన్నారాయణుడు.

## 728. కః

ప్రకాశించువాడు.

**సర్వేషు కనతీతి కః** అన్నింటియందు ఉండి ప్రకాశించువాడు.

**కనతీ దీవ్యతే ఇతి కః** తాను మలిన పదార్ధాలలో ఉంటూ కూడా ప్రకాశించేవాడు.

క అనగా ముఖము – పరమాత్ముడు ముఖస్వరూపుడు.

కం అనగా బ్రహ్మ – ఇతడు పరమేశ్వర స్వరూపుడు ముఖము అనేది బ్రహ్మ స్వరూపము. అందుచేత ఇతడు పరబ్రహ్మ స్వరూపుడు.

# 729. కిమ్

ప్రశ్నించువాడు.

**య ఈప్సితార్ధ ప్రా ప్త్యర్థం ప్రష్టవ్యః కిమితి స్మృతః ॥** అభీష్టఫలసిద్ధికోసం అడుగతగినవాడు.

తత్త్వము తెలుసుకోవాలి అనుకునే వారిని నిరుపాధికముగ ప్రశ్నించేవాడు.

ముముక్షువులతో అతడెవరు ? అని విచారణ చేయదగినవాడు.

చతుర్విధ పురుషార్ధఫలము తానే అయి ఉన్నందున విచారించదగినవాడు.

ఈవిధంగా శ్రీమన్నారాయణుడు 'కిం' అనబడుతున్నాడు.

# 730. యత్

ప్రయత్నించేవాడు.

**రక్షాయై పుచ్ఛకానాం సః యతతే యదితి స్మృతః**

తనను వేడిన భక్తుల రక్షణకోసం నిరంతరము ప్రయత్నించేవాడు.

**యతతే ఇతియత్** భక్తులను రక్షించేందుకు ఎప్పుడూ ప్రయత్నించేవాడు.

**కృష్ణకృష్ణేతి కృష్ణేతి యోమాం స్మరతి నిత్యశః**
**జలంభిత్వా యధా పద్మం నరకాదుద్ధరామ్యహమ్**

ఎవరైతే నన్ను కృష్ణకృష్ణ అని స్మరిస్తారో అటువంటివారిని నీటిని చీల్చుకుని తామరవచ్చినట్లుగా నేను ఉద్ధరిస్తాను అన్నాడు శ్రీకృష్ణభగవానుడు. **వరాహపురాణంలో**

**అహం స్మరామి మద్భక్తిం నమామి పరమాంగతిమ్**

నన్ను స్మరించిన భక్తులకు పరమపదాన్నిస్తాను.

ఇక్కడ యత్ అనగా – బ్రహ్మము అని అర్ధము. **తైత్తిరియోపనిషత్తు**లో

**యతోవా ఇమాని భూతాని జాయంతే**

ఎవరివ్లలనైతే సర్వబూతములు ఆవిర్భవిస్తున్నాయో, అతడే బ్రహ్మము.

చరాచరజగత్తంతా పరమేశ్వరుని వల్లనే సృజించబడుతున్నది. అందుచేతనే పరమేశ్వరస్వరూపుడైన శ్రీమన్నారాయణుడు 'యత్' అనబడుతున్నాడు.

## 731. తత్

భక్తులకు జ్ఞానము భక్తి కలిగించువాడు.

**స్వజ్ఞాన భక్తిం భక్తానాం తనోతీతి తదుచ్యతే ॥** భక్తితో తనను అర్చించేవారికి ఆ భక్తిని పెంపొందింపచేసి, తనను తెలుసుకొనే జ్ఞానాన్ని ప్రసాదించేవాడు.

**తనోతీతి తత్** భక్తులకు భక్తిజ్ఞానాలను కలిగించేవాడు.

అతడు పరమేశ్వరుడు. పరబ్రహ్మ అతడే ఈ లోకాలను విస్తరింపచేశాడు.

ఆ పరమేశ్వరుడు లోకాలను సృష్టించాలనుకున్నాడు. సృష్టించాడు. అని **ఐతరేయోప నిషత్తు**లో చెప్పబడింది.

**బృహదారణ్యకోపనిషత్తు**లో ఒంటరిగా ఉన్న పరమేశ్వరుడు తనకు తోడు కావాలి అనుకున్నాడు. స్త్రీ కావాలని సంకల్పంచేశాడు. వెంటనే స్త్రీ పురుషులు ఆవిర్భవించారు. వారివల్లనే 84 లక్షల జీవరాశి ఉద్భవించింది.

ఈరకంగా జీవరాశిని వృద్ధి పరచినవాడు. లోకాలను సృష్టించినవాడు. అతడే శ్రీమన్నారాయణుడు.

## 732. పదమనుత్తమమ్

పరమప్రాప్యుడు.

**పరమం యత్ప్రసన్నానాం ప్రాప్యం పదమనుత్తమమ్ ॥**

ప్రసన్నులకు ప్రధానమైనవాడు.

తనను ఆరాధించేవారు పొందదగినవాడు. భక్తులకు మోక్షముకన్న పొందదగినది ఏదీలేదు. అందుచేత వారికి పరమోత్కృష్టమైన పరమపదము అతడే. అందుకే శ్రీమన్నారాయణుడు 'పదమనుత్తమమ్' పొందటానికి ఉత్తమమైనవాడు అనబడుతున్నాడు.

## 733. లోకబంధుః

అందరికీ కావలసినవాడు.

**లోకానాం స్వజనత్వాద్ధి లోకబంధు రితిస్మృతః**

అన్ని లోకాల వారిని తనకు బంధువులుగా భావించేవాడు.

**లోకానాం బంధుః లోకబంధుః** సకలలోకములవారు ఆయనకు కావలసినవారే.

**సుబాలోపనిషత్తు**లో ఈ జగత్తంతా నారాయణ స్వరూపమే. తల్లి తండ్రి, గురువు, దైవము, తోడు, నీడ నివాసస్థానము అన్నీ నారాయణుడే. ఈ జగత్తులోని ఆదిత్యులు, రుద్రులు, మరుత్తులు, వసువులు, అశ్వనీదేవతలు, ఋక్కులు, సామములు, అగ్ని, ఆజ్యము ఒకటేమిటి సర్వమూ నారాయణుడే. అందుకే అతడు అందరికీ కావలసివాడు అని చెప్పబడింది.

లోకానాం బంధుః లోకాలకు బంధువు. లోకములన్నీ ఇతనిలో బంధింపబడి ఉంటాయి. ప్రళయకాలంలో లోకాలన్నీ ఇతనిలో చేరతాయి. మళ్ళీ సృష్టి జరిగేవరకు అవి ఇతనిలో బంధింపబడి ఉంటాయి. అందుకే ఇతడు లోకబంధువు.

లోకాలను సృష్టించినవాడు ఇతడే. కాబట్టి ఇతడే లోకాలకు తండ్రి. అందుకే లోక బంధువు. లోకాలహితం కోరి పరమాత్మ ధర్మసంస్థాపన చేస్తుంటాడు. అందుచేతనే అతడు లోకబంధువు. ఈ రకంగా శ్రీమన్నారాయణుడు 'లోకబంధుః' అనబడుతున్నాడు.

# 734. లోకనాథః

లోకనాథుడు.

**లోకబంధుత్వ మూ లాద్ధి లోకస్వామిత్వ మిత్యతః**
**స్వాభావి కాచ్చ సంబంధాత్ లోకనాథ ఇతీరితః**

ముల్లోకాలలో ఉండే వారికి ఇతడే బంధువు. ముల్లోకాలకు ఇతడే ప్రభువు. అందుచేత లోకనాథుడు అనబడతాడు.

**లోకానాంనాథః లోకనాథః** పధ్నాలుగు లోకాలకునాథుడు.

లోకాలచేత ప్రార్థించబడేవాడు. ఊర్ధ్వలోకాలలోగాని, అధోలోకాలలోగాని ఎవరికి ఎప్పుడు ఏ కష్టము వచ్చినా ఆదుకొనేవాడు. లోకంలోని దుష్టులను దుర్మార్గులను నశింపచేసేవాడు. లోకాల మేలు కోరేవాడు. లోకములందు ధర్మసంస్థాపన చేసేవాడు. లోకాలను శాసించేవాడు. లోకాలలో ధర్మసంస్థాపన గావించేవాడు. అందుచేత శ్రీమన్నారాయణుడు లోకనాథుడు అనబడుతున్నాడు.

# 735. మాధవః

లక్ష్మీపతి, యదువంశసంభూతుడు. 72, 167వ నామాలు కూడా ఇదే.

**లోకనాథత్వ సంబంధః శ్రీమత శ్చేతి మాధవః**
**మధోర్వంశోద్భవత్వాచ్చ మాధవః పరికీర్తితః**

ఈతడు లక్ష్మీపతి కాబట్టి లోకనాధుడు కాగలిగాడు.

మధువు అనబడే యాదవ వంశసంభూతుడు కాబట్టి లోకనాధుడు.

క్షీరసాగర మధనం జరుగుతున్నది. అందులో నుంచి అందాలరాశి, శుభలక్షణ, శుభాంగి ఐశ్వర్య అయిన లక్ష్మీదేవి ఆవిర్భవించింది. ఆమెను దేవతలు అర్చించారు. ఆ తల్లి వరమాల తీసుకుని బయలుదేరింది. అందరికన్న ఉత్తముని భర్తగా పొందాలన్నది ఆమె కోరిక. దేవ, గంధర్వ, యక్ష, కిన్నెర, కింపురుష, సిద్ధ, సాధ్య, గరుడు, ఉరగ గణాలలోగాని, తపోధనసంపన్నులైన వారిలో కాని ఆమెకు నచ్చినవాడు దొరకలేదు. చివరకు శ్రీహరిని, తన కోరిక ప్రకారము ఉన్నతుడు, ఉత్తముడు అయిన శ్రీ మహావిష్ణువు వరించింది. అందుచేతనే విష్ణుమూర్తి లక్ష్మీదేవి భర్త. కాబట్టే శ్రీమన్నారాయణుడు 'మాధవుడు' అనబడుతున్నాడు.

మధు విద్యచేత తెలియబడువాడు పరమేశ్వరుడు. **ఛాందోగ్యోపనిషత్తు**లో మధువిద్య చెప్పండి.

ఆదిత్యుని యందు మధువును ఆరోపించి, ఆ విధంగా ఆదిత్యుణ్ణి ఉపాసించటమే మధువిద్య. ఈ విద్యను మొదటగా హిరణ్యగర్భుడు ప్రజాపతికి చెప్పాడు. తరువాత ప్రజాపతి మనువుకు, మనువు ఇక్ష్వాకునికి తద్వారా అతని సంతతికి చెప్పబడింది. అరుణిని జ్యేష్ట పుత్రుడైన ఉద్దాలకుడికి అతని తండ్రి ఈ బ్రహ్మ విజ్ఞానాన్ని చెప్పాడు. విద్వాంసులైన వారు ఈ విద్యను తమ జ్యేష్ఠ పుత్రుడికి గాని, యోగ్యుడైన శిష్యుడికి గాని బోధించాలి. ఇతరులకు బోధించరాదు. అని శ్రుతి చెబుతోంది. మీరు నాకు యోగ్యులైన శిష్యులు కాబట్టి ఆ మధువిద్యను మీకు వివరిస్తున్నాను సావధానంగా వినండి" అంటూ రత్నాకరుడు 'మధువిద్య'ను ప్రారంభించాడు.

దూరంగా ఆకాశంలో మనకు కనిపించేవాడే సూర్యుడు. అతడే దేవతలను తృప్తిపరచేవాడు. అందుచేతనే అతడు దేవతలకు మధువు వంటివాడు. స్వర్గలోకం తేనెపట్టు పట్టేటందుకు వీలైన కర్రలాంటిది. అంతరిక్షం తేనెపట్టులా వ్రేలాడుతోంది. ఆదిత్యుని నుండి వచ్చే కిరణాలు తేనెపట్టులో ఉండే తేనెటీగల పిల్లలు. ఆదిత్యరూపమైన మధువుకు తూర్పు దిక్కున ఉండే కిరణాలే అంతరిక్ష రూపమైన తేనెతుట్టెలోని గదులు. ఋక్కులే తేనెటీగలు, ఋగ్వేదమే పుష్పం. తేనెటీగల్లాగా ఋక్కులే కర్మలనే పూలలోనించి అమృతమనే మధువును తయారు చేస్తున్నాయి. అగ్నిలో దాగి ఉండే సోమరసం అనబడే అమృతమే జలం. అగ్నిలోహోమం చేయబడే నెయ్యి, పాలు మొదలైనవి వేడెక్కి ఆవిరై జలరూపందాల్చి అమృతంగా ఆ కిరణాలలో నిక్షిప్తమై ఉంటుంది. తేనెటీగలు తేనెను గ్రహించినట్లుగా

హోమం చేసినప్పుడు ఋగ్వేదమంత్రాలు ఈ అమృతాన్ని గ్రహిస్తాయి. ఇక్కడ అమృతము అంటే హోమం చెయ్యటంవల్ల కలిగినటువంటి కనుపించని ఫలితము. దశలవారీగా అమృతత్వానికి అంటే మోక్షానికి కారణమౌతుంది.

దక్షిణ దిక్కున ఉండే కిరణాలే ఆదిత్య రూపమైన మధువు యొక్క దక్షిణ దిక్కులో ఉన్న తేనెతుట్టెలోని గదులు. యజుర్వేదమంత్రాలే తేనెటీగలు. యజుర్వేద విహితమైన కర్మయే పుష్పం. అగ్నిలో హోమం చెయ్యబడిన నెయ్యి మొదలైనవే అమృత జలం.

ఈ యజుర్వేదమంత్రాలు, యజుర్వేద విహితమైన కర్మలకు వేడికలిగించగా, దాని నుండి యశస్సు, తేజస్సు, ఇంద్రియాలు, బలము, అన్నము ఉత్పన్నమైనాయి. ఇవన్నీ ఆదిత్యుని దక్షిణ భాగాన్ని ఆశ్రయించి తెల్లని రూపంలో ఉంటాయి.

పశ్చిమ దిక్కున ఉండే కిరణాలే సూర్యుడనే పడమటి దిక్కున ఉండే తేనెతుట్టెలోని గదులు. సామవేద మంత్రాలే తేనెటీగలు. సామవేద కర్మయే పుష్పం. సోమాది రూపమైన అమృతమే జలం. ఈ సామవేదమంత్రాలు సామవేద విహితమైన కర్మలకు వేడి కలిగించగా, దానినుండి యశస్సు, తేజస్సు, ఇంద్రియాలు, వీర్యం తినటానికి వీలైన అన్నరూపరసం ఉత్పన్నమైనాయి. ఆ రసమే సూర్యుని పశ్చిమ బాగాన ఆశ్రయించి ఉండే నల్లని తేజస్సు.

ఉత్తరదిక్కున ఉండే కిరణాలే తేనె తుట్టెలోని గదులు. అధర్వ, అంగిరస మంత్రాలే తేనెటీగలు. ఇతిహాసాలు, పురాణాలు, పుష్పాలు. అగ్నిలో హోమం చెయ్యబడిన సోమాది రూపమైనదే అమృతజలం. అధర్వణ వేదమంత్రాలు ఇతిహాస, పురాణాలనే పూలను వేడెక్కించగా, వాటి నుండి యశము, తేజస్సు, ఇంద్రియాలు, వీర్యము అన్నరూపమైన రసము ఉద్భవించాయి. ఈ రసమే సూర్యుని ఉత్తర భాగాన ఆశ్రయించి ఉండే మిక్కిలి నల్లనైన రూపము.

ఆదిత్యుని పైకి వ్యాపించే కిరణాలే ఊర్ధ్వదిక్కులో ఉన్న తేనెతుట్టెలోని గదులు. లోకద్వారాలు తెరువవలసినదిగా చేసే ప్రార్థనలే తేనెటీగలు. ఓంకారమనే బ్రహ్మయే పుష్పం, సోమరసాది రూపమైన అమృతమే జలం. ప్రార్థనలనే తేనె టీగలు ఓంకారమనే పుష్పాన్ని అభితప్తం చేస్తాయి. అంటే వేడెక్కిస్తాయి. అప్పుడు ఆ పుష్పం నుండి యశము, తేజస్సు, ఇంద్రియాలు, వీర్యం అన్న రూపమైన రసముపుట్టి సూర్యునిపై భాగాన్ని ఆశ్రయించాయి. ఆదిత్యుని మధ్యలో చలిస్తున్నట్లు కనుపించే ఆ భాగమే మధువు.

ఈ రకంగా లోహితాది రూపాలే రసాలకు, రసలోకాలకు సారభూతం కాబట్టి వేదాలే రసాలు. ఈ వర్ణాలు రసానికి రసంలాంటివి. అమృతానికి అమృతంలాంటివి. వేదాలే అమృతాలు. లోహితాది రూపాలు వాటికన్న కూడా అమృతాలు –నాశనం లేనివి.

వీటిలో లోహిత వర్ణం గలమొదటి అమృతాన్ని అగ్ని దేవుని ద్వారా వసువులు అనుభవిస్తారు. ఇందులో దేవతలు తినేది, త్రాగేది ఏమీ ఉండదు. వారు ఆదిత్యుని తూర్పుభాగంగా ఎర్రని రంగుగల అమృతాన్ని చూస్తూ – దాన్ని ఇంద్రియాలతో అనుభవిస్తూ తృప్తి పడతారు. వసుదేవతా గణం కూడా ఈ అమృతాన్ని చూసి తృప్తులౌతారు.

ఇక రెండవ అమృతం ఇంద్రుడు ప్రధానుడుగా రుద్రగణం చేత అనుభవింప బడుతుంది. దేవతలు తినటము, త్రాగటము చెయ్యరు. కనులతో చూచి తృప్తి చెందుతారు. ఈ విషయం తెలిసినవాడు సూర్యుడు దక్షిణ దిక్కున ఉదయించి ఉత్తర దిక్కున అస్తమించినంత కాలము రుద్రుల వంటి ఆధిపత్యం, స్వరాజ్యం పొందుతాడు.

మూడవ అమృతం, వరుణుడు ప్రధానుడుగా ఆదిత్య గణం చేత అనుభవించ బడుతుంది. ఈ అమృతాన్ని గురించి తెలుసుకున్నవాడు సూర్యుడు పశ్చిమాన ఉదయించి తూర్పున అస్తమించినంత కాలము ఆదిత్యుల ఆధిపత్యాన్ని, సామ్రాజ్యాన్ని పొందుతాడు.

నాల్గవ అమృతం సోముడు ప్రధానుడుగా మరుద్గణం చేత అనుభవించ బడుతోంది. ఈ అమృతాన్ని గురించి తెలుసుకున్నవాడు సూర్యుడు ఉత్తరాన ఉదయించి దక్షిణాన అస్తమించినంతకాలము మరుద్గణాల ఆధిపత్యాన్ని, సామ్రాజ్యాన్ని పొందుతాడు.

ఐదవ అమృతం బ్రహ్మ ప్రధానుడుగా సాధ్యులచేత అనుభవింపబడుతుంది. ఈ అమృతాన్ని గురించి తెలుసుకున్నవాడు సూర్యుడు ఊర్ధ్వ దిక్కున ఉదయించి అధోదిక్కున అస్తమించినంతకాలము సాధ్యుల ఆధిపత్యాన్ని స్వారాజ్యాన్ని పొందుతాడు.

నిజానికి సూర్యునికి ఉదయాస్తమయాలు లేవు. ఆయన కనుపించినప్పుడే ఉదయం. కనుపించక పోవటమే అస్తమయంకాబట్టి ఏ దిక్కున కనిపించినప్పుడు, అక్కడి వారికి సూర్యోదయం అయిందని గ్రహించాలి. ఈ రకంగా ఉదయాస్తమయాల ద్వారా జీవులు వాటి కర్మఫలాన్ని అందిస్తూ, ఆ కర్మలు క్షయం అయిన తరువాత వాటిని తనలో లీనం చేసుకుంటాడు. జ్ఞానులైనవారు పైన చెప్పిన వసు, రుద్ర, ఆదిత్య, మరుద్గణాలు లాగా అమృతాన్ని అనుభవించి సూర్యునితో అభేదాన్ని పొందుతారు. కాబట్టే శ్రీమన్నారాయణుడు మాధవః అనబడుతున్నాడు.

## 736. భక్తవత్సలః

భక్తులయందు వాత్సల్యము గలవాడు.

**విశేషం వక్తి భక్తేషు యోఽసౌస్యాద్భక్తవత్సలః** భక్తులు తనకు ఆత్మ అని చెబుతాడు. ఆ రకంగా వారిని అత్యంత కరుణతో చూస్తాడు. కాబట్టే అతడు భక్తవత్సలుడు.

భక్తుల యెడ వాత్సల్యముకలగాడు.

**భక్తేషు వత్సలతః** భక్తులు తననే స్మరిస్తుంటే, వేరే ధ్యాసలేకుండా సకలమును మరిచిపోయేవాడు. అందుకే శ్రీమన్నారాయణుడు భక్తవత్సలుడు.

# 737. సువర్ణ వర్ణః

బంగారురంగుగలవాడు.

**గుణవత్స్వర్ణ నికష నిర్దోషోజ్జ్వల వర్ణత**
**సువర్ణ వర్ణ ఇత్యుక్తః నవార్ణో భక్తకామదః**

గుణాలకు తగినట్లుగానే బంగారములాగా మెరిసే దేహము కలవాడు. ఈ నామము నవాక్షరీమంత్రము అభీష్టప్రదము.

**సువర్ణస్యేవ వర్ణః యస్యసః సువర్ణవర్ణః** బంగారు వర్ణము గలవాడు.

బంగారు వంటివన్నె గలవాడు. అతని శరీరమురంగు, అతని గుణగణాలు అన్నీ బంగారుమయము కావటంచేత అతడు 'సువర్ణవర్ణః' అనబడుతున్నాడు.

# 738. హేమాంగః

శ్యామవర్ణము గలవాడు.

**వర్ణాశ్రయం తు యస్యాం గం దివ్యసత్త్వమయం యతః**
**అతోహేమాంగ ఇత్యుక్తః సప్తార్ణో హేమవర్ణతః ॥**

బంగారు వర్ణానికి ఆధారమై, దివ్యమైన శుద్ధసత్వమయమై ప్రకాశించే శరీరము గలవాడు. ఈ నామము సప్తాక్షరీమంత్రము. బంగారు రంగునిస్తుంది.

**హేమ అంగమ్ యశ్యసః హేమాంగః** శ్యామవర్ణ దేహము గలవాడు. సూర్యమండలాంతర్గతుడైన హిరణ్మయపురుషుడు.

**హేమ ఇవ అంగం అస్య** బంగారము వంటి శరీరము గలవాడు.

**సర్వేగుణాం కాంచన మాశ్రయంతి**

అన్ని గుణాలు బంగారంలోనే ఉంటాయి. అలాగే పరమేశ్వరుడు సర్వగుణశోభితుడు. అన్నిగుణాలు అతనియందే ఉన్నాయి. కాబట్టి అతడు బంగారము వంటివాడు. అందుకే శ్రీమన్నారాయణుడు 'హేమాంగః' అనబడుతున్నాడు.

# 739. వరాంగః

దివ్యమంగళవిగ్రహుడు.

**దేవతాప్రీతియే గుప్త దివ్యలాంఛనమంగళమ్**

**ఆవిష్కృతం స్వతో యేన వరాంగ స్స తు కథ్యతే ॥**

దేవతలయందలి ప్రీతిచేత వారి కోరికలు తీర్చటం కోసం, తన దివ్యలక్షణాలతో కూడిన దివ్యమంగళ విగ్రహముగా దేవకీవసుదేవులకు తనంతటతానే సాక్షాత్కరించినవాడు.

**వరం అంగమ్ యస్యసః వరాంగమ్** దివ్యమంగళవిగ్రహుడు. ఉపనిషత్తులో చెప్పబడినవాడు.

దేవకీవసుదేవులచే కోరబడినవాడు. ప్రసవసమయానికి ముందు దేవకీ వసుదేవులకు సాక్షాత్కరించినవాడు.

**ఫుల్లేం దీవర పత్రాభం చతుర్బాహుం నిరీక్ష్యతం**

**శ్రీవత్సవక్షసం జాతం తుష్టావాఽఽనక దుందుభిః**

వికసించిన నల్లకలువలవంటి వర్ణములు గలవాడై చతుర్బాహువులతోను శ్రీవత్సముతోను అవతరించిన వాసుదేవుని చూసి దేవకీవసుదేవులు పరిపరివిధాల స్తోత్రము చేశారు.

**వరాణి – శోభాని – అంగాని అస్యసః** శ్రేష్ఠమైనవి, చూడటానికి సుందరమైనవి, సాముద్రికశాస్త్రం ప్రకారం అమరి ఉన్నవి అయిన అంగములు గలవాడు.

శ్రీకృష్ణుడు జన్మించగానే అతని శరీరం మీద ఉన్న శ్రీవత్సము, దివ్య చిహ్నాలను వసుదేవుడు చూశాడు. ఆ దివ్యమంగళవిగ్రహాన్ని కాంచి పారవశ్యంతో తన్మయుడైనాడు.

కాబట్టి తన సుందరరూపంతో తల్లితండ్రులను తన్మయులను చేసినవాడు. కాబట్టే శ్రీమన్నారాయణుడు 'వరాంగః' అనబడుతున్నాడు.

# 740. చందనాంగదీ

అందమైన దివ్యాభరణములు గలవాడు.

**భూషణాన్యంగ దాదీని సదాహ్లాద కరాణి చ**

**సంతి యస్య చ నిత్యస్తు స స్మృత శ్చందనాంగదీ ॥**

ఆనందప్రదమైన అంగదాది ఆభరణములు ధరించినవాడు.

**చందనాని అంగదాని అస్యసంతీతి చందనాంగదీ** చందనములాగా ఆనందాన్ని కలుగచేసే భుజకీర్తులు మొదలైన ఆభరణములు ధరించినవాడు. అంగదము అంటే – భుజానికి ధరించే ఆభరణము. భుజకీర్తి. అంగదము కేయూరము అనే రెండు పదాలు ఒకే అర్థాన్ని చెబుతాయి అని సూర్యరాయాంధ్ర నిఘంటువు చెబుతోంది. అంగదములు అనే భుజకీర్తులు ధరించినవాడు.

**చందనాని అంగదాని అస్య** ఇతనికి ఆహ్లాదకరమైన భుజకీర్తులున్నాయి. వాటిచేత అలంకరించబడిన పరమాత్ముడు. ఆహ్లాదమైన చందనముతోను, కేయూరములు చేతను అలంకరించబడినవాడు.

శ్రీకృష్ణభగవానుడు నీలమేఘచ్ఛాయతో, వంటినిండా మంచిగంధం (గోపీచందనము) రాచుకుని, దివ్యాలంకార భూషితుడై అలరారుతూ ఉంటాడు. అందుకే శ్రీమన్నారాయణుడు 'చందనాంగదీ' అనబడుతున్నాడు.

**లలితాసహస్రంలో 31వ నామము 'కనకాంగదకేయూరకమనీయ భుజాన్వితా'**

## 741. వీరహా

వీరులైన రాక్షసులను సంహరించినవాడు. 166, 927 నామాలు కూడా ఇదే.

**సమూలం పూతనాదీన్వై యో జఘాన స వీరహా**

పూతన మొదలైన రాక్షసులను సంహరించినవాడు.

పూతకి ఈమెనే పూతన అని కూడా అంటారు. ఈమె ఒక రాక్షసకాంత. కంసుడి రాజ్యంలోఉండేది. తనను సంహరించేవాడు దేవకీసుతుడు వ్రేపల్లెలో పెరుగుతున్నాడని విని అతడెక్కడున్నాడో తెలియక విసిగిపోయి, చివరకు పూతనను పిలిచి "అక్కడున్న పసిపిల్లలందరికీ నీ స్తన్యము ద్వారా విషమచ్చి అందరినీ సంహరించు" అన్నాడు. ఆ మాటలకు సరేనన్న పూతన, అందమైన స్త్రీ వేషం ధరించి పసిపిల్లలున్న ప్రతి ఇంటికీ పోయి పిల్లలమీద ప్రేమకలదానిగా నటిస్తూ చనుబాలు త్రాగించి వారిని చంపుతోంది. అలా తిరుగుతూ తిరుగుతూ నందుని ఇంటికి వచ్చింది. యశోదకాని, మిగిలిన వారుకాని ఈమె రాక్షస స్త్రీ అని గుర్తించలేదు. అందుచేత కృష్ణుడి దగ్గరకు వెళ్ళనిచ్చారు. పూతన కృష్ణుడికి పాలిచ్చింది. పాలతోపాటుగా కృష్ణుడు ఈమె బలాన్నంతటినీ పీల్చివేశాడు. దాంతో పూతన పెద్దపెట్టున అరుస్తూ నిజరూపం దాల్చి ప్రాణాలు వదిలింది.

ఇదేవిధంగా తనను సంహరించటానికి వచ్చిన ధేనుకాసురుడు, శకటాసురుడు, కేసి మొదలైన మహావీరులైన రాక్షసులనేకమందిని సంహరించినవాడు.

**వీరహాన్ హంతీతి వీరహా**

బాలుడుగా ఉండి కూడా వీరులైన అనేకమంది రాక్షసులు పరిమార్చినవాడు.

ధర్మరక్షణకోసం రాక్షససంహారము చేసినవాడు.

రామావతార సమయంలో కేవలము ధర్మరక్షణ కోసం తాటక, సుబాహువు, ఖరదూషణాది 14 వేలమంది రాక్షసులు, రావణ, కుంభకర్ణులను కూడా సంహరించిన వాడు. అందుకే శ్రీమన్నారాయణుడు వీరహా అనబడుతున్నాడు.

## 742. విషమః

వైషమ్యము గలవాడు, భేదము గలవాడు.

**భీతిక్షేమకరత్వాద్ధి కుటిలాకుటిలాత్మసు విషమస్సతు విఖ్యాతా -**

దుష్టులకు భయము, శిష్యులకు ప్రేమ కలిగించేవాడు. దుష్టశిక్షణ శిష్టరక్షణ చేస్తూ ఈ విధంగా భేదభావం కలిగి ఉండేవాడు.

**పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం**
**ధర్మ సంస్థాప నార్థాయ సంభవామి యుగే యుగే ॥**

దుష్టశిక్షణ, శిష్టరక్షణ చెయ్యటానికి ఆర్తత్రాణ పరాయణుడైన శ్రీమన్నారాయణుడు ప్రతియుగంలోనూ భూమిమీద అవతరిస్తుంటాడు.

ప్రతియుగంలోనూ అంటే యుగానికి ఒక్కసారి అనికాదు. అవసరమైనప్పుడల్లా. ధర్మానికి హాని జరిగినప్పుడు పరమేశ్వరుడు భూమిమీద అవతరిస్తాడు.

**విగతః సమేభ్యః** తనకు సములగు వారి నుండి వేరగువాడు. ఇతనికి సములెవరూ లేనివాడు. అతనితో సమానమైన వారుకాని, అతనికన్న అధికులుగాని లేరు అని **బృహదారణ్యకోపనిషత్తు**లో చెప్పబడింది.

**భగవద్గీత** 11వ అధ్యాయము '**విశ్వరూప సందర్శనయోగము**'లోని 43వ శ్లోకము.

**పితాఽసి లోకస్య చరాచరస్య త్వమస్య పూజ్యశ్చ గురుర్గరీయాన్**
**నత్వత్సమోఽస్త్యభ్యధికః కుతోఽన్యో లోకత్రయేఽ ప్యప్రతిమప్రభావః॥**

ఓ సర్వేశ్వరా! ఈ చరాచరజగత్తుకూ నీవే తండ్రివి. నీవు పూజ్యుడవు. నీవే గురుడవు. సర్వశ్రేష్ఠుడవు. ముల్లోకాలలోనూ నీతో సమానులెవరూలేరు. ఇంకా నీకన్న అధికులు ఎలా ఉంటారు ?

పరమేశ్వరునికన్న అధికులుగాని, అతనితో సమానమైన వారుగాని లేరు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'విషమః' అనబడుతున్నాడు.

## 743. శూన్యః

దోషములు లేనివాడు.

**శూన్యస్స్యా ద్దోషవర్జితః** ఏవిధమైన దోషములు లేనివాడు.

ఆ పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు వివిధ దశలలో వివిధ రూపాలు ధరించాడు. వివిధ రకాల అవతారాలు ఎత్తాడు. మత్స్యము, కూర్మము, వరాహము. వంటి అవతారాలు కూడా ఎత్తాడు. అయినప్పటికీ ఏవిధమైన దోషములు లేనివాడు. అతడు శూన్యము వంటివాడు. ఏవిధమైన లక్షణాలు ఉండనివాడు. గుర్తించటానికి వీలుకానివాడు.

## 744. ఘృతాశీః

నేతియందు కోరిక గలవాడు.

**గోపానాం సద్మగవ్యే వా జగదాప్యాయనేన వా**
**ఘృతేత్వా శ్యాహి యస్యాస్తి ఘృతాశీః పరికీర్తితః ॥**

గొల్లభామల ఇండ్లలో దూరిపాలు, వెన్న, నెయ్యి దొంగిలించువాడు.

పరమేశ్వరుడు నువ్వులలోనూనెలాగా, పాలలో నేయిలాగా జీవులందు అంతర్లీనంగా ఉన్నాడు. పాలలో నెయ్యి అంటే – పాలలో నిజంగా నెయ్యి కనిపించదు. పాలుకాని, తోడువేసి, పెరుగును చిలికితే వెన్న వస్తుంది. ఆ వెన్నను కాస్తే నెయ్యి వస్తుంది. అంటే– పాలలో ఉన్న నేతిని తీయటము ఎంతకష్టమో, మనలో ఉన్న పరమాత్మను తెలుసుకోవటం అంతకష్టం. అయినప్పటికీ మానవులకు ఆ నేతిబుచిని చూపించాలనే కోరిక గలవాడు.

ఘృతము – తడుపబడినది అని అర్థం. పరమేశ్వరుడు తన కరుణతో లోకాలను తడపాలనే కోరిక గలవాడు. అనగా తన కృపాకటాక్ష వీక్షణాలను ప్రసరింపచేసేవాడు.

**ఘృతే ఆశీ యస్యసః ఘృతాశీ**

వ్రేపల్లెలోని గొల్లవారిండ్లయందు దొరికేనేతియందు ఇచ్ఛ గలవాడు.

తన కళ్యాణగుణములచేత జగత్తును ఉద్ధరించాలనే కోరిక గలవాడు.

**ఘృతా – విగలితాః ఆశిషః యస్య** కోరికలు లేనివాడు. పరమేశ్వరుడు పూర్ణకాముడు. అతడికి ఏ కోరికలు లేవు. అందుచేత ఘృతాశీ అనబడుతున్నాడు.

## 745. అచలః

కదలిక లేనివాడు.

**దుర్యోధనాద్య భేద్యత్వాత్ అచలః పరికీర్తితః**

పాండవులనుండి విడగొట్టబడటానికి దుర్యోధనాదులకు సాధ్యపడనివాడు.

శ్రీకృష్ణుడు పాండవపక్షపాతి అనిప్రతీతి. అతడు ఎప్పుడూ పాండవుల పక్షానే ఉండి వాళ్ళని అన్నివిధాలా రక్షిస్తూ ఉండేవాడు. అయితే దుర్యోధనుడు మొదలైన దుష్టచతుష్టయము శ్రీకృష్ణుణ్ణి పాండవుల నుంచి విడదియ్యాలని విశ్వప్రయత్నం చేశారు కాని ఏమాత్రం లాభం లేకపోయింది. ఆ దిశగా శ్రీకృష్ణుని యందు ఏ కదలికాలేదు. అందుచేత అతడు 'అచలః' అనబడ్డాడు.

**న చలః అచలః** దుర్యోధనాది దుర్మార్గులచే కదలింపజాలనివాడు.

పరమేశ్వరుడు స్థిరమైనవాడు. తన స్వరూపము నుండిగాని, సామర్థ్యము నుండిగాని, జ్ఞానాది గుణములనుండిగాని ఏ మాత్రము కదలిక లేనివాడు.

## 746. చలః

చలించినవాడు.

**సత్యాద్యః పాండవార్థేహి చలతీతి చలస్మృతః**

పాండవుల కోసం ఆయుధాలు ధరించి తన ప్రతిజ్ఞను వదలివేసినవాడు.

కౌరవపాండవయుద్ధం జరుగుతోంది. అర్జునుడు భీష్మునితో తలపడ్డాడు. భీష్మ పితామహుడు మహాయోధుడు. రణరంగంలో అతనిని ఎదిరించటం ఎవరికీ సాధ్యంకాదు. అతన్ని ఆపటం అర్జునుడికి సాధ్యంకావటంలేదు. అర్జునుడు బాణం తొడిగే లోపు భీష్ముడు రెండు బాణాలు వదుల్తున్నాడు. అర్జునుని వింటినారిని కూడా త్రెంచేశాడు. ఇక ఇలా అయితే అర్జునుడి పరాజయం తప్పదు. ఆ సమయంలో శ్రీకృష్ణ పరమాత్ముడు చక్రాయుధాన్నిచేత ధరించి 'భీష్ముని జంపి నిన్నుగా తునర్జునాయంచు' రథం మీది నుంచి క్రిందికి దూకాడు.

గతంలో కౌరవ పాండవులు తన సహాయమర్థించటానికి వచ్చినప్పుడు యుద్ధంలో ఆయుధము ధరించను అని ప్రతిజ్ఞ చేశాడు. ఇప్పుడు ఆ ప్రతినను కూడా వదలి భీష్ముని చంపటానికి ఉద్యుక్తుడైనాడు.

ఈరకంగా చలించినవాడు కాబట్టి 'చలః' అనబడుతున్నాడు.

**చలతీతి చలః** తనన్రాశ్రయించిన పాండవులకోసం తన ప్రతినను వదలివేసినవాడు. వాయురూపమున చలించువాడు.

లోకంలో వేగంగా చలించే శక్తి మనస్సు తరువాత వాయువుకే ఉన్నది. అందుచేత వాయురూపంలో చలించేవాడు.

అసలు వాయువే పరమేశ్వర స్వరూపము. **ఛాందోగ్యోపనిషత్తు**లో ఈ విషయం చెప్పబడింది.

పూర్వకాలంలో అరణ్యంలో ఒక ఆశ్రమం ఉండేది. అందులో ఇద్దరు ఋషులు ఉండేవారు. శౌనకుడు, అభిప్రతారి అని వారిపేర్లు. వాయుదేవుడు వారి ఆరాధ్య దైవం. ఒకరోజు మధ్యాహ్నం వారు భోజనం చేయబోయే సమయంలో తలుపు తట్టిన చప్పుడయింది. "భవతీ ! భిక్షాం దేహి" అని వినిపించింది. ఎవరో బ్రహ్మచారి భిక్షాటనకు వచ్చాడు. "ఇది సమయంకాదు. వెళ్ళు" లోపల నుంచి సమాధానం. భిక్షకుడికి లేదనటం విచిత్రం ఏమీకాదు. కాని ఋష్యాశ్రమంలో తిరస్కారానికి ఆశ్చర్యపోయాడు బ్రహ్మచారి. ఈ ఆశ్రమవాసులను తేలికగా వదలకూడదు అనుకున్నాడు. వెంటనే లోపలున్న వారినుద్దేశించి "ఆర్యా ! తమరు ఏ దేవతనుపాసిస్తారు" ? అని ప్రశ్నించాడు బ్రహ్మచారి.

"నువ్వు చాలా మొండివాడిలా ఉన్నావయ్యా ! మా ఉపాసనాదైవం వాయువు. ఆయననే ప్రాణం అని కూడా అంటారు." అన్నాడు ఆశ్రమం లోపల నుంచి ఒక ఋషి.

"స్వామీ ! ఈ ప్రపంచం అంతా ప్రాణం వల్ల రూపం దాల్చింది. సృష్టి అంతా తిరిగి ప్రాణంలోనే లయం అయిపోతుంది. ఈ విషయం తమకు తెలుసుగదా ! ప్రాణమనేది కనుపించే వస్తువులయందు, కనుపించని వాటియందు (వ్యక్తావ్యక్తముల యందు) కూడా ఉన్నది కదా!" అన్నాడు బ్రహ్మచారి.

'ఎందుకు తెలియదయ్యా ! నువ్వు చెప్పేదంతా మాకు తెలిసిందే క్రొత్త ఏమీ కాదు' అన్నాడు లోపలి ఋషి.

"అయితే సరే ! ప్రస్తుతం అన్నం తినబోతున్నారు కదా ! మరి ఆ అన్నం ఎవరి కోసం తయారు చేశారు ? ఎవరికి నివేదన చేస్తారు ?" తిరిగి ప్రశ్నించాడు బ్రహ్మచారి.

"ఆ మాత్రం తెలియదా ! మేము ఆరాధించే వాయుదేవుడికి సమర్పించటానికి" చాలా తేలిక భావంతో సమాధానం చెప్పాడు ఋషి.

అయితే వినండి. ప్రాణమనేది విశ్వమంతా వ్యాపించి ఉన్నది. ఆ ప్రాణానికి నైవేద్యంగా మీరు అన్నం వండారు. ఈ ప్రపంచంలో నేను కూడా ఒక భాగమే. అంటే నాలోకూడా ప్రాణమున్నది. మీరు ఉపాసించే పరబ్రహ్మ ప్రాణరూపంలో మీలో ఉన్నది. అదే నాలో కూడా ఉన్నది. అలాంటప్పుడు ఆకలితో ఉన్న బ్రహ్మచారి రూపంలో మీ ఉపాసనాదైవమైన వాయుదేవుడే మిమ్మల్ని భిక్ష అడుగుతుంటే మీరు ఎందుకు లేదంటున్నారు?" అని ప్రశ్నించాడు బ్రహ్మచారి.

ఈ వివరణకు ఆశ్రమంలోని ఋషులు చాలా సంతోషించారు. "సత్యం బ్రహ్మచారీ, నువ్వు చెప్పింది ముమ్మాటికీ సత్యం" అన్నారు.

"ఋషీశ్వరులారా ! నాకు భిక్షపెట్టకుండా పొమ్మంటే, నాలో ఉన్న ప్రాణాన్ని అంటే మీ ఆరాధ్యదైవాన్ని తిరస్కరించినట్లేగదా ! మీరు ఎవరికోసం అన్నం వండారో ఆ దేవునికే ఆహారం ఇవ్వననటం న్యాయమేనా ?" అన్నాడు బ్రహ్మచారి.

ఈ మాటలకు ఋషీశ్వరులు చాలా సిగ్గుపడ్డారు. వెంటనే లేచి గౌరవంగా ఆబ్రహ్మచారిని లోపలికి తీసుకుని వచ్చారు. దేవతయొక్క బాహ్యరూపాన్నే కాకుండా, ఆంతర్యం తెలుసుకుని ఆరాధించాలి అని అర్థం చేసుకున్నవారై బ్రహ్మచారికి భోజనంపెట్టి పంపారు. కాబట్టి చలః అంటే శ్రీమన్నారాయణుడైన పరమేశ్వరుడు తప్పవేరుకాదు.

# 747. అమానీ

అహంకారము లేనివాడు.

**అమానీయోఽ నహంకారీ భక్తే ష్వేవ స ఈరితః**

భక్తుల విషయంలో ఏమాత్రమూ అహంకారము లేనివాడు.

**న మానీ అమానీ** తనభక్తుల విషయంలో సిగ్గు అభిమానము ఏమాత్రము లేనివాడు.

పాండవులు అరణ్యవాసము, అజ్ఞాతవాసము పూర్తిచేసి తమ రాజ్యం తమకిమ్మని అడిగారు. దుర్యోధనుడు ఇవ్వటానికి నిరాకరించాడు. పాండవులు దౌత్యనిదూతగా పంపారు. రాయబారం ఫలించలేదు. ఈసారి సాక్షాత్తూ పరమేశ్వరుడైన శ్రీకృష్ణభగవానుడే రాయబారిగా వెళ్ళాడు. తాను పరమేశ్వరుడై ఉండి కూడా ఏ మాత్రమూ సిగ్గు, అభిమానము, అహంకారము లేక తనను నమ్మిన పాండవుల తరపున రాయబారిగా వెళ్ళాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'అమానీ' అనబడుతున్నాడు.

**భగవద్గీత**లోని 13వ అధ్యాయం 'క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగము'లోని 8వ శ్లోకం.

**అమానిత్వమదంభిత్వం అహింసా క్షాంతిరార్జివమ్**

**ఆచార్యోపాసనం శౌచం స్థైర్యమాత్మ వినిగ్రహః ॥**

తానే శ్రేష్ఠుడు అనే భావం లేకుండా ఉండటము, డాంబికము లేకపోవటము, అహింస, క్షమ, వాక్సరళత్వము, శ్రద్ధాభక్తులతో గురుజనసేవ, బాహ్యాంభ్యంతరశుద్ధి, అంతఃకరణ స్థిరత్వము, మనస్సు శరీరము ఇంద్రియనిగ్రహము గలవాడు.

కాబట్టే శ్రీమన్నారాయణుడు 'అమానీ' అనబడుతున్నాడు.

## 748. మానదః

గౌరవమిచ్చినవాడు.

**స మానదోఽర్జునాదిభ్యో మానం రాజ్యం చ దత్తవాన్**

పాండవులకు రాజ్య గౌరవమిచ్చినవాడు.

**మానం దదాతీతి మానదః** గౌరవమర్యాదలనిచ్చినవాడు. యుద్ధరంగంలో అర్జునునకు మహారథుడని ఖ్యాతినిచ్చినవాడు.

మేనమామ కంసునిచంపి ఉగ్రసేనుడిని రాజుగా అభిషేకించినవాడు.

కురుక్షేత్ర సంగ్రామంలో కౌరవులను నాశనం చేసి ధర్మరాజుకు సార్వభౌమాధికార మిచ్చినవాడు. రావణబ్రహ్మను ధిక్కరించి వచ్చి తన నాశ్రయించిన విభీషణునకు పట్టాభిషేకం చేసినవాడు. ఈరకంగా ఇంతమందికి గౌరవమర్యాదలు నిలిపాడు కాబట్టే 'మానదః' అనబడుతున్నాడు. తన మాయచేత ఎల్లరకు ఆత్మాభిమానం కలిగించేవాడు. తత్త్వవేత్తలకు ఆత్మాభిమానము లేకుండా చేసేవాడు.

## 749. మాన్యః

గౌరవముగా తలచేవాడు.

**మాన్యస్త దీయవత్త్వే స్యాత్ సమ్మస్తవ్య స్సదైవ సః ॥**

పాండవపక్షపాతి అనిపించుకోవటం గౌరవంగా తలచినవాడు.

కౌరవులు, పాండవులు ఇద్దరూ దాయాదులే. అయినప్పటికీ ధర్మసూక్ష్మముతో చూసినట్లైతే ధర్మము పాండవుల పక్షానే ఉన్నది. పరమేశ్వరుడు ధర్మమూర్తి. మూర్తీభవించిన ధర్మస్వరూపుడు. అందుచేత పాండవుల పక్షాన నిలచాడు. పాండవ పక్షపాతి అనిపించుకున్నాడు. అలా అనిపించుకోవటమే గౌరవంగా తలచాడు భగవానుడు.

యుద్ధంలో మహాపరాక్రమశాలి అయిన అర్జునునకు సారధ్యం వహించటం గౌరవంగా తలచినవాడు. పరమేశ్వరుడు సర్వవ్యాపి. ఈజగత్తునంతా ఆవరించి ఉన్నాడు. జగత్తులోన ఉన్నవన్నీ అతని రూపాలే. అందుచేతసర్వులచేత ఆదరింపబడుతున్నాడు. కాబట్టి శ్రీమన్నారాయణుడు సామాన్యుడు.

## 750. లోకస్వామీ

లోకాలకు ప్రభువు.

**లోకభర్తృతయా చైవ లోక స్వామీతి శబ్ద్యతే**

లోకాలన్నీ భరించేవాడు. లోకాలకు ప్రభువు. నాధుడు, స్వామి.

**లోకానాం స్వామీ లోకస్వామీ ।** సకలలోకనాయకుడు. చతుర్దశలోకాలకు అధిపతి.

## 751. త్రిలోకధృక్

మూడు లోకాలను ధరించినవాడు.

**లోకత్రయ స్య ధరణాత్ స త్రిలోక ధృదీరితః ॥**

ముల్లోకాలను ధరించేవాడు కాబట్టి త్రిలోకధృక్ అనబడుతున్నాడు.

**త్రీన్ లోకాన్ ధరతీతి త్రిలోకధృక్** ముల్లోకాలను ధరించేవాడు, పోషించేవాడు.

**భగవద్గీత**లోని 10వ అధ్యాయయం 'విభూతియోగం' లోని 42వ శ్లోకము.

**అథవా బహునైతేన కిం జ్ఞాతేన తవార్జున**

**విష్టభ్యాహమిదం కృత్స్నంఏకాంశేన స్థితో జగత్ ॥**

అర్జునా ! సంపూర్ణ జగత్తును నా యోగశక్తి అంశతో నేనే ధరిస్తున్నాను.

ఈ బ్రహ్మాండమంతా భగవంతునియొక్క ఏదో ఒక అంశములోని ఆయన యోగశక్తిచేత ధరించబడుతున్నది. ఈ రకంగా అతని శరీరము ముల్లోకాలకు ఆధారమై ఉన్నది. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'త్రిలోకధృక్' అనబడుతున్నాడు.

## 752. సుమేధాః

మంచి తలంపుగలవాడు.

**బుద్ధి స్సుశోభనా యస్య సుమేధాః పరికీర్తితః** తన భక్తుల విషయంలో మంచి బుద్ధి గలవాడు.

**సు-శోభనా మేధా యస్యసః సుమేధాః** తనను ఆరాధించే వారియందు మంచితలంపుగలవాడు. **శోభనా-మేధా-(ప్రజ్ఞా) అస్య** ఇతడికి శోభనమైన ప్రజ్ఞ ఉన్నది.

చక్కని ప్రజ్ఞా పాటవము గలవాడు. విశేషజ్ఞానము గలవాడు. ఇక్కడ జ్ఞానము విశేష జ్ఞానము అని రెండు ఉన్నాయి.

ఇనుపముక్క చక్కగా ఎర్రగా కాలి ప్రకాశిస్తున్నది. ఈ విషయం తెలియటం జ్ఞానం. అలాకాకుండా అందులోని వెలుతురు వేడి, అగ్నియొక్క ధర్మమేగాని అది లోహము యొక్క ధర్మంకాదు అని తెలియటం విశేషజ్ఞానం. ఈరకంగా మంచి జ్ఞానం గలవాడు. అందుకే శ్రీమన్నారాయణుడు 'సుమేధా' అనబడుతున్నాడు.

## 753. మేధజః

యాగఫలముగా అవతరించినవాడు.

**దేవకీకృత పుత్రీయ వ్రతయజ్ఞే చ యస్య వై:**
**జనిస్తుమేధజ స్స స్యాత్ సప్తార్ణః పుత్రదాయకః**

గతజన్మలలో కుమారులకోసం దేవకి చేసిన కర్మల ఫలం వలన జన్మించిన వాడు. ఈ నామము సప్తాక్షరీమంత్రము. పుత్రసంతానము నిచ్చును.

**మేధేజాతౌ ఇతి మేధజః** దేవకి పుత్రునికోసం చేసిన యాగఫలితముగా అవతరించినవాడు.

యజ్ఞయందు యజ్ఞేశ్వరస్వరూపమున ఉన్నవాడు. యజ్ఞమునుంచి ఆవిర్భవించినవాడు.

## 754. ధన్యః

ధనము గలవాడు.

**ధన్యస్తు దేవకీ జన్మ ధనలాభాదితిస్మృతః** ధనము గలవాడు ధన్యుడు అని చెప్పబడింది. దేవకి గర్భం నుంచి జన్మించుటే దన్యతగా కలవాడు.

**ధనం లబ్ధాః ధన్యః** దేవకి యందు పుట్టటము అనే ధనాన్ని పొందినవాడు.

**జాతోఽహం యుక్తవోధరరాత్** నీ ఉదరమునుండి జన్మించాను.

**అహం బాంధవో జాతః** నేను బంధువుగానే పుట్టాను. కృతార్థుడైనవాడు.

ఓ దేవకీ, నీ గర్భాన జన్మించి ధన్యుడనైనాడను. అందుచేతనే అంటే దేవకీ గర్భాన జన్మించటం చేత, ధనము కలిగిఉండటంచేత అతడు ధన్యుడు.

# 755. సత్యమేధాః

అవతారచేష్టలు సత్యముగా గలవాడు.

**పల్లవీ వసుదేవాది ప్రాజాత్య స్వాభిమానినీ**
**మేధా యస్యా పి సత్యాసః సత్యమేధాః ప్రకీర్తితః**

గోపికలతోను, వసుదేవుడు మొదలైన వారితో నటనగాక, నిజంగానే సజాతీయుడై చరించే వాస్తవ బుద్ధి గలవాడు.

అవతారమునందలి చేష్టలు సత్యముగా ఉండేవాడు.

**సత్యామేధా యస్యసః సత్యమేధాః**

గోపకాంతలతోను, మిత్రులైన గోపాలరుతోను అతడిది నటనకాదు. నిజమే.

సత్యజ్ఞానము గలవాడు. అంటే ఆత్మజ్ఞానము గలవాడు. రూపాత్మకమైన జగత్తులో కనిపించే అనిత్యమైన వస్తువులచూసి భ్రమించక, వాటికి అధిష్ఠానమైన సత్తను చూసి ఆనందించేవాడు. వాటికి అధిష్ఠానము, ఆధారము తానే అయినవాడు.

# 756. ధరాధరః

గోవర్ధనపర్వత మెత్తినవాడు.

**ధరంగోవర్ధనం శీఘ్రం ధృతవాన్ స ధరాధరః**

ఇక్కడ ధం అంటే – గోవర్ధన గిరి అని అర్థం. గోవర్ధన గిరినెత్తి పట్టినవాడు.

గోపకుల మీదకోపంతో ఇంద్రుడు వడగళ్ళ వానకురిపించాడు. దాని ధాటికి గోవులు, గోపకులు కూడా చెల్లాచెదరయిపోయినారు. అలా పరుగులు తీసిన గోపాలురు శ్రీకృష్ణుని శరణువేడారు. వెంటనే శ్రీకృష్ణపరమాత్ముడు వీరందరినీ తీసుకుని గోవర్ధన గిరికి వచ్చి ఆ పర్వతాన్ని ఎత్తి చిటికెన వ్రేలు మీద నిలబెట్టాడు. గోపాలురు, గోవులు అంతా దానిక్రింద రక్షణ పొందారు. ఈ రకంగా గోవర్ధనోద్ధరణము చేసినవాడు కాబట్టి శ్రీకృష్ణుడు 'ధరాధరః' అనబడుతున్నాడు.

**ధరమ్ ఆధరతీతి ధరాధరః** గోవర్ధనగిరినెత్తి గోపాలకుల రక్షించినవాడు.

**తదేతదిఖిలం గోష్ఠం త్రాతవ్య మదునామయా**
**ఇమమద్రి మహం ధైర్యాత్ ఉత్పాట్యాసు శిలామయమ్**
**ధారఇష్యామి గోష్ఠస్యపృధుఛత్ర మివాపరమ్ ॥**

ఇంద్రుడు కురిపించే రాళ్ళ వాననుండి వ్రేపల్లెను రక్షించటానికి ఈ గోవర్ధనగిరిని ఇప్పుడే గొడుగులా ఎత్తగలను.

**ధరాంధారయతి** ఆదిశేషుడుగా, ఆదికూర్మముగా, ఆదివరాహముగా అనేకరూపాలలో ఈ భూమిని మోస్తున్నవాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు 'ధరాధరః' అనబడుతున్నాడు.

## 757. తేజోవృషః

కాంతిని వర్షించువాడు.

**తేజో౭భి వర్షతి యతః సుహృత్పాలన లక్షణమ్**
**తేజోవృషస్సమాఖ్యాతః వస్వర్ణోమిత్రవృద్ధిదః ॥**

తన మిత్రులను కాపాడటము అనే తేజస్సును వర్షించువాడు. ఈ నామము అష్టాక్షరీమంత్రము మిత్రులను పెంపొందించును.

ఆదిత్యుని రూపంలో తేజస్సును వర్షించువాడు. లోకాలకు ఆదిత్యుడే ప్రాణము. అతడే అగ్ని. అతని కాంతులవల్లనే లోకములన్నీ ప్రవర్తిల్లుతున్నాయి. ఆదిత్యుడు అంటే పరమేశ్వరుడే ఆకాశంలో కనిపించే సూర్యభగవానుడే ప్రత్యక్ష దైవము. అతని కిరణమువల్లనే సముద్రములోని నీరు ఆవిరి అయి మేఘాలుగా మారుతుంది. ఆ మేఘము చల్లగాలికి ద్రవీభవించి వర్షిస్తుంది. ఆవర్షము కొండలమీద పడి, అక్కడ నుండి వాగులుగా, ఏరులుగా ప్రవహించి నదులుగా మారుతుంది. ఆ నదులే జీవులు త్రాగటానికి, వ్యవసాయానికి నీటిని అందిస్తాయి. ఈ రకంగా సూర్యుని కిరణములకాంతిచేతనే వర్షము కురిసిదేశం సస్యశ్యామలమవుతుంది. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'తేజోవృషః' అనబడుతున్నాడు.

## 758. ద్యుతిధరః

దివ్యశక్తి సంపన్నుడు.

**అమానుషీం యో ధృతవాన్ ద్యుతిమైంద్రాభి భావుకామ్**
**ఖ్యాతస్స హి ద్యుతిధరః వస్వర్ణః కాంతిదోమనుః**

ఇంద్రాది దేవతలను కూడా మోహింపచేయగలది, మానవులెవరికీ లేనిది అయిన కాంతిని ధరించి ఉండేవాడు. ఈ నామము అష్టాక్షరీ మంత్రము. కాంతి ప్రదము.

**ద్యుతిం (అంగగతాం కాంతిం) ధారయతి**

తన అవయవములయందు విశిష్టకాంతిని ధరించినవాడు.

పరమేశ్వరుడు జ్ఞానస్వరూపుడు. కాబట్టి దివ్యతేజస్సే అతని రూపము. అదేవిధంగా, దివ్యమైన కాంతియే అతని అంగాలు. అందుచేతనే ఆ పరమేశ్వరుని అవయవాలు విశిష్టకాంతిని ధరించి ఉంటాయి.

ద్యుతి అనగా – ప్రకాశము అని కూడా అర్ధము. ఇక్కడ ప్రకాశము అంటే 'ఆత్మప్రకాశము'. శరీరంలోని అంగములు–ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి వీటిని ప్రకాశింప చేసేది ఆత్మ. అందుచేత ఇక్కడ ద్యుతిధరః అంటే ప్రకాశించే ఆత్మతానైనవాడు. ఆత్మపురుషుడు.

ద్యుతి అంటే – శక్తి అని కూడా అర్ధము.

ఇంద్రియాలను పనిచేయించే ఆత్మశక్తి తానైనవాడు. అందుకే శ్రీమన్నారాయణుడు ద్యుతిధరః అనబడుతున్నాడు.

## 759. సర్వశస్త్రభృతాంవరః

అస్త్రధారులందరిలోను శ్రేష్ఠుడు, దివ్యమైన శస్త్రాస్త్రములు గలిగినవాడు.

**జరాసంధాది సమరే శ్రేష్ఠ శస్త్రభృతాం చ యః**

**సఃఖ్యాత స్సర్వలోకేషు సర్వశస్త్రభృతాం వరః**

జరాసంధునితో యుద్ధం చేసే సమయంలో సకల లోకములలోను శస్త్రధారులలో ఇంతటివాడు లేడని ఖ్యాతి గడించినవాడు.

మగధదేశాన్ని పాలించే బృహద్రధుడనే రాజు యొక్క కుమారుడు జరాసంధుడు. బృహద్రధుడికి చాలాకాలం సంతానం లేదు. సంతానంకోసం అనేక వ్రతాలు చేశాడు. ఫలితం లేకపోయింది. బృహద్రధుడు ఒకరోజున అడవిలో వెడుతూ మామిడిచెట్టు క్రింద కూర్చుని తపస్సు చేసుకుంటున్న 'చండకౌసికుడు' అనే మునిని ఆశ్రయించాడు. ఆ సమయంలో చెట్టు నుంచి ఒక పండు రాలి క్రింద పడింది. ముని ఆపండును మంత్రించి రాజుకిచ్చాడు. బృహద్రధుడికి ఇద్దరు భార్యలు. అందుచేత ఆ మామిడిపండును రెండు ముక్కలు చేసి ఇద్దరికీ ఇచ్చాడు. వారిద్దరూ గర్భవతులై చెరిసగము ఉన్న శిశువు కన్నారు. అంటే శిశువును నిలువునా చీల్చివేసినట్లుగా ఒక్కొక్క ముక్కను ఒకరు చొప్పున కన్నారు. ప్రతి ముక్కకు ఒక కాలు, ఒక చెయ్యి, ఒక కన్ను, ఒక ముక్కు ఇలా శరీరసగభాగం ఉన్నది. ఇలా వికృతాకారంలో పుట్టిన శిశువును చూసి భయపడినవారై, ఆ శిశుదేహాలను బయట పారేయించారు.

ఆ రోజులలో 'జర' అనే పేరు గల ఒక రాక్షసి మగధ సరిహద్దులలో ఉండేది. ఆ రాక్షసి వీధులలో తిరుగుతూ, బయట పారేసిన సగము చీలి ఉన్న దేహాలను చూసి, ఆహారం దొరికింది అనుకుని వాటిని తీసుకుపోయింది. ఆ విధంగా రెండు శరీరభాగాలను భుజాన వేసుకుని పోతుండగా, అవి దగ్గరకు వచ్చి ఒకటిగా అయి, జీవం వచ్చి బాలుడు ఏడవసాగాడు. అది చూసి వారు మహారాజుకు ఆ విషయం తెలియచేశారు. ఆ రాక్షసి కూడా మానవాకారంలో సామాన్య స్త్రీ మాదిరిగా వచ్చి, ఆ బాలుని వృత్తాంతమంతా రాజుగారికి వివరించి, ఆ బాలుణ్ణి రాజుగారికి ఒప్పగించింది. ఈ రకంగా జరచేత సంధింపబడ్డాడు కాబట్టి అతడు 'జరాసంధుడు' అని పిలువబడ్డాడు.

జరాసంధుడు పెరిగిపెద్దవాడయినాడు. రాజుగారు కుమారుడికి రాజ్యం పట్టంగట్టి, తాను అడవులకు వెళ్ళిపోయాడు.

గిరి వ్రజపురాన్ని రాజధానిగా చేసుకుని మగధ సామ్రాజ్యాన్ని పరిపాలిస్తున్నాడు జరాసంధుడు. ఈ రాజ్యానికి చుట్టూ గోరథము, ఋషభము, వైహారము మొదలైన పర్వతాలు పెట్టని గోడలాగా ఉన్నాయి. అందుచేత ఇది శత్రువులకు దుర్భేద్యమయింది. ఇతడు బ్రహ్మను గురించి తపస్సుచేసి అతని వరంగా రెండు భేరీలను సంపాదించాడు. శత్రువులు ఎవరైనా నగరంలో ప్రవేసిస్తే చాలు అవి తమంతట తామే మ్రోగుతాయి. ఈ రకంగా జరాసంధుడు శత్రుభీకరుడైనాడు. పైగా ఏ ఆయుధంచేతా మరణం లేకుండా వరం కూడా పొందాడు.

రాజులను బంధించి, భైరవపూజచేస్తూ ఒక్కొక్కరినే బలిఇస్తున్నాడు జరాసంధుడు. కంసుడు ఇతని అల్లుడు. కంసుని చంపిన నాటినుంచి, కృష్ణునిమీద కక్ష పెట్టుకుని అనేకసార్లు మధురమీదికి దండయాత్రలు చేశాడు. ఈరకంగా 17 సార్లు మధురపై యుద్ధానికి వెళ్ళి, ప్రతిసారీ శ్రీకృష్ణుని చేతిలో పరాజితుడై తిరిగివచ్చాడు.

ఈరకంగా జరాసంధునితో యుద్ధం జరిగిన సమయంలో, శస్త్రధారులలో శ్రీకృష్ణుడంతటి వాడు లోకంలోనే లేడని భాగవానుడుకీర్తించబడ్డాడు.

**భగవద్గీత**లోని 10వ అధ్యాయం **'విభూతియోగం'**లోని 31వ శ్లోకం.

**పవనః పవతామస్మి రామశస్త్రభృతామహమ్**

**ఝషాణాం మకరశ్చాస్మి స్రోతసామస్మి జాహ్నవీ ।**

పవిత్ర మొనరించు వారిలో వాయుదేవుడను నేను. శస్త్రధారులలో శ్రీరామ చంద్రుడను నేను. మత్స్యములలో మొసలిని నేను, నదులలో గంగా నదిని నేను.

ఇక్కడ రాముడు అంటే దశరథనందనుడు. కైకేయీ సుతుడు. అతడు గొప్ప పరాక్రమం గలవాడు. అతడు సాక్షాత్తూ శ్రీమహావిష్ణువే. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'సర్వశస్త్రభృతాంవరః' అనబడ్డాడు.

## 760. ప్రగ్రహః

భక్తులను తనమాటప్రకారము నడిపించేవాడు.

**పార్థసారథి నానేన రశ్మి భిర్య ప్రగృహ్యతే**

**సప్రగ్రహస్సమాఖ్యాతః సప్తవర్ణ ఉదాహృతః**

పగ్గాలువేసి గుర్రాలను స్వాధీనం చేసుకున్నట్లే, శ్రీకృష్ణపరమాత్మ అర్జునుని స్వాధీన పరచుకున్నాడు. అతన్ని తన మాటప్రకారం నడిపించాడు. ఈ నామము సప్తాక్షరీమంత్రము.

**ప్రగృహ్యతే అనేనేతి ప్రగ్రహః** పగ్గములతో లాగినట్లుగా, అర్జునిని తనమాటలతో, ప్రేమతో స్వాధీనము చేసుకున్నవాడు.

భవబంధాలలో చిక్కి విషయవాసనలచేత ఇష్టము వచ్చినట్లు అదుపులేకుండా చరించే గుర్రాలనబడే ఇంద్రియాలను అనుగ్రహము అనేపగ్గాలతో స్వాధీనము చేసుకున్నవాడు.

**కఠోపనిషత్తు**లో చెప్పినట్లుగా ఇంద్రియాలు గుర్రాలవంటివి. వాటి నడతసారథి అంటే మనసు మీద ఆధారపడి ఉంటుంది. మనసు మీద నియంత్రణ గలవాడు. మంచి సారథిలాగా ఇంద్రియాలను తన అదుపులో ఉంచుకోగలుగుతాడు. అలా చేయలేనివాడి ఇంద్రియాలు చెడ్డసారథిచేతిలోని అశ్వాలలాగా వాటి ఇష్టప్రకారం చరిస్తాయి.

ఇక్కడ పరమేశ్వరుడు సాధకుని మనస్సును నియంత్రించి, అతన్ని తన అదుపులో ఉంచుకోగలిగాడు. అందుకే పరమేశ్వరుడు ప్రగ్రహః అనబడుతున్నాడు.

ప్రగ్రహః – తీసుకునేవాడు. తన భక్తులు భక్తితో ఏది సమర్పించినా తీసుకునేవాడు. కాబట్టే శ్రీమన్నారాయణుడు 'ప్రగ్రహః' అనబడుతున్నాడు.

## 761. నిగ్రహః

శత్రువులను నిరసించువాడు.

**యేన సారథి వైచిత్ర్యాత్ నిగ్రహంతేత్రశత్రవః**

**స విగ్రహసమాఖ్యాతః సప్తార్ణ శ్శత్రునాశకః ॥**

పార్ధసారధి యొక్క సారధ్యనైపుణ్యంచేత అర్జునుడు శత్రువులను జయించగలిగాడు. అందుచేత భగవానుడు 'నిగ్రహః' అనబడుతున్నాడు. ఈ నామము సప్తాక్షరీ మంత్రము. శత్రునాశకరము.

**నిగృహ్యంతే శత్రవ ఇతినిగ్రహః** అర్జునుని పరాక్రమంతో సంబంధం లేకుండానే తన సారధ్యంతో శత్రువులను నాశనం చేసినవాడు.

తన బలంతోనే కురుక్షేత్ర సంగ్రామంలో కౌరవులను నాశనం చేసినవాడు.

జగత్తులో అన్నింటినీ తన అదుపులో ఉంచుకొనువాడు.

జీవులలో అహంకారాన్ని అంతమొందించేవాడు. అందరినీ తన అధీనంలో ఉంచుకొనేవాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'నిగ్రహః' అనబడుతున్నాడు.

## 762. వ్యగ్రః

తొందరపడువాడు.

**యుద్ధక్రమా సహిష్ణుత్వాత్ పార్ధవిద్విడ్వినిగ్రహే**
**యోஉసౌవ్యగ్ర సమాఖ్యాతః షడర్ణోవైరినాశకః ॥**

యుద్ధంలో శత్రుసంహారం కోసం అర్జునుడు పడే శ్రమని సహింపలేనివాడు. ఈ నామము షడక్షరి శత్రునాశనము.

**యేయాంతి యాంత్యే వశిని ప్రవీర యేஉవస్థితాః సత్వరతేஉపియాంతు**
**భీష్మంరథాత్ పశ్య త పాత్యమానం ద్రోణంచ సంఖ్యే సగణం మయా ద్య**

ఓ వీరుడా ! ఇక్కడ నుండి పారిపోయే వాళ్ళని ఇక్కడ ఉన్నవాళ్ళని అందరినీ కూడా నేనొక్కడనే సంహరిస్తాను" అన్నాడు శ్రీకృష్ణుడు.

ఆది అంతము లేనివాడు. జన్మమృత్యు జరాదులు లేనివాడు. భక్తుల కోరికలు తీర్చటంలో మునిగి ఉండేవాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'వ్యగ్రహః' అనబడుతున్నాడు.

## 763. నైకశృంగః

అనేకవిధాలుగా శత్రువుల బాధించువాడు.

**యస్య స్సాన్నైక శృంగస్సః బహుశోవైరిబాధకమ్**

శృంగములు – శత్రువుల భాదించే సాధనాలు (కొమ్ములు) శత్రువులను బాధించటం కోసం, వారిని శిక్షించటంకోసం అనేక సాధనాలు గలవాడు.

**నైకాని శృంగాణి వైరి బాధకాని యస్యసః నైకశృంగః** యుద్ధంలో తెలివితేటలు, సామర్థ్యము, సమయం వచ్చినప్పుడు భీష్ముని సంహరించటానికి ఆయుధధారణలాంటి వాటితో శత్రువులను బాగా చీకాకు పరిచేవాడు. శత్రువుల సంహరించటానికి పరమేశ్వరుడు నాలుగుకొమ్ములు కలిగి ఉన్నాడు. **తైత్తిరీయఅరణ్యకంలో**

**చత్వారిశృంగా త్రయోఅస్య పాదా ద్వేశీర్షే సప్తహస్తాసోఅస్య**
**త్రిధాబద్ధో వృషభోరోరవీతి మహాదేవో మర్త్యాగ్ం ఆవివేశ ॥**

నాలుగు కొమ్ములు, మూడు పాదాలు, రెండు శిరస్సులు, ఏడు చేతులు గలవాడై మూడుచోట్ల బంధింపబడిన వృషభరూపుడైన భగవానుడు శబ్దం చేస్తున్నాడు. ఇతడు మానవులలో ప్రవేసించి ఉన్నాడు.

ఇక్కడ నాలుగు కొమ్ములు అంటే - **మాండూక్యోపనిషత్తు**లో ఆత్మకు నాలుగు పాదాలు అని చెప్పబడింది. అవి జాగ్రస్వప్న సుషుప్తితురీయావస్థలు.

మూడుపాదాలు - స్థూలశరీరము, సూక్ష్మశరీరము, కారణ శరీరము.

రెండు శిరస్సులు - చల, అచల స్వరూపాలు

భగవానుని చేరే సప్తసాధనాలే - ఏడు చేతులు.

మూడు చోట్ల బంధింపబడింది - జాగ్రస్వప్న సుషుప్తులనే అవస్త్రాత్రయములో విశ్వ, తైజస, ప్రాజ్ఞులుగా బంధింపబడింది.

వృషభరూపుడు - ధర్మస్వరూపుడు.

అతడు చేసే శబ్దము - ఓంకారము

అటువంటి పరమేశ్వరుడు బ్రహ్మరంధ్రం గుండా మానవులలో ప్రవేశించి ఉన్నాడు.

ఇక్కడ పరమేశ్వరుడు శబ్ద బ్రహ్మగా చెప్పబడ్డాడు. అతడికి

| | | |
|---|---|---|
| నాలుగు కొమ్ములు | - | నాలుగువేదాలు |
| మూడుపాదాలు | - | భూతభవిష్యద్వర్తమానకాలాలు |
| రెండు శిరస్సులు | - | కార్యకారణములు |
| ఏడు చేతులు | - | ఏడు రకాల భక్తులు |
| బంధింపబడ్డ మూడుస్థానాలు | - | హృదయము, శిరస్సు, కంఠము |

ఈరకంగా శ్రీమన్నారాయణుడే నైక శృంగుడు.

# 764. గదాౖ గ్రజః

గదునకు అన్నగారు

**గదనామ్నోహ్యగ్రజత్వాత్ గదాగ్రజ ఇతీరితః** వసుదేవుడు ఉగ్రసేనుని తమ్ముడైన దేవకుని యొక్క కుమార్తెలను దేవకి, శాంతి, దేవ, ధృత దేవ అనబడే ఏడుగురిని వివాహం చేసుకున్నాడు. అంతే కాకుండా ఇతడికి రోహిణి, కౌసల్య, పౌరవి అనే భార్యలు కూడా ఉన్నారు. వసుదేవుడికి రోహిణియందు బలరాముడు, గదుడు, సారణుడు అనే కుమారులు కలిగారు. వీరిలో 'గదుడు' అనే వాడికన్న ముందుగా పుట్టినవాడు.

**గదస్య అగ్రజః గదాగ్రజః** రోహిణి కుమారుడైన గదునికన్న ముందుగా పుట్టినవాడు.

**నిగదేన అగ్రే జాయతే** నిగదము అంటే మంత్రము. మంత్రముగా ముందుగనే పుట్టినవాడు.

గదుడను వానికన్న ముందు జన్మించినవాడు. ఈ గదుడు మంత్రములనుంచి ఆవిర్భవించాడు. అందుచేత అతడు 'గదుడు' అనబడుతున్నాడు.

మంత్రముగా పుట్టినవాడు వాసుదేవుడు. ఆ మంత్రములనుండి పుట్టినవాడు గదుడు. అందుకే వాసుదేవుడు 'గదాగ్రజుడు' అనబడతాడు.

అంటూ 'పరమేశ్వర స్వరూపము' అనే ప్రకరణాన్ని పూర్తిచేశాడు రత్నాకరుడు.



# 48. వ్యూహావతారము

గురువుగారూ ! శ్రీమన్నారాయణుడియొక్క వ్యూహావతారమును గురించి వివరించండి” అన్నాడు నారాయణభట్టు. వివరించటం ప్రారంభించాడు రత్నాకరుడు.

పరమేశ్వరుడు నియంత. అతడు కేవలము జీవులయొక్క సమిష్టిరూపంకాదు. అతడు సర్వవ్యాపి. ఈ జగత్తు అంతా వ్యాపించి ఉన్నాడు. సర్వాంతర్యామి. జీవరాసులన్నింటియందు అంతర్లీనంగా ఉన్నాడు. అటువంటి ఆ పరమేశ్వరుడు 1. పర 2. వ్యూహ 3. విభవ 4. అంతర్యామి 5. అర్చ అనే రూపాలుగా ఉంటాడు.

ఇక్కడ వ్యూహము అంటే కామమోక్షాలను సృజించగోరినటువంటివాడై, దానికోసం సృష్టిస్థితిలయాలు, శాస్త్రాలు, శాస్త్రార్థాలు, శాస్త్ర ఫలితాలు ధానము, ఆరాధన, లీల అనే పనులకు తగినట్లుగా తన రూపాన్ని గుణాలను విభజించుకుని, లీలావిభూతిని నిర్వహించి, ముక్తికి సాధనమై 1. వాసుదేవ 2. సంకర్షణ 3. ప్రద్యుమ్న 4. అనిరుద్ధ అనే నాలుగు రకాలుగా ఉండే స్థితి. దీనిలో

వాసుదేవుని వ్యూహము – పరమపదము.

మిగిలిన మూడు క్షీరాబ్ధిలోని శ్వేతద్వీపము అని, అవతారకందమని పిలువబడే స్థానము. ఇక్కడ నుంచే అవతారాలు వస్తాయి.

1. వాసుదేవుడు – మోక్షప్రదాత
2. సంకర్షణుడు – జ్ఞానము, బలము
3. ప్రద్యుమ్నుడు – ఐశ్వర్యము, వీర్యము
4. అనిరుద్ధుడు – శక్తి, తేజస్సులను ఇస్తారు. ఇదే షాడ్గుణ్య పరిపూర్తి.

శ్రీమన్నారాయణుడు బలభద్రుడు (సంకర్షణుడు) వాసుదేవుడు, ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు అని నాలుగు శరీరములతో యాదవకులమందు జన్మించాడు. నాలుగు భుజములు గలవాడు. నాలుగు వ్యూహములు గలవాడు. ఇంద్రపదవి, బ్రహ్మపదవి, కైవల్యము, మోక్షము అని నాలుగువిధాలైన పదవులను, అధికారాలను తన భక్తులకిచ్చే వాడు. జాగ్ర, స్వప్న, సుషుప్తి, తురీయము అనే నాలుగు అవస్తలు గలిగి అందులో విశ్వ, తైజస, ప్రాజ్ఞ, ఆత్మ అనే నాలుగు రూపాలు గలవాడు. పైన చెప్పిన సంకర్షణ, వాసుదేవ, ప్రద్యుమ్న, అనిరుద్ధమూర్తులతో సృష్టి, స్థితి, లయము, శాస్త్రప్రదానము మొదలైన ప్రయోజనాలను గలిగి ఉంటాడు. నాలుగు వేదాలు తెలిసిన వారిచే, అంటే వేదాంతసారము

నెరిగిన వారిచేత అర్చించబడేవాడు. అంశావతారమైనవాడు. ధర్మసంరక్షణ కోసం మరల మరల భూమిమీద అవతరిస్తాడు. అతడు నిరపేక్షకుడు. నివృత్తి మార్గంలో పయనించేవాడు. అతన్ని జయించటమనేది ఎవరికీ వీలుకాదు. అతని ఆజ్ఞలు అనుల్లంఘనీయములు. అతన్ని ఇంద్రియాలతో తెలుసుకోలేము. అతడు ఎవరికీ సమీపించ శక్యముకానివాడు. పాపాత్ములచేత పొందశక్యముకానివాడు. మహానుభావులైన యోగీశ్వరులు ఎంతో శ్రమపడి ఇతన్ని తమ హృదయాలలో బంధిస్తారు. ఈ విషయాలన్నీ 765 నుంచి 780వ నామము వరకు వివరించటం జరిగింది. ఇక నామాలను చూద్దాం.

## 765. చతుర్మూర్తిః

నాలుగుమూర్తులు గలవాడు.

**బలభద్రోవాసుదేవః ప్రద్యుమ్నశ్చానిరుద్ధకః**

**చతస్రోమూర్తమోయస్య స చతుర్మూర్తి రుచ్యతే ॥**

బలభద్రుడు, వాసుదేవుడు, ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు అని నాలుగు శరీరములలో యదుకులమందు పుట్టినవాడు.

**చతురస్రః మూర్తయః యస్యసః చతుర్మూర్తిః**

నాలుగు రూపములు లేదా మూర్తులు గలవాడు.

బలభద్రుడు. ఇతడే బలరాముడు. రోహిణీ వసుదేవులపుత్రుడు. విష్ణుమూర్తి కృష్ణావతారమెత్తినప్పుడు ఆదిశేషుడు రోహిణి గర్భాన జన్మించాడు. రామావతారంలో ఆదిశేషుడు లక్ష్మణునిగా జన్మించి అన్నగారికి సేవచేశాడు. కాబట్టి ఇప్పుడు కృష్ణుడు తమ్ముడుగా, బలరాముడు అన్నగా జన్మించారు.

ముందు ఇతడు దేవకి సప్తమ గర్భంలో ఉన్నాడు. కంసుడు దేవకి సంతానాన్ని అందరినీ సంహరిస్తున్నాడు. కాబట్టి శ్రీహరి ఆజ్ఞమేరకు యోగమాయ ఈ గర్భాన్ని రోహిణికి మార్చింది. ఈ రకంగా దేవకి గర్భము అణగిపోవటంచేత ఇతడికి 'సంకర్షణుడు' అని పేరువచ్చింది. జనులను రమించటం చేత రాముడని, యదు సంకర్షణంబున సంకర్షనుడని, బలం కలిగిఉన్నాడు కాబట్టి బలుడని ఇతనికి పేరు వచ్చింది.

రుక్మిణీ కృష్ణులకుమారుడు ప్రద్యుమ్నుడు పూర్వజన్మలో మన్మధుడు. ఇతడే శంబరుని సంహరించినవాడు. ఇతని కుమారుడు అనిరుద్ధుడు.

పరమేశ్వరుని వ్యూహాలు నాలుగు. అవి

| | | |
|---|---|---|
| 1. వాసుదేవుడు | – | ఇతడు మోక్షప్రదాత |
| 2. సంకర్షణుడు | – | జ్ఞానము, బలము |
| 3. ప్రద్యుమ్నుడు | – | ఐశ్వర్యము, వీర్యము |
| 4. అనిరుద్ధుడు | – | శక్తి, తేజస్సు |

చతుర్మూర్తిః – నాలుగు మూర్తులు గలవాడు. అవి విరాట్, సూత్రాత్మ, అవ్యాకృతము, తురీయములు. అనబడే నాలుగురూపాలు గలిగినవాడు.

| | | |
|---|---|---|
| కృతయుగములో | – | తెల్లనిది |
| త్రేతాయుగంలో | – | ఎఱ్ఱనిది |
| ద్వాపరయుగంలో | – | పచ్చనిది |
| కలియుగంలో | – | నల్లనిది |

అయిన నాలుగుమూర్తులు గలవాడు.

విశ్వ, తైజస, ప్రాజ్ఞ, చైతన్యము అనే నాలుగు రూపాలు గలవాడు. కాబట్టి శ్రీమన్నారాయణుడు చతుర్మూర్తి అనబడుతున్నాడు.

## 766. చతుర్బాహుః

నాలుగు భుజములు గలవాడు.

**వ్యూహమూలా పరావస్థానిరుపాదిక రూపతః**
**చత్వారో బాహవో యస్య స చతుర్బాహురుచ్యతే**

పరావసుదేవునిగా దేవకి గర్భాన నాలుగు భుజములతో అవతరించినవాడు.

**చత్వారః బాహనః యస్యసః చతుర్బాహుః** నాలుగుచేతులతో అవతరించినవాడు.

**ఉపసంహార సర్వాత్మన్ రూపమేతచ్చతుర్భుజమ్**
**జానాతు మాఽవతారం తేకంసోఽయందితిజన్మజః ॥**

చతుర్భుజములతో ఉండే నీరూపాన్ని ఉపసంహరించవలసినది. కంసుడునీ అవతారాన్ని తెలుసుకోకూడదు. అని దేవకి కృష్ణుడికి చెప్పింది.

**చత్వారః బాహవః అస్య** నాలుగు బాహువులు ఇతడికి కలవు.

పరమేశ్వరుడికి నాలుగు బాహువులున్నాయి. వాటిలో శంఖము, చక్రము, గద, పద్మములను ధరించి ఉంటాడు. ఏదైనా ఒక పని చెయ్యాలంటే చేతులు కావాలి. అవి

మానవుడికి రెండే ఉంటాయి. కాని భగవానుడికి మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అనబడే నాలుగు చేతులుంటాయి. ఈ నాలుగు బాహువులు నాలుగువర్ణాలకు ప్రతీక, నాలుగు వేదాలకు ప్రతీక. చతురాశ్రమధర్మాలకు ప్రతీక. అందుచేతనే పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు 'చతుర్బాహుః' అనబడతాడు.

లలితాసహస్రంలో 7వ నామము "చతుర్బాహుసమన్వితా"

## 767. చతుర్వ్యూహః

నాలుగు వ్యూహములు గలవాడు. 138వ నామము కూడా ఇదే.

**సమస్త వ్యస్తషాడ్గుణ్యవ్యూహావస్థా చతుష్టయమ్**
**చతుర్వ్యూహ ఇతిఖ్యాతః చతుర్వర్గప్రదోమనుః**

సకల షడ్గుణములతో వాసుదేవుడుగ, రెండు రెండు గుణములతో సంకర్షణుడు, ప్రద్యుమ్నుడు అనిరుద్ధుడు అనే రూపాలను ఈ రకంగా చతుర్వ్యూహాలను ధరించినవాడు. ఈ నామము అష్టాక్షరీ మహామంత్రము. చతుర్విధపురుషార్థప్రదము.

**చత్వారః వ్యూహాః యస్యసః చతుర్వ్యూహః**

షాడ్గుణ్యములను నాలుగు వ్యూహములుగా గలవాడు.

| | | |
|---|---|---|
| 1. జ్ఞానము | 3. ఐశ్వర్యమ | 5. శక్తి |
| 2. బలము | 4. వీర్యము | 6. తేజస్సు |

వీటిని షడ్గుణాలు అంటారు. వాసుదేవుని రూపంలో పూర్ణంగా ఉంటాడు.

| | | |
|---|---|---|
| సంకర్షణరూపంలో | - | జ్ఞానము, బలము |
| ప్రద్యుమ్నునిరూపంలో | - | ఐశ్వర్యము, వీర్యము |
| అనిరుద్ధుని రూపంలో | - | శక్తి, తేజస్సులను |

గలవాడు. అందుకే పరమేశ్వరుడు షాడ్గుణ్యపరిపూరితుడు.

## 768. చతుర్గతిః

నాలుగు గతులు గలవాడు.

**చతస్రః ప్రాప్తమోయస్మిన్ భక్తానాం స చతుర్గతిః** ఇంద్రపదవి, బ్రహ్మపదవి, కైవల్యము, మోక్షములను నాలుగువిధాలైన పదవులను, అధికారాలను భక్తులకు ఇచ్చేవాడు.

**చతస్రః గతయః ప్రాప్తయః యస్మిన్ సః చతుర్గతిః**

ఉపాసకుల శక్తిసామర్థ్యాలననుసరించి వారికి పదవులనిచ్చువాడు.

**చతుర్ణాం వర్ణానాం ఆశ్రమాణాం చ యథోక్త కారిణాం - గతిః**

శాస్త్రప్రకారము నడచుకునే నాలుగు వర్ణాలవారికి ఆశ్రయమైనవాడు.

మానవుడు ఏ కులంవాడైనా, ఏ మతంవాడైనా చేరవలసినది పరమేశ్వరుని సన్నిధికే. అందుచేతనే అతడు అందరికీ ఆశ్రయమైనవాడు. బ్రహ్మచారులకు, గృహస్థులకు, వానప్రస్థులకు, సన్యాసులకు ఆశ్రయమైనవాడు.

అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'చతుర్గతిః' అనబడుతున్నాడు.

## 769. చతురాత్మా

నాలుగురూపములు గలవాడు. 137వ నామము కూడా ఇదే.

**స్థూలసూక్ష్మే జాగ్రదాదౌ చాతురాత్మ్య ప్రకాశనాత్**
**చతురాత్మా స విజ్ఞేయః వస్వర్ణో మను రుత్తమః**

జాగ్రస్వప్నసుషుప్తి తురీయము అనే నాలుగు అవస్థలలోను నాలుగు రూపాలు ధరించి ఉండేవాడు. ఈ నామము అష్టాక్షరీమంత్రము. మహత్తరమైనది.

**చత్వారః ఆత్మానః యస్యసః చతురాత్మా**

నాలుగు అవస్థలలోనూ నాలుగురూపములు గలవాడు.

**మాండూక్యోపనిషత్తు**లో ఈ అవస్థల గురించి వాటి అధిపతుల గురించి చెప్పబడింది.

**జాగరిద్రస్థానో బహిః ప్రజ్ఞః సప్తాంగ ఏకోనవింశతి**
**ముఖః స్థూలభుగ్ వైశ్వానరో ప్రథమపాదః**

అంతకుముందు ఆత్మకు నాలుగుపాదాలున్నాయి అని చెప్పారు. అందులో

జాగ్రదవస్థ మొదటిపాదం. దీనికి అధిపతి వైశ్వానరుడు. అతడికి ఏడు అంగములు, 19 నోళ్ళు ఉన్నాయి.

**స్వప్నస్థానోంతః ప్రజ్ఞః సప్తాంగ ఏకోనవింశతి**
**ముఖః ప్రవివిక్తభుక్ తైజసోద్వితీయపాదః**

స్వప్నావస్థ రెండవపాదం. దీనికి అధిపతి తైజసుడు. దీనికి ఏడు అంగములు, 19 నోళ్ళు ఉన్నాయి.

**సప్తాంగములు :**

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. స్వరము | – శిరస్సు | 5. జలం | – మూత్రస్థానం |
| 2. సూర్యుడు | – కన్ను | 6. భూమి | – పాదాలు |
| 3. వాయువు | – ప్రాణం | 7. ఆహవనీయాగ్ని | – నోరు |
| 4. ఆకాశం | – శరీరం | | |

**19 నోళ్ళు :**

| | | |
|---|---|---|
| 1. జ్ఞానేంద్రియాలు | – | 5 |
| 2. కర్మేంద్రియాలు | – | 5 |
| 3. పంచప్రాణాలు | – | 5 |
| 4. అంతఃకరణ చతుష్టయం | – | 4 |
| మొత్తం | | 19 |

**యత్ర సుప్తోన కంచనకామం కామయతేనకంచన**
**స్వప్నం పశ్యతి, తత్ సుషుప్తం, సుషుప్త స్థాన**
**ఏకీభూతః ప్రజ్ఞాన ఏవానందమయో హ్యానందభుక్**
**చేతోముఖః ప్రాజ్ఞస్తృతీయపాదః**

సుషుప్తి మూడవదశ. దానికి అధిపతి ప్రాజ్ఞుడు.

**నాంతః ప్రజ్ఞం నబహిః ప్రజ్ఞం నోభయతప్రజ్ఞం**
**నప్రజ్ఞాన ఘనం ప్రజ్ఞం నా ప్రజ్ఞం । అదృష్టమవ్యవ**
**హార్య మగ్రాహ్యమలక్షణ మంచిత్య మవ్యపదేశ్య**
**మేకాత్మ ప్రత్యయసారం ప్రపంచోపశమం శాతం**
**శివమద్వైతం చతుర్థం మన్యంతే స ఆత్మా విజ్ఞేయః**

నాల్గవదశ అంతరమైన చేతనాకాదు బాహ్యమైన చేతనాకాదు. రెండూ కలసినది అంతకన్నాకాదు. అస్పష్టమైన చేతనామాత్రంకాదు, సమిష్టిచేతనాకాదు. అచేతన అంతకన్నాకాదు. ఇది కనిపించదు. ఇంకొక దానితో సంబంధం పెట్టి చెప్పటానికి వీలులేదు. దానిని మనస్సు గ్రహించలేదు. ఊహించటానికి శక్యంకాదు. గుర్తులు చెప్పి నిర్ణయించటానికి వీలుపడదు. ఇదే ఆత్మ. అన్ని వికారాలు అందులో ఆగిపోతాయి. అదే శాంతం, శివం, అద్వైతం. అదే మనం తెలుసుకోవలసిన ఆత్మ.

నాల్గవదశ తురీయము దాని అధిపతి ఆత్మ. ఈ రకంగా పరమాత్మ నాలుగురూపాలు గలవాడు. అందుకే శ్రీమన్నారాయణుడు 'చతురాత్మా' అనబడుతున్నాడు.

**చతురః ఆత్మా అస్య** రాగద్వేషాలు లేనిది. పరమేశ్వరుడికి అహంకార మమకారాలు ఉండవు. రాగద్వేషాలుండవు. అందుచేత 'చతురాత్మా' అనబడుతున్నాడు.

## 770. చతుర్భావః

నాలుగు ప్రయోజనాలు కలిగి ఉన్నవాడు.

**శాస్త్రదానాది పంచాభివ్యంచనాత్ స్థూలసూక్ష్మయోః**

**చతుర్భావ స్సమాఖ్యాతః మున్యర్ణశ్చ గతిప్రదః**

సృష్టి, స్థితి, లయము, శాస్త్రప్రదానము మొదలైన స్థూల, సూక్ష్మప్రయోజనాలను, తన నాలుగు వ్యూహాల యందు ప్రకటింపచేయువాడు.

**చత్వారః భావాః యస్యసః చతుర్భావః**

సంకర్షణ, వాసుదేవ, ప్రద్యుమ్న, అనిరుద్ధమూర్తులలో సృష్టిస్థితి సంహారము, శాస్త్రప్రదానము అనే నాలుగు ప్రయోజనాలు ప్రకటించినవాడు.

చతుర్విధపురుషార్థాలు ఇతనినుండియే కలుగుతాయి. అవే ధర్మార్థకామ మోక్షాలు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'చతుర్భావః' అనబడుతున్నాడు.

## 771. చతుర్వేదవిత్

నాలువేదాలు తెలిసినవారిచే అర్చించ తగినవాడు.

**పరావర విభాగానాం కోవిదాస్తయ మేవయే**

**చతుర్వేద విదిత్యుక్తః వస్వర్ణో విగమప్రదః ॥**

నాలుగువేదాల సారమూ తెలుసుకున్నవారి చేత అర్చించబడేవాడు. ఈ నామము అష్టాక్షరీ మంత్రము.

**చతుర్వేదైః విద్యతే కణికామా తతయా జ్ఞాయతే ఇతి 'చతుర్వేవిత్'** నాలుగు వేదాలు తెలిసినవారు కూడా, ఆ పరమేశ్వరుని మహిమను కొద్దిగానే తెలుసుకోగలుగుతారు.

వేదములయొక్క సారమే వేదాంతము. దాని సారము. ఉపనిషత్తులు. వాటి సారము 'మహావాక్యాలు. ఈ మహావాక్యాలసారమే పరమేశ్వరుడు. అందుకే 'చతుర్వేదవిత్' అనబడుతున్నాడు.

## 772. ఏకపాత్

అంశావతారమైనవాడు.

**ఏకాంశేనా వశీర్ణత్వాత్ ఏకపాదితికథ్యతే**

ఒక అంశతో మాత్రమే అవతరించినవాడు.

**ఏకః పాదః యస్యసః ఏకపాత్**

శ్రీమహావిష్ణువు ఎత్తిన అవతారాలలో కొన్ని పూర్ణావతారాలు కాగా కొన్ని అంశావతారాలు. రామావతారము, కృష్ణావతారము వంటివి పూర్ణావతారాలు. కాగా పరశురామావతారము అంశావతారము. ఈరకంగా అంశావతారాలు ఎత్తినవాడు.

పరమేశ్వరుడు తనలోని ఒక భాగంతో ఈ జగత్తును సృష్టించాడు.

**భగవద్గీత**లోని 10వ అధ్యాయము **'విభూతియోగము'**లోని 42వ శ్లోకము.

**అథవా బహునై తేన కిం జ్ఞాతేన తవార్జున**

**విష్టభ్యాహమిదం కృత్స్నం ఏకాంశేనస్థితోజగత్ ॥**

అర్జునా ! చరాచరజగత్తును కేవలము నాయొక్క యోగశక్తి యొక్క ఒక అంశతోనే నిర్మిస్తున్నాను.

కాబట్టి పరమేశ్వరుని శక్తి అనంతమైనది. ఆయన ఏ పని చెయ్యాలన్నా కేవలము సంకల్పమాత్రంచేతనే చెయ్యగలడు. ఈ విధంగా అంశావతారములెత్తినవాడు.

## 773. ఆవర్తనః

మరల మరల అవతరించువాడు.

**ఏతాదృశం హి సర్వత్ర సర్వదా సర్వథాపిచ**

**వ్యూహస్య విభవస్యాపి యస్యాస్త్వా వర్తనం త్వితి**

**సమావర్త స్సమక్యాతః వస్వర్ణో జన్మనాశకః ॥**

ఈరకంగా వ్యూహావతారములు, విభవావతారములు ఎప్పుడూ ధరిస్తూనే ఉండేవాడు. ఈ నామము అష్టాక్షరీమంత్రము - జన్మరాహిత్యము.

**సమంతాత్ ఆవర్తః యస్యసః సమావర్తః**

వ్యూహవిభవములందు మారిమారి వచ్చేవాడు.

**సంసార చక్రం సమ్యక్ ఆవర్తయతి** సంసార చక్రాన్ని లెస్సగా త్రిప్పువాడు.

**భగవద్గీత**లోని 18వ అధ్యాయం **'మోక్షసన్యాసయోగం'**లోని 61వ శ్లోకం.

**ఈశ్వరసర్వభూతానాం మృద్దేశేఽర్జునః తిష్ఠతి**
**భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా ॥**

పరమేశ్వరుడు అన్నిజీవులయందు అంతర్యామిగా ఉండి, తన మాయచే సంసార చక్రమును త్రిప్పుతున్నాడు అని చెప్పబడింది.

జీవుడు సంసారమనే బండి చక్రంలో పడి గిరగిరా తిరుగుతూ ఉంటాడు. దీనికారణం అతడు చేసిన కర్మఫలం. మానవుడు పుడుతున్నాడు. కర్మచేస్తున్నాడు. కర్మఫలం అనుభవించటానికి మళ్ళీ జన్మిస్తున్నాడు. ఇలా సంసారచక్రాన్ని త్రిప్పేది పరమేశ్వరుడే. అందుకే శ్రీమన్నారాయణుడు 'సమావర్తః' అనబడతాడు.

## 774. అనివృత్తాఽఽత్మా

నిరపేక్షకుడు, కోరికలేనివాడు.

**నివృత్తాత్మా మనోయస్య సదాజగదమిశ్రతమ్ ॥**

జగద్వ్యాపారములందు ఆసక్తిలేనివాడు. సృష్టి, స్థితి లయాలయందు ఆసక్తి లేనివాడు.

**నివృత్తః ఆత్మాయస్యసః నివృత్తాత్మా** సృష్టి చెయ్యాలనే కోరికలేనివాడు.

మహాప్రళయం జరిగిన తరువాత, పరమేశ్వరుడు మళ్ళీ సృష్టి చెయ్యాలి అని సంకల్పిస్తాడు.

దీనికి కారణము : మహాప్రళయం జరిగినప్పుడు కర్మక్షయం కాని జీవరాశి అంతా తమ కర్మను తమతో పాటే మూటకట్టుకుని ఆ పరమేశ్వరునిలో లీనమవుతుంది. ఇప్పుడు ఆ జీవులకర్మక్షయం చేసి వాటికి మోక్షం ఇవ్వాలనే తలంపుతో మళ్ళీ సృష్టి చెయ్యాలని సంకల్పించాడు. అంతేకాని తన లీలా వినోదం కోసం మాత్రం సృష్టి చెయ్యటం లేదు. సృష్టిమీద పరమేశ్వరుడికి ఏరకంగానూ కోరికలేదు. అందుచేత అతడు నివృత్తాత్మా అనబడుతున్నాడు.

పరమేశ్వరుడు అంతా తానే అయి ఉన్నాడు. కాబట్టి దేనినుండి విడిపడడు.

శంకరభగవత్పాదులవారు ఈ నామాన్ని 'అనివృత్తాత్మా' అని చెబితే, పరాశరభట్టరు వారు 'నివృత్తాత్మా' అన్నారు. అంటే నివృత్తి మార్గంలో ప్రయాణించేవాడు.

**కఠోపనిషత్తు**లో యమధర్మరాజు నచికేతుడికి బ్రహ్మవిద్యను బోధిస్తూ వేదంలో రెండు మార్గాలు చెప్పబడ్డాయి. 1. ప్రవృత్తి మార్గము 2. నివృత్తి మార్గము. ఈ రెండింటిలోనూ మానవుడు ఏదో ఒక మార్గాన్ని ఎన్నుకోవాలి. ప్రవృత్తి మార్గము లౌకికము. కాగా నివృత్తి మార్గము మోక్షదాయకము" అని చెప్పబడింది. కాబట్టి నివృత్తాత్మా అంటే విషయవాసనలు లేనివాడు. వైరాగ్య చింతనతో ఉండేవాడు. తనను చేరాలనుకునే వారికి నివృత్తిమార్గాన్ని ప్రబోధించేవాడు. అందుకే శ్రీమన్నారాయణుడు నివృత్తాత్మా అనబడతాడు.

## 775. దుర్జయః

జయింప శక్యముకానివాడు.

**శక్యాదేవమను ష్యాద్యైః వశీకర్తుం న శక్యతే**
**అన్వేష్టుం వాపి యస్య స్యాత్ దుర్జయ స్సప్తవర్ణకః ॥**

దేవతలుగాని, మనుషులుగాని తమ శక్తి సామర్థ్యాలచేత వెతకటానికి వీలుకానివాడు. ఈ నామము సప్తాక్షరీమంత్రము.

**దుఃఖేనాపి జేతుమ్ అశక్యః దుర్జయః** ఏ శక్తివల్లా వశంకానివాడు.

**యన్నదర్శితవానేషః కస్తదన్వేష్టు మర్హతి**

వీడు తనకు తాను చూపకున్నచో, వీడిని ఎవరూ తెలుసుకొనలేరు.

ఎంత కష్టపడినప్పటికీ అతన్ని జయించటం సాధ్యంకాదు.

## 776. దురతిక్రమః

అతిక్రమింపరానివాడు.

**అతిక్రమ్య స్వపన్మూలం సర్వేషాం ప్రాపకాంతరమ్**
**నాస్తీతి సర్వపాపఘ్నం స స్మృతో దురతిక్రమః**

దేవతలకు, మానవులకు కూడా సకల పాపాలను హరించే తన పాదాలు తప్ప వేరొక గత్యంతరంలేదు. అన్నట్లుగా ఉండేవాడు.

**దుఃఖేనాపి అతిక్రమితుం అశక్యః దురతిక్రమః** తన పాదాలు తప్ప శరణాగతి వేరులేదు అని తెలియచెప్పి, ఎవరివల్లా కూడా అతిక్రమింపరానివాడు.

అతిక్రమించరాని విధంగా శాసించేవాడు. పరమేశ్వరుడున్నాడనే భయంతోనే గాలివీస్తున్నది. సూర్యుడు ఎండ కాస్తున్నాడు. అష్టదిక్పాలకులు తమ కార్యక్రమాలను

సవ్యంగా నిర్వర్తిస్తున్నాయి అని చెప్పబడింది. కాబట్టి పరమేశ్వరుని ఆజ్ఞ అనుల్లంఘనీయము ఎవరికీ ఆ ఆజ్ఞను మీరశక్యముకాదు.

## 777. దుర్లభః

తేలికగా లభించనివాడు.

**అజితేంద్రియ దుష్ప్రాప్యోః దుర్లభ స్స చ కథ్యతే ।**

ఇంద్రియాలను జయించిన వారికి లభించనివాడు.

**దుఃఖేనాపి లబ్ధుమ్ అశక్యః దుర్లభః** పరమేశ్వరుని పొందాలి అంటే నివృత్తి మార్గంలోనే పయనించాలి. విరాగులకు మాత్రమే అతడు చేరువైనవాడు. జ్ఞానులకు దగ్గరగా ఉంటాడు. అంతేకాని లౌకికమైన కోరికలయందు ఆసక్తిగలవారికి, ఇంద్రియలోలురకు, కామక్రోధాలను జయింపలేనివారికి పరమేశ్వరుడు దుర్లభుడు. లౌకికసుఖాలను వదలి పిపీలికాది బ్రహ్మ పర్యంతము ఆ పరమాత్మ స్వరూపంగా భావించేవారికి, చరాచరజగత్తును తమలోనే చూడగల జ్ఞానులకు మాత్రమే అతడు పొందదగినవాడు. ఇతరులకు కడు దుర్లభుడు.

అనేక వేల జన్మలయందు చేసిన భక్తిజ్ఞానవైరాగ్యాలవల్ల మాత్రమే భగవంతుని పొందగలరు. అతడు అనన్యమైన భక్తితోనే లభిస్తాడు. ఏ ఇతరమైన దానిచేత లభించడు. అందుకే శ్రీమన్నారాయణుడు 'దుర్లభః' అనబడతాడు.

## 778. దుర్గమః

సమీపించరానివాడు.

**నేత్రదుర్బలవృత్తీనాం మధ్యాహ్నే ద్యుమణేర్యథా**
**ప్రాప్తిర్దుష్కర తేజస్త్వాత్ దుర్గమః పరికీర్తితః ॥**

నేత్రదృష్టి సమంగా లేనివారు మధ్యాహ్నం పూట సూర్యుని చూడలేరు. అలాగే అత్యంత కాంతివంతుడైన సర్వేశ్వరుని ఎవరూ చూడలేరు.

**దుఃఖేనాపి గన్తుమ్ అశక్యః దుర్గమః** పరమేశ్వరుడు తేజోమయమైన కాంతిబింబము. కొన్నికోట్ల సూర్యులకాంతితో ప్రకాశిస్తున్నాడు. అంత తేజోమయుడైన పరమేశ్వరుని పంచభూతములతో ఏర్పడిన చర్మచక్షువులతో చూడటం సాధ్యం కాని పని. అందుకే అతడు దుర్గముడు.

పరబ్రహ్మ పాలలో కలిసి ఉన్ననెయ్యిలాగా జీవులందరిలోనూ అంతర్యామిగా ఉన్నాడు. పాలనుంచి నేతిని తియ్యటానికి ఎంత శ్రమపడాలో, ఆత్మసాక్షాత్కారం పొందటానికి కూడా అంత శ్రమపడాలి. అందుకే శ్రీమన్నారాయణుడు 'దుర్గమః' అనబడుతున్నాడు.

## 779. దుర్గః

ప్రవేశింపజాలనివాడు.

**దుష్ప్రవేశతయా దుర్గః పాపిభిస్తు కదాచన** పాపాత్ములచే ఎప్పటికీ పొందశక్యము కానివాడు.

**దుఃఖేన గచ్ఛంత్యత్రేతి దుర్గః** అవిద్య, అజ్ఞానముచే కప్పబడి ఉన్నవారికి ప్రవేశింపవీలుకానివాడు.

పరమేశ్వరుని పొందాలంటే అది కేవలము జ్ఞానులకే సాధ్యము. అంతేకాని అశాశ్వతమైన ఆనందం కోసం ప్రాకులాడే అజ్ఞానులకు అతడు అందడు. సాధకుడు కొన్ని జన్మలపాటు విరాగియై నివృత్తి మార్గంలో పయనించాలి. ఈ జగత్తంతా తనలోనే ఉన్నది. తానే పరబ్రహ్మ అని భావించాలి. అప్పుడు మాత్రమే అతడికి సాయుజ్యం లభిస్తుంది. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'దుర్గః' అనబడుతున్నాడు.

## 780. దురావాసః

దుర్లభమైన వాసము గలవాడు.

**దుష్కరావాస భూమిత్వాత్ దురావాస ఇతీరితః**

**దురారిణస్తు దుర్మార్గాగామినస్తా న్నిహంతి యః**

పాపాత్ములకు దుర్లభమైన వాసము గలవాడు.

**దుఃఖేనాపి ఆవాసయితుమ్ అశక్యః దురావాసః**

అజ్ఞానులను తనపాదాల చెంతకు కూడా చేరనీయనివాడు.

యోగులైన వారు ఎంతో శ్రమపడి ఇతన్ని తమ హృదయాలలో నివసింపచేస్తారు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు "దురావాసః' అనబడతాడు.

# 49. బుద్ధావతారము

"గురువుగారూ ! గౌతమబుద్ధుడు వేదాలులేవని నాస్తికవాదాన్ని లేవదీశాడు కదా! మరి అతడు కూడా శ్రీమహావిష్ణువు యొక్క అవతారమేనా ? అదెలా జరిగిందో వివరించండి" అన్నాడు కృష్ణశర్మ. వివరించటం ప్రారంభించాడు నారాయణభట్టు.

గౌతమబుద్ధుడు కూడా శ్రీమహావిష్ణువు యొక్క అవతారమే. అందులో సందేహం లేదు. అదెలా జరిగిందో వివరిస్తాను వినండి.

భూలోకంలో వేదవిహితమైన కర్మలు ఆచరిస్తున్నారు. ధర్మం నాలుగు పాదాలా నడుస్తున్నది. మరణానంతరము ప్రజలు స్వర్గం చేరుతున్నారు. యమలోకానికి ఎవరూ పోవటంలేదు. అందరూ స్వర్గానికే వెళ్ళటం వల్ల దేవతలకు, మానవులకు మధ్య భేదం లేకుండాపోయింది. కాబట్టి యముడు, ఇంద్రుడుకూడా శ్రీమహావిష్ణువు తో మొరపెట్టు కున్నారు. అప్పుడు విష్ణుమూర్తి "నేను భూలోకంలో అవతరించి, వేదాలయందు గౌరవము పోగొట్టి, వారిని కర్మభ్రష్టులుగా చేసి, స్వర్గానికి రాకుండా చేస్తాను" అని వారితో చెప్పాడు.

కపిలవస్తుపురాన్ని పరిపాలిస్తున్నాడు శాక్యవంశపురాజైన శుద్ధోదనుడు. ఆయన భార్యమాయాదేవి. వీరికి కలిగిన ఏకైక సంతానమే సిద్ధార్థుడు. ఇతడు చిన్నతనం నుంచీ కూడా చాలా సున్నితమనస్కుడు. రాకుమారుడు పెరిగి పెద్దవాడయినాడు. వివాహం కూడా జరిగింది. రాహులుడనే కుమారుడు కలిగాడు.

ఒకరోజు సిద్ధార్థుడు నగరంలో వెడుతుండగా ఒక పండు ముసలి ఎదురువస్తాడు. అతడు నడవలేక, నడవలేక నడుస్తుంటాడు. అతడు అలా ఎందుకు ఉన్నాడు ? అని సేవకులను అడిగాడు సిద్ధార్థుడు. అతడు జరాభారంతో ఉన్నాడు అని సమాధానం చెప్పారు సేవకులు. కొంత సమాయానికి ఒక కుష్ఠురోగి ఎదురువచ్చాడు. శరీరమంతా రక్తం కారుతూ మహా అసహ్యకరంగా ఉన్నది అతడు అలా ఎందుకు ఉన్నాడు ? అని అడిగాడు సిద్దార్ధడు. అతడు వ్యాధిగ్రస్తుడు అని చెప్పారు సేవకులు. ఇంకొంతదూరం వెళ్ళేసరికి మృతదేహం ఎదురయింది. అతడు చనిపోయాడు అని చెప్పారు సేవకులు.

ఆ సంఘటనల గురించే ఆలోచిస్తున్నాడు సిద్ధార్థుడు. దానికి కారణం ఏమిటి అని మంత్రి నడిగాడు. ప్రతి మానవుడికి ముసలితనము, రోగము, మరణము తప్పవు అని చెప్పాడు మంత్రి. దీన్ని గురించి తీవ్రంగా ఆలోచించాడు. దీనికి పరిష్కారం కనుక్కోవాలనే ఉద్దేశ్యంతోనే ఇల్లు వదలివెళ్ళిపోయాడు.

అలా వెళ్ళిన సిద్ధార్థుడు గయలో బోధివృక్షము క్రింద పన్నెండు సంవత్సరాలు తపస్సు చేశాడు. అప్పుడతనికి ఆత్మసాక్షాత్కామయింది. గౌతమబుద్ధుడైనాడు. తపస్సు విరమించాడు. బౌద్ధమతాన్ని స్థాపించి శూన్యవాదాన్ని ప్రచారంచేశాడు.

ఈరకంగా శ్రీమహావిష్ణువే వైదికధర్మానికి వ్యతిరేకంగా ప్రచారం చేశాడు. ఈ విషయం **మహాభాగవతం**లో చెప్పబడింది.

**శివపురాణం**లో బుద్ధుణ్ణి గురించి ఇంకో కథ కూడా బాగా ప్రచారంలో ఉన్నది. పూర్వకాలంలో త్రిపురాసురులు అనే రాక్షసులు మూడుపురాలను నిర్మించుకున్నారు. అవి ఆకాశగమనం గలవి. వాటిని ఎక్కడబడితే అక్కడ దించుతున్నారు. జనావాసాలు నాశనమవుతున్నాయి. దేవతలంతా లోకాలను రక్షించమని శ్రీమహావిష్ణువును వేడుకున్నారు అప్పుడు శ్రీమహావిష్ణువు "త్రిపురాసురులు రాక్షసులే. కాని శివభక్తులు. వేదవేదాంగవిదులు. నిత్యము అగ్నిహోత్రం నిర్వహించి వైదికకర్మలు ఆచరిస్తారు. కాబట్టి వారిని చంపటం అంత తేలికకాదు. ముందు వారిని ధర్మమార్గమునుంచి తప్పించాలి. దీనికి ఒక ఉపాయమున్నది. బౌద్ధమతాన్ని సృష్టించి, త్రిపురములందు సభలు ఏర్పాటుచేసి ఆ మతప్రచారం కావించండి. నేను సమయం చూసి వారిని సంహరిస్తాను అన్నాడు.

దేవతల వ్యూహం ప్రకారము త్రిపురములందు బౌద్ధమతం బాగా ప్రచార మయింది. సృష్టి అంటే స్త్రీ పురుష సంయోగము. వర్ణవ్యవస్థ, ఆచారవ్యవహారాలు, నియమనిష్ఠలు మానవకల్పితాలు. దేవడు అనేవాడులేడు. కర్మలకు అర్థంలేదు. వేదాలు కొందరు స్వార్థపరులు వ్రాసుకున్న గ్రంథాలు అని ప్రచారం చేశారు. ఈ వాదన త్రిపురాసురులకు కూడా నచ్చింది. వారికి వినాశకాలం దాపురించింది. అప్పటిదాకా వల్లెవేసిన వేదాలు పనికిరానివి అయినాయి. నియమనిష్ఠలు గంగలో కలిశాయి. వావివరుసలు, వర్ణవ్యవస్థ రూపుమాసి పోయినాయి. ధర్మము భ్రష్టుపట్టి పోయింది. కర్మలు గాలిలో కలిసిపోయినాయి.

ఆ సయమం కోసమే ఎదురుచూస్తున్నారు దేవతలు. శ్రీమహావిష్ణువు నాయకత్వంలో పినాకపాణి యుద్ధంచేసి త్రిపురాసుర సంహారం చేశాడు. ఈరకంగా బుద్ధుడు వేదవ్యతిరేకత ప్రచారంచేసి రాక్షససంహారంచేశాడు.

అతడు దుర్మార్గులను వేదభ్రష్టులుగ చేసి వారిని సంహరిస్తాడు. దివ్యమంగళ విగ్రహుడు. లోకాల సారాన్ని ఉపదేసించి రాక్షసులను మోహింపచేస్తాడు. రాక్షసులను వశపరచుకోవటానికి అనేక వేషాలు వేస్తాడు. సంసారాన్ని తంతువులాగా వృద్ధి చేస్తాడు. అతడెప్పుడూ దేవతల కోసమే పనిచేస్తాడు. న్యాయమైన పనులుచేస్తాడు. నాస్తికాచారాలను

ఆచరించాడు. వాటికి సంబంధించి ఆగమాలు కూడా వ్రాశాడు. సంసారబంధనాలు త్రెంచుకున్నట్లు కనిపిస్తాడు. సుందరాకారుడు. రాక్షసహృదయాలను ఆకర్షిస్తాడు. అందమైన నాభి, కనులు గలవాడు. అందరితోను స్తోత్రము చేయబడినవాడు. ఐహికవిషయాలయందు ఆసక్తిని కలిగించినవాడు. అహింసావాదిని అని చెప్పటానికి గుర్తుగా చేతిలో నెమిలి పింఛము ధరించాడు. నాస్తికవాదంతో ఆస్తికులను గెలిచినవాడు. అతిచతురంగా వాదించగల సమర్ధుడు. గంభీరహృదయుడు. నాస్తికులను రౌరవాదినరకాలలో పడేసేవాడు.

ఈ విషయాలన్నీ 781 నుంచి 804 వరకు నామాలలో వివరించటం జరిగింది. ఇక నామాలను చూద్దాం.

## 781. దురారిహా

దుర్మార్గులను నశింపచేయువాడు.

**త్రయీమార్గ త్యాజనా ద్యైః సస్యాన్నిత్యం దురారిహా**

దుర్మార్గులను వేదభ్రష్టులుగా చేసి వారిని నశింపచేయువాడు.

**దురారీన్ హంతీతి దురారి హా** దుర్మార్గులయిన శత్రువులను వేదమార్గము నుంచి తప్పించి వారిని నాశనం చేసేవాడు.

**మాయామోహేన తేదైత్యాః ప్రకారైః బహుభిస్థదా**

**వ్యుత్థాపితాయథానైషాం త్రయీం కశ్చిదరోచయత్ ॥**

**నిహతాశ్చ సురాదౌవ్యైః సన్మార్గ పరిపంథినః ॥**

అసురులను అనేకరకాలుగా మోహింపచేయగా వారందరూ వేదమార్గము వదలి, సాధుమార్గవిరోదులై దేవతలచే చంపబడిరి.

దురారులు – చెడుమార్గంలో ప్రవర్తించేవారు.

దురారిహా – చెడు మార్గంలో వర్తించే వారిని సంహరించువాడు.

ధర్మమార్గాన్ని వ్యతిరేకించే వారిని, ధర్మజీవనాన్ని ఆటంకపరచే వారిని సంహరించేవాడు.

తన భక్తుల హృదయాలలో అసురీభావాన్ని అంతమొందించేవాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు దురారిహా అనబడుతున్నాడు.

## 782. శుభాంగః

దివ్యమంగళవిగ్రహుడు.

**మాయామోహనవేషేణ విప్రలభ్యాసురానపి**

**అనుప్రవిష్టస్తాక్యోసౌ శుభాంగ ఇతికథ్యతే ॥**

రాక్షసులతో నమ్మదగినవాడు అనిపించుకుని, మంచివేషంతో వారిని వంచించి, వారిలో ప్రవేశించి, వారిని మోసము చేసేవాడు.

**శుభమ్ అంగమ్ యస్యసః శుభాంగః** వీడు బాగానమ్మదగినవాడు అనిపించే విధంగా వేషం ధరించగలిగే దివ్యమంగళ విగ్రహుడు.

రాక్షసులచే నమ్మించటానికి వారికి నచ్చిన రూపం ధరించేవాడు. వారు మెచ్చేటట్లు మాట్లాడేవాడు. ఈ రకంగా అందమైన రూపం ధరించి, రాక్షసుల ఆకర్షించి వారిని సంహరించేవాడు.

క్షీరసాగర సమయంలో అమృతం పుట్టింది. దేవదానవులంతా దానికోసం ఎగబడ్డారు. అప్పుడు శ్రీమహావిష్ణువు మోహినీ రూపం ధరించి, తన అందచందాలతో సొగసుతో రాక్షసవీరులను మోసంచేశాడు. అందుకే శ్రీమన్నారాయణుడు 'దురారిహా' అనబడతాడు.

## 783. లోక సారంగః

లోకసారముపదేసించి వారల మోహింపచేయువాడు.

**న్యాయానపేతం యత్సారం భోగనిర్వాణ వర్త్మ చ**

**లోకే తదచ్ఛతి సదా లోకసారంగ ఈరితః ॥**

రాక్షస సంహారానికి తగినటువంటి న్యాయమైన భోగ, మోక్షసాధనాలు తెలిసినవాడు.

**లోకే సారమ్ గచ్ఛతీతి లోకసారంగః**

భోగమార్గముపదేశించి వారిని పతనము చేయువాడు.

పూవ్వులలోని మకరందాన్ని తుమ్మెదలు గ్రహించినట్లుగా ఇతడు లోకాల సారాన్ని తెలిసినవాడు.

సారంగము అంటే తుమ్మెద. అన్ని లోకాలయందు సారమైన పదార్థము (చైతన్యము) అతడే. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'లోకసారంగః' అనబడుతున్నాడు.

# 784. సుతంతు

మంచి వల. రాక్షసులను వశపరచుకోవటానికి మంచి వలను గలవాడు.

**తంతుః కృత్రిమశాంత్యాది రూపస్త ద్రహణాయ వై**

**సుతస్తుః శోభనస్యేతి సప్తార్ణో దోష నాశకః ॥**

రాక్షసులను వశపరచుకోవటానికి అనేక వేషములు వేసేవాడు. ఈరకంగా మంచి వలగలవాడు. ఈ నామము సప్తాక్షరీ మంత్రము, దోషనాశహరి.

**శోభనః తంతుః యస్యసః సుతంతు**

శాంతము మొదలైన గుణలాపాదించుకుని రాక్షసులమోసముచేయువాడు.

**తన్యతే – ఇతి తంతు** విస్తరింపచేయబడునది. ఈ జగత్తుఅంతా పరమేశ్వరుని రూపమే. ఈరకంగా స్వాయంభువ మనువు, శతరూపలరూపంలో 84 లక్షల జీవరాశిని ఉద్భవింపచేసినవాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'సుతంతుః' అని పిలువబడుతున్నాడు.

# 785. తంతువర్ధనః

సంసారాన్ని తంతువులాగా వృద్ధి చేసేవాడు.

**అంశుభిః పాప రుచిభిః తంతుః సంసార నామకమ్**

**యస్సంతనోతీతి సదాతంతు వర్ధన ఈరితః**

పాపకర్మలయందు మక్కువను పెంచుతూ, సంసారబంధనాలను మరింత ధృడం చేసేవాడు.

**తంతుం వర్ధయతీతి తంతువర్ధనః** వైదికకర్మలు చేసే కన్న అవైదికకర్మలు చేసినట్లైతే ఫలితము ఎక్కువగా ఉంటుంది అని నమ్మించి సంసారబంధనాలను బాగాపెంచేవాడు.

తంతువు అంటే – దారము సాలెపురుగు నోట్లో నుంచి దారం ఎంత తేలికగా వస్తుందో, అదేవిధంగా ఈ సంసారాన్ని వృద్ధి చేసేవాడు.

లౌకికసుఖాల కోసం వైదికర్మలు చెయ్యటం కన్న అవైదిక కర్మలు చేసినట్లైతే ఫలితం త్వరగా వస్తుంది. దీనిమీద నమ్మకం కలుగచేసి, వైదికకర్మలకు దూరం చేసేవాడు.

**భగవద్గీత**లోని 16వ అధ్యాయం **'దైవాసురసంపద్విభాగయోగము'**లోని 19వ శ్లోకము.

**తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్ ।**
**క్షిపామ్యజస్రమశుభాన్ అసురీష్వేవ యోనిషు ॥**

ఇతరులను ద్వేషించేవారిని, క్రూరకర్మలు చేసేవారిని సంసారమనే అసురయోనుల యందు పడేస్తుంటాను.

అసురయోనులయందు జన్మింపచెయ్యటము అంటే వారిని సంసార బంధనాలలో ఇరికించటము. ఆరకంగా వారు ఇదే సుఖము అనుకుని ఈ బంధాలలో ఉండిపోతారు.

ఇక్కడ వర్ధనః అంటే – కేవలము వృద్ధి చెయ్యటమేకాదు, నశింపచెయ్యటం కూడా అని అర్థం. సాలెపురుగు తననోటిలోనుంచి దారాలను సృష్టించినట్లే ఈ సంసారాన్ని సృష్టించి, మళ్ళీ ఆ పురుగు దారాలను తన నోటిలోకి తీసుకున్నట్లుగా ఈ జగత్తును నశింపచేసేవాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'తంతువర్ధనః' అనబడుతున్నాడు.

## 786. ఇంద్రకర్మా

దేవతలకోసం పనిచేసేవాడు.

**ప్రసన్నేంద్రా ద్యర్థతయా దైత్యసంహారరూపకమ్**
**కర్మ యస్యాస్తీంద్రకర్మా హ్యష్టార్ణో మనురుత్తమః ॥**

ఇంద్రాది దేవతలు తనను శరణు జొచ్చినప్పుడు వారిని రక్షించటం కోసం దైత్యసంహారం చేసేవాడు. ఈ నామము అష్టాక్షరీ మంత్రము. శ్రేష్ఠమైనది.

**ఇంద్రాయ కర్మ యస్యసః ఇంద్రకర్మ**

ఇంద్రుని కోసం అంటే ఇంద్రుని రక్షించటం కోసం పనిచేసేవాడు.

**తమూచుః సకలాః దేవాః ప్రణిపాత పురస్సరమ్**
**ప్రసీదనాథ దైత్యేభ్యః త్రాహీతి శరణార్థినః ॥**

శరణు పొందిన ఇంద్రాది దేవతల కోసం ఇటువంటి పనులు చేసేవాడు.

రాక్షసులు విజృంభించి స్వర్గాన్ని ఆక్రమించుకుని దేవతలను అరణ్యాలకు తోలివేశారు. అటువంటి సమయంలో ఇంద్రాది దేవతలను ఆదుకున్నవాడు. వారికోసం దైత్యసంహారం చేసినవాడు. వృత్రాసురుడు, హిరణ్యకశ్యపుడు, బలిచక్రవర్తి ఈ రకంగా అనేకమంది దానవులను సంహరించి దేవతల రాజ్యాన్ని (స్వర్గాన్ని) వారికి ఇప్పించాడు. అందుచేతనే అతడు 'ఇంద్రకర్మా' అనబడుతున్నాడు.

ఇంద్రుని కర్మవంటి శుభప్రదమైన కర్మను ఆచరించేవాడు. ఇంద్రుడు స్వర్గాన్ని పాలిస్తే, పరమేశ్వరుడు జగత్తును పాలిస్తాడు. రాక్షసులను ఎదరించలేక ఇంద్రుడు పారిపోతే, వారిని సంహరించి స్వర్గాన్ని తిరిగి ఇంద్రునికిచ్చినవాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'ఇంద్రకర్మా' అనబడుతున్నాడు.

# 787. మహాకర్మా

న్యాయమైన పనులు చేసేవాడు. 672వ నామము కూడా ఇదే.

**ఏవం న్యాయ ప్రవృత్త త్వాత్ మహాకర్మేతి శబ్ద్యతే.**

న్యాయసమ్మతంగా ప్రవర్తిస్తాడు. కాబట్టి 'మహాకర్మా' అనబడుతున్నాడు.

**మహత్కర్మ యస్యసః మహాకర్మా** ఆశ్రితుల రక్షించటం కోసం దుర్మార్గులను శిక్షించాలి. అందుకోసం ఒక్కొక్కసారి వారిని వంచించవలసి వస్తుంది. ఈ రకంగా అవసరమైతే వారిని వంచించి సంహరించేవాడు.

పూర్వకాలంలో భస్మాసురుడు అనే దానవుడు శివుని గురించి ఘోరమైన తపస్సు చేశాడు. శివుడు ప్రత్యక్షమై ఏ వరం కావాలో కోరుకోమన్నాడు. 'నేను ఎవరి నెత్తిన చెయ్యిపెడితే వారు భస్మమైపోయేటట్లు వరమడిగాడు రాక్షసుడు. సరే అన్నాడు దేవదేవుడు. ఇప్పుడు రాక్షసుడికి చిన్న అనుమానం వచ్చింది. "నీ వరం సరిగా పనిచేస్తుందో లేదో నేను తెలుసుకోవాలి. అందుకని నీ తలమీద చెయ్యిపెట్టి చూస్తాను" అని శివుడి దగ్గరకు వెళ్ళాడు. శివుడు పారిపోసాగాడు. ఆ సమయంలో విష్ణుమూర్తి మోహిని రూపంలో వచ్చి రాక్షసుని మోసగించి అతని చెయ్యి అతడి తలమీదనే పెట్టుకునేటట్లు చేశాడు. దీంతో భస్మారుడు భస్మమైపోయాడు.

"జలంధరుని జన్మ వృత్తాంతము విచిత్రముగా ఉంటుంది. దక్ష యజ్ఞ సమయములో సతీదేవి యోగాగ్నిలో భస్మమైపోయింది. ఆ మాటలు విన్న ఈశ్వరుడు విరాగియై దేశాల వెంట తిరిగి తిరిగి చివరకు హిమాలయ పర్వతాలలో తపస్సు చేసుకుంటున్నాడు. ఈ లోపల వజ్రాంగుడికి తారకుడు జన్మించాడు. అతన్ని సంహరించటానికి పార్వతీ పరమేశ్వరుల వివాహం కావాలి. వారి కుమారుడు కుమారస్వామి చేతిలోనే తారకాసురుడు మరణిస్తాడు. పరమేశ్వరి పర్వతరాజు ఇంట పార్వతిగా జన్మించింది. ఆమె శివుని తప్ప అన్యుని వివాహమాడను అని ఖచ్చితంగా చెప్పేసింది. శివుడు విరాగియై తపోదీక్షలో ఉన్నాడు. విరాగియైన శంకరుని మనస్సు మార్చేందుకు మన్మథుడు ప్రయత్నించాడు.

శివుడికి అగ్రహం వచ్చింది. ఈశ్వరుని కోపాగ్నికి మన్మథుడు భస్మమైపోయాడు. మన్మథుణ్ణి భస్మం చేసిన తరువాత మిగిలిన శివుని నేత్రాగ్ని సముద్రంలో పడింది. అప్పుడు పెద్ద ధ్వని వినపడింది. ఆ శబ్దానికి లోకాలన్నీ గడగడలాడిపోయినాయి. భయకంపితులైన దేవతలు బ్రహ్మ దగ్గరకు పరుగెత్తారు. బ్రహ్మదేవుడు దేవతలను వెంట పెట్టుకుని సముద్రుని వద్దకు వచ్చి, 'ఆ శబ్దమేమిటి ? అని అడిగాడు. అప్పుడు సముద్రుడు శివుని త్రేతాగ్ని సముద్రములో పడిన సంగతిని వివరించి "ఆ అగ్ని నుండి ఒక బాలుడు జన్మించాడు" అని బాలుడిని చూపించి అతడికి నామకరణం చేసి జాతకము చెప్పమని అడిగాడు. 'వీడు జలాంతర్భాగాన నివసిస్తున్నాడు కాబట్టి 'జలంథరుడు' వీడి నామధేయము. వీడు లోకకంటకుడౌతాడు. ఈశ్వరుని చేతిలోనే మరణిస్తాడు" అని చెప్పాడు బ్రహ్మ.

ఈశ్వరుని క్రోధాగ్ని జ్వాలల నుండి పుట్టినవాడు కావటంచేత తమోగుణ ప్రధానుడైనాడు. రాక్షస కృత్యాలు చెయ్యటం వలన రాక్షసుడైనాడు. ఈ రకంగా జలంథరుడు అసురుడైనాడు. క్రమేణా పెరిగి పెద్దవాడైనాడు. గొప్ప తపో సంపన్నుడు, యుక్త వయస్సు రాగానే కాలనేమి కుమార్తె బృందనిచ్చి జలంథరునికి వివాహం చేశారు.

ఒకనాడు జలంథరుడు కొలువు తీర్చి ఉండగా, రాక్షస గురువైన శుక్రాచార్యుడు అక్కడికి వచ్చాడు. వచ్చిన ఆచార్యుని సగౌరవంగా ఆహ్వానించి విశేషాలు ఏమిటి? అని అడిగాడు దానవేంద్రుడు. "రాజా ! ఏమని చెప్పుదును. జరిగినవి, జరుగుతున్నవి, అన్నీ దుఃఖ కారణాలే. పూర్వకాలంలో దేవతలు, రాక్షసులు కలిసి పాలసముద్రాన్ని మథించారు. దానిలో నుండి ఉచ్చైశ్వరము పుట్టింది. దాన్నీ దేవతలు తీసుకున్నారు ఐరావతము పుట్టింది. దాన్నీ దేవతలే తీసుకున్నారు. కామధేనువు, కల్పవృక్షము పుట్టినాయి. వాటిని కూడా దేవతలే తీసుకున్నారు. చివరకు అమృతం పుట్టింది. దాన్ని కూడా దేవతలే ఆరగించారు. అమృతం తాగిన రాహువును చంపేశారు. అలా ఆనాడు జరిగింది. హిరణ్యకశ్యప, హిరణ్యాక్ష్యులను, ఇంకెందరో దానవ శ్రేష్టులను సంహరించారు. పోనీ ఇప్పుడు చూడు వైకుంఠాన్ని శ్రీహరి ఆక్రమించి ఉన్నాడు. కైలాసములో ఈశ్వరుడున్నాడు. దేవేంద్రుడు స్వర్గాన్ని పాలిస్తున్నాడు. ఈ రకంగా దేవతలు సర్వసౌఖ్యాలు అనుభవిస్తూ, మనలను అడవులలోకి నెట్టివేశారు. బలపరాక్రమాలు గలిగిన దానవేంద్రుడవు నువ్వు రాజుగా ఉండగా కూడా ఈ అన్యాయం ఇలా కొనసాగవలసినదేనా ?" అన్నాడు. గతం నుంచి దేవతలు రాక్షసులకు అన్యాయం చేస్తూనే ఉన్నారు. ఈ మాటలు తలచుకోగానే జలంథరుని రక్తం వేడెక్కింది. వెంటనే ఘస్మరుడు అనే రాక్షసుణ్ణి పిలిచి ఇంద్రుని దగ్గరకు దూతగా వెళ్ళి రమ్మన్నాడు. ఘస్మరుడు ఇంద్రుని వద్దకుపోయి "దేవేంద్రా ! ఇంతకాలం నువ్వు

స్వర్గసుఖాలు అనుభవించావు. ఇక స్వర్గాధిపత్యం దానవేంద్రుడైన జలంధరునకు ఇవ్వు, లేకపోతే యుద్ధం తప్పదు" అన్నాడు. ఆ మాటలు విన్న ఇంద్రుడు పగలబడి నవ్వుతూ "ఇంతకు ముందు ఎంతమంది రాక్షసులు పుట్టలేదు ? వారందరినీ విష్ణుమూర్తి సంహరించలేదా ? ఇప్పుడూ అంతే. జలంధరుడికి చేతనైతే యుద్ధం చేసి స్వర్గాన్ని గెలుచుకోమను" అన్నాడు. ఇంద్రుని మాటలు దూత ద్వారా విన్న జలంధరుడు కోపోద్రిక్తుడై ముందుగా వైకుంఠం మీదకి దండెత్తాడు. విష్ణువు పారిపోయి మానస సరోవరం చేరాడు. తరువాత స్వర్గం మీద దండెత్తి స్వర్గాన్ని ఆక్రమించాడు జలంధరుడు. స్వర్గాధిపతి ఇంద్రుడు అరణ్యాలకు పారిపోయాడు.

దేవతల పక్షాన యుద్ధం చేసేవారు లేరు. ఏం చెయ్యాలో అర్థం కాలేదు దేవతలకు. ఇంతలో నారద మహర్షి వారి దగ్గరకు వచ్చాడు. మహర్షితో తమ బాధలు మొర పెట్టుకున్నారు దేవతలు. "నారద మునీంద్రా ! జలంధరుని బాధలు పడలేకుండా ఉన్నాము. అతడితో యుద్ధం చేసేవాళ్ళు కూడా లేరు. ఏం చెయ్యాలో మాకు పాలుపోవటం లేదు. నువ్వే మాకు దారి చూపించు" అని వేడుకున్నారు. అప్పుడు నారదుడు దేవతలతో, "జలంధరుడు గొప్ప భక్తుడు. వేదవేదాంగవిధుడు. బ్రహ్మ వరప్రసాది. ఈ కారణంచేత అతణ్ణి యుద్ధంలో గెలవటం చాలా కష్టం. పైగా అతడి భార్య బృంద పరమేశ్వరి భక్తురాలు. మహా పతివ్రత. ఆమె పాతివ్రత్యము చెడితేనే గాని జలంధరుడు మరణించడు. మీరంతా పరమేశ్వరుణ్ణి ఆరాధించండి. నాకు చేతనైంది నేను చేస్తాను." అని చెప్పి అక్కడ నుండి బయలుదేరాడు. నారదుడు అలా లోక సంచారం చేస్తూ జలంధరుని ఆస్థానానికి వచ్చాడు. నారదమహర్షిని ఉచితరీతిని గౌరవించి లోకాలలో విశేషాలు ఏమిటి ? అన్నాడు. దానికి నారదుడు "రాక్షసరాజా ! నీ పాలనలో దేశం సుభిక్షంగా ఉన్నది. సకాలంలో ఎండలు కురుస్తున్నాయి. వానలు పడుతున్నాయి. నువ్వు దేవతలను జయించావు. స్వర్గాన్ని ఆక్రమించావు. వైకుంఠము, కైలాసము కూడా కైవశం చేసుకున్నావు. దానవేంద్ర ! ఇప్పుడు లోకంలో గొప్ప వస్తువులన్నీ నీ దగ్గరే ఉన్నాయి. ఇంద్రుని ఓడించి ఐరావతము, ఉచ్చైశ్వరము నీ అధీనం చేసుకున్నావు. మహత్తర శక్తిగల కామధేనువు, కల్పవృక్షము నీ ఆధీనంలో ఉన్నాయి. అష్టదిక్పాలకులు నీ అడుగులకు మడుగు లొత్తుతున్నారు. ఈ రకంగా లోకంలో ప్రశస్థమైనవన్నీ నీ అధీనంలోనే ఉన్నాయి. కాని చిన్న లోపం కనిపిస్తుంది" అన్నాడు. అంతవరకు తనని గురించిన పొగడ్తలు ఆనందంగా విన్న జలంధరుడూ, ఆ లోపం ఏమిటో తెలుసుకోవాలనే ఆతృతతో "ఏమిటి మునీంద్రా ! ఏమిటా లోపం ?" అన్నాడు. దానికి నారదుడు 'అదిపెద్ద లోపమేమీ కాదు. ప్రశస్తమైన వస్తువులన్నీ నీ

దగ్గరే ఉన్నాయి. కాకపోతే అందాల రాశి. లోకోత్తర సౌందర్యవతి, అపరంజి బొమ్మ. ఆమె మాత్రం నీ దగ్గర లేకుండా వేరొకరి దగ్గర ఉన్నది' అన్నాడు. ఆ మాటలు వినగానే, ఆ స్త్రీ మీద వ్యామోహము ఒక ప్రక్క, ఆమెను స్వాధీనపరుచుకోలేకపోయాననే అవమానం ఇంకొక ప్రక్క, పీడించసాగాయి. ఇంక ఉండబట్టలేక 'ఆ సౌందర్యరాశి ఎక్కడ ఉన్నది?' అని నారదుణ్ణి అడిగాడు. 'దానవేంద్రా ! వశం చేసుకోవటం కష్టమైన పనేమో. పోనీలే' అంటూ కనిపించకుండా జలంధరుణ్ణి రెచ్చకోట్టాడు నారదుడు. ఈ మాటలు రాక్షసేంద్రుని మీద బాగా పనిచేసినాయి. వెంటనే పరమేశ్వరునితో యుద్ధం ప్రకటించాడు. ఒక ప్రక్క యుద్ధం జరుగుతోంది. తాను శంకరుని వేషం ధరించి, కొంతమంది రాక్షసులచేత మాయా గణపతి వేషం వేయించి పార్వతీదేవి దగ్గరకు వెళ్ళి, శంకరుడు వచ్చాడని గణపతితో వర్తమానం పంపాడు. 'యుద్ధం జరుగుతుండగా శంకరుడు ఎలా వస్తాడు?' అని అనుమానం వచ్చిన పార్వతీదేవికి రాక్షసుల నిజస్వరూపం తెలిసింది. దాంతో వారు పారిపోయారు. అప్పుడు పార్వతీదేవి విష్ణుమూర్తికి వర్తమానం పంపి, జలంధరుని భార్య బృంద, మహాపతివ్రత. ఆమె పాతివ్రత్యాన్ని గనుక పాడు చెయ్యకపోతే జలంధరుడు మరణించడు. కాబట్టి నువ్వెళ్ళి ఆ పని చూడు అన్నది.

బృంద దీక్షలో ఉండి పరమేశ్వరుని ధ్యానిస్తోంది. విష్ణువు జలంధరుని రూపంలో వెళ్ళి ఆమె పాతివ్రత్యానికి భంగం కలిగించాడు. పరమేశ్వరుడు పాశుపతంతో జలంధరుణ్ణి సంహరించాడు.

రాజసావర్ణి కుమారుడు వృషధ్వజుడు. అతని కుమారుడు హంసధ్వజుడు. ఇతనికి ఇద్దరు కుమారులు 1. ధర్మధ్వజుడు 2. కుశధ్వజుడు.

ధర్మధ్వజుడు నిజంగానే ధర్మమూర్తి. చుట్టుపక్కల గల రాజ్యాలన్నీ జయించి ప్రజారంజకంగా పాలిస్తున్నాడు. ఇతని భార్య మాదవి. గుణవతి, శీలవతి.

కొంతకాలానికి ధర్మధ్వజుడికి మాధవి వలన ఒక ఆడపిల్ల పుట్టింది. ఆ సమయంలో అన్నీ శుభాలేజరిగినాయి. దేవతలు పూలవాన కురిపించారు. పుట్టిన బిడ్డ అందాలరాసి, కుందనపుబొమ్మ. సర్వలక్షణ సమన్వితమైన ఆ బిడ్డకు తులసి అని నామకరణం చేశారు. నామకరణం కాగానే ఆ పిల్ల పదహారు సంవత్సరాల బాలిక అయిపోయింది. అదిచూసి జనులందరూ ఆశ్చర్యపోయారు. నేను విష్ణువును తప్ప అన్యుణ్ణి వివాహమాడను అని చెప్పి బదరికావనానికి వెళ్ళి విష్ణుమూర్తిని గూర్చి తపస్సు చేయటం ప్రారంభించింది తులసి పంచాగ్నుల మధ్యన ఉండి పదివేల సంవత్సరాలు తపస్సు చేసింది. పంచాగ్నులు అంటే ఐదు రకాల అగ్నులు.

1. పూర్వాగ్ని　　3. పశ్చిమాగ్ని　　5. సూర్యుడు

2. దక్షిణాగ్ని　　4. ఉత్తరాగ్ని

ఆకులు మాత్రమే ఆహారంగా　　- పదివేల సంవత్సరాలు

వర్షాకాలంలో నీట మునిగి　　- పదివేల సంవత్సరాలు

శీతాకాలంలో గాలినే ఆహారంగా ఆరుబయట చలిలో ముప్పైవేలసంవత్సరాలు. ఈరకంగా మొత్తం లక్ష సంవత్సరాలు తపస్సు చేసింది.

ఆమె తపస్సుకు మెచ్చి బ్రహ్మ ప్రత్యక్షమై ఏ వరం కావాలో కోరుకోమన్నాడు. దానికి తులసి "ఓ దేవా ! పూర్వజన్మలో నేను ఒక గోపికను. నేను కృష్ణునితో ఉండగా చూసిన రాధ నన్ను మానవజన్మ ఎత్తమని శపించింది. అప్పుడు కృష్ణుడు నన్ను ఓదార్చి నాలుగు చేతులు కలవాడు నా అంశతో పుట్టి నన్ను వివాహమాడతాడు అని చెప్పాడు. కాబట్టి నా కోరిక ఫలింపచెయ్యి" అన్నది. దానికి బ్రహ్మ.

అమ్మా ! శ్రీకృష్ణుని చెలికాడు సుదాముడు అనేవాడుండేవాడు. ఒకనాడు కృష్ణుడు గోపికలతో విహరిస్తున్న సమయంలో రాధ చూసి శ్రీకృష్ణుడిని పరుషంగా మాట్లాడింది. దానికి కోపించిన సుదాముడు రాధతో నువ్వెందుకు కృష్ణుణ్ణి తిడతావు? అన్నాడు. అప్పుడామెకు సుదాముడిపై కోపం వచ్చి రాక్షసుడుగా పుట్టమని శపించింది. ఆ సుదాముడు దానవ వంశంలో పుట్టాడు. కృష్ణునిలాగానే నాలుగు చేతులు బ్రహ్మతేజస్సు కలిగి ఉంటాడు. అతడి పేరు శంఖచూడుడు. అతడే నీకు భర్త అవుతాడు. నీలాగే అతడు కూడా పూర్వజన్మ జ్ఞానం కలవాడు.

తరువాత కాలంలో విష్ణువు భూమిమీద పుట్టినప్పుడు నువ్వు అతణ్ణి చేరుకుంటావు. నీకు వృక్షరూపం వస్తుంది. విష్ణువుకు ప్రాణాలకన్నా ప్రియురాలవవుతావు. బృందావనంలో ఉండే నీకు బృంద అని కూడా పేరొస్తుంది" అన్నాడు.

కశ్యపప్రజాపతికి దనువునందు పుట్టినవాడు విప్రచిత్తుడు. ఇతడు హిరణ్యకశ్యపుని సోదరియైన సింహకను వివాహమాడాడు. ఇతని కుమారుడు దంభుడు. దంభుడు పుత్ర సంతానం కోసం విష్ణుమూర్తిని గురించి ఘోరమైన తపస్సు చేసి శంఖచూడుడు అనే కుమారుణ్ణి కన్నాడు. శంఖచూడుడు బ్రహ్మను గూర్చి తపస్సు చేశాడు. బ్రహ్మ ప్రత్యక్షమై ఇతడికి కృష్ణకవచమిచ్చి అదినీవద్ద ఉన్నంతవరకు నీకు ఏ ఆపదా రాదు. బదరికావనంలో తులసి ఉన్నది. వెళ్ళి ఆమెను వివాహమాడు అన్నాడు.

బదరికావనం చేరిన శంఖచూడుడికి ఒంటరిగా ఉన్న తులసి కనిపించింది. దగ్గరకు వెళ్ళి పలకరించాడు. పరిచయాలు కాగానే ఇద్దరి తనువులూ పులకించినాయి. పూర్వజన్మల

బంధం, దైవానుగ్రహం అలా ఉన్నాయి. ఒకరినొకరు కోరుకున్నారు. గాంధర్వవిధిని వారి వివాహం జరిగిపోయింది.

వీరి దాంపత్యం చాలాకాలం సుఖంగా సాగింది. కానీ శంఖచూడుని నైజము మళ్ళీ బయటకు వచ్చింది. యజ్ఞాలు పాడుచేస్తున్నాడు. మునులను బాధిస్తున్నాడు.

శంఖచూడుని దుశ్చర్యలకు తట్టుకోలేక దేవతలు త్రిమూర్తులను ఆశ్రయించారు. వారంతా కలిసి ఆలోచించి శంఖచూడునితో యుద్ధానికి శివుణ్ణి పంపారు. శివుడు భూతప్రేత గణాలతో పాటుగా కుమారస్వామినీ, కాళినీ వెంట పెట్టుకుని యుద్ధానికి వెళ్ళాడు. దేవతలందరికీ నమస్కరించి శంఖచూడుడు యుద్ధం ప్రారంభించాడు.

పోరుఘోరంగా జరిగింది. కుమారస్వామి ఆ రాక్షసుని చేతిలో చిత్తైపోయాడు. కాళి అతణ్ణి ఏమీ చెయ్యలేకపోయింది. ఆలోచించాడు విష్ణుమూర్తి.

శంఖచూడుని దగ్గర కృష్ణకవచమున్నది. అది ఉన్నంత వరకూ అతనికి అపజయంలేదు. పైగా అతని భార్య పతివ్రత. కాబట్టి అతని కవచం తీసుకోవాలి. అతని భార్య పాతివ్రత్యం చెడగొట్టాలి. అప్పుడు గాని శంఖచూడుడు మరణించడు. అందుకని విష్ణువు వృద్ధ బ్రాహ్మణ రూపంలో వచ్చి శంఖచూడుని కవచం దానమడిగాడు. వచ్చిన వాడు విష్ణువని, తనకు కాలం తీరిపోయిందని తెలిసి కూడా తన కవాచాన్ని దానం చేశాడు శంఖచూడుడు. ఆ కవచం ధరించి అచ్చు శంఖచూడునిలానే తయారయి తులసి దగ్గరకు వెళ్ళి ఆ రాత్రంతా ఆమెతో సుఖంగా గడిపాడు విష్ణువు. వచ్చినవాడు తన భర్తే అనుకుంది తులసి. ఆమె పాతివ్రత్యం చెడింది. అంతే మరుక్షణంలో శివుడు తన శూలంతో శంఖచూడుని తలనరికేశాడు.

కేళీవిలాసాలలో తేలి ఆడుతున్న తులసికి శంఖచూడుని మీద అనుమానం వచ్చి ఎవరునువ్వు అని గద్దించింది. విష్ణువు తన నిజస్వరూపంతో ప్రత్యక్షమైనాడు. తులసి కోపం హద్దులు దాటిపోయింది. మోసంతో తన భర్తను చంపి, తన శీలాన్ని హరించిన విష్ణువును పాషాణమై పొమ్మని శపించింది. అప్పుడు విష్ణువు తులసిని ఓదారుస్తూ శంఖచూడుని శరీరంలోని ఎముకలు శంఖజాతికి మూలమౌతాయి. వాటిలో పోసిన నీరు గంగా జలంలాగా పవిత్రమౌతుంది. శంఖధ్వని వినిపించిన చోట లక్ష్మిదేవి ఉంటుంది. నీవు కూడా ఈ శరీరాన్ని వదలగానే దివ్యరూపం ధరిస్తావు. నీ శరీరం గండకీనది రూపంలో ప్రవహిస్తూ ఉంటుంది. నువ్వు పవిత్రమైన తులసి వృక్షం అవుతావు. తులసి దళాలను తాకినంత మాత్రం చేతనే పాపాలు ప్రక్షాళనమైపోతాయి. తులసి దళాలు నీటిలో వేసి స్నానం చేస్తే కోటి తీర్థాలలో స్నానంచేసిన ఫలితం వస్తుంది. తులసి

దళాలు కలిపిన నీటితో అభిషేకం చేస్తే సహస్ర ఘటాభిషేకం చేసిన ఫలం వస్తుంది. తులసి దళం దానం ఇస్తే వేయిగోవులు దానం చేసిన ఫలం వస్తుంది. మరణ సమయంలో తులసి తీర్థం గొంతులో పోస్తే ఆ జీవిపుణ్య లోకాలకు పోతాడు. నిత్యము తులసి తీర్థం తాగేవాడికి లక్ష అశ్వమేధయాగాలు చేసిన ఫలం వస్తుంది. తులసి దళాలను శరీరం మీద ధరిస్తే వైకుంఠం ప్రాప్తిస్తుంది. తులసి దళాలను అగౌరవపరచినవాడు నరకం అనుభవిస్తాడు.

నువ్వు గండకీనదిగా ప్రవహిస్తున్నప్పుడు నేను ఆ నదిలో పాషాణ రూపంలో ఉంటాను. ఆ రూపమే సాలగ్రామం. ఇది అనేక రకాలుగా ఉంటుంది.

1. లక్ష్మీనారాయణుడు
2. అక్ష్మీజనార్ధనము
3. రఘునాధము
4. వామనము
5. శ్రీధరము
6. దామోదరము
7. రఘరామము
8. రాజరాజేశ్వరము
9. అనంతము
10. మధుసూదనము
11. హయగ్రీవము
12. నారసింహము
13. లక్ష్మిసింహము

ఈరకంగా అనేక రకాలైన సాలగ్రామాలుంటాయి. వీటిని పూజించిన వారికి విష్ణులోకం ప్రాప్తిస్తుంది. ప్రతిరోజూ సాలగ్రామము, తులసి, శంఖాలను పూజించేవాడు. సరాసరి వైకుంతానికి పోతాడు" అని వరమిచ్చాడు.

అప్పటి నుంచీ తులసి వృక్షంగా మారిపోయింది. ఆమె శరీరం గండకీనదిగా ప్రవహించటం మొదలు పెట్టింది. విష్ణువు సాలగ్రామరూపంలో ఆనదిలో ఉంటున్నాడు.

అందుచేతనే ఇప్పటికీ కూడా గండకీనదిలో సాలగ్రామాలు దొరుకుతాయి.

ఈరకంగా దేవతలను రక్షించటంకోసం రాక్షసులను కేవలము తన శౌర్యపరాక్రమాల వల్లనే కాకుండా, అవసరమైతే వారిని మోసగించి కూడా సంహరించాడు కాబట్టే శ్రీమన్నారాయణుడు 'మహాకర్మా' అనబడతాడు.

## 788. కృతకర్మా

కృతమైన కర్మలు చేసినవాడు. నాస్తికాచారములు ఆచరించినవాడు.

**స్వానుష్ఠిత తదాచారః కృతికర్మేతి కథ్యతే**

వారిని మోసం చెయ్యటం కోసం తానే ఆ దారిన నడిచినవాడు.

**కృతం కర్మ యేనసః కృతకర్మా** దురాచారులను నమ్మించటం కోసం తానే ఆ మార్గాన నడచినవాడు.

దితి కశ్యపుల కుమారుడు వజ్రాంగుడు. అతని భార్య వరాంగి. వీరి కుమారుడు తారకాసురుడు బ్రహ్మవరప్రసాది. ముల్లోకాలను గడగడలాడించిన దానవేంద్రుడు. చివరకు ఉమామహేశ్వరుల పుత్రడు, దేవసేనాని అయిన కుమారస్వామి చేతిలో మరణించాడు. తారకాసురునికి ముగ్గురు కుమారులు. వారు 1. తారకాక్షుడు, 2. కమలాక్షుడు. 3, విద్యున్మాలి. తారకుడు మరణించగానే, అతని భార్య కుమారులను తీసుకుని పాతాళానికి పారిపోయింది. అక్కడే వారిని పెంచి పెద్ద చేసింది. శుక్రాచార్యుని వద్ద విద్యాబుద్ధులు నేర్పించింది. బాలురు దినదిన ప్రవర్ధమానమై సకలశాస్త్ర కోవిదులైనారు. తమ తండ్రి మరణ వృత్తాంతము తల్లి వల్ల పూర్తిగా తెలుసుకున్నారు. తండ్రి మరణానికి కారణమైన దేవతల మీద పగ తీర్చుకోవాలని నిర్ణయించుకుని మేరు పర్వతం దగ్గర పరమేష్ఠిని గురించి పదివేల సంవత్సరాలు తపస్సు చేశారు. వారి తపస్సుకు మెచ్చి బ్రహ్మదేవుడు ప్రత్యక్షమై ఏ వరం కావాలో కోరుకోమన్నాడు. రాక్షస ప్రముఖులందరూ అడిగినట్లే చావు లేకుండా వరం కావాలి అన్నారు దానవులు. 'అది మాత్రం సాధ్యంకాదు. ఎందుచేతనేంటే నాకే శాశ్వతత్త్వము లేదు. బ్రహ్మకల్పము పూర్తికాగానే నేను కూడా వెళ్ళిపోతాను. అట్టి నేను నాకు సాధ్యం కాని దాన్ని మీకెలాఇవ్వగలను. ఇంకేదైనా వరం కోరుకోండి" అన్నాడు ఆలోచించారు తారకాసురుని పుత్రులు, "పరమేష్ఠి ! రథము కాని రథమెక్కి, విల్లుకాని విల్లు ధరించి, నారి కాని నారిని తొడిగి, బాణము కాని బాణము సంధించి, ఒక్క దెబ్బతో చంపగల వీరుని చేతియందు తప్ప మాకు మరణం లేకుండా వరం ప్రసాదించు" అన్నారు. తథాస్తు అన్నాడు బ్రహ్మ. "విధాతా ! అంతేకాదు. మేము ముగ్గురము నివసించటానికి సకల సదుపాయాలు కలిగి లోహ నిర్మితమై, కామ గమనం కల మూడు పురములు కావాలి. సకలైశ్వర్యాలకు, సకల భోగాలకు ఆ పురములు నెలవుగా ఉండాలి" అన్నారు. వారి కోరికలను అనుగ్రహిస్తూ "ఆ మూడు పురములు ఒకచోట ఎప్పుడూ కలియరాదు. అలా గనక కలిస్తే అవి నాశనమైపోతాయి' అన్నాడు బ్రహ్మ.

బ్రహ్మ వలన వరాలు పొంది, విశ్వకర్మను పిలిపించి గగనవిహారం చేసే మూడు లోహపట్టణాలు నిర్మించమన్నారు త్రిపురాసురులు. నిర్మించాడు విశ్వకర్మ. వాటిలో ఎక్కి తలోదిక్కుకూ బయలుదేరారు తారకుని కుమారులు. ఈ రకంగా గగనవిహారం చేస్తూ భూలోకంలోని పట్టణాల మీద వాటిని ఒక్కసారిగా దించేవారు. దాంతో ఆ పట్టణాలు, జనావాసాలు సర్వనాశనమై పోయేవి. అమితానందంతో మళ్ళీ పైకి ఎగిరిపోయేవారు

రాక్షసులు. ఈరకంగా ఆరాక్షసులు త్రిపురములలో సంచరిస్తున్నారు కాబట్టి 'త్రిపురాసురులు' అని పిలువబడ్డారు.

త్రిపురాసురుల ఆగడాలు మితిమీరి పోతున్నాయి. దేవతలు, మునులు, ఋషులు, సాధువులు, సజ్జనులు ఉన్నచోట ఆ పురములను దింపి ఆ ప్రదేశాలను నాశనం చేస్తున్నారు. జననష్టం కలిగిస్తున్నారు. మహర్షులు, దేవతలు అంతా కలిసి బ్రహ్మ వద్దకు పోయి త్రిపురాసురుల దౌర్జన్యాన్ని వివరించాడు. బ్రహ్మ వారందరితో కలిసి శ్రీహరిని సమీపించి తారకాసురుని కుమారులు లోకాలను పీడిస్తున్నారని, లోకాలను రక్షించమని వేడుకున్నారు. అప్పుడు శ్రీమహావిష్ణువు వారితో "దేవతలారా ! మహర్షులారా ! త్రిపురాసురులు రాక్షసులన్నది నిజమే కాని వారు శివభక్తులు. వేదవేదాంగ విదులు, నిత్యాగ్నిహోత్రములను నిర్వర్తిస్తారు. వైదికకర్మలను శాస్త్రానుసారము ఆచరిస్తారు. కాబట్టి వారని చంపటము ఏమాత్రము వీలుకాదు. కాబట్టి వారిని వంచించి, ధర్మమార్గము నుండి తప్పించి, అంతమొందించాలి. దీనికి ఒక ఉపాయమున్నది.

బౌద్ధమతాన్ని సృష్టించి, శిష్యప్రశిష్యులతో త్రిపురములయందు సభలను ఏర్పాటు చేసి బౌద్ధమత ప్రచారము కావించండి. నేను సమయం చూసి వారిని సంహరిస్తాను" అన్నాడు.

దేవతల వ్యూహము ప్రకారము త్రిపురములందు బౌద్ధమతము బాగా ప్రచారము పొందింది. సృష్టి అంటే స్త్రీ పురుష సంయోగము. వర్ణవ్యవస్థ, ఆచార వ్యవహారాలు, నియమనిష్టలు, మానవ కల్పితాలు. దేవుడనే వాడు లేడు. కర్మలకు అర్థంలేదు. వేదాలు కొందరు స్వార్థపరులు వ్రాసుకున్న గ్రంథాలు. ఈ రకమైన ప్రచారము త్రిపురాసురులకు కూడా నచ్చింది. వారికి వినాశకాలం దాపురించింది. విపరీత బుద్ధులు పుట్టినాయి. అప్పటిదాకా వల్లె వేసిన వేదాలు పనికి మాలినవయినాయి. నియమనిష్టలు గంగలో కలిసి పోయినాయి. వావి వరుసలు లేవు. వర్ణవ్యవస్థ లేదు. ధర్మము భ్రష్టు పట్టిపోయింది. కర్మలు గాలిలో కలిసిపోయాయి. ఈ అదను కోసమే వేచి ఉన్నారు దేవతలు.

విష్ణుమూర్తి నాయకత్వములో పినాకపాణి దగ్గరకు పోయి త్రిపురాసురులను సంహరించి లోకాలను రక్షించమని వేడుకున్నారు. బ్రహ్మ వరం ఇచ్చినట్లుగానే

| | | | | | |
|---|---|---|---|---|---|
| భూమి | – | రథము | బ్రహ్మదేవుడు | – | సారధి |
| రవి, చంద్రులు | – | రథ చక్రాలు | మేరు పర్వతము | – | విల్లు |
| నాల్గు వేదములు | – | హయములు | శ్రీహరి | – | శస్త్రము |

ఈరకంగా రథమెక్కి పరమేశ్వరుడు త్రిపురాసురుల మీద యుద్ధం ప్రకటించాడు. పాశుపతాస్త్రాన్ని సంధించి త్రిపురాసురులను వధించాడు. మూడు పురములూ కూడా బూడిదరాసులై పోయినాయి అంటూ త్రిపురాసుర సంహారాన్ని వివరించాడు రత్నాకరుడు.

## 789. కృతాఽఽగమః

కృతమైన ఆగమశాస్త్రాలు వ్రాసినవాడు. 655వ నామము కూడా ఇదే.

**కృతబుద్ధాద్యా ద్యాగమత్వాత్ కృతాగమ ఉదాహృతః**

బౌద్ధ, జైన ఆగమాలు కూడా వ్రాసినవాడు.

**కృతః ఆగమః యేనసః కృతాగమః** అవైదిక ఆచారాలను ప్రచారం చెయ్యటానికిగాను శాస్త్ర గ్రంధాలు కూడా వ్రాసిన వాడు.

మనదేశంలో కాలక్రమేణా వేదాలు ఎవరో కొందరు స్వార్ధపరులు కల్పించినవనీ, వాటిలో దోషాలు అనేకం ఉన్నాయనీ, కొన్ని వాదనలు బయలుదేరినాయి. వారినే నాస్తికులు' అన్నారు. నాస్తికులు' అంటే ప్రస్తుతార్ధం భగవంతుడు లేడు' అనేవారు. కాని ఇక్కడ వేదాలను ప్రమాణంగా నమ్మనివారు' అని అర్ధం. వారు కూడా దర్శనాలు వ్రాశారు. వాటిలో ముఖ్యమైనవి.

**1. చార్వాకదర్శనము :** చార్వాకులనే నాస్తికులు అని పిలుస్తారు. వీరికి దేవుడు లేడు. పంచభూతములలో పృథ్వి, జలము, అగ్ని, వాయువు అనే నాలుగు భూతాలనే అంగీకరిస్తారు. వీరి సిద్ధాంతంలో దేహము, ఆత్మ రెండూ వేరుకాదు. ఒక్కటే. ఆకులు, వక్కలు, సున్నములయందు ప్రత్యేకముగా లేని ఎరువు, తాంబూలము వేసుకొన్నప్పుడు ఎలా వస్తుందో అలాగే పృథివి, జలము, అగ్ని, వాయువుల చేరికతో దేహమందు చైతన్యము కలుగుతుంది అంటారు. వీరి దృష్టిలో స్వర్గ నరకాలు ప్రత్యేకంగా లేవు. ఈ లోకంలో ఉన్న సుఖమే స్వర్గము, దుఃఖమే నరకము. మోక్షమనగా మరణము అని నమ్ముతారు. ఏదైనాసరే ప్రత్యక్ష ప్రమాణాన్ని అంగీకరిస్తారు. కర్మలు చేసే వారిని, జ్ఞానులను చులకనగా చూస్తారు.

**2. బౌద్ధదర్శనము :** బుద్ధభగవానుడు తన శిష్యులకు బోధించిన బోధనలనే బౌద్ధదర్శనము అంటారు. బుద్ధుడు ముఖ్యంగా నాలుగు వాక్యాలను బోధించాడు. అవి

1. సర్వం శూన్యం శూన్యం
2. సర్వం స్వలక్షణ స్వలక్షణం
3. సర్వం దుఃఖం దుఃఖం
4. సర్వ క్షణికం క్షణికం

1. దీనిలో మొదటి సూత్రము అవలంభించువారిని 'మాధ్యమికులు' అంటారు. వీరు సర్వశూన్యతావాదులు. వీరి దృష్టిలో ప్రత్యక్ష ప్రమాణాలుగాని, వస్తువులు, ప్రపంచము అంతా శూన్యము. దీనివలన వాసనాక్షయముకాగా పరముయగు నిర్యాణము, మోక్షము, కలుగుతాయని వారి నమ్మకం.

2. రెండవసూత్రమవలంభించువారిని యోగాచారులు' అంటారు. వీరి దృష్టిలో బాహ్యవస్తువులు, ప్రపంచము అంతా శూన్యము. జ్ఞానము.

3. మూడవ సూత్రమవలంభించినవారు. వీరిదృష్టిలో జగత్తు అనుమానసిద్ధము. దానిని కూర్చిన జ్ఞానమే మోక్షము. ఆత్మలేదు. జగత్తంతా క్షణికం అనే నిశ్చయమే మోక్షము.

4. నాల్గవ సూత్రమును అవలంభించువారిని వైభాషికులు' అంటారు. వీరు ప్రత్యక్ష వాదులు. రాగద్వేషములను వదలి ప్రశాంతముగ జీవించటమే నిర్యాణము అంటారు.

**3. అర్హత దర్శనము :** ఇది జైనమతస్థాపకులైన తీర్థంకరులచే వ్రాయబడింది. వీరి దృష్టిలో శరీర పరిమాణము జీవుడు. వీరు శ్వేతాంబరులు దిగంబరులు అని రెండు శాఖలుగా ఉన్నారు. శ్వేతాంబరుల దృష్టిలో స్త్రీకి మోక్షమున్నది. సర్వమతసామరశ్యమే వీరి ఆశయము. వీరు రాగద్వేషాలకు అతీతులు. రాగద్వేషనిరసనే వీరి అభీష్టము.

ఈ దర్శనాలన్నింటినీ శంకరభగవత్పాదులవారు ఖండించి అద్వైతసిద్ధాంత ప్రతిపాదన చేశారు.

**కృతాగమః :** వేదాలను రచించినవాడు. వేదాలు ఎవరినోటినుంచో రాలేదు. అవి సాక్షాత్తూ పరమేశ్వరునిచేతనే చెప్పబడ్డాయి. అందుచేతనే అతడు 'కృతాగమః' అనబడుతున్నాడు.

**భగవద్గీత**లోని 15వ అధ్యాయము **'పురుషోత్తమ ప్రాప్తియోగము'**లోని 15వ శ్లోకము.

**సర్వస్య చాహం హృది సన్నివిష్టో మత్త స్మృతిః జ్ఞానమపోహనం చ ।**
**వేదైశ్చ సర్వైరహమేవ వేద్యోవేదాంతకృద్వేద విదేవ చాహమ్ ॥**

సమస్త ప్రాణుల హృదయాలలోను అంతర్యామిగా ఉన్నది నేనే. నానుండియే సృతి, జ్ఞానము, అపోహనము (సందేహాలు తొలగిపోవటం) జరుగుతున్నది. వేదముల ద్వారా తెలుసుకోవలసినవాడను నేనే.

వేదాలు రచించినవాడు, గ్రహించినవాడు కూడా ఆ పరమేశ్వరుడే. అందుకే శ్రీమన్నారాయణుడు 'కృతాగమః' అనబడుతున్నాడు.

## 790. ఉద్భవః

సంసారాన్ని దాటినట్లుండేవాడు. 373వ నామము కూడా ఇదే.

ఉద్భవము - జన్మకారణము, ఉద్భవించు - జన్మించు

**మోక్షోపదేశ నటనాత్ భవాదుద్భవ స్థితః ।**
**ఉద్భవస్సచ విజ్ఞేయః సప్తార్ణః పాపనాశకః ॥**

మోక్షమార్గము ఉపదేశిస్తున్నట్లుగా నటిస్తూ, సంసారబంధనాలనుండి బయట పడ్డట్లుగా కనిపించేవాడు. పునర్జన్మ లేనట్లుగాఉండేవాడు. ఈ నామము సప్తాక్షరి పాపాలను హరిస్తుంది.

**ఉద్గత ఇవ భవాత్ ఉద్భవః** సంసార బంధనాలనుండి విడివడినట్లుగా నటించేవాడు.

పరమేశ్వరుడు తన ఇష్టప్రకారమే అవతారాలు ఎత్తుతున్నాడు. అన్నింటికీ ఇతడే సర్వకారణుడు. అందుకే ఇతడికి జన్మలేదు.

అంటే - పరమేశ్వరుడు స్వేచ్ఛగా, తన ఇష్టప్రకారమే జన్మలెత్తాడు. అందుచేతనే అతడు ఉద్భవుడు అనబడతాడు. ప్రాణులను రక్షించటము, ధర్మసంస్థాపన చెయ్యటమే అతని పని. సృష్టికి కూడా అతడే కారణము. అందుచేతనే అతడికి జన్మలేదు కాబట్టి ఉద్భవుడు అనబడతాడు.

## 791. సుందరః

సుందరుడు.

**సస్యాత్సుందర ఉద్దిష్టః తేషాం దృష్టి మనోహరః ।**
**విశ్వాతిశాయి సౌభాగ్య శాలిత్వాత్సుందర స్మృతః ॥**

లోకాతీతమైన సౌందర్యానికి గనివంటివాడు. కాబట్టి వారిని ఆకర్షించాడు.

మంచి సుందరుడు. అసురుల నేత్రాలను బాగా ఆకర్షించగలడు.

లౌకికమైన సుఖాలలో చిక్కి, లౌకిక సౌందర్యముమీద ముక్కువ గలవారిని బాగా ఆకర్షించగలడు. రామావతారంలో వనవాసంలో ఉన్నప్పుడు శ్రీరామచంద్రుని చూసి శూర్పణఖ, అతన్ని మోహించి దరి జేరుతుంది.

**విశ్వాతి శాయి సౌభాగ్యశాలీ** విశ్వములోని ఎల్లరను మించిన సౌభాగ్యము గలవాడు. ఇతరుల చూపుకు ఇంపైన చక్కదనము గలవాడు.

శ్రీమన్నారాయణుడు బహు సుందరుడు. **న్నారాయణీయము**లో అతని సౌందర్యాన్ని వర్ణిస్తూ

**సూర్యస్పర్ధికిరీట మూర్ధ్వతిలక -ప్రోద్భాసిఫాలాంతరం**
**కారుణ్యాఽఽకులనేత్ర మార్ద్ర హసితో - ల్లాసం సునాసాపుటమ్**
**గండోద్యన్మకరాభకుండలయుగం - కంఠోజ్జ్వలత్ కౌస్తుభం**
**త్వద్రూపం వనమాల్యహారపటల - శ్రీవత్సదీప్రం భజే**

శ్రీకృష్ణ పరమాత్ముడు సూర్యుని కన్న దివ్యమైన తేజస్సుతో ప్రకాశించే కిరీటముతోను, కస్తూరి తిలకము దిద్దిన ఫాలమధ్యముతోను, అందమైన కనులు, దయార్ద్రమైన చిరునగవు, చెక్కిళ్ళపై ప్రకాశించే కుండలములు, కంఠమందు వ్రేలాడే కౌస్తుభరత్నము, వనమాల, ఇతర అభరణములు గలిగి మిక్కిలి సౌందర్యవంతుడై ఉన్నాడు.

**కేయూరాంగద కంకణోత్తమ మహా - రత్నాంగులీయాంకిత -**
**శ్రీమ ద్బాహుచతుష్క సంగత గదా - శంఖారి పంకేరుహామ్**
**కాంచి త్కాంచనకాంచి లాంఛితలసత్ - పీతాంబరాలంబినీ -**
**మాలంబే విమలాంబుజ ద్యుతిపదాం - మూర్తిం తవార్తిచ్ఛిదమ్.**

భుజముల పైన ధరించిన కేయూరములు, భుజంమీద మోచేతిపై భాగాన ధరించే అంగదములు, రత్నపు ఉంగరాలతో అలంకరింపబడి శోభిల్లుతూ, శంఖము, చక్రము, గద, పద్మము అనే ఆయుధాలను చేతుల యందు ధరించి, బంగారు మొలనూలుతో అలంకరించబడిన పట్టు పీతాంబరము ధరించి, దీనుల ఆర్తిని పోగొట్టే ఆ దేవదేవునకు ప్రణామాలు అర్పిస్తున్నాను.

## 792. సుందః

తడిగా చేయువాడు.

**ఉనక్తి సుష్ఠు చేతాంసి రక్షసాం సుందఈరితః**

రాక్షసుల హృదయాలను తన సౌందర్య తరంగాలచేత తడుపువాడు.

**సుష్ఠు ఉనత్తి క్లేదయతీతి సుందః**

తన సౌందర్యముచేత అసురుల మనస్సు స్పందించునట్లు చేయువాడు.

పరమేశ్వరుడు కరుణా స్వరూపుడు. భక్తుల హృదయాలను తేలికగా చూరగొంటాడు. తనను ఆశ్రయించిన వారి హృదయాలలో అమృతపు వానలు కురిపిస్తాడు. వారికి సాయుజ్యమునిస్తాడు.

## 793. రత్ననాభః

అందమైన నాభిని గలవాడు.

**సురత్ననాభ ఇత్యుక్తః యః పాండిత్య విడంబనాత్ ।**

**మృష్టోదరవ్యక్తి రమ్య నాభి సత్ఫలదోమనుః ॥**

సకల శాస్త్రాలు నిండి ఉన్న ఆ బొజ్జయందు అలరారుచున్న రత్నము వంటి నాభి కలవాడు. ఈ నామము అష్టాక్షరీమంత్రము. శాస్త్ర పాండిత్యప్రదము.

**రత్నమివనాభిః యస్యసః రత్ననాభః**

తన పాండిత్యానికి తగినట్లుగా రత్నములాగా ప్రకాసించే నాభి కలవాడు.

రత్నమువలె అందమైన నాభి కలవాడు.

## 794. సులోచనః

అందమైన కనులు గలవాడు.

**సులోచన ఇతి ప్రోక్తో దృంగ్మయా మోహితేక్షణః**

చూపులతోనే మోహింపచేయు నేత్రములు గలవాడు.

**సుశోభదేలోచనే యస్యసః సులోచనః**

తనను చూసిన వారి హృదయములను దోచేవాడు.

**పునశ్చ రక్తాంబరధృక్ మాయామోహోఽజితేక్షణః**

ఎర్రని వస్త్రములు ధరించినవాడై తనకు కన్పించిన వారిని తన మాయచేత మోహింపచేయువాడు. అందమైన నేత్రములు గలవాడు.

**శోభనం లోచనం నయనం జ్ఞానం వాఽస్యేతి సులోచనః** శోభనమైన కనులు కలిగి ఉన్నాడు. కాబట్టి భగవానుడు సులోచనుడు అనబడుతున్నాడు.

## 795. అర్కః

స్తోత్రము చేయబడినవాడు.

**అత్యంత ధార్మిక ఇతి స్తుతస్తైరర్క ఈరితః** తన భక్తులచేత మిక్కిలి ధార్మికుడని స్తుతించబడినవాడు.

**అర్క్యతే స్తూ యత్ ఇతి అర్కః** బుద్ధావతారంలో విరోధులతో కూడా ఇంతవాడు అంతవాడు అని స్తుతించబడిన వాడు.

మిగుల పూజ్యులైన బ్రహ్మాది దేవతలచేత పూజింపబడినవాడు.

అసుర సంహారంచేసినప్పుడు దేవతలు, యక్ష, గరుడ, నాగ, కిన్నెర, కింపురుష, సిద్ధ, సాధ్య, గంధర్వగణాలతో కీర్తించబడినవాడు.

రావణ బ్రహ్మను సంహరించినప్పుడు దేవతలు పూలవాన కురిపించారు. అప్సరసలు ఆడారు, గంధర్వులు పాడారు.

ఈరకంగా దేవతలచేత స్తోత్రము చేయబడినవాడు.

# 796. వాజసనః

ఐహికవిషయాలయందు రుచి కలిగినవాడు.

**అన్నాదీ న్యైహికాన్యేవ యస్మాన్మహ్యం భవంతి హి**
**స వాజసని రిత్యుక్తః వస్వర్ణోఽన్న ప్రదోమనుః**

అన్నము మొదలుగా గల ఐహిక ఫలములయందు రుచిని పుట్టించినవాడు. ఈ నామము అష్టాక్షరీ మంత్రము అన్నాన్నిస్తుంది.

**వాజమ్ ఐహికమ్ అన్నమేవ సనతి సంభజతీతి వాజసని** బుద్ధావతారంలో నాస్తికవాదన చేసి అన్నాదులయందు రుచి కలిగించినవాడు. ప్రతిరోజూ సూర్యోదయానికి పూర్వమే దద్ధోజనముతినాలని చెప్పినవాడు. ఇది 'క్షపణికు'ల మతాచారము.

వాజమ్ అంటే – అన్నము. సనోతి అనగా – ఇచ్చేవాడు. వాజసనః – అడిగిన వారికి అన్నం పెట్టేవాడు. ఆహారము నిచ్చి లోకాలను రక్షించేవాడు.

ఆహారమిచ్చి జ్ఞాన బిక్షను పెట్టేవాడు.

# 797. శృంగీ

నెమిలి పింఛము ధరించినవాడు.

**కరేఽస్తి పించికా యస్య శృంగీ హంస విడంబనాత్**
**సర్వ ప్రపంచ మిథ్యాత్వ సంవిదాత్మ త్వవాదినః**

ప్రపంచం మిధ్య, జ్ఞానమే ఆత్మ అని వాదించే బుద్ధుడు తాను అహింసావాదినని తెలియచెయ్యటానికి నెమలి పింఛాన్ని చేత ధరించాడు.

**శృంగమ్ అస్యాస్తీతిశృంగీ** జీవహింస చెయ్యరాదు అని చెప్పటానికి గుర్తుగా చేత్తో నెమలిపింఛాన్ని పట్టుకున్నవాడు.

**శృంగం అస్య అస్తిః** ఇతనికి కొమ్ముగలదు.

ద్రవిడదేశపురాజు సత్యవ్రతుడు. కృతమాలిక అనే నదీతీరంలో సూర్యుడికి అర్ఘ్యం వదులుతున్నాడు. ఆ సమయంలో అతని చేతిలోకి ఒక చేపపిల్ల వచ్చింది. దాన్ని నదిలో వదలబోయాడు. అప్పుడు ఆ చేప 'నన్ను ఎక్కడైనా భద్రంగా వదలిపెట్టు. నదిలో పెద్ద పెద్ద చేపలు నన్ను తినేస్తాయి' అన్నది. మహారాజు ఆ చేపపిల్లని కమండలంలో వేశాడు. తెల్లవారేసరికి ఆ చేపకమండలమంతా నిండిపోయింది. దాన్ని తీసి బావిలో వేశాడు. బావి అంతా నిండిపోయింది. సరస్సులో వేశాడు. సరస్సు అంతా నిండిపోయింది. నదిలో వేశాడు నది అంతా నిండిపోయింది. చివరకు దాన్ని సముద్రంలో వెయ్యటానికి బయలుదేరాడు. అప్పుడు ఆ చేప "నన్ను సముద్రంలో వెయ్యివద్దు. మొసళ్ళు తినేస్తాయి" అంది. దానికి ఆ మహారాజు ఆశ్చర్యపోయి "ఓ మహానుభావా ! నీవెవరవు ? దేవతవా? రాక్షసుడవా ? యక్షుడవా! గంధర్వుడవా ? చెప్పవలసింది" అని బ్రతిమాలాడు దానికి ఆ చేప "రాజా ! నేను జనార్దనుడను, ఇంకొద్ది రోజులలో ప్రళయం సంభవిస్తుంది. అందుచేత నీ దగ్గర ఉన్న ధాన్యముతోను, సప్తఋషులతోను కలిసి ఒక ఓడమీద ఎక్కు. వాసుకిని త్రాగుడ చేసి ఒకవైపునావకు, రెండవవైపు చేప కొమ్ముకు ముడి వెయ్యవలసినది అని చెప్పింది.

ఈ విధంగా మత్స్యావతారంలో శృంగము గలవాడు. కాబట్టి శ్రీమన్నారాయణుడు 'శృంగీ' అనబడుతున్నాడు.

## 798. జయంతః

ఆస్తికులను జయించినవాడు.

**ఆస్తిక్యవాదినాం తేజా జయంత ఇతికథ్యతే ॥** నాస్తికవాదముతో ఆస్తికులను గెలిచినవాడు.

**జయతీతి జయంతః**

జగత్తు మిధ్య, జ్ఞానమే ఆత్మ వంటి వాదనలతో ఆస్తికులను జయించినవాడు.

శత్రువులను అతి తేలికగా జయించేవాడు. అన్ని రకాలయిన విజయములకు ఆధారభూతుడు.

## 799. సర్వవిజ్జయీ

సర్వజ్ఞులను కూడా జయించినవాడు.

**యస్య జయ్యాశ్చ సర్వజ్ఞాః స చోక్త సర్వవిజ్జయీ** సర్వజ్ఞులందరనూ జయించు స్వభావము గలవాడు.

**సర్వవిదః జౌతుంశీలమస్యేతి సర్వవిజ్జయీ** నాస్తికవాదము ప్రమాణ విరుద్ధము. అయినప్పటికీ దానితో పండితులందరినీ జయించినవాడు.

ఇతడు పరమేశ్వరుడు. ఇతడికి అన్ని విషయాలు తెలుసు. ప్రతి విషయమును అతడెరుగును. ఇతడు అందరినీ జయించినవాడు. శత్రువులు రెండు రకాలు. 1. అతః శత్రువులు 2. బాహ్యాశత్రువులు.

బాహ్యాశత్రువులను తన పరాక్రమంతో జయించటమేకాక, అంతఃశ్శత్రువులయిన రాగద్వేషాలను కూడా జయించినవాడు. అందుచేతనే అతడు సర్వవిజ్జయీ అనబడుతున్నాడు.

ఈరకంగా పరమాత్మ సర్వజ్ఞానసంపన్నుడు. ఎప్పుడూ ఓటమి నెరుగనివాడు. అంత శత్రువులను పూర్తిగా జయించినవాడు. అందుచేత శ్రీమన్నారాయణుడు 'సర్వవిజ్జయీ' అనబడుతున్నాడు.

## 800. సువర్ణ బిందుః

అతి చతురవాదములచే అపలపించినవాడు.

**అస్తికత్వా ఫలాపేన పటుభిః పదకాక్షరైః ।**
**సువర్ణ బిందుర్గదితః నవార్ణః పాపనాశనః ॥**

తనయొక్క నేర్పుతో, వాదనాపటిమతో, అందమైన పదజాలంతో వైదికమతాన్ని మరుగుపరచి, నాస్తికమతము నందు ఆసక్తిని పెంపొందించువాడు. ఈ నామము నవాక్షరీమంత్రము. పాపములను పరిహరించును.

**సువర్ణైః బిందితి అపలపీతి సువర్ణబిందుః**

అతిచాతుర్యమైన వాదముతో ఆస్తికమతాన్ని మరుగుపరచినవాడు.

బంగారముతో చేసిన అవయవములవంటి అవయవములు గలవాడు. నఖశిఖ పర్యంతము అంతా బంగారుమయమే. ప్రణవమును మంత్రముగా గలవాడు. ప్రణవ స్వరూపుడు. అతడే శ్రీమన్నారాయణుడు.

## 801. అక్షోభ్యః

గంభీరహృదయుడు. 999వ నామము కూడా ఇదే.

**గంభీరాశయవత్త్వేన హ్యధికారతయా చ సః**

**అక్షోభ్య సప్తవర్ణస్యాత్ అక్షోభ్యత్వ ప్రదాయకః**

గంభీరమైన హృదయము కలవాడు, అధికారము గలవాడు, పరులచే కలతనొందింప తగనివాడు. ఈ నామము సప్తాక్షరీమంత్రము. కలతలు లేకుండా చేస్తుంది.

**న క్షోభ్యః అక్షోభ్యః** గంభీరమైన హృదయము గలవాడు. కలత నొందనివాడు. ఇతనికి రాగద్వేషాలు లేవు. అందుచేత రాగద్వేషములచేత కలత నొందడు. ఇంద్రియ వాసనలు లేవు. అందుచేత ఇంద్రియపరంగా కలత పొందడు. దేవతలుగాని, మానవులు గాని, ఇతర శత్రువులగాని ఇతన్ని క్షోభింపచెయ్యలేరు. అందుకే శ్రీమన్నారాయణుడు 'అక్షోభ్యః' అనబడతాడు.

## 802. సర్వవాగీశ్వరేశ్వరః

వాచాలకులలో శ్రేష్ఠుడు. వాక్చాతుర్యము కలవాడు.

**వాదవాగ్మత్వయోః పారం యోగచ్ఛతి సవిశ్రుతః ।**

**రవ్యర్ణో వాక్ప్రదఇతి సర్వవాగీశ్వరేశ్వరః ॥**

ప్రతివాదులతో వాదించుట యందుగాని, ఇతరుల హృదయాలను ఆకర్షించేటట్లుగా మాట్లాడటంలోగాని తనకు మించిన వాడులేడు అని పేరు పొందినవాడు. ఈ నామము ద్వాదశాక్షరి. వాక్పటుత్వము నిస్తుంది. **సర్వేషాం వాచః ఈశ్వరాణామ్ ఈశ్వరః** మాటకారులందరిలోకీ శ్రేష్ఠుడు. వాక్కు అనబడే గొప్ప ఐశ్వర్యము గలవారికి ఈశ్వరుడు.

## 803. మహాహ్రదః

గొప్ప మడుగులాగా ఉండేవాడు. హ్రదము అంటే – మడుగు అని అర్థము.

**శాస్యత్ర పుణ్యాం తృప్తింసః గాహంగాహం మహాహ్రదః**

పుణ్యపురుషులు స్నానంచేసి ఆనందం పొందేటట్లుగా గొప్ప మడుగువంటివాడు.

**మహాంశ్చాసౌ హ్రదశ్చ మహాహ్రదః** పాపం చేసినవారిని మళ్ళీ లేవకుండా ముంచి వేసే మడుగు వంటివాడు. పుణ్యపురుషులు మునిగి ఆనందించటానికి మడుగువంటివాడు.

పరమేశ్వరుడు గొప్ప హ్రదము వంటివాడు. పుణ్యపురుషులు, ముముక్షువులు ఆ పరమాత్మను పొంది అనిర్వచనీయమైన ఆనందాన్ని పొందుతారు. అందుచేతనే అతడు 'మహాహ్రదుడు'.

## 804. మహాగర్తః

రౌరవాది నరకములందు పడద్రోయువాడు.

**పాపాక్రాంత తయానష్ట ప్రజ్ఞానాం రౌరవాదయః**

**గర్తా యస్మాన్మహాగర్తః స స్మృతో వసువర్ణకః**

పాపకర్ములను, జ్ఞానములేని వారిని రౌరవాది నరకాలలో పడేసేవాడు. ఈ నామము అష్టాక్షరీమంత్రము.

**మహాంతః గర్తాః యస్మాత్ సః మహాగర్తః**

తమ నాస్తికవాదనలచేత వైదికమతాన్ని మభ్యపరచి, నాస్తికమతావలంబకులైన పాపులను రౌరవాది నరకాలలో పడవేస్తాడు. రకరకాల నరకాలు, అక్కడవిధించే శిక్షలు శివపురాణంలో వివరించబడ్డాయి.

మనోవాక్కాయ కర్మలచేత చేసిన తప్పుల వల్ల పాపం కలుగుతుంది. ఆ పాపాలకు మరణానంతరము మానవులు నరకంలో శిక్షలు అనుభవిస్తారు. మొత్తం ఇరవై ఎనిమిది రకాల నరకాలున్నాయి.

1. 'తామిస్ర' నరకము గాడాంధకారముగా ఉంటుంది. ఇతరులను హేళన చేసేవారు. ఇతరుల ధనాన్ని అపహరించేవారు ఇక్కడ రకరకాలుగా శిక్షింపడతారు.
2. భర్తలను ప్రలోభపెట్టి, లేదా మోసపుచ్చి వారి భార్యలను అనుభవించేవారు 'అంధతామిస్ర' నరకంలో ఘోరంగా శిక్షింపబడతారు.
3. కుటుంబ పోషణ కోసము ఇతరులను మోసం చేసేవారు 'రౌరవ' నరకంలో విషజంతువులచే పీడించబడతారు.
4. దయ, దాక్షిణ్యము లేకుండా ధనార్జన చేసేవారు 'మహారౌరవ' నరకంలో పీడించబడతారు.
5. ఎలుకలను, ఉడతలను చంపి తినేవాళ్ళు 'కుంభీపాక' నరకంలో సలసలా కాగే నూనెలో త్రోయబడతారు.

6. పెద్దలను, పండితులను దూషించేవారు 'కాలసూత్ర' నరకంలో మాడిపోయే ఇసుకలో పడవేయబడతారు.

7. వేద విరుద్ధమైన పనులు చేసేవారు. 'అసిపత్రవ్రతము' అనే నరకంలో కత్తుల బోనులో పడేసి, ఇనుప కొరడాలతో కొట్టబడతారు.

8. అమాయకులను దండించిన న్యాయాధికారులు 'సూకర ముఖము' అనే నరకంలో శరీరము నుగ్గునుగ్గు అయ్యేటట్లు కొట్టబడతారు.

9. జంతుజాలాన్ని హింసించేవారు 'అంధకూప' నరకంలో శిక్షించబడతారు. తేళ్ళు, జెర్రులు, నల్లులు, దోమలు, వాళ్ళ రక్తం పీల్చి పిప్పి చేస్తాయి.

10. సంపద కలిగి కూడా ఇతరులను ఆదరించనివారు 'క్రిభోజనము' అనే నరకంలో క్రిమికీటకాలతో బాధించబడతారు.

11. బ్రాహ్మణ ద్రవ్యము, విలువైన వస్తువులు దొంగతనం చేసేవారికి 'సందశన' నరకములో ఎర్రగా కాల్చిన కడ్డీలచే పొడిచి, చర్మము వలచబడుతుంది.

12. వావివరుసలు లేకుండా చరించినవారిని 'తప్తసూర్మి' నరకంలో ఎర్రగా కాల్చిన లోహపు విగ్రహాలను కౌగిలించుకోమంటారు.

13. మదంతో పశువులతో రమించేవారిని 'వజ్రకంటక' నరకంలో ముళ్ళపొదలలో పడదోస్తారు.

14. అధర్మపరులైన ఉద్యోగులను, వేదబాహ్యులైన బ్రాహ్మణులను 'వైతరిణీ' నదిలో తోస్తారు. అది చీము, నెత్తురులతో, క్రిమికీటకాదులతో నిండి ఉంటుంది.

15. కులాచారములు పాటించనవారిని 'పూయాదన' అనే మలమూత్రములతో నిండిన సముద్రంలో తోస్తారు.

16. కుక్కలను పెంచి వేటయే వృత్తిగాగల బ్రాహ్మణులను 'ప్రాణరోధ' నరకంలో కత్తులతో పొడుస్తారు.

17. జంతువులను, పశువులను చంపి తినేవాళ్ళు 'వైశస' నరకంలో పడరానిపాట్లు పడతారు.

18. కామాంధుడై, భార్య నోటియందు వీర్యమును వదిలినవాడికి 'లాలాభక్షణ' నరకంలో వీర్యాన్నే తినిపిస్తారు.

19. ఇళ్ళకు నిప్పు పెట్టేవారు, విషం పెట్టేవారు, దారిదోపిడీచేసేవారిని 'సారమేయోదన' నరకంలో పదునైన కోరికలు గల కుక్కలు చీల్చి వారి రక్తం త్రాగుతాయి.

20. దొంగ సాక్ష్యాలు చెప్పేవారు, వ్యాపారంలో మోసం చేసేవారు. 'అవిచింత'మనే నరకంలో కొండలమించి తలక్రిందులుగా క్రిందికి త్రోయబడతారు.

21. దీక్షలు పూని మద్యపానం చేసే బ్రాహ్మణుని 'ఆయుఃపాన' నరకములో సలసలాకాచిన ఇనుముని త్రాగిస్తారు.

22. తమకన్నా పెద్దవారిని నిర్లక్ష్యంగా చూసేవారిని 'క్షారకర్ధ' నరకంలో తలక్రిందులుగా వ్రేలాడదీసి బాధిస్తారు.

23. మనుష్యులను, పశువులను చంపేవారిని 'రక్షోగణ భోజన' నరకంలో పదునైన కత్తులతో ముక్కలు ముక్కలుగా నరకుతారు.

24. అడవి జంతువులను, ఊర జంతువులను చంపేవారిని 'శూలప్రోత' నరకంలో శూలాలతో పొడిచి ఉరివేస్తారు.

25. సాటి మానవులను హింసించేవారిని 'దండసూకర' నరకములో హింసిస్తారు.

26. మనుషులను చెరబట్టేవారిని, బంధించేవారిని 'అవధ నిరోధనీ' నరకములో పొగలో పడేస్తారు.

27. భోజన సమయంలో వచ్చిన అతిధులను దూషించిన వారిని 'పర్యావర్తన' నరకంలో కళ్ళు కాకులతో పొడిపిస్తారు.

28. ధనగర్వముతో ఇతరులను దూషించేవారిని 'సూచేముఖ' నరకంలో సూదులతో గ్రుచ్చి హింసిస్తారు.

నరకములో ఎన్ని బాదలు పడినా పాపి చావడు. ఎత్తైన కొండ నుండి క్రిందికి పడత్రోసినప్పుడు అతడి శరీరము ముక్కలు ముక్కలవుతుంది. అతడు ఆ బాధ అనుభవిస్తాడు. కాని ఆ ముక్కలన్నీ మళ్ళీ అతుక్కుని, తరువాత శిక్షకు సిద్ధమవుతుంది.

అగర్త అంటే – కోట గోడల మధ్యన ఉండేలోతైన కందకము. అందులో మొసళ్ళు కూడా ఉంటాయి.

ఇది పరమేశ్వరుని మాయ. దీనిని ఎవరూ దాటలేరు.

**భగవద్గీత** 7వ అధ్యాయం **'జ్ఞానవిజ్ఞానయోగము'**లోని 14వ శ్లోకము.

**దైవీ హ్యేషా గుణమయీ మమమాయా దురత్యయా ।**
**మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే ॥**

నా మాయ త్రిగుణాత్మకమైనది. అలౌకికమైనది. అధిగమించటానికి వీలుకానిది. నిరంతరము నన్నే భజించువారు మాత్రమే ఈ మాయను దాటగలరు.

గర్త అంటే రథము. గొప్ప రథముగలవాడు శ్రీమన్నారాయణుడు. అంటూ బుద్ధావతార ఘట్టాన్ని పూర్తిచేశాడు రత్నాకరుడు.

# 50. భక్తానుగ్రహము

“గురువుగారూ! పరమేశ్వరుడు భక్తసులభుడు. భక్తులను అతి తేలికగా అనుగ్రహిస్తాడు అంటారు కదా. ఆ విధానమును వివరించండి” అన్నాడు నారాయణభట్టు. చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

పరమేశ్వరుడు దయామయుడు. కరుణాస్వభావుడు. సాధుపుంగవులను అనుగ్రహించి వారికి పరమపదాన్నిస్తుంటాడు. అంతే కాకుండా సామాన్యులకు భోగభాగ్యాలు. సిరిసంపదలు మొదలైన కోరికలు తీరుస్తుంటాడు. తన ఆజ్ఞను ఉల్లంఘించిన వారిని కఠినంగా శిక్షిస్తాడు. మహాత్ములందరినీ తనవారుగా అనుగ్రహిస్తాడు. మహనీయుల పాలిట నిధి వంటివాడు. వారందరినీ ఆదరించేవాడు. భూమి అనబడే ప్రకృతి మండలములో మహాత్ములతో కలిసి ఆనందిస్తాడు. వారందరికీ భూమిమీదే మోక్షమిస్తాడు. అంటే ఈ లోకంలో కావలసిన సుఖాలన్నీ తీరుస్తాడు. భూభారాన్ని తగ్గించి భూదేవికి ఆనందము కలుగచేస్తాడు. సాధకులకు ఆత్మజ్ఞానాన్ని ప్రసాదిస్తాడు. భక్తుల పాపాలను నాశనం చేస్తాడు. ఆ రకంగా పాపనాశనం చేసి వారికి పరాభక్తి, పరాజ్ఞానము ఇచ్చేవాడు. తాపత్రయాలను హరిస్తాడు. భక్తులను రక్షించటం కోసం ఎంత దూరమైనా వెళ్ళేవాడు. ఇతన్ని ప్రేరేపించేవారు ఎవరూ లేరు. అందరికన్నా ఇతడే అధికుడు. క్షీరసాగరమథన సమయంలో దేవతలతో అమృతపానం చేయించాడు. సాధకులు యోగనిష్ఠలో ఉన్నప్పుడు సహస్రారమునుంచి అమృతపుధారలు కురిపించి వారిని ఆనందింపచేయువాడు. అమృతము వంటి అంటే నాశనము లేని దేహము గలవాడు. అతడు సర్వజ్ఞుడు. అన్ని వైపులకు ముఖాలు గలవాడు. అతన్ని ఏరకంగానయినా పొందవచ్చు. అతన్ని పొందటం చాలా తేలిక. అతడికి శరణాగతరక్షణ అనే మంచి వ్రతమున్నది. ఏ ప్రయత్నమూ లేకుండానే అతన్ని చాలా సులువుగా పొందవచ్చు తన తత్త్వాన్ని తెలుసుకున్న వారికి చాలా తేలికగా సాధ్యుడవుతాడు. శత్రువులను తపింపచేసేవాడు. నశింపచేసేవాడు. అతడికి ఎంత కోపం తెప్పించినాసరే, అంజలి ఘటించిన వారిని క్షమించే స్వభావము గలవాడు. అతడు లక్ష్మీదేవితో కూడి పరమపదములో ఉంటాడు.

ఈ విషయాలన్నీ 805 నుంచి 823 వరకు నామాలలో వివరించటం జరిగింది. ఇక నామాలను చూద్దాం.

## 805. మహాభూతః

మహనీయులను తన సొత్తుగా గలవాడు.

**నిగ్రాహకత్వం కథితం స్వస్యైవాజ్ఞాతింఘనాత్**

**స్వాజ్ఞానువర్తినాం పుంసా మనుగ్రాహస్త థోచ్యతే ॥**

**మహాభూతో మహాత్మానః స్వభూతాస యస్యచోచ్యతే ॥**

ఇంతవరకు తన ఆజ్ఞను ఉల్లంఘించువారి విషయము, వారిని శిక్షించే విషయము చెప్పారు. ఇప్పుడు తన ఆజ్ఞను పాలించేవారిని తాను ఎలా అనుగ్రహించేదీ చెప్పబడుతున్నది. మహాత్ములందరినీ తన వారుగా గ్రహించేవాడు.

**మహాన్తః భూతాః యస్యసః మహాభూతః** లోకంలో గొప్పవారు, మహనీయులు అతని సొత్తు. **భగవద్గీత**లోని 9వ అధ్యాయం **'రాజవిద్యారాజ గుహ్యాయోగం'**లోని 13వ శ్లోకము.

**మహాత్మా నస్తు మాం పార్థః దైవీం ప్రకృతి మాశ్రితాః**

**భజంత్య నన్య మనసో జ్ఞాత్వా భూతాది మవ్యయమ్**

దైవీ ప్రకృతిని ఆశ్రయించిన మహాత్ములు సకల జీవులకు మూలకారణమైన నన్ను తెలుసుకుని వచ్చి చేరెదరు.

ఈరకంగా ముముక్షువులంతా ఆ పరమేశ్వరునే చేరతారు కాబట్టి వారంతా ఆ పరమేశ్వరుని సొత్తే.

**మహాన్ భూతః మహాభూతః** గొప్ప అయినవాడు. భూతభవిష్యద్వర్తమాన కాలములచేత ఇప్పుడు ఉంటాడు. ఇప్పుడు ఉండడు అని అవధి నిర్ణయం జరగనివాడు.

మహనీయులు, సత్యగుణ ప్రభావులు అందరూ ఎప్పుడూ ఆ పరమేశ్వరునే ధ్యానిస్తూ ఉంటారు. అందుచేతనే మహనీయులను తన వారిగా కలవాడు అనబడుతున్నాడు.

## 806. మహానిధిః

మహనీయుల పాలిట నిధి వంటివాడు, మహనీయుల నాదరించువాడు.

**మహాత్మనో నిధిరివ ప్రియా యస్య మహానిధిః** మహనీయులపాలిట నిధివంటివాడు.

**మహాన్తః నిధయః యస్యసః మహానిధిః** మహనీయులను అధిక ప్రేమతో నిధివలె ఆదరించువాడు.

దేనియందైనా అన్నీ ఉంచబడతాయో అది నిధి పరమేశ్వరుడి దగ్గర అన్నీ ఉన్నాయి. ప్రత్యేకంచి నిధులున్నాయి. ఆ నిధులతో ధన ధన్యాలభోగభాగ్యాలను అనుభవించవచ్చు. కాని పరమేశ్వరుడు తన భక్తులను కాచి రక్షించేందుకు దయను నిధిగా గలవాడు.

సర్వాంతర్యామి అన్ని భూతముల యందు అన్నింటియందు ఆవరించి యున్నాడు. అందుచేతనే అతడు. 'మహానిధిః' అనబడుతున్నాడు.

పరమేశ్వరుడు సమస్త భూతాలయందు ఉన్నాడు. కాబట్టి నిధి అనబడుతున్నాడు. అతని నుండే లోకాలన్నీ ఆవిర్భవిస్తున్నాయి. అతని యందే లయమవుతున్నాయి. అందుచేత అతడు మహానిధి.

భక్తులకు కావలసిన ధనధన్యాలు, భోగభాగ్యాలు సిరిసంపదలు ఇస్తాడు. అవన్నీ ఆయన దగ్గర పుష్కలంగా ఉన్నాయి. కాబట్టి మహానిధి అనబడతాడు. త్రికరణశుద్ధిగా తనను సేవించే భక్తులు కలవాడు. అందుచేత మహానిధి.

**భగవద్గీత** 12వ అధ్యాయం **'భక్తియోగము'**లోని 20వ శ్లోకము.

**యే తు ధర్మ్యామృతమిదం యథోక్తం పర్యుపాసతే ।**

**శ్రద్దధానా మత్పరయాః భక్తాస్తే ఽతీవ మే ప్రియాః ॥**

ఉత్తమ గుణాలు కలిగి ఉండి నిష్కామ భక్తి శ్రద్ధలతో నన్ను సేవించేవారు నాకు అత్యంత ప్రియులు.

ఈరకంగా ఉత్తమమైన భక్తులను కలిగి ఉన్నాడు. కాబట్టి మహానిధిః అనబడుతున్నాడు.

## 807. కుముదః

ప్రకృతి మండలమున సంతసించువాడు. 589వ నామము కూడా ఇదే.

**ప్రాకృతే మండలే భూమౌ మోదనాచ్చ మహాత్మభిః ।**

**ముక్తి భూమి ప్రదానాద్వా కుముదః పరికీర్తితః ॥**

కుః అంటే – భూమి. అదే ప్రకృతి మండలము. అక్కడ మహాత్ములతో ఆనందించువాడు. కు అంటే – భూమి. ము అంటే – మోక్షము ద అంటే – ఇచ్చేవాడు.

భూమిమీద మోక్షమునిచ్చేవాడు. ఇహలోక సుఖాలను కలిగించేవాడు.

పరలోకానికి సంబంధించిన మోక్షము కూడా ఇచ్చేవాడు. మానవులకర్మఫలాన్ని బట్టి ఇహముగాని, పరముగాని ఇచ్చేవాడు.

**కౌ ప్రకృతి మండలే మోదతే ఇతి కుముదః**

ప్రకృతి మండలమైన భూమియందే మహనీయులతో కలసిఉండేవాడు.

భూభారాన్ని తగ్గిస్తూ, భూమికి సంతోషము కలుగచేసేవాడు. పరమేశ్వరుడు అనేక అవతారాలెత్తి, రాక్షససంహారము చేసి భూభారాన్ని తగ్గిస్తున్నాడు. అందుచేత భూదేవిని ఆనందింపచేస్తున్నాడు. అందుకే 'కుముదః' అనబడుతున్నాడు.

తనను శరణువేడిన వారిని రక్షించి వారికి ఆత్మజ్ఞానాన్ని ఇచ్చి వారిని జీవన్ముక్తులుగా చేస్తాడు. అంటే వారంతా ఈ భూమిమీదనే అమితానందము పొందుతారు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'కుముదః' అనబడుతున్నాడు.

## 808. కుందరః

ఆత్మజ్ఞానానిచ్చేవాడు, పాపములు తొలగించువాడు, నిర్మలమైనవాడు.

**భక్తేభ్యశ్చ సదాకుందః సుమవద్విమలాం మతిం ।**
**స్వయంరాతి దదాతీతి కుందరః పరికీర్తితః ॥**

మెల్లలు (ఒకరకమైన పూలు) వంటి నిర్మలమైన, స్వచ్ఛమైన బుద్ధి భక్తులకు ప్రసాదించేవాడు.

**కుందమ్ పరతత్త్వజ్ఞానాత్ రాతి దదాతీతి కుందరః** ఆత్మజ్ఞానాన్ని ప్రసాదించేవాడు.

**భగవద్గీత**లోని పదవ అధ్యాయం **'విభూతియోగం'**లోని 10వ శ్లోకము.

**తేషాం సతత యుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్ ।**
**దదామి బుద్ధి యోగం తంయేన మాముపయాంతితే ॥**

నిరంతరము ధ్యానాదుల ద్వారా నాయందే మనసులగ్నంచేసి, భక్తిశ్రద్ధలతో నన్నేజయించే వారికి నేను తత్త్వజ్ఞాన రూపయోగాన్ని ప్రసాదిస్తాను. అంటే ఆత్మజ్ఞానాన్ని ప్రసాదిస్తాను.

**కుం మోక్ష భువం రాతీతి కుందరః** ఆత్మజ్ఞానాన్ని ప్రసాదించి తద్వారా మోక్షమిచ్చేవాడు.

మల్లెలు, మొల్లలు – అనేవి అతి నిర్మలమైన తెల్లని పుష్పాలు. ఇక్కడ పరమేశ్వరుడు మొల్లపూలలాగా అతినిర్మలమైనవాడు.

**కుంధారయతీతి కుందరః** పాపములను తొలగించువాడు. భక్తుల పాపాలను భస్మం చేసేవాడు.

కుందములు అంటే మల్లెలు. మల్లెపూలవలె తెల్లగా, స్ఫటికమువలె స్వచ్ఛంగా ఉండేవాడు. హిరణ్యాక్షుని సంహరించటానికి వరాహరూపంలో భూమిని పెకలించినవాడు.

పరిశుద్ధమైన ఫలితము భక్తులకిచ్చువాడు. ఇక్కడ పరిశుద్ధమైన ఫలితము అంటే – మోక్షము. భక్తులకు జ్ఞానాన్ని ప్రసాదించి, తద్వారా ఆత్మసాక్షాత్కారం కలుగచేసి వారికి స్వచ్ఛమైన ఫలితము – మోక్షమునిచ్చేవాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు 'కుందరః' అనబడుతున్నాడు.

## 809. కుందః

పరాభక్తి, పరాజ్ఞానములనిచ్చువాడు. పాపములు తిరిగిరాకుండా చేసేవాడు.

**కు మవ్యయం పాపవాచి కుందరస్తవ్య దారణాత్**

**భక్తేభ్యః పరభక్త్యాది ప్రదానాత్కుంద ఉచ్యతే**

**విదారితం పాపజితం కుంద శ్శోధయతీతివా ॥**

కుం అనగా – పాపరాశిః ధరః అనగా – దానిని భేదించువాడు.

కుం అంటే పరాభక్తి. దానిని ఇచ్చువాడు. తన కృపతో తప్పిపోయిన పాపరాశిని తిరిగి దాపురించకుండా చూసేవాడు.

**కుందదాతీతి కుందః** పూర్వజన్మవాసనలు జయించినవారికి పరాజ్ఞనము, పరాభక్తి ప్రసాదించేవాడు. కుందాపుష్పమువలె సున్నితమైన శరీరము గలవాడు. కుందాపుష్పము లాగా నిర్మలమైనవాడు. పరశురామావతారంలో భూమిని కశ్యపప్రజాపతికి దానం చేసినవాడు.

పరశురాముడు 21 సార్లు దండయాత్రచేసి క్షత్రియులను సంహరించి వాళ్ళ రాజ్యాలు స్వాధీనం చేసుకున్నాడు. ఆ తరువాత ఈ పాపం పోవటానికి అశ్వమేధయాగంచేసి తాను సంపాదించిన భూమి యావత్తు మరీచి కుమారుడైన కశ్యప ప్రజాపతికిదానమిచ్చాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'కుందః' అనబడుతున్నాడు.

కార్తవీర్యుడు మొదలైన క్షత్రియులను సంహరించాడు. కాబట్టి 'కుందః' అనబడుతున్నాడు.

## 810. పర్జన్యః

తాపత్రయమును హరించువాడు.

**స్వతత్త్వజ్ఞానదానేన నిత్యం తాపత్రయాపహో పర్జన్యస్స స్సమాఖ్యాతః**

భక్తులకు తత్త్వాన్ని బోధించి, తాపత్రయములనుండి కాపాడువాడు.

**తాపత్రయం పర్షతి అర్థయతీతి పర్జన్యః** తన తత్త్వాని తెలుసుకున్నవారి తాపత్రయాలు తగ్గించేవాడు.

తాపత్రయము అంటే – మూడు రకాలతాపాలు.

**1. ఆధ్యాత్మికము :** శరీరంలో కలిగే వ్యాధులు, మానసకిమైన కామక్రోధాలు, జ్వరము, అలసత్వము, కపటము మొదలైనవి.

**2. ఆదిభౌతికము :** అగ్ని, వరద, భూకంపాలు, కుక్కల ఏడుపు, గుడ్లగూబల అరుపు మొ॥వి.

**3. ఆదిదిదైవికము :** దేవతావిగ్రహాలకన్నీరు. ఎండ, వాన, గాలి, యక్ష, రాక్షస, పిశాచాల వలన కలిగే బాధలు, ఈ మూడూ తాపత్రయాలనబడతాయి.

భక్తులకు తత్త్వాన్ని బోధపరచి ఈ రకమైన తాపత్రయాలను తగ్గిస్తాడు.

పర్జన్యుడు – మేఘము వంటివాడు. మేఘము నీటిని వర్షించినట్లుగా పరమేశ్వరుడు భక్తుల కామ్య ఫలాలను వర్షిస్తాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'పర్జన్యః' అనబడతాడు.

**లలితాసహస్రంలో** 357వ నామము **'తాపత్రయాగ్ని సందగ్ధ సమాహ్లాదన చంద్రికా.'**

## 811. పావనః

వెళ్ళువాడు. 292వ నామము కూడా ఇదే.

**పావనః పవతే హియః** తన భక్తులను రక్షించటం కోసం వారున్నచోటికి తానే స్వయంగా వెళ్ళేవాడు.

**పవతే గచ్ఛతీతి పావనః** భక్తుల తాపత్రయాలు హరించటంకోసం, వారి వద్దకు తానే వెళ్ళేవాడు.

స్మరించినంతమాత్రంచేతనే భక్తులను రక్షించేవాడు.

## 812. అనిలః

ప్రేరకులు లేనివాడు. 234వ నామము కూడా ఇదే.

**స్వస్య స్వస్మాత్ప్రేరకోఽస్యః ప్రసన్నానుగ్రహేసదా ।**
**నాస్తీతి సోఽ నిలః ప్రోక్తో మున్యర్ణో మనురుత్తమః ॥**

ప్రసన్నులను అనుగ్రహించటానికి తనకన్న మరియొక ప్రేరకుడు లేనివాడు. ఈ నామము సప్తాక్షరి. ఉత్తమమైనది.

**నాస్తి ఇలః ప్రేరకః యస్యసః అనిలః**

భక్తులను అనుగ్రహించే విషయంలో ఎవరి ప్రేరణ అవసరంలేనివాడు.

**తదప్య ప్రార్థితం ధ్యాతో దదాతి మదుసూదనః** మదుసూదనుని ప్రార్థించినంత మాత్రంచేతనే భక్తుడు కోరిన ఫలితాన్ని ఇస్తాడు. ప్రేరణ చేసేవాడు 'ఇల' అనబడతాడు. తన వ్యాపారములయందు ప్రేరేపించువాడు ఎవరికి లేడో, అతడు అనిలుడు అనబడతాడు.

పరమాత్మ సర్వస్వతంత్రుడు. తాను చేసే సృష్టి కార్యక్రమంలో అతనికి ఎవరి ప్రేరణ అవసరం లేదు.

ఆత్మజ్ఞానం లేనివాడు 'ఇలుడు'. దానికి విపరీతమైనవాడు అనిలుడు. పరమేశ్వరుడు సర్వజ్ఞుడు. తత్త్వజ్ఞానము అతని సొంతము. అందుకే అతడు అనిలుడు, ఈ నామానికి దుర్లభుడు కానివాడు. భక్తసులభుడు అని కూడా అర్థమున్నది. అందుకే శ్రీమన్నారాయణుడు 'అనిలః' అనబడతాడు.

## 813. అమృతాఽ ఽ శః

అమృతపానము చేయించువాడు.

**యశ్చాశయతి భక్తాన్స్యే స్వగుణామృత మాదరాత్ ।**
**అమృతాశ స ఇత్యుక్తః శృతపీయూషదో మనుః ॥**

తన భక్తులకు తన కల్యాణగుణములను ఆదరముతో అనుభవింపచేయువాడు. ఈ నామ మంత్రము చెవులకు అమృతము వంటిది.

**అమృతమ్ ఆశయతీతి అమృతాశయః** తన గుణామృతాన్ని భక్తులచే పానము చేయించువాడు.

సాధకుడు యోగనిష్ఠుడై కుండలినీశక్తిని జాగృతంచేసి, దాన్ని సహస్రారం చేర్చినట్లైతే అక్కడ నుండి అమృతం జాలువారి యోగియొక్క శరీరంలోని 72 వేల నాడీ మండలము తడుస్తుంది. ఈ రకంగా తన భక్తులతో అమృతపానము చేయించువాడు.

స్వాత్మానందరూపమైన అమృతపానము చేసేవాడు. తన భక్తులతో చేయించేవాడు. క్షీరసాగరమధన సమయంలో వచ్చిన అమృతాన్ని తాను త్రాగి, తన భక్తులైన దేవతలచేత త్రాగించినవాడు.

## 814. అమృతవపుః

అమృతము వంటి దేహము కలవాడు.

**వ పుర్యస్యామృత మితి న చామృతవపు స్మృతః**

అమృతము వంటి దేహము గలవాడు.

**అమృతం వపుః యస్యసః అమృతవపుః** అమృతమువలె కోరదగిన దేహము గలవాడు. మృతము అంటే – మరణము. అటువంటి మరణము లేని శరీరము గలవాడు.

పరమేశ్వరుడు సత్యము, నిత్యము అయినవాడు. శాశ్వతమైనవాడు. అతడికి జన్మమృత్యు జరాదులు లేవు. అందుచేత మరణములేని శరీరము గల శ్రీమన్నారాయణుడు 'అమృతవపుః' అనబడుతున్నాడు.

## 815. సర్వజ్ఞః

సర్వజ్ఞుడు. 453వ నామము కూడా ఇదే.

**శక్యాశక్యాదికం సర్వం సాధ్యాసాధ్యాదికం చయః**
**భక్తానామనుసధత్తే స సర్వజ్ఞ ఇతీరితః**

తన భక్తులయొక్క శాక్యాశక్యాలు, సాధ్యాసాధ్యాలు బాగా తెలిసినవాడు.

**సర్వం జానాతీతి సర్వజ్ఞః** అన్ని విషయములు తెలిసినవాడు. తన భక్తులకు ఏమికావాలో పూర్తిగా ఎరిగినవాడు. సర్వమూ తెలిసినవాడు. ఇక్కడ సర్వము అంటే సర్వమూ అయిన ఆత్మతత్త్వమును తెలిసినవాడు. జగత్తులోని ప్రతి చిన్న విషయము తెలిసినవాడు. పరమేశ్వరుడు సామాన్యరూపంలోను, విశేషరూపంలోనూ కూడా సర్వాన్నీ ఎరిగినవాడు. అందుకే శ్రీమన్నారాయణుడు 'సర్వజ్ఞుడు' అనబడుతున్నాడు.

## 816. సర్వతో ముఖః

ఏవిధముగానైనా పొందదగినవాడు, అన్నివైపులకు ముఖములు గలవాడు.

**తత్తన్నియమ ముత్సృజ్య యో జ్ఞాతు శక్యతే బుధైః ।**
**వ్యాజానే యేన కేనాపి స స్మృత సర్వతోముఖః ॥**

ఇంత గొప్పవాడు కాబట్టి ఈ ఉపాయంతో మాత్రమే తెలుసుకోవాలి అని లేకుండా, తన భక్తులైన జ్ఞానులకు ఏదో ఒక రకంగా తెలుసుకోదగినవాడు.

**సర్వతః ముఖః యస్యసః సర్వతోముఖః** ఇతన్ని ఈ ఉపాయంతోనే సాధించాలి. మిగిలిన వాటితో సాధించటం కష్టము అని లేనివాడు. ఇతన్ని ఏ మార్గాన అయినా పొందవచ్చు.

**ఆర్తోవా యదివా దృప్తః పరేంషాం శరణాగతః**

ఆర్తుడుకాని, తృప్తుడుకాని, శరణుగోరివచ్చిన వారిని రక్షించాలి అనుకునేవాడు.

ఇక్కడ ఆర్తులు అంటే – తనను తాను శారీరకంగా రక్షించుకోలేనివాడు.

తృప్తుడు అంటే పరిహాసములనాపి శరణుపొందినవాడు. పరిహాసం కోసం శరణన్నవాడు.

సాధకుడు ఎంతటివాడైనప్పటికీ, శరణనన్నవాడిని రక్షిస్తాడు. అందుకే శ్రీమన్నారాయణుడు సర్వజ్ఞ అనబడుచున్నాడు.

**సర్వతోముఖుని యస్య** అన్నివైపులకు ముఖములు గలవాడు.

**భగవద్గీత**లోని 13వ అధ్యాయం **'క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగం'**లోని 13వ శ్లోకం.

**సర్వతః పాణిపాదం తత్ సర్వతోஉ శిక్షిరోముఖమ్ ।**
**సర్వతః శృతిమల్లోకే సరమావృత్యతిష్ఠతి ॥**

ఆ పరమాత్ముని వేళ్ళు, గోళ్ళు, చెవులు, కనులు, ముఖములు, సర్వత్రా వ్యాపించి ఉన్నాయి. అతడు స్వర్గాన్ని ఆవరించి ఉన్నాడు. అన్నివైపులకు ముఖములు గలవాడు – పరమేశ్వరుడు. అందుకే శ్రీమన్నారాయణుడు 'సర్వతోముఖః' అనబడుతున్నాడు.

**లలితాసహస్రం**లో 533వ నామము **'సర్వతోముఖీ'**

## 817. సులభః

తేలిక అయినవాడు.

**సర్వేషాం సుప్రవేశ్యత్వాత్, సులభః పరికీర్తితః**

ఎవరైనాసరే తేలికగా తెలుసుకోదగినవాడు.

**సుఖేనలబ్ధుం శక్యః సులభః** వెలలేకుండా, తగిన మూల్యం చెల్లించుకోవాలి. అనకుండా పొందదగినవాడు. అతి తేలికగా పొందదగినవాడు.

**సుఖేనలభ్యతే సులభః** తేలికగా పొందదగినవాడు.

భక్తితో తెచ్చిన పత్రం, పుష్పం, ఫలం, తోయం వీటితో తేలికగా పొందదగినవాడు.

## 818. సువ్రతః

శరణాగతరక్షణ అనే మంచి వ్రతము గలవాడు. 455వ నామము కూడా ఇదే.

**యేన కేనప్రవిష్టానాం సర్వధా పరిపాలనం**

**దృఢం సుష్టువ్రతం యస్య స సువ్రత ఉదాహృతః**

భక్తులు ఏ ఉపాయంతో తన దగ్గరకు వచ్చినప్పటికీ వారిని వదలకుండా అన్ని ప్రయత్నాలు చేసి రక్షించటము అనే వ్రతం గలవాడు.

**సుశోభనం వ్రతం యస్యసః సువ్రతః** మంచి వ్రతము కలిగినవాడు.

**శోభనం వ్రతయితి**

చక్కగా వ్రతమును చేయువాడు. ఇక్కడ వ్రతము అంటే భుజించటము లేదా ఉపవాసము ఉండటము. ఈ రకంగా వ్రతాన్ని పాటించే వారంతా పరమాత్మ స్వరూపులే.

చాంద్రాయణాది వ్రతములను చేయువాడు. చాంద్రాయణ వ్రతము అంటే చంద్రుని యొక్క వృద్ధి క్షయాలననుసరించి ఆహారనియమములు పాటించటము.

దుష్టశిక్షణ, శిష్టరక్షణ లేని వ్రతముగా గలవాడు. శరణాగతులను రక్షించువాడు. అందుకే శ్రీమన్నారాయణుడు 'సువ్రతః' అనబడుతున్నాడు.

## 819. సిద్ధః

అయత్నసాధ్యుడు, సిద్ధించేవాడు. 97వ నామము కూడా ఇదే.

**అయత్న సాధ్యసిద్ధస్యాత్ స్వతత్వస్థితి వేదినామ్** పరమేశ్వరునియొక్క నిజస్థితిని తెలుసుకున్న వారు ఏ ప్రయత్నం చేయకుండానే, వారిచేత సాధింపబడతాడు.

అందుచేతనే పరమేశ్వరుడు అయత్నసాధ్యుడు అంటే-ప్రయత్నం లేకుండానే సాధింప బడేవాడు. ఇతరుల అధీనంలో లేనివాడు. తాను తనయొక్క అధీనంలోనే ఉన్నవాడు. తన స్వరూపస్వభావాల గురించి పూర్తిగా తెలుసుకున్న వారికి తను స్వాధీనమవుతాడు.

మంత్రాన్ని అనుష్టానం చేసేటప్పుడు ఆ మంత్రాధి దేవతసాక్షాత్కరించటము, మంత్రజపము వలన ఫలితము పొందటాన్నే మంత్రసిద్ధి అంటారు. అప్పుడు ఆ మంత్రాధిదేవత సాధకుడికి స్వాధీనమవుతుంది. ఈ రకంగా మంత్రసిద్ధి జరగాలంటే సాధకుడు చాలా ప్రయత్నం చెయ్యాలి. కాని పరమేశ్వరుని తత్త్వాన్ని తెలుసుకున్నవారికి అతడు అప్రయత్నంగానే సిద్ధిస్తాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'సిద్ధః' అనబడతాడు.

## 820. శత్రుజిత్

శత్రువులను జయించినవాడు.

పరమేశ్వరునకు శత్రువులు అనేవారులేరు. దేవతలయొక్క శత్రువులే అతని శత్రువులు. అందుచేత దేవతల శత్రువులైన రాక్షసులను ఎల్లప్పుడూ సంహరించేవాడు.

## 821. శత్రుతాపనః

శత్రువులను తపింపచేయువాడు.

**సురశత్రూన్ తాపయతి** దేవతల శత్రువులైన రాక్షసులను తపింపచేయువాడు.

శంకరభగవత్పాదులవారు ఈ రెండు నామాలను విడివిడిగా వ్రాశారు. కాని పరాశరభట్టరువారు ఆ రెంటినీ కలిపి ఒకే నామంగా వ్రాశారు.

**శత్రుజిచ్ఛత్రుతాపనః :** శత్రువులను జయించటము, వారిని తపింపచేయటమే లక్ష్యముగా గలవాడు.

**పురుకుత్స కుకుస్థాద్యైః శత్రుజిద్భిస్స్వతేజసా**
**ఆఢ్యో యత్నై రరిగణాన్ యస్తాపయతి నిత్యశః**
**శత్రుజిచ్ఛత్రు తాపన ఇతి విద్యద్గణోదితః ॥**

పురుకుత్సవుడు, కుకుత్సుడు మొదలైన రాజశ్రేష్ఠులయందు తన అంశను ప్రవేశపెట్టి శత్రునాశనము చేసినవాడు.

పురుకుత్సుడు – బిందుమతీ మాంధాతలకుమారుడు. ఇతడిని నాగకుమారులు తమలోకానికి తీసుకుపోయి, తమ చెల్లెలు నర్మదనిచ్చి వివాహం చేశారు. అంగీరసులను గంధర్వులు నాగలోకానికి వెళ్ళి అక్కడి నాగులను బాధపెడుతున్నారు. ఈ మాటలు విన్న పురుకుత్సుడు వారితో యుద్ధం చేసి ఆంగీరసులను వధించాడు.

**శత్రుజిద్భిః శత్రూన్ తాపయతీతి శత్రజిచ్ఛత్రుపానః**

మహారాజశ్రేష్ఠులకు బలపరాక్రమాలనిచ్చి శత్రువులను సంహరింప చేసినవాడు.

## 822. న్యగ్రోధః

అన్ని భూతములను తన మాయచే అడ్డగించి ఉన్నాడు.

# 823. ఉదుంబరః

పరమేశ్వరుడు జగత్కారణుడు కాబట్టి పంచభూతాలలోను మొదటిదయిన ఆకాశము కన్న పైస్థాయిలో ఉన్నాడు.

అన్నము మొదలైన వాటిని 'ఉందుంబరము' అంటారు. అన్నంచేత విశ్వాన్ని పోషిస్తున్నాడు. కాబట్టి 'ఉదుంబరః' అనబడుతున్నాడు.

ఈరకంగా శంకరభగవత్పాదులు వీటిని రెండు నామాలుగా చెప్పారు. కాగా పరాశరభట్టరువారు ఈ రెండింటినీ కలిపి ఒకే నామముగా చెప్పారు.

**న్యగ్భూతైః ప్రణతైః స్వానుగ్రహౌన్ముఖ్యేన రుధ్యతే**
**యోవ్యవస్థాప్యతే నిత్యం న్యగ్రోథ స్స ఉదాహృతః**
**గుణత్రయా దుద్గతం యత్ పరమం ధామ చాంబరం**
**లక్ష్మీ పరిజనాధి శ్చ యస్యా స్తి స ఉదంబరః**
**న్యగ్రోథో దుంబర ఇతి హ్యేకనామప్రకీర్తితమ్**
**అత్యుచ్ఛ్రితానాం సేవ్యో యో ప్యత నీచాను వర్తనాత్**
**న్యగ్రోథోదుంబర స్సస్యాత్ దశార్ణ సర్వసిద్ధిదః ॥**

న్యగ్రోథము అంటే – తనచేతిలో ఓడిపోయిన శత్రువులు, కాళ్ళమీద పడగా, వారియందు అనుగ్రహము గలవాడు.

ఉదంబరః అనగా – గుణత్రయముతో కలియక వాటిని దాటి ఉండే పరమపదము తనకు నివాసస్థానముగా గలవాడు. పరమపదములో లక్ష్మీదేవితో కూడి ఉన్నవాడు మహాత్ములచేతనేకాక, అతినీచులచేత కూడా సేవింపబడువాడు. ఇది ఒకే నామము దశాక్షరి. సర్వసిద్ధి ప్రదము.

పరమేశ్వరుడికి ఎంత కోపము తెప్పించినా కేవలం నమస్కారం చేసినంత మాత్రంచేతనే ఆ కోపమంతా ఎగిరిపోతుంది. అటువంటి స్వభావం గలవాడు. కాబట్టే శ్రీమన్నారాయణుడు 'న్యగ్రోథోదుంబరః' అనబడుతున్నాడు.

అంటూ 'భక్తానుగ్రహము' అనే ప్రకరణాన్ని పూర్తిచేశాడు రత్నాకరుడు.

# 51. జగన్నియంత

గురువుగారూ ! సృష్టికి పూర్వము ఉన్నవాడు పరమేశ్వరుడొక్కడే. అతని నుంచే త్రిమూర్తులు, ఇంద్రాది దేవతలు, సప్తఋషులు, అష్టవసువులు, ఏకాదశ రుద్రులు, ద్వాదశాదిత్యులు, చరాచర జగత్తు అంతా ఆవిర్భవించింది. అని చెప్పుకున్నాము కదా ! మరి ఈ జగత్తును అతడు ఏ రకంగా నియంత్రిస్తాడో వివరించండి అన్నాడు కృష్ణశర్మ. చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

ఈ జగత్తు అంతా పరమేశ్వర స్వరూపమే. ఇందులోని ప్రతి అణువు అతని నుండే ఆవిర్భవించింది. ఈ జగత్తుకు అతడే నియంత. పరమేశ్వరుడున్నాడు కాబట్టే గ్రహాలు గతి తప్పకుండా తిరుగుతున్నాయి. దిక్పాలకులు తమ పనులు సవ్యంగా చేస్తున్నారు. పరమేశ్వరుడు ఇంద్రాది దేవతలయందు ప్రవేశించి అన్ని పనులు చేయిస్తున్నాడు. చాణూరుడు అనే ఆంధ్రుని సంహరించాడు. అతడు లెక్కలేనన్ని కిరణములు గలవాడు. తేజోమయమైన కాంతిపుంజము. అతనియొక్క కాంతులవల్లనే చంద్ర సూర్యాగ్నులు లోకాలను ప్రకాశింపచేస్తున్నారు. అతడు ఏడు నాల్కలు గల అగ్నిరూపుడు. సప్తపాక యజ్ఞములచేత, ఏడు రకాల సమిధలచేత తృప్తి చెందుతాడు. ఏడు రకాల ఛందస్సులు సూర్యుని రథానికి గల గుర్రాలు. అతడికి పాంచ భౌతికమైన స్థూల రూపం లేదు. కాని దివ్యమంగళ విగ్రహుడు. అతడు పాపరహితుడు, దోషరహితుడు. అతడికి కర్మఫలం ఉండదు. అతనితో సమానమైనవారు కాని, అతనికన్న అధికులుగాని లేరు. ఉపమానము లేనివాడు. వేద విరుద్ధమైన కర్మలు చేసే వారిని నిర్దాక్షిణ్యంగా శిక్షించి వారికి భయం కలుగచేస్తాడు. తన భక్తులకు వేద విహితమైన కర్మలు చేసేవారికి భయాన్ని పోగొడతాడు. భవబంధాలను దూరం చేస్తాడు. ఈ రకంగా శ్రీమన్నారాయణుడు 'జగన్నియంత' ఈ విషయాలన్నీ 824 నుంచి 834 వరకు నామాలలో వివరించటం జరిగింది. ఇక నామాలను చూద్దాం.

## 824. అశ్వత్థః

ఇంద్రాదులయందు ప్రవేశించి సకలము ప్రవర్తింపచేయువాడు, అశ్వత్థ వృక్షము.

**అనిత్య మింద్రాది పదం యేషాం తేష్వపి నిత్యశః ।**

**నియామకత్వే నాశ్వత్థః తిష్ఠతీతి సకీర్తితః ॥**

ఇంద్రాది దేవతల స్థానములు నిత్యమైనవి కావు. వంద అశ్వమేధాలు చేసినవాడు ఇంద్రుడవుతాడు. అటువంటి అశాశ్వతమైన పదవులందున్న వారిని కూడా తాను నిత్యుడై ఉండి శాసించేవాడు.

**న శ్వః అశ్వః తతే ఏషామ్ అస్తీతి అశ్వాః ।**
**ఇంద్రాదయః తేషతిష్ఠతీతి అశత్థః ॥**

అనిత్యమైన ఇంద్రాది దేవతల స్థానములందు ప్రవేశించి, సకలమును పాలించేవాడు.

ఈ జగత్తు అశ్వత్థ వృక్షముతో పోల్చబడింది. అది మిక్కిలి అశాశ్వతమైనది. **కఠోపనిషత్తు**లో చెప్పబడినట్లుగా సంసారమనబడే వృక్షము పై వైపుకు మూలము, క్రిందివైపుకు కొమ్ములు గలిగి ఉన్నది. **భగవద్గీత** 15వ అధ్యాయం **'పురుషోత్తమ ప్రాప్తియోగం'**లోని ఒకటవ శ్లోకం.

**ఊర్ధ్వమూల మధశ్శాఖం అశ్వత్థం ప్రాహురవ్యయమ్ ।**
**ఛందాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్ ॥**

ఆదిపురుషుడైన పరమేశ్వరుడే మూలముగా, బ్రహ్మదేవుడే కాండముగా, వేదాలే ఆకులుగా గల సంసారరూపమైన అశ్వత్థ వృక్షము నాశరహితమైనది. దీని తత్త్వాన్ని సమూలంగా తెలుసుకో కలిగినవాడు వేదార్థమెరిగినవాడవుతున్నాడు.

అందుచేత పరమేశ్వరుడే అశ్వత్థవృక్షము.

## 825. చాణూరాంధ్రనిఘూదనః

చాణూర, ఆంధ్రులనబడేవారికి నాశకుడు.

**చాణూరాఖ్యాసురం యోఽరిం మల్లం సూదితవాంశ్చవః ।**
**ప్రోచ్యతే మునిభిర్నిత్యం చాణూరాంధ్ర నిఘాధనః ॥**

దేవతలను పీడించే చాణూరుడనబడే అసురుని చంపినవాడు.

**చాణూరమ్ ఆంధ్రం నిఘూదయతీతి । చాణూరాంధ్రనిఘూదనః ॥**

ఇంద్రాది దేవతలకు విరోధి అయిన అసురుల సంహరించువాడు.

చాణూరుడు అనేవాడు ఒక రాక్షసుడు. కంసుని కొలువులో ఉన్న మహాబలవంతుడు. పైగా మల్లుడు బలరామకృష్ణులను ధనుర్యాగానికి ఆహ్వానించాడు కంసుడు. ఆ సమయంలో ముష్టియుద్ధం చేసి బలరామకృష్ణులు ఆ రాక్షసులను సంహరించారు.

చాణూరుడు అనే పేరుగల ఆంధ్రుని సంహరించినవాడు.

# 826. సహస్రార్చిః

వేయి కిరణములు గలవాడు.

**సూర్యే సహస్ర మర్చీంషి శోషణాదిషు హేతవః ।**

**అనివిష్టాని యేనాసౌ సహస్రార్చి రితిస్మృతః ॥**

పాచన, శోషణ, తాపములకు కారణములైన సహస్ర కిరణములను సూర్యుని యందు ఉంచినవాడు.

**సహస్రమే అర్చీంషి యస్యసః సహస్రార్చిః** సహస్ర కిరణములను సూర్యునికిచ్చిన వాడు. **భగవద్గీత** 15వ అధ్యాయం **'పురుషోత్తమ ప్రాప్తియోగం'**లోని 12వ శ్లోకం

**యదాది త్యగతం తేజో జగద్భాసుయతేఽఖిలం ।**

**యచ్ఛంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్ ॥**

సమస్త జగత్తును ప్రకాశింపచేసే సూర్యుని తేజస్సు, అగ్ని తేజస్సు, చంద్రుని తేజస్సు కూడా నా తేజస్సే అని తెలుసుకో.

జగత్తులో ప్రకాశించేదంతా పరమేశ్వరుని తేజస్సే తప్ప వేరుకాదు. **భైరవయామళం**లో "పరమేశ్వరి నుంచి అనేక కోట్ల కిరణములు ప్రకాశిస్తున్నాయి. అందులో 11 కిరణములను సూర్యుడు, 108 కిరణములను అగ్ని, 136 కిరణములను చంద్రుడు తీసుకున్నారు. వీరివల్లనే జగద్వ్యాపారము జరుగుతున్నది" అని చెప్పబడింది. ఈ విషయం గతంలో వివరించాం. **బృహదారణ్యకోపనిషత్తు**లో కూడా ఈ విషయం చెప్పబడింది. కాబట్టి జగత్తును ప్రకాశింపచేసే సూర్యునికి కాంతి కిరణములనిచ్చినవాడు.

**సహస్రాణి-అనంతాని అర్చీంషి యస్యసః** వేలకొలది అనగా అనంతమైన కాంతి కిరణములు గలవాడు. **భగవద్గీత** 11వ అధ్యాయం **'విశ్వరూప సందర్శనయోగం'**లోని 12వ శ్లోకము.

**దివి సూర్యసహస్రస్య భవేద్యుగపదుత్థితా ।**

**యదిభా స్సదృశీ సా స్యాత్ భాసస్తస్య మహాత్మనః ॥**

ఆకాశంలో వేలకొలది సూర్యులు ఒక్కసారిగా ఉదయించినట్లైతే కాంతిపుంజములు కూడా ఆ విరాడ్రూప తేజస్సుకు సాటి రావు. అంత కాంతిగలవాడు పరమేశ్వరుడు. కాబట్టే

**కోటిసూర్య ప్రతీకాశం చంద్రకోటి సుసీతలమ్**

కొన్నికోట్ల సూర్యులకాంతితో, చంద్రుల చల్లదనంతో పరమేశ్వరుడు ప్రకాశిస్తున్నాడు. అతడే శ్రీమన్నారాయణుడు.

## 827. సప్త జిహ్వః

ఏడు జిహ్వాలు గలవాడు అగ్ని రూపుడు.

**యస్మాత్కాళ్యాది జిహ్వాశ్చ అగ్నేర్భవతి సప్త చ ।**

**స సప్తజిహ్వా అఖ్యాతః లోకసంతర్పణేంతః ॥**

లోకాలను ఆనందింపచెయ్యటం కోసం పరమేశ్వరుడు అగ్నిదేవుడికి ఏడు జిహ్వాలు ఇచ్చాడు.

**సప్తజిహ్వః యస్యసః సప్తజిహ్వః** దేవతలకు హవిస్సును అందించే కాళి, కరాళి మొదలైన ఏడు జిహ్వాలు అగ్నికి ఇచ్చినవాడు. అగ్నిహోత్రుడికి ఏడునాల్కలున్నాయి. అందుకే అతడికి సప్తజిహ్వుడు అని పేరు అవి :

1. కాళి – నల్లనిది
2. కరాళి – భయంకరమైనది
3. మనోజవ – మనసువంటి వేగము గలది
4. సులోహిత – ఎర్రని రంగు గలది
5. సుధూమ్రవర్ణ – దట్టమైన పొగరంగు గలది
6. విస్ఫులింగిని – రవ్వలు ఎగజిమ్మునది
7. దేవి – అనేక కిరణాలు గలది

**తద్వక్త్ర దేవతా నాంచ హుతభుక్ పరమేశ్వరః ।**

**మంత్రపూతం యదా దాయ హుతమాజ్య పురస్సరమ్ ।**

**బ్రహ్మాండ భువనం సర్వం సంతర్పయత సర్వదా ॥**

అగ్నిని ముఖముగా గల దేవతల రూపంలో హవిస్సుకు తీసుకునేవాడు పరమేశ్వరుడు. మంత్రసహితముగా, నేయి, హోమద్రవ్యాలు అగ్ని ముఖంగా ఆరగిస్తాడు.

## 828. సప్తైధాః

ఔపోసనాదులచే ఆరాధించబడేవాడు.

**వనస్పత్యోశ్చ సమిధః సప్తసంస్థాని వా తథా ।**

**ఇష్టా పూర్తాది కర్మాణి సప్తైధా స్సంతి యస్య సః ॥**

1. అశ్వత్థ, 2. ఉదుంబర, 3. పర్ణ, 4. శమీ, 5. వైకంకత, 6. అశనిహత, 7. పుష్కరవర్ణ అనబడే ఏడు రకాలయిన వృక్షములకు సంబంధించిన సమిధలు గలవాడు. ఇష్టా, పూర్తికర్మలు గలవాడు. ఇవి రెండు రకాల ఇష్టము అనగా - అగ్నిహోత్రము, తపస్సు, సత్యము, వేదానుపాలన, ఆతిధ్యము, వైశ్యదేవము.

పూర్తము అనగా - వాపీకూపతటాకాలు, దేవాలయాల ప్రతిష్ఠ, సత్రవులు కట్టించటము, అన్నదానము మొదలైనవి.

1. ఔపాసన 2. వైశ్యదేవము, 3. పార్వణము, 4. అష్టక 5. మాసశ్రాద్ధము, 6. సర్పబలి 7. ఈశానబలి. అనబడే ఏడు రకాలయిన యజ్ఞములు కలవాడు. వీటిని సప్తపాక యజ్ఞములు అంటారు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | ఆగ్నానేయము | 4. | చాతుర్మాస్యము | 6. | నిరూఢపశుబంధము |
| 2. | అగ్నిహోత్రము | 5. | అగ్రాయణేష్టి | 7. | సౌత్రామణి |
| 3. | దర్శపూర్ణమాస్యములు | | | | |

అనబడే సప్తహవిర్య యజ్ఞములు గలవాడు.

**సప్తఏథాంసి యస్యసః సప్తైధాః** ఏడు విధములైన వైదిక క్రియలచే ఆరాధించబడేవాడు.

**సప్త ఏథాంసి (దీప్తయః) అస్య** ఇతనికి ఏడు ప్రకాశములు గలవు. పరమేశ్వరుడు అగ్ని స్వరూపుడు.

**సప్తతే అగ్నే స్సమిధః సప్తజిహ్వాః ।**

అని అగ్నిమంత్రం. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'సప్తైధాః' అనబడుతున్నాడు.

## 829. సప్తవాహనః

సూర్యుని ప్రవర్తింపచేయువాడు.

**యో వహత్యవిలస్కందాన్ సప్తాసౌ సప్తవాహనః ।**

**వాహనానిచ స న్త్య స్య సప్తవాససప్తవాహనః ॥**

సప్త వాయుస్కంధములను వహించువాడు. గాయత్రి మొదలైన ఏడు ఛందస్సులు గలవాడు.

1. గాయత్రి
2. బృహతి
3. పంక్తి
4. త్రిష్టుప్
5. ఉష్ణిక్
6. జగతి
7. అనుష్టుప్

ఏడు అశ్వములు పూన్చిన రథమునెక్కినవాడు.

**సప్తవాహనానియస్యసః సప్తవాహనః**

ఏడు ఛందస్సులు ఏడు అశ్వాలుగా గల సూర్యుని రథాన్ని ప్రవర్తింపచేసేవాడు.

**సప్తవాయు స్కంధాన్ వహతి వాహయతీతి సప్తవాహనః**

సప్త వాయుస్కంధములను అధిష్టించి ఉండువాడు.

పరమేశ్వర స్వరూపుడైన సూర్యభగవానుడు ఏడు గుర్రములు పూన్చిన రథం మీద ప్రయాణం చేస్తున్నాడు.

అయితే 'సప్త' అనేది గుర్రముల సంఖ్య కాదు. అది గుర్రము పేరు అని చెబుతోంది ఋగ్వేదము.

**సప్తయంజంతి రథమేక అశ్వ ఏకోవహతి సప్తనామాః** సూర్యుని రథానికి ఒకే చక్రము, ఒకే గుర్రము ఉంటాయి. ఆ గుర్రము పేరు 'సప్త' అందుచేతనే సూర్యభగవానుడు.

**సప్తాశ్వ రథమారూఢం ప్రచండం కశ్యపాత్మజమ్ ।**
**శ్వేతపద్మ ధరం దేవం తం సూర్యం ప్రణమామ్యహం ॥**

అని స్తుతించబడతాడు.

## 830. అమూర్తిః

అప్రాకృత దివ్యమంగళ విగ్రహుడు.

**స్థూలభౌతిక మూర్తిభ్యః వ్యానత్తోఽమూర్తిరుచ్యతే ॥**

పరమేశ్వరునికి పాంచభౌతికమైన స్థూలదేహం లేదు. అయినప్పటికీ దానికన్న విలక్షణమైన అప్రాకృతమైన దివ్యమంగళ విగ్రహం గలవాడు.

**న మూర్తిః యస్యసః అమూర్తిః**

పాంచ భౌతిక రూపముకన్న వేరైన దివ్యమంగళ విగ్రహము గలవాడు.

మూర్తి అంటే – మూర్తము గలిగినది. స్థూలరూపము గలది. చేతితో తాకటానికి వీలైనది. ఘనరూపము గలది. అటువంటి స్థూలరూపము పరమేశ్వరుడికి లేదు. కాని అతడు దివ్యమంగళ విగ్రహుడు. తేజోరూపుడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'అమూర్తిః' అనబడుతున్నాడు.

# 831. అనఘః

పాపరహితుడు, దోషరహితుడు. 146వ నామము కూడా ఇదే.

**జీవేభ్యః కర్మవశ్యేభ్యః వ్యావృత్తశ్చానఘ స్మృతః**

కర్మకు లోబడి ఉండే జీవులకన్న విలక్షణమైనవాడు.

**నాస్తి అఘం యస్యసః అనఘః** జీవాత్మ, పరమాత్మ. ఇందులో జీవికర్మకు బద్ధుడైన వాడు. ఈశ్వరుడు కర్మఫలం లేనివాడు. **మాండూక్యోపనిషత్తు**లో "సంసారమనే వృక్షం మీద ఒకే పేరు, ఒకే రూపము గల రెండు పక్షులున్నాయి. అందులో ఒకటి దొరికిన ఆహారం తింటోంది. రెండవది ఏమీ తినకుండా చూస్తూ కూర్చున్నది. వీటిలో మొదటిది జీవాత్మ. అది కర్మఫలాలను అనుభవిస్తోంది. పరమాత్మకు కర్మఫలం లేదు. అందుచేత అది దిక్కులు చూస్తోంది. ఈ రెండూ అంటే జీవాత్మ, పరమాత్మ రెండూ ఒకటే. వేరు కాదు. కేవలం అజ్ఞానంవల్లనే జీవాత్మ తాను వేరు అనుకుంటున్నది. అజ్ఞానం గనక తొలగిపోతే జీవాత్మ తానే పరమాత్మ అని తెలుసుకుంటుంది" అని చెప్పబడింది.

సంసార సాగరంలో పడ్డ జీవికర్మలు చేస్తాడు. వాటివల్ల పాపపుణ్యాలు వస్తాయి. అవి అనుభవించటానికి స్వర్గ నరకాలకు పోతాడు. కర్మశేషం అనుభవించటానికి భూమి మీద మళ్ళీ జన్మిస్తాడు. మళ్ళీ కర్మ చేస్తాడు. ఈ రకంగా సంసారమనే బండిచక్రంలో కర్మఫలాలను అనుభవిస్తూ గిరగిరా తిరుగుతుంటాడు. కాని పరమాత్మకు కర్మఫలం ఉండదు. అతడు కర్మలు చెయ్యడు. అందుచేతనే అనఘ అనబడుతున్నాడు.

# 832. అచింత్యః

ఉపమానము లేనివాడు.

**అచింత్యో దుర్నిరూప స్స్యాత్ ముక్తాద్యుపమయాపిసః**

ముక్తులను, నిత్యులను చూసైనా సరే ఇతడు అసామాన్యుడు అని చెప్పవచ్చును.

ముక్తులు – ముక్తి పొందినవారు

నిత్యులు – శాశ్వతమైనవారు

ముక్తి అంటే విముక్తి. భవబంధనాల నుండి విముక్తి. సంసారబంధనాల నుంచి శాశ్వతమైన ఎడబాటు. అది సాధించినవాడు రాగద్వేషాలను జయించినట్లే. అరిషడ్వర్గాలు అతని అధీనంలో ఉంటాయి. అటువంటివాడికే ఆత్మజ్ఞానం కలుగుతుంది. చరాచర జగత్తంతా తనలోనే ఉన్నది. తననుంచే ఉద్భవిస్తున్నది. తనయందే లయమవుతున్నది. తానే పరబ్రహ్మ అని తెలుస్తుంది. అదే ముక్తి. ఈ బంధాలన్నీ వదిలించుకున్న వాడికి ఏ రకమైన బాధలు ఉండవు. అతడు సదా ఆనంద సాగరంలో తేలియాడతాడు. అతడే నిత్యము, సత్యము అయిన పరబ్రహ్మ. అటువంటి నిత్యులు, సత్యులైన వారిని చూసి పరమేశ్వరుడు 'అనుపమానుడు' అని తెలుసుకోవచ్చును.

**న చింత్య అచింత్య** ముక్తులైన వారితో కూడా సమానంగా ఊహింపజాలనివాడు.

అతన్ని గురించి ఆలోచించటానికి గాని, ప్రమాణాలు చెప్పి ఊహించటానికి గాని శక్యము కాదు.

# 833. భయకృత్

భయము కలిగించువాడు.

**ఆజ్ఞాతిలఙ్ఘినాం పుంసాం నరకాది భయంకరః ।**
**భయకృత్సమాఖ్యాతః సప్తార్ణో౽భవవర్ధనః ॥**

పరమేశ్వరుని ఆజ్ఞలే శ్రుతులు స్మృతులు. వాటిని ధిక్కరించి స్వేచ్ఛగా విహరించే వారిని నరక లోకాలకు పంపి కఠినంగా శిక్షించి భయపెడతాడు. ఈ నామము సప్తాక్షరీ మంత్రము. సంసారబంధనాలను త్రెంచి వేస్తుంది.

**భయంకరోతీతి భయకృత్** తన ఆజ్ఞను ఉల్లంఘించిన వారిని భయపెడతాడు.

పరమేశ్వరుని ఆజ్ఞలు అనుల్లంఘనీయాలు. అతడు ఉన్నాడనే భయంతోనే గాలి సవ్యంగా వీస్తున్నది. దిక్పాలకులు వారి విధులను సక్రమంగా నిర్వర్తిస్తున్నారు.

**అసన్మార్గవర్తినాం భయం కరోతి**

సన్మార్గంలో నడవనివారిని, చెడ్డదారిలో తిరిగేవారిని, కఠినంగా శిక్షించి భయం కలిగిస్తాడు కాబట్టే శ్రీమన్నారాయణుడు 'భయకృత్' అనబడతాడు.

# 834. భయనాశనః

భయాన్ని పోగొట్టేవాడు.

**ఆజ్ఞాను వర్తినాం స్వస్య భయం నాశయతీతి యః ।**

**భయనాశన ఇత్యుక్తో నవార్ణః కర్మకారకః ॥**

తన ఆజ్ఞను పాలించే భక్తులయొక్క భయాన్ని పోగొట్టేవాడు. ఈ నామము నవాక్షరి. పుణ్యకర్మలను చేయిస్తుంది.

**భయంనాశయతీతి భయనాశనః** తన ఆజ్ఞానువర్తులైన వారి భయాన్ని పారద్రోలేవాడు.

వర్ణాశ్రమ ధర్మాలను ఆచరించేవారి భయాన్ని పోగొట్టేవాడు.

**వర్ణాశ్రమాచారవతా పురుషేణ పరః పుమాన్ ।**

**విష్ణురారాధ్యతే పంథానాఽన్యస్తత్తోషకారకః ॥**

వర్ణాశ్రమ ధర్మాలను సరిగా అనుష్ఠించే వారి చేతనే పరమపురుషుడైన శ్రీమన్నారాయణుడు ఆరాధించబడుతున్నాడు. అంటూ 'జగన్నియంత' అనే ప్రకరణాన్ని పూర్తిచేశాడు రత్నాకరుడు.



# 52. అష్టసిద్ధులు

"గురువుగారూ ! పరమేశ్వరుడు సర్వశక్తిమంతుడు. అతడి దగ్గర లేనిది అంటూ ఏదీలేదు. మహాత్ములదగ్గర అష్టసిద్ధులు ఉంటాయంటారు. వాటిని గురించి వివరించండి" అన్నాడు నారాయణభట్టు. చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

మహనీయుల దగ్గర అనేక శక్తులుంటాయి. వాటినే సిద్ధులు అంటారు. ఇవి ఎనిమిది రకాలు. ఇవే అష్టసిద్ధులు.

1. **అణిమాసిద్ధి** : శరీరాన్ని అతిచిన్నదిగా చెయ్యటం. ఆంజనేయుడు తన శరీరాన్ని అతిచిన్నగా చేసి, సురసనోట్లో ప్రవేశించి మళ్ళీ బయటకు వచ్చేశాడు.
2. **మహిమాసిద్ధి** : శరీరాన్ని అతిపెద్దదిగా చెయ్యటం. లంఖిణిని సంహరించటానికి హనుమంతుడు, మధుకైటభుల సంహరించటానికి శ్రీమహావిష్ణువు తమ శరీరాలను అతిపెద్దవిగా పెంచేశారు.
3. **గరిమాసిద్ధి** : శరీరం బరువు విపరీతంగా పెంచటం
4. **లఘిమాసిద్ధి** : శరీరం బరువు పూర్తిగా తగ్గించి శరీరాన్ని అతి తేలిక చెయ్యటం. కృష్ణతులాభారంలో శ్రీకృష్ణ భగవానుడు ఈ రెండు విద్యలనూ ప్రదర్శించాడు.
5. **ప్రాప్తిసిద్ధి** : కావలసిన వస్తువులు పొందటం
6. **ప్రాకామ్యసిద్ధి** : ఆకాశగమనము
7. **ఈశిత్వసిద్ధి** : సమస్తము మీద అధికారం పొందటం.
8. **వశిత్వసిద్ధి** : అన్నింటినీ లోబరచుకోవటం

పరమేశ్వరుడి దగ్గర ఈ సిద్ధులు అన్నీ ఉన్నాయి. తనను అర్చించే వారికి సిద్ధులను ప్రసాదిస్తాడు. అతడు సూక్ష్మాతిసూక్ష్మమైన దేహం గలవాడు. జీవునియందు ప్రవేశించేంత చిన్నదేహం అతనికున్నది. అంతేకాదు. అతడు అన్నింటికన్నా పెద్దవాడు. ఆకాశాన్నంతా ఆక్రమించినవాడు. గలి కన్నా తేలిక అయిన శరీరం గలవాడు. కోరిన వస్తువులను పొందగలవాడు. సృష్టిలోని అన్నింటిమీద అతడికి అధికారమున్నది. అన్ని భూతాలు అతడికి లోబడే ఉంటాయి. తలచుకున్న క్షణమే ఎక్కడికైనా వెళ్ళిపోగల ఆకాశ గమన

మతనికి ఉన్నది. అతడు దేనికీ కట్టుబడడు. మహదైశ్వర్య సంపన్నుడు. ఎప్పుడూ ఒకే రూపంతో ప్రకాశిస్తూ స్థిరమైన ఐశ్వర్యము గలవాడు. జగత్తులో సర్వస్వమూ అతని ఇచ్ఛానుసారమే జరుగుతుంది. ఈ విషయాలన్నీ 835 నుంచి 845 వరకు నామాలలో వివరించబడ్డాయి. ఇక నామాలను చూద్దాం.

## 835. అణుః

అణిమగలవాడు.

**అతిసూక్ష్మ హృదాకాశా వ్యక్తజీవ ప్రవేశనే ।**

**శక్తిమానణు రిత్యుక్తః షడర్ణ స్సర్వశక్తిదః ॥**

సూక్ష్మాతి సూక్ష్మమైన మహదాకాశ మందు, అంతకన్నా సూక్ష్మమైన జీవుని యందు ప్రవేశించగల శక్తి సంపన్నుడు. ఈ నామము షడక్షర మంత్రము సర్వశక్తులు ఇస్తుంది.

**సర్వమ్ అణుగచ్ఛతీతి అణుః**

సూక్ష్మమైన హృదయాకాశంలో ఉండి, దానికన్న కూడా చిన్నదైన జీవాత్మలో ప్రవేశించే శక్తిగలవాడు. **అణోరణీయాన్** చిన్నవాటిలోకూడా అతి చిన్నదైనటువంటిది. ఆ పరమేశ్వర స్వరూపము అంటోంది **కఠోపనిషత్తు** సూక్ష్మాతి సూక్ష్మమైన ఆత్మతత్త్వమును కేవలము అనుభవంతోనే తెలుసుకోవాలి అంటోంది. **ముండకోపనిషత్తు**

పరమేశ్వరుడు ఈ రకంగా సూక్ష్మాతిసూక్ష్మమైన రూపం గలవాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'అణుః' అనబడుతున్నాడు.

## 836. బృహత్

మహిమ గలవాడు, పెద్దది అయినవాడు.

**విపులం పరమం వ్యోమ మహిమ్నా చుళకీకృతమ్ ।**

**యేననామ్నా బృహత్ స స్యాత్ షడర్ణశ్చ బృహత్వదః ॥**

అవధులు లేని పరమాకాశమును ఆవరించినవాడు.

ఈ నామము షడక్షరీ మంత్రము. గొప్పదశ నిచ్చును.

**బృహంతీతి బృహత్** పెద్దగా విస్తరించినవాడు. అవధులు లేని ఆకాశాన్ని తన శక్తితో ఆవరించినవాడు. **మహతోమహీయాన్** పెద్దవాటిలోకెల్లా అతిపెద్దదైనది ఆత్మ అంటోంది. **కఠోపనిషత్తు** పరమేశ్వర స్వరూపము అతిసూక్ష్మమైనది, అతిపెద్దదైనది కూడా.

## 837. కృశః

లఘిమ గలవాడు, తేలిక అయిన శరీరము గలవాడు.

**సర్వత్రా వ్యాహతగతిః లఘిమ్నా కృశ ఈరితః ॥**

అన్ని ప్రదేశాలకు వెళ్ళేటందుకు వీలుగా తేలిక అయిన శరీరము గలవాడు.

**కృశ్యతీతికృశః** దూదిపింజకన్నా తేలిక అయినవాడు.

కృష్ణతులాభార ఘట్టంలో రుక్మిణీదేవి వేసిన తులసి దళం కన్న కూడా తేలిక అయిన మహానుభావుడు.

పరమాత్మ ఏ రకమైన ద్రవ్య లక్షణాలు లేనివాడు కావటంచేత అతి తేలిక అయిన శరీరము కలిగి ఉన్నాడు.

## 838. స్థూలః

ప్రాప్తి గలవాడు. కోరిన వస్తువులు పొందగలవాడు.

**స్థిత్వైకత్రాఖిలం స్పృష్టుం శక్తిర్యా మహతీ సదా ।**
**తయా ప్రకృష్టయా శక్త్యా విశిష్టస్థూల ఉచ్యతే ॥**

తను ఒకచోట ఉండి అన్ని పదార్థాలను స్పృశించే శక్తి గలవాడు.

తనకు కావలసిన పదార్థాలను సృష్టించుకొనగలవాడు.

**తిష్టతీతి స్థూలః** ఒకే చోట ఉండి సకలము స్పృశించగలవాడు.

## 839. గుణభృత్

ఈశిత్వము గలవాడు, అన్నింటి మీద అధికారము గలవాడు.

**సంకల్పాత్వ గుణీభూత సర్వావస్థ మిదం జగత్ ।**
**కుర్వన్ భిభర్తి నిత్యం యః గుణభృత్ స స్మృతోబుధైః ॥**

సంకల్ప మాత్రంచేతనే సమస్త జగత్తును తన అధీనంలో ఉంచుకోగలవాడు.

**గుణాన్ భిభర్తీతి గుణభృత్**

తన సంకల్పంచేత సర్వావస్థలయందు సమస్తాన్నీ స్వాధీనం చేసుకోగలవాడు.

సృష్టి స్థితిలయాలు ఇతని అధీనంలో ఉంటాయి. త్రిగుణాలకు అతీతుడు.

## 840. నిర్గుణః

వశిత్వము గలవాడు. అన్ని భూతాలను లోబరచుకున్నవాడు.

**స్థితో౽పి నీ క్షీరవత్ జగతో ౽స్పర్శనాద్గుణైః ।**
**ఉక్తస నిర్గుణ ఇతి సప్తార్ణ పావనత్వదః ॥**

చేతనా చేతనములన్నింటిలోనూ పాలలో కలిసిన నీటివలె కలిసి ఉంటాడు. ఈ రకంగా అన్ని భూతాలను లోబరచుకుని ఉంటాడు. **నిర్గతః గుణః యస్యసః నిర్గుణః** అన్ని భూతములందు కలిసిపోయి, అన్ని గుణాలతోనూ ఉన్నప్పటికీ, అన్నింటినీ లోబరచుకొని ఉండేవాడు. అతడు అగ్నిలో ఉన్నాడు. అగ్ని అతన్నెరగదు. అగ్నే అతని శరీరము. అగ్నిలో ఉంటూనే అగ్నిని నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి. ఈ రకంగా పరమేశ్వరుడు ప్రభూతమందు ఉన్నాడు. కాని అన్నీ అతనికి లోబడే ఉన్నాయి.

## 841. మహాన్

ప్రాకామ్యము గలవాడు. ఆకాశ గమనము గలవాడు.

**భూమ్యాసహ మహావీరే హ్యున్మజ్జన నిమజ్జనాత్ ।**
**మహానితి చ విఖ్యాతః షడర్ణస్తు మహత్వదః ॥**

ప్రళయ కాలంలో భూమితోపాటుగా తనుకూడా మహాసముద్రంలో మునుగుతూ తేలుతూ ఉంటాడు. **మహత్యే ఇతి మహాన్** అన్నింటిలోకీ ఉత్కృష్టమైన ఆకాశ గమనము గలవాడు.

## 842. అధృతః

కట్టుపడనివాడు.

**యశ్చానియమ్యః కేనాపి హ్యధృత స్తతుకీర్తితః**

అతడు ఎవరిచేతా నియమింపబడడు కాబట్టి అధృతః అనబడతాడు.

**న ధృతః అధృతః**

1. ఇతరులయందు ప్రవేశించి వారిని వశం చేసుకోవటము.
2. తనను ధ్యానించేవారి హృదయాలలో ఉండటము.
3. జీవునితో కూడినది, కూడనిది అయిన దేహమందు ప్రవేశించటము.
4. ఇష్టాపూర్తి కర్మలయందుండటము. ఈ కర్మలు వేటిలోనూ కట్టుపడకుండా యదేచ్ఛగా ఉండేవాడు. భూమిమొదలైన వాటన్నింటినీ తానే ధరిస్తాడు. కాని తను ఎవరి చేతా ధరింపబడడు.

## 843. స్వధృతః

మహదైశ్వర్యము గలవాడు.

**స్వభావతో ధృ తైశ్వర్యః స్వధృతః పరికీర్తితః** సహజంగానే ఉభయవిభూతినాయకుడు

**స్వేనధృతం స్వధృతం స్వధృతమ్ అస్యాస్తీతి స్వధృతః**

సమాధి మొదలైన వాటితో కలిగినవికాక స్వతస్సిద్ధమగు ఐశ్వర్యము గలవాడు.

స్వ-ధృతః తనచేతనే తాను ధరించబడువాడు. ఇక్కడ జడము, చైతన్యము రెండూ అతడే. కాబట్టి చైతన్యమనే పరమేశ్వరుడు, జడమనే జగత్తును ధరిస్తాడు.

## 844. స్వాస్యః

స్థిరమైన ఐశ్వర్యము గలవాడు.

**ఆసనంశోభనం యస్య స స్వాస్య ఇతి చోచ్యతే ॥** ఎప్పుడూ ఒకే రూపముతో ప్రకాశించేవాడు. **సుశోభనా అస్యాస్థితిః యస్యసః స్వాస్యః** సంసారంలోని వృత్తి మార్గంలో ప్రయాణించే యుక్తపురుషులలాగా స్థిరమైన ఐశ్వర్యము గలవాడు.

స్వాశ్యః - చక్కని నోరు గలవాడు. తామరపూవులో ఉండే దుద్దులాగా ఎర్రగా అందమైన ముఖము గలవాడు. చతుర్విధపురుషార్థాలు సాధించటానికి చతుర్వేదాలు ఉపదేశించిన అందమైన నోరు గలవాడు.

## 845. ప్రాగ్వంశః

నిత్యులకు ఉత్పత్తి హేతువు.

**అనాదిముక్తాః ప్రాంచోయే తేషాం ఉద్భవ భూమిదః ।**

**ప్రాగ్వంశ ఇతి విఖ్యాతః సప్తార్ణో మనురుత్తమః ॥**

అనాదిగా ముక్తులైన నిత్యసూరులయొక్క ఉత్పత్తి, స్థితి అన్నీ ఇతని అధీనంలోనే ఉంటాయి. ఈ నామము సప్తాక్షరీ మహామంత్రము. ఉత్తమ ఫలప్రదము.

**ప్రాచాంవంశః ప్రాగ్వంశః** ముక్తి పొందిన వారికి కూడా ఉత్పత్తి స్థానమైనవాడు. సమస్తమూ ఇతని ఇచ్చానుసారమే జరుగుతుంది. అందుకే శ్రీమన్నారాయణుడు 'ప్రాగ్వంశః' అనబడుతున్నాడు.

అంటూ 'అష్టసిద్ధులు' అనే ప్రకరణాన్ని పూర్తిచేశాడు రత్నాకరుడు.

# 53. భక్తానుగ్రహము

గురువుగారూ ! పరమేశ్వరుడు భక్తానుగ్రహకారకుడు కదా ! భక్తులయొక్క కోరికలు తీరుస్తుంటాడు. లోకంలో ప్రతివాడికీ మోక్షం కావాలనే ఉంటుంది. దానికోసం ఏదో ఒక సాధనచేస్తాడు. ఒకవేళ సాధకుడు గనక యోగసాధనలో భ్రష్టుడైతే అతడి పరిస్థితి ఏమిటి ? అలాంటివారిని పరమేశ్వరుడు ఏరకంగా కనికరిస్తాడో వివరించండి అన్నాడు కృష్ణశర్మ చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

పరమేశ్వరుడు దయామయుడు. భక్తుల కోరికలు తీర్చటమే అతడి పని. అవి ఎటువంటివైనా సరే. ఇహముగాని, పరముగాని ఏకోరికనైనా తీరుస్తాడు. తన భక్తుడు సిరిసంపదలు, భోగభాగ్యాలు, ధనధాన్యాలు, పాడిపంటలు, రాజ్యము, పదవి, అధికారము ఏదికావాలంటే అది ఇస్తాడు. లేదూ మోక్షం కావాలంటే, అతని అర్హతని బట్టి మోక్షమిస్తాడు. ఒకవేళ భక్తులు తనను కాకుండా వేరే దేవతలను ఆరాధించినప్పటికీ, వారు కోరుకునే భోగవస్తువులను ఇచ్చే శక్తి ఆ దేవతలకిచ్చి, వారిచేత భక్తుల కోరికలు తీర్పించుతాడు. కర్మఫలాన్ని బట్టి జీవులను ఆయాస్థానములందు నియమించువాడు.

భక్తులను జ్ఞానులను తన సంతానముగా భావించి వృద్ధిచేస్తాడు. ముక్తిమార్గంలో పయనించేవారి భారము పూర్తిగా తానే వహిస్తాడు. అతడు ఘటనాఘటన సమర్థుడు. యోగాన్ని ఆరంభించి మధ్యలో వదలివేసినవారికి, యోగభ్రష్టులైన వారికికూడా అంతవరకు చేసిన దానికి ఫలితమునిస్తాడు. యోగభ్రష్టులైనవారు మరణానంతరము స్వర్గసుఖా లనుభవించి, ఆధ్యాత్మికవేత్తల గృహాలలో జన్మించేటట్లుగా అనుగ్రహిస్తాడు. అలా జన్మించిన వారు గతజన్మలో వదలివేసిన యోగాన్ని ఈ జన్మలో తిరిగి అభ్యసించేటట్లుగా అనుగ్రహిస్తాడు. వారు స్వయంగా సంసారసాగరాన్ని దాటగలిగే శక్తిని ప్రసాదిస్తాడు. సమాధినిష్ఠులను అజ్ఞానాంధకారము నుంచి దరిజేరుస్తాడు. భక్తులు ఒకవేళ పాపకర్మలు చేసి పతితులైతే తన సేవకుడైన గరుడుని పంపి వారిని ఉద్ధరిస్తాడు. భక్తుల భక్తికి ప్రతిబంధకాలను తొలగించటానికి సర్వకాల సర్వావస్థలయందు ధనుర్ధారియై ఉంటాడు. ధనుర్విద్యలో ఆరితేరినవాడు. వైదిక ధర్మాన్ని రక్షిస్తాడు. దుర్మార్గులను, దుష్టులను శిక్షిస్తాడు. దుర్మార్గులను శిక్షించటంకోసం దండోపాయము ననుసరించేవాడు. అపజయమును ఎప్పుడూ ఎరగడు. సకలమును సహించేవాడు, భరించేవాడు. భక్తులు ఆరాధించే దేవతల యందు నమ్మకము పెంచి, వారిని నియంత్రిస్తాడు. కర్మ ఫలితానన్ననుసరించి యమాదులను తమతమ స్థానాలయందు నియమిస్తాడు. ఈ విషయమంతా 846 నుంచి 866 వరకు నామాలలో వివరించబడింది. ఇక నామాలను చూద్దాం.

## 846. వంశవర్ధనః

జ్ఞానులవంశాలను వృద్ధి చేసేవాడు.

**నిత్యసిద్ధస్య వర్గో యః వంశం సంతాన లక్షణమ్ ।**
**తం వర్ధయతి యశ్చాసౌ వంశవర్ధన ఉచ్యతే ॥**

తన భక్తులను, జ్ఞానులను తన సంతానముగా భావించి వృద్ధి పొందించువాడు.

**వంశం వర్ధయతీతి వంశవర్ధనః** తత్పరులయొక్క వంశాన్ని వృద్ధి చేసేవాడు.

వంశము అనగా–ప్రపంచము. ప్రపంచాన్ని వృద్ధి చేసేవాడు. జగత్తు అనే ప్రపంచాన్ని వృద్ధి పరచేవాడు.

**బృహదారణ్యకోపనిషత్తు**లో "ఒంటరిగా ఉన్న పరమేశ్వరుడు ఒంటరితనాన్ని భరించలేకపోయాడు. తోడుగా ఒక స్త్రీ కావాలి అనుకున్నాడు. అనుకున్నదే తడవుగా స్త్రీ పురుషులు పరస్పరము కౌగిలించుకున్నట్లుగా అతని ముందు ప్రత్యక్షమైనారు. వారే స్వాయంభువ మనువు, శతరూప. వీరే పతిపత్ని. తననుంచి పుట్టిన స్త్రీని తాను అనుభవించటం ధర్మశాస్త్ర విరుద్ధంకాదా అని శతరూప పారిపోయి ఆవు అయింది. పురుషుడు ఆబోతు అయినాడు. గోసంతతి పెరిగింది. శతరూప ఆడుగుర్రము అయింది. పురుషుడు మగగుర్రము అయినాడు. అశ్వసంతతి పెరిగింది. ఈ రకంగా 84 లక్షల రూపాలు పొందింది శతరూప. 84 లక్షల జీవరాశి ఆవిర్భవించింది" అని చెప్పబడింది.

ఈ రకంగా జగత్తును వృద్ధి చేశాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు 'వంశవర్ధనః' అనబడుతున్నాడు.

## 847. భారభృత్

ముక్తుల భారము వహించేవాడు.

**ముక్తానాం బంధమోక్షాది భారస్య భరణాద్ధి సః ।**
**భారభృత్ సప్తవర్ణ స్స్యాత్ కార్యనిర్వాహ శక్తిదః ॥**

ముక్తి మార్గంలో ప్రయాణం చేసేవారిని సంసార బంధనాలనుంచి వేరు చేస్తాడు. వారికి స్వస్వరూప జ్ఞానము కలుగచేస్తాడు. ఇటువంటి భారం వహిస్తాడు కాబట్టి 'భారభృత్' అనబడుతున్నాడు. ఈ నామము సప్తాక్షరీ మంత్రము. కార్యనిర్వాహక శక్తినిస్తుంది.

**భారం భిభర్తీతి భారభృత్** ముక్తుల సంసారభారాన్ని తొలగించటము, వారికి ఆత్మసాక్షాత్కారము కలుగచేసి, వారిని తనతో చేర్చుకొనుట అనే భారాన్ని భరించేవాడు.

**భారం భిభర్తి** – భారాన్ని మోసేవాడు.

ఆదివరాహము, ఆదికూర్మము, అనంతుడు మొదలైన రూపాలలో భూభారాన్ని మోసేవాడు. అందుకే శ్రీమన్నారాయణుడు 'భారభృత్ అనబడుతున్నాడు.

## 848. కథితః

సకల శాస్త్రములచే చెప్పబడినవాడు.

**ఉక్తశ్శాస్త్రేషుకథితో యస్సర్వగుణవర్తయా ॥**

సకల కళ్యాణ గుణాభిరాముడు అని శాస్త్రములందు చెప్పబడినవాడు.

**వేదేషు స పురాణేషు సాంగోపాంగేషు గేయసే ॥**

వేద వేదాంగములయందు, పురాణములయందు ఇతని గురించి చెప్పబడింది.

**వేదే, రామాయణే పుణ్యేభారత్ భరతర్షభ ।**
**ఆదౌ మధ్యేతదాౕ_ంతే చ విష్ణుః సర్వత్ర గీయతే ॥**

వేదములయందు, రామాయణము, భారతము మొదలైన గ్రంథములందు అంతటా శ్రీమహావిష్ణువు గురించే చెప్పబడింది.

**కథితః:** చెప్పబడినవాడు, ప్రతిపాదించబడినవాడు, వేదములయందు శ్రీమహావిష్ణువే ఉత్కృష్టమైనవాడు. పరమపదమునందున్నవాడు అని చెప్పబడింది. **భగవద్గీత**లోని 15వ అధ్యాయం **'పురుషోత్తమ ప్రాప్తియోగము'**లోని 15వ శ్లోకము.

**సర్వస్య చాహం హృది సన్నివిష్టో మత్తస్మృతిః జ్ఞానమపోహనం చ ।**
**వేదైశ్చ సర్వై రహమేవ వేద్యో వేదాంతకృద్వేదవిదేవ చాహమ్ ॥**

సమస్త ప్రాణులయందు అంతర్యామిగా ఉండేవాడను నేనే. నా నుండి యే స్మృతి, జ్ఞానము అపోహనము (సందేహాలు తొలగిపోవటము) కలుగుతున్నాయి. వేదములద్వారా తెలుసుకోదగినవాడను వేదాంత కర్తను వేదజ్ఞుడను కూడా నేనే. కాబట్టి సర్వశాస్త్రములు, పురాణాలు, ఇతిహాసాలయందు ప్రతిపాదించబడిన శ్రీమన్నారాయణుడు 'కథితః' అనబడుతున్నాడు.

## 849. యోగీ

ఘటనాఘటన సమర్థుడు.

**యోగోహ్యఘటి తార్థస్య ఘటనం తేన సర్వథా ।**

**యస్యాస్తి నిత్య సంబంధః స యోగీ పరికీర్తితః ॥**

యోగము అంటే – కూడని వాటిని కూర్చటము. లేనివాటిని పొందటము. అని అర్థం అటువంటి గుణముతో ఎడతెగని సంబంధము గలవాడు.

**యజ్యతే ఇతి యోగః సః అస్యాస్తీతి యోగీ** యోగము అంటే ఘటనా ఘటన సామర్థ్యము. అది కలవాడు యోగి. యోగము–జ్ఞానము సాధకుని పరమేశ్వరుని దగ్గరకు చేర్చే జ్ఞానము. ఈ జ్ఞానము గలవాడు కాబట్టి పరమేశ్వరుడు 'యోగీ' అనబడుతున్నాడు.

యోగము – సమాధి. చిత్తమును తత్త్వము మీద నిలబెట్టటము. ఈ సమాధి ద్వారానే సాధకుని చిత్తము ఆత్మతత్త్వము మీద లగ్నమవుతుంది. అటువంటి యోగము ఆ పరమేశ్వరుని రూపమే. అందుకే శ్రీమన్నారాయణుడు 'యోగీ' అనబడుతున్నాడు.

యోగాన్ని గురించి తెలియజేసే ఉపనిషత్తులు 20 ఉన్నాయి. వాటిలో 18, 19 నామాలలో కొన్నింటిని వివరించాం. మరికొన్నింటిని ఇక్కడ చూద్దాం.

**అమృతనాదోపనిషత్తు**లో "మేధావంతుడు సర్వశాస్త్రాలను అధ్యయనం చేసి, వాటిని జాగ్రత్తగా పరిశీలించి, అర్థం చేసుకుని, వాటిద్వారా పరబ్రహ్మను తెలుసుకొని శాస్త్రాలను అవతల పడేసి, ఓంకారమనే రథాన్ని అధిరోహించి, శ్రీమహావిష్ణువును సారధిగా చేసుకుని, పరబ్రహ్మను అన్వేషిస్తూ ఉండాలి. ఈ సాధకుడు రథమార్గమున్నంత వరకు రథంలో పోయి, ఆ తరువాత రథాన్ని కూడా వదిలి బ్రహ్మలోకానికి పోవాలి. సూత్ర, లింగ మొదలైన పదాలను వదలి, స్వరరహితమైన సూక్ష్మమార్గంలో వెళ్ళాలి. మనస్సును పూర్తిగా అదుపులో ఉంచుకోవాలి. ఈ రకంగా

ఇంద్రియాలను వశపరచుకొని సంశయశీలుడై ఉండటమే ప్రత్యాహారము అనబడుతుంది. ఇక్కడ యోగానికి ఆరు అంగములున్నాయి. అవి

1. ప్రాణాయామము
2. ప్రత్యాహారము
3. ధ్యానము
4. ధారణ
5. సమాధి
6. సత్యాసత్యవిచారణ

ప్రాణాయామంలో ఇంద్రియాలయొక్క, మనసు యొక్క మలినాలను కడిగి వెయ్యాలి.

ధారణతో – పాపాన్ని పోగొట్టుకోవాలి

ప్రత్యాహారముతో – సంసర్గ (సంబంధిత) పాపాలు పోగొట్టుకోవాలి.

ధ్యానముతో – అనీశ్వర గుణాలను నశింపచెయ్యాలి

ఈ రకంగా పాపం పోగొట్టుకుని పరాత్మ చింతన చెయ్యాలి. పరిశుద్ధమైన, దోషరహితమైన భూమిమీద దర్భాసనము వేసుకుని సుఖాసనంలో కూర్చుని ప్రణవాన్ని జపించాలి. ఉత్తర దిక్కుగా తిరిగి ధ్యానం చెయ్యాలి.

ధ్యానయోగి భయము, క్రోధము, సోమరితనము, అధికనిద్ర, అతిజాగరణము, అధికంగా తినటము, ఉపవాసములను వదలివెయ్యాలి. ఈ విధంగా క్రమబద్ధంగా సర్వదా ధ్యానము చేస్తే మూడు మాసాలలో బ్రహ్మజ్ఞానము ప్రాప్తిస్తుంది." అని చెప్పబడింది.

నాదబిందూపనిషత్తులో "ఓంకారమనే పక్షికి

| | | | | | |
|---|---|---|---|---|---|
| అకారము | – | కుడిరెక్క | పాదములు | – | భూలోకము |
| ఉకారము | – | ఎడమరెక్క | జానువులు | – | భువర్లోకము |
| మకారము | – | పుచ్ఛము (తోక) | కటిప్రదేశము | – | సువర్లోకము |
| అర్ధమాత్ర | – | మస్తకము | హృదయము | – | జనోలోకము |
| పాదాలే | – | గుణాలు | కంఠము | – | తపోలోకము |
| శరీరమే | – | ప్రణవతత్త్వము | భ్రూమధ్యభాగము | – | సత్యలోకము |
| కుడికన్ను | – | ధర్మము | దాని సహస్రారంలో | – | ప్రణవమంత్రం |
| ఎడమకన్ను | – | అధర్మము | | | ప్రదర్శితమై ఉన్నది. |

ప్రణవానికి 12 మాత్రలు ప్రసిద్ధముగా ఉన్నాయి. వీటిని అర్చించిన వారికి ప్రత్యేకమైన ఫలితం వస్తుంది.

| | **మాత్రపేరు** | | **ఉపాసనఫలము** |
|---|---|---|---|
| 1. | ఘోషిణి | – | సార్వభౌముడుగా తిరిగి జన్మిస్తాడు. |
| 2. | విద్యుత్తు | – | యక్షులలో మహాత్మునిగా జన్మిస్తారు |
| 3. | పతంగిని | – | విద్యాధరుడుగా జన్మిస్తాడు. |
| 4. | వాయువేగిని | – | గంధర్వుడుగా జన్మిస్తాడు. |
| 5. | నామధేయ | – | చంద్రలోకంలో ఉంటాడు |
| 6. | ఇంద్రి | – | దేవేంద్రుని సాయుజ్యము పొందుతాడు |
| 7. | వైష్ణవి | – | వైష్ణవ పదము పొందుతాడు |
| 8. | శాంకరి | – | రుద్రలోకంలో పశుపతిని పొందుతారు |
| 9. | మహతి | – | మహర్లోకప్రాప్తి |
| 10. | ధృతి | – | జనోలోకప్రాప్తి |
| 11. | నారి | – | తపోలోకప్రాప్తి |
| 12. | బ్రాహ్మి | – | శాశ్వత బ్రహ్మలోకం చేరతారు. |

అని చెప్పబడింది.

**యోగచూడామణి ఉపనిషత్తు**లో షట్చక్రాలను గురించి వివరించారు. అలాగే

**మండలబ్రాహ్మణోపనిషత్తు**లో బ్రహ్మతత్త్వాన్ని వివరించారు.

**పాశుపత బ్రహ్మోపనిషత్తు**లో ప్రణవ విద్యను వివరించగా

**యోగకుండలి ఉపనిషత్తు**లో కుండలినీ శక్తిని వివరించారు. ఈ విషయాలను గతంలో వివరించటం జరిగింది.

ఈ రకంగా యోగసాధన చేయించి తన భక్తులకు మోక్షము ప్రసాదిస్తాడు కాబట్టే శ్రీమన్నారాయణుడు 'యోగీ' అనబడుతున్నాడు.

## 850. యోగీశః

యోగమును నెరవేర్చేవాడు.

**యోగీశః స్సనకాదీనాం యోగినాం ధుర్య ఉచ్యతే ॥** సిద్ధులైన సనకాది యోగులకు ప్రభువు.

**యోగినామ్ ఈశః యోగిశః** యోగులయొక్క యోగాన్ని నెరవేర్చేవాడు.

**సనందనాదీనపకల్మషాన్ మునీన్ చకార ।**
**బూయోఽతిపవిత్రి తం పదమ్ ॥**

దోషములు పోయినట్టి సనకసనందనాది మహర్షులను అతిపరిశుద్ధులుగా ఒనర్చినవాడు.

యోగులలో శ్రేష్ఠుడు. సామాన్యంగా యోగం చేసేవారు యోగభ్రష్టులవు తుంటారు. కాని ఇతడు అలా కాదు. ఎందుకంటే ఇతడు ఆత్మతత్త్వము తెలిసినవాడు. పరమేశ్వరుడు. అందుచేత ఇతడికి యోగభ్రష్టత ఉండదు. తనను నమ్మినవారికి కూడా అటువంటి భ్రష్టత కలగనీయడు.

## 851. సర్వకామదః

అన్ని కోరికలను తీర్చేవాడు.

**అణిమాదీన్ సర్వకామాన్ యోగస్ఖలిత యోగినామ్ ।**
**అన్తరాయతయా ముక్తేః దదత్ స్యాత్ సర్వకామదః ॥**

యోగము ఆరంభించి వదిలేసినవారికి కూడా అణిమాది అష్టసిద్ధులను ప్రదానం చేసేవాడు. అణిమాది అష్టసిద్ధులు ఐహికమైనవి. పొందినవారు మోక్షమార్గంలో నడవలేరు.

**సర్వాన్ కామాన్ దదాతీతి సర్వకామదః**

ఏ కారణంచేత యోగభ్రష్టులైనప్పటికీ, వారికి కూడా యోగఫలాన్నీందించేవాడు.

**భగవద్గీత**లోని 6వ అధ్యాయం **'ఆత్మసంయమనయోగం'**లోని 41వ శ్లోకం.

**ప్రాప్య పుణ్యకృతాం లోకానుషిత్వా శాశ్వతీసమాః ।**
**శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టో ఽభిజాయతే ॥**

యోగభ్రష్టుడైనవాడు స్వర్గాది ఉత్తమలోకాలు పొంది, అక్కడ అనేక సంవత్సరాలు సుఖించి, తరువాత పవిత్రులైన సంపన్నుల ఇంట జన్మిస్తాడు.

ఈ రకంగా యోగులకే కాదు, యోగభ్రష్టులైన వారికి కూడా మంచి ఫలితాన్నిస్తాడు. కాబట్టే శ్రీమన్నారాయణుడు 'సర్వకామదః' అనబడుతున్నాడు.

## 852. ఆశ్రమః

విశ్రమింప చేయువాడు.

**తేషాం తు యోగభ్రష్టానాం హేతుర్వైష్ణవ సద్మను ।**
**సుభిక్షపర విద్యేషు విశ్రాంతే రాశ్రమస్మృతః ॥**

యోగభ్రష్టులైనవారు ఆ రకంగా స్వర్గసుఖాలు అనుభవించి, అధ్యాత్మిక విద్యా నిపుణులైన వైష్ణవ గృహాలలో మళ్ళీ జన్మిస్తారు. ఆ రకంగా వారిని అనుగ్రహిస్తాడు.

**ఆశ్రమ్యంతే అనేనేతి ఆశ్రమః** యోగభ్రష్టులు అణిమాది సిద్ధులు పొందిన తరువాత, మరుజన్మలో బ్రహ్మవేత్తల ఇండ్లయందు జన్మిస్తారు. ఆ రకంగా వారికి జన్మనిచ్చి విశ్రమింప చేస్తాడు.

**భగవద్గీత**లో 6వ అధ్యాయము **'ఆత్మసంయమనయోగం'**లోని 41వ శ్లోకము దీన్ని 855వ నామంలో చెప్పటం జరిగింది. సంసారమనే అరణ్యంలో దారి తప్పి తిరిగేవారికి ఆశ్రమమువలె విశ్రాంతి స్థానమైనవాడు.

## 853. శ్రమణః

అభ్యసింపచేయువాడు.

**అక్షీణ పూర్వ సంస్కారైః జన్మనానుభవేన చ ।**
**శ్రమ్యతే ఽభ్యస్యతే ఽత్రేతి శ్రమణః పరికీర్తితః ॥**

ఆ రకంగా పుట్టిన భక్తులకు పూర్వ జన్మ సంస్కారముంటుంది. గత జన్మలో వదిలివేసిన యోగము ఈ జన్మలో తిరిగి అభ్యసించబడుతుంది.

**శ్రమ్యంతే అనే నేతిశ్రమణః**

యోగభ్రష్టుడు పూర్వజన్మలో వదలివేసిన యోగాన్ని తిరిగి ఈ జన్మలో అభ్యసిస్తాడు.

**భగవద్గీత**లోని 6వ అధ్యాయం '**ఆత్మసంయమన యోగం**'లోని 43వ శ్లోకం.

**తత్రతం బుద్ధి సంయోగం లభతే పౌర్వదైహికమ్ ।**
**యతతే చ తతోభూయ సంసిద్ధౌకురునందన ॥**

మరుజన్మ ఎత్తిన తరువాత గతజన్మలో సాధించిన యోగాన్ని అతితేలికగా పొందుతాడు. అర్జునా! పరమాత్మప్రాప్తికి అతడు గతజన్మలో కన్న ఇప్పుడు ఎక్కువ కృషి చేస్తాడు.

## 854. క్షామః

శక్తుడు.

**యోగాభిముఖ్య మాత్రేణ యోగభ్రష్టా అపి స్వయమ్ ।**
**యస్మాత్ క్షమంతి స క్షామో భవాబ్ధితరణాయ వై ॥**

గతంలో యోగభ్రష్టులైనప్పటికీ ఇప్పుడు యోగోన్ముఖులు కాబట్టి వారు స్వయముగానే సంసార సాగరాన్ని దాటగలిగే శక్తి నిస్తాడు.

**క్షమంతే అనేనేతి క్షామః** యోగభ్రష్టులైన వారు తిరిగి తనను ధ్యానించినంత మాత్రం చేతనే వారిని యోగోన్ముఖులు గావించి ముక్తిని ప్రసాదిస్తాడు.

**భగవద్గీత** 6వ అధ్యాయం '**ఆత్మసంయమనయోగం**'లోని 40వ శ్లోకము.

**పార్థ నైవేహ నాముత్ర వినాశస్తస్య విద్యతే ।**
**న హి కల్యాణకృత్ కశ్చిద్దుర్గతిం తాతఃగచ్ఛతి ॥**

పార్థా! అటువంటివాడు ఈ లోకంలోగాని, పరలోకంలోగాని అధోగతిపాలు కాడు. అంతేకాదు భగవత్ప్రాప్తి కోసం సాధన చేసేవాడెవడూ అధోగతిపాలు కాడు.

## 855. సుపర్ణః

దరిచేర్చువాడు. 192వ నామము కూడా ఇదే.

**ప్రత్యాసన్నసమాధీన్ యః సమాధేః పరిపాకతః ।**
**తమసః పారం నయతి సుపర్ణః న చ కీర్తితః ॥**

సమాధి నిష్ఠులను, సమాధి పరిపాకమువలన అజ్ఞానాంధకారమునుంచి దరిజేర్చువాడు.

**సుష్టుపారం నయతీతి సుపర్ణః** సమాధి స్థితి చేరినవారికి అజ్ఞానాంధకారము తొలగించి వారిని దరిచేర్చుతాడు. అంటే తన దగ్గరకు రప్పించుకుంటాడు.

**భగవద్గీత** 6వ అధ్యాయం **'ఆత్మసంయమనయోగం'**లోని 45వ శ్లోకము.

**ప్రయత్నాద్యత మానస్తు యోగీ సంశుద్ధ కిల్బిషః ।**
**అనేకజన్మసంసిద్ధః తతో యాతి పరాం గతిమ్ ॥**

ప్రయత్న పూర్వకంగా యోగసాధన చేసే యోగి అనేక జన్మల సంస్కారము చేత ఈ జన్మలో సిద్ధి పొంది పాపరహితుడై, తత్క్షణమే పరమపదాన్ని పొందుతాడు.

సంసారమనే వృక్షరూపంలో ఉన్న ఆ పరమేశ్వరునియందు ఛందస్సులు (వేదములు) అందమైన ఆకులుగా ఉంటాయి. అందుకే శ్రీమన్నారాయణుడు సుపర్ణః అనబడుతున్నాడు.

**భగవద్గీత**లోని 15వ అధ్యాయము **'పురుషోత్తమ ప్రాప్తియోగం'**లోని మొదటి శ్లోకము.

**ఊర్ధ్వమూలమధశ్శాఖం అశ్వత్థం ప్రాహురవ్యయమ్ ।**
**ఛందాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్ ॥**

ఆదిపురుషుడైన పరమేశ్వరుడే మూలముగా, బ్రహ్మయే కాండముగా, వేదాలే ఆకులుగా గల సంసారరూపంలో ఉన్న అశ్వత్థవృక్షము శాశ్వతమైనది. దీని మూలము నెరిగినవాడు వేదార్థముల నెరిగినవాడవుతాడు.

## 856. వాయువాహనః

గరుడునిచే ఉద్ధరించబడువాడు. 331వ నామము కూడా ఇదే.

**వాయునాగత్వరేణైవ కర్మణా పతితాన్ సతః ।**
**గరుత్మతా వాహయతి యస్స్యాద్వాయువాహనః ॥**

తన భక్తులు ఒకవేళ పాపకర్మలు చేసి పతితులైనట్లైతే వాయువేగముతో సంచరించే గరుత్మంతుని పంపించి వారిని ఉద్ధరించేవాడు.

**వాయునావాహయతీతి వాయువాహనః**

పతితులైన యోగులను వివేకవంతుడైన గరుడునిచే ఉద్ధరింపచేసేవాడు.

వాయువాహనుడు - వాయువును నియంత్రించేవాడు **తైత్తిరీయోపనిషత్తు**లో "పరమేశ్వరుడున్నాడనే భయంతోనే వాయువు సరిగా వీస్తున్నది. దిక్పాలకులువారి విధులను సక్రమంగా నిర్వర్తిస్తున్నారు." అని చెప్పబడింది.

## 857. ధనుర్ధరః

ధనుర్ధారి

**ఉపాసకానాం భక్తేభ్యః ప్రత్యూహ వినివృత్తయే ।**

**ధనుషో ధారకో నిత్యం స్వయం స స్యాద్ధనుర్ధరః ॥**

భక్తులయొక్క భక్తికి ప్రతిబంధకాలను పారద్రోలటానికి ఎప్పుడూ ధనుర్ధారియై ఉండేవాడు.

**ధనుః ధరతీతి ధనుర్ధరః** విరోధుల సంహరించటానికి ధనుస్సును ధరించి ఉండేవాడు. రామావతారమెత్తిన శ్రీమహావిష్ణువు రాక్షస సంహారం కోసం ఎప్పుడూ ధనుస్సును ధరించి ఉండేవాడు.

## 858. ధనుర్వేదః

ధనుర్విద్యా ప్రవర్తకుడు

**సురేంద్రాద్యాః ధనుశ్శాస్త్రం యస్మాద్విందంతి స శ్రుతః ।**

**ధనుర్వేదో హ్యష్టవర్ణో ధనుర్వేద ప్రదాయకః ॥**

మహావీరులైన దేవేంద్రాదులు కూడా తన దగ్గర నేర్చుకోవలసినంత ధనుర్విద్యా విశారదుడు ఈ నామము అష్టాక్షరీ మంత్రము. ధనుర్వేదాన్నిస్తుంది.

**ధనుః విందంతీతి ధనుర్వేదః**

ధనుర్విద్యా విశారదులు కూడా నేర్చుకోవలసిన మెళుకువలు కలవాడు.

ధనుర్విద్యా శాస్త్రముల ప్రవర్తింపచేసినవాడు. ధనుర్వేదము బాగా తెలిసినవాడు.

## 859. దండః

దండించువాడు.

**వేదధర్మా రిష్ఠతాతి నృపాది ముఖతః ఖలాన్ ।**

**దండనీత్యా దామ్యతీతి దండస్యాదృతువర్ణకః ॥**

వైదిక ధర్మాన్ని రక్షించటానికి దక్షులైన రాజులద్వారా దుష్టుల శిక్షించేవాడు. ఈ నామము షడక్షరీ మంత్రము. దుష్టులను దండిస్తుంది.

**దామ్యతీతి దండః** దండనీతిచే దుష్టుల శిక్షించువాడు.

ఇతరులను అణచే వారిలో దండము ఆ పరమేశ్వరుడే.

**భగవద్గీత** 10వ అధ్యాయము **'విభూతియోగము'**లోని 38వ శ్లోకము.

**దండో దమయతామస్మి నీతిరస్మి జిగీషతామ్ ।**

**మౌనం చైవాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానపతామహమ్ ॥**

శిక్షించువారిలో దండము అంటే దమనశక్తిని నేను. జయేచ్ఛ గలవారిలో నీతిని నేను. గోప్యవిషయ రక్షణమున మౌనమును నేను. జ్ఞానులయొక్క తత్త్వజ్ఞానాన్ని నేను.

## 860. దమయితా

దండించువాడు.

**తాచ్ఛీల్యా ద్రావణాదీనాం హర్తాదమయితా స్వయమ్ ।**

తానుకూడా అదే స్వభావము గలవాడు కాబట్టి రావణ, కుంభకర్ణాది రాక్షసులను దండించాడు.

**దమయతీతి దమయితా**

దుష్టులను దండించేవాడు.

మనువు, రాజులు, మొదలగు వారి రూపంలో దుష్టులను దండించేవాడు.

## 861. దమః

దండోపాయము

అదుపులో ఉంచవలసిన వారికోసం దండోపాయమునుపయోగించేవాడు.

శంకరులవారు ఈ నామాన్ని దమః అని చెప్పగా పరాశరభట్టరువారు 'అదమః' అన్నారు.

**అదమః :** నిరంకుశుడు.

**కశ్చిద్దమయితా నాస్తి యస్యాసా పదమస్మృతః**

ఈ రకంగా ఉండి కూడా తనను అణచువారెవరూ లేనివాడు.

**న దమః అదమః** దండించువారు లేనివాడు.

పరమేశ్వరునికన్న ఎక్కువైన వారెవరూలేరు. అందుచేత అతడు ఎవరితోనూ దండింపబడడు.

## 862. అపరాజితః

అపజయము లేనివాడు. 716వ నామము కూడా ఇదే.

**క్వచిత్కదాచి త్కుతశ్చిత్ సర్వతో ముఖశాసనే ।**
**యస్య ప్రతిహతిర్నాస్తి స వై స్యా దపరాజితః ॥**

లోకంలోని వారందరినీ, అన్ని వేళల యందు, అన్ని ప్రదేశాలలోనూ శాసిస్తాడు. అతడికి ఎప్పుడూ ఎదురనేది లేదు. అందుకే అతడు అపరాజితుడు అనబడుతున్నాడు.

**న పరాజితః అపరాజితః** తన ఆజ్ఞలు ఎక్కడా ఉల్లఘింపబడనివాడు.

## 863. సర్వసహః

సకలమును సహించువాడు.

**మందాధి కారిణాం సర్వం ఆరాధ్యత్వేన దైవతమ్ ।**
**భిభర్తి సహతే యస్తు స సర్వసహ ఈరితః ॥**

మందాధికారులచే ఆరాధింపబడే దేవతలను కూడా తనే భరించువాడు.

భక్తులలో ఉత్తములు, మధ్యములు, మందాధికారులు అని మూడు రకాల వారున్నారు. ఇందులో మూడవ రకం వారు యక్షినీ దేవతల పూజలు  చేస్తారు.

**సర్వసహతే బిభర్తీతి సర్వసహః** అధములు అర్చించే దేవతలను కూడా తానే భరించువాడు.

అన్ని దేవతారూపాలు ఆ పరమేశ్వరుడివే కాబట్టి ఆ రూపంలో వారి కోరికలు తీరుస్తాడు. సర్వసః – సర్వకర్మలయందు సమర్ధుడు.

## 864. నియంతా

నియంత్రించువాడు.

**దైవతేషు చ సర్వేషు తత్తదిచ్ఛాం ప్రరోచయన్ ।**
**మందాధికారిణో యోఽసౌనియంతాస్యాన్నియచ్ఛతి ॥**

భక్తులు ఆరాధించే దేవతలయందు వారికి ఆసక్తి, నమ్మకములను పెంచి, మందాధికారులను కూడా నియంత్రించేవాడు.

**ని యచ్ఛ తీతి నియంతా**

ఇతర దేవతల నాశ్రయించే వారికి, ఆ దేవతల యందు భక్తి కలుగునట్లు చేసేవాడు.

జగత్తులోని జీవులన్నింటినీ, వాటి కర్మ ఫలితాన్ని బట్టి తగిన స్థానాలలో నియమిస్తాడు. పుణ్యకర్మలు చేసినవారిని దేవతలుగా పాపకర్ములను క్రిమికీటకాలుగా నియమిస్తాడు.

## 865. అనియమః

నియమము లేనివాడు.

ఇతనికి నియమము అనేది ఏదీ లేదు. అందరినీ ఇతడే నియమిస్తాడు కాబట్టి ఇతడికి నియమాలుండవు. శంకర భగవత్పాదులు ఈ నామాన్ని అనియమః అని వ్రాస్తే పరాశరభట్టరువారు 'నియమః' అని వ్రాశారు.

**నియమః :** తానే ఇచ్చువాడు.

**భోగాధికం నియమ్యాస్మిన్ లంబయన్ నియమస్మృతః ॥** భక్తులు కోరుకునే భోగవస్తువులను ఇచ్చే శక్తిని ఆ దేవతలకిచ్చి, వారిచేత భక్తుల కోరికలు తీర్పించేవాడు.

**నియమ్యతే ఇతినియమః**

ఆ దేవతల మూలంగా వారినాశ్రయించిన భక్తుల కోరికలు తీర్చేవాడు.

**భగవద్గీత**లోని 7వ అధ్యాయం **'జ్ఞానవిజ్ఞానయోగం'**లోని 22వ శ్లోకం

**స తయా శ్రద్ధయా యుక్తః తస్యారాధన మీహతే ।**
**లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్ హితాన్ ॥**

అటువంటివారు ఆ దేవతలనే ఆరాధిస్తారు. నా అనుగ్రహము వల్లనే అతడు తానుకోరిన కోరికలు పొందగలడు.

## 866. అయమః

రక్షించువాడు.

**యమాదీన్ యచ్ఛతి యమః తత్తత్ఫల నియామకాన్ ॥**

ఆ కర్మ ఫలానికి నియామకులైన యామాదులను కూడా నియమించువాడు.

**యచ్ఛతీతి యమః** యముడు మొదలైన దిక్పాలకులను కూడా నియమించువాడు. ఈ నామాన్ని శంకరులు 'అయమః' అని చెబితే పరాశర భట్టరువారు 'యమః' అన్నారు.

దేవతలందరినీ ఆయాస్థానాలలో నియమించే శ్రీమన్నారాయణుడు 'యమః' అనబడతాడు. అంటూ 'భక్తానుగ్రహము' అనే ప్రకరణాన్ని పూర్తి చేశాడు రత్నాకరుడు.

# 54. సత్త్వగుణప్రధానుడు

"గురువుగారూ ! పరమేశ్వరుడు సత్వగుణప్రధానుడు అంటారు కదా ! ఈ సత్వగుణంతో భక్తులను ఏ రకంగా ఉద్ధరిస్తాడో వివరించండి" అన్నాడు నారాయణభట్టు. చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

నిరాకారుడు, నిర్గుణ స్వరూపుడు పరబ్రహ్మ. అతనికి ఎవరిమీద ఎటువంటి అభిమానము ఉండదు. అయితే అతడు ధర్మరక్షకుడు కాబట్టి ధర్మాన్ని కాపాడుతూ ఉంటాడు. ఎవరికి ఎంత ఇవ్వాలో అంతే ఇస్తాడు. ఏది ఇవ్వాలో అదే ఇస్తాడు. అంతకన్న ఎక్కువగాని తక్కువగాని ఇవ్వడు. అంతకన్న వేరైనది ఇవ్వడు. ఇతడు శుద్ధ బుద్ధముక్త స్వరూపుడు. శుద్ధసత్వగుణము ప్రధానంగా గలవాడు. అతడు చేసే కర్మను బట్టి భక్తుడికి లౌకిక సుఖాలు లేదా మోక్షాన్నిస్తాడు. సత్వగుణ ఫలాలైన జ్ఞానవైరాగ్యాలను తన అధీనంలో ఉంచుకుని వాటిని తన భక్తులకు ఇస్తాడు. అతడు నిజమైన వైభవము గలవాడు. సత్వమునందే నిలిచి ఉంటాడు. సాత్వికులు చేసే ధర్మాలను అత్యంత ప్రీతితో స్వీకరిస్తాడు. సత్యధర్మనిష్ఠలు గల మహానుభావులచే కోరబడతాడు. తన భక్తులలో జ్ఞానులు అంటే అతడికి మక్కువ ఎక్కువ. అందుచేత జ్ఞానులను అనుగ్రహిస్తాడు. ఇతరమైన ఫలాపేక్ష లేకుండా కేవలము మోక్ష దృష్టితో పరమేశ్వరుని అర్చించే జ్ఞానులకు మాత్రమే తగినవాడు. అర్హులైన వారికి తగినవాడు. ఇతర దేవతలను అర్చించేవారి కోరికలు, ఆయా దేవతలచేత తీర్పిస్తాడు. అలా చేయించి క్రమంగా వారిని తన వైపుకు త్రిప్పుకుంటాడు. ఈ రకంగా ఇతర దేవతలను ఆరాధించే వారికి తన మహిమలు చూపించి క్రమంగా వారిని తన వైపుకు ఆకర్షిస్తాడు. ఈ రకంగా భక్తులను ఆకర్షిస్తూ అర్హత గల జ్ఞానులకు పరమపదాన్నిస్తాడు. ఈ విషయాలన్నీ 867 నుంచి 876 వరకు నామాలలో వివరించటం జరిగింది. ఇకనామాలను చూద్దాం.

# 867. సత్త్వవాన్

శుద్ధ సత్వగుణము గలవాడు.

**ప్రకాశలాఘవ సుఖసంపదా మోక్షసాధనమ్ ।**

**సత్త్వం సాక్షాదధిష్ఠేయం యస్యాసౌ సత్త్వవాన్ శ్రుతః ॥**

జ్ఞానాన్ని బట్టి భక్తుడికి సుఖము లేదా మోక్షము ఇవ్వటమనేది సత్త్వగుణంవల్ల జరుగుతుంది. ఆ సత్వగుణాన్ని తన అధీనంలో ఉంచుకొన్నవాడు.

**సత్త్వం అస్యాస్తీతి సత్త్వవాన్** మోక్షకారకమైన సత్వగుణానికి తానే అధిష్ఠాన దేవత.

**శ్వేతాశ్వరోపనిషత్తు**లో గొప్ప ప్రభువగు ఈతడు సత్వప్రవర్తకుడు అని చెప్పబడింది.

శౌర్యము, వీరత్వము మొదలైన గుణములు గల సత్వము – అనగా సత్తువ ఇతనికి కలదు.

## 868. సాత్త్వికః

సత్వగుణ ఫలితమునిచ్చేవాడు.

**విజ్ఞానైశ్వర్య వైరాగ్య ధర్మరూప ఫలం స్వయం ।**
**నియమ్యార్పతి సత్త్వంయః సాత్త్వికః పరికీర్తితః ॥**

సత్వగుణ ఫలమైన జ్ఞానము, వైరాగ్యము, ధర్మములను తన అధీననంలో ఉంచుకొని వాటిని తన భక్తులకిచ్చేవాడు.

సత్త్వం గుణఫలమైన జ్ఞానము, వైరాగ్యము, ధర్మములను తన అధీనంలో ఉంచుకొని వాటిని తన భక్తులకిచ్చే వాడు.

**సత్త్వం అర్హతీతి సాత్వికః** సత్వగుణ ఫలములకు నియామకుడు. ఆ ఫలితాల నిచ్చేవాడు. సత్వగుణ ప్రధానుడు.

## 869. సత్యః

నిజమైన వైభవము గలవాడు, సత్యమున నిలిచి ఉండేవాడు. 106, 212 నామాలు కూడా ఇదే.

**యదార్థ వైభవః సత్యః సర్వశాస్త్రేషు విశ్రుతః ॥**

సాత్త్వికశాస్త్రములన్నింటి యందు కొనియాడబడిన వైభవము గలవాడు.

సాత్త్వికశాస్త్రములందు ప్రతిపాదించబడటం చేత యదార్థమైన వైభవము గలవాడు.

**సత్యే ప్రతిష్ఠితః కృష్ణః సత్యమస్మిన్ ప్రతిష్ఠితమ్**

కృష్ణుడు సత్యమందే నిలచి ఉన్నాడు. సత్యము వీనియందు నిలచి ఉన్నది.

సత్పురుషుల విషయమందు అనుకూలముగా వర్తించువాడు. అందుకే శ్రీమన్నారాయణుడు 'సత్యః' అనబడుతున్నాడు.

## 870. సత్యధర్మపరాయణః

సాత్వికులు చేసే ధర్మాలను స్వీకరించేవాడు.

**ఉపాధిరహిత స్సత్వ ముఖో ధర్మ పరాయణమ్ ।**

**పరమప్రీణనం యస్య సత్య ధర్మపరాయణః ॥**

ఇతరమైన ఫలితాలను అపేక్షించని, సత్వగుణ ప్రధానమయిన ధర్మాచరణముతో మిక్కిలిగా ప్రసన్నమయ్యేవాడు.

**సత్యః ధర్మః పరాయణం యస్యసః సత్యధర్మపరాయణః**

సాత్త్వికులు చేసే ధర్మాలను అత్యంత ప్రీతితో స్వీకరించేవాడు.

**సత్యం ధర్మశ్చ అయనం యస్యసః**

సత్యము, ధర్మములను ఉత్తమమైన ఆశ్రమములుగా కలవాడు.

## 871. అభిప్రాయః

కోరబడువాడు.

**స్వచ్ఛేన ధర్మనిష్ఠేన సత్యేన చ విశేషతః**

**నిరుపాధి కోద్దేశ్యత్వా దభితః ప్రేయతే చ యః**

**అభిప్రాయ స్సవిజ్ఞేయః వస్వర్ణో మనురుత్తమః ॥**

ధర్మముతోను, సత్యనిష్ఠతోను సర్వకాల సర్వావస్థలయందు, అందరిచేత సేవించబడు వాడు. అందరిచేత కోరబడువాడు. ఈ నామము అష్టాక్షరీ మంత్రము ఉత్తమ సాధనము.

సత్యధర్మనిష్ఠ గల మహానుభావులచే పరమప్రయోజనము కోసము కోరబడువాడు. ఈ నామము అష్టాక్షరీ మంత్రము. ఉత్తమ సాధనము.

పురుషార్థాలు కోరే వారు ఇతన్ని కోరతారు. భక్తులు ధర్మార్థకామ మోక్షాల సాధన కోసం పరమేశ్వరుని అర్చిస్తారు.

## 872. ప్రియార్హః

జ్ఞానులను అనుగ్రహించేవాడు.

**ఐదమర్హ్యజ్ఞావినం యః ప్రియార్హః ప్రియమర్హతి**

తనను ఆరాధించే భక్తుని మిక్కిలి ప్రేమించువాడు.

**ప్రియం అర్హతీతి ప్రియార్హః** తనకు ప్రియులైన జ్ఞానులను అనుగ్రహించువాడు. పరమేశ్వరుని చేరాలనే తలంపుతో, ముక్తిని పొందాలనే కోరికతో జగత్తునంతటినీ తమలోనే భావించుకునే వారు, మోక్షవాదులు. ఈ రకంగా మోక్షాన్ని కోరుకున్న వారిని ఆ పరమేశ్వరుడు అనుగ్రహిస్తాడు.

**భగవద్గీత** 7వ అధ్యాయం '**జ్ఞానవిజ్ఞానయోగము**'లోని 17వ శ్లోకము

**తేషాం జ్ఞానీ నిత్యయుక్తః ఏకభక్తిర్విశిష్యతే ।**

**ప్రియో హి జ్ఞానినో౽త్యర్థ మహం స చ మమ ప్రియః ॥**

నిరంతరము నా యందే మనసులగ్నంచేసి నన్నే ధ్యానించే జ్ఞాని అత్యుత్తముడు. నా తత్త్వాన్ని తెలుసుకున్న జ్ఞానికి నేను మిక్కిలి ఇష్టుడను. అతడు నాకు మిక్కిలి ఇష్టుడు.

జ్ఞాని అయినవాడు సర్వకాల సర్వావస్థలయందు పరమేశ్వరుని యందే మనసు లగ్నం చేసినవాడై, అతన్నే ధ్యానిస్తుంటాడు. అందుచేత అతడు శ్రేష్ఠుడు. అటువంటివాడు పరమేశ్వరునికి ప్రియుడు.

జీవులకు ఏది ఇష్టమో, దానిని వారి నుండి తీసుకోవటానికి అర్హుడు.

మానవులు తమ కిష్టమైన వస్తువులను మరుజన్మలో కూడా పొందాలని, ఇప్పుడున్న దానికన్న కొన్నిరెట్లు అధికంగా దానిని పొందాలనే తలంపుతో, ఆ వస్తువును భగవంతుడికి అర్పణ చేస్తారు. ఇలాంటి సమయంలో ఆ వస్తువును స్వీకరించే అర్హత గలవాడు ఆ పరమేశ్వరుడే. అందుకే అతడు 'ప్రియార్హః' అనబడతాడు.

కాశీలో మనకిష్టమైన వస్తువులను గంగలో వదలివేసే కారణం ఇదే.

## 873. అర్హః

జ్ఞానులకు అర్హుడు.

**అనన్యేచ్ఛావతాం పుంసాం యోగ్యస్యో౽ర్హ ఇతి స్మృతః ॥**

ఇతరమైన ఫలాపేక్ష లేని పురుషులకు మాత్రమే తగినవాడు.

**అర్హతీతి అర్హః** అర్హులైన వారికి తగినవాడు. ఇక్కడ అర్హులు అంటే పరమేశ్వరుని చేరటానికి అర్హత గలవారు. అది జ్ఞానులకు తప్ప వేరెవరికీ ఉండదు. అందుకే పరమేశ్వరుడు జ్ఞానులకు అర్హుడు.

**భగవద్గీత** 7వ అధ్యాయం '**జ్ఞానవిజ్ఞానయోగం**'లోని 18వ శ్లోకం

**ఉదారాసర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మై వ మే మతమ్ ।**
**అస్థితస్సహి యుక్తాత్మా మామేవానుత్తమాం గతిమ్ ॥**

ఈ భక్తులంతా ఎప్పుడూ భగవంతుని మీద విశ్వాసముంచి అతన్ని సేవిస్తుంటారు. కాని జ్ఞానియైనవాడు నా స్వరూపమే. అతడు మనస్సును, బుద్ధిని నాయందే ఉంచి నన్నే పరమప్రాప్యునిగా భావిస్తాడు. ఈ రకంగా అతడు నాయందే స్థితమై ఉంటాడు.

అందుచేతనే పరమేశ్వరుడు జ్ఞానులకు అర్హుడు.

**అర్హతి పూజామ్** పూజింపబడటానికి అర్హుడు. పరమేశ్వరుడు భక్తులచేత షోడశోపచార విధిని పూజింపబడటానికి అర్హుడు.

## 874. ప్రియకృత్

ప్రియములుగ నొనర్చువాడు.

**భజతో ప్య న్య భక్తాన్యః స్వప్రియాన్ కురుతే సదా ।**
**చందాను వర్తనేనేతి ప్రియకృత్స చ కథ్యతే ॥**

ఇతర దేవతలను సేవించే భక్తులయొక్క కోరికలు ఆ దేవతలచేత పూర్తి చేయిస్తూ క్రమంగా ఆ భక్తులను తన వైపుకు ఆకర్షించేవాడు.

**ప్రియాన్ కరోతీతి ప్రియకృత్** ఇతర ప్రయోజనాలాసించి తన నాశ్రయించిన వారినికూడా, చివరకు తననే కోరునట్లు చేసేవాడు. అనగా ఒకవేళ భక్తుడు సిరిసంపదలు, భోగభాగ్యాల కోసం భగవంతుని ఆశ్రయించినప్పటికీ, ముందుగా వాటిని ఇచ్చి, చివరకు ఆ భక్తుని మోక్షమార్గం వైపు ఆకర్షించేవాడు.

తనను అర్చించేవారికి ప్రియములు చేకూర్చేవాడు.

## 875. ప్రీతివర్ధనః

భక్తిని వృద్ధి చేయువాడు.

ఇక్కడ ప్రీతి అంటే – భక్తి అని అర్థం.

**గుణావిష్కరణాన్నిత్యం ఉత్తరోత్తరతోఽధికమ్ ।**
**యస్తు ప్రీతం వర్ధయతి ప్రీతివర్ధన ఈరితః ॥**

ఈ రకంగా ఇతర దేవతలనారాధించే భక్తులను తన మహిమలు చూపిస్తూ, వారికి తనయందు భక్తిని పెంపొందింపచేయువాడు.

**ప్రీతిం వర్ధయతీతి ప్రీతివర్ధనః** తనయందు నమ్మకం లేనివారికి కూడా తన మహిమలు చూపి వారిని తన వైపుకు ఆకర్షించుకునేవాడు.

**భగవద్గీత** 10వ అధ్యాయం **'విభూతియోగం'**లోని 10వ శ్లోకం

**తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతి పూర్వకం ।**

**దదామి బుద్ధియోగం తం యేన మాముపయాంతే ॥**

నిరంతరము ధ్యానాదులద్వారా నాయందే మనసు లగ్నం చేసి భక్తిశ్రద్ధలతో నన్నే భజించువారికి నేను బుద్ధియోగమును అనగా తత్త్వజ్ఞానరూప యోగాన్ని ప్రసాదిస్తాను. దానిద్వారా వారు నన్ను చేరతారు.

తనను అర్చించేవారికి ఆనందాన్ని కలుగచేసేవాడు.

## 876. విహాయసగతిః

పరమపదాన్నిచ్చేవాడు.

**నిరూఢభక్తియుక్తైర్యైః నిత్యం యస్మాత్తు గమ్యతే ।**
**విహాయసం పరం వ్యోమ విహాయసగతిస్తు సః ॥**

పరమభక్తి తత్పరులైన వారికి పునరావృతి లేనటువంటి పరమపదాన్నిచ్చేవాడు.

**విహాయసం గమ్యతే ఇతి విహాయ సగతిః**

భక్తిలో పరాకాష్ఠను చేరినవారికి పరమాకాశమనబడే పరమపదాన్నిచ్చేవాడు.

**భుక్త్వాచ మత్ప్రసాదతః మమానుస్మరణం ప్రాప్య మమలోకో నివత్స్యపి**

అన్ని భోగాలు అనుభవించి చిట్టచివరకు నా అనుగ్రహంతో, నన్నే స్మరించి, నా లోకమున నిలువగలవు.

భక్తుడైనవాడు ముందుగా సకల భోగాలు అనుభవిస్తాడు. ఆ తరువాత మోక్షమార్గంవైపు మరలుతాడు. ఈ రకంగా మోక్షసాధనకు కృషిచేసేవాడు పరమేశ్వరుని యొక్క అనుగ్రహంతో పరమపదం చేరతాడు. ఇదే భక్తునియొక్క అంతిమలక్ష్యము.

విహాయసము అనగా – హృత్పద్మమునందున్న సూక్ష్మాకాశము. దీన్నే దహరాకాశము అంటారు. అటువంటి దహరాకాశాన్ని స్థానముగ గలవాడు. అతడే శ్రీమన్నారాయణుడు.

అంటూ 'పరమపదము' అనే ప్రకరణాన్ని పూర్తిచేశాడు రత్నాకరుడు.

# 55. అర్చిరాది మార్గము

"గురువుగారూ ! అర్చిరాది మార్గము అంటే ఏమటి ? బ్రహ్మలోకం చేరే వ్యక్తి ఆ మార్గం ద్వారానే వెడతాడు అంటారు కదా ! దాన్ని వివరించండి" అన్నాడు కృష్ణశర్మ. చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

మానవులు చేసే కర్మలను బట్టి వారు పయనించే మార్గాలు నిర్దేశించబడ్డాయి. కఠోపనిషత్తులో చెప్పినట్లుగా లోకంలో రెండు మార్గాలున్నాయి. అవి 1. ప్రవృత్తి మార్గము 2. నివృత్తి మార్గము. అలాగే ముండకోపనిషత్తులో పరా, అపరా అని రెండు రకాల విద్యలు చెప్పబడ్డాయి. ప్రవృత్తిమార్గంలో పయనించేవారు అపరావిద్యను, నివృత్తి మార్గంలో పయనించేవారు పరావిద్యను అభ్యసిస్తారు.

అపరావిద్య లౌకికమైన కోరికల సాధనకు ఉపయోగిస్తుంది. దీనిలో యజ్ఞాలు, యాగాలు, ఉపాసన, అర్చనలు, వ్రతాలు, దానధర్మాలు, ఇష్టాపూర్తి కర్మలు ఉంటాయి. ఇదే దక్షిణాయన మార్గము. పరావిద్యను ఉపాసించేవారు నివృత్తిమార్గంలో పయనిస్తారు. ఇది దేవయానము, ఉత్తరాయణ మార్గము అనబడుతుంది.

**కౌషీతకీబ్రాహ్మణం**లో దీన్ని గురించి వివరించటం జరిగింది.

పూర్వకాలంలో చిత్ర అనే పేరుగల గార్గ్యాయణి ముని ఒక యాగం చెయ్య సంకల్పించినవాడై ఉద్దాలక అరుణి వద్దకు వచ్చి ఆ యాగము పూర్తి చేయించమని అడిగాడు. అప్పుడు ఉద్దాలకుడు తన కుమారుడైన శ్వేతకేతువుకు ఆ యాగము బాధ్యతలు అప్పగించాడు. శ్వేతకేతువును వెంట పెట్టుకుని బయలుదేరాడు గార్గ్యాయణి ముని త్రోవలో గార్గ్యాయణి శ్వేతకేతువుకు నమస్కరించి "శ్వేతకేతూ ! నన్ను ఊర్ధ్వలోకాలకు పంపగలవా? లేకపోతే ఊర్ధ్వలోకాలకు వెళ్ళే మార్గము చెప్పగలవా ?" అని అత్యంత వినయంతో అడిగాడు. దానికి శ్వేతకేతువు "నాకు ఆ విద్య తెలియదు. నా తండ్రిని అడిగి చెబుతాను." అని ఆశ్రమానికి వెళ్ళి తండ్రియైన ఉద్దాలకుని ఈ విషయము అడిగాడు. ఉద్దాలకుడుతనకు కూడా ఆ విషయము తెలియదు అని చెప్పి, దర్భలు చేత్తో పట్టుకుని తండ్రీ కొడుకులిద్దరూ కలిసి గార్గ్యాయణి దగ్గరకు వెళ్ళి అతడు అడిగిన విషయాన్ని వివరించమని ప్రార్థించారు. ఆ ప్రార్ధన ఆలకించిన గార్గ్యాయణి ఈ విధంగా చెప్పటం ప్రారంభించాడు.

దక్షిణాయనంలో ప్రయాణం చేసినవారు చంద్రలోకం చేరతారు. చంద్రలోకము స్వర్గానికి ద్వారముగా ఉన్నది. చంద్రలోకం చేరిన వారు తిరిగి భూలోకంలో జన్మించాలి. ఏ జీవులైతే తాము చేసిన పుణ్యకర్మలకు సమాధానం చెప్పగలరో, వారే స్వర్గానికి పోగలరు.

వీరు తమ పుణ్యఫలము స్వర్గంలో అనుభవించిన తరువాత, కర్మశేషము అనుభవించటానికి వర్షముద్వారా భూలోకానికి వస్తారు. ఆ తరువాత వారి కర్మఫలాన్నిబట్టి క్రిమికీటకాలుగానో, పశుపక్ష్యాదులు, మృగాలు ఈ రకంగా జన్మిస్తారు.

అర్చిరాది మార్గాన్ని గురించి గతంలో వివరించాం ఇప్పుడు మిగిలిన వివరాలు ఇస్తున్నాము.

నివృత్తిమార్గం ఇదే దేవయానము దీనిగుండా ప్రయాణించిన జీవుడు ముందుగా అగ్నిలోకం చేరుకుంటాడు. ఆ తరువాత వాయులోకము, వరుణలోకము, ఆదిత్యలోకము, ఇంద్రలోకము, ప్రజాపతి లోకాలకు వెళ్ళి చివరకు బ్రహ్మలోకము చేరతాడు. బ్రహ్మలోకంలో 'అరః' అనే సరస్సు ఉన్నది. అక్కడ 'యేష్టిహా' ముహూర్తములు గడుపుతాడు. 'విరజానది' ఉన్నది. 'ఈల్య' అనే వృక్షము 'సాయుజ్యము' అనే పట్టణము ఉన్నాయి. 'అపరాజితము' అనే సౌధమున్నది. ఆ సౌధములో ఇంద్రుడు, ప్రజాపతి ద్వారపాలకులుగా ఉంటారు. అందులో 'విభు' అనే పేరుగల సభావేదిక ఉన్నది. దానిమీద 'విచక్షణా' అనే తేజోవంతమైన సింహాసనమున్నది. 'అమితేజః' అనే గొప్ప వాహనమున్నది. మానసీ, చాక్షుషీ అనే పేర్లుగల ఇద్దరు దేవకాంతలు పుష్పములు చేత్తో పట్టుకుని జగత్తులను చూపుతుంటారు. అప్సరసలు, మాతృదేవతలు, నదీమతల్లులు, దాసీజనము అక్కడ సహకరిస్తారు. ఇక్కడికి చేరినవారు బ్రహ్మలోక సుఖమనుభవిస్తారు. బ్రహ్మ స్వయంగా వచ్చి వారితో "నా ఐశ్వర్యాన్ని దర్శించండి. అనుభవించండి. విరజానదిలో స్నానం చెయ్యండి మీకు ముసలితనము రాదు" అని చెబుతాడు.

బ్రహ్మలోకము చేరిన జీవుడి దగ్గరకు ఐదు వందల మంది అప్సరసలు వస్తారు. ఇందులో

| | | |
|---|---|---|
| వందమంది | – | మధురమైన పళ్ళు తెస్తారు. |
| వందమంది | – | సుగంధ లేపనము తెస్తారు. |
| వందమంది | – | పూలమాలలు తెస్తారు |
| వందమంది | – | సుగంధ ద్రవ్యాలు తెస్తారు |

మిగిలినవారు అక్కడకు చేరినవారిని బ్రహ్మలాగా అందంగా అలంకరిస్తారు. అలంకరణ పూర్తి అయిన తరువాత బ్రహ్మదగ్గరకు బయలుదేరతాడు జీవుడు. త్రోవలో అర అనే సరస్సులో మనస్సుతోనే స్నానంచేస్తాడు. యేష్టిహా అనే ముహూర్తాలు గడుపుతాడు. అక్కడ నుండి విరజానదికి బయలుదేరతారు. ఈ నది జీవులను అమరులుగా చేస్తుంది.

అందులో కూడా మనస్సుతోనే స్నానం చేస్తారు. అక్కడ పాపపుణ్యాలన్నీ వదిలేస్తారు. అలా వదలి పెట్టబడిన పాపపుణ్యాలు తనవారిని చేరతాయి. అంటే ఆ జీవికి ప్రియమైన వారికి పుణ్యము, అప్రియమైన వారికి – పాపము చేరుతుంది. ఈ విధంగా పాపపుణ్యాలు, సుఖదుఃఖాలు వదలి జీవుడు బ్రహ్మను చేరటానికి వెడతాడు.

త్రోవలో 'ఈల్య' వృక్షము దగ్గరకు చేరతాడు. అప్పుడు బ్రహ్మయొక్క సుగంధ చైతన్యము ఇతడిలో చేరుతుంది. అక్కడ నుంచి సాయుజ్యము అనే పట్టణం చేరతాడు. అక్కడ బ్రహ్మచైతన్యము ఇతనిలో చేరుతుంది. అపరాజిత అనే సౌధాన్ని చేరతాడు. అక్కడ బ్రహ్మతేజస్సు ఇతనిలో చేరుతుంది. అప్పుడు ద్వారపాలకులైన ఇంద్రుడు, ప్రజాపతిల దగ్గరకు వస్తాడు. వారు అతిప్రేమతో జీవుడికి త్రోవనిస్తారు. తరువాత 'విభు' అనే సభావేదిక చేరతాడు. బ్రహ్మతేజము ఇతనిలో చేరుతుంది. తరువాత 'విచక్షణ' అనే బ్రహ్మ సింహాసనము చేరతాడు జీవి. అక్కడ బృహద్రథంతర సామగానములు సింహాసనము ముందు కాళ్ళలోను, దైత్యనౌధస గానములు వెనక కాళ్ళలోను వినిపిస్తాయి. వైరూప, వైరాజ, శాక్వర, రైవత ప్రజ్ఞలు ప్రకాశిస్తాయి. వాటిలో సంభాషణ జరుగుతుంది. అక్కడ 'అమితాజసనము' అనే వాహన ముంటుంది. అది ప్రాణవాయువు. భూతభవిష్యత్తులు దానిముందు కాళ్ళు. సంపదలు, ఆహారము వెనుక కాళ్ళు. భద్రయజ్ఞా యజ్ఞీయములు రెండు శిరస్సులు, బృహత్ రథంతర సామగానములు రెండుప్రక్క కర్రలు. యజస్సులు అడ్డంగా ఉండే చెక్కలు. సోమలతలు క్రింద ఉన్న చాపలు. ఉద్గీతములు మెత్తని దిండ్లు. అక్కడ బ్రహ్మ ఆసీనుడై ఉంటాడు. జీవుడు బ్రహ్మదగ్గరకు వెడతాడు. అక్కడ బ్రహ్మజీవుని కొన్ని ప్రశ్నలు అడుగుతాడు. వాటికి జీవుడు సమాధానం చెబుతాడు.

**బ్రహ్మ** : మీరెవరు ?

**జీవి** : నేను ఋతుదేవతను. ఋతు ధర్మముతో నాకు సంబంధమున్నది. ఆకాశం నుంచి శుక్ల రూపంలో స్త్రీ గర్భంలో చేరాను. సంవత్సర తేజస్సుగా, అన్ని జీవాత్మలవలె ఉన్నాను. నీవు సర్వజీవాత్మలకు ఆత్మవై ఉన్నావు. నీకులానే నేనుకూడా ఆత్మనే.

**బ్రహ్మ** : నేను ఎవరు ?

**జీవి** : నీవుసర్వాత్మవు.

**బ్రహ్మ** : సర్వాత్మ ఎవరు ?

**జీవి** : ఇంద్రియ దేవతలు కాదు, ప్రాణవాయువు కాదు, అదే సత్యము. అదే సమస్త జగత్తు. నువ్వు కూడా ఈ జగద్రూపమై ఉన్నావు.

**బ్రహ్మ** : తెలియరాని నా పురుష రూపములు నీవు ఏ విధంగా తెలుసుకున్నావు.

**జీవి** : ప్రాణవాయువు శ్వాసవల్ల తెలుసుకున్నాను.

**బ్రహ్మ** : స్త్రీ రూపాన్ని ఎలా తెలుసుకున్నావు ?

**జీవి** : వాక్కుద్వారా తెలుసుకున్నాను.

**బ్రహ్మ** : నపుంసక రూపము ఏ రకంగా తెలుసుకున్నావు ?

**జీవి** : మనస్సు ద్వారా

**బ్రహ్మ** : వాసనలు ఏ రకంగా తెలుసుకున్నావు ?

**జీవి** : ఘ్రాణేంద్రియము ద్వారా

**బ్రహ్మ** : రూపమును ఎలా తెలుసుకున్నావు.

**జీవి** : నేత్రములద్వారా

**బ్రహ్మ** : శబ్దమును ఎలా తెలుసుకుంటున్నావు ?

**జీవి** : శ్రోత్రేంద్రియములద్వారా

**బ్రహ్మ** : రసములనెలా తెలుసుకుంటున్నావు ?

**జీవి** : జిహ్వాద్వారా

**బ్రహ్మ** : నువ్వు చేసే కర్మలనెలా తెలుసుకున్నావు ?

**జీవి** : రెండు చేతులద్వారా

**బ్రహ్మ** : సుఖదుఃఖాలనెలా తెలుసుకున్నావు ?

**జీవి** : శరీరము ద్వారా

**బ్రహ్మ** : ఆనందము, రతిసౌఖ్యము, సంతానోత్పత్తి ఎలా తెలుసుకున్నావు ?

**జీవి** : ఉపస్థేంద్రియము ద్వారా

**బ్రహ్మ** : నడవటం ఎలా తెలుసుకున్నావు ?

**జీవి** : పాదాలద్వారా

**బ్రహ్మ** : సంకల్పములను, భావనలు, కోరికలు ఎలా తెలుసుకున్నావు ?

**జీవి** : బుద్ధిప్రజ్ఞతో జలమయమైన ప్రపంచం అంతా నాదే. నీది కూడా సమస్త జగత్తు బ్రహ్మమయము. ఈ విషయం తెలిసినవాడు కూడా బ్రహ్మమే" అన్నాడు. గార్గ్యాయణి మహర్షి.

పరమేశ్వరుడు అగ్నిస్వరూపుడు భక్తులు సాయుజ్యం పొందటానికి సాధనమైన అర్చిరాది మార్గానికి ప్రథమ సోపానమైన అర్చిస్సు అనగా అగ్నిని నియమించువాడు. ఈ మార్గంలో అగ్నిలోకం గిడిస్తే దినాభిమాని దేవత ఉంటాడు. ఆ తరువాత శుక్లపక్ష దేవతగా ఉంటాడు హోమంలో వేసిన ద్రవ్యాలన్నీ అమృతంగా మారతాయి. ఆ అమృతాన్ని ఆరగించేవాడు చంద్రుడు. అతడు పూర్ణుడుగా ఉండే శుక్లపక్షానికి అభిమానిగా ఉండేవాడు. ఆ తరువాత దేవతలు నిద్రనుంచి మేల్కొనే కాలము ఉత్తరాయణము. దీనికి అభిమానిగా ఆ తరువాత సంవత్సరాభిమాని. తరువాత వాయుదేవత. ఆ తరువాత సూర్యలోకము, చంద్ర, విద్యుత్, వరుణ లోకాలు. ఆ తరువాత ఇంద్రలోకము బ్రహ్మలోకము ఉంటాయి.

పరమేశ్వరుడు భక్తులకు సంసార బంధనాలను వదిలించి తన సాయుజ్యము చేరటానికి అవిచ్ఛిన్నమైన సంతతినిచ్చేవాడు. బ్రహ్మలోకం చేరినవారికి దివ్యగంధము, వస్త్రము మొదలైనవాటిని ఇచ్చి అప్సరసలు అలంకరిస్తారు. ఈ అర్చిరాది మార్గంలో తనను చేరిన భక్తులను లక్ష్మీసమేతుడై సేవిస్తుంటాడు.

సంసార సాగరంలో పడి ఉన్నవారిని ఉద్ధరించివారిని మోక్ష సామ్రాజ్యానికి అభిషిక్తుల గావిస్తాడు. అలా పరమపదాన్ని పొందినవారు అతని ఉపకారానికి ప్రతిఫలంగా ఇచ్చే కైంకర్యాన్ని స్వీకరిస్తాడు. అతడే యుక్తపురుషులుండే ఉత్తమ లోకాలకు ఆధారమైనవాడు.

ఈ విధంగా ముక్తులైన వారితో అనుభవించబడుతున్నప్పటికీ నిత్యనూతనంగా కనిపించేవాడు. అతిప్రాచీనమైనవాడు. కపిలవర్ణుడు. నిత్యానంద స్వరూపుడు. భక్తులందరికీ మంగళము, శుభమునిచ్చువాడు. అందరికీ క్షేమాన్ని కలిగిస్తాడు. శుభాన్ని కలిగిస్తాడు. భక్తులు తనను అర్చించటానికి, వారికి శరీరము నిచ్చేవాడు. సౌమ్యుడు. శాంతమూర్తి. దివ్యాభరణములు, దివ్యశస్త్రాస్త్రములు ధరించినవాడు. గొప్ప పరాక్రమవంతుడు. దివ్యమైన ఆజ్ఞలు జారీ చేస్తాడు. అతని శాసనాలు అనుల్లంఘనీయములు. అతడు వేదాంతవేద్యుడు. అవాంగ్మానస గోచరుడు.

ఈ విషయాలన్నీ 877 నుంచి 911 వరకు నామాలలో వివరించబడ్డాయి. ఇక నామాలను చూద్దాం.

## 877. జ్యోతిః

అగ్నిస్వరూపుడు

**స్వప్రాప్తే స్సా ధన త్వాధ్యః స్వయం నిత్యం విశేషతః ।**
**అర్చిరాది గతే ర్జ్యోతిః ప్రథమం సర్వ కథ్యతే ॥**

తన భక్తులు సాయుజ్యం పొందటానికి సాధనమైన అర్చిరాది మార్గానికి ప్రథమ సోపానమైన అర్చిస్సు అనగా అగ్నిని నియమించువాడు. ఆ మార్గాన్ని పరమేశ్వరుని వల్లనే భక్తులు చూడగలుగుతారు.

**ద్యోత్యతే అస్మాదితి జ్యోతిః** అర్చిస్సు అనే మొదటి సోపానాన్ని నిర్మించేవాడు.

పూర్వకాలంలో పాంచాల దేశాన్ని ప్రవాహణుడు అనే రాజు పాలిస్తుండేవాడు. ఆ రోజుల్లో ఒకసారి శ్వేతకేతువు అనే బ్రాహ్మణ బాలకుడు అమిత దర్పంతో రాజాస్థానంలో అడుగుపెట్టాడు. శ్వేతకేతువు విద్యావంతుడు, తండ్రివద్దనే విద్యాభ్యాసం చేశాడు. అతనికి తెలిసింది ఎంతైనా, లోకంలోని విద్యనంతా అభ్యసించానని, విజ్ఞానమంతా తనసొంతమని అపోహ చెందాడు.

రాజాస్థానంలో ప్రవేశించే సమయానికి అక్కడ వేదాంత చర్చలు జరుగుతున్నాయి. పండితులంతా సభ తీర్చారు. ప్రశ్నలు అడుగుతున్నారు. సమాధానాలు చెబుతున్నారు. యజ్ఞాయాగాదులు జరిగేటప్పుడు, ఉత్సవాలు, వేడుకల సందర్భంగా ఇలాంటి సభలు జరగటం ఆచారంగా ఉండేది. ఆ కారణంగానే ఇప్పుడు కూడా అధ్యాత్మిక చర్చలు జరుగుతున్నాయి.

శ్వేతకేతువు రాజాస్థానంలోకి ప్రవేశించాడు. ఆ సమయంలో రాజైన ప్రవాహణుడు అక్కడే ఉన్నాడు. లోపలికి వస్తున్న శ్వేతకేతును చూసి రాజు అడుగుతున్నాడు. "కుమారా! నీవు విద్యాభ్యాసం పూర్తి చేశావనుకుంటాను" "అవును మహారాజా ! మా తండ్రిగారి దగ్గరే చదువంతా పూర్తిగా చేశాను" అన్నాడు శ్వేతకేతు. అతను చెప్పిన సమాధానంలో డాబు, దర్పము కనిపించినాయి. సర్వశాస్త్ర పారంగతుణ్ణి అని గర్వంకూడా తొంగిచూసింది. దాంతో ప్రవాహణుడికి శ్వేతకేతువును పరీక్షించాలనిపించింది. ఇక ప్రశ్నించటం మొదలు పెట్టాడు.

"బ్రాహ్మణ బాలకా ! మనుష్యులు మరణించిన తరువాత ఎక్కడికి వెడతారు?"

"నాకు తెలియదు" అన్నాడు శ్వేతకేతు.

'మరణించిన తరువాత ఈ లోకానికి ఏ విధంగా తిరిగి వస్తారు?"

"నాకు తెలియదు"

'మృతి చెందినవారు ప్రయాణం చేసే దేవయాన, పిత్రుయాన మార్గాలను వివరించు'

"నాకు తెలియదు"

"ప్రకృతి పరిణామక్రమంలో పురుషుడిగా ఆకారం దాల్చే ఉదంతము ఏది?"

"నాకు తెలియదు"

“శ్వేతకేతూ ! ఇన్ని ప్రశ్నలు అడిగాను. ఏ ఒక్కదానికీ సమాధానం చెప్పలేదు. కాని విద్యాభ్యాసం మాత్రం పూర్తయిందని చెప్పావు. దీన్నిబట్టి చూస్తే ముఖ్యమైన విషయాలను గురించిన పరిజ్ఞానం నీకు శూన్యమనిపిస్తోంది” అన్నాడు రాజు.

ఆ మాటలకు సిగ్గుపడ్డాడు శ్వేతకేతువు–విద్యాభ్యాసం పూర్తయిందని ఇంతవరకు అనుకున్నది భ్రమ అని తెలిసిపోయింది. సరాసరి తండ్రి వద్దకు వచ్చి నాన్నగారూ ! నేను నేర్చుకోవలసిన విద్య అంతా పూర్తయిపోయింది అని చెప్పారు. అది నిజమే అని నేను కూడా అనుకున్నాను. కాని పాంచాల దేశాధీశుడు ఐదు ప్రశ్నలడిగితే ఒక్కదానికి కూడా సమాధానం చెప్పలేక తెల్లమొగం వేశాను. విద్యాభ్యాసం పూర్తయిందని మీరు ఎందుకు చెప్పారో నాకు అర్థం కావటం లేదు” అన్నాడు. తనకు సభలో ఎదురైన పరిస్థితినంతా వివరించాడు.

రాజుకు శ్వేతకేతువుకు జరిగిన సంభాషణ అంతా విన్నటువంటివాడై ‘నాయనా! మహారాజు వేసిన ప్రశ్నలకు సమాధానం నాక్కూడా తెలియదు. తెలిస్తే నీకెందుకు చెప్పను? అన్నాడు శ్వేతకేతు తండ్రి అయిన అరుణుడు.

ఆ తరువాత కుమారునితోపాటుగా రాజు అడిగిన విషయాలను గురించి తెలుసుకోవాలనిపించింది అరుణునికి. తండ్రి కొడుకులిద్దరూ పాంచాలదేశానికి బయలుదేరారు. రాజప్రాసాదం చేరుకుని, రాజదర్శనం కోసం నిరీక్షిస్తూ అక్కడే ఉన్నారు. ఆ మరునాడు రాజదర్శనం లభించింది. వినయవిధేయతలతో రాజుకు నమస్కరించాడు.

పాంచాల దేశాధీశుడైన ప్రవాహణుడు శ్వేతకేతువును, అతని తండ్రి అరుణిని సగౌరవంగా ఆదరించి “బ్రాహ్మణోత్తమా ! ఏమాశించి నావద్దకు వచ్చారు ? ధనరాసులు కావాలా ? సంపదకావాలా ? మీకు ఏంకావాలో చెప్పండి” అన్నాడు.

ఆ మాటలు విన్న అరుణి “మహారాజా ! నీ ధనం కోసంగాని, గోధనం కోసంగాని ఇక్కడకు రాలేదు. నీవద్దనున్న జ్ఞానధనం కోసం వచ్చాను. అదే నీవు నాకు చేయవలసిన దానం. నా కుమారుణ్ణి అడిగిన ప్రశ్నలేవో నాతో చర్చించి సమాధానాలు చెప్పి నా సందేహాలు తీర్చు. నాకు జ్ఞానాన్ని ప్రసాదించు. అదే నేను కోరేది” అన్నాడు.

బ్రాహ్మణుడి మాటలకు చాలా ఆనందించి మహారాజు వారిని “కొంతకాలం మీరిక్కడే ఉండండి” అని అభ్యర్థించాడు. రాజు కోరిక మేరకు తండ్రి కొడుకులు కొంత కాలం రాజాస్థానంలోనే ఉన్నారు.

ఒకరోజు మహారాజు తండ్రీకుమారుల వద్దకు వచ్చి “బ్రాహ్మణ శ్రేష్ఠులారా ! ఇంతవరకు ఈ జ్ఞానం సంప్రదాయ సిద్ధంగా క్షత్రియుల దగ్గరే పరంపరగా ఉంటూ

వచ్చింది. మొట్టమొదటిసారిగా బ్రాహ్మణులైన మీకు వివరిస్తున్నాను” అంటూ ప్రారంభించాడు.

బ్రాహ్మణ వరేణ్యా ! నీ కుమారుణ్ణి అడిగిన ఆఖరు ప్రశ్నకు ముందుగా సమాధానం చెబుతాను. యజ్ఞాలు ఐదు రకాలు. యజ్ఞవిధానం ఈ విధంగా ఉంటుంది. స్వర్గమే అగ్ని. ఆ యజ్ఞానికి హవిస్సు సూర్యుడు. యజ్ఞఫలం జీవన ప్రదాత్రి అయిన సోమరసం. ఈ సోమరసం మేఘాల వరకు ప్రయాణిస్తుంది. మేఘాల ద్వారా భూలోకంలో వర్షిస్తుంది. దానివల్ల అన్నం ఉత్పత్తి అవుతుంది. అన్నం మానవుడికి లభిస్తుంది. అది అతనిలో రేతస్సుగా మారుతుంది. ఆ శక్తి స్త్రీలో ప్రవేశిస్తుంది. అప్పుడామె గర్భం దాలుస్తుంది. బిడ్డను ప్రసవిస్తుంది. ఈ రకంగా ఐదు యజ్ఞాల దశలు దాటి ప్రాణం పొందు ఆ యజ్ఞఫలమైన సోమరసం పురుషుడుగా మారుతుంది.

ఉద్దాలక అరుణీ ! ఇప్పుడు మిగిలిన నాలుగు ప్రశ్నలకు సమాధానం చెబుతాను విను. మానవుడు నాలుగు భూతాల సమ్మిశ్ర స్వరూపుడు. అతడు మరణించిన తరువాత ఆ నాలుగు భూతాలు ఆయా భూతాలలో కలిసిపోతాయి. మానవుని యోగ్యత అనేది అతడు చేసిన కర్మలమీద ఆధారపడి ఉంటుంది. అతడు గనక ఆత్మానుభవం పొందితే వెలుగుబాటలో ప్రయాణం చేస్తాడు. అదే దేవయానము. ఆ బాటలో ప్రయాణం చేసి పుణ్యఫలాన్ని అనుభవించి మోక్షాన్ని పొందుతాడు. ఇట్టి మానవుడికి పునర్జన్మ ఉండదు. అతడికి శాశ్వతమైన ఆనందం లభిస్తుంది. ఇదే ఉత్తరాయణ మార్గము.

అలా కాకుండా ఐహికమైన కోరికలు తీర్చుకోటానికే జీవిస్తూ, పుణ్యకర్మలను ఆచరిస్తూ జీవనయానం సాగిస్తే పితృయానం గుండా స్వర్గానికి చేరతాడు. అక్కడ అతని పుణ్యఫలం పూర్తిగా అనుభవించి మళ్ళీ ఈ లోకంలో జన్మిస్తాడు. మానవుడు తన జీవిత రహస్యాన్ని తెలుసుకోలేక పాపాలు చేస్తుంటాడు. త్రాగుడు, జూదము, వ్యభిచారము, దొంగతనము మొదలైన పనులు చేస్తాడు. అటువంటివాడు అటు అమృతత్వాన్ని, ఇటు స్వర్గాన్నీ కూడా పోగొట్టుకుంటాడు. ఇటువంటివారు నీచమైన జన్మలు ఎత్తుతారు.

కొంతమంది అతిప్రయత్నము మీద బ్రహ్మలోకాన్ని పొందుతారు. బ్రహ్మలోకం పొందినవారికి పునర్జన్మ లేదు. అయితే ఎక్కువమంది పుణకార్యాలు చేసి స్వర్గము పొందుతారు. ఎంతమంది అక్కడికి చేరినా స్వర్గము మాత్రం క్రిక్కిరిసిపోదు.

సంస్కారవంతులు, సదాచార సంపన్నులు ఉత్తమ యోనిని పొందుతారు. అంటే బ్రహ్మ క్షత్రియ వైశ్యాది యోనులు పొందుతారు. సంస్కారహీనులు కుక్కలుగా, పందులుగా,

ఛండాలురుగా నీచయోనులందు జన్మిస్తారు. పాపాత్ములు పైన చెప్పిన అర్చిరాది రెండు మార్గాలలోనూ పోరు. వారు శీఘ్రంగా పుడుతూ చస్తూ ఉంటారు. వీరిది మూడవ మార్గం. అందుకనే ఇన్ని జీవులు నిత్యం చస్తున్నా స్వర్గము మొదలైన పరలోకాలు నిండవు. చచ్చిన వారంతా అక్కడికి పోరు. మరణకాలంలో కూడా పాపాత్ములు నీచమైన చావు చస్తారు. అటువంటి వారి జీవితాన్ని అందరూ అసహ్యించుకుంటారు.

బ్రాహ్మణుల బంగారం దొంగిలించేవారు, బ్రాహ్మణుడై పుట్టి మదిరపానం చేసేవాడు. గురుపత్నీ సంగమము చేసేవాడు, బ్రహ్మహత్య చేసేవాడు ఈ నలుగురూ పతితులు. వీరితో సహవాసం చేసేవాడు కూడా పతితుడే. ఇంతకన్నా నీచపు పనులు చేసేవారు క్రిమికీటకాలుగా జన్మిస్తారు.

శిష్యులారా ! ప్రవాహణుడు చెప్పిన ఈ విద్యను పంచాగ్నివిద్య అంటారు. ఈ విద్యను తెలుసుకున్నవాడు పైన చెప్పిన పతితులతో సహవాసము చేసినప్పటికీ అతడికి ఆ పాపము అంటదు. ఉత్తరాయణ మార్గంలో చరించినవాడు అర్చిరాది మార్గంగుండా బ్రహ్మలోకానికి పోతాడు.

శ్రీమన్నారాయణుడు ఎవరి సహకారం లేకుండా స్వయంగానే ప్రకాశిస్తాడు. అందుకే 'జ్యోతిః' అనబడుతున్నాడు.

## 878. సురుచిః

దినాభిమానదేవతగా ఉండువాడు. ఈమార్గంలో అర్చిస్సు గడిస్తే దినాభిమాని దేవత.

**అహ శ్శుభం యస్య స వై సురుచిః పరికీర్తితః ॥**

అన్నింటికన్న ప్రకాశవంతమైనటువంటిది సూర్యోదయము నుండి సూర్యాస్తమయము వరకు ఉండే పగటి సమయము.

**సుశోభనా రుచిః యస్యసః సురుచిః**

సూర్యోదయముతో ప్రకాశించే పగలు గలవాడు శోభనమైన కాంతినిచ్చువాడు.

## 879. హుతభుగ్

887వ నామము కూడా ఇదే.

సమస్త దేవతలను ఉద్దేశించి చేసే కర్మలయందు హవిస్సును స్వీకరించేవాడు. యజ్ఞపతి తానే కాబట్టి యజ్ఞాన్ని రక్షిస్తాడు.

## 880. విభుః

240వ నామము కూడా ఇదే. అన్ని ప్రదేశములందు ఉండేవాడు. త్రిలోకాలకు ప్రభువు. సర్వవ్యాపి.

శంకరభగవత్పాదులు ఈ రెండింటినీ విడివిడిగా రెండు నామాలుగా వ్రాయగా పరాశరభట్టరు వారు ఈ రెండింటినీ కలిపి ఒకే నామంగా వ్రాశారు.

**హుతభుగ్విభుః :** శుక్లపక్షముగా ఉండేవాడు.

**సుధాపరిణామహుతం భుఞ్జానశ్చంద్రమా స్తథా ।**
**విభుః పూర్ణో భవే ద్యస్మిన్ స వై స్యాత్ హుతభుగ్విభుః ॥**

హోమంలో వేసిన ద్రవ్యాలన్నీ అమృతంగా మారతాయి. ఆ అమృతాన్ని ఆరగించేవాడు చంద్రుడు. అతడు పూర్ణుడుగా ఉండే శుక్లపక్షమునకు అభిమానిగా ఉండేవాడు. ఇతడు శుక్లపక్ష దేవత.

## 881. రవిః

ఉత్తరాయణముగా ఉండేవాడు.

**యశ్చోత్తరాయణ ద్వారా రూయతేఽత్ర ప్రకాశ్యతే ।**
**స వై రవి స్సమాఖ్యాతః ప్రాశస్త్య ఫలదోమనుః ॥**

ఉత్తరాయణము పుణ్యకాలము ఇది జనవరి 14 నుంచి జులై 7 వరకు అంటే సూర్యుడు మకరరాశిలో ప్రవేశించినప్పటి నుంచి కర్కాటక రాశిలో ప్రవేశించేంత వరకు ఉంటుంది. ఇవి గొప్పపరవడి రోజులు. ఈ కాలంలో దేవతలు మేల్కొంటారు. ఈ కాలంలో ఉన్న ఉత్తరాయణ దేవత ద్వారా స్తుతించబడేవాడు సూర్యుడు. అటువంటి సూర్యునకు అభిమాన దేవత. ఈ నామమంత్రము గొప్ప ఫలితానిస్తుంది.

**రూయతే శబ్ద్యతి ఇతిరవిః** దేవతలు నిద్రనుంచి మేల్కొనే కాలము ఉత్తరాయణము. దీనికి అభిమానిగా ఉంటాడు.

**రసాన్ ఆ దత్తే** జలమును తనకిరణములచే గ్రహించేవాడు కాబట్టి రవి అనబడుతున్నాడు.

**రసానాం చ తథా ఽఽదానాత్ రవి రిత్యభిధేయతే** రసము (జలము)ను గ్రహించేవాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు 'రవిః' అనబడుతున్నాడు.

# 882. విరోచనః

సంవత్సర స్వరూపుడు.

**అయనద్వయ గత్యాఽర్కం యో విరోదయతి స్వయం**

**విరోచన ఇతిఖ్యాతః ప్రకాశ ఫలదో మనుః**

ఉత్తరాయణ దక్షిణాయాన మార్గాలలో రథాన్ని నడిపి ఇతనిని స్వయముగ ప్రకాశింప చేయువాడు. సంవత్సరాభిమాని అయినవాడు. ఈనామజపము అమిత ప్రకాశమునిస్తుంది.

**విరోచయతి విద్యోత యతీతి విరోచనః** సూర్యుడు ఉత్తరాయణ దక్షిణాయన మార్గాల ద్వారా పోయి ప్రకాశించే సంవత్సరాభిమాని. వివిధ రకాలుగా ప్రకాశించేవాడు. సూర్యరూపుడు

# 883. సూర్యః

వాయులోకముగా ఉండేవాడు.

**వాయుస్సరతి యస్మాద్ధి తస్మా చ్ఛూర్య ష్షడక్షరః ॥**

సూర్యుడు అంటే అంతా సంచరించే వాయువు అంతర్యామి. ఈ నామము షడక్షరి.

**సరత్యస్మాదితి సూర్యః** జగత్తంతా సంచరించేవాడు కాబట్టి వాయువు అని అర్థం. వాయులోకాభిమాని. సంపదను కలిగించువాడు. శ్రీప్రదాత అయిన అగ్ని.

# 884. సవితా

సూర్యలోకముగా ఉండువాడు. 969వ నామము కూడా ఇదే.

**సృష్టి సస్యాదికం సూతే సవితేతి రవేర్ముఖాత్**

సూర్యుని వలన వర్షాలు కురిపించి పంటలు పండించేవాడు.

సూర్యుని యొక్క వేడికి సముద్రంలోని నీరు ఆవిరై మేఘరూపం ధరిస్తుంది. ఆ మేఘాలు కొండలమీద వర్షించి ఏరులు, వాగులు, వంకలుగా మారతాయి. ఇవన్నీ కలిసి నదులుగా ఏర్పడతాయి. నదులవల్ల భూమి సస్యశ్యామలమవుతుంది. దానివల్ల ఓషధులు, వనస్పతులు పండుతాయి. వాటినుంచే అన్నం పుడుతుంది. ఈరకంగా సూర్యుని వలన మానవుడికి ఆహారం దొరుకుతుంది. ఇక్కడ పరమేశ్వరుడు సూర్యలోకాభిమాని.

సర్వజగత్తును సృష్టించేవాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు 'సవితా' అనబడుతున్నాడు.

**ప్రజానాంతు ప్రసవనాత్ సవితేతి నిగద్యతే**

ప్రజలను ప్రసవించువాడు కాబట్టి పరమాత్మ సవితా అనబడతాడు.

## 885. రవిలోచనః

చంద్ర విద్యుత్ వరుణులుగా ఉండేవాడు.

**సూర్యస్య రశ్మి సంబంధాత్ విద్యుద్వరుణ చంద్రకాన్ ।**
**నిరంతరం లోచయతి రవిలోచన ఈరితః ॥**

సూర్యకిరణముల ద్వారా ప్రకాశించునట్టి విద్యుత్తు, వరుణ, చంద్రులకు అంతర్యామి అయిన అభిమాన దేవత.

**రవి ణా లోచ యతీతి రవిలోచనః**

సూర్యుని ప్రకాశమువలన ప్రకాశించేటటువంటి విద్యుత్తు, వరుణ, చంద్రులకు అభిమాని.

**రవిలోచనః :** ఇతనికి రవి కన్నుగా ఉన్నాడు. విరాట్పురుషునకు అగ్ని – శిరస్సు, సూర్యచంద్రులు – కనులు అని చెబుతోంది **ముండకోపనిషత్తు**

## 886. అనంతః

అనంతమైనవాడు. 659వ నామము కూడా ఇదే.

నిత్యమైనవాడు. అంతములేనివాడు. ఎల్లకాలములందు ఉండేవాడు. శాశ్వతమైనవాడు. ఆదిశేషుని రూపమైనవాడు.

## 887. హుతభుక్

హవిస్సును భక్షించేవాడు. 879వ నామము కూడా ఇదే.

పరమేశ్వరుడు అగ్నిరూపుడై యజ్ఞంలో దేవతలకిచ్చిన హవిస్సును భక్షిస్తున్నాడు.

## 888. భోక్తా

భుజించేవాడు. 143, 500 నామములు కూడా ఇదే.

ప్రళయకాలంలో జగత్తునంతా భక్షిస్తాడు.

శంకర భగవత్పాదులు 886, 887, 888 నామాలను విడివిడిగా వ్రాయగా పరాశరభట్టరువారు ఈ మూడింటినీ కలిపి ఒకటిగానే వ్రాశారు.

**అనంతహుతభుగ్భోక్తాః :** ఇంద్రుని, బ్రహ్మను గలవాడు.

**మరుత్వాన్ హుతభుక్ భోక్తా భువ క్ర్తీతి ప్రజానిధిః ।**

**సోఽనంత హుతభుక్ భోక్తా మహాంతౌ యస్య తౌ సదా ॥**

హుతభుక్ అనగా–దేవేంద్రుడు. భోక్త అనగా – కాపాడే బ్రహ్మ, వీరికి అంతర్యామియై నియమించు అభిమానదేవత.

**అనంతౌ హుతభుగ్భోక్తారౌ యస్యసః అనంతహుత భుగ్భోక్తా**

హోమము చేసిన హవిస్సును భుజించేవాడు ఇంద్రుడు, ప్రజలను కాపాడేవాడు బ్రహ్మ. వీరి లోకాలను పొందచేసేవాడు. ఇంద్రలోకాన్ని, ప్రజాపతి లోకాన్ని పొంద చేసేవాడు.

**స ఇంద్రలోకమ్ సప్రజాపతి లోకమ్**

వాడు ఇంద్రలోకము చేరుస్తాడు. వాడు ప్రజాపతి లోకాన్ని చేరుస్తాడు.

ఈ రకంగా ఒక లోకమునుంచి ఇంకొక లోకానికి చేర్చేవాడు పరమేశ్వరుడే. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'అనంతోహుతభుగ్భోక్తా' అనబడుతున్నాడు.

## 889 సుఖదః

సుఖమునిచ్చువాడు. 459వ నామము కూడా ఇదే.

**అమానవ కరస్పర్శాత్ భవ ముత్పార్య సత్వరమ్ ।**

**స్వప్రాప్తి లక్షణ సుఖం దదాతి సుఖదశ్చసః ॥**

అతని కరస్పర్శతో సంసారకరమయిన సూక్ష్మ ప్రకృతి బంధాన్ని కూడా విడిపించి తన సాయుజ్యము అనే అపారమైన, అవిచ్ఛినమైన సంతతి నొసంగు తున్నాడు.

తనను పొందుట అనే సుఖాన్నిచ్చేవాడు.

**సుఖం దదాతీతి సుఖదః**

అమానవుని కరస్పర్శచే సంసార వాసనలు తొలగించి స్వప్రాప్తి అనే సుఖాన్నిచ్చేవాడు.

అమానవుడు అంటే – విరజా నదీతీరంలో ఉండే పరమపావనుడు. భక్తాగ్రేశరుడు. సంసార బంధనాలమీద విరక్తి చెంది వచ్చే వారిని తనచేతులతో స్పృశిస్తాడు దాని వల్ల వారు సూక్ష్మశరీరము ధరించి దివ్యరూపం పొందుతారు.

మోక్షరూపమయిన సుఖాన్నిచ్చేవాడు.

## 890. నైకజః

ఒకసారికానివాడు.

**న ఏకజః** అనేక పర్యాయములు పుట్టినవాడు. ధర్మసంస్థాపన కోసం శ్రీమన్నారాయణుడు భూమిమీద అనేకసార్లు ఉద్భవించాడు. శంకరులవారు ఈ నామాన్ని 'నైకజః' అని వ్రాస్తే పరాశరభట్టరు వారు 'నైకదః' అని వ్రాశారు.

**నైకదః :** గంధాది వస్తువులనేకము లిచ్చువారు ఇతనికి కలరు.

**బ్రహ్మాలంకార దాయిన్యోముక్తే భ్యశ్చ పరే పదే ।**

**దివ్యాశ్చా స్సరసో యస్య నైకద స్సచ కథ్యతే ॥**

ముక్తి పొందినవారికి పరమపదము నందు దివ్యాలంకారములు చేయటానికి అనేకమంది అప్సరాంగనలు గలవాడు.

**ఏకాని దదాతీతి ఏకదాః**

**న ఏకదాః నైకదాః అస్యసతీతి నైకదః**

అపరిమితమైన దివ్యమాలలు, దివ్యగంధము, దివ్యవస్త్రాలు మొదలైన బ్రహ్మాలంకారములతో ముక్తపురుషుని సత్కరించి, తనవద్దకు తెచ్చే అప్సరసలు గలవాడు.

ముక్తపురుషుని ఐదువందలమంది అప్సరసలు పూలమాలలతోను, పై పూతలతోను బ్రహ్మాలంకారములతోను అలంకరిస్తారు. అని **కౌషీతకీ బ్రాహ్మణం**లో చెప్పబడింది.

## 891. అగ్రజః

అగ్రమున జన్మించినవాడు.

**స్వస్త్రాగ్రే ప్రాప్తముక్తానాం సర్వైశ్వర్యశ్రియా సహ**

**యథాపర్యంక విద్యంచ కరుణానిష్టచేతసా**

**తద్భోగ్యో జాయతే యశ్చ సోఽగ్రజః పరికీర్తితః ॥**

సకల భోగసంపదలతోను తనముందు నిలచిన ముక్తపురుషుల కోసము కరుణాంతరంగుడై "పర్యంకవిద్య" యందు చెప్పినట్లుగా భోగ్యభూతుడై ప్రకాశించేవాడు.

**అగ్రే జాయతే ఇతి అగ్రజః**

అర్చిరాది మార్గంలో తనను సమీపించిన ముక్తుల ఎదురుగా సకలైశ్వర స్వరూపిణి అయిన లక్ష్మితో కలసి, పర్యంకవిద్యలో చెప్పినట్లు పరమభోగ్యముగా సేవ చేస్తున్నాడు.

**పర్యంకవిద్యలో** ఈ విధంగా ఉన్నది.

లక్ష్మీదేవితో కూడి శ్రీమన్నారాయణుడు పర్యంకము మీదకు వెళ్ళి దానిని కాలుతో త్రొక్కగా పరమపురుషుడు నీవెవరవు ? అంటాడు.

బ్రహ్మానందు గల చైతన్యము, విశేషములచేత భక్తుడు ముక్తి పొందుతాడు" అని చెప్పబడింది. అందరికన్న ముందుగా జన్మించినవాడు హిరణ్యగర్భుడు.

## 892. అనిర్విణ్ణః

దుఃఖములు తొలగించువాడు. 435వ నామము ఇదే.

**మహతా ప్రనిధానేన హ్యుత్తార్య భవగర్తతః ।**
**ప్రాపయ్య చ తమాత్మానం కృతకృత్యశ్చ విజ్వరః ॥**

ఈ రకంగా నిరంతరము కృషి చేసి సంసార సాగరంలో పడి ఉన్నవారిని ఉద్ధరించి, వారిని మోక్షసామ్రాజ్యానికి అభిషిక్తుల గావించి, నిశ్చింతంగా ఉండేవవాడు.

**న నిర్విణ్ణః అనిర్విణ్ణః** ఆశ్రితులను సంసార సాగరంలోనుంచి ఉద్దరించి, వారికి పరమపదము కల్పించటం చేత, వారి దుఃఖాలను తొలగించినవాడు. నేను ఈ రకంగా ఉన్నాను అనే భేదములేనివాడు. పరమేశ్వరుడు ఆప్తకాముడు. పూర్ణకాముడు. అతడికి కోరికలు అనేవి ఏవీ లేవు. అందుచేత ఇది లేదు, అది లేదు అనే నిర్వేదము లేదు.

## 893. సదామర్షీ

కైంకర్యమును స్వీకరించేవాడు.

**సర్వకాలం తత్రప్రభృతి కృతప్రతికృతం చ సః ।**
**మర్షితుం శీలమస్యేతి సదామర్షీతి కీర్తితః ॥**

ఆ విధంగా పరమపదము పొందిన తరువాత, పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు తమకు చేసిన మహోపకారానికి ప్రతిక్రియగా భక్తులు సమర్పించే వివిధ రకాలైన నిత్యకైంకర్యములను (నివేదనలను) స్వీకరించేవాడు.

**సదామర్షితుం సోఢుం శీలమస్యేతి సదామర్షీ** పరమపదము చేరినవాడు తాను పొందిన దానికి ప్రతిఫలంగా సమర్పించే కైంకర్యములను స్వీకరించేవాడు. సజ్జనులను, సాధుపుంగవులను, క్షమించువాడు. వారి అపరాధములు మన్నించి వారిని రక్షిస్తాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'సదామర్షీ' అనబడుతున్నాడు.

## 894. లోకాఽధిష్ఠానమ్

లోకాలకు ఆధారమైనవాడు.

**లోకానాం ముక్తభోగ్యానాం లోకాధిష్ఠాన మాశ్రయః**

ఉత్తమ లోకాలకు ఆధారమైనవాడు. వాటిలోనే ముక్తపురుషులు ఉంటారు.

**లోకానామ్ అధిష్ఠానమ్ లోకాధిష్ఠానమ్**

పరమభక్తి తత్పరులు ఉండే లోకాలకు అధిష్ఠానమైనవాడు.

లోకములకు ఆశ్రయమైనవాడు. అతడికి ఆశ్రయము అనేది ఏదీలేదు. కాని అన్ని లోకాలకు అతడే ఆశ్రయము. అటువంటి శ్రీమన్నారాయణుడు 'లోకాధిష్ఠానమ్' అనబడతాడు.

## 895. అద్భుతః

ఆశ్చర్యముగ ఉండేవాడు.

**తత్పదా సర్వధా సర్వైః భుజ్యమానో ప్యపూరవత్ స్మయనీయోఽద్భుతః**

ఈ విధంగా నిత్యముక్తులందరితోనూ అనుభవించబడుతున్నప్పటికి, నిత్య నూతనంగా కనిపిస్తూ ఆశ్చర్య సాగరంలో ఓలలాడించేవాడు.

ఉత్తమలోకాలలోని భక్తులు పరమేశ్వరుని సదా అనుభవిస్తున్నప్పటికీ ఎప్పటికప్పుడు నిత్యనూతనంగా కనిపించేవాడు.

పరమేశ్వరుడు మహోత్కృష్టుడు అతన్ని గురించి పూర్తిగా వింటారు కాని అతన్ని తెలుసుకోలేరు. అతన్ని గురించి తెలుసుకున్న వారు బహుకొద్దిమంది. వారిని చూసి ఆశ్చర్యము చెందాలి.

**భగవద్గీత** రెండవ అధ్యాయం **'సాంఖ్యయోగం'**లోని 29వ శ్లోకం

**ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేన మాశ్చర్య వద్వదతి తథైవ చాన్యః ।**
**ఆశ్చర్య వచ్చైనమన్యః శృణోతిశ్రుత్వా ప్యేనం వేద న చైవ కశ్చిత్ ॥**

ఎవరో ఒక మహాపురుషుడు మాత్రమే ఈ ఆత్మను ఆశ్చర్యకరంగా చూస్తాడు. ఇంకొక మహానుభావుడు దీన్ని ఆశ్చర్యకరంగా వర్ణిస్తాడు. వేరొకడు దీనిని ఆశ్చర్యకరంగా వింటాడు. విన్నవారిలో కూడా కొందరు దీనిని గూర్చి ఏమీ ఎరుగరు.

కాబట్టి ఆత్మ అనేది ఆశ్చర్యకరంగా బహుకొద్దిమందిచేత మాత్రమే పొందబడుతుంది.

## 896. సనాత్

ప్రాచీనుడు, ముక్తులచే అనుభవించబడువాడు.

**.... ప్రోక్తః తేషామ్ సంభజనాత్ సనాత్ ॥** ముక్తులచే భాగించబడి అనుభవించ బడేవాడు.

సమత్ అనగా – చిరకాలము అని అర్థము. పరమేశ్వరుడు చిరకాలము నుండి ఉన్నవాడు.

## 897. సనాతనతమః

ప్రాచీనులందరిలోకి ప్రాచీనుడు.

**నిత్యనూతన భోగ్యత్వాత్ సనాతనతమస్మృతః**

నిత్యమూ అనుభవిస్తున్నప్పటికీ నిత్యనూతనమైనవాడు. అంత ప్రాచీనుడయికూడా అప్పుడే జన్మించినట్లుగా సదాభోగ్యముగా ఉండేవాడు.

పరమేశ్వరుడు సర్వకారణుడు కాబట్టి బ్రహ్మాదిదేవతలందరికన్నా ప్రాచీనుడు.

## 898. కపిలః

కపిలవర్ణము గలవాడు.

**విద్యున్మండలమధ్యస్థ నీలమేఘవ దుజ్వలః ।**
**కపిల స స్సమాఖ్యాతః సప్తవర్ణో మహామనుః ॥**

మెరుపులతో అలరారే నీలమేఘములాగా మంచి తేజస్సుతో వెలుగొందేవాడు. ఈ నామము సప్తాక్షరీ మహామంత్రము. గొప్పవిశేషమైన మంత్రము.

నీలమేఘమువంటి వర్ణముతో ప్రకాశించేవాడు. బడబాగ్నికి సంబంధించిన వర్ణము కపిలవర్ణము. అటువంటి వర్ణము గలవాడు.

## 899. కపిః

సూర్యుడు, వరాహము.

కం – జలము, పిబతి – త్రాగువాడు. నీటిని త్రాగువాడు – సూర్యుడు.

కపిః – వరాహశ్రేష్ఠుడు. అని కూడా అర్థమున్నది.

సూర్యుని రూపంలో సముద్రపునీటిని ఆవిరి చేసి మేఘముగా మార్చి, వర్షించి, పంటల పండించి జీవులను పోషించువాడు.

వరాహరూపంలో నీటిలో మునిగిపోయిన భూమినిపైకి తెచ్చినవాడు.

## 900. అవ్యయః

నాశనము లేనివాడు.

మహాప్రళయం జరిగినప్పుడు జీవజాలమంతా తమ కర్మను తమతో మూట గట్టుకుని ఇతనియందు ప్రవేశిస్తుంది. ఇతడు మాత్రం అలాగే ఉంటాడు. త్రికాలముల యందు ఉంటాడు. అందుకే అవ్యయుడు.

శంకర భగవత్పాదుల వారు ఈ రెండు నామాలను విడివిడిగా వ్రాస్తే, పరాశరభట్టరు వారు వాటిని కలిపి ఒకే నామంగా వ్రాశారు.

**కపిరవ్యయః :** నిత్యానందము పొందువాడు.

**అనశ్వరసుఖతిపాతి స ఉత్తః కపిరవ్యయః**

ముక్తబృందముతో శాశ్వతమైన ఆనందము పొందేవాడు.

**కం – సుఖం, పిబతీతి కపిః అవ్యయః కపి**

తానుకూడా శాశ్వతమైన ఆనందాన్ని అనుభవించేవాడు.

పరమేశ్వరుడు చిదానందరూపుడు. పంచకశాంతర స్థితుడు. అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశాలనడుమ ఆనందమయ కోశమున్నది. అందులో ఉంటాడు.

అన్నమయ కోశము – స్థూలశరీరము

ప్రాణమయ, మనోమయ,

విజ్ఞానమయ కోశాలు – సూక్ష్మశరీరము

ఆనందమయ కోశము – కారణశరీరము

స్థూలశరీరంలో – సూక్ష్మశరీరముంటుంది.

సూక్ష్మశరీరంలో – కారణ శరీరముంటుంది.

అందులో బ్రహ్మానంద స్థితిలో ఆ పరమేశ్వరుడు ఉంటాడు. అందుకే శ్రీమన్నారాయణుడు 'కపిరవ్యయః' అనబడుతున్నాడు.

## 901. స్వస్తిదః

మంగళము, శుభమునిచ్చువాడు.

**భక్తేభ్యోమంగళం స్వస్తి తద్దానాత్ స్వస్తి దస్మృతిః** తన భక్తులకు శుభము కలుగ జేయువాడు. **స్వస్తిదదాతీతి స్వస్తిదః** భక్తులకు శుభమును గలుగచేయువాడు. పరమేశ్వరుడు సర్వశుభంకరుడు. అందుచేత తనను నమ్మిన వారందరికీ శుభాన్నే కలుగజేస్తాడు.

## 902. స్వస్తికృత్

క్షేమముగావించేవాడు.

**స్వస్తి స్వభోగాశిషం యః కరోతి స్వస్తి కృచ్ఛ సః**

కల్యాణ గుణాలచేత తన భోగానికి విపత్తు రాకుండా చేసేవాడు.

**స్వస్తికరోతీతి స్వస్తికృత్** లోకములోని అన్ని జీవులకు క్షేమము గలిగించేవాడు. అందరికీ శుభము క్షేమము చేసేవాడు.

## 903. స్వస్తి

మంగళప్రదుడు.

**మహామంగళ రూపత్వాత్ స్వయం స్వస్తీతి కథ్యతే** తానే స్వయంగా మంగళప్రదుడు పరమాత్ముని పరమానంద స్వరూపము మంగళప్రదము.

## 904. స్వస్తిభుక్

మంగళములను పాలించువాడు.

**పాలనాన్మంగళ స్యైవ స్వస్తిభుక్ చేతి గమ్యతే ॥** మంగళములను కాపాడువాడు.

**స్వస్తి భునక్తీతి స్వస్తిభుక్** మంగళముల పాలించేవాడు.

మంగళముల అనుభవించేవాడు. మంగళముల రక్షించేవాడు.

## 905. స్వస్తి దక్షిణః

భక్తులకు శరీరమునిచ్చేవాడు.

**శక్త్యాద్యా ప్రకృతిః స్వస్తి స్వాత్మదానం చ దక్షిణా ।**
**ఆత్మార్పణాఖ్యయాగే తు యస్యాస్తి స్వస్తి దక్షిణః ॥**

తన కైంకర్యము చెయ్యటానికి తగినటువంటి దివ్యశరీరము, శక్తి మొదలైనవి. స్వస్తి అనబడతాయి. వాటిని ఆత్మారణ అనే యజ్ఞంలో నిత్యముక్తులయిన భక్తులకు దక్షిణగా ఇచ్చేవాడు.

**స్వస్తి దక్షిణాయస్యసః స్వస్తి దక్షిణః** తనకు పరిచర్యలు చెయ్యటానికి అవసరమైన వాటిని ఆత్మార్పణ చేసిన నిత్యసూరులకు దక్షిణగా ఇచ్చేవాడు. తన కైంకర్యము కోసము తగిన దివ్యశరీరము మొదలైనవి ఆ భక్తులకిచ్చేవాడు.

శుభమైన రూపముతో ఎల్లప్పుడూ వర్ధిల్లేవాడు. శుభమును ఇచ్చే శక్తి గలవాడు.

ఏ భగవంతుని స్మరించినంత మాత్రంచేత సర్వసిద్ధులూ లభిస్తాయో, అటువంటి వాడు శ్రీమన్నారాయణుడు. అతడు స్వస్తి దక్షిణః – శీఘ్రముగా శుభము నివ్వటానికి సమర్ధుడు.

**స్మృతే సకల కళ్యాణ భాజనం యత్ర జాయతే ।**

**పురుషస్తమజం నిత్యం వ్రజామి శరణమ్ హరిమ్ ॥**

ఎవరిని స్మరించినంత మాత్రం చేత సకల శుభాలు లభిస్తాయో, అటువంటి నిత్యుడు, శాశ్వతుడు అయిన వారిని శరణు పొందుతున్నాను.

**స్మరణాదేవ కృష్ణస్య పాపసంఘాత పంజరం ।**

**శతధా భేదమాయాతి గిరిర్వ్రజ హథోయధా ॥**

శ్రీకృష్ణ పరమాత్ముని స్మరించినంత మాత్రం చేతనే పాపము రాశి అంతా కూడా వజ్రాయుధంతో కొట్టబడిన పర్వతంలాగా ముక్కలై పోతుంది.

## 906. అరౌద్రః

రౌద్రము లేనివాడు, సౌమ్యుడు

**సర్వైశ్వర్యేఽపి సుగుణః శీతలోఽ రౌద్ర ఉచ్యతే ॥** తాను ఎంత ఐశ్వర్య సంపన్నుడైనప్పటికీ, కళ్యాణ గుణాఢ్యుడు కాబట్టి భక్తులకు చల్లనైన వాడు. అతి సౌమ్యుడు.

**న రౌద్రః అరౌద్రః** అతిసౌమ్యుడు, శాంతమూర్తి

రౌద్రమైన కర్మాచరణ లేనివాడు. ఇవి నాకు సుఖాన్నిస్తాయి. కాబట్టి నాకు కావాలి అనే ఆలోచన లేనివాడు అతడు ఆప్తకాముడు. అన్ని కోరికలు తీరినవాడు.

## 907. కుండలీ

కుండలములు  ధరించినవాడు.

**దివ్యభూషణ వా న్యోసౌ కుండలీతి ప్రకథ్యతే** దివ్యమైన ఆభరణములు గలవాడు.

**కుండలమ్ అస్యాస్తీతి కుండలీ** చెవులకు ధరించే ఆభరణాలు కుండలాలు అటువంటి దివ్యాభరణములు ధరించినవాడు.

## 908. చక్రీ

చక్రాయుధధారి. 995వ నామము కూడా ఇదే.

**నిత్య దివ్యాయుధ శ్చక్రీ** చక్రమువంటి దివ్యాయుధములను ధరించినవాడు

**చక్రమ్ అస్యాస్తీతి చక్రీ**

శత్రుసంహారము నిమిత్తము చక్రము వంటి ఆయుధము ధరించినవాడు.

సమస్త లోకాలను రక్షించటానికి సుదర్శనమనే చక్రమితడికి గలదు.

**చలన స్వరూప మత్యంత జనేనాంతరితా నిలం ।**
**చక్రరూపం చ మనోధత్తే విష్ణుః కరే స్థితమ్ ॥**

చలించే స్వభావము గలది, వాయువుకు మించిన వేగము గలది, చక్రరూపము గలది అయిన మనసును విష్ణువు తన చేతులయందు ధరించి ఉన్నాడు.

## 909. విక్రమీ

పరాక్రమవంతుడు. 75వ నామము కూడా ఇదే.

**స్యా ద్విలాసీ తు విక్రమీ** గాంభీర్యమునకు తగిన దివ్యచేష్టలు గలవాడు.

**విక్రమః అస్యాస్తీతి విక్రమీ** అత్యంత పరాక్రమవంతుడు.

విక్రమము అనగా – శౌర్యము, పాదవిక్షేపణము. పరమేశ్వరుడు అత్యంత శౌర్యవంతుడు. మూడు అడుగులతో జగత్తునంతా ఆక్రమించినవాడు,.

## 910. ఊర్జితశాసనః

దివ్యమైన ఆజ్ఞలను ఇచ్చేవాడు.

**బ్రహ్మాద్యలంఘ్యస్యాగో యః  సస్యా దూర్జిత శాసనః**

బ్రహ్మాదులకైనా ఉల్లంఘించరాని శాసనములు కలవాడు.

**ఊర్జితం శాసనం యస్యసః ఊర్జిత శాసనః** అనుల్లంఘనీయమైన ఆజ్ఞలనిచ్చువాడు. ఇతని ఆజ్ఞలకు తిరుగులేదు. అవి అనుల్లంఘనీయములు.

ఉత్కృష్టమైన శ్రుతి రూపమైన శాసనము ఇతనికి గలదు. శ్రుతులు స్మృతులు అతని ఆజ్ఞలే. అతని ఆజ్ఞలను ధిక్కరించినవాడు అతని ద్వేషానికి పాత్రుడవుతాడు.

## 911. శబ్దాతిగః

వేదాలకు అగోచరుడు.

**అనంతశాఖై రామ్నాయైః వాగ్దేవ్యాఽనంత భోగినా ।**
**వక్తుహ్యశక్య మహిమా యస్యశబ్దాతిగోఽస్తిసః ॥**

శాఖోపశాఖలుగా ఉన్న వేదాలవలన గాని, సరస్వతీదేవి చేతగాని, వేయి తలలు గల ఆదిశేషుని వలన గాని వర్ణింప వీలుకానివాడు.

**శబ్దమ్ అతి గచ్ఛతీతి శబ్దాతిగః** వేదములచేత కూడా వర్ణింప అలవి కాని వాడు.

శబ్దాలను అతిక్రమించి పోయినవాడు. పరమేశ్వరతత్త్వాన్ని వేదాలచేత తెలుసుకోలేము. యోగులు ధ్యానించే పరమేశ్వర స్వరూపము వర్ణింపనలవి కానిది. శబ్దముద్వారా గ్రహించటానికి వీలు కానిది. అందుచేతనే **కేనోపనిషత్తు**లో పరమాత్మ ఉన్న చోటికి వాక్కు పోలేదు. అని చెప్పబడింది.

ఈ విధంగా పరమాత్మ వేదశాస్త్ర పురాణాదుల వలన తెలుసుకోవటానికి వీలుపడదు.



# 56. గజేంద్రమోక్షము

గురువుగారూ ! 'గజేంద్రమోక్షము' అనే ఘట్టము పరమపవిత్రమైనదని, దాన్నివిన్నా, చదివినా దుస్వప్నాలురావు అని చెప్పబడింది. ఇంతకీ ఆ గజేంద్రుడు ఎవరు ? అతని కథ ఏమిటో కాస్త వివరించండి" అన్నాడు నారాయణభట్టు. చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

పూర్వకాలంలో 'హూహూ' అనే పేరుగల గంధర్వుడు తన భార్యలతో కలిసి విలాసంగా కాలం గడుపుతూ ఒక సరోవరతీరానికి వచ్చాడు. అది చాలా నిర్మలంగా ఉంది. అక్కడికి చేరటం తోడనే అందులో జలకాలాడాలి అనిపించింది. అనుకున్నదే తడవుగా తన భార్యలతో కలిసి ఆ నదిలోదిగాడు. తనవితీరా అందులో జలకాలాడుతున్నాడు. ఆ సమయంలో 'దేవలుడు' అనే ముని సత్తముడు ఆ సరస్సులో స్నానం చెయ్యటానికి వచ్చాడు. భార్యలతో సరసాలాడుతున్న గంధర్వుడికి, ఆ మునిని చూడగానే తేలికభావం కలిగింది. వినోదంలో భాగంగా తాను నీటిలో మునిగిపోయి ఆ ముని కాళ్ళు పట్టుకుని లాగాడు. దీంతో ఆ ముని కోపించినవాడై "నీటిలో నుంచి వచ్చి కాళ్ళు పట్టుకున్నావు కాబట్టి మొసలివి కావలసింది" అని శపించాడు. చేసిన తప్పుకు పశ్చాత్తాప పడినవాడై గంధర్వుడు మునీశ్వరుని కాళ్ళావేళ్ళా పడగా 'కొంతకాలానికి ఒక గజేంద్రుడు ఈ సరస్సులోకి వస్తాడు. అప్పుడు నువ్వు అతన్ని పట్టుకోవలసినది. ఆ సమయంలో శ్రీహరి వచ్చి ఆ గజేంద్రుని రక్షిస్తాడు. నీకు శాపవిమోచనం కలుగుతుంది' అని చెప్పాడు.

ద్రవిడ దేశాన్ని ఇంద్రద్యుమ్నుడు అనే పాండ్యరాజు పరిపాలిస్తుండేవాడు. అతడు వేదవేదాంగవిదుడు. కడు ధర్మపరుడు. కొంతకాలం రాజ్యంచేసి, తరువాత తన కుమారునికి పట్టంకట్టి మలయాచలంమీద నివాసం ఏర్పాటుచేసుకుని శ్రీహరినే ధ్యానిస్తూ వానప్రస్తంలో ఉండిపోయాడు.

ఒకరోజు ఆ దగ్గరలో ఉన్న సరస్సులో స్నానంచేసి వచ్చి ధ్యానంలో కూర్చున్నాడు. భౌతిక ప్రపంచాన్ని అతడు పూర్తిగా మరచిపోయాడు. ఆ సమయంలో అగస్త్యమహర్షి శిష్యసమేతుడై అక్కడికి వచ్చాడు. ధ్యాననిష్ఠలో ఉన్న మహారాజు అది గమనించలేదు. తనను రాజు కావాలనే అవమానించాడు అనుకున్నాడు మహర్షి. దాంతో అతడికి కోపం వచ్చింది. ఏమయ్యా ! ఇంతటివాడిని నేను వచ్చినా కదలకుండా ఏనుగులా కూర్చుంటావా? నువ్వు నిజంగానే గజరాజై జన్మించవలసినది' అని శాపం పెట్టాడు.

ఈరకంగా ఇంద్ర్యుమ్న మహారాజు మలయాచలంమీద గజరాజుగా, గంధర్వుడు అక్కడి సరస్సులో మొసలిగా జన్మించారు.

మలయాచలంమీద గజరాజు స్వేచ్ఛా విహారం చేస్తున్నది. దానికి ఆరుగురు భార్యలు. ఆ గజరాజు బాగా మదించి ఉన్నది.

ఇంతలో వేసవి వచ్చింది. ఎండ తాపానికి ఏనుగులమంద అలసిపోయింది. దాహం వేస్తున్నది. ఆ మదగజము తన భార్యలతో సహా నీటిమడుగువైపు బయలుదేరింది. త్రోవలో అడ్డువచ్చిన చెట్లకొమ్మలు విరిచేస్తోంది. కొన్ని చెట్లను మొదళ్ళతో సహా పీకిపారేస్తోంది. ఈరకంగా బయలుదేరిన గజరాజు నీటిమడుగుచేరింది. కడుపునిండా నీరు త్రాగింది. నీటిలో స్నానంచేసి తాపం తీర్చుకున్నది.

ఇక భార్యలతో కలసి కేళీవిలాసాలు ప్రారంభించింది. మడుగు అంతా కలియ తిరిగింది. అందులో ఉన్న తామరమొక్కలను పీకిపారేసింది. ఒకటేమిటి ? అదంతా నానాభీభత్సం చస్తోంది. ఇటువంటి స్థితిలో ఎక్కడ నుంచి వచ్చిందో ఒక మొసలి చిన్నగా నీటిలో ప్రవేశించింది. నీట మునిగి మెల్లమెల్లగా నడుస్తూ గజరాజును సమీపించి దాని కాలును నోటితో వడిసి పట్టుకుంది.

హటాత్సంఘటనకు విస్తుపోయింది గజరాజు. వెంటనే ప్రమాదం తెలుసుకుని భయంకరంగా అరవటం ప్రారంభించింది. అతని భార్యలు తమ భర్తను రక్షించటానికి ప్రయత్నించినాయి. కాని లాభం లేకపోయింది. అవి ఏమీ చెయ్యలేని స్థితిలో మడుగునుంచి దూరంగా పోయి దుఃఖిస్తూ నుంచున్నాయి. గజరాజు మొసలి పట్టువిడిపించుకోవాలని విశ్వప్రయత్నం చేశాడు కుదరలేదు. ఈ రకంగా కొన్నివేల సంవత్సరాలు గడచినాయి. గజరాజు బలం క్రమేపీ తగ్గిపోసాగింది. 'ఇక లాభం లేదు. ఈ మొసలితో పోరాడటం నావల్లకాదు.' అని తెలుసుకున్నదై ఆ పరమేశ్వరుని ప్రార్థించటం మొదలుపెట్టింది.

ఇక్కడ గజరాజు అంటే జీవుడు అతని ఆర్గురు భార్యలు అరిషడ్వర్గాలు. నేను నాది అనే అహంకారమమకారలతో విర్రవీగుతూ కొలనులో ప్రవేసించాడు. ఇప్పుడు మొసలి పట్టుకున్నది అదే సంచితకర్మ. గతజన్మలో అతడు చేసిన కర్మ ఫలితమే ఈ మొసలి. దాంతో శరీరంలో అహంకారమున్నంతవరకు పోరాడాడు. గెలవలేకపోయాడు.

ఇప్పుడు తెలిసింది. సంచితకర్మ క్షయం కావాలంటే రెండే మార్గాలు. 1. కల్పాంతం దాకా దాన్ని అనుభవించటం. 2. భగవంతుణ్ణి ఆరాధించి జ్ఞానజ్యోతులతో దాన్ని నశింపచెయ్యటం. ఇందులో రెండవ పద్ధతిని ఎన్నుకున్నాడు. ఇప్పుడు ఎవరిని

ప్రార్థించాలి? ముక్తి ప్రదాత పరమేశ్వర స్వరూపమైన శ్రీమన్నారాయణుని ప్రార్థించాడు. పరిపరివిధాల స్తుతించాడు. అతని ప్రార్థనలో భక్తి ఉంది. ఆర్తి ఉన్నది. తత్పరత ఉన్నది. 'ఓ పరమేశ్వరా ! నువ్వు తప్ప నాకు వేరే దిక్కులేదు నన్ను రక్షించవలసినది' అన్నాడు.

ఆర్త త్రాణపరాయణుడైన శ్రీమన్నారాయణుడు స్పష్టంగా తెలియని పశుపక్ష్యాదుల భాషను కూడా అర్థం చేసుకోగలిగాడు. గజేంద్రుని రక్షించటం కోసం అతివేగంగా కదలి వచ్చాడు. అతడు క్రూరుడు కాదు. వచ్చీ రాగానే గజరాజును చేతులతో ఎత్తుకున్నాడు. అతడికి ధైర్యం చెప్పాడు. అతనిపట్ల మిక్కిలి ప్రసన్నుడైనాడు. అతని భయాన్ని తొలగించాడు. మొసలిని సంహరించి గజేంద్రుని రక్షించాడు. గజేంద్రునికి పరమపదానిచ్చాడు. మొసలికి శాపవిమోచనం కావించాడు. 'గజేంద్రమోక్షము' అనే ఘట్టము పాపాలను హరించి వేస్తుంది. దుస్వప్నాలను నాశనం చేస్తుంది.

గజేంద్రుని లాగానే మిగిలిన ఆశ్రితులనుకూడా వృద్ధి చేసేవాడు శ్రీమన్నారాయణుడు. అనేక రూపాలు ధరించినవాడు. అనంతమైన ఐశ్వర్యము గలవాడు. క్రోధాన్ని జయించినవాడు. భయాన్ని పోగొట్టేవాడు. ఆశ్రితుల కోసం ఏదైనా చేసేవాడు. బ్రహ్మాదులకు కూడా అగోచరమైనవాడు. జీవులకు వారు చేసిన కర్మను అనుసరించి ఉన్నతమైన ఫలితాన్నిచ్చేవాడు. వారికి అర్హమైన స్థానములందు నియమించేవాడు. ఆది అనాది అయినవాడు. జగత్తుకు ఆధారమైనవాడు. సమృద్ధిగా సంపద ఉన్నవాడు. గొప్పశక్తి గలవాడు. తన భక్తులు అనుభవించటం కోసం తన శరీరాన్ని వారికిచ్చేవాడు.

ఈ విషయాలన్నీ 912 నుంచి 945వ నామం వరకు చెప్పబడ్డాయి. ఇక నామాలను చూద్దాం.

## 912. శబ్దసహః

శబ్దములను అంగీకరించువాడు. గజేంద్రుని మొర ఆలకించినవాడు.

**అతిధారమివా స్పష్టం తిరశ్చాం శబ్దమానూర్తిజం**

**సహతే య శ్శబ్దసహః వ స్వర్ణో మను రుత్తమః**

పశుపక్ష్యాదుల భాష స్పష్టంగా ఉండదు. అందుచేత సామాన్య మానవుడికి అది తెలియదు. అటువంటి భాషను కూడా ఆలకించువాడు.

**శబ్దం ఆర్తనాదం సహతి భారమివ సహతీతి శబ్ద సహ** స్పష్టంగా పలకలేనటు వంటి జన్మఎత్తి కూడా ఆర్తితో పిలిస్తే, ఆ శబ్దాన్ని గొప్ప భారంగా మోసినవాడు.

శబ్దములకు సహించువాడు. శబ్దములు అనగా వేదములు. వేదార్థాన్ని అంగీకరించినవాడు. వేదములయొక్క తాత్పర్యము, వేదసారము తానే అయినవాడు. వేదములయందు ప్రతిపాదించిన తత్త్వమేతానైనవాడు.

**భగవద్గీత** 15వ అధ్యాయము **'పురుషోత్తమప్రాప్తియోగము'**లోని 15వ శ్లోకము.

**సర్వస్య చాహం హృది సన్నివిష్టోమత్తః స్మృతిః జ్ఞాన మపోహనం చ**
**వేదైశ్చ సర్వైరహమేవ వేద్యో వేదాంతకృద్వేదవిదేవ చాహమ్ ॥**

సమస్త ప్రాణులయందు అంతర్యామిగా ఉన్నవాడను నేనే. నానుండియే స్మృతి, జ్ఞానము, అపోహనము (సందేహము తొలగుట) కలుగుతున్నాయి. వేదముల ద్వారా తెలిసికొనదగినవాడను నేనే. వేదాంతకర్తను, వేదజ్ఞుడను కూడా నేనే.

కాబట్టి వేదములచేత తెలుసుకోబడినవాడు, వేదాంతకర్త శ్రీమన్నారాయణుడు అయి ఉన్నాడు.

## 913. శశిరః

చల్లనివాడు, అతివేగముగా వచ్చినవాడు.

**గజేంద్ర పాలనార్థం యః శశిరస్త్వరయా గతః**

గజేంద్రుని రక్షించటంకోసం అమితమైన వేగముతో వచ్చినవాడు.

**శశతీతి శశిరః** గజేంద్రుని ఆర్తనాదం వినంగానే ఆగమేఘాల మీద వచ్చినవాడు.

**శ్రుత్వా చక్రగదాధరః సాన్నిధ్యం కల్పయామాస తస్మిన్ సరసి**

గజేంద్రుని ఆర్తనాదం వినగానే, ఆర్తత్రాణపరాయణుడైన శ్రీమన్నారాయణుడు శంఖచక్రగదాధారియై వాయువేగమనోవేగాలతో ఆ సరస్సు దగ్గరకు వచ్చాడు.

తాపత్రయములను చల్లార్చేవాడు. తాపములు మూడు రకాలు అవి.

1. ఆధ్యాత్మికములు – దైవముచే కలుగజేయబడేవి
2. ఆదిభౌతికములు – అగ్ని, వరద, భూకంపాలవంటివి.
3. ఆదిదైవికములు – అలసత్వము, కపటము, అశ్రద్ధ అవిశ్వాసము మొదలైనవి.

ఈ మూడు రకాల తాపాలను చల్లార్చేవాడు.

**లలితాసహస్రంలో 357వ నామము 'తాపత్రయాగ్ని సందగ్ధ సమాహ్లాదన చంద్రికా"**

# 914. శర్వరీకరః

రాత్రిని చేయువాడు, ఐదు రకాల ఆయుధాలను ధరించినవాడు.

**ఉద్యతే శర్వరీశబ్దాన్ హింస్రాపరనివారిణీ**

**పంచాయుధీ కరే చాస్యే త్యుదితశ్శర్వరీకరః**

శత్రువులను చీల్చి చెండాడటానికి ఉపయోగించే ఐదు ఆయుధాలను కలిపి - శర్వరీ అంటారు. వాటిని కరమున ధరించి ఉండువాడు.

**శర్వరీ కరే యస్యసః శర్వరీకరః** ఆర్తులను రక్షించటానికి, దుష్టులను శిక్షించటానికి శంఖము, చక్రము, గద, ధనుస్సు, ఖడ్గము అనే ఐదు ఆయుధాలు ధరించినవాడు.

జీవుల యొక్క చేష్టలను, క్రియావృత్తులను హింసించేవాడు. అనగా వారిని ప్రవృత్తి మార్గరహితులుగా చేసేవాడు.

సంసారులకు మాయను కలుగచేసేవాడు. జ్ఞానులకు మాయను తొలగించేవాడు. ఈ రకంగా సంసారులకు అవిద్య కమ్ముకునేలా చేసి తన తత్త్వాన్ని వారికి తెలియనీయడు. అదే జ్ఞానులకు మాయ ఆవరించకుండా చూస్తాడు. ఇద్దరికీ ఈ రకమైన స్థితి కలిగిస్తాడు. కాబట్టి శ్రీమన్నారాయణుడు 'శర్వరీకరః' అనబడుతున్నాడు.

**భగవద్గీత**లోని రెండవ అధ్యాయము **'సాంఖ్యయోగము'**లోని 69వ శ్లోకము.

**యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ**

**యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః ॥**

నిత్యజ్ఞానస్వరూప పరమానందప్రాప్తియందు స్థితప్రజ్ఞుడైన యోగి మేల్కొని ఉంటాడు. అది ఇతర ప్రాణులకు రాత్రితో సమానము. ప్రాణులు ప్రాపంచిక సుఖప్రాప్తి కోసం మేల్కొని ఉండే పగలు యోగికి రాత్రితో సమానము.

సామాన్యజీవులు జీవనోపాధి కోసం పగలు పనిచేసి రాత్రులందు విశ్రాంతి తీసుకుంటాయి. యోగీశ్వరుడు రాత్రులందు యోగసాధన చేస్తాడు.

కాబట్టి సంసారులు అజ్ఞానంతో నిద్రపోయే కాలము, యోగిజ్ఞానసముపార్జనకు మేల్కొని ఉండే కాలము ఒకటే. అందుచేతనే పరమేశ్వరుడు సంసారులకు అజ్ఞానము, యోగులకు జ్ఞానము ఇస్తాడు.

## 915. అక్రూరః

క్రూరుడుకానివాడు.

**యోఽసౌధృతాయుధై గ్రాహం అక్రూరో మక్ష్వకృత్తవాన్** గజేంద్రుని మొర ఆలకించివచ్చాడు హరి. మొసలి గజేంద్రుని బాధిస్తున్నది. ఇతని చేతిలో ఆయుధాలున్నాయి. అయినప్పటికీ వెంటనే మొసలిని కొట్టి చంపని దయాళువు.

**కృంతతీతి క్రూరః నక్రూరః అక్రూరః**

త్వరపడి ఆయుధాలతో మొసలిని చీల్చి పారెయ్యలేదు. కాబట్టి అక్రూరుడు.

**గ్రాహగ్రస్తం గజేంద్రంచ తంగ్రాహంచ జలాశయాత్**

**ఉజ్జహారాప్రమేయాత్మా తరసా మదుసూదనః**

మొసలిచేపట్టబడిన గజేంద్రుని ఆ మొసలిపట్టునుంచి ఒక్కసారిగా పైకి ఎత్తాడు. అంతేకాని మొసలిని చంపలేదు. కాబట్టి ఇతడు అక్రూరుడు.

క్రౌర్యము అనేది తీవ్రమైన కోపము అనే చిత్తోద్రేకము. జీవియొక్క కోరిక తీరకపోతే కోపం వస్తుంది. పరమేశ్వరుడు కోరికలు లేనివాడు. అన్ని కోరికలు తీరినవాడు. ఆప్తకాముడు. పూర్ణకాముడు. అందుకే అతడి కోరికలు గాని, కోపముగాని, క్రౌర్యముగాని లేవు. కాబట్టే శ్రీమన్నారాయణుడు 'అక్రూరుడు'.

## 916. పేశలః

సుకుమారుడు, మనోహరుడు.

**త్వరాతిశయతః ప్రస్త స్రగ్భూషాంబర సుందరః**

**గజేంద్ర రక్షాసమయే యోఽసౌ స్యాత్పేశలస్మృతః**

గజేంద్రుని రక్షించటానికి అతివేగంగా వెడుతున్నాడు శ్రీహరి. ఆ వేగానికి అతని మెడలో ఉన్న ఆభరణాలు, పూలమాలలు, కట్టుకున్న బట్టలు అన్నీ చెదరిపోయినాయి. అయినప్పటికీ ఆ స్థితిలో అతి సుందరంగా, మనోహరంగా ఉన్నాడు.

**పేశంలాతీతి పేశలః** మెడలోని ఆభరణాలు చెదరిపోయినాయి. మాలలు జారిపోతున్నాయి. కట్టుబట్టలు చెదరిపోతున్నాయి. అయినా అతి మనోహరంగా ఉన్నాడు మహావిష్ణువు.

పరమేశ్వరుడు మనసా వాచా కర్మణా అతి సుకుమారుడు. మనోహరుడు.

## 917. దక్షః

ప్రవృద్ధుడు, వేగముగ వచ్చినవాడు. 423వ నామము కూడా ఇదే.

**దక్షో యోద్ధృత మాగంతా రక్షణాయ స ఉచ్యతే ॥**

గజేంద్రుని రక్షించటం కోసం వేగంగా కదలివచ్చినవాడు.

**దక్షతే ఇతి దక్షః** గజేంద్రుడు పిలచిన వెంటనే పరుగున వచ్చి అతడిని కాపాడినవాడు.

సమర్థుడైనవాడు. గొప్పతనము, శక్తి, పరాక్రమము గలవాడు. భక్తుల ప్రార్థనలు ఆలకించటంలో శ్రేష్ఠుడు. భక్తుల అనుగ్రహించటంలో ఔదార్యము గలవాడు.

## 918. దక్షిణః

ప్రేమను చూపువాడు.

**గజేంద్రస్య ప్రసన్నస్య యః ప్రీతో దక్షిణస్తు సః**

శరణాగతుడైన గజేంద్రునిపట్ల మిక్కిలి ప్రసన్నుడైనవాడు.

**దక్షతే ఇతి దక్షిణః** గజేంద్రుడు పిలవగానే రాలేకపోయాను. అని బాదపడుతూ అతనిపై మిక్కిలి ప్రేమను చూపినవాడు.

## 919. క్షమిణాం వరః

క్షమించేవారిలో, ఓర్పుగల వారిలో శ్రేష్ఠుడు.

**గజేంద్ర దర్శనేనాసౌ ధృతాత్మా క్షమిణాం వరః**

గజేంద్రుణ్ణి క్షేమంగా చూసిన తరువాతనే అతని మనసుకుదుటపడింది.

గజేంద్రుని చూసిన తరువాతనే అతడి దుఃఖము తీరింది. అందుచేత ఓర్పు గల వారిలో శ్రేష్ఠుడు.

క్షమాశీలురైన యోగులయందు, భారము వహించే భూమి మొదలైన వాటియందు కూడా పరమేశ్వరుడు శ్రేష్ఠుడు.

భూమిలాగా బ్రహ్మాండాన్నంతటినీ మోస్తున్నప్పటికీ ఏమాత్రము భారముచేత పీడలేనటువంటివాడు. అందువల్ల పృథివి కన్న శ్రేష్ఠుడు. సామాన్యంగా క్షమాశీలురు శక్తి గలవారు. అయితే పరమేశ్వరుడు సర్వశక్తులు గలవాడు. అన్ని పనులు చెయ్యగల సామర్థ్యమున్నవాడు. అందుచేత 'క్షమిణాం వరః' అనబడుతున్నాడు.

## 920. విద్వత్తమః

బాగా తెలిసినవాడు.

**గజేంద్రార్తి చికిత్సాయా విద్వాన్ విద్వత్తమస్తు సః** గజేంద్రుని దుఃఖాన్ని పోగొట్టాడు కాబట్టి ఆర్తులకు చికిత్స చేసే విధానము బాగా తెలిసినవాడు.

**అయమతిశయేన విద్వాన్ విద్వత్తమః** తన కరస్పర్శచేత గజేంద్రునకు చేయవలసిన చికిత్స చేసినవాడు.

అందరిని మించునంత గొప్ప విద్వాంసుడు ఇతరుల గొప్ప దనాన్ని త్రోసి వేయగలవాడు. అన్నింటినీ గోచరింపచేసుకోగల జ్ఞానము గలవాడు.

## 921. వీతభయః

భయమును తొలగించినవాడు.

**వీతం భయం గజేంద్రస్య యస్మా ద్వీతభయశ్చ సః**

గజేంద్రుని భయమును పోగొట్టినవాడు.

**వీతం భయం యస్మాత్సః వీతభయః** తను బయలుదేరాడు. ఆ శబ్దం చెవిన పడగానే గజేంద్రుని భయం పూర్తిగా తీరిపోయింది. ఈరకంగా గజేంద్రుని భయము తీర్చినవాడు.

పరమేశ్వరుడు నిత్యముక్తుడు. ఇతడికి సంసారభయం లేదు. తనను అర్చించే వారికి కూడా సాంసారికమైన భయాలు తొలగించేవాడు.

## 922. పుణ్యశ్రవణ కీర్తనః

పరిశుద్ధులగావించువాడు.

**గజేంద్ర మోక్షణంశ్రుత్వా సద్యః పాపాత్ప్రముచ్యతే**
**యస్మాతత్కీర్తనం పుణ్యం శ్రవణం చేతి సస్మృతః**
**ద్వాదశార్ణోమనుశ్రేష్ఠః పుణ్య శ్రవణ కీర్తనః ॥**

గజేంద్ర మోక్షము కథను విన్నట్లైతే పాపాలన్నీ పటాపంచలైపోతాయి. కాబట్టి దీనిని విన్నా, చదివినా పుణ్యముగానేపరిగణిస్తాడు శ్రీమన్నారాయణుడు. ఈ నామము ద్వాదశాక్షరీ మహామంత్రము. ఉత్తమోత్తమమైనది.

**పుణ్యేశ్రవణకీర్తనే యస్మాత్సః పుణ్యశ్రవణ కీర్తనః**

గజేంద్రమోక్షము కథ విన్నవారి చదివినవారి పాపాలు పటాపంచలైపోతాయి.

**శ్రుతేనహికురుశ్రేష్ఠ స్మృతేనకథితేనవా**

**గజేంద్రమోక్షణే నైవసద్యః పాపాత్ ప్రముచ్యతే**

అర్జునా ! గజేంద్రమోక్షము కథవిన్నా, స్మరించినా కూడా సర్వపాపాలు హరించిపోతాయి.

శ్రీమన్నారాయణుని నామాన్ని విన్నా, కీర్తించినా, లేక స్మరించినప్పటికీ మానవుల సర్వపాపాలు హరించిపోతాయి. ఈ నామాన్ని నిత్యము స్మరించినవాడు ఇహపరాలన్నీ పొందుతాడు.

## 923. ఉత్తారణః

ఉద్ధరించినవాడు, దరిజేర్చినవాడు.

**సరసస్తంతారితవాన్ ఇత్యుత్తారణ ఈరితః** గజేంద్రుని ఆ సరస్సు నుంచి ఉద్ధరించిన వాడు. **ఉత్తారయ తీతి ఉత్తారణః** అటు గజేంద్రుణ్ణి, ఇటు మొసలిని ఇద్దరినీ ఉద్ధరించిన వాడు. సంసార సాగరమునుంచి దరిజేర్చినవాడు కాబట్టి 'ఉత్తారణః' అనబడుతున్నాడు.

## 924. దుష్కృతిహా

దుష్కృతులను నశింపచేసినవాడు. మొసలిని సంహరించినవాడు.

**గ్రాహంవిదారయా మాన యస్మా ద్దుష్కృతిహా చసః** మొసలిని సంహరించిన వాడు. భాగవతులకు అపచారమొనర్చిన వారిని నశింపచేయువాడు.

**దుష్కృతిమ్హంతీతి దుష్కృతిహా**

భాగవతోత్తముడైన గజేంద్రునికి అపచార మొనర్చిన మొసలిని సంహరించినవాడు.

**స్థలస్థం దారయామాసగ్రా సంచక్రేణ మాధవః**

తీరము జేరిన మొసలిని శ్రీహరి తన చక్రాయుధముతో చీల్చివేశాడు.

సంచితకర్మ అనే గజేంద్రుని కర్మఫలాన్ని నశింపచేశాడు.

## 925. పుణ్యః

పాపములు నశింపచేయువాడు. 687వ నామము ఇదే.

**కీర్త్యాస్మదాదీ నపియో గజేంద్రత్రాణరూపయా**

**పుణ్య స్సస్యాత్పునాతీతి షడర్ణః పావన త్వతః**

గజేంద్రమోక్షము అనబడే ఈ కీర్తిచేత మనలను కూడా పాపరహితులుగా చేయువాడు. ఈ నామము షడక్షరీమంత్రము. పాపనాశకరి.

**పునాతీతి పుణ్యః** ఈ కీర్తిచేత లోకులందరి పాపములు పోగొట్టిపరిశుద్ధులను చేయువాడు.

తన నామజపము, తపము చేసిన వారికి పుణ్యము కలిగించువాడు. అందుకే శ్రీమన్నారాయణుడు పుణ్యః అనబడుతున్నాడు.

## 926. దుఃస్వప్ననాశనః

చెడు కలలు నశింపచేయువాడు.

**గజేంద్రమోక్షణాధ్యాయ జాపాద్దుస్వప్నజం ఫలం**
**నాశయత్యంచ సాయోఽసౌ ఇతిదుస్వప్ననాశనః**

గజేంద్రమోక్షము అనే అధ్యాయము భక్తితో పఠించినట్లైతే దుస్వప్నాలు ఒక్కక్షణంలో పటాపంచలైపోతాయి.

**దుస్వప్నంనాశయతీతి దుఃస్వప్ననాశనః**

గజేంద్రమోక్షము విన్నవారికి కూడా చెడు కలలు రాకుండా పోతాయి. గజేంద్ర మోక్షానికి ఫలితము **దుస్వప్ననాశనము** పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుని ధ్యానించినా, కీర్తించినా చెడు కలలరావు. ఇతడు సంసారమనే దుస్వప్నాన్ని నాశనము చేసేవాడు.

## 927. వీరహా

వీరుడైనవాడు, గజేంద్రుని సంసారబంధనాలనుంచి విడిపించినవాడు.

166, 741 నామాలు కూడా ఇదే.

**వీరం తద్బాధకం మృత్యుం హతవాన్ య స్సవీరహా**

గజేంద్రుని బాధపెడుతున్న మొసలిని సంహరించినవాడు.

**వీరం హంతీతి వీరహా** విరోధి అయిన మృత్యువునుండి కాపాడి గజేంద్రుని సంసారబంధములనుంచి రక్షించినవాడు.

**మోక్షాయమాసనాగేంద్రం పాశేభ్యః శరణాగతమ్**

శరణాగతుడైన గజేంద్రుని సంసారబంధనాలనుంచి రక్షించినవాడు.

జీవులయొక్క కర్మఫలాన్ని నశింపచేసి, వారికి ముక్తి నొసంగేవాడు.

## 928. రక్షణః

రక్షించినవాడు.

**స్పర్శ సంశేషణాద్యైస్తం రక్షతీతి స రక్షణః**

తాను గజేంద్రుని తాకి, కౌగిలించి, ఓదార్చి, రక్షించినవాడు.

**రక్షతీతి రక్షణః** తాకి, ఒడలు నిమిరి మంచి మాటలు చెప్పి ఆ గజేంద్రుని రక్షించినవాడు.

సత్త్వగుణ ప్రధానుడైన శ్రీమహావిష్ణువు రూపంలో ముల్లోకాలను రక్షించువాడు.

## 929. సంతః

ఆశ్రితులను వృద్ధి చేయువాడు.

**యాస్స్వాశ్రితాన్ సంతనోతి స సంత ఇతి కథ్యతే**
**తేషామ స్తీతి వాసంతో వచన వ్యత్యయ స్మృతః**
**తేభ్య ఇష్టం దత్త వాన్వా స నోతే సంత ఉచ్యతే ॥**

తన భక్తులను, ఆశ్రితులను అనేక రీతులుగా వృద్ధి చేసేవాడు.

తన ఆశ్రితులకు అండగా ఉండేవాడు. ఆశ్రితుల అభీష్టములు తీర్చేవాడు.

సన్మార్గవర్తనులను–సంతః అంటారు. లోకంలో విద్య, వినయములను పెంపొందించటానికి ఆ పరమేశ్వరుడే సజ్జనులరూపంలో ఉంటాడు. అందుచేత పరమాత్ముడే 'సంతః' అనబడతాడు.

## 930. జీవనః

మొసలి శాపము తొలగించినవాడు.

**స్వహస్తేన హతం గ్రాహం గంధర్వ త్వేన జీవయన్**
**పూర్వశాపం విరస్యాధ్య యస్తిష్టతి స జీవనః ॥**

తనచేతిలో మొసలి మరణించగానే, దానికి శాపవిమోచనం కలిగి గంధర్వరూపము వచ్చింది. ఈ రకంగా మొసలికి శాపవిమోచనం చేసినవాడు.

**జీవయతీతి జీవనః** మొసలికి శాపవిమోచనం కలిగించి గంధర్వుడుగా జీవింపచేసినవాడు.

**సహి దేవల శాపేన హూహూర్గం ధర్వ సత్తమః**
**గ్రాహత్వమగమత్కృష్ణాత్ వధం ప్రాప్య దివంగతః**

దేవలుడు అనే మహర్షి శాపం వలన హూహూ అనే గంధర్వుడు మొసలి అయినాడు. ఇప్పుడు శ్రీ మహావిష్ణువుచే సంహరింపబడి అతడు స్వర్గానికి వెళ్ళాడు.

**సర్వప్రజా ప్రాణ రూపేణ జీవయతి** పరమాత్ముడైన శ్రీమన్నారాయణుడే ప్రాణ రూపంలో ఉండి, జగత్తులోని జీవులన్నింటినీ జీవింపచేస్తున్నాడు.

## 931. పర్యవస్థితః

చుట్టుచు ఉండినవాడు.

**వాత్యల్యాద్యో గజేంద్రంతు పరితో వసనాచ్చ సః**
**పర్యవస్థిత అఖ్యాతో వస్వర్ణో హ్యమిత ప్రదః ॥**

గజేంద్రుని పట్ల ప్రేమాతిశయములతో ఉండబట్టలేక అతనికి అన్నివైపుల నిలచి లాలించినవాడు. ఈ నామము అష్టాక్షరీమంత్రము. అమితఫలాన్నిస్తుంది.

**పరితః అవస్థితః పర్యవస్థితః** వాత్సల్యముతో గజేంద్రుని చుట్టిచుట్టి ఉండేవాడు. పుండరీకాక్షుడు శరణాగతవత్సలుడు, జగత్తుకు అన్నివైపులా వ్యాపించి ఉన్నవాడు.

## 932. అనంతరూపః

అనేక రూపములు ధరించువాడు.

**అనంతరూప స్సస్యాద్యై యస్యా సజ్ఞేయ విగ్రహాః** అనేక శరీరములు దాల్చువాడు.

**అనంతాని రూపాణి యస్యసః అనంతరూపః**

తన భక్తులను రక్షించటానికి అనేకమైన దివ్యరూపాలు ధరించినవాడు.

జగత్తులో ఉన్నవి అన్నీ అతని రూపాలే. కాబట్టి శ్రీమన్నారాయణుడు అనంతరూపుడు.

## 933. అనంతశ్రీః

అనంతమైన ఐశ్వర్యము గలవాడు.

**దేయాః స్వప్రాప్తి పర్యంతాః శ్రియోఽనంతాశ్చ నిత్యశః**
**ప్రసన్నే భ్యో యస్య సంతిసోఽ నంతశ్రీరితి స్మృతః ॥**

తన భక్తులకు ఇవ్వటం కోసం అనంతమైన సంపదలు గలవాడు. భక్తులకు తనను తాను సమర్పించుకోవటానికి కూడా సిద్ధపడేవాడు.

**అనంతాఃశ్రియః యస్యసః అనంతశ్రీః** ఆశ్రితులకు ఇవ్వదగిన ఐశ్వర్యము గలవాడు.

**తతోదివ్యపుర్భూత్వా హస్తిరాట్ పరమంపదమ్ జగామ**

గజేంద్రుడు దివ్యశరీరముతో పరమపదాన్నిచేరాడు. ఈ రకంగా గజేంద్రునికి పరమపదమనే ఐశ్వర్యమునిచ్చినవాడు.

శ్రీమన్నారాయణుని దగ్గర అష్టసిద్ధులు, నవనిధులు ఉన్నాయి. అవి ఎంత తీసినా తరగనివి. వాటిని తన భక్తులకు ఇచ్చేవాడు.

## 934. జితమన్యుః

క్రోధాన్ని జయించినవాడు.

**గజేంద్రద్వేషిణో యే చ కీటాద్యాః జలవాసినః**

**య స్తేషు మన్యుం జితవాన్ జితమన్యుః స కథ్యతే ॥**

ఆ మడుగులో ఉన్న గజేంద్రునియందు ద్వేషముతో ఉన్న మొసలి మొదలైన కీటకములపై కోపము జయించినవాడు.

**జితః మన్యుః యేనసః జితమన్యుః** శరణాగతుడైన గజేంద్రుడికి అపకారము తలపెట్టిన వారందరి మీదా వెంటనే కోపాన్ని జయించాడు. వాటిమీద అతడికి కోపం పోయింది. అందుకే మొసలికి కూడా శాపవిమోచనం చేశాడు.

## 935. భయాపహః

భయాన్ని పోగొట్టేవాడు.

**అనాథత్వ భయంహంతి వాత్సల్యేనైన మాదృశామ్**

**భయాపహసమాఖ్యాతః వస్వర్ణో మనురుత్తమః ॥**

అనాథులకు కూడా అమితమైన వాత్సల్యంతో తానే దిక్కయి నిలచి, దిక్కులేదనే భయాన్ని పోగొట్టేవాడు. ఈ నామము అష్టాక్షరీ మంత్రము శ్రేష్ఠమైనది.

**భయమ్ అపహంతీతి భయాపహః** పరమేశ్వరుడు ఆశ్రిత వాత్సల్యుడు. అందుచేత ఆశ్రితులకు కలిగే భయాన్ని పోగొడతాడు.

**భయే మహితి మగ్నాంశ్చత్రాతి నిత్యం జనార్దనః** మహాభయంలో మునిగిపోయిన వారిని జనార్దనుడు రక్షిస్తాడు. వారి భయాన్ని పోగొడతాడు. సంసారమువలన కలిగే భయాన్ని పోగొడతాడు.

## 936. చతురశ్రః

యుక్తములైన పనులు చేసినవాడు, చతురుడు.

**సమవేతకారీ యస్యాద్యై చతురశ్ర స్సకీర్తితః ॥** ఆశ్రితుల కోసం ఉత్తమమైన పనులు చేసేవాడు. వారిమీద ప్రేమ, వాత్సల్యము, వారి శత్రువులమీద కోపము చూపేవాడు. ఇది యుక్తము.

సముచితరూపముగలవాడు. న్యాయమును ఎప్పుడూ వదలనివాడు. ధర్మస్వరూపుడు. అందుకే జీవులు చేసిన కర్మలననుసరించి ఫలితాన్నిస్తాడు.

## 937. గభీరాఽఽత్మా

గంభీరస్వభావుడు.

**దాత్రాదీనా మప్రధృష్యం గాంభీర్యం యస్య విద్యతే**
**గభీరాత్మా స విజ్ఞేయః పస్తార్ణో మనురుత్తమః**

బ్రహ్మాదులకు కూడా నిర్ణయించలేని గాంభీర్యము గలవాడు. ఈ నామము అష్టాక్షరీమంత్రము శ్రేష్ఠమైనది.

**గభీరః ఆత్మా యస్యసః గభీరాత్మా** గంభీరమైన స్వభావము గలవాడు.

ఇతని ఆత్మ లేక శరీరము ఇంత పరిమాణము గలది అని నిర్ణయించలేము.

## 938. విదిశః

అగోచరుడు

**వినయాద్గద్గదస్తోత్ర ధాత్రీనాం విశేషః**
**దూరేశ్య వివిధాదేశాః విదిశః పరికీర్తితః**

వినయము, తత్పరతచేత గద్గదస్వరముతో స్తుతిచేసే బ్రహ్మాదులకు కూడా అగోచరుడు.

**వివిధాఃదిశాః యస్యసః విదిశః** బ్రహ్మాది దేవతలకు కూడా దర్శనమీయనివాడు.

ఆయా ఫలములకు అధికారము గలవారికి వారి వారి కర్మననుసరించి ఫలము నిచ్చేవాడు.

## 939. వ్యాదిశః

ఫలములను ఇచ్చేవాడు.

**బ్రహ్మాదీనాం తత్తత్ స్థానః సర్జనా ద్వ్యాదిశశ్చ సః**

బ్రహ్మాదులకు తమ స్థాయికి తగినస్థానము కల్పించువాడు.

**వ్యాదిశ తీతి వ్యాదిశః** జీవులచేసిన కర్మకు తగిన ఫలమునిచ్చేవాడు. ఇంద్రాది దేవతలకు వివిధ రకాలయిన ఆజ్ఞలనిచ్చువాడు.

## 940. దిశః

నియమించువాడు.

**ధాత్రాదీన్ సర్వకృత్యేషు స్వాజ్ఞావయతి యస్సదా**
**దిశస్స తు సమాఖ్యాతః సప్తార్ణో మనురుత్తమః ॥**

బ్రహ్మాదులకు అర్హమైన స్థానాలిచ్చి, వారిని తన ఆజ్ఞానువర్తులుగ చేయువాడు. ఈ నామము సప్తాక్షరీ ఉత్తమమైనది.

**దిశతీతి దిశః** గజేంద్రునిలాగా బ్రహ్మాది దేవతలను ఆంతరంగుకులుగా చేయకుండా, వారిని వేరువేరు పనులయందు నియమించువాడు.

గజేంద్ర మోక్షము చూసి ఇంద్రాది దేవతలంతా బ్రహ్మను ముందు నిలబెట్టి శ్రీమన్నారాయణునికి నమస్కరించారు. తమకు కూడా మోక్షాన్ని ప్రసాదిస్తాడేమో? అనే ఆశ. కాని వారికి మోక్షమివ్వలేదు.

తాను వేదరూపంలో ఉండి జీవులకు వైదిక కర్మలకు తగిన ఫలితాన్నిస్తాడు.

## 941. అనాదిః

మొదటివాడు, స్వీకరింపబడనివాడు.

**దేవతాంతర భక్తైర్యః కుత్సితై శ్చాపి సర్వదా**
**నాదీయతే స్వాభిమతం అనాదిః పరికీర్తితః ॥**

దేవతాంతర భక్తులచేత అనగా ఇతర దేవతలనారాధించు వారిచేత తమకు ప్రభువుగా ఆరాధింపబడనివాడు.

**అదీయతే ఇతి ఆదిః నఆదిః అనాదిః**

బ్రహ్మాది దేవతలు ఇతనిని ఉపాసించలేదు కాబట్టి వారికి మోక్షఫలమియ్యని వాడు.

సృష్టి ప్రారంభం కాకముందు నుంచీ ఉన్నవాడు. జగత్తుకే కారణభూతుడు. ఆది అనాది అయినవాడు.

## 942. భూర్భువః

స్థానమైనవాడు.

**తథ్య స్వదాస్యజ్ఞానేన హా త్మలాభవతః పదమ్**

**భవతి స్వయమే వేతి భూర్భువ స్స చ కథ్యతే ॥**

భగవంతుడికి తాము దాసులము అని తెలుసుకున్నటువంటివారై ఆత్మసాక్షాత్కారము కోరే భక్తులకు తానే ప్రాప్తిస్థానమైనవాడు.

**భవతీతి భూః తస్యభువః భూర్భువః**

భగవస్సాక్షాత్కారము పొందాలనుకే భక్తులకు తానే ప్రాప్తి స్థానమైనవాడు.

**భగవద్గీత** 12వ అధ్యాయము **'భక్తియోగము'**లోని ఎనిమిదవశ్లోకము.

**మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ**

**నివసిష్యసి మయ్యేవ అత ఊర్థ్వం న సంశయః ॥**

నాయందే మనసును నిలుపవలసింది. నాయందే బుద్ధిని లగ్నము చేయవలసింది. అప్పుడు నాయందే స్థిరంగా ఉంటావు. ఇందులో ఏ మాత్రం సందేహంలేదు.

ఈరకంగా ఆత్మసాక్షాత్కారము కోరేవారికి ప్రాప్తిస్థానము శ్రీమన్నారాయణుడు.

భూమికి భూమి. ఆధారమునకు ఆధారము. సర్వభూతాలకు ఆధారమైన భూమికి అతడే ఆధారము. అందుకే శ్రీమన్నారాయణుడు 'భూర్భువః' అనబడుతున్నాడు.

## 943. లక్ష్మీః

సంపదగా ఉన్నవాడు.

**ఆత్మలాభవతాం సర్వ సంపత్ లక్ష్మీ స్స యతస్మృతః ॥**

ఆత్మజ్ఞానము గల భక్తులందరికీ తానే సకలవిధ సంపత్తుగా ఉండేవాడు.

**భవద్గతం మేరాజ్యంచ జీవితం చ సుఖానిచ**

నారాజ్యము, నా జీవితము, నా సుఖము అన్నీకూడా మీ అధీనమే అని చెప్పినట్లుగా, ఆత్మసాక్షాత్కారం పొందిన భక్తులకు సమస్త సంపదలు తానే అయినవాడు.

ఈతడు భూమికి ఆశ్రయమేకాదు శోభాయమానమైన వాడు కూడా. ఇతడే భూలోకము. ఇతడే భువర్లోకము ఇతడే ఆత్మవిద్య. అందుకే శ్రీమన్నారాయణుడు 'లక్ష్మి' అనబడుతున్నాడు.

## 944. సువీరః

గొప్ప శక్తిమంతుడు.

**తేషాం యో వినిపాతస్య ప్రతీకారం కరోతి సః**
**సువీరఇతి విఖ్యాతః సప్తార్ణో మను రుత్తమః**

అటువంటి వారికి (భక్తులకు) ఎదురయ్యే ఆ పదాలను అడ్డుకునేవాడు. ఈ నామము సప్తాక్షరీ మంత్రము. ఉత్తమమైనది.

**సుతరాంవీరః సువీరః** భక్తుల ఆపదలు పోగొట్ట గల శక్తి గలవాడు.

**శోభనాః - వివిధాఃఈరాః గతయః - యస్యసః** సుందరములు, వివిధములు అగు నడకలు గలవాడు. అందముగా వివిధరకాలుగా ప్రవర్తించేవాడు.

## 945. రుచిరాంగదః

తన శరీరాన్ని భక్తులకు ఇచ్చేవాడు.

**ప్రసన్నేభ్య స్వానుభవ యోగ్యమంగం మనోహరం**
**అప్రాకృతం సదాదత్తే యోఽసౌ స్యా ద్రుచిరాంగదః ॥**

తన భక్తులు, తత్పరులు, ప్రసన్నులు అన్నివేళలయందు అనుభవించదగిన సుందరమయిన దివ్యమంగళ విగ్రహాన్ని వారికి ప్రసాదించేవాడు.

**రుచిరం అంగం దదాతీతి రుచిరాంగదః** అతి సుందరము, మనోహరము అయిన తన శరీరాన్ని భక్తులు అనుభవించటం కోసం ఇచ్చేవాడు.

**రుచిరే - కల్యాణే - అంగదే - అస్య** మనోహరములు, శుభకరములు అయిన అంగదములు అనగా భుజకీర్తులు ధరించినవాడు.

మనోహరమయిన అవయవములు కలవాడు. అందమైన శరీరము కలవాడు.

అటువంటి శ్రీమన్నారాయణుడు సర్వకాలసర్వావస్థలయందు భక్తులను అనుగ్రహిస్తాడు అంటూ గజేంద్ర మోక్షఘట్టాన్ని పూర్తిచేశాడు రత్నాకరుడు.

# 57. ఆశ్రితవత్సలుడు

"గురువుగారూ ! పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు అనాధరక్షకుడు, ఆశ్రిత పారిజాతము. తన బక్తులను సదా కాచి రక్షిస్తాడు అంటారు కదా ! అది ఏవిధంగానో వివరించండి" అన్నాడు కృష్ణశర్మ. చెప్పటం ప్రారంభించాడు రత్నాకరుడు.

పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు ఆర్తత్రాణపరాయణుడు. అనాధరక్షకుడు. ఆశ్రితవత్సలుడు. ధర్మానికి హాని జరిగినప్పుడల్లా భూలోకంలో అవతరించి దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేస్తుంటాడు. ధర్మాన్ని నాలుగుపాదాల పునఃప్రతిష్ఠ చేస్తాడు. అతడు తన భక్తులకోసం ఏదైనా చేస్తాడు. తన భక్తులు తనను పొందటానికి కావలసిన దేహము వారికిస్తాడు. తగిన ఇంద్రియాలను ఇస్తాడు. జీవులు జన్మించిన తరువాత వాటి అంతిమ లక్ష్యం అతడే అదే పరమపదము. అందుచేతనే జీవులజన్మకు అతడే ఫలము. తన అనుగ్రహానికి పాత్రులు కాని అజ్ఞానులను సంసారమనే బండి చక్రంలో పడేసి గిరగిరాత్రిప్పుతుంటాడు. తన భక్తులను రక్షించటం కోసం హిరణ్యకశ్యపాది రాక్షసులను సంహరించాడు. ఈ జగత్తుకు ఆధారమైనవాడు. అతడే అన్నింటికీ ఆధారము. అతనికివేరే ఆధారము ఏదీలేదు. వ్యవసాయదారుడు తన పంటలను రక్షించుకోవటానికి ఏరకంగా పగలు, రాత్రి మేల్కొని ఉంటాడో, ఆ రకంగా ఆశ్రితులను రక్షించటానికి ఆ పరంధాముడు మేల్కొని ఉంటాడు. అతడు గొప్పవాడు. మహనీయుడు. భక్తులను సన్మార్గంలో నడిపిస్తాడు. సంసారికమైన భోగాలలో చిక్కిన తన భక్తుల ఆత్మలను ఉద్దీపింపచేస్తాడు. అతడు ఓంకారస్వరూపుడు. తన భక్తులకు తాను దాసుడుగా ఉంటాడు. వేదార్ధాన్ని వివరించి, తన భక్తులకు వేదమందు నమ్మకం కలిగిస్తాడు. ప్రాణాలకు నిలయమైనవాడు. ప్రాణాలను పోషించేవాడు. ప్రాణులను జీవింపచేసేవాడు. తత్త్వాన్ని పూర్తిగా ఎరిగినవాడు. జన్మమృత్యు జరాదులు లేనివాడు. ముల్లోకాలకు ఆధారమైనవాడు. భక్తులను తరింపచేయువాడు. సకల లోకాలను అతడే సృష్టించాడు. పితామహుడైన బ్రహ్మను సృష్టించినది కూడా అతడే. అతడు యజ్ఞ స్వరూపుడు. యజ్ఞానికి అధిపతి, యజ్ఞకర్త, యజ్ఞమును నిర్వహించే వాడు. యజ్ఞమును పూర్తిచేసేవాడు. అసలు యజ్ఞాన్ని సృష్టించినది అతడే. యజ్ఞరక్షకుడు అతడే. యజ్ఞ ఫలితము ఇది అని సిద్ధాంతీకరించినవాడు అతడే. యజ్ఞముయొక్క రహస్యము కూడా అతడే. అతడు నిరంతరము తన భక్తుల చేత అనుభవింపబడుతుంటాడు. అతడే ఈ జగత్తుకు మూలకారణము. తనకు తానుగా అవతరించినవాడు. భక్తులయొక్క భవబంధాలను త్రెంచివేసేవాడు. అతడు సామగానప్రియుడు. దేవకీనందనుడు. లోకాలను

సృజించేవాడు. పాంచజన్యము అనే – శంఖము, నందకీ అనే – ఖడ్గము, సుదర్శనము అనే – చక్రము, శార్ఙ్గము అనే – ధనుస్సు, కౌమోదకి అనే – గద ధరించినవాడు.

అతడు అజేయుడు. ఆశ్రితులను రక్షించటంకోసం అన్నిరకాలయిన ఆయుధాలు ధరించినవాడు. భక్తులను సర్వకాలసర్వావస్థలయందు రక్షించేవాడు.

అతడే పరమేశ్వరుడు అతడే సర్వేశ్వరుడు. జగత్ప్రభువు, జగద్రక్షకుడు, ఆర్తత్రాణ పరాయణుడు, ఆశ్రితవత్సలుడు. అతనిని నమ్మినవారికి దుఃఖము లేదు. ఇహలోక, పరలోక సుఖాలను ఇచ్చే ప్రభువు. అతడే శ్రీమన్నారాయణుడు.

ఈ విషయాలన్నీ 946 నుంచి 1000 వరకు గల నామాలలో వివరించటం జరిగింది. ఇక నామాలను చూద్దాం.

## 946. జననః

జనింపచేయువాడు.

**అథోచ్యతేఽత్ర భగవత్ వ్యాపారాణాం ప్రయోజనం**

ఇక మీదట శ్రీమన్నారాయణుని వ్యాపారములకు ప్రయోజనము చెప్పబడుతున్నది.

తనను అనుభవించటానికి కావలసిన దేహముతో ప్రజలను సృజించువాడు.

**జనయ తీతి జననః** తనను అర్చించటానికి, అనుభవించటానికి తగిన ఇంద్రియాలు గల జీవులను సృష్టించినవాడు. ప్రాణులను జన్మింపచేయువాడు. భక్తులయొక్క హృదయాలలో ప్రేమను జనింప చేయువాడు.

## 947. జనజన్మాదిః

జీవుల జన్మలకు తానే ఫలముగా ఉన్నవాడు.

**జననో జనజన్మాదిః నవార్ణో జన్మనాశకః** వారి జన్మలకు ప్రయోజనమైనవాడు. ఈ నామము నవాక్షరీ మహామంత్రము. జన్మరాహిత్యము కలుగుతుంది.

**జనానాం జన్మనః ఆదిః జనజన్మాదిః** అటువంటి జీవుల జన్మకు తానే ప్రయోజనమైనవాడు. తనను అనుభవించటం కోసమే జనులను సృష్టించినవాడు.

**జన్మన్యవిఫలానైకా యా గోవిందాశ్రయా క్రియా**
**సుజన్మదేహ మత్యంతం తదేవా ఽ శేషజంతుషు**
**యదేవపులకోద్భాసి విష్ణునామని కీర్తితే ॥**

ఈ జన్మ ఎత్తినందుకు ఫలము ఏమిటంటే గోవిందుని గురించి చెప్పటమే. విష్ణు నామము చెప్పినంతనే గగుర్పాటు చెందేదే అన్ని జన్మలలోకి శ్రేష్ఠమైనది. జీవులయొక్క జన్మలకు మూలకారణమైనవాడు.

## 948. భీమః

భయంకరుడు. 357వ నామము కూడా ఇదే.

**ఏవం విధానుగ్రహస్య విముఖానాం నిరంతరమ్**

**గర్భ జన్మాది హేతుత్వాత్ భీమ ఇత్యుచ్యతే బుధైః ॥**

భవదనుగ్రహము నోచుకోనివారికి నిరంతర గర్భవాసమునకు కారణమైనవాడు.

తన అనుగ్రహమునకు పాత్రులు కాని వారిని సంసారమనే బండిచక్రంలో పడేసి గిరగిరా త్రిప్పేవాడు. **బిభ్యతి అస్మాదితి భీమః** తనఅనుగ్రహము పొందలేని జ్ఞానహీనులకు భయంకరుడు. వారికి గర్భవాసము శిక్షగా విధిస్తాడు. అధర్మపరుల హృదయాలలో భీతిని కలిగించేవాడు. ఎత్తబడిన వజ్రాయుధములాగా మిక్కిలి భయంకరుడు.

## 949. భీమపరాక్రమః

భయంకరమైన పరాక్రమము గలవాడు.

**లోకాహి తేషు నితరాం హిరణ్యాదిషు సర్వదా**

**భీమః పరాక్రమో యస్య సస్యాద్భీమ పరాక్రమః ॥**

లోకకంటకులైన హిరణ్యకశ్యపాది రాక్షసులయందు భయంకరమైన పరాక్రమమును చూపువాడు.

**భీమః పరాక్రమః యస్యసః భీమపరాక్రమః**

లోకాలను హింసించే వారియందు భయంకరమైన పరాక్రమమును జూపేవాడు. ఆయా అవతారములయందు అసురసంహారంకోసం భయంకరమైన పరాక్రమము గలవాడు.

## 950. ఆధారనిలయః

ఆధారమైనవాడు.

**ధార్మికా జగదా ధారాః ప్రహ్లాదాద్యా విశేషతః**

**తేషాంతు నిలయం స్థానం ఆధారనిలయశ్చ నః ॥**

ప్రహ్లాదాది మహాభక్తులు, ధార్మికులు ఈ జగత్తునకు ఆధారమైనవారు. వారందరకూ ఆధారమైనవాడు పరమేశ్వరుడు.

**ఆధారణాం నిలయః ఆధారనిలయః** ఈ జగత్తుకు ఆధారమైనవాడు.

పృథివ్యాది పంచభూతాలకు ఆధారమైనవాడు. జగత్తులోని సర్వజీవులకు ఆధారమైన వాడు. అందుకే శ్రీమన్నారాయణుడు 'ఆధారనిలయః' అనబడుతున్నాడు.

## 951. అధాతా

ఆధారము లేనివాడు.

తనకు మరియొక ఆధారము లేనివాడు. అన్నింటికీ తనే ఆధారమైనవాడు.

శంకర భగవత్పాదులవారు ఈ నామాన్ని 'అధాతా' అని వ్రాస్తే పరాశరభట్టరువారు 'ధాతా' అని వ్రాశారు.

**ధాతా :** నిర్వహించువాడు.

**స్వయం చ ధర్మాచార్యత్వాత్ దాతేతి పరికీర్త్యతే ॥**

తాను స్వయంగా ధర్మానికి ఆచార్యస్థానము అలంకరించేవాడు.

**దధా తీతి ధాతా** ధర్మానుష్ఠానము కోసము ఆచార్యస్థానము అలంకరించినవాడు.

## 952. పుష్పహాసః

పుష్పవికాసతుల్యుడు.

**స్వాత్మానుభవశక్తి నాం సాయం పుష్పవదస్యవై**
**హాసోఽస్తి భోగ్యతోల్లాసః పుష్పహాస ఇతిస్మృతః**

తనను అనుభవించటానికి తగిన శక్తి సామర్థ్యములను పుట్టించి, అటువంటి వారికి తన భోగ్యాతిశయములను సాయంకాలము వికసించు పుష్పములాగా ప్రకాశింపచేసేవాడు.

**పుష్పస్యేవహాసః యస్యసః పుష్పసః** తనను అనుభవించేవారికి వికసించిన పూలకుమల్లే తన భోగ్యతను ప్రకాశింపచేసేవాడు.

**పుష్పాణాం హాసః** ప్రపంచ రూపమున ఇతని వికాసము మొగ్గలుగా ఉన్న పుష్పముల నగవు వంటిది. ముందు మొగ్గగా ఉండి పుష్పము అయినట్లుగా, పరమాత్ముడు అవ్యక్త రూపం నుండి వ్యక్తమైన జగత్తుగా మారాడు.

## 953. ప్రజాగరః

మిక్కిలి మేలుకొని ఉండేవాడు.

**రాత్రిందినం ప్రజాగర్తి స స్యేష్విన కృషీవలః ।**
**భక్తేషు నితరాం యోఽసౌ ప్రజాగర ఇహోచ్యతే ॥**

వ్యవసాయదారుడు తన పంటలను కాపాడుకోవటానికి పగలు రాత్రి అనకుండా ఏ విధంగా జాగ్రత్తగా ఉంటాడో, అదే విధంగా పరమాత్మ కూడా తన భక్తులను రక్షించటానికి సర్వదా మేలుకొని ఉంటాడు.

**ప్రజాగర్తీ తి ప్రజాగరః** ఆశ్రితులను రక్షించటం కోసం సదా జాగరూకుడై ఉంటాడు.

**య ఏషుసుప్తేషు జాగర్తి కామంకామం పురుషోనిర్మిమాణః**

వీరందరూ నిద్రపోయినప్పుడు, వీరిని రక్షించటానికి తాను మేల్కొని ఉంటాడు.

**నిత్యప్రబుద్ధ స్వరూప సత్వాత్ ప్రకర్షేణ జాగర్తి**

స్వభావ సిద్ధంగానే జ్ఞానాన్ని పొంది ఉన్నవాడు. మిక్కిలి మెలుకువతో ఉండేవాడు.

## 954. ఊర్ధ్వగః

గొప్పవాడు.

**యోఽసౌ స్వాభావత స్తుంగః ఊర్ధ్వగః పరికీర్తితః**

సహజముగా గొప్పవాడు లోకోన్నతమైన స్వభావశీలుడు

**ఊర్ధ్వం గచ్ఛతీతి ఊర్ధ్వగః** సహజముగానే మహనీయుడు

**మహాత్మానాం సంశ్రయమభ్యుపేతః నైనావసీ దత్యతి దుర్గతోఽపి**

మహనీయుల నాశ్రయించినవాడు. ఎంత కష్టము వచ్చినా నశింపనివాడు.

**ఊర్ధ్వం గచ్ఛతి** అందరికన్నా, అన్నింటిలోనూ గొప్పవాడు.

## 955. సత్పథాచారః

సన్మార్గములో నడిపించేవాడు.

**సత్పథాచార ఇత్యుక్తః సన్మార్గే తత్ప్రవర్తనాత్** భక్తులను సన్మార్గంలో నడిపించేవాడు.

**సత్పథే ఆచారః యస్యసః సత్పథాచారః**

భక్తులు తనకు కైంకర్యము చేయటము అనే సన్మార్గములో ప్రవర్తింపచేసేవాడు.

**భగవద్గీత** 9వ అధ్యాయం **'రాజవిద్యా రాజగుహ్యయోగము'**లోని 33వ శ్లోకము

**కిం పునర్బ్రాహ్మణాః పుణ్యాభక్తా రాజర్ష యస్తథా ।**
**అనిత్యమసుఖం లోకమిమం ప్రాప్య భజస్వ మామ్ ॥**

ఈ పుణ్యాత్ములైన బ్రాహ్మణులు, రాజర్షులు, భక్తులు నన్ను శరణు పొందినట్లైతే వారు పరమపదము చేరతారు. మానవజన్మము క్షణభంగురము. సుఖరహితము. అయినప్పటికీ దుర్లభమైనది. కాబట్టి దీనిని పొంది, నిరంతరము నన్నే భజించవలసినది.

అనగా మానవజన్మ దుర్లభమైనది. సుఖాలు క్షణభంగురాలు. అందుచేత దుర్లభమైన మానవజన్మ పొంది అశాశ్వతమైన సుఖాలకు లోనుగాక శాశ్వత సుఖానిచ్చే పరమాత్మను సేవించవలసినది. సత్పురుషుల మార్గాన్ని అనుసరించేవాడు.

## 956. ప్రాణదః

ప్రాణమునిచ్చువాడు. ఆత్మను ఉద్దీపింపచేయువాడు. 65, 321, 408 నామాలు కూడా ఇవే.

**కాంతాది విషయవ్యాప్తా నష్టాత్మభ్యః కృపావశాత్ ।**
**సదాత్మో జ్జీవనం యోఽసా దదాతీ ప్రాణదస్మృతః ॥**

పరమేశ్వరుడు కడుదయామయుడు. కాబట్టి క్షుద్రమైనటువంటి సాంసారిక భోగాసక్తులై చెడిపోయిన జ్ఞానులకు ఆత్మోజ్జీవన మార్గము ఉపదేశించేవాడు.

**ప్రాణం దదాతీతి ప్రాణదః** విషయ వాసనలతో ఆత్మనాశనము పొందిన వారికి ఆత్మోజ్జీవనమిచ్చువాడు. ప్రాణాన్ దదాత్ – ప్రాణములనిచ్చువాడు.

## 957. ప్రణవః

ఓంకారము, ప్రణమిల్ల చేయువాడు. 409వ నామము కూడా ఇదే.

**ఆత్మోజ్జీవన సంబనం ఉద్భోధ ప్రణవే నవై ।**
**పాదారవింద మోస్త్రాస్య ప్రణామయతి నిత్యశః**
**ప్రణదన్న సమాఖ్యాతః సప్తార్ణో మోక్షదోమనుః ॥**

ప్రణవోపదేశం నుండి ఆత్మోజ్జీవన వరకు కావలసిన నవవిధ సంబంధ జ్ఞానము పుట్టించి, వారిని ఎల్లప్పుడు తన పాదాక్రాంతులుగ చేసికొన్నవాడు. ఈ నామము సప్తాక్షరీ మంత్రము. ముక్తి ప్రదము.

**ప్రణామయతీతి ప్రణవః** భక్తునికి తనకు అవినాభావ సంబంధముండటంచేత, అది వారికి తెలిపి, వారిని తన పాదాక్రాంతులుగా చేసుకొనువాడు.

## 958. పణః

శేషశేషీ భావము మారి ఉండువాడు.

**స్వాద్యు దాస్య వ్యతీహార వ్యవహారాత్పణ స్మృతః**

తాను శేషిగ, ఎల్లరు శేషభూతులుగ ఉండే సహజ స్వభావము తనభక్తుల విషయంలో తారుమారుగావించేవాడు. **పణతే ఇతి పణః** శేషశేషీభావము మారి ఉండేవాడు. అంటే భక్తులకు తాను దాసుడుగా ఉండేవాడు.

పరమేశ్వరుడు దృశ్య ప్రపంచములోని అన్ని రూపాలకు పేర్లుపెట్టి, వాటితో లోకంలో వ్యవహరిస్తున్నాడు. పుణ్యకర్మలన్నింటినీ పణముగా వెలగా తీసుకుని, దానికి తగిన ప్రతిఫలాన్ని ఆ కర్మలు చేసిన అధికారులకిస్తున్నాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'పణః' అనబడుతున్నాడు.

## 959. ప్రమాణం

విశ్వాసము కలిగించువాడు. 428వ నామము కూడా ఇదే.

**పరమార్థత్రయీసార ప్రత్యాయకతయా స్వయం**
**ప్రమాణమితి విఖ్యాతః సప్తార్ణో మనుర్త్తమః**

తన భక్తులకు వేదంలోని అర్థాన్ని ఉపదేసించి, వాటియందు విశ్వాసము కలుగచేయువాడు. ఈ నామము సప్తాక్షరీ మహామంత్రము. ఉత్తమమైనది.

**ప్రమీయతే అనేనేతి ప్రమాణమ్** సంశయములేకుండా వేదములయందు విశ్వాసము కలిగించువాడు. స్వతస్సిద్ధమైన యదార్థానుభవాత్మక జ్ఞానము. దీనిని ప్రమాణము అంటారు. ఇటువంటి జ్ఞానాన్ని కలిగించేవాడు.

## 960. ప్రాణనిలయః

ప్రాణములకు నిలయమైనవాడు.

**యస్మిన్నిత్యం ప్రతీయంతే ప్రాణాజీవాస్సదాఽగ్రజే**
**శకుంతా ఇవనీడేస్వే స ప్రాణనిలయస్మృతః**

పక్షులన్నీ తమ గూటిలో విశ్రమించేటట్లుగా ఇతర జీవులన్నీ తనయందే విశ్రమించి సుఖించునట్లు చేసేవాడు.

**ప్రణాః నిలీయంతే అస్మిన్నితి ప్రాణనిలయః** పక్షులు గూటిలో ఉన్నట్లుగా ఆత్మవర్గాన్ని అణచుకుని ఉండేవాడు.

ప్రాణములు అంటే ఇంద్రియాలు. ఎవరియందు లయమవుతాయో అతడు 'ప్రాణనిలయః' అనబడుతున్నాడు. అతడు సాక్షాత్తూ పరమేశ్వరుడే.

ప్రాణములను తనయందు ఉపసంహరించుకొనువాడు. అతడే శ్రీమన్నారాయణుడు.

## 961. ప్రాణభృత్

ప్రాణాలను పోషించేవాడు.

**ప్రాణాన్ భిభర్తి - పోషయతి అన్నరూపేణ**

అన్నరూపంలో తానుండి ప్రాణులను నిలుపుచు పోషించుచు ఉండేవాడు.

శంకర భగవత్పాదులు ఈ నామాన్ని 'ప్రాణభృత్' అని వ్రాయగా పరాశరభట్టరు వారు 'ప్రాణధృత్' అని వ్రాశారు.

**ప్రాణధృత్ :** ప్రాణములను రక్షించువాడు.

**తాన్మాతృతవ ద్ధారయతి ప్రాణధృత్ సస్మృతో బుధైః**

తనయందు లీనమయిన జీవులను తల్లిలాగా కాపాడువాడు.

**ప్రాణాన్ ధరతీతి ప్రాణధృత్** జగత్తులోని జీవరాశినంతటినీ తల్లివలె పోషించువాడు.

## 962. ప్రాణజీవనః

ప్రాణులను జీవింపచేయువాడు.

**జీవయత్యన్న వజ్జీవాన్ న ఉక్తః ప్రాణజీవనః**

అన్నపానాదులవలె అచేతనులకు తానే ధారక, పోషక, భోగవస్తువై వారిని కాపాడువాడు. **ప్రాణాన్ జీవయతీతి ప్రాణజీవనః** ప్రాణులకు జీవన హేతువుగా ఉండి జీవింప చేయువాడు.

ప్రాణములు అంటే - ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమాన వాయువులు. వీటిద్వారా జీవుల జీవింపచేయువాడు. **కఠోపనిషత్తు**లో చెప్పినట్లుగా మానవుడు

ప్రాణవాయువుతోగాని, అపానవాయువుతోగాని జీవించటం లేదు. ఈ రెండూ ఏ తత్త్వము నందు ఆశ్రయము పొంది ఉన్నాయో అటువంటి పరమాత్మ చేతనే జీవిస్తున్నాడు.

## 963. తత్త్వమ్

సారమైనవాడు, స్వభావము.

**సారాంశ భూతో జగతోయో౽సౌతత్త్వ మితి స్మృతః**

చేతనా చేతనాత్మకమైన సంసారానికి సారభూతమై ప్రకాశించేవాడు.

**తతో భావః తత్త్వమ్**

పాలు లేదా పెరుగు వీటిసారము మీగడ. అలాగే చిత్తు, అచిత్తు వీటికి సారమైనవాడు.

**పరమార్ధమశే షస్యజగతః ప్రభవాప్యయమ్**
**శరణ్యం శరణం గచ్ఛన్ గోవిందం నానసీదతి ॥**

సర్వరక్షకుడైన గోవిందుని శరణు పొందినవాడు దుఃఖింపడు. ఎందుచేతనంటే అన్ని జగత్తులకు ఉత్పత్తి స్థానమైనవాడు, లయస్థానమైనవాడు కూడా అతడు

శ్రీ మహావిష్ణువు అన్నింటియొక్క సారము. సకల లోకసారము కన్న శ్రీమహావిష్ణువే అధికుడు. దేశకాలవస్తు పరిచ్ఛేదము లేకుండా ఉండే పరబ్రహ్మతత్త్వము. అదే శ్రీమన్నారాయణ స్వరూపము.

## 964. తత్త్వవిద్

తత్త్వము నెరిగినవాడు.

**వేత్తి య స్స్వాత్మవస్తత్వం తత్త్వవి త్స చ కథ్యతే ॥** తన తత్త్వమును తాను ఎరిగినవాడు.

**తత్త్వము వేత్తీతి తత్త్వవిత్** తత్త్వము బాగా తెలిసినవాడు.

**స్వయమేవాత్మా నాత్మానం వేత్థత్వం పురుషోత్తమం** పురుషోత్తమా ! నిన్ను నీవే ఎరుగుదువు. **తత్త్వం – స్వరూపం యథావత్ వేత్తి** ఉన్నది ఉన్నట్లుగా తెలుసుకొన్నవాడు.

## 965. ఏకా౽౽త్మా

ఒకే పురుషుడు, ఒకే శేషి అగువాడు.

**శేషి భోక్తానిమావీచ ఏకశ్చిద చితోశ్చ యః**
**ఏకాత్మేతి స సప్తార్ణః సర్వప్రాణ ప్రదోమనుః**

చేతనాచేతనాలన్నింటికీ శేషి, భోక్త అయి నావి అనే అభిమానియై, అద్వితీయుడైనవాడు.

ఈ నామము సప్తాక్షరీ మహామంత్రము. దీర్ఘాయుః ప్రాప్తి **ఏకః ఆత్మా యస్యసః ఏకాత్మా** చేతనాచేతనములన్నింటికీ తానొక్కడే శేషి అయినవాడు.

మహాప్రళయం సంభవించినప్పుడు జగత్తంతా లయమయిపోతుంది. అప్పుడు మిగిలేది శ్రీమన్నారాయణుడొక్కడే. అందుకే అతడు 'ఏకాత్మా' అనబడతాడు. ప్రళయ కాలంలో జగత్తంతా అతనిలో లీనమైపోతుంది. చివరకు మిగిలేది ఆ పరమేశ్వరుడు ఒక్కడే. అందుచేతనే అతడు ఏకాత్మా అనబడుతున్నాడు.

**ఐతరేయోపనిషత్తు**లో "సృష్టి ప్రారంభం కాకముందు ఈ జగత్తంతా పరమేశ్వర తత్త్వము ఆవరించి ఉండేది. ఆ తరువాత అది లోకాలను సృష్టించాలి అనుకున్నది" అని చెప్పబడింది. **బృహదారణ్యకోపనిషత్తు**లో "సృష్టి ఆరంభానికి ముందు జగత్తంతా శూన్యంగా ఉండేది. ఆ మహాశూన్యాన్ని పరమేశ్వర తత్త్వము ఆవరించి ఉండేది." అని చెప్పబడింది. అదే ఆత్మ. అదే పరబ్రహ్మ.

## 966. జన్మమృత్యుజరాతిగః

ముసలితనము, జనన మరణాలు లేనివాడు.

**చిదచిద్ధర్మ హీనో యః జన్మమృత్యుజరాతిగః** జనన మరణాలు అనే స్వభావాలు లేనివాడు.

**జన్మచ మృత్యుశ్చ జరా చ జన్మమృత్యుంజరా తాః**
**అతిగచ్ఛ తీతి జన్మమృత్యు జరాతిగః**

చేతనాచేతన ధర్మాలయినటువంటి జనన మరణాలు లేనివాడు. ముసలితనము లేనివాడు. పరమేశ్వరుడు ఆది మధ్యాంతరహితుడు. జనన మరణాలు లేనివాడు. మానవ దేహానికి జనన మరణాలున్నాయి. జననమున్న ప్రతిదానికీ మరణమున్నది. కాని పరమేశ్వరునకు అసలు జన్మమే లేదు. అందుచేత మరణము కూడా ఉండదు. అతడు అవ్యక్త రూపుడు.

## 967. భూర్భువఃస్వస్తరుః

ముల్లోకాలయందు నివశించు ప్రాణికోటికి ఆధారమైనవాడు.

**భూరాదిభిర్లక్షితానాం జీవానాం యస్సమాశ్రయః ।**
**భూర్భువస్స్వస్తరు స్సస్యాత్ దశార్ణ స్సర్వదోమనుః ॥**

ముల్లోకములలోని (భూలోక, భువర్లోక, సువర్లోకములు) వారందరికీ, పక్షులకు వృక్షము ఆశ్రయమైనట్లుగా తాను ఆశ్రయమైనవాడు. ఈ నామము దశాక్షరీ మంత్రము. అధిక ఫలప్రదము.

**సమాశ్రితాత్ బ్రహ్మతరోనంతాత్ నిస్సంశయః పక్వఫలప్రపాతః**

బ్రహ్మము అనే వృక్షాన్నాశ్రయించినట్లైతే పక్వమయిన ఫలము పడి తీరుతుంది.

భూః, భువః, సువః అనేవి మూడు వ్యాహృతులు. ఈ వ్యాహృతిత్రయము – త్రిలోకాలకు ప్రతీక.

భూః – భూలోకము

భువః – భువర్లోకము

సువః – సువర్లోకము

భూర్భువస్వ స్తరు – ముల్లోకాలకు చెట్టువంటివాడు.

ముల్లోక వాసులకు పక్షులకు వృక్షములాగా ఆధారమైనవాడు. ఆవాసమైనవాడు.

ముల్లోకాలను వృక్షములాగా వ్యాపించి ఉన్నవాడు.

## 968. తారః

తరింపచేయువాడు. 338వ నామము కూడా ఇదే.

**సంసారతారణాత్తేషాం తారస్యా త్ప్రాణినాం సదా ॥**

సంసార సాగరమునుంచి ప్రాణులను ఒడ్డెక్కించువాడు.

**తారయతీతి తారః** సంసారార్నవమున మునిగిపోయిన వారిని ఉద్ధరించువాడు.

పరమేశ్వరుని అనుగ్రహం గనక ఉన్నట్లైతే భక్తులు సంసార సాగరం నుంచి రక్షింపబడతారు. తార అనగా ప్రణవము అని అర్థము. పరమేశ్వరుడు ప్రణవ స్వరూపుడు.

## 969. సవితా

సృష్టించువాడు.

884వ నామము కూడా ఇదే.

**సాక్షాజ్జనయితా యోఽసౌ సర్వస్య సవితాస్మృతః** జగత్తులో సకల జీవులను సృష్టించినవాడు.

**సూతే ఇతి సవితా** ఋగ్వేదంలో ఇతడు చాలాసార్లు చెప్పబడ్డాయి. ఇతని అవయవాలు, సామగ్రి అంతా బంగారుమయము. ఈ దేవత హిరణ్మయుడు. బంగారు కనులు, బంగారు చేతులు, బంగారు నాలుక గలవాడు. పెద్దపెద్ద చేతులు గలవాడు. పసుపు పచ్చని జుట్టు గలవాడు. పసుపు గోధుమరంగులు కలసిన కవచం ధరించినవాడు. బంగారు రథం మీద లోకాలను చూసి వస్తుంటాడు. ఈ రథానికి కాడిని కట్టే కఱ్ఱ కూడా బంగారపుదే. ఈయన గుఱ్ఱాలు తెల్లనివి. ఈయన బంగారుమయమైన కాంతిని సర్వత్రావ్యాపింపచేస్తాడు. ఆయన చేతులు ఆకాశం అంచులదాకా వ్యాపిస్తాయి. వాటితో అందరినీ నిద్రలేపి అనుగ్రహిస్తాడు. సూర్యునికాంతి వంటి కాంతి గలవాడు. తూర్పున ఉదయించేవాడు. చరాచర జగత్తును సృజించినవాడు.

**సూతే సర్వలోకమ్ – జనకః ఇవ**

తండ్రిగా సర్వలోకాలను సృష్టించినవాడు. లోకాలకు కన్న తండ్రి పరమేశ్వరుడు.

## 970. ప్రపితామహః

బ్రహ్మదేవుని తండ్రి

**పితామహస్య జనకః ప్రపితా మహ ఉచ్యతే** పితామహుడైన బ్రహ్మదేవుని సృజించిన వాడు. **ప్రకృష్టః పితామహః ప్రపితామహః** బ్రహ్మదేవుడికి పితామహుడు అని పేరు. అతనిని సృష్టించినవాడు కాబట్టి పరమేశ్వరుడు ప్రపితామహుడు అనబడతాడు. తాతకు తండ్రి ముత్తాత.

## 971. యజ్ఞః

యజ్ఞస్వరూపుడు. 445వ నామము కూడా ఇదే.

**జపయజ్ఞస్వరూపత్వాత్ తస్మాద్యజ్ఞ పతి స్మృతః**

యజ్ఞములలో జపయజ్ఞమైనవాడు. తనను ఆరాధించేవారికి తానే యజ్ఞరూపమైన వాడు. **భగవద్గీత** 10వ అధ్యాయము **'విభూతియోగం'**లోని 25వ శ్లోకము.

**మహర్షీణాం భృగురహం గిరామస్యేకమక్షరమ్**

**యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి స్థావరాణాం హిమాలయః ॥**

మహర్షులలో భృగువును నేను. శబ్దములలో ఓంకారము నేను. యజ్ఞములందు జపయజ్ఞము నేను, పర్వతములందు హిమాలయమును నేను.

యజ్ఞరూపంలో ఉండేవాడు ఆ పరమేశ్వరుడే. యజ్ఞోవైవిష్ణుః యజ్ఞము సాక్షాత్తూ విష్ణు స్వరూపమై ఉన్నది.

**లలితా సహస్రం**లో 769వ నామము 'యజ్ఞరూపా'

## 972. యజ్ఞపతిః

యజ్ఞమునకు పతి.

**యజ్ఞస్య ఫలదో యస్మాత్ తస్మాద్యజ్ఞ పతిస్మృతః**

సకల యజ్ఞములకు అధిపతి అతడే. ఫలప్రదాత కూడా అతడే.

**యజ్ఞస్యపతిః** యజ్ఞము చేసేవారికి ఆ యజ్ఞఫలము నిచ్చేవాడు. యజ్ఞపతి - యజ్ఞమును రక్షించువాడు.

**భగవద్గీత** 9వ అధ్యాయం **'రాజవిద్యారాజగుహ్యాయోగం'**లోని 24వ శ్లోకము

**అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభు రేవ చ ।**
**న తు మామభిజానంతి తత్త్వే నాఽతశ్చ్యవంతి తే ॥**

సకల యజ్ఞములకు భోక్తను నేను. స్వామిని కూడా నేనే నా పరమేశ్వర తత్త్వము తెలియనివారు పునర్జన్మ పొందుతారు.

## 973. యజ్వా

యజ్ఞమును అనుష్ఠించువాడు. యజ్ఞకర్త.

**అశక్తం తు స్వయం యష్టా తం యజ్వేతి ప్రచక్షతే ॥**

తన ఆరాధనా రూపమైన యజ్ఞము చేయజాలని వారి కోసం తానే యజ్ఞము చేయువాడు. యజ్ఞము చేసే యజమాని రూపమైనవాడు.

**లలితా సహస్రం**లో 88వ నామము 'యజ్ఞకర్త్రీ'

## 974. యజ్ఞాంగః

యజ్ఞమును అంగములుగా గలవాడు.

**శేషశ్శక్త కృతో యజ్ఞోఽవ్యస్య యజ్ఞాంగ ఉచ్యతే ॥**

శక్తిమంతులు ఆచరించే యజ్ఞాలన్నీ తాను ఆచరించే యజ్ఞానికి లోబడి ఉండేటట్లు చూసేవాడు.

**యజ్ఞః అంగమే యస్యసః యజ్ఞాంగః**

భక్తులు చేసే యజ్ఞాలన్నీ తాను చేసే యాగానికి అంగములుగా గలవాడు.

యజ్ఞంలో ఉపయోగించే వేదమంత్రాలు, అగ్ని, దర్భలు, ఆజ్యము. ఇవన్నీ పరమేశ్వరుని రూపమే. అందుచేతనే అతడు 'యజ్ఞాంగః' అనబడుతున్నాడు.

'యజ్ఞము విష్ణు స్వరూపము' దీన్ని గతంలో వివరించాం.

## 975. యజ్ఞవాహనః

యజ్ఞము నిర్వహించేవాడు.

**తేషాం శ్రద్ధాధికారాది దానాత్యా ద్యజ్ఞవాహనః** భక్తులు యజ్ఞములు చెయ్యటానికి కావలసిన శ్రద్ధ, అధికారము, సంపద మొదలైన వాటిని ఇచ్చువాడు.

**యజ్ఞం వాహయతీతి యజ్ఞవాహనః** భక్తులకు యజ్ఞం చెయ్యాలనే భక్తి శ్రద్ధ కలిగించువాడు. ఫలహేతువులైన యజ్ఞములు వాహనములుగా గలవాడు.

## 976. యజ్ఞభృత్

యజ్ఞము పూర్తి చేసేవాడు.

**పూర్ణాహుతి స్వస్మృతిభ్యాం విఫలం యజ్ఞమ పృత**
**పుష్ణాతి యజ్ఞభృత్స స్యాత్ సప్తార్ణో మను రుత్తమః**

యజ్ఞము చేసేటప్పుడు ఏదైనా లోపం జరిగినప్పటికీ, తనను తలచి పూర్ణాహుతి చెయ్యటం చేత ఆ యజ్ఞము యొక్క ఫలితం పూర్తిగా ఇచ్చేవాడు.

ఈ నామము సప్తాక్షరీ మహామంత్రము. ఉత్తమమైనది.

**యజ్ఞం భిభర్తీతి యజ్ఞభృత్** యజ్ఞం చెయ్యటంలో లోపాలు జరిగినప్పటికీ, తనను తలచినట్లైతే వాటిని నశింపచేసి యజ్ఞఫలాన్నిచ్చేవాడు.

**ప్రమాదాత్ కుర్వతాం కర్మ ప్రచ్యవత్యధ్వరేషుయత్**
**స్వరణాదేవ తద్విష్ణోః సంపూర్ణం స్యాదితిశ్రుతి**

యజ్ఞ నిర్వహణలో ఏవైనా దోషాలు దొర్లినప్పటికీ, అవి విష్ణు సంస్మరణ వలన తొలగిపోయి యాగము సంపూర్ణమవుతుంది అని వేదం చెబుతోంది.

**యజ్ఞం భిభర్తి** యజ్ఞమును ధారణచేయువాడు. యజ్ఞమును రక్షించువాడు.

## 977. యజ్ఞకృత్

యజ్ఞము సృష్టించినవాడు.

**జగద్ధి తాయ కృతవాన్ యజ్ఞమాదౌ స యజ్ఞకృత్**

లోకహితం కోసం సృష్టికాలమందే యజ్ఞమును కూడా సృష్టించినవాడు.

**యజ్ఞం కరోతి సృజతీతి యజ్ఞకృత్**

లోకాలకు మేలు చెయ్యటంకోసం సృష్ట్యారంభంలోనే యజ్ఞాన్ని సృష్టించినవాడు.

**యజ్ఞం కరోతి-కృతంతివా** జగత్తుయొక్క ఆదియందు అంతమందుకూడా యజ్ఞము ఆచరించేవాడు. ప్రళయకాలంలో యజ్ఞమును ప్రవర్తిల్లకుండా చేసేవాడు.

## 978. యజ్ఞీ

యజ్ఞముచే ఆరాధించబడువాడు.

**యస్సర్వేషాం తు యజ్ఞానాం శేషీ యజ్ఞీతి కథ్యతే**

సకల యజ్ఞములకు తానే ప్రభువైనవాడు.

**యజ్ఞం అస్యాస్తీతి యజ్ఞీ** అన్ని యజ్ఞములచేత ఆరాధించబడేది శ్రీమన్నారాయణుడే.

**యజ్ఞాః అస్యాసంతి** యజ్ఞములు ఇతని సొత్తులు. యజ్ఞములన్నింటికీ పరమాత్ముడే యజమాని.

## 979. యజ్ఞభుక్

యజ్ఞ రక్షకుడు.

**భుంకేతాన్వా భోజయతి యజ్ఞ భుక్స చ కథ్యతే** యజ్ఞము యొక్క భోక్తతానై ఉండి, యజ్ఞకర్తకు ఆ ఫలమునిచ్చి అనుభవింప చేసేవాడు.

**యజ్ఞాన్ భుంక్తే ఇతి యజ్ఞభుక్** యజ్ఞములకు కలిగే విఘ్నాలు తొలగించి వాటిని రక్షించువాడు. యజ్ఞ రక్షకుడైన శ్రీమన్నారాయణుడు.

## 980. యజ్ఞసాధనః

యజ్ఞములు సాధనముగా గలవాడు.

**జ్ఞానైశ్వర్యాసిద్ధ్యుపాయో యస్స సాద్యజ్ఞసాధనః**

యజ్ఞము జ్ఞానాన్ని కలుగచేసి పరమపదమును పొందింపచేసే సాధనముగా శాసించినవాడు. **యజ్ఞాః సాధనాని యస్యసః యజ్ఞసాధనః** జ్ఞానాన్ని కలిగించి, దాని మూలంగా తనను పొందేటట్లుగా చేసేవాడు. పరమాత్మునిచేరటానికి యజ్ఞాలు సాధనాలు.

## 981. యజ్ఞాంతకృత్

యజ్ఞానికి సిద్ధాంతము చేసేవాడు.

**సమాప్తిం చైవ యజ్ఞానాం స్వతత్త్వజ్ఞానతః క్షణాత్**
**నిరపేక్షణ యః కరోతి స యజ్ఞాంత కృదుచ్యతే ॥**

యజ్ఞం చేసినదానికి ఫలితము - వెంటనే "సాక్షాత్తు శ్రీమన్నారాయణుని తెలుసుకోవటమే" అనే సిద్ధాంతము నెలకొల్పినవాడు.

**యజ్ఞ స్య అంతం కరోతీతి యజ్ఞాంతకృత్** యజ్ఞం చేసేది పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుని తత్త్వం తెలుసుకోవటానికే అని సిద్ధాంతీకరించినవాడు. **భగవద్గీత**లోని నాల్గవ అధ్యాయం **'కర్మసన్యాసయోగం'**లోని 33వ శ్లోకం.

**శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరంతప**
**సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే ॥**

అర్జునా ! ద్రవ్యమయ యజ్ఞం కన్న జ్ఞానయజ్ఞము మిక్కిలి శ్రేష్ఠమైనది. కర్మలన్నీ జ్ఞానమందే పరిసమాప్తి అవుతాయి.

యజ్ఞాంతము అంటే యజ్ఞఫలము. దానిని ఇచ్చేవాడు శ్రీమన్నారాయణుడు.

## 982. యజ్ఞగుహ్యామ్

యజ్ఞము యొక్క రహస్యమైనవాడు.

**య స్తర్పయతి యజ్ఞేషు నిత్యతృప్తో స్య తృప్తవత్**
**పురోడాశాదికం భుక్త్వా తృప్యత్యనా న్విశేషతః**
**తద్యజ్ఞవిధి గత్యాది విదఏవ విదంతి హి**
**స స్థూలబుద్ధయ స్తస్మాత్ యజ్ఞగుహ్యామితి స్మృతః**

తాను తృప్తుడై, హవిస్సును, యజ్ఞద్రవ్యాలను అతి ఆదరముతో తీసుకుని వాటివల్ల పరితృప్తుడై యజ్ఞము చేసిన వారిని కూడా తృప్తి పొందిస్తాడు. ఈ విషయము జ్ఞానులకు గాని అజ్ఞానులకుగాని ఎవరికీ తెలియకుండా రహస్యంగా ఉంచుతాడు.

**యజ్ఞస్య గుహ్యమ్ యజ్ఞగుహ్యమ్** పరమేశ్వరుడు నిత్యతృప్తుడు. కాని యజ్ఞంలో హవిస్సును గ్రహించి సంతుష్ఠాంతరంగుడై యజ్ఞకర్తకు కూడా మంచి ఫలితమునిస్తాడు. ఈ విషయము అత్యంత గోప్యము.

## 983. అన్నమ్

అనుభవించబడువాడు.

**ఏవం నిష్టారితానంత భోకృశక్తి సమన్వితైః**
**భుజ్యతే య సదాకాలం సోఽ న్న మిత్యుచ్యతే బుధైః**

ఈరకంగా భగవంతుని అనుగ్రహంతో అవిచ్ఛిన్నమైన భోక్త శక్తిని పొందిన భక్తులచేత నిరంతరము అనుభవింపబడువాడు.

**అద్యతే ఇత్యన్నమ్** తనను అనుభవించే శక్తిని సంపాదించే వారికి అన్నములాగాధారకముగా ఉండేవాడు. భక్తులచేత అన్నములాగా అనుభవించబడేవాడు.

**ఆద్యతే భూతైః - అత్తి భూతాని** ప్రాణులచే తినబడును. ప్రాణులను తినును. అటువంటి అన్నము పరమాత్మ స్వరూపమే.

## 984. అన్నాదః

తనను అనుభవించే వారిని తాను అనుభవించువాడు.

**య ఆదత్తే తథా భుంకే స్వయం సోఽన్నాదఈరితః**

భోగ్యమైన భక్తులను అన్నములాగా ప్రేమతో అన్నములాగా పరిగ్రహించి అనుభవించేవాడు.

**అన్నమ్ అత్తీతి అన్నాదః** తన భక్తులను తాను అనుభవించువాడు.

అన్నమును భక్షించువాడు. జగత్తును ఆహారముగా గ్రహించువాడు. భక్తులయొక్క భక్తి, ప్రేమలను భక్షించువాడు.

## 985. ఆత్మయోనిః

తనతో చేర్చుకొనువాడు. జగత్తుకు మూలకారణము.

**భోక్తారమాత్మానాం నిత్యం యో యజయతి సర్వదా**
**ఆత్మయోని స్వచైవోత్తో వస్వర్ణ స్సుఖభోగదః**

జ్ఞానులను అన్నములాగా అనుభవించటానికి అన్నమువలె తనతో చేర్చుకొనువాడు. ఈ నామము అష్టాక్షరీమంత్రము. అవిచ్ఛిన్నమైన సంసారసుఖాన్నిస్తుంది.

**ఆత్మానంయాతీతి ఆత్మయోనిః** పాలలో పంచదారను కలిపినట్లుగా తనను అనుభవించే వారిని తనతో చేర్చుకొనువారు. యోని అనగా – జన్మస్థానము. ఆత్మ – పరమాత్ముడు. ఆ పరమేశ్వరుడే జగదుత్పత్తికి మూలకారణము.

## 986. స్వయం జాతః

తనకు తానే అవతరించినవాడు.

**జాతో యోఽసౌ స్వయంజాతః ప్రార్థనావ్య న పేక్షయా**

ఎవరూ ప్రార్థించవలసిన అవసరం లేకుండా తానే స్వయముగా ధర్మరక్షణ కోసం అవతరించేవాడు. ఇతరుల ప్రార్థనలతో నిమిత్తం లేకుండా, తనంత తానుగా అవతరించేవాడు.

ఇతర కారణాలు ఏవీ లేకుండా తనకు తానుగా అవతరించేవాడు.

## 987. వైఖానః

దుఃఖాన్ని తొలగించువాడు. మిక్కిలిగా త్రవ్వినవాడు.

**జనిత్వా భవదుఃఖం యో వివిధం ఖనతి స్వతః**

**వైఖాన స్సచ నిర్దిష్టః సప్తార్ణోఽఖిలదుఃఖహా ॥**

ఈరకంగా అవతరించి సంసారంలో కలిగే దుఃఖాలను పెళ్లగించి పారేస్తాడు. ఈ నామము సప్తాక్షరీ మంత్రము. సమస్త దుఃఖనాశనము.

**వైఖాన యతీతి వైఖానః ఏవ వైఖానః** ఈరకంగా అవతరించి భక్తులయొక్క సంసారదుఃఖాలను చీల్చి చెండాడేవాడు. శ్రీమన్నారాయణుడు వరాహరూపంలో భూమిని బాగా త్రవ్వి హిరణ్యాక్షుని సంహరించాడు.

## 988. సామగాయనః

సామమును గానము చేయువాడు.

**స్వప్రాప్తి మధుపానేన నిరతస్సామగీతిషు**

**నిత్యముక్తా స్యంతియస్య స ఉక్తసామగాయనః**

తన అనుభవము అనే మధుపానము చేత మధించినవాడై, నిరంతరము సామగాన నిమగ్నులైన నిత్యముక్తులు గలవాడు.

**సామాని గాయంతీతి సామగాయనాః తే అస్య సంతీతి సామగాయనః**

సామగానము చేసే ముక్తులు గలవాడు. యజ్ఞములందు సామగానము చేసేవాడు శ్రీమహావిష్ణువు. సామమంత్రములచే గానము చేయబడువాడు.

# 989. దేవకీనందనః

దేవకీపుత్రుడు.

**దేవక్యాస్తనయత్వేన పరావస్థ ప్రజజ్ఞివాన్**
**వాత్సల్యాద్ధనరో యోఽసౌ దేవకీ నందనస్మృతః**

తాను పరాత్పరుడై ఉండి కూడా వాత్సల్యము మొదలైన గుణాలతో అత్యంత పరతంత్రుడై దేవకి అష్టమగర్భాన అవతరించినవాడు.

**దేవక్యాః నందనః దేవకీనందనః** అటువంటి గొప్ప వైభవముగలవాడు దేవకీపుత్రుడు.

**యఏషపృథుదీర్ఘాక్షయః సంబంధీతేజనార్దనః**

విశాలమైన నేత్రములు కలిగి నీకు బంధువైనవాడు జనార్దనుడే.

**ఏషభూతం భవిష్యచ్చ భవచ్చ భరతర్షభ**

యుధిష్ఠిరా ! భూతభవిష్యద్వర్తమానాలు కల సకల పదార్థములు ఇతడే. (జనార్దనుడే)

**జ్యోతీంషి శుక్రాణి చ యానిలోకేత్రయోలోకా లోకపాలా స్త్రయీచ**
**త్రయోఽగ్న యశ్చాహుత యశ్చ పంచసర్వే దేవదేవకీపుత్ర ఏవ**

లోకములోని సూర్యచంద్రులు, త్రికోణములు, లోకపాలకులు, వేదత్రయము, అగ్నిత్రయము, సకల దేవతలు, సర్వమూ దేవకీనందనుడే.

# 990. స్రష్టా

సృజించువాడు. 588వ నామము కూడా ఇదే.

**పరావస్థాం ప్రపన్నోఽసౌ స్రష్టేతి ప్రజనాత్స్మృతః**

పరావస్థలో ఉండి సకల లోకాలను సృజించువాడు.

**సృజతీతి స్రష్టా** పరమేశ్వరుడై ఉండి లోకాలను సృష్టి చేసినవాడు. చరాచరజగత్తును సృష్టించినవాడు.

## 991. క్షితీశః

భూమికి ప్రభువు.

**భూభారక్లేశహారీ యః క్షితీశ స్స చ కథ్యతే ॥** భూభారాన్ని తీర్చేవాడు.

**క్షిత్యాః ఈశః క్షితీశః** పరమేశ్వరుడు విభిన్నమైన అవతారాలలో భూభారాన్ని తగ్గించాడు. కాబట్టి క్షితీశః అనబడుతున్నాడు. భూమికి ప్రభువు. దశరథ నందనుడు.

## 992. పాపనాశనః

పాపములు నశింపచేయువాడు.

**దేవకీతనయత్వేఽపి ప్రసన్నానాం విశేషతః**
**బాహ్యాంతశ్శతృసంహారీ యస్సస్యాత్పాపనాశనః ॥**

దేవకీనందనుడుగా జన్మించినప్పటికీ తన భక్తుల యొక్క బాహ్యాశత్రువులైన కంసాది రాక్షసులను, అంతఃశ్శత్రువులైన అరిషడ్వర్గాలను నాశనము చేసినవాడు.

**పాపంనాశయతీతి పాపనాశనః** వెన్నదొంగతనము, రాసక్రీడ, గోపికావస్త్రాపహరణము మొదలైన అవతారచేష్టలను అనుభవించే భక్తులయొక్క పాపాలను నాశనం చేసినవాడు.

పాపములు నశింపచేయువాడు. తనను పూజించేవారు, ధ్యానించేవారు, కీర్తించేవారు అయిన భక్తుల పాపములను నశింపచేసి వారిని ఉద్ధరించినవాడు.

**పక్షోపవాసాద్యత్పాపం పురుషస్య ప్రణస్యతి**
**ప్రాణాయామశతేనైవ తత్పాపం నశ్యతే నృణామ్**
**క్షణమాత్రేణ తత్పాపం హరేర్ధ్యానాత్ప్రణస్యతి**

పదిహేను రోజులు ఉపవాసం చేస్తే పోయే పాపము వంద ప్రాణాయామాలు చేస్తే పోయే పాపము ఇదంత ఒక్క క్షణం హరినామస్మరణ చేస్తే నశించిపోతుంది. అందుకే శ్రీమన్నారాయణుడు 'పాపనాశనః' అనబడుతున్నాడు.

## 993. శంఖభృత్

పాంచజన్యము అను శంఖమును పోషించువాడు.

**శంఖభృ త్పరమైశ్వర్య లక్షణాయుధ ధారణాత్**

నవనిధులలో శంఖనిధి ఒకటి. ఇది పరమైశ్వర్య సూచకము. శుభప్రదము. అటువంటి శంఖమును ఎల్లవేళలయందు ధరించి ఉండువాడు.

**శంఖంబి భర్తీతి శంఖభృత్** పరమైశ్వర్య చిహ్నమైన పాంచజన్యము అనే శంఖాన్ని అధరామృతముతో పోషించువాడు. అహంకారరూపమైన శంఖమును ధరించువాడు.

## 994. నందకీ

నందకము అనే ఖడ్గాన్ని ధరించినవాడు.

**నంద్యాన్మాయమ మి త్వేవం ప్రార్థ్యోభగవతాపి యః**

**సనందకో నిత్య యోగీ యస్యాసౌ నందకస్మృతః ॥**

పరమేశ్వరుని సన్నిధిని ప్రాప్తింపచేసే నందకము అనే దివ్యఖడ్గాన్ని ధరించినవాడు.

**నందక అస్యాస్తీతి నందకీ ॥** శ్రీమన్నారాయనుడు కూడా 'ఇది నన్ను సంతసింపచేయగలదు' అని ప్రార్థింపదగి ఉండటంచేత నందకమను పేరుగల ఖడ్గాన్ని ధరించినవాడు.

**విద్యామయః నందకాఖ్యః అసి అస్య**

ఇతడికి తత్త్వజ్ఞానరూపమయిన నందకము అనే ఖడ్గము గలదు.

## 995. చక్రీ

సుదర్శనమను చక్రము గలవాడు. 908వ నామము కూడా ఇదే.

**సర్వ రక్షోఽ సురచ్ఛేత్తా నిత్యం చక్రేణ యోగతః**

**చక్రీతి కథ్యతే సమ్యక్ ఋత్వర్ణ శత్రునాశకః ॥**

రాక్షససంహారంచేసి లోకాలను రక్షించటంకోసం సుదర్శనమనే చక్రాయుధాన్ని ధరించినవాడు. ఈ నామము షడక్షరీమహామంత్రము శత్రుసంహారి.

**చక్రం అస్యాస్తీతి చక్రీ** తన భక్తులైన దేవతల శత్రువులగు రాక్షసుల రక్తముచే తడిసిన తేజోవంతమైన సుదర్శనచక్రము చేతియందు ధరించినవాడు.

**నమస్తత్త్వాత్మకం సుదర్శ నాఖ్యం చక్రం అస్య అస్తి**

మనస్తత్త్వాత్మకమైన సుదర్శనము అనే చక్రాయుధమును ధరించినవాడు.

**స్వాజ్ఞయా పరివర్తమానం సంసార చక్రం అస్య అస్తి**

తన ఆజ్ఞచే గిరగిరా తిరిగే సంసారచక్రము అధీనమునందు గలవాడు.

## 996. శార్ఙ్గధన్వా

శార్ఙ్గమనే ధనుస్సు గలవాడు.

**శార్ఙ్గాఖ్యం ధనురప్యేతి శార్ఙ్గధన్వాప్రకీర్తితః ॥**

'శార్ఙ్గము' అనే పేరుగల ధనుస్సును ధరించినవాడు.

**శార్ఙ్గామ్ ధనుః యస్యసః శార్ఙ్గధన్వా**

శరపరంపరచేత శత్రుసేనల తుత్తినియలు చేయగల శార్ఙ్గమనే ధనుస్సు గలవాడు.

**ఇంద్రియాద్యహం కారాత్మకం శార్ఙ్గం నామ ధనుః**

ఇంద్రియాది అహంకారము రూపమైన శార్ఙ్గమను ధనువును ధరించినవాడు.

## 997. గదాధరః

కౌమోదకి అనేగదను ధరించినవాడు.

**కౌమోదకీ ధారణా చ్చ గదాధర ఇతీరితః** కౌమోదకి అనే గదను ధరించినవాడు.

**గదాంధారయతీతి గదాధరః** గిరగిరాత్రిప్పునపుడు ప్రళయాగ్నిలాగా నిప్పులు క్రక్కే కౌమోదకి అనే గదను ధరించినవాడు.

**బుద్ధి తత్త్వాత్మికాం కౌమోదకీం నామగదాధరతి**

బుద్ధితత్త్వరూపమగు కౌమోదకి అనే గదను ధరించినవాడు.

## 998. రథాంగపాణిః

చక్రము ధరించి ఉండువాడు.

**యథోచితం రథాంగం చ పాణౌ యస్యాస్తి నిత్యశః**
**రథాంగపాణి రాఖ్యాతో నవార్ణో భయనాశకః ॥**

తనకు తగినట్లుగానే ప్రకాశించే చక్రము చేతియందు గలవాడు.

**రథాంగమ్ పాణౌ యస్యసః రథాంగపాణిః** ఎల్లవేళలయందు ప్రకాశించు చక్రము గలవాడు. రథాంగమయిన చక్రము ఈతని చేతియందు గలవాడు.

## 999. అక్షోభ్యః

జయింపలేనివాడు. 801వ నామము కూడా ఇదే.

**అభయ ప్రదాన నియమ దార్ఢ్యారపిచ నిత్యశః**
**అచాల్య స్స్వమహిమ్నాపి హ్యక్షోభ్యః ఇతికీర్తితః ॥**

తను ఆశ్రయించిన వారిని రక్షించటము అనే దీక్షపూని, ఎన్ని ఆటంకములు వచ్చినా చలించనివాడు. మహామహిమోపేతుడు కాబట్టి శ్రీమన్నారాయణుడు అక్షోభ్యః అనబడుతున్నాడు.

**నక్షోభ్యః అక్షోభ్యః** శరణాగతులకు అభయమిచ్చి రక్షించేవాడు.

ఇతడు రథాంగపాణి కాబట్టి ఇతనిని కలవరపెట్టటమనేది ఎవరికీ సాధ్యంకాదు. ఎవరిచేతా క్షోభింపబడడు. శరణాగతులకు అభయ ప్రదానంచేసి శత్రువులను తనే క్షోభింపచేస్తాడు. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'అక్షోభ్యః' అనబడుతున్నాడు.

## 1000. సర్వప్రహరణాయుధః

అన్నిరకాలైన ఆయుధములు ధరించినవాడు.

**పాదమూలం ప్రసన్నానాం భక్తానాం చాపి నిత్యశః ।**
**అసంఖ్యేయాన్య మర్యాద సామర్థ్యా న్యాత్మన స్సదా ॥**

**సర్వత్ర సర్వదా సర్వ ప్రకారాశ్రిత రక్షణే ।**
**దీక్షితాన్య చితాన్యన్యా న్యనంతా న్యాయుధాని హి ॥**

**యస్య సంతి స వై నిత్యం సర్వ ప్రహరణాయుధః ।**
**ద్వాదశార్ణో మహామంత్రః సర్వదుఃఖ వినాశకః ॥**

తన శరణార్థుల కష్టములను తీర్చువాడు, లెక్కకు మించిన ఆభరణములు, శక్తివంతమైన ఆయుధములు ధరించినవాడు, ఆశ్రిత రక్షణ అనే దీక్షగలవాడు, సకలైశ్వర్య సంపన్నుడు అయిన శ్రీమన్నారాయణుడు అన్ని రకాల ఆయుధములు ధరించి ఆశ్రితులను రక్షిస్తున్నాడు. ఈ నామము ద్వాదశాక్షరీ మహామంత్రము. సకల దుఃఖములను హరిస్తుంది.

**సర్వేషాం ప్రహరణాని సర్వప్రహరణాని ।**
**ఆయుధాని అస్యసః సర్వప్రహరణాయుధః ॥**

తనని ఆశ్రయించిన భక్తుల కష్టాలు తీర్చటానికి శ్రీమన్నారాయణుడు అన్ని రకాల ఆయుధాలను ధరించి ఎల్లవేళలా సిద్ధంగా ఉంటాడు.

ఇతని ఆయుధములు ఇవి అని చెప్పటానికి లేదు. శత్రుసంహారం చెయ్యటానికి ఎన్ని రకాల ఆయుధాలుంటాయో, అన్నీ ఇతని దగ్గర ఉన్నాయి. చేతులతో పట్టుకునే ఆయుధాలే కాదు, నరసింహావతారంలో కోరలు, గోళ్ళు ఆయుధాలుగా ఉన్నాయి. శత్రువును ఏ రకంగా దెబ్బతియ్యటానికైనా సరిపోయే అన్ని రకాల ఆయుధాలు గలవాడు.

ఇతడు పరమేశ్వరుడు. ఇతని దగ్గర ఉండనిది అంటూ ఏదీలేదు. అన్ని రకాలయిన ఆయుధ సంపత్తి ఇతని దగ్గరే ఉంటుంది. **లలితా సహస్రం**లో 531వ నామము 'సర్వాయుధధరా'

శ్రీమన్నారాయణుడు సర్వేశ్వరుడు. ఆది అనాది అయినవాడు. ఆద్యంతములు లేనివాడు. త్రికాల స్వరూపుడు. కాలాతీతుడు. ఈ జగత్తులోని అన్ని జీవులయందు అంతర్యామిగా ఉన్నాడు. అనంత కోటి బ్రహ్మాండాలకు అతడే ప్రభువు. అతడు ఉన్నాడనే భయంతోనే గాలి సవ్యంగా వీస్తోంది. సూర్యుడు ప్రకాశిస్తున్నాడు. దిక్పాలకులు తమ విధులను సక్రమంగా నిర్వర్తిస్తున్నారు. ధర్మానికి హాని కలిగినప్పుడల్లా దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేయటానికి ఆ పరమేశ్వరుడు భూమిమీద అవతరిస్తుంటాడు ఆశ్రితవత్సలుడు. నమ్మిన వారికి ఇలవేల్పు. కోరిన వారి కొంగు బంగారం. అటువంటి శ్రీమన్నారాయణుడు ఆర్తత్రాణ పరాయణుడై ఆశ్రితులను సదాకాచి రక్షిస్తాడు అంటూ 'ఆశ్రిత వత్సలుడు' అనే ప్రకరణాన్ని పూర్తి చేశాడు రత్నాకరుడు.



# 58. ఫలశ్రుతి

"గురువుగారూ ! ఇప్పటి వరకూ శ్రీమహావిష్ణువు గురించిన వేయినామాలకు పూర్తి వ్యాఖ్య మీ ద్వారా విన్నాము. మహదానందంగా ఉన్నది. అయితే ఒక చిన్న సందేహం మాత్రం ఉన్నది. ఈ విష్ణు సహస్ర నామాలను అందరూ పారాయణ చేయ్యవచ్చా . ఇది పారాయణ చేసిన వారికి ఎలాంటి ఫలితము వస్తుంది ? మొదలైన విషయాలను కూడా మాకు వివరించి మమ్ములను కృతార్ధులుగా చేయవలసినది" అని అడిగాడు. నారాయణభట్టు.

విష్ణు సహస్రనామాలు పారాయణచేస్తే కలిగే ఫలితాన్ని వివరించటం ప్రారంభించాడు రత్నాకరుడు.

నాయనలారా ! విష్ణు సహస్రం అందరూ పారాయణ చెయ్యవచ్చా ? అనేది మీ అనుమానం. ఇక్కడ శ్రీమహావిష్ణువు అంటే పరమేశ్వర స్వరూపుడు. ముల్లోకాలను సృష్టించినవాడు. అఖిలాండకోటి బ్రహ్మాండాలకు నాయకుడు. ఆది అనాది అయినవాడు. ఆద్యంతములు లేనివాడు. జన్మ మృత్యు జరాదులు లేనివాడు. పరమ పురుషుడు. అతన్ని అర్చించటానికి గాని, కీర్తించటానికిగాని ఏ రకమైన అర్హతలూ అవసరం లేదు. అసలు పరమేశ్వరుని గురించి తలచుకోవాలన్నా, ఆయన్ను స్తోత్రం చెయ్యాలన్నా, ఆయన లీలా విభూతులు తెలుసుకోవాలన్నా గతజన్మలలో చేసిన పుణ్యఫలం కావాలి. అంతేకాని ఇంక ఏ అర్హతా అవసరం లేదు. ఆర్తత్రాణ పరాయణుడైన శ్రీమన్నారాయణుడు ఆ గజేంద్రుని మొర ఆలకించలేదా ? అందుచేత ఆయనను ఎవరైనా స్తుతించవచ్చు. ఇక దీని పారాయణా ఫలితము ఉత్తర భాగంలో చెప్పబడింది. దాన్నికూడా చెబుతాను వినండి.

ధర్మరాజుకు విష్ణుసహస్రనామాలను ఉపదేశించిన తరువాత భీష్ముడు అంటున్నాడు.

**ఇతిదం కీర్తనీయస్య కేశవస్య మహాత్మనః ।**

**నామ్నాం సహస్రం దివ్యానాం అశేషణ ప్రకీర్తితమ్ ॥**

**య ఇదం శృణుయాన్నిత్యం యశ్చాపి పరికీర్తయేత్ ।**

**నాశుభం ప్రాప్నుయాత్ కించిత్ సో ఽ ముత్రేహ చ మానవః ॥**

"మహాత్ముడు, కీర్తింపదగినవాడు 'కేశవుడు' అతడే శ్రీమహావిష్ణువు. ఆయన యొక్క వేయి నామాలను పూర్తిగా చెప్పాను. వీటిని ప్రతినిత్యం పారాయణ చేసినా, విన్నాకూడా సకల ఫలితాలు పొందుతారు.

**వేదాంతగో బ్రాహ్మణః స్యాత్ క్షత్రియో విజయీ భవేత్**
**వైశ్యో ధనసమృద్ధః స్యాత్ శూద్రః సుఖమవాప్నుయాత్ ॥**

**ధర్మార్థీ ప్రాప్నుయాద్ధర్మ మర్థార్థీచార్థ మాప్నుయాత్**
**కామానవాప్నుయాత్కామీ ప్రజార్థీ చాప్నుయాత్ ప్రజామ్ ॥**

**భక్తిమాన్ యః సదోత్థాయ శుచిః సద్గతమానసః ।**
**సహస్రం వాసుదేవస్య నామ్నామేతత్ ప్రకీర్తయేత్ ॥**

**యశః ప్రాప్నోతి విపులం యాతి ప్రాధాన్యమేవ చ ।**
**అచలాం శ్రియమాప్నోతి శ్రేయః ప్రాప్నోత్యనుత్తమమ్ ।**

అంతేకాదు విష్ణు సహస్రం పారాయణ చేస్తే

| | | |
|---|---|---|
| బ్రాహ్మణుడు | – | వేదాంత పరిజ్ఞానాన్ని పొందుతాడు. |
| క్షత్రియుడు | – | విజయం పొందుతాడు. |
| వైశ్యుడు | – | ధనాన్ని పొందుతాడు |
| శూద్రుడు | – | సకల సుఖాలను పొందుతాడు |
| ధర్మం కోరేవాడు | – | ధర్మాన్ని పొందుతాడు |
| అర్థము (ధనము) కోరేవాడు | – | అర్థాన్ని పొందుతాడు |
| భోగము కావలసినవారు | – | భోగాన్ని పొందుతాడు |
| సంతానం కావలసినవారు | – | సంతానాన్ని పొందుతారు. |

ఉదయం నిద్రలేవగానే పరిశుద్ధమైన భక్తిగలవాడై శ్రీమహావిష్ణువును ధ్యానించినవాడు కీర్తిని, ఉన్నతపదవిని, ఎన్నటికీతరగని భాగ్యాన్ని శ్రేయస్సును పొందుతాడు.

**న భయం క్వచిదాప్నోతి వీర్యం తేజశ్చ విందతి ।**
**భవత్యరోగో ద్యుతిమాన్ బలరూప గుణాన్వితః ॥**

**రోగార్తో ముచ్యతే రోగాత్బద్ధోముచ్యేత బంధనాత్ ।**
**భయాన్ముచ్యేత భీతస్తు ముచ్యేతాపన్న ఆపదః ॥**

**దుర్గాణ్యతితరత్యాశు పురుషః పురుషోత్తమః ।**
**స్తువన్నామ సహస్రేణ నిత్యం భక్తి సమన్వితః ॥**

**వాసుదేవాశ్రయో మర్త్యో వాసుదేవ పరాయణః ।**

**సర్వపాప విశుద్ధాత్మా యాతి బ్రహ్మసనాతనమ్ ॥**

అతడికి ఏ మాత్రము భయముండదు. పైగా ఉత్సాహము, వీర్యము, ఆరోగ్యము, శరీరకాంతి, బలము కూడా పొందుతాడు.

| | |
|---|---|
| అనారోగ్యంతో బాధపడేవాడు | – ఆరోగ్యవంతుడౌతాడు. |
| కారాగారంలో బంధించబడ్డవాడు | – బంధనాలనుంచి విముక్తి పొందుతాడు. |
| భయస్తుడు | – నిర్భయుడవుతాడు |
| ఆపదలు వాటిల్లినవాడు | – వాటి నుంచి బయటపడతాడు |

ప్రతిదినము విష్ణు సహస్రనామ పారాయణ చేసినవాడు ఎలాంటి కష్టాలనైనా అవలీలగా దాటగలడు. ఈ రకంగా వాసుదేవుడైన విష్ణువును ఆశ్రయించిన వారు సకల పాపాలనుండి విముక్తులై పరమపదము పొందుతారు.

**న వాసుదేవ భక్తానా మశుభం విద్యతే క్వచిత్ ।**

**జన్మమృత్యు జరావ్యాధిభయం నైవోప జాయతే ॥**

**ఇమం స్తవ మధీయానః శ్రద్ధాభక్తి సమన్వితః ।**

**యుజ్యేతాత్మ సుఖక్షాంతి శ్రీధృతి స్మృతి కీర్తిభిః ॥**

**న క్రోధో న చ మాత్సర్యం నలోభో నాశుభామతిః ।**

**భవంతి కృతపుణ్యానాం భక్తానాం పురుషోత్తమే ॥**

**ద్యౌః సచంద్రార్క నక్షత్రా ఖం దిశో భూర్మహోదధిః ।**

**వాసుదేవస్య వీర్యేణ విధృతాని మహాత్మనః ॥**

వాసుదేవుని అర్చించిన వారికి ఏ విధమైన ఆటంకాలు కలుగవు. జనన మరణాలు, జరావ్యాధులు అసలుండవు. భక్తిశ్రద్ధలతో ఈ నామాలను పారాయణచేసినవాడు శాంతి, భాగ్యము, కీర్తి, ఆత్మసుఖము పొందుతాడు విష్ణుభక్తులకు కోపము, లోభము, అసూయ, ద్వేషము, మత్సరమువంటి గుణాలుండవు. ఆకాశము, భూమి, నక్షత్రాలు, చంద్రలోకము, దేవలోకము అన్నీకూడా వాసుదేవుని ప్రభావంచేతనే నిలబడుతున్నాయి. అంటే వీటన్నింటికీ అతడే ఆధారుడు.

**ససురాసుర గంధర్వం సయక్షోరగ రాక్షసం ।**

**జగద్వశే వర్తతేదం కృష్ణస్య స చరాచరమ్ ॥**

**ఇంద్రియాణి మనోబుద్ధిః సత్త్వం తేజో బలం ధృతిః ।**
**వాసుదేవాత్మకాన్యాహుః క్షేత్రం క్షేత్రజ్ఞ ఏవచ ॥**

**సర్వాగమానామాచారః ప్రథమం పరికల్పతే ।**
**ఆచార ప్రభవో ధర్మోధర్మస్య ప్రభురచ్యుతిః ॥**

**ఋషయః పితరో దేవా మహాభూతాని ధాతవః ।**
**జంగమాజంగమం చేదం జగన్నారాయణోద్భవమ్ ॥**

దేవగంధర్వ యక్ష కిన్నెర కింపురుషసిద్ధసాధ్యరాక్షస గణాలతో కూడిన జగత్తంతా శ్రీమన్నారాయణుని అధీనంలోనే ఉన్నది. జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సు, బుద్ధి, చిత్తము, కాంతి, బలము, అహంకారము, ధైర్యము, శరీరము, జీవుడు మొదలైనవన్నీ ఆ వాసుదేవుని రూపాలే. సకలవేదాలకు ముందుగా ఆచారం చెప్పబడింది. ఆచారం నుంచి ధర్మం పుడుతోంది. ధర్మానికి ప్రభువు వాసుదేవుడు. దేవతలు, పిత్రుదేవతలు, సప్తరుషులు, పంచభూతాలు, సప్తధాతువులు ఒకటేమిటి? ఈ జగత్తంతా నారాయణుని నుంచే పుట్టింది.

**యోగో జ్ఞానం తథా సాంఖ్యం విద్యాః శిల్పాదికర్మ చ ।**
**వేదాః శాస్త్రాణి విజ్ఞానం ఏతత్సర్వం జనార్దనాత్ ॥**

**ఏకో విష్ణుః మహత్‌భూతం పృథగ్భూతా న్యనేకశః ।**
**త్రీన్‌లోకాన్ వ్యాప్య భూతాత్మా భుంక్తే విశ్వభుగవ్యయః ॥**

**ఇమం స్తవం భగవతో విష్ణోః వ్యాసేన కీర్తితం ।**
**పఠేద్య ఇచ్ఛేత్ పురుషః శ్రేయః ప్రాప్తుం సుఖాని చ ॥**

**విశ్వేశ్వరమజం దేవం జగతః ప్రభుమవ్యయం ।**
**భజన్తి యే పుష్కరాక్షం స తే యాన్తి పరాభవమ్ ॥**

యోగము, జ్ఞానము, సాంఖ్యము, సమస్త విద్యలు, వేదాలు, శాస్త్రాలు, విజ్ఞానము, శిల్పము మొదలైన విద్యలు అన్నీ జనార్దనుని వల్లనే కలుగుతున్నాయి.

ఈ జగత్తులో విష్ణువొక్కడే మహానుభావుడు. అతనిని మించినది ఏదీలేదు. సర్వభూతాత్మకుడైన శ్రీమహావిష్ణువే ముల్లోకాలలోనూ వ్యాపించి ఉన్నాడు.

శ్రేయస్సు, సుఖము కోరిన ప్రతివాడూ, వ్యాసమహర్షి ప్రణీతమైన విష్ణుసహస్ర నామాన్ని పఠించి తీరాలి. అతడు జగదీశ్వరుడు, జన్మరహితుడు, లోకాలకు నాయకుడు, అవ్యయుడు. అటువంటి మహావిష్ణువును ధ్యానించినవారు ఎన్నడూ పరాభవము పొందరు.

**న తేయాంతి పరాభవం ఓం నమ ఇతి.**

**అర్జున ఉవాచ :**

**పద్మపత్ర విశాలాక్ష పద్మనాభ సురోత్తమ ।**
**భక్తానా మనురక్తానాం త్రాతాభవ జనార్దన ॥**

**శ్రీ భగవాన్ ఉవాచ :**

**యోమాం నామసహస్రేణ స్తోతుమిచ్ఛతి పాండవ ।**
**సోహమేకేన శ్లోకేన స్తుత ఏవ న సంశయః ॥**

(స్తుత ఏవన సంశయః ఓం నమ ఇతి)

అటువంటి శ్రీమహావిష్ణువును సకలశుభాలు కోరి ఓంనమః అంటూ నమస్కరిస్తున్నాను" అన్నాడు.

ఆ మాటలు విన్న అర్జునుడు భగవానుడైన శ్రీకృష్ణుని వైపు తిరిగి 'ఓ పద్మనాభా! ఓ కమలనయనా ! దేవతలందరిలోకీ శ్రేష్టుడవైన జనార్దనా ! దయతో నీ భక్తులను కాపాడవలసింది" అన్నాడు. దానికి బదులుగా శ్రీకృష్ణుడు "పాండవా ! నన్ను సహస్రనామం చేత స్తుతించాలని ఎవరు ప్రారంభించినా, నేను ఒక్క శ్లోకంతోనే అతని ప్రార్థన ఆలకిస్తాను ఇందులో సందేహము లేదు" అన్నాడు.

**వ్యాస ఉవాచ :**

**వాసనా ద్వాసుదేవస్య వాసితం భువనత్రయం ।**
**సర్వభూత నివాసోఽసి వాసుదేవ నమోస్తుతే ॥**

(శ్రీ వాసుదేవ నమోస్తుతం ఓం నమ ఇతి)

**పార్వత్యువాచ :**

**కేనోపాయేన లఘునా విష్ణోర్నామ సహస్రకం ।**
**పఠ్యతే పండితైర్నిత్యం శ్రోతు మిచ్ఛామ్యహం ప్రభో ॥**

అప్పుడు వ్యాసభగవానుడు "వాసుదేవా ! నీవల్లనే ముల్లోకాలు నిలచి ఉన్నాయి. అన్ని భూతములందు అంతర్యామిగా ఉన్న నీకు నమస్కారము" అన్నాడు.

ఇదంతా విన్న పార్వతిదేవీ "ప్రభూ ! జ్ఞానులు, పండితులు ప్రతినిత్యం ఏ ఉపాయం చేత విష్ణుసహస్రాన్ని పారాయణచేస్తున్నారో నాకు తెలుపవలసినది" అని అడిగింది.

**ఈశ్వర ఉవాచ :**

**శ్రీరామ రామ రామేతి రమేరామే మనోరమే ।**
**సహస్రనామ తత్తుల్యం రామనామ వరాననే ॥**

**బ్రహ్మోవాచ :**

**నమోఽస్త్వనంతాయ సహస్రమూర్తయే**
**సహస్రపాదాక్షి శిరోరు బాహవే ।**
**సహస్రనామ్నే పురుషాయ శాశ్వతే**
**సహస్రకోటి యుగధారిణే నమః ॥**

(సహస్రకోటి యుగధారిణ ఓం నమ ఇతి)

పార్వతియొక్క మాటలు విన్న ఈశ్వరుడు "ఓ దేవీ ! ఆ శ్రీరామచంద్రుని 'రామరామ' అంటూ నేను మనసులోనే ప్రార్థిస్తున్నాను. ఒక్క రామనామమే – విష్ణుసహస్రానికి సమానమైనది." అన్నాడు.

అప్పుడు బ్రహ్మ చెబుతున్నాడు. "అంతములేనటువంటివాడు, వేలరూపాలు గలవాడు, వేల పాదాలు, వేల కనులు, శిరస్సులు, భుజాలు, నామములు గల నిత్యమైన పురుషుడికి నమస్కారము. సహస్రకోటి యుగాలు ధరించిన వాడికి నమస్కారము.

**సంజయ ఉవాచ :**

**యత్ర యోగీశ్వరః కృష్ణో యత్రపార్థో ధనుర్ధరః ।**
**తత్రశ్రీ ర్విజయోభూతిః ధ్రువా నీతిర్మతిర్మమ ॥**

**శ్రీ భగవాన్ ఉవాచ :**

**అనన్యాశ్చింతయంతోమాం యే జనాః పర్యుపాసతే ।**
**తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ॥**

**పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం ।**
**ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే ॥**

ఇప్పుడు సంజయుడు చెబుతున్నాడు. "ఎక్కడైతే యోగీశ్వరుడైన శ్రీకృష్ణుడు, ధనుర్ధారి అయిన అర్జునుడు ఉంటారో, అక్కడ విజయము, మంగళము, ఐశ్వర్యము నిశ్చయంగా ఉంటాయి."

ఆ మాటలు విన్న శ్రీకృష్ణభగవానుడు.

“ఇతర చింతనలు లేక త్రికరణశుద్ధిగాన్నే నమ్మి ఉపాసన చేసే వారి యోగక్షేమాలు నేను వహిస్తాను. దుష్టశిక్షణ, శిష్టరక్షణచేసి ధర్మాన్ని నిలబెట్టటానికి ప్రతియుగంలోనూ ఈ లోకంలో నేను అవతరిస్తుంటాను.

**ఆర్తా విషణ్ణాశ్శిథిలాశ్చ భీతాః**
**ఘోరేషు చ వ్యాధిషు వర్తమానాః ।**
**సంకీర్త్య నారాయణ శబ్దమాత్రం**
**విముక్త దుఃఖాః సుఖినోభవంతు ॥**

**కాయేన వాచా మనసేంద్రియైర్వా**
**బుద్ధ్యాత్మనా వా ప్రకృతేః స్వభావాత్ ।**
**కరోమి యద్యత్ సకలం పరస్మై**
**నారాయణా యేతి సమర్పయామి ॥**

ఓం తత్ సత్

దుఃఖితులైనవారు. భయస్థులు, వ్యాధిగ్రస్థులు మొదలైన వారంతా కేవలము ‘నారాయణ’ అన్నంత మాత్రంచేతనే సకలసుఖాలు పొందుతారు.

శరీరముచేతగాని, వాక్కుచేతగాని, ఇంద్రియాలచేతగాని, బుద్ధిచేతగాని, స్వభావంచేతగాని, చేసే కర్మలన్నింటినీ శ్రీమన్నారాయణుడికి సమర్పిస్తున్నాననే భావంతో ఉన్నట్లైతే అతడు సర్వసుఖాలు అనుభవిస్తాడు” అని చెప్పాడు.

కాబట్టి శిష్యోత్తములారా ! విష్ణుసహస్రము అనన్యసామాన్యమైనది. అద్భుతమైనది. అతి దుర్లభమైనది. ఘోరపాపాలను నాశనం చేయ్యటమేకాదు, జీవియొక్క అంతిమ లక్ష్యమైన పరమపదాన్ని కూడా ప్రాప్తింపచేస్తుంది.

పుణ్యాత్ములారా ! నాకు తెలిసినంతవరకు, నా బుద్ధికి అందినంతవరకు, శ్రీమన్నారాయణుని కృప ఉన్నంతవరకు విష్ణుసహస్రనామభాష్యాన్ని మీ కందించాను. దీన్ని చదివి పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుని కృపకు పాత్రులుకండి. మీకు శుభం కలుగుతుంది. ఆయురారోగ్య ఐశ్వర్యాలు, ధనకనక వస్తువాహనాలు, సుఖశాంతులు లభిస్తాయి. అంటూ ‘శ్రీ కైవల్యసారథి’ అనే విష్ణుసహస్రనామభాష్యాన్ని పూర్తిచేశాడు రత్నాకరుడు.

భాష్యాన్ని ఆసాంతం విన్న అతని శిష్యులు గురువుగారిని పరిపరివిధాల ప్రశంసించి, వారికి ప్రదక్షిణలుచేసి, సాష్టాంగదండప్రణామాలాచరించి ఉచితరీతిన సత్కరించి వారి దగ్గర శెలవుతీసుకున్నారు.

**హరితస గోత్రీకుడు, శ్రీ క్రోవి పురుషోత్తమశర్మ**
**శ్రీమతి లక్ష్మీ నరసమ్మగార్ల పౌత్రుడు,**
**శ్రీ క్రోవి కృష్ణమూర్తి, శ్రీమతి సత్యపర్వత వర్ధనమ్మ గార్ల**
**జ్యేష్ఠపుత్రుడు అయిన క్రోవిపార్థసారథి**
**సర్వజనామోదము పొందునట్లుగా సులభశైలిలో వ్రాసిన**
**“శ్రీ కైవల్యసారథి” అను విష్ణుసహస్రనామభాష్యము సమాప్తము.**

ఓం తత్సత్



# 59. కలిసంతరణోపనిషత్తు

## కృష్ణయజుర్వేదము

ద్వాపరయుగం చివరభాగంలో నారదమహర్షి బ్రహ్మదేవుని దగ్గరకుపోయి “దేవదేవా! నేను భూలోకంలో సంచరిస్తూ పాపాలను ఏవిధంగా పోగొట్టగలను” అని అడిగాడు. దానికి బ్రహ్మదేవుడు “నారదా ! సమస్త వేదరహస్యము, సంసారతరుణోపాయము చెబుతున్నాను శ్రద్ధగా వినవలసినది. భగవంతుడు, ఆది పురుషుడు అయిన శ్రీమన్నారాయణుని నామము ఉచ్చరించినంతనే సమస్త పాపములు నశించిపోతాయి” అన్నాడు.

“అయితే ఆ నామము ఏది ?” అని మళ్ళీ అడిగాడు నారదుడు. దానికి బ్రహ్మదేవుడు

**“హరేరామ హరే రామ రామరామ హరేహరే !**
**హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే ।**

ఇదే శ్రీ హరినామ మంత్రము. దీనిలో మొత్తం 16 నామాలున్నాయి. ఇది కలియుగంలో పాపాలన్నింటినీ నశింపచేస్తుంది. ఇంతకుమించిన ఉపాయమే లేదు. ఈ విషయం అన్ని వేదాలలోనూ చెప్పబడింది. ఈ రకంగా 16 కళలచేత కప్పబడిన జీవుని ఆవరణలు నశిస్తాయి. అప్పుడు మేఘములు తొలగిపోయిన సూర్యబింబం లాగా పరబ్రహ్మ ప్రకాశిస్తాడు.

ఈ నామ జపానికి ఏవిధమైన విధిలేదు. శుచిగాగాని, అశుచిగాగాని ఈ నామాన్ని సర్వకాల సర్వావస్థలయందు జపించవచ్చు. అలా జపించినవారు సామీప్య, సాలోక్య, సారూప్య, సాయుజ్యములు పొందుతారు. ఈ మంత్రాన్ని 31/2 కోట్లు జపం చేసినవారు సర్వపాపాలనుండి విమక్తులవుతారు.

ఈ నామ జపం చేసిన వారు బ్రహ్మహత్యాపాతకము నుండి విముక్తులవుతారు. వీరుహత్యాపాతకమునుండి తరిస్తారు. బంగారము దొంగిలించిన పాపము నుండి విముక్తులవుతారు. పరకాంతా గమనము వలన వచ్చిన పాపమునుండి విముక్తులవుతారు. దేవతలు, పితృదేవతలు, మనుష్యులకు చేసిన అపకారము వలన వచ్చిన పాపములనుండి విముక్తులవుతారు. సర్వధర్మములు త్యజించటం వల్ల వచ్చే పాపమునుండి విముక్తులవుతారు. సద్యోముక్తిని పొందుతారు.

# ౬౦. విష్ణుసహస్రనామముల అకారాద్యనుక్రమణిక

అ

ఆ



ఇ



ఈ